శ్రీరస్తు.

శ్రీరుక్మిణీసత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్రమహాభాగవతము * ప్రథమస్కంధము.

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్।
లక్ష్మీకాన్తం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్॥

నిగమకల్పతరోర్గలితం ఫలం శుకముఖాదమృతద్రవసంయుతమ్।
పిబత భాగవతం రసమాలయం ముహురహో రసికా భువి భావుకాః॥

శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర। క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో।
ద్రేకస్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా। నాకంజాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్॥

(ఉ॥ వాలినభక్తి మ్రొక్కెద నవారిత తాండవకేళికిన్ దయా । ళాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్। బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో । న్మూలికి నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్ * (ఉ॥ ఆతత సేవఁ జేసెద సమస్త చరాచరభూతసృష్టివి । జ్ఞాతకు భారతీహృదయసౌఖ్యవిధాతకు వేదరాశిని । ర్ణేతకు దేవతానికర నేతకుఁ గల్మషజేతకున్ నత । త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోకశుభప్రదాతకున్ * (వ ॥ అని నిఖిలభువనప్రధానదేవతావందనంబుఁ జేసి * (ఉ ॥ ఆదర మొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతాహృదయానురాగసం । పాదికి దోషభేదికిఁ బ్రపన్నవినోదికి విఘ్నవల్లికా। చ్ఛేదికి మంజువాదికి నశేషజగజ్జననందవేదికిన్ । మోదకఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్ * (ఉ॥ క్షోణితలంబు నెన్నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత। శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర । శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్। వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్ * (శా॥ పుట్టంబుట్ట శరంబునన్ మొలవ నంభోయానపాత్రంబునన్ । మెట్టం గల్గను గాళిఁ గొల్వను బురాణింపన్ దొరంకొంటి మీఁ। దెట్టే వెంటఁ జరింతుఁ దత్సరణి నాకీవమ్మ యో యమ్మ మేల్ । పట్టు న్నాకగుదమ్మ నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ దయాంభోనిధీ * (ఉ॥ శారదనీరదేందుఘనసారపటీరమరా। ళమల్లికా। హారతుషారఫేనరజతాచలకాశఫణీశకుందమం। దారసుధాపయోధిసితతామరసామరవాహినీశుభా । కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీ * (ఉ॥ అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారదచంద్రచంద్రికా । డంబర

---

శ్రీకైవల్యపదంబు-సర్వోత్కృష్టమైన మోక్షపదము. రెండవయర్థము, శ్రీశబ్దమునకు-ధర్మార్థకామముల నెడి త్రివర్గమర్థము. అట్టి త్రివర్గముతోఁ జేరిన - కైవల్యపదమనఁగా మోక్షము. — మహానందాంగనాడింభకున్ - ఉత్తమురాలైన నందుని భార్యయగు యశోదాదేవిపుత్రునికి-ఈ పద్యమందు-ఆరంభకు, సంరంభకు, కుంభకు, ఇటబహు శ్రీహ్యర్థమందు, స్తంభకు ఇటకర్త్రర్థమందు, డింభకు - ఇటస్వార్థమందు కప్రత్యయమని తెలియనది. — శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్ ॥ శిఖరిజా-పార్వతీదేవియొక్క, ముఖపద్మ-కమలమువంటిముఖమునకు, మయూఖమాలికిన్ - సూర్యునివంటివానికిని, నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్ ॥ నారదాదిఋషిశ్రేష్ఠుల హృదయకమలములకుఁదుమ్మెదవంటివానికిన్. — మోదకఖాదికిన్ ॥ కుడుములఁదినువానికిన్. — చంచరీకచయసుందరవేణికి ॥ తుమ్మెదలగుంపువలెసొబగైనకురులుగలదానికిన్. — పుట్టన్బుట్టన్ ॥ వల్మీకమందుజనింపలేదు-అనఁగా వాల్మీకిఁ గాననుట. శరంబునన్ మొలవన్-రెల్లు దర్భలయందుఁగలుగలేదు, అనఁగా స్కందుఁడను గాననుట. — అంభోయానపాత్రంబునన్ ॥ మెట్టన్-ద్రొక్కుటకు-పడవయందు నావిర్భవింపలేదు, అనఁగా వ్యాసుఁడను గాననుట. — కాళిన్-గొల్వను-కాళికాదేవిని సేవింపలేదు, అనఁగా కాళిదాసుఁడఁ గాననుట. —పురాణింపన్ ॥ శ్రీభాగవతపురాణము నురచించుటకు. —దొరకొంటిన్ - ఆరంభించితి. —అగుదమ్మ - అగుదువు అమ్మ - అనిపదచ్ఛేదము. అగుదువు అనఁగా, అగుదువు. బ్రాహ్మీ-ఓసరస్వతీ. శారదనీరద -శరత్కాలమేఘము. ఇందు - చంద్రుఁడు. ఘనసార - కర్పూరము. పటీర - చందనము. మరాళ - హంస. ఫేన - నురుగు

చారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా । చుంబితదిగ్విభాగశ్రుతిసూక్తివివిక్తనిజప్రభావభా । స్వాంబరవీథివిశ్రుతవిహారిని నన్ గృపఁజూడు భారతీ* ( ఉ॥ అమ్మలఁ గన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె । ద్దమ్మ సురారులమ్మ కడుపాఱడిపుచ్చిన యమ్మ తన్నులో । నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ దుర్గ మా । యమ్మ కృపాబ్ధి యీవుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్ * ( మ॥ హరికిం బట్టపురాణి పున్నెములప్రోవర్థంపు పెన్నిక్క చం । దురుతోఁ బుట్టువు భారతీగిరిసుతల్ తో నాడు పూఁబోఁడి తా । మరలం దుండెడి ముద్దరాలు జగముల్ మన్నించు నిల్లాలు భా । సురతన్ లేములు వాపు తల్లి సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్ *( వ॥ అని యిష్టదేవతలం జింతించి దినకరకుమారప్రముఖులం దలంచి ప్రథమకవితావిరచనవిద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి హయగ్రీవదనుజకరపరిమిళిత నిగమనివహ విభాగనిర్ణయనిపుణతాసముల్లాసుండగు వ్యాసునకు మ్రొక్కి శ్రీమహాభాగవతకథాసుధారసప్రయోగికి శుకయోగికి నమస్కరించి మృదుమధురవచనవర్గపల్లవితస్థాణునకు బాణునకుం బ్రణమిల్లి కతిపయశ్లోకసమ్మోదితసూరు మయూరు నభినందించి మహాకావ్యకరణకళావిలాసుం గాళిదాసుం గొనియాడి కవివదనకమలరవిద్భారవిన్ బొగడి విదళితాఘుని మాఘుని నుతియించి యాంధ్రకవితాగౌరవజనమనోహరి నన్నయసూరిం గైవారంబు సేసి హరిహరచరణారవిందవందనాభిలాషిం దిక్కనమనీషిం భూషించి మఱియు నితరపూర్వకవిజనసంభావనంబు గావించి వర్తమానకవులకుం బ్రియంబు వలికి భావికవుల బహూకరించి యుభయకావ్యకరణదక్షుండనై* ( ఉ॥ ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్ । సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే । సమ్మెట వ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ । బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్ *( గీ॥ చేతులారంగ శివునిఁ బూజింపఁడేని । నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని । దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ । గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు * ( వ॥ అని మదీయపూర్వజన్మసహస్రసంచితతపఃఫలంబున శ్రీమన్నారాయణకథాప్రపంచవిరచనాకుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాఁ గని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగయగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులిన శోభిత ప్రదేశంబున మహేశ్వరధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలితలోచనుండనై యున్నయెడ * ( సీ॥ మెఱుఁగు చెంగటనున్న మేఘంబు కైవడి నువిద చెంగటనుండ నొప్పువాఁడు । చంద్రమండలసుధాసారంబు పోలిక ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు । వల్లీయుత తమాల వసుమతీజము భంగి బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు । నీలనగాగ్రసన్నిహితభానుని భంగి ఘనకిరీటము దలఁ గల్గువాఁడు । పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు । వెడఁదయురమువాఁడు విపులభద్ర । మూర్తియైన రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా । కన్నుఁగవకు నెదుర గానఁబడియె*( వ॥ ఏను నా రాజశేఖరుం దేఱిచూచి భాషింప యత్నంబు సేయు నెడ నతండు నేను రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుఁగు సేయుము నీకు భవబంధంబులు దెగునని యానతిచ్చి తిరోహితుండైన సమున్మీలితనయనుండనై వెఱఁగుపడి చిత్తంబున*( క॥ పలికెడిది భాగవతమఁట । పలికించెడువాఁడు రామభద్రుండఁట నే । బలికిన భవహర మగునఁట । పలికెద వేఱొండు గాథఁ బలుకఁగ నేలా *( గీ॥ భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు । శూలికైనఁ దమ్మిచూలికైన । విబుధజనుల వలన విన్నంతఁ గన్నంతఁ । దెలియవచ్చినంతఁ దేటపఱతు *( క॥ కొందఱికిఁ దెనుఁగు గుణమగుఁ । గొందఱికిని సంస్కృతంబు గుణమగు రెండున్ । గొందఱికి గుణములగు నే । నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్ *( మ॥ ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విం బురాణావళుల్ । దెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో । తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిన్ దెనుంగించి నా । జననంబున్ సఫలంబు సేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్ * ( మ॥ లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం । జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో । జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై । వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై * ( వ॥ ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణపారిజాతపాదపసమాశ్రయంబున హరికరుణావిశేషంబునఁ గృతార్థత్వంబు సిద్ధించెనని బుద్ధి నెఱింగి లేచి మఱికొన్ని దినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండనై *( సీ॥ కౌండిన్యగోత్రసంకలి

---

కాశ - తెల్లపువ్వులు. మందార - కల్పవృక్షము — ముగురమ్మల - గౌరీలక్ష్మీసరస్వతులకు. మూలపుటమ్మ - ఆదికారణభూతురాలైనమహాశక్తి. పున్నెములప్రోవు ॥ సుకృతరాశి. పుణ్యశబ్దతద్భవము - పున్నెము. పెన్నిక్క ॥ ముఖ్యస్థానము. ఓకశ్శబ్దమునకు - తద్భవము ఇక్క. —లలితస్కంధము ॥ భాగవతపక్షమునందు ॥ సుందరములగుద్వాదశస్కంధములుగలది - కల్పతరుపక్షమునందు ॥ సుందరమైనప్రకాండములుగలది. ప్రకాండమనఁగానడుగు మొదలుకొనికొమ్మలుమొదలు పెట్టువఱకుఁగలమ్రానిమధ్యభాగము. కృష్ణమూలము ॥ కృష్ణ-కృష్ణుఁడు. నలుపు ॥భా॥ మూలము-ప్రతిపాద్యవస్తువు. కల్ప॥మూలము-వేళ్లు. శుకాలాపము॥భా॥ శుకమహర్షిసల్లాపము. కల్ప॥ చిలుకలపల్కులు. మంజులతా॥భా॥ ప్రతిపాద్యకథాంశములసొంపుచేతను ॥ కల్ప ॥ మంజు ॥ సుందరములగు. లతా ॥ కొమ్మలచేతను- ఇచటలతాశబ్దముశాఖావాచకము. సువర్ణసుమనస్సుజ్ఞే

తుఁడాపస్తంబసూత్రుండు పుణ్యుండు శుభగుఁడైన । భీమనమంత్రికిఁ బ్రియపుత్రుఁడన్నయ కలకంఠి తద్భార్య గౌరమాంబ । కమలాప్తువరమునఁ గనియె సోమనమంత్రి వల్లభమల్లమారితనయుఁ । ఎల్లనయగనికి నిల్లాలు మాచమ వారిపుత్రుఁడు వంశవర్ధనుండు । లలితమూర్తి బహుకళానిధి కేసన । దానమాననీతిధనుఁడు ఘనుఁడు । దనకులక్రమాంబ ధర్మగేహిని గాఁగ । మనియె శైవశాస్త్రమతము గనియె ॥ * (క॥ నడువదుసలయము వెలువడి । నడవదు పరపురుషగుణము దనపతనుదుపుర్ । గడువదు వితరణకరుణలు । విడువదు మలకాంబ విబుధవిసరము వొగడన్ ॥ * (ఉ॥ మానినులీడుగారు బహుమాననివారితదీనమానస । గ్లానికి దానధర్మమతిగౌరవమంజులతాగభీరతా । స్థానికి ముద్దసానికి సదాశివపాదయుగార్చనానుకం । పానయవాగ్భవానికి నిబమ్మెరకేసయ లక్కసానికిన్ ॥ * (క॥ ఆమిథునమునకుఁ బుట్టితి । మేమిగువుర మగ్రజాతుఁడీశ్వరసేవా । కాముఁడు దిప్పయ పోతయ । నామవ్యక్తుండ సాధునయయుక్తుండన్ ॥ * (వ॥ అయిన నేను నా చిత్తంబునఁ బేర్కొనఁదగిన థానంబుంబోని శ్రీరామచంద్రుని సన్న

—* షష్ఠ్యంతములు. *—

ధానంబుఁ గల్పించుకొని ॥ * (ఉ॥ హారికి నందగోకులవిహారికిఁ జక్రసమీరదైత్యసంహారికి భక్తదుఃఖపరిహారికి గోపనితంబినీమనోహారికి దుష్టసంపదపహారికి ఘోషకుటీపయోఘృతాహారికి బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్ ॥ * (ఉ॥ శీలికి నీతిశాలికి వశీకృతశూలికి బాణహస్తనిర్మూలికి ఘోరనీరదవిముక్తశిలాహతగోపగోపికాపాలికి వర్ణధర్మపరిపాలికి నర్జునభూజయుగ్మసంచాలికి మాలికిన్ విపులచక్రనిరుద్ధమరీచిమాలికిన్ ॥ * (ఉ॥ క్షుంతకుఁ గాళియోరగవిశాలఫణావళినర్తనక్రియారంభకు నుల్లసన్మగధరాజచతుర్విధఘోరవాహినీహంతకు నింద్రనందననియంతకు సర్వచరాచరావళీసంతకు నిర్జితేంద్రియసమంచితభక్తజనానుగంతకున్ ॥ * (ఉ॥ న్యాయికి భూసురేంద్రమృతనందనదాయికి రుక్మిణీమనస్స్థాయికి భూతసమ్మదవిధాయికి సాధుజనానురాగసంధాయికిఁ బీతవస్త్రపరిధాయికిఁ బద్మభవాండభాండనిర్మాయికి గోపికానవహామందిరయాయికి శేషశాయికిన్ ॥ * (వ॥ సమర్పితంబుగా నే నాంధ్రంబున నొనర్పంబూనిన శ్రీమహాభాగవతపురాణంబునకుం గథా

శ్రీమద్భాగవతకథాప్రారంభము.

ప్రారంభం బెట్టిదనిన ॥ * (సీ॥ విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వనివలన నేర్పడుచునను వర్తనమున । వ్యావర్తనమునఁ గార్యములందభిజ్ఞుఁడై తానరాజగుచుఁ జిత్తమునఁ జేసి । వేదంబుల జునకు విదితముల్గావించె నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ । నికి నెండమావులనీటఁ గాచాదుల నన్యోన్యబుద్ధి గానడుసనట్లు । త్రిగుణసృష్టియందు దీపించు సత్యము । భంగిఁ దోఁచు నట్టి ప్రభుని రస్త । కుహకుఁ డెవ్వఁడతనిఁ గోరి చింతించెద । ననఘు సత్యుఁ బరుని ననుదినంబు ॥ * (వ॥ ఇట్లు సత్యంపరంధీమహి యను గాయత్రీప్రారంభంబున గాయత్రీనామబ్రహ్మస్వరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసురవధంబు నెందుం జెప్పంబడు నదియ భాగవతంబని పలుకుటం జేసి యిప్పురాణంబు శ్రీమహాభాగవతంబన నొప్పుచుండు ॥ * (సీ॥ శ్రీమంతమై ముని శ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ । వినఁ గోరువారల విమలచిత్తంబులఁ జెచ్చెర నీశుండు సిక్కుఁ గాక । యితరశాస్త్రంబుల నీశుండు సిక్కునే మంచివారలకు నిర్మత్సరులకుఁ । గపటనిర్ముక్తులై కాంతు సేయకయును దగిలి

యము॥ భా॥ పరమార్థప్రతిపాదకమాటచే సత్పురుషులకు లెస్సగాఁ దెలియఁదగినది. కల్ప - మంచివన్నెలుగల పుష్పములచేత లెస్సగాఁ దెలుసుకొనఁదగినది. సుందరోజ్జ్వలవృత్తంబు॥ భా॥ వృత్తంబు - నానావిధఛందోనిబద్ధములగు. వంశస్థ॥ పుష్పితాగ్రాదివృత్తములుగలది. కల్ప॥ వృత్తము వినసొంపుగానుండు. సర్వలోకప్రసిద్ధంబైన ప్రఖ్యాతిగలది - విమలవ్యాసాలవాలంబు. కల్ప॥ పరిశుద్ధమై గుండ్రనైన పాదుగలది. భా॥ స్పష్టము సద్విజశ్రేయము. భా॥ ద్విజశబ్దవాచ్యులగు బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు, అధ్యయనాదులచే మోక్షరూపమగు క్షేమమును గలుగఁజేయునది. కల్ప॥ ఉత్తములగు శుకపికాదులకు ఫలప్రదానాదులచేత క్షేమమునుఁ గలుగఁజేయునది. —అనువర్తనమునన్ - అన్వయవ్యాప్తిచేత అన్వయవ్యాప్తియనఁగా, కార్యసద్భావమువలనఁ గారణసద్భావమును నిశ్చయించుట. వ్యావర్తనమునన్ ॥ వ్యతిరేకవ్యాప్తిచేత - వ్యతిరేకవ్యాప్తియనఁగా-, కారణాభావమువలన - కార్యాభావమును నిశ్చయించుట. ఇందుకుదాహరణము - ధూమముండుచోట నగ్నియుండుననుట యన్వయవ్యాప్తి. ఎచ్చోట నగ్నిలేకున్నదో - అచ్చోట ధూమముండదనుట వ్యతిరేకవ్యాప్తి. ఈ వ్యాప్తిద్వయముచేత బ్రహ్మజగత్కారణమని నిశ్చయింపఁబడుచున్నదనుట. రెండవపక్షము. అనువర్తనమనఁగా ॥ ఉపాదానకారణభూతమయి మృత్సువర్ణాదులు - ఘటకుండలాదులందునుండు తెఱంగున ననువర్తించియుండుట. వ్యావర్తమనఁగా - ఘటకుండలాదులవలె వికృతిరూపమగు భేదము నొందియుండుట. కాఁగా-మృత్సువర్ణాదులవలె ననువర్తించియుండుటవలన సద్రూపంబగు బ్రహ్మ జగత్కారణమగుచున్నది. వికృతిగానుండుటవలన-జగత్తు ఘటకుండలాదులవలె కార్యరూపమగుచున్నదనుట. కార్యములయందు ॥ ఆకాశాదికార్యములయం దభిజ్ఞుఁడు, సర్వజ్ఞుఁడు, తానరాజగుచు స్వరాట్టుగానుండును. అనఁగా స్వయంప్రకాశమానస్వరూపుఁడగుచు.—ఎండమావులన్ ॥ జలమరీచికలయందు-నీటన్ ॥ జలమందును, కాచాదులన్ ॥ గాఁజురాలు మొదలైనవానియందును, అన్యోన్యబుద్ధి ॥ పరస్పరభ్రాంతి-అనఁగాఁ దేజోరూపమగు నెండమావులయందు జలభ్రాంతి - జలమందు - కాచాదిభ్రాంతియు నీ తెఱంగున పరస్పరభ్రాంతి కలుగుచున్నదనుట. చిత్తమునఁ జేసి ॥ మనస్సువలననే చతుర్ముఖునకు వేదములను దెలిపెననుటచేత బుద్ధివృత్తిప్రవర్తకుఁడాయెనని యభిప్రాయము. నిరస్తకుహకుఁడు ॥ నిరస్త- పోఁగొట్టఁబడిన. కుహకుఁడు - కపటముఁ గలవాఁడు. అనఁగా, మాయికమగు ప్రపంచసంబంధము లేనివాఁడనుట.—సత్యంపరంధీమహి ॥ అను గాయత్రీప్రారంభమున్ - అనువచనమునందుఁ గల సంగతులన్నియు శ్రీ

యుండుటను మహాతత్త్వబుద్ధిఁ । బరఁగనధ్యాత్మికాదితాపత్రయంబు । నడఁచిపరమార్థభూతమైయధికసుఖద । మైసమస్తంబు గాఁకయునగుచునుండు । వస్తువెలుఁగంగఁదగు భాగవతమునందు*(గీ॥ వేదకల్పవృక్షవిగళితమై శుక । ముఖసుధాద్రవమున మొనసియున్న । భాగవతపురాణఫలరసాస్వాదన । పదవిఁగనుఁడు రసికభావవిదులు(క॥పుణ్యంబై మునివల్లభ।గణ్యంబై కుసుమఫలనికాయోత్థితసా।న్గుణ్యంబై నైమిశా। రణ్యంబునుతింపఁదగునరణ్యంబులలోఁ*(వ॥ మఱియును మధువైరిమందిరంబునుంబోలె మాధవీమన్మథమహితంబై, బ్రహ్మగేహంబునుంబోలె శారదాన్వితంబై, నీలగళసభానికేతనంబునుంబోలె వహ్ని వరుణసమీరణ చంద్రరుద్రహైమవతీకుబేరవృషభగాలవశాండిల్యపాశుపతజటిల పటలమండితంబై, బలభేదిభవనంబునుంబోలె నైరావతామృతరంభాగణికాభిరామంబై, ధనదాగారంబునుంబోలె శంఖకుంద ముకుంద సుందరంబై, మురాసురనిలయంబునుంబోలె నున్మత్తరాక్షసవంశ సంకులంబై, రఘురామయుద్ధంబునుంబోలె నిరంతరశరోగ్రానలశిఖాబహుళంబై, పరశురామభండనంబునుంబోలె నర్జునోద్భేదంబై, దానవసంగ్రామంబునుంబోలె నరిష్టజంభనికుంభశక్తియుక్తంబై, కౌరవసంగరంబునుంబోలె ద్రోణార్జునకాంచనస్యందనకదంబసమేతంబై, కర్ణుకలహంబునుంబోలె మహోన్నతశల్య సహకారంబై, సముద్రసేతుబంధనంబునుంబోలె నలనీలపనసాదిప్రదీపితంబై, భర్గువచనంబునుంబోలె నానాశాఖాలేఖాఫలితంబై, మరునికోదండంబునుంబోలెఁ బున్నాగశిలీముఖభూషితంబై, నరసింహరూపంబునుంబోలెఁ గేసరకరజకాంతంబై నాట్యరంగంబునుంబోలె నటనటీసుషిరాన్వితంబై, శైలజానిటలంబునుంబోలెఁ జందనకర్పూరతిలకాలంకృతంబై, వర్షాగమంబునుంబోలె నింద్రబాణాసనమేఘకరకకమనీయంబై, నిగమంబునుంబోలె గాయత్రీవిరాజితంబై, మహాకావ్యంబునుంబోలె సరసమృదులతాకలితంబై, వినతానిలయంబునుంబోలె సుపర్ణరుచిరంబై, యమరావతీపురంబునుంబోలె సుమనోలలితంబయి, కైటభోద్యోగంబునుంబోలె మధుమానితంబయి, పురుషోత్తమసేవనంబునుంబోలె నమృతఫలదంబయి, ధనంజయసమీకంబునుంబోలె నభంగకపవరాగంబయి, వైకుంఠపురంబునుంబోలె ఖడ్గపుండరీకవిలసితంబయి, నందఘోషంబునుంబోలెఁ గృష్ణసారసుందరంబయి, లంకానగరంబునుంబోలె రామమహిషీవంచకసమేతంబయి, సుగ్రీవసైన్యంబునుంబోలె గజగవయశరభశోభితంబయి, నారాయణస్థానంబునుంబోలె నీలకంఠహంసకౌశికశుకభరద్వాజతిత్తిరిభాసురంబయి, మహాభాగతంబునుంబోలె నేకచక్రబకకంకధార్తరాష్ట్రశకునినకుల సంచారసమ్మిళితంబయి, సూర్యరథంబునుంబోలె నురుతరప్రవాహంబయి, జలదకాలసంధ్యాముహూర్తంబునుంబోలె బహువితతజాతిసౌమనస్యంబయి, యొప్పునైమి

---

భాగవతమునకు శ్రీధరీయమనెడు నద్వైతవ్యాఖ్యానమునందుఁ దెలియఁజేయఁబడిన విషయములేకాని మూలమునందుఁగలవికావు, ఇదేతీరున నీగ్రంథమునందుఁ దఱుచుగా వ్యాఖ్యానవిషయంబులతోఁజేర్చి, మూలమునందుఁగల యావద్విషయములను సమగ్రముగాఁ దెలియఁజేయుటయొకాక ఆయాస్థలములందు, స్వకపోలకల్పితముగా ననేకవిషయములురచియింపఁబడియున్నవి—మధువైరిమందిరంబు ॥ శ్రీకృష్ణునిగృహము, మాధవీమన్మథమహితంబై ॥ మాధవీ-శ్రీమహాలక్ష్మిచేతను, మన్మథ-మన్మథునిచేతను, మహితంబై-పూజితముగనున్నది అరణ్యపక్షమందు ॥ మాధవీ-పువ్వులగురువిందలు, మన్మథ-వెలగచెట్లు, వీటిచేతఁగొనియాడఁబడియున్నదియనియర్థము. బ్రహ్మగేహంబు - సత్యలోకము, శారదాన్వితంబు సరస్వతీదేవితోఁగూడుకొనియున్నది. అరణ్య ॥ శారద - ఏడాకులఅంటిచెట్లచేతఁగూడుకొనియున్నది. నీలగళసభానికేతనంబు ॥ శివునిసభాస్థానము-వహ్ని మొదలగువారలుదిక్పాలకులు-హైమవతీ॥ పార్వతీ-వృషభాదులు ॥ ఋషులు-జటిపటలమండితంబు-ఋషిసమూహముచేతనలంకృతంబు-అరణ్య॥వహ్ని-చిత్రమూలము, వరుణ-ఉలిమిరిచెట్లు, సమీరణ-మరువము, చంద్ర - ఏలకతీఁగెలు, రుద్ర-రుద్రజడ, హైమవతీ - కరకచెట్లు, కుబేర-కలిగొట్టుచెట్లు, వృషభ-అడ్డసరపుచెట్లు, గాలవ-లొద్దుగచెట్లు, శాండిల్య-మారేడుచెట్లు, పాశుపత-పాశుపత్రమను పువ్వులచెట్లు, జటి-జువ్విచెట్లు, వీనియొక్క, పటల-సమూహముచేతను, మండితంబై-అలంకృతంబై అనిఅర్థము. బలభేదిభవనంబు - ఇంద్రునిగృహము, ఐరావత-ఐరావతమనుగజము, అమృత॥సుధ-రంభాగణికా॥రంభయనెడువారాంగన - వీరిచేత - అభిరామంబై యొప్పుచుండునది అరణ్య॥ఐరావత-నారదపుచెట్లు, అమృత-ఉసిరికచెట్లు, రంభా-అఁటిచెట్లు, గణికా-అడవిమొల్లలు, వీనివల్ల నొప్పుచునుండెడునది. ధనదాగారంబు - కుబేరునిమందిరంబు, శంఖ,కుంద,ముకుందంబులు,నిధిభేదంబులు. అరణ్య ॥ శంఖ-నఖమనెడుగంధిద్రవ్యపుచెట్లు, కుంద-మొల్లలు, కుముద - తెల్లకలువలు, వీనివల్లనలంకృతమైనది. మురాసురనిలయంబు - మురాసురునిగృహము, ఉన్మత్త - ఉన్మత్తుఁడనెడి, రాక్షసవంశ - రాక్షసవంశమువల్లను. అరణ్య॥ఉన్మత్త-ఉమ్మెత్తచెట్లు, రాక్షస-బలురక్కసిచెట్లు, వంశ-వెదుళ్లు. వీనిచేత-సంకులంబై-వ్యాకులంబుగానున్నది. రఘురామయుద్ధము ॥ రామయుద్ధము. నిరంతర—బహుళంబై - ఎల్లప్పుడు బాణములయొక్క భయంకరములగు, అగ్నిజ్వాలలవలన నధికముగనుండునది. అరణ్య॥శర॥కాకివెదుళ్లు-ఉగ్ర॥గాటుగానుండెడు-అనల-చిత్రమూలముయొక్క. శిఖా-కొమ్మలకొనలవలన, బహుళంబై-అధికమైయున్నది. పరశురామభండనంబు-పరశురామునియుద్ధము. అర్జున-కార్తవీర్యార్జునునియొక్క, ఉద్భేదము-భేదించుటగలది. అరణ్య॥అర్జున-మద్దిచెట్లయొక్క, ఉద్భేదము-ప్రకాశముగలది. దానవసంగ్రామంబు-రాక్షసులయుద్ధము. అరిష్ట, జంభ, నికుంభులనెడురాక్షసులు. అరణ్య॥ అరిష్ట-కుంకుడుచెట్లు, జంభ-నిమ్మచెట్లు, నికుంభ-దంతిచెట్లు, ద్రోణార్జునులు-ప్రసిద్ధులు. కాంచనస్యందన కదంబసమేతంబు - పసిఁడియరదంబులగుంపులతోఁగూడుకొనియున్నది. అరణ్య॥ద్రోణ-నీలిచెట్లు, అర్జున-మద్దిచెట్లు, కాంచన-ఉమ్మెత్తచెట్లు, స్యందన-నెమ్మిచెట్లు, కదంబ-కడపచెట్లు, వీనివలనఁగూడికొనినదై మహోన్నతంబై-ఉత్కృష్టుఁడైనశల్యసహాయంబుగలదై. అరణ్య-మిక్కిలిపొడవుగల, శల్య-మంగచెట్లు, సహకారంబై - తియ్యమామిడిచెట్లుగలదై॥నల,నీల,పనసలు ప్రసిద్ధవానరులు. అరణ్య॥నల-వట్టివేరు, నీల-నీలిచెట్లు, పనస-పనసచెట్లు, నానాశాఖాలేఖాఫలితంబై - అనేకవిధము



శ్రీరామపరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్రభాగవతపరిష్కరణప్రకారప్రకాశపీఠిక.

శ్రీమదశేషభువననిర్మాణరక్షణనిబర్హణప్రవణకర్మాలంకర్మీణాపరిణేయచాతురీమహిమానువర్ణనకృతార్థంమన్యమానసనకసనందనాదిపరమభాగవతజనతోష్టూయమానాగణ్యవరేణ్యగుణగణపరాయణాదినారాయణాంశసంభూతుండగువ్యాసుండునిఖిలలోకులకుధర్మాదిపురుషార్థచతుష్టయసిద్ధింగలుగఁజేయుండలంచిరచియించినభాగవతంబనునుత్తమపురాణంబునాంధ్రభాషయందు, గద్యపద్యాత్మకంబుగానొనర్చినశ్రీమదిందిరారమణసుందరచరణారవిందనిష్యందమానమరందపానతుందిలమదవదిందిరాయమానమానసుండైనశ్రీమత్పరమభాగవతుండగుబమ్మెరపోతనామాత్యునిజన్మకర్మప్రభావాద్యభివర్ణనంబునిఖిలజనోల్లాసజనకంబుగానుండుననితలఁచి యీదిగువసంగ్రహముగావివరించెదము.

శాలివాహనశకసంవత్సరంబులు-౧౩౦౦ గలకాలంబుగతంబైయుండుసమయంబునభగవద్భక్తులకునత్యంతోపయుక్తంబుగావించుటకువ్యాసావరావతారంబనఁబొగడొందఁదగినసుగుణగణాకరుండైనపోతనామాత్యుండుబమ్మెరవంశప్రసూతుండైన, కేసనమంత్రికిఁదనూజుండుగాజనించె-నిమ్మహాత్ముండుబాల్యంబునందు, గోసంరక్షణార్థంబుగాస్వగ్రామంబగునేకశిలానగరంబునకుసన్నికృష్టపర్వతాగ్రంబునసంచరించుసమయంబునఁ దచ్చటవతనిపూర్వజన్మసుకృతపరిపాకాతిశయంబునంజిదానందయోగీంద్రుండనునొక్క-ఋషిశ్రేష్ఠుండతనికి దృగ్గోచరుండయ్యె-నంతనాపోతనామాత్యుండమ్మహాత్మునింగాంచియతనిచెంతకుంజనియత్యంతభయభక్తులచేనవనతశరీరుండై యభివందనంబొనర్చి శరణుఁజొచ్చితిననిపలుకనాతపోధనుండుబాలుండగుపోతనామాత్యునియందవ్యాజకరుణనుంచి,శ్రీరామమంత్రరాజంబనుగ్రహించి,తదనుష్ఠానక్రమంబశేషంబుఁదెలిపికృతార్థుండవుగమ్మనిపలికియంతర్ధానంబయ్యె-నంతనాపోతనామాత్యుండత్యంతనియమనిష్ఠాగరిష్ఠుండు, నేకవారనియమితాహారుండును భూశయ్యాపరుండును,పుత్రమిత్రకళత్రక్షేత్రదాసీదాసపశుగృహవిత్తాద్యాసక్తిరహితుండును,ద్వంద్వసహిష్ణుండును,పరధనపరదారపరాఙ్ముఖుండును,నరస్తుతివిముఖుండును,భగవద్గుణవర్ణనైకాయత్తచిత్తుండునుయదృచ్ఛాలాభసంతుష్టమానసుండును నైశుక్లపక్షపాకరునికరణిస్వతపోమహిమచేఁగ్రమముగావృద్ధినొంది, విధూతాఖిలభవబంధబంధురుండైఋషివర్యునింబోలిలోకంబునవినుతికెక్కియుండెనిట్లుండఁ దనిమ్మహాత్మునికిశ్రీరామప్రసాదంబునననన్యాదృశానవద్యకవిత్వవిద్యావాస్తికలుగుటంజేసితత్కాలప్రసిద్ధులుగానుండినవిశిష్టశిష్టపండితజనులతనితోశ్రీమద్భాగవతంబాంధ్రభాషయందుగద్యపద్యాత్మకముగారచియింపనీవయర్హుండవుగావునఖిలలోకహితార్థంబుగానొనరింపవలయుననిప్రార్థింపఁబోతనామాత్యుండట్టియుత్తమజనప్రార్థనచేఁబరితుష్టహృదయుండైయాదుర్ఘటకార్యంబునెరవేరుటకుశ్రీరామప్రసాదంబుగోరిగంగాతీరంబునకరిగియచ్చటసోమోపరాగపుణ్యకాలంబున నానదియందుగృతస్నానుండైశ్రీరామమంత్రానుష్ఠానంబు సేయుచుహృదయంబునస్వాభిలషితార్థంబుదలంచియాకార్యంబునెరవేరుటకుశ్రీరామానుగ్రహంబునుంబ్రార్థింపనత్తఱిఁగృపాసముద్రుండగుశ్రీరామభద్రుండతనికిబ్రత్యక్షంబైయతండాంధ్రభాషయందు జేయనుద్యమించిన శ్రీభాగవతగ్రంథంబస్మదంకితంబుగాఁజేయుమదిసమగ్రంబుగానెరవేరునని యనుగ్రహించియంతర్ధానంబునొందె-నంతనతండుగృతార్థంమన్యమానుండైమఱలియేకశిలానగరంబనుస్వగ్రామంబున కేతెంచిశ్రీరామమూర్తిని హృదయంబునభావింపుచుఁదదనుగ్రహంబుననాంధ్రభాగవతంబనను గ్రంథంబుసమగ్రంబుగారచించి సంతసిల్లియుండె.

## ఆంధ్రభాగవతరచనాక్రమము.

పైఁదెలిపినపోతనామాత్యునిచేరచితంబగునాంధ్రభాగవతంబునంగలగ్రంథసంఖ్యసాకల్యంబుగాగణింపసరాసరిముప్పదివేలున్నవి.ఈగ్రంథంబునకుమూలభూతంబగుసంస్కృతభాగవతంబునంగలగ్రంథసంఖ్యరమారమియిరువదిరెండువేలుగానున్నవి. ఈమీఁదజెప్పినక్రమమునవాదిగ్రంథమనతిక్రమించెడిగ్రంథసంఖ్యగలదిగానీగ్రంథరచనచేయుటకుమూలకారణంబెయ్యదియనిన, బ్రాహ్మ్యాద్యష్టాదశపురాణంబులలోనుత్తమంబగునీభాగవతంబత్యంతరహస్యార్థప్రతిపాదకపరమవేదాంతప్రతిపాద్యభగవద్గుణగణాపాదకంబగు నుత్తమగ్రంథంబైనందుననిట్టిగూఢంబైనగ్రంథార్థంబుదేటపడునట్లువ్యాఖ్యానరూపముగాననభివర్ణించుటవల్లను. భగవద్గుణవర్ణనాదిఘట్టంబులసంస్కృతభాగవతప్రతిపాదితక్రమముననభివర్ణించిస్వకీయభగవద్భక్త్యతిశయమునస్వానవద్యకవిత్వవిద్యాచాతురీసంప్రాప్తసిరఁకుశస్వాతంత్ర్యమును,సకలవిద్వజ్జనంబులకుందెలుపుటకుగానుభగవద్గుణాదులనువిశేషముగావర్ణించుటవల్లను, భాగవతగ్రంథప్రతిపాదితంబుగాకవిశిష్టశిష్టజనాంగీకార్యంబులగువిష్ణుపురాణహరివంశాదిగ్రంథంబులయందుబ్రతిపాదితంబులగుకథాశేషంబులఁదెలుపుటవలనను* ఈమీఁదజెప్పినహేతుత్రయంబువలననాంధ్రభాగవతంబునందుసరాసరియష్టసహస్రగ్రంథసంఖ్యయధికంబైయున్నదిగానసంరక్షితసకలార్థంబులుగలధనికునకునధికార్థంబుచేకూడుటచేనతనిసంపదయతిశ్లాఘ్యంబుగానుండురీతిసంస్కృతభాగవతగ్రంథప్రతిపాదితార్థాతిరిక్తభగవద్గుణవర్ణనాదులుగలయీగ్రంథంబతిపూజ్యంబుగాసకలవిద్వజ్జనంబులచేనంగీకరింపఁబడఁదగినదిగానున్నయది-ఇదియనుంగాకభారతరామాయణవిష్ణుపురాణప్రముఖాద్యుత్తమగ్రంథంబులఁదెనుంగునగద్యపద్యాత్మకంబుగాఁజేసిననన్నయభట్ట,తిక్కనసోమయాజి,భాస్కరకవిప్రభృతులగుమహాకవులాయాగ్రంథస్థితకథాంశానుక్రమణికమాత్రమువదలకదమకుదోఁచినట్లుగ్రంథరచనగావించినందునసపాదలక్షగ్రంథపరిమితంబగుమహాభారతంబాంధ్రంబునసరాసరిపంచాశత్సహస్రసంఖ్యాకగ్రంథవిస్తృతంబైయున్నది. ఇదేరీతిన నిరువదినాల్గువేలగ్రంథపరిమితంబై షట్కాండసముదయంబు

* విష్ణుపురాణోక్తంబులగుసత్యభామయుద్ధాదికథాభాగములిందుదెలుపఁబడియున్నది. దీనిమూలగ్రంథంబగుభాగవతమందుఁదెలుపఁబడలేదు.

గల శ్రీమద్రామాయణంబు దెనుంగునం దు జెప్పినచో ప్పవ భాస్కరకవి పంచదశసహస్రగ్రంథవిస్తృతంబుగా నొనర్చె. నిట్లు మూలగ్రంథార్థం బతిసంగ్రహంబు చేసి స్వేచ్ఛననుసరించి గ్రంథంబుల రచియించుటవలన వ్యాసవాల్మీకాదిమహర్షులు యథోక్తార్థంబు సమగ్రంబుగా దెలుపబడక కేవలకథాంశానుక్రమవర్ణనపరంబులుగా నుండుటవలన ఋషిప్రోక్తసంస్కృతగ్రంథంబులవలె నత్యాదరణీయంబులుగా నేరవు గావునం బూర్వోక్తక్రమంబున నీభాగవతంబు వ్యాసప్రోక్తభాగవతగ్రంథార్థంబున నించుకమాత్రంబైనం బొరపాటు లేకనుండుటయ కాక నాయాసందర్భానుసారముగా హరిగుణవర్ణనాధిక్యాదులుం గలిగియుండుటవలన సమగ్రభగవద్గుణప్రతిపాదకగ్రంథమగుచున్నది. ఇందువలన భగవద్వ్యాసప్రణీతభాగవతంబువలె బోతనామాత్యవిరచితంబగు నీయాంధ్రభాగవతంబు బఠియింపంబడేనేని నిఖిలజనులకు నైహికాముష్మికఫలప్రదంబగు నని నిశ్చయించి చెప్పుటకు నేమియును సందేహంబు లేదని యఖిలసుజనులకతిదృఢంబుగాం దెలుపుటయం దత్యంతానందంబు నొందెదము.

## ఆంధ్రభాగవతపరిష్కరణపద్ధతి.

ఈమీద దెలిపిన తెలుంగున నతిపూజ్యంబగు నీయాంధ్రభాగవతం బఖిలజనగ్రాహ్యంబగుటం జేసి పండితాపండితజనులకు సాధారణంబుగా నీగ్రంథంబు పఠనపాఠనశ్రవణాద్యర్థంబై యంతట వ్యాపించియున్నది గాన నింపు లేఖకప్రమాదాదులవలన చాచినీళ్ళను గప్పియున్న కరణి నక్షరవ్యత్యాసములచేతను విరుద్ధయతిగణప్రాససంధ్యాగమశేషాదిసమావేశముచేతను, వ్యత్యస్తశబ్దప్రయోగములచేతను, గ్రంథపాతములచేతను, ప్రక్షిప్తగ్రంథగ్రథనముచేతను, నీగ్రంథ మాచ్ఛాదింపబడియుండుటవలన శ్రోతృవాచకార్థావబోధకులకు దదీయవిషయంబులన్నియు సందేహసముదయగ్రస్తంబులుగా నున్నవి గాన మీద జెప్పిన మూడువిధములవారికి నపరిహార్యంబగు కలతయు, ననుత్సాహకరంబైన హేయతాబుద్ధియు, నపరిమితమనోవేదనయుం గలుగుచున్నది. మఱియు మీద జెప్పిన క్రమంబున లేఖకప్రమాదాదులవలనం దటస్థంబులగు దోషంబులం బరిష్కరింపనశక్తులైన పామరజనులట్టి దోషంబుల మహాకవియగు గ్రంథకర్తయందారోపించి యుత్తమకవివిరచితంబై పండితజనాంగీకారముగా నుండు నీగ్రంథంబును లాక్షణికకవిప్రణీతగ్రంథంబులతో జేర్చి స్వావివేకమూలము దెలిసికొనజాలక తమంతటం దాము పరిహసింపుచు బండితమన్యమానులై కుకవినామములచే వ్యవహరింపబడుజనులకు నీమీద దెలిపిన లేఖకప్రమాదాదిజనితదోషంబు లేవారి పరిహాసంబునకు సాధారణంబుగా నున్నది గాన, మీద దెలిపిన శ్రోతృవాచకతదర్థావబోధకులకు బరితోషంబును, కుకవిజనులకపరితోషంబును గలుగ జేయుటకై యాంధ్రగ్రంథంబులలో నుత్తమోత్తమంబగు నీతెనుగుభాగవతంబు మూలభూతంబగు సంస్కృతభాగవతంబునకు సరిచూచి పరిష్కరించి ముద్రాక్షరములయందు బ్రకాశపఱచుట నిఖిలాస్మదీయసుజనానందజనకముగా నుండునని నిశ్చయించి యదేక్రమంబున శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తియనుగ్రహంబున ద్వాదశస్కంధంబులు సంపూర్ణముగా బ్రకాశపఱచడమైనది. ఇంతియకాక వేరొకవిశేషం బెందు దెలుపబడియున్నది దెట్లనిన వివరింపుచున్నారము:

శ్రీరామానుగ్రహాత్తానర్గళకవిత్వధారానిరాకృతాఖిలకవిజనజేగీయమానపదశయ్యావినుతానుపమసాహిత్యుండగు బోతనామాత్యుని పదలాలిత్యంబును, బాకవైలక్షణ్యంబును, శబ్దసౌష్ఠవంబును, దత్తద్ఘట్టోచితానన్యాదృశానవద్యభేదపదాద్యభినివేశచాతుర్యసాహిత్యమును దత్తద్వర్ణనసందర్భసముచితానుపమోల్లేఖానునయనవైదుష్యాదులనేకప్రకారంబుల నేకమూలగ్రంథంబుల రప్పించి వానినాద్యంతరంబు బరిశీలించిన యెడ నీగ్రంథమునందుగల దశమస్కంధోత్తరభాగంబున దెలిపియుండెడి రుక్మిణీదేవితో స్వామి విరసోక్తులాడెడి ఘట్టము మొదలుకొని తదుపరిగ్రంథభాగవిషయంబులు పై జెప్పిన తెలుంగున బోతనామాత్యుని పదశయ్యాదిసాజాత్యము నొందక నిత్తుకాలడగతపర్వంబులలో నాద్యంతంబులకుగల రసభేదంబునుం బోలి రసపుష్టి లేక పరస్పరవిభిన్నంబులుగా నుండుటవలన నిట్టిభేదంబు మహాకవిప్రణీతగ్రంథంబునం గలుగుటకు మూలకారణం బెయ్యదియని యన్వేషింపుచు సందిగ్ధాంతరంగులమై వేరే కొన్ని మూలగ్రంథములను రప్పించి యాయాఘట్టంబులం జూడ నందు మేము సంశయించిన ఘట్టమునం దేకొన్ని ప్రతులలో (కాటుక నేరయంగ గన్నీరు వరదలై) అను సీసపద్యము మొదలు శిష్టాంతము పోతనామాత్యప్రణీతము గాదనియు మఱికొన్ని ప్రతులందక్కడనే తదుపరిగ్రంథంబు వెలిగందల నారయాఖ్యప్రణీతంబనియు, వేరేకొన్ని గ్రంథంబుల నాఘట్టమునందుగల మీద దెలిపిన సీసపద్యాంతిమపాదాదియందది మొదలు శిష్టగ్రంథభాగమంతయు బోతనామాత్యప్రియశిష్య వెలిగందల నారాయణకవివిరచితంబని తెలివియుండంగ నిస్సంసందేహనివర్తకప్రాచీనపండితజనలేఖనానుమోదితాత్మాభిప్రాయులమై యదేరీతిన నది మొదలుకొని యగ్రిమగ్రంథభాగంబు నత్యాదరంబుతో సంస్కృతభాగవతానుసారముగం బరిష్కరింపుచు గ్రంథపాతాదుల నానాదేశాగతగ్రంథంబులవలన బరిష్కరించి పూర్ణంబుగా జేయుచు దశమాదిద్వాదశస్కంధంబులలో నితరకవివిరచితస్కంధంబులందు నాయాస్కంధాంతిమగద్యయందు దెలియబడునట్లు వ్రచి నిఖిలాస్మదీయజనులకు క్షేమంబుగా వించుటకు ముద్రాక్షరములయం దనేకప్రతులు గలుగునట్లు ప్రకాశపరచడమైనది.

## అన్యకవివిరచితగ్రంథప్రక్షేపణ కారణవివేచనము.

పై దెలిపిన క్రమంబున మహాకవియగు పోతనామాత్యుండు శ్రీరామప్రసాదంబున భాగవతంబు సంపూర్ణముగా రచియించి తన నిర్యాణావసరంబున గుమారుండగు *మల్లనయను మహాకవిని బిలిచి యతనితో నఖిలరహస్యార్థప్రతిపాదకమగు స్వకృతాంధ్రభాగవతంబు సాధనచతుష్టయసంపన్నులగు ముముక్షుజనులకు నధ్యేయంబు గాని యైహికసుఖేచ్ఛైకపరులగు పామరజనంబులకు నధ్యయనార్హంబు గాదు గాన సజ్జనవేద్యంబుగా నొనరింపవలదని చెప్పినందున దన్నిర్యాణానంతరకాలంబున దత్తనూజుండగు మల్లన పితృవాక్యపరిపాలనైకాయత్తచిత్తుండై తద్గ్రంథరచనార్థజనాన్వేషణంబు సేయుచు నొరుల కెవ్వరికిం బరిగ్రాహ్యంబు గానీ తెలుంగున నాగ్రంథంబు నేకసంపుటంబుగా నేర్పరచి యతిరహస్యంబున నిజదేవతార్చనాపేటికయందుని చిరకృతార్థం మన్యమానసుండై యుండె నంత నతం డవసానకాలంబునం దనకు సతీర్థ్యుండగు వె. నారాయణకవిం బిలిచి యతనితో దానురహస్యముగా దేవతార్చనాపేటికయందు గాపాడెడు తన పైతృకధనంబున దేక్రమంబున గాపాడుమని స్వాభిప్రాయంబు దెలిపి మృతినొందననంతరకాలంబున నారాయణకవి యట్టిరహస్యంబగు నతని పైతృకధనం బెయ్యదియని తెలియంగోరి తదుక్తప్రకారంబున నా

---

*రుక్మాంగదచరిత్రం బనునుత్తమకావ్యంబు రచించిన మహాకవి యితండె.

దేవతార్చనాపేటికి నాద్యంతంబుఁ బరిశోధింపనందు నీమహాగ్రంథంబతి జీర్ణంబులై యాఁడును త్రమపై నాంబరాదులచేన నేక ప్రకారంబులఁ బరివేష్టితంబై యతి శైథిల్యంబునొంది నానావిధ క్రియలచేన నేక ఘట్టంబులవిభ్రష్టంబై యుండంగని యపార దుఃఖసాగరమగ్నుండై యుండ నాదినమున రాత్రియందతని స్వప్నంబునం బోతనామాత్యుండే తెంచి యతనితో మందు దనకు మారుండుగా వించిన కార్యంబతి భక్తిజనితాత్యుక్తి ప్రయుక్తావివేకఫలంబుగా నుండుచున్నది గాన నింక నీవు నీమహాగ్రంథమున నేక ప్రతులుగా నేర్పఱచి సాకల్యంబుగా భ్రష్టంబులైన ఘట్టంబులయందు నన్ను ధ్యానింపుచు నవీనముగా రచియించి యాగ్రంథంబంతేయు మత్కృతంబుగా నుండునట్లు ప్రకాశపరచవలయునని యాజ్ఞాపించె- నంత నానారాయణార్యుఁడి యదే ప్రకారంబున నత్యంత గురుభక్తి సమన్వితుండై గురువాజ్ఞానుసారముగా నా గ్రంథమునందు సాకల్యంబుగా విభ్రష్టంబులైన ఘట్టంబుల నవీనముగా రచియించి పూర్ణంబులుగా నొనర్చి తక్కిన గ్రంథభాగమునంతయు లెస్సగాఁ బరిష్కరించి యనేక ప్రతులేర్పడునట్లు లిఖియించి లోకంబున ప్రసిద్ధినొందింపఁజేసెఁ గావునఁ, బంచమ, షష్ఠ, ఏకాదశ ద్వాదశ స్కంధంబులును, బోతనామాత్యుని పదశయ్యాది సాజాత్యమునొందియుండని వేఱె కొన్ని ఘట్టములును, వెం. నారాయణకవి ప్రభృతులగు పోతనామాత్యశిష్యజనరచితంబులని తెలియఁదగినవి- ఈవిషయమంతయు బమ్మెరపోతనామాత్యుని జన్మకర్మ ప్రభావాదులఁ దెలిపెడు వచనరూపంబగు ప్రాచీన పండితజనలిఖిత గ్రంథంబు రప్పించియందు దెలిపియుండెడు క్రమమున నతిసంగ్రహముగా నిందు దెలుపడమైనది. ※

## ※ శ్రీకృష్ణావతారకాలనిర్ణయవిచారఘట్టము. ※

శ్రీమదాశ్రితజనాపన్నివారణైక పరాయణుండగు నాదినారాయణుండు భూభారావతరణార్థంబు బ్రహ్మరుద్రేంద్రాదినిఖిలదేవగణంబుచే సంప్రార్థితుండై శ్రీకృష్ణావతారంబు నొంది యఖిలదుష్టజననిబర్హణశిష్టజనపరిరక్షణాదికృత్యంబుల సలిపియమానుషంబులగు ననంతవిచిత్రచరిత్రంబులచేన పరిమేయమహిమన శేషభక్తజనాళికిం దెలిపిమఱల బ్రహ్మాదిదేవగణ ప్రార్థితుండై స్వధామంబగు వైకుంఠధామంబునకరిగెనట్టి యపరిమేయానన్యాదృశానపద్యగుణగణప్రభావవినుతుండగు భగవంతుని యవతారకాలనిర్ణయంబు నన్యానాసతిరిక్తంబగునట్లు సాకల్యంబుగా దెలిపెడు భాగవతవిష్ణుపురాణహరివంశాది గ్రంథంబులలోఁగొన్నిటియందు శ్రీకృష్ణావతారఘట్టంబున తజ్జననక్షత్రమును. దదావిర్భావప్రతిపాదక నిశీథకాలవిశేషమును మాత్రము దెలిపియున్నది-మఱికొన్నిగ్రంథంబులయందు-మాస-ఋతు-పక్ష-నక్షత్రము హూర్తములు మాత్రము దెలుపఁబడియున్నవి గాని యట్టియభ్యుదయకాలంబుని ఖిలభక్తజనులత్యంతానందంబున నిదానించి తెలుసుకొనుటకును సయుక్తంబగునట్లు యుగవర్షాదినిర్ణయం బాయవతారఘట్టంబునఁగంఠోక్తిగా నెందుండెలుపఁబడలేదు- అయితే తదితరఘట్టంబులయందు నాయుగవర్షాదినిర్ణయంబు విద్వజ్జనైకవేద్యంబగునట్లు వివిధవచనంబులచే సూచితంబై యుంటున్నది-మఱిన్ని యట్టిసూచితార్థంబఖిలభక్తజనగ్రాహ్యంబుగాక బోవుచున్నందున నాకృష్ణపరబ్రహ్మమూర్తి యేయుగంబున నేవర్షంబున నవతరించెననియు, నట్టి కాలంబుగణుతింపనిప్పటికి గతసంవత్సరములిన్నియనియు, నప్పుడాత్మండు భూలోకంబున లీలామానుషవిగ్రహంబు దాల్చియుండిన వర్షంబులెన్నియనియు, నీతీరునఁగలిగెడు సందేహసముదయంబుచేన ఖిలభగవద్భక్తులు సందిగ్ధమానసులగుచున్నారు - కాఁగానట్టి సందేహసముదయనివృత్తి చేయుటచే నఖిలాస్మదీయజనులను ల్లసింపఁజేయందలంచి శ్రీకృష్ణావతారకాలనిర్ణయప్రతిపాదకగ్రంథంబులఁ దెలుపఁబడియుండెడు ప్రమాణవచనాభిప్రాయములఁబట్టి సర్వగ్రంథసామరస్యంబుగలుగునట్లు విశదముగా నీదిగువఁ దెలుపుచున్నాము.

## ※ శ్రీకృష్ణావతారకాలనిర్ణాయకప్రమాణవచనార్థవిచారము. ※

శ్రీమద్భాగవతంబునందు దశమంబునంగల తృతీయాధ్యాయమునందు దెలుపఁబడియుండెడు శ్రీకృష్ణమూర్త్యావిర్భావకాలప్రతిపాదకప్రమాణవచనములు.—౧శ్లో॥ అథ సర్వగుణోపేతః కాలః పరమశోభనః। యర్హ్యేవాజనజన్మర్క్షం శాంతర్క్షగ్రహతారకమ్॥ ౭॥ మందంమందం జలధరా జగర్జురనుసాగరమ్। నిశీథే తమఉద్భూతే జాయమానే జనార్దనే॥— ఈశ్లోకద్వయమునందు ప్రథమశ్లోకంబునంగల- అజనజన్మర్క్షం- అనుటచే తరోహిణీనక్షత్రమనియు, రెండవశ్లోకమునను౦డెడు-నిశీథే తమఉద్భూతే-అనెడు పదములచేత చీఁకటితోఁ జేరియుండెడు నిశీథకాలమనియుఁ దెలియఁబడుచున్నది- ఈమీఁదఁ జెప్పిన-రోహిణీనక్షత్ర-నిశీథకాలములు గాక తక్కిన యుగ- వర్ష-ఋతు-మాస-పక్ష-తిథులు- మొదలయినవియేమియు నీభాగవతంబుననుండు నాయవతారఘట్టంబునఁ దెలుపఁబడియుండలేదు. ※

హరివంశమునందు పూర్వభాగములోఁగల - ౫౨- అధ్యాయమునందునుండే ప్రమాణవచనములు.—యోగమాయాం ప్రతి విష్ణూక్తిః- ౨౮॥ శ్లో॥ తతోఽహం సంభవిష్యామి దేవకీజఠరే శుభే। గర్భేత్వయా యశోదాయా గంతవ్యమవిలంబితమ్॥—౨౭॥ శ్లో॥ ప్రావృట్కాలే చ నభసి కృష్ణపక్షే మహానిశి। ఉత్పత్స్యామి నవమ్యాం చ ప్రసూతిం త్వమవాప్స్యసి॥— ఈశ్లోకద్వయంబునందుఁగల-ప్రావృట్కాలే-అనుటవలన వర్షర్తువనియు, నభసి అనుటచే శ్రావణమాసమనియు, కృష్ణాష్టమ్యాం నిశి-అనుటవలనఁ గృష్ణపక్షాష్టమిలో రాత్రిపూటయనియుఁ-దెలియఁబడుచున్నది మఱియు-నవమ్యాం చ ప్రసూతిం త్వమవాప్స్యసి అనువాక్యార్థమును వక్ష్యమాణ హరివంశగ్రంథోదాహృత ప్రమాణవచనస్థమగు (యామేవ రజనీం కృష్ణో జజ్ఞే వృష్ణికులే ప్రభుః। తామేవ రజనీం కన్యాం యశోదాపి వ్యజాయత॥ అనువచనార్థమును సమరసపెట్టియాలోచింపఁగా నవమీవిద్ధయగు అష్టమి శ్రీకృష్ణజననతిథియని తెలియఁబడుచున్నవి. ※

తస్మిన్నేవాధ్యాయే.—యోగనిద్రాం ప్రతి శ్రీమన్నారాయణోక్తిః.—౭౪ శ్లో॥ అర్ధరాత్రే కరిష్యామి గర్భమోక్షం యథాసుఖమ్। అష్టమస్య తు మాసస్య జాతా వా వాం తతస్సమమ్॥ ౭౩॥ అహం యశోదాం యాస్యామి త్వం దేవీం యాహి దేవకీమ్। అవయోర్గర్భవ్యత్యాసే కంసో గచ్ఛతి మూఢతామ్॥——అధ్యాయే-౫౩—౭౭శ్లో॥ యస్మిన్నహని దేవేశం గర్భే చాధత్త దేవకీ। యశోదాపి సమాధత్త గర్భం తదహరేవ హి॥ ౭౭॥ విష్ణోశ్శరీరతాం నిద్రాం విష్ణోర్నిర్దేశకారిణీమ్। గర్భకాలే త్వసంపూర్ణే హ్యష్టమే మాసి తే స్త్రియౌ॥ ౭౮॥ దేవకీ చ యశోదా చ సుషువాతే సమం తదా।

---

※ ఇందుఁ బంచమస్కంధము, గంగనకవిచే రచియింపంబడె. షష్ఠస్కంధము, సింగనకవిచే రచియింపఁబడె.

యామేవరజనీంకృష్ణోజాతస్తస్మిన్ దివసేప్రభుః॥౮౭॥ తామేవరజనీంకన్యాంయశోదాదేవ్యజాయత । అష్టమ్యాంశ్రావణేమాసేకృష్ణపక్షేమహానిశా॥౮౮॥రోహిణ్యామర్ధరాత్రేచసుధాంశావుదయోన్ముఖే । దేవక్యజనయద్విష్ణుంయశోదాతాంతుకన్యకామ్॥౮౯॥ముహూర్తేభిజితిప్రాప్తేహ్యర్ధరాత్రేసుఖావహే!—తస్మిన్నేవాధ్యాయే.—౯౧శ్లో॥ వసుదేవస్తతోగత్వాదేవకీగర్భవేశ్మతత్ । దదర్శదేవదేవేశంరాత్రౌజాతమధోక్షజమ్॥—౯౨॥శయానమమ్బుజేపత్రేవటపత్రేయథాపురా। ప్రాచీనశిరసందేవంపశ్చిమస్యస్తపాదకమ్॥ఈవచనార్థపర్యాలోచనసాకల్యముగాఁజేయుటవలనభాగవతవిష్ణుపురాణప్రతిపాదితమాసఋతుపక్షనక్షత్రతిథిరాత్రాదులుమాత్రమేకాక జననముహూర్తమ్ము అభిజిత్తనియు, దేవకీయశోదలగర్భంబుననేకరాత్రియందేశ్రీకృష్ణయోగమాయలుద్భవించిరనియు, నట్టియుద్భవకాలముసంపూర్ణమగునర్ధమహాముగానుండెడుననియు, నట్లుసంపూర్ణకాలంబునజనియించిననందుననే శ్రీకృష్ణమూర్తియతనిజననోత్తరకాలంబున లోకులవాడుక ప్రకారము పద్మపత్రమునుంచబడియుండెననియు,నత్తరిసూతికాగృహంబునదేజరిల్లెడునా శ్రీకృష్ణుండు ప్రాగ్దిక్కైయమితశిరస్కుండును, పశ్చిమదిగ్విన్యస్తపాదయుగళుండు నైయుండెననియునివిమొదలగువిశేషార్థంబులు దెలియఁబడుచున్నవి.

—*శ్రీమద్భాగవతైకాదశస్కంధంబునంగలషష్ఠాధ్యాయమునుండు శ్రీకృష్ణమూర్తిజీవితకాలనిర్ణాయకప్రమాణవచనము.*—

శ్రీకృష్ణంప్రతిబ్రహ్మాదిదేవోక్తిః.—౨౫శ్లో॥యదువంశేవతీర్ణస్యభవతఃపురుషోత్తమః।శరచ్ఛతంవ్యతీయాయపంచవింశాధికంవిభో॥ ఈ వచనమునందుండు-భవతః, పంచవింశాధికం, శరచ్ఛతం, వ్యతీయాయ, అనుపదములచేత బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణునివైకుంఠమునకురమ్మనిపిలువవచ్చినకాలమునందునమ్మహాపురుషునికిజననప్రభృతిగతసంవత్సరములు-౧౨౫- అని తెలియఁబడుచున్నవి. విష్ణుపురాణమునందు నిదేక్రమంబునఁజెప్పఁబడియున్నది-అదెట్లనిన.——విష్ణుపురాణము, అంశము-౫-అధ్యాయము-, ౩౭,— శ్రీకృష్ణంప్రతి.ఇంద్రప్రేషితదేవదూతోక్తిః.-శ్లో॥వస్వశ్విమరుతాదిత్యరుద్రసాధ్యాదిభిస్సహ । విజ్ఞాపయతిశక్రస్త్వాంతదిదంశ్రూయతాంప్రభో॥దుర్వృత్తానిహతాదైత్యాభువోభారోవతారితః।త్వయాసనాథాస్త్రిదశాభవంతుత్రిదివేపునః॥పంచవింశత్యుత్తరకంశతంతుశరదాంగతమ్।ఇదానీంగమ్యతాంస్వర్గోభవతోయదిరోచతే॥ఈవచనములయందుఁదెలుపఁబడిన-పంచవింశత్యుత్తరకంశతంతుశరదాంగతం-అనువాక్యముచేత-౧౨౫-సంవత్సరములు జరిగినవియని తెలియఁబడుచున్నది. హరివంశాదిగ్రంథములయందు నిదేక్రమంబునఁదెలుపఁబడియున్నది. గ్రంథవిస్తరభీతిచేత నాగ్రంథస్థప్రమాణవచనంబుల నిచ్చటఁబ్రకాశపరచలేదు.

శ్రీమద్భాగవతైకాదశస్కంధమునంగలసప్తమాధ్యాయములోనుండు-శ్రీకృష్ణమూర్తినిర్యాణకాలప్రతిపాదకప్రమాణవచనములు.

౨శ్లో॥ఉత్తరార్ధమారభ్య॥సముద్రస్సప్తమేహ్న్యేతాంపురీమాప్లావయిష్యతి॥౩॥ యర్హ్యేవాయంమయాత్యక్తోలోకోయంనష్టమంగళః। భవిష్యత్యచిరాత్సాధోకలినాపినిరాకృతః॥ఈప్రమాణవచనార్థపర్యాలోచనవలనం దెలియఁబడినదేమనిన, బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణమూర్తినివైకుంఠమునకురమ్మనివిన్నవించి వారివారిలోకములకుఁబోయినతోడుతనే శ్రీకృష్ణుండుద్ధవునితోనీద్వారకాపట్టణము నేటికేడవదివసమునందుసముద్రునిచేనావరింపఁబడుననియు, నేనుభూలోకమునువదలఁగానే-కలిప్రవేశించుననియు, నట్టికాలమతిత్వరగానేసంభవించుననియు జెప్పినందున, శ్రీకృష్ణనిర్యాణకాలంబుకలియుగప్రవేశదినమునందనియు, నట్టికలియుగాదిదివసమునకునవ్యవహితపూర్వమాసంబుననే బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణాహ్వానము సేయవచ్చిరనియు, సూచనగాఁదెలియఁబడుచున్నది. ఈయర్థమువిష్ణుపురాణమునందుస్పష్టముగాఁదెలుపఁబడియున్నదదెట్లనిన —విష్ణుపురాణం, అంశం-౪, అధ్యాయం-౨౪, శ్లో॥యస్మిన్కృష్ణోదివంయాతస్తస్మిన్నేవతదాహని।ప్రతిపన్నంకలియుగంతస్యసంఖ్యాంనిబోధత॥ఈవచనార్థపర్యాలోచనవలన శ్రీకృష్ణనిర్యాణదివసమునందే ఈభూలోకమునందుగలిప్రవేశమాయెనని దృఢముగా దెలియఁబడుచున్నదిగాన-మీఁదఁదెలుపఁబడినభాగవతవచనసూచితార్థమునకుసామరస్యము లెస్సగాఁగలుగుచున్నదని తెలియఁదగ్గది.

బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణాహ్వానమునందు దెలియఁజేసిన- ౧౨౫- సంవత్సరములు దైవసంవత్సరములనిచెప్పెడుదురాక్షేపపరిహారవిచారము.—విష్ణుపురాణం, అంశం, ౫- అధ్యాయం, ౨౩ శ్రీకృష్ణంప్రతిముచికుందోక్తిః.—శ్లో॥ ముచికుందశ్చతత్రాశౌవృద్ధగార్గ్యవచస్స్మరన్। సంస్మృత్యప్రణిపత్యైనంసర్వేశ్వరంహరిమ్॥ప్రాహజాతో భవాన్విష్ణోరంశస్త్వంపరమేశ్వర।పురాగర్గేణకథితమష్టావింశత్తమేయుగే॥ ద్వాపరాంతేహరేర్జన్మయదువంశేభవిష్యతి। ఈవచనార్థపర్యాలోచనవలన శ్రీకృష్ణావతారమువజగత్సృష్టిమొదలుకొనిజరిగే ఇరువదెనిమిదవమహాయుగమునందు*తటస్థించెడుద్వాపరయుగంబుననంతిమభాగములో- యదువంశమునందు శ్రీకృష్ణమూర్తియవతరించఁబోవుచున్నాఁడనితొల్లివృద్ధగార్గ్యులుచెప్పినటుల ముచికుందమహారాజు శ్రీకృష్ణునితోవిన్నపముచేసెనని తెలుపఁబడినందున ముందునుదాహరించినప్రమాణవచనములలో శ్రీకృష్ణునితో బ్రహ్మాదిదేవతలు తెలిపినసంవత్సరపరిగణనముఐహికవ్యవహారోపయుక్తాస్మత్ప్రభవాదిసంవత్సరములేకాని ఆముష్మికలోకవ్యవహార్యమాణదైవసంవత్సరంబులుకావు - కానమీఁదఁజెప్పినముచికుందోక్తిచొప్పున ఇరువదెనిమిదవమహాయుగంబునతటస్థించిన ద్వాపరయుగంబీకలియుగంబునకునవ్యవహితపూర్వకముగానుండుద్వాపరయుగమేకానివేరొకద్వాపరయుగముకానేరదదెట్లనిన.

సూర్యసిద్ధాంతము-అధ్యాయము-౧.—శ్లో॥అయుషార్ధంగతంతస్యశేషాత్కల్పోయమాదిమః।కల్పాదస్మాచ్చమనవష్షడ్వ్యతీతాస్ససంధయః॥అష్టావింశయుగాదస్మాద్యాతమేతత్కృతంయుగమ్। అతఃకాలంప్రసంఖ్యాయసంఖ్యామేకత్రపిండయేత్॥ ఈవచనములయందు దెలిపిన-అష్టావింశయుగాదస్మాత్ । అనుటవలననిదియిరువదెనిమిదవమహాయుగమని తెలియనాయెను. ఇచ్చటయుగశబ్దము వ్యాఖ్యాత్రభిప్రాయానుసారముగా మహాయుగపరమని తెలియఁదగినది. అటుకానిపక్షమందీవచనములోనే- యాతమేతత్కృతంయుగం। అనువచనమువలనఁగృతయుగంబునకుమష్టావింశమహాయుగాంతఃపాతిత్వముఘటించకపోయ్యేని, కాఁగాన దేక్రమంబునఁగ్రిందటజరిగినకృతయుగము మొదలుకొనియి

*కృతాదియుగచతుష్టయము-ఒకమహాయుగమనబడుచున్నదిగాననొకమహాయుగమునకృతాదినాల్గుయుగములుతటస్థములగుచున్నవి.



శ్రీ ర స్తు.

## శ్రీమదాంధ్రభాగవతమునందుగలకథానుక్రమసూచిక.

### ప్రథమస్కంధమునందలికథానుక్రమసూచిక.



### ద్వితీయస్కంధము.



### తృతీయస్కంధము.



### చతుర్థస్కంధము.

శంబగు శ్రీవిష్ణుక్షేత్రంబునందు శౌనకాదిమహామునులు స్వర్లోకగీయమానుండగు హరిం జేరుకొఱకు సహస్రవర్షంబులనుష్ఠానకాలంబు గాఁగల సత్రసంజ్ఞికం బయిన యాగంబు సేయుచుండి రందొక్కనాఁడు వారలు రేపకడ నిత్యనైమిత్తిక హోమంబు లాచరించి సత్కృతుండై సుఖాసీనుండై యున్న సూతుం జూచి * (క ॥ ఆతాపసులిట్లని రవి। నీతుఁడ విజ్ఞానఘనిత నిఖిలపురాణ। వ్రాతుఁడ నుత హరిగుణసం। ఘాతుఁడ సూతుఁడ నితాంతకరుణోపేతుఁడ *(మ ॥ సమతం దొల్లి పురాణపంక్తు లితిహాస శ్రేణులు ధర్మశాస్త్రములు నాలను పన్యసింపుదురు వేదవ్యాసముఖ్యుల్మును ల్సుమతిం జేసిన వెన్ని యన్నియును దోఁచు నీ్ను సదిన్దల్ప్రసాదమునం జేసి యెఱుంగ నేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా * (క ॥ గురువులు ప్రియశిష్యులకుం। బరమరహస్యములు దెలియఁ బలుకుదు రచల। స్థిరకల్యాణం బెయ్యది। పురుషులకు నిశ్చయించి బోధింపు దయన్ *(క ॥ మన్నాఁడవు చిరకాలము। గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్। విన్నాఁడవు వినఁదగినవి। యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్ *(చ ॥ అలసులు మందబుద్ధియుతు లల్పతరాయువు లుగ్రరోగసం। కలితులు మందభాగ్యులు సుకర్మము లెయ్యవి సేయజాలరీ। కలియుగమందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై। యలవడు నేమిటం బొడము నాత్మకు శాంతి మునీంద్ర చెప్పవే*(సీ॥ ఎవ్వని యవతార మెల్లలోకములకు సుఖమును వృద్ధియు సొరిదిఁ జేయు। నెవ్వని శుభనామ మేప్రొద్దు నుడువంగ సంసారబంధంబు సమసిపోవు। నెవ్వని చరితంబు హృదయంబుఁ జేర్చిన భయమంది మృత్యువు పరువువెట్టు। నెవ్వని పదముల నేపారు జలముల సేవింప నైర్మల్యసిద్ధిగలుగుఁ। దపసు లెవ్వని పాదంబు దగిలి శాంతి। దెరువుఁ గాంచిరి వసుదేవదేవకులకు। నెవ్వఁ డుదయించె దత్కథ లెల్ల వినఁగ। నిచ్చ పుట్టెడు నెఱిఁగింపు మిద్ధచరిత*(క॥ భూషణములు సెవులకు నఘ। పేషణములు మృత్యుచిత్తభీషణము లుహ్రాత్తోషణములు కల్యాణవి। శేషణములు హరిగుణోపచితభాషణముల్ *(క ॥కలిదోషనివారణమై। యలఘుయశుల్పొగడు నట్టి హరికథనముఁ ని। ర్మలమతిఁ గోరుచుఁ బురుషుఁడు। వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు మహాత్మా*(గీ॥ ఆనఘ వినుర సజ్ఞులై విను వారికి। మాటమాటకధిక మధురమైన। యట్టి కృష్ణుకథన మాకర్ణనము సేయఁ। దలఁపు గలదు మాకుఁ దనివి లేదు॥(మ॥ వరగోవిందకథాసుధారసమహావర్షోరుధారావరం। పర ఫలంగాక బుధేంద్రచంద్రయుత రోపాయానురక్తింబ్రవి। స్తరదుర్ధాంత దురంతమ స్పహజను స్పంభావితానేకదు। స్తరగంభీరకఠోరకల్మషకనద్దావానలంబాఱునే* (సీ॥ హరినామకథనదావానల

లైనయుపనిషత్తులఫలమనఁగాఁదలఁప ) తిసాధ్యమగుపరతత్త్వము దానిం గలదిగా నున్నది. అరణ్య ॥ కొమ్మలవరుసలయందు ఫలములఁ గలది పున్నాగ-పురుషోత్తముండగు విష్ణువు, అతని రూపమగు బాణమువలన నలంకృతంబైనది. అరణ్య ॥ పున్నాగ॥ పొన్న చెట్లు-శిలీముఖ॥ తుమ్మెదలు-వీనివల్లన లంకృతంబైనది. కేసర ॥ సింహముఖమున కుఁ జుట్టునుండెడు నిడివి వెంట్రుకలు-కరజ ॥ గోళ్లు. అరణ్య ॥ కేసర॥ సురపొన్నలు-కరజ ॥ కానుగ-వీనితో నొప్పుచున్నది నటనటీసుషిరాన్వితంబు ॥ నటనటీజనులయొక్క- సుషిర॥ పిల్లనగ్రోవుల చేఁ గూడుకొనియున్నది. అరణ్య ॥ నట॥ దుంఢిగపుచెట్లు-నటీన॥ యనెడుగంధద్రవ్యము సుషిర॥ గూవగుత్తికెలు-చందన ॥ గంధము-కర్పూర ॥ కర్పూరము-తిలక ॥ కుంకుమబొట్టు. అరణ్య ॥ చందన। శ్రీగంధవృక్షములు-కర్పూర। కర్పూరవృక్షములు తిలక। తిలకపుచెట్లు-ఇంద్రబాణాసన । ఇంద్రధనుస్సు-మేఘ । మేఘములు-కరక । వడిగండ్లు. అరణ్య॥ ఇంద్ర। మద్దిచెట్లు-బాణా । నల్లపూలగోరంటచెట్లు-ఆసన। వేగిమ్రానులు-గాయత్రీ । వేదమాతయగు గాయత్రీదేవతాదిమంత్రములచేతను. అరణ్య ॥ గాయత్రీ। చండ్రచెట్ల చేతను- సరసమృదులతా । రచనాసాకర్యముతో నొప్పియుండెడు - మృదుపాకముతోఁ గూడినది. అరణ్య ॥ రసవత్తుగా నుండెడు మెత్తనీఁగెతోఁ గూడినది. సువర్ణ । గరుడుఁడు-అరణ్య ॥ మంచియాకులతోఁ జేరినది-సుమనస్సులు । దేవతలు-అరణ్య ॥ సుమనస్సులు। పుష్పములు. మధు । మధుఁడనెడు రాక్షసుఁడు. అరణ్య॥ మధు । తేనె-అమృతఫలదంబు । మోక్షపదమునిచ్చునది. అరణ్య॥ ఉసిరికపండ్లనిచ్చేది-అభ్రంకషపరాగంబు । ఆకాశమునంటియుండెడు ధూళిగలదై. అరణ్య ॥ ఆకాశమునంటెడు శ్రేష్ఠములైన వృక్షములనుగలది. ఖడ్గ-పుండరీకులు, భగవద్భక్తులు. అరణ్య ॥ ఖడ్గ। ఖడ్గమృగములు-పుండరీక । వ్యాఘ్రంబులు-కృష్ణసార । శ్రీకృష్ణమూర్తియొక్క బలముచేత. అరణ్య॥ కృష్ణసార। జింకలచేత-రామమహిషీవంచకసమేతంబు । శ్రీరామభార్యను మోసపుచ్చెడువానితోఁ జేరియున్నది. అరణ్య ॥ రామ । పెద్దదుప్పులు-మహిషీ। కాఱెనుములు. వంచక నక్కలు। గజగవయ శరభులు, ప్రసిద్ధవానరులు. అరణ్య ॥ గజ। ఏనుగులు-గవయ । మురుబోతులు-శరభ । ఎనిమిది కాళ్లుగలదై సింహమును జంపెడి మృగములు-నీలకంఠ। శివుఁడు హంస । పరమహంసలు. కౌశిక, శుక, భరద్వాజ, తిత్తిరులు, ప్రసిద్ధులు-వీరితోఁ గూడియున్నది. అరణ్య॥ నీలకంఠ, నెమళ్లు-హంస। హంసలు-కౌశిక, గుడ్లగూబలు-శుక । చిలుకలు-భారద్వాజ । భారద్వాజపక్షులు-తిత్తిరి। తీతువపక్షులు-వీనిచేఁ బ్రకాశించుచున్నది. ఏకచక్రబక । ఏకచక్రపురమునందుండిన బకాసురుఁడు కంక । కంకుఁడను ప్రచ్ఛన్ననామధేయముగల ధర్మరాజు-ధార్తరాష్ట్ర । ధృతరాష్ట్రపుత్రులైన దుర్యోధనాదులు-శకుని । శకుని యను వాఁడు- నకుల-నకులుఁడు, వీరియొక్క-సంచార । కథావర్ణనాది ప్రస్తావముతో సమ్మిళితంబై। కూడుకొనియున్నది, అరణ్య॥ ఏక। ముఖ్యములైన-చక్ర। చక్రవాకపక్షులు-బక। కొంగలు-కంక। గ్రద్దలు-ధార్తరాష్ట్ర) ఎఱ్ఱని ముక్కు కాళ్లును గలదై దేహమంతయుఁ దెల్లగానుండు హంసలు-శకుని। పక్షులు-నకుల। ముంగిసలు, వీనియొక్క-సంచార। తిరగడములతో-సమ్మిళితంబై । కూడియున్నది ఉరుతర । మిక్కిలి గొప్పదైన-ప్రవాహంబై । ఉత్తమాశ్వములుగలదై, అరణ్య ॥ ఉరుతర-మిక్కిలి విశేషమయిన - ప్రవాహంబై । జలప్రవాహముగలదై - బహువితతజాతిసౌమనస్యంబై । అనేకవిధములైయంతటవిస్తీర్ణములగు జాజిపువ్వులుగలది, అరణ్య ॥ అనేకవిధములగు పక్షిసమూహముచే నొప్పియుండునది. సొరది । క్రమముగా.— ఎవ్వనిపదనదికా । గంగ - పారుజలములు । ప్రవహించుజలములు.— అఘపేషణములు । పాపనాశకములు.— పరంపరలకా । శ్రీకృష్ణునికథామృతమనువానయొక్క గొప్పధారలగుంపు

జ్వాలలఁగాలవే ఘోరాఘకాననములు। వైకుంఠదర్శనవాయుసంఘములచేఁదోలఁగవే బహుదుఃఖతోయదములు । కమలనా
భధ్యానకంఠీరవములచేఁగూలవే సంతాపకుంజరములు। నారాయణస్మరణప్రభాకరదీప్తిఁదీరవే షడ్వర్గతిమిరతతులు । నలినన
యనభక్తినావచేఁగాక సం। సారజలధి దాఁటించనఁగరాదు। వేయునేల మాకు విష్ణుప్రభావంబు। దెలుపుమయ్య సూత ధీసమేత *
(వ ॥ మఱియుఁగపటమానవుండును గూఢుండును నైనమాధవుండు రామసహితుండై యతిమానుషంబులయిన పరాక్రమంబులు
సేసెనఁట వివరింపుము. కలియుగంబు రాఁగలదని వైష్ణవక్షేత్రంబున దీర్ఘసత్రనిమిత్తంబున హరికథలు వినఁ నెడగలిగి నిలిచితి
మి దైవయోగంబున * (క ॥ జలరాశి దాఁటఁగోరెడి। కలముజనుల్గన్న ధారుఁగాంచినభంగిన్। గలిదోషహరణవాంఛా । కలితుల
మగు మేము నిన్నుఁ గంటిమి సూతా * (క ॥ చారుతరధర్మరాశికి। భారకుఁడగు కృష్ణుఁడాత్మపదమునకేఁగన్ । భారకుఁడు లేకయె
వ్వానిఁ। జేరెను ధర్మంబు బలుపు సెడి మునినాథా * (వ ॥ అని యిట్లు మహనీయగుణగరిష్ఠులయిన శౌనకాదిమునిశ్రేష్ఠు లడిగిన రో

### సూతుండు నారాయణకథాప్రశంస సేయుట.

మహర్షణపుత్రుండయిన యుగ్రశ్రవసుండను పేరనొప్పు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండయిన సూతుండు * (మ ॥ స
మఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిఁబో । వ మహాప్రీతిని హా కుమారయనుచున్ వ్యాసుండు చీ
రంగ వృక్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్కం జేసె మున్నట్టిభూ । తమయుం గొల్చెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణి
న్ధీమణిన్ * (సీ ॥ కార్యవర్గంబును గారణసంఘంబు నధికరించి చరించు నాత్మతత్త్వ। మధ్యాత్మమనఁబడు నట్టియధ్యాత్మముఁ దెలి
యఁజేయఁగ జాలు దీపమగుచు । సకలవేదములకు సారాంశమై యేకమైయసాధారణమగు ప్రభావ । రాజకంబైన పురాణరా
జంబును గాఢసంసారాంధకారపటలిఁ। దాఁటఁగోరెడి వారికి దయదలిర్ప । నెఱిసోఁ ధివివరించె నేర్పడంగ । నట్టిశుకనామధే
యు మహాత్మ గేయు । విమలవిజ్ఞానరమణీయ వేద్యుఁ గొలుతు * (క ॥ నారాయణునకు నరునకు । భారతికిని మ్రొక్కి వ్యాసప
దములకు నమ । స్కారము సేసిర చింతును । దారగ్రంథంబు దళితతనుబంధంబున్ * (వ ॥ అని యిట్లు దేవతాగురునమస్కా
రంబు సేసి యిట్లనియె. మునీంద్రులారా నన్ను మీరలు నిఖిలలోకమంగళంబైన ప్రయోజనం బడిగితిరేమిటం గృష్ణసంప్రశ్నం
బు సేయంబడు నెవ్విధంబున నాత్మప్రసన్నంబగు నిర్విఘ్నయు నిర్హేతుకయునైన హరిభక్తియే రూపంబునం గలుగు నెద్దిపురు
షులకుఁ బరమార్థంబని నవాసుదేవునియందుఁ బ్రయోగింపంబడిన భక్తియోగంబు వైరాగ్యవిజ్ఞానంబులం బుట్టించు నారా
యణకథల నెయ్యేధర్మంబులు దగులవవి నిరర్థకంబులపవర్గపర్యంతంబాచరింపందగిన యీయాధికధర్మంబున కర్థంబు ఫలంబుగా
దు ధర్మంబునంద వ్యభిచారియైనయర్థంబునకుఁ గామంబు ఫలంబుగాదు విషయభోగంబైన కామంబున కింద్రియప్రీతిఫలంబు
గాదెంతవడవు జీవించు నంతియ కామంబున కుఫలంబు జీవునకుఁ గర్మములచేత నెయ్యది ప్రసిద్ధియదియ నర్థంబుగాదు తత్త్వజి
జ్ఞాసయనునది ధర్మజిజ్ఞాసయగుటఁ గొందఱు ధర్మంబె తత్త్వమని పలుకుదురు. తత్త్వవిదులు జ్ఞానమను పేర నద్వయమైనయది త
త్త్వమని యెఱుంగుదురా తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మమనియు, హైరణ్యగర్భులచేతం బరమాత్మయనియు సాత్త్వతులచే
త భగవంతుండనియును బలుకంబడు వేదాంతశ్రవణంబున గ్రహింపంబడిన జ్ఞానవైరాగ్యంబులతోడం గూడిన భక్తిచేతఁ దత్త్వ
రులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన యాత్మయందుఁ బరమాత్మం బొడగందురు ధర్మంబునకు భక్తిఫలంబు పురుషులు వర్ణాశ్రమధర్మ
భేదంబులం జేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయె సిద్ధి యేకచిత్తంబున గోవిందు నాకర్ణింపవర్ణింపందగుఁ జక్రా
యుధధ్యానంబను ఖడ్గంబున వివేకవంతు లహంకారంబను కర్మంబుఁ ద్రుంచివైతురు భగవంతునియందలి శ్రద్ధయపవర్గదంబగుఁ
దత్కథాశ్రవణాదులం దత్యంతాసక్తియుఁ బుణ్యతీర్థావగాహన మహత్సేవాదులచే సిద్ధించుఁ గర్మనిర్మూలనహేతువులైన క
మలలోచనుకథలం దెవ్వండు రతిసేయు విననిచ్చగించువాని కితరంబులెవ్వియు రుచిపుట్టవు పుణ్యశ్రవణకీర్తనుండైన కృష్ణుం
డు దనకథలు విను వారి హృదయంబులందు నిలిచి యశుభంబు లాచరించు నశుభంబులు నిరసించు నశుభంబులు నష్టంబులైన భాగవత
సేవావిశేషంబున నిశ్చలభక్తియుదయించు భక్తిగలుగ రజస్తమోగుణప్రభూతంబులైన కామలోభాదులకు వశంబుగాక చి
త్తంబు సత్త్వగుణంబునఁ బ్రసన్నంబగుఁ బ్రసన్నమనస్కుండై ముక్తసంగుండగు ముక్తసంగుండైన నీశ్వరతత్త్వజ్ఞానంబు సి
ద్ధించు నీశ్వరుండు గానంబడినఁ జిజ్జడగ్రథనరూపంబైన యహంకారంబు భిన్నంబగు నహంకారంబు భిన్నంబైన నసంభావనాది
రూపంబులగు సంశయంబులు విచ్ఛిన్నంబులగు సంశయవిచ్ఛేదంబైనఁ బ్రారబ్ధఫలంబులైన కర్మంబులు నశించుం గావున * (క ॥

టీ.— ప్రవిస్తర । దావానలంబు - మిక్కిలి విస్తారమయినదియును, అణఁగినదియును, తుదముట్టనిదియును, సహింపఁగూడనిదియునైన జన్మములవలనఁ గలిగినదియును, నానావిధములయినదియును, తరింపఁగూడనదియును, తెలుసుకొనఁగూడనిదియును, కఠినమయినదియును నగు - పాపమను రగులుచుండు కార్చిచ్చు — కంఠీరవములచేన్ । సింహములచేత ను — ఎడ । కాలము. కలముజనుల్ । ఓడలోనుండు మనుజులు అపవర్గంబు । మోక్షము - ఔపనిషదులు । అద్వైతులు - హైరణ్యగర్భులు । చతుర్ముఖోపాసకులు - సాత్త్వతులు । విశిష్టాద్వైతులు, చిజ్జడగ్రథనరూపంబ

గురుమతులుతపసులంతః।కరణంబులశుద్ధిసేయఘనతరభక్తిగా।హరియందుసమర్పింతురు।పరమానందమునభిన్నభవబంధను
లై*(తరల॥ పరమపూరుషుఁడొక్కఁడాఢ్యుఁడుపాలనోద్భవనాశముల్। సొరిదిఁజేయముకుందపద్మజశూలిసంజ్ఞలఁబ్రాకృ
త।స్ఫురితసత్త్వరజస్తమంబులఁబొందునందుశుభస్థితుల్। హరిచరాచరకోటికిచ్చుననంతసత్త్వనిరూఢుఁడై *(వ॥ మఱియు
నొక్కవిశేషంబుగలదు కాష్ఠంబుకంటెధూమంబుధూమంబుకంటెఁద్రయీమయంబయినవహ్నియెట్లువిశేషంబగునట్లుత
మోగుణంబుకంటెరజోగుణంబు రజోగుణంబుకంటె బ్రహ్మప్రకాశకంబగుసత్త్వగుణంబువిశిష్టంబగుఁదొల్లిమునులుసత్త్వమ
యుండనిభగవంతుహరినధోక్షజుఁగొలిచిరి కొందఱు సంసారమందలిమేలుకొఱకునన్యుల సేవింపుదురు. మోక్షార్థులయిన
వారలు ఘోరరూపులయినభూతపతులవిడిచి దేవతాంతరనిందసేయక శాంతులయి నారాయణకథలయందప్రవర్తింతురు,
కొందఱు రాజసతామసులయిసిరియునైశ్వర్యంబును బ్రజలనుంగోరి పితృభూతప్రేతపిశాచాదుల నారాధింపుదురు. మో
క్షమిచ్చుటంజేసి నారాయణుండుసేవ్యుండు వేదయాగయోగక్రియాజ్ఞానతపోగతిధర్మంబులు వాసుదేవపరంబులు నిర్గు
ణుండునుపరమేశ్వరుండుగలుగుచు లేకుండుచుఁద్రిగుణంబులతోడంగూడిన తనమాయచేత నింతయుసృజియించి గుణవం
తునిచందంబుననిజమాయావిలసితంబులయినగుణంబులలోఁబ్రవేశించివిజ్ఞానవిజృంభితుండై వెలుంగు నగ్నియొక్కరుండ
య్యుఁబెక్కు మ్రాఁకులందుఁదేజరిల్లుచుఁ బెక్కండై తోఁచుతెఱంగున విశ్వాత్మకుండైనపురుషుండొక్కండు దనవలనం
గలిగిననిఖిలభూతంబులందునంతర్యామిరూపంబున దీపించునతండు మనోభూతసూక్ష్మేంద్రియంబులతోడంగూడి గుణమ
యంబులైనభావంబులందనచేతనిర్మితంబులైనభూతంబులందుఁదగులువడకఁదద్గుణంబు లనుభవంబు సేయుచుఁలోకకర్తయై
నయతండు దేవతిర్యఙ్మనుష్యాదిజాతులందులీలనవతరించిలోకంబులరక్షించుననిమఱియు సూతుండిట్లనియె*(సీ॥ మహద
హంకారతన్మాత్రసంయుక్తుఁడై చారుషోడశకళాసహితుఁడగుచుఁ। బంచమహాభూతభాసితుండై శుద్ధసత్త్వుఁడై సర్వాతి
శాయియగుచుఁ।జరణోరుభుజముఖశ్రవణాక్షినాసాశిరములునానాసహస్రములువెలుఁగ।నంబరకేయూరహారకుండలకిరీ
టాదులుపెక్కువేలమెరుచుండఁ।బరమపురుషాకృతిధరించిపరుఁడనంతుఁ।డఖిలభువనైకకర్తయైయాత్మనలరి।మానితోదార

—భగవంతునియేకవింశత్యవతారములు.—

జలరాశిమధ్యమునను। యోగనిద్రావిలాసియైయొప్పచుండు*(వ॥ అదిసకలావతారంబులకు మొదలిగనిదైనశ్రీమన్నారా
యణదేవునివిరాజమానంబయినదివ్యరూపంబు దానిఁబరమయోగీంద్రులుదర్శింతు రప్పరమేశ్వరునాభికమలంబువలనసృష్టి
కర్తలలోనశ్రేష్ఠుండయినబ్రహ్మయుదయించెనతనియవయవస్థానంబులయందు లోకవిస్తారంబులుగల్పింపంబడియె మొదల
నద్దేవుండుకౌమారాఖ్యసర్గంబునాశ్రయించి బ్రహ్మణ్యుండై బ్రహ్మచర్యంబుచరియించె. రెండవమాఱు జగజ్జననంబుకొఱకు
రసాతలవర్తియయినభూమినెత్తుచుయజ్ఞేశుండైవరాహదేహంబుదాల్చె. మూఁడవతోయంబుననారదుండను దేవఋషియై
కర్మనిర్మోచకంబైన వైష్ణవతంత్రంబు సెప్పె. నాలవపరిధర్మభార్యాసర్గమునందు నరనారాయణాభిధానుండైదుష్కరంబై
నతపంబుసేసెఁ-బంచమావతారంబునంగపిలుండనుసిద్ధేశుండయ యాసురియనుబ్రాహ్మణునకుఁ దత్త్వసంఖ్యానిర్ణయంబుగ
లసాంఖ్యంబునుపదేశించె. నాఱవశరీరంబుననసూయాదేవియందు నత్రిమహామునికి దత్తుండనుకుమారుండై యలర్కుని
కిఁబ్రహ్లాదముఖ్యులకునాత్మవిద్యదెలిపె. నేడవవిగ్రహంబున నాకూతియందుఁజన్మించి యజ్ఞుండనఁబ్రకాశమానుండై య
మాదిదేవతలతోడంగూడి స్వాయంభువమన్వంతరంబురక్షించె, నష్టమమూర్తిని మేరుదేవియందు నాభికిజన్మించి యురు
క్రముండనంబ్రసిద్ధుండై విద్వజ్జనులకుఁబరమహంసమార్గంబుంబ్రకటించె. ఋషులచేతంగోరంబడి తొమ్మిదవజన్మంబునఁ
బృథుచక్రవర్తియైభూమిధేనువుంజేసి సమస్తవస్తువులంబిదికెఁజాక్షుషమన్వంతరసంప్లవంబున దశమంబైనమీనావతా
రంబునొంది మహీరూపమగునావనెక్కించివైవస్వతమనువునుద్ధరించె. సముద్రమథనకాలంబునంబదనకొండవమారుగ
మతాకృతినిమందరాచలంబుఁదనపృష్ఠకర్పరంబున నేర్పరియైనిలిపె. ధన్వంతరియనుబన్రెండవతనువునసురాసురమధ్య
మానక్షీరపాథోధిమధ్యభాగంబున నమృతకలశహస్తుండై వెడలి మోహినిచే సురలనమృతాహారులంగావించెఁ బదమూఁ
డవదియైనమోహినీవేషంబునసురాసురులమోహితులంజేసెఁ-బదునాలుగవదియైన నరసింహరూపంబునంగనకకశిపునిసం

యినయహంకారము, చిత్తుఅనఁగాజ్ఞానము. జడమనఁగాఁబ్రకృతి,కీని- గ్రథనమనఁగాఁజేర్చుట, అట్టియహంకారమనఁగావ్యవయము- కాఁ
గా-అహంకారశబ్దముహృదయవాచకమయినందున - హృదయగ్రంథిభేదింపఁబడుననితాత్పర్యము. ౧స్కంధము,౨అ,౨౧॥శ్లో॥ భిద్యతే
హృదయగ్రంథిశ్ఛిద్యంతేసర్వసంశయాః। క్షీయంతేచాస్యకర్మాణిదృష్ట ఏవాత్మనీశ్వరే - అనుశ్లోకార్థమే తెలుపఁబడియున్నది—.సి। సంపద
శ్రీశబ్దతద్భవము-సిరి:ఐశ్వర్యము, ప్రభుత్వము,వేద యాగ యోగ క్రియా జ్ఞాన తపో గతిధర్మంబులు. వేద।ఋగాదివేదంబులు-యాగ।జ్యో
తిష్టోమాదియజ్ఞంబులు-యోగ। యమనియమాదియోగంబులు-క్రియా। సంధ్యావందనాదినిత్యకర్మంబులు-జ్ఞాన, వేద్యవస్తువిజ్ఞానము-తపః।ఉప
వాసాదివ్రతాచరణము-గతి। స్వర్గాదిఫలంబులు-ధర్మంబులు। ధర్మశాస్త్రంబులు-షోడశకళాసహితుఁడు। మనంబుగూడనింద్రియంబులతో

హరించె-బదు నేనవదియైనకపటవామనావతారంబునబలినిఁబదత్రయంబుయాచించి మూఁడులోకంబుల నాక్రమించెఁ-
బదునాఱవదియైనభార్గవరామాకృతినిఁ గుపితభావంబుఁదాల్చిబ్రాహ్మణద్రోహులైనరాజులనిరువదియొక మాఱువధియిం
చి భూమినిఃక్షత్రియశూన్యంబుగావించెఁ-బదునేడవదియైన వ్యాసగాత్రంబుననల్పమతులైన పురుషులంగరుణించి వేద
వృక్షంబునకుశాఖలేర్పఱచెఁబదునెనిమిదవదైనరామాభిధానంబునదేవకార్యార్థంబు రాజ్యత్వంబునొంది సముద్రనిగ్రహా
దిపరాక్రమంబులాచరించె. నేకోనవింశతివింశతితమంబులైనరామకృష్ణావతారంబులచేయదువంశంబునందుసంభవించివి
శ్వంభరాభారంబునివారించె. నేకవింశతితమంబైన కలియుగాద్యవసరంబునరాక్షససమ్మోహనంబుకొఱకు మధ్యగయా
ప్రదేశంబునజినసుతుండగుబుద్ధనామధేయంబునం దేజరిల్లుయుగసంధియందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరిం
పవిష్ణుయశుండనువిప్రునికిఁగల్కి యనుపేరనుద్భవింపంగలండనియిట్లనియె*(మ॥ సరసింబాసినఁబాఱుకాలువలయోజన్
విష్ణునందైనశ్రీ । కరనానాప్రకటావతారములసంఖ్యాతంబులుర్వీశులున్ । సురలున్ బ్రాహ్మణసంయమీంద్రులుమహర్షుల్
విష్ణునంశాంశజుల్ । హరికృష్ణుండుబలానుజన్ముఁడెడలేదావిష్ణుఁడౌ నేర్పడన్* (క॥ భగవంతుండగువిష్ణువు । జగములకె
వ్వేళరాక్షసవ్యథగలుగున్ । దగనవ్వేళలఁగడయక । యుగయుగమునఁబుట్టికాచునుర్వీల్లీలన్ *(గీ॥ అతిరహస్యమైనహరిజన్మ
కథనంబు । మనుజుఁడెవ్వఁడేనిమాపురేపుఁ । జాలభక్తితోడఁజదివినసంసార । దుఃఖరాశిఁబాసితొలఁగిపోవు* (వ॥ వినుండ
రూపుండయిచిదాత్మకుండయిపరగుజీవునికిఁ బరమేశ్వరుమాయాగుణంబులైనమహదాదిరూపంబులచేత నాత్మాధారస్థా
నంబుగావిరచితంబైన స్థూలశరీరంబుగగనంబునందుఁబవనాశ్రితమేఘసమూహంబును గాలియందుఁబార్థివధూళిధూసర
త్వంబును నేరీతినట్లుద్రష్టయగునాత్మయందుదృశ్యత్వముబుద్ధిమంతులుగానివారిచేత నారోపింపంబడు నీస్థూలరూపముకం
టెనదృష్టగుణంబైయశ్రుతంబైనవస్తువగుటంజేసి వ్యక్తంబుగాక సూక్ష్మంబై కరచరణాదులులేక జీవునికి నొండొకరూప
మువిరచితమైయుండుసూక్ష్మండైనజీవునివలన నుత్క్రాంతిగమనాగమనంబులం బునర్జన్మంబుదోఁచునవు డీస్థూలసూక్ష్మ
రూపంబులు రెండునుస్వరూపసమ్యగ్జ్ఞానంబునన్నిషేధింపఁబడునని తెలియునవిద్యంజేసి యాత్మకుఁగల్పింపంబడెననియెడి
హేతువువలననపుడుజీవుండుబ్రహ్మదర్శనమనుజ్ఞానంబునకధికారియగునట్టి బ్రహ్మజ్ఞానమతివిశారదనై యీశ్వరునిదైక్రీ
డించునట్టిమతిప్రకాశంబుననవిద్యయనంబడుచున్నమాయయుపరతయై తానువిద్యారూపంబునం బరిణతయగునప్పుడుజీవో
పాధియైనస్థూలసూక్ష్మరూపంబునుదహించిజీవుండుగాత్రంబులేకఁ దేజరిల్లువహ్నిచందంబునఁ దానయుపరతుండయిబ్ర
హ్మస్వరూపంబునంబొందిపరమానందంబునవిరాజమానుండగునిట్లుతత్వజ్ఞులుసెప్పుదురనిసూతుండిట్లనియె*(చ॥ జననము
లేకకర్మములజాడలఁబోకసమస్తదిత్తవ । ర్తనుడగుచక్రికిన్ గవులుదారపదంబులజన్మకర్మముల్ । వినుతులుసేయుచుండు
దురువేదరహస్యములందునెందుఁజూ । చినమఱిలేవుజీవునికిఁజెప్పినకైవడిజన్మకర్మముల్ * (మ॥ భువనశ్రేణినమోఘలీలఁ
డగుచున్ బుట్టించురక్షించునం । తపిథింజేయుమునుంగఁడందుబహుభూతవ్రాతమందాత్మతం । త్రవిహారస్థితుఁడై షడింద్రి
యవమస్తప్రీతియున్ దవ్వులన్ । దివిభంగింగొనుజిక్కఁడింద్రియములన్ ద్రిప్పున్ నిబంధించుచున్* (చ॥ జగదధినాథుఁడై
నహరిసంతతలీలలనామరూపముల్ । దగిలిమనోవచోగతులఁదార్కిక చాతురిమెంతగల్గినన్ । మిగిలిమతర్కవాదిదగమేరలు
చేసిమెఱుంగనేర్చునే । యగణితనర్తనక్రమమునజ్ఞుడెఱింగినుతింపనోపునే*( ఉ॥ ఇంచుకమాయలేకమదినెప్పుడుఁబాయ
నిభక్తితోడవ । ర్తించుచునెవ్వఁడేనిహరిదివ్యపదాంబుజగంధరాశిసే । వించునతండెఱుంగునరవిందభవాదులకైనదుర్లభో
దంచితమైనయాహరియుదారమహాద్భుతజన్మకర్మముల్ *(మ॥ హరిపాదద్వయభక్తిమీవలననిట్లారూఢమైయుండునే । తి
రుగంబారదుచిత్తవృత్తిహరిపైదీపించిమీలోపలన్ । ధరణీదేవతలారమీరలుమహాధన్యుల్ సమస్తజ్ఞులున్ । హరిచింతన్ మి
ముఁజెందవెన్నఁడునుజన్మాంతవ్యథాయోగముల్ * (సీ॥ పుణ్యకీర్తనుఁడైనభువనేశచరితంబుబ్రహ్మతుల్యంబైనభా
గవతము । సకలపురాణరాజముదొల్లిలోకభద్రముగఁబుణ్యముగమోదముగఁబ్రీతి । భగవంతుఁడగువ్యాసభట్టారకుఁ
డొనర్చిశుకుఁడనియెడుతనసుతునిచేతఁ । జదివించెనింతయుసకలవేదేతిహాసములలోపలనెల్లసారమైన । యీపురాణమె
ల్లనెలమినాశుకయోగి ॥ గంగనడుమవచ్చిఘనవిరక్తి । యొదవిమునులతోడనుపవిష్టుఁడగుపరీ । క్షిన్నరేంద్రుఁడడుగఁ
జెప్పెవినుఁడు*(వ॥ కృష్ణుండుధర్మజ్ఞానాదులతోడందనలోకంబునకుంజనినపిమ్మటంగలికాలదోషాంధకారంబుననష్టదర్శ
నులైనజనులకునిప్పుడీపురాణంబు గమలబంధునిభంగినున్నది నాఁడందుభూరితేజుండైకీర్తించుచున్నవిప్రఋషివలననేఁబ

౧౧.— పంచమహాభూతంబులు । ఐదుచేరి, ౧౬కళలు-కళలనఁగాఅంశములు, ఈ ౧౬అంశములతోఁ గూడుకొనినవాఁడై.—మొదలిగని।అ
ఖిలావతారంబులకు నిధానమయినది, అనఁగా - అవతారకార్యము నెరవేరినపిదప నాయవతారంబులకన్నిటికినిఁబ్రవేశస్థానముగానుండునది
యనుట. భగవదవతారంబులసంఖ్యేయంబులయినను । ప్రసిద్ధంబులగుటచేనిటనీయవతారంబులకుఁబ్రథమద్వితీయాదిసంఖ్యానిర్ణయము. మా
యాశయనంబువలనం దెలిసినవాఁడు । మాయయనెడునిద్రనుండిమేలుకాంచినవాఁడనుట. ఉన్నిద్రః । అనుపదార్థవర్ణనమిదియని తెలియఁదగిన

తించి క్రమంబునఁ నాఁడదికి గోచరించిన నంతయు వినుపించెద ననిన సూతునకు మునివరుండైన శౌనకుం డిట్లనియె* (శా॥ సూతా యే యుగ వేళ నేమిటికి నెచ్చోట న్మునిశ్రేష్ఠ నే। శ్రోతల్ గోరిరి యేమి హేతువునకై శోధించి లోకైకవి। ఖ్యాతిన్ వ్యాసుఁడు మున్ను భాగవతముం గల్పించెఁ దత్పుత్రుఁడే। ప్రీతిన్ రాజునకీ పురాణకథఁ జెప్పెన్ జెప్ప వేయంతయున్* (వ॥ బుధేంద్రా వ్యాసపుత్రుండైన శుకుండను మహాయోగి సమదర్శనుండే కాంతమతి మాయాశయనంబువలనం దెలిసినవాఁడు గూఢుండు మూఢుని క్రియ నుండు నిరస్తభేదుండ దియును గాక *(తరల॥ శుకుఁడు గోఁచియు లేక పైఁజనఁ జూచి తోయములందుల। జకుఁ జలింపకఁ జీరలొల్లకఁ జల్లులాడెడి దేవక।న్యకలు హా శుక యంచు వెన్కఁ జనంగ వ్యాసునిఁ జూచియుం। శుకము లన్ ధరియించి సిగ్గున స్రుక్కి రందఱు ధీనిధీ*(వ॥ మఱియు నగ్నుండును తరుణుండునైచను తనకొడుకుం గని వస్త్రపరిధానంబొనరింపక వస్త్రధారియు వృద్ధుండు నైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవరమణులం గని వ్యాసుండు కారణం బడిగిన వారలు నీపుత్రుండు స్త్రీపురుషులనెడు భేదదృష్టి లేక యుండు మఱియు నతండు నిర్వికల్పుండు గాన నీకు నతనికి మహదంతరంబు గలదనిరి యంత శుకుండు కురుజాంగల దేశంబులు సొచ్చి హస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్లు జ్ఞాతుండయ్యె మఱియు నున్మత్తుని క్రియ మూఢుని తెఱంగున జడుని భంగి నుండు నమ్మహాయోగికి రాజర్షి యయిన పరీక్షిన్మహారాజుతోడ సంవాదం బెట్లు సిద్ధించె బహుకాల కథనీయంబైన శ్రీభాగవతనిగమ వ్యాఖ్యాన మేరీతిసాఁగెన య్యోగిముఖ్యుండు గృహస్థుల గృహంబున గోవు బిదికిన యంతతడవు గాని నిలువఁ డం డ్రతండు గోదోహనమాత్ర కాలంబు సంచరించిన స్థలంబులు తీర్థంబులగుఁ బెద్దకాల మేకప్రదేశంబున నెట్లుండె భాగవతోత్తముండైన జనపాలు జన్మకర్మంబులేప్రకారంబులు వివరింపుము *(సీ॥ పాండవవంశంబు బలము మానంబును వర్ధిల్లఁగ డిమి నెవ్వాఁడు మనియెఁ। బరిపంథి రాజులు భక్త్యాదిధనముల సర్పింతు రెవ్వని యంఘ్రియుగముఁ। కుంభజకర్ణాదికురుభటవ్యూహంబు సొచ్చి చెండాడె నెవ్వాని తండ్రి। గాంగేయ సైనికాక్రాంత గోవర్గంబు విడిపించి తెచ్చె నెవ్వని తాత।యట్టి గాథకీర్తియగు పరీక్షిన్మహా। రాజు విడువఁదగని రాజ్యలక్ష్మిఁ। బరిహరించి గంగఁ బ్రాయోపవిష్టుఁడై। యసువులుండ నేల యడఁగియుండె*(ఉ॥ ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నఁడున్। జిత్తములందుఁ గోరరు హసించియు లోకుల కెల్ల నర్థసం।పత్తియు భూతియు న్సుఖము భద్రము గోరుదు రన్యరక్షణా। యత్తమమైన మేను విభుఁ డూరక యేల విరక్తిఁ బాసెనో*(క॥ సారముల నెల్ల నెఱుఁగుదు। పారగుఁడవు భాషలంకు బహువిధకథనో। దారుఁడవు మాకు సర్వముఁ బారము ముట్టంగఁ దెలియఁ బలుకు మహాత్మా* (వ॥ అని యడిగిన శౌనకాది మునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియెఁ దృతీయంబైన ద్వాపరయుగంబు దిరుగు సమయంబున నుపరిచరవసువు వీర్యంబున జన్మించి వాసవి నాఁదగు సత్యవతియందుఁ బరాశరునికి హరికళం జేసివిజ్ఞానియైన వేదవ్యాసుండు జన్మించి యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీజలంబుల స్నానాదికర్మంబులం దీర్చి శుచియై పరులు లేని చోట నొంటిఁ గూర్చుండి సూర్యోదయ వేళ నతీతానాగత వర్తమానజ్ఞుండై యాఋషి వ్యక్తంబుగాని వేగంబుగల కాలంబునం జేసి యుగధర్మంబులకు హితంబుగా భువి సాంకర్యంబు నొందు యుగయుగంబుల భౌతిక శరీరంబులకు శక్తి సన్నమగుఁ బురుషులు నిస్సత్వులు ధైర్యశూన్యులు మందప్రజ్ఞులల్పాయువులు దుర్బలురు నయ్యెదరని తన దివ్యదృష్టిం జూచి సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయందలంచి నలువురు హోతల చేత ననుష్ఠింపం దగి ప్రజలకు శుద్ధికరంబులైన వైదికకర్మంబులగు యజ్ఞంబు లేడఁ దెగకుండఁ గొఱకు నేకంబయిన వేదంబు ఋగ్యజుస్సామాథర్వణంబులను నాలుగు నామంబుల విభాగించి యితిహాసపురాణంబులన్నియుఁ బంచమవేదంబని పల్కె నందు *(సీ॥ పైలుండు ఋగ్వేదపఠనంబు దొరకొనె సామంబు జైమిని చదువుచుండె। యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ దుదినథర్వము సుమంతుఁడు పఠించె। నఖిలపురాణేతిహాసముల్ మా తండ్రి రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ। దమతమ వేదమాతపసులు భాగించి శిష్యసంఘములకుఁ జెప్పిరంత। శిష్యులొండొరులాత్మీయ శిష్యజనుల। కంత బహుమార్గముల యందు ననుమతింపఁ బెక్కుశాఖలు గలిగి యీపృథివిలోన। నిగమమొప్పారె భూసురనివహమందు*(వ॥ ఇట్లు మేధామంతులయిన పురుషుల చేతనట్టి వేదంబులు ధరియింపంబడుచున్నవి మఱియు దీనవత్సలుండయిన వ్యాసుండు స్త్రీశూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విననర్హంబులు గావున మూఢులకెల్ల మేలగునని భారతాఖ్యానంబు చేసియు నమ్ముని భూతహితమందుఁ దనహృదయంబు సంతసింపకున్న సరస్వతీతటంబున

—వ్యాసుండు వ్యాకులచిత్తుండై చింతించుట.—

ది. పారగుఁడవు భాషలందు। ఇతిహాసపురాణాద్యర్థప్రవచనములందు మిక్కిలి సమర్థుఁడవు - విషయేనాచాంస్నాంతిం। అనుపదములయర్థముఁ దెలుపఁబడియె.—తిరుగుసమయంబున। అనఁగా నాయుగమునకుఁ బరమభాగమునందలి యభిప్రాయము.—శక్తిసన్నమగు। సామర్థ్యము క్షీణించును-నిస్సత్వులు। బలహీనులు. దొరఁకొనె। ఆరంభించెను.—ఆతపసులు। ఆఋషులు-తపస్విశబ్దభవము. తపసి। పెక్కుశాఖలుగలిగి, అనేకములగుకొమ్మలుగలదై - ఇచట వేదము వృక్షముగా నిశ్చయించి యా వేదమునందు నంతర్గతములగు నల్పాంశములకు శాఖలని శిష్టవ్యవహారము గలదు- నిగమము. వేదము.—త్రైవర్ణికాధములకు-ద్విశబ్దవాచ్యులగు బ్రాహ్మణక్షత్రియవైశ్యులలో నధములకు వీరే ద్విజబంధువులని చెప్పఁబడుచున్నారు.

నొంటినుండి హేతువు వితర్కించుచు న్నదనలో నిట్లనియె* ( సీ ॥ వ్రతధారినై వేదవహ్నిగురుశ్రేణి మన్నించుచు విహితకర్మములం గొఱంత । వడకుండ నడుపుమ భారత మిష మునం బలికితి వేదార్థభావ మెల్ల । మునుకొని స్త్రీశూద్రముఖరధర్మములం దుం దెలిపితి నేం జెల్లదీనం జేసి । యాత్మ సంతసమం దంచాత్మలో నీశుండు సంతసింపక యున్న జాడ దోంచె । హరికి యోగివరులకభిలషితంబయిన । భాగవతవిధంబుం బలుక నైతి । మోసమయ్యెం దెలివి మొనయదు మఱచితి । ననుచు వగచుచున్నయవసరమున*

— వ్యాసునికడకు నారదుండు వచ్చుట. —

(సీ ॥ తనచేతి వల్లకీతంత్రీచయంబున సతత నారాయణశబ్దమొప్ప । నాననసంభూత హరిగీత రవసుధాధారల యోగీంద్రతతులు సొక్కం । గపిలజటాభార కాంతిపుంజంబుల దిశలు ప్రభాతదీధితి వహింపం । దనులగ్నతులసికాదామగంధంబులు గగనాంతరాళంబుం గప్పికొనంగ । వచ్చె మింటనుండి వాసవీనందను । కడకు మాటలాడం గడంకతోడ । భద్రవిమలకీర్తి పారగుం డారూఢ । నయవిశారదుండు నారదుండు*(క ॥ కని యెన్నారదుం డంతట । వినయైకవిలాసు నిగమవిభజనవిద్యా । జనితోల్లాసుం భవదుఃఖనిరాసుం గురుమనోవికాసుం వ్యాసుం * (వ ॥ ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి లేచి వ్యాసుండు వివిధక్రమంబుల నంబూజించిన నతండు లేనగవు నెగడెడి మొగంబుతోడ విపంచి కాతంత్రి వ్రేలమీటుచు నిట్లనియె*(ఉ ॥ ధాతవు భారతశ్రుతివిధాతవు వేదపదార్థజాలవిజ్ఞాతవు కామముఖ్యరిపుషట్కవిజేతవు బ్రహ్మతత్త్వనిర్ణేతవు యోగినేతవు వినేతవు నీవు చలించి చెల్లరే । కాతరు కైవడిం వగవం గారణమేమి పరాశరాత్మజా ॥ అనినం బారాశర్యుం డిట్లనియె ॥ (క ॥ పుట్టితివజు తనువునం జే । పట్టితివి పురాణపురుషుభజనము పదముల్ । మెట్టితివి దికుల నందుదు । ముట్టితివి మహాప్రబోధమున మునినాథా * ( వ ॥ అదియునుం గాక నీవు సూర్యునిభంగి మూండులోకములం జరింతువు వాయువు పగిది నఖిలజనులలోన మెలంగుదువు సర్వజ్ఞుండవగుటం జేసి* ( క ॥ నీకెఱుంగరాని ధర్మము । లోకములను లేదు బహువిలోకివి నీవుం । నాకొఱంత వెట్టిదంతయు । నాకుం బివరింపుమయ్య నారదకరుణం ॥ అనిన నారదుం డిట్లనియె* (ఉ ॥ అంచితమైన ధర్మచయమంతయుం జెప్పితివందులోన నిం । దించుకగాని విష్ణుకథ లేర్పడ జెప్పవు ధర్మములు ప్రపం । చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినం గాక నీకు నీ । కొంచెము వచ్చు టెల్ల హరిగోరి నుతింపమి నార్యపూజితా* (మ ॥ హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ । సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తిం వెలుంగొందు శ్రీహరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ । కరమై యుండ దయోగ్యదుర్మతినటత్కాకోల గర్తాకృతిం *(మ ॥ అపశబ్దంబులం గూడియుం హరిచరిత్రాలాపముల్ సర్వపా । పపరిత్యాగము సేయుం గావున హరిం భావించుచు న్సాధుచుం । జపముల్ సేయుచు వీనులం వినుచు నశ్రాంతంబుం గీర్తించుచుం । దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా తత్త్వజ్ఞ చింతింపుమా*(వ ॥ మునీంద్రా నిర్గతకర్మంబై నిరుపాధికంబయిన జ్ఞానంబు గలిగినను హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు ఫలంబు గోరక కర్మ మీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు భక్తిహీనంబులయిన జ్ఞానవాచాకర్మకౌశలంబులు నిరర్థకంబులు గావున మహానుభావుండవు యథార్థదర్శనుండవు సకలదిగంతధవళకీర్తివి సత్యరతుండవు ధృతవ్రతుండవు నగు నీవు నిఖిలబంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ వర్ణింపుము హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వివక్షించి తద్వివక్షాకృతరూపనామంబులం జేసి పృథగ్దర్శనుండైన వాని మతి పెనుగాలి త్రిప్పనంబడి తప్పంబడు నావచందంబున నెళవు సేరదు కామ్యకర్మంబులం దనురాగంబు గల ప్రాకృతజనులకు నియమించిన ధర్మంబులు సెప్పి శాసకుండవగు నీ నడువడి దగదది యెట్లనిన - వారలది యె ధర్మంబని జుగుప్సితంబులగు కామ్యకర్మంబులు సేయుచుం దత్త్వజ్ఞానంబు మఱుతురది గావున బుద్ధిమోహంబు జనియింపక తత్త్వప్రదుండవై వ్యథా వియోగంబు సేయుమనిమఱియు నిట్లనియె * ( చ ॥ ఎఱిఁగినవాఁడు కర్మచయ మెల్లను మాని హరిస్వరూపముం । నెఱయ నెఱుంగుం దాను మది నేరుపుం జూపు గుణానురక్తుండై । తెలియుట లేక గ్రుమ్మఱుచు దేహధనాద్యభిలాషయుక్తుండై । యెఱుంగని వానికిం దెలియ నీశ్వరలీల లెఱుంగం జెప్పుమా*(చ ॥ తనకుల ధర్మము న్విడిచి దానవవైరిపదారవిందము । ల్వసి వడి సేవం జేసి పరిపాకమువొందక నెవ్వండేనిం జచ్చిన మఱుమేననైన నది సిద్ధి వహించుం దదీయసేవం బాసినం గులధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులం * (వ ॥ అదిగావున నెఱుకగలవాఁడు హరిసేవకు యత్నంబు సేయందగుం గాలక్రమంబున సుఖదుఃఖంబులు ప్రాప్తంబులయిన హరిసేవ విడువందగదు ధ్యానం జేసి యూర్ధ్వంబున బ్రహ్మపర్యంతంబు క్రిందం స్థావరపర్యంతంబు దిరుగుచున్న జీవులకు దుఃఖంబులట్ల సుఖంబులు ప్రాకృతకర్మాధీనంబులై సిద్ధించు నెయ్యది పొందరాదట్టి మేలు సిద్ధించు కొఱకు హరిసేవ సేయవలయు హరిసే

మిషమున । చలమున । వ్యాజమున । నెపమున-మునుకొని । పూర్వకాలమునందు - చెల్ల । చెల్లంబో-అనంగా-అయ్యో, కటకట అనువానివలె సంతాపార్థకావ్యయము.—వల్లకీతంత్రీచయము । వీణయొక్క తంతువుల సమూహము, తంత్రీశబ్దభవము-తంతి.—వాసవీనందనుకడకు । వ్యాసుని సమీపమునకు-కడంకతోడ । ధైర్యముతోను.—విపంచికా । ఏడుతంతువులుగల వీణ.—కాతరు । భయపడువాని.—కాకోలగర్తాకృతిం । మాలకాకు

వకుండగువాఁడుజననంబునొందియు నన్యక్రియాసంసారంబునంజిక్కఁడు క్రమ్మఱ హరిచరణంబుఁజేరు భక్తిరసవశీకృతుండయివిడువనిచ్చగింపఁడుమఱియు *(సీ॥ విష్ణుండువిశ్వంబువిష్ణునికంటెను వేఱేమియును లేదువిశ్వమునకు।భవవృద్ధిలయములాపరమేశుచేనగునీవెఱుంగుదు గాదెనీముఖమున । నెఱిఁగింపఁబడ్డదియేకదేశమునని భువనభద్రమునకై పుట్టినట్టి। హరికళాజాతుండవనవిచారింపుము కావునహరిపరాక్రమములెల్ల । వినుతిసేయుమీవువినికినిఁజదువును । దానమతులనయముఁదపముధృతియుఁ।గలిమికెల్లఫలముగాదెపుణ్యశ్లోకుఁ।గమలనాభుఁబొగడఁగలిగెనేని* (వ॥ మహాత్మా నేనుపూర్వక

—✤ నారదుని పూర్వజన్మవృత్తాంతము. ✤—

ల్పంబునందొల్లిటిజన్మంబున వేదవాదులయింటిదాసికింబుట్టిపిన్ననాఁడు వారలచేఁబంపంబడి యొకవానకాలంబునఁజాతుర్మాస్యంబున నేకస్థలనివాసంబు సేయనిశ్చయించినయోగిజనులకుంబరిచర్యసేయుచు* (క॥ ఓటమితో నెల్లప్పుడు।పాటవమునఁబనులుసేసిబాలురతో నే।యాటలకుఁబోక యొకజం।ఝాటంబును లేకభక్తిసలుపుదుననఘా*(క॥ మంగళమనుచును వారల।యెంగిలిభక్షింతువానకెండకునోడ।న్మంగలనిలుతునునియతిని।వెంగలిక్రియఁజనుదు నేవివేకముతోడన్* (వ॥ ఇట్లేనువర్షాకాలశరత్కాలంబులు సేవించితివారునునాయందుఁగృపఁజేసిరంత*(శా॥ వారల్గృష్ణచరిత్రముల్సదువఁగావర్ణింపఁగాఁబాడఁగా । నారావంబుసుధారసప్రతిమమైయశ్రాంతమున్వీనులం । దోరంబై పరిపూర్ణమైనమదిసంతోషించినేనంతటన్।ప్రారంభించితివిష్ణుసేవకితరప్రారంభదూరుండనై * (వ॥ ఇట్లుహరిసేవామతింజేసి ప్రపంచాతీతుండనై బ్రహ్మరూపకుండయిననాయందుస్థూలసూక్ష్మంబైనయీశరీరంబునిజమాయాకల్పితంబనియమ్మహాత్ములగు యోగిజనులమూలంబునరజస్తమోగుణపరిహారిణియయినభక్తిసంభవించె నంతఁజాతుర్మాస్యంబునిండిననయ్యోగిజనులు యాత్రసేయువారలైయివ్విధంబున*(మ॥ అపచారంబులు లేకనిత్యపరిచర్యాభక్తియుక్తుండనై।చపలత్వంబునుమాని నేఁగొలువఁగాసంప్రీతులై వారుని । ష్కపటత్వంబునదీనవత్సలతతోఁగారుణ్యసంయుక్తులై । యుపదేశించిరి నాకునీశ్వరరహస్యోదారవిజ్ఞానమున్*
(వ॥ ఏనువారియుపదేశంబునవాసుదేవునిమాయానుభావంబుఁదెలిసితినీశ్వరునియందు సమర్పితంబయినకర్మంబు తాపత్రయంబుమాన్పనౌషధంబగు నేద్రవ్యంబువలన నేరోగంబుజనియించె నాద్రవ్యమారోగంబుమానుప నేరదు ద్రవ్యాంతరంబులచేతనైనచికిత్సితంబుమానుపనోపునివ్విధంబునఁగర్మంబులుసంసారహేతుకంబులయ్యునీశ్వరార్పితంబులై తాముందమ్ముఁజెఱుపుకొననోపియుండునీశ్వరునియందుఁజేయఁబడుకర్మంబు విజ్ఞానహేతుకంబై యీశ్వరసంతోషణంబును భక్తియోగంబునుంబుట్టించు నీశ్వరశిక్షుంజేసికర్మంబులుసేయువారలు కృష్ణగుణనామవర్ణనస్మరణంబులుసేయుదురు ప్రణవపూర్వకంబులుగా వాసుదేవప్రద్యుమ్నసంకర్షణానిరుద్ధమూర్తినామంబులు నాలుగుభక్తింబలికి నమస్కారంబుసేసి మంత్రమూర్తియుమూర్తిశూన్యుండునయినయజ్ఞపురుషుంబూజించుపురుషుండుసమ్యగ్దర్శనుండగు * (క॥ ఏనివ్విధమునఁజేయఁగ।దానవకులవైరి నాకుఁదనయంతటివి।జ్ఞానమునిచ్చెను మదను।స్థానమునతఁడెఱుఁగునీవుసలుపుమదీనన్ * (క॥ మునికులములోనమిక్కిలి।వినుకులుగలవాఁడవీవువిభుకీర్తులునీ।వనుదినముఁబొగడవినియెడి। జనములకున్దుఃఖమెల్లశాంతింబొందున్*(వ॥ఇట్లునారదుజన్మకర్మంబులువినిక్రమ్మఱవ్యాసుండిట్లనియె*(మ॥ వినుమాభిక్షులునీకునిట్లుకరుణన్విజ్ఞానముం జెప్పిపో।యినబాల్యంబునవృద్ధభావమునని కేరీతిసంచారమున్ । జనె నీకిప్పుడుపూర్వకల్పమతియేజాడంబ్రదీపించెదు। త్తనువుంబాసినచందమెట్లుచెపుమా దాసీసుతత్వంబుతోన్ * (వ॥ అనియిట్లువ్యాసుండడిగిననారదుండిట్లనియె దాసీపుత్రుండనయినయేనుభిక్షులవలనహరిజ్ఞానంబుగలిగియున్నంత( సీ॥ మమ్మునేలినవారిమందిరంబునఁగలపనులెల్లఁగ్రమమునభక్తిఁజేసి। తనపరాధీనతఁదలఁపమసొలసితినలసితినాకొంటిననుచువచ్చు। మాపును రేపునుమాతల్లిమోహంబుసొంపారముద్దాడుచుంచుదువ్వు। దేహంబునివురుమోదించుఁగౌఁగిటఁజేర్చునర్మిలినన్నిట్టులరసిమనుప। నేనువిడిచిపోకనింటనుండితినయ్య।మోహఁగాకయెఱుకమోసపోక।మాఱుచింతలేకమానినైయేనేండ్ల।వాఁడనగుచుఁగొన్నివాసరములు* (క॥ సదనమువెలువడితెరువునఁ । జెదరకమాతల్లిరాత్రిఁజీఁకటివేళ । న్మొదవుంబిండుకఁగనొకఫణి ।పదభాగముఁగఱచెఁద్రొక్కఁబడిమునినాథా * (క॥ నీలాయతభోగఫణ।వ్యాళానలవిషమహోగ్రవహ్నిజ్వాలా।మాలావినిపాతితమై।వ్రాలెన్నుఁగన్నతల్లివసుమతిమీఁదన్*(ఉ॥ తల్లిధరిత్రిపైనొఱగితల్లడపాటునుజెందిచిత్తమున్ । బల్లటిలంగఁబ్రాణములువాసినఁజూచికలంగ నేను నా। యుల్లములోనమోహరుచినొందకసంగమువాసె మేలురా । జిల్లైనటంచువిష్ణుపదచింతయొనర్చుచుబుద్ధిఁజేర్చుచున్ * (వ॥ ఉత్తరాభిముఖుండనై యేను వెడలిజనపదంబులుఁబురంబులుఁబట్టణంబులుగ్రామంబులుఁబల్లెలు మందలుమ

లుఁదుపల్లమురీతి.—ఓటమి । ఓటము-అనఁగాగర్వలేశములేకున్నందునఁదనయందు నెల్లపుడనమత్వమునువహించుట.— తోరంబై । సుందరమై. —తాపత్రయంబు । ఆదిభౌతికము,ఆధిదైవికము,ఆధ్యాత్మికము,అనెడుమూఁడుతాపంబులు.—ప్రణవపూర్వకముగా । ప్రణవమనఁగాఓం

హిమోద్యానంబులుఁ గిరాతపుళిందనివాసంబులు వనంబులుఁ జిత్రధాతువిచిత్రితంబులైన పర్వతంబులు సమదకరికరవిదళితశాఖులుగలశాఖులునునివారితపథికజనశ్రమాతిరేకంబులైనతటాకంబులుబహువిధవిహంగనినదమనోహరంబులై వికచారవిందమధుపానపరవశపరిభ్రమద్భ్రమరసుందరంబులైన సరోవరంబులుఁ దాఁటిచనుచు క్షుత్పిపాసాసమేతుండనైనదీహ్రదంబునఁ గ్రుంకులిడి శుచినై నీరుద్రావి గతశ్రముండనై * ( క ॥ సాలావృకకపిభల్లుక।కోలేభలులాయశల్యఘూకశరభశా।ర్దూలశశగవయఖడ్గ।వ్యాళాజగరాదిభయదవనమధ్యమునన్ ।*( వ ॥ దుస్తరంబయిననలవేణుకీచకగుల్మలతాగహ్వరంబులఁ బొంతనొక్క రావిమ్రానిడగ్గరఁ గూర్చుండి యేవిన్నచందంబున నాహృదయగతుం బరమాత్మస్వరూపు హరిం జింతించితి*( శా ॥ ఆనందాశ్రులుఁ గన్నులన్ వెడలరోమాంచంబుతోఁ దత్పద। ధ్యానామోదుఁడనైననాతలఁపులోనన్ దేవుఁడుం దోఁచె నే।నానందాబ్ధిగతుండనై యెఱుఁగలేనైతిన్ననున్నీశ్వరున్।న్నానాశోకహమైనయత్తనువుగానన్నేరకట్లంతటన్ *( వ ॥ లేచి నిలువంబడి క్రమ్మఱనద్దేవునిదివ్యాకారంబుఁ జూడనిచ్ఛయించి హృదయంబున నిలుపుకొని యాతురుండపోలెఁ జూచుచుండఁగా నకసర్మనుష్యంబయిన వనంబున సంచరియించుచున్ననన్నునుద్దేశించి వాగగోచరుండైన హరి గంభీరమధురంబులయిన వచనంబులశోకంబు ప్రశమింపంజేయుచందంబున నిట్లనియె*( ఉ ॥ ఏలకుమారశోషిలఁగ నీజననంబున నన్నుఁగానఁగాఁ।జాలవు గానఁగామముఖషట్కము నిర్దళితంబుసేసిని।ర్మూలితకర్ములైన మునిముఖ్యులు గానికుయోగిగానఁగాఁ । జాలఁడు నీదు కోర్కిఁ గొనసాగుటకై నిజమూర్తిఁ జూపితిన్ *( క ॥ నావలని కోరికయూరక।పోవదు విడిపించుదోషపుంజములను మ । త్సేవంబుట్టును వైళము।భావింపఁగ నామభక్తి బాలక వింటే* ( క ॥ నాయందుఁ గలుగు నీమది।వాయదు జన్మాంతరముల బాలక నీవీ।కాయంబు విడిచి మీఁదట।మాయను మతిఁబుట్టఁగలవు మద్భక్తుఁడవై *( మ ॥ వినుమీసృష్టిలయంబునొంది యుగముల్వేయైనకాలంబు యా।మినియైపోయెడిఁ బోవఁగాఁగలుగుఁ జుమ్మీమీఁద నాసృష్టి యం । దు నిరూఢస్మృతితోడఁ బుట్టెదవు నిర్దోషుండవై నాకృపన్ । ఘనతం జెందెదు శుద్ధసాత్త్వికులలో గణ్యుండవై యర్భకా *( వ ॥ అనియిట్లాకాశంబున నోంకారమూర్తియు బుగ్వేదాదికంబు నిశ్వాసంబు గానొప్పు సర్వనియామకంబైన మహాభూతంబు వలికి యూరకున్న నేను మస్తకంబు వంచి మ్రొక్కి తత్కరుణకు సంతసించి మదము దిగనాడి మత్సరంబు విడిచి కామంబు జయించి క్రోధంబు వర్జించి లోభమోహంబులు నెడలనడిచి సిగ్గు విడిచి యనంతనామంబులు పఠించుచుఁ బరమభద్రంబులయిన తచ్చరిత్రంబులం జింతించుచు నిరంతరసంతుష్టుండనై కృష్ణుని బుద్ధి నిలిపి నిర్మలాంతఃకరణంబుతోడ విషయవిరక్తుండనై కాలమున కెదురుసూచుచు భూమిం దిరుగుచునుండ నంతఁ గొంతకాలంబునకు మెఱుపుమెఱసిన తెఱంగున మృత్యువు దోఁచిన నం బంచభూతమయంబును గర్మస్వరూపంబయిన పూర్వదేహంబు విడిచి హరికృపావశంబున శుద్ధసత్త్వమయంబైన భాగవతదేహంబు సొచ్చితి నంతం బ్రైలోక్యంబు సంహరించి ప్రళయకాలపయోరాశిమధ్యంబున శయనించు నారాయణమూర్తియందు నిదురఁబోవ నిచ్ఛగించు బ్రహ్మనిశ్వాసంబువెంట నతనిలోపలం బ్రవేశించితి నంతసహస్రయుగపరిమితంబైన కాలంబు చనిన లేచి లోకంబులు సృజియింపనుద్యోగించు బ్రహ్మప్రాణంబువలన మరీచిముఖ్యులగు మునులు నేనును జన్మించితిమి మందు నఖండితబ్రహ్మచర్యుండనై యేను మూఁడులోకంబుల బహిరంతరంబులందు మహావిష్ణునియనుగ్రహంబున నడ్డంబు లేక యీశ్వరదత్తయై బ్రహ్మాభివ్యంజకంబులయిన సప్తస్వరంబులు దనయంతన మ్రోయుచున్న యీవీణాలాపనరతిం జేసి నారాయణకథాగానంబు సేయుచుఁ జరియించుచుండుదు * ( గీ ॥ తీర్థపాదుఁడయిన దేవుండు విష్ణుండు।దనచరిత్రమేను దవిలి పాడఁ।జీఱఁ బడ్డవానిచెలువున నేతెంచి।ఘనుఁడు నామనమునఁ గానవచ్చు* ( క ॥ వినుమీ సంసారంబను।వననిధిలో మునిఁగి కర్మవాంఛలచే వే।దనఁ బొందెడు వానికి వి।ష్ణుని గుణవర్ణనము దేపసుమ్ము మునీంద్రా* ( చ ॥ యమనియమాదియోగముల నాత్మ నియంత్రితమయ్యుఁ గామరో । షములఁ బ్రచోదితంబయగు శాంతివహింపదు విష్ణుసేవచేఁ । గ్రమమున శాంతిఁ గైకొనినకైవడి నామశరీరజన్మక।ర్మములరహస్యమెల్లమునిమండన చెప్పితి నీవు గోరినన్ * ( వ ॥ అనియిట్లు భగవంతుండగు నారదుండు వ్యాసమునీంద్రునివీడ్కొని వీణ వాయించుచు యదృచ్ఛామార్గంబునం జనియెనని సూతుండిట్లనియె* ( క ॥ వాయించు వీణ నెప్పుడు। మ్రోయించు ముకుందగీతములు జగములకు । జ్ఞేయించుఁ జెవులపండువు।మాయించు నఘాళి నిట్టిమతము ఱిగలఁడే*( వ ॥ అని నారదుం గొనియాడిన సూతునిం జూచి నారదుమాటలు విన్నవెనుక భగవంతుండయిన బాదరాయణుండేమి చేసెనని శౌనకుండడిగిన సూతుండిట్లనియె బ్రహ్మనదియైన సరస్వతీపశ్చిమతీరంబున ఋషులకు సత్రధర్మవర్ధనంబయిన బదరీతరుషండమండితంబయిన శమ్యాప్రాసంబని ప్రసిద్ధంబగు నాశ్రమంబు గలదందు జలంబులు వార్చి కూర్చుండి వ్యా

కారము-అదిమందుగాఁ జేరియుండునటులవినుకులు ॥ ఆలకించుటలు, అనఁగా బహుశ్రుతుఁడవనుట.—సాలసితిన్ ॥ మూర్ఛిల్లితి, శోషపోతి, అలసితి, ఆయాసంబునొందితి.—ఆకొంటి ॥ ఆఁకలిగొంటి. చుంచు, చిప్పకూఁకటి-అనఁగాఁ బశిబిడ్డలతలలో నుండుచిఱు వెంట్రుకలు. మను ప।రక్షింపఁగాను. కిరాత ॥ పుళిందనివాసంబులు, కిరాతులనఁగా నెమలిపింఛముగట్టుకొను బోయలు. పుళిందులనఁగా-తమభాషఁదప్ప వేఱొ

సుందుదనము దిరదిరంబు సేసికొని భక్తియుక్తంబైన చిత్తంబున బరిపూర్ణుండయిన యీశ్వరుం గాంచి యీశ్వరాధీనమాయావృతంబైన జీవుని సంసారంబుఁ గని జీవుండు మాయచేత మోహితుండై గుణవ్యతిరిక్తుండయ్యు మాయాసంగతిం దాను త్రిగుణాత్మకుండనని యభిమానించుచుం ద్రిగుణాత్మాభిమానంబునం గర్తయు భోక్తయు ననర్థంబు నొందు ననియు నయ్యనర్థంబునకు నారాయణభక్తియోగంబు గాని యుపశమనంబు వేఱొకటి లేదని నిశ్చయించి* (మ॥ అవనీచక్రములోన నెవ్వరు మహాదేయామ్నాయమున్నిన్నమా । ధవుఁడౌ లోకశరణ్యు వైభవములం దవ్వింపఁ గాఁ జాలుభ । క్తివిశేషంబు జనించునట్టిభువనక్షేమంకరంబైన భాగవతామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె నేర్పొప్పఁగన్* (వ॥ ఇట్లు భాగవతంబు నిర్మించి మోక్షార్థియైన శుకునిచేఁ జదివించెనని చెప్పిన శౌనకుండు విని నిర్వాణతత్పరుండును సర్వోపేక్షకుండును నైన శుకయోగి యేమిటికి భాగవతంబభ్యసించెననవుడు సూతుండిట్లనియె* (క॥ ధీరులు నిరపేక్షులునా । త్మారాములునైన మునులు హరిభజనము ని । ష్కారణము చేయుచుందురు । నారాయణుఁ డట్టివాఁ డనన్యచరిత్రా* (క॥ హరిగుణవర్ణనరతుఁడై । హరితత్పరుఁడైన బాదరాయణిశుభత । త్పరతం బఠించె ద్విజగ । ద్వరమంగళమైన భాగవతనిగమంబున్* (క॥ నిగమములు వేయుఁ జదివిన । సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్ । సుగమంబు భాగవతమను । నిగమంబుఁ బఠింపముక్తి నివసనము నృపా* (వ॥ అని పలికి రాజ

—అర్జునుండు పుత్రఘాతియగు నశ్వత్థామ నవమానించుట.—

ర్షియైన పరీక్షిన్మహారాజు జన్మకర్మముక్తులును, పాండవుల మహాప్రస్థానంబును, కృష్ణకథోదయంబును జెప్పెదఁ గౌరవధృష్టద్యుమ్నాదుల యుద్ధంబున వీరులైన వారలు స్వర్గంబునకుం జనిన వెనుక భీముగదాఘాతంబున దుర్యోధనుండు తొడలు విఱిగి కూలిన నశ్వత్థామ దుర్యోధనునకుం బ్రియంబు సేయువాఁడై నిదురఁ బోవు ద్రౌపదీపుత్రుల శిరంబులు ఖండించి తెచ్చి సమర్పించెనది క్రూరకర్మంబని లోకులు నిందింతురు* (ఉ॥ బాలుర చావు కర్ణములఁ బట్టఁగలంగి యలంగి యోరువం । జాలక బాష్పతోయకణజాలము చెక్కుల రాల నేడ్చి పాం । చాలతనూజ నేలఁబడి జాలిఁబడం గని యొత్తినం జువా । చాలతఁ జూపుచుం జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనున్* (శా॥ ధరణీశాత్మజ నీకు నేల వగవన్ ధర్మంబె యీ ద్రోణినిం । పుర్కశుండై పడలించె బాలకుల మ్రగ్గాండీవనిర్ముక్తభీ । కరబాణంబుల నేఁడు వాని శిరముం ఖండించి నేఁ దెత్తుఁ దద । చ్ఛిరముం ద్రొక్కి జలంబులాడు మిచటన్ శోకంబు బింబాననా* (వ॥ అని యిట్లూఱడంబఱిచి తనకు మిత్రుండును సారథియునైన హరి మేలనుచుండం గవచంబు దొడిగి గాండీవంబు ధరియించి కపిధ్వజుండై గురుసుతుని వెంటరథంబుఁ దోలించిన* (శా॥ తన్నుం జంపెదనంచు వచ్చు విజయుం దర్శించి యా ద్రోణి యా । పన్నుండై శిశుహంత గావున నిజప్రాణేచ్ఛఁ బాఱెన్ వడిన్ । మున్నా బ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింపనా । సన్నుండౌ హరుఁ జూచి పాఱు పగిదిన్ సర్వేంద్రియభ్రాంతితోన్* (వ॥ ఇట్లోపినంత దూరంబుం బఱువిడి వెనుకఁ జూచి రథతురంగంబులలయుటఁ దెలిసి నిలిచి ప్రాణరక్షణంబునకు నొండుపాయంబు లేమి నిశ్చయించి జలంబులు వార్చి ద్రోణనందనుండు సమాహితచిత్తుండై ప్రయోగంబ కాని యుపసంహారంబు నేరకయు ప్రాణసంరక్షణార్థంబునకై పార్థుని మీఁద బ్రహ్మశిరోనామకాస్త్రంబుఁ బ్రయోగించిన నది ప్రచండతేజంబున దిఙ్మండలంబు నిండి ప్రాణభయంకరంబై తోఁచిన హరికి నర్జునుం డిట్లనియె* (సీ॥ పద్మలోచన కృష్ణ భక్తాభయప్రద నీవు ము సంసారాగ్ని నేర్చుచున్న । జనుల సంసారంబు సంహరింపఁగ నీవు దక్క నన్యులు లేరు దలఁచి చూడ । సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు ప్రకృతిపరుండవు పరమపురుష । నీప్రబోధము చేత నీమాయ నంతయు నడఁచువు నిశ్రేయసాత్మయందు । మాయయందు మునిఁగిన వారలకుఁ గృపఁ జేసి ధర్మముఖ్యవిధమ్ము లయిన । శుభము సేయుచుందువు జనుల నవనిలోఁ । గావఁ బుట్టుదువు జగన్నివాస* (క॥ ఇది యొక తేజము భూమియుఁ । జదలును దిక్కులును నిండి సర్వంకషమై । మొనలై వచ్చుచు నున్నది । యిదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా ॥ అనిన హరి యిట్లనియె* (శా॥ జిహ్మత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు ప్రాణేచ్ఛమై । బ్రహ్మాస్త్రంబ దె వేయ వచ్చె నిదె తద్బాణాగ్ని బీభత్సనీ । బ్రహ్మాస్త్రంబునఁ గాని దీని మఱలింపన్ రాదు సంహారమీ । బ్రహ్మోపత్యమెఱుంగఁ డేమము వడిన్ బ్రహ్మాస్త్రముం దీనిపై* (వ॥ అనినన్నర్జునుండు జలంబులు వార్చి హరికిం బ్రదక్షిణంబు వచ్చి ద్రోణనందనుం డేసిన యస్త్రంబు మీఁదఁ దన బ్రహ్మాస్త్రంబుం బ్రయోగించిన* (మ॥ అవని వ్యోమములం దనిండి తమలోనా రెండు బ్రహ్మాస్త్రము । లవిపహ్నిద్యుతిఁ బోరుచుం ద్రిభువనత్రాపంబు గావింపఁగా । వివశభ్రాంతియుఁ గాంతమోయని ప్రజల్ వీక్షింపనా వేళమా । ధవునాజ్ఞన్ విజయుండు సేసె విశిఖద్వంద్వోపసంహారమున్* (వ॥ ఇట్లస్త్రద్వయంబు నుపసంహరించి ధనంజయుండు ద్రోణనందనుఁ గూడ నరిగి పట్టుకొని రోషారుణితలోచనుండై గాజకుండు గజ్జుపున పశువుం గట్టిన చందంబున బంధించి శిబిరంబుకడకుం గొనిచని హింసింతు నని

---

కభాషఁ దెలియని చెంచుబోయెలు. కామముఖషట్కము॥ కామము మొదలయిన యాఱింటిని-అనఁగా-అరిషడ్వర్గము ననుట. ఏయామ్నాయముక్॥ భగవత్తత్త్వమును లెస్సగఁ దెలియఁ జేసెడు వేదతుల్యమయిన యే గ్రంథమును, చికురజాలము॥ తలవెంట్రుకలగుంపు. చదలు॥ ఆకసంబు,

తిగిచినం జూచి హరి యిట్లనియె* (ఉ॥ మాలుపడంగ లేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం । దేలని పిన్నపాపల వధించెను సిద్ధపు క్రూరకర్ముఁడై । పాఱుఁడె వీఁడు పాతకుఁడు ప్రాణభయంబున వెచ్చనూర్చుచుం । బాఱెడి వీనిఁ గావుము కృపామతి నర్జున పాపవర్జనా* (చ॥ వెఱచిన వాని దైన్యమున వేదురు నొందిన వాని నిద్రమై । మఱచిన వాని సౌఖ్యముగ మద్యము ద్రావిన వాని భగ్నుఁడై । పఱచిన వాని సాధుజడభావము వానిని గావు మంచు వా । చఱచిన వానిఁ గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా * (శా॥ స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణాసంగంబు చాలించి య । న్యప్రాణంబుల చేత రక్షణము సేయున్వాఁ డధోలోకదుః । ఖప్రాప్తుం డగు రాజదండమున సత్కల్యాణుఁడౌ నైన నీ । విప్రున్దండిపుఁ జేయు మేటికి మహావిభ్రాంతి చేసుండఁగన్* (వ॥ అని యివ్విధంబునఁ గృష్ణుం డానతిచ్చిన బ్రాహ్మణుండు కృతాపరాధుండైన వధ్యుండు గాఁడని ధర్మంబుఁ దలంచి చంపక ద్రుపదరాజపుత్రికిం దన చేసిన ప్రతిజ్ఞం దలంచి బద్ధుండైన గురునందనుం దోడ్కొని కృష్ణుండు సారథ్యంబు సేయ శిబిరంబు కడకు వచ్చి * (క॥ సురరాజసుతుఁడు సూపెను । దురవధిసుతశోకయుతకు ద్రుపదునిసుతకు । స్ఫురిచలితాంగశ్రేణి । స్ఫురుపమహాపాశబద్ధపాణిన్

—ద్రౌపదియశ్వత్థామను జూచి సంభాషించుట,—

ద్రౌణిన్* (వ॥ ఇట్లర్జునుండు దెచ్చి చూపిన బాలవధజనితలజ్జాపరాఙ్ముఖుండైన గురునికొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె* (మ॥ పరగన్వామగ వారలందఱును మున్బాణప్రయోగోపసం । హరణాద్యాయుధవిద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసించిరి పుత్రాకృతినున్న ద్రోణుఁడవు నీ చిత్తంబులో లేశము । న్గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే* (క॥ భూసురుఁడవు బుద్ధిదయా । భాసురుఁడవు శుద్ధవీరభటసందోహా । గ్రేసరుఁడవు శిశుమారణ । మానురకృత్యంబు ధర్మమగు నే తండ్రీ* (శా॥ ఉద్రేకంబున రాజశస్త్రధరులై యుద్ధావనిన్లేగు కిం । చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతోఁ జీకటిన్ న్నిరాకారులఁ జిన్నపాపల రణప్రౌఢక్రియాహీనులన్ । నిద్రాసక్తుల సంహరింపనకటా నీ చేతులెట్లాడెనో* (ఉ॥ అక్కట పుత్రశోకజనితాకులభారవిపన్నచిత్తనై । పొక్కుచునున్న భంగి నినుబోరగిరీటి నిబద్ధుఁ జేసి నేఁ । డొక్కడకీడ్చి తెచ్చుట సహింపదు భవదీయ మాత నేఁ । డెక్కడ నిట్టి శోకమున నే క్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో* (వ॥ అని కృష్ణార్జునులం జూచి యిట్లనియె* (ఉ॥ ద్రోణునితో శిఖింబడక ద్రోణకుటుంబిని యున్నదింటన । క్షీణతనూజశోకవివశీకృతనై విలపించు భంగి నీ । ప్రాణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంత పొక్కునో । ప్రాణవియుక్తుఁడైన నతిపాపము బ్రాహ్మణహింస మానరే* (క॥ భూపాలకులకు విప్రులఁ । గోపింపఁగఁ జేయఁ దగదు కోపించినఁ దత్కోపానలంబు మొదలికి । భూపాలాటవులఁ గాల్చు భూకంపముగన్* (వ॥ అని యిట్లు ధర్మ్యంబును సకరుణంబును నిర్వ్యళీకంబును సమంజసంబును శ్లాఘ్యంబునగు ద్రౌపది పలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె నకులసహదేవసాత్యకిధనంజయకృష్ణులు సమ్మతించిరి సమ్మతింపక భీముండిట్లనియె * (చ॥ కొడుకులఁ బట్టి చంపెనని కోపము నొందక బాలఘాతకున్ । విడువుమటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది వీఁడు విప్రుఁడే । విడువఁగ నేలఁ జంపుఁ డిటు వీనిని మీరలు చంపరేని నా । పిడికిటి పోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడుఁ డందఱున్ * (వ॥ అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె భీముని సంరంభంబు సూచి హరి చతుర్భుజుండై రెండు చేతుల భీముని వారించి కడమ రెంటను ద్రుపదపుత్రిక నుదలంగించి నగుచు భీమునకిట్లనియె* (ఉ॥ అవ్వఁడు గాఁడు వీఁడు శిశుహంత మరాత్మకుఁ డాతతాయి హం । తవ్యుఁడు బ్రహ్మబంధుఁ డగుఁ దప్పదు నిక్కము బ్రాహ్మణో న హం । తవ్య యటంచు వేదము శ్రుతిసంబుఁ గావున ధర్మదృష్టిఁ గ । ర్తవ్యము వీనిఁ గాచుట యథాస్థితిఁ జూడుము పాండవోత్తమా* (వ॥ అని పరసాలాపంబులాడి పవననందను నొడంబఱిచి యర్జునుం జూచి ద్రౌపదికిన్ భీమసేనునకు సమ్మతంబుగ మున్ను నీ చేసిన ప్రతిజ్ఞ యుసిద్ధించునట్లు నా పంపు సేయుమని నారాయణుం డానతిచ్చిన నర్జునుండు దదనుమతంబున* (శా॥ విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుండు ఘోరాసిచే । నశ్వత్థామశిరోజముల్ దఱిఁగి చూడాంతర్మహారత్నమున్ । శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని పాశవ్రాతబంధంబులన్ । విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరోర్వీభాగముం బాసిపోన్* (క॥ నిబ్బరపు బాలహంతయు । గొబ్బునఁ దేజంబు మణియుఁ గోల్పడినతుఁడై । ప్రబ్బిన చింతన్ విప్రుఁడు । సిబ్బితితో నొడలి గబ్బు సెడి వడి జనియెన్* (గీ॥ ధనము గొనుట యొండె దలఁ గొరుగుట యొండె । నాలయంబు వెడలనడఁచుట యొండెఁ । గాని చంపఁదగిన కర్మంబు సేసినఁ । జంపఁదగదు విప్రజాతి బతికి* (వ॥ ఇట్లశ్వత్థామం బ్రాణావశిష్టుం జేసి వెడలనడఁచి పాండవులు పాంచాలీసహితులై పుత్రులకు శోకించి మృతులైన బంధువులకెల్ల దహనాదికృత్యంబులు సేసి జలప్రదానంబు సేయుకొఱకు స్త్రీల ముందలనిడుకొని గోవిందుండునుం దారును గంగకుం జని తిలోదకంబులు వోసి క్రమ్మఱ విలపించి హరిపాదపద్మజాతపవిత్రంబులయిన భాగీరథీజలంబుల స్నాతులయి యున్నయెడం బుత్రశోకాతురుల

మిన్ను. తిగిల॥ ఈడ్చిపైకెత్తి. పాఱుఁడె॥ బ్రాహ్మణుఁడా. వెచ్చనూర్చుచున్ ॥ వెచ్చఁగా నూపిరి విడుచుచును. వెదురు నొందినవానినిన్ ॥ ఉన్మాదము నొందినవానిని. పఱచినవానిన్ ॥ యుద్ధరంగంబునఁ బరుగెత్తినవానిని. వాచఱచినవానిన్ ॥ వేడుకొనినవానిని. శిఖింబడక ॥ అగ్నిప్రవేశ

యినగాంధారీధృతరాష్ట్రులనుగుంతీద్రౌపదులనుజూచిమాధవుండుమునీంద్రులుందానును బంధుమరణశోకాతురులయిన వారలవగపుమానివిమన్నించెనిట్లు విధంబున* (శా॥ పాంచాలీకబరీవికర్షణమహాపాపత్తుతాయుష్కులం।జంచద్గర్వులధార్తరాష్ట్రులనినింజంపించిగోవిందుఁడి।ప్పించెన్రాజ్యముధర్మపుత్రునకుఁగల్పించెన్మహాఖ్యాతిఁజే। యించెన్మూఁడుతురంగమేధములుదేవేంద్రప్రభావంబునన్ *(వ॥ అంత వాసుదేవుండువ్యాసప్రముఖ భూసురపూజితుండయి యుద్ధవసాత్యకులుగొలువద్వారకాగమనప్రయత్నంబునఁ బాండవులవీడ్కొనిరథారోహణంబుసేయుసమయంబునం దత్తరపడుచు నుత్త

—⁂ శ్రీకృష్ణుండుత్తరగర్భస్థుండగు నర్భకుని రక్షించుట. ⁂—

రసనుదెంచి కల్యాణగుణాత్మకుండైనహరికిట్లనియె * (మ॥ ఇదె కాలానలతుల్యమైనవిశిఖంబేతెంచెదేవేశ నేఁ । డుదరాంతర్గతగర్భదాహమునకైయుగ్రప్రభన్వచ్చుచు।న్నదిదుర్లోక్యముమానుపన్శరణమన్యంబేమియు న్లేమనీ । పదపద్మంబులెకాని యొండెఱుఁగనీబాణాగ్ని వారింపవే* (క॥ దుర్భరబాణానలమున।గర్భములోనున్నశిశువుఘనసంతాపా।విర్భావంబునుబొందెడి।నిర్భరకృపఁగావుమయ్యనిఖిలస్తుత్యా* (క॥ చెల్లెలికోడలనీమే।నల్లుఁడుశత్రువులచేతహతుఁడయ్యెను సం।ఫుల్లారవిందలోచన।భిల్లాగ్నినడంచిశిశువుబ్రతికింపఁగదే* (గీ॥ గర్భమందుఁగమలగర్భాండశతములు । నిముడికొనినటించునీశ్వరేశ । నీకునొక్కమానిగర్భరక్షణమెంతబసువునిర్వహింతుగాక * (వ॥ అనినసాశ్రితవత్సలుండయినపరమేశ్వరుండుసుభద్రకోడలిదీనాలాపంబులాలించియిదిద్రోణనందనుండులోకమంతయు నపాండవంబయ్యెడుమనినియేసిన దివ్యాస్త్రమగునని యెఱింగెనంతఁబాండవులకభిముఖంబై ద్రోణనందనుదివ్యాస్త్రనిర్గతనిశితమార్గణంబుడగ్గరినజెగ్గడిలకవారును బ్రహ్మాస్త్రంబులందుకొనియెనంతసమయంబున* (మ॥ తనసేవారతిచింతగానిపరచింతాలేశముల్లేనిసజ్జనులన్నాండుతనూజులన్మనుపువాత్సల్యంబుతోద్రోణనం।దనుబ్రహ్మాస్త్రమునడ్డఁబెట్టఁబనిచెన్దైత్యారిసర్వారిసా । ధననిర్వక్రమురక్షితాఖిలసుధాంధశ్చక్రముంజక్రముం* (మ॥ సకలప్రాణిహృదంతరాళములభాస్వజ్జ్యోతియైయుండుసూ । త్మకుఁడుండచ్యుతుఁడయ్యెడన్విరటజాగర్భంబుఁదాజక్రహ । స్తకుఁడై వైష్ణవమాయఁగప్పెగురుసంతానాగ్ధమైయడ్డమై । ప్రకటస్ఫూర్తినడంచెద్రోణతనయబ్రహ్మాస్త్రముల్లీలతోన్ * ( వ ॥ ఇట్లుద్రోణతనయుండేసినప్రతిక్రియారహితంబయిన బ్రహ్మశిరంబనియెడిదివ్యాస్త్రంబు వైష్ణవతేజంబుననిరర్థకంబయ్యెనిజమాయచేసకలలోకసర్గస్థితిసంహారంబులాచరించునట్టిహరికిధరణీసురబాణనివారణంబుచిత్రంబుగాదు తత్సమయంబునసంతసించి పాండవపాంచాలీసహితయైగొంతిగమనోన్ముఖుండయినహరింజేరవచ్చియిట్లనియె*(క॥ పురుషుండాద్యుఁడుప్రకృతికిఁ । బరుఁడవ్యయుఁడఖిలభూతబహిరంతర్భా । సురుఁడునులోకనియంతృడు।పరమేశ్వరుఁడైననీకుఁబ్రణతులగుహరీ*(వ॥ మఱియుజవనికమఱుపుననాట్యంబుసలుపునటునిచందంబునమాయాజవనికాంతరాళంబుననిలువంబడినీమహిమచేఁ బరమహంసలునివృత్తరాగద్వేషులు నిర్మలాత్ములునయినమునులకు నదృశ్యమానుండవయిపరిచ్ఛిన్నుండవుగానినీవు మూఢదృక్కులుకుటుంబవతులునగుమాకు నెట్లుదగ్గనీయుండవయ్యెదు- శ్రీకృష్ణ-వాసుదేవ- దేవకీనందన-నందగోపకుమార-గోవింద-పంకజనాభ - పద్మమాలికాలంకృత-పద్మలోచన - పద్మసంకాశచరణ-హృషీకేశ భక్తియోగంబునం జేసినమస్కరించెదనవధరింపుము*(సీ॥ తనయులతోడ నేదహ్యమానంబగుజతుగృహంబందునుజావకుండఁ।గురురాజువెట్టించుఘోరవిషంబులమారుతపుత్రుండుమడియకుండ । ధార్తరాష్ట్రుఁడుసముద్ధతిఁజీరలొలువంగద్రౌపదిమానంబుదలఁగకుండఁ । గాంగేయకుంభజకర్ణాదిఘనులచేనాబిడ్డలనిలోననలఁగకుండ । విరటపుత్రికకడుపులోవెలయుచూలు।ద్రోణనందనశరవహ్నిఁద్రుంగకుండ।మఱియురక్షించితివిపెక్కుమార్గములను । నిన్ను నేమనివర్ణింతునీరజాక్ష*(మత్తకోకిల॥ బల్లిదుండగుకంసుచేతనుబాధనొందుచునున్నమీ। తల్లిఁగాచినభంగిఁగాచితిధార్తరాష్ట్రులచేత నేఁ । దల్లడంబునఁజిక్కకుండఁగదానవాంతకనీగుణం।బెల్లసంస్తుతిసేసిచెప్పఁగనెంతదానజగత్పతీ* (క॥ జననమునైశ్వర్యంబును।ధనమునువిద్యయునుగలమదచ్ఛన్నులకిఁ।చనగోచరుడఁగునిన్ను । న్వినుతింపఁగలేరునిఖిలవిబుధస్తుత్యా* (వ॥ మఱియుభక్తధనుండునునివృత్తధర్మార్థకామవిషయుండునాత్మారాముండును రాగాదిరహితుండును కైవల్యదాన సమర్థుండునుగాలరూపకుండునునియామకుండునునాద్యంతశూన్యుండును విభుండును సర్వసముండును సకలభూతనిగ్రహానుగ్రహకరుండునయిన నిన్నుఁదలంచినమస్కరించెద నవధరింపుము మనుష్యులవిడంబించు భవదీయవిలసనంబున్నిర్ణయింప నెవ్వఁడుసమర్థుండు నీకుంబ్రియాప్రియులు లేరుజన్మకర్మశూన్యుండవైన నీవుతిర్యగాదిజీవులయందు వరాహాదిరూపంబులునుమనుష్యులం

మునేయక. నిర్వ్యళీకము॥సర్మాయకము. అవ్యుఁడుగాఁడు॥రక్షణాగ్నుఁడుగాఁడు. సబ్బరపుబాలహంతి॥దృఢమైనబాలఘాతి - అనఁగా నిస్పందేహముగా-కుట్టులఁజంపినవాఁడు-గొబ్బునన్॥త్వరగా. ప్రబ్బినచింతన్॥పొందినదుఃఖముచేతను.

దు రామాదిరూపంబులును ఋషులయందు వామనాదిరూపంబులను జలచరంబులయందు మత్స్యాదిరూపంబులను నవతరించుట లోకవిడంబనార్థంబు గాని జన్మకర్మసహితుండవగుటం గాదు *(ఉ ॥ కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో గోపిక త్రాటఁ గట్టిన వికుంచితసాంజనబాష్పతోయధారాపరిపూర్ణవక్త్రముకరంబులఁ బ్రాముచు వెచ్చనూర్చుచుం బాపఁడవైన నటించుట కృపాపరనా మదిఁ జోద్యమయ్యెడిన్ * (క ॥ మలయమునఁ జందనక్రియ। వెలయఁగ ధర్మజునికీర్తి వెలయించుటకై। యిలపైన భవుఁడు హరి యదు। కులమున ననుదయించె నండ్రు గొందఱనంతా* (క ॥ వసుదేవకులు తా। పసగతిఁ గతభవమున నందుఁ బ్రార్థించిన సంతసమునఁ బుత్రత నొందితి। వసురులమృతికంచుఁ గొందఱండ్రు మహాత్మా * (క ॥ జలరాశి నడుమ మునిఁగెడు। కలముక్రియఁ భూరిభారకర్శితయగునీ। యిలఁ గావ నజుఁడు గోరినఁ। గలిగితివని కొందఱండ్రు గణనాతీతా * (గీ ॥ మఱచి యజ్ఞానకామకర్మములఁ దిఱుగు। వేదనాతురులకుఁ దన్నివృత్తిఁ జేయ। శ్రవణచింతనవందనార్చనములిచ్చు। కొఱకు నుదయించితం డ్రు నిన్గొందఱభవ*(మ ॥ నినుఁ జింతింపుచుఁ బాడుచుం బొగడుచున్ నీ దివ్యచారిత్రము। ల్వినుచుం జూచుచు గాక లోకులితరాన్వేషంబులం జూతురే। ఘనదుర్జన్మపరంపరాహరణదక్షుంబైన మహాయోగివా। గ్వినుతంబైన భవత్పదాబ్జయుగముల్ విశ్వేశ విశ్వంభరా*(వ ॥ దేవా నిరాశ్రయులమై భవదీయచరణారవిందంబులాశ్రయించి నీవారలమైన మమ్ము విడిచి విచ్చేయ నేల నీ సకరుణావలోకనంబుల నిత్యంబును జూడ లేని యాదవసహితులైన పాండవులు జీవుం బాసిన యింద్రియంబులచందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు కల్యాణలక్షణలక్షితంబులైన నీ యడుగుల చేత నంకితంబయిన మదీయధరణీమండలంబు నీవు వాసిన శోభితంబు గాదు నీ కృపావీక్షణావ్యాపారంబున నిక్కడి జనపదంబులు కుసుమఫలభరితంబులై యోషధితరులతాగుల్మనదనదీసమేతంబులై యుండు*(ఉ ॥ యాదవులందుఁ బాండవులయందు నధీశ్వర నాకు మోహపా। చ్ఛేదము సేయుమయ్య ఘనసింధువుఁ జేరెడి గంగభంగినీ। పాదసరోజచింతనము పై ననిశంబు మదీయబుద్ధిన। త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁ జేయఁగదయ్య యీశ్వరా* (శా ॥ శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా శృంగారరత్నాకరా। లోకద్రోహనరేంద్రవంశదహనా లోకేశ్వరా దేవతా। నీకబ్రాహ్మణగోగణార్తిహరణా నిర్వాణసంధాయకా। నీకుం మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ*(వ ॥ అని యిట్లు సకలసంభాషణంబుల నుతియించు గొంతిమాటలకు నియ్యకొని గోవిందుండు మాయానిరూఢమందహాసవిశేషంబున మోహంబు నొందించి రథారూఢుండై కరినగరంబునకు వచ్చి కుంతీసుభద్రాదుల వీడ్కొని తనపురంబునకు విచ్చేయ గమకించిన ధర్మరాజు చేఁగించి తాక్కాలంబు నిలువుమని ప్రార్థితుండై నిలిచె నంత బంధువధశోకాతురుండైన ధర్మజుండు నారాయణవ్యాసధౌమ్యాదుల చేతఁ దెలుపబడియుఁ దెలియక మోహాతురుండై నిర్వివేకంబగు చిత్తంబున నిట్లనియె* (మ ॥ తన దేహంబునకై యనేకమృగసంతానంబుఁ జంపించు మూ। ర్ఖునుభంగిన్ గురుబాలజద్విజతనూజభ్రాతృసంఘంబు నిట్లనిఁ జంపించిన పాపకర్మునకు రాజ్యాకాంక్షికిన్నా కహో। యనలబ్ధావధి నైన ఘోరనరకవ్యాసంగముల్మాను నే* (వ ॥ మఱియుఁ బ్రజాపరిపాలనపరుండయిన రాజు ధర్మయుద్ధంబున శత్రువుల వధియించినఁ బాపంబు లేదని శాస్త్రవచనంబు గలదైన నది విజ్ఞానంబుకొఱకు సమర్థంబు గాదు చతురంగంబుల ననేకాక్షౌహిణీసంఖ్యాతంబులఁ జంపించితి హతబంధులయిన సతులకేను జేసిన ద్రోహంబు దప్పించుకొన నేర్పు లేదు గృహాశ్రమధర్మంబులైన తురంగమేధాదియాగంబుల చేతం బురుషుండు బ్రహ్మహత్యాదిపాపంబులవలన విడివడి నిర్మలుండగునని నిగమంబులు నిగమించుఁ బంకంబునఁ బంకిలస్థలంబునకు మద్యంబున మద్యభాండంబునకు శుద్ధి సంభవింపని చందంబున బుద్ధిపూర్వకజీవహింసనంబులయిన యాగంబుల చేతం బురుషులకుఁ బాపబాహుళ్యంబు గాని పాపనిర్ముక్తి గాదని శంకించెద*(క ॥ అని యిట్లు ధర్మసూనుఁడు। మొనసి నిరాహారభావమున దేవనదీ। తనయుఁడు గూలిన చోటికిఁ। జని మేఁ బ్రజాద్రోహపాపచలితాత్ముండై *

—❀ ధర్మజుఁడు శ్రీకృష్ణసహితుండయి శరతల్పగతుండయిన భీష్ముని కడకేగుట. ❀—

(వ ॥ అయ్యవసరంబునం దక్కిన పాండవులు ఫల్గునసహితుండైన పద్మలోచనుండుఁ గాంచనసమంచితంబులయిన రథంబు లెక్కి ధర్మజుం గూడి చనిన నతండు గుహ్యకసహితుండయిన కుబేరునిభంగి నొప్పె నిట్లు పాండవులు పరిజనులు గొలువఁ బద్మనాభసహితులై కురుక్షేత్రంబునకేగి దివంబుననుండి నేలం గూలిన దేవత తెఅంగున సంగ్రామపతితుండైన గంగానందనునకు నమస్కరించి రంత బృహదశ్వభరద్వాజపరశురామపర్వతనారదబాదరాయణకశ్యపాంగీరసకౌశికధౌమ్యసుదర్శనశుకవసిష్ఠాద్యనేక రాజర్షి దేవర్షి బ్రహ్మర్షులు శిష్యసమేతులై చనుదెంచినం జూచి సంతసించి దేశకాలవిభాగవేదియైన భీష్ముండు వారలకుం బూజనంబు గావించి*(క ॥ మాయాంగీకృతదేహుం। డై యఖిలేశ్వరుఁడు మనుజుఁడై। నాడని ప్రజ్ఞాయత చిత్తంబున గాం। గేయుఁడు పూజనము సేసెఁ గృష్ణున్ జిష్ణున్ * (వ ॥ మఱియుఁ గంగానందనుండు వినయప్రేమసుందరులయిన పాండునందనులం గూర్చుండ నియోగించి మహానురాగజనిత బాష్పసందోహసమ్మిళితలోచనుండై యిట్లనియె*(గీ ॥ ధరణిసురులు హరియు ధర్మంబు దిక్కుగా। బ్రదుకఁ దలచి మీరు బహువిధముల। నన్నలార

పడితి రాపత్పరంపర। లిట్టి విచిత్రకర్మ మెందుఁ గలదు* (ఉ॥ సంతసమింత లేదు మృగశాబవశంబునఁ బొందు భూవిభుం। డంతము
నొందియుండమి మునగ్నిఫలంగొని వచ్చి కాంతుతో। నింతలువారిగాఁ బెనిచె నెన్నఁడు సౌఖ్యము పట్టుగాన దీ। కుంతియనేక దుః
ఖములఁ గుందుచునుండు నభాగ్యమెట్టిదో* (ఉ॥ వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచుం। బాయుచునుం
డుకైవడిఁ బ్రపంచము సర్వము కాలతంత్రమై। పాయుచుఁ గూడుచుండు నొకభంగిఁ జరింపదు కాలమన్నియుఁ। జేయుచునుం
డుఁ గాలము విచిత్రము దుస్తరమెట్టివారికిన్* (ఉ॥ రాజఁట ధర్మజుండు సురరాజసుతుండఁట ధన్వి శాత్రవో। ద్వేజకమైన
గాండివము విల్లఁట సారథి సర్వభద్రసం। యోజకుఁడైన చక్రియఁట యుగ్రగదాధరుఁడైన భీముఁడ। య్యాజికిఁ దోడువచ్చు
నఁట యాపద గల్గుట యేమి చోద్యమో (గీ॥ ఈశ్వరుండు విష్ణుఁడెవ్వేళ నెవ్వని। నేమి సేయఁ బురుషుఁ డేమి యెఱుఁగు। నతని మా
యలకు మహాత్ములు విద్వాంసు। లడఁగియుండుచుందు రంధులగుచు* (వ॥ కావున దైవతంత్రంబైన పనికి వగవం బనిలేదు, రక్షకు
లు లేని ప్రజల రక్షింపఁ బుండరీకాక్షుండు సాక్షాత్కరించిన నారాయణుండు తేజోనిరూఢుండు గాక యాదవులందు గూఢుండై
తనమాయచేత లోకంబుల మోహాతిరేకంబుల నొందించు నతని రహస్యప్రకారంబుల భగవంతుండైన పరమేశ్వరుండెఱుంగు
వాఁడియు దేవర్షియగు నారదుండును భగవంతుండగు కపిలమునియు నెఱుంగుదురు కృష్ణుండు దేవకీపుత్రుండగు మాతులేయుం
డని తలంచి, దూతసచివసారథిబంధుమిత్రప్రయోజనంబుల నియమించుదురిన్నిటంగొఱంత లేదు, రాగాదిశూన్యుండు నిర
హంకారుండు నద్వయుండు సమదర్శనుండు సర్వాత్మకుండు నయిన యీశ్వరునకు నున్నతభావమతివైషమ్యంబు లేకఁడివిశే
వైన భక్తవత్సలుండు గావున నేకాంతభక్తులకు సులభుండై యుండు* (సీ॥ అతిభక్తి నెవ్వని యందుఁ జిత్తముఁ జేర్చి యెవ్వని
నామమూహించి పొగడి। కాయంబు విడుచుచుఁ గామకర్మాదినిర్మూలితుండై యోగి ముక్తి నొందు। నట్టి సర్వేశ్వరుండఖిల
దేవోత్తముఁడెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు। నంతదాక నిదె మహాహర్షుఁడై వికసితవదనారవిందుఁడై వచ్చె నేఁడు। నా
ల్గు భుజముల కమలాభనయనయుగము। నొప్పఁగన్నులముందర నున్నవాఁడు। మానవేశ్వర నాభాగ్యమహిమఁ జూడు। మే
మి సేసితినో పుణ్యమితనిఁ గూర్చి* (వ॥ అని యిట్లు ధనంజయసంప్రాపితశరపంజరుండైన కురుకుంజరుని వచనంబు లాకర్ణించి
మునులందఱు వినుచుండ ధర్మనందనుండు మందాకినీనందనువలన నరజాతిసాధారణంబులగు ధర్మంబులును వర్ణాశ్రమధర్మం
బులును రాగవైరాగ్యోపాధులతోఁ గూడిన ప్రవృత్తినివృత్తిధర్మంబులును దానధర్మంబులును రాజధర్మంబులును స్త్రీధర్మం
బులును శమదమాదికంబులును హరితోషణంబులగు ధర్మంబులును ధర్మార్థకామమోక్షంబులును నానావిధోపాఖ్యానేతిహా
సంబులును సంక్షేపవిస్తారరూపంబుల నెఱింగె నంతరథికసహస్రంబులకు గమికాఁడైన భీష్ముండు స్వచ్ఛందమరణులైన యో
గీశ్వరులచేత వాంఛితంబగు నుత్తరాయణంబు సనుదెంచిన నదిదనకు మరణోచితకాలంబని నిశ్చయించి* (శా॥ ఆలాపంబు
లుమాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ। గ్జాలంబుల్ హరి మోముపైఁ బఱపి తత్కారుణ్యదృష్టిన్ వని। ర్మాలీభూతశరవ్యథా
నిచయుఁడై మోదించి భీష్ముండు సం। శీలంబొప్ప నుతించెఁ గల్మషగజశ్రేణీహరిన్ శ్రీహరిన్* (వ॥ ఇట్లు పీతాంబరధారియుఁ
జతుర్భుజుండు నాదిపూరుషుండుఁ బరమేశ్వరుండు నగు హరియందు నిష్కాముండై విశుద్ధంబగు ధ్యానవిశేషంబు చే నిరస్తదో
షుండగుచు ధారణావతియైన బుద్ధి సమర్పించి పరమానందంబు నొంది ప్రకృతివలననైన సృష్టిపరంపరలఁ బరిహరించు తలంపున
మందాకినీనందనుండిట్లనియె* (మ॥ త్రిజగన్మోహనశీల కాంతితను వుర్దీపింపఁ బ్రాభాతనీ। రజబంధుప్రభమైన చేలము పయి

—❀ భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట. ❀—

న్రంజిల్ల నీలాలక। వ్రజసంయుక్తముఖారవిందమతి సేవ్యంబై విజృంభింపమా। విజయుం జేరెడు వన్నెకాఁడు మదినావేశించు
నెల్లప్పుడున్* (మ॥ హయరింఖాముఖధూళిధూసరపరిన్యస్తాలకోపేతమై। రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నె
మ్మోముతో। జయముం బార్థునకిచ్చువేడ్కనని నాశస్త్రాహతిం జాలవా। ద్భియుఁ బోరించు మహానుభావుమదిలోఁ జింతింతు న
శ్రాంతమున్* (మ॥ నరుమాటల్విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ। బరులీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం
జూపుచుం। బరభూపాయువులెల్లఁ జూపులన శుంభత్కేలి వంచించు నా। పరమేశుండు వెలుంగుచుండెడు సుహృత్పద్మాసనా
సీనుఁడై* (క॥ తనవారిఁ జంపఁజాలక। వెనుకకుఁ బోనిచ్చగించు విజయుని శంకన్। ఘనయోగవిద్యఁ బాపిన। మునివంద్యుని పా
దభక్తి మొనయున్నాకున్* (సీ॥ కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ। నుఱికిన నోర్వక యుద
రంబులోనున్న జగముల వ్రేఁగున జగతి గదలఁ। జక్రంబుఁ జేఁబట్టి చను దెంచు రయమునఁ బైనున్న పచ్చనిపటము జాఱ। నమ్మితిఁద
నలావునగు బాటు సేయక మన్నించుమని క్రీడి మఱలఁ దిగువ। గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి। నేఁడు భీష్ముని జంపుదు
నిన్నుఁ గాతు। విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ। దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు* (మ॥ తనకున్ భృత్యుఁడు వీని
గాచుట మహాధర్మంబువొమ్మంచున। ర్జునసారథ్యము పూని పగ్గములఁ జేఁ జోద్యంబుగాఁ బట్టుచున్। మునికోలన్ వడిఁ బూన్పి

ఘోటకములన్మోదించి తాడించుచుఁ । జనులన్మోహమునొందఁజేయుపరమోత్సాహుం బ్రశంసించెదన్ ✽ (క॥ పలుకులనగవులనడపుల । నలుకలనవలోకనముల నాభీరవధూ । కులములమనములతాలిమి । కొలుకులవదలించుఘనునిఁ గొలిచెదమదిలోన్ ✽ (గీ॥ మునులునృపులుఁ జూడమునుధర్మజుని సభా । మందిరమున యాగమంటపమునఁ । జిత్రమహిమతోడ జేలువొందజగదాది । దేవుఁడమరు నాదుదృష్టియందు ✽ (మ॥ ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దానొక్కొక్కఁడై తోఁచుపోలిక నేదేవుఁడు సర్వకాలముమహాలీలన్నిజోత్పన్న జన్యకదంబంబులహృత్సరోరుహములన్నానావిధానూనరూపమఁడై యొప్పుచునుండునట్టిహరి నేఁ బ్రార్థింతుశుద్ధుండనై ✽ (వ॥ అనియిట్లుమనోవాగ్దర్శనంబులం బరమాత్మయగుకృష్ణునిహృదయంబుననిలిపికొనినిశ్వాసంబుమానినిరుపాధికంబైన వాసుదేవబ్రహ్మంబునందుంగలిసిన భీష్మునింజూచి సర్వజనులుదివసావసానంబున విహంగంబులుఁబోలెనూరకయుండు తెఱంగుననుండిరి. దేవమానవవాదితంబులైదుందుభివాద్యంబులు మొఱసె సాధుజనకీర్తనంబులు మెఱసెఁ గుసుమవర్షంబులుగురిసె, మృతుండైన భీష్మునికిధర్మజుండు పరలోకక్రియలుసేయించి ముహూర్తమాత్రంబు దుఃఖితుండయ్యెనంతనచ్చటిమునులు కృష్ణునిఁదమహృదయంబులనిలిపికొని సంతుష్టాంతరంగులగుచుఁ దదీయదివ్యనామంబులచేస్తుతియించిస్వాశ్రమంబులకుంజనిరిపిదపనయ్యుధిష్ఠిరుండు కృష్ణసహితుండై గజపురంబునకుంజనిగాంధారీసహితుండయినధృతరాష్ట్రునొడంబఱచి వారిసమ్మతంబునవాసుదేవానుమోదితుండై పితృపైతామహంబైన రాజ్యంబుగైకొనిధర్మమార్గంబునం బ్రజాపాలనంబు సేయుచుండెనని చెప్పినవినిసూతునకుశౌనకుండిట్లనియె ✽ (గీ॥ ధనములపహరించితనతోడఁ జెనకెడు । నాతతాయిజనులనవధించి । బంధుమరణదుఃఖభరమునధర్మజుం । డెట్లురాజ్యలక్ష్మినిచ్చగించె ॥ అనినసూతుండిట్లనియె ✽ (క॥ కురుసంతతికిఁ బరీక్షి । న్నరవరునంకురముసేసినారాయణుఁడీ । ధరణీరాజ్యమునకునీ । శ్వరుఁగాధర్మజునినిలిపి సంతోషించెన్ ✽ (వ॥ ఇట్లుజగంబుపరమేశ్వరాధీనంబుగాని స్వతంత్రంబుగాదుననదిమొదలగు భీష్మునివచనంబులఁ గృష్ణునిసంభాషణంబులధర్మనందనుండు ప్రవర్ధమానవిజ్ఞానుండును నివర్తితశంకాకలంకుండునునై నారాయణాశ్రయుండైన యింద్రుండునుంబోలెఁ దనతుస్సాగరవేలాలంకృతంబగు వసుంధరామండలంబు సహోదరసహాయుండై యేలుచుండె ✽ (సీ॥ సంపూర్ణవృష్టిఁ బర్జన్యుండుగురియించునిలయెల్లఁ గోర్కులనీనుచుండు । గోవులువర్షించుఘోషభూములఁ బాలుఫలవంతములులతాపాదపములు । పండుసస్యములుదప్పకఋతువుల నెల్లధర్మమెల్లడలనుదనరియుండు । దైవభూతాత్మతంత్రములనురాగాదిభయములు సెందవుప్రజలకెందుఁ । గురువులోత్తముండుగుంతీతనూజుండు । దానమానఘనుఁడుధర్మజుండు । సత్యవాక్యధనుఁడుసకలమహీరాజ్య । విభవభాజియయిన వేళయందు ✽ (వ॥ అంతఁ గృష్ణుండుచుట్టాలకుసుభద్రకుశోకంబులేకుండంజే

—౷ శ్రీకృష్ణుండు ద్వారకానగరంబున కరుగుట ౷—

యుకొంతకాలంబు గజపురంబునంగొన్ని నెలలుండి ద్వారకానగరంబునకుం బ్రయాణంబుసేయందలంచి ధర్మనందనునకుంగృతాభివందనుండగుచునతనిచేనాలింగితుండై యామంత్రణంబువడసికొందఱు తనకు నమస్కరించినం గౌఁగిలించుకొని కొందఱుదనుంగౌఁగిలింప నానందించుచు రథారోహణంబుసేయునవసరంబున సుభద్రయు ద్రౌపదియుఁ గుంతియునుత్తరయు గాంధారియు ధృతరాష్ట్రుండును విదురుండును యుధిష్ఠిరుండును యుయుత్సుతుండును కృపాచార్యుండును నకులసహదేవులును వృకోదరుండును ధౌమ్యుండును సత్సంగంబువలన ముక్తదుస్సంగుండగుబుధుండు సకృత్కాలసంకీర్త్యమానంబై రుచికరంబగు నెవ్వనియంశంబునాకర్ణించి విడువనోపఁడట్టి హరితోడి వియోగంబుసహింపక దర్శనస్పర్శనాలాపశయనాసన భోజనంబులవలన నిమిషమాత్రంబును హరికి నెడలేనివారలైన పాండవులంగూడికొని హరిమఱలవలెనని కోరుచు హరిచనినమార్గంబుసూచుచుహరివిన్యస్తచిత్తులై లోచనంబుల బాష్పంబులొలుక నంతంతంనిలువంబడిరయ్యవసరంబున ✽ (సీ॥ కనకసౌధములపైఁ గౌరవకాంతలు గుసుమవర్షంబులుగోరికురియ । మౌక్తికదామసమంచితధవళాతపత్రంబువిజయుండువట్టుచుండ । నుద్ధవసాత్యకులుత్సాహవంతులై రత్నభూషితచామరములువీవ । గగనాంతరాళంబుఁ గప్పి కాహళభేరిపణవశంఖాదిశబ్దములుమొఱయ । సకలవిప్రజనులుసగుణనిర్గుణరూప । భద్రభాషణములు పలుకుచుండ । భువనమోహనుండుపుండరీకాక్షుండు । పుణ్యరాశిహస్తిపురమువెడలె ✽ (వ॥ తత్సమయంబునం బౌరసుందరులు ప్రాసాదశిఖరభాగంబులనిలిచి గోపాలసుందరుని సందర్శించి మార్గంబురెండుదెసలంగరారవిందంబులుసాఁచి యొండొరులకుంజూపుచుం దమలోనందొల్లిటం బ్రళయంబునగుణంబులుగూడక జీవులులీనరూపంబులైయుండం బ్రపంచంబుప్రవర్తింపనిసమయంబునఁ బ్రపంచాత్మకుండునద్వితీయుండనగుచు మేలై దీపించు పురాణపురుషుం డితండనువారును, జీవులకు బ్రహ్మత్వంబుగలుగలయంబుసిద్ధించుట యెట్లనువారును, జీవోపాధిభూతంబులైన సత్త్వాదిశక్తులలయము జీవలయమనువారును, గ్రమ్మరనప్పరమేశ్వరుండు నిజవీర్యప్రేరితమైనిజాంశభూతంబులైనజీవులకు మోహినియగుచుసృష్టిసే

యనిచ్ఛయించి నామరూపంబులు లేనిజీవులందు నామరూపంబులుగల్పించుకొఁ అను వేదంబులనిర్మించి మాయానుసరణంబు సేయుననువారును, నిర్మలభక్తిసముత్కంఠానిశేషంబులనకుంఠితులై జితేంద్రియులగు విద్వాంసులిమ్మహానుభావునిజరూపంబుదర్శింతురనువారును, యోగమార్గంబులందర్శింపరాదనువారునై మఱియును* (మ॥ రమణీదూరమువో మొఁగృష్ణురథము న్రాదింక వీక్షింపనీ। కమలాక్షుంబొడఁగానలేని దినముల్గల్పంబులై తోఁచుగే । హములందుండఁగ నేలబోయివరిచర్యల్సేయుచున్నెమ్మినుం।దమురమ్మాయ నెనొక్కచంద్రముఖికందర్పాశుగభ్రాంతయై * (మ॥ తరుణీయాదవరాజుగాఁడితఁడు వేదవ్యక్తుఁడై యొక్కఁడై । వరుసన్లోకభవస్థితిప్రళయముల్వర్తింపఁగాఁజేయుఁడు । స్తరలీలారతుఁడై నయీశుఁడితనిన్దర్శించితింబుణ్యభా।సుర నేనంచునటించె నొక్కతె మహాశుద్ధాంతరంగంబునన్* (క॥ తామసగుణులగు రాజులు।భూమింబ్రభవించి ప్రజలఁబొలియింపఁగన।త్తామలతనుఁడై యీతఁడు । భామినివారలవధించుఁబ్రతికల్పమునన్॥ ఇదియునుంగాక* (సీ॥ ఈయుత్తమశ్లోకుఁడెలమిజన్మించినయాదవకులమెల్లననఘుమయ్యె । నీపుణ్యవర్తనుఁడే ప్రొద్దునుండినమధురాపురము దొడ్డసుహిమగనియె । నీపురుషశ్రేష్ఠునీక్షించిభక్తితో ద్వారకావాసులుధన్యులైరి । యీమహాబలశాలియెడఁగిశిక్షింపం గనిష్కంటకంబయ్యెనిఖిలభువన।మీజగన్మోహనాకృతినిచ్చగించి । పంచశరభల్లజాలవిభజ్యమాన।విమలమానసమగువల్లవీసమూహ । మితనియధరామృతముఁగ్రోలు నెల్లప్రొద్దు* (ఉ॥ ఈకమలాక్షునీశుభగునీకరుణాంబుధిఁబ్రాణనాథుఁగాఁ। జేకొని వేడ్కఁగాపురము సేయుచునుండెడిరుక్మిణీముఖా। నేకపతివ్రతల్నియతినిర్మలమానసలై జగన్నుతా । స్తోకవిశేషతీర్థములఁదొల్లిటిబాముల నేమినోఁచిరో* (వ॥ అనియిట్లునానావిధంబులైనపురసుందరీవచనంబులాకర్ణించి కటాక్షించి నగుచు నగరంబు వెడలె ధర్మజుండునుహరిరక్షకంబై కొలిచినడువం జతురంగంబులంబంపినఁ జతురంగసమేతులై తనతోడివియోగంబునకోర్వక దూరంబు వెనుఁదగిలినకౌరవులన్ మఱలించి కురుజాంగల పాంచాలశూరసేనయామున భూములంగడచి బ్రహ్మావర్తకురుక్షేత్రమత్స్యసారస్వత మరుధన్వసౌవీరాభీరవిషయంబులతిక్రమించి తత్తద్దేశవాసులిచ్చిన కానుకలుగొనుచు నానర్తమండలంబుసొచ్చి పద్మబంధుండుపశ్చిమసింధు నిమగ్నుండైన సమయంబునఁ బరిశ్రాంతవాహుండై చనిచని *

— శ్రీకృష్ణుఁడు ద్వారకానగరంబు ప్రవేశించుట. —

(మ॥ జలజాతాక్షుఁడు శౌరిడగ్గరెమహాసౌధాగ్రశృంగారకన్ ।గలహంసావృతహేమపద్మపరిఖాకాసారకన్ దోరణా।వలిసంఛాదితతారకన్ దరులతావర్గానువేలోదయా।త్ఫలపుష్పాంకురకోరకన్మణిమయప్రాకారకన్ ద్వారకన్ ॥ ఇట్లుతనప్రియపురంబుడగ్గరి* (మత్తకోకిల॥ ఆర్యసన్నుతసాహసుండుమురారియొత్తెయదూత్తము।ల్ధన్యులై వినఁబాంచజన్యముదారితాఖిలజంతుచై।తన్యమున్భవనైకమాన్యముదారుణస్వనభీతరా । జన్యమున్బరిమూర్ఛితాఖిలశత్రుదానవసైన్యమున్ * (శా॥ శంఖారావమువీనులన్వినిజనుల్సవర్ణాంబరద్రవ్యము।స్సంఖ్యాతీతముఁగొంచువచ్చిరిదిదృక్షాదర్పితోత్కంఠన । బ్రేంఖద్భక్తులువంశకాహళమహాభేరీగజాశ్వావళీ। రింఖారావములుల్లసిల్లదనుజారింజూడనాసక్తులై* (క॥ బంధులుపౌరులుదెచ్చిన।గంధేభహయాదులైనకానుకలుదయా।సింధుఁడుగైకొనెనంబుజ।బంధుఁడుగొనుదత్తదీపపఙ్క్తులభంగిన్ * (వ॥ ఇట్లాత్మారాముండుపూర్ణకాముండునయిన యప్పరమేశ్వరునికినుపాయనంబులిచ్చుచునాగరులువికసితముఖులయిగద్గదభాషణంబులతోడడయ్యకుండనడపునయ్యకునెయ్యంపుచూపులనడ్డంబులేనిబిడ్డలచందంబున మ్రొక్కియిట్లనిరి* (శా॥ నీపాదాబ్జముబ్రహ్మపూజ్యముగదానీసేవసంసారసం । తాపధ్వంసినియాఁగదాసకలభద్రశ్రేణులంబ్రీతితో । నాపాదింతుగదాప్రపన్నులకుఁగాలాధీశకాలంబుని । ర్వ్యాపారంబుగదయ్యచాలరునినున్వర్ణింపబ్రహ్మాదుల్ * (క॥ ఉన్నారముసౌఖ్యంబున।విన్నారమునీప్రతాపవిక్రమకథలు।న్మన్నారముధనికులమై । కన్నారముతావకాంఘ్రికమలములుహరీ * (క॥ ఆరాటముమదినెఱుఁగము । పోరాటములిండ్లకడలఁబుట్టవుపురిలోఁ।జోరాటనమెగయదునీ । దూరాటనమోర్వలేముతోయజనేత్రా* (ఉ॥ తండ్రులకెల్లఁదండ్రియగుధాతకుఁదండ్రివిదేవనీవుమా । తండ్రివితల్లివింబతివిదైవమవున్సఖివిగ్గురుండవే। తండ్రులునీక్రియంబ్రజలధన్యులఁజేసిరివేల్పులైననో । తండ్రిభవన్ముఖాంబుజముధన్యతఁగానరుమావిధంబునన్* (క॥ చెచ్చెరఁగరినగరికినీ।విచ్చేసిననిమిషమైనవేయేండ్లగునీ।వెచ్చోటికివిచ్చేయక।మచ్చికతోనుండుమయ్యమానగరమునన్* (గీ॥ అంధకారవైరియపరాద్రికవ్వలఁ। జనినసంధమయినజగముభంగి । నిన్నుగానకున్ననీరజలోచన। యంధతమసమతులమగుదుమయ్య* (వ॥ అనియిట్లుప్రజలాడెడిభక్తియుక్తమధురమంజులాలాపంబులుగర్ణకలాపంబులుగానవధరించి సకరుణావలోకనంబులువర్షించుచు హర్షించుచుఁ దనరాకవినిమహానురాగంబున సంరంభవేగంబులమజ్జనభోజనశయనాదికృత్యంబులొల్లక యుగ్రసేనాక్రూరవసుదేవబలభద్రప్రద్యుమ్న సాంబచారుదేష్ణ గదప్రముఖ యదుకుంజరులు కుంజర తురగ రథారూఢులై దివ్యకుంజరసన్నిభంబయినయొక్కకుంజరంబుముందఱిడుకొని సూతమాగధనటనర్తకవంది సందోహంబులమం

గళభాషణంబులును భూసురనికాయాశీర్వాద వేదఘోషణంబులును వీణావేణుభేరీపటహశంఖకాహళధ్వానంబులును స్ఫార ధారాఢ్యవిభూషణభూషితవారయువతిగానంబులసమానంబులై చెలఁగ నెమ్ముకొని యథోచితప్రణామనమస్కారపరిరంభకరస్పర్శనసంభాషణమందహాసనందర్శనాది విధానంబుల బహుమానంబులుసేసి వారలుం దానును భుజగేంద్రపాలితంబయినభోగవతీనగరంబుచందంబున స్వసమానబలమధుభోజదాశార్హకుకురాంధకవృష్ణివీరపాలితంబును సకలకాలసంపద్యమానాంకురపల్లవకోరకకుట్మలకుసుమఫల మంజరీపుంజభారవినమితలతాపాదప రాజివిరాజితోద్యాన మహావనోపవనారామభాసితంబును వనాంతరాళరసాలసాల శాఖాంకురఖాదన క్షుణ్ణకషాయకంఠకలకంఠమిథునకోలాహల ఫలరసాస్వాదపరిపూర్ణ శారికాకీరకులకలకలకల్హారపుష్పమకరందపానపరవశ భృంగభృంగీకదంబఝుంకారసరోవర కనకకమలమృణాలకాండఖండస్వీకార మత్తవరటాయత్తకలహంస నివహక్రేంకారసహితంబును మహోన్నతసౌధజాల రంధ్రనిర్గతకర్పూరధూపధూమపటల సందర్శనసంజాత జలధరభ్రాంతివిభ్రాంత సముద్ధూతపింఛ నర్తనప్రవర్తమాన మత్తమయూరకేకారవమహితంబును నానారూపతోరణధ్వజ వైజయంతికానికాయ నిరుద్ధతారకాగ్రహప్రకాశంబును ముక్తాఫలవిరచితరంగవల్లికాలంకృత మందిరద్వారగేహళీవేదికాప్రదేశంబులును ఘనసారగంధసారకస్తూరికా సంవాసితవణిగ్గేహగేహళీనికరకనక గళంతికావికీర్యమాణసలిలధారాసంసిక్తవిపణిమార్గంబును బ్రతినివాసబహిరంగణసమర్పిత రసాలదండఫలకుసుమగంధాక్షతధూపదీపరత్నాంబరాదివివిధోపహారంబును బ్రవాళనీలమరకత వజ్రవైడూర్యనిర్మిత గోపురాట్టాలకంబును విభవనిర్జితమహేంద్రనగరాలకంబునైన పురవరంబుఁ బ్రవేశించి రాజమార్గంబున వచ్చు సమయంబున* (మత్తకోకిల॥ కన్నులారఁగ నిత్యమున్ హరిఁ గాంచుచున్న మనువారలు। య్యున్నవీనకుతూహలోత్సవయుక్తి నాగరకాంతలు। త్తున్నతోన్నతహర్మ్యరేఖలనుండి చూచిరి నిక్కి-చే। సన్నలందమలోనఁ దద్విభుసౌకుమార్యము సూపుచున్*. (సీ॥ కలుములనీనెడుకలకంఠి మెలనాగ వర్తించు నెవ్వని వక్షమందు। జనదృక్చకోరకసంఘంబునకు సుధాపానీయపాత్ర మే భవ్యముఖము। సకలదిక్పాలకసమితికి నెవ్వని బాహుదండంబులు పట్టుకొమ్మ। లాశ్రితశ్రేణికే యధిపతిపాదరాజీవయుగ్మంబులు చేరునెడలు। భువనమోహనుండు పురుషభూషణుఁ డెవ్వఁ డట్టి కృష్ణుఁ డరిగె హర్మ్యశిఖర। రాజమానలగుచు రాజమార్గంబున। రాజముఖులు గుసుమరాజి సురియ* (మ॥ జలజాతాక్షుఁడు చూడనొప్పె ధవళచ్ఛత్రంబుతోఁ జామరంబులతోఁ బుష్పపిశంగచేలములతో భూషామణిస్ఫీతుఁడై। నళినీబాంధవుతో శశిద్వయముతో నక్షత్రసంఘంబుతో। బలభిచ్చాపముతో దటిల్లతికతో భాసిల్లు మేఘాకృతిన్*(వ॥ ఇట్లు తలిదండ్రుల నివాసంబు సొచ్చి దేవకీప్రముఖులయిన తల్లులకేడ్వురకు మ్రొక్కిన* (క॥ బిడ్డఁడు మొక్కినఁ దల్లులు। జడ్డననంకములను నిచి చన్నులఁ దుదిఁ బా। లొడ్డగిలఁ బ్రేమభరమున। జడ్డువడం దడపి రక్షిజలములననఘా*(వ॥

—॥ శ్రీకృష్ణుండష్టభార్యలు మొదలగువారినిఁ జూడఁబోవుట. ॥—

తదనంతరంబష్టోత్తరశతషోడశసహస్రసౌవర్ణసౌధకాంతంబయిన శుద్ధాంతంబు సొచ్చి హరితనమనంబున * (మ॥ ఒకభామాభవనంబు మున్న జొరవేలొక్కర్తులోఁ గుందునో। సుకరాలాపములాడదో సొలయు నోముప్రీతి నీక్షింపదో। వికలత్వంబుననుండునో యనుచు నవ్వేళన్ స్వభూగేహము। లప్రతికటాశ్చర్యవిభూతిఁ జొచ్చె బహురూపవ్యక్తుఁడై శౌనకా॥ ఆసమయంబున* (క॥ శిశువులఁ జంకలనిడి తను। కృశతలు విరహాగ్ని దెలుప గృహగేహళులన్। రశనలుఁ జారఁగ సిగ్గుల। శశిముఖు లెదుతేఁ గిరపుడు జలజాక్షునకున్ * (మ॥ పతినాయింటికి మున్న వచ్చెనిదె నా ప్రాణేశుఁ డస్మద్గృహా। గతుఁడయ్యెన్ మను జేరెఁ బోతొలుత మంతఃకాంతుండు నా శాలకే। నితరాలభ్యసుఖంబుఁ గంటినని తారింటింటనర్చించిర। య్యతివల్ హ్నాలుఁ బదాఱు వేలునెనమండ్రవ్వేళ నాత్మేశ్వరున్*(వ॥ వారలం జూచి హరియిట్లనియె*(మ॥ కొడుకుల్ భక్తివిధేయులౌదురు గదా కోడండ్రు మీవాక్యము। ల్గడవం జాలక యుందురా విబుధసత్కారంబు గావింతురా। తొడవుల్ వస్త్రములుం బచార్థరససందోహంబులుం జాలునా। కడమల్గావు గదా భవన్నిలయముల్ గల్యాణయుక్తంబులే * (సీ॥ తిలక మేటికి లేదు తిలకినీ తిలకమ పువ్వులు దుఱుమవా పువ్వుబోఁడి। కస్తూరియలఁద వా కస్తూరికాగంధి తొడవులు దొడవ వా తొడవుతొడవ। కలహంసమున్న దే కలహంసగామిని కీరంబు చదువునే కీరవాణి। లతలపోషింతువా లతికాకారుచిర దేహ సరసినోలాడుదే సరసిజాక్షి। మృగికి మేఁతలిడుదె మృగశాబలోచన। గురులనాదరింతె గురువివేక। బంధుజనులఁ బ్రోతె బంధుచింతామణీ। యనుచు సతులనడిగె నచ్యుతుండు*(వ॥ అనియడిగినవారలు హరిం బాసినదినంబులందు శరీరసంస్కారకేళీవిహారహాసమందిరగమన మహోత్సవదర్శనంబులొల్లని యిల్లాండ్రుగావున*(మ॥ సిరిచాంచల్యముతోడి దయ్యెఁ దనకుం జీవేశ్వరుం డంచు నే। పురుషశ్రేష్ఠు వరించు నట్టి పరమున్ బుద్ధిన్ స్వలోకంబుల। న్గరయుగ్మంబులఁ గౌఁగిలించి రినతు। ల్గల్యాణబాష్పంబులా। భరణశ్రేణులు గాఁ బ్రతిక్షణనవప్రాప్తానురాగంబులన్*(మత్తకోకిల॥ పంచబాణుని నీఱుసేసిన భర్గునిందను వల్లివ। ల్గించి మూర్ఛిలఁ జేయఁజాలు విశేషహాసవిలోకనో। దంచి

తాకృతులయ్యుఁ గాంతలు దంభచేష్టల మాధవుఁ జంచలింపఁగ జేయనేమియుఁ జాలరైరి బుధోత్తమా* (వ॥ ఇవ్విధంబున సంగవిరహితుండైన కంసారి సంసారికైవడి విహరింపన జ్ఞానవిలోకులైన లోకులు లోకసామాన్య మనుష్యుండని తలంతు రాత్మాశ్రయమైన బుద్ధి యాత్మయందున్న యానందాదులతోడం గూడని తెఱంగున నీశ్వరుండు ప్రకృతితోడం గూడియు నాప్రకృతిగుణంబులైన సుఖదుఃఖంబులఁ జెందక యుండుఁ బరస్పర సంఘర్షణంబులచే వేణువులవలన వహ్నిఁ బుట్టించి వనంబుల దహించు మహావాయువు చందంబున భూమికి భారహేతువులైయనేకాక్షౌహిణులతోడం బ్రవృద్ధతేజులగు రాజుల కన్యోన్యవైరంబులు గల్పించి నిరాయుధుండై సంహారంబు సేసి శాంతుండై పిదపం గాంతామధ్యంబునఁ బ్రాకృతమనుష్యుండునుంబోలె సంచరించుచుండె నా సమయంబున* (క॥ యతులీశ్వరు నిర్మహత్త్వము । మితమెఱుఁగ నిభంగి నప్రమేయుఁడు హరి । స్థితి నెఱుఁగక కఁగా ముకుఁదుఁ । రతములు సలుపుదురు తిగిచిరమణులు ప్రీతిన్* (క॥ ఎల్లపుడును మాయిండ్లను । వల్లభుఁడు వసించునేమ వల్లభల ముశ్రీ । వల్లభు నకును చు గోపీ । వల్లభు చేసతులు మమతపలఁబడిర నఘా * (వ॥ అని చెప్పిన విని సూతునకు శౌనకుం

— ఉత్తరకు పరీక్షిత్తు జన్మించుట —

డిట్లనియె* (సీ॥ గురునందనుండు సక్రోధుఁడై యేసిన బ్రహ్మశిరోనామబాణవహ్నిఁ । గంపించు నుత్తరగర్భంబు గ్రమ్మఱఁ బద్మలోచను చేత బ్రతికెనండ్రు । గర్భస్థుఁడగు బాలుఁ గంసారి యేరీతి బ్రతికించె మృత్యువు భయము వాపి । జనియించి యతఁ డెన్ని సంవత్సరములుండె నెబ్భంగి వర్తించె నేమి సేసె । వినుము శుకుఁడు వచ్చి విజ్ఞానపద్ధతి । నతనికెట్లు చూపెనతఁడు పిదపఁ । దన శరీరమే విధంబున వర్జించె । విప్రముఖ్య నాకు విస్తరింపు* (వ॥ అనిన సూతుం డిట్లనియె ధర్మనందనుండు చతుస్సముద్రముద్రితాఖిల జంబూద్వీప రాజ్యంబు నార్జనంబు సేసియు మిన్నుముట్టిన కీర్తి సంగ్రహించియు నంగనా తురంగ సుభట కాంచనాది దివ్య సంపదలు సంపాదించియు వీరసోదర విప్ర విద్వజ్జన వినోదంబులం బ్రమోదించియు వైభవంబులలరించియుఁ గ్రతువులాచరించియు దుష్టశిక్షణ శిష్టరక్షణంబు లొనరించియు ముకుంద చరణారవింద సేవారతుండై సమస్త సంగంబులందు నఖిలాషంబు వర్జించి యరిషడ్వర్గంబుల జయించి రాజ్యంబు సేయుచు* (గీ॥ చంపనామల నాఁకట బ్రస్గ్గు వాఁడు । దనివినొందనికైవడి ధర్మసుతుఁడు । సంపదలు పెక్కు గలిగియుఁ జక్రిపాద । సేవనంబులఁ బరిపూర్తి సెందకుండె* (వ॥ అంతం గొన్ని దినంబులకు నభిమన్యు కాంతా గర్భంబునందున్న డింభకుండు దశమాసపరిచ్ఛేద్యుండై గర్భాంతరాళంబున దురంతంబైన యశ్వత్థామ బాణానలంబున దందహ్యమానుండై తల్లడిల్లుచు* (ఉ॥ కుయ్యిడశక్తి లేదొడల గోళములోపల నున్నవాఁడ । దిక్కెయ్యది దానినాథ నని యెప్పుడుఁ దల్లిగణింపవిందు నేఁ । డియ్యము వహ్ని వారుటకు నెయ్యది మార్గము నన్నుఁ గావనే । యయ్యగలండు గర్భజనితాపద నెవ్వఁడెఱుంగ దైవమా* (క॥ చిచ్చర కోలవశంబునఁ । జచ్చిబహిర్గతుఁడఁగాని సమయము ననుదా । నుచ్చలితగర్భవేదనఁ । జచ్చును మా తల్లి గర్భసంతాపమునన్* (క॥ చెచ్చెర బాణజ్వాలలు । వచ్చిన విష్ణుండు గావ వచ్చుననుచుఁదా । ముచ్చటలు సెప్పు సతులకు । నిచ్చలు మాయవ్వ నేఁడు నిజము యెడినో* (శా॥ రాఁడా చూడ సమస్త భూతములలో రాజిల్లు వాఁడిచ్చటన్ । లేఁడా పాఱు నిచిచ్చ రమ్ముఁ దోలఁగన్ లీలాగతిం ద్రోచినా । కీఁడా నేఁడభయప్రదాన మతఁడూహింపన్న తత్త్రాతము । న్గాఁడా యెంపటిఁ గావఁడీయొడలహో తత్కర్మంబు దానెట్టిదో* (వ॥ అనిగతాగతప్రాణుండై శిశువు చింతించు సమయంబున* (సీ॥ మేఘంబుమీఁది క్రొమ్మెఱుఁగు కైవడి మేనిపై నున్న పచ్చని పటము వాఁడు । గండభాగంబులఁ గాంచన మణిమయమకరకుండల కాంతి మలయువాఁడు । శరవహ్ని నడఁగించు సంరంభమునఁ జేసి కన్నులను గెంపు గలుగు వాఁడు । బాలార్కమండల ప్రతిమాన రత్నహాటక విరాజిత కిరీటంబు వాఁడు । కంకణాంగద వనమాలికావిరాజ । మానుఁడసమానుఁ డంగుష్ఠ మాత్రదేహుఁడు । డాకగదఁ జేతఁ దాల్చి నేత్రోత్సవముగ । విష్ణుఁడావిర్భవించె నవ్వేళయందు* (వ॥ ఇట్లు భక్తపరాధీనుండైన పరమేశ్వరుండావిర్భవించి హిమంబు విరయించు మార్తాండు చందంబున శిశువునకు దశదిశలందన చేతి యఖండితమహోల్కాజ్వాలాసన్నిభంబైన గదాదండంబు మండలాకారంబుగ జిఱజిఱం ద్రిప్పి విప్రుని చిచ్చరమ్ము వేడిమి పోఁడిమిఁ జెఱచి డింభకుని పరితాపవిజృంభణంబు నివారించి గర్భంబు గందకుండ నర్భకునికి నానందంబుఁ గల్పించిన* (మ॥ గదఁ జేఁబట్టి పరిభ్రమించుచు గదాఘాతంబులం ఘోరశుక్రకమైన వృశరాగ్నిఁ దుత్తుమురుగా భంజించి రక్షించు నీ । సదయుం డెవ్వఁడొ కోయటంచు మదిలోఁ జర్చించుచున్నాఁ బకుం । డెవుఁడైచూడ నగ్నుఁ డయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా* (వ॥ అంతన నుకూల శుభగ్రహోదయంబు సర్వగుణోత్తర ఫలసూచకంబునైన శుభలగ్నంబునం బాండవవంశోద్ధారకుండై కుమారుండు జన్మించిన ధర్మనందనుండు ధౌమ్యాది భూసురవర్గంబు రప్పించి పుణ్యాహంబు సదివించి జాతకర్మంబులు సేయించి కుమారు జన్మమహోత్సవకాలంబున భూసురులకు విభవానుగుణంబులయిన గోమహిష హిరణ్య హయ గ్రామంబులును సాదురుచి సంపన్నంబులైన యన్నంబులిడిన వారలు ధర్మపుత్త్రునకిట్లనిరి* (చ॥ ప్రకటిత దైవయోగమునఁ బౌరవసంతతి యంతరింపఁగా । వికలత నొందనీక ప్రభ

విష్ణుఁడువిష్ణుఁడనుగ్రహించిశా।బకుబ్రతికించెఁగావునన్నృపాలకశాబకుఁడింకశా।తవాం। తకుఁడగువిష్ణురాతుఁడనధాత్రి
బ్రసిద్ధికినెక్కఁబూజ్యుఁడై* (వ॥ అనినవినిభూదేవోత్తములకునరదేవోత్తముండిట్లనియె* (శా॥ ఓపుణ్యాత్ములార నాప
లుకుమీరూహింపుఁడేమొక్కెఁదన్।మాపెద్దల్ శ్రుతకీర్తులై సదయులైవున్నారు రాజర్షులై। యీపిన్నాతఁడువారిఁబోలె
డిఁగదామెల్లప్పుడున్మాధవ। శ్రీపాదాంబుజభక్తియుక్తుఁడగుచుఁజీవించునేచూడరే* (వ॥ అనినవినినరేంద్రాభవదీయ
పౌత్రుండు, మనుమనుపుత్రుండయినయిక్ష్వాకుచందంబునంబ్రజలరక్షించు, శ్రీరామచంద్రునిభంగిబ్రహ్మణ్యుండు సత్య
ప్రతిజ్ఞుండునగుడేగవెంటనంటినబిట్టుభీతంబై వెనుకకువచ్చినకపోతంబుఁగాచినశిబిచక్రవర్తిరీతిశరణ్యుండువితరణఖనియు
నగు, దుష్యంతసూనుండయినభరతుపగిదిద్విజ్ఞాతివర్గంబులకుయజ్వలకుననర్గళకీర్తివిస్తరించు, ధనంజయకార్తవీర్యులకరణిధ
నుర్ధరాగ్రేసరుండగుఁ, గీలిపోలిదుర్ధర్షుండగు, సముద్రునిలెఱుంగునదుస్తరుండగు, మృగేంద్రంబుకైవడివిక్రమశాలియు
గు, వసుమతింబోలెఁదాలిమియుక్తుండగు, భానునిలాగునంబ్రతాపవంతుండగు, వాసుదేవువడువునసర్వభూతహితుండ
గుఁ, దల్లిదండ్రులమాడ్కిఁసహిష్ణుండగుమఱియును* (సీ॥ సమదర్శనంబునజలజాతభవుఁడనఁబరమప్రసన్నతభర్గుఁడనఁగ।
నెల్లగుణంబులనిందిరావిభుఁడననధికధర్మమునయయాతియనఁగ। ధైర్యసంపదబలిదైత్యవల్లభుఁడననచ్యుతభక్తిఁబ్రహ్లాదుఁ
డనఁగ। రాజితోదారతరంతిదేవుండనన్నాశ్రితమహిమహేమాద్రియనఁగ।యశముసార్జించుఁబెద్దలనాదరించు।నశ్వమేధం
బులొనరించునాత్మసుతుల। ఘనులఁబుట్టించుదండించుఖలులఁబట్టి। మానవనుఁడునీమనుమఁడుమానవేంద్ర* (భుజంగప్ర
యాతము॥ హరించుంగలిప్రేరితాఘంబులెల్లన్। భరించున్ధరన్రామభద్రుండువోలెం।జరించున్సదావేదశాస్త్రానువృ
త్తిన్వరించున్విశేషించివైకుంఠభక్తిన్* (వ॥ ఇట్లుపెక్కేండ్లుజీవించిభూసురకుమారకప్రేరితంబయినతక్షకసర్పవిషా
నలంబునందనకుమరణంబనియెఱింగిసంగవర్జితుండయిముకుంద పదారవిందభజనంబుసేయుచు శుకయోగీంద్రునివలనవా
త్మవిజ్ఞానసంపన్నుండైగంగాతటంబునశరీరంబువిడిచినిర్గతభయశోకంబైన లోకంబుఁబ్రవేశించునని జాతకర్మఫలంబుచె
ప్పిలబ్ధకాములైభూసురులుచనిరంత* (క॥ తనతల్లికడుపులోపల। మునుఁజూచినవిభుఁడువిశ్వమునవెల్లఁగలం। డనుచుఁబరీ
క్షింపఁగజనులనఘుఁబరీక్షిన్నరేంద్రుఁడండ్రుమునీంద్రా* (గీ॥ కళలచేతరాజుగ్రమముననఁబరిపూర్ణుఁ। డయినభంగిఁదాత
లనుదినంబు।పోషణంబుసేయఁబూర్ణుఁడయ్యెనుధర్మ।పటలపాలకుండుబాలకుండు* (వ॥ మఱియుధర్మజుండుబంధుసంహా
రదోషంబువాయుకొఱకునశ్వమేధయాగంబుసేయందలంచిప్రజలవలనంగరదండంబులనుపార్జితంబయిన విత్తంబుచాలక
చిత్తంబునఁజింతించునెడనచ్యుతప్రేరితులైభీమార్జునాదులుదొల్లిమరుత్తుండనురాజుమఖంబుచేసిపరిత్యజించినిక్షేపించి
నసువర్ణపాత్రాదికంబైనవిత్తముత్తర దిగ్భాగంబువలనబలవంతులైతెచ్చిన నారాజసత్తముండు సమాయత్తయజ్ఞోపకర
ణుండైసకలబంధుసమేతంబుగఁగృష్ణునినాహ్వానంబుచేసిపురుషోత్తమునుద్దేశించి మూఁడుజన్నంబులుగావించె తదనంత
రంబకృష్ణుండుబంధుప్రియంబుకొఱకుఁగరినగరంబునంగొన్నినెలలుండిధర్మపుత్రాదులచేనామంత్రణంబువడసి యాదవ
సమేతుండైధనంజయుండుతోడరా నిజనగరంబునకుఁజనియెనంతకు మున్నువిదురుండు తీర్థయాత్రకుఁజనిమైత్రేయుమంద
టఁగర్మయోగవ్రతాదివిషయంబులయిన ప్రశ్నలుగొన్నింటింజేసియతనివలన నాత్మవిజ్ఞానంబుదెలిసికృతార్థుండై హస్తి
పురంబునకువచ్చిన* (క॥ బంధుఁడువచ్చెనటంచును। గాంధారీవిభుఁడు మొదలుగానందముసం। బంధములునెఱిప్రీతి
న।మంథరగతిఁజేసిరపుడుమాన్యనలనఘా* (వ॥ అంతధర్మనందనుండువిదురునికిమజ్జనభోజనాది సత్కారంబులుసేయించి
సుఖాసీనుండైతనవారలందఱువినసిట్లనియె* (సీ॥ ఏవర్తనంబుననింతకాలముమీరుసంచరించితిరయ్యజగతిలోన।నేతీర్థము
లుగంటిరెక్కడనుండిరిభావింపమీవంటిభాగవతులు। తీర్థసంఘంబులధికరింతురుగదామీయందువిష్ణుండుమెఱయుకతన।
మీరెతీర్థంబులుమీకంటెమిక్కిలితీర్థంబులున్నవెతెలిసిచూడ। వేఱెతీర్థంబులవనిపైవెదుకనేల।మిమ్ముఁబోడగనిభాషించుమే
లెచాలు।వార్తలేమంద్రులోకులువసుధలోన। మీకుసర్వంబునెఱిగెడుమేరగలదు* (మత్తకోకిల॥ తండ్రిసచ్చినమీఁదమా
పెదతండ్రిబిడ్డలుదొల్లిపె। క్కండ్రుసర్పవిషాగ్నిబాధలగాసిపెట్టఁగమమ్మువి। ల్లాండ్రసంతముఁబొందకుండఁగలాలనంబు
నమీరుమా।తండ్రిభంగిసముద్ధరింతురుతద్విధంబుదలంతురే* (క॥ పతులుదమఱకలలోఁ। బక్షంబులురానిపిల్లపదువుల
మమతన్।రక్షించినక్రియమీరలు।పక్షీకరణంబుసేయబ్రతికితిమిగదే* (క॥ మన్నారాద్వారకలో।నున్నారాయదువులం
బుజోదరుకరుణన్।గన్నారాలోకులచే।విన్నారామీసువారివిధమెట్టిదియో* (చ॥ అనవినిధర్మరాజునకునావిదురుండుస
మస్తలోకవ। ర్తనముగ్రమంబుతోడవిశదంబుగజెప్పియదుక్షయంబుసె। ప్పిననతఁడుగ్రశోకమునబెగ్గిలుచుండెడినంచునే
మియు।న్విసమనిచెప్పఁడయ్యెయదువీరులనాశముభార్గవోత్తమా* (గీ॥ మేలుఁజెప్పనేనిమేలంద్రుఁలోకులు। చెట్టయంద్రు
కీడుజెప్పువాని।నంతమీఁదఁశూద్రుఁడైనకతంబున। శిష్టమరణమతఁడుసెప్పఁడయ్యె* (వ॥ అదియెట్లనిన మాండవ్యమహా

మునిశాపంబునం బొల్లి యముండు శూద్రయోనియందు విదురుండై జన్మించియున్న నూఱువత్సరంబులర్యముండు యథాక్రమంబున నంబాపకర్ముల దండించె నిట్లు యుధిష్ఠిరుండు రాజ్యంబు గైకొని లోకపాలసంకాశులయిన తమ్ములుం దానును కులదీపకుండైన మనుమని ముద్దుసేయుచుం బెద్దకాలంబు మహావైభవంబున సుఖియై యుండె* (క॥ బాలాజనశాలాధన। లీలావనము

## — గాంధారీధృతరాష్ట్రులు దేహత్యాగము చేయుట. —

ఖ్యవిభవలీనమనీషా। లాలసులగు మానవులను। గాలము వంచించు దురవగాహము సుమతీ* (వ॥ అదినిమిత్తంబున నంగాలగతి యెఱింగి విదురుండు ధృతరాష్ట్రునకిట్లనియె* (మ॥ కనకాగారకళత్రమిత్రసుతసంఘాతంబులన్నుం గట। ల్గణి ప్రాణేచ్ఛలనుండు జంతువులనే కాలంబు దుర్లంఘ్యమై। యనివార్యస్థితిం జంపునట్టి నిరుపాయంబైన కాలంబువ। చ్చెను పాంతంబున మాఱుదీనికి మది రాజింతింపు ధాత్రీశ్వరా* (శా॥ పుట్టంధుండవు పెద్దవాడవు మహాభోగంబులా లేవు నీ। పట్టెల్లం జెడిపోయె దుస్సహజరాభారంబు పైగప్పెనీ। చుట్టాలెల్లను బోయి రాలు మగడు న్శోకంబున న్మగ్నులై। కట్టాదాయలపంచనుండదగవే కౌరవ్యవంశాగ్రణీ*(క॥ పెట్టితిరి చిచ్చు గృహములం। బట్టితిరి తదీయభార్యం బాడడవులకుం। గొట్టితిరి వారు మనువంగ। నెట్టన భరియింపవలెనె నీప్రాణములకై* (క॥ బిడ్డలకు బుద్ధిసెప్పని। గుడ్డికిం బిండంబు వండికొని పొండి దెప్పైం। బడ్డాడని భీముండొఱు। గొడ్డములాడంగ గూడు గుడిచెదవధిపా* (క॥ కనియెదవో బిడ్డల నింక। మనియెదవో తొంటికంటె మనుమల మాటల్। వినియెదవో యుచ్చెదరమ్మనియెదవో దానములకు నవనీసురులకై*(క॥ దేహము నిత్యము గాదని। మోహముం దెగంగోసి సిద్ధముని వర్తనుండై। గేహము వెలువడు నరుండు। త్సాహముతోం జెందు ముక్తి సంపదనన ఘా* (వ॥ అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తిమార్గంబుపదేశించిన నతండు ప్రజ్ఞాచక్షుండై సంసారంబు దిగనాడి మోహపాశంబుల వలననూడి విజ్ఞానమార్గంబున గూడి మగ్గమంబగు హిమవన్నగంబునకు నిర్గమించిన* (శా॥ అంధుండైన పతిన్వరించి పతిభావాసక్తి నేత్రద్వయీ। బంధాచ్ఛాదనముంధరించి నియమప్రఖ్యాతయైయున్న త। ద్గాంధారక్షితినాథుకూతురను యోగప్రీతి చిత్తంబులో। సంధిల్లం బతి వెంటనే చనుదయత్సాధ్విగుణారూఢయై* (చ॥ వెనుక కురాక చొచ్చురణవీరుని కైవడి రాజదండనం। బునకు భయంబు లేక వడిం బోయెడ ధీరుని భంగినప్పుడా। వనిత దురంతమైన హిమవంతముపొంతవనాంతభూమికిం। బెనిమిటితోడ నించుకయు భీతివహింపక నేగెంబ్రీతితోన్* (వ॥ ఇట్లు విదురసహితులై గాంధారీధృతరాష్ట్రులు వనంబునకుం జనిన మఱునాఁడు ధర్మనందనుండు ప్రభాతంబున సంధ్యావందనంబు చేసి నిత్యహోమంబులు గావించి బ్రాహ్మణోత్తములకు గోహిరణ్యతిలవస్త్రాదిదానంబులిచ్చి నమస్కరించి గురువందనంబుకొఱకుం బూర్వప్రకారంబునం దండ్రిమందిరంబునకుం జని యందు విదుర సహితులయిన తల్లిదండ్రులం గానక మంజుపీఠంబున నూర్చున్న సంజయునకిట్లనియె* (సీ॥ మాతల్లిదండ్రులు మందిరంబున లేరు సంజయ వారెందుం జనిరి నేడు। ముందఱం గానడు ముదుసలి మా తండ్రి పుత్రశోకంబునం బొగులుచుండల్లి। సౌజన్యనిధి ప్రాణసఖుండు మా పినతండ్రి మందబుద్ధులమైన మమ్ము విడిచి। యెందు బోయిరో మువ్వురు నెఱిఁగింపు మాత్మలోఁ దనయపరాధంబుఁ దడవికొనుచు। భార్యతోడం దండ్రి పరితాపమును పొందుం। గపటమింత లేదు కరుణగలడు। పాండుభూవిభుండు పరలోకగతుండైన। మమ్ముం జిన్నవాండ్రను మనిచెన తండు* (వ॥ అనిన సంజయుండు దయాస్నేహంబువలన తికర్శితుండగుచుం దన ప్రభువు పోయిన తెఱంగెఱుంగక కొంతదడవూరకుండి తద్వియోగదుఃఖంబునం గన్నీరు దుడిచికొనుచు బుద్ధిబలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు సేసి తన భర్తృపాదంబుల మనంబున నెన్నుచు ధర్మజునికిట్లనియె * (గీ॥ అఖిలవార్తలు మున్ను నన్నడుగుచుండు। నడుగండీ రేయి మీ తండ్రి యవనినాథ। మందిరము లోన విదురుతో మంతనంబు। నిన్న నాడుచునుండెను నేఁడు లేఁడు* (వ॥ విదుర గాంధారీధృతరాష్ట్రులు నన్ను వంచించి యెందుం బోయిరో వారల నిశ్చయంబు లెట్టివో యెఱుంగనని సంజయుండు దుఃఖించు సమయంబున తుంబురు సహితుండై నారదుండు వచ్చిన లేచి నమస్కరించి తమ్ములుం దానును నారదుం బూజించి కౌంతేయాగ్రజుండిట్లనియె*(ఉ॥ అక్కట తల్లిదండ్రులు గృహంబున లేరు మహాత్మ వారు నే। డెక్కడం బోయిరో యెఱుంగ నెప్పుడు బిడ్డలపేరు గ్రుచ్చితాం। బొక్కుచునుండుం దల్లి యెటువోయెనొకో విపదంబురాశికి। న్నిక్కము కర్ణధారుఁడవు నీవు జగజ్జనపాలదర్శనా * (వ॥ అనిన విని సర్వజ్ఞుండైన నారదుండు ధర్మజునకిట్లనియె నీశ్వరశవంబు విశ్వంబీశ్వరుండు భూతంబుల నొకటితో నొకటిం జేర్చునెడం బాపును మఱి భిన్ననాసికలందు రజ్జుప్రోతంబులగుచుం గంఠరజ్జువులం గట్టంబడిన బలీవర్దంబులం బోలెం గర్తవ్యాకర్తవ్య వేదలక్షణయగు వాక్తంత్రియందు వర్ణాశ్రమలక్షణంబులుగల నామంబులచే బద్ధులై లోకపాలసహితంబులైన లోకంబులీశ్వరాదేశంబు వహించుం గ్రీడాసాధనంబులగు నక్షకందుకాదుల కెట్లు సంయోగవియోగంబు లట్లు క్రీడించు నీశ్వరునికిం గ్రీడాసాధనంబులైన జంతువులకు సంయోగవియోగంబులు గలుగుచుండు సమస్తజనంబును జీవరూపంబున ధ్రువంబు దేహరూపంబున నధ్రువంబై యుండు మఱియొక్కపక్షంబున ధ్రువంబున ధ్రువంబునంగాక యుండు శుద్ధబ్రహ్మస్వరూపంబునననిఁ

ర్వచనీయంబుగ రెండునైయుండు నజగరంబుచేత మ్రింగంబడిన పురుషుఁడన్యులరక్షింపలేని దెఱంగునఁ బంచభూతమయంబై కాలకర్మగుణాధీనంబైన దేహంబు పరులరక్షింపసమర్థంబు గాదు కరంబులుగలజంతువులకుఁ గరంబులు లేని చతుష్పాదాదులాహారంబులగుఁ జరణంబులుగల ప్రాణులకుం జరణంబులు లేని తృణాదులు భక్షణీయంబులగు నధికజన్మంబులుగల వ్యాఘ్రాదులకు నల్పజన్మంబులుగల మృగాదులు భోగ్యంబులగు సకలదేహిదేహంబులందు జీవుండు గలుగుటం జేసి జీవునికి జీవుండ జీవికయగు నహస్తసహస్తాదిరూపంబైన విశ్వమంతయు నీశ్వరుండు గాఁ దెలియుము తనికి వేఱు లేదు నిజమాయావిశేషంబున మాయావియై జాతిభేదరహితుండైన యీశ్వరుండు బహుప్రకారంబుల భోగిభోగ్యరూపంబుల నంతరంగబహిరంగంబుల దీపించుఁ గాన ననాథులు దీనులగు నామతలిదండ్రులు ననుం బాసి యేమయ్యెదరో యెట్లు వర్తించెదరో యని వగవం బనిలేదజ్ఞానమూలంబగు స్నేహంబున నైన మనోవ్యాకులత్వంబు పరిహరింపుమని మఱియు నిట్లనియె * (గీ॥ అట్టి కాలరూపుఁ డఖిలాత్ముఁడగు విష్ణుఁ। డసురనాశమునకు నవతరించి। దేవకృత్యమెల్లఁ దీర్చి చిక్కనపని। కెదురుసూచుచుండు నిప్పుడధిప * (మత్తకోకిల॥ ఎంతకాలము కృష్ణుఁ డీశ్వరుఁ డిద్ధరిత్రి జరించుమీ। యంతకాలము నుండుఁ డందఱు నవ్వలం బనిలేదు మీ। భ్రాంతిమానుము కాలముం గడఁపంగ నెవ్వరు నోపరీ। యింత యేల నరేంద్రసత్తమ చెప్పెదన్ విను మంతయున్ * (వ॥ ధృతరాష్ట్రుండు గాంధారివిదురసహితుండై హిమవత్పర్వతదక్షిణభాగంబున నొక్క మునివనంబునకుం జని తొల్లి సప్తఋషులకు సంతోషంబు సేయుకొఱకు నాకాశగంగ యేడుప్రవాహంబులై పాఱిన పుణ్యతీర్థంబున గృతస్నానుండై యథావిధిహోమము మొనరించి జలభక్షణంబు గావించి సకలకర్మంబులు విసర్జించి విఘ్నంబులం జెందక నిరాహారుండయి యుపశాంతాత్ముండగుచు శాంతి నంగీకరించి పుత్రార్థదారేషణంబులు వర్జించి విన్యస్తాసనుండై ప్రాణంబుల నియమించి మనస్సహితంబైన చక్షురాదీంద్రియంబుల నాఱింటి విషయంబులఁ బ్రవర్తింపనీక వర్తించి హరిభావనచే ధారణాయోగంబు వహించి రజస్సత్త్వతమోరూపంబులగు మలంబుల మాఁటి సహరించి మనంబున నహంకారాస్పదంబైన స్థూలదేహంబువలనం బాపి బుద్ధియందు నేకీకరణంబు సేసి యట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన వియోగించి క్షేత్రజ్ఞునియందుఁ బొందించి దృష్టంబైన యీశ్వరునివలన క్షేత్రజ్ఞునిం బాపి మహాకాశంబుతోడ ఘటాకాశముం గలుపు కైవడ నాధారభూతంబైన బ్రహ్మమందుఁ గలిపి లోపలి గుణక్షోభంబును వెలుపలి యింద్రియవిక్షేపంబును లేక నిర్మూలితమాయాగుణవాసనుండగుచు నిరుద్ధంబులగు మనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి యఖిలాహారంబుల వర్జించి కొఱడుచందంబున * (మ॥ ఉటజాంతస్స్థల వేదికన్ని యతుఁడై యున్నాఁడు నేఁ డాదిగా। నిటపై నేనవనాఁడు మేను విడువంగా నిజ్యాగ్ని యోగాగ్నితో। త్పటు దేహంబు దహింపఁ జూచి నియమప్రఖ్యాత గాంధారియు। ట్టటు వోనొల్లక ప్రాణవల్లభునితో నగ్నింబడు సుచ్ఛవరా * (క॥ అంతట వారలమరణము। వింతయగుచుఁ జూడఁబడిన విదురుఁడు చింతా। సంతాపమొదవఁ బ్రీతస్వాంతుండై తీర్థములకుఁ జనియెడు నధిపా * (వ॥ అనిపిదు గాలవృత్తాంతంబంతయు ధర్మనందనునకెఱింగిం

—※ ధర్మరాజు దుర్నిమిత్తంబులం గని చింతించుట ※—

చి తుంబురుసహితుండయిన నారదుండు స్వర్గంబునకు నిర్గమించిన వెనుక ధర్మజుండు భీమునిం జూచి యిట్లనియె * (సీ॥ ఒకకాలమునఁ బండు నోషధీచయము వేఱొకకాలమునఁ బండకుండు నండ్రు। క్రోధంబు లోభంబు గ్రూరతబొంకును దీపింప నరులు వర్తింతురండ్రు। వ్యవహారములు మహావ్యాజయుక్తములండ్రు సఖ్యంబు వంచనాసహితమండ్రు। మగలతో నిల్లాండ్రు మచ్చరించెదరండ్రు సుతులు దండ్రులఁ దెగఁ జూతురండ్రు। గురుల శిష్యులు దూషించి కూడదండ్రు। శాస్త్రమార్గము లెవ్వియు జరుగవండ్రు। న్యాయపద్ధతి బుధులైన నడువరండ్రు। కాలగతి యింతయై వచ్చెఁ గంటె నేఁడు * (తే॥ హరిఁ జూడ నర్జునుఁ డేగినాఁడు నెల లేడయ్యెం గదా రారు కాలరు లెవ్వారును యాదవుల్ మదలోలస్వాంతులీవేళను। స్థిరులై యుండుదురా మురారి సుఖియై సేమంబుతో నుండునా। యొరయై యున్నది చిత్రమీశ్వరకృతంబెట్లో కదే మారుతీ * (క॥ మానసము గలఁగుచున్నది। మానవు బహుదుర్నిమిత్తము ర్యాదలు సమ్మానవ దేహక్రీడలు। మానవిచారింపనోపు మాధవుఁడకటా * (క॥ మనవులు సెప్పక ముందఱ। మనదారప్రాణరాజ్యమానశ్రీలన్ మనుపుదు ననియా దేవుఁడు। చనమునఁ దలపోసి మని చెనసలంగఁ గుణాఢ్యా * (క॥ నారదుఁడాడిన కైవడిఁ। గ్రూరపుకాలంబు వచ్చెఁ గుంభిని మీఁదన్। ఘోరములగు నుత్పాతము। లారభటిం జూడఁబడియెన నిలజకంటే * (సీ॥ ఓడదు నాముందు నొక్కసారమేయంబు మొఱఁగుచున్నది మోరయెత్తి। యాదిత్యుఁడుదయింపనభిముఖంబై నక్క వాపోయెమంటలు వాఁతఁగలుగ। మిక్కిలియున్నవి మెఱసి గృధ్రాదులు గర్దభాములు దీర్పి క్రంమ కొనియె। నుత్తమాశ్వములకు నుదయించుఁ గన్నీరు మత్తగజంబుల మదము యిడిగెఁ। గాలు దూతభంగిఁ గదిసెఁ గపోతము। మండదగ్ని హోమమందిరములఁ। జుట్టుఁ బొగలు దిశల సౌరదినాచ్ఛాదించెఁ। దరణిమాసెఁ జూడు ధరణిగదలె * (క॥ వాతములు విసరి రేణు। వ్రాతములాకసముఁ గప్పవడి సుడిగొనిని। ర్ఘాతములు వడియె ఘనసం। ఘాతంబులు రక్తవర్షకలితములయ్యెన్ * (క॥ గ్రహములు వోరాడెడినా। గ్ర

హములువినఁబడియెభూతకలకలములుదు। స్సహములగుచుశిఖికీలా । వహములక్రియఁదోచెగగనవసుధాంతరముల్ *(క॥ దూడలుగుడువవుచన్నులు।దూడలకున్గోవులీవుదుగ్ధములోడలం।బీడలుమానవుపశువులఁ। గూడవువృషభములుదరపిపుఱ్ఱలనెక్కన్*(క॥కదలెడు వేల్పులరూపులు । వదలెడుఁగన్నీరువానివలనంజమటల్ । వొదలెడిఁబ్రతిమలు వెలిఁజని। మెదలెడినొక్కొక్కగుడిని మేదినియందున్*(క॥ కాకంబులువాపోయెడి।ఘూకంబులునగరఁబగలుఘుంట్రలుగొలిపెన్ । లోకంబులువిభ్రష్టశ్రీకంబులగతినశింధిశిథిలములయ్యెన్* (మ॥ యవపద్మాంకుశచాపచక్రఝషరేఖాలంకృతంబైనమా । ధవుపాదద్వయమింక మెట్టెడుపవిత్రత్వంబు నేఁడాదిగా।నవనీకాంతకు లేదుపోమఱిమదీయాంగంబువామాక్షిబా । హువులాకంపమునొందుచుండునిలకేయుగ్రస్థితుల్వచ్చునో* (వ॥ మఱియుమహోత్పాతంబులు పెక్కులుపుట్టుచున్నయవిమురాంతకునివృత్తాంతంబువినరాదనికుంతీసుతాగ్రజుండుభీమునితో విచారించుసమయంబున*(క॥ ఖేదమునన్నింద్రసూనుఁడు।యాదవపురినుండివచ్చియగ్రజుఁగనితఁ। త్పాదములనయనసలిలో।త్పాదకుఁడై పడియెదీనుభంగిన రేంద్రా* (క॥ పల్లటిలినయుల్లముతోఁ

—— అర్జునుండు ధర్మజునకుఁ గృష్ణ నిర్యాణంబు సెప్పుట ——

దల్లడపడుచున్నపిన్నతమ్మునిఁగనివె। ల్వెల్లనగుమొగముతోజను। లెల్లనువినధర్మపుత్రుఁడిట్లనిపలికెన్* (సీ॥ మాతామహుండైనమనశూరుఁడున్నాఁడెసంగళమేమనమాతులునకు । మోదమేనలుగురుముగురుమేనత్తలకానందమే వారియాత్మజులకు। నక్రూరకృతవర్మలాయుస్సమేతు లేజీవితుఁడేయుగ్రసేనవిభుఁడు । కల్యాణయుక్తులే గదసారణాదులుమాధవుతమ్ములుమానధనులు।నందమేమనసత్యకనందనునకు।భద్రమేశంబరాసురభంజనునకుఁ। గుశలమేబాణదనుజేంద్రుకూఁతుపతికి । హర్షమేపార్థముసలికిహలికిబలికి *(వ॥ మఱియునంధకమధుయదుభోజదాశార్హవృష్ణిసాత్వతులనియెడివంశంబులవీరులునుహరికుమారులైనసాంబసుషేణప్రముఖులును నారాయణానుచరులైనయుద్ధవాదులును గృష్ణసహచరులైనసునందనందాదులుననియందఱునడిగిధర్మజుండుగ్రమ్మఱనిట్లనియె*(సీ॥వైకుంఠవాసులవడువునెవ్వనిబలమున నానందభరితులగుచు। వెలుపకయాదవవీరులువర్తింతురమరులుగొలువుండునట్టికొలువు। చవికెనాకర్షించి చరణసేవకులైనబంధుమిత్రాదులపాదయుగము। నెవ్వఁడుద్రొక్కించెనింద్రపీఠముమీఁదవజ్రంబుఝళిపించివ్రాలువాని । ప్రాణవల్లభకెంగేలఁబాదుచేసి । యమృతజలములఁబోషింపనలరుపారి।జాతమెవ్వఁడుగొనివచ్చిసత్యభామ ।కిచ్చెనట్టిమహాత్మునకిపుడుశుభమె* (శా॥ అన్నాఫల్గునభక్తవత్సలుఁడుబ్రహ్మణ్యుండుగోవిందుఁడా । పన్నానీకశరణ్యుఁడీశుఁడుజగద్భద్రానుసంధాయిశ్రీ । మన్నవ్యాంబుజపత్రనేత్రుఁడుసుధర్మామధ్యపీఠంబునం।దున్నాఁడాబలభద్రుఁగూడిసుఖియైయుత్సాహియైద్వారకన్* (క॥ ఆరామకేశవులకు।న్నారామలభక్తినీవుసలుపుదువుగదా।గారాములుసేయుదురా । పోరాములబంధులెల్లప్రొద్దుజితారీ* (శా॥ మున్నుగ్రాటవిలోవరాహమునకైముక్కంటితోఁబోరుచో।సన్నాహంబునఁగాలకేయులవడింజక్కాడుచోఁబ్రాభవ।స్కన్నుండైచనుకౌరవేంద్రుపనికైగంధర్వులందోలుచోఁ। గన్నీరెన్నఁడుదేవుతండ్రిసెపుమాకల్యాణమేచక్రికిన్ ॥ అదియునుంగాక*(క॥ఓడితివోశత్రువులకు।నాడితివోసాధుదూషణాలాపంబుల్ ।గూడితివోపరసతులను । వీడితివోమానధనమువీరులనడుమన్*(క॥తప్పితివోయిచ్చెదనని। చెప్పితివోకపటసాక్షి సేసినమేలుం।దప్పితివోశరణార్థుల । రొప్పితివోద్విజులఁబసులరోగులనతులన్*(క॥అడిచితివోభూసురులను।గుడిచితివోబాలవృద్ధగురువులువెలిగా ।విడిచితివోయాశ్రితులను।ముడిచితివోపరులవిత్తములులోభమునన్* (వ॥ అనిపలికినంగన్నీరుకరతలంబునందుడిచి కొనుచుగద్గదస్వరంబున మహానిధిఁగోలుపోయినపేదచందంబుననిట్టూర్పులునిగుడించుచునర్జునుండన్నకిట్లనియె*(క॥ మనసారథిమనసచివుఁడు । మనవియ్యముమనసఖుండుమనబాంధవుఁడున్ ।మనవిభుఁడుగురుఁడు దేవర।మనలనుదిగనాడిచనియెమనుజాధీశా* (క॥ కంటకపునృపులుసూడఁగమింటంగంపించుయంత్రమీనముగోలన్।గెంటించిమనముదగవా । ల్గంటించెకొంటిమతనికరుణనకాదే* (క॥ దండించిననేకులతోనా। ఖండలుఁడెదుఱ్ఱయినగెలిచిఖాండవవనముం।జండార్చికినర్పించిన । గాండీవమునిచ్చెఁజక్రిగలుగుటనధిపా* (క॥ దిక్కులరాజులనెల్లను।ద్రక్కించిధనంబుగొనుటమయకృతసభము । న్నెక్కటజన్నము సేయుట। నిక్కముహరిమనకుదండనిలచినఁగాదే* (మ॥ ఇభజిద్వీర్యముఖాభిషిక్తమగునీయిల్లాలిధమ్మిల్లము । సభలోశాత్రవులీడ్చితెచ్చినపుడాచంద్రాస్యదుఃఖింపఁగా । సభయంబిచ్చిప్రతిజ్ఞఁజేసిభవదీయారాతికాంతాశిరో । జభరశ్రీలహరింపఁడేవిధవలై సౌభాగ్యముల్వీడఁగన్*(శా॥వైరుల్గట్టినపుట్టముల్విడువఁగావారింపనావల్లభుల్ । రారీవేళనుపేకుసేయఁదగవేరావేనివారింపవే । లేరేత్రాతలుగృష్ణయంచుసభలోలీనాంగియైకుయ్యిడం।గారుణ్యంబునభూరివస్త్రకలితంగాఁజేయఁడేద్రౌపదిన్*(సీ॥దూర్వాసుఁడొకనాఁడుదుర్యోధనుఁడుపంపఁబదివేలశిష్యులుభక్తిఁగొలువఁ । జనుదెంచిమనముపాంచాలియుఁగుడిచినవెనుకనాహారంబువేడికొనినఁ । బెట్టెదననవుడుఁబెట్టకున్నశపింతుననుచుఁదోఁయావగాహమునకేఁగ ।గడవలనన్నశాకములుదీరుటఁజూచి

పాంచాలపుత్రికపర్ణశాలలోనం దలంచినఁ జేసిలోవిలోని | శిష్టశాకాన్నలవము భ్రాశించి తపసి | కోపముడిగిం దిపరిపూర్ణకుక్షిం జేసె నిట్టి త్రైలోక్యసంతర్పి యెందుఁ గలఁడు * (సీ॥ వంది కైపోరాడ ఫాలాక్షుఁ డెవ్వని బలమున నాకిచ్చెఁ బాశుపతము | నెవ్వ నిలావున నీ మేన దేవేంద్రు పీఠార్థమున నుండ పెంపుఁగంటిఁ | గాలకేయ నివాతకవచాది దైత్యులఁ జంపితి నెవ్వని సంస్మరించి | గోగ్రహణమునాఁడు గురుకులాంభోనిధిఁ గడచితి నెవ్వని కరుణఁ జేసి | కర్ణసింధురాజ కౌరవేంద్రాదుల | తలలపాగలెల్లఁ దడివి తెచ్చి | నేమహాత్ము బలిమి నిచ్చితి విరటుని | పుత్రియడుగ బొమ్మపొత్తికలకు * (మ॥ గురుభీష్మాదులు గూడి పన్నిన కురుక్షోణీశ చక్రంబులో | గురుశక్తిన్ రథయంతయై నొగలపైఁ గూర్చుండి యా మేటి నా | శరములాఁ రకమున్న వారలబలోత్సాహాతిరేకంబు స | త్వరతం జూడ్కులసంహరించు నమితోత్సాహంబు నాకిచ్చుచున్ * (మ॥ అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశిందిగె | ల్వసమర్థంబులుగాని కైవడిఁ గృపాశ్వత్థామ గాంగేయసూ | ర్యసుత ద్రోణ ధనుర్విముక్త బహుదివ్యాస్త్రప్రపంచంబు నా | దెసకుం రాక తొలంగు మాధవుదయాదృష్టిన్ నరేంద్రోత్తమా * (చ॥ వసుమతి దివ్యబాణములఁ ద్రవ్వకలు వాపి కొలంకు సేసి నా | రసముల మాటు గాఁ బఱపి రథ్యములన్ రిపులెల్లఁ జూడ సా | హసమున నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపు నాఁడు నా | కసురవిరోధి భద్రగతి నండయి వచ్చినఁ గాదె భూవరా * (సీ॥ చెలికాఁడ రమ్మని చీఱు నొక్క వేళ మన్నించు నొక వేళ మఱఁది యనుచు | బంధుభావంబునఁ బాటించు నొక వేళ దాతయై యొక వేళ ధనములిచ్చు | మంత్రియై యొక వేళ మంత్రమాదేశించు బోధియై యొక వేళ బుద్ధి సెప్పు | సారథ్య మొనరించుఁ జనువిచ్చు నొక వేళఁ గ్రీడించు నొక వేళ గేలి సేయు | నొకట శయ్యాసనంబున నుండఁ గన్న | తండ్రి కైవడిఁ జేసిన తప్పుఁ గాచు | హస్తములు వట్టి పొత్తున నారగించు | మనుజవల్లభ మాధవు మఱువరాదు * (క॥ విజయ ధనంజయ హనుమ | ద్ధ్వజ ఫల్గున పార్థ పాండుతనయ నరమహేం | ద్రజ మిత్రార్జున యంచును | భుజములు తలఁకడవ రాక పోకలఁ జీఱున్ * (క॥ వారిజగంధులు దమలో | వారింపఁగరాని ప్రేమ వాదము సేయన్ | వారిజనేత్రుఁడు నను దగ | వారింపఁ గుబనుపు నలుక వారింప నృపా * (క॥ నిచ్చలు లోపలి కాంతలు | మచ్చికఁ దన తోడ నాడు మాటలు నాకున్ | ముచ్చటలు సెప్పు మెల్లన | విచ్చలవిడిఁ దొడలమీఁద విచ్చేసి నృపా * (చ॥ అటమటమయ్యె నా భజనమంతయు భూవర నేఁడు సూడ మా | యిటువలె గారవించు జగదీశుఁడు కృష్ణుఁడు లేనిపిమ్మటం | బటుతర దేహలోభమునఁ బ్రాణములున్నవి వెంటఁ బోక నే | కటకట పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో * (శా॥ కాంతారంబున నొంటిఁ దోడుకొని రాఁ గాఁ జూచి గోవిందశుద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మదరాగాయత్తులై తాఁకి నా | చెంతన్ బోయలు మూఁగి పట్టికొన నా సీమంతినీ సంఘమున్ | భ్రాంతిన్ స్వామి నిభంగి నుంటి విడిపింపన్ లేక ధాత్రీశ్వరా * (శా॥ ఆ తేరా రథికుండు నా హయములా యస్త్రాసనం బా శర | వ్రాతం బన్నియలఁ దొల్లిఁ జంపుదుఁ దుదిన్ వ్యర్థంబులై పోయెఁ దాఁ | జేతోధీశుఁడు చక్రి లేమి భసితక్షిప్తాజ్యమాయా విమా | యాతంత్రోషరభూమి బీజముల మర్యాదన్ నిమేషంబునన్ * (మ॥ యదువీరుల్ముని నాథు శాపమునఁ గాలాధీనులై యందఱున్ | మదిరాపానవివర్ధమానమదసమ్మర్దోగ్రరోషాధులై | కదనంబుల్దమలోన ముష్టిహతులం గావించి నీ రైరి న | ష్టదశం జిక్కి రినల్గురేవురచటన్ సర్వంసహావల్లభా * (క॥ భూతములవలన నెప్పుడు భూతములకు జన్మమరణపోషణములు ని | ర్ణీతములు సేయుచుండును | భూతమయుండీశ్వరుండు భూతశరణ్యా * (క॥ బలములు గల మీనంబులు | బలవిరహిత మీనములను భక్షించు క్రియన్ | బలవంతులయిన యదువులు | బలరహితులఁ జంపి రహితభావములన్ నృపా * (మ॥ బలహీనాంగులకున్ బలాధికులకుం బ్రత్యర్థిభావోద్యమంబులు గల్పించి వినాశమున్నెఱపి యీ భూభారముం బాపిని | శ్చలబుద్ధిన్ గృతకార్యుఁడై చనియె నా సర్వేశ్వరుం డచ్యుతుం | డలఘుండేమని చెప్పుదున్ భగవదీయాయత్తమూర్తీశ్వరా * (వ॥ మఱియు దేశకాలార్థయుక్తంబులును నంతఃకరణసంతాపశమనంబులును నయిన హరివచనంబులం దలంచి చిత్తంబు పరాయత్తంబై యున్నదని యన్నకుం జెప్పి నిరుత్తరుండై గోవిందచరణారవిందచింతనలబుద్ధియై శోకంబు వర్జించి సదాధ్యానభక్తివిశేషంబులం గామక్రోధాదుల జయించి తొల్లి తన కుభయసేనామధ్యంబున ననంతుం డానతిచ్చిన గీతంబులు దలంచి కాలకర్మభోగాభినివేశంబుల చేత నావృతంబయిన విజ్ఞానంబు గ్రమ్మఱ నధిగమించి శోకహేతువహంకారమమకారాత్మకంబయిన ద్వైతభ్రమంబనియును ద్వైతభ్రమంబునకుఁ గారణంబు దేహంబనియును దేహంబునకు బీజంబు లింగంబనియును లింగంబునకు మూలంబు గుణంబులనియును గుణంబునకు నిదానంబు ప్రకృతియనియును బ్రహ్మోహమని యెడు జ్ఞానంబున లీనమై ప్రకృతి లేకుండుట యనైర్గుణ్యంబనియును నైర్గుణ్యంబు వలనం గార్యలింగనాశనంబనియును గార్యలింగనాశనంబునన సంభవంబగుననియును బ్రకృతిం బాసి క్రమ్మఱ స్థూలశరీరప్రాప్తుండు గాక పురుషుండు సమ్యగ్భోగంబున నుండు ననియును నిశ్చయించి యర్జునుండు విరక్తుండై యూరకుండె ధర్మజుండు భగవదీయమార్గంబు దెలిసి యాదవుల నాశంబు విని నారదువచనంబులఁ దలంచి నిశ్చలచిత్తుండై స్వర్గగమనంబునకు యత్నంబు సేయుచుండె నా సమయంబున * (క॥ యదువుల నాశము మాధవు | పదవియు విని కుంతి విమలభక్తిన్ భగవ | త్పదదంతా

తత్పరమై । ముదమునసంసారమార్గమునకుంబాసెన్* (వ॥ ఇట్లుకంటకంబునంగంటకోన్మూలనంబు సేసికంటకంబులరెంటింబరిహరించువిన్నాణి తెఱంగున యాదవరూపశరీరంబునంజేసియీశ్వరుండులోకకంటకశరీరంబులు సంహరించి నిజశరీరంబుపిడిచె సంహారంబునకునిజశరీరపరశరీరంబులు రెండు నీశ్వరునకు సమంబులునిజరూపంబుననుండుచు రూపాంతరంబులుధరియించి క్రమ్మఱనంతర్ధానంబునొందు నటునికైవడి లీలాపరాయణుండైననారాయణుండు మీనకూర్మాదిరూపంబులుధరియించుంబరిహరించుంనని చెప్పి మఱియునిట్లనియె* (క॥ ఏదినమున వైకుంఠుఁడు। మేదినిపైఁదాల్చినట్టిమేనువిడిచె నాఁ। డాదినముననశుభ ప్రతి। పాదకమగుకలియుగంబుప్రాప్తంబయ్యెన్* (సీ॥ కలివర్తనంబునఁగ్రౌర్యహింసాపత్యదంభకౌటి

—ధర్మరాజుపరీక్షిన్మహారాజునకుఁబట్టముగట్టి మహాప్రస్థానంబునకరుగుట.—

ల్యాద్యధర్మచయము।పురములగృహములభూములఁదనలోనఁగలుగుటఁదలఁపోసి కరిపురమున। మనుమనిరాజవైమనుమనిదీవించిసింధుతోయకణాభిషిక్తుఁజేసి । యనిరుద్ధనందనుండైనవజ్రునిఁదెచ్చిమధురఁబట్టముగట్టిమమతబాసి । కరులఁదురగములసుగంకణాదికముల । మంత్రిజనులబుధులమానవతుల । నఖిలమయినధనములభిమన్యుసుతునకు । నప్పగించిబుద్ధినాశ్రయించి* (వ॥ విరక్తుండయినధర్మనందనుండు ప్రాజాపత్యమనియెడియిష్టిఁగావించి యగ్నులనాత్మారోపణంబు సేసినిరహంకారుండును,నిర్దళితాశేషబంధనుండునై, సకలేంద్రియంబులమానసంబుననడంచి ప్రాణాధీనవృత్తియగు మానసంబుం బ్రాణవాయువు, బ్రాణమునపానమునందు, నుత్సర్గసహితంబయినయపాయనమునుమృత్యువందును మృత్యువునుబంచభూతంబులకునైక్యంబయినదేహంబునందును, దేహమునుగుణత్రయంబునందును, సర్వారోపహేతువగునవిద్యను జీవునియందు జీవుండయిన తన్ననవ్యయంబయినబ్రహ్మమందునులయింపంజేసి బహిరంగవ్యాపారంబులవిడిచి నారచీరలుధరియించి మౌనియునిరాహారుండునుముక్తకేశుండునై యున్మత్తపిశాచబధిరజడులచందంబున నిరపేక్షత్వంబున* (క॥ చిత్తంబున బ్రహ్మమునా। వృత్తముఁగావించుకొనుచువిజ్ఞానధనా । యత్తులుదొల్లి వెలింగెడు । యుత్తరదిశకేగెనిర్మలోద్యోగమునన్ * (సీ॥ అంత నాతనితమ్ములనిలపుత్రాదులుకలిరాకచేఁబాపకర్మలగుచుఁ । జరియించుప్రజలసంచారంబులీక్షించియఖిలధర్మంబులనాచరించి । వైకుంఠచరణాబ్జవర్తితహృదయులైతద్భక్తినిర్మలత్వమునఁజెంది । విషయయుక్తులకుఁబ్రవేశింపఁగారాకనిర్ధూతకల్మషనిపుణమగుచు।బహుళవిజ్ఞానదావాగ్నిభసితకర్మ । లైనయేకాంతులకులక్ష్యమైవెలుంగు।ముఖ్యనారాయణస్థానమునకుఁజనిరి।విగతరజస్సులైనయాత్మలవిప్రవర్య* (వ॥ అంతవిదురుండు ప్రభాసతీర్థంబునహరియందుఁ జిత్తంబుసేర్చిశరీరంబువిడిచిపితృవర్గంబుతోడ దండధరుండగుటంజేసి నిజాధికారస్థానంబునకుంజనియె. ద్రుపదరాజపుత్రిపతులవలననుపేక్షితయైజగత్పతియైనవాసుదేవునందుఁజిత్తంబుఁజేర్చితత్పదంబుసేరునిట్లు* (క॥ పాండవకృష్ణులయానము। పాండురమతినెవ్వఁడైనఁబలికినవిన్నన్ । ఖండితభవుఁడైహరిదా । సుండైకైవల్యపదముసొచ్చునరేంద్రా* (వ॥ అంతటబరీక్షిత్కుమారుండుజాతకర్మవిదులైనపెద్దలుచెప్పిన చందంబున భూసురోత్తమశిక్షావశంబున మహాభాగవతుండైధరణీపాలనంబుసేయుచునుత్తరునిపుత్రిక నిరావతియనుమత్తకాశినింబెండ్లియాడి జనమేజయప్రముఖులైన నలువురుకొడుకుల నుత్పాదించి గంగాతటంబునఁగృపాచార్యుండుగురువైయుండయాగభాగంబులకువచ్చినదేవతలనీక్షించుచు భూరిదక్షిణంబులు గామూఁడశ్వమేధంబులాచరించి దిగ్విజయకాలంబునగోమిథునంబుఁ దన్నుచున్నశూద్రుండునురాజచిహ్నముద్రితుండునగుకలిం

—పరీక్షిన్మహారాజుదిగ్విజయంబున భూధర్మదేవతలసంవాదంబాలించుట.—

బట్టినిగ్రహించెనని చెప్పినశౌనకుండుపౌరాణికునకిట్లనియె* (క॥ భూవరరూపపుశూద్రుడు । గోవుందానేలదన్నెఁగోరి పరీక్షి।ద్భూవరుఁడుదిశలగెలుచుచు। నేవిధిఁగలినిగ్రహించెనెఱిఁగింపఁగదే* (మ॥ అరవిందాక్షుపదారవిందమకరందాసక్తులైనట్టిస । త్పురుషశ్రేష్ఠులవృత్తముల్వినకదుర్బుద్ధిన్విలంఘించీదు । ర్నరవార్తాకథనప్రపంచములుకర్ణప్రాప్తముల్సేసివా । నరముల్ వ్యర్థతఁద్రోచుచుండజనదీసంసారమోహంబునన్* (సీ॥ మనుటనిత్యముగాదుమరణంబునిజమనియెఱిఁగిమోక్షస్థితినిచ్ఛయించు । నల్పాయులగుమాకునట్టిదుర్జనచరిత్రములలోలిఁగర్ణరంధ్రములఁబెట్టి । బంగారువంటియాబ్రతికెడుకాలంబువోనాడఁగానేలపుణ్యచరిత । మాధవపదపద్మమకరందపానంబుసేయింపవేయేమసేయునట్టి । సత్రయాగమునకుసన్మునీంద్రులుచీఱవాఁడెదండధరుఁడువచ్చెఁజూడు । చంపఁడొకనినైనఁజన్నమయ్యెడుదాఁక । వినుచునుండుఁదగిలివిష్ణుకథలు* (క॥ మందునకుమందబుద్ధికి । మందాయువునకువిరక్తిమార్గములనుగో।విందచరణారవిందమ।రందముగొనఁదెఱపిలేదురాత్రింబవలున్* (వ॥ అనిశౌనకుండువలికినసూతుండిట్లనియెఁ బరీక్షిన్నరేంద్రుడు నిజవాహినీసందోహ సంరక్షితంబగుకురుజాంగలదేశంబునంగలిప్రవేశంబునాకర్ణించి యుద్ధకుతూహలతనంగీకరించియొకనాఁడుసముల్లాసంబులనబాణాసనంబుఁగైకొని నీలనీరదనిభతురంగనివహయోజితంబునుఫలితమనోరథంబునైన రథంబునారోహణంబుసేసిమృగేం

ధ్రధ్వజంబు వెలుంగ రథకరితురంగ సుభటసఘటితచక్రంబు నిర్వక్రంబునం గొలువ దిగ్విజయార్థంబు వెడలి పూర్వదక్షిణ
పశ్చిమోత్తరసముద్రలగ్నంబులైన యిలావృతరమ్యకహిరణ్మయహరివర్షకింపురుషభద్రాశ్వకేతుమాల భారతవర్షంబు
లను త్తరకురుదేశంబులును జయించి పుష్కలధనప్రదానపూర్వకలగు సపర్యల నభ్యర్చితుండై తత్తద్దేశమంగళపాఠకసం
ఘాతజేగీయమానపూర్వరాజవృత్తాంతంబు లాకర్ణించుచుం బాఠకపఠితపద్యంబులందుఁ బాండవులకు భక్తవత్సలుండైన పుం
డరీకాక్షుం డాచరించిన సారథ్యసఖ్యసభాపతిత్వసాచివ్యరచనవీరాసననూతనభావాదికర్మంబులు నశ్వత్థామాస్త్రతేజం
బువలనఁ దను రక్షించుటయు యాదవపాండవులందలి స్నేహానుబంధంబును వారలకుఁ గలిగిన భగవద్భక్తివిశేషంబు విశ్వం
భరత్వంబును విని యాశ్చర్యంబు నొందుచు వందిబృందంబులకు మహాధనంబులగు హారాంబరాభరణసందోహంబుల నొసం
గుచుం బద్మనాభపాదపద్మభజనపరతంత్రపవిత్రమానసుండై యుండె నయ్యెడ వృషభరూపంబున నేకపాదంబున సంచరించు
ధర్మదేవుండు దనసమీపంబున లేగలేని కట్టిచందంబు నహతప్రభమైన నేత్రంబుల సలిలంబులు గురియుచు గోరూపమై యున్న ధా
త్రికిట్లనియె* (మ॥ నయనాంభఃకణజాలమేల విడువన్నా తల్లి నీమేను సా । మయమై యున్నది మోము వాడినది నీమన్నిం
చు చుట్టాలకున్ । భయదుఃఖంబును నేఁడు వొందఁగ జాబంధిందిశూద్రుల్పద । త్రయహీనున్ననుఁ బట్టవత్తురని యో తాపంబు
నీకేటికిన్* (సీ॥ మఖములలేమిని మర్త్యులకిటమీఁద మఖభాగములు లేక మానునని యొ।రమణులు రమణుల రక్షింపరని యొపు
త్రులఁ దల్లిదండ్రులు ప్రోవరని యొ । భారతిఖజనులఁ బ్రాపించునని యొసద్విపుల నృపులు సేవింపరని యొ । కులిశహస్తుఁడు వా
నగురియింపకుండఁగఁ బ్రజలు దుఃఖంబులఁ బడుదురని యొ । హీనవంశజాతు లేలెదరని యొ రా । జ్యములు పాడిగలిగి జరుగవని
యొ।మనుజులన్నపానమైథునశయనాస। నాదికర్మసక్తులగుదురని యొ* (మ॥ జననీ నీభర మెల్ల డింపుటకునై చక్రాయుధుం
డిన్నిహా। యనము లేఁగలీనరాకృతి న్మెలఁగి నిత్యానందముం జేసి పో । యిన నేనింక ననాథనైతిఁ గుజనుండెవ్వాఁడు శాపించునో।
పెనుదుఃఖంబులఁ బొందఁ గంటినని యోభీతిల్లి చింతించుటల్ * (క॥ చెప్పరమగు కాలము చే। నెప్పుడు దేవతలకెల్ల నిష్టంబగు నీ।
యొప్పిదము కృష్ణుఁ డరిగినఁ। దప్పెఁగదా తల్లి నీవు దల్లడపడఁగన్ ॥అనిన భూదేవి యిట్లనియె* (క॥ ఈలోకంబునఁ బూర్వము।
నాలుగు పాదముల నీవు నడుతువు నేఁడా।శ్రీలలనేశుఁడు లేమిని।గాలము చే నీకు నొంటికాలయ్యెఁగదే*(వ॥ మఱియు సత్యశౌ
చదయాక్షాంతిత్యాగసంతోషార్జవంబులును శమదమతపంబులును సామ్యంబును బరాపరాధసహనంబును లాభంబుగల
యెడను దాసీనుండై యుండుటయును శాస్త్రవిచారంబును విజ్ఞానవిరక్తులు నైశ్వర్యశౌర్యప్రభావదక్షత్వంబులును స్మృతియు
ను స్వాతంత్ర్యమును గౌశలకాంతిధైర్యమార్దవప్రతిభాతిశయప్రశ్రయశీలంబులును జ్ఞానేంద్రియకర్మేంద్రియమనోబ
లంబులును సౌభాగ్యగాంభీర్యంబులును స్థైర్యశ్రద్ధాకీర్తిమానగర్వాభావంబులు ననియెడి ముప్పదితొమ్మిది గుణంబులు నవి

యును గాక బ్రహ్మణ్యతాశరణ్యతాదిమహాగుణసమూహంబును గృష్ణదేవునియందు వర్తించుఁగావున* (క॥ గణనాతీత
ములగు సద్గుణములుగల చక్రిసనిన ఘోరకలి ప్రేపే। రణమునఁ బాపము సేయుచు । ప్రణయుతులగు జనులఁ జూచి వగచెద దండ్రీ*
(క॥దేవతలకు ఋషులకుఁ బితృ । దేవతలకు నాకు నీకు ధీరులనునా । నావర్ణాశ్రమములకును । గోవులకును బాధ యనుచుఁ
గుందెద ననఘా* (సీ॥ బ్రహ్మాదు లెవ్వని భద్రకటాక్షవీక్షణము వాంఛించుచు సిత్తపములఁ । గమలాలయము మాని కమల యెవ్వ
ని పాదకమలంబు సేవించుఁ గౌతుకమున । భవ్యచిత్తమునందుఁ బరమయోగీంద్రులు నిలుపుదు రెవ్వని నియతితోడ । వేదంబు
లెవ్వని విమలచారిత్రములు వినుతింపఁగా లేక వెగడువడియె।నట్టివాసుదేవు నబ్జవజ్రాంకుశ । చక్రమీనశంఖచాపకేతు । చిహ్ని
తంబులైన శ్రీచరణములింక సోఁకవనుచు వగపు సోఁకెనయ్యా* (క॥ హరిపాదంబులు సోఁకెడి । సిరికతమున నఖిలభువనసేవ్య
త్వము తో। స్థిరనై తినిన్ని దినములు । హరి నాగర్వంబు మాన్పి యరిగె మహాత్మా* (క॥ లీలాకారము దాల్చెను।శ్రీలలనేశుండు
ఖలులశిక్షించి భవోన్మూలనము సేయుకొఱకును।నాలుగు పాదములనన్ను నడిపించుటకున్* (ఉ॥ అమధురోక్తులలానయము
లాదరహాసములాదయారసం । బాముటిపెంపు రాతగమనక్రియలా మనోహర । ప్రేమకరావలోకనము ప్రీతిఁగనుం
గొనలేమి మాధవుం। గామిను లేలనిర్దళితకర్ములు యోగులు వాయనేర్తురే*(క॥ మెల్లన నాపై యాదవ। వల్లభుఁడడుగిడఁగ మో
హవశనై నేరం।జిల్లఁగ రోమాంచము క్రియ । మొల్లములై మొలుచు సస్యములు మార్గములన్* (వ॥ అని యిట్లు పూర్వవాహి
నియైన సరస్వతీతీరంబున ధర్మదేవుండును భూమియు వృషభధేనురూపంబుల భాషింప రాజఋషియైన పరీక్షిద్భూవరుండు

—❀ కలిపురుషుఁడు ధర్మదేవతను దన్నుట. ❀—

డగ్గరియె నాసమయంబున* (శా॥ కైలాసాచలసన్నిభంబగు మహాగంభీరగోరాజము। న్గాలక్రోధుఁడు దండహస్తుఁడు నృపా
కారుండు క్రూరుండు జం। ఘాలుండొక్కఁడు శూద్రుఁడాసురగతిం గారుణ్యనిర్ముక్తుడై । నేలం గూలఁగఁ దన్నెఁ బండితిలఁగా
నిర్ఘాతపాదాహతిన్*(శా॥ఆలోలాంగకనమ్రశతోయకణజాలాక్షిన్మహాంభారవన్। బారారూఢతృణావళీకబళలోభవ్యా

ప్రజిహ్వాగ్రనాం। దోశ్శస్యాంతసజీవవత్సనుదయస్థఃఖాన్వితర్ఘమర్మకీ । లాలాపూర్ణశరీరనా మొదవునుల్లంఘించిత న్నేర్ప
వడిర్ * (వ॥ ఇట్లా ధేనువృషభంబుల రెంటిని గంటకుండై తన్నుచున్న రాజలక్షణముద్రితుండైన శూద్రునిం జూచి సువర్ణపరి
కరస్యందనారూఢుండగు నభిమన్యునందనుండు గోదండంబున గుణంబు సేసి మేఘగంభీరవచనంబుల నిట్లనియె॥* (శా॥ నిన్నుం
గొమ్ములఁ జిమ్మెనో కది సెనో నిర్భీతిమై గోవులం । దన్నం గారణమేమి కృష్ణజననాథశ్రేణి నే వేళలం । దున్నేరంబులు సేయ
రాదెఱుఁగవా ధూర్త స్వామిభూమిభృత్సన్నాహంబునొనర్చె దెవ్వఁడవు నిర్ శాసించెదర్ దుర్మతీ॥* (క॥ గాండీవియుఁ
జక్రియు భూమండలిఁ బెడఁబాసి చనిన నుదమత్తుఁడవై। దండింపఁదగని వారల । దండించెదు నీవ తగుదు దండనమునకున్ ॥ అని
వృషభంబును ద్దేశించి యిట్లనియె॥* (మ॥ కురుధాత్రీశ్వరబాహువజ్రయుగళీగుప్తక్షమామండలిన్ । బరికింపన్భవదీయ నేత్ర
జనితాంభః శ్రేణి దక్కన్ జనుల్ । దొరుగం జూడర ధర్మసంజనిత జంతుశ్రేణి బాష్పంబులన్ । గురుశక్తిన్విదళింతుఁ జూడు మిత
నిన్ గోమూర్తి దేవోత్తమా॥*(క॥ జాలిఁబడ నేల నాశర।జాలంబుల పాలు సేసి చంపెద వీనిన్। భూలోకంబున నిను నే । నాలుఁ
గుపాదముల నిపుడు నడిపింతుఁ జుమీ॥*(ఉ॥ వాచవిమైన గడ్డిఁ దిని వాహినులందు జలంబు ద్రావఁగా। నీ చరణంబు లెవ్వఁడిటు నిర్ద
ళితంబుగఁ జేసె వాఁడు దా । ఖేచరుఁడైన వానిఁ గనికీలితభూషణయుక్తబాహులన్ । వేచని త్రుంచి వైతు వినువీధికి నేగిన నేల
డాఁగినన్ ॥ అని మఱియు గోరూపయయిన భూదేవితో నిట్లనియె॥*(చ॥ అగణితవైభవుండగు మురాంతకుఁ డెక్కడవో యనంచు
నె। వ్యగలనశించి నేత్రముల వారికణంబులు దేమనమ్మలో । బెగడకు మమ్మహాద్విశిఖబృందములన్వృషలున్వధింతునా । మఱ
టిమిఁ జూడు నీ వెఱుపుమానఁగదమ్మ శుభప్రదాయినీ॥* (క॥ సాధువులగు జంతువులకు । బాధలుగావించు ఖలుల భంజింపని రా।
జాధము నాయుస్స్వర్గ।శ్రీధనములు ప్రీతిపోవు సిద్ధము తల్లీ॥ * (క॥ దుష్టజననిగ్రహంబును । శిష్టజనానుగ్రహంబు సేయఁగ నృపు
లన్।స్రష్ట విధించె బురాణ।ద్రష్టలు సెప్పుదురు పురుషధర్మము సాధ్వీ॥* (వ॥ అనిన ధర్మనందన పౌత్రునకు వృషభమూర్తి నున్న
ధర్మదేవుం డిట్లనియె॥* (ఉ॥ క్రూరులఁ జంపి సాధువులకున్విజయంబొనరించునట్టి యా।పౌరవవంశజాతుఁడవు భాగ్యసమేతుఁ
డనౌదు తొల్లి మీ । వారిటువంటివారగుట వారిజనేత్రుఁడు మెచ్చి దౌత్యసం । చారము సేసెఁగాదె నృపసత్తమ భక్తిలతాను
బద్ధుఁడై॥* (వ॥ నరేంద్రా యేము ప్రాణులకు దుఃఖహేతువుల మగాము మావలన దుఃఖంబు నొందెడు పురుషుండు లేఁడు వాది
వాక్యభేదంబుల యోగీశ్వరులు మోహితులై భేదంబుల నాచ్ఛాదించి తమకు నాత్మ సుఖదుఃఖంబుల నిచ్చు ప్రభువని చెప్పుదురు
దైవజ్ఞులు గ్రహదేవతాదులకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు మీమాంసకులు గర్మంబునకుం బ్రాభవంబుం బ్రకటింతురు లో
కాయతికులు స్వభావంబునకుఁ బ్రభుత్వంబు వలుకుదురు రందెవ్వరికిని సుఖదుఃఖప్రధానంబు సేయఁ బ్రభుత్వంబు లేదు పరు
లవలన దుఃఖంబు వచ్చిన నది గర్మంబు పరులు చేసిరని విచారింపవలదు తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరుని వలన సర్వము న
గుచుండు నని ధర్మదేవునికి ధర్మనందనపౌత్రుం డిట్లనియె॥* (గీ॥ ధర్మమూర్తివయ్య ధర్మజ్ఞ వృషరూప । పరమ ధర్మ మీవు పలుకు
త్రోవ। పాపకర్మ సేయు పాపంబు సూచింపఁ। బాపకర్ముఁ జేరు పథము వచ్చు॥* (వ॥ మఱియు దేవమాయ వలన భూతంబుల వాఙ్మ
నంబులకు వధ్యఘాతుకవృత్తి సులభంబు నం దెలియగాదు నీవు ధర్మదేవతవు కృతయుగంబున దపశ్శౌచదయాసత్యంబుల ను
నాలుగు నీకుఁ బాదంబులని చెప్పుదురు త్రేతాయుగంబునఁ బూర్వోక్తపాదచతుష్కంబునం దొక్కపాదంబు క్షీణంబయ్యె
ద్వాపరంబునం బాదద్వయంబు నశించెఁ గలియుగంబందు నివ్వడువున నిప్పుడు నీకుఁ బాదత్రయంబు భగ్నంబయ్యె నవశిష్టంబ
గు భవదీయచతుర్థపాదంబున ధర్మంబు కల్యంతంబు నని గ్రహింప గమకించుచున్న దివిను మదియునుం గాక॥* (క॥ భరమున్బాపి
రమాపతి భుంగరుణం బాదంబులం ద్రొక్కఁగా ।స్థిరమై వేడుక నింత కాలము సుఖశ్రీనొంది యీ భూమి తత । చ్చరణస్పర్శము లే
ని శూద్రకులజుల్ల్యాసంతు రంచున్నిరం।తర శోకంబున నీరు గన్నులని డెన్ ధర్మజ్ఞ వీక్షించితే॥* (వ॥ అని యిట్లు పలుకు ధర్మభూదే

—పరీక్షిన్మహారాజు కలిని నిగ్రహించి ధర్మపరిపాలనము సేయుట.—

వతల బుజ్జగించి మహారథుండయిన విజయపౌత్రుండు గ్రొక్కారు మెఱుంగు తెఱంగున నధికరించి దిక్కుల వెక్కసంబయిన
యడిదంబు బెడిదంబుగ జడిపించి పాపహేతువయిన కలిరూపు మాపనుద్యోగించిన వాఁడు రాజరూపంబుడిగి వాడిన మొగంబు
తోడ భయవిహ్వలుండయి హస్తంబులు సాచి తత్పాదమూలవిన్యస్తమస్తకుండయి ప్రణామంబు సేసి * (క॥ కంపించె దేహ
మెల్లం।జంపకు మో రాజతిలక శరణాగతుఁడ।క్షింపుము నిను ప్రొక్కెదఁ।జంపక కలిఁ జూచి నగుచు జనపతి వలికెన్॥* (క॥ అర్జు
నకీర్తిసమేతుం। డర్జునపౌత్రుండు భయరసాన్వితజనులన్।నిర్జితులఁ జంపనొల్లఁడు । దుర్జనభావంబు విడిచి తొలఁగు దురాత్మా॥ *
(వ॥ నీవు పాపబంధుండవు మదీయబాహుపాలితంబయిన మహీమండలంబున నిలువవలవదు రాజదేహంబులందు వర్తించుచుని
న్న నసత్య లోభ చౌర్య దౌర్జన్య దురాచార మాయా కలహ కపట కలుషాలక్ష్మ్యాది ధర్మేతర సమూహంబులాశ్రయించు సత్య
ధర్మంబులకు నివాసంబగు బ్రహ్మావర్తదేశంబున యజ్ఞవిస్తారనిపుణులయిన వారు యజ్ఞేశ్వరుండయిన హరిం బూర్పి యాగం

బు సేయుచున్న వారు యజించువారలకు సుఖప్రదానంబు సేయుచు సకలభూతాంతర్యామియై భగవంతుండయిన హరి జంగ
మస్థావరంబులకు నంతరంగబహిరంగంబులం జరించు వాయువు చందంబున నాత్మరూపంబున మనోరథంబుల నిచ్చుం గావు
నన్నిం జంపవలవదనుచు దండహస్తుండయిన జముని కైవడి మండలాగ్రంబు సాఁచిన రాజునకుం గలి యిట్లనియె॥ (క॥ జగతీశ్వ
రనీ యడిదము ధగధగితప్రభలతోడఁ దనరుచుఁ గ మెఱయన్ । బెగడెం జిత్తము గుండెలు వగిలెడి నిఁక నెందుఁ జొత్తు భావింపఁగ
దే॥ (వ॥ నరేంద్రా నిను నారోపితశరశరాసనునిఁగ సర్వప్రదేశంబులం గనుఁగొనుచున్నవాఁడ నే నెక్కడ నుండుదు నా
నతిష్మనిన రాజన్యశేఖరుండు ప్రాణివధ స్త్రీ ద్యూత పానంబులను నాలుగుస్థానంబుల నిచ్చి మఱియు నడిగిన సువర్ణమూ
లంబగు నసత్య మద కామ హింసా వైరంబుల నైదు పంచప్రదేశంబుల నొసంగి యితరస్థలంబుల స్పృశియింపకుండ నియ
మించె నిట్లు కలినిగ్రహంబు సేసి హీనంబులయిన తపశ్శౌచదయలను మూఁడు పాదంబులు వృషభమూర్తియయిన ధర్మదే
వునికిచ్చి రత్నగర్భకు నిర్భరంబయిన సంతోషంబు సంపాదించె॥ (క॥ గజనామధేయపురమున । గజరిపుపీఠమున ఘనుఁడు
కలిమర్దనుఁడై । గజవైరిపరాక్రముఁడై । గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్॥ (వ॥ ఇట్లు కృష్ణునియనుగ్రహంబున నశ్వ
త్థామబాణపావకంబువలనఁ బ్రతికి పరీక్షిన్నరేంద్రుండు బ్రాహ్మణశాపప్రాప్త తక్షకభయంబువలనఁ బ్రాణంబులు వోవునని
యెఱింగి సర్వసంగంబులు వర్జించి శుకునకు శిష్యుండై విజ్ఞానంబు గలిగి గంగాతరంగిణీతీరంబునం గళేబరంబు విడిచె వినుఁడు॥
(క॥ హరివార్తలెఱుఁగువారికి । హరిపదములు దలఁచువారి కనవరతంబున్ । హరికథలు వినెడువారికి । మరణాగతమోహసం
భ్రమము లేదనఘా॥ (క॥ శుభచరితుఁడు హరి యరిగినఁ । బ్రభవించి ధరిత్రి నెల్లఁ బ్రబ్బియుఁ గలి దా । నభిమన్యుసుతుని వేళను
బ్రభవింపక యడఁగియుండె భార్గవముఖ్యా॥ (వ॥ ఇవ్విధంబునఁ జతుస్సముద్రముద్రితాఖిలమహీమండలప్రాజ్యసామ్రా
జ్యంబు పూజ్యంబుగాఁ జేయుచు నాయభిమన్యుపుత్త్రుండు॥ (ఉ॥ చేసినఁగాని పాపములు సెందవు చేయఁదలంచినంతటన్
జేసెదనన్నమాత్రమునఁ జెందుఁగదా కలివేళఁ బుణ్యముల్ । మోసము లేదటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిన్ మరందముల్లాస
ముతోడఁ గ్రోలి విరులం దెగఁ జూడని తేఁటికైవడిన్॥ (వ॥ మఱియు బ్రమత్తులై యధీరులగు నరులయందు వృకంబు చందంబు
న నొడిగిలి యాచుకొనియుండి చేష్టించుఁ గాని ధీరులైనవారికిం గలివలని భయంబు లేదని కలిసంగంబు నొందింపఁ డయ్యె ననిన
విని ఋషులు సూతున కిట్లనిరి॥ (సీ॥ పౌరాణికోత్తమ బ్రతుకుము పెక్కేండ్లు తామరసాక్షుని ధవళయశము । మరణశీలుర
మయిన మాకెఱింగించితి కల్పితంబగు క్రతుకర్మమునఁ । బొగలచేఁ బొగిలియ బుద్ధివిశ్వాసుల మము హరిపదపద్మమధురరస
ముఁ । ద్రావించితి పినీవు ధన్యులమైతిమి స్వర్గమేని యనపవర్గమేని । భాగవతసంగలవభాగ్యఫలముకీడె । ప్రకృతిగుణహీనుఁ
డగు చక్రిభద్రగుణము । లీశకమలాసనాదులు నెఱుఁగలేరు । విని కివినఁ జాలము నియోడి వెట్టిగలఁడె॥ (క॥ శ్రీపంబులు ఖండిత
సం। తాపంబులు కల్మషాంధతమసమహాదిత్య। దీపంబులు పాపండము । రాపంబులు విష్ణువందనాలాపంబుల్॥ (క॥ పావన
ములు దురితలతా। లావనములు నిత్యమంగళప్రాభవసం। జీవనములు లక్ష్మీసం। భావనములు వాసుదేవపదసేవనముల్॥ (గీ॥
పరమభాగవతుఁడు పాండవపౌత్త్రుండు। శుకుని భాషణముల శుద్ధబుద్ధి । యైవిరాజమానుఁడై ముక్తియగు విష్ణు । పాదమూల
మెట్టుపడ సెననఘ॥ (వ॥ మహాత్మాపిచిత్ర యోగనిష్ఠాకలితంబు విష్ణుచరితలలితంబు పరమపుణ్యంబు సకలకల్యాణగుణగ
ణ్యంబు భాగవతజనాపేక్షితంబునైన పారీక్షితంబగు భాగవతాఖ్యానంబు వినుపింపుమనిన సూతుండిట్లనియె॥ (క॥ మిము బోఁ
టి పెద్దవారలు। కమలాక్షుని చరితమడుగఁగాఁ జెప్పెడి భా । గ్యము గలిగె నేఁడు మాజ । న్మము సఫలంబయ్యె వృద్ధమాన్యులమ
గుటన్॥ (క॥ కులహీనుఁడు నారాయణ। విలసత్కథనములు దగిలి వినుపింపినఁ ద। త్కులహీనతఁ బాసిమహా । జ్వలకులజ
త్వమును బొందు సన్మునులారా॥ (సీ॥ ఎవ్వని గుణజాల మెన్న జిహ్వలు లేక నళినగర్భాదులనంతుఁ డంద్రు । కోరెదు విబుధేం
ద్రకోటి నొల్లక లక్ష్మి ప్రార్థించె నెవ్వని పాదరజము । బ్రహ్మ యెవ్వని పాదపద్మంబు గడిగిన జలము ధన్యముఁ జేసె జగము నెల్ల ।
భగవంతుఁడని యెడి భద్రశబ్దమునకు నెవ్వఁడర్థాకృతి నేపు మిగిలె । నేమహాత్ము నాశ్రయించి శరీరాది । సంగకోటి నెల్ల సంహ
రించి । ప్రాభవమున మునులు పారమహంస్యంబు। నొందితిరిగి గాకయుందు రెలమి॥ (చ॥ క్రమమున మింటికై యెగయుఁగా
క విహంగము మింటి దైనపాఁ। రము గననేర్చునే హరిపరాక్రమ మోపినయంత గాక స । ర్వము వివరింప నెవ్వఁడు ప్రవర్తకుఁడౌ
మునులార నామది। త్తమునకు నెంతఁ గానఁబడెఁ దప్పక చెప్పెద మీకు నంతయున్॥ (క॥ వేదండపురాధీశుఁడు । కోదండము
చేఁబట్టి కొనిగహనములో । వేదండాదుల నొకనా । డేదండలఁ బోవనీక యొగి చెఱిబలిమిన్॥ (క॥ ఒగ్గములు ద్రవ్విపట్టుచు ।
నొగ్గెడు పెనుదెరల వలల నుగ్రమృగములన్ । డగ్గఱినఁ జంపు వేడుక । వెగ్గలమై చిత్తమందు వేఁటాడింపన్॥ (క॥ కోలముల గ

—— పరీక్షిన్మహారాజు వేఁటాడి శమీకమహాముని పై మృతసర్పము నెత్తినైచుట. ——

వయ వృక శార్దూలములఁ దరక్షు ఖడ్గ రోహిత హరిణంబులఁ । డాలముల శరభ చమర । వ్యాలముల వధించె భూభుజుఁడు వడి నోలమ్ములన్॥

(క॥ మృగయులు మెచ్చ నరేంద్రుఁడు। మృగరాజపరాక్రమమున మెఱసి హరించెన్ । మృగధరమండలమునఁగల । మృగమొకటి దక్క సర్వమృగముల నెల్లన్॥ (వ॥ ఇట్లు వాటంబయిన వేఁటతమకంబున మృగంబుల వెంటం దగిలి బుభుక్షాపిపాసలవల్ల మిగులం బరిశ్రాంతుండయి ధరణీకాంతుండు చల్లనినీటికొలంకులు గానక కలంగెడుచిత్తంబుతోఁ జనిచని యొక్కతపోవనంబు గని యందు॥ (సీ॥ మెలఁగుటఁ జాలించి మీలితనేత్రుఁడై శాంతుఁడై కూర్చుండి జడత లేక । ప్రాణమనోబుద్ధి పంచేంద్రియంబుల బహిరంగవీథులఁ బాఱనీక । జాగరణాదిక స్థానత్రయము దాఁటి పరమమై యుండెడి పదముఁ దెలిసి । బ్రహ్మభూతత్వసంప్రాప్తివిశ్రాంతుఁడై యతిదీర్ఘజటలు దన్నావరింప । నలఘురురుచర్మధారియై యలరుచున్న । తపసిఁ బొడఁగని శోషితతాలుఁడగుచు నెండిగడి లేనికుత్తుక నెలుఁగుడింక । నంకభాషల డగ్గరి మనుజవిభుఁడు॥ (క॥ తోయములు దెమ్ము మాకీ । తోయము వేఁటాడు వేళఁ దొల్లి వోడ నదీ । తోయము క్రియ జలదాహము । తోయము వారలును లేరు దుస్సహమనఘా॥ (వ॥ అని భూవరుండు శమీకమహాముని సమాధినిష్ఠుండును విస్మృతబాహ్యాంతరింద్రియకృతసంచారుండును హరిచింతాపరుండునయి యుండుటఁ జింతింపక॥ (ఉ॥ కన్నులు మూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుతనున్నవాఁడు చే । సన్నల నైన రమ్మనఁడు చాలజలంబులు దెచ్చిపోయఁడే । మున్నన లైనఁ జేయఁడు సముగ్రఫలంబులు వెట్టఁడింకసం । పన్నత నొందె నే తనతపశ్చరణాప్రతిమప్రభావముల్॥ (గీ॥ వారిఁ గోరుచున్న వారికి శీతల । వారి నిడుట యెట్టి వారికయిన । వారితంబు గాని వలసిన ధర్మంబు । వారియిడఁడు దాహవారి గాఁడు॥ (చ॥ అని మనుజేశ్వరుండు మృగయావసరాయతతోయదాహసంజనితదురంతరోషమున సంయమి దన్నుఁ దిరస్కరించి పూ । జనములు సేయఁడంచు మృతసర్పము నొక్కటి కంటికోపున । న్వనివడి తెచ్చి వైచె నటు బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్॥ (వ॥ ఇట్లతండు ప్రత్యాహృతబాహ్యాంతరింద్రియుండగుచు మీలితలోచనుండగు వోవునో యట్లుగాక గతాగతులగు క్షత్రబంధులచే నేమి యని మృషాసమాధినిష్ఠుండగునో వునో యని వితర్కించుచు వృథారోషదర్పంబున మునిమూఁపునఁ గతాసువయిన సర్పంబు నిడి నరేశ్వరుండు దనపురంబునకుం జనియె నంత సమీపవర్తులైన మునికుమారులు చూచి శ

—❀ శమీకమహామునిపుత్త్రుండగు శృంగిముని పరీక్షిత్తుని శపించుట. ❀—

మీకనందనుండైన శృంగికడకుం జని॥ (క॥ నరగంధగజస్యందన । తురగంబుల నేలు రాజు తోయాతురుఁడై । పరగన్నిజనకుని మెడ । నురగము వగిలించి పోయె నోడక దండ్రీ॥ (వ॥ అని పలికిన సమానవయోరూపమునికుమారలీలాసంగి యయిన శృంగి శృంగంబులతోడి మూర్తి ధరియించినట్లు విజృంభించి రోషసంరంభంబున నదరిపడి బల్యన్నంబుల భుజించి పుష్టంబులగు పరపుష్టంబులం బోలి బలిసి యద్వారంబులం గాచికొని యుండు సారమేయంబుల పగిది దాసభూతులగు క్షత్రియాధము లెట్లు బ్రాహ్మణోత్తములచే స్వరక్షకులుగ నిరూపితులయిరి యట్టి వారలెట్లు తద్గృహంబుల భాండసహితంబగు నన్నంబు భుజింపనర్హులగుదు రుతత్కృతంబులయిన ద్రోహంబు లెట్లు నిజస్వామిం జెందునని మఱియు నిట్లనియె॥ (ఉ॥ ఆడఁడు తన్ను దూషణము లాశ్రమవాసులఁ గాని వైరులం । గూడఁడు కందమూలములు గూడు గఁదించు సమాధిచిత్తుఁడై । వీడఁడు లోనిచూడ్కులను విష్ణుని దక్కఁ బరప్రపంచమున్ । జూడఁడు నస్సురుం ఘణిఁ జుట్టఁగ నేటికి రాచవానికిన్॥ (ఉ॥ పోము హిరణ్యదానములఁ బుచ్చుకొనం గథనంబు లేమియుమ్ । దేము సవంచనంబులు గదీవెనలిచ్చుచు వేసరింపఁగా । మా మువనంబులన్ గృహవిరాముల మైన వసింపఁ జెల్లరే । పాము మునుప వైవఁగాఁ దగునె బ్రహ్మమునీంద్రుభుజార్గళంబునన్॥ (క॥ పుడమిఁ గలజనులు వొగడఁగఁ । గుడుతురు గట్టుదురు గాక కువలయపతులై । యడవుల నిడుములఁ బడి మెడి । బడుగుల మెడఁ దగఁ దగునె పన్నగశవమున్॥ (క॥ భగవంతుఁడు గోవిందుఁడు । జగతిం బెడవాసి చనిన శాసింపంగాఁ । దగువరులు లేమి మగ్గను । లెగసి మహాసాధుజనుల నే చెదరకటా॥ (క॥ బాలకులార ధరిత్రీ । పాలకు శపియింతు నను చు బలువడి నిలో । లాలకుఁడగు ముని కుంజర । బాలకుఁ డరిగెం ద్రిలోకపాలకుల దరన్॥ (వ॥ ఇట్లు రోషించి కౌశికీనదికిం జని జలోపస్పర్శనంబు చేసి॥ (ఉ॥ ఓడక యింటికోపున మృతోరగముం గొనివచ్చి మా యుమా । టాడక యున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి ధర్మన । క్రీడఁ జరించు రాజు హరకేశవులొడ్డినఁ గానఁ జచ్చుఁబో । నేడవ నాఁడు తక్షకఫణీంద్రవిషానలహేతిసంహతిన్॥ (వ॥ అని శమీకమహాముని కుమారుండయిన శృంగి పరీక్షిన్నరేంద్రుని శపియించి నిజాశ్రమంబునకుం జనుదెంచి కంఠలగ్నకాకోదరుండయిన తండ్రిం జూచి॥ (క॥ ఇయ్యెడ నీకంఠమునకు । నియ్యురగశవంబుఁ దెచ్చి యిటు సేర్చిన మా । యయ్య నిఁక నేమి సేయుదు । నెయ్యంబులు లేవు సుమ్ము నృపులకుఁ దండ్రీ॥ (శా॥ ప్రారంభంబున వేఁటవచ్చి ధరణీపాలుండు మాతండ్రిపై । నేరంబేమియు లేక సర్పశవము న్నేఁడుగ్రుఁడై వైచినాఁ । డీరీతిన్ ఫణిక్రమ్మఁ బ్రతుకునో హింసించునో కోయన్ । రారే తాపసులార దీనిఁ దివరే రక్షింపరే మ్రొక్కెదన్॥ (వ॥ అని సర్పంబు దిగుచు నేర్పు లేక మెలుంగెత్తి విలపించుచున్న కుమారకురోదనధ్వని విని యాంగీరసుండయిన శమీకుండు సమాధిఁ జాలించి మెల్లన కన్నులు దెఱచి మూఁపున వేలుచున్న మృతోరగంబు నీక్షించి పారవైచి కుమారకుం జూచి॥ (క॥ ఏకీడు నాచరింపము । లోకులకు గామనము సర్వలో

వా। ర్ధిమునుంగక హరికూర్మరూపమునన ద్రిం గాల్పెఁ దత్పర్వత । భ్రమణవ్యాజత వీఁపుతీఁట శమియింపం జేయఁ గా నారదా. (వ॥ వెండియు నృసింహావతారంబు వినుము* (మ॥ సురలోకంబుఁ గలంచి దేవసమితిం బ్రాకిందియుద్యద్గదా।ధరుఁడై వచ్చు నిశాచరుం గనికనద్దంష్ట్రాంకురాళాస్య విస్ఫురితభ్రూకుటితో నృసింహాకృతి రక్షోరాజవక్షంబు భీ । కరభాస్వన్నఖరాజిఁ ద్రుంచెఁ ద్రిజగత్కల్యాణసంధాయియై ॥ ఆదిమూలావతారంబు సెప్పెద వినుము* (మ॥ కరినాథుం డుజలగ్రహగ్రహణదుఃఖక్రాంతుఁడై వేయువ। త్సరముల్ఘూర్ణిల్లుచునుండ వేల్పులకు విశ్వవ్యాప్తి లేకుండుటన్ । హరి నీవే శరణంబు నాకనినఁ గుయ్యాలించి వేవేగ వా । శ్చరముం ద్రుంచి కరీంద్రుఁ గాచెను హితోత్సాహంబునం దామసా ॥ మఱియును వామనావతారంబు వినుము* (సీ॥ యజ్ఞేశ్వరుండను హరివిష్ణుఁడదితిసంతానంబునకు నెల్లఁ దమ్ముఁడయ్యెఁ । బెంపారగుణములఁ బెద్దయై వామనమూర్తితో బలిచక్రవర్తిఁ జేరి । తద్భూమి మూఁడు పాదమ్ములనడిగి పదత్రయంబున నుజగత్త్రయంబు । వంచించికొనియెను వాసవునకు రాజ్యమందింప నీశ్వరుఁడయ్యు మెఱఁగి । యర్థికి నంబు గైకొని యడుగవలసె। ధార్మికుల సొమ్ము వినయోచితమునఁ గాని। వెడఁగుతనమున నాకవిగ్రహించి। బలనయించింప రామునిశ్చయము పుత్ర* (చ॥ బలి నిజమౌళి నవ్వటుని పాదసరోరుహభవ్యతీర్థము । తక్కలిక ధరించి తన్ను నుజగత్త్రయముం హరికిచ్చి కీర్తుల । న్నిలిపె వసుంధరాస్థలి నిర్జరలోకవిభుత్వహానికిం। దలఁకక శుక్రుమాటలకుఁ దారక భూరివదాన్యశీలుఁడై* (వ॥ మఱియును పరమేశ్వరుండు నారదానికి హంసావతారంబునొంది యతిశయభక్తియోగంబున సంతుష్టాంతరంగుండగుచు నాత్మతత్త్వప్రదీపకంబగు భాగవతమహాపురాణంబుపదేశించె మన్వవతారంబునొంది స్వకీయ తేజఃప్రభావంబున నప్రతిహతంబైన చక్రంబు ధరియించి దుష్టవర్తనులైన రాజుల దండించుచు శిష్టపరిపాలనంబు సేయుచు నాత్మీయకీర్తిచంద్రికలు సత్యలోకంబున వెలింగించె. మఱియు ధన్వంతరియననవతరించి తననామస్మరణంబున భూజనంబులకు సకలరోగనివారణంబు సేయుచు నాయుర్వేదంబు కల్పించె వెండియు పరశురామావతారంబు వినుము* (మ॥ ధరణీకంటకులైన హైహయనరేంద్రవ్రాతముం భూరివి। స్ఫురితోదారకుఠారధారఁ గలనన్ముయ్యేడుమాఱుల్పోరిం బోరి మర్దించి సమస్తభూతలము విప్రశ్రేణికిఁ గానిచ్చెఁ వాఁ । జిరకీర్తిం జమదగ్నిరాముఁడనఘుం డెలఁ దాపసేంద్రోత్తమా* (వ॥ మఱియు శ్రీరామావతారంబు సెప్పెద వినుము* (సీ॥ తోయజహితవంశదుగ్ధపారావారరాకాహిమాంశుకైరవహితుండు । కమనీయకోసలక్ష్మాభృత్సుతాగర్భశుక్తిసంపుటలసన్మౌక్తికంబు । నిజపాదసేవకవ్రజదుఃఖనిబిడాంధకారవిస్ఫురితపతంగుఁడు హసఖుఁడు । దశరథేశ్వరకృతాధ్వరవాటికాప్రాంగణాకరదేవతానోకహంబు । చటులదానవగహనవైశ్వానరుండు। రావణాటోపశైలపురందరుండు । నగుచు లోకోపకారార్థమవతరించె। రాముఁడై చక్రి లోకాభిరాముఁడగుచు* (క॥ చిత్రముగ భరతలక్ష్మణ । శత్రుఘ్నులకర్థి నగ్రజన్ముండగుచున్ । ధాత్రిం రాముఁడు వెలసెం బవిత్రుఁడు దుష్కృతలతాలవిత్రుండగుచున్ ॥ అంత* (సీ॥ కిసలయఖండేందుబిసకుందపద్మాస్త్రపదఫాలభుజరదపాణినేత్రఁ । గాహళకరభచక్రవియత్పులినశంఖజంఘోరుకుచమధ్యజఘనకంఠ । ముకురచందనబింబశుకగజశ్రీకారగండగంధోష్ఠవాగ్గమనకర్ణ । జంపకేందుస్వర్ణశంపాధనుర్నీలనాసికాస్యాంగదృగ్భ్రూశిరోజ। నలిసుధావర్తకుంతలహాసనాభి । కలితజనకావనీపాలకన్యకాలలామఁ బరిణీతుఁడయ్యె లలాటనేత్ర। కార్ముకధ్వంసమునుఁ గువగాఁగ నతఁడు॥ అంత* (క॥ రాముస్మేచకజలద।శ్యాముస్సుగుణాభిరాము సదైవ్యభవము। త్రాముం గనుష్టనిశాటవి । రాముఁ బొమ్మనియెం బఙ్క్తిరథుఁ డడవులకున్* (చ॥ అనుదుగలక్ష్మణుండు జనకాత్మజయుం దనతోడ నేగ దే। నరిగి రఘూత్తముండు ముదమారఁగఁ జొచ్చెఁ దరక్షుసింహసూ । కరకరిపుండరీకకపిఖడ్గకురంగవృకాహిభల్లకా। సరముఖవన్యసత్త్వచయచండతగాటపదండకాటవిన్* (క॥ ఆవనమున వసియించి నృ।పావననయశాలి యిచ్చె నభయము లుజగ। త్పావనమునిసంతతికిఁ గృ । పావననిధియైన రామభద్రుం డెలమిన్* (క॥ ఖరకరకులజలనిధిహిమ।కరుఁడగు రఘురాముఁ విభుఁడు గలకటికోదన్ । ఖరుని వధించెను ఘనభీ। కరశరముల నఖిలజనులుగర మరుదందన్* (క॥ హరిసుతుఁ బరిచరుఁ గాఁగొని।హరిసుతుఁ దునుమాడి పనిచె హరిపురమునకున్ । హరివిభునకు హరిమధ్యమ।హరిరాజ్యపదంబు నిచ్చె హరివిక్రముఁడై* (వ॥ అంత సీతానిమిత్తంబునం ద్రిలోకకంటకుండగు దశకంఠుం దునుమాడుటకునై కపిసేనాసమేతుండై చని దుర్గమంబయిన సముద్రంబు దెరువుఁ జూపకున్న నలిగి* (మ॥ వికటభ్రూకుటిఫాలభాగుఁడగుచున్వీరుండు క్రోధా

హరిసుతున్-సూర్యపుత్రుఁడగు సుగ్రీవుని । పరిచరుఁగాఁగొని-సహచరునిఁగాఁ జేకొని । హరిసుతున్-ఇంద్రపుత్రుఁడగు వాలిని । దునుమాడి-చంపి హరిపురమునకున్-యమపురమునకు। పనిచెన్-పంపెను । హరివిభునకున్-వానరరాజగు సుగ్రీవునకు । హరిమధ్యమ-సింహపు నడుమువంటి నడుముగల తారను । హరిరాజ్యపదంబు నిచ్చెన్ - వానర రాజ్యము నిచ్చెను । హరివిక్రముఁడై - విష్ణుస్వరూపుఁడగు శ్రీరాముఁడు పరాక్రమవంతుఁడయి. ధర్మ-న్యాయము। విల్లు. ఖర - తీక్ష్ణము।ఖరాసురుఁడు. పుణ్యజన - పుణ్యపురుషులు। రాక్షసులు. అవన-రక్షణము, విభీషణుఁడు-వెరపు గలవాఁడు। రావణుని తమ్ముఁడు.

రుణాం। బకుఁడై చూచినయంతమాత్రముననప్పాథోధిసంతప్తతో । యకణగ్రాహతిమింగిలప్లవధులీవ్యాళప్రవాళోర్మికా। వరకారండవచక్రముఖ్యజలసత్త్వశ్రేణితోఁ గింకినన్* (వ॥ అయ్యవసరంబున సముద్రుండు కరుణాసముద్రుండగు శ్రీరామభద్రుని శరణంబు సొచ్చి సంగరుణించియప్పటియట్లు నిలిపినలునిచే సేతువుబంధించి తన్మార్గంబునఁ జని* (మ॥ పురముల్ మూఁడును నొక్కబాణమున నిర్మూలంబు గావించు శం । కరుచందంబున నేర్పు రాఘవుఁడు లంకాపట్టణంబిద్ధగో । పురశాలాంగణహర్మ్యరాజభవనప్రోద్యత్ప్రతోళీకవా। టరథాశ్వద్విపశస్త్రమందిరనిశాటశ్రేణితోఁ ద్రెవ్వెల్మిడిన్* (క॥ రావణునఖిలజగద్వి ద్రావణుఁ బరిమార్చి నిలిపె పెరత్లోకభుఁగా। రావణునను జన్మునినై। రావణసితకీర్తి మెఱసి రాఘవుఁ డెలమిన్* (సీ॥ ధర్మసంరక్షకత్వప్రభావుండయ్యు ధర్మవిధ్వంసకత్వమునఁ బొడలి । ఖరదండనాదిముఖ్యతఁ బొంకకుండియు ఖరదండనాదిముఖ్యతను మెఱసి । పుణ్యజనావనస్ఫూర్తిఁ బెంపొందియుఁ బుణ్యజనాంతకస్ఫురణఁ దనరి । సంతతాశ్రితపభీషణుఁడు గాకుండియు సంతతాశ్రితవిభీషణత నొప్పి । మించితనకీర్తిచేత వాసించె దిశలు। దరమె నుతియింప జగతి నెవ్వరికినైనఁ । జారుతరగమూర్తి నవనీశచక్రవర్తిఁ బ్రకటగుణసాంద్రుఁ దశరథరామచంద్రు* (వ॥ అట్టి రామావతారంబు జగత్పావనంబు సమస్తప్రసాదకారణంబునై నుతికెక్కె నింకఁ గృష్ణావతారంబు వివరించెద వినుము* (సీ॥ తాపసోత్తమ వినుదైత్యాంశములఁ బుట్టినరనాథులఁ గులసేనాసమేతులగుచు ధర్మేతరులై ధాత్రిఁ బెక్కుబాధలనలయించుట ధరణివగలఁ । బొంపుచువాపోవ భూభారముడుపుటకై హరి పరుఁడు నారాయణుండు। చెచ్చెఱఁ దనసితాసితకేశయుగమున బలరామకృష్ణరూపములఁ దనరి । యదుకులంబున లీలమైనుదయమయ్యె। భవ్యయశుఁడగు వసుదేవు భార్యలైన। రోహిణియు దేవకియు ననురూపవతుల । యందు నున్మత్తదైత్యసంహారియగుచు* (వ॥ ఇట్లు పుండరీకాక్షుండగు నారాయణుండు సమస్తభూభారనివారణంబు సేయందనమేని కేశద్వయంబ చాలునని యాత్మప్రభావంబుఁ దెలుపుకొనుటకు నిజకళాసంభవులైన రామకృష్ణదేహవర్ణంబులు శ్వేతకృష్ణంబులని నిర్దేశించు కొఱకు సితాసితకేశద్వయవ్యాజంబున రామకృష్ణాఖ్యులనలరి యవతరించె నందు భగవంతుండు సాక్షాద్విష్ణుండునైన కృష్ణుండు జనమార్గవర్తియయ్యు నతిమానుషకర్మంబుల నాచరించుటం జేసి కేవలపరమేశ్వరుండయ్యె నమ్మహాత్ముండాచరించు కార్యంబులు లెక్కవెట్ట నెవ్వనికి నలవిగాదయినను నాకుఁ గోచరించినంతయు నెఱింగించెద వినుము* (క॥ నూతనగరళస్తనియగు । పూతనఁ బురిటింటిలోనఁ బొత్తులశిశువై । చేతనములఁ హరియించిన। కేతనగరమునసహననిచెఁ గృష్ణుఁడు పెలుచన్* (క॥ వికటముగ నిజపదాహతిఁ బ్రకటముగా మూఁడు నెలల బాలకుఁడైయా । శకటనిశాటుని సంశక। నికటస్థునిఁ జేసె నిభక్తనికగావనుఁడై* (క॥ ముద్దులకొమరుని వ్రేఁతల। గద్దులకై తల్లి రోలఁ రజ్జునఁ గట్టం। బద్దులకు మిన్నుముట్టిన । మద్దులవడిఁ గూల్చె జనసమాజము వొగడన్* (మ॥ మదిఁ గృష్ణుండు యశోదబిడ్డఁడని నమ్మం జాలరా యోగీంద్రత। ద్వదనాంభోజములోఁ జరాచరసమస్తప్రాణిజాతాటవీ । నదనద్యద్రిపయోధియుక్తముగ నాన్లోకజాలంబు భా । స్వదమానక్రియఁ జూపెఁ దల్లికి మహాశ్చర్యంబు వాటిల్లఁగన్* (చ॥ వరయమునానదీహ్రదనివాసకుఁడై నిజవక్త్రనిర్గత । స్ఫురితవిషాంబుపానమున భూజనులన్ మృతిఁ బొందఁ జేయు భీ । కరగరళద్విజిహ్వుఁ డగు కాళియపన్నగు నాహ్రదంబుఁ జె । చ్చెర వెడలించి కాచె యదుసింహుఁడు గోపకగోగణంబులన్* (మ॥ తనయాగోపకలోకము ల్రాతిరి నిద్రం జెందఁ గార్చిచ్చువ। చ్చినఁ గృష్ణా మమునగ్నిపీడితుల రక్షింపం దగుం గావవే। యనినం గన్నులు మీరు మోడ్పుఁడిదె దావాగ్నిన్ వెసన్నార్తునే । ననవారట్లొనర్ప భ్రమింగె శిఖిఁ బద్మాక్షుండు లీలాగతిన్* (క॥ ముందునిగతియము నాంబువు। లందునిశిం గ్రుంకి బద్ధుఁడై నికటనయా । నందుని వరుణుని బంధన। మందు నివృత్తునిఁగఁ జేసె హరి సదయుండై* (మ॥ హయసూనుండగు దానవుండు నిజమాయన్ గోపరాజిన్ గుహా । శ్రయమానట్లొనరించి తత్పథము నీరంధ్రంబు గావించినన్ । రయమొప్పన్ గుటిలాసు రాధమునిఁ బోరన్ ద్రుంచి గోపావళిన్ । దయతోఁ గాచిన కృష్ణు సన్మహిమ మేతన్మాత్ర మే తాపసా** (క॥ దివిజేంద్రప్రీతిగవ । ల్లవజను లేఁటేఁటఁ జేయు లాలితసవనో । త్సవము హరి మానిపిన గోపవరులు గావింపకున్న బలరిపుఁడలుకన్* (గీ॥ మందగొంపలవంచనమంచవృష్టిఁ । గ్రందుకొనఁ డంచు నింద్రుండు మంచనెంపఁ। చండపవనసముద్ధూతచటులవిలయ। సమయసంవర్తకాభీలజలధరములు* (శా॥ సప్తస్కంధశిఖాకలాపపటుచిమత్సౌదామనీవల్లికా । దీప్తోదగ్రముహుర్ముహుస్తనితధాత్రీభాగనీరంధ్రమై । సప్తాశ్వస్ఫురదిందుమండలనభస్సంఛాదితాశాతర। వ్యాప్తాంభోదనిగళ్ళస్ఫుటశిలావాఃపూరధారాళమై* (వ॥ అట్లు కురియు వానజల్లు పెల్లున ఱిమ్మలుగొని సొమ్ములువోయి సొమ్మసిలు గోపగోకులంబు బాకులంబునొంది కృష్ణకృష్ణ రక్షింపుమనియార్తింబొంది మొఱ్ఱయిడ నయ్యఖండకరుణారససముద్రుండు భక్తజనసురద్రుముండునగు పుండరీకాక్షుండు* (శా॥ సప్తాబ్దంబుల బాలుఁడై నిజభుజాస్తంభంబునన్ లీలతో । సప్తాహంబులు శైలరాజము లసచ్ఛత్రంబుగాఁ దాల్చి సం । గుప్తప్రాణులఁ జేసె మాధవుఁడు గోగోపాలకవ్రాతముల్ । సప్తాంభోధిపరీతభూధరున కాశ్చర్యంబెచింతింపఁగన్* (సీ॥ సాంద్రశరచ్చంద్రచంద్రికాధవళితవిమలబృందావనవీథియందు। రాసకే

శైలా హాలాహలంద్రై యుశ్శల్ల జలజాతముఁడొకనిశాసనయమునను । దనరారు నంద్ర మధ్యను తారకలనింపుడఘుకొ త్త
రాగభేదములఁ జెలఁగి । ధైవతబుషభ గాంధారనిషాదపంచమ షడ్జమధ్యమ స్వరములు లోలిఁ । గళలుజాతులు మూర్ఛనల్ గ
లుగ వేణు । నాళవివరాంగుళి న్యాసలాలనమున । మహితగతిఁ బాడెనవ్యక్తమధురముగను । బంకజాతుండు దారువులంకురిం
ప* (మ॥ హరి వేణూన్నతమంజులస్వననినాదాహూతలై గోపసుం । దరు లేవేరథ నాథిపాను చరగంధర్వాంశుగొంబోవఁడ ।
త్తురుణుల్వుర్యుడశంఖ చూడునిభుజాదర్పంబు మాయించి తాఁ । బరిరక్షించినయట్టికృష్ణునినుతింపన్ శక్యమే యేరికిన్* (చ॥ న
రకమురప్రలంబ యమనస్వివముష్టికమల్లకంసశం । బగశిశుపాలకంవజనపౌండ్రకపిప్పలకంతవక్త్రవా । నరకఖరసాల్వవత్స
బకనాగవదూనకముక్మి కేశిద । ర్దురగవృషధేనుకప్రముఖమత్తనిశాటులఁద్రుంచె ద్రేల్మిడిన్ ॥ మఱియును* (మ॥ బలభీమార్జున
ముఖ్యచాపధరరూపవ్యాజతంత్రముసలన్ । ఖలులన్ సప్తధరాతలేశ్వరులసంగ్రామైకపారీణ దో । ర్బలకేళిం దునుమాడి సర్వ
ధరణీభారంబు మాయించి సా । ధులరక్షించినయట్టికృష్ణున నంతుంగొల్తునెల్లప్పుడున్* (వ॥ అట్టి లోకోత్కృష్టుండైన కృష్ణు
నియవతారమాహాత్మ్యంబెఱింగింతు నీకింక వ్యాసావతారంబు వినుము* (చ॥ ప్రతియుగమందు సంసదితభావులునల్పతరా
యులౌనప । దతిమలునైన మర్త్యులకగమ్యములై స్వకృతంబులై శుశా । శ్వతములునైన వేదతరుశాఖలుదాఁ విభజించినట్టి స
న్నుతుఁడు పరాశరప్రియతనూజుఁడనన్ హరినవ్వుగ్రైవర్తి మిన్ ॥ మఱియుబుద్ధావతారంబు వినుము* (మ॥ అతిలోలాత్ములసూ
నృతోక్తులునవేదాచారసంశీలురు । ద్ధతపాషండమతౌపధర్మ్యలుజగత్సంహారులై నట్టియా । దితిసంజాతులధర్మనాశనలవ
ర్తింపందదాచారసం । హతిమాయించి హరించెదానవులఁ బ్రహ్మాత్ముండు బుద్ధాకృతిన్ ॥ మఱియుం గల్క్యవతారంబు వినుము॥
(మ॥ వనజాక్షుస్స్వకథామయంబులైన ఆవషట్స్వాహా స్వధావాక్యశో । భనహీనుల్గరి వాస్యతోక్తిపరులై పాషండులైనన ।
వని కాయంబును శూద్రభూపులగలిన్ భాసిల్లి నంగల్కియై । జననం బందియధర్మమెల్లనడఁచున్ స్థాపించుధర్మంబులన్* (వ॥
అనిమఱియుఁ బితామహుండు నారదునకిట్లనియె, మునీంద్రా పుండరీకాక్షుండంగీకరించు లీలావతారకథావృత్తాంతంబునే
నీకు నెఱింగించునంతకుమున్న హరివరాహాదియవతారంబులంగీకరించి తత్ప్రయోజనంబులు దీర్చె. మన్వంతరావతారం
బునంగీకరించినవియు నంగీకరింపంగలయవియునైయున్నవి. వర్తమానంబున ధన్వంతరి పరశురామావతారంబులు దాల్చి
యున్నవాఁడు, భావికాలంబున శ్రీరామాద్యవతారంబుల నంగీకరింపంగల వాఁడమ్మహాత్ముండు సృష్ట్యాదికార్యభేదంబుల
కొఱకు మాయాగుణావతారంబునొందు బహుశక్తిధారకుండయిన భగవంతుండు సర్గంబునందపంబేను ఋషిగణంబులును
ప్రజాపతులునై యవతరించి విశ్వోత్పాదనంబు గావించు విష్ణుండు ధర్మంబుయజ్ఞంబులు మనువులింద్రాది దేవగణంబులు ధా
త్రీపతులునయి యవతరించి జగంబుల రక్షించుచుండు, అధర్మంబు గ్రుండు మహోరగంబులు రాక్షసానీకంబులునై విల
యంబునొందించునని త్రైలింగునం బరమేశ్వరుండు సర్వాత్మకుండునైన హరి విశ్వోత్పత్తిస్థితిలయ హేతుభూతుండై విలసించు
ధరణీరేణువులనైన గణుతింపనలవియగుంగాని యమ్మహాత్ముని లీలావతారాద్భుత కర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికి నశక్యంబై
యుండు నీకు సంక్షేపరూపంబులనుపన్యసించితి సవిస్తరంబుగా నెఱింగింప నాకుం దరంబుగాదన్యులం జెప్ప నేలవినుము* (చ॥
అసురఁ ద్రివిక్రమస్ఫురణనందినయమ్మహితాత్ము పాదవే । గమునహతంబులై నత్రిజగంబుల కావలనొప్పు సత్యలో । కము చలి
యించి నంగరుణగైకొని తా ధరించు పాదపద్మముతుదినున్న యప్రతిహతంబగు శక్తిగణింపశక్యమే* (మ॥ హరిమాయాబ
లమెఱుంగ నట శక్యంబే సనందాదిప । త్పురుషానీకిని కైన బుద్ధినితంబున్ మానిసేవాధిక । స్ఫురణం దచ్చరితానురాగగుణవి
స్ఫూర్తిన్ సహస్రాస్యసం । దరతన్ బొల్పగు శేషుఁడు న్దెలియఁడన్నన్ జెప్ప వేరొండొరుల్* (చ॥ ఇతరము మాని తన్ను ను
దినెంతయు నమ్మి భజించువారినా । శ్రితజనసేవితాంఘ్రిసరసీరుహుఁడైన సరోజనాభుఁడం । చితదయతోడ నిమ్మ పటచిత్త
మునం గరుణించు నట్టివారితులదురంతమైనతనరునవ్విభుమాయఁ దరింతు రెప్పుడున్* (వ॥ మఱియును సంసారమగ్నులయి
దివసంబులు గడపి యంతంబున శునకసృగాలభక్ష్యంబులయిన కాయంబులందు మమత్వంబు సేయక భగవదర్పణంబు సే
నపుణ్యాత్ములు కొందఱుగల రెఱింగింతు వినుమేను నీ బ్రహ్మత్వంబు నం జెందు రాజసంబు విడిచియమ్మహాత్ముని పాదారవిందం
బుల భక్తినిష్ఠుండనై శరణాగతత్వంబున భజియించునప్పుడు దెలియుదు, రాజసగుణుండనై నఁ దెలియఁజాల, శాస్త్రంబులు
ప్రపంచింపక కేవలభక్తిజ్ఞానయోగంబున సేవింతు మఱియు సనకాదులగు మీరును, భగవంతుండైన రుద్రుండు, దైత్యపతియై
న ప్రహ్లాదుండు, స్వాయంభువమనువు, నతనిపత్నియగు శతరూప యుఁ, దత్పుత్రులగు ప్రియవ్రతోత్తానపాదులను వారలుఁ, న
త్పుత్రికలు, ప్రాచీనబర్హియు, ఋభువు, వేనజనకుండగు నంగుండు, ధ్రువుండును, గడువ జాలుదురు వెండియు* (సీ॥ గాధిగ
యానుల్విరూప్యాకుఁడలిపమాంధాతలు భీష్మయయాతిసగర । రఘుముచుకుందైళరంతిదేవోద్ధవసారస్వతోదంకభూరిషేణ ।
శ్రుతదేవమారుతిశతధన్వపిప్పలబలివిభీషణశిబిపార్థవిదుర । లంబరీషపరాశరాలర్క సౌభరిదేవలమిథిలేశ్వ రేంద్రదత్త

లాష్టిఁ బొందినాముఖ్యనమహాత్ములెల్లమిఁ దవిలి యద్దేవుభక్తిఁ జిత్తములఁ నిలిపి। తత్పరాయణభక్తి సన్నాంతమయిన। ప్రణ్ణనాయి దరింతురు విమలమతులు* (మ॥ అనఘా వీరల నెన్న నేమిటికిఁ దిగ్వ్యగ్రంశు సంతానప। ఙ్క్తిశాటాటపికాఘుజీవనివహ స్త్రీశూద్ర హూణాదులై। ఘను నారాయణభక్తియోగమహితానందాత్ములై రే సివా। తనయంబుల్ దరియింతురవ్విభుని మాయావై భవాంభోనిధిన్॥ కావున* (క॥ శశ్వత్ప్రశాంతు నభయుని। విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు విభు సంశుద్ధున్। శాశ్వతుఁ సదసత్పా లకు నీశ్వరుఁ జిత్తమున నిలుపు మెపుడు మునీంద్రా* (వ॥ అట్లయినఁ నప్పణ్యాత్ములు ననవద్యశీలురు నపద్యలజ్జావనత వదనవైఖరి దంజాలకవై ముఖ్యంబు నందవ్వుదవ్వులం డలంచి పోవునట్టియు * (చ॥ హరిఁ బరమాత్మ నచ్యుతు ననంతునిఁ జిత్తమునం దలంచి సు। స్థిరతపశ్శోకసౌఖ్యములఁ జెందినధీనిధులన్యకృత్యముల్। మరులునఁ జేయనొల్లరు తలంచిన నట్టి నయాను రేంద్రుఁ డుం। బరువడి నయ్యెఁ దద్వ్రతుని పానకభిస్త్రము మానుకై వడిన్* (ఉ॥ సర్వఫల ప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వశక్తుఁ డు। సర్వజగత్ప్రసిద్ధుఁడును సర్వగతుండగు చక్రపాణియా। సర్వశరీరులున్ గమనసంగతిఁ జెందివిశీర్యమాణులై। పర్విన చో నభంబుగతి బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్* (ఉ॥ కారణకార్యహేతువగు కంజదళాక్షుని కంటె నన్యులె। వ్వారును లే రుతం డఖిలభగవంతు ననంతు నిపశ్వభావనో। దారుని సద్గుణావళులు దాత్తమతిన్ గొనియాడ కుండినన్। జేపుచిత్తముల్ ప్రవృ త్తిఁ జెందనిస్సర్గుణమైన బ్రహ్మమున్* (మ॥ నిగమార్థప్రతిపాదకప్రకటమై నిర్వాణ సంధాయి గా। భగవంతుండు రచింపఁ భాగ వతకల్పద్రుమమై శాస్త్రరాజి దరిద్రంబగు నీపురాణకథసంక్షేపంబుగాఁ జెప్పితిన్। జగతిన్ని పుర దింపుదీని నతివిస్తారంబుగాఁ బుత్రకా* (చ॥ పురుషభవంబునొంద టయుఁ బూర్వపుజన్మములం దెమీఁదభూ। సురకులనంబు పుట్టుటలు చోద్యములిట్లగు టన్మనుష్యుల। స్థిరమగు కార్యదుర్దశలచేత నశింపక విష్ణుసేవనా। పరతఁ దనర్చి నిత్యశుభవ్యపథంబును నొందఁ టొప్పదే* (మ॥ ఉపవాసవ్రతశౌచశీలనఖసంధ్యోపాసనాగ్నిక్రియా। జపదానాధ్యయనాదికర్మముల మోక్షప్రాప్తి సేకూరదు। చ్చ పుభక్తిన్ హరిఁ బుండరీకనయనున్ సర్వాత్మ శాయిన్ రమా। ధిపుఁ బాపఘ్నుఁ బరేశు నచ్యుతుని నర్థిం గొల్వ లేకుండినన్* (క॥ వనజాక్షుమహిమ నిత్యము। వినుతించుచు నోరులు పెగడకను చున్మదిలో। నను మోదించుచునుండెడు। జనములు తన్మాయవ శతఁ జనరు నరేంద్రా* (క॥ అని వాణీశుఁడు నారద। మునివరునకుఁ జెప్పినట్టిముఖ్యకథాసూ। చనమతిభక్తిఁ బరీక్షి। జ్జనపాలుని

—— పరీక్షిన్మహారాజు శుకయోగినిఁ బ్రపంచోద్భవాదిప్రశ్నించుట. ——

తోడ యోగిచంద్రుఁడు నుడివెన్* (సీ॥ విను శుకయోగికి మనుజేశుఁ డట్లను మునినాథ దేవదర్శనము గలుగు। నారదమునికిఁ బం కేరుహభవుఁ డెఱిఁగించిన తెఱఁగు సతృప్తపదలిర్ప। గణుతింపసత్త్వాదిగుణశూన్యుఁడగు హరికన లాక్షులోక నుఁగళ ముల యిన। కథలు నా కెఱిఁగింపఁ గైకొని నిస్సంగమైన నాహృదయాబ్జమం దఁ గృష్ణు। భవ్యచరితుని నాద్యంతభావశూన్యుఁ। జిన్మ యాకారు ననఘు లక్ష్మీసమేతు। నిలిపి యస్థిరశుభంబు నిఖిలహేయ। భాజనంబైన యీకళేబరము విడుతు* (వ॥ అదియునుం గాక యెవ్వఁడు శ్రద్ధాభక్తియుక్తుండై కృష్ణుగుణకీర్తనంబులు వినుచుంబలుకుచుండునట్టి వానిహృదయపద్మంబునందుఁ గర్ణ రంధ్రమార్గంబున బ్రవేశించి కృష్ణుండు విశ్రమించి సలిలగతంబైన కలుషంబు నుశరత్కాలంబు నివారించుచందంబున నా త్మగతంబైన మాలిన్యంబు నపకర్షించుఁ గావున* (మ॥ భరితోదగ్రనిదాఘతప్తుఁడగు నప్పాంథుండరణ్యాదిసం। చరణక్లేశస ముద్భవంబగు పిపాసం జెందియాత్మీయమం। దిరము జేరి గతశ్రముండగుచు నెందే సిన్నగన్ లేనిభం। గిరమాధీశుపదారవింద యుగసంగీభూతుఁడై మాను నే* (వ॥ అదియునుం గాక సకలభూతసంసర్గశూన్యంబయిన యాత్మకు భూతసంగమంబే ప్రకా రంబుగలిగెనదిని నిర్నిమిత్తంబున జేసియో, కర్మంబున జేసియో, యాక్రమంబు నా కెఱిఁగింపుము* (సీ॥ ఎవ్వని నాభియం దెల్ల లోకాంగసంస్థానకారణపంకజంబు వొడమె। నంకుదయించి సర్వావయవస్ఫూర్తిఁ దనరారునట్టి పితామహుండు। గ డఁగి యెవ్వని యనుగ్రహమున నిఖిలభూతముల సృజించె నుతకాంతతోడ। నట్టి విధాత మేయనువున సర్వేశు రూపంబుగనుఁ గొనెను దిరభంగి। నాపరంజ్యోతియైనపద్మాక్షునకును। నళినజునకుఁ బ్రతీకవిన్యాసభావ। గతులవలనను భేదంబు గలదె చెపు ము। యతిదయాసాంద్రయోగికులాబ్ధిచంద్ర* (వ॥ మఱియును భూతేశ్వరుండయిన సర్వేశ్వరుండుత్పత్తిస్థితిలయకారణం బైన తనమాయను విడిచి మాయానియామకుండై యేయే ప్రదేశంబుల శయనంబు సేసె నదియునుం గాక పురుషావయవంబు లచేఁ బూర్వకాలంబున లోకపాలసమేతంబులయిన లోకంబులు కల్పితంబులయ్యె ననియు, లోకంబులు పురుషావయవంబుల నియుం జెప్పంబడియె నదియునుం గాక మహాకల్పంబులు, నవాంతరకల్పంబులును, భూతభవిష్యద్వర్తమానకాలంబులు, స్థూ లదేహాభిమానులై జనియించిన దేవపితృమనుష్యాదులకుం గలుగు నాయుఃప్రమాణంబు, మహత్స్వాత్మకాలానువర్తనంబు, నేనేకకర్మంబులం జేసి జీవులే యేలోకంబుల నొందుదురు. మఱియు నేనేకకర్మంబులం జేసి దేహాదికర్మశరీరంబులం బ్రాపింతు రట్టికర్మమార్గప్రకారంబు, సత్త్వాదిగుణంబుల పరిణామంబులగు దేవాదిరూపంబులం గోరు జీవులకు నేనేకకర్మసముదాయం

బెట్టుసేయుండగు, నెవ్వనికినర్పింపంగు నవియెవ్వనిచేత గ్రహింపంబడు భూషాతాళ కకుబ్వ్యోమగ్రహనక్షత్రపర్వతంబులు, సరిత్సముద్రద్వీపంబులు నేప్రకారంబున సంభవించె, నాయాస్థానంబునం గలవారి సంభవంబు లేలాటివి, బాహ్యాభ్యంతరంబులం గలుగు బ్రహ్మాండప్రమాణం బెంత, మహాత్ములచరిత్రంబు లెట్టివి, వర్ణాశ్రమవినిశ్చయంబులు, ననుగతంబులైయాశ్చర్యావహంబులగు హరియవతారచరిత్రంబులు, యుగంబులు, యుగప్రమాణంబులుఁ, బ్రతియుగమందును మనుష్యులకేయేధర్మంబు లాచరణీయంబులు, మనుష్యకర్తవ్యంబులగు సాధారణధర్మంబులు, విశేషధర్మంబులు జాతివిశేషధర్మంబులు, రాజర్షిధర్మంబు, లాపత్కాలజీవనసాధనభూతంబులగు ధర్మంబులు, మహదాదితత్వంబులసంఖ్యయు సంఖ్యాలక్షణంబు, నాతత్వంబులకు హేతుభూతలక్షణంబు, భగవత్సమారాధనవిధంబు, నష్టాంగయోగక్రమంబు, యోగీశ్వరులయణిమాద్యైశ్వర్యప్రకారంబు, వారలయర్చిరాదిగతులు, లింగశరీరవిలయంబు, ఋగ్యజుస్సామవేదంబులు నుపవేదంబులైనయాయుర్వేదాదులు, ధర్మశాస్త్రంబులు, నితిహాసపురాణంబులసంభవంబు, సర్వభూతంబులయవాంతరప్రళయంబు, స్థితిమహాప్రళయంబులు, నిష్టాపూర్తంబులనుయాగాదివైదికకర్మజాలంబును, వాపీకూపతటాక దేవాలయాదినిర్మాణంబులన్నదానంబారామప్రతిష్ఠ మొదలగు స్మార్తకర్మంబులుఁ, గామ్యంబులైన యగ్నిహోత్రంబులయనుష్ఠానప్రకారంబు, జీవసృష్టియు, ధర్మార్థకామంబులనియెడు త్రివర్గాచరణప్రకారంబు, మలినోపాధికపాషండసంభవంబు, జీవాత్మబంధమోక్షప్రకారంబు, స్వరూపావస్థానవిధంబు, సర్వస్వతంత్రుండయిన యీశ్వరుం డాత్మమాయం జేసి సర్వకర్మసాక్షియై క్రీడించుటయు, మఱియు మాయ నెడఁబాసి యుదాసీనగతివిభుండై క్రీడించుతెఱంగు, నివియెల్లగ్రమంబున నాపన్నుండనయిననాకు నెఱింగింపుము. బ్రాహ్మణశాపంబునం జేసి శోకవ్యాకులచిత్తుండవై యనశనవ్రతుండవైన నీవు వినుట యెట్లని సందేహింపవలవదు త్వదీయముఖారవిందవినిస్రుత నారాయణకథామృతపానకుతూహలినైన నాకు నింద్రియంబులు వశంబులై యుండునదిగావున నేనడిగిన ప్రశ్నంబులకుత్తరంబు లవిస్తంబుగా నానతిచ్చి కృతార్థునిం జేయఁ బరమేష్ఠితుల్యుండవగు నీవ పూర్వసంప్రదాయానురోధంబున నర్హుండవగుదువని విష్ణురాతుండయిన పరీక్షిన్నరేంద్రుండు బ్రహ్మరాతుండయిన శుకయోగి నడిగిన నతండు బ్రహ్మనారదసంవాదంబ నేక సంప్రదాయానుగతంబుగ తాగతికప్రకారంబునై తొల్లి సర్వేశ్వరుండు బ్రహ్మకల్పంబున బ్రహ్మకుపదేశించిన భాగవతపురాణంబు వేదతుల్యంబు నీకెఱింగింతు వినుమని చెప్పెనని సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకిట్లనియె✱ (సీ॥ భూపాలకోత్తమ భూతహితుండును జ్ఞానస్వరూపకుఁడైనయట్టి । ప్రాణికి దేహసంబంధ మెట్లగునన్న నుహి నొప్పు నీశ్వరమాయ లేక । కలుగదు స్వప్నవేగలలోనఁదోఁచిన దేహబంధంబుల తెరువుకరణి । హరియోగమాయామహత్త్వంబునం బాంచభౌతికదేహసంబంధుఁడగుచు । నట్టి మాయాగుణంబుల నాత్మలోన । బాల్యకౌమారయౌవనభావములను। నరసురవర్యాదిమూర్తులఁ బొరసి యేను । నాయదిదియను సంసారమాయఁదగిలి✱ (వ॥ వర్తించుచునిట్లున్న జీవునికి భగవద్భక్తియోగంబున ముక్తిసంభవించుటయెట్లనిన నెప్పుడేని జీవుండు ప్రకృతిపురుషాతీతంబగు బ్రహ్మస్వరూపంబునందు మహితధ్యాననిష్ఠుండగు నప్పుడు విగతమోహుండై యహంకారమమకారాత్మకంబయిన సంసరణంబుం దొలంగి ముక్తుండై యుండు మఱియు జీవేశ్వరులకు దేహసంబంధంబులు గానంబడుచుండునట్టి దేహధారియైన భగవంతునందు భక్తిం జేసి జీవునకు ముక్తియెట్లగు ననంగలుగునని యడిగితివి జీవుండవిద్యామహిమం జేసి కర్మానుగతంబయిన మిథ్యారూపదేహసంబంధుండు భగవంతుండు నిజయోగమాయామహిమంబున స్వేచ్ఛాపరికల్పితదిగ్ఘనలీలావిగ్రహుండుగాన భగవంతుండగు నీశ్వరుండు స్వభజనంబు ముక్తిసాధనంబని చతుర్ముఖునకుఁదదీయ

—❀ శ్రీమన్నారాయణుండు బ్రహ్మతపంబునకు మెచ్చి వరంబులిచ్చుట. ❀—

నిష్కపటతపశ్చర్యావిశేషంబున నిజజ్ఞానానందఘనంబయిన స్వరూపంబు సూపుచు నానతిచ్చె నదిగావున జీవునికి భగవద్భక్తిమోక్షప్రదాయకంబగు నిందులకొక యితిహాసంబుగల దెఱింగింతు నారకఁగొనుము దానభవదీయసంశయనివృత్తి యయ్యెడునని శుకయోగీంద్రుండు రాజేంద్రునకిట్లనియె✱ (సీ॥ హరిపాదభక్తిరహస్యోపదిష్టయనఖిలదేవతలకునధిపుండు। నైనవిధాతకల్పాదియందును నిజాశ్రయపద్మమునకధిష్ఠానమరయ । నర్థించి జలములన న్వేషణము సేసి నలినంబు మొదలు గానంగలేక। విసివి బ్రహ్మ యనుదద్బినరుహాసీనుఁడై సృష్టినిర్మాణేచ్ఛఁజిత్తమందుఁ । జాలనూహించి తత్వవిజ్ఞానమహిమ।సరణిమనమునఁదోఁపక జడనుపడుచు।లోకజాలంబుపుట్టింప లేక మోహితాత్ముఁడై యంతనొంకనయ్యవసరమున✱ (వ॥ జలమధ్యంబుననుండి యక్షరసమామ్నాయంబున స్పర్శంబులందు షోడశాక్షరంబు మఱియు నేకవింశాక్షరంబునైన యయక్షరద్వయంబువలన ననగుచు మహామునిజనధనంబయిన తపయను శబ్దంబు రెండుమాఱులుచ్చరింపంబడి వినంబడిన నట్టిశబ్దంబు పలికిన పురుషుని వీక్షింపంగోరి నలుదిక్కులకుం జని వెదకి యెందునుం గానక మఱలి నిజస్థానంబైన పద్మంబునం దాసీనుండై యేకాం

చుక చింతించి యట్టి శబ్దంబు దన్నుం దపంబు సేయుమని నియమించుటగాఁ దలంచి ప్రాణాయామ పరాయణుండై జ్ఞానేంద్రి
య కర్మేంద్రియంబుల జయించి యేకాగ్రస్వాంతుండై సకలలోక సంతాపహేతువగు తపంబు వేయిదివ్యవత్సరంబులు గావిం
పనీశ్వరుండు ప్రసన్నుండై పొడసూపిన నక్కమలసంభవుండు తత్క్షణంబ రాజస తామస సమిశ్ర సత్త్వగుణాతీతంబు శుద్ధసత్త్వ
గుణావాసంబు, నకాలవిక్రమంబు, సర్వలోకోన్నతంబు, సకలసురగణస్తుత్యంబు, లోభమోహభయవిరహితంబు, నపున
రావృత్తిమార్గంబు, ననంత తేజోవిరాజితంబు నైన వైకుంఠపురంబుం బొడగనియందు* (సీ॥ సూర్యచంద్రానలస్ఫురణలఁ
జొరనీక నిజదీధితిస్ఫూర్తి నివ్వటిల్ల। దివ్యమణిప్రభాదీపితసౌధవిమానగోపురహర్మ్యమంటపములఁ। బ్రసవగుచ్ఛస్వచ్ఛభ
రితకామిత ఫలసంతానపాదపసముదయములఁ। గాంచనదండసంగతమారుతోద్ధూతతరళవిచిత్రకేతనచయముల। వికచ
కైరవదరదరవిందగతమరందరసపానమోదితేందిందిరప్ర। భూతమంజులస్వనదప్రబుద్ధరాజ। హంసశోభితవరకమలాకర
ముల* (సీ॥ వలనొప్పఁగా నదైవం కేశవాత్పరంబని పలుకు రాజకీరావళియును। మహిమ సర్వం విష్ణుమయము జగత్తని వదివె
డు శారికాసముదయంబు। నేపారఁగా జితం తే పుండరీకాక్ష యని లీలఁ బాడు పికావళియును। లలిమీఱఁగా మంగళం మధుసూ
దన యని పలుకు కేకులనారతంబు। నలరి శ్రౌషడ్వషట్స్వధేత్యాదిశబ్ద। కలితముగ మ్రోయు మధుపనికాయములును। గలిగియ
ఖిలైకదివ్యమంగళవిలాస। మహిమఁ జెన్నొందు వైకుంఠమందిరంబు* (వ॥ మఱియుం బయోధరావళీవిభాసితనభంబుం బో
లె వెలుంగుచున్న యద్దివ్యధామంబునందు* (సీ॥ సలలితేందీవరశ్యామాయమానోజ్జ్వలాంగులు నవ్యపీతాంబరులును। ధవ
ళారవిందసుందరపత్రనేత్రులు సుకుమారతనులు భాసురవినూత్న। రత్నభూషణగ్రైవేయకంకణహారకేయూరమంజీర
ధరులు। నిత్యయౌవనులు వినిర్మలచరితులు రోచిష్ణులును హరిరూపధరులు। నగుసునందుండు నందుండు నర్హణుండు। ప్రబలుఁ
డును మొదలగు నిజపార్శ్వచరులు। మఱియు వైదూర్యవిద్రుమామలమృణాళ। తుల్యగాత్రులు దనుభక్తితో భజింప* (సీ॥ శ్రా
శ్రితాఖిలకల్మషవ్రజామరనదీజనక కోమలపదాబ్జములవాని। నఖిలసంపత్కారణాపాంగలక్ష్మీవిలాసితవక్షఃస్థలంబువానిఁ
బద్మమిత్రామిత్ర భాసురలోచననలినసుందరవదనంబువాని। భువననిర్మాణనైపుణభవ్యనిజజన్మకారణనాభిపంకజము వా
ని। నహిహితాహితశయనవాహనము వాని। సేవితామరతాపసశ్రేణివాని। నఖిలలోకంబులకు గురుఁడయినవానిఁ। గాం
చెం బరమేష్ఠి గన్నులకఱవుదీఱ* (క॥ కమనీయరూపరేఖా। రమణీయతఁ జాలనొప్పురమణీమణియ। కమలాలయ దన్నుఁ బదు
కర। కమలంబుల విభుని పాదకమలములొత్తన్॥ వెండియు* (శా॥ శ్రీకాంతాతిలకంబు రత్నరుచిరాజిప్రేంఖితస్వర్ణడో। లా
కేళిన్ వెలసింపఁ దత్కుచభరాలంకృత్యగా మోదలో। భాకీర్ణప్రచరన్మధువ్రతమనోజ్ఞాలోలనాదంబుల। స్తోకానుస్వరలీ
లనొప్పఁగ నిజేశు నేవ్రేడ్కతోఁ బాడఁగాన్॥ అట్టి నిత్యవిభూతియందు* (మ॥ సతతజ్ఞానరమాయశోబలమహైశ్వర్యాదియు
క్తున్ జగత్పతి యజ్ఞేశు ననంతు నచ్యుతు సశత్త్వం కేశు మోక్షున్ శ్రియః। పతి నాద్యంతవికారదూరుఁ గరుణాపాథోనిధిం సాత్త్వ
తాంపతి వర్ధిష్ణు సహిష్ణు విష్ణు గుణవిభ్రాజిష్ణు గోవిష్ణునిన్* (మ॥ దరహాసామృతపూరితాస్యు నిజభక్తత్రాణపారాయణుం
దరుణాంభోరుహపత్రలోచనుని బీతాచ్ఛాదనున్ లోకసుం। దరు మంజీరకిరీటకుండలముఖోద్యద్భూషు యోగీశ్వరే। శ్వరు
లక్ష్మీయుతవక్షుఁ జిన్మయు దయాసాంద్రున్ జతుర్బాహునిన్* (వ॥ మఱియు ననర్ఘరత్నమయసింహాసనాసీనుండు, సునం
దనందకుముదాది సేవితుండుఁ, బ్రకృతిపురుష మహదహంకారంబులును, జతుశ్శక్తులుఁ, గర్మేంద్రియజ్ఞానేంద్రియమనోమ
హాభూతంబులను షోడశశక్తులుఁ, బంచతన్మాత్రంబులును బరివేష్టింపఁ గోట్యర్కప్రభాభాసితుండునై స్వేతరాలభ్యస్వా
భావికసమస్తమైశ్వర్యాతిశయుండునై స్వస్వరూపంబున క్రీడించు సర్వేశ్వరుండైన పరమపురుషుం బుండరీకాక్షు నారా
యణుం జూచి సాంద్రానందకందళితహృదయారవిందుండు రోమాంచకంచుకితశరీరుండు నానందబాష్పధారాసిక్తకపో
లుండగుచు* (క॥ వరపరమహంసగమ్యా। స్ఫురణన్ దనరారు పరమపురుషుని పదపం। కరుహములకు నజుఁడు చతుశ్శిరములు
సోఁకంగ నతులు సేసిన హరియున్* (చ॥ ప్రియుఁడగు బొడ్డుతమ్మి తొలిబిడ్డఁడు వేలుపుపెద్ద భూతసం। చయములఁ జేయుకర్త
నిజశాసనపాత్రుఁడు ధాత మ్రొక్కినన్। దయ దళుకొత్తఁ బల్కెఁ బ్రమదస్మితచారుముఖారవిందుఁడై। నయమునఁ బాణిపం
కజమునన్ హరి యాతని దేహమంటుచున్॥ ఇట్లనియె* (గీ॥ కపటమునులకెంతకాలంబునకు నైన। సంతసింప నేను జలజగర్భ। చి
రతపస్సమాధిఁ జెందిన సర్గేచ్ఛ। మెలఁగు నిన్నుఁ బరిణమింతుఁ గాని* (గీ॥ భద్రమగుఁగాక నీకు నో పద్మగర్భ। వరము నిపుడిత్తు
నెఱిఁగింపు వాంఛితంబు। దేవదేవుఁడనగు నస్మదీయపాద। దర్శనంబవధి విపత్తిశ్శలకు నఘుశ* (చ॥ సరసిజగర్భ నీ యెడఁ బ్రసన్న
తనొందిన మదీయలోకమే। నిరవుగఁ జూపు టెల్లను నహేతుకభూరిదయాకటాక్షవి। స్ఫురణను గాని నీదగు తపోవిభవంబునఁ గా
దు నీ తప। శ్చరణము నామవాక్యముల సంగతిఁ గాదె సరోజసంభవా* (క॥ తపము నఁగ నాదు హృదయము। తపమున మ్రూపను
నఘుధర్మముఁ దపమా। తపమున నే జననస్థి। త్యుపసంహరణముల నర్పుచుండుదుఁ దనయా* (క॥ కావున మద్భక్తికిఁ దప। మేవి

ధమున మూలధనము నిదినీఁ గదిరా। జీవభవ యేఁ జేఁగితపమిటు। గాఁపించుట విగత మోహకర్ముఁడ వింకన్ * (క॥ అనియానతిచ్చి కమలజ। యెనయఁగ భవదీయమాన సేప్సిత మేమై। నను నిత్తు వేడుమ నినను। వనరుహసంభవుఁడు పికచవడనుండగుచున్ * (చ॥ మహి వచనంబులాత్మకుఁ బ్రియంబొనరింపఁ బయోజగర్భుఁడో। పరమపదేశ యోగిజన భావనయా నిఖిలోర్వియం చనీ। వరయనియట్టి యర్థ మొకడైనను గల్గు నెనైనమానుది। స్వైరి సినకోరిక దేవ పినుపింపుదయామది నెత్తగింపవే * (వ॥ దేవా సర్వభూతాంతర్యామివై భగవంతుండవైన నీకు నమస్కరించి మదీయవాంఛితంబు విన్నవించెద నవధరింపు మవ్యక్తరూపంబులై వెలుంగు భవదీయ స్థూలసూక్ష్మరూపంబులు నానాశక్త్యుపబృంహితంబులైన బ్రహ్మాదిరూపంబుల నీయంత నీవే ధరియించి జగముత్పత్తిస్థితిలయంబులం దంతుకీటంబునుం బోలెఁ గావించుచు నమోఘసంకల్పుండవై లీలావిభూతిం గ్రీడించు మహిమంబుఁ దెలియునట్టి పరిజ్ఞానంబుఁ గృపసేయుము భవదీయశాసనంబున జగన్నిర్మాణంబుఁ గావించునపుడు బ్రహ్మాభిమానంబునం జేసి యవశ్యంబును మహాహంకారంబులు నామదిం బొడముంగావునఁ దత్పరిహారార్థంబు వేడెద। నన్నుం గృపాదృష్టి విలోకించి దయసేయుమని విన్నవించి నాలించి పుండరీకాక్షుండతనికిట్లనియె * (క॥ వారిజభవ శాస్త్రార్థవి। చారజ్ఞానమును భక్తిసమాధిః సాత్త్వా। త్యాగములను నీ మూఁడును। దారత నీమనమున సంధరియింపనగున్ * (సీ॥ పరికింప మత్స్వరూపస్వభావములును మహిమావతారకర్మములు దెలియు। తత్త్వవిజ్ఞానంబు దలకొని మత్ప్రసాదమున గల్గెడి నీకు గమలగర్భ। సృష్టిపూర్వమునఁ జర్చింపనేనొక్కరుండ కలిగియుండు మపీతకర్మినగుచు। సమధిక స్థూలసూక్ష్మస్వరూపములఁ దత్కారణప్రకృతియుఁ దగదంశ। నంకలీనమైనద్వితీయుండనై। యుండు నాకు నన్య మొకటి లేదు। సృష్టికాలమునను సృష్టి నాశంబున। జగము మత్స్వరూపము గనుమ వత్స * (క॥ అరయఁగఁ గల్పప్రళయాంతరమున నాద్యంతవిరహితక్రియతోడన్। బరిపూర్ణ నిత్యమహిమం। బరమాత్ముఁడనై సరోజభవ యేనుందున్ * (వ॥ అదియునుం గాక నీవు నన్నడిగిన యీజగన్నిర్మాణమాయాప్రకారంబెట్టిదంటేని వేనియర్థంబు శుక్తిరజతభ్రాంతి యేమిటి మహిమం దోఁచి క్రమ్మఱం దోఁచక మానునదియె మదీయమాయావిశేషంబనియెఱుంగుమిదియునుం గాక లేని యర్థంబు దృశ్యంబగుటయుం, గలయర్థంబు దర్శనగోచరంబు గాకుండుటయును, ద్విచంద్రాదికంబును, దమఃప్రభాసంబును దృష్టాంతములుగాఁ దెలియుమే ప్రకారంబున నేమి మహాభూతంబులు భౌతికంబులయిన ఘటపటాదులందుం బ్రవేశించి యుండు నా ప్రకారంబున నేను నీభూతభౌతికంబులయిన సర్వకార్యంబులందు సత్త్వాదిరూపంబులం బ్రవేశించియుండుదు భౌతికంబులు భూతంబులయందుఁ గారణావస్థం బొందు చందంబున భూతభౌతికంబులు కారణావస్థం బొందిన నాయందు నభివ్యక్తంబులై యుండవు సర్వదేశంబులయందును సర్వకాలంబులయందును నేదిబోధితంబై యుండునట్టిది యపరబ్రహ్మస్వరూపంబు తత్త్వంబెఱుంగ నిశ్చయించిన మిముబోఁటివారలకుని చెప్పినది మదీయతత్త్వాత్మకంబయినయర్థంబనియెఱుంగుదు రీయర్థంబు తత్ప్రష్టంబయినయది యేకాగ్రచిత్తుండవై యాకర్ణించి భవదీయచిత్తంబున ధరియించిన నీకు సర్గాదికర్మంబులందు మోహంబు చెందకుండెడినని భగవంతుండయిన పరమేశ్వరుండు చతుర్ముఖునకాజ్ఞాపించి నిజలోకంబుతోనంతర్థానంబునొందెనని చెప్పి శుకుండు వెండియు నిట్లనియె * (సీ॥ అవనీశ బ్రహ్మయిట్లంతర్హితుండైనఁ బుండరీకాక్షునకు బుద్ధి నిలిపి। యానందమును బొంది యంజలిఁ గావించి తత్ప్రతిగ్రహమునఁ దనదు బుద్ధిఁ। గైకొని పూర్వప్రకారంబునను సమస్తప్రపంచంబెల్లఁ దగ సృజించి। మఱియొకనాఁడు ధర్మప్రవర్తకుఁడౌచు నఖిలప్రజాపతియైన కమల। గర్భుఁడాత్మహితార్థమై కాక సకల। భువనహితబుద్ధినున్నతస్ఫురణమెఱసి। మానితంబైన యమనియమముల రెంటి। నాచరించెను సమ్మోదితాత్ముఁడగుచు॥ అయ్యవసరంబున * (క॥ అనలి నానందను। లైన సనందాదిమునులకగ్రేసరుఁడు। న్మానుగఁ బ్రియతనుజుండగు। నా నారదుఁడేను దెంచె నబ్జజుకడకున్ * (క॥ చను దెంచి తండ్రికిం బ్రియ। మొనరఁగ శుశ్రూషణంబు లొగిఁ జేసిన చో। దన దెసఁ బ్రసన్నుఁడగుటయుఁ। గని భగవన్మాయ దెలియఁగా నుత్సుకుఁడై * (సీ॥ అవనీశ నీవు నన్నడిగిన పగిది నతఁడు దండ్రి నడుగ బితామహుండు। భగవంతుఁడాశ్రితపారిజాతమ్ము హరికృపతోడఁ దనకెఱింగించినట్టి। లోకమంగళ చతుశ్శ్లోకరూపంబును దం లక్షణంబులఁ దనరు భాగ। వతము నారదునకున్నతిఁ జెప్పె నా కఁడు చారు సరస్వతీతీరమునను। హరిపదధ్యానపారీణుఁడాత్మవేది। ప్రకటతేజస్వియగు బాదరాయణునకుఁ। గోరి యెఱిఁగించె నమ్మహాభాగవతము। నాకు నెఱిఁగించె నెఱిఁగింతు నీకు నేను * (వ॥ అదియునుం గాక యిపుడు విరాట్పురుషుని వలన నీజగంబు లేవడువున బొడమె ననియెడిది మొదలయిన కొన్ని ప్రశ్నలు నన్నడిగితివి యవియేను నన్నింటికిను త్తరంబగునట్లుగా నమ్మహాభాగవతంబు పన్యసించెద నాకర్ణింపు మమ్మహాపురాణంబు చతుశ్శ్లోకరూపంబును, దశలక్షణంబుల సంసూచితమార్గంబులనొప్పు, నందు దశలక్షణంబు లెయ్యవియనిన సర్గంబు, విసర్గంబు స్థానంబు, పోషణంబు, ఊతులు, మన్వంతరంబు, ఈశానుచరితంబు, నిరోధంబు, ముక్తియు, నాశ్రయంబు, ననంబది తెఱంగులయ్యె. దశమవిశుద్ధ్యర్థంబునకుఁ దక్కిన తొమ్మిది లక్షణంబులు చెప్పంబడు నవియెట్టివనిన * (గీ॥ మహదహంకారపంచతన్మా

త్రగగనపవనశిఖితోయభూభూతపంచకేంద్రి । యప్రపంచంబు భగవంతునంగనుట సర్గన ంబుగుదీని జనవరేణ్య* (క॥ సరసిజగర్భుండు విరాట్పురుషునివలన జ్ఞానవిభాగితరచరా। చరభూతసృష్టిఁ జేయుటఁ । బరువడి విసర్గనాంబు భరతకులేశా* (క ॥ లోకద్రోహనరేంద్రానీకముఁ బరిమార్చి జగము నెట్టికల్పినయా । వైకుంఠనాథకృతరక్ష । యాకల్పము స్థానమన్యోనవనీనాథా* (క ॥ హరిసర్వేశుఁడనంతుఁడు నిరుపమశుభమూర్తి చేయు నిజభక్తజనో ద్ధరణము పోషణమనవనీవరయాతులనంగఁగర్మవాసనలరయక* (గీ॥ జలజనాభదయాకటాక్షప్రసాద । లబ్ధిసఖిలైకలోకపాలకవిభూతి । సహితులై పొందినవారిధర్మములు విస్తరము నఁ బలుకుట మన్వంతరములు భూప* (క॥ వనజోదరు నవతారకథనముఁ జదీయాను వృత్తిఁ దచ్చారిత్రం బును విస్తరించి పలుకంజనును నవియీశానుకథలు సౌజన్యనిధీ* (సీ॥ వసుమతీనాథ సర్వస్వామి యైన గోవిందుండు చిదచిదానందమూర్తి । సలలితస్వోపాధిశక్తి సమేతుఁడై తన రారునాత్మీయధామమునందు । ఫణిరాజస్ఫురులతల్పంబు పై సుఖలీలయోగనిద్రారతి నున్నవేళ । నఖిలజీవులు నిజవ్యాపారశూన్యులై యున్నత తేజంబులులుగానఁగ । జంగమస్థావరాదిచేష్టలెల్ల విదితమగునట్టు వలుకుట యదినిరోధ । మనఁ దియవాంతరప్రళయంబనంగఁ । బరగుసఁకము క్తిగతిఁవిను పార్థివేంద్ర* (సీ॥ జీవుండు భగవత్కృపావశంబునఁ జేసి దేహధర్మంబులై ధృతిననేక । జన్మానుచరితదృశ్యములైన యజ్ఞరామరణంబులాత్మధర్మంబులయిన ఘనపుణ్యపాపనికాయ నిర్మోచనస్థితినొప్పి పూర్వసంచితములైన । యపహతపాప్మవత్త్వాదృష్టతద్గుణవంతుఁడై తిగభగవద్భిరీర । భూతుఁడై పారతంత్ర్యాత్మబుద్ధినొప్పి దివ్యమాల్యానులేపనభవ్యగంధ । కలితమంగళదివ్యవిగ్రహవిశిష్టుఁడగుచు హరిరూపమొందుటే యనఘముక్తి* (వ॥ మఱియు నుత్పత్తిస్థితిలయంబులెంచుననగుచుఁ బ్రకాశింపఁబడు నదియాశ్రయంబనంబడు నదియ, పరమాత్మబ్రహ్మశబ్దవాచ్యంబు - నదియ. ప్రత్యక్షానుభవంబున విదితంబు సేయుకొఱకు నాత్మకాధ్యాత్మ్యాది విభాగంబు సెప్పంబడియె నదియెట్లనిన నాత్మయాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబులఁ ద్రివిధంబయ్యె నందునాధ్యాత్మికంబు చక్షురాదిగోళకాంతర్వర్తియై యెఱుంగఁబడుఁ జక్షురాదికరణాభిమానియై ద్రష్టయైన జీవుండె యాధిదైవికంబనఁదగుఁ జక్షురాద్యధిష్ఠానాభిమానదేవతయైన సూర్యాదితేజోవిగ్రహుండనగుచు నెవ్వనియందు నీయుభయవిభాగంబునుంగలుగు నతండె యాధిభౌతికుండు విరాడ్విగ్రహుండనగుం గావున ద్రష్టయు దృక్కు దృశ్యంబుననందగు నీమూఁటియందు నొకటి లేకున్న నొకటిగానరాదీత్రితయంబు నెవ్వఁడెఱుఁగు నతండు సర్వలోకాశ్రయుండై యుండు నతండె పరమాత్మ యనమ్మహాత్ముండు లీలార్థంబై జగత్సర్జనంబు సేయుతలంపున బ్రహ్మాండంబుని ర్భేదించి తనకు సుఖస్థానంబు నపేక్షించి మొదల శుద్ధంబులగు జలంబుల సృజియించె, స్వతఃపరిశుద్ధుండు గావున స్వసృష్టంబగు నేకార్ణవాకారంబైన జలరాశియందు శయనంబు సేయుటం జేసి ॥ శ్లోకము. ఆపోనారా ఇతిప్రోక్తా ఆపో వై నరసూనవః। తా యదస్యాయనం పూర్వం తేన నారాయణస్స్మృతః ॥ అను ప్రమాణము చొప్పున నారాయణశబ్దవాచ్యుండు గావున నతని ప్రభావంబు వర్ణింప నర్లభంబు పాదానభూతంబయిన ద్రవ్యంబు, ద్రివిధంబయిన కర్మంబు, కళాకాష్ఠాద్యుపాధిభిన్నంబయిన కాలంబు, జ్ఞానాదికంబగు జీవస్వభావంబు భోక్తయగు జీవుండు నెవ్వని యనుగ్రహంబునం జేసి వర్తింపుచుండు, నెవ్వని యుపేక్షం జేసి వర్తింపకుండు నట్టి ప్రభావంబు గల సర్వేశ్వరుండు డానేకమయ్యు నానేకంబుగాఁదలంచి యోగతల్పంబున ప్రబుద్ధుండై యుండు నతమీఁదన్న సంకల్పంబునం జేసి తన హిరణ్మయంబైన విగ్రహంబు, నధిదైవంబు, నధ్యాత్మకంబు, నధిభూతంబునను సంజ్ఞాయుతంబై త్రివిధంబుగా సృజియించె* (సీ॥ అట్టి విరాడ్విగ్రహాంతరాకాశంబువలన నోజస్సహోబలములయ్యెఁ ప్రాణంబు సూక్ష్మరూపక్రియాశక్తిచే జనియించి ముఖ్యాసువనఁగఁ బరఁగె । వెలువడిచను జీవి వెనుకొని ప్రాణముల్ చనుచుండు నిజనాథు ననుసరించు । భటుల చందంబునఁ బాటిల్లుకుత్తును భూరితృష్ణయుఁ గుటిముఖమువలనఁ । దాలుజిహ్వాదికంబులుద్భవమునొందె । నందు నుదయించె జిహ్వయు నందు రసము । లెల్ల నుదయింపఁ జిహ్వచే నెఱుఁగఁబడును । మొనసి పలుక నపేక్షించు ముఖమువలన* (వ॥ మఱియు వాగింద్రియంబు పుట్టె - దానికి దేవత యగ్ని - ఆ రెంటివలన భాషణంబు వొడమె - నా యగ్నికి మహాజలవ్యాప్తంబగు జగంబు నిరోధంబు గలుగుటం జేసి యాజలంబె ప్రతిబంధకంబయ్యె - దోధూయమానంబయిన మహావాయువలన ఘ్రాణంబు వుట్టెంగావున వాయుదేవతాకంబయిన ఘ్రాణేంద్రియంబు గంధగ్రహణసమర్థంబయ్యె - నిరాలోకంబగు నాత్మనాత్మయందుఁ జూడం గోరి తేజంబువలన నాదిత్యదేవతాకంబయి రూపగ్రాహకంబైన యక్షియుగళంబు వుట్టె ఋషిగణంబులచేత బోధితుండగుచు భగవంతుండు దిగ్దేవతాకంబును, శబ్దగ్రాహకంబునైన శ్రోత్రేంద్రియంబు వుట్టించె - సర్జనంబు సేయు పురుషునివలన మృదుత్వ కాఠిన్యంబులు లఘుత్వ గురుత్వంబులు నుష్ణత్వ శీతలత్వంబులునుం జేసెడు త్వగింద్రియాధిష్ఠానంబగు చర్మంబు వుట్టె - దానివలన రోమంబులుదయించె - వానికి మహీరుహంబులధిదేవతలయ్యె - నందు నధిగతస్పర్శగుణుండగు వాయువంతర్బహిఃప్రదేశంబుల నావృతుండగు - బలవంతంబులు నింద్రదేవతాకంబులు నాదానసమర్థంబులు నానాకర్మకరణదక్షంబులు న

గుహ్యస్తంబులుదయించె - స్వేచ్ఛావిషయగతిసమర్థుండగు నీశ్వరునివలనవిష్ణుదేవతాకంబులగు పాదంబులుదయించె- బ్ర
జానందామృతార్థియగుభగవంతునివలనఁ బ్రజాపతిదేవతాకంబై స్త్రీసంభోగాదికామ్యసుఖంబులు కార్యంబులుగాఁగల
శిశ్నోపస్థలుదయించె- మిత్రుండధిదైవతంబులుగాఁగలిగి భుక్తాన్నాద్యసారాంశత్యాగోపయోగంబగు పాయువనెడిగుదం
బుద్భవించె-దానికృత్యంబుభయమలమోచనంబు- దేహంబుననుండి దేహాంతరంబుఁజేరంగోరి పూర్వకాయంబువిడుచుట
కుసాధనంబగు నాభిద్వారంబుసంభవించె, నట్టినాభియ ప్రాణాపానబంధస్థానమనంబడుఁ, దద్బంధవిశ్లేషంబె మృత్యువగు
నదియయూర్ధ్వాధోదేహభేదకంబనియుం జెప్పంబడు, నన్నపానాదిధారణార్థంబుగనాంత్రకుక్షి నాడీనిచయంబులుఁగల్పిం
పఁబడియె దానికినదులుసముద్రంబులు నధిదేవతలయ్యెఁదుష్టిపుష్టులను నుదరభరణరసపరిణామంబులును గలిగియుండు,నా
త్మీయమాయాచింతనంబొనర్చునపుడు కామసంకల్పాదిస్థానంబగుహృదయంబుగలిగె, దానివలనమనంబు చంద్రుండుకా
మ్యంబుసంకల్పంబునుదయించె, నంతమీఁదజగత్సర్జనంబుసేయు విరాడ్విగ్రహంబువలన సప్తధాతువులును, పృథివ్యప్తేజో
మయంబులయినసప్తప్రాణంబులును, వ్యోమాంబు వాయువులచేనుత్పన్నంబులయి గుణాత్మకంబులయిన యింద్రియంబు
లు,నహంకారప్రభవంబులయినగుణంబులును, సర్వవికారస్వరూపంబగుమనస్సును, విజ్ఞానరూపిణియగుబుద్ధియును,వివిధం
బగునివియంతయుసర్వేశ్వరునిస్థూలవిగ్రహంబునంబుట్టుమఱియును* (క॥ వరుసఁబృథివ్యాద్యష్టా । వరణావృతమైనసమగ్ర
వైభవములఁబం।కరుహభవాండాతీత। స్ఫురణంజెలువొందునతివిభూతిదలిర్పన్* (క॥ పొలుపగుసకలవిలక్షణ।ములుగల
యాద్యంతశూన్యమునునిత్యమునై।లలిసూక్ష్మమైమనోవా।క్కులకుందలపోయఁగానగోచరమగుచున్* (సీ॥ అలఘుతేజో
మయంబైనరూపంబిదిక్షితినాథనాచేతఁజెప్పఁబడియె । మానితస్థూలసూక్ష్మస్వరూపంబులవలన నొప్పెడుభవత్స్వరూప।
మమ్మహాత్మకునిమాయాబలంబునఁజేసి దివ్యమునీంద్రులుదెలియలేరు । వసుధేశవాచ్యమైవాచకంబై నామరూపముల్గ్రి
యలునురూఢిఁదాల్చి । యుండునట్టియీశ్వరుండునారాయణుం । డఖిలధృతిజగన్నియంతయైన । చిన్మయాత్ముండుసృజి
యించునీప్రజా।పతులఋషులఁబితృపతతులనపుడు॥ మఱియును* (సీ॥ సురసిద్ధసాధ్యకిన్నరవరచారణగరుడగంధర్వరాక్ష
సపిశాచ।భూతభేతాళకింపురుషకూశ్మాండగుహ్యకడాకినీయక్షయాతుధాన । విద్యాధరాప్సరోవిషధరగ్రహమాతృగణవృ
కహరిఘృష్టిఖగమృగాళి।భల్లూకరోహితపశువృక్షయోనులవివిధకర్మంబులు వెలయఁబుట్టి । జలనభోభూతలంబులసంచరిం
చు।జంతునయములసత్త్వరజస్తమోగు । ణములఁదిర్యక్సురాసురనరధరాది।భావములభిన్నులగుదురుపౌరవేంద్ర* (మ॥
ఇరవొందన్ద్రుహిణాత్మకుండయిరమాధీశుండువిశ్వంబును । స్థిరతంజేసిహరిస్వరూపుఁడయిరక్షించున్సమస్తప్రజో। త్క
రసంహారముఁజేయునప్పుడుహరాంతర్యామియైయింతయున్ । హరియించున్బవమందు మేఘములమాయంజేయుచండంబు
నన్* (క॥ ఈపగిదినివిశ్వముసం । స్థాపించునుమనుచునడఁచుధర్మాత్మకుఁడై।దీపితతిర్యఙ్నరసుర । రూపంబులుదానెతాల్చి
రూఢిచెలిఁపన్* (సీ॥ హరియందునాకాశమాకాశమునవాయువనిలంబువలనహుతాశనుండు । హవ్యవాహనునందునంబు
వులుదకంబువలనవసుంధరగలిగెధాత్రి । వలనబహుప్రజావళియుద్భవంబయ్యెనింతకుమూలమైయొసఁగునట్టి। నారాయణుఁ
డుచిదానందస్వరూపకుండవ్యయుఁడజుఁడు ననంతుఁడాఢ్యుఁ । డాదిమధ్యాంతశూన్యుండనాదినిధనుఁ । డతనివలననుసం
భూతమైనయట్టి।సృష్టిహేతుప్రకారమీక్షించితెలియఁ।జాలరెంతటివారును లైనజనవరేణ్య॥ అదియునుంగాక* (మ॥ ధరణీ
శోత్తమభూతసృష్టినిటుసంస్థాపించిరక్షించునా । హరికర్తృత్వమునొల్లఁడాత్మగతమాయారోపితంజేసితా । నిరవద్యుం
డునిరంజనుండుపరుఁడున్ నిష్ప్రపంచనుండాఢ్యుఁడున్ । నిగమేడ్యుండునునిష్కళంకుఁడగుచున్ నిత్యత్వముంబొందెడిన్*
(వ॥ బ్రహ్మసంబంధియగు నీకల్పప్రకారంబ వాంతరకల్పంబుతోడ సంకుచితప్రకారంబున నెఱింగించితి, నట్టిబ్రహ్మకల్పం
బుననొప్పుప్రాకృతవైకృతకల్పప్రకారంబులు, తత్పరిమాణంబులు, కాలకల్పలక్షణంబులు, నవాంతరకల్పమన్వంతరాదిభే
దపభాగస్వరూపంబునతివిస్తారంబుగముందునెఱింగింతువినుమదియునుం బద్మకల్పంబనందగుననిభగవంతుఁడైన శుకుండు
పరీక్షిత్తునకుఁజెప్పెనని సూతుండుమహర్షులకునెఱింగించిన* (క॥ వినిశౌనకుండుసూతుం।గనుఁగొనియిట్లనియెసూతకరు
ణోపేతా।జననుతగుణసంఘాతా।ఘనపుణ్యసమేతవిగతకలుషవ్రాతా* (వ॥ పరమభాగవతోత్తముండైన విదురుండుబం
ధుమిత్రజాతంబులవిడిచి సకలభువనపావనంబులుఁ గీర్తనీయంబులునైన తీర్థంబులునగణ్యంబులైన పుణ్యక్షేత్రంబులును ద

ర్శించి క్రమ్మఱవచ్చి కౌమారదేశంబున మైత్రేయుం గని యతనివలన నధ్యాత్మబోధంబు వడసె నని పలికిన నదియంతయు నెఱిం గింపు మని నన్నతం డిట్లనియె* (క॥ వినుమిపుడు మీరు నన్నడి। గిన తెఱఁగున శుకముని నృపుఁగేయుఁ బరీక్షి। జ్జనపతి యడిగిన నతఁ డా। తని కెఱిఁగించినవిధంబుఁ దగ నెఱిఁగింతున్॥ సావధానులై వినుండు* (ఉ॥ రామ గుణాభిరామ దినరాజకులాంబుధిసోమ తో యద। శ్యామ దశాననప్రబలసైన్యవిరామ సురారిగోత్రసు। త్రామ సుబాహుబాహుబలదర్పతమఃపటుతీవ్రధామ ని। ష్కా మ కుభృల్లలామ గరకంఠసతీనుతనామ రాఘవా* (క॥ అసురేంద్రసుతవిదారణ। కమలాప్తతనూజరాజ్యచారణ భవసంత। మసదినేశ్వర రాజో। త్తమ దైవతసార్వభౌమ దశరథరామా* (మాలిని॥ నిరుపమగుణజాలా నిర్మలానందలోలా। దురితఘన సమీరా దుష్టదైత్యప్రహారా। శరధిమదవిశోషా చారుసద్భక్తపోషా। సరసిజదళనేత్రా సజ్జనస్తోత్రపాత్రా॥........*

గద్య * ఇది శ్రీకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను పురాణంబునం బరీక్షిత్తుతోడ శుకయోగి భాషించుటయు, భాగవతపురాణ వైభవంబు, ఖట్వాంగు మోక్షప్రకారంబు, ధారణాయోగ విషయంబయిన మహావిష్ణుని శ్రీపాదాద్యవయవంబుల సర్వలోకంబులున్న తెఱంగు, సత్పురుషవృత్తియు, మోక్షవ్యతిరిక్త సర్వకామ్యఫలప్రద దేవతాభజనప్రకారంబు, మోక్షప్రదుండు శ్రీహరి యనుటయు, హరిభజనావిరహితులైన జనులకు హేయతాపాదనంబు, రాజప్రశ్నంబు, శుకయోగి శ్రీహరిస్తోత్రము సేయుటయు, వాసుదేవప్రసాదంబునం జతుర్ముఖుండు బ్రహ్మాధిపత్యంబు వడయుటయు, శ్రీహరివలన బ్రహ్మరుద్రాది లోకప్రపంచంబు పుట్టుటయు, శ్రీమన్నారాయణ దివ్యలీలావతార పరంపరావైభవ వృత్తాంతసూచనంబు, భాగవతవైభవంబు, పరీక్షిత్తు శుకయోగి నడిగిన ప్రపంచాది ప్రశ్నలు, అందు శ్రీహరిప్రధానకర్తయని తద్వృత్తాంతంబు సెప్పుటయు, భగవద్భక్తివైభవంబు, బ్రహ్మతపశ్చరణంబునకుం బ్రసన్నుండై హరి వైకుంఠ నగరంబుతోడఁ బ్రసన్నుండయిన స్తోత్రంబు సేసి తత్ప్రసాదంబునం దన్మహిమ వినుటయు, వాసుదేవుం డానతిచ్చిన ప్రకారంబున బ్రహ్మ నారదునికి భాగవతపురాణ ప్రధానదశలక్షణంబులుపన్యసించుటయు, నారాయణ వైభవంబు, జీవాదితత్త్వసృష్టియు, శ్రీహరి నిత్యవిభూత్యాది వర్ణనంబు, కల్పప్రకారాది సూచనంబు శౌనకుండు విదుర మైత్రేయ సంవాదంబు చెప్పుమని సూతు నడుగుటయు ననుకథలంగల ద్వితీయస్కంధము సంపూర్ణము.

శ్రీ కృష్ణార్పణమస్తు.

---

## తృతీయస్కంధప్రారంభము.

శ్రీమహితవినుతదివిజ।స్తోమా యశస్సీమ రాజసోమా సుమేరు। స్థేమా వినిర్జితభార్గవ । రామా దశాననవిరామా రఘుకులరామా* (వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె* (ఉ॥ పాండునృపాలనందనులు బాహుబలంబున ధార్తరాష్ట్రులన్ । భండనభూమిలో గెలిచి పాండురశారదచంద్రచంద్రికా । ఖండయశఃప్రసూనకలికావళి గౌరవరాజ్యలక్ష్మినొం।డొండ యలంకరించుచు జయోన్నతి రాజ్యము సేయుచుండఁగన్* (క॥ మనుజేంద్ర విదురుఁ డంతకు । మునువనమున కేగి యచట మునిజనగేయున్ । వినుతతపోధారేయున్ । ఘనుననుపమగుణపథేయుఁ గనె మైత్రేయున్* (క॥ కనుఁగొని తత్పాదంబులు వనఫాలము సోఁక మ్రొక్కి తగ నిట్లనియెన్ । మునివర సకలజగత్పా। వనచరితుఁడు కృష్ణుఁ డఖిలవంద్యుం డెలమిన్* (క॥ పాండితతేజోనిధియై । పాండవహితమతి నిదూతభావంబున వే । దండపురి కేగి కురుకుల । మండనుఁడగు ధార్తరాష్ట్రు మందిరమునకున్* (గీ॥ చనఁగ నొల్లక మద్గృహంబునకు భక్త।వత్సలుండగు కృష్ణుండు వచ్చుటేమి । కతము నాకది మెఱిఁగింపు కరుణతోడ। నను చు విదురుండు మైత్రేయు నడిగెననిన* (క॥ విని వెండియుఁ బరీక్షిన్మనుజవరేణ్యుండు వినుల మతిని స్తంద్రున్। మునికులజలనిధిచంద్రున్।సునిశితహరిభక్తిసాంద్రు శుకయోగీంద్రున్* (క॥ కని యిట్లనె మైత్రేయుని। ననఘుండగు విదురుఁడే రహస్యములడిగెన్।మునియేమి చెప్పె నే పగిదిని దీర్ఘములాడె నెచటఁ దిరుగుచునుండెన్* (గీ॥ ఇన్ని దెలియంగ నానతియిచ్చి నన్ను । నర్థి రక్షింపవే విమలాంతరంగ।ఘనదయాపాంగ హరిపాదకమలభృంగ।మహితగుణసంగ పాపతమఃపతంగ* (చ॥ అనవుడు బాదరాయణిధరాధిపుతో ననుఁ గూరువంశవర్ధనవినుకష్టుఁడైన ధృతరాష్ట్రనృపాలుఁడు పెంపుతో సుయో । ధనముఖపుత్రులం గడు ముదంబునఁ బెంచుచుఁ బాండురాజుద । ప్పినపిదపన్ దదాత్మజులు వెల్తుఁ బితన్ననిఁ జేరవచ్చినన్* (వ॥ ఇట్లు వచ్చిన పాండవులయెడ నసూయానిమగ్నులై సుయోధనాదులు* (క॥ పెట్టిరి విషాన్నమంతం। గట్టియు ఘనపాశములను గంగానదిలో। నెట్టిరి రాజ్యము వెడలం।గొట్టిరి ధర్మంబు విడిచి కుటిలాత్మకులై* (క॥ క్రూరాత్ములగుచు లాక్షా । గారంబున వారు నిద్రఁ గైకొనియుండన్। దారుణశిఖఁ దరికొలిపిరి। మారణకర్మములప్రవృత్తులరగుచున్* (గీ॥ సూరిజనగేయమగు రాజసూయయజ్ఞ।విలసదవభృథసేకపవిత్రమైన ద్రౌపదీచారువేణీభరంబుపట్టి । కొలువులోపల నీడ్చిరి కుచ్చితమున* (క॥ కావున వారలకపకృతి। గావింపని దొకదినంబు గలుగదు తమజ।న్మావధి నిజనందనులను । వావిరి నయ్యంధనృపతి వలదనఁడయ్యెన్* (గీ॥ మాయజూదంబువన్ని దుర్మార్గవృత్తిఁ।బుడమిఁ గొని యడవులకుఁ బోనడువ నచటఁ । దిరిగి వారలు సమయంబు దీర్చి యేసు। దెంచి తమయంశమడిగినఁ బంచి యిడక।ఉన్నయెడ* (చ॥ సకలనియంతయైన హరి సర్వశరణ్యుఁడు మాధవుండు సే । వకనవకల్పకంబు భగవంతుఁడనంతుఁ డనంతశక్తినం । దకధరుఁ డబ్జలోచనుఁడు ధర్మతనూభవుచే నియుక్తుఁడై । యకుటిలభక్తియోగమహితాత్మకుఁడై ధృతరాష్ట్రపాలికిన్* (క॥ చని యచట భీష్మగురుత। త్తనయకృపాచార్యనిఖిలధాత్రీపతులన్ । వినియను మోదింపఁగ నిట్లనియెన్ ధృతరాష్ట్రుతోడ నవనీనాథా* (క॥ కౌరవపాండవులిరువురు । నారయ నీకొక్క సమమ యవనీవరనీ। వేరీతినైనఁ బాండుసు।మారుల పాలొసఁగి తేని మనుము భయంబున్* (క॥ అని ధర్మబోధమునఁ బలి।కిన మాటలఁ జెవుల నిడమి కృష్ణుఁడు విదురున్ ఘననీతిమంతుఁ బిలువన్ । బనిచినఁ జను దెంచెఁ గురుసభాస్థలమునకున్* (వ॥ చను దెంచి యచటి జనంబులచేత నుపస్థితంబయిన కార్యంబు దెలుపంబడినవాఁడై ధృతరాష్ట్రు నుద్దేశించి యిట్లనియె* (మ॥ ధరణీనాయక పాండుభూవిభుఁడు నీతమ్ముండు తత్పుత్రులన్ । బరిరక్షించిన ధర్మముం దగవునుం బాటిల్లు వంశంబును । స్థిరసౌఖ్యోన్నతిఁ జెందు శత్రుజయమున్ జేకూరు గోపాలశే।ఖరుచిత్తంబును వచ్చునట్లగుటయా గౌరవ్యవంశాగ్రణీ* (గీ॥ వారితండ్రి పాలు వారికి నొసఁగినీ । పాలు సుతులకెల్లఁ బంచి యిచ్చి। చలము విడిచి ధర్మమలవడ నీబుద్ధి।జొనుపుమయ్య కులము మనుపుమయ్య* (చ॥ వినుము నృపాల నాపలుకు వేయనేల సమీరసూతి నీ।తనయుల పేరు విన్నఁ బదతాడితదుష్టభుజంగమంబు చా । ద్పునఁ గనలొందు నింతయును మున్నునఁ జెప్పితిగాదె వానిచే। తనభవదీయపుత్రులకుఁ దప్పదు మృత్యువ దెన్నిభంగులన్॥ అదియునుంగాక* (క॥ నీపుత్రులశౌర్యంబును।జాపాచార్యాపగాత్మజాతకృపభుజా।టోపంబును గర్ణుమరా।లాపంబును నిజము గాఁదలంతె నమునన్॥ అట్లనిపనుము* (ఉ॥ ఏపరమేశుచే జగములీ సచరాచరకోటి శోసము। ద్దీపితమయ్యెనేఁ భువిదివ్యకళాంశజులబ్జగర్భగౌ । రీపతిముఖ్యదేవము సబృందము లెవ్వఁ డనంతుఁ డచ్యుతుం।డా పురుషోత్తముండు కరుణాంబుధి కృష్ణుఁడు యోగేశ్వరా* (ఉ॥ అట్టి జగన్నివాసుఁడు మురాసురభేది పరాపరుం డు చే । పట్టిన ఖుండు వియ్యము నుబాంధవుఁడున్ గురుఁడున్ హితుండునై । నిట్టలమైన ప్రేమమున నెప్పుడుఁ

జొప్పడుచుండువారలఁ జుట్టనవేలనెవ్వరికిఁ జూడఁగవచ్చును బార్థివోత్తమా* (ఉ॥ కావునఁ బాండునందనులఁ గాఱియఁ
బెట్టక రాజ్యభాగముఁ నావిరినిచ్చి రాజ్యమును వంశముఁ బుత్రులబంధువర్గముఁ । గావుము కాకలోభియగుకష్టసుయోధ
నుమాటవింటివే। భూవరనీయుపేక్షనఁ బోకులనాశము బంధునాశముఁ* (గీ॥ ఒకనికై యిట్టులకులమెల్లనుకడంప। నెత్తు
కొనఁజూచెదిదిసీతియే నృపాల। వినుము నామాటనీసుయోధనుని డిడిచి। కులము రాజ్యంబు తేజంబుఁ గలుగనయ్య* (క॥ అనియి
ట్లువరమిచెప్పిన। విని దుర్యోధనుఁడు రోషవివశుండయి తా। నినతనయ శకుని దుశ్శా। సనులఁ గీక్షించి తానసంబునఁ బలికెన్*
(క॥ దాసీపుత్రుని మీరలు। దాసీనుం జేయకిటకుఁ దగునే పిలువఁగా। నాశీనుండై ప్రేలెడు। గాసిలి చెడిపోవ వెడలఁగా నడఁపుఁ
డనన్* (వ॥ అనియిట్లు దుర్యోధనుండాడిన దురాలాపంబులు దనకు మనస్తాపంబులు సేయం గార్యంబు విచారించి ధైర్యంబవ
లంబించి యొండుపలుకనొల్లక శరశరాసనంబులు విడిచి క్రోధంబునడఁచి వనంబునకుం జనియె నంత* (సీ॥ విష్ణుస్వయంవ్య
క్తవిమలభూములను బవిత్రంబులగు హరిక్షేత్రములను। నెలకొనిదేవతానిర్మితహరిదివ్యభూములఁ గంగాదిపుణ్యనదుల। సి
ద్ధపురాణప్రసిద్ధపుణ్యాశ్రమస్థలములను వవనస్థలములందు। గంధమాదనముఖక్ష్మాభృత్తటంబుల మంజులగిరి కుంజపుంజము
లను। వికచకైరవపద్మహల్లకమరంద। పానపరవశమధుకరగానబుద్ధ। రాజహంసవిలోలవిరాజమాన। మగుచుఁ జెలువొందు
పంకేరుహాకరముల* (క॥ మఱియును ఋష్యాశ్రమవన। సరిత్పవనసదపులిందజనపదగిరిగ। హ్వరగోష్ఠియజ్ఞశాలా।పుర
దేవాయతనపుణ్యభూములయందున్* (క॥ మూరలుఁ గాయలు నీళ్లా। హారము గాఁగొనుచు నియమమలవడఁగనసం।స్కార
శరీరుండగుచును। దారతనవధూతవేషధరుఁడై విదురున్* (క॥ హర్షముగదురఁగ భారత। వర్షమునం గలుగు పుణ్యవరతీర్థములు।
తత్కర్షంజూచుచు విగతా। మర్షుండై సంచరించె మనుజవరేణ్యా* (వ॥ ఇట్లు సంచరించుచుఁ బ్రభాసతీర్థమ్మునకు వచ్చునప్పుడు
(చ॥ అసురుచుదైత్యభేదనదయాపరిలబ్ధసమస్తమేదినీ। భరణధురంధరుండగుచుఁ బాండుసుతాగ్రజుఁ డొప్పుచుండ భూ।వర
విదురుండుఁ దన్నికటవర్యతమాలరసాలమాధవీ। కురువకమాలతీవకుళకుంజలసత్తటమందు నున్నెడన్* (చ॥ నరవరవేణు
జాలసవినష్టమహాటవిమాడ్కిఁ బాండుభూ। వరధృతరాష్ట్రసూనులనివార్యనిరూఢవిరోధమెత్తి యొండొరులు జయింపఁగో
రికదనోర్విఁ గురుక్షితిపాదులెల్లన। న్వరుసవినష్టులౌట విని వారిశోకనిమగ్నచిత్తుఁడై* (ఉ॥ ఆయెడఁ గాలుదన్నకరయం
బున వేగిసరస్వతీనదీ। తోయములందు గ్రుంకి మునితుల్యుఁడు వేచనియొండనూనపా। న్యోయగుహాప్తభార్గవపృథుద్విజసోమ
సుధాసగోగ్నిభూ। వాయుయమాభిధానయుతవాహినులందనురక్తి గ్రుంకుచున్*(ఉ॥ వెండియుఁ బుణ్యభూములఁ బవి
త్రసరిత్తులఁ జూచుచున్ రమా। నుండనుఁడుండు దివ్యరుచిమన్మణిచారుకవాటగేహాళీ। మండితసౌధగోపురసమానములున్న
తిభక్తిఁ జూచుచున్। నిండినవేడ్కఁ గృష్ణపదనీరజచింతనుఁడై క్రమంబునన్* (చ॥ చనిచని తొంటిగస్స్యకురుజాంగలభూము

—విదురుండుద్ధవుం గని కృష్ణాదులవృత్తాంతంబడుగుట.—

లతిక్రమించిచ। య్యనయము నానదిం గడచి యచ్చట భాగవతున్ సరోజలో। చనగృహభక్తిసత్తుని విశారదు శాంతుని దేవమం
త్రిశిష్యుని మహితప్రసిద్ధుఁ బరిశోషితదోషుఁ బ్రబుద్ధునుద్ధవున్* (క॥ కనియనురాగవికాసము। దనమనమునఁ దొంగలింపఁ
దగఁ గాఢాలింగనమాచరించి నెయ్యం। బునఁ గుశలప్రశ్న సేసి ముదమునఁ బలికెన్* (క॥ హరిభక్తులు పుణ్యాత్ములు। చరితవి
ధూరులు పరోధికుర్దమబలులున్। గురుకులతిలకులు కుంతీ। వరసూనులు కుశలులే యవారిగభక్తిన్* (చ॥ హరిదననాభిపంకరు
హమందు జనించినయట్టి భారతీ। శ్వరుఁడతిభక్తి వేఁడ యదువంశమునన్ బలకృష్ణమూర్తులై। పరఁగ జనించి భూభరము వాపి
నమూరులు రేవతీంచిరా। వరులటశూరసేనునినివాసమునన్ సుఖమున్నవారలే *(చ॥ కురుకులులాదరింపఁగ సఖుండును నా
పుఁడు నైతనర్చిసో। దరతరుణీజనంబులనుదప్పకులంగడు గారవంబునన్। గరుణదలిర్ప నాత్మజులకంటెఁ బ్రియోన్నతిఁ బ్రో
చు వాఁడు సుస్థిరమతినున్నవాఁడె వసుదేవుఁడు వృష్ణికులప్రదీపకా॥ (శా॥ కందర్పాంశమునం దనూజుఁ బడయం గామించి భూ
దేవతాబృందంబున్ భజియించి తత్కరుణదీపింపన్ బ్రభావంబు పెం। పొందన్ రుక్మిణి గన్ననందనుఁడు ప్రద్యుమ్నుండు సుభాస్వ
చ్ఛమ్ముం సంతోషంబులు దన్నుఁ గొల్వ మహితోత్సాహంబునన్ మించునే*(క॥ సరసిజలోచనకరుణా। పరిలబ్ధసమస్తధరణిపా
లనమహామం। బరమప్రీతిసుఖించునె। చిరవిభవోచారుఁడుగ్రసేనుఁడు జగతిన్* (చ॥ లలితపతివ్రతామణివిలాసవతీతిలకం
బుపార్వతీ। లలనసమానుఁ గన్న గతిలక్షణజాంబవతీలలామ సౌ। ర్మలగతిఁ గన్నపట్టి సుకుమారతనుండు విరోధిభంజనుం। డలి
కసుఖించునే గుణకదంబుఁడు సాంబుఁడు వృష్ణిపుంగవా* (క॥ హరిపదసేవకుఁడరిభీ। కరుఁడర్జునువలన మిగులఁ గార్ముకవిద్యా
ల్ దిరముగఁ గఱచిన సాత్యకి। వరసుఖవిభవములనున్నవాఁడె ధరిత్రిన్* (మ॥ జలజాతాంకుశచక్రచాపకులిశచ్ఛత్రాదిరే
ఖాంకితో। జ్జ్వలగోవిందపదాబ్జలక్షితవిరాజన్మార్గధూళిచ్ఛటా। కలితాంగుండు విధూతకల్మషుఁడు నిష్కామైకధన్యుండు
శ్వఫల్కజుండనఁ బొల్పునట్టి ఘనుఁ డక్రూరుండు భద్రాత్ముఁడే* (క॥ శ్రుతులను గ్రతుజాతములు। న్మతిఁ దాల్చినయట్టి వేద

మాతగతిఁ గ్రీ । పతిఁ దనగర్భంబున రక్షితుఁ జేసినగతిత దేవకీపతిసుఖమే* (వ॥ మఱియు మహాత్మా మహితోపాసకులగువా
రలకోర్కులు నిండింపఁజాలిన పరమేశ్వరుండు శబ్దశాస్త్రంబునకుం గారణంబని తన్ను నఖిలదేవతాజనంబులగ్గింపంగల మే
టియగుటం జేసి మనోనయుండును సకలజీవచతుర్విధాంతఃకరణంబులకుం జిత్తాహంకారబుద్ధిమనంబులకుఁ గ్రమంబున
వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులధిదైవతంబులగుట రట్టిచతుర్విధతత్త్వంబులకుం దుర్యంబయినతత్త్వంబగు ననిరుద్ధ
కుమారుండు సంతోషచిత్తుండగు నేయుని* (మ॥ ఇతరారాధనబుద్ధిమాని కమలాధీశుం బయోజాసనా।ర్చితుఁ గృష్ణుఁ గని జనా
ఘుఁగా సతతముఁగా సేవించుపుణ్యుల్ జగ । న్నుతులధ్యాత్మవిదుల్ మహాభుజులు మాన్యుల్ ధర్మమార్గుల్ సము । న్నతిసత్యాత్మజ
చారుధీక్షణకమలాసంగాత్ము లేయుద్ధవా* (గీ॥ క్రోధమాత్సర్యధనుఁడును మోహధనుండు । వోలుచు నెవ్వనిసభఁ జూటకలుష
మొదవి।మానములోననసూయానిమున్నుఁడయ్యె। నట్టిధర్మజుఁడున్నాఁడె యనఘచరిత* (గీ॥ ఘనగదాభ్యాసచిత్రసంగతుల
మెఱసి । కురుకుమారులభూరిసంగరములోన । హతులఁ గావించి వెలసెయట్టిజెట్టి । వాయుతనయుండు కుశలియై వెలసెన
య్యె* (చ॥ హరికరుణాతరంగితకటాక్షనిరీక్షణలబ్ధశౌర్యవి । స్ఫురణఁ దనర్చి తన్నునని బోయగతిం గిరిశుండెదిర్చి నవ్వరవస
మొప్పఁగా గెలిచి పాశుపతాస్త్రముఁ గొన్న శత్రుభీ । కరుఁడు ధనంజయుండు శుభగస్థితి మోదమునొందుచుండునే* (మ॥*
తెరఁగొప్పన్ జననీవియోగమునఁ గుంతీస్తన్యపానంబు పో। దరసంరక్షయుఁ గల్గి దేవకీభువక్త్రస్థామృతంబుఁ గాఖగే।శ్వరుఁడు
ర్థిం గయికొన్న మాడ్కిఁ గురువంశశ్రేణి సిగ్గించి త। ద్ధరణీరాజ్యముఁ గొన్న మాద్రికొడుకుల్ దన్వ్యాత్ము లేయుద్ధవా* (గీ॥ పాండు
భూమీశ్వరుండు సంప్రాప్తమరణుఁ।డైనశిశువులఁ బ్రోచుటకై సిజేశుఁ। గూడిచనకున్న యట్టియాకుంతిభోజ।తనయ జీవించు
నే నేఁడు మనుచరిత్ర॥ అని వెండియు* (మ॥ అనుజాతుండగు పాండుభూవిభుఁడు నిర్యాణంబునుం బొందనా।తనిపుత్రుల్ ద
నుఁ జేరవచ్చిన నుమాధ్యస్థ్యంబుఁ బోఁ దట్టియె । గ్గొనరింకెన్ ధృతరాష్ట్రభూమివిభుఁడట్లూహింపఁగా నెగ్గుసే।సినవాఁడేయ
గుఁ గాక మేలుగల దేఁ చింతింపఁగా నుద్ధవా* (క॥ అనుజుఁడనియనక తననిజ। తనయులనను వెడలనడువఁ దానూరకయుం।డిన
ధృతరాష్ట్రుఁడు నరకంబునఁ బడునాదైనదుఃఖమునననఘాత్మా* (వ॥ అదియునుం గాక పరమశాంతుండవైన నీమనంబున దుః
ఖంబు కర్తవ్యంబు గాదంటి వేని* (క॥ నరలోకవిడంబనమున । హరిపరమపరుండు మానవాకృతితోని।ద్ధరఁ బుట్టియాత్మమా
యాస్ఫురణన్మోహింపఁజేయు భూజనకోటిన్* (ఉ॥ కావునసమ్మహాత్మునివికారవిదూరునిసర్వమోహమా । యావిలమా
యా।స్ఫురణన్మోహింపఁజేయు భూజన కోటిన్* (ఉ॥ కావునసమ్మహాత్మునివికారవిదూరునిసర్వమోహమా । యావిలమా
నసుండనగునప్పుడు సంసృతిదుఃఖనౌదున । ద్దేవుసత్కృపామహిమఁ దేరినవేళ సుఖింతు నేనకా । దావిధిశంకరప్రభృతుల
వ్విభుమాయఁ దరింపనేర్తురే* (వ॥ అయిననమ్మహాత్మునికరుణాతరంగితాపాంగపరిలబ్ధజ్ఞానదీపాంకురనిరస్తసమస్తదో
షాంధకారుండునగుటచే మదీయచిత్తంబు హరిపరాయత్తంబై తన్మార్గంబు సతతంబు నిరీక్షింపుచునుండు మఱియును* (సీ॥ అ
ట్టిసరోజాక్షుఁ డాత్మీయపదభక్తులదవులనిడుములగుడుచుచుండ । దౌత్యంబుసేయఁ గొండఱువిరోధులు హరిబద్ధునిఁ జేయస
న్నద్ధులైన। బలహీనుమాడ్కి మాఱ్పడఁగ లేఁడసమర్థుఁడని తలంచెదవేని యచ్యుతుండు । పగలజయింపనోపక కాదు మిథ్యా
భిజాత్యధనంబులజగతిఁ బెరుగు । బాధలఁగలంచు దుష్టభూపతులనెల్ల। సైన్యయుక్తులు గానని సంహరించు।కొఱకుసభలోనన
ప్పుడాకురుకుమారు।లాడుదుర్భాషణములకు నలుగఁడయ్యె* (మ॥ జననంబందుటలేనియీశ్వరుఁడుదా జన్మించు టెల్లఁ దివ్వ
రో।ధినిరాసార్థము వీతకర్ముఁడగు నద్దేవుండు కర్మప్రవ । ర్తనుఁడౌటెల్లఁ జరాచరప్రకటభూతశ్రేణులన్గర్మవ। ర్తనులం జేయఁ
దలంచికాక కలవే దైత్యారికిం గర్మముల్* (క॥ హరినగులకెల్లఁ బూజ్యుఁడు।హరిలీలామనుజుఁడును గుణాతీతుండై।పరగినభ
వకర్మంబులఁ। బొరయుండట హరికిఁ గర్మములు లీలలగున్* (క॥ మదిఁదనశాసనమిడి నిజ।పదములు సేవించు లోకపాలాదులు
వెం।పొదవింపయదుకులంబున।నుదయించెను భువిని బలునసోదరుఁడగుచున్* (గీ॥ చలనమందక భూరిసంసరణతరణ।మై
నసతీకీర్తిదిక్కులనతిశయిల్లి।వఱలసుమతియై యున్నవాఁడె కృష్ణుఁ । డనుచు నుద్ధవుని విదురుఁడడుగుటయును ॥ ఇట్లడుగఁగ న
య్యుద్ధవుండు* (క॥ యదుకులనిధియగు కృష్ణుని।పదజలజవియోగతాపభరమున మాటల్ ।ప్రిదులక హృదయం బెరియఁగఁ।బె
దవులుదడుపుచును వగలఁ బెంపఱియుండెన్* (క॥ అని చెప్పి బాదరాయణి।మనుజేంద్రునివలనుసూచి మఱియిట్లనియెన్।పను
మొకనాఁడీయుద్ధవుఁ। డనయమునైదేండ్ల బాలుఁడైయున్నతఱిన్* (వ॥ మున్ను కృష్ణునింగూడియాడు బాలకులలోనొకర్క
బాలునిఁ గృష్ణునిఁగా భావించి పరిచర్యసేయుచుండ గుణవతీమతల్లియగు తల్లి చనుదెంచి యారగింపవిదియేల రావన్నయనిపి
లిచినజననీవాక్యంబులు గైకొనక యఖండతేజోనిధియైన పుండరీకాక్షు పాదారవింద సేవానురక్తిం జేసియున్న యుద్ధవుం

---

తుర్యంబు-అతీతము — అని-యుద్ధము — నిర్వాణము — మరణము.

* తెలుఁగు-ఇట్లు ప్రాసంబులయందు లఘురేఫంబె కొన్నిటం జెప్పటంజేసి లఘ్వలఘురేఫంబులు రెండుగలపదంబులు గొన్ని గలవనియెఱుఁగుట.

డు నేఁడు కృష్ణవియోగతాపంబున హరివార్త విదురునకుఁ జెప్పంజాలక యుండుట యేమిచిత్రంబని వెండియు నిట్లనియె నంత నుద్ధవుండు సరోజాక్షు పాదారవింద మకరందసుధాజలనిధినిమగ్నమానసుండై సముత్కంఠం జింతించి యొక్కముహూర్త మాత్రంబునకు బాష్పజలపూరితలోచనుండై గద్గదకంఠుండగుచు* (క॥ ఘనముగ నెమ్మనమునమిం । దినకృష్ణవియోగజనిత శిఖిదరికొనఁగాఁ। గనుఁగవఁ బెడ చేనొత్తుచుఁ। బెనుపొందినదురితశిఖరిభిదురుఁ డవిదురుఁ ॥ కనుంగొని యిట్లనియె* (క॥ యముఁడను ఘనకాలభుజంగము పుంగవ మొదిగిపట్టఁగా యదువంశో । త్తముచారిత్రము తత్కుశ। లము లేవని చెప్పవు నను గలంగెడి మనముఁ* (సీ॥ మునిజనముఖపద్మములు ముకుళింపంగ ఖలజనలోచనోత్పలములలర । జారచోరుల కోర్కి సఫలతనొందఁగ దానవదర్పాంధతమసమడర । వరయోగిజనచక్రవాకంబులడలంగఁ గలువ జనానురాగంబు పర్వ । భూరిదోషాగమస్ఫూర్తి వాటిల్లంగ నుదితధర్మక్రియలుడిగియడఁగ । మానుషాకారగురుదికోటివంశపదియనఘయేన నేర్తుఁ గృష్ణాభిదాన । లోకబాంధవుఁ డుత్తమశ్లోకమూర్తి। మించు తేజంబుతోన నస్తమించెనయ్య ॥ మఱియు* (క॥ హలకులిశజలజరేఖా। లలితశ్రీకృష్ణపాదలక్షితమైన। ర్మ్యలగతినొప్పెడు ధరణీ। లలనామణి నేఁడు భాగ్యలక్షణయయ్యెన్* (క॥ యాదవులవలని రాజ్య। శ్రీ దొలఁగె నుధర్మగతి నశించెను భువిను। గ్యాదులు దప్పెన ధర్మో। త్పాదనమున దైత్యభేది దప్పిన పిదపన్* (వ॥ మఱియు లలితనీకమణివిరాజమానమణిగణకిరణసమమావిశేషవిడంబిత విమలసలిలంబులందుఁ బ్రతిఫలిత సంపూర్ణచంద్రమండలరుచి నిరీక్షించి జలచరబుద్ధిం జేసి తజ్జలవిలోలమీనంబులనూన స్నేహంబున నంగలంచు చంచంబునఁ గృష్ణానుచరులయిన యదువృష్ణికుమారులమ్మహానీయమూర్తిం దమమనగ్రేసరుండని కాని లీలామానుషవిగ్రహుండయిన పరమాత్ముండని యెఱుంగక హరిమాయాజనితంబగు నసద్భావనంబునం జేసి భోజనశయనాసనానుగమనంబులం జేరి సహాబాదరాదిభావంబులం గూడి చరియింతురద్దేవుని మాయాపయోనిధిని మగ్నులుగాకుండ నబ్జభవాదులకైన నంచిరము. సత్త్వగుణగరిష్ఠులు సత్పురుషశ్రేష్ఠులును పరమభాగవతులకుం దక్కం దక్కినవారలం జెప్ప నేల యదియునుంగాక యభిజనవిద్యాధనబలగర్వమదాంధీభూతచేతస్కులయిన శిశుపాలాదిభూపాలకులమ్మహాత్ముని పరతత్త్వంబని యెఱుంగక నిందించు దుర్భాషలుదలంచిన సంతాపంబు నొందుచుండుదునని వెండియు* (మ॥ అవితృప్తేక్షణధీసమాహితతపోవ్యాసంగులైనట్టి భా। గవతశ్రేష్ఠులకాత్మమూర్తి నిఖిలైకజ్యోతిమాయిఁ జూపి శోక। కవిశోకంబులు నిర్దహించి కమలాకాంతుండు శాంతుండు నా। నవరూపంబగు దేహము న్వదలి యంతర్థానుఁ డయ్యెం జూమీ* (సీ॥ మానవైకవికారమానమై తనకును విస్మయజనకమై వెలయునట్టి । యాత్మీయయోగమాయాశక్తిఁ జేపట్టి చూపుచు నత్యంత సుభగుఁడగుచు। భూషణంబులకును భూషణంబై వివేకముల కెల్లను పరాకాష్ఠయగుచు । సకలకల్యాణసంస్థానమై సత్యమై తేజరిల్లెడునట్టి దివ్యమూర్తి। దానత నమూర్తి నిజశక్తిఁ దగధరించి । యమతనూభవు రాజసూయాధ్వరంబు। నందు నెవ్వాని శుభమూర్తి నర్థితోడ । నిందు వేడుకఁ జూచి వర్ణించుచుండు* (క॥ ప్రకటముగఁ గమలభవసృష్టికిఁ గారణమిమ్మహాత్ముఁ డేయనుచును సుత్సుకులై తన్మూర్తినిక। ప్పుకసూదిరిగాదె తత్సభాజను లెల్లన్* (వ॥ మఱియు శాంతోగ్రరూపధరుండయిన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ బరకృతాపరాధని పీడ్యమానమానసుండయ్యు ననుకంపాయత్తచిత్తుండై వర్తించు పరావరుండును, ప్రకృతికార్యంబైన మహత్తత్త్వరూపుండును, జననవిరహితుండయ్యును దారువులవలన ననలంబు దోఁచుచందంబున జననంబు నొందుచుండునట్టి సరోజనాభుని మహారాసలీలానురాగవిలోకనప్రతిలబ్ధమానలైన గోపకామినులు తన్మూర్తిదర్శనానువృత్తనీపలంగలిగి వర్తించి రదియునుంగాక* (చ॥ దితిజులకోర్కి దీర్పవసుదేవుని యింటను జనించి కంసదా। నవుఁడు వధించునన్భయమున జనినందుని యింటనుఁటకుర్ । యవనజరాసుతాదులకు నాజి నెదుర్పడ వేక సజ్జన। స్తవమధురాపురీవిడిచి చాఁగుటకున్మదిఁజింతనొందుదున్ ॥ అదియునుంగాక* (సీ॥ కడఁగి పెక్కడుములఁగుడుచుచుఁజిత్తముల్లలఁగఁగబంధనాగారములను । వసరిన దేవకీవసుదేవులను డాయఁజను దెంచి భక్తివందనమొనర్చి । తలిదండ్రులార యేఁగలుగంగమీరలు కంసుచేనలజడిఁ బ్రాఁగుచుండ । గడఁగి శత్రునిఁ జంపఁగాలేక చూచుచునున్న నాతప్పు ప్రసన్నులగుచుఁ । గావుఁడని యానతిచ్చిన దేవదేవు।నచ్ఛతావహమధుర వాక్యములఁ దలఁచి। తలఁచినాదిత్తమునఁ బెద్దగలఁగుచుందుఁ । బృథులపాతకభూమిభృద్భిదుర విదుర* (క॥ విమలమతిఁ దలప నెవ్వని। బొమముడి మాత్రమున నఖిలభూదేవీభా । రమువాయునట్టి హరిపద। కమలమరందంబుఁ గ్రోలుఘనుఁ డెవ్వాఁడో* (క॥ సంప్రజ్ఞుఁడనైగో। విందుని మురదైత్యహరుని విష్ణునిఁ బరమా । నందునిఁ నందతనూజుని। మందరధరుఁ జిత్తమునందు మఱు నెయ్యెంకన్* (చ॥ అదియునుగాఁక మీ సునృపులందఱుఁ జూడఁగ ధర్మసూతి పెం। పొదవిన రాజసూయసవనోత్సవమందు మజన్మమాదిగాఁ। బదపడి యొగ్గొనఁగ్చు శిశుపాలుఁడు యోగిజనంబులిట్టిద । ట్టిదని యెఱుంగ నోపనికడింది

దౌత్యము-దూతకృత్యము. నిరాసార్థము-సంహారనిమిత్తము. భూరిసంసరణతరమైన-అపారమగు సంసారమును దాటించునదియైన. మతల్లి-శ్రేష్ఠురాలు. దురితశిఖరిభిదురుఁడు-పాపములను పర్వతములకు వజ్రమువంటివాఁడయిన శ్లోక-కీర్తి. హల-నాగలి. కులిశ-వజ్రము.

పదంబునుఁ బొందె నేకదా* (చ॥ కురునృపపాండునందనులకుం దిశకేళిఁ జయూనమేకులై । యరిదిరణోర్వి నెవ్వనిమహాభాం
బుసహోపృతమాత్మఁ గోచనో। తఱరములఁ గ్రోలి పార్థుఁ పిశిఖప్రకరక్షతపూతగాత్రులై । గురుతర మోక్షధామమునకుం జని
సౌఖ్యమునొందిరే కదా* (సీ॥ అట్టి సరోజాక్షుఁ డాద్యంతశూన్యుండు సుభగుండునై త్రిలోక్యసుందరుండు। కమనీయసాగర
కన్యకాకుచకుంకుమాంకితవిపులబాహాంతరుండు। సకలదిక్పాలభాస్వత్కిరీటన్యస్తపద్మరాగారుణపాదపీఠుఁ । డజ్ఞుఁడసం
తుఁడుసమానాధికరహితుండు సిద్ధమూర్తిత్రయాధీశ్వరుండు । నైనహరి యుగ్రసేనుని యఖిలరాజ్య । రుచిరసింహాసనము
నఁ గూర్చుండఁబెట్టి। భృత్యభావంబునొంది సంప్రీతి నతని। పనుపు సేయుట కెపుడు నానమఁగుంచ* (వ॥ అని వెండియు నిట్లని
యె నసఘాపరాత్పరుండు యోగీశ్వరేశ్వరుండు నగు కృష్ణుండు భగవద్భక్తుండు పరమభాగవతోత్తముండు నైన యుగ్రసేను
ని సేవించుట యాశ్చర్యంబు గాదు తన్నుహరియింపం దలంచి కుచంబుల విషంబు ధరించి స్తన్యపానంబు సేయించిన దుష్టచేతన
మైన పూతనకుం జన్నిచ్చి పెంచిన యశోదాదేవకినైన నంద రాని పదంబుఁ గారుణ్యదృష్టిం దైయొసంగెననిన నిజపదధ్యానపరా
యణులగు వారలననుసరించి సేవించుట చెప్ప నేలయనిన నుద్ధవునికి విదురుండిట్లనియె భక్తవత్సలుండుఁ గారుణ్యజలనిధియు
నై భాగవతజనుల ననుగ్రహించు పుండరీకాక్షుండు నిజదాసలోకంబునకొసంగు పరమపదంబు క్రకర్ములైన రాక్షసులకె
ట్లొసంగెనతై అంగెఱింగింపు మనిన విదురునకునుద్ధవుండిట్లనియె* (మ॥ దనుజానీకము నేకవారము లుదోర్దర్పంబు సంధిల్లఁగా।
వినతాసూనుభుజావరోహుఁడగుచు నష్వేష్ణుఁ సునాభాస్త్రిఁ దా । రనిలోమారొకనిపోకు పోవు హరి దైత్యారాతియంచుం ద
దా। ననముం జూచుచుఁ గూలి మోక్షపదముల్ ప్రాపింతురత్యున్నతిన్* (క॥ ధీరజనోత్తమ నవసిత। సారసనేత్రుఁడగు కృష్ణుజ
ననంబును దచ్చారిత్రము నెఱిఁగింతును। దారతనీవిపుడు వినుము తద్విధమెల్లన్* (చ॥ ధరణిభరంబు వాపుటకుఁ దామరసాస
ను ప్రార్థనక్రమా । వరుఁడలకంసబంధననివాసమునన్ వసుదేవదేవకీ । వరులకు నుద్భవించి బలవంతుఁడు కంసుఁ హింససే
యున। నిర్భరపునర్ధరాత్రి సుతుని గని యవ్వసుదేవుఁ డిమ్ములన్* (క॥ నందునిసదనంబునకుఁ జనిత। తుందరితల్పమునఁ బరులు సూ
డక యుండన్। నందనుని నునిచి యానక । దుందుభియు అలంగ నేగెం దొల్లి టిపురికిన్* (క॥ హరియేకాదశసంవత్సరములునంద
వ్రజమునఁ దను హరియని యెవ్వరు నెఱుంగకుండ నాహల। ధరుతోఁ దగ నాడుచుండెఁ దద్దయుఁ బ్రీతిన్* (క॥ గోపాలవరుల
కైనను। వాపోవఁగఁ దనసహంచి తా కారమొగిన్। జూపని శ్రీపతి వేడుక। గోపాలురఁ గూడి కాచె గోవత్సములన్* (వ॥ అయ్యవ
సరంబునం గృష్ణుండు లీలావినోదంబులతోడి గోపాలబాలురకుం జూపం దలంచి* (చ॥ వరయమునానదీసలిలఘర్షితసౌగంధ
యుక్తపుష్పమే । దురమకరందపానపరితుష్టమధువ్రతరంగమాధవీ । కురువకకుందచందనసకుంజములందు మయూరశారి
కా। పరభృతరాజకీరమృదుభాషలభంగిఁ జెలంగి పల్కుచున్* (ఉ॥ శ్రీరమణీమనోవిభుఁడు సింహకిశోరముఁ బోలి లీలఁగా।
మారదశాకారమా విమలమందిరముల్ బురణించు గోతతిన్ । వారక మేపు చుందరళవంశరవస్ఫుటమాధురీసుధా। సారము చే
త గోపజనసంఘముల న్ముదమందఁ జేయుచున్॥ మఱియు* (మ॥ దిర కేళీరతిబాలకుల్ తృణములన్ సింహాదిరూపంబుల। న్గర మొ
ప్పన్వ్రరచించి వానివ అలన్ఖండించు చందంబున । న్గరుణాతీతులు కామరూపులగు నక్కంసప్రయుక్తక్షపా । చరులం గృష్ణుఁడు
సంగరస్థలముల న్జెండాడె లీలాగతిన్*(చ॥ వరయమునానదీజలనివాసమహోరగవిస్తృతాస్యవి । స్ఫురితవిషానలప్రభల
సోఁకునఁ గ్రాఁగిన గోపగోధనో। త్కరముల నెల్లఁగాఁ దిభుజగప్రవరు న్వెడలంగఁ దోలి తత్। సరిదమలాంబుపానమున సంతసమం
దఁగఁ జేసె గోతతిన్* (మ॥ దివిజాధీశుఁ గుజెందివానకొఱకై దీపింపనందాదివ । ల్లవులేఁటేఁటన మానసంపదల నుల్లాసంబు
నం జేయును। త్సవముం గృష్ణుఁడు మాన్పి గోపగణముల్ సంప్రీతినొందన్ మచీ। ధవు గర్వంబడఁపన్ధనవ్యయము గాఁ దాఁ జేసె గోయా
గముల్* (చ॥ హరిహయుఁడంతరోషవివశావిలమానసుఁడై సరోరుహా। దరును హిమంబెఱుంగక మదంబడరం గవలా
హకాదిభీ। కరఘనపఙ్క్తిఁ బంపినన ఖండశిలామయభూరివర్షము । ల్గురిసెన మానగర్జనల గోకులమాకులమందికుందగన్*
(ఉ॥ ఆతఱిమందగొంచలము నందఁగ వల్లవులెల్లఁ గృష్ణయూ। చేతను లెల్ల నిట్టిజడిఁ జిందరవందరలై మనంబుల । న్గాతరులై రిసీ
వు కృపఁగావుమహాత్మ యనాథనాథ ని। ర్ధూతకళంకభక్తపరితోషణభూషణ పాపశోషణా* (మ॥ అనయుబ్బంగి విపన్నులయిన
లుకుమయ్యాలించి కృష్ణుండు మన। జ్జనవర్ధిష్ణుఁడు గోపగోనివహరక్షాదక్షుఁడై దేవతా । జములగ్గింపఁగ రాంబుజాతము న సచ్ఛ
త్రంబుగాఁ దాల్చె భో। రున గోవర్ధనశైలముల్ దటచరద్రమ్యామరీజాలముల్ ॥ వెండియు* (సీ॥ శరదాగమారంభసంపూ
ర్ణపూర్ణిమాసాంద్రచంద్రాతపోజ్జ్వలితమగుచు । వెలయు బృందాటవీవీధిఁ నందొకనాఁడు రాసకేళీమహోల్లాసుఁ డగు
చు। రుచిరసౌభాగ్యతారుణ్యమనోరమస్ఫూర్తిఁ జెన్నొందినమూర్తి దనర । సలలితముఖచంద్రచంద్రికాతతి గోపనయనో
త్పలముల కానందమొసఁగ। ధన్యచాతుర్యభంగిత్రిభంగియగుచు । నబ్జనాభుండు సమ్మోహనమ్ముశయిల్ల । లీలఁ బూరించె వర
మురళినినాద। మర్థివీతేరసని మోహితాత్మలగుచు* (చ॥ పతులు మఱందులున్సుతులు బావలునత్తలు మామలున్సను। న్నతివల

దన్నమూనకమునంబులఁగృష్ణపదాబ్జసేవనా । న్వితరతిగోపకామినులు వేచను దేరదయాపయోధి శో । భితగతి రాసకేళిసలి
పెంపరుణీనవపుష్పచాపుఁడై* (ఉ॥ గాముఁడు దానుగూడి మధురాపురికిం జనియం ॥ వైభవో । ద్దామనృపాసనంబునను చా
రతనున్నదురాత్మ కంసుకు । స్థామరశ్రుండ్రు జంపి ముదమారఁగఁ దల్లినిదండ్రి నందిత । శ్రీమహితాత్ములై తనగఁ జేసె స
రోరుహనాభుఁడున్నతిక* (మ॥ నలువొప్పం గమడంగయుక్తమహితామ్నాయంబు చౌషష్టివి। ద్యలు సాందీపుని చే నెఱింగెఁ
జెలువొందన్విన్నమాత్రంబులో। పలనేలోకగురుండు దానతనకున్ భావిపనన్యుల్గురు । ల్గల రేలోకవిడంబనార్థమ గుల్లీలల్గా వె
యమ్మెటికిక* (ఉ॥ మించిప్రభాసతీర్థమున మృత్యువశంబున బొందిపోయియా । పంచజనోదరస్థుఁడగు బాలుని దేశికనంద
నుం బ్రభో । దంచితలీలఁ దెచ్చి గురుదక్షిణఁగా నతిభక్తియుక్తిన । ర్పించె గురుండు చిత్తమునఁ బెంపెసలారను రారి వెండి
యుక* (సీ॥ ఘనుఁడు విదర్భేశుఁడనఁ బొప్పు భీష్మకువరసుతామణి నవవారిజాక్షిఁ । బద్మాపమానరూపశ్రీ విభాసితఁ గమనీయ
భూషణఁగంబుకంఠిఁ । జతురస్వయంవరోత్సవ సమాగత చైద్య సాల్వ మాగధముఖ్యజనవరేణ్య । నికరసమావృతఁ బ్రకటస
చ్చారిత్ర రుక్మిణిని సమాన రుక్మకాంతి। నసురగుప్తామృతము విహగాధిపభుఁడు । గొనినకైవడిగను జేంద్రకోటిఁ దోలి కమల
వాభుండు నిజభుజాగర్వ మలరఁ। దెచ్చి పరిణయంబె నెనతనినుతింప వశమె* (చ॥ పరువడిఁ బట్టిన స్తవ్యమభంబులముకుళ లుకుట్టఁద
ళ్బల । స్ఫురణసహింపఁ జాలక నృపుల్గల పడ్డజయించి నగ్నజి । ద్ధరణిపునందనన్ వికచతామరసాక్షిఁ బ్రమోదియై స్వయం। వర
మునఁ బెండ్లియాడె గుణవంతుఁడనంతుఁడనంతశక్తితోఁ* (మ॥ ప్రతివీరక్షయకారిమున్నహరిసత్రాజిత్తనూజాహృదీ।
ప్సితమున్ పీర్చెఁ దలంచి నాకమునకున్ బెంపొంద గానేగి వ । ల్గితలౌర్యోన్నతిఁ బారిజాతములకున్ లీలాగతిం దెచ్చెను । ద్ధతి దేవేం
ద్రుజయించి కృష్ణుఁడనమేతన్మాత్రుఁడే చూడఁగఁ* (సీ॥ మానితాఖిలజగన్మయ దేహమునఁ బొల్చుధరణి దేవికిఁ బ్రియతన
యుఁడైన । నరకదానవుని సువాభాఖ్యఁ జెన్నొందుఘనచక్రధారాప్రఖండితోత్త । మాంగునిఁ జేయ నయ్యావనీబలాగాంబు వేఁ
డినఁ దత్పుత్రు విమలరాజ్య । పదమున నిల్పి లోపలి మంచిరంబులఁ జిరముగ నరకుండు చెఱలఁ బెట్టి । నట్టి కన్యలు నూఱుబదాఱు
వేలు। నార్తబంధువుఁడై నపద్మాక్షుఁ జూచి । హర్షబాష్పాంబుధారాప్రవర్షమొదవఁ । బంచశరబాణనిర్భిన్న భావులగుచు*
(చ॥ లలితతదీయసుందరవిలాసవిమోహితలైన వారిని। గొలసిన కోర్కెఁ దీర్పుటకునొక్క ముహూర్తమునన్వరించి క। న్య
లలితావరోధభవనంబు వినందఱు నన్నిరూపులై । కలసి సుఖస్థితిం బని పెఁగాంతల భక్తిని శాంతచిత్తులక* (క॥ చతురతతో
నందొక్కొక । యతివకును బదేసిసుతులనాత్మసములను । న్నతభుజశక్తులఁ గాంచెను। వితతంబయి కీర్తి దిశల వినుతికి నెక్కఁ*
(సీ॥ మధురాపురముఁ జతుర్విధబలౌఘములతో నావరించిన కాలయవనసాల్వ । మగధభూపాలాదిమను జేంద్రలోకంబు సై
న్యయుక్తముగాఁగ సంహరించి । తనబాహుశక్తిఁ జిత్తముల నర్థించిన భీమపార్థులకును ద్దామవిజయ । మొసఁగి తద్వైరులను
కఱడంగఁగ ద్రుంచి బాణశంబరమురపల్వలాది। దనుజనాయకసేనావితానములను । హలధరాదిసమేతుఁడై హతులఁ జేసె।
దంతవక్త్రాదిదైత్యులుదన్నునెదుర। ఖండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి* (వ॥ వెండియుం గృష్ణుండు కౌరవపాండవ
భండనంబునకుం బోడ్పడి రాజన్యులన్యోన్య మాత్సర్యోత్సాహసమేతులై సైనికపాదఘట్టనంబుల ధరాచక్రంబు గంపింప
ననన్యసామాన్యంబులయిన శంఖభేరీప్రముఖతూర్య ఘోషంబులు సింగిరిమింగఁ దురంగమరింఖాసముద్ధూతధూళిపటలపరి
చ్ఛన్నభానుమండలంబునుఁగాఁ జనుదెంచి కురుక్షేత్రంబున మోహరించిన నుభయపక్షబలంబులందునుమాడి నిఖిలరాజ్య
వైభవమదోన్మత్తుండయిన సుయోధనుండు నిఖిలరాజసహితుండుంబునఁ గర్ణశకుని దుశ్శాసనామలదుర్మంత్రంబున నిరంతరం
బుఁ గుంతీనందనుల కెగ్గు చేసినదోషంబునం జేసి సంగరరంగంబున భీముగదాఘాతంబునం దొడలువిరిగి పుడమిం బడి గతాయు
శ్రీవిభవుండై యుండం జూచి యపరితుష్టచిత్తుండయి యపరిమితబాహుబలోత్సాహులయిన భీష్మద్రోణభీమార్జునుల చేత నఖిల
ధరాధిపతుల నష్టాదశాక్షౌహిణీబలంబులతోడం బనిమించి మఱియు స్వసమానబలులయిన యదువీరుల జయింప నెంతవారగల
రైనం బీరదుమధుపానమదవిఘూర్ణితతామ్రవిలోచనులై వర్తించు యాదవుల కన్యోన్యవైరంబులు గల్పించి పోరించి యితరే
తరకరాఘాతంబుల హతులై తనుఁ గలసినం గాని భూభారంబుడుఁగదని చిత్తంబునం దలంచి యంత ధర్మనందను చేనిస్సపత్నం
బగు రాజ్యంబు ప్రాజ్యంబుగాఁ జేయించుచుండి మర్త్యులకుం గర్తవ్యంబులైన ధర్మపథంబులు సూపుచు బంధుమిత్రుల నెల్లం బ
రితోషంబు నొందించుచుం దత్పరోక్షంబున వారి వంశంబుద్ధరింపం దలంచి యభిమన్యులవలన నుత్తరయందు గర్భంబు నిలిపి గురు
తనయప్రయుక్తను హిత బ్రహ్మాస్త్రపాతంబునఁ దద్గర్భదళనంబు గాకుండ నగ్భకుని రక్షించి నిజపదారవింద సేవారతుండైన
ధర్మజు చేఁ గీర్తిప్రతాపంబులు నివ్వటిల్లం దురంగమేధంబులు మూఁడు సేయించి వెండియు* (సీ॥ వలనొప్పలౌకికవైదికమార్గ
ముల్నడుపుచు ద్వారకానగరమందు । నవిదితాత్మీయమాయాప్రభావమున నస్సంగుడై యుండి సంసారి పగిదిఁ। జెంది కామం
బులచేత విమోహితుఁడై సుఖించుచు ముదితాత్ముఁడగుచు । నందితస్నిగ్ధస్మితావలోకముల సుధాపరిపూర్ణ సల్లాపములను।

శ్రీనికేతనమైనశరీరమునను। బాండునందనయదుకులప్రకరములను। లీలఁగారుణ్యమొలయఁబాలించుచుండె। నార్తరక్షా
చణుండునారాయణుండు* (సీ॥ సంపూర్ణపూర్ణిమాచంద్రచంద్రికనొప్పురమణీయశారదరాత్రులందు। సలలితకాంచన
సంభసౌధోపరిచంద్రకాంతోపలస్థలములందు। మహితకరేణుకామధ్యదిగ్గజములగతిని సౌదామినీలతలనడిమి। నీలమేఘం
బులలీలముక్తాఫలలలితమధ్యస్థనీలమణులభాతి। సతతయౌవనసుందరీయుతవిహారుఁ। డగుచుసతులెందఱుంగలరన్నిరూపము
లనుగ్రీడించెఁబెక్కబ్దములుసెలంగి।నందనందనుఁడభినవానంగలీల॥ అంతనొక్కనాఁడు* (చ॥ మునివరులేగుదేరయదుము
ఖ్యులుమూఁకలుగూడిముట్టఁబ। లిక్కనఁగనలొందివారుతనుకిందిశపించినఁగొన్నిమాసము। ల్చనునెడదైవయోగమునజాత
రఁబోసముకట్టివేడుక। ల్మనములఁదొంగలింపగరిమన్నిజయానములెక్కి యాదవుల్* (ఉ॥ కోరిప్రభాసతీర్థమునకుంజనిత
న్నదిఁగ్రుంకినిర్మలో। దారతనందుదేవమునితర్పణముల్పితృతర్పణంబుల। న్వారకభక్తిఁజేసిసవత్సలతోఁబొలుపారుగో
వులఁ।భూరిసదక్షిణాకముగభూసురకోటికినిచ్చి వెండియున్* (క॥ అజినపటరత్నకంబళ। రజతమహారజతతిలధరాధరక
న్యా।గజతురగరథములనుపా।ద్విజకోటికినిచ్చిపెంపుదీపింపంగన్* (వ॥ ఇట్లుసఫలంబులయినభూదానంబు మొదలుగాఁగల
దానంబులనూనంబులుగాభగవదర్పణబుద్ధింజేసియనంతరంబ* (గీ॥ ఎసఁగుమోదంబుసందిల్లనిష్టమైన।రసికమృదులాన్న
మర్థిఁబారణలుసేసి। మంజులాసవరసపానమత్తులగుచు। గడఁగియన్యోన్యహాస్యవాక్యములఁగలగి* (వ॥ ఇట్టిదశలోన
మదిరాపానమదవిఘూర్ణితతామ్రలోచనులై మత్సరంబులనొండొరులంబొడిచి సమస్తయాదవులు వేణుజాతానలంబునఁ
దద్వనవంశపరంపరలు దహనంబునొందు చందంబునఁబొలిసిరి యంతయుంగనుంగొనికృష్ణుండప్పుడు * (క॥ చతురతనో
నిజమాయా।గతిఁజూచిలసద్విలోలకల్లోలసమం। చితవిమలకమలసార। స్వతజలములఁబిహితవిధులుసలిపినవాఁడై* (క॥
ఒకవృక్షమూలతలమున। సకలంకగుణాభిరాముఁడాసీనుండై। యకుటిలమతిబదరీవని। కిఁకనీవరుగుమని మొఱఁగియేగిన
నేనున్*(క॥ క్రమముననిజకులసంహా। రముసేయఁగడంగుటెఱిఁగిరమణీయశ్రీ।రమణుచరణాబ్జయుగవిర। హముననకుమది
నోర్వలేకయనుగమనుఁడనై* (క॥ హరినరయుచుఁజనిచనియొక। తరుమూలతలంబునందుఁదనదేహరుచు।ల్పరఁగఁగనున్న
మహాత్మునిఁ।బరునిఁబ్రపన్నార్తిహరునిభక్తవిధేయున్॥ మఱియును* (సీ॥ అస్మత్ప్రియస్వామినచ్యుతుఁబరుసత్త్వగుణగరి
ష్ఠునిరజోగుణవిహీను। సురుచిరద్వారకాపురసమాశ్రయుననాశ్రయునీలనీరదశ్యామవర్ణు। దరదరవిందసుందరపత్రనేత్రు
లక్ష్మీయుతుఁబీతకౌశేయవాసు। విలసితవామాంకవిన్యస్తదక్షిణచరణారవిందుశశ్వత్ప్రకాశు। ఘనచతుర్బాహుసుందరా
కారుధీరుఁ। జెన్నుగలలేఁతరావిపై వెన్నుమోఁపి।యున్నవీరాసనాసీనునన్నుఁగన్న। తండ్రినానందపరిపూర్ణసనుజహరుని*
(మత్తకోకిల॥ కంటిఁగంటిభవాబ్ధిఁదాటఁగఁగంటినాశ్రితరక్షకు। న్గంటియోగిజనంబుడెందముఁగంటిఁజుట్టముఁగంటిమ
క్కంటికింగనరానియొక్కటిఁగంటిఁదామరకంటిఁజేకొంటిముక్తినిధానముంగలకొంటిసౌఖ్యములందఁగన్* (వ॥ అయ్యవ
సరంబునంబరమభాగవతోత్తముండుమునిజనసత్తముండు ద్వైపాయనసఖుండుం బరమతపోధనుండు సకలమాన్యుండునఖి
లజనమాన్యుండుబుధజనవిధేయుండునగుమైత్రేయుండుతీర్థాచరణంబుసేయుచుంజనిచని* (మ॥ కనియెందాపసపుంగవుం
డఖిలలోకఖ్యాతవర్ధిష్ణుశో। భనభాస్వత్పరిపూర్ణయౌవనకళాభ్రాజిష్ణుయోగీంద్రహృ। ద్వనజాతైకచరిష్ణుఁగౌస్తుభమ
ణోద్యద్భూషణాలంకరి।ష్ణునిలింపాహితజిష్ణువిష్ణుఁబ్రభవిష్ణుంగృష్ణురోచిష్ణునిన్*(క॥ తదనంతరంబహరిఁదన।హృదయాబ్జ
మునందుముకుళితేక్షణములన।మ్మదమునఁజూచుచునానత। వదనుండైయుండెముదముపఱలఁగననఘా* (వ॥ అంతడగ్గరనే
తెంచియున్న మైత్రేయుండువినుచునుండదరహాస చంద్రికాసుందర వదనారవిందుండు నానందసుధానిష్యందకందళితహృ
దయుండుభక్తానురక్తదయాసక్తవిలోకనుండునగు పుండరీకాక్షుండు నన్నునిరీక్షించియిట్లనియానతిచ్చెఁ బూర్వభవంబు
న, వసుబ్రహ్మలుసేయుసత్రయాగంబున వసువైభవదీయహృదయంబున నితరపదార్థంబులుగోరకమదీయపాదారవిందసే
వయపేక్షించితి కావునం దన్నిమిత్తంబున నేనునీహృదయంబునవసియించి సమస్తంబునుగనుఁగొందు నాత్మారాముండనయిన
నన్నునెవ్వరేనియుసదసద్వివేకులై యెఱుంగంజాలరు - వారలకు నేనగోచరుండనై యుందు-- మత్పరిగ్రహంబుగలనీకునీజ
న్మంబె కానిపునర్భవంబునొందకుండుటకు భవదీయపూర్వజన్మకృతసుకృతవిశేషంబుకతననీయాశ్రమంబునమత్పదారవిం
దసందర్శనంబుకలిగెనదియునుంగాక పద్మకల్పంబునందుమన్నాభిపద్మమధ్యనిషణ్ణుండయిన పద్మసంభవునకుజన్మమరణాది
సంసృతినివర్తకంబు, నపరతానశ్వరసౌఖ్యప్రవర్తకంబునగుమన్మహత్త్వంబుదెలియంజేసిన దివ్యజ్ఞానంబునీకునెఱింగింతున
నియమ్మహనీయతేజోనిధియానతిచ్చినసుధాసమానసరసాలాపంబులు కర్ణకలాపంబులై మనస్తాపంబులంబాపినరోమాంచ
కంచుకితశరీరుండ,నానందబాష్పధారాసిక్తకపోలుండ, పరితోషసాగరాంతర్నిమగ్నమానసుండనయి యంజలిపుటంబుని
టలతటంబునఘటియించియిట్లంటి* (క॥ పురుషోత్తమ నీపదసర।సీరుహమననామృతాభిషేకస్ఫురణాన్తర మొప్పిననాదిత్తమ

తరవస్తువులంకు వాంఛఁదగులు నెయ్యెందుఁ* (చ॥ జననము లేనినీవుభవసంగతినొందుట కేమి కారణం।బనియును గాలసంహా
రుఁడవై జగముల్విలయించునీవుపా । యనిరిపుభీతికై సరిదుదంచితదుర్గము నాశ్రయించుటె । ట్లనియును దేవ నామనము నం
దుఁదలంతు సరోజలోచనా॥ అదియునుంగాక* (క॥ శ్రీరమణీశ్వర నీవా । త్మారాముఁడవయ్యులీలఁదరుణీకోటిం।గోరిరమిం
చితివనీయును। వారకయేఁదలఁతుభక్తవత్సలకృష్ణా*(క॥ పరతత్త్వజ్ఞులు కరుణా। కరనిను సంసారరహితుఁగాఁదలపోయ।న్నర
సినినుఁగాంచు టెట్లను।గరమరు దేతలఁచిచూడఁగ మలాధీశా* । (వ॥ దేవా నీవ ఖండితవిజ్ఞానరూపాంతఃకరణుండవయ్యును
ముగ్ధభావంబునం బ్రమత్తుని చందంబున నిర్మోహికై వడిం బ్రవర్తించుచు నెందేనియు నొదిగి యుండుటం దలంచి నా డెందంబు
గుందుచుండు సరసిజలోచన, సురవందిత, ముకుంద, యిందిరాసుందరీరమణ, సరస్వతీరమణున కుంగరుణించిన విజ్ఞానంబు
ధరించు శక్తి నాకుం గలదేని గృపసేయుము - భవదీయశాసనంబు ధరియించి భూరిసంసారపారావారోత్తరణంబు సేయుదున
నివిన్నవించి బహుభంగులం బ్రస్తుతించిన భగవంతుండుం బ్రపన్నపారిజాతుండునై కృష్ణుండు పరతత్త్వనిర్ణయంబు నెఱింగిం
చిన*(క॥ సరసిజలోచన కరుణా। పరిలబ్ధజ్ఞానకలితభావుఁడనగుటఁ । బరతత్త్వవేదినైత । చ్చరణసరోజముల కెఱఁగి సమ్మతి
తోడఁ*(క॥ హరిపదజలరుహవిరహా।తురఘనదుర్దాంతదుఃఖతోయధిఁగడువ । న్నెరవేదిత్రిరుగవలసెను।సరసిజభవకల్పవి
లయసమయముదాకఁ॥ ఇట్లుదిరుగుచు* (మ॥ నరనారాయణతాపసాశ్రయపదౌన్నత్యంబునం బొల్చుభా। సురమందారర
సాలసాలవకుళాశోకామ్లపున్నాగకే।సరజంబీరకదంబనింబకుటజాశ్వత్థస్ఫురన్మల్లికా। కరవీరక్షితిజాభిరామబదరీ కాంతా
రసేవారతిఁ* (క॥ చనుచున్నవాఁడననిప।ల్కినపలుకులకులికికళవళింపుచు విదురుం। డనుపమశోకార్ణవమున।మునిగియు
నిజయోగసత్త్వమునఁదరియించెఁ* (వ॥ ఇట్లు విదురుండు శోకపావకునిం దనవివేకజలంబులనార్పియుద్ధవునకిట్లనియె*(మ॥
అనఘా యుద్ధవ నీకుఁ గృష్ణుఁడు సురేంద్రారాతి మున్నిందిచె । ప్పినయధ్యాత్మరహస్యతత్త్వవిమలాభిజ్ఞానసారంబు భో । రనన
న్నుంగరుణించి చెప్పినఁ గృతార్థత్వంబునుం బొందెద । న్వినుపుణ్యాత్ములు శిష్యసంఘములనుర్విం బ్రోవరే వెండియుఁ* (క॥
భగవద్భక్తులు సుజనులు।దగవెఱిఁగి పరోపకారతాత్పర్యవివే।కగరిష్ఠులై చరింతురు। జగతిం బెంపొందివృష్ణిసత్తమ యెందుఁ*
(క॥ అనవుడునుద్ధవుఁడవ్విదు। రునకిట్లను ననఘమునివరుఁడు సాత్వాద్వి । ష్ణునిభుండగు మైత్రేయుఁడు।దనమనమునసుజగతి
పచలఁదలఁచితగఁ*(క॥ హరిముర భేదిఁ బరాపరుఁ । గరుణాకరుఁ దలఁచునట్టి ఘనుఁడెమ్మునికుం।జరుకడకేగిన నాతఁడు।గరమ
ర్థిం దెలుపు సాత్త్వికజ్ఞానంబుఁ॥ అనియుద్ధవుండు విదురుంగూడి చనిచని* (ఉ॥ ముందటఁ గాంచిరంత బుధముఖ్యులు హల్లకఫు
ల్లపద్మని। వ్యంపమరంధపానవిలసన్మదభృంగజలత్తరంగమా । కందలవంగలుంగలతికాచయసంగసురాంగనాశ్రితా। నం
దితపుణ్యసంగయమునన్భవభంగశుభాంగనర్మిలిఁ* (క॥ కని డాయ నేగి మోదం।బునఁదత్సరిదమలపులినభూములఁదగనా।
దిన శేషమునవసించిరి।వనజోదర పాదపద్మవశమానసులై* (క॥ మరునాఁడు రేపకడ భా।సురపుణ్యుఁడు ఘనుఁడు మధునిషూ
దనచరణ।స్మరణక్రీడాకలితుఁడు।దరియించె న్గలుషగహనదహనన్యమునన్* (వ॥ ఇట్లుద్ధవుండు యమునానదినుత్తరించి బద
రికాశ్రమంబునకుం జనియెననిన విని రాజేంద్రుండు యోగీంద్రునకిట్లనియె* (క॥ శౌరియు నతిరథవరులును । హారథసమరథు
లుయదుబలాధిపులెల్ల।న్బోరిమృతిఁబొందనుద్ధవుఁ। డేరీతిఁ బ్రతికెనాకు నెఱిఁగింపుతగన్* (సీ॥ నావుడు రాజేంద్రునకు శుక
యోగీంద్రుఁడిట్లను మునుపరమేష్ఠి చేత । సంప్రార్థితుండైన జలరుహనాభుండు వసుమతిపైయదువంశమందు । నుదయించి త
నుదానవదిలోనఁ జింతించి తెలివొంది యాత్మీయకులవినాశ । మొనరించి తానుబంచోపనిషణ్మయమగు దివ్యదేహంబునందుఁ
జెందఁ । దలఁచి విజ్ఞానతత్త్వంబు ధరణిమీఁదఁ । దాల్చి జనకోటి కెఱిఁగింపఁదగిన ధీరుఁ । డుద్ధవుఁడు దక్క నితరులు నోపరితఁ
డుఁజితేంద్రియుఁడాత్మసన్నిభుఁడటంచు* (క॥ క్షితిపైనిలిపిన కతమున।నతనికి మృతిదొరకదయ్యె నవనీశ రమా। పతియభి
మానము గలిగిన।యతిపుణ్యుఁడు చనియె బదరికాశ్రమమునకున్॥ అంత* (క॥ ఉద్ధవుఁడరిగిన పిదప । సిద్ధపరిజ్ఞాను సుజనహి
తు మైత్రేయు। న్వృద్ధజనసేవ్యుఁదాపస । వృద్ధశ్రవుఁజూడఁగోరి విదురుఁడు గడకన్* (వ॥ యమునానది దాఁటి కతిపయ

—— విదురమైత్రేయ సంవాదము. ——

ప్రయాణంబులఁ దత్పుణ్యనదుల హరిక్షేత్రంబులను దర్శించుచు నతిత్వరితగమనంబున* (క॥ చనిచని ముందటఁ గనుఁగొనె।ఘు
నపాపతమఃపతంగఁ గరుణాపాంగ।న్ఘనదుత్తుంగతరంగ।న్సజ్జనవరనుతబహుళపుణ్యసంగన్గంగన్* (క॥ అందు నరవిందసౌరభ।
నందిత పవమానధూతనటదూర్మిపరి । స్పందితకందళశీకర । సందోహలసత్ప్రవాహజలమజ్జనుఁడై* (సీ॥ ఘనసారగుచి
వాలుకాసముదంచితసైకత వేదికాస్థలమునందు । యమనియమాదియోగాంగ క్రియానిష్ఠఁబూని పద్మాసనాసీనుఁడగుచు।
హరిపాదసరసీరుహన్యస్తచిత్తుఁడై బాహ్యేంద్రియవ్యాప్తిఁ బాఱఁదోలి । సకలవిద్వజ్జనస్తవనీయసముచితాచార వ్రతోప
వాసములఁ గృసి। యున్నపుణ్యాత్ము విగతవయోవికారు।వినుతసంచారు భువనపావనవిహారు । యోగిజనగేయు సత్తతిభాగ

ధేయు।నాశ్రితవిధేయుమైత్రేయునపుడుగాంచె* (వ॥ ఇట్లుకనుంగొనియమ్మునీంద్రుని పాదంబులకుంబ్రణమిల్లి ముకుళిత
హస్తుండైయిట్లనియె మునీంద్రాలోకంబున సకలజనంబులుమనంబులఘనంబులగు సౌఖ్యంబులందలంచితత్ఫలప్రాప్తిహేతు
వులైనకర్మంబులాచరించిదైవోపహతులైతత్కర్మంబులచేత నిష్ఫలారంభులగుదురు కర్మంబులుబంధకరంబులు దుఃఖహే
తువులుంగానిసౌఖ్యదాయకంబులై పాపనివృత్తిఁజేయనోపవదియట్లుండె భూరిదుఃఖానుసాగరంబైన సంసారచక్రంబు
నం బరిభ్రమించుచుంగామ విమోహితులై పూర్వకర్మానుగతంబులైన శరీరంబులుదాల్చుచుఁజచ్చుచు మఱలంబుట్టుచు
నంతకాలంబునకుఁ బాపనిర్ముక్తిఁగానక మాతృయోనవనవనవరారులై జనియించి వర్తించుమాహాత్ములం బరుప్రాయులర
క్షించుకొఱకుఁగాదె నారాయణపరాయణులైన మీవంటిపుణ్యాత్ములులోకంబునంజరియించుట యదియునుంగాక* (మ॥
అవివేకానుగతస్వకార్యజలవేలాకీర్ణమైమిత్రబం। ధువధూపుత్రజలగ్రహోగ్రయుతమై దుర్దాంతసంసారదు। గ్ధరపా
థోధిఁదరించునారెహరిసంబంధక్రియాలోలభా।గవతానుగ్రహనావలేనియథముల్కారుణ్యసంధాయకా* (క॥ మునినాథ
చంద్రననుఁగై।కొని కాచుతలంపుబుద్ధిగొనకొనినఁదగ। న్వినుముచుదీప్సితమదినా। చనువునఁగావింపుమయ్యసజ్జనతిలకా*
(వ॥అనివెండియువిదురుండుమైత్రేయుంజూచి మునీంద్రా త్రిగుణాత్మక మాయానియంతయగు భగవంతుండుస్వతంత్రుం
డగుచునవతరించియెయ్యేయవతారంబులందు నెయ్యేకర్మంబులాచరించెనదియునిష్క్రియుండగునీశుండు మొదలఁబ్రపం
చంబు నేపథంబునంగల్పించె నేపగిదిదీనింబాలించెనఁటియునీవిశ్వంబు నాత్మీయహృదయాకాశగతంబుంజేసి నివృత్తవృత్తి
యగుచుయోగమాయయందు నెట్లువసించె- బ్రహ్మాంశంబునందు నేలీలఁబ్రవర్తించెనందు బ్రహ్మాదిరూపంబులంబొంది బహు
ప్రకారంబులనెట్లుక్రీడించె- భూసురగోసురాదులకొఱకుంబుకొఱకై మత్స్యాద్యవతారంబులుధరించె యేయేప్రయోజనం
బులందీర్చెఁ- బయోరుహగర్భాండకటాహాంతర్గతంబులై లోకపాలసహితంబులైనలోకంబుల లోకాలోకపర్వతంబులబ
హిర్భాగంబుల నెయ్యేతత్వభేదంబుల నే తెఱంగునంబుట్టించెనంతఁబ్రతీతంబగు జీవకోటియెవ్వానిం గొల్చి బ్రహుజనులకుం
గర్మనామరూపభేదంబు లెట్లునిర్దేశించె నింతయుసవిస్తరంబుగావింపు ముత్తమశ్లోకమౌళిమండనునకు యోగీశ్వరేశ్వరుం
డయినపుండరీకాక్షుని చరిత్రశ్రవణంబునంగాని జన్మమరణాదిసకలదుఃఖాకరంబులు దుష్కర్మప్రాప్తంబులునగుభవబంధం
బులు దెగవని వెండియునిట్లనియె* (తరల॥ సతతమున్సరసీరుహోదరసత్కథామృతపూరముల్। శ్రుతిపుటాంజలిచేతని
మ్ములజుట్టియుంకనివోదుభా। రతకథామిషమూనివిష్ణుఁబరాశరప్రియసూతిస। న్మతినుతించినచోటసమ్మునినాథ నామనసు
బ్బుదుల్* (క॥ ఇతరకథావర్ణనముల। నతిహేయతనొందెఁజిత్తమునఘాత్మరమా।పతిచరితామృతరతిసం।సృతివేదనలెల్లఁ
బాయఁజేయుమునీంద్రా*(గీ॥భూరివిజ్ఞానవిమలగునారదాది।నిర్మలాత్ములకయినవర్ణింపరాని। హరికథామృతపానంబునం
దువిసివి।యొల్లననువాఁడెపోవెట్టిగొల్లఁడనఘ*(సీ॥అరవిందనాభునియవతారమైజననమందినపరాశరసుతుండు।సు
హినొప్ప వర్ణాశ్రమాచార ధర్మముల్వర్ణింపలోకవిడంబనములు। నగుగ్రామ్యకథలుపెక్కర్థిఁగల్పించుచు హరికథావర్ణన
మంతలోన।నిందుకించుకగానియేర్పడఁజూప్పమినంచితవిజ్ఞానమాత్మనిలువ। కున్నఁజింతించిమఱినారదోపదిష్టుఁ।డగుచుహ
రివర్ణనామృతమాత్మఁగ్రోలి।విమలసుజ్ఞాననిధియనవినుతికెక్కి।ధన్యుఁడయ్యెనులోకైకమాన్యుఁడగుచు॥ కావున* (క॥సర
సీరుహోదరుమంగళ। చరితామృతమాత్మఁగ్రోలుజనుఁడితరకథా।గరళముఁగ్రోలునెహరిసం। స్మరణముజీవులకునఖిల
సౌఖ్యదమనఘా* (క॥ శ్రీవసతాధిపునాదుక।థావిముఖులకిహముపరముదవ్వైపిదపం। బోవుదురునరకమునకు।న్నాపరి నే
వారిఁజూచివగతుమునీంద్రా*(క॥పనరుఁడేనొకనిమిషం। బైనవృథావాదగతినిహరిపదకమల।ధ్యానానందుఁడుగాఁడే।నా
నరునకునాయువల్పముగుముని నాథా* (చ॥ మృదుగతిఁబువ్వుదేనియరమించుచుఁబానముసేయఁబాఱుప। ట్పదమునుబోలి
యార్తజనబాంధవువిశ్వభవస్థితివ్యయా। స్పదమహితావతారుఁడగుపంకరుహోదరునిత్యమంగళ। ప్రదగుణకీర్తనామృ
తముఁబాయకఁగ్రోలెదఁజెప్పవేదయన్* (క॥ అనివిదురుఁడుమైత్రేయుం। డనుమునినాయకునినడిగెనని వేదవ్యా। సునిత
నయుండభిమన్యుని।తనయునకుంజెప్పిమఱియుఁదగనిట్లనియెన్* (వ॥ ఇట్లువిదురుండుమైత్రేయునడిగిననతండతనింగనియ
తన్మృదుమధురవచనరచనుండై యిట్లనియె ననఘాకృష్ణకథాశ్రవణతత్పరుండవై నీవునన్నడిగితివిగావున భద్రంబయ్యెనీవు
భగవద్భక్తుఁడవుగావున హరికథాసక్తుండవగుట చిత్రంబుగాదదియునుంగాక మాండవ్యునిశాపంబున సాత్యవతేయువల
నభ్రాతృక్షేత్రంబున శూద్రయోనింబుట్టినట్టి ప్రజాసంయమనుండవగు యముండవు పరమజ్ఞానసంపన్నుండవు నారాయ
ణునకుంబ్రియుండవుగావునఁ గృష్ణుండునిర్యాణకాలంబునం దనసన్నిధికింజనననన్నుఁజాయంజీఱి విజ్ఞానంబెల్లనుపదేశించి
నీకునెఱింగింపుమనియానతిచ్చుటంజేసియవశ్యంబునీకునెఱింగింతుదత్తావధానుండవైవినుమని* (క॥వనజాక్షుయోగమా
యా।జనితంబగువిశ్వజననసంస్థానవినా।శములతెఱంగెఱిఁగింపుదు। ననఘావిష్ణునిమహత్వమభివర్ణింతున్* (సీ॥ సకలజీవు

లకెల్లఁ బ్రకటదేహమువాత్మనాథుం డపరుఁడు నానాపరైక । మత్స్యవలక్షణసహితుండును భగవంతుండు సృష్టిపూర్వం
బునందు । నాత్మీయమాయలయంబునొందినవిశ్వగర్భుఁడై తానయొక్కటివెలుంగు । పరమాత్ముఁడభవుండు మహాద్రష్టయయ్యు
వస్త్వంతరపరిశూన్యుఁడగుటఁజేసి । ద్రష్టగాకుండుమాయాప్రధానశక్తి నశులదిచ్ఛక్తిగలవాఁడునగుచుఁదన్ను లేనివా
నిఁగఁజిత్తంబులోనఁదలఁచి । ద్రష్టయగుతనభువనసర్జనవాంఛ* (గీ॥ బుద్ధిఁదోఁచినసమ్మహాపురుషవరుఁడు । కార్యకారణ
రూపమైమనతకెక్కు । భూరిమాయాభిధానవిస్ఫురితశక్తి వినుతికెక్కు నయట్టియవిద్యయందు* (క॥ పురుషాకృతినాత్మాంశ
స్ఫురణముగలశక్తి లిపిపురుషోత్తముఁడీశ్వరుఁడభవుండజుఁడు నిజోదరసంస్థితవిశ్వమహపుడుదగఁబుట్టించెన్* (సీ॥ ధృతి
బూని కాలచోదితము నవ్యక్తంబు ప్రకృతియనను పేళ్లఁబరఁగుమాయ । వలనమహత్తత్త్వమెలమిఁబుట్టించె మాయాంశకా
లాదిగుణాత్మకంబు । నైనమహత్తత్త్వమచ్యుతదృగ్గోచరమగుచువిశ్వనిర్మాణవాంఛ । నందఁటఁజేసిరూపాంతరంబునఁబొం
దినట్టిమహత్తత్త్వమందు నోలిఁ । గార్యకారణకర్తాత్మకత్వమైన । మహితభూతేంద్రియకమనోమయమనంగఁ । దగునహం
కారతత్త్వముత్పన్నమయ్యె । గోరిసత్త్వరజస్తమోగుణకమగుచు* (వ॥ వెండియు రూపాంతరంబులం బొందుచున్న సాత్త్వికా
హంకారంబువలన మనంబునై కారికకార్యభూతంబులైన దేవతాగణంబులును సంభవించె - నింద్రియాధిష్ఠాతలయినవానివ
లన శబ్దంబుపూర్వంబునఁ బ్రకాశంబగుటం జేసి జ్ఞానేంద్రియంబులయిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును గర్మేం
ద్రియంబులయిన వాక్పాణిపాదపాయూపస్థలును దైజసాహంకారంబున నుత్పన్నంబయ్యెఁ - దామసాహంకారంబువలన
శబ్దస్పర్శరూపరసగంధంబులుదయించె - నందుశబ్దంబునిజగుణంబయినశబ్దంబువలనాకాశంబుఁబుట్టించె - గగనంబుకాల
మాయాంశయోగంబునం బుండరీకాక్షునీక్షణంబున స్పర్శతన్మాత్రంబువలనవాయువుంగలిగించెఁ - బవనుండునభోబలం
బునరూపతన్మాత్రంబువలన లోకలోచనంబయిన తేజంబును త్పాదించెఁ - దేజంబుకాలమాయాంశయోగంబునను త్తమశ్లో
కునిపలోకనంబునఁ బవమానయుక్తంబగుచు రసతన్మాత్రంబువలన నంబువులుఁగలిగించె - సలిలంబుకాలమాయాంశయో
గంబునంబరమేశ్వరానుగ్రహంబుగలిగి తేజోయుక్తంబై గంధగుణంబువలనఁబృథివిఁగలిగించె - నందుగగనంబునకు శబ్దంబు
వాయువునకు శబ్దస్పర్శంబులుఁ, దేజంబునకు శబ్దస్పర్శరూపంబులు, సలిలంబునకు శబ్దస్పర్శరూపరసంబులుఁ, బృథివికి శబ్దస్ప
ర్శరూపరసగంధంబులును, గుణంబులైయుండుఁ - గాలమాయాంశలింగంబులుగలిగి మహదాద్యభిమానంబులు నొందినదేవ
తలు విష్ణుకళాకలితులగుచు నట్టి మహదాదితత్త్వంబులైక్యంబు చాలమిం బ్రపంచంబుం గల్పింప సమర్థంబులుగాక కృతాంజ
లులై యోగీశ్వరేశ్వరుండయిననారాయణునిట్లని స్తుతియించె* (దండకము॥ శ్రీనాథనాథా జగన్నాథ నమై)కరకాపిపక్ష
క్షమాభృత్సహస్రాక్ష నీరేజపత్రేక్షణా దేవదేవా భవద్దాసవర్గాను తాపంబులం బాపఁగా నోపు దివ్యాతపత్రంబునాఁబొ
ల్చు యుష్మత్పదాంభోజమూలంబు పుణ్యాలవాలంబుగాఁ బొందియోగీంద్రులుద్దామ సంసారతాపంబులం బాయఁగా మీ
టివర్తింతు రోతండ్రి యీశా సమస్తాఘనిర్ణాశ యీవిశ్వమందెల్లజీవుల్ భవోదగ్రదుర్వారతాపత్రయాభీల దావాగ్ని
చేఁ గ్రాఁగి దుఃఖాబ్ధిలోఁదోఁగి యేకర్మముం ధర్మముం బొందఁగాలేక సంసారచక్రంబునం జిక్కి బరిభ్రామ్యమాణాత్ములయి
యుండురమ్మూఢచేతస్కులం జెప్పఁగా నేల నోదేవ విజ్ఞానదీపాంకురంబయిన మీపాదపంకేరుహచ్ఛాయఁ బ్రాపింతురజ్ఞాత్మ
సన్మానిసంఘంబులయి కాంతికస్వాంతతం బేర్చి దుర్దాంతపాపౌఘనిర్ణాశకాంబుప్రవాహౌఘ గంగానివాసంబనా నొప్పు మీ
పాదయుగ్మంబు యుష్మన్ముఖాంభోజనీడోద్గతంబయిన వేదాండజశ్రేణిచేతం గవేషించి సంప్రాప్తులై యుందురో నాథ వైరా
గ్యశక్తిస్ఫుటజ్ఞానబోధాత్ములైనట్టి ధీరోత్తముల్ నిత్యనైర్మల్యభవ్యాంతరంగంబులం దేపరంజ్యోతి పాదాబ్జపీఠంబు గీలించి
కైవల్యసంప్రాప్తులై రట్టి నిర్వాణమూర్తిం బ్రశంసింతు మింద్రాదివంద్యా ముకుందా సమస్తంబు గల్పింపఁ బాలింపఁ దూలిం
పఁగాఁ బెక్కు దివ్యావతారంబులం బొందు నీపాదపంకేరుహధ్యానపారీణసుస్వాంతులై యొప్పు భక్తాళికిన్మోక్షదంబైన మీ
పాదకంజాతముల్ గొల్తు మీశా రమాధీశ పుత్రాంగనామిత్ర సంబంధబంధంబులం జెంది సోహంమమేతి క్రియాలోలులై దేహ
గేహంబులందోలి వర్తించు దుర్మానవశ్రేణులం దంతరాత్ముండవయి యుండియున్ దూరమై తోఁచు మీపాదపద్మంబులర్చింతు
మో దేవ బాహ్యేంద్రియవ్యాప్తిమద్వృత్తులైనట్టి మూఢాత్ములధ్యాత్మ తత్త్వప్రభావాఢ్యులై మీపదాబ్జాతవిన్యాస లక్ష్మీక
ళావాసముం గన్నయయ్యుత్తమశ్లోకులం గానఁ గాజాలర ప్పుణ్యులాదుష్టులం జూడఁ గానొల్లరంభోధిరాట్కన్యకాకాంత
వేదాంతశుద్ధాంతసిద్ధాంతమై యొప్పు మీసత్కథాపారచంచత్సుధాసారపూరంబులం గ్రోలి సౌఖ్యోన్నతిం బ్రోలి ధీయుక్త
లై వ్రాలి తాపంబులందోలి మోదంబులం దేలి సంపన్నులై మన్ననిత్యప్రపన్నుల్ మహాత్మ్యోన్నతం బేర్చి వైకుంఠధామం
బునల క్రియాలోలులయి కాంతు రద్దివ్యవాసైకసంప్రాప్తికిం గోరుచున్నారమో దేవ వైరాగ్యవిజ్ఞానలబోధాత్మయోగక్రి
యాహృతినంతర్బహిర్వ్యాప్తిం జాలిందివిశుద్ధాంతరంగంబుగావిందివ్యాత్పద్మవాసుండవై చిన్మయాకారమయియున్ననీయు

న్నతానంత తేజోవిలాసోల్లసన్మూర్తిఁజిత్తంబులం జేర్చి యానందలోలాత్మతం బొల్పు యోగీశ్వరశ్రేణికిం దావకీనానుకం
పానులబ్ధస్ఫుటజ్ఞానముం గల్గుటం జేసి యాయాసమురజేంకరో దేవతాచక్రవర్తీ సదానందమూర్తీ జగద్గీతకీర్తీ లసద్భూతవ
ర్తీ భవద్దాసులైనట్టి మమ్ముం జగత్కల్పనాసక్తచిత్తుండవై నీవు త్రిగుణ్యవిస్ఫూర్తిఁ బుట్టించినం బుట్టుటే కాక నీ భవ్యలీలా
నుమేయంబుగా సృష్టినిర్మాణముం జేయ నేమెంతవారమ్ము మచ్ఛక్తియుక్తిప్రవర్తుల్ జగంబౌ నిట్లుండె నీసత్కళా
జాతులమ్మైన మమ్మెన్నఁగా నేలన ధ్యాత్మతత్త్వంబవన్నంబరంజ్యోతివన్నం ప్రపంచంబవన్నన్నధిష్ఠాతవన్నన్సదాసాక్షివ
న్నన్నిర్గుణాతీతనీ వేకదా పద్మపత్రాక్షసత్త్వాది త్రిగుణ్యమూలంబు నానొప్పుమాయాగుణంబందు నుద్యన్మహాతత్త్వమైనట్టి నీ
వీర్యముం బెట్టుటం జేసి నీవింతకుం గారణంబౌదు వా యాయి కాలంబులన్నిటను సౌఖ్యంబులే మెట్లు గాంతు మేరీతి నన్నం బుభ
క్షింతు మెబ్భంగి వర్తింతు మే నిల్కడన్నుం చు మీజీవలోకంబె యాధారమై యుండి భోగంబులం బొందుచున్నన్నయి కార్య
సంధానులమ్మైన మాకుం జగత్కల్పనాశక్తికిన్ దేవ మీశక్తిఁ దోడ్పాటుగా విందువిజ్ఞానముం జూపి కారుణ్యసంధాయివై మ
మ్ముగక్షింపు లక్ష్మీమనఃపల్వలక్రోడయోగీంద్రచేతస్సరోహంస దేవాదిదేవా నమస్తే నమస్తే నమః* (సీ॥ అనినఁబ్రసన్నుఁ
డై హరి మహదాదుల కన్యోన్యమిత్రత్వమంచకున్న। కతమున నిఖిలజగత్కల్పనాశక్తి వొడమకుండుటఁ దనబుద్ధి నెఱిఁగి।
కైకొని కాలవేగమున నుద్రేకంబునొందిన ప్రకృతితోఁ బొందినిజబ। లము నిల్పి తా ననుక్రముఁడనస ప్తవింశతి తత్త్వములయం
దు సమత నొక్క। పరిఁబ్రవేశించి యాతత్త్వభవ్యగుణము। నం దుఁజ్యేష్ఠానురూపంబులలరఁజేంది। యొకటినొకటిని గలయక
యుండి విశ్వ। రచన నెఱుఁగని యాతత్త్వనిచయమునకు* (వ॥ ఇట్లు విశ్వనిర్మాణనిపుణత్వంబు నెఱుంగంజూపుచు నన్నింటికి
నన్యోన్యతం గల్పించి తనయనుగ్రహంబునం బ్రేరితంబయి కొనంబడి క్రియాసామర్థ్యంబునఁ జెన్నొందిన తత్త్వవితానంబు
దేవప్రేరితంబయి స్వకీయంబులగు నంశంబులచేతం బుట్టించిన విరాడ్విగ్రహంబయి తత్త్వవితతి దమయందుఁ జెందిన పుండరీ
కాక్షునికళాంశంబున నొకటికొకటికి నైక్యంబు వాటిల్లి పరిణతంబై రూపాంతరంబును జెందె నేతత్త్వంబున నేని యుఁజరా
చరలోకపుంజంబులుండి యుండు నా హిరణ్మయంబయిన విరాడ్విగ్రహంబునొందిన పురుషుండు సర్వజీవసమేతుండయి యుం
డెనంత* (క॥ జలములలోపల నిమ్ముల। జలగుహ జాతాండమందు సాహస్రాబ్దం। బులునిలిచెఁ గార్యరూపా। కలితంబగు నవ్విరా
ట్పుగర్భమువరుసన్* (గీ॥ దైవకర్మాత్మశక్తివితానములను। దగిలితఁనచేతఁ దానేకదైవశక్తి। యనుచు వెలుఁగొందుచుం బ్ర
కాశాంతరమునఁ। దనువువితతంబుఁ గాని చైతన్యమొంది* (గీ॥ రూపసంశక్తిఁ జేసి నిరూఢకర్మ। శక్తియును వృత్తిభేదసంసక్తి
దశవిధములుగలిగిన ప్రాణరూపమున నాత్మ। శక్తిబోధత్వమగుచున్నశక్తిగలిగి* (క॥ త్రివిధంబగుచును నాధ్యా। త్మ్యవిభే
దంబునను భాపితమఱియధిభూతా। త్మవిరాడ్రూపంబగు నిది। వివిధప్రాణులకు నాత్మ విధమై మఱియున్* (క॥ జీవంబై పరమా
త్మకుఁ। దావలమై యాదిమావతారంబగున। ద్దేవుని గర్భంబున భూ। తావలి తోడం బ్రపంచ మర్థిం దోచెన్* (వ॥ ఇట్లు దోఁచిన వి
రాట్పురుషుండాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబులను భేదంబులచేఁ బూర్వోక్తక్రమంబున నెలుఁగొందుననుచు విదురునకు
మైత్రేయుం డెఱింగించెనని చెప్పి వెండియు నిట్లనియె* (చ॥ హరి పరమాత్ముఁ డీశుఁ డజుఁ డాద్యుఁ డనంతుఁ డనంతమూర్తి సాగ
రతనయాహృదీశుఁ డవికారవిదూరుఁడు నిత్యమంగళా। కరుఁ డుకృపాపయోనిధి యకల్మషచిత్తుఁడు సర్వశక్తిఁదా। మరసవి
లోచనుండు బుధమాన్యచరిత్ర పవిత్రుఁ డిమ్ములన్* (వ॥ ఇత్తెఱంగున నీశుండగు నధోక్షజుండు మహదాదితత్త్వంబులను నంబుల
ఘనంబులగు తలంపులుఁ డా నెఱింగి యట్టి తత్త్వంబుల వివిధవృత్తిలాభమునకై స్వకీయ దివ్యశక్తిచే నిట్లు లోనర్తునని చింతించి ని
జకళాకలితంబగు విరాడ్విగ్రహంబునందు నగ్నిప్రముఖంబగు దేవతావళికెల్ల నివాసంబగుచుఁ గానంబడిన వైరాజపురుషు
నియాస్యాద్యవయవంబుల వినుపింతు దత్తావధానుండవై వినుము* (సీ॥ నరనుతయాదివ్యపురుషోత్తమునిపృథగ్భావంబునొం
ది ముఖంబువలన। భువనపాలకుఁడై నపవమానసఖుఁడంత రాష్ట్రుఁ డీశ్వరునంశమైన వాని। కనయంబునను కూలమగుచు నిజ
స్థానమునఁ బ్రవేశించిన ముఖమునందుఁ। బరఁగుజీవుండు శబ్దమును చ్చరించుఁ బృథగ్భావమైన నేత్రముల నినుఁడు। చక్షురిం
ద్రియయుక్తుఁడై సరవిఁ జెంద। రూపవిజ్ఞానమహిమ నిరూఢి నొందు। మఱియుఁ జర్మంబునను బవమానుఁ డీశ్వ। రాంశమైతత్త్వ
గింద్రియమంచుఁ గూడ* (వ॥ నిజనివాసంబు నాశ్రయించి జీవుండు స్పర్శేంద్రియగతుండై స్పర్శంబునొందు శ్రోత్రంబులది
క్కులచ్యుతకళాంశంబులై కూడ జీవుండు శ్రవణేంద్రియయుక్తుండై నిజస్థానంబునం బొంది శబ్దజ్ఞానగతుండగు మఱియుఁ
దాలువు నిర్భిన్నంబయిన లోకపాలుండగు వరుణుండంతఁ బ్రవేశించి రసనేంద్రియంబులచేఁ బ్రకాశించిన ఘ్రాణిరసంబు
లంగ్రహించెఁ - బరమేశ్వరుని నాసికేంద్రియంబులు పృథగ్భావంబునొంది యాశ్వినేయాధిష్ఠానంబై ఘ్రాణాంశంబునొం

దత్తావధానుండవై-నిశ్చలచిత్తుండవై — కండూయమానుండు-గోఁకుకొనుచున్నవాఁడు.

డినజంతువు గంధగ్రహణ సమర్థంబయ్యె - వెండియు భిన్నంబయిన చర్మంబున నోషధులును, బరమపురుషాంశంబులయిన కే
శంబులం గూడ నిజనివాసంబు నొంది జీవుండు కండూయమానుండగు భిన్నభూతంబైన మేఢ్రంబునం బ్రజాపతి నిజస్థానంబు
నొంద రేతంబున జీవుండానందంబునం బొందు భిన్నభావంబైన గుదంబున మిత్రుండచ్యుతాంశంబును బొంది పాయువుం గూ
డ నిజాధిష్ఠానంబు నొందుచు జీవుండు విసర్గంబు సేయు వేఱువేఱైన బాహువులం ద్రిదశాధీశ్వరుండయిన పురందరుండు క్ర
యవిక్రయాదిశక్తియుక్తుండగుచు నిజస్థానంబు నొంద జీవుండు వానిచేత జీవికం బొందు మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబుల
యిన విష్ణుండు స్వావాసంబుగైకొని గతిశక్తిం బొందిన జీవుండు గమనాగమనార్హుండయ్యె। వెండియు భిన్నభావంబయిన హృ
దయంబు మనంబుతోడం గలసి నిజాధిష్ఠానంబున జంద్రుండు ప్రవేశించిన శరీరసంకల్పాదిరూపంబగు వికారంబునుం బొందు
భిన్నభావంబైన యహంకారంబున నహంకృతియుక్తుండై రుద్రుండు నిజస్థానంబుగా వసియింప నా యహంకృతిచే శరీరకర్త
వ్యంబులు నడపు - బుద్ధి వాగీశ్వరావాసంబై హృదయంబుతోడం గలసి నిజాధిష్ఠానంబున బోధాంశంబుచే వెలింగిన శరీరి భోద్ధ
వ్యతం బొందు భిన్నంబైన చిత్తంబు బ్రహ్మావాసంబయి చేతనాంశంబు నొందినం బ్రాణి విజ్ఞానంబునుం బొందు నా విరాట్పురు
షుని శీర్షంబున స్వర్గంబు, చరణంబుల వసుమతియు, నాభియందు గగనంబునుం గలిగె - సత్త్వాదిగుణపరిణామంబుల నమరులయిరి
ఊర్జితసత్త్వగుణంబున నద్దేవతలు త్రిదివంబునుం బొందిరి - రజోగుణంబున మనుజులు గవాదులును ధరణిం బొందిరి - తామసం
బున భూతాద్యులైన రుద్రపార్షదులు ద్యావాపృథివ్యంతరంబగు వియత్తలంబునుం బొందిరి - ముఖంబువలన నామ్నాయంబు
లుత్పన్నంబులయ్యె వెండియు* (క॥ ధరణీదివిజులు శ్రుతులును। నరవర యమ్మేటి ముఖమునం బొడముట భూ।సురుఁడఖిలవర్ణ
ములకు।న్గురుఁడున్ముఖ్యుండునయ్యె గుణరత్ననిధీ* (క॥ ధర బ్రాహ్మణాదికము తత్కర బాధం బొందకుండఁ గైకొని కావ।న్బ
రుషోత్తము బాహువుల।న్నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ*(క॥ గణుతింపఁగఁ గృషిగోరక్షణవాణిజ్యాదికర్మకలితంబు
గనా।గుణనిధి యూరువులందుం।బ్రణుతింపఁగ వైశ్యజాతిప్రభవంబయ్యెన్* (గీ॥ తివిరి సేవకధర్మములై దేవదేవు। పదములను
శూద్రసంతతులుదయమయ్యె।వీరలందఱు తమతమవిహితకర్మ। ములరఁ జేయుచు జనకుఁడనాత్మగురుఁడు* (క॥ అగుసర్వే
శుఁ బరాత్పరు।జగదేకప్రభుని బాదజలజాతంబు।ల్దగిలి భజింతురు సతతము। నిగమోక్తిస్ఫుక్తియోగనిపుణాత్మకులై* (గీ॥ మ
హిమ దీపింపఁగా లకర్మస్వభావ।శక్తిసంయుక్తుఁడగు పరేశ్వరుని భూరి। యోగమాయావిజృంభణోద్యోగమెవ్వఁ।డెఱిఁగి
నుతియింపఁగా నోపు నిద్ధచరిత*(ఉ॥ అన్యకథానులాపముల హర్నిశముస్బరియించి చాలమా।లిన్యము నాత్మశోభనవిలీనతనొం
దు మదీయజిహ్వ సా। జన్యము తోడఁ గ్రోలు హరిసద్గుణదివ్యకథామృతంబు స।న్మాన్యచరిత్రమై నెగడు మద్గురువాక్యపదంబుఁ
జేందగన్* (మ॥ హరినామాంకితసత్కథామృతరసవ్యాలోలుఁడై నట్టిస। త్పురుషశ్రేష్ఠుఁడ సత్కథాలవణవాఃపూరం
బుఁ ద్రాఁగ్రోలునే। వరమందారమరందపానకుతుకస్వాంతద్విరేఫంబు స। త్వరమై పోవునె చేతి వేములకుఁ దద్గంధానుమో
దాత్మమై* (క॥ హరిమహిమము దన్నాభీ।సరసిజసంజాతుఁడైన చతురాననుఁడు।న్బరికింప నెఱుఁగఁడనీ సని। తరమనులఁ
జెప్ప నేల తత్త్వజ్ఞనిధీ* (గీ॥ శ్రుతులు దమలోన వివరించి చూచి పుండ। రీకలోచను నుత్తమశ్లోకచరితు।సమరగణవంద్యమాన
పాదాబ్జయుగళు। వెదకి కనుఁగొనలేవంద్రు విమలమతులు* (క॥ హరియుఁ దన మాయాగతిఁ।బరికింపఁగ నేరఁడయ్యెఁ బరి
మితిలేమి।న్మఱి మాయావినిమోహిని। చరితముఁ గనుఁగొందురెట్లు చతురాస్యాదుల్* (క॥ ఆదివిజాధీశుఁడు మహా।దాదు
లు దిక్పతులుఁ బంకజాసనుఁడున్గా।రీదయితుఁడు గనజాలని। శ్రీదేవుని పదయుగంబుఁ జింతింతు మదిన్* (క॥ అనిమైత్రేయుం
డప్పుడు।మున కెఱిఁగించిన తెఱంగు రుచిరముగాన।ర్జునపౌత్రునకుఁ బరాశర। మునిమనమండెఱుఁగఁ జెప్పె ముదము దలిర్పన్॥
వెండియునిట్లనియె* (క॥ భూమీశ్వర మైత్రేయమ।హాముని విదురునకు నట్లు హరిగుణశుభలీ।లామాహాత్మ్యముఁ జెప్పిన।నా
మైత్రేయునకు విదురుఁడనియెన్మఱియున్*(క॥ అగుణునకు నిర్వికారికి। జగదవనోద్భవవినాశసత్కర్మములుం। దగులీల లెట్టు
లాతఁడు।సగుణుండై యుండు టెట్లు సౌజన్యనిధీ* (సీ॥ అని యగ్రజునిగతి నఘుని మైత్రేయముని జూచి విదురుఁడిట్లనియె మఱి
ల।బాలుఁడు గ్రీడావిలోలమానసమున దీపించు లీలానురూపుఁడగుచుఁ। గానిచో గామానుగతుఁడై రమించును నర్భకుఁడర్థి
వస్త్వంతరమున। నర్భకాంతరమున నైనను బాలకేళిసంయుతుఁడగుచు నోలిఁ జరించు। హరియు నెపుడు నివృత్తుఁడత్యంతతృ
ప్తుఁడగుట వర్తించుటెట్లు క్రీడాకులంబు। మఱియు ద్రిగుణాత్మకంబైన మాయఁగూడి। యఖిలజగములఁ గల్పించె ననఁట యె
ట్లు* (సీ॥ ఆమాయచేత నీయఖిలంబు సృజియించి పాలించి పొలియించి పరమపురుషుఁ। డనఘాత్మ దేశకాలావస్థలందు ననిత
రులయందు నహీనమైన। జ్ఞానస్వభావంబుఁ బూని యా ప్రకృతితో నెట్లుఁ గలసెఁ దా నేకమయ్యెఁ। గోరి సమస్తశరీరం
బులం దనుజీవరూపమున వసించియున్న।జీవునకు దుర్భగక్లేశసిద్ధి యెట్టి కర్మమున సంభవించెను గడఁగి నాడు। చిత్తమజ్ఞానదు

ద్విరేఫంబు-తుమ్మెద — వేములకున్-వేపచెట్లకు — కుతుక-అధిక సంతోషము.

గ్గా స్థితిఁ గలంగి । యధిక ఖేదంబునొందెడు ననఘచరిత * (వ॥ అదిగావున సూరిజనోత్తముండవైన నీవు మదీయమానసిక సంశయంబులఁ దొలంగింపనర్హుండవని విదురుండు మైత్రేయమహామునీంద్రు నడిగెనని బాదరాయణతనూభవుండభిమన్యునందనునకిట్లనియె * (క॥ సరసిరుహోదరుమంగళ । చరితామృతపానకుతుకసంగుండగు నా । గ్భరుఁడగు విదురునకు మునీ । శ్వరుఁడగు మైత్రేయుఁడనియె సజ్జనతిలకా * (చ॥ వినుము వితర్కవాదములు విష్ణువికస్వరసరోజపత్రనే । త్రుని ఘనమాయ నెప్పుడు విరోధము సేయఁబరేశు నిత్యశో । భనయుతు బంధనాదికవిపద్దశలన్గ్రహణత్వ మెప్పుడే । జనయముఁ బొందలేవు విభుఁడాద్యుఁడనంతుఁడు నిత్యుఁడౌటచేఁ ॥ మఱియును * (చ॥ పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు సవస్తుసుఖంబులాత్మసంహారణశిరోవిఖండనములాదిగ జీవునికిం బ్రబోధమున్ దరయఁగఁ దోఁచుచున్న గతి నాదిఁ బరేశుఁడు బంధనాముల । న్బొరయక తత్కటెట్లనుచు బుద్ధిని సంశయమందెదేని యిట్లు * (వ॥ అవ్విధంబతనికిం గలుగ నేరదదియెట్లంటేని * (చ॥ లలితవిలోలనిర్మలజలప్రతిబింబితపూర్ణచంద్రుఁడున్ దలముదదంబు చాలనవిడంబనహేతువునొందియున్వియ । త్తలమునఁ గంపమొందనవిధంబున సర్వశరీరధర్మములలిగిరమించుని నీశునకుఁ గల్గఁగ నేరవు కర్మబంధముల్ * (వ॥ కావున జీవునకు నవిద్యాగ్రహమంజేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తంబగుం గాని సర్వభూతాంతర్యామియైన యీశ్వరునకుం బ్రాప్తంబుగా నేరదని * (చ॥ నరునకు నాత్మదేహజగుణంబులఁ బాపఁగ నోపు పంకజోదరచరణారవిందసుహితస్ఫుటభక్తియయింద్రియంబులీ । శ్వరవిషయంబులైన నవి సంచితనిశ్చలతన్మయమైనచో । పంకజనేత్రు కీర్తన మెచ్చాలు విపద్దశలం జయింపఁగన్ * (చ॥ హరిచరణారవిందయుగళార్చన సన్నుతిభక్తియోగముల్ । నిరతము గల్గువారు భవనీరజగర్భులకందరాని ఛా । సురపదముం గడుఁ జేరుదురు సూరిజనస్తవనీయ యట్టిచో । త్పురుషుల పూర్వజన్మఫలమున్ గణుతింపఁదగం బెవ్వరికిన్ * (వ॥ అని చెప్పిన విదురుండు మైత్రేయుంగనుంగొని ముకుళితహస్తుండు వినమితమస్తకుండును సుచందనమనంబున శ్రీహరిం దలంచుచు వినయయుక్తవచనరచనుండై యిట్లనియె - మునీంద్రా భవదీయవాక్యంబులచేతనా మనంబున నారాయణుండు లోకైకనాథుండెట్లయ్యెననియు శరీరధారియైన జీవునికిం గర్మబంధంబు లేరీతి సంభవించెననియునుం బొడమిన సంశయంబు నేఁడు నివృత్తంబయ్యె నెట్లనిన లోకంబునకీశ్వరుండు హరియనియు జీవుండు పరతంత్రుండనియును దలంపుము నారాయణభక్తిప్రభావంబు ప్రాణిగోచరంబయిన యవిద్యకు నాశనకారణంబనం దనరుచుండు నారాయణుండు దనకు నాధారంబు లేక సమస్తంబునకుం బ్రధానయాధారభూతుండై విశ్వంబువోడి వియన్మందానుండు తెలంగెల్లు శరీరాభిమానంబును బొందియెవ్వఁడు మూఢతముండయి సంసారప్రవర్తకుండగు నెవ్వండు భక్తిమార్గంబునఁ బరమాత్ముండైన పుండరీకాక్షునిఁ జెందు - వీరలిద్దఱును సంశయక్లేశంబులు లేమిం జేసి సుఖానందపరిపూర్ణులయి యభివృద్ధి నొందువారగుదు రెవ్వండు సుఖదుఃఖానుసంధానంబుచే లోకానుగతుండగుచుం బ్రమోదవేదనంబుల నొందు నతండు దుఃఖార్తుండగు నారాయణభజనంబున సమస్తదుఃఖనివారణంబగునని భవదీయచరణసేవానిమిత్తంబునఁ గంటిఁ బ్రపంచంబు ప్రతీతిమాత్రంబు గలిగియున్నదంతకుఁ గారణంబు లేకుండుటం జేసి తెలియనివాఁడనై వర్తింతునని వెండియు * (క॥ లలినానాదిదళంపు సుమంతులుగొని యాడంగఁదగిన తోయజనాభుం । డలవడనల్పతపోనర । తులతలఁపోఁతలకు మిగుల దుర్లభుఁడంచున్ * (సీ॥ ఇంద్రియంబులతోడ నెలమి నొప్పెడి మహదాదులనిత రేతకాను షంగ । మున జేసివాసియందొగి విరాడ్దేహంబు పుట్టించి యందుఁ జేపట్టితాను । వసియించు నాతఁడు వరలసహస్రసంఖ్యాతంబులగు సమస్తకాంఘ్రిబాహు । కలితసత్పురుషుఁ గా బ్రహ్మ నాదులు పలుకుదురా విరాట్పురుషునందు । భువనజాలంబులలజడిఁ బొరయకుండఁ । బ్రాణదశకంబు సేంద్రియార్థములు నింద్రియాధిదైవతములు గూడ ననఘ త్రివిధ । మగుచు విప్రాదివర్ణములయ్యెనంట * (క॥ ఇలఁ బుత్రపౌత్రసంపద । గలిగిన వంశములతోడఁ గడుఁ జోద్యముగా । లలిఁ బ్రజలేగతిఁ గలిగిరి । కలిగిన యా ప్రజలచేఁ జగములెట్లుండెన్ * (క॥ చతురత దీపించు ప్రజా । పతులకుఁ బతియనఁగ వెలయు పద్మాపతియే । గతిఁ బుట్టించెను స్రష్ట్ర । ప్రతతులచే ననవిధప్రపంచము మఱియున్ * (గీ॥ వాని భేదంబులును మనువంశములును । మనుకులాధీశ్వరులును దన్మనుకులాను । చరితములు నేభూతి నేజాడ దీని । నింతయునుఁ బుట్టఁ జేసెనా కెఱుఁగఁ బలుకు * (క॥ సరవిం గ్రిందన్మీఁద । న్ధరణికిఁ గల లోకములను దత్తత్స్థితుల । న్వరుసం బరిణాహంబులు । చిరకృప నెఱిఁగింపు నాకు సిద్ధచరిత్రా * (క॥ సురతిర్యఙ్నరరాక్షస । గరుడోరగసిద్ధసాధ్యగంధర్వనభ । శ్చరముఖభవములు మునికుంజర గర్భస్వేదజాండజముల తెఱంగుల్ * (క॥ త్రిగుణప్రధానకంబులు । నగువవతారములు పూర్ణమై వెలసిన యా । జగదుత్పత్తిస్థితిలయ । నిగమములవిధంబు వ్రానివిలుక డలుదగన్ * (క॥ చక్రాయుధ సౌందర్యవ । రాక్రమముఖ గుణములు నుధరామరముఖవ । ర్ణక్రమములు నాశ్రమధ । ర్మక్రియలును శీలవృత్తమతభావములున్ * (గీ॥ యోగవిస్తారమహిమలు యోగములును । జ్ఞానమార్గంబులును బరిజ్ఞానసాధ । నములునై యొప్పు సాంఖ్యయోగములు వికచ । జలజనయన కృతంబులౌ శాస్త్ర

ప్రబోధమందున్ - జాగ్రదవస్థయందు ప్రతిబింబితి - ప్రతిఫలించిన అవిద్యా-మాయభవములు - ఉత్పత్తిక్రమములు - పాషండ-వేదబాహ్యులయొక్క

ములును* (సీ॥ పాషండధర్మంబు ప్రతిలోమకులవిభాగములు జీవులగుణకర్మములును। బలుకులగతులును గలిగెడిధర్మమోక్ష
ములయందలి పరస్పరవిరోధ । ములు లేనిసాధనములు భూమిపాలకనీతివార్తలు దండనీతిజాడ । మును బృథగ్భావంబులును వి
ధానములును బిత్రుమేధములును దత్పితృపిసర్గ । గతులుఁ దారాగ్రహంబులుఁ గాలచక్ర । మును వసించిననిలుకడలును దపంబు।
దానములుఁ దత్ఫలంబులుఁ దనరుఁ బ్రబల। ధర్మములుఁ బ్రజలొనరించుకర్మములును* (చ॥ వదలక భూజనావళికి వచ్చువిపద్గశధ
ర్మములన్నరో। జదళనిభాక్షుఁ డేగతిని సంతసమందెడు నెట్టివారిచే౯। బొదవఁగఁ గానవచ్చు గురువుల్ ప్రియశిష్యులు గొల్వ వా
రు సమ్మదమునఁ గోరు నర్థములు మానుగ నెల్లఁ దెలింగింతురిమ్ములకా౯* (క॥ పలయాదిభేదములన। య్యలఘునిఁ బరమేశు నెవ్వ
రంచితభక్తి। న్గొలుతురదెవ్వనితోను। తగ్గలికన్సుఖియించు జీవతత్త్వము తెలియ౯* (క॥ గోపించు నిరూపంబున। జీవబ్రహ్మల
కు నైక్యసిద్ధియు నెట్లొ। భావనను పనిషదర్థం। బై వెలసెడిజ్ఞానమెట్టిదార్యస్తుత్యా* (గీ॥ ఉచితమగునట్టిశిష్యప్రయోజనములు।
సజ్జనుల చేత విజ్ఞానసాధనములు। నేమి పలుకంగఁ బడువాని నెల్ల మఱియుఁ। బొలుచు వైరాగ్యమునఁ దగు పురుషభక్తి* (గీ॥ ఇ
న్నియుఁ దెలియనానతియిచ్చి నన్ను। నర్థిరక్షింపు యజ్ఞదానాదిపుణ్య। ఫలము వేదంబు చదివినఫలము నార్త। జనులఁ గాచినఫ
లముతో సమము గావు* (క॥ అనివిదురుఁడు మైత్రేయుని। వినయంబునఁ దెలియనడుగు విధమెల్లను వ్యా। సునిసుతుఁ డభిమన్యు
నినం। దనునకు నెఱిఁగించి మఱియుఁ దగనిట్లనియె౯* (చ॥ ఇలఁ గల మానవావళికి నెల్లను తింపభజింపయోగ్యమై। వెలసినపూ
రువంశము పవిత్రము సేయఁగఁ బుట్టి సద్గుణా। కలితయశఃప్రసూనలతికాతతికిం బ్రతివాపరంబు పెం। పలరఁగఁ బ్రోదివెట్టుదు
గదయ్య ముకుందకథామృతంబున౯* (గీ॥ అల్పతరమైనసుఖములకంకుచున్న। జనులదుఃఖంబు మాన్పంగఁ జాలునట్టి। పుండ
రీకాక్షుగుణకథా ప్రోక్తమైన। వితతనిగమార్థమగు భాగవతము నీకు* (వ॥ ఎఱింగింతు వినుమని యిట్లనియె* (సీ॥ అస్మహాభా
గవతామ్నాయమొకనాఁడు గైకొని పాతాళలోకమందు। నప్రతీకజ్ఞానియై వాసుదేవాఖ్యఁ బొలుచు సంకర్షణమూర్తి దివ్య।
పురుషుఁడు దనుఁ దానబుద్ధిలోఁ జూచుచు నలలిత ధ్యానముకుళితనేత్రుఁ। డై సనందాభ్యుదయార్థంబుగను విచ్చి చూచినవారు
సంస్తుతులొనర్ప। నమరగంగావగాహనులై యహీంద్ర। కన్యలార్ద్రజటాబంధకలితలగుచు। భర్తృవాంఛను బుద్ధి నప్పరమ
పురుషుఁ। గదియనేతెంచి తత్పాదకమలయుగము* (క॥ సేవించి భక్తితోనా। నావిధపూజోపహారనతినుతులను నా। దేవుని
హృదయము వడసిరి। యావేళ సనందనాములమ్మహాత్ముల౯* (మ॥ ఘనసాహస్రకిరీటరత్నవిలసత్కాంతి ప్రశుద్ధప్రభా।
జనితోదగ్రరుచిప్రకాశితఫణాసాహస్రుఁడా దేవతా। వనరత్నౌచణురూపకృత్యము లొగిన్వాఁ ఛప్ర శంసించి వా। రనురా
గస్థలితోక్తులొప్పనడుగ౯ హర్షించి యా దేవుఁడు౯* (గీ॥ భూరినిగమార్థసారవిచారమగుచుఁ। దనరు నీ భాగవతము సాదరతఁ
బలికె। నలినభవసూతియైన సనత్కుమార। కునకు నెఱిఁగించె సాంఖ్యాయనునకు నతఁడు* (క॥ వరగన తండంతఁ బరాశరున
కును పదేశమిచ్చె సన్మతిని నతఁడు। న్నరగురునకొనఁగె నాతఁడు। గరమరుదుగ నాకుఁ జెప్పెఁ గైకొని యేను౯* (క॥ నీకిప్పుడు వి
వరించెద। నాకర్ణింపుము సరోరుహాక్షుండగును। శ్లోకునిచరితామృతపరి। షేకుఁడవై ముదము గదురఁ జెలఁగు మువిదురా*
(వ॥ ఇట్లు భవత్ప్రోక్తంబు ఋషిసంప్రదాయగతంబుఁ బురుషోత్తమస్తోత్రంబుఁ బరమపవిత్రంబు భవలతాలవిత్రంబునయి
న భాగవతకథాప్రపంచంబు శ్రద్ధాళుండవు భక్తుండవునగు నీకు నుపన్యసించెద వినుము* (సీ॥ అనఘ యేకోదకమైయున్నవేళ
నంతర్నిరుద్ధానలదారువితతి। భాతిఁ జిచ్ఛక్తి సమేతుఁడై కపటనిద్రాలోలుఁడగుచు నిమీలితాక్షుఁ। డయిన నారాయణుండంబు
మధ్యమున భాసుర సుధాఫేనపాండురశరీర। రుచులు సహస్రశిరోరత్నరుచులతోఁ జెలిమి సేయఁగ నొప్పు శేషభోగ। తల్ప
మునఁ బవ్వళించియనల్పతత్త్వ। దీప్తి జెన్నొందఁ గానద్వితీయుఁడగుచు। నభినుతుండయ్యుఁ గోరుకలయుమంచుఁ బాసి। ప్రవిమ
లాకృతి నానందభరితుఁడగుచు* (గీ॥ యోగమాయావిదూరుఁడై యుగసహస్ర। కాలపర్యంతమఖిలలోకములు మ్రింగి। పే
ర్చి మఱి కాలశక్త్యుపబృంహితమున। సహతసృష్టిక్రియాకలాపములఁ దగిలి* (క॥ తనజఠరములోపలదాఁ। చినలోకనికాయ
ములసృజించుటకును సా। ధనమగు సూక్ష్మార్థము వాన। మునఁ గని కాలానుగతరజోగుణవంత౯* (సీ॥ పుట్టించె దద్గుణంబున
బరమేశ్వరునాభిదేశమునం దుసలిననాళ। మదయించెవటియప్ప యోరుహముకుళంబు కర్మబోధితమయిన కాలవశంబు। దన
తేజమున బ్రవృద్ధంబయి నజలముచే జలజాప్తుగతి బ్రకాశంబునొంద। జేసి లోకాశ్రయస్థితిగతి నొప్పు నా శ్రీవరునాభి రాజీవ
వంశు। నజకళాకలితాంశంబు నిలిపి డాని। వలన నామ్నాయమయుఁడును వరగుణుండు। నాత్మయోనియునయినతోయజభ
వుండు। పరవిజతురాననుండు నాఁ జననమందె* (గీ॥ అతఁడు తత్పద్మకర్ణికయందు నిలిచి। వికచలోచనుఁడయి లోకవితతిదిశలు।
నంబరంబును నిజచతురాననముల। గలయ బరికించి చూచుచుఁ గమలభవుఁడు* (చ॥ అలఘుయుగాంతకాలపవనాహతసం

పితృమేధములు-పితృయజ్ఞములు.—ప్రోదివెట్టుదుగదయ్య-వృద్ధిఁగలుగఁ జేయుచున్నావుగదయ్య.—అప్రతీక-అసదృశమయిన.—అంత
ర్నిరుద్ధానలదారువితతిభాతి౯-వృక్షసమూహములోపలనగ్నియడఁగియున్నట్టు.—నిమీలితాక్షుఁడైన-నేత్రములను ముకుళించినట్టి.

చలదూర్మిజాలసం। కలితజలప్రభూతమగు కంజముతద్వనజాతకర్ణికా। తలముననున్నతన్ను విశదక్రియగల్గినలోకతత్త్వ ము|న్నెఱిఁ దెలియంగ నోపక మనంబునఁ జాలవిచారమొందుచున్॥ ఇట్లు వితర్కించె* (ఉ॥ ఈజలమందు నీకమలమే గతినుద్భవమయ్యె నొంటి నే।నీజలజాతపీఠమున నేగతినుంటి నిదాఖ్యయెద్దినా। కీజననంబు నొందుటకు వెయ్యది హేతువొ బుద్ధిఁ జూడనే। యోజ నెఱుంగలేననివయోరుహగర్భుఁడు విస్మితాత్ముఁడై* (క॥ ఆవనజనాళమూలం। బావనములలోన నర్థినరయుట కొఱకై। యావనజాతప్రభవుం। డావనరుహ నాళవివరమందభిముఖుఁడై* (మ॥ అతిగంభీరవిశాలవారినిధితో నంతర్నిమగ్నాంగుఁడై। చతురాస్యుండురుదివ్యవత్సరసహస్రంబబ్జమూలంబున। న్మతినీక్షించియుఁ గానలేక భగవన్మాయామహత్త్వంబు వి|స్మృతిఁ గావింపలిభీతుఁడై మఱలఁ జేరెం దత్సరోజాతముఁ॥* (గీ॥ అట్లుఁ గ్రమ్మఱఁ జేరియయ్యబ్జపీఠ। మందు నస్థాలగయోగక్రియానురక్తిఁ।బవనుబంధించి మహితతపస్సమాధి।నుండి శతవర్షములు చనుచుండనంత* (గీ॥ అట్టియోగజనితమయి నవిజ్ఞానంబు|గలిగియుండి దానఁగమలనయనుఁ। గాన లేక హృదయకమలకర్ణికయందు।నున్నవానిఁ దన్నుఁ గన్నవాని* (మ॥ కనియెన్నిశ్చలభక్తియోగమహిమన్గంజాతగర్భుండు శో। భనచారిత్రుజగత్పవిత్రువిలసత్పద్మాకళత్రున్సుధా। శనముఖ్యస్తుతిపాత్రు దానవచమూజైత్రున్దళత్పద్మనే। త్రునవీనోజ్జ్వలనీలమేఘనిభగాత్రున్సత్కృపాపాత్రునిన్॥ మఱియు* (చ॥ అలఘుఫణాతపత్రనిచయాగ్రసముంచితనూత్నరత్నని। ర్మలరుచిచేయుగాంతతిమిరంబు నడంపి యకల్మషోల్లస। జ్జలములఁ జేసియందు నవసారసనాళసితైకభోగము।గలిగినశేషతల్పమును గైకొనియున్న మహాత్ము నొక్కనిన్* (సీ॥ వరపీతకౌశేయపరిధానకాంతి సంధ్యాంబుదరుచినిచయంబుగాఁగఁ। గననీయనవహేమకలితకిరీటంబు రమణకాంచనశిఖరంబుగాఁగ। మానితమౌక్తికమాలికారుచి సానుపతితనిర్ఝరపరంపరలుగాఁగఁ। జెలువొందు నవతులసీదామకములు లాలితతటజౌషధీలతలుగాఁగ।వరభుజంబులు నికటస్థవంశములుగఁ। బదములంగణపాదపప్రచయములుగ। లలితగతినొప్పు మకరతాచలవిడంబి। తాత్మదేహంబుగలుగు మహాత్ముహరిని* (వ॥ మఱియు నపరిచ్ఛిన్నంబునగు ప్రమాణంబు నఖిలలోకసంగ్రహంబున నతివిస్తారవర్తులాయామంబునై వివిధవిచిత్రదివ్యమణిభూషణంబుల నాత్మీయనిర్మలద్యుతిచేతం బ్రకాశంబునొందం జేయు దివ్యదేహంబు దనరవివిధంబులగు కామంబుల నభిలషించి విశుద్ధంబయిన వేదోక్తమార్గంబున భజియించు పురుషశ్రేష్ఠులకుఁ గామధేనువనం దగినపాదపద్మయుగంబున నళికఫలకవితతరుచినిచయంబులకు నోటువడి కృపాపాత్రుండై చంద్రుండు బహురూపంబులఁ బదసరోజంబుల నాశ్రయించెననన నొప్పు పదనఖంబులుఁ గమరాభూకాంతలకు నుపధానరూపంబులనంగ కదళికాస్తంభంబుల డంబు విడంబించు నూరుయుగళంబుఁ గనకమణిమయ మేఖలాకలాపాభిరామంబుగ దంకింజల్కశోభిత పీతాంబరాలంకృతంబై విలసిల్లు కటిమండలంబు శృంగారవాహినీజలావర్తంబు నాఁబొలుపొందు నాభీవివరంబు జఠరస్థనిఖిలబ్రహ్మాండముహుర్ముహురుద్భవకృశీభూతంబనందగు మధ్యభాగంబు మహితముక్తాఫలమాలికానిరచితరంగవల్లీవిరాజితంబు నవతులసీదామకిసలయాకల్పంబుఁ గుసుమమాలికాలంకృతంబు ఘనసారకస్తూరికాచందనవిలిప్తంబు గౌస్తుభరత్నప్రదీప్తంబు శ్రీవత్సలక్షణలక్షితంబై యిందిరకుఁ గేళీమందిరంబనం బొల్పువక్షస్స్థలంబు సుఖకేళీసమారంభ పరిరంభణాంభోధిరాట్కన్యకాకరాంభోజ కీలితకనకమణికంకణ నికషంబులం బొలుపారు రేఖాత్రయవిరాజమానకంబుకంధరంబు సుమహితానర్ఘదివ్యమణిప్రభావిభాసితకేయూరకంకణముద్రికాలంకృతంబులైన బాహువులు సకలలోకార్తినివారక దరహాసచంద్రికాధవళితంబులై కర్ణకుండలమండిత మణిమరీచులు నర్తనంబులు సలువం దనరి నిద్దంబులగు చెక్కుటద్దంబులుఁ బరిపక్వబింబఫలప్రవాళపల్లవారుణాధరంబు నఖిలభువనపరిపాలనంబునకు నేనచాలుదునని వివాదించు నయనయుగళంబునకు సీమాస్తంభంబుఁ జంపకప్రసూనరుచివిభాసంబునగు నాసాదండంబుఁ గమలకుముదంబులకుం బెంపు సంపాదించుచుఁ గరుణామృతతరంగితాపాంగంబులై కర్ణాంతవిశ్రాంతంబులై చెలువొందు నేత్రంబులు సలలితశ్రీకారంబునకు నత్తురత్వంబు సార్థకంబయ్యెననందగు కర్ణంబులు నిక్షుచాపు చాపద్వయరూపంబులఁ జూపట్టు భ్రూయుగళంబు నపరపక్షాష్టమీశశాంక శంకాస్పదఫాలఫలకంబు నీలగిరీంద్రశృంగసంగత బాలమార్తాండమండలవిడంబితపద్మరాగమణి ఖచితకాంచనకిరీటంబుచేఁ బొలుపారి సూర్యేందుపవనానలప్రకాశంబులకు నవకాశంబు చూపక త్రిలోకవ్యాపకసమర్థంబులగు తేజోవిశేషంబులుం గలిగి సంగరరంగంబుల దానవానీకంబుల హరింపం జాలు సుదర్శనాది దివ్యసాధనంబులచే దురాసదంబగు దివ్యరూపంబునుం గలిగి మఱియు* (ఉ॥ హారకలాపపుష్పనిచయంబులఁ జందదనర్ఘరత్న కే। యూరకరాంగుళీయకమహోజ్జ్వలబాహుసహస్రశాఖలన్। ప్పారఁగఁ జూడనొప్పి భువనాత్మకలీలల దృష్టమూలవి। స్ఫారితభోగి వేష్టితవిభాసితచందనభూరుహాకృతిన్* (మ॥

నికటస్థవంశములుగన్ - సమీపమందలి వెదుళ్లగుచుండఁగాను, అపరిచ్ఛిన్నంబు - విభాగింపఁగూడనది, ఉపధాన - దిండు, డంబువిడంబించు- కాంతిని ప్రకటనజేయుచున్న, జఠరస్థ - గర్భమందున్నట్టి, ముహుర్ముహురుద్భవ - మాటిమాటికిపుట్టించుటవలన, పరిరంభణ - ఆలింగనము, కం.

ములును* (సీ॥ పాషండధర్మంబు ప్రతిలోమకులవిభాగములు జీవులగుణకర్మములును। బలుకులగతులును గలిగెడిధర్మమోక్ష
ములయందలిపరస్పరవిరోధ । ములు లేనిసాధనములు భూమిపాలకనీతివార్తలు దండనీతిజాడ । మును బృథగ్భావంబులును వి
ధానములును బితృమేధములును దత్పితృపిసర్గ । గతులుఁ దారాగ్రహంబులుఁ గాలచక్ర । మునవసించిననిలుకడలును దపంబు ।
దానములుఁ దత్ఫలంబులుఁ దనరుఁ బ్రబల। ధర్మములుఁ బ్రజలొనరించుకర్మములును* (చ॥ వదలకభూజనావళికి వచ్చువిపద్దశ ధ
ర్మములన్నరో। జదళనిభాక్షుఁ డేగతిని సంతసమందెడు నెట్టివారిఁ బెం। పొదవఁగఁ గానవచ్చు గురువుల్ ప్రియశిష్యులు గొల్చువా
రు స।మ్మదమునఁ గోరు నర్థములు మానుగ నెల్లఁ దెలింగింతు రిమ్ములన్* (క॥ పలయాదిభేదములన। య్యలఘుని బరమేశు నెవ్వ
రంచితభక్తి। న్గొలుతుర దెవ్వనితోను। తఱలి కన్సుఖయించు జీవతత్త్వము నెఱియున్* (క॥ గోపించు నిరూపంబున। జీవబ్రహ్మల
కునైక్యసిద్ధియు నెల్లా। భావననుపనిషదర్థం। బై వెలసెడి జ్ఞానమెట్టిదార్యస్తుత్యా* (గీ॥ ఉదితమగునట్టి శిష్యప్రయోజనములు।
సజ్జనులచేత విజ్ఞానసాధనములు। నేమిపలుకంగఁ బడువాని నెల్ల మఱియుఁ। బొలుచు వైరాగ్యమునఁ దగుపురుషభక్తి* (గీ॥ ఇ
న్నియుఁ దెలియ నానతియిచ్చి నన్ను । నర్థిరక్షింపు యజ్ఞదానాదిపుణ్య । ఫలము వేదంబుచదివినఫలము నార్త। జనులఁ గాచినఫ
లముతో సమము గావు* (క॥ అని విదురుఁడు మైత్రేయుని । వినయంబునఁ దెలియనడుగు విధ మెల్లను వ్యా।సునిసుతుఁ డభిమన్యు
నినం।దనునకు నెఱిఁగించి మఱియుఁ దగ నిట్లనియెన్* (చ॥ ఇలఁగల మానవావళికి నెల్ల మతింపభజింపయోగ్యమై। వెలసిన పూ
రువంశము పవిత్రము సేయఁగఁ బుట్టిసద్గుణా । కలితయశఃప్రసూనలతికాతతికిం బ్రతివాపరంబు పెం । పలరఁగఁ బ్రోదివెట్టుదు
గదయ్య ముకుందకథామృతంబునన్* (గీ॥ అల్పతరమైనసుఖములఁ గాంచుచున్న। జనులదుఃఖంబు మాన్పంగఁ జాలునట్టి। పుండ
రీకాక్షుగుణకథాప్రోక్తమైన। వితతనిగమార్థము గుభాగవతము నీకు* (వ॥ ఎఱింగింతు వినుమని యిట్లనియె* (సీ॥ అమ్మహాభా
గవతామ్నాయ మొకనాఁడు గైకొని పాతాళలోకమందు । నప్రతీకజ్ఞానియై వాసుదేవాఖ్యఁ బొలుచు సంకర్షణమూర్తి దివ్య ।
పురుషుఁడు దనుఁ దానబుద్ధిలోఁ జూచుచు నలలి సద్ధ్యానముకుళితనేత్రుఁ । డై పసందాభ్యుదయార్థంబుగను వచ్చి చూచినవారు
సంస్తుతులొనర్ప।నమరగంగావగాహనులై యహీంద్ర । కన్యలార్ద్రజటాబంధకలితలగుచు । భర్తృవాంఛను బుద్ధినప్పరమ
పురుషుఁ। గదియనే తెంచితత్పాదకమలయుగము* (క॥ సేవించి భక్తితోనా । నావిధపూజోపహారనతినుతులను నా। దేవుని
హృదయము వడసిరి । యావేళ సనందనాదులమ్మహితాత్మున్* (మ॥ ఘనసాహస్రకిరీటరత్నవిలసత్కాంత ప్రశుద్ధప్రభా।
జనితోదగ్రరుచిప్రకాశితఫణాసాహస్రుఁడౌదేవతా । వనరత్నాచణురూపకృత్యము లొగిన్వాఁ ఛ్ఛశంసించి వా । రనురా
గస్థలితోక్తులొప్పనడుగన్ హర్షించియాదేవుఁడున్* (గీ॥ భూరినిగమార్థసారవిచారమగుచుఁ। దనరునీ భాగవతము సాదరతఁ
బలికె। నలినభవసూతియైనసనత్కుమార। కునకు నెఱిఁగించె సాంఖ్యాయనునకునతఁడు* (క॥ వరగనతండంతఁ బరా। శరున
కును పదేశమిచ్చె సన్మతి నతఁడు। న్సురగురునకొసఁగె నాతఁడు । గరమరుదుగ నాకుఁ జెప్పెఁ గైకొనియెన్నన్* (క॥ నీకిప్పుడు వి
వరించెద। నాకర్ణింపుము సరోరుహాక్షుండగుసు । శ్లోకునిచరితామృతపరి । షేకుఁడవై ముదముగదురఁ జెలఁగు మువిదురా*
(వ॥ ఇట్లు భగవత్ప్రోక్తంబు ఋషిసంప్రదాయగతంబుఁ బురుషోత్తమస్తోత్రంబుఁ బరమపవిత్రంబు భవలతాలవిత్రంబు నయి
న భాగవతకథాప్రపంచంబు శ్రద్ధాళుండవు భక్తుండవునగు నీకు నుపన్యసించెద వినుము* (సీ॥ ఆనఘు మేకోదకమైయున్న వేళ
నంతర్నిరుద్ధానలదారువితతి। భాతిఁ జిచ్ఛక్తిసమేతుఁడై కపటనిద్రాలోలుఁడగుచు నిమీలితాక్షుఁ । డయిననారాయణుండంబు
మధ్యమున భాసురసుధాఫేనపాండురశరీర । రుచులు సహస్రశిరోరత్నరుచులతోఁ జెలిమి సేయఁగనొప్పు శేషభోగ । తల్ప
మునఁ బవ్వళించియనల్పతత్త్వ । దీప్తి జెన్నొందఁగానద్వితీయుఁడగుచు । సభినుతుండయ్యుఁ గోరుక లయమునఁ బాసి। ప్రవిమ
లాకృతి నానందభరితుఁడగుచు* (గీ॥ యోగమాయావిదూరుఁడై యుగసహస్ర । కాలపర్యంతము ఖిలలోకములు మ్రింగి। పే
ర్చిమఱి కాలశక్త్యుపబృంహితమున। సహితసృష్టిక్రియాకలాపములఁ దగిలి* (క॥ తనజఠరములోపల దాఁ। చినలోకనికాయ
ములసృజించుటకును సా।ధనమగు సూక్ష్మార్థమునఁ। మునఁగని కాలానుగతరజోగుణవంతన్* (సీ॥ పుట్టించెఁ దద్గుణంబున
బరమేశ్వరునాభిదేశమునం గనలిననాళ । ముదయించెవఱియప్పయోరుహముకుళంబు కర్మబోధితమయిన కాలమునందు। దన
తేజమునఁ బ్రవృద్ధంబయినజలముచే జలజాప్తుగతిఁ బ్రకాశంబు నొంద । జేసి లోకాశ్రయస్థితిగతి నొప్పు నా శ్రీవరునాభిరాజీవ
మందు। నజకళాకలితాంశంబు నిలిపిడాని । వలన నామ్నాయమయుఁడును వరగుణుండు । నాత్మయోనియునయినతోయజభ
వుండు। పరవిజతురాననుండు నా జ్ఞననమందె* (గీ॥ అతఁడు తత్పద్మకర్ణికయందు నిలిచి । వికచలోచనుఁడయి లోకవితతిదిశలు।
సంబరంబున నిజచతురాననముల । గలయఁ బరికించి చూచుచుఁ గమలభవుఁడు* (చ॥ అలఘుయుగాంతకాలపవనాహతసం

పితృమేధములు-పితృయజ్ఞములు.—ప్రోదివెట్టుదుగదయ్య-వృద్ధిఁగలుగఁజేయుచున్నావుగదయ్య.—అప్రతీక-అసదృశమయిన.—అంతర్నిరుద్ధానలదారువితతిభాతిన్-వృక్షసమూహములోపలనగ్నియడఁగియున్నట్టు.—నిమీలితాక్షుఁడైన-నేత్రములనుముకుళించినట్టి.

చలదూర్మిజాలసం । కలితజలప్రభూతమగు కంజముతద్ఘనజాతకర్ణికా । తలమునవున్నతన్ను విశదక్రియగల్గినలోకతత్వ
మున్నేఁ దెలియంగ నోపక మనంబునఁ జాలవిచారమొందుచుఁ । ఇట్లువితర్కించె* (ఉ॥ ఈజలమందు నీకమలమే గతిను
ద్భవమయ్యెనొంటి నే।నీజలజాతపీఠమున నేగతినుంటిని దాఖ్యయెద్దినా । కీజననంబునొందుటకు వెయ్యది హేతువొ బుద్ధిఁజూ
డనే। యోజనెఱుంగ లేననిపయోరుహగర్భుఁడువిస్మితాత్ముఁడై* (క॥ ఆవనజనాళమూలం। బావనములలోననర్థినరయుట
కొఱకై। యావనజాతప్రభవుం।డావనరుహనాళవివరమందభిముఖుఁడై* (మ॥ అతిగంభీరవిశాలవారినిధిలో యాంతర్ని
మగ్నాంగుఁడై । చతురాస్యుండురుదివ్యవత్సరసహస్రంబబ్జమూలంబున । న్మతినీక్షించియుఁ గానలేకభగవన్మాయానుభా
త్వంబువి।స్మృతిఁ గావింపలిభీతుఁడై మఱలఁజేరెందత్సరోజాతముల్* (గీ॥ అట్లుఁ గ్రమ్మఱఁజేరియయ్యబ్జపీఠ । మందునష్టాల
గయోగక్రియానురక్తిఁ।బవనుబంధించిమహితతపసమాధి।నుండిశతవర్షములుచనుచుండనంత* (గీ॥ అట్టియోగజనితమాయి
నవిజ్ఞానంబు।గలిగియుండి దానఁ గమలనయనుఁ । గానలేకహృదయకమలకర్ణికయందు।నున్నవానిఁ దన్నుఁ గన్నవాని* (మ॥
కనియెన్నిశ్చలభక్తియోగ మహిమన్గంజాతగర్భుండుశో । భనచారిత్రుజగత్పవిత్రువిలసత్పద్మాకళత్రుస్సుధా । శనముఖ్య
స్తుతిపాత్రు దానవచమూజైత్రుం దఖత్పద్మనే । త్రునవీనోజ్జ్వలనీలమేఘనిభగాత్రుస్సత్క్షితేరాట్పుత్రునిన్ ॥ మఱియు* (చ॥ అల
ఘుఫణాతపత్రనిచయాగ్రసమంచితనూత్నరత్ననిర్మలరుచిచేయుగాంతతిమిరంబునడంచియకల్పఘోల్లస । జ్జలములఁ జేసి
యందునవసానసనాళసితైకభోగముం।గలిగినశేషతల్పమునుగైకొనియున్నమహాత్మునొక్కనిన్* (సీ॥ వరపీతకౌశేయప
రిధానకాంతిసంధ్యాంబుదరుచినిచయంబుగాఁగఁ । గమనీయనవహేమకలితకిరీటంబురమణకాంచనశిఖరంబుగాఁగ । మా
నితమౌక్తికమాలికారుచిసానుపతితనిర్ఝరపరంపరలుగాఁగఁ । జెలువొందునవతులసీదామకములులాలితతటజౌషధీలతలు
గాఁగ।వరభుజంబులునికటస్థవంశములుగఁ । బదములంగణపాదపప్రచయములుగ। లలితగతినొప్పుమరకతాచలవిడంబి।తా
త్మదేహంబుగలుగుమహాత్ముహరిని* (వ॥ మఱియునపరిచ్ఛిన్నంబునగుపరిమాణంబు నిఖిలలోకసంగ్రహంబునతివిస్తారవర్త
లాయామంబునైవివిధవిచిత్రదివ్యమణిభూషణంబుల నాత్మీయనిర్మలద్యుతిచేతం బ్రకాశంబునొందం జేయు దివ్యదేహంబు
దనరవివిధంబులగుకామంబులభిలషించివిశుద్ధంబయిన వేదోక్తమార్గంబున భజియించు పురుషశ్రేష్ఠులకుఁ గామధేనువనం
దగినపాదపద్మయుగంబునళికఫలకవితతరుచినిచయంబులకునోటువడిక్రుపాపాత్రుండై చంద్రుండు బహురూపంబులఁ బద
సరోజంబుల నాశ్రయించెననఁ నొప్పుపదనఖంబులుఁ గమరాభూకాంతలకు నుపధానరూపంబులనంగి కదళికాస్తంభంబుల
డంబువిడంబించునూరుయుగళంబుఁ గనకమణిమయ మేఖలాకలాపాభిరామంబుగదంబకింజల్కశోభిత పీతాంబరాలంకృ
తంబై విలసిల్లుకటిమండలంబు శృంగారవాహినీజలావర్తంబు నాఁబొలుపొందు నాభివివరంబుజఠరస్థ నిఖిలబ్రహ్మాండము
హుర్ముహురుద్భవకృశీభూతంబనందగు మధ్యభాగంబుమహిత ముక్తాఫలమాలికానిరచితరంగవల్లీవిరాజితంబు నవతులసీ
దామకిసలయాకల్పంబుఁ గుసుమమాలికాలంకృతంబు ఘనసారకస్తూరికాచందన విలిప్తంబుగౌస్తుభరత్నప్రదీప్తంబు శ్రీ
వత్సలక్షణలక్షితంబై యిందిరకుఁ గేళీమందిరంబనంబొల్చువక్షస్స్థలంబు సుఖకేళీసమారంభ పరిరంభణాంభోధిరాట్కన్య
కాకరాంభోజకీలితకనకమణికంకణ నికషంబులంబొలుపారు రేఖాత్రయ విరాజమానకంబుకంధరంబు సుమహితానర్ఘ్యది
వ్యమణి ప్రభావిభాసితకేయూర కంకణముద్రికాలంకృతంబులైన బాహువులు సకలలోకార్తినివారక దరహాసచంద్రికా
ధవళితంబులైకర్ణకుండలమండిత మణిమరీచులనర్తనంబులు సలువంగనరి నిద్దంబులగు చెక్కుటద్దంబులుఁ బరిపక్వబింబఫల
ప్రవాళపల్లవారుణాధరంబు నఖిలభువనపరిపాలనంబునకు నేనచాలుదునని వివాదించు నయనయుగళంబునకు సీమాస్తం
భంబుఁజంపక ప్రసూనరుచివిభాసంబునగు నాసాదండంబుఁ గమలకుముదంబులకుంబెంపుసంపాదించుచుఁ గరుణామృతత
రంగితాపాంగంబులై కర్ణాంతవిశ్రాంతంబులై చెలువొందు నేత్రంబులు సలలితశ్రీకారంబునకు నత్యురత్వంబు సార్థకంబ
య్యెననందగు కర్ణంబులునిక్షుచాపు చాపద్వయరూపంబులఁ జూపట్టుభ్రూయుగళంబు నవరపత్యష్టమీశశాంక శంకాస్పద
ఫాలఫలకంబునీలగిరీంద్రశృంగసంగత బాలమార్తాండమండలవిడంబితపద్మరాగమణి ఖచిత కాంచనకిరీటంబుచేఁ బొలుపా
రిసూర్యేందుపవనానలప్రకాశంబులకు నవకాశంబుచూపక త్రిలోకవ్యాపక సమర్థంబులగు తేజోవిశేషంబులుంగలిగి పం
గరరంగంబులదానవానీకంబుల హరింపంజాలుసుదర్శనాది దివ్యసాధనంబులచే దురాసదంబగుదివ్యరూపంబునుంగలిగి మ
ఱియు* (ఉ॥ హారకలాపపుష్పనిచయంబులఁ జంచదనర్ఘ్యరత్నకే । యూరకరాంగుళీయక మహోజ్జ్వలబాహుసహస్ర
శాఖలొ।ప్పారఁగఁ జూడనొప్పిభువనాత్మకలీలలదృష్టమూలవి। స్ఫారితభోగివేష్టితవిభాసితచందనభూరుహాకృతిన్* (మ॥

నికటస్థవంశములుగన్ - సమీపమందలి వెదుళ్లగుచుండఁగాను, అపరిచ్ఛిన్నంబు - విభాగింపఁగూడనిది, ఉపధాన - దిండు, డంబువిడంబించు - కాంతిని ప్రకటన జేయుచున్న, జఠరస్థ - గర్భమందున్నట్టి, ముహుర్ముహురుద్భవ - మాటిమాటికి పుట్టించుటవలన, పరిరంభణ - ఆలింగనము, కం

విలసత్కుండలిరాజసఖ్యమున నుర్వీభృత్సమాఖ్యన్సను । జ్వలితోదారశిరోవిభూషణసహస్రస్వర్ణకూటంబుల । స్సలిలా
వాసతఁజారుకౌస్తుభవిరాజద్రత్నగర్భంబునన్నలినాక్షుం గనుంగొనంగఁదగెమైనాకావనీభృద్ధతిన్* (క॥ వితతార్థజ్ఞా
నిజనస్తుతిమకరందప్రవహృష్టశ్రుతిజాతషట్పదు । వ్రతగణపరివృతశోభా । గతకీర్తిప్రసవమాలికలుగలవాఁనిన్ ॥ కనుంగొనిచ
తురాననుండు* (సీ॥ అనఘుఁడ సర్వేశ్వరు నాద్యంతశూన్యుని ధన్యు నిజగదేకమాన్యచరితుఁ । దన్నాభిసరసస్సరోద్భవసరోజం
బునునప్పలనన్నియుని నంబరమును । మానితభువననిర్మాణవృష్టిఁబొడగనేఁగానియుతరముఁగానలేక । యాత్మీయకర్మబీజాం
కురంబునురజోగుణయుక్తుఁడగుచునకుంఠితప్ర । జాభిసర్గాభిముఖతసవ్యక్తమారుఁ । డయినహరియందుఁదనహృదయంబుఁ
జేర్చి యమ్మహాత్మునిఁబరముననంతునభవు । నజునమేయుని వేగకట్లనినుతించె* (సీ॥ నలినాక్షమాయాగుణవ్యతికరమునఁజే
సికార్యంబైననృష్టిరూప । మునఁబ్రకాశించునీఘనరూపవిభవంబు రూపింపదేహధారులకునగ్గి । భావ్యంబుదలపోయ భగ
వంతుఁడవునయిన పద్మాక్ష నీస్వరూపంబుకంటె । నన్యమొకటిసత్యమైబోధకంబైనయది లేదు కాననీయతులదివ్య । మైన
రూపంబునాకుఁబ్రత్యక్షమయ్యె । నదియుఁగాక వివేకోదయమునఁజేసి।వరదనీరూపమజ్ఞానగురుతమోని। వారకంబయ్యె నా
కుశశ్వత్ప్రదీప* (క॥ ఘనసత్పురుషానుగ్రహమునకైయని తావతారమూలంబగుచుం । దనరెడినీరూపముశో।భనమగు
భవదీయనాభిపద్మమువలనన్* (క॥ జననంబందిననాచే। ననయము మొదల నెగృహీతమయ్యెజగత్పా।వననీదుసుస్వరూపము
ఘనరుచిరంబై స్వయంప్రకాశకమగుటన్* (వ॥ మఱియుజ్ఞానానందపరిపూర్ణమాత్రంబున నానృతప్రకాశంబు భేదరహి
తంబుఁబ్రపంచజనకంబుఁ బ్రపంచవిలక్షణంబు భూతేంద్రియాత్మకంబు నేకంబునైనరూపంబునొందనయు నెంకునుం బొడ
గాననట్టినిన్నాశ్రయించెదనదియునుంగాక జగన్మంగళస్వరూపధరుండవై నీయుపాసకులమైనమామంగళంబులకొఱకు ని
రంతరధ్యానంబుచేతనీదివ్యరూపంబునంగానంబడితివియిట్టి నీవునిరయభాక్కులై నిరీశ్వరవాదంబునంజేసి కుతర్కంబులు
ప్రసంగించు భాగ్యరహితులచేత నాదృతుండవుగావు మఱియుం గొందఱుగృతార్థులైన మహాత్ములుభవదీయ శ్రీచరణార
విందగంధంబు వేదమారుతానీతంబగుటంజేసి తమతమకర్ణకుహరంబులచేతం గ్రహింతురు వారలహృదయకమలంబులం
దుభక్తిపారతంత్ర్యంబున గృహీతపాదారవిందంబులుగలిగి ప్రకాశింతువదియునుంగాక ప్రాణులకుద్రవ్యాగార సుహృ
న్నిమిత్తంబయినభయంబు తన్నాశనిమిత్తంబయిన శోకంబు ద్రవ్యాదిస్పృహయుఁ దన్నిమిత్తంబయిన పరిభవంబు మఱి
యునంపుఁదృష్ణయునది ప్రయాసంబున లబ్ధంబయిననార్తిమూలంబగు దదీయంబైన వృథాగ్రహంబునీ శ్రీపాదారవిందంబు
లందువై ముఖ్యంబెంతకాలంబు[illegible]గునంతకాలంబును ప్రాప్తంబగుంగాని మానదాత్మనాయకుండవగు నిన్నునాశ్రయిం
చినభయనివృత్తిహేతువగుమోక్షంబుగలుగు మఱియుంగొందఱు సకలపాపనివర్తకంబయిన త్వదీయనామస్మరణకీర్తనం
బులందువిముఖులయి కామ్యకర్మప్రావీణ్యంబునంజేసినష్టమతులై యింద్రియపరతంత్రులై యమంగళంబులయినకార్యంబు
లుసేయుచుండురు దానంజేసి వాతాదిత్రిధాతుమూలంబైనక్షుత్తృడాదులచేత శీతోష్ణవర్షవాతాదిదుఃఖంబులచేత నతిదీ
ర్ఘంబైన కామాగ్నిచేతనవిచ్ఛిన్నంబగు క్రోధంబుచేతందహ్యమానులగుదురు వారలంగనినానాచిత్తంబుగలంకంబొందు జీ
వుండుభవదీయమాయాపరిభ్రామ్యమాణుండై యాత్మవేఱనిమెప్పుడు దెలియనంతగాలంబునిరర్థకంబై దుస్తరంబయిన సం
సారసాగరంబు దరియింపంజాలకుండు సన్మునీంద్రులైనను భవదీయనామస్మరణంబులుమఱచి యితరవిషయాసక్తులై రేని
వారలుదివంబులందు వృథాప్రయత్నులై సంచరించుచు రాత్రీనిద్రాసక్తులై స్వప్నగోచరంబైన బహువిధసంపదలకునా
నందించుచు శరీరపరితాపాదిపీడలకుదుఃఖింపుచు ప్రతిహతంబులైనయుద్యోగంబుల భూలోకంబున సంసారులయి వర్తిం
తురునిష్కాములై మిమ్ముభజియించు సత్పురుషులకర్ణమార్గంబులంబ్రవేశించి భవదీయభక్తియోగపరిశోభితంబయిన హృ
త్సరోజకర్ణికాపీఠంబునవసియింతువదియునుంగాక* (మ॥ వరయోగీంద్రులుయోగమార్గములభావంబందు నేనీమనో।హ
రరూపంబుఁదలంచియేగుణగణధ్యానంబుఁగావింతుర । ప్పురుషశ్రేష్ఠపరిగ్రహంబునకునైఁబొల్పారఁదద్ధ్యానగో । చరమూ
ర్తిన్ధరియింతుగాదెపరమోత్సాహుండవై మాధవా* (గీ॥ అరయనిష్కామధర్ములైనట్టిభక్త । లందునీవుప్రసన్నుండవైనరీ
తి।హృదయములబద్ధకాములైయున్న దేవ।గణములందుఁబ్రసన్నతగలుగవీవు* (చ॥ అరయసమస్తజీవహృదయంబులయం
దువసించియేకమై।పరగియనంతరాత్మసఖభావసుధర్ముఁడవుస్బ్రరావతే । శ్వరుఁడవునైతనర్చుచునుసజ్జన దుర్లభమైనయట్టి
సు।స్థిరమగుసర్వభూతదయచేఁబొడగాన్ఁగవత్తువచ్యుతా * (మ॥ క్రతుదానోగ్రతపస్సమాధి జపసత్కర్మాగ్నిహోత్రా
త్రాఖిల । వ్రతచర్యాదులనాచరింపవఖిలవ్యాపారపారాయణ । స్థితనొప్పారెడిపాదపద్మయుగళీసేవాభిపూజాసమర్పి
తధర్ముండగుదానిభంగినసురారీ దేవచూడామణీ* (గీ॥ తవిలిశశ్వత్స్వరూపచైతన్యభూతి । మహిమచేతనపాస్తసమస్తభే

బుకంధరము-మూఁడురేఖలుగలకంఠము, దుర్విభావ్యంబు-భావింపశక్యమైన, నిరభాక్కులై-నరకమునననుభవించువారై, పరితాపము-వికారములు

ణ। మోహముఁ డవఖిలవిజ్ఞానమునకు నాశ్ర । యముండవగు నీకుఁ బ్రమ్రొక్కెదనో రమేశ* (క॥ జననస్థితివిలయంబుల । కనయంబును
హేతుభూతమగు మాయాలీ । లనుఁ జెందినటనాసలిపెదు । ననఘాత్మక నీకొనర్తునభివందనముల్* (సీ॥ అనఘాత్మ మఱిభవదవ
తారగుణకర్మఘనవిడంబనహేతుకంబులయిన । రమణీయమగు దాశరథివసుదేవసుతాదిదివ్యదేహంబులోలి! వెలయం
గమనుజులు వివశాత్ములై యవసానకాలంబున సంస్మరించి । జన్మజన్మాంతరసంచితదురితంబుఁ బాసి కైవల్యసంప్రాప్తులగుదు
రట్టిదివ్యావతారంబుల వతరించు । నజుఁడవగు నీకుఁ బ్రమ్రొక్కెదనఘచరిత । చిరశుభాకార నిత్యలక్ష్మీవిహార । భక్తమందారదు
ర్భరభవవిదూర* (తరల॥ జననవృద్ధివినాశహేతుకసంగతింగలయేనుని । మునుహరుండుఁ ద్రిశాఖలై మనుపుల్మరీచిముఖామ
రుల్నరసంఘపశాఖలై చెలువొందు నింతకు మూలమై । యనయము న్భవసద్రుమాకృతివైన నీకిదె మ్రొక్కెదన్* (మ॥ పు
రుషాధీశ భవత్పదాబ్జయుగళీపూజాదికర్మక్రియా । పరతం జెందని మూఢచిత్తునిఁ బరప్రాయున్మనుష్యాధము । వ్యర్థయున్నం
తమునొందజేయునతిదక్షుండవైన కాలంబుత । ద్గురుకాలాత్ముఁడవైన నీకు నతిసంతోషంబునన్మ్రొక్కెదన్* (సీ॥ సర్వేశక
ల్పాంతసంస్థానమగు జలసంజాతమందేను సంభవించి । భవదీయసుస్వరూపముఁ జూడనర్థించి బహువత్సరములు తపంబుసే
సి । క్రతుకర్మములు పెక్కుగావించియును నినుఁ బొడఁగానగాలేక బుద్ధిభీతిఁ । బొందిననాకు నిష్పృహసనిశ్చేతుక కరుణచే నఖి
లలోకైకవంద్య । మానసతతప్రసన్న కౌమలముఖాబ్జ । కలితభవనీయదివ్యమంగళవిలాస । మూర్తిఁ దర్శింపఁగలిగె భక్తార్తి
హరణ । కరుణ తుభ్యం నమో విశ్వభరణ దేవ* (సీ॥ అసురతిర్యఙ్మనుష్యాదిచేతనయోనులందు నాత్మేచ్ఛఁ జెందినట్టి । కమనీ
యశుభమూర్తి గలవాఁడవై ధర్మసేతువసంగఁ బ్రఖ్యాతినొంది । విషయసుఖంబులవిడిచి సంతతనిజానందానుభవసమున్న
తిఁ బనర్తు । పదగానఁ బురుషోత్తమాఖ్యఁ జెన్నొందుచు వట్టి నెప్పుడునభినుతింతు । నర్థిభవదీయపాదంబులాశ్రయింతు । మ
హితభక్తి నీకు నమస్కరింతు । భక్తజనపోషపరితోషపరమపురుష । ప్రవిమలాకారసంసారభయవిదూర* (సీ॥ తలకొనిపం
చభూతప్రవర్తకమైన భూరిమాయాగుణస్ఫురణఁ జిక్కి । పడకలోకంబులు భవదీయ జఠరంబులోనల్పి ఘనసమాలోలచ
టులు । సర్వంకషోర్మిభీషణవార్ధినడుమను ఫణిరాజభోగతల్పంబుసందు । యోగనిద్రారతినుండంగనొక కొంత కాలంబుచనఁ
గమేలుకొనినవేళ । నలఘుభవదీయనాభితోయజమువలనఁ । గడఁగి ముల్లోకములసోపకరణములుగఁ । బుట్టఁజేసితివతులవిభూతి
మెఱసి । పుండరీకాక్ష సంతతభువనరక్ష* (క॥ నిగమస్తుతలక్ష్మీపతి । జగదంతర్యామివగుచు సర్గములెల్లన్ । దగుభవదైశ్వర్యంబు
న । నగణితసౌఖ్యానుభవము నందింతుగదే* (సీ॥ జలజాక్ష యెట్టి విజ్ఞానబలంబునఁ గల్పింతువఖిలలోకంబులోలి । నతజనప్రి
యుఁడవు నాకట్టి సుజ్ఞానమర్థిమైఁ గృపసేయుమయ్యవరద । సృష్టినిర్మాణేచ్ఛఁ జెందినాచిత్తంబు తత్కర్మకౌశలత్వమునఁ దగి
లి । యును గర్మవైషమ్యమును బొందుకతమున దురితంబుఁ బొరయకతొలఁగునట్టి । వెరవు నాకెల్లగలుగునవ్విధముఁ దలఁచి । క
ర్మవర్తనుసనుభవత్కరుణ మెఱసి । తగఁ గృతార్థునిఁ జేయుమునిగమవినుత । సతతకృపామూర్తియో దేవచక్రవర్తి* (చ॥ భ
వమ దరప్రభూతమగు పద్మమునందు వసించియున్న నే । నవిరళతావకీనకలితాంశమునం దవరారువిశ్వము । న్దవిలి రచింపుచు
న్బహువిధంబులఁ బల్కెడి వేదజాలము । ల్నివతరమై ఫలింపఁ గృపసేయుము భక్తఫలప్రదాయకా* (చ॥ అనియనుకంపనొప
వినయంబున జాగిలి మ్రొక్కి చారులో । చనసరసీరుహుండగుచు సర్వజగత్పరికల్పనారతిం । దనరిననన్నుఁ బ్రోచుటకుఁ దా
నిటు సన్నిధిమైన యీశ్వరుం । డనయము నాదుదుఃఖముదయామతిఁ బాపెదునంచు నమ్రుఁడై* (క॥ వనరుహసంజాతుఁడు
నెమ్మనమున హర్షించె ననుచు మైత్రేయమహా । మునిఘనుఁడు విదురునకు । న్వినయంబున నెలుఁగఁ జెప్పి వెండియుఁ బలికెన్*
(మ॥ వనజాతప్రభవుండు గేవలతపోవ్యాసంగుఁడై పద్మలో । చనగోచరుండు ననంతునాద్యుఁ దనవాక్ఛక్తి న్నుతింపన్సుధా ।
శనవంద్యుండు ప్రసన్నుఁడై నిఖిలవిశ్వస్థాపనాలోకనం । బునఁ జూచెన్విలయప్రభూతబహువాఃపూరంబులన్ప్రేల్మిడిన్*
(గీ॥ అట్లు బొడగనియార్తుఁడై నట్టి పద్మ । భవుని వాంఛితమాత్మ దీర్పంగఁ దలఁచి । యతని మోహనివారకమైనయట్టి । యమృతర
సతుల్యమధురవాక్యములననియె* (చ॥ తలకొని నీ వెనర్పపనిదప్పమఁ జిందలపోయు దుఃఖము । వలఁగుము నాదులీలలకుఁ బ్ర
ధానగుణంబగు సృష్టికల్పనం । బలవడఁ జేయు బుద్ధిహృదయంబున జొన్పితపస్సమాధిని । ష్ఠలనతిభక్తులన్నుఁ బ్రసన్నునిఁ జే
యుము చెందుఁ గోరికల్* (క॥ నీవొనరించు తపోవి । ద్యావిభవవిలోకనీయమగు నీసృష్టి । న్గావింపుము లోకంబుల । లో వెలిఁ గె
డి నన్నుఁ గంటి లోకస్తుత్యా* (క॥ నాలోని జీవకోటులు । వాలాయము నీకుఁ గానవచ్చు నిపుడు నీ । వాలోకింపుము దాసుస । లో
లహుతాశనునికరణి లోకస్తుత్యా* (సీ॥ నలువొప్పనఖిలజీవులయందుఁ గలనన్నుఁ దెలిసి సేవింపుమనలినగర్భ । భవదీయ
దోషముల్వాయుభూతేంద్రియవ్యతిరిక్తమై శుద్ధమైన హృదయుఁ । డైనజీవుని విమలాంతరాత్ముఁడనైననను నేకముగఁ జూచు
నర్థుఁడు మోక్ష । పదమార్గవర్తియై భాసిల్లుబ్రహ్మాండమందుల వివిధకర్మానురూప । వర్తులఁ జేసి పెక్కురూపములనొందు । జీ
వతతిరచియించు నీచిత్తమెపుడు । మత్పదాంబుజయుగళంబునఁ జిగియున్న । కతన రాజసగుణము నగలుగదఘము* (క॥ విను

మదియుఁగాక ప్రాణుల । కనయము నెఱుఁగంగ రాని యనఘు డ తేజో । ధనుఁడప రేశుఁడనీ చే।తను గానంబడితిని దెపితామ
హకంటే* (వ॥ నాటియుభూతేంద్రియ గుణాత్ముండనియుజగన్మయుండనియునన్నునీచిత్తంబునందుఁదలంపుము తామరస
నాళవివరపథంబు వెంటంజనిజలంబులలోనంజూడంగోరునట్టి మదీయస్వరూపంబు* (క॥ నీకిప్పుడుఁ గానంబడె।నాకులకును
సురగవతిపినాకులకైనన్।వాగ్రవ్యందలపోయన్ । రాకేందుముఖ దీయరూపరమణీయంబుల్ * (క॥ కావునమచ్చారిత్రక।థా
విలసితమైనసుమహిత స్తవముజగ।త్పావనమువిగతసంశయ।భావుఁడవై బుద్ధినిలుపు పంకజజన్మా* (క॥ సగుణుఁడనయిలీలా
ర్థము।జగములఁగల్పింపఁదలచు చతురుదినన్ను । స్వగుణనిఁగానుతియించితి । దగ సంతసమయ్యెనాకుఁదామరసభవా*(క॥
ఈమంజు స్తవరాజము। నీమనమునఁజింతఁదకిట నిలుపుము భక్తిన్।ధీమహితనీమనంబునఁ । గామించినకోరుకెల్లఁగలుగుం
జుమ్మీ* (క॥ అనుదినమునుద్రిగజన్మా । వనముగనీమంగళ స్తవంబుఁబఠింపన్।వినినసుజనులకు నేఁబొడ । గనఁబడుదునా ప్త
సకలకాముఁడనగుచున్*(గీ॥వనతటాకోపవనయజనవివాహదేవ । భవననిర్మాణభూమ్యాదివివిధదాన। జపతపోవ్రతయోగయ
జ్ఞములఫలము।మామకస్తవఫలముసమంబుగాదు* (క॥ జీవావలిఁగల్పించుచు।జీవావలిలోనఁదగవసించుచుఁబ్రియవ।స్త్వా
వలిలోవలఁబ్రియవ।స్త్వావలినైయుండునన్నునిశముఁబ్రీతిన్* (క॥ తలఁపుమతిప్రీతికినై । కలిగించితినిన్నుభువనకారణ
నాలో।పలనడఁగియేకమై।శ్చలగతివసియించియున్నజగములనెల్లన్* (గీ॥తగనహంకారమూలతత్త్వంబునొంది।నీవుపుట్టిం
పుమనుచురాజీవభవుఁడు।పనగనాతనికియిచ్చియప్పద్మనాభుఁ।డంతనంతర్హితుండయ్యెననఘచరిత* (క॥ అనిచెప్పినమై
త్రేయుని।గనుఁగొనివిదురుండువలికెఁగడుముదమెప్పన్ । జననుతనలినదళాక్షుఁడు। సనినంబద్మజుఁడు దేహసంబంధము
నన్* (క॥ మానససంబంధంబును।బూనినయీసర్గమెట్లుపుట్టించెదయాం। భోనిధివైనాకింతయు । మానుగ నెఱిఁగింపుమ
య్యామహితవిచారా* (వ॥ అనవుడునమ్మునివరేణ్యుండువిదురునకిట్లనియెఁబుండరీకాక్షువరదానప్రభావంబునంబంకజాస
నుండు శతదివ్యవత్సరంబులు భగవత్పరంబుగాఁదపంబుగావించి తత్కాలవాయువుచేఁగంపితంబగు నిజనివాసంబయినప
ద్మంబునుజలంబుఁగనుంగొనియాత్మీయతపశ్శక్తిచేత నభివృద్ధింబొందనవిద్యాబలంబునవాయువుతోడఁదోయంబు సమస్తం
బునుంగ్రోలియంత గగనవ్యాపియగుజలజంబునుగనుంగొని* (ఉ॥ వారిజసంభవుండు బుధవంద్యుఁడుచిత్తమునందలంచె
దై।త్యారిఁబరోపకారిసముదంచితహారినతాఖిలాశ్రితా। హారిరమాసతీహృదయహారినుదారవిదూరగభూరిసం । సారిభ
వప్రహారివిలసన్నుతసూరినఘారినయ్యెడన్* (గీ॥ అట్లుదలఁచిసరోజజుఁడంబుజమును। గగనతలమునఁజూచియాకమలకో
శ।లీనమైయున్నలోకవితానములను। నొయ్యఁబొడగనిహరిచేనియుక్తుడైన* (గీ॥ వానిఁగాఁదనుఁదలఁచియవ్వనరుహంబు।
లోపలికిఁబోయిమున్నందులోననున్న। ముజ్జగంబులఁజూచియిమ్ములసృజించె । మఱిచతుర్దశభువనముల్మహిమఁజేసి*(క॥
మఱియుసుధాశనతిర్య।ఙ్నరవివిధస్థావరాదినానాసృష్టి । స్ఫురణనజుండొనరించెం।బనువడినిష్కామధర్మఫలరూపమునన్*
(వ॥ఇట్లుభువనంబులఁబద్మజుండుగల్పించెననిమైత్రేయుండువిదురునకెఱింగించిన* (క॥ విదురుఁడుదురితావనిభృద్భిదు
రుఁడుమునివరునిఁజూచి ప్రియముమనమున । న్గదురఁగనిట్లనిపలికెన । త్రిపురాంతకంబయిన విష్ణుదేవునిమహిమన్ * (గీ॥
అమరభువనంబులతనికాలాఖ్యతయును । గణుతిసేయఁదదీయలక్షణములర్థి । నాకునెఱిఁగింపుమయ్యవివేకచరిత । య
నినమైత్రేయుఁడవ్విదురునకుననియె * (సీ॥ ఆద్యంతశూన్యంబునద్వయంబైతగు తత్త్వమింతకును పాదానమగుట । గు
ణవిషయములు గైకొనికాలమును మహదాదిభూతములు దన్నాశ్రయింపఁ । గాలానురూపంబుగయికొని యీశుండుదన
లీలకైఁదనుఁదాసృజించెఁ। గర మొప్పనఖిలలోకములందుఁదానుండుఁదనలోననఖిలంబుఁదనరుచుండుఁ।గానవిశ్వమ్మునకుఁ
గార్యకారణములు।దానయమ్మహాపురుషునితనువులనఁ । బాసివిశ్వంబువెలిమైప్రభాసమొందె। మానితాచారయీవర్త
మానసృష్టి * (క॥ తెరఁగొప్పనఖిలవిశ్వము । పురుషోత్తముదేహమందుఁబుట్టుంబెరుగుఁ ।విరతింబొందుచునుండుం।గరమ
ర్థిన్ భూతభావికాలములందున్* (వ॥ అట్టిసర్గంబునవవిధంబందుఁబ్రాకృతవైకృతంబులు కాలద్రవ్యగుణంబులనుత్రివిధం
బులగు భేదంబులచేఁ బ్రతిసంక్రమంబులగుచునుండునందు మహత్తత్త్వంబుప్రథమసర్గంబదినారాయణసంకాశంబున గుణ
వైషమ్యంబునందు ద్రవ్యజ్ఞానక్రియాత్మకంబైన యహంకారతత్త్వంబు ద్వితీయసర్గంబు శబ్దస్పర్శరూపరసగంధంబులను పం
చతన్మాత్రద్రవ్యశక్తియుక్తంబయిన పృథివ్యాదిభూతసర్గంబుమూఁడవదియైయుండు జ్ఞానేంద్రియంబులైనత్వక్చక్షుశ్శ్రో
త్రజిహ్వాఘ్రాణంబులు గర్మేంద్రియంబులైన వాక్పాణిపాదపాయూపస్థలను దశవిధేంద్రియజననంబు చతుర్థసర్గంబు సా
త్త్వికాహంకారజనితంబైన మనోమయసుమనోగణసర్గంబె యైదవసర్గంబై యొప్పు జీవలోకంబులకు నబుద్ధికృతంబులైన
యావరణవిక్షేపంబులం జేయుఁ దామససర్గంబాఱవదై యుండు సయ్యాలునీశ్వరునకు లీలార్థంబులైనప్రాకృత సర్గంబుల
య్యె నింకవైకృతసర్గంబు నేఁడవది మొదలుగాఁగలుగునది వినుపింతు వినుము పుష్పోత్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థో

ఉదుంబరపనసన్యగ్రోధాదులైన వనస్పతులును బుష్పితంబులై ఫలపాకాంతంబులైన వ్రీహియవముద్గాద్యోషధులు నారోహణాపేక్షుంబులైన మాలతీమల్లికాదిలతలుఁ ద్వక్సారంబులైన వేణ్వాదులుఁ గఠినీభూతమూలంబులును శిఖావిస్తృతంబులున్నగులతావిశేషరూపంబులైన వీరుధంబులుఁ బుష్పవంతంబులై ఫలప్రాప్తంబులగు చూతాశోకాదిద్రుమంబులు నవ్యక్తచైతన్యంబులునూర్ధ్వస్రోతంబులు నంతస్స్పర్శంబులై తమఃప్రాయంబులైన స్థావరంబులగు నీయాఱు నేఁడవసర్గంబయ్యె నెనిమిదవసర్గం బిరువదియెనిమిది భేదంబులుగలిగి స్వస్థానాదిజ్ఞానశూన్యంబులై యాహారాదిజ్ఞానమాత్రనిష్ఠంబులయి ఘ్రాణంబువలన నెఱుంగందగినదాని నెఱుంగుచు హృదయంబున దీర్ఘానుసంధానరహితంబులై వర్తించు ద్విశఫంబులుంగల వృషభమహిషాజకృష్ణసూకరోష్ట్రగవయరురుమేషముఖర నవకంబు నేకశఫంబునుంగల ఖరాశ్వాశ్వతరగౌరశరభచమర్యాదిరుటంబుఁ బంచనఖంబులుంగల శునకసృగాలవృకవ్యాఘ్రమార్జారశశశల్యకసింహకపిగజకూర్మగోధముఖ భూచరద్వాదశంబు మకరాదిజలచరంబులుఁ గంకగృధ్రబకశ్యేనభాసభల్లూకబర్హిహంససారసచక్రవాకకాకోలుకాది ఖేచరంబులు మొదలగునది తిర్యక్సర్గంబయ్యె నర్వాక్స్రోతంబై యేకవిధంబగు మానుషసర్గంబు రజోగుణప్రేరితంబై కర్మరక్షణదక్షంబై దుఃఖంబందు సుఖంబు గోరునది తొమ్మిదవసర్గంబనందగునని చెప్పి యీత్రివిధసర్గంబులు వైకృతంబులనంబడు దేవసర్గంబు వినుమదియు నెనిమిది తెఱంగులంగలిగియుండు నందు విబుధపితృసురాదులు మూఁడు గంధర్వాప్సరస్సులొకటియు యక్షరక్షస్సులొకంబు భూతప్రేతపిశాచంబులొకటియు సిద్ధచారణవిద్యాధరులేకంబుఁ గిన్నరకింపురుషులొకటియునుంగా దేవసర్గంబయ్యె నిట్టి బ్రహ్మనిర్మితంబులైన దశవిధసర్గంబులు నెఱింగించితి మఱియు నిందొక్క విశేషం బెఱింగించెదఁ గౌమారసర్గంబను నది దేవసర్గాంతర్భూతంబయ్యును బ్రాకృతవైకృతోభయాత్మకంబై దేవత్వమనుష్యత్వపూజ్యంబైన సనత్కుమారాది సర్గంబనంబడె నమోఘసంకల్పుండైన పుండరీకాక్షుండు దనుఁ జానవిశ్వభేదంబునం గల్పించెనని మైత్రేయుండు విదురునకుం జెప్పి కాలలక్షణం బెఱింగించువాఁడై యిట్లనియె* (సీ॥ భుజిదనకార్యాంశమునకు నంతమునన్యవస్తుయోగంబు నేవలనలేక । ఘటపటాదిక జగత్కార్యంబునకు నిజసముదాయ కారణత్వమునఁ బరఁగి । జాలసూర్యమరీచిసంతగగనస్థసుత్రసరేణుషడంశమరయఁ । బరమాణువయ్యెఁ దత్పరమాణువవందర్క గతియెంతతడవు దత్కాలమగును । సూక్ష్మకాలంబునదివిమసూర్యమండలంబు ద్వాదశరాశ్యాత్మకంబనంగఁ । గలుగు జగమున నొకయేఁడు గడచి చనినఁ । గాలమెంతగునది మహత్కాలమనఘ॥ (వ॥ అంతఁ బరమాణుద్వయంబొక్క యణువగు నణుత్రితయంబొక్క త్రసరేణువగు నవి మూఁడుగూడనొక్క త్రుటియగు నాత్రుటిశతంబొక్క వేధయనంబరగు నట్టివేధలు మూఁడుగూడ నొక్క లవయనందగు నవి మూఁడైన నొక్క నిమేషంబనంజను నిమేషత్రయంబొక్క క్షణంబగుఁ దత్క్షణపంచకంబొక్క కాష్ఠయనందగు నవిపదియైన నొక్క లఘువననొప్పు నట్టి లఘుపంచదశంబొక్క నాడియనంబరగు నట్టి నాడికాద్వయం బొక్క ముహూర్తంబయ్యె నట్టి నాడికలాఱైన నేఁడైన మనుష్యులకు నొక్క ప్రహరంబగు నదియ యామంబనంజను దివసపరిమాణవిజ్ఞేయంబగు నాడికోన్మాన లక్షణం బెఱింగింతు షట్పలతామ్రంబునం బాత్రంబు రచియించి చతుర్మాషసువర్ణంబునం జతురంగుళాయామశలాకంబుఁ గల్పించి దానం దత్పాత్రమూలంబున ఛిద్రంబుఁ గల్పించి తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్రతోయంబు పరిపూర్ణంబునొందునంత గాలంబొక్క నాడికయగు యామంబులు నాలుగైన నొక్క పగలగు రాత్రియు నప్పగిదిఁ జరుగు నట్టి యహర్నిశంబులుగూడ మర్త్యులకొక దినంబగు నవి పదునేనైన నొక్క పక్షంబగు శుక్లకృష్ణనామంబులం బరగిన యప్పక్షంబులు రెండుగూడ నొక్క మాసంబగు నది పితృదేవతలకు నొక్క దివసంబగు నట్టి మాసంబులు రెండయిన నొక్క ఋతువగు షణ్మాసంబులరిగిన నొక్క యయనంబగు దక్షిణోత్తరనామంబులం బరగి నట్టి యయనంబులు రెండుఁగూడి ద్వాదశమాసంబులైన నొక్క సంవత్సరంబగు నట్టి సంవత్సరశతంబు నరులకుం బరమాయువై యుండుఁ గాలాత్ముండు నీశ్వరుండు నైన సూర్యుండు గ్రహనక్షత్రతారాచక్రస్థుండై పరమాణ్వాదిసంవత్సరాత్మకంబైన కాలంబునం జేసి ద్వాదశరాశ్యాత్మకంబైన జగంబున సౌరబార్హస్పత్యసావన చాంద్రనాక్షత్రమాన భేదంబులం గానంబడుచున్నవాఁడై; సంవత్సరపరివత్సరేడావత్సరానువత్సరవత్సరనామంబుల సృజ్యమైన బీజాంకురములశక్తిం గాలరూపంబైన స్వశక్తిచేత నభిముఖంబు గాఁ జేయుచుం బురుషులకు నాయురాదివ్యయంబులం జేసి విషయాసక్తిని వర్తింపం జేయుచుం గోరికలుగలవారికి యజ్ఞముఖంబులం జేసి గుణమయంబులయిన స్వర్గాదిఫలంబులవిస్తరింపం జేయుచు గగనంబునం బరువువెట్టు వత్సరపంచకప్రవర్తకుండగు మార్తాండునకుం బూజఁ గావింపుమని మైత్రేయుండు పలికిన విదురుండిట్లనియె* (క॥ నరపితృసురపరమాయుః । పరిమాణము లెఱుఁగ నాకుఁ బలికితివిమనీశ్వరమెఱిఁగింపుఁ ద్రిలోకీ । పరిలోకవిలోకనైనపరులగు వారికి* (ఉ॥ పూనినయోగసిద్ధిదగఁ బొందిన నేత్రయుగంబునన్బహి । జ్ఞానముగల్గియుండి భువనంబులఁ జూచుచునుండువారికి । న్మానుగఁ గల్గు కాలగతిమాకెఱిఁగింపు మునీంద్ర నావుడు।

న్నానయశాలియవ్విధంబుపాదరుండై తగంజూచియుట్లనుట* (సీ॥ జనుతకృతయుగసంఖ్య నాలుగు వేలుదివ్యవర్షములుదదీయసంధ్య లెనుబదినూతేండ్లువిను త్రేతవత్సరత్రిసహస్రములగుండదదీయసంధ్య । లాఱునూతేండ్లును ద్వాపరము రెండువేలువత్సరములవెలయుసంధ్య । లోలినన్నూతేండ్లునొగిఁగలియుగముసహస్రవర్షములు సంధ్యాంశమరయ । రెండునూతేండ్లునునిల్చియుండుఁజువ్వె యనఘసంధ్యాంశమధ్యంబులందుధర్మ । మతిశయించును సంధ్యాంశలందుధర్మ మల్పమైకానంబడుచుండుననఘచరిత* (వ॥ మఱియుధర్మదేవతకృతయుగంబున నాలుగుపాదంబులుం ద్రేతయందు మూండుపాదంబులుద్వాపరంబునందుబాదద్వయంబుఁగలియుగంబున నేకపాదంబుఁగలిగి సంచరించునట్లగుటంజేసి* (క॥ పాదవిభేదంబునమ రాద్యదలునొగిఁజెడునధర్మమూఁకొలందినెయ్యు। త్వాదిల్లివృద్ధిఁబొందుధ। రాదిపజులు పాపబుద్ధిరతులగుచుండిరలర* (సీ॥ భూర్భువస్స్వర్లోకమునకంటెఁబొడవునఁ గడునొప్పుసత్యలోకంబునందు । మండు బ్రహ్మకుఁజతుర్యుగసహస్రములేగ దివసమొక్కటగురాత్రిదీనినట్ల । చనధాతనిద్రవోజగము లుమడగు మేలట్ని చూడమ అలలోకములుపుట్టుఁ । దద్దినమునఁజతుర్దశమనువులగుడరొకొక్కమనువునకొనరదివ్య యుగములోలిని డెబ్బదియొక్కటమాఱు । సనినగను కాలమయ్యెనమ్మనుకులంబుసుతలుమునులునుసప్తర్షులరయభగవదంశమునఁబుట్టిపాలింతురఖిలజగము* (క॥ హరిపితృసుపర్వతిర్య । జ్నరరూపములంజనించినయమునమన్వంతరములనిజసత్వంబునఁ । బరిపాలించునుజగంబుఁబౌరుష మొప్పన్* (క॥ క్రమమునఁదైల్రికసర్గము జెప్పంబడెసరోజగర్భుఁడుదవసాం । తమునఁదమఃపిహితపరాక్రముఁడై శయనించునిద్రఁగైకొనియంతన్* (సీ॥ ఆరాత్రిభువనత్రయము దమఃపిహితమైభానుచంద్రులతోఃలీనమైన । సర్వాత్ముఁడగుహరిశక్తిరూపంబయికడఁగి వెలుంగుసంకర్షణాగ్ని భువనత్రయంబునుదవిలిదహింపనయ్యనలకీలలఁ బొడమినమహోష్మ । లలమినఁగమలిమహర్లోకవాసులుజనలోకమునకునుజనుమరపుడు । విలయసమయసముత్కటవిపులచండ । వాతధూతోర్మిజాలదుర్వారవార్ధి । భువనములముంచనమ్మ్రాఁడుభువనములను । దత్పయోరాశిమీఁదఁబద్మావిభుండు* (ఉ॥ చారుపటీరహీరఘనసారతుషారమరాళచంద్రికాపూరనృణాళహారపరిపూర్ణసుధాకరకాశమల్లికా । సారనిభాంగశోభితభుజంగమతల్పమునందుయోగని । ద్రారతిఁజెందియంతజరస్థితభూర్భువరాదిలోకుఁడై* (క॥ జనలోకవాసులర్థిని వినుతింపఁగనతులదివ్యవిభవప్రభచేఁ దనరుచుమీలితనిజలోచనుఁడైవసియించునతఁడుసముదితలీలన్॥ ఇవ్విధంబున* (సీ॥ కైకొనిబహువిధకాలగత్యుపలక్షితమమైయమహారాత్రతలుజరుగ । శతవత్సరంబులుజనులకుఁబరమాయువైనరీతిని బంకజాసనునకుఁ । బరమాయువగుశతాబ్దంబులంధులసగమరిగినసదియుఁబరార్ధమండ్రు । గానఁబూర్వార్ధంబుగడుచుటఁజేసిద్వితీయపరార్ధంబుదీనిపేరు । కడఁగిపూర్వాపరార్ధాదికాలమందు । బ్రహ్మకల్పాఖ్యనెంతయుఁ బరగునందు । బ్రహ్మయుదయించుటంజేసి బ్రహ్మకల్ప । మనియుశబ్దాత్మకబ్రహ్మమునఁగనెగడె* (క॥ పినుమెన్నఁడుపంకజనా । భునినాభీసరసియందుభువనాశ్రయమై । తనరినపద్మమువొడమునుననఘాయదిపద్మకల్పమనవిలసిల్లున్* (వ॥ పూర్వపరార్ధాదినింగలిగినపద్మకల్పంబుఁజెప్పితి నింకద్వితీయపరార్ధంబుమొదలనెన్నఁడేనిహరిసూకరాకారంబుదాల్చునదివరాహకల్పంబనందగు నట్టివరాహకల్పంబిపుడు వర్తమానంబగుచున్నదివెండియు* (సీ॥ దీపింపఁగాలస్వరూపుఁడైనట్టిపద్మాక్షుఁడనంతుఁడనాదిపురుషుఁ । డఖిలవిశ్వాత్మకుఁడగునీశునకుఁబరమాణ్వాదియుగపరార్ధాంతమగుచు । జరుగునీకాలంబుచర్చింపనొక్కనిమేషకాలంబయిమెలఁగుచుండు । గానయీశ్వరునకుఁగర్తగాఁజాలదికాలంబువినుమదిగాకదేహ । మందిరార్ధాదికర్మాభిమానశీలు । రైనవారికినాశ్రయంబగుటఁజేసి । యరయహరితద్గుణవ్యతికరుండుగానఁ । గాలమమ్మేటికెన్నఁడుఁగర్తగాదు* (వ॥ మఱియుషోడశవికారయుక్తంబై పృథివ్యాదిపంచభూతపరివృతంబును దశావరణంబులుంగలిగిపంచాశత్కోటివిస్తీర్ణంబై బ్రహ్మాండకోశంబుదనర్చుచుండు* (చ॥ హరిపరమాణురూపముననందు వసించివిరాజమానుఁడై । సరివెలుఁగొందునిమ్ములనసంఖ్యములైన మహాండకోశముల్ । నెరిఁదనయందుడిందననసీరజనేత్రుఁడనంతుఁ డాద్యుఁడ క్షరుఁడుపరాపరుండఖిలకారణకారణుఁడప్రమేయుఁడై* (క॥ నిరతిశయోజ్జ్వలతేజఃస్ఫురణన్దనరారుపరమపురుషునివిష్ణుం బురుషోత్తమువర్ణింపను సరసిజభవభవులకైనశక్యమెచెపుమా* (క॥ అనిమైత్రేయుఁడువిదురుం గనుఁగొని వెండియునుఁబలికెఁ గాలాహ్వయుఁడై । తనరినహరిమహిమలనే । వినుపిందితిసృష్టిమహిమయును మెఱిఁగింతున్* (వ॥ పరమేష్ఠియైన సృష్ట్యాదినహమ్మను దేహాభిమానబుద్ధింగల మోహంబునంగనాసంగమసక్తంబనాదిగ్రామ్యభోగేచ్ఛలుగల మహామోహంబుఁదత్ప్రతిఘాతజాతంబయిన క్రోధంబునందుఁగలుగునంధతామిస్రంబుఁ దన్నాశంబునందహమేవ మృతోస్మీయనుతామిస్రంబుజిత్తవిభ్రమంబను నవిద్యాపంచకమిశ్రంబుగా సర్వభూ

షోడశవికార-పదియాఱువికారములు అనఁగా-జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, మనస్సు-పంచభూతములు.—దశావరణంబులు-భూజలాగ్నివాయ్వాకాశమనోబుద్ధ్యహంకారఅవ్యక్తపురుషావరణములు.—పారాయణులై-ప్రీతిగలవారలయి.

తావలింబుట్టిం ది యాత్మీయచిత్తంబునం బాప సృష్టిఁ గల్పించుటకుఁ బశ్చాత్తాపంబునొంది భగవద్ధ్యానామృతపూతమాన
సుండై యూర్ధ్వరేతస్కులుఁ బరమపవిత్రులు నైన సనకసనందనసనత్కుమారసనత్సుజాతులను మునుల సత్వగరిష్ఠులఁ ధీరజ
నోత్తముల నార్యుల హరిప్రసన్నులంగా దివ్యదృష్టిం గల్పించి వారలం జూచి మీమీ యంశంబులఁ బ్రజలం బుట్టించి ప్రపంచం
బు వృద్ధిఁ బొందింపుండనిన వారలు తద్వచనంబుల పహసించుచు బ్రహ్మజుం గని మోక్షధర్ములు నారాయణపారాయణులు యి ప్ర
పంచనిర్మాణంబునకుఁ బ్రతికూలవాక్యంబులు వలికినఁ గనలొందు నరవిందసంభవుని భ్రూమధ్యంబువలనం గ్రోధస్వరూ
పంబున నీలరోహితుం డనిఖలసురాగ్రజుండై యుదయించుచు నాక్రందనంబొనరించెనంత * (మ॥ జననంబందిన నీలలోహి
తుఁడు గంజాతాసనుం జూచి యిట్లను నో దేవ నా దాఖ్యలెట్టి వి మదీయావాసముల్ వేఁకనా । కనయంబీ వెటిఁ గింపుమా యనుఁడు
నయ్యంభోజగర్భుండు లాలనమున దోఁపఁ గుమారసీ జనన వేళన్ రోదనంబు చ్చుటన్ * (గీ॥ రుద్రనామంబు నీకు నిరూఢమయ్యెఁ
జంద్రసూర్యానలానిలసలిలగగన । పృథివి ప్రాణతపోహృదింద్రియములనఁగ । గలుగునేకాదశస్థానముల వసింపు * (వ॥ అని
వెండియు మన్యు, మను, మహాకాల, మహత్, శివ, ఋతధ్వజ, ఉరురేత, అభవ, కాల, వామ, దేవ, ధృతవ్రతులను నేకాదశనా
మంబులు గిలిగి - ధీ, వృత్తి, అశనా, ఉమా, నియుత్, సర్పిః, ఇలా, అంబికా, ఇరావతీ, సుధా, దీక్షా, నామపత్నీసమేతుడవయి
పూర్వనియుక్తంబయిన నామంబులందత్తన్నివాసంబుల వసియించి ప్రజలం గల్పింపుమనిని ర్దేశించిన భగవంతుండగు నీలలో
హితుండు విశ్వగురుండైన పితామహుని చేనియుక్తుండై సత్త్వాకృతిస్వభావంబుల నాత్మసములైన ప్రజలం గల్పించె * (ఉ॥
రుద్రుని చేత నీగతి నిరూఢమతిన్ సృజనీయులైన యా । రుద్రగణంబులోలి నతిరుద్ధత విశ్వము మ్రింగ నమ్మహా । పద్రవశాంతి
కై యజుఁడు భర్గులఁ జూచి కుమారులార మీ । రౌద్రవిలోకనానలభరంబున గ్రాఁగెసమస్తలోకముల్ * (గీ॥ మీ సృష్టిస్విర
మింపుఁడు । ధీసత్తములార వినుఁడు ధృతి మీరు దపో । వ్యాసంగచిత్తులై చనుఁ । డాసన్మంగళములగు దృఢంబుగ మీకున్ *
(మ॥ భగవంతున్ బురుషోత్తమున్ హరిఁ గృపాపాథోధి లక్ష్మీశ్వరు । న్సుగుణభ్రాజితునచ్యుతుం బరుఁ బరంజ్యోతిన్ బ్రభున్సర్వ
భూతగణావాసు నధోక్షజున్ శ్రితజనత్రాణైకపారీణు నా । జగదాత్ముం డను చుందు రార్యులు తపశ్శక్తిన్ స్ఫుటజ్ఞానులై ॥ అనిన
విని * (ఉ॥ కైకొని యిట్లు పంకరుహగర్భనియంత్రితులైన రుద్రులు । ద్రేకముఁ దక్కి కాననకు ధీయుతులై తపమాచరింపన స్తో
కచరిత్ర నేగినఁ జతుర్ముఖుఁ డంతఁ బ్రపంచకల్పనా । లోకనుఁడై సృజించె జనలోకశరణ్యులఁ దీవ దేణ్యులన్ * (గీ॥ వినుము భగవ
ద్బలాన్వితవినుతగుణులు । భువనసంతానహేతువిస్ఫురణకరులుఁ । బద్మసంభవతుల్యప్రభావయుతులు । పదుగురు సుతులు
పుట్టిరి భవ్యయశులు * (సీ॥ అరవిందసంభవునంగుష్ఠమున దక్షుఁ డూరువువలనను నారదుండు । నాభిఁ బులహుఁడు గర్ణములఁ
బులస్త్యుండు త్వక్కున భృగువు హస్తమునఁ గ్రతువు । నాస్యంబువలన నయ్యంగిరసుఁడు ప్రాణమున వసిష్ఠుఁడు మనమున మ
రీచి । గన్నులనత్రియుఁ గాఁ బుత్రదశకంబు గలిగిరి వెండియు నలినగర్భు । దక్షిణస్తనమువలన ధర్మ మొదవె । వెన్నువలన నుదయ
మయ్యె విశ్వభయద । మైన మృత్యుప్రధర్మంబునందకలిగె । నాత్మఁ గాముండు జననమునం దెమటియు * (సీ॥ భ్రూయుగళంబు
నఁ గ్రోధంబు నధరమునందు లోభంబు నాస్యమున వాణి । యును మేఢ్రమందుఁ బయోధుల పానంబునందు నఘాశ్రయుఁడైన
నిరృతి । లాతిత చ్ఛాయవలన దేవహూతి విభుండు గర్దముఁడును బుట్టిరంత । నబ్జజుఁ డాత్మదేహమున జనించిన భారతిఁ జూచి వి
భ్రాంతిఁ బొరసి । పంచశరబాణనిర్భిన్నభావుఁడగుచుఁ । గూతురను పాపమునకు సంకోచపడక । కవయఁ గోరినజనకుని గని మ
రీచి । మొదలుగాఁ గలయమ్మునిముఖ్యులలిగి ॥ ఇట్లనిరి * (ఉ॥ చాలు బురే సరోజభవ సత్పథవృత్తిని దొంగి కూఁతునిట్లాలరివై
రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే । బేలరివై తినీగతగవు పెద్దతనంబును మంటిపాలుగా । శీలము వోవఁ దట్టియుటుఁ జేసి
న వారలు మున్నగల్గి రే * (ఉ॥ నీవు మహానుభావుఁడ వనింద్యచరిత్రుఁడవిట్టిచోటరా । జీవభవుండు దావిధినిషేధములాత్మనె
ఱుంగఁడయ్యెనీ । భావభవప్రసూనశరబాధితుఁడై తనకూఁతుఁ బొందెబో । వావిఁ దలంపలేక నుచు వారకలోకులు పృథ్విఁ ది
ట్టరే * (క॥ పాపముదలఁపక నిమిషము । లోపల జెడు సౌఖ్యమునకు లోనైతి వెయిం । తేపో ధారుణి గామాం । ధోపినపశ్యతి య
నంగఁ దొల్లియు వినమే * (మ॥ అనియిబ్భంగి మునీంద్రులాడిన కఠోరాలాపముల్ వీనుల । న్వినిలజ్జావనతాననుండగుచు నానీరే
జగర్భుండున । య్యనదేహంబు విసర్జనీయముగఁ జేయన్ దిక్కులే తెంచిత । త్తనువుం గైకొనఁ బుట్టెఁ దిక్కలితమై తామిస్ర నీ
హారముల్ ॥ అంత * (చ॥ ఉడుగక పంకజాతభవుఁ డొండొక దేహము దాల్చి ధైర్యము । న్విడువక సృష్టిఁ బూర్వమున వే సృజి
యించిన నైపుణంబుడాఁ । బొడమిన నాత్మలోనఁ దలపోయుచునుండఁ జతుర్ముఖంబుల । న్వెడలెననూనరూపముల వేదములం
చితధర్మయుక్తతన్ * (గీ॥ మఱియు మఖములు మహితకర్మములుఁ దంత్ర । ములును నడవల్లునాశ్రమములుఁ దదీయ । ముఖచతు
ష్కమునందునఁ బొడమెననిన । వినిమునీంద్రుఁ జూచి యప్పుడు రుఁడనియె * (క॥ తోయజసంభవుఁ డప్పుడు । నేయే ముఖమం డ

లమున నేయే సృష్టింపఁ బూనెనో తెలుప నుద్దేశించి ( మొదట బ్రహ్మ ) యెట్లు ( ఏ విధముగా ) సృజియించెను । బాయికి యత్తెఱఁగు దెలియఁబలుకుము నాకున్ * (వ॥ అనియిట్లు విదురుండ డిగిన మైత్రేయుండతనితో నిట్లనియె ఋగ్యజుస్సామాథర్వంబులను వేదంబులు, హౌత్రకర్మంబులయిన యప్రగీతమంత్ర స్తోత్రంబులగు శస్త్రంబులు నధ్వర్యుకర్మంబైన యిజ్యయు, సంగీతస్తోత్రంబగు స్తుతియు, గాతృప్రయోజ్యంబైన ఋక్సము దాయరూపంబగు స్తోమంబుఁ, బ్రాయశ్చిత్తంబగు బ్రహ్మకర్మంబు, నాయుర్వేదధనుర్వేద గాంధర్వ వేదంబులను నుపవేదం బులు, విశ్వకర్మశాస్త్రంబగు స్థాపత్యంబుఁ, బ్రాగాదిముఖంబులనుత్పన్నంబులయ్యెఁ బంచమవేదంబగు నితిహాసపురాణంబు లు, సర్వముఖంబులం గలిగె మఱియుగర్మతంత్రంబులయిన షోడశిస్యుక్థ్యలు చయనాగ్నిష్టోమంబులు, నాప్తోర్యామాతిరాత్రం బులు, వాజపేయగోసవంబులు, ధర్మపాదంబులైన విద్యాదానతపస్సత్యంబులు బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థయత్యాశ్ర మంబులు వీనికి నొక్కొక్కటికిం జతుర్విధంబులైన వృత్తులుం గలిగియుండు - నందు సావిత్రంబు, బ్రహ్మచర్యంబు, నుపనయనం బాదిగా దివసత్రయంబు గాయత్రిజపించుటయ ప్రాజాపత్యంబు, వేదవ్రతచతుష్టయంబు, వ్రతులుసంవత్సర పర్యంతం బుగా నాచరించుటయ, బ్రాహ్మంబు వేదగ్రహణాంతంబు నాచరింపందగు, నయిష్ఠికంబునను బ్రహ్మచారివృత్తిచతుష్టయంబ నిషిద్ధకృష్యాదివృత్తియగు వార్తయు, యజనాదికర్మోపయుక్తంబైన యాచ్ఞాదిరూపంబగు సంచయంబు, పరులయాచింప కుండ నయాచితంబను శాలీనంబు క్షేత్రపతితకణిశకణ సంగ్రహణరూపంబగు శిలోంఛనంబుఁ ననుగృహస్థవృత్తులు నాలు గు, నకృష్టపచ్యాహారులగు వైఖానసులు, నూతనఫలంబులబ్ధంబైనఁ బూర్వసంచితపదార్థత్యాగంబుగల వాలఖిల్యులుఁ, బ్రా తఃకాలంబున నేదిక్కు విలోకింతురద్దిక్కునకుం జని, యచ్చటలభించు పదార్థంబులం భుజించి, జీవించు నౌదుంబరులుఁ దమంత ఫలించి తరుపతితంబులగు ఫలంబులఁ దినుచుండు ఫేనపులు, ననుచతుర్విధవృత్తులుం గలవానప్రస్థులు, స్వాశ్రమవిహితకర్మం బులం బ్రధానుండగు కుటీచకుండు, కర్మంబు పరిసర్జనంబుచేసి జ్ఞానప్రధానుండగు బహూదకుండుఁ, గేవలజ్ఞానాభ్యాసనిష్ఠుం డగు హంసుండుఁ, బ్రాప్తంబైన పరబ్రహ్మతత్వంబుగల నిష్క్రియుండునను సన్న్యాసిచతుర్విధవృత్తులు, మోక్షఫలప్రదం బైయాత్మానాత్మవివేకవిద్యారూపంబగు నాన్వీక్షికియు, స్వర్గాదిఫలప్రదంబయి కర్మవిద్యారూపమగు త్రయియు, జీవనఫల ప్రధానంబయి కృష్యాదిరూపంబగు వార్తయు, నర్థసంపాదనైక ప్రయోజనంబగు దండనీతియు, మోక్షధర్మకామార్థంబులైన న్యాయవిద్యాచతుష్టయంబులు, భూర్భువస్సువయను వ్యాహృతులును, బూర్వాదిముఖములనుదయించె - మఱియునతని హృ దయాకాశంబువలనం బ్రణవంబు, రోమంబువలన నుష్ణిక్ఛందంబుఁ, ద్వగింద్రియంబువలన గాయత్రిచ్ఛందంబు, మాంసం బువలనం ద్రిష్టుప్ఛందంబు, స్నాయువువలనననుష్టుప్ఛందంబు, నస్థివలన జగతీచ్ఛందంబు, మజ్జవలన పఙ్క్తిచ్ఛందంబుఁ, బ్రా ణంబువలన బృహతీఛందంబుఁ, గకారాది పంచవర్గాత్మకంబులయిన స్పర్శలవలన జీవుండును, కారాదిస్వరాత్మకంబైన దేహంబు నూష్మలను శషసహాదివర్ణచతుష్టయరూపంబులగు నింద్రియంబులునంతస్థలగు యరలవలను వర్ణంబులు షడ్జాదిసప్తస్వరరూ పంబు, నాత్మబలంబునైన శబ్దబ్రహ్మంబును, జతుర్ముఖుని లీలావిశేషంబున నుత్పన్నంబయ్యె - వ్యక్తావ్యక్తంబు వైఖరీప్రణవా త్మకంబయిన శబ్దబ్రహ్మంబువలనం బరమాత్మయవ్యక్తాత్మకుండగుటం జేసి పరిపూర్ణుండు - వ్యక్తాత్మకుండగుటం జేసియింద్రాది శక్త్యుపబృంహితుండై కానంబడుఁ బదంపడియజుండు భూరివీర్యవంతులయిన ఋషిగణంబుల సంతతియవిస్తృతంబని తలంచి పూర్వతను పరిగ్రహంబు చాలించి యనిషిద్ధకామాసక్తంబయిన దేహాంతరపరిగ్రహంబుచేసి నిత్యంబు ప్రజాసృష్టియందు వ్యాసక్తుండనైనం బ్రజలభివృద్ధినొందకయుండుట కేమి కారణంబగునని యచ్చెరువొంది తద్వృద్ధియగు విధంబాలోచించు చు దైవంబిచ్చట విఘాతుకంబుగానఁ దదానుకూల్యం బావశ్యకంబని దాని నెదురుచూచుచు యథోచితకృత్యకరణదక్షుండగు చుండు చతుర్ముఖుని దేహంబు ద్వివిధంబై ననట్టిరూపద్వయ విభాగంబు స్వరాట్టగు స్వాయంభువమనువుఁ దన్మహిషియగు శత రూపయనుకన్యకయుఁగా మిథునంబై జనియించె నమ్మిథునంబువలనం బ్రియవ్రతోత్తానపాదులను పుత్రద్వయంబు నాకూ తీదేవహూతిప్రసూతులను కన్యకాత్రయంబునుం గలిగిరందు నాకూతిని రుచికునకు, దేవహూతిం గర్దమునకుఁ, బ్రసూతిం దక్షునకునిచ్చె వీరలవలనఁ గలుగు ప్రజాసంతతులచేత జగంబులు పరిపూర్ణంబులయ్యెననవుడు * (క॥ అనిమైత్రేయుఁడు వలికిన

**స్వాయంభువమనుప్రజావృద్ధి చేయుట**

వినిమనమున హర్ష మొదవ విదురుఁడు మునినాథునిఁ జూచి నోడి వెఁ గ్రమ్మఱ । వనజోదరపాదభక్తివశమానసుఁడై * (క॥ ఘనుఁ డు స్వాయంభువునకుఁ బ్రియ । తనయుఁడు స్వాయంభువుండు దైతేయవిభే । దనసేవాచతురుండును । జనవినుతుండాదిరాజన

ఆత్మానాత్మ-ఆత్మయనఁగా శరీరత్రయవిలక్షణమై-అవస్థాత్రయసాక్షియై - పంచకోశవ్యతిరిక్తమై-సచ్చిదానందస్వరూపమై - కాలత్రయాబాధ్య మైయుండు వస్తువు. అనాత్మయనఁగా - వ్యష్టిసమష్టిరూపములైన స్థూలసూక్ష్మకారణ శరీరములేను — వీర్య - ప్రభావము — వ్యాసక్తుండన -ఆ సక్తిగలవాఁడను — అవ్యాహతసుఖదంబు - నిత్యనిరూపాధి నిరతిశయానందమును గలుగజేయునట్టిది. ఆప్లుత - తడుపఁబడిన. మొనయుఁగన - పు

త్తముఁడౌటన్॥* (క॥ అతనిచరితంబవ్యా।హతసుఖదము నిఖిలమంగళావహము సమం। చితముఁ గావున బుధసే।వితనా కెఱుఁ
గంగఁ బలుకు విశ్వస్తుత్యా॥* (క॥ అదియును గాక ముకుంద ని। పదకమలమరందపానపరవశులై పెం।పొదవిన వారిచరిత్రము।
సదమలమతివినిన భవము సఫలము గాదే॥* (చ॥ అని విదురుండు వల్కిన దయాన్వితుఁడై మునినాథచంద్రుఁడి। ట్లను శ్రుతిశా
స్త్రపారకలితాత్మకుఁడై ననరుండఁ బద్మలో। చనచరణారవిందయుగసంగము గల్గిన సజ్జనుండ వో। దినఫలమొందె భాగవ
తదివ్యకథాశ్రవణానురక్తిచేన్॥* (క॥ అని చెప్పను నికలాగ్రణి।దనుజారికథాసుధాప్లుతస్వాంతుండై।తనువునఁ బులకాంకు
రములు। మొనయఁగ నానందబాష్పములు జడిగురియన్॥* (సీ॥ వినిపింపఁ దొడఁగె నాఘనుఁడు స్వాయంభువుఁ డంగనాయు
క్తుఁడై యబ్జగర్భు। నకు మ్రొక్కి వినయవినమితోత్తమాంగుఁడై హస్తముల్మొగిచి యిట్లనియెఁ బ్రీతి। జీవసంహతికి రాజీవసం
భవ నీవ జననరక్షణవినాశములకరయ। హేతుభూతుఁడవు మా కెద్ది యాచరణీయమైన కర్మము దాని నానతిమ్ము। హర్షదము
లైనకృత్యములాత్మజుండు।జనకునకుఁ జేసె పరిచర్య సలుపఁ గీర్తి। నందను తికెక్కి వర్తించు నందు నందుఁ। గాన నెఱిఁగింపుఁ డ
ట్టి సత్కర్మ మనఘ॥* (క॥ అని పలికిన స్వాయంభువ।మనుకృతభావమునకు నలరి మనమునఁ గమలా।సనుఁడను రాగము ముప్పిరిఁ।
గొనఁ బ్రియతముఁడై నసుతున కనుని ట్లనియెన్॥* (చ॥ మనుకొని తండ్రి యాజ్ఞఁ దలమోఁచి నిజోచితకృత్యమేమిపం। చినఁద
నశక్తిచేత నెడసేయక చేయుట పుండరీకలో। చనపదసేవ సేయుట ప్రజాపరిపాలనశాలియౌటయు। న్ననుతుఁడై సుతుండు
పరిచర్యలొనర్పుట సుపుత్రకా॥ కావున* (మ॥ వివరింపన్ హరియజ్ఞమూర్తిఁ బరముం ద్విష్ణున్ హృషీకేశుఁ గే। శవుఁ బద్మా
క్షుఁ గురించి జన్నములు శశ్వద్భక్తిఁ గావింపుమా। ధవుఁడాత్మన్ బరితోషమొందన తఁ ద్యత్ప్రీతిఁ గైకొన్న లో।కవితానం
బులు తుష్టిఁ బొందు ననఘా కావింపుమా యజ్ఞముల్॥* (చ॥ అవుటిలభక్తిఁ గేశవసమర్పణబుద్ధిఁ గ్రతుక్రియల్వొన। ర్పక విపరీ
తులై యుము కరాసులు దంభిఫలంబు నందఁగా। నక చెడురీతి మారక ధనవ్యయమాటయె కాని మోక్షదా। యకమగుచున్నత
త్ఫలము నందరు విష్ణుపరాఙ్ముఖక్రియల్॥* (ఉ॥ కావున యజ్ఞముల్ హరివికారవిదూరుఁ గురించి చేయు నీ। భావము సూనృతవ్రత
శుభస్థితిఁ జెందెదు నీకుమారులు। నీవును నీధరాభరము నెమ్మి వహింపుము సజ్జనావళిం। బ్రోవుము ధర్మమార్గమునఁ బుత్రక
దోషలతాలవిత్రకా॥* (క॥ అనవుడు నతనికి నతఁడి।ట్లని యెన్నివదీయమైన యానతి యెట్ల। ట్లొనరించెద నాకును నా।తనయులకు

—❀ శ్రీయజ్ఞవరాహావతారవర్ణనము. ❀—

వసింపియుండఁదగు నెలవెంకుశ॥* (గీ॥ అరయ లేదు విధాత యీయఖిలజంతు। జాతముల కెల్ల నాధారభూతమైన।ధరణి యి
ప్పుడు ఘనజలాంతర్నిమగ్న।మైనకతమునఁ జోటు లేదరయఁ దండ్రి॥* (క॥ కావున భూమ్యుద్ధరణము। గావించును పాయమి
పుడు కైకొని నాకు దేవా నీ వెఱిఁగింపుము। నావుడు పద్మజుఁడు దనమనంబునఁ దలఁచెన్॥* (మ॥ జలమధ్యంబున లీనమొందిన
ధరాచక్రంబు నేనే ప్పన। న్నిలుపన్ వచ్చును బూర్వమందు జగముల్ నిర్మించువాఁ డాదిన। ప్పులఁ బుట్టించితి నమీఁద నివ్వసుమతి
మ్మట్టించి తింబుగ్రయం। బులలోఁ గ్రుంకి గపాతలాంతరమునుం బొందెన్ దాపృథ్వియున్॥* (సీ॥ అఖిలజగత్కల్పనాటోపము
నకుఁ బాల్పడిన నాచేత నెబ్భంగి నిపుడు। దగిలి విశ్వంభరోద్ధరణంబుఁ గావింపనగు నని సర్వభూతాంతరాత్ముఁ। బురుషోత్తము
నినవపుండరీకాక్షు లక్ష్మీపతిఁ దనమనస్స్థితునిఁ జేసి। తలపోయుచున్నఁ బద్మజు నాసికావివరమ్మున యజ్ఞవరాహమూర్తి। యద్ధి
నంగుష్ఠమాత్రదేహంబుతోడ। జనన మందిని యత్తలస్థాయియగుచు।క్షణములోపల భూరిజగత్ప్రమాణ। మయ్యె నచ్చటి జన
ములకద్భుతముగ॥* (సీ॥ అంతఁ బ్రజాసర్గమందు నియుక్తులైనట్టి మరీచ్యాదులైన మునులు। సనకుమారకులు నస్మను సహితం
బుగ యజ్ఞవరాహంబు నబ్జజాది। యిట్టియాశ్చర్యమెట్లొందె నిఁగల దెనాసారంధ్రనిర్గతస్తబ్ధరోమ। లోకంబునమువిలో
కింపనంగుష్ఠమాత్రమై యిటు క్షణమాత్రలోన। మహిమ దీపింప దంతిప్రమాణమును మ। హోన్నతంబైన గండశైలోపమం
బునయ్యె నను చు పితామహాదిరబ్జభవుఁడు।హర్షమిగురొత్త నిట్లని యపుడు దలఁచె॥* (క॥ నానానమునఁ గలమకిఖ। విరామముఁ
గావించుకొ ఇసు రాజీవాక్షుం।డీమేర యజ్ఞపోత్రీ। శ్రీమూర్తి వహించెనది విచిత్రము దలఁపన్॥* (వ॥ అని వితర్కించుచున్న
యంబున సూకరాకారుండయిన భగవంతుండు॥* (గీ॥ ప్రళయజీమూతసంఘాతభయదభూరి। గర్జనాటోపలోపకృద్ఘనగభీ
ర।రావమడరింపనపుడు రాజీవభవుఁడు।మునులు నానందమును బొందిర నఘచరిత॥* (వ॥ అంత మాయాసూకరవరాహఘుర్ఘు
రారావంబు బ్రహ్మాండకోటర పరిస్ఫోటనంబుఁ గావింపవిని జనస్తపస్సత్యలోక నివాసులయిన మునులు ఋగ్యజుస్సామమం
త్రంబుల వినుతించిరి యజ్ఞవరాహరూపధరుండయిన సర్వేశ్వరుండు సత్పురుషపాలనదయాపరుండు గావున దిగ్గజేంద్రలీలా
విలోలుండై॥* (సీ॥ కఠినసటాచ్ఛటోత్కటజాతవాతనిర్ధూతజీమూతసంఘాతమగుచు। క్షురనిశితసునిశితఖురపుటాహతచ

---

ట్టఁగాను—వినయవినమితోత్తమాంగుఁడై - అడఁకువగలిగి వంపఁబడినశిరస్సుగలవాఁడై —అప్పు - జలము— స్తబ్ధరోమ - వరాహము,—గండ
శైలోపమంబు-గండశైలముతోఁ దుల్యమైనది-గండశైలమనఁగా భూకంపాదులచేతఁ బర్వతమునుంచి జారిన బండఱాయి. ముష్టి-పదిముఖము

లక్ష్మణిరాజదగ్గజప్రచయమగుచు । చండసంఘట్టోత్థవైశ్వానరార్చిః స్రవద్రజత హేమాద్రివిస్రంభమగుచు । ఘోరగంభీ
రఘుర్ఘురభూరిస్వనపంకీలాఖిలవార్ధిసంకులముగఁ । బొరలుఁగెరలునటించునంబరము దెరల । జొప్పనుప్పర మెగయును
గొప్పరించుముట్టెబిగియించుముసముసమూరుకొనుచు । నడరుసంరక్షితక్షోణియజ్ఞఘోణి ॥ మఱియునయ్యజ్ఞవరాహం
బు* (సీ॥ తివిరిచతుర్దశభువనంబులనుదొంతులుగఁ గొమ్ములఁజిమ్మునొక్కమాటు। పుత్తడికొండమూపురమునునొఱగం
టనురుము గా రాపాడునొక్కమాటు । ఖురములసప్తసాగరములరొంపిగానుక్కించిమట్టాడునొక్కమాటు। అభీలవాలవా
తాహతిచేమిన్నునొఱసిబ్రద్దలుసేయునొక్కమాటు । కనులకొనలనువిస్ఫులింగములుసెదర । నుగ్రభయంకరగతిఁదోఁచు
నొక్కమాటు। పరమయోగీంద్రజనసేవ్యభవ్యవిభవ । యోగ్యమైకానఁగానగునొక్కమాటు* (వ॥ ఇట్లుహరివిహరింపు
చుఁబ్రాతర్మధ్యందినతృతీయసవనరూపుండైన యజ్ఞవరాహమూర్తియగు సర్వేశ్వరుండుమహాప్రళయంబునందు యోగని
ద్రావశుండైయుండు నవసరంబుననుదకస్థంబైన భూమిరసాతలగతంబైనదాని నుద్ధరించుటకుసముద్రోదరంబు దరియంజొ
చ్చు వేగంబుసైరింపంజాలక సముద్రుండూర్ములనుభుజంబులెత్తిపశీర్ణహృదయుండై యార్తునిపగిదియజ్ఞవరాహనన్నురక్షిం
పురక్షింపుమనియాక్రోశింపనిశితకరాళక్షురతీక్ష్ణంబులైన ఖురాగ్రంబులజలంబుల విచ్ఛిన్నంబులఁగావించి యపారంబైన
రసాతలంబుప్రవేశించిభూమిఁబొడఁగనునవసరంబున* (క॥ శరనిధిలోనమహోగ్రా । మరకంటకుఁడెదురుగాంచెఁగఖ
మయగాత్రిన్। ఖురవిదళితకులగోత్రిన్। ధరణికళత్రిన్గవేషధాత్రిన్బోత్రిన్* (వ॥ ఇట్లుపొడఁగనిదైత్యుండురోషభీషణాకా
రుండై* (మ॥ గదసారించియసహ్యవిక్రమసహస్రస్ఫూర్తిచేవ్రేయుచో । నదిదప్పించివరాహమూర్తినిజదంష్ట్రాగ్రాహ
తిన్ద్రుంచెఁబెం। పొదవన్గ్రోధమదాతిరేకబలశౌర్యోదానవిస్తారసం । పదఁబంచాస్యముసామజేంద్రుఁజలమొప్పంద్రుంచు
చందంబునన్* (మ॥ దితిజాధిపుఁ నీగతింబునిమియుద్వృత్తిన్దదీయాంగశో। ణితపంకాంకితగండతుండుఁడగుచు న్విష్ణుండు
మనొప్పెవి। స్ఫుతసంధ్యాంబుదధాతుచిత్రితసముద్దీప్తక్షమాభృద్గతిన్ । క్షితిదంష్ట్రాగ్రమునన్ ధరించిజలరాశింబాసియే
తేరఁగన్* (గీ॥ బాలశీతాంశురేఖవిభాసమాన। ధవళదంష్ట్రాగ్రముననున్నధరణియొప్పె । హరికినిత్యానపాయినియైనల
క్ష్మియనగుచుఁబూసినకస్తూరి నామమనఁగ* (వ॥ అట్టియజ్ఞపోత్రిమూర్తింజూచికమలాసనప్రముఖులిట్లనిస్తుతియించిరి* (సీ॥

—* శ్రీయజ్ఞవరాహమూర్తిని బ్రహ్మాదులుస్తుతియించుట. *—

దేవజితంజితం తేపరమేశ్వరజితయజ్ఞభావనశ్రుతిశరీర । కారణసూకరాకారుండవగునీకునతిభక్తిన్మ్రొక్కెద మయ్యవర
ద । భవదీయరోమకూపములందుఁలీనంబులయ్యుండునంబుధులట్టియధ్వ । రాత్మకమైతనరారునీరూపంబుఁగానంగరాదుదు
ష్కర్మపరులకట్టినీకుఁబ్రణామంబులాచరింతు । సుఖిలజగత్సుకీర్తిదయానువర్తి। భవ్యచారిత్రపంకజపత్రనేత్ర। చిరశుభా
కారయిందిరాచిత్తచోర॥ అని వెండియునిట్లుస్తుతియించిరి* (సీ॥ త్వక్కుననఖిలవేదంబులురోమంబులందునుబర్హిస్సులక్షు
లందు । నాజ్యంబుఁబాదంబులందుఁజాతుర్హోత్రకలితంబులగు యజ్ఞకర్మములును । స్రుక్కుతుండంబునస్రువమునాసమున
నిడయుఁబొత్రియుదరకోటరమునందుఁ । శ్రవణాస్యబిలములఁజమసప్రాశిత్రముల్గళమునఁనిష్టిత్రికంబుజిహ్వఁ । దగుఁబ్రవ
ర్గ్యమునగ్నిహోత్రములునీదు। చర్వణంబునుసభ్యోపసభ్యులుత్త । మాంగమసువులుచయనములగుఁగిటీశ* (వ॥ వెండి
యుముహుర్ముహుర్భగవదావిర్భావంబుదీక్షణీయేష్టియగు నీదుదంష్ట్రలుప్రాయణీయంబను దీక్షాసంతతేష్టియు దయనీ
యంబనుసమాప్తేష్టియు యుష్మద్రేతంబుసోమంబును త్వదీయావస్థానంబు ప్రాతస్సవనాదులు నీదుత్వఙ్మాంసాదిసప్తధా
తువులగ్నిష్టోమోక్థ్యషోడశీవాజపేయాతిరాత్రాప్తోర్యామంబులను సంస్థాభేదంబులుద్వాదశాహాదిరూపంబులయి బహు
యాగసంఘాతరూపంబులగు సర్వసత్రంబులుభవదీయశరీరసంధులు ససోమాసోమంబులగు యజ్ఞక్రతువులునీవ మఱియు
యజనబంధనంబులచేనొప్పుచుండువాడియునుంగాక* (క॥ హవరూపివిహవనేతవు। హవభోక్తవుః ఖిలహవఫలాధారుఁడ
వున్। హవరక్షకుండవగునీ। కవితతముగనుతులొనర్తుగయ్యముకుందా* (గీ॥ సత్వగుణమునసక్తభక్తిసంభవించు । భక్తియు
తముగఁజిత్తంబుభవ్యమగును। హృదయపద్మంబునందోలినెఱుఁగఁబడిన। యట్టినీకునమస్కారమయ్యవరద* (మ॥ అరవిందో
దరతావకీనసితదంష్ట్రాగ్రావలగ్నక్షమా। ధరనద్యబ్ధివనాటవీయుతసమిద్ధక్ష్మాతలంబొప్పెభా । సురకాసారజలావతీర్ణమద
వచ్ఛుండాలరాడ్దంతశే। ఖరసంసక్తపినీలపంకజముఁరేఖంబొల్పుదీపింపఁగన్* (మఱియు* (మ॥ చతురామ్నాయవపుర్వి
శేషధరచంచత్సూకరాకారనీ । సితదంష్ట్రాగ్రవిలగ్నమైనధరరాజిల్లెన్గులాద్రీంద్రరా । జతశృంగోపరిలగ్నమేఘముగతిం
జాలందగెన్సజ్జనాం। చితహృత్పల్వలలోలభూరమణలక్ష్మీనాథదేవోత్తమా* (సీ॥ సమధికస్థావరజంగమాత్మకమైనవసుమతీ
చక్రమవక్రలీల । నుద్ధరించితికరుణోపేతచిత్తుండవగుచునస్మన్మాతయయ్యెధరణి । మాతయాకెట్లనిమదిఁదలంచెదవేనిఁజ

గవేషధాత్రిన్ -భూమినివెదుకుచున్నవాని--త్రయీమయ-వేదస్వరూపమయిన.

ర్పింపమాకు విశ్వమునకీవు। జనకుఁడవగుటయుష్మత్పత్ని భూదేవియగుటమాకునుదల్లియయ్యెనిపుడు। ధరకునీతోడఁగూడవం
దనమొనర్తు। సురణియందుననుయాజ్ఞికుఁడగ్నిఁ గిలుపు। కరణిమీ తేజమీధరాకాంతయందు। నిలుపధరణిపవిత్రయై నెగడుఁగా
న* (చ॥ తలఁపరసాతలాంతరగతక్షితిఁ గ్రమ్మఱనిల్పినట్టినీ। కలితనమెన్నవిస్మయముగాదుసమస్తజగత్తులోనిమై। గలుగఁగఁ
జేయుటద్భుతముగాకనుజూడాన్నతనీవొనర్చుపెం। పలరినకార్యముల్నడుపనన్యులకుం దరమేరమేశ్వరా* (ఉ॥ సకలజగ
న్నియామక విచక్షణలీలఁ దనర్చునట్టినం। కకధరతావక స్ఫురదుదారత మంత్రసమర్థుఁడైనయా। జ్ఞికుఁడరణిం గాహుతాశను
నిలిల్పినకైవడి నున్నవాసమా। టకుఁదలపోసియాక్షితిదృఢంబుగనిల్పితివయ్యయీశ్వరా* (చ॥ పలలితవేదశాస్త్రమయ
సాకరమూర్తిఁ దనర్చుచుకగసా। తలముననుండి వెల్వడును దారత మేనువిదిర్పఁదత్సటో। చ్చలితములైనబిందువులసాధుత
పోజనసత్యలోకవా। సులసుగుమేముదోఁగి పరిశుద్ధివహించితిమయ్యమాధవా* (ఉ॥ విశ్వభవస్థితిప్రళయవేళలయందువి
కారసత్వము। స్వీశ్వమునీవయానిఖిలవిశ్వములోలిసృజింతువిందిరా। ధీశ్వరయాశకేశవత్రయీమయదివ్యశరీర దేవనీ
శాశ్వతలీలలిట్టివనిసమ్మతిసేయఁగమాకుశక్యమే* (సీ॥ పంకజోదరనీవపారకర్మండవుభవదీయకర్మాబ్ధిపారమరయ। నె
ఱిఁగెదనని మదినిశ్చయించినవాఁడుపరికింపఁగామతిభ్రష్టుగాక। విజ్ఞానియేచూడవిశ్వంబునీయోగమాయాపయోనిధిమ
గ్నమౌటఁ। దెలిసియుఁదనుబుద్ధిఁదెలియనిమూఢులనేమననఖిలలోకేశ్వరేశ। దాసజనకోటికతిసౌఖ్యదాయకములు। వితత
కరుణాసుధాంచరంగితములైన। నీకటాక్షేక్షణములచే నెఱయమమ్ము। జూచిసుఖులను జేయవేసుభగచరిత* (క॥ అనిబ్రహ్మ
వాదులగుస। న్మునివర్యులుభక్తియోగమునవినమితులై। మనమున మోదముప్పిరి। గొనఁబొగడిరిఖురవిదళితగోత్రిన్ బో
త్రిన్* (ఉ॥ అంతటలీలవోలెజగదాత్ముఁడుయజ్ఞవరాహమూర్తిమ। ద్దాంతగభీరభీషణమహార్ణవతోయసమూహమున్ ఖు
రా। క్రాంతముఁజేసి క్రమ్మఱఁ ధరాతలమంబులమీఁదనిల్పివి। శ్రాంతివహింపఁ జేసిగుణశాలితిరోహితుఁడయ్యెనయ్యెడన్*
(ఉ॥ మంగళమైనయీకథనమందితభక్తిఁ బఠింపవిన్నవా। రింగరుణార్ద్రదృష్టిఁగని శ్రీహరి చాలఁ బ్రసన్నుఁడౌ నస। త్సంగ
తుఁడైనవిష్ణుఁడుప్రసన్నుఁడుదానగునేని వారికి। న్మంగళముల్లభించుననుమానము లేదదిగాక వెండియున్* (చ॥ హరినిజదా
సకోటికిఁదదాశ్రయులై రమియించునట్టిస। త్పురుషులకిష్టవస్తుపరిపూర్ణమనోరథసిద్ధిగల్గును। స్థిరమగుచున్నముక్తియును
సిద్ధముగాఁజెలువారునన్నన। స్థిరతగతుచ్ఛసౌఖ్యములు సేకురుటల్మఱిఁజెప్ప నేటికిన్* (ఉ॥ కానసరోజలోచనుజగత్పవనీ
యకథాసుధారసం। బానినయట్టిజిహ్వయపదన్యకథాలవణోదకంబుల। న్పానముసేయఁజూచునెసుపర్వమహీజసురంద
పానలా। భామభవంబునొందుమధుపంబును బోవునె వేఁపచెట్లకున్* (క॥ అనిమైత్రేయమునీంద్రుం। డనఘుఁడు విదురునకుఁ
జెప్పినట్టితెఱంగ। ర్జునపౌత్రునకున్ వ్యా। సునితనయుఁడువినిపించి మఱియుఁదగనిట్లనియెన్॥ (క॥ అనిచెప్పనవినిమైత్రేయు
నిఁగనివిదురుండువలుకు మునిసత్తమ వినుమా। దనుజకులాంతకుచరితము। వినితనియదు నామనంబువిమలచరిత్రా* (చ॥ ఘవనవ
రాహమూర్తికథసర్వమునీదయవింటి వెండియు। న్నవరముగావినంబలుక వేడుణసాంద్రమునీంద్రచంద్రమా। ధవగుణకీర్త
నామృతవితానముఁగర్ణపుటాంజలిన్ వెసన్। జవిఁగొనకేలమానుజనసంతతికిన్భవతాపవేదనల్॥ కావున* (సీ॥ శ్రీహరియజ్ఞ
వరాహరూపముఁదాల్చిమించి హిరణ్యాక్షుఁ ద్రుంచెననుచు। నప్పుడుమునినాథ చెప్పితి నాతోడ నవ్వరాహంబుదంష్ట్రాగ్ర
మునను। ధరణి నెబ్బంగినిధరియించెహరికిహిరణ్యాక్షుతోడ వైరమునకేమి। కారణమసుర నేగతిసంహరించెఁదానింతయు
నెఱిఁగింపుమిద్ధచరిత। యనిన మైత్రేయముని విదురునకుననియె। హరికథావర్ణనమునఁబెంపారునీకు। జన్మఫలసిద్ధియగుటను
సందియంబు। వలదుహరిమహిమవిధికివశమె తెలియ* (క॥ అనఘాత్మనన్నునీవడి। గినయీకథధ్రువుఁడువిష్ణుకీర్తనపరతన్। ద
నరిననారదునడుగన। తనికఁ దెఱిఁగింపహరికథాశ్రవణమునన్* (గీ॥ దండధరుఁడుబెల్పడాకాలఁదన్నిధ్రువుడు। నిందునం
దును వాసికినెక్కెనట్టి। విష్ణుసంకీర్తనంబరఁపింపభవుఁడు। దివిజులకుఁజెప్పెనదినీకుఁ జేటపఱతు॥ ఆకర్ణింపుము* (సీ॥ బలిసిదతు

—* మైత్రేయమహాముని విదురునకు హిరణ్యాక్షహిరణ్యకశిపులజననం బెఱింగించుట. *—

ప్రజాపతితనూభవదితిసంతానవాంఛఁదాఁజింతతోడ। నొకనాడు పుష్పసాయకశరనిర్భిన్న భావయైవిరహతాపమున వ
చ్చి। పతిసమాగమవాంఛ ప్రభవింపనిజనాథు సన్నిధినిలిచియస్ఖలితనియతి। నగ్నిజిహ్వుండనుయజురధీశుండనువాహిత స్థు
దనచిత్తమందునిలిపి। తగబయప్పుననగ్నిహోత్రంబుఁ జేసి కమలహితుఁడస్తశైలసంగతుఁడు గాఁగ। హోమశాలాం
గణమునఁగూర్చున్నవిభునిఁ। గశ్యపుని గాంచివిమలవాక్యములననియె* (చ॥ గజవిభుఁడుద్ధతిన్నఁటికంబముల న్వడిఁ ముఱిఁ
జి। త్తజుఁడు ప్రసూనసాయకవితానము చేతమదీయచిత్తము। న్గజిబిజిఁజేసిపెన్వగలఁగాఱియఁబెట్టఁగ నాథనీపదాం। బుజ
ములఁ గానవచ్చితిఁ బ్రభుత్వమెలర్పఁగనన్నుఁగావవే* (వ॥ అదియునుం గాకనాతోడిసవతులెల్లను భవత్కృపావిశేష...

పెల్పడాకాలన్ - వేగముగా ఎడమకాలిచేత. — విష్ణుం - విశ్వంవేష్టి వ్యాప్నోతివిష్ణుః - ప్రపంచమును వ్యాపించియుండువాఁడు - ...

నగర్భాధానంబులువడసి నిర్భరానందంబుననుండంజూచి శోకవ్యాకులితచిత్తనైయున్న నన్నురక్షించుటపరమధర్మంబు నీ
వువిద్వాంసుండవునీ వెఱుంగనియర్థంబుగలదె నీవంటిమహానుభావులైన సత్పురుషులార్తులైన వారికోర్కు లువ్యర్థంబులు
గాకుండందీర్చుటధర్మంబని వెంచియుండనియెం* (క॥ పతిసన్మానమువడసిన। సతులకునభిమతపదార్థసంసిద్ధియునౌ। రీతియశ
ముఁగలిగిలోకస్తుతమై చెలువారుచుండుఁజువ్వె మహాత్మా* (క॥ తనధర్మపత్నివలనను। మునుకొని తాఁబుత్రరూపముననుద
యించునిప్పు దీపముచే దీపించినదీపము రెండుగా వెశేషమొకడయ్యా* (క॥ కావుననీయర్థమయా। ఆత్మా వై పుత్రయను వేద
తతులందోలి నా వివరించి బలుకఁగవినవే। ధీవరననుఁగావుమధికదీనుంగరుణన్* (చ॥ వరకరుణామతీక మహితాత్మవత్సలతందన
రారునట్టిమ। ద్గురుఁడొకనాఁడుమమ్ముఁదనకూఁతులనందఱఁబిల్చిమీమహో। హరుఁడెవ్వఁడింపుఁడిత్తుఁగమలాననలార యట
న్ననందులోఁబురుషవరేణ్యుయేమపదముపూర్వమర్మిలివిస్తరింపమే* (క॥ దితియాగతిఁగామవిమో। హితమతిబహువచ
నములహృదీశునిఁబలుకన్। ధృతిఁగృపణపతివ్రతసిజ। పతిఁగనికశ్యపుఁడువలికెసల్లాపమునన్* (వ॥ నీవుచెప్పినయట్లపురుషు
లకు సంగనలవలనధర్మార్థకామంబులు సిద్ధించుఁగర్ణధారుండునావచేతం బయోధిఁగడచుచందంబున గృహమేధిసర్వాశ్ర
మవాసులనరసిరక్షించుచుని జాశ్రమంబున వ్యసనార్ణవంబుఁదరియింపంజేయు భార్యపురుషునకు నర్ధంబు, భార్యయందు
సకలగృహకార్యభారంబునుంజేర్చి పురుషుండునిశ్చింతుండై సుఖియించుచుండు మఱియునితరాశ్రమదుర్జయంబులైనయిం
ద్రియశత్రువర్గంబుల భార్యాసమేతుండైన గృహస్థుండుదుర్గాధిపతియైనరాజు శత్రుసంఘంబులజయించుచందంబున లీలా
మాత్రంబునంజయించునట్టి కళత్రంబునకుం బ్రత్యుపకారంబుసేయ సకలగుణాభిరాములగు సత్పురుషులునూఱేండ్లకునుజ
న్మాంతరంబులకునైన సమర్థులుగారనినమముబోఁటి వారలుసేయనోపుదురే నైన నీమనంబునంగలదుఃఖంబుఁదక్కఁజనియి
ట్లనియె* (గీ॥ తరళలోచననీవుసంతానవాంఛ। జేసివచ్చితివాఁగులశీలవర్తనములుగలభార్యమనమునమరుకోర్కిఁ।దవి
లితీర్పుటపతికిఁగర్తవ్యమరయ* (మ॥ తరుణీయొక్కముహూర్తముండుమిదిసంధ్యాకాలమికాలమం।దరయన్భూతగ
ణావృతుండగుచుఁగామారాతిలీలన్వృషేశ్వరయానంబునసంచరించుటనభావ్యంబయ్యెనీయుగ్రవే। ళరమింపంగనిషిద్ధక
ర్మముగునేలాధర్మమున్వీడఁగన్* (మ॥ అరవిందాననవీఁడెనీమఱఁదిలీలాటోపరుద్రత్వపా। చరజంఝానిలధూతపాంసుపట
లచ్ఛన్నుండుధూమ్రైకదు। గ్ధరవిద్యోతితకీర్ణభీషణజటాబద్ధుండుభస్మావలి। ప్తసుదిస్ఫారసువర్ణవర్ణుఁడగుచున్భాసిల్లున
త్యుగ్రుఁడై* (క॥ అనలసుధాకరరవిలో।చనములవికసింపఁజేసినమధికరోషం।బునఁజూచుచున్నవాఁడదె।వనితాబంధుత్వ
మరయవలవదెసుమ్మీ* (క॥ అతనికిఁదలపోయహితా। హితులునుసన్మాన్యులునువిహీనులునతిగ।ర్హితులును లేరీశుఁడుసమ।
మతియునునిఖిలైకభూతమయుఁడైయుండన్* (క॥ కావునమద్భ్రాతభవ।ద్దేవరుఁడనితరుణినీమదింజూడకుమా। దేవాదిదే
వుఁద్రిజగ।త్పావనునిఖిలైకనేతభగవంతుహరున్* (వ॥ ఏమునుసత్పురుషులైన విజ్ఞానవంతులును భుక్తభోగంబైదూర
తోన్యస్తమైన పుష్పమాలికయునుంబోలె నమ్మహాత్మునిచరణారవింద వందనాభిలాషిమైనయవిద్యననుసరించి వర్తింతుమ
దియునుంగాక* (సీ॥ ఎవ్వనికరుణబ్రహ్మేంద్రాదిదిక్పాలవరులాత్మపదవైభవములఁదనరి। రెవ్వనియాజ్ఞవహించివర్తించు
మవిశ్వరూపిణియానవిద్యయెపుడు। నెవ్వనిమహిమంబులిట్టివట్టివియని తర్కింపలేవు వేదంబులైన। నెవ్వనిసేవింతురెల్ల
వారునుసమానాధికరహితుఁడైయలరునెవ్వఁ। డట్టిదేవునిఁద్రిపురసంహారకరుని। నస్థిమాలాధరుండుభిక్షాశనుండు।భూ
తిలిప్తాంగుఁడుగ్రపేతభూమి। వాసుఁడనిహాస్యమొనరించువారుమఱియు* (క॥ ధరశునకభోగ్యమనునిహ। పరమూరము
లైనతనువుఁబాథేయముగా। నెరినమ్మివస్త్రమాల్యా।భరణంబులలంకరించుపామరజనులన్* (క॥ ఘననిర్భాగ్యులుగామ
దిఁగనుమనియారీతిఁబ్రియుఁడుకశ్యపుఁడెఱిఁగిం। చినదితిగ్రమ్మఱఁబలికెను। మనసిజసాయకవిభిన్నమానసయగుచున్*
(క॥ మునుకొనిలజ్జావనతవ।దనయైప్రాణేశుకొంగుఁదాలిమిదూలం।బెనఁగొనియెవారకామిని। యనువునవినిషిద్ధకర్మమంచ
భిముఖయై* (వ॥ ఇట్లుచేసినభార్యానిర్బంధంబునకుందొలంగనేరకయీశ్వరనమస్కారంబొనరించి యేకాంతంబుననిజ
కాంతాసంగమంబుఁదీర్చి సంగమానంతరంబునవార్చిస్నాతుండయి ప్రాణాయామంబును విరజంబుసనాతనంబునైనబ్ర
హ్మగాయత్రిజపియించెనంత* (క॥ దితియునిషిద్ధకర్మ। స్థితికైమదిలోనసిగ్గుదిట్టాడఁగనా।నతవదనయగుచునాపశు।పతివ
లనిభయంబుఁదక్క పరమప్రీతిన్* (క॥ అర్భకులు లేనిదగుటను।గర్భమ్మునిజనాథువలనఁగనులాననకా।విర్భూతమైనఁగర్మవి।
నిర్భరపరితోషమాత్మ నెలకొనియుండెన్* (వ॥ అంతఁగశ్యపుండుతత్కాలసముచితసంధ్యావందనంబులుదీర్చి* (క॥ ఆచెలి
కిగర్భచిహ్నములుదోఁచినఁబతితోషమాత్మఁదోడ్కొనసామా।రీచుండునిజతలోదరిఁ। జూచియకర్మమునకాత్మస్రుక్కుచుఁబలి
కెన్* (మ॥ సతినీవేగతినిందకోడకమనోజాతేక్షుకోదండని।ర్గతనారాచపరంపరాహతవిశీర్ణస్వాంతవై పాపసం।గతిల

నేత-పతి — పాథేయముగా-జీవాధారముగా — వార్చి-ఆచమనము చేసి — సనాతనంబు-శాశ్వతమయినది — ఆవిర్భూతమయినన్-పుట్టగా.

జాఁ భయధర్మములెల్ల విడిచి దుష్కాలంబునం దేరమింప । దితిబల్మి న్వేలయాలికై వడిసి ముశ్శీలక్రియాలోలతఁ॥ అట్లు రమించుటం
జేసి*(క॥ సతి విను భూతగణప్రే। రితులై రుద్రానుచరులరీణబలసమ । న్వితులుగ్రకర్ములతిశౌ । ర్యతములు భద్రానుభద్రులను
నాగముల౯*(క॥ పరగిన సరోషబుద్ధు లి। ద్దరు కొడుకులు నీకుఁ బుట్టి ధరణికి వేగై। నిరతము బుధజనపీడా । పరులై వర్తింతురాత్మ
బలగర్వమున౯*(గీ॥ అట్టినుష్కర్ములకును మహాత్ములలిగి। విశ్వవిభుఁడైన హరికి నివిన్నవింప। నతఁడు కోపించి హరికులిశాయు
ధమున, గిరులనరికినగతి వారిధరణిఁ గూల్చు*(క॥ అనికశ్యపుఁ డెఱిఁగించిన । విని దితి భయమంది చాల విహ్వలమతియై। తనహృద
యేశుముఖాబ్జముఁ। గనుఁగొని యిట్లనియె విగతకౌతుకయగుచు౯*(చ॥ ధరసుజనాపరాధులగు తామసచిత్తులకెందు నాయు
వు। స్మరియు నశించిపోవు స్మృతిసేసుకు శస్త్రులచేత నింతయా । నరయఁగ నిక్కవంబు భవదాత్మజులాహ్యలకెగ్గుఁ జేయభూ। సు
గుల ప్రసిద్ధగ్ని పాల్పడక శోభనమా హరిచేతి పంచత౯*(చ॥ అనవుడు గశ్యపుండు గమలాననకిట్లను నింతినీవు చే । సిన విపరీతక
ర్మమునఁ జేసి రెనిట్టియవస్థదీని కి। న్మనమునఁ దాపమొందకుము మాధవుపాదసరోజయుగ్మము । తనమున జేసియున్నను ముదం
బునఁ గొల్చుటఁ జేసియాం౯దర౯*(గీ॥ నమణి నీసుతులందు హిరణ్యకశిపు। వలన నుదయించువారిలోపల ముకుంద। పదసరోజా
తవిన్యస్తభావుఁడైన। తనయుఁ డుదయింపఁగలఁ డతిధార్మికుండు॥ మఱియును*(క॥ ఘనపుణ్యుఁడు సన్వయపా । వనుఁడగు న
పుణ్యతమునివగ కీర్తిలతి। ల్ప సజభవాండోదగమె। ల్లను సిండఁగఁ బర్వు బుధలలాముండగుట౯*(గీ॥ వామలోచన వినుము దు
ర్వర్ణహేమ। మగ్ని పుటమునఁ బరిశుద్ధమై వెలుంగు । నట్లు దుష్టాత్మసంభవుఁ డయ్యు వంశ। పావనుండగు హరిపాదభక్తుఁడౌట॥
అట్టినీ పౌత్రుండు*(గీ॥ అంది తా ప్తాంగయోగక్రియాకలాపు। లైన యోగీశ్వరులు ననమ్యమహానుభావు। నతులశీలస్వభావవిజ్ఞా
నసరణిఁ। దాముఁ జరియింప నాత్మలఁ దలఁతు రెపుడు*(ఉ॥ ఆమహితాత్ముఁడు సుగుణాంబుధి భాగవతోత్తముండు లక్ష్మీమ
హిళాదినాథుఁ డులసీదళధాముఁ బరేశు నాత్మహృ । త్తామరసంబునందు బ్రమదంబున నిల్పి తదన్యవస్తువుం। దామదిలోహ
సించు హరిదాస్యవిహారపిపాసితాత్ముఁడై*(సీ॥ మహితదేహాద్యభిమానంబు దిగనాడి విరతరాలంపటశీలుఁడగుచుఁ। బరస
మృద్ధికి నాత్మఁ బరితోషమందుచుఁ బరదుఃఖమునకుఁ దాపమును బొందు। నీవిశ్వమంతయు నేవిభుమయమని యెవ్వని కరుణచే నె
ఱుఁగనయ్యె। నట్టి యీశ్వరునిఁ దా నాత్మసాక్షిగ మోదమడరంగఁ జూచు ననన్యదృష్టి । నతని దాఘోగ్రసమయంబునం దనిఖ
ల। జంతుసంతాపమడఁగించు చంద్రుమాడ్కి । నఖిలజగముల దుఃఖంబులపనయించు। రూఢిమీర నజాతవిరోధియగుచు*(వ॥
మఱియు హరిధ్యాననిష్ఠాగరిష్ఠుఁ డగు నమ్మహాభాగవతాగ్రగణ్యుండు*(క॥ విమలాంతరంగబహి । రంగములను స్వేచ్ఛాను
రూపకలితుండగు నా। కమలాధీశ్వరుఁ గుండలి। రమణీయముఖంబుఁ జూచుఁ బ్రమదంబెసఁగ౯*(గీ॥ మఱియు నీవిశ్వమా హరి
మయము గాఁగ । మనములోపలఁ దలచు నమ్మనుని భుండు । మనుమహాత్ములలోన నీమనుమఁ డధికుఁ। డనఁగ నుతికెక్కనునుఁ
గశ్యపుఁడు వలుక*(క॥ అనితనతనయులు మధుమా । దను చేహతులగుదురనుచుఁ దనమనుమఁడు సజ్జనుత భాగవతుండగు। న
నినునమునఁ జాలదుఃఖహర్షములొదవ౯*(వ॥ ఉండునంత నాదితియుఁ గశ్యపువీర్యసంభృతంబైన గర్భంబు దుర్భర తేజోభి
రామంబు నన్య తేజోవిరామంబు దినదినప్రవర్ధమానంబునై నివ్వటిల్ల నిజోదరస్థితులైన సురమారు లమరదమనులై వర్తింపఁ
గలరని చింతింపుచు గర్భంబు శతవర్షంబులు ధరియించియున్న తదనంతరంబ*(ఉ॥ ఆదితిగర్భమందు రుచిరాకృతితో నొకతేజ
మన్యతే। జోదమలీల వెల్వడి వసుంధరయు న్గగనంబు నిండి సంఛాదితపద్మబాంధవనిశాకరదీప్తులు గల్గి సూచికా । భేదమహోగ్రా
గ్రసంతమసభీషణమైన భయాకులాత్ములై *(చ॥ అమరగణంబులెల్లఁ గమలాసను పాలికి నేగి తత్పదా । బ్జములకు మ్రొక్కి కేఁ
యంజలులు ఫాలములం గదియంగఁ జేర్చి చి । త్తముల భయంబు సంభ్రమము దార్కొన నిట్లని విన్నవించిరో । యమరకులాగ్ర
గణ్య దురితార్ణవతారణ సృష్టికారణా*(ఉ॥ నీవు చరాచరప్రచయనేతవు ధాతవు సర్వలోకపా । లావళిమౌళిభూషణుఁడ
వంచితమూర్తివి దేవదేవవా । ణీవర యీయజాండమున నీవు నెఱుంగనియర్థమున్నదే । భావనసంపలంపుము విపన్నులము
మ్ము భవత్ప్రపన్నుల౯*(వ॥ దేవా కార్యరూపంబగు చేతనాచేతనాత్మక ప్రపంచంబునకుఁ గారణుండవైన నీచేత సమస్త
భువనంబులు సృజియింపంబడె నీవు సర్వభూతాత్మభావవికుండవు లోకనాథశిఖామణిభూతుండవు జ్ఞానవీర్యుండవు నవిద్యం
జేసి యిట్టి ప్రస్ఫుటరూపంబు నొందితి గృహీతరజోగుణుండవు నీయందుఁ బ్రపంచంబు లీనంబై యుండును పక్వయోగంబు నొం
దినిష్కములై ధ్యానంబున విన్నఁగయుచు నిర్జితశ్వాసేంద్రియాత్ములై భవత్ప్రసాదంబు వడసినవారలకుం బరాభవంబులె
క్కడివి యెవ్వనివాక్యపాశబద్ధులై పశువుల చందంబున నిఖిలజీవులు వర్తింతురట్టి నీకు నమస్కరించెద మహాహోరాత్రవిభా
గాభావంబున లుప్తకర్మంబులగు లోకంబులకు సేమంబుఁ గావింపుము శరణాగతులమైన మమ్ము నతిశయకరుణారసపరిపూ
ర్ణంబులగు కటాక్షంబుల నీక్షించి రక్షింపుము కశ్యపవీర్యంబు దితిగర్భంబుననుండి సకలదిక్పలయంబు నాక్రమించి దారువం

నిర్భరపరితోషము-అధికానందము—మారీచుండు-మరీచిబ్రహ్మపుత్త్రుఁడయిన కశ్యపుఁడు—వ్రేఁగు-భారము—నిత్య-

దువహీన్న చందనంబునలీనంబై ప్రవృద్ధంబగుచున్నదని విన్నవించిన బృందారక సందోహంబులకు నానందంబుగం బలికెం నరవింద నందనుండిట్లనియె *(క॥ గీర్వాణులార యుష్మ । త్పూర్వజులాత్మీయ సుతులు పుణ్యులు విచర । న్నిర్వాణులు సనకాదులు । సర్వాంకష శేముషీ విచక్షణు లెందుం *క॥ వారలు నిస్పృహులగుచున । వారణ భువనంబు లెల్ల వడిఁ గ్రుమ్మరుచుం । ధీగుణ లోకనాఁడు భక్తిన్ । శ్రీరమణీశ్వర పదాబ్జ సేవానిరతిన్ * (చ॥ చనిచని కాంచిరంత బుధ సత్తములంచిత నిత్యదివ్యశో । భన విభవా

* సనకసనందనాదులు వైకుంఠమునకరుగుట. *

భిరామముఁ బ్రపన్నజన స్తవనీయ నామముం । ఘన నవిరామ మార్యజన సన్నుతిభూమము భక్తలోకపా । లన గుణధామముం బురలలామముఁ జారు వికుంఠధామమున్ *(ఉ॥ ఆ మహనీయ పట్టణమునందు వసించెడువారలాత్మని । ష్కామ ఫలంబె సత్ఫలము గాఁదలపోసి ముముక్షుధర్ములై । శ్రీమహిళాధిపాంఘ్రి సరసీరుహ పూజలొనర్చుచున్న మా । హాత్ములు ద్వాఃస్థ తదీయరూపములఁ దాల్చి సుఖించుచునుందు రెప్పుడున్ *(చ॥ విగత రజస్తమోగుణుఁడు పశ్రుతచారుయశుండు శుద్ధస । త్త్వగుణుఁడజుండనాది భగవంతుఁడనంతుఁడనంతశక్తియున్ । నిగమచయాంత వేద్యుఁడు ప్రనిశ్చల నిర్మలధర్మమూర్తియై । తగు హరి పేరఁ బెంపెసఁగుఁ దన్నగరోపవనమ్ములిమ్ములన్ *(చ॥ మరియుం గైవల్యంబు మూర్తీభవించిన తెఱంగునం బొలుపారుచు నైశ్రేయసనామంబున నభిరామంబై సతతంబు సకల ఋతుధర్మంబులు గలిగి యర్థిజనంబుల మనంబులు ఘనంబులుగ నీరిక లెత్తిన కోరికెలు పారి కెలుగొనన నొసంగుచుఁ గామదోహన హితంబులుం బుష్పఫలభరితంబులునై తనర్చు సంతానవన సంతానంబులు సమన్విత వసంత సమయ సౌభాగ్య సంపదభిశోభిత వాసంతికా కుసుమ విసర పరిమళ మిళిత గళిత మకరంద లలితామోద ముదిత హృదయులై యఖండ తేజోనిధి యగు పుండరీకాక్షు చరిత్రంబులుగ్గడింప లేక ఖండిత జ్ఞానులైనను నిరతిశయ విషయ సుఖానుభవ కారణంబగుట నిందిరాసుందరీ రమణు చరణ సేవావిరమణ కారియగునని తలంచి తద్గంధప్రాపక గంధవహునిం దిరస్కరించి నారాయణభజన పారాయణులై చరియించు సుందరీయుక్తులైన వైమానికులునై మానిక మానసోత్సేకంబుగం బారావత హంస సారస శుక పిక చాతక తిత్తిరి మయూర రథాంగ ముఖ్య విహంగ సరంగ కోలాహలవిరామంబుగా నరవింద నయనకథా గానంబుల మానంబులుగా మొరయు మదవదిందిందిర సందోహ కలిత పుష్పవల్లీమతల్లికలు నకుంఠిత చరిత్రుండైన వికుంఠనిలయుని కంఠంబునం దేజరిల్లు విలసిత తులసీ దామంబుం గనుంగొని యీ తులసీమాల్యంబు హరిగళ విలగ్నంబై యుండు సౌభాగ్యంబు వడయుటకేమి తపంబు గావించెనో యని బహూకరించు చందంబున నొప్పు చందన మందార కుందారవింద పున్నాగ నాగకురువ కోత్పల పారిజాతాది ప్రసూన మంజరులు మంజరీపుంజ గుంజిత నికుంజంబులయందు సముత్తుంగ పీనకుచభారాకంపిత మధ్యంబులుం గటితటకనక మేఖలాకలాప నినదోపలాలిత నీలచికురాలశోభిత పృథునితంబభరాలసయాన హసిత కలహంస మయూరగమనంబులును సమశర కుసుమశర విలసితంబున వహసించు నయనకమలంబులును గలిగిన సుందరీ సందోహంబులం దగిలి కందర్ప కేళీ విహారంబుల నానందంబునొందక ముకుందచరణారవింద సేవాపరిలబ్ధ మరకత వైడూర్య హేమమయ విమానారూఢులై హరిదాసులు విహరించు పుణ్యప్రదేశంబులును నిందిరాసుందరియై త్రైలోక్య సౌందర్యఖనియైన మనోహరమూర్తి ధరియించి రమణీయ రణిత మణినూపుర చరణారవిందయై నిజహృదయేశ్వరుండైన సర్వేశ్వరుని మందిరంబులోనం జాంచల్యదోషరాహిత్యంబున వర్తింపంగ రకమల భ్రమణీకృత లీలాంబుజాతయై తన నీడ కాంచన స్ఫటికమయ కుడ్యప్రదేశంబులం బ్రతిఫలింప శ్రీనికేతనుని నికేతన సమ్మార్జన కైంకర్యంబు పరమధర్మంబని తెలుపు చందంబునం జూపట్టుచు నిజవనంబునందనరు సౌరభాభిరామంబులగు తులసీదామంబుల నాత్మనాయకుని చరణారవిందంబుల నర్చింపుచు నొసటి మృగమద మదపుటసలున మసలుకొని తుంపెసలాడు కురులు లలిత తిలప్రసూన రుచిరాభ నాసం దనరు మోము తానుదవిమల సలిలంబులం బ్రతిబింబింప నిజము నోనాయకు చేతం జుంబితంబగుటం గాఁదలంచి లజ్జావనతవదనయై యుండ జేయు ప్రవాళ లతికాపలంబులైన కూలంబులుంగల నడబావులుం గలిగి పుణ్యంబునకు శరణ్యంబు ధర్మంబులకు నిర్మలస్థానంబు సుకృతమూలంబునకు నాలవాలంబునై పొలుపొందుచుండు* (చ॥ హరివిముఖాత్ములన్యవిషయాదృత చిత్తులుఁ బాపవర్తులు । న్నిరయనిపాత హేతువు సనింద్య చరిత్రములైన మథానిరతిం జరించువారలును నేరరుపొందఁగ నిందిరామనో । హరచరణారవిందభజనాత్మకులుండెదగొందు రాయెడన్॥ వెండియు* (చ॥ హరిఁ బరమేశుఁ గేశవుననంతు భజింపఁగ ధర్మతత్త్వధీ । పరిణతి సాధనంబగు స్వభావముఁ దాల్చినయట్టి నర్తులా । సరసిజనేత్రు మాయను భృశంబుగ మోహితులై తదంఘ్రి సం । కరుహములర్థి మైఁ గొలువఁగానమిఁ బొందరు తత్పదంబునున్ * (చ॥ మఱియు సరోరుహాదరుని మంగళ దివ్యకథానులాపని । ర్భరపరితోష బాష్పకణబంధుర చారుకపోలగద్గద । స్వరపులకీకృతాంగులగు వారలు నిస్పృహచిత్తులత్యహంకరణ విదూరులుందురు సుకర్ములునుండెడు పుణ్యభూములన్॥ అందు *(మ॥

---

కాలత్రయమందును నశింపని, దివ్య. అప్రాకృతమైన, భగవంతుఁడు, షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు, అనంతుఁడు- దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యుఁడు.

వర వైకుంఠము సారసాకరము దివ్యస్వర్ణశాలాంకము। పురహర్మ్యావృతమైన తద్భువనపంభోజంబు తన్మందిరాంతరవిభా
జితభోగికర్ణికతదుద్యద్భోగపర్యంకమందిరం బొంకన్ వసియించు మాధవుఁడు దా నేపారు భృంగాకృతిన్॥ అంత* (మ॥ హరి
చేఁ బాలితమైన కాంచనవిమానారూఢమైనట్టి స। త్పురుషానీకముచేఁ దనర్చు విభవాపూర్ణప్రభావోన్నతి। న్నగర మొప్పారు తదీ
యధామము జగత్కల్యాణమూర్తుల్మునీ। శ్వరు లర్థి న్నిజయోగశక్తిఁ బరితోషస్వాంతులై చెచ్చెరన్॥ డాయంజని* (చ॥ మ
రకతరత్నతోరణసమంచితకుడ్యకవాటగేహళీ। విరచితషట్కకక్ష్యలరపంకదశాతవిలోకనోత్సవా। దరిమతి నన్యముం గన
క దాఁటి యనంతరకక్ష్యయందు ని। ద్దరను తదీయపాలురను ద్వారసమానవయోవిశేషులన్* (సీ॥ కాంచననవరత్నకటకాం
గుళీయకహారకేయూరమంజీరధరులఁ। గమనీయసౌరభాగతమత్తమధుకరకలితపద్మవనమాలికావిరాజి। తోరస్థలులఁ గదా
ధరులను ఘనచతుర్బాహులను నున్నతోత్సాహమతుల। నాకూఢరోషానలారుణితాక్షుల భ్రూలతాకౌటిల్యఫాలతలుల। వే
త్రదండాభిరాముల వెలయ నమ్ము। కుంఠశుద్ధాంతమందిరాళిందభూమి। మున్న యిద్దఱ సనకాదియోగివరులు। చూచుచును
పృథులయ్యానాసుభగమతులు* (క॥ ధీరతఁ బంచాబ్దములకు। మారకులై కానఁబడుచు మానము నశంక। న్నారక చతురాత్మకుల
నివారితగమనములఁ డాయవచ్చిన నెమకున్* (క॥ శ్రీలలనేశ్వరదరన్మ। లాలసులై యేఁగు బుధలలాముల నతిదు। శ్శీలతఁ దద్వ
చన ప్రతికూలవృత్తి న్నోచ్చవకుండఁ గుటిలాత్మకులై* (క॥ వారించిన వారలు భ్రూ। దారకు లీక్షించుచుండ దారుణపటురో। షారుణి
తాంబకులై రోద। వారించువారు నచటి వారగు నవినఁగన్॥ ఇట్లనిరి* (చ॥ పరమున ననంతభక్తపరిపాలు సుహృత్తము నిష్టు నీ
శ్వరే। శ్రీగుభజియింపఁ గోరి యనివారణ నిందరు దేరనిచ్చలు। గరితము దాత్ములై కొలువఁ బాయక తద్భుజనాంతరాయతా
త్పరమతి మాకు నిప్పుడరివడ్డకు రాత్ముల నేఁడు గంటిరే* (వ॥ అని మఱియు సనకసనందనాదు లిట్లనిరి మీమనంబుల స్వామిహి
తార్థంబై నిష్కపటవర్తనులమైన మాబోఁటులఁ గూహకృత్తింగల యితరజనంబులు భగవత్సదనంబుఁ బ్రవేశింతురో యను
నుశంకఁ జేసి కొందఱఁ బ్రవేశింపఁ జేయుటయుఁ, గొందఱ వారించుటయు దౌవారికస్వభావంబని వారింపం దలంచితిరేని
బ్రశాంతదివ్యమంగళవిగ్రహుండు, గతవిగ్రహుండు, భగవంతుండు, విశ్వగర్భుండునైన యీశ్వరుండు ప్రాప్యంబు ప్రా
పకంబు ప్రాప్తియునను భేదశూన్యుండు గావున మహాకాశంబునందు ఘటపటాద్యాకాశంబులు వేఱులేక యేకంబయి తోఁ
చుచందంబున విద్వాంసులకు వారమ్మహాత్ముని సకలాత్మభేదరహితునింగాఁ బొడగందురదియునుం గాక లోకమందు రాజు
లు సాపరాధులైన కింకరజనంబుల నాజ్ఞాపించుచందంబున నీశ్వరుండు దండించు నోయను భయంబునం జేసి వారించితిమని త
లంచితిరేని భూసురవేషధారులమైన మాకు వైకుంఠనాయకుండయిన సర్వేశ్వరునకు భేదంబు లేకుండుటం జేసి శంక సేయుంబ
ని లేదిట్లగుట నెఱింగి మందబుద్ధులై మమ్ము వారించిన యనుచితకర్ములగు మీరలు మదీయశాపార్హులగుదురు గాన భూలోకం
బునం గామక్రోధలోభంబులను శత్రువులు బాధింపం బుట్టుండని పలికిన* (క॥ వారలు విని తమమానములఁ। భూరిస్ఫుటచండకాం
డపూగంబుల చే। వారింపరాని భూసుర। దారుణవాక్యములకులికి తల్లడపడుచున్* (క॥ పరితాపంబును బొందుచు। సరసిజలో
చనునిభటులు సనకాదిమునీ। శ్వరుల పదాంబుజములకు। న్గరవర్థిన్ మ్రొక్కి నిటలఘటితాంజలులై॥ ఇట్లనిరి* (మ॥ వరయో
గీశ్వరులార మమ్ము మదినొవ్వ న్నీ మరలిట్లన్నని। ష్ఠురవాక్యంబులకింక మానసములన్ శోకింపఁగా రాదు స। త్పురుషప్రశ్రేణిబరా
భవింపదిన వృథాభూతాత్ములన్ మమ్ము మా। దురితం బింతకుఁ దెచ్చె మీదశుభముల్ దూకొంచు మేమీయ యల్॥ అదియెట్లంటిరే
ని* (ఉ॥ మీకరుణావలోకనసమేతులగా మము జేయ నుత్తము। ల్దూకొనె నేని మా చనువు ద్రోయక యీదగు గామలోభ
ముల్। గైకొని పుట్టుచో టనవకంజదళాక్షుని నామసంస్మృతిన్। బైకొనకుండఁ జేయుట శుభంబగు మీదిమదీయజన్మముల్*
ఆసమయంబున* (మ॥ హరి సర్వేశుఁ డనంతుఁ డాకలకలం బాలించి పద్మాలయా। సరసాలాపవినోదసౌఖ్యరచనల్పాలింది
శుద్ధాంతమందిరమాణిక్యపుగేహళుల్ గడచి యేతెంచెం బ్రపన్నార్తిసం। హరుఁడై నిత్యవిభూతిశోభనకరుండయి మానితాకా
రుఁడై॥ మఱియును* (చ॥ శరనిధికన్యకామణి యసంభ్రమమొప్పఁగఁ దోడరా మనో। హరనిజలీలమై ఖగమహంసమునీంద్ర
గవేషపాదపం। కరుహములన్నిఁ నూత్నమణికాంచననూపురమంజుఘోషము। ల్లరుసఁ జెలంగ నాగ్యజనవంద్యుఁడు యోగి
జనైకసేవ్యుఁడై* (చ॥ కనమణిహేమకింకిణికాయఝణంకృతులుల్లసిల్లన। చ్చరలిడుహంసవత్తుసితచామరగంధవ
హోచ్చలత్సుధా। కరరుచిరాతపత్త్రసుభగప్రవిలంబితహారవల్లరీ। సరసగళత్తుషారకణజాలవిరాజితమంగళాంగుఁడై॥
మఱియు* (సీ॥ నిఖిలమునీంద్రవర్ణితసస్మితప్రసన్నాననాంబుజము చేసలరువాఁడు। సస్మృతస్నేహార్ద్రవీక్షణాంజభక్తజన
గుహాశయుండనఁ దనరువాఁడు। మానితశ్యామాయమానవక్షమున సంచితవైజయంతి రాజిల్లువాఁడు। నతజనావనకృపా
మృతతరంగితములై భాసిల్లు లోచనాబ్జములవాఁడు। నఖిలయోగీంద్రజనసేవ్యుఁడైనవాఁడు। సాధుజనముల రక్షింపఁజాలు

భృశంబుగన్ - అత్యంతముగాను—సారసాకరము - కొలను—పంభోజము - పద్మము—లలాములన్ - శ్రేష్ఠులను—బృందారకులు-దేవతలు.

వాఁడు।భువనచూడావిభూషమైభూరిమహిమ । మించినవైకుంఠపురముభూషించువాఁడు* (సీ॥కటివిరాజితపీతకౌశేయ
శాటితోవితతకాంచీగుణద్యుతినటింప । నాలంబికంఠహారావళిప్రభలతోఁగౌస్తుభరోచులుగ్రందుకొనఁగ । నిజకాంతిజితత
టిద్విజకర్ణకుండలరుచులుగండద్యుతులొప్పిదిసేయ । మహనీయనవరత్నమయకిరీటప్రభానిచయంబుదిక్కులు నిండఁబ
ర్వమైనతేయాంసవిన్యస్తవామహస్త । కలితకేయూరవలయకంకణములొప్ప । నన్యకరతలభ్రమణీకృతాను మోదసుంద
రాకారలీలారవిందమమర* (వ॥ మఱియుఁజరణారవిందమంజుకింజల్కపుంజప్రభారంజితతులసీమరందబంధుర గంధాను
బంధ సుగంధిగంధవహాస్వాదకతలి సేవాతత్పరులై చనుదెంచు యోగీంద్రులమానసానందకారియు బహిఃకరణాంతఃకర
ణపరితోషప్రకీర్ణరోమాంచరుచిదాయకంబుఁ బ్రభాపూర్తియుక్తంబగుమూర్తితోడ నిజసౌందర్యపరకళావినిర్జిత శ్రీరమ
ణీసౌందర్యభాసమానుండగుచుఁబాదచారియైయఖిలవిశ్వగురుండైనసర్వేశ్వరుండు వేంచేసెనప్పుడు* (చ॥ స్థిరశుభలీలన
ట్లకుగుదెంచినయవ్విభువిద్రుమారుణాధరనవపల్లవస్ఫురదుదంచితకుందరుచిస్మితైకసుం । దరవదనారవిందముముదంబునఁ
దప్పకచూచియమ్మునీశ్వరులునిజాత్మలందనివిసాలక వెండియుఁజూచిరిమ్ములన్* (చ॥సునిశితభక్తిఁదన్ముఖముఁజూచినచూ
డ్కులఁద్రిప్పలేకయుం । గనుఁగొనిరెట్టకేలకునకల్మషభక్తవిఘాతఖేదము । ల్మునిజనచిత్తమోదములు ముక్తినివాసకవాట
భేదములేవినుతవినూత్నమాపురితవేదములమ్మహనీయపాదముల్ ॥(చ॥కనినఖపద్మరాగమణికాంతివిభాసితపాదపద్మము
ల్మనములయందుఁగీల్కొలిపిలబ్ధమనోరథయుక్తులై పునః । పునరభివందనంబులువిభూతిదలిర్పనొనర్చియోగమా । ర్గనిరతచి
త్తులున్వెదకికానఁగలేనిమహానుభావునిన్* (క॥ మానసమునవిలిపిరితద్ధ్యానాస్పదుఁడైనవానిఁదత్త్వజ్ఞులకున్ । గాననగు

—❀ సనకసనందనాదులునారాయణదేవునినుతించుట. ❀—

వానిభక్తజ । నానందకరైకమూర్తినలరినవానిన్* (వ॥ మఱియుంజక్షురింద్రియగ్రాహ్యంబగుదివ్యమంగళవిగ్రహంబు
ధరియించియున్నపురుషోత్తమునుదాత్తతేజోనిధింజూచి సనకాదులిట్లని స్తుతించిరి* (చ॥ వనజదళాక్షభక్తజనవత్సలదే
వభవత్సుతుండవు । జ్జనకుఁడునైనపంకరుహజాతుఁడుమాకు రహస్యమొప్పజె । ప్పినభవదీయమంగళగభీరపరిగ్రహవి
గ్రహంబుమే।మనయముఁజూడఁగంటిమికృతార్థులమైతమంటిమీశ్వరా* (సీ॥ దేవదుర్జనులకుభావింపహృదయసంగతుఁ
డవైయుండియుఁగానఁబడవు । కడగిమీదివ్యమంగళవిగ్రహంబునఁజేసిసమంచితాశ్రితులనెల్లఁ । జేకొనిసంప్రీతచిత్తులఁ
గాఁజేయుదతిశయకారుణ్యమతిఁదనర్చి । కమలాక్షసర్వలోకప్రజాధిపభవదనుసరణాభిలాషానులాప । విదితదృఢభక్తి
యోగప్రవీణులగుచుసర్థిమైపీతరాగులైనట్టియోగి । జనమనఃపంకజాతనివణ్ణమూర్తి । వనియెఱుంగుమరయ్యనిన్నాత్మవి
దులు* (క॥యుక్తిందలఁపభవద్వ్యతిరిక్తములైనట్టియితరదృఢకర్మంబుల్ ।ముక్తిదములైనమీపద। భక్తులుతత్కర్మములను
బాటింపరిలన్* (ఉ॥ కావునఁగీర్తనీయగతకల్మషమంగళతీర్థకీర్తిసు । శ్రీఃభవప్రశస్తసుచరిత్రుఁడవైనభవత్పదాబ్జసే। వా
విమలాంతరంగబుధవర్గమనర్గళభంగినన్యము । న్భావమునందలంచునెకృపాగుణభూషణపాపశోషణా* (చ॥పరమతపోవి
ధూతభవపాపులమైచరియించుమాకునేఁ । డరయభవత్పదాశ్రితులనల్గి శపించినభూరిదుష్కృత । స్ఫురణనసత్పథైకపరి
భూతలమైనిజధర్మహానిగా।నిరయమునొందఁగావలసె నేరము వెట్టకముమ్ముఁగావవే* (చ॥ కరమనురక్తిషట్పదముక్రుసు
గంధమరందవాంఛచే । దరుచుగశాతకంటక వృతస్ఫుటనవ్యతరప్రసూనమం । జరులను డాయుపోల్కి ని భృశంబగువిఘ్న
ములంజయించుమీ । చరణసరోజముల్గొలువసమ్మతివచ్చితిమయ్యకేశవా* (చ॥ అలరుభవత్పదాంబుజయుగార్పితమైపొలు
పొందునట్టియూ। తులసిపవిత్రమైనగతిఁదోయజనాభభవత్కథాసుధా । కలితములైనవాక్కులనకల్మషయుక్తినివిన్నఁగర్ణ
ము । ల్విలసితలీలమైభవిఁబవిత్రములై విలసిల్లుమాధవా* (చ॥ సుహితయశోవిలాసగుణమండనసర్వశరణ్యయింద్రియ ।
స్పృహులకుఁగానరాకయతశీకుసుమద్యుతినొప్పుచున్నమీ । సహజశరీరమిప్పుడుభృశంబుగఁజూచిమదీయదృక్కులిం । ద
హహకృతార్థతంబొరసెనచ్యుతప్రమోకదమాదరింపవే* (క॥ అనిసనకాదులుతత్పద।వనజములకుప్రమొక్కిభక్తివశమా
నసులై।వినిపించినగోవిందుఁడు। మునివరులంజూచిపలికెముదితాత్ముండై* (వ॥ ఈమునువురుజయవిజయాభిధానంబులుగ
లమదీయద్వారపాలకులు వీరుమిమ్ముంగైకొనక మదీయాజ్ఞాతిక్రమణులయి చేసినయపరాధంబునకుఁ దగినదండంబుఁగా
వించితిరదియునాకునభిమతంబయ్యెనదియునుంగాక భృత్యవర్గంబుచేయు నపరాధంబుస్వామిదియకాన మాననీయుండవ
యునన్నునన్నిందిప్రపన్నులగుకురుగాకయని వెండియు* (చ॥ తనువునబుట్టినట్టిబెశదంబగుకష్టమహాగడంబుచే।వనరిత
సియచర్మమువిఖర్ణతనొందినరీతిభృత్యులో।ప్పనిపనిఁజేసినన్విభులుబడ్డుకచారుయశంబుపేరుపెం । పునుఁజెడిపోయిదుర్యశ
ముఁబొందుచునుండురువిష్టపంబులన్* (చ॥ అలవడమీకునావలననబ్బినతీర్థసుకీర్తనీయస । ల్లలితవినిర్మలావృతవిలాసయ

తస్సాలయా-లక్ష్మి—ప్రకీర్ణ-వృద్ధిబొందించుచున్న—ఎట్టకేలకున్-కొంతతడవునకు—క్రమ-మనోహరమయిన.

శోభితవాభిరామమై । వెలయువికుంఠనామమహాపవిత్రమునశ్వపచాధమాదులో । కులచెవిసోఁకదత్క్షణముకోరిపవిత్రులఁజేరి యువారలఁ* (గీ॥ అట్టినేనుదలంపమీయట్టిసాధు। జనులకు వికారమర్థిఁ జేసినమదీయ । బాహుసములైనఁద్రుంచుకొనుత్సాహ లీల।నన్నితరులమీఁద్రమోలనెన్ననేల* (క॥ ధరణిసురోత్తమసేవా । పరిలబ్ధంబైనయట్టిపాతకనాశం।కగనిఖిలభువనపూ త।స్ఫురితాంఘ్రిసరోజతోయములుగలనన్నుఁ* (క॥ అలఘుగతివిరక్తునిగాఁ । దలపకనిజశుభకటాక్షదామకకలితా। ఖిలసంపద్వైభవశ్రీలలనారత్నంబురస్థలంబునుజెందెఁ* (చ॥ క్రతువులుసేయుచోశిఖిముఖంబునవేలుచునట్టిదద్ఘృత । ప్లుతచరుభక్షణమ్ముదముఁబొందదునిస్పృహధర్మమార్గసం। గతుఁడగుభూసురోత్తమముఖంబునవేడ్క భుజించునయ్యవి। తృప్తకబళంబునన్మనముతృప్తివహించినరీతినిచ్చలుఁ* (సీ॥ సతతంబునప్రతిహతయోగమాయావిభూతిచేఁబ్రఖ్యాతిఁబొందు నేను। నేనుహీసురులసమిద్ధనిర్మలపాదనలినరజోవితానములుభక్తి । హాటకనవరత్నకోటీరమునఁదాల్తునట్టినాచరణాంబుజాంబువులను । దవిలిధరించిసద్యఃపునీతాత్ములైరర్థిఁజంద్రావతంసాదిదేవ । చయము లెవ్వాఁడుబ్రాహ్మణజనులుదమకు। నపకృతుల్సేసిరేనిమారలుగఁడతఁడు।విప్రులనునన్నుఁగాఁగభావించునతఁడు।ధర్మపద్ధతినాప్రియతముఁడువాఁడు* (ఉ॥ గోవితతిఁ ధరాదివిజకోటినినన్నునుదీనవర్గము।న్నావిరిభేదబుద్ధిఁగనువారలధోగతిఁబొందనంతునా। శివిమరోషవిస్ఫురణఁజెందికృతాంతభటుల్మహోగ్రగృధ్రావళిఁబోలిఁజంచువులనంగములుద్ధతినొంచు రెప్పుడున్* (చ॥ ధరణిసురోత్తముల్బహువిధంబులఁదమ్ముఁబరాభవించినన్ । దగహసితాస్యులైయతి ముదంబుననిచ్చలుపూజసేయుచు । స్వరసవచోవిలాసములసన్నుతిసేయుచుఁదండ్రి వాత్మజు।లకరమునురక్తిఁబిల్చుగతిఁగైకొనిపిల్చినవారునాసముల్* (క॥ వినుఁడయ్యనఘచరిత్రుల। కనయముఁబ్రియతముఁడనగుచునమ్ముఁడువోదు।న్మునునన్నుభృగువుదన్నినఁ।గనలకపరితోషవృత్తిఁగైకొంటిఁగదే* (సీ॥ పాలుచునామానసాంభోజాతభావంబుదెలియంగలేకయుద్వృత్తులగుచుఁ । గడఁగిమాయానతిఁగడచినఁదద్దోష ఫలమువీరలకుసంప్రాప్తమయ్యె । మునులారనాచిత్తమునున్నరీతియు నిట్టిదభూమిపైఁబుట్టివీర । లచిరకాలముననాయంతికంబునకోలినరుదెంచునట్లుగానమతింప। వలయుననియమ్ముకుందుఁడువలుకుటయును । వినిమనంబుననసనకాదిమునివరేణ్యు । లస్మహోత్ము నిమృదులభాషామృతంబుఁ । దవిలిక్రోలియురోషసందష్టులగుచు* (సీ॥ మునివరుల్దమచిత్తములఁదృప్తిఁబొందకపంకజాతాక్షుఁడువలికినట్టి।పరిమితగంభీరబహుళార్థమరవగాహములనువిస్ఫురదమృతతుల్య । మాధుర్యసుగుణసమన్వితమ్ములువినిర్గతశబ్దదోషనికాయయుతము। లైనవాక్యములకునాత్మలఁబరితోషమందియిట్లనిరినెయ్యములమనల । కొడయఁడివ్వఁడునందించిరెయొ.తలంప । నర్థినింపించియోమత్కృత్యైకదండ । ముసకుసంకోచమందిరోయనుచుసంశ । యాత్ములగుచు విలోకించియంతలోన* (క॥ నలినాక్షుఁడుదమదెసఁగృప। గలిగినభావంబుఁదెలిసికౌతుకమొలయ । న్పులకీకృతాంగులైయ।త్కలికహార్షించినిటలఘటితాంజలులై* (క॥ భరితనిజయోగమాయా। స్ఫురణంబనరారునతివిభూతియుబలము।న్బరమోత్కర్షముగలయీ।శ్వరునకునిట్లనిరిమునులుసద్వినయమునన్* (గీ॥ పొలుపుదీపింపనిత్యవిభూతినాయ । కుఁడవుభగవంతుఁడవునఘుఁడవునీవు।మత్కృతంబిప్డునీకభిమతమటంటి। వీశభవదీయచారిత్రమెఱుఁగఁదరమె* (ఉ॥ దేవగణాలికెల్లఁబరదేవతలైతనరారునట్టివి। ప్రావలికాత్మనాయకుఁడవై పెనుపొందిననీకునీధరా । దేవతలెల్లనెన్నఁనధిదేవతలైరటయెట్టిచోద్యమో। దేవసమస్తపావనసుధీజనతావనవిశ్వభావనా* (చ॥ కమలదళాక్షునీవలనఁగల్గినధర్మము.తాపకారతా।రములనురక్షితంబగుఁదిరంబగునీశ్వరసర్వకారత।త్వమునఁడనర్పునిన్నరయఁదత్ఫలరూపముతత్ప్రధానగో। వ్యమునవివల్కుచుందురుకృపామయులోచనపాపమోచనా* (చ॥ మహిఁదలపోయనెవ్వనిసమగ్రపరిగ్రహముల్లభింపని । స్పృహమతులైమునీశ్వరులుమలిత్యుభయంబునఁబాతురట్టిస।న్మహితవివేకశాలిగుణమండననీకిలనన్యసత్పరి । గ్రహమదిమెట్టిచోద్యముజగత్పరిపాలననిత్యఖేలనా* (సీ॥ సతతంబునర్థార్థిజనశిరోలంకారపదరేణువులుగలపద్మమనెడు । జలజకింజల్కనివ్యంపవురందలోభాగతభ్రమరదనాయుకునపగిది।ధన్యజనార్పితోదంచితతులసీదామంబునమునిజధామమగుచు । భాసిల్లుభవదీయపాదారవిందమ్ముల్విలసితభక్తిసేవింపుచుండి । కమలనయనకృపావలోకనములోలయ । నర్థిఁబొడఁజూపు భాగవతానురక్తిఁ।జేసిభవదీయమహిమంబుచిత్రమరయ।చిరశుభాకారయిందిరాదిత్తచోర* (మ॥ చిరభాగ్యోదయదేవదేవలలితశ్రీవత్సలత్మ్మంగయీ। వరవిప్రానుపదైకపుణ్యరజమేవర్ణింపనీమేనికా । భరణంబంటివిసర్వలోకులకువిప్రశ్రేణిమాహాత్మ్యమీ।వరయంజెప్పుటకైధరించితిగదామెన్నన్బునీతాకృతీ* (సీ॥ ధర్మమూర్తివిజగత్కర్తవునగునీవుప్రోవంగఁదగువారిఁబ్రోవవేని।నవిరళవేదోక్తమగుధర్మమార్గమసన్మార్గమగుఁగానసత్త్వగుణవి । శిష్టుండవగుచునీజీవసంఘముసేమమరసిరక్షించునీకైనశక్తి।చేతనుధర్మవిఘాతులదండించునీకునంచితమైననిగమధర్మ। మార్గనాశకరకంబులుమదికినింపు । గావువిప్రులయం

అనీతకుసుమ-వ్ల్లిగినెపుష్పము—గోవిందుఁడు॥ గో-అనఁగాభూమి-దానినుద్ధరించినవాఁడుఁ—గదంబు-వ్యాధి-విష్టపము-లోకము.

౨౨

మసత్కరుణ మెఱసి ఘనతఁ బలికితి వినయవాక్యములు నీకు। యుక్తమగుచుండు సతతంబు భక్తవరద* (వ॥ అట్లయిన నంబరుల
యెడఁ బినయంబులు వలికిన నంబ్రాభహానియగునని తలంచితివేని * (గీ॥ విశ్వమున కెల్లఁ గర్తవు శ్వనిధిప। విశ్వసంరక్షకుండ
వై వెలయు నీకుఁ। గడఁగి ప్రాభవహాని యొక్కడిదలంప। వినయములు నీకు లీలలై వెలయుఁగాన* (గీ॥ మునులమగు మమ్మునతి
మోదమున ననునీవు। సత్కరించుట యెల్ల సజ్జనపరిగ్ర। హార్థమై యుండుఁగాదె నీ మాహాత్మ్య మొకటి। విన్నపించెద మీ జయవిజయుల
కును* (గీ॥ అలిగి మేము శపించితి మంతకంటె। బెడిదమగు నాజ్ఞ సేయ నభీష్టమేని। చేయుమది గాక సమధిక శ్రీదనర్పఁ। జేసి ర
క్షించెదేని రక్షింపుమీశ* (వ॥ అట్లయిన మాకుం బ్రియంబగుం గావున ననపరాధులు నతినిర్మలాంతఃకరణులు నైన వీరలకు ననృ
తంబులు వలికితి మేని మమ్మైనం జిత్తంబు కొలఁది నాజ్ఞాపింపుమని కరకమలంబులు మొగిడ్చి కృతాంజలులై యున్న మునులం గరు
ణార్ద్రదృష్టిం గనుంగొని* (క॥ అనఘుఁడు భగవంతుఁడి। ట్లనియె మునులార వీరలలరన్నువికి। జ్జనియచటనసురయోని। జ్జనియిం
తురు లోభమోహసంగతులగుచున్* (క॥ దేవజనావళికుపహతిఁ। గావింపుచు నిఖిలభువనకంటకవృత్తిన్। జీవించుచు నాయెడ
సంభావితవైరానుబంధభావుల నగుచున్* (క॥ ఆహవముఖమున ననునతి। సాహసమున నెదిరి పోరి చక్రసిశితధా। రావాతిఁ దె
గి వచ్చెదరు। త్సాహ మెలర్పంగ నాదు సన్నిధికంతన్॥ అదియునుంగాక (క॥ ననువైరంబుననైనను। మనమునఁ దలఁచుటయు నా
సమక్షమున మదా। ననమీక్షింపుచు నీల్గుట। ననఘాత్ములులై వసింతురస్మజ్జగతిన్ (క॥ పినుమిల మీఁదనిఁకెన్నటికిని బుట్టువు లేదు మీ
రికిని మీరలు వలిక్కనయట్ల నాదు చిత్తము। ననుఁ దలఁతుంగాన మీ సంబంధనింకన్ (ఉ॥ దీనికిఁ జింతఁ దక్కుఁడు మహీజపుంగవుల
న్నప్రీతులై। యానలినాసనాత్మజుల నంత నిభావము దాఁ మెఱింగి పెం। పూనిన వేడ్కఁ దేలి తెలివొందిన చిత్తములన్నతిం చి
రంభోనిధిశాయి నార్తజనపోషణభూషణుఁ బాపశోషణున్* (చ॥ ఆసనకాదులప్డు పులకాంకురముల్ననలొత్తబాష్పధా। రా
సుభగాక్షులై మునిశరణ్యవరేణ్యునగణ్యదేవతా। గ్రేసరు దివ్యమంగళశరీరముఁ జూరుతదీయధామము। న్భాసురలీలఁ జూ
చినవపద్మదళాక్షున కుస్వనమ్ములై* (క॥ తనుపలికిన భాషణములు। కమలోదరు భాషణములు గాఁ దలఁపుచు నె। య్యము సర్వా
వైష్ణవలక్ష్మిన్। బ్రమదంబునఁ బ్రస్తుతించి పరమేశ్వరుచేన్* (క॥ ఆమంత్రితులై తగనిజ। ధామములకుఁ జనిరి వారు తదయక
లక్ష్మీ। కాముఁడు జయవిజయుల నభి। రామంబుగఁ జూచి పలికె రయమొప్పారన్* (క॥ మీరసుర యోనియందని। వారితులై జన
నముందవలసెను నేఁడు। శ్వారబలాఢ్యుఁడ నయ్యును। వారింపఁగ నోపవిప్రవచనము లెందున్* (క॥ అదిగాన దనుజయోనిం। బ
దపడి జనియించి మద్విపక్షులరై మీ। మది నెపుడు నన్నె తలఁచుచు। వదలక నాచేతఁ జచ్చి వచ్చెదరిటకున్* (ఉ॥ పొండని యాన
తిచ్చి హరి ఫుల్లసరోరుహపత్రనేత్రుఁడా। ఖండలముఖ్యదిగ్వరనికాయకిరీటలసన్మణిప్రభా। మండితపాదపీఠుఁడు రమారమ
ణీమణితోడ నేగు దే। నిండిన వేడ్కనేగె నిజనిర్మలపుణ్యనివాసభూమికిన్॥ అంత* (క॥ నిజతేజోహానిగ జయ। విజయులు ధరఁ
గూలి రపుడు విహ్వలురగుచున్। ద్విజగములసురవిమాన। వ్రజములు హాహారవంబు గ్రందుగఁ జెలఁగెన్* (క॥ వారలు నాడతిగ
ర్భాగారంబున నున్నవారు గడఁగి తదీయో। దారఘనతేజమిపుడని। వారణ మీ తేజమెల్ల వమ్ముగఁ జేసెన్* (ఉ॥ ఇంతకు మూ
లమా హరి రమేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యము। ల్వింత లె సర్వభూతభవవృద్ధినాశన హేతుభూతుఁడా। ద్యంతవికారశూన్యుఁ
డు దయానిధి మీ యెడ మేలు సేయు నీ। చింతఁ దొలంగి వేఁ జనుఁడు చేకురు మీకు మనోరథార్థముల్* (క॥ అనివనజాసనుఁ డాడి
న। వినితద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం। బునకేగిరి దితి నిజనా। థుని మాటలు దలఁచి యపరితోషముతోడన్* (గీ॥ తనసుతు

—*జయవిజయులు దితిగర్భంబున హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా బుట్టుట.*—

లుసురలహరింతురనుచు నాత్మఁ। దలఁచుచుండంగ నంతవత్సరశతంబు। సనఁగ నటమీఁదఁ గని యెఁ గశ్యపుని దేవి। యఖిలలోకై
కకంటకులైన సుతుల॥ అయ్యవసరంబున* (గీ॥ ధరణి గంపించెఁ గులపర్వతములు వడఁకె। జడనిధి గలంగెఁ దారకావళులు డు
ల్లెఁ గగనమగలెను మ్రొగ్గె దిక్కరులు దిశల। మిడుగురులడరెఁ బిడుగులు పుడమిఁ బడియె* (సీ॥ హోమానలంబుల ధూమంబు
లడరెను బ్రతికూలవాయువుల్ప్రబలసి వీఁచెఁ। దరువులెల్లెడల విటతాటంబులై కూలె గ్రహతారకావళి కాంతి మాసె। బెరసి మొగు
ళ్లు నెత్తురు వానగురిసెను మెఱుఁగులు దెసలమిర్మిట్లు గొలిపె। సర్భానుఁ డొగి నపర్వమున భానునిఁ బట్టెఁ గైకొని చిమ్మచీఁక
ట్లుపర్వె। మొనసి కుక్కలు మొఱఁగెను మోర లెత్తి। పగలు నక్కలు వాపోయె ఖగములార్త। రవములిచ్చెను దేవతాప్రతిమలొ
రగెఁ। గన్నులను నశ్రుకణములు గ్రమ్ముకొనఁగ* (క॥ మొదవులెన్నెత్తురుఁ జీమును। బిదికెన్ గార్దభరవంబు భీషణమయ్యె। న్మదము
డిగెఁ గరులకటములఁ। బొడ మెఱుఁగముల వాలముల నిప్పులొగిన్* (క॥ సుహాలు రొదలిచ్చెఁ బాప। గ్రహమిత్రతఁ జెంది వక్ర
గతుల ననుసౌమ్య। గ్రహములు వర్తించె నుదు। స్సహతేజోదితితనూజసంభవవేళన్* (మ॥ భయదప్రక్రియనిట్లు దోఁచిన మ

అంతికము-సమీపము—సందష్టులు-పండ్లుకొరకుచున్నవారు—పాతురు-తొలఁగుదురు—నిష్యందు-స్రవించుచున్న—ఉపహతి-పీడను.

హేమాత్పాతంబు లీక్షించి దనం। తఱియ కాలంబని కాని సాధుపాన నోగ్రరౌద్ర దేవాహితో।దయసంక్షోభముగా నెఱుంగక స
మస్తప్రాణిజాతంబులు।భయమందెన్నన కాదియోగిజనముల్దక్కన్బ్రభేంద్రోత్తమా* (వ॥ అట్లావిర్భవించిన యనంతరంబ॥
మ॥ కులశైలాభశరీరముల్గనరరక్షోనాథులత్యుగ్రదో। ర్బలమొప్పన్బదఘట్టనన్ధరచలింపన్రత్నకేయూరకం। డలకాంచీక
టకాంగుళీయకకిరీటస్వర్ణమంజీరని। ర్మలకాంతుల్దులకింపనాత్మరుచిచేమందీకృతార్కాంశులై* (వ॥ ఉన్నసమయంబు
నంగశ్యపుండు నిజతనూభవులంజూడం దలంచి దితిమందిరంబునకుంజను దెంచి పుత్రులంగనుంగొని వారలకు నామకరణంబు
సేయందలంచి* (చ॥ దితిజఠరంబునందుఁదన తేజము మున్నిడినట్టి పుత్రునద్భుతచరితుర్హిరణ్యకశిపుండను పేరఁ బ్రసూతి
వేళనాదితిమునుగన్నపట్టి రవితేజునిఁగాంచన లోచనుండునా। హితమతిఁబేరువెట్టిచనియె న్నిజనిర్మల పుణ్యభూమికిన్*
(వ॥ అయ్యవసరంబున నతులతేజోవిరాజితుండైన హిరణ్యకశిపుండు హిరణ్యగర్భవరదానగర్వంబున దుర్వార పరిపంథిగర్వ
నిర్వాపణాఖర్వభుజావిజృంభణంబున నఖిలలోకపాలాదుల జయించి స్వవశంబొనర్చి సంతుష్టాంతరంగుండై యెందు
నుండినను మృత్యుభయంబులేక నిర్భయుండై సుఖంబుననుండె దత్సోదరుండైన హిరణ్యాక్షుండును బ్రతిదినంబుఁ జండవేదండ
శుండాదండమండిత భుజాదండంబున గదాదండంబు ధరియించి తన్నెదిరి కదనంబు సేయంజాలిన యరివీరునిం గానక భూ
లోకంబెల్లఁ గ్రుమ్మరి దివంబునకుఁ దాడి వెట్టియందు సమరవిముఖులయిన బర్హిర్ముఖులం గనుంగొని వనజాసనవరప్రదానంబుఁ
జింతించి హితులు నెలంగ నహితులు గలంగ సమహితమై జయంతికాదామంబు బఘేరామంబై వెలుంగం జరణంబుల మణినూపు
రంబులు మొఱయ నిజదేహద్యుతి దిక్కులం బిక్కటిల్లంజను దెంచు వానిం గని భీతచిత్తులై దేవతాగణంబులు గరుడునిం గనిపర
చునురగంబులుంబోలె నిజనివాసంబులకుం గాంచననివాసంబులుగ నొనర్చి యొక్కెడి కేగియుంజనిన* (ఉ॥ శౌర్యమువోవఁ
దట్టినిజసాధనముల్దిగనాడి విక్రమా। హార్యపరాక్రమక్రమముదప్పఁగభీతిలిపారిరక్కటా। కార్యముఁదప్పె నాకునని గై
కొనియార్చిసుమేరుపర్వతస్థైర్యుఁడు వార్ధిఁజొచ్చె నతిదర్పితభూరిభుజావిజృంభియై॥ ఇట్లు చొచ్చిన* (క॥ వరుణుని బలములు
దనుజేశ్వరు తేజముఁదేరి చూడఁజాలక శౌర్య। స్ఫురణము చెడి యొండేనియుఁ। బరచెంగజ్జలధిమధ్యభాగమునందున్* (క॥ అ
మరారివిపులనిశ్వా। సములం బ్రభవించినట్టి జలనిధికల్లో। లములను విపులగదాదం। డమునం బోనడఁచెనతిదృఢంబగుశక్తిన్॥
(చ॥ మఱియును నమ్మహాజలధిమధ్యమునన్సురవైరి పెక్కువ। త్సరములు గ్రీడసల్పి రిపుసైన్యవిదారణశౌర్యఖేలనా। పరతఁ
జరించి యవ్వరుణపాలితమైన లసద్విభావరీ। పురమున కేగియందుఁ బరిపూర్ణతనున్నపయోధినాథునిన్॥ మఱియును* (సీ॥
యాదోగణాధీశుఁడగుచుఁబాతాళభువనపరిపాలుడై తనరుచున్న। వరుణునిఁగనుగొని దరహసితోక్తుల నిట్లను విశ్వమం
దెన్నగలుగు। సకలలోకైకపాలకులలోనతిబలాధికుఁడ నిజగము నుతింపఁదగిన। శూరుండ వీవు నీపౌరుష మొప్పంగఁగదన
రంగమునన న్నెదిరి చూడు। నీభుజావిక్రమంబును బ్రాభవంబు। నడఁతు ననిపల్కుటయు విని యబ్ధినిభుఁడు। పగరజయమును
వృద్ధియు బలము నాత్మ। బలముఁదలపోసి దనుజుతో బవరమునకు* (క॥ సమయము గాదని తనచి। త్తమునం గల రోషవహ్నిదాలి
మియను తో। ద్యములందగ నార్పుచును ప్రశమితోక్తులఁ బలికె దనుజసత్తముతోడన్* (చ॥ మనమున శాంతిఁ బూనినియమం
బున సంగరముజ్జగించితి యే। ననయము నున్నవాఁడ నిపుడాహవకేళిఁ జరింపరాదు నీ। ఘనభుజవిక్రమస్ఫురిత గాఢవిజృంభణ
ముజ్జయింపఁజా। లినప్రతివీరు లెవ్వరును లేరు ముకుందుఁడు దక్క నెక్కుడన్* (చ॥ గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబు
ననున్నవాఁడు దా। నని మొనఁబెక్కు మాగుల భియాతుల నోలిజయించి శక్తి పెం। పున నడిగన్న వీరుఁడని భూజనకోటినుతించు
నందు వేచను మతఁడిచ్చు నీకుననిసర్వముదీఱ మనంతమీఁదటన్* (ఉ॥ నిందకునోర్చి యాజిమొనని ల్వఁగనోపక వీఁగిపాఱు
నీ। పంపల వెంటఁబడ్డ మగపంతమె సర్వశరణ్యుఁడైన గో। విందుఁడు దీర్చునీపనివివేకవిహీనచనంగనోపుదే। నందుల కేగుమా
తఁడు మలారులఁబోరజయించు నిచ్చలున్॥ అదియునుంగాక* (క॥ పురుషాకృతిఁ బ్రతియుగమునఁ। బురుషోత్తముఁడవతరించి
భూరిభుజావి। స్ఫురణన్దుష్టనిశాటుల। హరియించుచునుండు మునిగణార్చితపదుఁడై* (ఉ॥ కావున నావిభుం దొడరి కయ్యము ద
య్యమెఱుంగఁ జేసిర। క్షోవర నీభుజాబలము సొంపరి మేదినిఁగూలి సారమే। యావలికాశ్రయంబగుదు నచ్చటికిప్పుడు నేగు
దేనినీ। చేవయులావు నేర్పుడును జెప్పగ నేటికి మీఁదికార్యముల్* (చ॥ అనివరుణుండు వల్కిన దురాగ్రహమెత్తి హిరణ్యలో
చనుండనయము మానసంబున భయంబొకయించుకలేక సంగరా। వని నెదిరింతునేఁడు మురవర్ధను దుష్టవివర్ధనుం జనా। ర్దనున
నుచున్వికుంఠనగరస్ఫుటసంచితమార్గవర్తియై* (క॥ చనునవసరమున నారద। మునివరుఁడెదురేగుదెంచి ముదముదలిర్పన్। దను
జేంద్ర యెందుఁబోయెద। వనియడిగిన నారదునకు నతఁడిట్లనియెన్* (చ॥ సరసిరుహోదరుండొడరి సంగర మేనొనరింద

ఆమంత్రితులై - నెలవుగొనినవారలై — అగారము - ఇల్లు — అనివారణన్ - నివారణము లేనిదగుటవలన — విటతాటంబులై - తారుమారై.

యిందిరా। వరుసననంతుఁ డుండి సురవైరికులంబుల కెల్ల మోదవి। స్ఫురణఘటింపఁ జేయుటకుఁ బూని వికుంఠపథానువర్తినై। యరిగెద నన్న నమ్మునికులాగ్రణి దానవనేతకిట్లనున్॥ (చ॥ గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు భూ। భరము వహింపనాదికిటిభావము దాల్చి రసాతలంబునం। దిరవుగనున్నవాఁడు చటికే గఁగ నోపుదు వేని మే గుఱుం। దరయఁగఁ గల్గు నీ కసురాంతకుతో డి రణంబవశ్యమున్॥ (చ॥ అనవుఁడు దానవేంద్రుఁడు హుతాశనుకై వడి మండిపడ్డ లో। చను నెదిరిం

—*హిరణ్యాక్షుఁడు యజ్ఞవరాహంబగు హరి నెదిరించి యుద్ధము చేయుట.*—

చు వేడుకలు సందడిఁ గొల్పఁ నల్ప తేజుఁడై। ఘనగదఁ గేలఁ బూని త్రిజగద్భయదాకృతి దాల్చి వెల్వడి। న్జని యెఱ రసాతలంబునకుఁ జండభుజాబలదర్పమేర్పడన్॥ చని జలమధ్యంబున॥ (క॥ దివిజారి యెదురఁ గనె। నవిరళ దంష్ట్రాగ్ర ధరాముననమరలలామున్। కువలయ భరణోద్దాము। న్నవనమయ స్తబ్ధరోమ జలదశ్యామున్॥ అయ్యవసరంబున సూకరాకారుండైన హరియు॥ (క॥ వనజనిభ సన్నిభములగు। తనలోచన యుగళ దీప్తిఁ దనరఁ దదాలో। కనములఁ దనుజాధీశుని। తనుకాంతి హరింపఁ జేసె దత్క్షణమాత్రన్॥ (వ॥ మఱియు నయ్యాదివరాహంబవార్యశౌర్యంబున మారులేని విహారంబు నంజరియించు నట్టియెడ॥ (సీ॥ తుదమొదళ్లకుఁ జెక్కుడు నిసిపారఁగ మోరఁగుల శైలములఁ జిమ్ముఁ గొంత తడవు। బ్రహ్మాండభాండంబు పగిలి దిల్లులు వోవఁ గ్రోష్ములఁ దాడించుఁ గొంత తడవు। బలధులేడును బంకసంకులంబై యింక ఖురములఁ గట్టాడుఁ గొంత తడవు। నుడురాజు సూర్యుడునొక్క మూలకుఁ బోవఁ గురుచవాలముఁ ద్రిప్పుఁ గొంత తడవు। కునియుఁ గుప్పించు లంఘించుఁ గొప్పరించు। నెగయు ధరఁ ద్రవ్వుఁ బొరియగా నేపు దేఁగి। దానవేంద్రుని గుండెలు దల్లడిల్లఁ। బంది మెల్లన రణపరిపంథియగుచు॥ మఱియు॥ (క॥ కనుఁగవ నిప్పులు రాలఁగ। సునిశిత దంష్ట్రాగ్రయుతవసుంధరుఁ డగుచున్। దనకెదుటే తేరఁగఁ గని। వనచర మేరీతి నెపుడు వనచరమయ్యెన్॥ (క॥ అనియాశ్చర్యభయంబులు। దనమనమున దొంగలింపఁ దనుజాధిపుఁడి। ట్లని యెన్సీకర సూకర। తను వొందిచరించు దనుజదర్పహరునితోన్॥ (క॥ ఘనసూకర మాయాత్మక। వనరుహసంభూత దత్తవరదానమున। న్ననిరసాతలగత భువి। యనయంబును నాయధీనమై వర్తించున్॥ (క॥ గొనకొని నీవీ ధరణిని। గొనిపోవుము విడువు కాక కొనియెద వేని। గొని యెదనీ ప్రాణముఁ గై। కొను నావచనములు చలముఁ గొననేమిటికిన్॥ (క॥ మాయావివగుచు నిప్పుడు। పాయక యీపుడమిఁ జోరభావము తోనీ। వీయెడఁ గొనిపోఁజూతు నె। యాయత భుజబలము చేతనడఁపకయనుచున్॥ (సీ॥ అవిరళయోగమాయాబలంబునఁ జేసి యల్పపౌరుషములనలరు నిన్ను। నర్థి సంస్థాపించి యస్మత్సుహృద్భృత్యకులుల కెల్లను మోదములయఁ జేయఁ। జెలువేది మర్ధదాశీర్ణుఁ డవగు నిన్నుఁ గనుగొని దేవతాగణములెల్ల। నిర్మూలులై చాల నెఱి నశించెదరన్న విని యజ్ఞపోత్రియై వెలయుచున్న। హరిసరోజజసురమునివరుల కెల్ల। వచ్చెదురవస్థ కాత్మలో వంతనొంది। నిశితదంష్ట్రాగ్రలసితమై తనరు ధరణి। దేవితో నొప్పె నా దేవదేవుఁడపుడు॥ (క॥ సురరిపు వాక్యాంకుశములఁ। గురుకుపితస్వాంతుఁడయ్యుఁ గోమరారువసుం। ధరతో డభీతి నొందిన। కరణిం గలకరికలేంద్రుకరణిం బెలుచన్॥ (గీ॥ నిశితసితదంతరోచులు నింగిఁ బర్వఁ। గంరి వెడలి భయంకరాకారలీల। నగుగభీషణమైన రాహోవతార। మొనరఁ దాల్చిన పద్మలోచనుని వెనుక॥ (క॥ కరి వెనుకఁ దగులు నక్రము। కరణం జని దైత్యవిభుఁడు గదిసిట్లనియెన్। దురితపయోనిధితరికిన్। గిరికిన్ ఖురదళిత మేరుగిరికిన్ హరికిన్॥ (క॥ సంరకురోయకలజ్జన్। జెందక వంచననురణము సేసి జయంబున్। బొందెదననిమదిఁ దలఁచిటు పందగతిం బాఱఁ బంటువంత మెనీకున్॥ అనియాక్షేపించినఁ బుండరీకాక్షుండు కోపోద్దీపితమానసుండై॥ (క॥ తోయములమీఁద భూమిన। నాయాసతనిల్పి దానికాధారముగాఁ। దోయజనాభుఁడు దనబల। మాయతమతిఁ బెట్టె సురలు హర్షము నొందన్॥ (గీ॥ కుసుమములవృష్టి భోరునఁ గురిసె నంత। విభవమొప్పార దేవదుందుభులు మొరసెఁ। గడఁకవీతెంచె గంధర్వగానరవము। నందితములయ్యె నప్సరోనర్తనములు॥ (వ॥ అయ్యవసరంబున నయ్యజ్ఞవరాహమూర్తిధరుండైన కమలలోచనుండు కనకకుండల కేయూర గ్రైవేయ కటకాంగుళీయక భూషణరోచులు నింగిఁ బర్వ సమరసన్నద్ధుండై॥ (చ॥ ఘనగదఁ గేలఁ బూని మణికాంచన నవ్యవిచిత్రవర్మమిం। పొనరఁగ దాల్చి దానవనియుక్తదురుక్తనిశాతబాణము। ల్గనఘనమర్మముల్గలపదానవహంతనితాంతశౌర్యుఁడై। కనలుచు వచ్చు నద్దనుజుఁ గన్గొని రోషవిభీషణాకృతిన్॥ ఒప్పనగుచునిట్లనియె॥ (మ॥ వినరా యోరియమంగళాచరయుద్ధ్వ్ల త్తిన్ననున్నీ దుధీ। ననయంబున్వనగోచరంబగు మృగంబంచున్ గదాలంతౌర నే। నెనయన్వన్యమృగంబనౌదు బలిమిన్నే తెంచు నీబోటియీ। శునకశ్రేణి వధింతు నేడని మొనన్సోకోర్చి వర్తించినన్॥ (క॥ బలిమిగలదేని నాతోఁ। గలహమున నెదిరించి పోరఁగడఁగుము నీకో। ర్కులు నేఁడు దీర్తు నూరక। తలపోయవికత్థనములుడగదు దురాత్మా॥ (చ॥ వినుమది గాక సంగర వివేక విశారదులైన యట్టి స। జ్జనములు మృత్యుపాశములఁ జాలఁ బద్ధులునయ్యు నీవలెన్గొనకొని యాత్మసంస్తుతులకున్ మదమంది రె యేల యీవిక। త్థనములు బంటుపంతము లె దైత్యకులాధమ యెన్న చూడఁగన్॥

అభియాతులన్ - శత్రువులను — పారమేయావళికిన్ - కుక్కలగుంపులకు. కువలయ - భూమండలము, ఖురములమట్టాడున్ - గొరిజలతోఁ ద్రొ

(మ॥ ధృతిఁ బాతాలమునందు నీవ నెడ సంపీర్ణోగ్రనిక్షేపమే। నతిదర్పంబునఁ గొంచుఁ జూడుమిదె దేవారాతి నన్నెన్నెదొ। గతల
జ్జుండన దాగియుండి రణముం గాంక్షింతు యుష్మద్గదా। వితతద్రావితు నన్ను నేఁడె కనుఁ డుమా వేదీర్తుని కోరికల్ * (ఉ॥ ఎన్నఁబడా
తియోధముల కెల్ల విభుండవు పోటుబంటవై। నన్ను రణోర్వి నేఁ డెదిరితి నన్భవదీయబలంబు నాయువు। న్నిన్నకఁ గొందుఁ జూడు
మిదె మేరఁగ మేదినిరీత దైత్యమై। వన్నెకు నెక్కఁ జేసెదన వార్యపరాక్రమవిక్రమంబునన్ * (చ॥ ననునెకు నంగఁ జాలినఘ
నంబగు శౌర్యము స్థైర్యముస్చలం। బునుగల దేని సల్పు రణభూమిని నీహితులైన వారికి। న్గనుఁగవ బాష్పపూరములు గ్రమ్మఁగ
మాన్పఁగ నోపు దేస। య్యనఁ జనఁ బొమ్ము దానవకులాధమ యారకలజ్జు లేటికిన్ * (క ॥ ననునిట సంస్థం జేసెద। ననిపలికితి
వంశవాఁడవౌదు వునీశు। న్నెనరైన చుట్టములఁ బొడఁ। గని రాయిదె యముని పురికిఁ గాపురముగన్ * (మ॥ అనియిబ్భంగిస
రోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్విడంబించిన। లిన్ నహోసోక్తులకుల్కి రోషమదసంగీభూతచేతస్కుఁడై। కనుగ్రేవన్నిప్పులు గుర్లు
చాలఁ బొడమంగా గినుకమైఁ దోఁకద్రొ। కిన్ నక్కృష్ణోరగరాజుమాడ్కిన్ మదిలోఁ గిట్పాటు వాటిల్లగన్ * (క॥ చలితేంద్రి
యుఁడై నిట్టూ। ర్పులు నిగుడింపుచును బొమలు ముడివడ గోపాకులమానసుఁడై గదఁ గొని। జలజాక్షున్నకెమ ననడిచె సాహస
మొప్పన్ * (వ॥ అత్తఱి హిరణ్యాక్షుండతిభయంకరాకారుండై * (మ॥ గదసారించి మదాసురేంద్రుఁడు సమగ్రక్రోధుఁడై
మాధవుం। గుదియన్వేసిన క్రేటు గైకొనక రక్షోహంతశౌర్యోన్నతి। న్గదఁ గేలంధరియించి దానిఁ దునకల్గాఁ జించినం దైత్యుఁ
డున్మనుఁడై యొంటుగదన్ మహాభుజుని భీమప్రక్రియన్వేసినన్ (చ॥ అదిడనుఁ దాకఁ గుంఠనము రారిగదారణకోవిదక్రియా
స్పదకరలాఘవక్రమముఁ బైకొని చూపి విరోధి పేఱురం। బదరఁగ వ్రేయ వాఁడు వివశాకులభావము నొందియంతలో। మది చె
లిపొందివ్రేసె రిపుమానవిమర్దను నాజనార్దనున్ *( వ॥ ఇట్లుదలపడియన్యోన్యజయకాంక్షులనితరేతరతుంగ తరంగ తాడితం
బులగు దక్షిణోత్తరసముద్రంబులచందంబున రౌద్రంబునంబరస్పరశుండాదండ ఘట్టితమదాంధగంధసింధురయుగంబు చం
దంబున గోపభీషణాటోపంబులం దలపడు బెబ్బులుల గబ్బున నలిగిద ర్పాతిరేకంబున నెదిట్చి ఆంకెలువై చుమదవృషభంబుల ర
భసంబున నసహ్యసింహపరాక్రమంబున విక్రమించి పోరునెడ హిరణ్యాక్షుండు సవ్యమండలభ్రమణంబునం బరివేష్టించి
నం బుండరీకాక్షుండు దక్షిణమండల భ్రమణంబునం దిరిగి విపక్షువక్షంబశనిసంకాశంబగు గదాదండంబునం బగిల్చిన వాఁ
డు దెప్పిరి తెలివొంది దనుజపరిపంథిఫాలంబునొప్పించె నంమేటివీరులు శోణితసిక్తాంగులై పుష్పితాశోకంబులం బురణింపు
చుం బాయుచు డాయుచు వ్రేయుచు లోయుచు నొండొరుల రుధిరంబులాఘ్రాణించుచుఁ దిరస్కార పరిహాసోక్తులనిచ్చుచుఁ
బోరు సమయంబున నమ్మహాబలుల సమరంబుఁ జూచుచు వేడ్కఁ బద్మసంభవుండు నిఖిలమునీంద్రసిద్ధసాధ్యదేవగణంబులతోడం
జనుదెంచి ధరిత్రీనిమిత్తంబసురతోడం బోరుయజ్ఞవరాహునకిట్లనియె * (ఉ॥ అంచితదివ్యమూర్తివరమాత్మకయాకలుషా
త్మకుఁడైనన। క్తుంచగుఁ డస్మదీయవరగర్వమునన్ భువనంబులెల్లఁ గా। రించుచు దించియిట్టి విపరీతచరిత్రుని ద్రుంపకిట్లుపే। క్షిం
చుట గాదు వీని బలిసేయుము వసుంధరకున్ శుభంబగున్ * (క ॥ బాలుఁడు గరమునను గ్ర। వ్యాలము ధరించియాడువడుపున ర
క్షించి పాలునిద్రుంపకయారక। పాలార్చ్చటనీత్రియే శుభప్రదయింకన్। ఆదియునుంగాక (మ॥ అనఘా యీ యభిజిన్ముహూ
ర్తమున దేవార్యాతి నుర్దింపవే। యనయంబున్ మఱిదైత్యవేళయగు సంధ్యాకాలమే తెంచినన్। ఘనమాయాబలశాలియైనద
నుజున్ ఖండింపఁగా రాదు కా। వున నీవేళ నద్రుంపు సజ్జనహితోద్యోగానురక్తుండవై * (క॥ అనిసరసిజగర్భుఁ డువ। లిన నవచ
నములర్థి వినినిలింపులుఁ గంపుల్। గొనిచూడ సస్మితాననవనజము చెలువొందనసురవరునకునెకుత్తై * (గీ॥ పుండరీకాక్షుఁడ
య్యనుభూరిరోష। నిగతఁ దరుణారుణాంభోజనేత్రుఁడగుచు। ఘనగదాదండమెత్తి రాక్షసునిహనువు। నుగ్రగతి మొత్తవాఁ
డునునోసరించె * (క॥ పరువడి దితిసుతుఁ డతిభీ। కరగదఁ జేఁబూని చిత్రగతులం బద్మో। దరుఁడాసి చేతిగదసా। గరమునఁ బడనడఁ
చె బాహుగర్వమెలర్పన్ ॥ అంత *(గీ॥ హరిని రాయుధుఁడైన సురారి సమర। ధర్మమాత్మను దలఁచి యుద్ధంబుఁ డక్కి। నిలిచి చూచు
చునుండె నుప్పొంగి నమర। వగులహాహారవంబులు భరితమయ్యె * క॥ సరసిజనేత్రుఁ డుదనుజే। శ్వరు సంగరధర్మమునకు సమధిక
శౌర్యాస్ఫురణకుఁ దనచిత్తంబునఁ। గిరమాశ్చర్యంబునొందికడఁకదలిర్పన్ * (మ॥ కుతలోద్ధర్తమనంబునం దలఁచె రక్షోరా
డ్యథార్థంబుగా। దితిసంతానకులాటవీమహితసందీప్తప్రభాశుక్రమున్। సతతోర్జయశబ్దసన్ముఖరభాస్వచ్చక్రమున్ సంత
తా। శ్రితనిర్వక్రముఁ బాలితప్రకటధాత్రీచక్రముం జక్రమున్ * (వ॥ అదియునుం బ్రచండమార్తాండమండలప్రభాపటలచ
టులవిద్యోతమానంబుఁ, బటునటజ్జ్వాలికాపాస్తసమస్తకుపితారాతిబలాఖర్వదుర్వారబాహాగర్వాంధకారంబు, నసహ్య
కహకహనినదాధరీకృతసాగరఘోషంబు, సకలదేవతాగణజేగీయమానంబు, ననంతతేజోవిరాజితంబు, నిజప్రభాపటల
పూరితబ్రహ్మాండకటాహంబునై, రయంబునం జనుదెంచి, దనుజారిదక్షిణకరసరోజంబలంకరించిన నాసుభాంగుండురథాం

గదాపాణియై దివంబున నమరగణంబులు జయజయశబ్దంబులు వలుకన సురవిభునకెదురుగా నడిచిన* (క॥ పొడగని దనుజుడు ప్రే
ల్చడవుల దడుపుచు బోలివోని బంటుతనమున భీరుబుడుగక భీషణగద గొని। యడచెన్నఖముఖవరాహునమితోత్సాహున్*
(క॥ త్రిదశారి తన్ను వ్రేసిన। గద బడమున బోవ దన్నిక వలాక్షుడు పెం। పొదవంగ నమన మోదము। గదురంగ లేనవ్వు
వదనకమలమున నొందన్*। వ॥ ఇవ్విధంబున గద బోవం గన్న యసురవిభుని తోనిట్లనియె* (చ॥ ఘనగద గేలం బూనిభుజగ
ర్వమెలర్పగ నన్ను సంగరా। వనినెదురించు రారయనివారణదైత్యకులేశ్వరాధమా। యనవుడు వాడునుబ్బి గదనంబుజ
నాభునినేసె నేసినం దన జవిరోధి పట్టికొనెం దార్క్ష్యుడు పాంద్రుగ బట్టుకైవడిన్* (క॥ దితిజుడు తనబలము ప్రతిహత తేజుం
డగు సరోరుహాక్షుని శౌర్యోన్నతి మీదబెట్టకుండుట। మతి నెఱింగియు బెనగెను మరభిమానము పేర్మిన్॥ అంత* (సీ॥ కాలా
నలజ్వలజ్జ్వాలావిలోల కరాళమై పెంపొందు శూలమంది। సురవైరియజ్ఞసూకరరూపధరుడైన వనజనాభునిమీదవైవ
దియు। సద్విజోత్తముమీద జపలతగా నించు నభిచారకర్మంబునట్లు బెండు। పడిపడ తెగనిపద్మోదరుడు దాని జక్రధారాహ
తి జండవిక్రముమున నడుమ నవడి ద్రుంచెన మరభర్త। మహితదంభోళి చేగరుత్మంతు పక్షు। మతిరయంబున ద్రుంచిన త్రిగజై
ళంగి।సురఖు మోదింపనసురులు సొంపుడింప* (వ॥ అయ్యవసరంబున నయ్యసురతనశూలంబు చక్రంబుచేత నిహతంబగుటం
గని* (క॥ దితిజుడు రోషోద్ధతుడై। యతినిష్ఠురముష్టి బొడిచె హరినాలోకో।న్నతుడై ప్పగుసుమమాలా। హతిదిగ్గజరా
జు బోలియతిదర్పితుడై* (మ॥ హరిమీద దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్।ధరణీచక్రము భూరిపాంసువ
టలధ్వాంతంబున గప్పెభీ। కర పాషాణపురీషమూత్ర ఘనదుర్గంధాస్థిరక్తావళు। ల్గురిసె న్మేఘములభ్రవీథిని మహోత్క్రోధక్రి
యాలోలమై॥ మఱియు* (చ॥ తపిలిపిముక్తకేశపరిధానములుగ్రకరాళదంతతా। లువులు నరక్తలోచనములుం గలభూత
పిశాచఢాకినీ। నివహములంతరిక్షమున నిల్చి భుజాయుధపాణులై మహా। రవముగ యతు దైత్యచతురంగబలంబుల గూడి తోచ
చినన్॥ అంత* (క॥ త్రిసవన పాదుండగునా। బిసరుహనేత్రుండు లోకభీకరమగు నా। యసుగాధిపుమాయావిని। రసనకరంబై
నశస్త్రరాజము బసిచెన్* (క॥ ఆచక్రభానుదీప్తిధ। గాచక్రమునందు సంధిరయమునసమ్మా। యాచక్రము నడగించెను।నీ
చక్రము డైనయామినీచరు నెమఁర్జ॥ అంతనిక్కడ* (క॥ దితితనయభువాక్యంబుల। గతిదప్పనయనుచు దలపగా జన్నుల
శోణితధారలొలికెరక్షః। పతియగుకనకాక్షుపతనభావము దోచన్* (వ॥ అయ్యవసరంబున నసురవిభుండు దానుజేసిన
మాయాశతంబులు కృతఘ్నునకుం గావించిన యుపకారంబులుంబోలె హరిమీద బనిసేయక విఫలంబులైనం బోలివోవని బం
టుతనంబున నంబుండరీకాక్షు జేరంజని దెంచి బాహుయుగళంబు సాచియాచి పొడిచి రక్షోవైరివక్షంబు బీడించిన నయ్యా
ధోక్షజుండు తప్పించుకొని తలంగిన జెలంగి దైత్యుండు నిష్ఠురంబగు ముష్టిం బొడిచిన నసురాంతకుండు మిసిమింతలు లేక
రోషభీషణాకారంబున వాసవుండు వృత్రాసురుం డెగటార్చు చందంబున వజ్రివజ్రసన్నిభంబగు నఱచేతం గఱకుట సుర
కటతటంబు జటులగతి వ్రేసిన హిరణ్యాక్షుండు దిర్దిరం దిరిగి మీలితాక్షుండై సోలి యొట్టకేలకు నెక్కఁ అనిలువంబడె నంత* (క॥ ది
టచెడిలోబడె దైత్యుడు। సటకిటి దంష్ట్రావిభిన్నశత్రుమహోదార। స్తటకిటి ఖరఖురపుటికి। న్నటిటిటహతకనులజాండఘటి
కిన్నిటికిన్॥ ఇట్లులో బడిన* (మ॥ దివిజేంద్రాదులు సంతసింప హరి మొత్తెం గర్ణమూలంబునన్। బవసం కాశకరోగ్రహస్తమున నుం
భల్లీలమై దానదా। నవలోకేశుడు రక్తనేత్రుడగుచున్ దైన్యంబువాటిల్లగా। భువిమీదంబడి శోలె మారుతహతోన్మూలా
వనీజాకృతిన్* (క॥ బుడబుడ నెత్తురు గ్రక్కుచు। వెడరూపము దాల్చి గ్రుడ్లు వెలికుఱక నిలం। బడి పండ్లుగీటుకొనుచు। న్విడిచె
న్ప్రాణంబు దైత్యవీరుం డంతన్* (గీ॥ పడిన దనుజేశ్వరుని జూచి పద్మసంభ। వాదిదివిజులు వెఱగందిరాత్మలందు। నితడు వొం
దుటయెట్లు కోయిూయవస్థ। ననితలంచుచు మఱియు నిట్లనిరి వెసను* (మ॥ వరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్ మనో
వీథిను। స్థిరతన్లింగశరీరభంగమునకై చింతింతురావంకజో। దరుపాణ్యాహతి దన్ముఖాంబుజము దర్శింపుచున్ జచ్చెనీ। ఖ
రితోత్తంసుని దైత్యవల్లభుని సౌభాగ్యంబు దానెట్టిదో* (చ॥ సమమతి వీరు దైత్యకులశాసను పారిషదుల్మునీంద్రశా। పమున ని
కృష్టజన్మమున బైకొని పుట్టియు నేడు విష్ణుచే। సమయుట జేసి మీద నగుజన్మములన్ జలజాక్షు నిత్యవా। సమున వసింతురెన్న
టికి జావును బుట్టువు లేదు వీరికిన్* (క॥ అని వెఱగునొంది త్రిసవన। తనువొందనయట్టి పికచతామరసాక్షు। న్ముని యోగిజన
త్రిదశావనదక్షున్ దనుజకరటివరహర్యక్షున్॥ కనుంగొని* (చ॥ వనజదళాక్షు యీజగతి వారలమర్మమునీ వెఱింగియా। సున
బగబట్టి యాదివిజసూదనుజంపితి గాన సంక్షోభనము గునంచు హస్తములు ఫాలములం గదియించి యంజలు। ల్వినమితులైన
తిందిరిపి వేకవిశాలు సబుణ్యశీలురన్॥ అంత* (చ॥ సవనవరాహమూర్తి సురశాత్రవు ద్రుంచిన మీద భారతీ। ధవముఖదేవ
తాముని కదంబము దన్ను నుతించు నట్టిసం। స్తవమున కాత్మలోన బ్రముదంబును బొందిసమగ్రమంగళో। త్సవము దలిర్పనంద
అంబ్రసాదవిలోకనమొప్ప జూచుచున్* (చ॥ అరిగెవికుంఠధామమునకమ్మహితోత్సవసూచనంబుగా। మొరసెసుపర్వదుం

దుఃఖులమోఘములై ధరణీతలంబున, న్గురిసెఁ బ్రసూనవృష్టి శిఖికుండము లెల్లెడఁ దేజరిల్లె భా। స్వరశశివహ్నుఁ దలంబులు నిజద్యుతితో వెలుఁగొందెన త్తఱిన్ ॥ (క॥ అనియాపుణ్యచరిత్రము। వనగుహసంభవుఁడు ద్రిదివవాసులకుం జె, ప్పినయది మైత్రేయుఁడు విదురునకెఱిఁగించినవిధంబు రూఢము గాఁగన్ ॥ (క॥ శుకయోగిపరీక్షిత్తున, కకుటిలమతి నెఱుఁగఁ జెప్పెనని సూతుఁడు శౌనకముఖ్యులైన మునీశ్వరు। లకుఁ దెలియఁగఁ జెప్పెఁ జేయులాలన మొప్పన్ ॥ (వ॥ ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పిన విని విదురుండు సంతసల్లెనఁ ॥ (క॥ ఆనఘుం బగు నీ చరితము। వినినఁ బఠించినఁ లభించు విశ్రుతకీర్తు। ల్వనజోదరుపదభక్తియు, మునుకొనీ యిహపరసుసౌఖ్యములు జనములకున్ ॥ (వ॥ అని చెప్పి వెండియు సూతుండు మహర్షులకిట్లనియెం బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుఁ గనుంగొని మునీంద్రా హిరణ్యాక్షవధానంతరంబున వసుంధర సమస్థితిం బొందినవిధంబు స్వాయంభువమనుకట తిర్యగ్జాతిజంతుసృష్టినిమిత్తంబులైన మార్గంబు లెన్ని సృజించె, మహాభాగవతోత్తముండయిన విదురుండు కృష్ణునకపకారంబునలందినపాపవర్తనులగు ధృతరాష్ట్రపుత్రులం బాసి జనకుండగు కృష్ణద్వైపాయనునకు సముండగుచు మనోవాక్కాయకర్మంబులు కృష్ణునందు చేర్చి భాగవతజనోపాసకుండయి పుణ్యతీర్థసేవాసమాలబ్ధయశోవిగత కల్మషుండగుచు మైత్రేయమహాముని నేమి ప్రశ్నలడిగె నవియెల్లం దెలియ నానతిమ్మనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె ॥ (సీ॥ విమలాత్ముఁ

❀ చతుర్ముఖుండొనర్చు యక్షాదిదేవతాగణసృష్టిఁ దెలియఁజేయుట. ❀

డైనయవ్విదురుండు మైత్రేయమునివరుని జూచి యిట్లనియెఁ బ్రీతిఁ। జతురాత్మ సకలప్రజాపతియైనట్టి జలజగర్భుఁడు ప్రజాసర్గమందు। మును బ్రజాపతులను బుట్టించి వెండియుఁ జిత్తమం దేమి సృజింపఁదలచె। మును సృజించిన యట్టి మునులమ్మరీచ్యాదులబ్జజువాదేశమాత్మ నిలిపి, యర్థి నెట్లు సృజించిరి యఖిలజగము, మెఱసి మఱి వారు భార్యాసమేతులగుచు। నేమి సృజియించిరది గాక కామినులను, బాసి యేమి సృజించిరో భద్రయశుఁడు ॥ (క॥ అందఱుదమలోనైక్యమఁ, జెందినచో నేమిదగ సృజించిరి కరుణా, కందళితహృదయ యిన్నియుఁ, బొందుగ నెఱిఁగింపు మయ్య బుధనుతనాకున్ ॥ (సీ॥ అనిన మునీంద్రుఁ డిట్లనియె జీవాదృష్టపరుఁడు మాయాయుక్తపురుషవరుఁడు। కాలాత్మకుఁడునను కారణంబున నిర్వికారుఁడైనట్టి జగన్నివాసుఁ। డాదిజాతక్షోభుఁడయ్యు నం మేటి వలనను గుణత్రయంబును జనించె। నా గుణత్రయమున నందయ్యె మహత్తత్త్వ మది రజోగుణహేతువైన దాని। యందహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ। బొడమె నది దానివలనఁ బ్రభూతమయ్యెఁ, బంచతన్మాత్రలందు సంభవము నొందె, భూతపంచకమీసృష్టిహేతువగుచు ॥ (వ॥ అనిమఱియు నదములోనఁ బ్రత్యేకంబుగ భువననిర్మాణకర్మంబునకు సమర్థంబులు గాక యున్నయన్నింటి సంఘాతంబునఁ బాంచభౌతికంబైన హిరణ్మయాండంబు సృజియించె నదియును జలాంతర్వర్తియై వృద్ధిఁ బొందుచుం డెనంత ॥ (సీ॥ నారాయణాఖ్యు నన్నతినొప్పు బ్రహ్మాంబు సాహస్రదివ్యవర్షంబులోలి। వసియించియుండెనావాసుదేవుని నాభియందు సహస్రసూర్యప్రదీప్తిఁ। దనరుచు సకలజీవనికాయయుతమగు పంకజాతంబు సంభవమునొందెఁ, బరగంగ నందులో భగవదధిష్ఠితుఁడగు స్వరాట్టగుచతురాననుండుఁ। జననమందెను దత్పద్మసంభవుండు। నామరూపగుణాదిసంజ్ఞాసమేతుఁ, డగుచు నిర్మాణ మొనరించె నఖిలజగము। వనజజుండు నిజచ్ఛాయవలననుఱియు ॥ (సీ॥ తామిస్రమును నంధతామిస్రమును దమంబును మోహమును మహామోహనంబు। ననుపంచమోహరూపాత్మకమైన యవిద్యఁ బుట్టించియ వ్వేళఁ దనకు। నదితమోమయదేహమని ధాత రోసి తత్తనువు విసర్జించె ధాత్రిముక్త। మూర్తియుత్తృట్సముద్భవంబగు రాత్రిమయమయ్యె నప్పుడు మహీతలంప। నందులో యక్షరక్షస్సులనజనింప। వారికప్పుడు క్షుత్తృషల్వారలఁగొంప, ఖ్యాచతుర్ముఖు భక్షింత మనిరి కొంద। ఱతని రక్షింపుఁడతని తగనాడిరంత ॥ (వ॥ ఇట్లు పలుకుచు ధాతసన్నిధికి నతని భక్షింపవారలయి చనిననతండు భయవిహ్వలుండై యేను మీజనకుండ మీరలు మత్పుత్రులరు నన్ను హింసింపకుండనుచు మాహాజక్షతరక్షత యనుశబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున వారలకుఁ గ్రమంబున యక్షరక్షోనామంబులు ప్రకటంబులయ్యె వెండియుం బ్రభావిభాసితంబైన యొక్కకాయంబు ధరించి సత్త్వగుణగరిష్ఠులుఁ బ్రభావంతులు నగు సుపర్వాణులు ముఖ్యఁబగునట్లు సృజియించి తత్ప్రభామయగాత్రవిసర్జంబు జేసె నదియహోరూపంబై దేవతావళికి నాశ్రయంబయ్యె మఱియు జఘనంబువలన నతిలోలుపులైనయసురలం బుట్టింప వారలతికాముకులగుటం జేసి యయ్యజునిం జేరి మిథునకర్మంబపేక్షించిన విరించి నగుచు నిర్లజ్జులయిన యసురులు దనవెంటనంటి తగులంబగ విప్రపన్నార్తిహరుండు భక్తజనానురూపసందర్శనుండునైన నారాయణుం జేరి తత్పాదంబులకుం బ్రణమిల్లి యిట్లనియె ॥ (క॥ రక్షింపుము రక్షింపుము। పేక్షింపక వినుత నిఖిలబృందారకవి। శ్వేక్షామంకరవినుమిటు దక్షత నీయాజ్ఞ నేను దలనిడి వరుసన్ ॥ (గీ॥ ఈ ప్రజాసృష్టికల్పనం బేనొనర్ప। నందుఁ బాపాత్ములయిన యీయసురలిపుడు, నను రమింపఁగ డాయవచ్చినఁ గలంగి, యిటకు వచ్చితి నను గావుమిద్ధచరిత ॥ (వ॥ అదియునుం గాక లోకంబువారలకుం గ్లేశంబు లొనరింపం గ్లేశంబు నం బొందిన వారల క్లేశంబులపనయింపను నీవ కాక యని స్తుతియించినఁ బద్మజు కార్పణ్యం

జెఱుంగనవధరింపు వివిక్తాధ్యాత్మదర్శనుండగుచు నిట్లనియెదఁగమలసంభవుఁ భవద్ఘోరతను త్యాగంబు సేయుమనియానతిచ్చిన
నతండు నట్ల చేసిననదియును* (సీ॥ నవ్యకాంచనరణన్మణినూపురారావవిలసితపాదారవిందయుగళ। కాంచీకలాపసంకలి
తదుకూలవస్త్రస్ఫారపులినసితంబబింబ। రాజితాన్యోన్యకర్కశపీనకరికుంభపృథుకుచభారకంపితవలగ్న। మదిరారసా
స్వాదమదవిఘూర్ణితచారుసితవనపికచరాజీవనయన। యపరపక్షాష్టమీశశాంకాభఫాల। మదవదళికులరుచిరోపమానచికు
ర।లలితచంపకకుసుమవిలాసనాస।హాసలీలావలోకనయబ్జపాణి* (క॥ ఆనఁదగి సంధ్యారూపం।బునలలనారత్నమపుడుపు
ట్టినదాని।నద్దనుఁగొనిదానవులుపగూ।హనమొగిఁగావించిపలికిరంచలుదమలోన్* (క॥ ఈసౌకుమార్యమారయ।నీసౌందర్య
క్రమంబునీధైర్యంబౌ।రా సౌభాగ్యవిశేషము। నేసతులకుఁగలదుచూడనిదిచిత్రమగున్* (చ॥ అని వెలఁగందియద్దనుజులం
దఱునిట్లనిరీతలోదరిం।గనిమనమింతనిస్పృహతి కాముకవృత్తిఁజరింపుచుండఁగా। మనయెడదీనిచిత్తమునఁ తక్కువలేమికి నేమి
హేతువో।యనిబహుభంగులంబలికిరా ప్రమదాకృతియైనసంధ్యతోన్* (క॥ ఓకదళీస్తంభోరువ। యేకులమేజాడదాన వె
వ్వరిసుతవి।ట్లే కాంతంబునసిచ్చట। నే కారణమునజరించెదెఱిఁగింపుతగన్* (క॥ భవదీయచారురూప। ద్రవిణలసత్పుణ్యభూ
మిఁదగు మోహమున। న్దవిలినదుర్భగులను మముఁ।గవయవుస్వాస్త్రీబాధమునమయ్యెఁగదే* (వ॥ మఱియుఁదదీయసౌంద
ర్యంబుగ్గడింపనలవిగాక చింతింపుచు* (సీ॥ గురుకుచభారసంకుచితావలగ్నంబుదనరారునాకాశతలముగాఁగ। లలితపల్లవ
పాణితలమునఁజెన్నొందుచెందుపత్రపతంగంబుగాఁగ। సలలితనీలపేశలపృథుధమ్మిల్ల బంధంబు ఘనతమఃపటలిగాఁగ।బ్ర
విమలతరకాంతభావవిలోకనజాలంబు దారకాసమితిగాఁగ। గడగిమైపూఁతసాంధ్యరాగంబుగాఁగ। నంగనాకృతినొప్పె
సంధ్యావధూటిఁ।గదిసిమునమురిమోదంబుగడలుకొనఁగ।నసురలంచలుఁగూడియిట్లనిరిమఱియు* (క॥ వెలయఁగఁబద్మంబౌ
కి।స్థలమున నేయొప్పుఁగానిత్యన్ముఖపద్మం।బిలబహుగతులనేకస్థలములఁదనరారెనిపుడు తరుణాబ్జముఖీ* (క॥ అనిదనుజు
లదముమనమున। నను రాగములుప్పతిల్లనంగలునాసం। ధ్యనుబట్టికొనిరి వనజా। సనుఁడప్పుడుహృదయమందు సంతసమం
దెన్* (క॥ సరసిజభవుఁడయ్యెడఁదను।గరమాఘ్రాణింపనపుడు గంధర్వులున। ప్సరసలుపుట్టిరిధాతయుఁ। బరువడినాత్మీ
యతనువుఁబాసిననదియున్* (వ॥ చంద్రికారూపంబైనతద్గాత్రంబు విశ్వావసుపురోగములగు గంధర్వాప్సరోగణంబులు గై
కొనిరి వెండియుంగమలగర్భుండుదంద్రోన్మాదజృంభికానిద్రారూపంబైనశరీరంబుఁబాల్పు పిశాచ గుహ్యక సిద్ధభూతగణం
బులంబుట్టించినవారలు దిగంబరులు ముక్తకేశులునయిననంజూచి ధాతలోచనంబులముకుళించితద్గాత్రంబు విసర్జనంబుగావిం
చిననదివారలుగైకొనిరి వెండియు నజుండు దన్నునన్నవంతునిగాఁగైకొనిచింతించియదృశ్యదేహుండగుచుం బితృసాధ్యగ
ణంబులంబుట్టించిన వారలుదమ్ముంబుట్టించిన యదృశ్యశరీరంబునకుం గార్యంబగు దేవభావంబుఁగైకొనినం దత్కారణంబు
నంబితృసాధ్యగణంబులనుద్దేశించి శ్రాద్ధంబులహవ్యకవ్యంబులాచరింతురు మఱియును* (సీ॥ సజ్జనస్తుతిఁయిను చతురతఁబంక
జాసనుఁడుతిరోధానశక్తివలన। నరసిద్ధవిబుధకిన్నరులనుబుట్టించి తవిలివారికిఁదిరోధాననాము। ధేయమైనట్టి యాదేహం
బునిచ్చెను వెండియుభారతీవిభుఁడు దనకుఁ। బ్రతిబింబమగుశరీరమునఁగిన్నరులఁగింపురుషులఁబుట్టింపఁబూనివారు। ధాతృ
ప్రతిబింబదేహముల్దాల్చివరుస। నిద్దగిద్దగుగవఁగూడియింపులొదవ।బ్రహ్మపరమైనగీతముల్పాడుచుండి। రంతఁబంకజసంభ
వుఁడాత్మలోన* (క॥ తనసృష్టివృద్ధిలేమికిఁగనలుచుశయనించిచింతఁగరచరణాదు। ల్గొనకొనకదలింపఁగరా। లినరోమము
లుగ్రకుండలిప్రజమయ్యెన్* (క॥ వనజజుఁడుదన్నుఁగృతకృ।త్యునిఁగాభావించియాత్మఁదుష్టిఁవహింప। న్మనమున నిఖిలజగ
త్పావనులగుమునులంద్రిలోకవరులసృజించెన్* (సీ॥ పుట్టించివారికిఁ బురుషరూపంబైనతనదేహమిచ్చినఁ దవిలివారు। గ
నుఁగొనిమున్నుపుట్టించినవారలావనజసంభవుని కిట్లనిరి దేవ। యఖిలజగత్సృష్టవై ననీచేతఁగావింగఁబడినయీవితతసు
కృత। మాశ్చర్యకరముయజ్ఞాదిక్రియాకాండమీనసర్గమందీడ్యమయ్యె। దగ్ధవిశ్వాగములుమాకుఁదవిలిజిహ్వ।లందునా
స్వాదనములుసేయఁగలిగె।ననుచుమానములహర్షంబులతిశయిల్ల। వినుతిఁజేసిరి భారతీవిభునిమఱియు* (వ॥ వరతపోవి
ద్యాయోగసమాధియుక్తంబగుచు ఋషివేషధరుండు హృషీకాత్ముండునై ఋషిగణంబులంబుట్టించి సమాధియోగైశ్వర్య
తపోవిద్యావిరక్తియుక్తంబగు నాత్మీయశరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొకనికి నిచ్చెనని మైత్రేయుండు సెప్పినవి
నవిదురుండు బరమానందంబునుబొందిగోవిందచరణారవిందంబులు డెందంబునం దలంచి వెండియు మైత్రేయునింజూచియిట్ల

—❀ కర్దమప్రజాపతిభగవదనుజ్ఞవడసిదేవహూతియనుకన్యకం బెండ్లియాడుట. ❀—

నియె* (సీ॥ మునినాథ స్వాయంభువమనువంశముపరమసమ్మతిమదప్పని తలంప।గొనకొనితద్వంశమునమిథునక్రియఁజేసి
ప్రజావృద్ధిఁజెప్పితీవు। నదిగాక స్వాయంభువమనువున కొగిబూని ప్రియవ్రతోత్తానపాదు। లనునందనులు గలరంటివి
వారునసప్తద్వీపవతియైనధాత్రినెల్ల। ధర్మమార్గంబులేమియుఁదప్పకుండ।ననఘులైయెల్లపాలించిరయ్యవారి। చరితమెల్ల

నుసర్గక్రియాపానిరతబుద్ధి। నెఱుఁగవినిపింపుసాకుమునీంద్రచంద్ర* (వ॥ అదియునుంగాక తన్మనుపుత్రియు యోగలక్షణసమేతయునగు దేవహూతియనుకన్యకారత్నంబును స్వాయంభువుండుకర్దమునకు నేవిధంబునం బెండ్లి చేసె నా దేవహూతియం దమహాయోగియయినకర్దముండు ప్రజల నేలాగునం బుట్టించె నదియునుంగాక కర్దముండు రుచియను కన్యకుక ప్రజాపతికిని చ్చెనని చెప్పితివాకుచియందు నమ్మహాత్ముండు సృష్టి యేలాగునం బుట్టించె నది యన్నియుం దెలియ నానతీవలయునని యడిగినవిదురునకు మైత్రేయుండిట్లనియె* (క॥ వినుమనఘకృతయుగంబున। మునినాథుండయినకర్దముండు ప్రజలస్సృజిం। పనువనజసంభవుని చే। తనియుక్తుండగుచు మదిముదము సంధిల్లన్* (గీ॥ ధీగుణుండు సరస్వతీతీరమునం। దవిలిపది వేలుదివ్యవత్సరములోలిం। దపము సేయుచునొకనాఁడు జపసమాధి। నుండియేకాగ్రదృష్టిఁ బ్రీతుండు వేడ్క* (క॥ వరదుఁ బ్రసన్నుని నొరథ। వరదానసుశీలు నమరవంద్యు రమేశున్। హరి తదూరుసుదర్శను। కరుఁ బూజించిననతండు కరుణాకరుఁడై * (వ॥ అంతనంతరితంబునం బ్రత్యక్షుండైన* (సీ॥ తరణిసుధాకరకిరణోదరాందితనరసీరుహాత్పల స్రగ్విలాసుఁ। గంకణనూపురగ్రైవేయముద్రికాహారకుండలకిరీటాభిరాముఁ। గమనీయసాగరకన్యకా కౌస్తుభమణిభూషణోద్భాసమానవక్షు। సలలితదరహాసచంద్రికాధవళితచారుదర్పణవిరాజత్కపోలు। శంఖచక్రగదాపద్మ చారుహస్తు। నళికులాలకరుచిభాస్వదళికఫలకుఁ। బీతకౌశేయవాసుఁ గృపాతరంగి। తస్మితేక్షణుఁ బంకజోదరుని హరిని* (వ॥ వఱియు శబ్దబ్రహ్మశరీరవంతుండు, సదాత్మకుండు, జ్ఞానైకవేద్యుండు, వైనతేయాంసవిన్యస్తచరణారవిందుండునయిన, గోవిందునింగనుంగొని సంజాతహర్షలహరీపరవశుండును, లబ్ధమనోరథుండునగుచు సాష్టాంగదండప్రణామంబు లాచరించి తదనంతరంబ* (క॥ ముకుళితకరకమలుండై। యకుటిలసద్భక్తిఁ బరవశాత్మకుఁడగుచు। న్వికచాంభోరుహలోచను। నకునిట్లనియెం దదాననము గనుఁగొనుచున్* (సీ॥ అజ్ఞాతసకలభూతాంత రాత్ముఁడవనఁదనరుచుండెడినీదుదర్శనంబుఁ। దలఁకొని సుకృతసత్ఫలభరితంబులై నట్టి యనేకజన్మానుసరణిఁ। బ్రకటయోగక్రియాభ్యాసనిరూఢులై నట్టి యోగీశ్వరులాత్మఁగోరి। యెంతురు యోగీశ్వరేశ్వర యే భవత్పాదారవిందముల్పరగనిపుడు। గంటి భవవార్ధిఁ గడువఁగఁ గంటి నంటిఁ। గడగి నాలోచనంబులకలిమి నేఁడు। దఫలి సఫలతనొందె మాధవముకుంద। దిరదయాకారసత్యలక్ష్మీవిహార* (వ॥ అదియునుంగాక దేవా భవదీయమాయావిమోహితులై హతమేధస్కులై సంసారపారావారోత్తారకంబులైన భవదీయపాదారవిందంబులు తుచ్ఛవృత్తికాములయి సేవించి నిరయగతులైన వారికిం దత్కామయోగ్యంబులగు మనోరథంబులనిత్తువట్టి కాములయినవారి నిందించుచు నేనును గృహమేధధేనువున శేషమూలయింద్రివర్గకారణయు సమానశీలయు నయినభార్యం బరిణయంబు సేయనపేక్షించి కల్పతరుమూల సదృశంబులయిన భవదీయపాదారవిందంబులు సేవించితినయిననొక్క విశేషంబుగలదు విన్నవించెద నవధరింపుము బ్రహ్మాత్మకుండయిననీదువచస్తంతునిబద్ధులై లోకులు కామహతులై రంటయేనును వారలననుసరించినవాఁడనయి కాలాత్మకుండవైన నీకునభిమతంబగునట్లు గాఁ గర్మమయంబైన భవదాజ్ఞాచక్రంబు ననుసరించుట గాని మదీయకామంబుకొఱకుఁ గాదు భవదీయమాయానిర్మితంబు కాలాత్మకభూరివేగసమాయుక్తంబు నకురంబు నయిన బ్రహ్మాంబునందు భ్రమణశీలంబు నధిమాసనమేతత్రయోదశమాసారంబు షష్ట్యుత్తరశతత్రయాహోరాత్రమయపర్వంబు ఋతుషట్కసమాకలితనేమియుం జాతుర్మాస్యత్రయవిరాజితనాభియు నపరిమితక్షణలవాదిపరికల్పితపత్త్రశోభితంబుఁగాలాత్మకభూరివేగసమాయుక్తంబునయిన కాలచక్రంబు సకలజీవనికాయాయుర్గ్రసనతత్పరంబగుం గాని కామాభిభూతజనానుగతపశుప్రాయులగు లోకుల విడిచి భవపరితాపనివారణకారణంబయిన భవదీయతరుణాతపత్రచ్ఛాయాసమాశ్రయులై తావకీయగుణకథనసుధాస్వాదనరుచిరలహరీనిరసితసకలదేహధర్ములైన భగవద్భక్తజనాయుర్హరణసమర్థంబు గాకుండునని* (మ॥ అనఘా యొక్కఁడవయ్యు నాత్మకృతమాయాజాతసత్త్వాదిశ। క్తిని కాయస్థితినీజగజ్జననవృద్ధిక్షోభహేతుప్రభా। వనిరూఢింగను మార్ణనాభిగతి విశ్వస్తుత్యసర్వేశనీ। ఘనలీలామహిమార్ణవంబు గడువంగావచ్చునే యేరికిన్* (వ॥ దేవా శబ్దాదివిషయసుఖకరంబగు రూపంబు విస్తరింపంజేయు టెల్లనస్మదనుగ్రహార్థంబు గాని నీకొఱకుం గాదాత్మీయమాయాపరివర్తితలోకతంత్రంబు గలిగి మదీయమనోరథసుధావర్షివై ననీకు నమస్కరించెద* (మ॥ అనిమిఁబ్భంగినుతింపఁ న న్విని సరోజాక్షుండు మోదంబున। న్వినతానందనకంధరోపరివరద్విభ్రాజమానాంగకుం। డనురాగస్మితచంద్రికాకలితశోభాలోకనాంద్రై మునీం। ద్రుని గారుణ్యమెలర్పఁ జూచి వలికెం గారోంచిష్ణుండై ప్రేల్మిడిన్* (క॥ మునివర యేకోరికకునీ। వనముననుగాసించినమ సమంచితభక్తి। న్ననమునఁ బూజించితి నీ। కనయము నాకోర్కెసఫలమయ్యెడుఁ జుమ్మీ* (వ॥ అనియానతిచ్చి ప్రజాపతిపుత్రుండు సమ్రాట్టునయిన స్వాయంభువమనువు బ్రహ్మావర్తదేశంబునందు సప్తార్ణవమేఖలామండితమహీమండలంబుఁ బరిపాలించుచున్నవాఁ డమ్మహాత్ముండపరదివసంబున నిందులకు శతరూపయను భార్యాసమేతుండై భర్తృకామయగు కూఁతుం దోడ్కొని భవదీయసన్నిధికిం జనుదెంచి నీకునను రూ

నవయశ్శీలసంకల్పగుణాకరమైనతనపుత్రింబరిణయంబుగావించు భవదీయ మనోరథంబుసిద్ధించు ననుంజిత్తంబున సంస్మరిం
పుచుండునమ్మనుకన్యనువరించి భవద్వీర్యంబువలన నతిసౌందర్య వతులయిన కన్యలం దొమ్మండ్రఁగను వాకన్యకానవకంబు
నందుమునీంద్రులుపుత్రోత్పాదనంబులుసేయంగలరు నీవు మదీయశాసనంబును ధరియించి మదర్పితాశేష కర్మండవగుచు
నై కాంతికస్వాంతంబునభూతాభయదానదయాచరితజ్ఞానివై నాయందుజగంబులుగలవనియు నీయందు నేఁగలనని యెఱింగి
సేవింపుము చరమకాలంబుననన్నుంబొందఁగలవు భవదీయవీర్యంబువలన నేనునీభార్యాగర్భంబునంబ్రవేశించి మత్కళాం
శంబునసంభవించి నీకుందత్త్వసంహితనుపన్యసింతునని జనార్దనుండు కర్దమునకెఱింగించి యతండు గనుంగొనుచుండనంత
ర్హితుండై* (చ॥అతులసరస్వతీ సరిదుదంచితబాలరసాలసాలశో । భితతటతుంగరంగమగుబిందుసరంబు విసర్గమించియం
చితగరుడావరోహణము చేసెదకీయగరుత్ప్రభూతరుక్ప్రతతివిలక్షణక్రమవిరాజితనాదముపించు మోదియై* (చ॥అరిగె
విభుఁడథామమునకంగసకామనుఁడైనకర్దముం । డగయవిమోహియై మనమునందనుముండటవచ్చుకోరిక। ల్విరిగొనుచుం
డఁడస్త్రుణమబిందుసరంబుచేరియుండి రావరుఁదలపోయుచుండెజనవంద్యుఁడు భక్తినితాంతచిత్తుఁడై* (వ॥అంతస్వాయం
భువుండు కనకరథారూఢుండగుచు నిజభార్యాసమేతుండై భర్తృవాంఛాపరయైన పుత్రికం దోడ్కొనుచు నిజతనూజకుం
దగినవరు నన్వేషింపుచు భువనంబులుగలయఁ ద్రిమ్మరి యెందునుంగానకవచ్చివచ్చి* (ఉ॥ ముందటఁగాంచెనంతబుధము
ఖ్యుఁడువిష్ణుఁడుకర్దమున్మహా।నందమెలర్పఁజూచినయనంబులరాలినబాష్పముల్ధర। స్బిందువులై వెసందొరఁగి పేర్చిసరస్వ
తిఁజుట్టిపారుట।స్బిందుసరోవరంబనెడి పేరుదనర్చినపుణ్యతీర్థముక్* (ఉ॥ అందుఁ దమాలసాలవకుళార్జుననింబకదంబపాట
లీచందననారికేళఘనసారశిరీషలవంగలుంగమా। కందకుచందనక్రముకకాంచన బిల్వకపిత్థమల్లికా । కుందమధూకమంజు
శనికుంజములన్ధనరాజివెండియుక్* (క॥పరిపక్వఫలభరానత।తరుశాఖానికరనివసితస్ఫుటపికగో। త్కరబహుకోలాహ
లరవ।భరితదిగంతములుగలిగిభవ్యంబగుచుక్* (క॥ అతినిశితచంచుదళన । క్షుతనిర్గతపక్వఫలరసాస్వాదనమో। దితరాజ
శుకవచోర్థ।శ్రుతిఘోషముచెలఁగశ్రవణసుఖదంబగుచుక్* (క॥ లలితసహకారపల్లవ । కలితాస్వాదనకషాయకంఠవిరా
జితకలకంఠపంచమస్వర।కలనాదములుల్లసిల్లఁగఁడురమ్యములై* (క॥ అతులతమాలమహీజ । ప్రతతీక్షణజాతజలదపరిశం
కాంగీ।కృతతాండవఖేలనవిల।సితపింఛవిభాసిజాలశిఖిసేవ్యంబై* (క॥ కారండవజలకుక్కుట। సారసబకచక్రవాకషట్పద
హంసాం।భోరుహకైరవనవక।ల్హారవిరాజితసరోరుహాకరయుతమై*। క॥ కరిపుండరీకవృకకా। సరశశభల్లూకహరిణచమ
రీహరిసూ।కరఖడ్గగవయబలిముఖ । శరభప్రముఖోగ్రవన్యసత్వాశ్రయమై* (వ॥ ఒప్పునప్పరమతాపసోత్తమునియాశ్ర
మంబుఁగనుంగొని మితపరిజనంబులతోడంజొచ్చియందు* (సీ॥ అందితబ్రహ్మచర్య వ్రతయోగ్యమై విలసిల్లు ఘనతపోవృత్తి
చేత। దేహంబురుచిరసందీప్తమై చెలువొందఁగఁడుఁగృశీభూతాత్మకాయుఁడగుచు।నలినోదరాలాపనవసుధాపూరంబుశ్రో
త్రాంజలులద్రావిచొక్కియున్న । కతనఁగృశీభూతకాయుండుగాకజటావలుల్ లాజినశ్రీ వెలుంగఁ । గమలపత్రవిశాలనే
త్రములుదనర।నలినసంస్కారసంధితానర్ఘ్యమాత్మ।రత్నమునుబోలియున్నకర్దమునిఁజూచి । భక్తినమ్మనువెరగందత్పా
దములకు*(వ॥ ఇట్లువందనంబుఁగావించికర్దముండు తనగృహంబునకువిచ్చేసెను దెంచిన యమ్మనువు నాదరించియర్ఘ్యపా
ద్యాదివిధులంబరితుష్టునింగావించిపూర్వోక్తంబయిన భగవదాదేశంబు సంస్మరించిస్వాయంభువునకిట్లనియె* (సీ॥వరగు
ణాకరభగవచ్ఛక్తియుక్తుండవైన త్వదీయపర్యటనమెల్ల।శిష్టపరిగ్రహదుష్టనిగ్రహములకొఱకుఁగదా పుణ్యపురుషమఱియు।
వనజహితాహితవహ్నిసమీరవైవస్వతవార్ధిపవాసవాత్మ।కుఁడవుహరిస్వరూపుఁడవై ననీకునుమానితభక్తినమస్కరింతు।
ననఘనీ వెప్పుడేనేమియఖిలలోక।జైత్రమగుహేమమణిమయస్యందనంబు। నెక్కి కోదండపాణివై యుద్ధసైన్య । పదఘట్ట
నచే భూమిభాగమగల*(మ॥ తరణింబోలిచరింపకున్నఘననిద్రంబొందియొంటనిభూ। వరపద్మోదరకల్పితంబులగునీవర్ణాశ్ర
మోదారవి।స్తరవాథోనిధి హేతుభూతమహామాచారక్రియల్దప్పనం । కరమైచోరభయంబున న్నిఖిలలోకంబుల్నశించుం
జుమీ*(వ॥అనిపలికి భవదాగమనంబునకునిమిత్తంబెయ్యది యనవుడు సమాహితసకలసత్కర్మానుష్ఠానుండైన మునీంద్రు
నకుస్వాయంభువుండిట్లనియె*(క॥సరసిజగర్భుఁడుదనచే।పరిచితమైనట్టివేదతతులనెల్ల।న్ధరవెలయించుటకై బుధ।వరనుత
ముఖముఁదనముఖంబువలనసృజించెక్* (క॥ మరితస్వరూపపాట । చ్చరపీడంబొందకుండసకలక్షోణిం।బరిపాలించుటకై మ
మునరవిందభవుండుభుజములందుసృజించెక్* (క॥ మఱియట్టిజలజభవునకుఁ । గరమంతఃకరణగాత్రకములైవరుసం।బర
గినబ్రహ్మక్షత్రము।లరయరమాధీశ్వరునకునవనీయంబుల్ * (వ॥ కావునహరిస్వరూపుండవై దుర్జనదుర్గమ్నుండవై నన్నినుంగ
నుటమదీయభాగ్యంబునసిద్ధించె భవత్పాదకంజకింజల్కపుంజరంజితంబైమదియమస్తకంబుతావకవచన సుధాపూరితంబు
లైనశ్రవణంబులుమంగళాకరత్వంబును సాఫల్యంబునుంబొందె నేనుకృతార్థుండనైతి దుహితస్నేహజదుఃఖపరిక్లిన్నాం॰

తఃకరణుండనై సకలదేశభ్రమణఖిన్నుండనయిన నావిన్నపంబవధరింపుమని యిట్లనియె* (మ॥ వరయోగీశ్వర దేవహూతి యనునీ వామాక్షి మత్పుత్రి దా। వరలావణ్యగుణాఢ్యులన్వినియు నెవ్వానిన్మదింగోర దా । తురమైనారమపంపునన్మిముఁ వరింతు న్వేగనం చెంచెనీ। తరుణీభిక్షఁబరిగ్రహింపుము శుభోదాత్తక్రియాలోలతన్* (క॥ అసురినగృహమేధికకర్మములగునను రూపగుణవిరాజితశీల। క్రమమునఁదనరినతరుణిం।బ్రమదమునవరింపుమయ్యభవ్యచరిత్రా* (క॥ అనఘువిరక్తులకైనఁ। దనయంతలభించుసౌఖ్యతతివర్జింపఁ।జ్ఞనదఁట కాముకులకున।బ్బినమానుదు రేలభించుప్రియసౌఖ్యంబుల్* (క॥వినుముఫలారంభుఁడుకృప । ఘునినడిగినఁదనయశంబునుంగనమానం।బును జెడుఁగావునఁదగనీ । వెనయవివాహేచ్ఛఁదగులు టెటిఁగేనిటమున్* (క॥చను దెంచితినస్మత్స్వార్థనగైకొనిమత్తనూజఁదగవరియింపుం । డనమునిస్వాయంభువునిం । గనుగొనిమఱలంగఁబలికెఁగడుమోదమునన్* (సీ॥అనఘునీచేతనన్యదత్తముగఁబ్రతిష్ఠితంబైనయాతీఁగెబోడి । కమనీయరూపరేఖావిలాసంబులమాసితలక్ష్మీసమానయగుచు । నొకనాఁటిరాత్రియందుడురాజచంద్రికాధవళితనిజసౌధతలమునందు । సుహితహిరణ్మయమంజీరశోభితచరణయైనిజసఖీసహితయగుచుఁ । గందుకక్రీడఁజరియింపగగనమందు । వరవిమానస్థుఁడగుచువిశ్వావసుండనునాగఁదనరినగంధర్వనాయకుండు।దగుణిఁజూచివిమోహితుడైధరణిఁబడియె* (గీ॥ పుండరీకాక్షు నెఱుఁగనిపురుషపశువు।లీతలోదరిఁబొడగానరేమిచెప్ప।నట్టికోమలిభాగ్యోదయమునఁదాన।వచ్చికామింపనొల్లనివాఁడుగలఁడె* (క॥ ఈకన్యారత్నమునకు। నాకునుగుణరూపవర్తనంబులయెడనా।లోకింపసమము కావునఁ । గైకొనివరియింతు విగతకల్మషవృత్తిన్* (క॥విమలాత్మదీనికొకసమ।యముఁగలదెటిఁగింతువినుగుణాకరయగునీ । రమణికిసపత్యపర్యం । తమువర్తింపుదుగృహస్థధర్మక్రియలన్* (గీ॥ అంతమీఁదవిష్ణువాజ్ఞయాదలఁదాల్చి।శమదమాదియోగసరణిఁబొంది।సన్న్యసించువాఁడజలజనేత్రునివాక్య।కారణమునఁజేసధీరచరిత* (క॥ శ్రీవిభునవలననీలోకావళియుదయించుఁబెరుగునడఁగునువినురా। జీవప్రభవునకతఁడే।భూవరనిర్మాణహేతుభూతుండరయన్* (వ॥ అదిగావునయస్మహాత్మునియాజ్ఞోల్లంఘనంబుసేయరాదనికర్దముండు పలికినవినిస్వాయంభువుండు నిజభార్యయైన శతరూపతలంపును బుత్రియైనదేవహూతిచిత్తంబునెఱింగినవాఁడై మునిసమయంబునకియ్యకొనిప్రహృష్టహృదయుండగుచు సముంచితగుణగణాఢ్యుండయిన కర్దమునకు దేవహూతిని విధ్యుక్తప్రకారంబునవివాహంబుసేయించి తదనంతరంబశతరూపయును బారిబర్హసంజ్ఞికంబులైన వివాహోచిత దివ్యాంబరాభరణంబులు దేవహూతికర్దములకొసంగె నివ్విధంబున నిజకులాచారసరణింబరిణయంబుఁగావించి విగతచింతాభరుండయి స్వాయంభువుండుమహితవియోగవ్యాకులితస్వాంతుఁడై కూఁతుంగౌఁగలించుకొని చుబుకంబుఁబుడుకుచుఁజెక్కిలి ముద్దుగొని శిరంబు మూర్కొని ప్రేమాతిరేకంబున బాష్పధారాసిక్తమస్తకంజేసి తల్లీపోయివచ్చెదనని చెప్పి కర్దముని చేత నామంత్రితుండైనిజభార్యాసమేతంబుగరథంబెక్కి సపరివారుండై* (చ॥తరళతరంగవీచిసముదంచితబిందుసరస్సరస్వతీ।సరిదరవిందతుందిలలసత్తటతీరనివాససన్మునీ । శ్వరనికరాశ్రమాకలితసంపదలంగనుగొంచు వేడ్కమెయి । ప్పురిగొననేగె నాత్మపుటభేదనవిస్ఫుటమార్గవర్తియై ॥ ఇట్లుచనిచని బ్రహ్మావర్తదేశంబునందు* (సీ॥ ఎందేని దొల్లిలక్ష్మీశుండుయజ్ఞసూకరమూర్తిఁగైకొనిసరభసమున । నొడలుజాడించినఁబుడమిపైరాలినరోమజాలంబులురుచిరహరిత । వర్ణమైపొలుపారువరకుశకాశమయంబునుయజ్ఞక్రియాకలాప । యోగ్యంబులై చాలనొప్పారిబర్హిస్సుసంభవించిన వానసకలఋషులు । క్రతువులొనరించి తద్విఘ్నకారులైనయసురులనుద్రుంచిరట్లస్వాయంభువుండు । విష్ణుపరముగమఖముగావించిరుచిర । మేధఁజెలువొందవచ్చియాత్మీయపురము* (క॥డాయంజనఁబురజనములు । పాయనములుదెచ్చియిచ్చిబహుగతులనుతు। లేసేయఁగమంగళతూర్యములాయతగతిమ్రోయఁజొచ్చెనంతఃపురమున్* (వ॥ఇట్లుప్రవేశించితాపత్రయోపశాంతంబగు భగవద్భక్తివృద్ధిం బొందింపుచుంబుత్రమిత్రకళత్రసుహృద్బాంధవహితుండై పరమానందంబున* (మ॥ అతిభక్తిం బ్రతివాసరంబుమహరివ్యాసంగుఁడై మాధవాంకితగంధర్వనిషంచికాకలితసంగీతప్రబంధానుమో । దితుఁడై యిష్టవిభూతులందుననురక్తింబొందక ప్రౌఢ్మన । చ్యుతసేవైకపరాయణుండగుచుస్తోకప్రభావోన్నతిన్* (మ॥ హరిపాదాంబురుహద్వయార్పితతులస్యామోదముంగొంచుక। త్పరితంబుల్దలపోయుచుంబొగడుచున్ జర్పింపుచున్వించుఁద । త్పరిచర్యావ్యతిరిక్తసంసరణసద్ధర్మార్థకామంబుల। న్బరిభూతంబులుసేసి మోక్షపథసంప్రాప్తిక్రియారంభుఁడై* (క॥ నిగమార్థగోచరుండనఁ। దగుహరిచరితప్రసంగతత్పరచిత్తుండగునతనికిస్వాంతరగములగు యామములాగినయాతయామములయ్యెన్* (సీ॥ వెండియునమ్మేటివిష్ణుమంగళకథాకర్ణనధ్యానానుగాననుతులు । సలుపుచు స్వస్వప్నజాగ్రత్సుషుప్తులఁదలగించియాపుణ్యతముఁడుదాను। చక్రిదాసుఁడుగానశారీరమానసదివ్యమానుషభౌతికవ్యథలను । దగులకసన్మునీంద్రశ్రేణికిందగఁ దనరువర్ణాశ్రమధర్మగతులు। దప్పకుండంగఁజెప్పుచుఁదగిలిసర్వ।భూతహితవృత్తినఖిలవిఖ్యాతలీల। నేకసప్తతియుగములస్తోకచరితుఁ । డగుచువర్తించెను

మ్మోపవఁతిశలంబుల్ల* (క॥ అనియమ్మను చరితము విదురునకు మైత్రేయమునివరుఁడు దయతోడ । న్వినిపించి కర్దమునికథఁ । దనరఁ

—* కర్దమప్రజాపతియోగభావంబుచే విమానంబుగల్పించి భార్యతోఁగూడి విహరించుట. *—

గ నెఱిఁగింతునని ముదంబునఁ బలికెన్* (వ॥ ఇట్లు స్వాయంభువుండు దేవహూతిని గర్దమునికి వివాహంబు సేసి మరలి చనిన తద
నంతరంబ దేవహూతియుఁ బతిభక్తి గలిగి భవునికి భవాని పరిచర్య సేయు తెఱంగునఁ బతియాతనను నేమఱక యుండఁగా నెఱింగి
యమ్మునీంద్రుని చిత్తవృత్తిఁ గోరఁది దినదినంబునకు భక్తి తాత్పర్య స్నేహంబులు రెట్టింపఁ బ్రియశుశ్రూషణంబులు గావింపు
చునున్న తేజోవిరాజితయగుచుఁ గామ క్రోధదంభలోభాది గుణవిరహితయై శరీరశుద్ధి వహించి చతుర సౌహార్ద స్నేహంబు
లుగలిగి పతియ దైవంబుగా భావించి మృదుమధుర వచనరచనయై పతిభక్తియే మఱక వర్తింప దైవయోగంబునుం దప్పింపసమ
ర్థుండయిన కర్దముండు నిజసేవాయాస కృశీభూత దేహయైయున్న దేవహూతిం గరుణాతరంగితాపాంగుండై కనుంగొని
మంజుభాషణంబుల నిట్లనియె* (ఉ॥ మానితధర్మమార్గమహిమ స్ఫుటభూరి తపస్సమాధివి । ద్యానిభృతాత్మయోగ సముపార్జి
తవిష్ణుకటాక్షలబ్ధశో । భానఘ దివ్యభోగబహు భద్రవితానములస్మదీయ సే । వానిరతిన్ లభించు ననివారణ నిత్తుము దివ్యదృష్టి
యున్* (గీ॥ నెలఁత తద్దివ్యదృష్టి నన్నియును నీవు । గానవచ్చు విలోకింపు కమలపత్ర । నయనభూమముడిమాత్ర సనాశమందు ।
నితరము గుకుచ్ఛభోగంబులేమి చెప్ప* (సీ॥ అనుపమ రాజ్యదర్పాంధచేతస్కులై పాపవర్తనులైన పార్థివులకు । ధృతిఁ బొంద
రాని యీ దివ్యభోగంబులు నీదు పాతివ్రత్యనిష్ఠఁ జేసి । సంప్రాప్తములు నయ్యె వమితభోగింపుము కార్యంబు సిద్ధించుఁ గాక నీ
కు । ననుటయు నతివయు ననుపమ యోగమాయావిచక్షణశాలియైన కర్ద । మునిఁ గనుంగొని విగతాధియును గటాక్షు । కలితలజ్జాన
తాస్యపంకజయున గుచు । వినయప్రణయములం జేసి విహ్వలంబు । లయిన పలుకులఁ బలికె నిట్లనియె ప్రీతి* (వ॥ అనఘా యమో
ఘన యోగమాయావిభుండవు సమర్థుండవు నయిన నీయందు నీయనువు దివ్యభోగంబులుగలుగుటనిక్కంబ యెఱుంగుదు భవ
త్సంగతిన న్నియు నాకుం గలుగు నయినను దేవా నీ వానతిచ్చిన సంతానపర్యంతంబైన శరీరసంగమసమయంబు చిత్తంబునంద
లందిభవదంగసంగమంబుఁ గృపం జేసి మన్నింపుము భవదీయ సంయోగ వాంఛాపరతం గృశీభూతంబయిన యీ దేహంబు దేవ
ధంబున మజ్జన భోజన పాన సుఖంబులం బరితుష్టిం బొందునట్లుగు న మ్మనోరథంబు దీర్ప రతిరహస్య ప్రకాశకంబగు కామశాస్త్ర
ప్రకారంబు పరీక్షించి యందులకనుచితంబులైన వివిధాంబరాభరణ మాల్యానులేపన మందిరారామ ప్రముఖ నిఖిలవస్తువి
స్తారంబుఁ గావించి నన్నుం గరుణింపుమనిన నమ్మహాత్ముండు నిజయోగమాయాబలంబునం దత్క్షణంబ* (సీ॥ దివ్యమణిస్తంభ
దీప్తిఁ జెన్నొందుచు మరకతస్థలముల మహిమ దనర । వరవజ్రకుడ్యకవాటశోభితములై విద్రుమదేహళీవీథులమరఁ । గొమ
రొప్పు నవశాతకుంభకుంభములపై హరినీలశకల విస్ఫురణ మెఱయఁ । దగఁ బద్మరాగంబు మొగడలఁ జెన్నొందు వైడూర్యవలభు
లువన్నెఁ జూపఁ । దరళతరధూతకేతుపతాకలాలయ । మంజుశింజత్సమంచిత మధుపకలిత । సురచిరాలంబమాన ప్రసూనరా
జి । మాలికలనొప్పు వివిధగృహాళిఁ దనరి* (క॥ మఱియును దుకూలచీనాం । బర కాశేయాది వివిధపటపరివృతమం । దిరసుభగాకా
రంబై । కర మొప్పు విచిత్రపట్టి కాలంకృతమై* (మ॥ లలితోద్యానవనాంతసంచరణ లీలాలోలహంసాళికో । కిలపారావతచ
క్రవాకశుకకేకీందిందిరానీకము । తరులింకం గృత్రిమపక్షులన్నిజవిహంగశ్రేణియంచుం గుతూ । హలియై పల్కుచు నాడుచుం
దుఁ బ్రతిశాఖారోహణవ్యాప్తులన్* (క॥ ఘనసౌధాంతరశయ్యా । సనకేళీగేహకృతకజగతీధరశో । భనచంద్రకాంతచారు
భ । వనఫలభరితావనీజవంతములగుచున్* (క॥ సకలర్తుశోభితంబును । సకలశుభావహము సకలసంపత్కరముం । సకలోప
భోగయోగ్యము । సకలేప్సిత కామదంబు సదలంకృతమున్* (వ॥ అగుచు నొప్పు దివ్యవిమానంబుఁ గల్పించి తదీయ సుషమావిశే
షవిచిత్రంబులు నిర్మించి తాన తెలియం జాలనియట్టి కృతకర్మంబయిన విమానంబు దేవహూతికిం జూపినం జూచి యమ్ముదియ
పంత సంతసింపకుండుట నెఱింగి సర్వభూతాంతరాశయాభిజ్ఞుండును సంతుష్టాంతరంగుండును నయిన కర్దముం డిట్లనియె* (గీ॥ అతివ భ
గవత్కృతంబయి యఖిలమంగళాళికాకరము గు నిజలాశయమునఁ । దవిలి గ్రుంకి సజంతువితానములకుఁ । గామ్యఫలసిద్ధి సేకు
రుఁ గాన నీవు* (క॥ ఇజ్జలముల నతిభక్తిని । మజ్జనమొనరించి యీ విమానము వేడ్కన్ । లజ్జావతి యెక్కవె యని । బుజ్జగమొనరం
గఁ గర్దముఁడు వల్కుటయున్* (వ॥ వినియా కువలయాక్షి పతిసేవాయాస మలినాంబరయు వేణీభూత శిరోజయు ధూళిధూస
రితాతికృశీభూతాంగియు శబలస్తనయునై భర్తృనియోగంబున సరస్వతీసలిల సంభూత జలచరాశ్రయంబగు బిందుసరో
వరంబుఁ బ్రవేశించి తజ్జలంబులఁ గ్రుంకులిడు సమయంబునఁ దద్వాఃపూర మధ్యంబున రుచిరసూక్ష్మాంశుకధారులుఁ గిశోర
వయఃపరిపాకశోభితులుత్పలగంధులును నగు కన్యాసహస్రంబులు దేవహూతింగనుంగొని యిట్లనిరి* (క॥ తరుణీ నీదుని మో

శాతకుంభకుంభములపైన్-బంగరుకుండలమీద.— మొగడలన్-మొగ్గలతోడ— వలభులు-కొణిసెలు— చీనాంబర-చీనాదేశపువస్త్రములు,

గా॥ చరణములమిఁదె మేమునీకు సదమలభక్తిన్। బరిచర్య సేయ నేర్తుము । కరుణాకలితేక్షణములఁ గనుఁగొను మమ్మున్॥ * (సీ॥ అని పలికి డాసి యయ్యతివకు నభ్యంజనోద్వర్తనములు పెంపొనరఁ జేసి । మలయజకర్పూరమహితవాసితహేమకలశోదకంబులఁ జలక మార్చి। ధవళవస్త్రంబులఁ దడి యొత్తి సర్వాంగ ధూపంబు లొసఁగి కస్తూరి నలఁది । మంజుశింజన్మణిమంజీరకింకిణీకలరావకలితమేఖలలు రత్న । ఖచితతాటంకముద్రికాకంకణాది। సముదితానర్ఘ్యహేమభూషణము లొసఁగి। భవ్యమాల్యానులేపనాంబరము లిచ్చి। షడ్రసోపేతవివిధాన్నసమితిఁ దనిపి* (వ॥ మఱియుం గనకపాత్రగతితంబులగు నకర్పూరవీటికలిచ్చి రుచిరాసనంబునఁ గూర్చుండఁ బెట్టి దర్పణంబు చేతి కిచ్చిన నందత్ప్రతిఫలితనిజదేహంబుఁ గనుంగొని కర్దమునివాసంబున నవలంబిననతండు గన్యాసహస్రంబును దత్క్షణంబున దనసన్నిధి నుండుటం జూచి నిజభర్తృయోగమాయాప్రభావంబున కద్భుతంబు నొందె నంతఁ గర్దముండు కృతస్నానయైన దేవహూతిం గనుంగొని వివాహంబునకు ముందట నే చందంబున నందనరుచుండు నాచందంబునం జెన్నొందుచుండుటకు నానందభరితుండై భార్యాసహితంబుగఁ దత్కన్యకాసహస్రంబు గొలువ నిజవిమానారూఢుండై తారాగణపరివృతుండై రోహిణీయుక్తుండగు సుధాకరుం బోలి యొప్పుచుఁ దదనంతరంబ* (చ॥ చిరశుభమూర్తి యమ్ముని యశేషదిగీశవిహారయోగ్యముల్ । సురుచిరమందగంధవహశోభితమున్నకటప్రధాతుని। ర్ఝరసరిదంబుశీతలతుషారము నై తనరారు మేరుకందరమున కేగి దేవవనితాయుతుఁడై నను బేచు చాద్మునన్॥ మఱియు* (మ॥ అకరోద్యానవనప్రదేశములు నవ్యారామభూముల్దగ। తుక ముకాంభోజవిభాసిమానససరఃకూలంబులున్ మంజుకుంజములున్ జైత్రరథంబు విస్ఫురితవిస్రంభంబునం జూచె నే। య్యమునన్ గర్దమయోగి కామగవిమానారూఢుఁడై చెచ్చెరన్* (వ॥ ఇవ్విధంబున సమస్తభూభాగంబును వాయువేగంబునం గలయం బరిభ్రమించి ఖిలవైమానికలోకంబు నతిశయించి లోకంబులఁ జరియించె మోక్షదాయకుండుఁ దీర్థపాదుండు నగు పుండరీకాక్షుని సన్నుతించి సేవించు పుణ్యాత్ములకుం బొందరాని పదార్థంబులు గలవె యిట్లు కర్దముండు దేవహూతికి నిఖలధరాచక్రంబంతయుం జూపి మఱలి నిజనివాసంబునకుం జనుదెంచి కామకేళీవినోదాత్ముఁడై యున్న భార్యనుపలక్షించి రతిప్రసంగవ్యాసంగంబుఁ గైకొని బహువిధంబులయిన యిష్టోపభోగంబుల బహువత్సరంబు లొక్క ముహూర్తంబుగా జరుపుచు నన్యోన్యసరసావలోకనంబుల సముచితాలింగన సంభాషణంబుల గోష్ఠీసమావేశంబున సేయనేరక శతవత్సరంబులు గడపి తదనంతరంబ* (క॥ మునివరుఁ డొకనాఁ డిమ్ములఁ। దననిజదేహంబు నవవిధంబుగఁ గావించి। దన యంబునఁ దద్వీర్యముఁ। దనసతి గర్భమున నవవిధంబుగ నిలిపెన్* (క॥ అది కారణంబుగాఁ బెం। పొదవిన యవ్వేళ దేవహూతి తనయల। న్మదమునఁ గనెఁ దొమ్మండ్ర। న్ముదితయు మదిసంతసించె మునివరుఁ డంతన్* (గీ॥ సన్న్యసింపంగఁ గోరిన సతి యెఱింగి। యాత్మఁ బొడమిన సంతాప మగ్గలింప। జింత వాటిల్లఁ జెక్కిటఁ జెయ్యిఁ జేర్చి। పదములను నేలవ్రాయుచుఁ బలికెఁ బతికి*(సీ॥ అనఘ సంతానపర్యంతంబు నను గూడి వర్తింతు నను చుఁ బూర్వమున బలికి। కూఁతుల నిచ్చితి కొమరార నిప్పుడీతరుణులు వతులను దమకుఁ దార। యరసి వర్తింపరో యనిభీతినొందెదఁ గావున నీపుత్రికలకుఁ దగిన। వరులసంపాదించి పరిణయంబులు సేసి తత్సంహితనాకుఁ దవిలి తెలుపు। సుతుని గృపఁ జేసి నను గావు సుజనవినుత। యర్థిసంసారదుఃఖంబున వనయుంపన। ర్షాఁడవు నీవ కామమోహమున నింత। కాల మూరక పోయె నే గతియు లేక* (చ॥ ఉపరతి పుట్టనై హికసుఖోపగతానుభవంబులం దుము। న్నపలతఁ గామభోగరతిసంగముఁ గోరి మహాత్మ నిన్ను నచ్చపుఁదలపాస్ప గాఁ దెలియఁజాలక యే వరియించుటన్నవ। త్కృపఫలియించెను భక్తి నిను గేవలభక్తి భజింపగల్గదే॥ అదియునుం గాక*(చ॥ సమమతి నొప్పు సత్పురుష సఖ్యము సద్గతి కారణంబు నీ। చమతివిలోలదుష్పురుష సఖ్యము దుర్గతి హేతువంచు నెజి। త్తమున వలందియోగిజనతాను తమిమ్ము భజింతుఁ బ్రాణి సంగమమునఁ బుణ్యపాపములు గైకొని పొంద వెమెట్టివారలన్* (క॥ అనయిట్లు వేదనాభర। మున మనుగుచు బలుఁ గర్దముఁ డామనుపుత్రి । న్గనుఁగొని సరసిజనయను వ। చనములు మది సంస్మరించి సతికిట్లనియెన్* (క॥ మనుసుత నీమదిదుఃఖం। బును బొందకు మచిరకాలమున భగవంతుం। డనఘుండక్షరుఁడు జనా। ర్దనుఁడు భవద్గర్భమునఁ గదగ వసియించున్* (క॥ వరనియమవ్రతనిష్ఠా। చరణ నియుక్తాంతరంగ సమధిక వైసం। భరితతపోధనదాన। స్ఫురితశ్రద్ధానుభక్తిపూర్వముగాఁగన్* (మ॥ మఱి నారాయణపాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజింపు తత్పురుషశ్రేష్ఠుఁడు మానసంబున భవత్పూజానుసంప్రీతుఁడై। కరమర్థిం దరుణీశిరోమణి భవద్గర్భస్థుఁడై యుండి తాఁ గరుణం జేయు భవన్మనోజ్ఞతశంకాగ్రంథివిచ్ఛేదమున్॥ ................................*

—* దేవహూతిగర్భంబున విష్ణుండు కపిలాచార్యుండుగా నుదయించుట *—

(చ॥ అనవుడు దేవహూతి హృదయంబున సంతసమంది యమ్మునీం। ద్రునివచనక్రమంబునఁ బరున్ భగవంతు ననంతుఁ బద్మలోచను హరి విష్ణు నర్చనము సల్పుచు నుండఁగఁ గొన్నియబ్దముల్। చను నెడఁ దానవాంతకుఁడు సమ్మతిఁ గర్దమునందు నైన తేజమున్*

అంశుక-వస్త్రము — ఉపరతి-నిస్పృహ — యోగిజనతా-యోగిజనసమూహముచేత.

(క॥ ధరియించి యమ్మునీంద్రువనితరుణీగర్భంబువలన ననుజారిశమీ । తరుకోటరమున వైశ్వా । నరుఁడుదయించిన విధంబున
జనియించెన్ ॥ (సీ॥ అయ్యవసరమున నాకాశమున దేవతూర్యఘోషంబంతదుములమై మ్రోయ । నందిత దేవతాబృందంబులం
తంతఁ గురిసిరి మందారకుసుమవృష్టి । గంధర్వకిన్నరగానంబు వీతెంచె నప్సరోగణములాటలాడె । వారిదికులఁ గా
విరిసిరి సెసుదపలి వార్ధులకలఁకలునుమానె । సాధుజనములమనములు సంతసిల్లె । హోమానలములు ప్రభలఁ జెన్నొందె వెలిఁ
గెఁ గుసుమఫలభరములనొప్పెఁ దరుజములెల్ల । సర్వసస్యాళి చెన్నొందె జగతిలోన ॥ (వ॥ ఇట్టి మహోత్సవంబున నవహమా
[illegible]ం దత్త్వబోధంబుఁ గావించుకొఱకుఁ దదీయగర్భంబున నుదయించిన పరబ్రహ్మస్వరూపుండైన నారాయణునిదర్శించుకొ
అనమరీచిప్రముఖమునిగణసమేతుండై చతుర్ముఖుండు చనుదెంచి యమ్మహాత్ముని దర్శించి కర్దమదేవహూతులం గనుంగొని
యిట్లనియె ॥ (క॥ నుతచరితులార మీరలు । కృతకృత్యులు విష్ణుపూజఁ గేవలభక్తి । న్మానసపటులరై చే । సితిరి తదర్చనఫలంబు
చేకురె మీకున్ ॥ (క॥ శ్రితభయహరణుఁడు మునిజననుతచరితుఁడు పరుఁడు మీ మనోరథసిద్ధి । స్థితలంబుగఁ గావించుట । జ
తురత మీజన్మమింక సఫలతఁ బొందెన్ ॥ (క॥ వినుఁడు సకాములునై హరి । ననుపమభక్తిన్ భజించు నదె ముక్తికిఁ జా । లును మీపుణ్యం
బేమనికొనియాడఁగవచ్చునీతి కోవిదులారా ॥ (వ॥ అని వెండియుం గర్దముం గనుంగొని యిట్లను భవదీయతనూభవలం బ్రక
టశీలవ్రతాచారసంపన్నలైన మునివరేణ్యులకుం బెండ్లిసేయు మట్లయిన వారివలనం బ్రజాసృష్టి బహువిధంబుల వృద్ధిం బొం
దునని చెప్పి కర్దమున కిట్లనియె ॥ (చ॥ అనఘ భవత్సుతుండు సముదంచిత తేజుఁడునైన యమ్మహాత్మునిఁ బరమేశు నీశు నజితు నన్న
లినాభు నమేయు నచ్యుతున్ । ఘనునవికారు నక్షరు నఘారి ననంతుని గాఁ దలంపుసు । క్ష్మనియ సమస్త చేతననికాయహృదీప్సిత
దాయిగాఁ బురన్ ॥ (సీ॥ మానితజ్ఞానవిజ్ఞానయోగంబులు ననుపాయంబులు నొనరఁజేసి । మోలి మైఁ గర్మజీవులనుద్ధరించుట
కై అవనమ్మహితాత్ముఁడు సహగ్రహాటకరుచిజటాజూటుండు నుత్ఫుల్లపంకజనేత్రుండు పద్మవజ్ర । హలకులిశాంకుశ లలి
తరేఖాంకితచరణతలుండును సత్త్వగుణుఁడు । నగుచు నిష్వహుస సీకుహాక్షి నీదు । గర్భమందుదయించెను ఘనుఁడు నీకుఁ । దత్త్వబో
ధంబుఁ గావించు దావకీన హృదయసంగతసంశయమెల్లఁ బాపు ॥ మఱియును ॥ (క॥ నుతికెక్కి సిద్ధగణసే । వితుఁడై ఘనసాం
ఖ్యయోగవిలసితతత్త్వ । స్థితిని రతుఁడగుచుఁ గపిలా । ఖ్యతఁ దనరుచరించు నీజగత్త్రయమెల్లన్ ॥ (క॥ అనిపలికి యమ్మరీచిం । గని
యుద్వాహార్థముని చికవలజుఁడంత । సనందనులకు నారద । సనకాదులఁ గూడి హంసాత్మసదమునకిరిగెన్ ॥ (వ॥ అంతనా కర్ద
ముండు కమలసంభవచోదితుండగుచు యథోచితంబుగా నాత్మీయదుహితల వివాహంబు సేయందలంచి మరీచికిం గళయను
కన్యకను, నత్రికి ననసూయను, నంగిరసునకు శ్రద్ధను, బులస్త్యునకు హవిర్భువును, బులహునకుం గతిని, గ్రతువునకుం గ్రియను, భృగు
వునకు ఖ్యాతిని, వసిష్ఠునకు నరుంధతిని, నథర్వునకు శాంతిని గా నిజకులాచారసరణిం బరిణయంబుఁ గావించిన వారును గృతదా
రపరిగ్రహులు కర్దమకృతసంభావనాసంభావితులగుచు నతనిచేత ననుజ్ఞాతులై జాయాసహితులగుచు నిజాశ్రమభూములకుం
జరియనంతరంబు కర్దముండు దేవోత్తముండగు విష్ణుండు దన మందిరంబున నవతరించి వసించియుంటం దనచిత్తంబున నెఱిం
గి వివిక్తస్థలంబునకుం జని యచ్చటఁ గపిలునకు వందనంబాచరించి యిట్లనియె ॥ (సీ॥ చతురాత్మ వినుమాత్మకృతములైనట్టి యమం
గళభూతకర్మంబులనెడి । దావాగ్నిశిఖలచే దందహ్యమానులైనట్టి జీవులు తుదముట్టలేక । పాయక సంసారబద్ధులైయుందురు
బహువిధకాలంబిట్లువరలుచుండ । సకలదేవతలు ప్రసన్నులునగుదురు బహుజన్మపరిచితప్రాప్తయోగ । చిరసమాధిస్థపోనిష్ఠచే
వివిక్త । దేశముల యోగిజనములు ధృతుల నేమ । హానుభావుపలోకింతురట్టిదివ్య । పురుషరత్నంబు నా యింటఁ బుట్టితీవ ॥ (వ॥ మ
ఱియు సంసారచక్రపరిభ్రామ్యమాణులమగుచు గ్రామ్యములయిన మావర్తనంబులు గణింపక మదీయగృహంబున సంభూతుండ
వునం బ్రతిశ్రుతంబులయిన భవదీయవాక్యంబులు దప్పకుండ ననుగ్రహింపనుదయించితని వెండియు నిట్లనియె ॥ (క॥ తలపోయఁ
గ నప్రాకృత । బలయుక్త చతుర్భుజాదిభవదవతారం । బులు నీకు రూపములునై । పొలుపొందంగా దెపరమపురుష మహాత్మా ॥ అ
దియునుం గాక ॥ (క॥ అనయము భవదీయాశ్రిత । జనసంరక్షణముకొఱకు సమ్మతితోఁ దా । ల్చిన మానవరూపంబులు । ననురూ
పములగును గాదె హరి నీకెపుడున్ ॥ (క॥ సుమహితతత్త్వజ్ఞానా । ర్థము విద్వజ్జనగణంబు దవిలి నవసారా । రములోలిఁ జేయు పద
పీఠముగలనినుఁ బొగడవశమె తరమె నింపంగన్ ॥ (సీ॥ సమధికషడ్గుణైశ్వర్యకారణుఁడవు పరమేశ్వరుండవు ప్రకృతిపురుష । మ
హదహంకారతన్మాత్ర తత్త్వోద్భవ హేతుకాలాత్మ విఖ్యాతధృతివి । జగదాత్మకుండవు నిచ్ఛాశక్తినాత్మీయ జఠరనిక్షిప్తవిశ్వప్ర
పంచ । మునుగలసర్వజ్ఞమూర్తివి స్వచ్ఛందశక్తియుక్తుండవు సర్వసాక్షి । వగుచుఁ గపిలాఖ్యఁ దనరారునట్టి నీకు । ననఘ ప్రమో
క్షంబుఁ జెందవకుచు నీవు । నాకుఁ బుట్టినకతన గుణత్రయంబు । వలనఁ బాసితినిక భక్తవరద నేను ॥ (గీ॥ మానితవ్రతయోగ
సమాధిపూర్తి । జెందిభవదీయపాదారవిందయుగము । డెందమునఁ జేర్చి శోకంబులందుఁ దొలఁగి । సంచరించెద నంచితస్థలము

కర్దమున - కర్దము బ్రహ్మవీర్యము — హాటకరుచిజటాజూటుండు - బంగారుచాయవంటి జడలుగలవాఁడు — ఉద్వాహార్థము - పెండ్లినిమిత్తము.

లందు* (క॥ అనియిట్లుపన్నిందిన। మునిపుంగవుఁడైన కర్దముఁ డివచనంబుల్ । విని భగవంతుండగు । నయ్యనఘుఁడు కపిలుండు
వలికె నర్మిలి దోఁపన్* (సీ॥ నాచేతఁ బూర్వంబున సప్రతిశ్రుతమైన వచనముల్లప్పక వరమునీంద్ర । నీయింటఁబుట్టితి నస్మైతుకస్థి
తిభూరిదయాగుణంబున నవాప్త। సకలకాముఁడ నేను సన్మునివేషంబు ధరియించుటెల్ల నాకొఱకుఁ గాదు । వినుమహాత్ములై
నమునులకుఁ బరమాత్మకురు సద్వివేకంబు నరసి చూపు। తత్త్వబోధంబుకొఱకును దాల్పఁబడిన । యందితవ్యక్తమార్గమైనట్టి దే
హ। మునితలంపుము మత్పదధ్యానభక్తి। ధీపరాయణమహిమంబు దెజరిల్ల* (క॥ సమధికనిష్ఠం గృతయో। గమున నన్న్యస్తసకల
కర్ముఁడవై మోహముఁ బాసి భక్తిచే మోక్షము నసుభజియింపు నను వికారరహితుఁడై* (క॥ ననుబరమేశుఁ బరంజ్యోతిన న
ఘు ననంతు దేవదేవు సకలభూతనికాయగుహాశయు నా। ద్యుని నజు నాద్యంతశూన్యు దురితవిదూరున్* (క॥ తిరముగభవదీ
యాంతఃకరణసరోజాతకర్ణికాతలమున నను । స్థిరుఁ జేసి యింద్రియంబుల । నిరసించి మనోంబకమున నెఱిఁగను మనఘా॥ అ
ల్లైని* (క॥ తనరిన మోక్షమునొందెద। వని పలికిన గర్దముండు నమ్మునికులచంద్రుని వలఁగొని వందనములు । ఘనముగనతిభక్తిఁ
జేసి కౌతుకమలరన్* (క॥ మునిగణసేవితమగు వన। మునకుం జనియంత మౌనమున నిస్సంగుఁ। డురువహ్నిరహితుఁడనికేత
నుఁడై యాత్మైకశరణతత్పరుఁడగుచున్* (వ॥ పరబ్రహ్మంబునఁ జిత్తంబునఁ నిల్పి యహంకారంబు విడిచి మమత్వంబు నిరసించి ద
యాగుణంబునం జేసి సకలభూతంబులందు సమత్వంబు భజియించి శాంతశేముషీగరిష్ఠుండగుచు నిస్తరంగంబగు వార్ధిచందం
బున ధీరుండై నిఖిలప్రపంచంబును వాసుదేవమయంబుగాఁ దలంచుచు భక్తియోగంబున భాగవతగతిం బొందెనని చెప్పి వెం
డియు మైత్రేయుం డవిదురునకుం గర్దముండు వనంబునకుం జనిన యనంతరంబ మాతృవత్సలుండయిన కపిలుండు బిందు
సరంబున వసియించియుండ దేవహూతి తత్త్వమార్గాగ్రదర్శనుండయిన సుతునిం గనుంగొని బ్రహ్మవచనంబులు దలంపుచు ని

❖* దేవహూతి తనపుత్రుండయిన కపిలునివలనఁ దత్త్వజ్ఞానంబు వడయుట. *❖

ట్లనియె* (క॥ అనదింద్రియతర్షణమున। వసుమతినిర్విణ్ణ గుచువనరెడి నాకీ । యసదృశమోహతమోపహ। రసనంబన ఘాత్మ
తమే వెరవునఘటిలచున్* (క॥ పటుఘనసీరంధ్రతమః। పటలపరీవృతజగత్ప్రపంచమునకు నేకకటిలోచనమై నుహాత్సత్కట
రుచి వెలుఁగుచు పుభానుకైవడి ననఘా* (ఉ॥ భూరిమదీయమోహతమముం బెడబాపసమర్థులన్యులె। వ్వారలు నీవకాక నిరవ
ద్యనిరంజననిర్వికారసం। సారలతాలవిత్రబుధసత్తమసర్వశరణ్యధర్మని। స్తారకసర్వలోకశుభదాయక నిత్యవిభూతినాయ
కా* (చ॥ నిను శరణంబుఁ జొచ్చెదననింద్యతపోనిధి నన్నుఁ గావవే। యనితను దేవహూతి వినయంబున సన్నుతి చేసి వేఁడఁగా।
ననుపమసత్కృపాకలితుఁడై కపిలుండనురాగమొప్ప స। జ్జననిచయాపవర్గఫలసాధనతం దగు తల్లివాక్యముల్* (క॥ వినిమం
దస్మితలలితాననకమలుండగుచు నెమ్మనమునఁ బ్రమోదం । బనయంబు గడలుకొననిజ । జననికిట్లనియెఁ బరమశాంతుండగు
చున్* (క॥ వినుజీవునిచిత్తము దా। ఘనభవబంధాపవర్గకారణమదియే । చినఁద్రిగుణాసక్తంబయి । నను సంసృతిబంధకార
ణంబగు మఱియున్* (గీ॥ అదియ నారాయణాసక్తమయ్యెనేని । మోక్షకారణమగు నని మునికులాబ్ధి। చంద్రుఁ డనఘాత్మకపి
లుండు జననితోడ। నర్థి వినఁ జెప్పి మఱియు నిట్లనియెఁ బ్రీతి* (వ॥ మఱియుఁ జిత్తంబహంకారమమకారరూపాభిమానజాతంబు
లగు కామలోభాధికలుషవ్రాతంబులచేత నెప్పుడు విముక్తంబై పరిశుద్ధంబగు నప్పుడు సుఖదుఃఖవివర్జితంబు నేకరూపంబునై
ప్రకృతికంటెఁ బరుండు పరమపురుషుండు నిర్భేదుండు స్వయంజ్యోతియు సూక్ష్మస్వరూపుండు నితరవస్త్వంతరాపరిచ్ఛిన్నుం
డును దాసీనుండునైన పరమాత్మ నిం దన్మయంబుగాఁ దౌజసరూపంబైన ప్రపంచంబును జ్ఞానవైరాగ్యభక్తియుక్తంబగు మనంబు
చేఁ బొడగాంచి యోగిజనులు పతతత్త్వసిద్ధికొఱకు నిఖిలాత్మకుండైన నారాయణునందు నియుజ్యమానంబయిన భక్తిభావం
బువలన నుదయించిన మార్గంబునకు నితరమార్గంబులు సరిగావు। దుర్విద్యాంసులు సంగం బింద్రియార్థాద్యసద్విషయంబుగ
నొనరింపంబడిన జీవునకు నశిథిలంబగు బంధంబునకుఁ గారణంబగు ననియు నదియె సద్విషయంబైన యంతఃకరణసంయమన
హేతుభూతంబగుచు సాధుజనులకు ననర్గళమోక్షద్వారంబుగాఁ దెలియుదురు సహనశీలురు సమస్తశరీరధారులకు సుహృత్తు
లుఁ బరమశాంతులుఁ గారుణికులునై మదర్థంబుగఁ బరిత్యక్తకర్మఫలస్వభావులు విసృష్టస్వజనబంధుజనులునై మద్గుణధ్యాన
పారీణులు మత్కథాప్రసంగసంభరితశ్రవణానందులగుచు మదీయకథలనొడువుచు వినుచునుండు పరమభాగవతోత్తముల
నాధ్యాత్మికాదితాపత్రయంబు నొప్పింపంజేయంజాలదట్టి సర్వసంగవివర్జితులగు పరమభాగవతజనులసంగం బపేక్షణీయంబ
దిసలకదోషనివారకంబగునట్టి సత్సంగంబున సర్వప్రాణిహృత్కర్ణరసాయనంబులగు మదీయకథాప్రసంగంబులు గలుగుమ
ద్గుణాకర్ణనంబునం జేసి శీఘ్రంబుగఁ గ్రమంబున నైవల్యమార్గదంబులగు శ్రద్ధాభక్తులుదయించు నదియునుంగాక యేపురు

నిస్తరంబగువార్ధిచందంబునన్ - అలలులేని సముద్రమువలె — గడలుకొనన్ - ఆవరింపఁగా — ఉదాసీనుఁడు - పక్షపాతములేనివాఁడు.

ఘుండైన నేమిమద్విరచితగర్హాల్పనాదిపఘోరచింతచే నుదయించినభక్తిం జేసి యింద్రియసుఖంబులవలన దృష్టశ్రుతంబులై
నయిహికాముష్మికంబులవలనను విముక్తుండగుచు జిత్తగ్రహణార్థంబు ఋజువులైన యోగమార్గంబులచే సంయుక్తుండగున
ట్టియోగి ప్రకృతిగుణసేవనంబుచేత వైరాగ్యగుణవిజృంభితంబైన జ్ఞానంబుచేత యోగంబులచేత మదర్పితభక్తియోగంబు
చేతను బ్రత్యగాత్మకుండనయిననను నంతఃకరణనియుక్తునింగా భావించునని చెప్పినవిని దేవహూతి కపిలునకిట్లనియె* (క॥ ఏభ
క్తిభవద్గుణపర । మైభవపాపప్రణాశమైముక్తిశ్రీ । లాభము రయమునఁ జేయునో । యాభక్తివిధంబుఁ దెలియ నానతియీ
వే* (వ॥ అదియునుం గాక భవదుదితంబైన యోగంబుఁ దదంగంబులుఁ దద్గతతత్త్వావబోధంబును సాకల్యంబుగ మందబుద్ధినైన
నాకుస్ఫుటంబగునట్లు దెలియ నానతిమ్మనినఁ గపిలుండిట్లనియె* (సీ॥ జననియిత్రి నినుమఱి సకలపదార్థపరిజ్ఞానతత్త్వపారీణమై
న। యామ్నాయవిహిత కర్మాచారములఁ గల్గి తివుటమైవర్తింప దేవగణము । పూని నైసర్గికంబైన నిర్హేతుకమగు భగవత్సేవమి
గులముక్తికంటెఁ గరిష్ఠంబు గావుననదియు భుక్తాన్నంబు జీర్ణంబు నందఁ జేయు । దీప్తజఠరాగ్నిగతిలింగదేహనాశ । కంబుగా
వించునదియొను గాక పిష్టం। భక్తివైభవములఁ దేటపఱతు వినుము। సద్గుణవ్రాతయోగలక్షణసమేత* (చ॥ అమలినభక్తిఁ గొం
దఱు మహాత్ములు మచ్చరణారవిందయుగ్మము హృదయంబునన్నిలిపి కౌతుకులై యితరేతరానులా । పములను దీయదివ్యతను
పౌరుషమల్లోని యాడుచుండి మో। క్షము మదిఁ గోరరు నొల్లరనిశంబు మదర్పితసర్వకర్ములై* (సీ॥ పరికింపఁగొందఱు భాగవ
తోత్తముల్ ఘనతకెక్కి-నపురాతనములైన చారుప్రసన్నవక్త్రారుణలోచనములుగల్గి వరదానకలితములుగఁ । దనరుశుద్ధ
వ్యావతారవైభవములు మదినొప్పఁ దను యోగమహిమఁ జేసి । యనుభవింపుచుఁ దదీయాలాపముల సన్నుతింపుచుఁ దివుటఁ
దద్దివ్యవిలసనవవయవోదారసుందరనవవిలాస । మందహాసమనోహరమధురవచన । రచనచేనపహృతమనఃప్రాణులగుచు।
నెలమినుంకురుని వేయ సేచ్ఛ లేక* (మ॥ కణఁకన్వారలు వెంశి మోక్షనిరపేక్షస్వాంతులై యుండి తా। మణిమాద్యష్టవిభూ
తిసేవితము నిత్యానందసంధాయము౯ । గణనాతీతమునప్రమేయము సమగ్రశ్రీకమున్సర్వల । క్షణసంయుక్త వికుంఠలోక
పదవిం గైకొందురత్యున్నతి౯ ॥ ఇట్టులొంది* (క॥ తనరుదు రప్పుణ్యాత్ములు । జనయిత్రి మదీయకాలచక్రగ్రసనంబును బొం
దకనిత్యంబగు । ననుపమసుఖవృత్తినుందురదియెట్లనిన౯* (మ॥ సముదైన్నేహము చేసుతత్త్వమును విశ్వాసంబుచేతన్సఖి
త్వము చాల౯ హితవృత్తిచేతను సుహృత్త్వంబున్సమత్రోపదే । శము చేతన్నిజదేశికుండనఁగ నిచ్చల్పూజ్యుఁడౌనిష్టదై। వము
నై వారికిఁ గాలచక్రభయముల్వారింపుదుం గావున౯ ॥ అనియిట్లు దెలుపుచు మఱియునిట్లనియె* (చ॥ వినుమది గాక యాభవి
దిపింబలు మాలుఁ జరించునాత్మదా । ధనపశుపుత్రమిత్రవనితాతతి పైఁదగులంబు మానిన । న్ననఘుని విశ్వతోముఖుననన్యగ
తిన్భజింజియుంచె నేసివా। నినఘునమృత్యురూపభవనీరధి నేఁదరియింపఁ జేయుదు౯* (సీ॥ రూఢిఁ బ్రధానపూరుష నాయకుండను
భగవంతుఁడను జగత్ప్రభుఁడనైన। నాకంటెనన్యులఁ గైకొని తగిలిన యాత్మలు భవభయంబందుదురది । గావుననాయాజ్ఞఁగ
డువంగనోడుటఁ జేసి వాయువు వీఁచు శిఖి వెలుంగు । నినుఁడుఁ దపించుఁ దానింద్రుఁడు వర్షించు భయమంది మృత్యువు పరువు
వెట్టుఁ గాన విజ్ఞానవైరాగ్యకలితమైన। భక్తియోగంబునం జేసి పరమపదము। కొఱకునయోగివరులు మచ్చరణభజను । లగు
చుఁ జరియింపుదురు నిర్భయాత్ములగుచు* (క॥ గురుభక్తి౯ జిత్తము మత్పరమై విలసిల్లునంత పర్యంతము సత్పురుషులకిహలో
కంబున నజితరమోక్షోదయంబు సేసిరుచుందు౯* (క॥ అనియిట్లు సన్మునీంద్రుఁడు । జననికి హరిభక్తియోగసంగతి నెల్ల।
న్వినిపించుచు వెండియుని । ట్లనియె స్సమ్మోదచిత్తుఁడగుచుఁ గడంక౯* (వ॥ అవ్వాయివ్విధంబున భక్తియోగప్రకారంబు సె
ప్పితి నింకఁ దత్త్వలక్షణంబు వేఱు వేఱ నెఱింగింతు నేతత్త్వగుణంబుల నెఱింగి నరులు ప్రకృతిగుణంబులవలన విముక్తులగుదురు
హృదయగ్రంథివిచ్ఛేదకంబు నాత్మదర్శనరూపంబునగు జ్ఞానంబాత్మనిశ్రేయసకారణంబుగాన దాని నెఱింగింతునందు నా
త్మస్వరూపంబెట్టిదనిన - ననాదియుఁ, బురుషుండును సత్త్వాదిగుణశూన్యుండును, బ్రకృతిగుణవిలక్షణుండును, బ్రత్యక్స్వరూ
పుండును, స్వయంప్రకాశుండును, మఱియు నెవ్వనితోడనీ విశ్వంబు సమన్వితంబగు- నతండు గుణత్రయాత్మకంబు నవ్యక్తంబు
భగవత్సంబంధియగు ప్రకృతియందు యదృచ్ఛచే లీలావశంబున నంప్రవేశించిన నాప్రకృతిగుణత్రయమయంబై సరూపంబ
యినఁ బ్రజాసర్గంబుఁ జేయంగనుంగొని యప్పుడు మోహితుండై విజ్ఞానతిరోధానంబునం జేసి గుణత్రయాత్మకంబయిన ప్ర
కృత్యధ్యానంబున నన్యోన్యమేళనంబగుటయు నంతం బ్రకృతిగుణంబునఁ దనయందు నారోపించికొని క్రియమాణంబులగు కా
ర్యంబులవలనఁ గర్తృత్వంబు గలిగి సంసారబద్ధుండై పారతంత్ర్యంబు గలిగియుండుఁ గర్తృత్వశూన్యుండగు నీశ్వరుం
డు సాక్షియగుటం జేసి యాత్మకుం గార్య కారణకర్తృత్వంబులు ప్రకృత్యధీనంబులనియు సుఖదుఃఖభోక్తృత్వంబులు ప్ర
కృతివిలక్షణుండయిన పురుషునివనియు నెఱుంగుమని చెప్పిన విని దేవహూతి కపిలునకిట్లనియెఁ బురుషోత్తమా ప్రకృతిపు
రుషులు సదసదాత్మక ప్రపంచంబునకు గారణభూతులుగావున వానిలక్షణంబు సదసద్వివేకపూర్వకంబుగా నానతిమ్మని

నభగవంతుండిట్లనియె* (క॥ క్రమమునఁద్రిగుణమునవ్య । క్తమునిత్యముసదసదాత్మకముమఱియుఁబ్రధా । నమునసనఁగాఁ
బ్రకృతిపిశే। షములదియవిశిష్టమనిరిసద్విదులెలమిన్* (వ॥ అందుఁబ్రకృతి, చతుర్వింశతతత్త్వాత్మకంబై యుండు, నదియె
ట్లనినం, బంచమహాభూతంబులుం బంచతన్మాత్రలు జ్ఞానకర్మాత్మకంబులయిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులు, వా
క్పాణిపాదపాయూపస్థలు, ననుదశేంద్రియంబులు, మనోబుద్ధిచిత్తాహంకారంబులను నంతఃకరణచతుష్టయంబు, నను
చతుర్వింశతి తత్త్వాత్మకంబయిన, సగుణబ్రహ్మసంస్థానంబు సెప్పితి. నిటమీఁదఁ గాలంబను పంచవింశతితత్త్వంబు సెప్పెద
నదిగొంటఁబురుషశబ్దవాచ్యుండయిన యీశ్వరునిపౌరుషంబు కాలశబ్దంబునఁజెప్పంబడు నందుఁ రంగు నహంకారమోహి
తుండై, ప్రకృతినొందు జీవుండు భయంబుఁజెందుఁ, బ్రకృతిగుణసామ్యంబునం జేసివర్తించు నిర్విశేషుండగు భగవంతునిచే
ష్టావిశేషంబు దేనివలన నుత్పన్నంబగు నదియ కాలంబని చెప్పంబడు నదియు జీవరాశ్యంతర్గతంబగుటం జేసి, పురుషుండనియు
వానిబహిర్భాగవ్యాప్తిం జేసి కాలంబనియుఁ జెప్పంబడు, నాత్మమాయం జేసి తత్త్వాంతర్గతుండైన జీవునివలనక్షుభితం
బై, జగత్కారణంబగు ప్రకృతియందుఁ బరమపురుషుండు దనవీర్యంబు వెట్టిన, నాప్రకృతి హిరణ్మయంబైన మహత్తత్త్వంబువు
ట్టించె, నంత సకలప్రపంచబీజభూతుండు, లయవిక్షేపశూన్యుండునగు నీశ్వరుండు సూక్ష్మరూపంబున, నాత్మగతంబయిన, మ
హదాదిప్రపంచంబుల వెలిఁగింపుచు స్వతేజోపపత్తిం జేసి, యాత్మప్రస్వాపనంబు సేయునట్టి తమంబును గ్రసించెనని చెప్పి
వెండియు నిట్లనియె* (క॥ దివ్యమగు వాసుదేవా। దివ్యూహచతుష్టయంబు త్రిజగములందు । సేవ్యంబని చెప్పంబడు। భవ్యగు
ణోదాని నెఱుఁగఁ బలికెద నీకున్* (సీ॥ సత్త్వప్రధానమై స్వచ్ఛమై శాంతమై యూర్మిషట్కంబులకోసరించి। పరుదరపాద్గు
ణ్యపరిపూర్ణమై మైత్ర్యమై భక్తజనసేవ్యమై తనర్చి । వలనొప్పుచుండు నవ్వాసుదేవవ్యూహమంత మహత్తత్త్వమందు నొలి ।
రూఢిఁగ్రియాశక్తిరూపంబుగల్గునహంకారముత్పన్నమయ్యె నదియు । సరవివైకారికంబుఁ దైజసముఁ దామసంబునామూఁ
డు తెఱఁగులజరుగునంకుఁ । దనరు వైకారికామలు మానసేంద్రి । యములకును గగనముఖభూతములకరయ* (వ॥ ఉత్పత్తి
స్థానంబై యుండు మఱియు* (సీ॥ అట్టియహంకారమం దధిష్ఠించి సాహస్రఫణామండలాభిరాముఁ। డై తనరారు ననంతుఁడు
సంకర్షణుండనఁ దగుపురుషుండు ఘనుఁడు । మహితభూతేంద్రియమానసమయుఁడునై కర్తృత్వకరణత్వకార్యములును ।
బ్రకటశాంతత్వఘోరత్వమూఢత్వాదిలక్షణలక్షితోల్లాసియగుచు। నుండు నంమేటి రెండవవ్యూహమనఁగ। ఘనవికారంబుఁ
బొందు వైకారికంబు। వలన వినుము మన స్తత్త్వమెలమిఁ బుట్టె। మఱియు వైకారికంబును మాత వినుము* (వ॥ అదియెట్టులం టేని
సామాన్యచింతయు, విశేషచింతయు, ననందగు సంకల్పవికల్పంబులుం జేసి కామసంభవమునం బడు నెద్దియనిరుద్ధాఖ్యంబైన
వ్యూహంబు నదియ హృషీకంబులకు నధీశ్వరంబై సకలయోగీంద్రసేవ్యంబగుచు శరదిందీవరశ్యామంబై యుండు, వెండి
యు దైజసంబువలన బుద్ధితత్త్వంబు పుట్టె దానిలక్షణంబులు ద్రవ్యప్రకాశంబైన జ్ఞానంబు నింద్రియానుగ్రహంబు సంశయం
బు మిథ్యాజ్ఞానంబు, నిద్రయు, నిశ్చయంబు, స్మృతియు, ననందగియుండు- తైజసాహంకారంబువలన, జ్ఞానేంద్రియకర్మేంద్రి
యంబులుఁ గ్రియాజ్ఞానసాధనంబులు గలిగియుండుఁ బ్రాణంబునకుం గ్రియాశక్తియు బుద్ధికి జ్ఞానశక్తియునగుటం జేసి యిం
ద్రియంబులకుఁ దైజసత్వంబు గలిగియుండు, భగవచ్ఛక్తిప్రేరితంబైన తామసాహంకారంబువలన శబ్దతన్మాత్రంబు పుట్టె దా
నివలన నాకాశంబు, నాకాశంబువలన శ్రోత్రేంద్రియంబు పుట్టె శ్రోత్రంబు శబ్దగ్రాహియయ్యె శబ్దంబర్థంబునకు నాశ్రయం
బై శ్రోతకు జ్ఞానజనకంబయ్యె, మఱియు నభస్తన్మాత్రంబు సూక్ష్మాకాశంబయ్యె యాకాశంబు భూతంబులకు బాహ్యాభ్యంతర
రంబువలన నవకాశం బిచ్చుటయు, నాత్మప్రాణేంద్రియామలకు నాశ్రయంబగుటయు, ననులక్షణంబులు గలిగియుండుఁ, గాలగ
తిచే వికారంబు నొందు శబ్దతన్మాత్రలక్షణంబగు నభంబువలన స్పర్శంబు, స్పర్శంబువలన వాయువు, వాయువుచే స్పర్శగ్రాహి
యైత్వగింద్రియంబు పుట్టె, మృదుత్వంబు, కఠినత్వంబు, శైత్యంబు, నుష్ణత్వంబు, ననునవి స్పర్శంబునకు స్పర్శత్వంబని చెప్పం
బడు, మఱియు వాయువునకుఁ జాలనంబు, పరస్పరవిభాగకరణంబు, దన్మేళనంబు, ద్రవ్యశబ్దనేత్రత్వంబు, నంమ గంధవంతం
బగు ద్రవ్యంబును, ఘ్రాణేంద్రియంబు నొందించుట ద్రవ్యనేత్రత్వంబు, దూరస్థంబగు శబ్దంబును, శ్రోత్రేంద్రియగ్రాహ్య
మగునట్లొనరించుట, శబ్దనేతృత్వంబు, సర్వేంద్రియాత్మకత్వంబునను నవి లక్షణంబులై యుండు, దైవప్రేరితంబై స్పర్శత
న్మాత్రగుణకంబగు వాయువువలన రూపంబు, దానివలన దేజంబు పుట్టె రూపంబు నేత్రేంద్రియగ్రాహకంబయ్యె, ద్రవ్యాకా
రసమత్వంబు ద్రవ్యంబునకు మపసర్జనంబగుటయు, ద్రవ్యపరిణామప్రతీతియు- నివిరూపవృత్తులనంబడుఁ దైజసంబునకు సాధా
రణంబులగు ధర్మంబులు, ద్యోతనంబనఁ బ్రకాశంబు, పచనంబనఁ దండులాదులపాకంబు, పిపాసానిమిత్తంబైన పానంబు, క్షు
న్నిమిత్తకంబైన యోదనంబు హిమమర్దనంబగు శోషణంబునను వృత్తులై యుండు రూపతన్మాత్రంబువలన దైవచోదితంబై వికా
రంబు నొందు తేజస్సువలన రసతన్మాత్రంబు పుట్టె, రసతన్మాత్రంబువలన జలంబు పుట్టె జిహ్వాయనురసనేంద్రియంబు రసగ్రా

హకంబయ్యె, నారసంబుకషాయతిక్తకట్వమ్లమధురాదిభేదంబులననేకవిధంబయ్యె, వెండియుసాంసర్గికద్రవ్యవికారంబునం
జేసి,రసంబేకంబయ్యునార్ద్రీంబగుటయు మద్దగట్టుటయుఁ,దృప్తిదాతృత్వంబు, జీవనంబు,తల్లేశనివర్తనంబు, మృదూక
రణంబు,తాపనివారణంబు, కూపగతంబయినజలంబుదివియఁజియనుద్గమించుటయు, ననునివిజలవృత్తులనంబడు,రసతన్మా
త్రంబువలనదైవచోదితంబై వికారంబునుంబొంది జలంబువలన గంధతన్మాత్రంబువుట్టె, దానివలనం బృథ్వియుఁగలిగె,
ఘ్రాణంబుగంధగ్రాహకంబయ్యె నందు నేకంబగుగంధంబువ్యంజనాదిగతంబయి, హింగ్వాదినిమిత్తంబయిన మిశ్రగంధం
బనుకరంభంబు,గృంజనాదిగతంబయినపూతిగంధంబు,ఘనసారాదినిమిత్తంబయినసుగంధంబు,శతపత్రాదిగతంబగుశాంత
గంధంబు, లశునాదిగతంబైన యుగ్రగంధంబు, పర్యుషితచిత్రాన్నాదిగతంబయిన యామ్లగంధంబు, ద్రవ్యావయవవైష
మ్యంబునంజేసియనేకవిధంబయియుండు,నదియునుంగాక, ప్రతిమాదిరూపంబులంజేసి సాకారతాపాదనంబగుభావంబు,జ
లాదివిలక్షణత్రయాంతర నిరపేక్షంబయినస్థితియు, జలాద్యాధారతయును, ధారణంబు, నాకాశాద్యవచ్ఛేదకత్వంబు, స
కలప్రాణిపుంస్త్ర్యభివ్యక్తీకరణంబుననునివిపృథ్వీవృత్తులనంబడునని చెప్పి వెండియునిట్లనియె నభోసాధారణగుణ శబ్దవిశే
షగ్రాహకంబుశ్రోత్రంబు, వాయ్వసాధారణ గుణవిశేషగ్రాహకంబు స్పర్శనంబు, తేజోసాధారణగుణ విశేషగ్రాహ
కంబుచక్షురింద్రియంబు, నంభోసాధారణగుణ విశేషగ్రాహకంబు రసనేంద్రియంబు, భూమ్యసాధారణగుణవిశేషగ్రా
హకంబు ఘ్రాణేంద్రియంబు నాకాశాదిగుణంబులగుచు, శబ్దాదికార్యంబులగు వాయ్వాదులందుఁ గారణాన్వయంబున
నన్నిటికింబృథ్వి సంబంధంబుగలుగుటంజేసి, భూమియందు శబ్దస్పర్శరూపరసగంధంబులుగలుగుట మహదాది పృథివ్యం
తంబులగునీయేడుతత్త్వంబులు, పరస్పరామిళితంబులై,భోగాయతనంబగుపురుషునింగల్పింప సమర్థంబులై యున్నంజూచి,
కాలాదృష్టసత్త్వాదులంగూడిజగత్కారణుండుఁ, త్రైగుణ్యవిశిష్టుండు నశేషనియామకుండు, నిరంజనాకారుండు నగుస
ర్వేశ్వరుండందుఁబ్రవేశింపనంతనన్యోన్యక్షుభితంబులైమిళితంబులైన మహదాదులవలననధిష్ఠాతృచేతన రహితంబగునొక
యండంబువుట్టెనందు* (సీ॥ గురుశక్తియావిరాట్పురుషుండుప్రభవించెనట్టివిశేషాండమర్థిఁబొదివె । నంబ్వాదులావరణం
బునొక్కొక్కటిదశగుణితంబయితవిలియావ । రణములయందునుగ్రమమునలోకంబులకు మేలుకట్లుపోలికఁదనర్పఁ।
బంకజోదరు నిరూపమువిలసించునులోలతజలములోఁదేలుచున్న । హేమమయమైనయండంబులోమహాను । భావుఁడభ
వుండుహరిదేవదేవుఁడఖిల । చేతనారాయణుఁడుప్రవేశించియపుడు।పద్మపదభేదనంబుగావించియందు* (సీ॥ కరమొప్పఁ
గావిరాట్పురుషుండు వెలుఁగొందు నావిరాట్పురుషుని యాననంబు । వలనను వాణియు వాణితోవహ్నియు నాసంబువలనఁ
బ్రాణములఁగూడి । ఘ్రాణేంద్రియంబయ్యెఘ్రాణంబువలనను వాయువులును బ్రాణవాయువులును । నందునక్షులుచక్షువం
దుసూర్యుండునునందభిధ్యానంబులర్థిఁజేయఁ । గర్ణములుజాతమయ్యెదత్కర్ణ సమితి । వలన శ్రోత్రేంద్రియంబుదిక్కు లు
నుగలిగెఁ।ద్వక్కుచేశ్మశ్రురోమవితానకములు। నోషధీవ్రాతమునుభవమందెమఱియు* (గీ॥ దానివలను మేఢ్రంబుఁగానఁ
బడియెఁబరగరేతంబువలన నాపంబువుట్టె । గుదమువలననపానంబునుదయమయ్యె । దానివలననుమృత్యువుదగఁజనించె*
(క॥ కరములవలనను బలమును।నిరవుగనారెంటివలననింద్రుఁడు పాదాం।బురుహంబువలనగతియును । నరుదుగనారెంటివల
నహరియుమగలిగెఁ* (క॥ ఘననాడీపుంజమువల । ననురక్తముదానివలననదులునుజఠరం । బున నాఁకలియును దప్పియు।నన
యమునారెంటివలననబ్ధులువుట్టెఁ* (క॥ వినుహృదయమువలనను మన । మును మనమునదుహినకరుఁడుబుద్ధియుఁజిత్తం।
బునబ్రహ్మాయుక్షేత్రజ్ఞుం।డునుగలిగిరియవ్విరాజుఁడున్పురుషతఁ* (వ॥ మఱియు విరాట్పురుషునం దుదయించిన వ్యష్టి
రూపంబులగు నాకాశాదిభూతంబులు శబ్దంబు మొదలగుభూతతన్మాత్రంబులు, వాగాదీంద్రియజాతంబు, తదధిదేవతలును,
తమంతన సమష్టిరూపుండగు క్షేత్రజ్ఞుంబ్రవృత్తి ప్రవర్తకుంజేయ నసమర్థంబులయ్యె నెట్లనిన దేవాధిష్ఠితంబులగు నింద్రి
యంబులుదాము వేర్వేఱ నయ్యీశ్వరుండుప్రవృత్త్యున్ముఖుంజేయనోపక క్రమంబునంద త్తదధిష్ఠానాదులనొందె నందునగ్ని
వాగింద్రియంబుతోడముఖంబునొంది ప్రవర్తింపన విరాట్కార్యంబగు వ్యష్టిశరీరజాతంబనుత్పన్నంబయ్యె, నంత నాసయు
ఘ్రాణేంద్రియంబుతోడ వాయువుంగూడిననట్టిదయయ్యె, నాదిత్యుండు చక్షురింద్రియంబుతోడ నేత్రంబులనొందిన వృథా
భూతంబయ్యెదిగ్దేవతాకంబగుకర్ణంబులుశ్రోత్రేంద్రియంబుతోడంగూడిన విరాట్కార్యప్రేరణామోఘ్యంబయ్యె నోషధు
లురోమంబులందుత్వగింద్రియంబుజెందనిఫలంబయ్యెనద్దైవంబగు మేఢ్రంబు రేతంబునొందినఁ దత్కార్యకరణాదక్షంబయ్యెఁ
బపంపడిగుదంబుమృత్యువుతోడనపానేంద్రియంబుఁజేరిననతిస్థైర్యంబునొందెవిష్ణుదేవతాకంబులగు చరణంబులు గతితోఁ
గూడిననీశ్వరంబయ్యెఁబాణీంద్రియంబు లింద్రదైవతంబులగుచు బలంబునొందిన శక్తిహీనంబులయ్యె మఱియు నాడులున

నదీకంబులై లోహితంబు నొందినం దగ్గకంబులయ్యె నుదరంబు సింధువులతోడం జేరి క్షుత్పిపాసలం బొందినవ్యర్థంబయ్యె హృదయంబు మనంబుతోడం జంద్రుని నొందిన నూరకయుండె బుద్ధి బ్రహ్మాధిదైవతంబయి హృదయంబు నొందిన నిష్ఫలంబయ్యెఁ జిత్తంబభిమానంబుతో రుద్రునిం జెందిన విరాట్కార్యజాతంబను ద్భూతంబయ్యె నంతం జైత్యుండగు క్షేత్రజ్ఞుఁడు హృదయాధిష్ఠానంబు నొంది చిత్తంబుతోడం బ్రవేశించిన విరాట్పురుషుండు సలిలకార్యభూతబ్రహ్మాండంబు నొంది ప్రవృత్త్యున్ముఖుండయ్యెను సుప్తుండగు పురుషునిం బ్రాణాదులు రమబలంబుచే భగవదప్రేరితంబులగుచు నుత్థాపనాసమర్థంబులగు చందంబు ననగ్న్యాదులు స్వాధిష్ఠానభూతంబులగు నింద్రియంబులతోడ దేవాదిశరీరంబుల నొందియు నశక్తంబులయ్యె నంత మఱియును న్విరాట్పురుషుని ననవరత భక్తిం జేసి విరక్తులై యాత్మలయందు వివేకంబుగల మహాత్ములు చింతింపుదురనియుఁ బ్రకృతిపురుషవివేకంబున మోక్షంబుఁ బ్రకృతిసంబంధంబున సంసారంబుఁ గలుగునని చెప్పి మఱియు నిట్లనియె* (సీ॥ జననుత సత్త్వరజస్తమోగుణమయమైన ప్రాకృత కార్యమగు శరీర । గతుఁడయ్యుఁ బురుషుండు గడగి ప్రాకృతములు నగు సుఖదుఃఖ మోహముల వలనఁ। గరమనురక్తుండు గాఁడు వికారవిహీనుఁడు ద్రిగుణరహితుఁడునగుచు । బలసి నిర్మలజలప్రతిబింబితుండై నదినకరుభంగివర్తించునట్టి। యాత్మ ప్రకృతిగుణంబులయందుఁ దగులు। వడి యహంకారమూఢుఁడై తొడరి యేనుఁ । గడఁగి నిఖిలంబునకు నెల్లఁ గర్తననిప్ర। సంగవశత ను బ్రకృతిదోషముల బొంది* (క॥ పరతిర్యఙ్మనుజస్థా। వర రూపములగుచుఁ గర్మవాసనచేత। న్బరువైన మిశ్రయోనులఁ। దిరముగ జనియించి సంసృతిం గైకొని తా* (క॥ పూని చరింపుచు విషయ। ధ్యానంబునఁ జేసి స్వాప్నికార్థాగమ సం। ధానమురీతి నసత్పథ। మానసుఁడగుచుఁ భ్రమించు మతిలోలుండై ॥ అట్లుగావున* (గీ॥ పూని మోక్షార్థియగువాఁడు దీనిఁ దీవ్ర। భక్తియోగంబు చేత విరక్తిఁ బొంది । మనము వశముగఁ జేసియ మనియమాది । యోగమార్గక్రియాభ్యాసయుక్తిఁ జేసి* (సీ॥ శ్రద్ధాగరిష్ఠుఁడై సత్యమైనట్టి మద్భావంబు మత్పాదసేవనంబు । వర్ణితమత్కథావర్ణనంబును సర్వభూతసమత్వమజాతవైర। మును బ్రహ్మచర్యంబు ఘనమౌనమాదిగాఁ గల నిజధర్మసంగతుల జేసి । సంతుష్టుఁడును మితాశనుఁడు నేకాంతియు మననశీలుఁడు వీతమత్సరుండు। నగుచు మిత్రత్వమునఁ గృపఁ దగిలి యాత్మ । కలితవిజ్ఞానిమై బంధకరములయిన। ఘనశరీరపరిగ్రహాత్మకంబయం స। నాగ్రహము చేసి వర్తింపనగును మఱియు* (వ॥ జీవేశ్వరతత్త్వజ్ఞానంబునం జేసి నివృత్తంబయిన బుద్ధితదవస్థానంబును గలిగి దూరీభూతేతరదర్శనుండై జీవాత్మజ్ఞానంబునం జేసి చక్షురింద్రియంబున సూర్యుని దర్శించు చందంబున నాత్మనాయకుండయిన శ్రీమన్నారాయణుని దర్శించి నిరుపాధికంబై మిథ్యారూపంబగు నహంకారంబున సద్రూపంబుచేఁ బ్రకాశమానంబగుచుఁ బ్రధానకారణంబునకు నధిష్ఠానంబుఁ గార్యంబునకుఁ జక్షువుం బోలి ప్రకాశకంబు సమస్తకార్యకారణానుస్యూతంబుఁ బరిపూర్ణంబు సర్వవ్యాపకంబునగు బ్రహ్మంబుఁ బొందు నని చెప్పి వెండియు నిట్లనియె* (సీ॥ వినుమాత్మవేత్తకు విష్ణుస్వరూపంబు నెఱుఁగంగఁ బడునది యెట్లటన్న । గగనస్థుఁడగు దినకరుకిరణచ్ఛాయ జలములగృహకుడ్యజాలకములఁ। వలనఁ దోఁచినఁ బ్రతిఫలితంబుచేతఁ దానూహింపఁబడినయయ్యినునివగిది । నర్థిమనోబుద్ధ్యహంకారత్రితయనాడీప్రకాశము చేత లీల నెఱుఁగ । వచ్చు నాత్మస్వరూపంబు వలఁతిగాఁగ। జిత్తమునఁ దోఁచు నంచిత శ్రీఁ దనర్చి। యమ్మహామూర్తి సర్వభూతాంతరాత్ముఁ । డటనాత్మజ్ఞులకుఁ గాననగును మఱియు* (వ॥ జీవుండు సుషుప్త్యాద్యవస్థలయందుఁ బరమాత్మానుషక్తుండై నభూతాదితత్త్వంబులు లీనంబులై ప్రకృతియందు వాసనామాత్రంబు గలిగియ కార్యకరణంబులు గాకున్న సుషుప్తిసమయంబునందా నునిస్తంద్రుండగుచు నితరంబు చేతఁ గప్పంబడనివాఁడై పరమాత్మానుభవంబు సేయుచుండు నని చెప్పిన విని దేవహూతి యిట్లనియె* (సీ॥ విమలాత్మ యీపృథివికిని గంధమునకును సలిలంబునకును రసంబునకును। నన్యోన్యమగు ననినాభావసంబంధమైన సంగతి బ్రకృత్యాత్మలకును। సతతంబు నన్యోన్యసంబంధమైయుండు ప్రకృతి దానయ్యాత్మఁ బాయు టెట్లు। దలపోయ నొకమాటు తత్త్వబోధము చేత భవభయంబుల నెల్ల బాయుటెట్లు । చద్ది క్రమ్మఱఁ బుట్టని జాడ యేది। యిన్నియు దెలియనానతి యిచ్చి నన్నుఁ। గరుణ రక్షింపవే దేవగణసుసేవ్య। భక్తలోకానుగంతవ్య పరమపురుష* (వ॥ అనిన భగవంతుండిట్లనియె ననివృత్తంబైన స్వధర్మంబున నిర్మలాంతఃకరణంబునను నిశ్చితంబైన మద్భక్తియోగంబున సత్కథాశ్రవణసంపాదితంబయిన వైరాగ్యంబున దృష్టప్రకృతిపురుష యాథాత్మ్యంబగు జ్ఞానంబున బలిష్ఠంబయిన కామాభివ్యంగంబగు నిరక్తివలనఁ దపోయుక్తంబయిన యోగంబున సుతీవ్రంబయిన చిత్తైకాగ్రతం జేసి పురుషుని దగు ప్రకృతి దహ్యమానంబై తిరోధానంబును బొందునది యెట్లని

నయరణిగతంబయిన వహ్నిచే నరణిదహింపఁబడుచందంబున జ్ఞానంబునం దత్త్వదర్శనంబునం జేసి నిరంతరంబు దృష్టదోషయగు ప్రకృతి జీవుని చేత భుక్తభోగమై విడువంబడునని చెప్పి* (క॥ ఓను ప్రకృతి నైజమహిమం। బునఁ దనలోనున్నయట్టి పురుషునకుమహా। శుభనిస్ఫురణం। బనయముఁ గావింపఁజాలదది యెట్లనినఁ* (చ॥ పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు ననర్థక

ములఁ బ్రబోధము దరయఁగ మిథ్యలై పురుషునకు ఘటింపనికై వడిన్ బరేశ్వరునకు నాత్మనాథునకు సర్వశరీరికిఁ గన్న సాక్షి
కిన్ బరువడిఁ బొందవెన్నటికిఁ బ్రాకృతదోషములంగనామణీ॥ అని వెండియు నిట్లనియె* (సీ॥ అధ్యాత్మతత్పరుండగువాఁడు పె
క్కుజన్మంబులఁ బెక్కుకాలంబులందు। బ్రహ్మపదప్రాప్తిపర్యంతమును బుట్టు సర్వార్థవైరాగ్యశాలి యగుచుఁ। బూని నాభ
క్తులచే నుపదేశింపఁబడిన విజ్ఞానసంపత్తిచేతఁ బరఁగఁ బ్రబుద్ధుఁడై బహువారములు భూరిమత్ప్రసాదప్రాప్తి నాఁ దనర్చు। నిజ
పరిజ్ఞానవిచ్ఛిన్ననిఖిలసంశయుండు నిర్ముక్తలింగదేహుండు నగుచు। ననఘయోగీంద్రహృద్గేయమగు మదీయ। దివ్యధామం
బున్ బొందు సందీప్తుఁడగుచు* (వ॥ మఱియు నణిమాద్యష్టైశ్వర్యంబులు మోక్షంబునకంతరాయంబులు గావున వానియందు వి
గతసంగుండు మదీయచరణసరోజస్థితలబ్ధాంతరంగుండు నగువాఁడు మృత్యుదేవతనపహసించి మోక్షంబు నొందు నని చెప్పి
వెండియు యోగలక్షణప్రకారంబు వినిపింతు వినుమని భగవంతుండైన కపిలుండు నిజమాతృజున కిట్లనియె* (క॥ ధీనిధులయ్యును
యోగవిధానంబునఁ జేసిన నమితగవిమలంబై। మానితమగు మత్పదముం। బూనుదురా యోగధర్మముల నెఱిఁగింతున్*
వ॥ ఆదిమెట్లనిన శక్తికొలఁది స్వధర్మాచరణంబు శాస్త్రవిచారంబుల నిషిద్ధధర్మకర్మంబులు మానుటయు దైవికంబై వచ్చిన
యర్థంబువలన సంతోషించుటయు మహాభాగవతశ్రీపాదారవిందార్చనంబు గ్రామ్యధర్మనివృత్తియు మోక్షధర్మంబులయందు
రతియు మితంబై శుద్ధంబైన యాహారసేవయు విజనంబు నిర్బాధకంబయిన స్థానంబున నుండుటయు హింసారాహిత్యంబు స
త్యంబు నస్తేయంబుఁ దనకెంత యర్థంబు పయోగించు నంత యర్థంబ స్వీకరించుటయు బ్రహ్మచర్యంబుఁ దపశ్శౌచంబులు స్వా
ధ్యాయపఠనంబు పరమపురుషుండైన సర్వేశ్వరుని యర్చనంబు మౌనంబు నాసనజయంబును జేసి స్థైర్యంబుఁ బ్రాణవా
యుస్వవశీకరణంబు నింద్రియనిగ్రహరూపంబైన ప్రత్యాహారంబు మనంబుచే నింద్రియంబుల విషయంబులవలన మరలించి
హృదయమందు నిలుపుటయు దేహగతంబయిన మూలాధారాదిస్థానంబులలో నొక్క స్థానంబునందు హృదయగతంబయిన
మనస్సుతోడం గూడఁ బ్రాణధారణంబు వైకుంఠుండైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్యలీలాచరిత్రధ్యానంబు మానసైకా
గ్రకరణంబుఁ బరమాత్మ యగు పద్మనాభుని సమానాకారతయు నిదియును గాక తక్కిన వ్రతదానాదులం జేసి మనోదుష్టంబ
యిన యసన్మార్గంబును బరిహరించి జితప్రాణుండై మెల్లన యోజించి శుచియైన దేశంబునం బ్రతిష్ఠించి విజితాసనుండై యభ్య
స్తకుశాజినచేలోత్తరాసనంబునందు న యాసనంబు చేసి ఋజుకాయుండై ప్రాణమార్గంబును గుంభకరేచకపూరకంబు
లం గ్రమశోధనంబు చేసి కుంభకపూరకంబులచేతం బ్రతికూలంబు గావించి చంచలంబైన చిత్తంబు సుస్థిరంబు గావించి
తీవ్రంబయిన యమంబునం బ్రతప్తంబై విగతసమస్తదోషంబగు చామీకరంబుకరణి విరజంబు చేసి జితమారుతుండగు యో
గికిం గ్రమ్మఱం బ్రాణాయామంబులను పావకునిచేత వాతపైత్యశ్లేష్మంబులను దోషంబుల భస్మీకరణంబులు చేసి ధారణం
బుచేతఁ గిల్బిషంబులను బ్రత్యాహారంబుచేత సంసర్గంబులను రాగంబుల దహనంబుఁ జేసి సత్త్వాదిగుణంబులను నివారించి
స్వనాసాగ్రావలోకనంబు చేయుచు* (సీ॥ దరదరవిందసుందరపత్రరుచిరాక్షు సలలితశ్రీవత్సకలితవక్షు। నీలనీరదనీలనీ
లోత్పలశ్యామ నలికులాకులమాలికాభిరాముఁ। గౌస్తుభకలితముక్తాహారయుతకంఠు యోగిమానసపంకజోపకంఠు। సత
తప్రసన్నసస్మితవదనాంభోజు దినకరకోటిసందీప్తతేజు। సలలితానర్ఘ్య రత్నకుండలకిరీట। హారకంకణకటకకేయూ
రముద్రి। కాతులాకోటిభూషభక్తప్రపోషుఁ। గింకిణీయుత మేఖలాకీర్ణజఘను॥ మఱియు* (సీ॥ కంజాతకింజల్క
పుంజరంజితపీతకౌశేయవాసు జగన్నివాసు। శత్రుభీకరచక్రశంఖగదాపద్మవిహిత చతుర్బాహు విగతమోహు। నుతభ
క్తలోకమనోనేత్రవర్ధిష్ణులాలిత సద్గుణాలంకరిష్ణు। వరకుమారకవయఃపరిపాకసుశ్లోకసుందరాకారు యశోవిహారు।
సకలలోకనమస్కృతచరణకమలు। భక్తలోక పరిగ్రహ ప్రకటశీలు। దర్శనీయ మనోరథదాయిఁ గీర్త। నీయతీర్థయశో
మహనీయమూర్తి। వెండియు* (క॥ అనుపమగుణసంపూర్ణుని। ననఘుని సుస్థితుని గతుని నాశీనుశయాని। నుని భక్తహృద్గుహా
శయు। ముని సర్వేశ్వరు ననంతు నుతసదుదంతున్* (మ॥ విమలంబై పరిశుద్ధమై తగు మనోవిజ్ఞానతత్త్వప్రబోధమతిన్ గల్పితదీయ
మూర్తివిభవధ్యానంబు గావించి చి। త్తము సర్వాంగవిమగ్నక్రియలకున్ దార్కొల్పి ప్రత్యంగము। న్మహాధ్యానము సే
యఁగావలయుఁ బో శుద్ధాంతరంగంబునన్॥ అదియెట్టిదనిన* (సీ॥ హలకులిశాంకుశజలజధ్వజచ్ఛత్రలాలితలక్షణలక్షితము
లు। సలలితనఖచంద్రచంద్రికానిర్ధూతభక్తమానసతమఃపటలములును। సురుచిరాంగుష్ఠనిష్ఠ్యూత గంగాతీర్థమండితహరజ
టామండలములు। నుచితధ్యానపారాయణజనభూరికలుషపర్వతదీప్తకులిశములును। దాసలోక మనోరథ దాయకములు।
చారుయోగిమనఃపద్మషట్పదంబులనఁగ దనరిన హరిచరణాబ్జములను। నిరుపమధ్యానమున మది నిలుపవలయు* (చ॥ కమలజు
మాతయై సురనికాయసమంచితసేవ్యమానయై। కమలదళాభనేత్రములు గల్గి హృదీశ్వరభక్తి నొప్పున। కర మల నిజాంకపీఠ

మనంగైకొని మొత్తుపరేశు జానుయుగ్మము హృదయారవిందమున మక్కువంజేర్చి భజింపఁగాఁదగున్* (ఉ॥ చారువిహంగ
వల్లభభుజంబులమీఁద విరాజమానను శ్రీకరదినుల్లసిల్లి యతసీకుసుమద్యుతిఁ జాలనొప్పు పం । కేరుహనాభు నూరువుల కిల్బిష
భక్తి భజించి మానసాంభోరుహమందు నిల్పఁదగుఁబో మునికోటికి నంగనామణీ* (క॥ పరిలంబితమృదుపీతాం । బరకాంచీగు
ణసనాథభరితంబగు నప్పురుషోత్తముని నితంబముఁ దరుణీ భజియింపవలయుఁ దద్దయుఁ బ్రీతిన్* (క॥ వినుభువనాధారత్వం ।
బునఁదగి విధిజననహేతుభూతంబగు నవ్వనజాతము చేఁగడు మించు దిన హరినాభీసరస్సుఁ జింతింపఁదగున్* (గీ॥ దివ్యహారకతర
త్నసందీప్తలలిత కుచములను మౌక్తికావళిగు చులఁదనరి । యిందిరాదేవిసదనమై యొసక మెసఁగు వక్షమాత్మను దలపోయవ
లయుఁ జుమ్ము* (మ॥ నిరతంబున్భజియించు సజ్జనమనో నేత్రాభిరామైకసు । స్థిరదివ్యప్రభగల్గు కౌస్తుభరుచిశ్లిష్టంబునై యొ
ప్పునా వరయోగీశ్వరవంద్యమానుఁడగు సర్వస్వామి లక్ష్మీశు కం । ధరమాత్మ న్దదియించి తద్గుణగణధ్యానంబు సేయందగున్*
(క॥ ఘనమందరగిరిపరివ । ర్తనవికచోజ్జ్వలితకనకరత్నాంగదము । ల్దనరారలోకపాలకు । లనఁగలిగిన బాహుశాఖలును దలఁ
పఁదగున్* (వ॥ మఱియు ననతజనాసహ్యంబులైన సహస్రారంబులు గలుగు సుదర్శనంబును సరసిజోదరకరసరోరుహంబం
దురాజహంసరుచిరంబైన పాంచజన్యంబు నరాతిభటశోణితకర్దమలిప్తాంగంబై భగవత్ప్రీతికారిణియగు కౌమోదకియును నగ
పిన్దనందవాదిబృందారకబృందారమందానందకరంబగు నందకంబును దుర్హృదహృదయరోపంబగు శార్ఙ్గంబును బంధురసు
గంధగంధానుబంధమందగంధవహాహూయమాన పుష్పంధయఝంకారనినదపరాజిత వైజయంతీవనమాలికయును జీవత
త్త్వంబైన కౌస్తుభమణియును బ్రత్యేకంబ ధ్యానంబు సేయందగు వెండియు భక్తసంగ్రహణార్థంబంగీకరించు దివ్యమంగళవి
గ్రహంబున కనురూపంబైన యాననంబును మకరకుండలమణినిచయమండితముకురోపమాననిర్మల గండమండలంబును స
తతశ్రీనివాసంబులైన లోచనపంకజంబులను లాలిత్యభ్రూలతాజుష్టంబును మధుకరసమాన రుచిచికురపరాజితంబునైన ముఖ
కమలంబు మరకమణీయహీరమణిఖచితంబై మధ్యందినవిద్యోతమాన ఖద్యోతమండలచ్ఛవిచ్ఛటాప్రకటంబగు మకుటంబును
ధ్యానంబు గావింపవలయు మఱియు శరణాగతులకభయప్రదంబులగుచు నెగడు పాణిపంకేరుహంబుల మనంబునఁ దలఁపవల
యు* (క॥ గురుఘోరరూపకంబై । పరగెడు తాపత్రయంబు వశమింపఁగ శ్రీ । హరిచేతనిసృష్టములగు । కరుణాలోకములఁ ద
లఁపగాఁదగు బుద్ధిన్* (క॥ ఘనరుచిగల మందస్మిత । మునకనుగుణమగు ప్రసాదమును జిత్తమునన్ । మును కొని ధ్యానము సేయం ।
జను యోగిజనాళికెపుడు సౌజన్యనిధీ* (గీ॥ పూనినతశిరులైనట్టి భూజనముల । శోకబాష్పాంబుజలధిసంశోషకంబు । నత్యుదార
తమము హరిహాస మెపుడుఁ దలఁపఁగావలయు నాత్మలోఁ దవిలి వినుము* (సీ॥ మునులకు మకరకేతనునకు మోహనంబైన స్వకీ
యమాయావిలాస । మునరచితంబైన భ్రూమండలంబును మునిమనఃకుహరసంవర్ధమానుఁ । డగునీశ్వరుని మందహాసంబునవ
పల్లవాధరకాంతిచే నరుణమైన । మొల్లమొగ్గల కాంతినుల్లసంబాడెడు దంతపఙ్క్తియు మదిఁ దలఁపవలయు । వెలయు నీరీతి నన్ని
యు వేఱు వేఱ నంచితధ్యాననిర్మలస్థానములుగ । మనములోఁగనుమని చెప్పి మఱియుఁ బలికె । దేవహూతికిఁ గపిలుండు దేటప
డఁగ* (సీ॥ ఈ ప్రకారమున పరేశ్వరునందను ప్రతిలబ్ధభావసంపన్నుఁడగుచుఁ । జిరతరసద్భక్తిచేఁ బ్రవృద్ధంబయిన యతి
మోదమునఁ బులకితశరీరుఁడగుచును హెూత్కంఠనానందబాష్పముల్ జడిగొనఁ బరితోషజలధిఁ గ్రుంకి । భగవత్స్వరూపమై
భవగుణగ్రాహకమగుచు మత్స్యబంధమనుకరించి । సుమహితధ్యానమునఁ బరంజ్యోతియందు । మనముఁ జాలని యోజించి మ
హిమఁదనరు మోక్షపదమాత్మలోనన పేక్ష సేయ । ననఘవర్తనుఁడైన మహాత్ముఁడెపుడు* (వ॥ అదిగావున ముక్తి నపేక్షిం
చు మహాత్ముండగు వాని చిత్తంబు విముక్తంబయిన భగవద్వ్యతిరిక్తాశ్రయంబు గలిగి విషయాంతరశూన్యంబై విరక్తిం బొందు
టం జేసి పురుషుండు శరీరభావంబుల ననన్యభావంబగు నిర్వాణపదంబు సూక్ష్మంబగు తేజంబు తనకంటె నధికంబగు తేజంబుతో
డిసమానాకారంబునగు చందంబు నిశ్చయించు వెండియు* (సీ॥ పురుషుండు చరమమై భువి యన్యవిషయనివృత్తమై తగనివర్తిం
చు చిత్తవృత్త్యాదులు గల్గి వెలయం । నాత్మీయ సుఖమహిమను నిష్ఠుఁడై లభించు । సుఖదుఃఖములు మనస్సునఁ దలంపక యహం
కారధర్మంబులుగాఁ దలంచి । యనయంబు సాక్షాత్కృతాత్మతత్త్వము గల్గునతఁడు జీవన్ముక్తుఁడం ద్రుధీరు । లతఁడు నేచందము
ననుండుననిన వినుము తనశరీరంబు నిలుచుటయును జరించు । టయును గూర్చుండుటయునుఁ గేమియు నెఱుంగ । కర్థివర్తించు సను
తల్లి యతఁడు మఱియు* (వ॥ మదిరాపానంబునం జేసి మత్తుండగు వాఁడు దనకుఁ బరిధానంబగు నంబరంబు ననివర్తించు చం
దంబునఁ దనశరీరంబు దైవాధీనంబున నశ్వరంబని తలంచి యాత్మతత్త్వనిష్ఠుండై యుపేక్షించునదియునుం గాక సమాధియోగం
బునం జేసి సాక్షాత్కృతాత్మతత్త్వంబు గలవాఁడై స్వాప్నికశరీరంబు చందంబున యావత్కర్మఫలానుభవపర్యంతంబు పుత్ర
దారాసమేతంబగు ప్రపంచంబు ననుభవించి యటమీఁదఁ బుత్రదారాదిసంబంధంబువలనం బాసి వర్తించు* (సీ॥ సుతదారమి
త్రానుజులకంటె మర్త్యుండు భిన్నుఁడై వర్తించుచున్నరీతి । విస్ఫులింగోల్ముకవిపులధూమములచే హవ్యవాహనుఁడు వేఱ

యిరీతి। వలనొప్పు దేహంబువలననీజీవాత్మ పరికింప్రభిన్నరూపమునను౦డుఁ। దవిలిభూతేంద్రియాంతఃకరణంబులభాసిల్లుచున్నయాప్రకృతిరూప । బ్రహ్మమునకాత్మ దాబృహద్భావమగుచు । దద్దయగుబ్రహ్మసంజ్ఞ చేదనరుచుండు । నఖిలభూరిప్రపంచంబులందుఁదన్నుఁ।దవిలితనయందునఖిలభూతములఁగనుచు॥ వెండియు* (సీ॥ వరుసననన్యభావంబులఁజేసిభూతావళియందుఁదదాత్మకత్వ।మునజూచునాత్మీయఘనతరోపాదానములయందుఁదవిలియిమ్ములవెలుంగు। నిట్టిదివ్యజ్యోతియేకమయ్యును బహుభావంబులనుఁదోఁచుప్రకృతిగతుఁడు । నగుచున్నయాత్మయుఁబొగడొందు దేవతిర్యఙ్మనుష్యస్థావరాదివివిధ।యోనులను భిన్నభావంబునొందుటయును। జాలఁగల్గునిజగుణవైషమ్యమునను । భిన్నుడై వెల్గుగావునఁ బేర్చియదియు। దేహసంబంధియగుచువర్తింపుచుండు* (క॥ భావింపసదసదాత్మక । మై వెలయుచుదుర్విభావ్యమగుచుస్వకీయం। బైవర్తింపుచుఁబ్రకృతిని। భావమునఁదిరస్కరించుభవ్యస్ఫూర్తిన్* (వ॥ ఈయాత్మ నిజస్వరూపంబునం జేసివర్తించుననికపిలుండెఱిగించినవిని దేవహూతి వెండియునిట్లనియె మహాత్మా మహదాదిభూతంబులకుం బ్రకృతిపురుషులకుంగల్గిన పరస్పరలక్షణంబులను దదీయస్వరూపంబుల నెఱింగించితి వింకనీప్రకారంబున సాంఖ్యంబునందు నిరూపింపంబడు నట్టిప్రకారంబును భక్తియోగమాహాత్మ్యంబును బురుషుండు భక్తియోగంబునంజేసి సర్వలోకవిరక్తుండగునట్టియోగంబును బ్రాణిలోకంబునకుసం

—* కపిలుండు దేవహూతికి భక్తియోగమును దెలియజేయుట *—

సారంబనేకవిధంబులైయుండుఁగావునఁ బరాపరుండవై కాలస్వరూపివైన నీస్వరూపంబు నేనీవలనభయంబునంజేసి జనులుపుణ్యకర్మంబులు సేయుదురుమిథ్యాభూతంబయిన దేహంబునందు నాత్మాభిమానంబు సేయుచుమూఢుండై కర్మంబులందు।నాసక్తంబయినబుద్ధింజేసివిభ్రాంతుండగుచుసంసారస్వరూపంబగు మహాంధకారంబునందుఁజిరకాలప్రసుప్తుండైనజనునిఁబ్రబోధించుకొఱకు యోగభాస్కరుండవయియావిర్భవించిన పుణ్యాత్ముండవుగావుననాకునిన్నియుందెలియ సవిస్తరంబుగా వానతిమ్మనిన దేవహూతికిఁగపిలుండిట్లనియె* (క॥ నలినాయతాక్షి వినుజన। ములఫలసంకల్పభేదమునఁజేసి మదంగలభక్తియోగమహిమం।బలవడఁగనేకవిధములనఁదగునవియున్* (వ॥ వివరించెదఁదామసరాజససాత్త్వికాదిభేదంబులం దివిధంబయియుండునందుఁదామసప్రకారంబెట్టిదనిన* (గీ॥ సతతహింసాదిదంభ మాత్సర్యరోష। తమములనుఁజేయుచును భేదదర్శియగుచుఁ।బరగనాయందుఁగావించుభక్తివలనఁ।దామసుండనఁదగువాఁడు తానసుండు* (క॥ ఘనవిషయప్రావీణ్యములను మహదైశ్వర్యయశములనుబూజాద్య।స్థానిసినునర్థిభజించుట।చను రాజసయోగమనఁగసౌజన్యనిధీ* (చ॥ అనుపమపాపకర్మపరిహారముకై భజనీయుఁడైనశో । భనచరితుండితండనుచుభావమునందలపోసిభక్తిచే । ననితరయోగ్యతన్భగవదర్పణబుద్ధినొనర్చికర్మము।ల్జనహితకారినై నెగడుసాత్త్వికయోగమనంగఁజొప్పడున్* (చ॥ మనుసుతమద్గుణశ్రవణమాత్రలభించినయట్టిభక్తిచే। ననఘుఁడసర్వశోభనగుణాశ్రయుఁడస్బరమేశ్వరుండనై । తనరిననన్నుఁజెందినయుదాత్తమనోగతులవ్యయంబులై।వననిధిగామిన్రైనసురవాహినిఁబోలిఫలించునిమ్ములన్* (క॥ హేయగుణరహితుఁడనగల।నాయందలిభక్తిలక్షణముఁదెలిపితిన। న్యాయకనిర్హేతుకముగఁ । జేయుమదీయప్రవైతైకచిరతరభక్తిన్* (వ॥ నిష్కాములయినమదీయభక్తులకునట్టిభక్తియోగంబు సాలోక్యసామీప్యసారూప్య సాయుజ్యంబులకుసాధనంబుగావున మహాత్ములగువారు దమమనోరథ ఫలదాయకంబులయినను మదీయసేవావిరహితంబులయిన యితరకర్మంబులనాచరింపనొల్లరు దీనినాత్యంతికభక్తియోగంబని చెప్పుదురుసత్వరజస్తమోగుణవిహీనుండయినజనుండు మత్స్వరూపంబుఁబొందుననిచెప్పి మఱియునిట్లనియె* (సీ॥ నిత్యనైమిత్తికనిజధర్మమునగురుశ్రద్ధాగరిష్ఠతఁజతురపాంచ । రాత్రోక్తహరిసమారాధనక్రియలనునిష్కామనంబున నెఱిమదీయ । విగ్రహదర్శనవినుతిపూజావందనధ్యానసంశ్రవణములఁగర్మ । సంగిగాకుండుటసజ్జనప్రకరాభిమానంబునొందుటహీనులందుఁ।జాలననుకంపసేయుటసములయందు । మైత్రి నెఱపుటయమనియమక్రియాది। యైనయోగంబుచేతనాధ్యాత్మికాధి।భౌతికామలఁదెలియుటపలుకుటయును॥మఱియును* (క॥ హరిగుణమంగళకీర్తన । పరుఁడై తగనార్జవమునభగవత్పరుల।సంగమునరక్తిభజించుట।నిరహంకారముననుంటనిశ్చలుఁడగుటన్* (క॥ ఇవిమొదలుగాఁగఁగలుగుభ।గవదుద్దేశస్వధర్మకలితుండై వీ।నివలనఁబరిశుద్ధగతిం।దవిలినమదిగలుగుఁబుణ్యతముఁడెయ్యెడలన్* (గీ॥ గురుతరానేకకల్యాణగుణవిశేషుఁ।డనఁగనొప్పిననన్నుఁబొందునతఁడుగొనక । పవనవశమునఁబుష్పలపరిమళంబు । ఘ్రాణమున నావరించినకరణిమెఱసి* (చ॥ అనిశముసర్వభూతహృదయాంబుజవర్తియనంతనన్నుసీ। ఘనమునవజ్ఞజేసిమనుజుండొగిమత్ప్రతిమార్చనావిడం।బనమునమూఢుఁడై యుచితభక్తినన్నుభజింపఁడేనియ।మ్మనుజుఁడుభస్మకుండమునహోమకవేల్చినయట్టివాఁడగున్* (సీ॥ అజ్ఞాకీటనిఖిలభూతాంతరాత్ముఁడనైననాయందుభూతగణంబునందు । నతిభేదదృష్టిమాయావులై సతతంబుఁబాయకవైరానుబంధనిరతులగువారిమనములఁదగులదుశాంతియెన్నటికైన నేను నాకుటిలజనులు । మావకయెపుడుసామాన్యాధికద్రవ్యస

మితి చేమత్పదార్పణ మొనర్పు। నర్థినాదిత్తమునను దంబం పకుండు। ననుచు నెఱింగించి మఱియు నిట్లనియెం గపిలుం। గలిత సన్నుణ
జటిలుండకల్పి మెండెలమిండల్లి తోడ గుణశాలీ నత్తల్లి తోడ* (సీ॥ తరళాక్షి వినుమచేతన దేహములకంటెం జేతన దేహములు శ్రే)
ష్ఠ మందుఁ బ్రాణవంతంబులై స్పర్శనజ్ఞానంబు గలుగు చైతన్య వ్రతము లకంటె। ఘనరసజ్ఞాన సంకలిత చేతనలు త్తములు రస
జ్ఞానంబు గలుగువాని। కంటె గంధజ్ఞాన కలిత బృందంబులు గడు శ్రేష్ఠములు వానికంటె శబ్ద। వేదులగుచుండు శ్రేష్ఠమై వెలయు శ
బ్ద। వేదికంటెను సద్రూపవేదులైన। వాయసాదులు శ్రేయములు వానికంటె। వరుస బహుపాదులుత్తములు వానికంటె*
(క॥ తలఁపఁ జతుష్పదులధికులు। బలకొని మఱి వానికంటెఁ బాదద్వయముం। గలనరుజులు లఘుతములి। మ్మలవారలయందు వర్ణ
ములు నాల్గరయన్॥ అందు*। సీ॥ తలఁప బ్రాహ్మణులు నుత్తములు వారలకంటె వేదవేత్తలు వేదవిదులకంటె। విలసిత వేదార్థవి
దులు వారలకంటె సమధిక శాస్త్రసంశయము మాన్పు। మీమాంసకులు మఱి మీమాంసకులకంటె నిజధర్మ విజ్ఞాన నిపుణులరయ।
వారికంటెను సంగవర్జిత చిత్తులు దగవారికంటె సద్ధర్మపరులు। ధార్మికులకంటెను త్తమోత్తములు నను ము। మత్సమర్పిత సకల
దర్మస్వభావ। మహిమములు గల్గి యితర ధర్మములు విడిచి। సమతవర్తించు నప్పుణ్యతముఁడు ఘనుఁడు॥ అట్టివాని* (క॥ కని సకల
భూతగణములు। మనమున నానంద జలధి మగ్నములగుచున్। ఘనబహుమానపురస్సర। మనయము వాటిల్ల వినుతులర్థిం జేయున్*
(వ॥ అంతర్నీశ్వరుండు జీవస్వరూపానుప్రవిష్టుండై యుండు నట్టి భగవంతుండు భక్తియోగంబున నైన యోగంబుననైనం బు
రుషుండు పరమాత్మం బొందు నట్టి ప్రకృతి పురుషాత్మకంబును దద్వ్యతిరిక్తంబు నైన దైవంబు నై కర్మవిచేష్టితంబగుచునుండు నది
యీ భగవద్రూపంబిట్టి భగవద్రూపంబు రూపభేదాస్పదంబగుచు నద్భుత ప్రభావంబు గల కాలంబనియుఁ జెప్పంబడు నట్టి కాలంబు
మహదాది తత్త్వంబులకుఁ దత్తదభిమానులగు జీవులకును భయావహంబులగుటం జేసి సకలభూతంబులకు నాశ్రయం బగు
చు నంతర్గతంబై భూతంబుల చేత భూతంబులఁ గ్రసింపుచు యజ్ఞఫలప్రదాత గావున వశీకృతభూతుండై ప్రభుత్వంబు భజియించి
విష్ణుండు ప్రకాశింపుచుండు నతనికి మిత్రుండు శత్రుండు బంధుండును లేఁడట్టి విష్ణుండు సకలజనంబులయందావేశించి యప్ర
మత్తుండై ప్రమత్తుండై ప్రమత్తులయిన జనంబులకు సంహారకుండై యుండు నతని వలని భయంబునం జేసి వాయువు వీచు సూ
ర్యుండు తపియించు నింద్రుండు వర్షించు నక్షత్రగణంబు వెలుంగుఁ జంద్రుండు ప్రకాశించుఁ దత్తత్కాలంబుల వృక్షలతాదులో
షధులతోడం గూడి పుష్పఫలభరితంబులగు సరిత్తులు ప్రవహించు సముద్రంబులు మేరలు దప్పకయుండు నగ్ని ప్రజ్వలించు భూ
మి గిరులతోఁ గూడ బరువునఁ గ్రుంగ వెఱచు నాకాశంబు సకలజనంబులకు నవకాశంబిచ్చు మహత్తత్త్వంబు జగత్తునకు నంకుర
స్వరూపంబుగావున సప్తావరణావృతంబగు లోకంబను స్వదేహంబు విస్తరింపం జేయు గుణాభిమానులగు బ్రహ్మాదులు సర్వే
శ్వరుని చేత జగత్సర్గంబునకు నియోగింపంబడి ప్రతిదినంబు నయ్యయి సర్గంబు చేయ నప్రమత్తులై యుండుదురు పిత్రాదులు పు
త్రోత్పత్తిం జేయుదురు కాలుండు మృత్యుసహాయుండై మారకుండై యుండుఁ జరాచరాత్మకంబగు సకల ప్రపంచంబు భగవ
దధీనంబయ్యుండు* (క॥ మఱియిట్టి నిఖిలలోకే। శ్వరుని పరాక్రమముఁ దెలియ సామర్థ్యం బె। వ్వరికిని గలుగదు మేఘము। గగనవ
లి విక్రమముఁ దెలియఁగా లేనిగతిన్* (క॥ మనువాని సుఖహేతుక। మనునర్థము దొరకమికి మహాదుఃఖమునం। దగులుచు దివి
యంతయు వా। భగవంతుని యాజ్ఞ జేసి ప్రాణులు మఱియున్* (సీ॥ పూని యసత్యంబులైన గృహక్షేత్ర పశుధన సుతవ
ధూబాంధవాది। వివిధ వస్తువులను ధ్రువముగా మదినమ్మి వరలు దుర్మతియగు వాఁడు జంతు। సంఘాతమగు దేహ సంబంధమున
నిల్చి యర్థినెయ్యే యోనులందుఁ జొరంగ। ననుగమించును వాని యందు విరక్తుండు గాక యుండును నరకస్థుఁడైన। దేహి యాత్మీ
య దేహంబు దివిరి వదల। లేక తనకది పరమ సౌఖ్యకరంబుఁ। గాఁగ వర్తించు నదియును గాక యతఁడు। దేవమాయా విమోహిత
భావుఁడగుచు* (క॥ ఘనమగు బుత్రవధూపశు। ధనగృహ రక్షణమునం దత్తత్క్రియల। న్మనమునఁ దలపోయుచు దిన। దిన
మున్ దందహ్యమాన దేహుండగుచున్* (క॥ అతిమూఢహృదయుఁడగుచు దు। రిత కర్మారంభమునఁ జరింపుచు ధరణిం। గృతగో
ప్య భాషణములను। సుతలాలన భాషణములఁ జొక్కుచు మఱియున్* (క॥ వినుమింద్రియపరవశుఁడై। మనుకొని తత్కూటధ
ర్మములు గలుగు శిఖం। బనయము సుఖరూపంబుగ। మనమున దలపోసి తదభిమానుండగుచున్* (క॥ సతతము దనచే సంపాది
తములగు నర్థముల చేతఁ ద్రుతిఁ బరులకు గుప్త నత్తహింసలు సేయుచు। నతిమూఢమనస్కుఁ డగుచు నాత్మజనములన్* (గీ॥ పూని ర
క్షింపుచును వారి భుక్తశేష। మనుభవింపుచుఁ దజ్జీవనము దొరఁ। కడగి మఱి మఱియపరార్థ కాముఁడగుచు। నత్య మెడలి కు
టుంబపోషణమునందు* (సీ॥ బలిమి చాలక మందభాగ్యుఁడై కుమతియై పూని యెప్పుడు క్రియాహీనుఁడగుచుఁ। దపిలి వ్యర్థ ప్ర
యత్నంబులు సేయుచు మూఢుఁడై కార్పణ్యమునఁ జరించు। నట్టి యకించనుఁడగు వానిఁ జూచి తద్దార సుతాదులాత్మలను వీడ।
గడునశక్తుఁడు ప్రోవంగఁ జాలఁడితఁడని యొగ్గింపరర్థిఁ గృషీవలుండు। బడుగు ముసలియెద్దు పోసినపగిదినంత। నతఁడు నే వెంటల
ను సుఖంబంద లేక। తాను పోషించు జనులు సందసరిప్రోవ। బ్రతుకు ముదిమియు మికిలి బాధ సలుప* (క॥ వెడరూపుఁ దాల్చి

బాంధవులు డలఁగని ధ్యానమునకునభిముఖుఁడై యి। ల్వెడలఁగఁజాలక శునకము । వడువునఁగుడుచుచును నేనువడవడవడ కఁ*(సీ॥ అతిరోగపీడితుండై మందమగుజఠరాగ్ని చెమిగులనల్పాశియగుచు । మెఱసి వాయువుచేతమీఁదికి నెగసినకన్నులు కఫమునఁగప్పఁబడిననాళంబులును గంఠనాళంబునను ఘురఘురను శబ్దంబుదోఁగబంధు । జనులమధ్యంబున శయనించు బహువిధములఁ దన్నుఁబిలువంగఁ బలుకలేక। చటులతర కాలపాశవశంగతాత్ముఁ। డగుచుబిడ్డలఁ బెండ్లామునడసి ప్రోచు। చింతవికలములయినహృషీకములును। గలిగి విజ్ఞానమును బాసికష్టుఁడగుచు*(వ॥ అంతమరణావస్థంబొందు సమయంబున నతిభయంకరాకారులు సరభసేక్షణులునగు యమదూతలిద్దరు దనముందర నిలిచినం జూచి త్రస్తహృదయుండై శకృన్మూత్రంబులు విడుచుచు యమపాశంబులచే గళంబున బద్ధుండై శరీరంబువలన నిర్గమించి యాతనాశరీరంబున నవలంబించి బలాత్కారంబున దీర్ఘంబయిదుర్గమంబగు మార్గంబును బొంది రాజభటులచే నీయమానుండగుచు దండంబున కభిముఖుండై చను నపరాధిచందంబునం జనుచుండి*(చ॥ అనయముమూర్ఛనొందు శునకావళిచేతను భక్ష్యమాణుఁడై । యనుపమకాలకింకరభయంకరతర్జనగర్జనంబుల । న్మనముగలంగ దేహముసమస్తముఁగంపమునొందఁగాఁ బురా । తనభవపాపకర్మసముదాయముఁజిత్తములో దలంపుచున్*(సీ॥ అనుపమక్షుత్తృష్ణలంత వ్యథలఁజేయ జంఝూనిలజ్వాలజ్వలనచండ । భానుప్రదీప్తితప్తంబైన వాలుకామార్గానుగతతప్యమానగాత్రుఁడై వీఁపుఁగశలచే నడవంగ వికలాంగుఁడగుచుమార్గమునందు నచటనచటఁ । జాల మూర్ఛిల్లియాశ్రయశూన్యమగునీళ్లమునుఁగుచు లేచుచు మొనసి పాపరూపమగుతమముల చేసి రూఢుఁడగుచు। వెలయఁదొంబదితొమ్మిదివేల యోజనములదూరంబుగల యమనగరమునకుఁ । బూనియమభటుల్గొంపోవఁబోవునంత* (వ॥ ఇట్లు మహాపాపాత్ముండైనవాఁడు ముహూర్తత్రయకాలంబునను సామాన్యదోషియగువాఁడు ద్విముహూర్తంబున నేగి యాతనంబొందునందు*(క॥ పట్టుదురుకొఱవులను వడిఁ। బెట్టుదురసిపత్రికలను బెనుమంటలయం। దొట్టుదురొడల్లనలియ। న్మట్టుదురప్పాపవిత్తముచుత్తుంబెలుచన్*(ఉ॥ మింతురుతప్తతోయముల మొత్తుదురుగ్రగదాసిధాగలన్ । త్రెంతురుపొట్టప్రేవులు వధింతురు మీఁదనిభేంద్రవజ్జికల్। ప్పింతురు ఘోరభంగిఁగరపింతురుపాములచేతబిట్టుద్రో । ల్చింతురు మీఁదగుండ్లఁదిసపింతురు దేహముఁగోసి కండలన్*(వ॥ మఱియుఁగుటుంబపోషణంబునఁ గుక్షింభరుండగుచు నధర్మపరుండై భూతద్రోహంబున నతిపాపుండై నిరయంబునుంబొంది నిజధనంబులు గోలుపడి మొఱవెట్టు నాపన్నుని చందంబునం బరస్పరసంబంధంబునఁ గల్పింపఁబడిన తమిస్రాంధతామిస్రరౌరవాదులగు నరకంబులంబడి తీవ్రంబులైన బహుయాతనల ననుభవించి క్షీణపాపుండై పునర్నరత్వంబును బొందునని చెప్పి వెండియు నిట్లనియె* (సీ॥ దైవకొనిమఱిపూర్వ కర్మానుగుణమున శశ్వత్ప్రికాశకుండీశ్వరుండు।

✤* కపిలుండు దేవహూతికి పిండోత్పత్తి క్రమంబు దెలుపుట. *✤

ఘటకుండుగావునఁ గ్రమ్మఱ జీవుండు దేహసంబంధంబు దివిరి తాల్ప । దొరకొని పురుష రేతోబిందుసంబంధియై వధూగర్భంబునందుఁజొచ్చి। దైకొని యొకరాత్రిఁ గలిలంబు పంచరాత్రములబుద్బుదమును దశమదివస । మునఁ గర్కంధువై యుండునంతమీఁద। బేశమగునంత మీఁదటఁ బేర్చియండ । కల్పమగునొక్కనెలను స్తకమును మాస । యమళమైననుగరచరణములుఁబొడము*(వ॥ మఱియు మాసత్రయంబున నఖరోమాస్థిచర్మంబులు లింగచ్ఛిద్రంబులును గలిగి, నాలవమాసంబున సప్తధాతువులు, పంచమమాసంబునకు క్షుత్తృష్ణలు, షష్ఠమాసంబున మావిచేతం బొదువంబడి తల్లికుక్షిని దక్షిణభాగంబునందుఁ దిరుగుమాతృభుక్తాన్నపానంబులవలనఁ దృప్తింబొందుచు సప్తధాతువులును గలిగి జంతుసంకీర్ణంబగు విణ్మూత్రగర్తంబందుఁ దిరుగుచుఁ గ్రిమిభక్షితశరీరుండయి మూర్ఛలంబొందుచుఁ దల్లిభక్షించిన కటుతిక్తోష్ణ లవణ క్షారామ్లాద్యుల్బణంబులయిన రసంబులచేతఁ బరితప్తాంగుఁడగుచు జరాయువునఁ గప్పంబడి బహిఃప్రదేశంబునందు నాంత్రంబులచేత బద్ధుండయి కుక్షియందు శిరంబు మోఁపికొని భుగ్నంబయిన పృష్ఠగ్రీవోదరుండయి స్వాంగచలనంబునందు నసమర్థుండగుచుఁ బంజరంబునందుండు శకుంతంబు చందంబున నుండి దైవకృతంబయిన జ్ఞానంబునఁ బూర్వజన్మదుష్కృతంబులం దలంచుచు దీర్ఘోచ్ఛ్వాసంబు సేయుచు నేసుఖంబు లేశంబునుం బొందక వర్తించుచునంత నేడవ నెలయందు లబ్ధజ్ఞానుండయి జేష్టలు గలిగి క్రిమిసోదరుండయి యొక్కదిక్కున నుండక సంచరించుచుం బ్రసూతి మారుతంబులచేత నతివేపితుండగుచు యాచమానుండు దేహాత్మదర్శియుఁ బునర్గర్భవాసంబునకు భీతుండగుచు బంధనభూతంబగు సప్తధాతువులచే బద్ధుండయి కృతాంజలిపుటుండు దీనవదనుండు నయి జీవుండు దా నెవ్వని చేను దరంబున వసియింపనియమింపఁబడెనట్టి సర్వేశ్వరుని నిట్లని స్తుతియించు * (క॥ అనయమును భువనరక్షణమునకై స్వేచ్ఛామరూపమునఁ బుట్టెడి విష్ణుని భయవిరహితపద । వనజయుగంబర్థిఁ గొల్తు వారనిభక్తిన్ * (వ॥ అదియునుం గాక పంచభూతవిరహితుండయ్యుం బంచభూతవిరచితంబయిన శరీరంబునందుఁ గప్పంబడి యింద్రియగుణార్థచిదాభాసజ్ఞానుండయిన నేను* (సీ॥ ఎవ్వఁడు నిఖిలభూతేంద్రియమయమగు మాయావలంబనమహితకర్మబద్ధుఁడై వర్తించు

పగిదిదందహ్యమానంబగుజీవచింతనమునందు । నవికారమైశుద్ధమైయఖండజ్ఞానమునను౦డు వానికిముఖ్యచరితు।నకునకుంఠితశౌర్యునకుఁబరంజ్యోతికిసర్వజ్ఞునకుఁగృపాశాంతమతికిఁ । గడఁగియాఁబ్రకృతిపురుషులకంటెఁబరముఁ। డయినవానికిఁబ్రమోక్కెదనస్మదీయ।దుర్భరోదగ్రభీకరగర్భనరక।వేదనలఁజూచిశాంతిఁగాంచుకొఱకు* (సీ॥అనవుఁడుసుతునకుజననియిట్లనుఁ దగమహితాత్మయెవ్వనిమహిమచేత । ఘనమోహములైగుణకర్మనిమిత్తసాంసారికమార్గసంచారములను।ధృతిచెడియలసియేదిక్కునెఱుంగకహరిపదధ్యానంబునాత్మకు అది । యుండువారలకునేయుక్తియానమ్మహాపురుషునను గ్రహబుద్ధిలేక । తద్గుణధ్యానతన్మూర్తివర్ణనములు।గోచరించుటయెట్లునాకునుబ్రబోధ । కలితముగఁబల్కుమనవుడుఁగపిలుఁడనియె। నంబతోడనునుగుణకదంబశోడ* (వ॥ అట్టియీశ్వరుండుకాలత్రయంబునందునుజంగమస్థావరాంతర్యామియగుటంజేసి జీవకర్మమార్గంబులంబ్రవర్తించువారుతాపత్రయనివారణంబుకొఱకు భజియింతురనిచెప్పినజీయునట్లనియె* (క॥ జనయిత్రిగర్భమందును।ఘనక్రిమివిణ్మూత్రరక్తగర్తములోన।న్మునుఁగుచుజఠరాగ్నినిదిన।దినమునుదంతహ్యమానదేహుండగుచుఁ* (గీ॥దీనవదనుఁడగుచుదేహియీదేహంబు । వలనఁగ్రమింపఁదలచిచనిన । నెలలనెన్నికొనుచునెలకొనిగర్భంబు । వలనవెడలఁ।దోయువారుగలరె*(వ॥అనితలంపుచుదీనరక్షకుండైనపుండరీకాక్షుండుదన్నుగర్భనరకంబువలనవిముక్తునిఁజేయనమ్మహాత్మునికిఁబ్రత్యుపకారంబు సేయలేమికినంజలిమాత్రంబు సేయందగునట్టి జీవుండనైననేనుశమదమాదియుక్తంబయిన శరీరంబునందువిజ్ఞానదీపాంకురంబునంబురాణపురుషునిరీక్షింతునని జీయునిట్లనియె* (సీ॥ నెలకొనిబహుదుఃఖములకునాలయమైనయీగర్భనరకము నేను వెడలఁ।జాలబహిఃప్రదేశమునకువచ్చిననుపను దేవమాయావిమోహ । తాత్ముండనైనఘోరతమమగుసంసారచక్రమందునుబరిభ్రమణశీలి । నైయుండవలయుఁదానదిగాకగర్భంబునందుండుశోకంబునపనయించి । యాత్మకనయంబుసారథియయినయట్టి।సుచిరవిజ్ఞానమునఁదమోరూపమయిన । భూరిసంసారసాగరోత్తారణంబు । చేసియీయాత్మనరసిరక్షించుకొందు॥నుజీయును*(చ॥పరగుచునున్నదుర్వ్యసనభాజనమైఘనదుఃఖమూలమై।యగయగఁబెక్కుతూఁట్లుగలదైక్రిమిసంభవమైనయట్టిదు । స్తరబహుగర్భవాసములసంగతిమాన్పుటకైభజించెద । స్సరసిజనాభభూరిభవసాగరతారకపాదపద్మముల్* (క॥అనికృతనిశ్చయుఁడైయే।దినవిమలజ్ఞానియగుచుజీవుఁడుగర్భం।బున వెడలనొల్లకుండఁగజనియెన్నవమాసములునుజననీయంతక్* (వ॥ దశమమాసంబునవానినధోముఖుంగావించిననుచ్ఛ్వాసనిశ్వాసంబులులేకఘనదుఃఖభాజనుండువిగతజ్ఞానుండు రక్తదిగ్ధాంగుండైవిష్ఠాస్థక్రిమింబోలి నేలంబడియేడ్చుచుండుజ్ఞానహీనుండైజడుంబోలియుండియంతనిజభావాన భిజ్ఞులగుపరులవలనవృద్ధింబొందుచు నభిమతార్థంబులంజెప్పనేరక యనేకకీటసంకులంబయినపర్యంకంబునందుశయానుండైయవయవంబులు కండూయమానంబులైనఁ గోఁకనేరక యాసనోత్థానగమనంబులనశక్తుండయితనశరీరచర్మంబు మశకమత్కుణమక్షికాదులువొడువఁ గ్రిములచేవ్యథంబడుక్రిమిసుంబోలిదోధూయమానుండయి రోదనంబుసేయుచు విగతవిజ్ఞానుండైయుండుచు శైశవంబునంతత్తత్క్రియానుభవంబుఁగావించి పౌగండవయస్సునందదనురూపంబులగు నధ్యయనాదిదుఃఖంబులనుభవించి తదనంతరంబ యౌవనంబుప్రాప్తంబయిన నభిమతార్థఫలప్రాప్తికిసాహసపూర్వంబులగు వృథాగ్రహంబులుసేయుచుఁ బంచమహాభూతాదిలబ్ధంబగుదేహంబందుఁ బెక్కుమాఱులహంకారమమకారంబులంజేయుచుఁదదర్థంబులయినకర్మంబులాచరింపుచు సంసారబద్ధుండగుచు దుష్పురుషసంగమంబున శిశ్నోదరపరాయణుండయివర్తింపుచు నజ్ఞానంబునంజేసి వర్ధిష్యమాణరోషుండగుచుఁ దత్ఫలంబులగుదుఃఖంబులనుభవింపుచుఁగాముకుండయి నిజనాశంబునకు హేతువులగుకర్మంబులంబ్రవర్తింపుచుండునుజీయును* (సీ॥ జనయిత్రిసత్యంబుశౌచంబుఁదయయునుధృతియుమానంబుబుద్ధియునుసిగ్గు । క్షమయునుయశమును శమదమంబులునునీమొదలుగాఁగలగుణంబులునశించు । జనులకసత్సంగమునననఁయెఱిఁగింది వెండియునిట్లనువినుముమూఢ । హృదయులుశాంతివిహీనులుదేహాత్మబుద్ధులునంగనామోహపాశ।బద్ధకేళీమృగంబులపగిదిఁదగిలి। పరవశస్వాంతములశోచ్యభావులయిన। వారిసంగతివిడువంగవలయునందు । నంగనాసంగమముదోషమండ్రుగాన* (వ॥ దీనికొక్కయితిహాసంబుగలదుతొల్లియొక్కనాఁడుప్రజాపతిస్వసుతయినభారతి మృగీరూపధారిణియైయుండంజూచి తదీయరూపరేఖావిలాసంబులకుమోటువడి వివశీకృతాంతరంగుండు విగతత్రపుండు నయిదానునుమృగరూపంబునొంది తనను ధావనంబుహేయంబనితలంపక ప్రవర్తించెంగావున నంగనాసంగమంబువలనదస్మదీయనాభీకమలసంజాతచతుర్ముఖనిర్మితమరీచ్యాద్యుద్భూతకశ్యపాదికల్పితదేవమనుష్యాదులందు మాయాబలంబునంగామినీజనమధ్యంబున విఖండితమనస్కుండుగాకుండుటకుఁ బుండరీకాక్షుండయిననారాయణుఁడుదక్కనన్యులకునెవ్వరికిఁదీరదని వెండియునిట్లనియె* (గీ॥ రూఢినామాయకామినీరూపమునను।బురుషులకునెల్లమోహంబుఁబొందఁజేయుఁ।గానఁబురుషులుసతులసంగంబుమాని।యోగవృత్తిఁజరింపుచునుండవలయు* (క॥ధీరతతోమ

త్పదసరసీరుహసేవానురక్తిఁ జెందినవారలు నారీసంగము నిరయద్వారముగా మనములం దలఁపుదు రెందుఁ గ* (క॥ హరిమాయావిరచితమై తరుణీరూపంబుఁ దాల్చి ధరఁ బర్వినదం ధురతృణపరివృతకూపము కరణిని దియు మృత్యురూపకంబగు మఱియున్* (చ॥ ధనపశుపుత్రమిత్రవనితాగృహకారణభూతమైనయీ తనువుననున్న జీవుఁడు పదంపడి యట్టిశరీర మెత్తి తా ననుగతమైనకర్మఫలమందకపోవఁగ రాదు మిన్నుఁ ద్రొక్కినఁ భువిఁ దూరిన న్దిశల కేగిన నెచ్చటనైన నాగినన్* (వ॥ అట్టి పురుషరూపంబు నొందిన జీవుండు నిరంతరస్త్రీసంగంబుచే విత్తాపత్యగృహాదిప్రదంబగు స్త్రీత్వంబు నొందు నీక్రమంబున నంగనారూపుండగు జీవుండును మన్మాయచేఁ బురుషరూపంబు నొంది ధనాదిప్రదుండగు భర్తను నాత్మబంధకారణంబగు మృత్యువుగ నెఱుంగవలయు మఱియు జీవోపాధిభూతంబగు లింగదేహంబుచే స్వావాసభూతలోకంబుననుండి లోకాంతరంబు నొందుచుం బ్రారబ్ధకర్మఫలంబుల ననుభవింపుచు నల కర్మాదులందాసక్తుండగుచు మృగయుండు కాననంబున ననుకూలసుఖప్రదుండయిన మృగంబునకు మృత్యువగు చందంబున జీవుండు భూతేంద్రియమనోమయంబయిన దేహంబు గలిగియుండు నట్టి దేహవిరోధంబె మరణంబు నావిర్భావంబె జన్మంబు నుంగాన సకలవస్తువిషయజ్ఞానంబు గలుగుటకు జీవునకు సాధనంబు చక్షురింద్రియంబగు ద్రష్టృదర్శనీయ యోగ్యతాప్రకారంబున జీవునకు జన్మమరణంబులు లేవు గావున భయకార్పణ్యంబులు విడిచి సంభ్రమంబు మాని జీవప్రకారంబు జ్ఞానంబునం దెలిసి ధీరుండై ముక్తసంగుండగుచు యోగవైరాగ్యయుక్తంబయిన సమ్యగ్జ్ఞానంబున మాయావిరచితంబయిన లోకంబున దేహాదులందాసక్తి మాని వర్తింపవలయునని చెప్పి వెండియు నిట్లనియె* (సీ॥ గృహమందు వర్తించు గృహమేధులగువారు హితధర్మార్థకామములకొఱకు। సంప్రీతులగుచుఁ దత్సాధనానుష్ఠానసిరతులై వేదనిర్ణీతభూరి। భగవత్సుధర్మతద్భక్తిపరాఙ్ముఖులై దేవగణముల ననుదినంబు। భజియింపుచును భక్తిఁ బైతృకకర్మముల్ సేయుచు శిష్టచరితు। లగుచుఁ దగ దేవపితృసువ్రతాఢ్యులయిన। కామ్యచిత్తులు ధూమాదిగతులఁ జంద్ర। లోకములఁ జెంది పుణ్యంబులోపమయిన మఱి వత్తురు భువికి జన్మంబు నొంద॥ అదియునుంగాక* (గీ॥ ప్రవిమలానంతభోగితల్పంబునందు। యోగనిద్రాళువై హరియున్నవేళ। నఖిలలోకంబులును విలయంబునొందు। నట్టి సర్వేశ్వరునిఁ గూర్చి యనఘమతులు* (మ॥ పరికింపన్నిజభక్తియుక్తిగరిమం బాటిల్లు పంకేరుహా। దరవిన్యస్తసమస్తధర్ములు ప్రశాంతస్వాంతులై సంగముం। బరివర్జించి విశుద్ధచిత్తులగుచున్ బ్రాంకేజవ్రశేషణోత్తరధర్మైకనివృత్తులై సతతముం దైత్యారిఁ జింతింపుచున్* (సీ॥ మఱియు నహంకారమమకారశూన్యులై యర్థి వర్తింపుచు నర్చిరాది। మార్గగతుండును మహనీయచరితుండు విశ్వతోముఖుఁడును విమలయశుఁడు। జగదుద్భవస్థానసంహారకారణుం డవ్యయుఁ డజుఁడు పరాపరుండు। పురుషోత్తముఁడు నవపుండరీకాక్షుండునైన సర్వేశ్వరునందుఁ బొంది। మానితాపునరావృత్తిమార్గమయిన। ప్రవిమలానంతతేజోవిరాజమాన। దివ్యపదము నసుఖయించు ధీరమతులు। మఱల రా రెన్నటికి నిజన్మములఁ బొంద* (వ॥ మఱియుఁ బరమేశ్వరదృష్టిచే హిరణ్యగర్భుని పాసించువారు సత్యలోకంబున ద్విపరార్థావసానంబగు ప్రళయంబుదనుకఁ బరుండగు చతురాననుం బరమాత్మరూపంబున ధ్యానంబు సేయుచునుండి పృథివ్యప్తేజోవాయ్వాకాశమానసేంద్రియ శబ్దాదిభూతాదులతోడం గూడ లోకంబునుఁ బ్రకృతియందు లీనంబు సేయ సర్వేశ్వరుండు సకలహర్తయగు సమయంబున గతాభిమానంబులుం గలిగి బ్రహ్మలోకవాసులగు నాత్మలు బ్రహ్మతోడం గూడ పరమానందరూపుండును సర్వోత్కృష్టుండు నగు పురాణపురుషుం బొందుదురు గావున నీవు సర్వభూతహృదయపద్మనివాసుండు శ్రుతానుభావుండు నిష్కళంకుండు నిరంజనుండు నిర్ద్వంద్వుండగు పురుషుని భావంబుచే శరణంబు నొందుమని చెప్పి మఱియు నిట్లనియె* (మ॥ సకలస్థావరజంగమప్రతతికిన్ జర్చింపఁ దానాద్యుఁడై। యకలంకశ్రుతిగర్భుఁడుం బరుఁడు సర్వాద్యుండు నీశుండు నే। వక యోగీంద్రకుమారసిద్ధమునిదేవశ్రేణి యోగప్రవ। ర్తకమై తన్ను భజింపఁ జూపు సగుణబ్రహ్మంబు లీలాగతిన్* (సీ॥ అట్టి సర్వేశ్వరుఁడయ్యయి కాలంబులందును దద్గుణవ్యతికరమున జనియింపుచుండు నీ చాడ్పున ఋషిదేవగణములు దమ తమ కర్మనిర్మితైశ్వర్యపారమేష్ఠ్యముల్ గాంచు పురుషత్వమొంది యయ్యధికారములు వహించి। వర్తించి క్రమ్మఱ వత్తురు మఱి కొందఱు దృఢకర్మానుసారమైన। మనములను జాలఁ గలిగి ధర్మములయందు। శ్రద్ధతోఁ గూడి యప్రతిషిద్ధమైన। నిత్యనైమిత్తికాచారవిపులులగుచుఁ। దగిన జోటనకలితచిత్తములు గలిగి* (వ॥ సకాములై యింద్రియజయంబు లేక పితృగణంబుల నెల్లప్పుడు పూజింపుచు గృహంబులయందు వర్తించి హరిపరాఙ్ముఖులగు వారలై త్రివర్గికపురుషులని చెప్పంబడుదురు* (చ॥ వినుతగుణోత్తరుండును నురువిక్రముఁడైన హరిన్ భజించిత। న్మననసత్కథామృతము మానుగ గ్రోలుటమాని దుష్కథ। ల్విని ముదమంది యుండు ఖలవేకమహీనత నూరపంది యా। త్మను మధురాజ్యభక్ష్యములు మాని పురీషము మెక్కు చాడ్పునన్* (చ॥ అలవడ ధూమమార్గగతులై పితృలోకముఁ బొంది పుణ్యముం। బొలిసినవారు తొంటితమపుత్రులకున్ దగఁ దామ పుట్టి వి। హ్వలమతి గర్భగోళపతనాదిపరేతధరాక్రియాంతమై। వెలసిన కర్మముం గనుభవింతురు గావున నీవు భామినీ* (క॥ వినుసర్వభావము

లంబర। మునినన్ఘునన్నంగు నీశుఁబురుషోత్తము సాన్నమనము నభజింపుము ముదమునఁబున గావృత్తిలేనిముక్తిలభింతురా ✱ (వ
అని చెప్పి వెండియు నిట్లనియె భగవంతుండగు వాసుదేవునియందుం బ్రయుక్తంబగు భక్తియోగంబు బ్రహ్మసాక్షాత్కారసాధ
నంబులగు వైరాగ్యజ్ఞానంబులం జేయునట్టిభగవద్భక్తియుక్తంబైన చిత్తంబింద్రియవృత్తులచే సమంబులగు నర్థంబులందు వైష
మ్యంబుఁబ్రియాప్రియంబులును లేక నిస్సంగంబు సమదర్శనంబు హేయోపాదేయరహితంబునై యారూఢంబయిన యా
త్మపదంబునాత్మచేఁ జూచుచుండు జ్ఞానపురుషుండు పరబ్రహ్మంబు పరమాత్ముండునీశ్వరుండు పరమపురుషుం డేకరూపంబుగ
లిగియుండియు దృశ్యద్రష్టృకరణంబులచేతం బృథగ్భావంబును బొందుచుండు నదియుయోగికి సమగ్రంబగు యోగంబునం
జేసి ప్రాప్యంబగుఫలంబు గావున విషయవిముఖంబులగు నింద్రియంబులచేత జ్ఞానరూపంబు హేయగుణరహితంబునగు బ్ర
హ్మంబు నారోపితభ్రాంతిం జేసి శబ్దాదిధర్మంబగు నర్థరూపంబునం దోఁచునది యెట్టులన్ధాకారంబునందోఁచునని యడిగితి వేనియ
హంకారంబు గుణరూపంబునం జేసి త్రివిధంబు భూతరూపంబునం బంచవిధంబు నింద్రియరూపంబున నేకాదశవిధంబునయి
యుండు జీవరూపుండగు విరాట్పురుషుండు జీవవిగ్రహంబయిన యండంబగు జగంబునందోఁపుచుండు దీనిశ్రద్ధాయుక్తంబ
యినభక్తిచేత యోగాభ్యాసంబునం జేసి సమాహితమనస్కుండయి నిస్సంగంబునవిరక్తుండయినవాఁడు పొడగనుచుండు
నదియంతయు బుధజనపూజనీయ చరిత్రవు గావున నీకుం జెప్పితి సర్వయోగసంప్రాప్యుండు నిర్గుణుండును భగవంతుండ
ని చెప్పిన జ్ఞానయోగంబును మదీయభక్తియోగంబునను రెండులో నొక్కటియ యింద్రియంబులు భిన్నరూపంబులుగావు
న నేకరూపంబయిన యర్థం బనేకవిధంబులగున ట్లేకంబగు బ్రహ్మం బనేకవిధంబులుగఁ దోఁచు నదియు ✱ (సీ॥ అంబనారా
యణుండఖిలశాస్త్రములను సమధికానుష్ఠితపవనతీర్థ। దర్శనజపతపోధ్యయనయోగక్రియాదానకర్మంబులఁ గానఁబడక।
యేచినమనము బాహ్యేంద్రియంబులఁ గెల్చి సకలకర్మత్యాగసరణి నొప్పి। తలకొని యాత్మతత్త్వజ్ఞానము నమించియుఁ దగక
వైరాగ్యయుక్తిఁ దనరి। మహితఫలసంగరహితధర్మమునఁ దనరు। నట్టిపురుషుండు దలపోయ నఖిలహేయ। గుణములను
బాసి కల్యాణగుణవిశిష్టుఁడయిన హరి నొందుఁ బరమాత్మ ననఘుఁడగుచు ✱ (వ॥ అదిగావున నీకుం జతుర్విధభక్తియోగప్రకా
రంబు దేటపడ నెఱింగించితి నవియునుంగాక కాలరూపయగు మదీయగతి జంతువులయందును త్పత్తినాశరూపంబులనుండున
విద్యాకర్మనిర్మితంబులైన జీవునిగతు లనేకప్రకారంబులై యుండునదియు జీవాత్మ వానియందుం బ్రవర్తించి యాత్మగతియిట్టి
దని యెఱుంగక యుండు నని చెప్పి మఱియు నిట్లనియె నిట్టియతిరహస్యంబగు సాంఖ్యయోగప్రకారంబు ఖలునకు నవినీతునకు జ
డునకు దురాచారునకు డాంబికునకు నింద్రియలోలునకుఁ బుత్రదారాగారాద్యత్యంతాసక్తచిత్తునకు భగవద్భక్తిహీనునకు
విష్ణుదాసులయందు ద్వేషముపడువానికి నుపదేశింపవలవదు శ్రద్ధాసంపన్నుండు భక్తుండు వినీతుండు నసూయారహితుండు
సర్వభూతమిత్రుండు శుశ్రూషాభిరతుండు బాహ్యార్థజాతవిరక్తుండు శాంతచిత్తుండు నిర్మత్సరుండు శుద్ధాత్ముండు మద్భ
క్తులయందుఁ బ్రేమగలవాఁడు నన్యకాంతావిముఖుండు నిష్కాముండు నగునధికారికి నుపదేశింపనర్హంబగు నీయుపాఖ్యా
నంబే పురుషుండేని బతివ్రతయగు నుత్తమాంగనయేని శ్రద్ధాభక్తులుగలిగి మదర్పితచిత్తంబున న్వినుఁబఠించు నట్టిపుణ్యా
త్ములు మదీయదివ్యస్వరూపంబుఁ బ్రాపింతురని చెప్పెనని మైత్రేయుండు విదురునకు వెండియు నిట్లనియె నీప్రకారంబునం గర్ద
మదయితయైన దేవహూతి కపిలుని వచనంబులు విని నిర్ముక్తమోహపటలయగుచు సాష్టాంగదండప్రణామంబు లాచరించి త
త్త్వవిషయాంకితసాంఖ్యజ్ఞానప్రవర్తకంబగు స్తోత్రంబు సేయ నుపక్రమించె దేవహూతి కపిలునకిట్లనియె ✱ (సీ॥ ఆనయంబు
విను మింద్రియార్థమనోమయంబును భూతచయమయంబును సమస్త। భూరిజగద్బీజభూతంబును గుణప్రవాహకారణ
మును వలను మెఱయు। నారాయణాభిఖ్యనఁ గలభవదీయదివ్యమంగళమూర్తి దేజరిల్లు। చారుభవద్గర్భసంజాతుఁడగునట్టి
కమలగర్భుండు సాక్షాత్కరింప। లేకమనమునఁ గనియె ననేకశక్తి। వర్గములుగల్గి సుగుణప్రవాహరూప। మంది విశ్వంబు దా
ల్చి సహస్రశక్తి। కలితుఁడై సర్వకార్యములు బుగఁ జేయు॥ అంత ✱ (గీ॥ ప్రళయకాలంబునందంఘ్రిపాయికపట। శిశువవై
యొంటిఁగుక్షిని త్తనిఖిలభువనములుయుండవై మహాంభోధినడుమ। జారువటపత్రమధ్యసంస్థాయివగుచు ✱ (గీ॥ లీలనాత్మీ
యపాదాంగుళీవినిర్గ। తామృతముఁ గ్రోలినట్టిమహాత్మ నీవు। గడఁగి నాపూర్వభాగ్యంబుకతనఁ బుడమి। పూని నాగర్భమున నేఁ
డు పుట్టితయ్య॥ అట్టిపరమాత్ముండవయిన నీవు ✱ (సీ॥ వరుసవిగ్రహపారవశ్యంబునంజేసి రఘురామకృష్ణవరాహనార।
సింహాదిమూర్తు లంచితలీలధరియించి దుష్టనిగ్రహమును శిష్టపాల। నము నుగావింపుచునయమున సద్ధర్మనిరతచిత్తులకువ
ర్ణింపఁదగిన। చతురాత్మతత్త్వవిజ్ఞానప్రముండవైవర్తింతువనఘభవన్మహత్త్వ। మజునకైనను వాక్రువ్వ నలవుగాదు। నిగ
మజాతంబులయినవర్ణింపవెఱుఁగ। నెఱిఁగి సంస్తుతిసేయ నేనెంతదాన। వినుతగుణశీలమాటలు వేయు నేల॥ అదియుమంగా
క ✱ (క॥ధీమహితభవన్మంగళ। నామస్మరణానుకీర్తనములహీనుల్। శ్రీమంతులగుదురగ్ని। ష్టోమాదిక్రతువాళికంటెఁ శుద్ధులు

దలఁపఁగ॥ అదియునుంగాక* (క॥ నీనామస్తుతిశ్వపచుం। డైననుజిహ్వాగ్రమందుఁదనుసంధింప। న్వానికిసరిభూసురుఁడు। న్గా నేరఁడుచిత్రమదిజగంబులనరయఁగ* (ఉ॥ ఈవిధమాత్మలందెలిసియెప్పుడుసజ్జనసంఘముల్లగ। త్ప్రవనమైననీగుణకథామృతమాత్మలఁగ్రోలిసర్వతీ। ర్థావళిఁగ్రుంకినట్టిఫలమందుదురంచుసమస్తవేదము। ల్వావిరిఁబల్కుఁగావుననువారలుధన్యులుమాన్యులుత్తముల్* (వ॥ అదిగావునఁబరబ్రహ్మంబవుపరమపురుషుండవుప్రత్యఙ్ముఖీభావ్యుండవుసమస్తజనపావనివారకస్స్వయంప్రకాశుండవు వేదగర్భుండవు శ్రీమహావిష్ణుండవునగు నీకువందనంబులాచరించెదనని స్తుతియించినఁబరమపురుషుండుమాతృవత్సలుండునగుకపిలుండుకరుణారససాంద్రహృదయకమలుండై జననికినిట్లనియె* (గీ॥ తలిసుఖరూపముమోక్షదాయకంబు। నైనయీయోగమార్గమేనంబనీకు। నెఱుఁగవివరించిచెప్పితినిదిదృఢంబుగాగభక్తినమష్ఠింపుకమ నయన (క॥ జీవన్ముక్తిలభించుం। గావుననేమరకతలఁపుఁగైకొనిదీని న్వావిరినొల్లనివారికిఁ। దావలమగుమృత్యుభయముదవ్వగుసుఖముగ* (క॥ అనియిట్లుదేవహూతికి। వినమలరఁగఁగపిలుఁడాత్మమార్గంబెల్ల। న్వినుపించిచనియెననవిదు। రునకుఁగమైత్రేయమునివరుండెఱిఁగించెఁగ* (వ॥ అట్లుకపిలుండేగినపిదపదేవహూతియుంబుత్రుండుచెప్పినయోగమార్గంబునఁబ్జ్ఞానంబుగలిగియుండియుంబెనిమిటినైనకర్దమునిందనయుండైనకపిలునిం బాసి నష్టవత్సయగు గోవుచందంబునఁదల్లడిల్లుచుఁగపిలునహామునిందలంపుచుంగర్దమతత్వసామర్థ్యంబులైనయట్టి* (ఉ॥ మానితసౌరభప్రసవమంజులపక్వఫలప్రవాళభా। రానతచూతపోతపటపాగ్రనికేతనరాజకీరస। మ్మానితరామలాపపరిచుంశితకర్దమతాపసాశ్రమో। ద్యానవనప్రదేశకమలాకరతీరనికుంజపుంజముల్॥ వెండియు* (సీ॥ అంచితస్ఫటికమయస్తంభదీప్తిచేఁగొమరారుమరకతకుడ్యములను। సజ్జాతివజ్రాలసజ్జాలకరుచులభాసిల్లునీలసోపానములను। దీపించుచంద్రకాంతోపలవేదులవిద్రుమగేహళీవిలసితముల। హాటకరత్నకవాటశోభితములనలరినసౌధశాలాంగణముల। వరపయఃఫేనపటలపాండురకరీంద్ర। దంతనిర్మితఖట్వాదిధవళపట్ట। రచితశయ్యాళులనుచతురంతయాన। కనకపీఠాదివస్తుసంఘములనెల్ల* (వ॥ మఱియుఁబకచకములకుముదసౌగంధికబంధురసుగంధానుబంధిగంధవహశోభితంబు నరవిందనిష్యందకందళితమకరందరసపానమదవదిందిరసందోహఝుంకారసంకులంబునై చెలువారుబావులుంగలిగి పురందరసుందరీనందితంబయిన కర్దమాశ్రమంబుఁ బరిత్యజించి కుటిలంబులయిన కుంతలంబులు జటిలంబులుగాధరించి సరస్వతీబిందుసరోవరంబులం ద్రిషవణస్నానంబుగావింపుచు నుగ్రతపోభారంబునం గృశీభూతశరీరయై నిజకుమారుండు ప్రసన్నవదనుండు కపిలరూపనామధేయుండు నగునారాయణునిసమస్తచింతలచేధ్యానంబు సేయుచుఁ బ్రవాహరూపంబైనభక్తియోగంబున నధికవైరాగ్యంబున యుక్తానుష్ఠానజాతయై బ్రహ్మాత్మోపాదకంబు నగుజ్ఞానంబునవిశుద్ధమనంబునుంగలిగి* (సీ॥ అనయంబునాత్మనాయకుఁడునువిశ్వతోముఖుఁ డనంతుడుపరముడునజుండు। చతురుండునిజపరిజ్ఞానదీపాంకురమహిమనిరస్తసమస్తభూరి। మాయాంధకారుఁడమేయుఁడీశ్వరుఁడగునాపరబ్రహ్మంబునందవిరత। బద్ధతత్వజ్ఞానపరతచేనిర్ముక్తజీవభావమునవిశిష్టయోగ। భవ్యసంప్రాప్తనిర్మలబ్రహ్మభావ। ములనుగలిగిసమాధిచేనెలమిఁదనరు। నపునరావృత్తమగుత్రిగుణప్రధాన। తత్వములనొప్పిసంతతోదాలనయతి* (గీ॥ కలలఁదోఁచినవస్తుసంఘములమేలు। కనికనుంగొనగాలేనిమనుజుపోల్కి। బొలఁతిదనయాత్మమఱచియిమ్ములనథూను। మైనపావకుగతినుండెనంతలోన* (క॥ గురుయోగశక్తిచేనం। బరతలమునకెగసిసత్కృపామయుఁడగునా। పరవాసుదేవుచరణాంబురుహయుగన్యస్తచిత్తనుగలదియగుచుఁ* (వ॥ ఇట్లుకపిలోక్తమార్గంబున దేవహూతిశ్రీహరియందుఁగలసెనయ్యంగనారత్నంబు మోక్షంబునకుంజనినక్షేత్రంబుసిద్ధిపదంబను పేరంబరగిప్రసిద్ధవహించెనంతనకట్టఁడఁగపిలుండుదల్లిచేత ననుజ్ఞాతుండై సిద్ధచారణగంధర్వాప్సరోమునినివహసంస్తూయమానుండగుచుసముద్రునిచేతదత్తార్ఘ్యాణపూజానికేతనంబులువడసి సాంఖ్యాచార్యాభిష్టుతంబగుయోగంబునవలంబించిలోకత్రయశాంతికొఱకు సమాహితుండై స్వపిత్రాశ్రమంబునిడిచి యుదగ్భాగంబునకుంజనియెనని మైత్రేయమహామునివిదురునకిట్లనియెఁ దండ్రీయీయుపాఖ్యానంబునాకుగోచరించినరీతినీకుంజెప్పితినిది కపిలదేవహూతిసంవాదంబత్యంతపావనంబుకపిలప్రణీతంబునైన యోగంబుదీనింబరమభక్తియుక్తుండై యెవ్వఁడుపఠించు నెవ్వడువినునట్టిపుణ్యాత్ముండువిగతపాపుండై గరుడధ్వజుండైనపుండరీకాక్షుని శ్రీచరణారవిందంబులంబొందునని మైత్రేయుండువిదురునకెఱింగించెనని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుంజెప్పెనని సూతుండుశౌనకాదిమహామునులకు నీకథావృత్తాంతంబుజెప్పినవిని ప్రహృష్టహృదయులయి మునికులోత్తమా భవద్వాక్పూరంబగు భగవత్కథామృతంబు గ్రోలుచుండ మామనంబులుదనివినొందె నింకఁదగువాతి వృత్తాంతంబులుమాకువిశదంబులుగవినుపింప నీవయర్హుండవనియడుగుటయు* (చ॥ జనకసుతామనోవిమలసారసకోమలచంచరీకచం। దనశరదిందుమందహారతారమరాళపటీరచంద్రికా। వినుతయశోవిశాలరఘువీరదరస్మితపద్మపత్రలో। చననిటలాంబకప్రకటచాపవిఖండనవంశమండనా (తరల॥ పరమపాపవిశ్వభావనభాం

ధవప్రకటదానా। శరధిశోషణసత్యభాషణసత్క్రమయభూషణా । దురితతారణసృష్టికారణదుష్టలోకవిదారణా। ధరణిపాలనధర్మశీలనదైత్యమర్దనఖేలనా॥ (మాలినీ॥ దివిజగణశరణ్యా దీపితానంతపుణ్యా। ప్రవిమలగుణజాలా భక్తలోకానుపాలా। భవతిమిరదినేశా భానుకోటిప్రకాశా । కువలయహితకారీ ఘోరదైత్యప్రహారీ॥......................*

గద్య॥ ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసన మంత్రిపుత్రసహజ పాండిత్యపోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు విదురనీతియు, విదురునితీర్థాగమనంబు, నుద్ధవసందర్శనంబును, గౌరవయాదవకృష్ణాదినిర్యాణంబు, గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుటయు, విదురమైత్రేయసంవాదంబు, జగదుత్పత్తిలక్షణంబు, మహదాదులసంభవప్రకారంబు, మహదాదులు నారాయణునభినందించుటయు, విరాడ్విగ్రహప్రకారంబు, శ్రీమహాభాగవతభక్తికారణంబగు పద్మసంభవుజన్మప్రకారంబు, బ్రహ్మతపంబును, బరమేష్ఠికిం బుండరీకాక్షుండు ప్రత్యక్షంబగుటయు, బ్రహ్మకృతంబైన విష్ణుస్తోత్రంబును, గమలసంభవునిమానససర్గంబును, బరమాణువులపుట్టువు, భూర్భువస్సువరాదిలోకవిస్తారంబును, గాలదివసమాసవత్సరాదినిర్ణయంబు, నాయుఃపరిమాణంబును, జతుర్యుగపరిమాణంబును, బద్మసంభవుసృష్టిభేదంబు, సనకాదులజన్మంబు, స్వాయంభువమనువుజన్మంబు, శ్రీహరివరాహావతారంబు, భూభరణంబు, సూకరాకారుండైనహరిని విధాతస్తుతియించుటయును, దితికశ్యపసంవాదంబు, కశ్యపుండురుద్రునిం బ్రశంసించుటయును, కశ్యపువలనదితిగర్భంబుధరియించుటయును, దత్ప్రభావంబునకువెఱచి దేవతలుబ్రహ్మసన్నిధికింజని దితిగర్భంబువిన్నవించుటయు, సనకాదులువైకుంఠంబునకరుగుటయు, నందుజయవిజయులనలిగి శపించుటయు, శ్రీహరిదర్శనంబు, బ్రాహ్మణప్రశంసయు, సనకాదులుహరినిస్తుతించుటయు, హిరణ్యకశిపుహిరణ్యాక్షులజన్మప్రకారంబు, హిరణ్యాక్షునిదిగ్విజయంబు, సవనవరాహహిరణ్యాక్షులయుద్ధంబు, బ్రహ్మస్తవంబు, హిరణ్యాక్షవధయు, నమరగణంబులు శ్రీహరినభినందించుటయు, హరివరాహావతారవిసర్జనంబు సేయుటయు, దేవతిర్యఙ్మనుష్యాదులసంభవంబును, గర్దమమహామునితపంబునకుసంతసించి శ్రీహరిప్రత్యక్షంబగుటయు, గర్దముండుస్వాయంభువమను పుత్రియైన దేవహూతింబరిణయంబగుటయు, దేవహూతిపరిచర్యలకు సంతసిల్లి కర్దముండునిజయోగకల్పితంబగు విమానంబునందునిలిచి సహస్రదాసీపరివృతయైన దేవహూతింగూడి భారతాదివర్షంబులుగలయ గ్రుమ్మరుటయు, దేవహూతికర్దమునివలనం గన్యకానవకంబునుం గపిలునిగనుటయును, దత్కన్యకావివాహంబును, గర్దమతపోయాత్రయును, గపిలదేవహూతిసంవాదంబు, శబ్దాదిపంచతన్మాత్రలజన్మప్రకారంబు, బ్రహ్మాండోత్పత్తియు, విరాట్పురుషకర్మేంద్రియపరమాత్మప్రకారంబును, బ్రకృతిపురుషవివేకంబు, నారాయణుని సర్వాంగస్తోత్రంబు, సాంఖ్యయోగంబు, భక్తియోగంబు, జీవునకైన గర్భసంభవప్రకారంబును, జంద్రసూర్యమార్గంబును, బితృమార్గంబు, దేవహూతి నిర్యాణంబును, గపిలమహామునితపంబునకుం జనుటయు, ననుకథలుగల

తృ తీ య స్కం ధ ము.

శ్రీకృష్ణార్పణమస్తు.

—❀❀❀—



## చతుర్థస్కంధప్రారంభము.

శ్రీవిలసితధరణీతన । యావదనసరోజవాసరాధిపనుతరా । జీవదళనయననిఖిల । ధరావరనుతసగుణధామరాఘవరామా॥
(వ॥ అమ్మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె నట్లు ప్రా
యోపవిష్టుండయిన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె* (సీ॥ జననాథవిదురునకును మను మైత్రేయమునినాథ
చంద్రుడిట్లనియె మఱల । స్వాయంభువునకర్థిశతరూపవలనను గూఁతులుమువ్వురాకూతి దేవ । హూతిప్రసూతులునొనరఁ
బ్రియవ్రతోత్తానపాదులను తనయయుగము । జనియింపఁగా నందు సంభవంబైన యాకూతిని సుమహితభాగ్యమతిని । ద
నకు సంతానవిస్తరార్థంబుగాఁగఁ బుత్రికాధర్మమొందియాపువ్వుఁబోఁడి । బ్రకటమూర్తిరుచిప్రజాపతికినిచ్చె । మనువుము
దమొందిశతరూపయనుమతింప* (వ॥ అట్లువివాహంబైన రుచిప్రజాపతిబ్రహ్మవర్చస్వియుఁ బరిపూర్ణగుణుండును గావునఁ
జిత్తైకాగ్రతంజేసి యాకూతియందు శ్రీవిష్ణుండు యజ్ఞరూపధరుండగు పురుషుండు గను జగదీశ్వరియగు నాదిలక్ష్మీయమ్మహా
త్మునకు నిత్యానపాయిని గావునఁ దదంశంబునఁ దక్షిణయను కన్యకారత్నంబుగను మిథునంబు సంభవించెనంబు స్వాయంభు
వుండు సంతుష్టాంతరంగుఁడగుచుఁ బుత్రికాపుత్రుండు వితతతేజుండునగు శ్రీవిష్ణుమూర్తిరూపుండగు యజ్ఞునిఁ దనగృహంబు
నకుఁ దెచ్చియును రుచియు దక్షిణయను కన్యకాలలామంబును దనయొద్దనునిలిపెనంత సకలమంత్రాధిదేవతయగు శ్రీయజ్ఞుం
డు దనుఁ బతిఁగాఁ గోరెడు దక్షిణయను కన్యకం బరిణయంబయ్యె వారు నామిథునంబు గావున నిషిద్ధంబు గాకుండెనని చెప్పి మై
త్రేయుండు వెండియు నిట్లనియె* (క॥ ధీమహితయంత వారల। యామాఖ్యలఁ గలుగు దేవతావళి గడఁకన్। వేమరు నభినందించు
చు। నామిథునమువలనఁ బుట్టెనతిబలయుతమై* (వ॥ వారు తోషుండు, ప్రతోషుండు, సంతోషుండు, భద్రుండు, శాంతియు, ని
డస్పతియు, నిధ్మండు, గవియు, విభుండు, వహ్నియు, సుదేవుండు, రోచనుండు, నన బన్నిద్దరు సంభవించిరి, వారలు స్వాయం
భువాంతరంబునం, దుషితులను దేవగణంబులై వెలసిరి మఱియు మరీచి ప్రముఖులైన మునీశ్వరులు యజ్ఞుండు దేవేంద్రుండు
మహాతేజస్సంపన్నులయిన ప్రియవ్రతోత్తానపాదులుం గలిగి పుత్రపౌత్రనప్తృవంశంబుల జేవ్యాప్తంబై యామన్వంత
రంబు పాలితంబగుచు వర్తించె మనువు ద్వితీయపుత్రియైన దేవహూతిం గర్దమునకిచ్చి తద్వంశవిస్తారంబు గావించెనని మున్న
యెఱింగించితి నెండియు నమ్మనువు మూఁడవ కూఁతురైన ప్రసూతియను కన్యకను బ్రహ్మపుత్రుండగు దక్షప్రజాపతికిచ్చె నాద
క్షునకుం బ్రసూతివలన నుదయించిన ప్రజాపరంపరలచేత ముల్లోకంబులు విస్తృతంబులయ్యె మఱియుఁ గర్దమపుత్రికాసను
దయంబు బ్రహ్మర్షిభార్యలగుటం జేసి వారివలనం గలిగిన సంతానపరంపరల వివరించెద* (సీ॥ ఘనుఁడా మరీచికిఁ గర్దమాత్మ

✽ కర్దమప్రజాపతిసంతతిని దెలుపుట, ✽

జయను కళయను కన్యకవలనఁ గశ్య । పుండను కొడుకును బూర్ణిమయను నాడుబిడ్డయుఁ బుట్టిరి పేర్చి వారి । వలనఁ బుట్టిన ప్రజా
వళిపరంపరలచే భువనంబులెల్ల వాపూర్ణమగుచు । జరిగెను బూర్ణిమ కజన్మాంతరంబున హరిపదప్రక్షాళితాంబువులను । గంగ
యను పేరఁ బుట్టిన కన్య దేవ । కుల్యయను దాని నొక్క తెఁగూఁతు నఖిల । విష్టపవ్యాపకుండగు విరజుఁడనెడి । తనయు నొక్కనిఁ
గాంచె మోదంబుతోడ* (క॥ అనఘుండత్రి మహాముని। యనసూయా దేవివలన హర్యజపురసూ। దనుల కళాంశంబుల నంద
నులను ముప్పురను గాంచె దత్తదయుఁ బ్రీతిన్* (క॥ అనవుడు విదురుఁడు మైత్రే। యునిఁ గనుఁగొని పలికె మునిజనోత్తమ జగతిన్ జ
ననస్థితిలయకారణులన వెలసిన పద్మగర్భహరిహరులెలమిన్* (క॥ ఏమినిమిత్తంబత్రిమ। హామునిమందిరమునందు ననసూ
యకును బ్రద్ధామగుణులుదయమయిరన। నామైత్రేయుండు వలికె నవ్విదురునితోన్* (సీ॥ సుచరిత్ర వినువిధిచోదితుండయి యత్రి
దపమాచరింపఁగాం దా సమేతుఁ । డయి ఋక్షనామకులాద్రితటంబునను మధు । రావసంకులపిలోల । కల్లోలజాలసం
కలితనిర్వింధ్యానదీజలపరిపుష్టరాజితప్ర । సూనగుచ్ఛస్వచ్ఛమానితాశోకపలాశకాంతారస్థలమునఁ గెలమి। నరిగియచ్చట
నిర్ద్వంద్వుఁడగుచుఁ బ్రాణనియమమున నేకాంఘ్రి చేసి లిబి గాలి । దివుటఁ గ్రోలి కృశీభూతదేహుఁడగుచుఁ। దపముఁ గావిం
చె దివ్యవత్సరశతతంబు* (వ॥ ఇట్లతిఘోరంబైన తపంబు సేయుచుఁ గనదిత్తంబున* (క॥ ఏవిభుఁడు జగదధీశ్వరుఁ। డావిభుశర
ణంబుఁ జొత్తునతఁ డాత్మసమంబయి వెలసిన సంతతిని ద । యావరమతి నిచ్చుఁ గాక యనితలఁచునెడన్* (చ॥ మునుకొనియ
త్తపోధనుని మూర్ధజమైన తపఃకృశానుచే। తనుద్రిజగంబులుం గఱగి తప్తములైననుజూచి పంకజా। సనమురశాసనత్రిపురశా
సనులచ్చటికేగిరప్సరో । జనసురసిద్ధసాధ్యమునిసన్నుతభూరియశోభిరాములై* (వ॥ అట్లు మునీంద్రునాశ్రమంబుఁ డా

యంజనునవపరంబున* (చ॥ అనఘుతపోభిరాముఁడగు నత్రిమునీంద్రుఁడు గాంచె దత్తశాం చనఘునచంద్రికారుచిరచారుశ
రీరుల హంసనాగసూ। దనవృషభేంద్రవాహులను దారకసుండలుచక్రశూలసా । ధనులవిరించివిష్ణుపురదాహులవాక్కను
లాంబికేశులన్* (వ॥ మఱియుఁగృపావలోకనసుందరహాససుందరవదనారవిందంబులుగల మహాత్ములకర్మిందియముందానం
దకందళితహృదయారవిందుండై సాష్టాంగదండప్రణామంబులాచరించి నిటలతటఘటితకరపుటుండై దుర్నిరీక్ష్యంబైనతత్తే
జోవిశేషంబుఁ దేరిచూడంజాలక ముకుళితనేత్రుండై తత్పదాయత్తచిత్తుండగుచు సర్వలోకప్రశస్యంబులైన మృదుమధురగం
భీరభాషణంబులనిట్లని స్తుతియించె* (సీ॥ ప్రతికల్పమందు సర్వప్రపంచోద్భవస్థితివినాశంబులఁ జేయునట్టి। మహితమాయా
గుణమయదేహములఁ బొల్చునజవాసుదేవశివాభిధాన । ములుగల్గుమీపాదజలజాతములకేను నతిభక్తివందనంబాచరింతు।
నఖిలచేతనమనస్సాగమ్యమున నొప్పు మూర్తులుగల్గునీముగ్వురందుఁ । బరగనాచేతఁ బిలువంగఁబడినధీరుఁ । డెవ్వఁడేనొ
క్కరునిఁ బిల్వనిపుడు మీరు। ముగ్వురేతెంచుటకు నాదు బుద్ధిసమ్మి। యంబుగదిరేడిఁ జెప్పఁగేయనఘులార* (వ॥ అదియునుంగా
కసంతానార్థంబు నానావిధపూజలు గావించి నాదిత్తంబునధరియించిన మహాత్ముండొక్కరుండయ్యును నమ్ముగ్వురు విబుధ
శ్రేష్ఠులు ప్రశస్యమాననపోవిభవంబుగలయతనింగనుంగొని సుధామాధుర్యసమంబులయినవాక్యంబులనిట్లనిరి* (క॥ వినుమేము
ముగ్వురయ్యును। ననుపమమతిఁ దలఁపనేకమైయుందుము నీ। మనమున నేనిఁగోరితి । వనయము నాకోరిక సఫలమ
య్యెడుఁజుమ్మీ* (క॥ మాముగ్వురయంశంబుల। ధీమంతులగుసుతులుపుట్టి త్రిభువనములలో। నీమంగళగుణకీర్తి। శ్రీమహితము
సేయఁగలరు సిద్ధము సుమ్మీ* (క॥ అనిమునిచంద్రుఁడుతనమన। మునఁ గామించినవరంబు బుధవరులుముదం। బునఁనొసఁగియత
నిసతుఁబ్రజనములఁ బరితృప్తులగుచుఁ జనిరియథేచ్ఛన్* (ఉ॥ ఆసుచరిత్రదంపతులు దంచితలీలఁ గనుంగొనంగన। బ్జాసనుసంశ
మందు నమృతాంశుఁడు విష్ణుకళన్ సయోగవి। ద్యాసుభగుండు దత్తుఁడు పురాంతకభూరికళాంశమందు దు। ర్వాసుఁడు నైజ
సందరనవద్యపవిత్రచరిత్రులిమ్ములన్* (క॥ అంగిరసుఁడనెడుమునికిఁ గు। లాంగనయగు శ్రద్ధయందు నందితసౌంద। ర్యాంగ
లుగూఁతులు నలువురు। మంగళవతులుదయమైరిమాన్యచరిత్రా* (క॥ వారు సినీవాలియునుగు। హూరాకామసమతులనఁగనొ
ప్పిరిమఱియుం। గోరసుతయుగముగలిగెను। స్వారోచిషమనువువేళశస్తఖ్యాతిన్* (వ॥ వారలెవ్వరనిన భగవంతుండగునుచ
థ్యుండు బ్రహ్మనిష్ఠుండగు బృహస్పతియునననుం బ్రసిద్ధివహించిరి పులస్త్యుండు హవిర్భుక్కను నిజభార్యయందు నగస్త్యునిం బు
ట్టించెనాయగస్త్యుండు జన్మాంతరంబున జఠరాగ్నిరూపంబై ప్రవర్తించె వెండియు నాపులస్త్యుండు విశ్రవసునింగలిగించె నా
విశ్రవసునకు నిలబిలయను భార్యవలన గుబేరుండు కైకసియనుదానివలన రావణకుంభకర్ణవిభీషణులు పుట్టిరి పులహునకుఁ గ
తియను భార్యయందుఁ గర్మశ్రేష్ఠుండు వరీయాంసుండు సహిష్ణుండు ననుముగ్వురు కొడుకులు జనియించిరి మఱియుఁ గ్రతువు
నకుఁ గ్రియయను భార్యయందు బ్రహ్మతేజంబున జ్వలింపుచున్న షష్టిసహస్రసంఖ్యలుగల వాలఖిల్యులను మహర్షులుగలిగి
రి వసిష్ఠుండూర్జయను భార్యయందుఁ జిత్రకేతుండును రోచియు విరజుండు మిత్రుండు నుల్బణుండు వసుభృద్ధ్యానుండు ద్యు
మంతుండునను సప్తఋషులను భార్యాంతరంబున శక్తిప్రముఖపుత్రులం బుట్టించె నథర్వుండను వానికిఁ జిత్తియను భార్య
యందు ధృతవ్రతుండును శ్వశిరస్కుండయిన దధ్యంచుండును బుట్టె మహాత్ముండగు భృగువు ఖ్యాతియనుపత్నియందు ధాత
యు విధాతయునను పుత్రద్వయంబును భగవత్పరాయణయగు శ్రీయనుకన్యకం బుట్టించె నాధాతృవిధాతృలు మేరువనువా
నిపుత్రులయిన యాయతినియతులను భార్యలవలన మృకండు ప్రాణులను కొడుకులం బుట్టించిరందు మృకండునకు మార్కం
డేయుండును బ్రాణునకు వేదశిరుండనుమునియుం బుట్టిరి భార్గవునకు శయనయనుకన్యయందుఁ గవియనువాఁడు పుట్టె నిట్లు
కర్దమదుహితలయిన కన్యకానవకంబువలనం గలిగిన సంతానపరంపరలచేత సమస్తలోకంబులు పరిపూర్ణంబులయ్యె నిట్టిప
ట్టుపాపహరంబు శ్రేష్ఠతమంబు నయిన కర్దమదౌహిత్రసంతానప్రకారంబు శ్రద్ధాగరిష్ఠచిత్తుండవు నీకుం జెప్పితి నింక దక్ష
ప్రజాపతివంశంబెఱింగింతు వినుము* (క॥ వనజజునివలన భవమం। దిన యాదక్షప్రజాపతికి మనునిజనం। దనయగు ప్రసూతిస

—*దక్షప్రజాపతిసంతతినిఁ దెలియఁజేయుట*—

తియం। దనఘా పదియాఱ్వురు దయవనదిరికన్యల్* (వ॥ ఇట్లావిర్భవించినకన్యకలందు శ్రద్ధయు, మైత్రియు, దయయు, శాం
తియుఁ, దుష్టియుఁ, బుష్టియుఁ, గ్రియయు, నున్నతియు, బుద్ధియు, మేధయుఁ, దితిక్షయు, హ్రీయు, మూర్తియు ననునామంబులుగ
లపదమువ్వురను ధర్మరాజునకిచ్చె నొక్కకన్యకనగ్నిదేవునకు నొక్కతెం బితృలకు నొక్కతెఁ జన్మమరణాదినివర్తకుండగు నభ
వునకుం బెండ్లిసేసెనంత నా ధర్మపత్నులయందు శ్రద్ధవలన శ్రుతంబు, మైత్రివలన ప్రసాదంబు, దయవలన భయంబు, శాంతివల
న సుఖంబుఁ, దుష్టివలన ముదంబుఁ, బుష్టివలన స్మయంబు, గ్రియవలన యోగంబు, నున్నతివలన దర్పంబు, బుద్ధివలన నర్థంబు,
మేధవలన స్మృతియుఁ, దితిక్షవలన క్షేమంబు, హ్రీవలన ప్రశ్రయంబు, మూర్తివలన సకలకల్యాణగుణోత్పత్తిస్థానభూతులగు

నరనారాయణులగు ఋషులిద్దఱు సంభవించిరి వారలజన్మకాలంబున* (సీ॥ గంధవాహుండు మందగతిననుకూలుండై వీచె నె
మ్మదిదిశల్విశదములుగ। నఖిలలోకంబులు నానందమునుబొందె దుములమై దేవదుందుభులు మ్రోసె। గరము మొప్పజలధు
లకలంకలడంగెను మించినగతిఁబ్రవహించె నదులు। గంధర్వకిన్నరగానముల్వీతెంచె నప్సరోజనులు నృత్యంబులూనరె। సురలు
గురియించిరంతంతవిరులవాన, మునిజనంబులు సంతోషమునుజెలంగి। వినుతులొనరించిరవ్విశ్వవిశ్వమెల్లఁ। బరమమంగళ
మైయొప్పె భవ్యచరిత* (వ॥ ఆసమయంబున బ్రహ్మాదిదేవతలమ్మహాత్ములకడకుంజనుదెంచి యుల్లసస్తుతియించిరి* (సీ॥ గగ
నస్థలింపోచుగంధర్వనగరాదిరూపభేదములట్లరూఢీ మెఱసి। మేయాత్మయందేని యేపారమాయచే నీవిశ్వమిటు రచియింపఁ
బడియె। నట్టియాత్మప్రకాశార్థమైమునిరూపమున ధర్మగృహమునఁబుట్టినట్టి। పరమపురుష నీకుఁబ్రణమిల్లెద మడియగాక
యీసృష్టిదుష్కర్మవృత్తింజనుగకయెయొందుకొఱకునై సత్వగుణము। చేసృజించిన యమ్మిట్లు శ్రీనివాస। మైనసరసీరుహప్ర
భనపహసించు మీకృపాలోకనంబులమిందికనుఁడు* (క॥ అనియిట్లు దేవగణములు। వినుతింపఁగృపాకటాక్షవీక్షణములచేఁ
గనివారు గంధమాదనమునకేఁగిరితండ్రియుఁడముముప్పరిగొనఁగ* (క॥ ధరణీభరముడుపుటకా। నరనారాయణులు భువిజ
నసనయముననిరి యర్జునకృష్ణాఖ్యులఁగురుయదువంశములసత్వగుణయశులగుచు* (వ॥ మఱియునగ్నిదేవునకు దక్షపు
త్రియైనస్వాహాదేవియనుభార్యయందు హుతభోజనులను పావకుండును బవమానుండును శుచియనను ముగ్వురుకొడుకులుగలి
గిరి వారివలనం బంచచత్వారింశత్సంఖ్యలుంగలయగ్నులుత్పన్నంబులయ్యె నిట్లు పితృపితామహయుక్తంబుగా నేకోనపం
చాశత్సంఖ్యలుగలయగ్నులు బ్రహ్మవాదులచే యజ్ఞకర్మంబులందగ్నిదేవతాకంబులయిన యిష్టులు తత్తన్నామంబులచేతఁ జే
యంబడుచుండు నాయగ్నులెవ్వరనిన నగ్నిష్వాత్తులుబర్హిషదులు సౌమ్యులు పితృలు నాజ్యపులు సాగ్నులు నిరగ్నులు నన
నేను లెఱుంగులై యుండురు దాక్షాయణియగు స్వధయను ధర్మపత్నియందు వారలవలన వయునయు ధారిణియునను నిద్దఱుకన్య
లుదయించి జ్ఞానవిజ్ఞానపారగలగుచు బ్రహ్మనిష్ఠలై యుపరగిరి వెండియు* (సీ॥ దక్షప్రజాపతితనయ యభవునిభార్య యనఁ

—* ఈశ్వరునకుదక్షప్రజాపతికివిరోధముసంభవించినకథ. *—

గాఁదగు సతియనులతాంగి। సతతంబుపతిభక్తిసల్పుచుండియుఁ దనుజాతిలాభమునందఁ జాలదయ్యె। భర్గునిదెసఁ జాలఁ
బ్రతికూలుఁడైనట్టి తనతండ్రిమీఁది రోషమునఁ జేసి। వలనేది తాముగ్ధవలెనిజయోగమార్గంబున నాత్మదేహంబువిడిచె। నని
మునీంద్రుఁడుపనుపింపనమ్మహాత్ముఁడయినవిదురుండు మానమున నచ్యుతాంబ। గమురఁ దత్కథవిన వేడ్కఁగడలుకొనఁగ। ముని
వరేణ్యునకు జూచియిట్లనియె మఱియు* (సీ॥ చతురాత్మమహితవత్సలుఁడైన దక్షుండు తనకూఁతు సతినాదరముఁజేసి। య
నయంబునఖిలచరాచరగురుఁడు నిర్వైరుండు శాంతవిగ్రహుఁడుఘనుఁడు। జగములకెల్లనుజర్చింపఁ దేవుండు నంచితాత్మా
రాముఁడఖిలమూర్తి। శీలవంతులలోనఁ శ్రేష్ఠుండునగునట్టి భవునందు విద్వేషపడుటకేమి। కారణముసతితానేమికారణము
న। విడువరానట్టిప్రాణముల్విడిచెనఁటియు। శ్వశురజామాతృవిద్వేషసరణినాకుఁదెలియనానతియిమ్ము సుధీవిధేయ* (క॥ అ
నియడిగినయవ్విదురునకుఁ। గనుగొని మైత్రేయుఁడనియెఁ గౌతుకమొప్ప। న్విను మనఘ తొల్లి బ్రహ్మలు। జనసుతముగఁజేయున
ట్టిసత్రముఁజూడఁగ* (చ॥ సరసిజగర్భయోగిజనశర్వసుపర్వమునీంద్రహవ్యభు। క్పరమఋషి ప్రజాపతులు భక్తిమెయిం
జనుదెంచియుండన। త్తరణిసమానతేజుఁడగుదక్షుఁడు వచ్చినదత్సదస్యులా। దరమునలేచిరప్పుడుపితామహ భర్గులుతక్క
నందఱు* (క॥ చనుదెంచిన యాదక్షుఁడు। వనజజునకు మ్రొక్కిభక్తివశులైసభ్యుల్దనకిచ్చినపూజలుకై। కొనియవ్వాసన
మునందుఁ గూర్చుండితఁగ* (గీ॥ తన్నుఁ బొడగనిసభ్యులందఱును లేవ। నాసనముదిగనట్టివురారివలనుఁ। గన్నుఁగవలను విస్ఫు
లింగములు చెదరఁ। జూచియిట్లనురోషవిస్ఫురణమెఱయ* (గీ॥ వినుఁడు మీరలు రోదమానివిబుధమునిసమూహ। తాశనాదిసురోత్త
ములార మోహ। మత్సరోక్తులుకావునామాటలనుచు। వారికందఱికాపురవైరిఁజూపి* (సీ॥ పరికింపనితఁడు దిక్పాలయశో
హానికరుఁడీక్రియాశూన్యపరునిచేతఁ। గరమొప్పసజ్జనాచరితమార్గముదూషితంబయ్యెనెన్నగతత్రపుండు। మహితసావి
త్రీసమాననుసాధ్వినస్మత్తనూజను మృగశాబనేత్ర। సకలభూమీసురజనసమక్షమున నగ్నిటలోచనుఁడుకరగ్రహణము
ధీరఁ జేసి తాశిష్యభావంబుఁ జెందుటాత్మ। దలఁచి ప్రత్యుద్గమాభివందనము లెలమి। నడువఁగొంచెనమ్మనెవినతుఁడుకాక। నో
రిమాటకుఁ దనకేమిగోరువోయె* (సీ॥ అనయంబులుప్తక్రియాకలాపుఁడు మానహీనుఁడు మర్యాదలేనివాఁడు। మత్తప్ర
చారుఁడున్మత్తప్రియుఁడు దిగంబరుఁడు భూతప్రేతపరివృతుండు। తామసప్రమథభూతములకు నాథుండు భూతిలిప్తుండస్థి
భూషణుండు। నష్టశౌచుండునున్మదనాంగుఁడునుదుష్టహృదయుండునుగ్రవరేతభూమి। కేతనుఁడుపితశ్మశ్రుకేశుఁడగుచు।
యయినయితనికిశివనాముఁడనుప్రవాద। మెటులఁగలిగెనశివుఁడగునితనినెఱిఁగి। యెఱిఁగి వేదంబు శూద్రునకిచ్చినటుల*
(వ॥ ఇతనికినస్మత్తనయనుపిధిప్రేరితుండనై యిచ్చితి* (క॥ అనియిట్టులు ప్రతికూలవ। చనములుదక్షుండుపలికిశపియింతును

శీర్ష్యాదినంజలములుగొని కరమునసలిదియిట్లనె రోషమునననఘాత్మా ✻ (క॥ ఇతఁడింద్రోపేంద్రపరీ। వృతుఁడై మఖసమయ
మునహవిర్భాగము దే। వతలంగూడఁగ నిహతని। యతిఁబొందకయుండుఁగాక యనిశపియించెన్ ✻ (వ॥ఇట్లుదక్షుండుపల్కి
నగర్హితవాక్యంబులు విగర్హితంబులుగనుండిన యథార్థంబునగా స్తవంబులగుమ భగవంతుండగు రుద్రునందున నిందితంబు
లై స్తుతిరూపంబులకొప్పుఁదదనంతరంబ రుద్రునకు శాపంబిచ్చి దక్షుండు సదస్యముఖ్యులచే నకృత్యంబని నిషేధింపంబడి ప్ర
వృద్ధంబయిన క్రోధంబుతోడ నిజనివాసంబునకుం జనియెనంత గిరిశానుచరాగ్రేసరుండగు నందికేశ్వరుండు దక్షుండిటులా
క్రుళి శపించిన శాపంబునతనిఁబల్కిన యసహ్యవాక్యంబులువిని కోపారుణితలోచనుండై యిట్లను నీదక్షుండు మర్త్య
శరీరంబు శ్రేష్ఠంబుగాఁదలంచి యప్రతిద్రోహియయిన భగవంతునందు భేదదర్శియై యపగాఢంబుఁగాపించె నట్టిమూఢా
త్ముండు తత్త్వవిముఖుండగు నటియుంగూటధర్మంబులయిననివాసంబుల గ్రామ్యసుఖాసక్తులంజేసి సక్తుండై యర్థవాదం
బులయిన వేదంబులచేతనష్టమనీషంగలిగి కర్మతంత్రంబు విస్తృతంబుసేయుచు దేహాదికంబులు నుపాదేయంబులుగాఁ దలఁచు
దుర్బుద్ధిచేత నాత్మతత్త్వంబునవివర్తించి పశుప్రాయుండై స్త్రీకాముండునగుచుండియునుంగాక దక్షుండు చిరకాలంబున మే
షముఖుండగునని మఱియు ✻ (మ॥అనయంబుం దనమానసంబున నవిద్యన్ముఖ్యతత్త్వంబుగాఁ। గని గౌరీశుఁదిరస్కరించిన యస
త్కర్మాత్ము నీదక్షుఁడా। ననువర్తించినవాఁడు సంసరణకర్మారంభుఁడై నిచ్చలు। జననంబందుచుఁజచ్చుచున్మఱలనో జంబు
ట్టుచున్వర్తిలున్ ✻ (వ॥అదియునుంగాక యీహరద్వేషులైనద్విజులర్థవాదబహుళంబులైన వేదవాక్యంబులవలన మధుగంధ
సమంబైన చిత్తక్షోభంబుచేత విమోహితమనస్కులై కర్మాసక్తులగుదురు మఱియును భక్ష్యాభక్ష్యవిచారశూన్యులై దే
హాదిపోషణంబుకొఱకు ధరియింపఁబడు విద్యాతపోవ్రతంబులుగలవారలై ధనదేహేంద్రియంబులయందుఁ బ్రీతింబొంది
యాచకులై విహరింతురనిన నందికేశ్వరుండు బ్రాహ్మణజనంబుల శపియించిన వచనంబులువిని భృగుమహాముని మఱల శపియిం
పంబూని యిట్లనియె ✻ (గీ॥వసుధనెవ్వారు ధూర్జటివ్రతులు వారు। వారికనుకూలురగుచు నెవ్వారువారు వార। లట్టి సచ్ఛాస్త్రపరి
పంథులైనవారు। నవని పాషండులయ్యెదరని శపించె ✻ (సీ॥సకలవర్ణాశ్రమాచారహేతువు లోకములకు మంగళమార్గమును
సనాతన। మును పూర్వఋషిసమ్మతము జనార్దన మూలమును నిత్యమును శుద్ధమును శివంబు। నార్యపథానుగంబగు వేదమును
విప్రగణమునిందించిన కారణమున। నే శివదీక్షయందేనిమత్స్యమపూజ్యులై భూతపతి దైవమగుచునుండు। నంత నీరలు భ
స్మజటాస్థిధారణములం దగి మూఢబుద్ధులు నష్టశౌచు। లైన శంకరుపాషండులగుచు నరుచు। శాపమొనరించె నాద్విజసత్త
ముండు ✻ (వ॥ఇట్లన్యోన్యంబును శాపంబులం బొందియు భగవదనుగ్రహంబుగలవారలగుటంజేసి నాశంబునొందరైరంతవి
మనస్కుండగుచు నప్పుడతసమేతుండై భవుండు సనియెనంత ✻ (సీ॥ అనఘాత్మ యేయజ్ఞమందు సర్వశ్రేష్ఠుండగు హరిసంపూ
జ్యుఁడై వెలుంగు। నట్టియజ్ఞంబు సమ్యగ్విధానమున సహస్రవత్సరములు నజుఁడొనర్చెఁ। గర మొప్పు నమరగంగాయమునాసం
గమంబునఁ గలుగు ప్రయాగయందు। నవభృథస్నానంబుల భక్తిగావించి గతకల్మషాత్ములై ఘనత కెక్కి। తగ నిజాశ్రమ
భూములఁ దలఁచి వారలందఱును వేడ్కతోఁ జనిరనుచు విదురు। నకును మైత్రేయుఁడను మునినాయకుండు। నెఱుఁగ వినిపించి

—✻ దక్షప్రజాపతియజ్ఞముఁ జేయునపుడు దాక్షాయణీయచ్చటికిఁబోవుట. ✻—

వెండియు నిట్లనియె ✻ (వ॥ అంతశ్వశురుండ సదక్షునకుఁ జామాతయైన భర్గునకున న్యోన్యవిరోధంబులు పెరుగుచుండ నతి
చిరంబగు కాలంబరిగె నంత దక్షుండు రుద్రవిహీనంబగు యాగంబు లేనిదియైనను శర్వుతోడి పూర్వవిరోధంబున నుబరమేష్ఠి
కృతంబైన సకలప్రజాపతి విభుత్వగర్వంబునంజేసి బ్రహ్మనిష్ఠులగు నీశ్వరాదులు ధిక్కరించి యరుద్రంబుగా వాజపేయసవ
నంబు గావించి తదనంతరంబ బృహస్పతిసవననామకంబయిన మఖంబు సేయనుపక్రమించిన నచ్చటికిం బ్రగమంబున ✻ (చ॥ కర
మనురక్తి నమ్మఖము గన్గొను వేడుక దోఁగలింపఁగాఁ। బరఁగ మునిప్రజాపతి సుపర్వమహర్షివరుల్ సభాగ్యులై। పరువడి వచ్చి
యందు శుభస్థితి దీవనలిచ్చి దక్షుచేఁ। బొరిఁబొరి నచ్చట న్విహితపూజలనొందిరి సమ్మదంబునన్ ✻ (గీ॥ దక్షుతనయ సతీదేవి
తపిలి యాత్మ। సదనమున నుండి జనకుని సవనమహిమ। గగనచరులును తింపనాకలకలంబు। వినుచు తత్సాహసమొప్పఁగ విన్నజా
డ ✻ (వ॥ అయ్యవసరంబున దక్షసవదర్శన కుతూహలులై సర్వదిక్కులవారును జనుసమయంబున ✻ (సీ॥తనరారు నవరత్న
తాటంకరోచులు చెక్కుటద్దములతోఁ జెలిమి సేయ। మోహనీయ తపనీయమయ పతకద్యుతులంసభాగంబుల నావరింప। నంచిత
చీనిచీనాంబరప్రభలతో మేఖలకాంతులు మేలమాడఁ। జంచలసారంగచారువిలోచనప్రభలు నల్దిక్కులఁ బ్రబ్బికొనఁగ।
మించు వేడుక భర్తృసమేతముగను। మానితములైన దివ్యవిమానయాన। లగుచు నాకాశపథమున నరుగుచున్న। ఖచరగంధ
ర్వకిన్నరాంగనలఁ జూచి ✻ (క॥ సతి తనపతి యగు నాపశు। పతిఁ జూచి సముత్సుకమున భాషించెఁ బ్రజాపతి మీమామ మఖము।
ప్రతమతి నొనరింపుచున్నవాఁడఁట వింటిరే ✻ (క॥ కావున నయ్యజ్ఞమునకు। నీ విబుధగణంబులర్థి నేగెదరిది గో। దేవ మన మిప్పడ

చటికిఁ బోవలెనని వేడ్క నాకుం బుట్టెడు భవా * (క॥ ఆయజ్ఞముఁ గనుఁగొనఁ గా । నాయనుజలు భక్తిఁ బ్రాణనాథులతో
డ। న్బ్రియకై వత్తురు మానము। న్బ్రాయిన నేవారి నచటఁ బొడఁగనఁ గల్గున్ * (క॥ జనకుని మఖమునకర్థిం। జన దివిఁ బోఁ బ్రాణిబహుసం
జ్ఞికములచేఁ। దనరిన భూషణములఁ గై। కొన వేడ్కఁ జనిం చెలీశకుజన నాశా * (క॥ నాతోడి స్నేహముగల। మాతృపదత్వోస్వసరీ
సమాజము ఋషిసంఘాతకృతమఖసమంచిత। కేతువుఁ గన వేడ్క గగనకేశజ యంచెన్ * (వ॥ అదియునుం గాక దేవా మహై
శ్వర్యకరంబై గుణత్రయాత్మకంబగు ప్రపంచంబు భవదీయమాయాపినిర్మితంబగుటం జేసి నీకు నైశ్వర్యకరంబు గాదయిన
ను భవదీయతత్త్వంబెఱుంగఁజాలక కామినీస్వభావంబు గలిగి కృపణురాలయిన మదీయజన్మభూమిఁ గనుంగొన నిచ్ఛయించి
తిననిఁ జెండియు నిట్లనియె * (చ॥ ముదమునఁ దన్మఖోద్భవవిభూతిఁ గనుంగొన నన్యకామిను। ల్పతులుఁ గట్టి భూషణవిభాసిత
లై నిజనాథయుక్తలై। మదకలహంసపాండురసమంచితదివ్యవిమానయానలై। యదె చనుచున్న వారు గను మభ్రపథంబున
నీలకంఠరా * (క॥ అనఘా వినులోకంబుల। జనకుని గేహమునఁ గలుగు సకలసుఖంబుల్ దనయలు చని సంప్రీతిఁ। గ్గనుఁగొనకే రీతిను
ల్చుఁ గాయముల భవా * (క॥ అనయముఁ బిలువక యుండ। న్జననను బితమంటి వేనిజనక గురుసుహృజ్జననాయక గేహములకుఁ।
జనుచుందురు పిలువకున్న సజ్జనుల భవా * (వ॥ అని మఱియు నిట్లనియె దేవా నాయందుఁ బ్రసన్నుండవై మదీయమనోరథం
బుదీర్పనర్హుండవు సమధికజ్ఞానంబు గలనీచేత నేను భవదీయదేహంబునం దర్ధంబు నధరియింపంబడితి నట్టి నన్ను ననుగ్రహింప
వలయునని ప్రార్థించిన మందస్మితవదనారవిందుండగుచు జగత్స్రష్టల సమక్షంబున దక్షుం డానాఁడు నమర్మభేదంబులయిన
దురుక్తవాక్యసాయకంబుల దలంచుచు నిట్లనియె * (సీ॥ కల్యాణి నీమాటగడునొప్పు బంధువుల్ పిలువకుండిననుసంప్రీతిఁ జను
దు। రంతియ యది లెస్సరైన దేహాభిమానమదమున నమర్షమునను। గడఁది యారోపితఘనకోపదృష్టులు గారేని బోఁ దగుఁ
గాని వినుము। వినుతవిద్యాతపోవిత్తవయోరూపకులములు సుజనులకనుగుణంబు। లివియ కుజనులయెడ దోషహేతుకంబు।
లై వివేకంబు చెఱుపు మహాత్ములైన। వారి మాహాత్మ్యమాత్మగర్వమునఁ జేసి। జడులు చూడఁగానఁ జాలరు జలజనేత్ర * (క॥ విను
మాట్లు కుజనులగుచు। గ్జనులగృహంబులకు బంధుసరణిని బోవ। న్జనదు వినీతుల కిదికదు। నను దితమైనట్లయుండునది యెట్లని
న్నా * (గీ॥ కుటిలబుద్ధులైన కుజనులయిండ్లకు। నాప్తులైనవారి నాదరిమ న। బోవలుముడివడం భూరిరోషాక్షులై। చూతుర
దియుఁ గాక నుదతి వినుము * (చ॥ సహదరిపుప్రయుక్తపటుసాయకజర్జరితాంగుఁ డయ్యు దుఃఖమును దొఱంగి నిద్రఁ గను గా
ని కృశింపఁడు మానవుం డనో। యుగ విను మిష్టబాంధవసురుక్తులు మర్మములంట నాటఁజి। త్తము నవహన్నిశంబు పరితాప
మునొంది కృశించు నెప్పుడున్ * (క॥ వినుము తత్కృష్టుండగుద। క్షునికిఁ దమూభవలఁగోనఁ గూరిమిసుతవై। నను నాసంబంధం
బున। జనకుచే బూజవడయజాలవు తరుణీ * (వ॥ అదియునుంగాక తనచేత భవత్సంబంధంబునం జేసి పూజఁబడయమికి నతనికి నీకుని
రోధంబునకు హేతువెట్టిద యంటివేని * (మ॥ నిరహంకారమహాస్సమృద్ధిసుజనానందోల్లసత్కీర్తియుం। ధరఁ గామిందియ
శక్తులై మనముల స్వాందహ్యమానేంద్రియా। తురులై కొందఱు దుచ్చరింతురు మహాత్ముండీశ్వరుండై నయా। హరితో బద్ధవిరో
ధము న్దొడనరు దైత్యశ్రేణిచందంబునన్ * (వ॥ అదియునుం గాక నీపతనికిం బ్రత్యుత్థానాభివందనంబులుఁ గావింపకుండుటం జే
సియతండు తిరస్కృతుండయ్యె నంటివేని లోకంబుల జనులన్యోన్యంబును బ్రత్యుత్థానాభివందనంబులు గావింతురదియ
ప్రాజ్ఞులయినవారు సర్వభూతాంతర్యామియయిన పరమపురుషుండు నిత్యపరిపూర్ణుండు గావునఁ గాయిక వ్యాపారంబ
యుక్తంబని తదుద్దేశంబుగా మానసంబులంగా నమస్కారాదికంబులు గావింతురు కాని దేహాభిమానంబులు గలుగు పురుషులం
దుఁ గావింపరు గాన నేనును వాసుదేవశబ్దవాచ్యుండు శుద్ధసత్త్వమయుండు నంతఃకరణంబునందు నావరణవిరహితుండు నయి
ప్రకాశించు వాసుదేవునకు నాహృదయంబున నమస్కరింపుచుండుదు నిట్లనపరాధియయిన నన్నుఁ బూర్వంబున బ్రహ్మలు
సేయు సత్రంబునందు దురుక్తులం జేసి పరాభవించిన మద్ద్వేషియయిన దక్షుండు భవజ్జనకుండయ్యు నతఁడును దదనువర్తనుల
యినవారలును జూడఁదగరు గావున మద్వచనాతిక్రమంబుం జేసి యరిగితి వేని యచటనీకుఁ బరాభవంబు సంప్రాప్తంబగు లో
కంబున బంధుజనులవలనఁ బూజవడయక తిరస్కారంబునొందుట చచ్చుటయకాదే యని పలికి మఱియు నభవుండు పొమ్మ
నియనుజ్ఞనిచ్చిన నచ్చట నవమానంబునం జేసి యశుభంబగునని యు నిచ్చట బొమ్మనక నివారించిన మనోవేదనయగునని
యుమానసంబునఁ దలపోయుచు నూరకుండెనంత * (సీ॥ పతిసుహృద్దర్శనేచ్ఛాప్రతికూలనిఃశ్వాసయగుచు నంగములు వడఁ
కి నుండందఁ దొరిఁగెడు నశ్రుపూరంబులు గండభాగంబులఁ గడలుకొనఁగ। నున్నతస్తనమండలోపరిహారము ల్వేడినిట్టూర్పుల
వెచ్చఁగంద। నతిశోకరోషాకులాత్యంతదోధూయమానమై హృదయంబు మలఁగుచుండ। మఱియుఁ గుపితాత్మయై స్వసమాన
రహితు। నాత్మదేహంబు సగమిచ్చినట్టిధవుని। విడిచి దమూఢాత్మయగుచు నవ్వేలఁది సనియె। జనకుఁ జూచెడు వేడుక సందడింప *
(సీ॥ మానిని చనుచుండ మణిమన్మథాది సహస్రసంఖ్యాత రుద్రానుచరులు। యక్షులు నిర్భయులై వృషభేంద్రుని మున్నిడి

కొనుచు నమ్ముదిత దాల్భ్యక నకశాంబుజశారికా తాళవృంతదర్పణ ధవళాతపత్ర ప్రసూన । మాలికా సౌవర్ణ నానావిధ భూషణ ఘనసార కస్తూరికా చందనాది వస్తువులం గొంచు వేగిరమ్మునం గదిసి । శంఖ దుందుభి వేణు నిస్వనము లొప్ప । మానితంబైన వృషభేంద్రయానంజేసి । యజ్ఞభూమార్గులై యర్థిని నేగి యరిగి ॥ ముంగట* (చ॥ ఘనమున మోదమందుచును మాతరుణీమణి గాంచె జాముహ్వత్ర నకుశాజి నాయసని కాయవినిర్మిత పాత్రసీమము । స్ననుపమ వేదఘోష సుమహత్స్వబంధనకర్మ భూమము ముని విబుధాభిరామము సముజ్జ్వల హోమము యాగధామమున్* (వ॥ ఇట్లు గనుంగొని యజ్ఞశాలం బ్రవేశించిన* (క॥ చనుదెంచిన యమ్మగువను । జనని యు సోదరులు దక్క సభ గల జనులెల్ల నుదక్షుని వలని భయమున నన్నయము నపుడాదరింపరైరి మహాత్మా* (క॥ మఱి దల్లియు బినతల్లులు । పరిరంభణమాచరింపం బరితోషాశ్రు ప్రవాహ లగద్గద్గదక్తికతో । సరసజముఖి సేమమరయ సరదానర్తక* (క॥ జనకుండవమానించుట । యును సోదరలర్థిం దనకును నుచితక్రియం జే । సినపూజలనంకశోభనమరసినమా ఉమా దాంబులుక కనుండెక* (వ॥ ఇట్లు దండ్రిచే నాదరింపంబడని దై విభుం డైన యీశ్వరునంకు నాహ్వానక్రియాశూన్యత్వరూపంబైన తిరస్కారంబున రుద్రభాగంబైన యజ్ఞంబు గనుంగొని నిజరోషానలంబున లోకంబులు భస్మంబు సేయంబూనిన తెఱంగున నుద్రేకించి రుద్రవిద్వేషియు గ్రశుకర్మాభ్యాస గర్వితుండు నగు దక్షుని వధియింతు మనుచు లేచిన భూతగణంబుల నివారించి రోషావ్యక్త భాషణంబుల నిట్లనియె లోకంబున శరీరధారులైన జీవులకుం బ్రియాత్ముకుండయి యీశ్వరు నకుం బ్రియాప్రియులు నధికులును లేరట్టి సకల కారణుండు నిర్మత్సరుండు నైన రుద్రునందు నీవు దక్క నెవ్వండు ప్రతికూలం బాచరించు నదియునుం గాక మీము బోంటివారలు పరులవలని గుణంబులందు దుర్గుణంబుల నారోపింతురు నీ యట్టిగొందఱు దృష్టులైనవారలు పరుల గుణంబులయందు దోషంబుల నాపాదింపరు కొందఱు సాధువర్తనంబు గలవారలు పరులదోషంబులనైన గుణంబులుగా ననుగ్రహింతురు నీ యట్టి గొందఱు త్తమోత్తములు పరులయందు దోషంబుల నాపాదింపక తుచ్ఛగుణంబులు గలిగినను సద్గుణంబులుగాఁ గైకొందు రట్టి మహాత్ములయందు నీవు పాపబుద్ధిం గావించితివని వెండియు నిట్లను మహాత్ములగువారల పాదధూళిచే నిరస్తప్రభావులై జడస్వభావంబు గల దేహంబు నాత్మయని పలుకు కుజనులగువారు మహాత్ములనిందించుట కార్యంబు గాదదియు వారికను చితంబగునని వెండియు నిట్లనియె* (సీ॥ అనయంబు శివయను నక్షరద్వయనామ వాక్యంబులుకక భావమునం దలంప । సర్వజీవుల పాపసంఘము లైచెడునట్టి మహాత్మునంచన మంగళుండ । వగు నీవు విద్వేషివగుట కాశ్చర్యంబు నందెద విను మునీవదియుం గాక । చర్చింప నెవ్వని చరణపద్మంబుల నరసి బ్రహ్మానందమను మరంద । ముల భక్తి నిదమహృదయంబుల నెడ । ముమ్మెరలచేత గ్రోలి సంతుష్టచిత్తులగుచు నత్యంత విజ్ఞానులట్టి జేవు । నంచ ద్రోహంబు సేసి తేమంచు నిన్ను* (క॥ నాటి గడునమ్మహాత్ముని । యటి ముటిజర ణాబ్జయుగము నఖిలజగంబు । లెన్నటం గోరిన కోరికలల దలమిడి వర్షించు నతనిం దగునే తెగడన్* (చ॥ వరగజి తాస్థిభస్మనృకపాల జటాధరుడున్న రేతభూ । చరుడు పిశాచయుక్తుండని శర్వునమంగళుఁ గాఁ దలంపరే । వ్వరు నొకడీవు దక్క నాటి వాక్పతి ముఖ్యులు నమ్మహాత్ము నా । చ్చరణసరోజ రేణువులు సమ్మతి దాల్తురు మస్తకంబులన్* (చ॥ నెలకొని ధర్మపాలన వినిర్మలు భర్గుది రస్కరించున । క్కలుషుని జిహ్వ గోయ దగుఁ గాక టు సేయఁగ నోపఁడేని దా । బోలియుఁబు మొప్ప రెంటికిం బ్రభుత్వము చాలమి కర్ణరంధ్రము లంబులు పగమూసి కొంచు జనబాడియటందురు ధర్మవర్తనుల్ ॥ అది గావున* (మ॥ జనుఁడజ్ఞానమున న్భుజించిన జుగుప్సంబైన యన్నంబు నయ్యన వెళ్లించి పవిత్రుఁడై నగతిదుష్టాత్ముండ వై యీశ్వరున్ । ఘనునిందించిన నీతనూభవయనంగా నోర్వ నీహేయభా । జనమైనట్టి శరీరము న్విడిచి భాస్వద్బుద్ధి వాటిల్లెదన్* (వ॥ అదియునుం గాక దేవతల కాకాశగమనంబును, మనుష్యులకు భూతలగమనంబును, స్వాభావికంబులైనట్లు ప్రవృత్తినివృత్తిలక్షణకర్మంబులు రాగవై రాగ్యాధికారంబులుగా వేదంబులు విధించుటం జేసి రాగయుక్తులై కర్మతంత్రులైన సంసారులకు వైరాగ్యయుక్తులై యాత్మారాములయిన యోగిజనులకు విధినిషేధరూపంబులయిన వైదికకర్మంబులు గలుగుటయు లేకుండుటయు నైజంబులగుటం జేసి స్వధర్మనిష్ఠుండగువాని నిందింపం జనదది యుభయకర్మశూన్యుండు బ్రహ్మభూతుండునయిన సదాశివుని గ్రియాశూన్యుఁ డని నిందించుట పాపంబగుటం దండ్రీ సంకల్పమాత్ర ప్రభవంబులగుటం జేసి మహాయోగిజన సేవ్యంబులైన యస్మదీయంబులగు నణిమాద్యష్టైశ్వర్యంబులు నీకు సంభవింపవు భవదీయంబగు నైశ్వర్యంబులు ధూమమార్గప్రవృత్తులై యాగాన్నభోక్తులైన వారిచేత యజ్ఞశాలయందె చాలనుతింపంబడియుండుఁ గాన నీచనంబున నేనధిక సంపన్నుండనని యుంజితాభ స్మాస్థిధారణుండైన యీ త్ర్యంబకుండు దరిద్రుండని యును గర్వింపం జనదని వెండియు నిట్లనియె* (ఉ॥ నీలగళాపరాధియగు నీకుం దనూభవనౌట చాలదా । చాలుంగుమర్త్య నీవలన జాతననమ్మది సిగ్గువుట్టెడి । జ్ఞాలధరన్మహాత్ములకుం జయ్యన నెగ్గొనరించు జన్మము । న్నాలుపనేతలంతజనకా కుటిలాత్మక మెన్న

చూడఁగన్* (చ॥ వరవృషకేతనుండు భగవంతుఁడునైన హరుండు నన్ను నా । దరపరిహాసవాక్యముల దక్షతనూభవ యంచుఁ
బిల్వఁగా । బురపురబోకుచున్ముదము బొంచక నర్మవచస్స్థితంబుల । న్దొరుగు సునీతనూజనను దుఃఖముకంటెను జచ్చుటొప్ప
గున్* (వ॥ అని యిట్లు యజ్ఞసభామధ్యంబునం బ్రతికూలుండగు దక్షుని నుద్దేశించి పలికి కామక్రోధాదిశత్రుఘాతిని యగు సతీదే
వి యుదఙ్ముఖియై జలంబుల నాచమనంబు చేసి శుచియై మౌనంబు ధరియించి జితాసనయై భూమియం దాసీనయగుచు యోగ
మార్గంబునం జేసి శరీరత్యాగంబు సేయందలంచి* (సీ॥ వరుసఁ బ్రాణాపానవాయునిరోధంబు గావించి వాని నేకముగ నాభి।త
లమునఁ గూర్చి యంతటను దానముదాఁక నెగయించి బుద్ధితో హృదయపద్మ । మున నిల్పి వాని మెల్లనఁ గంఠమార్గమున నను మరి
భ్రూమధ్యమున వసింపఁ। జేసి శివాంఘ్రిరాజీవచింతనము చే నాథునందకు నవ్యంబుఁ జూడ । కమ్మహాత్ముని యంకపీఠంబు నం
దు। నాదరంబున నుండు దేహంబు దక్షు।వలన నిరోషంబునను విడువంగఁ దలఁచి । తాల్పె తనువున ననిలాగ్నిధారణములు* (వ॥
ఇట్లు ధరియించి గతకల్మషంబైన దేహంబుగల సతీదేవి నిజయోగసమాధిజనితంబగు వహ్నిచేఁ దత్క్షణంబ దగ్ధంబయ్యె నంత*
(క॥ అదిగనుఁగొని హాహారవ। ముదవఁగ నిట్లని రిమానవులు త్రిదశులు నీ। మది రాక్షియకట దేహము । వదలెఁగ దా దక్షుతోడి
వైరముకతనన్॥ మఱియును* (సీ॥ సకలచరాచరజనకుఁడై నట్టియీ దక్షుండు దనకూర్మితనయ మాన । వతి పూజనీయ యీస
తి దనచే నవమానంబు నొంది సమక్షమందుఁ । గాయంబుఁ దొరుగఁగఁ గనుగొనుచున్న వాఁ డిట్టి దురాత్ముఁ డెందేనిఁ గలఁడె।
యనుచుఁ జిత్తంబుల నాశ్చర్యములఁ బొందిర దియునుఁ గాక నిట్లని రియిట్టి । దుష్టచిత్తుండు బ్రహ్మబంధుండునయిన । యీతఁ డన
యంబుఁ దానపఖ్యాతిఁ బొంది। నిందఁబడి మీఁద నరకగతిఁ జెందుఁగాక।యనుచు జనములు వలుకు నయ్యవసరమున* (క॥ దేహము
విడిచిన సతిఁ గని। బాహాబలమొప్ప గురుద్రపార్షదులు నుద । ద్దోర్హిం ద్రుంచుటకై యు । త్సాహంబున లేచిరసిగదాపాణులు
నై * (క॥ ఆరవమపుడీక్షించి మహాగోషముతో డభృగుమహాముని క్రతుసం।హారకమారకమగు నభి। చారికహోమంబొ
నర్చె సరభసమొప్పన్* (వ॥ ఇటు దక్షిణాగ్నియందు వ్రేల్చిన నం దపంబొనర్చె సోమలోకంబునందు సహస్రసంఖ్యలుగల
ఋభునామధేయులైన దేవతలుదయించి బ్రహ్మతేజంబునం జేసి దివ్యవిమానులై యుల్ముకంబులు సాధనంబులుగా ధరియిం
చి రుద్రపార్షదులయిన ప్రమథగుహ్యకగణంబులం బారఁదోలిన వారును బరాజితులై రితఃనంతరంబ నారమువలన భవుండు
దంద్రిచేన సత్కృతురాలగుటం జేసి భవాని పంచత్వంబు నొందుటయుం బ్రమథగణంబులు ఋభునామక దేవతలచేఁ బరా
జితులగుటయు విని* (శా॥ అద్యుండుగ్రుఁడు నీలకంఠుఁడిభదైత్యారాతి దష్టౌష్ఠుఁడై। మాద్యద్భూరిమృగేంద్రఘోషమునభీ
మప్రక్రియన్నవ్వుచు। న్సద్యద్వహ్నిశిఖాసముచ్చయరుచి న్వెల్గొందు చంచజ్జట । న్సద్యఃక్రోధముతోడఁ బుచ్చి వయిచెన్
క్ష్మాచక్రమధ్యంబునన్* (వ॥ ఇట్లు పెఱికి వైచిన రుద్రుని జటయందు* (సీ॥ అభ్రంలిహోదభ్ర విభ్రమ భ్రాభ్రభ్రమకృష్ణలదీర్ఘ

—* మహేశ్వరుండు వీరభద్రునిచే దక్షయజ్ఞంబుధ్వంసంబు చేయించుట. *—

శరీరసమరఁ । బ్రజ్జ్వలజ్జ్వలనదీప్తజ్వాలి కాజాలజాజ్జ్వల్యమాన కేశములు మెఱయఁ। జండదిగ్వేదండశుండాభదోర్దండ
సాహస్రధృతహేతిసంఘు మొప్ప । వీక్షణత్రయలోకవీక్షణవ్యతిలోకవీక్షణత తి దుర్నిరీక్షమగుచుఁ । గ్రకచకఠినకరాళ
దంష్ట్రలు వెలుఁగ।ఘనకపాలాస్థివనమాలికలును దనర । నఖిలలోకభయంకరుఁడగు చుపీర । భద్రుఁడుదయించె మాఱటరు
ద్రుఁడగుచు* (గీ॥ వీరభద్రుండు విహితవిద్వేషిభద్రుఁ। డగుచుఁ దనవేయి చేతులు మొగిచి వినయ । మెసఁగ నేనేమి సేయుదు
నెఱుఁగనాకు।నానతిమ్మనన తనికయ్యభవుఁడనియె* (చ॥ గురుభుజశౌర్యభూరిరణకోవిదమస్మటకోటికెల్ల నీ। వరయ వరూ
థినీవరుఁడవై చని యజ్ఞముగూడ దక్షుని । న్పరువడిఁ ద్రుంపు మీవచట బ్రాహ్మణతేజము జేయుమంటివే । నరదిమదంశసంభవుఁ
డవై తగు నీకున సాధ్యమెయ్యెడన్* (వ॥ అని కుపితచిత్తుండై యాజ్ఞాపించిన నట్ల కాక యని* (చ॥ అనఘుఁడు రుద్రుఁ జేరి ముద
మారఁ బ్రదక్షిణమాచరించి దీవి। డోలసియాని వాహ్య వేగమునఁ గుంభిని గ్రక్కదలన్ ఝుళంఝుళ । ధ్వనిమణినూపురంబులుపదం
బుల మ్రోయఁగ భీషణప్రభ। ల్దనరఁగ కృతాంత కాంతక శితస్ఫుటశూలముఁ బూని చెచ్చెరన్* (చ॥ సరభసవృత్తినట్లరుగు సైన్య
పదాహతపాదధూళిధూ। సరితకుబేరదిక్తటము సభ్యులు దక్షుఁడు చూచి మొట్టభీ । కరితమగుంచినందము గాదు రజఃపటలం
బటంచునన్। చ్చెరియమునొంది రాత్మల విచక్షణతారహితాత్ములై కడున్ (సీ॥ ఈధూళి పుట్టుట కెయ్యది హేతువో విలయసమీ
రమువోల వీచెపుడు । ప్రాచీనబర్హిరాధరాపతితో గ్రశాసనుండిపుడు రాజ్యంబు సేయుఁ । జోరసంఘముల కోరారాదు మ
ఱి గోగణాళి రాకకు సమయంబుగాదు । కావున నిప్పుడు గల్పావసానంబుగాఁ బోలుఁ గాకటు గాకయున్న। నిట్టియాత్పాతిక
రజమెందేనిఁ గలదె । యనుచుఁ దమనములభయమందిరచటిజనులు।పురలు ఋత్విజులనంత బ్రసూతిముఖ్య । లయిన భూసురకాం
తలిల్లనిరి మఱియు* (క॥ తనహేతులు సూడఁగని।తనయను సతిననపరాధఁ దగ వేదియు టె। గ్గొనరించినయాదక్షున।కునపాప
విపాకమిది యుఁగాఁదగునను చున్* (వ॥ అని వెండియు నిట్లు రికుపితాత్ముండై నదక్షుండు దనకూఁతుతో విరోధంబుచాలకజగ

త్సంహారకారణుండయినరుద్రునిం గ్రోధింపం జేసిననమ్మహాత్ముం డెంతటివాఁడం టేని ప్రళయకాలంబున॥ (సీ॥ సుమహిత
నిశితత్రిశూలాగ్రసంప్రోతనిఖిలదిక్కరిరాజనివహుండగుచుఁ। జటులోగ్రనిష్ఠురస్తనితగంభీరాట్టహాస నిర్భిన్నాఖిలాశుఁ
డగుచు। భూరికరాళవిస్ఫారదంష్ట్రాహతిబలితతారాగణప్రచయుఁడగుచు। వివిధహేతివ్రాతవిపులప్రభాపుంజమండిత
చండదోర్దండుఁడగుచు। వికటరోషభయంకరభ్రుకుటిమూర్తి। తీక్ష్యదుస్సహతేజోమహిమాదనర్పి। ఘనవికీర్ణజటాబంధకలి
తుఁడగుచు। నఖిలసంహారకారణుఁడయి నటించు॥ (గీ॥ అట్టిదేవునిఁ ద్రిపురసంహారకరునిఁ। జంద్రశేఖరు సద్గుణసాంద్రు నభ
వు। మానమురోషింపఁ జేసిన సమంగళములఁ। బొందవచ్చునె పద్మగర్భునకునైన॥ (వ॥ అనియివ్విధంబున భయవిహ్వలలోచను
లై పలుకుచున్న సమయంబున మహాత్ముండయిన దక్షునకు భయావహంబులై సహస్రసంఖ్యాతంబులైన మహోత్పాతం
బులు భూనభోంతరంబులఁ గానంబడుచుండె నాసమయంబున రుద్రానుచరులు నానావిధాయుధంబులు ధరియించి కపిల
పీతవర్ణంబులుగలిగి వామనాకారులు మకరోదరాననులై యజ్ఞశాలాప్రదేశంబునబరువులువెట్టుచుఁ గదియంజని దెంచి
దక్షాధ్వరవాటంబులపైటాటంబుసేయుచుం గొందఱు ప్రాగ్వంశంబును గొందఱు పత్నీశాలయుఁ గొందఱు సదస్యశాల
యునుం గొందఱాగ్నీధ్రశాలయుఁ గొందఱు యజమానశాలయుఁ గొందఱు మహానసగృహంబును విధ్వంసనంబులుగా
వించిరి మఱియుఁ గొందఱు యజ్ఞపాత్రంబులనగ్నులం జెఱచిరి వెండియుఁ గొందఱు హోమాగ్నులార్చిరి పదంపడి గొంద
ఱు హోమకుండంబులయందు మూత్రంబులు విడిచిరి గొందఱు త్తరవేదికామేఖలలు త్రెంచిరి గొందఱు మునులబాధించిరి
గొందఱు తత్పత్నుల వెఱపించిరి మఱికొందఱు దేవతాసిరోధంబుఁ గావించిరి యంత మణిమంతుండు భృగువును, వీరభద్రుం
డు దక్షునిఁ, జండీశుండు పూషుని, భగుని నందీశ్వరుండును, బట్టిరి యివ్విధంబున సదస్యదేవ ఋత్విక్కాయంబుల శిలలఱువ్వి
యు, జానువులఁ బొడిచియు, నఱచేతులనడఁచియు, గుల్ఫంబులఁ బొడిచియు, వివిధబాధలం బఱచిన, వారు కాందిశీకులై యె
క్కడెక్కడేనియుం జనిరి మఱియును॥ (క॥ మునుదక్షుఁడు భవుఁబలుకఁగ। గనుగీటిన భగునిఁ బట్టి కన్నులు పెకలిం। చె నందీ
శ్వరుఁ డచ్చటి। జనములు హాహారవంబు సందడిఁ గొలుపన్॥ (గీ॥ కుపితుఁడై వాఁడు భవుని దక్షుఁడు శపింప। బరిహసించిన పూ
షుని పండ్లు డుల్లఁ। గొట్టె బలభద్రుఁడాకళింగుని రదనంబు। లెలమి డులిచిన పగిది జండీశ్వరుండు॥ (క॥ తగవేదిదక్షుఁడా సభ। నగ
చాపుఁ దిరస్కరించునాఁడు శ్మశ్రు। ల్నగుచుం జూపుటనాభృగు। పగకై శ్మశ్రువులు వీరభద్రుఁడు వెఱికెన్॥ (సీ॥ అతులదర్పో
ద్ధతుండై వీరభద్రుండు గైకొనిదక్షువక్షంబుఁ ద్రొక్కి। ఘనసితధారాసిఁ గొని మేనఁ నడఁచియు మంత్రసమన్విత మహితశ
స్త్ర। జాలావినిర్భిన్నచర్మంబుగలదక్షుఁ జంపఁగాలేక విస్మయమునొంది। తద్వధోపాయంబుఁ దనచిత్తమునఁ జూచి కంఠనిష్పీ
డనగతిఁ దలంచి। మస్తకము దున్మియంచితాహర్షణమున। దక్షిణానలమున వ్రేల్చెఁ దదనుచరులు। హర్షమునుబొంద నదటి
బ్రాహ్మణజనంబులాత్మలను జాలదుఃఖంబులందుచుండ॥ (వ॥ ఇటు వీరభద్రుండు దక్షుని యాగంబు విధ్వంసనంబుఁ గావించి
నిజనివాసంబైన కైలాసంబునకుం జనియె నయ్యవసరంబున॥ (చ॥ హరభటకోటిచేతనిశితాసిగదాకరవాలశూలముద్గరము

—* దేవతలు వీరభద్రాదులచేఁ బరాజితులయి బ్రహ్మతో విన్నవించుట. *—

సలాదిసాధనవిదారితజర్ఝరితాఖిలాంగులై। సురలు భయాకులాత్ములగుచున్ సరసీరుహజాతుఁ జేరి త। చ్చరణసరోరుహంబు
లకు సమ్మతిఁ జాగిలి మ్రొక్కి నమ్రులై॥ (క॥ తమ ధూర్జటి సైనికులగు। ప్రమథులు దయమాని పెలుచ బాధించుటస। ర్వముఁ జె
ప్పిరి యని మైత్రేయమునీంద్రుఁడు విదురుతోడ ననియెన్ మఱియున్॥ (గీ॥ ఇంతయును మున్ను మనమున నెఱిఁగియున్న। కతన
విశ్వాత్మకుండును గమలలోచ। నుండు నను నొప్ప నారాయణుండు నజుఁడు। చూడరారైరి యపుడు దక్షుని మఖంబు॥ (వ॥ అని
చెప్పి సురలిట్లు విన్నవించిన చతుర్ముఖుండు వారలకిట్లనియె॥ (క॥ ఘనతేజోనిధిపురుషుం। డనయంబుకృతాపరాధుఁడయిననుఁ
దా మొల్లఁడ ప్రతికారముఁ గావిం। చన జనులకు లోకమందు సేమముఁ గలదే॥ (వ॥ అనిమఱియు నిట్లనియె॥ (క॥ క్రతుభాగా
ర్హుండగు పశు। పతి నీశ్వరు భవు శర్వు భర్గుని దూరీ। కృతయజ్ఞభాగుఁ జేసిన। యతిదోషులు దుష్టమతులు నగు మీరింకన్॥ (సీ॥ పూ
నియే దేవుని బొమముడిమాత్రన లోకపాలకులును లోకములును। నాశమొందుదు రట్టి యీశుండు ఘనదురుక్త్యస్త్ర నికాయ
విద్ధాంతరంగుఁ। డును బ్రియాపరిహీనుండు నగనైన వాఁడమ్మహాత్మునిఁ ద్రిపురసంహారకరుని। సాఖపునస్సంధానమతినపే
క్షించుమీరలు చేరి శుద్ధాంతరంగులగుచు। భక్తినిష్ఠలఁ దత్పాదపద్మయుగళ। ఘనపరిగ్రహపూర్వంబుగాఁ గనతని। శరణ
మొందుఁడతండు ప్రసన్నుఁడయినఁ। దిపిరి మీకోర్కె సిద్ధించు దివిజులార॥ (వ॥ అనిమఱియు నిట్లనియె నద్దేవునిఁ డాయంజన వె
ఱతుమఱి తలంపకుండ తనం జేసిన పాయంబెఱింగింపుమాటి రేని నేనునింద్రుండు మునులు మీరలు మఱియు దేహధారులెవ్వ
రేనినమ్మహాత్ముని రూపంబునతని బలపరాక్రమంబులకొలఁది నెఱుంగఁజాలమతండు స్వతంత్రుఁడు గావునఁ దదుపాయంబె
ఱింగింప నెవ్వఁడు సమర్థుండగునైననిపుడు భక్తపరాధీనుండు శరణాగతరక్షకుండగు నీశుని జేరంబోవుదమని పలికి పద్మసం

భవుండు దేవపితృగణప్రజాపతులం గూడి కైలాసాభిముఖుండయి చనిచని* (ఉ॥ భాసురలీలఁ గాంచిరి సుపర్వులు భక్తజనై
కమానసోల్లాసముఁ గిన్నరీజనవిలాసము నిత్యవిభూతిమంగళా । వాసము సిద్ధగుహ్యకనివాసము రాజతభూవికాసికై। లాస
ముఁ గాంతినిర్జితకులక్షితిభృత్సుమహాద్విలాసముం* (సీ॥ ధాతువిచిత్రితోదాత్తరత్నప్రభాసంగతోజ్జ్వల తుంగశృంగము
లును। కిన్నరగంధర్వకింపురుషాప్సరోజననికరాకీర్ణసానువులును । మానితనిఖిలవైమానికమిథునసద్విహారశైలైకశుభప్రదే
శములును। కమనీయనవమల్లికాసుమనోవల్లికామతల్లీలసత్కందరములు । సమరసిద్ధాంగనాశోభితాశ్రమములు। విబుధజ
నయోగ్యసంపన్నివేశములును। గలిగి బహువిధపుణ్యభోగములనొప్పు। వినుతసుకృతములకు దండవెండికొండ* (వ॥ అదిమఱి
యును మందారపారిజాతసరళతమాలసాల తాల తక్కోలకోవిదార శిరీషార్జునచూతకదంబ నీప పున్నాగ చంపక పాట
లాశోక వకుళకుందకురువక కనకారశతపత్ర కింశుకైలాలవంగమాలతీమధూకమల్లికాపనస మాధవీకుటజోదుంబరాశ్వ
త్థప్లక్షవటహింగుళభూర్జపూగరాజపూగజంబూఖర్జూరామ్లాతక ప్రియాళు నాళికేరేంగుదవేణుకీచకముఖరతరుశోభితం
బుఁ గలకంఠ కాలకంఠకలవింకరాజకీరమత్తమధుకర నానావిహంగకోలాహల నినదబధిరీభూతరోదోంతరాళంబు సింహ
తరక్షుశల్యగవయశరభశాఖామృగవరాహవ్యాఘ్రకుక్కురరురు మహిష వృకసారంగ ప్రముఖవన్యసత్వసమాశ్రయవి
రాజితంబు కదళీషండమండితకమలకల్హారకైరవకలితపులినతల లలితకమలాకర విహరమాణకలహంస కారండవసారస
చక్రవాకబకజలకుక్కుటాదిజలవిహంగజలకూజితసంకులంబు సలిలకేళీవిహరమాణ సతీరమణీరమణీయ కుచమండలవిలి
ప్తమృగమదమిళితహరిచందనగంధసుగంధిత జలపూరితగంగాతరంగిణీసమావృతంబునయిన కైలాసపర్వతంబు వొడగని
యరవిందసంభవపురందరాది దేవగణంబులత్యద్భుతానందంబులం బొంది ముందట దారహీర హేమమయ విమాన సంకు
లంబుఁ బుణ్యజనమానినీశోభితంబునయిన యలకాపురంబుఁ గడచి తత్పురబాహ్యప్రదేశంబునం దీర్ఘపాదుండైన పుండరీకా
క్షుపాదారవిందరజఃపావనంబు రతికేళీవ్యాసంగపరిశ్రమనివారకసలిలకేళీవిలోల దేవకామినీపీనవక్షోజ విలిప్తకుంకు
మపంకసంగతపిశంగవర్ణవారిపూరవిలసితంబులైన నందాలక నందాభిధానంబులుగల నదీద్వితయంబు దాఁటి తత్పురోభాగం
బున వనగజసంఘృష్టమలయజపరిమిళితపవనాస్వాదనముహుర్ముహురున్మదితమానసపుణ్యజనకామినీకదంబంబు వైదూర్య
సోపానసమంచితకనకోత్పలవాపీవిభాసితంబుఁ గింపురుషవ్యాప్తంబునగు సౌగంధికవనసమీపంబునందు* (సీ॥ ఉజ్జ్వలంబై

—* బ్రహ్మాదులు దక్షిణామూర్తిరూపుఁడగు నీశ్వరుని స్తుతియించుట. *—

శతయోజనంబుల పొడవును బంచసప్తతి యోజనముల । పఱపును గల్గి యేపట్టునఁ దఱుగనినీడ శోభిల్లుసంకీర్ణతమగుచుఁ। బర్ణశాఖా
సమాకీర్ణమై మాణిక్యములఁ బోలఁగల ఫలములు దనర్చి । కమనీయసిద్ధయోగక్రియామయమయి యనఘ ముముక్షుజ నాశ్ర
యంబు। భూరిసంసారతాపనివారకంబు। నగుచుఁ దరురాజమనఁగఁ జెంపగ్గలించి । భక్తజనులకు నిచ్చలుఁ బ్రమదమెసఁగ। వల
యు సంపదలందు నావటము వటము॥ ఆవృక్షమూలతలంబున (సీ॥ ఇద్ధసనందనాదిసిద్ధసంసేవితు శాంతవిగ్రహుని వాత్సల్యమున
ను। గమనీయలోకమంగళదాయకుని శివు విశ్వబంధుని జగద్వినుతయశుని । గుహ్యకసాధ్యయక్షోరక్షనాథకుబేరసేవితుని దు
ర్వారబలుని । సుచితవిద్యాతపోయోగయుక్తుని బాలచంద్రభూషణుని మునీంద్రనుతుని । దాపసాభీష్టకరు భస్మదండలింగ।
ఘనజటాజినధరుని భక్తప్రసన్ను । వితతసంధ్యాభ్రరుచివిడంబితవినూత్న । రక్తవర్ణుసనాతను బ్రహ్మానుయుని ॥ మఱియు
ను* (సీ॥ అంచితవామపాదాంభోరుహము దక్షిణోరుతలంబునను నిచితగను। సవ్యజానువుమీఁద భవ్యబాహువు సాఁచి వలప
లిముంజేత సలలితాక్ష । మాలిక ధరియించి మహనీయతర్కముద్రాయుక్తుఁ డగుచుఁ జిత్తంబులోన । నవ్యయంబయిన బ్రహ్మా
నందకలితసమాధినిష్ఠుఁడు వీతమత్సరుండు। యోగపట్టాభిరాముఁడై యుచితవృత్తి । రోమసంగతిఁ బ్రాసికూర్చన్నజముని। య
నువునను దర్భరచితబృస్యాసనమున। నున్నముని ముఖ్యునంచితయోగనిరతు* (క॥ అలఘునినభవుని యోగీం । ద్రులువిను
చుండంగ నారదునితోఁ బ్రియభాషలు జరుపుచున్న రుద్రుని। సలలితపన్నగవిభూషు సజ్జనపోషుం* (క॥ కనిలోకపాలురును
ముని। జనులును సత్కృతినతని చరణంబులకు। న్వినతులయి రియ్యెడబ్జా। సనుఁ గనియయ్యభవుఁ డధికసంభ్రమమెుప్పన్* (క॥
అనఘుని హర్షుండగువా। మనుఁడాకశ్యపునకునొగినమస్కారము చే। సిన గతి నజునకు నభివం । దనమొగిఁ గావించె హరుఁడు
దర్దయుఁ బ్రీతిన్* (గీ॥ ఆంతరుద్రానువర్తులైనట్టి సిద్ధ । గణమహర్షి జనంబులు గనివయోజ । గర్భునకు మ్రొక్కిరంత నాకమల
భవుఁడు। శర్వుఁగని పలికె మందహాసంబుతోడ* (గీ॥ జగములకు నెల్ల యోనిబీజంబులైన। శక్తిశివకారణుండవై జగతినిర్వి।
కారబ్రహ్మంబవగు నిన్నుఁ గడఁగ విశ్వ । నాథుఁగా నెఱిఁగెదనాననముసనభవ* (గీ॥ సమతనది గానఁదావకాంశంబులైన శ
క్తి శివరూపములఁ గ్రీడసలుపుదూర్ణ। నాభిగతి విశ్వజననరక్షానాశవృద్ధి । హేతుభూతుండవగుచుండు వీశరుద్ర* (సీ॥ అనఘలో
కంబులయందు వర్ణాశ్రమసేతువులనఁగఁ బ్రఖ్యాతినొంది । బలిసిమహాజనపరిగృహీతంబులై యఖిలధర్మార్థదాయకముల

యున । వేదంబులను నభివృద్ధినొందించుటకొఱకునై నీవ దక్షుని నిమిత్తమాత్రునిఁ జేసి యమ్మఖముఁ గావించితివటుగాన శుభ
మూర్తివైన నీవు గడఁగి జనములమంగళకర్ములయిన । వారి ముక్తిసమంగళాచారులయిన । వారి నరకంబునొందింపు భూరిమ
హిమ! భక్తజనపోష రాజితఫణివిభూష* (వ॥ అట్లగుటం దత్కర్మంబు లోకానీకనికి విపద్వ్యాసంబు నొందుటకుఁ గారణంబె
య్యది యో భవ నీయరోషంబు హేతువని తలంచితి నేనిఁ ద్వదీయపాదారవిందనిహితచిత్తులై సమస్తభూతంబులయందు ని
న్నుం గనుంగొనుచు భూతంబుల నాత్మయందు వేఱుగాఁ జూడక వర్తించు మహాత్ములయందు నజ్ఞులైన వారియందుంబోలె రో
షంబు దరుచుపొరయ దట్టి నీకుఁ గ్రోధంబు గలదే యని* (సీ॥ నాటి భేదబుద్ధిఁ గర్మప్రవర్తనములమదయుతులై దుష్టహృదయులగు
చుఁ । బరవిభవాసహ్యభవమనోవ్యాధులఁ దగిలి మర్మాత్మభేదకములైన । బహుదురుక్తులచేతఁ బరులఁ బీడించుచు నుండుమూ
ఢులను దైవోపహతులఁ । గాఁ దలపోసి యక్కపటచిత్తులకు నీవంటి సత్పురుషుఁడే వలననైన । హింసఁ గావింపకుండు సమిద్ధచ
రిత! నీలలోహిత! సుహితగుణాలవాల! లోకపాలనకలితగంగాకలాప! హరజగన్నుతచారిత్ర! యదియుఁ గాక* (సీ॥ అరయ
సమస్తదేశములందు నఖిలకాలములందుఁ దలఁపఁ దుర్లంఘ్యుఁ డగు మహిమఁ । డగు పద్మనాభు మాయా మోహితాత్ములై భేదదర్శ
నులైన వారి । వలన నద్రోహంబు గలిగినం జేయునది దైవకృతమని యన్యదుఃఖ । ములకోర్వలేక సత్పురుషుండు దయసేయుఁ
గాని హింసింపఁడు గాన నీవు । నచ్యుతుని మాయ మోహమునం దగులక । జేసి సర్వజ్ఞుఁడవె మాయచేత మోహి । తాత్ములై క
ర్మవర్తనులయిన వారి । వలన ద్రోహంబు గలిగిన వలయుఁ బ్రోవ* (వ॥ అదిగావున యజ్ఞభాగార్హుండవైన నీకు సవనభాగంబు స
మర్పింపని కతన నీచేత విధ్వస్తంబయి పరిసమాప్తి నొందని దక్షాధ్వరంబు నవలనుద్ధరించి దక్షుని పునర్జీవితుం జేయుము - భ
గుని నేత్రంబులు, భృగుముని శ్మశ్రువులుఁ, బూషుని దంతంబులుఁ, గృపసేయుము. భగ్నాంగులైన దేవఋత్విజ్జనకాయం
బులకు నారోగ్యంబుఁ గావింపు మీ మఖావశిష్టంబు యజ్ఞపరిపూర్తిహేతుభూతంబయిన భవదీయభాగంబగుఁ గాక* (చ॥ అ

—* శివుఁడు బ్రహ్మాదులచేఁ బ్రార్థితుండయి దక్షాదుల ననుగ్రహించుట. *—

నిచతురాననుండు వినయంబున వేఁడిన నిందుమౌళి స । య్యనఁ బరితృప్తిఁ బొంది దరహాసమునన్ మృదువొంగలింపని । ట్లను హరి
మాయచేత నయంబును బామరులైన వారుచే । సిన యపరాధదోషములు చిత్తములో గణియింప నెన్నఁడున్ ॥ అట్లయుండి*
(క॥ బలియుర దండించుట దుర్బలజనరక్షణము ధర్మపద్ధతి యగుటన్ । గలుషాత్ములయపరాధము । కొలఁదిని దండింపుచుందుఁ
గొనకొని యేనున్* (వ॥ అసిదగ్ధశీర్షుండయిన దక్షుండు అజముఖుండగుఁ భగుండు బర్హిస్స్వసంబంధభాగంబులు గలిగి మిత్రనామ
ధేయ దక్షుస్సనం బొడఁగాంచుఁ బూషుండు పిష్టభుక్కగుచు యజమాన దంతంబులచే భక్షించు దేవతలు యజ్ఞావశేషంబు
నాకొసంగుటం జేసి సర్వావయవపూర్ణులై వర్తింతురు ఖండితాంగులైన ఋత్విగాదిజనంబులశ్వినీదేవతల బాహువులచే
తను బూషుని హస్తంబులచేతను లబ్ధబాహుహస్తులై జీవింతురు భృగువు బస్తశ్మశ్రువులు గలిగి వర్తించునని శివుండానతిచ్చిన
సమస్తభూతంబులు సంతుష్టాంతరంగంబులై తండ్రి లెస్స యయ్యె నని సాధువాదంబుల నభినందించిరి యంత నాశంభుని యామం
త్రణంబు వడసి శునాసీరప్రముఖులగు దేవతలు ఋషులతోడం గూడి రా నజుండు రుద్రునిం బురస్కరించుకొని దక్షాధ్వర
వాటంబునకుం జనెనంత* (క॥ శర్వుని యోగక్రమమున । సర్వావయవములు గలిగి సన్మునిఋత్వి । గ్గీర్వాణముఖ్యులొప్పి
రి పూర్వతను శ్రీల నార్యభూషణ యంతన్* (క॥ వినుదక్షునంత మేషము । ఖునిఁ జేసిన నిద్రమేలుకొని లేచిన పో । ల్కి నిలిచె
దక్షుఁడు భవుఁడు గనుఁగొనుచుండంగ నాత్మఁ గౌతుక మొప్పన్* (వ॥ ఇట్లు లేచి నిలిచి ముందటనున్న శివునిం గనుంగొనినమా
త్రన శరత్కాలంబున నకల్మషంబైన సరస్సునుంబోలి పూర్వరుద్రవిద్వేషజనితంబులైన కల్మషంబులం బాసి నిర్మలుండై య
భవుని నుతియింపం దొడంగి మృతిఁ బొందిన సతీతనయం దలంచి యనురాగోత్కంఠంబుల బాష్పపూరితలోచనుండు గద్గదకం
ఠుండునై పలుకం జాలక యెట్టకేలకు దుఃఖంబుల సంస్తంభించికొని ప్రేమాతిరేకవిహ్వలుండగుచు సర్వేశ్వరుండగు హరునకి
ట్లనియె* (క॥ వినునీకపరాధుఁడనగు । నను గండించుట దిదండనము గాదు మదిన్నను రక్షించుటగా మన । మునఁ దలఁతును దేవ
యభవ పురహర రుద్రా* (సీ॥ అనఘాత్మ తగ నీవు నబ్జనాభుండును బరికింప బ్రాహ్మణాభాసులయిన । వారల యెడల నెవ్వలనను
పేక్షింపరటు దృఢవ్రతచర్యులైన వారి । యెడ నీకుపేక్ష యెక్కడిది సద్గాదినినామ్నాయసంప్రదాయప్రవర్త । నము నెఱిం
గించుటకు సారవిద్యాతపోవ్రత పరాయణులైన బ్రాహ్మణులను । వరుసఁ బుట్టించితివి కాన వారి నెపుడుఁ । గేలదండంబుఁ బూని
గోపాలకుండు బలసి గోవుల రక్షించు పగిది నీవు నరసి రక్షింపుచుందు గదయ్య రుద్ర* (సీ॥ తలపోయ నవిదితతత్త్వవిజ్ఞానుండనై
న నాచేత నైన సభాంతరమున । నతిదురుక్త్యంబక క్షతుఁడయ్యు నస్మత్కృతాపరాధము హృదయంబునందుఁ । దలఁపక త్ర్యక్షు
నిందాదోషమునను నధోగతిఁ బొందుచున్న దుర్మార్గు నన్నుఁ । గరుణఁ గాచిన నీదు ఘనసద్గుణంబుల నెఱిఁగి సంస్తుతి సేయ నెంత
వాఁడ నుతచరిత్ర భవత్ప్రసాదానుగ్రహాను । రూపకార్యంబు చేతసిరూఢమైన । తుష్టి నీచిత్తమందు నొందుము గాక । యుద్రసం

హారకరుణాసముద్రరుద్ర* (వ॥ అనియిట్లు రుద్రదత్తవాపణంబుఁగాంచి పద్మసంభవుని చేత ననుజ్ఞాతుండై దక్షుండుపా ధ్యాయ ఋత్విగ్గణసమేతుండగుచుఁ గ్రతుకర్మంబు నిర్వర్తించు సమయంబున బ్రాహ్మణజనంబులు యజ్ఞంబులు నిర్విఘ్నంబు లై సాగుటకుఁ బ్రమథాదివీరసంసర్గకృత దోషనివృత్త్యర్థంబుఁగా విష్ణుదేవసహితంబు త్రికపాల పురోడాశద్రవ్యకంబునై నకర్మంబుఁగావింపనధ్వర్యుకృత్యప్రవిష్టుండగు భృగువుతోడంగూడి నిర్మలాంతఃకరణుండగుచు దక్షుండు ద్రవ్యత్యాగంబుఁ

* దక్షాధ్వరంబునకువచ్చిన నారాయణుని దక్షాదులు స్తుతియించుట. *

గావింపఁ బ్రసన్నుండై సర్వేశ్వరుండు* (సీ॥ మాసితశ్యామాయమానశరీరదీధితులు నల్దిక్కులఁదీటుకొనఁగ । గాంచనమే ఖలాకాంతులతోడఁ గౌశేయ చేలద్యుతుల్ వెలిమి సేయ । లక్ష్మీసమాయుక్తలలితవక్షంబున వైజయంతీప్రభల్ వన్నెఁజూప। హాటకరత్నకిరీటకోటిప్రభల్ బాలార్కరుచులతో మేలమాడ। లలితనీలాభ్రరుచిఁగుంతలములుదనరఁ । బ్రవిమలాత్మీయదే హజప్రభసరోజ । భవభవామరముఖ్యులప్రభలుమాప । నఖిలలోకైకగురుఁడు నారాయణుండు* (చ॥ సలలితశంఖచక్ర జలజాగ్రగదశరచాపఖడ్గ । ర్మలరుచులున్సువర్ణరుచిరన్మణికంకణముద్రికాప్రభా । వలులను దేజరిల్లు భుజవర్గముసర్గళకాం తియుక్తమై విలసితకర్ణికారవృథివీరుహమున్బ్రరణించుబిట్టుగన్* (క॥ సరసోదారసమంచిత దరహాసవిలోకనములఁదగ లోకములన్బ్రీతోషముఁ బొందింపుచుఁ బర మోత్సవ మొప్ప విశ్వబంధుండగుచున్* (చ॥ ఘటియించు రాజహంసరుచిరాచ్ఛ) మణీకృతలతాలవృంతచామరములు వీవఁగా దివిజమానినులచ్ఛసుధాకరీ దివి । స్ఫురణసితాతపత్రరుచిపుంజము దిక్కులంబి క్కటిల్లఁగాఁగ నీవరదుఁడు వచ్చె సుభగశ్రుతివర్ణ సుపర్ణయానుఁడై* (చ॥ ఘనసుదనస్తువచ్చిన వికాగవిదూరుమకుందుఁజూ చిభో। రుననరవిందనందనపురందరచంద్రకళాధరామృతా । శనముఖులర్థి లేచి యతిసంభ్రమము మొప్ప నమోనమోదయా। వననిధమేయటంచు ననివారణప్రమోద రిథ క్తియుక్తులై*(వ॥ అట్లుకృతప్రణాములైనయనంతరంబ*(ఉ॥ ఆనలినాయతా క్షుఁ డయనంతపరాక్రమదుర్నిరీక్ష్యతేజో । నిహతస్వదీప్తులగుచున్నియేయనశక్తులై భయ । గ్లానివహించి బాష్పములు గ్రమ్మగగద్గదకంఠులై తమల్ ప్రమానువదంగనవ్విభుసమున్ననఁగై కొనియెట్ట కేలకున్* (వ॥ నటలతటఘటిత కరపుటులై య ప్పుహాత్మున యపారమహిమంబెఱింగి నుతియింపశక్తులుగాక యుండియుఁ గృతానుగ్రహవిగ్రహుండగుటం జేసి తమతమ మతులకుఁ గోచరించిన కొలంది నుతియింపం దొడంగిరి యందు గృహీతంబులగు పూజాద్యుపచారంబులు గలిగి బ్రహ్మాసులక్షణ నకుండును సనందనాది పరమభాగవతజనసేవితుండు యజ్ఞేశ్వరుండును భగవంతుని శరణ్యునింగాఁదలంచి దక్షుండిట్లనియె దేవా నీవు స్వస్వరూపమునమన్నయప్పుడు పరతంబుగాని రాగాద్యఖిలబుద్ధ్యవస్థచే విముక్తుండవు నద్వితీయుండవు భయ రహితుండవునై మాయందిరస్కరించి మఱియు నామాయననుసరించుచు లీలామానుషరూపంబుల నంగీకరించి స్వతంత్రుం డవయ్యును మాయాపరతంత్రుండవై రాగాదియుక్తుంబోలె రామకృష్ణాద్యవతారంబులఁ గానంబడుచుందువు గావున నీ లోకంబులకు నీవయీశ్వరుండవనియు నితరులైన బ్రహ్మరుద్రాదులు భవన్మాయావిభూతులగుటం జేసి లోకంబులకు నీశ్వరు లుగారనియును భేదదృష్టిగలనన్ను రక్షింపుమీ విశ్వకారణులైన ఫాలలోచనుండు బ్రహ్మయు దిక్పాలురు సకలచరాచరజం తువులును నీవభవద్వ్యతిరిక్తంబు జగంబున లేదని విన్నవించిన తదనంతరంబ ఋత్విగ్జనంబులిట్లనిరి* (సీ॥ వామదేవునిశాప వశమునఁ జేసికర్మానువర్తనుల మేమైనకతన । బలసి వేదప్రతిపాద్యధర్మోపలక్ష్యంబైన యట్టినుఖంబునందు । దీపింపనింద్రా దిదేవతాకలితరూపవ్యాజమును బొందిపరగునిన్ను । యజ్ఞస్వరూపుండవనియును గేవలనిర్గుణుండవు నిత్యనిర్మలుఁడవు। నర యనవద్యమూర్తివి యైననీదు లలితతత్త్వస్వరూపంబుఁ దెలియఁజాలము య్యమాధవగోవిందహరిముకుంద। చిన్మయాకార నిత్యలక్ష్మీవిహార॥సదస్యులిట్లనిరి* (సీ॥ శోకదావాగ్నిశిఖాకులితంబు పృథుక్లేశఘనదుర్గదుర్గమంబు । దండధరక్రూరకుండలి క్లిష్టంబు పాపకర్మవ్యాఘ్రపరివృతంబు । ఘనసుఖదుఃఖకాకోలపూరితగర్తముగు ముననాశ్రయమైనయట్టి । సంసారమార్గ సంచారులై మృగతృష్ణికలబోలు విషయసంఘమునహమ్మ । మేతిహేతుకదేహనికేతనములు । ననుమహాభారవహులైనయి ట్టిమూఢజనము లేనాఁటమీపదాబ్జములుగాన। జాలువారలుభక్తప్రసన్నదేవ॥ రుద్రుండిట్లనియె* (చ॥ వరదనిరీహయోగి జనవర్గసుపూజితమీపదాబ్జము । ల్నిరతమునంతరంగమున నిల్పిభవత్సమనుగ్రహాధిక । స్ఫురణఁదనర్చునన్ను మతిమూఢులవి ద్యలుమున్నమంగళా। వరణుఁడటందుఁ బల్కిన భవన్మతినేగణియింపనచ్యుతా ॥ భృగుండిట్లనియె* (మ॥ అరవిందోదరతా వకీనఘనమాయామోహితస్వాంతులై । పరమంబయిన భవన్మహామహిమమున్బాటించి కానంగనో । పరుబ్రహ్మాదిశరీరుల జ్ఞులయి యోపద్మాక్ష భక్తార్తిసంహరణాలోక నన్ను గావదగును నిత్యానందసంధాయివై ॥బ్రహ్మయిట్లనియె* (సీ॥ తవిలిప దార్థభేదగ్రాహకములైన చక్షురింద్రియముల సరవిఁజూడఁ । గలుగు నీరూపంబుఁ గడఁగి మాయామయంబని నసద్వ్యతి రిక్తమగుచు మఱియు । జ్ఞానార్థకారణసత్త్వాదిగుణముల కాశ్రయభూతమైయలరుచున్న । నిరుపమాకారంబు నీకు విలక్షణ

మైయుండుననుచు నేనాత్మఁ దలఁతు । నిర్వికారనిరంజననిష్కళంక। నిరతిశయనిష్క్రియారంభ నిర్మలాత్మ। విశ్వసంబోధ్య
నిరవద్య వేదవేద్య। ప్రమిమహానందసంసారభయవిదూర॥ ఇంద్రుండిట్లనియె* (మ॥ జితిసంతానవినాశసాధనసముద్దీప్తాష్ట
బాహాసమ। న్వితమై యోగిమనోనురాగపదమై వెల్గొందు నీదేహమా। యతమైనట్టి ప్రపంచముం బలెను మిథ్యాభూతముం
గామి శాశ్వత మంగామదిలోఁ దలంతు హరి దేవాదైవచూడామణీ॥ పత్నులిట్లనిరి* (చ॥ కడఁగి భవత్పదార్చనముఁ గానిటు
దక్షుని చేరఁ దింపఁగా । బడిశితికంఠరోషమున భస్మము నొందిన రేతభూమియై । చెడికడు శాంతమేధమునఁ జెన్నఱియున్నమ
ఖంబుఁ జూడుమీ। ర్పడజలజాభ నేత్రములఁ బావనమై విలసిల్లు నచ్యుతా॥ ఋషులిట్లనిరి* (మ॥ అనఘా మాధవ నీవు మాకలె
నెకర్మారంభివై యుండియుఁ। వినుతత్కర్మఫలంబుఁ బొందవితరుల్ విశ్వంబునన్ బ్రాంతిమై। యనయంబున్ భజియించు నిందిరగ
రంబర్థిన్నినుం జేరఁగ। కొనవేమంకుమునీ చరిత్రమునకున్ గోపించదపద్మోదరా॥ సిద్ధులిట్లనిరి* (చ॥ హరిభవదుఃఖభీషణదవాన
లదగ్ధతృషార్తమన్మనో। ద్విరదము శోభితంబును పవిత్రమునై భవత్కథాసుధా। సరిదవగాహనంబునను సంసృతితాపముఁ
బాసి క్రమ్మఱన్। దిరుగును బ్రహ్మముం గనిన ధీరుని భంగిఁ బయోరుహోదరా॥ యజమానియగు ప్రసూతియిట్లనియె* (చ॥
కరచరణాదికాంగములు గల్గియు మస్తము లేని మొండెము । న్బరువడి నొప్పకున్న గతిఁ బంకజలోచన నీవు లేనియ। ధ్వరము ప్ర
యాజలంగలిగి తద్దయు నొప్పకయున్న దీయెడన్ । హరి యిటు నీవు రాక శుభమయ్యె రమాధిప మమ్ము గావవే॥ లోకపాలకులి
ట్లనిరి* (సీ॥ దేవాదిదేవ యాదృశ్యరూపంబగు సుమహితవిశ్వంబుఁ జూచు ప్రత్య। గాత్మభూతుండవై నట్టి నీవు నసత్ప్రకాశ
రూపంబులై గలుగుమాయ। కేంద్రియంబులచేత నీశ్వర నీమాయ నొందించి పంచభూతోపలక్షి। తంబగు దేహివిధంబునఁ గా
నంగఁబడుదువు గాని యెర్పడినశుద్ధ। సత్వగుణయుక్తమయిన భాస్వత్స్వరూప। ధరుఁడవై కానబడవు గా పరమపురుష। య
వ్యయానందగోపింపయట్లు గాక। యెనయ మాజీవనములఁ కనేమిగలవు॥ యోగీశ్వరులిట్లనిరి* (సీ॥ విశ్వాత్మ నీయందు వేఱు
గాజీవులఁ గనఁ డెవ్వఁడటు వానికంటె ప్రియుఁడు । నీకు లేఁడయిననుఁ అఖిల విశ్వోద్భవస్థితిప్రలయంబులకు తనదైవ । సంగతి
నిర్భిన్నసత్వాదిగుణశక్తిస్తాత్మీయమాయ చేనజభవాది। వివిధభేదము నొందుదువు స్వస్వరూపంబునందుండుదువు విగతవి
మోహుఁడగుచు నుండుదువు తగ నిన్ననన్యభక్తి। మృత్యుభావంబుఁ బాల్పసంప్రీతిఁ గొల్చు। మమ్ము రక్షింపు మోకృపామయర
మేశ। పుండరీకాక్షసంతతభుజనరక్ష॥ శబ్దబ్రహ్మయిట్లనియె* (చ॥ హరి భవదీయతత్వము నమంచిత భక్తి నెఱుంగ నేను నా। స
రసిజసంభవాదులును జాలము సత్వగుణాశ్రయుండవు । న్బరుఁడవు నిర్గుణుండవును బ్రహ్మము నైతగు నీకు నందఱు । న్గరము చ
తుర్విధార్థఫలకాంక్షులమై ముకుంద రాదరింపుమా॥ అగ్నిదేవుండిట్లనియె* (మ॥ హవరక్షాతిచణుండవై నెగడు దీవయ్యాగ్ని
హోత్రాదిపం । చపథంబున్ మఱిమంత్రపంచక సుసృష్టంబై తగంబొల్చునా । హవరూపంబగు నీకు మ్రొక్కెద మనీయాజ్ఞ
న్భువిన్ హవ్యముల్ నవనవ్రాతములన్ వహింతు హరియుష్మత్తేజమున్ బ్బానుమన్॥ దేవతలిట్లనిరి* (మ॥ మును గల్పాంతమునం
దుఁగుక్షినఖిలంబున్ దాఁచి యేకాకివై। జనలోకోపరిలోకవాసులును యుష్మత్తత్వమార్గంబు చిం। తనముం జేయఁ బయోధియం
దునహిరాట్తల్పంబునన్ బవ్వళిం। చిన నీరూపము నేఁడు చూపితివి లక్ష్మీనాథ దేవోత్తమా॥ గంధర్వులిట్లనిరి* (మ॥ హరిపంకేజ
భవామరాదులు మరీచ్యాదిప్రజానాథులో । యరవిందాక్షరమాహృదీశ భవదీయాంశాంశసంభూతులై। పరగం దావకలీల
కై నెగడు నీబ్రహ్మాండము న్దేవయీ। శ్వర నీకేమదిభక్తి మ్రొక్కెదము దేవాధీశరక్షింపుమా॥ విద్యాధరులిట్లనిరి* (సీ॥ నలినా
క్ష విను భవన్మాయావశంబున దేహంబుఁ దాల్చి దద్దేహమందు । నాత్మయహమ్మనుయమనభిమానియై పుత్రజాయాగృహక్షే
త్రబంధు । ధనపశుముఖవస్తుతనులసంయోగవియోగదుఃఖంబులనొందుచుండు । ధృతివిహీనుఁడు నసద్విషయాతిలాలసుఁ
డతిదుష్టమతియునైనట్టివాఁడు। దవిలి భవదీయగుణసత్కథావిలోలుఁ । డయ్యె నేనియు నాత్మమోహంబు వలనఁ। బాసి వర్తిం
చు విజ్ఞానపరతఁ దగిలి। చిరదయాకర యుంచిరాదిత్తచోర* (వ॥ బ్రాహ్మణజనంబులిట్లనిరి దేవా యాక్రతువు హవ్యంబు నగ్ని
యు మంత్రంబు సమి ద్దర్భపాత్రంబులు సదస్యులు ఋత్విక్కులు దంపతులు దేవతలు నగ్నిహోత్రంబు స్వధయు సోమంబు
నాజ్యంబు పశువు నీవుఁ దొల్లి వేదమయ సూకరాకారంబు ధరియించి దంష్ట్రాదండంబునవారణేంద్రంబు నళినంబు ధరియించు
చందంబున రసాతలగతయయిన భూమి నెత్తితివి యట్టియోగిజనస్తుత్యుండవు యజ్ఞక్రతురూపుండవయిన నీవు పరిభ్రష్టకర్మ
లమై కాంక్షించు మాకుఁ బ్రసన్నుండవగుము భవదీయ నామకీర్తనంబుల సకలయజ్ఞవిఘ్నంబులు నాశంబు నొందు నట్టి నీకు నమ
స్కరింతుము* (క॥ అనితను సకలజనంబులు । వినుతించిన హరిభవుండు విఘ్నము గావిం। చినయా దక్షుని యజ్ఞము। ఘనము
గఁ జెల్లించె గోఁటఁ గాకంసంగన్* (క॥ సకలాత్ముఁడు బానుటను। సకలహవిర్భోక్తయయ్యు జలజాక్షుఁడుఁ దన్। బ్రకటస్వ
భాగమునను య్యకొలంపుఁడు తృప్తిఁ బొంపియ నెనయుని తోన్ (వ॥ అనఘా యేను బ్రహ్మయు శివుండును నీ జగంబులకుఁ గారణభూ
తులమంము నేనీశ్వరుండ ద్రష్టయు స్వయంప్రకాశకుండనై గుణమయంబైన యాత్మీయ మాయం బ్రవేశించి జననవృద్ధిప్రల

యంబులకు హేతుభూతంబులగు త్రిగుణాత్మకంబులయిన బ్రహ్మరుద్రాది నామధేయంబుల నొందుచుండుదునట్టి యద్వితీయ బ్రహ్మరూపకుండనైన నాయందు నజభవాదులను భూతగణంబులను మూఢుండగువాఁడు వేఱుగాఁ జూచు మనుజుండు శరీరంబునకుఁ గరచరణాదులు వేఱుగాఁ దలంపని చందంబున మద్భక్తుండు నాయందు భూతజాలంబు భిన్నంబుగాఁ దలంపఁడు గావున మాముగ్గురయందు నెవ్వండు వేరుసేయకుండువాఁడు కృతార్థుండని యానతిచ్చిన దక్షుండు* (క॥ వినువిష్ణుదేవతాకంబనఘా త్రికపాలకలితమగు నాయాగంబునఁ దగ నవ్విష్ణునిపద । వనజంబులు పూజఁ జేసి వారసభక్తిన్ ॥ మఱియును॥ (సీ॥ అంగప్రధానక యాగంబులను జేసి యమరులు రుద్రుని నర్థిఁ బూజ । జేసి విశిష్టేష్టశిష్టభాగమున నవసానకర్మంబుఁ దవిలి తీర్చి । తాను ఋత్విక్కులు వగ సోమపులఁ గూడి యవభృథస్నానంబు లాచరించి । కడఁక నవాప్తసకలఫలకాముండై తనరు దక్షుఁ జూచి ధర్మబుద్ధి గలిగి సుఖవృత్తిఁ జీవింపుఁ గాక యనుచుఁ । బలికి దివిజులు మునులును బ్రాహ్మణులును । జనిరి నిజమందిరములకు జలజనయన । భవులు వేంచేసిరి స్వకీయ భవనములకు* (వ॥ అంత దాక్షాయణియైన సతీదేవి పూర్వకళేబరంబు విడిచి హిమవంతునకు మేనకయందు జనియించి విలయకాలంబున బ్రసుప్తంబయిన శక్తి సృష్టికాలంబున నీశ్వరునిఁ బొందుచందంబున నపూర్వ దయితుండగు రుద్రుని వరియించె నని దక్షాధ్వర ధ్వంసకుండగు రుద్రుని చరిత్రంబు బృహస్పతి శిష్యుండైన యుద్ధవునకు నెఱింగించె నతండు నాకుం జెప్పె నేను నీకుం జెప్పితి నని మైత్రేయుండు వెండియు విదురున కిట్లనియె* (క॥ ఈ యాఖ్యానముఁ జదివిన । ధీయుతులై వినిన యట్టి ధీరులకైశ్వ । ర్యాయుః కీర్తులు గలుగును । బాయును దురితములు దొలఁగు భవబంధంబుల్ ॥ అని వెండియు నిట్లనియె* (క॥ వినుసనకాదులు నారదుఁ । డును హంసుఁడు నరుణిఋభుఁడును యతికదులా । సనజులు నైష్ఠికులని కే । తనులగుట న్నాగవయ్యెఁ దద్వంశంబుల్ * (వ॥ మఱియు నధర్మునకు మృష యను భార్యయందు దంభుండు మాయ యను నంగనయుం బుట్టిరి యధర్మసంతానంబగు వారిరువురును మిథునంబైరి వారిని సంతానహీనుండగు నిర్ఋతి గైకొనియె వారలకు లోభుండును నికృతియను సతియునుం గలిగి మిథునంబయ్యె యామిథునంబునకుఁ గ్రోధుండు హింసయను నంగనయుం బుట్టి మిథునంబయ్యె నామిథునంబునకుఁ గలియు దురుక్తియు ననునతివలు జన్మించి దాంపత్యంబుఁ గైకొనిరి యాదంపతులకు భయమృత్యువులను మిథునంబు గలిగె దానివలన, యాతనయు, నిరయంబును బుట్టిరి వీరలు సంసారహేతువగు నధర్మతరుశాఖలై నెగడిరి వీని శ్రేయఃపాకముండగు జనుండు త్రివర్ణమాత్రంబున నువర్తింపం జనదివ్విధంబున బ్రతిసర్గంబును సంగ్రహంబున వినిపించితి నిప్పుణ్యకథ నెవ్వండేని ముమ్మాటు వినిన నతండు నిష్పాపియగునని చెప్పి మఱియు* (క॥ వినునిఖిలభువనపరిపాలన

—* ధ్రువోపాఖ్యానము. *—

మునకై చంద్రధరకళాకలితుండై । వనజజునకు స్వాయంభువ । మనువపుడుదయించెఁ గీర్తిమంతుండగుచున్ * (గీ॥ రూఢినమ్మనువుకు శతరూపవలన । భూనుతులగు ప్రియవ్రతోత్తానపాదు । లనఁగ నిద్దఱు పుత్రులై రందులోన । భవ్యచారిత్రుఁడుత్తానపాదునకును* (క॥ వినుము సునీతియు సురుచియు । నను భార్యలు గలరు వారియందును ధ్రువుని । న్గనిన సునీతియు నప్రియ । యును సురుచియుఁ బ్రియయు ననగు చునున్నట్టి యెడన్ * (సీ॥ ఒకనాఁడు సుఖలీల నుత్తానపాదుండు మఱి ప్రియురాలైన సురుచిగన్న । కొడుకు నుత్తముఁ దన తొడలపై నిడికొని యుపలాలనము సేయుచున్న వేళ । నధిరోహణాపేక్షితుండైన ధ్రువుని గనుంగొని తివకయాద । రింపకుండుట గర్వించి యా సురుచియు సవతి బిడ్డండైన ధ్రువునిఁ జూచి । తండ్రితొడ నెక్క వేడుక దగిలె నేని । వూని నాగర్భమున నాఁడు పుట్టకిన్య । గర్భమునఁ బుట్టఁ గోరినఁ గలదె నేఁడు । జనకుతొడ నెక్కు భాగ్యంబు సవతికొడుక* (క॥ అదిగాక నీవధోక్షజు । పదపద్మములాశ్రయింపు పాయకహరినా । యుదరమునఁ బుట్ట నిచ్చును । వదలక నట్లయిన ముదము వడసెదవనఘా* (క॥ అని యీరీతిన సహ్యావ । చనములు పినతల్లి యపుడు జనకుఁడు వినఁగాఁ । దను నాడిన దుర్భాషా । ఘనశరములు మనము నాఁటి కారియఁ బెట్టన్ * (క॥ తమ నట్లు పేక్షఁ జేసిన । జనకుని కడఁ బాసి దుఃఖజలనిధిలోన । మ్మను గుచును దండతాడిత । ఘనభుజగముఁ బోలి రోషకలితుండగుచున్ * (క॥ ఘనరోదనంబు సేయుచుఁ । గనుఁగవలను శోకబాష్పకణములు దొలుఁగ । జ్జననికడకేగుట యునిజ । తనయునిఁ గని యాసునీతి తద్దయుఁ బ్రేమన్ ॥ తొడలపైనిడికొని* (క॥ కరవరుక్తిని మోముసి । పరితప్త్వ త్తాంతమెల్ల వెలఁదులు నంతః । పురవాసులుఁ జెప్పిన విని । వరపు గసట్టూర్పు లెసఁగ బాష్పాకులయై* (గీ॥ సవతియాడిన మాటలఁ జాలఁ దలఁచి । కొనుచుఁ బేర్చిన దుఃఖాబ్ధిఁ గుందుచుండె । దావపావకశిఖల చేఁ దగిలి కాంతి । చెదరి కందిన మాధవీలతిక వోలె* (వ॥ అంత నాసునీతి బాలకునిఁ జూచి తండ్రి దుఃఖింపకుమని యిట్లనియె* (క॥ అనఘా యీ దుఃఖమునకుఁ । బని లేదన్యులకు సోలయబలనంతంబై । తన పూర్వజన్మదుష్కృత । ఘనకర్మము వెంటనంటఁగా నెవ్వలనన్ ॥ కావున* (క॥ పెనిమిటి చేతను బెండ్లామని కాఁ దునికృష్టదాసియనియును బిలువం । గన జాలినకుగ్భుగురా । లనఁగల నాకుక్షినుదయమందిన కతనన్ * (క॥ నిననాడి నయాస్తురుచివ । చనములు సత్యంబులగును సర్వశరణ్యుం । డనఁగల హరిచరణంబుల । గనుజనకుని యంక మెక్కఁగాఁ దలఁతే

నిక * ( వ॥ కావునపినతల్లిమైనయాసురుచియాదేశంబుననధోక్షజునాశ్రయింపుమని వెండియునిట్లనియె * ( సీ॥ పరికింపనీవి
శ్వపరిపాలనమునకై నర్థిగుణవ్యక్తుఁడైనయట్టి । నారాయణునిపాద నళినము ల్సేవించి తగబ్రహ్మ బ్రహ్మపదంబునొందెఁ॥ ఘ
నుఁడుమీతాతయామనువుసర్వాంతరయామిత్వమగు నేకమైనదృష్టిఁ । జేసియాగంబులఁజేసి తాభౌమసుఖములను దివ్య
సుఖముల మోక్షసుఖములనుబొందెనట్టియచ్యుతునిఁబరుని॥ వితతయోగీంద్రనికరసంవేద్యమాన । చరణసరసిజయుగళుశ
శ్వత్ప్రకాశు॥ భక్తవత్సలువిశ్వసంహార్యుహారిని॥ మఱియును * ( క॥ కరమునగృహీతలీలాం॥ బురుహాయునరవిందగర్భముఖ

—* ధ్రువుండు నారదోపదేశంబువడసి తపంబు జేయుట. *—

గీర్వాణుల్వరికిరిపంగలలక్ష్మీ॥ తరుణీమణిచేత వెదుకఁదగుపరమేశుఁ * ( వ॥ నిజధర్మపరిశోభితంబైనయేకాగ్రచిత్తంబుననిలి
పిసేవింపుమమ్మహాత్మునకంటెనీదుఃఖంబపనయించువాఁడన్యుండొక్కఁడుండు గలఁడేయనిపలికిన పరమార్థప్రాప్తిహేతుకం
బులైనతల్లివాక్యంబులువినితన్నుఁదాననియమించుకొనిపురంబు వెడలి చనునవసరంబున నారదుండుతద్వృత్తాంతంబెఱిం
గియచ్చటకేంజనుదెంచియతనిచికీర్షితంబుఁదెలిసిపాపనాశనకరంబైనతనకరతలంబునధ్రువునిశిరంబంటిమానభంగంబున
కుసహింపనిక్షత్రియులప్రభావంబద్భుతంబుగదా బాలకుండైయుండియుఁ బినతల్లియాడినదురుక్తులు చిత్తంబునంబెట్టిచ
నుచున్నవాఁడనిమనంబుననాశ్చర్యంబునొందియోబాలకసకలసంపత్సమృద్ధంబగుమందిరంబుఁదెగడియుంటి నెందునేగెద
వుస్వజనకృతంబగునవమానంబుచేనినుసంతప్తుంగాఁదలంచెదననిన ధ్రువుండిట్లనియె సపత్నీమాతృవాగిషుక్షతంబగుమ
నంబుభగవద్ధ్యానయోగరసాయనంబునమాపుకొందుననుధ్రువునికినారదుండిట్లనియె * ( క॥ వినుపుత్రకబాలుఁడవై । యన
యంబునుగ్రీడలందునాసక్తమనం॥ బునఁదిరిగెదునికాలం॥ బుననీకవమానమానములు లేవెందుఁ * ( గీ॥ కాఁగసమునఁ
దద్వివేకంబునీకుఁగలిగెనేనియుసంతోషకలితులయిన॥ పురుషులాత్మీయకర్మవిస్ఫురణఁజేసి । వితతసుఖదుఃఖములనుభవిం
తురెపుడు * ( వ॥ కావున వివేకంబుగలపురుషుండుదనకుంబ్రాప్తంబులగుసుఖదుఃఖంబులు దైవవశంబులుగాఁదలంచితావ
న్మాత్రంబునం బరితుష్టుండగు నీవును దల్లిచెప్పిన యోగమార్గప్రకారంబున సర్వేశ్వరానుగ్రహంబుఁబొందెదనంటివేని *
( సీ॥ అనఘాత్మయోగీంద్రులనయంబుధరఁబెక్కుజన్మంబులందునిస్సంగమైన । గతిఁదీవ్రయోగసమాధినిష్ఠలఁజేసియైనను
దెలియలేరతనిమార్గ॥ మదిగాననతఁడుదురారాధ్యుఁడగునీవును దగుమునివృత్తి లోద్యోగమిపుడు । గాకనిశ్రేయసకాముఁ
డవకుదేనిఁదండ్రివత్తిఁచుతకాలమందుఁ॥ బూనిసుఖదుఃఖములరెంటిలోననేది॥ దైవవశమునఁజేకుఱుఁదానఁజేసి । డెంద
మునఁజాలసంతుష్టినొందుచుండ॥ విమలవిజ్ఞానియనభువివెలయుదెపుడు * ( వ॥ మఱియుగుణాఢ్యుండగువానిఁజూచిసంతో
షింపుచు సాభాసుండగువానింజూచి కరుణింపుచు సమానునియెడ మైత్రిసలుపుచు వర్తింపుచున్నవాఁడు తాపత్రయాదికం
బులందోఁడంగుననినారదుండువలికినవినిధ్రువుండిట్లనియె ననఘాయీశమనంబు సుఖదుఃఖహతాత్ములగు పురుషులకుదుర్గ
మంబనికృపాయత్తుండవైననీచేతఁనంబడె నట్లయినంబరభయంకరంబగు క్షాత్రధర్మంబునొందిన యవినీతుండనేను సురు
చిదురుక్తబాణవినిర్భిన్నహృదయుండనగుటమదీయచిత్తంబునశాంతినిలువదు గావునంద్రిభువనోత్కృష్టంబున నన్యాధిష్ఠి
తంబునగుపదంబునుఁబొందనిచ్చయించిన నాకుసాధుమార్గంబు వెఱింగింపుము నీవుభగవంతుండవగు నజునియూరువువలన
జనించివీణావాదనకుశలుండవై జగద్ధితార్థంబు సూర్యునింబోలివర్తింతువని నవిని * ( క॥ నారదుండిట్లుననఘకు । మా
రకవినునిన్నుమోక్షమార్గంబునకుఁ । బ్రేరేఁచినవాఁడిప్పుడు । ధీరజనోత్తముఁడు వాసుదేవుండగుటఁ * ( వ॥ నీవు నమ్మ
హాత్మునినజస్రధ్యానప్రవణచిత్తుండవై భజియింపుము * ( క॥ పురుషుఁడుదవిలిచతుర్విధ । పురుషార్థశ్రేయమాత్మఁబొందె
దననిన॥ ధరదత్ప్రాప్తికిహేతువు॥ హరిపదయుగళంబుఁదక్కనన్యముగలదే॥ కావున * ( క॥ వరయమునాతటమునను॥ హ
రిసాన్నిధ్యంబుశుచియునతిపుణ్యము నై॥ పరగినమధువనమునకును॥ సరసగుణాచనముమేలుసమకుఱునచట * ( క॥ ఆయ
మునాతటినీశుభ॥ తోయములఁగ్రుంకినిష్ఠతోనచ్చటనా॥ రాయణునకునుననుస్కృతు । లాయతమతిఁజేసిసేయుయమని
యమములఁ * ( వ॥ మఱియుఁబాలుండవగుటంజేసి వేదాధ్యయనాద్యుచితకర్మానర్హుండవయ్యునుచితంబులగుకుశాజినంబు
లంజేసినస్వస్తికప్రముఖాసనంబులంగల్పించుకొని త్రివృత్ప్రాణాయామప్రత్యాహారంబులచేతం బ్రాణేంద్రియమనో
మలంబులనుచాంచల్యదోషంబులహరించి స్థిరంబయినచిత్తంబున * ( సీ॥ ఆశ్రితసత్ప్రసాదాభిముఖుండును స్నిగ్ధప్రసన్నా
ననేత్రుండు॥ సురుచిరనాసుండుసుభ్రూయుగుండునుసుకపోలతలుఁడునుసుందరుండు । హరినీలసంశోభితాంగుండుఁదరు
ణుండునగుణావలోకనోత్సాదరుండుఁ । గరుణాసముద్రుండుఁబురుషార్థనిధియును బ్రణతాశ్రయుండుశోభనకరుండు । లలి
తశ్రీవత్సలక్షణలక్షితుండు॥ సర్వలోకశరణ్యుండుసర్వసాక్షి । పురుషలక్షణయుక్తుండుపుణ్యశాలి । యసితమేఘసభశ్యా
ముఁడవ్యయుండు॥ మఱియును * ( సీ॥ హారకిరీటకేయూరకంకణఘనభూషితుండాశ్రితపోషణుండు॥ లాలితకాంచీకలాప

శోభితకటిమండలుండం చితకుండలుండు। మహనీయకౌస్తుభమణిఘృణి చారుగ్రైవేయకుండానందదాయకుండు। సలలిత ఘనశంఖచక్రగదాపద్మహస్తుండు భువనప్రశస్తుండజుండు। కమ్రసౌరభవనమాలికాధరుండు। హతమోహుండు నవ్యపీతాంబరుండు। లలితకాంచననూపురాలంకృతుండు। నిరతిశయసద్గుణుండు దర్శనీయతముండు॥ (క॥ సరసనవనీరజానన సముదారుండు సుహృత్పద్మకర్ణికానివసితుం। స్ఫురదురునఖమణిశోభిత। చరణసరోజాతుండతులశాంతుండు ఘనుండున్॥ (వ॥ అయిన పురుషోత్తముం బూజింపుచు హృదయగతుండు సానురాగవిలోకనుండు వరదశ్రేష్ఠుండు నగు నారాయణు నేకాగ్రచిత్తంబున ధ్యానంబు సేయుచుం బరమనివృత్తిమార్గంబున ధ్యాతుండయిన పురుషోత్తముని దివ్యమంగళస్వరూపంబు చిత్తంబునం దగిలిన మరల మగుడ నేరదదియునుంగాక యేమంత్రంబు జేని సప్తవాసరంబులు పఠియించిన ఖేచరులం గనుంగొను సామర్థ్యంబు గలుగు నట్టి ప్రణవయుక్తంబగు ద్వాదశాక్షరకలితంబు దేశకాలవిభాగవేదియగు బుధానుష్ఠితంబునయిన వాసుదేవమంత్రంబునం జేసి॥ (సీ॥ దూర్వాంకురంబుల దూర్వాంకురశ్యాము జలజంబులను జారుజలజనయను। తులసీదళంబులం దులసికాదామునిమాల్యంబులను సన్నైర్మల్యచరితు। పత్త్రంబులను బక్షిపత్త్రునిం గడు వన్యమూలంబులను నాదిమూలఘనుని। నంచితభూర్జత్వగాదినిర్మితపవిధాంబరంబులను బీతాంబరుని। దనరు భక్తి నిర్మృచ్ఛిలాదారురచిత। రూపములయందుం గాని నిరూఢమైన। సలిలములయందుం గాని సుస్థలములందుం। గాని పూజింపవలయు నకమలనాభు॥ (క॥ ధృతచిత్తుండు శాంతుండు నియతపరిభాషణుండు సుమహితాచారుండు వర్ణితహరిమంగళగుణుండును। మితవన్యాశనుండు నగుచు మెలంగంగవలయున్॥ (వ॥ ఉత్తమశ్లోకుండగు పుండరీకాక్షుండు నిజమాయాస్వేచ్ఛావతారచరితంబులచేత నచింత్యంబుగా నెద్ది సేయు నద్ది హృదయగతంబుగా ధ్యానంబు సేయందగు మఱియుం గార్యబుద్ధిం జేసి సేయంబడు పూజావిశేషంబుల వాసుదేవమంత్రంబున సర్వేశ్వరునకిసమర్పింపవలయు నిట్లు మనోవాక్కాయకర్మంబులచేత మనోగతంబగునట్లుగా భక్తియుక్తంబులయిన పూజలచేతం బూజింపంబడి సర్వేశ్వరుండు మాయాభిభూతులు గాక సేవించు పురుషులకు ధర్మాది పురుషార్థంబులలోన నభిమతార్థంబు నిచ్చు విరక్తుండగువాఁడు నిరంతరభావంబయిన భక్తియోగంబునం జేసి మోక్షంబుగోరి భజియించునని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రదక్షిణపూర్వకంబుగా నమస్కరించి మహర్షిజనసేవ్యంబై సకలసిద్ధులనొసంగుచు భగవత్పాదసరోజాలంకృతంబయిన మధువనంబునకుం జనియె నంత॥ (గీ॥ పద్మభవసూనుఁడు తాన పాదుకడకు। నరిగి యా రాజు చేసి వివిధార్చనముల। నంది సంప్రీతుఁడై యున్నతాసనమున। నెలమిం గూర్చుండి యాతని వలనుం జూచి। యిట్లనియె॥ (క॥ భూనాయక నీవిపుడా। మ్లానాస్యుఁడవగుచుం జాలమదిలోం జింతం। బూనుటకేమికతంబన। నానారదుతోడ నాతఁడనియె న్మఱలన్॥ (క॥ మునివరవివేకశాలియు। ననఘుఁడునై దేండ్లబాలుఁడస్మత్ప్రియనం। దనుఁడదయుఁడనగు నాచే। తనుపరిభవ మొందిచని మొదల్లియుండాడున్॥ (మ॥ చనియుం గ్రాటవిం జొచ్చియచ్చటం బరిశ్రాంతుండు క్షుత్పీడితుం। డును సమ్లానముఖాంబుజుండు గనఘుండు న్బాలకుండైనవు। త్తనయుం ఘోరవృకాహిభల్లముఖసత్వశ్రేణి నిర్జించునో। యని దుఃఖించెద నాదుచిత్తమున వార్యస్తుత్యయిల్లౌటకున్॥ (గీ॥ అట్టి యుత్తమబాలు నాయంకపీఠ। మందుం గూర్చుండనీక నిరాకరించి। యంగనాసక్తచిత్తుండనైన యట్టి నాదు దౌరాత్మ్యమిది మునినాథచంద్ర॥ (ఉ॥ నావిని నారదుండు నరనాథునకిట్లను నీకుమారుఁడా। దేవకిరీటరత్నగుదిదీపితపాదసరోజుఁడైన రా। జీవదళాక్షురక్షితుఁడ శేషజగజ్జనకీర్తనీయకీ। ర్తిప్రభవప్రశస్తసుచరిత్రుఁడు వానికి మఃఖ మేటికిన్॥ (ఉ॥ కావున నమ్మహాత్ముఁడు సుకర్మముచేత సమస్తలోకపా। లావళికందరాని సముదంచితనిత్యపదంబునన్ బ్రభు। శ్రీవిలసిల్లఁ జెంకుఁ దులసీదళదామ భజించి యాజగ। త్పావనుఁడైన నీసుతుప్రభావ మెఱుంగవు నీవు భూవరా॥ గాక॥ (క॥ నీకీర్తియు జగములయం। దాకల్పము నొందఁ జేయు నుచితగుణర। త్నాకరుఁడిటకే తెంచును। శోకింపకు మతనిఁ గూర్చి పుభగచరిత్రా॥ (క॥ అని నారదుండు పలికిన। విని మనమున విశ్వసించి విభుఁడు న్బ్రియనం। దను జింతింపుచు నాదర। మున నూడండయ్యె రాజ్యమును బూజ్యముగన్॥ అంత నక్కడ ధ్రువుండు॥ (క॥ చనిమంటఁగని గోనెమధు। వనమును ముని దేవయోగివర్ణితగుణపా। వనమును దుర్భరజలదప। వనమును నిఖిలైకపుణ్యావరభవనమునున్॥ (వ॥ అట్లుగని డాయం జని యమునానదిం గృతస్నానుండై నియతుండు సమాహితచిత్తుండునై సర్వేశ్వరుని ధ్యానంబు సేయుచుం ద్రిరాత్రత్రిరాత్రంబుల కొకమాఱు కృతకపిత్థబదరీఫలపారణుండగుచు దేహస్థితిననుసరించి యొక్కమాసంబు హరిం బూజించి యంతనుండియు నాఱు దినంబులకొకపరికృత జీర్ణతృణపర్ణాహారుండగుచు రెండవమాసంబున విష్ణుసమారాధనంబుం జేసి యంతనుండి నవరాత్రంబులకొకమాఱు దకభక్షణంబు సేయుచు మూఁడవమాసంబున మాధవునర్చించియంతనుండి ద్వాదశదినంబులకొకమాఱు వాయుభక్షణుండగుచు జితశ్వాసుండై నాలవమాసంబునం బుండరీకాక్షుని భజియించి యంతనుండి మనంబున నలయక నిరుచ్ఛ్వాసుండై యేకపదంబునం నిలిచి పరమాత్మం జింతింపుచు నచేతనంబైన స్థాణువుంబోలె నైదవమాసంబున జపియింపం

త* (సీ॥ సకలభూతేంద్రియాశ్రయమగు హృదయంబునందు విషయములఁ జెందనీక। మహదాదితత్త్వసమాజమ్ములకును నాధారభూతమును బ్రధానపూరు। షేశ్వరుఁడై నట్టి శాశ్వతబ్రహ్మంబుఁ దనసితహృదయపద్మమున నిలిపి। హరిరూపమునకంటె నన్యంబు నెఱుఁగక చిత్తమువ్విభునందుఁ జేర్చియున్న। కతనముల్లోకములు చాలఁ గంపమొందె। వెండియును బేర్చియయ్యర్భకుండు ధరణి నొక్క పాదంబు మోపి నిల్చున్న వేళ। బేర్చియబ్బాలునంగుష్ఠపీడఁ జేసి* (గీ॥ వసుమతీతలసర్థమువంగఁ జొచ్చె। భూరిమదదుర్నివారణ వారణేంద్ర। మెడమఁగుడి నోరఁగునపుడడుగడుగునకును। జలనమొందు చునడఁగెడు కలమువోలి* (వ॥ అతఁడు ననన్యదృష్టి నిజరాచరదేహశరీరధారణా। స్థితిగలయీశునందుఁ దన జీవితమున్నట్టియుండఁ జేసియే। కతఁగనఁదన్నిరోధమునఁగైకొనికంపము నొందె నీశ్వరుం। డతఁడు చలింపనిజ్జగములన్నియుఁ జంచలమొందెన త్తఱిన్* (క॥ ఆలోకభయంకరమగు। నాలోకమహద్విపద్దశాలోకనులై। యాలోకపాలురందఱు। నాలోకశరణ్యుఁ గానఁ రిగిరి భీతిన్* (వ॥ అట్లరిగి నారాయణునుద్దేశించి కృతప్రణాములై కరంబులు ముకుళించి యిట్లనిరి* (చ॥ హరిపరమాత్మ కేశవ చరాచరభూతశరీరధారివై। పరగుదు వీవు నిట్టులను బ్రాణనిరోధమెఱుంగ మెందుము। దిరముగ దేవదేవ జగదీశ్వర సర్వశరణ్య నీపదాం। బురుహములోలి మైశరణుఁ బొందెద మార్తిహరించి కావుమీ* (వ॥ అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారలకిట్లనియె నుత్తానపాదుండను వానితనయుండు విశ్వరూపుండనైన నాయందుఁ దనచిత్తంబైక్యంబుఁ జేసి తపంబుఁ గావింపుచుండ దానం జేసి భవదీయప్రాణనిరోధంబయ్యె నట్టి దురత్యయంబైన తపంబు నివర్తింపం జేసెద వెఱవక మీమీనివాసంబులకుం జనుండని యానతిచ్చిన నా దేవతలు నిర్భయాత్ములై యీశ్వరునకుం బ్రణామంబు లాచరించి త్రివిష్టపంబులకుం జనిరి తదనంతరంబ* (సీ॥ హరియీశ్వరుండు విహంగకులేశ్వరయానుఁడై నిజభృత్యుఁడైన ధ్రువుని। గనుఁగొను వేడుక జనియింప నామధువనమునకప్పుడు సనిధ్రువుండు। పరువడి యోగవిపాకతీవ్రంబైన బుద్ధిచే నిజమనోంబురుహముకుళ। మందుఁదటిత్ప్రభాయతమూర్తియటఁదిరోధానంబునను బొందితత్క్షణంబ। తనపురోభాగమున నునిల్చినను బూర్వ। సమధికజ్ఞాననయనగోచరసమగ్ర। మూర్తిఁగనుఁ

—* సాక్షాత్కరించిన భగవంతుని ధ్రువుండు స్తుతియించుట. *—

గొని సంభ్రమమునను సమ్మ। దాశ్రువులు రాలఁ బులకీకృతాంగుఁడగుచు* (గీ॥ నయనముల విభుమూర్తిఁ బానంబు సేయు। పగిదిఁ దనముఖమున నుజుంబనము సేయు। లీలఁ దగ భుజములను నాలింగనంబు। సేయు గతిఁ దండవన్నమస్కృతులొనర్చె* (వ॥ ఇట్లు దండప్రణామంబు లాచరించి కృతాంజలియై స్తోత్రంబు సేయ నిశ్చయించి స్తుతిక్రియాకరణ సమర్థుండు గాకయున్న ధ్రువునకు సమస్తభూతంబులకు నంతర్యామియైన యీశ్వరుండు ధ్రువుని తలం పెఱింగి వేదమయంబైన తన శంఖంబు చేతన బ్బాలుని కపోలతలంబంటిన నజీవేశ్వరనిర్ణయజ్ఞుండును భక్తిభావనిష్ఠుండు నగు ధ్రువుండును నఖిలలోకవిఖ్యాతకీర్తిగల యీశ్వరుని భగవత్ప్రతిపాదితంబులగుచు వేదాత్మకంబులైన తనవాక్కులవిట్లని స్తుతియించె దేవా నిఖిలశక్తిధరుండవు నంతఃప్రవిష్టుండవైన నీవు లీనంబులైన మదీయవాక్యంబులం బ్రాణేంద్రియంబులం గరచరణశ్రవణత్వగాదులను జిచ్ఛక్తిచేఁ గృపం జేసి జీవింపం జేసిన భగవంతుండవు పరమపురుషుండవైన నీకు నమస్కరింతు నీ వొక్కరుండవయ్యు మహదాద్యంబైన యీయశేషవిశ్వంబు మాయాఖ్యంబైన యాత్మీయశక్తిచేతం గల్పించి యందుం బ్రవేశించి యింద్రియంబులందు వసింపుచుఁ దత్తద్దేవతారూపంబులచే నానాప్రకారంబుల దారువులందున్న వహ్నిచందంబునం బ్రకాశింతువదియునుం గాక* (చ॥ వరమతి నార్తబాంధవ భవద్ఘనబోధసమేతుఁడై భవ। చ్ఛరణముఁ బొందినట్టి విధిసర్గము సుప్తజనుండు బోధమం। దరయఁగఁ జూచు రీతిగను నట్టి ముముక్షుశరణ్యమైన నీ। చరణములం గృతజ్ఞుఁడగు సజ్జనుఁ డెట్లు దలంపకుండెడున్* (సీ॥ మహితాత్మ సుజీజన్మ మరణప్రణాశనహేతుభూతుఁడవు నీవిద్ధకల్ప। తరువవు నకునిన్నుఁ దగ నెవ్వరే నేమి పూని నీమాయవిమోహితాత్ము। లగుచు ధర్మార్థకామంబులకొఱకుఁ దా మర్చింపుచుం ద్రిగుణాభమైన। దేహోపభోగ్యమై దీపించు సుఖముల నేనయంగ మది నిచ్ఛయింతురట్టి। విషయసంబంధజన్యమై వెలయు సుఖము। వారికి నిరయమందును వరలు దేవ। భూరిసంసారతాపనివారగుణక। ధామ్యతాపూర్ణ యీశ మాధవ ముకుంద* (మ॥ అరవిందోదర తావకీనచరణధ్యానానురాగోల్లస। చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్ల్యానందకబ్రహ్మమం। దరయన్లేదఁట దండభృద్ధతవిమానాకీర్ణులై కూలు నా। సురలోకస్థులఁ జెప్ప నేల సుజనస్తోమైకచింతామణీ* (చ॥ హరిభజనీయమార్గవిదులాత్ములై భవదీయమూర్తిపై। వరలినభక్తియుక్తులగు వారలసంగతి గల్గఁ జేయుస। త్పురుషమసంగతిన్ వ్యసనదుర్భరి సాగరమాంద్రయత్నత। న్సరసభవత్కథామృతరసంబునమత్తుఁడనై తరించెదన్* (చ॥ నిరతముఁ దావకీనభజనీయపదాబ్జసుగంధలబ్ధి నెవ్వరి మదినొందఁ గాఁ గలుగు వారలు త్పత్తి ప్రియమర్త్యదేహమున్న రయఁదదీయ దారతనయార్థసుహృద్గృహబంధువర్గము। న్మరతురు విశ్వతోముఖ రమాహృదయేశ ముకుంద మాధవా* (సీ॥ పరమాత్మ మర్త్యసర్వతిర్యఙ్మృగదితిజసరీసృపద్విజగణాది। సంవ్యాప్తమును సదసద్విశేషంబును గైకొనినుహదాదికారణంబు। నైనవిరా

డ్విగ్రహంబు నేనెఱుఁగుదుఁగాని తక్కినసుమంగళము నైన । సంతతసుమహితైశ్వర్యరూపంబును భూరిశబ్దాదివ్యాపార
శూన్యమయినబ్రహ్మస్వరూపమే నాత్మ నెఱుఁగఁ । బ్రవిమలాకారసంసారభయవిదూర । పరమమునిగేయసంతతభాగధే
య।నళినేనేత్ర।రమాలలనాకళత్ర* (సీ॥ సర్వేశ కల్పాంతసమయంబునందు నీయఖిలప్రపంచంబునాహరించి। యనయంబు
శేషసహాయుఁడవై శేషపర్యంకతలమునఁబవ్వళించి। యోగనిద్రారతినుండి నాభీసింధుజస్వర్ణలోకకంజాతగర్భ । మందుఁ
జతుర్ముఖునురఁబుట్టింపుచుదివొప్పుబ్రహ్మస్వరూపివైన । నీకుఁ బ్రమొకెఁ దనత్యంతనియమమొప్ప । భవ్యచారిత్రపంకజప
త్రనేత్ర।చిరశుభాకారనిత్యలక్ష్మీవిహార।యవ్యయానందగోవిందహరిముకుంద* (వ॥ అనియిట్లు యోగనిద్రాపరవశుండవ
య్యును జీవులకంటె నత్యంతవిలక్షణుండవై యుండుమవదియెట్లనిన బుద్ధ్యవస్థాభేదంబున నఖండితంబయిన స్వశక్తింజేసి
చూచు లోకపాలననిమిత్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్యముక్తుండవు బరిశుద్ధుండవు సర్వజ్ఞుండవు నాత్మవుఁ గూటస్థుం
డవు నాదిపురుషుండవు భగవంతుండవు గుణత్రయాధీశ్వరుండవు నైవర్తింతువు భాగ్యహీనుండై న జీవునియందు నీగుణంబులు
గలుగవే సర్వేశ్వరునందే నేమి విరుద్ధగతులై వివిధశక్తియుక్తంబులైన యవిద్యాదులానుపూర్వింజేసి ప్రలీనంబులగుచుం
డు నట్టివిశ్వకారణంబు నేకంబు ననంతంబు నాద్యంబు నానందమాత్రంబున వికారంబునగు బ్రహ్మంబునకు నమస్కరించె
దనవిభుఁ దేవా నీవు సర్వవిధఫలంబని చింతించు నిష్కాములై నవారికి రాజ్యాదికామితంబులలోనఁ బరమార్థంబై న ఫ
లంబు సర్వార్థరూపుండవైన భవదీయపాదపద్మంబులిట్లు నిశ్చితంబులై నను సకాములై నదీనులను గోవు వత్సంబును స్తన్యపా
నంబు సేయింపుచు వృకాదిభయంబువలన రక్షించుచందంబునం గామప్రదుండవై సంసారభయంబువలనం బాపుదువనియి
ట్లు సత్యసంకల్పుండు సుజ్ఞానియునైన ధ్రువునిచేత వినుపింపంబడి భృత్యానురక్తుండైన భగవంతుండు సంతుష్టాంతరంగుం
డైయిట్లనియె* (క॥ ధీరవ్రత రాజన్యకుమారక నీహృదయమందు మసలిన కార్యం। బారూఢిగా నెఱుంగుదు।నారయ నదిపొంద
రానిదైనను నిత్తున్* (వ॥ అదియెట్టిదనిన నిమ్మేదినియందు బరిభ్రామ్యమాణగో చక్రంబునుంబోలి గ్రహనక్షత్రతారాగ
ణజ్యోతిశ్చక్రంబు నక్షత్రరూపంబులైన ధర్మాగ్నికశ్యపశక్రులు సప్తర్షులును దారాసమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండు
దురట్టమరావంబుననన్యాధిష్ఠితంబు లోకత్రయప్రళయకాలంబునందు నశ్వరంబుగాక ప్రకాశమానంబునైన ధ్రువక్షితి
యను పదంబు ముందట నిరువదియాఱువేలేండ్లు సనఁ బ్రాపింతువు తత్పదప్రాప్తిపర్యంతంబు భవదీయజనకుండు వనవాసగ
తుండై నందద్రాజ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేంద్రియుండవై జేయుదువు భవదనుజుండగు నుత్తముండు మృగ
యార్థంబు వనంబునకుం జని మృతుండగుఁ దదన్వేషణార్థంబు తదాహితచిత్తయై తన్మాతయు వనంబునకుం జని యందుఁ దావ
దహనసమగ్నయగు వెండియు* (సీ॥ అనఘాత్మ మఱి నీవు యజ్ఞరూపుండనఁ దగు నను సంపూర్ణదక్షిణంబు।లగుమఖంబులచేత
నర్చించి సత్యంబులగు నిహసౌఖ్యంబులనుభవించి । యంత్యకాలమునననాత్మఁ దలంపుచు మఱి సర్వలోకనమస్కృతము
ను। మహిఁబునరావృత్తిరహితంబు సప్తర్షిమండలోన్నతము గు మామకీన । పదముఁదగఁ బొందఁగలవని పరమపురుషుఁ। డతని
యభిలషితార్థంబులర్థినిచ్చి।యతఁడు గనుగొనుచుండంగ నాత్మపురికి । గరుడగమనుఁడు వెంచేసెఁ గౌతుకమున* (గీ॥ అంత
ధ్రువుఁడు నుబంకేరుహాక్షుపాద । కమలసేవోపసాదితఘనమనోర । థములదనరియుఁ దనదుచిత్తంబులోనఁ। దుష్టిఁబొం
దకచనియె విశిష్టచరిత॥ అట్లు* (క॥ అని మైత్రేయుఁడు ధ్రువుఁడ । ట్లనయము హరిచేఁ గృతార్థుఁడైనవిధంబె। ల్లను వినిపించిన విదురుఁడు।విని మునివరుఁ జూచి పలికె వినయం బెసఁగన్* (క॥ మునినాయక వినుమాముక ।జనదుష్ప్రాప్యంబు విష్ణుచరణాంబు
రుహా।ర్చనహితజనసంప్రాప్యము।ననఁగలపంకేరుహాక్షునవ్యయపదమున్* (వ॥ పెక్కుజన్మంబులం గాని పొందరాని పదం
బు దానొక్కజన్మంబున నేనొందియుండ దనమనంబునందప్రాప్తమనోరథుండనని పురుషార్థవేదియైన ధ్రువుండెట్లు దలంచెన
నిన మైత్రేయుండిట్లనియె* (గీ॥ అనఘపినతల్లి దన్నుఁ బలికినదురుక్తి। బాణవిద్ధాత్ముఁడగుచు దద్భాషణములు। చిత్తమందు
తాస్మలునైనసనందనాములిం। దనయము నేకజన్మసము పార్జితయోగసమాధిఁ జేసి యె। వ్వనిచరణారవిందములు వారకభ
క్తి నెఱుంగుచుందురా।ఘనుఁబరమేశు నీశు నవికారుని మేయుని జేయునాద్యునిన్* (వ॥ పనుషక్తాసంబులు భజియించిత త్వా
దపద్మచ్ఛాయం బ్రాపించియు భేదదర్శనుండనై తినక్కటా యిట్టి భాగ్యహీనుండనైన నేను భవనాశనుండై నయతనిం బొడగ
నిసహింపంజాలని యీ దేవతలచేత మదీయమతి కలుషితంబయ్యెం గాక నాఁడు నారదుండాడినమాట తథ్యంబయ్యె నతని వా
క్యంబులంగీకరింపక నేనసత్తముండనై స్వప్నావస్థలం బొందినవాఁడు దైవికంబయిన మాయం జెంది భిన్నదర్శనుండగు
చందంబున నేనద్వితీయుండనైనను భ్రాంతియనుశత్రువుచేఁ బ్రాప్తంబయిన దుఃఖంబునొంది జగదాత్మకుండు సుప్రసాదుండు

భవనాశకుండునైనయీశ్వరు నారాధించి తత్ప్రసాదంబువడసియు నాయుర్విహీనుండైనరోగికిం బ్రయోగించు నౌషధ
ముంబో లెనిరర్థకంబులై నశ్వరంబులైనయీ కామితంబులు గోరితినని వెండియు* (మ॥ ధనహీనుండు నృపాలుఁ జేరి తృషతో
దారోఁ న్నచోఁ దూకఁదె! మ్మనియర్థించినరీతిముక్తిఫలదుండైనట్టిపంకేజలో! చనుఁడే చాలఁ బ్రసన్నుఁడైననతని న్సంసారికం
బద్ధిఁ గోరిననావంటివిమూఢమానసులు ధాత్రిన్గల్గిరే యెవ్వరుఁ* (సీ॥ అని యిట్లు చింతించెనను చు నమ్మైత్రేయముని విదురున

—*ధ్రువుండు మరలితనపురంబునకువచ్చుట.*—

కునిట్లనియెఁ దండ్రి! కమనీయహరిపాద కమలరజోభిసంస్కృత శరీరులును యాదృచ్ఛికమున! సంప్రాప్తమగుదానసంతు
ష్టచిత్తులై వరలుచునుండు మీవంటి వారు! దగభగవత్పాదదాస్యంబుదక్కంగ నితరపదార్థంబు లెడదలంచ! మఱియును గో
రనొల్లరుమను చరిత్ర! తపిలియిట్లు హరిప్రసాదంబునొంది! మరలివచ్చుచున్నకుమారవార్తఁ! జారుచే వినియుత్తానచర
ణుఁడప్పుడు! మనమున నిట్లని తలంచె* (క॥ చచ్చినవారలు గ్రమ్మఱ! వచ్చుటయేగాక యిట్టివార్తలు గలవే! నిచ్చలు నమంగళుఁ
డనగు! దిచ్చట మఱి నాకు శుభము లేల ఘటించుఁ* (క॥ అనివిశ్వసింపకుండియు! మనమున నారదుఁడు కుమారుఁడు వేగం!
బునరాగలఁడను చును బలి! కినపలుకులు దలఁచి నమ్మి కృతకృత్యుండై* (క॥ తనసుతుని రాకఁ జెప్పిన! ఘనునకు ధనములును మౌ
క్తిక పుహారములు! న్నమలరనిచ్చి తనయునిఁ! గనుఁగొను సంతోషమాత్మఁ గడలుకొనంగఁ* (సీ॥ వలనుమీఱఁగ సైంధవంబు
లఁబూన్చినకనకరథంబునుత్కంఠనెక్కి! బ్రాహ్మణకులవృద్ధబంధుజనామాత్యపరివృతుండగుచు విస్ఫురణ మెఱసి! బ్రహ్మని
ర్ఘోషతూర్యస్వనశంఖకాహళవేణురవములందందఁ జెలఁగఁ! శిబికంబులెక్కి భూషితలైసునీతిసురుచులు త్తముండు నారూ
ఢినడువ! గరిమదీపింపనతిశీఘ్రగమనమొప్ప! నాత్మనగరంబు వెలువడియరుగుచుండి! బలసినగరోపవనసమీపంబునంకు!
వచ్చు ధ్రువుఁగని మేదినీశ్వరుఁడు నంత* (చ॥ అరదము డిగ్గి ప్రేమదొలుకాడసనంభ్రముఁడై రమామనో! హరుచరణారవింద
యుగళార్పణనిర్దళితాఖిలాఘునీ! శ్వరకరుణావలోకనసుజాతసమగ్రమనోరథున్సుతు! న్గరమనురక్తిడాసి పులకల్ననలో
త్తఁ బ్రమోదితాత్ముఁడై* (గీ॥ బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నివిరి! శిరము మూర్కొనిచుబుకంబు చేతఁ బుణికి! యవ్వ్య
యానందబాష్పధారాభిషిక్తుఁ! జేసి యాశీర్వదింపనాచిరయశుండు* (క॥ జనకుని యాశీర్వచనము! లనయముఁగైకొనిప్ర
మోదమైతత్పదము! ల్దనఫాలతలముసోకఁగ! వినతులుగావించిభక్తివిహ్వలుఁడగుచుఁ* (గీ॥ అంతనాసజ్జనాగ్రణియైన ధ్రు
వుఁడు! దల్లులకుభక్తివినతులు దగనొనర్చి! సురుచికిని మ్రొక్కనర్భకుఁ జూచి మెత్తి! నగుమొగంబున నాలింగనంబుఁ జేసి* (సీ॥
కరమొప్పనానందగద్గదస్వరమున జీవింపుమనుచు నాశీర్వదించె! భగవంతుఁ డెవ్వనిపై మైత్రి వాటించు నతనికృపానిరతిఁ
బ్రసన్నుఁడగుచు! నతనికిఁ దమయంతననుకూలమై యుండు సర్వభూతంబులు సమతఁ బేర్చి! మహిఁ దలపోయ నిమ్నప్రదేశ
ములకుననయంబు చేరుతోయములపగిదిఁ! గానఁ ఘనునమ్మహాత్ముని గారవించె! సురుచిపూర్వంబుఁ దలఁపకసుజనచరిత! విష్ణు
భక్తులు ధరను బవిత్రులగుట! వారికలుగరు ధరణి నెవ్వారు మఱియు* (వ॥ కావునను త్తముండును ధ్రువుండును బ్రేమవిహ్వలు
రగుచు నన్యోన్యాలింగితులై పులకాంకురాలంకృతశరీరులై యానందబాష్పంబుల నొప్పిరంత సునీతియుఁ దనప్రాణంబు
లకంటెఁ బ్రియుండైనసుతునుపగూహనంబు చేసి తదవయవస్పర్శనంబు చేత నానందంబునొంది విగతశోకయయ్యెనప్పుడు సం
తోషబాష్పధారాసిక్తంబులై చనుబాలుగురిసెనంత* (సీ॥ ఉన్నతసంతోషముప్పతిల్లఁగఁ బౌరజనములాధ్రువుతల్లి నెన
యఁజూచి! తొడరిన భవదీయదుఃఖనాశకుఁడైన యీతనూజుండునెందేని బెద్ద! కాలంబు క్రిందటఁ గడఁగి నష్టంబైన వాఁడిప్డు
నీభాగ్యవశముఁ జేసి! ప్రతిలబ్ధుఁడయ్యె నీతండు భూమండలమెల్లను రక్షించెనిద్ధమహిమఁ! గమలలోచనుఁ జింతించు ఘనులు
లోక! దుర్జయంబైనయట్టి మృత్యువును గెల్తు! రట్టిప్రణతార్తిహరుఁడైనయబ్జనాభుఁ! డర్థి నీచేతఁ బూజితుఁ డగుట నిజము*
(వ॥ అని ప్రశంసించిరట్లు పౌరజనంబుల చేత నుపలాల్యమానుండగుచు నుత్తానపాదుండుత్తమసమేతంబుగా ధ్రువుని గజా
రూఢునిం జేసి ప్రహృష్టాంతరంగుండై పురాభిముఖుండై చనుదెంచి* (సీ॥ స్వర్ణపరిచ్ఛదస్వచ్ఛకుడ్యద్వారలాలితగోపురా
ట్టాలకములు! ఫలపుష్పమంజరీకలితరంభాస్తంభపూగపోతాదివిభూషితంబు! ఘనసారకస్తూరికాగంధజలబందురాసిక్తవి
పణిమార్గాంచితంబు! మానితనవరత్నమయరంగవల్లీవిరాజితప్రతిగృహప్రాంగణంబు! శుభనదీజలకుంభసంశోభితంబు!
తండులస్వర్ణలాజాక్షతప్రసూన! ఫలభరవ్రాతకలితసభ్రాజితంబు! నగుచుసర్వతోలంకృతమైనపురము* (వ॥ ప్రవేశించి
రాజమార్గంబునఁ జనుదెంచునప్పుడు* (మ॥ హరిమధ్యల్పురకామినుల్సుతులుసౌధాగ్రంబులందుండి భా! స్వగసిద్ధార్థఫలా
క్షతప్రసవదూర్వావ్రాతదధ్యంబువు! లంరవల్లీమణిహేమకంకణఝణత్కారంబు శోభిల్లఁజ! ల్లిరి యాభాగవతోత్తమోత్త
మునిపైలీలానుమేయంబుగఁ* (వ॥ ఇట్లువాత్సల్యంబునఁ జల్లుచు సత్యవాక్యంబులఁ దీవించుచు సువర్ణపాత్రరచిత మణిదీపనీ
రాజనంబులని వాళింప బౌరజానపదమిత్రామాత్యబంధుజనపరివృతుండై చనుదెంచి* (సీ॥ కాంచనమయమరకతకుడ్యమణి

జాలసంచయ రాజితసౌధములును। వరసుధాఫేనపాండుర సూక్ష్మపరికర తాంతపరిచ్ఛదతల్పములను। సురతరుశోభిత శుకపిక మిథునాళి గానవిభాసితోద్యానములను। సుమహిత వైడూర్యసోపానవిమలశోభితజలపూర్ణ వాపీచయముల। వికచకల్హారదరదరవింద కైరవప్రదీపిత బకచక్రవాక రాజహంస సారస కారండవాదిజలవిహంగ నినదాభిరామ పద్మాకరముల॥ మఱియును* (గీ॥ చారుబహువిధవస్తువిస్తారమొప్పి। యంగనాయుక్తమగుచు బెంపగ్గలింప। నర్థిఁ దనరారు జనకుఁ గృహంబుఁ జొచ్చె। నెలమిఁ ద్రిదివంబు సొచ్చు దేవేంద్రుపగిది* (వ॥ ఇట్లు ప్రవేశించి రాజర్షియైన యుత్తానపాదుండు సుతుని యాశ్చర్యకరబ యునప్రభావంబు వినియుం జూచియు మనంబున విస్మయంబునొంది ప్రజానురక్తుండయ్యును ప్రజాసమ్మతుండును నవయౌవనపరిపూర్ణుండు నైన ధ్రువుని రాజ్యాభిషిక్తుం జేసి వృద్ధవయస్కుండైన తన్నుం దాన యెఱింగి యాత్మగతిఁ బొందనిచ్ఛయించి విరక్తుండై వనంబునకుం జనియె నంత ధ్రువుండు శింశుమార ప్రజాపతికూతురైన భ్రమియను దాని వివాహంబై దానివలనఁ గల్పవత్సరులను నిద్దఱు గొడుకులం బడసి వెండియు వాయుపుత్రియైన యిలయను భార్యయందు నుత్కలనామకుండైన కొడుకునను మనోహరమైన కన్యారత్నంబునుం గనియె నంతఁ దద్భ్రాతయైన యుత్తముండు వివాహంబు లేకుండి మృగయార్థంబు వనంబునకరిగి హిమవంతంబున యక్షుని చేత హతుండయ్యె నతని తల్లియుఁ దద్దుఃఖంబున వనంబునకేగి యందు గహనదహనంబున మృతిఁ బొందె ధ్రువుండు భ్రాతృమరణంబు విని కోపామర్ష వ్యాకులిత చిత్తుండై జైత్రంబగు రథంబెక్కి యుత్తరాభిముఖుం

❖* ధ్రువుండు కుబేరానుచరులైన గుహ్యకులతో యుద్ధము సేయుట. *❖

డై చని హిమవద్ద్రోణియందు భూతగణసేవితంబు గుహ్యకసంకులంబు నైన యలకాపురంబు వొడగని* (మ॥ ఘనశౌర్యోన్నతితోడ సర్వకకుబాకాశంబులం దూఱ బ్రతి। ధ్వనులొప్పిన్ని గుడంగ శంఖము మహోద్యల్లీలఁ బూరింపఁద। న్నినదంబున్ విని యక్షకాంతలు భయావిష్టాత్మలై రుగ్రసా। ధనులై యక్షభటుల్ పురిన్ వెడలి రుత్సాహంబు సందిల్లఁగన్॥ ఇట్లు వెడలి యాధ్రువుఁ గండాకిన* (చ॥ కరము మహారథుండు భుజగర్వపరాక్రమశాలి యున్నను। ధ్రువుడును మూఁడౌ ధ్రువుఁడు దన్నెదిర్చిన యక్షుకోటిఁ జె। చ్చెరఁ బదమూఁడు వేలునొక చీటికిఁ గైకొనక గ్రక్కపెట్టభీ। కరముగ మూఁడుమూఁడు శితకాండములం దగఁ గ్రువ్వ నేసినన్* (ఉ॥ వారలలాటముల్ వగిలి వారక సోలయుఁ దేలి యస్త్రమోహా। దారుపరాక్రమప్రకటధైర్యముఁ దత్కరలాఘవంబుఁ బ్లాఘించుచుఁ గుపితమానసులై పదతాడిత ప్రదు। ష్టోరగకోటిఁ బోలి చటులోగ్రభయంకర రోషమూర్తులై* (ఉ॥ ఆరథికోత్తముం దొడరి యందఱు నొక్కట బెట్టుముట్టి పెం। పారఁగ బాణషట్కము తదంగములన్ బలులంగ నేసివి। స్ఫారగదా శరక్షురిక పట్టస తోమర శూల ఖడ్గము। ల్సారథియుక్తుఁడైన రథిసత్తము పైఁ గురియించి రేపునన్॥ అట్లు గురియించిన నతండు* (క॥ పెంపడియుండెను ధారా। సంపాతచ్ఛన్నమైన శైలము భంగిన్। గుంపులుగొని యాకసమునఁ। గంపింపుచు నపుడు సిద్ధగణములు వరుసన్* (క॥ హాహాకారము లెసఁగఁగ। నోహో యీరీతి ధ్రువపయోరుహహితుఁడు। త్సాహము చెడి యిటు దైత్యస। మూహార్ణవమున నేఁడు మునిఁగెనె యకటా॥ అని చింతించు సమయంబున* (క॥ తామాతనిఁ గెలిచితిమని। యామనుజాశనులు వలుక నటనీహార। స్తోమము సమయించు మహో। ద్దాముండగు సూర్యుఁ బోలి తద్దయుఁ దోఁచెన్॥ అట్లు దోఁచిన* (మ॥ అరిమఃశిఖావహమైన కార్ముకము కార్యస్ఫూర్తితోఁ దాల్చె భీ। కరబాణావళిఁ బింజపింజగ నవంగా వేసి ఝంఝానిలుం। డురుమేఘావళిఁ బాఱఁదోలుగతి నత్యుగ్రాహవప్రారంభ। ధురశస్త్రావళి రూపుమాపె విలసద్దోర్లీల సంధిల్లఁగన్* (చ॥ మఱియపుడ మ్మహోత్కుఁడ సమానబలుండును మహోగ్రబాణము। ల్గడకఁటిఁ దాకనేసి భుజగర్వ మెలర్ప విరోధిమర్మము। ల్పరియలు సేసి యంగములు భంగము నొందఁగఁ జేసె ద్రెళ్ళిమడి। ల్గిటిగొని పర్వతంబుల నొగిం దెగఁగొట్టెడు నింద్రుకైవడిన్॥ అయ్యవసరంబున* (చ॥ అలఘుచరిత్రుఁ డమ్మనుకులాగ్రణి చేవిక లాంగులైన వా। రలసకిరీటకుండలవిరాజితమస్తకకోటి చేసము। జ్జ్వలమణికింకణాంగదలసద్భుజవర్గము చేత సంగర। స్థలమతిరమ్యమై తనరెఁ జందితవీరమనోహరాకృతిన్॥ అంత హతశేషులు* (క॥ వరబలుఁడగు నమ్మనుమని। శరసంధిన్నాంగులగుచు సమరవిముఖులై। హరిరాజముఁ గని పఱచెడు। కరిబృందముఁ బోలి చనిరి కళవళపడుచున్* (క॥ అప్పుడు రాక్షసమాయలు। గప్పిన ధ్రువుఁ డసురవరుల కార్యం బెఱుఁగ। న్నొప్పడక వారిఁ బొడగన। దెప్పరమగుటయును సారథిం గని యంతన్* (క॥ తలపోయఁగ భువి మాయా। వుల కృత్యం బెఱుఁగ నెవ్వరోపుదు రనుచు। న్బలుకుచుఁ దత్పురిఁ జొరఁగాఁ। దలఁపుచు నది గానరాకఁ దద్దయు మానెన్* (వ॥ అట్లు పురంబునకరుగుట మాని చిత్రరథుండైన యాధ్రువుండు సప్రయత్నుండయ్యును బరప్రతియోగశంకితుండై యుండెనయ్యెడ మహాజలధిఘోషంబు ననుకరించు శబ్దంబు వినంబడె నంత సకలదిక్తటంబుల వాయుజనితంబైన రజఃపటలంబు చేద క్షణంబున నాకాశంబున విస్ఫురత్తటిత్ప్రభాకలితగర్జారవయుక్తమేఘంబుల మోఘంబులగుచు భయంకరాకారంబులై తోఁచెనంత* (మ॥ అనయంబున్ ధ్రువుమీఁద దైత్యకృతమాయాజాలమున్ గ్లేదభో। రనమస్థిమజ్జాపురీషమూత్రపలదుర్గంధాస్థిమేదశ్శరా। సనని(స్త్రిం)శశరాళితో మరగదాచక్రత్రిశూలాది

సాధనభూభృద్భుజగావళిం గురిసెను గ్దండక్రియాలోలత౯ * (వ॥ మఱియు మత్తగజసింహవ్యాఘ్రసమూహంబులునూర్మిభయంకరంబై సర్వతఃప్లవనంబయిన సముద్రంబును గానంబడియె వెండియుం గల్పాంతంబునందుంబోలె భీషణంబైన మహాహ్రదంబును దోఁచె నివ్విధంబున నానావిధంబుల ననేకంబులు నవిరళభయంకరంబులు నైన యసురమాయలు క్రూరప్రవర్తనులగు యక్షులచేత సృజ్యమానంబులై యడరె నాసమయంబున* (క॥ అనయము మాయావ్యసురుల ఘనమాయ నెఱింగి మునిని కాయము వరుస౯ మనుమను మనినను మనుముని । మనమునఁ దలపుచును దత్సమక్షమున కున౯ ॥ చనుదెంచి యిట్లనిరి* (సీ॥ అనఘాత్మ లోకులెవ్వని దివ్యనామంబు సమతనాకర్ణించి సంస్మరించి । దుస్తరంబైన మృత్యువు నైన సుఖవృత్తిం దరియింతురట్టి యీశ్వరుండు వరుఁడు । భగవంతుఁడును శార్ఙ్గపాణియు భక్తజనార్తిహరుండగు నట్టి విభుఁడు । భవదీయ విమతులఁ బరిమార్చుఁ గాక నివలికిన మునుల సంభాషణములు । వినికృతాచమనుఁడు రమావిభుని పాద । కమలముఁ దలంచి రిపుభయంకర మహోగ్ర । కలితనారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ బూనఁ దడవఁ దద్యసంధానమునను* (గీ॥ కడఁగి గుహ్యకమాయాంధకారమప్పుడు వెరవు చెడి దవ్వులవిరిసిపోయె । విమలమైన వివేకోదయమునఁ జేసి । సమయు రాగాదికంబులసరణి నంత* (మ॥ వరనారాయణదేవతాకపటు దుర్వారప్రభా హేమపుం । ఖరుచి స్ఫారమరాళ రాజసితపత్త్ర క్రూరధారాపత। చ్ఛర సాహస్రము లోలి భీషణవిపక్షశ్రేణిపై వ్రాలె భీ। కరరావంబునఁ గానఁ జొచ్చు శిఖిసంఘాతంబు చందంబున౯ ॥ అట్లేసిన* (చ॥ ఖరనిశితోగ్ర సాయకనికాయ పరంపర వృష్టిచేఁ బొరిం। బొరి వికలాంగులై యడరి పుణ్యజనుల్ పృథుహేతిపాణులై । గరుడునిఁ జూచి భూరి భుజగప్రకరంబు లెదిర్చి పేర్చి చె । చ్చెర నడతెంచు చందమునఁ జిత్రరథుం బలుపూని తాఁకిన౯* (ఉ॥ వారలఁ జండతీవ్రశరవర్గముచేత నికృత్తపాదజం । ఘోరు శిరోధరాంబకశిఖోదరకర్ణులఁ జేసె యోగివం । కేరుహమిత్రమండలసకృద్భిద నెట్టి పదంబుఁ జెందునా । భూరిపదంబునం బెలుచఁ బొందఁగఁ బంపె భుజావిజృంభియై* (వ॥ ఇవ్విధంబున నాచి

❀ * స్వాయంభువు ధ్రువుని సంగరంబుడుగుమని యుపదేశించుట. * ❀

త్రరథుండగు ధ్రువునిచేత నిహన్యమానులు నిరపరాధులు నైన గుహ్యకులం జూచి యతని పితామహుండైన స్వాయంభువుండు ఋషిగణపరివృతుండై చనుదెంచి ధ్రువునిం జూచి యిట్లనియె వత్సా నిరపరాధులయిన పుణ్యజనుల నెట్టి రోషంబున వధియించితివట్టి నిర్హేతుకవైర రోషంబు విరమింపుము భ్రాతృవత్సల భ్రాతృవధాభితప్తుండవై కావించు నీయత్నంబుడుగుమని* (క॥ అనఘా మనుకులమునకిది । యనుచితకర్మంబ యొకనికై పెక్కండ్రి । ట్లని మొనఁ గ్రుంకిరి యిది నీ । కనయంబును వలవదుడుగుమయ్యనుమారా* (వ॥ అదియునుంగాక దేహాభిమానంబునం బశుప్రాయులై హింసఁ గావించుట హృషీకేశానువర్తనులయిన సాధువులకుఁ దగదు నీవు సర్వభూతంబుల నాత్మభావంబునఁ దలఁచి సర్వభూతావాసుండు దురారాధ్యుండు నైన విష్ణుని పదంబులఁ బూజించి తత్పరమపదంబును నొందితివి యట్టి భగవంతుని హృదయంబునకును సమస్త భాగవతుల చిత్తంబులకు సమ్మతుండవు మఱియు సాధువర్తనుండవన నొప్పు నీవీ పాపకర్మం బెట్లు సేయ సమకట్టితి వేపురుషుండైన నేని మహాత్ములయందుఁ దితిక్షయు సములయందు మైత్రియు హీనులయందుఁ గృపయు నిరతములగు సమస్తజంతువులయందు సమత్వంబును గలిగి వర్తించువానివలన సర్వాత్మకుండైన భగవంతుండు ప్రసన్నుండగు నతండు ప్రసన్నుండయిన వాఁడు ప్రకృతిగుణంబులం బాసి లింగశరీరంబు భంగంబుఁ గావించి బ్రహ్మానందంబునుం బొందు నదియునుంగాక కార్యకారణసంఘాతరూపంబైన సర్గంబీశ్వరునందు నయస్కాంతసన్నిధానంబు గలిగిన లోహంబు చందంబున వర్తించునందు సర్వేశ్వరుండు నిమిత్తమాత్రంబుగాఁ బరిభ్రమించునట్టి యీశ్వరుని మాయాగుణవ్యతికరంబున నారబ్ధంబులైన పంచభూతంబులచేత యోషిత్పురుషవ్యవాయంబువలన యోషిత్పురుషాదిరూపసంభూతియగు నివ్విధంబున సర్గంబుఁ దత్సంస్థానంబుఁ దల్లయంబు నగుచునుండు నిట్లు దుర్విభావ్యంబయిన కాలశక్తిం జేసి గుణక్షోభంబున విభజ్యమానవీర్యుండు ననంతుండు ననాదియునై జనంబుల చేత జనంబులఁ బుట్టింపుచుండుటం జేసి కడా యాదికరుండు మృత్యుహేతువులగు జనంబుల లయంబు నొందించుటం జేసి యంతకరుండునై యనాదియగుటం జేసి యవ్యయుండు నైన భగవంతుండు జగత్కారణుండగుఁ గావున నీ సృష్టిపాలన విలయంబులకుం గర్తగాని వానివలన దానిఁ జేయుచుండు నిట్లు మృత్యురూపుండు పరుండు సమవర్తియు నైన యీశ్వరునికి స్వపక్ష పరపక్షంబులు లేవు కర్మాధీనంబులైన భూతసంఘంబులు రజంబులు మహావాయువు ననుసరించు చాడ్పున నస్వతంత్రంబులగుచు నతనిననువర్తించు నీశ్వరుండు జంతుచయాయురుపచయాపచయకరణంబుల స్పృష్టుండు నగు జీవుండు కర్మబద్ధుండగుటం జేసి కర్మంబవానికి నాయురుపచయాపచయంబులం జేయుచుండు మఱియు సర్వజగత్కర్మసాక్షియగు సర్వేశ్వరుని* (క॥ కొందఱు

మహారథుఁడు॥ శ్లో॥ ఏకాదశసహస్రాణి యోధయేద్యస్తు ధన్వినామ్ । శస్త్రాస్త్రప్రవీణస్తు మహారథ ఇతి స్మృతః ॥ అమితాన్ యోధయేద్యస్తు సంప్రోక్తోతిరథస్తు సః । సమస్త్వేకేన యోయోద్ధా తస్యోనోర్ధరథో మత ఇతి. తా॥ పదనొకండువేలవిలుకాండ్రతో యుద్ధము చేయుసామ

స్వభావమందురు। కొండలుకర్మంబటంద్రుకొండలుకాలం । బందురుగొండలుదైవం।బందురుగొండలును గామమంద్రుమ హాత్మా* (వ॥ ఇట్టులవ్యక్తరూపుండు నప్రమేయుండు నానాశక్త్యుదయభూతహేతుండునైనభగవంతుండు సేయుకార్యం బులబ్రహ్మర్షులాదులెఱుంగరట యతనితత్త్వంబు లెవ్వరు నెఱుంగ నోపుదురు గావునం బుత్రా యిట్లుత్పత్తినాశంబులకుదై వంబు కారణంబై యుండంగా ననిద్ధనదానుచరులు భవదీయభ్రాతృహంతలగుదు రే భూతాత్మకుండు భూతేశుండు భూతభా వనుండు సర్వేశ్వరుండు పరావరుండు నగు నీశుండు మాయాయుక్తుండై స్వశక్తిచే సృష్టిస్థితిలయంబులం జేయునైన నహంకా రంబునం జేసి గుణకర్మంబులచే నస్పృశ్యుండగుచు వర్తించునదియునుంగాక యీ ప్రజాపతులు విశ్వసృణ్నామంబులనియం త్రితులై ముకుత్రాళ్లు వెట్టినపశువులంబోలి యెవ్వని యాజ్ఞాధీన కృత్యులై వర్తింతు రట్టిదుష్టజనమృత్యువు సుజనామృతస్వరూ పుండు సర్వాత్మకుండు జగత్పరాయణుండు నైన యీశ్వరుని సర్వప్రకారంబుల శరణంబు బొందుమదియునుంగాక* (సీ॥ అనఘాత్మ నీవు పంచాబ్దవయస్కుండవై పినతల్లి నిన్నాడినట్టి । మాటలనిర్భిన్న మర్ముండవగుచును జననియాత్రి దిగనాడి కాననకే గి । తపమాచరించి యచ్యుతునీశ్వరు సభక్తిం బూజించి మహితవిభూతి మెఱసి । రవణంద్రిలోకోత్తరంబైనపదమును బొంది తివదిగానభూరి భేద। రూపమైన ప్రపంచంబు రూఢి నేమహాత్ము । నందు బ్రతీతమైయలరునట్టి। యగుణుండై యద్వితీయుండన ఘుండు నైన యీశ్వరుం బరమాత్ము ననుదినంబు* (సీ॥ కైకొనిశుద్ధంబుగతమత్సరాదికంబనఘలంబునగుహృదయంబునందు। సోలయక న్వేషింపుచును ప్రత్యగాత్ముండు భగవంతుండు నుబరబ్రహ్మమయుండు । నానందమాత్రుండు నవ్యయుండు పపన్న సకలశక్తియుతుండు సగుణుండు జుండు । నైన సర్వేశ్వరు నందుత్తమంబైన సద్భక్తిం జేయుచు సమత నొప్పి । రూఢి సోహమ్మను యని ప్రరూఢమగుచు । ఘనతతోనవిద్యామహాగ్రంధి నీవు । ద్రెంచివైచితి కావున ధీవరేణ్య। సర్వశుభహానిమైన రోషంబు వలదు* (క॥ వినురోషహృదయుండగునంగొని। యనయము లోకము నశించ నతిభయయుతమై। ఘనరోగమహౌషధంబుల। యను వుననది గాన రోషము డంపుమహాత్మా* (గీ॥ అనఘ నీదు సహోదరహంతలనుచుం। బెనచి యీపుణ్యజనులం జంపితిక డంగి। పర గని దిమెసదాశివభ్రాతమైన। యర్థవిభు నకు నపరాధ మయ్యెం గాన* (క॥ ధృతి నుతుల చేత నీవిపు। డతనిం బ్రసన్నునిం గం జేయు మని మనువు దయాళు తిం జెప్పె ధ్రువుని చేస। తత్పృడై నయ మొప్పం జని యెఋషియుక్తుండై॥ అంత* (గీ॥ యక్షచారణసిద్ధ విద్యాధరాది । జనగణస్తూయమానుండై ధనదుండంత । బుణ్యజనవైశసనివృత్తభూరిరోష । రహితుండై నట్టి ధ్రువునిం జే రంగవచ్చి। అప్పుడు* (సీ॥ చనుదెంచి వేసంగ్రుతాంజలియై ధ్రువునిం జూచి తివుటనిట్లనియె క్షత్రియకుమార। తగ భవదీయపితా మహాదేశంబు ననుదుస్త్యజంబైన ఘనవిరోధ । ముడిగితి నట్లు గావునం దానం జేసి నీయందు ప్రసన్నుండనైతి భూత । జననల యంబులకనయంబు కాలంబెకర్తయై వర్తించు గాన యుష్మ। దనుజుం జంపిన వారలీయక్షవరులు। గారు తలపోయ నీయక్షగణము నిట్లు। నెజీవధించిన వాండవు నీవుం గావు। వినుతగుణశీల మాటలు వేయు నేల* (వ॥ అదియునుంగాక యే బుద్ధిం జేసి కర్మసంబం ధదుఃఖాదికంబులు దేహాత్మానుసంధానంబునం జేసి సంభవించు నట్టియహంత్వమ్మను నపార్థజ్ఞానంబు స్వప్నమందుం బోలెం బురుషునకుం దోంచునది గావున సర్వభూతాత్మవిగ్రహుండు నధోక్షజుండు భవచ్ఛేదకుండు భజనీయపాదారవిందుండున నంతామేయశక్తియుక్తుండు గుణమయియగు నాత్మమాయచే విరహితుండునైన యీశ్వరుని సేవింపుము॰ - నీకు భద్రంబ య్యెడు భవదీయమనోగతంబైన వరంబుం గోరుము నీవంబుజనాభపాదారవింద సేవనంబుం దిరంబుగం జేయుదువని యెఱుం గుదునని రాజరాజు చేతనట్లు మహామతియు భాగవతోత్తముండునైన ధ్రువుండు ప్రేరేపింపంబడి యే హరిస్మరణంబుచేతం ద నప్రయత్నంబున దురత్యయంబైన యజ్ఞానంబుం దరియింతురట్టి హరిస్మరణం బచలితంబగునట్లొసంగుమని యడిగిన నట్లకా కయని యంగీకరించి యంతంగుబేరుండు సంప్రీతచిత్తుండయి ధ్రువునికి శ్రీహరిస్మరణంబట్లయనుగ్రహించి యంతర్ధానంబునొం దెనంత ధ్రువుండు యక్షకిన్నరకింపురుషగణసంస్తూయమానవైభవుండగుచు నాత్మీయపురంబునకు మరలి చనుదెంచి* (సీ॥ గణుతింపభూరిదక్షిణలచేం గడు నొప్పు యజ్ఞములు సేయ నయ్యజ్ఞవిభుండు। ద్రవ్యక్రియాదేవతాఫలరూపసత్కర్మఫలప్రదాతయ యియొప్పు । పురుషోత్తముని నర్థిం బూజించి మఱియు సర్వోపాధివర్జితుండుత్తముండు । సర్వాత్మకుండగు జలజాక్షునందుం దీ వ్రంబై ప్రవాహరూపంబునైన । భక్తిసలుపుచు నఖిలప్రపంచమందు । నలరందనయందు నున్న మహాత్ముహరినిం । జిదచిదా నందమయుని లక్ష్మీశుం బరము నీశ్వరేశ్వరుం బొడగనెసిద్ధచరిత* (వ॥ ఇట్లు సుశీలసంపన్నుండు బ్రహ్మణ్యుండు ధర్మసేతురక్ష కుండు దీనవత్సలుండు నయి పాలించు ధ్రువునిం బ్రజలు దండ్రియని తలంప నిరువదియాఱువేలేండ్లు భోగంబులచేతం బుణ్యక్ష యంబును భోగంబులయిన యాగాదులచేత నశుభక్షయంబును జేయుచు బహుకాలంబు దనుకం ద్రివర్గసాధనంబుగా రాజ్యం

రథశ్రేయుగల శస్త్రాస్త్రప్రవీణుండయిన వాండు మహారథికుండనంబడును- అపరిమితరథికులతో యుద్ధము జేయువాండు - అతిరథుండనంబడును - ఒకరథికునితో యుద్ధముచేయువాండు సమరథుండనంబడును-సమరథునికంటె తక్కువైనవాండు అర్ధరథుండనంబడును.

బు చేసి కొడుకునకుం బట్టంబుం గట్టి యచలితేంద్రియుండై యవిద్యారచిత స్వప్నగంధర్వనగరోపమంబయిన దేహాదికంబగు విశ్వంబు భగవన్మాయారచితంబని యాత్మం దలంపుచు వెండియు* (చ॥ మనుని భుఁడంత భృత్యజనమంత్రిపురోహితబంధుమి త్రనం| దనపశువిత్తరత్నవనితాగృహరమ్యవిహారశైలవా । రినిధిపరీతభూతలహరిద్వీపముఖ్యపదార్థజాలము| ల్లనమతిచే నశ్యములుగాఁ దలఁపోసి విరక్తచిత్తుఁడై* (సీ॥ పురము వెల్వడిచని పుణ్యభూ బదరికాఘనవిశాలానదీకలితమంగ| ళాంబుపూరంబులను రక్తిమెఁ గ్రుంకి కమనీయపరిశుద్ధకరణుఁడగుచుఁ । బద్ధాసనస్థుఁడై పవనుని బంధించి నెలకొని ముకుళితనేత్రుఁ డగుచు| హరిరూపవైభవధ్యానంబు సేయుచు భగవంతుని చ్యుతుఁ బద్మనేత్రు| నంకు సతతంబు నిశ్చలమైన యట్టి| భక్తిఁ బ్రవహింపఁజేయుచుఁ బరమామోద| బాష్పధారాభిషిక్తుండు భవ్యయశుఁడు| పులకితాంగుండునగుచు నిమ్ములఁ దనర్చి* (వ॥ మఱియు విగతక్లేశుండు ముక్తలింగుండును ధ్రువుండు దన్నుఁ దా మఱచియుండు సమయంబున దశదిక్కుల నుద్యద్రాకానిశానాయకుంబోలి వెలింగింపుచు నాకాశంబుననుండి యొక్క విమానంబు చనుదేరనందు దేవశ్రేష్ఠులు చతుర్భుజులు రక్తాంబుజేక్షణులు శ్యామవర్ణులు గదాధరులు సువాసస్సులుఁ గిరీటహారాంగదకుండలధరులుఁ గౌమారవయస్కులు నుత్తమశ్లోకకింకరులు నయిన వారల నిద్దఱం గని సంభ్రమంబున లేచి మధుసూదననామంబులు సంస్మరింపుచు వారల భగవత్కింకరులుగాఁ దలంచి దండప్రణామంబులాచరించి కృష్ణపాదారవిందవిన్యస్తచిత్తుండుఁ గృతాంజలియు వినమితకంధరుండునైన ధ్రువునిం గనుంగొని పుష్కరనాభభక్తులైన సునందనందనులు ప్రీతియుక్తులై మందస్మితులగుచు నిట్లనిరి* (ఉ॥ ఓ నృపనీకు భద్రమగు నొప్పగుచున్న మదీయవాక్యము । లీవు నలయందుఁ జొన్పుము వివేకముతో నయిదేండ్లనాఁడు మే । ధానిధివై యొనర్చినయుదాత్తతపోవ్రతనిష్ఠచేతఁ దేజోమయశాలివైన మధుసూదనుఁ దృప్తివహింపఁజేసితౌ* (గీ॥ అట్టి శార్ఙ్గపాణి యఖిలజగత్కర్త| దేవదేవుఁ డతుల దివ్యమూర్తి| నమ్ముఁ బనుపమేము మాధవపదమున| కర్థి నిన్నుఁ గొనుచు నరుగుటకును* (వ॥ వచ్చితిమి యేపదంబు నేమి సూరిజనంబులు సర్వోత్తమంబని పొందుదురు దేనిఁ జంద్రదివాకర గ్రహనక్షత్ర తారాగణంబులు ప్రదక్షిణంబుగా దిరుగుచుండు మఱియు నీదు పితృల చేతనన్యుల చేతన నధిష్ఠితంబు జగద్వంద్యంబు నభక్తజనాతిదుర్జయంబునయిన విష్ణుపదంబుఁ బొందుదువు రమ్మిది విమానశ్రేష్ఠం బుత్తమశ్లోక జనమౌళిమణియైన శ్రీహరి పుత్తెంచె దీని నెక్క నర్హుండవనిన నురుక్రమప్రియుండయిన ధ్రువుండు తన్మధురవాక్యంబులు విని కృతాభిషిక్తుండయి యచ్చటి మునులకుం బ్రణమిల్లి తదాశీర్వాదంబుఁ గైకొని విమానంబునకుం బ్రదక్షిణార్చనంబులు గావించి పార్షదులైన సునందనందనులకు వందనం బాచరించి భగవద్రూపవిన్యస్తచక్షురంతఃకరణాదికుండగుచు యావిమానాధిరోహణంబు గావించుటకు హిరణ్మయరూపంబు ధరియించెనప్పుడు* (క॥ సురకుంభిపణవానక । మురజాదులు మొఱసె విరులముసరుగురిసెఁ గి| న్నరగంధర్వుల పాటలు| భరితములై చెలఁగెనపుడు భవ్యచరిత్రా* (వ॥ అట్టి సమయంబున ధ్రువుండు దుర్గమంబగు త్రివిష్టపంబునకు నేగువాఁడగుచు దీనయగు జననిం దెగడి యెట్లు పోవుదునని చింతించు వానిం బార్షదులవలోకించి యగ్రభాగంబున విమానారూఢయై యేగుచున్న జననిం జూపిన సంతుష్టాంతరంగుండగుచు* (క॥ జనని సునీతని మునుగనుఁ। గొని యమలవిమాన మెక్కి కొనకొని విబుధు| ల్దనమీఁదఁ బుష్పవర్షము| లనయము గురియింప ధ్రువుఁడు హర్షముతోడన్* (క॥ చనిచని వెస గ్రహమండల। మును ద్రైలోక్యంబు సప్తమునిమండలముం| ఘనుఁ డుత్తరించి యవ్వలఁ| దనరెడు హరిపదము నొందెఁ దద్దయుఁ బ్రీతిన్* (వ॥ అది మఱియు నిజకాంతిచేతం ద్రిలోకంబులం బ్రకాశింపం జేయు, నిర్దయాగమ్యంబు, శాంతులు, సమదర్శనులు, శుద్ధులు, సర్వభూతానురంజనులు నచ్యుతభక్తబాంధవులు నైన భద్రాచారులకు సుగమ్యంబు గంభీరవేగంబున నిమిషంబునకు జ్యోతిశ్చక్రంబు సమాహితంబై గోగణంబు మేధినియందుంబోలె నెందుఁ బరిభ్రమించుచుండు నట్టి యచ్యుతపదంబునుం బొంది విష్ణుపరాయణుండయిన ధ్రువుండు త్రిలోకచూడామణియై యొప్పుచుండె నప్పుడు భగవంతుండయిన నారదుండు ధ్రువుని మహిమం గనుంగొని ప్రచేతస్సత్రంబునందు వీణవాయించుచు* (సీ॥ పతియొ దైవంబుగా భావంబులోపలఁ దలఁచు సునీతినందను తపఃప్ర । భావము క్రియధర్మభవ్యనిష్ఠలఁ బొందఁ జాలరు బ్రహ్మర్షిజనములనిన । క్షత్రియకులులెన్నఁగా నేల యెవ్వఁడు పంచసంవత్సరప్రాయమునను| పరుదిదురుక్త్యుగ్రశర భిన్నహృదయుఁడై మద్వాక్యహితబోధమతిఁ దనర్చి| వనమునకు నేగి హరిభక్తివశత నొంది । యజితుఁడగు హరి తనవశుఁడయి చరింపఁ| జేసి వెసఁ దత్పదంబును జెందెనట్టి| హరిపదంబును బొంద నెవ్వరికిఁ దరము* (క॥ అని పాడెనను చు విదురున| కనఘుఁడు మైత్రేయుఁ డనియె నందితభక్తి| న్వినుతోద్దామయశస్కం| డనఁగల యాధ్రువుని చరితమార్యస్తుత్యా* (సీ॥ మహితసత్పురు

అఘమర్షణంబు- పాపనాశకరమయినది—సినీవాలి-చంద్రకళతోఁ జేరిన అమావాస్యపేరు. అః విష్ణుః- తేన సహవర్తత ఇతి సాలక్ష్మీః- సా అస్యామితి- సినీ చంద్రకళా సా చంద్రకళా బాలా అస్యామితి సినీవాలీ- అ- అనగా విష్ణువు- అతనితోఁ గూడినది గాన- సా-అనగా లక్ష్మి ఆలక్ష్మిగలదిగనుక సిని అనగా జంద్రకళ ఆ చంద్రకళ దీనియందు లేశమైయుండుటగాపున సినీవాలి—మహిషి పట్టపుదేవి.

మ సమ్మతమును ధన్యంబు స్వర్గప్రదంబు యశస్కరంబు । నాయుష్కరంబుఁ బుణ్యప్రదాయకమును మంగళకరము మహార్హణం
బు। సౌమనస్యముఁ బ్రశంసాయోగ్యమును బాపహరమును ధ్రువపదయాపకంబు । నై యొప్పునీయుపాఖ్యానంబుఁ దగనీకు నె
ఱిఁగించితి నిదీని నెవ్వఁడేని తివుటఁ శ్రద్ధాగరిష్ఠుఁడై తీర్థపాద । చరణసరసీరుహద్వయాశ్రయుఁడునైన । భవ్యచరితుఁడినాం
త ప్రభాతవేళలను సినీవాలిపూర్ణిమలం దమఱియు* (గీ॥ ద్వాదశినిబద్ధ్మ బాంధవవాసరమున । శ్రవణనక్షత్రమున దినక్షయ
మునందుఁ బరగ సంక్రమణవ్యతీపాతలందు । సభలభక్తి నివిను నట్టి సజ్జనులకు* (వ॥ క్లేశనాశంబు మహాప్రకాశంబునైన భ
గవద్భక్తియు శీలాదిగుణంబులును గలుగు మఱియుఁ దేజఃకామునకుఁ దేజంబు నిష్కామునకుఁ దత్త్వజ్ఞానంబును గలుగు వినిపిం
చు వారికి దేవతానుగ్రహంబు గలుగు నట్టియుపాఖ్యానంబు నీకెఱింగించితినని మైత్రేయుండు విదురునకుఁ జెప్పిన క్రమంబున
శుకయోగి పరీక్షిత్తునకెఱింగించిన తెఱంగు నసూతుండు శౌనకాదులకు వినిపించి వెండియు నిట్లనియె నట్లు చెప్పిన మైత్రేయునిం
గని విదురుం డిట్లనియె* (సీ॥ అనఘాత్మ నారదమునిపతి ధ్రువచరిత్రము ప్రచేతసుల సత్త్రంబునందు । నర్థిమైఁ గీర్తించె నంటి
ప్రచేతసుల నెవ్వ రెవ్వని తనయులెట్టి । వంశజుల్ సత్త్రమెవ్వలను గాఁ జేసిరి యాగంబు నను నిజాచారశీలు । రగు ప్రచేతసుల చే
యజియింపఁగాఁ బడె యజ్ఞపూరుషుఁ డెట్టు లచ్యుతాంఘ్రి। భక్తియుక్తుఁడు విజితసద్భాగవతుఁడు । నివిరిహరిపాదసేవావిధి
ప్రయుక్త। దేవదర్శనుఁడగు నట్టి దివ్యయోగి। నారదుం డెట్టుగొనియాడె శౌరికథలు* (క॥ నాకిపు డెఱిఁగింపుము సుశ్లోకుని చరి
తామృతంబు శ్రోత్రాంజలులం। బైకొని జుఱ్ఱియుఁ దనివిం। గైకొనదు సన్నదిమనంబు కరుణోపేతా* (క॥ అనియడిగిన విదురునిఁ
గనుఁగొని మైత్రేయుండు వలికె గొనకొని ధ్రువుఁడు । వ్వనమునకుఁ జనిన నాతని। తనయుండగు నుత్కలుండు దళితాఘుండై*
(సీ॥ చతురుఁడా జన్మప్రశాంతుండు నిస్సంగుఁడును సమదర్శనుండును ఘనుండు । నైయాత్మయం దఖిల లోకావళి లోకంబులం
దనాత్మయుఁ జూచు ననఘుమైన। యనుపమ యోగక్రియాపావకాదగ్ధకర్మమలాశయ కలనఁ బేర్చి । జడుని కైవడిఁ జీకు చందం
బునను మూఢుపగిది నున్మత్తుని భంగిఁ జెవిటి । వడువున నుగానఁబడుచు సర్వజ్ఞుఁడయ్యు ప్ర । శాంతకీలమహాశనుసరణిఁ జొచ్చి
పతత శాంతంబు సంచితజ్ఞానమయము । నైన బ్రహ్మస్వరూపంబు నాత్మఁ దలఁచి* (క॥ తనకంటెనితర మొకటెఱుఁగని కతము
న సార్వభౌమశ్రీఁ బొంద। న్మనమునఁ గోరకయుండుటఁ। గని కులవృద్ధులును మంత్రిగణములు నంతః* (వ॥ అతనిని న్మత్తునిం
గాఁ దెలిసి తదనుజుండయిన వత్సరునకుఁ బట్టంబుగట్టిరి యావత్సరునికి సర్వర్ధియను భార్యయందుఁ బుష్పార్ణుండుఁ జంద్రకేతుం
డు నిషుండు నూర్జుండు వసువు జయుండును నన నార్వురు తనయులు గలిగిరి యందుఁ బుష్పార్ణుండను వానికిఁ బ్రభయు దోషయు
ననునిద్దరు భార్యలైరి యందుఁ బ్రభ యను దానికిం బ్రాతర్మధ్యందిన సాయంబులను సుతత్రయంబును దోష యను దానికిం బ్ర
దోష నిశీథ వ్యుష్టులను వారు ముగ్గురును బుట్టిరందు వ్యుష్టుండను వానికిఁ బుష్కరిణియను పత్నియందు సర్వతేజసుండను సు
తుండు పుట్టె వానికి నాకూతియను మహిషివలనఁ జక్షుస్సంజ్ఞుండయిన మనువు జనించె వానికి నడ్వలయను భార్యయందుఁ బు
రువుఁ, గుత్సుఁడుఁ, ద్రితుండు, ద్యుమ్నుండు, సత్యవంతుండు, ఋతుండు, వ్రతుండు, నగ్నిష్టోముండు, నతిరాత్రుండు, ప్రద్యు
మ్నుండు, శిబియు, నుల్ముకుండు, నను పన్నిద్దరు తనయులు గలిగిరి యందు నుల్ముకునికిఁ బుష్కరిణియను దానివలన నంగుండు, సు
మనసుండు, ఖ్యాతియుఁ, గ్రతువు, నంగిరసుండు, గయుండు నన నార్వురు కొడుకులు పుట్టిరి యందు నంగునికి సునీథయను ధర్మప
త్నివలన వేనుండను పుత్రుండుదయించిన* (మ॥ క్షితినాథోత్తముఁ డాత్మనందను నిదుశ్శీలంబు వీక్షించి దుః। ఖితుఁడై యొంటి
గఁ దత్పురి న్వెడలి యేగె న్వేగ నెందేనిఁ ద। ద్గతి వీక్షించి మునీశ్వరుల్కుపితులై దంభోళిసంకాశవా। క్యతతిన్ శాపవశం పింప వాఁ డపు
డు వీఁకం గూలె నమ్మేదినిన్* (సీ॥ కైకొని యపుడు లోకం బరాజకమైనఁ బ్రజలు తస్కరపీడఁ దల్లడిల్లఁ। గనుగొని దుఃఖించి ము
నులు గతాసుఁడై పడిన వేనుని వలపలి భుజంబు । నర్థి మథింప నారాయణాంశంబున నాదిరాజన నొప్పు నట్టి పృథుఁడు । జనియించె
ననవుడు విని విదురుఁడు మునిఁ గనుఁగొని పలికె నోయనఘచరిత । సాధువు సుశీలనిధియును సజ్జనుండు । నలఘుబ్రహ్మణ్యుఁడును
మహాత్ముండు నంగ। ధరణివిభునకు దుష్టసంతానమెట్లు। గలిగె నయ్యంగపతి యేమి కారణమున* (వ॥ విమనస్కుండగుచుఁ బు
రంబు విడిచె ధర్మకోవిదులైన మునులు దండధరుండు రాజునగు వేనునియందు నేపాపంబు నిరూపించి బ్రహ్మదండం బొన
ర్చిరి యదియునుం గాక లోకంబుల రాజులు లోకపాలతేజోధరులు ప్రజాపాలనాసక్తులు గావునఁ గల్మషంబు గలిగినం బ్రజల
చేత నవజ్ఞానర్హులై యుందురు గావున నా వేనుని చేష్టితంబులు శ్రద్ధాగరిష్ఠుండు భక్తుండునైన నాకుం బరాపరవిదగ్రేసరుం
డవయిన నీ వెఱింగింప నర్హుఁడవనిన మైత్రేయుండతని కిట్లనియె* (సీ॥ అనఘాత్మ రాజర్షియైనట్టి యయ్యంగ మేదినీవిభుఁడశ్వ

—* అంగదపుత్రుండగు వేనునిచరిత్రము. *—

మేధముఖము । గావింపఁ బుత్విజ్నికాయంబుచేత నాహూతమయ్యును సురవ్రాతమందు । నాత్మహవిర్భాగమందరాకుండి
ననప్పుడు బుత్విక్కులద్భుతంబు । నందుచు యజమానుఁడయిన యయ్యంగనృపవరుఁ జూచి రాజేంద్ర యిట్లు । త్రిదశులిడెపి

ల్పబడియుసంప్రీతినాత్మ। భాగములఁబొందరారైరిభవ్యచరిత। యేమిహేతువోయిది నాకు నెఱుఁగఁజెప్పు। కడఁగిహోమంబునష్టంబుగానుమఱియు* (వ॥ శ్రద్ధాయుక్తులైన యీబ్రహ్మవాదులచేత సంప్రయుక్తంబులయినయీఛందస్సులవీర్యవంతంబులై యున్నయవి యిందుదేవతాపరాధం బణుమాత్రంబయిన నెఱుంగ మిట్టిచోటఁగర్మసాక్షులైన దేవతలు స్వకీయభాగంబులంగీకరింపకుండుటకుఁ గతంబెయ్యదియో యనినయ్యంగుండు దుఃఖితస్వాంతుండై తన్నిమిత్తంబుసదస్యులనడుగందలంచి వారలయనుమతింబడసిమౌనంబుమానియిట్లనియె* (గీ॥ అనఘచరితులారయాహూతులయ్యును। పర్వగణములాత్మభాగములను। స్వీకరింపరేను జేసినయపరాధ। మెట్టిదనినవారలిట్టులనిరి* (క॥ నరనాథయిదియునిప్పుడు। పొరసినదుష్కృతము గాదుపూర్వభవమున। న్బరగినదురితంబిది యా। దరమున నెఱిఁగింతుమింతఘన్యచరిత్రా* (క॥ నీకింతవాఁడవయ్యును। భూవరసంతానలాభమును బొందమినా। దేవతలుయాగభాగము। లీవేళభుజింపరైరియిందుకునీవుఁ* (గీ॥ పుత్రకామేష్టిఁగావించిపుత్రుఁబడయు। మట్లొనర్చినదేవతలాత్మభాగ। మర్థినంగీరింతు రయ్యజ్ఞపురుషు। హరిభజించినసకలకార్యములుగలుగు* (వ॥ అనినాతండుసంతానార్థంబు శిపివిష్టదేవతాకంబయిన పురోడాశంబుచే హోమంబుగావించినంత దదీయహోమకుండంబునందు హేమమాల్యాంబరుండయినపురుషుండు హిరణ్మయపాత్రంబున సిద్ధపాయసంబుగొనుచునుద్భవించిన నప్పుడువిప్రానుమతంబున నారాజుతత్పాయసంబు నంజలిచే గ్రహించి సంతోషయుక్తుండగుచు భార్యకొసంగెనంత* (చ॥ కులదళాక్షి పాయసముకౌతుకమొప్పభుజించిభవ్యసం। గమమునఁజేసితత్క్షణమగర్భముఁదాల్చికుమారుఁగాంచెన। కొడుకుఁడునంతమాతృజనకుండగుమృత్యువుఁబోలితానధ। ర్మమునఁజరింపుచుండెగుణమండనవేనుఁడనంగనిచ్చలుఁ* (చ॥ ఎనయఁగబాల్యమందుఁదనయీడుకుమారులఁగ్రీడవోలెనె। మ్మనమునభీతిలేకకృపమానిపశుప్రకరంబునొంచుపోలిక నరికట్టిచంపుచునుగిల్బిషలుబ్ధకవృత్తిమైశరా। సనశరముల్ధరించిమృగజాతిన సాధుగతిన్వధింపుచుఁ* (వ॥ ఇట్లుపాపప్రవర్తనుండై చరియించు కొడుకుంజూచియంగుండు వివిధశాసనంబులదండించియు నతనిదుశ్చేష్టితంబులు మానుపంజాలకదుఃఖితాత్ముండై మనంబున* (క॥ అనయంబునిట్టిపుత్రునిఁ। గనిపరితాపమునుఁబొందుకంటెనుధరలో। ననపత్యుండగుటొప్పును। వనజాక్షుభజించునట్టివాడగువాడుఁ॥ అని వెండియునిట్లనియె* (సీ॥ జనులకుదుష్పుత్రకుని చేతనపకీర్తియునధర్మమును సర్వజనవిరోధ। మును మనోవ్యథయునునునుకొని ప్రాపించునట్టికుపుత్రు మోహంబువిడువఁ। జాలకబహుమానసంగతిఁగను నెవ్వఁడతనిగేహంబుదుఃఖాలయంబు। నగుననిమఱియునిట్లను మనుజుండుశోకస్థానమగుపుత్రుకతనఁజేసి। యనుపమక్లేశభాజనంబయినగృహము। విడుచుఁగావుననిట్టివివేకహీనుఁ। డగుకుపుత్రుసుపుత్రుఁగా నాత్మఁదలఁతు। ననుచు నారాజుబహుదుఃఖితాత్ముఁడగుచు* (క॥ తగుమహదైశ్వర్యోదయ। మగుగృహమును బ్రజలనింద్రనందిన భార్యన్। దిగవిడిచియొక్కఁడేనియు। జగతీశుఁడు సనెనుశీథసమయమునందుఁ* (వ॥ అంతఁదద్వృత్తాంతంబంతయుసుహృద్బాంధవపురోహితామాత్యప్రభృతులైన ప్రజలెఱింగి దుఃఖింపుచున్నతదనంతరంబ* (సీ॥ సవధికబ్రహ్మనిష్ఠాతిగరిష్ఠులౌభృగ్వాదిమౌనీంద్రబృందమప్పుడు। లోకావనైకావలోకనోత్సుకమౌటజనులుస్వరక్షకజనవిభుండు। లేమిఁబశుప్రాయులై మెలంగుటఁగనియంత వేనునిమాతయగుసునీథ। యనుమతినఖిలప్రజావళికప్రియుండైనన వేనుఁబట్టాభిషిక్తుఁ। జేసెనంతటమహితోగ్రశాసనుఁడగు। వేనుఁబట్టంబుగట్టుటవినిసమస్త। తస్కరులుసర్వభీతిచేఁదలఁగుమూష। కములకైవడిఁగడఁగిరిగహనములకు* అంతనతండు* (చ॥ పసువడినష్టలోకపరిపాలకముఖ్యవిభూతియుక్తుఁడై। పరగినృపాసనంబునపభాసిల్లుఁడౌటస్వభావసిద్ధమై। నరుమహావతేపమునవారకసంతతమాననీయస। త్పురుషులనెల్లనెందుఁబరిభూతులఁజేయుచునుండెనిచ్చలుఁ* (చ॥ మఱియునతండుభూగగనమార్గమునందొకవేళనొక్కఁడే। యరదమునెక్కిప్రమత్తుఁడునిరంకుశవృత్తిఁజరించుమత్తసిం। ధురభుపోల్కిసత్పురుషదూషితవర్తననొప్పుచున్నిరం। తరసుజనాపరాధకృతితత్పరమానసుఁడై క్రమంబునన్* (క॥ దివ్యులువెఱగందఁగఁబృ। థ్వీవ్యోమములగలభేరిఁ వేయించెనయ। ష్టవ్యందాతవ్యంహో। తవ్యంపపాయనుచునుదాత్తధ్వనులన్ *(క॥ అనియిట్టులుభేరీరవ। మునఁజేసిసమస్తకర్మములువారింపన్। మునులపనీతుండగువే। నునిదుశ్చరితంబుజనమనోభయమగుటన్ *(గీ॥ కనికృపాయత్తులగుచునిట్లనిరియిట్టి। రాజచోరభయంబులీభూజనులను। బలసియిరువంకలనుబాధవఱుపఁజొచ్చె। దారువందులవహ్నిచందమునఁదెలుచ* (చ॥ అరయనరాజకంబగుమహాభయముందొలఁగించువారమై। కరమతదర్హగహీనతసక్షమపఱిఁజేసినయట్టిదోషము। న్బరువడిఁజెందెదుగ్ధరసపానమునంబరివృద్ధినొందున। య్యురగముపైజపోషకునినొందినరీతిననర్థహేతువై॥ అదియునుంగాక* (క॥ మునుకొనిసునీథగర్భం। బునజనియించిస్వభావమునదుర్జనుఁడై। యఁబ్రజాపాలనమున। కునుబాల్పడిప్రజలమనికిఁగొనఁజొచ్చెఁగదే* (వ॥ అదిగాననీ వేనుండుపూర్వంబునజ్ఞానసఁలమైనమనచేత రాజుగాఁ జేయఁబడియెనిట్టివాని మనముందరమనుగూడి ప్రార్థింతము లోకరక్షణార్థంబుగావునఁద

వసమ్మతమును ధన్యంబు స్వర్గప్రదంబు యశస్కరంబు । నాయుష్కరంబుఁ బుణ్యప్రదాయకమును మంగళకరము ఘనమార్గణం
బు । సౌమనస్యముఁ బ్రశంసాయోగ్యమును బాపహరమును ధ్రువపదయాపకంబు । నై యొప్పునీయుపాఖ్యానంబుఁ దగనీకు నె
ఱిఁగించితినిదీని నెవ్వఁడేని । తివుటశ్రద్ధాగరిష్ఠుఁడై తీర్థపాద । చరణసరసీరుహద్వయాశ్రయుఁడునైన । భవ్యచరితుఁడి నాం
తఃప్రభాతవేళలను సినీవాలిపూర్ణిమలందు మఱియు* (గీ॥ ద్వాదశినిబద్మబాంధవవాసరమున । శ్రవణనక్షత్రమునఁ దినక్షయ
మునందుఁ । బరగసంక్రమణవ్యతీపాతలందు । సభలభక్తినివినునట్టి సజ్జనులకు* (వ॥ క్లేశనాశంబు మహాప్రకాశంబునై నభ
గవద్భక్తియుశీలాదిగుణంబులును గలుగు మఱియుఁ దేజఃకామునకుఁ దేజంబు నిష్కామునకుఁ దత్త్వజ్ఞానంబును గలుగు వినిపిం
చు వారికి దేవతానుగ్రహంబు గలుగు నట్టియుపాఖ్యానంబు నీకెఱింగించితినని మైత్రేయుండు విదురునకుఁ జెప్పిన క్రమంబున
శుకయోగి పరీక్షిత్తునకెఱింగించిన తెఱంగు నసూతుండు శౌనకాదులకు వినిపించి వెండియు నిట్లనియె నట్లు చెప్పిన మైత్రేయునిం
గని విదురుండిట్లనియె* (సీ॥ అనఘాత్మ నారదముని పతి ధ్రువచరిత్రము ప్రచేతసుల సత్రంబునందు । నర్థిమైఁ గీర్తించెనంటి
ప్రచేతసులన నెవ్వ రెవ్వనితనయులెట్టి । వంశజుల్సత్రమెవ్వలనుగాఁ జేసిరి యాగంబు నను నిజాచారశీలు । రగుప్రచేతసులచే
యజియింపఁగాఁబడె యజ్ఞపూరుషుఁడెట్టులచ్యుతాంఘ్రి । భక్తియుక్తుఁడు విదితసద్భాగవతుఁడు । నవిరిహరిపాదసేవావిధి
ప్రయుక్త । దేవదర్శనుఁడగునట్టి దివ్యయోగి । నారదుండెట్టు గొనియాడె శౌరికథలు* (క॥ నాకిపుడెఱిఁగింపుము సుశ్లోకుని చరి
తామృతంబు శ్రోత్రాంజలులం । బైకొనిజుర్రియుఁదనివిం । గైకొనకున్నది మనంబు కరుణోపేతా* (క॥ అనియడిగిన విదురునిఁ
గనుఁగొని మైత్రేయుండు పలికె గొనకొని ధ్రువుఁడు । వనమునకుఁ జనిన నాతని । తనయుండగు నుత్కలుండు దలిర్తామ్రుండై*
(సీ॥ చతురుఁడా జన్మప్రశాంతుండు నిస్సంగుఁడును సమదర్శనుండును ఘనుండు । నై యాత్మయందులోకావళి లోకంబులం
దునాత్మయుఁ జూచుచనఘుమైన । యనుపమయోగక్రియాపావకాదగ్ధకర్మమలాశయకలనఁ బేర్చి । జడునికైవడిఁ జీకు చందం
బునను మూకుపగిదినున్మత్తునిభంగిఁ జెవిటి । వడువుననుగానఁబడుచు సర్వజ్ఞుఁడయ్యు ప్ర । శాంతకీలహుతాశనుసరణిఁ జొచ్చి
పతతశాంతంబునందితజ్ఞానమయము । నైన బ్రహ్మస్వరూపంబునాత్మఁదలఁచి* (క॥ తనకంటెనితరమొకటెఱుఁగని కతము
న సార్వభౌమగ శ్రీఁబొందన్నమనముఁ గోరకయుండుటఁ । గని కులవృద్ధులును మంత్రిగణములునంతన్* (వ॥ అతనినున్మత్తునిం
గాఁ దెలిసి తదనుజుండయిన వత్సరునికిఁ బట్టంబుగట్టిరి యావత్సరునికి సర్వర్ధియను భార్యయందుఁ బుష్పార్ణుండుఁ జంద్రకేతుం
డునిషుండు సూర్జుండు వసువుజయుండునన నాల్వురుతనయులు గలిగిరి యందుఁ బుష్పార్ణుండను వానికిఁ బ్రభయు దోషయు
నను నిద్దరు భార్యలైరి యందుఁ బ్రభయనుదానికిం బ్రాతర్మధ్యందిన సాయంబులను సుతత్రయంబును దోషయనుదానికిం బ్ర
దోషనిశీథవ్యుష్టులనువారు ముగ్గురునుబుట్టిరందు వ్యుష్టుండనువానికిఁ బుష్కరిణియనుపత్నియందు సర్వతేజసుండను సు
తుండు పుట్టె వానికి నాకూతియను మహిషివలనఁ జక్షుస్సంజ్ఞుండయిన మనువు జనించె వానికి నడ్వలయను భార్యయందుఁ బు
రువుఁ, గుత్సుఁడుఁ, ద్రితుండు, ద్యుమ్నుండు, సత్యవంతుండు, ఋతుండు, వ్రతుండు, నగ్నిష్టోముండు, నతిరాత్రుండు, ప్రద్యు
మ్నుండు, శిబియు, నుల్ముకుండు, నను పన్నిద్దరు తనయులు గలిగిరి యందు నుల్మునికిఁ బుష్కరిణియనుదానివలన నంగుండు, సు
మనసుండు, ఖ్యాతియుఁ, గ్రతువు, నంగిరసుండు, గయుండునను నార్వురు కొడుకులు పుట్టిరి యందు నంగునికి సునీథయను ధర్మప
త్నివలన వేనుండను పుత్రుండుదయించిన* (మ॥ క్షితినాథోత్తముఁ డాత్మనందనునిదుశ్శీలంబు వీక్షించి దుః। ఖితుఁడై యొంటి
గఁ దత్పురి న్వెడలి యేగె న్వేగ నెందేనిఁ ద । ద్గతి వీక్షించి మునీశ్వరుల్కుపితులై దంభోళిసంకాశవా । క్యతతిన్శాపవశంపవాఁడపు
డు వీఁకం గూలెనమ్మేదినిన్* (సీ॥ కైకొని యపుడు లోకంబరాజకమైనఁ బ్రజలు తస్కరపీడఁ దల్లడిల్లఁ । గనుగొని దుంఖించి ము
నులుగతాసుఁడై పడిన వేనునివలపలిభుజంబు । నర్థిమథింపనారాయణాంశంబున నాదిరాజననొప్పునట్టి పృథుఁడు । జనియించె
ననవుడు విని విదురుఁడు మునిఁ గనుఁగొని పలికె నోయనఘచరిత । సాధువు సుశీలనిధియును సజ్జనుండు । నలఘుబ్రహ్మణ్యుఁడును
రంబువిడిచె ధర్మకోవిదులైన మునులు దండవ్రతధరుండు రాజునగు వేనునియందు నేపాపంబు నిరూపించి బ్రహ్మదండంబొన
ర్చిరి యది యునుంగాక లోకంబుల రాజులు లోకపాలతేజోధరులు ప్రజాపాలనాసక్తులుగావునఁ గల్మషంబు గలిగినం బ్రజల
చేత నవజ్ఞానర్హులైయుందురు గావున నా వేనుని చేష్టితంబులు శ్రద్ధాగరిష్ఠుండు భక్తుండునైన నాకుం బరావరవిదగ్రేసరుం
డవయిన నీ వెఱింగింప నర్హుండవనిన మైత్రేయుండతనికిట్లనియె* (సీ॥ అనఘాత్మ రాజర్షియైనట్టి యయ్యంగమేదినీవిభుఁడశ్వ

—*అంగదపుత్రుండగు వేనుని చరిత్రము.*—

మేధమఖము । గావింపబుత్త్విజ్ఞికాయంబు చేతనాహూతమయ్యు సురవ్రాతమందు । నాత్మహవిర్భాగమందరాకుండి
న నప్పుడు ఋత్విక్కులద్భుతంబు । నందుచు యజమానుఁడయిన యయ్యంగునుహీవరుఁ జూచి రాజేంద్ర యిట్లు । త్రిదశులిదెపి

ల్పబడియు సంప్రీతి నాత్మ। భాగములఁ బొందరా రైరి భవ్యచరిత। యేమి హేతువో యిది నాకు నెఱుఁగఁ జెప్పు। కడఁగి హో
మంబు నష్టంబు గాదు మఱియు* (వ॥ శ్రద్ధాయుక్తులైన యీ బ్రహ్మవాదుల చేత సంప్రయుక్తంబులయిన యీ ఛందస్సులు వీ
ర్యవంతంబులై యున్నయవి యిందు దేవతాపరాధం బణుమాత్రంబు యిన నెఱుంగ మిట్టిచోటం గర్మసాక్షులైన దేవతలు స్వ
కీయ భాగంబు లంగీకరింపకుండుటకుఁ గతంబెయ్యదియో యనినయ్యంగుండు దుఃఖితస్వాంతుండై తన్నిమిత్తంబు సదస్యు
ల నడుగం దలంచి వారల యనుమతింబడసి మౌనంబు మాని యిట్లనియె* (గీ॥ అనఘచరితులార యాహూతులయ్యు సురగ
ణములాత్మభాగములను। స్వీకరింప రేను జేసిన యపరాధ। మెట్టిదనిన వారలిట్టులనిరి* (క॥ నరనాథ యిదియు నిప్పుడు। పొరసిన మ
హాకృతము గాదు పూర్వభవమున। న్బరగిన దురితంబిది మా। దరమున నెఱిఁగింతు మింత ధన్యచరిత్రా* (క॥ నీ వింతవాఁడవ
య్యును। భూవర సంతానలాభమును బొందమి నా। దేవతలు యాగభాగము। లీ వేళ భుజింపరైరి యిందుకు నీవున్* (గీ॥ పుత్ర
కామేష్టిఁ గావించి పుత్రుఁ బడయు। మట్లొనర్చిన దేవతలాత్మభాగ। మర్థి నంగీకరింతు రయ్యజ్ఞపురుషు। హరి భజించిన సకలకా
ర్యములు గలుగు* (వ॥ అనిన నాతండు సంతానార్థంబు శిపివిష్టదేవతాకంబయిన పురోడాశంబుచే హోమంబు గావించిన న
దదీయ హోమకుండంబునందు హేమమాల్యాంబరుండయిన పురుషుండు హిరణ్మయపాత్రంబున సిద్ధపాయసంబు గొను
చు నుదయించిన నవ్విధి విప్రానుమతంబున నా రాజు తత్పాయసంబు నంజలిచే గ్రహించి సంతోషయుక్తుండగుచు భార్యకొ
సంగెనంత* (చ॥ కులదళాక్షి పాయసము కౌతుకమొప్ప భుజించి భవ్యసం। గమమునఁ జేసి తత్క్షణమ గర్భముఁ దాల్చి కుమా
రుఁ గాంచె। కొమరుఁడు నంత మాతృజనకుండగు మృత్యువుఁ బోలి తా నధ। ర్మమునఁ జరింపుచుండె గుణముండన వేనుఁడనం
గ నిచ్చలున్* (చ॥ ఎనయఁగ బాల్యమందుఁ దనయీడు కుమారులఁ గ్రీడవోలె నె। మ్మనమున భీతి లేక కృపమాని పశుప్రకరంబు
నొంచు పోల్కి నని కట్టి చంపుచును గిల్బిషలుబ్ధకవృత్తి మెశగా। నసశరముల్ధరించి మృగజాతిన సాధుగతిన్వధింపుచున్* (వ॥
ఇట్లు పాపప్రవర్తనుండై చరియించు కొడుకుం జూచి యంగుండు వివిధశాసనంబులఁ దండించియు నతనిదుశ్చేష్టితంబులు మా
నుపం జాలక దుఃఖితాత్ముండై మనంబున* (క॥ అనయంబు నిట్టిపుత్రుఁ। గని పరితాపమునుఁ బొందుకంటెను ధరలో। ననపత్యుం
డగుటొప్పును। వనజాక్షు భజించునట్టివాఁడగు వాఁడున్॥ అని వెండియు నిట్లనియె* (సీ॥ జనులకు దుష్పుత్రకుని చేత నపకీర్తియు
నధర్మమును సర్వజనవిరోధ। మును మనోవ్యథయును మును కొని ప్రాపించు నట్టి కుపుత్రు మోహంబు విడువఁ। జాలక బహు
మానసంగతిఁ గను నెవ్వఁడతని గేహంబు దుఃఖాలయంబు। నగు నని మఱియు నిల్లును మనుజుండు శోకస్థానమగు కుపుత్రు కతనఁ జే
సి। యనుపను క్లేశభాజనంబయిన గృహము। విడుచుఁ గావున నిట్టి వివేకహీనుఁ। డగు కుపుత్రుఁ సుపుత్రుఁ గా నాత్మఁ దలఁతు। నను
చు నా రాజు బహుదుఃఖితాత్ముఁడగుచు* (క॥ తగు మహదైశ్వర్యోదయ। మగు గృహమును బ్రజల నిద్రనందిన భార్యన్। దిగవి
డిచి యెక్కడేనియు। జగతీశుఁడు సనె నిశీథసమయమునందున్* (వ॥ అంతఁ దద్వృత్తాంతం బంతయు సుహృద్బాంధవపురోహి
తామాత్యప్రభృతులైన ప్రజ లెఱింగి దుఃఖింపుచున్న తదనంతరంబ* (సీ॥ సమధిక బ్రహ్మనిష్ఠాతిగరిష్ఠులౌ భృగ్వాదిమౌనీం
ద్రబృందము ప్రజ। లోకావనైకావలోకనోత్సుక మాటజనులు స్వరక్షక జనవిభుండు। లేమిఁ బశుప్రాయులై మెలంగుటఁ గని
యంత వేనుని మాతయగు సునీథ। యనుమతిన ఖిలప్రజావళికి ప్రియుండై నన వ్వేనుఁ బట్టాభిషిక్తుఁ। జేసెనంత బహుహితోగ్ర
శాసనుఁడగు। వేనుఁ బట్టంబుగట్టుట విని సమస్త। తస్కరులు సర్పభీతిచేఁ దలఁగు మూష। కములకైవడిఁ గడఁగి రిగహనములకు*
అంత నతండు* (చ॥ పనుపడి నష్టలోకపరిపాలక ముఖ్యవిభూతియుక్తుఁడై। పరగి నృపాసనంబున విభాసిల్లుఁ డౌట స్వభావసిద్ధ
మై। పరఁగు మహావతేపమున వారక సంతతమాననీయస। త్పురుషుల నెల్ల నెంతయుఁ బరిభూతులఁ జేయుచునుండె నిచ్చలున్* (చ॥
మఱియు నతండు భూగగనమార్గమునందొక వేళ నొక్కఁడే। యరదము నెక్కి భ్రమ్మలు నిరంకుశవృత్తిఁ జరించుమత్తసిం। ధు
రవిభుపోల్కి సత్పురుషదూషితవర్తన నొప్పుచున్నిరం। తరసుజనాపరాధకృతి తత్పరమానసుఁడై గ్రసంబునన్* (క॥ దివ్యు
లు వెఱగందఁగ బృ। థ్వీవ్యోమములగల భేరి వేయించెనయ। ష్టవ్యం దాతవ్యం హో। తవ్యంబి పాయనుచును దాత్త్వను
లన్* (క॥ అని యిట్టులు భేరీరవముఁ జేసి సమస్తధర్మములు వారింప మ్మునులపనీతుండగు వే। నుని దుశ్చరితంబు జనమనోభయ
ముగుటన్* (గీ॥ కదికృపాయత్తులగుచు నిట్లనరి యిట్టి। రాజచోరభయంబు లీ భూజనులను। బలసి యిరువంకలను బాధవఱుపఁ జొ
చ్చె। దారువందుల వహ్ని చందమునఁ దెలుచ* (చ॥ అరయన రాజకంబగు మహాభయమందోలఁగించువారమై। కరము తదర్హ
గహీనతను నిత్యంబతిఁ జేసనయట్టి దోషము। న్బరువడిఁ జెందెదుర్ధరసపానమునం బరివృద్ధి నొందునా। ...ముని జపోవకని
నొందిన రీతి ననర్థహేతువై॥ అదియునుం గాక* (క॥ మును కొని సునీథగర్భం। బున జనియించి స్వభావమున దుర్జనుఁడై। యొన
యఁ బ్రజాపాలనమున। కును బాల్పడి ప్రజల మసికిఁ గొనఁ జొచ్చెంగదే* (వ॥ అదిగాన నీ వేనుండు పూర్వంబున జ్ఞానసంపన్ను
లమైన మనచేత రాజుగాఁ జేయఁబడియె నిట్టి వాని మనమందరము నుగూడి ప్రార్థింతము లోకరక్షణార్థంబు గావునఁ దద్దోషం

బునసలస్పృశింపదు సమీచీనోక్తులం జేసి వీనిననయింప వానిగ్రహింపకుండె నేని మున్నులోకధిక్కారాగ్నిసందగ్ధుండగు
వీనిమున తేజోమహాగ్నిచేత భస్మీభూతుం జేయుదమని యాలోచించి గూఢమన్యులగుచు వేనునింగదియంజని యతనికిట్లనిరి
(క॥ నరపాలక నీ కాయువు। సిరియును బలమును యశంబు చేకురు వృద్ధిం। బొరయుదు గాకనుచు నో। హరముగ నాశీర్వదించి
యతివినయమునన్॥* (వ॥ ఇట్లనిరి నరేంద్రా యేమొకటి విన్నవించెదము అవధరింపుము పురుషులకు వాఙ్మనఃకాయవృత్తులవలన
నాచరించు ధర్మంబు సమస్తలోకంబుల విశోకంబులం జేయు నసంగులైన వారికి మోక్షంబు నిచ్చునట్టి ధర్మంబు ప్రజలకు క్షేమ
కారణంబు గావున నీయందుఁ జెడకుండం గాకయని పలికి మఱియు ధర్మంబు నాశంబు నొందిన నైశ్వర్యంబుచే రాజు విడువంబ
డునని చెప్పి వెండియు నిట్లనిరి దుష్టచిత్తులగు నమాత్యులవలనం దస్కరులవలనను బ్రజలు నాశంబు నొందకుండ రక్షింపుచు యథా
న్యాయంబుగ వారలచేఁ గరంబు గొనుచునుండు మహీపతి యిహపరసౌఖ్యంబులం బొందు నదియునుం గాక యెవ్వని రాష్ట్రంబున
నేని పురంబున నేనియు యజ్ఞేశ్వరుండయిన పురుషోత్తముండు నిజవర్ణాశ్రమోచితంబయిన ధర్మంబుగల వారిచేత యజనంబులు చే
యంబడునట్టి నిజశాసనవర్తియగు రాజువలన సర్వభూతభావనుండు మహాభాగుండు భగవంతుండు నగు సర్వేశ్వరుండు సం
తుష్టుండగు నట్టి సకలజగదీశ్వరుండైన సర్వేశ్వరుండు సంతోషించిన రాష్ట్రాధిపతికి సర్వసౌఖ్యంబులు ప్రాపించు లోకపాల
కులగు వారు సర్వేశ్వరునికి బలిప్రదానంబులు సేయుదురు సమస్తలోకదేవతాయజ్ఞాదిసంగ్రహుండు వేదమయుండు
ద్రవ్యమయుండుం దపోమయుండు నగు నారాయణుని విచిత్రంబులైన యజ్ఞంబులచేత యజనంబు చేసిన నీకు నభయంబగు మో
క్షంబును గలుగుం గావున నీ రాజ్యంబున మఖంబులు సేయుమని యాజ్ఞాపింపుము నీ దేశంబునం జేయంబడిన యజ్ఞంబులచేత హ
రికళాయుక్తంబులగు దేవగణంబులు స్విష్టంబులై తుష్టంబులగుచు భవదీయ వాంఛితార్థంబు లిచ్చుం గావున దేవతాతిరస్కా
రంబు నీకు యుక్తంబు గాదు వేదచోదితంబులగు ధర్మంబులం దాసక్తుండవు గమ్మనిన వేనుండిట్లనియె॥* (క॥ మునులార మీరలిప్పు
డు। ననునీగతిం బడుచుదనమునం బలికితిరై। నను మీరల ధర్మముం దగ। ననయము ధర్మంబటంచు నవ్వెదరైనన్॥ అదియునుం
గాక॥* (చ॥ ఎనయఁగ జారకామినిని జేకొని ముచ్చిలి జారపూరుషున్। దనపతిఁ గాఁదలంచు గతిఁ దద్దయు మూఢమనస్కులై తన
ర్చిన నరపాలరూపము ధరించిన యీశ్వరు నన్నెఱుంగక। న్యుని భజియింప మీరిహపరోన్నత సౌఖ్యములందరెన్నఁడున్॥* (వ॥
అని మఱియు నిట్లనియె యజ్ఞపురుషుండన నెవ్వఁడెవ్వని యందు మీకు భక్తిస్నేహంబులుదయించె భర్తృస్నేహవిదూరంబు
లై యోషిద్గణంబులు జారునందు సేయు భక్తిచందంబునం బలికెదరదియునుం గాక॥* (క॥ హరిహరహిరణ్యగర్భ। స్వరధీశ్వ
రవహ్నిశమన జలధిపతిమరు। న్నరవాహనశశిభూరవి। సురముఖ్యులు నృపశరీరసూచకులగుటన్॥* (క॥ పరికింపను భజింపుఁ
డు। ధరణీశుఁడు సర్వదేవతామయుఁడగుట। త్వరముడుగుఁడు నాకంటెను। బురుషుఁడు మఱియెవ్వఁడగ్రపూజార్హుఁడి
లన్॥* (వ॥ అదిగాన మీరు నాయందు బలివిధానంబులు సేయుఁడని పాపకర్ముండును నసత్ప్రవర్తకుండును నష్టమంగళుండు విపరీత
జ్ఞానుండునగు వేనుండు పండితమానియగుచుం బలికి మునుల వచనంబులు నిరాకరించి యూరకుండిన మునులు భగ్నమనోరథు
లై తమలో నిట్లనిరి యీ దారుణకర్ముండయిన పాపుండు హతుండు గాక జీవించెనేని వీనిచేత నీజగంబులు భస్మంబులు గాఁగలవి
దినిశ్చయంబు మఱియు దుర్వృత్తుండగు వీఁడు మహారాజసింహాసనంబునకర్హుండు గాఁడితండు మున్ను నేసర్వేశ్వరు ననుగ్రహం
బునం జేసి విభూతియుక్తుండయ్యె నట్టి యజ్ఞపతియైన శ్రీవిష్ణుని నిందింపుచున్నవాఁడు గావున నిర్లజ్జుండయిన హరిదూషకుని హన
నంబు సేయవలయునని మునులుద్యోగించి యాత్మప్రకాశితంబైన క్రోధంబునం జేసి హుంకారమాత్రంబున నాయీశ్వరనిం
దాహతుండగు వేనునిం బొలియం జేసిరంత॥* (క॥ అరయ సునీథయు శోకాతురయై తనసుతుఁడు తనువుఁ దొఱఁగినఁ దదనం। తర
మునను యోగశక్తిన్ బ్రగువడి నిజతనయు తనువు పరిపాలించెన్॥ అంతనొక్కనాఁడు॥* (సీ॥ మునివరేణ్యులు భక్తి దనర సరస్వ
తీసలిలంబులను గృతస్నానులగుచు। మునుకొని తత్తీరమున నగ్నిహోత్రము ల్వెలసిల్లనియతిఁ గావించి యచటఁ। దవిలిస
త్పురుషకథావినోదంబులు సలుపుచునుండంగ సకలలోక। భయదంబులగు మహోత్పాతములు దోఁచిన మసలి లోకంబుల
మంగళమును। బొరయకుండెడు గాక విబుద్ధిలోన। దలఁపుచుండఁగఁ బెలుచనుదగ్రమైన। సర్వదిశలను బాంసువర్షంబు గురి
సెఁ। దస్కరులు సర్వజనుల విత్తములు గొనిరి॥* (వ॥ ఇట్టి లోకోపద్రవంబెఱింగి జననాథుండు పరగతుండగుటం జేసి జనపదంబుల
రాజకంబులై యన్యోన్యహింసల నొందుచుం దస్కరబాధితంబులగుచు నుండుట నెఱింగియుం దన్నివారణంబునకు సమర్థు
లయ్యును జోరాదిబాధలం గనుంగొనుచు మునులు వారింపకయుండిరి సమదర్శనుండు శాంతుండు మననశీలుండు నగు బ్రాహ్మ
ణుండు దీనుల నుపేక్షించిన నతని తపంబు భిన్నభాండగతంబయిన క్షీరంబు చందంబున నశియించుం గావున నంగవంశాధీశవం
శోద్భవులు హరిపదాశ్రయులగుట నమోఘసత్యనిష్ఠులగుటం జేసి వీరలవంశంబు విచ్ఛిత్తి నొందింప ననర్హంబు గాన స్థాపనీ
యంబని నిశ్చయించి మృతుండయిన వేనుని కళేబరంబు డగ్గరవచ్చి తదూరువు మథనంబు గావింపనందు॥* (సీ॥ ఘనకాకకృష్ణసంకా

శవర్ణుండును హ్రస్వావయవుండు మహాహనుండు। హ్రస్వబాహుండును హ్రస్వపాదుండును నిమ్ననాసాగ్రుండు నెఱయురక్త। నయనుండు తామ్రవర్ణశ్మశ్రుకేశుండు నతిదీనవదనుండు నైనయట్టి। యొకఁడు నిషాదకుండుదయించి నేమి సేయుదుననిపలుకుచునున్నఁ జూచి। వారమునులు నిషీదయనుచుఁ బలుకుటయును। దానవాఁడు నిషాదాభిధానుఁడయ్యె। నతని వంశ్యులు గిరి కాననలంకు వేను। కల్మషముఁ దెల్పుచుండిరి కడఁక మఱియు* (క॥ కని వారనపత్యుం డగు। మనుజేంద్రుని బాహులంతమధియించిననం। దనఘంబగునొక మిథునము। జనియించెను సకలజనులు సమ్మదమందఁగ* (వ॥ అందు లోకరక్షణార్థంబుగా నారాయణాంశంబున నొక పురుషుండును హరికి నిత్యానపాయినియయి లక్ష్మీకళాకలితయై గుణంబులను భూషణంబులకు నలంకారప్రదాత్రియునగు కామినియుఁ జనియించెనంతఁ బృథుయశుండగుటనతండు పృథుచక్రవర్తియను పేరం బ్రసిద్ధుండయ్యెనంగనయు నర్చియనునామంబునం దనరుచు నతని వరియించె నా సమయంబున* (సీ॥ అందందకురియించిరమరులు మునినాథవితి మోదంబంద విరులవానఁ। బరమానురక్తిశుంభల్లీలఁ జూపట్టె సురపతి వీటనచ్చరలయాట। కర్ణరసాయనక్రమమునవీతెంచెబజిపైన తేటకిన్నరులపాట। యనిమిషకరహతంబై చాలఁ జెలఁగెను బ్రభవోత్సవకర దుందుభిరవంబు। మునినుతిచెలంగె శిఖగుండములవెలింగె। నంత నచటికి సరసీరుహాసనుండు। గరుడగంధర్వకిన్నరగణము తోడ। నర్థిఁజను దెంచె సమ్మోదమతిశయిల్ల॥ అంత* (కవిరాజవిరాజితము॥ అరయఁగవైన్యునిదక్షిణహస్తమునంబరమార్గణిసుమనో। హరలలితాయుధచిహ్నము పాదములందు సమగ్రహలాంకుశభా। స్వరకులిశధ్వజచాపసరోరుహశంఖవిరాజితరేఖలు వి। స్ఫురగతినొప్పఁ బితామహముఖ్యులు చూచి సవిస్మయులై మఱియున్* (వ॥ ఇతండు నారాయణాంశసంభూతుండితని యంగన రమాంశసంభూతయుంగానోపుదురని తలంచి రయ్యవసరంబున బ్రహ్మవాదులగు బ్రాహ్మణోత్తములతనికి విధ్యుక్తప్రకారంబున రాజ్యాభిషేకంబు గావించు సమయంబున* (క॥ సరిదంభోనిధిఖగమృగ। ధరణీసురవర్త్మపర్వతప్రముఖములై। పరగిన భూతశ్రేణులు నవరునకుఁ దగను పాయనములిచ్చె నోగిన్* (గీ॥ సమధికఖ్యాతి నా పృథుచక్రవర్తి। దేవియగునర్చితోఁ గూడ దివ్యవస్త్రగంధమాల్యప్రభూషణకలితుఁడగుచుఁ। బాలకునిఁ బోలి సత్ప్రభాభాసియయ్యె* (సీ॥ రాజరాజా పృథురాజుకు హేమమయంబైన వీరవరాసనంబు। జలపతి జలకణసావకంబగు పూర్ణ చంద్రసన్నిభసితచ్ఛత్రము మఱిఁ। బవమానుఁడమలశోభనమగువాలకేశాసమంచితసితచామరములు। ధర్ముండు నిర్మలోద్యత్కీర్తిమయమగు మహనీయ నవపుష్పమాలికయును। జంభవైరి కిరీటంబు శమనుఁడఖిల। జననియామకదండంబు జలజభవుఁడు। నిగమమయ గవచమును వాణీలలామ। యచ్చమగు నవ్యహారంబులిచ్చె మఱియు* (సీ॥ దామోదరుండు సుదర్శనచక్రంబు నవ్యాహతైశ్వర్యమబ్జయోని। చంద్రార్ధధరుఁడును జంద్రమండలదశకమనీయకోశసంకలితఖడ్గ। మంబిక శతచంద్రమను ఫలకముఁ జంద్రుఁ డమృతమయశ్వేతహయచయంబుఁ। ద్వష్టరూపాశ్రయోదాత్తరథంబును భానుండు ఘృణిమయబాణములును। శిఖియుఁ గోజవిషాణసందితమహాజ। గవమనందగు చాపంబు నవనిదేవి। యోగమయమైన పాదుకాయుగముగగన। చరులు గీతాదులిచ్చిరి సంతసమున* (వ॥ వెండియుం బ్రతిదినంబునాకాశంబు పుష్పంబులఁ గురియించె మహర్షులు సత్యంబులైన యాశీర్వచనంబుల సముద్రుండు శంఖంబు నదంబులు పర్వతంబులు నదులును రథమార్గంబులొసంగెఁ దదనంతరంబ సూతమాగధవందిజనంబులు దన్ను నుతియించిన బ్రతాపశాలియగు నవ్వైన్యుండు మందస్మితసుందరవదనారవిందుండై చతురవచనరచనుఁడగుచు మేఘగంభీరభాషణంబులనిట్లనియె* (సీ॥ వందిమాగధసూతవరులార నాయందుఁ గమనీయగుణములు గలిగెనేని। నహర్షంబునుతిఁ జేయనవి లేవు నాయందునదిగాన మీనుతి వ్యర్థమయ్యె। నిటమీఁద గుణములనే పారియుండిననపుడు నుతింతురు చెదరగుటమీరు। సభ్యనియుక్తులై చతురతనుత్తమశ్లోకుని గుణముల స్తోకభూప్ర। సిద్ధములు గాన సన్నుతి సేయుఁడ జుని। నతనిబహువిధభావంబులనునుతింప। నలవిగాక నెయ్యందు దురదియుఁ గాక। చతురమతులార మాగధజనములార* (వ॥ మఱియు మహాత్ముల గుణంబులు దనయందు సంభానెంబులు సేయసామర్థ్యంబులు గలిగిన నందు మహాత్ముల గుణంబులు ప్రసిద్ధంబులు గావునం దత్సమంబుగా నెట్లు నుతింపవచ్చు నితవ్యం డేని యొకండు శాస్త్రాభ్యాసంబునం దనకు విద్యాతపోయోగగుణంబులు గలుగుననిపలికినవానిం జూచి సభ్యులు పరిహసింతురదికు మతియగువాఁ డెఱుంగండదియునుంగాక* (క॥ అతిపరిశుద్ధులు లజ్జా। న్వితులు మహోదారులధికనర్మ్యులాత్మ। స్తుతి పరనిందల దోషము। లతిహేయములని తలంతు రాత్మల నెపుడున్* (క॥ వందిజనంబులు లోకము। లందును విదితవరకర్మలగు భూపతులన్నందించుట శక్యంబై। నందగదు నుతింపశిశుజనంబుల పగిదిన్* (క॥ అని సూతవందిమాగధ। జనులా నరనాయకుని వచనములు పనిరూ। న్మనిచోదితులై క్రమ్మఱ। నను రాగమునుప్పతిల్లనమ్మను జేయన్॥ అమృతోపమానంబులయిన మధురవాక్యంబులనిట్లనిరి* (క॥ వేనాంగసంభవుండవు। శ్రీనాథకళాంశజుఁడవు విరతరగుణప। న్నానాహర్షాండవతరించితి। మైనభవన్మహిమ బొగడనలవి మొనార్కున్* (క॥ అవి వెండియునిట్లనిరై। నను నొక మార్గంబుగలదు నందింపభవ। ద్ఘనచరితామృతపానం। బునఁ

జేసియుమునులవచనములఁ జేసితగన్* (వ॥ శ్లాఘ్యంబులైన భగవదీయచరిత్రంబులస్తుతియించెదనని యిట్లనిరి *(సీ॥ ఈవై
న్యుఁడఖిలలోకావళిధర్మానువర్తనముల నెప్పుడరలఁ జేసె । ఘనధర్మమార్గవర్తనులలోధన్యుఁడై ధర్మసేతువుఁ బ్రీతిఁ దగిలి ప్రో
చు । ధరణుశాస్త్రవులనుదండించు నష్టదిక్పాలకమూర్తిసంకలితుఁడగుచు । నయ్యాయికాలంబులందు మదండాదండనులఁ బ్రజా
రంజనములఁ దనర్పు । సవనసద్వృష్టికరణాదిసక్తుఁడౌచు । నుభయలోకంబులకు బ్రీతినొదవఁ జేయు । న్యాయమార్గంబునను
భూజనాళిధనముఁ । బుచ్చుకొనునిచ్చు సూర్యునిబోలియితఁడు॥ మఱియు* (సీ॥ సర్వభూతములకు సముఁడును బర్యతిక్రమ
మునలోకాపరాధములను । హవ్యాంశసంయుక్తుఁడై సహింపుచు నార్తులగువారియెడఁ గృపాయుక్తుఁడగుచు । నరరూపుఁ దా
ల్చినహరిమూర్తిగావున నింద్రుఁడు వర్షించి యెల్లప్రజల । రక్షించుగతిదా నరక్షించు నమృతాంశుసన్నిభవదనాబ్జ సస్మితా
నురాగమిళితావలోకన రాజఁ జేసి । సకలజనులకు సంప్రీతిసంభవింపఁ జేయు సంతతము ను గూఢవిత్తుఁడగుచు । శత్రువరులక
సాధ్యుఁడై సంచరించు (వ॥ అని వెండియుం బ్రవేశనిర్గమశూన్యమార్గనిరూఢకార్యుండు నపరిమితమహత్త్వాదిగుణగణైకధా
ముండు సముద్రునిభంగి గంభీరచిత్తుండు దుష్టగుప్తవిత్తుండు వరుణునింబోలి సంవృతాత్ముండు శాత్రవాసహ్యప్రతాపయుక్తుం
డు దురాసదుండు సమీపవర్తియయ్యును దూరస్థునిభంగి వర్తింపుచు వేనారణిజనితహుతాశనుండు హుతాశనుచందంబున నన
న్యదుస్పర్శనుండు చారులవలన సకలప్రాణిబాహ్యాభ్యంతర కర్మంబులఁ దెలియుచు దేహధారులకు నాత్మభూతుండైనసూ
త్రాత్మకుండైనవాయువుభంగి వర్తించుచు నాత్మస్తుతినిందలవలన నుదాసీనుండగుచు ధర్మపథంబున వర్తించు మనాత్మీయసుత
సుహృజ్జనులవలనం దప్పుగలిగినను దండించు నాత్మశత్రుపుత్రులనైన నదండ్యులఁ దండింపఁడు తనయాజ్ఞాచక్రంబప్రతిహతం
బగుచు మానసాచలపర్యంతంబు వర్తింప సూర్యుండు నిజకిరణంబులచేత నెంతపర్యంతంబు భూమిం బ్రకాశింపం జేయు నంతప
ర్యంతంబు నిజగుణంబులచేత లోకంబుల రంజిల్లం జేయునదియునుంగాక ప్రకృతిరంజకంబులైన గుణంబులచేత దృఢవ్రతుండు
సత్యసంధుండు బ్రహ్మణ్యుండు సర్వభూతశరణ్యుండు వృద్ధసేవకుండు మానప్రదుండు దీనవత్సలుండు పరవనితామాతృభావ
నుండు తనపత్నినర్ధశరీరంబుగాఁ దలంచువాఁడునగుచుం బ్రజలయెడఁ దండ్రివలెఁ బ్రీతిసేయుచు రక్షించుచు నుండు మఱియు*
(సీ॥ తపోయబ్రహ్మవిద్యానిష్ఠ జనములకనయంబుఁ గింకరుండైనవాఁడు । నఖిలశరీరగుణాప్త సుహృజ్జనతానందకరుఁడన
నలరువాఁడు । సంసారఘనకర్మసంగహీనులయందు సంగసంప్రీతుఁడై జరుగువాఁడు । దుర్మార్గమనుజసందోహంబునకు
నుగ్రదండధరుండనఁ దనరువాఁడు । ప్రకృతిపురుషకావేశుఁడై పరగునట్టి । భగవదవతారయుక్తుఁడై నెగడువాఁడు । నగుచు వ
ర్తించు సమ్మోదమతిశయిల్లఁ । జారుతరమూర్తియా రాజచక్రవర్తి *(వ॥ మఱియుం ద్ర్యధీశుండు కూటస్థుండు పరమాత్ముండు
బ్రహ్మకళారూపుండునగువాఁడునై యుదయించెం గావున నితనియందు నవిద్యారచితంబై ప్రతీతంబగు భేదంబు నిరర్థకంబ
గునని పెద్దలగువారలు చూతురని మఱియు నిట్లనియె *(సీ॥ ఉదయాద్రిపర్యంతమర్వీతలంబేకవీరుఁడై రక్షించి వెలయునీతఁ
డొకనాఁడు విజయయాత్రోత్సవంబే పార సన్నద్ధుఁడై మణిస్యందనంబు । నెక్కి చాపముఁ బూని దిక్కులసూర్యునిపగిది నిశ
త్రుభూపాలతమము । పిరియింగునని చాల వెలుఁగొందుచు నుధరాచక్రప్రదక్షిణశాలియగుచు । దీనుగు నెడ సర్వదిక్పాలవర
సమేత । పార్థివోత్తమనికరము పాయనంబు । లిచ్చి తను జక్రపాణికి నెనయునాది । ధరణివిభుఁడని నుతియించెదలఁ జూరను మ*
(క॥ ఈనృపతిధరాచక్రము । ధేనువుఁగాఁ జేసి పితుకు ధృతినఖిలపదా । ర్థానీకముఁ బుధులసన్నా । నింపఁగఁ బ్రజకు జీవనప్రదుఁ
డగుచున్ *(చ॥ అనరవరేణ్యుఁ బోలియనయంబునితండును గోత్రభేదనత్వముననెలంగుఁ దా సజగవప్రదరాసనశింజనీని
నాదమునవిరోధిభూపతులు దల్లడగుందన సహ్యసింహవి । క్రమము నపంచరించునని కౌతుకమొప్పఁగఁ బల్కి వెండియున్॥ ఇ
ట్లనిరి* (చ॥ సకలజగన్నుతుండితఁడు చారుయశోనిధియశ్వమేధముల్ । ప్రకటముగా శతంబునగఁ బావనమైన సరస్వతీతటీ
నికటధరిత్రిఁ జేయుతఱి నేర్పున నంతిమయాగమందు గొం । జకమఖసాధనాశ్వమును జంభవిరోధిహరించునద్ధరన్* (సీ॥ ఒ
కనాఁడు నిజగంవిరోపవనమునకుఁ జనియందు షడ్గుణశాలియైన । ఘనుని సనత్కుమారునిఁ గాంచియమ్మునివరు బ్రహ్మతన
యునివరుసభక్తిఁ । బూజించి విజ్ఞానమును బొందుదేనిచే బ్రహ్మవేత్తలు మునిప్రవరులవని । ఘనతరభక్తిసంపన్నులై వర్తిం
తురిమ్మహారాజు మహీతలంబు । నంకవిక్రమపక్రముఁడగుచు మిలఁ । దనకథావళి భూప్రజాతతి నుతింప । నకఁ డకఁ డపిను
చుశౌర్యమున నఖిలదిక్కులను గెల్చి వర్తించు ధీరయశుఁడు* (వ॥ ఇట్లు పిపాటితవిరోధిన నశ్మల్యుండసురాసురజేగీయమా
నసజవైభవుండునై ధరాచక్రంబునకితండు రాజయ్యెడినని యివ్విధంబున స్తోత్రంబు సేసిన వందిమాగధ సూతజనంబులం
బృథుచక్రవర్తి పూజించి మఱియుం బ్రాహ్మణ భృత్యామాత్య పురోహిత పౌర జానపద తైలిక తాంబూలికస యోజ్యప్రము

గోత్రభేదనత్వమునఁ- ఇంద్రునిపరమందు- పర్వతములఁ బ్రక్కలు జేయుటయందని యర్థము. భూమిని సమము రచుటయందనిప్పృథుచక్రవర్తిపరమైన

ఖా శేషజనంబులం దత్తదుచితక్రియంబూజించెనని మైత్రేయుండు చెప్పిన విని విదురుండిట్లనియె* (సీ॥ ఏమినిమిత్తమై భూమి

**పృథుచక్రవర్తి గోరూపధారిణియగు భూమివలన నోషధులం బిదుకుట.**

గోరూపిణియయ్యె దానికి వత్సమయ్యె నెవ్వండు। గొనకొని దోహనమునకు నర్హంబైన పాత్రమెయ్యది దలఁపంగ దోగ్ధ। యైన యా పృథు వేపదార్థముల్ పితికెను బరికింప నవని స్వభావమునను। విషమమై యుండియు వెలయంగ నేరీతి సమగతిం జెందెను జంభవైరి। క్రతుహయంబునుఁ గొనిపోవఁ గార్యమెద్ది। ధీరనిధియైన బ్రహ్మకుమారువలనఁ। గలితవిజ్ఞానియగుచు నేగతిం బొందె। ననఘచారిత్ర మైత్రేయ యదియుఁ గాక* (వ॥ మఱియు బరబ్రహ్మంబు భగవంతుండు పుణ్యశ్రవణకీర్తనుండు సర్వనియామకుండునగు కృష్ణుని యవతారాంతరాశ్రయంబగు దివ్యకథలను భగవంతుండైన పుండరీకాక్షుండు పృథ్వవతారంబు ధరియించి గోరూపిణియగు పృథివిం బిదికిన యది మొదలగు పుణ్యకథలన్నియు నీకు నధోక్షజునకు దాసుండనైన నాకు నెఱింగింపుమనిన వాసుదేవకథా సంప్రీతచేతస్కుండగు విదురుం బ్రశంసించి మైత్రేయుం డిట్లనియె నట్లు బ్రాహ్మణజనంబులచేత రాజ్యంబునం దభిషిక్తుండగుచు సకలప్రజాపాలననియుక్తుండై పృథువు రాజ్యంబు సేయుచుండ నంతనీరసయగు ధరిత్రియం దన్నరహితులగుచుం బ్రజలు క్షుత్పీడాక్షీణదేహులై వైన్యునిం జూచి యిట్లనిరి* (క॥ అరయఁగ నేము బుభుక్షా। పరిపీడంబడితి మయ్య పైకొని తరుకోటరజనితవహ్నిచేతను। దరికొను వృక్షంబుఁ బోలి ధరణీనాథా* (క॥ శరణశరణ్యుడవగు నిను। శరణము వేడెదము మాకు సత్కృపవన్నం। బరసి కృపఁ జేసి ప్రోవుము। నరనాయక యనుచుఁ బ్రజలు నతులై పలుకన్* (క॥ విని దానికి సముపాయము। జననాయకుఁడాత్మఁ దలఁచి సక్రోధుండై। ధనువునఁ బాణముఁ దొడిగెను। ఘనరౌద్రుండైన త్రిపురఘస్మరుపగిదిన్॥ ఇట్లు దొడిగిన* (క॥ మహిపతి నప్పుడు గనుఁగొని। మహి గోరూపమునఁ గంప్యమానయు నగుచున్। గుహకుఁడగు లుబ్ధకుఁ గని। గహనంబునఁ బాఱు హరిణికైవడి బాఱెన్* (వ॥ ఇట్లు ధరణి పాఱిన నతండు కుపితారుణేక్షణుండై వెంటం దగిలిన దివియును దిక్కులును భూభాగనభోభాగంబుల నెక్కడఁ జనియె నక్కడికి వెనుదగిలి యుద్యదాయుధుండై చనుచుండ నవ్వైన్యునిం గని మృత్యుగ్రస్తలగు ప్రజలచందంబున ననన్యశరణ్యయై యతిభయంబునం బరితప్యమానహృదయయగుచు నిట్లనియె వైన్య ధర్మజ్ఞుండవు నాపన్నవత్సలుండవు మహాత్ముండవు సకలప్రాణిపరిపాలనావస్థితుండవు నైన నీవు దీనయుం బాపరహితయుం గామినియునగు నన్ను వధియింపం బూని యేల వెనుదగులుచున్నవాఁడవు ధర్మతత్త్వం బెఱుంగువారు సతీజనంబులు కృతాపరాధులైనం దీనవత్సలతం జేసి వధియింపరని పలికి మఱియు నాధరణి పృథుచక్రవర్తికి నిట్లనియె* (క॥ జననాథచంద్ర యాభూ। జనకోటికి యానపాత్రసదృశస్థితితో। ఘనదృఢశరీరయగు నే। నని యము నాధారభూతయగుచుఁ జరింతున్* (గీ॥ ఇట్టి నన్ను గృపామతి యెడలనిట్టువి। పాటనముఁ జేసి త్వం జెదు ప్రజలు నీట। మునుఁగకుండంగ నేరీతి ననఘచరిత। యరసి రక్షింతు వనన నతం డవనికనియె* (వ॥ ధరిత్రీ మదీయాజ్ఞోల్లంఘనంబు సేయుచున్నదాన వదియునుం గాక నీవు యజ్ఞంబులందు హవిర్భాగంబుల ననుభవింపుచు ధాన్యాదికంబుల విస్తరింపం జేయక గోరూపంబు ధరియించి యనయంబుఁ దృణభక్షణంబు సేయుచుఁ బాలుం బిదుకక నీయందయడంచికొంటివి నీయందున్న యోషధీబీజంబులు బ్రహ్మచేఁ బూర్వంబునందె కల్పింపంబడిన యవి వానిని నీ దేహమందడంచికొని యిప్పుడీయక మూఢహృదయవు మందమతివియునై యపరాధంబుఁ జేసిన దుష్టురాలవగు నిన్ను నా బాణంబులచే జర్ఝరీభూతశరీరం జేసి వధియించి నీ మేనిమాంసంబునం జేసి క్షుద్బాధితులు దీనులునగు నీ ప్రజలయార్తి నివారించెద నీవు కామినివి నంటివి స్త్రీపురుషనపుంసకులలో నెవ్వండేని భూతదయ లేక స్వమాత్రపోషకుండగుచు నిరనుక్రోశంబున భూతద్రోహియై వర్తించువాని రాజులు వధించిన నవ్వధంబు గాదు గాన దానఁ బాపంబు వొరయదు నీవు కామినివైనను దుర్మదయు స్తబ్ధయునగుచు మాయాగోరూపంబునం బాఱిపోవుచున్న నిన్నుఁ దిలలంతఖండంబులు చేసి నా యోగమహిమం బ్రాణికోటి నుద్ధరించెదనని పలికి రోషభీషణాకారంబు ధరియించి దండధరుని వడువున వర్తించు పృథునిం జూచి వడంకుచు మేదిని ప్రాంజలియై యిట్లని నుతియింపం దొడంగె* (క॥ ఓ నాథ పరమపురుషుఁడ। వై నిజమాయాగుణంబులం దనికతన। న్నానావిధదేహములం। బూనుదు సగుణుండవనుచు బుధనుతచరితా। అట్టి నీవు* (క॥ నను సకలజీవతతికిని। మును నీవాధారభూతముగ నిర్మింప। న్వినునాయంబఁ జతుర్విధ। ఘనభూతవిసర్గమర్థిఁ గైకొనవలసెన్॥ అట్లె యుండన్* (క॥ నను నుద్యదాయుధుఁడవై। మనుజేంద్ర వధింపఁ బూనినను సలెఱు నీకం। చెనితరు నెవ్వరి నిపుడే। ఘనమగు శరణంబుఁ జొత్తుఁ గరుణాభరణా॥ అదియునుం గాక* (సీ॥ అనఘ స్వకీయంబునై యతర్కితమునై మహిమ వొప్పిన భవన్మాయ చేత। సకలచరాచరసర్గంబు నిర్మించి ధర్మార్థపరుఁడవై తనరుదీశ। నీవిక్రమమున నవనీరజలోచన సకలలోకులకు దుర్జయము దలఁప। దగు నట్టి నీవు స్వతంత్రుఁడవగుటను బ్రహ్మఁ బుట్టించి యా బ్రహ్మ

---

యర్థము— త్రిపురఘస్మరుపగిదిన్ - త్రిపురహరుడైన శివుని వలె— గుహకుండగు - వంచకుఁడైన, లుబ్ధకుంగని - బోయవానిఁ జూచి— యానపాత్రము-ఓడ—చతుర్విధ-దేవతిర్యఙ్మనుష్యస్థావరములని నాలుగువిధములయిన—విసర్గము-సృష్టి.

చేత। సకలజగములఁ జేయించు సమర్థుఁ జెప్ప । యేకస్యాయ్యు మహాత్మ్యయనేకవిధము। లగుచు వెలుఁగొందుచుండు వీయఖిల మందు॥ జాగరతరమూర్తి యోపృథుచక్రవర్తి* (వ॥ మఱియు మహాభూతేంద్రియకారక చేతనాలంకారంబులను శక్తులం జేసి యీజగంబుల యుత్పత్తిస్థితిలయంబులఁ గావింపుచు సముత్కటనిరుద్ధశక్తులుంగల పురుషునకు నమస్కరించెద నట్టి పరమపురుషుండవయిన నీవు నిజనిర్మితంబు భూతేంద్రియాంతఃకరణాత్మకంబు లయిన యీవిశ్వంబు సంస్థాపింపంబూని* (సీ॥ఆదివరాహంబవగుచు రసాతలగతనైన నన్ను నక్కటికతోడ । నుద్ధరించితి వట్టియుదకాగ్రభాగంబునందర్థినున్న నేన నేడి నావ। యందున్న యఖిలప్రజావళి రక్షింపఁ గోరి యీపృథురూపధారివైతి। వట్టిభూభరణుండవైన నీవిపుడు పయోనిమిత్తంబు గాను గ్రచరుడవు చునన్ను వధించెదనను చుఁ బుద్ధిఁ దలఁపుచున్నాఁడవిది విచిత్రంబు గాదె। విశ్వసంపాద్య నిరవద్య వేదవేద్య। భవ్యగుణసాంద్రవైన్యభూపాలచంద్ర* (వ॥ కావున నీశ్వరగుణసర్గరూపంబైన మాయచే మోహితాంతఃకరణులమైన మావంటివారల చేత హరిభక్తుల చేష్టితంబెఱుంగఁబడదన్న హరిచేష్టితంబెట్లెఱుంగంబడు నట్టిజితేంద్రియయశస్కులైన వారలకు నమస్కరింతు నను చుని వ్విధంబున సంగోపప్రస్ఫురితాధరుండైన పృథుని నభినుతించి ధైర్యంబవలంబించి వెండియు నిట్లని యె* (క॥ విమలాత్మ నాకు నభయము। సమకూడెడునట్లు గాఁగ సన్మతి నీక్రో।ధమును పశమించి కరుణిం।పుము నావిన్నపము వినుము పుణ్యనిధానా* (క॥ధరవిరులు గందకుండఁగ। సరసగతి న్బ్వుఁదేనెఁ జవిఁ గొను సంసా।ర విభుకైవడి బుధుఁడగు। పురుషుఁడు సారాంశమాత్మఁ బూని గ్రహించుర* (సీ॥వినుమయ్య తత్త్వదర్శనులైన యట్టిసన్మునులచే నైహికాముష్మికంబు। లైనఫలప్రాప్తికర్థి కృష్యగ్నిహోత్రాద్యుపాయంబులుర్వీమీఁద । దృష్టంబులును సుచరితములు నగుచుండా నెనయఁదగు నుపాయ మెవ్వఁడాచ। రించుని వాఁడు ప్రాపించుఁ దత్ఫలము నువిద్వాంసుఁడైన ను వెలయదీని। నాదరింపక తనయంత నాచరించె। నేని నాయాసమేయగుఁ గాని తత్ఫ। లమును బొందడు బహుళకాలమునకైన। వినుతగుణశీల మాటలు వేయునేల॥ అని మఱియు మహియిట్లని యె* (చ॥జలరుహగర్భుచేత మును జాలసృజింపఁగఁబడ్డ యోషధు।లిల లుపహతిన్ ధృతవ్రతులు గాని యసజ్జనభుజ్యమానలై । మెలఁగుటఁ జూచి యేను నృపమీరలు మాన్పమిఁ జోరబాధల । న్బలుమరుఁ బొందితా నపరిపాలితనై కృశియించి వెండియుర్ల* (క॥అనుపమమఖకర్మక్రియ। లనయము లేకుంట నేన నాదృతనగుచు। న్జననాయక యీలోకము। ఘనచోరీభూతమగుటఁ గనుఁగొని యంతర* (క॥సవనాదిసిద్ధికొఱకై। తవిలి తదీయౌషధీవితతులను ధరణీ। ధవ యేనపుడు గ్రసించితి। నవియును నాయందు జీర్ణమయ్యెఁ గడంకర* (క॥ వినువాని యొకయుపాయం। బున గ్రమ్మఱఁ బడయవచ్చు భూవర చంద్రా। వినుమది యెఱిఁగించెద నీ।కును వత్సలురాలనగుట ననఘచరిత్రా* (క॥అనయము నాకొకవత్సము। ననురూపసుదోహనమ్మున నురూపక దోగ్ధను గల్పింపుము దగనై। నను నీభూతములకవని నాయక దానర* (క॥ పరగ నభీప్సితములు బళి। కరములు నగు నన్నదుగ్ధకలితములసుభా।సురకామంబులఁ బిదికెద।నరనాయకచంద్ర వినుము నావచనంబుల్ * (చ॥ మనుజవరేణ్య యేను విషమస్థలినై యిపుడున్నదానఁగా। పునజలదాగమోదితపయోనివహంబు తదాగమంబుపో। వు నను దదంబువుల్పుడమినింక కయింతటసల్పుచనట్లుగా।మనునిభ నన్ను నిప్పుడు సమస్థలినై పెనుపొందఁ జేయవే* (క॥ అనియివ్విధమున నాభూ।వనితామణి వలుకు మధురవచనంబులుదా।వినియనురాగము దనమన।మునఁ గడలుకొనంగ రాజముఖ్యుండంతర* (చ॥ మనువును దూడఁ జేసి గరిమన్నిజపాణితలంబు లీలదో। హనముగఁ జేసియందు సకలౌషధులన్బిదికెన్గ్రమంబున। న్దనరఁగఁ దద్విధంబున నుదత్పృథువత్సలమైన భూమియం। దనయము వారువారును బ్రియంబగు కోరుకలఁ బొందిరున్నతిర* (సీ॥ బలసి ఋషుల్బృహస్పతివత్సకంబుగా నర్థించితముయింద్రియంబులందు। సంచితచ్ఛందోమయక్షీరమును దేవతలు సురరాజవత్సకము గాఁగ। గనకపాత్రమునందుఁ దనరు నోజోబలవీర్యామృతంబునై వెలయుఁబయసు। దైత్యదానవులు దైత్యశ్రేష్ఠుఁడగు గుణవంతుఁ బ్రహ్లాదు వత్సంబుఁ జేసి। సత్సురాసవపయసాయసచషకమున। నప్సరోజనగంధర్వులలరియపుడు। దనరు విశ్వావసును వత్సమునుగఁ జేసి। పద్మమయనిర్మితంబైనపాత్రమందు* (వ॥ మాధుర్యసౌందర్యసహితగాంధర్వక్షీరంబును పితృదేవతలు సూర్యవత్సకంబుగా నామపాత్రమందుఁ గవ్యంబను దుగ్ధంబును సిద్ధులు కపిలవత్సకంబుగా నాకాశపాత్రమందు సంకల్పనారూపాణిమాదిసిద్ధియను క్షీరంబును విద్యాధరాదులు తద్వత్సకంబుగఁ దత్పాత్రంబునుంగా ఖేచరత్వాదివ్యాపారరూప క్షీరంబును గింపురుషాదులు మయవత్సకంబును నాత్మపాత్రంబునుగా సంకల్పమాత్రప్రభవంబు నంతర్ధానాద్భుతాత్మసంబంధియునగు మాయయను క్షీరంబును యక్షరక్షోభూతపిశాచంబులు భూతేశవత్సకంబు కపాలపాత్రంబునుగా రుధిరాసవంబను క్షీరంబు నహి దందశూకసర్పనాగంబులు తక్షకవత్సకంబుగా బిలపాత్రంబున విషరూపక్షీరంబును బశువులను గోవృషవత్సకంబు లరణ్యపాత్రంబునుం గాఁ దృణంబను క్షీరంబును గ్రవ్యాదమృగంబులు మృగేంద్రవత్సకంబు నాత్మకళేబరపాత్రకంబును గాఁ గ్రవ్యంబను

ఆయసచషకమునన్ - ఇనుపపాత్రయందు — సుదోహనమ్మునన్ - పాలుపితుకుటకుఁదగినపాత్రను। దోగ్ధన్ - పాలుపితుకువాని.

దుగ్ధంబును విహంగంబులు సుపర్ణవత్సకంబు నిజకాయపాత్రంబునఁ గీటక ఫలాదికంబును దుగ్ధంబును వనస్పతులు వటవత్స
కంబుగా భిన్నరోహరూపవయస్సును గిరులు హిమవద్వత్సకంబును నిజసానుపాత్రకంబును గా నానాధాతువులను దుగ్ధంబు
లుఁగా నివ్విధంబున సమస్తచరాచరవర్గంబు సముఖ్యవత్సకంబును స్వస్వపాత్రకంబును గా భిన్నరూపంబులయిన క్షీరంబు
లం బిదికి రని చెప్పి మఱియును* (క॥ క్రమమున నిటు పృథ్వాదులు। దమతమ కామితములనఁగఁ దగు భిన్నక్షీ। రము దోహనవ
త్సకభే।దమున నందఁ గఁ బిదికి రంత ధరణీధవుఁడున్* (గీ॥ వముదితానందమును బొందిసర్వకామ।దుఘయనం దగు భూమిని దుహి
తఁ గాఁగఁ। గోరి కై కొనినిజధనుఃకోటి చేత। భూరిగిరికూటములఁ జూర్ణములుగఁ జేసి* (గీ॥ చండదోర్దండలీలభూమండలం
బు।సమతలంబుగఁ జేసి శశ్వత్ప్రసిద్ధి। నొందియవ్విభుఁడీ లోకమందు నెల్ల। ప్రజకు దండ్రియు జీవనప్రదుఁడునగుచు* (గీ॥ అ
కర్షకర్షణఁ బూర్వంబునందు లేని। గ్రామపట్టణదుర్గఖర్వటపుళింద। ఖేటశబరాలయవ్రజవాటఘోష। వివిధనిలయముల
ధీరతఁ గావించె నంత* (క॥ వారును భయవిరహితులై। ఘోరనదత్తన్నివాసములయందు సుఖ। శ్రీరుచి నొప్పుచునుండిరి।నార
కయాపృథునిఁ బొగడ వశమె ధరిత్రిన్* (సీ॥ అని చెప్పి మునినాథుఁ డైన మైత్రేయుఁ డవ్విదురునకిట్లను వేడ్కతోడ।ననఘాత్మ
రాజర్షి యైన వైన్యుం డశ్వమేధ శతంబు సమ్మేధతోడఁ। గావింతునని దీక్షఁ గైకొని వ్రతనిష్ఠ దివిరి బ్రహ్మావర్తదేశమందు। న
లరు మను క్షేత్రమందు సరస్వతీనదిప్రాంతఁ దాను చాలాన్నతి నొనర్చు। సవనకర్మక్రియకు నతిశయవిశేష। ఫలము గలిగెడి
నిబుద్ధిఁ దలఁచియ చట।వరుసఁ గావించు నతిశయాధ్వరమహోత్స। వము సహింపక యుండె నయ్యమరపభుఁడు* (సీ॥ అట్టి

—*పృథుచక్రవర్తియశ్వమేధంబు సేయు నెడ నింద్రుం డశ్వంబు నపహరించుట.*—

యధ్వరకర్మమందు సాక్షాద్భగవంతుఁడు హరి రమేశ్వరుఁడు లోక। గురుఁడును సర్వాత్మకుండును విభుఁడును నీరజభవభ
వాన్వితుఁడు లోక। పాలకనిఖిలసుపర్వానుగుండును యజ్ఞాంగుఁడఖిలాధ్వరాదివిభుఁడు। గంధర్వమునిసిద్ధగణసాధ్యవిద్యా
ధరాప్సరోదైత్యగుహ్యకాళి దాన। వాదిజేగీయమానుఁడు నలఘుయశుఁడు। ప్రకటనందసునందాదిపార్షదుండు। కపిలనారద
వరసనకప్రముఖ్య। మహిత యోగీంద్రసంస్తూయమానుఁ డజుఁడు* (వ॥ మఱియుం బరమభాగవతసేవితుండు నారాయ
ణాంశప్రభవుండు నైన పృథుచక్రవర్తికి భూమి హవిరాదిదోగ్ధ్రియయ్యును సర్వకామదుఘయై సమస్తపదార్థంబులం బితు
కుచుండె మఱియుఁ దరువులు ఘనతరాకారంబులు గలిగి మకరందస్రావులగుచు నిక్షుద్రాక్షాది రసంబులు దధిక్షీరాజ్యతక్ర
పానకాదికంబులు వర్షింపనవి యెల్లనదులు వహించె సముద్రంబులు హీరాదిరత్నవిశేషంబుల నీనుచుండెఁ బర్వతంబులు
భక్ష్యభోజ్యలేహ్యచోష్యంబులను చతుర్విధాన్నంబులఁ గురియుచుండె లోకపాలసమేతులైన సకలజనంబులు పాయనం
బులు దెచ్చియిచ్చుచుండి రిట్టి పరిపూర్ణవిభవాభిరాముండై యధోక్షజసేవాపరాయణుండగు పృథుచక్రవర్తి యేకోనశతా
శ్వమేధంబులు సమ్మేధంబునం గావించి నూఱవయాగంబునందు యజ్ఞపతియైన పుండరీకాక్షుని యజింపుచుండం దదీయపర
మోత్సవంబు సహింపం జాలక* (క॥ అమరేంద్రుఁడు ఘనరోషా।గ్రముఁడై పాషండవేషకలితతిరోభా। వమునం దన్మఖపశు
వుం। గ్రమమేది హరించి చనియె గగనంబునకున్॥ అట్లు చనునప్పుడు* (క॥ అనఘుం డగు నత్రిమహా। మునిచోదితుఁ డగుచుఁ బృ
థునిపుత్రుఁడు బాణా।సనతూణీరధరుండై। యనిమిషపతి వెనుకఁ జనియె నతిదర్పమునన్॥ అట్లు చని చని ముందట* (సీ॥ యజ్ఞ
సాధనపశుహరణు నివధియించు ధర్మంబునందు నధర్మమనెడి। బుద్ధిఁ బుట్టఁగఁ జేయ భూరిమాయావేష ధారియై యరుగుచు
న్త్రాముఁ గదిసి। నిలునిలు మని యార్చి నిజగుణధ్వనిఁ జేసి ఘనజటాభస్మాస్థికలితమయిన। మూర్తిఁ గనుంగొని మూర్తీభవించి
నధర్మంబు గాఁ బుద్ధిఁ దలఁచి యమర। నాయకుని మీఁద సాయకమేయఁ జాల।కున్నఁ గనుఁగొని యత్రి విద్వన్నుతుండు। వైన్యజున
కనెవ్వాసవు వలఁకుఁ జూపి। మనములోపల రోషంబు మల్లడింప* (క॥ వినుమితఁడు యజ్ఞహంతయు। ననిమిషనికరాధిపుండు నగు
నింద్రుఁడు గా।వున నితని జయింపు మునీ।వనిమమ్మా లుచ్చరింపన వైన్యజుఁడున్* (మ॥ వినువీధిం జను దేవవల్లభుని పై వీరుండు
గ్రోధాంతరం। గనిరూక్షిన్మృగరాట్కిశోరము మహాగంధద్విపేంద్రంబు మీఁ। దను లంఘించు విధంబునం బడిన నాతం డశ్వ
చౌర్యైకసా।ధనరూపంబుఁ దదశ్వమున్విడిచి యంతర్ధానముం బొందినన్* (క॥ వీరుఁడు పృథుభూపాలకు। మారుఁడు నిజయ
జ్ఞపశువు మఱలం గొనిదు।ర్వారబలుఁడగుచు జనకుని।భూరిసవనరాజపుణ్యభూమికి వచ్చెన్* (వ॥ అయ్యవసరంబున నచ్చట
నున్నపరమర్షిపుంగవులతని యద్భుతకర్మంబు గనుంగొని యాశ్చర్యంబు నొందియతనికి జితాశ్వుండను సన్వర్థనామంబు వెట్టి
యున్న సమయంబున* (చ॥ మఱియును దేవతాపతి తమఃపటలంబు జనింపఁ జేసి యె। వ్వరుఁ దనుఁ గానకుండ ననివారణఁ గాం
చన పాశబద్ధమై। సురుచిరయూపదారుపరిశోభితమైన హయంబుఁ గొంచుఁ జె। చ్చెర వినువీధి నేఁగఁగ మహిప్రవరుండగు నత్రి
సెప్పినన్* (క॥ వినిపృథుభూవరతనయుఁడు।ఘనబలమున నజకపాలఖట్వాంగములో।లి నిధరియించి యంబున।జనునిం
ద్రునిఁ గాంచి నొంపఁ జాలక యంతన్* (ఉ॥ క్రమ్మఱ నత్రి చేఁ దెలుపఁగాఁ బడి వైన్యతనూభవుండు రో। షమ్మున దోశ్చద్రో

కిం నభుజంగమపుంగవుఁబోలియుగ్రుఁడై । యమ్మరివోసినంగనిసురాధిపుఁడెప్పటియట్లఁబాటెన । శ్వమ్మునురూపమున్విడి
చిచాలఁదిరోహితుఁడై రయంబునన్ ॥ (వ॥ అట్లుచనినంబశువుంగొనిమఱలియవ్వీరోత్తముండు పితృయజ్ఞశాలకుంజనుదెం
చెనంత ॥ (సీ॥ హరిహయుండధ్వరహయహరణార్థమైమిందికైకొనివిసర్జించినట్టి। భూరియమంగళభూతమాయారూపముల
నుధరించిరిమూఢజనులు । పాషండచిహ్నమ ల్పరగుటవారలుజగతిపై నగ్నవేషములుగలుగు । జైనులుభూరికాషాయవ
స్త్రంబులుధరియించుబౌద్ధులుదగజటాస్థి। భస్మధారులునైనకాపాలికాదు। లనఁగవెలసిరిలోకంబులంహఁజాలఁ। బలఁపథ
ర్మోపమంబనఁదగునధర్మ। మాదునభిరతివొడమినయజ్ఞజనులు ॥ (వ॥ తదీయచిహ్నంబులుపారంపర్యంబుగాధరియింపందొడం
గిరితద్వృత్తాంతంబుభగవంతుండైనపృథుచక్రవర్తియెఱింగికుపితుండైయుద్యతకార్ముకుండగుచు నింద్రునిమీఁదబాణంబు
వేయనుద్యమించినఋత్విక్కులుశక్రవధోద్యుక్తుండుననహ్యరంహుండునైనపృథుచక్రవర్తింగనుంగొనియిట్లనిరి ॥ (క॥ జ
ననాయకయజ్ఞములం। దనుపమవిధిచోదితంబులనఁదగుపశుబం। ధనహింసలెకాకితరుల। ఘనదీక్షితునకువధింపఁగాదంద్రు
బుధుల్ ॥ (వ॥ కావుననీవిపుడింద్రవధోద్యోగంబుపసంహరింపుముభవదీయధర్మవిరోధియైనయట్టియింద్రుని ॥ (క॥ జనపా
లవీర్యవంతము। లనఁదగుమంత్రములచేతనాహ్వానముఁజే। సిననత డిచటికివచ్చును। జనుదెంచినయమరప్రభునిపరభసమొ
ప్పన్ ॥ (క॥ ధృతిచెనరఁబట్టిశిఖిశా।హుతిఁగావేల్చెదముదాననుర్విపరనీ। వితతమహోహాహతవీర్యో। న్నతుఁడై చెడిపోవు
నమరనాథుండంతన్ ॥ (వ॥ అనిపృథునివారించిఋత్విగ్జనంబులుకుపితస్వాంతులైహస్తంబులనుస్రుక్స్రువంబులుధరియించివ్రే
ల్చుసమయంబునంజతుర్ముఖుఁడు చనుదెంచిఋత్విక్కులంగనుంగొని యిట్లనియెయజ్ఞంబులందుయజింపంబడు దేవతలెవ్వ
నియంశంబులెవ్వండుయజ్ఞనామకుఁడగు భగవదంశంబగునట్టియింద్రుండు మీచేతవధార్హుండుగాఁడితఁడుభగవదంశసం
భవుఁడగుటనీయజ్ఞకర్మవిధ్వంసనేచ్ఛుండయికావించు ధర్మవ్యతికరంబులు చూచుచుండవలయుంగాని ప్రతీకారంబులుక
ర్తవ్యంబులుగావీపృథుకీర్తియగుపృథునకు నేకోనశతంబగునధ్వరప్రయోగఫలంబు సిద్ధించుంగాకయని పృథుచక్రవర్తికిని
ట్లనియె ॥ (సీ॥ మనుజేంద్రమోక్షధర్మమునెఱింగిననీకుపవనములేయుటచాలుమఱియు। నేవిధంబుననైనదేవేంద్రుఁ మనము
నఁగైకొనరోషంబుగదురకుండ। వర్ణింపవలయునువాసవుండునీవుపుణ్యశ్లోకులుగానమీకు। మంగళంబగుఁగానమానవ
నాథనీచిత్తంబులోపలఁజింతఁదొఱఁగి। మించీమద్వాక్యములనాదరించివినుము। దైవహతమగుయజ్ఞంబుఁదగిలిసేయు। కొఱ
కుభవదీయచిత్తంబుగుందిరోష॥ కలుషితంబైనయజ్ఞానకలితమగుచు ॥ (వ॥ భవదీయయజ్ఞహననార్థంబశ్వహరణుండైనయిం
ద్రుండుదేవతులలోనంకురాగ్రహుండగుటంజేసి యతనిచేతనిర్మింపంబడిచిత్తాకర్షకంబులైన యీపాషండధర్మంబులచేత
ధర్మవ్యతికరంబుగలుగుఁగాననీయజ్ఞంబుచాలింపుమనిమఱియునిట్లనియె ॥ (సీ॥ అదిగాకవినుమువేనాపచారంబునఁబూనివి
లుప్తంబులైనయట్టి। యలఘునానాసమయానుధర్మంబులఁబరిపాలనముసేయఁబరగివేను। దేహంబువలననుదివిరిజనించియు
న్నాఁడవునారాయణాంశజుఁడవు। గావుననీవీశకలితలోకంబునఁబుట్టినతెఱఁగునీబుద్ధిఁదలఁచి। యెవరిచేనేమిటికిసృజియిం
పఁబడితి। వట్టియాబ్రహ్మసంకల్పమవనినాథ। తప్పకుండంగఁబాలింపుధర్మగతినిఁ। జారుశుభమూర్తియోపృథుచక్రవర్తి ॥ (వ॥
అనిమఱియునిట్లనియెనుపధర్మమాతయంబ్రచండపాషండమార్గంబునైన యీయింద్రకృతంబగుమాయనుజయింపుమనివన
జసంభవుండానతిచ్చినంబృథుచక్రవర్తియుఁ దదాజ్ఞాపితుండై దేవేంద్రునితోడబద్ధసఖ్యుండయ్యెనంత నవభృథానంతరంబు
న ॥ (చ॥ సురుచిరలబ్ధదక్షిణలసొంపునఁబొంపిరివోయిభూసురు। ల్వరుసననేకదీవెనలవారణనిచ్చిరిసర్వదేవత। ల్భరితముదంత
రంగములఁబాయనివేడ్కవరంబులిచ్చిరా। నరవరుఁడైననైన్యునకునందితకీర్తికిఁబుణ్యమూర్తికిన్ ॥ అంతనచ్చటిజనంబులి
ట్లనిరి ॥ (గీ॥ అనఘనీచేతనాదృతులైరిసర్వ। జనులుమఱిచానమానోపచారములను। బిత్రదేవర్షిమానవవితతిపూజ। నొందిసం

— * యాగంబుననారాయణుండుప్రసన్నుఁడయిపృథుచక్రవర్తిననుగ్రహించుట. * —

చితమోదంబునొందెనయ్య ॥ (వ॥ అనిపలుకుసమయంబునయజ్ఞభోక్తయుయజ్ఞవిభుఁడు భగవంతుండునైనసర్వేశ్వరుండిం
ద్రసమేతుండైయచ్చటికింజనుదెంచియాపృథునకిట్లనియె ॥ (క॥ జనవరభవదీయంబై। జననుతమగునశ్వమేధశతమునకిపుడీ।
యనిమిషపతిభంగముచే। సినకతనతమాపణంబుసేసెడిఁగంటే ॥ (వ॥ కావుననితనిక్షమింపుముసత్పురుషులగువారుదేహా
భిమానులుగాకుండుటంజేసి భూతంబులయెడద్రోహంబాచరింపరట్లగుటంజేసి నీవంటిమహాత్ములుదేవమాయామోహితు
లైపరోపతాపంబుసేసిరేనిదీర్ఘతరంబైన వృద్ధజనసేవవ్యర్థంబుగాదెయదియునుంగాక యీశరీరంబవిద్యాకామకర్మం
బులచేతనార్థంబని తెలిసినపరమజ్ఞాని యీదేహంబునందుననుషక్తుండుగాకుంకుట సహజంబనదేహాత్మాపాదితంబులై
నగృహదారామలయందు మమత్వంబులేకుండుటంజెప్పనేల నిట్టిదేహంబునదున్నయాత్మయేకంబుశుద్ధస్వరూపంబు స్వ

ఖట్వాంగ-మంచపుకోడు—అరివోసి-సంధించి—నగ్న-దిగంబరులు—యుద్యతకార్ముకుండు-ఎత్తఁబడినవిల్లుగలవాఁడయి.

యంజ్యోతియు నిర్గుణంబు గుణాశ్రయంబు వ్యాప్యవ్యాపకంబు ననంవృతంబు సాక్షిభూతంబు నిరాత్మయు నగు దీని దేహంబున కంటె వేఱుగా నెవ్వండు దెలియు వాఁడు మత్పరుండగుటం జేసి దేహధారియై యుండియుఁ దద్గుణంబులం బొఱయక వర్తించు మఱియు నెవ్వండేని స్వధర్మాచారపరుండు నిష్కాముండు శ్రద్ధాయుక్తుండునై నన్నెల్లప్పుడు భజియించు నట్టివాని మనంబు క్రమంబునఁ బ్రసన్నంబగు నట్లు ప్రసన్నమనస్కుండు గుణాతీతుండు సమ్యగ్దర్శనుండు నైన యతండు మదీయ సమవస్థానరూప శాంతినొందు నదియ కైవల్యపదంబనం బఱఁగు గూటస్థుండైన యీ యాత్మ యుదాసీనభూతంబై నవీని ద్రవ్యజ్ఞానక్రియామనంబులకు నీశ్వరుంగా నెవ్వండు దెలియు వాఁడు భవంబు నొందకుండు నీ సంసార ద్రవ్యక్రియాకారక చేతనాత్మకము గుటం జేసి ప్రభిన్న దేహాద్యుపాధికంబు గావునఁ బ్రాప్తంబులయిన యీ యాపత్సంపదలయందు మత్పరులైన మహాత్ములు వికారంబు నొందరు గావున నీవు సుఖదుఃఖంబులయందు సమచిత్తుండవు సమానోత్తమమధ్యమాధముఁడవు జితేంద్రియాశయుండవునై విశిష్టాదితాఖిలామాత్యాదిసంయుతుండవై యఖిలలోకరక్షణంబు సేయుము మఱియు వెండియు నిట్లనియె* (సీ॥ పార్థివోత్తములకుఁ బ్రజలరక్షించుట పరమధర్మంబగు నరవరేణ్య। ధరణీశులకుఁ బ్రజాపరిపాలనంబునఁ బూనిలోకులు సేయు పుణ్యమందు। షష్ఠాంశమూర్తిని సంప్రాప్తమగు నట్లు ప్రజలఁ బ్రోవని రాజు ప్రజలచేత। నపహృతపుణ్యుఁడై వారు గావించు ఘనపాపఫలముఁ దా ననుభవించు। గాన నీవును విప్రవరానుమతము। సాంప్రదాయకవిధమునై జరుగు ధర్మ। మహిమఁ జేఁ బట్టి యర్థకామములయందు। నమరతన మ్మాటియందు నాసక్తి లేక॥ ఇవ్విధంబున* (క॥ జనులకు ననురక్తుఁడవై। జననాయక నీవు ధరణిసమచిత్తుఁడవై। యనయముఁ బరిపాలించిన। సనకాదులఁ గాంతువాత్మ సదనము నంతన్* (సీ॥ భూవర యోగతపోముఖంబుల చేతఁ గైకొనసులభుండఁ గాని యేను। సమదృష్టులైన సజ్జనుల చిత్తంబుల వర్తింపుచుండెడి వాఁడ నగుటఁ। జేసి తావకశమశీలవిమత్సరకీర్తనముల వశీకృతుఁడనైన నేనీకు నొకవరంబిచ్చెద వేఁడుము నావుడు విని మేదినీవరుండు। లోకగురుఁడైన యప్పుండరీకనయనుఁ। డానతిచ్చిన ట్టి మృదులలితామృతోప। మానవాక్యములాత్మీయమస్తకమునఁ। దాల్చి సమ్మోదితాత్ముఁడై ధరణిభుఁడు* (క॥ తనపాదములకు భక్తి। నినతుండై యాత్మకర్మకృతకీలజ్జం। దనరుచు నున్న సురేంద్రుని। గనుఁగొని సత్ప్రీతి మొదవఁ గౌఁగిటఁ జేర్చెన్* (వ॥ ఇట్లు గౌఁగిటం జేర్చి గతద్వేషుండై యున్న యనంతరంబ* (మ॥ భగవంతుండును విశ్వరూపకుఁడునై భాసిల్లు నవ్విష్ణుఁడా। జగతీనాథకృతార్చనానతుల చేసంప్రీతచేతస్కుఁడు। న్నిగృహీతాంఘ్రిసరోరుహద్వయుఁడునై నిల్చెన్ బ్రయాణాభిము। ఖ్యగరిష్ఠాత్ముఁడయ్యు నా పృథునిపైఁ గారుణ్యమే పారఁగన్* (వ॥ ఇట్లు తనమీఁది యనుగ్రహంబునం జేసి విలంబితుండగు నయ్యాదిరాజన్యుండైన పృథుచక్రవర్తి యమ్ముకుంద సందర్శనానందబాష్పజల బిందు సందోహ కందళిత నయనారవిందుండై యవ్విభుమూర్తిం గనుంగొని కనుంగొనలేక గద్గదకంఠుండై పలుకలేకయుండియు నెట్టకేలకుఁ దన హృదయంబున నద్దేవు నినుపగూహనంబుఁ గావించి తన్మూర్తి ధరియించి కన్నులందొఱంగు నానందబాష్పంబులు దుడిచికొని విలోకనంబు సేయుచు నత్యప్తదృగ్గోచరుండు గరుడస్కంధవిన్యస్తహస్తుండు వసుధాతలస్థితపాదకమలుండునై యొప్పు నద్దివ్యపురుషున కిట్లనియె* (క॥ వరదాయీశ్వర సనుస। త్పురుషుఁడు దేహాభిమానభోగములకు నీ। వరమెట్లు గోరు నిహసుఖ। వరములు నారకులకైన నలవె చెప్పుమీ* (చ॥ ఘనమగు దేవ యీ వరము గాదు మహాత్మక వాగ్వినిర్గతం। బనఁ దగు తావకీన వదనాంబుజ చారుమరందరూపమై। తనరెడి కీర్తియున్వినిముదంబును బొందఁగలేని మోక్షమై। నను మదిఁ గోరనొల్ల నఘనాశ రమేశ సరోజలోచనా* (క॥ అజగానఁ బద్మలోచన। సదమలభవదీయఘనయశము వినుటకునై। పదివేలు చెవులు కృపని। మ్మిదియే నాయభిమతంబు లెస్సఁగు ముకుందా* (చ॥ అనఘ మహాత్మ వాగ్గళితమైన భవత్పదపంకజాతసం। జనితసుధాకణానిలవశంబున విస్మృతతత్త్వమార్గవ। ర్తనలగు కుత్సయోగులకుఁ గ్రమ్మఱఁ దత్త్వముఁ జూపఁజాలుఁగా। పునఃదిదకల నన్యవరమొల్లఁ బయోరుహపత్రలోచనా* (సీ॥ వినుతమంగళయశోవిభవ సర్వేశ్వరయిందిర గుణసంగ్రహేచ్ఛఁ జేసి। యేనీమశివతరంబైన సత్కీర్తి నర్థమైవరియించె నట్టి కీర్తి। కలితసత్పురుషసంగము మిగుల్చుచునుండ ధృతి నెవ్వఁడేని యాదృచ్ఛికమునఁ। జేసియు నొకమాటు చెవులార విన్నవాఁడనయంబును గుణజ్ఞుఁడయ్యెనేని। పరత నేరీతిఁ బొందకుండు ధరణిఁ బశువుఁ। దక్కఁ దక్కిన తద్జ్ఞుండు దనుజభేది। గాన సుస్పృకమతినైన మేను లక్ష్మీకరణి నిన్ను భజింతు నో పరమపురుష* (వ॥ ఇట్లు భవదీయ సేవాతత్పరులమయిన యిందిరయు నేను నేకపదార్థాభిలాషం జేసి స్పర్ధమానలగుచున్న మా యిద్దరికిని బర్యాయ సేవం జేసి కలహంబు లేకుండ నిమ్మట్లఁ గాక భవదీయచరణసరోరుహ సేవాసక్తమనోవస్థాగులమగుటం జేసి నేను నేని మున్న భజియింతు నను తలంపులం గలహంబు గానిమ్ము దేవా యని వెండియు నిట్లనియె* (సీ॥ జగదీశ దేవ యుష్మత్పదకైంకర్యపరత దనర్చు సాగరతనూజ। కృత్యంబునందు నకిల్బిషబు

---

అనుషక్తుండు - అభిలాషగలవాఁడు — ఏకంబు - సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యమయినది — శుద్ధ - జరామరణక్షుత్పిపాసాదిమాలిన్యశూన్యమయినట్టి — నిర్గుణంబు - రాజసతామససాత్త్వికగుణములు లేనిది.

వంబునం జేసి పూనిన శుద్ధవిజ్ఞానఘనుండును । సగుణుండు నై నానావయనికర్మమార్గమునందు వ్రీహ్యాదిద్రవ్యములను । శుక్లాది
గుణముల విస్ఫురదవఘాతాది సత్క్రియలును మంత్రపంచయంబు । సంకల్పమును యాగసాధ్యమైనట్టి యిష్టండోపకారంబు
ఘనపదార్థశక్తియుం జ్యోతిష్టోమాదిసంజ్ఞికమ్ము । నమున నేకవిశేషగుణతను మెఱయు । నట్టియధ్వరరూపమై యఖిలజగము ।
నంహననశరంబు ప్రఖ్యాతి నొందుచుండు * (వ॥ అదియునుం గాక దారుస్థితంబైన యనలంబు తద్దారుగుణంబులయిన దైర్ఘ్యస్థౌల్యవక్ర
త్వాదికంబుల ననుచరించు చందంబున నవ్యక్తంబు తత్క్షోభకంబయిన కాలంబు వాసనయు నదృష్టంబును కారణంబులచే
తంబుట్టిన శరీరంబునందు విషయాకారంబయిన బుద్ధి నొందిత దృశ్యమానాభివ్యంగ్యంబైన యానందస్వరూపుండగుచుం గ్రియా
ఫలంబునం బ్రసిద్ధి యనొందునని చెప్పి వెండియు నిట్లను మదీయజనంబు లీ మేదినీతలంబున నృపక్రతులై యజ్ఞభుగీశ్వరుండు గు
రుండునైన సర్వేశ్వరుని హరి నిరంతరంబును స్వధర్మయోగంబున బూజింపుచున్న వారిలు నన్నాశ్వర్యకంబుగా ననుగ్ర
హించువారని హరిభక్తిరతులయిన మహాత్ముల నుతియించి వెండియు నిట్లనియె * (మ॥ పరసంపద్విభవప్రతాపమహదైశ్వ
ర్యంబులం బొల్చిన ధరణీనాథుల తేజమంచిత తపోదాంతి క్షమావిద్యలం । గరము ప్పారుధరాసుపర్వహరిభక్తశ్రేణులం దె
ప్పుడుం ధరలోనం బ్రభవింపకుండు నని యద్ధాత్రీశుఁ డిట్లనున్ * (చ॥ అరయఁగ నేధరామరపదాంబుజరేణువు లర్థిఁ దాల్చి
యప్పగము పురాణపూరుషుఁడు బ్రాహ్మణదేవుఁడునైనయట్టియీ । శ్వరుఁడు సదానపాయియగు సాగరకన్యను సర్వలోక
విస్ఫురితపవిత్రకీర్తియను బొందివిభూతిఁ దనర్చెఁ గావునన్ * (సీ॥ ఏవసుధామరసేవను జేసియ శేషగుణాశ్వతస్థితిఁ దనర్చు
సర్వేశ్వరుఁడు మతిసంతుష్టుఁ డగునట్టి ధరణీదివిజులు సద్ధర్మపరులు । నలఘుమనీషులునై యవశ్యంబును సేవింపుఁ డీ ధరాదేవని
త్య సేవ చే బురుషుఁడు చిరతరజ్ఞానవిద్యాభ్యాసి గాకున్ననైన నతఁడు వేగమునన తరంగంబు విశదమగుటఁ జేసి కైవల్యపద
మునుం జెందునట్లు గానలోకసుభూదేవ తాసికరము దగిలి భజియింపవలయునుదాత్తమతిని నతియును * (సీ॥ విజ్ఞానఘ
నుండన వెలయునీశ్వరుఁడు తత్త్వజ్ఞానులైనట్టి వారిచేత । దీపింపనింద్రాది దేవతాదేశంబునను భూమిసురముఖంబున హుతం
బులగుహవిస్సులఁ దృప్తినొందినగతిన చేతనమైన యాహుతాశనముఖంబు వలను వ్రేల్చినహవిస్సులచే తృప్తుండు గాకుండుఁ
గావున లోకసంకాశనగ్నిముఖము నకం బెథరామశేంద్ర ముఖము పరిశుద్ధమత్యంతముఖ్యమనఁగ దనరు నదిగాన భూసుగా
గ్నినముసకలజనులు గావింపఁ దగునార్యజనములార ॥ అదియునుం గాక * (సీ॥ ఏ వేదమందేని నీశ్వ మెల్లను దర్పణప్రతిబింబి
తము ముసవస్తు । నివహంబుకై వడిఁ దిపరి ప్రకాశించు నదివిరజము మత్తియవ్యయంబు । నగుచు సనాతనంబగు వేద సద్ధగా దేవ
తాజనములు దినముఁ దగిలి । మహితశ్రద్ధా తపోమంగళమౌనసంయమసమాధులం బొలుపారుచుండి । యర్థిసదసద్విచారు
లై యధికరింతు రట్టి వారలపదరజంబంది తాల్చు । నంఘులకు సర్వపాపక్షయంబు నఖిల । సద్గుణావాప్తియు నగుజతుగులా
ర * (వ॥ కావున నిట్టి విప్రపాదసరోజరేణువులేనును గిరీటంబున ధరియించు నిట్లు బ్రాహ్మణభజనంబునం జేసియవాప్తసకల
గుణుండు శీలధనుండు కృతజ్ఞుండు శ్రద్ధాయుక్తుండునైన మహాత్ము నఖిలసంపదలు ప్రాపించుఁ గావున గోబ్రాహ్మణకులంబు
ననుచరసమేతుండయిన జనార్దనుండు నాయెడం బ్రసన్నులయ్యెదరుగాక యని పలుకుచున్న పృథుచక్రవర్తిం గనుంగొని పి
తృదేవద్విజ సత్పురుషులు సంతుష్టాంతరంగులై సాధువాదంబుల నభినందించి యిట్లనిరి * (క॥ మనుజేంద్ర నీ కతంబున । ననుప
మనున బ్రహ్మదండహతుఁ డఘ్యవుఁ ర్తనుఁ డునగునట్టి వేనుండనయము నరకంబువలన నర్థిఁ దరించెన్ * (వ॥ కావునఁ బుత్రే
ణలోకాజయతియను వేదవచనంబు నిశ్చయంబయ్యెనుం గాక * (చ॥ పురుషవరేణ్య హిరణ్యకశిపుండు రమాలలనేశనింద
చే నరకమునం దగోరియగు నజ్ఞుఁడు భాగవతుండునైన యా । వరతనయప్రభావమున నాసికి నెక్కితధూతపాపుఁడై । గిర
యముఁ బొందఁడయ్యె నతినిర్మలకీర్తిఁ దనర్చెఁ గావునన్ * (క॥ అనిపలికి పృథువర్యం । డనఁదగు పృథుశాశ్వతంబులగు హాయన
గుణాభాయణునం ము నీట్టి భక్తి వాడనుటం జేసియు బ్రహ్మణ్యకవుండను త్తమశ్లోకుండునైన సర్వేశ్వరుని సత్కథాజాలం
బువ్యక్తంబు సేయుచున్న నీవు మాకు నాథుండవగుటం జేసియు నేమునుకు దదానులమైతిమి యీ భవదీయ ప్రజాశాసనంబు
ప్రజానురాగంబును గారుణ్యమూర్తులైన మహాత్ముల స్వభావంబులుగావున నాశ్చర్యంబు గాదు దైవసంజ్ఞితంబు లయిన
కర్మంబులచేత వినష్టజ్ఞానులమై పరిభ్రమించు మాకు తమఃపారంబుఁ గంటిమి యేసర్వేశ్వరుండు బ్రాహ్మణజాతి నధిష్ఠించి
క్షత్రియులను క్షత్రియజాతి నధిష్ఠించి బ్రాహ్మణులని యుభయంబ నధిష్ఠించి విశ్వంబును భరియించునట్టి విన్యస్తసత్త్వుండు స
ర్వరూపుండు మహాపురుషుండునైన పృథునకు నీశ్వరబుద్ధిం జేసి యేము నమస్కరింతుమనుసమయంబున * (క॥ వినువీధినుండి

— * పృథుచక్రవర్తి యొద్దకు సనకాదులరుగుదెంచుట * —

మెల్లనఁ జనుదెంచిరి బాలసూర్యసంకాశతనుల్ । జనవినుతసిద్ధవర్యులు । సనకాదులు శేముషీచతురులంతన్ ॥ ఇట్లు చను

డెందిన* (క॥ అనఘాత్ములతిథిరూపంబున రాగృహమేధిప్రాణములు నుద్గతి చేఁ। దనరన్ బ్రత్యుద్గతివం। దనములమఱలం బ్రతిష్ఠితములగు ననుచున్* (క॥ వినఁబడువచనన్యాయం। బున నుద్గతములగు ప్రాణములఁ గ్రమ్మఱఁ బొం। దను గోరు వాఁడునుం బలె। నను చరలిత్విక్సదస్యుఁడై పృథుఁడర్థిన్* (గీ॥ ఇంద్రియేశుఁడు గంధాదికేష్టగుణముఁ। గూర్చియర్ఘ్యాసనక్రియఁ గోరి చేయు। పగిదిఁ బృథుచక్రవర్తి సంభ్రమముతోడ। మహితభక్తిని బ్రత్యుద్గమంబు సేసె* (క॥ ఘనగౌరవమున నమ్మునిజనచిత్తవశీకృతుండు సభ్యుఁడు ప్రియుఁడు। వినయానతకంధరుఁడై। జనవరుఁ డా పరమయోగిచంద్రుల నెలమిన్* (సీ॥ పూని యర్ఘ్యాసనాసీనులఁ గావించి కరమర్థి విధివత్ప్రకారమునను। బూజించి తత్పదాంభోరుహక్షాళనసలిలంబు లాత్మమస్తమునఁ దాల్చి। హాటకకలితసింహాసనాసీనులై విహితాగ్నులనుఁ బోలి వెలుగుచున్న। శర్వాగ్రజన్ములసనకాదులనుఁ జూచి యతుల శ్రద్ధాసంయమాన్వితుండు। పరమసంప్రీతమతియునై పలికె రాజు। గూరిమో మంగళాయనులార పూర్వ। భవమునందెద్ది మంగళప్రదసుకర్మ। మేను జేసితి మిముఁ జూడ నిపుడు గలిగె॥ అని వెండియు* (క॥ భువి నెవ్వని యెడ విప్రులు। భవుఁడును విష్ణుఁడుఁ దదీయభక్తులును బ్రసన్నవదనులగుదురు వానికి। భువి నిదిపిన సాధ్యకర్మములు లేవనఘా* (వ॥ అనిమఱియు ననఘాత్ములారా లోకంబుల నీక్షింపుచుం బర్యటనంబు సేయు మిమ్ము సర్వదర్శనుండయిన యాత్మను గనుంగొనంజాలని సర్వదృశ్యంబు చందంబున నీలోకంబు గనుంగొనంజాలకుండునట్టి మహాత్ములరయిన మీదర్శనంబు చేసి యేను ధన్యుండనయితి నదియునుం గాక* (చ॥ అరయ ధరిత్రి నెవ్వని గృహంబు మహాజనోపభోగ్యవి। స్ఫురితతృణాంబుభృత్యగృహభూముల పారెఁ దనర్చునట్టి మం। దిరపతి పేదయైన జగతిం గడుఁ ధన్యుఁడటండ్రు గాన మ। స్థిరమతి మీరు వచ్చుటయశేషశుభంబుల నేను బొందెదన్॥ అదియునుం గాక* (చ॥ వరమఖులార యెవ్వని నివాసము తీర్థపదాంతరంగులై। పరగిన యట్టి భాగవతపాదజలంబులు సోఁకవేనిఁ ద। ద్గృహపుఁడు భూరిసంపదలఁ బొంపిరిపోయిన నైన వాని మం। దిరము రగప్రకీర్ణ జగతీజముఁ బోలునటండ్రు కోవిదుల్॥ అని పలికి వెండియు నిట్లనియె* (సీ॥ పరమపావనులార బాల్యంబునందుండి మానితశ్రద్ధాసమన్వితులును। గుణనిధుల్ ధైర్యయుక్తులుఁ ముముక్షువులునై యధికవ్రతంబుల నాచరింతు। రట్టి పుణ్యులు భవదాగమనంబు స్వాగతమయ్యె సత్కృపాకలితులార। యనివారితవ్యసనార్ణవంబయినట్టి భూరిదుర్లంఘ్యసంసారమందు। మతివిహీనస్వకీయకర్మములఁ జేసి। యడరి మగ్నులమై యింద్రియార్థములనె। తిపరిపురుషార్థములు గాఁగ దెలియమాకుఁ। గుశలమున్నదె లోకైకకుశలులార* (వ॥ మీరలు నాత్మారాములగుటం జేసి మీయందుఁ గుశలాకుశలరూపంబులైన మనోవృత్తులు సంభవింపవు కావున గుశలప్రశ్నం బుపపన్నంబు గాదు కాన నేనుఁ గృతవిశ్వాసుండనై సంతప్తులైన వారలకు సుహృత్తులైన మిమ్ము నాకు నీసంసారంబునందు నేమిట వేగంబె క్షేమంబు గలుగునని యడిగెద నాత్మవంతులకు నాత్మయు నాత్మభావనుండునైన యీశ్వరుండు భక్తానుగ్రహంబుకొఱకు నీలోకంబుల మీ వంటి సిద్ధరూపంబున వర్తింపుచుండునని పలికిన యతని గంభీరార్థగౌరవంబులు శుభకరంబులు న్యాయసహితంబులు మితాక్షరంబులు శ్రోత్రప్రియంబులునైన వచనంబులు విని సంప్రీతచేతస్కుండై సనత్కుమారుం డిట్లనియె* (మ॥ ధరణీశోత్తమ సర్వభూతహితచేతస్కుండవై ధర్మము। స్థిరభాగ్యోదయశాలివై మెసఁగు నీచే సాధులోకోత్తరో। త్తరసంప్రశ్నము సేయఁగాఁ బడె మహాత్మా సాధులోకైకస। చ్చరితంబుం దలపోయ నిట్టిదకదా చర్చింప లోకత్రయిన్* (గీ॥ ధరణి సజ్జనసంఘంబు దలఁపనుభయ। సమ్మతంబగు వారలు సలుపునట్టి। సరససంభాషసంప్రశ్నసరణి నిఖిల। జనములకు సుఖకరము గుజనవరేణ్య* (వ॥ అని యభినందించి మోక్షసాధనోపదేశకాముండై న పృథుచక్రవర్తికి వెండియు నిట్లనియె* (సీ॥ ధరణీశ మధుసూదనుఁడైన యట్టి నారాయణు లలితపాదారవింద। వరగుణధ్యానధీపరిణతత్వంబున సకలాత్మమలవిమోచనమునైన। రతియు ననిత్యవైరాగ్యంబు మొదలనే లోకోత్తముఁడవైన నీకు గలవు। సమ్యగ్విచారశాస్త్రములజనులకు సేమంబునకు సునిశ్చితంబులైన। యాత్మవ్యతిరిక్తవస్తువులందు మీత। రాగతదలంపనిర్గుణబ్రహ్మమయిన। యాత్మయందుల రతియుననఁగ నివియును। హేతువులు బుద్ధిఁ జింతింపసిద్ధచరిత* (వ॥ కావున శ్రద్ధయు భగవద్ధర్మచర్యయుఁ దద్విశేషజిజ్ఞాసయు నాధ్యాత్మికయోగనిష్ఠయు యోగీశ్వరోపాస్తియుఁ బుణ్యశ్రవణుండయిన నారాయణకథాలాపంబు నర్థేంద్రియారాములైన వారలతోడి సంగతులయందు విరక్తియు వారల కభిమతంబులైన యర్థకామంబులందు ననాకాంక్షయు సర్వేశ్వరుని గుణకీర్తనామృతపానంబు దక్క నితరపదార్థవైరాగ్యంబు నొంది యాత్మారామతం గలిగి విజనస్థలంబులం దులరు దిగలుగుటయు నహింసయు పశమాదిప్రధానవృత్తియు నాత్మహితానుసంధానంబు భగవత్కథానుస్మరణంబునఁ గామ్యంబులయిన యమనియమంబులు నితరభక్తిమార్గాగర్హణంబు యోగక్షేమార్థక్రియారాహిత్యంబు శీతోష్ణాదిద్వంద్వసహిష్ణుతయు భాగవతకర్ణాలంకారభూతంబులగు భగవద్గుణాభిధానంబులను వీని చేత విజృంభమాణంబయిన భక్తియోగంబునం జేసి యనాత్మయందు నసంగంబు కార్యకారణరూపంబగు నిర్గుణబ్రహ్మంబునందు రతియు నెప్పుడు గలుగు నప్పుడ సదాచార్యానుగ్రహవంతుండయిన పురుషుండు బ్ర

౩౮

త్మనిష్ఠులతోడఁ జెలిమి సేయుచు నీషణత్రయంబు వర్జించి ప్రకృతిం జేరక వైరాగ్యవేగంబు నం జేసి* (సీ॥ అనఘ సాధూత్తమ నిష్ఠులతోడఁ జెలిమి సేయుచు నీషణత్రయంబు వర్జించి ప్రకృతిం జేరకవై రాగ్య వేగంబునం జేసి* (సీ॥ అనఘసాధూత్తా-
త్మనిష్ఠులతోడఁ జెలిమి సేయుచు నీషణత్రయంబు వర్జించి ప్రకృతిం జేరకవై రాగ్య వేగంబునం జేసి* (సీ॥ అనఘసాధూత్త
రమునుభక్తియోగాగ్నిఁ గడఁగి జీవాధానకమును బంచ। భూతాత్మకంబునై పొలుచు హృద్గ్రంథినిఁ బూని సర్వకారణభూతను
యునై యరణిదహించు హుతాశనుమాడ్కి వడి నిగ్రహించి ననట్లు నెఱసి దగ్ధబీజుఁడై ముక్తనిశ్శేషాత్మగుణుఁడు సద్ధర్ముఁడు నైనయ
తండు మిగుల। నర్థిఁ బాహ్యంబులయిన ఘటాదికములు। నాంతరములైన సౌఖ్యదుఃఖాదికములు। ననువిభేదములాత్మభేదకములు
లగుటనయ్యుపాధివినాశంబునం దగలఁడు॥ అదియెట్లనిన* (చ॥ పురుషుఁడు నిద్రఁ బోఁ గలలఁ బొందినయాత్మసుఖైకహే
తువై। పరగిన రాజభృత్యజనభావగుణంబులు సంప్రబోధనం। బరయఁగ మిథ్యమైనగతి నాంతరబాహ్యగుణప్రభేదముల్ప
రువడిఁ గానకుండు జనపాలనశీలనసత్యఖేలనా* (వ॥ మఱియును ద్రష్టయైనయాత్మయు దృశ్యంబయిన యింద్రియార్థంబున
ను వీనికి నహంకారంబు సంబంధహేతువగుటం జేసి యాదియంతఃకరణంబునం గలుగుచుండు జాగ్రత్స్వప్నంబులయందు నీభే
దంబు గనుంగొనుచుండు నట్టియంతఃకరణంబు లేనిదియగు సుషుప్తికాలంబునం బురుషుండు జలతర్పణాదినిమిత్తాభావంబగు
నప్పుడు బింబప్రతిబింబభేదంబు గనుంగొననిచందంబున దృశ్యభేదంబుగనుంగొనకుండుం గావున నంతఃకరణంబు విలయంబు
నొందిన బాహ్యాంతరభేదంబు గనకుండుట నిశ్చయంబని వెండియు నిట్లనియె* (సీ॥ భువివిషయాకృష్టభూతంబులయినయింద్రి
యముల చేతను దివిరి మనమునుదగ విషయాసక్తిఁ దగిలి యాంతరమైన మహితవిచారసామర్థ్యమెల్ల। శరకుశస్తంబకజాలంబు
హ్రదతోయములు గ్రోలు గతిఁ గ్రహంబున హరించు। నీరీతినంతర్విచారసామర్థ్యంబున పహృతంబయిన పూర్వాపరాను
మేయసంధానురూపసంస్మృతి నశించు నది నశించిన విజ్ఞానమంతఁ దొలఁగు। నట్టివిజ్ఞాననాశంబు నార్యజనులు। స్వాత్మకదిస
కలాపహ్నవంబటం డ్రు* (వ॥ అదియునుం గాక యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతీయను వేదవచనంబునం జేసి విష
యంబులకుం బ్రియతమత్వంబై యాత్మోపాధికంబు నొంది యాత్మాపహ్నవంబునం బాటిల్లు స్వార్థనాశంబెట్టిదగలుగు దానికం
టెలోకంబున నధికంబైన స్వార్థనాశంబు లేదదియెట్లనిన సర్వార్థనాశంబునను స్థైర్యంబు నొందించునట్టి యర్థకామాభిధ్యా
నంబునం దద్ధేతుకంబయిన స్వార్థనాశంబునం బరోక్షాపరోక్షరూపజ్ఞానంబునం జేసి నశించుం గావున నాత్మాపహ్నవంబున
కంటెనధికతరంబైన సర్వార్థనాశంబు లేదని వెండియు నిట్లనియె* (సీ॥ అనఘ యీసంసారమతిశయంబునఁ దరియింపఁగను
దినిశ్చయించువాఁడు। గైకొనిధర్మార్థకామమోక్షములకు నతివిఘాతుకమెద్దియట్టిదాని। వలను సంగము సేయవలవదు ధ
ర్మాదులందు త్రివర్గంబునంతకొగ్ర। భయకారియగుటను బరను మోక్షంబె ముఖ్యార్థమై వెలసిల్లునం డ్రు బుధులు। భువిగుణ
వ్యతికరమునఁ బుట్టినట్టియబ్జజాతాదులకు సన్మార్గాదులకును। గాలవిధ్వంసితాఖిలక్రమము గల్గుఁ। గలుగ దెన్నఁడు సేమంబు
గానవినుము* (వ॥ కావున మోక్షంబె పరమపురుషార్థంబని చెప్పి వెండియు నిట్లనియె నరేంద్రా దేహేంద్రియప్రాణేంద్రియబు
ద్ధ్యహంకారపరివృతంబులైన యీస్థావరజంగమంబులహృదయంబులందు వ్యాపకుండు ప్రత్యక్షభూతుండు ప్రత్యగాత్మయుం
డు భగవంతుండు నైన యీశ్వరుం డంతర్యామిరూపంబునం బ్రకాశింపుచుండునది నారాయణుని సద్రూపంబుగాఁ దెలియు
మని వెండియు నిట్లనియె* (ఉ॥ భూవర యే మహాపురుషభూషణు నంకులనీసమస్తవి। శ్వావళిలీలమైసదసదాత్మకభావమునొం
దిభూరిమా। యావిభవంబులందగి సమగ్రవివేకవిరోధిసర్గునా। శేషవిశుద్ధిఁ దోఁచు పశేషగతిన్ వెలుఁగొందు నెప్పుడున్*
(చ॥ సుమహితనిత్యముక్తపరిశుద్ధవిబుద్ధమతత్త్వుఁడై యురుక్రముఁడభిభూతసత్ప్రకృతికర్మకళంకుఁడు నైనయట్టియు। త్తమ
చరితుం గృపాకరుని దాత్తగుణోన్నతుని శ్వరేశుఁజి। త్తమునఁ దలంపుమయ్య జనతాపరిరక్షణదుష్టశిక్షణా* (సీ॥ వసుమతీ
నాథ యెవ్వని పాదపద్మపలాశవిలాససల్లలితభక్తి। సంస్మరణంబు చేసజ్జనప్రకరంబు ఘనకర్మసంచయగ్రథితమగు నహంకా
రమనిహృదయగ్రంథిఁ జేరరు విచరింపనట్లు నిర్విషయమతులు। మహి నిరుద్ధేంద్రియమార్గులునైనట్టి యతులకుఁ జేరంగనలవి
గాని యట్టిపరమేశుఁ గేశవు నాదిపురుషు। వాసుదేవుని భువనపావనచరిత్రు। సతిఁ శరణంబుగాఁ దత్పదాంబుజములు। భక్తి
సేవింపు గుణసాంద్ర పార్థివేంద్ర* (మ॥ అరిషడ్వర్గమహోర్మినక్రనికరవ్యాకీర్ణసంసారసా। గరమబ్జోదరకీర్తనాద్యు
ఘుపసాంగత్యంబునం బాసితా। మరుదారంగన ఘూపహప్రకటయోగాదిక్రియాయుక్తిచేఁ। దరియింపన్మదిఁ గోరువారలకు
దుర్దాంతంబగుఁ గావునన్* (మ॥ ధరణీశోత్తమ నీవు కేవలసముద్యద్భక్తియుక్తిన్ పరగోవిందపదారవిందయుగభాస్వ
న్నావ సంధించుడు। స్తరఘోరవ్యసనాకరోల్లసితమద్దాంతోగ్రగంభీరసం। సరణాంభోధిఁ దరింపుమయ్య పరమోత్సాహం
బుదీపింపఁగన్* (క॥ అనియీగతిఁ బంకరుహాసనసుతుఁడు సనత్కుమారకమునినాథుం। డనుయోగివల్లభుని చే తను దెలియఁ
గఁబడిన బ్రహ్మతత్త్వుండగుచున్* (క॥ జనపతిమునిఁ బూజించుచుఁ। ననఘమును బాద్యజన్మమున నేదీ। నావనుఁడై నయీశ్వరు
వి చే తనునికట మమ్మగ్రహింపఁ దగితిమునీంద్రా* (క॥ ఘనదుష్టమనుప్రహా। ధనమునకై మీరలిపుడు దగనిచ్చుటకింజను

డెందమునఁ గరుణాళువులును, ననఘులు భాగవతవరులు ననుత్తములుఁ * (సీ॥ నిరతంబు నా యందు నిష్పాదితములగు దేహ నమేత మదీయ రాజ్యసర్వసంపదలును సద్ధిజదత్తములుగావున బ్రాహ్మణకాంతావిభూతి। మందిరసుత రాజ్యమహి బలకోశపరిచ్ఛదంబుల నెల్లను భృత్యుఁదలంప। రాజును భృత్యుండు రాజకీయములగు తాంబూలముఖపదార్థములఁ జేసి। సమ్మతసంతర్పణోపచారములు నడపు। గతిసి వారల కవిని వేదితము లయ్యెఁ। గాన నీయుపచారమే గతిసౌన ర్తు। నతులగుణసాంద్రులార మహాత్ములార (వ॥ అదియెట్లు బ్రాహ్మణాధీనమంటిరేని సేనాపత్య రాజ్యదండనేతృత్వ సర్వలోకాధిపత్యంబులు వేదశాస్త్రవేదులైన బ్రాహ్మణులనుం గాక యితరులకు యోగ్యంబులుగావు కావున బ్రాహ్మణులకు భోజనవసనదానంబులు స్వకీయంబులై యుండు క్షత్రియాదులకు బ్రాహ్మణానుగ్రహంబున నన్నమాత్రంబు దక్కఁ దక్కిన వస్తుస్వాతంత్ర్యంబు లేదు గావున మీకు గురుదక్షిణ నేమి సమర్పించువాఁడ ననియు నంగాక స్వాతంత్ర్యంబు గలిగిన నిట్టి యధ్యాత్మవిచారులు వేదాంతవేదులు నై భగవద్భక్తిని పదేశించెడు మీ వంటి పుణ్యాత్ములకుం బరిహాసాస్పదుండు దక్కఁ దక్కిన వాఁడెవ్వఁ డంజలిమాత్రంబు దక్కఁ దక్కిన ప్రత్యుపకారంబు సేయ నేరఁడు కావున దయాళులైన మీరలు స్వకృతోపకారంబునం జేసి సంతుష్టాంతరంగులగుదురు గాక యని పలుకుచున్న యాదిరాజైన పృథుచక్రవర్తిచేతం బూజితులై యాత్మయోగనిష్ఠులైన సనకాదులు తని స్వభావంబుఁ బ్రశంసింపుచు సమస్తజనంబులు సూచుచుండ నాకాశగమనంబునఁ జనిరయ్యవసరంబున * (గీ॥ వినుమహాత్మముఖ్యుఁడన నొప్పువైన్యుఁడే।

**** పృథుచక్రవర్తి జ్ఞానవైరాగ్యవంతుఁడగుచు ముక్తినొందుట. ****

కాగ్రచిత్తుఁడగుచు నాత్మనిష్ఠ। డైనయట్టితనునవాప్తకాముఁ గాఁగ। బుద్ధిలోఁ దలఁచె భూవరుండు॥ అంత * (సీ॥ కర్మంబులను యథాకాలదేశోచితబలవిత్తములుగాఁగ బరగు ధర్మ। మగను బ్రహ్మార్పణబుద్ధినిఁ జేసి కర్మాసక్తుఁడగుచు సమాహితుండు। ప్రకృతికం టెను దవ్వుఁబరమైన యాత్మను గర్మసంచయసాక్షిఁ గాఁగ బుద్ధి। నర్థిఁ దలంపుచు నాచరింపుచు నట్లు మెఱసి సామ్రాజ్యలక్ష్మీసమేత। మందిరోద్యానవనభూములందు రాజ్య। గరిమ వర్తింపఁగా నహంకారరహితుఁ। డగుచుఁ దనచిత్తమున నింద్రియార్థములను। సగుల కయ్యుండె నాతఁడు తరణి పగిది * (వ॥ ఇట్లధ్యాత్మయోగనిష్ఠుండై కర్మంబుల నాచరింపుచు నర్చియను భార్యయందు విజయాశ్వుండు ధూమ్రకేశుండు హర్యశ్వుండు ద్రవిణుండు వృకుండు నను నాత్మసములైన పుత్రులనేవురం గనియె నంత * (క॥ జనవినుతభూమి వలనను। ధనముల మర్యాదఁ గొనుచు దాననిమిత్తం। బునఁ గ్రమ్మఱఁ దాఁ జెచ్చెడు। దిననాయకుఁ బోలి వసుమతీశుఁడొప్పెఁ * (వ॥ అతండు మఱియు నగ్నిచందంబునం దేజోదుర్ధర్షుండు మహేంద్రునిపగిది దుర్జయుండు ధరణికరణి సతతక్షమాయుక్తుండు స్వర్గంబు పగిది నభీష్టదుండు పర్జన్యుని భాతిఁ గామితప్రవర్షణుండు సముద్రుని రీతి గాంభీర్యయుక్తుండు మేరువు పోలికె సత్త్వవంతుండు ధర్మరాజుకైవడి ననుశాసకుండు మహేంద్రుని విధంబున నైశ్వర్యవంతుండు కుబేరుని వడువున ధనవంతుండు వరుణుని సరణిగుప్తార్థుండు సర్వాత్మకుండగు వాయువు చొప్పున బలౌజస్తేజోయుక్తుండు రుద్రుని పగిది నసహ్యతేజుండు కందర్పుని యనువున సౌందర్యవంతుండు మృగరాజునోజ నధికశౌర్యోపేతుండు మనువు రూపున వాత్సల్యయుక్తుండు నజుని చందంబునం బ్రభుత్వసమేతుండు బృహస్పతి గరిమ బ్రహ్మవాదియు నైశ్వర్యుని జాడ జితేంద్రియుండు విష్వక్సేనానువర్తనులైన గోగురు విప్రజనంబులందు భక్తియు లజ్జావినయశీలంబులందు బరోపకారంబునందు ననిరుపముండై యివ్విధంబున సర్వలోకపాలక పృథగ్విధగుణంబులనన్నింటి నిందా నొక్కరుండ ధరియించి * (క॥ అనఘాత్మ కలోకత్రయ। మున సజ్జనకర్ణరంధ్రములఁ నిండు నా। వినుతయశోమహనీయుఁడు। జనవినుతుండగు సు రామచంద్రుని మాడ్కి * (చ॥ సరసవచోర్థసత్పురుష సంఘసమంచితగీయమానను। స్థిరవరకీర్తిపూరము సుధీజనకర్మములందు నిందితా। నిరుపమసౌమ్యభాషణమునీపల శోడఁ బ్రజానురక్తుఁడై। ధరణిని రాజనామమునఁ దానగు రెండవ చంద్రుఁడో యనఁ * (వ॥ మఱియు నమ్మహాత్ముండు విజ్ఞానియు వర్ధితాశేషస్వానుసర్గుండు ప్రజాపాలకుండు స్థావరజంగమవృత్తిదాయకుండు సత్పురుషధర్మవర్తనుండు నిష్పాదితేశ్వరాదేశకుండునైన పృథుం డొక్కనాఁడు తన వార్ధకంబు వీక్షించి నిజరాజ్యము నాత్మజుల యందు నిలిపి ప్రజలు చింతాతురచిత్తులగుచుండ నిజభార్యాసమేతుండై యప్రతిహతనియమంబు వైఖానససమ్మతంబునైన యుగ్రతపంబు నందుఁ బూర్వంబున దిగ్విజయ ప్రవృత్తుండగుచందంబునం బ్రవృత్తుండై తపోవనంబునకుం జనియందు * (మత్తకోకిల॥ కందమూలఫలాశియై బహుకాలము గ్రతపఃపరి। స్పందుఁడై యటుమీఁదటం దృణపర్ణభక్షణ జేసియా। చంద మేది జలాశియై నృపసత్తముండది మానితా। మఁబగం బవమాశియయ్యెఁ గ్రమంబునం దృఢచిత్తుఁడై। ఇట్లు వర్తింపుచు * (సీ॥ మెండుగా మిటమిటమండు వేసవియందు దప్తపంచాగ్నిమధ్యమున నిలిచి। మానక జడిగొన్న వానకాలంబునఁ బైఁ గోక వేయక

దుర్ధర్షుండు-భరింపనశక్యమైనవాఁడు — పర్జన్యుఁడు- మేఘుఁడు — కందర్పుని యనువున - మన్మథునివలె — విష్వక్సేన-విష్వక్సేనుండనఁగా విష్వక్‌-వ్యాప్తా సేనాయస్యసః-అంతట వ్యాపించిన సేనగలవాఁడు-అనగా-విష్ణువు.

బైటనిలిచి। జనులుహాహాయనుచలివేళఁగుత్తుకబంటితోయములలోపలవసించి । శిశిరంబుచాలనల్లిశలఁబగ్యేడు వేళ వె
లయభూశయనుఁడై విశ్రమించి। సహితనియతిఁదితిక్షాసమన్వితుండు । నియతపరిభాషణుఁడుజితానిలుఁడు దంతుఁడిద్ధమ
తినీశ్వరారాధనేచ్ఛుఁడనఘుఁ। డూర్ధ్వరేతస్కుఁడయ్యెనుగ్రమోదతమున* (వ॥ అతిఘోరంబయినతపంబాచరించెనివ్వి
ధంబునసంగ్రమాను సిద్ధంబయిన తపంబునం బ్రాణాయామంబులచే విధ్వస్తాశేష కర్మమలాశయుండును జితారిషడ్వర్గుండు
ఛిన్నబంధనుండును పురుషశ్రేష్ఠుండునైన పృథుచక్రవర్తి భగవంతుండయిన సనత్కుమారుండెఱింగించిన యోగమార్గంబున
సర్వేశ్వరభజనంబు గావించె నిట్లుభగవద్ధర్మపరుండు సాధువర్తనుండు శ్రద్ధాసమన్వితుండునైన పృథునకు నారాయణునం
దుభక్తియనన్యవిషయంబై ప్రవృద్ధంబయ్యెనివ్విధంబున* (క॥ నరలోకోత్తమభగవత్పరిచర్యారాధనము తపశ్శుద్ధాంతఃక
రణుఁడునగు నాపృథునకు । సరసిరుహోదరుకథానుసంస్మరణమునన్* (క॥ పరిపూర్ణంబగుభక్తిని । గరమనిశము సంశ
యాత్మకంబై చాలన్వేలినహృదయగ్రంథిన్ నిరసించువిరక్తియుతగనీషజనించెన్* (వ॥ దానంజేసియతండుసంఛిన్నదే
హాత్మజ్ఞానుండునధిగతాత్మస్వరూపుండునై గదాగ్రజుండయిన శ్రీకృష్ణునికథాసక్తినొంది సమస్తయోగసిద్ధులందు నిస్పృ
హుండగుటను హృదయగ్రంథిచ్ఛేదకంబయిన జ్ఞానయోగంబునువిడిచి యాత్మయందు నాత్మయోగంబుఁగావించి బ్రహ్మ
భూతుండయినిజకళేబరంబువిడువనిశ్చయించి* (సీ॥ కోరిగాఁడెమెలఁజేగునుపీడనముచేసిపూనియుక్తాసనాసీనుఁడగుచుఁ। దన
రుమూలాధారమునసుండి వాయువునొయ్యననెగయించియొనరనాభి । కలితంబుగాఁబెంచిక్రమమున నుద్వత్సకంఠశిరఃకో
ష్ఠకములఁజేర్చి। కైకొనిమూర్ధభాగమునకునెగయించిప్రాణముల్విడిచియాపవనుఁబవను । నందునాకాశమాకాశమందుఁ
దేజ । మందుఁదేజంబునుదకంబునందునుదక । మర్థిఁగాయంబుమేదినియందుఁగలపెఁ । బూనివానియధోచితస్థానములుగ*
(వ॥ మఱియుభూమి నుదకంబునందునుదకంబును దేజమునందుఁదేజంబును వాయువునవాయువునాకాశంబునందు నాకాశం
బునుమనంబున మనంబు నింద్రియంబుల నింద్రియతన్మాత్రలు భూతాదియైన యహంకారంబునం దహంకారంబు మహత్త
త్త్వంబునందనుకూర్చియట్టిసర్వకార్యహేతుభూతంబయిన మహత్తత్త్వంబును జీవోపాధిభూతంబయిన ప్రకృతియందుఁగ
లిపి జీవభూతుండయిన పృథుండు జ్ఞానవైరాగ్యంబులచేత బ్రహ్మనిష్ఠుండై మాయోపాధింబాసి ముక్తుండయ్యెనని చెప్పి
వెండియునిట్లనియె* (సీ॥ అంత నాపృథునిభార్యామణియగునర్చి పుడమిపైఁదనయడుగిడినఁగందు। సుకుమారపాదాబ్జసుంద
రీరత్నంబు నతులపతివ్రతయగుటఁజేసి । యాత్మేశకృతసువ్రతాచరణంబును సుమహితశుశ్రూషణమును జేసి। యూర్ణేయ
మగుదేహయాత్రయు ననువీనిచేతమిక్కిలిఁగృశీభూతదేహ। యయ్యుఁబ్రియనాథకృతకరుణావలోక। కరతలస్పర్శనాదరస
త్కారములకు। సబలసుఖవృత్తిఁజెందియయ్యడవులందుఁ। గృశతనుదిందోఁపకుండఁజరించునపుడు* (క॥ తనమనమున నే
దుఃఖంబునయంబు నెఱుంగనట్టియర్చి నిజాధీశుని ప్రాణరహితదేహముఁ। గనుఁగొని విలపించివిగతకౌతుకయగుచున్* (సీ॥
మానితసుందరసానుప్రదేశంబునందుఁజితారోపమర్థిఁజేసి । లలితమహానదీసలిలసుస్నాతయై కలితమహోదారకర్ముఁడ
యిన । నాథునకుదకదానక్రియల్గావించియతిభక్తిసురలకునతులొనర్చి । వహ్నికిముమ్మాఱువలగొని పతిపాదకమలయుగం
బుఁజిత్తముననిలిపి । సంస్మరించుచుశిఖిప్రవేశంబుసేసె । వీరవరుఁడైనపృథుపతివీరసేన । సహగమనముసేయునట్టి
సాధ్వినర్చిఁగనుఁగొనిదేవాంగనాసహస్ర। మాత్మనాథులఁగూడినెయ్యంబుతోడ* (క॥ పరమోత్కంఠమునన్మందరగిరి
సానుప్రదేశతలమునవరుసం। గురియించిరినవసురభిత। వరమందారప్రసూనవర్షములంతన్* (క॥ కరమప్పుడచ్చరలాడిరి
మొరయించిరిశంఖతూర్యములుదివిజులుపా। డిరికిన్నరజనులుపర । స్పరనుతులొనరించిరాసురాంగనలున్॥ మఱియుని
ట్లనిరి* (సీ॥ చర్చింపనిట్టియాశ్చర్యమెందేనియుఁగనుఁగొంటిరేయర్చియనులతాంగి । ధన్యాత్మురాలుగదాతనవిభుఁగూడి
యుందిరామణియక్షేశుఁగూర్చి । వెనుచనుకైవడిననుగమనముఁజేసెనియ్యన నిజహృదయేశుఁడయిన । ఘనవైన్యునూర్ధ్వ
లోకంబునుఁబొందించునేఁడింతవట్టునునిశ్చితంబు। పరమయోగీంద్రులకుమరిభావ్యమైన । దృఢసుకర్మమువలననతిక్రమిం
చి।వైన్యభూమీశువెనుచనివసుసనూర్ధ్వ।గామినియునగునీయింతిఘనతనొంది* (వ॥ కాసంబతివ్రతలకునసాధ్యంబెందునుం
గలదేయనిమఱియు* (క॥ పరికింపఁగనేమనుజుఁడు।హరిపదమునుబొందఁజేయునట్టివివేక।స్ఫురణముఁదనర్పువానికిఁ।బరువ
డినిలఁబొందరానిపదముంగలదే* (గీ॥ అట్టియపవర్గసాధనమునను మనుజ।భావమొందియువిషయసంబద్ధుఁడగుచు।వసుధనె
వ్వఁడువర్తించువాఁడుధరణి।ననయమునిజాత్మవంచకుఁడనఁగఁబరఁగు* (క॥ అనివారలుదన్నర్చిని। వినుతింపఁగనర్చియాత్మవి
భువెనువెంటంజనియచ్యుతలోకంబున।ననుపమవిభవమునుబొందెననిపమరునసుణా* (క॥ మునివరుఁడగుమైత్రేయుఁడు।వి
షయంబుననెఱుఁగఁజెప్పివెండియుఁదగనిట్లనునమ్మహానుభావుం।డనఘుఁడుభగవత్తముండునగుపృథుఁడనఘా* (క॥ ఏనీకి
ప్పుడుసెప్పితి।మానుగనీపుణ్యకథనుమహితశ్రద్ధా। ధీనుండైవిస్ఫురదవ।ధానుండైయెవ్వఁడేనిసరినిభక్తిన్* (క॥ వినినఁబ

తించినద్రావాసిన। వినిపించిన వాఁడు పృథుఁడు విమలగతిం బొం। దిన క్రియ హరిపద మొందెడు। ననయము నిర్ధూత పాపుఁడగుచు మ
హాత్మా* (సీ॥ బ్రాహ్మణుఁ డుచితభక్తిఁ బఠించిన బ్రహ్మవర్చస్సు సంప్రాప్తుఁ డగును। క్షత్రియుం డర్థిమైఁ జదివిన విన్న జగతీ
విభుత్వంబు సంభవించు। వైశ్యుండు వినిన ధనవంతుఁడై యొప్పును శూద్రుండు వినిన సుశ్లోకుఁ డగును। మఱియును భక్తిమై మ్మా
ఱు పఠించిన విత్తహీనుండును విత్తపతియు। నప్రసిద్ధుఁడు ప్రఖ్యాతయశుఁడు ప్రజలు। లేనియధముఁడు సతతసంతానయుతుఁ
డు। మూర్ఖచిత్తుండు విజ్ఞానబోధమతియు। నగుచు నతికెక్కు-దురు మహాత్మ మఱియు* (వ॥ ఈలోకంబునం బురుషులకు స్వ
స్త్యయనంబు నమంగళనివారణంబు ధన్యప్రదంబు యశస్కరంబు నాయుష్కరంబు స్వర్గదాయకంబుఁ గలిమలాపహంబు
నైన యీ పుణ్యచరిత్రంబు చతుర్విధ పురుషార్థకాములైనవారికిఁ జతుర్విధపురుషార్థకారణం బగుం గావున వినందగు రాజు
సంగ్రామాభిముఖుండై యీచరిత్రంబు విని సంధించి విరోధి నెదిర్చిన నవ్విరోధి పృథునకుం బోలెఁ గప్పంబు లిచ్చు ముక్తావ్య
సంగుండు భగవద్భక్తుండు నైనవాఁడు పుణ్యంబు వైన్యమాహాత్మ్యసూచకంబునైన యీచరిత్రంబు వినుచుఁ బఠియింపుచుం
గృతమతియై దినదినంబు నాదరంబునం బ్రకటంబు సేయువాఁడు భవసింధుపోతపాదుండైన సర్వేశ్వరునియందు నచల
నంబైన భక్తి గలిగి పృథుచక్రవర్తి వొందిన విష్ణుపదంబుఁ బొందు ననియు పుణ్యచరిత్రంబు మైత్రేయుండు విదురున కెఱింగించి
వెండియు నిట్లనియె* (క॥ పృథునకు నర్చికిఁ బుట్టిన। పృథుకీర్తి ధనుండు ఘనుఁడు పృథుతుల్యుండై। పృథుశౌర్యధైర్యధుర్యుఁడు। పృ
థివి విజితాశ్వుఁ డొప్పెఁ బృథివీపతియై* (క॥ వినునంతర్ధానగతిం। దనరి శునాసీరువలన దగ విజితాశ్వుం। డును మఱియంత
ర్ధానుం। డను పేరఁ బ్రసిద్ధుఁ డయ్యె నతిచతురుండై* (సీ॥ స్థిరమతి రాజ్యాభిషిక్తుఁడై యమ్మేటి సమమతి నయ్యనుజన్ములైన। హ
ర్యశ్వునకు సమాదరమునఁ దూర్పు దక్షిణదిశఁ దగ ధూమ్రకేశునకును। బరఁగంగ వృకునకుఁ బశ్చిమభాగంబు ద్రవిణునకర్థి ను
త్తరపుదిశను। గొమరొప్ప నలువురకును బంచియిచ్చి స్వకాంతమైనట్టి శిఖండి వలన। మనుజయోనిని జనియింపుఁడనుచు మున్ను।
బలికినట్టి వసిష్ఠు శాపమునఁ జేసి। పూని త్రేతాగ్నులతనికిఁ బుత్రులగుచు। జననమొందిరి సజ్జనస్తవ్యచరిత* (వ॥ వారలు పా
వకుండు పవమానుండు శుచియను నామంబుల మనుష్యయోనిం బుట్టియు నాత్మప్రభావంబునం గ్రమ్మఱ నగ్నులై చనిరి తద
నంతరంబ* (క॥ అతఁడు నభస్వతియసయెడి। ద్వితీయపత్నివలన హవిర్ధానుఁడను నా। సుతుఁ గని విజితాశ్వుండా, నతవిమతుఁ
డు రాజ్యవర్తనముఁ దలపోయఁగ* (క॥ విమలాత్మ కరాదానము। దమశుల్కాదికము రగము దారుణమని ధై। ర్యమునం దీర్ఘమ
ఖవ్యాజమునం దద్వర్తనంబు సమమతి విడిచెన్॥ ఇట్లు విడిచి* (క॥ అతఁ డాత్మదర్శనుండయి। చతురతఁ బరమాత్మ హంస సర్వే
శ్వరుఁ దాత్మ క్రతువున యజించి విమలా। చ్ఛతయోగసమాధిముక్తిఁ బొందె మహాత్మా* (వ॥ అంత విజితాశ్వుండు పరలోక
గతుండయిన హవిర్ధానుండు హవిర్ధాని యను భార్యవలన బర్హిష్మంతుండు గయుండు శుక్లుండు కృష్ణుండు సత్యుండు జితవ్రతుండు
నను పుత్రుల నార్వురం గాంచె నందు బర్హిష్మంతుండు* (సీ॥ సంతతసవనదీక్షాశాలియగుచు ధరాతలంబెల్లను గ్రతువుల
కును విలసిల్లు యజ్ఞశాలలు వేలు వేలుఁ గల్పించి యజ్ఞములు గావించుచుండఁ। జిరకీర్తి యతఁడు ప్రాచీనాగ్రకుశలచే క్షితితలం
బెల్లనాస్తృతము సేయు। వసుధయెల్లను యజ్ఞవాటమై విలసిల్ల సత్క్రియాకాండనిష్ణాతుఁడగుచు। సుభగయోగసమాధిని
ష్ఠుఁడు ప్రజాపతియగుచు నని తన్ను జనము నుతింప వెలయు। నట్టిఘనుఁడు హవిర్ధాని యఖిలజగతిఁ। బరపఁ గుశలను బ్రాచీనబర్హి
యయ్యెఁ। మఱియు నతండు* (చ॥ అలవడ నే సతీమణి సమంచితలీల వివాహవేళను। త్కలికఁ బ్రదక్షిణంబు లిడఁ గాఁగని హవ్య
వహుండు వొల్లియ। మ్ముల శుకిఁ జూచి మోహమునుఁ బొందిన రీతి విమోహి యయ్యె నా। లలితవినూత్నభూషణయలంకృత
చారుశుభాంగి వెండియున్* (చ॥ సురుచిరభంగి నాసతి కిశోరవయఃపరిపాకమైరగణ। ద్వరమణి హేమనూపురరవంబు చెలం
గ వివాహవేళఁ దా। గరమున వోథమై పరగఁ గాంచి నిర్జరులైరి దేవకి। న్నరవరసిద్ధసాధ్యముని నాగనభశ్చరముఖ్యులందఁ
ఱున్* (వ॥ అట్టి సౌందర్యఖనియు సముద్రపుత్రియు నైన శతధృతియను కన్యం బ్రహ్మోదేశంబునం బాణిగ్రహణంబు సేసె నా శ
తధృతివలనం బ్రాచీనబర్హికిఁ బదుగురు కొడుకులు జనియించిరి వారలు తుల్యనామవ్రతులగుచు ధర్మపారగులునైన ప్రచేత
సులు ప్రజాసర్గంబునందుఁ దండ్రిచే నాజ్ఞాపితులగుచుఁ దపంబుఁ గావింప వనంబునకుం జను సమయంబునం దమ్మార్గంబునం బ్రస
న్నుండగుచు దృశ్యమానుండయిన శ్రీరుద్రునిచేత నేదియుపదేశింపంబడె దానిజపధ్యానపూజానియమంబుల సేవింపుచుఁ ద
పస్పతియైన నారాయణుం బదివేల సంవత్సరంబులు పూజించిరని చెప్పిన విని విదురుండు మైత్రేయునకిట్లనియె* (సీ॥ తాపసోత్త

—*రుద్రుండు ప్రచేతసులకు యోగాదేశమను స్తోత్రము తెలియఁ జేయుట.*—

మ ప్రచేతసులకు పావనమార్గంబు నందు నాభర్గుతోడ। సంగమెట్లయ్యెఁ బ్రసన్నుఁడై హరుఁ డెద్ది తివుట వారలకుపదేశమిచ్చె।
జీవవ్రజమునకా శివుతోడి సంగంబు గడుదుర్లభంబీ జగంబునందుఁ। జర్చింపనమ్మేటి సన్మునీంద్రులకును సంచితధ్యానగోచ

పోత-ఓడ — శునాసీరు-ఇంద్రుడు — సవన-యాగము — కాండము-గుంపు — అలవడఁ-ఒప్పనట్లు — ఉత్కలిక;తహతహపడుట

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



రుఁడుగాని పుడమిఁ బ్రత్యక్షముగాఁ గానఁబడఁడు మఱియు । నంది తాత్మసదారాముఁడఖిలలోక। గతుఁడుఁడు పరముఁడు విరూపాక్షుఁడాత్మ। శక్తితోఁ గూడిజగతిపై సంచరించు* (క॥ కావున భగవంతుండును। దేవాధీశుండునైన దేవుని సంగంబే వెరవు నఘటియించెనో। యావిధమంతయును దెలియ నానతియీవే* (క॥ అనవుడు విదురునకమ్ముని । జననాయకుఁడని యొనట్టిసాధుమనీషం। దనకుఁ బ్రచేతసులునునిజ । జనకుని సద్భావములు సమ్మతితోడన్* (క॥ శిరమునవహించి ప్రాగ్దిశ । కరిగెడిసమయమున నెదుట నంబుధికం బెం। బరపఁగు నొక సరసి మనో। హరనిర్మలసలిలపూర్ణమై యెదుటఁ దమఱియున్* (సీ॥ రక్తోత్పలేందీవర ప్రఫుల్లాంభోజకమనీయకల్హారకలితమగుచుఁ। గంజాతకింజల్క పుంజపిశంగక మందగంధానిలానందమగుచు। రమణీయహంససారసచక్రవాక కారండవాసనదాభిరామ మగుచు । వరమత్తమధుపసుస్వర మోదపల్లవాంకురితలతాతరుభరితమగుచు। సిద్ధచారణగంధర్వసేవ్యమగుచుఁ। బుణ్యములకాలయంబయి పొలుపు మిగిలి। లలితమై దూడనొప్పఁగరమ్యమగుచు । దివ్యశుచిలఘుమధురాంబుభవ్యమగుచు* (గీ॥ సజ్జనుని హృదయముఁ బోలి స్వచ్ఛమగుచు। హరిపదాకృతదివిజవిహారమగుచు। ఘనునిసిరిభంగినర్హ జీవనమునగుచు । మానవతివృత్తిగతినిమగ్నంబునగుచు* (గీ॥ శశికరంబులఁ బోలి విశదములగుచు । హరికథలఁ బోలి కల్మషహరములగుచు। వహ్నులనుఁ బోలిభువనపావనములగుచుఁ। బొగడఁదగునీరముల చేఁ బరిపూర్ణమగుచు* (వ॥ ఒప్పునట్టిసరోవరంబుఁ బొడగని యందు నొక్క దివ్యపురుషునింగనిరియతండు* (మ॥ సమదశ్రీకమృదంగవేణుముఖభాస్వన్నాదమై దివ్యమా। ర్గము నోరంజకమైతనర్పు విలసద్గాంధర్వగానంబు నే । య్యముసంధిల్లఁగ వించుఁ దమ్మహిమకత్యాశ్చర్యమునొంది వే। గము నాదత్కమలాకరంబు వెడలె న్గాతూహలోల్లాసిమై॥ ఇట్లు వెడలివచ్చిన* (మ॥ కనిరా తాపసపుంగవుల్దివిజలోకశ్రేష్ఠునిందప్తకాం । చనవర్ణున్ సనకాదియోగిజనభాస్వద్ధ్యేయమానుం బ్రదిల్లో । చనుభక్తానుగుణానుగున్ సుమహితైశ్వర్యున్ ద్రిసాదాభిశో। భనవక్త్రున్మహతాఘకర్తృజనసంపద్భద్రుని ర్రుద్రుని న్* (క॥ కనివారలుదమమనముల। ననురాగమునద్భుతంబుననయము వొడము। న్వినయము దోఁపఁగఁ దత్పద। వనజములకు మ్రొక్కి భక్తివశగతులగుచున్* (వ॥ భగవంతుండు నఖిలధర్మజ్ఞుండు కృపాళుండు దర్శనంబున నఖిలపాపహరుండు భక్తవత్సలుండునైన హరుండు ప్రీతుండగుచుం బ్రసన్నాంతఃకరణులు ధర్మజ్ఞులు శీలసంపన్నులు సంప్రీతులునైన వారలకిట్లనియె* (సీ॥ వినుఁడు నృపాలనందనులార మీమదిఁ గలతలంపెల్లను గానవచ్చె। మీకు భద్రంబగు మీయెడ నేననుగ్రహబుద్ధి చేసితిఁ గానఁబడితిఁ। గైకొనియిపుడుసూక్ష్మము త్రిగుణాత్మకమునగు నా ప్రకృతికంటెనుధరణిసీఁ। బరఁగుజీవునికంటెఁ బరుడైన వాసుదేవుని చరణాబ్జముల్దనరుభక్తి। నర్థినెవ్వరుభజియింతురట్టివారు । నాకుఁ బ్రియతముల్వారికినయచరిత్రు। లార యేనుఁ బ్రియుండనై భూరిమహిమ। వెలయుచుండుమనది గాక వినుఁడుమీరు* (వ॥ స్వధర్మనిరతుండయిన పురుషుండనేకజన్మాంతరసుకృతవిశేషంబులం జతుర్ముఖత్వంబునొంది తదనంతరంబునం బుణ్యాతిరేకంబున నన్నుం బొంది యధికారాంతంబున నేను దేవతాగణంబులు నవ్యాకృతంబైన యేహరిపదంబును బొందుదుమట్టిపదంబు భాగవతుండు దనంతనె పొందుం గావున మీరు భాగవతత్వంబు నొందుటం జేసి నాకుం బ్రియులైయుండుదురు భాగవతజనంబులకు నాకంటె నధికప్రియుండు లేఁడు గాన వివిక్తంబు జప్యంబు పవిత్రంబు మంగళంబు నిశ్శ్రేయసకరంబునైన నా వచనంబు నాకర్ణింపుఁడు సర్గాదిని బ్రహ్మ నిజనందనుల కెఱింగించిన శ్రీహరిస్తోత్రంబు మీకు నెఱింగింతు వినుం డదియెట్టిదనిన* (క॥ వనజాసనుఁడాత్మజులగు। సనకాదులఁ జూచిపలికెసమ్మతితోడ। న్వినుఁడు కుమారకులారా। వనజోదరు మంగళస్తవంబెఱింగింతున్* (వ॥ అనివారలతో నిట్లనియె నోయీశా యాత్మవేదులైన వారలకు భవదీయోత్కర్షంబు స్వానంద లాభకరంబుగావున నట్టి స్వానందలాభంబు మాకుం గలుగవలయు నీవు పరిపూర్ణానందస్వరూపుండ విట్టి సర్వాత్మకుండవైన నీకు మనస్కరింతునని వెండియు నిట్లనియె* (సీ॥ పంకజనాభాయ సంకర్షణాయ శాంతాయ విశ్వప్రబోధాయ భూతసూక్ష్మేంద్రియాత్మనే సూక్ష్మాయ వాసుదేవాయ పూర్ణాయ పుణ్యాయ నిర్వి । కారాయ కర్మవిస్తారకాయ త్రయీపాలాయతై త్రిలోక్యపాలకాయ। సోమరూపాయ తేజోబలాఢ్యాయ స్వయంజ్యోతిషే దురంతాయ కర్మ। సాధనాయ పురాపురుషాయ యజ్ఞ। రేతసే జీవతృప్తాయ పృథ్వీరూప । కాయ లోకాయ నభసేంతకాయ విశ్వ । యోనయే విష్ణవే జిష్ణవే నమోస్తు* (సీ॥ స్వర్గాపవర్గసుద్వారాయ సర్వరసాత్మనే పరమహంసాయ ధర్మ । పాలాయ సద్గతఫలరూపకాయ కృష్ణాయ ధర్మాత్మనే నర్వశక్తి । యుక్తాయ ఘనసాంఖ్యయోగీశ్వరాయ హిరణ్యవీర్యాయ రుద్రాయ శిష్ట । నాథాయ దుష్టవినాశాయ శూన్యప్రవృత్తాయ కర్మణే మృత్యవే వి। రాట్ఛరీరాయ నఖిలధరాయ వాగ్వి । భూతయే నివృత్తాయ సత్పుణ్యభూరి। వర్చసేఖిలధర్మదే

సంకర్షణః-శత్రూన్ ప్రళయేజనాన్వా సంకర్షతి సంహరతీతి-శత్రువులను ప్రళయమందు సర్వజనులను సంహరించువాఁడని యర్థము.
సోమ-ఉమయాసహవర్తతఇతి సోమః-అనఁగా నీశ్వరుఁడు—వేధ-విధతి సృజతీతి వేధాః - సృజించువాఁడు-అనఁగా బ్రహ్మ-విధవిధానే అని ధాతువు—ప్రద్యుమ్నుండవు-ప్రకృష్టమైనబలముగలవాఁడవు—ద్విజ-దంతములు—ధ్యేయ ధ్యానముచేయఁదగినది.

వాయచాత్మ। నేనిరుద్ధాయనిభృతాత్మ నేనమోస్తు* (గీ॥ సర్వసత్వాయదేవాయసన్నియామ। కాయబహిరంతరాత్మనే
కారణాత్మ। నేసమస్తార్థలింగాయనిర్గుణాయ। వేధసేజితాత్మకసాధవేనమోస్తు* (వ॥ అనిమతియుఁ బ్రహ్మమ్మనుండవునంత
రాత్మవు సమస్తాశేష కారణుండవు చాతుర్హోత్రరూపుండవు నంతకుండవు సర్వజ్ఞుండవుజ్ఞానక్రియారూపుండవు నతఃకరణ
వాసివినైననీకునమస్కరింతునని* (క॥ అనఘా దేవభవత్పద। వనరుహసందర్శనేచ్ఛవఱలినమాకుఁ।విను వైష్ణవసత్కృత
మై।యొనరుభవద్దర్శనంబునీ వెనహాత్మా॥అదియెట్టిదనిన* (క॥ అనఘసకలేంద్రియగుణాం। జనముసుభక్తప్రియంబుజలద
శ్యామంబును సౌందర్యసమగ్రము।ననుపమమునుఖిలమంగళావహమగుచుఁ॥మఱియును* (సీ॥ అళికులోపమలసదలక
శోభితమగునమృతాంశు రేఖానిభాననమును। సమకర్ణదివ్యభూషాప్రభాకలితంబుసుందరభ్రూవిభాసమురుచిరంబు। సలలిత
కుందకుట్మలసన్నిభద్విజపూరితస్నిగ్ధకపోలయుగము। పద్మపలాశశోభనలోచనంబును మందస్మితాపాంగసుందరమును। స
స్మితాలోకసతతప్రసన్నముఖము। కంబుసుందరరుచిరమంగళగళంబు। హారమణికుండలప్రభాపూరకలిత। చారుమృగరా
జసన్నిభస్కంధయుతము* (వ॥ వెండియుశంఖచక్రగదాపద్మకలితాయత బాహుచతుష్టయంబువై జయంతీవనమాలికా
కౌస్తుభమణిశ్రీవిరాజితంబు నిత్యానపాయినియైన యిందిరాసుందరీ రత్నపరిస్పందంబునందనరి తిరస్కృతనికషోపలవక్ష
స్స్థలంబు నుశ్వాసనిశ్వాసంబులంజంచలంబులయిన వళిత్రయగుచిరప్రకాశమానదళోదరంబు ప్రూర్వ్యవిసర్గతనిఖిలవిశ్వం
బునుప్రవిష్టంబుసేయురీతినొందు నలిలావర్తసన్నిభగంభీరనాభివివరంబు పంకజకింజల్క విభాసిత దుకూలసిబద్ధకనకమేఖ
లాకలాపశోభితశ్యామపృథునితంబబింబంబు నీలకదళీస్తంభరుచిరోరుయుగళంబు సమచారుజంఘంబుసమ్నజానుయుగళం
బుపద్మపత్రభాసురపాదద్వయంబుమదీయాంతరంగతమోనివారకనిర్మలచంద్రసకలసన్నిభనఖంబుఁగిరీటకుండలగ్రైవే
యహారకేయూరవలయ ముద్రికామణినూపురాది వివిధభూషణభూషితంబునిరస్తసమస్తనతజనసాధ్వసంబు భక్తజనమ
నోహరంబు సర్వమంగళాకరంబునైన భగవద్దివ్యరూపంబుఁదామసజన సన్మార్గప్రదర్శకుండవైననీవుమాకుంజూపి మ
మ్ముఁగృతార్థులఁజేయుమని వెండియునిట్లనియె* (సీ॥ ఆత్మకుఁబరిశుద్ధినర్థించువారికిధ్యేయవస్తువుభవద్దివ్యమూర్తి।యంచిత
స్వర్గరాజ్యాభిషిక్తునకైనసమధికస్పృహణీయతముఁడవీవు। సద్భక్తియుతభక్తజనములభుండవుదుష్టాత్ములకుఁగడుదుర్ల
భుండ। వాత్మదర్శనులకునరయఁగమ్యుండవునైయర్థివిలసిల్లుదనఘచరిత। యిట్టినిఖిలదురారాధ్యయీశదేవ। నెఱయసుజ
నులకైనవర్ణింపరాదు। వఱలనెవ్వఁడుపూజించువాఁడువిడువఁ।జాలు నేపద్మదళనేత్రసచ్చరిత్ర*(చ॥ ఎనసినభక్తియోగ
మున నేభవదీయపదాబ్జమొందఁగా। ననయముఁగోరువాఁడుచటులాగ్రహభీషణవీర్యశౌర్యత। ర్జనములచేననూనగతిసర్వ
జగంబులుసంహరించున। య్యనుపముఁడైనకాలునిభయంబునుబొందడుసుమ్ముకావునన్* (గీ॥ ఇట్టిమీపాదమూలంబులె
వ్వఁడేని। బొందిధన్యాత్ముఁడౌనట్టిపుణ్యుఁడొందు। మనములోపలగోరునేమఱదిరైన।నవ్యయానందగోవిందహరిముకుం
ద*(క॥హరిమీభక్తజనులతో।నిరుపమగతిఁజేయుసఖ్యనిమిషార్థముతో।సరిగాదుమోక్షమనినన।దిరశుభమనుమర్త్యసుఖ
ముఁజెప్పఁగనేలా* (క॥దురితవినాశకపదపం।కరుహభవత్కీర్తితీర్థకణచయబాహ్యాం।తరసేకధూతకల్మష।పురుషులుధర
మీఁదఁదీర్ఘభూతులుగారే*(వ॥అట్టిభూతదయాసమేతులురాగాదివిరహితచిత్తులునార్జవాదిగణయుక్తులునగుభాగవత
జనులసంగంబుమాకుఁగలుగఁజేయు మిదియమమ్మనుగ్రహించుటయని వెండియునిట్లనియె* (చ॥ సరసిజనాభసత్పురుష
సంగసముంచితభక్తియోగవి। స్ఫురణననుగ్రహింపఁబడిశుద్ధమునొందినవానిచిత్తము। స్థిరబహిరంగమంగనదు చెందదు
భూరితమస్స్వరూపసం।సరసగుహాజిరంబుగనఁజాలుభవన్మహనీయతత్వముఁ॥అదియెట్టిదనిన* (సీ॥అరయంగనేమిటి
యందునీవిశ్వంబువిదితమైయుండునీవిశ్వమందు। నేదిప్రకాశించునెప్పుడునిట్టివ్యోయంజ్యోతినిత్యంబునవ్యయంబు। నాకా
శమునుఁబోలియవిరళవ్యాపకమగునాత్మతత్వంబునధికమహిమఁ। దనరుపరబ్రహ్మమగునదిపలికి యిట్లనియెనవి క్రియండై
నవాఁడు। నెవ్వఁడాతఁడుదనయందునెపుడునాత్మ। కార్యకరణసమర్థంబుగానిభేద। బుద్ధిజనకంబునాఁదగుభూరిమాయఁ।
జేసివిశ్వంబుసత్యంబుగాసృజించె* (గీ॥మఱలమఱలఁబెక్కుమాఱులీవిశ్వంబు।జననవృద్ధివిలయసంగతులు। నందఁజేయు
చుండునట్టియీశ్వరుఁడవై।తనరునిన్నునాత్మతత్వముగను* (వ॥ తెలియుదుమని వెండియునిట్లనియె యోగవరాయణులగు
వారుశ్రద్ధాసమన్వితులై క్రియాకలాపంబుల నంతఃకరణోపలక్షితంబయిన భవదీయరూపంబుయజింతురువారు వేదాగమ
తత్వజ్ఞానులునీవాద్యుండవునవాదియానద్వితీయుండవుమాయాశక్తియుక్తుండవునై విలసిల్లుచుందుమవట్టి మాయాశక్తిచే
త* (సీ॥ చతురాత్మసత్వరజస్తమోగుణములువరుసజనించెనువానివలన। మహదహంకారతన్మాత్రనభోమరుదనలజలావ
నిమునిసువర్వ।భూతగణాత్మకస్ఫురణనీవిశ్వంబుభిన్నరూపమునసముత్పన్నమయ్యె। దేవయీగతిభవదీయమాయనుజేసికూ
ఢఁజతుర్విధరూపమైన। పురమునాత్మాంశమునఁజెందుపురుషుఁడింద్రియములచేవిషయసుఖములనుభవించు। మహినిమఘ

మక్షికాకృతమధువుఁబోలి। యతఁడుబురవర్తియగుజీవుఁడంద్రుమజియు* (వ॥ ఇట్టిజగత్సర్జకుండవైననీవు*(క॥ భూతగణంబులచేతనే। భూతగణంబులను మేఘపుంజంబులని। ర్ధూతముగఁజేయుననిలుని। భాతిఁజరియింపఁజేసి పౌరుషమొప్పన్* (గీ॥ విరూఢిఁదత్రితే- త్రియాలబ్ధరూపుఁడవును। సుమహితస్ఫురదమితతేజుఁడవుచండ। వేగుడవునయిఘనభుజావిపులమహిమ। విశ్వసంహారమార్గఁగావింతువీశ॥ అదియెట్లనిన* (క॥ ఇతికర్తవ్యవిచారక। మతిచేఁడగనెప్పుడుంబ్రమత్తంబునసం। చితవిషయలాలసమునా। గ్రితలోభమునైనయట్టిసృష్టిగడంకన్* (గీ॥ అప్రమత్తుఁడవగుచుఁబద్మాక్షనీవు। క్రమించుదువుచాలనాఁకటఁ ద్రెుగ్గుచుఁడి। నాలుకలుచాఁచుభూరిపన్నగమువాఁతఁ। బడినయెలుకనుభక్షించుపగిదినను* (చ॥ అనిశమునస్మదీయగురుఁడైనసరోరుహసంభవుండునర్మనువులునాత్మసంశయముమానిభజించుభవత్పదాబ్జముల్। వనమునివిల్పియుత్పదవమనమహావ్యథజెందునట్టిసం। జ్జనుఁడుపరిత్యజించునెభుజంగమతల్పకభక్తకల్పకా* (క॥ కావుననాథనుమూరిజ। నావళికినిసర్వసంశయంబులువాపం। గావనుబ్రోవనుదరుగతి। నీవనివినుతించినట్టియీస్తవమెలమిన్* (వ॥ రుద్రుండుప్రచేతసులకెఱింగించి వెండియునిట్లనియెఁబ్రచేతసులారా యిట్టియోగాదేశనామకంబైన యీస్తోత్రంబు బహువారావృత్తిఁజేఁబఠించి మనంబునధరించియుండి సమాహితచిత్తులై మీరందఱు నాదరంబునవిశ్వాసయుక్తులు స్వధర్మాచారవంతులుభగవదర్పితాశయులునై జపియించుచు సర్వభూతావస్థితుండు నాత్మారాముండునైనసర్వేశ్వరుని నుతింపుచుధ్యానంబుసేయుచుఁ బూజింపుఁడు తొల్లియీస్తోత్రంబు భగవంతుండైనపద్మసంభవుండు సిసృక్షువగుచు నాత్మజులమైనమాకును సృజియింపనిచ్ఛగించుభృగ్వాదులకు నెఱింగించె నేమునాభృగ్వాదులును బ్రజాసర్గంబునందు బ్రహ్మచోదితులమై యీస్తోత్రంబునంజేసివిధ్వస్తసమస్తతమోగుణులమై వివిధప్రజాసర్గంబుగావించితిమిగావున నీస్తోత్రంబునెల్లప్పుడు నేకాగ్రచిత్తుండు వాసుదేవపరాయణుండునై యెవ్వఁడుజపియించువాఁడు వేగంబెశ్రేయస్సునుబొందు తదీయజ్ఞానప్లవంబునవ్యసనార్ణవరూపంబైన సంసారంబును సుఖతరంబునందరియించునిట్టిమదుపదిష్టంబయిన శ్రీహరిస్తవంబు నెవ్వండుచదువుచుమరారాధ్యుండైన శ్రీహరిం బూజించువాఁడుమదుక్తస్తోత్రగానసంతుష్టుండుశ్రేయస్సులకునేకాశ్రయభూతుండునగుశ్రీమన్నారాయణునివలనసమస్తాభీష్టంబులంబొందునెవ్వఁడుప్రభాతంబునలేచిప్రాంజలియుశ్రద్ధాసమన్వితుండునై యీమంగళస్తవరాజంబునువినినవినిపించినవాఁడుకర్మబంధవిముక్తుండగుననిమఱియునిట్లనియె* (క॥ నరదేవతనయులారా। పురుషాధీశుండుపరమపురుషుఁడునగునీశ్వరునస్తోత్రముమీకా। దరమునఁదెలిపితిఁసిమీరుదద్దయుభక్తిన్* (క॥ ఏకాగ్రచిత్తులునునుశ్లోకులునైజపమునేయుచునుఘనతపముంగైకొనిచేసినమీకును। జేకురుమహితేప్సితార్థసిద్ధిగడంకన్* (క॥ అనియీగతినుపదేశం। బొనరించిసదాశివుండునొగివారలచే। తనుబూజితుఁడైవారలు। గననంతర్ధానుఁడయ్యెఁగౌతుకమొప్పన్॥ అంత* (గీ॥ తివుటవారలురుద్రోపదిష్టమైనయచ్యుతస్తవముజపించుచయుతసంఖ్య। వత్సరములుగ్రతపముదుర్వారవారి। మధ్యమునఁజేయుచున్నసమయమునందు*

—* నారదుండుప్రాచీనబర్హికిజ్ఞానమార్గమునదెలియఁజేయుట. *—

(వ॥ అంతంగర్మాసక్తచిత్తుండైయున్న ప్రాచీనబర్హికడకు నధ్యాత్మవేదియుం గృపాళువునైననారదుండు చనుదెంచియారాజునకుజ్ఞానబోధంబు సేయుకొఱకతనికిట్లనియె రాజాయీకర్మంబునంజేసి యెట్టిశ్రేయస్సు నభిలషించుచున్నవాఁడవరిష్టనిరసనాభీష్టప్రాప్తికరంబునైన శ్రేయంబీకర్మంబువలనలభింపదనినంబ్రాచీనబర్హినారదమునకిట్లనియె* (సీ॥ అనఘమునీంద్రమహాభాగయేనుగర్మాపహతజ్ఞానినగుచుమోక్షము। మెఱుఁగంగలేనైతినిట్టినాకిప్పుడుగడువిమలంబునుగర్మబంధ। నాశకంబైనవిజ్ఞానోపదేశంబుగావింపుమఱదయాకారమూట। ధర్మంబులగుగేహతతులందుఁజెందిజాయాతపూజాతధనాదికములుభూరిపురుషార్థములుగాఁగబుద్ధిఁదలఁచు। మతివిహీనుండుసంసారమార్గములను। దగఁబరిభ్రామ్యమాణుఁడైయొగినిమోక్షపదమునొందఁగఁజాలఁడుభవ్యచరిత* (క॥ అనవుడునతనికినతఁడను। ననఘాయీయధ్వరంబులందునుగృపమాలినసీచేవిశసింపంజనిమాలినపశులవేలసంఖ్యలఁగనుమా* (వ॥ కావునంబశువ్రాతంబులుత్వదీయవైశసంబునుస్మరింపుచున్నవియగుచు లోహయంత్రమయశృంగంబులచేత నెన్నఁడునీవుపరలోకంబు నొందెదవపుడు నినుహింసింతుమని భవదీయమృతికినెదురుచూచుచున్నవిట్టి సంకటంబునొందంగలనీకునిస్తారకంబయిన యొక్కయితిహాసంబుగలదెఱింగింతునని యిట్లనియె*

** పురంజనోపాఖ్యానము, **

(సీ॥ భూమీశవినుమయ్యపూర్వకాలమునఁబురంజనుఁడనునొకరాజుగలఁడు। నతనికివిజ్ఞాతుఁడనుపేరఁదగిలివిజ్ఞాతచేష్టితుఁడగుసఖుఁడుగలఁడు। ఆపురంజనుఁడుపురాన్వేషియైధరాచక్రంబుగలయంగసంచరించి। తనకనురూపమైపెనుపొందుపురమెందువీక్షింపఁజాలకవిమనుఁడగుచు। నేపురములుర్విఁబొడగనెనాపురములు। కామములఁగోరుతనకునకా-

ఆర్జవము-త్రికరణములుసన్మార్గప్రవర్తకములగుట—సిసృక్షువగుచు-సృష్టింపనిచ్ఛగలవాఁడయి—ప్లవ-ఓడ,

మములను।బొందుటకు వానిని నవర్హములుగాదనుము । నమునందలంచియు కానొకనాడతండు* (వ॥ చనుచున్నసమయం బునహిమవత్పర్వతదక్షిణసానువులందు* (సీ॥ వరనవద్వారకవాటగవాక్షతోరణదేహళీగోపురములనొప్పి । ప్రాకార యంత్రగవ్యప్రణాళీపరిఘాట్టాలకోపవనాళిందనరి । సౌవర్ణరౌప్యాయసఘనశృంగంబుల రమణీయవివిధగేహముల మించి।రథ్యాసభాచత్వరధ్వజక్రీడాయతనముచైత్యాపణతతిందనర్చి । మరకతస్ఫటికవైడూర్యమణిసమాత్న । మౌక్తికాయుతఖచితహర్మ్యములుగలిగి।విద్రుమద్రుమవేదుల వెలయనొకట ।పురముగనెభోగవతికెనబోలు దాని* (వ॥ ఇట్లుగనుంగొని యనంతరంబమ్మండటంబు రబాహ్యోపవనంబున దివ్యద్రుమలతాకుంజపుంజంబులు సమదనదద్విహంగమమత్తమధుకరకులకోలాహలసంకులజలాశయశోభితంబు హిమనిర్ఘ్రబింబు సందోహపరిస్పందకందళిత మందమలయమారుతదుచ్ఛతప్రవాళవిటపనళినీతటంబు పాంథజనమనంబులకు నాహ్వానబుద్ధిజనకకలహంసరాజకీరకోకిలాలాపవిరాజమానంబు మునిప్రతనానావిధవనమృగవ్రాతబాధారహితంబునైన పురబాహ్యోద్యానవనంబునందు యాదృచ్ఛికంబుననేకైకశతనాయకులైనయనుచరదశకంబుపంచమస్తకసర్పప్రతీహారుండుదోడరాజను దెంచుచున్న భర్త్రన్వేషిణియుం గామరూపిణియు నవోఢయునైనయట్టి* (సీ॥ ఘనసమపిన్యస్తకర్ణకుండలరుచుల్గండభాగంబులనిండిపర్వ । దమ్మిరేకులసిరిదటముటింపగజాలు మెరుగుకన్నులుడలదిరిగిరాగ । జఘనసంకలితపిశంగనీవిద్యుతికనకకాంచీరుచిగరముజెనుప । జరణసరోజభామరచలన్నూపురఝణఝణధ్వనినర్మసరణిజూప । లలితయౌవనలక్ష్మీవిలాసభాసు । రోదయవ్యంజితప్రభాయుక్తపీన।సమున్నతోరకుచకుట్మలములవ్రీడ।జెందిపయ్యెదగప్పుబాలేందుముఖని* (వ॥ మఱియును బాలయుసుదతియు గజగామినియునైనయొకట ప్రమదోత్తమంగాంచి* (క॥ అరుదుగ బ్రియమగ్గలమై।మరువిండ్లంబోలుకన్బొమలుగలతరుణి। స్మరసాహంగవిలోకన।శరపరివిద్ధాంగుడగుచుజనవిభుడనియెన్* (క॥ఎవ్వరిదానవుజనకుం।డెవ్వడుపేరేమిభృత్యులీపదియొకరిం।దెవ్వరుసఖులెవ్వరుమఱి।యివ్వనమున నుండగార్యమెద్దిమృగాక్షీ* (క॥భవదీయపురస్సరుడగు। పవనాశనుడెవ్వడతిక్రమామతినాకు।న్వివరింపుమనుచువెండియు।ధవళేక్షణజూడిధరణిధవుడిట్లనియెన్* (సీ॥ తరళాక్షిపతియగుధర్మునన్వేషింపజరియించుహ్రీయనుసతివో కాక।రుద్రునన్వేషించురుద్రాణివో కాకబ్రహ్మనువెదుకుభారతివో కాక । నారాయణునిభక్తిగోరియన్వేషించునిందిరవో కాకయెవ్వతెవీవు । త్వత్పాదకామనత్వమునను సంప్రాప్తసకలకాముండగుసరసుడెట్టి। వానివెదకెదుతరుణీభవత్కరాగ్ర । పద్మకోశంబునేడెంబబలితమయ్యె। నాకునెఱిగింపదగుదువివేకచరిత । యనిన్నృపాలుడుమఱియునిట్లనియెసతికి* (క॥కరమొప్పగనీవిటుభూ।చరవగుటనుశచివిశివవుశారదవునుసా।గరకన్యవుగాకుండుటదమణీపొడగంటిననిపదంపడిపలికెన్* (సీ॥ మొనసియదభ్రకర్మ్ముడనైననాచేతనిపుడుపాలితమైనయీపురంబు । సరసిజోదరునిభుజాపాలితోదాత్తలలితవైకుంఠమలంకరించు । నిందిరాసుందరిచందంబుననునీవలంకరింపగడంగుపంకజాక్షి । యదిగాకయీవకీనాపాంగరుచిమోహితాంతరంగుడనైనట్టినన్ను। మహితసవ్రీడభావసన్మందహాస । చారుభ్రూభ్రమభ్రూలతాప్రేరితుడుగ।దనసుభగవంతుడగునట్టిమనసిజుండు।పడతినుడుగకపీడింపదొడగెనిపుడు ॥ కావున* (చ॥ తరుణిసుతారలోచనయుతంబునుమంజుసుధాసమానభా । సురమృదువాక్యయుక్తమునుశోభితకోమలలంబమానమం। దరరుచిరాభిరామమును దారమునైనభవన్ముఖాబ్జము।న్సురుచిరలీలనెత్తినను జూడుముసిగ్గునుజెందనేటికిన్* (వ॥ అనియివ్విధంబుననధీరుండైపలుకుపురంజనుంజూచియాప్రమదోత్తమవీరమోహితమైసస్మితాననయగుచునానందంబునొందియిట్లనియె* (క॥ పురుషవర నాకువీకును। గురువునునామమునుగులముగోరియెఱుగనీ। పురమునచుండుదుగానీ। పురమును నిర్మించినట్టిపురుషునెఱుంగన్* (క॥వీరలునాసఖురీలల।నాత్మములార్యవినుతవాచెలులీవృ।ద్ధోరగమేనిద్రింపగ । ధీరతమేల్కాంచిపురముధృతింబాలించున్॥ వెండియునిట్లనియె* (సీ॥ మనుజనాయకనీవుమద్భాగ్యవశమున నిటకునేతెంచితివిపుడునీకు।మంగళంబగునీవుమహితేంద్రియగ్రామభోగ్యంబులగుకామపుంజములను।నర్థిసంపాదింతువనఘాత్మయీనవద్వారగ్రయుక్తమైతనరుపురము।నీవుగైకొనియేలునీకంటెనెందు కు నధికుడన్యుండు లేడనఘుయింక । మదుపనీతములైనకామములననుభవింపుచునుసమశతమనుష్ఠింపుమెలమి।గోరినీకంటెబ్రియులునెవ్వారునాకు।నరసిచూడంగమనుజేంద్రయదియుగాక* (వ॥ మఱియురతిజ్ఞానవిహీనుండు నకోవిదుండు నిహపరచింతాశూన్యుండుబశుప్రాయుండు త్వదన్యుండునైనవానినే నెట్లువరియింతు గృహస్థాశ్రమమందు ధర్మార్థకామమోక్ష ప్రజానందంబులు యశంబు యతివేద్యంబులుగాని రజస్తమోవిహీనపుణ్యలోకంబులునుగలుగు పితృదేవర్షిమర్త్యభూతగణంబులకుందనకు నీలోకంబునగృహస్థాశ్రమంబు సర్వక్షేమాహారంబయినయాశ్రమంబంద్రుకావునవదాన్యుండవు విఖ్యాతుండవుప్రియదర్శనుండవు స్వయంప్రాప్తుండవునయి భోగిభోగసదృశభుజాదండంబులచేతనొప్పుభవాదృశుందగిలిమాదృశయగుకన్యవరియించకుండునే యని వెండియు* (క॥కరుణారసపరిపూర్ణ।స్ఫురిత

సుదతి-మంచిదంతములుగలది—వదాన్యుండవు-దాతవు—లేక, వాచాలుడవు—సమ-సంవత్సరము—లహరీ-ప్రవాహము—హ్రాదినీ-నది.

స్మితరుచివిలోకపుంజముచేతన్ । గరమర్థిఁ దినజనభయహరణుఁడవై సంచరింపు మఖిలజగములన్ * (క॥ అనియాగతిఁ బలికిన యా । వనజాక్షిఁ బురంజనుండు వరియించి ముదంబునన న్యోన్యప్రీతిన్ । దనరుచుఁ దత్పురమున సౌఖ్యధన్యుఁ డగుచున్ * (చ॥ శత సమకాలము పూర్ణనిజసద్మభూరిసమస్తసౌఖ్యసం । గమములఁ దనర్చి వందిజనగాయకసద్వినుతోపగానమో । దితమతి నొప్పి సుందరసతీజనసేవితుఁడై నృపాలకో । చితలలితస్థలంబుల వసించుచుఁ గ్రీడలు సల్పుచుండఁగన్ * (క॥ నరనాథుఁడు లోకభ యంకరగతి వర్తించు గ్రీష్మకాలము దోఁపం । దరళలహరీమనోహర । వరహ్రదినీసలిలముల మునిఁగియుఁ జెందఁగన్ * (వ॥ ఇట్లు వసించి కతిపయదినంబులగు సమయంబున * (సీ॥ అవనీశ్వరోత్తమ యప్పురంబున వాల్గువంకలు మున్న గవనులు ఘనుము । తూర్పుదిక్కునం దైదును దక్షిణోత్తరంబుల రెండు వశ్చిమంబునను రెండు । గాఁగను తొమ్మిది గవనులును పరిదిక్కున నేఁడు గ్రింది దిక్కునను రెండు । నైయుండు నా యవాని యందుఁ బృథగ్విధ విషయగత్యర్థమై వెలయు నీశ్వరుండొకఁడగ యంగఁగలండు రూఢి. దశ్పురంబుఁ బాలించు నట్టి పురంజనుండు । నాపురద్వారనవకంబునందు లోన । నర్థిఁ బ్రాగ్ద్వారపంచకమందు వరుస * (వ॥ ఖద్యోతయు నావిర్ముఖియు నను నామంబులుగల ద్వారయుగంబున ద్యుమత్సఖుండై విభ్రాజితాఖ్యజనపదంబును బొందు వెండియు నళినియు నాళినియు నను పేళ్లుగల వాకిళ్ల రెంటియందు నవధూతసఖుండై సౌరభరూపంబులయిన విషయంబులం బొందుచుఁ జేయు ముఖ్యనామకంబగు ప్రధానప్రాగ్ద్వారంబున రసజ్ఞవిపణాన్వితుండై యాపణబహూదనంబులను విషయంబులనొందుఁ బితృహూ నామకంబయిన దక్షిణద్వారంబున శ్రుతధరాన్వితుండై దక్షిణపాంచాలంబను రాష్ట్రంబునొందు దేవహూ నామకంబయిన యుత్తరపు వాకిట శ్రుతధరాన్వితుండై యుత్తరపాంచాలంబను రాష్ట్రంబు నొందు వెండియుం బడమటివాకిళ్ల రెంటియందు నాసురీ నామకంబైన వాకిట దుర్మదసమేతుండై గ్రామక నామకంబైన విషయంబును నిర్ఋతి నామకంబైన వాకిటియందు లుబ్ధకయుక్తుండై వైశసంబను విషయంబు నొందుచుండు వెండియుం బురంజనుం డప్పురంబునం బౌరజనంబులందు నిర్వాక్పేశస్కరులను నంధులు గలరు వారలచేత గమనకరణంబులను క్రియలనొందుచు నంతఃపురగతుండగుచు నప్పుడు విషూచీనసమన్వితుండై జాయాత్మజోద్భవంబయిన మోహప్రసాదహర్షంబుల నొందుచుండు నివ్విధంబున గర్మాసక్తుండు గామాత్ముఁడు మూఢుండునై బుద్ధియను మహిషిచేత వంచితుండయ్యెను కామినియు * (సీ॥ పానంబు సేసినఁ దానుఁ బానముఁ జేయుఁ గుడిచినఁ దానును గుడుచుఁ జెలియ । భక్షింపఁ దానును భక్షించు నడిచిన నడుచును నవ్విన నవ్వు నేడ్వ । నేడుచుఁ బాడినఁ బాడు విన్నను వినుఁ జూచినఁ జూచుఁ గూర్చున్న నుండు । దుఃఖింపఁ దీనుఁడై దుఃఖించు నిలిచిన నిలుచు నిద్రింపఁగ నిద్రఁబోవు । ముట్టినను ముట్టు మూర్కొన్న మూరుకొనును । బలుకఁ బలుకును బవళింపఁ బవ్వళించు । హర్షమును బొంద నాత్మను హర్షమొందు ను । నెదియుఁ జేయును దానును నదియుఁ జేయు * (వ॥ ఇవ్విధంబున రతిం దమహిషీవిప్రలబ్ధుండును వంచితస్వభావుండునై పారవశ్యంబునం జేసి యజ్ఞుండు నితరేచ్ఛావిరహితుండు నై క్రీడామృగంబు చాడ్పున ననుకరింపుచు వర్తింపుచు నాపురంబునఁ గాపురంబుండు నాపురంజనుండొకానొకదినంబున ధనుర్ధరుండై * (సీ॥ పంచాశ్వయుక్తంబు పంచబంధనము చక్రద్వితయము మయుగద్వయంబు । నాశువేగంబు నేకాక్షంబు కూబరద్వయమును త్రితయపతాకయుతము । నేకరశ్మియుతంబు నేకసారథికంబు సప్తవరూథంబు స్వర్ణభూష । మును బంచవిక్రమమును నీడ మొక్కటి ప్రకటపంచప్రహరణములు నైన । రథము కాంచనరచితవర్మము ధరించి । విలసదక్షయతూణీరకలితుఁ డగుచుఁ । గడఁకఁ దీపింప నెక్కె నేకాదశప్ర । సంఖ్యసేనాసమేతుఁడై సంభ్రమున * (వ॥ ఇవ్విధంబున నప్పురంబు వెడలి పంచప్రస్థంబను వనంబునకుం జని యందు విడువరాని మహిషిని విడిచి దృప్యగయాసక్తుండై కృప్రుండగుచు ధనుర్బాణంబులు ధరియించి సంచరించుచు నాసురవృత్తిం దగిలి ఘోరాత్ముండును నదయుండునై నిశాతసాయకంబులచేత నమ్మృగవ్రాతంబులం బరిమార్చె రాజుల వన్యమృగయావినోదంబు విహితానుష్ఠానంబుగఁ జెండ నాసురవృత్తి మెల్లమెయ్యెన నియంతివేసి సదిరాగప్రాప్తంబగుటను విహితంబు గాదు వినుము శ్రాద్ధాదులందె ప్రఖ్యాతశ్రాద్ధదివసంబులయందె రాజైనవాఁడె మేధ్యంబులయిన పశువుల నైననంబునం దెయథోపయుక్తంబుగా నేవధింపఁజనును నియమమాత్రంబు గలుగు గావున జ్ఞానమైన విద్వాంసుండాచరింపఁడుగాక యాచరించినం గర్మానుష్ఠానజనితంబైన జ్ఞానంబునం జేసి యుండంబొరయఁడట్లు గాక నియమోల్లంఘనంబునం గర్మాచరణుండగు వాఁడభిమానంబు నొందఁ గర్మబద్ధుండై గుణప్రవాహపతితుండు నప్రజ్ఞుండు నై యథోగతిం గూలు నిట్లగుటం జేసి సాధుజనులకు సర్వప్రకారంబుల నాసురవృత్తి మానందగు నని వెండియు నిట్లని యెనంతం బురంజనుండు వనంబున * (క॥ వరచిత్రపక్షసునిశిత । శరముల చే శశవరాహచమరీరురుకా । సరగవయశల్యహరిణీకరిహరివృకపుండరీకకపిఖడ్గములన్ ॥ వధియించి చెలియ * (సీ॥ వరుస మేధ్యామేధ్యవన్యమృగంబుల ఘృణజన దుస్పృహాక్రీడ సంహరించి । శ్రమయుక్తుండై వేఁటఁ జాలించి మఱలి మందిరమునకర్థి నేతెంచియుఁ దు । సముచితస్నానభోజనకృ

మృగయా-వేట — దృప్తుఁడు-గర్వించినవాఁడు.

త్యములుదీర్చి యతిపరిశ్రాంతిశయానుండగుచుఁ । బరిమళమిళితధూపవ్రాతవాసితసర్వాంగుండగుచు స్రక్చందనాది । వివిధ
భూషణచేలములెల్ల యఁదాల్చి తృప్తుండును హృష్టుండునునై యలంకృతుండయియున్నవాఁడై రతిప్ర । సంగకౌతుక
మాత్మనుదొంగలింప* (వ॥ అంతస్స్వకీయప్రాణవల్లభయగుమహిషియందుమనంబునిడిన నావరారోహయుగృహమే
ధియునైన గృహిణిం గానక విమనస్కుండై నిజాంతఃపురకామినులం గనుంగొని యిట్లనియె* (క॥ రామాజనసంఘములారా
మానవతీలలామ రామామణి సా। రామలకృపచే మెలఁగుచు, రామానుగఁగుశలమాపరామర్శింపన్* (ఉ॥ పారవివేకలార
గృహసంపదలీయెడఁబూర్వరీతిచే। నారయఁగారుచింపవు గృహస్థునకుంగృహమంచుమాతగా । వీరమణానుకూలరమణీమ
ణియైతనరారుభార్యగా। నీరుచిఁగొందమున్నఁగన నేర్పునెతగ్గృహమేధిసౌఖ్యముల్॥ అదియునుంగాక* (క॥ పొగడొందుమజనని
గానీ। తగవునవర్తించునట్టిదయితయుఁగానీ। తగనుండని గృహమునను । టగుఁజక్రవిహీనరథమునంమంటరయన్॥ కావున*
(చ॥ తలకొనినాకుఁ దానుపథంబున బ్రజ్ఞజనింపఁజేసెసం । చలకురుమర్త్యగవ్యసనసాగరమగ్నుఁడనైననన్నుని । శ్చలమ
తినుద్ధరించియనిశంబునునుత్ప్రియయైనభార్యయే। వలనుజరింపుచున్నదని వారణనాకెఱిఁగింపరేదయన్* (క॥ అనవుడుపిని
య కాంతలు। జనపతికిట్లనిరి రాజసత్తమయిదిగో। తనకొంగైననుబఱపుగ। నొనరింపక నేలఁబొరలుచున్నది వగలన్* (గీ॥ ప
మికతమున నున్నదో యెఱుఁగమేము। నీవు చూడుమటన్న నాభూవరుండు । నేలఁబడిపొరలెడుభార్యఁబోలఁజూచి । మనము
మిక్కిలికలఁగి తాపంబునుల్లడింప॥ అంత* (గీ॥ జలజనేత్రప్రణయసంజాతరోషభావంబునైన యట్టివక్రదృష్టి। జనవిభుండుచూచి
యనునయకోవిదుండగుచునప్పుడొరుహాస్తిఁజేరి* (క॥ పొలతుకఁదనయుత్సంగంబులనిడితత్పాదయుగళమునునంటుచు
మంజులమృదుభాషణములనా। లలనామణిఁజూచిపలికెలాలనమొప్పన్* (చ॥ రమణిరోభృత్యులంపునపరాధముగల్గిననా
మంజులమృదుభాషణములనా। లలనామణిఁజూచిపలికెలాలనమొప్పన్
యకుల్ స్వప । తిముందలపోసి యుగ్రతరశాసనముం దెగి చేయరల్లుగా। కమనములోనికినట్టిదమకంబున నాజ్ఞనొనర్చి రేని
నిగ్రహముగ ననుగ్రహించుటయకాకతలంపఁగ నాజ్ఞ సేయుటే* (క॥ కమలాననబాంధవకృత్యముఁదలపక రోషచిత్తుఁడగుస
టిలాత్ముఁ। సనుదావర్షుఁడు నీతి। క్రమరహితుఁడునైన బాలుఁగా నెన్నఁదగున్॥ అని వెండియునిట్లనియె మృగాక్షీహృదయేశ్వరి
వైననీవు* (మ॥ సరసోదారసుధారసోపమవచశ్చాతుర్యసౌభాగ్యమై। హరినీలోపమకోమలాలకయుతంబై విభ్రమభ్రూవిల
తా। పరిజుష్టస్మితసద్విలోకనమునై భాసిల్లుయుష్మన్ముఖాం। బురుహంబున్భవదీయదాసునకుఁబూబోణికృపంజూపవే* (క॥ పి
నుమీరపత్నినీయెడ । సనయంబునుబ్రాహ్మణులునుహరిభక్తులుద । క్కనితరులెగ్గొనరించిన। వనితాశిక్షించునెంతవారలనై
నుమీరపత్నినీయెడ । సనయంబును బ్రాహ్మణులును హరిభక్తులు ద । క్కనితరు లెగ్గొనరించిన। వనితా శిక్షించు నెంతవారలనై
నన్* (క॥ ఈముల్లోకములంజెను । నామనమున రోషమొదవినన్భయరహితుండై మదిలోఁబరితోషముతో మెలఁగెడువా
నిఁగాననదోయజనేత్రా* (సీ॥ ఇందీవరేక్షణయే నొసటభవదీయతిలకవిరహితము మలినయుతము। హర్షశూన్యంబు మనోప్ర
కాశకమునై యత్యమర్షయుతంబునై నముఖము। గళితామ్రబింబసంకలితసంచితశోభమానపీనస్తనమండలమును । రమణీ
య తాంబూలరాగవిహీనమైనట్టి సుపక్వబింబాధరంబు । గాఁగనిట్లుంటకిప్పుడేమికతము నాప । నర్థినెఱిఁగింప వేశ్యగయాత
నక్తినబలనీకెఱిఁగింపకయరిగినట్టి తప్పు సైరించి కావంగఁదగుదు నేను* (క॥ వనితాజనపరవశుఁడై। మనసిజశరబాధ్యమాన
సక్తి నబలనీకెఱిఁగింపకయరిగినట్టి తప్పుసైరించి కావంగఁదగుదు నేను
మానసుఁడగువాని। దనిఁగర్తవ్యార్థము। లనుభజియింపక తొలంగులలనలుగలరే* (వ॥ అనుచుండదీయవిభ్రమవశంగతుం
డై పలికినవిని* (క॥ కంజాతపత్రనేత్రప। రంజనుదెసరోషముడిగి రమణీయశ్రీ। మంజులమృదూక్తులమనము । రంజింపుచుఁబ
లికెసదనురాగమెలర్పన్॥ అంత* (సీ॥ అమ్మహాదేవి నెయ్యంబునమంగళస్నానమైమృదులవస్త్రములుగట్టి । సక్చందనాది
భూషణములుధరియించి మనీషమోహనాకారయగుచుఁ । బతికడనిలిచిననతఁడు సంతుష్టాంతరంగు। డైయభ్యంతరమున
నుండియన్యోన్యసరసగాఢాలింగనంబులు గాఢంబిగోప్య వాక్యములచేత । నతఁడు ప్రమదాపరిగ్రహవ్యసనమునను । గడఁక
నపకృష్టఘనవివేకమునుగలిగి। పగలు రేయను ప్రొద్దులేర్పఱుపలేక। మెనసియాయాయుర్వ్యయంబుదానెఱుఁగడయ్యె* (వ॥ మఱి
యునతండు నన్నగ్గపదంబునహానునుండు సర్వాశయాశయానుండు మహిషీభుజోపధానుండునై యజ్ఞానాభిభూతుండగు
టంజేసి స్వరూపభూతపరమపురుషార్థంబు నెఱుఁగక నిజమహిషి నేపరమపురుషార్థంబుగాఁదలంపుచు గమింపుచుంగామక
శ్మలచిత్తుఁడై నయానికినవయౌవనంబైన కాలంబుక్షణార్ధంబునుంబోలిగతంబయ్యెనంత (క॥ వశదయశోజలనిధియా। శశిము
ఖియగుభార్యవలనసమ్మతినేకా। దశశతపుత్రులరణక। ర్కశదేహులఁగాంచి కౌతుకంబునమఱియున్* (క॥ సుసుశీలాదార్య
గుణో। త్తరులను సల్లలితగుణకదంబలఁబ్రియలన్। వగులపావనలదశో । త్తరశతమహితలను గాంచెదన్సాతివలనన్* (వ॥ ఇ
ట్లుపుత్రపుత్రికాజనంబులంగనియంత (క॥ వినుమాతనియాయువులో। ననరిగెనర్థంబునంతనరపతికులవ। ర్ధనులగుపుత్రులకుఁబరి
ణయ। మొనరించెన్నృశలయిననయువిదలతోడన్ (క॥ నరనాథుఁడాఁడుబిడ్డల। వరరూపవయోవిలాసవైభవములచేఁ। బరగిన

ఉత్సంగ-తొడముందటిభాగము, రక్షహరి-పింఛప్రదాత, షష్ట్యుత్తరశతత్రయ-మున్నూటరువది, వింశత్యుత్తరసప్తశతంబు-ఏడునూటయిరువది.

స్వతనయలసదృశవరులకుసంప్రీతితో వివాహముఁజేసెఁ* (వ॥ అట్లువివాహంబుగావించియున్నసమయంబున* (క॥ విను
తత్సుతులొక్కొక్కరు నూర్గురు నేకనయముఁ బాంచాలదేశమునకుఁ బౌరంజనకులవర్ధనులగుచుఁ । జనియించిరి నూఱ్వురేసి శౌర్యబ
లాఢ్యుల్ * (గీ॥ అనఘయిట్టిరిక్థహరులు గేహకోశానుజీవయుతులునైనయట్టి । నందనాదులంతఁ జెందినమమతను బద్ధుఁడ
య్యెనంతఁ బార్థివుండు* (చ॥ తిరమగునిష్ఠతోననఁడు దీక్షితుఁడై పశుమారకంబులు । న్సరభిభయంకరంబులగు సన్మఖముల్దగఁ
జెక్కుచేసియా । దరమున నీప్రమంబ లెనుద త్తదనూనఫలాప్తికాముఁడై । సురపితృభూతసంఘమునసూయఁదనర్చి భజించె
భూవరా* (వ॥ ఇట్లాత్మహితంబులైనకర్మంబులయందనవహితుండు కుటుంబాసక్తమానసుండునై యున్నయతనికి విరోధి
యై ప్రియాంగనలకు కాముకజనంబులకు నప్రియంబగు కాలంబు సంభవించినం జండవేగవిఖ్యాతుండగు గంధర్వాధీశుండు
షష్ట్యుత్తరశతత్రయసంఖ్యాతులైన గంధర్వులు నందఱు గంధర్వీజనంబులు సితాసితవర్ణంబులు గలిగి మిథునీభూతులగుచున
నుగమింపం జనుదెంచి స్వపరిభ్రమణంబుచేతనె సర్వకామంబుల నిర్మితంబగు నా పురంబు నిరోధించిన నప్పుడా చండవేగాను
చరులైన గంధర్వులా పురంజను పురంబు వ్యాకులంబు నొందించుచు నపహరింప నుపక్రమించు సమయంబునం బురంజనపు
రాధ్యక్షుండైన ప్రజాగరుండను వాఁడు వింశత్యుత్తరసప్తశతంబులయిన గంధర్వగంధర్వీజనంబుల నివారించి బలవంతుండ
యి సంవత్సరశతంబు యుద్ధంబు గావించి యొక్కరుండయ్యును బెక్కండ్రతో నిట్లు పోరి క్షీణుండైన పురంజనుండు దాననిలిచి
తత్పురంబున నల్పసుఖంబుల ననుభవించుచుఁ బాంచాలదేశంబులందుఁ దన నిజపార్షదులచేత నానీతంబులైన పదార్థంబుల నొందు
చుం గామినీజనసమేతుండై భయపర్యాలోచనంబు సేయనేరక రాష్ట్రపురబాంధవసమేతుండై యార్తినొందించి తాఁ గ్రాం
తుండయియుండె నంత* (క॥ అనయంబు కాలపుత్రిక । యనునొక కామినివ రేచ్ఛ నఖిలజగంబుం । దనయంతఁ గలయఁదిరుగు
చుఁ । జనిచని యొక నాఁడు రాజసత్తమ వింటే* (సీ॥ అనఘాత్మ రాజర్షియై నయయాతికుమారకుండయినట్టి పూరుచేత । వరి
యింపఁగాఁబడి వలనొప్పనతనికి వరమిచ్చి దౌర్భాగ్యవశతనొంది । ప్రఖ్యాతిగను టదుర్భగయను పేరను బరగున క్కాంత నేపు
రుషవరుఁడు । వరియింపఁడయ్యెనాతరుణియానొక నాఁడు గరము బ్రహ్మలోకమున నుండి । వసుధకేతెంచి విను బృహద్వ్ర
తుఁడనైన నన్ను వరియింపఁ గోరి నను మదనాగమశరవిమోహితయై వేఁడఁగ రమునేను । సమ్మతింపకయున్న రోషమున నలిగి*
(వ॥ ఇట్లు మునీంద్రా మదీయాశావిముఖుండవై నీకు నేకత్రావస్థానంబు లేకయుండుం గాకయని శపించి నిహతసంకల్పయై
మదుపదేశంబునం జనియవనేశ్వరుండు భయనామకుండునైన వానిం గదిసి యిట్లనియె* (క॥ అవనీపతి భయనామక । యవనకు
లాధీశ్వరుండవగు నినుఁ బతిఁగాఁ । దవిలి వరింపఁగ వచ్చితి । సవినయముగ నిను ముభూతసంకల్పముఁ గనఁ* (వ॥ కలుగుమతాక
మితంబు వ్యర్థగాదు లోకంబున వేదంబులందు దేయగ్రాహ్యరూపంబైన వస్తువు యాచ్యమానంబగుచుండ నెవ్వఁడొసంగఁ
డెవ్వండింపు దీయమానంబగుచుండం గోరండట్టి వీరలిద్దఱును జడస్వభావులని సత్పురుషులు శోకంబు నొందుదురు కావునని
న్నుభజియించుచున్న నన్నుం గరుణార్ద్రచిత్తుండవై భజియింపుమిట్టి యార్తానుకంపయుఁ బురుషధర్మంబని పలికిన యక్కాల
పుత్రికవచనంబులు విని యవనేశ్వరుండు దేవగుహ్యచికీర్షువగుదానింగనుంగొని మందస్మితవదనుఁడగుచు నిట్లనియె* (క॥ విను
తరుణి యాచ్యమానం । బనఁదగు నీ లోకమందమంగళవు నస । జ్జనములకసమ్మతవు నను । నినునభినందింపమంద్రు నెటి నెవ్వా
రుఁ* (వ॥ కావున నేను జ్ఞానదృష్టిం జేసి నీకుం బవినిరూపణంబు సేసెద నదియెట్లనిన మదీయసేవాసహాయంబు వడసి ప్రజానా
శంబొనరించు నట్టి నీవవ్యక్తగవైకర్మనిర్మితంబైన లోకంబు ననుభవింపు మీ ప్రజ్వారుండను వాఁడు నా సహోదరుండు
నీవు మదీయభగినివి యీయిద్దఱింగూడి యీ లోకంబునందు నవ్యక్తుండ భీమసైనికుండనై యేను వర్తింతు ననిన నా భయనామ
కుండయిన యవనేశ్వరు నిదిష్టకాగులైన సైనికులు ప్రజ్వారకాలకన్యాయుక్తులై భూమండలంబెల్లఁ దిరుగుచు నొక్కనాఁడతి
వేగంబున భౌమభోగాఢ్యంబు జరత్పన్నగపాలితంబునైన పురంజనుపురంబు నావరించియున్నం ద స్వాభిభూతుండయిన పు
రుషునకుఁ నిస్సారత్వంబు గలిగించునట్టి కాలకన్యకబలాత్కారంబున నా పురంజనుపురంబు ననుభవించె నట్లు కాలకన్యకోపభుజ్య
మానంబైన పురంబు సర్వద్వారంబులందును సర్వతోధిక్యంబుగా నయ్యవనులు ప్రవేశించి తత్పురంబు సమస్తంబును బీడింప
నిట్లు పురంబు ప్రపీడ్యమానంబగుచుండ నభిమానయైన పురంజనుండు* (సీ॥ అనఘ యాతఁడు మమతాకులచిత్తుఁడై బహువిధ
భూరితాపములఁ బొంది । ఘనకుటుంబియుఁ గాలకన్యోపగూఢుండు నష్టసంపదుఁడు వినష్టమతియు । విషయాత్మకుండును విని
హతైశ్వర్యుండు కృపణుండు చాలనకించనుండు । నగు పురంజనుఁడు శోకావిలభావుఁడై గంధర్వయవనసంఘములచేత । నో
జ చెడి వికలము నొందు నిజపురమును । దవిలి ప్రతికూలురై యనాదరణ మొందు సుతులు । నైన పుత్రులఁ బౌత్రుల ననుచరులను సచివ
పౌరోహితుల నిజ నిజాచి* (వ॥ మఱియుం గాలకన్యాగ్రస్తుండైన తన్నుఁ దిరస్కృతంబులైన పాంచాలబలంబుల మంజూ
షియపార చింతనొంది తత్ప్రతీకారంబు సేయనేరకుంగక కాలకన్యాపహృతసర్వంబులయిన నంగామంబుల నఖిలశింపుచుఁ

నుండువిగతాత్మగతికుండు స్నేహంబునం జేసి పుత్రదారోపలాలనపరుండునై కాలకన్యోపమర్దితంబు గంధర్వయవనాక్రాం
తంబునైన పురంబు విడువనిచ్ఛ లేక యువిడువనుపక్రమించెనప్పుడు* (క॥ అనఘా భయనామాగ్రజుఁ। డనఁగల ప్రజ్వారుఁడు
వేగ నరుదెంచి పురం।బును సకలంబును భయనా। మునికిం బ్రీతిగ దహించె మునుకొని యంతన్* (వ॥ అట్లు దహ్యమానంబగు
చుండఁ బౌరభృత్యవర్గాదిసమన్వితుండు కౌటుంబికుండు పుత్రాదిసమన్వితుండు యవనోపరుద్ధాలయుండు కాలకన్యాగ్ర
స్తుండునైన పురంజనుండప్పురంబునందుఁ బ్రజ్వారసంస్పృష్టుండై యను తాపంబునొంది తత్పురపాలనంబునందు సమర్థుం
డు గాక పురుకృచ్ఛ్రోరువేపథుండై యుండుండ నశక్తుండయ్యె* (క॥ దవశిఖియుత తరుకోటర।నివసిత పన్నగము పగిది నిజపురి
వెడలం।దివురుచు నతఁడు శిథిలదవ।యవుఁడును గంధర్వగణవిహతశౌర్యుండున్* (సీ॥ అయి చాల ఘురఘురశబ్దముదరం
గమునమునఁ జింతానిమగ్నుఁడగుచుఁ। గొడుకులఁ గోడండ్రఁ గూఁతుల నల్లుర మనుమల నాప్తుల ననుచరాళి। ననయంబు న
ల్పమాత్రావశిష్టంబైన గృహకోశనివహపరిచ్ఛదముల। మపలు నహంకారమమకారములఁ జేసి మతిహీనుఁడగుచు నెమ్మన
ములోనఁ। గడఁకఁ దలఁచుచు విప్రయోగమునఁ దాను। గటకటా యిట్లు పరలోకగతుఁడనైన।నట్టి భార్యయ నాథయై యీ సుతు
మాన।వరుల నేరీతిఁ బ్రోచునో యవనిననుచు॥ మఱియు నిట్లని తలంచు* (సీ॥ పడఁతి యేనను భుజింపక భుజింపదు నేను స్రవనో
వక మఱి స్న్రవోదు। నేను నీళ్లాడక నీళ్లాడ నొల్లదు పదరి నేఁ గోపింప భయమునొందు। భర్జించుటకు మాఱుఁబలుకఁగ వారో
డు బుద్ధిహీనుఁడనైన బుద్ధిఁ జెప్పు।లలి మీఱ గయిట్టి కళత్రంబుతో నేను గడఁగి దేహాంతరగతుఁడనైన। తనయముల దాను బుత్రిణి
యగుటఁ జేసి।యాత్మశోచనీయ యగుచు గృహస్థధర్మ।మాచరించుచు నుండునో యనుగమనము।సేయునో యని మనమునఁ జింత
నొందు* (క॥ తన పుత్రులుఁ దన తనయలు। ననయముఁ దాఁ జనిన యెడ నిరాశ్రయులగుచున్। జననిధిమధ్యంబున నవి। సినకలమం
బోలి యెట్లు జీవించెదరో* (క॥ అనియిట్లి విధమునఁ గృపణుని।యనువున ఘనదుఃఖవిహ్వలానర్హుండై।యును దుఃఖించు పురంజ
ను।నన యముఁ గొనిపోవ నిశ్చితాత్ముండగుచున్* (క॥ చను దెంచెను భయనాముం।డను వాఁ డప్పుడు పురంజనాఖ్యుఁడు పెలుచ।
న్వను తాత్మపశుపృథంగిని। మనముఁగలఁగ యవనీయమానుండగుచున్* (వ॥ అనుచరవర్గంబు భృశాతురులు దుఃఖితులు
నై దుఃఖించుచు వెనుచనుచుండ నుపరుద్ధంబగు భుజంగమంబప్పురంబు నెపుడు వాసె నప్పుడాపురంబు విశీర్ణంబై ప్రకృతింబొం
దె బలవంతుండయిన యవనుని చేత బలాత్కారంబున వికృష్యమాణుండైన పురంజనుండు తమఃపిహితుండై పూర్వసహృత్తగు స
ఖునీశ్వరు నెఱుంగకుండెనంతం బరలోకగతుండయిన పురంజనుం గదిసి పూర్వంబున నదయుండైన యతని చేత హింసింపఁబడి
న యజ్ఞపశువులు క్రోధోద్రేకంబునఁ గుఠారంబుల నతనినఱికెనివ్విధంబున నం బ్రమదాసంగదోషదూషితుండు నపారతమో
నిమగ్నుండు నష్టజ్ఞానుండునై పురంజనుండనేక కాలంబు పరలోకంబున నార్తిననుభవించి తద్భార్యయైన ప్రమదోత్తమం జి
త్తంబున నశ్రాంతంబును దలంచుచుండం దదీయసంస్మరణంబునం జేసి తరువాతి జన్మంబున విదర్భరాజగృహంబునం బ్రమదో
త్తమయై జన్మించెనంత* (సీ॥ నరవరపీర్యపణాప్తయైనట్టి వైదర్భి నిమలయకేతనుఁడనంగ। బరపురంజయుఁడైన పాండ్యభూ
మీశుండు దారుణసంగరస్థలమునందు। శక్తి ననేకరాజన్యుల నిర్జించి పరిణయంబయ్యె నాగురుభుజుండు। వావిదర్భాత్మజ
యందసితేక్షణిన్మైన కూఁతును ద్రవిడాధినాథు। లైన కొడుకుల నేడ్వుర నర్థిఁ గనియె। వారలకు నెల్ల నొక్కొక్క వసుసన
ర్బు।దార్బుదసుతులు సంజాతులైరి యతని।సుత ధృతవ్రత నాయగస్త్యుఁడు వరించె* (క॥ ఆతఁడా కన్యకవలన న।జతురుండై
యిధ్మవాహ జనకుఁడగు దృఢ।చ్యుతుఁడగు మునీంద్రుఁ గనియెను।మతిననంతవిరక్తుఁడగుచు మలయధ్వజుఁడున్* (గీ॥ క్ష్మాతలం
బెల్ల నిజతనూజాతులకును।బంచి యిచ్చి సరోజాక్షు పాదపంక।జార్చనాయత్తుఁడగుచుఁ గులాద్రికరుగ। నంతమదిరాక్షి సతి
యగు నా విదర్భి (గీ॥ కనకగృహములనఖిలభోగములు విడిచి। చంద్రు వెనుచను చంద్రిక చందమునను।భక్తి దళుకొత్తఁ బాండ్య
భూపాలుఁడైన।మలయకేతను వెనుకొని మగువ సనియె* (వ॥ అట్లు ధర్మపత్ని వెంటరాఁ జని యందుఁ జంద్రవసా తామ్రపర్ణీ
నవోదకలను నదుల పుణ్యజలంబుల స్నాతుండయి ప్రక్షాళిత బాహ్యాభ్యంతరమలుండుఁ గందమూలఫలబీజపుష్పపర్ణతృణతో
యాహారుండునై కాయకర్శనంబైన తపంబాచరించుచు శీతోష్ణవర్షవాతంబులు క్షుత్పిపాసలు ప్రియాప్రియంబులు సుఖ
దుఃఖంబులు ననుద్వంద్వంబుల సమదర్శనుండై జయించి తపోవిద్యాయమనియమంబులం జేసి పక్వకషాయుండై బ్రహ్మాయం
దు నిజాత్మ ననుసంధించి పజితేంద్రియప్రాణచిత్తుండయి స్థాణువుంబోలి దివ్యవర్షశతంబు తపంబు సేసె భగవంతుండయిన వా
సుదేవునందుఁ బ్రీతి వహించుచు నన్యంబెఱుంగక వర్తించుచుఁ దన్ను స్వప్నమందు మచ్ఛేదం శిరశ్ఛిన్నమితియను ప్రతీతియం
దుం బోలె వ్యతిరిక్తునిఁగ వ్యాపకునిఁగ నంతఃకరణవృత్తిసాక్షిఁగా నెఱింగి* (సీ॥ సాక్షాత్కృతుండును సర్వేశ్వరుండును భ
గవంతుఁడును గృపాపరుఁడునైన। హరి యనులోకైకగురుని చేనుక్తమై సర్వతోముఖముతో స్వప్రకాశ। మగునట్టి సహిత

పురుకృచ్ఛ్రోరువేపథుండై॥ పురు-అధికమైన, కృచ్ఛ్ర-కష్టము, వేపథుండై-వణంకుగలవాఁడయి.

మహాజ్ఞానదీపప్రభాతతిచేఁ బరబ్రహ్మనుం జుఁ । దన్ను నుదనయందుఁ దగఁ బరబ్రహ్మంబు నేనయఁగన్గొనుచు దగ్ధేంధనాగ్ని|
భంగి నేవణములఁ బెడఁబాసి భూరి|వ్యసనసాగరసంసృతివలనఁ జాల । నుపరతుఁడయ్యె నాహా హితోన్నతుండు । సవని నాయ
కవిను నప్పుడతని భార్య* (క॥ పతిదైవతశీలసమం|చితవేణీభూతకురుచీనాంబరసు|వ్రతచర్యాతపా క్షాంగిపె|గతదోషపద
గ్భు రాజకన్యక యచటన్* (గీ॥ కమలలోచనసఖిలభోగములఁ దొఱఁగి|మలయకేతను బరమధర్మజ్ఞుఁ జేరి|నిరుపమైకపతివ్ర
తానియమ మొప్ప|సాధ్వియై భక్తిఁ బరిచర్యసలుపుచుండె* (క॥ విమలమతిఁ జేశుపమా|సము నగతిధూమరహితపవమానస
ఖా|గ్రమున వెలుఁగొందు కీలవి|ధమునఁ బ్రకాశించుచుండెఁ దద్దయు వేడ్కన్* (క॥ సతిదన ప్రాణేశ్వరుఁ డుపరతుఁ డగుటను
సంబులోనరయక యపూర్వ|స్థితిను పచారక్రియలం|చితమతిఁ గావింపఁ దలఁచి చిత్తభక్తిన్* (క॥ అనుపమ సుస్థిర నియమా|
సనుఁడగు నిజనాథుఁ డాయఁ జనిపూర్వగతిన్|వినమితమై సతి తత్పద । వనజములర్చించునపుడు వగు పాదములన్* (క॥ విను
మూష్మత లేకున్నను|గని యూధభ్రష్టహరిణికైవడి సతి నె|మ్మనమునఁ వెగడుచు దీనత । ననయంబును బాధురహితమై శోకిం
చెన్* (చ॥ అనయము నిట్లు శోకవిపులాశ్రుపయఃకణసిక్తమానిత|స్తనయుగమై వియోగపరితాపమునన్ హృదయంబు గంద
శో|భనలలితాధరోష్ఠనవపద్మము శోషిలసుస్వరంబుగా|వనజదళాక్షి యేడ్చె నని వారణఁ దద్విపినాంతరంబునన్* (ఉ॥ హా
నరనాథ హా సుమహితాత్మక హా గుణశాలి యింక నం । భోనిధిమేఖలాకలితభూమియ ధార్మిక రాజచోరపీ|డానిరతిం గృశింపన
కటా తగునయ్య యుపేక్ష సేయ శో|భానయశాలి నీవు పరిపాలన సేయుము లెమ్ము భూవరా* (చ॥ అని విలపించుచున్నరసిజాక్షి
నిజేశుపదారవిందముల్ । దనని టలంబు సోఁకఁ బరితాపమునం బడి బిట్టు చాలరో । దన మొనరించుచుం దగిలి దారువులన్ జితిఁ జే
ర్చి యందులోఁ|బెనుపగు తత్కళేబరముఁ బెట్టి శిఖిం దరికొల్పి యిమ్ములన్* (క॥ తానను గమనము సేయం|బూనినచో నంతలో
నఁ బూర్వసఖుఁడు వి|జ్ఞానస్వరూపుఁ డమలుఁడు|నైన ధరాదివిజుఁ డొక్కఁ డబలం గని యిట్లన్* (క॥ చను దెంచి యత్తలోదరి|సు
నయోక్తుల ననునయించుచుం దగ ననియెన్|వని తా నీ వెవ్వతె వె|వ్వని దాన వితం డెవండు వగచెద వేలన్* (క॥ అనియడుగుచు
వెండియు ని|ట్లని మొను నే సృష్టిపూర్వమందును నీవె । వ్వనితోడి సఖ్యసౌఖ్యం|బనవరతం బనుభవించి తట్టి సఖుండన్* (క॥ న
న్నెఱుఁగుదే నిమానము న । నన్నెఱుఁగక యున్నదానవైన నలినదళాక్షీ । నన్నుఁ బొగాతన సఖునిగ|నెన్నంగలదానవైన నెఱుఁగవె
చెపుమా* (వ॥ కావున నీవు నేనును బూర్వంబునందు మానసనివాసులమైన హంసలమై యుండి గృహంబుఁ బాసి సహస్రవ
త్సరంబులు సఖులమై వర్తించునంత నీవు నన్నుం బాసి భౌమభోగరతుండవై పదంబు నిచ్ఛయించుచు మహీమండలంబుగలయం
గ్రుమ్మరుచు నప్పు డొక్క కామినీనిర్మితంబు పంచారామంబు నవద్వారసమేతంబు నేకపాలకంబు త్రికోష్ఠంబు షట్కులంబు పం
చవిపణంబు పంచప్రకృతియు స్త్రీనాయకంబునైన యొక్క పురంబు వొడగంటి వది యెట్టిదనినం బంచారామంబులనం బంచేంద్రి
యార్థంబులు నవద్వారంబులన నాసికాదిద్వారంబు లేకపాలకంబనం బ్రాణపాలనంబు త్రికోష్ఠంబులనం దేజోభిన్నం
బులు షట్కులంబులన నింద్రియసంగ్రహంబు విపణంబులనం గర్మేంద్రియంబులు పంచప్రకృతియన భూతంబులు ప్రకృతియ
ను కామినియనబుద్ధి యిట్టిపురంబునం బ్రవిష్టుండైన పురుషుం డంగనాపరతంత్రుండై యజ్ఞుండగు నీవు నప్పురంబునం గామినీ
సంస్పృష్టుండవై రమియించుచుఁ దత్సంగమంబున నష్టస్మృతివై పురంజనవైదర్భిజన సంభావితసుఖాభాసంబులగు దుఃఖం
బుల చే నిట్టి పాపిష్ఠంబైన దశం బొందితివి గావున* (సీ॥ నీవు వైదర్భివి గావు వీరుఁ డితండు వివరింపఁగాఁ గాఁడు విభుఁడు నీకు|నా
గిమున్నుఁ బుగమున నుపరుద్ధుఁ జేసిన యా పురంజనపతివరియఁ గావు । మఱియు నీ వన్యసీమంతినియని యనుజర్చింపఁగాఁ బూ
ర్వజన్మమందుఁ|బురుషుండవని యనుబుద్ధిఁ దలంచుట యరయంగ నీ యుభయమునసత్య । మింతయును మామకీనమై యెసఁగు
మాయఁ|జేసి కల్పితమయ్యెఁ జర్చింపమనము । బూర్వమున హంసలమనియుఁ బూని యెఱుఁగఁ । బలికితిఁ దెలియ మనలరూపం
బుఁ జూడు* (వ॥ ఏ నే నీవు గాని యన్యుండవు గావు నీవే నేఁ గాని యన్యుండం గాని కెల్లెఱుంగుము విద్వాంసులు మనయిద్దరియందు
నంతరంబు నీక్షింపరు పురుషుండు దన్నొక్కని నె యాదర్శచక్షువులం బ్రభిన్నరూపులు గాఁ దలంచు చందంబున మనయిద్దరికి
నిభేదంబు గలిగినయట్లు తోఁచునని యివ్విధంబున నతం డతని చేత నీవు పూర్వంబున మదీయసఖుండవైన హంసవని తెలుపంబడి
స్వస్థుండై తద్వియోగనష్టంబైన జ్ఞానంబు గ్రమ్మఱం బొందెనని చెప్పి నారదుండు ప్రాచీనబర్హిం జూచి యీ యధ్యాత్మత
త్త్వంబు రాజకథామిషంబున నీకు నెఱింగించితి ననిన* (క॥ విని భూమీశుఁడు నారద|మునికను భవదీయవచనములు సూరులుద|
కర్కనుగర్మమోహితులమై|వనరెడు నే మెట్లు దెలియువారము చెపుమా* (వ॥ అనిన యోగీంద్రుండు రాజేంద్రునకిట్లనియె న
రేంద్రా యేకతంబున, నాత్మ యేకద్విత్రిచతుష్పాదంబు, బహుపాదంబు నపాదంబు నగుచు, బురంజను దేహంబు బ్రకటంబొ
నర్చె, నా కతంబునం బురంజనుండు పురుషుండయ్యె, నట్టి పురుషునకు, నామక్రియాగుణంబుల విజ్ఞాతుండు గామండుటం జేసి,
యవిజ్ఞాతశబ్దంబునం జెప్పంబడు సఖుండీశ్వరుండు పురుషుండు సాకల్యంబునం జేసి, దేహపరిగ్రహంబు సేయ నిశ్చయించున

ప్పుడు నవద్వారకలితంబు ద్విహస్తచరణయుక్తంబునైన పురంబే గలదది లెస్సయనఁ దలంచి యప్పురంబను దేహంబు నొందుఁ
బురుషుండింద్రియంబులం జేసి, యేబుద్ధి నధిష్ఠించి విషయంబుల ననుభవించు, నహంకారమమకారంబులకు నేబుద్ధితత్త్వంబు
గారణంబగు, నట్టిబుద్ధి ప్రమదోత్తమయనంబడు, దానికి సఖులు జ్ఞానకర్మకారణంబులైన యింద్రియగుణంబులు, సఖీజనం
బులు తత్సఖవృత్తులు, పంచముఖోరగంబనం బంచవృత్తియైన ప్రాణం, బేకాదశమహాభటులన బృహద్బలుండు, నుభయేంద్రి
యనాయకుండునైన మనంబు, నవద్వారసమేతంబైన యప్పురంబు చుట్టివచ్చిన పాంచాలదేశంబులనం, బంచవిషయంబు
లు, నవద్వారంబులన నక్షినాసికాకర్ణముఖగుదశిశ్నంబు, లందు నక్షినాసాస్యంబులైదును ప్రాగ్ద్వారపురస్కృతంబులు
దక్షిణోత్తరకర్ణంబులు దక్షిణోత్తరద్వారంబులు, గుదశిశ్నంబులు పశ్చిమద్వారంబులు, నందు నేకస్థలనిర్మితంబులయిన ఖ
ద్యోతావిర్ముఖులు నేత్రంబులు, విభ్రాజితంబన రూపంబు ద్యుమంతుండనం జక్షురింద్రియంబు, నళినీనాళినులన నాసికాద్వా
రంబులు, సౌరభంబనం గంధం, బవధూతయనఁ ఘ్రాణేంద్రియంబు, ముఖ్యయన నాస్యంబు, విపణంబన వాక్కు, రసజ్ఞుండనర
సం, బాపణంబన వ్యవహారంబు, బహూదనంబన వివిధాన్నంబు, పితృహూయనన దక్షిణకర్ణంబు, దేవహూయనను త్తరకర్ణం
బు, చండవేగుండనఁ గాలోపలక్షకంబైన సంవత్సరంబు, గంధర్వులన దివంబులు, గంధర్వీజనంబులన రాత్రులు, పరివర్తనంబ
నే నాయుర్హరణంబు, కాలకన్యకయన జర, యవనేశ్వరుండన మృత్యువతని సైనికులాధివ్యాధులు, ప్రజ్వారుండనం బ్రాణి
హింసయందు శీఘ్రవేగంబుగలిగి శీతోష్ణభేదంబుల ద్వివిధంబైన జ్వరంబు, దక్షిణపాంచాలంబనం బితృలోకప్రాపకంబు ప్ర
వృత్తరూపకంబునయిన శాస్త్రం, బుత్తరపాంచాలంబన దేవలోకప్రాపకంబు నివృత్తసంజ్ఞికంబునయిన శాస్త్రంబు, శ్రుత
ధరుండన శ్రోత్రంబు, ఆసురీనామకంబనం బశ్చాద్ద్వారంబైన మేఢ్రంబు, గ్రామకంబన సురతసుఖంబు, దుర్మదుండనగు
హ్యేంద్రియంబు, నిరృతినామకంబైన పశ్చిమద్వారంబన గుదంబు, వైశసంబన నరకంబు, లుబ్ధకుండనం బాయు, వంధుల
నహస్తపాదంబు, లంతఃపురంబన హృదయంబు, విషూచియన మనంబని వెండియు*(సీ॥ అనఘాత్మ వినుము జాయాత్మజులను గు
ణాక్తంబగు మఱిబుద్ధితత్త్వమర్థి । వెలయ నేయేగతి వికృతి సేయంబడు నేయే తెఱంగుల నింద్రియములు । వికృతి నిబొందు నావిధ
మునఁ దద్గుణాన్వితుఁడును వరుసఁ దద్వృత్తులకును । ఘనుఁడును వద్రష్టయును దగునాత్మయుఁ దద్వృత్తులను బలాత్కారముల
ను నను కరింపఁగ నర్థిఁ జేయంగఁ బడుట । నవరతమాత్మమహిమ షినిననుచరించు । టయు నెఱుంగఁగఁ జెప్పియిట్లని మఱియు ।
జనవరేణ్యునితో యోగిసత్తముండు*(వ॥ మఱియు నరదంబన దేహంబు, తురంగంబులన నింద్రియంబు, లీషాద్వయంబన సం
వత్సరంబు, తత్కృతవయస్సును, జక్రద్వయంబనం బుణ్యపాపకర్మద్వయంబు, వేణుత్రయంబన గుణత్రయంబు, పంచబంధు
రంబనం బంచప్రాణంబులు, రశ్మియనమనంబు, సారథియన బుద్ధి, రథికోపవేశస్థానంబన హృదయంబు, కూబరంబులన శోక
మోహంబులు, పంచప్రహరణంబులనం బంచేంద్రియార్థప్రక్షేపంబు, పంచవిక్రమంబనం గర్మేంద్రియంబులు, సప్తవరూ
థంబులన ధాతువులు, హైమోపస్కరంబన రజోగుణం, బక్షయతూణీరంబన ననంతవాసనాహంకారోపాధి, యేకాదశచ
మూపతియన నేకాదశేంద్రియంబయిన మనంబు, ఆసురీవృత్తియనం బాహ్యవిక్రమంబు, పంచేంద్రియంబులచేత మృగయా
వినోదంబుచదంబున హింసాదులం జేసి విషయంబుల ననుభవించుటయ మృగయాచరణం, బీవిధంబున నుండ జీవుండు దేహం
బున స్వప్నసుషుప్తిజాగ్రదవస్థలయందు, నాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబులైన బహువిధదుఃఖంబులం జేసి క్లేశంబులనను
భవించుచు నజ్ఞానావృతుండయి వర్షశతంబు నిర్గుణుండయ్యును బ్రాణేంద్రియమనోధర్మంబులం దనయందు నధ్యవసించి కా
మలవంబులధ్యానంబు సేయుచు నహంకారమమకారసహితంబుగాఁ గర్మాచరణంబు సేయుచుండు*(క॥ పురుషుఁడు నిజప్ర
కాశతఁ బరగియు ననలఘుఁడు పరుండు భగవంతుండు ర్గా । గురుఁడగు నయ్యాత్మ నుడగఁ బసువడి నెఱుఁగంగ లేక ప్రకృతిగుణము
లకా*(క॥ వినుమెపుడు దగులునప్పుడు । నానరంగు గుణాభిమానియును గర్మవశుం । డనవగు నా పురుషుఁడు దా । ఘనమగు త్రైగు
ణ్యకర్మకలితుండగుచుర్గా*(సీ॥ ధృతినొప్పుచున్న సాత్త్వికకర్మమున నుప్రకాశభూయిష్ఠలోకములఁ బూరి । రాజసప్రకటకర్మ
మున దుఃఖోదర్కలోలక్రియాయాసలోకములను । గైకొని తామసకర్మంబున నుదను శోకమోహబహుతమలోకముల
ను । బొందుచుఁ బుంస్త్రీనపుంసకమూర్తుల దేవతిర్యఙ్మర్త్యభావములను । గలుగుఁ గర్మానుగుణములు గాఁగ జగతిఁ । బుట్టిచ
చ్చుచుఁ గ్రమ్మఱఁ బుట్టునట్లు । దివిరి కామాశయుఁడయిన దేహియప్పు । డున్నతోన్నతపదవులనొందుచుండు॥ అనుమఱియునిట్ల
నియె*(మ॥ ఎనయఁ గాక్షుత్పరిపీడఁగుందిశునకం బింటింటికిం బోవఁ బూ । నినదద్దైవకమైనదండహతిఁగానీ గాకచౌర్యాన్నమై ।
నను గానీతగఁ బొందుచుండమున నెన్నగా దైవయోగంబు పెం । పునఁ జీవుండుదా ప్రియాప్రియములం బొందున్ద్రిలోకంబు
లకా*(చ॥ గొనకొని యిట్టి దుఃఖములకుం బ్రతికారము మానవేంద్రక । ల్గినవిమతత్త్వ రీతిక్రియ నకించన వృత్తిజనుండు మనస్తకం

బునవిడు మోఁపుమూఁపునను బూనినఁ దద్భరదుఃఖమాత్మకా । యనిగలజీవుఁడుం ద్రివిధమైతగుదుఃఖముఁ బాయఁడెన్నఁ డుర్వ* (క॥ ఘనదుఃఖహేతుకర్మం।బునుదత్ప్రీతికారకర్మమునివియమాయా।జననములగుటను బురుషుఁడు।గనుఁగలలోఁ దోఁచినట్టికలచందమునన్* (వ॥ నవాసనోచ్ఛేదకంబుగాదని వెండియునిట్లనియె* (సీ॥ నరనాథవినుము స్వప్నంబుచందంబున నజ్ఞానవిలసితంబగుటఁజేసి। యవిరిమిథ్యాభూతదేహాదికమునకునరయనివర్తనాయాసమేటి । కనియంటివేనియనర్థంబు లేకున్ననర్థిసోపాధికంబైనదనమున।వాంఛతోస్వప్నమువర్తింపఁబురుషునిఁబూనిజాగ్రద్బోధచేనుపాధి । చెడకస్వాప్నికసంసృతిపెడునవన్నట్లు।తత్త్వవిజ్ఞానమున నవిద్యానివృత్తి। ద్వారదేహాదికనివృత్తిదగులకున్నఁ । దివుటసంసృతిదానివర్తింపకుండు* (తే॥ఘనపురుషార్థభూతమనఁగాఁదగునాత్మకునేనిమిత్తమై । యొనరననర్థహేతువననూల్కొమనసంసృతిసంభవించినట్లనయముఁదన్నిమిత్తపరిహారకమర్థిజగద్గురుండునాఁ । దనరినవాసుదేవపదతామరసప్పటభక్తియారయన్* (క॥ ఘూనినతద్భక్తిసమీ।చీనగతిందెలియననఘుదిరవైరాగ్య।జ్ఞానజనకమగుభక్తిని।ధానముగోపింపవరకథాశ్రయమగుటన్* (వ॥ కావుననదితతకథాకర్ణనగాననిరతుండుపవిశ్వాససంయుక్తుండునైన వానికిసంభవించుమతియును* (క॥ ధరసాధులువిమలాంతఃకరణులుభగవద్గుణానుకథనశ్రవణస్ఫురితస్వాంతులునఘులు।వరధీమణులునైనభగవజ్జనసభలన్* (క॥ సరసోదారమహాత్మము । ఖరితములగునుధువిరోధి కమనీయగుణో।త్కరసురుచిరచరితామృత । పరిపూరితవాహినులనుపరమప్రీతిన్* (క॥ మునమలరఁగశ్రోత్రాంజలులనుబానముసేయుపుణ్యులకుఁదూగ్రుష్ణా।ఘునభయశోకవిమోహము।లనయంబును సోఁకఁజేయఁడునవనీనాథా* (వ॥ కావునఁట్టిభాగవతనివాసంబులేకతనంతనభగవద్భాగవతగుణాభివర్ణనకథానుచింతనాదులయందంపుంబవర్తించినసనాలస్యాదిదోషంబులొందియీజీవలోకంబు సహజక్షుధాదికంబున నుపద్రుతంబైన సర్వేశ్వరకథామృతవాహినియందు రతింజేయదదినిశ్చయంబనిమఱియునిట్లనియె* (సీ॥ పద్మసంభవుఁడునుభవుఁడును మనువులుసమితిదక్షాదిప్రజాపతులును । నైష్ఠికులైనసనకాదిముఖ్యమునులుపులస్త్యుండు భృగువుపులహుఁడు క్రతువు । నత్రిమరీచియునంగిరసుండునరుంధతీవిభుఁడునురూఢి మెఱయ । బహుపుణ్యులైనిగడపలఁగాగలబ్రహ్మవాదులునంపటవాక్పతికి।నెననమునీశ్వరులైయుండియును సహస్రసుతిఁదపోయోగవిద్యాసమాధివరవి । చారులైయుండియును సర్వసాక్షియైన । యీశ్వరుని వెదకియుఁగానరిద్ధచరిత।ఆదిమెల్లంబేని* (మ॥ ఘనపుస్తారమపారమద్వయమనంగానొప్పువేదంబుదా । మనువర్తించుచు మంత్రయుక్తివివిధంబైనట్టిదేవాఖ్యశో । భనసామర్థ్యముచేతనింద్రముఖరూపంబిష్టదైవంబుగాఁ । గనివేడ్కభజియించు వారలుగనంగానేర్తురేయీశ్వరున్* (క॥నినుమాత్మభావితుండన।నెనసినభగవంతుఁడెప్పుఁడెవ్వనిఁగరుణం । దనరుచుననుగ్రహించును।మనుజేశ్వరయపుడువాఁడుగుహితాత్మకుఁడై* (క॥ ధీరతనీలోకవ్యవ । హారంబును వైదికంబునవదగుకర్మా।చారములందువినిష్ఠిత । మైరూఢిదనర్చుబుద్ధినర్థివిడుచున్* (సీ॥ కావునరాజేంద్రనీవును బరమార్థరూపంబులగుచుఁబ్రరోచమాన।ములునుగర్ణప్రియంబులునగు నస్వష్టవస్తువులునుదగవఱలుకర్మ । ములయందుఁబురుషార్థబుద్ధిగావింపకుమతిఘనస్వాంతులైనట్టివారు । పరగుజనార్దనప్రతిపాదకంబైన శ్రుతిఁగర్మపరమనిచూపుచుండు । వారువేదజ్ఞులనఁదగువారుగారు। రూఢిమఱివారునిత్యస్వరూపభూత।మైనయీయాత్మతత్త్వంబునలరువేద।కలిత తాత్పర్యమనియాత్మఁదెలియలేరు* (వ॥ కావునంబ్రాగగ్రంబులైనదర్భలచేత సకలక్షితిమండలాస్తరణంబుగావించి యహంకారయుక్తుండవు నవినీతుండవు నైపశువధ బహుపశువులఁజంపనేకాని కర్మస్వరూపంబును విద్యాస్వరూపంబును నెఱుంగవు కర్మవిద్యాస్వరూపంబులెట్టివనిన సర్వేశ్వరపరితోషకంబేది యదియకర్మంబు వాసుదేవేశ్వరునియందు నేమిటమతిసంభవించు నదియవిద్య యతండే దేహులకు నాత్మయునీశ్వరుండు నగుచుండుఁగావునంబురుషులకు క్షేమకరంబైనయాశ్రయంబు తత్పాదమూలంబ యతండుప్రియతముండును సేవ్యమానుండునగుచుండ నణుమాత్రంబైన దుఃఖంబులేదట్టి యీభగవత్స్వరూపంబెవ్వండెఱుంగు వాఁడువిద్వాంసుండు గురుండు హరియునని చెప్పి వెండియునిట్లనియె* (క॥ అవనీశ యీవిధంబున।భవదీయప్రశ్నమిట్లుపరిహృతమయ్యెన్ । దవిలియిఁకనొకగోప్యము।వివరించెదఁజిత్తగింపు విమలచరిత్రా* (సీ॥ లలితమనోవాటికలయందునల్పప్రసూనమకరందగంధానుమోద । సంచారితమమృగీసహితమఁదన్ని వేశితచిత్తమునమధువ్రతనినాద । మేదురశ్రవణానుమోదితమునుబురోభాగచరన్నిజప్రాణహారి।దీపితవృకగణాధిష్ఠితమును లుబ్ధకక్రూరఘనసాయకప్రభిన్న । పృష్ఠభాగంబునైనసంబుననుమృత్యుభీతిపాటింపనొంచుదప్పింపవెరవు।గానకడవిఁజరించుమృగంబువగిది।భూవరోత్తమవినుమయ్యపురుషుఁడెపుడు* (వ॥ అంగనానివాసంబులయందు క్షుద్రతమంబగు కామ్యకర్మపరిపాకజనితంబైన జిహ్వోపస్థాది కామజనితసుఖలేశంబుల నన్వేషించుచుఁ గామినీయుక్తుండు తన్నివేశితమానసుండు నతిమనోహర వనితాజనాలాప శ్రవణతత్పరచిత్తుండు ప్రత్యక్షంబున నాయుర్హరణకారణాహోరాత్రాది కాలనిశేషగణనాపరుండుగాక పరోక్షంబునం గృతాంతశరనిర్భిన్న గా

త్రుంచునట్టి నీజీవుండు విహరించుచుండుం గావున నీవు నీజీవుని మృగచేష్టితునిగ విచారించి శ్రోత్రాదులందున్న శబ్దాదులం
బోలె బాహ్యవృత్తులగు శ్రౌతస్మార్తాదిరూపంబగు కర్మంబును హృదయంబునందు నియమించుచు సజ్జనయూథవార్తాసహి
తంబైన గృహాశ్రమంబు విడువుము సకలజీవాశ్రయుండైన యీశ్వరుని భజియింపు మిట్లు సర్వతో విరక్తుండవు గమ్మని వార
లుండు పలికిన నంబ్రాచీనబర్హి యిట్లనియె* (క॥ మునివరభగవంతుండవు నను పమవిజ్ఞాననిధి వియనఁదగు నీచే నను వివరింపంగా
దగి నయొనసిన యీయాత్మతత్వమిటు నాచేతః* (వ॥ శ్రుతంబు ఋషిచారితంబు నయ్యెఁ గర్మనిష్ఠులగు నుపాధ్యాయులైన వారలీ
యాత్మతత్వంబు నెఱుంగ రెఱింగి రేని నుపదేశింపరు కావునఁ దత్కృతంబయిన మహాసంశయంబు నీచేత నివృత్తంబయ్యె నని
వెండియు నిట్లనియె* (సీ॥ అనఘాత్మ యేమిటియందు నీయింద్రియవృత్తులుఁ దగఁ బ్రవర్తింపకుండు । టను జేసి ఋషులైన ఘన
ముగ మోహింతురట్టి యర్థము నందు నాత్మసంశ । యము గల్గుచున్న దియది యెట్టిదనిన నుబురుషుఁ డేయే దేహమునను జేసి । కర్మ
ము ల్సేసి తత్తాయంబు నీలోకమందు నేవిడిచి తాననన్యదేహ । మర్థితోఁ ఘటియించి లోకాంతరమున । బొందిత తత్కర్మఫలము
ను బొందునను చుఁ । బ్రకటముగ వేదవేత్తలు పలుకుచుండు । రన్నది యెట్లు పిన నుపపన్నమగును* (వ॥ అదియునుంగాక యా
చరితంబైన కర్మంబు తత్క్షణంబున నవినష్టంబగుటంజేసి దేహాంతరంబున లోకాంతరగామియైన ఫలంబెల్ల ననుభవించుననిన బ
ద్ధిమంతులనకు వారదుండెల్లనియె నరేంద్రా స్వప్నావస్థయందు లింగశరీరాధిష్ఠాతయైన జీవుండు జాగ్రద్దేహాభిమానంబు విడి
చి తాదృశంబ కాని యతాదృశంబ కానివైన శరీరాంతరంబునొంది మనంబునందు సంస్కారరూపంబున వాహితంబైన కర్మం
బు ననుభవించు చందంబున నంబురుషుండె లింగశరీరంబునం జేసి కర్మంబు నాచరించు నా లింగశరీరంబున నే లోకాంతరంబున
దేహవిభేదంబు నొందక తత్ఫలంబను భవించునదియునుం గాక దానప్రతిగ్రహాదులయందు స్థూలదేహంబునకుం గర్తృత్వం
బు గలదంటి వేని నహంకారమను కారయుక్తుఁ డయిన పురుషుండు మనంబునం జేసి యేయే దేహంబు పరిగ్రహించు నాయా దే
హంబున సిద్ధంబైన కర్మంబా జీవుండనుభవించు నట్లుగాకున్న గర్మంబు పునర్భవకారణంబగుట యుపపన్నంబుగాకుండుఁగా
వున మనః ప్రధానంబైన లింగశరీరంబునకె కర్తృత్వంబుపపన్నంబగు నని వెండియు నిట్లనియె* (క॥ క్షితినుభయేంద్రియకర్మ।
స్థితులనుభవమందఁబడిన చిత్తము పగిదిన్ । ధృతిజిత్తవృత్తులను లక్షితమగుఁ దత్పూర్వదేహకృతకర్మంబుల్* (వ॥ అది యెట్ల
ననినీ దేహంబునం జేసి యేరూపంబు నే ప్రకారంబు నెప్పుడు నెచ్చట ననుగునదియును భూతంబు నదృష్టంబు నశ్రుతంబునైయుం
డునట్టిది యొకానొక కాలంబున వాసనాశ్రయుండయిన పురుషునకుఁ దదనుభవాదియుక్తంబగు పూర్వదేహంబున ననుభూ
తంబు దృష్టంబు శ్రుతంబును నని విశ్వసింపుమీ మనంబు ననుభూతార్థంబు గోచరింపఁజాలదీ మనంబె పురుషులకు శుభాశుభ
నిమిత్తంబులైన పూర్వాపర దేహంబులం బ్రకాశింపంజేయుచుండు నీమనంబునందు నదృష్టంబు నశ్రుతంబునైన యర్థంబు స్వ
ప్నాదికమందుఁ దోఁచునంటి వేని నది దేశకాలక్రియాశ్రయంబని తలంపందగు సమస్తవిషయంబులు క్రమానురోధంబున మ
నంబునం జేసి భోగ్యంబులగునని మఱియు* (చ॥ సుమహిత శుద్ధసత్వగుణశోభితమున్సరసీరుహోదరో। త్తమగుణచింతనా
పరము ధన్యము నైన మనంబునందు భూ। రమణసుధాంశునందు నుపరాగము నట్టి విఁ దోఁచు రాహు చం। దమున నమ్మ గోచరంబగు
నుదారతనీయఖిలప్రపంచముల్* (వ॥ అని వెండియు నిట్లనియె లింగదేహమునకుఁ గర్తృత్వభోక్తృత్వంబులు స్థూలదేహ
ద్వారకంబులగుటం జేసి స్థూలదేహవినాశనంబు గలుగం జీవునకుఁ గర్తృత్వభోక్తృత్వంబులకు లేకుండుటం జేసి ముక్తిగలు
గునంటి వేని నీస్థూలదేహసంబంధంబు జీవునియందు బుద్ధిమనోమోక్షార్థగుణవ్యూహరూపాది లింగశరీరభంగపర్యంతంబు గ
లుగుచుండును సుషుప్తిమూర్ఛాదులయందు నిష్టవియోగాది దుఃఖమందు నహంకారంబుగలిగియుండునది యింద్రియోప
హతిం జేసియ మావాస్యయందు లేఁజంద్రుని బోలి తరుణపురుషునకు గర్భబాల్యావస్థలయందు నింద్రియపాటవంబు లే
కుండుటం జేసి యేకాదశేంద్రియస్ఫురణసమర్థంబైనయహంకారంబు గర్భాదులకుఁ బ్రకాశింపని చందంబునం దోఁపకుండుం
గావున స్థూలదేహవిచ్ఛేదకంబు లేకుండుటం జేసి వస్తుభూతార్థంబు లేకున్న నీసంసారంబు విషయంబులయందాసక్తుండగు జీ
వునకు స్వాప్నికానర్థాగమనంబు చందంబున నివర్తింపదీ తీరునఁ బంచతన్మాత్రాత్మకంబునం ద్రిగుణాత్మకంబున షోడశవికారా
త్మకంబునని స్మృతంబైన లింగశరీరంబు నధిష్ఠించి చేతనాయుక్తుండైన జీవుండని చెప్పంబడు మఱియు* (సీ॥ తివిరియప్పురుషుం
డు దేహంబునను జేసియనయంబు బెక్కు దేహాంతరముల । నంగీకరించుచునది విసర్జించుచు సుఖదుఃఖభయమోహశోకముల
ను । బురుషుండు తద్దేహమున నెపొందుచునుండు నదియెట్టులన్న ననగ్రభాగ । తృణముఁ దిమ్మటి పూర్వతృణపరిత్యాగంబుగా
పఁ చు తృణజలూకయును బోలి । జీవుఁ డవనిఁ గొంతజీవించి ప్రియమాణుఁ । డగుచునుండ దేహమథిఁ జెంది । కాని పూర్వమైన
కాయంబు విడువఁడు । గాన మఖిలజన్మకారణంబు* (తే॥ నరవరోత్తమ యట్లు గాన మనంబె జీవులకెల్ల సంసరణకారణమ
ట్టికర్మవశంబున నన్యకళేంద్రియా । చరణుఁ డౌటన విద్య గల్గును సంతతంబు ననిద్యచేఁ । బరగుటన్బహు దేహకర్మనిబంధముల్గలు

నిందిరాధీశ్వరుఁ డచ్చటివారలఁ గరుణించి । ప్రత్యక్షమున నుండుఁ బాయక యెప్పుడు నట్టిగణ్యంబైనయాశ్రమమున । నిలిచి
సాలగ్రామములుగల గండకీనదియందు నెంతయుఁ గనిసియుండు । నచ్చోట నేకాకియగుచును భరతుండు బహువిధనవపుష్ప
పల్లవముల । నతులతులసీదళంబుల నంబువులను । కందమూలాదిఫలములఁ గంజములను । ఘనతనర్పించి చాలుఁ దనివి లేక
సేవ సేయుచునుండె నా శ్రీశుహరిని* (వ॥ దానంజేసి విగతవిషయాభిలాషుండై శమదమాదిగుణంబులుగలిగి యథేచ్ఛంజే
సియెడ లేక పరమపురుషుని పరిచర్యాభక్తిభరంబున శిథిలీకృతహృదయగ్రంథి గలిగి సంతోషాతిశయంబునం బులకితాం
గుండు నానందబాష్పపరిపూర్ణావలోకనయనుండు నగుచు నిజస్వామియైనహరిచరణారవిందానుధ్యానపరిగత భక్తియోగంబు
నం బరమానందగంభీరహృదయంబను నమృతహ్రదంబున నిమగ్నుండగుచుఁ దానపుడు పూజించుపూజ నెఱుంగక యిట్లు భగ
వద్వ్రతంబు ధరియించి యేణాజినవాస త్రిషవణస్నానంబుల నార్ద్రకుటిలకపిశవర్ణజటాకలాపంబులుగలిగి మార్తాండాం
తర్గతుండయిన పరమేశ్వరుని హిరణ్మయపురుషునిం గాఁ దలంచుచు నిట్లనియె* (సీ॥ కర్మఫలంబులఁ గడఁక నిచ్చుచు మనోవ్యా
పారమున నిట్టియఖిలలోకములఁ జేసి యాలోకములకు నంతర్యామియగుచుఁ బ్రవేశించి యంతమీఁద । నానందరూపమైనట్టి
బ్రహ్మముఁ గోరుచున్నజీవునికిఁ దనలోని యోగశక్తిచేఁ దగ నిశంబుఁ బాలన సేయుచుండె యింతటను మార్తాండమధ్య । వర్తి
యగుచు నిట్లు వరలుచు జగముల । యందు నుండి ప్రకృతిఁ బోరయకుండ । నతులదివ్యమూర్తియైనయానందరూ । పమును శరణ
మొందెద భరతవిభుఁడు* (వ॥ అంతనాభరతుండొక్కనాఁడు మహానదిం గృతాభిషేకుండయి ముహూర్తత్రయంబంతర్జలం
బులం బ్రణవోచ్చారణంబు సేయుచుండు సమయంబున నిండుగర్భిణియగుహరిణి జలార్థినియై యొంటిజలాశయసమీపం
బునకు వచ్చి జలపానంబు సేయునెడ నాసమీపంబున మృగపతి గర్జించి లోకభయంకరంబుగ నాదంబు సేయ హరిణిస్వభావం
బున భీరువగుటం జేసి బెగ్గడిలి హరివిలోకనవ్యాకులచిత్తయై దిగ్గన నదరి గగనంబునకు నెగిరి యగతత్తృషయగుచు నదినుల్లంఘిం
చునెడ నధికభయంబునం జేసి యాగర్భంబు యోనిద్వారంబున గళితంబయి జలంబులం బడియె నాహరిణియుల్లంఘనాది భ
యంబునం జేసి తత్తీరంబున నుండు గిరిదరింబడి శరీరంబుఁ బాసె నంత నాహరిణపోతంబు జలంబులం దేలుచున్న భరతుండు గను
విచ్చి చూచి కరుణార్ద్రచిత్తుండై మృతజననియగు హరిణపోతంబును దనయాశ్రమంబునకుం గొనిపోయి మిక్కిలి ప్రీతింజేసి యు
పలాలనంబు సేయుచుఁ బోషణపాలనప్రీణనలాలనానుధ్యానంబుల భాగితునకు నాత్మనియమంబులైన యష్టాంగయోగంబు
లును బరమపురుషపూజాపరిచర్యాదులును నొక్కొక్కటిగఁ గ్రమక్రమంబునం గొన్నిదినంబులకు నస్తంబులుత్సన్నంబు నొం
దెనంత* (క॥ ఘనతపము చలనమొందుట । యును భరతుండెఱుంగఁ డాత్మయోగంబును జ । య్యనఁ బాసె హరిణపోతముఁ । దనరుచి
దిలోకిల్లి ప్రీతిఁ దప్పక పలికెన్* (ఉ॥ అక్కట తల్లిఁ బాసి హరిణార్భకమాపులు లేమిఁ జేసి యే । దిక్కును లేక యున్న నిటఁ దెచ్చి
తినా యెడ నీమృగార్భకం । బెక్కుడు ప్రేమఁ జేసి జరియించుచు మున్నది నామసన్నిధి । న్మక్కువఁ జేసి దీనిఁ గడు మన్ననలందఁగఁ
బ్రోతు నెంతయున్* (క॥ శరణముగ నిచ్చు జంతువుఁ । గరుణం గను విచ్చి చూచి కాచినఁ బుణ్యం । బరయఁగ నధికంబగును । నరమె
ఱింగించెను మునీంద్రగణములు ప్రేమన్* (వ॥ అని యిట్లు హరిణపోతంబుం దనయాశ్రమంబున నత్యాసక్తిం జేసి యాసనశ
యనాటనస్నానసమిత్కుశకుసుమఫలపలాశమూలోదకాహరణ దేవపూజాజపాదుల యెడం దనయొద్దన యునిచికొనుచు
వృకసాలావృకాది క్రూరమృగంబుల వలని భయంబున వనంబుల వెనువెంటం దిరుగుచు నధికప్రణయభరపరీతహృదయుండ
గుచు నతిస్నేహంబునం జేసి కొంతసేపు స్కంధంబుల వహించుచు మఱికొంతతడవురంబున నుత్సంగంబున నుంచికొని లాలించు
చు సంతసంబునొందు మఱియు నాభరతుండు నిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబు నిర్వర్తించునెడ నంతనంత లేచి హరిణకుణ
కంబుఁ జూచుచు గించిత్స్వస్థహృదయుండై దాని నాశీఃపరంపరల నభినందించుచుం జుంబనాదులం బ్రీతిం జేయుచు నతిమో
హంబునం బెంచుచుండు నెడ* (గీ॥ గరిమ నీరీతి మెల్లన గెరలు వొడిచి । చెంగి యాడఁగ భరతుండు చిత్తమందు । సంతసిల్లుచు
నుండె నాశ్రమముఁ బాసి । హరిణడింభకమంతలో నురికి చనిన* (వ॥ భరతుండంతం దన్మృగశాబకంబు గానంబడకుండినఁ దప్ప
దుమిక్కిలి వ్యాకులితచిత్తుండగుచు నష్టధనుండువోలె నతిదీనుండై కరుణతోడం గూడి తద్విరహవిహ్వలమతియై దానిఁ దలం
చుచు నతిశోకంబుతో మనంబునఁ దుఃఖించి యిట్లనియె* (గీ॥ హరిణపోతంబు నీకువనాంతమందుఁ । గ్రూరమృగబాధ లేకుండఁ గో
రుచుండఁ । దలఁగిపోయి తెయనుచుఁ జిత్తంబునందు । రాజఋషభుండు భరతుఁడు చారాటపడియె* (గీ॥ తల్లి చచ్చిన హరిణపో
తంబు వచ్చి । పుణ్యహీనుండనగు నన్నుఁ బొందిపాసె । నేమి సేయుదు నేనింక నెట్లు గందుఁ । జేరి యేరీతిఁ గాంచి రక్షించువాఁడ*
(క॥ కట్టా యీయాశ్రమమునఁ । బుట్టిన తృణచయము మేసి పొదలిన హరిణం । బిట్టట్టు దిరుగుచుండఁగఁ । బట్టి మృగేంద్రుండు గొ
ట్టి బాధించెనొకో* (వ॥ ఇట్లు భరతుండు హరిణకుణకమేమింబుఁ గోరుచు నెప్పుడు వచ్చి నన్ను సంతోషపఱచునా నాప్రకారం

కపిశ-మర్కటవర్ణము—గళితంబై-జారినదై—హరిణపోతంబు-లేడిపిల్ల—వృక-తోడేలు—స్కంధము-భుజశిరస్సు.

బుత్రైనతనగతులచేత నెప్పుడానంద మొందించు ధ్యానసమాధినున్నప్పుడు నన్నుంగొమ్ములఁగ్రోఁకుచునుండు నట్టిపోండం బులెప్పుడుగనుఁగొందు దేవపూజాద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనినం గోపించిచూచినం గుమారుండువోలె దూరంబున కుంజనిసలిచినమజిల నేఁబిలదిన వెనుకనిలిచియుండునట్టి మెలఁకువస్వభావంబు గలుగుటమెట్టులీభూదేవి యెంతతపంబుఁజేసినదియోహరిణపాదస్పర్శంబులంబవిత్రంబైనభూమిస్వర్గాపవర్గకాములైనమునులకుయజ్ఞార్హంబగునట్టిహరిణపోతంబు నెట్లుగనుఁగొందు నదియునుంగాకభగవంతుండగుచంద్రుండు మృగపతిభయంబున మృతజననియు స్వాశ్రమపరిభ్రష్టంబు నైనమృగశాబకంబునుగొనిపోయి పెంచుచున్నవాఁడొ మున్నుపుత్రవియోగతాపంబును జంద్రకిరణంబులంబాపుదునిపుడు హరిణపోతంబుదనశరీరస్పర్శంజేసిచంద్రకిరణంబులకన్ననధికంబగుచుంబుత్రవియోగతాపంబు నిర్వర్తింపంజేసె ననుచుం బెక్కుభంగులహరిణనిమిత్తంబులైనమనోరథంబులచేతంబూర్వకర్మవశంబున యోగభ్రష్టుండగుభరతుండుభగవదారాధనంబువలనవిభ్రంశితుండయ్యెను నితరజాతింబుట్టినహరిణపోతంబునందిమోహంబగ్గలంబగుచుండెనని పలికి శుకయోగీంద్రుండుమఱియునిట్లనియె*(సీ॥ జననాథమున్ను మోక్షవిరోధమని సాయఁగా రాని పుత్రాదికంబులెల్లఁ। బాసితపస్వియైభరతుండుహరిణశాబకపోషణంబునఁ బాలనమున। నటలాలనప్రీణనానుషంగంబులమూషకబిలమహిరోపమునను। సర్పంబుచొచ్చినచందంబునను యోగవిఘ్నంబుమిక్కిలిపిస్తరిల్లెఁ। గాన నెంతవానికైనను గాలంబు। గడువరామి నట్లు గాకపోదు । పరమముముక్షులకైనఁ బాయని కర్మంబు। నరులకుఁగ నెంగ నవరేణ్య*(వ॥ ఇట్లుభరతుండుమృగవియోగతాపంబునొందుచుండు నెడహామృగశాబకంబుచను దెంచినసంతసిల్లుచుండెనంతనొక్కనాఁడు*(మ॥ భరతుండల్లనసంత్యకాలమువెసంబ్రాపింపఁగాననాడాహరిణంబుంగడుభక్తింబుత్రుగతినత్యాసక్తివీక్షింపనా। హరిణంబుండననాత్మలోనిలిపి దేహంబంతటంబాసి తా।ద్భువిణీగర్భమునంజనించిహరిణంబైయొప్పెఁబూర్వస్మృతిన్*(వ॥ ఇట్లుభరతుండుహరిణీగర్భంబునఁబుట్టియాభగవదారాధనసామర్థ్యంబునందనమృగకారణంబుఁదెలిసి కడుతాపంబునొందుచునిట్లనియె*(ఉ॥ రాజులుప్రస్తుతింపసురరాజసమానుఁడనైతినూజులు। నాత్మజులఁజేసి తాపసులు రాజఋషీంద్రుడటంచుఁబలుకఁగాఁ। దేజమునొందియాహరిణదేహమునందమలఁబ్రీతఁజేసి నా।యోజచెడంగ నేఁజెడితి యోగిజనంబులలోనఁ బేలనై*(వ॥ ఇట్లుశ్రీహరిశ్రవణమననసంకీర్తనారాధనానుస్మరణాభియోగంబులంజేసి యశూన్యసకలయామంబగు కాలంబుగలనాకు హరిపోతస్మరణంబుకతంబున యోగవిఘ్నంబు ప్రాప్తంబయ్యె మోక్షదూరుండనైతినని నిగూఢనిర్వేదుండగుచుఁ దల్లిం బాసి క్రమ్మఱ నుపశమశీలముని గణసేవితంబయిభగవత్క్షేత్రంబయినసాలతరునిబిడతమగ్రామసమీపపులస్త్యపులహాశ్రమంబునకుం గాలాంజనపర్వతంబువలనఁజనుదెంచియందుమృగదేహత్యాగావసానంబు గోరుచుసంగంబువిడిచి యేకాకియగుచు శుష్కపర్ణతృణవీరుధాహారుండై మృగత్వనిమిత్తంబగునానదీతీర్థంబునందునవసానంబుగోరుచుఁ దత్తీర్థోదకక్లిన్నంబగుచుండు శరీరంబువిడిచెనని శుకయోగీంద్రుండుపరీ

—* భరతుండుహరిణజన్మంబువిడిచిఆంగిరసుండనుబ్రాహ్మణునకుఁబుట్టుట. *—

క్షిన్నరేంద్రునకువినుపించిమఱియునిట్లనియె*(సీ॥ హరిణదేహముఁబాసి యంతనాంగిరసాహ్వయుండుశుద్ధుఁడుపవిత్రుండుఘనుఁడు । శమదమగుణతపస్స్వాధ్యాయనిరతుండు గుణగరిష్ఠుఁడు నీతికోవిదుండు । నైనబ్రాహ్మణునకునాత్మజుండైపుట్టిసంగంబువలనను జడకిఁతుడగుచుఁ। గర్మబంధంబులఖండింపఁజాలునీశ్వరుఁనచ్యుతునజు శ్రవణమనన। ములనుహరిచరణధ్యానములను విఘ్నభయమునను జేసి మఱి మంకుఁబాయనీక। నిలిపిసంస్తుతి సేయుచునలిదియుండె। భరితయశుండైనభరతుండు పార్థివేంద్ర*(వ॥ ఇట్లాంగిరసుండు ప్రథమభార్యయందుఁ బుత్రనవకంబుఁగని గనిష్ఠభార్యయందు స్త్రీపురుషులనిద్దరనుగలుగఁ జేసినయందుఁ బురుషుండుపరమభాగవతుండు రాజర్షిప్రవరుండునుత్సృష్టమృగశరీరుండుఁ జరమశరీరంబునంబ్రాప్తవిప్రశరీరుండునగుభరతుండయ్యెనతండాజన్మంబున నన్యజనసంగంబుజన్మపరంపరలకుఁ గారణంబనియత్యంతభయంబునొందికర్మబంధవిధ్వంసనశ్రవణస్మరణాదుల శ్రీహరియనుగ్రహంబునం బూర్వజన్మపరంపరలసంస్మరించుచుఁ దనస్వరూపంబున్మత్తజడాంధబధిరరూపంబునలోకులకుఁజూపుచుండెనంత*(మ॥ జనకుండంగిరసుండు నాత్మజునివాత్సల్యంబునంబెంచుచుం। దనరంజౌలముఖాగ్ర్యకర్మములచేతన్సంస్కృతుంజేసి పా। యనిమోహంబులనచ్చలుంగడఁకశౌచాచారముల్సెప్పెన్। ఘనుఁడా భాగవతుండు సమ్మతనిదత్కర్మంబులంగైకోనే*(వ॥ ఇట్లుబ్రాహ్మణకుమారుండుకర్మంబులయందునిచ్ఛలేకయుండియునుబితృనియోగనిర్బంధంబునం బితృసన్నిధియందెయసమీచీనంబుగా వ్యాహృతిప్రణవశిరస్సహితంబగునట్టి గాయత్రీమంత్రంబుజపియించుచుఁ జైత్రాదిచతుర్మాసంబుల సమవేతంబుగ వేదంబులనధ్యయనంబు సేయుచుండెజనకుండాత్మజుని శిష్టాచారంబు చేశిక్షింపవలయునమలశౌచాచారంబుననువర్తింది యాత్మభూతుండగు నాత్మజునందుననభినివేశితచిత్తుండగుచు

విభ్రంశితుండు-జారినవాఁడు—ఓజ. తేజస్సు-బలము—పేల-మూఢుఁడు—నిగూఢనిర్వేదుఁడు-ఇతరులకెఱుఁగరాకుండవ్యసనపడువాఁడు.

శౌచాచమనాధ్యయనవ్రతనియమంబులు గురువులవలన శుశ్రూషణాదికంబులు నయిన భక్తియుక్తంబులయిన సంబంధములు చేసి నేర్పి యుచిత
ప్రాప్తము నొందుండయ్యె నంత* (క. ఈరీతి సగోత్రకుమారాచారంబులు గఱపి కొంత సద్గృహమున సంసారియగుచుండి విప్రుం
డు భోరున దేహంబు బాసిపోయిన మీదట* (గీ. తల్లి తండ్రితోడఁ దా నగ్నిఁ జొచ్చిన సతి నిమిషమున వెలుఁగఁగ నిలలోన పవ
తితల్లి కొడుకులు పసిబుద్ధులగు మనుశాస్త్రవిద్యలతని జడుపనీ* (వ. ఇటు బ్రాహ్మణకుమారుని సవతితల్లి కొడుకులు వేదవిద్యల
వలనం బాపి గృహకర్మంబులనతని నియమించిన* (క. ధరణీసురోత్తముఁడు దానరు దుర్గదమ వారు సెప్పిన పనులెల్లను నేర్పు
కం మఱి ప్రీతి సేయక నిరతము గృహకర్మనట్లు నెఱపుచునుండె* (వ. ఇట్లు గృహకర్మప్రవర్తనుండగుచునుండ మాధులగు ద్వి
పాత్పశువులు చేమన్మత్తజడబధిరయని యాహ్వాయమానుండై నపుడు తదనురూపంబులగు సంభాషణంబులనొనర్చుచుఁ బరే
చ్ఛాయదృచ్ఛలం జేసెపెట్టి వేగతన సాచ్ఛాదులవలన నియుక్తకర్మంబులం బవర్తించుచు* (గీ. ఆతులదివ్యాన్నమైన మృష్టాన్న
మైన నెద్ది పెట్టిన జిహ్వకు హితముగా నెఱితలఁ దిఫ తిందుఁగాకొండుఁదలఁ దిమిగులఁ ప్రీతి సేయఁడు రుచులందఁ బెంపుతోడ॥
(వ. మఱియు నావిప్రుండొక నిత్యానందసుఖలాభంబు గలిగి బాహ్యసుఖదుఃఖంబులయందు దేహాభిమానంబు సేయక శీతో
ష్ణవాతవర్షాతపంబులకు నోడి పైఁ జీరఁ గప్పక వృషభంబునుంబోలె బలీవర్దుండై గదినాంగంబునగు మష్టంకిలశాయియై రజోప
టలంబునంగప్పంబడిన దివ్యమాణిక్యంబువోలె నభివ్యక్తబ్రహ్మవర్చసుండై మలినాంబరపరీత కటితటుండై నతిమలిన ప్తయ
జ్ఞోపవీతుండై నగుటం జేసి యజ్ఞజనంబులతఁడు బ్రాహ్మణాభాసుండు మందుండనివి పలుకసంచరించుచుండ ధర్మమూలంబున
బరులవేతనాహారంబు గొనునప్పుడు దమవారు వ్యవసాయకర్మంబునందు నియమించిన క్షేత్రవిహితసమవిషమన్యూనాదికం
బులనెఱుంగక ప్రవర్తించుచునూఁక తవుడు తెలకపిండి పొట్టు నిప్పటి మాడుదబ్బెడయాదిగాఁగల ద్రవ్యంబులయందు నమృ
తంబువగిది రుచి చేసి భక్షించుచుం జేనికావలియుండు నెడనొక్కనాఁడు* (క. పురిలోన వృషలపతి దానరుదుగ సంతానకా

—* వృషలరాజభృత్యులు కాళికి బలియిచ్చుటకు భరతునిఁ గొనిపోవుట. *—

ముఁడై వేడుకతోఁ బురుషపశువుఁ గాళికి వేగురుగతికొనిపోవఁ దలఁచి కొన్న నుభృత్యుల్* (గీ. అరసి కాన లేక యారాత్రి వీ
రాసనమునఁ జేసి కాపు విమలబుద్ధి నున్నవిప్రయోగి నొక్కనిఁ బొడగాంచి పశువు మంచిదనుచుఁ బట్టిరతని* (క. ఆరీతి నిభూ
సురవరు నారయ నా కాళిగృహమునకుఁ దగ భృత్యుల్ భోరునఁ గొనిచని సల్పిరి చారుతరాభ్యంగనాదిసంస్కారంబుల్ (వ.
ఇట్లభ్యంగనాదికృత్యంబులు దీర్చి నూతనవస్త్రంబు గట్టనిచ్చి గంధపుష్పాభరణాక్షతాలంకృతునిం జేసి మృష్టాన్నంబులు భుజి
యింపం జెట్టి ధూపదీపమాల్యలాజకిసలయాంకురఫలోపహారాదులు సమర్పించి మహావాద్యఘోషంబుతోడ నా పురుషపశు
వుం గాళికాదేవి సమ్ముఖంబున నాసీనుం గావించి యా వృషలపతి పురుషపశువు రక్తంబున భద్రకాళి సంతోషపెట్టం దలంచి
కాళికామంత్రాభిమంత్రితంబు నతికరాళంబునైన ఖడ్గంబంది నిజాభీష్టసిద్ధికి హింసింపం దలంచిన* (సీ. సర్వభూతములకు స
ఖుఁడును బ్రహ్మభూతాత్ముఁడు నిర్వైరుఁడయిన బ్రహ్మ మతుని తేజంబంతఁ జూడఁ దుస్సహమైన భయమంది వడఁకుచు భద్రకా
ళి క్రోధంబు మిమ్మిడి గొనఁగ హుంకారంబు సలుపుచు నట్టహాసంబుఁ జేసి పాపాత్ములును దుష్టవరులును రాజసతామసకర్మ
సంధానులగుచు విప్రవరునట్లు హింసించు వృషలపతిని భృత్యవర్గంబుతోడఁ దలఁ బృథ్విఁ గూల్చి యపుడు వృషలాధిపుని శిరమంది
లీలఁ బాడియాడుచు నందంద క్రీడసలిపె* (క. ధరలోన నెవ్వరేనియు ధరణీసురవరుల కెగ్గు దగఁ దలఁచిన వారరయఁగ జె
డుదురు సిక్కము హరిధరణీసురవరేణ్యులందుండుటయుక్త మఱియు* (ఉ. అచ్చట విప్రసూనుఁడు భయంబొకయించుక లే
కచంపఁగా వచ్చినవారియందుఁ గరవాలమునందమనుఁగాళియందుఁ దా నచ్యుతభావమంది హృదయంబునఁ బద్మదళాక్షు
నెంతయు మ్మచ్చిక తోడ నిల్పి యనుమానము నొందకయుండె నెంతయున్* (వ. మఱియు నావిప్రవరుండు చండికాగృహంబు
వెలువడి క్రమ్మఱం జని కావలియుండు నెడ* (సీ. అంతటఁ గొన్నినాళ్ళ యనముల సింధుభూపాలనము సేయు భూవరుండు ధీ
రతనిఁ దుమ తీతీరమునమన్నకపిలమహాముని గాంచి తత్త్వ విజ్ఞానమెఱిఁగెడు వేడ్కతోడ తశిబికారోహణముఁ జేసి యరుగు
చుండ నాలోన నా శిబికారోహకులు చేని కాపున్న విప్రునిఁ గాంచి తెచ్చి శిబిక మోపింతమీతని చేత ననుచుఁ బట్టి మూపునఁ బల్ల
కీఁ బెట్టి మోపు మనుచు మోపించు నంతధరావరుండు శిబిక మూపున నిడి యెందుఁ జింత లేక* (క. తనమనమునఁ గోల్ దినప్పుడు
మునుకొని యట్లప్రయత్నమున నడువఁగ నా జనపతిని మ్మొన్నతమైచనుట యెఱిఁగి శిబిక మోచుజనులకు ననియెన్* (గీ. మీర
లిప్పుడిచటఁ జేరిమిక్కిలి ప్రయత్నంబుతోడఁ దగిలి నడుచుచుండ విషమమగు దుగమన వేగంబునను బాధఁ బెట్టుచున్న దనిన బె
స్తలనిరి* (వ. దేవా యీ విషమగమనంబు మావలననైనది గాదీ తురీయవాహకుండు సుఖగమనంబుగా నడువనేరండు వీనితో
డ మేము నడువనేరమనిన రహూగణుండను రాజు పాసితవృద్ధజనుండైనను బలాత్కారంబునం బుట్టిన కోపంబునం గోపించి వి
మర్యాదప్పి నీవు గప్పిన నిప్పువోలె నెఱుంగరాని బ్రహ్మతేజంబు గల బ్రాహ్మణునికిం గంటకంబులుగా నిష్ఠురవాక్యంబుల నిట్లని

మె* (చ॥ అలసితి వెంతయున్న మసలి వాఁక టడస్సితి మేను మిక్కిలిం। బలచన యున్నదీ శిబిక భారము దూరము మోసి తేగతిం। బలి
చెదవంచు భూవరుఁడు సస్థూరముల్లగఁ బల్క నా యెడం బలుకక మోసె నా శిబిక బ్రాహ్మణవర్యుఁడు పార్థివేశ్వరా* (వ॥ అప్పు
డా ప్రవరుండు దనకుం గడపటిదియగు కళేబరంబునం దహంకార మమకారంబులం బొందనీక మిథ్యాజ్ఞానరహితుండై బ్ర
హ్మభూతుండై మౌనవ్రతంబున నా శిబిక మోయుచున్న విషమగమనంబుఁ జూచి యతికుపితుండగుచు భూవరుండు వెండియు
నిట్లనియె* (సీ॥ ఓరి దుర్మదవినరోరి జీవన్మృత నాయాజ్ఞఁ దప్పుచు నడచెదీవు । నీవక్రమార్గంబు లిన్నియు విడిపించి నడిపింతు ని
న్ను సన్మార్గమందు నని రాజగర్వాంధుఁ డగుచు గుణత్రయంబున వృద్ధిబొందిన భూవరుండు। బద్ధప్రలాపముల్ పల్కుచుండినఁ జూచి
శమదమాదులచేఁ బ్రశస్తుఁడగుచు। జగతి బ్రహ్మస్వరూపమై సకలభూత । ములకు నత్యంతహితుఁడైన భూసురుండు। యోగివర్త
న దెలియక యున్న రాజు నంత వీక్షించి వెఱియ నిట్లనుచుఁ బలికె* (వ॥ నరేంద్రా నీవు చెప్పునది సత్యంబు భారం బీ శరీరంబున

## * భరతుఁడు రహూగణునిమాటలకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట. *

కే కాని నాకుం గలుగ నేరదయిన స్థౌల్య కార్శ్యంబులు వ్యాధులు నాధులు క్షుత్తృష్ణలు నిచ్ఛా విరోధ భయంబులు జరామరణం
బులు రోష నిద్రా జాగరణంబు లహంకార మమకారంబు దశోపణాదులును దేహంబుతోడన జనియించుం గాని నాకుం గలుగ నేర
వు జీవన్మృతుండ నేన కాదాద్యంతంబులు గలుగుటం జేసి యంటియందును గలిగి యుండు స్వామిభృత్యసంబంధంబులు వివిధ
కృత్యంబు లగుచు వ్యవహారంబులం జేసి శరీరంబునకుం గలుగుం గాని జీవునికి లేక యుండునదియునుం గాక 'రాజాభిమానంబున
నీవు నన్నాజ్ఞాపించెద వేని యుంబ్రమత్తుండవైన నీకుం బూర్వస్వభావం బెట్లుండె నట్లు గాక యే నేమి సేయుదు నెఱింగింపుము
న్మత్తమూకాంధజడులఁ బోలె సహజస్వభావంబునుం బొందిన నాయందు నీ శిక్ష యే మిలాభంబుఁ బొందింప నేర్పునదియునుం
గాక స్తబ్ధుండును మత్తుండు నైన నాకు నీ శిక్ష వ్యర్థంబగు ననిపలికి యుపశమశీలుండై మునివరుండు పూర్వకర్మశేషంబునం గల్గు
భారవాహకత్వంబును దలంగం దోలుటకు భారంబు వహించి శిబిక మోచుచుం జను నెడ నా రాజవల్లభుండు దత్త్వజ్ఞానాపేక్షి
తుండై చనియెడి వాఁడగుటం దనహృదయగ్రంథి విమోచకంబులు బహుయోగగ్రంథసమ్మతంబులు నగు బ్రాహ్మణవాక్యం
బులు వినియా శిబిక దిగ్గనడిగ్గనురికి యా విప్రునికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి గర్వవర్జితుండయి ముకుళితహస్తుండగు
చు నిట్లనియె* (సీ॥ ధరణీసురులలోనఁ దలపఁ నెవ్వఁడవీవు నవధూతవేషివై యవనియందు । నేమిటికై చరియింపఁగ వచ్చితి చటి
నాకల్కఁడవో చెటిజను టనేఁడు । నను గృతార్థునిఁ జేయ నలుకూలుఁ డగుచున్న యట్టియా కపిలమహామునీంద్రుఁడవో నీ మహ
త్త్వంబు దవిలి విచారింప నెఱుఁగక చేశితిఁ గరుణఁ జూడు। తప్పు సైరింపు నేయమ దండమునకు । హరుని శూలంబునకును వజ్రాయు
ధమునకు। కనలచంద్రార్కధనదశస్త్రములకు। వెఱవ విప్రున కేనిట్లు వెఱచినట్లు* (వ॥ మఱియు నిస్సంగుండవై జడుండవుం
బోలె నిగూఢవిజ్ఞానంబు గలిగి చరియింపుచున్న వాఁడవు నీ వచనంబులు యోగశాస్త్రసమానంబులై వాఙ్మనంబులకు నభే
ద్యంబులయి యున్నవి యేను విష్ణుకళావతీర్ణుండు సాక్షాద్ధరి యనఁగు కపిలమహామునివలనఁ బ్రహ్మవిద్యఁ దెలియం గోరి చను
చున్న వాఁడ లోకనిరీక్షణార్థంబ వ్యక్తలింగుండవై చరియింపుచున్న కపిలమహామునీంద్రుండవు గాఁ బోలుదువు మందుండై
న గృహస్థుండు యోగీశ్వరచరిత్రంబు లెట్లు తెలియంగ నేర్చుఁ గర్మవశంబున నప్పుట్టంబైన భ్రాంతి వహించుచు నడుచుచున్న యీ
యాశ్రమంబు నాకును బోలె నీకు వగునని తోఁచుచున్నది యెట్లనిన ఘటంబు లేక జలంబులు దేనేరని తెలియును లేనిది గలుగ నేర
దు గావునం బ్రమాణమూలంబయిన లోకవ్యవహారంబు సత్పథంబున సమ్మతంబై యుండుటం జేసి మీరలాడు వాక్యంబులు
నాకు సమ్మతంబు గా నేరదని సింధుదేశాధీశ్వరుండు వినిపించిన నా విప్రుండు లోకవ్యవహారంబునకు నిత్యత్వంబౌపాధికంబ
గుం గాని నిత్యంబు గా నేరదని దృష్టాంతనిదర్శనంబున నిట్లనియె* (సీ॥ పావకశిఖలచే భాండంబు దాఁ దప్తమగు తప్తఘటము చే
నందున్న। జలము తపించు నాజలము చేఁ దండులంబులు తప్తమొంది యప్పుడు విశిష్ట । మైన యన్నంబగు నా చందమున దాదే
హేంద్రియంబులఁ దెలివితోడ । నాశ్రయించక యున్నయట్టి జీవునకు దేహంబున బ్రాణేంద్రియాదికమున । జరుగుచుండు ని
ట్లు సంసారఘటవృత్తి దుండుమనైన రాజు దుష్టమైన। కర్మములకుఁ బాసికం జాతుపదసేవ । జేసె నేనిభవముఁ జెందకుండు* (గీ॥
అనుచు ధారుణీసురాత్మజుఁ డీరీతిఁ। బల్కుటయును రాజు పరిణమించి। వినయవాక్యములను వినుతించి క్రమ్మఱఁ। బుణ్యుఁడైన
సింధుభూవరుండు* (వ॥ మహాత్మా యేను రాజనని యెడి యభిమానమదాంధుండనై మహాత్ముల దిరస్కరించిన నన్ను గ
రుణింపుము నీ వార్తబంధుండవు నీకృపాదృష్టిం జేసి మహాత్ముల నవమానంబుఁ జేసిన దురితంబు వలన విముక్తుండనయ్యెద వి
శ్వసుహృత్తవైన నీకు రోషంబు గలుగ నేర దసమర్థులయి నమాబోఁటివారలు మహాజనావమానంబున శీఘ్రంబె నశింతురు
గాన నీవు దయాళుండవై నన్ను మన్నింపు మనిన నా విప్రుం డిట్లనియె* (క॥ కడు వేడ్క నీవు విద్వాంసుఁడవై యుండియును మి
గులఁ జోద్యము విద్వాంసుఁడు వో లెను బలికెదవి। ప్పుడు మేలన వచ్చుఁ గొంత పురుషులలోనన్* (గీ॥ పరగఁ జెప్పరీ ప్రపంచము

తయుఁదత్త్వ।మునకునీవుతత్త్వమును చుఁబలికి।యిట్లు గానయిన్న నధిపుఁడవనిపల్క।రాహుగణాసంజ్ఞుఁడ రాజచంద్ర* (సీ॥ యజ్ఞాదిక
ములంచునామ్నాయములయందుఁదలుచు గాఁదత్త్వవాదంబు లేదు । స్వప్నంబునందులసౌఖ్యమాకారంబునంజాల నిత్యమై
యంతలేని । యట్టిచందమున వేదాంతవాక్యంబులుతత్త్వంబు నెఱిఁగించితలఁచుఁగాని । నిత్యంబులై యుండ నేరవుపుగుషునిచి
త్తంబుగుణములఁజెందియెంత।కాలముండును నటియంత కాలమందు । నరయవిజ్ఞానకర్మేంద్రియములచేత।నా ఱిగిధర్మంబు
మఱియధర్మంబునట్లు । దగిలిపుట్టించుచుండునత్యంతమహిమ* (వ॥ మఱియుధర్మాధర్మవాసనాయుక్తంబు విషయానుర
క్తంబునైనచిత్తంబు గుణప్రవాహంబులచేత వికారంబునొంది దేవతిర్యఙ్మనుష్యరూపంబులైన దేహంబులం బుట్టించుచుఁ
గాలప్రాప్తంబులైన సుఖదుఃఖతదుభయఫలంబుల ననుభవించుచుననవరతంబుజీవునికిం బ్రత్యక్షంబగుచుస్థూలసూక్ష్మరూ
పంబులనుండుస్వాంతంబుగుణరహితంబైన ముక్తికారణంబగుఘృతవర్తులుగలదీపంబు సధూమశిఖలం బుట్టించుఘృతవర్తు
లునాశంబునొందిన స్వరూపంబుఁబొందిన తెఱంగుననమనంబుగుణకర్మానుబంధంబైన జన్మాదులంబుట్టించు గుణకర్మంబులం
బాసి నేనియుం బరతత్త్వంబునొందుజ్ఞానేంద్రియంబులేనునువిషయంబుల మీఁదఁదోఁచుబుద్ధి లేనుసభిమానంబునను నేకా
దశవృత్తులంగూడినమనంబు జీవునికి ససంఖ్యంబులైన జన్మంబులంబొందించు నామనోవృత్తులనతి క్రమించినజీవుండు పరం
జ్యోతిస్వరూపమైన నారాయణస్వరూపంబుగా నెఱుఁగుము, స్థావరజంగమంబులైనజీవులకుం బవనుండుప్రాణంబై యున్నచం
దంబుననీశ్వరుండు సర్వభూతాంతర్యామియగుచుజీవాత్మస్వరూపంబుననుండు జీవాత్ముండుజ్ఞానోదయంబునంజేసిమా
యనెంతకాలంబునంగెలువకుండు నంతకాలంబుముక్తసంగుండుగాఁ డరిషడ్వర్గంబునుజయించి పరతత్త్వంబు నెఱింగిననీశ్వ
రుండగుఁ జిత్తంబెంతకాలంబు విషయాసక్తంబగునంతకడపు పంసారచక్రంబునందుసంచరించుంగావున మహావీరుండైన
నుడనకుశత్రువైనమనంబునప్రమత్తుండయి యిచ్ఛావిహారంబునజరుగనీకపరమగురుండైన శ్రీహరిచరణోపాసనాస్త్రంబు
నంజిత్తంబుగెలిచియుం బరతత్త్వంబునొందుమని విప్రుండువలికిననతనిమహిమ నెఱింగి బ్రాహ్మణునకునమస్కారంబు సే
యుచుభూవరుండిట్లనియె* (ఉ॥ కారణవిగ్రహంబునకుకాయమునీయవధూతవేషము।న్నార్యరిధరామరత్వమునుబూర్వస
మాగమమాత్మభావము।జారువిహారమత్యతులశాంతిగుణంబునుగూఢవర్తనం। బారయఁగల్గునీకునయంబునమ్రొక్కెద
పెక్కుభంగులన్* (మ॥ జ్వరితార్తుండగురోగికౌషధమభీష్టంబైనచందంబునన్। ధరలోనాతపతప్తదేహిగడుశీతంబైనతో
యంబుమం।గరిమంగ్రోలిననీతి నెంతయునహంకారాహిదష్టుండనై। పరగున్నాకునునీవచోమృతముదప్పన్మందు వేఱున్నదే*
(గీ॥విప్రవర్య నేను వేడ్కతో నాసంశ । యంబులెల్లనిన్నునడిగి తెలియఁ । దలచియున్నవాఁడఁదప్పకయెఱిఁగింపు।ముచితవృ
త్తిఁదత్త్వయోగమెల్ల॥అనియడిగినయారాజునకావిప్రుండిట్లనియె* (గీ॥ కానవచ్చినఫలములుకర్మమూల।ములగుటనుజేసి
సంసారములనుజిత్త।మెపుడువర్తించుచుండుఁగా నెఱుఁగలేవు । తత్త్వయోగంబుమిగులనిత్యంబటంచు* (వ॥ మఱియునీవ
సుంధరనున్నచరణంబులకు నెక్కుడుజంఘలు నామీఁదజానువులాపాడవున నూరువులందులకు నుపరిప్రదేశంబునమధ్యంబ
టమీఁదనురమందుకు నెక్కువకంఠంబటమీఁద స్కంధంబులదారువాదారువునశిబికయందు రాజననియెడియభిమానం
బుగలిగినీవున్నవాఁడవిట్టిచోద్యంబయినకష్టదశంబొందిన నీవుప్రజాపాలనంబు సేయుచున్నవాఁడ ననుగర్వంబునమావంటి
మహాత్ములసభలోనం బూజ్యుండవుగాకయున్నవాఁడవీస్థావరజంగమంబులకునివాసస్థానంబు వసుంధరయైనచందంబునస
త్క్రియలచేత నెఱుఁగందగిన జగత్కారణంబైనతత్త్వంబు నెఱింగించెదపరమాణుసముదయంబీధరిత్రియైనచందంబుననవి
ద్యామనంబులచేతంగల్పితంబైనకృశస్థూలబృహదణు సదసజ్జీవాజీవద్రవ్యస్వభావాశయ కాలనామబుద్ధిరూపంబైన మా
యచేజగత్తు రెండవదియైకల్పింపంబడియె బాహ్యాభ్యంతరంబులంగలిగి స్వప్రకాశంబై భగవచ్ఛబ్దవాచ్యంబు విశుద్ధంబుపర
మార్థంబుజ్ఞానరూపంబునై బ్రహ్మంబొకటియ సత్యంబుజగత్తసత్యంబగునని పలికిమఱియు* (సీ॥ ధరలోనబ్రహ్మంబు దప
మునదానంబులనుగృహధర్మంబులనుజలాగ్ని । సోమసూర్యులచేతఁద్రుతులచేనైననుబరమభాగవతులపాదసేవఁ । బొంది
నమాడ్కినిబొందంగరాదనిపలుకుదు గార్యులుపరమమునులు । ఘనతపోబాహ్యసౌఖ్యములకువిముఖులునై పుణ్యులుహరిగు
ణామవాద।మోదితాత్ములునగురుబుధపాదసేవ।ననుదినంబునుజేసిననంతమీఁద । మోక్షమార్గంబునకునుబద్ధాత్మునందు ।బ
ట్టువడియుండు నెప్పుడుపరగబుద్ధి* (వ॥ నరేంద్రా యేనుపూర్వంబునభరతుండనురాజనుసర్వసంగపరిత్యాగంబుఁజేసి, భ
గవదారాధనంబు సేయుచు, మృగంబుతోడిస్నేహంబుకతన, మృగంబునైపుట్టియు, నందుమహాభక్తిఁదప్పకుండియిపుడు,
మనుష్యుండనై, జనసంగంబునశంకితుండనగుచు, మనుష్యసంసర్గంబును బాసి యేకాకినైచరియించుచున్నవాఁడ నటఁదు
వృద్ధసంసేవంజేసి, సంసారమోహంబును బాసిహరిధ్యానకథలచే, లబ్ధజ్ఞానుండై పుండరీకాక్షునింబూజింపుచుం, బరలో
కంబునుంబొందుదనిపలికివిప్రుండుమఱియునిట్లనియె* (సీ॥ ధరణీశమాయచేతనుదాఁటఁగారాని పదమునఁబట్టంగబడ్డజీ

వుఁ దెలమిమైగుణకర్మములఁ జేయుచును లాభమాశించితిరిగెడినర్యుమాడ్కి । ఫలాపేక్షింపుచుఁ బాయకజీవుండుసంసారగహనసంచారియగుచు ననవరతమునుండు నామహావనమునం గామలోభాదితస్కరులుగూడి । ధరణివిజితేంద్రియుఁడుగానినరునిఁబట్టి ధర్మనామయొకియామహాధనము నెల్ల నరసిగొనిపోవుచుండుదురనుదినంబుఁ । గానసంసారమందు నాశాంతువలను* (క॥ అరయఁగసంసారాటవిఁ దరలకయాపుత్రమిత్రదారాదులనం బరగినసృగాలవృకములు పరువడినరబస్తములనుభక్షించువడి* (తేగ॥ నలసిసంసృతిఘోరకాననమందిరంబులనెల్లనుం జెలఁగి గుల్మలతాతృణాదులచేతగహ్వరమైననీశ్చలనికుంజములందుమర్జనసంజ్ఞలంగలనుక్షికంబులనిరోధముదన్నసోఁకినఁబొందుచుండువిపద్దశ* (గీ॥ మఱియునీగృహస్థమార్గంబునందెల్ల । విషయములనుబొందివిశ్వమెల్ల గడఁకతోడనిట్లుగంధర్వలోకంబుఁ గాఁదలంచి మిగులమోదమందు* (గీ॥ మఱియుఁ గాననమునఁ గొఱవిదయ్యముఁగాంచి । యగ్నిఁగోరివెంటనరుగుమాడ్కిఁ గాంచనంబుగోరికలవారియిండ్లవెంబడులనుదిరుగునరుడుచలనమంది* (గీ॥ బహుకుటుంబియగుచుబహుధనాపేక్షుల । నెండమావులఁగనియేగుమృగములకరణిఁ బ్రేమఁజేసిపరువులువారుచు । నొక్కచోటనిలువకుండునెపుడు* (గీ॥ మఱియునొక్కచోటమస్తుఁడై పవనజోహతాక్షుఁడగుచు జూపుఁదప్పి దిక్కెఱుఁగక కొందుదిశకేగుపురుషునికరణిఁదిరుగునరుఁడునగవరేణ్య* (వ॥ మఱియు నొక్కచోట నులూకఝిల్లీస్వనంబులనోడసమానంబులయిన శత్రురాజతిరస్కారంబులకు దుఃఖపడుచు నొక్కచోటను ధార్ధితుండై యపుణ్యవృక్షంబులనాశించుమాడ్కిఁ బాపకర్ములు ద్రవ్యహీనులునగువారి నాశ్రయించుచు నొక్కయెడంబిపాసావరుండై జలహీనంబయిననదికిఁజనురీతి నిహపరదూరులైనపాషండులసేవింపుచు మఱియునొక్కప్రదేశంబునం దగ్నిచేతందప్తుండయినవాఁడు దావాగ్నింజేరి వ్యథనొందురీతి నన్నార్థియగుచు దాయాదులంజేరి దుఃఖింపుచు మఱియు నొక్కచోట పరబాధంజేసిమున్నగానక రాజ్యాభిలాషం బ్రాణసఖులైపితృపుత్రభ్రాతృజ్యేష్ఠులైనను వధియింపుచును మఱియుశూరులచేతం గొట్టుఁబడిసర్వధనంబునుబోనాడి చింతాపరవశుండై దుఃఖింపుచునున్నంతగంధర్వనగరప్రాయంబైన సంసారసుఖంబులనుభవించి మోదింపుచు మఱియునగారోహణంబుసేయు నరుండుకంటకపాషాణాదులవలనంబాదపీడితుండగుచు దుఃఖించుచందంబున గృహాశ్రమోచితమహానుష్ఠానంబునకుపక్రమించి వ్యసనకంటకశర్కరాపీడితుండై దుఃఖింపుచునొక్కచోటంజఠరాగ్నిపీడితుండై కుటుంబంబుమీఁదనాగ్రహింపుచువనంబుననజగరగళితుండై జీర్ణితుండైన చందంబునరాత్రిగృహాటవియందునిద్రాపరవశుండై యెఱుంగకయుండుచు మఱియునువనంబునందృణచ్ఛన్నకూపపతితుండగుచు సర్పదష్టుండయినతెఱంగున సంసారియై దుర్జనులచేత వ్యథితహృదయుండగుచు నంధుండై యజ్ఞానాంధకూపంబు నంబడుచు నొక్కయెడజుంటితేనియకునై మక్షికాబాధనత్యంత దుఃఖితుండయినమాడ్కిని సంసారకాముండై పరదారద్రవ్యాభిలాషియగుచు భూపాలకులచేతనైనను గృహపతిచేతనైనను దాడితుండయి నరకంబునంబడుచుండు యావనంబునసంపాదించిన ద్రవ్యంబులుపరులచేతం బోనాడినపథంబున శీతవాతాద్యనేక ప్రయాసలబ్ధంబైన ధనంబులుపోనాడి సంపాదియతిచింతాక్రాంతుండై యుండుమఱియును వనంబునలుబ్ధకులుసంసృష్టంబయిన యల్పామిషంబునకు నన్యోన్యవైషమ్యంబునంగలహించిన విధంబున సంసృష్టవ్యవహారియై యల్పద్రవ్యంబులకుంబోరాడుచుండునని భూపాలునకువిప్రుండు సంసారాటవితెఱంగెఱిఁగించి వెండియునిట్లనియె* (గీ॥ అల్పధనుఁడువిశ్రమస్థానములఁదృప్తిఁ బొందకొరులధనముఁ బొందఁగోరి యరిగివారివలననవమానములఁబొంది యధికమయినదుఃఖమనుభవించు* (గీ॥ అంతఁగొందఱెల్లనన్యోన్యవిత్తాది వినిమయమునఁగడుఁ బ్రవృద్ధమైన వైరములనుబొందిపోరాటమొందుదు రాత్మచింతలేకయనుదినంబు* (సీ॥ సంసారమార్గసంచారుఁడై యధికప్రయాసంబుననుగూర్పనర్థములను । విహరింపుచునుగొందఱిహలోకఫలములఁగోరి మోక్షంబునుగోరకంతఁ జెడిపోవుచుందురెప్పుడుగానియంకుకుఁగడపటియోగంబుఁగానలేరు । మానవంశులునసమానశౌర్యులనగువారు మిక్కిలినైనవైరబుద్ధి నాహవంబుననుడియుదురంతెకాని । మోక్షమార్గంబుగానరుమూఢవృత్తినినుచు సంసారగహనవిహారమెల్లఁ దెలిపిక్రమ్మఱనిమైధాత్రీపురుండు* (వ॥ మఱియుంగాలచక్రనియంత్రితుండై చక్రాయుధునిం గొల్వకశాకగృధ్రబకసమానులైన పాషండసఖ్యంబునంజేసి వారలచేతవంచితుండై బ్రాహ్మణకులంబునంజేసి శ్రౌతస్మార్తకర్మానుష్ఠానపరుండై విషయసుఖంబులంద్రఁదగులంబడి కాలంబుకుడనెఱుంగక వృక్షంబులుంబోలెనైహికార్థంబులయందుఁదృష్టగలిగి మైథుననిమిత్తంబుపనదారాదులయందు స్నేహంబుసేయుచుపథికుండుమాతంగంబులయందు భయంబునదీర్ఘనిమ్నకూపంబునంబడినతెఱంగున సంసారమృత్యుగజభయంబున గిరికందరప్రాయంబయిన యజ్ఞానతమంబునంబడుంగావున మాయచేతసంసారమార్గంబయినరాజభావంబువిడిచి సర్వభూతమైత్రిగలిగి జితేంద్రియుండవై జ్ఞానాసిచేమార్గంబుకడపలఁగ

గంధర్వనగరప్రాయంబైన-మాయాపట్టణసదృశమైన, నగ-కొండ, తృణచ్ఛన్నకూపపతితుండగుచు - గడ్డిచేగప్పబడినబావియందుగూలినవాఁడయి

నమ్మనిపలికినభూపాలుండిట్లనియె* (క॥ ఆక్కటమానుషజన్మం। బెక్కువమైయుండు నెప్పుడ భేదమతింబెం। పెక్కెనయోగిస
మాగమ। మక్కజముగఁగలిగెనేనియఖిలాత్ములకున్* (క॥ ధరణీసురవరనీశ్రీ। చరణాంబుజయుగళరేణుసంస్పర్శమునా। ను
రితంబులడఁచెనింతట। హరిభక్తియనంతకంతకధికంబయ్యెన్* (వ॥ మఱియువిప్రవరులయందుయోగీశ్వరులవధూతవే
షంబునంజరియింపుచుందురు గావున విప్రులుపిన్నపెద్దలనక యందఱికి నమస్కారంబనిస్తుతియించిన నాయోగీశ్వరుండును
సింధుపతికిఁ గరుణాన్వితుండగుచుఁ దత్త్వజ్ఞానం బుపదేశించి యారాజుచేత వందితచరణుండై పూర్ణార్ణవంబునుబోలె సం
పూర్ణకరుణారసపూరపూరితస్వాంతుండై వసుంధరంజరియింపుచుండె సింధుభూపతియును సుజనసమాగమంబునలబ్ధతత్త్వ
జ్ఞానుండై దేహాత్మభ్రమంబాసెననిపలికినశుకయోగీంద్రునకుఁబరీక్షిన్నరేంద్రుండిట్లనియె (చ॥ అరయఁగమోక్షికంబువినతా
త్మజుఁగూడఁగ లేనిరీతియీ। భరతునిసచ్చరిత్రములు ప్రస్తుతిసేయఁగనీవసుంధర। న్నరపతులెల్లనోపరుమనంబుననైననుసంక
నిట్టియా। భరతునిపుణ్యవర్తనముఁ బ్రస్తుతిసేయఁగనాకుశక్యమే* (వ॥ నరేంద్రా భరతుండు సుతదారరాజ్యాదులనుబూ
ర్వకాలంబునంద విడిచి భగవత్పరుండగుచు యజ్ఞరూపంబును ధర్మస్వరూపంబును సాంఖ్యయోగంబును బ్రకృతిపురుషస్వ
రూపంబునైన నారాయణునకు నమస్కారంబునుచుమృగరూపంబునుఁబాసెనట్టిభరతునిచరిత్రంబెవ్వరుసెప్పిన నెవ్వరువినిన న
ట్టివారిలఁబుండరీకాక్షుండు రక్షించు నాయురభివృద్ధియగు ధనధాన్యసమృద్ధియునగుచు స్వర్గోపభోగంబులఁబొందుదురని*

(మ॥ నరదేవాసురయక్షరాక్షసమునీంద్రస్తుత్యదివ్యాంబరా। భరణాలంకృతభక్తవత్సలకృపాపారీణవైకుంఠమం। దిరబృందావనభాసురప్రియ
ధరిత్రీనాథగోవిందశ్రీ। కరపుణ్యాకరవాసుదేవత్రిజగత్కల్యాణగోపాలకా* (క॥ పరమపదవాసదుష్కృత। హరకరుణాకరమహాత్మహతదితిసుత
భా। సురగోపికామనోహర। సరసిజదళనేత్రభక్తజననుతగాత్రా* (మాలిని॥ సరసహృదయవాసా చారులక్ష్మీవిలాసా। భరితశుభచరిత్రా భాస్క
రాబ్జారినేత్రా। నిరుపమఘనగాత్రా నిర్మలజ్ఞానపాత్రా। గురుతరభవదూరా గోపికాచిత్తచోరా॥......................*

గద్య. ఇది సకలసుకవిజనానందకరబొప్పనామాత్యపుత్త్ర గంగనార్యప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబునందు ప్రియవ్రతునిసుజ్ఞానదీక్షయు, బ్రహ్మదర్శనంబు, నాగ్నీధ్రాదులజన్మంబు, నుత్తమతామసరైవతులజన్మంబును, బ్రియవ్రతుండువనంబునకుఁజనుటయు, నాగ్నీధ్రుండప్సరసం బరిగ్రహించుటయు, వర్షాధిపతులజన్మంబు, నాగ్నీధ్రుండువనంబునకుంజనుటయు, నాభిప్రముఖులరాజ్యంబును, నాభియజ్ఞంబును, ఋషభునిజన్మంబును, ఋషభునిరాజ్యాభిషేకంబును, భరతునిజన్మంబును, ఋషభుండుతపంబునకు జనుచు నతుల జ్ఞానంబుపదేశించుటయు, భరతునిపట్టాభిషేకంబును, భరతుండువనంబునకుఁజనుటయు, భరతుండుహరిణపోతంబునందుఁ బ్రీతింజేసిహరిణగర్భంబున జనియించుటయు, మఱలవిప్రసుతుండై జనియించుటయు, విప్రుండుచండికాగృహంబునఁ బ్రతికివచ్చుటయు, సింధుపతివిప్రసంవాదంబునుగల పంచమస్కంధమునందుఁ బ్రథమాశ్వాసము..............................

శ్రీ గోపాలకృష్ణార్పణమస్తు.



## శ్రీమదాంధ్రభాగవతము—పంచమస్కంధము.

### ద్వితీయాశ్వాసము.

శ్రీకాంతాహృదయప్రియ। లోకాలోకప్రచారలోకేశ్వరను। శ్లోకభవభయనివారక। గోకులమందారనందగోపకుమారా॥

(వ॥ సకలపురాణార్థజ్ఞానవిఖ్యాతుండగుసూతుండిట్లనియె* (క॥ మునులారబాదరాయణి। యనఘాత్ముఁడైనయుత్తరాత్మ
జునకును। ద్వినయోక్తిభరతుచరితము। వినిపించుచుమఱియునిట్లువినిపించెదగన్* (గీ॥ పార్థివేంద్రయిట్లుభరతాత్మజుండై
న। సుమతిధర్మవర్తనమునఁదిరుగ। నదియెఱింగిదుష్టులయినపాషండులు। దమమతంబుమిగులఁదలఁచిపొగడి* (క॥ ధరణీవల్లభ
నిన్నును। సిగతంబునుబుద్ధదేవునింగొలిచినయా। తెఱఁగునఁగొలిచెదమనిభా। సురమతిబోధించిరపుడుసుమతింబ్రీతిన్* (వ॥
ఇట్లుపాషండబోధితుండైన సుమతికి వృద్ధసేనయందు దేవతాజిత్తనుపుత్త్రుండుజనించె వానికి దేవద్యుమ్నుండనుసత్పుత్త్రుం
డాసురియందుదయించె నమ్మహాత్మునకు ధేనుమతియందుఁ బరమేష్ఠిజనియించె నతనికిసువర్చలయందుఁ బ్రతీహుండనువాఁ
డుసుతుండయ్యె నప్పరమపురుషుండు సకలజనులకుఁ బ్రహ్మోపదేశంబుఁజేసి తానుశుద్ధాత్ముండై హరిస్మరణసేయుచుయ
జ్ఞకరణనిపుణులగు ప్రతిహర్త ప్రస్తోత ఉద్గాత యను సత్పుత్త్రులఁగాంచె నాప్రతిహర్తకు స్తుతియందువ్యోమ భూమయను
పుత్త్రద్వయంబుత్పన్నంబయ్యె నందుభూమకు ఋషికుల్యయందు నుద్గీథుండను సుతుండుజనించె నతనికి దేవకుల్యయందుఁబ్ర
స్తోతగలిగె నాప్రస్తోతకు వరరుత్సయందు విభుండనుతనయుండుద్భవించె నతనికిరతియందుఁబృథుషేణుండుదయించె నతనికి

నాహూతియందు ననక్తుండు గలిగె నానక్తునకు రాజర్షిశ్రేష్ఠుండగు గయుండను మహాకీర్తిసంపన్నుం డుదయించె* (గీ॥ అట్టిగయు
నివలన నఖిలజీవులఁ బ్రోవఁ దలఁచి సాత్త్విక ప్రధానమయిన యట్టి మేనుఁ దాల్చి యాత్మతత్త్వజ్ఞానుఁడగుచు నుండె హరినిజాంశ
మునను* (వ॥ ఇట్టి మహనీయ గుణాకరుండగు గయుని గాథానువర్ణనంబు పురాదిసులగు మహాత్ములచే నీతెఱంగున నుతింపఁ
బడుచున్నది సావధానమనస్కుండవై యాలకింపు మని యిట్లనియె* (సీ॥ ధర్మమార్గంబున ధారుణీజనులను బ్రేమతోఁ బోషణ
ప్రీణనోపలాలనశాసనలక్షణాదులచేతఁ బోషించుచును యజ్ఞములను యజ్ఞ | పురుషునీశ్వరుఁ జిత్తమున నిల్పి సేవించి స్వాం
తమందున్న యీశ్వరుని గాంచి | యఖిలజీవతతికి నానంద మొసఁగుచు నిరభిమానంబున ధరణి నేలె | సత్యసంధుఁడు మిగుల సత్సేవ
యందును | ధర్మమందు యజ్ఞకర్మమందుఁ గయుఁడు వసుధలోనఁ గంజాక్షుఁడే కాని | మానవుఁడు గాఁడు మానవేంద్ర* (వ॥ అ
ట్టి మహాపురుష గుణగణ పరిపూర్ణుండగు గయునకుఁ దక్షకన్యకలగు శ్రద్ధా మైత్రీ దయాదులు దమయంత వచ్చి కోరికలొసఁగ నత
ని ప్రజలకు వసుంధర కామధేనువై పొదుగ వేదంబులు సకలకామంబుల నిచ్చుచుండ సంగరంబున భంగంబునొందిన రాజు లప్ప
నంబులొసంగ విప్రులు ధర్మంబు బాఱవ పాలు పంచియిడ, నిరంతరసోమపానంబున శ్రద్ధాదిశుద్ధభక్తియోగంబునుం గలిగి యొన
ర్చు యజ్ఞంబుల నింద్రాది దేవతలు తృప్తులై యజ్ఞఫలంబులనొసంగ బ్రహ్మాదితృణగుల్మలతాంతంబుగా సకలలోకంబులవారి
నిం దృప్తిం బొందింపుచు శ్రీహరిం దృప్తిం బొందఁజేయుచు గయుండు పెక్కుకాలంబు రాజ్యంబు నేలె నట్టి గయునికి జయంతియం
దుఁ జిత్రరథ స్వాత్య వరోధులను ముగ్గురు కొడుకులు పుట్టిరి యాచిత్రరథునికి నూర్ణయందు సామ్రాట్టు వానికి నుత్కళయం
దు మరీచి యామేటికి బిందుమతియందు బిందుమంతుండను వాఁడు నాబిందుమంతునకు సరఘయందు మధువు మధువునకు సు
మనస్సను దాసియందు వీరవ్రతుండా వీరవ్రతునకు భోజయందు మన్యుప్రమన్యువులను నిద్దరుపుత్రులు మన్యువునకు సత్యయందు
భువనుండు నతనికి దోషయందుఁ ద్వష్టయు నాత్వష్టకు విరోచనయందు విరజుండను వాఁడు జనించె నంత* (క॥ ఆవిరజునకుద
యించిరి భూపనుత విషూచియందుఁ బుత్రశతంబు నన్నావలనొక కన్యకయు | నన్నా నేశ సమస్తజనులు హర్షంబందన్* (క॥ ఘ
నుఁడు ప్రియవ్రతువంశంబునకు ముదమైన విరజభూవిభు వంశం | బును దానలంకరించెను | వినుమింద్రావరజుఁడయిన విష్ణుని
మాడ్కిన్* (క॥ అనిపలికిన శుకయోగిం గని గొని యభిమన్యుసుతుఁడు గడు మోదముతో | వనజదళాక్షుని మహిమలు | విని
సంతసమందియని యిట్లనియె వేడుక మతి యర్థిన్* (వ॥ మునీంద్రా సూర్యరశ్మియందాఁక ప్రవర్తిల్లు నక్షత్రయుక్తంబైన చంద్రకిరణం
బులెంత మేరఁ దిరుగును తమోరంబు ప్రియవ్రతుని రథనేమిఘట్టనల చేత సప్తద్వీపంబులును సప్తసముద్రంబులు నయ్యె నని పలి
కితివా ద్వీపసముద్రంబుల పరిమాణంబులు సవిస్తరంబుగా నెఱింగింపుము గుణమయంబును స్థూలరూపంబును నైన శ్రీహరిశరీ
రంబగు నీలోకంబునందు నిలిపిన చిత్తంబు గుణంబును సూక్ష్మంబు నాత్మజ్యోతియు బ్రహ్మంబు నైన వాసుదేవునియందు నిల్పం
గావున ద్వీపవర్షాదివిస్తారంబు వినుపింపుమనిన శుకయోగీంద్రుం డిట్లనియె* (క॥ ధరణీవల్లభ వినుము శ్రీహరిమాయాగుణవిభూ
తులగు జలనిధులు సరసి నదీపులు వర్షము | లరయంగాఁ గొలఁది వెట్టనలవియె జగతిన్* (గీ॥ తెలిసినంత నేను దెలిపెద సంక్షేప
మునను జిత్తగించి వినుము దెలియ | ననుచుఁ జెప్పఁ దొడఁగె నభిమన్యుసుతునకు | నింపుగాను శుకమునీంద్రుఁ డిట్లు* (వ॥ నరేంద్రా

—* శుకయోగివరుండుపదేశరూపముగాఁ దెలుపు భూగోళస్వరూపాదినిర్ణయము. *—

జంబూద్వీపంబు భూపద్మంబునకు మధ్యప్రదేశంబున లక్షయోజనంబుల వెడల్పు నంతియ నిడుపునుం గలిగి కమలపత్రంబునుం
బోలె వర్తులాకారంబై నవసహస్రయోజన పరిమితాయామంబు గల నవవర్షంబుల నష్టమర్యాదాగిరులునుం గలిగి విభక్తంబై
యుండు నందు మధ్యమ వర్షంబిళావృతవర్షంబగు నందు మధ్యమప్రదేశంబున సువర్ణమయంబయి* (క॥ భూపద్మమునకు మేరు
వు దీపించుచుఁ గర్ణికాకృతిని బెంపగుచుం బ్రాపై కులగిరిరాజుఁ గనఁ జూపట్టును సురగణాళిచోద్యంబందన్* (సీ॥ మాఱియును ద
న్మేరుగిరి లక్షయోజనోన్నతమగుచుండి యానడిమి దళము | విదితమై పదియాఱు వేలయోజనములు నంతియ పాతునై యతిశయి
ల్లు | నామీఁద విస్తారమునయ ముప్పదిరెండు వేలయోజనముల వెలసియుండు | నాగిరికుత్తరంబున నీల శ్వేత శృంగ పర్వతములు
నింగి ముట్టి యుండు రెండు వేలయోజనంబుల దాఁక వెడల్పు గలిగి పూర్వపశ్చిమాయతంబు దక్షిణోత్తరంబున విస్తారమగు
చు మిగుల రమ్యమైన నరేంద్ర* (వ॥ ఇట్లు పూర్వపశ్చిమంబులు లవణసాగరాంతంబులై యున్న సీమాపర్వతంబులయందు నీలశ్వే
తశృంగవత్పర్వతంబులు నిడివి నియతాక్రమంబున దశమాంశన్యూనప్రమాణయోజనములు గలవిగా నుండు వీనిమధ్యప్రదేశం
బున రమ్యక, హిరణ్మయ, కురువర్షంబులను నామంబులు గల వర్షంబులుండు వాని విస్తారంబులు నవసహస్రయోజనంబులు గలి
గి లవణసముద్రాంతంబులై క్రమంబున నీలాదిపర్వతదీర్ఘపరిమాణంబుల నుండు నిళావృతవర్షంబునకు దక్షిణంబున నిషధ, హే
మకూట హిమవత్పర్వతంబులను సీమాపర్వతంబులును బూర్వపశ్చిమంబులు నిడుపును దక్షిణోత్తరంబులు విశాలంబు నా నీలా
దిపర్వతముల తీరున నుండు నాగిరుల మధ్యప్రదేశంబున హరివర్ష కింపురుషవర్ష భారతవర్షంబులను నామంబులు గల వర్షంబు

లుండునాయిళావృతవర్షంబునకుఁబశ్చిమంబున మాల్యవత్పర్వతంబుఁబూర్వభాగంబున గంధమాదనంబును సీమాపర్వతంబులుపూర్వపశ్చిమంబులనిడుపును దక్షిణోత్తరంబులవిశాలంబులునగుచు నీలపర్వతనిషధపర్వతంబులం గదిసి ద్విసహస్రయోజనంబుల విస్తారంబయియుండు మాల్యవత్పర్వతంబు పశ్చిమసముద్రాంతంబై కేతుమాలవర్షంబును గంధమాదనపర్వతంబునకుఁ బూర్వభాగంబున సముద్రాంతంబగుచు భద్రాశ్వవర్షంబును మేరువునకుం దూర్పునమందరపర్వతంబు దక్షిణంబున మేరుమందరపర్వతంబులను పడమటిపార్శ్వంబులనుత్తరమునం గుముదపర్వతంబులను నామంబులు గలిగి యయుతయోజనోన్నతంబులయి మేరునగంబును వర్ధోన్నతమేధిస్తంభంబునకుం జతుర్ముఖంబుల హ్రస్వస్తంభంబులను బోలియుండు నాచతుస్తంభంబులయందును బర్వతశిఖరంబుల వెలుఁగొందు కేతువులునుంబోలెఁ జూతజంబూకదంబన్యగ్రోధంబులను వృక్షరాజంబులు క్రమంబున నొండొంటికి నేకాదశశతయోజనాయతంబును శతయోజనవిస్తారంబును గలిగియుండు నాతియూనాపర్వత శిఖరంబులఁ గ్రమంబునం బయోమధ్విక్షురస మృష్టజలంబులుగలిగి శతయోజనవిస్తారంబులయినసరోవరంబులు తేజరిల్లు నందుస్నానంబులగువారలకు యోగైశ్వర్యంబులు స్వభావంబునం గలుగు నాతిసు నందన చైత్రరథవైభ్రాజకసర్వతోభద్రంబులను నామంబులుగల దేవోద్యానంబులు పర్వతశిఖరంబుల వెలుఁగొందుచుండు నందు దేవతాగణంబులు దేవాంగనలంగూడి గంధర్వులగీతనృత్యంబులుగనుంగొనుచు విహరింతురంత* (ఉ॥ మందరపర్వతంబు తుదిమామిడిపండ్లమృతోపమానమై । మందరశైలశృంగసుసమానములై గిరిమీఁదనట్టివా । కిం ఫలాకృతంబుగలుగంబడి జారిమహాప్రవాహమై । యందరుణోదనామమునఁ నద్భుతమై సెలసెల్లునెంతయున్* (చ॥ కడుమధురంబునన్సురభిగంధముచేనరుణప్రకాశతన్వడిఁగొనమందరాచలమువంతలఁ జెంగలజారియుంతలోఁ । ద్రోడతొడనాయిళావృతముఁ ద్రోఁచుచువింతగఁబూర్వవాహినియై । నమచుఁగరంగ సంతసులసంగతినచ్చటఁ జేయుదురన్యులన్* (గీ॥ ఆనదీజలంబులాని నచ్చటి । యంబికానుచరులసంగగంధి । నందిపవనుఁడంతనను జేశపదియోజ । నములుచుట్టుపరిమళములనింపు* (గీ॥ మేరుమందరాద్రిమీఁద జంబూఫలంబులు మహాగజోపములుగ ప్రాఁగి । యవిసియఁ తత్ప్రదసామృతంబల్ల సి । యమ్మహానగంబునందు బొడమి* (క॥ అనుపమ మగు జంబూనది । యను పేరను వెలసిలీలనరుగుచునంతం । ఘనగని ఇళావృతవర్షము । పనుపడఁ దుంచుచునుదక్షిణంబ్రవహించుఁగగ* (ఉ॥ అనదిసీటఁదోఁగిపదనై యటుమృత్తికలారసం సంగతి । న్మారుతకడు స్వపాకమునఁ బొందుచుశుద్ధసువర్ణజాతిజాం । బూనదనామమొందిసురముఖ్యులకెల్లనుభూషణార్హమై । మానుగవన్నెమించి దుమనందివ్యమైవిలసిల్లు నెంతయున్* (వ॥ మఱియుసుపార్శ్వనగాగ్రంబునందు బంచవ్యామపరీణాహ బంధురంబులగునైదు మధుధారాప్రవాహంబులు పంచముఖంబుల వెడలిసుపార్శ్వనగశృంగంబులంబడియిళావృతవర్షంబు పశ్చిమభాగంబుఁ దడుపుచుం బ్రవహించుచునా తేనియననుభవించువారలముఖమారుతసుగంధంబు శతయోజనపర్యంతంబుపరిమళించు* (సీ॥ కుముదపర్వతశిఖాగ్రముననుత్పన్నమైకనువట్టువటతరుస్కంధమధ్య । నుదయించునట్టిపయోదధిఘృతమధుగుడవిశిష్టాన్నంబులధికమయిన । యంబరశయ్యాసనాభరణాదివస్తువులుగోరికెలుదీర్చుచునుగుముద । పర్వతాగ్రంబునఁ బడియిళావృతవర్షమునిజనులకునెల్లభోగ్యములను । వదలకొసఁగు వారివళిపలితంబులు । దొలఁగుదుష్టగంధములను బాయు । మరణభయముముదమిపారయజన్నఁడునుశీ । తోష్ణబాధజెందకుందురధిప* (గీ॥ దేవదానవులునుదివ్యమునీంద్రగం । ధర్వులాదిగాఁగఁదగిలియాశ్ర । యించియుండురాగిరీంద్రమూలమునందు । హర్షమందిఘనవిహారలీల* (వ॥ నరేంద్రా మేరునగేంద్రంబునకుఁ బూర్వభాగంబున జఠరదేవకూటంబులుపశ్చిమంబునం బవనపారియాత్రలునను పర్వతంబులు నాలుగు దక్షిణోత్తరంబులొండొంటికి నష్టాదశసహస్రయోజనంబులనిడుపును బూర్వపశ్చిమంబులు ద్విసహస్రయోజనంబుల వెడల్పును, దక్షిణంబునఁ గైలాసకరవీరంబులు, నుత్తరంబునఁ ద్రిశృంగమకరంబులను నామంబులుగల దక్షిణోత్తరంబుల పర్వతంబులునాలుగును బూర్వపశ్చిమంబుల నష్టాదశసహస్రయోజనంబులనిడుపును, దక్షిణోత్తరంబుల ద్విసహస్రయోజనంబుల వెడల్పగుచు నగ్నిపురుషునకుం బ్రదక్షిణంబగుచున్న పరిస్తరణలచందంబున మేరువునకుం బ్రదక్షిణంబుగా నష్టనగంబులునిలిచియుండు మేరుశిఖరంబున దశసహస్రయోజనంబులనిడుపునంతియవిస్తారంబునగుచు సువర్ణమయంబైన బ్రహ్మపురంబు తేజరిల్లుచుండు నాపట్టణంబునకునష్టదిక్కులయందును లోకపాలురపురంబులుండు* (క॥ పరమేష్ఠిపట్టణంబున । హరిమున్నుత్రివిక్రమణములందస్సర్వే । శ్వరచరణాగ్రనఖాహతిఁ బనువడినూర్ధ్వాండము తెఁబగిలెనరేంద్రా* (వ॥ ఇట్లు చరణనఖస్పర్శంజేసి భేదింపంబడ్డయూర్ధ్వకటాహ వివరంబువలననంతఃప్రవేశంబు సేయుచున్న బాహ్యజలాధార శ్రీహరిపాదస్పర్శంజేయుచుం జనుదెంచి సకలలోకజనంబుల దురితంబులువాపుచుభగవత్పాదియను పేరం దేజరిల్లుచుదీర్ఘకాలంబు స్వర్గంబునవిహరించుచువిష్ణుపదంబున నుత్తానపాదపుత్రుండును బరమభాగవతుండునయిన ధ్రువుండు తనకుల దేవతయైన శ్రీహరిపాదోదకంబుఁ బ్రతిదినంబును భక్తియోగంబున నిమీలితనేత్రుండై

యానందబాష్పంబుల గోమాంచితగాత్రుండై యాత్మాధారుని నేకానుశీలనంబు నరయించుచునున్న వాఁడతనికి సధోభాగంబుననుండు మండలాధిపతులైనసప్తర్షులును హరిపాదోదకప్రభావంబు నెఱింగి తామువొందుతపస్సిద్ధియగు శాశ్వగంగాజలంబులస్నానములకుటయే యని సర్వభూతాంతర్యామియగు నీశ్వరునియందు భక్తి నిలిపి యితరపదార్థాపేక్ష సేయక మోక్షార్థిముక్తిమార్గంబు బహుమానంబు సేయుచు నెఱింగినబహుమాన నయుక్తంబుగాఁదమ జటాజూటంబులయందు నేఁడును ధరించుచుండుదురు* (సీ॥ అంతనసఖ్యంబులైనదివ్యవిమానసంకులంబులను విశాలమైన। దేవమార్గంబునదిగివచ్చి చంద్రమండలముఁదోఁచుచు మేరునగశిఖాగ్ర। మునను వాబ్రహ్మదేవునిపట్టణమునకువచ్చియందు లచతుర్ద్వారములను। నరుసతోదీర్ఘప్రవాహంబులగుచును బ్రవహించియమలపవిత్రభావములను। నకుగులవణసాగరాంతంబులుగి నాల్గు। మోములందు నాల్గునామములను దన్నుఁగన్నవారిదనవారిఁదోఁగిన। వారికెల్లనమృతవారియగుచు* (వ॥ ఇట్లు సీత యను పేరవినుతనొందినయమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదన పూర్వద్వారంబున వెడలి కేసరావలయంబుఁదడుపుచుఁ గంధమాదనాద్రికిం జని భద్రాశ్వవర్షంబుం బావనంబు సేయుచుం బూర్వలవణసాగరంబునం బ్రవేశించుఁ జక్షువను పేరఁ దేజరిల్లెడు దీర్ఘప్రవాహంబు పశ్చిమద్వారంబున వెడలి మాల్యవత్పర్వతంబునం బడి కేతుమాలవర్షంబుఁ బవిత్రంబు సేయుచుఁ బశ్చిమలవణార్ణవంబునం గలయు భద్రయను పేర వెలుఁగొందునయతుల ప్రవాహంబుత్తరద్వారంబున వెడలి కుముదనీలశ్వేతాఖ్యపర్వతశిఖరంబులం గ్రమంబునఁ బ్రవహించుచు శృంగనగంబునకుం జని మానసోత్తరంబులను కురుభూములఁ బవిత్రంబు సేయుచు నుత్తరలవణసాగరంబుఁ జేరు - నలకనందయనుప్రఖ్యాతిఁ గాంచిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదనదక్షిణద్వారంబున వెడలి యత్యంతదుర్గమంబులైనభూధరంబులఁ గడచి హేమకూట హిమకూటనగంబులను దరించి యతివేగంబునఁ గర్మక్షేత్రంబగు భారతవర్షంబుఁ బావనంబు సేయుచు దక్షిణలవణాంబుధిం గలయునంత* (సీ॥ జగతిలో మేరువాదిగఁ బర్వతములు కులములు ధాత్రికలైనట్టి పుణ్యతీర్థములు వేలసంఖ్యలుగలవు జంబూద్వీపమందు భారతవర్షము గర్మ। భూమిఁ దక్కిననవర్షములదివంబునుండి భుక్తిదవచ్చిన వారుపుణ్యశేష। ములు భుజింపుచునుండ్రు భూస్వర్గమనఁదగు నావర్షమునను బుట్టినవార। లయుతసంఖ్యవత్సరాయువులయుతమాతంగబలులు దేవతాసమాను। లకులవజ్రశరీరులధికప్రమోదితులప్రమత్తులారోగ్యలసుఖులధిప* (వ॥ మఱియును రతసుఖానందంబున మోక్షంబునైనంగైకొనకసత్పరిణతులగుచు ననవరతంబును ద్రేతాయుగకాలంబుగలిగి ప్రవర్తింతురియష్టవర్షంబులయందు దేవతాగణంబులు తమ భృత్యవర్గంబులు త్యుపచారంబులు సేయుచుండ నెల్లఋతువులయందుం గిసలయకుసుమఫలభరితంబులయినలతాదుల శోభితంబులగువనంబులుగలవర్షనిధిగిరిద్రోణులయందుఁ గమలామోదితంబులగు రాజహంసకలహంసలుగలసరోవరంబులయందును జలకుక్కుటకారండవసారసవినోదంబులుఁగలిగి మత్తాళిఝంకృతిమనోహరంబులై నానావిధంబులయినకొలంకులయందు దేవాంగనలకామోద్రేకజంబులయిన విలాసహాసలీలావిలోకనంబులందివియంబడిననునోదృష్టిగల దేవగణంబులు విచిత్రవినోదంబులుగలిగి యుచ్చావచహారంబులు సలుపుచుండుదురు* (క॥ ఈనవవర్షంబులయందా నారాయణుఁడు వచ్చి యనవరతములో। కానుగ్రహమునకై సు। జ్ఞానంబీఁదలఁచి లీలఁ జరియించుఁ దగన్* (సీ॥ వసుధ నిళావృతవర్షాధిపతియైన పురహరుండావర్షమునవనంబు। నందుచుండుటకునాయంబికాశాపవశంబుననావనస్థలమునందు। నెవ్వరువచ్చిన నంకులై యుండు రావనమందు పార్వతియనుదినంబు। సంగనాజనసహస్రార్బుదంబులతోడ ననములోచనుఁగొల్పనతులభక్తి। వట్టిశివునిగోరి యాయిళావృతవర్ష। మునఁ జరించుజనులు మోదమునను। గదిసి తత్ప్రకాశకములైనమంత్రతంత్రములఁ బూజఁ జేసి తలఁతు రెపుడు* (క॥ భద్రాశ్వవర్షమందుల భద్రశ్రవుండనెడి పేరఁ బరగుచుఁ దపనీయాద్రిసమద్యుఁడగుచు సముద్రాంతంబైనజగతిఁ బాలుపుగ నేలున్* (క॥ ఆనరవరునకుఁ బ్రియతముఁడైనహయగ్రీవమూర్తి ననవరతంబున్। ధ్యానస్తోత్రజపాను। ష్ఠానాదులఁ బూజఁ జేసి సజ్జనులంతన్* (గీ॥ తత్ప్రకాశకస్వప్రధానమంత్రార్థసంసిద్ధిఁ జేసి ముక్తిఁ జెందిరప్పు। డట్టివర్షమందువాహయగ్రీవునిఁ దలఁచికొలిచి మిగులధన్యులగుచు* (సీ॥ హరివర్షపతియైనసహరిననిశంబునందున్నజనులును హాత్ములయిన। దైత్యదానవకులోత్తములు ప్రహ్లాదాది పెద్దలుఁ గూడి సంప్రీతితోడ। సుస్నాతులయి భక్తిఁ జూచుచునందరు రమ్యవకూలాంబరములు దాల్చి। తత్ప్రకాశకమంత్రతంత్రజపస్తోత్రపాఠకధ్యానతపఃప్రధాన। మైనసత్పూజలను జేసియచలబుద్ధి। శ్రీనృసింహుని జేరి పూజించియతని। కరుణనొందుచునతులప్రకాశులగుచు భుక్తిముక్తులఁ గైకొంద్రు భూపవర్య* (వ॥ మఱియుఁ గేతుమాలవర్షంబునందు భగవంతుండు శ్రీదేవికి సంతోషంబొనరఁగుటకుఁ గామదేవరూపంబునసుండు నమ్మహాపురుషునియస్త్రతేజఃప్రకాశంబునఁ బ్రజాపతిదుహితలగు రాత్రిదేవతలగర్భంబులు సంవత్సరాంతంబున నిర్జీవంబులై స్రవించు నాకామదేవుండును దనగతివిలాసలీలావలోకన సుందరభ్రూమండలసుభగవదనారవిందకాంతులం జేసి శ్రీరమాదేవి నిరమింపంజేయు భగవన్మాయారూపిణియగు శ్రీదేవియుఁ బ్రజాప

తిపుత్రికలును బుత్రులు నైన రాత్రింబగళ్ళం గూడి కామదేవస్తోత్రపాఠకపూజాధ్యానాదులం బూజించుచుండు నంత* (క॥ వి
మలమతిఁ జిత్తగింపుము। రమణీయంబై నవిమలరమ్యక నామవర్షమునను నధిదైవత దా। నమరంగా మత్స్యరూపమున గుహరిద
లంచు* (క॥ అట్టి వర్షమునకు నధిపతి యగుచున్న। మనువు పుత్రపౌత్రమంత్రివరులఁ। గూడి నతత్స్యమైన రుంభినీధగు చిత్తము మఱు
లభక్తియు క్తిహత్తుగొలుపు* (గీ॥ తత్ప్రకాశకృత్ప్రధానమంత్రస్తోత్ర। ములను ధర్మకర్మములను హెచ్చు। మునుజనులు సేసి
పుణ్యులై భుక్తిము। క్తులను బొందుచుందు రెలమి గోడ* (క॥ వినుము హిరణ్మయవర్షం। బునకు గూర్మావతారమును దాల్చిన।
యావనజోదరుఁ డధిదేవత। యనఘుఁడు పితృపతి మహాత్ముఁ డర్యముఁడు నృపా* (క॥ ఆవర్షమందు నర్యము। డావర్షజనం
బుఁ గూడి హరిఁ జిత్తములో భావింప సంస్తవంబులు। గావించుచుఁ గాంచు రతి కైవల్యంబుల్* (క॥ అరయఁగ సీతాలక్ష్మీ। పరి
వృతుఁడై యచ్చిరామభద్రుఁడు గడిమిం। బరగ నధిపుఁడగుఁ గిం। పురుష మహావర్షమునకు భూపవరేణ్యా* (గీ॥ అట్టి రామభద్రు
నంజనీసుతుఁడు కింపురుషగణముఁ గూడి పూజఁ జేసి। తత్ప్రకాశకప్రధానమంత్రస్తోత్ర। పఠనములను దగ నుపాస్తిఁ జేయు (సీ॥
భారతవర్షాధిపతి యైన బదరికాశ్రమమున నున్న నారాయణుండు। భూనాథ యామహాత్ముని నారదాదులు భారతవర్షంబు ప్ర
జలు ప్రేమఁ। బాయకఁ జేరి యుపాస్తిఁ జేయుచు సాంఖ్యయోగంబు నుపదేశము చిత్తవృత్తి నందియంద అనుఁ। గృతార్థులై యట్టి నా
రాయణదేవు నారాధనంబు। చేసి యాత్మఁ జాలఁ జింతించి తత్ప్రకా। శకములయిన మంత్రసంస్తవములఁ। బూజఁ జేసి ముక్తిఁ
బొందుచునుందురు। రచలమైన భక్తి ననుదినంబు* (క॥ భారతవర్షమునం దుల। సారాంశములైన పుణ్యశైలంబులు గం। భీరప్ర
వాహములు గల। వారయ నెఱిఁగింతు మానవనాథా* (వ॥ మలయపర్వతమును, మంగళప్రస్థమును, మైనాకంబును, త్రికూ
టంబును, ఋషభపర్వతంబును, కూటకమును, గొల్లమును, సహ్యపర్వతంబును, వేదగిరియును, ఋశ్యమూకపర్వతంబును,
శ్రీశైలంబును, వేంకటాద్రియును, మహేంద్రంబును, వారిధరంబును, వింధ్యపర్వతంబును, శుక్తిమత్పర్వతంబును, ఋక్ష
గిరియును, పారియాత్రంబును, ద్రోణపర్వతంబును, చిత్రకూటంబును, గోవర్ధనాద్రియును, రైవతకంబును, కకుంభంబును,
నీలగిరియును, గాకముఖంబును, నింద్రకీలంబును, రామగిరియు నాదిగాఁ గల పుణ్యపర్వతంబు లనేకంబులు గల వాపర్వతపుత్రిక
లైన చంద్రవటయుఁ దామ్రపర్ణియు నవటోదయుఁ గృతమాలయు వైహాసియుఁ గావేరియు వేణియుఁ బయస్వినియు బయోంద
యు శర్కరావర్తయుఁ దుంగభద్రయుఁ గృష్ణయు వేణియుఁ భీమరథియు గోదావరియు నిర్వింధ్యయుఁ బయోష్ణియుఁ దాపియు రే
వానదియు శిలానదియు సురసయుఁ జర్మణ్వతియు వేదస్మృతియు ఋషికుల్యయుఁ ద్రిసామయుఁ గౌశికియు మందాకినియు యము
నయు సరస్వతియు దృషద్వతియు గోమతియు సరయువును భోగవతియు సుషమయు శతద్రువును జంద్రభాగయు వితస్తయు నసి
క్నియు విశ్వయు నను నీమహానదులును సింధుశోణములను నదంబులు నట్టి మహాప్రభావంబు లీ భారతవర్షంబున గలవందు ను
స్నాతులైన మానవులు ముక్తిం జెందుదురు మఱియు నీ భారతవర్షంబున జన్మించిన పురుషులు శుక్లలోహితకృష్ణవర్ణరూపం
బులగు త్రివిధకర్మంబులం జేసి క్రమంబుగ దేవ మనుష్య నరకగతులను త్రివిధగతులం బొందుచుందురు వినుము రాగద్వేషాదిశూ
న్యుండును వాఙ్మానసగోచరుండు ననాధారుండు నగు శ్రీవాసుదేవమూర్తి యందుఁ జిత్తంబు నిలుకడఁ జేసి భక్తియోగంబున నా
రాధించెడు మహాత్ము లవిద్యాగ్రంథిదహనంబు గావించుటం జేసి పరమభాగవతోత్తములు పొందెదు రుత్తమగతిని జెందుదు
రు గావున భారతవర్షంబు మిగుల నుత్తమ మని మహాపురుషు లిట్లు స్తుతించుచుందురు* (ఉ॥ భారతవర్షజంతువుల భా
గ్యము లేమని చెప్పవచ్చు నీ। భారతవర్షమందు హరి పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిన్। ధీరత తోడఁ దత్త్వ ముపదేశము సేయుచుఁ జె
ల్మి సేయుచున్। నారయ బాంధవాకృతిఁ గృతార్థులఁ జేయుచు నుండు నెంతయున్* (క॥ తనజన్మకర్మములను। గొనియాడెడి
వారి కెల్లఁ గోరిన నంత। న్దనియఁగ నొసఁగుచు మోక్షం। బనయముఁ గృపఁ జేయుఁ గృష్ణుఁ డవనీనాథా* (వ॥ ఇట్లు భారతవర్షం
బునందుల జనంబులకు నెద్దియు నసాధ్యంబు లేదు నారాయణస్మరణ సకలదురితంబుల నడంచుఁ దన్నామస్మరణరహితంబులైన య
జ్ఞతపోదానాదులు దురితంబుల నడంపలేవు బ్రహ్మకల్పాంతంబుఁ బ్రతికెడి యితరస్థానంబులం బునర్జన్మభయంబున భీతిల్లుచు నుం
డుటకన్న భారతవర్షంబునం దక్షణమాత్రంబు మనంబున సర్వసంగపరిత్యాగంబుఁ జేసిన పురుషశ్రేష్ఠునకు శ్రీమన్నారా
యణపదప్రాప్తి యతిసులభంబున సంభవించుఁ గావున నట్టి యుత్తమం బగు నీ భారతవర్షంబు గోరుచుండుదురు మఱియు నెక్క
డ వైకుంఠుని కథావాసన లేకుండు నే దేశంబున సత్పురుషులయిన పరమభాగవతులు లేకుండుదు రే భూమిని యజ్ఞేశ్వరుని మ
హోత్సవంబులు లేకయుండు నది సురేంద్రలోకంబైన నుండందగదు జ్ఞానానుష్ఠాన ద్రవ్యకలాపంబుల చేత మనుష్యజాతిం
బొందితపంబున ముక్తిం బొందకుండెనేని మృగంబుల మాడ్కి నతండు దనకుం దానె బంధనంబు నొందు భారతవర్షంబునందుఁ
బ్రజలచేత శ్రద్ధాయుక్తంబుగా ననుష్ఠింపంబడిన యజ్ఞంబులయందు వ్రేల్వంబడు హవిస్సులను పెక్కునామంబులం బుండరీ
కాక్షుం డందితనమీఁది భక్తి యధికంబుగాఁ జేయునట్టి భారతవర్షంబునందలి ప్రజలమీఁదం గరుణించి సర్వేశ్వరుం డిహపరసౌ

ఖ్యంబునొనంగుచుండుజంబూద్వీపంబునసగరాత్మజులశ్వమేధాశ్వంబునన్వేషింపంబూని భూఖననంబు సేయుటంజేసి స్వ
ర్ణప్రస్థ, చంద్రశుక్ల,ఆవర్తన, రమణక,మందేహారుణ, పాంచజన్య,సింహళ, లంకయను నెనిమిదియుపద్వీపంబులుగలిగె*
(సీ॥ లక్షయోజనములులవణాబ్ధిపరివృతమగుచుజంబూద్వీపము లీశయిల్లు । విను రెండులక్షలువిస్తృతముగనుప్లక్ష ద్వీపమి
క్షురసాబ్ధిచేత । నావృతమయియుండునారూఢముగనం దువృక్షంబుప్లక్షంబువిదితముగను । దనరునాద్వీపంబుతరునామము
హిమచేమిగులఁబ్లక్షంబనమించిరహిని । నందుసంచరించునట్టివారలకగ్ని । దెపుడుమరునాదిదేవతయగు । నందులోననా
ప్రియవ్రతసుతుఁడగు।నిధ్మజిహ్వుఁడనుమహీవరుండు* (వ॥నరేంద్రా యీయిధ్మజిహ్వుండాప్లక్షద్వీపంబు నేడువర్షంబు
లుగవిభజించియందు నావర్షనామధారులుగానుండు తనపుత్రులగుశివ,యవస్య,సుభద్ర, శాంత,క్షేమ,అభయ,అమృతు
లనియెడు నేడుగురు నేడువర్షంబులకధిపతులంగాఁజేసి యిధ్మజిహ్వుండు తపంబునకుంజనియెనావర్షంబులయందుమణి
కూట,వజ్రకూట,ఇంద్రసేన, జ్యోతిష్మత,ధూమ్రవర్ణ, హిరణ్యగ్రీవ,మేఘమాలలనునామంబులుగల సప్తకులపర్వతంబులు
నరుణయు, నృమణియు, నాంగిరసియు, సావిత్రియు, సుప్రభాతయు, ఋతంభరయు, సత్యంభరయు,ననసప్తమహానదులు
నానదులయందు సుస్నాతులగుచుగతపాపులైనహంసపతంగోర్ధ్వాయనసత్యాంగులను నామంబులుగలచాతుర్వర్ణ్యులుగలి
గియుండుదురందుఁబురుషులు సహస్రవత్సరజీవులును దేవతాసములును దృష్టిమాత్రంబునంగ్లమస్వేదాది రహితంబగున
పత్యోత్పాదనంబుగలవారలగుచు వేదత్రయాత్మకుండును స్వర్గద్వారభూతుండైన భగవత్స్వరూపియగుసూర్యుని వేద
త్రయమ్మునసేవించుచుండు ప్లక్షద్వీపంబాదిగా మీఁదటిద్వీపపంచకంబందలిపురుషులకు నాయురింద్రియపటుత్వంబులును దే
జోబలంబులునుదోడనెజనియించుచుండు*(క॥ప్లక్షద్వీపముద్విగుణిత।లక్షేక్షురసాబ్ధిసుట్టిరావిలసిల్లు। న్నిక్షురసోదద్విగు
ణం।బక్షయముగశాల్మలీమహాద్వీపమిలన్ (వ॥అందుశాల్మలివృక్షంబుప్లక్షాయామంబై తేజరిల్లునావృక్షరాజంబునకున
ధోభాగంబునఁబత్త్రిరాజుగానుండుగరుత్మంతుండు నిలకడగావసించునాశాల్మలీవృక్షంబు పేర నాద్వీపంబుశాల్మలీద్వీపం
బనవిలసిల్లునాద్వీపపతియైనప్రియవ్రతాత్మజుండగుయజ్ఞబాహువుతనపుత్రులగు సురోచన,సౌమనస్య, రమణక,దేవబర్హ,
పారిబర్హ,ఆప్యాయనులనియెడువారి పేరనావర్షంబుల నేర్పఱచి యావర్షంబులయం దేడ్వురఁగుమారులనభిషిక్తులం
జేసెనావర్షములయందుస్వరస, శతశృంగ,వామదేవ,కుముద, ముకుంద,పుష్పవర్ష, శతశ్రుతులను పర్వతసప్తకంబు,
ననుమతియు,సినీవాలియు,సరస్వతియు, కుహూ,అజని,నంద,రాకయు, ననుసప్తమహానదులును,శ్రుతధర,విద్యాధర,వసుం
ధర,ఇధ్మధరసంజ్ఞులగు నావర్షపురుషులు భగవత్స్వరూపుండును వేదమయుండు నాత్మస్వరూపియునగుసోముని వేదమం
త్రంబులచే నారాధించుచురాద్వీపంబు లక్షచతుష్టయపరిమితయోజనవిస్తృతమయిన సురాసముద్రముచే నావృతమై తేజ
రిల్లునంత* (సీ॥భూనాథయాసురాంభోధికిఁజుట్టుగానుండుకుశద్వీపమురివిమీఁద।ఘోరమైతాద్విచతుర్లక్షయోజనంబుల
నువిస్తారమైపాలుపుమిగులు । నందుఁగుశస్తంభమనిశంబు దేవతాకల్పితంబైనట్టి కాంతిచేత । దిక్కులు వెలుఁగించుద్వీపంబు
నకుఁదనపేరనుసత్కీర్తిపెంపు సేయు । నట్టిదీవికియధిపతియగుప్రియవ్ర । తాత్మజుండుహిరణ్యరేతస్సనంగ।దనరుభూపతి
తవసుతనామములను।వర్షములు సేసెనత్యంతహర్షమునను*(వ॥ఇట్లుహిరణ్యరేతస్సువసుదాన,దృఢరుచి,నాభి,గుప్త
సత్యవ్రత,విప్ర, వామదేవులను, నామంబులుగల పుత్రులనామంబులసప్తవర్షంబులంగావించి యాకుమారసంతతినిలిపి తా
నుదపంబునకుంజనియెనావర్షంబునందు బభ్రు,చతుశ్శృంగ,కపిల,చిత్రకూట, దేవానీక,ఊర్ధ్వరోమ,ద్రవిణులను,నామం
బులుగలసప్తగిరులును, రసకుల్యయు, మధుకుల్యయు, శ్రుతవిందయు, మిత్రవిందయు, దేవగర్భయు, ఘృతచ్యుతయు,మం
త్రమాలయు,ననుసప్తమహానదులు, నానదీజలంబులఁగృతమజ్జనులగుచు భగవంతుండగుయజ్ఞపురుషుని, కుశల, కోవిద,అ
భియుక్తులను,కులములుగలవర్షపురుషులారాధించుచుందురు* (సీ॥ఆకుశద్వీపంబునరికట్టుకొనియుండు నెనిమిదిలక్షలఘు
నఘృతాబ్ధి। యాఘృతసాగరంబవ్వలషోడశలక్షయోజనములలలితమగుచు । నుండుఁగ్రౌంచద్వీపమురిపిశయందుమధ్యప్ర
దేశంబునసట్టిదీవి । పేరుఁగాఁదనపేరఁబెద్దగాఁజేసినక్రౌంచాద్రిగలదానగంబుమున్ను। షణ్ముఖుండుదివ్యశరమునఘనశతం।
బంబుదూయ నేయఁబాలవెల్లి।గరిమఁదదుపుచుండువరుణుండురక్షింప।నంతమిగులభయమునొందకుండె* (వ॥ నరేంద్రా
యాక్రౌంచద్వీపపతియగు ఘృతపృష్ఠుండుదనకుమారుల పేరంగలయామోద, మధువహ, మేఘపృష్ఠ,సుధామ,ఋషిజ్య,
లోహితార్ణ,వనస్పతులనువర్షంబులనభిషిక్తులంజేసిపరమకల్యాణగుణయుక్తుండైన శ్రీహరిచరణారవిందంబుల సేవించు
చుండపంబునకుంజనియెనావర్షంబులయందు, శుక్ల,వర్ధమాన,భోజన, ఉపబర్హణ,ఆనంద, నందన,సర్వతోభద్రములనుస

ప్లక్షము-జువ్వెనచెట్టు—క్లమస్వేదాది-చెమటమొదలగునవి—శాల్మలి-బూరగచెట్టు—పతత్రి - పక్షి—చతుష్టయ-నాలుగు—విస్తృ
తము-విశాలము—ఘోరమై-ఘనమయి.

ప్తసీమాపర్వతంబులు,నభయ,అమృతౌఘయు, నార్యకయుఁ,దీర్ఘవతియుఁ,దృప్తిరూపయుఁ, పవిత్రవతియు,శుక్లయు,నను
సప్తనదులయందునుపవిత్రోదకంబులనుభవించుచు, గురు,ఋషభ, ద్రవిణక, దేవక, సంజ్ఞలుగలిగివరుణదేవునినుదకాంజ
లులంబూజించుచున్నచాతుర్వర్ణ్యంబులుగలిగియుండు* (సీ॥ జగతీశవినుము క్రౌంచద్వీపమునుజుట్టియుండుషోడశలక్షయో
జనముల । విస్తారమైపాలవెల్లియందునను శాకద్వీపముతుల్యప్రకాశమొందు । దండిమై ముప్పదిరెండులక్షల యోజనములవి
స్తారమైయమరియుండు । నందునశాకవృక్షమామోదమాద్వీపమునుసుగంధంబునఁబెనఁగఁజేసి।యంతఁదనపేరదీవిప్రఖ్యాతమ
మరఁ।జేసియంతనమిగులఁబ్రసిద్ధికెక్కె । నందుమేధాతిథియుఁగర్తయగుచునుండెఁ। దవిలివేడుకఁదనదునందనులఁజూచి*
(వ॥మఱియునాప్రియవ్రతపుత్రుండయిన మేధాతిథితనపుత్రులపేరంగలపురోజవ, మనోజవ, వేపమాన,ధూమ్రానీక, చి
త్రరథ,బహురూప,విశ్వధారులను, సంజ్ఞలుగలసప్తవర్షంబులయందు, వారలకుఁబట్టంబుగట్టిశ్రీహరిపాదసేవసేయుచుఁ
దపోవనంబునకుంజనియె నాశాకద్వీపంబునందు,నీశాన, ఉరుశృంగ,బలభద్ర, శతకేసర,సహస్రస్రోతో, దేవపాల,మహాన
సములను,సీమాగిరులు,ననఘు, ఆయుర్దఉభయస్పృష్టి,అపరాజిత,పంచనది, సహస్రస్పృతి,నిజధృతియు,ననుసప్తనదులు, నాన
దీజలంబు లుపయోగింప నచ్చటివారలు ప్రాణాయామంబుఁజేసి విధ్వస్తరజస్తమోగుణంబులుగల్గిపరమసమాధినివాయు
రూపంబైన భగవంతునిసేవించు, ఋతవ్రత,సత్యవ్రత, దానవ్రతనువ్రత, నామంబులుగలచాతుర్వర్ణులుంగలిగి యుండుదు
రు*(సీ॥అట్టిశాకద్వీపమరికట్టితత్ప్రమాణంబునదధిసముద్రంబువెలుఁగు । నందుకుఁబరివృతంబై పుష్కరద్వీపమిలఁజతుష్ష
ష్టిలక్షలవిశాల।మమ్మహాదీవియందయుతకాంచనపత్రములఁగల్గికమలగర్భునకునాస । నంబగుపంకేరుహంబుండు నాద్వీపమ
ధ్యంబుననునొక్కమానసోత్తరంబనంగఁబర్వతంబుండుఁదనకుఁబూర్వాపరములనుండు నట్టివర్షములకు రెంటికిట్లునిలిచి
నమర్యాద।నగమనంగఁజాలఁబొగడునొందు*(వ॥ఇట్లుదనకులోపలివెలుపలివర్షంబుల రెంటికిమర్యాదాచలంబునుంబోలి
యున్నమానసోత్తరపర్వతంబయుతయోజనవిస్తారంబు నంతియ యౌన్నత్యంబునుగలిగి యుండు నానగంబునకునలుదిక్కు-
లయందునాలుగులోకపాలురపురంబులుండు నామానసోత్తరపర్వతంబుతుద సూర్యరథచక్రంబు సంవత్సరాత్మకంబై య
హోరాత్రంబులయందు మేరుప్రదక్షిణంబుసేయు నందు నాపుష్కరద్వీపాధిపతియగు వీతిహోత్రుండు రమణకధా
తకనామంబులుగలపుత్రులనిరువురవర్షద్వయంబునందభిషిక్తులంజేసి తాను పూర్వజులేగినతెఱంగున భగవత్కర్మశీలుం
డగుచుఁదపంబునకుంజనియెనంత* (క॥ మనుజేశ్వరయావర్షంబుననప్పుడుసంచరించుపురుషులుపద్మా।సనునిదగనర్చనా
రాధనసేయుదురచలబుద్ధితాత్పర్యమునన్*(క॥ధరణీవల్లభవినుపు । ష్కరమనుద్వీపమునలేరుచాతుర్వర్ణ్య।స్వరగఁగభేద
ములేకే।నరసతసమ్ములగుదురందుసకలజనంబుల్ * (వ॥ మఱియునాపుష్కరద్వీపంబు చతుష్షష్టియోజన విస్తారంబైనశు
ద్ధోదకసముద్రముద్రితంబగుచుండు నవ్వల లోకాలోకపర్వతంబుండు శుద్ధోదకసముద్ర లోకాలోక పర్వతంబులనడుమ
రెండుకోట్లయోజన విస్తారంబైన నిర్జనభూమి దర్పణోదరసమానంబై దేవతావాసయోగ్యంబుగానుండు నాభూమింజేరి
నపదార్థంబుమఱలఁబొందనశక్యంబుగానుండు నటమీఁద లోకాలోకపర్వతం బెనిమిదికోట్ల యోజనంబులు సువర్ణభూమి
యు సూర్యాదిధ్రువాంతంబులగు జ్యోతిర్గణంబుల మధ్యంబున నుండుటంజేసి లోకాలోక పర్వతంబనఁదగియుండుఁ బం
చాశత్కోటియోజనవిస్తృతంబగుభూమండలమానంబునకుఁదురీయాంశప్రమాణంబుగల లోకాలోకపర్వతంబుమీఁద
నఖిలజగద్గురువగుబ్రహ్మచేతఁజతుర్దిశలయందు, ఋషభ,పుష్కర,చూడ, వామనా, పరాజిత, సంజ్ఞలుగల దిగ్గజంబులు నా
లుగునులోకరక్షణార్థంబునిర్మితంబై యుండునంత* (సీ॥ తనదువిభూతులై తనరినయాదేవబృందతేజశ్శౌర్యబృంహణార్థ।
మైభగవంతుఁడు నగునాదిదేవుండునైనజగద్గురుండచ్యుతుండు। సరిలేనిధర్మవిజ్ఞానవైరాగ్యాదులై నవిభూతులనలరియున్న।
యట్టివిష్వక్సేనుఁడాదిగావెలుఁగుపార్షదులతోఁగూడిప్రశస్తమైన। నిజవరాయుధదోర్దండనిత్యసత్త్వఁ । డగుచునాపర్వ
తంబుపైనఖిలలోక।రక్షణార్థంబుకల్పపర్యంతమతఁడు।యోగమాయావిరచితుఁడై యొప్పుచుండు*(వ॥ అట్లువివిధమంత్ర
గోపనార్థంబానగాగ్రంబుననున్న భగవంతునిఁదక్క లోకాలోకపర్వతంబునకునవ్వలనొరులకుసంచరింపనశక్యంబై యుం
డుబ్రహ్మాండంబునకు సూర్యుండుమధ్యగతుండై యుండునాసూర్యునకును భయపక్షంబులయందు నిరువదేనుకోట్లయోజన
పరిమాణంబుననండకటాహంబుండు నట్టిసూర్యునిచేతవాకాశదిక్స్వర్గాపవర్గంబులును నరకంబులునునిర్ణయింపంబడు దేవ
తిర్యఙ్మనుష్యనాగపక్షితృణగుల్మలతాదిసర్వజీవులకుసూర్యుండాత్మయగుచునుండు* (క॥కరమనురాగంబుననీ।ధరణీమం
డలమున్నసన్నిధానంబెల్ల।న్నరవరయెఱుగంజెప్పితి।మఱివిని చెదవినుముదివ్యమానంబెల్లన్*(గీ॥కమలజాండమధ్యగతుఁడై న
సూర్యుండు భరితమైనయాతపంబుచేత।మూఁడులోకములనుమించితపింపఁగఁ।జేసికాంతినొందఁజేయుచుండు*(వ॥ఇట్లు
భాస్కరుండుత్తరాయణ దక్షిణాయనవిషువులనునామంబులుగల మాంద్యతీవ్రసమానగతుల నారోహణావరోహణస్థానం

*** భ గో ళ వి ష య ము. ***

బులయందుదీర్ఘహ్రస్వసమానంబులుగాఁ జేయుచుండు* (గీ॥ మేషతులలయందుమిహిరుండహోరాత్రు । లందుఁదిరుగు సమవిహారములను।బరఁగగవృషభాదిపంచమాసములనొ । క్కొక్క గడియరాత్రిఁదక్కనడుచు* (గీ॥ మించివృశ్చికాదిపం చమాసములనొ।క్కొక్క గడియరాత్రినిక్క నడుచు।దివములందునెల్లదిగజారునొక్కొక్క । గడియనెలకుఁదప్పకారము నను* (వ॥ మఱియునివ్విధంబునదివసంబులుత్తరాయణదక్షిణాయనములవృద్ధిక్షయంబులనొందనొక్కయహోరాత్రం బునఁనేకపంచాశదుత్తరనవకోటియోజనంబులపరిమాణంబుగల మానసోత్తరపర్వతంబున సూర్యరథంబుతిరుగుచుండు నా మానసోత్తరపర్వతంబునందుఁ దూర్పునదేవధానియనునింద్రపురంబును దక్షిణంబునసంయమనియనుయమనగరంబును ప శ్చిమంబునని మ్లోచనియనువరుణపట్టణంబు నుత్తరంబునవిభావరియను సోమునిపుటభేదనంబును జెజరిల్లుచుండు నాపట్టణం బులయందునుదయమధ్యాహ్నాస్తమయ నిశీథంబులనియెడు కాలభేదంబులను భూతప్రవృత్తినివృత్తినిమిత్తం బచ్చటిజనుల కుంబుట్టించుచుండు సూర్యుఁడెపుడింద్రనగరంబుననుండి గమనించునదియాదిగాఁ బదియేనుగడియలను రెండుకోట్లుముప్ప దియేడులక్షల డెబ్బదియైదువేలయోజనంబులునడచు నివ్విధంబునసింద్రయమవరుణ పురంబులమీఁదఁ జంద్రాదిగ్రహనక్ష త్రంబులంగూడిసంచరించుఁబండ్రెండంచులు, నాలుకమ్ములును, మూఁడుతొలులుంగలిగి, సంవత్సరాత్మకంబై, యేకచక్రం బైన, సూర్యునిరథంబు, ముహూర్తమాత్రంబున, నష్టశతాధికచతుస్త్రింశల్లక్షయోజనంబులు సంచరించు* (సీ॥ ఇనుర థంబుననున్నయిరుసొక్కటియమేరుశిఖరంబునందును జేరియుండు । నొనరఁజక్రముమానసోత్తరపర్వతంబందుఁదిరిగెడు నారథంబు। నిరుసుననున్నరెండిరుసులుదగులంగఁబవనపాశంబులబద్ధమగుచు । ధ్రువమండలంబునందులనంటియుండఁగా సంచరించుచునుండుసంతతంబు । నట్టియరదంబు ముప్పదియాఱులక్ష । లందునంటినకాడియున్నయోజ । నములవిస్తార మైతురంగములకంధ । రములఁదగులుచువెలుగొందురమణతోడ* (వ॥ ఆరథంబునకుగాయత్రీఛందంబాదిగాసప్తఛందం బులునశ్వంబులై సంచరించు భాస్కరునకునగ్రభాగంబున నరుణుండునియుక్తుండై రథంబుగడుపుచుండు నంగుష్ఠపర్వమా త్రశరీరంబులుగల యఱువదినేలవాలఖిల్యాఖ్యులగు ఋషివరులుసూర్యునిముందట సౌరసూక్తంబులస్తుతియింప మఱియు ననేకమునులును గంధర్వకిన్నరకింపురుష నాగాప్సరఃశతంగాదులు నెలనెలవరుసక్రమంబునసేవింపం దొమ్మిదికోట్లునేఁ బదియొకలక్షయోజనంబుల పరిమాణంబుగల భూమండలంబునందొకక్షణంబున సూర్యుండు రెండువేలయేఁబది యోజన ములుసంచరించుచు నొకయహోరాత్రంబునందె యాభూమండలంబంతయుసంచరించునని శుకయోగీంద్రుఁడు నకుఁబరీ క్షిన్నరేంద్రుండిట్లనియె* (క॥ మునివరమేరుధ్రువులకు । నొనరఁబ్రదక్షిణముఁదిరుగుచుండెడియాసూ।ర్యునకునురాశికినెదు రుగఁ।జనుచందముతేటపడఁగఁజనునెఱిఁగింపన్* (క॥ అనిపలికినభూవరునిం। గనుఁగొనిశుకయోగివిభుగులగరుణాన్వితుఁడై మనమునశ్రీహరిఁదలఁచుచు । వినుమనిక్రమ్మఱఁగనిట్లువినిపించెదగన్* (వ॥ నరేంద్రాయతివేగంబునఁదిరుగుచుండుకులా లచక్రంబునందుఁ జక్రభ్రమణమునకువేఱైనగతినొంది బంతిసాగితిరిగెడు పిపీలికాదులచందంబున నక్షత్రరాసులతోఁగూడి నకాలచక్రంబు ధ్రువమేరువులంబ్రదక్షిణంబు తిరుగునపుడా కాలచక్రంబునెదురసంచరించు సూర్యాదిగ్రహంబులకు నక్ష త్రాంతరంబుల యందునురాశ్యంతరంబులయందునునికి గలుగుటంజేసిసూర్యాది గ్రహంబులకుఁజక్రగతి స్వగతులవలనగ తిద్వయంబుగలుగుచుండు మఱియునాసూర్యుండాది నారాయణమూర్తియగుచులోకంబుల యోగక్షేమంబులకు వేదత్ర యాత్మకంబునుగర్మసిద్ధినిమిత్తంబును దేవర్షిగణంబులచేత వేదాంతార్థంబుల ననవరతంబువితర్క్యమాణంబగుచున్నత నస్వరూపంబును ద్వాదశవిధంబులుగవిభజించి వసంతాదిఋతువుల నాయాకాలవిశేషంబులయందుఁగలుగఁజేయుచుండు నట్టిపరమపురుషునిమహిమ నీలోకంబునమహాత్ములగు పురుషులు వారివారి వర్ణాశ్రమాచార క్రమంబున వేదోక్తప్రకా రంబుగా భక్త్యతిశయంబుననారాధించుచు క్షేమంబునొందుచుందు రట్టి యాదినారాయణ మూర్తి జ్యోతిశ్చక్రాంతర్వ ర్తియైస్వకీయతేజఃపుంజ దీపితాఖిలజ్యోతిర్గణంబులుగలవాఁడై ద్వాదశరాసులయందు నొకసంవత్సరంబునసంచరించు చుండు నట్టియాదిపురుషుని గమనవిశేషకాలంబునులోకులయనఋతుమాసపక్షతిథ్యాదులచే వ్యవహరించుచుందురు మఱి యునప్పరమపురుషుండారాసులయందు షష్ఠాంశసంచారంబునొందిన సమయంబును ఋతువనివ్యవహరింపుదు రారాసు లయందునర్ధాంశసంచారమ్మున రాశిషట్కభోగంబొందినతఱి యయనమనిచెప్పుదురు సమగ్రంబుగారాసులయందు సం చారమొందినయెడలనట్టికాలంబునుసంవత్సరంబని నిర్ణయింపుదురిట్టిసమగ్రరాశిసంచారంబునందు శీఘ్రగతిమందగతిస మగతులనియెడుత్రివిధగతివిశేషంబులవలన వేఱువడెడు నావత్సరంబును, సంవత్సరంబు, పరివత్సరం, బిడావత్సరంబనువ త్సరం,బిద్వత్సరంబని,పంచవిధంబులఁజెప్పుదురు,చంద్రుం డీరెండుసున నాసూర్యమండలంబుమీఁద లక్షయోజనంబులను

డిసంవత్సర పక్షరాశినక్షత్రభుక్తులు గ్రహించుచు నగ్రచారియై శీఘ్రగతిం జరించు ననంత వృద్ధిక్షయరూపంబునఁ బితృగణంబులకుఁ బూర్వపక్షాపరపక్షంబులచేత నహోరాత్రంబులఁ గలుగఁ జేయుచు సకలజీవప్రాణంబై యొక్కొక్కనక్షత్రంబు త్రింశన్ముహూర్తంబు లనుభవించుచు షోడశకళలు కలిగి మనోమయాన్నమయామృతమయదేహుండై దేవపితృమనుష్యభూతపశుపక్షిసరీసృపవీరుత్ప్రభృతులకుఁ బ్రాణాప్యాయనశీలుండగుటం జేసి సర్వసముండనంబడు* (క॥ చందురునకు మీఁదైయా। నందంబు లక్షయోజనంబులఁ దారల్। గ్రదుందుకొని మేరుశైలం। బంది ప్రదక్షిణముఁ దిరుగు నభిజిన్ముఖతో ౯* (సీ॥ అట మీఁద దారలకన్న టికుపరియై రెండు లక్షల శుక్రుఁ డుండి భాస్క । రునికి ముందరఁ బిఱుదను సావ్యాస్యుఁడు శీఘ్రసంచారముల ను భాస్కరుని మాడ్కిఁ। జరియించుచుండు ను జనులకు ననుకూలుఁడై వృష్టి నొసఁగుచు ననంతరంబ । జనురత వృష్టివిష్టంభక గ్రహశాంతిఁ నొనరించువారలకొసఁగు శుభము । లుండు నామీఁద సౌమ్యుండు రెండు లక్ష । లన జరించు దురహి మండలంబుఁ బాసి। కండ్ల బడినను జనులకు క్షామ డాంబ । రాదిభయములఁ బుట్టించు నతులమహిమ* (సీ॥ ధరణీతనూజుఁ డంతటిమీఁద రెండు లక్షలనుండ మూఁడు పక్షములనొక్క । రాశిదాఁటుచు నుండు గ్రమమున ద్వాదశ రాసులఁ భుజియించు రాజసమున । వక్రించియైనన వక్రతనైనను దఱుచుగాఁ బీడలు నరులకొసఁగు। నంగారకుని కంటె కావల రెండు లక్షల యోజనంబుల ఘనితమించి యొక్కరాశినుండు నొక్కొక్క వత్సరం । బనుభవించుచుండు నమరగురుఁడు । వక్రమంకనైన వసుధామరులకును। శుభమొనొసఁగు నెపుడు నభినవముగ* (క॥ సురగురునకు మీఁదై భా। స్కరసుతుఁడిరులక్షలను జగములకుఁ బీడల్ । జరుపుచుఁ ద్రింశన్మాసము। లరుదుగ నొక్కొక్క రాశియందు వసించున్* (క॥ ప్రాకటముగ రవిసుతునకు। నేకాదశలక్షలను మహీసురులకు నీ। లోకులకు మేలుగోరుచుఁ। జోకగ ముని సప్తకంబు సొంపు వహించున్* (క॥ మునిసప్తకమున కెక్కు-వఁ । దనరుచు నామీఁదఁ ద్రయోదశలక్షలఁ జెం। పున శింశుమారచక్రం। బనఁగా నన్నిటికి నుపరియగుచుండు నృపా* (సీ॥ ఆశింశుమారాఖ్యమగుచు చక్రమున భాగవతుఁడైన ధ్రువుఁ డింద్రవరుణకశ్య । పప్రజాపతియమప్రముఖులతోఁ గూడి బహుమానముగ విష్ణుపదముఁ జేరి । కడఁక నిచ్చలు ప్రదక్షిణముగాఁ దిరుగుచు చెలఁగియుండును గల్పజీవియగుచు । ననఘుఁ డుత్తానపాదాత్మజుఁ డార్యుఁడు నైనయా ధ్రువుని మహత్త్వమెల్లఁ। దెలిసి వర్ణింప బ్రహ్మకైన లవిగాదు । నేనెంతెంగిన యంతయు నీకు మున్న। తెలియఁ బలికితిఁ గ్రమ్మఱఁ దలఁచికొనుము । జితరిపువ్రాత శ్రీపరీక్షిన్నరేంద్ర* (వ॥ మఱియు నా ధ్రువుండు నిమిషమాత్రంబెడలేక సంచరించు జ్యోతిర్గ్రహనక్షత్రంబులకు నీశ్వరునిచేత ధాన్యాక్రమణంబునఁ బశువులకై యొగ్గఁబడిన మేఢిస్తంభంబు తెఱంగున మేటిగాఁ గల్పింపంబడి ప్రకాశించుచుండు గగనంబునందు మేఘంబులును శ్యేనాదిపక్షులును వాయువశంబునం గర్మసారథులై చరించు తెఱంగున జ్యోతిర్గణంబులును బ్రకృతిపురుషయోగగృహీతాశయులై కర్మనిమిత్తగతిగలిగి వసుంధరం బడుచుండు* (క॥ పొందుగ జ్యోతిర్గణములు। నందము గా శింశుమారమం దులనుండం। గొందఱు దఱుచుగఁ జెప్పుచు । నుందురు విని పింతు వినుమమోఘచరిత్రా* (క॥ తలక్రిందై వట్రువయై। సలలితమగు శింశుమారచక్రమునందున్। నెలకొని పుచ్ఛాగ్రంబున। నిలిచి ధ్రువుం డుండు నెపుడు నిర్మలచరితా* (వ॥ మఱియు నా శింశుమారచక్రపుచ్ఛంబునఁ బ్రజాపతియు నాగ్నింద్రధర్ములును బుచ్ఛమూలంబున ధాతవిధాతలును గటిప్రదేశంబున ఋషిసప్తకంబును దక్షిణావర్తకుండలీభూత భూతశరీరంబునకు నుదగయననక్షత్రంబులును దక్షిణపార్శ్వంబున దక్షిణాయన నక్షత్రంబులును పృష్ఠమార్గంబున దేవమార్గంబును నాకాశగంగయు నుత్తరభాగంబునఁ బునర్వసుపుష్యంబులును దక్షిణాయనంబున నార్ద్రాశ్లేషలును దక్షిణవామపాదంబుల నభిజిదుత్తరాషాఢలును దక్షిణవామనాసారంధ్రంబుల శ్రవణపూర్వాషాఢలును దక్షిణవామలోచనంబుల ధనిష్ఠామూలలును దక్షిణ వామకర్ణంబుల మఘాదినక్షత్రంబులును వామపార్శ్వంబున దక్షిణాయనంబును దక్షిణపార్శ్వంబునఁ గృత్తికాది నక్షత్రత్రయంబును నుత్తరాయణంబును వామదక్షిణస్కంధంబుల శతభిషాజ్యేష్ఠలును త్తరహనువున నగస్త్యుండును నపరహనువున యముండును ముఖంబున నంగారకుండును గుహ్యంబున శనైశ్చరుండును మేఢ్రంబున బృహస్పతియును వక్షంబున నాదిత్యుండును నాభిని శుక్రుండును జిత్తంబున చంద్రుండును స్తనంబుల నశ్వినులును బ్రాణాపానంబుల బుధుండును సర్వాంగంబులను శనికేతుగ్రహంబులు సురోమంబున దారలునుండు నదిసర్వదేవతామయంబైన పుండరీకాక్షుని దివ్యదేహంబు ధ్రువునిగా నెఱుంగుము* (సీ॥ ఇట్టిదివ్యశరీర మెవ్వఁడు ప్రతిదినంబును సంధ్యాకాలమతులభక్తి। మనమందు నిలిపి యేమఱక మిక్కిలి ప్రయత్నంబున నియతుఁడై తత్త్వబుద్ధి। మౌనవ్రతంబునఁ బూని వీక్షించుచు నీసంస్తవంబుఁ దానెంతఁ బ్రేమ । జపియించి కడుఁ బ్రశస్తమును మునీంద్రసేవ్యమును జ్యోతిస్స్వరూపమున వెలుఁగు। విపులశింశుమారవిగ్రహంబునకు వం । దనము వందనంబులను చు నిలిచి। సన్నుతించె నేని సకలార్థసిద్ధులఁ। బొందు మీఁద ముక్తిఁ జెందు నధిప* (క॥ ఇనమండలంబునకు క్రిం। దను దశసాహస్రయోజనంబుల స్వర్భానుని మండలంబు గ్రహమై। ఘనముగ నపసవ్యమార్గగతి నుండు నృపా* (క॥ అసురాధముఁడగు రాహువు। బిసరుహసంభవుని వ

రము పెంపున నెంతయు న్బసయగు నమరత్వంబున నసమానంబైన గ్రహవిహారముఁ బొందెన్* (సీ॥ జననాథ రాహువుజన్మక
ర్మంబులు వినిపింతు మున్న విస్తరించి । యయుతయోజనవిస్తృతార్కమండలము ద్విషట్సహస్రవిశాల।చంద్రమండల
ముఁబర్వకాలంబులను త్రయోదశసహస్రవిశాలమైమీఁదరాహుగప్పు । నదిచూచియుపరాగమనుచును బలుకుదురెల్లవా
రునస్వథమేచ్ఛలగుచు। నంతలోననిశశాంక మండలములఁ।గుణఁబ్రోవఁదలఁచిహరిసుదర్శ।నంబువచ్చుననుభయంబు
ననైదాఁటు।గడియలవురాహువడినిదొలఁగు* (క॥ నరవరయా రాహువునకు। సరసతనాక్రిందసిద్ధచారణవిద్యా।ధరుల
యుతయోజనంబులఁ।నిరముగవసియించిలీలఁదిరుగుచురచటన్* (క॥ పరికింపసిద్ధవిద్యా। ధరులకుఁబదివేలుక్రిందఁదరలక
యక్షు।ల్మరియును భూతప్రేతలు । జరియింతురు రాక్షసులు పిశాచులుగొలువన్* (గీ॥ వారిక్రిందఁదగిలివాయువశంబున
మలయుచుండు మేఘమండలంబు।మేఘమండలంబుమీఁదగుచుండుభూ।మండలంబుక్రిందనుండునధిప* (వ॥ అట్టిభూమండ
లంబుక్రిందయోజనాయుతాంతరంబుననండకటాహాయామంబుగలిగి క్రమంబున నొండొంటిక్రిందగుచు, నతల,వితల,
సుతల,రసాతల,తలాతల,మహాతల, పాతాళలోకంబులుండు, నట్టిబిలస్వర్గంబులయందు నుపరిస్వర్గంబునకధికంబైన కామ
భోగంబులనైశ్వర్యానందంబులను సుసమృద్ధ వనోద్యాన క్రీడావిహార స్థానంబుల ననుభవించుచు దైత్యదానవకాద్రవే
యాదిదేవయోనులు సత్యప్రముదితానురక్తులగుచుఁగళత్రాపత్య సుహృద్బంధు దాసీదాస పరిజనులతోఁ జేకుకొని మణిగణ
ఖచితంబులగుసతిరమణీయగృహంబులయందు నీశ్వరునివలనంజేటులేని కాయంబులుగలిగి వివిధమాయావిశేష నిర్మితనూ
తనకేళీసదనవిహారమంటపవిచిత్రోద్యానాదులయందుఁ గేళీవినోదంబులసలుపుచు జరియింతురంత* (సీ॥ అట్టిపాతాళం
బులందునుమయకల్పితములగుపుటభేదనములయందు । బహురత్ననిర్మితప్రాకారభవనగోపుర సభాచైత్యచత్వరవిశేష।
ములయందునాసురావ లమిథునముల చేశుకపికశారికానికరసం।లములశోభిల్లుకృత్రిమభూములనుగల గృహముల చేనలం
కృతములగుచుఁ।గుసుమఫలసుగంధికిసలయ స్తబకసం। తతులచేతనవనతంబులయిన । వృక్షరాజంబుసంకుల మెలయఁ చుండు।
శారికాకీరపికములుసంతతంబు* (వ॥ మఱియు నానావిధజలవిహంగమమిథునంబులుగలిగి నిర్మలజలపూరితంబులై మత్స్య
కులసంచారక్షుభితంబులయిన కుముద కువలయ కల్హారలోహితశతపత్రాదికంబులఁ దేజరిల్లెడుసరోవరంబులుగలయుద్యా
ననంబులయందుఁ గృతనికేతనులై స్వర్గభూముల నతిశయించినవివిధ విహారంబులుగలిగి యహోరాత్రాది కాలవిభా
గభయంబులులేక మహాహిప్రవరుండయిన శేషుని శిరోమణి దీధితులచే నంధకారోపద్రవంబులేక యెల్లప్పుడుదివసాయ
మానంబుగానుండునాలోకంబునందు నఖిలజనులుదివ్యౌషధిరసరసాయనంబుల ననవరతంబున్నపానంబులుగా సేవించు
టంజేసియచ్చటివారలకునాధివ్యాధులును వళితపలితంబులును జరారోగంబులునుశరీరవైవర్ణ్యంబులును స్వేదదౌర్గంధ్యం
బులునుగలుగక పరమకల్యాణమూర్తులగుచు హరిచక్రభయంబుదక్క నన్యంబగు మృత్యుభయంబునొందక నుండురదియు
నుంగాక* (గీ॥ అట్టిపాతాళలోకంబునందువిష్ణు।చక్రమెప్పుడేనియుఁబ్రవేశంబునొందు।నప్పుడెల్లనుదైత్యకులాంగనలకు।
గర్భసంపదలందందఁగలఁగుచుండు*(చ॥అతలమునందుమయసుతుండైనబలాసురుండును।న్మతిఁజరియించుషణ్ణవ
తిమాయలగూర్చి వినోదమందుచున్ । సుతలమునందు నేఁడునొకకొందలునచ్చటిమాయఁజెందినం। తతముఁజరించుచుం
డుదురునప్పుడు మోహనిబద్ధచిత్తులై *(వ॥అట్టిబలునియావలింతలను స్వైరిణులు కామినులుపుంశ్చలులను స్త్రీగణంబులుజని
యించిరాకామినీజనంబులు పాతాళంబుబ్రవేశించినపురుషునకిహాటకరసంబునెడుసిద్ధరసఘుటికనిచ్చి రససిద్ధునింగావిం
చియతనియందుస్వవిలాసావలోకనానురాగస్మితసల్లాపోపగూహనాదుల నిచ్ఛావిహారంబుసలుపుచుండ నాపురుషుండును
దాంధుండై తానె సిద్ధుండననియును, నాగాయుతబలుండననియును, దలంచి నానావిధ రతిక్రీడలఁ బరమానందంబునొందు
చుండు*(సీ॥హాటకేశ్వరుఁడైనయంబికాధీశుండువితలంబునందుల వేడ్కనిలిచి। తనదుపార్షదభూతతతులతోఁబ్రహ్మసర్గో
పబృంహణముననొక్క।చోటఁబార్వతీసంభోగపరుఁడగుచుండఁగా వారలవీర్యంబువలనఁబుట్టి । నట్టిహాటకియనియెడున
దియనిలాగ్నులుభక్షించి యంతనుమియ।నదియుహాటకమనుపేరవతిశయిల్లి।వన్నెమీఱుచు శుద్ధసువర్ణమయ్యె। నాసువర్ణం
బునాలోకమందుమున్న।జనులకెల్లనువినుతభూషణములయ్యె* (సీ॥ ఆక్రిందసుతలంబునందుమహాపుణ్యుఁడగువిరోచనపు
త్రుఁడైనయట్టి । బలిచక్రవర్తియాపాకశాసనునకు ముదమొసగఁగఁగోరియదితిగర్భ । మునవామనాకృతిఁబుట్టియంతటఁ
త్రివిక్రమరూపముననుభోకత్రయంబు । నాక్రమించినదానవారాతిచేతముందటనియాఁబడినయింద్రత్వమిట్లు । గలుగువాఁ
డుపుణ్యకర్మసంధానుండు।హరిపదాంబుజార్చనాభిలాషుఁ । డగుచుశ్రీరమేశునారాధనముసేయు। చుండునెప్పుడునతిమ
హోత్సవమున* (వ॥ నరేంద్రా సకలభూతాంతర్యామియును దీర్ఘభూతుండునైన నాసుదేవునియందుఁ జిత్తంబుగలిగియి
చ్చినభూదానంబునకు సాక్షాత్కరించిన మోక్షఫలంబగుంగాని పాతాళ స్వర్గ రాజ్యంబులు ఫలంబులుగా నేర వైననే

వ్వరికిని మోక్షంబు సాక్షాత్కృతంబుగా నుండుటం జేసి లోకప్రదర్శనార్థంబు పాతాళ స్వర్గరాజ్యంబుల నిచ్చె యుక్తమతన ప్రస్ఖలనాదులందును వివశుండైనను నామస్మరణంబు సేయు పురుషుండు కర్మబంధంబులవలన విముక్తుండగు ముముక్షుజ్ఞానంబునం బొందునట్టి వాసుదేవుం డాత్మజ్ఞానప్రమోషణము సేయు మాయామయంబులైన భోగైశ్వర్యంబుల నెల్ల నెట్లొసంగు ననవలదు భగవంతుండు యాచనం జేసి సకలసంపదల జేకొని శరీరమాత్రావశిష్టునిం జేసి వారుణపాశంబులం గట్టి విడిచినప్పుడు బలీంద్రుం డిట్లనియె. * (సీ॥ పరమేశ్వరునకు నెప్పటి పదార్థములం దృష్ణ లేకుండుట దెలిసినాఁడ। నింద్రాదులెల్లను పేంద్రుని బ్రార్థించి యడిగిరిగాని శ్రీహరికిఁ గోరి । కలులేవు మిక్కిలి గంభీరమగు మహా కాలస్వభావంబు గలుగుచుండు । నరయంగ మన్వంతరాధిపత్యమును లోకత్రయంబును నెంత గానందలఁప । మత్పితామహుండు మానవంతుండు ప్ర । హ్లాదనపి భువిఁ జూచి హర్షమంది యొద్దికైనఁ గోరుమిచ్చెదననుటకు నంతలో నయ్యాశ్వరాజ్ఞఁ దెలిసి * (వ॥ ఇట్లు కృతార్థుండై పిత్ర్యంబయిన రాజ్యంబునొల్లక పరమేశ్వర దాస్యంబ కోరె నా ప్రహ్లాదచరిత్రకథ నావసరమున నీతండికిని నీకును విశేషముగా నే పురుషుండు భగవదనుగ్రహంబుఁ బొందనోపునని పుండరీకాక్షుండానతిచ్చిన వాక్యంబులు వక్ష్యమాణగ్రంథంబున విస్తరించెద నా బలిచక్రవర్తి గృహద్వారంబున నఖిలలోక గురుండయిన శ్రీమన్నారాయణుండు గదాపాణియును నిజజనానుకంపితుండును శంఖచక్రాద్యాయుధధరుండునగుచు నిస్వనమును దేజరిల్లుచుండునట్టి బలిద్వారంబున లోకంబుల గెలువ నిచ్చయించెదు దశగ్రీవుండుల్లంఘితశాపనుండై ప్రవేశంబుగాంప నారాయణాది పురుషుండు తన పాదాంగుష్ఠంబున యోజనాయుతాయుతంబులం బాఱం జిమ్మెనంత * (క॥ ఆ సుతలమునకుఁ గ్రిందై। భాసిల్లుఁ దలాతలంబు ప్రభువందు మయుం। డాసురపురనిర్మాతయు। వాసిగఁ బొగడొందియేలు వసుధాధీశా * (చ॥ పురహరుచేఁ బరమేశ్వరుఁడు భూతహితార్థముగాఁ బురత్రయం। బరుదుగ నీఱు చేసె శరణాగతునా మయుఁ గావుమంచు నెంతయుం। గరుణఁ దలాతలంబులకుఁ గర్తగ నిల్పె ననున్నవాఁడు శ్రీ। ధరువిమదగ్ని సంభవుఁడపృతిముక్తభయుండు గాఁ దగఁ * (క॥ తలఁపగ నా క్రింద మహా। తలమునఁ గద్రువ వధూటి తనయులు సర్పం। బులుగలవు పెక్కు శిరములు నలఘంగాఁ గ్రోధవశగణావళియనఁగ * (వ॥ మఱియును, కుహక, తక్షక, కాళియ, సుషేణాది ప్రధానులైన వారలతుల శరీరంబులు గలిగి యాదిపురుషుని వాహనంబైన పతగరాజభయంబున ననవరతంబు, నుద్వేజితులగుచు స్వకళత్రాపత్యసుహృద్బాంధవసమేతులై యుందురా క్రింద రసాతలంబున దైత్యులు దానవులునగు నివాతకవచ కాలకేయులను హిరణ్యపురనివాసులగు దేవతాశత్రువులు మహాసాహసులును దేజోధికులునగుచు సకలలోకాధీశ్వరుండైన శ్రీహరితేజంబునం బ్రతిహతులై వల్మీకంబునందు నడంగియున్న సర్పంబుల చందంబున నింద్రదూతయగు సరమ చేఁ జెప్పఁబడెడు మంత్రాత్మకవాక్యంబులగు భయంబునొందుచుండుదురు * (క॥ ఇందుకులోద్భవవినుమా। క్రిందటి పాతాళమున సుగ్రీడించుచు నా। నందమునొందుచునుండును। సందడిఁబడి నాగకులము చతురతతోడన్ * (వ॥ ఇట్లు వాసుకి ప్రముఖులైన, శంఖ, కులిక, మహాశంఖ, శ్వేత, ధనంజయ, ధృతరాష్ట్ర, శంఖచూడ, కంబళాశ్వతర, దేవదత్తాదులైన మహానాగంబులైదు నేడు పదియు నూఱు వేయుశిరంబులుగలిగి ఫణామణికాంతులం జేసి పాతాళతిమిరంబును బాపుచుండుదురు * (సీ॥ పాతాళలోకంబు పాదున శేషుండు వెలయంగ ముప్పదివేలయోజ । నంబుల వెడలుపునను దోఁకఁ జుట్టుగా జుట్టుకయుండు విష్ణునిమహోగ్ర । మైన దాను శరీరమైన యనంతాఖ్య సంకర్షణుండుండు సంతతంబు। నట్టి యనంతనామాభిపూజ్యుని మస్తకమున సిద్ధార్థంబు క్రణీధరణి । యంతనా విభుండు నఖిలలోకంబుల । సంహరింపఁ గోరి చండకోప। వశతసృజనఁ జేయువరుస నేకాదశ । రుద్రమూర్తుల నెడ రౌద్రమతుల * (గీ॥ అట్టి సుక్రమమూర్తులతుల త్రినేత్రులు । నఖిలశూలహస్తులగుచునుండు । రందునున్న ఫణికులాధిపుల్శేషుః। పాదపంకజములభక్తిఁ జేరి * (గీ॥ నమ్రులగుచు నచు దినంబును మహాళిర। త్నములచేతఁ గడు ముదంబునొంది। కోరికలు దలిర్పనీ రాజనంబుల। నిచ్చుచుందు రెపుడు మద్బికలను * (వ॥ మఱియు నా సంకర్షణమూర్తిం జేరి నాగకన్నియలు కోరికలుగలవారలగుచు నొప్పెడి శరీరవిలాసంబులం జేసి యగురుచందనకుంకుమపంకంబులను లేపనంబులు సేయుచు సంకర్షణమూర్తి దర్శన స్పర్శనాదుల నుద్బోధితమకరధ్వజావేశితచిత్తంబులు గలిగి చిఱునవ్వులొలయ సధికాభిలాషంజేసి స్మితావలోకనంబుల సవ్రీడితలై యవలోకించుచుండ ననంతగుణంబులు గలయనంత దేవుండుపసంహరింపంబడిన క్రోధంబుగలిగి లోకంబుల మఱిమఱి బుఁ గోరుచు సురాసురసిద్ధగంధర్వవిద్యాధరమునిగణంబుల ననవరతంబు ధ్యానంబు సేయ సంతతసంతోషాతిశయంబున మ్రాఁగన్ను వెట్టుచు సలలితగీతవాద్యంబుల నానందంబునొందుచుఁ దనపరిజనంబుల నతిస్నేహంబున నవలోకించుచు నవతులసీగంధపుష్పరసామోదితమధుకరవ్రాతమధురగీతంబులు గలవై జయంతీ నమాలికల ధరియించుచు నీలాంబరధరుండును హలధరుండు నగుచు నితండు మహేంద్రుండో హరుండో యనుచు జనంబులు వలుకుచుండఁ గాంచనాంబరధరుండై ముముక్షువులు ధ్యానంబులు సేయన

---

స్మితావలోకనంబుల సవ్రీడితలై। స్మిత-చిఱునగవుతోఁ గూడిన, అవలోకనంబుల-చూపుల చేత, సవ్రీడితలై-సిగ్గుతోఁ గూడినవారై

ధ్యాత్మవిద్యాయుక్తంబైన యానందహృదయగ్రంథిఁ భేదించునట్టి శేషునిస్వాయంభువుండగు వారమందు తుంబురుప్రభృ
తులగుఋషిశ్రేష్ఠులతోఁ జేరుకొని కమలాసనుని సభాస్థానంబునందునిట్లుస్తుతించుచునంత* (సీ॥ ఓలిమై నెవ్వనిలీలావినోద
ముల్జన్మసంస్థితిలయములకును । హేతువులగుచుండు నెవ్వనిచూపులజనియించెసత్వరజస్తమంబు । లెవ్వనిరూపంబులేక
మైబహువిధంబులను జగత్తులఁ బ్రోచుచుండు । నెవ్వనినామంబు లెఱుంగక తలఁచినయంతనదురితంబులడఁగుచుండు నట్టిసం
కర్షణాఖ్యుండు నవ్యయుండు నైనశేషునివినుతిసేయంగఁ దరమె తలఁపనెవ్వడు వాఙ్మనంబులకునింక । మూఁడులోకంబులం
దును భూతతతికి* (గీ॥ మఱియుఁ బెక్కుగతులమాభోఁటి వారలఁ బ్రోవఁదలఁచి వేషమూర్తిస్వాతి । కస్వభావమొందెఁ గడఁ
కతోనట్టిశేషునకు మ్రొక్కుచుందునను దినంబు* (వ॥ మఱియు నాశేషుని నెవ్వండేనియు నాకస్మికంబుగనైనను వార్తుండగు
చునైనను స్మరించినమాత్రమున నఖిలపాపంబులం బోలసి సకలశ్రేయస్సులం బొందునట్టి శేషుని నేము ముముక్షువులాశ్రయించి
ధ్యానంబొనర్చి భవబంధనిర్ముక్తులగుదుము రతవిధంబులయందు భూగోళంబణుమాత్రంబగుచునుండు నతని మహిమలు గణు
తింప సహస్రజిహ్వలుగలపురుషుండయిన నోపండని పలుకుచుందు రాయనంతుండు పాతాళంబుననుండి సకలలోకహితా
ర్థంబు భూమిని ధరించునని లోకతిర్యఙ్మనుష్యగతులను లోకస్థితియును శుకయోగీంద్రుండు వినిపించి యింకనేమి వినుపింతు
నెఱింగింపుమనిన నంబరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రునకిట్లనియె* (క॥ మునివర లోకచరిత్రం । బనుపమము మహావిచిత్ర
మగునట్లుగనా । కునువినిపించితివంతయుఁ । బనుపడి నాచిత్తమందుఁ బాయకనిలిచెన్ ॥ అనిన శుకయోగీంద్రుండిట్లనియె*
(గీ॥ జంతుజాలములకు శ్రద్ధలు త్రిగుణాత్మకములుగాన వారికర్మగతుల । తారతమ్యములును దగిలియున్నవి వివిధంబులగు
చు సంతతంబునుండు* (వ॥ నరేంద్రా ప్రతిషిద్ధలక్షణంబగు నధర్మంబాచరించు నరుని శ్రద్ధవిపరీతముగాఁ బ్రవర్తిల్లునట్టివా
నికిఁ గలిగెడు కర్మఫలంబును విపరీతంబుగా నెయుండుఁ గావున ననాద్యవిద్యాకామప్రవర్తనలవలనఁ బెక్కు తెఱంగులఁ గ
లిగెడుకర్మగతుల సంగ్రహంబుగ నెఱింగించెదననిన శుకునితోఁ బరీక్షిన్నరేంద్రుండిట్లనియె* (గీ॥ మునివరేణ్య నరకము
లు ముజ్జగంబుల । యందో యంతరాళమందో వెలియొ । యదియుఁగాక దేశమందుండు భూవిశే । షములో తెలియఁబలు
కు సంతసమున* (వ॥ అనిన శుకయోగీంద్రుండిట్లనియె* (క॥ ఎడ తెగక ముజ్జగంబులఁ । గడపలనై యామ్యదిశను గదలకని

—* శుకయోగి పరీక్షిత్తునకు నుపదేశరూపకముగా నరకలోకవర్ణనమును దెలుపుట. *—

లుచున్నదుర ఘోరములుగ నరకములడరంగా నంతరాళమందుల నధిపా* (వ॥ మఱియును దక్షిణంబున నగ్నిష్వాత్తాదిపితృ
గణంబులు తమగోత్రజులకు మేలుగలుగుటకై యకు సత్యంబులగునాశీర్వాదంబుల నొసంగుచుందురు రచ్చట పితృపతియగు
శమనుండు తనలోకంబునకుం జనుదెంచు జంతువుల కర్మంబులకుం దగిన ఫలంబులనిచ్చి శిక్షించుచునుండు, నందుదమిస్రంబు,
నంధతామిస్రంబును, రౌరవంబును, మహారౌరవంబును, కుంభీపాకంబును, కాలసూత్రంబు, నసిపత్రవనంబును, సూకర
ముఖంబు, నంధకూపంబును, క్రిమిభోజనంబును, సందంశమును, తప్తోర్మియును, వజ్రకంటకశాల్మలియు, వైతరణియుఁ, బూ
యోదయుఁ, బ్రాణరోధయు, విశసనంబును, లాలాభక్షమును, సారమేయాదనంబు, నావీచిరయంబును, రేతఃపానంబునను నే
కవింశతిమహానరకంబులును, మఱియును, క్షారకర్దమంబును, రక్షోగణభోజనంబు, శూలప్రోతంబును, దందశూకంబును,
నవటనిరోధంబును, పర్యావర్తనంబును, సూచీముఖంబు, నను సప్తవిధనరకంబులతోడ, యష్టావింశతినరకంబులుగలవని
కొందఱు నొడువుదురందు* (క॥ పరపుత్రకళత్రంబులఁ । బరికింపఁగ నపహసించు పాపాత్ముఁడుదు । ష్కరపాశబద్ధుఁడై య
మపురుషులచే నధికబాధఁ బొందుచునుండున్* (వ॥ మఱియు నివ్విధంబున బాధితుండగుచుఁ, దామిస్రనరకంబునంబడి, య
నశనాద్రిపాతనదండతాడన తర్జనాదిబాధలం జెంది కష్టభయంబున మూర్ఛలం బొందుచుండు* (క॥ పరకాంత నెవ్వఁడేని
యుఁ బురుషుండుండంగ మోఁసగిపొందిన యమకిం । కరులతనిఁ బట్టి వడిద । త్తరమునఁ బడవైతురంధతామిస్రమునన్* (వ॥ న
రేంద్రా యెవ్వఁడేనియుఁ గుటుంబపోషణార్థంబు పరులకు ద్రోహంబు సేయు నానరుండు రౌరవనరకంబునం బడు నెవ్వండిహ
లోకంబునందు స్వేచ్ఛావిహారంబున సంచరించుచుఁ బరోపద్రవపరాఙ్ముఖంబులై యుండు పశుపక్షిమృగాదుల బాధించు
నాయామృగంబులు రురురూపంబులఁ దాల్చి యట్టిపాపిజనుల నానావిధయాతనల బాధించుటం జేసి రౌరవమహారౌరవనర
కంబులనఁ బడు నెవ్వఁడేనియు దేహపోషణార్థంబు మూషకాదుల బిలనిరోధంబుఁ జేసి వధించు నానిష్కరుణుండైన పురుషుం
కుంభీపాకనరకంబులయందుఁ గలతప్తతైలంబులం బెక్కుబాధలం బొందితురు* (సీ॥ తల్లిదండ్రులకును ధరణిసురులకును న
హితంబుఁ జేసిన యట్టివాఁడు । కాలసూత్రంబనుకడుఁదీవ్రనరకంబునందున నందందయయుతయోజ । నాయతపాత్రా మ
లంములసూర్యుండుమీఁద గ్రిందను వహ్నిమిగులమండ । నత్యంతక్షుత్పిపాసాదులచేతను బాధితుండగుచుండుఁ బాయకె
ప్పుడుఁ బరువు వెట్టుచున్నఁ బడియున్న నిలిచిన గదలకున్నఁ జాలనొదిగియున్న । బాధబొందుచుండు పశురోమముల లెక్క । వ

రుసనపరిమేయవత్సరములు* (వ॥ మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాచరించుపురుషుని నసిపత్రవనంబునం దుయమకింకరులు తరట్లనడచుచుఁ బరిహసించుచుండ నోలునెడ నాయసిపత్రంబు లిరుగెలంకుల శరీరంబు ద్రెంచుచుండ నడుగడుగున మొఱ్ఱవెట్టుచుండ బాధించుచుండుదురు* (క॥ దండింపఁదగనివారల । దండించిన విప్రవరుల తనువులు ముట్టం దండించిన దుర్మతులం । దండింతురు కాలసూత్రనరకములందున్* (గీ॥ మఱియు నట్టిదుష్టమానవుని కరులు । ద్విజేది చెఱుకు రోలవిఱిచిన ట్లు । బాధబెట్టుచుండ, బడి మూర్ఛఁ జెందుచుఁ । బొరలు వెట్టుచుండు భూపవర్య* (వ॥ నరేంద్రా యెవ్వఁడేనియు నీశ్వరకల్పిత వృత్తిగల జంతువుల హింసించు నట్టివాని నంధకూపంబను నరకంబునం బడవైచిన నందునతండు దొల్లి తాను జేసిన భూతద్రోహంబున నచ్చట వివిధక్రూరపక్షి పశు మృగ సర్ప మశక మత్కుణ యూకా దులచేత హింసంబొందుచు మహాంధకారంబునఁ మనిద్రానుభవసుఖలేశంబును లేక కుశరీరంబునం దుల జీవుండునుంబోలె మృతప్రాయుండై యుండు నంత* (క॥ తనకలిమి నెవ్వఁడేనియుఁ । దన బాంధవవరులఁ గూడి తగఁ గుడువక తా । నును వాయసంబు భక్షిం । చిన మాడ్కి నదిన్న వాని శీఘ్రమె యచటన్* (క॥ క్రిమిభోజనమను నరకమునం బడి క్రిమిలె కూడు గాఁగ మెచ్చుచుఁ దాఁ । గ్రిమియగుచు లక్షవరిమా । ణముగల క్రిమిగుండమందు నాటుకయుండున్* (వ॥ మఱియు నీభూలోకంబున నెవ్వఁడేని యానవిపన్నుండై చౌర్యవృత్తిచే బ్రాహ్మణాదుల హిరణ్యరత్నాదిద్రవ్యంబుల నపహరించు నట్టి పురుషుని నగ్నివర్ణంబులగు నయఃపిండంబుల నగ్నితప్తంబులగు శూలంబుల నతని శరీరంబు లందివియుచుండుదురు మఱియును గాఢనాతురులగుచు స్త్రీపురుషుల గమ్యాగమనంబులు చేసిరేని నట్టివారిని యమలోకంబున నతితీక్ష్ణకశాతాడితులం జేసి యగ్నిమయంబులయిన యుక్కుప్రతిమల నాలింగనంబు సేయింతురు* (గీ॥ సర్వజంతుజాలసంగమ మొందెడు । వానిఁ బట్టి కట్టి వజ్రదంష్ట్రి । కములుగలుగునట్టి ఘనతరశాల్మలీ । తరువులందుఁ జేర్చి దంతు రెపుడు* (గీ॥ పార్థివేంద్ర నరుఁడు పాషండదర్శనుఁ । డగుచు ధర్మమార్గమడఁచెనేని । వాఁడు నరకమందు వైతరణీనది । నుడుగకెపుడుఁ బొరలిపడుచునుండు* (వ॥ మఱియు నట్టి వైతరణీనదియందు జలగ్రాహంబులు దిగిచి భక్షింప బ్రాణంబులు నిర్గమింపఁదమ పాపంబులు స్మరించుచు విణ్మూత్ర పూయ శోణిత కేశ నఖాస్థి మేదో మాంస వసాసినియగు నందుఁ దప్పుండగుచుండు విప్రుండు శూద్రకామినులం బొంది శౌచాచారంబులం బాసి గతలజ్జుండై పశువుంబోలి చరియించెనేని నతండు నరకంబునుం బొందియందుఁ బూయవిణ్మూత్రలాలా శ్లేష్మపూర్ణార్ణవంబందు ద్రొబ్బంబడి నతిభీభత్సితంబులగు నాద్రవ్యంబుల భుజియించుచుండు* (క॥ శునకముల బెంచి యెవ్వం । డనయంబును వేఁటసలిపి యాత్మార్థముగా । వనమృగముల హింసించెను । మనుజాధమున నస్త్రముల మర్దింతు రొగిన్* (గీ॥ ద్రవ్యలోభమునను దంభార్థమై పశు । వులను జంపి జన్నములను జేయు । వానిఁ బట్టి యముని వారలు గోయుచు । నుందు రెపుడు మిగుల సందడిలుచు* (వ॥ కామమోహితుండై యెవ్వండేనియుఁ దన భార్యచేత రేతఃపానంబు సేయించు నాపాపాత్ముని రేతోహ్రదంబునం ద్రోచి యారేతంబునె పానంబు సేయింపుదురు రాజపుత్రులైనను చోరులైనను ధనికుల గ్రామంబు పైఁబడి యందు గృహదాహంబు సేయు వారలను విషాదులవలన నన్యులఁ జంపెడు వారలను వజ్రదంష్ట్రిలుగల వింశత్యుత్తర సప్తశత శునకంబులెడ తెగక తిగిచి భక్షించుచుండు* (సీ॥ లంచంబుఁ గొని సాక్షి వంచించి యనృతంబుఁ బలికెడు పాపాత్ముఁ బట్టి కట్టి । యంతమహావీచియను నరకమునందు శతయోజనోన్నత శైలశిఖర । మునఁ దలక్రిందుగాను నిచియ యధోముఖంబుగఁ బడ ద్రొబ్బిన బొబ్బలిడుచుఁ । గల్లోలములు లేని కమలాకరము వోలెఁ జటులమై యున్న పాషాణమందుఁ । బడిన యంత నదేహంబు పగిలి పెక్కు । తునుకలై పాసి యది గూడికొనుచునుండు । నుండి యాకులమును నొందుచుండుఁ గాని । చావు లేకుండు నావదుష్టజంతువునకు* (గీ॥ సోమయాజి భార్యఁ గామించి పొందిన । వానిఁ గపటమద్యపాన సోము । పానమును దినంబుఁ బానంబు సేయు పిట్ట । క్షత్రియులను బట్టి సంభ్రమమున* (గీ॥ ఆొమ్ముఁ ద్రొక్కి మోముజిమ్మవట్టగ మోది । యనలముఖమునందు నగ్నివర్ణ । ముగ నగానివక్త్రిమునను నిండఁగా నుక్కు । నీగు వోతు రేచి నిష్ఠురమున* (వ॥ మఱియు నీచవర్ణుండు నిస్తసలుపుచుఁ దపోదానవిద్యాచారంబులఁ బెద్దల కవమానంబు సేయువాఁడు క్షారకర్దమంబను నరకంబునం దధోముఖుండగుచు బాధలం బొందు స్త్రీపురుషులెవ్వరేని యుశరీరరక్షణార్థంబు వశువుల మానవుల బలి యిచ్చిరేని వారల నిరయంబునందు యమకింకరులు సురియలం దునిమి తద్రక్తంబు పానంబు సేయించుచుం బారాడుచుండు గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతలం గావించి హింసించుచు హర్షించుచున్న వారలను నరకంబునందు శూలప్రోతలం జేసిన క్షుత్పిపాసాపరు

రురురూపంబులన్ - సర్పాదులకన్న నతిక్రూరమయిన విషజంతువుల రూపములను — యాతన - అతివేదన — తప్తతైలంబులన్ - కళకళ క్రాగుచుండెడినూనెలయందు — అయుత - పదివేలు — ఆయత - విశాలమయిన, క్షుత్పిపాసాదులచేతన్ - ఆఁకలి దప్పిబడలికలు మొదలగువానిచేత. హ్రదము - మడుగు — వింశత్యుత్తరసప్తశతశునకంబులు - ఏడునూటయిరువదికుక్కలు — చటులమైయున్న - సుందరమగుచున్న జిమ్మవట్టఁగన్ - ముద్దపారునట్లు — ఏఁచి - విజృంభించి — సురియలన్ - కత్తులచేత, తుండాగ్రంబులన్ - నోటికొనలతో - అనఁగా ముక్కుచివరతో.

లను చుండఁగంక గృధ్రాదులుతీక్ష్ణతుండాగ్రంబులనదిగి భక్షించుచుండు మఱియు ధూర్తస్వభావంబున జంతుపీడనంబుఁగావిం చెడు పాపాత్ములదందశూకంబను నరకంబునందునైదు నేడు ముఖంబుల సర్పంబులుఁ గఱచుచుండు ✽ (గీ॥ ఎనయదొడ్డిలోననండ్లలోనైనను బశుపతంగవారిణప ఙ్క్తి నెల్లఁ । బట్టి హింస సేయు పాపాత్ము విషవహ్ని । ధూమశిఖల ద్రొబ్బుదురున్న పాల ✽ (క॥ తనయింటికివచ్చినమను । జునినతిథింగ్రోధదృష్టిఁ జూచినవానిం । గనుఁగవలవజ్రదంష్ట్రిలఁ । దనరినయాకంక గృధ్రితతిభక్షించుఁ ✽ (మ॥ ధనవంతుండగుమానవుండు గడుఁగర్ధర్మోపకారంబులఁ । ఘనతం జేయకయుండెనేని యమలోకంబందు నూచీముఖం । బను నాదుర్గతిఁబట్టిత్రోచి యదిగా పైయున్న భూతంబటం । చును బాశంబులఁ బట్టికట్టివడితో నొప్పింతురత్యుగ్రులై ✽ (గీ॥ నరవరేణ్య యిట్టినరకముల్ యమలోక । మందుఁగలవు మఱి సహస్రసంఖ్య । లందు శమనదూతలనిశంబు బాధింతు । రవనిధర్మదూరులయిననరుల ✽ (గీ॥ ధర్మవంతు లెల్లఁదప్పక స్వర్గంబు । నందు భోగసమితిఁ బొందుచుందు । రెలమిఁ బుణ్యపాపముల శేషములవల్లఁ । బుట్టుచుందు రవనిఁ బుణ్యచరిత ✽ (వ॥ నరేంద్రా మోక్షమార్గంబు మున్నె వినిపించితి నిప్పుడు నీ కెఱింగించినవెల్లను బ్రహ్మాండకోశంబునం గలవని పురాణంబులు వలుకుచుండు నట్టి బ్రహ్మాండంబు శ్రీమన్నారాయణుని స్థూలశరీరంబగుటం జేసి బ్రహ్మాండంబెవ్వరు వర్ణింతు రెవ్వరు వినుచుండువారలకు సకలశ్రేయస్సులుగలుగు నీశ్వరస్థూలశరీరంబుఁ దెలిసినవారికి శ్రద్ధాభక్తులం జేసి స్థూలదేహంబు నెఱుంగవచ్చు భూద్వీపవర్షసరిదద్రినభస్సముద్రపాతాళ దిఙ్నరకతారాగణలోకసంస్థితంబయిన శ్రీహరి సకలజీవనికాయంబై యద్భుతంబైన స్థూలశరీరంబు వినిపించితి ననిన ॥ ................✽

(చ॥ జలజభవాదిదేవముని సన్నుతతీర్థపదాంబుజాతని । ర్మలనవరత్ననూపురవిరాజితకౌస్తుభభూషణాంగయా । జ్వలతులసీమరందమదవాసనవాసితదివ్యదేహ శ్రీ । నిలయశరీరకృష్ణధరణీధరభానుశశాంకలోచనా ॥ (క॥ శ్రీతరుణీహృదయస్థిత । పాతకహర సర్వలోకపావనభువనా । తీతగుణాశ్రయయతివిఖ్యాతసురార్చితపరార్చితపదాబ్జకంసవిదారీ ॥ (మత్తకోకిల॥ దండితారిసమూహభక్తనిధానదానవిహారమార్తాండమండలమధ్యసంస్థితతత్త్వరూపగదాసికో । దండశంఖసుదర్శనాంగసుధాకరార్కసునేత్రభూ । మండలోద్ధరణార్తపోషణమత్తదైత్యనివారణా ॥ ................✽

గద్య ✽ ఇది శ్రీసకలసుకవిజనానందకర బొబ్బనామాత్యపుత్ర గంగనార్యప్రణీతంబైన శ్రీమద్భాగవతపురాణంబునందు భరతాత్మజుండయిన సుమతికి రాజ్యాభిషేకంబును, పాషండదర్శనంబును, సుమతిపుత్రజన్మవిస్తారంబును, గయునిచరిత్రంబును, గయునిసంస్తుతియు, భూద్వీపవర్షసరిదద్రినభస్సముద్రపాతాళదిఙ్నరకతారాగణసంస్థితియు, ననుకథలుగల పంచమస్కంధమునందు ద్వితీయాశ్వాసము ..........✽



## షష్ఠస్కంధప్రారంభము.

శ్రీవత్సాంకితకౌస్తుభస్ఫురితలక్ష్మీచారువక్షస్స్థల । శ్రీవిభ్రాజితనీలవర్ణశుభరాజీవాక్షుఁ గంజాతభూ । దేవేంద్రాదిసమస్తదేవమకుటోద్దీప్తోరురత్నప్రభా । వ్యావిద్ధాంఘ్రిసరోజునచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్ ✽ (ఉ॥ సింధుమతిం దలంతుఁ గమనీయభుజంగమరాజమండలీ । మండనుఁ జంద్రఖండపరిమండితమస్తకుఁ దారవల్లికా । పాండురవర్ణు జంపతరభండను హేమగిరీంద్రచారుకో । దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్ ✽ (ఉ॥ హంసతురంగము న్బరమహంసమువందితదేవతాకులో । త్తంసము నాగమాంతవిదితధ్రువపుణ్యరమావతంసముం । గంసజిఘాంసు నంశమును గర్బురసూత్రసమావృతాంసమున్ । హింసనడంచు బ్రహ్మము నహీనశుభంబులకై భజించెదన్ ✽ (ఉ॥ మోదకహస్తు నిన్సమదమూషకవాహను నేకదంతులం । బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యు గణేశు దేవతా । హ్లాదగరిష్ఠు దంతిముఖు నందితభక్తఫలప్రదాయకున్ । మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్ ✽ (ఉ॥ కల్లతనంబు గాక పొడఁగట్టినపూర్వపురీతి నేఁడు నా యుల్లమునందు నుండుము సమున్నతతేజముతోడ భక్తిరం । జిల్లినచూపుగూఁడ ఖ్యాతిఁ జెందిన ప్రోఢబుధాళిసీడమా । తల్లిదయామతల్లి ప్రణతద్రుమకల్పకవల్లి భారతీ ✽ (క॥ విలసత్కంకణరవరవ । కలితంబగు నభయవరదకరముల బెనయం । జెలరేఁగి భక్తులకు నల । కలుముల దయసేయు జలధికన్యకఁ దలఁతున్ ✽ (క॥ కాళికి బహుసన్నుతలో । కాళికిఁ గమనీయవలయకరగీలితకం । కాళికిఁ దాపసమానస । కేళికి వందనముఁ జేసి కీర్తింతు మదిన్ ॥ అనియిష్టదేవతాప్రార్థనంబుఁ జేసి ✽ (చ॥ పరమసమాధిధుర్యుఁ బటుపావనకర్మవిధేయు దేవతా । వరనరవంద్యు సద్విమలవాక్యు జనార్దనకీర్తనక్రియా । భరణసమర్థు వేదచయపారగు భవ్యుఁ బ్రదికాలవేదిభా । సురమతిఁ గొల్చుటొప్పు బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మజున్ ✽ (క॥ వ్యాసుని భగవత్పదసం । వాసుని నాగమపురాణవరవిస్తుకథా । వాసుని సర్మలకవితా । భ్యాసుని పదపద్మయుగము భావింతు మదిన్ ✽ (క॥ వరకవితోద్రేకి వాల్మీకిఁ గొనియాడి భాగవతార్థమై భవముఁ బలుకు । శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి బాణమయూరుల ప్రతిభ

నొడివి । భాససౌమిల్లికభారవిమాఘులఘనసుధామధురవాక్యములం దలంచి। కాళిదాసుం గవీంద్రకల్పవృక్షముం గొల్చి నన్న
పాచార్యువర్ణనలం బొగడి వెలయం దిక్కనసోమయాజుల భజించి । యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చలు నిచి।సుకవి సోముని నా
చనసోము నెఱంగి।కవిమనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి* (ఉ॥ ఎమ్మెలు సెప్ప నేలజగ మెన్నంగఁ బన్నగరాజశాయికిన్ । సొ
మ్ముగ వాక్యసంపదలు సూరలు చేసినవాని భక్తిలో । నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో । బమ్మెరపోతరాజుఁ
గవిపట్టపు రాజుం దలంచి మ్రొక్కెదన్ । అనిసకలసుకవినికరంబులకు ముకుళితకరకమలుండనై* (ఉ॥ ఎయ్యది కర్మబంధముల
నెల్ల హరించు విభూతి కారణం। బెయ్యది సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము । న్నెయ్యది సర్వమంత్రముల నేలిన
దెయ్యది మోక్షలక్ష్మికిరూ। పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవతార్థమంత్రముల్* (వ॥ అని శ్రీమహాభాగవతపురా
ణంబునం దుపష్ఠస్కంధంబాంధ్రభాషరచియింపం బూని యాకృతికిం బతిగా నద్దేవుండు గలండని తర్కించి నాకుం గవిత్వమ
హత్వంబు సంప్రాప్తంబగు కాలంబుం దలంచి నారాయణుండె దైవంబని యెఱింగి మనోరథంబు సఫలంబయ్యెనని యాకృతి
కృష్ణార్పణంబుఁ జేసితి నదియెట్లనిన నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండికనై యుండ నొక్కనాఁడు దివంబున* (చ॥ కలితవిశే
షవస్త్రములుగట్టి హిమాంబుసుగంధచందనం । బలది వినూత్నభూషణములారయఁ దాల్చి వినోదలీలని।ఫుల్లమృదుశయ్య
నిద్రఁదగఁ బొందినచోఁ గనుపట్టె బల్మఱుం । దలమునఁ గ్రమ్ముక్రొమ్మెఱుఁగు చందము రూపున నిల్చెపోలికన్* (సీ॥ ఉరువడిఁ
బ్రాగ్విధినుదయించు మార్తాండకోటిబింబచ్ఛాయఁ గూడినట్లు । హరిహరబ్రహ్మలయాత్మలలో నుబ్బి కరుణయొక్కటమూ
ర్తిఁ జేసినట్లు।ఖరకరకరతీవ్రగతినిఁ గఱంగుచు హిమాద్రి చెంక పెల్లెగసినట్లు । ఫణిరాజఫణరాజమణిగణవిస్ఫూర్తి సుషిరం
పు వెలిఁ దలఁ జూపినట్లు।ఉట్టిపడ్డట్లు కట్టెఱ్ఱనూఁదినట్లు । దేజమెసఁగంగ నాముందు దివ్యవాణి।పూని సాక్షాత్కరించి సంపూర్ణ
దృష్టి।జూచియిట్లనిపలికె మంజులముగాను* (ఉ॥ ఆటలుఁ బాటలుం జదువులభ్యసములిట్టి వనొప్పువాద్యము । ల్సాటివిదలంప
రానిబలుసాములు మున్నగు విద్యలెల్ల నీ।కాటలుఁ బాటలయ్యెవిను మన్నిటికి న్నెఱుఁగిడ్డ భంగినా । చాటునఁ జాటుకారపదసాధు
కవిత్వముఁ జెప్పుమింపుగన్* (వ॥ అనియానతిచ్చుజగన్మాతకృపావలోకనసుశ్లోకుండనై యేనొకశ్లోకంబు నతిణం బనుడివితి
నదియెట్టిదనిన* (శ్లో॥ హంసాయ సత్త్వనిలయాయ సమాశ్రయాయ నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ।సత్సంగ్రహా
య సగుణాయ సరీశ్వరాయ సంపూర్ణపుణ్యపతయే హరయే నమస్తే* (వ॥ ఈశ్లోకంబద్దేవుండంగీకరించె నంత మేలుకాంచి
యానందభరితుండనై నాఁటనుండి చంద్రానుగతయగు చంద్రికయుంబోలె నారాయణాంకితంబయిన కవిత్వతత్త్వజ్ఞానంబు
గోచరంబయ్యె దానికి ఫలంబుగా గోపికావల్లభుని నుల్లంబున నిడుకొని* (గీ॥ పలుకగలిగె మొదలభాగవతార్థంబు । భర్తకృ
ష్ణుడా మెభాగ్యమెద వె।నమృతరసముఁ గూరనలరు చింతామణి।పాత్ర సంభవించు భంగి నపుడు* (గీ॥ భాగవతము తేఁటప
ఱుపనెవ్వఁడు చాలు।శుకుఁడు దక్క నరునిసఖుఁడు దక్క।బుద్ధిఁ దోఁచినంత బుధులచే విన్నంత । భక్తి నిగిడినంతఁ బలుకువాఁడ*
(ఉ॥ పుట్టిననాటనుండియును బుట్టదె యెట్టియదట్టునైనఁ జే । పట్టిను తింపఁ జిత్తము శుభంబగు మద్వరవాక్యసీమకుం। బట్టము
గట్టినాడ హరిఁ బాయక తత్కథనామృతంబు నే।నుట్టిపడంగఁ జెప్పెద బుధోత్తములారనుఁడు శ్రోత్రపద్ధతిన్॥ అని* (సీ॥ శ్రీవత్స
గోత్రుండు శివభక్తియుక్తుండాపస్తంబ సూత్రుఁడ పారగుణుఁడు । నేర్చూరిశాసనుండెఱ్ఱనప్రెగ్గడ పుత్రుండు వీరనపుణ్య
మూర్తి । కాత్మజుండగు నాదెయామాత్యునకుఁ బోలమాంబకు నందనులమితయశులు । కసువనామాత్యుండు ఘనుఁడు వీరన
మంత్రిసింగధీమణియు నంచితగుణాఢ్యు।లుద్భవించిరి తేజంబులూర్జితముగ । సారిదిమూర్తిత్రయంబన శుభకీర్తిఁ।బరగిరం దు
లఁగసవనప్రభువునకును।ముమ్మడెమ్మను సాధ్వి యిమ్ములను వెలసె* (ఉ॥ ఆడదుభర్తమాట కెదు ఱాడదు వచ్చినవారివీడఁగా।
నాడదు పెక్కుభాష లెడనాడదు వాకిలి వెళ్లి కల్లమా।టాడదు మిన్నకేని సుగుణావళికిందిర గాకసాటి । యే చేడియ లేమ చూరి
కులశేఖరుకస్వయముమ్మడమ్మకున్* (క॥ ఆకసవయమంత్రికిఁ బు । ణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మయు మమున । వ్యాకులచిత్తు
లనిరువుర।శ్రీకరగుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్* (క॥ అంగజసమలావణ్యశు।భాంగులు హరిదివ్యపదయుగాంబుజవిలస।
ద్భృంగాయమానచిత్తులు।సింగయ తెలగయలు మంత్రిశేఖరులనఁగన్* (క॥ అందగ్రజుండశివపూ।జం దనరినవాఁడ విష్ణుచ
రితామృతని।ష్యందిపటువాగ్విలాసా।నందోచితమానసుఁడను నయకోవిదుఁడన్* (వ॥ కావున గృష్ణపాదారవిందసందర్శ
నాదర్శతలాయమానచిత్తుండనై । షష్ఠ్యంతములు* (క॥ శ్రీపతికి సుర్వపతికినుత । గోపతికిం ద్రిలోకపతికి గుహుజనబుధసం।తా
వనివారణమతికిని। బ్రాపితసనకాదితతికి బహుతరధృతికిన్* (క॥ హరికిగురుఃకలుషకుంజర । హరికి బలాభీలహరికి నంతస్థితగ
హ్వరికిన సహరికిరక్షిత।కరికిఁగరాగ్రస్థగిరికి ఘనతరకిరికిన్* (క॥ గుణికి సమాశ్రితచింతా । మణికి మహేంద్రాదిదివిజమండల
చూడా।మణికిఁ బ్రకల్పితశయ్యా।ఫణికి మరో భాగకౌస్తుభప్రియమణికిన్* (క॥ కంసాసురసంహారున । కంసాంచితకర్ణకుండ
లాభరణునకున్।హింసాపరపరమస్తక । మాంసకరాళితగదాభిమకహస్తునకున్* (క॥ వరయోగిమానసాంతః। కరణసు

థాంభోధిభావకల్లోలలస।త్పరతత్వశేషశాయికి।జిరదాయికిసకలభక్తచింతామణికిన్* (వ॥ సమర్పితంబుగా నాయొనర్పంబూను నషష్ఠస్కంధంబునకుంగథాప్రారంభక్రమంబెట్టిదనిన హరిచరణస్మరణపరిణామ వినోదులైన శౌనకాదులకు నిఖిలపురాణేతిహాసనిర్ణయవిఖ్యాతుండైనసూతుండిట్లనియె* (క॥ శ్రీరమణీరమణకథా।పారాయణదత్తుండగుచుంబలికెంబరీక్షి।ద్భూరమణుండాదరంబున। సూరిజనానందసాంద్రుశుకయోగీంద్రుల్* (సీ॥ షడ్గుణైశ్వర్యశాశ్వతమూర్తియైనట్టిమునినాథదయతోడముక్తిపదము । మున్నుగానేమార్గమునవినిపించితివారయనపవర్గభూరిమహిమ౯ । గ్రమయోగసంభవబ్రహ్మంబుతోడనయనుపొందనగుననివినుతికెక్క । మఱియుసత్వరజస్తమఃప్రభావంబులకడిందినైయున్నట్టికర్మచయము । నప్పటప్పటికడంగనియట్టిప్రకృతి౯ । గలుగుపురుషునిభోగార్థఘటనదేహ। కారణారంభరూపమార్గంబుమొదలు । మాటిమాటికినన్నియుందేటపడంగ* (వ॥ మఱియునసేకపాపలక్షణంబులగు నానావిధనరకంబులును వానికాద్యంతంబులునుస్వాయంభువసంబంధియగు మన్వంతరంబులు ప్రియవ్రతోత్తానపాదులవంశంబునుదచ్చరిత్రంబును ద్వీపవర్ష సముద్రాద్రినద్యుద్యానవనస్పతులును భూమండలసంస్థానంబును వానిపరిమాణంబును జ్యోతిశ్చక్రచలన ప్రకారంబును విభుండయినపరమేశ్వరుండెవ్విధంబునసర్జించెనావిధంబంతయు నెఱింగించి నాఁడవిప్పుడు* (గీ॥ కడిఁదివేదనలకుఁగారణంబై యుండు । గుఱుతులేనినరకకూపరాశి। పాలుగాక నరుఁడు బ్రతికెడుమార్గంబు। పరమపుణ్య తెలియఁబలుకవయ్య* (వ॥అనినంబరీక్షిన్నరేంద్రునకుశుకయోగీంద్రుండిట్లనియె* (క॥ కట్టాత్రికరణమెఱుఁగక । పుట్టినదురితములనపుడపొలియింపనియా।కట్టడిదేహంబుడిగినఁ।గొట్టాడునుబిట్టునరకకూపంబులలోన్* (ఉ॥ కావునఁగాలకింకరవికారముగానకమున్నమృత్యువు।ర్భావనదిత్తముంజెడుగుపాటుగఁజేయకమున్నమేనిలో । జీవమువెల్లుచుండిత్తనచెల్వముఁదప్పకమున్నమున్నగాఁ । బావనదిత్తుఁడైయఘముఁబాయుతెఱంగొనరింపఁగాఁదగున్* (క॥ కాలంబెడగనిపాపము।మూలముఁజెఱుపంగవలయుమునురోగముల౯।దేలినదోషమునెఱుఁగుచువా।లాయముదానినడఁచువైద్యునిభంగిన్* (సీ॥ అనవుడునాతనికనియెభూకాంతుండుకనుకలివినుకలిగలిగినట్టి।పాపముదనకునొప్పమిచాలఁబరికించిపరితృప్తుఁడయ్యుఁగ్రమ్మఱనొనర్చు । మాధాత్మునకుదోషమోచనంబెయ్యదియారయనెఱింగింపుమదియుఁగాక । కలుషమొక్కచోటఁగావించునొకచోటఁగావింపకుండుఁదత్కర్మమెఱిఁగి।యట్టిజనుఁడుపుణ్యమేరీతిఁజేసిన।నదిఫలింపనేరదనితలంతు। సలిలమందుమేనిమలినంబుపోవంగ । గజముగ్రుంకువెట్టుగతియుఁబోలె।అనినశుకుండిట్లనియె* (క॥ కర్మముకర్మముచేతను।నిర్మూలముగాదు తెలియనేరకతానే।కర్మముఁజేసెనఁదత్ప్రాయశ్చి।త్తి।కర్మంబొనరింపవలయుఁగలుషవిదూరా* (క॥హితముగలకుపుమఱిరు।గ్విత్తులఁబొడమంగనీనివిధమునవతిస్వాద్వ తుఁడయినవాఁడునిర్మల।మతిచేనఘరాశినెల్లమట్టముసేయున్* (చ॥ తపమునబ్రహ్మచర్యమునదానములన్శమసద్దమంబుల౯ । జపములసత్యశౌచములనన్నియమాదియమంబులంగృపా । నిపుణులుధర్మవర్తనులునిక్కముహృత్తనువాక్యజంపుపా । పపుగుదిఁద్రుంతురగ్నిశతపర్వవనంబులనేర్చుకైవడిన్ ॥ అదియునుంగాక* (ఉ॥ కొందఱుపుణ్యవర్తనులుగోపకుమారపదారవిందజా।నందమరందపానకలనారతషట్పదచిత్తులౌచుగో । విందపరాయణుల్విమలవేషులుదోషమడంతురాత్మలం। జెందినభక్తిచేతరవిచేకొనిమంచునడంచుకైవడిన్* (క॥ హరిభక్తిచేతఁగొందఱు।పరిమార్తురు మొదలుముట్టపాపంబుల౯।స్ఫురతరకరములసూర్యుం। డరుదుగఁబెనుమంచుపింఛమడఁచినభంగిన్* (క॥దంతిపురనాథవినుమొక । మంతనమెఱిగింతుశమనమంబులునంబూ।వంతశుభవంతుఁజేయవు । కంతునిగురుభక్తిముక్తిగలిగించుగతిన్* (సీ॥ హరికినర్థముఁబ్రాణమర్పితంబుగనుండువానికైవల్యమెవ్వనికిలేదు । వనజలోచనుభక్తవరులసేవించినవానికైవల్యమెవ్వనికిలేదు । వైకుంఠనిర్మలవ్రతపరుండయినట్టివానికైవల్యమెవ్వనికిలేదు । సరసిజోదరుకథాశ్రవణలోలుండైనవానికైవల్యమెవ్వనికిలేదు । లేనుతపములబ్రహ్మచర్యాదినియతి।శమదమాదులసత్యశౌచములదాన । ధర్మముఖములసుస్థిరస్థానమైన । వైష్ణవజ్ఞానజనితనిర్వాణపదము*(గీ॥అరయనెన్నఁడుఁజేటులేనట్టిముక్తి । వత్మ౯మీలోకమందునెవ్వనికిఁగలదు । సాధులునుబుణ్యశీలురుసజ్జనులును।హరిపరాయణతత్పరులగుటఁగాక* (క॥అరుదుగనరహరిభక్తిం।బొరయనియాపురుషసుకృతపుంజంబులువే।వరుఁబుణ్యుజేయనేరవు।నరవరమధుఘటముఁబెక్కునదులుంబోలెన్* (చ॥ సతతముఁగృష్ణపాదజలజంబులయందుమనంబునిల్పుసు।వ్రతులుఁదదీయశుద్ధగుణరాగులుఁగాలునియుగ్రపాశసం । హతులధరించుతత్సుభటవర్గములంగలలోనఁగానరే । గతులనుదుష్టకర్మములుగైకొనువారలఁజెందనేర్చునే* (వ॥ కావుననీయర్థంబునకుంబురాతనంబగునొక్కయితిహాసంబుగలద

## ❖* అజామిళోపాఖ్యానము. *❖

దివిష్ణుదూతయమదూతసంవాదంబనంబగుదానినెఱింగింతునాకర్ణింపుము* (సీ॥ నరనాథవినుముకన్యాకుబ్జపురమునఁగలఁడుబ్రాహ్మణుఁడజామీళుఁడనఁగ।బాతకుండతులనిర్భాగ్యుండవజ్ఞుండునష్టసదాచారికష్టరతుఁడు । జూదంబులందుదురా

దంబులందును జౌర్యంబునం దమచ్చరముగలిగి। తొత్తాత్మపత్నిగా మత్తుండై వరియించి కొడుకులం బదుగుఱం బడసి చాల। మోహజలధిలోన మునిగి ముచ్చటఁదీఱ। బాల లాలనాది లీలఁదగిలి। పెద్దగాలమతఁడు పెంపారసుఖియించి। ఫలితమెల్లవదలి పతితుఁడయ్యె* (సీ॥ నిరాలంబనంజాల నెఱయుచిత్తంబునన నల్లనివెండ్రుకలెల్లనయ్యెఁ। దగుమోహపాశబంధంబుజారిన మాడ్కిఁ బొదలినయంగంబువదలఁబాఱె। నింద్రియంబులకోర్కులెఁకనొల్లననుభంగి నుడుగకతలచాలవడఁకఁ జొచ్చెఁ। దమకంబుఁబ్రాయంబుఁ దగిలిపోయినమాడ్కి లోచనంబులచూడ్కి నీచమయ్యె। వగరుపుట్టెనంతఁ బెకలెదంతంబులు। నుక్కసయును దగ్గుపిక్కటిల్లె। శిరసునొవ్వఁదొడఁగెఁ జెదరెమనంబంతఁ। గడిదియైనముప్పుకాలమునను* (గీ॥ ఎనయనతనికెనుబదెనిమిదివర్షంబు। లంతనరుఁగుటయును భ్రాంతుఁడగుచుఁ। గోరిపిన్నకొడుకునారాయణాఖ్యుందు। బాలుఁడగుటమిగులభక్తిఁజేసి* (క॥ తనసతియుఁదానుఁగూరిమి। వనమునఁబెనఁగొనఁగనసుకుమారునినసిశం। బనుముద్దుసేయుచుండెను। జనవత వాత్సల్యమాత్మసందడిగొనఁగ* (క॥ బాలునిగలభాషణుజన। పాలునినిజజనకబంధుపరిణామకళా। శీలునిలోలతఁగనుఁగొనియాలరిబ్రాహ్మణుఁడునందితాత్ముండగుచు* (క॥ అత్యంతపానభోజన। కృత్యంబులఁ బొత్తుగలిగి క్రీడలఁదత్సాం। గత్యంబువదలకాగత। మృత్యువుఁగననేరఁడయ్యెమిక్కిలిజడుఁడై* (గీ॥ తెలియకీరీతినతఁడువర్తించుచుండ। భయదమగుమృత్యుకాలంబుప్రాప్తమయిన। భూరివాత్సల్యవృత్తినప్పుత్త్రుఁదలఁచి। యాత్మఁబ్రలపించెనారాయణాయటంచు॥ అప్పుడు* (క॥ కింకరులధర్మరాజవ। శంకరులదురంతదురితసమధికజననా। శంకరులసకలలోకభ। యంకరులంగనియెనింద్రియాకులుఁడగుచు* (క॥ ఘాతుకులదండదండిత। పాతకులమహోగ్రకర్మభరనిష్కరుణా। జాతకులబ్రేతనాయక। దూతకసంతతులనతఁడుదూరమునఁగనుఁ* (మ॥ కనియెన్ బ్రాహ్మణుఁడంత్యకాలమునవీఁకన్ రోమనిష్ఠ్యూతలన్। ఘనపీనోష్ఠవికారవక్త్రవిలసద్గర్వేక్షణోపేతలన్। జనసంత్రాసకరోద్యతాయతసుపాశశ్రేణికామోహితలన్। హననవ్యాప్తిపిభీతలన్ముపురవాత్మానేతలన్దూతలన్* (వ॥ ఇట్లతివిభ్రమితతుండగండభాగవిభాగ విషమవివృత్తనేత్రులు నతిపుష్టనిష్ఠురతనుయష్టిసంవేష్టితమహోర్ధ్వరోములు నభ్యస్తసమస్తజీవాహరణకరణప్రశస్తహస్తవిన్యస్త పాశధారులునగుయమభటుల మువ్వురంగనుంగొనియజామిళుండు వికలేంద్రియుండును వికంపితప్రాణుండును వికృతలోచనుండును విహ్వలాత్మకుండునై* (క॥ దూరమునఁనాడుబాలుఁడు। భోరనఁదనచిత్తసీమఁబొడగట్టిననో। నారాయణనారాయణ। నారాయణయనుచునాత్మనందనునొడివెన్* (చ॥ మరణపువేళనర్ధమజమర్దనుసంస్మరణంబుసేయఁద। త్వరితరవర్తులాత్మపరిపాలకునామమునాలకించినిస్ఫురగతినేగుదెంచిహాడసూపియదల్పిరికాలుచాసులన్। ఘనతరభాషులన్ వికటకల్పితవేషులదీర్ఘరోషులన్ (క॥ దాసీభర్తనజామిళ। భూసురుఁదత్తనువుపలనభోరున వెలికిం। దీసియమభటులబాఱిన్। ద్రోసిరిశ్రీవరునిమూర్తిదూత

—*విష్ణుదూతయమదూతలసంవాదము.*—

లుకడిమిన్* (వ॥ ఇట్లువిష్ణుదూతలవలన నిర్ధూతప్రయత్నులైయమదూతలిట్లనిరి* (క॥ ఎవ్వనివారలు మాతో। దివ్వనుగతమేమియిట్లుదికిరి నవానిం। గ్రొవ్వునవిడిపించితిరిఁక। నవ్వులకోజమునిశాసనంబులుజగతిన్* (సీ॥ ఎవ్వరుమీరయ్య యీభవ్యరూపములన్నులకద్భుతక్రమమొనర్పె। దివిజులోభువిజులోదేవతాప్రవరులోసిద్ధులోసాధ్యులోచెప్పరయ్య। దళితపాండురపద్మదళదీర్ఘనేత్రులువరపీతకౌశేయవాసులరయ। గండమండలనటత్కుండలీయుతులును బటుకిరీటప్రభాభాసితులును। భూరిపుష్కరమాలికాచారువక్షులమితకోమలనవయౌవనాధికులును। బాహుకేయూరమణిగణభ్రాజమాన। ఘనచతుర్భుజులభ్రసంకాశరుచులు* (క॥ ధనువులు నిషంగచయములు। కనదంబుదశంఖచక్రఖడ్గగదాసా। ధనములుధరించినమీ। తనువులులోకములకద్భుతంబొనరించెన్* (క॥ శాంతంబులయినమీతను। కాంతులుజగములనుదిశలఁగలిగినబహుళ। ధ్వాంతములభ్రాంతిఁదోలుచు। సంతసమొనరించె విపులసర్వంకషమై* (వ॥ ఇట్లఖిలలోకానందకర కమ్రాకారులు నఖిలవిభ్రాజమానతేజోదుర్నిరీక్ష్యమాణులును నిఖిలధర్మపాలురునగుమీరు ధర్మపరిపాలురమమ్ము నడ్డపెట్టంగతంబేమియనినఁదారుధర్మరాజానుచరులుగారమతలంపున మందస్మితకందళితముఖారవిందులై గోవిందునికందువమందిరంబుకావలివారలు వారివాహగంభీరనిర్ఘోషపరిపోషణంబులైనవిశేషభాషణంబులనిట్లనిరి* (ఉ॥ మీరుపరేతనాయకునిమేలిమిదూతలఁటేనిఁబల్కుఁడా। తోరపుపుణ్యలక్షణముదుష్కృతభావముదండకృత్యముల్। భీరముతోడనాతనికిభీష్టనివాసముఁబూనిదండ్యులెవ్వారలుసర్వభూతములవారకకొందరుపాపకర్ములో। అనినయమభటులిట్లనిరి* (క॥ వేదప్రణిహితమేయను। మోదంబుగధర్మమయ్యెమున్నతదన్యం। బేదియగునదియధర్మం। బాదియుహరిరూపువేదమనివినుకతనన్* (సీ॥ ఎవ్వనిచేఁదనయిరవొందుత్రిగుణస్వభావమైనట్టియీప్రాణిచయము। లనుగుణనామక్రియారూపములచేతనేర్పడుగతిఁదాన నెఱుఁగఁబడును। సర్వముండననంబునాకాశమును బ్రభంజనుఁడు గోచయమునుశశధరుండు। సంఖ్యలుదివములు శర్వరీచయములు కాలాంబువ

మఱి తీఁజాలములును । దేహధారికి సాక్షులై తెలుపుచుండు । దండనస్థానపథము సద్ధర్మగతియుఁ। దగుల మీఱి క్రమానురోధన
ముఁ జేసి।యఖిలకర్మలు దండార్హులరయ నెపుడు* (గీ॥ కోరి కర్మంబునడిపెడువారికెల్లఁ । గలితశుభములు నశుభములు గలుగు
చుండు। నరయఁగా దేహి గుణసంగియైనయపుడె।పూని కర్మంబు సేయక మానరాదు* (క॥ ప్రకృతము నఁ దానొనర్చిన। సుకృత
ము దుష్కృతము నెంతఁ జూడఁగ నంతే। వికృతిగ ననుభవించును। నకృతమతిఁ దత్ఫలంబు నతినిపుణుండై* (వ॥ మఱియు వి
నుండు జన్మంబు శాంత ఘోర మూఢ గుణంబులచేత నైనను సుఖదుఃఖ గుణంబులచేత నైనను ధార్మికాది గుణంబులచేత నైనను స
కలభూతంబులు త్రైవిధ్యంబు నేప్రకారంబునం బొందు నాప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు దేవుండైన యముం
డు సర్వజీవాంతర్యామియై ధర్మాధర్మయుక్తంబైన పూర్వరూపంబుల విశేషరూపంబులచేతం జూచుచుండి వానికనురూపం
బుల జింతించుచుండు నవిద్యోపాధిజీవుండు తమోగుణయుక్తుండై ప్రాచీనకర్మంబులచేత నేర్పడిన వర్తమాన దేహంబు నేన
ని తలంచుచుండి నష్టజన్మస్మృతిగలవాఁడై పూర్వాపరంబు లెఱుంగంజాలకుండు మఱియు కర్మేంద్రియంబులచేతఁ గర్మంబు
లం జేయుచుండి జ్ఞానేంద్రియంబులచేతఁ దమోవిషయంబులైన శబ్దస్పర్శరూపరసగంధంబుల నెఱుంగుచుండి పదియాఱవది
యైన మనంబుతోఁ గూడి పదియేడవవాఁడగుచుండి షోడశోపాధ్యంతర్గతుండయి యొక్కరుండయిన జీవుండు సర్వేంద్రియవిష
యప్రతిసంధానంబు కొఱకు జ్ఞానేంద్రియకర్మేంద్రియమనోవిషయంబులం బొందుచుండి షోడశకళలు గలిగి లింగశరీరంబనం
బరగి గుణత్రయకార్యంబను నిమిత్తంబున హర్షశోకభయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియించుచుండు నజితషడ్వర్గుండై
న దేహి కర్మంబు లొల్లనిబుద్ధి నెఱింగియు వీనికర్మంబులు సేయుచుండి తనసంచారకర్మంబునం జుట్టుకొన్న పసిరి కాయ పురుగు
నుం బోలె నిర్గమోపాయంబెఱుంగక నాశంబు నొందుచుండు వర్తమానవసంతాదికాలంబు భూతభావివసంతకాలయోగ్యం
బైన పుష్పఫలాదులు తత్కాలజ్ఞాపకంబు నెట్లు సేయు నట్లు భూతభావిజన్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుం
డు నొక్కొ నరుండు నొకక్షణంబును గర్మంబుఁ జేయకుండువాఁడు లేఁడు పూర్వసంస్కారంబులం గలగుణంబులచేత బురుషుం
డవశుండుగావున బలిమిఁ గర్మంబు సేయింపంబడుచుండు నవ్యక్తనిమిత్తంబు నొంది తదనురూపంబులైన స్థూలసూక్ష్మశరీరం
బులు మాతాపితృసదృశంబులగుచుండు నిట్టి విపర్యయంబు పురుషునికిఁ బ్రకృతిసంగమంబునం గలుగుచుండు నాప్రకృతిపురా
ణపురుషుండైన యప్పరమేశ్వరుని సేవించినఁ దలంగుచుండు* (సీ॥ కావున నితఁడు సత్కర్మవర్తనమున భూదేవకులమునఁ బు
ట్టినాఁడు। దాంతుఁడై శాంతుఁడై ధర్మశీలుఁడై సకలవేదంబులఁ జదివినాఁడు । ననయంబు గురువుల నతిథులఁ బెద్దలఁ జేరి శు
శ్రూషలఁ జేసినాఁడు। సర్వభూతములకు సమబుద్ధియై చాల బహుమంత్రసిద్ధులఁ బడసినాఁడు । సత్యభాషణనియమంబు జరిపి
నాఁడు। నిత్యనైమిత్తికాదుల నెఱపినాఁడు । దండిలోభాదిగుణములఁ దరిమినాఁడు । మంచిగుణములు దనయందు మెఱిపినాఁ
డు* (క॥ సతతాచారసమంచితమతియై సుజ్ఞానమునకు మఱి గెడుతజీనా । యతఁ గతినాతనికంగజ।మతమైన వయోవనాగమం
బెడసొచ్చెన్* (సీ॥ కడకంటయౌవనగర్వంబు వొడగట్టె మదిలోన నుద్రేకమదము దొట్టెఁ । గడు మేనఁగామవికారంబు దల
సూపె ముఖమునఁ జిఱునవ్వు మొలకలెత్తె।నతిపుష్టినిష్ఠురంబయ్యె దేహంబెల్లఁ గచభారమున నెఱిఁగప్పుమెఱసెఁ। గటిభారము
న నూరుకాండముల్ జిగిమీఱె బాహుశాఖలు దీర్ఘభంగిఁ దోఁచె। నురము విపులమయ్యె నుల్లసద్వర్ణకాంతి। పూరమంగకము
నఁ బొంపువడియె। భూరితేజుఁడయిన భూసురాన్వయునకు। నభినవీనయౌవనాగమమున* (క॥ హృదయమునఁ బొడము యౌ
వన। మదము వెలిం ద్రోఁచు భంగి మానితరుచిత। ద్వదనమున నూఁగుమీసలు । పొదలుచుఁ గప్పడరి చూడఁ బొంకంబయ్యెన్॥ మఱి
యును* (క॥ తమ్మి విరిమీఁద వ్రాలిన। తుమ్మెద పఙ్క్తి యనుబోలెఁ దోరపులీలం । గ్రమ్ముకొని విప్రతనయుని। నెమ్మొగమునఁ గా
నఁబడియె నెఱిమీసంబుల్* (వ॥ అంత ననంగబ్రహ్మతంత్రంబున మవసంతుం డొనర్చు నంకురార్పణారంభంబునుం బోలె నసి
తకిసలయవిసరప్రసారభాసుర బహుపాదపాదిపురోపవన పవనజవనప్రభావ పరికంపితవిటపిటీజన హృదయప్రఫుల్లపల్లవ
భల్లంబు, ననూనప్రసూననిర్భరగర్భవిర్భూతసురభిపరాగ పటలపటఘటితనభోమండలంబు, సమందనిష్యందమరందబిం
దుసందోహకందళిత చిత్తమత్తమధుపసంకుల ఝుంకారముఖరిత సకలదిశావలయంబును, నిరంతరధారాళరసభరితపరిప
క్వఫలఫలాను భవప్రభవసమ్మోదవాదశుక ప్రముఖపతంగకోలాహలంబునై, మధుమాసంబు, సర్వజనమనోహరంబు
నై నిఖిలవనపాదపంబుల నలంకరించె నయ్యవసరంబున, నజామిళుండు పితృనిర్దేశంబునం, గుశసమిత్పుష్పఫలార్థంబు వనంబు
నకు రిగి తిరిగి వచ్చుసమయంబున నొక్కలతాభవనంబున* (క॥ బద్ధానురాగయై స్మర యుద్ధంబున కలరు బుద్ధినుద్ధతకేళికి।బద్ధ
యగు వృషలితోఁ బ్రియు। వృద్ధిం దగఁ గూడియున్న విటు నొరు గాంచెన్* (క॥ ఘటునిన్ రతిశాస్త్రకళా। స్ఫుటునిన్ వరయావ
నానుభవమదవిభవో। ద్భటునిన్ సురతేచ్ఛాసం।ఘటునిన్ విగతాంబరోరుకటునిన్ విటునిన్* (శా॥ హాలాఘూర్ణితనేత్రతో
మదనతంత్రారంభసంరంభతో । ఖేలాపాలనయోగ్యభావిభవతోఁ గీర్ణాలకాజాలతో । హేలాలింగనభంగివేపవతితోఁ

ద్భావతీమూర్తితోఁ। గేలిందేలుచునున్నవానిఁగనె బుంఖీభూతరోమాంచుఁడై*(క॥కలికివగమదనకదనపు। పలుకులకలకల
ము బెడఁగుఁబడు మేఖలము। వ్వలనవళిఁదగిలిగదిగొనఁ। గలకంఠిరతంబుసలుపుగమకముఁగనియెన్* (క॥కవకవనై పదనూపు
ర। రవరవమైగుబ్బకొన్నగతిపతిగతులం। జివచివనై పిటుచెవులకు। రవళిన్ రతిసల్పురతులరవరవగనియెన్* (చ॥కురులళికం
బుపై నెగయఁగ్రొమ్ముడివీడఁగగుబ్బదోయిపైసరములుచౌకళింపఁగటిసంగతమేఖలతాళగింపస। త్వర రవకంకణావణాళుల
గర్జిల్లఁగౌనసియాడమీఁదుగా। మరునివినోదముల్సలిపెమానినియౌవనగర్వరేఖతోన్* (క॥చవ్వపుసుకుమారాంగినిజవ్వని
నుపగూహనాదిసముచితగతుల। న్నివ్వటిలుదానిఁగనిచది। నుప్పొల్లూరంగమన్మథోద్దీపనుఁడై* (తే గల॥ బహుళదృక్పరిపాక
మోహనబంధుఁడౌచుమనఃబులో। సహజకర్మము వేదశాస్త్రము సాత్వికంబుఁదలంచక। న్నిహితచిత్తముపట్టిపట్టఁగ నేరఁడ
య్యెసదామనో। గహనసుంధమసుందుపాపకుకై పడిన్ జరియింపఁగాన్* (శా॥ ఆలీలావతిగండపాళికలపైహాసప్రసాదం
బుపై। నాలోలాలకపఙ్క్తి పైనళిక పైవాకర్ణదృగ్భూతిపై । హేలాపాదిమచద్వయోరుకటిపైనిచ్చల్పిసాళింపఁగా । జాలిం
బొందుచునాత్మసుందుచుమనోజాతానలోపేతుఁడై* (గీ॥ మఱిఁగులాచారవర్తనమాటుఁజేసి । పరసుపిత్రర్థములుదాని
పాలుఁజేసి। సాధులక్షణగుణవృత్తిఁజాలుజేసి। లోలలోచనపసఁజెందిలోలుఁడయ్యె* (క॥ శ్యామన్గుమమాత్రఖేలన। కామ
న్సుగుణాభిరామఁగమనీయగుణ। స్తోమునిజభామనొల్లక। ధామముఁనినటించెఁగ్రించుతనమునఁజడుఁడై* (ఉ॥ బందుగుఁబట్టిసజ్జ
నులబాధలఁబెట్టియనాథకోటిబెన్। బందెలుసుట్టిఋూరములుపట్టిపథంబులుగొట్టిదిట్టయై । నంకలకోర్చిసాధుఁకుఁందితుఁడై
గడియించువిత్తమా। సుందరికిచ్చిమచ్చికలుసొంపెనఁగూర్చివసించెఁదత్పృపన్* (సీ॥ సముచితశ్రుతిచర్చఁజర్పింపనొల్లక
సతకుచద్వయచర్చఁజర్చసేయుఁ । దరకరశపాతతరంబుగాదనికలికితోఁబ్రణయతర్కంబుసేయు। స్మృతిపదవాక్య
సంగతిగాకతత్సతిపదవాక్యసంగతిపరగఁజేయు । నాటకాలంకారనైపుణంబుడిగితన్నాటకాలంకారపాటిఁదరుగుఁ। బరఁగజి
రకాలమీరీతిఁబాపనయతి। రమణదాసికుటుంబభారమువహించి। యదిగుటుంబినిగాఁగఁబాపాత్ముఁడగుచు। నశుచియును దుష్ట
వర్తనుఁడగుటఁజేసి* (క॥అటుగానఁబాపకర్మునిఁ। గుటిలునిసుజనార్తిభూర్తుఁగ్రూరునినేమా। రటమునఁగొనియేగెదముఁ । త
టవండమువలననితఁడుధన్యతనొందున్* (వ॥ ఇట్లుపలుకుచున్నయమహూతలవారించినయకోవిదులయిన భగవద్దూతలిట్లని
రి*(క॥అవురాధర్మవివేక। ప్రవసులసభగానఁబడియెఁజాపముపుణ్యో। ద్భవులనవంద్యులదండన। వివరంబొనరింపఁబడియె
పిధినెఱుఁగమిజేన్* (చ॥ సములును సాధులున్ విహితశాసనులున్ సదయాళురున్ శుభో। త్తమగుణులైనయట్టితలిదండ్రు
లుబిడ్డలకెగ్గుసేయుచోఁ । గ్రమమునవారలెవ్వరికిఁ గైకొనికుయ్యిడఁజాలువారు సం । భ్రమమునమీమనంబులఁ దిరంబుగఁ
జప్పయొనర్పిచూడుఁడా* (గీ॥ ఎఱుకగలుగువారలేదియొనర్చిన। నదియచేయురితరమయినవారు । నలరిసత్యమిట్టిదని రేని
లోకంబు। తత్ప్రవర్తనమునఁదగిలియుండు* (గీ॥ నెమ్మిఁదొడలమీఁదనిద్రించుచెలికాని। నమ్మదగినవాఁడునయమువిడచి। ద్రో
హబుద్ధిఁజంపఁదొడరునేమెందైనఁ। బ్రీతిలేకధర్మదూతలార* (గీ॥ చిత్తమెల్లనిచ్చి చెలితనంబునవచ్చి। నచ్చికలయనొచ్చన
మ్మువానిఁ। గరుణగలుగువాఁడుకడుసౌమ్యుఁడగువాఁడు। దింతసేయకెట్లుచెరువనేర్చు। అదియునుంగాక* (ఉ॥ ఈతఁడు కో
టిసంఖ్యలకునెక్కుడుపుట్టువులందుఁబుట్టియా । యాతములైనపాపనివహంబులనన్నిటిఁబారఁదోలిప్ర। ఖ్యాతమతిన్మహా
మరణకాలమునన్ హరిపుణ్యనామసం। భూతసుధామయాద్భుతవిభూతికరాతురసంగ్రహంబునన్* (సీ॥ బ్రహ్మహత్యా
నేకపాపాటవులకగ్నికీలలుహరినామకీర్తనములు । గురుతల్పకల్మషక్రూరసర్పములకుఁ గేకులుహరినామకీర్తనములు। తపనీ
యచౌర్యసంతమసంబునకుసూర్యకిరణముల్ హరినామకీర్తనములు । మధుపానకిల్బిషమదనాగనమితికిఁగేసరుల్ హరినా
మకీర్తనములు । మహితయోగోగ్రనిత్యసమాధవిధుల । నలరుబ్రహ్మాదిసురులకునందరాని। భూరినిర్వాణసామ్రాజ్యభోగ
భాగ్య। ఖేలనంబులుహరినామకీర్తనములు* (సీ॥ ముక్తికాంతైకాంతమోహనకృత్యముల్ కేలిమైహరినామకీర్తనములు
సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్ కేలిమైహరినామకీర్తనములు । మహితనిర్వాణ సామ్రాజ్యాభిషిక్తముల్ కేలిమై
హరినామకీర్తనములు । బహుకాలజనితతపఃఫలసారముల్ కేలిమైహరినామకీర్తనములు । పుణ్యమూలంబులనపాయపోష
కంబు। లభిమతార్థంబులజ్ఞానహరణకరము । లాగమాంతోపలబ్ధంబులమృతసేవ । లార్తశుభములుహరినామకీర్తనములు*
(క॥కామంబుపుణ్యమార్గ। స్థేమంబుమునీంద్రసాంద్రచేతోసరసీ । ధామంబుజిష్ణునిర్మల। నామంబుఁదలఁచువాఁడు నాథుఁ
డుగాఁడే*(క॥ డెందంబుపుత్రుపలనం। జెందినదనితలఁపవలమశ్రీపతిపేరే। చందముననైనఁబలికిన। నందకధరుఁడందెకలఁ
ధునాథుండగుచున్*(గీ॥బిడ్డపేరుఁబెట్టిపిలుచుటవిశ్రామ। కేలినైనమిగులఁగేలినైనఁ। బద్యగద్యగీతభావార్థములనైనఁ। గమ
లనయనుఁదలఁపఁగలుషహరము* (ఉ॥కూలినచోటఁగొట్టుపడికుందినచోటమహాజ్వరాదులం। బ్రేలినచోటసర్వముఖపీడల

పిసాళింపఁగాన్-అధికములగుచుండఁగాను—క్రించుతనమునన్-దుష్టత్వముచేత—ఊరములు-పాదరింజ్లు—చర్చ-సంఖ్య। విచారణ.

నందినవోటనార్తులై । తూలినచోటవిష్ణుభవదూతలు నేఁ బేరొన్ని రేనిమీఁదన । కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖ
భావముల్ * (సీ॥ అతిపాపములకుఁ బ్రయత్నపూర్వకమునఁ దనుపాపములక మితంబుగాఁగ । నన్మునివరులచే సంపాద్యమై
యుండు నిర్మలంబగు పాపనిష్కృతములు । క్రమరూపమున నుపశమనంబులగుఁ గాని తత్స్వయచయములఁ దలుపలేవు । సర్వక
ర్మంబుల సంహారమొనరించి చిత్తంబునకు దత్వసిద్ధి నెపుడు । నొసగుఁ నట్టిపుణ్యయోగమానసపరో । వాసుసేవ హేమవాసు
సేవ । వేదవేద్యసేవ వేదాంతవిభుసేవ । బరమపురుషపాదపద్మసేవ * (క॥ హరినెఱుఁగని యాబాలుఁడు । హరిభక్తులతోడఁ
గూడి హరియనువాఁడు । న్సరియైదోషములడఁచును । గిరువలితో నగ్నితృణముఁ గాల్చినభంగిన్ * (ఉ॥ ఆరయవీర్యవంతమగు
నౌషధమెట్లు యదృచ్ఛఁ గొన్నఁ ద । చ్చారుగుణంబు రోగములఁ జయ్యనఁ బాపిన చూడ్కిఁ బుణ్యవి । స్ఫారుని నంబుజోదరునిఁ
బామరుఁడజ్ఞుఁ డజ్ఞఁ బల్కినన్ । న్వారకఁ దత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే * (క॥ ధృతిఁ దప్పినతఁ డినిఁ బురా । కృ
తమునఁ గాకెట్లు దోఁచుఁ గేశవుఁడు మది । న్మితలేని జగముఁ దాల్చిన । యతఁ డొక్కని మనమునలోనన డఁగెడువాఁడే * (మ॥ నిర
తంబై నిరవద్యమై నిఖిలదిన్నిష్ఠాణమై సత్యమై । నిరహంకారగుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ । హరినామస్మరణావ్య
వంబిత దుష్ప్రత్యుత్పుంబు సేయించెదా । మరణాంతంబున నిట్టి సజ్జుని ధర్మంబేల వ్యర్థంబగున్ * (వ॥ అని యిట్లు భగవద్దూతలు భా
గవత ధర్మంబు నిర్ణయించి బ్రాహ్మణుని నతి ఘోరంబైన మృత్యుపాశబంధనజనితభీతిచే ముక్తునిఁ గావించిరంత నాయమదూ
తలా భగవద్దూతల సంభాషణ ప్రభావంబులఁ దమమనంబుల శాంతి నొంది భగవత్తత్త్వజిజ్ఞాసితులయి చేయునది లేక నిరాకృతు
లై యమలోకంబునకుం జని పితృపతికి సర్వంబును నెఱింగించిరంత * (క॥ అతఁడును బాశచ్యుతుఁడై । గతభయుఁడై ప్రకృతి
నొందికడు నుత్సవసం । గతిఁ జూచి మ్రొక్కె మదిలో । నతులితముద మొదవి పాదలి హరిదాసులకున్ * (గీ॥ నిలిచి కేలు మోగిచి పలు
కను ద్యోగించి । చెలఁగుచున్న లోనిఁ తలఁపుఁ దెలిసి । చక్రధరుని మూర్తి సహచరులరిగిరి । దృశ్యులగుచు దేవదేవుకడకు * (క॥ వేద
త్రయసంపాద్యము । మోక్షంబగు నాశ్రయంబుమును భగవద్ధ । ర్మాదేశంబగు తత్పట । వాదంబున జామిళుండు వదలక విను
చున్ * (క॥ శ్రీమన్నారాయణపద । తామరసధ్యానసలిలధౌతమహాఘు । స్తోమకుఁడై సద్భక్తికి । ధామముఁడగుచుండెఁ దెలిసిత
క్షణమాత్రన్ * (క॥ బరవసమున నరికట్టిన । దురితంబులఁ దలఁచి తలఁచి కుదిదాపమునన్ । హరిని శనాశ్రయించుచు । బరితాప
మునొందిపలికె బ్రాహ్మణుఁ డాత్మన్ * (సీ॥ వృషలియందనురాగవృద్ధిఁ బిడ్డలఁ గనికులము గోదావరిఁ గూలఁద్రోచి । రచ్చలకెక్కి
పెనరజ్జు సేతలసరివారిలో పలఁదలవంపుఁ జేసి । కట్టడిముదుకనై కర్మబంధంబులఁ బుట్టనై నింకల బ్రోవనగుచుఁ । దరుణులరోఁ
తలఁ దవిలి భోగించినకడిదియా జన్మంబు గాలిపోయెఁ । జమువుచట్టువడియె శాస్త్రంబు మున్నయ్యె । బుద్ధిపురుషుమేసెఁ బుణ్యము
డఁగె । నీతి మట్టువడియె నిర్మలజ్ఞానంబు । మొదలికుడిగె బోధమూఱివోయె * (క॥ దిక్కని చక్కని చన్నుల । మక్కువయిల్లాలి విడి
చి మాయలు గలయీ । వెక్కసపు మద్యపానపు । డొక్కపసన్దలి దుర్విటుఁడనై చెడితిన్ * (ఉ॥ అక్కట ఘోరదుష్కృతమహా
నలకీలలు నన్ను ముట్టిపే । ఱుక్కఁడగింపక ఇట్లు ధృతి నుండఁగ నిచ్చిన హా దురాత్మునిన్ । గ్రక్కునఁ దల్లిదండ్రులనకల్మషచిత్తు
లఁ బెద్దలన్ మతే । దిక్కును లేనివారిఁ బెనుతీఁపులఁ బెట్టుచుఁ బారఁదోలితిన్ * (క॥ అకృతజ్ఞుఁడనై విడిచితిఁ । బ్రకృతిం గలబంధు
వులను బాల్యముసేనను । న్వికృతిఁ జనకుండఁ బెంచిన । సుకృతుల మజ్జనకపరుల సోభనకరులన్ । అప్పుడు * (గీ॥ పెక్కుపాతకముల
భృశదారుణంబైన । దొడ్డనరకచంపుఁ బడ్డనన్ను । నాపదలకుఁ బాపి యరికట్టి రక్షించి । రిట్టి ధర్మపురుషులెందువారో * (శా॥ చో
ద్యంబైకలనో లెనీక్షణము నంజూడంగఁ బ్రత్యక్షమై । వేద్యంబయ్యెను నన్ను నీడ్చినమహావీరుల్ భృశోదగ్రులా । యుద్యోగం
బులవారు పాశధరులీయుత్సాహముల్మానిసం । పాద్యానేకవికారరూపకుటిలప్రఖ్యాతులెవ్వారలో * (ఉ॥ దారుణపాశబం
ధనవిధానములన్నరకార్ణవంబులోఁ । గూరిననన్ను నేఁడు సెడకుండ నొనర్చిన పుణ్యమూర్తులం । భోరుహనేత్రులుజ్జ్వలన
భోమణితేజులులోచనోత్సవు । ల్వారు దయాసమన్వితవిచారులు నల్వురు నెందుకేగిరో * (మ॥ ననురక్షించినపుణ్యవంతులు
కనన్నాళీకపత్రాక్షులం । జనసంకాశులు శంఖచక్రధరులాజానూరుబాహుల్ స్మితా । ననులాలంబితకర్ణవేష్టనసువర్ణచ్ఛా
యదివ్యాంబరు । ల్ఘనకారుణ్యరసైకపూర్ణుసమగ్రస్ఫూర్తినెవ్వారలో * (వ॥ పాతకుఁడనగు నామున్నివ్విబుధోత్తమదర్శ
నంబు పురాకృతమదీయపుణ్యవిశేషంబునం గాని పొందశక్యంబు గాదు తత్సందర్శనంబాత్మకునతి సుప్రసన్నంబై యొప్పున
ట్లు గాకుండెనేనిఁ గలుషవర్తనంబున వృషలీభర్తనై యుండి మృతిబొందుచున్న నాదుజిహ్వకు శ్రీమన్నారాయణ నామగ్ర
హణంబు సంభవింప నేరదు మఱియును * (గీ॥ పాతకుఁడను జడుఁడ బ్రహ్మఘాతకుఁడను । మానలోభమోహమత్సరుండ । నాకు
నెట్లు దొరుకు నారాయణుని దివ్య । నామవిమలకీర్తనంబు మదికి * (సీ॥ దారుణమోహాంధకారపూరితుఁడను హరివిస్మయస్మర
ణార్హమతినె । పంచమహాతీవ్రపాతకోపేతుఁడ హరివిస్మయస్మరణార్హమతినె । కౌటిల్యకితవవికారపారీణుండ హరివిస్మయ

నిష్కృతములు-ప్రాయశ్చిత్తములు — హేమవాసు-బంగరుపట్టుపుట్టముగలవిష్ణువు యొక్క-పరువలితో-వాయువుతో.

స్మరణార్హమతివై।యఖిలదుఃఖైకఘోరార్ణవమగ్నుండహరిఁబిస్మయస్మరణార్హమతినై । నందలకునెల్ల నెలవైననిర్గుణుండ మందభాగ్యుండనే నేడమధువిదారి । దివ్యగుణనామకీర్తన తెలియఁగ దేడఁ। బూర్వసుకృతంబులే కెట్లుపొందఁగలుగు ॥ అనివిత ర్కించి * (మ॥ యతచిత్తేంద్రియమారుతుండవగుచుఁ యత్నంబొనర్తుఁహరి । వ్రతసంపత్తికిబుణ్యవృత్తికిఁజిదావాసో న్ముఖాసక్తికిఁ। యతనిర్వాణపదానురక్తికిసుఖోద్యోగక్రియాశక్తికిఁ । ధృతిలబ్ధోత్తమమూర్తికిఁసకలధాత్రీధుర్యసద్భ క్తికిఁ* (క॥విడిచితిభవబంధంబుల।నడిచితిమాయావిమోహమైనతపంబు। నొ్నడిచితినరివర్గంబులఁ।గడిచితినాజన్మదుఃఖ కష్టార్ణవముఁ* (క॥ యోషిద్రూపంబుననను । నేషణముఖగహ్వరమున నెగ్రమింగిక దు । ద్వేషమునఁగోఁతఁజేసిన।దోష దయగునాత్మమాయతోలఁగఁగంటిఁ * (వ ॥ అనియిట్లు వైష్ణవజ్ఞానదీపంబాత్మస్నేహంబునంద్రోచిన బ్రాహ్మణుండు* (మ॥భగవద్ధర్మపరాయణోత్తములసంభాషైకమంత్రంబులఁ । మిగులఁజ్ఞానమువుట్టమోహభవసమ్మిశ్రాత్మబంధంబుల। నైగఖండించిసబంధుమిత్రసుతపత్నీ మోహవిభ్రాంతుఁడై । జగతీనాథురమేశుఁగృష్ణునిదమైశ్వర్యంబులంగోరుచుఁ*(క॥ హరిభక్తులతోమాటలు । ధరనెన్నఁడుఁజెడనిపుణ్యధనములమూఁట।ల్వరముక్తికాంతతేటలు । నరిషడ్వర్గంబుచొరనియరు గులకోటల్* (సీ॥ అనుచనాబ్రాహ్మణుండతితత్త్వవేదియై భవబంధములనెల్లఁబారఁదోలి । మొనసిగంగాద్వారమునకేగి యచ్చటఁబ్రబ్బినదేవతాభవనమందు । నాసీనుడై యోగమాశ్రయించి వెలుంగుదేహేంద్రియాదుల తెరువులఁన । దనుఁ బాపుకొనిపరతత్త్వంబుతోఁగూర్చిమానుగానాత్మసమాధిచేత।గుణగణంబుఁబాసికొమరొప్పినభగవ । దనుభవాత్మయందు నాత్మగలిపి । రమణఁదన్నుమొదలరక్షించినట్టియా।పురుషవరులఁగాంచిపొసగ్రమొక్కె* (వ ॥ అట్లజామిళుండుయోగ మార్గంబునదేహంబువిడిచిపుణ్యశరీరుండై యగ్రభాగంబునం బ్రాగుపలబ్ధులైన మహాపురుషకింకరులంగాంచినమంచితరో మాంచిత చలచ్ఛటాపింజరితస్వేదబిందు సందోహమిషనిష్యందమహానందవల్లికామతల్లి కాంకురసంకుల పరిశోభితతనుం డును,హర్షనికర్షమాణమానసోద్యోగయోగప్రభావోత్సాహవిస్మయమందస్మిత ముఖారవిందకందళితుండును,నిఖిలజగజ్జే గీయమానాఖండ శుభప్రదశుభాకారసందర్శనసమాసాదిత కుతూహలమానసుండై ప్రణామంబులాచరించుచుభాగీరథీతీ రంబునఁగళేబరంబువిడిచితత్క్షణంబున హరిపార్శ్వవర్తనులైనదాసవరుల స్వరూపంబుదాల్చి యావిష్ణుసేవకులతోఁగూ డిదివ్యమణిగణఖచితంబగు సువర్ణమయంబైనయపమానవిమానంబెక్కి నిఖిలానందభోగభాగ్యాను భవాకుంఠితంబైనవై కుంఠంబునశ్రీమన్నారాయణ పాదారవిందసేవాచరణ పరిణామస్థితికింజనియె నిట్లువిప్లావితసర్వధర్ముండైనదాసీపతిగర్హి తకర్మంబులచేతఁబతితుండునుహతవ్రతుండునై నరకంబునంగూలుచుండి భగవన్నామగ్రహణంబున సద్యోముక్తుండయ్యెఁ గావున*(క॥కర్మంబులెల్ల బాయను।మర్మమువలపంగలేదుమధురిపుపేరే। పేర్మినొ్నడుపుటకంబెను।దుర్మదమునఁజిత్తమె న్నిత్రోవలనున్నఁ*(ఉ॥పాండవవంశపాలననృపాలకయీయితిహాసమెవ్వఁడే। నొండొకభక్తిలేకవినవొప్పమెయింబఠి యించునాతఁడుఁ। దండతముక్తికామినికిఁదానకమైడనుజారిలోకమం । దుండుమహావిభూతియమదూతలచూడ్కికగోచ రాకృతిఁ*(గీ॥అరయపుత్రోపచారితమైనవిష్ణు। నామమవసానకాలంబుననుభజించి । శార్ఙ్గినిలయంబుఁజేరెనజామిళుం డు।విష్ణుసద్భక్తిఁదలచిననేమిసెప్ప* (క॥ కోరినవారలకెల్లను।జేరువకైవల్యపదముసిరివరునిమదిఁ।గోరనివారలకెల్లను। దూరముమోక్షప్తిమెన్నిత్రోవలనైనఁ* (వ॥ అనినంబరీక్షిన్నరేంద్రుండిట్లనియె మునీంద్రాదాయాజ్ఞాభ్రష్టుండైయమధ ర్మరాజుశ్రీవిష్ణునిర్దేశకులచేతవిహతులైనభటులచేతవర్ణింపంబడిన నారాయణునినామప్రభావంబాకర్ణించి వారలకేమని యెఱుఁగియు వెన్నఁడేనియుయమదండంబు విఫలంబైపోయినతెఱంగుగలదేనివినవలయు నీసందేహంబుబాపమహాత్మానీవు దక్కదక్కనవారలు సమర్థులుగారనితలంచుచున్నవాఁడఁజిత్తంబును బ్రసాదాయత్తంబుగా భవదీయ వచనసుధాధారలఁ బ్రసాదింపవలయుననినశుకుండిట్లనియె* (క॥ శ్రీకృష్ణభటులచేతని। రాకృతులై యామ్యభటులుయమునకునాత్మ।స్వీకృతవి ప్రకథాక్రమ।మేక్రియనుందెలిపిరయ్యనెతెఁగింపుతగఁ* (గీ॥ చేరిత్రివిధకర్మలఁజేయుజీవతతికిఁ। గర్మఫలములఁదెలిపెడు కారణులుగ।నగుచుశిక్షించువారలీయవనిమీఁద।దేవయెందఱుగలరయ్య తెలియవలయు*(క॥దక్షిణదిశాధినాయక।శిక్షుండ గఁజేయువారుక్షితిపెక్కండ్రే।నిక్షయమున్నత్వయమును।సాక్షాత్తుగరెండునెందుసంపన్నముగుఁ* (గీ॥ దట్టమైనట్టికమఁ బంధముల నెల్ల।నాజ్ఞఁబెట్టెడువారుపెక్కైనచోట । యుకటశాస్త్రార్థముపచారమయ్యెఁగాదె । శూరులైనట్టిమండలేశుల కుఁబోలె*(ఉ॥కావుననీవయొక్కఁడవకర్తవుమూఁడుజగంబులందుసం। భావితభూతకోటిఁబరిపాకవశంబునశిక్షసేయఁ గా।నీవరశాసనంబఖిలనిర్ణయమైతనగారుచుండ నే।దీవలఁగ్రమ్మరింపమఱియెవ్వఁడుశక్తుఁడుధర్మపాలనా* (క॥ చండకరత నయయొరులకు।దండధరత్వంబుగలదెతగజగమునను।ద్దండధరవృత్తినొత్తిలి।దండింతువునిన్నుదండధరుఁడనిబొగడఁ* (సీ॥

ఖాతమహాఘస్తోముఁడై - ప్రోఁగొట్టఁబడినఘనపాపసమూహముగలవాఁడయి — బరనమున్నఁ - అతిసమర్థతచేత.

ఇట్టినీదండంబునీమూఁడుజగములఁ దెగువమై నేఁడువర్తించుచుండు । మనుజలోకంబునమహదద్భుతాకారసద్ధులమగుసల్ప్ర సిద్ధులైన। వారునల్వురు వేగవచ్చినిర్దేశంబుభంగించిమమ్మంతఁబారఁదోలి । మీశాసనంబునమేమీడ్చికొనివచ్చుక్రూరదిత్తుని వుద్భికొనియదళ్సి। పాశబంధంబులీమనఁబట్టి తెంచి।బలిమిమిగులంగమమ్మనఁబారఁదోలి । యిచ్చఁజనినారువారుదామెచటి వారి। లాదరమ్మునమాకునేఁడానతిమ్ము* (వ॥ అనిరనినాఁటియమశకుండిట్లనియెనట్లుగూతలు పరితాపసమేతులై పలికినదండ ధరుండు పుండరీకాక్షునిచరణకమలంబులు దనమానసంబునసన్నిహితంబుగఁజేసి వందనంబాచరించి పరమభక్తిపరుండై వారలకిట్లనియె* (సీ॥ కలఁడుమదన్యుండుఘనుఁడొకఁడతనుండు వెలికిఁగానఁగరాకవిశ్వమెల్ల । నతిలీనమైనమహాద్భుతస మగ్రస్ఫూర్తినుండుఁగోఁకందునూలున్నభంగి । దామెనఁబశువులుదగిలియుండెడుమాడ్కి నామసంకీర్తనస్థేమమతుల । వి హరించునెవ్వఁడువిలసితమత్స్వాజలెవ్వనిపదములనివ్వటిల్లుఁ । గనుటమనుటచనుటగల్గునెవ్వనిలీల।లందులోకమెవ్వనందు బొందు। నెన్నఁబడుచుపుడమి నెవ్వని నామము।ల్గర్మబంధనములఁజేర్చినడంచు* (తేట॥ వినుఁడు నేనుమహేంద్రుఁడప్పతిపిత హూత్రుఁడురాక్షసుం । డనిలుఁడరుఁడుచంద్రుఁడుఁగమలాసనుండుమరుద్గణం । బునుమహేశుఁడురుద్రవర్గముభూరి సంయమిసిద్ధులు।న్మౌనసికన్గొనఁజాలరెవ్వనిమూర్తివిశ్రుతకీర్తిమై*(క॥సత్త్వేతరగుణపాశవ।శత్వంబునఁబొంవవీరుజలజా క్షునదై। కల్పంబుగానమోపరు।సత్త్వప్రాధాన్యలితరజనులకుసరియే* (చ॥ అభవునమేయునవ్యయుననంతునవారతుఁ బూనిమేనిలో।నుభయమునై వెలుంగు పురుషోత్తముఁగాననుచిత్తకర్మవా । గ్విభవగరిష్ఠులై వెదకివీఁడెప్రాణులుసర్వవస్తు వు।ల్నుభగతిఁజూడనేర్చితనుఁజూడఁగనేరనికంటిపోలిక* (చ॥పరమునిభక్తలోకపరిపాలునిశీలుఁనిదుష్టలోకసం।హారునిఁబ తంగపుంగవవిహారునిమూరిమిదూతలామహో।హరులుసురేంద్రవందితులు నాహరిరూపగుణస్వభావులై। తిరుగుచునుందురె ల్లెడలఁదిక్కులఁదేజముపిక్కటిల్లఁగ* (ఉ॥ లెక్కకు నెక్కు వైకసటులేనిమహాద్భుతతేజమెల్లెడం।బిక్కటిలంజరింతుర తిభీమబలాఢ్యులువిష్ణుభూతము।ల్చక్కనిధర్మశాంతులతిసాహసవంతులు దేవపూజితు। ల్దిక్కులఁజేసీజగంబునను గేశవసేవక రతుణార్థమై*(క॥నావలననుమీవలనను । దేవాసురగణమువలనఁద్రిజగంబులలో। నేవగలఁబొందకుండఁగ।గావంగలవా రుపుడమిఁగలవైష్ణవులు* (క॥భగవత్ప్రణీహితధర్మం।బగపడ దెవ్వారిమతికినని మిషగరుడో।రగసిద్ధసాధ్యనరసుర।ఖగతా పసయతుదివిజఖచరులకైన* (క॥ఎన్నఁడుఁదెలియఁగనేరరు । పన్నగపతిశాయితత్త్వభావముమేనం।గన్నులవేల్పుమఁడా పల।సన్నుతిగలవేల్పుముదురుచదువులవేల్పు* (సీ॥ వరమహాద్భుతమైనవైష్ణవజ్ఞానంబుఁదిరముగా నెవ్వరు తెలియఁగల రు। దేవాదిదేవుండుద్రిపురసంహరుఁడొండెఁగమలసంభవుఁడొండెఁగార్తికేయ । కపిలనారదుఁడొండెగంగాత్మజుండొండె మనువొండెబలియొండెజనకుఁడొండెఁ । బ్రహ్లాదుఁడొండెఁనేర్పాటుగాశుకుఁడొండెభాసురతరమతివ్యాసుఁడొండెఁ।గాక యన్యులతరమైయీలోకమందునీసుబోధంబుసద్బోధమీపదార్థ। మీసదానందచిన్మయమీయగమ్య। మీవిశుద్ధంబుగుహ్యం బునీశుభంబు* (క॥ఈపన్నిద్దఱుఁదక్కఁగ । నోపరుతక్కొరులు దెలియనుపనివదుచిత। శ్రీహరి నామమహాద్భుత।దీపితభాగ వతధర్మదివ్యక్రమము* (గీ. ఏదిజపియింపనమృతమైయెసఁగుచుండు।నేదిసద్ధర్మపథమని యెఱుఁగఁదగిన । దదియెసద్భక్తి యోగంబునావహించు।మూర్తివంతంబుతోహరికీర్తనంబు* (గీ॥ కంటిరేమీరుసుతులారకమలనేత్రు । భవ్యమగునామకీర్త నఫలము నేఁడు।తవిలిమృత్యువుపాశబంధములవలన।జాణతనమునవీడెనజామిళుండు* (ఉ॥ఏటికిజాలిఁబొందనగులేక్రియఁ గృష్ణునికీర్తనంబుపా।పాటవులన్దహింపఁగలపాటుకుసందియమేలయిప్పుడీ । తూటరిదోసకారి వెనుదోసియజామిళుఁడంత మొందుచుం।బాటిగవిష్ణునామమునుబల్కుచుఁగేవలముక్తికేఁగఁడే* (క॥ఇంతయనుపథ్యమనిమది । నెంతయుఁదెలియంగ లేరుహీనాత్ములుమ।ద్దాంతతరఘటితమాయా।క్రాంతాత్యంతప్రకాశగౌరవజడులై* (మంగళమహాశ్రీవృత్తము ॥ ఈవిధ మునన్విబుధులేకతము చిత్తములనేకతములేకహరినీశు । న్భావమునననిల్పితగు భాగవతయోగపరిపక్వమున నొందుదురువా రిల । దేవలదుదండనగతిఁజనదుమాకుగురిదిప్పరఘముల్దలఁగుమీఁద । శ్రీవరునిచక్రమువిశేషగతిఁగాచుసురసేవితులు ముక్తిఁగదుపెద్దల్* (ఉ॥ ఎవ్వరుసిద్ధసాధ్యఖచరేశలసత్పరిగీతగాధలం। దెవ్వరుముక్తిభోగతలహేమమనోహరచంద్ర శాలలం। దెవ్వరుశంఖచక్రముఖహేతిగదారుచిరోగ్రపాణులా । మవ్వపురూపవంతులసమానులువోధరలోనివైష్ణవుల్* (సీ॥ శ్రుత్యంతవిశ్రాంతసత్యసుకమనీయభగవత్ప్రసంగతుల్ భాగవతులు । సకలసన్ముఖయోగిజనసదానందైకపరమ భాగ్యోదయుల్భాగవతులు। కృష్ణపదధ్యానకేవలామృతపానపరిణామయుతులుశ్రీభాగవతులు । బహుపాతకానీకపరిభవ ప్రక్రియాపరుషాగ్ర్యమూర్తులుభాగవతులు । భావతత్త్వార్థవేదులుభాగవతులు । బ్రహ్మవాదానువాదులుభాగవతులు । సి రులుడనరంగనెన్నఁడుఁజేటులేని।పదవినొప్పారువారువోభాగవతులు* (క॥అదిగానవిష్ణుభక్తులఁ।గదియఁగజనవలదుమీరు కరిపర్వదులన।త్పదపద్మవినతివిముఖులఁ।దుదినంటఁగఁగట్టితెండుధూర్తులువారల్* (సీ॥ ఏకసకైమునకైననిందిరారమణు

నంబలుకంగ లేనిదుర్భాషితులను । గలలోనైన శ్రీకాంతునిసత్పాదకమలముల్ సూడనికర్మగతుల । నవ్వుచునైనఁగృష్ణప్ర
శంసకుఁ జెవిదాల వేయనిదుష్కథాభిరతుల। యాత్రోత్సవంబులనైననీశునిగుడిత్రోవఁద్రొక్కఁగ లేనిదుష్పదులను। బరమ
భాగవతులపాదధూళిసమస్తతీర్థసారమనుచుఁదెలియలేని । వారివారివారివారిఁజేరినవారిఁ । దోలుతెఁగట్టితెండు దూత
లార* (గీ॥ఎల్లపాపములకునిల్లయినయింటిలోఁ।బద్ధతృష్ణులగుచుబుద్ధిఁదగిలి।పరమహంసకులముగుణిఁదప్పవర్తించు ధూర్త
జనులఁదెండు దూతలార* (గీ॥అరయఁదనదుజిహ్వహరిపేరునుడువదు । చిత్తమతనిపాదచింతఁజనదు।తలఁపఁదనకు ముక్తి
తంగేటిజున్నాకో।సకలవిష్ణుభక్తులకును బోలె* (గీ॥ పద్మనయనుమీఁదిభక్తియోగంబెల్ల।ముక్తియోగమనుచు మొదలెఱుం
గు। వారివారివారివారిఁజేరినవారి । త్రోవబోవవలదుదూతలారా* (వ॥ అనిపలికెనని చెప్పి శుకుండిట్లనియె శ్రీ
కృష్ణనామకీర్తనంబు, జగన్మంగళంబనియును, జగన్మోహనంబనియును, జగజ్జేగీయమానంబనియును, నిఖిలపాపైకనిష్కృ
తియనియును, నిఖిలదుఃఖనివారణంబనియును, నిఖిలదారిద్ర్యనిర్మూలకంబనియు, నఖిలమాయాగుణవిచ్ఛేదకంబనియు, ను
ద్దామంబులగు హరివీర్యంబులనాకర్ణించువారలచిత్తంబులతి నిర్మలంబులగుభంగిందక్కిన వ్రతాచరణంబులం గావనియును
శ్రీకృష్ణపదపద్మంబులు హృత్పద్మంబులఁదలఁచువారలన్యపాపకర్మంబులగు నవిద్యావ్యసనంబులం బొరయ నేరరనియును, ని
జస్వామియైనయమధర్మరాజుచేతఁగీర్తింపంబడినభగవన్మహత్త్వంబునాకర్ణించి విస్మితులై కాలకింకరులు నాఁటనుండియు,
వైష్ణవజనంబులం దేరిచూడ వెరతురు నరేంద్రా పరమగుహ్యంబగునీయితిహాసంబును, పూర్వకాలంబున సకలవిజ్ఞానగోచ
రుండైనకుంభసంభవుండు సకలదుఃఖవిలయంబును, సకలపుణ్యనిలయంబైన మలయంబున పురాణపురుషుండైన పురుషోత్త
మునారాధనంబు సేయుచుండి నాకెఱింగించెనని చెప్పిన విని విస్మయానందహృదయుండై పరీక్షిజ్జనపాలుండిట్లనియె* (క॥
స్వాయంభువమనువేళల । నోయయ్య సురాసురాండజోరగనరవ।ర్గాయదసర్గముఁ దెలిపితి।పాయక నదివిస్తరించి పలుకంగ
దవే* (క॥ఉత్తరకొడుకిట్లడిగిన । యుత్తరమునకమ్మునీంద్రుఁడుత్తముచేతో। వృత్తిముదమందిపలికెను।దత్తరపాటుడిగి వినుఁ
డు దాపసులారా* (సీ॥ పూని ప్రచేతసపుత్రులు పదుగురు ప్రాచీనబర్హిష ప్రాఖ్యగలుగు । వారుమహాంభోధివలన వెల్వడి వ
చ్చితగవృక్షవృతమైనధరణిఁ జూచి । మేదినీజములపైమిక్కిలి కోపించి నుదిలోనదీపితమన్యులగుచు । వక్త్రంబులనుమహా
వాయుసంయుతమయినయనలంబుఁగల్పించియవనిజములఁ । బెల్లువడఁ గాల్పఁదొడఁగినఁదల్లడిల్లి । వారికోపంబువారించు
వాఁడపోలెఁ।బలికె జంద్రుండుయో మహాభాగులార।దీనమగువృక్షములమీఁద దెగుటనగునె* (గీ॥ మొదలవర్ధిష్ణులగుమి
మ్మునదయహృదయు । లగుప్రజాపతులనుచు సర్వాత్ముఁడనియె । నట్టిమీకు ప్రజాసృష్టికైనవార । లీవనస్పతితతులదహింపఁద
గునె* (సీ॥ఆదికాలంబున నా ప్రజాపతిపతియైనలోకేశ్వరుండచ్యుతుండు । పద్మనేత్రుఁడు వనస్పతుల నోషధిముఖ్యజాతం
బునిభముననూర్జంబుఁగోరి।కల్పించెనందుముఖ్యంబైనయన్నంబు యచరంబులైనట్టియపదమెల్లఁ । బాదచారిణులకుఁ బాల్వె
ట్టియురుగాళ్లు చేతులుగలిగినజీవతతికి।హస్తములు లేనియాచతుష్పాదులెల్ల । నన్నముగఁబూనికావించెననియుఁగాక । నామ
హాభాగుఁడచ్యుతుఁడాదరమున।మీకు ననఘాఖ్యవిఖ్యాతిఁజోకపరచె* (క॥నిజముగ దేవాధీశ్వరుఁ।డజుఁడు ప్రజాసర్గమునకు న
నఘులమిమ్మున్।సృజియించె నట్టివారికిఁ । గుజదహనముసేయనెట్లు కోరికవొడమెన్* (చ॥సతతమహత్త్వసత్త్వగుణసత్పురు
షశ్రుతిఁబొందిరయ్య మీ । పితరులునుం బితామహులు పెద్దలు నెన్నఁడుఁబొందనట్టి సు । మహితమతమైనకోపముననఁగిల్బిష
భావమునానరయ్య సంభృతకరుణావలోకమున భీతతరుప్రకరంబుఁ జూచుచున్* (ఉ॥ తప్పకనర్భకావళికిఁదల్లియుఁదండ్రి
యు నేత్రపక్ష్మికిన్। ఱెప్పలు నాతికింబతిని రేంద్రుఁడులోకులకెల్లనర్థికి । నొప్పగృహస్థుమూఢులకునుత్తములెన్నఁగవీరుబం
ధువుల్మునుపునఁగావనేనికదుమూర్ఖులుమిమ్మిసమస్తబంధువుల్* (సీ॥ అఖిలభూతముల దేహాంతస్థమగునాత్మ యీశుఁడచ్యు
తుఁడని యెఱుఁగవలయు । నెఱిఁగిసర్వంబైనయిందిరారమణునిలోఁజూపుదనివిగాఁజూడవలయుఁ।జూచిన ద్రుమాపశుద్ధాత్ము
లగుమిమ్ము నెఱసిన వేడ్కతో నిచ్చమెచ్చు।మెచ్చిన సర్వాత్ముమీరెఱింగిన చోటఁ గోపగుణంబులఁ బాపవలయుఁ।బాపిదగ్ధశేష
పాదపజాలంబు।దియ్యమెసఁగఁ బ్రతుకనీయవలయు। ననఘులార మీరలస్మదీయప్రార్థనంబున రగఁజేకొనంగవలయు* (క॥
ఇదెవృక్షసముద్భవయగు।మదిరేక్షణనాప్సరసఁగుమారికనిత్తు।న్వదలకపత్నిగఁజేకొని । ముదమందుఁచు పాదపముల మోస
ము వాయన్* (వ॥అనియిట్లామంత్రణంబు సేసి మారిష యనుకన్యకను వారలకిచ్చి చంద్రుండు చనియె నప్పుడు* (క॥ వారలు
పశ్చాత్యంబున నీరజముఖినిన్వరించి నెఱిరమియింపన్ । ధీరుఁడు ప్రాచేతసుఁడై । వారకదక్షుండు పుట్టె వనజజసముఁడై*
(క।ఎవ్వనిసంతానంబులు।నివ్వటిలన్నపుధ నెల్ల నెఱినాదక్షుం। డివ్వలనజగములన్నిటఁ।బ్రవ్వజలము నిలిపినట్లు ప్రజలఁ బుట్టిం
చెన్* (ఉ।వారని వేడ్కతో దుహితృవత్సలదక్షుఁడు దక్షుఁడాత్మచేఁ।గోరిసృజించెఁగొన్నిటినకుంఠితవీర్యముచేతఁగొన్ని
టిన్।ఘోరునఖేచరంబులనుభూచరముఖ్యవనేచరణంబుల।న్నీరచర వ్రజంబు రజనీచరజాలని వాచరంబులన్* (క॥నరసురగ

రుడోరగకి।న్నరదానవయక్షపక్షినగవృక్షములం।దరమిడిసృష్టియొనర్చెను।దిరముగదక్షప్రజాపతిస్ఫుటకీర్తిన్* (క॥ బహువిధములబహుముఖముల। బహురూపములైనప్రజలబహులోకముల।న్బహుళముగఁజేసి మదిలోబ।హుమానమునొందఁడయ్యెఁబ్రఖ్యాతముగన్* (గీ॥ ఆప్రజాసర్గబృంహితంబైనజగము। దక్షుఁడీక్షించిమదిలోనఁజాపమొంది। మఱియుజననంబునొందించుమతముఱోసి పరమపురుషునాశ్రయింపంగఁదలఁచె* (వ॥ ఇట్లుదక్షప్రజాపతిప్రజాసర్గంబుచాలకచింతించిమఱితనయంబునలక్ష్మీకాంతునిసంతుష్టుంజేయువాఁడై *(క॥ మోదంబై పరిదూషిత। ఖేదంబై శాబరీద్ధకిలికించితద్య।గ్భేదంబై బహుసౌఖ్యా।పాదంబై యొప్పువింధ్యపాదంబునకున్- (వ॥ ఇట్లువింధ్యపాదంబునకఱిగియందఘమర్షణంబనుతీర్థంబుసర్వదురితహరంబయియొప్పు దానిననుసవనంబుసేవించి యతిఘోరంబైనతపంబుసేయుచు హరింబ్రసన్నుంజేసె హంసగుహ్యంబను

*** దక్షుఁడుస్తుతియించినహంసగుహ్యంబను స్తవరాజము. ***

స్తవరాజంబుననిట్లని స్తుతియించె* (గీ॥ పరమునికివందనముసేతుఁబరిఢవించి। మునునవితథానుభూతిక్రమొక్క- కొందు।మెఱయగుణములఁదేలునిమిత్తమాత్ర। బంధుఁడైనట్టివానికిఁబ్రణుతిసేతు* (గీ॥ తవిలిగుణముచేతఁదత్త్వబుద్ధులజేత।నిగిడికానరానినెలవువాని।మొదలఁనాసకలిగి ముక్తిమానావధి।రూపమైనవానిఁబ్రాపుఁగొందు* (గీ॥ ఎల్లతనువులందునిలవొందితనతోడఁ।బొందుసేసినట్టిపొందుకాని।పొందునొందలేఁడుపురుషుండుగుణముదా।గుణనిఁబోలునట్టిగుణిభజింతు* (ఉ॥ పూనిమనంబులున్దనువుభూతములున్మఱియింద్రియంబులున్। బ్రాణములున్వివేకగతిఁబాయకనన్యముదంబునెమ్మెయిం।గానఁగనేరవాగుణనికాయములంబరికించునట్టిస।ర్వానుగతున్సమస్తహితునావిమపూరుషునాశ్రయించెదన్* (వ॥ మఱియునానేకవిధనామరూపనిరూప్యంబగుమనంబునకుదృష్టస్మృతులనాశంబువలనఁగలిగెడు నుపరామంబగుసమాధియందుఁగేవలజ్ఞానస్వరూపంబునఁదోఁచునిర్మలప్రతీతిస్థానుండైన హంసస్వరూపికినమస్కరింతు దారువందునతిగూఢంబైన వీతిహోత్రుని బుద్ధిచేతంబ్రకాశంబునొందించు భంగిబుద్ధిమంతులుహృదంతంబున సన్నివేశుండయిన పరమపురుషుని నాత్మశక్తిత్రయంబులచేతం దేజరిల్లంజేయునట్టిదేవుండు సకలమాయావిచ్ఛేదకంబయిన నిర్వాణసుఖానుభవంబులంగూడి యుచ్చరింపంగొలంది గాని శక్తిగలవిశ్వరూపినాకుంబ్రసన్నుండగుంగాక వాగ్బుద్ధీంద్రియమానసంబులచేతంజెప్ప నిట్టిదనిరూపింపనలవిగాకయెవ్వని గుణరూపంబులువర్తించు నెవ్వండు నిర్గుణుండుసర్వంబు నెవ్వనివలనసముత్పన్నంబగు నెవ్వనివలనస్థితింబొందు నెవ్వనివలనలయంబగుఁబరాపరంబులకుంబరమంబై యనన్యంబై ప్రాక్ప్రసిద్ధంబై సర్వవ్యాపకంబై యాదికారణంబై యున్నతత్త్వంబునాశ్రయింతు నెవ్వనిప్రభావంబు మాటలాడెడు వారలకువాదంబు సేయువారలకు వివాదస్థలంబులగుచునప్పటప్పటికి మోహంబునొందించుచుండునట్టి యనంతగుణంబుగల మహాత్మునకుం బ్రణామంబుసేయుచు నస్తినాస్తియనువస్తువ్యయనిష్ఠలంగలిగియొకటనగలిగియుండి విరుద్ధధర్మంబులఁగనుండును పాసనాశాస్త్రసాంఖ్యశాస్త్రంబులకు సమంబై వీక్షింపఁదగినపరమంబు నాకునునుకూలంబగుంగాక నెవ్వఁడుజగదనుగ్రహంబుకొఱకు జన్మకర్మంబులచేత నామరూపంబు లెఱుంగంబడుచుండునట్టి నామరూపంబులుగలిగి తేజరిల్లునన్తుండయినభగవంతుండుప్రసన్నుండగుంగాక యెవ్వండుజనులపురాకృతజ్ఞానపదంబులచేతనంతర్గతుండై మేదినింగలుగుగంధాదిగుణంబుల నాశ్రయించినవాయువు భంగిమెలంగుచుండు నాపరమేశ్వరుండు మదీయమనోరథంబు సఫలంబుసేయుంగాకయనుచు భక్తిపరవశుండై యుక్తివిశేషంబున స్తుతియించుచున్నదక్షునికిభక్తవత్సలుండయిన శ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబునొంది ప్రత్యక్షుండయ్యెనంత * (సీ॥ భర్మాచలేంద్రప్రపాతద్వయంబునఁ గలిగిననీలంపుగనులనంగ। మొనసితార్క్ష్యుని యుగుమూఁపుపైఁ బడ్డట్లుపదములకాంతులుపరిఢవింపఁ। జండదిజ్మండలశుండాలకరములకైవడినెనిమిదికరములమరఁ। జక్రకోదండాసిశంఖనందకపాశచర్మగదాదులసరవిఁబూని। నల్లమేనుమెఱయనగుమొగంబలరంగఁ।జల్లచూపువిబుధసమితిఁబ్రోవఁ। బసిఁడికాశఁబూనిబహుభూషణకిరీట।కుండలములకాంతిమెండుకొనఁగ* (సీ॥ కుండలమణిదీప్తిగండస్థలంబులఁబూర్ణేందురాగంబుఁబొందుపరపదివ్యకిరీటప్రదీప్తులంబరరమాసతికిఁగౌస్తుభవస్త్రంబుగాఁగ। వక్షస్థలంబుపైవనమాలమాలికల్ శ్రీవత్సకౌస్తుభశ్రీలమెఱయ। నీలాద్రిఁబెనఁగొనినిలిచినవిద్యుల్లతలభాతికనకాంగదంబుమెఱయ। నఖిలలోకమోహనాకారయుక్తుఁడయి। గదిసిమునులుఁబొగడగంధర్వకిన్నర।సిద్ధగానరవముసెవులనలర*(క॥ సర్వేశుఁడుసర్వాత్ముఁడు। సర్వగతుండచ్యుతుండుసర్వమయుండై।సర్వంబుచేరికొలువఁగ।సర్వగుఁడైదక్షునకుఁబ్రసన్నుండయ్యెన్* (వ॥ ఇట్లుప్రసన్నుండయినసర్వేశ్వరునిసర్వంకషంబయి, మహదాశ్చర్యధుర్యంబయి తేజరిల్లు దివ్యరూపంబుఁగాంచి, భయంబును,హర్షంబును, విస్మయంబును,జిత్తంబునముప్పిరిగొనఁ, జొప్పఁదప్పింపఁదెప్పిరికప్పురపాటునంబుడమిపై,నిడుసాగిలంబడి నారదాదిమునులుసేరిపొగడఁ। సెలయేరులతోఁగొట్టుపడి యుట్టట్టుపట్టుచాలక నిట్టవోడదిమున్నీరుఁదండప్రణామంబు లాచరించికరకమలంబులుమొగిడ్చి

దన్నినిలిచినపెన్నీరునుంబోలె సర్వాంగంబులుం దొంగలించి చిత్తంబు నాత్మాయత్తంబు సేసి పిక్కటిల్లిన సంతోషంబుచేత భగవంతుం బలుకను నత్యంత మంగళసందోహపాదకంబులైన తన్నామంబులు గ్గడింపనతినిర్మలంబులైన తదీయకర్మంబులుద డువనువిబుధహర్షకరంబులైన, తత్స్వరూపంబులు పొగడను, నాత్మీయమనోరథంబు వాక్రువ్వ నోపక, ప్రజాకాముండై యూర కున్నప్రజాపతిం జూచి సర్వజీవదయాపరుండును, సర్వసత్వహృదంతరస్థుండును, సర్వజ్ఞుండునుం గావున, నతనిభావంబు దె లిసి, జగన్నాథుం డార్తపోషణంబులైన భాషణంబుల నిట్లనియె* (క॥ మెచ్చితి ప్రాచేతస తప। మిచ్చటఫలసిద్ధియయ్యె నిల్లతిభ క్తిం। హెచ్చగు మద్వరవిభవము। నచ్చుపడం బొంద నెవ్వఁడర్హుఁడు జగతిన్* (గీ॥ తపము చాలునిం కఁదగ భూతతతికి। విభూతు లొనరుఁ గాక పొందుపడఁగ। నిదియ సుమ్ము మాకు నిచ్చలోఁ గలకోర్కి। పొసఁగ నీదు వలనఁ బొందు పడియె* (వ॥ వినుము బ్రహ్మ యు, భర్గుండును, బ్రజాపతులు, నింద్రులును, వీరలు నిఖిలభూతంబులకు భూతిహేతువులయిన, మద్భూతినిభవంబులు, మఱి యు నాకు, యమనియమాదిసహిత సంధ్యావందనాదిరూపంబగు తపంబు హృదయంబు, సాంగజపవద్ధ్యానరూపంబగు విద్యాశ రీరంబు, ధ్యానాదివిషయపుంవ్యాపారంబు గానుండు భావనాదిశబ్దవాచ్యంబగు క్రియ యాకృతియుఁ గ్రతుజాతంబు లంగం బులు, ధర్మంబాత్మ, దేవతలు ప్రాణంబులు, నిగమంబు నాత్స్వరూపంబు, జగదుత్పత్తికి నాదియందు నేనొక్కఁడన తేజరిల్లుచుం డిబహిరంతరంబుల వేఱొక్కటి లేదు, సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనంబగుటం జేసి, సంజ్ఞామాత్రుండు నవ్యక్తుండును గానుండు జీవునిభంగి నొక్కఁడనయుండుదు, ననంతుండనై, యనంతగుణంబులుగల మాయాగుణంబువలన, గుణవిగ్రహంబ గు బ్రహ్మాండంబును, నయోనిజుండు స్వయంభువుండగు బ్రహ్మయును, నుదయించిరి, మదీయవీర్యోపబృంహితుండయి, మహా దేవుండగు నా బ్రహ్మ యసమర్థునిఁబోలె నకృతార్థంమన్యమనమానసుఁడయి, సృష్టింపనుద్యమించుతఱి, తపంబాచరింపు మని నాచేత బోధితుండయి, యఘోరంబైనతపంబాచరించి, తొలుత సృష్టికర్తృత్వంబు వహించిన మిమ్ము సృజియించె, నంత పంచజనుండను ప్రజాపతితనూజయగు, యసిక్ని యను పేరట వినుతినొందియున్న యొకకన్యకను నీకిచ్చితి, దీనిం బత్నిగాఁగై కొని, మిథునవ్యవాయధర్మంబుగలవాఁడవై, మిథునవ్యవాయధర్మంబుగల యీనాతియందుఁ బ్రజాసర్గంబు నతివిపులంబుగఁ గావింపంగలవాఁడవు మఱియు నీకు బిదప నీక్రమంబున నిఖిల ప్రజలును మన్మాయామోహితులయి మిథునవ్యవాయధర్మంబున బ్రజావృద్ధినొందించి, మదారాధనపరులై యుండఁగలవారని పలికి విశ్వభావనుండైన హరి, స్వప్నోపలబ్ధార్థంబునుంబోలె, నంతర్ధానంబు నొందెనప్పుడు, దక్షుండు విష్ణుమాయోపబృంహితుండై, పాంచజనియగు నసిక్నియందు, హర్యశ్వసంజ్ఞల వి నుతిఁజెందియున్న యయుతసంఖ్యాపరిగణితులైన పుత్రులం గాంచె, నప్పుడా ధర్మశీలురయిన, దాక్షాయణులు, పితృనిర్దేశంబు నం, బ్రజాసర్గంబుకొఱకుఁ, దపంబు సేయువారై పశ్చిమదిశకుం జని, యచ్చట సింధుసముద్రసంగమంబున, సమస్తదేవముని సిద్ధగణసేవితంబై దర్శనమాత్రంబున, నిర్ధూతకల్మషులను, నిర్మలచిత్తులం జేయుచున్న, నారాయణసరస్సనం బరగు, తీర్థరా జంబున, నవగాహనంబుఁ జేసి, నిర్మలాంతరంగులై, పరమహంసధర్మంబునందు, నుత్పన్నమతులై ప్రజాసర్గంబు కొఱకుఁ దం డ్రియనుమతంబున, నుగ్రతపంబు సేయుచుండ వారికడకు నారదుండు వచ్చి యిట్లనియె* (సీ॥ మీరతిమూఢులు క్ష్మీఁదటి గతిఁ గాన రెన్నంగఁ బసిబిడ్డలన్నలార। పుడమిఁ దానింతనిక డఁ బరికింపరు ప్రజలబుట్టింప నే ప్రతిభ గలదు। అట్లైన నొక్క మహాత్ముఁడు పురు

షుండు బహురూపములుగల భామయొకతె। పుంశ్చలిగత్తయఁ బురణింప నుభయప్రవాహంబు గలనది వరలఁగదల। నంచ యొకటి యిరువదై దింటి మహిమలఁ। గలిగి యుండు తెరువు గానరాక। వజ్రనిబిడమగుచు వరుసదనంతన। తిరుగుఁ గాష్ఠబిలము కేటపడఁగ* (క॥ వినుఁడం మలనను రూపము। నను వొందగ నెఱుఁగ కాత్మ నాత్మగురూక్తిం। గొనసాగించెదమను మి।మ్మన నేమి యు లేదు మూఢులని తెలిసితగన్* (వ॥ అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత నారదవాక్యంబులఁ దమలోని ట్లనివితర్కించిరి* (గీ॥ సారది క్షేత్రజ్ఞుడన నతిసూక్ష్మమంది। యరయ నజ్ఞానబంధనంబగు చులింగ। దేహమున నెద్దిగలదది దెలి యకున్నఁ। గలదె మోక్షంబు మఱి దుష్కర్మగతులచేత* (గీ॥ కలదు జగదేకసన్నుత కారణుండు। స్వామి భగవంతుఁడభవుండు స్వాశ్రయుండు। పరముఁ డాతనిఁ జూడక బ్రహ్మకైనఁ। గలుగునే ముక్తిపదము దుష్కర్మగతుల* (గీ॥ పురుషుఁ డెట్లయేనిఁ బూని బిలస్వర్గ। గతుఁడు వోలె వర్తకంబు మాను। నట్టి బ్రహ్మ మెఱుఁగు నయ్యదు స్వరోచ్ఛిగ। కర్మగతుల నేమి కానఁబడును* (శా॥ త న్నిష్ఠాగతిలేని వానికి నసత్కర్మప్రచారంబు చే। ముస్నేనయ్యెడి నాత్మబుద్ధిగుణసమ్మోహంబు నందోఁచుమ। న్యాన్నైన్యె ట్టుకవింత బాగులతఱిన్వర్తించు దౌర్గుణ్యసం। పన్న స్త్రీయనుబోలె నెల్లగతులం బ్రఖ్యాతిమైయుండగన్* (సీ॥ అనువొందసృ ష్టిసువ్యయము గఁజేయుచుఁ బ్రచుర ప్రవాహసంపతితమైన। నెఱయఁ గూలంబను సిర్గమస్థానంబునందు వేగముగల క్రందుమా య। కడలియహంకారగతివశంబునఁ జాల వివశుఁడై బోధకు విపరీతమైన। వానికి నీరీతి వలవంతకర్మ ప్రచారంబులను మీఁదఁజ

కథనైన జన్మమరణముఖ్యజాడ్యంబుతోఁ బాసి । యఖిలసౌఖ్యపదవినరసికఁ బ్రమార్గమైనయట్టిమహనీయధామంబు । చిత్త మార నెట్లు చేరఁగలఁడు* (గీ॥ దానిసంపర్కగుణములుదప్పినడచుఁ । గుచ్చితపుభార్యఁజేకొన్నకు మతివోలెఁ । దివిరిసుఖదుఃఖములఁగూడి తిరుగుజీవ । రూపమెఱుఁగనివారికిఁ బ్రాపుగలదె* (మత్తకోకిల॥ పంచవింశతితత్త్వరాశికపారదర్పణమయ్యుఁడా । గొంచమైపురుషుండుతత్త్వముఁ గోరిపట్టఁగనేరకే । మించుఁదలఁచుచునుండిహేయపుమార్గకర్మము సేయఁగా । మించి లోకము వానికేటికి మానుగాసముహూరుడికా* (క॥ బంధాను మోక్షణక్రమ । సంధానైశ్వర్యధుర్యశాస్త్రసమగ్ర । గ్రంథంబు మాను చిద్రూపాంధున కుపకర్మగతులననునేశుభముల్* (మత్తకోకిల॥ చూడనీజగమంతయున్స్వాసఁజుట్టిపట్టుకలీలనే । జోడు లేకరయంబునంగుడిచుట్టినట్టిస్వతంత్రమై । గూడియుండినకాలచక్రముఁ గోరిచూడనివారికే । జాడఁగల్గును గర్మసంగతిఁ జారు మోక్షపదంబిలన్* (గీ॥ జన్మహేతువై నజనకుని శ్రేశంబు । తనకుఁ జేయరానిదనుచుఁ దెలిసి । గుణమయప్రవృత్తిఘోరాధ్వనిశ్వాస । నిరతుఁడగుచుఁ జేయ నేరఁడతఁడు* (వ॥ అనితమలోపితర్కించియాపువారలప్పుడు* (సీ॥ వినవయ్యభూపాలమునివరేణ్యుని మాటలను వొందఁదలపోసి వినయమలర । వలగొనియతనికి వందనంబొనరించి తిరిగి యెన్నఁడు రాని తెరువువట్టి । చయ్యన నేగి రిసహజ సత్త్వబ్రహ్మమయమైనపంకజనయను పాద । పద్మమరందంబుపానంబు సేయుచు మత్తిల్లినిలిచినమానసాళి । పరిణమింపవిష్ణుఁ బాడుచుఁ దత్కీర్తి । సరణిఁ బ్రమోయుమహాతిసంఘటించి । నారదుండు గుణవిశారదుండెందేనిఁ । జనియెజగముదన్ను సన్నుతింప* (క॥ అప్పుడు దక్షుఁడు తనయులు । దప్పి మహాపథముగనుటఁ దగ నారదుఁడే । చెప్పనఁగప్పినశోకము । ముప్పిరిగొనిచిత్తవృత్తిమూఁజింబోవన్* (చ॥ అడలుచునున్న వద్విక మలాసనుఁడూరడిలంగఁబల్కి ముఁ । న్బడసినవీలపుత్రులనపారకుణాఢ్యులఁ గాంచుమన్ననా । పడఁతుకయందుఁ గ్రమ్మరనుబల్వురఁ దాశబళాశ్వసంజ్ఞలం । బెడఁగగువారిఁబుణ్యములఁ బెచ్చినవారిసహస్రసంఖ్యలన్* (క॥ పుట్టించి నిజజనకునమదిఁ । బుట్టినతలఁపెఱిఁగి వారు పూనికెఁ బ్రజలం । బుట్టించువ్రతముఁ గైకొని । గట్టిగఁ దపమాచరింపఁ గాజనిరి వెసన్* (వ॥ ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రిపంపునం దపంబు సేయువారై యేతీర్థంబు తీర్థరాజకంబై సకలతీర్థఫలంబుల నాలోకనమాత్రంబున ననుగ్రహించు సకలపాపంబుల నిగ్రహించు నే తీర్థప్రభావంబున నగ్రజన్ములు ఫలసిద్ధిం బొందుమరట్టి నారాయణసరస్సను పుణ్యతీర్థంబునకుం జని తదుపస్పర్శమాత్రంబున నిర్ధూతమలామలాత్ములై* (శా॥ బ్రహ్మేంద్రాదులు నందనేరని పరబ్రహ్మంబు జింతించుచున్ । బ్రహ్మానందముఁ బొంది జిహ్వకలపై బ్రహ్మణ్యమంత్రంబున । దృప్తిం బ్రహ్మలోకనవాంఛతో నిలుపుచున్ బ్రహ్మంబితండంచుమున్ । బ్రహ్మజ్ఞానగురున్ హరిం దపమునం బాటించి రబ్బాలకుల్* (సీ॥ ఏకపాదాంగుష్ఠమిలమీఁద సవరించి నిశ్చలకాయులై నిక్కి నిలిచి । కరములుగీలించి నరవిమీఁదికి నెత్తి సురుతుగాఁ బెనుబయల్ గుట్టిపట్టి । నిడివిగాఁ గ్రూరమైనిగిడినచూడ్కులఁగడు తీవ్రహీనునిఁ బొదివిపట్టి । వడిఁగొంత కాలంబు వాయువు భక్షించి యంతనుండియు నిరాహారులగుచు । సకలలోకములకు సంహారకరమును । బెర్చిదేవతలకు భీతికరము । గాఁగ ఘోరతపముఁ గావింపఁదొడఁగిరి । మహితచిత్తులకుమారవరులు* (వ॥ ఇట్లతిభయంకరంబయిన

—* నారదుఁడు శబళాశ్వులకు నివృత్తిమార్గంబు నుపదేశించుట. *—

తపంబు సేయుచు నెడతెగక భగవన్మంత్రంబుల నొడువుచుఁ బ్రజాసర్గకాములై యున్న బాలురకడకు నారదుండు సనుదెంచి పూర్వవిధంబునం బలుకుచు నిట్లని యె భ్రాతృవత్సలులై యున్న మీరలు వేదాంతసారంబుఁ బలుకుచున్న నావచనంబు లాదరించితోఁ బుట్టువులు సనినమార్గంబునఁ జనుండెవ్వరేని యుఁదనయగ్రజులుగన్న మాగఁ బునందానునుండవలకవర్తించునట్టివాని విశేషధర్మంబెఱింగినవాఁడంద్రు సతతంబును బుణ్యబంధుండై దేవతలం గూడి సుఖంబుండుండని పలికి నారదుండు సనియె వారలు సర్వకర్మంబులయందు నిర్మోహితులై పరమపదంబునకు నాస్పదంబులయిన దేవర్షి వాక్యంబుల నాశ్రయించి* (ఉ॥ అప్పుడు లజ్జతోడ శబళాశ్వులు పూర్వజులేగినట్టియా । చొప్పున నెన్నఁడుం దిరిగి చూడని త్రోవ విశేషపద్ధతిం । దప్పకఁ బోయి రయ్యుగుణధాములు నేఁడును మళ్ల రేమి నేఁ । జెప్పెదఁ గాక రాకకడఁ జేరిన రాత్రులఁ బోలి భూవరా* (క॥ దక్షుని కా కాలంబున । లక్షితమైయుండెఁ బెక్కులాగులను త్పాత । క్షోభఁ బులవారికి । రూక్షవ్యథ నొందియాపురుష నాశము* (క॥ నారదకృతముని యెఱిఁగి ము । హారోషముతోడ నేగి యాతనిఁ గని దుః । ఖాదూఢచిత్తుఁడై మది । నూరడిలం దెరువు లేక నుగ్రుండగుచున్* (గీ॥ మోము జేవురింప ముడివడ బొమదోయి । చూపు వెంట మంటనుడిగొనంగఁ । బెదవులదరఁ బండ్లు పెటపెటఁ గొఱుకుచు । దక్షుఁడాగ్రహించి తపసిఁ బలికె* (చ॥ నెఱయఁగ సాధురూపమున నీవతి బాలురనాత్మజాలికిం । గఱుకనభిక్షుమార్గము సుకంపవసెప్పితి వేలధూర్తవై । మఱగకయుండ వచ్చునెకుమారకులీమరితఁబు నేఁడు ని । న్నారలఁ గద్రోతునామసముదోగ్రమహాగ్రహశాపవహ్నులన్* (వ॥ అదిమొల్లంబేని దేవర్షి పితృఋణంబులు దీర్పక కర్మవిచారంబు సేయని బాలుర మనంబులకు నైహికేచ్ఛలయందు నైరాశ్యముఁ గలుగంజేసి నివృత్తిమార్గం బుపదేశించి వారలకు నుభయలోకంబులయందుఁ జెందఁగల శ్రేయో

*** దక్షుండు నారదుని శపియించి ప్రజాసర్గంబొనరించుట. ***

హానినొనర్చితివిట్టిపాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవై యశోహానింబొందిచరింపుదువుగాక నిరపరాధులై వైరంబులేని నాపుత్రులపట్లద్రోహకృత్యంబొనర్చిన నిన్నుందప్పెడకిట్టి భాగవతోత్తములు సకలభూతానుగ్రహపరవశులుగావున నిరంతరంబును లోకసంచారివైన నీకు నేలోకంబుననునికి పట్టులేకుండుగాక యనినిర్దయుండై శాపంబిచ్చె నంతనారదుండుతత్కఠినవాక్యంబుల కలుగకయట్లకానిమ్మనిసమ్మతించిచనియె నిట్టిశాంతభావంబు నెవ్వనివలననంగలుగు నతండుసర్వాతీతుండై సర్వేశ్వరుండనంబడు మఱియుదక్షుండు దనమనోరథంబువిఫలంబగుటంజేసి యతిదుఃఖితమనస్కుండై పొగులుచున్నం బితామహుండు చనుదెంచి ముఱియుం బ్రజాసర్గోపాయంబుపదేశించిన నాప్రజాపతిప్రియభామయైన యసిక్నియందుం బితృవత్సలలైన పుత్రికలనరువదింటిని బుట్టించి వారిలో ధర్మునకుం బదుగురను, కశ్యపునకుం బదమువ్వురను, చంద్రునకు నిరువదేడ్వురను, భూతునకు నాంగిరసునకుం గృశాశ్వునకు నిద్దరేసి చొప్పున నాల్వురను, తార్క్ష్యుండను నామాంతరంబుం దాల్చినకశ్యపునకు మఱి నలుగురనిక్రమంబున నిచ్చె వారినామంబు లాకర్ణింపుము * (గీ॥ ఎట్టిపుణ్యవతులొ నీచేడియలు సెప్పనవతులేని యట్టిసవతులయ్యుం గడుపువడసి రెట్టికడుపునం బుట్టిరో । కడిది త్రిజగమెల్లకడుపుగాంగ * (వ॥ వారలెవ్వరనిన, భానువు, లంబయుం, గకుప్పు, జామియు, విశ్వయు, సాధ్యయు, మరుత్వతియు, వసువును, ముహూర్తయు, సంకల్పయు, ననంబడుగు ధర్మునకుం బత్నులై కోడుకులం బడసిరి, వారలెవ్వరం టేని, భానువుకు వేదఋషభుండు వుట్టె, నతనికి నింద్రసేనుండుదయించె, లంబకు విద్యోతుండు గలిగె, నతనికి స్తనయిత్నుండు పులను వారు వుట్టిరి, కకుద్దేవికి సంకటుండు వుట్టె, సంకటునకుం గీకటుండు వుట్టెం, గీకటునకు దుర్గాభిమానులయిన దేవతలు జన్మించిరి, జామిదేవికి దుర్గభూములకధిష్ఠాన దేవతలు జనియించిరి, వానికి స్వర్గుండును నందియు జన్మించిరి, విశ్వయను దానికి విశ్వేదేవతలు జన్మించిరి, వారలపుత్రకులు నంబరగిరి, సాధ్యయను దానికి సాధ్యగణంబులు వుట్టె, వానికి నర్థసిద్ధియను వాఁడు వుట్టె, మరుత్వతియను దానికి మరుత్వంతుఁడు జయంతుండను వారలుదయించిరి, యందు జయంతుండు, వాసుదేవాంశజుండైన యుపేంద్రుఁడనంబడి వినుతినొందె, ముహూర్తయను దానికి సకలభూతంబులకు నాయా కాలంబులం గలిగెడు, నాయాఫలాఫలంబులనిచ్చు మౌహూర్తికులని యెడు దేవగణంబులు వుట్టిరి. సంకల్పయను దానికి, సంకల్పజుండగు కాముండు జనించె. వసువను దానికి, ద్రోణుండును, ప్రాణుండును, ధ్రువుండు, నర్కుండు, నగ్నియును, దోషుండును, వస్తువును, విభావసుండు, నను నెనమండ్రు వసువులుదయంబునొందిరందు, ద్రోణునకు నభిమతియను భార్యయందు హర్షశోకభయాదులు వుట్టిరి. ప్రాణునకు భార్యయైన యూర్జస్వతియందు సహుండు నాయువును బురోజవుఁడును వారు గలిగిరి. ధ్రువుని భార్యయగు ధరణియందు వివిధులగు పురులను వారు జనించిరి. యర్కునికి భార్యయగు వాసనయందుఁ దర్షాదులుదయించిరి. యగ్నికి భార్యయైన వసుధారయందు ద్రవిణకాదులు వుట్టిరి. మఱియుం గృత్తికకు స్కందుండు గలిగె. నా స్కందునకు విశాఖాదులుదయించిరి. దోషునకు శర్వరియను భార్యయందు హరికళయగు శింశుమారుండుదయించె. వస్తువునకు నాంగిరసయందు విశ్వకర్మయను శిల్పాచార్యుండుదయంబందె. నావిశ్వకర్మకు నాకృతియను సతియందుం జాక్షుషుండను మనుజనించె. నామనువువలన విశ్వేలు సాధ్యులను వారలు వుట్టిరి. విభావసునకు నుషయను భార్యయందు, వ్యుష్టియు రోచిస్సు, నాతపుండును జనించిరి. యందు నాతపునికిం, బంచయాముండను దివసాభిమానదేవత జనించె - శంకరాంశజుండయిన భూతునకు సురభియను భార్యయందుం గోట్లసంఖ్యలైన రుద్రగణంబులుదయించిరి. రైవతుండజుండు, భవుండు, భీముండు, వాముండు, గ్రుండు, వృషాకపియు, నజైకపాత్తు, నహిర్బుధ్న్యుండును, బహురూపుండును, మహాన్మండు, నను వారలనతిభయంకరులగు రుద్రపారిషదులయిన ప్రేతలును వినాయకులును బుట్టి రంగిరస్సను ప్రజాపతికి, స్వధయను భార్యయందుం బితృగణంబులు వుట్టిరి. సతియను భార్యకు నథర్వణవేదాభిమానదేవతలు వుట్టిరి. కృశాశ్వునకు నర్చిస్సను భార్యయందు ధూమ్రకేశుండను పుత్రుండుదయించె. వేదశిరస్సునకు ధిషణయను భార్యయందు, దేవలుండును వయునుండును, వసువులునుం బుట్టిరి. తార్క్ష్యునకు వినత, కద్రువు, పతంగి, యామినియనునలువురు భార్యలందుం, బతంగికిం బక్షులు వుట్టె, యామినికి శలభంబులు వుట్టె, వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికి వాహనంబయిన గరుడుండును, సూర్యునకు సారథియైన యనూరుండును జనియించిరి, కద్రువునకుం బెక్కుతెఱంగులగు భుజంగమంబులు వుట్టెం, జంద్రునకుం గృత్తికాదినక్షత్రంబులు భార్యలు, వారలయందుం జంద్రుండు, రోహిణియందు మాత్రము మోహితుండగుటం జేసి, దక్షశాపంబున క్షయరోగగ్రస్తుండై, సంతానంబు వడయ నేరఁడయ్యె, నంతదక్షప్రసాదంబున క్షయపీడితంబులగు కళల మఱలంబొందెను మఱియు మ*(సీ॥ కామితప్రదుండైన కశ్యపుంగాంగిటముచ్చటదీర్త రేముద్ధరాంద్రు । అఖిలలోకములకు నవ్వలై జగమెల్లం బూజింప మండు రేపువ్వుబోండ్లు । బలియులై పుత్రులు పౌత్రులు త్రిజగంబులేలంగం జూతు రేయింపముఖులు । ముంగొంగుపసిడిదై

మూల్గుపుణ్యంబులవిజ్ఞవీగెదఁ రెట్టివింత రాండ్రు । వావిగలగంపకడుపుల నేరుపరుల। నరిదిబిడ్డలఁబడసినబిరుదుసతుల। నామములునన్వయంబులునీమనంబు। పూనఁ జెప్పెదువినవయ్య మానవేంద్ర* (తేరల ॥ అదితియున్దిది కాష్ఠయున్దనువయ్యరిష్టయుఁ దామ్రయు । న్నరయ క్రోధవశాఖ్యయున్సురసాఖ్యయున్సరభిన్మని । న్మోదలు గాఁదిమియున్నిళ ప్రియముఖ్యయాసరమా దిగా । ముదితలెన్నఁగఁగన్న సంతతిమజ్జగంబులభూవరా* (సీ॥ చాలంగఁదిమికినిజలచరంబులువుట్టెమఱికిరాతులుసరమ కును బ్రజలు । సురభికినుహిషాదిసురభులుజనియించెఁదామ్రకు శ్యేనగృధ్రములుగలిగె । మునికినప్సరసలమూఁకలుజనియించెఁ ళగనెభూరుహములునుగ్రోధ । వశకున్భవిల్లెదుర్వారసర్పంబులు సరియాతుధానులుసురసకరయ । నుప్పతిల్లిరిగంధర్వులాకట-మొగిన। రిష్టకుదితంబునొందిరిత్రిదశముఖులు । పదియు నెనమండ్రులయినట్టివిదితబలులు । వారినామాన్వయంబులఁగోరివినుము* (వ॥ ద్విమూర్ధుండు, శంబరుండు, నరిష్టుండు, హయగ్రీవుండు, విభావసుండు, నయోముఖుండు, శంకుశిరస్సు, స్వర్భానుండుఁ, గపిలుండు, నరుణియుఁ, బులోముండు, వృషపర్వుండు, నేకచక్రుండను తాపనుండు, ధూమ్రకేతుండు, విరూపాక్షుండు, విప్రచిత్తియు, దుర్జయుండు, నను వారలువీరలలోనస్వర్భానునకు సుప్రభయనుకన్యకపుట్టె, దానినముచి వివాహంబయ్యె, వృషపర్వునకుశర్మిష్ఠయనుకూఁతురుపుట్టె, దానినహుషపుత్రుండైనయయాతిపెండ్లియయ్యె, వైశ్వానరునకు,నుపదారవి,హయశిర,పులోమ, కాలక యనునలువురుపుత్రికలుదయించిరందు నుపదారవిహిరణ్యాక్షునకుభార్యయయ్యె,హయశిరయును,గ్రతువువివాహంబయ్యెఁ, బులోమ కాలకలనునిరువురను, గశ్యపప్రజాపతిచతుర్ముఖునివాక్యంబునం గయికొనియె,నాయిరువురకును, సమరకోవిదులయినదానవులు,పౌలోమకాలకేయులనంబుట్టిరి, మఱియు నాయిరువురకు, నరువదివేలరాక్షసులుజన్మించిరి, వారుయజ్ఞకర్మంబులకువిఘాతకులైవర్తింప వారి నింద్రునకుఁబ్రియంబుగా నీపితామహుండగునర్జునుండువధించె, మఱియు విప్రచిత్తిసింహికయనుదానియందు, రాహుప్రముఖంబుగాఁగలకేతుశతంబునుబడసె, వారలుగ్రహత్వంబుఁగైకొనిరి, మఱియుంబురాణపురుషుండైనశ్రీమన్నారాయణుండు, తనయంశంబుననే, పరమభాగ్యవతియయిన, యదితిగర్భంబుననుదయించె, నాయదితివంశంబును విదితంబుగావినుపించెద సావధానుండవయివినుము, వివస్వంతుండు,నర్యముండును, బూషయుఁ,ద్వష్టయు,సవితయు, భగుండును,ధాతయు,విధాతయు, వరుణుండును,మిత్రుండును, శక్రుండు, నురుక్రముండును, నను మనువులుజన్మించిరందు, వివస్వంతునకు, శ్రాద్ధదేవుండను మనువు సంజ్ఞాదేవియందునుదయించె, మఱియుయముండు, యమియునను, నిరువురుమిథునంబుగానుదయంబునొందిరి, మఱియు నాసంజ్ఞాదేవి,బడబాస్వరూపంబునొంది, యశ్వినీదేవతలం గనె,ఛాయాదేవియందు,శనైశ్చరుండును, సావర్ణియు,మనువును,దపతియనుకన్యకయుంబుట్టిరి, యాతపతిని సంవరణుండువరియించె,నర్యమునకుమాతృకయనుపత్నియందు, జర్షణులుదయించిరివారిమూలంబున మనుష్యజాతి యీలోకంబునస్థిరంబుగానుండునట్లు బ్రహ్మదేవునిచేఁ గల్పింపంబడెఁ, బూషుండుభర్గుని జూచి దంతంబులువివృతంబులుగానగిన, నతండు క్రోధించిదంతంబులూడనడచిన, నాటనుండియుభగ్నదంతుండయి యనపత్యుండయి, పిష్టాదులంభక్షించుచుండెఁ, ద్వష్టకుదైత్యానుజయైన, రచనయనుకన్యకకు, నధికబలాఢ్యుండగు, విశ్వరూపుండువుట్టె, నంత నా దేవతలుబృహస్పతింగోపింప, నతండుతలఁగిపోయినం, దమకు నావిశ్వరూపుని నాచార్యునింగావరియించిరని చెప్పినవిని శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుండిట్లనియె* (సీ॥ అరయంగయోగీంద్రయద్భుతంబయ్యెడుసురలపై నేటికిసురగురుండు । కోపించెనీతండు గురుభావమున దేవతల కేమియాపదఁదలఁగఁజేసె । నెఱఁగింపుమనవుడు నింద్రుండు త్రిభువనైశ్వర్యమదంబునసత్పథంబు । గానకవసురుద్రగణములు నాదిత్య మరుదశ్వినీముఖ్యమండలములు । సిద్ధచారణగంధర్వజిహ్మగాది।సురలుమునులునురంభాదిసుందరాంగు।లాడఁబాడంగవినుతిసేయంగఁగొలువ । నొకట-భద్రాసనంబుననుక్క-మీఱి* (సీ॥ నిండుపున్నమనాఁడుగండరించినచంద్రమండలశ్రీలతో మారుమలయ । భద్రవిద్యోతాతపత్రంబు గ్రాలంగమిన్నేటితరగలమేలుకొలుపఁ।గలితదివ్యాంగనాకరతలచాతుర్యచామీకరశ్రేణిజాడపరపఁ।జింతామణిస్ఫుట కాంతరత్నానేకఘటితసింహాసనాగ్రంబునందు।నూరుపీఠంబులోశచియుండనుండి । వసుసఁదిక్పాలకాదిదేవతలుగొలువ।సాటిఁజెప్పంగరానిరాజసముతోడ।నింద్రుఁడొప్పారివైభవసాంద్రుఁడగుచు॥ అయ్యవసరంబున* (క॥ గురుతరధర్మక్రియనయ।గురుఁడుగురుఁడు మంత్రవిషయగురుఁడువచశ్శ్రీ।గురుఁడుసమస్తామరగణ।గురుఁడుగురుండరుగుదెంచెఁగొల్వునకున్నృపా* (చ॥ అమితతపఃప్రభావుఁగరుణాత్మునిగీష్పతిఁజూచిరాజ్యదు । ర్దమమదరేఖనింద్రుఁడువృథాతనగద్దియలేవకుండె నె।య్యమున నెదురోంకనం జనకయాసనమీయక గౌరవోపచా।రములఁబ్రసన్నుఁజేయక తిరంబుగదివ్యసభాంతరంబునన్* (క॥ అప్పుడుసురపతిగన్నులఁ।గప్పినసురరాజ్యమదవికారంబునకుం।జప్పుడుసేయకగృహమున । కప్పుణ్యుఁడుదిరిగిపోయెనతిఖిన్నుండై* (చ॥ ఎఱుగమిఁజేసినట్టిగురుహేళనమంత నెఱింగియింద్రుఁడ । చ్చెరువడిభీతినొందియతిచింతితుఁడైతలపోసిపల్కె-న।ప్పరమపవిత్రులో

కనుతభవ్యచరిత్రు విశేషపాదపం । కరుహము బూజ సేయక యకర్మము జేసితి నప్రబుద్ధినై* (క॥ త్రిభువనవిభవమదంబున। సభలో వాక్పతి గురువునకుఁ బ్రసన్ననకులస। త్త్రిభువనకు నెగ్గుఁ జేసితి। శుభములు దొలఁగంగ నేనసురభావము నర్గా* (గీ॥ పార మేష్ఠ్యమయిన పదవి నొందిన భూపు। లెట్టివారికైన లేవవలదు । విబుధులిట్లు సెప్పువిధ మెన్నవారలు। ధర్మవేత్తలను చుదలప బడరు*(గీ॥ కుపథవర్తులగుచుఁ గుత్సితమర్త్యచో । నిపుణులైనవారు నడివి దెలిసి । తొలఁగలేక వారధోగతిఁ బడుదురు। తప్పులేక రాతి తెప్పభంగి* (ఉ॥ కావున లోకవందితునిఁ గార్యవిచారునియింటికేగి త । త్పావనపాదపద్మములపై మకుటంబు ఘటిల్ల మ్రొక్కి స । త్సేవ మొనర్చి చిత్తము వసించి ప్రసన్నునిఁ జేతునంచున । ద్దేవవిభుండు వో యెనతి తీవ్రగతిన్ గురుధామసీమకున్* (సీ॥ ఈరీతిఁ జనయింటికేతెంచు దేవతాపతి రాక యా బృహస్పతి యెఱింగి । యధ్యాత్మమాయ చేనడఁగి యదృశ్యుఁడై పోయెన ప్పుడు దేవపుంగవుండు। సకలంబుఁ బరికించి జాడఁ గానక గురుఁ జింతించి తలపోసి చిన్నవోయెఁ । బోయినవిధ మెల్లదాయలు రాక్షసవీరులు వేగులవారివలనఁ । దెలిసి మిక్కిలి తమలోనఁ దెలివినొంది। యందరును గూడి భార్గవు నాశ్రయించి । తత్కృపాదృ

—*దానవులు దేవతలతో యుద్ధము చేసి దేవతల నోడించుట *—

ష్టిఁ దమశక్తి దట్టమైన। దేవతలమీఁది దాడికిఁ దెరువు వెట్టి*(క॥ధూర్తులు సమస్తకిల్బిష। మూర్తులు వరధర్మకర్మమోదితమార్గా। వర్తులు దుర్నయనిర్మిత। కీర్తులు దానవులు సనిరి గీర్వాణులపై*(స్రగ్ధర॥ దండింగోదండకాండోద్ధతరథహయవేదండతండంబుతో డన్। దండెత్తి మెండుగాన న్దనుజనికరముల్ దేవతాకోటిమీఁదం । జండబ్రహ్మాండభేదోచ్ఛ్రయజయరవము ల్చండదిక్క్షోభగాను । ద్దండప్రఖ్యాతలీలం దలపడి రసురల్దర్పులై వారితోడన్* (చ॥ మదమున దేవదానవులు మచ్చరము ల్గడుఁ బిచ్చలింపసం । పదలను గోరి పోరు నెడ భార్గవమంత్రకళావిశేషులై । యెదురులు వ్రాలి యస్త్రముల నేయ మహాసురులేచి యేపి పేర్। గుములుగ గ్రువ్వ దేవతలు కొల్లలకోర్వక పాఱిరయ్యెడన్* (గీ॥ దనుజవీరులేయ దారుణదివ్యాస్త్ర। దళితదేహులగుచుఁ దలలువీడ। నోడి పాఱి రద్భుతోపేతబలులైన। త్రిదశవరులు బిట్టుఁ దిట్టినట్లు* (క॥ ఒకమొగము గాక దిపిజులు। తికమకఁ గొని వైరులెల్ల డీకొనఁ దమ్ముం। బకపకలై కనకనలై । లుకలుకఁ బరువెత్తిరోడి లోఁగొనుభీతిన్* (చ॥ దనుజులగర్వరేఖయును దానవనీరులయుంపజోఁకయు । న్మనుజవిశేషభోజనులమచ్చరికంబును శాటకోటియే । చినబలశౌర్యముం దమకు సిగ్గును హానిమహాభయంబుని। ర్గుణకముఁ జేయునమ్మలికఁ గొల్తులకోపక పారిరార్తులై*(క॥అమరులు విసృష్టదానవ । సమరులు శరభిన్నదేహసంతాపసుల। భ్రమరులు దైత్యకిరాతక। చమరులుకమలజునికడకుజనిరిభయార్తిన్* (ఉ॥ధాతకు దేవతావిభవధాతకుఁ బుణ్యజనానురాగసం। ధాతకు సర్వలోకహితతాతకు వైదికధర్మమార్గని। ర్ణేతకు నుల్లసద్విభవనీతకు సర్వజగజ్జయాంగజ। భ్రాంతకుఁ బుణ్యయోగిజనభావవిధాతకు మ్రొక్కిరయ్యెడన్*(క॥ఆఖండలుండు మొదలుగ । లేఖానీకము లఁబ్రహ్మ లేనగవునని । త్యాఖండసత్కృపారస । ఖేచరవాక్యముల వారి సేదలు దేర్పెన్* (వ॥ ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖులయిన దేవతలకనుకంపాతివిభవంబున నభయంబొసంగి యిట్లనియె* (ఉ॥ నెట్టనఁ బాపకర్మమున నేరముఁ జేసితిరేమి చెప్పమీ। పుట్టిననాఁటనుండియును బుద్ధులు జెప్పి జగంబులేలఁగాఁ। బట్టముఁ గట్టి పెంచినకృపానిధి బ్రహ్మకళావిధిజ్ఞుఁ జేఁ । బట్టక గుట్టు జాఱిసిరి పట్టునఁ దొట్టినపొట్టక్రొవ్వునన్* (వ॥ బ్రహ్మిష్ఠుండైన బ్రాహ్మణు నాచార్యుంగైకొనక గురుద్రోహంబుఁ జేసితిరి తద్దోషంబిపుడు మీకుఁ జేఁజేతఁ దత్కృతంబై యనుభవింపంజేసె నతిబలవంతులయిన మిమ్ము నతిక్షీణులైన రాక్షసులు జయించుట తమయాచార్యుండైన శుక్రు నారాధించి తన్మంత్రప్రభావంబునఁ బునర్లబ్ధవీర్యులై యిప్పుడు మదీయంబైన నిలయంబునాక్రమింపంగలవారునై మదోద్రేకంబున నెదురు లేక వర్తిల్లుచున్న రక్షోనాయకులకుం ద్రిదివంబుఁ గొనుట తృణప్రాయంబ భేద్యమంత్రబలంబుగల భార్గవునకు వారు శిష్యులగుటం జేసి విప్రగోవిందగవేశ్వానుగ్రహంబుగలవారలకుఁ దక్కొండక్కొన రాజులకరిష్టంబగుం గావున మీరిప్పుడు త్వష్టయను మనుపుత్త్రుండగు విశ్వరూపుండను మునిసత్తముని తపోమహత్త్వసత్త్వస్వభావుండతని నారాధించిన మీకు నభీష్టార్థంబులనతండు సంఘటిల్లఁ జేయునిట్టి దుర్దశలఁ దఁడడంచునని చెప్పిన దివ్యులకాదులు డెందంబులు డెందు పడి కమలగర్భునివీడ్కొని విశ్వరూపుకడకుం జని యిట్లనిరి* (గీ॥ అన్న మేలగు నీకు నిన్నడుగఁ గోరి। వచ్చినారము భవదీయవనమునకును। దంభ్రములకు నేఁడు సమయోచితంబులయిన। కోర్కెలొడఁగూడఁ జేసి చేకొనుము యశము* (క॥సుతులకుఁ బితృశుశ్రూషణ। మతిపుణ్యము సేయుచుండు వాత్మజులుగుణో । న్నతిఁ బ్రహ్మచారులైనను। మతితో గురుసేవకన్న మఱియుంగలదే। అదియునుంగాక*(సీ॥ అరయ నాచార్యుండు పరతత్త్వరూపంబు దండ్రి తలంపంగ ధాతరూపు । రూపింపభ్రాత మరుత్పతిరూపంబు దెలియంగ తల్లి భూదేవిరూపు। భగినిదయారూపు భావంబు ధర్మస్వరూపంబు దానర్థిరూపు మొదల । నభ్యాగతుఁడు మున్న యగ్నిదేవునిరూపు సర్వభూతములు గేశవునిరూపు। గానఁ దండ్రి వేగఁగదు నార్తులకు పిత్రు । జనులమైన మమ్ముఁ జల్లజూచి। పరభయంబువాపి నిరుపమంబగు తపో । మహిమ చేత మెఱసి మనుపుమయ్య* (వ॥ ఇప్పుడు బ్రహ్మనిష్ఠుండవైన నిన్నాచా

ర్యునిఁగా వరించి భవదీయ తేజోవిశేషంబుచేత వైరివీరులం బరిమార్చెద మాత్మీయార్థంబయిన యస్మత్పాదాభివందనంబు నిందితంబుగాదని వేదవాక్యంబుగలుగుఁగావున నీకు ననుసరింపుచున్న దేవతలం గైకొని పౌరోహిత్యంబు సేయుమనిన సంప్రహసితవదనుండై యమ్మునీశ్వరుండిట్లనియె* (గీ॥ బ్రహ్మవర్చస్సువోయెడి ప్రార్థనంబు। ధర్మగుణగర్హితంబని తానెఱింగి। సౌర దిననుబోటి తపస్వియూపరులచేతఁ। బ్రకటసాధుకోక్తి నేటికిఁ బలుకఁబడియె। విశేషించి* (క॥ గురుధనమునఁ గూర్ప నేటికి। గురుశిష్యుండగిలి సంతకోవిదులైన। స్థిరధర్మనిరతులేనియు। గురువులకును శిష్యవరులె కూర్పనధనముల్* (సీ॥ అరయ నకించనులైనట్టివారికిఁ దగు శిలోంఛనవృత్తిధనము సుమ్ము। దానిచే నిర్వర్తితప్రియసాధుసత్క్రియగలవారలై ప్రీతినొందె। దరుగాన సద్గర్హితాచారమైన యాచార్యత్వమిపుడు మీశాసనమున। గైకొంబి గురువుల కార్యంబు ప్రాణార్థవంచనములు లేక వడినొనర్తునను చు విశ్వరూపుఁడను యెడిముని ప్రతిజ్ఞోక్తిఁ బలికె వారి నూరడించి। సుహితమైన తత్సమాధిచే గురుభావ। మునరఁ జేసెఁ దేవసమితికపుడు* (క॥ భార్గవవిద్యాగుప్త। స్వర్గశ్రీద్విగుణదనుజసమాధికసంప। ద్వర్గములవిష్ణుమాయా। నర్గళగతిఁ దెచ్చి యింద్రునకునిచ్చెన్నృపా* (క॥ ఏవిద్యచేత రక్షితుఁ। డై వజ్రి దురంబులోన నసురులఁ ద్రుంచె। భావించనట్టి విద్య। శ్రీహరిమాయాహతంబు చెచ్చెరఁ జెప్పెన్* (ఉ॥ నావుడు పాండవాన్వయుఁడు నమ్మిన భక్తిజగన్నివాసురా। జీవదళాత్ములుఁ గృష్ణుఁడనదిత్తమునన్భజియించి పలెన్ సో। దేవగణార్చితాంఘ్రియుగ దివ్యమునీశ్వర విశ్వరూపుఁడ। పావనమైన విద్య సురపాలున కేక్రియ నిచ్చె జెప్పవే* (ఉ॥ ఎందు నరక్షితుండగుచు నింద్రుఁడు లీలయవో లెవైరిసే। నం దునుమాడి దేవతలు నమ్మి సుఖింపఁగనిష్టసంపదం। జెంది సమస్తలోకముల శేకొనియే లెమునీంద్ర దానినే। విందు సుఖంబుఁగందుఁ దక వీనులు సంతసమందఁ బల్కవే*

✵* శ్రీమన్నారాయణకవచప్రారంభము. *✵

(క॥ వరనారాయణకవచము। నరిభీకరవజ్రకవచమాశ్రితసంప। త్పరిణామకర్మసువచము। పురుహూతునకెట్లు మౌని బోధించెఁదగన్ ॥ అనినంబరీక్షిజ్జనపాలునకు మునినాథుండిట్లనియె* (సీ॥ వినవయ్య నరనాథ మునినాథుఁడింద్రునకనువొంద నారాయణాఖ్యమైన। కవచంబు విజయసంకల్పంబు నప్రమేయస్వరూపంబు సుమహాఫలంబు। మంత్రగోప్యము హరిమాయావిశేషంబు సాంగంబుతోడ నెఱుంగఁ జేసె। దాని నే విని పింతుఁ బూనితదేకాగ్రచిత్తంబుతో మతిఁ జిత్తగింపు। మొనగధౌతాంఘ్రిపాణియై యుత్తరంబుముఖముగా నుత్తమాసనమున వసించి। కృతనిజాంగకరన్యాసమహాశయిల్ల। సహితనారాయణాఖ్యవర్మము వొనర్చె* (వ॥ ఇట్లు నారాయణకవచంబు ఘటియించి పాదంబులను జానువుల నూరువులను దరంబున హృదయంబున నురంబున ముఖంబున శిరంబున నిట్లష్టాంగంబులం బ్రణవపూర్వకంబైన యష్టాక్షరమంత్రరాజంబు న్యాసంబుఁ జేసి ద్వాదశాక్షరవిద్యచేతఁ గరన్యాసంబుఁ జేసి మంత్రమూర్తియై ప్రణవాదియకారాంతము సుషామంత్రంబుచేత నంగుళ్యంగుష్ఠపర్వసంధులయందు పన్యసించి మఱియు హృదయంబున నోంకారంబు వికారంబు మూర్ధయందు షకారంబు భ్రూమధ్యంబున ణకారంబు శిఖయందు వేకారంబు నేత్రంబులయందు నకారంబు సర్వసంధులయందు మఱియు నస్త్రమును దేశించి మకారంబును పన్యసించె నేన్ని మంత్రమూర్తియగు మఱియు నస్త్రియఫట్, అను మంత్రంబున దిగ్బంధనంబుఁ జేసి పరమేశ్వరుఁడనభావంబున నిల్పి విద్యామూర్తియుఁ దపోమూర్తియునగు షట్ఛక్తిసంయుతంబయిన నారాయణకవచాఖ్యమైన యీమంత్రరాజంబు నిట్లని పఠించె* (చ॥ గరుడుని మూఁపుపైఁ బదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్రవ। ర్మరుచిర శార్ఙ్గఖడ్గశరరాజితపాశగదాది సాధనో। త్కరనికరంబు లాత్మకరకంజముల న్ధరియించు భూతిసం। భరితమహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁ గావుతన్* (గీ॥ ప్రకటమకరవరుణపాశఁబులందుల। జలములందు నెందుఁ బొలయకుండఁ। గాచుఁ గాక నన్ను ఘనుఁడొకఁడైనట్టి। మత్స్యమూర్తి విద్యమానకీర్తి* (క॥ వటుఁడు సమాశ్రితమాయా। నటుఁడు బలిప్రబలశోభనసతిఘటనో। ద్భటుఁడు త్రి

శ్రీనారాయణకవచప్రారంభః.

రాజా ॥ యేన గుప్తస్సహస్రాక్షస్సవాహాన్రిపుసైనికాన్। క్రీడన్నివ వినిర్జిత్య త్రిలోక్యా బుభుజే శ్రియమ్ ॥ భగవంస్తన్మమాచక్ష్వ వర్మ నారాయణాత్మకమ్। యథాతతాయినశ్శత్రూన్ యేన గుప్తోజయన్మృధే ॥ శ్రీశుకః॥ వృతః పురోహితస్త్వాష్ట్రో మహేంద్రాయానుపృచ్ఛతే। నారాయణాఖ్యం వర్మాహ తదిహైకమనాశ్శృణు ॥ విశ్వరూపః॥ ధౌతాంఘ్రిపాణిరాచమ్య సపవిత్ర ఉదఙ్ముఖః। కృతస్వాంగకరన్యాసో మంత్రాభ్యాం వాగ్యతశ్శుచిః॥ నారాయణమయం వర్మ సన్నహ్యేద్భయ ఆగతే। దైవభూతాత్మకర్మభ్యో నారాయణమయః పుమాన్ ॥ పాదయోర్జానునోరూర్వోరుదరే హృద్యథోరసి। ముఖే శిరస్యానుపూర్వ్యాదోంకారాదీని విన్యసేత్ ॥ ఓం నమో నారాయణాయేతి విపర్యయమథాపి వా। కరన్యాసం తతః కుర్యాద్ద్వాదశాక్షరవిద్యయా। ప్రణవాదియకారాంతమంగుళ్యంగుష్ఠపర్వసు ॥ న్యసేద్ధృదయ ఓంకారం వికారమను మూర్ధని। షకారం తు భ్రువోర్మధ్యే ణకారం శిఖయా న్యసేత్ ॥ వేకారం నేత్రయోర్యుంజ్యాన్నకారం సర్వసంధిషు। మకారమస్త్రముద్దిశ్య మంత్రమూర్తిర్భవేద్బుధః। సవిసర్గం ఫడంతం తు సర్వదిక్షు వినిర్దిశేత్ ॥ ఓం విష్ణవే నమః॥ ఇత్యాత్మానం పరం ధ్యాయేద్ధ్యేయం షట్ఛక్తిభిర్యుతం। విద్యాతేజస్తపోమూర్తిమిమం మంత్రముదాహరేత్ ॥ ఓం హరిర్విదధ్యాన్మమ సర్వరక్షాం న్యస్తాంఘ్రిపద్మః పతగేంద్రపృష్ఠే। దరారిచర్మాసిగదేషుచాపపాశాన్దధానోష్టగుణోష్టబాహుః॥ జలే

విక్రముదేవుఁడు చతులస్థలమందు నన్నుసంరక్షించుఁగాక* (చ॥ అడవులసంకటస్థలులనాజిముఖంబులనగ్నికీలలం। దెడగులనె
ల్లనాకు నుతికెక్కఁగడకఁగనుఁగాక శ్రీనృసిం। హుఁడుకనకాక్షురాక్షసవధోగ్రుఁడు విస్ఫురితాట్టసవ। క్షుభితదుఘనదం
ష్ట్రిపావకిధూమవిగంతరుఁడప్రమేయుఁడై* (చ॥ అరయఁగనెల్లలోకములు నంకిలినొందఁగ హోర్ణవంబులో। నొరిగినిసుగ్గ
మైనధరనుద్ధతిఁగొమ్మున నెత్తినట్టియా। కిటిపతియగ్నికల్పుఁడురుఖేలుఁడు మార్గితమేదినీగనో। హరుఁడుగృహాపిథేయుఁ
డు సవాధ్వములన్నుఁగాచుఁగావుత* (క॥ గాముఁడు రాజకులైకవిరాముఁడు భృగుసత్కులాభిరాముఁడు నుగుణ। స్తో
ముఁడు నను రక్షించును। శ్రీమహేంద్రోన్నతుఁడు నద్రిశిఖరములందుఁ* (సీ॥ తాటకీవర్గించితపసజన్నముఁగాఁచి హరువిల్లు
విఱిచిధైర్యమునమెఱసి। ప్రబలులైనట్టివిరాధకబంధోగ్రఖరదూషణాదిరాక్షసులదునిమి। వానరవిభునేలివాలిఁగూలఁగ
నేసిజలరాశిగర్వంబుఁజక్కఁజేసి। సేతువుబంధించి చేరి రావణకుంభకర్ణాదివీరులఁగడిమిఁద్రుంచి। యలవిభీషణులంకకును
ధిపుఁజేసి। భూమిసుతఁగూడిసాకేతపురమునందు। రాజ్యసుఖములుగైకొన్న రామవిభుఁడు। వరుసననుఁబ్రోచుచుండుఁబ్ర
వాసగతుల* (వ॥ మఱియునఖిలప్రమాదంబులైనయభిచారకర్మంబులవలన నారాయణుండును గర్వంబువలన నరుండును
యోగభ్రంశంబువలన యోగనాథుండయిన దత్తాత్రేయుండును గర్మబంధంబువలన గణేశుండయిన కపిలుండును గామదేవు
నివలన సనత్కుమారుండును మార్గంబుల దేవహేళనంబుఁజేయుటవలన శ్రీహయగ్రీవమూర్తియును దేవతానమస్కారతిర
స్కారదేవపూజాచ్ఛిద్రంబులవలన నారదుండును శేషనిరయంబువలనఁ గూర్మంబును పథ్యంబువలన భగవంతుండైన ధన్వంత
రియును జనాపవాదంబువలన యజ్ఞదేవుండును జననమరణాదులంగలుగఁజేయు కర్మంబులవలన బలభద్రుండును గాలంబువ
లన యముండును సర్పగణంబులవలన శేషుండు నప్రబోధంబువలన ద్వైపాయనుండును బాషండసమూహంబువలన బుద్ధదే
వుండును శనైశ్చరునివలనఁ గల్కియును ధర్మరక్షణపరుండయిన మహావతారుండును నన్ను రక్షించుఁగాత। ప్రాహ్ణమధ్యాహ్న

---

షుమాంరక్షతుమత్స్యమూర్తి-ర్యాదోగణేభ్యోవరుణస్యపాశాత్। స్థలేషుమాయావటువామనోవ్యా-త్త్రివిక్రమః ఖేవతువిశ్వరూపః ॥ దుర్గేష్వట
వ్యాజిముఖాదిషుప్రభుః-పాయాన్నృసింహోఽసురయూథపారిః। విముంచతోయస్యమహాట్టహాసం।దిశోవినేదుర్న్యపతంశ్చగర్భాః ॥ రక్షత్వసౌ
మాధ్వనియజ్ఞకల్పస్స్వదంష్ట్రయోన్నీతధరోవరాహః। రామోద్రికూటేష్వథవిప్రవాసే-సలక్ష్మణోవ్యాద్భరతాగ్రజోమామ్ ॥ మాముగ్రధర్మాద
ఖిలాత్ప్రమాదాన్నారాయణఃపాతునరశ్చహాసాత్। దత్తస్త్వయోగాదథయోగనాథః-పాయాద్గణేశఃకపిలఃకర్మబంధాత్ ॥ సనత్కుమారోవతు
కామదేవా-ద్ధయాననోమాంపథిదేవహేళనాత్। దేవర్షివర్యఃపురుషార్చనాంతరా-త్కూర్మోహరిర్మాంనిరయాదశేషాత్ ॥ ధన్వంతరిర్భగ
వాన్ పాత్వపథ్యాద్ద్వంద్వాద్భయాదృషభోనిర్జితాత్మా। యజ్ఞశ్చలోకాదుతతత్కృతాన్నో బలోగణాత్క్రోధవశాదహీంద్రః ॥ ద్వైపాయనో
భగవానప్రమోహా-ద్బుద్ధశ్చపాషండగణాత్ప్రమాదాత్। కల్కిఃకలేఃకాలమలాత్ప్రపాతుధర్మావనాయోరుకృతావతారః॥ మాంకేశవోగద
యాప్రాతరవ్యా-ద్గోవిందఆసంగవమాత్తవేణుః। నారాయణఃప్రాహ్ణఉదాత్తశక్తి-ర్మధ్యందినేవిష్ణురరీంద్రపాణిః ॥ దేవోపరాహ్ణేమధుహోగ్ర
ధన్వా-సాయంత్రిధామావతుమాధవోమాం। దోషేహృషీకేశఉతార్ధరాత్రే-నిశీథఏకోవతుపద్మనాభః॥ శ్రీవత్సధామాపరరాత్రఈశః-ప్రత్యూ
షఈశోసిధరోజనార్దనః।దామోదరోవ్యాదనుసంధ్యంప్రభాతేవిశ్వేశ్వరోభగవాన్ కాలమూర్తిః॥ చక్రంయుగాంతానలతిగ్మనేమి-భ్రమత్సమం
తాద్భగవత్ప్రయుక్తం। దందగ్ధిదంధగ్ధ్యరిసైన్యమాశు-కక్షంయథావాతసఖోహుతాశః। గదేశనిస్పర్శనవిస్ఫులింగే-నిష్పిండినిష్పిండ్యజిత
ప్రియాసి।కూష్మాండవైనాయకయక్షరక్షో-భూతగ్రహాంశ్చూర్ణయచూర్ణయారీన్ ॥ త్వంయాతుధానప్రమథప్రేతమాతృపిశాచవిప్రగ్రహఘోర
దృష్టీన్। దరేంద్రవిద్రావయకృష్ణపూరితో-భీమస్వనారేర్హృదయానికంపయ ॥ త్వంతిగ్మధారాసివరారిసైన్యమీశప్రయుక్తోమమఛింధిఛింధి।
చక్షూంషిచర్మన్ శతచంద్రఛాదయద్విషామఘోనాంహరపాపచక్షుషామ్॥ యన్నోభయంగ్రహేభ్యోభూత్కేతుభ్యోనృభ్యఏవచ। సరీసృపే
భ్యోదంష్ట్రిభ్యోభూతేభ్యోంహోభ్యఏవచ॥సర్వాణ్యేతానిభగవన్నామరూపాస్త్రకీర్తనాత్। ప్రయాంతుసంక్షయంసద్యోయేన్యేశ్రేయఃప్రతీప
కాః॥గరుడోభగవాన్ స్తోత్రస్తోభశ్ఛందోమయఃప్రభుః। రక్షత్వశేషకృచ్ఛ్రేభ్యోవిష్వక్సేనస్యవాహనమ్ ॥ సర్వాపద్భ్యోహరేర్నామరూపయా
నాయుధానినః।బుద్ధీంద్రియమనఃప్రాణాన్ పాంతుపార్షదభూషణాః ॥ యథాహిభగవానేవవస్తుతస్సదసచ్చయత్। సత్యేనానేననస్సర్వేయాం
తునాశముపద్రవాః॥యథైకాత్మ్యానుభావానాంవికల్పరహితస్స్వయమ్। భూషణాయుధలింగాఖ్యాధత్తేశక్తీస్స్వమాయయా ॥ తేనైవసత్య
మానేనసర్వజ్ఞోభగవాన్ హరిః। పాతుసర్వస్స్వరూపేణనస్సర్వత్రసర్వగః॥ విదిక్షుదిక్షూర్ధ్వమధస్సమంతాదంతర్బహిర్భగవాన్నారసింహః।
ప్రహాసయన్ లోకభయంస్వనేనస్వతేజసాగ్రస్తసమస్తతేజాః॥శ్రీవిశ్వరూపః ॥ మఘవన్నిదమాఖ్యాతంవర్మనారాయణాత్మకం విజేష్యస్యంజసా
యేనదంశితోసురయూథపాన్॥ ఏతద్ధారయమాణస్తుయంయంపశ్యతిచక్షుషా।పదానాసంస్పృశేత్సద్యస్సాధ్వసాత్సవిముచ్యతే ॥ నకుతశ్చిద్భ
యంతస్యవిద్యాంధారయతోభవేత్। రాజదస్యుగ్రహాదిభ్యోవ్యాధ్యాదిభ్యశ్చకర్హిచిత్ ॥ ఇమాంవిద్యాంపురాకశ్చిత్కౌశికోధారయన్ ద్విజః।
యోగధారణయాస్వాంగంజహౌసమరుధన్వని ॥ తస్యోపరివిమానేనగంధర్వపతిరేకదా। యయౌచిత్రరథఃస్త్రీభిర్వృతోయత్రద్విజక్షయః॥ గగ
నాన్న్యపతత్సద్యస్సవిమానోహ్యవాక్శిరాః। సవాలఖిల్యవచనాదస్థీన్యాదాయవిస్మితః ॥ ప్రాస్యప్రాచీసరస్వత్యాంస్నాత్వాధామస్వమన్వగాత్।
య ఇదంశృణుయాత్కాలేయోధారయతిచాదృతః। తంనమస్యంతిభూతానిముచ్యతేసర్వతోభయాత్ ॥ శ్రీశుకః॥ ఏతాంవిద్యామధిగతోవిశ్వ
రూపాచ్ఛతక్రతుఃపత్రైలోక్యలక్ష్మీంబుభుజేవినిర్జిత్యమృధేసురాన్ ............................................................ *

ఇతిశ్రీభాగవతే, షష్ఠస్కంధే, నారాయణవర్మోపదేశోనామాష్టమోధ్యాయః.

పరాహ్ణసాయంకాలంబులను బ్రదోషార్ధరాత్రాపరరాత్ర ప్రత్యూషానుసంధ్యలను గదాద్యాయుధంబులధరియించి కేశవ
నారాయణ గోవిందవిష్ణుమధుసంహార త్రివిక్రమవామన హృషీకేశపద్మనాభ శ్రీవత్సధామ సర్వేశ్వరయీశజనార్దనవి
శ్వేశ్వర కాలమూర్తియను నానారూపంబులుగలదేవుండు నన్నురక్షించుఁ బ్రళయకాలానలతీక్ష్ణ సంభ్రమభ్రమణనిర్వక్ర
విక్రమవక్రీకృత దనుజచక్రంబయిన సుదర్శననామచక్రంబ మహావాయుప్రేరితంబై హుతాశనుండు నీరసతృణాటవుల భ
స్మీభూతంబుసేయుభంగి భగవత్ప్రయుక్తంబవై మద్వైరిసైన్యంబుల దగ్ధంబుగాపింపుము జగత్సంహారకాలఘటిత చటు
లమహోత్పాత గర్జారవపర్జన్యదిశాభివర్జిత ఘనఘనాంతరనిష్ఠ్యూతనిష్ఠుర కోటి శతకోటిసంస్పర్శ స్ఫురద్విస్ఫులింగని
ర్గమానర్గళ భుగభుగాయమానమూర్తివిస్ఫూర్తి నారాయణకరకమలవర్తిని గదాయుధోత్తమ మదీయవైరితండోపతండం
బులఖండనంబునం జండగతింబిండిగాఁ గూశ్మాండవైనాయకరక్షోభూతగ్రహంబులం జూర్ణంబులుగాఁ గొండొకవినోదం
బుసలుపుము దరేంద్రుండవైన పాంచజన్యంబ సర్వలోకజిష్ణుండయినశ్రీకృష్ణుని నిఖిలఫుత్కారైకసదనవదననిష్ఠ్యూతనిశ్వా
సాధర వేణుపరిపూరితంబవై యున్మత్త భూతప్రేతపిశాచవిప్రగ్రహాది క్రూరదుర్గ్రహంబుల విద్రావణంబుగానస్మత్పరవీ
రమండలంబుల గుండియలతోఁ దదీయమానినీదుర్భరగర్భంబులు గర్భస్థార్భకవివర్జితంబులుగానవియ బ్రహ్మాండభాండభీ
కరంబయినభూరినాదంబున మోదు మతితీవ్రధారాదళిత నిశాతకోటికఠోరకంఠ కరాళరక్తధారాధౌత మలీమసవిసరంబ
వైనందకమహాసిశేఖరంబ జగదీశప్రేరితంబవయిమద్విద్విషవిమతవ్యూహంబుల మెండుఖండములుగఖండించి చెండా
డుమునిష్కళంకనిరాతంక సాంద్రచంద్రాకారమండలపరిమండిత సర్వాంగలక్షణవిచక్షణ ధర్మనిర్మితంబవయిన చర్మం
బదుర్మదమద్వైరిలోకంబులకు సమాకులనిబిడనీరంధ్ర నిష్ఠురతమఃపటలపటుఘటనంబులం గుటిలపరుపుమునిఖిలపాపగ్ర
హంబులవలన సకలనగమృగసర్ప క్రోడభూతాదులవలన నగుభయంబులుపొందకుండ భగవన్నామరూపయాన దివ్యా
స్త్రంబులు రక్షించుఁగాక బృహద్రథంతరాది సామంబులచేతస్తోత్రంబు సేయఁబడుచున్న ఖగేంద్రుండు రక్షణదక్షుండ
యినన్నురక్షించుఁగాక శ్రీహరి నామరూప వాహన దివ్యాయుధ పారిషదోత్తమప్రముఖంబు లస్మదీయ బుద్ధీంద్రియమనః
ప్రాణంబులసంరక్షించుభగవంతుండయిన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు సేయుజగద్వైక్యభావంబయిన ధ్యానంబుగ
లవానికివికల్పరహితుండై భూషణాయుధలింగాఖ్యలగు శక్తులందనమాయచేతధరియించి తేజరిల్లుచుండు లక్ష్మీకాంతుండు
వికల్పవిగ్రహంబులవలన నన్నురక్షించుఁగాక లోకభయంకరాట్టహాసభాసుర వదనగహ్వరుండగుచు సమస్తతేజోహరణ
ధురీణ తేజఃపుంజసంజాతదివ్యనృసింహావతారుండగు నప్పరమేశ్వరుండుసర్వదిగ్భాగంబులవలన నమరక్షించుచుండుఁగా
కయని నారాయణాత్మకకవచప్రభావం బితిహాసరూపంబుననింద్రుండు తెలిసికొనఁ ధ్యానంబుఁజేసి తద్విద్యాధారణమహి
మవలననరాతులనిర్జించెంగావున నెవ్వరేని నిర్మలాత్ములగువారలేతద్విద్యాధారణులై యనుదినంబును బఠియించిన నతి
ఘోరరణంబులనత్యుత్కటసంకటంబులనుసర్వగ్రహనిగ్రహకర్మమారణకర్త్రాదిదుష్కర్మజన్యక్లేశంబులనువదిలియవ్యా
కులమనస్కులై విజయంబునొందుదురుమఱియునుసర్వరోగంబులకు నగమ్యశరీరులై సుఖంబునొందుదురదియునుంగాక*
(సీ॥అతిభక్తిఁగౌశికుండనుబ్రాహ్మణుఁడుదొల్లియీవిద్యధరియించి యెలమిమించి । మరుభూమియందునిర్మలచిత్తుఁడై యో
గధారణంబునబిట్టుతనువువిడిచె । దానిపైనొకఁడుగంధర్వవరేణ్యుండు చిత్రరథాఖ్యుఁడజేయుఁడొంటిఁ । జదలఁజనంగఁదద
చ్ఛాయదదస్థిపైఁగదిసిననాతఁడుగళవళించి।యువిదపిండుతోడనవవిమానముతోడఁ।దనదువిద్యతోడఁధరణిఁద్రెళ్లి । తిరిగిలే
వలేకతికమకగుచువంగ।వాలఖిల్యమౌనివానిఁజూచి* (క॥ నారాయణకవచసమా।ధారణపుణ్యాస్థిదీనిదగ్గరనీకుం।గూరెడి
నెవిష్ణుభక్తుల।వారకచేరంగనెట్టివారికిదరమే* (ఇంద్రవజ్రం॥ సంబంధినీయంగకసంధులెల్ల । న్బంధించితన్మంత్రబలంబుపే
ర్మిన్।అందంబుమాన్పింపఁదనన్యమేదీ।సింధుప్రవాహోన్నతిచేతఁదీర్చ* (వ॥ కావుననీవుపుణ్యాశల్యంబులుభక్తియుక్తుం
డవైకైకొనిపోయి ప్రాఙ్ముఖంబునఁ బ్రవహించెడుసరస్వతిజలంబులనిక్షేపణంబుఁజేసికృతస్నానుండవై యాచమనంబుచే
సిననీసర్వాంగబంధనంబులుడుగుననిన నతండట్లచేసి తనవిమానంబెక్కి నిజస్థానంబునకరిగెంగావున* (క॥ అనుదినముదీని
నెవ్వరు।విని రేనిఁబఠించి రేనివిస్మయమొదవ।న్ఘనభూతజాలమెల్లను । మునుకొనివారలనుగాంచిమ్రొక్కుచునుండున్* (గీ॥వి
శ్వరూపువలననైశ్వర్యకరమైన।యిట్టివిద్యఁదాల్చియింద్రుఁడపుడు । మూఁడులోకములకుముఖ్యమైనట్టిశ్రీ । ననుభవించిమిం
చెనధికమహిమ* (సీ॥ భూపాలయీవిశ్వరూపునకగుమూఁడుతలలుమూఁడనువొందఁదగిలియుండు।సొరదిసురాపానసోమపా
నంబులునన్నాదమునగనుసమరవరుల । తోఁగూడిభుజియించితూకొనివారితో।యజ్ఞభాగంబుప్రత్యక్షమొంది । కైకొనుచుం
డిదుష్కర్ముఁడై యాయజ్ఞభాగంబురాక్షసప్రవరులకును।దల్లిమీఁదఁగలుగు తాత్పర్యవశమున।దివిజవరులమొఱఁగి తెచ్చియి
చ్చు।నదిమెఱింగియింద్రుఁడతభీతచిత్తుఁడై।తనకుఁగానియతనితలలుద్యంచె* (క॥ భాసురుఁడనకమహాత్మా । గ్రేసరుడనకమ

రవిభుఁడు ప్రియకర్మగతి, స్వపరుఁడనక మహేంద్రుఁడు, భూసురుతలలపుడు రోషమునఁ దెగనడచెన్* (వ॥ ఇట్లయ్యింద్రుండు క్రోధంబు సహింపంజాలక విశ్వరూపు తలలు ఖడ్గంబునం దెగనడిచిన సోమపానంబు సేయు శిరంబు కపింజలంబయ్యె సురాపానంబు సేయు శిరంబు కలవింకంబయ్యె నన్నంబు భక్షించు శిరంబు తిత్తిరియయ్యె నిట్లు త్రివిధపక్షిస్వరూపంబుఁ దాల్చి బ్రహ్మహత్యయే తెంచి యింద్రునిఁ జుట్టుకొని తమ్ము బరిగ్రహింపుమని నిర్బంధింప నపుడింద్రుండతి భీతచిత్తుండయి త్రిలోకనాయకుండయునం దానిం దప్పించుకొనం జాలక యంజలియొగ్గి యమ్మహాదోషంబుఁ గైకొనియెఁ దద్దోషంబొక్క సంవత్సరంబనుభవించి యంతంబాపుకొనువాఁడై భూజలవృక్షస్త్రీలం బ్రార్థించి మద్దురితంబు చతుర్విధంబులం బుచ్చికొమ్మనిన భూమితనయందుఁ జేయంబడిన ఖాతంబు తనంతన పూడునట్టి వరంబును జలంబులు సర్వంబు దనయందుఁ బ్రక్షాళితంబయనం బావనంబగునను వరంబును, వృక్షంబులు ఛేదింపంబడి పునఃప్రరోహంబు గలుగునను వరంబును, స్త్రీలెల్లప్పుడుం దమకుఁ గామసుఖంబు గలుగునను వరంబును గోరినన తండట్ల కాకయని యొసంగిన నతనిదుష్కృతంబు ధరణి నెఱియ, యూషరక్షేత్రంబులవిధంబున నుదకంబు, బుద్బుదఫేనరూపంబునను, మహీరుహంబులు, నిర్యాసభావంబున, సతులు రజస్స్వలవికారంబున, నిట్లు చతుర్భాగంబులం బంచికొని రంత* (మ॥ హతపుత్రుండగు విశ్వరూపజనకుండా త్వష్ట దుఃఖాయతో । ద్ధతరోషానలదహ్యమానుఁడగుచు దానింద్రుపై మారణ । క్రతుహోమంబు నొనర్పనంకుఁ బొడమెం గల్పాంతకాకారవి । శ్రుతకీలానలనిష్ఠురేక్షణ గుణక్షుభ్యత్త్రిలోకోగ్రుఁడై* (సీ॥ యుగముద్రుంగెడునాఁడు జగములు వొలియించునంతకు మూర్తిపై నింతయగుచుఁ । బరపునిడుపును బ్రతిదినంబును నొక్క శరపాతమంగంబు విరివిగొనుచుఁ । గడు దగ్ధశైలసంకాశదేహమునం గరము సంధ్యారాగకాంతి మెఱయ । మును గాఁకరాగి చేఁ గనుమించు మంచుల కఱకుమీసలు కచాగ్రముల మెఱయఁ । జండమధ్యాహ్నమార్తాండమండలోగ్ర । చటులనిష్ఠురలోచనాంచలవిధూతదశదిశాభాగుఁ డుజ్జ్వలతరకరాళ । భీమరసనిశితదంష్ట్రోరువదనగుహుఁడు* (ఉ॥ నింగికి నేలకుం బొడవు నిట్టలమై శిఖలందుఁ బర్వను । త్తుంగతరాగ్నిజాలములఁ దొట్రిలుచున్న త్రిహాపజిహ్వజారని । స్సంగకరాళశాతఘనసద్ఘృణిమండలచండశూలము । ప్పొంగుచుఁ గేలలీలఁ గొని భూమి చలింపఁగ సోలియాడుచున్* (సీ॥ పదపడి విరివిగా వదనంబుఁ దెరచుచు నాకాశమంతయు నప్పళించుఁ । గడు నాల్క నిగుడించి గ్రహతారకంబులనయ మెల్ల దిగజార నాకికొనుచు । నలవోకయును బోలె నట్టహాసమునకు మెఱసి లోకములెల్ల మ్రింగఁ జూచుఁ । దనరు దిగ్దంతిదంతములు చెక్కలువారను గ్రదంష్ట్రలు ద్రిప్పనుక్కు మిగిలి । త్వష్టబలితంపు తపమున సృష్టి నొంది । యఖిలలోకంబులెల్లఁ దానాక్రమించి । వృత్రనామాఖ్యదేవతాశత్రుఁడగుచు । దారుణాకారుఁ డఖిలదుర్దముఁడు మెఱసె* (మత్తకోకిల॥ అట్టి వృత్రుని మీఁద దేవతలల్కతోఁ జెనుమూఁకలై । చుట్టిముట్టి మహాస్త్రవిద్యలు సూపి యేపునయేయనా । గొట్టువీకుఁడు వారలేసిన క్రూరశస్త్రములన్నియుం । జుట్టిపట్టుక మ్రింగి శూరత జోకనాశ్చేమహోగ్రుఁడై* (క॥ భక్షితదివ్యాస్త్రుండగు । రక్షోనాయకుని నమరరాజప్రముఖుల్ । వీక్షింప వెఱచి పఱచిరి । రక్షకుఁ జింతించికొనుచు రయమొప్పారన్* (వ॥ ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబుల, వృత్రాసురుండు మ్రింగిన, నచ్చెరువడి, చేయునది నేరక, తత్తేజోవిశేషవిభవంబునకు, భయంబునొంది, కందిన డెందంబునం గుందుచుఁ బురందరప్రముఖులార్తరక్షకుండగు, పుండరీకాక్షునకుఁ, గుయ్యిడువారలై* (లయగ్రాహి॥ వీఁడు కడుదుర్దముఁడు వాడిమనకై దువులు వాడి చెడఁగా మెసవి యీడుఁ గనకున్నాఁ । డేడ బ్రదుకింకఁ జెనుకీడు వొడమెన్మనకుఁ దోడుపడనాక్కరుఁడు లేఁడు హరి దక్క । న్వేఁడుదము శ్రీధరునిఁ గూడుదము సద్భటులఁ బాడుదము గీతములఁ జాడపడునంత । న్వాడి చెను త్రోవఁ దయతోడ నెఱిఁగించు ఘనుఁ డోడక సురాలయము పాడువడు దింకన్* (క॥ అసితలపోయాచుఁ దమలో । మునుకుచుఁ దిక్కమకలు గొనుచు మురరిపుకడకు । న్గునుకుచుఁ దినుకుచు నేగిరి । ఘనరాక్షసుఁ గన్నఁ గన్నుగవ బెగ్గిలఁగన్* (వ॥ ఇట్లు భయార్తులై యమర్త్యవ్రాతంబు, చనిచని ముందట, నభంగభంగరంగదుత్తుంగ, డిండీరమండలసముద్దండాడంబర, విడంబితనారాయణనిరంతరకీర్తిలతాకుసుమ, గుచ్ఛస్వచ్ఛంబు, ననవరతగోవిందచరణారవిందసేవాసమాకులకలకలఫలితమహాపుణ్యపలాయమాన, సముద్దీపితావర్తవర్తితదక్షిణావర్తరుచిరశంఖమండలమండితంబును, నతినిష్ఠురకఠినపాఠీనపృథురోమరాజిసంకుల, తిమితిమింగిల కర్కటకమకరకచ్ఛపమకర నక్రవక్రగ్రహగ్రహణఘుమఘుమారావదారుణగమన, విషమితవిషమతరంగఘట్టనఘట్టితసముత్తుంగశీకరనికరనీరంధ్రితారకితతారాపథంబును, మహోచ్ఛ్రియశిలోచ్చయశిఖరాగ్రప్రవహిత, దుగ్ధనిర్ఝరసమ్మార్జిత, పురాణపురుషవిశుద్ధశుద్ధాంతవిహారణధురీణ, నవసుధాధౌతధావళ్యధగద్ధగాయమాన, రమ్యహర్మ్యనిర్మాణకర్మంబు, నతిపవిత్రగుణవిచిత్రనిజకళత్ర, ప్రేమానందసందర్శిత, ముకుందపరిస్రవదంతరంగకరుణారసపరిమిళితభావబంధురవిద్రుమవల్లీమతల్లికాంకురశోభితంబును, బ్రసిద్ధసిద్ధరసాంబువాహసంగమసముత్థితగంభీరఘోషపరిదూషితసకలరోదోంతరాళంబును సముద్రమేఖలాఖిలప్రదేశవిలసితనవీనదుకూలాయమానంబును హరిహరప్రముఖదేవతానిచయపరిల

ద్ధామృతమహదైశ్వర్యదానధౌరేయమహానిధానంబును వైకుంఠపురపౌర వరకామ్యఫలఫలితమందారపారిజాత సంతాన కల్పవృక్షహరిచందన ఘనవనానుకూలకూలంబునై యొప్పుచుఁ గుబేరభాండాగారంబునుంబోలెఁ బద్మమహాపద్మశంఖమకరకచ్ఛపముకుందకుంద నీలవరసమగ్రంబై విష్ణుకరకమలంబునుంబోలె సుదర్శనావర్తప్రగల్భంబై కైలాసమహీధరంబునుంబోలెనమృతకళాస్థానశేఖర పదార్పణంబై యింద్రవైభవంబునుంబోలె కల్పవృక్షకామధేను చింతామణిజనితంబై సుగ్రీవసైన్యంబునుంబోలె నపరిమితనిబిడహరిసంచారంబై నారాయణోదరంబునుంబోలె నిఖిలభువనభారభరణసమర్థంబై శంకరుజటాజూటంబునుంబోలె గంగాతరంగిణీ సమాశ్రయంబై బ్రహ్మలోకంబునుంబోలెఁ బరమహంసకుల సేవ్యంబై పాతాళలోకంబునుంబోలె ననంతభోగిభోగయోగ్యంబై నందనవనంబునుంబోలె నైరావత మాధవీరంభాదిసంజననకారణంబై సౌదామినీనికరంబునుంబోలె నభ్రంకషంబై విష్ణునామకీర్తనంబునుంబోలె నిర్మలస్వభావంబై క్రతుశతగతుండునుంబోలె హరిపదభాజనంబయి యొప్పుచున్న దుగ్ధవారాశిఁ డాసి శ్వేతద్వీపంబున వసియించి యందు సకలదిక్పాలకాది దేవతలు దేవదేవునాశ్రయించి యిట్లని స్తుతియించిరంత* (సీ॥ పంచమహాభూతపరినిర్మితంబైన మజ్జగంబులకెల్లనొజ్జయైన । బ్రహ్మయు నేమును బరగ నందఱుఁగూడి యెవ్వనికై పూజలిత్తుమెపుడు । నట్టిసర్వేశ్వరుండాగమవినుతుండు సర్వాత్మకుఁడు మాకుశరణమగును। అతిపూర్ణకాము నహంకారదూరు సమునిశాంతుఁ గృపాస్పదు నిగురుని । మానియన్యుని సేవింపఁబూనునట్టి। కపటశీలుని యతిపాపకర్మబుద్ధి। శునకవాలంబు వట్టుక ఘనతరాబ్ధిఁ। దరియఁజూచుటగాదె తాఁదామసమున* (చ॥ ఉదకమయంబు నవ్వసుధనోడగఁజేసి తనచ్చకొమ్మున । న్వదలకనంటఁగట్టి మనువల్లభుఁగాచిన మత్స్యమూర్తిసం । మదమున మమ్ముఁబ్రోచు నుమానము మానఁగవృత్ర చేతియా। పదఁదోలఁగించి నేఁడు నరపాలుర పాలిటి భాగ్యదేవతై* (మత్తకోకిల॥ రంకుసేయుచు వాతధూతకరాళభంగురభంగదు। ర్దాంతసంతత సాగరోదక తల్పమొందివసించు బ్ర । హ్మాంతవానిని బొడ్డుదమ్మిని నాదికాఁచిన నేర్పరిం। తంతవాఁడనరాని యొంటరి యాదరించుము మమ్ము గృపన్* (గీ॥ దేవతలమైన మేమిట్టి దేవదేవు। సర్వలోకశరణ్యు నిశ్శరణుఁ జొచ్చి । బలితమైనట్టి వీని యాపదలఁ బాసి। మీఱు శుభములఁ జేకొను వారమిపుడు* (వ॥ ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుండైన వైకుంఠుండు ప్రసన్నుండయ్యె నప్పుడు* (సీ॥ తగు శంఖచక్రగదాధరుండగువాని। శ్రీవత్సకౌస్తుభచిహ్నవానిఁ। గమనీయమాణిక్య ఘనకిరీటము వాని। దివ్యవిభూషణదీప్తివాని । మండితకేయూరకుండలంబుల వాని సిరియురస్థలమునఁ జెలఁగు వానిఁ। దనుఁబోలు సేవకతండంబుగలవాని జిలుగైన పచ్చనివలువవానిఁ । దెల్లదమ్మివిరులఁ దెగడు కన్నులవాని। నవసుధాద్రవంబునవ్వువానిఁ। గనిరి మె వేల్పుపిండు కప్పురపాటు తోఁ। గన్నులందు నున్న కలవు దీఱ* (సీ॥ తనసేవకులలోనఁ దడబడు రూపంబు। శ్రీవత్సకౌస్తుభశ్రీలు దెలుప । వికచాబ్జములతోడ వీడ్వడు కన్నులకడలగైవారెడు కరుణఁదెలుప । నెల్లలోకములకు నిల్లయిన భాగ్యంబు కాపురంబుండెడు కమలఁదెలుప । మూఁడుమూర్తులకును మొదలయిన తేజంబు ధాతఁబుట్టించిన తమ్మి దెలుప। బుద్ధిఁబోల్పరాని పుణ్యంబుఁ దత్పాద । కమలజనితమైన గంగ దెలుప। నప్రమేయుఁడభవుఁడవ్యక్తుఁడవ్యయుఁ । డాదిపురుషుఁ డఖిల మోదిఁ యొప్పె* (వ॥ ఇట్లు జగన్మోహనాకారుండయిన నారాయణుని కృపావలోకనాహ్లాదస్వభావచరితులై సాష్టాంగదండప్రణామంబులాచరించి ఫాలభాగపరిగిలితకరకమలులై యిట్లనిరి* (గీ॥ దుర్గమంబులయిన స్వర్గాదిఫలములఁ। బుట్టఁజేయఁజాలునట్టి గుణము। గలిగి మెలఁగుచున్న ఘనుఁడవవైనట్టి నీ। కరయమ్రొక్కువారమాదిపురుష* (సీ॥ దండంబు యోగీంద్రమండలనుతునకు దండంబు శార్ఙ్గకోదండునకును । దండంబు మండితకుండలద్వయునకు దండంబు నిష్ఠురభండనునకు। దండంబు మత్తవేదండరక్షకునకు దండంబు రాక్షసఖండనునకు । దండంబు పూర్ణేందుమండలముఖునకు దండంబు తేజఃప్రచండునకును । దండమద్భుతపుణ్యప్రధాననకును । దండముత్తమవైకుంఠధామునకును । దండమాశ్రితరక్షణ తత్పరునకు। దండము రుభోగినాయకతల్పునకును* (ఉ॥ చిక్కిరి దేవతావరులు చిందరవందరలైరి ఖేచరుల్ । సొక్కిరి సాధ్యసంఘములు శోలిరి పన్నగులాజిభూమిలో । స్రుక్కిరి దివ్యకోటికడు మ్రగ్గిరి యక్షులు వృత్రుచేత నీ । చిక్కిన వారినైన దయసేయుము నొవ్వక యుండ నోహరీ* (క॥ మొదలారి నరకక్కసులకు । మొదలై మాకాపదలకు మూలంబగుచుం। దుద మొదలు లేని రక్కసు। తుది చూపగదయ్య తుదకుఁ దుదివైన హరీ* (గీ॥ అకట దిక్కులకెల్ల దిక్కైన మాకు। నొక్క దిక్కును లేదు కాలూననైన। దిక్కుగావయ్య నేఁడు మా దిక్కుఁ జూచి। దిక్కులేకున్న వారల దిక్కు నీవ* (క॥ నీ దిక్కుగాని వారికి। నే దిక్కును వెదుకనుండదిహపరములకు। న్మోదింపఁదలఁచు వారికి। నీదిక్కే దిక్కు సుమ్ము నీరజనాభా* (గీ॥ అరయ మా తేజములతోడ నాయుధములు । మ్రింగి భువనత్రయంబును మ్రింగుచున్న। భీకరాకారు వృత్రుని పీఁచమడఁచి। యెల్లభంగుల మా భంగ మీగుమభవ* (గీ॥ పరమపురుష దుఃఖభంజన పరమేశ। భక్తవరద కృష్ణ భవవిదూర । జలరుహాక్ష నిన్ను శరణంబు వేఁడెద। మభయమిచ్చి కావుమయ్య మమ్ము* (వ॥ మఱియు నో భగవన్నారాయణ వాసుదేవ యాదిపురుష మహానుభావ పరమమంగళ పరమకల్యాణ దేవ పరమకారుణికులైన పర

మహంసలగు పరివ్రాజకులచేత నాచరితంబులగుపరమసమాధిభేదంబుల పరిస్ఫుటంబయినపరమహంసధర్మంబున ననువాది
తంబగు పరహంకపాలద్వారంబున నావృతంబయిన యాత్మలోకంబుననుపలబ్ధమాత్రుండవై నిజసుఖానుభవుండవైయున్న నీ
వాత్మసమవేతంబులైన యపేక్షింపంబడనిశరీరంబులకు నుత్పత్తిస్థితిలయకారణుండవైయుందువు గుణసర్గభావితుండవై
యపరిమితగుణగణంబులున్ననీవు దేవదత్తునిమాడ్కిఁబరతంత్రంబుచునిచ్చిన కుశలఫలంబులననుభవించి చింతింతువుషడ్గుణై
శ్వర్యసంపన్నుండవైననీ వాత్మారాముండవైయుందువు గుణసర్గభావితుండవై యపరిమితగుణగణంబు లర్వాచీనవిక
ర్తవిచార ప్రమాణభావంబునకు తర్కశాస్త్రంబులఁ గర్కశంబయినప్రజ్ఞలుగలిగి దురాగ్రహవాలైన విద్వాంసులవివా
దానుసరణంబులయందు నుపరతంబులగు నస్తినాస్తీత్యాదివాక్యంబుల సమస్తమాయామయుండవై నిజమాయచేతఁ గా
నంబడక యుక్తిగోచరుండవై సమస్తవిషయరూపంబులఁబ్రవర్తింతువు దేవారజ్జువునందుసర్పభ్రాంతిగలుగునట్లు ద్రవ్యాం
తరంబులచేతబ్రహ్మంబయిననీయందుఁబ్రపంచభ్రాంతిగలిగెనని యిట్లతిమనోహరచతురవచనంబులభక్తిపరవశులయివిను
తిసేయుచున్నదేవతలంజూచియప్పరమేశ్వరుం డమృతప్రాయంబులగుగంభీరభాషణంబులనిట్లనియె* (క॥ నుపస్థానంబ
గుమీ।సదమలనుజ్ఞానము నమసంతోషమునం।బొదలెమదిఁబ్రీతినొందితి।వదలకనాభక్తివాడమివ్యర్థంబగునే*(వ॥ మఱియు
నతిప్రీతుండనైన నాయందుభక్తులకుం బొందరానియర్థంబు లేదు విశేషించినాయందు నేకాంతమతియైనతత్వవిదుం డన్యం
బులంగోరకుండుగుణంబులయందుఁదత్వజ్ఞానగోచరుండయినవాఁడు విషయనివృత్తుండై సంసారమార్గంబునిచ్ఛయింపఁడు
గానమీకుశుభంబయ్యెడు మీరలుదధీచియనుఋషిసత్తముండుగలండతనిశరీరంబు మద్విద్యాతిశయ మహత్వంబునండె
జోవిశేషంబునసారంబయియున్నయది యతనినడిగి తచ్ఛరీరంబుఁబుచ్చికొనుండు పూర్వకాలంబున నశ్వినీదేవతలకు నశ్వ
శిరోనామంబునుబ్రహ్మస్వరూపంబగు నిష్కళంకంబయినవిద్య యుపదేశించిన వారలు జీవన్ముక్తిత్వంబునొందిరి మఱియుఁ
ద్వష్ట్రపుత్రుండయినవిశ్వరూపునకుమదాత్మకంబయిన యభేద్యకవచంబునిచ్చెఁగావున నతండతివదాన్యుండు దేహంబువం
చింపక మీకిచ్చునతనిశల్యంబులు విశ్వకర్మనిర్మితంబులయి శతధారలుగల యాయుధశ్రేష్ఠంబయి మత్తేజోబృంహితంబయి
వృత్రాసుర శిరోహరణకారణంబయియుండు దానంజేసిమీరుపునర్లబ్ధ తేజోస్త్రాయుధ సంపదలుగలిగి వెలింగెదరు విశే
షించిమద్భక్తవరులయిన వారలేలోకంబుల నెవ్వరికినజేయులుగావున మీకుభద్రంబయ్యెడునని భూతభావనుండయిన భ
గవంతుండదృశుండయ్యెనప్పుడు దేవతలు దధీచిమునికడకుంజనిన నత్తెఱయింద్రుండిట్లనియె*(గీ॥ దేహిసుఖముఁగోరుదేహం
బుఘటియించి।దేహివిడువలేదు దేహమెపుడు। దేహియస్మదీయదేహంబుకొఱకునై।దేహమీగదయ్యదేవతలకు* (ఉ॥ ఎ
క్కడనెల్లలోకముల నెవ్వరుగోరనికోర్కెనేఁడుమా। తెక్కలిపాటుకైతివిరిదేహము వేఁడఁగవచ్చినారమే। మెక్కడఁదీ
ప్రకర్మగతియెక్కడదైవకృతంబుగాకనీ।త్రొక్కుడుదాన మీవరుసఁదోయక వేడుదు రేజగంబులన్* (క॥ నీచగతియెల్లభం
గుల।యాచకమని తెలిసితగనిదడుగుదు వేనిన్।యాచకవర్గములోపల।నీచపలనఁబడరెయెంత నేర్పరులైనన్* (క॥అడుగం
గరానివస్తువు।లడుగరుబతిమాలియట్టియర్థులునినునే।మడిగితిమి దేహమెల్లను।గడునడిగెడు వానికేడగరుణమహాత్మా*(ఉ॥
నావుడునాదధీచియుమనంబునసమంతసందినవ్విసం।భావితవాక్యపత్తులఁబల్కుచునిట్లనె బేర్మితోడనో। దేవతలారప్రా
ణులకుఁదెక్కలిమృత్యుభయంబుపూనుటే।భావములందలంపరుకృపామతినెన్నడుమీమనంబులన్* (గీ॥ ఎలమిఁబ్రతుకని
చ్ఛయించినవారికి। దేహమెల్లభంగిదీపుగాదె। యచ్యుతుండువచ్చియర్థించెనేనియుఁ।దన్నునిచ్చునట్టిదాతగలఁడె ॥ అదియు
నుంగాక* (సీ॥అర్థంబువేడెడునర్థులుగలరుగాకంగంబువేడెడినర్థిగలఁడె। తగగోరికలనిచ్చుదానశీలుఁడుగల్గుఁదనదేహ
మీనేర్చుదాతగలఁడె। యీనేర్పువాఁడుదన్నిచ్చినరోయకచంపెడునట్టియాచకుఁడుగలఁడె। చంపియుఁబోవకశల్యంబు
లన్నియు నేటివంచుకపోవువారుగలరె।రమణలోకమెల్లరక్షించువారికి। హింససేయుబుద్ధియెట్టువొడమె। భ్రాంతియైనయ
ట్టిప్రాణంబుపైఁదీపి।తమకుఁబోలినెదిరిఁదలఁపవలదె॥అనినయింద్రుండిట్లనియె* (గీ॥ సర్వభూతదయాపరస్వాంతులకును।
బుణ్యవర్తనులగుమిమ్ముబోటివారి।కమితసత్కీర్తికాములకలఘుమతుల। కియ్యరానిపదార్థంబులెవ్విగలవు* (గీ॥ ఆడుగరా
నిసొమ్ములడుగరాదనిమాన।డడుగువానిమాటలడుగనేల। భ్రాంతినడుగుచోటఁబ్రాణంబులేనియు। నిచ్చువాఁడుదాపడిచ్చుఁ
గాని* (వ॥ అనిపరసంకటంబుదలంపకనిలింపులు కార్యపరతన్నవినయవాక్యపరంపరలఁబ్రార్థించిన నతండుదరహసితవదనుం
డైయఖిలలోకధర్మంబెఱిఁగియు నొక్కింతగాలంబుప్రతివాక్యంబిచ్చితి దీనిసహింపందగుదురుమీయట్టివారలకుం బ్రియం
బగునేని నెప్పుడైనవిడువందగిన శరీరంబువిడుచుటయేమిదుర్లభంబు యధ్రువంబైనయీదేహంబుజేతం గీర్తిసుకృతంబుల
నెవ్వండార్జింపకుండునతండు పాషాణాదులకంటెనతికఠినుండు మీయట్టిపుణ్యశ్లోకులచేత సాకాంక్షింపంబడినశరీరంబ
ప్రమేయధర్మార్జితంబే దేహంబుచేతనైనను సకలభూతంబులు శోకానుభవంబునశోకించు హర్షానుభవంబునహర్షించునట్టి

మహాకష్టదైన్యాకరంబైన శరీరంబు కాకశునక శృగాలాదులపాలుగాకుండ మేలయ్యెనని నిశ్చితాత్ముండయి దధీచి తత్త్వావ
లోకనంబుచేత నిరసితబంధనుండై బుద్ధీంద్రియమానసంబులతోఁగూడిన క్షేత్రజ్ఞునిపరబ్రహ్మస్వరూపంబైన భగవంతునం
దునేకీభూతంబుఁజేసి యోగజ్ఞానంబున శరీరంబువిడిచెనప్పుడింద్రుండతనిశల్యంబుల విశ్వకర్మనిర్మితంబైననిశితశతధారాస
మావృతంబై వెలుంగువజ్రాయుధంబుఁగైకొని భగవత్తేజోపబృంహితుండయిమైరావతారూఢుండై సకలదేవోత్తమగరుడ
గంధర్వఖచరకిన్నరకింపురుష సిద్ధవిద్యాధరపరిసేవితుండై సకలమునిజనంబులువినుతింపఁ ద్రిలోకహర్షకారియై భగవదను
గ్రహసంప్రాప్త మహాహాత్సాహవికసితవదనారవిందుండయి వృత్రాసురుపైనడిచెనప్పుడు* (ఉ॥ వృత్రుఁడుమానవాన్వ
యపవిత్రుఁడులోకజిఘాంసకక్రియా । సూత్రుఁడునిగ్రహాగ్రహణసుస్థిర వాక్యవివేకమానహా । రిత్రుఁడు దేవతోరగదరీకృ
తవక్త్రుఁడురోషదూషితా।మిత్రుఁడుశత్రురాకఁగనిమిక్కిలిమైనయుగాంతకాకృతిన్* (క॥ మెండుగలదనుజనాయక।మం
డలములుగొల్వనడిచెనుహిమోద్ధతివేదండములనడుమఁజనునడ । గొండయునుంబోలెనిబిడకోపోద్ధతుఁడై *(క॥ కాలగళుఁ
డదరికదువడిఁ।గాలులిపైఁగవయుమాడ్కిఖరతరరవసం। చాలితపూర్వదిగంతరుఁ । డైలీలమహేంద్రుమీఁదనడతదరిగెన్న
పా* (వ॥ ఇట్లురుద్రగణంబులుమరుద్గణంబులునాదిత్యగణంబులశ్విని దేవతలుపితృదేవతలువిశ్వేదేవులువహ్నియుఋభువు
లువరుణవాయువుబేరేశానారులుసిద్ధసాధ్యకిన్నర కింపురుషగరుడగంధర్వఖేచరప్రముఖంబులగు నింద్రసైన్యంబులతోడన
ముచియుశంబరుండనర్వుండును ద్విమూర్ధుండును వృషభుండునుహయగ్రీవుండును శంకుశిరుండునువిప్రచిత్తియునయోము
ఖుండునుబులోముండును వృషపర్వుండును హేతియుఁ బ్రహేతియునుత్కటుండును ధూమ్రకేశుండును విరూపాక్షుండు
నుగపిలుండునువిభావసుండు నిల్వలుండునుబల్వలుండును దండశూకుండును వృషధ్వజుండును గాలనాభుండును మహానా
భుండునుభూతసంతాపనుండునువృకుండునుసుమాలియుమాలియుమున్నగుదైతేయదానవయక్షరాక్షసాద్యసంఖ్యలగువృ
త్రాసురుబలంబులుఁదలపడి సమరంబుఁజేసిరప్పుడు* (చ॥ అసురులకున్సురావలికినయ్యెమహారణమప్పుడొండొరు।ల్ముసలగ
దాసికుంతశరముద్గరతోమరభిండివాలప । ట్టసపటుశూలచక్రములడంబముఁజూపియదల్చియార్చుచు । న్మసలకకప్పిరస్త్ర
ములవారొక్కనిమంటలుమింటనంటగన్*(క॥ ఒండొరులగడువనేసిన। కాండములాకాశపథముఁగప్పిమహోల్కా।తండ
ములుతోలినిష్ఠుర।ఖండనముఖమొప్పెఁజూడఁబ్రళయోచితమై* (చ॥ సురవరులేయుబాణములుసూడిక్కగోచరమైనభస్థ
లం।బటిముటిఁగప్పి రేనిదివసాంతముఁజేసినలీలనాసురే । శ్వరబలయోధవీరులురుసాయకపఙ్క్తులచేతవానిరూ।పరశతధూ
ళిఁజేసిపరపైనతమంబొనరించిరార్చుచున్* (చ॥ సమరమదాంధులై సురనిశాచరవీరులుసైనికాంఘ్రిసం । క్రమితమహీప
రాగములుగ్రమ్మిననుమ్మలికంపుజీకటు । ల్దమకనుదోయికడ్డముగఁదార్కొనినంజలమేదిపోరిరా । క్రమితనిజాంతరంగపరిఘ
ట్టితరోషమహాగ్నిపెంపునన్*(క॥ అతిగళితరక్తధారా।క్షతములతోఁగానఁబడిరిసైనికులుమహా।ద్భుతమేషవహ్నికీలలు
వికలంబైపెల్లగిల్లి వెలికుబుభంగిన్* (సీ॥ రవణించుశింజినీటంకారరవములుభటసింహనాదంబుపరిభవింప।భీషణోత్తమహ
యహేషావిఘోషంబుకరిబృంహితస్ఫూర్తిఁగ్రందుకొలుప। సమరనిశ్శంకాంకశంఖనినాదంబునేమిస్వనంబులనిహ్నవింపఁ
దుములమైచెలఁగెడుదుందుభిధ్వానంబులట్టహాసంబులనాక్రమింప। ఘటితశస్త్రాస్త్రనిష్ఠురఘట్టనోత్థ।ఖరకరోరోరువిస్ఫు
లింగంబులడరి।దివ్యకోటీరమణిఘృణిదిక్కరింప।సమరమొనరించిరసురులునమరవరులు* (వ॥ ఇట్లుప్రళయసంరంభవిజృం
భితసముత్తుంగతరంగితభైరవాగావనిష్ఠ్యూతమహార్ణవంబునుంబోలె యుగాంతసంక్రాంతఝంఝూపవన పరికంపితదీర్ఘని
ర్ఘాతనిబిడనిష్ఠురనీరదంబులుంబోలె నుభయసైన్యంబులుంగలసి సమరంబుసలుపుసమయంబున యుగాంతకృతాంతసకల
ప్రాణిసంహారకారణలీలయుంబోలెఁబదాతిరాహుత్తమావంతరథిక మహారథికవీరులొండొరులఁజండగతిం గాండంబులఁబ
రపుచు గదలంజదుపుచు గత్తులఁగత్తళంబులఁజినంబొడచుచు నడిదంబులనడఁచుచుఁ గుంతంబులంగ్రుచ్చుచుఁ గుఠారం
బుల వ్రచ్చుచుముసలంబుల మోదుచుముద్గరంబులంబాదుచుఁ జక్రంబులంద్రుంచుచుఁ బరిఘంబులనొంచుచు నరియలమె
ఱుముచుశూలంబులఁ గ్రుమ్మచువాలంబులనఱకియుఁ దొడలుతుండించియుఁదుండంబులఖండించియుఁ నుదురులెడలించియు
మెదళ్లు గెడలించియు నడుముద్రుంచియు నాసికలఁద్రెంచియుఁ బదంబులవిరిచియుఁ బార్శ్వంబులంగలయ జఱచియుఁగ
జంబులఁబఅపియుగాత్రంబులనుఱిపియుఁ గుంభంబులఁబగలించియుఁగొమ్ములు పెకలించియుహస్తంబులు తుండించియునం
గంబులఁజించియురథంబులనలయించియు రథికులంబొలియించియుసారథులంజంపియు సైంధవంబులదంపియుశిరంబులనొ
గిలించియు సీసకంబులంగలంచియు ఛత్రంబులనుగుమాడియుఁ జామరంబులందునుమాడియు సైన్యంబులజదిపియు సాహ
సులమెదిపియునడుములుద్రుంచియు మఱియునుబరస్పరగుణవిచ్ఛేదనంబు నన్యోన్యకోదండ ఖండనపటుత్వంబు నుభయ
సైంధవధ్వజసారథిరథికరథవికలనంబు నొండొరులపాదజానుజంఘాహస్తమస్తకనిర్దళనంబును రక్తమాంసమేదఃపంకసంక

లితసమరాంగణంబుననైయతిఘోరభంగింబెనంగిరప్పుడు* (చ॥ సమజయమున్నమాపజయసామ్యపరిశ్రమమున్న మోరు
వి। క్రమముసమాస్త్రశస్త్రబలగర్వమునైకడుఘోరభంగి నా । నముచివిరోధిసైన్యగణనాథులతోడ నిశాచరేశ్వరో। త్తము
లుమరంబు సేసిరొగిఁదార్కొనివృత్రబలంబుప్రాపునన్॥ అప్పుడు॥*(లయగ్రాహి ॥ మొత్తముగఁబాఱు పెను నెత్తురుమహా
నదులమొత్తములతోను ఱఁకుత్తుకలుమోవన్ । జిత్తములనుబ్బి వెస నెత్తుకొను భూతములనత్తుకొని శాకినులుజొత్తిలి చుమాం
సం । బుత్తములతో మెసఁగి నృత్తములుసేయు మదసత్తఘనఢాకినులువృత్తగతిఁబేర్చు । బ్బిత్తరములందిగిచి మెత్తమెదడు
ల్మ్రింగినసిగుత్తగొనుచుండభయవృత్తిఁగలనొప్పెన్* (వ॥ ఇట్లు దేవదానవులునర్మదాతీరంబునఁగృతయుగంబునందలపడి త్రే
తాయుగంబు చొచ్చునంతకాలంబు పోరుదారుణంబుగాఁజేయుచుండ నంతవృత్రాసురుభుజబలంబు పెంపునఁదెంపుఁజేసి
కంపింపకనిలింపులపైరక్కసులుగుంపులై పెంపుచూపిమహావృక్షపాషాణగిరిశిఖరంబులువర్షించిన* (మ॥ గిరిపాషాణమ
హీజముల్గురియఁగాగీర్వాణులన్నింటిని। స్థిరనారాచపరంపరల్పఱపుచున్ జూర్ణంబుఁగావింపని । ర్భరలీలందమచేయుశస్త్ర
ములుదోర్భంగంబులై పోవఁగాఁ। దెరలెన్ రాక్షసయోధవీరులమదోద్రేకంబుసంభిన్నమై* (క॥ ప్రచురముగ రాక్షసావళి।
ఖచరులపై నేయునిబిడకాండావళిదు। ర్వచనముఁడెడనాడుమాటలు। సుచరిత్రునియందుఁబోలిచొరవయ్యెనృపా ॥ అప్పుడు*
(వనమయూరము॥ అంతసురలేయునిబిడాస్త్రములపాలై। వంతములుదక్కిహతపౌరుషముతోని । శ్చింతగతిరక్కసులుసిగ్గు
డిగిభూమిం। గంతుగొనిపాఱిరపకారపరులార్వన్*(క॥ కొండలబోలెడురక్కసు । లొండొరులంగడవఁబాఱిరుక్కఱిపటు
కో। దండముఖసాధనంబులు। భండనమునవైచిదివిజపతులార్వంగన్* (వ॥ ఇట్లుసమరతలంబువాసితనప్రాపుగూసిపఱచు
చుండుదండనాయకులంజూచి యకుటిలమతింబకపకనగివృత్రాసురుండిట్లనియె* (ఉ॥ క్షుల్లకవృత్తిమీకగు నెశూరులకిమ్మె
యిఁగీర్తిభోగము । లొల్లఁగఁజేయుఁజావుమతిఁగోరినవారలకైనఁగల్గునే। తల్లడమందియీసమరధర్మముమానితలంగఁబా
డియే। మల్లుఁడుదుర్గమప్రధనమత్తునివృత్రునిపాటెఱుంగరే* (క॥ చావుధ్రువమైనప్రాణికిఁ । జావులురెండరసికొనుఁడుస
మరమునందు । న్భావింపయోగమందును। జావంగాలేనిచెడుచావుంజావే* (వ॥ అనివాసుదేవతేజోవిశేషవిశేషితుడైద
వానలకీలలంబోలె వెలుంగుచు వెరచి వెన్నిచ్చిపాఱెడు నసురుల వెనుకొనితఱుముసురవీరులంజూచి హుంకరించిస్వర్గానుభ
వంబుననిచ్చలేకుండెనేని మదవలోకనస్పర్శనమాత్రంబుముందర నిలుతురుగాకయని మేచి కల్పాంతానల్పఘన ఘనాటో
పంబునుంబోలెఁ గఠోరకంఠహుంకారతర్జనంబులంగర్జిల్లుచుఁ బ్రళయకాలపవనపరిభావిత మహాశిఖిశిఖావళులందృణీకరిం
చుకుటిలావలోకనంబుల నాలోకించుచుంగాలపరిపక్వలీలాలోలుండయినశూలిపోలి కెనాభీలమూర్తియై సకలజీవభారభర
ణదుర్భరభగ్న బ్రహ్మాండభాండ మహాధ్వానంబు భంగి నాస్ఫోటించిన* (ఉ ॥ కూడెజగంబులన్నియును గ్రుంకిరిసూర్యసు
ధాంశులద్రులూ। టాడెనభస్థలంబగిలెనంబుధులింకెనుదిగ్గజాళిప। ట్టూడెవడిద్దిశల్వగిలెనుర్వరక్రుంగెనజాండభాండము।
ల్లాడెవిధాతబెగ్గడిలెపార్చుచువృత్రుఁడుబొబ్బవెట్టినన్*(లయగ్రాహి ॥ కూలిరివియచ్చరులుసోలిరిదిశాధిపులు। వ్రాలిరమ
రుల్పెలుచదూలిరురగేంద్రుల్ । వ్రేలిరిమరుత్తులెదజాలిఁగొనిరశ్వినులుకాలుడిగిరుద్రులవలీలఁబడిరార్తిన్ । వ్రీలిరిదినేశ్వ
రులుకీలెడలినట్లుసురజాలములుపెల్నిదురపాలగుచుధారా । భీలగతితోడఁదమకేలిధనువుల్విడిచి నేలఁబడిమూర్ఛలను దేలి
రిమహాత్మా* (వ॥ ఇట్లుకఠోరకంఠనాదంబొనర్చిననసనిపాతంబునంగూలుప్రాణిచయంబుభంగినంగంబులెఱుంగకరణరం
గంబునంబడి బెట్టుమూర్ఛిల్లిన దివిజరాజసైన్యంబులవృత్రాసురుండు సంగరరంగదుర్దముండై మహీవలయంబు పదాహ
తంబులగజగజవడంకనిశితశూలంబు కేలనంకించుచు మదించినభద్రమాతంగంబుకమలవనంబుసొచ్చిమట్టిమల్లాడువిధంబున
నిమీలితాక్షుండగుచుఁ బదతలంబులరూపంబులు మాయంజమురుచు వెక్కసంబునఁ గ్రీడించువానింగని వజ్రివజ్రశతోపమ
నిష్ఠురగదాదండంబాభీలభంగిఁబ్రళయకాలమార్తాండ చండపరివేషప్రేరితంబుగాఁద్రిప్పివైచిన* (మ॥ అదిమింటంబెను
మంటలంటఁబఱపైయాభీలవేగంబునం। గదియన్వచ్చినలీలతోడఁగరసంగ్రాహంబుగావించిబె। ట్టిదమై చేరిసురారిదానిఁగొ
నికాఠిన్యోరుపాతంబులం। జదియన్మోదెగజేంద్రమస్తకమునుత్సాహైకసాహాయ్యుఁడై* (గీ॥ అగ్గజంబుకులిశహతిఁగూలు
కులమహీధ్రంబువోలెరక్తధారలురుల । మస్తకంబువగిలిమదమఱిజిరజిరఁ। దిరిగివిఱుగుసూపి తెరలిపఱచె*(ఉత్సాహవృ
త్తము॥ గజముదెరలిదానికొఱలిగర్జిలుచుఁబాఱఁగా। బలిమినింద్రుఁడంకుశమునఁబట్టిబిట్టునిల్పుచు । న్నిజసుధారసైకపానని
గ్ధయార్ద్రముకరమునన్। బుజువుమీఱనిమిరెనపుడురూఢిమెఱసిక్రమ్మఱన్* (వ॥ ఇవ్విధంబుననైరావతంబునుసేదదేర్చు
చునెదురనిలుచుచున్నభిదురపాణింగనితోఁ బుట్టువుఁజంపినతెంపుఁదలంచి మోహశోకంబునవివశ్యాసంబుగా నవ్వుచునా
హవకామ్యార్థియైవృత్రుండిట్లనియె* (శా॥ నాకుంబెద్దయునీవుసద్గురువుదీనవ్రాతరక్షున్ముభా। లోకుంజంపితివిట్లుపాపమతి
వైలోభంబుతోనిర్మోహ్యడన్ । లోకుల్నవ్వఁగమన్నజావటిమకున్లోనైతివీశూలమ్ము। దాకంపింపఁగనిన్ను గ్రుచ్చిబుణముక్తా

ష్ఠుండనై పేర్చెదన్*(క॥ ఎట్టితుల వైననుఁగానీ। నెట్టనఁదన బ్రతుకుకొఱకు నీవ తెగుదువుం। జుట్టమును బుణ్యు బ్రాహ్మణుఁ। బట్టివ
ధింపంగఁ గలఁడె పశువుంబోలెన్* (చ॥ దయయును సత్యమున్నొడిచి ధర్మము మానియశంబు మాసి శ్రీ। జయములఁ బాఱఁదోలి
పుఱుషత్వము గానకలోకనిందితా। హ్వయుఁడగు వాని చావునకు నార్యులు కుందుదు రెన్నగాలము। బ్రియముననంతు నేశ
వముఁ బ్రేలక చేరు నెకంక గృధ్రముల్ * (క॥ నిక్కమగు పాపములచేఁ। జిక్కితివి నిశాతశూలశిఖ రాగ్రమున। న్మిక్కిలి నీమ
మాంసమున్। నక్కలుఁ గుక్కలును జేరి నమలంగఁ జేతున్* (ఉ॥ డీకొని నీకు నేఁడిచట దిక్కని వచ్చినవారు గల్గిరే। నేకమతిం బి
శాచముల కెల్లను దృప్తిగ మన్ని శాతశూ। లైకమహాగ్నికీలల ననేకవిధంబుల సోమయాజినై। మేఁకలఁ జేసి వ్రేల్చెదనమేయ
మదోద్ధతి వ్రాలి నియ్యనిన్* (క॥ కాకననుఁ గులిశధారలఁ। దీకొని నీజీవ మపఁగలిగి తేని ప్రభూతో। ద్రేకంబుఁ దలఁగి శూరుల।
ప్రాకటపదపద్మధూళి భాగంబగుమీ* (సీ॥ సందేహమేటికి జంభారి వేవేగ భీమరంబు ద్రేయుమాభీలభంగి। నతిలోభి నడిగిన
యర్థరాశియుఁ బోలెఁ గడవలేని దివ్యర్థగాదు సుమ్ము। మురమర్దనుని తేజమున నాదధీచి వీర్యాతిశయంబున నధికమయిన। యదిగా
న హరి చేసి యంత్రితోన్నతుఁడవై గెలుపుము శత్రులగీటడంచి। యెందుఁగలఁడు విష్ణుఁ డందు జయశ్రీలు। పొందుదానవచ్చి
పొందుచుండుఁ। గాన భక్తవరదుఁ గమలాక్షు సర్వేశు। పదములందు మనముఁ బదిలపఱుతు* (వ॥ ఇట్లు వజ్రధారలం దెంపంబ
డిన విషయభోగంబులు గలవాఁడనై శరీరంబు విడిచి భగవద్ధామంబుఁ బొందెద నారాయణుని దాసుండనైన నాకు స్వర్గమ
ర్త్యపాతాళంబులం గల సంపద్భోగంబులు నిచ్ఛయింపంబడవు త్రైవర్గికాయాసరహితంబయిన మహదైశ్వర్యంబుఁ బ్రసా
దించుటం గావున నేననుపమేయంబయిన భగవత్ప్రసాదంబు న్యూలక గోచరంబద్దేవుని పాదైకమూలంబు గానుండు దాసుల
కుఁ దాసానుదాసుండనై యున్నవాఁడనని యప్పరమేశు నుద్దేశించి* (చ॥ అరయఁగ భక్తపాలనములైన భవద్గుణజాలమాత్మ
సం। స్మరణము సేయు వాక్కు నిను సన్నుతిసేయు శరీరమెల్ల గిం। కరపరివృత్తి సేయ మది గాంతుఁ యొనర్చెదఁగాని మొల్లనే।
నరిది ధ్రువోన్నతస్థలము నబ్జజుపట్టణ మింద్రభోగముల్* (ఉ॥ ఆకలిగొన్న క్రేపులు రయంబున నీకెలు రాని పక్షులు। స్రుక్కొనిత
ల్లికిన్ మఱి విదేశగపుత్రుఁడు భర్తకుం గజ। వ్యాకులచిత్తమైన జవరాలును దత్తరమందుభంగి నో। శ్రీకర పంకజాక్ష నినుఁ జేరఁగ
నా మది గోరెడుం గదే* (క॥ నామనువక్ష్యము పుణ్య। శ్లోకులతోఁ గాని తత్త్వశూన్యులు సంసా। రైకవిమోహులతోడం। గాకుం
డ నొనర్పుమయ్య కంజదళాక్షా* (మహాస్రగ్ధర॥ హరిపై సర్వాత్ముపైనన్యగణితగుణుపైనంతరంగంబు పర్వ। న్సరి మేను ప్పొం
గఁ జావుం జయమును సరిగా సంతసంబందుచున్ శ్రీ। కరుఁడై కాలాగ్నివోలెన్ దనలుచుఁ గవిసెన్ ఖర్వగర్వోన్నతిస్ఫూ। ర్భరలీల
న్స్వామిఁ గంపింపఁగ దిశల ద్రువ్వఁ బ్రచండనోద్దండవృత్రిన్* (క॥ దొరఁకొని ప్రళయోదకమున। హరిపైఁ గైటభుఁడు గవియు హంకా
రమున। న్సురనాథుమీఁద వృత్రా। సురుఁడు మదోద్వృత్తి నడిచె శూలాయుధుఁడై* (శా॥ కల్పాంతాగ్నియుఁ బోలె నుల్కలెగ
యంగాఁ ద్రిప్పుచు న్డీననో। రల్పా పాల్పితివంచు శూలము రయంబారంగఁ బై వైచినం। బోల్పం గోటిరవిప్రకాశత దివింబో వంగవీ
క్షించియా। వేల్పుల్పొంగఁగ వజ్రధారఁ దునిమెన్ వ్యాణ ముప్పారఁగన్* (గీ॥ శూలమప్పుడతఁడు ముక్కలుగ ఖండించి। పూ
నితోనకదిసి భుజముఁ ద్రుంచె। నసురగనలియేకహస్తుఁడై పరిఘంబు। గొని మహేంద్రుఁ గిట్టి హనువులడఁచె* (వ॥ ఇట్లు ప్రళయ
కాలభీషణ పరివేషపోషంబుగా రోషంబునం బరిఘంబుఁ ద్రిప్పుచుప్పించి గజకుంభస్థలంబు భగ్నంబుసేసి యింద్రు హనుప్రదే
శంబులు నిష్ఠురాహతి నొప్పించిన* (క॥ గజము మదముడిగి తిరుగుచు। గుజగుజనై ఘీకవెట్టఁ గులిశము నేల। న్బలిమిచెడి విడిచె నిం
ద్రుఁడు। గజిబిజితోఁ జెగడె నసురకడిమి జగంబుల్* (క॥ గరుడుఁడు పొదివిన నాగము। కరణి న్వృత్రాసురేంద్రు కడిమికి లో
నై। తిరుగుడువడ్డ హరిం గని। పురపుర నాహాయటంచుఁ బొగిలె జగంబుల్॥ అప్పుడు* (గీ॥ గజముపాటుఁ జూచి కడు దీనగతిఁ జూ
చి। పవికరంబు జారిపడుటఁ జూచి। యొద్ధధర్మ మెఱిఁగియున్న శత్రుఁడు జూచి। సిగ్గుతోడ వజ్రిశిరము వంచె* (వ॥ ఇట్లు యుద్ధంబున
శత్రుసన్నిధిం గరంబు జారిపడిన వజ్రంబుఁ బుచ్చికొనక నిర్వీణుండై యున్న పాకశాసనుం జూచి వృత్రుండిట్లనియె* (క॥ దుర
మునఁ గైదువు వదలిన। శరణన్నను వైరిజనుల కంపరు వైరిన్। వెరగొంద నేల కులిశము। కరమరుమకఁ బుచ్చికొనుము కాదితి
నింద్రా* (సీ॥ వజ్రంబుఁ గైకొని వైరి నిర్జింపు మిట్లడలంగ వేళగాదమరనాథ। యసుర దేహాధీనులైన మూర్తుల కెల్ల నీశు లక్ష్మీశు
సర్వేశుఁ బాసి। కడతేఁజ జయములు గల్గునె యొండైనఁ దలపోసి జూడుమా తత్త్వదృష్టి। నీలోకపాలురు నెవ్వని వశగతివలఁ బడ్డప
క్షులవర్తనమునఁ। జిక్కి చేష్టలు చేయుచుఁ జింతసేతు। రట్టి మృత్యుబలంబుల నాత్మజయము। తమది గాఁగోరి యజ్ఞానతంత్రు
లగుచుఁ। గనులలోచనులీలావికారములను* (గీ॥ మెఱయ యంత్రమయంబైన మృగముభంగి। వారునిర్మితమైనట్టి తరణిపో
లిక। శక్ర మెఱుఁగుమి లభూతజాలమెల్ల। దళితపంకేరుహాక్షు తంత్రంబుగాఁగ* (వ॥ మఱియు భూతంబులచేత నింద్రియం
బులచేత వశుండైన పురుషుండు ప్రకృతిచేత వేఱు సేయంబడిన యాత్మం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖియించుచుండు
విద్వాంసుండైన వాఁడనవరతంబు తన్ను స్వతంత్రుండుగాఁ దలంచుచుండు భూతంబులవలన భూతంబులు పుట్టుచుండు నా

భూతంబులుభూతంబులవలనభక్షింపఁబడుచుండుఁ బురుషునకాయువుశ్రీయును గీర్తియునైశ్వర్యంబులు మొదలయినవియ
నుభవింపనెంతగాలంబు ప్రాప్తంబంత కాలంబు నివసించుఁబ్రాప్తంబుదీఱిన బురుషుండు జాలింబొందిన నదియుండక పోవు
చుండుఁగావునగుణంబునవగుణంబుఁగీర్త్యపకీర్తులును,జయాపజయంబులును,సుఖదుఃఖంబులును, జావుబ్రతుకులును సమం
బులయికలుగుచుండునజ్ఞానియైనవానికి సత్త్వరజస్తమోగుణంబులు గలిగియుండునట్టివానికి గుణమయంబులైనయింద్రియా
దులేయాత్మయని తోఁచుచుండుంగావున వాఁడాగుణంబులచేతబద్ధుండగు నాగుణంబులకుసాక్షిమాత్రంబయిన శరీరం
బువేఱనియెవ్వఁడెఱుంగ నోపువాఁడాగుణంబులచేతబద్ధుండుగాఁడు గావునగుణంబులుగుణియునుభోక్తయునుభోగంబు
నుజయంబు నపజయంబునుహర్తయును హన్యంబును సృష్టిస్థితిలయకర్తనై సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వరుండె కా
నియన్యంబులేదిప్పుడొక్క హస్తంబు నాయుధంబుపోయిన నేనుభవత్ప్రాణాపహరణంబునకు సమర్థుండనగుచున్ననన్నుం
జూడుమనిమఱియునిట్లనియె* (గీ॥ వాహనంబులుసారులువాడిశరము | లూర్జితాక్షములసువులునొడ్డణములు। గాఁగఁబోరెడి
నీద్యూతకర్మమందు। నెసఁగజయమును నపజయ మెవ్వఁడెఱుఁగు* (చ॥ అనవుఁడువృత్రుమాటలకునచ్చెరువందిసురేంద్రుఁ
డెంతయుందనమదిఁగుత్సితంబుడిగిదైవముగానతనిన్నుతించి హర్షితుఁడై । కొనియెఁగరంబునన్దిగువఁగూలినవజ్రమునప్పుడాత్మఁ
దనరెజగంబులన్నియుముదంబునుబొందిరిఖేచరావళుల్* (క॥ రాహుగ్రహవక్త్రమహా। గేహాంతమువాసివచ్చికిరణావ
లినద్బాహుళ్యమొప్ప వెలిఁగెడు। నాహరిదశ్వుఁడువోలెహరియొప్పెన్సా* (వ॥ ఇట్లుకరకలితవజ్రాయుధరుఙ్మండలమం
డితదిఙ్మండలుండయిజంభారిగంభీరవాక్యంబులవిస్మయమందస్మితముఖారవిందుండయివృత్రునకిట్లనియె* (క॥ఓదానవేంద్ర
నీమతి। వేదాంతమువోలెఁదత్త్వవిజ్ఞానకళా। మోదముఁనీవతిభక్తుఁడ। వాదిమపురుషునకుహరికినబ్జాక్షునకున్* (ఉ॥ లోక
ములెల్లనిండితనలోనుగసర్వముఁజేసిప్రాణులన్దీకులఁబెట్టియెల్లడలఁదీపులునూపెడివిష్ణుమాయనేఁ। డేకమతింవలందితిది
యేలమహాసురరూపుమానిను।శ్లోకుంబురాణపూరుషునిశోభనమూర్తిధరింపుమింపునన్* (ఉ॥ఏనియమంబుసల్పితివొయె
ట్టిమహాతపమాచరించితో।పూనిరజోగుణాభిరతిఁ బొందిననీమతిశాంతదాంతన | న్మానసమానసానుభవమత్తమరాళనిరో
ధభావన । న్మానునమేయునాదనుజమర్దనుభక్తినొసంగియుంతయర్థ్* (క॥ నారాయణరూపామృతపారావారమునఁదేలు
భక్తుఁడుదాభూ।దారకరఖాతకోదక।పూరంబులనేలతృప్తిఁబొందుమహాత్మా* (వ॥ ఇట్లుపలుకుచున్నయింద్రునుపలక్షించి
వృత్రాసురుండాయోధనదుర్మర్షణసంఘర్షమాణమానసుండై వైరింబురికొల్పుకొని వామహస్తంబునంబరిఘంబుఁద్రిప్పు
చు నుప్పరంబునంగుప్పించుచు బ్రహ్మాండకర్పరంబు నిష్ఠురభైరవారావంబునంబగిలించుచు సముత్తుంగమత్తమాతంగపుంగ
వంబువృషభంబుపైఁగదియుభంగి సురవృషభుపేరురముపలక్షించిభీషణాశనినిపాతవేగంబునంగొట్టిన నింద్రుండుకులిశధా
రనప్పరిఘంబుఁదునిమి తోడనశేషఫణావిశేషంబయినబాహుదండంబుఖండించెనప్పుడువృత్రుండుభిన్నబాహుద్వయమూ
లుండై రక్తధారలందోఁగుచువజ్రిచేతపక్షహతంబై దివంబుననుండుజారుచున్న కులపర్వతంబునుంబోలెఁజూపట్టె ప్రళయ
కాలసంహారనిటలచ్ఛటచ్ఛటార్భటకఠోరకీలాభీలాగ్నిసమాన క్రూరకుటిలనిరీక్షణదుర్నిరీక్షణుండై భూనభోమండలంబు
లఁగ్రిందిమీదిదౌడలహత్తించి నభోమండలంబునుంబోలెఁ దుదిమొదలెఱుంగరాక వికృతంబుగావక్త్రంబుఁదెఱచి మందర
మథనమథ్యమానవిషధర విషమజిహ్వాభీలంబగునాలుక నభంబునాకుచుఁగాలసంహార కారణుండయినకాలుని భుజదండ
మండితకాలదండంబునుంబోలెడిదంష్ట్రలచేత జగత్త్రయంబునుమ్రింగెడువానింబోలెన తిమాత్రమహాకాయుండయి పర్వ
తంబులందలంగమీటుచునడగొండయుంబోలెనభోభాగభూభాగంబులనాక్రమించియప్పుడు* (ఉ॥ కాలమునాటిమృత్యువు
ముఖంబునఁబోలుచువిస్ఫులింగముల్। గ్రాలఁగదేవసంఘములుగంపమునొందజగంబులెల్లనా।హాలురితారవంబెసఁగనభ్ర
గజంబునునాయుధంబుతో।నాలుకఁజుట్టిపట్టిసురనాథునిమ్రింగె మహాద్భుతాకృతిన్* (గీ॥ లోకమెల్లనపుడుచీకాకుపడెఁద
మంబడరెనుడుగణంబులవనిమీఁద । సోనవానగురిసెసూర్యచంద్రాగ్నులరశ్ములుడిగెదిశలురభసమయ్యె ॥ అప్పుడు*(ఉ॥
కంపఁడుభీతిఁగుంపఁడుప్రకంపితమొందఁడుపెద్దనిద్దురం । జెందఁడుతత్తరింపఁడువిశేషముఁజెప్పఁడువైష్ణవీజయా।నందపరై
కవిద్యయుమనంబునఁదాల్చుచునుండెఁగానిసం । క్రందనుఁడానిశాచరునిగర్భములోహరిరక్షితాండుఁడై* (వ॥ ఇట్లుకవ
చరూపశ్రీనారాయణకృపాపాలితుండై యోగబలంబున బలభేదియతనియురంబు వజ్రాయుధంబునభేదించి యైరావణస
హితుండై యతనికంధరంబు తెగనడువవజ్రంబుఁబ్రయోగించిన నతినిష్ఠురవేగంబున వృత్రహరణార్థంబునందిరుగుచు సూ
ర్యాదినక్షత్రంబులకు దక్షిణోత్తరగతిరూపంబయిన సంవత్సరసంధియందు నహోరాత్రమధ్యంబున వృత్రుశిరంబుపర్వ
తశిఖరంబునుంబోలెఁద్రుంచికూలంద్రోచెనప్పుడు* (మ॥ మొరసెందుందుభులంబరంబునఁగడున్మోదించిగంధర్వులు । న్సుర
లున్సాధ్యులుసిద్ధులున్మునివరుల్సొంపారవృత్రఘ్నునీ । కరతేజోవిభవప్రకాశకరవిఖ్యాతైకమంత్రంబులం । దిరమొప్పంబ

తియించుచుం గురిసె రెంతేఁ గ్రొత్తపూసోనల౯* (గీ॥ ఏమి చెప్పనప్పు డింద్రారి తనువున । నొక్క దివ్య తేజ ముబ్బి వెడలి। లోక
మెల్లఁ జూడ లోకులు చూడఁ జీ। లోకమర సవిష్ణులోను సొచ్చె* (వ॥ ఇట్లు లోకభీకరుండైన వృత్రాసురుండు గూలిన నఖిలలోకంబు
లు శిరితాపంబు లుడిగి సుస్థితిం బొందె దేవఋషిపితృగణంబులు దానవులతోడం గూడి యింద్రునకుం జెప్పక తమతమ స్థానంబు
లకుం జనిర నిన విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె* (గీ॥ ఏమి కారణమున నింద్రుతోఁ బలుకక । సురలు వోయి
రట్టి సురగణంబు। లెంను చేత సుఖముఁ జెందిరి వజ్రికిఁ। జేటు గలుఁగు టెట్లు చెప్పుమయ్య* (వ॥ అనిన శుకుం డిట్లనియె వృత్రపరా
క్రమచకితులైన సఖిలదేవతలును మహర్షిగణంబులును మున్ను వృత్రవధార్థం బింద్రుని బ్రార్థించిన నతండు బ్రహ్మహ
త్యఁ జేయఁ జాలక తొల్లి విశ్వరూపునిం జంపిన పాపంబు స్త్రీలయందును, భూమియందును, జలంబులందును, ద్రుమంబులందు
ను, విభజించి పెట్టినయప్పుడే హత్య యేరీతిం బాపుకొనువాఁడ నాకశక్యంబగిన మహర్షులశ్వమేధయజ్ఞంబు సేయించి యజ్ఞపురు
షుండయిన శ్రీనారాయణదేవుని సంతుష్టునిం జేసి యీహత్యఁ బాపంగలవారము స్వభావంబున బ్రాహ్మణ పితృ గోమాతృవ
జ్ఞనహంతలైనవారలే దేవునిం గీర్తించి శుద్ధాత్ములగుదురు ద్దేవుని నశ్వమేధమహామఖంబున శ్రద్ధాన్వితుండవై సేవించిన నీవు
ఖలుండైన యిద్దురాత్ముని హింసించిన హత్య యేమి సేయంగలదని యొడంబఱచిన నింద్రుండు వల్లెయని యివ్విధంబున మారు
తునిఁ బరిమార్చి బ్రహ్మహత్యం బొందియ త్తాపంబు భరియింప నోపక దుర్దశం బొందెనప్పుడు* (సీ॥ పాపంబు చండాలరూపం
బుగల దాని ముదిమి చేనొడలెల్లఁ గదలు దాని। క్షయకుష్ఠరోగసంచయకృతంబగు దానినురుర క్తపూరంబు దొరుగు దాని। నెఱసి
న వెంట్రుకల్ బైరసిన తల దానిన టపోకుపో కుండుమ నెడు దానిఁ । గదుగుకంపున బ్రేవులదర జేసెడు దానిఁ దానెంమఁ బాటినఁ
దరుము దాని। నాగుణంబు లెల్ల భోగింప కేరీతి। నరుగ నెంత వాఁడవనెడు దాని। బిట్టుతిరిగి చూచి భీతిల్లి సిగ్గుతో। దేవనాయకుండు
దెరలి పఱచె* (వ॥ ఇట్లతివికృతంబుతో బ్రహ్మహత్య వెనుదగుల నింద్రుండును భోభాగభూభాగదిగ్భాగంబులెల్లం దిరిగి చోరం
దెసువులేక దీర్ఘనిగ్గాతాటోప నిశ్వాసదూషితుండై యీశాన్యభాగంబునకుం బఱచి యద్దెసన మేయపుణ్యగణ్యంబైన మాన
సనరస్సునం బ్రవేశించి యందు నొక్క కమలనాళంబు సొచ్చి యందుఁ దంతువుంగల సిరూపంబు లేకన లబ్ధభోగుండై బ్రహ్మహ
త్యావిమోచనంబుఁ జింతించుకొనుచు సహస్రవర్షంబులుండె నాచండాలి యదపరమేశ్వరదిగ్భాగంబు గుటంజేసి యందుం
జొరకాక కాచియుండె నంత గాలంబు త్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబలయోగబలంబులం బాలించుచుండె సంప
దైశ్వర్యమదాంధుండై యింద్రపత్నిం గోరి యింద్రుండు వచ్చునంతకాఁక నాకుంబత్నివి గమ్మనిన నాశచీదేవి బృహస్పతిప్రేరి
తయై బ్రహ్మర్షివాహ్యశిబికంబు నెక్కి వచ్చి నన్నుభోగింపుమనిన నతండట్ల చేసి కుంభసంభవశాపహతుండై యజగరయోని
యందుఁ బుట్టెనంత నింద్రుండు బ్రహ్మర్షిగణోపహతుండై త్రిదివంబునకు వచ్చి నంత గాలంబు నారాయణచరణారవింద
ధ్యానపరుండై యుండుటం జేసి దిశాధినాయకుండైన శంకరుచేత రక్షింపం బడ్డవాఁడై యుండుటం జేసి తద్దోషంబు దఱిగిన
హంసాశ్రితుం బీడింప లేదయ్యె నప్పుడింద్రుండు నైశ్వర్యంబును బొంది బ్రహ్మర్షిపరివృతుండై మహాపురుషారాధనంబుఁ జేసి
హయమేధాధ్వరంబునకుం దీక్షఁ గైకొని బ్రహ్మర్షుల చేతఁ జేయింపంబడుచున్నవాఁడయి సర్వదేవతామయుండైన నారా
యణుం బరితృప్తుం జేసినం జుచు విరియించు మార్తాండుని చందంబునఁ ద్వాష్ట్రవధరూపపాపంబు నాశంబు నొందింది సకలదివిజ
యక్షగంధర్వసిద్ధమునిజనసంస్తూయమానుండై త్రిభువనైశ్వర్యభోగభాగ్యంబులం గైకొనియెనప్పుడు* (చ॥ సతతమరీచి
ముఖ్యమునిసంఘము చేత యథోచితంబుగాఁ । గృతఘన వాజిమేధముఁ గేశవునీశుఁ బురాణపూరుషున్। హితుజగదీశు యు
జ్ఞపతిని ష్టఫలప్రదు నంతరంగసం। గతు భజియించి వజ్రి గతకల్మషుఁడై నెగడెన్ మహీశ్వరా* (సీ॥ మఱియుఁ బుట్టింపం గమ నము
వెట్టిన యట్టి బ్రహ్మారకగ్రాంభోధికుంభజుండు । అంగారములుసేయనాహుతిగన నోపు బహుపాపకాననపావకుండు । కందక
డిగ్రమింగగల్గు నంద్రదేవంగఁ గల్మషగరళ గంగాధరుండు । ఘనగుతహాంతరముల శాలూనని య్యనికలుష దుస్తరతమో గ్రహ
విధుండు। సకలముక్తిలోకసామ్రాజ్యశమాధిక । సహజభోగభాగ్యసంగ్రహైక । కారణాప్రమేయకంజాతుసర్వేశ । కేశ
వాదినామకీర్తనంబు* (సీ॥ అఖిలదుఃఖైకసంహారాది కారణంబఖిలార్థసంచయాహ్లాదకరము । విమలభక్త్యుద్రేకవిభవసం
దర్శనంబనుపమభక్తవర్ణనపరతంబు । విబుధహస్తానేకవిజయసంయుక్తంబు గ్రస్తామరేంద్రమోతుక్రమంబు । బ్రహ్మహ
త్యానేక పావని స్తరణంబు కమనీయసజ్జన కాంక్షితంబు । నైనయీయితిహాసంబునధికభక్తి । వినినఁ జదివిన వ్రాసిన ననుదినం
బు। నాయురారోగ్యభాగ్యభోగాభివృద్ధి। కర్మనాశమును సుగతియుఁ గలుగు ననఘ* (సీ॥ నావుడు యోగీంద్ర నామసంబీవృత్రువి
వరంబునీ చేత విన్నమొదలు । కడునచ్చుతంబునఁ గళవళం బందెదఁ గోరి రజస్తమోగుణములందు । వర్తించునీపాపవర్తికి నేరీ
తి మాధవపదభక్తి నుదివసించె । సత్త్వస్వభావులై సమబుద్ధులైతపోనియమప్రయత్నులై నిష్ఠచేత । నిర్మలాత్ములైనట్టి ధర్మ
పథుల్ కమరులకుఁ బుణ్యమునులకునంబు జాకు। భూరికైవల్యసంప్రాప్తిమూలమైన। భక్తి వీనికిఁ భోలెనే ర్పాటుగాదు* (సీ॥

ఉర్వరఁగలరేణువులకన్నదట్టమైకడునొప్పుజీవసంఘములుగలవు । ఆజీవములలోననరయధర్మాయతమతివసించిన వారును నుజడాతి।యామనుష్యులలోనఁగామంబులెడవాసి మోక్షార్థులగువారు మొదలననరిది । మోక్షమార్గంబాత్మమూలంబుగా నుండువారిలోముక్తులు లేరుతలుచు। ముక్తులయినట్టివారిలోయాసక్తిదలఁపఁ । జాలదుర్లభుఁడమితప్రశాంతిపరుఁడు।పరమసుజ్ఞాననిరతుండుభద్రగుణుఁడు । రమణశ్రీవాసుదేవపరాయణుండు* (గీ॥ సకలలోకాపకారిదుస్సంగుండు।వృత్రుఁడేక్రియ సుజ్ఞాననిరతుఁడయ్యె।సమరమునఁబౌరుషంబుచేసెనమరవిభుని। నెట్లుమెప్పించెదీనినాకెఱుఁగఁజెపుమ* (వ॥ అనిపరీక్షిన్నరేం

❖* చిత్రకేతూపాఖ్యానకథాప్రారంభము. *❖

ద్రుండు శుకయోగీంద్రునడిగెనని సూతుండు శౌనకాదిమునులకుం జెప్పె మఱియునిట్లనియె నట్లుగజపురవల్లభుండు సంప్రశ్నంబుసేసినబాదరాయణిహరిస్మరణశ్రద్ధాపరుండై యిట్లనియెఁ దొల్లికృష్ణద్వైపాయన, నారద, దేవల, మహర్షులునాకెఱింగించినయితిహాసంబుగలదు దానినెఱింగించెదసావధానుండవై యాకర్ణింపుమనియిట్లనియె* (చ॥అమితవిభూతిఁజాల నమరాధిపుఁబోలుచుశూరసేనదే। శములకుభర్తయైప్రజలుసంతసమందఁగసార్వభౌముఁడై।తమఁదమకెల్లకాలమును గామదుహంబుగఁజిత్రకేతునా। మమునప్రసిద్ధికెక్కెగుణమండనుఁడంచితకీర్తికాముఁడై* (సీ॥ మానితతారుణ్యమదనతురంగులుకందర్పవిజయైకఖడ్గలతలు।మదనసమ్మోహనమంత్రాధిదేవతల్పంచశిలీముఖుబందెకత్తె। లసమాస్త్రపిండఖిలంబున డఁగించుబొమ్మలునాత్మసంభవునికట్టాయితములుఁ । ఋంద్రేశుకోదండభూరితేజంబులుశంబరవిద్వేషిసాయకములు । నాగఁబోలుపారునొకకోటినలినముఖులు । దనకుఁబత్నులుగాఁగసత్యంతవిమల । కీర్తివైభవసన్మార్గవర్తియగుచు।జగతిఁబాలించుచుండెనాజనవిభుండు*(గీ॥కడిమివేలేలుభార్యలుగలిగియుండఁ। బరఁగసంతతియొకరునిఁబడయలేక । చిత్తమునఁజాలఁ బాయనిచింతవొడమి।బడలఁజొచ్చెనునేసవిమడుపువోలె* (ఉ॥ రూపముసత్ప్రతాపముమరుత్పతిగమయావనంబుసం।దీపితచారువర్తనము దిగ్విజయంబునుసత్యముజ్జగ । ద్వ్యాపితకీర్తియున్నతులు వైభవముఖ్యములెల్లమాన్పఁగా । నోపకయుండెనయ్యపతినొందినసంతతిలేనిదుఃఖముల్* (వ॥ ఇట్లుసంతతిలేకయతిదుఃఖమానసుండయినయానరేంద్రునిమందిరంబునకాంగిరసమహామునివచ్చియతనిచేతనతిథిసత్కారంబులువడసి కుశలంబడిగి రాజ్యంబుభవదధీనంబక డాపృథివ్యప్తేజోవాయ్వాకాశ మహదహంకారంబులనియెడియేడింటిచేత రక్షింపంబడినజీవుండునుంబోలె నమాత్యజనపదదుర్గద్రవిణసంచయదండామిత్రంబులనెడి సప్తప్రకృతులచేతరక్షితుండవయి ప్రకృతిపురుషులయందుభారంబువెట్టి రాజ్యసుఖంబులనుభవింతువుకదా మఱియుదారప్రజామాత్యభృత్యమంత్రి పౌరజానపదభూపాలురునీకువశవర్తులుగదా సర్వంబునుంగలిగిసార్వభౌముండవైన నీవదనంబునవిన్నఁదనంబుగలిగియున్న యదిగతంబేమియనిననాముని ప్రవరునకునతండిట్లనియెమీతపోబలంబున మీకునెఱుంగరాని యదియుంగలదేయనితలవంచి యూరకున్ననతనియభిప్రాయంబెఱింగి యాభగవంతుండయిన యాంగిరసుండుదయాళుండయి పుత్రకామేష్టిఁవేల్చి యజ్ఞశేషమతనియగ్రమహిషియైన కృతద్యుతికిచ్చి నీకుంబుత్రుఁడుగలిగెడినతనివలన సుఖదుఃఖంబులనుభవింపంగలవనిచెప్పి యమ్మహాత్ముండుసనియె నాకృతద్యుతియును దేవిగర్భంబుధరియించినవమాసంబులునిండినంగుమారునింగనియెనాకాలంబునరాజునుసమస్తభృత్యామాత్యజనంబులుఁబరమానందంబుఁబొందిరియపుడుచిత్రకేతుండుకృతస్నానుండై సకలభూషణభూషితుండై సుతునకుజాతకర్మంబులునిర్వర్తించి బ్రాహ్మణులకునపరిమితహిరణ్యరజతదానంబులును వస్త్రాభరణంబులును గ్రామంబులును గజంబులునువాహనంబులును ధేనువులనాఱేసియర్బుదంబులద్రవ్యంబును దానంబుసేసి ప్రాణిసముదయంబునకుం బర్జన్యుండునుంబోలెఁ దక్కినవారలకు నిష్టకామంబులువర్షించిపరమానందహృదయుండయియుండెఁగుమారుండును మాతృపితృబంధుజనంబులకుసంతోషంబుసేయుచుదినదినప్రవృద్ధమానుండై పెరుగుచుండెనంతంబుత్రమోహంబునం గృతద్యుతియందు బద్ధానురాగుండై మహీధవుండువర్తించుచుండం దక్కినభార్యలు సంతానసంతోషవికలలై యీమోహంబునకుం గారణంబుపుత్రుండయనియీర్ష్యంజేసి దారుణచిత్తలై కుమారునకు విషంబిడి సుఖనిద్రితుండునుంబోలె బాలుండుమృతిఁబొందెనప్పుడు వేఁగుటయు దాదిబోధింపంజనియాకుమారునివికృతాకారంబుఁజూచివిస్మయశోకభయార్తయైపుడమింబడియాక్రందించెనప్పుడు* (తే॥ రలు।పుడమినిట్టకనిల్వనం బడిపొక్కుచుంగడుదీనయై।యడఁకునేమియులేనివాక్కులనాపురంచువిలాపమం। దెడరుదోఁపభృశాతురోన్నతినేడ్పినస్వనిభీతితోఁ।గడుపుబిట్టవియంగవభూపతికాంతగ్రక్కుననేగుచుర్* (గీ॥బాలుఁడొకఁడుండుపరిణామశీలుండు।వంశకర్తవసివరమువలనఁ।బుట్టిమిన్నకట్లుబులసియున్నట్టియా।కొడుకుఁజూచితల్లియడలఁజొచ్చె* (ఉ॥ కుంకుమరాగరమ్యకుచకుంభములంగడుఁకజ్జలంబుశోఁ । బంకిలమైనబాష్పములపాల్పడమజ్జనమాచరించు । న్గంకణపాణిపల్లవయుగంబునవక్షముమోదికొంచునా।వంకరుహాక్షియేడ్చెఁబరిభావితపంచమసుస్వరంబుల్* (క॥ ఆయార్తరవమునకుభూ।నాయకుఁడుభయంబు

నొందినయమ్ము డిగిసుఖంబుండాయంగ నెగంబుగాఁ జని । పాయని మోహంబు శోడబాలునిమీఁదఁ* (స్రగ్విణి॥ వ్రాలియోపు
త్రవీవార్తగంభోళిన్మై । మాలఁగాఁ గ్రేయకికొల్దినన్నేటికిఁ । జాలినొందింప నెనాజాడయుంకెట్టినో । తూలుమీతల్లికేలాదుఃఖ
మెట్లాఱునో* (వ॥ అనిపలవించుచుభృత్యామాత్యబంధుజనంబులంగూడియడలుచునున్న యారాజుదుఃఖంబెఱింగియాం
గిరసుండునారదుని శోడంగూడివచ్చెం దమ్మృతుండయినపుత్త్రునిపదతలంబున మృతుండునుంబోలెపడియున్న యారాజుం
గనుంగొనియిట్లనియె* (సీ॥ నీకునీఁ డెవ్వఁడు నీ వెవ్వనికి శోకసంతాపమందెదు సార్వభౌమ । పుత్త్రమిత్త్రాదులుపూర్వజన్మం
బున నెవ్వని వారలో నెఱుఁగఁగలరె । మొదలనదీవేగమున నాడ గాడకుసికతంబులుగూడుచుఁ జెదరుచుండు । నారీతిఁ బ్రాణు
లకతికాలగతి చేతఁ బుట్టుటచచ్చుటపొసఁగుచుండుఁ । గానభూతములకుఁ గలుగుభూతంబులు । మమతతో డవిష్ణుమాయఁ జేసి ।
దీనికడలనేల ధృతిఁ దూలఁగా నేల । బుద్ధిదలఁపవలదె భూతసృష్టి* (వ॥ మఱియు నీవు నేము నుదక్కిన వారలును బ్రవర్తమాన
కాలంబు గలిగి జన్మంబు నొంది మృత్యువుఘనలన విరామంబు నొందంగలవారై యిపుడ లేక పోవుదుము చావుపుట్టువులకుఁ గుఱవం
బులేదీశ్వరుండు దనమాయచేత భూతజాలంబులవలన భూతంబులం బుట్టించువాని నాభూతంబులచేత రక్షించువాని నా
భూతంబులచేతన నపహరించును స్వతంత్రంబు కానితనసృష్టి చేత బాలుండునుంబోలెన పేక్షలేక యుండు దేహియైనపితృదేహం
బుచేత దేహియైన పుత్త్రదేహంబు వలనం గలుగుచుండు నాప్రకారంబున బీజంబువలన బీజంబులు పుట్టుచుండు దేహికి నవిశా
శ్వతంబై జరుగుచుండుఁ బూర్వకాలంబున సామాన్యవిశేషంబులు సన్మాత్రంబయినవస్తువులందే విధంబునం గల్పింపంబడియె
నాప్రకారంబున దేహంబునకుఁ జీవునకు నన్యోన్యవిభాగంబు పూర్వకాలంబున నజ్ఞానకల్పితంబయ్యె జన్మఫలంబులను జూచు
చున్నవారికి దహనక్రియల నగ్ని పెక్కురూపంబులం గానంబడు భంగి నొక్కరుండైన జీవుండు పెక్కుభంగుల వెలుంగుచుండు
నివియన్నియు నాత్మజ్ఞానంబు చాలక దేహిదేహసంయోగంబు స్వప్నంబునందు భయావహంబయిన ప్రయోజనంబునడుపు
చుండి మేల్కాంచిన యాస్వప్నార్థంబైన ప్రయోజనంబు తనదగాదని యెఱుంగుభంగి జీవుండే తానజ్ఞానగోచరుండైనవాఁ
డెఱుంగుం గావున నన్నియును మనోమాత్రంబని తెలిసి మోహితమనంబువాసి భగవంతుండైన వాసుదేవునియందుఁ జిత్తంబు
నెట్టి నిర్మలాత్మకుండవగుమని బోధించిన జిత్రకేతుండు లేచి వారలకిట్లనియె* (సీ॥ యతివేషములు పూని యతిగూఢగతి నిందు
నేతెంచినట్టిమీ రెవ్వరయ్య । క్రకడఁగిన న్బాలిశగ్రామ్యబుద్ధుల నెల్ల బోధింపవచ్చిన పుణ్యమతులొ । రమణఁ గుమార నారదఋ
భులాదులో దేవలాసితులమధీరములో । వ్యాసవసిష్ఠదుర్వాసమార్కండేయగౌతమశుకరామకపిలమునులొ । యాజ్ఞవ
ల్క్యయుదరణియు నారుణియును । జ్యవనరోమశయాసురిచత్వ దేవ । దత్తమైత్రేయవరభరద్వాజబోధ్య । పంచశిఖులో పరా
శరప్రభృతిమునులొ* (క॥ వీరలలో నెవ్వరు మర । చారణగంధర్వసిద్ధసంఘంబులలో । వారలొ యీసుజ్ఞానము । కారణమైయె
వ్వరందఁ గలమతలంపఁగ* (క॥ పాంసుగ్రామ్యపశుత్వము । బొందిమహాశోకతమముఁ గ్రుంగిననాకున్ । మ్మందఁ జివ్యజ్ఞాన
ముఁ । జెందించినవారో మిమ్ముఁ జెప్పుడు తెలియన్* (వ॥ అనిన నాంగిరసుండిట్లనియెఁ బుత్త్రకాంక్షివైననీకుం బుత్త్రుం బ్రసాదిం
చినయాంగిరసుండ నితండు బ్రహ్మపుత్త్రుండయిన నారదభగవంతుండు దుస్తరంబయిన పుత్త్రశోకంబున మునుఁగ్నుండవైన నిన్ను న
నుగ్రహించి పరమజ్ఞానంబుపదేశింపవచ్చితిమి మీదుఃఖంబెఱింగి పుత్త్రు నిచ్చితిమేని పుత్త్రవంతులయిన వారితాపంబు నీచేత
ననుభవింపంబడు నీప్రకారంబున లోకంబున సతులును గృహంబులును సంపదలును శబ్దాదులయిన విషయంబులును రాజ్యవై
భవంబు సపంచలంబులు మఱియు రాజ్యంబును భూమియును బలంబును ధనంబును భృత్యామాత్యసుహృజ్జనంబులును మొదల
యిన విశోక మోహభయపీడలం జేయుచుండుం గాని సుఖంబులనీనేరవు గంధర్వనగరంబునుంబోలె స్వప్నలబ్ధము. మనోరథంబు
నుంబోలె నర్థంబుఁ బాసి కానంబడుచు మనోభవంబులయిన యర్థంబులం గూడి స్వార్థంబులయి కానంబడనేరవు కర్మంబులచేత
ధ్యానంబులు సేయుచుండు మనంబులు నానాకర్మంబులం జేయుచుండు నీదేహిదేహంబు ద్రవ్యజ్ఞానక్రియాత్మకంబయి దేహికి
వివిధక్లేశసంతాపంబులం జేయుచుండుఁ గావున నిర్మలంబయిన మనంబుచేత నాత్మగతి వెదకి ధ్రువంబయినపదవి నొందుమని యె
నప్పుడు నారదుండిట్లనియె నుపనిషద్గోప్యంబగు నేనిచ్చు మంత్రంబెవ్వఁడేని సప్తరాత్రంబులు పఠియించునతండు సంకర్షణుం
డైన భగవంతునిం జూచు నెవ్వని పాదమూలంబు సర్వాశ్రయంబైయుండు నట్టి శ్రీమన్నారాయణుని పాదంబులు సేవించి
యీమోహంబువదలి యతిశీఘ్రంబునను త్తమపదంబు నొందు మిప్పుడిక్కుమారునకు నీకుం బ్రయోజనంబు గలదేని జూడుమ
ని నారదుండా పుత్త్రుని కళేబరంబుఁ జూచి యోజీవుండ నీకు శుభంబయ్యెడు నీదేహంబుఁ బ్రవేశించి మీతల్లిదండ్రుల బంధుజనులం
జూచి వీరలదుఃఖంబులార్చి యీకళేబరంబునం బ్రవేశించి యాయుశ్శేషంబున ననుభవించి పితృదత్తంబయిన రాజ్యాసనం
బునఁ గూర్చుండుమనిన నజ్జీవుండిట్లనియె* (గీ॥ కర్మవశమున నొందు సుఖంబులేక । దేవతిర్యఙ్మనుష్యయోనులఁ దిరుగునాకు । వెల
యు నేజన్మమున నకు నావీరు తల్లిదండ్రులయినవారు చెప్ప వేతాపసేంద్ర* (గీ॥ బాంధవజ్ఞాతిసుతులు నుబగతులాత్మ । వరులు దాసీ

సమస్తవర్ణములును। పరవిఁగనుచుండు రొక్కొక్క జన్మమునను। నెఱయఁ బ్రాణికి నొకవాఁడనిజము గలదె* (గీ॥ రత్నములు హేమములనను రాగలీల నమ్మకంబులనీవలనావలయిన। భంగిన నులంప జీవుండు ప్రాప్తుఁడగుచు। నేలమిఁది రుగుచునుండుఁ దానెంకుఁ జెడఁడు* (సీ॥ ఒక్కఁడై నిత్యుఁడై యెక్కుడుఁగడ లేక సౌరదిజన్మాదులశూన్యుఁడగుచు। సర్వంబునందుండి సర్వంబు దనయందునుండంగ సర్వాశ్రయుండనంగ। సూక్ష్మమై స్థూలమై సూత్మాధికములకు సాక్ష్యమై స్వప్రకాశము న వెలిఁగి। యఖిలంబుఁ జూచుచు నఖిలప్రభావుఁడై యఖిలంబు దనయందు నడచికొనుచు। నాత్మమాయాగుణంబుల వాత్మనాయము। గాఁగవిశ్వంబు దనసృష్టి ఘనతఁ జెందఁ। జేయుచుండును సర్వసంజీవనుండు। రమణవిశ్వాత్ముఁడయిన నారాయణుండు* (క॥ పతులెవ్వరు సతులెవ్వరు। సుతులెవ్వరు మిత్రశత్రుసుజనప్రియసం। గతులెవ్వరు సర్వాత్మక। గతుఁడయి గుణసాక్షియైన ఘనుఁడొక్కనికి* (వ॥ మఱియు సుఖదుఃఖంబులం బొందక సర్వోదాసీనుండై పరమాత్మయై యుండు నప్పరమేశ్వర రూపుండైన నాకును మీకు నెక్కడి సంబంధంబు మీకు దుఃఖంబునకుం బని లేదని పలికి యాజీవుండు వోయిన నంజిత్రకేతుండును బంధువులు నతివిస్మితచిత్తులై శోకంబులు విడిచి మోహంబులం బాసి యమునానదియందు నక్కుమారునకు నుత్తరకర్మంబులు నిర్వర్తించి చిత్ర

—* చిత్రకేతుండు తపంబాచరించి భగవత్ప్రసాదంబు నొందుట. *—

కేతుండు గాఢపంచకంబునం బడిన యేనుంగునుం బోలె గృహాంధకూపంబు వెడలి కాళిందీనదికిం బోయి యందు విధిపూర్వకంబుగఁ గృతస్నానుండై మౌనంబుతోడ నారదునకు నమస్కరించిన నతండు ప్రసన్నుండై భగవన్మంత్రంబు విధిపూర్వకంబుగా నతనికి నుపదేశించి యాంగిరసుతోడం గూడి బ్రహ్మలోకంబునకుం జనియెఁ జిత్రకేతుండును నారదోపదేశమార్గంబున నిరాహారుండై సమాధినియతుండై నారాయణరూపంబయిన విద్యనారాధించి సప్తరాత్రాంతంబున నప్రతిహతంబయిన విద్యాధరాధిపత్యంబును భాస్వద్రత్నదివ్యవిమానంబును నారాయణానుగ్రహంబున నంబొంది మనోగమనంబునం జరియించుచుండఁ గొన్ని దినంబులకు నొక్కచోట* (సీ॥ తారహారపటీరధవళదేహము వాని రమణీయ నీలాంబరంబు వాని। మణికిరీటస్ఫురన్మస్తకంబుల వానిఁ గంకణకేయూరకరము వానిఁ। గర్బురమయదీప్తకటిసూత్రముల వానిఁ దరళ యజ్ఞోపవీతముల వాని। నతిసుప్రసన్నవక్త్రాంబుజంబుల వానిఁ దరుణవివృత్తనేత్రముల వాని। సిద్ధమండలంబు సేవింపఁ బుణ్యప్ర। సిద్ధి వెలసినట్టియుద్ధచరితుఁ। బద్మలోచను నసుఁ బాదపీఠంబైన నహిమునిఁ బన్నగేంద్రుఁ గాంచె నతఁడు* (గీ॥ కన్నమాత్ర నతఁడు కల్మషంబులఁ బాసి। విమలచిత్తుఁడగుచు విశదభక్తి। నిట్టరోమములకు బట్టగు నానంద। బాష్పనేత్రుఁడగుచుఁ బ్రణుతిఁ జేసె* (క॥ సంతోషాశ్రుల చేతననంతునఁ బరిషిక్తుఁ జేసియతఁడు ప్రమోదం। బెంతయు నఁకట్టిననొక। కొంతయుఁ బలుకంగ లేక కొండొకవడికిన్* (చ॥ నదినొకయింతమాత్రము సమంబుగఁ జేయుచు బాహ్యవర్తనం। గదిసిన యింద్రియంబుల నొకింతకుఁ దెచ్చి మనంబు వాక్కునుం। గుదురుగఁ ద్రోచి తత్త్వమునఁ గూర్పుచు శాశ్వతవిగ్రహంబునా। సదయుఁ బ్రశాంతలోకగురు సన్నుతిఁ జేయఁ దొడంగె నిమ్ములన్* (క॥ అజితుఁడవై భక్తులచే। విజితుఁడవై నాడ వెపుడు వేడుక నీచే। విజితులు నిల్లకోర్కుల। భజియింపని వారు నిన్నుఁ బడయుదురె హరీ* (ఉ॥ నీవిభవంబులీ జగము నిండుటయుండుట నాశమొందుట। లీనివిమలాంశజాతములు నెమ్మి జగంబు సృజించు వారలో। దేవభవద్గుణాంబుధుల తీరము గానక నీశబుద్ధితో। వాదిరి జర్పసేయుదురు వారికి వారలు దొడ్డవారలై* (క॥ పరమాణువు మొదలుగఁ గొని। పరమమ్ముదుదిగాఁ గమధ్యపరికీర్తనచే। స్థిరుఁడగు త్రిగుణహరుండవు। సమసత్త్వాద్యంతమధ్యసర్వసుగతివై* (గీ॥ ఉర్వి మొదలుగ నేడునొండొంటికంటె। దశగుణాధికమై యుండు దాననంద। నాశమొందెడు నాయండకోటులెన్న। నందునణుమానమగునననంతాఖ్యుఁడతఁడు* (వ॥ మఱియు నొకానొకచోట విషయతృష్ణావరులై నరపశువులు పరతత్త్వంబవైన నిన్ను మాని యైశ్వర్యకాములై తక్కిన దేవతల భజియింపుదురు వారిచ్చు సంపదలు రాజకులంబునుం బోలె వారలం గూడి నాశంబునం బొందుచుండు విషయకాములై నిన్ను సేవింపలేని వారు వేఁచిన విత్తనంబునుం బోలె దేహాంతరోత్పత్తి నొందకుండుదురు నిర్గుణుండవై జ్ఞానవిజ్ఞానరూపంబునొందియున్న నిన్ను గుణసమేతునిఁగా నజ్ఞానులు భావింపుదురు నీ భజనంబే రూపుననైన మోక్షంబు ప్రసాదించు జితమతివై ననీవు భాగవతధర్మంబే ప్రకారంబున నిర్ణయించితి వా ప్రకారంబున సర్వోత్కృష్టుండవైన నిన్ను సనత్కుమారాదులు మోక్షంబుకొఱకు సేవింపుచున్నారీ భాగవత ధర్మంబునందు జ్ఞానహీనుండొక్కండును లేఁడన్య కామ్యధర్మంబులం దు విషమబుద్ధిచేత నేను నీవు నాకు నీకు ననివచియించుచున్న వాఁడు ధర్మనిరతుండయి తుయించుచుండు స్థావరజంగమ ప్రాణిసమూహంబునందు సమంబైన భాగవతధర్మంబుల వర్తించుచున్న మనుజునికి భవద్దర్శనంబువలనఁ బాపంబు క్షయించుటయేమి చిత్రంబిపుడు భవత్పాదావలోకనంబున నిరస్తాశుండనయితి మూఢుండనయిన నాకుఁ బూర్వకాలంబున నారదుండనుగ్రహించి భగవద్ధర్మంబు దయసేసెనది నేఁడు నాకు వరదుండవైన నీకతంబున దృష్టంబయ్యె ఖద్యోతంబుల చేత సూర్యుండు గోచరుండు గాని మాడ్కి జగదాత్మకుండయిన నీమహత్త్వంబు మనుజులచేత నాచరింపంబడ

ప్రసిద్ధంబైనది గావున త్రిస్థితిలయ కారణుండవై భగవంతుండవైన నీకు నమస్కరించెద మఱియును* (గీ॥ అరయ బ్రహ్మాదు లెవ్వనినను నయింది । భక్తియుక్తులమనమునఁ బ్రస్తుతింతు రవని నెవ్వని తలమీఁద నావగింజ । బోలునా వేయిశిరముల భోగిఁ గొల్తు* (క॥ ఈవిధమున వినుతింపఁగ। నా విద్యాధరుల భర్తకని యెనమంతుం । డోవిమల బుద్ధి నీదగు। ధీవిభవంబునకు మెచ్చితిం బ్రియమార* (గీ॥ అరయ నారదుండు నాంగిరసుండును। దత్త్వమొసఁగినారు దానికతన । నన్నుఁ జూడఁగల్గె నాభక్తి నీకుఁ గల్గె। నా పథంబు నీకు నమ్మగలిగె* (సీ॥ పూని నారూపంబు భూతజాలంబులు భూతపావనుఁడఁ బొందువడఁగ । బ్రహ్మంబు మఱియు శబ్దబ్రహ్మమును శాశ్వతంబైన తనువులుదగిలె నాకు। నఖిలలోకంబులు ననుగతంబై యుండు లోకంబు నాయందుఁ జోకఁ జెందుఁ। నుభయంబు నాయందు నభిగతంబయ్యు దియఖిలీనము య్యోనయ్యుభయమందు । వెలయ నిద్రించువాఁడాత్మ విశ్వమెల్లఁ । జూచి మేల్కాంచి తానొక్కచోటు వాని। గావివేకించు మాడ్కి నీజీవ దేశ । మాయదిగనాడి పరమ ధర్మంబుఁ దెలియ* (గీ॥ నిద్రఁ బోవు వేళ నిరతుఁడై దేహి దా। నెట్టిగుణము చేతనింద్రియములఁ। గడచినట్టి సుఖముఁ గనునట్టి బ్రహ్మంబు । కడిమి మెఱయ నన్నుఁ గా నెఱుంగు* (గీ॥ స్వప్నసంమ నెట్లు సంచార మొనరించు। మేలుకాంచి దృష్ట మెల్ల నెఱుఁగు । నుభయ మెఱుఁగునట్టి యుత్తమ జ్ఞానంబు। తత్త్వమట్టిదైన తలఁపు నేను* (సీ॥ అరయంగ నెవ్వనికలవిగానట్టియీ సలలితమానువజాతిఁ బుట్టి। యాత్మతత్త్వజ్ఞాన హేతుఁడైన వానికిగలుగు నేయందు సుఖంబొకింత । వెలయఁ బ్రవృత్తినివృత్తిమార్గంబుల సుఖదుఃఖచయముల సొరిదిఁ దెలిసి। పని చెడి సంకల్పఫలమూలమునఁ బొఱుఁగడు సుఖదుఃఖ మోక్షములకొఱకు । దంపతీక్రియామతంబునవర్తింత్రు। దాన మోక్షమేలదక్కయుండు। నఖిలదుఃఖహేతువైనయీ కర్మంబు। నెఱిఁగి నన్ను దలఁపరిచ్చలోన* (వ॥ మఱియు విజ్ఞానాభిమానులయిన మనుష్యులకు నతిసూక్ష్మంబయిన యాత్మగతిని స్థానత్రయ లక్షణంబును జతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మిక విషయంబుల చేతను వివేకబలంబు చేతను నియుక్తుండయిన జ్ఞానవిజ్ఞానసంతృప్తుండయిన పురుషుండు నాకు భక్తుండగు నీపథంబు లుగలవారలు యోగనైపుణబుద్ధిగలవారలునై స్వార్థంబయిన యాత్మ చేతం బరమాత్మను దెలియుచుందురు నీవు నీక్రమంబున మద్భక్తిశ్రద్ధాపరుండవై విజ్ఞానసంపన్నంబైన వాక్కుల చేత నన్ను స్తోత్రంబుఁ జేసి ముక్తుండవయితివని యాశేషభగవంతుండు విద్యాధరపతియైన చిత్రకేతుంబలికి యతనికదృశ్యుండై పోయె నేదిక్కున సర్వాత్మకుండయిన యనంతుం డంతర్ధానంబు నొందె నాదిక్కునవిద్యాధరభర్త నమస్కరించి గగనచరుండయి చనిలక్షలసంఖ్యలైనదివ్యవర్షంబు లవ్యాహత బలేంద్రియుండై పరమయోగీంద్ర పురుషులును, దివ్యమునీంద్ర సిద్ధచారణగంధర్వులు వినుతిసేయం గులద్రోణాది శైలంబులును, రమ్యప్రదేశంబులను, సంకల్ప సిద్ధప్రదేశంబులను, వినోదించుచు శ్రీనారాయణ దత్తంబగు దివ్య విమానంబునందుఁ జరియించుచునుండె* (శా॥ ఆడించున్ హరిదివ్యనాటకగుణవ్యాపారనృత్యంబులన్। బాడించుం జలజాతనేత్రబిరుదప్రఖ్యాతఁగీతంబులం । గూడించున్సతతంబు జిహ్వలతుదిన్గోవిందనామావళుల్। గ్రీడంగిన్నరయక్షకామినులచేఁ గృష్ణార్పితస్వాంతుఁడై* (సీ॥ వాసించునాత్మఁ బోవైష్ణవజ్ఞానంబు నాశించు భాగవతార్చనంబు । భూషించు నేత్రపొద్దుపుండరీకాక్షుని భాషించు హరికథాప్రౌఢి మెఱసి । ఘోషించు హరినామగుణనికాయంబులు పోషించుఁ బరతత్త్వబోధ మెఱసి । సేవించు శ్రీకృష్ణసేవకనికరంబు సుఖమునఁ జేయు నీశునకబలులు। పాడుఁ బాడించు వైకుంఠభర్తనటన। రూపవర్తనగుణనామదీపితోరు। గీతజాతప్రబంధ

—* విద్యాధరాధిపతియగు చిత్రకేతుండీశ్వరధిక్కారంబువలన గౌరిచే శాపంబు నొందుట. *—

సంగీతవిధులఁ । గేశవప్రీతిగాఁ జిత్రకేతుఁ డెపుడు* (మ॥ హరిగీతించుచు నల్లనల్ల మదిలో నబ్జాక్షు సేవించుచుం । బరమానందమునొందుచున్నగములన్ ప్రఖ్యాతి వర్తించుచు। న్సురగాజోపమమూర్తియక్షగణముల్సొంపార విద్యాధరా । ప్సరసల్గొల్వఁగఁ బాడఁగా సితగిరిప్రాంతంబున న్నేగుచున్* (శా॥ ఆవిద్యాధరభర్తగాంచె హరునీహాగామృతాహాసమున్। శ్రీవిభ్రాజితమున్నిరస్తగిరిజాసేవాగతాయాసము । న్దైవానీకవికాసమున్శుభమహాదేవాంఘ్రిసంవాసము । న్భూవిఖ్యాతవిలాసమున్ త్రిభువనీభావంబుఁ గైలాసమున్* (క॥ ఆరజతభూధరంబున । నీ రేజభవామరాదినికరము గొల్వ। న్పేరోలగమున నుండిన। గౌరీయుతుఁడయిన హరుఁ గని యెనరేంద్రా* (సీ॥ తననిజరూపమింతంతని తెలియక వాదంబు నేసెడు వేదరవము। కరుణావలోకనాకాంక్షితులయియున్న బ్రహ్మాదిసనకసత్ప్రణుతరవము । సారశివానందసల్లాపములనొప్పు ప్రమథగణాళి యాగ్భట రవంబు । డమరుమృదంగాదిథథమధ్వనితోడఁ బటుభృంగినాట్యవిస్ఫారరవము । మానుగాఁ జామరలువీచు మాతృకాదికామినీజనమహితకంకణరవంబు। మెండుఁ జెలఁగంగఁ గన్నులపండువయ్యెఁ। గొండరాచూలి పెనిమిటినిండుకొల్వు* (వ॥ ఇట్లు బ్రహ్మాదిసురనికరసేవితుండై యామహాపీఠంబున నున్న భవానిం గౌఁగిటం జేర్చుకొని యొడ్డోలగంబుననున్న పరమేశ్వరుం జూచి చిత్రకేతుండు పకపకనగియద్దేవి వినుచుండ నిట్లనియె* (సీ॥ కొమరొప్పఁగా లోకగురుఁడును గడ లేనిధర్మస్వరూపంబు దానయగుచు। జడలు ధరియించియు సరిలేని తపమునఁ బొడవైనయీ యోగిపుంగవులును। బ్రహ్మవాదులుఁ గొల్వ భాసిల్లి కొల్వులోని

ఘనరూపంబున మెలఁతతోడఁ। బ్రాకృతుండును బోలె బద్ధానురాగుఁడై లాలితుండయ్యె లజ్జతోడ । నకటప్రకృతిపురుషుఁడ
యునఁదానేకాంత । మందుసతులతోడ నలరుఁగాని । యిట్లుధర్మపథులనింతులతోఁగూడఁ । బరిహసింపవలన భ్రాంతినొంది॥
(క॥ అనవినిసర్వేశ్వరుఁడా। తని నేమియుననకనవ్వెఁ దత్సభవారుం। గనుఁగొనియూరకయుండిరి। ఘనుజేశ్వరయీశుదైన్య
మహిమెట్టిదయో॥ (వ॥ ఇట్లుతనపూర్వకర్మవివేషంబునవింద్రియజయుండనఁ బుట్టినయహంకారంబున జగద్గురువుం బెనఁ
ద్రెల్లనంబులాడుచున్నచిత్రకేతుంజూచి భవానియిట్లనియె॥ (క॥ నమ్ముఁబోటిలజ్జలుడిగిన । కుమతులకుం గర్తయగుచుఁగో
పింపంగా। నమితాజ్ఞానపునుండగు శమనుండానేఁడు వీఁడు జగముల కెల్లన్॥ (క॥ భృగునారదశిలాదులు । నిగమాంతజ్ఞులు
ను యోగసిద్ధయనిపుణులు। త్రిగుణాతీతుని మహేశ్వరు। నగరెన్నడు వారుధర్మనయమెఱుంగరొకో॥ (సీ॥ ఎవ్వనిపదపద్మ మిం
ద్రాదివిబుధులమాడాగ్రపఙ్క్తులనీడఁ జూచు । నెవ్వనితత్వంబు నెనయంగ। బ్రహ్మాదియోగిమానసవృత్తి నోలలాడు। నెవ్వ
నిరూపంబు నేర్పాటుగానక వేదంబులందంద వాదమాడుచు। నెవ్వనికారుణ్యమీలోకముల నెల్లఁ దనిపి యెంతయు ధన్యతములఁ
జేయునట్టి సర్వేశుఁ బాపసంహారుధీరు । శాశ్వతైశ్వర్యునాత్మ సంసారునీశు । నెగ్గుబలికిన పాపాత్ముఁ డెల్లభంగి। దండనా
ర్హుండుగాకెట్లుతలఁగఁగలఁడు॥ (గీ॥ నిఖిలలోకాశ్రయంబునన్నిహితసుఖము। సకలభక్తశ్రీకసేవ్యంబు సాధుసేవ్య। మయి
నకంజాక్షుపాదపద్మార్చనంబు। ననుసరింపంగ ఖలుఁడు వీఁడర్హుఁడగునె॥ (వ॥ కావున నోరిదురాత్మక యీపాపంబునం బాప
స్వరూపంబయిన రాక్షసయోనిం బుట్టుమని శపియించి యింతనుండి మహాత్ముల కునవజ్ఞ సేయకుండుమని పలికిన చిత్రకేతుం
డువిమానంబుడిగ్గివచ్చి యద్దేవికి దండప్రణామంబులాచరించి కరకమలంబులు మోడ్చి యిట్లనియె నోజగన్మాతభవచ్ఛా
పవాక్యంబులట్లకైకొంటి। బ్రాచీనకర్మంబులం బ్రాప్తంబైన సంసారచక్రంబుచేత నజ్ఞానమోహితులై తిరుగుచున్న జంతు
వులకు సుఖదుఃఖంబులునై జంతులై ప్రవర్తిల్లుచుండునట్టి యాత్మసుఖదుఃఖంబులకు నెవ్వరుకర్తలీగుణంబులనిమిత్తమై శాపా
నుగ్రహంబులును స్వర్గనరకంబులును సుఖదుఃఖంబులును సమంబులు భగవంతుండొక్కరుండు తనమాయచేత జగంబులు సృ
జియించుచుండు వారివారికి బద్ధానురాగంబులు గలుగఁజేయుచుండును వానికిలోను గాక నివర్తుఁడై యుండు నీవిధంబున నం
బుట్టుచున్న నరునకుం బంధుశత్రుమిత్రోదాసీనంబులెక్కడివి వారివారి కర్మవశంబునం బరమేశ్వరుండు సర్వసముండై
యుండు నప్పరమేశ్వరునకు సుఖదుఃఖంబులచేత రాగంబులేదు రాగాను బంధంబు నరోషంబు లేదతని మాయ గుణవిసర్గంబు
జంతువులకు సుఖదుఃఖంబులను బంధమోక్షంబులం గల్పించుచుండు గావున నీకు నమస్కరించుచున్న నన్ను ననుగ్రహింపు
ము శాపభయశంకితుండంగాను జగన్మాతవై ననిన్నుఁ బలికినదోషంబునకు శంకించుచున్నవాఁడనని దండప్రణామంబు లాచ
రించి పార్వతీపరమేశ్వరులం బ్రసన్నులం జేసితనవిమానంబెక్కి చనియెనప్పుడు పరమేశ్వరుండు బ్రహ్మాది దేవర్షిదైత్యదా
నవప్రమథగణంబులు వినుచుండఁ బార్వతికినిట్లనియె నీకునిప్పుడు దృష్టంబయ్యెగదా నారాయణదాసదాసానుచరుల నిస్పృహా
భావంబు హరిభృత్యార్థదర్శనులయి నిస్పృహులైన భాగవతులకు స్వర్గాపవర్గనరక భేదభావంబులు లేవు ప్రాణులకు దేహసం
యోగంబువలన నారాయణలీలం జేసియుండి ద్వంద్వాది సుఖదుఃఖంబులాత్మయందు నజ్ఞానంబున భేదంబు సేయంబడియెని
ట్టి విపర్యయంబు భగవంతుండైన వాసుదేవునిభక్తిగలవారిం జెందవు మరియును॥ (ఉ॥ నేనుఁ గుమారనారదులు నీరజగ
ర్భుఁడు దేవసంఘముల్। మౌనితయోగివర్యమునిమండలమిట్లగువారమందరు। ధ్యానవవిద్విషాంశజనితంబులమయ్యుఁ దనీయత
త్వము। గానఁగనేరమీశుఘనగర్వమునందలపోసిచూచుచున్॥ (క॥ ఆతనికినిఁ బ్రియుఁడప్రియుఁ । డేతెఱఁగున లేఁడు నఖిల
మెల్లను దానై। భూతములకాత్మయగుటయు। భూతప్రియుఁడొక్కఁడాదిపురుషుఁడుతన్వీ॥ (గీ॥ అరయఁ జిత్రకేతుఁడతిశాం
తుఁడతిలోక। సముఁడు విష్ణుభక్తిసంగతుండు। నితని నేమి చెప్ప నీశుండనగు నేను। సువిదయచ్యుతప్రియుండుసుమ్మి॥ (క॥ కావున
భగవద్భక్తుల। భావమునకు విస్మయంబుపని లేదుమహా। ధీవిభవశాంతచిత్తులు। పావనపరతత్వనిపుణభవ్యులు వారల్॥ (వ॥ అ
నినవిని యద్రినందన విస్మయంబుమాని శాంతచిత్తయయ్యె నట్లు పరమభాగవతుండయిన చిత్రకేతుండద్దేవికిం బ్రతిశాపంబియ్య
సమర్థుండయ్యును మఱలశపింపక శాంతరూపంబున శాపంబు శిరంబున ధరియించె నిట్లు సాధులక్షణంబులు నారాయణపరా
యణులయినవారలకుం గాక నొరులకుం గలుగ నేర్చునే యిపుడు శాపహతుండయిన చిత్రకేతుండు త్వష్ట సేయు యజ్ఞంబున ద
క్షిణాగ్నియందు దానవయోనిం బుట్ట వృత్రాసురుండనవిఖ్యాతుండయి భగవద్జ్ఞానపరిణతుండయ్యెగావున॥ (సీ॥ నరనాథ
యావృత్రునకు రాక్షసాకృతి గలిగినయీపూర్వకారణంబు । చిరపుణ్యుఁడయినట్టి చిత్రకేతుమహానుభావంబు భక్తితోఁ బర
గవిన్నఁ। జదివినవారికి సకలదుష్కర్మముల్నిఖిలంబులైకడుఁ జెదిరిపోవు। సకలవైభవములు సమకూరు దనయంతఁ దోడ్తోఁ
డుకోర్కెలతోడఁగూడి। నిర్మలాత్ములగుచు నిత్యసత్యజ్ఞాన । నిరతులగుచు దురితులగుచు । బంధుమిత్రపుత్రపౌత్రాదుల
నుగూడి। యనుభవించుచుందురధికఫలము॥ (సీ॥ వినవయ్య నరనాథవిశదంబుగా త్వష్ట్రృవంశంబుసెప్పితివాని వెనుక । సవిత

*** సవితృవంశాదిప్రవచనకథాప్రారంభము. ***

యుఁ బృశ్నియు సావిత్రి వ్యాహృతి యను భార్యలందు నింపారు వేడ్క । నగ్నిహోత్రంబుల నరయఁగఁ బశుసోమపంచయ జ్ఞంబుల బరఁగఁ గనియె। భగుఁడు సిద్ధి యను భార్యకు మహిమానుభవుని విభవుని దాఁ బడసె ముపుఁ । దనయ నొకతెఁ గాంచె దదనంతరమున వా। తరళనేత్ర సద్వ్రితైకధామ। పుణ్యశీలను గుణపూరిత చారిత్ర। యఖిలలోకపూజ్య యాశిషాఖ్య* (వ॥ మఱియు ధాతకుఁ గలఁగు హూ సినీవాలి రాకానుమతు లను నలువురు భార్యలలోఁ గుహూదేవి సాయమను సుతునిఁ గాంచె సినీవాలి దర్శాఖ్యునిం బడసె రాక ప్రాతరాఖ్యునిఁ గాంచె ననుమతి పూర్ణిమాఖ్యుఁ గనె విధాత క్రియయను భార్యయందు నగ్నిపురీష్యాదులం గనియె వరుణునకుఁ జర్షిణి యను భార్యయందుఁ బూర్వకాలంబున బ్రహ్మపుత్త్రుండయిన భృగువును వల్మీకంబునం జనియించిన వాల్మీకియును దయించిరి మిత్రావరుణులకు నూర్వశి యందు రేతోద్గమంబైన నది యుఁ గుంభంబునం బ్రవేశింపఁ జేయ నందు నగస్త్యుండును వసిష్ఠుండు జనియించిరి ప్రత్యేకంబ మిత్రునకు రేవతి యందు నుత్సర్గసంభవులైన యరిష్టయుఁ బిప్పలుండు నను వారలు జనియించిరి శక్రునకు పౌలోమియందు జయంత ఋషభ విదుషుల నమువ్వురు పుట్టిరి వామనుండయిన యురుక్రమదేవునకుఁ గీర్తియను భార్యయందు బృహచ్ఛ్లోకుండు పుట్టె నా బృహచ్ఛ్లోకునకు సౌభగాదులు పుట్టిరి మఱియు వామను భావుండు మున కశ్యపప్రజాపతికి నదితియందు శ్రీనారాయణుం డవతరించిన ప్రకారంబు వెనుక వివరించెద దితిసుతులైన దైతేయుల వంశంబు సెప్పెద నే దైతేయవంశమునం బ్రహ్లాదబలులు పరమభాగవతులై దైత్యదానవవంద్యులై వెలసిరి దితికి హిరణ్యకశిపు హిరణ్యాక్షు లనఁ బ్రసిద్ధిఁ బొందిరి యందు హిరణ్యకశిపునకు జంభాసురతనయయైన దత్రికిఁ బ్రహ్లాదయనుహ్లాద సంహ్లాద ప్రహ్లాదు లను నలువురు కొడుకులును సింహిక యను కన్యకయుఁ జన్మించిరి యా సింహికకు రాహువు జనియించె నా రాహువు శిరం బమృతపానంబు సేయ హరి తన చక్రంబునం ద్రుంచె సంహ్లాదునకు గతి యను భార్యయందుఁ బంచజనుండు పుట్టె హ్లాదునకు ధమని యను భార్యయందు వాతాపి యిల్వలులు పుట్టిరి వారల నగస్త్యుండు భక్షించె ననుహ్లాదునకు సూర్మియను భార్యయందు బాష్కల మహిషులు గలిగిరి ప్రహ్లాదునకు దేవియను భార్యయందు విరోచనుండు పుట్టె నతనికి బలి జన్మించె నా బలికి నశనయను భార్యయందు బాణుండు జ్యేష్ఠుండుగా నూర్గురు కొడుకులు పుట్టిరి యా బలిప్రభావంబు వెనుక వివరించెద బాణాసురుండు పరమేశ్వరు నారాధించి ప్రమథగణంబులకు ముఖ్యుండయ్యె మఱియు నా దితిసంతానంబు వలన నేకోన పంచదశకంబు లుదయించె వారలందఱు ననపత్యులై యింద్రుతోఁ గూడి దేవత్వంబుఁ బొందిర నవిని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె* (గీ॥ ఏమి కారణమున నింద్రుకీ మరుత్వ్య । యములాప్తులగుచు శాంతిఁ బొంది । రరయఁ దత్కృమానులగుచు వర్తించిరి దీని విననగవలయుఁ దెలుపవయ్య॥ అని నశుకుం డిట్లనియె* (సీ॥ నరనాథ విను తన నందనులందఱు నమరేంద్రు చేత హతులగుచునుండఁ । గోపశోకంబులఁ గ్రుళ్ళుచుఁ దనలోన నమ్మదితి జాలము ఉంగఁ దొడఁగె । భ్రాతృహంతకుఁ డతిపాతకు నింద్రునిఁ జంపక నాకేల సొంపు గలుగు। పీని భస్మము సేయు వానిఁ గా నొక సుతుఁ బడసెద నని చాల భర్తఁ గోరి । ప్రియము సేయఁ దొడఁగెఁ బెక్కు భావంబులు। భావనముల నధిక పోషణములఁ। భక్తియుక్తిచేతఁ బరిచర్య గతిచేత। నుతుల చేత నతుల రతుల చేత* (చ॥ కలికి కటాక్షవీక్షణ వికారములన్ హృదయానురాగసం। కలితవిశేష వాఙ్మధుర గర్జనలన్ లలితాననేందు మం। డలపరిశోభితామృతవిడంబితసస్మిత సుప్రసన్నతా। ఖిలరుచిరప్రధానముల భామిని భర్తమనంబులోఁ గొనెన్* (గీ॥ అఖిల మెఱిఁగిన కశ్యపునంతవాని। హితవృతల కెకుఁ-రతులసంగతుల చేత। నవశుఁ గాఁ జేసె వేల్మిడి నబ్జవదన। పతుల భ్రమియింప నేరని సతులు గలరె* (క॥ ఏతల పెఱుఁగక నిలిచెను। భూతంబులఁ జూచి యాత్మ పురుషుల మనము। ఖ్యాతి గొలుపంగ యువతీ । వ్రాతంబు సృజించె బతులు వారలకసుదే* (వ॥ ఇట్లు గజసతి చేత నుపలాలితుండై కశ్యపప్రజాపతి యాసతికిం బరమప్రీతుండై యిట్లనియె నూతనీ నీకుఁ బ్రసన్నుండనైతి వరంబు గోరుమిచ్చెద నాథుండు ప్రసన్నుండయిన స్త్రీలకుం గోరిక సంభవించుటయేమి గొఱంత సతికిం బతియె దైవంబు నర్వభూతంబుల మానసంబులకు వాసుదేవుండె భర్త నావరూపకల్పితులయిన సకలదేవతామూర్తుల చేతం బురుషుల చేతను భర్తృరూపధరుండయిన భగవంతుండు సేవింపంబడుచుండు స్త్రీల చేతఁ బతిరూపంబున భజియింపంబడుఁ గావునఁ బతివ్రతలైన సుందరులు శ్రేయస్కాములై యేకచిత్తంబున నాత్మేశ్వరుండయిన యప్పరమేశ్వరుని భర్తృభావంబున సేవించుచుండుదు రేనును నీచు భావంబున వరదుండనైతి దుశ్శీలురైన వనితలకుం బొందరాని వరంబు నీకిచ్చెద వేఁడుమనిన నా కశ్యపునకు దితి యిట్లనియె* (గీ॥ వరము గోర నాకు వరదుండ వేనియు । నింద్రుఁ ద్రుంచునట్టి నిద్ధబలుని । నమిత తేజుఁ దనయు నమరత్వసంప్రాప్తు। నెందుఁ జెడని వాని నిమ్ము నాథ॥ అనవుడు* (క॥ ఉట్టిపడునట్టి వెరమి। కట్టడి నన్నెట్టు వేఁడెఁ గటకట యనుచు। న్నిట్టిపడి యతని మదిలోఁ బుట్టిన తల్లడము తోడఁ బొరుగుచునుండెన్* (చ॥ ప్రకృతిని గర్మపాశముల బద్ధుఁడనై తగఁదయ్య నేఁడు నీ। ప్రకటసతీస్వభావమున వేదురుఁ గొల్పిన నియ్యసంద్రియా। ధిక మతినైన నాకు నహంపును నజిత్తము చెప్ప బెట్టిబా। తగములఁ గూలకున్నె నను దై

వమునవ్వ డెల్లలి తాఱ్ఱుర్ణ* (సీ॥ కండశర్కరతోడఁగలహించుఁబలుకులు బద్మవిలాస మేర్పఱుపు మోముఁ। దుహినాంశుకళలతోఁ దులదూఁగు చెయ్యులుఁ జెమటఁ గ్రొన్నెత్తురు సేయు మేను । నిలువెల్లఁ గరఁగించు నింపుల నేర్పులఁ బువ్వులకరుదైన పోడి సేఁత। తమకంబు పుట్టించు తరితీఁపు తలఁపులు వెనసినమదిలోని యిచ్చ గింత । గలిగి కరవనున్న కాలాహి పోలికఁ । జెలఁగుచున్న సతుల దిత్తవృత్తిఁ। దెతియవశమె యెంతతిధృతిగలవారికి। నాకె కాదు నిఖిలలోకములకు* (గీ॥ కోరి సతుల కెల్లఁ గూర్చెద రెవ్వరు। పతులనైన సతుల హితులనైన। బలిమిఁ జేసియైనఁ బరహస్తమునైన । హింస సేతు రాత్మ హితముగాఁ ఆకు* (వ॥ అనఁ చింతించి దీనికి నేమని ప్రతివాక్యం బిచ్చువాఁడ మద్వచనంబెందున మోఘంబు త్రిలోకవరిపాలనశీలుండయిన భిదురపాణివధార్థ్యాం డెమైనను దీనికి నైనదియొకటి గర్పించెదనని దితిం జూచి యోతను మధ్యనీకు నట్ల దేవబాంధవుండయిన యింద్రహంతయగుపుత్రుండు గలిగెడు నొక్క సంవత్సరం బీవ్రతంబున జరియింపు ముదీని ప్రకారంబు విను మెల్లజీవులవలన హింసాభావంబు లేకనతిధ్వనివాక్యంబులుడిగి కోపంబు మాని యనృతంబు వలుకక నఖరోమచ్ఛేదనంబు సేయక నస్థికపాలాదియమంగళంబుల నంటక నదీతటాకాదుల నవగాహస్నానంబు కానిఘటోదకమాపోదకంబుల స్నానంబు సేయక దుర్జనసంభాషణంబులు వర్జించి కట్టిన కోకయును ముడిచినపువ్వులను గ్రమ్మఱ ధరియింపక భోజనంబులయందు నుచ్ఛిష్టాన్నంబును జండికాని వేదితాన్నంబును గేశశునకమార్జారకంక క్రిమిపిపీలికాదివిదూషితాన్నంబును నామిషాన్నంబును వృషలాహితాన్నంబు నీపంచవిధనిషిద్ధాన్నంబులు వర్జించి దోయిట నీళ్లు ద్రావక నుచ్ఛిష్టగాక సంధ్యాకాలంబుల ముక్తకేశిగాక మితభాషిణియై యలంకారవిహీనగాక వెలుపలం దిరుగక పాదప్రక్షాళనంబు చేసికొని కానిశయనింపక నార్ద్రపాదయై పవ్వళింపక పశ్చిమశిరస్సయును నగ్నయయ్యును సంధ్యాకాలంబుల నిద్రింపక నిత్యంబును ధౌతవస్త్రంబులు గట్టి శుచియై సర్వమంగళసంయుక్తయై ప్రాతఃకాలంబున లక్ష్మీనారాయణుల నారాధించి యావాహనార్ఘ్యపాద్యోపస్పర్శన సుస్నానవాసోపవీత భూషణపుష్పధూపదీపోపహారాద్యుపచారంబు లర్పించి హవిశ్శేషంబుగా ద్వాదశాహుతుల వేల్చి దండప్రణామంబు లాచరించి భగవన్మంత్రంబును దశవారంబుల నుసంధించి స్తోత్రంబుఁ జేసి గంధపుష్పాక్షతల ముత్తైదువులం బూజించి పతిని సేవించి పుత్రుంగుక్షిగతుంగా భావించి

యివ్విధంబున మార్గశిరశుద్ధప్రతిపదారంభంబుగా నొక్కసంవత్సరంబు నలిపి యాద్వాదశమాసాంత్య దివసంబున విధ్యుక్తంబుగా నుద్యాపనంబు సేయవలయు నీవీపుంసవనంబను నెడి వ్రతంబు ద్వాదశమాసపర్యంతంబె చేయుటకు సల్పిన నీవు గోరినకుమారుండు గలిగెడు ననిన దితియా వ్రతంబుతోడనె గర్భంబు ధరియించి వ్రతంబు సలుపుచునుండ నింద్రుండు మాత్రభిప్రాయంబెఱింగి యాయమ్మన హరహంబును రహస్యంబున సేవించుచు వ్రతంబునకుం దగిన పుష్పఫలసమిత్కుశపత్రాంకురంబులు మొదలయిన వస్తువితతి నింద్రకాలంబున నందిచ్చి యిచ్చుచుఁ బుండరీకంబు హరిణికిం బొందియున్న భంగి నాయమ్మ వ్రతభంగంబునకై కాచి శుశ్రూషఁ జేయుచు నాయమ్మ ధరియించిన తేజోవిశేషంబునకు బెగ్గిలించుచుఁ గృశించుచునుండె నంతనొక్కనాఁడు* (సీ॥ వామాక్షి యమ దిన వ్రతధారణోన్నత పరిచర్యవిధుల చేఁ బడలి యలసి । యొంటి సంధ్యావేళ నుచ్ఛిష్టయై పదప్రక్షాళనాదులఁ బాసి మఱచి। తనకర్మమోహంబు తవిలి నిద్రింపంగ నింద్రుండు చయ్యన నెదురుఁగాంచి । యోగమాయాబలోద్యుక్తుఁడై యాయింతి యుదరంబుఁ జొఱఁబడి యుగ్రుఁడగుచుఁ । దివిరి దేదీప్యమానమై తేజరిల్లు । గర్భకు వజ్రధారలనఁ జెనేఁడు। దునుకలు గవాఁడుదుని సియుఁదునకదునకఁ। జెడక నొక్కొక్కబాలుఁడై చెలఁగుచున్న* (క॥ వారేడ్వ రగుచుఁ గుయ్యిడ। నోరేడ్వకుమనుచుఁ గ్రమ్మంచె నొక్కొక్కనినా। శూరుం డేడ్గురిఁ దునకలు। గారయమునవారు సెడక ఖండితులయ్యున్* (క॥ ఖండములన్నియు నందఱుఁ। జండాంశుసమప్రకాశ శౌశ్వతులగుచు । న్మెండుకొని సిల్పియనిరా। ఖండలునకుఁ గరుణవుట్టు గతిమతేఁదోఁచ* (వ॥ అందఱు ముకుళితకరకమలులై నీకుందోడఁబుట్టువులము మమ్ము హింసింపం బని లేదు నీకుం బారిషదులమైమరుద్గణములమై నిన్ను సేవించెదము మమ్ము రక్షింపుమనిన నారాయణప్రసాదంబునం జెడని మరుద్గణంబుల వలుకులకుఁ గృపాళుండై యింద్రుండు వారల సహోదరులుగాఁ గైకొని మఱి హింసింపక మానె నశ్వత్థామశరాగ్నివలన నారాయణరక్షితుండవయిన నీవు నుంబోలె గులిశధారల శకలంబులయిన కుమారులన్నిరూపంబులై సంవత్సరంబునకు నొక్కింతకడమగా హరిం బూజించినవారుగావున నింద్రుతోడం గూడఁ బంచాశద్దేవతలయిన మరుద్గణంబులు దితిగర్భంబు వెలువడి రంత దితి మేల్కాంచి యనలప్రకాశులై యింద్రుతోడం గూడి వెలుంగుచున్న కుమారులం జూచి నంతోషింపక యింద్రుం జూచి నీకు మృత్యురూపంబయిన పుత్రుఁ గోరి దుస్తరంబయిన వ్రతంబు సలిపితి సంకల్పించిన పుత్రుండొక్కరుండు సప్తసంఖ్యగల కుమారులగుట కేమి కతంబు నీ వెఱింగి వ్రభంగిన తథ్యంబుఁ బలుకుమనిన నింద్రుండిట్లనియె నోతల్లి భగవద్వ్రతంబుఁ జింతించి సమయవిచ్ఛేదనంబునం గర్భంబుఁ జొచ్చి పాపచిత్తుండనై వజ్రధారల గర్భంబు విదళనంబుఁ జేసిన నాశకలంబులు సెడక మహాశ్చర్యంబుగా నివ్వి

థంబునంగుమారకులైరి మహాపురుషపూజాసంసిద్ధికార్యానుషంగగాకుండునే భగవదారాధనంబు గోరికలంబాపియెవ్వరుగావింతురువారిహావరంబుల సర్వార్థకుశలులగుదుర మ్మహాపురుషవ్రతసముత్పన్న తేజంబుభజింపనెవ్వండోపుంగావున దుర్మదంబున బాలిశస్వరూపుండనై దోషంబుంజేసిన నాదౌర్జన్యకర్మంబునహింపందల్లికన్న నెవ్వరుసమర్థులుపాపాత్ముండనగునన్నుంగావుము నేనువీరలతోడివాండననినిష్కపటంబుగాప్రార్థించిననద్దేవియట్లకాకయని శాంతచిత్తయయ్యెనింద్రుండునువారలంగూడిత్రిదివంబునకుంబోయి సోమపానహవిర్భాగంబులు వారలకుంబంచిపెట్టికూడిసుఖంబుండెనని చెప్పిపరీక్షిన్నరేంద్రునకుశుకయోగీంద్రుండువెండియునిట్లనియె* (క॥ హరివరముడయినవ్రతముంట । హరివంశజులకునెగడునమరులజన్మస్ఫురణంబుంటపఠియించిననరయంగనురుదీర్ఘ పాపహరమగుటకుదే*(వ॥అనివిష్ణుకథాశ్రవణకుతూహలాయమానమానసులైనశౌనకాదిమహామునులకు సూతుండుసెప్పెనని. శుకయోగీంద్రుండుపరీక్షిన్నరేంద్రునకుంజెప్పెననుటయు॥

క ॥ రాజీవరాజపూజ్యా। శ్రీజితగోపికటాక్షభువనాంతరవి। భ్రాజితమూర్తిమదోద్ధత। రాజకులోత్సాహరామరాజాఖ్యనిధీ ॥

తరల ॥ మురవిదారణముఖ్యకారణమూలతత్త్వవిచారణా। దురితతారణదుఃఖవారణదుర్మదాసురమారణా ।

కిరివిహారణకీర్తిపూరణకీర్తనీయమహారణా। ధరణిధారణధర్మతారణతాపసస్తుతిపారణా॥

తోటకము॥కరుణాకరశ్రీకరకంబుకరా।శరణాగతసంగతజాడ్యహరా।పరిరక్షితశిక్షితభక్తహరా।కరిరాజశుభప్రదకాంతిధరా॥

గద్య. ఇది, శ్రీసకలసుకవిజనమిత్ర శ్రీవత్సగోత్రపవిత్ర కసువయామాత్యపుత్రబుధజన ప్రసంగానుషంగసింగయ నామధేయప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబునందు నజామిళోపాఖ్యానంబును, ప్రచేతసులంజంద్రుండామంత్రణంబుసేయుటయు, దక్షోత్పత్తియుం, బ్రజాసర్గంబును, దక్షుండుశ్రీహరింగూర్చితపంబుసేయుటయు, నతనికినప్పరమేశ్వరుండుప్రత్యక్షంబగుటయు, హర్యశ్వశబళాశ్వులజన్మంబును, వారలనారదుండుబోధించుటయు, నారదువచనప్రకారంబున వారు మోక్షంబునొందుటయుం దద్వృత్తాంతంబునారదువలనవిని దక్షుండుదుఃఖాక్రాంతుండగుటయుం, దదనంతరంబబ్రహ్మపదంబు దక్షుండుశబళాశ్వసంజ్ఞులగు సహస్రసంఖ్యాతులగు పుత్రులంగాంచుటయును, సృష్టినిర్మాణేచ్ఛానిమిత్తంబున దక్షుపంపునవారుంగ్రజన్ములు సిద్ధింబొందినతీర్థరాజంబయిన నారాయణసరస్సునకుంజనుటయు, వారికినారదభగవంతుండు బ్రహ్మజ్ఞానంబునుపదేశించుటయును, వారుపూర్వజులేగినప్రకారంబున మోక్షంబునొందుటయును, దద్వృత్తాంతంబుదక్షుండుదివ్యజ్ఞానంబుననెఱింగి నారదోపదిష్టంబనితెలిసి నారదునిశపియించుటయు, నారదుండుదక్షుశాపంబు ప్రతిగ్రహించుటయును, దక్షునకుమఱల బ్రహ్మవరంబున సృష్టివిస్తారంబుకొఱకుంగూతులఱువదిమంది జనియించుటయు, నందుంగశ్యపునకునిచ్చినపదుమువ్వురివలన సకలలోకంబులునిండుటయును, దేవాసురనరతిర్యఙ్మృగఖగాదిజన్మంబులును, దేవేంద్రతిరస్కారంబున బృహస్పతియధ్యాత్మమాయచేతంగానరాకుండుటయును, దద్వృత్తాంతంబు రాక్షసులువినిక్రోధవిష్టులైవచ్చుటయును, దేవాసురయుద్ధంబును, నాచార్యతిరస్కారంబునదివిజరాజపలాయనంబును, బలాయమానులయిదేవతలుబ్రహ్మసన్నిధికిం జనుటయును, బ్రహ్మవాక్యంబునంద్వష్టృకుమారుండయిన విశ్వరూపునాచార్యునింగా దేవతలువరించుటయును. విశ్వరూపుప్రసాదంబుననింద్రుండు నారాయణవర్మంబను కవచంబుధరియించి రాక్షసులజయించుటయును, బరోక్షంబునరాక్షసులకు విశ్వరూపువర్ధనంబును,వృత్రాసురజన్మంబును, సురలకునారాయణుండు ప్రసన్నుండగుటయును, విశ్వరూపువధానంతరంబుననింద్రునకు బ్రహ్మహత్యసంప్రాప్తంబైన నింద్రుండుస్త్రీభూజల ద్రుమంబులయందుం బంచిపెట్టుటయును, విశ్వరూపుండుహతుండగుటకుం ద్వష్టయింద్రవధార్థంబుమారణహోమంబుసేయవృత్రాసురుండుజనించుటయును, వృత్రాసురయుద్ధంబునపరాజితులై యింద్రసహితులయినదేవతలు శ్వేతద్వీపంబునకుం జనుటయు, నందుశ్రీహరిప్రసన్నుండయి దధీచివలనభిదురంబుగైకొనుటయు, నింద్రుండు వజ్రాయుధంబున వృత్రునిసంహరించుటయు, నింద్రుండుబ్రహ్మహత్యాపీడితుండయి మానససరస్సుంబ్రవేశించుటయును, నహుషుండుశతాశ్వమేధంబులంజేసి యింద్రాధిపత్యంబువడయుటయును, నహుషుండగస్త్యశాపంబుననసురరాజ్యచ్యుతుండయి యజగరయోనింబుట్టుటయు, నింద్రాగమంబును, నశ్వమేధంబును, నింద్రుండుత్రిలోకాధిపత్యంబువడయుటయును, చిత్రకేతూపాఖ్యానంబును, మరుద్గణంబుల జన్మప్రకారంబుననుకథలుగల షష్ఠస్కంధము..................*

శ్రీకృష్ణార్పణమస్తు.

( శ్రీమదాంధ్రమహాభాగవతము.—సప్తమస్కంధప్రారంభము. )

శ్రీమద్విఖ్యాతిలతా। క్రామితరోదోంతరాళకమనీయమహా। జీమూతతులితదేహ। శ్యామలరుచిజాలరామచంద్రనృపాలా॥

(వ॥మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకునిఖిలపురాణ వ్యాఖ్యానవైఖరీసమేతుండయిననూతుండిట్లనియె నట్లుప్రాయోపవిష్టుండైనపరీక్షిన్నరేంద్రుండుశుకయోగీంద్రునవలోకించి* (సీ॥ సర్వభూతములకుసముండునెచ్చెలిప్రియుండయిన వైకుంఠుండనంతుండాద్యుం । డింద్రునికొఱకువై దైత్యేంద్రులనేటికి విషమునికైవడివెదకిచంపె । నసురులజంపంగ నమరులచేదనకయ్యెడిలాభమెంతైనంగలదె । నిర్వాణనాథుండునిర్గుణుండగుతనకసురులవలని భయంబుసగయుంగలుగ నేరదట్టిఘ

నుఁడు దైత్యులఁ జంపి । సురలఁ గాచుచునికి చోద్యమనుచు। సంశయంబు నాకు జనియించె మునినాథ । ప్రజ్ఞ మెఱసి తెలియఁబలుక వయ్య॥ అనినఁ శుకుండిట్లనియె* (శా॥ నీ సంప్రశ్నము వర్ణనీయము గదా నక్షంబు రాజేంద్ర లక్ష్మీసంభావ్యుని సచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁగ । ద్వ్యాసాఖ్యానములొప్ప విష్ణుచరణధ్యానప్రధానంబులై । శ్రీసంధానములై మునీశ్వర వచోజేగీయమానంబులై* (క॥ చిత్రంబులు త్రైలోక్యపవిత్రంబులు భవలతాలవిత్రంబులు స। న్మిత్రంబులు మునిజనవన । చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్* (వ॥ నరేంద్రా కృష్ణద్వైపాయనునకు నమస్కరించి హరికథనంబులు సెప్పెద వినుము వ్యక్తుండు గాక గుణంబులు లేక ప్రకృతిం జెందక భవంబులఁ బొందక పరమేశ్వరుండు తన మాయవలన నైన గుణంబుల నావేశించి బాధ్యబాధకత్వంబులఁ బొందు నతండు గుణరహితుండు సత్త్వరజస్తమంబులు ప్రకృతిగుణంబులా గుణంబులకు నొక్క కాలంబున హానివృద్ధులు గలవా యీశ్వరుండు సత్త్వంబున దేవఋషులను రజోగుణంబున నసురులను దమోగుణంబున యక్షరక్షోగణంబులను విభజించె సూర్యుండు పెక్కెడలం గానంబడియు నొక్కరుండయిన తెఱంగున నద్వితీయుండును సర్వగతుండయ్యును భిన్నుండు గాఁడు తత్త్వవిదులైన పెద్దలు తమలోనం బరమాత్మస్వరూపంబు ననున్న యీశ్వరుని విధంబున నెఱుంగుదురు జీవాత్మకుఁ బరుండైన సర్వేశ్వరుండు తన మాయచేత విశ్వంబు సృజియింపం గోరి రజంబునఁ గ్రీడింపం గోరి సత్త్వంబున నిద్రింపం గోరి తమంబును త్పాదించి చరమైన కాలంబున సృజియించుచు నా కాలమున సర్వదర్శనుండైన యీశ్వరుండు కాలాహ్వయుండై సత్త్వగుణంబైన దేవానీకంబునకు వృద్ధియు రజస్తమోగుణులైన రాక్షసులకు హానియుం జేయుచుండు* (క॥ జననాయక యీ యర్థము ఘనయశుఁడగు ధర్మజునకుఁ గ్రతుకాలమున । న్మును నారదుండు సెప్పెను । వినిపించెద వినుము చెవులు విమలత నొందన్* (వ॥ మున్ను ధర్మరాజు సేయు రాజసూయయాగంబున బాలుండైన శిశుపాలుండు హరిచే నందించిన శిత నిర్వక్ర చక్రధారాదళితమస్తకుండయి తేజోరూపంబున వచ్చి హరిదేహంబు సొచ్చుటం జూచి వెఱఁగుపడి ధర్మజుండు సభలోనున్న నారదు నీక్షించి యిట్లనియె* (గీ॥ ఎట్టివారికైన నేకాంతులకునైన । వచ్చి చొరఁగరాని వాసుదేవు। తత్త్వమందుఁ జేరి ధరణీశుఁ డహితుఁడై। యెట్లు చొచ్చె మునివరేణ్య నేఁడు* (ఉ॥ వేనుఁడు మాధవుం దెగడి విప్రులు దిట్టిన భగ్నుఁడై తమో। లీనుఁడు గాఁడె తొల్లి మఁదలిప్తుఁడు చైద్యుఁడు పిన్ననాఁటనుం । డేనియు మాధవున్ వినసహింపఁడు భక్తి వహింపఁడట్టివాఁ । డే నిబిడప్రభావమున నీ పరమేశ్వరునందుఁ జొచ్చెనో* (మ॥ హరి సాధింతు హరిన్ గ్రహింతు హరిఁ బ్రాణాంతంబు నొందింతుఁ దా। హరికిన్ వైరి నటంచు వీఁడు పటురోషాయత్తుఁడై యెప్పుడున్। నిదురన్ సంభ్రమవేళ నోరు ప్రీలిపడదో దేహంబు దాహంబుతో । నరకావాసము నొందఁడే క్రియ జగన్నాథుం బ్రవేశించెనో* (వ॥ అదియునుం గాక దంతవక్త్రుండును వీఁడును నిరంతరంబు గోవిందు నింద సేయుదురు నిఖిలజనులు సందర్శింప నేఁడు వీనికి విష్ణుసాయుజ్యంబు గలుగుట కేమి హేతువు వినిపింపుము పవనచలిత దీపశిఖయుంబోలె నా హృదయంబు చలించుచున్నదనిన ధర్మనందనునకు నారదుండిట్లనియె దూషణ భూషణ తిరస్కారంబులు శరీరంబునకుం గాని పరమాత్మకు లేవు శరీరాభిమానంబునం జేసి దండవాక్పారుష్యంబులు హింసయై తోఁచు తెఱంగున నేను నాయది యని యెడు వైషమ్యంబు భూతంబులకు శరీరంబునందు సంభవించు నభిమానంబు బంధంబు నిరభిమానుండయి వధించిన వధంబు గాదు కర్తృత్వ మొల్లని వానికి హింసయు సిద్ధింపదు సర్వభూతాత్మకుఁడయిన యీశ్వరునికి వైషమ్యంబు లేదు గావున* (గీ॥ అలుకనైనఁ జెలిమినైనఁ గామంబునైన బాంధవమున నైన భీతి । నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ । జేరవచ్చు వేఱు సేయఁ డతఁడు* (క॥ వైరానుబంధనంబునఁ। జేరిన చందమున విష్ణుఁ జిరతర భక్తిం। జేరఁగరాదని తోఁచును। నారాయణ భక్తియుక్తి నా చిత్తమునన్* (క॥ కీటకముఁ దెచ్చి భ్రమరము। పాటవమున బంభ్రమింప భావితంబై త । త్కీటకము భ్రమరరూపము । పాటించి వహించుఁగాదె భయయోగమునన్॥ ఇవ్విధంబున* (శా॥ కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా । సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్। ప్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రిం గంటిమెట్లైనను । ఉద్దామధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా॥..............................

*శ్రీహరిద్వారపాలకులయిన జయవిజయులకు సనందనాదులవలన శాపంబు సంభవించుట.*

(వ॥ మఱియుం బెక్కండ్రు కామ ద్వేష భయ స్నేహ సేవాతిరేకంబులఁ జిత్తంబు హరిపరాయత్తంబు గాఁ జేసి తద్గతిం జెందిరి హరిని ద్వేషించి క్రోధాదు లేనింటిలోపల నొక్కటియైన వెన్నునికి లేని నిమిత్తంబున నతండు వ్యర్థుండయ్యె మీ తల్లి చెలియలి కొడుకులయిన శిశుపాల దంతవక్త్రులు తొల్లి విష్ణుమందిర ద్వారపాలకులు విప్రశాపంబునఁ బదభ్రష్టులై భూతలంబున జన్మించిరనిన విని యుధిష్ఠిరుండు నారదున కిట్లనియె* (మ॥ అలుగం గారణమేమి విప్రులకు మున్నా విప్రులెవ్వారు ని । శ్చలు లేకాంతులు నిర్జితేంద్రియులు నిస్సంసారు లిచ్ఛానువ । ర్తులు వైకుంఠపురీనివాసులనవిందు న్వారి కెబ్భంగినీ । ఖలజన్మంబులు వచ్చె నారదమునీ

కౌతూహలంబయ్యెడిన్* (వ॥ అనిన నారదుండిట్లనియె నొక్కవాఁడు బ్రహ్మమానసపుత్రులయిన సనకసనందనాదులు దైవయోగంబున భువనత్రయంబునందును సంచరించుచు నైదాఱేండ్లప్రాయంపు బాలకులభావంబున దిగంబరులయి హరిమందిరంబునకు వచ్చిచొచ్చునెడ మొగసాలనున్న పురుషులిరువురు వారలం జూచి॥ (క॥ డింభకులనలఘుకళా।సంభకులరమాధినాథసల్లాపసుఖా।రంభకులముక్తమానస। దంభకులంజొరఁగనీక తఱిమిరధీశా* (క॥ వారింపనదమకంబున। వారించుకనిలువలేక వడిఁదిట్టిరిదా।వారికులనసురయోనిన।వారితు వై పుట్టుఁడనుచు వసుధాధీశా* (వ॥ మఱియు నాపిన్నపెద్దలు వారలం జూచి మీరలీయెడనుండనర్హులు గారు నారాయణచరణమూలంబు విడిచి రజస్తమోగుణులైన రాక్షసయోనిం బుట్టుండని శపియించిన నాశాపవశంబునఁ బదభ్రష్టులై కూలుచు మొఱలిడిన నమ్మహాత్ములు దయాళువులై క్రమ్మఱ నంగీకరించి మూఁడుజన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెడునని నిర్దేశించిచని రివ్విధంబున శాపహతులై హరిపార్శ్వచరులైన పురుషులిరువురు హిరణ్యకశిపుహిరణ్యాక్షులనఁ దితికి జన్మించి రందుఁ గనిష్ఠుండయిన హిరణ్యాక్షుని హరి వరాహరూపంబున సంహరించె నగ్రజుండయిన హిరణ్యకశిపుండును నరసింహమూర్తియైన శ్రీహరిచేత విదళితుండయ్యె నతనికొడుకు ప్రహ్లాదుండు తండ్రిచేత హింసితుండయ్యును నారాయణపరాయణుండై శాశ్వతుండయ్యె రెండవభవంబునఁ గైకేశియను రాక్షసికి రావణకుంభకర్ణులయి సంభవించిన విశ్వంభరుండు రఘుకులంబున రాఘవుండై యవతరించి వధించెఁ దృతీయజన్మంబున మీతల్లి చెలియలికి శిశుపాలదంతవక్త్రులయి యుద్భవించి* (శా॥ వక్రంబింతయు లేకపాయని మహావైరంబుతో నిత్యజా।తక్రోధస్మరణంబులన్విదళితోద్యత్పాపసంఘాతులై। చక్రచ్ఛిన్నశిరస్కులై మునివచశ్శాపావధిప్రాపులై। చక్రింజెందిరి వారె పార్శ్వచరులై సారూప్యభావంబునన్॥ అనిన విని ధర్మనందనుండిట్లనియె* (క॥ బాలుఁ హరిపదచింతా।శీలున్ సగుణాలవాలు శ్రీమన్మేధా।జాలున్ సంతోషింపక।యేలా శిక్షించె రాక్షసేంద్రుండనఘా* (క॥ పరిభూతవ్యథనంబులు।నిరుపమసంసారజలధినిర్మథనంబు।ల్నరకేసరికథనంబులు।పరిరక్షితదేవయక్షఫణిమిథునంబుల్* (వ॥ మునీంద్రా వినుపింపుమనిన నారదుండిట్లనియెఁ గమలోదరుచేత సహోదరుండు హతుండయ్యెనని విని హిరణ్యకశిపుండు రోషశోకదందహ్యమానమానసుండయి ఘూర్ణిల్లుచు నాభీలదావదహనజ్వాలావిశాలంబులయిన విలోకనజాలంబుల గగనంబునం బొగలెగయ నిరీక్షించుచుఁ దటిల్లతాంకురసంకాశధగద్ధగిత దంతసందష్టదశనచ్ఛదుండు నదభ్రభయంకర భ్రుకుటితఫాలభాగుండును నిరంతరశాంతదురంతవైరవేగుండునై మహాప్రభాజ్వాలజటాజాలంబగు శూలంబుఁ గేలనందుకొని సభామంటపంబున నిలువంబడి త్రిమస్తకత్రిలోచనశకునిశంబరశతబాహునముచి హయగ్రీవ పులోమవిప్రజిత్ప్రముఖులైన దైత్యదానవుల నాలోకించి యిట్లనియె* (శా॥ నాకుందమ్ముఁడు మీకునెచ్చెలి రణన్యాయైకదక్షుండు బా। హాకుంఠీకృతదేవయక్షుఁడు హిరణ్యాక్షుండు వానిన్ మహా। సౌకర్యాంగము దాల్చి దానవవధూసౌకర్యములీన్లు గా।వైకుంఠుండు వధించిపోయె నటయీవార్తాస్థితిన్వింటిరే* (చ॥ వనములనుండఁ జొచ్చు మునివర్గములోపల సంచరించుపం। జనన మెఱుంగ రెవ్వరును జాడ యొకింతయు లేదు తన్నుఁ డా। సినమఱిఁ డాయు వెంటఁబడి ద్విక్కఁ జిక్కఁడు వీనినొక్కకీలునమన మెల్ల లోఁబడక లోఁబడఁ బట్టుకొనంగ వచ్చునే* (సీ॥ భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి మున్నీట మునిఁగినమునుఁగుఁగాక। యలయించి పెనఁగు నాయచలసంభ్రమమున కెఱఁగి వెన్నిచ్చిననిచ్చుఁగాక। జగడంబు సైఁపక సౌకర్యకాంక్షియై యిలక్రిందనీఁగిననీఁగుఁగాక। క్రోధించియటుగాక కొంతపౌరుషమున హరింభంగి నడరిననడరుఁగాక।కఠినశూలధారఁ గంఠంబు విదళించి। వానిశోణితమున వాడిమెఱసి। మత్సహోదరునకు మహిఁదర్పణముఁ జేసి।మీఁదవత్తుమీకు మేలుదెత్తు* (క॥ ఖండితమూలద్రుమమున।నెండెడివిటపములభంగి నీతఁడు వడనా।ఖండలముఖ్యులువాడు దురు।ఖండనమున నతఁడు డమకుప్రాణములగుటన్* (సీ॥ పొందుదానవులార భూసురక్షేత్రసంగతమైన భూమికిఁ గములుగట్టి। మఖతపస్స్వాధ్యాయమౌనవ్రతస్థుల వెదకి ఖండింపుఁడు విష్ణుఁడనఁగ। నన్యుఁడొక్కఁడు లేఁడు యజ్ఞంబు వేదంబు నతఁడె భూదేవక్రియాదిమూల।మతఁడె దేవర్షిపిత్రాదిలోకములకు ధర్మాదులకు మహాధారమతఁడె। యేస్థలంబున గోభూసురేంద్రవేద। వర్ణధర్మాశ్రమంబులు వరుసనుండు।నాస్థలంబుల కెల్లమీరరిగి చెఱిచి।దగ్ధములు సేసిరండు మీదర్పమొప్ప* (వ॥ అని యిట్లు నిర్దేశించిన దివిజమర్దను నిర్దేశంబులు శిరంబున ధరియించి రక్కసులు పెక్కండ్రు భూతలంబునకుం జని* (సీ॥ గ్రామపురక్షేత్రఖర్వటఖేటఘోషారామనగరాశ్రమాదికములు।గాలిచి కొలఁకులుగలఁచి ప్రాకారగోపురసేతువుల్ ద్రవ్వి పుణ్యభూజ। చయములు ఖండించి సౌధప్రపాగేహపర్ణశాలాదులు పాడుచేసి। సాధుగోబ్రాహ్మణసంఘంబులకు హింసఁ గావించి వేదమార్గములు చెఱిచి।కుతలమెల్లనిట్లు కోలాహలంబుగా।దైత్యులాచరింపఁ దల్లడిల్లి। నష్టమూర్తులగుచు నాకలోకము మాని।యడవులందుఁ జొచ్చిరమరవరులు* (వ॥ అంత హిరణ్యకశిపుండు దుఃఖితుండై మృతుండయిన సోదరునకు నుదకప్రదానాదికార్యంబులాచరించి యతనిబిడ్డలగు, శకుని, శంబర, కాలనాభ, మహోత్కచ, ప్రముఖులనూరడించి వారలతల్లి శోకమూడ హిరణ్యాక్షుని భా

ర్యలనందఱ రావించిదమతల్లియైనదితినవలోకించియిట్లనియె* (శా॥ నీరాగారనివిష్టపాంథులక్రియన్నిక్కంబు సంసారసం।
చారుల్వత్తురుకూడవిత్తురుసదాసంగంబు లేదొక్కచో । శూరుల్వోయెడిత్రోవఁబోయెనుభవత్పుత్రుండు దల్లీమహా । శూ
రుండాతఁడుతద్వియోగమునకు న్శోకింపనీ కేటికిన్* (సీ॥ సర్వజ్ఞుఁడీశుండు సర్వాత్ముఁడవ్యయుండన లుండు సత్యుఁడనంతుఁ
డాఢ్యుఁ । డాత్మరూపంబునన శ్రాంతమునుదనమాయాప్రవర్తనమహిమవలన । గుణములఁగల్పించి గుణసంగమంబునలింగ
శరీరంబులీలఁదాల్చి । కంపితజలములోఁగదలెడిక్రియఁదోఁచుపాదపంబులభంగిభ్రామ్యమాణ । చక్షువునధరిత్రిచలితయై
కానంగఁబడినభంగివికలభావరహితుఁ డాత్మయుఁడు కంపితాంతరంగంబునఁ గదలినట్లతోఁచుఁగదలఁడతఁడు* (వ॥ అ

—* బాలవేషముదాల్చినయముండు దెలిపెడుసుయజ్ఞోపాఖ్యానము. *—

వ్వ యివ్విధంబునలక్షణవంతుండగుగాని యాత్మవుండు లక్షితుండై కర్మసంస్మరణంబున యోగవియోగంబులనొందించు
సంభవవినాశశోకవివేకావివేకచింతాస్మరణంబులువివిధంబు లీయర్థంబునకుఁబెద్దలు ప్రేతబంధు యమసంవాదంబనునితిహా
సంబునుదాహరింతురువినుండు సెప్పెద - నుశీనరదేశంబునందుసుయజ్ఞుఁడనురాజుగలండతండు శత్రువులచేతయుద్ధంబున
నిహతుండయియున్నయెడ* (సీ॥ చినిగినబహురత్నచిత్రవర్మముతోడ రాలినభూషణరాజితోడ । భీకరబాణనిర్భిన్నవక్ష
ముతోడఁదఱుచుఁగారెడుశోణితంబుతోడఁ గీర్ణమైజారినకేశబంధముతోడరయరోషదంష్ట్రాధరంబుతోడ । నిమిషహీనం
బైననేత్రయుగ్మముతోడభూరజోయుతముఖాంబుజముతోడఁ దునిసిపడినదీర్ఘదోర్దండములతోడ । జీవరహితుఁడగునుశీన
రేంద్రుఁ జుట్టిబంధుజనులుసారదినుండఁగభియ । క్రాంతలగుచునతనికాంతలెల్ల* (శా॥ ప్రస్తాకంపితకేశబంధములతోసం
ఛిన్నహారాళితో । హస్తాబ్జంబులుసాఁచిమోఁదికొనుచున్హానాథయంచున్బహు । ప్రస్తావోక్తులతోడనేడ్చిరివగన్ బ్రాణేశు
పాదంబుపైనస్తోకస్తనకుంకుమారుణవికీర్ణాస్రంబువర్షించుచున్* (ఉ॥ అనఘానిన్నునుశీనరప్రజలకత్యానందసంధాయిగా
మునునిర్మించినబ్రహ్మనిర్దయతనున్మాలించె నేవీరికిన్దనయశ్రేణికి మాకుదిక్కుగలదేధాత్రీశనీబోటికిన్జను నేపాసిచనంగభా
ర్యజనులన్సన్మిత్రులంబుత్రులన్* (మ॥ జనలోకేశ్వరనిన్నుఁబాసిననిమేషంబుల్మహాబ్దంబులై చనులోకాంతరగామివైన అ
లకీచందంబునన్నీవుపో యొనవెబ్బంగిఁజరింతుమెల్లముగదా యీలోకవృత్తంబు నేఁ డనలజ్వాలలఁజొచ్చివచ్చెదమునీయం
ఘ్రిద్వయంజూడఁగన్* (వ॥ అనియిట్లుగాజభార్యలారాజశవంబుఁడగ్గఱివిలపింపంబ్రొద్దుగ్రుంకెడిసమయంబునవారలవిలా
పంబులవినిబాలకుండై యముండుసనుదెంచి ప్రేతబంధులంజూచియిట్లనియె* (ఉ॥ మచ్చికవీరికెల్లబహుమాత్రముచోద్యము
దేహిపుట్టుచున్జచ్చుచునుండఁజూచెదరుచావకమానెడువారిభంగినీ చచ్చినవారికేడ్చెదరు చావునకొల్లకడాగవచ్చునే మె
చ్చుటఁబుట్టినచ్చటికి నేగుటనైజము ప్రాణికోటికిన్* (క॥ జననీజనకులబాసియు ఘనవృకములబాధపడకఁగడు బిన్నలమై మని
యెదమెవ్వఁడుగర్భంబునమునుఁబోషించెవాఁడెపోషకుఁడడవిన్* (క॥ ఎవ్వఁడుసృజించుఁబ్రాణుల । నెవ్వఁడురక్షించు
ద్రుంచునెవ్వఁడనంతుం డెవ్వఁడు విభుఁడెవ్వఁడువాఁ । డివ్విధమునమనుచుఁజెనుచుహేలారతుఁడై* (గీ॥ ధనమువీథిఁబడి
నదైవవశంబుననుండుఁబోవుమూలనున్ననైన । నడవిరక్షలేనియబలుండువర్ధిల్లు రక్షితుండుమందిరమునఁజచ్చు* (క॥ క
లుగునుమఱిలేకుండును । గలభూతములెల్లఁగాలకర్మవశములై నిలువఁడుప్రకృతింబడ్డుణ । కలితుఁడుగాడాత్మయుఁడగ
మ్యుఁడుదలఁపన్* (సీ॥ పాంచభౌతికమైనభవనంబు దేహంబుపురుషుండుదీనిలోఁబూర్వకర్మ । వశమునఁనొకవేళవర్తించుదీ
పించుదఱిమైననొకవేళదలఁగిపోవుఁ । జెడెనేనిదేహంబుఁజెడుగానిపురుషుండుచెడఁడాతనికినింతచేటులేదు । పురుషుని
కినిదేహపుంజంబునకు వేఱుఁగానియేకత్వంబుగానరాదు । దారువులవెలుంగుదహనునికైవడి గాయములజరించు గాలిభం
గి । నాకలీనమైననభముచాడ్పునవేఱు దెలియవలయు దేహిదేహములకు అనిమఱియునిట్లనియె॥ (సీ॥ భూపాలకుఁడునిద్రవో
యెడినొందేమివిలపింపనేటికివెఱ్ఱులార యెవ్వఁడుభాషించునెవ్వఁడాకర్ణించునట్టివాఁడెన్నఁడోయరిగినాఁడు । ప్రాణభూ
తుండైనపవనుఁడాకర్ణించుభాషింపనేరఁడుప్రాణిదేహములకువేఱైతానుముఖ్యుఁడై యింద్రియవంతుఁడై జీవుండువల
సుమెఱయఁ । బ్రాభవమునభూతపంచకేంద్రియమనో । లింగదేహములనులీలఁగూడి । విడుచునన్యుఁడొకఁడువిభుఁడుదీనికి
మీరుపొగలనేలవగలబొరలనేల* (క॥ ఎందాకనాత్మదేహము । నొందెడునందాఁకకర్మయోగములట్టపైఁ । జెందవుమా
యామోగ్యస్యందితులై రిత్తజాలిఁబడనేమిటికిన్* (మ॥ చెలులుండల్లులుదండ్రులాత్మజులుసంసేవ్యుల్సఖుల్బాంధవుని । మఱల
గేహంబులటంచుగూర్తురుమహామాయాగుణభ్రాంతులై । కలలోఁదోఁచినయర్థముల్నిజములేకన్మానబంధంబులుం గలుగు
స్సంగములేకమానువిసపన్నస్మాంతకాలంబునన్* (వ॥ మఱియుమాయాగుణప్రపంచంబునెఱింగెడి తత్వజ్ఞులునిత్యానిత్యం
బులఁగూర్చిసుఖదుఃఖంబులంజెందరజ్ఞులుగొందఱు యోగవియోగంబులను సుఖదుఃఖంబులనొందుదురు తొల్లియొక్కమ
హాగహనంబునవిహగంబులగునంతకభూతుండైన యొకకలఁడతండు ప్రభాతంబుననొక్కనాఁడులేచి వాటంబైన వేఁట

తమకంబున.* (క॥ వలలురులు జిగురుగండెలుఁ। జలిదియుఁ జిక్కంబు ధనువు శరములు గొనుచుం। బులుఁగులఁ బట్టెడు వేడుక। నలు
కుడు వెడలం గఁ గదలి యడవికి నడచెన్॥ ఇట్లడవికిం జని తత్ప్రదేశంబున.* (క॥ కట్టలుకఁ దడుక చాటునఁ। బిట్టలను తీగోలఁ ది
గిచి బిఱుసున రెక్కల్పట్టి విఱిచి దిక్కములోఁ। బెట్టుచు విహరించె లోకభీకరలీలన్.* (వ॥ ఇట్లు యిటు నానావిధంబుల గుశకుంతం
బులనంతంబు నొందించుచు సకలపక్షిసంహారసంరబ్ధకరుండైన లుబ్ధకుండు దనముందటఁ గాలచోదితంబై సంచరించుచున్న కు
ళింగపక్షిమిథునంబు గనుంగొని యందు కుళింగను బొందిగించి యొక్కదిక్కంబులోవైచి దానిం జూచి దుఃఖించి కుళింగపక్షి యిట్లని
యె.* (చ॥ అడవుల మేఁత మేసి మనమన్యుల కెన్నఁడు నెగ్గు సేయక। క్కడ విహరింప నేడకటకట్టడి బ్రహ్మ కిరాతు చేతిలోఁ బడ
మనిర్వాసె నేను దుటపాపపుదైవము కంటికింత నేఁ। కుక్కడుఁ బరువవయ్యె నే బ్రతుకుకోమలి యేమనవే ర్తుఁజెల్లరే.* (క॥ ఒకమాటు
మనలనందఱ బ్రకటించి కిరాతు వలలఁ బడఁ జేయక నని। న్నొక్కటి నన్నులఁ బడఁ జేసెన్ వికటీకృతదత్తమైన విధి నేమందున్.* (ఉ॥ తె
క్కలు బాపుపిల్లలకు రేపటి నుండియు మేఁతగాన మిం। బొక్కచు గూఁటిలో నెగసి పోవగ నేరవు మున్ను దల్లి యే। దిక్కున
నుండి వచ్చునని త్రిప్పని చూపులనిక్కి నిక్కి న। ల్దిక్కల జూచుచున్నవతి దీనత నెట్లు భరింతునక్కటా॥ అని యివ్విధంబున.*
(క॥ కుంఠిత నాదముతోడను కంఠము శోషింపవగచు ఖగము నుపాననో। త్కంఠుండై నకిరాతుఁడు కుంఠితగతి నేసె నొక్క కో
లం గూలన్.* (క॥ కాలము వచ్చిన శబరుఁ కోలం దరగూలె ఖగము ఘోషముతోడన్। గాలము డాసిన నేలం। గూలక పోవశమె మెయి
ట్టిగుణవంతులకున్.* (ఉ॥ కావున మీరు చచ్చుతతిఁగానరు చచ్చి ధరిత్రిఁబద్ధ్రథా। త్రీవరు దేహముం గదిసి దీనత నేడువ నేల పొం
దుదిం। తావతులారవత్సరశతంబున కైనని జేరు చక్కిం। బోపుట దుర్లభంబు చ్యుతి బొందిన వారలు సేరవత్తురే.* (వ॥ అని యి
ట్లు కపట బాలకుండై క్రీడించుచున్న యముని యుపలాలనాలాపంబులు విని సుయజ్ఞుని బంధువులెల్ల వెఱఁగుపడి సర్వప్రపంచం
బు నిత్యంబు గాగాద వితలం దిశోకంబు మాని సుయజ్ఞునికి సాంపరాయిక కృత్యంబులు సేసి చనిరంత నంతకుండంతర్హితుండయ్యె నని
చెప్పి హిరణ్యకశిపుండు దన తల్లి నిఁ దమ్ముని భార్యలం జూచి యిట్లనియె.* (క॥ పరులెవ్వరు దా మెవ్వరు। పరికింపఁగ నేకమగుట భా
వింపరు తప్పరమజ్ఞానము లేమిని। బరులును నేమనుచుఁ దోఁచు ప్రాణుల కెల్లన్.* (వ॥ అని తెలియం బలికిన హిరణ్యకశిపుని వచ
నంబులు విని దితి కోడండ్రును దానును శోకంబు మాని తత్త్వవిలోకనంబు గలిగి లోకాంతరగతుండైన కొడుకునకు వగవక చని యె
నని చెప్పి నారదుండు ధర్మనందనున కిట్లనియె.* (క॥ అజరామరభావంబును। ద్రిజగద్రాజ్యంబు నప్రతిద్వంద్వము దోః। ర్విజితాఖి
లశాత్రవమును గజరిపుబలమును హిరణ్యకశిపుఁడు గోరెన్.* (వ॥ ఇట్లు గోరి మందరాచలద్రోణికిం జని యందుఁ గాలి పెను
వ్రేల నేల నిలువంబడి యూర్ధ్వబాహుండై మిన్నుఁ జూచుచు వాడిమయూఖంబులతోడి ప్రళయకాలభానుండునుం బోలె దీ
ర్ఘజటాచారుణప్రభాజాలంబులతోడ నెవ్వరికిం దేరిచూడ రాక పరమదారుణంబైన తపంబు సేయుచుండె నిర్జరులు నిజస్థానంబు
నను డిరంత.* (మ॥ అదరెం గుంభిని సాద్రిదిఙ్మైకలఁగె నేడంభోనిధుల్ తారక। ల్పెదరెన్ సగ్రహసంఘులై దిశలు విచ్ఛిన్నాంతలై
మండెఁ బెల్లదరెన్ నుండెలు జంతుసంతతికి నుగ్రాచార్యుడై త్యేంద్రమూ। ర్ధన్ది శోద్ధూతసధూమహేతిపటలో దంచత్తపో వ
హ్ని చేన్.* (వ॥ ఇట్లు మూడులోకము సంతాపకరంబైన దైత్యరాజ తపోదహనవిజృంభణంబు సైరింపక నిలింపులు నాకంబు విడిచి బ్ర
హ్మలోకంబునకుం జని లోకేశ్వరుండైన బ్రహ్మకు నతులై యిట్లని విన్నవించిరి.* (క॥ దితికొడుకు తపము వేడిమి। నతితప్తుల మై
తిమి యింక నలజడి నమరావతి నుండ వెఱతుము య్యది। గతి మాకిట దేవదేవ కారుణ్యనిధీ.* (మ॥ శంకాలేశము లేదు దేవ త్రిజగత్సం
హారము ద్దేవతా। సంకోచంబును వేదశాస్త్రపరవీసంక్షేపముం జాలనే। వంకన్ జేతునటంచు దుస్సహతపోవ్యాపృత్తి చిత్తం
బులో। సంకల్పించె నిశాచరుండు ప్రతిసంస్కారంబుఁ జింతింపవే.* (శా॥ నీ వేరీతిఁ దపోబలంబున జగన్నిర్మాణముం జేసియా।
దేవాధీశులకం టెనెక్కుడు సిరిం దీపించితి బ్బంగిఁ దా। నీ విశ్వంబు తపస్సమాధిమహిమన్ హింసించి వేఱొక్కవి। శ్వావిర్భా
వకరత్వశక్తి మదిలో నర్థించెనాఁడీశ్వరా.* (వ॥ అదియునుం గాక కాలాత్మలగు జీవాత్మలకనిత్యత్వంబు గలుగుటం జేసి తపో
యోగసమాధిబలంబున నందనకు నిత్యత్వంబు సంపాదింతునని తలంచి నాఁడని మఱియు నిట్లనియె.* (మ॥ భవదీయంబగు నున్నతో
న్నతమహాబ్రహ్మైకపీఠంబు సం। స్తవనీయంబగు భూతియు న్విభవమున్ సౌఖ్యంబు సంతోషము। న్భువనశ్రేణికి నిచ్చెదైత్యుని

—* బ్రహ్మదేవుండు హిరణ్యకశిపునకు వరమిచ్చుట. *—

తపస్ఫూర్తిన్నివారింది యో। భువనాధీశ్వర కావవే భువనముల్ పూర్ణప్రసాదంబునన్.* (వ॥ అని దేవతలు విన్నవించిన నవ్వియం
భూతుండును భగవంతుండునైన నలుమొగంబుల వేల్పుల ప్రోడ భృగుదక్షాదులతోడ మందర పర్వతంబునకు వచ్చి యందు నియ
మయుక్తుండును బిపీలికావృత మేదోమాంసచర్మరక్తుండును వల్మీకతృణవేణుపటల పరిచ్ఛన్నుండును మహాతపఃప్రభావసం
పన్నుండునై నీరంధ్ర నిబిడ నీరదనికరనివిష్ట నీరజబంధుండునుం బోలె నివసించి యున్న నిర్జరారాతిం జూచి వెఱఁగుపడి నగుచు ని

ట్లనియె* (మత్తకోకిల॥ ఓసురారికులేంద్ర నీక్రియ నుగ్రమైన తపంబు మున్ । జేసి చూపినవారు లేరిక జేయువారును లేరు నే। నీ
సమాధికి మెచ్చితిన్ వినుమీ యభీష్టములిత్తు నా। యాసమేటికి లెమ్ము వేగ మహాత్మ కోరుము కోరికల్* (శా॥ దంశవ్రాతములు
న్పిపీలికలు మేదస్సుక్రవ్యరక్తంబుల। న్వంశీర్ణంబులు సేసి పట్టితిన గాశల్యావశిష్టుండవై । వంశచ్ఛన్నతృణావళీయుత మహావల్మీ
కమందింద్రియ । భ్రంశంబింతయు లేక నీవు నిలువం బ్రాణంబు లెట్లుండెనో* (ఉ॥ ఉత్సుకతన్ జలాన్నములనొల్లక నీక్రియ నూ
ఱుదివ్యసం। వత్సరముల్ శరీరమున వాయువులున్నిలుపంగ వచ్చునే । యుత్సవమయ్యె నాకు మము నుగ్రతపంబునఁ గెల్చితీవు నే।
వత్సలతన్ననుం గదియవచ్చితిఁ గోరికలెల్ల నిచ్చెదన్* (వ॥ అని వలికి వనముష్టి కాపిపీలికాభక్షితుండై నగడ్కోపభుని దేహంబు
మీఁదం గమండలు జలంబులు ప్రోక్షించిన నద్దానవేంద్రుండు కమలాసనకరకమల కమనీయకనకమయదివ్యామోఘకమండ
లునిర్గతనిర్మలనీరధారాబిందుసందోహసంసిక్తసకలాంగుండై తపంబు చాలించి సాంద్రకీచకసంఘాతసంఛాదితవామలూ
రుమధ్యంబు వెలువడి మహాప్రభావబలసౌందర్యతారుణ్యసహితుండును వజ్రసంకాశదేహుండును దప్తసువర్ణవర్ణుండును నీ
రసేంధననికరనిర్గతవహ్నియునుంబోలె వెలుంగుచుఁ జనుదెంచి* (మ॥ దివిజానీకవిరోధి మ్రొక్కెఁ గని వాగ్దేవీమనోనేతకు। న్స
విశేషోత్సవసంవిధాతకు నసత్సంత్రాతకున్ సత్త్వపో। షవహాభీష్టవరప్రదాతకు జగన్నిర్మాతకున్ ధాతకు । న్వివిధప్రాణిలలాట
లేఖనమహావిద్యానుసంధాతకున్* (వ॥ ఇట్లు దైత్యేశ్వరుండు దివినున్న హంసవాహనునకు ధరణితలంబున దండప్రణామం
బులాచరించి సంతోషబాష్పసలిలసంవర్ధితపులకాంకురుండై యంజలిఁ జేసి కంజగర్భుని మీఁదఁ దృష్టి యిడి గద్గదస్వరంబున నిట్ల
ని స్తుతియించె* (సీ॥ కల్పాంతమున నంధకారసంభృతమైన జగము నెవ్వఁడు దన సంప్రకాశ।మున వెలిఁగించు మూఁడు భం
గుల రజస్సత్త్వతమోగుణ సహితుఁడగుచుఁ । గల్పించు రక్షించుఁ గడపటఁ బ్రహరించు నెవ్వఁ డాఢ్యుఁడు సర్వహేతు వగు
చు । శోభితుండై స్వయంజ్యోతియై యొకటి విలసిల్లు నెవ్వఁడు విభుత మెఱసి । సమయుమయునవమాన సప్రాణబుద్ధీంద్రి।
యములతోడ నెవ్వఁ డలఘుమహిమ । నడరునట్టి సచ్చిదానందమయునకు । మహితభక్తి నే నమస్కరింతు* (వ॥ దేవా నీవు
ముఖ్యప్రాణంబగుటం జేసి ప్రజాపతివి మనోబుద్ధిచిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు మహాభూతగణంబులకు నాధారభూ
తుండవు త్రయీతనువున నంగ్రతువులు విస్తరింతువు సకలవిద్యలు నీతనువులు సర్వార్థసాధకులకు సాధనీయుండవు నీవ యాత్మని
ష్ఠాగరిష్ఠులకు ధ్యేయంబగు నాత్మకాలమయుండవై జనులకు నాయుర్నాశంబుఁ జేయుదువు జ్ఞానవిజ్ఞానమూర్తివి వాద్యంతరహి
తుండవు అంతరాత్మవు మూఁడు మూర్తులకు మూలంబగు పరమాత్మవు జీవలోకంబునకు జీవాత్మవు నీవ సర్వంబును నీవ నీవు గాని ది
లేశంబు లేదు వ్యక్తుండవు గాక పరమాత్మవై పురాణపురుషుండవై యనంతుండవైన నీవు ప్రాణేంద్రియమనోబుద్ధిగుణంబు
ల నంగీకరించి పరమేష్ఠిపదప్రవేశంబున నిలిచి స్థూలశరీరంబునం జేసి యింతయుం బ్రపంచింతువు భగవంతుండవైన నీకు మ్రొక్కె
దనఁ బఱియ నట్లనియె* (క॥ కోరినవారల కోర్కులు । నేరుపుతో నిచ్చు నుపనిక్రియ నన్యుల్ నేరరు కరుణాకర నేఁ । గోరె
ద నీవిచ్చెదేఁ గోరికల భవా* (శా॥ గాలిం గుంభిని నగ్నినంబువుల నాకాశస్థలిన్ దిక్కుల। న్రేలం ఘస్రములందమర్త్యప్రబలభూరి
గ్రాహారణ్యమృగ। వ్యాళాదిత్యనరాదిజంతుకలహవ్యాప్తిన్ సమస్తాస్త్రశ। స్త్రాళిన్ మృత్యువు లేని జీవనము లోకాధీశ యిప్పిం
పవే* (వ॥ మఱియు రణంబులం దెదురు లేని శౌర్యంబును లోకపాలుర నతిక్రమించు మహిమయును భువనత్రయజయంబు
ను హిరణ్యకశిపుండు గోరిన నతని తపంబునకు సంతోషించి దుర్లభంబులయిన వరంబులన్నియు నిచ్చి కరుణించి విరించి యిట్లనియె*
(శా॥ అన్నా కశ్యపపుత్ర దుర్లభములీయర్థంబు లెవ్వారికి। న్నెన్నెవ్వారలు గోరరీ వరములన్ మోదించితి నీయెడ। న్నన్నుం గోరిన
వెల్ల నిచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధిసం। పన్నత్వంబున నుండుమీ సుమతివై భద్రైకశీలుండవై* (వ॥ అని యిట్లమోఘంబులగు
నవరంబులిచ్చి దితినందనుచేతం బూజితుండై యరవిందసంభవుండు బృందారకసందోహవంద్యమానుండగుచు నిజమందిరంబు
నకుం జనియె నవ్విధంబున నిలింపారాతి వరపరంపరలు సంపాదించుకొని* (క॥ సోదరు జంపిన పగకై। యాదరమించుకయు లేక
యసురేంద్రుఁడు కం। జోదరుపై వైరము దు। ర్మాదరతుండగుచుఁ జేసె మనుజాధీశా* (సీ॥ ఒకనాఁడు గంధర్వయూథంబు పరిమా
ర్చు దివిజుల నొకనాఁడు దెరలఁదోలు । భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు గ్రహముల నొకనాఁడు గట్టివైచు। నొకనాఁడు
యక్షుల నుగ్రత దండించు నొకనాఁడు విహగుల నొడిసిపట్టు । నొకనాఁడు సిద్ధుల నోడించి బంధించు మనుజుల నొకనాఁడు మద
మడంచుఁ । గడిమి నొకనాఁడు కిన్నరఖచరసాధ్య । చారణప్రేతభూతపిశాచవన్య । సత్త్వవిద్యాధరాదుల సంహరించు । దితి
తనూజుండు దుస్సహతేజుఁడగుచు* (క॥ అట్టళ్లతోడఁ గోటలఁ। గట్టలు కంగూలఁ ద్రోచి క్రవ్యాదులతోఁ । జుట్టు విడిసి దివ్యా
లయపట్టణములు గొని యెనతఁడు బలమున నధిపా* (క॥ కృశలై సంప్రాపితదుర్దశలై సర్వంకషోగ్రదైతేయాజ్ఞావశలై నిశలు
నుదివములు దిశలెల్లను గట్టువడియె దీనత ననఘా* (వ॥ మఱియు నద్దానవేంద్రుండు విద్రుమసోపానంబులును, మరకతమణి
మయప్రదేశంబులును, వైడూర్యరత్నస్తంభసముదయంబులును, జంద్రకాంతసన్నిభస్ఫటికసంఘటితకుడ్యంబులును బద్మరాగ

పీఠకనకకవాటగేహళీవిటంకవాతాయనంబులును, విలంబమానముక్తాఫలదామవితానశోభితధవళపర్యంకంబులును, వివిధవిచిత్రవిమానంబులును, నిరంతరసురభికుసుమఫలభరిత పాదపమహోద్యానంబులును, హేమారవిందసౌగంధికబంధురసరోవరంబులును, రమణీయరత్నప్రాసాదవిశేషంబులును, మనోహరపరిమళశీతలమందమారుతంబులును మృదుమధురనినదకీరకోకిలనుల కోలాహలంబులును గలిగి విశ్వకర్మనిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీశోభితంబైన మహేంద్రభవనంబుఁ జొచ్చి* (మ॥ దితిపుత్త్రుండు జగత్త్రయైకవిభుఁడై దేవేంద్రసింహాసనో। ద్ధతుఁడై యుండ హరామ్యతాంబుజభవుల్ దప్పంగ భీతిన్సమాగతులై తక్కనయక్షకిన్నరమరుద్గంధర్వసిద్ధాదులా। నతులై కానుక లిచ్చి కొల్తురతని న్నానాప్రకారంబులన్* (శా॥ ఏదిక్పాలురఁ జూచి నేఁడలుగునో యే దేవుఁ బంధించునో। యేదిగ్భాగము మీఁద దాడిచనునో యే ప్రాణులం జంపునో। యీ దైత్యేశ్వరుఁ డంచు నొండొరులు దారింద్రాదు లాస్థానభూవేదిన్ మెల్లనె నిక్కి చూతురు భయావిర్భూతరోమాంచులై* (సీ॥ కోలాహలము మాని కొలువుఁడీ సురలార తలఁగి దీవింపుఁడు తపసులార। ఫణులె త్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార ప్రణతులై సనుఁడు దిక్పాలురార। గానంబు సేయుఁడు గంధర్వవరులార సంకడించబడకుఁడీ సాధ్యులార। యాడుఁడు నృత్యంబు లప్సరోజనులార వేరిక ప్రమొక్కుఁడు సిద్ధులార। శుద్ధకర్పూరవాసితసురభిమధుర। భవ్యమాతంగమైరేయపానజనిత। సుఖవిలీనతనమరారిసొక్కి నాఁడు। శాంతి లేదంత్రుఁ డివ్వలు చారులధిప* (శా॥ లీలోద్యానలతానివాసములలో లీలావతీయుక్తుఁడై। హాలాపానవివర్ధమానమదలోలాన్యత్తతామ్రాక్షుఁడై। కేళిం దేలఁగ నేను దుంబురుఁడు సంగీతప్రసంగంబులన్। వ్వాలాయంబుగఁ బంగఁ జేయుదుము దేవద్వేషి సుర్వీశ్వరా* (క॥ యాగములు బుధులు ధరణీ। భాగములం జేయుచుండఁ బఱతెంచి హవి। ర్భాగములఁ దానకై కొనుఁ। జాగింపఁడు దైత్యుఁడమరసంఘంబునకున్* (సీ॥ సకలమహాద్వీపసహితవిశ్వంభరాస్థలి నిదున్నకషంఁకుసస్యచయము। కామధేన్వాదులకరణి నర్థులుగోరు కోర్కులు గగనంబు గురియుచుండు। వననిధులేడు ను వాహినీసంధోహములును వీచులరత్నములు వహించు। నుర్విరుహంబులు నొక్క కాలంబుననఖిలఋతుగుణముల నతిశయిల్లు। నంబుసంపూరితద్రోణులగుచు నొప్పు బర్వతంబులు సర్వదిక్పాలవిభవ। గుణము లెల్లను దానెకై కొనుచు దైత్య। విభుఁడు త్రైలోక్యరాజ్యసంవృద్ధి గాంచి* (వ॥ ఇట్లు సకలదిక్కులు నిర్జించి లోకైకనాయకుండై తనయిచ్ఛాప్రకారంబున నింద్రియసుఖంబులననుభవించుచుండ నియక శాస్త్రమార్గంబు నతిక్రమించి విరించివరజనితదుర్వారగర్వాతిరేకంబున సుపర్వారాతి యైశ్వర్యవంతుండై పెద్దకాలంబు రాజ్యంబు సేయునెడ* (ఉ॥ ఎన్నఁడు మా కడిక్కు గలదెన్నఁడు దైత్యునిబాధ మానుమే। మెన్నఁడు వృద్ధిఁ బొందఁగలమెవ్వఁడు రక్షకుఁడంచు దేవతా। కిన్నరసిద్ధసాధ్యమునిఖేచరనాయకు లాశ్రయించిరా। పన్నగతల్పు భూరిభవబంధవిమోచనుఁ బద్మలోచనున్* (వ॥ ఇట్లు దానవేంద్రుని యుగ్రదండంబునకు వెఱచి యనన్యశరణ్యులై రహస్యంబున నందఱుం గూడికొని* (ఉ॥ ఎక్కడ నున్నవాఁడు జగదీశ్వరుఁ డాత్మమయుండు మాధవుం। డెక్కడికేగి శాంతులు మునీశులు భిక్షులు రారు క్రమ్మఱం। డెక్కులు నెల్లనెక్కడఁ దుదిం జొరదిక్కు గునట్టి దిక్కుకై। ప్రమొక్కెదమే మహాస్తయుగముల్ముకుళించి దదీయ దిక్కునన్* (వ॥ అని వాఙ్మయనా హారసద్రలు మాని చిత్తంబులు పరాయత్తంబులుగానీక సమాహితబుద్ధులై భగవంతుండును మహాపురుషుండును, మహాత్ముండును, విశుద్ధజ్ఞానానందమయుండును నైన హృషీకేశునకు నమస్కరించుచున్న యెడ మేఘరవసమానగంభీరనినదంబున దిశలు ప్రమోయించుచు, సాధులకు నభయంబు గావించుచు, దృశ్యమానుండును గాక పరమేశ్వరుండై న హరి యిట్లనియె* (మ॥ భయముం జెందకుఁ డయ్య నిర్జరవరుల్ భద్రంబు మీకయ్యెడు। న్జయము న్లాభము భూతసంతతికి మత్సందర్శనప్రాప్తిన। వ్యయమై చేరు నెఱుంగుదున్ దితిసుతవ్యాపారభాషావిప। ర్యయముం గాలముఁ గూడఁ జంపెదఁ జనుండ దాఁక మీ త్రోవలన్* (గీ॥ శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు। గోవులందు విప్రకోటియందు। ధర్మపదవియందుఁ దగిలి నాయందు వాఁ। డెన్నఁడలుగు నాఁడె హింసఁజెందు* (క॥ కన్నకొడుకు ప్రశమదము సం। పన్నుఁడు నిర్వైరుఁ డనక ప్రహ్లాదుని వాఁ। డెన్నఁడు రోషంబున నా। పన్నతఁ బొందించు నాఁడె పట్టి వధింతున్* (శా॥ వేధోదత్తవరప్రసాదగరిమన్వీఁ డెంతవాఁడై మిము। న్బాధం జేయుచునున్నవాఁడు నదివ్యాభిఁ ఉంతు భావించి నే। సాధింపం దఱి గాదు కావునఁ గడున్ సైరించితి న్మీఁదట। న్సాధింతున్ సురలార నేఁడు సనుఁ డాశంకింపమీ కేటికిన్* (వ॥ అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన నలింపులు గుంపులు గొని ప్రమొక్కి రక్కసుండు ప్రస్తుటనిక్కం బని తమతమ దిక్కులం జనిరి హిరణ్యకశిపునకు విచిత్రచరిత్రులు నలువురు పుత్రులుద్భవించిరందు* (సీ॥ తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహి

✲✲* ప్రహ్లాదచరిత్రప్రారంభము. *✲✲

తత్వంబునఁ జూచుచు వాఁడు। పెద్దలఁ బొడఁగన్న భృత్యునికై వడిఁ జేరి నమస్కృతుల్ సేయువాఁడు। కన్నుదోయికి నన్యకాంతలడ్డంబై న మాతృభావముఁ జేసి మెలఁగువాఁడు। దల్లి దండ్రుల భంగి ధర్మవత్సలతను దీనులఁ గావఁ జింతించువాఁడు। సఖులయెడ సోదరస్థితి జనుపువాఁడు। దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు। లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁడనియ॥ మఱియును* (సీ॥ ఆకా

రజన్మవిద్యార్థవరిష్ఠుఁడై గర్వసంస్తంభసంగతుఁడుగాఁడు । వివిధమహానేకవిషయసంపన్నుఁడై పంచేంద్రియములచేఁ బట్టువ
డఁడు। భవ్యవయోబలప్రాభవోపేతుఁడై కామరోషాదులఁ గ్రంమకొనఁడు। కామినీప్రముఖభోగము లెన్ని గలిగిన వ్యసనసం
సక్తిని వంకఁబోఁడు। విశ్వమునందుఁ గన్నవిన్న యర్థములందు। వస్తుదృష్టిఁ జేసి వాంఛసేఁడు। ధరణీనాథ దైత్యతనయుండు హరిప
రాయత్తుఁడై హతాన్యతంత్రుఁడగుచు* (గీ॥ సద్గుణంబు లెల్ల సంఘంబులై వచ్చి। యసురరాజతనయునందు నిలిచి। వాసిచన
వు విష్ణుఁ బాయని విధమున। నెప్పుడుఁ దగిలి యుండు నిర్మలాత్మ* (మ॥ పగవారైన సురేంద్రులు సభలలోఁ బ్రహ్లాదసంకాశులన్
గుణోపేతుల నెందు మేమెఱుఁగ మంచున్ వృత్తబంధంబులం। బొగడంజొత్తురు సత్కవీంద్రులక్రియన్ భూనాథ మీబోటి సద్భ
గవద్భక్తులు దైత్యరాజతనయుం బాటించి కీర్తింప రే* (క॥ గుణనిధియగు ప్రహ్లాదుని। గుణముల నేకముఖులుగలవు గురుకాలమున।
గ్గణుతింపన శక్యంబులు। ఫణికిం బృహస్పతికిని భాషాపతికిన్* (వ॥ ఇట్లు సద్గుణగరిష్ఠుండైన ప్రహ్లాదుండు భగవంతుండైన వాసుదే
వునియందు సహజసంవర్ధమాననిరంతరధ్యానరతుండై* (సీ॥ శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరిన యట్లైనఁ జెలికాండ్ర నెవ్వరిఁ జేరమఱ
చు। నసురారితన మ్రోలనాడిన యట్లైన। నసురబాలురతోడ నాడమఱచు। భక్తవత్సలుఁడు సంభాషించిన ట్లైనఁ బరభాషలను మా
ఱు బలుకవెఱచు। సురవంద్యుఁ దనలోనఁ జూచిన యట్లైనఁ జొక్కి సమస్తంబుఁ జూడమఱచు। హరిపదాంభోజయుగచింతనామృ
తమున నంతరంగంబు నిండిన ట్లైన నతఁడు। నిత్యపరిపూర్ణుడగుచు నన్నియును మఱచి। జడతలేక యుండును జడునిభంగి* (శా॥
పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ। లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత। శ్రీనారా
యణపాదపద్మయుగళీచింతామృతాస్వాదసం। ధానుండై మఱచున్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా* (సీ॥ వైకుంఠచిం
తావివర్జితచేష్టుఁడై యొకచోట నేడుచు నొక్కచోట। నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై యుద్ధతుఁడై పాడు నొక్కచోట। విష్
ణుఁ డింతియె కాని వేఱొండు లేదని యొత్తిలి నగుచుండు నొక్కచోట। నలినాక్షుఁ డను నిధానముఁ గంటి నేనని యుబ్బి గంతులు వై
చు నొక్కచోటఁ। బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ। బ్రణయహర్షజనితబాష్పసలిల। మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై।
యొక్కచోట నుచు నూరకుండు* (వ॥ ఇట్లు పూర్వజన్మపరమభాగవతసంసర్గసమాగతంబైన ముకుందచరణారవిందసేవా
తిరేకంబున నఖర్వనిర్వాణభావంబు విస్తరించుచు నప్పటప్పటికి దుర్జనసంసర్గనిమిత్తంబున దనచిత్తంబన్యాయత్తంబుగా నీక
నిజాయత్తంబు సేయుచు నప్రమత్తుండును, సంసారనివృత్తుండును, బుధజనవిధేయుండును, మహాభాగధేయుండును, సుగుణ
మణిగణగరిష్ఠుండును, బరమభాగవతశ్రేష్ఠుండును, గర్మబంధలతాలవిత్రుండును, బవిత్రుండును నైన పుత్రుని యందు విరోధిం
చి సురవిరోధి యనుకంప లేక చంపం బంపెనని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె* (శా॥ పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పో
షింతు రెల్లప్పుడు। మిత్రత్వంబున బుద్ధిఁ జెప్పుదురితో మేమంబు వారింతురే। శత్రుత్వంబుఁ దలంప రిట్టియెడ నా సౌజన్యరత్నాక
రుం। బుత్రున్ లోకపవిత్రుఁ దండ్రి మిగులన్ బాధింప నెట్లోర్చెనో* (ఉ॥ బాలుఁ బ్రభావిశాలు హరిపాదపయోరుహచింతనక్రి
యాలోలుఁ గృపాళు సాధుగురులోకపదానతఫాలు నిర్మల। శ్రీలు సమస్తసభ్యనుతశీలు విఖండితమోహవల్లికా। జాలు నదేల
తండ్రి వడిఁ జంపఁగఁ బంపె మునీంద్ర సెప్పవే॥ అనిన నారదుం డిట్లనియె* (శా॥ లభ్యంబైన సురాధిరాజపదమున్ లక్షింపఁ డశ్రాం
తము। సద్భృత్యత్వంబున నున్నవాఁడ బలుఁడై జాడ్యంబుతో వీఁడు వి। ద్యాభ్యాసంబునఁ గానఁ దీవ్రమతిగాఁ డంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్కదినంబు నంబియసుతున్ వీక్షించి సోత్కంఠుఁడై* (క॥ చదువని వాఁడజ్ఞుం డగుఁ। జదివిన సదసద్వివేకచతురత
గలుగుం। జదువఁగవలయును జనులకుఁ। జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ* (వ॥ అని పలికి యసురలోకపురోహితుండ
గు శుక్రాచార్యుకొడుకులఁ బ్రచండవితర్కులైన చండామర్కుల రావించి సత్కరించి యిట్లనియె* (శా॥ అంధప్రక్రియ నున్న
వాఁడు పలుకం డస్మత్ప్రతాపక్రియా। గంధం బించుక లేదు మీరగురువుల్ కారుణ్యచిత్తుల్మనో। బంధుల్మాన్యులు మాకుఁ బెద్దలును
ముం బాటించి యీ బాలకుం। గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం గాఁ జేసి రక్షింపరే* (వ॥ అని పలికి వారలకుం బ్రహ్లాదు నప్పగిం
చి తోడ్కొనిపొండనిన వారును దనుజరాజకుమారుం గొనిపోయి యతనికి సవయస్కులగు సహస్రోతలయిన యసురకుమారు
లం గొండఱం గూర్చి* (ఉ॥ అంచితభక్తితోడ దనుజాధిపగేహసమీపమందు బ్రవే। శించి సురారిరాజసుతుఁ జేకొని శుక్రకుమార
కుల్వరిం। పించిరి పాఠయోగ్యములు పెక్కులు శాస్త్రములా కుమారుఁడా। లించి పఠించె నన్నియుఁ జలింపని వైష్ణవభక్తిపూ
ర్ణుఁడై* (క॥ పరగదివారు సెప్పిన। నాపగిదిం జెప్పుగాని యిట్టట్టనియా। క్షేపింపఁడు తా నన్నియు। రూపించిన మిథ్యలని నిరూఢమ
నీషన్* (శా॥ అంతం గొన్ని దినంబులేగిన సురేంద్రారాతిశంకాన్విత। స్వాంతుండై నిజనందనున్ గురువులేజాడం బఠింపించిరో।
ఖ్యాపింతుం డేమ్మికపరించె నొపిలిచి సంభాషించి విద్యాపరిశ్రాంతిం జూచెదఁ గాక నేఁడని మహాసౌధాంతరాసీనుఁడై* (ఉ॥ మో

దముతోడనై దైత్యకులముఖ్యుఁడు రమ్మని చీరఁబంచె౯ | ప్రహ్లాదకుమారకున్ భవమహార్ణవతారకుఁ గామరోషలోభాదివిరోధివ
ర్గపరిహారకుఁ గేశవచింతనావ్రతా | స్వాదకరోగకుంగలుషజాలమహాగ్రవనీకుఠారకు౯ * (వ॥ ఇట్లు చారులచేత నా
హూయమానుండై ప్రహ్లాదుండు సనుదెంచిన * (శా॥ ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమేయోద్యోగమారూఢసం | విత్సంప
న్నుఁడవై త్రివేదవిదితేవేదంబులున్నాస్త్రము | ల్వత్సరమ్మునఁ జేరఁ జీఁకికొడుకు న్వాత్సల్యసంపూర్ణుఁడై | యుత్సంగాగ్రముఁ
జేర్చి దానవవిభుండుత్కంఠదీపింపఁగ౯ * (క॥ అనుదినసంతోషణములు | జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్ | తనయులసం
భాషణములు | జనకులకుం గర్ణయుగళసద్భూషణముల్ * (వ॥ అనిమతియుఁ బుత్రా నీకెయ్యది భద్రంబైయున్నది చెప్పుమని
నఁ గన్నతండ్రికిఁ బ్రియనందనుండిట్లనియె * (చ॥ ఎల్లశరీరధారులకు నిల్లను చీఁకటినూతిలోపలం | ద్రెళ్లక మీరు నేమనుమతిభ్రం
శణంబున భిన్నులై ప్రవ | ర్తిల్లక సర్వమున్ దనదివ్యకళామయమంచు విష్ణునం | దుల్లముఁ జేర్చి ఘోరడవి నుండుట మేలు నిశా
చరాగ్రణీ * (వ॥ అనికుమారుండాడిన ప్రతిపక్షానురూపంబులైన సల్లాపంబులు విని దానవేంద్రుండు నగుచు నిట్లనియె * (క॥
ఎట్టాడిన నట్టాడుదు రిట్టట్టని పలుక నెఱుఁగరెల్ల శిశువులు నట్టిం దియెవ్వ రేనియుఁ బట్టించిరొ బాలకుని కుఁబరపక్షంబుల్ * (శా॥
నాకుం జూడఁగ జోద్యమయ్యెడుఁగదా నాతండ్రియీబుద్ధిదా | నీకున్ లోపల దోఁచెనో పరులు దుర్నీతుల్ప్రతిం పించిరో | యే కాం
తంబున భార్గవుల్ పలికిరో యీదానవశ్రేణికి | నై కుంఠుండు గృతాపరాధుఁడతని న్వర్ణింప నీకేటికి౯ * (మ॥ సురలం దోలుట
యో సురాధిపతులన్ శిక్షించుటో సిద్ధులం | బరి వేధించుటయో మునిప్రవరుల న్బాధించుటో యక్షకి | న్నరగంధర్వవిహంగ
నాగపతులన్నాశంబునొందించుటో | హరియంచున్ హరియంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా * (వ॥ అనిన దండ్రి మాట
లకుఁ బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుండిట్లనియె మోహనిర్ముక్తులనంబుఁ జేసి యెవ్వనియందుఁ దత్పరులయిన యెఱుకఁగల పురు
షులకుఁ బరులు దార నియెడుమాయాకృతంబయిన యసద్గ్రాహ్యంబగు భేదంబుగానంబడ దట్టి పరమేశ్వరునకు నమస్కరించె
ద * (శా॥ అజ్ఞుల్గాందఱు మేము దాయనుచు మాయం జెందిసర్వాత్మకుం | బ్రజ్ఞాహీనులు మధ్యవర్తులు యక్రమముల న్భాషింపఁగా నే
రరా | జిజ్ఞాసాపథమందు మూఢులుగదా చింతింప బ్రహ్మాదివే | దజ్ఞుల్దాన్పరమాత్మువిష్ణు నితరుల్దర్శింపఁగా నేర్తు రే * (గీ॥ ఇనుమ
యస్కాంతసన్నిధి నెట్లు భ్రాంతమగుచు హృషీకేశుసన్నిధి నావిధమునఁ | గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి | బ్రాహ్మణోత్త
చిత్తంబు భ్రాంతమగుచు * (సీ॥ మందారమకరందమాధుర్యమునఁ దేలుమధుపంబువోవు నేమదనములకు | నిర్మలమందాకి
నీవీచికలదూఁగు రాయంచచను నెతరంగిణులకు | లలితరసాలపల్లవఖాదియై చొక్కు కోయిల సేరునే కుటజములకుఁ | పూర్ణేం
దుచంద్రికాస్ఫురితచకోరక మరుగునే సాంద్రనీహారములకు | నంబుజోదరుదివ్యపాదారవింద | చింతనామృతపానవిశేషమ
త్తచిత్తమేరీతి నితరుల జేర నేర్చు | వినుతగుణశీలమాటలు వేయు నేల * (వ॥ అనిన విని రోషించి రాజసేవకుండై న పురోహితుం
డు ప్రహ్లాదుం జూచి తిరస్కరించి యిట్లనియె * (ఉ॥ పంచశరద్వయస్కుఁడవు బాలుఁడవించుక గాని లేవు భాషించెదమేతరక్క వా
క్యములఁ జెప్పిన శాస్త్రములోని యర్థమొకించుకయైనఁ జెప్పవు మహేంద్రునిముందట మాకు నౌదల | ల్వంచుకొనంగఁ జేసితివి
వైరివిభూషణవంశదూషణా * (చ॥ తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు దైత్యచందనవనమందుఁ గంటకయు
తక్షితిజాతము భంగిఁ బుట్టినాఁడనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతిసేయుచుండు దం | డనమునఁగాని శిక్షలకుఁ డాయఁడు
వట్టుఁడు కొట్టుఁడుద్ధతి౯ * (క॥ నీపాపని జదివింతుము | నీపాదములాన యింక నిపుణతతోడం | గోపింతుము దండింతుము | కోపం
పకుమయ్య దనుజకుంజరపంచా * (వ॥ అనిమరియు నారాచపాపనికి వివిధోపాయంబులం బురోహితుండు వెఱవు జూపుచు రా
జసన్నిధిం బాపి తోడుకొనిపోయి యేకాంతంబున * (క॥ భార్గవనందనుఁడతనికి | మార్గము సెడకుండఁ జెప్పె మారులు నిచ్చ | ల్వర్గ
త్రితయముఁ జెప్పెన నర్గళమగు మతివిశేషమమరనరేంద్రా * (వ॥ మరియు గురుండు శిష్యునకు సామదానభేదదండోపాయం
బులనెఱింగించి నీతకోవిదుండయ్యెనని నిశ్చయించి తల్లికి నెఱింగించి తల్లిచేత నలంకృతుండయిన కులదీపకు నవలోకించి * (ఉ॥
త్రిప్పకుమన్న మామతము దీర్ఘములైన త్రివర్గపాఠము | ల్దప్పకుమన్న నేఁడు మన దైత్యవరేణ్యుని మ్రోల నేమము | ల్జెప్పిన
నీతిఁగాని మఱి సెప్పకుమన్న విరోధిశాస్త్రము | ల్విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్రకథానుజాలముల్ * (వ॥ అని బుజ్జగించి
దానవేశ్వరుని సన్నిధికిం దోడి తెచ్చిన * (సీ॥ ఆదుగడ్డునకు మాధవానుచింతనసుధామాధుర్యమున మేనుమఱచువాని | నంభోజ
గర్భాదులభ్యసింపఁగలేని హరిభక్తిపుంభావమైనవాని | మాతృగర్భమునఁ బొచ్చి మన్నది మొదలుగా చిత్తమచ్యుతుమీఁదఁ జే
ర్చువాని | నంకించితనలోన నఖిలప్రపంచంబు శ్రీవిష్ణుమయమని చెలఁగువాని | వినయకారుణ్యబుద్ధివివేకలక్ష్మ | ణాదిగుణముల
కాటపట్టయినవాని | శిష్యుబుధలోకసంభావ్యుఁ జీటిగురుఁడు | ముందటికిఁ ద్రోచ్చెతండ్రికి మ్రొక్కుమనుచు * (క॥ శిక్షించితిమ
న్యములను | పక్షంబులుమాని నీతిపారగుఁడయ్యె౯ | రక్షోవంశాధీశ్వర వీక్షింపుము నీకుమారు విద్యాబలము౯ * (వ॥ అని పలికిన
శుక్రకుమారకు వచనంబులాకర్ణించి దానవేంద్రునకు దండప్రణామంబుఁ జేసి నిలుచున్న కొడుకును దీవించి బాహుదండ

డంబులు సోఁకఁ దిద్దుచు నండగ్గరించి గాఢాలింగనంబుఁ జేసి తనతొడమీఁదనిడుకొని చుంచుచువ్విచుచుఁ గంబుఁ బుడికి చెక్కిలి ము
ద్దుఁగొని శిరంబు మూర్కొని ప్రేమాతిరేకసంజనితబాష్పబిందుసందోహంబుల నతనివదనారవిందంబుఁ దడుపుచు మందహాసము
రాలాపంబుల నిట్లనియె * (శా॥ చోద్యంబయ్యెడి నింతకాలము రిగెకా శోధించియే మేమిసం । వేద్యాంశంబులు సెప్పిరో గురు
వులే వెంటంబరిఁపించిరో । విద్యాసారమెఱుంగఁ గోరెదభవద్విజ్ఞాతశాస్త్రంబులోఁ । బద్యంబొక్కటిఁ జెప్పి సార్థముగఁ దాత్ప
ర్యంబు భాషింపుమా * (శా॥ నిన్నున్ మెచ్చరు నీతిపారమహిమన్ నీతోడి దైత్యార్భకుల్ । ఉన్నారన్నియుఁ జెప్పనేర్తువు గదా
గ్రంథార్థముల్ దక్షులై । యన్నా యెన్నఁడు నీవు నీతిమతివై యాదంచు నన్ మహావాంఛతో । నున్నాఁడన్ననుఁ గన్నతండ్రి భవదీయోత్కర్ష
తజ్ఞాపవే * (వ॥ అని సంగన్న తండ్రికిఁ బ్రియనందనుండయిన ప్రహ్లాదుం డిట్లనియె * (క॥ చదివించిరి నను గురువులు । చదివితి ధ
ర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ జదివినవి గలవు పెక్కులు । చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ * (మ॥ తనుహృద్భాషల స
ఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా । ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం । బనునీతొమ్మిది భక్తిమా
ర్గముల సర్వాత్ముం హరి నమ్మి స । జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతుఁ సత్యంబు దైత్యోత్తమా * (శా॥ అంధేందూద
యముల్ మహాబధిరశంఖారావముల్ మూకస । ద్గ్రంథాఖ్యానము లన్ పుంసకవధూకాంతల్ కృతఘ్నావళీ । బంధుత్వంబులు భ
స్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస । ద్గంధంబుల్ హరిభక్తివర్జితుల రిక్తవ్యర్థసంసారముల్ * (సీ॥ కమలాక్షునర్చించు
కరములు కరములు । శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ । సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు । శేషశాయికి మ్రొక్కు శి
రము శిరము । విష్ణు నాకర్ణించు వీనులు వీనులు । మధువైరిఁ దవిలిన మనము మనము । భగవంతు వలగొను పదములు పదములు పురు
షోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి । దేవదేవునిఁ జింతించు దినము దినము । చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు । కుంభినీధవుఁ జెప్పె
డి గురుఁడు గురుఁడు । తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి * (సీ॥ కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే పవనగుంఫిత
చర్మభస్త్రి గాక । వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే ఢమఢమ ధ్వనితోడి ఢక్క గాక । హరిపూజనము లేని హస్తంబు
హస్తమే తరుశాఖనిర్మిత దర్వి గాక । కమలేశుఁ జూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాలరంధ్రములు గాక । చక్రి చింత లేని
జన్మంబు జన్మమే । తరలసలిలబుద్బుదంబు గాక । విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే । పాదయుగముతోడి పశువు గాక *
(సీ॥ సంసారజీమూతసంఘంబు విచ్చునే చక్రిదాస్యప్రభంజనము లేక । తాపత్రయాభీలదావాగ్నులాఱునే విష్ణుసేవామృ
తవృష్టి లేక । సర్వంకషాఘౌఘజలరాసు లింకునే హరిమనీషాబడబాగ్ని లేక । ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే పద్మాక్షు
నుతిరవిప్రభలు లేక । నిరుపమాపునరావృత్తినిష్కళంక । ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన । శార్ఙ్గకోదండచింతనాంజన
ము లేక । తామరసగర్భునకు నైన దానవేంద్ర * (వ॥ అనియివ్విధంబున వెలపు నలపు నెఱుంగక నులుకఁ జెడి పలికెడి కొడుకును
డువులు సెవులకు ములుకులక్రియ నొదవఁ గటములవరఁ బెదవులఁ గఱచుచు నవిరి పడిగుఱుసుతు సింగనుం గొని విమతకథనంబు
లుగ అపినాఁడ వని దానవేశ్వరుండిట్లనియె * (చ॥ పటుతరనీతిశాస్త్రచయపారగుఁ జేసెద నంచు బాలునీ । వటుఁ గొనిపోయి వా
నికిననర్హములైన విరోధిశాస్త్రము । ల్కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండవటంచు నమ్మితిం । గటకట బ్రాహ్మణాకృతిపిగాక
యథార్థపు బ్రాహ్మణుండవే * (క॥ ధర్మేతరవర్తనులును । దుర్మంత్రులునైన జనుల దురితములొంకు । న్మర్మములుకలఁచి కల్మష
కర్మలరోగములు వొందుకై వడి విప్రా । అని నరరాజునకుం బురోహితుండిట్లనియె * (ఉ॥ తప్పులు లేవు మా వలన దానవనాథ విరోధి
శాస్త్రము । ల్సెప్పము ప్రూరులై పరులు సెప్పరు మీచరణంబులాన సు । మ్మెప్పుడు నీకుమారునకు నింతయు నైజము నీవ యెవ్వరుం ।
జెప్పెడి పాటిగామ ప్రతిచింతఁ దలంపుము నేర్పు నవ్వడిన్ * (క॥ మిత్రులము పురోహితులము । పాత్రుల మేము దియుఁ గాక భా
గ్గవులము నీ పుత్రుని నిటువలెఁ జేయఁగ । శత్రుల మే దైత్యజలధిచంద్రమ వింటే * (వ॥ అనిన గురునందనుం గోపింపక దైత్యవల్ల
భుండు కొడుకున వలోకించి యిట్లనియె * (క॥ ఒజ్జలు సెప్పని యీమతి । నుజ్జాతుఁడవై ననీకు మఱి యెవ్వని చే । నుజ్జాతమయ్యె బా
లక । తజ్జనులం బేరుకొనుము తగ నా మ్రోలన్ * (వ॥ అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె * (ఉ॥ అప్పుడు జీకటింబడి గృహవ్ర
తులై విషయప్రమత్తులై । చచ్చుచుఁ బుట్టుచున్ మఱలఁ జర్వితచర్వణులైన వారికిం । జెచ్చెఱఁ బుట్టునే పరులు సెప్పిననైనను జేచ్చనైన
ననేమిచ్చిననైనఁ గానలకునైన నెగినహరిప్రబోధముల్ * (ఉ॥ కాననివాని నూఁతఁ గొని కాననివాఁడు నభీష్టవస్తుపు । గానని
భంగిగర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై । కానరు విష్ణుఁ బొందరటఁ గందురకించనవైష్ణవాంఘ్రిసం । స్థానరజోభిషిక్తుల
గు సంహృతకర్ములు దానవేశ్వరా * (శా॥ శోధింపం బడె సర్వశాస్త్రములు గర్తుర్నాథ వెయ్యేటికి । న్నాథల్మాధవ శేముషీతరణి
సాంగత్యంబు నం గాకదు । ర్మేధం దాఁటఁగ వచ్చునే సుతవధూమీనోగ్రవాంఛామద । క్రోధోల్లోలవిశాలసంసృతిమహాఘోరా
మితాంభోనిధిన్ * (వ॥ అని పలికిన కొడుకును ధిక్కరించి మకుటవసేయక రక్కసులతోఁ దనతొడలపైనుండనీక గొబ్బున ది
గద్రొబ్బి నిబ్బరంబగు కోపంబు దీపింప వేఁడిచూపుల మింటనుంట లెగయ మంత్రులఁ జూచి యిట్లనియె * (శా॥ క్రోడం బై పినతం

ద్రింపం బెనని తాఁ గ్రోధించి చిత్తంబునన్ పీడం జేయఁడు బంటుభంగి హరికిన్ ద్వేషికిన్ భక్తుఁడై। యోడం డక్కడ ప్రాణవాయువులు వీఁ డొప్పించుచున్నాఁడు నా । తోడనై స్వరముపట్టై నిట్టి జనకద్రోహిన్ మహిం గంటిరే॥ అని రాక్షసవీరుల వీక్షించి యిట్లనియె*

*హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని వధాదివివిధోపాయంబుల శిక్షించుట.*

(శా॥ పంచాబ్దంబుల వాఁడు తండ్రి నగు నాపక్షంబు నిందించి య । క్కించిద్భీతియు లేక విష్ణు నహితుం గీర్తించుచున్నాఁడు వ । ల్దంచుం జెప్పిన మానఁ డంగ మునఁ బుత్రాకారతన్ వ్యాధిజ। న్మించెన్ వీని వధించి రండు దనుజుల్ మీపటుశస్త్రంబులన్* (శా॥ అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే। షాంగశ్రేణికి రక్ష సేయు క్రియ నీ యజ్ఞుం గులద్రోహి దు। స్సంగుం గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో। త్తుంగఖ్యాతిఁ జరించెదం గులము నిర్దోషంబుగాఁ జేసెదన్* (క॥ హంతవ్యుఁడు రక్షింపను । గంతవ్యుఁడు గాఁడు యమునికడకు నరకుఁ। గంతవ్యుఁడు వధమునకును। రంతవ్యుం డనక చంపి రండీ పడుచున్* (వ॥ అని దానవేంద్రుం డానతిచ్చిన వాఁడికోఱ కరకరలు పెకలింద్రుఁడు శూలహస్తులై వక్త్రంబులు దెఱచికొని యుబ్బి బొబ్బలిడుచు ధూమసహిత దావదహనంబునుం బోలెఁ దామ్రసంకాశంబులైన కేశంబులు మెఱయ భేదనవాదనచ్ఛేదనంబులు సేయుచు* (చ॥ బాలుఁడు గాఁడు చిక్కఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్యసం। శీలుఁడు వీఁడు వధ్యుఁడని చిక్కక రుక్కక క్రూరచిత్తులై। శూలములం దదంగములు సుస్థిరులై ప్రహరించి రుగ్రవా। చాలత నందఱున్ నిజశత్రుఁడు వల్దనఁ డయ్యె భూవరా* (చ॥ పలువురు దానవుల్ పొడువ బాలుని దేహము లేశమాత్రము । న్నొగులదు లోపలన్ రుధిర మబ్బదు కంపము శల్యసంఘము । న్నలియదు దృష్టివైభవము నష్టము గాదు ముఖేందుకాంతియుం । బొలియదు నూతనశ్రమము పుట్టదు మోమున దీనభావమున్* (ఉ॥ తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు మాటిమాటికో। పన్నగశాయి యో దనుజభంజన యో జగదీశ యో మహా। పన్నశరణ్య యో నిఖలపావన యంచు నుతించుఁ గాని తాఁ। గన్నుల నీరు దేఁడు భయకంపసమేతుఁడు గాఁడు భూవరా* (ఉ॥ పాఱఁడు లేచి దిక్కులకు బాహువు లొడ్డఁడు బంధురాజిలోఁ। దూఱఁడు ఘోరకృత్య మని చేరఁడు తండ్రిని మిత్రవర్గముం । జీఱఁడు మాతృసంఘము వసించు సువర్ణగృహంబులోనికిం। దాఱఁడు కావరే యనఁడు తాపము నొందఁడు కంటగింపఁగన్*(వ॥ ఇట్లు సర్వాత్మకంబై యిట్టిదట్టిదని నిర్దేశింపగాని పరబ్రహ్మంబు దాన యైన శ్రీమహావిష్ణుని యందుఁ జిత్తంబుఁ జేర్చి తన్మయుండై పరమానందంబున నున్న ప్రహ్లాదుని యందు దైత్యేంద్రుండు తనకింకరుల చేతఁ జేయించు మారణకర్మంబులు పాపకర్ముని యందుఁ బ్రయుక్తంబులైన సత్కారంబులుం బోలె విఫలంబు లగుటం జూచి*(మ॥ శూలము లన్నిశాచరులు సుక్కక దేహము నిగ్రహింపఁగా । బాలుఁడు నేలపైఁ బడఁడు పాఱఁడు చావఁడు తండ్రి నైన నా । పాలికి వచ్చి చక్రధరుపక్షము మానితి కావు మంచు దా । ఫాలము సోఁక మ్రొక్కఁ డనపాయత నుండుట కేమి హేతువో॥ అని శంకించుచు* (సీ॥ ఒకమాటు దిక్కుంభియూథంబుఁ దెప్పించి కెరలి డింభకుని ద్రొక్కింపఁ బంపు । నొకమాటు విషభీకరోరగశ్రేణులఁ గఱువఁ డిన స్సఘుఁ గఱవఁ బంపు । నొకమాటు హేతిసంఘోగ్రానలములోన వివరికుమారుని ద్రోయఁ బంపు । నొకమాటు హాలంకషోల్లోలజలధిలో ముత్తించి శాబకు ముంపఁ బంపు। విషము బెట్టఁ బంపు విదళింపఁగాఁ బంపు । దొడ్డకొండచరులఁ ద్రోయఁ బంపు । బట్టి కట్టఁ బంపు బాధింపఁగాఁ బంపు । బాలు గిసిసి దనుజపాలుఁ డధిప* (సీ॥ ఒకవేళ నభిచారహోమంబు సేయించు నొకవేళ నెండలనుండఁ బంపు । నొకవేళ వానలను పహతి నొందించు నొకవేళ రంధ్రంబు లుక్కఁ బట్టు। నొకవేళఁ దనమాయ నొదవించి బెగడించు నొకవేళ మంచున నొంటి నిలుపు । నొకవేళఁ బెనుగాలి కున్నుఘుఁ గాపించు నొకవేళఁ బాతించు నుర్వియందు। నీరు నన్నంబు నడనీక నిగ్రహించుఁ । గశల నడిపించు రువ్వించు గండశిలలఁ । గదల మొత్తించు వ్రేయించు ఘనశరములఁ । గొమరు నొకవేళ నమరారి క్రోధి యగుచు* (వ॥ మఱియు ననేకమారణోపాయంబులం బాపరహితుండైన పాపని రూపుమాపలేక యేకాంతంబున దురంతచింతాపరిశ్రాంతుండై రాక్షసేంద్రుండు దనమనంబున* (ఉ॥ ముంచితి వార్ధులన్ గదల మొత్తితి శైలతటంబులందుఁ ద్రొ। బ్బించితి శస్త్రరాజిఁ బొడిపించితి మీఁద నిభేంద్రపంక్తి రొ। ప్పించితి ధిక్కరించితి శపించితి ఘోరదవాగ్నులందుఁ ద్రో। యించితిఁ బెక్కుబాధ నలయించితిఁ జావఁ డిదేమి చిత్రమో* (చ॥ ఎఱుఁగఁడు జీవనౌషధము లెవ్వరు భర్తలు లేరు బాధలం। దఱుఁగఁడు నైజతేజముఁ దథ్యము జాడ్యము లేదు మిక్కిలిన్। మెఱయుచునున్నవాఁ డొకనిమేషము దైన్యము నొందఁ డింకనే। తెఱఁగునఁ ద్రుంతు వేసరితి దివ్యము వీనిప్రభావ మెట్టిదో* (వ॥ అదియునుం గాక తొల్లి శునస్సేఫుం డను మునికుమారుండు దండ్రిచేత యాగపశుత్వంబునకు దత్తుండై దండ్రి దనకు నపకారి యని తలంపక బ్రతికిన చందంబున* (క॥ ఆగ్రహమున నేఁ జేసిన । నిగ్రహములు పరులతోడ నెఱి నొకనాఁడు। న్విగ్రహములనుచుఁ బలుకఁడు। నగ్రహములు గాస్మరించ నొవ్వఁడు మదిలోన్* (వ॥ కావున వీఁడు మహాతపఃప్రభావసంపన్నుండు వీని కెందును భయంబు లేదు వీనితోడి విరోధంబునఁ దనకు మృత్యువు సిద్ధించునని విన్నంబోయి ఖిన్నుండై ప్రసన్నుండు గాక క్రిందు జూచుచు విషణ్ణుండై చింతనంబు సేయుచున్న రాజునకు మంతనంబునఁ జండామర్కు లిట్లనిరి* (శా॥ శుభ్రఖ్యాతి వినీప్రతాపము మహోద్యం

బుద్ధి దైత్యేంద్రరో । షభ్రూయుగ్మవిజృంభణంబున దిగీశవ్రాతముం బోరులన్ । విభ్రాంతంబుగఁ జేసె మేలితిఁ గదా విశ్వంబుని
డెంతయు నాధ్భోత్రుల్లుణదోష హేతువులు చింతం బొందనీ కేటికిన్* (శా॥ వక్రుండై నజనుండు వృద్ధగురుసేవం జేసి మేధాన
యోనవ్రాంతిన్విలసిల్లు మీఁదట వయఃపాకంబుతో బాలకు । న్నక్రద్వేషణబుద్ధి జేయుము మదిం జాలింపుమీ రోషము । న్మక్రా
చార్యులు వచ్చునంతకితఁడున్ సుశ్రీయుతుండయ్యెడున్* (వ॥ అని గురుపుత్రులు వలికిన రాక్షసేశ్వరుండు గృహస్థులైన రా
జులకు నుపదేశింపఁదగిన ధర్మార్థకామంబులు ప్రహ్లాదునకు నుపదేశింపుండని యనుజ్ఞ చేసిన వారు నతనికిఁ త్రివర్గంబు నుపదేశిం
చిన నతండు రాగద్వేషంబుల చేత విషయాసక్తులైన వారలకుఁ గ్రాహ్యంబులైన ధర్మార్థకామంబులుఁ దనకు నగ్రాహ్యంబులని
యును వ్యవహారప్రసిద్ధికొఱకైన భేదంబు గాని యాత్మభేదంబు లేదనియు ననర్థంబులయందర్థకల్పనసేయుట దిగ్భ్రమం బనివి
శ్వసించి గురూపదిష్టశాస్త్రంబులు మంచివని తలంపక గురువులు తమ గృహస్థకర్మానుసంధానంబునకుం జనిన సమయంబున*
(క॥ ఆటలకుఁ దన్నురమ్మని। పాటించి నిశాటసుతులు భాషించినదో। పాటకులేంద్రకుమారుఁడు । పాటవమున వారి జీరి ప్రజ్ఞా
న్వితుఁడై* (క॥ చెప్పెడొక చదువు మంచిది। చెప్పెడి గుఱువులు చెవులు చిందరగొనఁగా । నెప్పుడు మునయెడ నొజ్జలు। నెప్పె
దనొక చదువు వినుఁడు చిత్తములలరన్* (వ॥ అని రాజకుమారుండు గావున గురుణింది సంగడికాండ్రతోడనగి యెడు చందంబు
న గ్రీడలాడుచు సవయస్కులైన దైత్యదానవకుమారుల కెల్ల నేకాంతంబున నిట్లనియె* (ఉ॥ బాలకులార రండు మన ప్రాయ
పు బాలురు కొందరుర్విలోఁ । గూలుటఁ గంటిరే గురుఁడు క్రూరుఁడు నర్థచయంబు నందుఁడు । శ్మీలత నర్థకల్పనముఁ జెప్పెడి గ్రా
హ్యము కాదు శాస్త్రము। త్మేలెటఁగించె దన్వినిన మీకు నిరంతరభద్ర మయ్యెడిన్* (వ॥ వినుండు సకలజన్మంబులందును ధర్మా
ర్థాచరణకారణంబయిన మానుషజన్మంబు దుర్లభంబందుఁ బుంస్త్వంబు దుర్లభంబదియు శతవర్షపరిమితంబయిన జీవితకా
లంబున నియతంబై యుండు నందు సగంబంధకారబంధురంబయి రాత్రిరూపంబున నిద్రావ్యవహారంబుల నిరర్థకంబయి చను
జిక్కిన పంచాశద్వత్సరంబులందును బాల్యయౌవనకౌమార కైశోరవయోవిశేషంబుల వింశతిహాయనంబులు గడచుఁ గడ
మ ముప్పదియబ్దంబులు నింద్రియంబుల చేతఁ బట్టువడి దురవగాహంబులైన కామక్రోధలోభమోహమదమాత్సర్యంబులను పా
శంబులఁ గట్టువడి విడివడ సమర్థుండుగాక ప్రాణంబులకంటె మధురాయమానమైన తృష్ణకులోనై భృత్యతస్కర వణిక్క
ర్మంబులఁ బ్రాణహానిదైననంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్యసంభోగ చాతుర్యసౌందర్యవిశేషంబుల ధైర్యవల్లికా
లవిత్రంబులయిన కళత్రంబులను మహనీయమంజుల మధురాలాపంబులు గలిగి వశులయిన శిశువులను శీలవయోరూపధన్యలగు
కన్యలను వినయవివేకవిద్యాలంకారులయిన కుమారులను గామితఫలప్రదాతలగు భ్రాతలను మమత్వప్రేమమైన్యజనకులయి
న జననీజనకులను సకలసౌజన్యసింధువులయిన బంధువులను ధనకనకవస్తువాహన సుందరంబులైన మందిరంబులను సుకరంబు
లైన పశుభృత్యనికరంబులను వంశపరంపరాయత్తంబులయిన విత్తంబులను వర్జింపలేక సంసారంబు వర్జింప నుపాయంబుఁ గా
నక తంతువర్గంబున నిర్గమద్వారశూన్యంబయిన మందిరంబుఁ జేరి చిక్కువడి వెడలెడి పాటవంబు చాలక తగులువడు కీటకంబు
చందంబున గృహస్థుండు స్వయంకృతకర్మబద్ధుండై శిశ్నోదరాది సుఖంబులఁ బ్రమత్తుండై నిజకుటుంబ పోషణపారవశ్యం
బున విరక్తిమార్గంబుఁ దెలియనేరక స్వకీయపరకీయభిన్నభావంబున నంధకారంబునం బ్రవేశించుఁ గావునఁ గౌమారసమ
యంబున మనీషాగరిష్ఠుండైన పరమభాగవతధర్మంబనుష్ఠింపవలయు దుఃఖంబులు వాంఛితంబులు గాక చేకుఱుభంగి సుఖంబులు
కాలానుసారంబులై లబ్ధంబులగుం గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయందగదు హరిభజనంబున మో
క్షంబు సిద్ధించు విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు ముముక్షుండగు దేహికి దేహావసానపర్యంతంబు నా
రాయణచరణారవిందసేవనంబు కర్తవ్యంబు* (సీ॥ కంటిరే మనవారు ఘనులు గృహస్థులై విఫలులై గైకొన్న వెట్టితనము । భ
ద్రార్థులై యుండి పాయరు సంసారపద్ధతి నూరకపట్టువడిరి । కలయోనులందెల్ల గర్భాద్యవస్థలఁ బుట్టుచుండు దేహియై పుట్టు
చుండుఁ దన్నెఱుంగక కర్మతంత్రుఁడై కడపటముట్టఁడు భవశతములకునైన । దీనశుభము లేదు దివ్యకీర్తియు లేదు। జగతిఁ బుట్టి
పుట్టి చచ్చి చచ్చి। పొరలనేల మనకుఁ బుట్టని చావని। త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి* (శా॥ హాలాపానవిజృంభమాణమదగర్వా
తీత దేహోల్లస। ద్బాలాలోకనశృంఖలానిచయసంబద్ధాత్ముఁడై లేశము । న్వేలా నిస్సరణంబుఁ గానక మహావిద్వాంసుఁడుం
గామినీ। హేలాకృష్టకురంగశాబకము గుఱ్ఱుహీనస్థితిన్వంటిరే* (గీ॥ విషయసక్తులయిన విబుధాహితులతోడ । మనికి వలదు
ముక్తిమార్గవాంఛ। నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త । సంగజనులఁ గూడి శైశవమున* (వ॥ కావున విషయంబులఁ జిక్కు
వడిన రక్కసులకు హరిభజనంబు శక్యంబు గాదు రమ్యమయ్యును బహుతర ప్రయాసగమ్యమని తలంచితిరేనిఁ జెప్పెద సర్వభూ
తాత్మకుండై సర్వదిక్కాలసిద్ధుండయి బ్రహ్మకడపలఁ గాఁగల చరాచరస్థూలసూక్ష్మజీవసంఘంబులందును నభోవాయువుంబ
నీసలిలతేజంబులని యెడు మహాభూతంబులందును భూతవికారంబులయిన ఘటపటాదులందును గుణసామ్యంబైన ప్రధా

నమందును, గుణవ్యతిరిక్తంబైనమహత్తత్త్వాదియందును, రజస్సత్త్వతమోగుణంబులయందును, భగవంతుండవ్యయుండీశ్వ
రుండు పరమాత్మపరబ్రహ్మమనియెడు వాచకశబ్దంబులం గేవలానుభవానందస్వరూపకుండు, సవికల్పితుండు, నిర్దేశ్యుండు,
ననిర్దేశ్యుండునైనపరమేశ్వరుండు త్రిగుణాత్మకంబైనతనదివ్యమాయచేతనంతర్హితైశ్వర్యుండై వ్యాప్యవ్యాపకరూపంబులం
జేసిదృశ్యుండును, ద్రష్టయు, భోగ్యుండును, భోక్తయునై నిర్దేశింపందగి వికల్పితుండైయుండు దత్కారణంబున నాసురభా
వంబువిడిచిసర్వభూతంబులందునుదయాసుహృద్భావంబులుకర్తవ్యంబులు - దయగలిగిన నధోక్షజుండు సంతసించుననం
తుండాద్యుండుహరిసంతసించిననలభ్యంబెయ్యదియు లేదుజనార్దనచరణసరసీరుహయుగళ స్మరణసుధారస పానపరవశు
లమైతిమేనిమనకుదైవవశంబున నకాంక్షితంబులై సిద్ధించు, ధర్మార్థకామంబులు కాంక్షితంబై సిద్ధించు, మోక్షంబన నేలత్రి
వర్గంబును, నాత్మవిద్యయుందర్కదండనీతిజీవికాదులన్నియుంద్రైగుణ్యవిషయంబులైన వేదంబులవలనంబ్రతిపాద్యంబులు
నిస్త్రైగుణ్యలక్షణంబునంబరమపురుషుండయినహరికి నాత్మసమర్పణంబు సేయుటమేలుపరమాత్మతత్త్వజ్ఞానోదయంబునం
జేసిస్వపరభ్రాంతింజేయకపురుషుండు యోగావధూతత్వంబున నాత్మవికల్పభేదంబునం గలలోఁగన్న విశేషంబుభంగిఁద
థ్యంబనమిథ్యయనితలంచుననిమఱియుఁబ్రహ్లాదుండిట్లనియె*(మ॥ నరుఁడుండానును మైత్రితో మెలఁగుచో నారాయణుం
డింతయు।న్వరుసన్నారదసంయమీశ్వరునకువ్యాఖ్యానముంజేసెముని । హరిభక్తాంఘ్రిపరాగశుద్ధతను లేకాంతుల్మహా
కించను।ల్పరతత్త్వజ్ఞులుగాని వేరఁగునుటెన్భావింపనీజ్ఞానముల్*(వ॥ తొల్లి నేనుదివ్యదృష్టిగలనారదమహామునివలనసవిశేషం
బైనయీజ్ఞానంబునుపరమభాగవతధర్మంబునువింటిననవెఱఁగుపడిదైత్యబాలకులుదనుజరాజకుమారునకిట్లనిరి*(ఉ॥మం
టిమికూడిభార్గవకుమారకునొద్దననేకశాస్త్రము।ల్వింటిమి లేఁడుసద్గురుఁడువేఱొకఁడెన్నఁడురాజశాలము । కంటికిఁబై
నరాదుసౌరఁగా వెలికింజనరాదునీకుని।ష్కంటకవృత్తినెవ్వఁడుప్రగల్భుఁడుసెప్పెగుణాఢ్యసెప్పుమా*,(క॥ సేవింతుముని
న్నెప్పుడు।భావింతుమురాజవనుచుబహుమానంబు । ల్గావింతుము తెలియముని । కీవింతమతిప్రకాశ మేక్రియఁగలిగెన్*
(వ॥అనియిట్లుదైత్యనందనులుదన్నడిగినఁబరమభాగవత కులాలంకారుండయిన ప్రహ్లాదుండునగి తనకుఁ బూర్వంబునందు
వినంబడిననారదుమాటలుదలంచియిట్లనియె*(శా॥అక్షీణోగ్రతపంబుమందరముపైనర్థించిమాతండ్రిశుద్ధత్రాంతింజనియుం
డంజీమగమిచేతన్భోగిచందంబున।న్భక్షింపంబడెపూర్వపాపములచేఁబాపాత్ముఁడుండంచుము । నత్యుత్సంఘముమీఁదనిర్జరు
లుసంరంభించియుద్ధార్థులై*(శా॥ప్రస్థానోచితభేరిభాంకృతులతోఁబాకారియుందారుశౌ। ర్యస్థైర్యంబున నేగుదెంచినఁదదీ
యాటోపవిభ్రాంతులై।స్వస్థేమల్దిగనాడిపుత్రధనయోషామిత్రసంపత్కళా । ప్రస్థానంబులుడించిపారిరసురుల్ప్రాణా
వనోద్యుక్తులై* (మత్తకోకిల॥ ప్రల్లదంబునవేల్పులుగ్ధతిబారి రాజనివాసము । గొల్లబెట్టిసమస్తవిత్తముఁగ్రూరతంగొని
పోవఁగా।సిల్లుజొచ్చివిశంకుఁడైయమరేశ్వరుండదలించిమా।తల్లిఁదాఁజెఱఁబట్టెసిగ్గునఁదప్తయైవిలపింపఁగాన్*(వ॥ఇట్లు
సురేంద్రుండుమాతల్లింజెఱఁగొనిపోవుచుండ నమ్ముగుద కురరియనుపులుఁగుక్రియ మొఱలిడినఁ దెరువునదైవయోగంబున
నారదుండువొడగనియిట్లనియె*(ఉ॥స్వర్భువనాధినాథసురసత్తమవేల్పులలోనమిక్కిలి । న్నిర్భరపుణ్యమూర్తివినుసీతివి
మానినిఁబట్టనేలయీ।గర్భిణినాతురన్విడువుకల్మషమానసురాలుగాదునీ । దుర్భరరోషమున్నిలుపుమర్జయుఁడైననిలింపవై
రిపై॥అనినవేల్పుతపసికివేయిగన్నులవరయిట్లనియె*(ఉ॥అంతనిదానమైనదనుజాధిపువీర్యముదీనికుక్షిన । త్యంతసమృద్ధి
నొందెడిమహాత్మకకావునఁదత్ప్రసూతిప।ర్యంతముబద్ధఁజేసిజనితార్భకువజ్రపుధారఁద్రుంచిని।శ్చింతుఁడనైతుదిన్విడుతు
సిద్ధముదానవరాజవల్లభన్*(వ॥అనిపలికినవేల్పుతేఁకిదపస్వియిట్లనియె*(శా॥నిర్భీతుండుప్రశస్తభాగవతుఁడున్నిర్వై
రిజన్మాంతరా।విర్భూతాచ్యుతపాదభక్తిమహిమావిష్టుండుదైత్యాంగనా।గర్భస్థుండగుబాలకుండుబహుసంగ్రామాద్యపా
యంబులన్ । దుర్భావంబునుఁబొందిచావఁడుభవద్దోర్దర్పవిభ్రాంతుఁడై*(వ॥అనిదేవమునినిర్దేశించినవచనంబులుమ
న్నించితానుమహరిభక్తుండుగావునదేవేంద్రుండుభక్తిభావంబున మాయవ్వనువిడిచి వలగొని సురలోకంబునకుంజనియె-
మునీంద్రుండుమజ్జననియందుఁబుత్రికాభావంబుఁజేసి యూరడించి నిజాశ్రమంబునకుంగొనిపోయి నీవుపతివ్రతవు నీయుద
రంబునఁబరమభాగవతుండయినప్రాణియున్నవాఁడుతపోమాహాత్మ్యంబునంగృతార్థుండై నీపెనిమిటిరాఁగలండందాఁక
నీవిక్కడనుండుమనినసమ్మతించి*(శా॥యోషారత్నమునాథదేవతవిశాలోద్యోగమాతల్లిని।ర్దైన్యంబున నాథురాకమ
దిలోవాంఛించినిర్దోషయై । యీమద్భీతియులేకగర్భపరిరక్షేచ్ఛన్విచారించిశు।శ్రూషల్సేయుచునుండె నారదునకున్సవ్య
క్తశీలంబునన్* (వ॥ ఇట్లుతనకుఁబరిచర్యసేయుచున్నదైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షావిశారదుండయిననారదుండుని
జసామర్థ్యంబుననభయంబిచ్చి గర్భస్థుండయిననన్నునుద్దేశించి ధర్మతత్త్వంబును, నిర్మలజ్ఞానంబుపదేశించిన నమ్ముద్దియతద్గ

యుం బెద్దకాలంబు నాఁటిపిసికిఁ గావున నాఁడుదియగుటం జేసి పరిపాటి దప్పి సూటిలేక యచ్చెనారిచుండు నాయెడఁ గృపగల నిమిత్తంబున* (క॥ వెల్లిగొనినాఁటనుండియు। నుల్లసితంబైన దైవయోగంబున శో। భిల్లెడు మునిసమ్మతమంతయు । నుల్లంబున మఱపుపుట్టదొకనాఁడైనన్* (గీ॥ వినుఁడు నాదు పలుకు విశ్వసించితి రేని। నసులకైన బాలజనులకైన। దెలియవచ్చు మేలు దేహాద్యలంకార। దళననిపుణమైన తపసినాతము* (వ॥ అనినాదోక్తప్రకారంబున బాలకులకుఁ బ్రహ్లాదుండిట్లనియె నీశ్వరమూర్తియైన కాలంబునం జేసి వృక్షంబుఁ గలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థానవర్ధనాపక్షీణత్వపరిపాకనాశంబులు ప్రాప్తంబులైన తెఱంగున దేహంబునకుం గాని షడ్భావవికారంబు లాత్మకు లేవాత్మ నిత్యుండు, క్షయరహితుండు, శుద్ధుండు, క్షేత్రజ్ఞుండు, గగనాదులకు నాశ్రయుండు, క్రియాశూన్యుండు, స్వప్రకాశుండు, సృష్టిహేతువు, వ్యాపకుండు, నిస్సంగుండుఁ, బరిపూర్ణుం డొక్కఁడ నవివేకసమర్థంబులగు నాత్మలక్షణంబులు పండ్రెండు నెఱుంగుచు దేహాదులందు మోహజనకంబులగు నహంకారమమకారంబులు విడిచి పసిండి గనులుగల నెలవున విభ్రాజమానకనకలేశంబుల పాషాణములందుఁ బుటంబు వెట్టి వహ్నియోగంబునఁ గఱఁగనూది హేమకారకుండు పాటవంబున హాటకంబుఁ బడయు భంగి నాత్మకృతకార్యకారణంబుల నెఱింగెడి నేర్పరి దేహంబునందాత్మసిద్ధికొఱకు నైన యుపాయంబులం జేసి బ్రహ్మభావంబునఁ బడయు మూలప్రకృతియు మహదహంకారంబులుఁ బంచతన్మాత్రంబులు నిట్టియెనిమిదియుం బ్రకృతులనియును, రజస్సత్త్వతమంబులు మూఁడును బ్రకృతిగుణంబులనియును, కర్మేంద్రియంబులైన వాక్పాణిపాదపాయూపస్థలును, జ్ఞానేంద్రియంబులైన శ్రవణనయనరసనాత్వగ్ఘ్రాణంబులును, మనంబును మహీసలిలతేజోవాయుగగనంబులును నిపదారును వికారంబులనియును, కపిలాదిపూర్వాచార్యులచేతం జెప్పంబడియె సాక్షిత్వంబున నిరువదియేడింటిని నాత్మఁ గూడియుండుఁ బెక్కింటి కూటువ దేహమదియు జంగమస్థావరరూపంబుల రెండువిధంబుల య్యె మూలప్రకృతి మొదలైన వర్గంబునకు వేఱై మణిగణంబులఁ జొచ్చియున్న సూత్రంబు చందంబున నాత్మ యిన్నింటియందునుం జొచ్చి దీపించు నాత్మకు జన్మస్థితిలయంబులు గల వంచు మిథ్యాతత్పరులుగాక వివేకశుద్ధమైన మనంబున విచారించి దేహంబునందాత్మ వెదకవలయు నాత్మకు నవస్థలు గలయట్లుండుఁ గాని యవస్థలు లేవు జాగరణస్వప్నసుషుప్తులను వృత్తులెవ్వని చేత నెఱుంగంబడు నతండాత్మ యంత్రము కుసుమధర్మంబులయిన గంధంబుల చేత గంధాశ్రయుండయిన వాయువు నెఱింగెడు భంగిఁ ద్రిగుణాత్మకంబులై కర్మజన్యంబులయిన బుద్ధిభేదంబుల నాత్మ నెఱుంగందగు నని చెప్పి* (సీ॥ సంసారమిది బుద్ధిసాధ్యము గుణకర్మగణబద్ధ మజ్ఞానకారణంబు । కలవంటిదింతియ కాని నిక్కము గాదు సర్వార్థములు మనస్సంభవములు। స్వప్నజాగరములు సములు గుణశూన్యుఁడగు పరమునికి గుణాశ్రయమున । భవవినాశంబులు పాటిల్లినట్లుండుఁ బట్టిమూనిన లేవు బాలురార। కడఁగి త్రిగుణాత్మకములైన కర్మములకు। జనకమైవచ్చు నజ్ఞానసముదయమును । ఘనతరజ్ఞానవహ్నిచేఁ గాల్చివుచ్చి। కర్మవిరహితులై హరిఁ గనుట మేలు* (వ॥ ఆదిగావున గురుశుశ్రూషయు సర్వలాభసమర్పణంబును సాధుజనసంగంబు నీశ్వరప్రతిమాసమారాధనంబును హరితత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రేమయు నారాయణగుణకర్మకథానామకీర్తనంబును వైకుంఠచరణకమలధ్యానంబును విశ్వంభరమూర్తివిలోకనపూజనంబులు మొదలైనవి జ్ఞానవైరాగ్యలాభసాధనంబులయిన భాగవతధర్మంబులపయిరతి గలిగి సర్వభూతంబులయందు నీశ్వరుండు భగవంతుండాత్మ గలఁడని సన్మానంబు సేయుచుఁ గామక్రోధలోభమోహమదమత్సరంబులం గెలిచి యింద్రియవర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండయిన విష్ణుదేవునియందు రతిసిద్ధించు* (సీ॥ దనుజారిలీలావతారంబులం దలి శౌర్యకర్మంబులు సద్గుణములు। విని భక్తుఁడగువాఁడు వేడ్కతోఁ బులకించుఁ గన్నుల హర్షాశ్రుకణములొలుక । గద్గదస్వరముతోఁ గమలాక్ష వైకుంఠ వరద నారాయణ వాసుదేవ। యనుచు నొత్తిలి పాడు నాడు నాక్రోశించు నగుఁ జింతనము సేయు నతిరయోనక్ష్ప । గాఱులుకొనియుం బదన సోనిన్నాటలాడు। వేల్పు సోఁకిన పురుషుని వృత్తిఁ దిరుగు । బంధములువాసి యజ్ఞానపటలిఁ గాల్చి। విష్ణుఁ బ్రాపించుఁ దుదిభక్తి పెంపుఁ గలుగుచు* (వ॥ కావున రాగాదియుక్తమనస్కుండయిన శరీరికి సంసారచక్రనివర్తకంబైన హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణసుఖంబని బుధులు దెలియుదురు హరిభజనంబు దుర్లభంబు గాదు హరి సకలప్రాణిహృదయంబులయందు నంతర్యామియై యాకాశంబు భంగి నుండు విషయార్జనంబుల నయ్యెడిది లేదు సమిమభంగురప్రాణులైన మర్త్యులకు మమతాస్పదంబులు చంచలంబులయిన పుత్రమిత్రకళత్ర పశుభృత్యబలబంధురాజ్యకోశమణిమందిరమంత్రిమాతంగమహీప్రముఖవిభవంబులు నిరర్థకంబులు యాగప్రముఖపుణ్యలబ్ధంబులైన స్వర్గాదిలోకభోగంబును పుణ్యానుభవక్షీణంబులు గాని నిత్యంబులు గావున గుండు విద్వాంసుండనని యభిమానించి కర్మంబులాచరించియు మోఘంబులయిన విపరీతఫలంబులఁ బొందుఁ గర్మంబులు గోరక చేయవలయుఁ గోరి చేసిన దుఃఖంబులు ప్రాపించుఁ బురుషుండు దేహంబుకొఱకు భోగంబుల నపేక్షించు దేహంబు సత్యంబుగాదు తోడరాదు మృతంబయిన దేహమును శునకాదులు భక్షించు దేహి కర్మంబులాచరించి కర్మబద్ధుండయి క్రమ్మఱం గర్మానుసా

లంబైన దేహంబుఁ దాల్చు నజ్ఞానంబునం జేసి పురుషుండు కర్మదేహంబున విస్తరించు నజ్ఞానతంత్రంబులు ధర్మార్థకామంబు
లజ్ఞానలభ్యంబు మోక్షంబు మోక్షప్రదాతయగు హరి సకలభూతంబులకు నాత్మేశ్వరుండుఁ బ్రియుండుఁ దనచేతనైన మ
హాభూతంబులతోడ జీవసంజ్ఞితుండయి యుండు నిష్కాములై హృదయగతుండయిన హరిని నిజభక్తిని భజింపవలయు* (క॥
దానవదైత్యభుజంగమ । మానవగంధర్వసురసమాజములో । లక్ష్మీనాథు చరణకమల । ధ్యానంబున నెవ్వఁడయిన ధన్యతనొం
దున్* (క॥ చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ । జిక్కఁడు దానముల శౌచశీలతపములం । జిక్కు దువ్యక్తి నిభక్తిని జిక్కిన క్రియ
నచ్యుతుండు సిద్ధము సుండీ* (క॥ చాలదు భూదేవత్వము । చాలదు దేవత్వ మధిక శాంతత్వంబున్ । జాలదు హరి మెప్పింపవి । శా
లోద్యములారభక్తి చాలిన భంగిన్* (గీ॥ దనుజభుజగయక్ష దైత్యస్త్రీ గాభీర । సుంకరీ విహంగ శూద్ర శబరు । లయినఁ బాపజీవు
లైన ముక్తికిఁ బోదు రఖిలజగము విష్ణుఁడనుచుఁ దలఁచి* (క॥ గురువులు దమ మనులోఁ బడు । తెరువులు సెప్పెదరు విష్ణు దివ్యపద
వికిఁ । దెరువులు సెప్పరు చీఁకటి । బరువులు వెట్టంగ నేల బాలకులారా* (క॥ తెండెల్ల పుస్తకంబుల । నిండాచార్యనకుమజలనేక
తమునకుఁ । రండు విశేషముఁ జెప్పెదఁ । బొండొల్లని వారు కర్మపుంజము పాలై* (క॥ ఆడుదము మనము హరిరతిఁ । బాడుదమే
ప్రొద్దు విష్ణుభద్రయశంబుల్ । వీడుదము దనుజసంగతిఁ । గూడుదము ముకుంద భక్తకోటిన్ సూటిన్* (క॥ విత్తము సంసృతిపట
లము । వ్రత్తము కామాదివైరివర్గంబుల నేఁ । డిత్తము చిత్తము హరికిని । జొత్తము నిర్వాణపదము శుభము మనకున్* (వ॥ అని
యిట్లు రహస్యంబున బ్రహ్మోదంబున యాయావేళల రాక్షసకుమారులకు నపవర్గమార్గంబెఱింగించిన వారును గురుశిక్షితంబైన
చదువులు సాలించి నారాయణభక్తిఁ జిత్తంబులం గీలించి యుండుటం జూచి వారలయేకాంతభావంబుఁ దెలిసి వెఱచి వచ్చి శు
క్రాచార్యనందనుండు శక్రవైరికిట్లనియె* (శా॥ రక్షోబాలుర నెల్ల నీకొడుకు చేరం జీరి లోలోనన । శిక్షామార్గము లెల్లఁ గల్లల
నియాక్షేపించి తానందఱ । న్మోక్షాయత్తులఁ జేసి నాఁడు మన మున్మోసంబు వాటిల్లెనీ । దక్షత్వంబున నక్కఁజేయవలయున్ దై
తేయవంశాగ్రణీ* (క॥ ఉల్లసితవిష్ణుకథనము । లెల్లప్పుడు మాకుఁ జెప్పఁడీ గురుఁడనిన । న్నుల్లంఘించి సమారకు । లొల్లరు చదు
వంగ దానవోత్తమ యంటే* (క॥ ఉడుగఁడు మధురిపుకథనము । విడువఁడు జడుపగిదిఁ దిరుగు వికసనమున నే । నొడివిన నొడువులు
నొడువఁడు । మడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా* (క॥ చొక్కపు రక్కసకులమున । బెక్కురు జన్మించిరిందుఁ బీతాంబరు
నిన్నెక్కుడు నాకుఁ వంగొలి చెడు । నెక్కడి సుతుఁ గంటి రాక్షసేశ్వర వెట్టిన్* (వ॥ అని యిట్లు గురుసుతుండు సెప్పిన కొడుకువల
నివిరోధవ్యవహారంబులు కర్ణరంధ్రంబులందు ఖడ్గప్రహారంబులయి సోఁకిన బిట్టుమిట్టిపడి పాదతాడితంబైన భుజంగంబు భంగి
బవనప్రేరితంబైన దవానలంబు చందంబున దండతాడితంబయిన కంఠీరవంబు కైవడి భీషణరోషరసావేశ జాజ్వల్యమానచి
త్తుండును, బుత్రసంహారోద్యోగయుక్తుండును, గంపమానగాత్రుండు, నరుణీకృతనేత్రుండునై కొడుకు నరప్పించి సంమాన
కృత్యంబులు దప్పించి నిర్దయుండయి యశనిసంకాశభాషణంబుల నదల్చుచు* (శా॥ సూనున్ శాంతగుణప్రధాను నతిసంశుద్ధాం
చితజ్ఞానున । జ్ఞానారణ్యకృశానున న్నంజలిపుటీసంభ్రాజమానున్ సదా । శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాద
నాధీనున్ ధిక్కరణంబుఁ జేసి పలికెన్ దైవాహితుండుగ్రతన్* (సీ॥ అస్మదీయంబగు నాదేశమునఁ గాని మిక్కిలి రవి మింట మెఱయ
వెఱచు । నన్ని కాలములందు ననుకూలుఁడై కాని విద్వేషమున గాలి వీవ వెఱచు । మత్ప్రతాపానలమందీకృతార్చియై విచ్చలవిడి
నగ్ని వెలుఁగ వెఱచు । నతితీక్ష్ణమైన నాయాజ్ఞ నుల్లంఘించి శమనుండు ప్రాణులఁ జంప వెఱచు । నింద్రుఁ డౌదల నామ్రోల నెత్త
వెఱచు । నమరకిన్నరగంధర్వయక్షవిహగ । నాగవిద్యాధరావలి నాకు వెఱచు । నేల వెఱవవు పలువ నీ కేది దిక్కు* (శా॥ ప్రజ్ఞా
వంతులు లోకపాలకులు శుంభద్వేషులయ్యున్మదీ । యాజ్ఞాభంగము సేయ నోడుదురు రోషాపాంగదృష్టిన్ నే । కజ్ఞానచ్యుత
మై జగత్త్రితయముం గంపింపఁ నీ విట్టిచో । నాజ్ఞోల్లంఘన మెట్లు చేసితివి సాహంకారతన్ దుర్మతీ* (శా॥ కంఠక్షోభము గాఁగ నొత్తి
లిచుహాగాఢంబుగా డింభవై । కుంఠుం జెప్పెదు మజ్జయుండనుచు వైకుంఠుండు వీరవ్రతో । త్కంఠాబంధురుఁడేని నేనసురుల
న్ఖండింపఁ దండింపఁగాఁ । గుంఠీభూతుఁడు గాక రావలదె నన్ఘోరాహవక్షోణికిన్* (శా॥ ఆచార్యోక్తము మాని బాలురకు మో
క్షాసక్తిం బుట్టించి నీ । వాచాలత్వముఁ జూపి విష్ణు నహితున్ వర్ణించి మద్దైత్యవం । శాచారంబులు నీవుఁ జేసితి విమూఢాత్ముంగుల
ద్రోహిని । న్నీచుం జంపుట మేలు చంపి కులము న్నిర్దోషముం జేసెదన్* (క॥ దిక్కులు గెలిచితి నన్నియు । దిక్కెవ్వఁడు కోరి నీ
కు దేవేంద్రాదు । ల్దిక్కులరాజులు వేఱొక । దిక్కెఱుఁగక కొలుతు రితఁడె దిక్కని నన్నున్* (క॥ బలవంతుఁడ నే జగముల । బల
ములతో జనక వీరభావమున మహా । బలులఁ జయించితి నెవ్వని । బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడవై ॥ అనిన తండ్రికి మె
ల్లన వినయంబుతోఁ గొడుకిట్లనియె* (క॥ బలయుతులకు దుర్బలులకు । బలమెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకు । న్బలమెవ్వఁడు
ప్రాణులకును । బలమెవ్వం డట్టి విభుఁడు బలము సురేంద్రా* (క॥ దిక్కులు కాలముతో నే । దిక్కున లేకుండుఁ గలుగుఁ దిక్కుల

మొదలై దిక్కుగలలేనివారికి దిక్కై యాదియదియనాఁడిదక్కు మహాత్మా* (సీ॥ కాలరూపంబులఁగలవి శేషంబులనలఘు
గుణాశ్రయుండయిన విభుఁడు। సత్త్వాఖ్యేంద్రియసహజప్రభావాఢ్యుఁడై వినోదంబున నఖిలజగముఁ। గల్పించు రక్షించు ఖం
డించు నవ్యయుఁ డన్నిరూపములందు నతఁడు గలఁడు। చిత్తంబు సమముగాఁ జేయుము మార్గంబుఁ దప్పి వర్తించు చిత్తంబు కం
టె వైరులెవ్వరు చిత్తంబు వైరిగాని। చిత్తమును నీకు వశముగాఁ జేయుమయ్య। మదయుతాసురభావంబు మానుమయ్య। య
య్య నీ మ్రోల మేలాడరయ్య జనులు* (ఉ॥ లోకములన్నియున్గడియలోన జయించినవాఁడ వింద్రియానీకము చిత్తముం గెలు
వనేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ భీకరశత్రులార్వురఁ బ్రభిన్నులఁ జేసిన ప్రాణికోటిలో। నీకు విరోధి లేఁడొకఁడు నేర్పునఁ జూ
డుము దానవేశ్వరా* (క॥ పాలింపుము శేముషిను। మ్మాలింపుము కర్మబంధములసమదృష్టిం। జాలింపుము సంసారముఁ। గీ
లింపుము హృదయమందుఁ గేశవభక్తి౯* (వ॥ అనినఁ బరమభాగవతశేఖరునకు దోషాచరశేఖరుండిట్లనియె* (క॥ చంపెదఁ జ
చ్ఛేదనను చుము। గంపింపక యోరి పడుచ కఠినోక్తులన౯। గుంపించెదు చావునకుం। దెంపరివై పదరువాని తెలఁగునఁ గుమతీ*
(శా॥ నాతో డంబరతిభాషలాడెదు జగన్నాథుండనా కంటెనీ। భూతశ్రేణికి రాజు లేఁడొకఁడు సంపూర్ణప్రభావుండనై।
ద్వాశీకంజంపిన మున్నె నే వెదికితి౯ స్వల్లమౌ నారాయణుం। డేతద్విశ్వములోన లేఁడు గదా వాఁడెందుండురా దుర్మతీ* (క॥ ఎ
క్కడఁ గల డే క్రియ నే। చక్కటి వర్తించు నెట్టిజాడను వచ్చుం। జక్కడఁతును నిన్ను పిన్నుని। బెక్కులు ప్రేలెదవు వానిభృత్యునిప
గిదిక్కా* (వ॥ అనిన హరికింకరుండు శంకింపక హర్షపులకాంకురసంకలిత విగ్రహుండై యాగ్రహంబు లేక హృదయంబున హరిం
దలంచి నమస్కరించి బాలవర్తనంబున నర్తంబు సేయుచు నిట్లనియె* (మ॥ కలఁడంభోధిఁ గలండు గాలిఁ గలఁడాకాశంబునం
గుంభినిం। గలఁడగ్నిం దిశలం బగళ్ల నిశలం ఖద్యోతచంద్రాదులం। గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంత
టం। గలఁ డీశుండు గలండు తండ్రి వెదకం గానేల యీయాయెడ౯* (క॥ ఇందుఁ గలఁ డందు లేఁడని। సందేహము వలదు చక్రిస
ర్వోపగతుం। డెందెందు వెదికి చూచిన। నందందే గలఁడు దానవాగ్రణి వింటే॥ ఇవ్విధంబున* (మ॥ హరి సర్వాకృతులం గలండను
చుఁ బ్రహ్లాదుండు భాషింపస। త్వరుఁడై యెందును లేఁడు లేఁడని సుతుం దైత్యుండు దర్జింప శ్రీ। నరసింహాకృతినుండె నచ్యుతుఁడు
నానాజంగమస్థావరో। త్కరగర్భంబులనన్ని దేశములనుద్దండప్రభావంబున౯* (వ॥ అయ్యవసరంబున నద్దానవేంద్రుండు*
(క॥ డింభక సర్వస్థలముల। నంభోరుహనేత్రుఁ డుండునను చుమిగులసం। రంభంబునఁ బలికెదవీ స్తంభంబునఁ జూపఁగలవె చ
క్రిం గిక్రి౯* (క॥ స్తంభమునఁ జూపవేనియుఁ। గుంభినిని శిరముఁ ద్రుంచి కూల్పఁగరతు। రంభమున వచ్చి హరి వి। స్రంభంబున నడ్డ
పడఁగల శక్తుండను నే* (వ॥ అనిన భక్తవత్సలునిభటుండిట్లనియె* (శా॥ అంభోజాసనుఁ డాదిగాఁ గఁదృణపర్యంతంబు విశ్వాత్ము
డై। సంభావంబున నుండు ప్రోడ విపుల స్తంభంబునం దుండఁడే। స్తంభాంతర్గతుఁడౌట కుస్సలఁప నేసందేహముం గాలేమిని। ర్దం
భత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్షస్వరూపంబున౯* (వ॥ అనిన వినిక రాళించి గద్దన లేచి గద్దియ డిగ్గనుఱికి యొఱఁ బెఱికి ఖ
డ్గంబు కేలన మర్చి ఝుళిపించుచు మహాభాగవతశిఖామణియైన ప్రహ్లాదుని ధిక్కరించుచు* (మ॥ వినరా డింభక మూఢచిత్త గరి
మన్విష్ణుండు విశ్వాత్మకుం డని భాషించెదవై ననిందు గలడే యంచున్మదోద్రేకియై। దనుజేంద్రుం డతిచేత వ్రేసెను మహో

✻✻ శ్రీహరి నరసింహరూపంబెత్తి స్తంభంబునుంచి వెడలివచ్చుట. ✻✻

దగ్రప్రభాస్తంభము। న్జనదృగ్భీషణదంభముగా హరిజనుస్సంరంభముగా స్తంభముగా* (వ॥ ఇట్లు దానవేంద్రుండు పరిగృ
హ్యమాణవైరుండును, వైరానుబంధజాజ్వల్యమానరోషానలుండును, రోషానలజఘన్యమాన విజ్ఞానవినయుండును, వినయ
గాంభీర్యధైర్యజేగీయమానహృదయుండును, హృదయచాంచల్యమాన తామసుండును, తామసగుణచంక్రమ్యమాణస్థై
ర్యుండునై విస్రంభంబు నహుంకరించి బాలుని ధిక్కరించి హరి నిందుఁ జూపుమని కనత్కనకమణిమయ కంకణక్రేంకారశబ్ద
పూర్వకంబుగా దిగ్దంతిదంత భేదనపాటవప్రశస్తంబగు హస్తంబున సభామంటపస్తంభంబు వ్రేసిన వ్రేటుతోడన దశదిశల
మిణుంగురులు చెదరఁ జిటిలి పెటిలిపడి బంభజ్యమానంబగు నమ్మహాస్తంభంబునఁ బ్రళయవేళాసంభూతసప్తస్కంధబం
ధురసమీరసంఘటితరజోఘుష్యమాణమహాబలాహకవర్గనిర్గతనిబిడనిష్ఠురదుస్సహనిర్ఘాతసంఘనిర్ఘోషనికాశంబులయిన
ఛటచ్ఛటస్ఫుటస్ఫుటధ్వనిప్రముఖభయంకరారావపుంజంబులు జంజన్యమానంబులయి యెగసి యాకాశకుహరాంతరాళం
బు నిరవకాశంబుఁ జేసి నిండినం బట్టుచాలక దోధూయమాన హృదయంబులై పరవశంబులైన పితామహమహేంద్రవరుణవా
యుశిఖిప్రముఖచరాచరజంతుజాలంబులతోడఁ బ్రహ్మాండకటాహంబు పగిలి పరిస్ఫోటితంబుగాఁ బ్రఫుల్లపద్మయుగళసంకా
శభాస్వరచక్రచాపహలకులిశజలచరరేఖాంకితచారుచరణతలుండును, చరణచంక్రమణఘనవినమితవిశ్వవిశ్వంభరాభా
రధౌరేయదిక్కుంభికుంభీనసకుంభినీధరకూర్మకులశేఖరుండును, దుగ్ధజలజాతశుండాలశుండాదండమండితప్రకాండప్ర

చండమహోదార స్తంభయుగళుండును, ఘణఘణాయమానమణికింకిణీగణముఖరితమేఖలావలయవలయితపీతాంబరశోభితకటిప్రదేశుండును, నిర్జరనిమ్నగావర్త వర్తుల కమలాకర గంభీర నాభీవివరుండును, ముష్టిపరిమేయవినుతతనుతరస్నిగ్ధమధ్యుండును, కులాచలసానుభాగసదృశకర్కశ విశాలవక్షుండును, దుర్జనదనుజభటధైర్యలతికాలవిత్రాయమాన రక్షోరాజవక్షోభాగవిశంకటక్షేత్రవిలేఖనదుంచులాంగలాయమాన ప్రతాపజ్వలనజ్వాలాయమాన శరణాగతనయన చకోరచంద్రరేఖాయమానవజ్రాయుధప్రతిమాభాసమానఖశాత నఖరతర ముఖనఖరుండును, శంఖ చక్ర గదా ఖడ్గ కుంత తోమర ప్రముఖనానాయుధ మహితమహోత్తుంగ మహీధరశృంగసన్నిభ వీరసాగర వేలాయమానమాలికా విరాజమాననిరర్గళానేకశతభుజాగ్రళుండును, మంజుమంజీరమణిపుంజరంజిత మంజులహార కేయూర కంకణ కిరీటమకరకుండలాది భూషణభూషితుండును, త్రివళీయుతశిఖరిశిఖరాభ పరిణద్ధబంధురకంధరుండును, ప్రకంపన కంపిత పారిజాత పాదపపల్లవప్రతీకాశకోపావేశసంచలితాధరుండును, శరత్కాలమేఘజాల మధ్యమధగద్ధగాయమానతటిల్లతాసమాన దేదీప్యమానదంష్ట్రాంకురుండును, కల్పాంతకాలసకలభువనగ్రసనవ్యసనవిజృంభమాణసప్తజిహ్వాజిహ్వాతులిత తరలతరాయమాన విభ్రాజమానజిహ్వుండును, మేరుమందరమహాగుహాంతరాళవిస్తారవిపులవక్త్రనాసికావివరుండును, నాసికావివర నిస్సర న్నిబిడనిశ్వాసనికరసంఘట్టనసంక్షోభితసంతప్యమానసప్తసాగరుండును, పూర్వపర్వత విద్యోతమానఖద్యోతమండల సదృశసమంచితలోచనుండును, లోచనాంచలసముదీర్యమాణపీలోలకీలాభీలవిస్ఫులింగ వితానరోచిరుద్ధూయమాన తారకాగ్రహమండలుండును, శక్రచాపసురుచిరోదగ్రమహాభ్రూలతాబంధబంధురభయంకరవదనుండును, ఘనతరగండశైలతుల్యకమనీయ గండభాగుండును, సంధ్యారాగరక్తధారాధర మాలికాప్రతిమమహాభ్రింకష తంతన్యమాన పటుతరసటాచ్ఛటుండును, సటాజాలప్రపంచాలనసంజాతవాతడోలాయమానవైమానికవిమానుండును, నిష్కంపితశంఖవర్ణ మహోదార్ధ్వకర్ణుండును, కాంచనదండాయమానసుందరవసుంధరాధరపరిభ్రమణవేగసముత్పద్యమానపయస్మండలమండితసుధారాశి కల్లోలశీకరాకారభాసురకేసరుండును, బర్హాఖర్వశిశిరకిరణమయూఖగౌరతనూరుహుండును, నిజగర్జననినాదనిర్దలిత కుముదసుప్రతీకవామనైరావణసార్వభౌమప్రముఖదిగిభరాజకర్ణకోటరుండును, ధవళధరాధరదీర్ఘదురవలోకనీయ దేహుండును, దేహప్రభాపటలనిర్మథ్యమానపరిపంథియాతుధానానీకుఁడుంబకర్వాంధకారుండును, ప్రహ్లాదహిరణ్యకశిపురంజనభంజననిమిత్తాంతరంగ బహిరంగజేగీయమాన కరుణావీరరస సంయుతుండును, మహాప్రభావుండు నై నరశ్రీనృసింహదేవుండావిర్భవించినంగనుంగొని* (క॥ నరమూర్తిగాదు కేవల। హరిమూర్తియుగాదు మానవాకారము కే। సరియాకారము నున్నది। హరిమాయారచితముగ యథార్థముసూడన్* (ఉ॥ తెంపున వాలుఁ డాడి నమధీరత సర్వగతత్వముం బ్రతి। ష్ఠింపఁ దలంది యిందునరసింహశరీరముఁ దాల్చె చక్రి శ్రీ। క్షింపఁగ వచ్చి నాఁడు హరి చేసినృతి యంచుఁదలంకు నై ననా। సొంపుమ్రుఁబెంపునందఁబును

—* శ్రీనరసింహమూర్తి చేతనయారుపులయందు హిరణ్యకశిపుని వధించుట. *—

జూడఁజరింపుహరింపుశ్రుపుర* (వ॥ అని మెత్తంబడని చిత్తంబున గదయెత్తికొని తత్తరంబున నార్పుచు నకుంఠిత కంఠీరవంబు డగ్గరు గంధసింధురంబు చందంబున నక్తంచరకుంజరుండు నరసింహదేవున కెదురు నడిచి, తదీయదివ్యతేజోజాలసన్నికర్షంబునం జేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెఁ గర్తవ్యాకర్తవ్యంబులు దెలియక నిగ్గతప్రభుండయ్యె నప్పుడు* (మ॥ ప్రకటంబై ప్రళయావసానమున నమ్మా బ్రహ్మాండభాండావరో। దకమై యున్నతమిస్రము న్ జగమును త్పాదించు చోఁ ద్రావినా। త్రిక తేజోనిధియైన విష్ణునెడ మర్దింపించు నే నష్టమై। వికలంబై చెడుగాక తామసుల ప్రావీణ్యంబు రాజోత్తమా* (వ॥ అంతన ద్దానవేంద్రుండు మహోగ్రదండంబగు గదాదండంబు గిరగిరం ద్రిప్పి నరమృగేంద్రునిఁ వేసిన నతండు దర్పంబున సర్పంబు నొడిసిపట్టు సర్పపరిపంథి నేర్పున దితిపట్టిం బట్టుకొనిన మిట్టిపడి నట్టించిపట్టు కట్టలుక నయ్యసురపరివృఢుండు దృఢబలంబున నిట్టిట్టుమిడిసిపడిపట్టుఁ దప్పించుకొని విడివడిదిట్టతనంబు తప్పక చుప్పుందియుప్పరంబున కెగసి విహంగకులరాజ చరణనిర్గలితభుజంగంబు తెఱంగున నందలంగను జేకితనభుజాటోపంబున నరకంఠీరవుండు కుంఠితుండయ్యె డిననితలంచి కలంక చెలంగుచుఁ డున్ననిబిడనీరదనికరంబులమాటున నిలింపులు గుంపులుగొని డాఁగి మూఁగి క్రమ్మఱ నాత్మీయజీవనశంకాకలంకితులై మంతనంబునఁ జింతనంబు సేయుచు నిరీక్షింపన క్షీణసమరదక్షతావిశేషంబు వరియించి ఖడ్గవర్మంబులు ధరియించి భూనభోభాగంబుల వివిధవిచిత్రలంఘనలాఘవంబులఁ బరిభ్రమణభేదంబులం గరాళవదనుండై యంతరాళంబునఁ దిరుగుసాళ్వపు డేగవడువున సంచరించిననసహింపక* (సీ॥ పంచాననోద్ధూత పావకజ్వాలలు భూనభోంతరమెల్లఁ బూరితముగ। దంష్ట్రాంకురాభీలధగధగాయితదీప్తి నసురేంద్రు నేత్రములంధములుగ। గంటకసన్నిభోత్కట కేసరాహతినభ్రసంఘము ఛిన్నమై చలింప। ప్రళయార్భ చంచలాప్రతిమభాస్వరములై ఖరనఖరోచులు గ్రమ్మ జేజ।సటలు ఝళిపించి నిగర్జించి దిసంభ్రమించి। దృష్టిసారించి భూమలు బంధించి కె

రలిజిహ్వయాడించిలంఘించిచేతనొడిసి।పట్టెనరసింహుఁడాదితిపట్టి నధిప* (క॥ సంకుగొనకలీలాగతి। నురగేంద్రుఁడుమూషకంబునొడిసినభంగి।న్నరకేసరిదనునొడిసిన।సురవిముఖుఁడు ప్రాణభీతిసుడివడియెన్నృపా* (క॥ సురరాజవైరిలోఁబడెఁ। బరిభావితసాధుభక్తపటలాంహునకు । న్నరసింహునకుమదంచత్ఖరతరజిహ్వునకునుగ్రనఖరంహునకున్ ॥ అంత* (మ॥ విహగేంద్రుండహిఁ బ్రచ్చుకైవడిమహోరుద్వృత్తిన్నృసింహుండుసా । గ్రహుఁడైయూరువులందుఁజేర్చినఖసంఘాతంబులన్ వ్రచ్చెరు।స్సహుఁదంభోళికఠోరదేహునచలోత్సాహున్మహాబాహునిం। ద్రహుతాశాంతకభీకరున్సనకరుం దైత్యాన్వయశ్రీకరున్* (శా॥ చించున్ హృత్కమలంబుశోణితమువర్షించున్ధగామండలిం। ద్రెంచుం గర్కశనాడికావలులు భేదించున్మహావక్షముం।ద్రుంచున్మాంసమునూక్ష్మఖండములుగా నుత్పాటసురున్వ్రచ్చిద । ర్పించుం బ్రేవులుకంఠమాలికలుగల్పించున్నఖోద్భాసిమై* (సీ॥ వక్షఃకవాటంబు వ్రక్కలుసేయుచో ఘనకుఠారంబులకరణినొప్పు।గంభీరహృదయపంకజము భేదించుచోఁ గుద్దాలములభంగిఁ గొమరుమిగులు । ధమనీవితానంబుదవిలిఖండించుచోఁబటులవిత్రంబులపగిదిమెఱయు । జఠరవిశాలాంత్రజాలంబుఁ ద్రెంచుచోఁ గ్రకచసంఘంబులగరిమఁ జూపు।నంకగతుఁడైనదైత్యునినాగ్రహమున । శస్త్రచయములనొంపకసంహరించి।యమరునరసింహునఖరంబులతివిచిత్ర।సమరముఖరంబులై యుండెజనవరేణ్య* (క॥ స్ఫురితవిబుధజనముఖములు।పరివిదళితదనుజనివహపతితనుముఖములు।ల్గురురుచిజితశిఖిశిఖములు। నరహరికరనఖములమరునతజనసఖముల్ * (వ॥ ఇట్లు కేవలపురుషరూపంబును మృగరూపంబునుంగాని నరసింహరూపంబున రేయునుఁబవలునుగాని సంధ్యాసమయంబునన ంతరంగంబును బహిరంగంబునుంగాని సభాద్వారంబున గగనంబును భూమియునుఁ గాని యూరుమధ్యంబునఁ బ్రాణసహితంబును బ్రాణరహితంబునుంగాని నఖంబులం ద్రైలోక్యజనహృదయభల్లుండైనదైత్యమల్లుని వధియించి మహాదహనకీలాభిలదగ్మముండును, కరాళవదనుండును, లేలిహానభీషణజిహ్వుండును, శోణితపంకాంకితకేసరుండునునై ప్రేవులుమాలికలుగధరించి కుంభికుంభవిదళనంబుఁజేసిచనుదెంచు పంచాననంబునుంబోలె దనుజకుంజరహృదయకమలవిదళనంబుజేసితదీయరక్తసిక్తంబులైననఖంబులు సంధ్యారాగరక్తచంద్రరేఖల చెలువువహింపనహింపక లేచితనకట్టెదుఱనాయుధంబులెత్తికొనితత్తరంబు నరణంబునకునురువడించురక్కసులం బెక్కసహస్రంబులంజక్రాది నిర్వక్రసాధనంబుల నొక్కనిం జిక్కకుండంజక్కడఁ జెనివ్విధంబున* (శా॥ రక్షోవీరులనెల్లఁ ద్రుంచిరణసంరంభంబుచాలించి దృష్టిక్షేపంబుభయంకరంబుగసభాసింహాసనారూఢుఁడై।యక్షీణాగ్రహుఁడైనృసింహుఁడుకరాళాస్యంబుతో నొప్పెద । నీక్షింపంబరికింప నోడి మరుద్వ్రాతంబులై డాగగన్* (క॥ సురచారణవిద్యాధర।గరుడోరగయక్షసిద్ధగణములలోనొ।క్కరుఁడైనఁ డాయవెఱచును। నరహరినయ్యవసరముననరలోకేశా* (క॥ తపనంబులనరసింహుని। హర్షంబులఁజూచినిర్జరాంగనలుమహో।త్కర్షంబులఁగుసుమంబుల। వర్షంబులుగురిసిరుత్సవంబులనధిపా* (వ॥ మఱియునయ్యవసరంబునమింటననేకదేవతావిమానంబులును, గంధర్వగానంబులు, నప్సరోగణనర్తనసంవిధానంబులును, దివ్యకాహళభేరీపటహమురజాదిధ్వానంబులును, బ్రకాశమానంబులయ్యె సనందనందాదులైనహరిపార్శ్వచరులును, మహేశ్వరవిరించిమహేంద్రపురస్సరులగుత్రిదశకిన్నరకింపురుష పన్నగసిద్ధసాధ్యగరుడగంధర్వచారణవిద్యాధరాదులును, బ్రజాపతులునునరకంఠీరవదర్శనోత్కంఠితులయిచనుదెంచి* (క॥ కరకమలయుగళకలి

—* బ్రహ్మాదిదేవతలుశ్రీనృసింహమూర్తినివెవ్వేరుగాస్తుతియించుట. *—

తాశిరులై డగ్గఱికభక్తిఁ జేసిరిబహుసం।సరణాబ్ధితరికినఖరికి।నరభోజనహస్తిహరికినరకేసరికిన్* (వ॥ ఆసమయంబున దేవతలందఱు వేఱువేఱ వినుతించిరందుగమలాసనుండిట్లనియె* (మ॥ ఘనలీలాగుణజాలురిన్భువనముల్గల్పించి రక్షించి భేదనముంజేయుదురంతశక్తికినసంతజ్యోతికిం జిత్రవీ । ర్యునికిన్నిత్యపవిత్రకర్మునికినేనుత్కంఠతోనవ్యయాత్మునికిన్వందనమాచరింతెదఁ గృపాముఖ్యప్రసాదార్థినై ॥ రుద్రుండిట్లనియె* (చ॥ అనఘరవరేణ్యమీఁదట సహస్రయుగాంతమునాఁడుగానికో । పమునకువేళగాదుసురబాధకుఁడైనతపస్వినీచరు। న్సమరమునన్వధించితివిచాలుఁ దదాత్మజుఁడైనవీఁడు సద్విమలుఁడునీకు భక్తుఁడు పవిత్రుఁడు గావుముభక్తవత్సలా ॥ ఇంద్రుండిట్లనియె* (సీ॥ ప్రాణిసంఘములహృత్పద్మమధ్యంబులనివసించిభాసిల్లునీవయొఱుఁగుదింతకాలముదానవేశ్వరుచే బాధపడిచిక్కియున్నయావన్నజనుల । రక్షించితివిమమ్మురాక్షసేశ్వరుఁ జంపిక్రతుహవ్యములుమాకుఁ గలిగెనఱల । మంటిమినీసేవమఱిగినవారలుకైవల్యవిభవంబు కాంక్షసేయ । రితరసుఖములెల్లనిచ్ఛయింపఁగనేలయ।స్థిరంబులివియనంతభక్తిఁగొలువనిమ్మునిన్నుఘోరదైత్యానీక।విత్రభయదరంహ శ్రీనృసింహ॥ ఋషులిట్లనిరి* (మ॥ భవదీయాదరలీలలోకములనుత్పాదించిరక్షింపనేఁ।డవిదైత్యేశునిచేతభేదితములై హ్రస్వంబులైయుండనీ । యవినీతున్నరసింహరూపమునసంహారంబునొరీదించివే । దవిధింగ్రమ్మఱనుద్ధరించితిగదాధర్మానుసంధాయివై ॥ పితృదేవతలిట్లనిరి* (శా॥ చండక్రోధముతోడదైత్యుఁడువడిన్ శ్రాద్ధంబులన్మత్సుతు।ల్పిండంబుల్సతిలోదకంబులుగనర్పింపంగమాకీకయు।గ్గండ

త్యంబునఁ దానకైకొను మహాబాధాగ్రుండు పీడకుఁ డుగ్ర। ఖండింపంబడె నీనఖంబుల నుతుల్గావింతు మాత్మేశ్వరా॥ సిద్ధులిట్లని
రి॥ (క॥ శుద్ధంబై యణిమాదిక। సిద్ధులు గైకొన్న దైత్యుఁ జీరితివి మహా। యోద్ధవు నీకృప మాకును। సిద్ధులు మఱలంగఁ గలిగె
శ్రీనరసింహా॥ విద్యాధరులిట్లనిరి॥ (క॥ దానవుని జంపి యంతర్ధానాదికవిద్య లెల్ల దయతో మఱలం। గానిచ్చితివి విచిత్రము। నీ
నిరుపమవైభవంబు నిజము నృసింహా॥ భుజంగులిట్లనిరి॥ (క॥ రత్నములను మత్కాంతా। రత్నంబులఁ బుచ్చికొన్న రక్కసు నుర
ముఁగా। యత్నమునఁ జీల్చివైచితి। పత్నులు రత్నములు గలిగె బ్రతికితి మీశా॥ మనువులిట్లనిరి॥ (క॥ దుర్ణయుని దైత్యుఁ బొరిగొ
ని। వర్ణాశ్రమధర్మసేతువర్గము మఱలం। బూర్ణముఁ జేసితివే సని। వర్ణింతుము కొలిచి బ్రతుకువారము దేవా॥ ప్రజాపతులిట్లని
రి॥ (మ॥ ప్రజలం జేయుటకై సృజించితి మముం బాటించి దైత్యాజ్ఞచేఁ। బ్రజలం జేయక యింత కాలము మహాభారంబుతో నుం
టిమి। కుజనున్ వక్షముఁ జీరి చంపితి విసంకోచంబు లేకెల్లచోఁ। బ్రజలం జేయుచు నుండువారము జగద్భద్రాయమానోదయా॥
గంధర్వులిట్లనిరి॥ (క॥ ఆడుదము రేయుఁ బగలుం। బాడుదము నిశాటు వొద్ద బాధించు దయం। జూడఁడు నీచే జమునిం। గూడెను హా
పాతకునసుఁ గుశలము గలదే॥ చారణులిట్లనిరి॥ (క॥ భువనజనహృదయభల్లుఁడు। దివిజేంద్రవిరోధి నేఁడు దెగె నీచేత। భవరోగ
నివర్తకము। భవదంఘ్రియుగంబుఁ జేరి బ్రతికెద మీశా॥ యక్షులిట్లనిరి॥ (ఉ॥ భ్రంశము లేని నీభటుల భంగి సముత్తుల మమ్ము
నెక్కొని। సంశయ మన్న త్రిదిక్కులఁ బ్రచారముఁ జేయుచునుండు వీఁడు ని। స్త్రింశముతోడ వీఁకఁ గడతేర్చితి వాపద మానె నోచ
తుర్వింశతితత్త్వశాసన త్రివిష్టపముఖ్యజగన్నివాసకా॥ కింపురుషులిట్లనిరి॥ (క॥ పురుషోత్తమ నేరము కింపురుషుల మల్పుల
ము నిన్ను భూషింపఁగ మ। హాపురుషున్నికలుషజనహృ। త్పరుషుం జంపితివి జగము బ్రతికె నధీశా॥ వైతాళికులిట్లనిరి॥ (క॥ త్రిభువ
నశత్రుఁడు వడిమెను। సభలందును మఖములందు జగదీశ్వర। నీశుభగీతములు పఠించుచు। నభయులమై సంచరింతు మాతతశర
ణ్యా॥ కిన్నరులిట్లనిరి॥ (క॥ ధర్మముఁ దలఁపము లఘుతర। కర్మము సేయించు మమ్ముఁ గలుషాత్ముఁడు। దు। ర్మునిఁ జంపితి వున్నతశ
ర్మలమై నీదుభక్తి సలిపెద మీశా॥ విష్ణుసేవకులిట్లనిరి॥ (ఉ॥ సంచితవిప్రశాపమునఁ జండనిశాచరుఁడైన నీ శి। క్షించుట కీడు
గాదు కృపఁ జేసితివీశ్వర భక్తితోడ సే। వించుటకంటె వైరమున వేగమె చేరఁగ వచ్చు నిన్ను నీ। యంచితనారసింహతను వద్భుత
మూపఁ జూపిరందఱుఁ గా॥ (వ॥ ఇట్లు బ్రహ్మరుద్రేంద్రసిద్ధసాధ్యపురస్సరులైన దేవముఖ్యులందఱనేకప్రకారంబుల వినుతించి
రందు రోషవిజృంభమాణుండయిన నరసింహదేవుని డగ్గఱఁ జేర వెఱచి లక్ష్మీదేవిం బిలిచి యిట్లనిరి॥ (క॥ హరికిం బట్టపు దేవివి। హరి
సేవానిపుణమతివి హరిగతివి సదా। హరిరతివి నీవు సనినర। హరిరోషము డింపవమ్మ హరివరమధ్యా॥ (వ॥ అనిన నయ్యకో
సిమహోత్కంఠతోడ నాకలకంఠి నరకంఠీరవుని యుపకంఠంబునకుం జని॥ (సీ॥ ప్రళయార్కబింబంబువగిది నున్నది గా
ని నెమ్మోము పూర్ణేందునిభము గాదు। శిఖిశిఖాసంఘంబు చెలువుఁ జూపెడుఁ గాని చూడ్కి ప్రసాదభాసురము గాదు। వీరరౌ
ద్రాద్భుతవేష మొప్పెడుఁ గాని భూరికృపారసస్ఫూర్తి గాదు। భయదదంష్ట్రాంకురప్రభలు గప్పెడుఁ గాని దరహాసితాంబు
జాతంబు గాదు। కఠినతర నారసింహవిగ్రహము గాని। కామినీజనసులభవిగ్రహము గాదు। విన్నదియుఁ గాదు తొల్లి నే విష్ణువ
లనఁ। గన్నదియుఁ గాదు భీషణాకారముగుట॥ (క॥ వలికెద ననిగమకముఁ గొనుఁ। బలికినఁ గడునలిగి విభుఁడు ప్రతివచనములం। బ
లుకఁడని నిలుచు శశిముఖి। బలువిడి హృదయమునఁ జనుపు భయమును గదురన్॥ (వ॥ ఇట్లు నరహరియావంబు వారిజనివాసిని వీ
క్షించి శంకించి శాంతుండయిన వెనుక డగ్గరియెదనని చింతించుచున్న వారిజసంభవుం డద్దేవుని రోషంబు నివారింప నితరులకలవి
గాదని ప్రహ్లాదుం జీరి యిట్లనియె॥ (క॥ తీండ్రపు గురోషమున నీ। తండ్రి నిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్। వేఁడ్రము విడు
వఁడు మెల్లనఁ। దండ్రీ శీతలునిఁ జేసి దయసేయఁగదే॥ (వ॥ అనిన నాఁగాక యని మహాభాగవతశేఖరుండైన బాలకుండు గరకమ
లంబులు ముకుళించి మందగమనంబున నమందవినయవివేకంబుల నరసింహదేవుని సన్నిధికిం జని సాష్టాంగదండప్రణామంబుఁ
జేసిన భక్తపరాధీనుండగు నయ్యీశ్వరుం డాలోకించి కరుణాయత్తచిత్తుండై॥ (ఉ॥ ప్రాభవ మొప్పఁ గన్గొని కృపామతియై క
దియంగఁ జేసి సం। శోభితదృష్టిసంఘములఁ జూచుచు బాలుని మౌళియందు లో। కాభినుతుండు వెట్టె నసురాంతకుఁ డుద్భటకా
లసర్పభీతాభయదానశస్తమున నర్గళమంగళహేతుహస్తముల్॥ (వ॥ ఇట్లు హరికరస్పర్శనంబున భయవిరహితుండును, బ్ర
హ్మజ్ఞానసహితుండును, పులకితదేహుండును, సముత్పన్నసంతోషబాష్పసలిలధారాసమూహుండును, ప్రేమాతిశయగద్గ
దభాషణుండును, వినయవివేకభూషణుండును, నేకాగ్రచిత్తుండును, భక్తిపరాయత్తుండునై యద్దేవుని చరణకమలంబులు దన
హృదయంబున నిలిపికొని కరకమలంబులు ముకుళించి యిట్లనియె॥ (మ॥ అమరుల్ సిద్ధులు సంయమీశ్వరులు బ్రహ్మాదుల్ సుతాత్ప

—* ప్రహ్లాదుండు నరసింహమూర్తి నిస్తుతించుట. *—

ర్యవృత్తిఁ స్తోత్రములన్నియున్ బహుప్రకారముల నిత్యంబున్ బ్రచారించి పా। రము ముట్టన్నుతి సేయ నోపరట నే రక్షస్తనూజుండఁ గ। ర్వ
మదోద్రిక్తుఁడ బాలుఁడ జ్జడమతిన్ వర్ణింప శక్తుండనే॥ (మ॥ తపమున్ వంశము తేజముం శ్రుతము సౌందర్యంబు నుద్యోగముం। న్ని

పుణత్వంబుఁ బ్రతాపపౌరుషములుఁ బ్రజ్ఞాబలప్రజ్ఞలు । నపస్తపోమంత్రములు చాలవీశ్వర భవత్సంతుష్టికై దంతియూథపుచం
దంబున భక్తిసేయవలయుం దాత్పర్యసంయుక్తుఁడై *(మ॥ అమలజ్ఞానదానధర్మరతిసత్యక్షాంతినిర్మత్సర। త్వములన్ యజ్ఞత
పోనమూయగలఁడున్ దర్పించు ధాత్రీసురో । త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోర్థప్రాణవాక్కర్మముల్ సమ్మతన్నిన్నా
నుంచెనేని భగవత్సంతోషకుండౌటఁ దుర్గ *(సీ॥ అజ్ఞుండు సేసినయపరాధములను జేపట్టఁడీశ్వరుఁడు కృపాళుఁడగుటఁ। జేప
ట్టునొకవేళ సిద్ధమీశ్వరునకునర్థంబు లేకుండు నతఁడు పూర్ణుఁ। డై యర్థములు నీశ్వరార్పణంబులు గాఁగఁ జేయుట ధర్మంబు సే
సె నేని నద్దంబుఁ జూచినఁ దిలకలలామంబు ప్రతిబింబితంబగు పగిదిమఱల । నర్థములు దోఁచుఁ గావున నధికబుద్ధి । భక్తిసేయంగ
వలయును భక్తిగాని మెచ్చఁడర్థంబులోసఁగెసు మేరలంచుఁ బరమకరుణుండు హరిభక్తిబాంధవుండు* (క॥ కావున నప్పుఁడ
సంస్తుతిఁ గావించెద వెఱపులేక కలనేరుపునన్ వర్ణనమును భక్తికిఁ బోవును విద్య మజయించి పురుషుఁడనంతా* (సీ॥ సత్త్వా
కరుఁడవైన సర్వేశ నీయాజ్ఞ శిరములనిడుకొని చేయువారు । బ్రహ్మాదులమరులు భయమొందుచున్నారు నీ భీమ నాకృతి నేఁడు
చూచి రోషంబుమాను నీ రుచిరవిగ్రహములు కల్యాణకరములు గాని భీతి । కరములు గావు లోకములకున్ శ్రీకవన్నగంబు లభం
గి భయముఁ జేయు నపరముగ్గిం దిలిపి సాధుహర్షమయ్యె నవతరించినపని దీఱెనలుక యేలఁ గలువహారివిసంతోషకారివగుము
నిన్నుఁ దలఁతురు లోకులు నిర్మలాత్మ *(మ॥ ఖరదంష్ట్రాభ్రుకుటీసటానఖయునుగ్రధ్వానయున్ రక్తకేసరయుం దీర్ఘితరాంత్ర
మాలికయు భాస్వన్నేత్రయునైన నీ । నరసింహాకృతిఁ జూచి నే వెఱవఁ బూర్ణక్రూరదుర్వారదు । ర్భరసంసారదవాగ్నికి
న్వెఱతు నీపాదాశ్రయుం జేయవే *(వ॥ దేవా సకలయోనులందును సుఖవియోగదుఃఖసంయోగజనితంబైన శోకానలంబున
దందహ్యమానుండనై దుఃఖనివారకంబుగాని దేహాద్యభిమానంబున మోహితుండనై పరిభ్రమించుచున్న యేను నాయంబి
యుండవు సఖుండవు పరమదేవతయునైన నీ బ్రహ్మగీతంబులగు నీ లీలావతారవిశేషంబులఁ బఠియించుచు రాగాదివిముక్తుండ
నై దుఃఖపుంజంబులు దరించి భవదీయచరణకమలస్మరణసేవానిపుణులైన భక్తులం జేరియుండెద బాలునిం దల్లిదండ్రులును
రోగికి వైద్యదత్తంబయిన యౌషధంబును, సముద్రంబున మునింగెడివానికి నావయును, దక్కరులు రక్షింపలేని తెఱంగున సం
సారతాపసంతప్యమానుండై నీచేత నుపేక్షితుండయినవాని నుద్ధరింప నెవ్వండును సమర్థుండుగాఁడు జగంబుల నె
వ్వండేమికృత్యంబున నెవ్వనిచేతం బ్రేరితుండయి యేయింద్రియంబులం జేసి యేమిటికొఱకు నెవ్వనికి సంబంధియై యేస్థలం
బున నేసమయంబున నేదేమిరూపంబున నేగుణంబయిన నేపరంబుననైన జనకాదిభావంబును బొందించి పరంబైన బ్రహ్మాదిభా
వంబున రూపాంతరంబు నొందించునట్టి వివిధప్రకారంబులన్ని నీవ సత్త్వముక్తుండవు రక్షకుండవు నీయంశంబైన పురుషునికి నీ
యనుగ్రహంబునఁ గాలంబుచేతం బ్రేరితమై కర్మమయంబును, బలయుతంబును, ప్రధానలింగంబునునైన మనంబును, మా
య సృజించు నవిద్యాకల్పితవికారంబును, వేదోక్తకర్మప్రధానంబును, సంసారచక్రాత్మకంబయిన యీమనమున నన్ను సేవిం
పక యమించి తరియింపనొక్కండును సమర్థుండు లేఁడు విజ్ఞాననిర్జితబుద్ధిగుణుండవు నీవు నీవలన వశీకృతకార్యసాధనశక్తియై
న కాలంబు మాయతోడం గూడ షోడశవికారయుక్తంబయిన సంసారచక్రంబుఁ జేయుచుండు సంసారదావదహనసంతప్య
మానుండ గున్నన్ను రక్షింపుము *(సీ॥ జనులు దిక్పాలుర సంపదాయుర్విభవములు గోరుదురు శుభవ్యంబులనుచు । నవియంతయు
ను రోషహాసజృంభితమైన మాతండ్రిబొమముడిచే హీనముఁ జేసి । విహతంబులగునట్టి వీరుండు నీచేత నిమిషమాత్రంబున నేఁడు
మడిసెఁ । గావున ధ్రువములు గావు బ్రహ్మాదుల శ్రీవిభవంబులు జీవితములు । కాలరూపకుఁడగు నురుక్రమునిచేత । విదళితము
లగు కలువవువేయు నేల యితరమేనొల్ల నీమీఁది యొలుక గొంత గలిగియున్నది గొలుతుఁ గింకరుఁడనగుచు *(మత్తకోకిల॥ ఎండ
మావులవంటి భద్రములెల్ల సార్థములంచు మర్త్యుండు లోకనిధానదేహముతో విరక్తుఁడు గాకయు । ద్దండమన్మథవహ్ని నెప్పు
డు దప్తుఁడై యొకనాఁడుఁ జేరఁడు పారము దుష్టసౌఖ్యపరంపరాక్రమణంబునన్ *(ఉ॥ శ్రీమహిళా మహేశ సరసీరుహగ
ర్భులకైన నీ మహిమ । హస్తాకరంబు చేన భయదానము జేయ నీవు బాలుఁడం । దామసవంశసంభవుఁడ దైత్యుఁడనుగ్రర
జోగుణుండ నిస్సీమ దయం గరాంబుజము శీర్షముఁ జేర్పుట చోద్యమీశ్వరా * (వ॥ మహాత్ములు జనులైన బ్రహ్మాదులందును, సు
జ్ఞులైన మాయందును, సేవానురూపంబునం బక్షపాతంబులు లేక కల్పవృక్షంబు చందంబున ఫలప్రదానంబు సేయుదువు కం
దర్పదర్పమేతంబగు సంసారకూపంబునం గూలుచున్న మూఢజనులం గూడి కూలెడి నేను భవదీయభృత్యుండగు నారదుని య
నుగ్రహంబునం జేసి నీకృపకుఁ బాత్రుండనైతి నన్ను రక్షించి మజ్జనకుని వధియించుటనాయందులఁ బక్షపాతంబుగాదు దుష్టజ
నసంహారంబును, శిష్టభృత్యమునిజనరక్షాప్రకారంబును, నీకునైజగుణంబులు విశ్వంబు నీవ గుణాత్మకంబైన విశ్వంబు సృజి
యించి యందుం బ్రవేశించి హేతుభూతగుణయుక్తుండవై రక్షకసంహారకాది నానారూపంబులనుండుదువు సదసత్ప్రకా
రకార్యాత్మకంబైన విశ్వంబునకుం బరమకారణంబు నీవ నీమాయచేత వీఁడు వాఁడనిరెడ బుద్ధివికల్పంబు దోఁచుఁ గాని నీకం

చెనొండెద్దియు లేదు బీజంబునందు వస్తుమాత్రభూతసౌక్ష్మ్యంబును, వృక్షంబునందు నీలత్వాదివర్ణంబునుం గలుగు తెఱంగు నవిశ్వంబునకునీయంద జన్మస్థితిప్రళయనాశంబులుం గలుగునీచేతనైనవిశ్వంబు నీయందణిలుపుకొని తొల్లి ప్రళయకాలపారావారంబునఁ బన్నగేంద్రపర్యంకంబునఁ గ్రియారహితుండవై నిజసుఖానుభవంబు సేయుచు నిద్రితుఁభంగి యోగనిమీలితలోచనుండవై యుండుచుఁ గొంతగాలంబునకు నిజకాలశక్తిచేతఁ బ్రేరితంబులై ప్రకృతిధర్మంబులగు సత్త్వాదిగుణంబులంగీకరించి సమాధిఁ జాలించి వెలుంగుచున్న నీనాభియందు వటబీజమువలన నుద్భవించు వటంబు తెఱంగున నొక్కకమలంబు సంభవించెనట్టికమలంబున నాల్గుమోముల బ్రహ్మ జన్మించి దిశలు వీక్షించి కమలంబునకు నొండయిన రూపంబు లేకుండుటఁ జింతించి జలాంతరాళంబుఁ బ్రవేశించి జలంబులందు నూఱుదివ్యవత్సరంబులు వెదకి తనజన్మంబునకు నుపాదానకారణంబైన నిన్ను దర్శింపనసమర్థుండగుటగాక మగిడి కమలంబుకడకుం జని విస్మయంబు నొంది హిరణ్యగర్భుండు చిరకాలంబు నిర్భరతపంబుఁ జేసి పృథివియందు గంధంబుగను చందంబునఁ దనయందు నానాసహస్రవదనశిరోనయన నాసాకర్ణవక్త్రభుజకర చరణుండును, బహువిధాభరణుండును, మాయాకలితుండును, మహాలక్షణలక్షితుండును, నిజప్రకాశదూరీకృతతముండునునై, బురుషోత్తముండునైన నిన్ను దర్శించె నయ్యవసరంబున* (క॥ ఘోటకవదనుఁడవై మధు । కైటభులం ద్రుంచి నిగమగణముల నెల్లం। బాటించి యజునకిచ్చిన । కూటస్థుఁడవీశ్వరుఁడవు కోవిదవంద్యా* (వ॥ ఇవ్విధంబునఁ గృతత్రేతద్వాపరంబులను, మూఁడు యుగంబులందును, దిర్యఙ్మానవముని జలచరాకారంబులనవతరించి లోకంబులనుద్ధరించుచు, ధరియించుచు, హరియించుచు, యుగానుకూలధర్మంబులం బ్రతిష్ఠించుచునుండుదువు దేవా యవధరింపుము* (సీ॥ కామహర్షాదిసంకలితమై చిత్తంబు భవదీయచింతనపదవి సోరదు । మధురాదిరసములనుఱిగి చొక్కుచు జిహ్వ నీవర్ణనమునకు నిగుడనీదు । సుందరీముఖములఁ జూడఁగోరెడి చూడ్కి దావకాకృతులపైఁ దగులువడదు । వివిధదుర్భాషలు వినఁగోరు వీనులు వినవు యుష్మత్కథావిరచనములు । ఘ్రాణమురువడిఁ దిరుగు దుర్గంధములకుఁ । దనువు గొలువదు వైష్ణవధర్మములకు । నడఁగియుండవు కర్మేంద్రియములు పురుషులఁ గలఁచు సవతులు గృహమేధిఁ గలఁచునట్లు* (వ॥ ఇవ్విధంబున నింద్రియంబులచేతఁ జిక్కువడి స్వకీయ పరకీయ శరీరంబులందు మిత్రామిత్రభావంబులు సేయుచు జన్మమరణంబుల నొందుచు సంసారవైతరణీ నిమగ్నంబయిన లోకంబు నుద్ధరించుట లోకసంభవస్థితిలయకారణుండవైన నీకుం గర్తవ్యంబు భవదీయ సేవకులమయిన మాయందుఁ బ్రియభక్తులైన వారలనుద్ధరింపుము* (మ॥ భగవద్దివ్యగుణానువర్ణనసుధాప్రాప్తైకచిత్తుండనై । బెగడన్ సంసరణోగ్రవైతరణికిన్ భవన్నాత్ములైతా

ఎకి। యగుణస్తోత్రపరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్యభావంబుల । న్మగతింగాననిమూఢుల న్గని మది న్శోకింతు సర్వేశ్వరా * (వ॥ దేవా మునీంద్రులు నిజవిముక్తికాములై విజనస్థలంబులం దపంబు లాచరింతురు కాముకత్వంబు నొల్లక నుండు వారికి నీకంటె నొండు శరణంబు లేదు నిన్ను సేవించెదం గొందఱు కాముకులు శరద్వ్యయకండూతి చేతం దనియని చందంబునఁ దుచ్ఛము యిపశుపక్షి క్రిమికీటసామాన్యంబైన మైథునాది గృహమేధిసుఖంబులందనియక కడపటనతిదుఃఖవంతులగుదురు నీప్రసాదంబుగలుగు గుణంబు నిష్కాముండై యుండు మౌనవ్రతజపతపశ్శ్రుతాధ్యయనంబులును నిజధర్మవ్యాఖ్యాన విజనస్థలనివాసనియమంబులును మోక్షహేతువులగునైన నివిపది యునింద్రియజయంబు లేనివారికి భోగార్థంబులై విశ్రమించు వారికి జీవనోపాయంబులై డాంభికులకు వార్తాకరంబులై యుండు సఫలంబులుగావు భక్తిలేక భవదీయజ్ఞానంబు లేదు రూపరహితుండవైన నీకు బీజాంకురంబులకై వడిఁ గారణకార్యంబులైన సదసద్రూపంబులు రెండును ప్రకాశమానంబులగునా రెంటియందును భక్తియోగంబున బుద్ధిమంతులు మథనంబున దారువులందు వహ్నిం గనియెడు తెఱంగున నిన్నుం బొడగందురు పంచభూతతన్మాత్రంబులు ప్రాణబుద్ధీంద్రియంబులును మనోహంకారచిత్తంబులును నీవ సగుణంబును నిర్గుణంబును నీవ గుణాభిమానులైన జన్మమరణంబుల నొందు బుధులాద్యంతంబులుగానక నిరుపాధికుండవైన నిన్నెఱుంగరు తత్త్వజ్ఞులైన విద్వాంసులు వేదాధ్యయనాదివ్యాపారంబులు మాని వేదాంతప్రతిపాద్యుండవగు నిన్ను సమాధివిశేషంబుల నెఱింగి సేవింతురది గావున* (సీ॥ నీగృహాంగణభూమినిటలంబు ప్రోవంగ మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని । నీమంగళస్తవనికరవర్ణంబులు పలుమారు నాలుకఁ బలుకఁడేని నీయధీనములుగా నిఖిలకృత్యంబులు ప్రియభావమున సమర్పింపఁడేని । నీపదాంబుజములు నిర్మలహృదయుడై చింతించి మక్కువ ఏజక్కఁడేని । నిన్నుఁ జెవులార వినఁడేని నీకు సేవఁ జేయరాఁడేని బ్రహ్మంబుఁ జెందఁగలఁడె । యోగియైనఁ దపోవ్రతయోగియైన । వేదియైన మహాతత్త్వవేదియైన* (వ॥ కావున భవదీయదాస్యయోగంబు కృపఁ జేయుమని ప్రణతుండైన ప్రహ్లాదుని వర్ణనంబులకు మెచ్చి నిర్గుణుండైన హరి రోషంబు విడిచి యిట్లనియె* (శా॥ సంతోషించితి నీచరిత్రములకున్ సద్భద్రమాగాక నీ । యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదన్ చింతం జెందకు భక్తకామదుఁడ నే సర్వార్థంబు మర్త్యోర్వర జంతుశ్రేణికి నన్నుఁ జూచి

నంబునర్జన్మంబు లేదర్భకా* (గీ॥ సకలభావములను సాధులువిద్వాంసు। లఖిలభద్రవిభుండనైననన్నుఁ। గొల్తు) రిమ్మటం జేయఁగోరుదురిచ్చెదఁ గోరుమెద్దియైనఁ గుఱ్ఱనీవు* (వ॥ అని పరమేశ్వరుండు ప్రహ్లాదునియందుఁ గల నిష్కామత్వంబుఁ దెలియఁగోరి యకుపవంచించియిట్లానతిచ్చిన నతండు నిష్కాముండైన యేకాంతభక్తుండు గావున, గామంబు భక్తియోగంబునకు నంతరాయంబని తలంచి యిట్లనియె - నుత్పత్తి మొదలు కామాద్యనుభవాసక్తిగల నాకు వరంబులిచ్చెదనని వంచింప నేల సంసారబీజంబులును హృదయబంధకంబులునైన కామంబులకు వెఱచి ముముక్షుండనై నీ సేమంటుకొని యున్న నేనంబునఁ గన్నుం జేరితిఁ గామంబులు నింద్రియంబులును, మనశ్శరీరధైర్యంబులును, మనీషాప్రాణధర్మంబులును, లజ్జాస్మరణలక్ష్మియు, సత్య తేజోవిశేషంబులును, నశించు లోకంబులందు భృత్యులర్థకాములయి రాజుల సేవింతురు రాజులుం బ్రయోజనంబులర్థించి భృత్యులకు నర్థంబు లొసంగుదురివ్విధంబునఁ గామనాకుం గామంబు లేదు నీకుం బ్రయోజనంబు లేదైన దేవా వరదుండవయ్యెదవేనిఁ గామంబు వృద్ధిఁబొందని వరంబు కృపఁ జేయుము కామంబుల విడిచిన పురుషుండు నీతోడ సమానవిభవుండగు నరసింహ పరమాత్మ పురుషోత్తమ యని ప్రణవపూర్వకంబుగా నమస్కరించిన, హరి యిట్లనియె* (సీ॥ నీవంటి విజ్ఞాననిపుణు లేకాంతులు గోరరు లు నా యంద గోరవొల్ల। రట్లైన బ్రహ్లాద యసురేంద్రభర్తవై సాగి మన్వంతరసమయమెల్ల। నిఖిలభోగంబులు నీవు భోగింపుము కల్యాణబుద్ధి నా కథలు వినుము। సకలభూతములందు సంపూర్ణుఁడగు నన్ను యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి। కర్మచయములెల్ల ఖండించి పూజనమాచరింపు మీశ్వరార్పణముగ। భోగముల నశించు పుణ్యంబు వ్రతములఁ। బాపసంచయములు పాపు నిన్ను* (వ॥ మఱియు నట మీఁదఁ గాలవేగంబునం గళేబరంబు విడిచి వైరిలోకవ్యవిరాజమానంబును, దివిజరాజ జేగీయమానంబును, బరిపూరితదశదిశంబునైన యశంబుతోడ ముక్తబంధుండవై నన్ను డగ్గిరియెదవు వినుము* (గీ॥ నరుఁడు ప్రియముతోడ నా యవతారంబు। నీ యుదారగీతకరములను। మానసించె నేని మఱి సంభవింపఁడు। కర్మబంధచయముఁ గడచిపోవు॥ అనిన బ్రహ్లాదుం డిట్లనియె* (సీ॥ దంష్ట్రివై తొల్లి సోదరుని హిరణ్యాక్షుని నీవు సంపుటఁ జేసి నిగ్రహమున। మాతండ్రి రోషనిర్మగ్నుఁడై సర్వలోకేశ్వరుఁ బరమునిన్నెఱుఁగలేక। పరిపంథివగిది నీభక్తుండనగు నాకు నపకారములు సేసెనతఁడు నేఁడు। నీ శాంతదృష్టిచే నిర్మలత్వము నొందెఁ గావున పాపసంఘంబువలనఁ। బాసి శుద్ధాత్ముఁడు గాఁగ భవ్యగాత్ర। వరము వేఁడెద నాకిమ్ము వనజనేత్ర। భక్తసంఘాతముఖపద్మపద్మమిత్ర। భక్తకల్మషవల్లికాపటులవిత్ర॥ అనిన భక్తవత్సలుం డిట్లనియె* (మ॥ నిజభక్తుండవు నాకు నిన్నుఁ గనుటన్ నీ తండ్రి త్రిస్సప్తపూర్వజులం గూడి పవిత్రుఁడై శుభగతిన్ వర్తించు విజ్ఞాననిధీ। పజితానేకభవాంధకారులగు మద్భక్తుల్ విమోదించు దేశజనుల్ దుర్జనులైన శుద్ధులు సుమీ సత్యంబు దైత్యోత్తమా* (సీ॥ ఘనసూక్ష్మభూతసంఘాతంబులో వలనెల్ల వాంఛలు మాని యెవ్వరయిన। నీచందమున నన్ను నెఱియ సేవించిన మద్భక్తులగుదురు మత్పరులకు। గుఱి సేయ నీవ యోగ్యుఁడవైతి విటమీఁద వేదచోదితమయిన విధముతోడఁ। జిత్తంబు నామీఁద జేర్చి మీ తండ్రికిఁ బ్రేతకార్యములు సంప్రీతిఁ జేయు। మతఁడు రణమున నేఁడు నా యంగమర్శనముల నిర్మలదేహుఁడై నవ్యమహిమ। నవగతాఖిలకల్మషుఁడై తనర్చి। పుణ్యలోకంబునకు నేగుఁ బుణ్యచరిత* (వ॥ అని యిట్లు నరసింహదేవుం డానతిచ్చినం బ్రహ్లాదుండు హిరణ్యకశిపునకుం బరలోకక్రియలు చేసి భూసురోత్తముల చేత నభిషిక్తుండయ్యె నయ్యెడఁ బ్రసాదసంపూర్ణముఖుండైన శ్రీనృసింహదేవునిం జూచి దేవతాప్రముఖ సహితుండై బ్రహ్మదేవుం డిట్లనియె* (సీ॥ దేవదేవాఖిలదేవేశ భూతభావన వీఁడు నాచేత వరము వడసి। మత్సృష్టిజనులచే మరణంబు నొందక మత్తుఁడై సకలధర్మములు చెఱిచె। నేఁడు భాగ్యంబున నీచేత హతుఁడయ్యెఁ గల్యాణమమరె లోకములకెల్ల। బాలు నీతని మహాభాగవతశ్రేష్ఠుఁ బ్రతికించితివి మృత్యుభయము వాపి। వరము కృప జేసితివి మేలు వారిజాక్ష। నీ నృసింహావతారంబు నిష్ఠతోడఁ। దగిలి చింతించువారలు దండధరుని। బాధనొందరు మృత్యువుఁ బాఱఁబడరు* (వ॥ అనిన నరసింహదేవుం డిట్లనియె* (క॥ మన్నించి దేవశత్రులకెన్నఁడు నిటువంటి వరములీకుము పాపోత్పన్నులకు వరములిచ్చుట। పన్నగములకమృతమిడుట వంకజగర్భా* (వ॥ అని యిట్లానతిచ్చి బ్రహ్మాది దేవమునులచేఁ బూజితుండై భగవంతుండైన శ్రీనృసింహదేవుండు తిరోహితుండయ్యెఁ బ్రహ్లాదుండును భూలికిఁ బ్రణతుండై తమ్మిచూలికి వందనంబులు చేసి ప్రజాపతులకు మ్రొక్కి భగవత్కళలైన దేవతలకు నమస్కరించినం జూచి బ్రహ్మదేవుండు శుక్రాదిమునీంద్రసహితుండై దైత్యదానవ రాజ్యంబునకుఁ బ్రహ్లాదుం బట్టంబు గట్టి యతని చేతఁ బూజితుండై దీవించె నంత నీశానాది నిఖిలదేవతలు వివిధంబులగు నాశీర్వాదంబుల చేత నా ప్రహ్లాదుని గృతార్థుఁ గాఁ జేసి తమ్మిచూలి నిముందలనిడుకొని నిజస్థానంబులకుఁ జనిరిట్లు విష్ణుదేవుని నిజపార్శ్వచరులిరువురు బ్రాహ్మణశాపంబునం జేసి ప్రథమజన్మంబున దితిపుత్రులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను వరాహ నారసింహరూపంబుల వధించె ద్వితీయభవంబున రావణకుంభకర్ణులయిన శ్రీరామరూపంబున సంహరించెఁ దృతీయజన్మంబున శిశుపాలదంతవక్త్రులయిన శ్రీకృష్ణరూపంబున ఖండించె నివ్విధం

బురమాఁడుజన్మంబులగాఢవైరానుబంధంబున నిరంతర సంభావితధ్యానులై వారలుహరినిండాది పాపముక్తులైహరిం గలిసిరనిచెప్పినారదుండిట్లనియె* (ఉ॥ శ్రీరమణీయమైననరసింహవిహారమునింద్రశత్రుసం । హారముఁబుణ్యభాగవతుఁడైన నిశాచరనాథపుత్రసం। చారమునెవ్వఁడైనసువిచారతవిన్నఁబఠించినన్శుభా। కారమతోడ నేభయముగల్గనిలోకముఁజెందుఘూవరా** (మ॥ జలజాతప్రభవాదులున్మనములోఁజర్చించి భాషావళిం। బలుకన్లేనిజనార్దనాహ్వయపరబ్రహ్మంబునీయింటిలోఁ। జెలియై మేనమఱందియై సచివుఁడై చిత్తప్రియుండై మహా। ఫలసంధాయకుఁడై చరించుటమహాభాగ్యంబురా

త్రిపురాసురసంహారము.

జోత్తమా* (క॥ బహుమాయుఁడైనమయుచే। విహితంబగుహరునియశము విఖ్యాతజయా। వహమునగనీభగవంతుఁడు। మహితాత్ముఁడుమున్నొనర్చెమనుజవరేణ్యా॥ అనినధర్మనందనుండిట్లనియె* (క॥ ఏకర్మంబునవిభుఁడగుశ్రీకంఠునియశముమయుని చేసుఁజెడియె। నెవ్వఁడుఁ డెవ్విధంబునఁ। గైకొనితత్కీర్తిచక్కఁగానొనరించెన్॥ అనిననారదుండిట్లనియె* (క॥ చక్రాయుధబలయుతులగు। శక్రాదులకోపాటించిశ్రమమునసురు। లక్రోధంబుననరిగిరి। విక్రమములుమానిమయునివెనుకకుఁదిపా* (వ॥ ఇట్లుగక్కసులుదనవెనుకఁజొచ్చినమాయానిలయుండును, దుర్దముండునైనమయుండుదనమాయాబలంబుననయోరజతసువర్ణంబులై యెవ్వరికిలక్షింపరానిగమనాగమనంబులును, వితర్కింపరానికక్కశపరిచ్ఛదంబులుఁగలిగినత్రిపురంబులు నిర్మించియిచ్చిన నక్తంచరులందునందుఁబ్రవేశించికామసంచారులై పూర్వవైరంబుఁదలందినాకనాయకానీకంబులయిన లోకంబులనస్తోకంబులయినబలాతిరేకంబులశోకంబులనొందించిన* (క॥ లోకాధినాథులెల్లను। శోకాతురులగుచునేగిచొచ్చిరిమస్తానీకవిదళనాకంఠుకా। శ్రీకంఠున్భువనభరణచిత్తోత్కంఠున్* (వ॥ ఇట్లుసకలలోకేశ్వరుండగుమహేశ్వరుంజేరి లోకపాలకులుప్రణతులై పూజించికరకమలంబులుముకుళించి* (క॥ త్రిపురాలయులగుదానవు। లపరాజితులగుచుమాకునత్రాంతంబున్బురాదిపీడఁజేసెద। రపరాధికులనువధింపుమగజాధీశా* (క॥ దీనులముగాకయుష్మద। ధీనులమైయుండుమేముదేవాహితదోర్లీనులమైశారముబల। హీనులమగుమమ్ముఁగావుమీశానశివా* (వ॥ అనినభక్తవత్సలుండగుపరమేశ్వరుండుశరణాగతులయినగీర్వాణులవెఱవకుండనిదుర్వారబలంబునబాణాసనంబుఁగేలనందికొనియొక్క దివ్యబాణంబుసంధించిత్రిపురంబులపై నేసిన మార్తాండమండలంబునవెలువడుమయూఖజాలంబుల చందంబునఁదద్బాణంబువలనఁ దేదీప్యమానంబులైనయనేకబాణసహస్రంబులుసంభవించి భూనభోంతరాళంబులు నిండిమండితెప్పలుగాఁగుప్పలుగొని త్రిపురంబులపైఁగప్పినప్పుడుతద్బాణపావకహేతిసందోహదందహ్యమానులయి గతాసులయినత్రిపురనివాసులందెచ్చిమహాయోగియైనమయుండుసిద్ధరసకూపంబునవైచిన* (క॥ సిద్ధామృతరసమహిమను। శుద్ధమహావజ్రతుల్యశోభితతనులై। వృద్ధిం బొందిరిదానవు। లుద్ధతనిర్ఘాతపావకోపములగుచున్* (క॥ రూపామృతరససంగతి। దీపితులైనిలిచియున్నదేవాహితులన్। రూపించిచింతనొందెడు। గోపత్ప్రజుఁజూచిచక్రికుహనాన్వితుఁడై* (ఉ॥ ఉత్సాహంబుననొక్కపాడిమొదవై యాధంబుఘ్రాణించుచున్। వత్సంబైతనవెంటబ్రహ్మనడువవైకుంఠుఁడేతెంచియు। ద్యత్సత్వంబునఁగూపమధ్యరసముంద్రావెన్విలోకించుచున్। దత్సౌభాగ్యనిమగ్నులైమఱచిరాదైత్యుల్నివారింపఁగన్* (వ॥ ఇట్లువిష్ణుండు మోహనాకారంబునధేనువైవచ్చిత్రిపురమధ్యకూపామృతరసంబుద్రావిననెఱింగి శోకాకులచిత్తులయిన రసకూపపాలకులంజూచిమహాయోగియైన మయాసురుండువెఱఁగుపడిదైవగతింజింతిందిశోకింపకయిట్లనియె* (గీ॥ అమరుఁడైనదనుజుఁడైనరుండైన। నెంతనిపుణుఁడయిననెవ్వడైన। దైవికార్థచయముదప్పింపఁగాలేఁడు। వలదుదనుజులారవగవమనకు* (వ॥ అనిపలికెనంతవిష్ణుండునైజంబులైనధర్మజ్ఞానవిద్యాతపోవిరక్తిసమృద్ధిక్రియాశక్తివిశేషంబులశంభునికిఁ బ్రాధాన్యంబునమర్చించి రథసూతకేతువర్మవాహనబాణచాపానవప్రముఖసంగ్రామసాధనంబులంజేసినఁగైకొని* (మ॥ శరియై కార్ముకియైమహాకవచియైసన్నాహియైవాహియై। సరథుండైవనియంతయైనబలుఁడై సత్కేతనచ్ఛత్రుఁడై। పరమేశుండొకబాణముస్విడిచెఁదద్బాణానలజ్వాలలం। బురముల్గాలెఁజటుచ్చటాధ్వనిన భూభామధ్యమున్నిండఁగన్* (వ॥ ఇట్లుహరుండుదురవగాహంబులైనత్రిపురంబులనభిజిన్ముహూర్తంబునభస్మంబుఁజేసికూల్చినఁనమరగరుడగంధర్వసిద్ధసాధ్యయక్షవల్లభులువీక్షించి జయజయశబ్దంబులుసేయుచుఁగుసుమవర్షంబులుగురిసిరి - ప్రజలుహర్షించిరి బ్రహ్మాదులుగీర్తించిరి -యప్సరసలునర్తించిరి - దివ్యకాహళదుందుభిరవంబులును, మునిజనమోత్సవంబులుఁబ్రచురంబులయ్యె నిట్లువిశ్వజనీనంబగుత్రిపురాసురసంహారంబుననఖిలలోకులును సంతసిల్లియుండ నయ్యవసరంబున* (గీ॥ తృణకణములభంగిఁద్రిపురంబులదహించి। పరముఁడవ్యయుండుభద్రయశుఁడు। శివుఁడుపద్మజాదిజే

నారదుండుధర్మజునకువర్ణాశ్రమధర్మనిర్ణయంబుపదేశించుట.

గీయమానుఁడై। నిజనివాసమునకునేఁగెననియె* (వ॥ ఇట్లునిజమాయావిశేషంబునమర్త్యలోకంబునవిడంబించుచున్నవిష్ణు

యుండు ననినవిని నారదునకు ధర్మ
విపరాక్రమవిధానంబులు మునిజనవంద్యమానంబులై సకలలోకకల్యాణప్రధానంబులై యుండు ననినవిని నారదునకు ధర్మ
నందనుండిట్లనియె*(సీ॥అనఘాత్మ సకలవర్ణాశ్రమాచారసమ్మతధర్మమెయ్యదిమానవులకు। నేధర్మమునసరుండిద్ధవిజ్ఞానము
భక్తియుఁబ్రాపించుఁబద్మజునకు।సాక్షాత్సుతుండవు సర్వజ్ఞుఁడవు నీకు నెఱుఁగరానిదిధర్మమింత లేదు। నారాయణపరాయణ
స్వాంతులనఘులుశాంతులుసదయులుసాధువృత్తి। మెఱయుచున్నఘనులుమీవంటివారెట్టి। పరమధర్మమనుచుభక్తిఁగ..
రట్టిధర్మరూపమఖిలంబు నెఱిఁగింపు। వినఁగనిచ్చగలదువిమలచరిత* (వ॥ అనిననారదుండుధర్మరాజుంజూచి దాక్షు
యండునిజాంశంబున జన్మించిభువనశోభనంబుకొఱకు బదరికాశ్రమంబునఁదపోనిరతుండయియున్న నారాయణునివలనస
నాతనధర్మంబువింటినది సెప్పెద-సకలవర్ణంబుల జనులకుసత్యంబును, దయయు,నుపవాసాదితపంబును, శౌచంబును, సైర
ణయు,సదసద్వివేకంబును, మనోనియమంబును,బహిరింద్రియజయంబును, హింసలేమియు, బ్రహ్మచర్యంబును, దానంబు
ను,యథోచితజపంబును, సంతోషంబును,మార్దవంబును, సమదర్శనంబును,మహాజనసేవయు,గ్రామ్యంబులయినకోరికలు
మానుటయు,నిష్ఫలక్రియలువిడుచుటయు,మితభాషిత్వంబును, దేహంబుగాని తన్ను వెదకికొనుటయు,నన్నోదకంబులుప్రా
ణులకుంబంచియిచ్చుటయుఁ,బ్రాణులందు దేవతాబుద్ధియు,నాత్మబుద్ధిం జేయుటయు, శ్రీనారాయణచరణస్మరణకీర్తన శ్రవ
ణ సేవార్చన నమస్కారదాస్యాత్మసమర్పణ సఖ్యంబులనియెడిత్రింశల్లక్షణంబులుగలుగవలయు, నందుసత్కులాచారుం
డయివిధిచోదితంబులయినగర్భాధానాదిసంస్కారంబులవిచ్ఛిన్నంబులుగాఁగలవాఁడుద్విజుండు ద్విజునకు యజనయాజనా
ధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహంబులనుషట్కర్మంబులువిహితంబులు రాజునకుఁబ్రతిగ్రహవ్యతిరిక్తంబులైనయజనా
దికర్మంబులైదును,బ్రజాపాలనంబును,బ్రాహ్మణులుగానివారివలన దండశుల్కాదులుగొనుటయు,విహితకర్మంబులు. వై
శ్యునికిఁగృషివాణిజ్యగోరక్షణాదికర్మంబులును,బ్రాహ్మణకులానుసరణంబును విహితంబులు, శూద్రునకు ద్విజశుశ్రూష
సేయవలయు*(సీ॥ వినుకర్షణాదివృత్తికంటెను మేలుయాచింపనొల్లనియట్టివృత్తి। ప్రాప్తంబుఁగైకొనిబ్రదుకుకంటెను లె
స్సయనుదినంబునుధాన్యమడిగికొనుట।యాయాచవరముకంటెనధికకల్యాణంబుపరిగెయెన్నలధాన్యభక్షణంబు । శిలజీవన
ముకంటెశ్రేయమాపణముల బడ్డగింజలుదినిబ్రతుకఁగనుట । యడుగుచోటనృపతికీనాల్గువృత్తులు। దగుఁబ్రతిగ్రహంబుఁదలఁ
పఁదగఁడు। నాపదవసరములనధముఁడెక్కువజాతివృత్తినున్నదోషవిధముగాము* (వ॥ వినుము శిలవృత్తియు,నుంఛవృత్తి
యు,ఋతమనియు, నయాచితవృత్తియమృతమనియుఁ, గర్షకవృత్తిప్రమృతమనియు నెన్న
దురట్టివృత్తులజీవించుట మేలుశ్వవృత్తినీచసేవయనిపలుకుదురు - సర్వవేదమయుండు బ్రాహ్మణుండు సర్వదేవమయుండు
క్షత్రియుండు బ్రాహ్మణక్షత్రియులకునీచసేవనంబుగర్తవ్యంబుగాదు* (క॥ దమమును శౌచముదపమును । శమమునుమా
ర్దవముగృపయుసత్యజ్ఞాన। క్షమలునుహరిభక్తియుహార్షమునిజలక్షణములగ్రజాతికినధిపా* (ఉ॥ శౌర్యముదానశీలముఁ
బ్రసాదమునాత్మజయంబుఁదేజముఁ। ధైర్యముదేవభక్తియునుధర్మమునర్థముఁగామమున్బుధా । చార్యముకుంద సేవలును
సత్కృతియుంబరితోషణంబుస।ద్వీర్యమురక్షణంబుఁబృథివీవరశేఖరరాజచిహ్నముల్ *(క॥ ధర్మార్థకామువాంఛయు। నిర్మ
లగురుదేవవిప్రనివహార్చనము।న్నిర్మదభావముప్రమదము। శర్మకరత్వములువైశ్యజనలక్షణముల్ * (ఉ॥ స్తేయములేనివృ
త్తియుశుచిత్వమునన్నుతియున్నిజేశుల । న్మాయలులేకడాయుటయుమంత్రముజెప్పకపంచయజ్ఞము। ల్సేయుటయుంద్విజోత్తరా
మరుల సేవయుగోవులరక్షణంబున । న్యాయములేనియున్మనుజనాథయెఱుంగుముశూద్రధర్మముల్ * (సీ॥ నిలయమువా
టించినిర్మలదేహయైశృంగారమేప్రొద్దుఁజేయవలయు । సత్యప్రియాలాపచతురయైప్రాణేశు చిత్తంబుప్రేమరంజింపవల
యు। దాక్షిణ్యసంతోషధర్మమేధాదులదైవతమునిప్రియుఁదలఁపవలయు। నాథుఁడేపద్ధతినడుచు నాపద్ధతినడిచిసద్బంధులన
డుపవలయు।మార్దవమునఁబతికిమజ్జనభోజన।శయనపానరతులజరుపవలయు । విభుఁడుపతితుఁడయిన వెలఁదిపాతివ్రత్య। మ
హిమఁబుణ్యుఁజేసిమనుపవలయు*(క॥తరుణితనప్రాణవల్లభు।హరిభావముగాఁభజించియతడునుదాను।న్సిరికైవడివర్తిం
చును।హరిలోకమునందుసంతతానందమునన్*(క॥ఉపవాసంబులువ్రతములుఁ। దపములువెయ్యేలభర్తదైవతమనిని।ష్క
పటతఁగొల్చినసాధ్వికి।నృపవరదుర్లభము లేదునిఖిలజగములన్ * (వ॥ మఱియుసంకరజాతులైనరజకచర్మకారకనటబురుడ
కకైవర్తకమ్లేచ్ఛభిల్లురగునంత్యజాతులేడ్వురకుజండాలపుల్కసమాతంగజాతులకును నాయాకులాగతంబులైన వృత్తులఁ
జౌర్యహింసాదులువర్జించిసంచరింపవలయుమానవులకుఁబ్రతియుగంబుననైసర్గికంబులైన ధర్మంబులు రెండులోకంబులం
దుసుఖకరంబులని వేదవిదులైనపెద్దలు సెప్పుదురు కాలుకాలునను నెడు క్షేత్రంబులావు సెడు నందుజల్లినబీజంబులునిస్తే
జంబులైయుండి లెస్సగనంకురింపవు నిరంతరఘృతధారావర్షంబున దహనంబునకుదాహకత్వంబులేక శాంతింజెందునందు

పంచయజ్ఞములు॥ శ్లో॥ పాఠోహోమశ్చాతిథీనాంసపర్యాతర్పణంబలిః। యేతేపంచమహాయజ్ఞాబ్రహ్మయజ్ఞాదినామకాః॥

ప్రేల్చిన హవ్యంబులు ఫలింపవు తద్విధంబున ననవరత కామానుసంధానంబునఁ గామోన్ముఖంబైన చిత్తంబు కామంబులం దనిసి నిష్కామంబై విరక్తి నొందకుం గావున సత్త్వస్వభావంబుతోడ నెప్పుడుఁ దప్పక నిజవంశానుగత విహితధర్మంబు నవర్తించు నరుండు మెల్లన స్వాభావికకర్మపరత్వంబు విడిచి ముక్తి నొందు జాతిమాత్రంబునఁ బురుషుని వర్ణంబు నిర్దేశింప లేదు శమదమాది వర్ణలక్షణవ్యవహారంబులఁ గనవలయు ననినారదుం డిట్లనియె॥ (క॥ క్రమమున వర్ణంబులచి । హ్నము లెల్లను జెప్పఁబడియె నాశ్రమముల ధర్మము లెఱుఁగిం చెద నన్నియు । సముదాహితహృదయ శూలసదమల శీలా॥ (వ॥ వినుము బ్రహ్మచారి మౌంజీకౌపీనయజ్ఞోపవీత కృష్ణాజిన పాలాశదండ కమండలు ధరుండును, సంస్కారరహిత శిరోరుహుండును, దర్భహస్తుండును, శీలప్రశస్తుండును, మౌనియునై త్రిసంధ్యంబుల బ్రహ్మగాయత్రి జపియించుచు, సాయంప్రాతరవసరంబుల నర్కపావక గురుదేవతోపాసనంబులు సేయుచు గురుమందిరంబునకుం జని దాసునిచందంబున భక్తి వినయ సౌమనస్యంబులు గలిగి వేదంబులు చదువుచు నధ్యయనోపక్రమావసానంబుల గురుచరణంబులకు నమస్కరించుచు రేపుమాపును విహితగృహంబుల భిక్షించి భైక్షంబు గురువునకు నివేదించి యనుజ్ఞ గొని మితభోజనంబు గావించుచు విహితకాలంబుల నుపవసించుచు నంగనయందు నంగనాసక్తులందుం బ్రయోజనమాత్ర భాషణంబు లొనర్చుచు గురుపరాంగనలవలన నభ్యంగన కేశప్రసాధన శరీరమర్దన మజ్జనరహస్యయోగంబులు వర్జించుచు గృహంబుననుండక జితేంద్రియత్వంబున సత్యభాషణుండయి సంచరింపవలయు॥ (గీ॥ పొలఁతి దావవహ్ని పురుషుం డాజ్యఘటంబు । గరఁగకుండ రాదు కదిసెనేని । బ్రహ్మమైనఁ గూఁతుఁ బట్టక మానఁడు । వటునకింత పొత్తు వలను వలదు॥ (వ॥ వినుము స్వరూపసాక్షాత్కారంబున దేహబహిరింద్రియాదికంబైన యంతయు నాభాసమాత్రంబు గాని నిశ్చయించి యెంతదాఁక జీవుండు స్వతంత్రుండయిన యీశ్వరుండు గాకుండు నంతదడవు నంగన యిది పురుషుండ నేన నియెడిబుద్ధి మానుట కర్తవ్యంబు గాదు - బ్రహ్మచారి, యతి, గృహస్థులం దెవ్వఁడయినఁ జిత్తంబు పరిపక్వంబు గాక నద్వైతానుసంధానంబు సేసి మూఢుండగుం గావున రహస్యంబునఁ బుత్రికనైన డాయకుండవలయు॥ (చ॥ శిరమున మేన సంస్కృతులు సేయక చందనభూషణాద్యలం । కరణము లెల్ల మాని ఋతుకాలముల న్నిజభార్యఁ బొందుచుం । దరుణులఁ జూడ బాఱక దృఢవ్రతుఁడై మధుమాంసవర్జియై । గురుతరవృత్తి నోమెఁగు కోవిదుఁ డొక్క గృహస్థుభూవరా॥ (వ॥ మఱియు ద్విజుండు గృహస్థుండై గురువులవలన నుపనిషదంగసహితంబైన వేదమంత్రంబు బరియించి నిజాధికారానుసారంబున నర్థవిచారంబుఁ జేసి తనబలంబుకొలంది గురువులకు నభీష్టంబు లొసంగి గృహంబుననొండె, వనంబుననొండె, నైష్ఠికత్వంబు నాశ్రయించి ప్రాణులతోడ జీవించుచు గురువునందు, నగ్నియందు, నాత్మయందు, సర్వభూతంబులందు, నచ్యుతదర్శనంబుఁ జేయుచు, నింద్రియవ్యసనాదిమగ్నుండు గాక మెలుకగలిగి వర్తించుచు పరబ్రహ్మంబు నొందు॥ (క॥ వినుము వనప్రస్థునకున్ముని । కథితములైన నియమములు గలవా చొప్పున వనగతుఁడయి మెలఁగెడు । ఘనుఁడు మహర్లోకమునకు గమనించు నృపా॥ (వ॥ అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి వనంబునకుం జని దున్నక పండెడు నీవారాదికంబుల గ్నిపక్వంబు చేసియొండె, నామంబులు చేసియొండె, నర్కపక్వంబులైన ఫలాదులొండె, భక్షించుచు వన్యాహారంబుల నిత్యకృత్యంబులయిన చరుపురోడాశంబు లొనర్చుచుఁ బ్రతిదినంబు నంబు పూర్వసంచితంబులు పరిత్యజించి నూతనద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్నికొఱకుఁ బర్ణశాలయయినఁ, బర్వతకందరంబయిన నాశ్రయించుచు హిమ, వాయు, వహ్ని, వర్షాతపంబులకు సహించుచు, నఖ, శ్మశ్రు, కేశ, తనూరుహంబులు ప్రసాధితంబులు సేయక జటిలుండై వసియించుచు-దండాజిన కమండలు వల్కలపరిచ్ఛదంబులు ధరియించి పండ్రెండయిన నెనిమిదైన, నాలుగైన రెండయిన నొకవత్సరంబైనఁ దపఃప్రయాసంబున బుద్ధినాశంబు గాకుండ మునియై చరించుచు- దైవవశంబున జరారోగంబుల చేతఁ జిక్కి నిజధర్మానుష్ఠాన సమర్థుండు గాని సమయంబున నిరశనవ్రతుండై యగ్నుల నాత్మారోపణంబు సేసి సన్న్యసించి యాకాశంబునందు శరీరరంధ్రంబులును, గాలియందు నిశ్వాసంబును, దేజంబులోపల సూక్ష్మంబును, జలంబుల రసంబును, ధరణియందు శల్యమాంసప్రముఖంబులును వహ్నియందు వ్యక్తంబుతోడ వాక్కు నింద్రునియందు శిల్పంబుతోడఁ గరంబులును, విష్ణునియందు గతితోడఁ బదంబులును, బ్రజాపతియందు రతితోడ నుపస్థంబును, మృత్యువందు విసర్గంబుతోడ పాయువును, దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రంబును, వాయువందు స్పర్శంబుతోడఁ ద్వక్కును; సూర్యునియందు రూపంబుతోడఁ జక్షువులును, సలిలంబులందు బ్రచేతస్సహితయయిన జిహ్వయు, క్షితియందు గంధసహితంబయిన ఘ్రాణంబును, జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును, కవియైన బ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు, రుద్రునియందహంకారంబుతోడ మహత్త్వంబును, క్షేత్రజ్ఞునియందు సత్త్వంబుతోడఁ జిత్తంబును జెందించి, యటమీఁద బృథివియందు బృథివిని, జలంబునందు జలంబును దేజంబునందుఁ దేజంబును, వాయువందు వాయువును, గగనమందు గగనము, నహంకార తత్త్వమందు నహంకారమును, మహ

తా, వేదపాఠము, వైశ్వదేవాది హోమము, అతిథిపూజ, పితృతర్పణము, భూతబలి, అనునీయయిదును పంచమహాయజ్ఞములనం బరఁగును.

త్త్వమ్మునంచుమహత్తత్త్వమ్మును, బ్రకృతియందుఁ బ్రకృతి, నక్షరుండయిన పరమాత్మయందును లయంబునొందించి చిన్మాత్రావశేషితుండయినక్షేత్రజ్ఞుండగు తన్నునక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుండై దగ్ధకాష్ఠుండైనవహ్నిచందంబునఁబరమాత్మమైననిర్వికారపరబ్రహ్మంబునందులీనుండుగావలయు.* (క॥ అనఘువనప్రస్థుండై । చనితద్ధర్మంబులిట్లుసలుపుచుమఱి యున్మనెనేనిసన్న్యసింపం।జనునటమీఁదటనుముక్తిసంగత్వమునకా.* (వ॥ ఇట్లువానప్రస్థాశ్రమంబుజఱిపిసన్న్యసించి దేహమాత్రావశిష్టుండును, నిరపేక్షుండును, భిక్షుండును, నిరాశ్రయుండు, నాత్మారాముండును, సకలభూతసముండును, శాంతుండును, సమచిత్తుండును, నారాయణపరాయణుండునై కౌపీనంబను నాచ్ఛాదనమాత్రంబైన వస్త్రంబుధరియించి, దండాదివ్యతిరిక్తంబులువిసర్జించి, యాత్మపరంబులుగాని శాస్త్రంబులువర్జించి, గ్రహనక్షత్రాదివిద్యలజీవింపక, భేదవాదంబైనతర్కంబులుతర్కింపక నెందును బక్షీకరింపక, శిష్యులకు గ్రంథంబులువచించి యుపన్యసింపక, బహువిద్యలజీవింపక, మత్తాదివ్యాపారంబులనుల్లసిల్లక, పెక్కుదినంబులొక్కచోట వసియింపక, యారనూరనొక్కొక్క రాత్రిసలుపుచుఁ, గార్యకారణవ్యతిరిక్తంబై పరమాత్మయందు విశ్వంబుదర్శించుచు, సదసన్మయంబైనవిశ్వంబునందుఁ బరబ్రహ్మంబైన యాత్మనవలోకించుచు, జాగరణస్వప్నసంధిసమయంబులనాత్మనిరీక్షణంబు సేయుచు, నాత్మకుబంధమోక్షణంబులుమాయామాత్రంబులుగాని వస్తుప్రకారంబునలేవనియును, దేహంబునకుజీవితంబు ధ్రువంబుగాదనియును, మృత్యువుధ్రువంబనియెఱుంగుచు భూతదేహంబుల సంభవనాశంబులకు మూలంబైనకాలంబుఁ బ్రతీక్షించుచునివ్విధమ్మున జ్ఞానోత్పత్తిపర్యంతంబుసంచరించియటమీఁదవిజ్ఞానవిశేషంబుసంభవించిననఁబరమహంసుండై దండాదిచిహ్నంబులుధరియించి యొండెధరింపకనొండె బహిరంగవ్యక్తచిహ్నుండుగాక యంతరంగవ్యక్తంబైనయాత్మానుసంధానంబుగలిగి మనీషియైబాహ్యానుసంధానభావంబునమనుష్యులకుఁదనవలననున్మత్తబాలమూకులరీతిఁజూపుచుండవలయు.* (క॥ మునివల్లభుఁడజగరుఁడను। సునయుండుమహిత

—* ప్రహ్లాదాజగరమునులసంవాదము. *—

న్యకశిపుసూనుండనుము।న్నొనరించినసంవాదము।వినుమీయర్థంబునందువెలయునరేంద్రా.* (వ॥ తొల్లిభగవత్ప్రియుండైనప్రహ్లాదుండుకతిపయామాత్యసమేతుండయిలోకతత్త్వంబు నెఱింగెడికొఱకు లోకంబులసంచరించుచునొక్కనాఁడు కావేరీతీరంబున, సహ్యపర్వతతటంబున, ధూళిధూసరితంబులైనకరచరణాద్యవయవంబులతోడ గూఢంబైననిర్మలతేజంబుతోఁ గర్తాకారవచోలింగవర్ణాశ్రమాదులనెవ్వరికినెఱుంగఁబడక నేలనిద్రించుచునజగరవ్రతధరుండైనమునింగనిడాయఁజనివిధివత్ప్రకారంబునసర్చించి మునిచరణంబులకుశిరంబుమోపి మ్రొక్కియతనిచరిత్రంబులు దెలియనిచ్ఛయించి యిట్లనియె.* (సీ॥ భూమినుద్యోగివైభోగివైయుండెడినరునిక్కైవడిమునినాథనీవు । ఘనశరీరముదాల్చికదలవుచిత్రముద్యోగయుక్తునకుఁ గానిధనములేదు । ధనవంతునకుగానితగుభోగములులేవుభోగికిఁగానిసంపూర్ణమైన । తనువులేదుద్యోగధనభోగములులేక నేలనూరకపడిన్రవ్రోవు।నీకునెట్లుగలిగెనిరుపమదేహంబు।సముఁడవార్యుఁడవువిశారదుఁడవు । బుద్ధినిధివిజనులఁబొగడఁబ్రదెగడవు।నిద్రవతిదినంబునిలుపనేల.* (వ॥ అనియిట్లుప్రహ్లాదుండడిగినవికసితముఖుండైమునీంద్రుండు దదీయమధురాలాపసుధారసప్రవాహంబులుగర్ణంబులఁబరిపూర్ణంబులైననతనినవలోకించియిట్లనియె.* (సీ॥ అంతరంగికదృష్టినంతయునెఱుఁగుదువార్యసన్మతుఁడవీవసురవర్య । విశ్వజంతువులప్రవృత్తినివృత్తిలక్షణములునీవెఱుంగనివిలేవు । భగవంతుఁడగుహరిపాయకనీమనోవీధిరాజిల్లుచువెలుఁగుచుండెని । క్రమమునబహిరంధకారంబుఁబరిమార్చుఁబరమసాత్త్వికుఁడవుభద్రబుద్ధి । వైననీవునన్నునడిగెదుగావున। విన్నధర్మమెల్లవిస్తరింతు।నన్నుఁజూడఁగలిగెనీతోడిమాటలనాత్మశుద్ధిగలిగెననఘచరిత.* (వ॥ వినుముప్రవాహకారిణియైనవిషయంబులచేతఁ బూరింపరానితృష్ణచేతంబడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండనైన నేనునానావిధయోనులందుఁ బ్రవేశించుచువెడలుచునెట్టకేలకుమనుష్యదేహంబుధరియించి యందుధర్మంబునస్వర్గద్వారంబునునధర్మంబున శునకసూకరాది తిర్యగ్జంతుయోనిద్వారంబులనొంది క్రమ్మఱమనుష్యుండైపుట్టవలయుననివివేకించి సుఖరక్షణదుఃఖమోక్షణంబులకొఱకు ధర్మంబుసేయు దంపతులవ్యవహారంబుఁగని సర్వక్రియానివృత్తిఁగలిగినజీవుండు స్వతంత్రుండైప్రకాశించుననినిర్ణయించిభోగంబులు మనోరథజాతమాత్రంబులుగాని శాశ్వతంబులుగావని పరీక్షించినివృత్తుండనైయుద్యోగంబులేకనిద్రించుచుఁబ్రారబ్ధభోగంబులనుభవించుచునుండుదు। వివ్విధంబునఁదనకు సుఖరూపంబయిన పురుషార్థంబుదనయందుఁగలుగుట యెఱుంగకపురుషుండుశైవాలజాలనిరుద్ధంబైనశుద్ధజలంబులువిడిచి, యెండమావులుజలంబులనిపాఱెడుమూఢునివడువునసత్యంబుగానిద్వైతంబుఁజొచ్చి ఘోరసంసారచక్రపరిభ్రాంతుండయి దైవతంత్రంబులైన దేహాదుల

పూజాసపర్యాధ్యయనంబ్రహ్మయజ్ఞస్తుతర్పణం । హోమోదైవబలిర్భౌతోనృయజ్ఞోతిథిపూజనమితిస్మృతిః ॥ తా॥ వేదపారము-బ్రహ్మయజ్ఞమ్ము, హోమము-దేవయజ్ఞము, అతిథిపూజనము-మనుష్యయజ్ఞమ్ము, పితృతర్పణము-పితృయజ్ఞమ్ము, భూతబలి-భూతయజ్ఞమనితాత్పర్యము

చేతనాత్మసుఖంబునుదుఃఖనాశంబును గోరుచునీశుండ మనవాసిఁ బ్రారంభంబులు నిష్ఫలంబులగు నదియునుంగాక మర్త్య
నకుధనంబు ప్రాప్తంబయిననది దుఃఖకరంబుగాని సుఖకరంబుగాదు-లోభవంతులయిన ధనవంతులు నిద్రాహారంబులు లేక రా
జచోరయాచకశత్రుమిత్రాదిసర్వస్థలంబులందు శంకించుచు దానభోగంబుల మఱచియుందురు - ప్రాణార్థవంతులకుభ
యంబునిత్యంబు శోకమోహభయక్రోధరాగశ్రమాదులు, వాంఛామూలంబులు, వాంఛ లేకుండవలయు* (మ॥ సరఘుల్గూ
ర్చిన తేనె మానవులకున్ సంప్రాప్తమైనట్లు-లో । భగతుల్గూర్చినవిత్తముల్పరులకుం బ్రాపించుఁ బ్రాప్తాశనై । తిరుగంబోనిసు
హారగంబు బ్రదుకుం దీర్ఘాంగమై యుండియు। న్నిరకాలంబును వానివర్తనములం జింతించి మే శాంతినై * (క॥ అజగరమును
జుంటీఁగయు। నిజగురువులుగాఁ దలంచి నిశ్చింతుఁడనై। విజనస్థలిఁ గర్మంబుల। గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్* (సీ॥ అజిన
వల్కలకుఁ గూలాంబరంబులుఁ గట్టియొండెఁ గట్టక యొండెనుండుచుండు। నాందోళికారథహయనాగముల నెక్కి- నైన నెక్క-క
నైన నరుగుచుండుఁ। గర్పూరచందనకస్తూరికాలేపమైన భూరజమైన నలఁది కొండు । ధర్మశయ్యలనైనఁ బర్ణశిలాతృణభస్మం
బులందైనఁ బడుచునుందు । మానయుక్తమైన మానహీనంబైనఁ। దీయనైన మిగులఁ దిక్తమైనఁ । గుడుతుసగుణమైనఁ గుణవర్జి
తంబెనను నల్పమైనఁ జాలనధికమైన* (క॥ లేదని యెవ్వరినడుగను। రాదనఁ జింతింపఁ బరులు రప్పించినచోఁ। గాదన యెద్దియు మాన
ను। ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్* (క॥ నందింపఁ బరుల నెన్నఁడు । వందింపన నేక పీడవచ్చిన మదినా। క్రందింపవిభ
వములకు। నందింపఁ బకాను వర్తనంబుననధిపా* (వ॥ ఇట్లు కోరికలేక యొక్క-సమయంబున దిగంబరుండనై పిశాచంబు
చందంబుననుండుచుఁ బెక్కు-దినంబులుం గూలెఁ బెను పాము వర్తనంబుఁ గైకొని నిమీలితలోచనత్వంబున నేకాంతభావంబు
విష్ణునియందుఁ జేర్చి భేదగ్రాహకచిత్తవృత్తులనర్థరూపపరిభ్రమంబు గలమనంబునందు మనంబు నహంకారంబునందు నహం
కారంబు మాయయందు మాయ నాత్మానుభూతియందు లయంబునొందించి సత్యంబదర్శించుచు విరక్తినొంది స్వానుభవంబున
నాత్మస్థితుండనై యుండుదు నీవు భగవత్పరుండవుగావున రహస్యంబైన పరమహంసధర్మంబు స్వానుభవగోచరంబైనతెఱం
గున నీకుహృద్గోచరంబగునట్లు చెప్పితినని పలికిని* (క॥ మునుసజగరముని వల్లభు। దను జేంద్రుండు పూజఁ జేసి తగ పీడ్కొ-ని నెమ్మన
మున సంతోషించుచుఁ। జని యెన్నిజ గేహమునకు శశికులతిలకా* (వ॥ అనిన యుధిష్ఠిరుండిట్లనియె* (క॥ నను బోటి జడగృహస్థుఁ
డు। మునివల్లభ యిట్టిపదవి మోదంబున నే। యనువునఁ జెందును వేగమ। వినిపింపుము నేఁడు నాకు విజ్ఞానన్ధీ* (వ॥ అనిన నారదుం
డిట్లనియె గృహస్థుండయినవాఁడు వాసుదేవార్పణంబుగా గృహోచితక్రియలను సంధించుచు మహామునుల సేవించి వారి
వలన నారాయణదివ్యావతారకథాశ్రవణంబుఁ జేయుచు నయ్యై విహితకాలంబుల శాంతజనులం గూడియుండుచుఁ బుత్రమి
త్రకళత్రాది సంగంబులు గలలవంటివని యెఱుంగుచు లోపల నాసక్తిలేక సక్తునికైవడి వెలుపలఁ బురుషాకారంబు లొనర్చు
చుఁ దగులంబులు లేక విత్తంబులిచ్చి జనకసుతసోదరసఖజ్ఞాతిజనుల చిత్తంబులు సమ్మతాయత్తంబులుగావించుచు ధనధాన్యని
ధానదైవలబ్ధంబుల వలన నభిమానంబు మాని యనుభవించుచు గృహక్షేత్రంబులఁ జొచ్చి యుదరపూరణమాత్రంబు దొంగిలి
నవానిదండింపక భుజగమృగమూషకమర్కటమక్షికాఖరోష్ట్రంబులహింసింపక పుత్రులభంగి నీక్షించుచు దేశకాలదైవంబు
లకొలందినిధర్మార్థకామంబులఁ బ్రవర్తించుచు శునకపతితచండాలాదులకైన భోజ్యపదార్థంబులు తగిన భంగినిచ్చుచు నిజవృ
త్తిలబ్ధంబులగు నశనాదులచేత దేవఋషిపితృభూతమానవుల సంతర్పించుచుఁ బంచమహాయజ్ఞావశేషంబుల నంతర్యామి
పురుషయజనంబు నాత్మజీవనోపాయంబును సమర్థించుచునుండవలయు* (గీ॥ జనకసురులనైనఁ జంపునర్థము నకై। ప్రాణమై
నవిడుచు భార్యకొఱకు। నట్టి భార్య పురుషుఁ డతిథిశుశ్రూషఁ జే। యింది గెలుచు నజితు నీశునైన* (గీ॥ పరముఁ డీశ్వరుఁడు బ్రా
హ్మణముఖమున। నాహరించి తుష్టుఁడయిన భంగి । నగ్నిముఖమునందు హవ్యరాసులు గొని । మైనఁ దుష్టినొందఁ డనఘచరిత*
(వ॥ కావున గృహస్థుండు బ్రాహ్మణులందును, దేవతలందును, మర్త్యప్రముఖపశుజాతులందును, నంతర్యామి యు బ్రాహ్మణా
ననుండైన క్షేత్రజ్ఞునందు నయ్యై కోరికలు సమర్పించి సంతర్పణంబుఁ జేయవలయు భాద్రపదంబునఁ గృష్ణపక్షంబునందును, ద
క్షిణోత్తరాయణంబులందును, రేయింబగలు సమమైన కాలంబులందును, వ్యతీపాతంబులందును, దినక్షయంబులందును, సూ
ర్యచంద్రగ్రహణంబులందును, శ్రవణద్వాదశియందును, వైశాఖశుక్లతృతీయయందును, కార్తికశుక్లనవమియందును, హే
మంతశిశిరంబులలోన నాలుగష్టకలందును, మాఘశుక్లసప్తమియందును, మాసనక్షత్రంబులతోడం గూడిన పున్నములందును,
ద్వాదశితోడం గూడిన యుత్తరా శ్రవణానూరాధలందును, నుత్తరాత్రయసహితలైన యేకాదశీతిథులందును, జన్మనక్షత్ర
యుక్తదివసంబులందును, మఱియుఁ బ్రశస్తకాలంబులందును, జననీజనకబంధుజనులకు శ్రాద్ధంబులును, జపహోమస్నాన
వ్రతంబులును, దేవబ్రాహ్మణసమారాధనంబులు నాచరింపవలయు, భార్యకుఁ బుంసవనాదికంబు పత్యంబునకు జాతకర్మాది
కంబును దనకు యజ్ఞదీక్షాదికంబును బ్రేతజనులకు దహనాదికంబును మృతదివసంబున సాంవత్సరికంబును జరుపవలయు* (మ॥

వినుమే దేశములన్నియు గుణతపోవిద్యాన్వితంబైనవి। ప్రనికాయంబు వసించునేస్థలములన్భాగీరథీముఖ్యవాహినులుండున్ హరిపూజలెయ్యెడలఁ బాయిష్టప్రకారంబులం। దనరున్భూవర యిట్టిచోటుల కగున్ధర్మంబులం జేయఁగన్* (క॥ హరియంమజగములుండును। హరిరూపము సాధుపాత్రమంకుండు శివంకరమగు పాత్రము గలిగిన। నరయఁగ నది పుణ్యదేశ మనఘచరిత్రా* (వ॥ మఱియుఁ గురుక్షేత్రంబును, గయాశీర్షంబును, ప్రయాగంబును, పులహాశ్రమంబును, నైమిశంబును, ఫాల్గునంబును సేతువును, ప్రభాసంబును, కుశస్థలియును, వారాణసియు, మధురాపురియును, పంపాబిందుసరోవరంబులును, నారాయణాశ్రమంబును, సీతారామాశ్రమంబును, మహేంద్రమలయాదులైన కులాచలంబులును, హరిప్రతిమూర్త్యున్న ప్రదేశంబులును, హరిసేవాపరమభాగవతులు వసించెడు పుణ్యక్షేత్రంబును, శుభకాముండైనవాఁడు సేవింపవలయు* (గీ॥ భూవరేంద్ర యిట్టి పుణ్యప్రదేశంబులం దునరుఁడు సేయునట్టి ధర్మ। మల్పమైననదిసహస్రగుణాధిక। ఫలము నిచ్చు హరికృపావశమున* (వ॥ వినుము చరాచరంబయిన విశ్వమంతయు విష్ణుమయంబగుటం జేసి పాత్రనిర్ణయనిపుణులైన విద్వాంసులు నారాయణుండు ముఖ్యపాత్రంబని పలుకుదురు దేవఋషులును బ్రహ్మపుత్రులును సనకాదులునుండ భవదీయ రాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుండయ్యె, నానేకజంతుసంఘాతసంకీర్ణంబయిన బ్రహ్మాండపాదపంబునకు నారాయణుండు మూలంబు తన్నిమిత్తంబున నారాయణసంతర్పణంబు సకలజంతుసంతర్పణంబని యెఱుంగుము ఋషినరతిర్యగమరశరీరంబులు పురంబులు వానియందు తారతమ్యంబులతోడ జీవరూపంబున భగవంతుండైన హరి వర్తించుటం జేసి పురుషుండన బ్రసిద్ధుండయ్యె నందుఁ దిర్యగ్జాతులకంటె నధికత్వంబు నరులకును నరులయందు విలసిల్లుటం జేసి పురుషుండు పాత్రంబు పురుషులలోన హరితనువైన వేదంబును ధరించుచు సంతోషవిద్యాతపోగరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు బ్రాహ్మణులలోన నాత్మజ్ఞానపరిపూర్ణుండయిన యోగిముఖ్యపాత్రంబని పలుకుదురు పరస్పరపాత్రంబులను సహింపని మనుష్యులకుఁ బూజనార్థంబు త్రేతాయుగంబునందు హరిప్రతిమలు గల్పింపంబడియెఁ గొందఱు ప్రతిమార్చనంబుఁ జేయుదురు. పురుషద్వేషులయిన వారలకు నట్టి ప్రతిమార్చనంబు ముక్త్యర్థప్రదంబు గాదు మందాధికారులకుఁ బ్రతిమార్చనంబు పురుషార్థప్రదంబగును* (గీ॥ అఖిలలోకములకు హరి దైవతము సూడ। హరికి దైవతము ధరాధినాథ। పదపరాగలేశపఙ్క్తిచే దైత్రిలోక్యపావనంబుఁ జేయు బ్రాహ్మణుండు (వ॥ అట్టి బ్రాహ్మణజనులందు గర్మనిష్ఠులు, తపోనిష్ఠులు, వేదశాస్త్రనిష్ఠులు, జ్ఞానయోగనిష్ఠులునై కొందఱు వర్తింతురందు జ్ఞాననిష్ఠునకు ననంతఫలకాముండైన గృహస్థుండు పితృజనుల నుద్దేశించి కవ్యంబులును, దేవతల నుద్దేశించి హవ్యంబులును బెట్టుట ముఖ్యంబు, దైవకార్యంబునకు నిరువురనైన నొకరినైనఁ బిత్ర్యకార్యంబునకు మువ్వురనైన నొకరినైన భోజనంబు సేయింపవలయు ధనవంతుండైన శ్రాద్ధవిస్తారంబు గర్తవ్యంబు గాదు దేశకాలప్రాప్తకందమూలఫలాదికంబయిన హరినైవేద్యంబున విధిచోదితప్రకారంబు గాశ్రద్ధతోడ బాత్రంబునందుఁ బెట్టిన యన్నంబు కామదంబై యక్షయఫలకారి యగు ధర్మతత్త్వవేది యైనవాఁడు శ్రాద్ధంబులందు మాంసప్రదానంబుఁ జేయక భక్షింపక చరింపవలయుఁ గందమూలాదిదానంబున నయ్యెడి ఫలంబు పశుహింసనంబున సంభవింపదు ప్రాణిహింసఁ జేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు యజ్ఞవిదులైన ప్రోడలు నిష్కాములై బాహ్యకర్మంబులు విడిచి యాత్మజ్ఞానదీపంబులందుఁ గర్మమయంబులైన యజ్ఞంబుల నాచరింతురు* (క॥ పశువులఁ బొరిగొని మఖములు। విశదములుగఁ జేయు బుధుని వీక్షించి తము। న్విశసనము జేయునో యని। కసిమసి బొగడొందు భూతగణము నరేంద్రా* (వ॥ అదిగావున ధర్మవేదియైనవాఁడు దైవప్రాప్తంబులైన కందమూలాదికంబులచేత నిత్యనైమిత్తికక్రియఁ జేయవలయు నిజధర్మబాధకంబయిన ధర్మంబును బరధర్మప్రేరితంబయిన ధర్మంబు నాభాసధర్మంబును, పాషండధర్మంబును, గపటధర్మంబును, ధర్మజ్ఞుండయినవాఁడు మానవలయు, నైసర్గికధర్మంబు దురితశాంతిసమర్థంబగు నిర్ధనుండు ధర్మార్థంబు యాత్రచేయుచునైన ధనంబు గోరవలదు జీవనోపాయంబునకు నిట్టట్టు దిరుగక గార్పణ్యంబు లేక జీవించు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండై యెద్దియుఁ గోరక బ్రతికెడు సుఖంబు నికింగల సుఖంబు కామలోభంబులం దశదిశలం బరిధావనంబుఁ జేయువానికి సిద్ధింపదు పాదరక్షలుగలవానికి గర్కరకంటకాదుల వలన భయంబు లేక మెలంగు భంగిఁ గామంబుల వలన నివృత్తిగలవానికి నెల్లకాలంబును భద్రంబగును పస్థకునుజిహ్వార్థైన్యంబునకును బురుషుండు గృహపాలకశునకంబునై వడి సంచరించుచు సంతుష్టిలేక చెడు సంతోషిగాని విప్రుని విద్యాతపోవిభవయశంబులు నిరర్థకంబులగు నింద్రియలోలత్వంబున విజ్ఞానంబు నశించు సకలభూలోకభోగంబులు భోగించియు దిగ్విజయంబుఁ జేసియు బుభుక్షాపిపాసల వలనఁ గామపారంబును హింసవలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు సంకల్పవర్జనంబునఁ గామంబును, గామవర్జనంబునఁ గ్రోధంబును నర్థానర్థదర్శనంబున లోభంబును, దైవతానుసంధానంబున భయంబు నాత్మానాత్మవివేకంబుల శోకమోహంబులును, సాత్త్వికసేవనంబున డంభంబును, మౌనంబున యోగాంతరాయంబును, శరీరవాంఛలేమి హింసయు హితాచరణంబున భూతజంబయిన దుఃఖంబు

ను, సమాధిబలంబున దైవికవ్యథయును, ప్రాణాయామాదికంబున మన్మథవ్యథయును సాత్త్వికాహారంబుల నిద్రయు సత్త్వగు
ణంబున రజస్తమంబులును, గురుభజనకుశలుండై శీలంబున జయింపవలయు* (క॥ హరిమహిమ తనకుఁ జెప్పెడి। గురువున్నరుఁడ
నుచుఁ దలఁచి యంరిఁ భక్తిఁ దిరుగుపురుషుశ్రమ మెల్లను। గరిశౌచముక్రియ నిరర్థకంబగు నధిపా* (ఉ॥ ఈవనజాతనేత్రు
బరమేశు పుమేహాత్ముఁ బ్రధానపూరుషున్। దేవశరణ్యు సజ్జనవిధేయు ననంతుని బురాణయోగిసం। సేవితపాదపద్ముఁ దన చిత్త
ములన్ మనుఁడంచు లోకులు చ్ఛాధిఁ జూచుచుండుదురు సన్మతి లేక నరేంద్రచంద్రమా* (వ॥ వినుము షడింద్రియంబులలో నొ
కటియందు దగ్గునై యిచ్ఛాపూరణపథానంబులఁ జరితార్థులమైతి మనువారలు ధారణాధ్యానసమాధియోగంబుల సాధిం
పలేరు కృషిప్రముఖంబులు సంసారసాధనంబులు గాని మోక్షసాధనంబులు గావు కుటుంబసంగంబునఁ జిత్తవిక్షేపంబుఁ జిత్త
విజయప్రయత్నంబున సన్న్యసించి సంగంబు వర్జించి మితంబయిన భిక్షాన్నంబు భక్షించుచు శుద్ధవివిక్తసమప్రదేశంబున నొ
క్కచో నాసీనుండై సుస్థిరత్వంబున ప్రణవోచ్చారణంబుఁ జేయుచు రేచకపూరక కుంభకంబుల ప్రాణాపానంబుల నిరో
ధించి కామహతంబయిన చిత్తంబు పరిభ్రమణంబు మాని కామవిసర్జనంబుఁ జేసి మఱలునంతకు నిజనాసాగ్రనిరీక్షణంబుఁ జే
యుచు నివ్విధంబున యోగాభ్యాసంబు చేయువాని చిత్తంబు కాష్ఠరహితంబయిన వహ్ని తెఱంగున శాంతిఁ జెందు: గామా
దులచేత వేధింపంబడక ప్రశాంతసమస్తవృత్తంబయిన చిత్తంబు బ్రహ్మసుఖసమర్శనంబున లీనంబై మఱియు నెగయ నేరదు*
(మ॥ ధరణీదేవుఁడు సన్న్యసించి యతియై ధర్మార్థకామంబులన్ బరివర్జించి పునర్విశంబమునఁ దత్ప్రారంభియై నేనిలో। భవ
తింగకిన్ నహూడుమంచి సనుచున్ భక్షించి జీవించుదుర్న్నగు చందంబున హాస్యజీవనుఁడగున్నానాప్రకారంబులన్* (క॥ మలము
నఁ గ్రిమి యయినుబడు క్రియ నిలఁబడు నొడలాత్మగాను హేయంబనుచున్ దలఁతురు తద్జ్ఞులు వొగడుదు కలసతనొడలాత్మయ
ను చనజ్ఞులి లేశా* (గీ॥ వ్రతము మానఁ దగదు వడుగు కుట్టీకిని। క్రియలుమానఁదగదు గృహగతునికిఁ దపసి మారనుండఁ దగదు స
న్న్యాసికిఁ దరుణితోడి పొత్తుదగదు తగదు* (సీ॥ రథము మే నెల్ల సారథి బుద్ధి యింద్రియగణము గుఱ్ఱములు పగ్గములు మనము ప్రా
ణాదిదశవిధపవనంబులిరుసు ధర్మాధర్మగతులు రథాంగకములు బహుళశరంబయిన బంధంబు చిత్తంబు శబ్దాదికములు సంచార
భూములభిమానసంయుతుండయిన జీవుఁడు రథికుఁడనతర ప్రణవంబు కార్ముకంబు। శుద్ధజీవుండు బాణంబు సుభగమయిన బ్ర
హ్మమందితెలక్ష్యంబు వైరులు రాగ। భయమదద్వేషశోకలోభప్రమోహ। మానమత్సరముఖములు మానవేంద్ర* (వ॥ ఇట్లు
మనుష్యశరీరంబయిన రథంబు దనవశంబు చేసికొని మహాభాగవత చరణకమల సేవానిశితంబయిన విజ్ఞానఖడ్గంబు ధరి
యించి శ్రీమన్నారాయణకరుణావలోకనబలంబున రాగాది శత్రునిర్మూలంబు గావించి ప్రణవబాణాసనంబున శుద్ధజీవశ
రంబు సంధించి బ్రహ్మమను నెడికుఱియందుఁ బడ వేసిన నహంకార రథికుండు రథికత్వంబు మాని నిజానందంబున నుండవల
యు, నట్టివిశేషంబు సంభవింపని సమయంబున బహిర్ముఖంబులయిన యింద్రియ ఘోటకంబులు బుద్ధిసారథిసహితంబులై సా
భిమానరథికుని ప్రమత్తత్వంబు దెలిసి ప్రవృత్తిమార్గంబు నొందించి విషయశత్రుమధ్యంబునం గూల్చిన* (గీ॥ విషయశత్రు లె
ల్ల విక్రాంతితోడ సారథిసమేతుఁ డయిన రథికుఁ బట్టి। యుగ్రతిమిరమృత్యుయుతమగు సంసార। కూపమధ్యమందుఁ గూల్తు రధి
ప* (వ॥ వినుము వైదికకర్మంబు ప్రవృత్తంబును నివృత్తంబునను రెండు తెఱంగుల య్యెనందుఁ బ్రవృత్తంబునఁ బునరావర్తనంబును
నివృత్తంబున మోక్షంబును సిద్ధించుఁ బ్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబులను రెండుమార్గంబులు గలవందు హింసాద్రవ్య
మయ కామ్యరూపంబులయిన దర్శపూర్ణమాస పశుయాగ వైశ్వదేవ బలిహరణప్రముఖంబులైన యాగాదికంబు లిష్టంబులు
దేవతాలయ వనకూపతటాకప్రముఖంబులు పూర్తంబులు ప్రవృత్తకర్మంబున దేహంబు విడిచి దేహాంతరారంభంబున దేహి
హృదయాగ్రంబున వెలుంగువానితోడ నింద్రియంబులం గూడి భూతసూక్ష్మయుక్తుండై ధూమదక్షిణాయన కృష్ణపక్షరాత్రి
దర్శంబులవలన సోమకంబుఁ జేరి భోగావసానంబున విలీనదేహుండై వృష్టిద్వారంబునఁ గ్రమంబున నోషధిలతాన్నశుక్ల
రూపంబులఁ బ్రాపించి భూమియందుఁ జన్మించు నది పునర్భవరూపంబయిన పితృమార్గంబు నివృత్తకర్మనిష్ఠుండయిన వాఁడు జ్ఞా
నదీప్తంబులయిన యింద్రియంబులందుఁ గ్రియాయజ్ఞంబుల యజించి యింద్రియంబుల దర్శనాదిసంకల్పరూపంబయిన మ
నంబునందు వికారయుక్తంబయిన మనంబును, వాక్కు-యందు విద్యాదిలక్షణమైన వాక్కును, వర్ణసముదాయంబునందును,
వర్ణసముదాయంబు నకారాదిస్వరత్రయాత్మకంబయిన యోంకారంబునందు నోంకారంబును, బిందువందు బిందువును నా
దంబునందు నాదంబును ప్రాణంబునందుఁ బ్రాణంబును బ్రహ్మమందు నిలుపవలయు, దేవమార్గంబులయిన యుత్తరాయణ శు
క్లపక్షదివా ప్రాహ్ణపూర్ణిమా రాకలవలన సూర్యబ్రహ్మలోకంబులందుఁ జేరి భోగావసానంబున స్థూలోపాధిని విశ్వుండై
సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధియైన తైజసుండై సూక్ష్మంబును గారణంబునందు లయించి కారణోపాధియైన ప్రా
జ్ఞుండై కారణంబును సాక్షిస్వరూపంబునందు లయించి తుర్యుండై సాక్షిలయంబునందు శుద్ధాత్ముండయి యివ్విధంబున ము

త్తుండగుచు*॥ గీ॥ అసురనిర్మితంబులై యొప్పుపితృదేవ। గణములెవ్వఁ డెఱుఁగు శాస్త్రదృష్టి। నట్టివాఁడు దేహియై మోహమునఁ బొందఁ। డతిశయించుబుద్ధి నవనినాథ* (వ॥ వినుము దేహాదులకుఁ గారణత్వంబున నాదియంతనవధికత్వంబున నంత్యంబునై యుండు నుగలుగుచు బహిరంతరంబునను భోగ్యంబును, నంతరంగంబునను భోక్తయు, బరంబును నవరంబును జ్ఞానంబును జ్ఞేయంబును, వచనంబును వాచ్యంబును, బ్రకాశమును బ్రకాశ్యంబునై వస్తువునకు వేఱొండు లేదు ప్రతిబింబాదికంబు వస్తుత్వంబు నందె జేసి వికల్పితంబై తలంపంబడు ఛంగి నైంద్రియకంబయిన సర్వంబును నర్థత్వంబున వికల్పితంబై తోఁచుం గావున పరమార్థంబు గాదు దేహాదికంబులు వినాశ్యంబులు వానికి హేతువులయిన తీవ్రముఖంబులు వినాశ్యంబులగుట సిద్ధంబు పరమాత్మ యునవిద్య చేత నెంతతడవు వికల్పంబు దోఁచు నంతతడవును భ్రమంబు దోఁచు నవిద్యానివృత్తియైన సర్వంబును మిథ్య యను యనశాస్త్రవిధినిషేధంబుల నెఱింగికలలోపల మేలుఁ గన్న తెఱంగులగు భావాద్వైతక్రియాద్వైతద్రవ్యాద్వైతంబులు మూఁడుగలవందుఁ బటతంతున్యాయంబునఁ గార్యకారణంబులందు వస్తువొక్కటియై యుండుననియెఱింగి యేకత్వాలోచనంబు చేసి వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు మనోవాక్కాయకృతంబునయిన సర్వకర్మంబులను ఫలవభేదంబుఁ జేయక పరబ్రహ్మార్పణంబు జేయుటక్రియాద్వైతంబు తనుపుత్రకళత్రాది సర్వప్రాణులకుం దనకును, దేహంబునకుం దనకుం బంచభూతాత్మకత్వంబునను భోక్తయొక్కండను పరమార్థత్వంబునను నర్థకామంబులయెడ నైక్యదృష్టిఁ జేయుట ద్రవ్యాద్వైతంబు, నేర్పున నాత్మతత్త్వానుభవంబున నద్వైతత్రయంబును విలోకించి వస్తుభేదబుద్ధియు, స్వకీయపరకీయబుద్ధియు స్వప్నంబులుఁ గాదలంచి మునినైన వాఁడు మానవలయు*॥ క॥ వాదములు వేయు నేటికి। వేదోక్తవిధిం జరించు బుధుఁడు గృహస్థుం। డాదరమున నారాయణ। పాదంబులఁ గొలిచి ముక్తిపదమున కేఁగు* (శా॥ భూపాలోత్తమ మీరు భక్తిగరిమన్ స్ఫూర్తిన్ సరోజేక్షణుం। శ్రీపాదాంబుజయుగ్మమున్ యతులై సేవించి కాంక్షమహా। గ్రావత్సంఘములోనఁ జిక్కక సమస్తాశాంతనిర్జేతలై। యేపారంగమఖంబుఁ జేసితిరి దేవేంద్రప్రభావంబునన్* (వ॥ వినుము పోయిన మహాకల్పంబునందు గంధర్వులలోన నుపబర్హణుండను పేర గంధర్వుండనైన నేను సౌందర్యచాతుర్య మాధుర్యగాంభీర్యాదిగుణంబుల సుందరులకుఁ బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వసృట్టులయిన బ్రహ్మలు దేవసత్రనామక మైనయాగంబులోన నారాయణకథలు గానంబు చేయుకొఱకు నప్సరోజనులను గంధర్వులం జీరిన* (గీ॥ కతువులోని కేను గంధర్వగణములోఁ। గలసిపోయి విష్ణుగాథలచటఁ। గొన్నిపాడి సతులఁ గూడి మోహితుఁడనై। తలఁగిచనితినంతధరణినాథ* (క॥ వారిజగంధులపొత్తున। వారింగైకొనక తలఁగి వచ్చినబుద్ధి। న్వారెఱిఁగి శాపమిచ్చిరి। వారింపఁగరాని రోషవశమున నధిపా*(గీ॥ పంకజాక్షునిచటఁ బాడక కామినీ। గణము గూడి చనిన గర్వమునను। దగ్ధకాంతివగుచు ధరణీతలంబున। శూద్రజాతి సతికిసుతుఁడవగుము* (వ॥ అని యిట్లు విశ్వస్రష్టలు శపించిన నొక్క బ్రాహ్మణదాసికిఁ బుత్రుండనై జన్మించియందు బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూషణ జేసిన భాగ్యంబున నిమ్మహాకల్పంబునందు బ్రహ్మపుత్రుండనై జన్మించితి* (గీ॥ కాశలమున మోక్షగతికి గృహస్థుఁడే। ధర్మమాచరించి తగిలిపోవు। నట్టిధర్మ మెల్లనతివిశదంబుగాఁ। బలుకఁబడియె నీకు భవ్యచరిత* (మ॥ అఖిలాధారుఁడజాదిదుర్లభుఁడు బ్రహ్మంబైన విష్ణుండునీ। మఖవంద్యర్చితుఁడై నివాసగతుఁడై మాధుర్యసంభాషియై। సఖియై చారకుఁడై మనోదయితుఁడై సంబంధియై మంత్రియై। సుఖదుండయ్యె భవన్మహామహిమ దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా* (వ॥ అని యిట్లు నారదుండు చెప్పిన వృత్తాంతంబంతయు విని ధర్మనందనుండు ప్రేమవిహ్వలుండై వాసుదేవునిం బూజించె వాసుదేవధర్మనందనుల చేతఁ బూజితుండై నారదమునియు దేవమార్గంబునం జనియె నని శుకయోగీంద్రుండు పాండవపౌత్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పె॥..........*

(క॥ రాజీవసదృశలోచన। రాజీవభవాదిదేవరాజవినుతవి। భ్రాజితకీర్తిలతావృత। రాజీవభవాండభాండ రఘుకులతిలకా * (మాలిని ॥ ధరణిమహి తృరంతా ధర్మమార్గావగంతా। నిరుపమనయవంతా నిర్జరారాతిహంతా। గురుబుధసుఖకర్తా కుంభినీచక్రభర్తా। సురభయపరిహర్తా సూరిచేతోవిహర్తా॥

గద్యము. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల పూర్వజన్మవృత్తాంతంబుఁ జెప్పుటయు, హిరణ్యకశిపు దితిసంవాదంబును, సుయజ్ఞ చరిత్రంబును, యమసల్లాపంబును, బ్రహ్మవరలాభగర్వితుండైన హిరణ్యకశిపు చరిత్రంబును, ప్రహ్లాద విద్యాభ్యాసకథయును, ప్రహ్లాదహిరణ్యకశిపు సంవాదంబును, ప్రహ్లాదువచనంబు ప్రతిష్ఠించి హరినరసింహరూపంబున నావిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకు నభయంబిచ్చి నిఖిలదేవతానివహ ప్రహ్లాదాదిస్తూయమానుండై తిరోహితుండగుటయుఁ,ద్రిపురాసుర వృత్తాంతంబును, నీశ్వరుండు త్రిపురంబుల దహించుటయు, వర్ణాశ్రమధర్మవివరణంబును, ప్రహ్లాదాజగరముని సంవాదంబును, నారదుపూర్వజన్మవృత్తాంతంబునను కథలుగల సప్తమస్కంధము సమాప్తము.........*

శ్రీకృష్ణార్పణమస్తు.



## శ్రీమదాంధ్రమహాభాగవతము * అష్టమస్కంధప్రారంభము.

శ్రీమన్నామపయోద! శ్యామ ధరాభృల్లలామ జగదభిరామా । రామాజనకామ మహో!ద్దామగుణస్తోమధామ దశరథరామా* (వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుం డంతశ్శుకయోగీంద్రుం గనుంగొని* (క॥ వినఁబడియెను స్వాయంభువ! మనువంశము వర్ణధర్మమర్యాదలతో! మనుజుల దనుజుల వేల్పుల। జననంబులు సృష్టియెల్ల జనియించుటయున్* (ఉ॥ ఏ మను కాలమందు హరి యీశ్వరుఁ డేటికి సంభవించె నే। మేమి యొనర్చె నమ్మనువు లెవ్వరొ యే క్రియఁ జేయుచున్నవాఁ। డేమి నటించు నిఁకఁ దగ తమెయ్యాదిసజ్జనులైనవారుము! న్నే గతిఁ జెప్పుచుందురు మునీశ్వర నాకెఱిఁగింపవే దయన్॥ అనిన శుకుండిట్లనియె* (క॥ ఈ కల్పంబున మనువులు! ప్రాకటముగ నార్వురై రిపదఁ నలువురిలో! లోకములజనులపుట్టువు। లాకథితములయ్యె వరుస నఖిలములు న్నృపా* (వ॥ ప్రథమమనువైన స్వాయంభువునకు నాకూతి దేవహూతులను నిరువురు కూఁతులు గలరు వారికిఁ గ్రమంబునఁ గపిల యజ్ఞ నామంబుల లోకంబులకు ధర్మజ్ఞానబోధంబు సేయుకొఱకు హరిపుత్రత్వంబు నొందె నందుఁ గపిలుని చరిత్రంబులు మున్న చెప్పంబడియె యజ్ఞుని చరిత్రంబు సెప్పెద వినుము* (మ॥ శతరూపాపతి కామభోగనిరతిన్ సంత్యక్తభూభారుఁడై। సతియుం దానును గాన కేగి శతవర్షంబుల్సునందానది। న్నతిమై యేకపదస్థుఁడై నియతుఁడై వాచంయమిస్ఫూర్తితో। గతదోషుండు తపంబు సేసె భువనఖ్యాతంబుగా భూవరా* (వ॥ ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువమనువు దనమనంబులోన* (సీ॥ సృష్టి చేనెవ్వఁడు చేతనపడకుండు సృష్టి యెవ్వని చేతఁ జేతనించు। జగములు నిద్రింప జాగరూకతనుండి యెవ్వఁడు బ్రహ్మాండమెఱుఁగుచుండు। నాత్మకాధారంబు నఖిలంబు నెవ్వఁడు నెవ్వని నిజధనంబింతవట్టు। పొడఁగానరాకుండుఁ బొడఁగను నెవ్వఁడు నెవ్వని సృష్టికి నెమ్ములు లేదు। జననవృద్ధివిలయసంగతిఁ జెందక యెవ్వఁ డెడపకుండు నెల్లయెడలఁ। దన మహత్వసంజ్ఞ తత్వ మెవ్వఁడు దానవిశ్వరూపుఁడనఁగ విస్తరించు* (వ॥ అనిమతిచే నిరహంకృతుండును నిరాశయ పరిపూర్ణుండును ననన్యప్రేరితుండును నృశిక్షాపరుండును నిజమార్గసంస్థితుండును నిఖిలధర్మభావనుండును నైన పరమేశ్వరుని నమస్కరించెద నని యుపనిషదర్థంబులు పలుకుచున్న మనువుం గనుంగొని* (క॥ రక్కసులు దినఁగ గడఁగిన। వెక్కసముగ యజ్ఞనామవిష్ణుఁడు వారిం జక్కడఁచె జక్రధారల। నిక్కముగ వేల్పులెల్ల మేలని పొగడన్* (వ॥ ఇది ప్రథమమన్వంతరంబింక రెండవ మనువు వినుము* (సీ॥ స్వారోచిషుండన సప్తార్చి బిడ్డఁడు మనువు వానికి నాద్యుమత్సుషేణ। రోచిష్మదాద్యులాఢ్యపుత్రులు ధాత్రి నేలిరి రోచనుఁడింద్రుఁడయ్యె। నధికులు తుషితాదులమరులూర్జస్తంబ ముఖ్యులాఢ్యులు సప్తమునులు నాఁడు। వేదశిరుండను విప్రుని దయితకుఁ దుషితకుఁ బుత్రుఁడైతో యజ్ఞాత్ముఁ డవతరించె నువిభుఁడను నశీత్యష్టస। హస్రమునులు నధికులయినవారు। ఘనులను గ్రహింపఁగ గోమారకబ్రహ్మ। చారియగుచు నతఁడు సలిపె వ్రతము॥ తదనంతరంబ* (సీ॥ మనువు మూఁడవవాఁడు మనుజేంద్ర యుత్తముం డనఁ బ్రియవ్రతునకు నాత్మజుండు పాలించె నిల యెల్ల పవనసృంజయ యజ్ఞహోత్రాదులాతని పుత్రులధిక। గుణులు వసిష్ఠుని కొడుకులు ప్రమథాదులైరి సప్తఋషులు నమరవిభుఁడు। సత్యజిత్తను వాఁడు సత్యభద్రాద్యులు సురలు ధర్మునికిని సూనృతకును। బుట్టి సత్యనియతిఁ బురుషోత్తముఁడు సత్య। సేనుఁడనఁగ మత్తశీలయుతుల। దనుజయక్షపతులఁ దండించె సత్యజి। న్మిత్రుఁడనఁగ జగము మె

### —* గజేంద్రమోక్షణకథాప్రారంభము. *—

ఱనంగ* (వ॥ చతుర్థమనువు కాలప్రసంగంబు వివరించెద* (సీ॥ మానవాధీశ్వర మనువు నాలవవాఁడు తామసుండనఁగ నుత్తముని భ్రాత। పృథివీపతులు కేతుపృథునరఖ్యాతాదులతని పుత్రులు పదురధికబలులు। సత్యకహరివీరసంజ్ఞులు వేల్పులు త్రిశిఖనామము వాఁడు దేవవిభుఁడు। మునులు జ్యోతిర్వ్యోమముఖ్యులు హరిపుట్టె హరిమేధునకుఁ బ్రీతిహారిణియందు। గ్రహనిబద్ధుఁడయిన గజరాజు విడిపించి। ప్రాణభయమువలనఁ బాపి కాచె। హరిదయాసముద్రుఁ డఖిలలోకేశ్వరుఁ। డనఘశుకునిఁ జూచి యనియె విభుఁడు* (క॥ నీరాట వనాటులకుం। బోరాటం బెట్లు కలిగె పురుషోత్తము చే। నారాట మెట్లు మానెను। ఘోరాటవిలో నిభద్రకుంజరమునకున్* (క॥ మునినాథ యీ కథాస్థితి। వినిపింపుము వినఁగ నాకు వేడుక పుట్టె। న్వినియెద గర్ణేంద్రియములఁ। బెనుపండువు సేయ మనము ప్రీతిం బొందన్* (క॥ ఏ కథలయందుఁ బుణ్య। శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే। నా కథలు పుణ్యకథలని। యాకర్ణింపుదురు పెద్దలతిహర్షమునన్* (వ॥ ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుండయిన పరీక్షిన్నరేం

---

పయోదశ్యామ॥ పయోద-మేఘమువలె, శ్యామ-నల్లనైనవాఁడా. ధరాభృల్లలామ॥ ధరాభృత్-రాజులలో, లలామ-శ్రేష్ఠుఁడా, అభిరామా-మనోహరమైనవాఁడా, రామాజనకామ - స్త్రీజనములకు మన్మథునివంటివాఁడా, మహోద్దామగుణస్తోమధామ॥ మహత్-మిక్కిలియు, ద్దామ-ఉత్కృష్టములయిన, గుణస్తోమ-గుణసమూహములకు, ధామ-స్థానమయిన వాఁడా.

క్రమంబున బాదరాయణి నడిగెనని చెప్పె సభాసదులయిన మునులనవలోకించి సూతుండు పరమాహర్షసమేతుండై చెప్పె నట్లు శు
కుండు రాజునకిట్లనియె* (సీ॥ రాజేంద్ర వినుసుధారాశిలో నొకపర్వతము త్రికూటంబన నరుచుండు। యోజనాయుతముగు
నున్నతత్వంబునునంతియ వెడలుపునతిశయిల్లుఁ। గాంచనాయసస్సార కలధౌతమయములై మూఁడుశృంగంబులు మొనసి
యుండుఁ। దటశృంగబహురత్నధాతుచిత్రితములై దిశలుభూనభములు దేజరిల్లు। భూరిభూజలతాకుంజపుంజములును। మ్రో
సిపఱతెంచు సెలయేటి మొత్తములును। మఱిఁగిత్తిగెడు దివ్యవిమానములును। జరులఁ గ్రీడించు కిన్నరచయము గలిగి* (వ॥ అది
మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుళ వట కుటజ కుందకురువక కు
రంటక కోవిదార ఖర్జూర నారికేళ సింధువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాలతక్కోల తమా
లహింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కింశుక శాల శిరీష శింశుపాశోక పలా
శ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లి కామతల్లికా ప్రముఖ నిరంతర వసంత సమయ సౌభాగ్య సంపదంకురిత పల్లవిత
కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరున్నివహాలంకృతంబును, మణివాలుకానేక విమల పులిన తరంగిణీ సంగత విచిత్ర విద్రుమ,
శాఖాహ్వాద్యాన శుకపికనికర సితసముచ్ఛిత చంచూపుటపరిదళిత శాఖశాఖాంతర పరిపక్వఫలగంధి) ప్రవర్షిత రసప్రవా
హబహుళంబును, గనకమయ సలిలకాసార కాంచన కుముద కల్హారకమల పరిమళమిళిత కబళాహార సంతతాంగీకార భారపరి
శ్రాంత కాంతాసమాలింగిత మధురమత్త మధుకరపటల సముదయ సమీప సంచార సముదంచిత శకుంతక లహంస కారండవజ
లకుక్కుటచక్రవాక కలకంఠ బక బలాహక కోయష్టిక ముఖర జలవిహంగ విసర వివిధ కోలాహల బధిరీభూత భూనభోంతరా
ళంబును, దుహినకర కాంతమరకత కమలరాగ వజ్ర వైడూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనక కలధౌత మణిమయా
నేక శిఖర తట దరీ విహరమాణ విద్యాధర విబుధ సిద్ధ చారణ గంధర్వ గరుడ కిన్నర మిథున సంతత సరససల్లాప సంగీత ప్రసంగమం
గళాయతనంబును గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీరవ శరభ శార్దూల చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహి
ష మర్కట మహోరగ మార్జాలాది నిఖిలమృగనాథ సమూహ సమరసన్నాహ సంరంభ సంచకిత శరణాగత శమనకింకరం
బును నై యొప్పున ప్పర్వతకందరంబునందు* (క॥ భిల్లీ భల్లుబులాయక। భల్లుకఫణిఖడ్గగవయబలిముఖచమరీ। ఝిల్లీహరిశరభకి
రికిటిమల్లాఢ్యభూతకాకఘూకమయమగు నడవిన్* (శా॥ అన్యాలోకనభీకరంబులు జితాశానేకపానేకముల్। వన్యేభంబులు
గొన్నిమత్తతనువుప్రవజ్యావిహారాగతో। దన్యత్వంబున భూరిభూధరదరీద్వారంబులందుండి సో। జన్యక్రీడల నీరుగాలివడిఁ
గాసారావగాహార్థమై* (మ॥ అంధకారమెల్ల నద్రిగుహాంతర। వీథులందుఁ బగలు వెఱచిడాఁగి। వెడను వేచి సంధ్య నినుఁడు
వృద్ధతనున్న। వెడలెననఁగ గుహలు వెడలెఁగరులు* (క॥ తలఁగవుకొండలకైనను। మలఁగవు సింగములకైన మార్కొనఁగడ
మింగలఁగవు పిడుగులకైనను। నిలబలసంపన్నవృత్తి నేనుఁగుగున్నల్* (సీ॥ పులులమొత్తంబులు పొదరిండ్లలో దూఱు ఘోర
భల్లూకముల్గుహలు సొచ్చు। భూదారములు నేలబొరియలలో డాఁగు హరిదంతములకేగు హరిణచయము। మహిషులఁ జొ
రఁబాఱు మహిషసంఘంబులు గండశైలంబులు గవులుదాఁకు। వల్మీకములు జొచ్చు వనభుజంగంబులు నీలకంఠంబులు నింగికె
గయు। వెఱచి చమరీమృగంబులు విసరువాల। చామరంబుల విహరణశ్రమము వాయ। భయదపరిహేల విహరించు భద్రకరు
ల। గాలివారినమాత్రాన జాలిఁబొంది* (క॥ మదగజదానామోదము। కదలనితమకమునఁ ద్రావికదుపులు నిండన్। బొదలు
చుఁదుమ్మెదకొదమల। కదుపులుఝుంఝుమ్మటంచు గానము సేసెన్* (క॥ తేటియొకటియొరు ప్రియకును। మాటికిమాటికి
సినాగమదజలగంధం। బేటికియని తనుఁబొందెడి। బోఁటికి నందిచ్చు నింత బోఁటితనమునన్* (క॥ అంగీకృతరంగన్మా
తంగీమదగంధమగుచుఁదద్దయు వేడ్కన్। సంగీతవిశేషంబుల। భృంగీగణమొప్పె ద్రమాను వెట్టెడిమాడ్కిన్* (క॥ వల్లభులు
వారమున్నడ। వల్లభయనిమును సరిరేని వారణదానం। బొల్లక మధుకరవల్లభ। యుల్లంబున బొందిరెల్లయుల్లాసంబుల్॥ అ
ప్పుడు* (మ॥ కలభంబుల్సరలాడుఁబల్వలములన్ ఘ్రాణించి ముట్టాడుచున్। ఫలభూజంబులు రాయుచుం జివురు జొంపంబుల్వడి
న్మేయుచున్। బులులన్నాశెవబోతులన్మృగములన్వ్యాళీక శిక్షించుచున్। గ్గొలఁకుల్సొచ్చికలంచుచున్ గిరులపైఁ గొబ్బిళ్లు గోరాడు
చున్* (క॥ తొండంబులమదజలవృత। గండంబులఁ గుంభములను ఘట్టనసేయం। గొండలుదలక్రిందై పడు। బెండుపడున్దిశలు
సూచి బెగడున్నగముల్* (క॥ ఎక్కడఁజూచిన లెక్కకు। నెక్కువమై యడపనదుచు నిభయూథములో। నొక్కకరినాథుఁడెడ తె
గి। దిక్కొక్కక రేణు కోటిసేవింపంగన్* (వ॥ ఇట్లు వెనుకముందఱ నడుమ నుభయపార్శ్వంబులఁ దృష్టార్దితంబులై యరుగు
దెంచు నేనుంగుగములం గూడికొని తెఱఁగుఁదప్పి తొలంగుపడి యీశ్వరాయత్తంబుఁ జిత్తంబు సంవిత్తంబుగాకుండుటం జే
సి తానును దనకరేణు సముదయంబును నొక్కతెఱువై పోవుచు* (సీ॥ పల్వలంబుల లేఁతపచ్చికమచ్చికఁ జెఱులకందిచ్చున
చ్చికములేక। చివురుజొంపములఁ గ్రొవ్వేలయుఁ బూఁగొమ్మలఁ బ్రాణవల్లభలకుఁ బాలువెట్టు। ఘనదానశీతలకర్ణతాళంబులఁ

యితలచెమటార్చ్చితనువులరసి। మృదువుగాఁగొమ్మలమెల్లనెగళములునివురుచుఁ బ్రేమతో నెఱపుగలవు । పిఱుదుచక్కిల్లి డగ్గఱిప్రేమతోడ। డాసిమూర్కొనిదివికిఁదొండంబుసాఁపు । వెదవివేకించుఁగ్రీడించువిశ్రమించు । మత్తమాతంగమల్లంబు మహిమతోడ*(సీ॥తఃకుంభములపూర్ణతకుడిగ్గియువతులకుచములపయ్యెదకొంగులీవ । తనయానగంభీరతకుఁజాలకబలల యానంబులందెలపండఁగోరఁగ । దనకరశ్రీఁగనితలఁగిచాలలచిఱుదొడలమేఖలదీప్తిదోడుపిలువఁ। దనదంతరుచికోటి దరుణులనగవులుముఖచంద్రదీప్తులముసుకుఁదిగువఁ। దనమలావణ్యరూపంబుదలఁచిచూడ । నంజనాభ్రముకపిలాదిహరిణిభే ద్రమదయితలందఱుఁదనవెంటఁదగిలినమనఁ । గుంభివిభుఁడొప్పెనొప్పులకుప్పఁబోలె* (వ॥ మఱియునాగహనవిహరణమ హిమహితోన్మదగజేంద్రంబుమార్గంబుదప్పి పిపాసాపరాయత్తచిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానునుంజనిచ ని*(మ॥ అటఁగాంచెంగరిణీవిభుండునవపుల్లాంభోజకల్హారము। న్నటదిందిందిరవారమున్నతరమీనగ్రాహదుర్వారమున్। వటహింతాలరసాలసాలసుమనోవల్లీకుటీతీరము। న్నటులోద్ఘాతమరాళచక్రబకసంచారంబుగాసారమున్* (వ॥ ఇట్లనన్య పురుషసంచారంబును నిష్కళంకంబునై యప్పంకజాకరంబుం బొడఁగని* (సీ॥ తోయజగంధంబుదోఁగిన చల్లని మెల్లనిగా డ్పులమేనులలరఁ। గమలనాళాహారవిమలవాక్కలహంసరవములుసెవులపండువులుసేయ। ఫుల్లదిందీవరాంభోరుహామోదం బుఘ్రాణరంధ్రంబులగారవింప । నిర్మలకల్లోలనిర్గతాసారంబువదన గహ్వరముల వాఁడుదీర్పఁ। ద్రిజగదభినవ సౌభాగ్యదీ ప్తమైన। విభవమీక్షణములకునువిందుసేయ । నరిగిపంచేంద్రియవ్యవహారములను । గా నదిమత్తేభయూథంబు నడుగుఁజొ చ్చె*(క॥ తొండంబులఁబూరించుచు। గండంబులఁజల్లుకొనుచుగళగళరవముల్ । మెండుకొనవలుదకడుపులు। నిండ న్వేదండ కోటినీరుంద్రావెన్॥ అప్పుడు*(మ॥ ఇభలోకేంద్రుఁడుహస్తరంధ్రములనీరెక్కించిపూరించిచం। డభమార్గంబునకెత్తిని క్కెవడిన్సాడించిపైఁజిమ్మునా। రభటిన్నీరములోనఁబెల్లెగసినక్రగ్రాహపాఠీనముల్। నభమందాడెడుమీనకర్కటములన్ బట్టెన్సురల్మ్రాన్పడన్॥మఱియునగ్గజేంద్రంబునిరర్గళవిహారంబున* (సీ॥ కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁదోఁగిసెలయేటివీ లాద్రిచెలువుఁదెగడు। హస్తినీహస్తవిన్యస్తపద్మంబులవేయిగన్నులవానివెలుపుసూపుఁ। గలభీసముత్కీర్ణకల్హారరజమునఁ గనకాచలేంద్రంబుఘనతఁదాల్చుఁ। గుంజరీపరిచితకుముదకాండంబుల ఫణిరాజమండనప్రభవహించు । మదకరేణుముక్త మౌక్తికశుక్తులమెఱుఁగుమొగులతోడమేలమాడు । నెమరులేనిగరిమనిభరాజమల్లంబు। వనజగేహకేళివ్రాలునపుడు*(వ॥ మఱియు నాసరోవరలక్ష్మీమదగజేంద్రవివిధవిహార వ్యాకులితమానలక్ష్మీవిభవమ్మైయనంగ విద్యానిరూఢ పల్లవప్రబంధప రికంపితశరీరాలంకారయును కుసుమకోమలియునుంబోలెవ్యాకీర్ణచికురను త్తమధుకరనికరయు, విగతరసవదనకమలయు,న జస్థానవలితకుచరథాంగయుగళయు,లంపటితజఘనపులినతలయునై యుండెనంత* (సీ॥భుగభుగాయతఘూరిబుద్బుదచ్ఛట లతోఁగదలుచుదివికిఁబొంగంబులెగయ । భువనభయంకరపూత్కారరవమున ఘోరనక్రగ్రాహకోటిబెగడ । వాలవిక్షేపదు ర్వారజంఘానిలవశమునఘుమఘుమావర్తములడరఁ। గల్లోలజాలసంఘట్టనంబులతటీతరులుమూలంబుతోధరణిఁగూల। సరసి లోనుండిపొడఁగనిసంభ్రమించి । యుదరికుప్పించిలంఘించిహుంకరించి । భానుఁగబళించుపట్టుస్వర్భానుపగిది। నొక్కమక రేంద్రుఁడిభరాజునొడిసిపట్టె* (క॥ వడిఁదప్పించికరీంద్రుఁడు । నిడుదకరంబెత్తివైవనీరాటంబుం । బొడవడఁగినట్లుజలము లఁబడికడువడిఁబట్టెఁబూర్వపదయుగళంబున్*(చ॥పదములఁబట్టినందలఁకుపాటొకయింతయులేకశూరత । న్మదగజవల్ల భుండుధృతిఁగుంకుఁడుదంతయుగాంతఘట్టనన్। జెదరఁగఁజిమ్మెనమ్మకరిచిప్పలుపాములుదప్పనుప్పరన్ । వదలిజలగ్రహంబుక రివాలముమూలముఁజీరెగోరులన్*(క॥కరిఁదిగుచుమకరిసరసికిఁ। గరిదరికిని మకరిఁదిగుచుగరికరిబెరయన్ । గరిమకరిపుక రికింగరిభరముననిట్లతలకుశలభటులదరిపడన్* (వ॥ ఇట్లుకరిమకరంబులురెండునునొండొండసముద్దండతండంబులైతలప డినిఖిలలోకాలోకన భీకరంబులై యన్యోన్య విజయశ్రీ వశీకరంబులై సంక్షోభితకమలాకరంబులై హరిహరియునుగిరిగిరి యునుందాకిపేరుతివియక పెనంగుతెఱంగుననీరాటంబయినపోరాటంబువెట్టుచువెలికిలోనికిందిగుచుచుఁ గొలంకులకలంకం బందఁగడువడినిట్టట్టుపడితడబడకబుడబుడానుకారంబులైభుగులుభుగుల్లనుచప్పుళ్లతో నురుఫులుగట్టుచుజలంబులుప్పరంబు న కెగయంజప్పరించుచుఁదప్పకవదనగహ్వరంబులనవ్వలించుచునిశిత నితాంతదురంతదంతకుంతంబుల నింతింతలుతునియలై నప్పళంబన బునుకచిప్పలు కుముళ్లుదప్పి రక్తంబులు గ్రమ్ముదేర హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచునితరేతరసమాకర్షణంబు లంగదలకపదంబులుమొదలిపట్టువదలక కుమురై యుండుచుఁ బరిభ్రమణవేగంబునజలంబులందిఱుగుచు మకర కమఠ కర్కట గండకమండూకాదిసలిలనిలయంబులుప్రాణంబులుక్షీణంబులుగా నొకటొకటిందాకు రభసంబున నిక్కలువడ బ్రగ్గంబ్రొ క్కుచు మెండుచెడి జెండుపడి నాచు గుల్లచిప్పతండంబులఁ బరస్పర తాడనంబులకు నడ్డంబులొడ్డు మనోలమాసఁగొనత గెలుపుతలంపులుబెట్టిదంబులై రెట్టింప నహోరాత్రంబులుంబోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులై బహుకాలకలహ

విహారంబులై నిర్గతనిద్రాహారంబులై యవక్రపరాక్రమ ఘోరంబులై పోరుచున్న సమయంబున* (క॥ జవమును జలము
నుబలమును । వివిధములుగబోరు కరటివీగతకుభుపర్ల । దివిజ కనమీనకర్కట । నివహము లోకట నమిత్ర నిలయము
బొందెర్ల* (శా॥ ఆటోపంబున జిమ్ముటొమ్మగల వజ్రాభీల దంతంబులర్ల । దాటించు న్మెడజుట్టిపట్టిహరి దోర్దండాభశుం
డాహతి । న్నీటర్ల మాటికిమాటికిందిగుచుంగానీరాటము న్నేటిపో । రాటందోటమిపాటుజూపుట కంజ్యాటంబు వాచాట
మై॥అప్పుడు*(గీ॥ నుకరి జోడంబోరుమాతంగ విభునినో॥క॥ రుండించిపోవంగాల్లురాక కోరిచూచుచుండెం గుంజరీయూథంబు
మగలుతనులుగా రెని గువలకును॥అంగ*(గీ॥ జీవసంబుతన కుజీవనంబై యుంట। నలవుబలమునంతకంత కెకిరి । నకరమొప్పె
డస్నెమత్తేభమల్లంబు।బహుళ పక్ష శీత భానుపగిది* (ఉ॥ ఉరుకుంగుంభయుగంబుపైహరిక్రియర్ల హుమ్మంచుంబాడంబులం।
దిఱుగుంగంఠము వెన్నుందన్న నెగయర్ల హేలాగతిన్వాలయుం । జఱచున్నగ్గంగదాంకుముంచుముగుర్ల శల్యంబులుం
దంతములు।వ్విఱుగన్వ్రియుచుంబొంచిబొంచికదియ న్వేదండయూథోత్తముర్ల*(మ॥పాడగానంబడకుండడాగు వెలికింబో
వంగందానడ్డమై।పొడచూపుంజరణంబులంబెనంగొనుంబోరాకరారాకబె। గ్గడిలంగూలంగదాంటు లేచు తటీను ఘాటించులం
ఘించుట। ల్విడిజీఱుండలంగున్మలంగునొడియు న్వేధించుగ్రోధించుచుర్ల* (వ॥ఇట్లువిస్మితనక్రచక్రంబై నిర్వక్రవిక్రమంబు
ననల్పహృదయజ్ఞానదీపంబునతిక్రమించు మహామాయాంధకారంబువంబోలె నంతకంతకు నుత్సాహ కలహ సన్నాహంబ
హువిధజలావగాహంబయిన గ్రాహంబున హాసాహసంబున* (శా॥ పాదద్వంద్వము నేలమోపి పవనుస్పంధించివం చేంద్రి
యో । న్మాదంబుంబరిమార్చిబుద్ధిలతకున్మాజాకుహత్రించినిః । ఖేదబ్రహ్మపదావలంబనగతిం గ్రీడించు యోగీంద్రుమ । ర్యా
దన్నక్రముపిక్రమించెంగరిపాదాక్రాంతనిర్వక్రమై* (గీ॥ వనగజంబు నెఱుచువనచారిం బోడంగని । వనగజంబ కానవజ్రిగజ
ము। వెల్లనైను రేంద్రుమవైచిసుథాంధులంబట్టుపట్టనీకి బయలుద్రావకె* (ఉ॥ ఊహకలంగి జీవనపుటోలమునంబడిపోవుచుర్ల
మహా। మోహలతానిబద్ధపదముస్విడిపించుకొనంగలేకసం । దేహముంబొందు దేహిక్రియదీనదశర్ల గజముండెభీషణ।గ్రాహ
దురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్యమై॥ఇవ్విధంబున* (క॥ అలయక సొలయక వేసట।నొలయకకరిమకరితోడనుద్దండ
తరాత్రులుసంధ్యలుదివసంబులు। సలిపెవ్వొరొకట వేయు సంవత్సరముల్* (మ॥ పృథుశక్తిన్గజమా జలగ్రహముతోంబె
కెటంబ్లుపోగాడిపం।శిథిలంబై తనలావువైరిబలముంజింతించిమిథ్యానునో । రథమింకేటికిదీనిం గెల్వ సరిపోరంజాల రాదం
చున।వ్యథమైయిట్లనుంబూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తిశోర్ల* (శా॥ ఏరూపంబున దీనిం గెల్తునిటమీ దేవేల్పుజింతింతునె।
వ్వారింజీఱుదు నెవ్వరడ్డమింక నివ్వారిప్రచారోత్తముర్ల । వారింపందగువార లెవ్వరఖిలవ్యాపార పారాయణు।ల్లే రేమ్రొ
కెటదదిక్కుమాలిన మొఱాలింపంబ్రపుణ్యాత్మకుల్* (శా॥ నానానేకపయూథము ల్వనములోనం బెద్దగాలంబున। న్మానిం
పన్దశలక్షకోటికరిణీనాథుండనై యుండిను । ద్దానాంభఃపరిపూర్ణ చందనలతాంతచ్ఛాయలం కుండలే। కీనీరాశికి రేలవచ్చితి
భయంబెట్లోక దేయీశ్వరా*(ఉ॥ఎవ్వనిచేజనించుజగమెవ్వనిలోపలనుండులీనమై। యెవ్వనియందుడిందుంబరమేశ్వరుం
డెవ్వండుమూలకారణం।బెవ్వండనాదిమధ్యలయుండెవ్వండు సర్వముందానమైనవాం। డెవ్వండు వానినాత్మభవునీశ్వరునే
శరణంబువేడెదర్ల*(క॥ఒకపరిజగములువెలినిడి । యొకపరిలోపలికిగొనుచునుభయముదానై । సకలార్థసాక్షియగున।
య్యకలంకునినాత్మమూలునర్థిదలంతుర్ల*(క॥లోకంబులులోకేశులు।లోకస్థులుదెగినతుదినలోకంబగు పెంజీంకటికవ్వలనె
వ్వాం। డేకాకృతివెలుంగునతనినేసేవింతుర్ల* (క॥నర్తకునిభంగింబెక్కగు।మూర్తులతో నెవ్వండాడుమునులుందివిజు।ల్కీర్తింప
నేరరెవ్వని।వర్తనమొరులెఱుంగరట్టివానినుతింతుర్ల*(గీ॥ముక్తసంగులైనమునులుదిదృక్షులు । సర్వభూతహితులుసాధుచి
త్తులసదృశవ్రతాఢ్యులైకొల్తురెవ్వని।దివ్యపదమువాండుదిక్కు నాకు* (సీ॥ భవముదోషంబురూపంబుకర్మమునాహ్వయ
మునుగుణములెవ్వనికిలేక।జగములంగలిగించుసమయించుకొఱకునైనిజమాయనెవ్వండిన్నియునుదాల్చు । నాపరేశునకున
నంతశక్తికిబ్రహ్మకిద్ధరూపికిరూపహీనునకును । జిత్తచారునకుసాక్షికినాత్మరుచికినిబరమాత్మునకుంబరబ్రహ్మమునకు । మాట
లన్నెరుకలమనములర్ల జేరంగ।గానిశుచికిసత్వగమ్యుండగుచు । నిపుణుండైనవానినిష్కర్మతకుమెచ్చు।వానికేనొనర్తువంద
నములు*(సీ॥శాంతునకపవర్గసౌఖ్యసంవేదికినిర్వాణభర్తకునిర్విశేషు। నకుఘోరునకుమూఢునకు గుణధర్మికిసౌమ్యునకధి
కవిజ్ఞానమయున । కఖిలేంద్రియద్రష్టకధ్యక్షునకుబహుక్షేత్రజ్ఞునకునయాసింధుమతికి । మూలప్రకృతికాత్మమూలునకుజి
తేంద్రియజ్ఞాపకునకుదుఃఖాంతకృతికి। నెఱినసత్యమనెడినీడతో వెలుంగుచు । నుండునెక్కటికిమహోత్తమునకు।నిఖిలకా
రణునకునిష్కారణునకున।మస్కరింతునన్నుమనుచుకొఱకు* (క॥యోగాగ్నిదగ్ధకర్ములు । యోగీశ్వరులేమహాత్మునొండెడ
ఱుంగకస।ద్యోగవిభాసితమనములబాగుగవీక్షింతురట్టిపరముభజింతుర్ల* (సీ॥ సర్వాగమామ్నాయజలధికినపవర్గమయో
త్తమునకుందిరునకు।సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిందనంతరాజిల్లుధన్యమతికి। గుణలయోద్దీపితగురుమానసునకు

ఉకు।శుకములఁదోఁచెఁజకుర్మీనములకున్ ద్రాకినీపాఠీనలోకమెసఁగు। మీనపఙ్క్తులు వాటిమెఱుఁదీఁగెతో రాయిశంపాల తెలుమింటసరణిఁగట్టు।శైవలానుజయింపఁజక్రవాకంబులు। కుచయుగంబుఁదాఁకి క్రొవ్వుఁజూపు। మెలఁత మొగులపిఱుఁదిమెఱుఁగుఁదీఁగెయుఁబోలె।జలకన్యవర్ణ వెనుకఁజరుగునప్పుడు* (మ॥ పనువీథిన్గను దేరఁగాఁచి మరుల్గొన్నన్నురారాతిజీ।వనసంపత్తిని శాకరిష్ణుఁగరుణావర్ధిష్ణు యోగీంద్రహృ।ద్వనవర్తిష్ణు సహిష్ణుభక్తజనబృన్దప్రాభవాలంకరి।ష్ణునవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణురోచిష్ణునిన్ ॥ఇట్లుపొడగని* (మ॥ చను దెంచెన్ఘను డల్లవాఁడెహరిపజ్జంగంటిరేలక్ష్మిశం। ఖనినాదంబల్లదెచక్రమల్లదెభుజంగధ్వంసియున్వాఁడెక్రన్నన నేతెంచె నటంచు వల్పులనమో నారాయణాయేతినిస్వనులై మ్రొక్కిరి మింటహస్తికరవస్థావక్రికింజక్రికిన్* (వ॥ అయ్యవసరంబునఁగుంజరేంద్రపాలనపారవశ్యంబున దేవతానమస్కారంబులంగీకరింపక నస్సమాన సంచారుండై పోయిపోయికొంతదూరంబున శింశుమారచక్రంబునుంబోలె గుఱువకరకుళీరమీనమిథునంబై కిన్నరేంద్రునిభాండాగారంబునుంబోలె స్వచ్ఛవరకచ్ఛపంబై భాగ్యవంతునిభాగధేయంబునుంబోలె సరాగజీవనంబై వైకుంఠపురంబునుంబోలె శంఖచక్రకమలాలంకృతంబై సంసారచక్రంబునుంబోలె ద్వంద్వసంకులపంకసంకీర్ణంబై యొప్పునప్పంకజాకరంబుఁబొడగని* (మ॥ కరుణాసింధుఁడు శౌరివారిచరముం ఖండింపఁగాఁబంపెస।త్వరితాకంపితభూమిచక్రమున్ మహాస్ఫూర్యద్విస్ఫులింగచ్ఛటా। పరిభూతాంబరశుక్రమున్ బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం। తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాంధశ్చక్రముం జక్రమున్॥ఇట్లుపంచిన* (శా॥ అంభోజాకరమధ్యనూతననళిన్యాలింగనక్రీడనారంభుండైన వెలుంగుఱేని చెలువారన్వచ్చి నీటన్గుభుల్గుంభధ్వానముతోఁగొలంకుపుకలంకంబొందఁగాఁజొచ్చెదుష్టాంభోవవర్తివసించుచక్కటికిడాయంబోయి హృద్వేగమై* (శా॥ భీమంబై తలఁద్రుంచిప్రాణములఁబాపెంజక్రమాశుక్రియన్। హేమఘోరదేహముం జకితవన్యేభేంద్రసందోహముం। గామక్రోధనగేహముం గరటిరక్తస్రావగాహంబుని। స్సీమోత్సాహము వీతదాహముజయశ్రీమోహముం గ్రాహమున్* (వ॥ఇట్లు విమతస్వప్నంబునసునగ్నంబుమకరితలఁద్రుంచునవసరంబున* (క॥ మకరమొకటిరవిఁజొచ్చెను।మకరము దరిఁయొకటిధనదుమాటున డాగెన్। మకరాలయమునఁదిరిగెడు।మకరంబులుకూర్మరాజుమఱుఁగునకరిగెన్* (మ॥ తనముంబాసినరోహిణీశుభక్రియన్ దర్పించిసంసారదుః। ఖమువీడ్కొన్న విరక్తచిత్తునిగతిన్ గ్రాహంబుపట్టూడ్చిపా। దములల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పెసం। భ్రమదాశాకరిణీకరోజ్ఝితసుధాంభస్స్నానవిశ్రాంతుఁడై* (శా॥ పూరించెన్ హరిపాంచజన్యముఁ గృపాంభోరాశిసౌజన్యము।న్భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యము। న్సారోదారసితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్। దూరీభూతవిపన్నదైన్యమునిర్ధూతద్విషత్సైన్యమున్* (మ॥ మొఱసెన్నిగ్గగదుంద భుల్జలరుహామోదంబులై వాయువు। ల్దిరిగెన్పువ్వులవానజల్లుగురిసెన్దేవాంగనాలాస్యము। ల్పరగెన్ దిక్కులయందు జీవజయశబ్దధ్వానముల్నిండెసా। గరముప్పొంగెఁదరంగచుంబితనభోగంగాముఖాంభోజమై*(క॥ విడుదయగు కేలగజమును।మడువున వెడలంగఁదిగి చిమదజలరేఖ।ల్దుడుచుచుమెల్లనఁబుడుకుచు।నుడిపెన్విష్ణుండు దుఃఖమూర్చ్ఛనాథా* (క॥ శ్రీహరిసంస్పర్శనమున। దేహముదాహంబుమానిధృతిఁగరిణీసం। దోహమును దానుగజపతి। మోహనఘీంకారశబ్దములతోనొప్పెన్*(క॥కరమున మెల్లనఁనివురుచుఁ। గరమనురాగమున మెలసికలయస్పృశచున్।గరిహరికితమున బుసకొట్టుచుఁ।గరపీడనమాచరించెఁగరిణులు నరలున్*(సీ॥జననాథ దేవలశాపవిముక్తుఁడై పటుతరగ్రాహరూపంబు మాని। ఘనుఁడుహూహూనామగంధర్వుఁడప్పుడు తనతొంటినిర్మలతనువుఁదాల్చి। హరికినయ్యయనకునతిభక్తితోమ్రొక్కి తవిలి కీర్తించిగీతములఁబాడి। యాదేవుకృపనొంది యందంద మఱియును వినతశిరస్కుఁడై వేడ్కతోడ।దళితపాపుఁడగుచుఁదనలోకమునకేగె।నపుడు శౌరికేలనంటనడువ। హస్తిలోకనాథుఁడజ్ఞానరహితుఁడై। విష్ణురూపుఁడగుచు వెలుఁగుచుండె* (మ॥ అవనీనాథగజేంద్రుఁడామకరితో నాలంబు గావించెమున్। ద్రవిళాధీశుఁడతండు పుణ్యతముఁడింద్రద్యుమ్ననాముండువై। ష్ణవముఖ్యుండుగృహీతమాననియతిన్సర్వాత్మనారాయణు। న్సవిశేషంబుగఁబూజఁజేసెనుమహాశైలాగ్రభాగంబునన్*(మ॥ ఒకనాఁడానృపుఁడచ్యుతున్మనములోనూహించుచున్మౌనియై। యకలంకస్థితినున్నచోఁగలశజుండచ్చోటికిన్వచ్చి లే।వకపూజింపకయున్నమానిఁగనినవ్యక్రోధుఁడైమూఢలు।బ్ధకరీంద్రోత్తమయోనిఁబుట్టుమనిశాపంబిచ్చెభూవల్లభా*(క॥ మునిపతి నవమానించిన।ఘనుఁడింద్రద్యుమ్నవిభుఁడు కుంజరయోనిం। జననంబందెను విప్రులఁ।గనియవమానింపఁదగదు ఘనపుణ్యులకున్*(క॥ కరినాథుఁడయ్యెనాతఁడు।కరువైరి భటాదులెల్లగజమైయుండిన్। హరిచరణసేవకతమునఁ।గరివరునకుమనధికముక్తిగలిగెనరేంద్రా* (గీ॥ కర్మతంత్రుఁడగుమఁగవలాతుఁగొల్చుచు। మభయనియతవృత్తినుండెనేనిఁ। జెడును గర్మమెల్లశిథిలమై మెల్లనఁ।బ్రబలమైన విష్ణుభక్తిచెడదు*(క॥ చెడుఁగరులుహరులుధనములు।చెడుదురుసజపతులుసుతులుచెడుచెనటులకు।జెడకమనునెఱుసుగుణులకుఁ।జెడనిపదార్థములు విష్ణుసేవానిరతుల్*(వ॥ అప్పుడు జగజ్జనకుండునప్పరమేశ్వరుండు

దరహసితముఖకమలయగుచుఁ గమలకిట్లనియె* (క॥ బాలా నా వెనువెంటను। హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ। చేలాంచ
లంబుఁ బట్టుట। కాలో నేమంటి నన్ను నంభోజముఖీ* (క॥ మెఱుఁగుఁగుఁ దెఱవా యిప్పుడు। మఱువను సకలంబు నన్నున్ మఱచిన యె
డలన్। మఱతును నెఱిఁగి మెఱుఁగక। వఱువక మొఱయిడిరి యేని వఱియన్యములన్* (వ॥ అని పలికి నవరవిందమందిర యగుచు న
య్యిందిరాదేవి మందస్మితచంద్రికావదనారవిందయగుచు ముకుందున కిట్లనియె* (క॥ దేవా దేవర యడుగులు। భావంబున నిలి
పికొనుచు పనినాపనిగా। కోవల్లభ యేమని యెఱు। నీ వెంటన వచ్చుచుంటి నిఖిలాధిపతీ* (క॥ దీనులఁ గుయ్యాలింపను। దీనులఁ రక్షింప
మేలు దీవెనఁ బొందన్। దీనావననీకొప్పును। దీనపరాధీన దేవదేవ మహేశా* (వ॥ అని యిట్లు యనుసముచితసంభాషణంబుల నం
కించుచున్న పరమవైష్ణవీరత్నంబును సాదరసరససల్లాప మందహాసపూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివారుం
డై గంధర్వసిద్ధవిబుధగణజేగీయమానుండై గరుడారూఢుండగుచు నిజసదనంబునకుఁ జనియెనని చెప్పి శుకయోగీంద్రుండిట్లని
యె* (సీ॥ నరనాథ నీకు నాచేత వివరింపఁబడిన యీ కృష్ణానుభావమైన। గజరాజమోక్షణకథ నువారికి యశము లెచ్చును గ
ల్మషాపహంబు। దుస్స్వప్ననాశంబు దుఃఖసంహారంబు ప్రొద్దున మేల్కాంచి బూతవృత్తి। నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్ముకు
లైన విప్రులకును బహువిభవమగు। సంపదలు గల్గుపీడలు శాంతిఁ బొందు। సుఖము సిద్ధించు వర్ధిల్లు శోభనములు। మోక్షము ల
చేతిదయ్యుంకుముదము చేరు। ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె* (వ॥ అని యిట్లు యనుసప్పరమేశ్వరుండిట్లని యానతిచ్చె నె
వ్వారేని యునపరరాత్రంబున మేల్కాంచి సమాహితమనస్కులై శ్వేతద్వీపంబును, నాకుం బ్రియంబైన సుధాసాగరంబును,
హేమనగంబును, నిగ్గిరికందరకాననంబులను, వేత్రకీచకవేణులతాగుల్మసురపాదపంబులును, ఏనును బ్రహ్మయు ఫాలలోచ
నుండును నివసించియుండు నికూటండశిఖరంబులను, కౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను, శ్రీదేవిని శేషగరుడవా
యుకిప్రహ్లాదనారదాదిఋషులను, మత్స్యకూర్మవరాహాద్యవతారంబులను, తదవతారకృతకార్యంబులను, సూర్యసోమ
పావకులను, బ్రణవంబును, ధర్మతపస్సత్యంబులను, వేదంబును, వేదాంగంబులను, శాస్త్రంబులను, గోభూసురసాధుపతివ్ర
తాజనంబులను, జంద్రకాశ్యపజాయాసముదయంబును, గౌరీగంగాసరస్వతీ కాళిందీసునందా ప్రముఖపుణ్యతరంగిణీనిచ
యంబును, నమరులను, నమరతరువులను, వైరావతంబును, నమృతంబును, ధ్రువుని, బ్రహ్మర్షినివహంబును, పుణ్యశ్లోకులయి
నమానవులను, సమాహితచిత్తులై తలంచువారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుం
డుదగ్రదేశంబునఁ శంఖంబు పూరించి విహగపరివృఢవాహనుండయి వేంచేసె విబుధానీకంబు సంతోషించె నని చెప్పి శుకుండు రాజు
నకిట్లనియె* (క॥ గజరాజమోక్షణంబును। నిజముగఁ బఠియించు నట్టి నియతాత్మలకున్। గజరాజవరదుఁ డిచ్చును। గజతురగస్యం
దనములు గైవల్యంబున్* (క॥ తామసుతమ్ముఁడు రైవతనామకుఁడై వెలసె మనువు నలువుర మీఁద। న్స్వామికిఁ బ్రతివింధ్యార్జు
న నామాదులు నృపులు మనువునందనులు నృపా* (సీ॥ మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు వేదశీర్షుండును వీరు మొ
దలు। నమరులు భూతరథాదులు శుభ్రుని పత్నియై కుంతాఖ్యపరమసాధ్వి। యా యిద్దరకుఁ బుత్రుఁడై తనకళలతో వైకుంఠుఁడనఁ
బుట్టి వారిజాక్షుఁ। డవనిపై వైకుంఠమని యెడిలోకంబుఁ గల్పించె నెల్లలోకములు మ్రొక్క। రమయెదురోఁపలు చేకొనెరా
జముఖ్య। తదనుభావగుణంబులుదలఁపఁ దరమె। యీధరారేణుపటలంబు నెఱుఁగవచ్చుఁ। గాని తాదయ్యహరిగుణగణము సం
ఖ్య॥ తదనంతరంబ* (సీ॥ చక్షువు తనూజుండు చాక్షుషుండను పేరఁ డాఱవమనువయ్యె నవనినాథ। భూమీశ్వరులు పురుఃపురు
షసుద్యుమ్నాదులాతని నందనులమరవిభుఁడు। మంత్రద్రుమాఖ్యుఁడమర్త్యులాప్యాదిక లాహవకృశభీక శాదిమునులు। ము
నులంకు విభుఁడు సంభూతికి నాత్మజుండై పుట్టి యజితుండు నాగనొప్పె। నతఁడ కాఁడె కూర్మమై మందరాద్రిని। నుదధిజలములో
ననుండి మోసె। నతఁడచు వ్వెదివిజులర్థింపనమృతాబ్ధిఁ। ద్రచ్చియిచ్చెనా సుధారసంబు* (వ॥ అని పలికిన నంబరీక్షిన్నరేంద్రుండు

—* క్షీరసాగరమథనకథాప్రారంభము. *—

మునీంద్రునకిట్లనియె* (మ॥ వినుమున్నేటికిఁ ద్రచ్చె పాలకడలిన్ విష్ణుండు కూర్మాకృతి। న్వనధిం జొచ్చి యదెట్లు మోసె బలుక
వ్యంబైన శైలంబు దే। వనికాయంబమృతంబు నెట్లు వడసె న్వారాశి నేమేమి సం। జనితంబయ్యె మునీంద్ర చోద్యము గదా స
ద్వ్యంబుఁ జెప్పంగదే* (క॥ అప్పటినుండి బుధోత్తమ। చెప్పెదు భగవత్కథావిశేషంబులనా। కెప్పుడుఁ దనివి జనింపదు। సెప్పఁ
గదే చెవులునిండ శ్రీహరికథలన్* (వ॥ అని మఱియు నడుగంబడినవాఁడై యతని నభినందించి హరిప్రసంగంబు చెప్పను పక్ర
మించె నని సూతుండు ద్విజులకిట్లనియె నట్లు శుకుండు రాజునుం జూచి* (క॥ కసిమసఁగి యసురవిసరము లసలతికల సురల నెఱువ న
మువులు వెడలం। బసచెడి రిపడిరి గెడసిరి। యసమసమర విలసనములనస మెడలి నృపా* (క॥ సురపతి వరుణామరులతో। సురమును
లుం గొలువ గదలి సురశైలము పై। సురనుతుఁడగు నజుగాంచిరి। సురదుష్కృతిఁ జెప్పిర పుడు సొలయుచు నతులై* (క॥ దుర్వా
సుశాపవశమున। నిర్విణ్ణత జగములెల్ల నిశ్శ్రీకములై। పర్వతరిపుతోఁ గూడన పర్వతమైయుం సెహతసుపర్వావళులై* (గీ॥ నె

లవు వెడలియున్న నిసేజులై నట్టి। వేల్పుగముల జూచి వేల్పుపెద్ద। పరమపురుషుఁ దలఁచి ప్రణతుఁడై సంఫుల్ల। పద్మవదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ* (క॥ ఏను నుమీ సనుగాములు। మానవతిర్యఙ్నగద్రుమస్వేదజము। ల్మానుగ నెవ్వనికళలము। వానికి మ్రొక్కెదము గాక వగవఁగ నేలా* (క॥ ఆద్యుండు రక్షకుండు న। నాద్యుఁడు మాన్యుండు లోకనగ్రణి నాం। తాత్యాన లోనగ్చున తం డాస్వంతవిధానములకు నగ్వాఁడు మాకు నగు* (క॥ పరమునిర్భరము జగన్నుతుఁ। గరుణాపరతంత్రుఁ డనముఁ గమ్మఁ గొనదుఃఖజ్వ రములు చెదరనిపురలకు। బోగఁగఁ బద్మజుఁడు సెప్పి పరమప్రీతిన్* (వ॥ అంతర్ధానము దేవతాసమూహంబును నతిదయం బునం జనితినయంబునం గానంబడనియప్పుఁ భునుద్దేశించి శ్రైపికంబులగు వచనంబులనియతేంద్రియులై యిట్లని స్తుతియించిరి* (సీ॥ ఎవ్వనిమాయకు నెంతయు మోహింతుఁ దరిమి యెవ్వనిమాయదాఁటరాదు। నవమాయ నెవ్వఁడెంతయుఁ గెల్చె నెవ్వాఁడు నెవ్వనిఁ బోఁడగాన రెట్టిమునులు। సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు వరియించు నతఁడె పోజనితమయిన। ధరణిపాదములు చిత్తము సోముఁ డగ్ని ముఖంబును గన్నులు కనలహితులు। చెవులు దిక్కులు రేతంబు సిద్ధజలము। మూఁడు మూఁపులు ట్టిల్లు మొదలినెలవు। గర్భ మఖిలంబు మూర్ధంబు గగనము గుము। గాలియు నెవ్వని కానన్నమస్కరింతు* (వ॥ మఱియు నెవ్వనిబలంబు మహేంద్రుండును, బసాదంబున దేవతలును, గోపంబున రుద్రుండును, బరుషంబున పిరించియు, నింద్రియంబులవలన వేదంబులు, మునులును, మేఢ్రంబున బ్రజాపతియు, వక్షంబున లక్ష్మియు, ఛాయవలనఁ బితృదేవతలు, స్తనంబులవలన ధర్మంబును, బ్రస్తంబువలన నధర్మంబును, శిరంబువలన నాకంబును, విహారంబులవలన నప్సరోజనంబులును, గుహ్యంబువలన బ్రహ్మంబును, ముఖంబువలన విప్రులు భుజంబులవలన రాజులు నూరువులవలన వైశ్యులును, బదంబులవలన శూద్రులు, నధరంబున లోభంబును, నుపర్వ రంధ్రంబువలనఁ బ్రీతియు, నాసాపుటంబులవలన నక్షత్రము, స్పర్శంబున గామంబును, భ్రూయుగళంబున యమంబును, పక్షంబునఁ గాలంబును సంభవించె నెవ్వనియోగమాయావిర్జింబులు ద్రవ్యవయఃకర్మగుణవిశేషంబులు చతుర్విధసర్గంబె వ్వనియాత్మతంత్రం బెవ్వనివలన సిద్ధించు లోకంబులును, లోకపాలురుం బ్రతుకుచుండురు పెరుగుచుండరు వనిజులనాయు వుబలంబునై నజగంబులకు నీశుండై పరమమహాభూతియగు నప్పరమేశ్వరుండు మాకుం బ్రసన్నుండు గాక యని మఱియును* (క॥ మొదల జలమిడిన భూజము। మొదలన మరుజల్లఁ దనముదో కొనుమాడి। న్మొనలను హరికిని మ్రొక్కి నా। మొదమొందుదు మెల్ల వేల్పు మూకలు నేమున్* (క॥ ఆపన్నుల గుద్దిర్పకుల। కోపుణ్యభవమ్ము ఖాబ్జ మొయ్యన నాసితోఁ। బ్రాపింపఁ జేయు సంపద। నోపరమదయానివాసయుజ్జ్వలవాసా* (వ॥ అని యిట్లు దేవగణసమేతుండై యనేకవిధంబులం గీర్తించుచున్న పరమేష్ఠి యందుఁ గరుణించి దయాగరిష్ఠుండు విశ్వగర్భుండావిర్భవించె* (మ॥ ఒకవేయర్కులు గూడ గట్టిక దుపైయుగ్రత్వ ప్రభాభూతితో। నొకరూపై చనుదెంచు మాడ్కి హరి దానొప్పారె యాఖేలుపు। లొకలాలోకనులై పిసన్నమతులై విభ్రాంతులై మ్రోలఁ గానకి శంకించిరి కొంతప్రొద్దు భగవానం బోలు నే వారికిన్॥ అప్పుడు* (సీ॥ హారకిరీటకేయూరకుండలపాదకటకకాంచనరత్నకంకణాది। కౌస్తుభోపేతంబుగా మోదకీశంఖచక్రశరాసనసంయుతంబు। మరకతశ్యామంబు సరసిజనేత్రంబుగ గ్ర్రాభరణకాంతిగండయుగము। గళితకాంచనవర్ణకౌశేయవస్త్రంబు శ్రీవనమాలికాసేవితంబు। నైన నోహగంబు నైనన్యసౌభాగ్య। మమునయతని రూపుహర్ష మెసఁగఁ। జూచి బ్రహ్మ మొదలు సురలును దానును బొంగినమ్ములగుచుఁ బొగడఁ దొడఁగె* (క॥ జననస్థితిలయదూగుని। మునినుతుని ర్వాణసుఖసముద్రుని సుగుణుం। దనుతను నిబృథులపృథులుని। ననఘుండని మహాను భావు నభినందింతున్* (క॥ పురుషోత్తమ నీరూపము। పరమశ్రేయంబు భువనపజ్జుల కెల్లన్। స్థిరమై దీని యోగంబున। వగుసనుని మాయందుఁ గావ చ్చెను మాకున్* (క॥ మొదలను నీలోఁ దోఁచెను। మధ్యమున్నట్టుఁ దోఁచెనడుమ దోఁచెను నాపై। మొదలును నడుమను దుదిసృష్టికి। గదియఁగ ఘటమునకు మన్నుతియగు నూకన్* (క॥ నీమాయచేత విశ్వము। వేమఱు సృజియింతువనుచు విష్ణుఁడవనుచున్। ధీమంతులు గుణపదవిని। నేమంబున సగుణుఁడైన నిను గాంతురొగిన్* (గీ॥ అన్నమవనియందున్నతంబు గోవులయందు వహ్నిసమిథలందు నమరు। యోగవశతఁ బొంక నోజను బుద్ధిచే। నగుణు నిన్నుఁ గాంతు రధికగుణులు* (మత్తకోకిల॥ పట్టితేవ బహుప్రకారవిపన్నదిత్తులమైతి మే। మెట్టకేలకు నిన్నుఁ గంటిమి భీప్సితార్థము వచ్చె। న్వెట్టమైన దవానలంబున వేగు నేనుఁగు మొత్తము। న్నిట్ట లేచి నగంగలోపల నీరుఁ గాంచిన చాడ్పునన్* (మత్తకోకిల॥ నీకు నేమనివిన్నవింతుము నీవు సర్వము నుండవె। లోకమెల్ల ను నిండియుండఁగ లోకలోచన నీవదా। లోకసంఘ శుభంబు మాకును లోకపాలకు నేనునీ। నాకవాసుల నీవ హిన్నఁదనర్చు లాతితతిక్రియన్* (వ॥ అని కమలసంభవప్రముఖులు వినుతిసేసిరని చెప్పి నరేంద్రునకు ముని కుండిట్లనియె* (శా॥ ఈనీతిం జతురాననాదిసురులై యేపారజీమూతగంభీరంబై నరవం బునంబలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం। డారోపాంచితకాయులన్ నవిముక్తాపాయులన్ శ్రేయులం బ్రాగబ్ధోగ్రమహార్ణవోన్మథనవాంఛానల్పులన్ వేల్పులన్* (క॥ ఓన

పంకాన ము-కవ్వము, విపధి-సముద్రము. నెయ్యము-ప్రేమ, నతులు పెట్టి-నమస్కారములుచేసి, ఇయ్యప్పనము-కానుక.

లువ యోమరేశ్వర। యోఁటలతటూకు యోమరోత్తములారా। దానవులతోఁ డనిప్పుడు । మానుగఁ బోరామి గలిగిన నటయ
యొప్పగ॥ అది యెట్లంటి రేని*(క॥ ఎప్పుడు దనకును సత్వము। చొప్పడు నందాఁక రిపులఁ జూచియుఁ దనమైఁ। గప్పికొని యుండవల
యు। నొప్పుగ నహిమూషికమునకొదిగిన భంగిన్*(క॥ అమృతోత్పాదనయత్నము। విశదమతిం జేయుటొప్పు వేల్పులు వినుఁ
డీయమృతంబుఁ ద్రావి జంతువు। లమృతగతిం బ్రతుకు దుండు రాయుర్వృద్ధిన్* (సీ॥ పాలమున్నీటిలోపలఁ సర్వతృణలతౌషధ
ములు దెప్పించి చాలవైచి। మందరశైలంబు మంథానముగఁ జేసి తనదవాసుకిఁ దరిత్రాఁడు చేసి । నాపహాయంబున నెలమినంద
ఱుమీరు తరువుడు వేగనాలంక్రమలను చుఫలము మీద యెట్టుడుబహుళమయిఖంబులఁ బడుకుగు దైత్యులు పాపము ఘలు। అలసటయు
ను లేకయఖిలార్థములుగల్గు। విపధిలోనవొక్క విషము పుట్టుఁ । గడఁగి చెఱుపలేవు కానదోషంబులు। వస్తుచయమునందు వల
యుఁ జేయ॥ అనియుపదేశించి* (క॥ అంతాదిగహితుఁడచ్యుఁ।డంతర్ధానంబునొందె నజ ఫాలాక్షు। లంతో వంబునఁ దనత
మ। కాంతాలయమునకుఁ జనిరి గౌరవ మొప్పన్*(క॥ కయ్యంబు సేయవొల్లక । నెయ్యంబుననసురులు వెట్టి నిర్జరనికరం।బియ్యప్ప
నములు వెట్టుచుఁ। దివ్యంబునఁ గొల్చె బలిని దేవద్వేషిన్*(క॥ పసచెడి తనకును వశమై। సుసరముతోఁ గొల్చుచున్న సురసంఘ
ములనన్నిసిమసంగి చంపఁ బూనిన। నసురుల వారించె బలియ నతినయయుక్తిన్* (వ॥ అనియిట్లు వారించి వైరోచని రాక్షసనము
దయంబునకిట్లనియె*(క॥ పగవారు శరణుజొచ్చిన। మగతనములు నెఱపఁదగవు మగవారలకున్। దగుసమయమెఱుఁగవలదే।
మగటిమిఁ బాటింపవలదె మర్త్యులతోడన్* (వ॥ అనిపలికి కొలువుకూటంబున సురనికరపరివృతుండై నిఖలలోకరాజ్యలక్ష్మీస
హితుండై యఖిలంబున విజయాహంకారనిజాలంకారుండై సుఖంబున గొలువున్న విరోచననందనుం గనిశచీభుండుత్తమస
చివుండునుం బోలె సాంత్వవచనంబుల శాంతింబొందించి పురుషోత్తమశిక్షితంబైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు సె
ప్పి, యరిష్టనేమి ననునయించి, త్రిపురవాసులగు దానవులనొడంబఱచి, జంభుని సమ్మతంబు చేసికొని, హయగ్రీవుని నిగ్రహం
బు మాన్చి, నముచి తారక బాణాదులతో సఖ్యంబు నెఱపి, విప్రజిత్తునకుం బొత్తుహత్తించి శకుని విరోచన వృత్ర హేతులకుం బోరా
మిఁ జూపి, మయమాలి సుమాలి ప్రముఖులకు మైత్రి యెఱింగించి, కుంభనికుంభులకు సౌజన్యంబుగైకొలిపి, పౌలోమ కాలకేయ
నివాతకవచాదుల యెడ బాంధవంబు ప్రకటించి వజ్రదంష్ట్రికి నశక్తుండై యితరదానవదైత్య సమూహంబు వలన నతిస్నేహం
బు సంపాదించి మనకు మనకుఁ జెలియలి బిడ్డలకు నొడ్డారంబు లేమిటికి యేకకార్యపరత్వంబున నడ్డంబు లేక బ్రతుకుద మన్యోన్యవి
రోధంబులేలఁ దొల్లి నన్యోన్యవిరోధంబున నలంగితిమి ది మొదలుదను జదివిజసముదయంబులకు రాజు విరోచననందనుండు వన
మందఱము తనిపంపునఁ జేయంగలవార ముభయకులంబును వర్ధిల్లునట్టియుపాయింబెఱింగింతు ననియమృతజలధిమథన ప్రారం
భకథనంబు దెలియం జెప్పె నట్లు సురాసురయూథంబులు బలారాతిబలిప్రముఖంబులై పరమోద్యోగంబున సుధాసంపాద
నాయత్తచిత్తులై సఖ్యంబునొంది మందరగమనంబున మందరనగంబునకుం జని* (సీ॥ వాసవవర్ధకి వాఁడిగాఁ జఱచిన పద్దాలమ
ఖములఁ గొంతద్రవ్వి। ముసలాగ్రములు సొన్పి మొదలిపాతగలించి దీర్ఘపాశంబులఁ ద్రిండుపట్టి । పెకలించి బాహులఁ బీడించి కద
లించి పెల్లార్చి తమతమ పేరువాడి। పెటికిమీఁదికినెత్తి పృథులహస్తంబులఁ దలల భుజంబులఁ దరలకుండ । నానివెల్ల నెడఁబుత
ప్పటడుసలిడుచు। భారమధికంబు మఱు వకపట్టుఁడనుచు। మందరనగంబుఁ దెచ్చిరమందగతిని । దేవదైత్యులు జలరాశి తెరువు
వట్టి*(క॥ మందరము మోవనోపమి । నంద్రటిపై బడి యెడయునతిచోద్యముగాఁ । గొందఱు నేలం గలసిరి । కొందఱు నుగ్గ
యిరి చనిరి కొందఱు భీతిన్* (క॥ ఏలా హరికడ కేగితి। మేలాదొరఁ గొంటి మధికల హాలనశైలో।న్మూలనము చేసి తెచ్చితి। మే
లా పెకలించుమని డసి రేలా నసురన్ * (క ॥ ఏటికి మముఁ బంపంచెను । నేటికి దనుబోటివారికింతలు పనులిం । కేటికి రాఁ
డు మహేశ్వరుఁ । డేటికి పేక్షించె మఱవ నేటికి ననలన్* (వ॥ అని కులకుధరపతనజన్యంబగు వేదనసహింపనోపక పలవిం
చుచున్న దివిజులభయంబు మాన్పంబున నెఱింగి సకలవ్యాపకుండగు హరి తత్సమీపంబున * (మ ॥ గరుడారోహకుండై గదాది
ధరుఁడై కారుణ్యసంయుక్తుఁడై । హరికోటిప్రభతో మహోహయా వెలుఁగుఁడీయంచుం బ్రదీపింపఁగ । ద్ధిరిగేలన్నావకుండఁ
గంటుకముమాడ్కఁ బెట్టెఁ బక్షీంద్రుపైఁ । గరుణాలోకసుధన్ సురాసురులప్రాణంబుల్ పసఁ దీర్చెన్* (క॥ వారలు
గొలువఁగ హరియును । వారిధిదరికడకు నేగె వసుధాధరము । న్వారిజనయనుని గొంచున । వారితగతిఁ జనియె విహగవల్ల
భుఁడును* (క॥ వననిధిజలరాశి తటంబున । వనజాక్షుని గిరిని డించి వందనములు సం । ద్విననకులు సేసిఖగేంద్రుఁడు। వనిపినియెమ
నాత్మభక్తిభవనంబునకున్ ॥ అప్పుడు* (సీ॥ భూనాథ మనుమయ్యభాగింపు వాసుకిఁ బిలిపించి యతనికిఁ బ్రియము సెప్పి। ఫ
లభాగమీనొడఁబడి సమ్మతునిఁ జేసి మెల్లనఁ జేతుల మేనునివిరి । నీవఖా కెవ్వరు నేదురీపనికి యయ్యకొమ్మని యతనికై కోలువ
డప । కవ్వంపుఁ గొండనమర్చటకొంబుగఁ జేసి గర్జించు తనిభోగంబుఁ జుట్టి । కడఁగియమృతజలధిఁ గలశంబుఁ గావించి । త్ర

తియ్యంబునక--ప్రీతితో— ముసరముతో-చిన్నచనముతో, కనిమసఁగి-విజృంభించి—వైరోచని విరోచనపుత్రుఁడయినబలిచక్రవర్తి

చ్చునవపరమునఁదలఁపులమర। బద్ధవస్త్రకేశభాగులై యారెంట। గముల వారు పరువఁగదిసిరి చట॥ తదనంతరంబ* (క॥
హరియును దేవానీకము। నురగేంద్రునితలలు పట్టను ద్యోగింపన్। హరిమాయాపరవశులై। సురవిమతులు గూడి పలుకఁ జో
చ్చిరి కడిమిన్* (మత్తకోకిల॥ స్వచ్ఛమైన ఫణంబు మీరలు చక్కఁ బట్టి మథింపఁగాఁ। బుచ్ఛమేటికి మాకుఁ బట్టను బూరుషత్వ
ము గల్గి మే। మచ్ఛమైన తపోబలాఢ్యయనాన్వయంబున వారమై। యిచ్ఛయించము మెచ్చ వృత్తికి నిందు మాకు ఫణాగ్రముల్॥
అనిపలుకు దనుజులం జూచి* (క॥ విస్మయముఁ బొందిదానవ।ఘస్మరుఁడు ఫణము విడువఁగా గొనియసురుల్। విస్మితముఖులై
యార్చిరి। విస్మితముగఁ గొలువ మేటి వీఁకం దోఁకన్* (వ॥ ఇట్లు సమాకర్షణస్థానభాగనిర్ణయంబు లేర్పఱచుకొని దేవతలు పు
చ్ఛంబును బూర్వదేవతలు ఫణంబులం బట్టి పయోరాశిమధ్యంబునం బర్వతంబు వెట్టి పరిమాయత్తచిత్తులై యమృతార్థంబు ద్ర
చ్చుచున్న సమయంబున* (క॥ విడువఁబడఁ డుపఫణిపలుకఁగఁ। గడుభరమున మొదలఁ గుదురుగలుగమి వేడఁగై। బుడబుడరవమున
నఖిలము। వడవడవడఁకఁగ మహాద్రి వననిధి మునింగెన్* (ఉ॥ గౌరవమైన భారమునఁ గవ్వపుఁగొండ ధరింపలేక దో। స్సారవిహీను
లై యసురయస్సైనికులున్నడు సిగ్గుతోనహా। పారితటంబునం బడిరి పౌరుషముం జెడి పాండవేయ యొ। వ్వారికి నేరఁ బోలు బలవంత
పు దైవము నాక్రమింపఁగన్* (క॥ వననిధిజలములలోపల। మునిఁగెడి గిరిఁ జూచి దుఃఖమునఁ జింతాబ్ధిన్। మునిఁగెడి వేల్పులఁ గనుఁ
గొని। వనజాక్షుఁడు వార్ధి నడుమ వారలు సూడన్* (సీ॥ సవరనలక్ష యోజనముల వెడలుపుఁ గడుఁ గఠోరమునైన కర్పరమును।

** కూర్మావతారకథాప్రారంభము. **

నదనైన బ్రహ్మాండమైన నాహారింపఁ జఘనతరంబగు ముఖగహ్వరంబు। సకలచరాచరజంతురాసుల నెల్ల మ్రింగిలోఁ గొనున
ట్టి మేటికడుపు। విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁబడ్డనాఁగినఁ గదలని యట్టి కాళ్లు। వెలికిలోనికిఁ జను దెంచు విపులతుండ। మంబుజం
బులఁ బోలెడు నక్షియుగము। సంవరంబగు పిష్ణంబు సురలకోడి। కూర్మ చెలునొందనొక మహాకూర్మమయ్యె* (మ॥ కమఠంబై
జలరాశిఁ జొచ్చి లఘుముక్తాశుక్తిచందంబున। న్నను దద్రీంద్రము నెత్తి వాసుకిమహానాగంబుతో లీలతో। నమరేంద్రాదులు
మౌళికంపములతో నానాఁగ దేబ్బారే। కమలాప్రాశరణంబు భూదిశలు నాకాశంబు నన్ మ్రోయఁగన్॥ ఇవ్విధంబున* (క॥
తరికాండ్రలోన నొకఁడట। తరికడవకుఁ గుదురు నాకఁ డ్రాడట చేతుల్ దరిగవ్వంబును దానట। హరిహరిహరి చిత్రలీల హరి
మేయొరులన్* (గీ॥ జలధిఁ గడవ సేయ శైలంబు కవ్వంబు। సేయభోగిఁ ద్రాడు సేయఁ దరువ। సిరియు సుధయుఁ బడయ శ్రీవ
ల్లభుఁడు కర్త।నొరులఁ దుశక్తిమంతుఁడొకఁ డుగలఁడె* (గీ॥ గొల్లవారి బ్రతుకు గొఱలతనవచ్చె।గొల్లరీతిఁ బాలకుప్పద్రచ్చె।
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుఁడు। చేటులేని మంచుసిరియుఁ గనిరి* (వ॥ ఇట్లు సురాసురయూథంబులు హరిసనాథంబులై క
వచంబులు నెట్టంబులు వెట్టికొని పుట్టంబులు పరిచుట్టు చుట్టికొని గరంబులు కరంబుల నప్పళించుచు, భుజంబులు భుజంబుల నొఱ
యుచు, లెండు లెండు దరవఁ దొడంగుఁడు రండని యమందగతిఁ బెనుగుఁ ద్రచ్చ మందగొల్లలచందంబున మహార్ణవమధ్యంబున
మంథాయమాన మందరమహీధర విలగ్నభోగిభోగాద్యంతంబులం గరంబులం దెమల్చుచుఁ బెనుబొబ్బల బ్రహ్మాండకటా
హంబు నిర్భరంబై గుబ్బుగుబ్బునియుగుల కొండకవ్వంబు త్రిజగజ్జనందిరుగు వేగంబున ఘటచ్ఛటాయమానంబులై భుగుభు
గుల్లను చప్పుళ్ల నుప్పరం బెగసి లెక్కకుమిక్కిలి చుక్కలకొమ్మల చెక్కులం జక్కులువడ మిసిమిగలమీఁది మీఁగడపాల తేటని
గ్గుతుంపరలపరంపరలవలన నిజకరక్రమాక్రమాకర్షణ పరిభ్రాంతఫణిఫణాగర్భసముద్భూత నిర్భరవిషకీలికీలాజాలంబు లప్ప
టప్పటికి నుప్పతిల్లి నదప్పనొందక మందగతిం జెందక యపారవేలాతటకుటజకుసుమ మధుచ్ఛపుచ్ఛస్వచ్ఛమకరంద సుగంధి
గంధవహవహనంబునం గ్రొంజెమటపిటిలిపెనువరదగములోడల్లనిగుడనొండొరులం బరిహసించుచుఁ దేఱివాడి పలసించుచు
మేలు మేలని యగ్గించుచుఁ గాదు కాదని భంగించుచు నిచ్చమెచ్చని మచ్చరంబులవలన వననిధివలమానవైశాఖవసుంధరాధర
ప్రవర్తనసంజనిత ఘుమఘుమారావంబును, మథనగుణాయమానమహాహీంద్రప్రముఖ ముహుర్ముహురుచ్చలిత భూరి
ఘోరపూత్కారఘోషంబును, కులకుధరపరిక్షేపణక్షోభితసముల్లంఘనసమాకులితంబులై వెఱచి చెఱచి గుబురుగుబురు
లై మొరలు కమఠకర్కటకాకోదరనక్ర తిమితిమింగిలమురాళచక్రవాకబలాహక భేకసారసానీకంబుల మొఱలును నంగా
డికొని ముప్పిరిగొని దనుజదివిజభటాట్టహాసతర్జనఘూర్జనధ్వనుల నలుపురియై మొత్తినబైనదశదిగంతభిత్తులును వేడెత్తి పెల్లగి
ల్లం బ్రవల్లుచు గిరుకుపాడుచుచు, నొకనినొకనికం టెవడియుతుందడవును ంగలుగఁ ద్రచ్చుచుఁ, బంతంబులిచ్చుచు, సుధాజననం
బు జింతించుచు, నూతనపదార్థంబులకు నెదురుసూచుచు, నెంతఁ దడవు ద్రచ్చితమని హరి నడుగుచు, నెడపని తమకంబులనంత
కంతకు మురువు డింపక ద్రచ్చుసమయంబున* (క॥ అప్పాలవెల్లిలోపల। నప్పటికప్పటికి మందరాగము దిఱుగం। జప్పుడు సిం డెన

తులదుధరవకసజ కృతంబుగు-కులపర్వతముల మీఁదఁ దన్ని దుటవలనఁగలిగిన; వ్రుంఖించుచున్న-దుఃఖించుచున్న; వారధి-సముద్రము; పనివిని మొఱ-పోము

జాండము। చెప్పెడి దేవా జుని చెవులు చిందఱఁగొని యోర్తు ॥ అంతనప్పయోరాశిమధ్యంబున* (క॥ ఎడమఁ గుడి ముందు దిరుగు చుఁ। గుడి నెడ మను వెనుక దిరుగు కులగిరికడలి। న్నడ వెడలసురలు నసురులు। దొడిదొడి ఫణిఫణము మొదలు తుదియును దిగువన్* (క॥ వడిఁ గొని కులగిరి దరువఁగ। జడనిధి ఖగ మకర కమఠ ఝష ఫణిగణము। ల్సుడివడుఁ దడఁబడు గెలఁకులఁ। బడు భయపడి నెగసి బయలఁబడు మరిలి పడున్* (క॥ అను రాసురకర విపరి। భ్రమణార్థ రాధరత రేంద్ర భ్రమణంబునఁ దాఁ। గమఠేంద్రుపీఁపు తీఁటను। శమియింపఁగఁ జాలదమ్యు జగతీనాథా॥ ఆటసంతరంబ* (క॥ ఆలోనజలధిలోపల। నాలోనహిపిడిచి సురలు నసురులుఁ బరవం। గీలాకోలాహలమై। హాలాహలవిషము పుట్టెనవనీనాథా* (వ॥ అదియును బ్రళయకాలాభీల ఫాలలోచన లోచనానల శతం

—* పాలకడలి ద్రచ్చునెడ హాలాహలము జనించుట. *—

బుచండంబునను దంబై, విలయదహన సహస్రంబులై వడివడిన్నై, కడపటి పట్టపగటింటి వెలుఁగులకు తెఱ గున దుర్లక్షితంబై, తుటతేఱు వెలింగిన మొగులు గములు నంబడు బలుపిడుగుల వడువున వెడిదంబై పంచభూతంబులు తేజోరూపంబులైన చాడ్పునదుస్సహంబై, భుగభుగాయమానంబులైన పొగలును, జిటజిటాయమాన విస్ఫులింగంబులును, దగద్ధగాయమానంబులైన నెఱమంటలును గలిగి మహార్ణవమధ్యంబున మందరనగంబు నందగంబున నదిగుగునెడ జనియించి, పెటపెటాయమానంబై నింగికిం బొంగి దిశలకుం గేలుసాఁచి బయల్లు ప్రబ్బికొని, తటిగవ్వంపుకొండ నండగొనక నుఱుగడలకుం బఱచి, దగులకుఱికి, సురాసుర సముదయంబులం దఱికొని, గిరివరగుహాగహ్వరంబుల పుడిచడక, కులశిఖరి శిఖరంబుల నెఱగలివడి గహనంబుల దహించి, కుంజమంజరీపుంజంబుల భస్మంబు చేసి, జనపదంబు లేర్చి నదీనదంబు లెఱియించి, దిక్కుంభికుంభంబులు నిక్కలువడ నిక్కి తరణి తారా మండలంబుల పైమిట్టించి, మహర్లోకంబుఁ దఱికొని, యుపరిలోకంబునకు మాఱుగొనలిడి, నడిపడి ముసరుకొని బ్రహ్మాండగోళంబు చిటిలిపడం దాటి, పాతాళాదిలోకంబులకు వేళ్లు చారి, సర్వాధిక్యంబై శక్యంబుగాక యెక్కడం జూచి నందాన మైమరంగంబు క్రియం గ్రేళ్లుఱుకుచు, భుజంగంబు విధంబున నొడియుచు, సింగంబు భంగి లంఘించుచు, సహంగ్రంబు పోగిది నెగయుచు, మాతంగంబు పోలికె నిలువంబడుచు, నిట్లు హాలాహలదహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున మెలకువ సెగల మిడుకం జాలక నీఱైన దేవతలును, నేలంగూలిన రక్కసులును, డుల్లిన తారకంబులును, గీఁటడంగిన కిన్నరమిథునంబులును, గవులిన గంధర్వ విమానంబులును, జీకాకుపడిన సిద్ధచయంబులును, జిక్కువడిన గ్రహంబులును, జిందఱవందఱలైన వర్ణాశ్రమంబులును, నిగిరిన నదులును, నింకిన సముద్రంబులును, గాలిన కాననంబులును, బొగిలెడి పురంబులును, పొనుఁగువడిన పురుషులును, పొక్కుపడిన పుణ్యాంగనాజనంబులును, బగిలిన పర్వతంబులును, భస్మంబులైన ప్రాణిసంఘంబులును, వేఁగిన లోకంబులును, వివశలైన దిశలును, వడ్డగెడపులైన భూజచయంబులును నవజలైన భూములును నై యకాలవిలయ కాలంబై తోఁచుచున్న సమయంబున* (క॥ ఒడ్డారించి విషంబున। కొడ్డుముచను దెంచి కావనధికులు లేమి। న్నొడ్డెఱు బ్రమందిరాలన। బిడ్డను నెడ లేక జనులు పృథ్వీనాథా॥ అప్పుడు* (చ॥ చని కైలాసముఁ జొచ్చి శంకరునివాసద్వారముం జేరియా। ఘనదౌవారికులడ్డపెడ్డదలమంచుం జొచ్చి కుయ్యో మొఱో యనుమాలింపుము దిత్తగింపుము దయన్ వీక్షింపు మంచంబుజా। సనముఖ్యుల్ గని రార్తరక్షణకళాసంరంభు నిస్సంభుని* (క॥ వారలు దీనత వచ్చుటఁ। గూరిమితో నెఱిఁగి దక్షకుమారీరుడాను। స్వైరోలగమున నుండిద। యారతుఁడై చంద్రచూడుఁ డవసరమిచ్చెన్* (వ॥ అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగదండప్రణామంబులు గావించి ప్రజాపతిముఖ్యులిట్లని స్తుతియించిరి* (సీ॥ భూతాత్మ భూతేశ భూతభావనరూప దేవ మహాదేవ దేవవంద్య। యీలోకముల కెల్ల నీశ్వరుండవు నీవ బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ। యార్తశరణ్యుండ వగుగురుండవు నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు। సకలసృష్టిస్థితి సంహారకర్తవై బ్రహ్మవిష్ణుశివాఖ్యఁ బరగుదీవు। పరమగుహ్యమైన బ్రహ్మంబు పదసత్తు। నాఁబు నీశశక్తిమయుఁడవీవ। శబ్దయోనీవ జగదంతరాత్మవు। నీవ ప్రాణమరయ నిఖిలమునకు* (క॥ నీయందసంభవించును। నీయందె వసించియుండు నిఖిల జగంబుల్। నీయందె లయముఁ బొందును। నీయుదరము సర్వభూతనిలయము రుద్రా* (సీ॥ అగ్నిముఖంబు పరాపరాత్మకమాత్మ కాలంబు గతిరత్నగర్భపదము। శ్వసనంబు నీయూర్పు రసనజలేశుండు దిశలు కర్ణంబులు దివము నాభి। సూర్యుండు కన్నులు శుక్లంబు సలిలంబు జఠరంబు జలములు చదలు శిరము। సర్వౌషధులు రోమచయములు శల్యంబులద్రులు మానసమమృతకరుఁడు। ఛందములు ధాతువులు ధర్మసమితి హృదయ మాస్యపంచకము పనిషదాహ్వయంబు। లయిన నీరూపు పరతత్త్వమై శివాఖ్యమై స్వయంజ్యోతిమై యొప్పు నాద్యమగుచు* (క॥ కొందఱు కలఁడందురు నినుఁ। గొందఱు లేఁడందురంతఁ దుది గానఁడనుచు। న్గొందఱు కలఁడని లేఁడని। కొందఱమందుదురు నిన్నుఁ గూర్చి మహేశా* (సీ॥ తలఁప బ్రాణేంద్రియద్రవ్యగుణస్వభావుఁడవు కాలక్రతువులును నీవ। సత్యంబు ధర్మమక్షరము ఋతంబును నీవ ముఖ్యుండవఖిలమునకు। ఛందోమయుండవు సత్త్వరజస్తమ

ఆకూపారతటంబున కా-సముద్రపుగట్టున. కర్పరము-తాఁబేటివీఁపు చిప్ప. ఆఁక త్రాడు-ఆనగాఁ గవ్వరుపారలకుండ గుంజకుఁ గట్టియుండుపాశము

శ్వతుండవై యుండు సర్వరూప। కామురాధ్వరకాలక(?)ాదిభూతద్రోహభయము చోద్యంబు గాదు। లీలలోచనవహ్నిస్ఫు లింగశిఖలనంత కాములఁ గాల్చిన యిట్టి నీకు రాజఖండావతంస పురాణపురుష దీన తుక కరుణాత్మ దేవదేవ* (గీ॥ మూఁడు మూర్తులకును మూఁడు లోకములకు। మూఁడు కాలములకు మూలమగుచు। భేదమగుచు దీన భేదమై యొప్పారు। బ్రహ్మమనఁగ నీవ ఫాలనయన*(క॥ సదసత్తత్వ చరాచర। సదనంబగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్। పెదవులు గదలుప వెఱతురు। వదలక నిన్నుఁ బొగడ నెంతవారము దేవా* (మత్తకోకిల॥ బాహుశక్తిసురాసురుల్ పాలవెల్లి మథింపహాలాహలంబు జనించె నేరికలంఘ్యమై భువనంబుకోలాహలంబుగఁ జేయుచిచ్చునులాలనంగొని ప్రాణిసందోహము౦ బతికింప వేదయ తొంగలింపఁగ నీశ్వరా*(క॥ లంపటలని వారింపను। సంపదఁ గృపఁ జేయ జయము సంపాదింపన్। జంపెడువారి వధింపను। సొంపారఁగ నీక చెల్లు సోమార్ధధరా*(క॥ నీకంటె నొండెఱుంగము। నీకంటెం బరులు గావ నేరరు జగము। ల్నీకంటె నొడయఁ డెవ్వఁడు। లోకంబుల కెల్ల నిఖిలలోకస్తుత్యా*(వ॥ అనినఁ జేయునభినందించుచున్న ప్రజాపతిముఖ్యులం గని సకలభూతసముండగు నద్దేవుఁడు దనప్రియ

*** ఈశ్వరుండు దేవబృందప్రార్థితుండై హాలాహలమును బానము చేయుట ***

సతికిట్లనియె*(క॥ కంటె జగముల దుఃఖము। వింటే జలజాతవిషము వేఁడిమి బ్రభులై। యుంటకు నార్తుల యాపదఁ। గెంటింపుట ఫలముగాదె కీర్తిమృగాక్షీ* (క॥ ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన। ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లన్। ప్రాణులకిత్తురు సాధులు। ప్రాణంబులు నిమిషభంగురములగు మగువా*(క॥ పరహితము సేయ నెవ్వఁడు। పరమహితుండగును భూతపంచకమునకుం। బరహితమె పరమధర్మము। పరహితునకు నెందు లేమి పర్వేందుముఖీ*(క॥ హరి మదినానందించిన। హరిణాక్షి జగంబు లెల్ల నానందించున్। హరియును జగములు మెచ్చఁగ। గరళము వారించుటొప్పఁగ మదలఁకాక్షీ*(క॥ శిక్షింతు హాలాహలమును। భక్షింతును మధురసూక్ష్మఫలరసము క్రియన్। రక్షింతుఁ బ్రాణికోట్లను। వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ*(వ॥ అని పలికిన ప్రాణవల్లభ(?)నువల్లభియిట్లనియె దేవా చిత్తంబుకొలంది నవధరింపుమని పలికె నని చెప్పిన నమ్మునీంద్రునకు నరేంద్రుం డిట్లనియె* (మ॥ అమరుల్ లోకహితార్థమంచు నభవుండాఁ గాకయంచాడెఁబో। యమరుల్ భీతిని బ్రమిఁగు మీయసిరివో యంభోజగర్భాదులుం। దముఁ గావన్ హరలెమ్ము లెమ్మనిరివో తాఁజూచి కన్గొంటన। య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మింగుమనె నయ్యుగ్రానలజ్వాలల*॥ అనిన శుకుండిట్లనియె*(క॥ మింగెడువాఁడు విభుండని। మ్రింగెడునది గరళమనియు మేలని ప్రజకున్। మ్రింగుమనె సర్వమంగళ। మంగళసూత్రంబు నెంతమదినమ్మినదో* (మ॥ తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్। ఘనగంభీరరవంబుతో శివుఁడు లోకద్రోహిహుంపోకుర। న్మని కెంగేలఁ దెమల్చి హుమ్మికడగా నంకించి జంబూఫలం। బని సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్॥ అతిఘోరంబుగ నాపానసమయంబున* (మ॥ కదలంబాఱవు పాపపేరులొడలన్ ఘర్మాంబుజాలంబువె। ట్టదు నేత్రంబులు నెఱ్ఱగావు నిజజూటార్ధేందుఁడు గ్రందఁడు। న్వదనాంభోజము వాడదా విషము నాహ్వానించుచోఁ డాయుచోఁ। బదిలుండై కడిసేయుచోఁ దిగుచుచో భక్షించుచో మ్రింగుచోన్* (క॥ ఉదరము లోకంబులకును। సదనంబగుటెఱిఁగి శివుఁడు చటులవిషాగ్నిన్। నుదరుకొనఁ గంఠబిలమునఁ। బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసము క్రియన్* (క॥ మెచ్చిన మచ్చిక గలిగిన। నిచ్చిన నీవచ్చుఁగాక నిచ్చ నొరులకుం। జచ్చుఁగడిఁగొనఁగవచ్చునె। చిచ్చఱరూపచ్చు పడిన శివునకుఁ దక్కన్* (గీ॥ హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ। గప్పుగలిగి తొడవుకరణి నొప్పె సాధురక్షణంబు సజ్జనులకు నెన్న। భూషణంబుగాదె భూవరేంద్ర॥ తదనంతరంబ*(క॥ గరళంబు కంఠబిలమున। హరుఁడు ధరించుటకు మెచ్చి యానొనను చున్। హరియును విరించియును నుమయును। సురనాథుఁడు వొగడి రంతసుస్థిరమతితోన్* (క॥ హాలాహలభక్షణకథ। హేలాగతి విని జనమువ నెలమి లిఖింపన్। వ్యాళానలవృశ్చికముల। పాలై చెడ రెట్టిజనులు భయపరహితులై* (వ॥ మఱియు నారత్నాకరంబు సురాసురులు గ్రచ్చు నెడ*(క॥ తెల్లని మేనున నమృతము। జల్లున జల్లి చుపొదు గుశితశృంగములు। న్బెల్లుగ నర్థులకోర్కెలు। వెల్లిఁ గొలుపు మొదవు పాలవెల్లిని బుట్టెన్* (గీ॥ అగ్నిహోత్రియనుచు నా సురభిని దేవ। మునులు పుచ్చుకొనిరి ముదముతోడ। విబుధసంఘము

—* పాలకడలి దఱచు నెడనైరావతాదులు జనించుట. *—

లకు వెరవుతోనధ్వరహవులు వెట్టుకొఱకు నవనినాథ॥ మఱియు నాజలరాశియందు* (క॥ సచ్చంద్రపాండురంబై। యుచ్చైశ్శ్రవమనఁగఁ దురగముదధిజనించెన్। బుచ్చికొనియె బలిదైత్యుం। డిచ్చఁగొనండయ్యె నింద్రుఁడీశ్వరశిక్షన్*(క॥ ఒఱపగు సురమును బిఱుదును। నెఱిఁదోఁక యు ముఖము సిరియు నిర్మలఖురముల్। కుఱుచ చెవులుఁ జెలిగన్నులుఁ। దఱుచగు కందంబు చూడఁదగు నాహరికిన్॥ అంత నా పాలకుప్పయందు*(క॥ దంతిచతుష్టాహతిశై। లాంతంబులు విఱిగిపడఁగ నవదాతకుభృ। త్తారంతంబగునైరావణ। కంతావళ ముద్భవించె ధరణీనాథా*(క॥ తడలేని మదపువడిగల। మొదలును బెను నిడుపకరము నురుకుంభములున్। బెడఁగైయువతుల మురిపెపు। నడతలకున్ మూలగురువునంగజ మొప్పెన్॥ మఱియును తరంగిణీవల్లభు మథింపుచున్నయ్యె

(క॥ హరిచూచినసిరిచూడదు।సిరిచూచినహరియుచూడసిగ్గునుబొందున్। హరియునుసిరియునుదగఁలో। సరిచూపులఁజూడ
మరుఁడుసంగడిఁజేసె* (చ॥ జగములతండ్రిమైతనరుశౌరిజగంబులతల్లిని దిరం। దగనురమందుదాల్చెనటతత్కరుణా
రసదృష్టిచేఁబ్రజల్మగుడఁగఁదొంటిభంగిసతిమంగళసాధ్విపతివ్రతాసంపద। నెగడినలోకముల్లని రసైకశుభంబులఁబొందిర
త్తఱిన్*(వ॥ అంతఁబయఃన్నయబ్ధిరాజుదనయుఁడునున్నయమూల్యంబైనకౌస్తుభంబు పేరిటి యనర్ఘ్యమణిరాజంబు నయ్యంబు
జాతునకుసమర్పించిసఁదనవక్షస్థలంబునధరియించెనప్పుడయ్యాదిలక్ష్మియుశ్రీవత్సకౌస్తుభ వైజయంతీ వనమాలికాది తార
హారాలంకృతంబైనపుండరీకాక్షువక్షస్థలంబునివసియించెనయ్యవసరంబున* (శా॥ ప్రమోదస్వన్శంఖమృదంగవేణురవము
ల్మున్నాడెపెంజీకటుల్పాసెన్నర్తనగానలీలలప్సరల్పాటిల్లిరార్యుల్జగద్వ్యాప్తున్విష్ణుని బ్రహ్మదేవముఖులు ల్లల్లింగమంత్రం
బులం।బ్రాశస్త్యిన్వినుతించిరుల్లసితపుష్పశ్రేణివర్షించుచున్*(క॥ ఆపాలవెల్లికూఁతురు।తీఁపులమాఁపులకుఁదోఁగితిలకింప
బ్రజ।ల్చెప్పట్టిరిసంపదలను।బ్రాపించెను మేలుజగము బ్రతికెనరేంద్రా* (క॥ పాలేటిరాచకన్నియ। మేలారెడిచూపులేకమి
డుకమిడుకుమం।జాలింబురపురబొక్కుచుఁ।మాలిరిరక్కసులుకీడుఁదోఁచిననధిపా*(క॥ వారిధిదరువఁగనంతట।వారుణియ
ననొకకన్యవచ్చినసురు।ల్వారిజలోచనుయనుమతివారైగైకొనిరిదానివారిజనేత్రన్*(సీ॥ తరుణుండుదీర్ఘదోర్దండుం
డుకంబుకంధరుఁడుపీతాంబరధారిస్రగ్వి।లాలితభూషణాలంకృతుండరుణాక్షుఁడున్నతోరస్కుఁడత్యుత్తముండు।నీలకుంచి
తకేశనివహుండుజలధరశ్యాముండుమృగరాజసత్వశాలి।మణికుండలుఁడురత్నమంజీరుఁడచ్యుతు నంశాంశసంభవుండమల
మూర్తి। భూరియాగభాగభోక్తన్వంతరియనఁగనమృతకలశహస్తుఁడగుచు। నిఖిలవైద్యశాస్త్రనిపుణుఁడాయుర్వేది।వే
ల్పువెజ్జుకడలివెడలివచ్చె।తదనంతరంబ*(గీ॥ అతనిచేతనున్నయమృతకుంభముసూచి। కెరలువాడిచి సురలగికురువెట్టి।పు
చ్చికొనిసరియసురపుంగవులెల్లను।మాఱులేనిబలిమిమానవేంద్ర। వెండియు* (గీ॥ చావులేనివామంచుచక్కనగునకబ్బె। ననుచుఁ
గడవనసురులడఁచికొనిన। వెఱచిసురలుహరికిమొఱలువెట్టిరిసుధాపూర్ణఘటముపోయెంబోయెననుచు*(వ॥ ఇట్లుశరణాగ
తులైనవేల్పులదైన్యంబువొడగనిభృత్యజనకామదుండగునప్పరమేశ్వరుండుమీరలుదుఃఖింపవలవదను నామాయాబలంబు
నంజేసిమీయర్థంబుమఱల సాధించెదనని పలికినసమయంబున నయ్యమృతపూరంబు నేముంద్రావుదమని తమకించు దైత్య
దానవజనంబులలోన నమంగళంబగు కలిసంభవించిన కతంబునఁ బ్రబలురగు రక్కసులువిలోకించి సత్రయాగంబునందమన
డుచుచందంబునఁదుల్యప్రయాసహేతువులగుసురలును సుధాభాగంబునకర్హులగుదురుగావున బంచిపడుచుట కర్తవ్యం
బిదిననాతనంబగుధర్మంబగుటంజేసియయ్యమృతకుంభంబువిడువుండని దుర్జనులగునిశాచరులు జాతమత్సరులై తమవారల
వారించుచున్నసమయంబున*(గీ॥ ఒకనిచేతనుండనొకడుబలిష్ఠుఁడై।పుచ్చికొనినవానిఁబొదుగఁబట్టి। యతనికంబెనధిపుఁ

—* శ్రీవిష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట. *—

డమృతకుంభమునెత్తికొంచుఁబాఱెఁబకులుకుయ్యిడంగ*(సీ॥ మెత్తనియడుగులుమెఱుగారుజానువు లఁటికంబములఁదో
మైనతొడలు।ఘనమగుజఘనంబు గడుశేతనసుమును బల్ల వారుణకాంతి పాణియుగముఁ। గడుదొడ్డపాలిండ్లు కంబుకంఠం
బునుబింబాధరముఁజంద్రబింబముఖముఁ। జెలికన్నుఁగవయునునళికుంతలంబులుబాలేందుసన్నిభఫాలతలము। నసరుమండ
లకేయూరహారకంకణాదులేపారమంజీరనాదమొప్పు। నల్లనవ్వులఁబద్మదళాక్షుఁడసుర। పతులనడఁగింపనాడురూపంబుఁ
దాల్చి।అయ్యవసరంబునజగన్మోహనాకారంబున* (సీ॥ పాలిండ్లపైనున్నపయ్యెదజాఱించుజాఱించిమెల్లనఁజక్కనొత్తుఁ।న
ఘుఁదళుకునుగండఫలకంబులొలయించునొలయించికెంగేలనుజ్జగించుఁ। గడుమెఱుంగులువాఱుకడకన్నులఁగాఱ్పనల్లార్చి
ఱెప్పలనండఁగొలుపు। సవరసదరహాసచంద్రికఁజికిలించుఁజికిలించికెమ్మోవిఁజిక్కుపఱచు। దళితధమ్మిల్లకుసుమగంధమ్మునె
ఱపుఁ।గంకణాదిభూషణంకృతుల్ గడలుకొలుపు। నొడలికాంతులుపట్టులేకుబుకఁబాఱు। సన్నవలిపెంపుపయ్యెదచౌకళింప*
(వ॥ ఇవ్విధంబున నక్కపటయువతీరత్నంబు జగన్మోహనదేవతయునుంబోలెనెమ్మొగంబుతావికిఁ ద్రిల్లిన తేఁటిమొత్తంబు
లంగెలిచిచిగురుజొంపంబులనెడగలుఁగజడియుచుముగియుచుండ రాత్రిచరులుగనుంగొని*(సీ॥ ఔఁగదేలావణ్యమౌఁగదే
మాధుర్యమౌఁగదే సతినవయౌవనాంగి। యెటనుండివచ్చితివి యేమిచ్ఛయించెదు నీనామధేయమ్మేది నీరజాక్షి।యమరగంధర్వ
సిద్ధామరచారణమనుజకన్యలకునీమహిమగలదె। ప్రాణదిత్రేంద్రియపరిణామదాయిసృజియించెంబో విధినిన్నుఁగరుణ। వని
తకశ్యపుసంతతివారమేము।భ్రాతలముసురలకునిద్ధపౌరుషులము। జ్ఞాతులముమాకునేకార్థసంగతులుఁ। బాలుదీరనియర్థం
బుపంచియిమ్ము* (క॥ సభవైయుండెదమిందఱ।మభయంబునవచ్చుకొలఁదినమృతంబును। విభరాజగమనతప్పక।విభజిం
పువిపత్సుపత్సువిరహితమతివై* (వ॥ ఆనిమంత్రించినదైత్యులంగనిమాయాయువతీరూపుఁడగుహరితనవాఁడిచూపుటంపఱు
ఫలనవారలతాలుములనగలించు దిటునగవు లెగయ మొగమెత్తియిట్లనియె*(క॥ సుందరుగుపురుషులఁగని।పొందెదునాయు

దుబుద్ధిఁబుట్టు నేమీకుఁ। బృందారకరిపులారా। చెందరు కామినుల విశ్వసింపఁగఁ బెద్దల్ *(క॥ పలుకులు మధురసధారలు। దలఁపులు నానాప్రకార దావానలము। ల్సెలుములు సాలావృకములు। చెలువలనమ్మఁటలు వేదసిద్ధాంతములే *(క॥ నానేర్పుకొలఁదిమీకును। మానుగ విభజించియిత్తు మానుఁడు శంక। గా నిండనవుడు నిచ్చిరి। దానవులమృతంపుఁ గడవఁ దరుణీమణికిన్ * (క॥ ఆశాంతాలోకనములు। నాశీతలభాషణములు నాలలితములున్। రాశిపరంపరలగుచును। బాశములై వారినోళ్లు బంధించె నృపా *(వ॥ ఇట్లు సుధాకలశంబు కేలనందికొని మందస్మితభాషణంబుల సుందరీరూపుండగు ముకుందుండు మేలుకీడనక నేనుపంచియిచ్చిన తెఅంగున నంగీకరించుట కర్తవ్యంబనవుడు నగుంగాకయని సురాసురదైత్య దానవసమూహంబులుపవసించి కృతస్నానులై హోమానంబులాచరించి విప్రులకు గోభూహిరణ్యదానంబులు సేసి తదాశీఃప్రవచనంబులు గైకొని ధవళపరిధానులై గంధమాల్యధూపదీపాలంకృతంబగు కనకరత్నశాలామధ్యంబునఁ బ్రాగగ్రకుశోపేతంబులఁ బూర్వదిశాభిముఖులై పఙ్క్తులుగొనియున్న సమయంబున *(క॥ శ్రోణీభరకుచయుగభర । వేణీభరములనుడస్సి వివిధాభరణ। శ్రేణియయి యుదవచ్చెను। బాణిసరోజముననమృతభాండముఁగొంచున్ *(క॥ భాసురకుండలభాసిత। నాసాముఖకర్ణగండనయనాంచలయై। శ్రీపతియగుసతిగనిదే। వాసురయూథంబు మోహమందెన రేంద్రా॥ అప్పుడు *(క॥ అసురులకమృతమువోయుట। పాసఁగదుపాములకుఁ బాలువోసినమాడ్కిన్। దోసఁగగునంచునవేటోక। దెసనుంగూర్చుండఁబెట్టె దేవాహితులన్॥ ఇట్లు రెండుపఙ్క్తులుగా నేర్పఱించి *(సీ॥ వేగిరపడకుఁడీ వినుఁడు దానవులార తడవు సేయక వత్తుదైత్యులార। యటుచక్కఁగూర్చుండుఁడనికన్నులల్లార్చి చనుఁగవపయ్యెదఁ జాఱఁ దిగిచి। వదనేమ అందలి వావులుకల్పించి హర్షంబు లెడలించి మముఁగుఁజేసి। మెల్లనినగవుల మేనులు మఱపించికడుజాణమాటలఁగాకుపఱచి। యసురవరులనెల్ల నడఁగించి సురలను। దడవుసేయవలదు ద్రావుఁడనుచు। వచ్చుకోలఁదినమృతవారివిభాగించె। దరుణిదివిజులెల్లఁదనిసిపొగడ॥ అయ్యవసరంబున *(సీ॥ వనకువేల్పులకునుమాత్రాటములు రాకపంచిపెట్టెదననివడఁ ద్రిప్పునేఁ। దానేలతప్పునదప్పుదుతరళాక్షి గాకరమ్మనుచునుగడఁకఁబిల్వ। మఱుమాటలాడదోమఱిచూడకుండునోచనుఁగవఁగప్పునోచాలుననుచు। నొండాడకలగుచునొక్కింతసోలయునోమనయెడఁగంమనోమగువయనుచు। నెలఁతచూడ్కిగములనీరైకలంగుచుఁ। బ్రణయభంగభీతిబద్ధులగుచు। నూరకుండిరి గాసియువిదతే తెమ్మని। యడుగఁజాలరైరియసురవరులు॥ అప్పుడు *(మ॥ అసురవ్రాతములోనఁజొచ్చిదివిజుండై రాహుపీయూషపానముసేయంగనిచంద్రభాస్కరులుసన్నల్సేయ నారాయణుం। డమరారాతిశిరంబు చక్రహతిఁ దున్మాడెన్ సుధాసిక్తమై। యమరత్వంబును జెందె మూర్ధము తదన్యాంగంబు నేలంబడెన్ *(గీ॥ అజుఁడువానిశిరమునంబరవీధిని। గ్రహముసేసిపెట్టిగారవించె। వాఁడుపర్వములను వైరంబుదప్పక। భానుచంద్రములనుఁ బట్టుచుండు *(క॥ ఒకబొట్టుదిక్కకుండఁగ। సకలసుధారసమునసురసంఘంబులకుం। బ్రకటించిపోసిహరిదనుసుక రాకృతిఁ దాల్చెనసురశూరులు బెగడన్ *(మ॥ అమరుల్ లక్కనులుం బ్రయాసబలహేత్వర్థాభిమానంబులన్సములై లబ్ధవికల్పులైరి సురలున్ శ్రేయస్సంయుక్తులై। రమరారుల్బహుదుఃఖముంగనిరి తామత్యంతదౌర్గత్యులై। కమలా

—* దేవాసురయుద్ధము. *—

క్షున్నరణంబువేడనిజనుల్కల్యాణసంయుక్తులే *(క॥ దానవులమృతముద్రావం। బూనిపయోరాశిఁద్రచ్చిపొగిలినమాడ్కిన్। శ్రీనాథపరాఙ్ముఖులగు। హీనులువొందంగఁజాలరిష్టార్థములన్ *(క॥ శోధించి జలధినమృతము। సాధించినిలింపవైరిచయుర్గతులై। రోధించసురలకిడిహరి। బోధించిఖగేంద్రునెక్కిపోయెనరేంద్రా *(క॥ శుద్ధులగుసురలకమృతము। సిద్ధించిననసురవరులు సిడిముడిపడుచున్। గ్రుద్ధులునానాయుధసన్నద్ధులునై యుద్ధమునకునడిచిరిబలిమిన్ *(క॥ ధన్యులువైరోచనిశత। మన్యుప్రముఖులుమతాభిమానులుదనుజుల్। నన్యోన్యరణముబాహావిన్యాసంబులనుజేర్పి వెలసిరికడిమిన్ *(మ॥ అరుదై కామగమై మయాసురకృతంబై లోకితాలోక్యమై। వరశస్త్రాస్త్రసమేతమై తరళమై వైహాయసంబై మహా। సురయోధాన్వితమైన యానమున సంశోభిల్లెఁబూర్ణేందుసుస్థిరకాంతిన్ బలిచామరధ్వజచమూనీ ప్రస్థితిన్మందరున్ *(వ॥ నుజేయు, నముచి, శంబర, బాణ, ద్విమూర్ధ, కాలనాభ, శకుని, నికుంభ, కుంభ, అయోముఖ, ప్రహేతి, హేతి, భూతసంతాప, హయగ్రీవ, కపిల, మేఘదుందుభి, మయ, త్రిపురాధిప, విప్రచిత్తి, విరోచన, వజ్రదంష్ట్ర, తారక, అరిష్ట, రిష్టనేమి, శుంభ, నిశుంభ, శిరోముఖప్రముఖులును, పౌలోమ, కాలకేయులును, నివాతకవచప్రభృతులును, దక్కినదండయోధనులుంగూడుకొనియరదంబులం, మరగంబుల మాతంగంబుల, హరిణంబుల, హరి, కిరి, కీట, జలచరంబులను, శరభ, మహిష, గవయ, ఖడ్గ, గండభేరుండ, చమరీ, జంబుక, శార్దూల, గోవృషాదిమృగంబులను, గంక, గృధ్ర, కాక, కుక్కుట, బక, శ్యేన, హంసాదివిహంగంబులను, తిమి, తిమింగిలాదిజలచరంబులను, నరులను, నసురసురనికరవికృతనిగ్రహరూపంబులగు జంతుల నారోహించి తమకు నడియాలంబులగు గొడుగులు, పడ

గలు, జోడు, కైదువ, పక్కెర, బొమిడికంబులు, మొదలగుసోటుముట్లాయితంబులం గైకొని వేలుపులు మొనలై విరోచననంద నుండగు బలిముంగట నలువంబడిరి దేవేంద్రుండు నైరావణారూఢుండై వైశ్వానర వరుణ వాయుదండధరాద్యనేకదిగ్గజవాహినీసందోహంబులును, దానును నెమరుపడి పిఱుతియక మోహరించె నట్టి సమయంబున సమరసన్నాహసముత్సాహంబుల రెండుదెఱంగులవారుం బోరాడువేడుకలమీటుచు మాటలసందడించుచున్న సమయంబున* (సీ॥ వజ్రకంప్రాంచిత వ్యజనంబులును బహుచామరంబులు సితచ్ఛత్రములును। చిత్రవర్ణధ్వజచేలంబులను వాతచలితోత్తరోష్ణీషజాలములును। చప్పళ్లనొసఁగుకంకణభూషణంబులుఁ జండాంశురోచులశస్త్రములును। వివిధఖేటకములుఁ వీరమాలికలును। బాణపూర్ణములైనతూణములును। నిండిపెచ్చు రేగినసురాసురవీర। సైన్యయుగ్మకంబు చాలనొప్పె। గ్రాహజాతులతోడఁ గలహంబునను వచ్చు। సాగరములభంగిజనవరేణ్య॥* (క॥ భేరీభాంకారంబుల। వారణఘీంకారములను వరహయహేషల్। భూరథనేమీరవములు। ఘోరములై పెల్లగిల్లె గులశైలంబుల్* (వ॥ ఇవ్విధంబున నుభయబలంబులు మోహరించి యింద్రునితో బలియును, దారునితో గుహుండును, హేతితో వరుణుండును, ప్రహేతితోడ మిత్రుండును, గాలనాభునితోడ యముండును, మయునితో విశ్వకర్మయుఁ, ద్వష్టతో శంబరుండును, సవితతోడ విరోచనుండును, బరాజితుతోడ నముచియును, వృషపర్వునితో నశ్వినీదేవతలును, బలిసుత బాణాదిపుత్రశతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, బులోమునితో ననిలుండును, నిశుంభశుంభులతో భద్రకాళీదేవియు, జంభునితోడ వృషాకపియును, మహిషునితో విభావసుండును, బ్రహ్మపుత్రులతోడ నిల్వలవాతాపులును, గామదేవునితోడ దుర్మర్షుండును, మాతృగణముతోడ నుత్కలుండును, శుక్రునితోడ బృహస్పతియును, నరకునితో శనైశ్చరుండును, నివాతకవచులతో మరుత్తులును, గాలేయులతోడ వసువులు, నమరులును, క్రోధవశులైన పౌలోములతో రుద్రవిశ్వేదేవగణంబులు నివ్విధంబున నంగలసి పెనంగి ద్వంద్వయుద్ధంబు సేయుచు రథికులను రథికులను బదాతులు పదాతులను వాహనారూఢులు వాహనారూఢులం దాఁకి సింహనాదంబులు సేయుచు, నట్టహాసంబులిచ్చుచు, నాహ్వానంబులొసంగుచు, నన్యోన్యతిరస్కారంబులు సేయుచు, బాహునాదంబుల విజృంభించుచుఁ, జెనుబొబ్బలు నుబ్బి రేఁగుచు హుంకరించుచు, నహంకరించుచు, ధనుర్గుణంబులటంకరించుచు, శరంబుల నాటించుచుఁ, బగతుర నలుకుచుఁ, జక్రంబులం జెక్కుచు, శక్తులం దునుముచుఁ, గశలం బెట్టుచుఁ, గుఠారంబులం బొడుచుచుఁ, గదల నడచుచుఁ, గరంబులఁ బొడుచుచుఁ, గరవాలంబుల వ్రేయుచుఁ, బట్టసంబుల నొంచుచుఁ, ప్రాసంబులం ద్రెంచుచుఁ బాశంబులం గట్టుచు, పరిఘంబుల మొత్తుచు, ముసలంబుల మోఁదుచు ముద్గరంబులం జదియుచు, ముష్టిపిలయంబుల ఘట్టించుచుఁ, దోమరంబులను ఱుముచు, శూలంబులఁ జిమ్ముచు, నఖంబులం జీఱుచు, దరుశైలంబుల రువ్వుచు, నుల్ముకంబులం జెండుచు, నిట్లు బహువిధంబులం గలహవిహారంబులు సలుపునవసరంబున భిన్నంబులైన శిరంబులును, విచ్ఛిన్నంబులయిన కపాలంబులును వికలంబులయిన కపోలంబులును, జిక్కులువడిన కేశబంధంబులును, భగ్నంబులయిన దంతంబులును, కృత్తంబులయిన భుజంబులును, ఖండితంబులయిన కరంబులును, విదళితంబులయిన మధ్యంబులును, వికృతంబులయిన వదనబింబంబులును, వికలంబులయిన నయనంబులును, విశీర్ణంబులయిన కర్ణంబులును, విశీర్ణంబులయిన నాసికలును, విఱిగిపడిన యూరుమధ్యంబులును, వితథంబులయిన పదంబులును, జినిగిన కంకటంబులును, వ్రాలిన కేతనంబులును, గూలిన ఛత్రంబులును, మ్రొగ్గిన గజంబులును, మగ్గిన రథంబులును, నుఱుమైన హయంబులును, జిందరవందరలయిన భటసమూహంబులును, పొఱలెడు మేనులును, నుబ్బియాడు భూతంబులును, బాఱెడు రక్తప్రవాహంబులును, గట్టలుగొన్న మాంసంబులును, నెగసి తిఱిగెడు కళేబరంబులు, గలకలంబులు సేయు కంకగృధ్రాదివిహంగంబులునై యొప్పున ప్రతిఘోరంబయ్యె నప్పుడు* (శా॥ నాకాధీశుం బదియింట మూఁట గజమున్నాల్గింట గుఱ్ఱంబుల। న్నేకాస్త్రంబున సారథిం జొనిపె దైత్యేంద్రుండు వీకన్నవ। ల్లోకాధీశుఁడు ద్రుంచె నన్నిటినిఁ దోడ్తో సన్నిభల్లంబులన్। రాకుండన్ రిపువర్గమున్దునిమెగీర్వాణారి యగ్గింపఁగన్* (సీ॥ తనతూఁపులన్నియుఁ దరమిడి శక్రుండు నఱికిన జోడువిన్నఁగ మెఱసి। బలిమహాశక్తిచేఁ బట్టిన నదియును నతఁడు ఖండించె నత్యద్భుతముగ। మఱి ప్రాసశూలతోమరములు గైకొన్న, దోడ్తోడ నవియును దునిమివైచె। నంతటం బోక యయ్యెదివాఁడు సాధించెఁ దోడరి తా నదియును దురుము సేసె। ససురభర్తవిరథుఁడై తనపగఱిఁ జేఁ। గానఁబడక వివిధకపటవృత్తి। నేర్పు మెఱసి మాయ నిర్మించె మింటను। వేల్పుగములు సూచి వెఱఁగుపడఁగ* (వ॥ ఇట్లు దానవేంద్రుండు మాయావిశేషవిధానంబునను సురానీకంబులపైఁ బర్వతంబులు వడియె, దావాగ్నిదందహ్యమానతరువిస్ఫులింగంబులు గురిసె, శిఖిశిఖాసారంబులు గప్పె, మహోరగదందశూకంబులు గఱచె, వృశ్చికంబులు మీఁటె, వరాహవ్యాఘ్రసింహంబులు కదిసి విదళింపం దొరఁకొనియె, వనగజంబులు మట్టి నల్లాడం జొచ్చె, శూలహస్తులు దిగంబరులునై బలురక్కసులు శతసహస్రసంఖ్యలు ఛేదన ఛేదనభాషణంబులాడఁ దొడంగిరి విక్ర

పడగలు-జండాలు, జోడు-కవచము, కైదువ-ఆయుధము, పక్కెర-గుఱ్ఱమునకుఁ దొడిగెడుచొక్క, బొమిడికము-శిరోకవచము.

తపదనులుగఁ దాదండధారులు నాలంబితకేశభారులునై యనేకరాక్షసవీరులు పోనీకు పోనీకు తునుముఁడని వెనుతగిలి వివర్షగం భీరనిర్ఘాతసమేతంబులయిన జీమూతసంఘాతంబు భాతాహాణంబై యుప్పతిల్లి నిప్పులకుప్పలు మంటలప్రోవులం గురిసె మహా పవనవిజృంభితంబులై నకాల్చిచ్చు ప్రళయానలంబు చందంబునం దటికొని యెంద్రబలండజంఝూనిల ప్రేరితపముత్తుంగతరం గావర్తభీషణంబైనమహార్ణవంబు చెలియలికట్ట దాటి వెల్లివిరిసినట్లయ్యె నాసమయంబునం బ్రళయకాలసమేతంబులై యుం డెమిన్నుమన్ను రేయుంబగలనియెఱుంగరాదయ్యె నయ్యవసరంబున* (క॥ ఆయసు రేంద్రుని బహుతరమాయాజాలంబుల ఘనుమూ తెలుంగక వజ్రాయుధముఖరాదిత్యులు సాయంబును బొందిచికుపడిరి నరేంద్రా॥ అప్పుడు* (క॥ ఇయ్యసురుల చేఁ జిక్కితి । మెయ్యెదిదెసు వెందుఁ జొత్తుమిటువోలయఁగదే । యయ్యా దేవజనార్దన । కుయ్యో యెయ్యో యటంచుఁగూయిడిరసు రుల్ ॥ అని మొఱయిడునవసరంబున* (మ॥ విహగేంద్రాంసనరూఢుఁడై మణిరమాపిభాసితోరస్కుఁడై । బహుశస్త్రాస్త్ర రథాంగసంకలితుఁడై భాస్వత్కిరీటాదిసు । స్పృహుఁడై నవ్యపిశంగచేలధరుఁడై సంపుల్లపద్మాక్షుఁడై । విహరాలంకృతి తోడ మాధవుఁడుఁదా వచ్చె నచ్చోటికిన్* (చ॥ అసురులమాయలన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్ । గసిబిసియైనిరర్థ ముగ గ్రక్కునఁ బోయెను నిద్రపొందిసం । తసమున మేలుకొన్నగతిఁ గాంచి చెలంగిరి వేల్పులందఱుం । బసచెడ కేలయుం మహా రిపాదపరిష్కృతి సేయవా పదల్ ॥ అయ్యెడ* (గీ॥ కాలనేమి ఘోరకంఠీరవము నెక్కి । తార్క్ష్యశిరము శూలధారఁ బొడువ । గ తనిపోటుముట్టు హరి కేలనంకించి । దానఁ జావఁ బొడిచె దానవుసని* (క॥ పదపడి మాలిసుమాలులు । బెదరించినఁ దలలు గ్రుంచెఁ బృథుచక్రహతిన్ । గదఁ గొని గరుడుని కతిక్కలు । చెదరించిన మాల్యవంతు శిరము ద్రెవ్వెన్* (వ॥ ఇట్లు పరమపురుషుండగు హరికరుణాపరతత్వంబునఁ బ్రబుద్ధ్యుపలబ్ధమనస్కులయిన వరుణవాయువాసవప్రముఖులు పూర్వంబున నెవ్వరెవ్వరితోఁగ య్యంబుసేయుదురు వారు వారలం దలపడి పొప్పించిరయ్యవసరంబున* (క॥ బాహుబలంబున నింద్రుఁడు । సాహసమున బలిని గెలువసమకట్టి పసన్ । స్నాహమున వజ్రమెత్తిన । హాహానినదంబు సేసిరఖిలజనంబుల్ * (వ॥ ఇట్లు సముద్యతభిదురహస్తుండై యింద్రుండు తనపురోభాగంబునం బరాక్రమించుచున్న విరోచననందనును పలకించి యిట్లనియె* (మ॥ జగతీనావైరిమొఱంగి గెల్చుటయనీశౌర్యంబె ధైర్యంబె తా । మగవాఁడయ్యును దన్నుఁదా నెఱుఁగి సామర్థ్యంబునం గల్గియు । న్నగవానిన్గనఁ దాఁగి నేనిమెయిసహాపంజాలఁ డే నింగటా । నగరే బంధులు దిట్టరే । బుధులు కన్యల్లూర్తురే దానవా* (ఉ॥ మాయల్సేయఁగరాదు పోనగవు లేమా తోడి పోరాటముల్ద్రాయా చికిల్తిత్రకల్లించెదఁగ నద్దంభోళిధారాహతి । న్నీయిష్టార్థములెల్లఁ జూడుము వెసనీ్న వారలం గూడు కెరా । నీయాటోపము నిగ్గ రేంద్రుఁడడచు న్నేఁడాజిలో దుర్మతీ ॥ అనిపలికిన వజ్రితో విరోచననందనుండిట్లనియె* (శా॥ నీవే పోటరివే సురేంద్ర తెగడన్ నీకేల గోల్పోవుట । ల్లేవే యెవ్వరిపాలఁ బోయిననివే లీల్లడుల్ విర్రించాదులన్ । త్రోవం జాలుదు రెవ్విధానమున సంతోషింపశోకింపనా । దైవంబే మికరస్థలామలక మేదల్పొప్పకుస్తులుం బాడియే* (గీ॥ జయములపజయములు సంపదలాపద । లనలచలితదీపి కాంచలములు । చంద్రకళలు మేఘచయములు తరగలు । మెఱుఁగులమరవర్య మిట్టివెఱగు ॥ అని యిట్లాక్షేపించి* (క॥ వీఁడుడు దానవనాథుఁడు । నారసములు నింద్రుమేన నాటించి మహా । ఘోరాయుధకల్పములగు । ఘోరాలాపములు సెవులఁ జొనిపెన్మఱలన్ ॥ ఇట్లు తథ్యవాదియైన బలి చేనిరాలంకృతుండై* (క॥ శత్రువునాక్షేపంబున । దోర్త్రాహతగజముభంగిఁ ద్రుళ్లుచు బలినా । వృత్రారి వీచివైచిన । గోత్రాకృతి నతఁడు నేలఁ గూలె నరేంద్రా* (క॥ చెలికాని పాటు గనుఁగొని । బలిసఖుఁడగు జంభుఁడసులబాహాశక్తిన్ । జెలితనము సాలనెఱపుచు । నిలునిలుమనివీకఁ దాఁకె నింగ్జరనాథున్* (క॥ పంచాననవాహనుఁడై । చంచద్గదజంభుఁడెత్తి శైలారినిఁ దాఁకించిసు రేభంబునునో । ప్పించి విజృంభించి యార్చి పేర్చెంగడిమిన్* (క॥ వీఁకఁ జెడి ఘనగదాహతిఁ । దోఁకయుఁ గదలింప లేక దుస్సహపీడన్ । మోఁకరిలఁబడియె నేలను । సోఁకోర్వక దిగ్గజంబుసుడి పుడి గొంచున్ ॥ అయ్యెడ* (క॥ సారథి వేయుహయంబుల । తేరాయత్తంబు సేయ దేవేంద్రుఁడు దా । నారోహించె మదైత్యుఁడు, దారథమాతలిని శూలధారం బొడిచెన్* (గీ॥ శూలనిహతి నొందిస్రుక్కుచు నోర్చిన । సూతు వెఱుపు మెచ్చుసురవిభుండు । వానిశిరముఁ దునిమె వజ్రఘాతంబున । దైత్యసేన లెల్లఁ దల్లడిల్ల* (చ॥ చనిసురనాథు చేఁ గలనజంభుఁడు నచ్చుట నారదుండు చెప్పినవిని వాని భ్రాతలు గభీరబలాధికుఁ డాబలుండు పా । కనముచులా పురందరునిఁ గాంచి ఖరోక్తులఁ దూలనాడుచు । న్ఘనజలధారలన్నగముఁ గప్పినచాడ్పునఁ గప్పిరమ్ములన్* (సీ॥ విబుధలోకేంద్రుని వేయుగుఱ్ఱంబులనన్నికోలలబలుండదరనేసి । యున్నూటమాతలిని నూటరథమును నారీతి నింద్రుప్రత్యంగకముల । వేథించెఁ బాకుండు వింటవాఁడస్త్రంబు లేయుటఁ దోడుగుటనెఱుఁగరాదు । నకపుంఖంబుల కాండంబులొక్కపదియేనింటనముచి దానేసియార్చె । బలిమినట్టుమును గురుపగవానిరథ

వజ్రాయుధముఖరాదిత్యులు-ఇంద్రుఁడు మొదలగు దేవతలు — తార్క్ష్యశిరము-గరుత్మంతునిశిరస్సును — మొఱంగి-మోసపుచ్చి.
నిరాలంకృతుండై-తిరస్కరింపఁబడినవాఁడయి — తోత్రము-ములుకోల, ఈటె । గోత్రాకృతి-పర్వతమువలె — పంచానన-సింహము.

సూత। సహితముఁ గను శస్త్రజాలములను । వనజలోకసఖుని వానకాలంబున । మొగులు గములు మునుఁగ మూఁగినట్లు॥ అయ్య
వసరంబున* (మ॥ అసురారాతుల బాణజాలముల పాలై పోయితే చెల్లరే। యసురాధీశ్వరయంచు ఖిన్నతనులై యంభోధి
లోఁ జంచల। త్క్షమునం గ్రుంకు వణిగ్జనంబుల క్రియం దైత్యాధిపవ్యూహమ । ధ్యమునం జిక్కిరి వేల్పులం దఱు విపద్ధ్వానంబులం
జేయుచుఁ* (శా॥ ఓహో దేవతలార కుయ్యిడకుఁ డేనున్నాఁడ నంచం బుభృ। ద్వాహుండా శరబద్ధపంజరమునం తంజిఁచి
తేజంబున । న్నాహాహా పేతరథంబుతోడ వెలికిన్ వచ్చెన్నిశాంతోల్లస। న్మాహాత్మ్యంబునఁ దూర్పునం బొడుచు నామార్తాం
డు చండంబునఁ॥ ఇట్లు వెలువడి* (చ॥ విఱిఁగిన సేన గాంచి సురవీరుఁ డొహోహో యని బిట్టుఁ జీఱి క్రొ। మ్మెఱుఁ గురికొల్పి పాకబలను
స్త్రకముల్ని శితాస్త్రధారల। న్నెఱపిన తీక్ష్ణవజ్రమున నేలకు వ్రాల్చెను వాని సుట్టము । ల్వెఱచిరి తచ్చమూపతులు విహ్వలులై
చెడిపాఱి రార్తితోఁ॥ అప్పుడు నముచి నిలువంబడి* (మ॥ తనచుట్టంబులఁ జంపె వీఁడనుచు నుద్యత్క్రోధశోకాత్ముఁడై। కనకాం
తంబు సుశక్తసారమయముం ఘంటాసమేతంబునై । జనదృగ్దుస్సహమైన శూలము నొగి న్సారించి వైచెన్సురేం। ద్రుని పై దీనహ
తుండవౌదనన్మృగేంద్రుం బోలి గర్జించుచుం* (శా॥ ఆకాశంబున వచ్చు శూలమును జంభారాతి ఖండించినా। నాకాండంబుల వా
నికంఠము దెగఁ దంభోళియు వైచెన । స్తోకేంద్రాయుధమున్సురారిగళముం గ్రుంపంగ లేదయ్యె వాఁ। డాకంపింపక నిల్చె దే
వవిభుఁడత్యాశ్చర్యముం బొందఁగ* (వ॥ ఇట్లు నిలిచియున్న నముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతంబగుటకు శంకించి బలభే
దిడనవనంబున* (సీ॥ కొండల ఱెక్కలు ఖండించినై చుచో వజ్రమేన్నఁడు నింత వాడిచెడదు । వృత్రాసురాదుల విదళించె నీప
విదియు గదెన్నఁడు పగఁదీర్చి కాని । యింద్రుఁడఁ గాన కోయే నుదంభోళియుఁ గాదకో యిది ప్రయోగంబు చెడెనో। దనుజాధముఁ
డు మొన తాకుఁ దప్పించెనో భికురంబు నేఁ డేల బెండువడియె । ననుచు వజ్రి వగవ నార్ద్రశుష్కంబులఁ। జావకుండఁ దపము సలి
పెనకట। యితర మెద్దియైన సంద్రప్రయోగింపు। వైళమనుచు దివ్యవాణి పలికె ॥ ఇట్లుపదేశించిన దివ్యవాణి పలుకులాకర్ణించి
యిట్లనియె* (గీ॥ ఆత్మబుద్ధిఁ దలఁచె నార్ద్రశుష్కంబు। గాన సాధనంబు ఫేనమగును। నదియొ వైచి దాన నమర్గులు మెచ్చంగ।
నముచిశిరముఁ ద్రుంచెనాకవిభుఁడు॥ అయ్యవసరంబున* (సీ॥ పురుహూతు నగ్గించి పుష్పాంజలులు సేసి మునులు దీవించిరి ముద
ముతోడ। గంధర్వముఖ్యులు ఘనులు విశ్వావసుఁడును బరావసుఁడును పెనయఁబాడి । రమరాంగనాజనులాడిరి దేవతాదుం
దుభులును మ్రోసె మరములోన । వాయువహ్నికృతాంతవరుణాదులును బ్రతిద్వంద్వ్యులఁ గెల్చి దుర్దండవృత్తి నల్ల మృగముల
సింహంబులట్ల దోలి। రమరవర్యులు దనుజుల నటువాయ । నజుఁడు పుత్తేర నారదుఁ డరుగుదెంచె । దైత్యహరణంబు వారింప
ధరణినాథ* (వ॥ వచ్చి సురలకు నారదుం డిట్లనియె* (శా॥ సిద్ధించెన్సురలార మీకమృతముం శ్రీనాథసంప్రాప్తులై। వృద్ధిం బొం
దితిరెల్ల వారలును విద్వేషుల్కృతింబొందిరీ । యుద్ధంబేటికి సంకఁ జాలుపని లేదోహోహో పురేయంచు సం। బద్ధాలాపములాడి
మాన్పె సురలం బాంధవ్యవంశాగ్రణీ* (వ॥ ఇట్లు నారదవచననియుక్తులై రాక్షసులతోడి సంగ్రామంబు సాలించి సకల దేవము
ఖ్యులును త్రివిష్టపంబునకుం జనిరి హతశేషులైన దైత్యదానవులు విపన్నుండైన బలిం దోడ్కొని పశ్చిమ శిఖరిశిఖరంబుఁ జేరిరి వి
ధ్వంసమానకంధరులును విసష్టదేహులను యామినీచరులనెల్లను శుక్రుండు మృతసంజీవని యైన తనవిద్యపెంపునం జేసి బ్రతి
కించె బలియును భార్గవానుగ్రహంబున విగతశరీరవేదనుండై పరాజితుండయ్యును లోక కాలవిచక్షణుండగుటం జేసి దుఃఖింప
కయుండెనని చెప్పి రాజునకు శుకుం డిట్లనియె* (సీ॥ కైలాసగిరిమీఁద ఖండేందుభూషణుండొక నాఁడు కొలువున్నన్న వేళ। నం
గనయై విష్ణుఁడసురులవంచించి సురలకు నమృతంబు చూరలిడుట । విని దేవియును దాను వృషభేంద్రగమనుఁడై కడువేడ్క భూత
సంఘములు గొలువ। మధుసూదనుం డున్న మందిరంబునకేగి పురుషోత్తముని చేతఁ బూజలొంది। తానుగూర్చుండి పూజించె దను
జవైరిఁ। గుశలమే మీకు మాకును గుశలమనుచు। మధురభాషల హరిమీఁద మైత్రినెఱపి। హరుఁడు పద్మాక్షుఁ జూచి యిట్లనియెఁ
బ్రీతి* (సీ॥ దేవజగన్మయ దేవేశ జగదీశ కాలజగద్రూపక స్వరూప । యఖిలభూతములకు నాత్మహేతువునైన యాదియీశ్వ
రుఁడవాద్యంతములకు। మధ్యంబు బయలును మఱి లోపలను లేక పూర్ణమై యమృతమై భూరిసత్య । మానందచిన్మాత్రమవికార
మాద్యమనన్యమశోకంబు నఖిలగుణము । సంభవస్థితిలయముల సంగరహిత। మైన బ్రహ్మంబు నీవనీయంఘ్రియుగము। నుభయ
సంగవిసృష్టులై యున్నమునులు । గోరి కైవల్యకాములై కొల్తురెపుడు* (సీ॥ భావించికొందఱు బ్రహ్మంబు నీవని తలపోసికొం
దఱు ధర్మమనియుఁ। జర్చించికొందఱు సదసదీశ్వరుఁడవి సరసఁ గొందఱు శక్తిసహితుఁడనియుఁ। జింతించికొందఱు చిరతనుండ
వ్యయుఁడాత్మతంత్రుఁడు పరుండధికుఁడనియుఁ। దొడరియూహింతురు తుదినద్వయద్వయసదసద్విశిష్టసంశ్రయుఁడవీవు। త
లఁపనొక్కంత వస్తుభేదంబు గలదె। కంకణాదులు పసిఁడి యొక్కటియుఁ గాదె। కడలు పెక్కైన వార్ధి యొక్కటియ కాదె। భేద
మంచు మునిను వికల్పింపవలదు* (సీ॥ యద్విలాసము మరీచ్యాదులెఱుంగరు నిత్యుఁడనై యున్న నే నెఱుంగ। యన్మాయ నంధులై
యమరాసురాదులు వనరెద రటయున్న వారలెంత । నేరూపమునఁ బొందకే పారుదువు నీవు రూపివై సకలంబు రూపుసేయ। ర

క్షింపఁ జేయుపఁగారణమైన సచరాచరాఖ్యమైవిలసిల్లునంబరమున । నసలుఁ డేరీతిఁ హరించునట్లనీవు । గలసివర్తింతువు సర్వాత్మకత్వ మొప్పు।జగములకు నెల్లబంధమోక్షంబునీవ।నీవసర్వంబుదలపో యనీరజాక్ష॥ (మ॥ ఘనతన్నీవు గపోఁడుముల్పలుకులుంగన్నారఁగన్నారమే। నినువిన్నారముచూడమెన్నఁడును మున్నీరూడుచందంబు మో । హినివై దైత్యులకన్నుఁ బ్రామియన్నృతంబింద్రాదిదేవాళికి। ద్చిననీరూపముఁజూపుమా కుతుకము ర్జితంబునంబొట్టెడి॥ (క॥ సుగవాఁడవై జగంబులఁ।దగిలిచి విరులను బెట్టుదంటవు నీకుఁ।మగువతనంబున జగములఁ।గగులముఁబొందింప నేఁతదడవు మకుందా॥ (వ॥ అనిపలుకుచున్న శూలపాణిచేనపేక్షితుండై విష్ణుండుభావగంభీరంబగునవ్వునివ్వటిల్లనవ్వామదేవునకిట్లనియె॥ (శా॥ శ్రీకంఠా నను నీవమెచ్చ అనుమీంచి త్తంబురంజించె నే।న్నాకద్వేషులఁడాఁసరించుటకునై నాఁడేను గైకొన్న కాం। తాకారంబు జగన్నిమజ్జన మునీకేఁజూచెదే చూపెదన్।గైకోనన్ల్లాములంద్రుకాముకులు సంకల్పప్రభావంబులన్॥ (వ॥ అనిపలికి కమలలోచనుండంతర్హి

**శ్రీహరితలమోహినిరూపంబుచేత నీశ్వరుని మోహింపఁజేయుట.**

తుండయ్యె నయ్యుమాసహితుండయినభవుండు విష్ణుం డెడఁబోయె నోయెందుఁజొచ్చెనోయనిదశదిశల్గలయనవలోకించి చూచుచుండం దనపురోభాగంబున॥ (సీ॥ ఒకయెలదోఁటలోనొకవీథి నొకనీడఁగుచకుంభములమీఁదికొంగుదలఁగ।గబరీకాబంధంబు కంపింపను పటిపైఁజికురజాలంబులులిక, వడఁగ । ననుమానమైమధ్యమల్లాడఁ జెక్కులఁగర్ణకుండలకాంతిగంతులిడఁగ।నారోహభరమున నసుగులుగడఁబడదృగ్దీప్తి సందులు దిశలుగప్ప । వామకరమున జారినవలువవట్టి । కనకనూపురయుగళంబు ఘల్లనంగ।గంకణంబులు ఝుణఝుణత్కార మెసఁగ।బంతిచే నాడుప్రాయంపు టింతిఁగనియె॥ (వ॥ కనిమున్నుమగువను టిగిసగమయినమగవాఁడమ్మగువ వయోరూపగుణ విలాసంబులుదన్ను నూటింపంగను వెట్టక తప్పకచూచి మత్తనైనచిత్తంబున॥ (శా॥ ఈకాంతాజనరత్న మెవ్వరిదో కోయీయాడురూపంబుము । న్నేకల్పంబులయందుఁగానము జుఁడీయింతిస్సజింపంగదా। లేకుంటెల్ల నిజంబువల్లభతనీలీలావతింజేరఁగా। నేకాంతుండుగలండొ క్రీడలకు నాకీయింతిసిద్ధించునే॥ (వ॥ అని మఱియుం జెఱకువిలుతుని కోలలు మేనఁదాఁటిన నుమనెఱిఁబిఱుదు వెఱంగుపడం దెఱవదుటిమినతటు ముఁచుబిగి ముడివదలికదలి భుజముల మెడలనదిటిచెదటిన కుఱులునొసలిమృగమదతిలకంపుటకలనంపలవిసవిసనగు మొగము మెఱుంగులు దశదిశలంబ సలుగొలుపఁజిఱునగవు మెఱయనునుజఘనటందడంబడి పులకలుగొన హృదయానందకందకంబగు కంచుకంబు కరారవిందంబు నందెమల్చియసఱ్ఱనఁజేర్చి చెఱఁగ్రహత్తించి చుఱుకంబు మోఁపి చూచుకంబులంగదియించి సఖంబులమీఁటుచు మెల్లమెల్లనఁ గెల్లాడుచుఁగరకమలములకనకమణివలయములు ఝణఝణయనంగుచకలశములునొకటికొకటి నొఱయ నెడమకుడినందడంబడఁ గ్రమ్మనెగరఁజిమ్ముచు నెగరఁజిమ్మి తనకుఁ దానెకొన్ని చిన్నవన్నెందంబులు చేసుకొని బడుగునడుము బెడఁగి వడవడవడంకనరుతిసరులుకలయంబడఁ దిరుగుచు బెనుకువలుగొనఁ జెవులతొడవుల రుచులుకటముల నటనములు సలుపఁ బవిరితిరిగియొడయుచుఁ నొడిసి కెలంకుల కుంజడియుచు,జడిసిజడనుపడకవలువ నెలవువదిలిదిగంబడంగటిస్థలంబునంగాంచీనకనకమణికింకిణులు మొఱయఁ జరణకటకమ్ములు ఘల్లుఘల్లనంగ మిట్టిదప్పిన మోహాతిరేకంబునుప్పొంగ వెనుకొనియాటికి పట్టుచుఁబుట్టి పుడమిఁబడవైచి పాటు వెంట నెమింటి కెగసినంగెంటక కరంబునంగరంబుదిరంబై పలుమఱు నడఁచుచు, నెగయు నెడదిగంబడుతటినీలంపుమెఱుంగుటగ్గునోగపగ్గంబులువలలువైచి రాఁదిగిచినపగిది వెనుకొనంగ విలోకనజాలంబులుని గుడించుచుఁ,గరలాఘవంబుననొకటిపదినూఱువేయి సేసి నేర్పువాటించుచు, నరుణచరణకమలరుచులనుదయశేఖరిశేఖర తరణికరణిసేయుచుముఖచంద్రచంద్రికలు మండలంబులుగావించుచు నెడనెడనురోజదుర్గనిర్గతచేలాంచలంబులుఁ జక్కనొత్తుచుఁ, గపోలఫలకాలోలఘర్మజలబిందుబృందంబులు నఖాంతంబులనోసరించుచు,నధరబింబారుణసంభ్రాంతసమాగతరాజకీరంబులంజోపుచు,ముఖసరోజపరిమళాసక్తమత్తమధుపంబులనివారించుచు, మందగమనాభ్యాసకుతూహలాయత్తమరాళయుగ్మంబుల కుందలంగుచు, విలాసవీక్షణానందితమయూరమిథునంబులకు నెడగలుగుచుఁ, బొదరిండ్లయీరంబులకుఁ బోకమలంగుచుఁ, గరకిసలయాస్వాదకాముకకలకంఠదంపతులకు దూరించుచుఁ,దీఁగెయుయ్యెలలనూఁగుచు,మాధవీమంటపంబులెక్కుచుఁ గుసుమరేణుపటలంబుల గుబ్బల్లుఁ ద్రావఁకుచు, మకరందస్యందబిందుబృందంబు త్తరించుచుఁ, గృతకశైలంబున నారోహించుచుఁ,బల్లవపీఠంబులం బరిశ్రమంబువుచ్చుచు, లతాసౌధభాగంబులఁ బొడఁజూపుచు మున్నతకేతకీస్తంభంబులనొఱుగుచుఁ, బుష్పదళఖచితవాతాయనంబులఁ దొంగిచూచుచుఁ, గమలషండపాళికలనాలంబించుచుఁ, జంపకగేహాళీమధ్యంబుల నిలువఁబడుచుఁ,గదళీకాపత్రవాతంబులనొఱయుపరాగనిర్మితసాలభంజికానివహంబుల నాదరించుచు, మణికుట్టిమంబుల మెఱయుచుఁ, జంద్రకాంతవేదికల నెలయించుచు, రత్నపంజరశారికానివహంబులకుఁజదువుఁజెప్పుచుఁ, గోరినక్రియంజూచుచుఁ, జూడన

వనరెదరు-దుఃఖించుచున్నారు—కుతుకము-సంతోషము—కబరికాబంధము-కొప్పు. ఆరోహాపేక్షుఁడు—కుకుము-కొప్పు.

క్రియ మెచ్చుచు మెచ్చినక్రియ లెఱుఁగుపడుచు, వెఱుఁగుపడినక్రియ మఱచుచు, మాఱవక నేకాంతంబున సర్వాంతంబుననసంతవిభ్రమంబులజగన్మోహినియై విహరించుచున్నసమయంబున* (గీ॥ వాలుగంటి వాఁడివాలారుచూపుల శూలిధైర్యమెల్ల గోలుపోయి। తలిరుబోఁడి లేక మాఱచేగుఱంబుల। నాలిమఱచె నిజగణాలిమఱచె। అప్పుడు* (గీ॥ ఎగరవైచినపట్టనెడ లేమిఁజేదప్పి। వ్రాలుబంతిఁ గొనఁగవచ్చు నెడను। బడఁతివలువ వీడిపడియె మారుతహతిఁ। జంద్రధరుఁడు మనము సంచలింప* (మ॥ రుచిరాపాంగినివస్త్రబంధనపరన్ రోమాంచవిభ్రాజితన్। కుచభారానమితాంగరద్వయపుటీగూఢీకృతాంగింజలత్కచబంధంగని మన్మథాతురతనాకంపించి శంభుండు లజ్జ చలింపం దనకాంతసూడఁగ దిసెంజంద్రాస్య కేల్దమ్మికిన్* (గీ॥ పడఁతి సేరవచ్చు ఫాలాక్షుఁ బొడఁగని। చీర వీడిపడిన సిగ్గుతోడ। మగువ నగుచుఁ దరులమాటున డాఁగెను। వేల్పుఱేఁడు నబల వెంటఁబడియె* (మ॥ ప్రబలోద్యత్కరిణింగరీంద్రుఁడు రమింపన్వచ్చు లీలన్నిలింపు। డబలాపోకడఁబోక వేయఁచుచు డాయంబాఱి కెంగేలఁబా। గబరీబంధము పట్టి సంభ్రమముతోఁ గౌఁగిళ్లఁ గూరార్చె నం। తబహిఃప్రక్రియ నెట్టకేనిఁ గదియం దబ్బాహుసిద్ధ్యర్థమై* (సీ॥ వీడి వెన్నున నాడు వేణీభరంబు దో। జఘనభారగతశ్రాంతితోడ। మాయావధూటి మైమఱఁ బాఱిచూచుచుఁ బాఱు విష్ణునద్భుతకర్మ వెంటఁదగిలి। ఋషాశ్రమముల నుఱవులు నెడవులు గిరులు దరుల సరిత్తులఁ దాల్చి। కొండలు నేఱులు కోలఁకులు వనములు దాఁటి శంభుఁడు సనందనమ్మహాత్మ। నిర్మలామోఘవీర్యంబు నేలమీఁదఁ। బడిన చోట్లెల్ల వెండియుఁ బైఁడియయ్యె। ధరణి వీర్యంబు వడఁ దన్నుఁ దానెఱింగి। దేవమాయాజడత్వంబు దెలిసె హరుఁడు* (క॥ జగదాత్ముఁడు గుశంభుఁడు। మగిడెను హరి నెఱిఁగి తనరు మాహాత్మ్యమునను గతత్రపుఁడై సలిచెను। మగువతనంబు డిగి హరియును గవాఁడయ్యెన్* (గీ॥ కాముఁ గెలువవచ్చుఁ గాలారిఁ గావచ్చు। మృత్యుజయము గలిగి మెఱయవచ్చు। నాఁడు వారిచూపుటంపఱఁ గెలువంగ। వశముగాదు త్రిపురవైరికైన* (వ॥ ఇట్లు పురుషాకారంబు వహించిన హరి హరున కిట్లనియె* (సీ॥ నిఖిలదేవోత్తమ నీవొక్కరుఁడు దక్క నెవ్వఁడు నా మాయ నెఱుఁగనేర్చు। మానినియైన నా మాయ చే మనుఁగక ధృతి మోహితుండవై తెలిసితీవు। కాలరూపంబునఁ గాలంబుతోడ నీ నాయంశ నీ మాయ నధివసించు। నీ మాయ నన్ను జయింప నేరదు నిజమకృతాత్ములకు నెట్లు నా నుపలభ్య। మిప్పుడు నీ నిష్ఠ పెంపున నిలిచితనుచు। సతతరించిన సఖ్యంబు చాల నెఱపి। దత్తతనయగణంబులుఁ దన్నుఁ గొలువ। భవుఁడు విచ్చేసెఁ దన నిజభవనమునకు* (శా॥ పారావారముఁ ద్రచ్చువోఁ గిరి సముద్యత్స్ఫారమై కచ్ఛపా। కారుండై నరమేశవర్తనము నాకర్ణింపఁ గీర్తింపసం। సారాంభోనిధిలోఁ మునుంగకుదనుల్సంశ్రేయముం బొంది పస్తారోదారసుఖంబుఁ జెందుదురు తథ్యంబెంతయున్భూవరా* (మ॥ ఎలమిన్ దైత్యుల నాఁడు రూపమున మోహింపించి పీయూషముం। జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్విభాగించి నిర్మలరేఖన్విలసిల్లు శ్రీవిభుని దన్మాయావధూరూపముం। దలఁతున్ సొక్కుదు నాత్మలోన పురితత్త్వాంతారరూపంబుగన్ ॥ అని చెప్పి శుకుం డిట్లనియె* (గీ॥ నరవరాధీశ యిప్పుడు నడచుచున్న। వాఁడు సప్తమమనువు వైవస్వతుండు। శ్రాద్ధదేవుండనం దగు జనవరేణ్య। పదురు నందనులతనికిం బ్రకటబలులు* (వ॥ వారలిక్ష్వాకుండును, నభగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుండును, నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, బృషధ్రుండును, వసుమంతుండు ననువారు పదుగురు రాజులు పురందరుండను వాఁ డింద్రుండు, నాదిత్యమరుదశ్వినీవసురుద్రసంజ్ఞలు గలవారు దేవతలుఁ - గౌతమకశ్యపాత్రివిశ్వామిత్రజమదగ్నిభరద్వాజవసిష్ఠులను వారు సప్తర్షులై యున్నవారందుఁ గశ్యపునకు దితిగర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించియుఁ ద్రావరజుండయ్యె నిప్పుడేడు మన్వంతరంబులు సెప్పంబడియె - రాఁగల మన్వంతరంబులును, శ్రీహరిపరాక్రమంబుం జెప్పెద దత్తావధానుండవై వినుమని శుకుం డిట్లనియె* (సీ॥ జననాథ సంజ్ఞయుఁ జాయయు ననువారు గలరర్కునకుఁ బూర్వకర్మ తనయ। లిరువురు వల్లభ లిట మున్న చెప్పితిఁ బరగఁ దృతీయయు బడబ యనఁగ॥ సంజ్ఞకు యముఁడును శ్రాద్ధదేవుండును యమునయుఁ బుట్టిరి హర్షమెసఁగ। ఛాయకుఁ దపతియు సావర్ణియును శనైశ్చరుఁడును గలిగిరి సంచరణుఁడు। దపతి నాఁగను గైకొని ఖ్యాపరించె। నశ్వయుగళంబు బడబకు నవతరించె। వన్నె నష్టమమనువు సావర్ణి వాఁడు। తపము సేయుచు నున్నాఁడు ధరణినాథ* (క॥ ఒకపరిఁ జూచిన వెండియు। నొకపరి జూడంగ లేక యుండు సిరులకు। నొక నొకనిచేటు వేళకు। నొకఁడొకఁడు మనువుగా నియుండున రేంద్రా* (వ॥ సూర్యసావర్ణిమన్వంతరంబున నతని తనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును, సుతపోవిరజామృతప్రభులను వారు దేవతలును, గాఁగలకు గాలవుండును, దీప్తిమంతుండును, పరశురాముండును, ద్రోణపుత్రుండగు నశ్వత్థామయు, గృపుండును, మజ్జనకుండగు బాదరాయణుండును, ఋశ్యశృంగుండను వారు సప్తర్షులయ్యెదరు వారలిప్పుడు దమతమ యోగబలంబుల నిజాశ్రమమండలంబులం జరియించుచున్నవారు విరోచననందనుండగు బలి యింద్రుండయ్యెనని చెప్పి శుకుండిట్లనియె* (సీ॥ బలిమున్న నాకంబు బలిమిమై జేకొన్న వామనుండై హరి వచ్చి వేడఁ। బాదత్రయంబిచ్చి భగవన్నిబద్ధుఁడై మురవైరి మెచ్చిన ముఖ్యభాగమైన। సుతలలోకంబున సుస్థితిని న్నాఁడు పెతలేక నటమీఁద వేడ్కఁ గుహికి। నాసరస్వతికిఁ బానంట

సార్వభౌముండను నాప్రభుఁడై హరి నాకవిభుండు. ఱ్ఱ్ఱ్

౧ శ్రీయుతుఁడయ్యును దైత్యారి యాచకుఁడై వచ్చెను కలఁడు దేవతల కిమ్మహిమ కలఁడు రాజసుతాదుల కాతని తోడి సఖ్యంబు రాజిల్లు

౨ యట్లు వామనుండై యజ్ఞంబు జేయు బలిచక్రవర్తి పాలికి మరలె. వాఁడు బలిని మహాదాన సంతుష్టుని జేసి యసురేంద్రుని పాతాళంబునకు బంపి యింద్రునకు రాజ్యం బిచ్చెను. అని యిట్లు బాదరాయణి చెప్పి మఱియు నిట్లనియె.

౩ సార్వభౌముఁడనె నా ప్రభుఁడై హరి నా దైవభువనంబునకుం జనియె. ఆ యెడ బలిచక్రవర్తి హరిచేత బద్ధుండై సావర్ణిమనువు సమయంబున నింద్రుండు గాగలఁడు.

తాత్పర్యము: సార్వభౌముఁ డను నా ప్రభు వై హరి నాకవిభుఁడై బదవిహీనుని జేసి బలి డెబ్బనిలుపును. బలియు నిర్జరేంద్రపదము నొందు. ఇంద్రపదము హరికి నిచ్చిన కతమున దానఫలము చెడదు ధరణీనాథ.

ఆ పిమ్మట మనువులు గూర్చి - దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి ధర్మసావర్ణి రుద్రసావర్ణి దేవసావర్ణి ఇంద్రసావర్ణి యను మనువులు గలరు.

పద్మమాలఁ గలుషహరుఁడు తన తాతకు నానొసఁగె॥ సోముసంకాశశంఖంబు శుక్రుఁడిచ్చె॥ ఇవ్విధంబున* (క॥ పాణిఁ దుర
ధియుఁ గృపాణియుఁ । దూణియు ధన్వియును బ్రగ్విభూరగియు దేహత్రాణియు ధికృతవిమత । ప్రాణియు నణికనకవలయ
పాణియు నరుచర్మ* (మ॥ పలుదానంబుల విప్రులం గనిపితృభ్రద్రోక్తులం బొందె పె । గ్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతలనంతర్భక్తిఁ
బూజించి విప్రమ్ములు బ్రస్తోమునిఁ జీచేన మశీరుఁడై రాజ సధారూఢుఁడై । వెలిగె ద్దానవభర్త శైలశిఖరోద్వేల్లద్దవాగ్నిప్రభ*
(క॥ దండితనృపకృతాంకులు ఖండితసురసిద్ధసాధ్యగంధర్వాదు । ల్పిండితదిశలమరాహిత । దండాధీశ్వరులు సములుద
న్నుంగొలువఁగ* (క॥ చూపులకదనము ద్రిమ్మంగుచు నేపున నవిభుగ యునావలీవల సేయఁగ । రూపించు చుదనుజేంద్రుఁడు । ప్రా
పించెను దివిజనగరపథమున రేంద్రా* (వ॥ ఇట్లు బలవంతుండగు బలిసురేంద్రుని సాధింపసమకట్టి దండగమనంబు సేసి నిడుదవ
యనంబులం జనిచని* (మ॥ కనియె న్బణ్యజనౌకము న్విగతరోగస్వప్నపీడాన్వఖా । దనసంకేతముఁ బుష్పవల్లవఫలోద్దామద్రు
మానీకము న్స్వనితోద్ధూతపతాకము న్విచరద్వైమానికానీకము । న్ఘనగంగాసలిలైకము న్మనువ యుక్తశ్రీకము న్నాక
ముఁ* (వ॥ కనకరుచులతోఁడు వెక్కసంబై చాడ్పుగల వేల్పుల నెలవు దరియంజొచ్చి చెన్నెఱుపుండటపుంజనిచని ముండట నె
డపడక మొన మొగ్గయి గురువిగురుతలిశాకుజొంపంబునన మొగుడమొగ్గయ అవిటి నెఱవిటికు ద్రిపిండె పూఁప దోరగాయపం
డు గెలకండంబుల వ్రేఁగున వ్రేఁగులాఁగలేక మూఁగివీగి వ్రేఁకలకు వ్రాఁకుల ప్రోఁకలకుఁ బెంటలకు పెండొఁటలును దోఁటల
గాటంబులై నివ్వటిల్లు మవ్వంపు గ్రొవ్విరులకు గవలు విచ్చి కసమసలు గలిగి మసరికొనిరి పూనిపాకొని తేనియలాని విసరు
గలిగి మసరుగవిసి క్రొవ్వి తెమ్మిగొని ఝుమ్మఝుమ్మని ఝుంఝుంకరించు తేఁటిదాఁటులును, దాఁట్లు వడకనాటుకొని కూడి
జోడు విడువక క్రొమ్మావుల కమ్మని కొమ్మల నిమ్మలము సరి పసిమిగల కిసలయంబులు పొసంగ మెసంగి కిసరువడక కసరు చెడి బి
ట్టురట్టడిత నంబుల మించి కరాళించు కోయిలల ముత్తంబును, ముత్తంబులై చిత్తంబులు మత్తంబులుగఁ దత్తఱంబున నందీయని
పండ్లకు గదియంబడి కయ్యంబు సేసి యాస రేఁగి బేసంబులు గాసంబులుగొని వాసికెక్కి ఎలుబొసలాడుచు బహుప్రకారం
బులగు కీరంబులును గీరంబుల సనలిగడచి మింటనంట నెగసి పిట్టల పట్టుజీవిన యిట్టట్టు చనక నెట్టువ్రాలుచు నింపుగల రవమ్ములు
గలుగుక లరవమ్ములును, గలరవంబుల లరం దలంకని కొలంకుల కెలంకుల కడవలం బ్రియలనిడుకొని క్రమ్మిదొమ్మిఁ జేసి యొలత
మ్మిఁ తూండవాండ్లగు చంచువులం జించి మెక్కి చొక్కి రెక్కల మిక్కిలి కలకలపడుచు నలబలంబులు సేయు హంసంబులును,
హంసరుచిజనిత వికసనముల వికపికనగుచుం బసగలిగి మిసమిస మెలఁచు పసిఁడి కెంపమ్ములిందిరామందిరమ్ముల చందమ్ముల
గు కొలంకులును, గొలంకుల కరుళ్ళఁ దడిసి వడవడ వడంకుచు సల్లిబిల్లులు గొని సాఁగి నతీఁగె యిండ్ల గండ్ల యారములందరుమలు
నెడి పలువిరుల కమ్మవలపుల వ్రేఁగు నందూర లేక యాడిగలం బడు గాడ్పులును, గాడ్పుల వలన నెగసి గగనమున విరిసి పలువన్నె
లం జెన్నగు మేలుకట్టు పుట్టంబుల తెఱంగులదట్టంబులయి నడుపు పరాగంబులును, బరాగంబుల సరాగంబులను వ్రాఁకవంతల
చెంతలగుంపులుగొని నెమర్లు వెట్టుచు నోదవుగల పాడువులుగ దల వాడల జాడలం బరగు లిడుదూడల క్రీడల వేడుకలం గూడుకొ
నియిండ్ల వాకిండ్లకుం జేరి పొరుగులకోరి కెలుపారి కెలసుచు నమృతంబు గురియు కామధేనువులును, గామధేనువుల కునిలువనీడలగు
చు నడిగిన జనమ్ముల కు ధనమ్ముల ఘనమ్ముగఁ బుడుకు కల్పతరువులును, గల్పతరువుల పల్లవపంజరుల గుంజరులను విటిచియిచ్చుచు
మచ్చికల కలిమిని మెచ్చుచుఁ జరము గిరిచరుల నడుపడంకు లనడలకు గురువులగు మత్తేభంబులును నిభంబుల సరసమె సరుకొని వ
రుసఁబరు సదనము వెడలి మకరములగు మకరతోరణస్తంభంబులును దోరణస్తంభంబుల చేరువ చేరువ నిలిచి చెలువు విలుతుం
డొఱవెటికిన బెడిదములగు నవకంపు మెఱుఁగుచిగురుటడిదముల తెఱంగున నిలుకడ సంపదలు గలుగు శంపల సొంపు నంగరచరణా
దిశాఖలుగల చంద్రరేఖల పోడిమిని వాహినిగల మోహినీవిద్యల గ్రద్దనఁ జూపులకుం దీపులొదవించుచు ధర్మకర్మంబుల యశం
బుల వశంబు గలిగి యనూనంబులగు విమానంబులెక్కి చక్కవచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెఱ నెదురుసని తూకొని తోకొనిపో
పురంభాది కుంభికుంభకుచలకలకలంబులును, గలహంస కారండవకోక సారస బృందసుందర సుందరియు, నిందీవరారవిందసం
దదిందిందిరయు, నభంగయు, సభంగయునగు గంగనంగికింబొంగి మిగులదిగులువడఁ బొగడ్తలకెక్కిన యగడ్తలును, నగడ్తల
మిన్నేటి తేఁటనీటనీఁటు లేని పాటిసూటి చల్లులాఁటల మేటికూటువలుగొనుచు నేచిన ఖేచరకన్యకా వారంబులును, వారవనితా
సుపూజిత దేహళీపాటవంబులగు గోపురకనకకవాటంబులును, గవాటవేదికాఘటిత మణిగణ కిరణోదారంబులగు నింద్రనీ
లస్తంభగంభీరంబులును, పీరరసజలధివేలాకారంబులగు శుద్ధస్ఫటికబద్ధమహోత్తానంబులగు సోపానసుకుమారంబులును
గంభీర విశాల కమలరాగ పాలికా మాలికా వారంబులగు చతుర్ద్వారంబులును, ద్వారదేశంబుల సావళ్లం గావళ్లుండి ప్రా
ద్దవోక రక్కసుల వేల్పులకయ్యంబులు నెయ్యంబులు సెప్పికొనుచున్న యస్త్రశస్త్రధారులును శూరులైన మహాద్వారపా
లకవీరులును, మహారజత ప్రదీపంబులగు వజ్రవజ్రంబులును, వప్రోపరిదృశ్య శిరోభాగ చంద్రకాంత కాంతారుణ హిమక

రకిరణముఖరంబులగు సాలశిఖరంబులును, శిఖరస్తోమధామనికృంతతారకంబులును, దారతారమణిశిలాకారకఠోరంబులగు చుమిగులగరితయగు నగరిసిరిమీఱ అనమకమొగులుపొడగని విలుకడలకునలువనడిగికొని పడసిన పసిడి తెఱవలవడువున బెడంగు నంబోరంబులగు ప్రాకారంబులును, ప్రాకారకాంచనాంచితయుద్ధసన్నద్ధమహాఖర్వగంధర్వ వాహినీపాలకంబులగు మరకతాట్టాలకంబులును, అట్టాలకోత్తుంగవజ్రమయస్తంభోదంచనంబులును పరభటప్రాణవంచనంబులును సముదంచనంబులునగు ముదంచనంబులతుదలు రథంబులయి ఉసులొఱసికొనం గోటయీవలావలకావలి దివియలకరణి రుచిరములగుచున్న దినకరహిమకర మండలంబులును హిమకరమండలంబు నిద్దంపుటద్దంబని మూఁగితొంగి చూచుచు నలికఫలకఫలములగు కలములుగొనుచు నలకములన్దర్చి తిలకములం దెలుగుపఱచుకొని సమయముల వెనుక నొదిగి కదిసి ముకురమునం బ్రతిఫలితులైన పతులితరసతుల రతుల కనుఁగొని తులనికన్ను చెన్నుగారల నీడ తలంగి కలంగిచని కాంతులు సోలయము గుదలను నేకాంతంబులై గగనసముచ్ఛేదనంబులైన రాజసౌధంబులును సౌధంబులసిగులము త్రియపుసరులతోడి నిబ్బరపునుబ్బు చన్నుల చెన్నులఁ బ్రక్కల జుక్కలపదువులుండ మణ్డితసౌధశిఖరంబులకు శృంగారంబులైన భృంగారంబులును భృంగారశయనజాలకహోలికాని శ్రేణికాది విశేషరమ్యంబులైన హర్మ్యంబులును, హర్మ్యైకనకగవాక్షరంధ్రనిర్గతకర్పూరకుంకుమాగరుధూపధూమంబులు, ధూమంబులు జీమూతస్తోమంబులని ప్రేమంబున గొబ్బున పాటువబ్బులబ్బైన నిపురులుగొని పురులువన్నియలసిరులు గొనంగుటవిటపములందట వెటనటించుచుఁ బురుజువిడిసికి కురువోవుచు చువలతేని మురువుచమువులటీకలనంగేకలిడు నెమళ్లును, నెమళ్లపురులనారలు నారులగు విండ్లఁ గనమలందలంపులుగఁ దోఁకలువడసి వీఁకలు మెఱసి మూఁకలుగొని దివికెగరి రవికింగవిసిన రాహువుం క్రియం దివిఁ దడఁబడుపడగలును, బడగలును, గొడుగులును, దమకుహోరంబులగు నడియాలంబులుగ దోరంబులైన సారంబుల బీరంబులు మెఱసి బెబ్బులుల గ్రబ్బు సంగరుల సిరులసింగంబుల భంగంబుల శరభంబుల రభసంబుల ధూమకేతుల రీతులవై రింజీటికిం గొనక శంకలుడిగి రంకెలిడుచు అంకెపై లెక్కకుమిక్కిలిగుచు రక్కసుల చక్కటి మొక్కటికయ్యముల దయ్యము లెఱుంగం దిరుగు వీరభటుల కదంబంబులును, కదంబకరవాలశూలామల మెఱుంగులు మెఱుపుల తెఱంగుల దిశల చెఱంగులం దమఱంగలింపనే మినివదంబులు తుఱుములగు నుఱుములుగ నడమొగుళ్ల పెల్లునం బ్రవర్షిత రథికమహారథంబులగు రణంబుల గములును, గములుగొని గమనవేగములవలన హరిహరులనగి గాలిం జాలింబడ గేలిగొని, ఘనంబులగు మనంబులం దెగడి, నెగడు తురంగంబులగు తురంగంబులును రంగదుత్తుంగవిశద మదకలకరికటతటజనితమదసలిలకణగణవిగణితదశశతనయన భుజసరళమిళితలలితనిఖిలదిగధిపతిశుభకరకరకనకకటకఘటిత మణిసముదయసముదితరేణువర్గదుర్గమంబులయి నవిర్వక్రమార్గంబులును, మార్గస్థలోకపరిగతాగతశతాయుతానేకగణనాతీత రోహణాచలతట విరాజమానంబులగు విమానంబులును, విమానవిహారమాణసుందరసుందరీసందోహ సంపాదితభూరిభేరీవీణాపణవమృదంగ కాహళశంఖాదివాదనానూన గానసాహిత్యనృత్యవిశేషంబులును, విశేషరత్నసంఘటితశృంగారశృంగాటక వాటికాగేహ దేహళీప్రదీపంబులును, దీపాయమాన మానితసభామంటపఖచితరుచిర చింతారత్నంబునుం గలిగి రత్నాకరంబునుంబోలె ననిమిషకౌశిక వాహినీవిశ్రుతంబయి శ్రుతివాక్యంబులుంబోలె నకల్మషసువర్ణప్రభూతంబయి భూతపతికంఠంబునుంబోలె భోగిరాజకాంతంబై కాంతాకుచంబునుంబోలె సువృత్తంబై వృత్తజాతంబునుంబోలె సదాగురులఘునియమాభిరామంబయి రామచంద్రుని తేజంబునుంబోలె ఖరదూషణాది దోషాచరానుపలబ్ధంబయి లబ్ధవర్ణచరిత్రంబునుంబోలె విబుధాంతరంగద్యోతమానంబయి మానధనుని నడువడియునుంబోలె సన్మార్గభాతిసుందరంబై సుందరోద్యానంబునుంబోలె రంభాంచితాశోకపున్నాగంబయి పున్నాగంబునుంబోలె సురభిమనోమానవిశేషంబయి శేషాహిమతంబునుంబోలె నున్నతక్షమావిశారదంబై శారదసముదయంబునుంబోలె ధవళజీమూతప్రకాశితంబై సితేతరాజినదానంబునుంబోలె. పరసతిలోత్తమంబై యుత్తమపురుషవచనంబునుంబోలె ననేకసుధారసప్రవర్షంబై వర్షాదియునుంబోలె నుల్లసదింద్రచాపంబై గోపతిమాపురంబునుంబోలె విచతురాశ్యాలంకృతంబై కృతార్థంబైన యమరావతీనగరంబు చేరంజని కోటచుట్టునుం బట్టుగలుగ బలంబుల జవంబున విడియించి పొంచి మార్గంబులెల్లనరికట్టుకొని యేమఱక యుండెనంత* (క॥ మాయరు నగవులకు మగమ। మాయరు కాలంబుకతన ముదియరు ఖలులం। డాయరు పుణ్యాజనంబులఁ। బాయరు పురరాజువీటి ప్రమదాజనముల్ ॥ అప్పుడు* (క॥ దుర్బలవానవశంఖా। విర్భూతధ్వానములు నిండి విబుధేంద్రవధూ। గర్భములు వగిలి లోవలి। యర్భకతతులాపురనుచు నాక్రోశించెన్ ॥ అంత* (సీ॥ బలివచ్చి విడియుట బలభేది వీక్షించి గట్టిగా గోటకుఁ గాఁపు వెట్టి। దేవవీరులు దాను దేవతామంత్రిని రప్పించి సురవైరి రాకఁ జెప్పి। ప్రళయానలునిభంగి భాసిల్లుచున్నాఁడు ఘోరరాక్షసులను గూడినాఁడు। మనకోడి చని నేఁడు మఱలలేఁడే తెంచె నేతపంబున వీనికింత వచ్చె। వీఁడు రాత్మకునకు నెవ్వాఁడు దోడయ్యె। నింక వీని గెల్వ నేది త్రోవ। యేమి చేయువార మెక్కడి మగఁటిమి। యెదురు మోహరింప నెవ్వఁడోపు* (క॥ మింగె

డు నాకాశంబును బొంగెడు నమరాద్రికం బెంబోడవై వీఁడుఁ । గ్రుంగెడు కాలాంతకుక్రియ । భంగించును మఱలఁబడ్డఁబంక
జగర్భుఁ* (క॥ ఈరాదు రాజ్య మెల్లను । బోరాదు రణంబు సేయఁబోయితి మేనిఁ । రారాదు దనుజు చేతను । జారాదిటమీఁద నే
మిజాడ మహాత్మా॥ అనిన సురరాజునకు నాచార్యుండిట్లనియె* (సీ॥ వినుము య్యా దేవేంద్ర వీనికి సంపద బ్రహ్మవాదులు భృగుప్ర
వరులెల్ల నిచ్చిరి రాక్షసు నెదుటింపవాదింప । హరియీశ్వరుఁడు దక్క నన్యజనులు । నీవును నీ సములిన్నికం బెనధికులు చాలరు రా
జ్యంబు సాలు నీకు । విడిచిపోవుటనీతి విబుధనివాసంబు విమతులు వెలిఁగెడు వేళ సూచి । మఱలి మఱునాఁడు వచ్చుట మామతం
బు । విప్రబలమున వీనికి వృద్ధి వచ్చె । వారకైకొనకిటమీఁద వాఁడు చెడును । దలఁగుమం దాఁక రిపు పేరు దలఁపవలదు* (క॥ పరు గె
లువవలయు నొండెను । సరిపోరఁగవలయు నొండె జావలె నొండెన్ । సరిగెలుపు మృతియు దొరకమి । సరసంబుగ మున్నె తొ
లఁగి చనవలె నొండెన్* (వ॥ అని కార్యకాలనిదర్శినియగు బృహస్పతివచనంబులు విని కామరూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి
తగు తమ పొందువట్లకుం జనిరి బలియును బ్రతిభటవివర్జితయగు దేవధానినధిష్ఠించి జగత్త్రయంబును దనవశంబు చేసుకొని
విశ్వవిజయుండై పెద్దకాలంబు రాజ్యంబు సేయుచుండె శిష్యవత్సలుర గుభృగ్వాదులు తనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి
తత్కాలంబున* (శా॥ అర్థుల్వేడకు దాతలుం జెడరు సర్వారంభముల్పండు బ్రత్యర్థుల్లేరు మహోత్సవంబులను దేవాగార
ముల్వెల్వుఁబూ । గర్థుల్వ్విప్రులు వర్షముల్లురియగాలాగ్రాంబులై ధాత్రికి । న్సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాదీశు
రాజ్యంబునన్॥ అంత* (సీ॥ తనతనూజుల ప్రోలు దనుజులు గొనుటయు వేల్పు లెల్లను డాఁగి వెడలుటయును । భావించి పరమా
తపరితాపమును బొందివగ నాథాకృతి చనరుచుండ । నాయమ్మ పెక్కుమిటి యుఁగు కశ్యపబ్రహ్మ మఱియొక నాఁడు సమాధిమా
నితనకుటుంబినియున్నధామంబునకు నేగి నాతిచేవిహితార్చనములు వడసి । వందిత్రావలి కుంది వాడిన యిల్లాలి । వదనవారిజం
బువడువుఁజూచి । చేఁదిగి చిమగువచుబుకంబు పుడుకుచు । వారిజాక్షి యేలవగ చెదనుచు॥ అమ్మహాత్ముండిట్లనియె* (మ॥ తెఱ
వా విప్రులు పూర్ణులే చెలఁగునె దేవార్చనాచారము । ల్లతితో వేలుతు రే గృహస్థులు సుతుల్ధర్మానుసంధానులే । నేఁటి నభ్యాగత
కోటికన్నమిడుదే నీకంబునుంబోయు దే । మఱలేకర్థుల దాసులన్సుజనులన్మన్నింపు దే పైదలీ* (గీ॥ అన్నమైన దోయమైన ద్రవ్యం
బైన । శాకమైనఁ దనకు జగుకొలఁది । యతిథిజనులకడ్డమాడకయిడరేని । లేమవారు పుడమి లేనివారు॥ మఱియు* (గీ॥ నెలఁత వి
ష్ణునకు నఖిలదేవాత్మున కాననంబు శిఖియు నవనిసురులు । వారుదనియఁ దనియు వనజాతలోచను । డతఁడు దనియ జగము
లన్నదనియు* (క॥ బిడ్డలు వెఱతురు నీకఱ । గొడ్డంబులు సేయ రెల్ల కోడండ్రును మా । ఱొడ్డారింపక నడతురె । యెడ్డము గాకున్న
దె నృగేక్షణ యింటన్॥ అని పలికిన ప్రతికి సతియిట్లనియె* (ఉ॥ ప్రేమ యొకింత లేక దితిబిడ్డలు బిడ్డల బిడ్డలున్మహా । భీమబలాఢ్యు
లై తనదు బిడ్డలనందఱిఁదోలి సాహస । క్రామితవైరులయ్యునమరావతి నేలుచునున్నవారు నీ । కేమని విన్నవింతు హృదయేశ్వ
ర మేలుఁదలంచి చూడవే* (క॥ అకటా చెల్లెండ్రయ్యును । దకట రునాతోడిపోరు దనుజులు దితియున్ । రకటసులు సురల మొత్తఁ
గ నకట వలదనదు చూచు నౌనౌననుచున్* (సీ॥ ఎండకన్నెఱుఁగని యింద్రునియిల్లాలు వలుపంచలను జాలిఁబడియె నేఁడు ।
త్రిభువనసామ్రాజ్యవిభవంబు గోల్పోయి దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు । కలిమి గారాబు బిడ్డలు జయంతాదులు శబరా
ర్భకుల వెంటఁ జనిరి నేఁడు । నమరుల కాధారమగు సునమగాపతి యసురుల కాటపట్టయ్యె నేఁడు । బలి జగముల నెల్ల బలియుచును
న్నాఁడు । వాని గెలువరాదు వాసవునకు । యాగభాగమెల్ల నతఁ డాహరించును । గడఁగి సురలకొక్క కడియు నీఁడు* (క॥ ప్రజల
కు నెల్లను సముఁడవు । ప్రజలను గడు పారఁగన్న బ్రహ్మవు నీవుం । బ్రజలందు దుష్టమతులను । నిజముగ శిక్షింపవల దె నీవు మహా
త్మా* (మ॥ సురలన్సభ్యులనార్తులన్విరథుల న్మోకంబు వారించి నీ । ర్జరధాని న్నిలుపంగ రాత్రిచరులన్నాశింపసత్కార్యమే । వె
రవేరీతి ఘటించునట్టి క్రమము న్నే వేగఁ జింతింపవే । కరుణాలోకసుధాఝురిం దనుపవే కల్యాణసంధాయకా* (వ॥ అని సమనో
వల్లభి పలుకులాకర్ణించి ముహూర్తమాత్రంబు చింతించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాలకార్యంబు విచారించి కశ్యపబ్రహ్మ
యిట్లనియె* (మ॥ జనకుండెవ్వఁడు జాతుఁడెవ్వఁడు జనస్థానంబు లెచ్చోటు సంజననంబెయ్యది మేను లేకొలఁది సంసారంబు తే
రూపము న్విమమాయఁ తెయు విష్ణుమాయ దలఁపఁ వేతెమియుఁ లేదు మో । హనిబద్ధంబది మూలమింతటికి జాయా విన్నఁబో
నేఁటికిన్* (వ॥ అగునైనం గాలోచితకార్యంబు సెప్పెద* (మ॥ భగవంతుం బరము జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకుఁ న్జ
గదీశు న్హరి సేవ సేయుము తఁడున్సాంగత్యముం బొందిసీ । కగు నిష్టార్థము లెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి చేకూఱెడిన్ । న్భగవత్సేవలఁ
బొందరాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ॥ అనిన గృహస్థునకు గృహిణి యిట్లనియె* (క॥ నారాయణు బరమేశ్వరు । నేరీతిఁ దలం
తు మంత్రమెయ్యది విహితా । చారంబు లే ప్రకారము । లారాధనకాల మెద్దియానతియీవే* (వ॥ అనినం గశ్యపప్రజాపతి సతి
కిఁబయోభక్షణంబను వ్రతంబుపదేశించి తత్కాలంబును, దన్మంత్రంబును, దద్విధానంబును, దదుపవాస దానభోజనప్రకారం
బు లెఱింగించిన నదితియును ఫాల్గున మాసంబున శుక్లపక్షంబున బ్రథమదివసంబునం దొరఁకొని పండ్రెండు దినంబులు హరిస

మర్పణంబుగా వ్రతంబు సేసి వ్రతాంగంబునఁ యతనైయున్న యెడఁ జతుర్బాహుండును, పీతవాసుండును, శంఖచక్రగదా ధరుండునై నేత్రంబులకు గోచరుండై నారాయణదేవుండు ప్రత్యక్షుండై నంగనుం గాంచి *(క॥ కన్నులసంతోషాశ్రులు। చన్నులపైఁ బడఁ బులకజాలము లెసఁగ। నన్నన్ను తులు సన్నుతులును। మున్నతమతిఁ జేసె నిటలయుక్తాంజలియై* (క॥ చూపుల శ్రీపతి రూపము। నాపోవక ద్రావి ద్రావి హర్షోద్ధతయై। వాపుచ్చి మందమధురా। లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్* (సీ॥ యజ్ఞేశ విశ్వంభ రాచ్యుత శ్రవణమంగళ నామధేయ లోకస్వరూప। యాపన్న భక్తజనార్తి విఖండన దీనలోకాధార తీర్థపాద। విశ్వోద్భవ స్థితి విలయ కారణభూత సంతతానంద శశ్వద్విలాస। యాయువు దేహంబు ననుపమ లక్ష్మియు వసుధయు దివము ద్రివర్గములును। వైదిక జ్ఞానయుక్తియు వైరిజయము। నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁగలదె। వినుతమందార గుణహార వేదసార। ప్రణుతవత్సల పక్షాత్తు పరమపురుష *(గీ॥ అసురవరులు సురలనదలించి బెదరించి। నాకమేలుచున్నవాఁడనుండి। కన్నకడుపు గాన గంటఁ గూరుకు రాదు। కడుపుపాకు మాన్పఁ గావుమయ్య* (వ॥ అని వినిదరహసితవదనుండగు నాశ్రిత కామధేనువైన యప్పరమేశ్వరుం డిట్లనియె *(శా॥ నీ కోడండ్రకు నీకుమారవరులు న్నీనాథుఁడు న్నీవును। శ్లోకింపన్సుతులున్సతుల్ముఖులసంతోషింపరా త్రింవరు। లోకింపన్ఘవదీయగర్భమునఁ దేజోమూర్తి జన్మించెద। న్నాకు న్నే డుకఫుట్టు నీసుతుఁడనై వర్తించి నర్తింపఁగాన్ *(మ॥ బలిమిన్ దైత్యుల జంపరాదు వినయోపాయంబులంగాని సంచలనంబొందరు నేను నీ నియతికిన్ సంతృప్తికిన్మెచ్చితిన్ బలివిద్వేషుఁడు నా నిలింపగణముం బౌలోమియున్మెచ్చఁగాన్। దైత్యుల రాజ్యంబు హరింతు నింద్రునికి నిత్తున్ దుఃఖమిం కేటికిన్ *(క॥ నీరమణుని సేవింపుము। నారూపము మానసించి నలినీ గర్భా। గారంబు వచ్చి చొచ్చెద। గారవమునఁ బెంపు మక్కరుణ నన్నున్ *(క॥ పలింతు దివము సురలను। బాలింతు మహేంద్రయువతి భాగ్యశ్రీలన్। దూలింతు దానవులని ర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్ *(వ॥ అని యిట్లు భక్తజనపరతంత్రుండగు పురాణపురుషుండానతిచ్చి తిరోహితుండయ్యె నయ్యదితియుఁ గృతకృత్యయై సంతోషంబున నననిపోల్ల భుండగు కశ్యపు నాశ్రయించి సేవించుచుండె నంత నొక్కదినంబున * (గీ॥ ఘనసమాధినుండి కశ్యపుఁడచ్యుతునంశమాత్మనా లయ న దితియందుఁ। దనదువీర్యమధికతరము సేర్చె ను గాలి। శిఖిని దారువందుఁ జేర్చినట్లు *(వ॥ ఇట్లు కశ్యపచిరతరతపస్సంభృత వీర్యప్రతిష్ఠితగర్భయై సురలతల్లి యుల్లంబున నుల్లసిల్లుచునుండె నంత*(క॥ చలచంచలనై పిదపదనై। గలలంబై కరుఁడు గట్టిగళనాళముతో। నలమేర్పడి గర్భంబై। నెలమవలం జీరచి కెక్క నెలతకు నదితిక్* (క॥ నెలతకు చూలై నెల రెం। న్నెలలై మూఁడు నాల్గు నెలలై వరుసన్। నెలలంతకంత కెక్కఁగ నెలలు నుడగ్గరియె నసురనిర్మూలతకున్ *(క॥ మహితతరతేఃపుమాలా। విహితాయుత చండభాను బింబప్రభతో। విహితాంగంబులఁ గశ్యపు। గృహిణీగర్భమున శిశువు క్రీడించె నృపా*(క॥ తనకడుపున నొకవెరవున। వనరుహ గర్భాండ భాండవనధిచయంబు। ల్లోనకొని జగములు నిడుకొని। తనుగతిఁ గడుమడఁగి మునిఁగి తనరెకు బెడగై *(వ॥ అంతనకాలంతాతిలకంబు క్రమక్రమంబున *(మ॥ నిలిపె న్నెప్పలబృందిమన్విశదము ల్నేత్రంబులుం జూచుకంబులనా కాళిమమేఖలం ద్రఢిమను న్మోముస్సుధాపాండిమం। బ్బలిమింజన్నుల శ్రోణిపాళిగరిమన్మధ్యంబు నంబృంహిమ। న్నలితాత్మన్లఘిమన్మహామహిమ మేనన్గర్భము ర్వాగమై *(క॥ పెట్టుమరుమదుట భూతిని। బొట్టిడుమరు మేనఁ బట్టు పుట్టముదోయి। న్నెట్టుకరు వేల్పుటమ్మకుఁ గట్టుమరోగ రత్నుపడఁతి గర్భంబునకున్ ॥ ఇవ్విధంబున* (గీ॥ విశ్వగర్భుఁడు దన గర్భవివరమందుఁ। బూటపూటకుఁ బూర్ణుఁడై పొటకరింప। వ్రేకఁ జూలాలితనమున వేల్పుపెద్ద। పొలఁతికంతటనీశ్వాడు ప్రొద్దులయ్యె *(వ॥ తదనంతరంబునం జతురాననుండరుగుదెంచి యదితిగర్భపరిభ్రమ విభ్రముండగు నప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె *(సీ॥ త్రిభువనమయరూప దేవ త్రివిక్రమా పృథులాత్మ శిపివిష్ట పృశ్నిగర్భ। ప్రీత త్రిణాభ త్రిపృష్ఠ జగంబులకాద్యంత మధ్యంబులగ యనీవ। జంగమస్థావరజననాదిహేతువు। నీవ కాలంబవై నిఖిలమాత్మ। లోపలధరియింతు లోనిజంతులనెల్ల స్రోతంబులోఁ గొని సుందరతను। బ్రహ్మలకు నెల్లసంభవభవనమీవ। దివమునకుఁ బాసి దుర్దశదిక్కులేక। శోకవారిధి మునిఁగిన సురల నెల్ల। దెలియ నాధారమగుచున్న తెప్పవీవ *(క॥ విచ్చేయుమదితిగర్భము। చెచ్చెఱ వెలువడు మహాత్మ చిరకాలంబు। న్విచ్చలవిడి లేకమరులు। ముచ్చటపడియున్నవారు ముదమందింపన్ *(వ॥ అని యిట్లు కమలసంభవుండు వినుతి సేయ నయ్యవసరంబున

—* వామనమూర్త్యవిర్భావఘట్టము. *—

*(మ॥ రవిమధ్యాహ్నమునం జరింపగ్రహతారాబద్ధచంద్రస్థితిన్। శ్రవణద్వాదశినాఁడు శ్రోణనభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్। భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్। దివిజాధీశ్వరమాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్ *(వ॥ మఱియు నద్దేవుండు శంఖచక్రగదాకమలకలితచతుర్భుజుండును, పిశంగవస్త్రుండును, మకరకుండలమండితగండభాగుండును, శ్రీవత్సవక్షుండును, నళినచక్షుండును, నిరంతర శ్రీవిరాజిత రోలంబ కదంబ బింబిత వనమాలికా పరిష్కృతుండును, కనక కంకణ కాంచీవలయాంగద నూపురాలంకృతుండు, కమనీయ కంఠ కౌస్తుభాభరణుండును, నఖ

లజనము నోహారుండునై యవతరించిన సమయంబున* (శా॥ చింతంబాసిరి యక్షతార్క్ష్య సుమనస్సిద్ధోరగాధీశ్వరుల్ సంతో
షించిరి సాధ్య చారణమునీశ బ్రహ్మవిద్యాధరు। ల్కాంతిం జెందిరి భానుచంద్రములు రంగద్గీత వాద్యంబులన్ దంతులై వ్రేచిరి మింటఁ
గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్* (క॥ దిక్కుల కాపిరివాసెను। నెక్కువ తనువలు లేక నేడుపయోధుల్। నిక్కి మయిలి
చే ధరణియుఁ। జుక్కలు త్రోవయును విప్రసుర సేవ్యంబై* (క॥ ముంపుగొని విమలవానలు। జొంపంబులు గురియ సురలు సుమనో
వాధువు। ల్లుంపర లెగయఁ బరాగపు। రొంపుల భూభాగమతని యాపితమయ్యెన్ ॥ తదనంతరంబున (గీ॥ ఈ మహానుభావుఁ డెట్ల
క్రోయీ కాల। ముదరవాసమున నిలిచియుండెననుచు। నదితి వేఁడుకపడి యెవానందభయశబ్ద। ములను గశ్యపుండు మొగిననుతించె*
(వ॥ అంతనవ్విభుండు సాయుధసాలంకారంబగు తన దివ్యరూపంబును జగ్గించి రూపాంతరం బంగీకరించి కపటవటుని చందంబున
నుపనయన వయస్కుండై బాలకుండు తల్లి ముందర నమ్మచి తాలాపంబులాడుచుఁ గ్రీడించు సమయంబున నదితియుం దనయుని
లోకన పరిణత పారవశ్యంబున* (గీ॥ నన్నుఁ గన్న తండ్రి నా పాలి దైవమ। నాతపఃఫలంబ నా కుమార। నాదు చిన్ని వడుగ నా కు
లదీపక। రాఁగదయ్య భాగ్యరాశివగుచు* (క॥ అన్నా డగ్గరి రమ్మని। చన్నులఁ బాలేఱువాఱ నాశ్లేషిణియై। చిన్నారి మొగము నివు
రుచు। గన్నారంజూచె గన్నకడుపై యుండఁగన్* (క॥ పురుఁడింబోఁటికి నందిర। పుగుడంబిక గాక యొరులు పుగుడేయనుచున్। బు
రుటాలికి పదిదినములు పురుఁడు ప్రవర్తించి రెలమి పుణ్యపురంధ్రుల్* (వ॥ అంతన బ్బాలకునకు సంస్కారంబు నమహర్షులు కశ్యపప్ర
జాపతిం బురస్కరించుకొని సముచితోపనయనకర్మకలాపంబులు సేయించిరి సవితసావిత్రి నుపదేశించె బృహస్పతి యజ్ఞోపవీ
తంబును, గశ్యపుండు ముంజియు, గోపీనంబు దితియు, ధరణి కృష్ణాజినంబును, దండంబు సోముండును, గగనాధిష్ఠాన దేవత ఛ
త్రంబును, గమండలంబు బ్రహ్మయు సరస్వతి యక్షమాలికయు, సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి। ఆతియును* (క॥ భిక్షాపాత్రి
కనిచ్చెను। యక్షేశుఁడు వామనునకు నక్షయమనుచు। న్నాతుళోత్కరించి పెట్టెను। భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా* (క॥
శిక్షణ బ్రహ్మర్షిసమా। రాధ్యుండై విహితమంత్రరాజీఁ జదువుచు। న్నిద్ధంబగు ననలంబున। వృద్ధాచారమున వటుఁడు వ్రేల్చెం గడి

❀ బలిచక్రవర్తికడకు వామనమూర్తి యేతెంచుట. ❀

మిన్* (వ॥ ఇట్లు కృతకృత్యుండై మాయామాణవకుండు దేశాంతర సమాగతులగు బ్రాహ్మణులఁ గొందఱనవలోకించి యిట్లని
యె* (క॥ వత్తురె విప్రులు వేడన్। న్నిత్తురె దాతలును రేకుమిఁక నిష్టార్థములుం। దెత్తురె మీరును సంపద। లిత్తెఱఁగున దానవీరుఁ డెవ్వఁ
డొ సెప్పుఁడా* (వ॥ అనిన నఖిలదేశీయులగు భూసురులిట్లనిరి* (మ॥ కలరే దాతృవరుల్వె సన్నదనములుం గామ్యార్థముల్ గోంచు వి
ప్రులు నేతెంతురు గాని యీ విధిని బలి నోర్చల్ వదాన్యుండు లేఁ। డనఘుండై యొనరించు నశ్వరశతం బా భార్గవానుజ్ఞతో। బలి వే
డ్కబడయంగవచ్చు బహుసంపల్లాభముల్వాననా* (వ॥ అని తెలియంజెప్పిన బ్రాహ్మణుల వచనంబు లాలకించి బోంబలకుం బ్రీ
తిపుట్టింపంబయనంబై లాభవచనంబులు గైకొని తల్లితండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదలె* (క॥ ప్రక్షీణదివిజవల్లి
భ। నదయాపరతంత్రుఁడగుచు రాజీవాక్షుం। డక్షీణమున బలియింటికి। భిక్షాగమనంబు సేసెఁ బేదరికము తోన్* (క॥ హరిహరి సి
రియురమునఁ గల। హరిహరి హాయికొ అకుదనుజునడుగం జనియె। న్సరహిత రత గతియుక్తులకు। దొరలకునను గుటయు నొడలి
తొడవులు పుడమిన్* (క॥ సర్వప్రపంచగురుభర। నిర్వాహకుఁడగుటఁ జేసి నేలఁ జనుచేర। న్నుర్వుని వేగునసహింపక। నుర్విస్థలి
క్రుంగెఁ బ్రాగ్గనురగేంద్రుండున్ ॥ ఇట్లు చనిచని* (క॥ శర్మదయమునండధృత। వర్మదనతికరిని ముక్తివనితాచేష్టో। మర్మదనంబు
నివారితి। దుర్మదనర్మదదరించెద్రోవన్వటుఁడున్ ॥ దాటి తత్ప్రవాహంబునకు నుత్తరతటంబునందు* (శా॥ చండస్ఫూర్తి వ
టుండుగాంచె బహుధాజల్పన్నిశాటంబును గ్దండాహూతమునీభ్య బిభ్యదమృతాంధస్సిద్ధకూటంబు వే। దండాశ్వధ్వజినీక
వాటము ను హోత్రధ్యక్ష్మామపంథన్న మా। ర్తాండ స్యందన ఘోటముస్బలి మఖాత్కత్వేదికావాటమున్* (వ॥ కని దానవేంద్రు
నిహయమేధవాటిక దాటి దరియం జొచ్చునయ్యవసరంబున* (శా॥ శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వ
హ్నియో। దంభాకారత వచ్చెగాక ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁడీ। శుంభద్ద్యోతనుఁడీ నోజ్ఞాతమునుఁడంచు స్వస్మయభ్రాం
తులై। సభాంపించిరి బ్రహ్మచారిగనితత్సభ్యుల్ మహస్యంబునన్* (క॥ గుజగుజలు వోవువారును। గజిబిజిఁబడువారుచాలఁ గల
కలపడుమన్। గజిబిజిమైరి సభాస్థలిఁ। బ్రజలెల్లను బొట్టివడుగు పావనిరాకన్ ॥ ఆ సమయంబున బలిసభామంటపంబుఁ వటు
యుం జొచ్చి* (సీ॥ చవులుగాఁ జెవులకు సామగానంబులు సదివెడు హోతల చదువు వినుచు। మంత్రతంత్రార్థసంబంధభా
వంబులఁగొని యాడు యాజులఁ గూడికొనుచు। హోమకుండంబులందున్న త్రేతాగ్నుల వెలిగించు యాజకవితతిఁ గనుచు
దక్షులై బహువిధాధ్వరవిధానంబులు సెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచుఁ। బెట్టుగో రెడు వేడుకపట్టువఱుప। నదితి పుట్టువు లచ్చికి
వాటపట్టు। గోరి చరియించె సభలోనఁ గొంతతడవు। పుట్టువెన్నడు నెఱుఁగని పొట్టివడుగు ॥ మఱియును* (క॥ వెలుచుచు వంగు
చు ద్రావలుచు। నటి మెటిసుబురుకుఁ జనుచు హరిహరి యనుచు న్మఱుగుచునులుకుచు దిఱదిఱ। గుఱుమాపట్టపుపొట్టివడుగుకొం

నిన్నుఁ ద్రిభువనేశుఁడవనుచున్। నిన్నదినంబులనుండియు। నెన్నఁడు నినుఁ బెట్టుకొనుచు నింద్రము సేయన్॥ (గీ॥ ఒంటివాఁడ
నాకు నొకటి రెండడుగుల మేర యిమ్ము సొమ్ము మేరనొల్ల। కోరెదీర బ్రహ్మకూఁకటి ముట్టెడు దానకుతుకసాంద్ర దానవేం
ద్ర॥ అనినం బరమయాచకునకు నెలవాతమిట్లనియె॥ (గీ॥ ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ। సత్యగతుల వృద్ధసమ్మతంబు। లడు
గఁ దలఁచికొంచ మడిగితివో చెల్ల। దాత పెంపుసొంపుఁ దలఁపవలదె॥ (మ॥ వసుధాఖండము వేఁడితో గజములన్ వాంఛించితో వాజు
ల। న్వ్యసనమూహించితో కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో। పసిబాలుండవు నేరవీవడుగ నీ భాగ్యంబు లీపాటి గా। కసు
రేంద్రుండుపదత్రయంబడుగఁ దానీయల్పమీ నేర్చునే॥ అని మొగంబునం జిఱునవ్వు మొలకలెత్తఁ గృపామేధికి మేధావి యిట్లని
యె॥ (మ॥ గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో। వడుగే నెక్కడ భూములెక్కడ కరుల్ వామాక్షుల
శ్వంబులెక్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదాకాంక్షామితంబైన మూఁ। డడుగుల్ మేరయ త్రోయకిచ్చుటయె బ్రహ్మాండంబు నా
పాలికిన్॥ అదియునుం గాక॥ (క॥ వ్యాప్తింబొందక వగవక। ప్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచున్। తృప్తిం జెందని మనుజుఁడు। స
ప్తద్వీపములనైన చక్కంబడునే॥ (శా॥ ఆశాపాశము దాఁ గడున్నిడుపు లేదంతంబు రాజేంద్ర నా। రాశిప్రావృతమేదినీవల
యసామ్రాజ్యంబుఁ జేకూరియున్। గాసింబొందిరి గాక వైన్యగయభూకాంతాదులున్నర్థకా। మాశన్ బాయఁగ నేర్చిరే మును ని
జాశాంతంబులం జూచిరే॥ (సీ॥ సంతుష్టుఁ డీమూఁడు జగములఁ బూజ్యుండు సంతోషి కెప్పుడు జఱుగు సుఖము। సంతుష్టి గాకున్న
సంసారహేతువు సంతసంబున ముక్తి సతియు దొరకు। బూటపూటకు జగంబున యదృచ్ఛాలాభ తుష్టిని దేజంబు తనరుఁ బె
రుఁగు। బరితోషహీనతఁ బ్రభ చెడిపోవును జలధారననలంబు సమయునట్లు। నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట। తగవు గాదు నా
కుఁ దగినకొలఁది। మేను వేఁడికొన్న యీపదత్రయమును చాలదన యిమ్ము చాలుఁ జాలు॥ (వ॥ అని యిట్లు పలుకుచున్న ఋష్యునకు
నుర్వీశ్వరుండుర్వీదానంబు సేయం దలంచి కరకలితసలిలకమండలుండైన వితరణగుణముఖరుం గని నిజవిచారయుక్తదనుజ
రాజ్యచక్రుండగు శుక్రుఁ డిట్లనియె॥ (సీ॥ దనుజేంద్ర యీతఁడు ధరణీసురుఁడు గాఁడు దేవకార్యంబు సాధించుకొఱకు। హరివి
ష్ణుఁ డవ్యయుండదితిగర్భంబున గశ్యపసూనుఁడై కలిగెఁ గటా। యెఱుఁగవీతని కోర్కెనిచ్చెదనంటివి దైత్యసంతతికుపద్రవము వ
చ్చు। నీలక్ష్మి తేజంబు నెలవు నైశ్వర్యంబు వంచించి యిచ్చును వాసవునకు। మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల। నఖిల కా
యుఁడగుచు నాక్రమించు। సర్వధనము విష్ణుసంతర్పణము సేసి। బడుగుపగిది నెట్లు బ్రదికెదీవు॥ (క॥ ఒక్కపదంబున భూమి
యు నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి యున్నతమూర్తిన్। దిక్కుల గగనము దానై। వెక్కసమై యున్న నెట్లు వెడలెదు చెపుమా॥
(సీ॥ ఇచ్చెదననిపలికి యీకున్న నరకంబు ప్రాపవు నీవు సమర్థుఁడవె దేవ। యేదానమున నాశమే తెంచునది యును దానంబు గా
దండ్రు తత్త్వవిదులు। దానంబు యజ్ఞంబు తపము కర్మమ్ములు దావిత్తవంతుఁడై తలఁపవలయుఁ। దనయింటఁగల సర్వధనమెల్ల నై
దు భాగములుగా విభజించి తానుమనకు। నర్థములకు ధర్మ యశములకాశ్రిత। బృందములకుఁ బమతఁ బెట్టునట్టి। పురుషుఁడిందు
నంబుఁ బూర్ణుఁడై మోదించుఁ। దన్నుమాని సేతఁ దగవు గాదు॥ (వ॥ అదియునుం గాక యీయర్థంబునకు బహువిధంగి బహ్వృచగీ
తార్థంబు గలదొక్కటి సావధానుండవై యాకర్ణింపుము॥ (సీ॥ అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో నన్నృతంబు గాదు లేదనిన నధిప।
యాత్మవృక్షము మూలమనృతంబు నిశ్చయ మాత్మ మూలముగల్గ నాత్మ చెడదు। పుష్పఫలంబాత్మభూజంబునకు సత్యమా ప్రా
ణ బ్రతుకమినదియుఁ జెడదు। ఫలపుష్పములు లేకపస చెడి వృక్షంబు మూలంబుతో వృద్ధిఁబొందుఁ గాదె। చేఁటుకొఁటఁ దయాలఘి
మాయుఁ జెందకుండ నిచ్చుపురుషుండు చెడకుండు సిద్ధచరిత। గాక యుచితసత్యసంగతి నటంచు। నిజధనంబర్థికిచ్చిన నీకు లేదు॥
(గీ॥ సర్వమయినచోట పర్వధనంబులు నడుగ లేదటంచు నన్నృతమాడు। చెనఁటిపంద నేమి చెప్పఁ బ్రాణముతోడ। శవము వాఁడు
వానిజన్మమేల॥ మఱియు నొక్కవిశేషంబుగలదు వివరించెద॥ (గీ॥ వారిజాక్షులందు వైవాహికములందుఁ। బ్రాణవిత్తమాన
భంగమందుఁ జకితగోకులాగ్రజన్మరక్షణమునందుఁ। బొంకవచ్చునఘము పొందదధిప॥ (మ॥ కులము న్రాజ్యముఁ దేజమున్నిలు
పుమీ కుబ్జుండు విశ్వంభరుండు। తలఁ తింబోడు త్రివిక్రమస్ఫురణవాఁడై నిండు బ్రహ్మాండమున్। గలఁడే మానవునొకండు నాపలుకు
లాకర్ణింపు కర్ణంబులన్। వలదీదానము గీనముం బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా॥ (వ॥ అని యిట్లు హితంబు పలుకుచు
న్నకులాచార్యునకుఁ క్షణమాత్ర నిమీలితలోచనుండై యశస్వి యిట్లనియె॥ (సీ॥ నిజమానతిచ్చితి నీవు మహాత్మక మహనిగృహ
స్థధర్మంబు నిదియ। యర్థంబు గామంబు యశమును వృత్తియు నెయ్యది ప్రార్థింప నిత్తునన యు। నర్థలోభంబున నర్థిఁ బొమ్మనుటె
ట్లు పలికి లేదనుకంటెఁ బాపమెద్ది। యెట్టిమనుష్యుని యేభరించెదఁగాని సత్యహీనుని మోవఁజాలననుచుఁ। బలుకదే తొల్లి భూ
దేవి బ్రహ్మతోడ। సమరమున నుండి తిరుగకఁ జచ్చుకంటెఁ। బలికి బొంకక నిజమునఁ బఱఁగుకంటె। మానధనులకు భద్రంబు మ
ఱియుఁ గలదె॥ (క॥ ధాత్రీపాలికునకు సస్య। క్షేత్రము బీజములు లెస్సఁ జేకొను భంగిం। జిత్రంబుగ రాజునకును। బ్రోతము సమ
కూడునట్టి భాగ్యము గలదె॥ (శా॥ కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే। వారేరీ సిరి మూటఁ గట్టుకొని పోవం

జాలిరే భూమిపైఁ, బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్యశఃకాములై । యీరే కోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా ✽ (క॥ ఉడుగక క్రతువుల వ్రతములఁ బొడగనఁ జననట్టి పొడవు పొడవుం గనుఁ బై । యడిగెడి నటనను బోఁటిని యడరాదె మహానుభావ యిట్టి ప్రార్థంబుల్ ✽ (శా॥ ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ । బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమర్యాదం జెందు కరంబు గ్రిం దగుట మీఁదై నాకరం బుంట మేల్ । గాదే రాజ్యముఁ గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే ✽ (మ॥ నిరయంబైన నిబద్ధమైన ధరణీనిర్మూలనంబైన దుర్మరణంబైనఁ గులాంతమైన నిజముం గాసమ్ము కానిమ్ము పో । హరి యైనన్ హరుఁడైన నీరజభవుండభ్యాగతుండైన నౌఁ । దిరుగన్నేరదు నాదు జిహ్వ విను మాధీవర్య వేయేటికిన్ ✽ (గీ॥ వాఁడి విసంశవట్టును నలక యిచ్చుచో । నేలకట్టు పట్టుఁ డేటిమాట । గట్టెనేని దానకరుణించి విడుచును । విడువకుండె నమ్ము విమలచరిత ✽ (క॥ మేరువు తలక్రిందైనను । బారావారంబు లింకఁ బాఱిన లోలో । ధారుణి రజమై పోయినఁ । దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్ ✽ (మ॥ త్రిజగత్కోకల॥ ఎన్నఁడుం బను వేఁడఁ బోఁడట యేకలంబుఁ టకన్న వా । రన్నదమ్ములు నైన నేరఁట ... న్నిద్యులమూలగో । ష్ఠి న్నెఱింగిన ప్రోడ గుజ్జట చేతులొగ్గి వసింపనీ । దిన్ని పాఁపని ద్రోచి పుచ్చఁగఁ జిత్తమొల్లదు సత్తమా ✽ (వ॥ అని యిట్లు సత్యవదవ్రిప్రమాణతత్పరుండును, పితృగణకుతూహలసత్వరుండును, విమలయశస్కుండును, దృఢమనస్కుండును, నియతసత్యసంధుండును, నర్థిజనకమలబంధుండు నైన బలింజూచి శుక్రుండు కోపించి మదీయశాసనం బతిక్రమించుటం జేసి శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శపియించిన బలియును గురుశాపతప్తుండయ్యును మహావ్రతమార్గంబున కభిముఖుండై యుండె నప్పుడు ✽ (గీ॥ బ్రతుకవచ్చుఁగాక బహుబంధనములైన । వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక । జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక । మాటఁ దిఱుఁగలేరు మానధనులు ✽ అనునయ్యవసరంబున ✽ (గీ॥ దనుజలోకనాథు దయితవింధ్యావళి । రాజవదన మదమరాళగమన । పటుని కాళ్ళుగడుగ వరహేమ కలశమున । జలముఁ దెచ్చె భర్తసన్న నెఱిఁగి ✽ (వ॥ అయ్యవసరంబునఁ గపటవటునకుఁ దద్దానవేంద్రుం డిట్లనియె ✽ (క॥ రమ్మా మాణవకోత్తమ । లెమ్మా నీవాంఛితంబు లేదనకిత్తుం । దెమ్మా యడుగులనిటు రా । నిమ్మా కడుగంగవలయు నేటికిఁ దడయన్ ✽ (మ॥ బలిదైత్యేంద్రకరద్వయీకృతజలప్రక్షాళనవ్యాప్తికి । న్జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమనస్సంప్రార్థితశ్రీదమున్ । గలితానమ్రసురమాటలాటపదవీకస్తూరికాశాదము । న్నలినామోదము రత్ననూపురితనానావేదమున్ బాదమున్ ✽ (క॥ పరలోకసముద్ధరణము । నిరతశ్రీకరణమఖిలనిగమాంతాలం । కరణము భవసంహరణము । హరిచరణముఁ నీటఁ గడిగె నసురోత్తముఁడున్ ✽ (వ॥ ఇట్లు ధరణీసురదక్షిణచరణప్రక్షాళనంబు సేసి వామపాదంబు గడిగి తత్పావనజలంబులు శిరంబున నంజల్లుకొని దేశకాలాదిపరిగణనంబు సేసి ✽ (శా॥ విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వేదప్రామాణ్యవిదే త్రిపాదధరణిం దాస్యామి యంచుం గ్రియా । క్షిప్తుండై దనుజేశ్వరుండు వడుసుం జేజాచి పూజించి బ్రహ్మప్రీతం బని ధారవోసె భువనంబాశ్చర్యముం బొందఁగన్ ✽ తత్కాలంబున ✽ (గీ॥ § నీరధారఁ బడకనీక నయ్యెడఁ గంటఁ । గలశరంధ్రమావఁ గాను దెలిసి । హరియుఁ గావ్యనేత్రమటు కుశాగ్రంబున । నడవ నొకటి నేత్రుఁడయ్యెనతఁడు ✽ అంత ✽ (ఉ॥ అమరారాతికరోక్షితోజ్ఝితపవిత్రాంభఃకణశ్రేణికిం । గమలాధీశ్వరుఁ డొడ్డి ఖండితదివౌకస్స్వామివిన్యస్తముం । గమలాకర్షణసుప్రశస్తము రమాకాంతాకుచోపాస్తమున్ । విమలశ్రీకుచశాతచూచుకతటీవిన్యస్తమున్ హస్తమున్ ✽ (క॥ మునిజననియమాధారను । జనితాసురపతిపునేత్రజలకణధారన్ । దనుజేంద్రనీరధారను । వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్ ✽ (గీ॥ కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు । లెఱిఁగి శుక్రుమాట లెఱిఁగి నాశ । మెఱిఁగి పాత్రమనుచు నిచ్చె దానము బలి । మహిఁ వదాన్యుఁ డొకఁడు మఱియుఁ గలఁడె ✽ (క॥ క్షితిదానమిచ్చునతఁడును । నతికాంక్షఁ బరిగ్రహించునతఁడును మఱి త । చ్చ్యుతులై శతవత్సరములు । శతమఖలోకమునఁ గ్రీడసలుపుదు రెలమిన్ ✽ (వ॥ అట్లుగావున నేదానంబును భూదానంబునకు సదృశంబుగా నేరదు కావున వసుంధరాదానం బిచ్చితి పుభయలోకంబులం గీర్తిసుకృతంబులు వడయుమని పలికి యమ్మాయావటుం డిట్లనియె ✽ (క॥ ఇది యేమి వేఁడితనినీ । మదిఁ బగవక ధారఁబోయుమా సజ్జనుఁ జెం । పొదవఁగఁ గోరికె యర్థం । బిదియిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్ ✽ (వ॥ అని పలికిన పలుకులకు హర్షనిర్భరచేతస్కుండై వైరోచనుండు ✽ (గీ॥ పుట్టి నేర్చుకొనెనో పుట్టక నేర్చెనో । చిట్టిబుద్ధులిట్టిపొట్టి వడుగు । పొట్టనున్న వెల్ల భూములు ననినవ్వి । యెలమి ధరణిదానమిచ్చె నతఁడు ✽ (క॥ బలి చేసిన దానమునకు । నలినాక్షుఁడు విలభూతనాయకుఁ డనుటం । గలకలనై దశదిక్కులు । భళిభళియని పొగఁడె భూతపంచకమనఘా ✽ (గీ॥ గ్రహమునీంద్రసిద్ధగంధర్వకిన్నర । యక్షపక్షిదేవతాహిపతులు । పొగడి రతని పెంపుఁ బుష్పవర్షంబులు । గురిసె దేవతూర్యకోటి మొరసె ॥ ఇట్లు ధారాపరిగ్రహంబుఁ జేసి ✽

✽ వామనమూర్తి విశ్వరూపంబు నొందివిజృంభించుట. ✽

(శా॥ ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై । నంతై తోయదమండలాగ్రమునకల్లంతై

§ ఈపద్యము ప్రక్షిప్తము.

ప్రభారాశిపై। సంతైచంద్రుని కంతరమై ధ్రువునిపైఁ దంతై మహర్వాటిపై। నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై* (మ॥ రవిబింబంబుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై। శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణకే యూరమై। ఛవి తత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర। ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్నిండుచోన్* (వ॥ ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరియించి నభంబును, దివంబును, భువనంబును, దిశలును, సముద్రంబులును, జలచరాచల సకలభూతనివహంబులుం దానయై యేకీభవించి క్రమాక్రమంబున భూలోకంబు నతిక్రమించి భువర్లోకంబు నతిక్రమించి సువర్లోకంబును దలకడచి మహర్లోకంబుఁ దాఁటి జనోలోకంబునకు మీఁదై తపంబునకు నుచ్ఛ్రయంబై సత్యలోకంబుకంటె నౌన్నత్యంబు వహించి యెడలిన ములు సంధులు రంధ్రంబులు లేకుండ నిండి మహాదేహవిహారుండై చరణతలంబున రసాతలంబును, పాదంబుల మహియును, జంఘల మహీధ్రంబులును, జానువులం బతత్రిసముదయంబులును, నూరువుల నింద్రసేన మరుద్గణంబులును, సంధ్యాంబున సంధ్యయు, వసనంబున నింద్రుడును, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబున నసురులును, నాభి నభంబును, నుదరంబున నుదధిసప్తకంబును, నురంబున నక్షత్రకానీకంబును, నురోజంబుల ఋతుషట్కంబును, హృదయంబున ధర్మంబును, వక్షంబున నంగమలహస్తయగు లక్ష్మియుఁ, గంఠంబున వేదంబులును, భుజంబుల బురందరాది దేవతలును, కర్ణంబుల దిశలును, శిరంబున నాకంబును, శిరోజంబుల మేఘంబులును, నాసాపుటంబున వాయువులును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు, వాణి నఖిలఛందస్సముదయంబును, దృష్టంబున నధర్మంబును, రసనంబున జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రంబులును, లలాటంబునఁ గోపంబును, నధరంబున లోభంబును, స్పర్శంబున గామంబును, రేతంబున జలంబును, గ్రహణంబున యజ్ఞంబును, ఛాయవలన మృత్యువును, నగవువలన నానేకమాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, ప్రాణంబుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమస్థావరజంతుసంఘంబులును గలవాఁడై, జలధరనినదశంఖశార్ఙ్గసుదర్శనగదాదండ ఖడ్గాక్షయబాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కేయూర హార కంకణ కౌస్తుభ మణిమేఖలాంబర వనమాలికావిరాజితుండును, సునందనందజయవిజయ ప్రముఖ పరిచర వాహినీ సందోహ పరివృతుండును, నసమాన తేజోవిలసితుండును నై, బ్రహ్మాండంబు దనమేనికప్పు తెఱంగున నుండ విజృంభించి* (మ॥ ఒకపాదంబున భూమిఁగప్పె నటువేఱొంటన్ దివిరోధించి యొండొకటన్మీఁదిజగంబు లెల్లవడినొండొంటన్ విలంఘించి పై। ట్టక బ్రహ్మాండకటాహముం బగిలి వేంద్రంబై పరుల్గానరాకొక్కఁడై వార్ధ్యగలభ్యుఁడై హరివిభుం డొప్పారె విశ్వాకృతిన్* (గీ॥ ఒకపదంబు క్రింద నుర్వీపద్మము నంటికొనినపంకలవము కోవరుడాల్చె। నొకటిమీఁదివక్ష్మ కొదిగిన తేఁటి నా। వెలసె మిన్ను నృపతివిక్రమమున॥ తత్సమయంబున* (గీ॥ జగము లెల్ల దాఁటి చనిన త్రివిక్రము। చరణనఖరచంద్రచంద్రికలను। బొనరు వడిమె సత్యమున బ్రహ్మతేజంబు। దివసకరుని నుచులదివియుభంగి* (సీ॥ భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ గాపురంబులు సేయుఘనులు రాజు। లానారీచ్యాదులు నాపనందాదులు నాదివ్యయోగీంద్రులచట నెపుడు। మూర్తిమంతంబులై బ్రహ్మయుపురాణతర్కామ్నాయనియమేతిహాసధర్మ। సంహితాదులు గురుజ్ఞానాగ్నిసంర్దగ్ధకర్మలై మఱియును గలుగు నట్టి। వారలెల్ల జొచ్చి వచ్చి సర్వాధిపు। నంఘ్రిఁ జూచి మ్రొక్కి రధికభక్తిఁ। దమమనంబులంకఁ దలఁచు నిధానంబుఁ। గంటిమనుచు నేడు కంటిమనుచు* (సీ॥ తనపుట్టిల్ల దెపొమ్మటంచు నజుడుం దన్నాభిపంకేరుహం। బు నిరీక్షించిన టెంచి యున్నతపదంబుం జూచి తత్పాదసే। చనముం జేసెఁ గమండలోదకమునం జల్లింౘ తత్తోయము। ల్వియద్వీథిం బ్రవహించె జేవనదినా విశ్వాత్మకీర్తిప్రభన్॥ తత్సమయంబున* (సీ॥ యోగమార్గంబున నూహించి బహువిధపుష్పదానంబులఁ బూజఁ జేసి। దివ్యగంధంబులు దెచ్చి సమర్పించి ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి। భూరిలాజాక్షతంబులు సల్లి ఫలములు గానుకలిచ్చి రాగములఁ బొగడి। శంఖాదిరవములు జయఘోషములు సేసి కళత్రాంబునిధి త్రివిక్రమయటంచు। బ్రహ్మమొదలు లోకపాలురు గొనియాడి। రెల్లదిశలవెనచరేశ్వరుండు। జాంబవంతుఁ డెఱిఁగి చాటె భేరీధ్వని। వెలయఁ జేసె విష్ణువిజయమనుచు* (క॥ అన్నిజగంబులు దానై యున్నజగన్నాథుఁ జూచి యోగిభావింపం। గన్నందక మనమంటక। సన్నుతులం జేసి రపుడు సభ్యులు భళియన్* (వ॥ అంతనా య్యసుఁ బూర్వప్రకారంబున నున్నవామనుం గని పదత్రయవ్యాజంబుననితండు సకలమహీమండలంబు నాక్రమించెఁ గపటవటురూపధరోహితుండగు విష్ణుండని యెఱుంగక మనదానవేంద్రుండు సత్యసంధుండుగావున మాటఁదిరుగక యిచ్చె నతనివలన నేరంబు లేదీకుబ్జుం డప్రతిహతతేజఃప్రభావంబున నిజ్జగంబులం బరిగ్రహించి వాసవునకు నీయందలంచియున్న వాఁడీవటుని నింకూరి పాఱక నిర్జించుట కర్జంబని తర్జనంబులఁ గర్జనంబులు సేయుచు విప్రచిత్తి రాహు హేతిముఖ్యులగు రక్షసులుస్సు మిగిలి యుద్ధసన్నద్ధులై పరశుపట్టసభల్లాది సాధనంబులు ధరియించి కసిమసంగి ముసరికొని దశదిశలం బ్రసరించినం జూచి హరిపరిచరులగు సునంద నంద జయ జయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష

తార్క్ష్య పుష్పదంత విష్వక్సేనప్రముఖ దేవపార్షదులును దండనాథులయును వేదండ సమబలులై తమ తమ యూథంబుల నాయుధంబులతోఁ గూడికొని దానవానీకంబుల నంబరలోకంబున కనుపువారలై యుండ వారి లెదుర్కొని కదనంబునకుం బగవసంబు సేయుచున్నం గనుంగొని శుక్రుశాసనంబుఁ దలంచి దనుజవల్లభుం డిట్లనియె ✻ (సీ॥ రాక్షసోత్తములార రణము పోరాడక కాలంబు గాదిది కలహమునకు । సర్వభూతములకు సంపదాపదలకుఁ బ్రభువైన దైవంబు పరిభవింప । మన మోపునె మెత్తొల్లి మనకు రాజ్యంబును సురలకు నాశంబు హానిదిడ్డ । విపరీతముగఁ జేయు వేల్పునే నుండుము మన పాలి భాగ్యంబును హీనుగాక । వెఱచి పలుమారు బాఱెడి విష్ణుభటులు మిమ్ము గెలుచుట దైవంబు మేరగాదె । మనకు నెప్పుడు దైవంబు మందిదగును నాఁడు గెలుతము పగవారి నేఁడు వలదు అది యుండుం గాక ✻ (క॥ బలు దుర్గంబులు సచివులు బలములు మంత్రౌషధములు బహుశేముషియుం గలిగియు సామోపాయంబులు కాల మెఱింగిన్ని పుడు పోరుట యొప్పదు ✻ (వ॥ అట్లు గావున రణంబునకిప్పుడు శత్రుల మోహరించుట కార్యంబు గాదు మనకుం గుడు కాలంబున జయింతము వలదు కతలంగుండ ననఁ దలంగి భాగవత భటభీతులై దిక్కులకు దసుల రసాతలంబునకుం జని రప్పుడు హరి హృదయంబెఱింగి తార్క్ష్యనందనుండు యాగపుత్యాహంబున వారుణపాశలంబుల నసురవల్లభుని బంధించె నంత ✻ (క॥ బాహులు పదములుఁ గట్టిన శ్రీహరికిఁ గాక యేమి సేయుదు ననిసం । దేహింపక బలి నిలిచెను । హాహారవ మెసఁగె దశదిశాంతములందున్ ✻ (క॥ సంపద చెడియును దైన్యముఁ గంపంబును లేక తొంటికంటెను పెంపుం । దెంపును నెఱుకయు ధైర్యము నింపెసగ వైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్ ✻ (సీ॥ దానవ త్రిపదభూతలమిత్తునంటి ధరణిఁ జంద్రార్క్కు లెందాక నుండు నంత నాకు మిరియు నొక్క యడుగయ్యె నాకును స్వర్లోకము నొక్క చరణమయ్యె । నీ సొమ్ము సకలంబు నేఁడు రెండడుగులుగడమ పాదమునకుఁ గలదె భూమి । యిచ్చెద నన్నర్థమీక దురాత్ముండు నిరయంబు గొంటుట నిజముగాదె । కానదుర్గతికిఁ గొంత కాలమరుగు కాక యిచ్చెద వేని వేగంబు నాకు నిపుడు మూఁడవ పదమునకిమ్ము జూపు । బ్రాహ్మణాధీనములు ద్రోయ బ్రహ్మవశమె ✻ (వ॥ అని యిట్లు వామనుండు వలుక సత్యభంగ సందేహవిషదిగ్ధశల్యనికృత్తహృదయుండయ్యును భీతుండు గాక వైరోచని ప్రసన్నవదనంబుతోఁ జిన్నిప్రోడ వడుగున కిట్లనియె ✻ (గీ॥ సూనృతంబుగా సుడియదు నా జిహ్వ బొంకఁ జాల నాకు బొంకు లేదు నీతృతీయపదము నిజము నా శిరమున నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ ✻ (గీ॥ నిరయమునకు బ్రాప్తిఁ గ్రహంబునకును బదవిహీనతకును బంధమునకు నర్థభంగమునకు నఖిలదుఃఖమునకు వెఱవ దేవ బొంక వెఱచినట్లు॥ అదియును గాక ✻ (సీ॥ తల్లిదండ్రులున్న దమ్ములు చెలికాండ్రు గురువులు శిక్షింపఁగా నతఁ వడునె । పిదప మేలగుఁ గాక పృథుసుదాంధులకును దానవులకు మాకుఁ దతీ మెఱింగి విస్రంభచక్షువు ల్వేలయని చ్చుటఁ జేసి గురువులలో నాదిగురువ వీవ । నీవు బంధించిన నిగ్రహమో లజ్జయో నష్టియో బాధయో తలంప నిన్ను నెవ్వరిం దపోరాడి గజ్జగారు లాది యోగీంద్రులం దెదునట్టి లెంక । నంద రేతొల్లి పెక్కండ్రు హర్షమూర్తి వైరి భక్తులు గట్టిగా వలయు గాక యీశ నీ మొడ దుర్లభమేమి కలదు ✻ (మ॥ చెలియే మృత్యువు చుట్టమే యముఁడు సంసేవార్థులే కింకరుల్ బలంజేసె నే బ్రహ్మదన్నదృఢమే జీవంబు నో చెల్లరే । చలితంబౌట నెఱుంగరే కపటసంసారంబు నిక్కంబుగా దలచు నాథుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁడై ✻ (సీ॥ చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు కాంతలు సంసారకారణములు । ధనములస్థిరములు దనువతి ఫలనంబు కార్యార్థులన్యులు గడచుఁ గాలు । మాయువ్యమైశ్వర్యమతిశీఘ్రమని కాదె యసఘుండు దనుతండ్రి ధిక్కరించె । మా తాత సాధుసమ్ముఖుఁడు ప్రహ్లాదుండు నీ పాదకమలములను యతి జేరె । భ్రమఁ దతనికి మృతి లేని బ్రతుకు గలిగె । వైరులై తొల్లి మా వారు గాన రక్తిఁవై వచ్చి నీవు నన్నడుగుటెల్లఁ । బద్మలోచన నా పుణ్యఫలము గాదె ॥ అని యిట్లు పలుకుచున్న యవసరంబున ✻ (శా॥ ఆదైత్యేంద్రుఁడు పీనవక్షునవపద్మాక్షు న్బిశంగాంబరాచ్ఛాదు న్నిర్మలసాధువాదుఘనసంసారాదిపచ్ఛేదు సంప్రీతున్ సత్కిల తాతి రోహితహరి శ్రీపాదు నిఃఖేదుఁ బ్ర । హ్లాదు న్బోధకశాపనోదుఁ గని యొగాహర్షంబుతో ముందటన్ ✻ (వ॥ ఇట్లు సమాగతుండై నతము తాతంగనుంగొని విరోచననందనుండు వారుణపాశబద్ధుండు గావునఁ దనకుం దగిన నమస్కారంబు సేయరామింజేసి సంకులాశ్రుసలిలలోలలోచనుండై సిగ్గువడి తలశిరస్కుండై సంభ్రమభావంబున మ్రొక్కి చెల్లింజె నంత బ్రహ్లాదుండు మఖమండపంబున సునందాదిపరికరసమేతుండై కూర్చున్న వామనదేవునింగని యానందబాష్పజలంబులుం బులకాంకురంబులు న్నెఱయ దండప్రణామంబాచరించి యిట్లని విన్నవించె ✻ (సీ॥ ఇతనికి మున్ను నీవింద్రపదంబిచ్చి నేఁడు ద్రిప్పుట యును నెఱయ మేలు । మోహనాహంకృతి మూలంబుగ ర్వాంధతను సవికారంబు దానిమాన్పి । కరుణరక్షించుట గాక బంధించుటే తత్త్వజ్ఞునకును హేంద్రత్వ మేల । నీ పాదకమలంబులనియతిఁ గొల్వనదానఁ బోలు నేమర రాజ్యభోగపరత గర్వమే పారఁ గన్నులు గాన రావు । చెవులు వినరావు చిత్తంబు చిక్కుపడును । మఱచు నీ సేవలన్నియు మహిమ మాన్పు । మేలు చేసితి నీ మేటి మేర సూపి ✻ (వ॥ అని పలికి జగదధీశ్వరుండును నఖిలలోక సాక్షియు నగు నారాయణ దేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్న సమయంబున ✻ (మ॥ తతమత్తద్విపయానయై ముకుచనిరుంధచ్చోళసంవ్యానయై । ధృతబాష్పాం

బువి శానస్థైక గయుగాధీనాళిక స్థానమై । పతిభిక్షాంమను దేహి కోమలను తేపక్ష్మాప తే యంచుఁద । త్సతి వింధ్యావళి సేరవ
చ్చెఁ ద్విజగద్రక్షామునుస్వామిమక* (వ॥ వచ్చి యచ్చేడియ తచ్చరణసమీపంబునం బ్రణతయై సెలువంబడి యిట్లనియె* (క॥ నీ
కుం గ్రీడార్థములగు । లోకంబులఁ జూచి పరులు లోకులు కునుతు । ల్లోకాధీశులనంగ రు । లోకములకు రాజవీవ లోకస్తుత్యా*
(క॥ కాదనఁడు పొమ్ము లేదీ । రాదనఁడు జగత్త్రయైక రాజ్యము నిచ్చె । న్నాకయి కుఁగట్ట నేటికి । శ్రీదయితా విత్తనోగ్ర శ్రితమందా
రా* (వ॥ అని యిట్లు వింధ్యావళియుఁ, బ్రహ్లాదుండు విన్నవించునవసరంబున హిరణ్యగర్భుండు సను దెంచి యిట్లనియె* (సీ॥
భూతలోకేశ్వర భూతభావన దేవ దేవజగన్నాథ దేవవంద్య । తనసొమ్ము సకలంబు దప్పక నీకిచ్చె దండయోగ్యుఁడు గాఁడు దా
నవరుఁడు । కరుణింపనర్హుండు కమలలోచన నీకు విడిపింపుమీ తని వేఁ అపుదీర్చి । తోయపూరము చల్లి దూర్వాంకురంబులఁ జేరి నీప
దములర్చించునట్టి । భక్తియుక్తుఁడు లోకేశపదము నందు । నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ । నెఱిఁగి తనరాజ్యమంతయు ని
చ్చినట్టి । బలికిదగునయ్య దృఢపాశబంధనంబు ॥ అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుండిట్లనియె* (సీ॥ ఎవ్వనిఁ గరుణిం
పనిచ్ఛయించితి వానినఖిలవిత్తంబు నేనపహరింతు । సంసారగురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు దెగడి లోకము నన్ను ధిక్కరించు ।
నతఁ డెల్ల కాలంబు సకలయోనులయందుఁ బుట్టుచుఁ దుర్గతిఁ బొందుఁ బిదప । విత్తవయోరూపవిద్యాబలైశ్వర్యకర్మజన్మంబు
లగర్వము డిగి । యేకవిధమునకు మలుఁడై యెవ్వఁడుండు । వాఁడు నాకు హర్షింగ క్షింపవలయు వాఁడు । స్తంభలోభాభిమానసంసా
రవిభవ । మత్తుఁడై చెడనొల్లఁడు మత్పరుండు* (శా॥ బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధుప్రజత్యక్తుడై । సిద్ధైశ్వర్యముఁ
గోలుపోయి విభవక్షీణుండునై పేదయై । శుద్ధత్వంబును సత్యముం గరుణయుం జాలమి పేమియుం దప్పఁడు । స్సబ్ధుండై యజయా
ఖ్యమాయ గెలిచెం బుణ్యుండితండల్పుఁడే* (గీ॥ అసురనాథుఁడనుచు ననఘుని మర్యాద । యేను చూతమనుచు నింత వలుక । నిజ
ము వలికె నితఁడు నిర్మలాచారుండు । మేలు మేలు నాకు మెచ్చువచ్చు* (క॥ సావర్ణిమనువు వేళను । దేవేంద్రుండగు నితండు దేవత
లకు సంభావింపను నా చోటికి । రావించె ననంతమీఁద రక్షింతు దయన్* (క॥ వ్యాధులు దప్పులు నొప్పులు । బాధలు చెడి విశ్వకర్మ
భావితసనుజా । రాధితసుతలాలయమున । నేధితసుభవమున నుండు నితఁడు దానక ॥ అని పలికి బలిం జూచి భగవంతుండిట్లనియె*
(సీ॥ సేమంబు నీకింద్రసేనమహారాజ వెఱవకు మేలు నీ పితరణంబు । వేలుపులందుండ వేడుకబడు దుర దుఃఖంబులిడుములు దు
ర్మరణము । లాతురతలు నొప్పులంధుంత వారికి నొందవు సుతలమందుండు నీవు । సేవంపు సేయనిసర్జరారాతులనాచక్రమే తెం
చినలుకు చుండు । లోకపాలకులకు లోను గావక్కడ । నన్య్యులెంత వారి నచట నిన్ను । నెల్లప్రొద్దు వచ్చి యేను రక్షించెదఁ । గరుణ
తోడ నీకుఁ గానవత్తు* (క॥ దానవదైత్యులసంగతిఁ । బూనిననీ యసురభావమును దోడ్తోను । ధ్యానమునఁ దలఁగిపోవును । మాను
గ సుతలమున నుండు మామాయాజ్ఞన్* (వ॥ అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తులముదుక వేల్పు తియ్యని నెయ్యంపు పలుకులు చె
వులకు రసంబు సోనలు వీనుల తెరువులం జొచ్చి లోబయలు నిండి తెప్పలకప్పతప్పం బ్రోచి కొనికనుఁగవకొలంకులనలుగులు వె
డలిన చందంబున సంతసంబున సంగన్నీరు మున్నీరై పఱవ నురఃఫలకంబునం బులకంబులు కులకంబులై తిలకంబులొత్తఁ గేలు
మొగిడ్చి నెకొన్న వేడుకం బ్రోకుపడుచుఁ జిక్కనిచిత్తంబునఁ జిక్కని మాటల రక్కసుల ఱేఁడిట్లనియె* (ఉ॥ ఎన్నఁడు లో
కపాలకుల నీ కృపఁ జూడని నీవు నేఁడు న । న్నున్నతిఁ జేసి నా బ్రతుకు నోజయు నానతియిచ్చి కాచితీ । వన్నలు నీదయారసము మా
టల పెద్దఱికంబు చాలదే । పన్నగతల్పుని న్నెఱిఁగి పట్టిన నాపద గల్గనేర్చునే* (వ॥ అని పలికి బంధవిముక్తుండై హరికి నమస్కరించి
బ్రహ్మకుం బ్రణామంబు సేసి యిందుధరునకు వందనంబాచరించి తనవారలతోఁ జేరి కొని బలి సుతలంబునకుం జనియె నంత హ
రికృపావశంబున కృతార్థుండై కులోద్ధారకుండయిన మనుమనిం గని సంతోషించి ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె* (సీ॥
చతురాననుఁడు నీప్రసాదంబు గానఁడు శర్వుఁడీ లక్ష్మిల జాడఁ బొందఁ । డన్యుఁడెక్కడి దసురులకు మా కును బ్రహ్మాది పూజి
తపదుఁడవైన । దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడవై తి పద్మజాములు భవత్పాదపద్మ । మకరందసేవన మహిమనైశ్వర్యంబులంది
రి కాక మేమల్పమతుల । మధిక దుర్యోధులము కుత్సితాత్మకులము । నీకృపాదృష్టిమార్గంబు నెలవు సేర । నేమి తపమాచరించితి
మెన్నఁగల మె । మమ్ముఁగాచుట చిత్రంబు మంగళాత్మ ॥ అదియునుం గాక* (గీ॥ సర్వగతుఁడవయ్యు సమదర్శనుఁడవయ్యు । నొక
టి విషమవృత్తి నుండుదరయ । నిచ్చలేని వారికీవు భక్తులు గోరు । తలఁపులిత్తు కల్పతరువు మాడ్కి* (వ॥ అని విన్నవించుచున్న ప్ర
హ్లాదుం జూచి పరమపురుషుండిట్లనియె* (గీ॥ వత్సప్రహ్లాద మేలు నీవారు నీవు । పొరది మనవమనిఁడో డాకనిసుతలమునకుఁ । బైన
మైహమ్ము నేగదాపాణినగుచుఁ । జేరి రక్షింపదురితంబు చెందదచట* (వ॥ అని యిట్లు నియమించినం బరమేశ్వరునకు నమస్క
రించి వలగొని కరకమలపుటఘటిత నిటలతటుండై వీడ్కొని బలిందోడ్కొని సకలాసురయూథంబునుం దానునొక్క మహాబిల
ద్వారంబు సొచ్చి ప్రహ్లాదుండు సుతలలోకంబునకుం జనియె నంత బ్రహ్మవాదులయిన యాజకుల సభామధ్యంబునం గూర్చు

న్నశుక్రునింజూచి నారాయణుండిట్లనియె* (గీ॥ ఏమికో యంతవడియె నీతని యాగంబు। విస్తరింపుమీవు ప్రవర్గ్య పశుమమయి
నకర్మవిసర్గంబు బ్రాహ్మణజనులు సూచి నంశమతఁ బొందు ॥ అనిన శుక్రుఁ డిట్లనియె* (సీ॥ అఖిలకర్మంబులకధినాథుఁడవు నీవు
యజ్ఞేశుఁడవు నీవు యజ్ఞపురుష। ప్రత్యక్షము నీవు పరితుష్టి నొందినఁ గడమేల గల్గు నే కర్మములకు। ధనదేశకాలార్హతంత్రమం
త్రంబులఁ గొఱంతయిన్నఁ బేరొననమూను। నైన గాపింపు నీయానతి భవదాజ్ఞ మెలఁగుట జనులకు మేలుగాదె। యింతకం
టెను శుభము నాకెచటఁ గలుగు। ననుచు హరిపంపు శిరమున నావహించి। యావ్యూఢశు క్రేంద్రుఁ జన్నంబు కడవఁ దీర్చె। మునులు వి
ప్రులు సాహాయ్యమునఁ జరింప* (వ॥ ఇవ్విధంబున వామనుండై హరి బలి నడిగి మహిఁ బరిగ్రహించి తనకు నగ్రజుండగు నమరేం
ద్రునకుం ద్రిదివంబు నదయుండై యొసంగెన తదవసరంబున భృగుప్రజాపతులును, భవుండును, కుమారుండును, దేవర్షిపితృగణం
బులును, రాజులును, దానును గూడికొని చతురాననుండు కశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు, లోకపాలురకు,
వాసనుండు వలభుండని నియమించె ధర్మంబునకు యశంబునకు, లక్ష్మికి, శుభంబులకు, దేవతలకు, వేదంబులకు, స్వర్గాపవర్గం
బులకును పేంద్రుండు ప్రధానుండని సంకల్పించి గానసమయంబున* (క॥ కమలజుఁడు లోకపాలురు। నమరేంద్ర నఁ గూడి దేవ
యానంబున నవ్వామనావతారుని వానసున్కి। నమస్కంగొని పోయిరంత నటమీఁదన్నృపా* (గీ॥ బల్లిదంపు తోడు ప్రస్ఫాపున సంప్రసాద।
యానంబున నవ్వామరావతికి నివాసముల్। నమస్కంగొనిపోయి రంతనటమీఁద దన్నృపా* 
కింద్రపదము చేరుటిట్లు గలిగె। దనకు నాద్యుఁడై నతమ్ముఁడు గలిగినఁ। గోరుకు లన్ని కేలఁ గొఱంత నొందు*(క॥ పాలడుగఁడు మే
లడుగం। డేలఁడు భిక్షించి యన్నకిచ్చెఁ ద్రిజగము। న్నేలు పులకల్లి కడపటి। చూలు న్బొలంగఁ గలరె సొలయనితమ్ముల్* (గీ॥ క
డు పుబరువుగాఁ గఁ గొడుకులఁ గనుకంటెఁ। దల్లి కొకఁడె చాల బల్లిదుండు। త్రిదశగణముఁ గన్నయదితి కానుపుఁ దీర్చెఁ జిన్న పేటి
యడుగుఁ గన్నయట్లు* (వ॥ ఇట్లు దేవేంద్రుండు వామనభుజపాలితం బగు త్రిభువనసామ్రాజ్యవిభవంబు ననుభవించె న
ప్పుడు బ్రహ్మయు, శర్వుండును, కుమారుండును, భృగుప్రముఖులైన మునులును, పితృదేవతలును, దక్షాది ప్రజాపతులును, సి
ద్ధులును, వైమానికులును, నాఁటియుండక్కినవారలు నద్భుతపరాక్రమండైన విష్ణు ప్రభావంబులకు నాశ్చర్యంబు నొందుచుఁ
బ్రశంసించుచు నాడుచుం బాడుచుం దమతమ నివాసంబులకుం జనిరని చెప్పి శుకుండిట్లనియె* (గీ॥ మనుజనాథ త్రివిక్రమ
హిమకొలఁది। యెఱిఁగి తలఁ పలెక్కింప నెవ్వఁడోపుఁ। గుంభినీరేణుకణములు గుణుతు పెట్టు। వాఁడు నేరఁడు దక్కిన వానివశ
మె*(క॥ అద్భుతవర్తనుఁడగు హరి। సద్భావికమైన విమలచరితము వినువాఁ। డుస్ఫుటవిక్రముఁడై తుది। నుద్భాసితలీలఁ బొందు
ను త్తమగతులన్*(గీ॥ తగిలి మానుష పైతృక దైవకర్మ। వేళలం దు త్రివిక్రమ విక్రమంబు। లెక్కడెక్కడఁ గీర్తింతు రెవ్వరేని।
బొందుదురు నిత్యసౌఖ్యంబు భూవరేంద్ర* (వ॥ అని యిట్లు శుకుండు రాజునకు వామనావతారచరితంబు సెప్పె నని సూతుండు

## * మత్స్యావతారకథాప్రారంభము. *

మునులకుం జెప్పిన విని వారలతనికిట్లనిరి* (సీ॥ విమలాత్మ విన మాకు వేడుకయ్యెడు మున్ను హరి మత్స్యమైన వృత్తాంత మెల్లఁ గ
ర్మబంధునిభంగి ఘనుఁడీశ్వరుఁడు లోకనిందితంబై పయోనిలయమైన। మీనరూపము నేల మేదినిధరియించె నెక్కడవర్తించె నే
మి చేసె। నాద్యమై వెలయు నయ్యవతారమునకు నెయ్యది కారణంబు కార్యాంశమెట్లు। నీవు దగుదు మాకు నిఖిలంబు నెఱిఁగిం
పఁ। దెలియఁ జెప్పవలయు దేవదేవు। చరితమఖిలలోకసౌభాగ్యకరణంబు। గాదె విస్తరింపు క్రమముతోడ* (వ॥ అని మునిజనం
బులు సూతు నడిగిన నతండు మీరలడిగిన యీయర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుండడిగిన భగవంతుండగు బాదరాయణి యిట్లనియె*
(సీ॥ విభుఁడీశ్వరుఁడు వేదవిప్రగోసురసాధుధర్మార్థములు గావఁ దనువుఁ దాల్చి। గాలిచందంబున ఘనరూపములయందుఁ దను
రూపములయందుఁ దగిలియుండు। నెక్కువ తక్కువ నెన్నఁడు నొందక నిర్గుణత్వంబున నెఱియు ఘనుఁడు। గుణతయుఁ గొఱఁత
యుగుణసంగతి వహించు మనుజేశ చోద్యమే మత్స్యమగుట। వినుము పోయిన కల్పాంత వేళ దొల్లి। ద్రవిడదేశపు రాజు సత్య
వ్రతుండు। నీరుఁ ద్రావుచు హరిఁ గూర్చి నిష్ఠఁ దపముఁ గావించె నొక్కమేటి తలమునందు* (వ॥ అనిన మఱియు నొక్క నాఁడ
మ్మేదినీకాంతుండు కృతమాలిక యను నేటిపొంతహరిసమర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్న సమయంబున నారాజు దో
యిటనొక్కమీను పట్టి దవిలి వచ్చిన నులికిపడి మఱలం దరంగిణీజలంబునందు శకులశాబకంబు విడిచె విడివడి నీటిలో నుండి జ
లపోతంబు భూతలేశ్వరునకిట్లనియె* (మత్తకోకిల॥ పాటువచ్చిన జాతిఘాతులు పాపజాతి ఝషంబులీ। మేటఁ గొంపోక మీను
పిల్లల నేటిపట్టి వధింపవ। చోటు మండక నీకు దోసిలి వచ్చి సొచ్చిన నన్ను నన్। బట్టఁ ద్రోవఁ గఁ బాడియే కృపయింత లేక దయానిధీ*
(గీ॥ వలలు దాఁగొనిం కవచ్చి జాలరి నేఁటి కాలు వేఁలుగలఁచి తారు వెట్టి। మిడిసిపోవనీక మెడబట్టుకొనియెద। రప్పుడెంచుఁ జొత్తు
ననఘచరిత*(క॥ భక్షింతురొండెరు ఝషములు। శిక్షింతురు దుష్టులగుచుఁ జెడకుండ ననుఁ। రక్షింపు దీనవత్సల। ప్రక్షీణులఁ గాచు
కంటె భాగ్యము గలదే* (వ॥ అనిన పసికరుణాకరుండగు నవ్విభుండు మెల్లన నంభోజడింభకంబును గమండలుజలంబున నం బెట్టి
తన నెలవునకుం గొనిపోయె నది యునొక్కరాత్రంబున నంగుండిక నిండ తనకు నుండ నిమ్ముచాలక రాజున కిట్లనియె* (క॥ ఉండ

సి దిగ్గోం చెమెంతయు । నొండొకటిం దెమ్ము భూవరోత్తము యనుడు। న్గండకము( దెచ్చిపడి చెను। గండలపతికలశ సలిలమధ్యము నం మర్చ* (వ॥ అనియును ముహూర్త మాత్రంబునకు మూ(డు చేతులనిడుపై యుదంచనంబునం డినఁ బట్టు లేక వేఱొండు దెమ్మ నవుడా రాచపట్టికరుణాగుణంబులకు నాటపట్టు గావున గండకంబునొక్క చిఱుతనూఁ గునను నిచె నదియు నా సరోవర జలంబు లకు నగ్గలంబై తనకు సంచరింపన దిక్కొంచంబని పలికినఁ బుడమి ఱే(డు మంచి వాఁడగుటం జేసి యాయా యుదకచర బు నుద చితజ లాశ్రయంబైన హ్రదంబునం దునిడియెనదియు జలాశయంబునకు నధికంబై సెలుగనిమ్ము లేదని చెప్పికొనిన నప్పుణ్యుఁ డొప్పి డినదు నడి: దప్పనిపాఁడై నకతంబున నమ్మహామీనంబును మహార్ణవంబునఁ డిచె నదియును మకరాకరంబునం బడి పెను మొస ళ్లు మఃసరికొనకి సము సంగ్రమింగెడినింగ కాలంబు నడపక డపటదిగఁ డుపక వెడలందిరుగువు నినియె లెంగింపనన్నీటిస్రోడకుంబు డమి ఱేఁడు దెలిసి యిట్లనియె* (సీ॥ ఒకదినంబున శతయోజనమాత్రము విస్తరించెకు నీవు వినుము చూడ। మిటువంటి ఝషముల నెన్నఁడు నెఱుఁగము మీన జాతులకిట్టి మేను గలదె । యేమిటికెవ్వఁడ వేలఁ ద్రవ్వింప చెముక రుణ నా పన్నులఁ గావ వేడి । యంభ శ్చరంబైన హరివి నే నెఱిఁగితి నవ్యయ నారాయణాభిధాన। జనన సంస్థితి సంహార చతురచిత్త । దీనులగు భక్తులకు మాకు నిక్క నీ వ। నీను మీనావ తారంబు నఖిలభూత। భూతి హేతువు మ్రొక్కెదఁ బురుషవర్య* (క॥ ఇతరులమ గామచిత్సం। గతులమువాపా లనీవు గలిగిక భక్తస్థితుఁడవనుసన్ను నెప్పుడు । నుతిసేసినవారి కేల నాశముగలుగుఁ* (క॥ శ్రీలలనాకుచవీథీ। కేళీపరతంత్రబు ద్ధిక్రీడించుసుఖా। లోలుఁడవు దాన సాకృతి। నేలా మత్స్యంబవైతి వెఱిఁగింపు హరీ* (వ॥ అనిపలుకు సత్యవ్రతుండను మహారా జునకు నయ్యుగంబు కడపటఁ బ్రళయవేళ సముద్రంబున నేకాంత జనప్రీతుండై విహరింప నిచ్ఛయించు మీనరూపుండైన హరి యిట్లనియె* (సీ॥ ఇటమీఁదనీ రాత్రి కేడవ దినమునఁ బద్మగర్భునకొక్క పగలు నిండు । భూర్భువాదికజగంబులు మూఁడు విలయాబ్ధిలోన మునుంగు నాలోనఁ బెద్ద । నావ చేరఁగ వచ్చు నా పంపు పెంపున వానిపై నౌషధీ తతులు బీజ। రాసులు నిడపరో రాశిలోవి హరింపఁగలవు సప్తర్షులఁ గలిసితిరుగ । మ్రోలఁ గాన రాక మిం చు పెంజీఁకటి। మునుగు చుండు మునుల మేని వెలుఁగు । దోలుకు చుంచు జలధిదోధూయమానమై। నావ తేలుచుండు నరవరేణ్య* (వ॥ నుఱియున న్నావముఁ నీటికగుళ్లకులోను గాకుండ నిరుగెలంకుల వెనుక ముందఱ నేన అకుండఁ బెన్నెఱులగు నాగరులంజడియుచుఁ బోడువ వచ్చిన బలుగ్రాహంబుల నోడియు చుసంచ రించెదనొక్క పెనుపాము చేరువ నాయను నతింబోడచూపెడు దానం జేసి పడిగాడ్పులకతంబున నావ వడిఁ దిరుగకుండ నా కొమ్మకు దిఁబదిలంబుగఁ జేసి నీవును మునులకు నలజడి చెందకుండ మున్నీటనిప్పాటం దమ్మిజాలిరేయి వేగునంతకు మెలంగెదన దికారణంబుగా జలచర రూపంబుఁ గైకొంటి నుఱియును ప్రయోజనంబుగలదు నా మహిమ పరబ్రహ్మంబని తెలియుముని న్ననుగ్రహించితినఁ సత్యవ్రతుండు సూడ హరి తిరోహితుండయ్యె నయ్యవసరంబున* (గీ॥ మత్స్యరూపియైన మాధవు నవు గులు। తలఁచికొనుచు రాచతపసియొక్క । దర్భశయ్యఁ బూర్వతలకడగాఁబడి । కాచియుండె నాఁటి కాలమునకు॥ అంతక ల్పాంతంబు డాసిన* (క॥ ఉల్లసితమేఘపఙ్క్తులు । జల్లించిన మహాగ్రవృష్టి జడిఁ గొనకురియ। న్వెల్లివిరిసి జలరాసులు। సెల్లెలికట్టలనుఁ దాటి సీమలముంచెన్॥ తదనంతరంబ* (గీ॥ మున్ను వోయిన కల్పాంతమున నరేంద్ర । బ్రహ్మమనఁ గనై మిత్తికప్ర ళయ వేళ। సింగి పైనిట్టి తొలఁకు మున్నీటిలోనఁ । గూలెభూతాళి జగములకొలఁది వెడలి॥ అంతనమ్మహారాత్రియందు* (మ॥ నెఱి నెల్లప్పుడు నిల్పి ప్రాణచయముల్ మ్రింపఁ ర్మించివీ । పెఱియన్నీల్లుచు నావులించుచు నజుండీ సృష్టియున్మాని మేనొఱఁగెన్ ఱెప్పలు మూసి కేల్దలగడై యుండంగ నిద్రించుచున్। గుఱు వెట్టం దొడఁగెన్ గల ల్గనుచు నిర్ఘోషించుచున్భూవరా* (గీ॥ అలసి సొలసిని దుర నందిన పరమేష్ఠి। ముఖమునం దుండి వెడలె మొదటి శ్రుతులు । నపహరించె నొక్క హయగ్రీవుఁడను దైత్యు। భటుఁడు దొంగ( దొడ రఁబరులవశమె* (క॥ చదువులు దన చేఁ బడెనని। చదువు చుఁబెన్ బయలనుండ శంకించి వడిన్। జదువులముదుకడు గూరుక। జదువుల తస్కరుడుఁ సొచ్చె జలనిధి కడుపున్* (వ॥ ఇట్లు వేదంబులు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునింగిన వానిజయింపవ లసి యుద్రమానుదిఁ గెలయందు వి త్తనంబుల పెన్నీట వాని చెడకుండను నుపవలసియు నెల్ల కార్యంబులకుఁ గావలియగు నా పురు షోత్తముండప్పెను రేయి చోరునలయందు* (క॥ కలుగలులువలుదమీసలు। చిఱుదోఁకయుఁ బసిఁడి మొడలు సిరిగల పొడలున్। న్నెఱిమొగము నొక్క కొమ్మును। మిఱుచూపులు గలిగి విభుఁడు మీనంబయ్యెన్* (వ॥ ఇట్లు లక్షయోజనాయతంబై విశ్వంభ రుండు జలధి సొచ్చి* (సీ॥ ఒకమాటు జలజంతు యూథంబుతోఁ గూడు నొకపఱి దరులకు నుఱికివచ్చు। నొకమాఱిమింటికి నుదిరియు ల్లంఘించు నొకపారి లోపలనొదిగి యుండు। నొకసారి వారాశి నొడలు ముంపమి సూపు నొకతేప బ్రహ్మాండమొఱయఁ దలఁచు। నొ కపూరి ఝష కోటి నొడసి యాహారించు నొక మాఱు జలముల నుమిసివైచు । గెలులు సారించు మీసలు గడలు కొలుపుఁ। బొడలు మెఱపించుఁ గన్నుల పొలుపు మార్చు। నొడలు ఝళిపించుఁ దళతళ నొలయు మీన। వేషి పెన్నీటి నిగమగవేషియగుచు* (వ॥ అం తకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీపలయంబు ముంచునవసరంబు సభక్తపరాధీనుండగు హరిం దలంచుచునుండ

నారాయణప్రేరితమై యొక్క నావవచ్చె నంతనంగొని* (మ॥ ఘనసత్యవ్రతమేదినీశ్వరయితుఁడోజంబూనిఁ బ్రాన్లీఁగెపి। త్తన ముల్పెక్కులు నావపైనిడి హరిధ్యానంబుసేయుచు నిప్పై। మునిసంఘంబులు దాను నెక్కి వెలితోమున్నీటిపైఁ దేలుచు। న్ననియెన్నుంధిట భక్తలోకహృదలంకర్మీణముస్మీనమూర్తి* (వ॥ ఆనిజలచరేంద్రుని కొమ్మున నొక్క పెనుపాముత్రాటన న్నావఁగట్టి సంతసించి డెందంబునఁ బరికొనిత వస్తువులతోడఁ గూడికొని యారాచ పెద్దమీనాకారుండగు వేల్పు తేనినిట్లని పొగడె నప్పుడు* (మ॥ తమలోఁ బుట్టిన పద్యగస్వకొనఁగ న్దద్మ్మాల సంసారపిభ్రమములై కొందఱు దేలుచుండఁగలఁచుచుండఁ బల్వెంటలందైన మోహము నందేపరి మేను గొల్చితును లై కైవల్యసంప్రాప్తులై। ప్రమదంబందెదరట్టివీవు కరుణంబాలింపుమమ్మీశ్వరా* (ఉ॥ కన్నులు లేనివాఁడు వఁటికానని వానికిఁ ద్రోవఁ జూపఁగాఁ। జన్నతెఱంగు మూఢునకనన్మఁ దాగురుఁడౌటసూర్యుఁడే। కన్నులుగాఁగ భూతములఁగాంచుచునుండుదు రమేశ మా గురుడు। ద్యన్మయమూర్తివై గురుఁడువై యలసద్గతిజాడఁ జూపవే* (క॥ ఇంగలముతోటి సంగతిఁ బంగారము వన్నెగలుగు భంగినినీసే। వాంగీకృతులయఘంబులు। భంగంబులఁ బొందుముక్తి ప్రాపించు హరీ* (క॥ వ్యాసమేశ నీప్రసన్నతి। పదివేలవపాలిలే భాగమునకు సమం। ద్రిదశేంద్రాద్యులు గలఁదట। సుదినను మెప్పింపనేదిదొంకదు శ్రీశా* (క॥ పెలనాఁడు గుఁడ టంచును। గొలిగాని పదంబుమూఢుఁడు జనుండనుని। నెఱుఁగ్రోవ నడువ నేర్చిన। నలవి అలేనట్టిపదము నందు దయాబ్ధీ* (మ॥ చెలివై చుట్టమవై మనస్థితుఁడవై దివ్యార్థమవై యాత్మవై। వలనై కోర్కైలపంటవై విభుఁడవై వర్తిల్లు నీసన్నొల్లకీ। పలువెంటంబడి లోకులక్కలవృథాబద్ధాశులై పోయెద। న్నలువ నెన్నచ్చనెహేమరాశిఁ గనియున్నిర్భాగ్యుఁడంభశ్శయా* (గీ॥ నీరరాశిలోన నిజకర్మబద్ధనైయుండనుండు బొందియున్నలోక। మేమహోత్సుచేత నెప్పటి మేల్కాంచు। నట్టినీవు గురుఁడ వధిపమాకు (క॥ ఆలింపుము విన్నపమిదె। వేలుపుగని తేనినిన్ను వేఁడికొని యిదె। వ్వాలోనిచిక్కు మానిచి। నీలోనికిఁ గొంచుపొమ్ము నిఖిలాధీశా* (వ॥ అనియిట్లు సత్యవ్రతుం డు వలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసముద్రంబున విహరించు హరిపురాణపురుషుండు నటంజేసి సాంఖ్యయోగక్రియాసహితయగు పురాణసంహితను పదేశించెనమ్మహారాజు మునిసమేతుండై భగవన్నిగదితంబైన సనాతనంబగు బ్రహ్మస్వరూపంబు దెలిసికొని కృతార్థుఁడయ్యెనమ్మహాకల్పంబున వివస్వతుండనంబరగిన సూర్యునకు శ్రాద్ధదేవుండనజన్మించి శ్రీహరికృపావశంబున నేడవ మనువయ్యె నంతనవ్విధంబునం జెనురేయినిండునంతకు సంచరించి జలచరాకారుండగు నారాయణుం డు దన్నిశాంతసమయంబునందు* (మ॥ ఉగుఁడంభోనిధిరోసి వేదములనొయ్యంబై న్యముంజూచి వేగ। ముల్లాడించి ముఖంబు సాఁచి బలువీఁకం దోఁకసారించి మే। న్మైఅయ్యదౌడలు గీటిమీసలదరం మీనాకృతిన్విష్ణుఁడ। క్కఱటిందాఁకి వధించె ముష్టిదళితగ్రావున్హయగ్రీవునిన్॥ అంతఁ బ్రళయావసానసమయంబున* (సీ॥ ఎవ్వఁడు వేగునం జెదురుచూచుచునుండు మునులడెందంబులు ముదము నొందఁ। దెలివితోఁ బ్రక్కనిద్రించు భారతి లేచి యోగపయ్యెదఁ జక్కనొత్తికొనఁగ। మలినమై పెనురేయి ప్రగ్గినతేజంబు తొంటిచందంబునఁ గొంగలింపఁ। బ్రాణులసంచిత భాగధేయంబులు గన్నులకొలుకులఁ గానఁబడఁగ। నవయవంబులు గదలించి యావులించి। నిదురఁ దెప్పిలి మేల్కాంచి నీల్గి నాటిగి। యొడలు విఱుచుచుఁ గనుఁగవ నుదురుకొనుచు। ధాతఁ గూర్చుండె సృష్టిసంధాత యగుచు॥ అయ్యవసరంబున*(గీ॥ వాసవారిజంపి వానిచేఁ బడియున్న। వేదకోటిచిక్కు విడ్చి తెచ్చి। నిదురమానియున్న నీరజాసనునకు। నిచ్చెఁ గరుణతోడ నీశ్వరుండు* (క॥ జలరుహనాభునికొఱకై। జలతర్పణమాచరించి సత్యవ్రతుఁడా। జలధిఁ బ్రతికి మనువయ్యెను। జలజాక్షునిఁ గొలువ కేందుసంపదగలదే*(గీ॥ జనవిభుండు తపసి సత్యవ్రతుండును। మత్స్యరూపియైన మాధవుండు। సంచరించినట్టి సదనులాఖ్యానంబు। వినినవాఁడు బంధవిరహితుండు* (క॥ హరిజలచరావతారము। బరువడిఁ బ్రతిదినముచదువఁ బరమపదంబు। న్నరుదందు వారి కోర్కులు। ధరణీశ్వర సిద్ధిఁ బొందుఁ దథ్యము సుమ్మీ* (మ॥ ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రంజెందు వాణీశు మోముల వేదంబులు గొన్నదైత్యు సమ్మృతింబొందించి సత్యవ్రతుం। డలరం బ్రహ్మము మాటఁ జానిలి పెనర్వాధారుఁడై మీనమై। జలధిం గ్రుంకుచుఁ దేలుచుం మెలఁగు రాజన్మాత్రికిం బ్రమ్ముకెక్కుదరా॥ అని చెప్పి॥ ... *

క॥ రాజేంద్రదైత్యదానవ। రాజమహాగహనదహనరాజసుత్యా। రాజావతంససమానిత। రాజధరార్చనగుణాఢ్య రాఘవరామా *( మాలిని॥ దివిజరిపువిదారీ దేవలోకోపకారీ। భువనభరనివారీ పుణ్యరక్షానుసారీ। ప్రవిమలశుభమూర్తీ బంధుపోషప్రవర్తీ। ధవళబహుళకీర్తీ ధర్మనిత్యానువర్తీ॥

గద్య, ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహాప్రబంధంబునందు స్వాయంభువస్వారోచిషోత్తమతామసమనువుల చరిత్రంబును, గరిమకరియుద్ధంబును, గజేంద్రరక్షణంబును, రైవతచాక్షుషమనువుల వర్తనంబును, సముద్రమథనంబును, కూర్మావతారంబును, గరళభక్షణంబును, నమృతాది సంభవంబును, దేవాసురకలహంబును, హరికపటకామినీరూపంబు నవలంబించి దేవతలకమృతంబువోయుటయు, రాక్షసవధంబును, హరిహరసల్లాపంబును, హరికపటకామినీరూపవిభ్రమణంబును, వైవస్వతసూర్యసావర్ణి, దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి, భద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణి, మనువులవృత్తాంతంబును, బలియుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవపలాయనంబును, వామనావతారంబును, శుక్రబలిసంవాదంబును, త్రివిక్రమవిస్ఫురణంబును, రాక్షసులు సుతలగమనంబును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావతారంబును ననుకథలుగల యష్టమస్కంధము .......................... ............ . ............*

శ్రీకృష్ణార్పణమస్తు.

## శ్రీమదాంధ్రమహాభాగవతము.__నవమస్కంధప్రారంభము.

శ్రీరాజితమునిపూజితవారిధిగర్వాతిరేకవారణబాణా। సూరిత్రాణమహోజ్జ్వలసారయశస్సాంద్రరామచంద్రనరేంద్రా.

(వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె నట్లు ప్రా
యోపవిష్టుండయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుఁ గనుంగొని* (సీ॥ మనువుల నడవళ్లు మర్యాదలను వింటి మన్వంతరం
బుల మాధవుండు। దిరిగినజాడలు దెలిసె సత్యవ్రతుఁ డను రాజు ద్రవిళదేశాధిపుండు। పోయినకల్పాంతమున విష్ణు సేవించి వి
జ్ఞానముఁ బొంది వెలుఁగుచుండె। క తఁడు వైవస్వతుండయి పుట్టి మనువయ్యె నతనికి నిక్ష్వాకుఁ డాదిగాఁగఁ। బదుగురు కొడుకులు గల
గిరందుఁ బరగవారి। వంశమే రీతి వర్తించె వారిలోనఁ। జనినవారి జనువారిఁ జనెడువారిఁ। జెప్ప వే వ్యాసనందన చిత్తగింతు*
(క॥ చెవులార నేడు విని యెదఁ। గవి వంశము నందుఁ గలుగు రాజుల కీర్తుల్। వివరింపు వరుసతోడను। భువిఁ బుణ్యుల చరిత వినినఁ బుణ్యా
ముగాదే* (వ॥ అనినం బరాశరమునినందనుం డిట్లనియె* (గీ॥ వినుము మనువుకులము వేయినూఱేండ్లును। బరఁగ విస్తరించి పలుక
రాదు। నాకుఁ దోఁచినంత నరనాథ వేగంబ। యెఱుఁగఁబడఁగఁ బ్రీతి నేర్పరింతు* (క॥ ఎక్కువ తక్కువ పొడవుల। నెక్కడ మొద
లైన పురుషుఁ డింతయుఁ జెడఁ దా। నొక్కఁడు కల్పాంతంబున। నక్కజమై నిల్చె విశ్వమతఁడై యుండన్* (సీ॥ భూమీశ యమ్మ
హాపురుషుని నాభిమధ్యమునఁ బంగారు కెందమ్మి మొలిచె। నాతమ్మిపూవులోనఁ బుట్టెఁ దనయంతవాఁడు నలుమోముల నలువ పు
ట్టె। నా బ్రహ్మమానసమున నట మరీచి జనించెఁ। గశ్యపుం డతనికిఁ గలిగె నంత। నా కశ్యపుని దక్షునాత్మజ యదితికిఁ గొమరుఁడై చీఁక
టిఁ గొంకవోడ మె। జలజబంధుని పెండ్లాము సంజ్ఞయందు। శ్రాద్ధదేవుండు మనువు సంజాతుఁ డయ్యె। మనువునకు శ్రద్ధయను మె
డమువయందుఁ। బదురు కొడుకులు గలిగి రిభప్రసయశులు* (వ॥ వారలిక్ష్వాకుండును, నృగుండును, శర్యాతియు, దిష్టుండును
ధృష్టుండును, కరూశకుండును, నరిష్యంతుండును, వృషధ్రుండును, నభగుండును, గవియును నన నెగడి రట మున్న మనువు కొడు
కులు లేనివాఁడై మిత్రావరుణులను ద్దేశించి* (సీ॥ మనువు బిడ్డలువుట్ట మఖమాచరించుచో నతని భార్యయు హోత నాశ్ర
యించి। కూతురు వెట్టనా కోర్కిఁ జేయుమని పలికె వరభక్తితోఁ బయోవ్రతము సలిపె। నా సతి చెప్పినట్లధ్వర్యుఁడును హో
తయు గాక వ్రేల్చెదనంచుఁ బలికె। హవియందుకొని కూతురగుఁ గాకయని వషట్కారంబు సెప్పుచుఁ గదిసి వ్రేల్చె। హో
త పెడచేత నిల యనునువిదపుట్టె। దానిఁ బొడగని మనువు సంతాపమంది। కొడుకు మేల్గాక యేటికి కూతురనుచుఁ। జెప్ప వేయని
పోయె వసిష్ఠుకడకుఁ జని యిట్లనియె* (క॥ అయ్యా కొడుకులకొఱకై। యియ్యాగము నీయనుజ్ఞ నేఁ జేయంగా। నియ్యాఁడు జేల
వుట్టెను। మీ యంతటివారికొంకు మేరయుఁ గలదే* (వ॥ అదియునుంగాక మీరు బ్రహ్మవాదులగు మంత్రవాదులరు పాపంబు
లందకుండఁ జేయించువారిది యేమియనవుఁడు వసిష్ఠుఁడు హోతృవ్యవిచారం బెఱింగి మనువునకిట్లనియె* (గీ॥ అధిపసంకల్ప
వైపర్యము ఘటింపఁ జేసి। హోత కల్లదనంబున నువిద గలిగె। నైనఁ గలిగింతు నీకుఁ బ్రియాత్మజులను। నీవు మెచ్చంగఁ జూడు నా నే
ర్పు బలిమి* (వ॥ అని పల్కి భగవంతుండగు వసిష్ఠుండు కీర్తితత్పరుఁడు గావున మనువుకూఁతు మగతనంబు కొఱకు నేకచిత్తం
బున నాదిపురుషుండగు హరిం బొగడిన నప్పరమేశ్వరుండు మెచ్చి తపసి కోరిన వరంబిచ్చె నదినిమిత్తంబున నిళాకన్యక సుద్యు
మ్నుండను కుమారుండై రాజ్యంబు సేయుచు* (సీ॥ ప్రొద్దుపోకకు నాఁడు పోయి పేరడవుల వెంటవేటాడుచు వేడ్కతోడఁ।
గొందఱు మంత్రులుఁ గూడి రా సైంధవంబయిన గుఱ్ఱము నెక్కి యడవి కేగి। బలువిల్లు గ్రొవ్వాఁడి బాణంబులును దాల్చి పెనుమె
కంబుల వెంటఁ బఱుచుతోడ। నుత్తరదిశకు మహోగ్రుఁడై యేతెంచి మేరువు పొంతఁగు మారవనముఁ। జేరె నందు మహేశుం
డు శివయు నెపుడు। రతిఁ దేలుచు సలుపుచు రందు నా రాజుపోవ। నాఁడుదయ్యె నుదోడ నేయనుచరులును। బడఁతులై రి తదశ్వంబు బడబ
యయ్యె* (వ॥ ఇట్లు మగతనంబు సెడి మగువలై యొండొరుల మొగంబులు సూచి మఱుఁగుచుండి రనవిని శుకునకు రాజిట్లనియె*
(గీ॥ రాజుతోడివారు గమ్ములై రంటివి। కాంతలయిరి యేమి కారణమున। నిట్టిదేశ మెఱుఁగ నెన్నఁడా కథలెల్ల। వేడ్క దీఱ నాకు వి
స్తరింపు॥ అదియునుంగాక* (గీ॥ మగువతనము మాని మగవాఁడు గావచ్చుఁ। గాక పేరుపెంపు గాసి గాఁగ। మగతనంబు మాని
మగువ గావచ్చునె। మానవంతుఁడైన మానవునికి॥ అని పలికిన నర్జునపౌత్రునకు వ్యాసపుత్రుం డిట్లనియె* (సీ॥ పురవైరి కొకనాఁ
డు పొడసూపు వేడుకఁ దపసులు దిక్కులఁ దమము లెల్లఁ। దమతమ వెలుఁగులు దగిలి కొందఱు సారఁ గొందఱు హోమములు గోరి రాఁగఁ।
బ్రాణేశుతొడలపై భాసిల్లు నంబిక వారలఁ జూచి మైవలువ లేమి। సిగ్గుపుట్టిన లేచి చీరఁ గట్టినఁ జూచి తపసులు దేవుండు దీర్ఘలీల।
నొంటితమలోనఁ గ్రీడించుచున్నవారు। మనకుఁ బనియంబు గాదని మఱలిమునులు। నరుఁడు నారాయణుం డున్న నారతంబు। మె
లఁగుచోటికిఁ జని చిత్త మేదినీశ ॥ ఆదికారణంబు గ భగవంతుండగు శివుండు దన ప్రియురాలి వేడ్క కలకొఱకున్నిల్లని వక్కాణించె*

(క॥ ఈనెల వెవ్వఁడుసొచ్చిన।మానినియగునని నతొంటిమాటకతమున। న్మానవుఁడు మగువవోడిమి।మానక పేఁ అడవులందు
మఱియుండిరి గెరౌ* (వ॥ఇట్లు చెలికత్తియలముత్తంబులుం దానును నారాచపూబోఁడి నాఁడిమిచూపులనాఁడుఁబోఁడిమి నెఱ
వుచు దైవయోగంబున సోముసుతుండును, భగవంతుండునునగు బుధునియాశ్రమంబుఁ జేరి మెలఁగుచున్నయెడ* (గీ॥ రాజు
కొడుకుఁ జూచె రాజీవదళనేత్ర। రాజవదనసూచె రాజుపట్టి। దొంగకాముఁ డంతదొందడిఁ జిసు రాకు। వాలు వెఱికియుఱికి వా
రి మొత్తె* (వ॥ఇట్లలరు విల్తుని నెఱబిరుసు చిగురుటడిదంబు మొనకు మోహాటించి వారలిద్దఱురుం బైఁబడి వేడుకలకుం జొచ్చినవా
రలకుం బురూరవుండను కుమారుండు పుట్టె నివ్విధంబున* (గీ॥ మనుసుతుండు ఘనుఁడు మగనాలితనమునఁ। గొడుకుఁ గాంచి గి
రిసి కుందుచుండి। చింతఁ బొంది గురువసిష్ఠుని భావింప। నతని తలఁపులోన నతఁడు వచ్చె* (వ॥వచ్చి సుద్యుమ్నుండు మగవాఁడయ్యె
డు కొఱకు నమ్మునిపుంగవుండు శంకరునారాధింప నీశ్వరుండు దపస్ప్రయాసంబునకు సంతసిల్లి యిట్లనియె* (మ॥ తనుమున్నా
డిన మాటయు న్నిజము గాఁ దన్మౌనికిం బ్రీతిగా। మనుజేంద్రుం డొక నెలన్నెలం బురుషుఁడై మాసాంతరంబైన కా। మినియై
యాగతి నీఁడుపాట మఱి భూమిం జానరక్షించుఁ బో। మ్మని సన్ప్రచ్చె వసిష్ఠుఁ డామనుసుతుం డారీతి రాజ్యస్థుఁడై* (గీ॥ మగువ
యగుచు మఱి అలమగవాఁడునగుచును। భూతధాత్రియంత నాతఁడేలెఁ। బ్రజలు సంతసింప బాహాబలముతోడ। గురుని కరుణఁ
జేసి కువలయేశ* (వ॥ఆతనికి నుత్కలుండును, గయుండును, విమలుండును నను కొడుకులు మువ్వురు గలిగి ధర్మపరులై దక్షిణాప
థంబునకు రాజులైరి సుద్యుమ్నుండు ముసలియై ప్రతిష్ఠానపురంబు విడిచి పురూరవునకు భూమి నిచ్చి వనంబునకుం జనియె నివ్విధంబు
న* (సీ॥కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేగ వందురి మనువు వైవస్వతుండు। తనకు బిడ్డలు గల్గఁ దపమాచరించెను హరిఁ గూ
ర్చి నూఱేండ్లు యమునలోన। హరి యంత నిక్ష్వాకుఁ డాదిగాఁ బదుగురు పుత్రులనిచ్చెను బొసఁగ వారి। యందు పృషధ్రాఖ్యుఁడ
నువాఁడు గురు నాజ్ఞ విమలధర్మంబులు వెలయఁ బూని। పసుల కదుపులఁ గాచుచు బలుమొగుళ్లు। వచ్చినదు రేయిజోరున వానకు
రియ। మంద విడిఖుంచి చుట్టు నేమఱక యుండె। నడవి మెకములుసొరకుండ నరసికొనుచు* (క॥ప్రబ్బికొనిన పెంజీకటి। నిబ్బరము
ననడికి నడికి నింగికి వడితో। గొబ్బున నెగసి తటాలున। బెబ్బులి మందావుఁ బట్టెఁ బెల్కుఱియఱవన్* (క॥ ఉల్లము లుగలఁగి మొద
వులు। వెల్లువలన్నియును రేచి విచ్చలవిడితోఁ। జెల్లాచెదరై పాఱెను। బెల్లుగనంభాయటంచు బెబ్బులిగాలిన్ ॥ అయ్యవసరంబు
న* (శా॥ఆ పెంజీకఁటి మోఁతలఁ గానక డిసంబంకించి శార్దూలమం। చాపుల్లావు శిరంబుఁ ద్రుంచి తెగదోయంచుం బులిన్వొంది
యు। న్వాపోవం దెగవ్రేసె భూవరుఁడు ద్రోవన్ఖడ్గరక్తంబుచేఁ। బైఁ బైఁ గీయుచుఁ జేరి చూచెఁ దలఁద్రెవ్వం బడ్డయద్ధేనువున్*
(వ॥ చూచి దుఃఖితుండై యున్న పృషధ్రునిఁ గని కులగురుండగు వసిష్ఠుండు కోపించి నీవు రాజత్వంబు వాసి యీయపరాధంబున
శూద్రుండవు గమ్మని శపియించె నతండును గృతాంజలియై తనకులాచార్యునివలనను అలంగై కొలువడసి యతనియనుమతం
బున* (సీ॥అఖిలాత్ముఁడగుచున్న హరియందు హరునందు భక్తితో జాలఁ దత్పరత మెఱసి। యూర్ధ్వరేతస్కుఁడై యున్న ప్రా
ణులకెల్ల నాప్తుఁడై సర్వేంద్రియములు గెల్చి। సంగంబునకుఁ బాసి శాంతుండు నపరిగ్రహుండునై కోరక యుండుఁ దనకు। వ
చ్చిన యది యజీవనముఁ గావించుచుఁ దనుఁ దాన నిలుపుచు ధన్యబుద్ధి। జడుని తెఱఁగున మూకుని చందమునను। జెవిటిభంగి నిమ
హి నెల్లఁ జెల్లఁ దిరిగి। యడవులకు నేగి కార్చిచ్చులందఁ జొచ్చి। దిక్కుఱసియతుఁడై బ్రహ్మంబుఁ జెందె నతఁడు* (క॥ కవియను కడ
పటికొమరుఁడు। భవనము రాజ్యంబు విడిచి బంధులతోనే। గివనము నం బరమపురుషునిఁ। బ్రవిమలమతిఁ దలఁచి తలఁచి పరముం
బొందెన్* (వ॥ మఱియుఁ గరూశకుండను మానవునివలనం గొందఱు కారూశులు గలిగి ధర్మంబుతోడి ప్రియంబున బ్రహ్మణ్యు
లై యుత్తరాపథంబునకు రక్షకులైరి - ధృష్టునివలన ధార్ష్టంబను వంశంబు గలిగి భూతలంబున బ్రహ్మభావంబు నొంది నెగడెన్న
గు మూలంబున సుమతి గలిగె నతనికి భూతిజ్యోతి పుట్టె - నతనికి వసువు జనించె వసువునకుం బ్రతీకుండు గలిగెఁ - బ్రతీకునికి నో
ఘవంతుండ తని కూతురోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహంబయ్యె నరిష్యంతుండను మనుపుత్రునికిఁ జిత్రసేనుండా
విభునకు దక్షుండా పుణ్యునకు మీఢ్వాంసుండా సుజనునికి శర్వుండమ్మహాత్మునికి నింద్రసేనుండా రాజునకు వీతిహోత్రుం
డా సుమతికి సత్యశ్రవుండా ఘనునికి నురుశ్రవుండా వీరునకు దేవదత్తుండా పండితునకు నగ్నివేశుండు సుతుండయి జనియిం
చి కానీనుండన నెగడి జాతకర్ణుండను మహర్షియై వెలసె నతనివలన నాగ్నివేశ్యాయనంబను బ్రహ్మకులంబుఁ గలిగె నివ్విధంబు
న* (క॥ తెలుపఁబడె నరిష్యంతుని। కులమెల్లను నీకు దిష్టకులము న్దెలియ। న్దెలిపెద రాజేంద్రోత్తమ। తెలియుము సర్వంబు నీకుఁ
దేటపడంగన్* (వ॥దిష్టునికొడుకు నాభాగుండను వాఁడు కర్మవశంబునవైశ్యత్వంబు నొందె - నాభాగునికి హలంధనుండు గ
లిగె - నతనికి వత్సప్రీతి - వత్సప్రీతికిఁ బ్రాంశువు - నతనికిఁ బ్రమితి - ప్రమితికి ఖనిత్రుఁడు - ఖనిత్రునికిఁ జాక్షుషుండు - నతనికి వివిం
శతి - వింశతికి దంభుండు - దంభునికి ఖనినేత్రుండు - నతనికిఁ గరంధముండు - గరంధమునకవిక్షిత్తు - నాయవిక్షిత్తునకు మరుత్తుండు జ
నించి చక్రవర్తియయ్యె నతని చరిత్రంబు వినుము* (సీ॥ అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁడతని యాగమునకు యాజకుం

డు। తరిగియుండెడినురు దాఖ్యగణంబులో వారుపశ్వేదేవులచటిసభ్యు । లధికలక్షణులబ్రాహ్మణకోటిదనిపెనుసోమపానం
బునమరవరుండు। మంత్రిమైబంగారునయముగావించెను యాగవస్తువులెల్లనధికనియతి । నానరుత్తుండుసేసిన యట్టిభం
గి।ధీరభావంబునసురంగదెంపుగలిగి।సుఖముసేసినవారినిమటియు నెఱుఁగ।మెల్లలోకములందునరేంద్రముఖ్య* (వ॥ అమ
రుత్తునకుదముండును,దమునకురాజవివర్ధనుండును,రాజవివర్ధనునకుసుధృతి, సుధృతికిసౌధృతేయుండును, సౌధృతేయునకుఁ
గేవలుండును,గేవలునకుబంధుమంతుండతనికివేగవంతుండును, వేగవంతునికిబన్ధుండుసంభవించె*(క॥అచ్చరలన్నియలంబు
సగ్రచ్చరనాబంధుఁజూచికామించిశుదిస్వచ్ఛవిలులనియమ్ముల । మచ్చిచ్చునవచ్చిపొందెమోహాతురయై* (వ॥ఆదంపతు
లకుఁదృణబిందుండనుమహారాజుసంభవించె - నిలబిలయనుకూతుఁరుజన్మించె నాకొమ్మవిశ్రవసుండుపొందిననైలబిలుం
డనుకుబేరుండుపుట్టె-నాతృణబిందునకుఁవిశాలుండును శూన్యబంధుండును ధూమ్రకేతుండునను వారు ముగ్వురుకొడుకులుగ
లిగిరి. యందువిశాలుండు వంశవర్ధనుండై వైశాలియనునగరంబునిర్మించె - నారాజునకుహేమచంద్రుండు-డానరేంద్రునకు
ధూమ్రాక్షుండు-డావుడమునికిసంయమునికిపుత్రులు-డామనుజపాలునకుసహదేవుండు-డాజలిస్తునకుఁగృశాశ్వుం-డాతనికిసోమదత్తుం
డుజనించెనందు*(గీ॥అసురవిభుండు మెచ్చనశ్వమేధముఁజేసి । భూరిపుణ్యగతికిఁబోయె నెలమి। సోమదత్తుకొడుకుసుమతికిజ
నమేజ।యుండనంగఁగొమరుఁడుప్పతిల్లె* (వ॥ వీరలువైశాలులనంబరగితృణబిందునికీర్తివహింపరాజ్యంబుసేసిరి మఱియు
ను*(సీ॥శర్యాతియనురాజుజనియించెబ్రహ్మవరుండైననునుపుత్రులతోడ । నతఁడంగిరసుసత్రమందు రెండవసారివిహిత
కర్మములెల్ల వెలయఁజెప్పె।నతనికూతురుసుకన్యకయనువనజాక్షితండ్రితోడుగఁదపోవనికిఁజరిగి। చ్యవనాశ్రమముఁజేరిసఖు
లును దానునుఫలపుష్పములుగోయఁబాటితిరిగి।యొక్కపుట్టలోననొప్పారుజ్యోతులు।రెంటిఁగాంచి వాటిముంటఁబొడిచెఁ।
గన్యముగుదమ అచిఖద్యోతయుగమంచు।దైవవశముకతనఁదమకియగుమ* (క॥ జ్యోతులుముంటంబొడిచిన।వాతలనెత్తురు
లుఁగురిసెవసుధీశుభట।వాతములకెల్లనచ్చట।నాతమతిమలమూత్రబంధమయ్యెనరేంద్రా*(వ॥వారలంజూచిరాజర్షి యగు
శర్యాతివిస్మితుండైమీరలియ్యాశ్రమదూషణంబుసేయవోపుమరది కారణంబుగా మీకువిరోధంబుసిద్ధించెనిపలుకునవసరం
బునఁదండ్రికిసుకన్యకయిట్లనియె*(గీ॥అయ్యాయీపుట్టచేరువనాడియాడి। యిందుఁబోరెండుజ్యోతులనేను గాంచి।కంటకం
బునఁబొడుబువరక్తంగురిసె। నేవిధంబునఁగురిసెనోయెఱుఁగుమీవు*(వ॥అనినవినిశర్యాతిభీతుండైకూఁతుందోడ్కొనివల్మీ
కంబుకడకుఁజని యందులోఁదపంబుసేయుచున్నచ్యవనుఁగని తననేర్పుననతనివలనఁబ్రసన్నతవడసి తపసిచిత్తంబునె
ఱింగితనపుత్రికనిచ్చియెట్టకేలకుంబ్రతికినవాఁడై మునీశ్వరునవీడ్కొని పురంబునకుంజనియెనంత* (గీ॥ పరమకోపుఁడయిన
భార్గవుఁబతిఁజేరి।మిగులఁబనులయెడలమెచ్చఁదిరిగి । యతనిపర్ణశాలనాసుకన్యకయును। మసుపగొన్నియేండ్లుమనువుమని
యె*(వ॥అంతనొక్కనాఁడయ్యాశ్రమంబునకువేల్పువెజ్జులగునయశ్వినులిద్దఱువచ్చిన వారలంబూజించితజముదిమిసూపి
చ్యవనుండిట్లనియె మీకున్నయాగభాగంబులేని సోమపానంబు నేనుగల్పించియిచ్చెద సోమపానపయంబునఁబానపా
త్రమిమాకునందిచ్చెదనాముదిమిమానుపుఁడనియిట్లనియె*(క॥నవకంబగుప్రాయంబున। జవరాండ్రఁగరంచుమేనిచక్కఁదనం
బున్నవతరముగఁగృపసేయుఁడు।దివిజాధిపవైద్యులారదీవింపుమిమ్ముఁ* (వ॥అనినయశ్వినీదేవతలుసంతోషించిసిద్ధనిర్మితం
బయినయీమడుగునమునుఁగుమనిపలికి* (సీ॥ ముసలితాపసిఁబట్టిమొగినెత్తికొనిపోయిమునుగునామడుగునమునిఁగిలేచి।వ
నితాజనులనెల్లవలపించువారలై సుందరమూర్తులైసుభగులగుచుఁ।గమలమాలికలతోఁగనకకుండలులుగాఁ బుష్పసాయకు
తోడఁబోలితుల్యు।లైసూర్యతేజసులైయున్నవారలముగ్వురఁబొడఁగాంచిసుకుదచాల। నందుఁబెనిమిటివీఁడనియెఱుఁగ
లేక।గరితగావుననిజనాథుఁగానఁగోరి।సుభగవతులార నానాథుఁజూపుమనుచు। నశ్వినీదేవతలకునయ్యబలమ్రొక్కె* (వ॥
వారలాపతివ్రతతనంబునకుమెచ్చి వయోరూపసంపన్నుండయినచ్యవనుఁజూపి దంపతులవీడ్కొని విమానారూఢులై వేలు
పులప్రోలికింజనిరంత* (సీ॥ యాగంబుసేయంగనర్థించి శర్యాతి చ్యవనమునీంద్రునాశ్రమముకడకుఁ । గూతురునల్లునిఁ
గొనిపోవువేడుకవచ్చిపుత్రికకుఁబార్శ్వంబునందు । సూర్యతేజంబునసొంపారువరుగని వీఁడెవ్వఁడోదీనివిభుఁడుగాఁడు।చె
ల్లరేయనిపుత్రిసేసిదప్రియములుమ్రొక్కులునొల్లక మోముపాంచి।మాఱుమాటాడదీవింప మనసురోసి । చ్యవనుఁడధింకు
డుమునిజనసత్తముండు।భువనపన్నుతుఁడతఁడెందుఁబోయెనాతఁ।డెట్లువందింపబడియెవీఁడెవ్వఁడబల* (మ॥తగవేధర్మమె
శీలమేకులజవైదప్పెందిమోదింపనా।జగదారాధ్యునిఁబుణ్యశీలుఁదపసిన్సాధ్వీమనస్సమ్మతు । న్మగనిన్మానిభుజంగుఁబొందఁద
గునేమానంబువాటింపఁగా । దగదేవర్గతిద్రోచితేకతినవై తండ్రింబతిం గూతురా* (గీ॥ పద్మనయనమగఁడుప్రాయంపు

ప్రచ్ఛికొనిన-దట్టముగనావరించిన—నడికినడికి-పొంచిపొంచి—మొదవులవెల్లువలు-ఆవులగుంపు—కానీనుండు-కన్యకకుజనించినవాఁడు.
తమకియగుచు-భ్రమగలదయికంటకము-ముల్లు—భుజంగుఁ-జారపురుషుని—విషయంబులు-దేశములను.

వాఁడై నఁగాఁపు వెట్టికొంత గావ నేర్చుఁ గపటిముసలి తపసి గావంగ నేర్చునే। యువతిముసలిఁ గూర్చుటొప్పదెందు* (వ॥ అ
ని పలికిన నప్పతివ్రత తాఁ లలామంబు చిఱునగవు చెక్కుటద్దంబులు పిడిముడిపడం దండ్రి కిట్లనియె* (క॥ నీయల్లుఁడితఁడు భార్గ
వుఁడ య్యాజారుండు గాఁడు హర్షముతోడ నెయ్యంబు నిల్పమంచును। దొయ్యలి సర్వంబుఁ దండ్రికి విన్పించెన్* (వ॥
అంతశర్యాతియు నప్రమత్తుండై కూఁతురిం గౌఁగిలించుకొని గారవంబున నైనపుగమ్మని దీవించె నంత భార్యాసహితుండై చ్య
వనుండు సవనీశునకు యాగంబు సేయించి యొక్క పాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజతపోబలంబున నశ్వినీ దేవతల
కిచ్చినం జూచి* (క॥ కోపముతోడుత వాసవుఁడేపున ముని వైవ వజ్రమెత్తిన నలర్। దాపసుఁడు వజ్రిభుజమున నాపవిని
లిపెన్ జగంబులాశ్చర్యపడన్* (వ॥ ఇవ్విధంబున నశ్వినీదేవతలిద్దఱు సోమపానంబు లేనివారయ్యుఁ జ్యవనుసామర్థ్యంబునఁ
బ్రాప్తభాగులై చనిరి శర్యాతికి నుత్తానబర్హి యానర్తుండు భూరిషేణుండనను మువ్వురు కొడుకులు గలిగిరందు* (సీ॥ ఆన
ర్తునకు రైవతాహ్వయుండు దయించె నతఁడు కుశస్థలి యను పురంబు। నీరధిలోపల నిర్మించె బెంపుతో నానర్తముఖవిషయం
బులేలెఁ గని యొకకుకుద్మి ముఖ్యులైన నందనశతముఁ గకుద్మి విశాలయశుఁడు। దనకూఁతు రేవతి ధాతముందటఁ బెట్టి తగువరునడి
గెడి తలఁపుతోడఁ గన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేగి యచట గంధర్వకిన్నరులజుని మ్రోల। నాటపాటలు సలుపఁగ నవసరం
బుగాక నిలుచుండె నతఁడొక్కక్షణము దడవు॥ అంత నవసరంబయిన నజునికి నమస్కరించి కకుద్మి యిట్లనియె* (గీ॥ చాలముద్దరా
లు జవరాలు కోమలాంగి యీశుభాత్మురాలి కెవ్వఁడొక్కొ। మగఁడు సెప్పుమనిన నజుఁడు జూచి పకపక। నవ్వి భూమిపతికి నలువపలికె*
(సీ॥ మనుజేశ దీనికై మదిలోన దలఁచిన వారలెల్లను గాలవశత జనిరి। వారలబిడ్డల వారల మనుమల వారలగోత్రంబు వా
రినైన వినము మేదిని మీఁద విను మునీ వచ్చిన యీలోన నిరువదియేడుమాఱ్లు। నొండొండ నాలుగు యుగములు సనియెనీవటుగా
న ధరణికి నరుగుమిపుడు। దేవదేవుండు హరి బలదేవుఁడనఁగ। భూమిభారంబు మాన్పంగఁ బుట్టినాఁడు। సకలభూతాత్మకుఁడు ని
జాంశంబుతోడ యువతిమణి నిమ్ము జనమణి కున్నతాత్మ* (వ॥ అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి భూలోకంబునకుం జ
ను దెంచి సోదరస్వజనహీనంబగు తననగరంబున కారాజు వచ్చి బలభద్రుంగాంచి రేవతీకన్యన తనకిచ్చి నారాయణాశ్రమంబ
గు బదరికావనంబునకు నియమంబునఁ దపంబుఁ జేయుటకుం జనియె* (క॥ నభగుఁడను మనుజపతికిని। శుభమతి నాభాగుఁడనఁగ
సుతుఁడుదయించెన్। బ్రభులై వెలయుతలంపున। విభజించిరి భ్రాతలతని విత్తమునధిపా* (వ॥ అంత నాభాగుండును బ్రహ్మ
చారియై తనతోడంబుట్టువులను ధనంబు పాలడిన వారలు దండ్రిచెప్పిన క్రమంబున నిచ్చెదమనిన నాభాగుండు తండ్రియగున
భగుకడకుం జని విభాగంబు సేయుమని పలికిన నతండింక నంగిరస్సులు మేధగలవారలయ్యును సత్రయాగంబు సేయుచునా
అవదినంబున నర్హకర్మంబులు దోఁపక మూఢులయ్యెదరు వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెండెఱింగించినఁ గవియనం
బ్రసిద్ధికెక్కెడువారలు దానంబు సేసి కృతకృత్యులై స్వర్గంబునకుఁ బోవుచు సత్రావశిష్టంబగు ధనంబు నీకిచ్చెదరని పలికి
నం దండ్రివీడ్కొని నాభాగుండు నట్లు సేసిన నంగిరస్సులు సత్రపరిశేషధనంబు లతనికిచ్చి నాకంబునకుం జనిరంత* (క॥
అంగిరసులిచ్చు పసిఁడికి నంగళమతిఁ జేరు నృపుని మానిచి యొకఁడు। త్తుంగుఁడు జలదనిభాంగుఁడు ముంగనిలుచుండి విత్తముం
జేకొనియెన్* (వ॥ వానిం జూచి నాభాగుండు దనకు మునులిచ్చుటం జేసి తనధనంబని పలికిన నమ్మహాపురుషుండు మీతండ్రి సెప్పి
న క్రమంబ కర్తవ్యంబనిన నాభాగుండు నభగునడిగిన నతండు యజ్ఞపరిశిష్టంబగు ధనంబు దొల్లి మహామునులు రుద్రునకిచ్చిరది
కారణంబుగా నాదిదేవుండు సర్వధనంబులకు నర్హుండనిన విని వచ్చి నాభాగుండు మహాదేవునకు నమస్కరించి దేవా యీధ
నంబు నీయధీనంబని మాతండ్రి సెప్పె నేనపరాధంబు సేసితి సహింపుమనవుడు భక్తవత్సలుండగు నమ్మహాపురుషుండు నభగు
సత్యవచనంబులకు నాభాగుని నిజంబునకు మెచ్చి నీవు దప్పక పలికితివి కావున సత్రపరిశేషితంబగు ధనంబు నీకు నిచ్చితినని పలికి
యంతర్దర్శిత్వంబును సనాతనంబగు బ్రహ్మజ్ఞానంబుపదేశించి తిరోహితుండయ్యె నివ్విధంబున* (క॥ భువిలో నాభాగుని కథ।
ధవళమతిన్ రేపుమాపుఁ దలఁచిన మాత్రన్। గవియగు మంత్రజ్ఞుండగుఁ। బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁడై* (వ॥
అంత నాభాగునకు నంబరీషుండు జనియించె - నతనియందు జగదప్రతిహతంబైన బ్రాహ్మణశాపంబు నిరర్థకంబయ్యె నేమి కార

## * అంబరీషోపాఖ్యానము. *

ణంబున నమరంతంబైన బ్రహ్మదండంబు వలన నితండు సదువంబడియెనని యనిన నప్పుడమితేనికి శుకుండిట్లనియె* (శా॥ సప్తద్వీపవిశా
లభూభాగము దోస్తంభంబున నంబూనిసం। ప్రాప్తశ్రీయుతుఁడై మహావిభవసంపచ్చాతురిం గల్గిదు। ర్వ్యాప్తింజెందె వెన్న
వార్చనలమేరం గాలముం బుచ్చుచున్। సంప్రాప్తిం బొందక యొప్పె సద్గుణగరిష్ఠుండంబరీషుండిలన్* (సీ॥ చిత్తంబు మాధవు శ్రీ
పాదములయందు పలుకులు హరిగుణపఠనమందు। కరములు విష్ణుమందిర మార్జనమునందు శ్రవములు హరికథాశ్రవణమందు।
చూపులు గోవిందరూపవీక్షణమందు శిరము కేశవ నమస్కృతులయందు। పదములీశ్వర గేహ పరిసర్పణములందు కామంబు చ

క్రి కైంకర్యమందు। సంగమచ్యుతనిజగుణసంగమందు। ఘ్రాణము మురారిభక్తాంఘ్రికమలమందు । రసనతులసీదళములందరసు
లు పుణ్య।సంగతులయందయా రాజచంద్రమునకు॥ నాటియున్నమ్మహీవిభుండు* (సీ॥ ఘనవైభవంబునఁ గల్మషదూరుఁడై యజ్ఞే
శునీశునజ్ఞాతుఁ గూర్చి । మొనసి వసిష్ఠాదిమునివల్లభులతోడఁ దగిలి సర్వాతీతటమునందు । మేధతో బహువాజిమేధంబులొన
రించి గణుతింపరానిదక్షిణలు వెట్టి । సములోష్టహేముఁడై సర్వకర్మంబులు హరిపరంబులు గాఁగనవనియేలె విష్ణుభక్తులందువి
ష్ణువునందుఁగ । లంక మెడలఁగ నుపలంకె వెట్టి । విహితరాజ్యవృత్తి విడువనివాఁడునై । యతఁడు రాజతపసియు నఁగనొప్పె॥
వెండియునమ్మహాభాగవతుండు* (క॥ హరియని సంభావించును । హరియని దర్శించు నంటు నాఘ్రాణించున్ । హరియని రుచిగొ
నఁదలఁచును। హరిహరి యను నంబరీషుఁ డలవియె పొగడన్* (వ॥ ఇట్లు పుణ్యచిత్తుండీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు సే
యుచున్న సమయంబున* (గీ॥ ఆతనికి హయములందుఁ గరులందు। ధనములందుఁ గేళివనములందు। పుత్రులందు బంధుమి
త్రులయందును । పురములందు సంతిపురమునందు* (వ॥ అంతఁ గొంత కాలంబునకమ్మేదినీకాంతుండు సంసారంబువలని తగు
లంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తిపరవశుండై యుండ నారాజతపసికి భక్తలోకవత్సలుండగు పురుషోత్తముండు ప్ర
తిభటశిక్షణంబును, నిజజనరక్షణంబును, నిఖిలజగదవక్రంబగు చక్రంబిచ్చె నంత* (క॥ ఆనతో డినీడక్కై వడి ననురూపగు
ణాఢ్యయైన యాత్మమహిషితో। జనవిభుఁడు ద్వాదశీవ్రత। మొనరఁగ హరిఁ గూర్చి చేసె నొకయేఁడు దరిన్* (వ॥ ఇట్లు వ్రతంబు
సేసి యావ్రతాంతంబున గార్తికమాసంబున మూఁడు రాత్రులు నుపవసించి కాళిందీజలంబులను స్నాతుండయి మధువనంబు
న మహాభిషేకవిధానంబుల విహితపరికరసంపన్నుండై హరిసభిషేకంబు సేసి మనోహరంబులైన గంధంబులు సమర్పించి
యభినవామోదంబులైన పుష్పంబులం బూజించి తదనంతరంబ* (శా॥ పాలేఱై ప్రవహింపఁ గ్రుగ్గుచు లేఁబ్రాయంబులం రూ
పముల్। హేలం ధూర్తలుగాక వెండిగొరిజల్ హేమోరుశృంగంబులన్ । గ్రాలం గ్రేఁపులనబ్బు నాఁకుచును నంగచ్ఛాయలై
యున్న వందాలన్నర్బుదషట్క మిచ్చె భూభుఁడుద్యద్వైభవశ్రేణికిన్* (క॥ పెక్కండ్రు విప్రవరులకు। గ్రక్కున నతిభక్తితో
డఁగడుపులు నిండన్। జొక్కపుటన్నంబిడి విభుఁ। డొక్కెడఁ బారణము సేయ నుద్యోగింపన్॥ అయ్యవసరంబున* (క॥ భాసుర
నిగమపదోపన్యాసుఁడు మ తపోవిలాసుఁడనుపవాసయోగాభ్యాసుఁడు రవిభాసుఁడు దు । ర్వాసుండేతెంచె దన్నివాసంబున
కున్* (వ॥ వచ్చిన నమ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు సేసి కూర్చుండఁగద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి సేమంబరసి తన
యింటనన్నంబు గుడువు మని నమస్కరించిన నమ్మహాత్ముండు సంతసించి భోజనంబునకు నంగీకరించి నిర్మలంబగు కాళిందీజలం
బులం బరమధ్యానంబు సేయుచు మునిఁగి లేచి శాకతడవు సేసిన ముహూర్తావశిష్టయగు ద్వాదశియందుఁ బారణ సేయవల
యుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారలనుద్దేశించి* (క॥ ముని నీకు సొచ్చి వెడ
లఁడు। చని యెను ద్వాదశియు నింతిచనని దెయిూలో। న పారణయున్న్యలయును । పనుఁడగ్గ్హంబైన ధర్మవిధమెట్టిదియో॥ అనిప
లికిన నా రాజునకు బ్రాహ్మణజనులిట్లనిరి* (గీ॥ అతిథివోయి రామి నధిపయీ ద్వాదశి । పారణంబు మానఁబాడిగాదు। గుడువకుం
డఁగాదు గుడుచుటయును గాదు। సలిలభక్షణంబు సమ్మతంబు* (వ॥ అని ధర్మసందేహంబు వాపిన నా రాజర్షిశ్రేష్ఠుండును మ
నంబున హరిందలంచి నీరు పారణంబు సేసి జలంబుల మునింగిన తపసి రాక కెదురుచూచుచున్న సమయంబున* (సీ॥ యమునలో
గృతకృత్యుఁడై వచ్చి రాజుచే సేవితుండై రాజచేష్టితంబు । బుద్ధిలోనూహించి బొమముడి మొగముతో నవరెడి మేనితో నాగ్ర
హించి । రెట్టించి యాఁకలి కోర్వక మిట్టాడంగ నీసంపదున్మత్తుఁ డీనృశంసు । నీదురహంకారు నిందరు గంటిరే విష్ణుభక్తుఁడు గాఁడు
వీఁడు నన్నుఁ గుడువరమ్మని మును ముట్టఁ గుడిచినాఁడు । ధర్మభంగంబు సేసి కుమర్త్యుఁడయ్యె । నైననిప్పుడు నూపెదనన్ని దిశల
నేను గోపింపమాన్పు వాఁడెవ్వఁ డనుచు* (చ॥ పెటపెట బండ్లు గీటుచును భీకరుఁడై కనుగ్రేవ నిప్పుకల్ । పొటపొట రాలఁగం
డములు పొంగ మునీంద్రుఁడు హుంకరించుచున్ । జటమొదలంటఁ గాఁ బెఱికి చక్కనవానసకృత్య నాయుధో । త్కట వనమాల
హస్తయుగ నొనరంగ వియుంచె రాజుపైన్* (క॥ కాలానలసన్నిభమై। శూలాయుధహస్తయగుచు నసుఱసుఱ క్రేఁ।స్నె
లఁబదంబుల ద్రొక్కుచు। వాలమహాకృత్య నృపుజవల్లభుఁ జేరెన్* (గీ॥ ఆప్రకారమెఱిఁగి హరివిశ్వరూపుండు। వెట్టితపసిచే
యు వేఁడబంబుఁ। జక్రంబుఁ బెట్టుమనుచుఁ జక్రంబుఁబంచినఁ। బచ్చెనదియుఁ బ్రళయవహ్నిపగిది* (వ॥ వచ్చి మునిపంచిన కృత్యను ద
హించి యసవసనక ముని వెంటంబడిన మునియు మేరుగుహ సొచ్చిన నదియు వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన
సొచ్చె। ఆటియును* (మ॥ భువి దూరన్ భువి దూరు నబ్ధి సొర నబ్ధుల్సొచ్చు నుద్యోగియై । దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు దిక్కులకుఁ బో దిగ్వీ
ధులంబోవుఁ జి। క్కవెసన్ గ్రుంకినఁ గ్రుంకు నిల్వ నిలుచున్ గేడింపఁ గేడించు । నొక్కవడిన్ దాపసు వెంటనంటి హరిచక్రంబన్ని
దుత్యగ్రమై* (శా॥ ఏ లోకంబున కైన వెంటఁబడి తోనే తెంచు చక్రానల । జ్వాలల్ మాన్పు వారు లేమిఁ జని దేవశ్రేష్ఠులో కేశు

రేపు మాపు - రాత్రిందివములు — సమలోష్టహేముఁడై - మంటిగడ్డను బంగారును తుల్యముగఁ దలఁచినవాఁడయి — మేదినీకాంతుండు - రాజు.

హా! డాలోకించి విధాతవిశ్వజననవ్యాపారపారీణ నే । ఖాలీలేశుణ కావవే కరుణఁ జక్రంబున్ని వారింప వే॥ అనిన బ్రహ్మ యిట్ల
నియె॥ (మ॥ కనుఁ ద్విపరార్ధసంజ్ఞ గలయీ కాలంబుఁ గాలాత్ముఁడై । హరి దిన్నాండఁగఁ జేసి లోకముల నాచోటు న్విభుం డెవ్వ
డో । హరిమూర్తి న్గమక్రేవఁ గెంపులోలు నెన్నఁ స్మంబుగాఁ జేయునా । హరిచక్రాకృతివహ్ని కన్యుఁ డొకరుం డడ్డంబుగా నేర్చునే॥
(గీ॥ ఏమహాపురుషు దత్తుఁడింద్రాదులును బ్రజాపతులు భృగుఁడు భూతపతులు శిరము । లందు డాల్తుమతని యాజ్ఞ జగద్ధితం । బం
చు భూరికార్యమతులమగుచు॥ (వ॥ కావున నీసుదర్శననివారణంబునకు నోపనని పలికిన దుర్వాసుండు కైలాసంబునకుం
జనుదెంచి శర్వునాలోకించి చక్రానలంబు తెలంగతింగించిన నమ్మహాదేవుండిట్లనియె॥ (సీ॥ వినుము యీత్రతం డియాపి శ్వేశ్వ
రుని యందుఁ జతురాస్యజీవకోశములు పెక్కు । వేలసంఖ్యలుగూడి వేళతో నిబ్బంగి నగుచుండు జనుచుండు నవి యొకఁ గాక । యీ
శ్వానిచే భ్రాంతి నేమందుచున్నార మేను దేవలుఁడును శేంద్రసుతుండు । నారదుండజుఁడు సనత్కుమారుండు ధర్ముండా కపి
లుఁడు మరీచ్యాదులఖిలసిద్ధరుంబును సిద్ధనివహ మెవ్వని మాయ । నెఱుఁగ లేము మా లమిట్టిదనుచు । నట్టి నిఖిలనాథు నాయుధ శ్రే
ష్ఠంబు । దొలఁగఁ జేయ మాకు దుర్లభంబు॥ (వ॥ మునీంద్రా నీవు నమ్మహాత్ము నిశరణంబు వేదుమతండు మేలు సేయంగలవాఁడ
ని పలికిన నీశ్వరు నివలననిరాశుండై దుర్వాసుండు వైకుంఠనగరంబున కుంజని॥ (శా॥ ఆవైకుంఠములో నిభర్మమణిసౌధాగ్రం
బుపై లక్ష్మీ డాఁ క్రేవ నెల్లనర్మభావములన్నీ గ్రిడింపఁ బుణ్యస్మారిఁ । దేవాధీశ్వరుఁ గాంచి యో వరద యో దేవేశ యో భ
క్తరక్షా విద్యా వరతంత్రమా నువఁగ జేచక్రానలజ్వాలలకు॥ (ఉ॥ నీ మహిమార్ణవంబు మదినిక్క మఁగా నెఱుఁగంగ లేక నీ ।
ప్రేమకు వచ్చు దాసులకుఁ బిచ్చఁలనంబున నెగ్గు జేసితి । నా మతి యవ్వనిహింపు మటనారకుఁడైన మనంబులో భవ । న్నామము
చింత సేసిన ననంతసుఖస్థితి నొందకుండునే॥ (వ॥ అని పలికి పాదకమలంబులకు మ్రొక్కి లేవకయున్న దుర్వాసుం గని హరి యి
ట్లనియె॥ (చ॥ చలము నబుద్ధి సంగులను సాధులు నా హృదయంబు లీలదొం । గిలి గొని పోవుచుండుదురు కిబ్బి పభక్తిలతాచయం
బులు నన్నులు నఁగఁ బట్టి కొట్టుదురు నే గుణ తో మక సంభికై వడి । నన్నులకుఁ జిక్కి భక్తజనవత్సలతం జనుచుండ దావసా॥ (గీ॥ నా
కు మేలు గోరు నాభక్తుఁడగువాఁడు । భక్తజనులకే నుఁ బరదుగతియు । భక్తుఁడెందు జనిన బఱతెంచు వెను వెంట । గోవు వెంటఁ ద
గులు కోడె భంగి॥ అదియునుం గాక॥ (గీ॥ తనువు సుతుల విడచి తనయుల జుట్టాల । నాలి విడిచి సంపదాలి విడిచి । నన్నె కాని యన్య
మెన్నఁడు నెఱుఁగని । వారి విడువ నెట్టి వారి నైన॥ (క॥ పంచేంద్రియముల తెరువుల । వంచించి మనంబునందు వరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నన్ను । మంచి వరు న్భవ్యసతులు మాటఁగినభంగిన్॥ (క॥ సాధుల హృదయము నాయది । సాధుల హృదయం
బు నేను జగముల నెల్లన్ । సాధుల నేనెఱుంగుదు । సాధులెఱుంగుదురు నా చరితము విప్రా॥ (గీ॥ ధారుణీసురులకుఁ దపము
విద్యయు రెండును ముక్తి సేయుచుండు ముదము శోడ । దుర్వినీతులైన దుర్గజులకు మీకు । నిది యొకఁ గీడు గాక నేలయుండు॥ (క॥ నా తే
జము సాధులలో । నాతతమై యుండు వారి నలఁచు జనులకుఁ । హేతిక్రియభీతి నిచ్చును । చేతో మోదంబు చెఱుచు సిద్ధము సుమ్మీ॥
(క॥ అదె పో బ్రాహ్మణ నీకును । సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుతగుణా । స్పదుఁడిచ్చు నభయ మాతని । మదినెంత సపఱచి
వేఁడుమా శరణంబున్॥ (మ॥ అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహాహ్లాద్య చ్చక్రకీలావళీ । జనితాయాసుఁడు నిర్వికాసుఁడు దిత
స్వాంతుండు దుర్వాసుఁడు । ల్లన నేతెంచి సభక్తి గాంచె గుణాలావణ్య వేమున్వదో । మున యోదారమనీషు సంభావితభూము
న్నంబరీషు న్వేసరన్॥ (వ॥ కని దుఃఖితుండై మహీవల్లభు పాదంబులు వట్టి విడువకున్న నా నరేంద్రచంద్రుండు చరణస్పర్శనంబు
నకు నోడుచు గరుణారసభరితహృదయుండై హరిచక్రంబును హృదయంబున నిట్లని స్తుతియించె॥ (సీ॥ నీవ పావకుఁడవు నీవ
సూర్యుండవు నీవ చంద్రుండవు నీవ జలము । నీవ నేలయు నింగి నీవ సమీరంబు నీవ భూతేంద్రియనికరములును । నీవ బ్రహ్మంబును
నీవ సత్యంబును నీవ యజ్ఞంబును నీవ ఫలము । నీవ లోకేశులు నీవ సర్వాత్మవు నీవ కాలంబును నీవ జగము । నీవ బహుయజ్ఞభోజివి నీ
వ నిత్య । మూల తేజంబు నీవ నే మ్రొక్కువాఁడ । నీరజాక్షుండు చాల మన్నించునట్టి । శస్త్రముఖ్యమ కావవే చాలు మునిని॥ (మ॥
హరి చే నీవు విసృష్టవై చనఁగ మున్నాలించి నీ ధారల । న్ధరణి న్వ్రీలుట నిక్కమం చుముమనుష్ పేదై దైత్యేంద్రమద్యంబుల । న్నిరముల్వా
దములు న్భుజాయుగళము చ్ఛేదింపనంగంబులు । న్నొరలు ప్రాణసమీరముల్దదలు నీ యౌగ్ధంబులం జక్రమా॥ (గీ॥ కలఁగి నిద్రవో
వఁగలఁగోన వచ్చి సనిన్నుఁ జూచి దీర్ఘనిద్రవోదు । రసురవరులు శయ్యలఁ దున్న సతులు ప్ర । భాతమందు లేచి వలువరింప॥ (ఉ॥ చీ
కటి వాపుచున్వెలుఁగు సేయుచు సజ్జనకోటినెల్లన । శ్రీకులఁ జేయు నీ రుచులు చెల్వుగ ధర్మమ సేతులై వినుము । వ్యాపనసిట్టిదట్టిదని
వర్ణన సేయ విధాత నేరఁడు । స్తోకముని మహాద్రుహము దోషనివారి పరాపరాఖ్య మే॥ (గీ॥ కమలలోచనుండు ఖలుల శిక్షింపంగ ।
బాగు సేయ నీవు పాలువడితి । వైనసింకఁ జాలునాసన్నుఁడై యున్న । తపసిఁ గావు మీవు ధర్మవృత్తి॥ (వ॥ అని విమతించి కేలుఁ వ
మ్మిదోయి నొసటం బొసఁగించి యిట్లనియె॥ (గీ॥ ఏన మస్కరి తుమీంద్ర శాత్రవధామ । కేతువున కు ధర్మసేతువునకు । విమల
రూపమునకు విశ్వదీపమునకుఁ । జక్రమునకు నగు ప్రశక్రముకకు॥ అని మఱియు నిట్లనియె॥ (గీ॥ విహితధర్మమందు విహరింతు నేని

యు। నిష్టమైనద్రవ్యమిత్తు నేని। ధరణిసురుఁడు మాకు దైవతంబగు నేని। విప్రునకు శుభంబు వెలయుఁగాక* (క॥ అఖిలగుణాశ్ర
యుఁడగు హరి। సుఖిసైనాకొలువువలనఁ జొక్కెడినేని। న్నిఖిలాత్మమయుండగుటను। సుఖమందుంగాక భూమిసురుఁడివ్వే
ళ* (వ॥ అనియివ్విధంబున నంబోగడు పుడమితేని వలన నన్నిందితపసికి దాహంబు నొందింపక రకరసులగొంగ చక్రంబు తిరిగి
చనియె నంతదుర్వాసుండు శాంతిం బొంది మెల్లని మాటల నారాజుం దీవించి యిట్లనియె* (మ॥ నరనాథోత్తమ మేలు సేసితి కదా
నాతప్పు నన్నించి శ్రీ। హరిపాదాబ్జములెంత ముట్టఁగొలుతే యాశ్చర్యమా నైనచో। నమఁదండ్రీ నినుబోఁటి సాధులకుఁదానై
యిచ్చుటల్లా చట। ల్సోరదినై న్నజగుణంబులై నరసవచ్చుంగా దెమిత్రాకృతిగ। అదియు నుంగాక* (మ॥ ఒకమాటెవ్వని పే
రుకర్ణములలో నొయ్యారమై సోఁకిన। న్సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగున్ సభాస్రింతిశోనట్టిన। ఘుకదున్మంగళతీర్థపాదు హరివి
ష్ణుం దేవదేవేశుఁదా। నకలంకస్థితిఁ గొల్చుభక్తులకు లేనదండంబు రాజాగ్రణీ* (మత్తకోకిల॥ తప్పుఁగొంచు చక్రపావక దాహముం
జెడఁబాపితా। నొప్పునొప్పుభవద్దయారసమోన రేశ్వరప్రాణము। లెప్పమున్నను వోయి క్రమ్మఱఁ జేరె ధన్యుఁడవైతివీ। శౌ
ర్యమున్మభమేను గ్రోరెద నింకఁబోయెద భూవరా* (క॥ అననవిని రాజముఖ్యుఁడు। మునివల్లభు పాదములకు మ్రొక్కి కడున్మ।
న్ననసేసి యిష్టభోజన। మును పుగఁ బెట్టింపఁ దృప్తుఁడయ్యెన తండు॥ మఱియు నమ్మునీంద్రుండిట్లనియె* (శా॥ కంటిన్నేటికి నిన్ను
నీవచనములకర్ణద్వయింబ్రీతిగా। వింటిన్నన్నముఁ గొంటి నీగృహమున న్వేడ్కనౄలంబందెనే। మింటంబోయెద నీచరిత్రమను
ఘల్మర్త్యులు సుఖాసీనులై। మింటన్మేదినిసన్నుతింపఁగలరీమీఁదన్న రేంద్రాగ్రణీ* (వ॥ అని చెప్పి దుర్వాసుం డంబరీషుని దీవించి
కీర్తించి మింటి తెరువున బ్రహ్మలోకంబునకుం జనియె మునీశ్వరుండు మగుడం జను వేళకు నొకవత్సరంబు నిండి వ్రతంబు పరిపూ
ర్ణంబైన* (గీ॥ అవనిసురుఁడు గుడువనతిపవిత్రంబైన। వంటకంబు భూమివరుఁడు గుడిచెఁ। దపసియెగులు మాన్పఁదా నెంతవాఁడ
ను। హరికృపామహత్వమనుచుఁదలఁచి॥ మఱియు* (క॥ హరిఁగొల్చుచుండు వారికిఁ। బరమేష్ఠిపదంబు మొదలు పదభోగంబు। ల్న
రకసమంబనుతలఁపున। ధరణీరాజ్యంబుతో డితగులము మానె॥ ఇట్లు విరక్తుండై* (గీ॥ తనకు సదృశులైన తనయుల రావించి। ధ
రణిభరము వారిఁ దాల్పఁబంచి। కాననంబు సొచ్చి కామాదివిజయుఁడై। నరవిభుండు హరిసమానుఁడగుచు* (క॥ అయ్యంబరీషు
చరితముఁ। దియ్యంబున విన్నఁ జదువధీసంపన్నుం। డయ్యిందును భోగవరుం। డయ్యెందును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా*
(వ॥ వినుమయ్యంబరీషునకు విరూపుండును, గేతుమంతుండును, శంభుండను, వారు మువ్వురుగొడుకులందుఁ గేతుమంతుండు
ను, శంభుండును, హరిం గూర్చి తపంబు సేయువారై వనంబునకుం జనిరి విరూపునికిఁ బృషదశ్వుండును, బృషదశ్వునకు రథీతరుండ
మ్మహాత్మునికి సంతతి లేకున్న నంగిరస్సను మునీంద్రుండు తని భార్యయందు బ్రహ్మతేజోధనులయిన కొడుకులం గనియె వారలు రథీ
తరగోత్రులు నాంగిరసులను, బ్రాహ్మణులునై యితకులందు ముఖ్యులై ప్రవర్తిల్లిరని చెప్పి శుకుండిట్లనియె* (క॥ ఒకనాఁడు మ
నువు తుమ్మిన। వికలుఁడుగాఁక తనిఘ్రాణరంధ్రము వెంటం। బ్రకటయశుండిక్ష్వాకుఁడు। నకలంకుఁడు పుట్టె రవికులాధీశుండై*

## ఇక్ష్వాకువంశానుక్రమము.

(సీ॥ ఇక్ష్వాకునకుఁ బుత్రులెలమిఁ బుట్టిరి నూఱ్వురమరవికుక్షియు నిమియు దండ। కుండు నాతని పెద్దకొడుకులు మువ్వురార్యా
వర్తమంపుహిమాచలంబు। వింధ్యాద్రిమధ్యనుర్వీమండలము గొంత నేలిరి యిరువదియేవురొకట। పొంకుగ నాతూర్పుభూ
మి పాలించిరి యందఱు పడమటికధిపులైరి। యున్ననలువదియేడ్వురు నుత్తరోర్వి। దక్షిణోర్వియుఁ గాచిరి తండ్రియంత। నష్ట
కాశ్రాద్ధమొనరింతు ననుచు నగ్ర। సుతు వికుక్షి నిరీక్షించి శుద్ధమయిన। మాంసఖండంబు దెమ్మనె మహితయశుఁడు* (మ॥ అ
గుఁగాకంచు వికుక్షి వేఁటఁజని ఘోరారణ్యభూమిందగ। న్మృగసంఘంబులఁ జంపి బిట్టలసి తా మేనొల్లఁ బోనాకట। న్నగమై
యొకశశంబువట్టి తిని శేషంబైన మాంసంబు శ్రీ। ఘ్రగతిం దండ్రికిఁ దెచ్చియిచ్చె నకళంకస్ఫూర్తిఁ వర్తిల్లఁగాక* (తరల॥
కులగురుండు వసిష్ఠుఁడంత వికుక్షికుం దెలుదింటలో। పల నెఱింగి యనర్హమెంగిలి పైతృకంబొనరింపఁగా। వలదు వీఁడు దురా
త్ముఁడండన వానితండ్రియు వానిఁ జెంతలను జేరఁగనీక దేశము దాఁటిపోనడఁచెన్వడిగ* (గీ॥ కొడుకు వెడలఁగొట్టి గుణవంతుఁడి
క్ష్వాకుఁ। డావసిష్ఠుఁ డేమియానతిచ్చె। నదియుఁజేసి యోగియై వనంబున గళే। బరము విడిచి ముక్తిపదము నొందె* (చ॥ జన
కుఁడు ముక్తిఁ బొందనయశాలి వికుక్షి శశాదుఁడంచు భూ। జనులు నుతింప నీధరణిచక్రమశేషము నేలి యాగము। ల్గొనకొని
చేసెఁ బ్రీతిహరిఁగూర్చి పురంజయపుత్రుఁ గాంచె బేరొకనేయము రేంద్రవాహుఁడు కకుత్స్థుఁడునంచును వానిలోకముల్*
(సీ॥ కృతయుగాంతంబున దితిసుతామరులకు రణము య్యెనంపులశాతుసులకు। నమరవల్లభుఁడోడి హరితోడఁ జెప్పినజలజ
నేత్రుఁడు పురంజయుని యందు। వచ్చి నేనుండెద వాసవవృషభంబవై మోపుమనిపలుక నమరవిభుఁడు। గోరాజమూర్తికక
కుత్స్థిదేశంబున నాపురంజయు మోచె నంతనతఁడు। విష్ణుతేజంబు దనయందు విస్తరింప। దివ్యచాపంబు చేపట్టి దీర్ఘనిశిత। బా
ణములబూని వేల్పులు ప్రస్తుతింప। నంతఁగాలాగ్నిచాడ్పుననని కినడచె* (చ॥ నడిచి శరావళిందనుజనాథుల మేనులు చించి కం

తము | ల్గ్రాడితోడి ద్రుంది కాలుపురిత్రోవకుఁ గొంచదెఱఁ బుచ్చికొందఱ | న్వాడి నురగాలయంబున నివాసము సేయఁగఁ దోలి
యంతనా | రడకనిశాచరేంద్రుల పురంబులు గాల్చెఁ బురంజయాఖ్యతన్ ✱ (వ॥ ఇవ్విధంబున శశాదపుత్రుండు రాక్షసుల
పురంబులు జయించిన కతంబునం బురంజయుండును, వృషభరూపుండయిన యింద్రుండు వాహనంబగుటం జేసి యింద్ర
వాహనుండ తనిమూపురం బెక్కి రణంబు సేసిన కారణంబునఁ గకుత్స్థుండనని మూఁడు నామంబులఁ బ్రసిద్ధి కెక్కె దైత్యులధనం
బులనింద్రునకిచ్చె నప్పురంజయునిపుత్రుండనేనస్సతనిపుత్రుండు పృథుండు, పృథునకు విశ్వగంధుండు, విశ్వగంధునకుఁ జంద్రుండు
చంద్రసుతుండు యువనాశ్వుండు, యువనాశ్వతనూభవుండు శబస్తుండతండు శాబస్తినామ నగరంబు నిర్మించె శబస్తతన
యుండు బృహదశ్వుండు బృహదశ్వునకుఁ గువలయాశ్వుండానరేంద్రచంద్రుండు ✱ (క॥ లావు మెఱసి యిరువదియొక | వేవు
రునందనులుఁ దాను వీఁడఁ దతఁడు భూ | దేవుఁడు గంటుఁడు వనుపదు । రావహుఁడై చంపె దుంధునమరాబంధున్ ✱ (వ॥ అదికార
ణంబు గాఁ దుంధుమారుండన నెగడెనయ్యసురముఖానలంబునఁ గువలయాశ్వకుమారులందఱు భస్మంబులైరందు దృఢాశ్వుం
డును, కపిలాశ్వుండును, భద్రాశ్వుండునను వారలు ముగ్గురు చిక్కిరందు దృఢాశ్వునకు హర్యశ్వుండును, హర్యశ్వునకు నికుం
భుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృతాశ్వుండును, గృతాశ్వునకు సేనజిత్తు, సేనజిత్తునకు యువ
నాశ్వుండు జనించె నతండు గొడుకులు లేక నూర్వురు భార్యలుం దానును వేఁజపడియుండె నారాజునకు మునులు కృపఁ జేసి యిం
ద్రునిగూర్చి సంతతికొఱకై యింద్రయాగంబు చేయించిరంత ✱ (సీ॥ భూమీశు భార్యకుఁ బుత్రలాభమునకై పోయుతలంపున భూ
మిసురులు | జలములు మంత్రించి జలకలశము దాఁచి నియమంబుతోఁ గూడి నిద్రవోవ | ధరణీశ్వరుఁడు నీరు దప్పితో నారాత్రి తృతి లే
క యజ్ఞమందిరము సొచ్చి | యానీరు ద్రావి ననంత మేల్కని వారలెవ్వఁడు ద్రావె నీరెందు బోయె । ననుచు రాజు ద్రావుటంత
యు భావించి | యెఱిఁగి చోద్యమందియీశ్వర రాజ్ఞ | యెవ్వఁడోపు గడవనీశ్వరునకు నమస్కారమనుచు నేద కార్యమనుచు ✱ (వ॥
వారలు దుఃఖించుచుండ నంత గొంత దడపునకు యువనాశ్వుని కడుపు వ్రక్కలించుకొని చక్రవర్తి చిహ్నంబులుగల కుమారుండు
జన్మించి తల్లి లేమికతంబునఁ గడుపునకు లేక యేడ్చుచుండ నింద్రుండు వచ్చి శిశువునకు నాఁకలిదీఱుకొఱకు వాని నోటం దన వ్రేలి
డి నంద్రా వెడకతంబున వాని పేరు మాంధాతయని దేశించి చనియెనివ్విధంబున ✱ (గీ॥ కడుపు వగలముద్దుకొడుకు జన్మించిన | ధీ
రుఁడయ్యెదంద్రి దేవవిప్ర | కరుణయట్ల కాదె కడిదిదైవములావు । గలుగువాఁడు బ్రతుకుగాక చెడునె ✱ (వ॥ ఇట్లు బ్రదికియు
న్నయువనాశ్వుండు గొంత కాలంబునకుఁ దపంబు సేసి సిద్ధిం బొందెనంత ✱ (సీ॥ పడమట నొదవెడు బాలచంద్రుని మాడ్కిఁ బూ
టపూటకు వృద్ధిఁ బొందె బాలుఁ | డల్ల నబరిపూర్ణయౌవనారూఢుఁడై రావణాదిరిపుల రాజవరుల । దండించి తను ద్రసదస్యుఁ
డంచును రేంద్రుఁ డంకింపఁ శూరుఁడై యఖిల దేవ | మయు నతీంద్రియు విష్ణు మాధవు ధర్మాత్మ నజుని యజ్ఞాధీశు వాత్మఁ గూర్చి | చేసె
క్రతువులు భూరిదక్షిణలిచ్చి | ద్రవ్యయజమానవిధిమంత్రధర్మయజ్ఞ | కాలబుత్విక్ప్రదేశముఖ్యంబులెల్ల | విష్ణురూపంబులను
చు భావించె నతఁడు ✱ (క॥ బలిమినడంచు నరులం | జలివెలుఁగు న్వేడివెలుఁగు జనుచో టెల్లన్ । జలరుహనయను నికరుణను |
జెలువుగ మాంధాతయేలెసిరినిండారన్ ✱ (వ॥ ఆ రాజునకు శశిబిందుకూతురగు బిందుమతియందుఁ బురుకుత్సుండు నంబరీ
షుండును ముచికుందుండునను వారు ముగ్గురు కొడుకులు నేబండ్రుకూతులుం జనియించి పెరుగుచున్నయెడ ✱ (సీ॥ యమునాజల
ములోన నధికుండు సౌభరి తపము సేయుచు జలస్థలములందుఁ, బిల్లలు దన ప్రాణవల్లభయును గూడి మెలఁగ నానందించు మీనరా
జుఁ గనుగొని సంసారకాంక్షియై మాంధాత నొక కన్యనడుగ నృపోత్తముండు । తరుణి నిత్తును స్వయంవరమునఁ జేకొను మనవు
డు ననుజూచి యౌవనాంగి | మేలము సలిగోరునిట్టట్టుపడఁ గెడి | వాఁడఁ జాల నెరసి వాడనొడల । జిగియు బిగియు లేని శిథిలుం
డఁ గరఁగింపఁ | జాలఁ డిగి చికొనును సాయమెట్లు | అదియునుంగాక ✱ (గీ॥ బాలపువ్వుబోఁడి ప్రాయంపు వానిని । జెన్నువానిధన
ముఁ జేర్చువాని | మఱిగె నేసిగొంతమూలు కుఁ గాకెదిరిఁ ద | న్నెఱిఁగి ముసలితపసి నేలమూలుగు ✱ (వ॥ అని విచారించి సౌభరి తన
తపోబలంబునం జేసి ముసలితనంబు విడిచి యెలప్రాయంపు గోమరుండయి యలంకరించికొని ముందట నిలువంబడిన మాంధాత
యుఁ గన్నియలనగఁ గాఁచికొనియున్న వారికి సెలవు సేసిన వారమ్మునీంద్రుని నారాజపుత్రిక లున్నయెడకుం గొనిపోయి చూ
పిన ✱ (ఉ॥ కోమలులార వీఁడు నలకూబరుఁడో మరుఁడో జయంతుఁడో । యేమతి వచ్చె నీనిదడ వేలవరింతము నేము నేమయా |
చా మునినాథుఁ జూచి చలితాత్మకులై సొరిదిన్వరించిరా | భామినులందఱుం గుసుమబాణుఁడు ఘీయని ఘంటవ్రేయఁగన్ ✱ (వ॥
ఇట్లు రాజకన్యకలం జేకొని సౌభరి నిజతపఃప్రభావంబున ననేకలీలావినోదంబులు కల్పించియందు ✱ (సీ॥ గృహరాజము
లయందుఁ గుసుమవల్లులయందుఁ గోలాహలంబైన కొలకులందుఁ । గలకంఠశుకమధుకరనినాదములచే వర్ణనీయములైన వన
ములందు | మణివేదికలయందు మహనీయపర్యంకపీఠలీలాశైలబిలములందు | శృంగారవతులగు చెలువలు పలువురు తనవంపు సే
యా సుస్థలములందు | సప్రమాల్యానులేపనవర్ణహార | భూరిసంపదనిష్టాన్నభోజియగుచుఁ । బూటపూటకు నొకకొంతహాలు

పుఁడాల్చి। రాజకన్యలనందఱరతులఁ దేల్చె* (క॥ ఏకేంద్రుఁడు రాజముఖులకు । నాకేంద్రుఁడు గడయ్యెఁ దనియఁ డాతండె మునీం ద్రుండొకఁడు స్మృతధారలచే। నకట జలమైత్రి తృప్తి లేనియనలునిభంగిన్ । ఇత్యర్థంబున* (క॥ ఆరామంబున మునివరుఁ। డారా ములతో బహువిహారముఁ యుండె । గారాములందనకిల్లటు పోగాములు సేసికొన్ని ప్రొద్దులు పుచ్చెన్* (వ॥ అంత నొక్కనాఁ డు మేదినీవల్లభోత్తముండగు నామాంధాతమునీశ్వరుండెందు వో యెఱుంగక లేకుండ నలజడిపడుచున్నవారిలో యని తలంచి వెదుకవచ్చి యొక్క మహానగంబున మణిమయసౌధంబులం జక్రవర్తితనయలం బోలెఁ గ్రీడించుచున్న తాపసరాజుం గని సంతసించి వెఱఁగుపడి మన్ననలం బొంది మెల్లనం గూతులం బొడఁగని సత్కరించి యిట్లనియె* (క॥ నాతో దులార మీపతి। మీతో డిదె వసుల మొడలమె లేయనుడున్నాతోడిదె నాతోడిదె। తా తా మేలనుచు ననిరి తరుణులు వరుసన్* (వ॥ అంతగొంతకాలంబునకు భా ర్యాచర్యుండగు సౌభరియే కాంతంబునఁ దన్నుఁ దా నెదిరించికొని మీనమిథునసంగదోషంబునం గాపురంబు దనకు నగుపడు ట యెఱింగి పశ్చాత్తాపంబున నిట్లనియె* (ఉ॥ ఉపవాసంబులఁ డయ్యెఁ టో విషయసంయోగంబు వర్జించుటో। తపముం బూనిచరిం చుటో హరిపదధ్యానంబు నన్నిల్పుటో। యపలాపంబున నేలఁ బొందితివి హా తంబయ్యెం నవంబెల్లనీ। కపటస్త్రీపరిరంభ మఱల్మను లకుం గైవల్యసంసిద్ధులే* (చ॥ మునియఁట తత్త్వవేదియఁట మోక్షము గాని సుఖంబు లెవ్వియుం। జనదఁట కాంత లేఁబదఁట సౌధ చయంబఁట వాసదేశముం। దనయులు నైదువేలఁట నిదానము మీనకుటుంబి సౌఖ్యముం। గనుఁడట చెల్లరే నగవు గాక మహా త్ములు సూచి మెత్తురే* (గీ॥ తపము సేయు వాఁడు దత్త్వజ్ఞుఁడగు వాఁడు । నెలమి మోక్షమిచ్ఛయించువాఁడు। నేకతంబు విడిచి మేర్పడ నేరఁడు । కాఁపురంబు సేయుఁగ ఆటితవసి* (వ॥ అని మఱి ఖిందితనుఁ దానచింతించుకొని తనవేడంబంబు వేచించుము నిహపరసాధకుండై కాపురంబు విడిచి పత్నులుం దానును వానప్రస్థధర్మంబున నడవికిం జని ఘోరతపంబు సేసి శరీరముఁ గుడి యుండి యగ్నిసహితుండై పరబ్రహ్మంబు సొచ్చెనంత* (క॥ మునిపతి వనమునకరిగిన । వనితలు తోనరిగి ప్రాణవల్లభగతి కేం। జనిరి వెనుదగిలి విడువక। యనలునితో శిఖలు నిలువకరిగిన భంగిన్* (వ॥ అంత మాంధాత పెద్దకొడుకగు నంబరీషుండు వానిపి తామహుండగుటం జేసి యువనాశ్వుండనకుఁ బుత్రుండు గావలయునని కోరి పుచ్చుకొనియె - నయ్యంబరీషునకు యౌవనా శ్వుండతనికి హారీతుండు జనియించె నది కారణంబున నంబరీష యౌవనాశ్వ హారీతులు మాంధాతృగోత్రంబునకుం బ్రవరు లైరి-మాంధాత రెండవ కొడుకు పురుకుత్సుండతని నురగలోకంబునకుం గొనిపోయి భుజంగపుమారులు దమ చెల్లెలగు నర్మద యను కన్యకను వివాహంబు చేసిరి - పురుకుత్సుండు నక్కడ ననేకగంధర్వనాథుల వధించి తన నాగలోకసంచరణంబు దలంచు వారికి నురగభయంబు లేకుండ వరంబు వడసి తిరిగివచ్చెఁ- బురుకుత్సునకుఁ ద్రసదస్యుండు, త్రసదస్యునకు నరణ్యుం, డా య రణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వునకు నరుణుండు, నరుణునకుఁ ద్రిబంధనుండు, త్రిబంధనునకు సత్యవ్రతుండు, సత్యవ్రతు నకుఁ ద్రిశంకుండు జన్మించె నతండు* (సీ॥ గురుశాపవశమునఁ గూలి చండాలుఁడై యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి। యతని లా వున దివిజాలయంబున కేగ మన్నింపక సురలు మఱలఁ ద్రోయఁ। దలక్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ గౌశికుండప్పుడు మ నత మెఱసి । నిలిపె వాకవమున నేఁడు నున్నట్టి త్రిశంకుఁ డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె । నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జే రి । యాగదక్షిణమిషమున నఖిలధనముఁ । గొల్లఁగొని మీఁద దుఃఖహీనుఁ గొలువఁబెట్టి । బొంకఁ జలజడిఁ బొందెనా భూవ రుండు* (వ॥ ఇట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నేఁచుట విని వసిష్ఠుండు విశ్వామిత్రుని గృధ్రమ్ముగమ్మని శపించె వి శ్వామిత్రుండును వసిష్ఠుని బకంబుగమ్మని శపించె- పక్షిరూపులయ్యును నా యిరువురు యుద్ధంబు సేసిరంత, హరిశ్చంద్రుండు పుత్రులు లేక నారదుఉపదేశంబున వరుణోపాసన నతిభక్తితోఁ జేయ నావరుణుండు ప్రత్యక్షంబయిన నతనికి మొక్కి యిట్ల నియె* (గీ॥ వరుణ దేవ నాకు వరధీరగుణముల । కొడుకు పుట్టెనేని కొడుకుఁ బట్టి। పశువుఁ జేసి నీకుఁ బరిణమింపంగ వేల్తుఁ। గొడు కు నీగదయ్య కొసరు లేక * (వ॥ అనిపలికిన నగుమాకుండు గలిగెడునని వరుణుండు వరంబిచ్చె నమ్మెనంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుండను కుమారుండు జన్మించె వరుణుండును, హరిశ్చంద్రు కుమారునుద్దేశించి * (సీ॥ పుట్టిటి లోపల వచ్చి పుత్రు వేల్వుమన్నఁ బుట్టు కువెల్లినఁ గానిపొసఁగదనియెఁ । బలుగాక మును వచ్చి పాలు వేల్వుమన్నఁ బండ్లు లేకు న్న పశువ్వుఁడనియెఁ।బండ్లు రాఁ జూచి డింభకుని వేల్వుమన్నఁ బడి పండ్లు రామిన భవ్వుఁడనియెఁ । బడిపండ్లు వొడమినఁ గొడు కు వేల్వుమన్న బోరల కొడక పొసఁగదనియె । దొడరి యిట్లు కొడుకుతోడి మోహంబునఁ । బ్రొద్దుఁ గడపుచుండె భూవ రుండు। నంత్రిడ తలఁపు కొలఁదిపనలోనఁ జింతించి। యింటనుండక డవికేగె వెఱచి * (వ ॥ ఇట్లు వనంబునకుం జని శరశరాసన ధరుండై రోహితుండు దిరుగుచుండె వరుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు మహోదరవ్యాధి చేత బీడితుండుగా నుండుట విని పురంబునకుం దిరిగి రాఁ గమకింప నింద్రుండు ముసలి తపసియై వచ్చి యిట్లనియె* (గీ॥ పుణ్యభూముల రుగుపుణ్యతీర్థంబులఁ। గ్రుంకు పుణ్యజనుల గోరి చూడు। పుణ్యకథలు వినుము భూపాలపుత్రక। మేలుగలుగునట్టి మేరగలదు* (వ॥ అని యిట్లు మగుడిం

చనం దిరిగి చనిరోహితుండొక్క యేఁడవ్వనంబునం దిరిగి క్రమ్మఱఁజను దేర నింద్రుండువచ్చితొంటియట్లనివారించె నివ్విధం
బున॥ (సీ॥ ఐదేండ్లమఱలించె నను రేంద్రుఁడా బాలునాఱవయేఁటవాఁడడవినుండి। యింటికివచ్చుచు నెలమితో నజగర్తుమధ్య
మపుత్రు సన్మాన్యచరితు। ఘనుశునశ్శేఫుఁగొని యాగపశువుగ నా హరిశ్చంద్రున కాతఁడిచ్చెఁ। బురుషమేధము సేసి భూపా
లవర్యుఁడు వరుణుఁడాదిగ దేవతలను దనిపె। హోతకౌశికుఁడధ్వర్యుఁడౌ నరభృగుఁడు। బ్రహ్మ జమదగ్ని సామంబు పాడు
వాఁడు। మునివసిష్ఠుండు మఖమునను ముదముఁ బొంది। కనకరథమిచ్చె నింద్రుఁడా మనుజపతికి॥ (వ॥ శునశ్శేఫుని ప్రభావంబు
వెనుక వివరించెద నంత భార్యాసహితుండయిన హరిశ్చంద్రు వలనం బ్రీతుండై విశ్వామిత్రుండతనికి ముఖ్యజ్ఞానంబు కృప
సేసిన మనంబన్నమయంబుగావున మనంబున నన్నరూపిమైన పృథివి నెఱింగి పృథివిని జలంబు వలన నడంచి జలంబు దేజం
బువలన వినింకించి తేజంబు వాయువువలనం జేర్చి వాయువు నాకాశంబునం గలిపి యాకాశంబు దామసాహంకారంబు నందుల
యంబు సేసి యహంకారత్రయంబు మహత్తత్త్వంబునం దడంచి పరతత్త్వంబునకు లోకంబును సృజించెదనను తలంపైన మహ
త్తత్త్వంబునం దల విషయాకాశంబు నిర్వర్తించి విషయవివర్జితుండై మహత్తత్త్వంబును బరతత్త్వంబుగా నెఱుంగుచు నవ్యో
ఉకవలన సంసారహేతువైన ప్రకృతిని భస్మంబు సేసిన నయ్యేఉకను నిర్వాణసుఖపారవశ్యంబునం బరిహరించి సకలబంధవి
ముక్తుండై హరిశ్చంద్రుండ వాఙ్మానసగోచరంబయిన నిజరూపంబుతో వెలుంగుచుండె నతని కుమారుండు హరితుండు, హరి
తునకుఁ జంప నామధేయుండతండు, దన పేరఁ జంపానగరంబు నిర్మించెఁ జంపునకు సుదేవుండు, సుదేవునికి విజయుండు, విజయున
కు రురుకుండు, రురుకునకు వృకుండు, వృకునకు బాహుకుండు, జనియించెనతండు॥ (సీ॥ దండించి వగవారు దనభూమి జేకొన్న

* సగరచక్రవర్తికథాప్రారంభము. *

నంగనలును దానునడవి కేగి। యడవిలో ముసలిమైయాతఁడుసచ్చిన నాతనిభార్య దానను గమింపఁ। గదియచో నాస్త్రీకి గ
ర్భంబుగలుగుటయౌర్వమునీశ్వరుఁడాత్మ నెఱిఁగి। వారించె నంతనవనజాక్షి సవతులుసూలు నిండారినఁ జూడజాల। కర్థిన
న్నంబుగుడుచుచో నందుఁగలిపి। విషము వెట్టిరి పెట్టిన విడక గుడువ। గరముతోఁగూడ సగరుండు ఘనుఁడు పుట్టి। వరయశస్స్ఫూ
ర్తితోఁ జక్రవర్తి యయ్యె॥ (శా॥ చండస్ఫూర్తినతండు తండ్రి వగకై సంగ్రామరంగంబులన్। చండోగ్రా హైహయబర్బరాదుల
వధించెన్ దాళజంఘామలన్, ముండీభూతులుగా నిరంబరులుగా మూర్తుల్ప భీభత్సులై। యుండం జేసె నిజారులన్ సగరనామో
ర్వీవిభుం డల్పుఁడే॥ (క॥ ఖగరాజరుచులుగల యల। నగరాజులనడఁచి మేలెబాహాశక్తిన్। నగరాజధీరకుమారుల్। సగరుండాహ
తవిమతు నిఖిలజనులు నుతింపన్॥ (సీ॥ ఔర్వుండు సెప్పఁగ నమరవేదాత్మకు హరినీశు నవ్యతు నంతుఁ గూర్చి। వాజిమేధంబు
లువమధీశ్వరుఁడు సేసెనందొక్కమఖమున హయము విడువ। నగభేదిగొనిపోయి నాగలోకంబునఁ గపిలుని చేరువఁ గట్టి తొలఁ
గె। నంతఁగుఱ్ఱము గానక రాజు దనపుత్రనివహంబు దిశలకు వెదుకఁ బంప। వారునీమేదిని దీవులు వరుస వెదకి। మఖతురంగంబు లేకు
న్న మగుడి రాక। ప్రాభవంబున దోర్దండబలము మెఱసి। క్రొచ్చి కోరాడి త్రవ్విరి కుతలమెల్ల॥ (వ॥ ఇట్లు సుమతి కొడుకులు నేలఁ
ద్రవ్వి పాతాళంబునం దూర్పుముట్టియున్న యుత్తరభాగంబునఁ గపిలముని పొంతనున్న తురంగంబుఁ గని॥ (చ॥ ఎఱిఁగితి మద్దిర
యతడ వేఁటకిఁ గుఱ్ఱపుదొంగ యాతఁడే। గురుతుగఁ బట్టి చంపుఁడతి ఘోరమునీంద్రుఁడు వోలె నేత్రముల్। దెఱవక యున్నవాఁ
డితనిఁ దెంపుగఁ బైసి గవట్టినంచుఁ డం। చఱువదివేవురున్ని జకరాయుధముల్ ఘళిపించి డాయుచోన్॥ (చ॥ కపిలుఁడు నేత్రముద్దె
లవఁగాఁ దమ మేనులమంట పుట్టి తా। రవగతదైన్యులై పడియహంకరణంబున మూఢచిత్తులై। నృపసుతులందఱున్ ధరణినీఱయి
రత్తుణమాత్ర సాధులం। దపసులఁ గాసి వెట్టెడి మదస్ఫురితాత్ములు విల్వనేర్తురే॥ (సీ॥ కొండలుక పిలునికోపానలంబున మండిరి
సగర మాకుమారులనుచు। నందు రాముని శాంతుఁడానందమయమూర్తి తొడరి కోపించు నేదువ్వనేల। గాక జన్మించు నే గగన
స్థలంబున నే సాంఖ్యమతమున నిర్గమతులు। భవసముద్రము మృత్యుపదమును లంఘింతురా బుద్ధిఁ జేయ పరాత్మభూతుఁ। డఖిల
బోధకుఁడతని కినర సి చూడ। సఖులు మిత్రులు నెవ్వరు సగరసుతులు। డాముతమచేయు నేరమిదనువులంచు। ననలకీలలు పుట్టినీ
తైరిగాక॥ (వ॥ మఱియు సగరుండా కేశినియందుఁ గన్నపుత్రుండసమంజసుండను వాఁడు సమంజసగుణంబులు లేక పూర్వ
జన్మంబున యోగీశ్వరుండై యుండి సంగదోషంబువలన యోగభ్రష్టుండై సగరునకు జన్మించి జాతిస్మరణజ్ఞానంబుగలిగి లోకు
లకప్రియంబగు వర్తనంబునం దిఱుసుమనొక్కనాఁడు॥ (చ॥ ఎరుసన యోధ్యలోన గలవారల నాడెకుపిన్న వాండ్రనా। స
రయువులోనవైచి జనసంఘముఁ దండ్రియుఁ దిట్టుచుండ వాఁ। డురుమతిఁ గొన్ని ప్రొద్దులకు యోగబలంబునఁ జేసి బాలురం।
దిరిగి పురంబులోపలికిఁ దెచ్చిన నివ్వెఱఁ గందిరందఱున్॥ (వ॥ అంత సగరుండు దన మనుమండగు నంశుమంతుని నశ్వంబు వెదకి
తెమ్మని పంచిన నతండు దమతండ్రులచొచ్చినం జని వారలు ద్రవ్విన మహాఘాతంబు సొచ్చి యందు భస్మరాసులపొంత నున్న హయం
బుఁ గని హయసమీపంబుననున్న కపిలాఖ్యుండైన సహిష్ణునికి దండప్రణామంబు సేసి యిట్లని స్తుతియించె॥ (సీ॥ మఱచికట్టఁబట్టిన

మాధిగౌరవమునవాసి గాంచఁ దనకునవ్వుల వెలుంగు । నినునొక్కఁడనాడై నెఱుఁగు నే యాబ్రహ్మాయిజునిమనంబున నవయవము లఁబుట్టిజన్మించినభూరిజంతువులందుహీనులమైనమా కెఱుఁగవశమె । తమలోనసీవుండఁదా మెఱుంగరు నిన్నుగుణములఁ జూతురుగుణములైనఁ గాననొకచోటఁజీఁకటిగండురాత్మ । లందుదెలియరు వేలుపులరయఁబొందు । లరయుదురు దేహధారులత్యంధులగుదుఁ । గడిదినీమాయ నెన్నఁడుఁగడువలేక ✱ (వ॥ అనినుతిసేయుచు హయంబు విడువుమఁ చెప్పక తనతండ్రులు నీఱగుటం దడవక మ్రొక్కి నిలుచున్న యంశుమంతునకిఁ గరుణావిపులుండగుచుఁ గపిలుండిట్లనియె ✱ (క॥ గుఱ్ఱముఁ గొనిపోఁబుద్ధులకుఱ్ఱడమీ తాత యొద్దకునీ తండ్రు లెల్లఁ బులునీఱైరదె యీమిట్టునగంగాజలంబు మెలఁగ శుభమగుఁగా ✱ (వ॥ అనివల్కిన నమస్కరించి తురగంబుఁ గొనివచ్చి యాపె గరువకిచ్చిన సగరుండాపశువువలవజన్నంబు కడమనించి యంశుమంతునకు రాజ్యంబిచ్చి ముక్తబంధనుండై యౌర్వుండు సెప్పినమార్గంబునను త్తమగతికిం జనియెనంత ✱ (క॥ జనకులు మ్రగ్గిన చోటికి నఁమిష నదిఁదెత్తునని చరింటపెద్దలికింజనితలము సేయఁజాలక । మునిమునవగలోలయునంశుమంతుఁడు దీఱెఁగా ✱ (క॥ అతనికొడుకుదిలీపుఁడు భూతలమునఁ గంగఁదెచ్చిపొందించుటకై ప్రీతిం దపంబు సేయుచు భాతిగఁదే లేక కాలవశగుఁడయ్యెఁగా ✱ (క॥ అతనిసుతుండు భగీరథుఁడతి తపమొనరించి యేనియొనవృత్తాంసంగ మ్మనితరంగస్మఖవనరుహ । రతభృంగస్వజటాగ్రదంగన్నంగా ✱ (వ॥ కనినను సక్కరించిన గంగ కృపచేసి వరంబు వేఁడుమనిన నాకాచపట్టియిట్లనియె ✱ (క॥ మావారిభస్మ రాసుల । నీవారిం గలిపికొనుము నేఁటిమావారల । నీవారిగలయనాకము । మావారికిఁ గలుగునిది ప్రమాణముతల్లీ ✱ (ఇంద్రవజ్రము॥ చెల్లన్మదిన్నిన్నుభజింతుగంగా । ఫుల్లాంతరంగ స్వహువుణ్యసంగా । గల్లోలలక్ష్మీజితకాశమల్లీ । దల్లిస్సదీక ల్పలతా వితల్లీ ॥ అనివినుతులుసల్పుచున్న రాజకుమారునకులోకపావని యిట్లనియె ✱ (మ॥ ఏనువీథిం బర తెంచి నేలఁబడనా వేగంబు మున్నిల్పనోపినవాఁడెవ్వఁడు మేదినీతలము నే భేదించి పాతాళముం । జనుదున్వచ్చితి నేని నాజలములన్ స్నానాసక్తులై మానవుల్ నన్నుబొంపంచునఘవ్రజంబచట నే వాశంబు వొందించెదన్ ✱ (వ॥ అది కారణంబుగా విచారించెదనని పలుకుచున్న లోకమాతకు రాజన్యవర్యుండగు భగీరథుండిట్లనియె ✱ (మ॥ పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపః పారీణులార్యుల్ఘను । ల్పురుషశ్రేష్ఠులు వచ్చి తల్లి భవదంభోగాహముఁ జేయఁగా నిరసంఘౌఘము నిన్నుఁబొందు నెజగన్నాథుండు నా వాఘుసంహారుఁ డావిష్ణుఁడువారి చిత్తములఁ దానై యుంటవు మందాకినీ ✱ (మ॥ తనలోనిన్ని జగంబులుంగలుగుటం దానిన్నిటం జెందుటన్ । జనసీతంతువులందుఁ జీరగలయా చందంబునన్ విశ్వభావనుఁడై యొప్పు శివుండు గాక నీ ఉనీవారిన్నవారింపనే । ర్చినవారెవ్వరు నిన్ ధరించుకొఱకై శ్రీకంఠు నింగొల్చెదన్ ✱ (వ॥ అనిమొఱఁగింగిందవిడ్కొనిచని భగీరథుండు మహేశ్వరును ద్దేశించి ప్రగ్గనఁ దపంబు సేసిన ✱ (గీ॥ భక్తవత్సలుండు ఫాలాక్షుఁడా భగీరథుని మెచ్చి నిజశిరంబునందు శౌరిపాదపూతసలిలమైదివినుండి ధరకువచ్చు గంగఁదాల్చెనపుడు ✱

✱ శ్రీపరమేశ్వరజటాజూటనిర్గతగంగాప్రవాహమహిమానువర్ణనము. ✱

(వ॥ ఇట్లమ్మహానదిపురారాతిజటాజూటరంధ్రంబువలన నిగంబడి నిరర్గళప్రవాహంబై ఖలఖలుజల్లించి నెఱసినిండి పెల్లు వెల్లువంగొని పెచ్చుపెరిగివిచ్చలవిడిఁ గేవు వెంబడిమఱఁక ప్రేగ్లుటుకు మరళప్రాయంపు కామధేనువు చందంబున ముందఱికినిఁ గుసుచు, ముగ్ధచంద్రుకోడి నెయ్యంబునఁ గ్రయ్యవెడలి చొప్పదప్పక పొగిచను జెంచు సుధార్ణవంబుకై వడిఁ పెంపుగలిగి, మహేశ్వరువదనగహ్వరంబువలన నోంకారంబు పెలుంద వెలుపడు శబ్దబ్రహ్మంబు భంగి నదభ్రవిభ్రమంబున నమ్మహీపాలతిలకంబు తెరువు వెంటనంటి వచ్చు వెలిమేనుఁ గుతొండంపాలనుకరించిపఱచువఱనమొగంబుల పెలుంద నందంద క్రందుకొనిపొడసూపితొలంగుబాలశారదాకువకుంభంబులకు నగ్గలంబైన బుగ్గలును, బుగ్గలసంఘడంబునం బారిజాతకుసుమస్తబకంబుల చెలువంబులం దెగడు వెలినురువులును, వెలినురువుల చెంగల నర్థోన్మీలిత కర్పూరతరుకిసలయంబులం గేలిగొనుసుళ్లును, సుళ్లకెలంకుల ధవళ జలధర రేఖాకారంబుల బాగు మెచ్చనినిడుదయేఱులును, యేఱులంగలసి వాయువశంబున నొండొంటిందాఁకి బిట్టుమిట్టించి మీఁదికెగయు దురితభంగంబులైన భంగంబులును, భంగంబులకొనల భిన్నభిన్నంబులై కప్పించి యొప్పరం బెగయు ముక్తియంబు సరుల సరణిచాల్లి కాదామంబుల తెఱంగున గర్పూరఖండకదంబంబులకు రణి, నిందుశకలంబుల తేజంబునఁ దారకానికరంబుల పొలుపున మెఱయుచు, ముక్తికన్యావశీకరంబులైన శీకరంబులునుంగలిగి మధ్యమలోక శ్రీకరంబై, శీకరంబు తెరంగున విష్ణుపదంబు ముట్టి విష్ణుపదంబు భాతినుల్లసితహంసరుచిరంబై, సితహంసంబు రీతినతిశోభితకువలయంబై, కువలయంబుచెన్నున బహుజీవనంబై, జీవనంబులాగున సుమనోవికాసప్రధానంబై ప్రధానపర్వతంబు పోలుపున ననేకచక్రబకభీమమహాభంగసుభద్రాగ్జునచరితాభిరామంబై, రామచిత్తంబు మెలుపునందన వారిలోఁ జొచ్చినదోషాచరాభయప్రధానవణంబై, దానచణుని పోలికె విభూతిసుకుమారంబై కుమారచరిత్రంబు తేవను క్రౌంచప్రముఖవిజయంబై, విజయురథంబు భాతి హరిదయానుంధకంబై, మందరవిచారంబు గ్రద్ధన మహారామ గిరివనప్రవేశకామంబై, కామకేతనంబు పెల్లున నుద్దీపితమ్ము

కరంబై, మకరకేతను బాణంబులకై యెడఁగలీనపరవాహినీకలితశంబరంబై, శంబరారాతిచికురుగొంతంబుసూటి నథర్వగవేదవా
శమునంబై, శమనదండంబుజాడ నిమ్నోన్నతసమవృత్తంబై, వృత్తశాస్త్రంబుపథంబున వడిఁగలిగి, సదాగురులఘువాక్య
చ్ఛటాపరిగణితంబయి, గణితశాస్త్రంబుకోలదిని ఘనఘనమూలవర్గ సంకలితభిన్నమిశ్ర ప్రకీర్ణఘాతభీష్మంబయి, భీష్మవ
ర్ణ్యంబు పెంపుననేకభగవద్గీతంబయి, గీతశాస్త్రంబునలుకడను మహాపుష్పితతనుఘననానాశబ్దంబయి, శబ్దశాస్త్రంబుగు
ణాద్యదనవచ్చువడిహల్లుగలిగి మహాకావ్యరూపావతారవృత్తి వృద్ధిగుణసమర్థంబయి, యర్థశాస్త్రంబుమహిమనుబహుప్ర
యోజనప్రమాణదృష్టాంతరంబయి, దృష్టాంతరంబు తెలుంగున సర్వసామాన్య గుణవిశేషంబయి, శేషవ్యాపారంబు కరణి
సుస్థిరోద్ధరణతత్పరంబయి, పరబ్రహ్మంబుగరిమనతిక్రాంతానేక నిగమంబయి, నిగమంబునడువడి బ్రహ్మవర్ణిత పదక్రమసంగ్ర
హంబయి, గ్రహశాస్త్రంబు పరిపాటినిగరటుటమీనమిథునమకరమంథరంబయి, సుందరీముఖంబుపోడిమినిర్మలచంద్రకాం
తంబయి, కాంతాధరంబురుచినిశోణితచ్ఛాయావిలాసంబయి, విలాసవతికొప్పుచొప్పుననృష్ణాలకాధికంబయి, యధికమతిశా
స్త్రసంవాదంబుసొంపున నపార పరస్త్రీవిజయ విభ్రమంబయి, విభ్రమవతి చనుదోయిపగిది నిరంతరపయోవ్యాప్తాఖిల
లోకజీవనప్రదతురంగభద్రాదిరేఖాసంలలితంబయి, లలితవతినగవుమించునవహాసించుననవహసితచంద్రభాగధేయంబయి,
సూర్యతనయుశరవర్షంబుబోలిక భీమరథ్యాటోపహారణంబయి, వారణంబుచిరుమనంబుమహారోన్నతసంరంభంబై, రంభనె
మ్మోముడాలున సురతనాతిశయపశంబయి, దశరథతనయుబొమముడిచాడ్పున, సింధుగర్వప్రభంజనంబయి, ప్రభంజనతన
యుగదపెట్టుమాడ్కి-నిసమీనగత దుశ్శాసనమర్మనివారకంబయి, వారకన్యముంజేతిగతిని ముహుర్ముహురుచ్చలితకంక
ణాలంకృతంబయి, కృతయుగంబు సొజనపంకంబయి, పంకజాసనుముఖంబు నెఱపునఁబ్రభూతముఖ్యవర్ణంబయి, వర్ణగుణితం
బు తెలుపువనుబహుదీర్ఘబిందువిసర్గంబయి, సర్గబంధకావ్యంబుచిన్నవుచిగంభీరభావమధురంబయి, మధురాపురంబుసొబ
గునమహానందంబయి, నందనవనంబుపొందున విహారమాణ కౌశికంబయి, కౌశికహయంబురీతి నుదరధ్రువంబయి, ధ్రువుత
లంపుక్రియమ పరికీలిత విశ్వంభరంబయి, విశ్వంభరునిశంఖంబురూపున దక్షిణావర్తోత్తరంబయి, యుత్తరావివాహంబుచం
దంబునఁ బ్రముదితనలనరంబయి, నరసింహునఖరంబులభాతి నాశ్రితప్రహ్లాద గురువిభవ ప్రధానంబయి, దానకాండంబుపి
రింగామధేనుకల్పలతాద్యభినవంబయి, నవసూతికాకుచంబుపేర్మిని నిరంతర వయోవర్ధనంబయి, ధనదునిలయంబుతూనిక
సంగతమకరమహాపద్మకచ్ఛపంబయి, కచ్ఛపకర్పరంబుబలిమిని బలితశైలసముద్ధరణంబయి, ధరణిధరంబుపాటి నుత్తుంగతట
ముఖ్యంబయి, ముఖ్యవరాహంబుగరిమనున్నతఘోణంబయి, తమూసురహస్తంబుగఁ జగణికెను సత్పవిత్ర మనోరామంబయి,
రామచంద్రుబాణంబుకడిందినభ్యాగతఖరదూషణాదావహరణముఖరంబయి, ముఖరామనుకుఠారంబురీతినిభూభృన్మాల
భేదనప్రబలంబయి, బలరామహలంబుభాతిఁ బ్రతికూలవన్నికర్షణ ప్రబుద్ధంబయి, బుద్ధదేవుని మేనియొఱపున నభియాతివ
ధూశారమనోహరంబయి, హరతాండవంబు మేలునుల్లసి తానిమిషంబయి, యనిమిషావతారంబుకీర్తిని శ్రుతిమంగళప్రదం
బయి, ప్రదాతయాగిసూటినర్థపరంపరావామనంబయి, వామనచరణరేఖను బలివంశవ్యసనయంబయి, నయశాస్త్రంబుమా
ర్గంబున సామభేదమాయోపాయంబయి, చతురాననాండంబు భావంబున నపరిమిత భువన జంతుజాల సేవ్యమానంబ
యి, మానినియ్యనలోకనుమాపకగరితయనవలి చప్పుము సేయక మగువయనబయలుపడక ప్రమదయనఁ గ్రయ్యంబుఁబాలుచుఁ
బతివ్రతయననిట్టటుపనక తల్లియన నెవ్వరైనలోఁగొనుచుదైవంబనభక్తమనోరథంబులిచ్చుచు నంతకంతకు గుతిగడచియ
వాఙ్మానసగోచర-బయిప్రవహించి॥ (మ॥ జగతీనాథుగధంబుపజ్జబహుదేశంబుల్వడిందాఁటిత । త్సగరత్మాత్మజమారభస్మ
ములమీఁదన్నుంచి పొలున్నరున్నగరావాసముల్వారుపొందిరినవీనశ్రీలకోగంగనీ । రుగతింగాఁగమహామరంతసుజనద్రోహ
నలంబాయనే॥ (మ॥హరు మెప్పించిమహాతపోనియతుఁడై యాకాశగంగావధిన్నధరకుందెచ్చినితాంతకీర్తిలతికాస్తంభంబు
గానవ్యాప్త స్థిరలీలంబిత్పకృత్స్నసంతయుకొనర్చెనవారితానేకము । స్తరవంశవ్యథుఁడాభగీరథుఁడునిష్యశ్లీకరుండల్పుఁడే॥
(క॥హరిదనమునమునలోనిడి హరిపాదాంభోజజనితమైననదిన్సు । స్థిరుతైకృంతిమువీంద్రుబు । హరిఁగలసిరిత్రిగుణరహితు
లై యచ్ఛేళ॥ (వ॥అంత నాభగీరథునకు శ్రుతుండును, శ్రుతునకు నాభావరుండును, నాభావరునకు సింధుద్వీపుండు, సింధు
ద్వీపునికినయుతాయువునయుతాయువునకుఋతుపర్ణుండును, జనియించెనతండు॥ (గీ॥ నయవిశాలబుద్ధి నలచక్రవర్తితో ।
సంగడీనితనముచాలఁజేసి । యక్షహృదయమతనికవ్యస్తముగనిచ్చి । యశ్వవిద్య నేర్చె యతనివలన॥ (వ॥ ఆఋతుపర్ణునకు సర్వ
కాముండును సర్వకామునకు సుదయంతీవల్లభుండైనసుదాసుండు పుట్టెనారాజశేఖరుఁ మిత్రసహుండునుగల్మాషపాదుండు
నననిచెప్పుచుఁ గాథాపరుండు వసిష్ఠునిశాపంబునరాక్షసుండై తనకర్మంబున ననపత్యుండయ్యెనననవిని పరీక్షిన్నరేంద్రుండే
మికారణంబునసుదాసునకుగురుశాపంబుప్రాప్తంబయ్యెననవినివుండిల్లనియె॥ (సీ॥ అసుదాసుఁడు వేటకై వనంబున కేగి

గర్వించి యొక్క రక్కసుని జంపి, వానితోఁ బుట్టిన వానిఁ బోవిడిచిన వాఁడును దనతోఁటి వాని స్మృతికి । నతి దుఃఖితుండై యా
రాజగృహమున సూదభావంబున సొంపు నొంది । యుండ వసిష్ఠునకు నుర్వీశుఁ డొక్క నాఁ డన్నంబు సేయంగ నతని బనుప । వాఁడు
మానవమాంసంబు వండి తెచ్చి, మునికి వడ్డింపఁ గోపించి ముని నరేంద్రుఁ । బిల్చి మానవమాంసంబుఁ బెట్టితనుచు । నలుకతోఁ రా
క్షసుఁడవు గమ్మని శపించె* (వ॥ ఇట్లు రాక్షసుండు వండి తెచ్చుటయు సుదాసుం డెఱుంగమి దన మనంబున నెఱింగి వసిష్ఠుండు పం
డ్రెండేడ్లు రక్కసుండవై యుండుమని శపియించె నయ్యవసరంబున* (మ॥ గురువున్మారు శపింతునంచు జలముల్గొసంబుతో
దోయిటం, గ్నరనాథుండు ధరింపఁ దత్సతి పతిన్వారించు మిన్నందిశల్, ధరయుం జీవమయంబు గాని ఖిలముం దాఁ జూచి చల్లం ధరా, వ
రుఁడాత్మీయపదంబులం గరపుటీ వాఃపూరము న్వేగమై* (వ॥ ఇట్లు మిత్రసహుండు గావునఁ గళత్రానుకూలుండయి శపియిం
పనొల్లక సుదాసుండు రాక్షసభావంబు నొంది కల్మాషవర్ణంబులయిన పాదంబులతో నడవులం దిరుగుచు* (క॥ ఆఁకటమటమట
మాడుచు వీఁకన తండడవి నున్న విప్రమిథునముఁ గాంచి । దాకి తటాలున విప్రుని, కూఁకటి చేపట్టి మ్రింగఁ గోపోవుతఱిన్* (వ॥ అంత
నా బ్రాహ్మణుని భార్య మోఁది కొనుచుం బెగ్గడిల్లి డగ్గుత్తికతోఁ జతికిన డ్డంబు వచ్చి యేడ్చుచు రాచరిక్కమనకిట్లనియె* (క॥ మా
నుష దేహము గలుగుట, భూనాయక దుర్లభంబు పుట్టినమీఁదన్ । దానము పరోపకారము । భూనుతకీర్తియు నువలదె పురుషున
కెంకన్* (మ॥ రవివంశాగ్రణివై సమస్తధరణీరాజ్యానుసంధాయివై, భువనస్తుత్యుఁడవై పరార్థరతివై పుణ్యానుకూలుండ
వై । వివరంబేమియు లేక నా పెనిమిటి న్విప్రుం దపశ్శీలుని । న్వభ్రివరున్బ్రహ్మవిదున్ సగర్భురణున్ భక్షింపగాఁ బాడియే* (శా॥ తం
డ్రీ మీకు దినేశవంశజులకున్ దైవంబగున్ బ్రాహ్మణుం । డంద్రా మాటలు లేవె భూమిసురగోహత్యాభిలాషంబు గై । కొం డ్రే
మీ యట్టువంటి సాధువులు గల్గో భావమిట్లేల మీ । తండ్రింపాతల పూర్వులందల వేదధర్మంబు నంబోఁగదే* (శా॥ అన్నా చెల్లె
లనయ్యో దన్నిడుదువు నీకన్నంబు వెట్టింతునా । హృన్నాథున్ ద్విజుఁ గంగి కుజ్జనకటా హింసింపనేలయ్య నీ । వెన్నం డింటులతోఁ డఁ
బుట్టవె సజంబిల్లయి నముస్మట్టనా । పన్నున్ శిరంబుఁ ద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే* (క॥ అనికరుణ పుట్టనాడుచు, వ
నితామణి పలువరింపవసుధాదేవుం, దిని యెనతఁడు పులి పశువుం, దిను క్రియ శాపంబుకతన ధీరహితుండై* (వ॥ అంత నా బ్రా
హ్మణి కోపించి కామార్తనై న నాదు పెనిమిటిని భక్షించితివి గావున నీవు నెలఁతలం బొందఁ జేరిన వేళ మరణంబుఁ బొందుమని
కల్మాషపాదుని శపించి, పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబు సేసి సుగతికిం జనియె నంతఁ బండ్రెండేండ్లు సనిన నారాజు ముని శాప
నిర్ముక్తుండై* (గీ॥ రతులకొఱకు భార్య రావింప నదియును, బెదరి విప్రసతి శపించు టెఱిఁగి, మగని నడ్డపెట్టి మైథునకర్మంబు । మా
న్పె సతుల గోష్ఠి మానె నతఁడు* (క॥ అది కారణముగఁ బుత్రాభ్యుదయము లేదాసు దాసభూపాలునకుం, దదనుమతిన వ్వసిష్ఠు
డు, మదయంతికిఁ గడుపుఁ జేసె మదనక్రీడన్* (వ॥ ఇట్లు సుదాసుని భార్యయగు మదయంతి వసిష్ఠునివలన గర్భిణియై యేడేండ్లు
గర్భంబు ధరియించి నీళ్లాడ సంకటపడుచున్న వసిష్ఠుండు వాఁడియగు నశ్మమున నాగర్భంబుఁ జీఱిన నశ్మకుండను కుమారుండు పుట్టె
నతనికి నారీకవచుండు పుట్టె నా సమయంబున* (క॥ వీరుఁడగు పరశురాముఁడు । ఘోరకుఠారమున నృపులఁ గూలుచువేళ,
న్నారీజనములు దాఁచిన, నారీకవచుండనంగ నరనుతికెక్కెన్* (వ॥ ఆ నారీకవచుండు నిర్మూలంబయిన రవివంశంబునకు మూ
లంబగుటం జేసి మూలకుండయ్యె మూలకునకు విశ్వసహుండును, విశ్వసహునకు ఖట్వాంగుండు పుట్టి చక్రవర్తియయ్యె న
తండు* (సీ॥ అసురులు వేడిన నసురనాథులఁ జంపి త్రిదశులతోఁ దన తెగెడు కాల, మెంతని యడిగిన నిదె నిండుచున్నది తడవు లేదే
మైన నతఁడు గుమనిన, వరములు గోరక వరవిమానంబెక్కి తనపురికేంచి తత్వబుద్ధిఁ । బరమేశ్వరుని యందు భావంబు గీలించి కుల
దైవతద్విజకులము కంటె, నంగనా ప్రాణ రాజపుత్రాదులెల్లఁ । గావు ప్రియములు ధర్మంబు గడచి వాదు । మతి ప్రవర్తింపదెన్న
డు మది నెఱుంగ నన్యమాయీశ్వరుని దక్కననుచు మఱియు* (మ॥ ఇలమీఁదన్ బ్రతుకేల వేల్పులవరం బేలా ధనం బేల చం, చ
లగంధర్వపురీవిడంబనములై శ్వర్యంబు లేలా జగం । బులు బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తే తుదిం బాసిని । ర్మలమై వాఙ్మ
నసామితంబగు పరబ్రహ్మంబు నేఁ జెందెదన్, అని నిశ్చయించి* (మ॥ కలసెన్ సంగములెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగుఁడుశ్రాంత
మై । కలనయ్యున్ మఱి పైన లేద నెడి దైకల్యాణమై సన్నుతిం । దలపంబల్కఁగరానిదై పరము మైత్రత్వజ్ఞులూహించి హృ, జ్జలజా
తంబుల వాసుదేవుఁడని సంస్థాపించినా బ్రహ్మమున్* (వ॥ అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు దీర్ఘబాహునకు రఘువు, రఘు
వునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండు, దశరథునకు సురప్రార్థితుండై పరబ్రహ్మమయుండయి
నహరి నాల్గువిధంబులై శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్ననామంబుల నిజాంశసంభూతుండై జన్మించె, దచ్చరితంబు వాల్మీకిప్ర

** శ్రీరామచరిత్రము. *—

ముఖులయిన మునులచేత వర్ణితంబై నదియైనం జెప్పెద సావధానమనస్కుండవై యాకర్ణింపుము* (మ॥ అమరేంద్రాశకుఁ బూ
ర్ణచంద్రుఁ డుదితుండైనట్లు నారాయణాంశమునం బుట్టె మదాంధ రావణశిరస్సంఘాత సంఛేదన, క్రమణోద్దాముఁడు రాము

డాగరితకుంగౌసల్యకుఁ గనన్న తా। సమనైర్మల్యకళలకుఁ ంచితజనుస్సంపారసాఫల్యకుఁ * (మ॥ సవరత్నౌఘ నందంద్రడివంపఁ
జనవిశ్వామిత్రుడుం దోడరా। నవలీలంగ మమా డెరామఁడదయుండై బాలుండై కుంతల । చ్ఛవిసంపజ్జితహాటకస్ఫటభాషావి
స్ఫురన్నాటకఁ । జవభిన్నార్యసుఘోటకఁ గరపి రాజజ్జైటకఁ దాటకఁ * (క॥ గారాముననౌశికుమఖ। మారాముఁడు గాఁ
చినై త్ర్యనఘకుపుబాహుఁ । ఘోరాజిఁ ద్రుంచి ఖో లెను। మారీచునీచుపిగతమంజులరోచుఁ * (మ॥ ఒకముస్నాఁ లుగడల్పి
తెచ్చినలలాటో గ్రాక్షు చాపంబు బాలుఁ రీఁ గ్రంబుసలీలమై చెఱుకుఁ గోలం ద్రుంచుచందంబునఁ । సకలోర్వీశులుసూడఁగా
పిణి చెవోక్మ క్తిఁ పదేహితుమా। సకగేహంబునసీతకై గుణగణిప్రస్ఫీతకై లీలతోఁ * (క॥ భూతలనాథుఁడు రాముఁడు। ప్రీ
తుండై పెండ్లియాడెఁ బృథుగుణమణిసం। భూతన్నాగ్న్యోపేతఁ । సీతఁ ముఖకాంతిపదితశీతఖద్యోతఁ * (క॥ రాముఁడునిజ
బాహుబల। స్థేమంబున భంగపఱచె దీర్ఘుఁ కుతారో। ద్దాముని ద్విదళీకృతనృప। ధాముఁ ద్రుంగరంగభీము భార్గవరాముఁ * (క॥ దశర
థుఁడుముసన్నకైకకు। వశుఁడై తా నిచ్చినట్టివరముకతనవా । గ్దశ చెడకయడవికనిచెను । దశముఖముఖకమలతుహినధాముఁ
రాముఁ *(క॥ జనకుఁడు పంచినమేలని। జనని జయుసులక్ష్మణుండు సంసేవింపఁ । జనపతిరాముఁడు విడిచెను। జనపాలారాధ్య
ద్వివదసాధ్యనవరాధ్యఁ *(క॥ భరతుస్నజపదసేవా। నిరతుఁ రాజ్యమునను నిచ్చినృపమణియె కేక్తఁ । సురుదరకుచిపరిభావి
త। గురుగోత్రాచలముచిత్రకూటాచనముఁ * (ఉ॥ పుణ్యుఁడు రామచంద్రుఁడటఁ బోయి ముదంబునఁ గాంచెదండకా। రణ్యా
ముదాపసాశ్రమశరణ్యమునుద్ధతబర్హిబర్హ లా। వణ్యముగౌతమీవిమలవాఃకణపర్యటనప్రభూతసా । న్ద్రణ్యమునుల్లసత్తరుని
కుంజవరేణ్యము నగ్రగణ్యముఁ *(సీ॥ ఆవనంబున రాముఁడనుజసమేతుఁడై సతితోడ నొకపర్ణశాలనుండ। రావణు చెల్లెలురతి
గోరి వచ్చిన మొగి లక్ష్మణుఁడుదాని ముక్కుఁ గోయ । నదివిని ఖరదూషణాదులు పదునాల్గు వేవుర నా రామవిభుఁడు కలన। బాణా
నలంబున భస్మంబు గావింప జనకనందిని మేని చక్కఁదనము। విని దశగ్రీవుఁ డంగజవివశుఁడగుచు । నర్థిఁ బంచిన బసిడిల్లమై నటిం
చు। నీచుమారీచు రాముఁడు నెత్తివధించెన తలో సీతఁగొలబోయె నసురవిభుఁడు* (ఉ॥ ఆయసురేశ్వరుండు వడి నంబరవీథిని
లాతనూజన। వ్యాయము సేసిని పక్షి రుణుఁడై కొనిపోవగ నడ్డమైనఘో । రాయతహేతిఁ ద్రుంచె నసహాయతరామనరేంద్రకా
ర్యద। త్తాయుపుఁ బక్షివేగపరిహాసితవాయువు నజ్జటాయువుఁ * (వ॥ అంత నా రామచంద్రుండు లక్ష్మణసహితుండై సీత వెదు
కను దెంచి నిజకార్యసహితుండయి నజటాయువున కంబరలోకక్రియలు గావించి బుశ్యమూకంబున కుం జని *(క॥ నిగ్రహమునీ
కువలదిక। నగ్రజు వాలిఁ వధింతుననిసమయము తో। నగ్రేసరుగా నేలెను । సుగ్రీవుఁ జరణఘాతచూర్ణగ్రావుఁ * (క॥ లీల
న్రాముఁ విభుండొకకోలం గూలంగ నేసె గురునయశాలిఁ । శీలిన్సేవితశూలిఁ । మాలిన్వాలిన్దశాస్యమానోన్మాలిఁ *(క॥
ఇలమీఁదసీత వెదుకఁగ । నలఘుఁడు రాఘవుఁడు వనిచెహనుమంతునతి । చ్ఛలవంతున్మతిమంతు। న్బలవంతున్శౌర్యవంతుఁ
బ్రాభవవంతుఁ *(క॥ అలవాయుఁ గొనకమారుతి। లలితామితలాఘవమున లంఘించెను శై । వలినీగణసంబంధిఁ । జలపూరిత
ధరణిగగనసంధిన్గంధిఁ * (వ॥ ఇట్లు సముద్రంబు దాఁటి సీతం గని హనుమంతుండు దిరిగి చనుదెంచుచు నక్షకుమారాదులవధి
యుంచి *(క॥ సముద్రగతన లసుతుం। డసురాహితదత్తవాలహస్తాగ్నులభ। స్మముచేసెని రాతంక । న్సమదాసురసుభటవిగ
తశంకన్లంకఁ *(వ॥ ఇట్లు లంకాదహనంబు చేసి వచ్చి వాయుజుండు సీతాకథనంబు సెప్పిన విని రామచంద్రుండు వనచరనాథ
యూథంబులుం దానును జనిచని* (శా॥ ఆరాజేంద్రుఁడు గాంచె భూరివిథరత్నాగారము న్మీనకుం । భీనగ్రాహకఠోరము
న్విపులగంభీరంబు నభ్రభ్రమ। ద్ఘోరామోఘ్యాన్యవిభిన్నభంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ । ప్రారుద్ధాంబరపారము న్లవణపారా
వారము న్జైవకఁ *(వ॥ కనితనకుద్రోవయిమ్మని వేఁడిన నదియు మార్గంబుసూపక మిన్నకున్న నారాచవట్టి రెట్టించిన కోపంబు
న *(క॥ మెల్లని నగవుల నయనము। లల్లాగ్నిశరంబులల్లు నదనమాత్ర। న్గుల్లలు నాచలు దిప్పలుఁ । బెల్లలునై జలధి పెద్దబీఁడై యుం
డెఁ *(వ॥ ఇట్లు విపన్నుండగు సముద్రుండు నవలతో మూర్తిమంతుండై చనుదెంచి రామచంద్రుని చరణంబు శరణంబుగఁ
జేసి యిట్లని స్తుతియించె *(శా॥ ఓ కాకుత్స్థకులేశ యో గుణనిధీ యో దీనమందార నే। నీ కోపంబున కెంతవాఁడ జడుఁడ న్నీవే
మి భూపుండవే। లోకాధీశుఁడవాదినాయకుఁడవీలోకంబు లెల్లప్పుడు। న్నీకుక్షిన్బ్రభవించునుండు నడఁగున్నిక్కంబు సర్వా
త్మకా *(క॥ ధాతలరజమున దేవ। వ్రాతము సత్త్వమున భూతరాశి తమమునఁ । జాతులుగా నొనరించుగు। ణాతీతుఁడవీవు గుణగ
ణాలుకారా *(క॥ కట్టుము సేతువు లంకం। జొట్టుము నీ బాణశిఖల పురవైరితలల్। గొట్టుము నేలం బడఁ జే। పట్టుము నీ యబల నధి
కభాగ్యప్రభలన్ * (గీ॥ హరికి మామ నగుదు నటమీఁద శ్రీదేవి। తండ్రి నూరకేల తాఁగడింపఁ । గట్టు కట్టి దాఁటు కమలాప్తకులనా
థ। నీ యశోలతలకు నెలవుగాఁగ * (వ॥ అని విన్నవించిన రామచంద్రుండు సముద్రుని బూర్వప్రకారంబుననుండు పొమ్మని వీడు
కొల్పె నంత *(క॥ ఘనశైలంబులు తరువులు। ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్। ఘనజలరాశిం గట్టిరి। ఘనవాహ ప్రము
ఖదివిజగణము నుతింపఁ *(చ॥ ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణుతమ్ముండైన విభీషణుండు శరణంబు వేఁడిన

భయంబిచ్చి కూడుకొని లంకకుం జని విడిసి వెడవెట్టించి లగ్గలుపట్టించిన* (సీ॥ ప్రాకారములఁ ద్రవ్వి పరిఘలనిండించి కోటకొ
మ్మలనేలఁగూలఁద్రోచి । వప్రంబులగలించి వాకిళ్లఁ బెకలించి తలుపులు విఱిచి యంత్రములఁ ద్రుంచి । ఘనవిటంకంబుల ఖండిం
చి గోపురంబుల విప్పి వలభులఁ బొందు చెఱిచి । మకరతోరణముల మహిఁగూల్చి కేతనంబులఁ జించి సోపానములు గదల్చి । గృ
హములెల్ల వ్రచ్చి గృహరాజములఁ జొచ్చి । ధర్మకుంభచయము పాలివై దిక్కులుకొలను సొచ్చి కలఁచినకైవడిఁ । గపులు లంకఁ
జొచ్చి కలఁచిరపుడు* (వ॥ అంతనయ్యసురేంద్రుండు పంచిన కుంభనికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష సురాంతక నరాంతక దు
ర్ముఖ ప్రహస్త మహాకాయ ప్రముఖులగు దనుజవీరులు శరశరాసన తోమర గదా ఖడ్గ శూల భిండివాల పరశు పట్టస ప్రాసము స
లాదిసాధనంబులు ధరియించి మాతంగ తురంగ స్యందన సందోహంబుతో బరవంబు సేయ సుగ్రీవ పవనతనయ పనస గజ గవయ
గంధమాదన నీలాంగద కుముద జాంబవదాదులారక్కసులు నెక్కటికయ్యంబులం దుదగుల గిరుల కరాఘాతంబులను క్కడం
చి త్రుంచిరంత* (క॥ ఆమేడ లక్ష్మణుఁ డుజ్జ్వల। సాయకముల ద్రుంచె శైలసమకాయు సురా। జేయు నసగ్గళ మాయో। పాయు
న్నయగుణవిధేయు నతికాయుఁగా* (గీ॥ రామచంద్రవిభుఁడు రణమున ఖండించె। మేటికడిమి నీలమేఘవర్ణు। బాహుశక్తి ప్రా
ర్ణుఁ బటుసింహనాదసం। కుచితదిగిభకర్ణు కుంభకర్ణు* (క॥ అలవున లక్ష్మణుఁ డాజి । స్థలిఁ గూల్చె మేఘనాదుఁ జటులాహ్లాదుఁ।
బలభేదిజయవినోదు। స్వలజనితసుపర్వసుభటభావవిషాదుఁ॥ అంత* (క॥ తనవారంతలు ద్రుంగిన। ననిమిషపతివైరి పుష్పకా
రూఢుండై యనికి నడచి రామునితో। ఘనరౌద్రముతోడ నంపకయ్యము సేసెఁ॥ అయ్యవసరంబున* (క॥ సురపతి పంపున మాత
లి। సురుతరముగు దివ్యరథముఁ గొనివచ్చిన నా। ధరణీవల్లభుఁ డెక్కెను। ఖరకరుఁ డుదయాద్రి నెక్కుకైవడిఁ దోపన్॥ ఇట్లు దివ్య
రథారూఢుండై రామచంద్రుండు రావణునకిట్లనియె* (చ॥ చపలత్వంబున డాగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో। కపట
బ్రాహ్మణమూర్తివై యబలనాకాంతారమధ్యంబున। న్దవలాపించుటయో మదీయశితదివ్యామోఘబాణాగ్నిసం। తపనం బే
గతి నోర్చువాఁడవు దురంతం బెంతయున్ రావణా* (క॥ నీ చేసిన పాపములకు। నీ చాత్మక యముఁడు వలను నేఁ డిట నా నా। రాచ
ములఁ ద్రుంచివైచెద। ఖేచరభూచరులు గూడి క్రీడన్ జూడన్॥ అని పలికి* (మ॥ బలుఁ డుత్సన్నగుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండభీమం
బుగాఁ। బ్రళయోగ్రానలసన్నిభంబగు మహాబాణంబు సంధించి రా। జలలాముం డగు రాముఁ డేసె ఖరభాషా రావణు న్దేవ
తా। బలవిద్రావణు వైరిదారజనగర్భస్రావణున్ రావణున్* (క॥ దశరథసూనుం డేసిన। విశిఖము హృదయంబు దూఱి వివశుం
డగుచున్ దశకంధరుండు గూలెను। దశవదనంబులను రక్తధారలు దొరుగన్॥ అంత నా రావణుండు దెగుట విని* (సీ॥ కొప్పులు వి
గివీడి కుసుమమాలికలతోఁ గంపభాగంబుల నావరింప। సేసముత్యంబులు చెదరఁగఁ గర్ణికలూడఁ గంఠహారంబులు గ్రందుకొనఁగ।
వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ గన్నీళ్లవఱదలంగములు దడుప। సన్నపునడుములు జవ్వాడఁ బాలిండ్లబరువులు నడుము
లఁ బ్రబ్బికొనఁగ। నెత్తిమోదికొనుచు నెఱిబయ్యెదలు జాఱ। నట్టునిట్టు దప్పటడుగులిడుచు। నసురసతులు వచ్చిరట భూతభేతా
ళసదనమునకు ఘోరకదనమునకు* (వ॥ ఇట్లు వచ్చి తమతమ నాథులం గని శోకించి యందు మండోదరి రావణుం జూచి యిట్లనియె*
(ఉ॥ హా దనుజేంద్ర హా సురగణాంతక హా హృదయేశ నిర్జరేం। ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రు శిలీముఖకోటి కోర్వలేక సో। న్మాదము
నన్ రఘుప్రవరు మానిని నేటికిఁ దెచ్చితప్పుడున్ । గాదని చెప్పినన్ వినక కాలవశంబునఁ బొందితక్కటా* (గీ॥ ఎండగాయ వెఱ
చు నినుఁడు వెన్నెలఁగాయ। వెఱచు విధుఁడు గాలి వీవ వెఱచు। లంక మీఁద నట్టి లంకాపురికి మాకు। నధిప విధవభావ మయ్యె నేఁడు*
(క॥ దురితముఁ దలఁపరు గానరు। జనులు గదురెటకై ననిమిషసౌఖ్యంబులకై। పరవనితాసక్తులకును। బరధనరక్తులకు సహాముఁ బ
రముం గలదే* (వ॥ అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపువడసి రావణునకు దహనాదిక్రియలు గావించె నంత
హనుమంతుం డశోకవనంబున కేగి శింశుపాతరుసమీపంబునందు* (శా॥ దైతేయప్రమదాపరీతను భీతను గ్రంథిబం
ధాలకన్ । ప్రాతర్నిశ్శ్వసనానలాశ్రుకణజీవంజీవదారామభూ । జాతన్ మ్లానకపోలకీలితకరాబ్జాతన్ స్వభ్రీభూతన్ కృశీ।
భూతన్ స్వభ్రీణ సమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డా ముందటన్* (వ॥ కని రామచంద్రుండు తాపంబునొంది భార్యవలన దోషం
బు లేకుండుట వహ్నివలనం బ్రకటంబు సేసి దేవతల పంపున దేవిం జేకొని* (ఉ॥ శోషితదానవుండు నృతసోముఁడు రాముఁ
డు రాత్మ సేంద్రతా । శేషవిభూతి గల్పన మజీవివిగమ్మని నిల్పె నర్థిసం। తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదపోషణున్
మిత్రా। భాషణు నార్యపోషణు గృపాగుణభూషణు నవ్విభీషణున్* (వ॥ ఇట్లు విభీషణసంస్థాపనుండై రామచంద్రుండు సీతా
లక్ష్మణసమేతుండై సుగ్రీవహనుమదాదులం గూడికొని పుష్పకారూఢుండై వేల్పులు గురియు పువ్వులసోనలం దడియుచుఁ దొల్లి
వచ్చిన జాడలు సీతకు నెఱింగించుచు మఱలి నందిగ్రామంబునకు వచ్చె నయ్యవసరంబున* (గీ॥ రామచంద్రవిభుని రాక విని లవి
ని భరతుఁడు త్సహించి పాదుకలను। మోదికొనుచు వచ్చి ముదముతోఁ బురజనుల్। గొల్చుచుండ నన్నకెదురువచ్చె* (వ॥ వచ్చి
పాదుకలు ముందర నిడికొని యెడనెడ సాష్టాంగదండప్రణామంబులు సేయుచు మెల్లన డాసి రామచంద్రుని పాదంబులనొ

నలంగఁదియించి తచ్చరణరేణువులు నుదిటి శిరంబునం జల్లికొని తనివిలేక మఱియు నప్పదకమలంబులకున్ మోపికొనుచు
సంతసంబునం గన్నీటం గడిగి సేవింపుచుండ సీతా లక్ష్మణ సహితుండై విభుండును దనకెదురువచ్చిన బ్రాహ్మణ
జనంబులకును నమస్కరించి తక్కిన వారల చేత మన్ననలువొంది వారల మన్నించె నయ్యవసరంబున* (చ॥ నృపవర పెక్కునాళ్ల
గొలె నిన్ను నంపినయట్టి నేఁడుమా । తపములు పండె నందరము ధన్యుల మైతిమటంచుఁ బుట్టువుల్ । చపలత ద్రిప్పి పువ్వుల
వసంతములాడుచు బాడుచున్నత । త్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁ బండుగఁ జేసి రెల్లెడన్* (సీ॥ కపిగూడియుఱ
దెసఁ గపిరాజు రాక్షసరాజు నొక్కెడ చామరములు వీవ । హనుమంతుఁ డంథవళాతపత్రము నట్టఁ బాదుకల్ భరతుండు భక్తిఁ
దేర । శత్రుఘ్నుఁ డమ్ములు చాపంబుఁ గొని రాఁగ సౌమిత్రి భృత్యుఁడై చమువు సూప । జలపాత్ర చేఁబట్టి జనకజ గూడి రాఁ గాం
చనఖడ్గ మంగదుఁడు మోవఁ బసిడిగద్దియఁ బెద్దభల్లూకపతి మోవఁ గొలువఁ బుష్పకంబు నెలమి నెక్కి । గ్రహములెల్ల వెలయ
గడు నొప్పు సంపూర్ణచంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె* (వ॥ ఇట్లు పుష్పకారూఢుండై కపిబలంబులు చేరి కొలువ శ్రీరా
ముండయోధ్యకుం జనియె నంతకు మున్న యప్పురంబునందు* (సీ॥ వీధులు సక్కగా వించి తోయంబులు సల్లి రంభాస్తంభచ
యములిడి పట్టుచీరలు చుట్టి బహుతోరణంబులు గలువడంబులు మేలుకట్లుకట్టి । వేదికలలికించి వివిధరత్నంబుల ముగ్గులు
వలుచందములుగఁ బెట్టి । కలయ గోడల రామకథ లెల్ల వ్రాయించి ప్రాసాదముల దేవభవనములను । గోపురంబుల బంగా
రుకుండలెత్తి । మెల్ల వాకిండ్ల గానుకలేర్పఱించి । జనులు కైచేసి తూర్యఘోషములతోడ । నెదురనడిచిరి యారాఘవేం
ద్రునకడకు* (క॥ సమదగజదానధారల । దుమదుమలై యున్న పెద్దత్రోవలతోడన్ । రమణీయమయ్యె నప్పురి । రమణుఁడు వ
చ్చిన నగరంగు రమణి యుంబోలెన్* (గీ॥ రామభూవరేంద్రు రాకతూర్యములతో । రథగజాశ్వసుభటరాజితోడ । నమరెఁ బుర
ముచంద్రుఁ డరుదేర ఘూర్ణిలు జంతుభంగిమిళితజలధిభంగి* (వ॥ ఇట్లొప్పుచున్న యప్పురంబు ప్రవేశించి రామచంద్రుండరు
గుచున్న సమయంబున* (మ॥ ఇతఁడే రామనరేంద్రుఁ డీయబలకా యింద్రారిఖండించెన । ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివ
రుండా పొంత వాఁడే మరు । త్సుతుఁడా చెంగట నావిభీషణుఁడటంచుం జేతులం జూపుచున్ । సతులెల్ల న్సరికించి చూచిరి పురీ
సౌధాగ్రభాగంబులన్* (వ॥ ఇట్లు జనులు చూచుచుండ రామచంద్రుండు రాజమార్గంబునం జనిచని* (సీ॥ పటికంపు గో
డలు పవడంపు వాకిండ్లు నీలంపుటరుగులు నెఱయగలిగి । కమనీయ వైడూర్యక స్తంభచయముల మకరతోరణముల మహితము
సుచుఁ । బడగల మాణిక్యబద్ధజాలంబులఁ జిగురుతోరణములఁ జెలువుమీఱి । పువ్వుదామకముల భూరివాసనలను బహుతరధూ
పదీపముల మెఱసి । మాఱునేల్పుల భంగి నివాళయుచున్న । సతులఁ బురుషులు నెప్పుడు సందడింప । గుఱుతులిడరాని ధనములకు
ప్పలున్న । రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు॥ ఇట్లు వచ్చి* (ఉ॥ తల్లుల కెల్ల మ్రొక్కి తనతల్లికి వందనమాచరించి యు । ల్లల్ల
బుధాళికి న్వినతుండై చెలికాండ్రను దమ్ములం బ్రసం । పుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁ । డోలిఁ గృపారసంబురం । జిల్లఁగఁ జాల
మన్ననలు సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్ । తత్సమయంబున* (చ॥ కొడుకులఁ బెద్దకోడలును । గొబ్బున మ్రొక్కిన నె
త్తి చేతులం । బుడుకుచు మోము మందలలు భోరన ముద్దులు గొంచు నవ్వుల । న్దోడలకు వారి రాఁ దిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధా
రలన్ । వెడలిన ప్రాణముల్దగఁ బ్రతిష్ఠములయ్యె నటంచు నుబ్బుచున్* (వ॥ అంత వసిష్ఠుండు శ్రీరామచంద్రు నిజటాబంధంబు
విడిపించి, కులవృద్ధులుం దానును, సమంత్రంబుగ । దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతిచందంబున సముద్ర
నదీజలంబుల నభిషేకంబు సేయించిన, రఘువరుండు సీతాసమేతుండై, జలంబులాడి, గందపుట్టంబులు గట్టికొని, కమ్మని పువ్వు
లు దురిమి, సుగంధంబు లలందికొని, తొడవులు దొడిగికొని, తనకు భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి
యతని మన్నించి, కౌసల్యకుం బ్రియంబు సేయుచు, జగత్పూజ్యంబుగ రాజ్యంబు నేలుచుండె నప్పుడు* (సీ॥ కలఁగుటెల్లను మా
నెఁ గంధులేడింటికిఁ జలనంబు మానె భూచక్రమునకు । జాగరూకత మానె జలజలోచనునకు దీనభావము మానె దిక్పతులకు । మా
సియుండుట మానె మార్తాండమండలి గావిరి మానె దిగ్గగనములకు । నుడిగిపోవుట మానె నుర్వీరుహంబుల కడఁగుట మానెఁ ద్రే
తాగ్నులకును । గడగి వేగు మానెఁ గరిగిరికిటి నాగ । కమఠములకు బ్రజలకలఁక మానె । రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు ।
ధరణిభరణరేఖఁ దాల్చునపుడు* (సీ॥ బాలకుల వాలుచూపులయంద చాంచల్యము బలల నడుములయంద లేమి । కాన్తాలకములం
ద కౌటిల్యసంచారము తివలనడుపులయంద జడిమ । ముగుదల పరిరంభములయంద పీడనమంగనా కుచములయంద పేరు । పడతుల
రతులంద బంధసంభావంబు సతులఁ బాయుటయంద సంజ్వరంబు । ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పు । నందచౌర్యం
బు వల్లభులాత్మసతుల । నాగి క్రొమ్ముళ్ల పట్టుటం దక్రమంబు । రామచంద్రుండు పాలించు రాజ్యమందు* (క॥ తండ్రి క్రియ రా
మచంద్రుఁడు । దండ్రుల నణఁపించి ప్రజలఁ దా రక్షింపం । దండ్రులనందఱు మఱచిరి । తండ్రిగదా రామచంద్రధరణీపుఁ డనుచున్
(వ॥ మఱియు నా రామచంద్రుండు రాజర్షిచరితుండును, నిజధర్మనిరతుండును, నేకపత్నీవ్రతుండును, సర్వలోకసమ్మతుండును

చు,ధర్మవిరోధంబుగాకుండఁ గోరికలనుభవించుచుఁ, ద్రేతాయుగంబైనఁ గృతయుగధర్మంబుగాఁ బెంచుచు, బాలమరణంబు మొదలగునరిష్టంబులు ప్రజలకుఁ గలుఁగకుండ రాజ్యంబు సేయుచుండె నయ్యెడ* (గీ॥ సిగ్గువడుటగల్గి సింగారము నుగల్గి। భక్తిగల్గి చాలభయముగలిగి। నయముఁ బ్రియముఁ గల్గి నరనాథుచిత్తంబు। సీతదనకువశము సేసికొనియె ॥ అనవిని పరీక్షిన్న రేంద్రుండిట్లనియె* (గీ॥ భ్రాతృజనులయందు బంధువులందును। బ్రజలయందు రాజభావ మొంది యెట్లు మెలఁగె రాముఁ డీశ్వరుండగుతన్నుఁ। గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె ॥ అనిన శుకుండిట్లనియె (సీ॥ భగవంతుడగు రామభద్రుఁడు ప్రీతితో దేవోత్తముని సర్వదేవమయునిఁ। దను దానగూర్చి యధ్వరములు సేసెను హోతకుఁ బూరువునుత్తరంబు। సామగాయకునికి సమదిగ్భాగంబు బ్రహ్మకుఁ గ్రమముననొసఁగెఁబడమరెల్ల। నధ్వర్యునకు శేషమాచార్యునకునిచ్చి సొమ్ములఁ బంచి భూసురులకొసఁగి। తనదు రెండు పుట్టంబులు దనకునైన। మెలఁతమంగళసూత్రంబు మినుకుదక్క। వినతుఁడై యుండె నారామవితరణంబు। పాండవోత్తమ మేమని పలుకవచ్చు* (వ॥ అంత నారామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు దమతమభూమాగంబులనిచ్చి యిట్లనిరి* (గీ॥ ధరణివలన మమ్ము కడపనుల కేలనీ। వఖిలలోకగురుఁడవైన హరివి। మామకాంబులందు మలయుచీఁకటిఁ బాపు। భవదుదారరుచుల పార్థివేంద్ర *(వ॥ అనిపలికి బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రునిచే సమ్మానితులై యోక్తులంబూజించి మునులు సనిరిట్లు పెద్దకాలంబు రాజ్యంబుసేసి రాఘవేంద్రుండొక్క దినంబున* (సీ॥ వసుధ పై బొబ్బిడు వార్తలాకర్ణించు కొఱకునై గాముండు గూఢవృత్తి। నడురేయి దిరుగుచో నాగరజనులలో నొకఁడు దన సతి యొప్పకున్న। నొరునింటఁ గాపురంబున్న చంచల రాలిఁ బాయంగ లేక చేపట్టనేమి। తావెఱ్ఱియను రామధరణీశ్వరుండ నే బెలపొమ్మను మాట బిట్టువలుక। నాలకించి మఱియు నామాటచారుల, వలన జగము లోనఁగలుగఁ దెలిసి। సీతనిద్రవోవఁ జెప్పక వాల్మీకి। పర్ణశాలఁ బెట్టఁబని చెరాత్రి* (వ॥ అంత సీతయుఁ గర్భిణి గావునఁ గుశలవులనియెడు కొడుకులం గనియె వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె లక్ష్మణునకు నంగదుండును, జంద్రకేతుండును, భరతునకుఁ దక్షుండుఁ బుష్కలుండును, శత్రుఘ్నునకు సుబాహుండును, శ్రుతసేనుండును, సంభవించిరయ్యెడ (క॥ బంధురబలుఁడగు భరతుఁడు। గంధర్వచయంబుఁ ద్రుంచి కనకామలసద్బంధుఁడగు నన్నకిచ్చెను। బంధువులును మాత్యజనులుఁ బ్రజలు న్మెచ్చన్* (గీ॥ మధువనంబులోన మధునందనుండను। లవణుఁ జంపి భుజబలంబు మెఱసి। మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ డన్న రామచంద్రునాజ్ఞ నంగ* (వ॥ అంత రామచంద్రుండు గొంత కాలంబునకుఁ దనకొమరులయిన కుశలవులిద్దరును, వాల్మీకివలన వేదాదివిద్యలయందు నేర్పరులై పెక్కుసభలను ఆనకంబుగా రామకథాశ్లోకంబులు పాడుచు నొక్కనాఁడు రాఘవేంద్రునియజ్ఞశాలకుం జని *

మత్తకోకిల॥ వట్టిమాకులు పల్లవింపనవారియై మధుధారదానుట్టఁ బాడిన వారిపాటకు నుర్వరాధిపుఁ డుబ్బ్రజ। బ్బిట్టు సంతసమంది రయ్యెడఁ బ్రీతిఁ గన్నుల బాష్పముల్గొట్టనొదలలూఁచి వారలతో డిమ్ముక్కవపుట్టఁ గాక ॥ అంత నారామచంద్రుండు కుమారులకిట్లని యె (గీ॥ చిన్నియన్నలార శీతాంశుముఖులార। నళినదళవిశాలనయనులార। మధురభాషులార మహిమీఁద నెవ్వరు దల్లిదండ్రి మీకు ధన్యులార (వ॥ అనిన వార లేము వాల్మీకి పౌత్రులము రాఘవేశ్వరుని యాగంబు సూడవచ్చితిమనవుడు - మెల్లననగి యెల్లి ప్రొద్దున మీతండ్రి నెఱింగెదరుండుండని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె మఱునాఁడు సీతం - దోడ్కొని కుశలవుల ముందటనిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని యనేకప్రకారంబుల స్తుతియించి యిట్లనియె* (గీ॥ సీత ముద్దరాలు చిత్తవాక్కర్మంబులందు సత్యమూర్తి యమలచరిత పుణ్యసాధ్వి విడువఁ బోలదు చేకొను। రవికులాబ్ధిచంద్ర రామచంద్ర* (వ॥ అని వాల్మీకి పలుక రామచంద్రుండు పుత్రార్థియై విచారింపఁ గుశలవులను, వాల్మీకికి నొప్పగించి రామచంద్రచరణ। ధ్యానంబు సేయుచు నిరాశయై సీత భూవివరంబు సొచ్చె నయ్యెడ* (మ॥ ముదితా యేటికిఁ గుంకితీవు మనసలో మోహంబు దింతింపవే। వదనాంభోజము సూపవే మృదువు నీవాక్యంబు విన్పింపవే। తుది సేయందగదంచు నీశ్వరుఁడు నై దుఃఖించె భూపాలుఁడా। పదగాదే ప్రియురాలిం బాసిన యెడన్ భావింప నెవ్వారికిన్* (వ॥ అని వగచి రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి పదునొకండు వేలయేండ్లెడ దెగకుండ నగ్నిహోత్రంబులు సెల్లించెఁ దా నీశ్వరుండు గావున దన మొదలి నెలవునకుం జనియె నివ్విధంబున* (గీ॥ ఆదిదేవుఁడైన యా రామచంద్రుని। కబ్ధిగట్టు టెంత యసురకోటిఁ జంపు టెంత కపులసాహాయ్యమది యెంత। సురలకొఱకుఁ గ్రీడసూపెఁ గాక* (చ॥ వశుఁడుగ మొక్కెదన్లవణవార్ధి విజృంభణ తానివర్తికి। న్దశదిగధీశమౌళిమణిదర్పణమండితదివ్యకీర్తికి న్దశశతభానుమూర్తికిఁ సుధారుచిభాషికి సాధుపోషికి న్దశరథరాజుపట్టికిని దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్* (ఉ॥ నల్లనివాఁడుఁ బద్మనయనంబులవాఁడు మహాశుగంబులున్విల్లును దాల్చువాఁడుఁ గడువిప్పగువక్షమువాఁడు మేలుపైఁ। జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డీవుత మాకభీష్టముల్ * (గీ॥ రామచంద్రుఁ గూడి రాకలఁ బోకలఁ గదిసితిరుగువారుఁ గన్నవారు। నంటికొన్నవారు నాకోసల ప్రజలరిగి రాదియోగులరుగు గతికి* (క॥ మంతనములు సద్గతులకుఁ బొంతనములు ఘనములైన పుణ్యములకిదా నీంతనములు పూర్వాఘుని। కృంతనములు రామనామ

కృతిచింతనముల్ * (వ॥ ఆరామచంద్రునకుఁ గుశుండును, గుశునకు నతిథి, యతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునకి బుండరీకుండును, బుండరీకునకు క్షేమధన్వుండును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, బారియాత్రునకు బలుండును, బలునకుఁ జలుండును, జలునకు నర్క సంభవుండగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియును, విధృతికి హిరణ్యనాభుం, డతండు జైమిని శిష్యుండయిన యాజ్ఞవల్క్య మునివలన నధ్యాత్మయోగంబు నేర్చి హృదయకలుషంబు లంబాసి యోగచర్యుండయ్యె, నాహిరణ్యనాభునకుఁ బుష్యుండును, బుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుండును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుండు పుట్టె, నారాజయోగిసిద్ధుండయి, కలాపగ్రామంబున నున్నవాఁడు, కలియుగాంతంబున నష్టంబయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱం బుట్టింపంగలవాఁడా మరువునకుఁ బ్రశుశ్రుకుం, డాప్రశుశ్రుకునకు సంధియు, నతనికి నమర్షణుం డాయమర్షణునికి మహస్వంతుం, డామహస్వంతునకు విశ్వసాహ్వ, విశ్వసాహ్వకి బృహద్బలుండు జనియించె, వాఁడు భారతయుద్ధంబున మీతండ్రియగు నభిమన్యునిచేత హతుండయ్యె వినుము * (గీ॥ వరగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలు

—* భవిష్యద్రాజేతిహాసవర్ణనము: *—

లు దుదయుగాఁ గలరాజులఁ దోషహీనుల నెఱుఁగఁ జెప్పితి నే వారి నింక మీఁదఁ బుట్టఁగలవారిఁ జెప్పెద భూవరేంద్ర * (వ॥ ఆబృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణునకు నురుక్షతుండు, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును, బ్రతివ్యోమునకు భానుండును, భానునకు సహదేవుండును, సహదేవునకు బృహదశ్వుండును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును, బ్రతీకాశ్వునకు బ్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరుదేవునకు సుతక్షత్రుండును, సుతక్షత్రునకు బుష్కరుండును, బుష్కరునకు సుతపుండును, సుతపునకు నమిత్రజిత్తు, నతనికి బృహద్వాజియు నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండును, ధనంజయునకు రణంజయుండు, నతనికి సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధోదుండును, శుద్ధోదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తు, నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునకు రుణకుండును, రుణకునకు సురథుండును, సురథునకు సుమిత్రుండును, సుమిత్రునియనంతర కాలంబున, సూర్యవంశంబు నశింపఁగలదు, వీరలు బృహద్బలునినుండి క్రమంబునం బుట్టంగలవారలని చెప్పి శుకుండిట్లనియె * (సీ॥ ధన్యుఁడాయిక్ష్వాకుతనయుఁడా నిమి యాగమాచరింపఁగ గోరి యావసిష్ఠు। నార్త్విజ్యమునకుఁ దానర్థింపఁగని యాతఁ డింద్రుని మఖము సేయింపనియ్యకొని నాఁడనఁ జివత్తుఁ గొంత వ లేదని వచ్చి సంసారమెంతయుఁ జంచలంబు। కాలయాపనమేలఁ గ్రతువు సేసెదనని యన్యబుత్విజులనతఁడు గూర్చి। సేయనింద్రుని యాగంబు చెల్లఁజేసి। గురుఁడు చనుదెంచి శిష్యుపైఁ గోపమెత్తి। యోరి నావచ్చునందాఁక నుండవనుచు। నతని దేహంబు వడుగాతయని శపించె * (వ॥ ఇట్లు వసిష్ఠుండు శపియించిన నిమియును వసిష్ఠుని దేహంబు వడుఁగాక యని యలశపియింప నవ్వసిష్ఠుండు మిత్రావరుణులవలనఁ గడపట నూర్వశికి జన్మించె, గురుశాపంబున బ్రహ్మజ్ఞానియైన నిమి విగతదేహుండై ననతని దేహంబు మునీశ్వరులు గంధవస్తువులం బొదివిదాఁచి దొరకొన్న సత్త్రయాగంబు చెల్లించిరి కడపట దేవగణంబులు మెచ్చి వచ్చిన వారలకు నిమి దేహంబు సూపి బ్రతుకం జేయుండనవుఁడు వారలు నిమిప్రాణంబు వచ్చుంగాక యని పలికిన నిమి తన దేహంబు సొరనొల్లక యిట్లనియె * (మ॥ అతిమోహాకులితంబు సాంద్రమను తాపాంగారమూలంబు సం। తతనానాసుఖదుఃఖపీడితమనిత్యంబిట్టి దేహంబు సం। కృతి నాకేటికి మీన జీవనము భంగి భీతి బాహుళ్యమం। చితరు ల్వెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశు న్మదిం గొల్వెదన్ * (వ॥ అని పలికిన నిమి మాటలు గ్రమ్మఱింప నేరక శరీరులు గన్నులు దెఱచి నప్పుడును మూసినప్పుడును నిమిగాన వచ్చుంగాక యని పలికి దేవతలు చనిరంత * (గీ॥ పెద్దలైన మునులు పృథివీస్థలికి రాజు లేమి జూచి నిమికళేబరంబు। తరువ నొకఁడు పుట్టె దనయుండు వానిని। జనకుఁడనుచుఁ బలికె జగములెల్ల * (వ॥ వాఁడయు నతండు విగతదేహుండు గావున వైదేహుండనియును, మథనజాతుండు గావున మిథిలుండనంబరగె, నమ్మిథులుని చేత నిర్మితంబయినది గావున, మిథిలానగరంబు నాఁబరగె, నాజనకునకు నుదావసుండు, నుదావసునకు నందివర్ధనుండు నందివర్ధనునకు సుకేతుండును, సుకేతువునకు దేవరాతుండును, దేవరాతునకు బృహద్రథుండు పుట్టె, నతనికి సుధృతియు, నతనికి ధృష్టకేతుండును, నతనికి హర్యశ్వుండును, నతనికి మరువు, నతనికి బ్రతింధకుండును, నతనికి కృతరథుండు, నతనికి దేవమీఢుండును, నతనికి విధృతుండును, నతనికి మహాధృతియు, నతనికిఁ గీర్తిరాతుండును, నతనికి మహారోముండును, నతనికి స్వర్ణరోముండును, నతనికి హ్రస్వరోముండును, నతనికి సీరధ్వజుండును బుట్టె * (గీ॥ అతఁడు మఖము సేయ నవని దున్నింపంగ। లాంగలంబు కొనను లక్షణాంగి। సీతజాతయయ్యె సీరధ్వజుండన। దానఁ జెప్పబడియె ధన్యుఁడతఁడు * (వ॥ ఆసీరధ్వజునకు కుశధ్వజుండును, కుశధ్వజునకు ధర్మధ్వజుండును, ధర్మధ్వజునకు కృతధ్వజమిత్రధ్వజులను వారిద్దఱు పుట్టిరి, యందుఁ గృతధ్వజునకు కేశిధ్వజుండతండు, దన్నుఁ దానెఱింగెడి విద్యయందు నేర్పరి

యయ్యెమిత్రధ్వజునకు ఖాండిక్యుండను వాఁడు జన్మించి, తండ్రివలన నెఱుకగలవాఁడై, కర్మతత్త్వంబు నేర్చె, కేశధ్వజునివలనఁ భీతుండై యేగె, ఖాండిక్యునకు భానుమంతుండు, భానుమంతునకు శతద్యుమ్నుండును, శతద్యుమ్నునికి శుచియు, శుచికి సనద్వాజుండు, సనద్వాజునకు నూర్ధ్వకేతుండు, నూర్ధ్వకేతునకు నజుండు, నజునకు పురుజిత్తు, పురుజిత్తునకు నరిష్టనేమియు, నరిష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువునకుఁ బార్శ్వకుండును, పార్శ్వకునకు జిత్రరథుండును, జిత్రరథునకు క్షేమాపియు, క్షేమాపికి హేమరథుండును, హేమరథునకు సత్యరథుండును, సత్యరథునకు నుపగురుండును, నుపగురునకు నగ్నిదేవుప్రసాదంబున నుపగుప్తుండును, నుపగుప్తునకు సాహసుండును, సాహసునకు సువర్చసుండును, నతఁడే సుభూషణుండని వినఁబడు, నా సుభూషణునకు జయుండును, జయునకు విజయుండును, విజయునకు ఋతుండును, ఋతునకు శునకుండును, శునకునకు వీతిహవ్యుండును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహుళాశ్వుండును, బహుళాశ్వునకు కృతియు, కృతికి మహావశియను వాఁడును జన్మించె, వీరలు మైథిలురను రాజులని చెప్పంబడుదురు, యోగీశ్వరప్రసాదంబున గృహస్థులైయుండియు, బంధనిర్ముక్తులై యాత్మజ్ఞానంబుగలిగి నిరంతర బ్రహ్మానుసంధానంబు సేయుచునుండుదురని పలికి శుకయోగీంద్రుండిట్లనియె* (గీ॥ చంద్రగౌరవమునఁ జంద్రవంశమునందుఁ జంద్రకీర్తు

### ✽* చంద్రవంశ్యులగు రాజుల యితిహాసము. *✽

లశోడ జనితమైన। యట్టిపుణ్యసుతులు నైనరారాజుల। నింక వినుము మానవేంద్రచంద్ర* (సీ॥ ఒకవేయితలలతో నుండు జగన్నాథు బొడ్డుతమ్మిని బ్రహ్మపుట్టె మొదలఁ। నతని గుణంబులఁ దనకుఁ బోలెఁడు దత్తుఁడత్రియను సంజాతుఁడయ్యె నత్రి। కడకంటిచూడ్కులఁ గలువలసంగడీఁడుదయించె విప్రులకోషధులకు। నంబుగర్భములకును జనియింపునాథుఁడై యుండి రాజసూయంబుజేసి। మూఁడులోకములను గెల్చి మోదమునను। జని బృహస్పతిదారఁ జారుమూర్తిఁ। దారనిలుచొచ్చి గొనిపోయి తన్నుగురుఁడు। వేడునం దాకనియ్యం తివిడువఁడయ్యె* (వ॥ అంత వేల్పులతో రక్కసులకుఁ గయ్యంబయ్యె బృహస్పతితోడి వైరంబునం జేసి కావ్యుండు రాక్షసులతోఁ జేరికొని చంద్రుని జేపట్టి సురాచార్యునింబోదోలిన హరుండు భూతగణసమేతుండై యతని గురుపుత్రుండైన బృహస్పతిం జేపట్టె, దేవేంద్రుండును సురగణంబులుం దానును బృహస్పతికి నడ్డంబువచ్చె నయ్యవసరంబున బృహస్పతిభార్యానిమిత్తంబున గణంబును రాసుర వినాశకరంబయ్యె నాలోన బృహస్పతి తండ్రియగు నంగిరసుండు సెప్పిన విని బ్రహ్మదేవుండు చంద్రునిం గోపించి గర్భిణియైన తారను మఱల నిప్పించినం జూచి బృహస్పతి దానికిట్లనియె* (ఉ॥ సిగ్గొకయింత లేక వెలచేడియభంగి నిధర్మకీర్తులఁ। బొగ్గులు సేసి జారుశశిఁ బొందికటా కడుపేల దెచ్చుకొం। పెగ్గుదలంపగావలదె యిప్పుడు గర్భము దించుకొమ్మనిన న్వ్రిగ్గఁగఁ జేసెదఁ జెంటిమానవతుల్నిను జూచి మెత్తురే* (వ॥ అని కోపించుచుండ నా చెలువకుఁ బసిండిచాయమేనుగలకొడుకు పుట్టె వానిం జూచి మోహంబుచేసి బృహస్పతి తనకొడుకనియును జంద్రుండు దనకన్నవాఁడనియును జగడించి రప్పుడు* (గీ॥ వారివాదు జూచి వారింపఁగా వచ్చి। యేర్పరింప లేక యెల్లమునులు। నమరవరులనడుగనా వేడుకలకత్తె। యెఱుఁగుఁగాని యితరులెఱుఁగరనిరి॥ ఆపలుకులు విని సిగ్గుపడియున్న తారకుఁ జిన్నికొమరుండిట్లనియె* (క॥ ఇలువరుస చెడఁగ బంధులు। దలవంపఁగ మగఁడు తోయఁదల్లీ కట్టా। వెలి నేలనమ్మఁ గంటివి। కలిగించినవాఁడు శీతకరుఁడో సురుఁడో* (వ॥ అని పలుకుచున్నకొడుకునకుమఱుమాటలాడనేఱకయున్న తార నేకాంతంబునం జీఱి మంతనంబున బ్రహ్మయిట్లనియె* (మ॥ చెలువా నీ మెలసిగ్గువాపి గురుఁడో శీతాంశుఁడో యెవ్వఁడీ। లలితాకారుఁ గుమారుఁగన్న యతఁడేలా దాఁపనీపాటునీ। తలనేపుట్టెనె వెచ్చనూర్పకుము కాంతల్గా మినుల్గారె మా। టలనిం జేమియుఁ బోదు పోయెరులతోడం జెప్పి విన్పింపవే* (వ॥ అని పలికిన బ్రహ్మకు నెమఱు మాటాడవెఱచుచుంతనంబున నయ్యింతి చంద్రునికింగన్న గాన ననవుడా బాలునకు బుధుండను పేరువెట్టి చంద్రునికిచ్చె బ్రహ్మ సనియె నంత* (గీ॥ బుద్ధిమంతుఁడైన బుధుఁడు పుత్రుండైన। మేనుఁ బెంచి రాజు మిన్నుముట్టె। బుద్ధిగలసుతుండు పుట్టినఁ దండ్రి మిన్నుముట్టకేలమిన్నకుండు* (వ॥ ఆ బుధునకుఁ దొల్లి చెప్పినయిళాకన్యకవలనఁ బురూరవుండు పుట్టె నా పురూరవునకుఁ గల శౌర్యసౌందర్యగాంభీర్యాదిగుణంబులు నారదువలన నింద్రసభలోన నూర్వశివిని మిత్రావరుణ శాపంబున మనుష్యస్త్రీరూపంబు దాల్చి భూలోకంబునకు వచ్చి యుందర నిలువంబడి* (తరల॥ సరసిజాక్షు మనోజ్ఞు గేంద్రసమధ్యు విశాలవక్షు మహాభుజు। న్సురుచిరాననచంద్రమండలశోభితున్సుకుమారు నా। పురుషవర్యుఁ బురూరవుం గని పువ్వుటంపరజోదు చేఁ। దొఱఁకు క్రొవ్విరితూపులన్మదిఁ జాలఁ బోవఁగ భ్రాంతయై। యూర్వశి నిలిచియున్నంత* (ఉ॥ భావజు కోలయో మొగులు వాసి వెలుంగు మెఱుంగు మోహినీ। దేవతయో నభోరమయో దీనికరగ్రహణంబు లేనిచోఁ। జీవనమేటికంచు మరుచేఁ జిగురాకడిదమ్ము జిమ్ములం। దావడకెన్ను పూరవుఁడు దామరపాకుజలంబుకైవడిన్* (వ॥ ఇట్లు రాచపట్టి చెలువు వింటి వాని దాడికి నోడి యెట్టకేలకు సైరణ సేసినిలుకడం దెచ్చుకొని యచ్చెలువకిట్లనియె* (ఉ॥ ఎక్కడనుండి రాక మనకిద్దరికిం గనుఁ నీకుఁ దక్కితిన్। ముక్కటి వచ్చెనో యలరుములుక్కులు వాఁడడిదంబుఁ ద్రిప్ప నేఁడిదిక్కునెఱుంగనేయబల దేహము దేహము గేలు గేలునీఁ। చెక్కునఁ జెక్కు మోపితగు

చెయ్యవలసినవ్వి పనుల్గావవే॥ అని నంబోడ చేడియ యిల్లాలై యుండె* (మ॥ ఇవి నా గూర్చుతగల్లు రెండుదగనీ వెల్లప్పుడుం గాచె దే, నివివస్త్రుండవుగాక నాకడను దానీవుండు దే నిన్ను వే, కగుణాలంకృత నీకు నా మతము నికెట్టంబయ్యె నే నిన్మనో, జవినోదంబులనిన్ను దేల్తునగు నేచంద్రాన్వయగ్రామణీ ॥ అనిపలికిన వేల్పులవెలయాలి ప్రతిమాటలకియ్యకొని తనమనంబున* (క॥ మంచి నటరూపు సంతతి, నంచితయా దేవగణికయటమురుచేత । న్సంచలితచిత్తుననుగా । మించిన నటయంతకంటె మేలుంగలదే॥ అని నిశ్చయించికొని* (గీ॥ రాజ రాజముఖ్యగతి సల్లెబంగారు, మేడలందుఁదరులనీడలందు । దోటలందు రత్నకూటంబులందును, గొలకులందుఁ గిరులకెలకులందు* (వ॥ అంతనయ్యిద్దఱకుం దగులంబు నెలకొని* (క॥ ఒకవలసి కేగుదురు వా, రొకచోటన కాసి నిలిచియుండుదు రులో, నొకటియె కానమునా నెంచుచు, రొకనిమిషము పాయకుండు రువిదయు ఱేఁడున్* (క॥ దయ్యమెఱుంగు న్వారల, నెయ్యంబులు మక్కువలును నిజగరితనముల్, వియ్యములుగలచో సందడిఁ । బయ్యెదకొంగడ్డమైన బ్రాణము వెడలున్* (వ॥ ఇట్లూర్వశీయుం బురూరవుండును నొండొరువుల వలన మక్కువలు చెదరక లోత్తం బగల్లు రేలు నెల్లెడల విహరింపనొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండి తనకొలువున నూర్వశి లేకుండుటం జూచి* (క॥ ఇన్నిదినంబులు దగమనమున్న సభామధ్య వేదియూర్వశి లేమిన్, నిన్నదనంబున నున్నది, యెన్నదఁ జెగియున్న పసిఁడి వడువున ననుచున్* (వ॥ ఇంద్రుండు గంధర్వులం బంచిన వారునడురేయింజని చీకటి నూర్వశి పెంచుచున్న మేడకంబులం బట్టినఁ బిరెండును మొఱవెట్టుడు వాని మొఱ విని రతిఖిన్నుండై మేనుమఱచి కూఁకుచున్న పురూరవు కౌఁగిటనుండి యూర్వశి యిట్లనియె* (మ॥ అదెనాబిడ్డల బట్టి దొంగలు మహాహంకారులై కొంచుఁ బో, మ్మదులై పోయెఁ దడ్డపాటునకు సామర్థ్యంబు నష్టీనుఁడై, కదలండే మగపందకూరుకుగతింగన్మూసి గుఱ్ఱెట్టుచు, న్వడలం జాలఁడు నామకౌఁగిలియుఁ దావత్యాస్పుఁడై చెల్లరే* (క॥ పగతులు దొంగలరేవఁగ, మగటిమి వాటింపలేక మగతనమెల్ల, న్మగువలకౌఁగిటఁ జూపెడు, మగవాఁడగు కంటె మగఁడు మగువగుటొప్పున్* (గీ॥ అధముఁడైన వాని కాలగుకంటె నత్యధికునింటఁ దాసియగుట మేలు, హీనుఁ బొందియోని హింసింపఁగానేల, యువతిజనుల కూరకుంట లెస్స* (క॥ ఏటికినీ రాచఱికము, బోఁటులు మొఱవెట్టఁ బశువు భోరన యడవి, న్వేఁటలనీడ్చెడి దొంగల । గీటడఁపవు వెడలి శవము క్రియనుండెదిదే* (క॥ వినియుఁ వినవు రణభీరువు । మనుజాధమునిమరపోతుమందుని నకటా । నినుఁ జక్రవర్తి జేసిన, వనజాసను కంటె వెఱ్ఱి వాఁడును గలఁడే* (వ॥ అని పెక్కుభంగుల నయ్యింతి పరుషోక్తులను కరవాలమ్ములు చెవులఁ జొనుప నా రాజశేఖరుండు డంకుశంబు పోట్లనడంగు మదగజంబు చందంబున మఱలి దిగంబరుండై వాలు కేలనం కించి నడురేయి దొంగల నఱికి వైచి మేషంబుల విడిపించుకొని తిరిగి వచ్చు నెడ* (గీ॥ చీఱలేని మగనిఁ జెలువ దానీక్షించి, కన్ను మొఱఁగి పోవఁగాల్లు రాక, వెఱ్ఱి వాని భంగి వివశుఁడై పడి లేచి, పొగిలి తెలిలి ప్రుక్కి పొక్కి పడియె* (వ॥ మఱియుఁ బురూరవుండు మదనాతురుండై వెదకుచు సరస్వతీనదీతీరంబునఁ జెలికత్తెలతోఁ గూడియున్న యూర్వశిం గని వికసితముఖకమలుండై యిట్లనియె* (మ॥ తనుమధ్యా యిదియేల వచ్చితి కటాధర్మంబె శర్మంబె మా, న్మనలోనుండు వలాడి కొన్నపలుకుల్మ త్యాదలుందప్పినే, నిను నేఁ బాసినయంతనుండి తనువు న్నేలంబడంబాఱెన, న్దినును గ్రంపున్మృగాలీదీనిఁ గరుణాదృష్టి న్విలోకింపవే॥ అనిన నూర్వశి యిట్లనియె* (క॥ మగువల కునిత లొంగెదు, మగవాఁడవె నీవు పశువు మాడ్కిన్ వగవం । దగవే మానుషపశువును, మృగములు గని యొయఁగాక మేలని దినునే॥ అదియునుంగాక* (మ॥ తలఁపుల్ పిచ్చులు మాటలుజ్వలసుధాధారల్ విభుండైన వు, వ్వలుతు న్మెచ్చరు యన్యులందలఁతు రేవిశ్వాసముల్లేదు క్రూ, రులపొత్తుల్ సతినైనఁ జంపుదురధర్మర్నిర్దయుల్పంచలు, ల్వెలయాండ్రెక్కడివారి వేడబములా వేదాంత సూక్తంబులే* (ఉ॥ ఇంకొకయేఁడునోయి నన శ్వేశ్వర యవ్వలి రేయి నీవు నా, లంకెకు వచ్చి యాత్మజులలక్షణవంతులఁ గాంచెదమియ, న్నాంకకపొమ్ము నీవనఁడు గొమ్మను గర్భిణి గాఁదలంచుచు । న్సంకయొకింత లేక నృపసత్తముఁడట్లనపోయె వీటికిన్* (వ॥ ఇట్లు మఱలిచని తన పురంబునకొక్కయేఁడుండి పిదప నూర్వశికడకేగి యొక్క రేయి పురూరవుండయ్యింతి కడనున్న నావెలంది యాగంధర్వ వరుల వేఁడికొనుము, తన్నిచ్చెదరనవ్రుముతం దుగంధర్వవరులం బ్రార్థించిన వారలతండు పొగడుటకు మెచ్చి యగ్నిస్థాలి నిచ్చిన నయ్యగ్నిస్థాలిని నూర్వశింగాఁ దలంచుచు దానితో నడపుందిరుగుచుండి యొక్కనాఁడగ్నిస్థాలియని యెఱింగి వనంబునందిగ విడిచి యింటికిఁ జనుదెంచి నిత్యంబు రాత్రి దానిం జింతించుచుండెఁ ద్రేతాయుగంబు సొచ్చిన నారాజు చిత్తంబునఁ గర్మబోధంబులునై వేదంబులు మూఁడు మార్గంబులై తోఁచిన నాభూవరుండుం స్థాలికడకుం జని యందు శమీగర్భజాతంబై నయశ్వత్థంబుఁ జూచి యశ్వత్థంబు చేత నరణులు రెండుగావించి మొదటియరణిఁ దానును వెనుకటి యరణి యూర్వశియును రెంటి నడుమనున్న కాష్ఠంబు పుత్రుండని యును మంత్రంబు సెప్పుచుం ద్రచ్చుచుండ జాతవేదుండన నగ్ని సంభవించె నతఁడు విహితారాధనసంస్కారంబునం జేసి యాహవనీయాదిరూపితుఁడై నెగడి పురూరవుని పుత్రుండని కల్పింపంబడియె నా యగ్ని పురూరవుని పుణ్యలోకంబునకుం బనుపం గారణంబగుటం జేసి* (క॥ ఆ యగ్నిచేఁ బురూరవుఁ । డాయజ్ఞేశ్వరుని నంతు హరి వేదమయుం, గ్రీ

యుతుఁ గూర్చి యజించెఁ గుణాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడుకొఱకై* (ఉ॥ ఒక్కటి వహ్ని వేల్పుఁ బురుషోత్తముఁ డొక్కఁడు వహ్ని వాఙ్మయం । బొక్కటి వేదమా ప్రణవ మొక్కటి వర్ణము దొల్లి త్రేతయం । దొక్కటి చూచి మూఁడుగను దోరము గానొనరించె బుద్ధిచే । జక్కఁగ నా పురూరవుఁడశక్తులకున్ సులభంబు లెల్లగన్* (వ॥ ఇట్లు వేదవిభాగంబుఁ గల్పించి యాగంబు సేసి పురూరవుండూర్వశియున్న గంధర్వలోకంబున కరిగెను. ఆ నృపతికి నూర్వశిగర్భంబున నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండును, జయుండును, విజయుండన నార్గురు పుత్రులుం గలిగిరందు, శ్రుతాయువునకు వసుమంతుండును, సత్యాయువునకు శ్రుతంజయుండును, రయునకు శ్రుతుండును, నేకుండన నిరువురు గలిగిరి, జయునకు నమితుండు, విజయునకు భీముండు జనించి, రా భీమునకుఁ గాంచనుండను కాంచనునకు హోత్రుండను, హోత్రునకు గంగాప్రవాహంబు పుక్కిటం బెట్టిన జహ్నుండు, జహ్నునకుఁ బూరుండుఁ, బూరునకు బాలకుండు, బాలకునకు జకుండు, నజకునకు కుశుండు, కుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుండన నలువురు సంభవించిరందుఁ గుశాంబునికి గాధియను వాఁడు గలిగె నా గాధి రాజ్యంబు సేయుచుండ* (సీ॥ సత్యవతిని గాధిజాతను కన్యను విప్రుఁడు ఋచికుండు వేడికొనిన। గాధియు మతకీడుగాఁడని తెల్ల నినవకంపు మేనులు నల్ల చెవులు। గలసుఱ్ఱములు వేయి కన్యకు నీవుంకు విచ్చినఁ గూఁతు నిత్తుననిన। వసుధామహుండును వరుణుని కడ కేగి హరులఁ దెచ్చినఁ గూఁతు నాతఁ డిచ్చె। నా మహాత్ముపత్నియు నంతటఁ గొడుకులఁ। గోరి యడుగ నీయగోని యతండు । విప్రరాజమంత్రవితతుల వేల్పించి । చెరువు చేసి స్రుకుంతఁ జనియె నదికి* (వ॥ అమ్మ్యొడ దల్లి నియడిగిన సత్యవతి బ్రహ్మమంత్రంబుల వేల్పించిన చరువు దల్లి కిచ్చి క్షాత్రమంత్రంబులం దల్లికి వేల్పించిన చరువు దానందుకొనియుండ నా ముని సను దెంచి చరువు వీడ్వడుటయెఱింగి భార్యకిట్లనియె* (గీ॥ తల్లిచరువు నీవు దాల్చి నీచరు వేల। తల్లి పాలనిడితి తరళనేత్ర। కొమ్మ యింక నీకుఁ గ్రూరుఁడు పుట్టుమీ। యన్న బ్రహ్మవిదుని నన ఘుఁ గాంచు* (వ॥ అనినయ్యింతి వెఱచి మ్రొక్కి వినయంబులాడిన ప్రసన్నుండై నీకొడుకు సాధువై నా నమందు క్రూరుండగుం గాక యని రుచికుండనుగ్రహించిన నా సత్యవతికి జమదగ్ని సంభవించె - నా సత్యవతియుం గౌశికనదియై లోకపావనియై ప్రవహించె, నా జమదగ్నియు రేణువు కూఁతురు రేణుకను వివాహంబై వసుమనాదికుమారులం గనియె నందు* (క॥ పురుషోత్తముఁ నంశంబున। ధర జమదగ్నికి జనించె ధన్యుఁడు రాముం। డిరువదియొక మఱి నృపతుల। శిరముల జక్కడి చెఁదన

✤* భగవదంశసంభూతుండగు శ్రీపరశురాముని చరిత్రము. *✤

దు చేగొడ్డంటన్॥ అనిన విని భూవరుండు శుకునకిట్లనియె* (ఉ॥ ఏటికి జంపె రాముఁడవనీశులఁ బల్వుర వారి యందుఁ ద। ప్పేటికిఁ గల్గె విప్రుఁడతఁ డేటికి రాజస తామసంబుల । న్నాటముఁ బొందె భూభర మవారితమా టది యే విధంబునా। మాటకు మానిచంద్రముఖ మాటప్రకాశము గాఁగఁ జెప్పవే ॥ అనిన విని శుకుండిట్లనియె* (సీ॥ హైహయాధీశ్వరుండర్జునుండను వాఁడు ధరణీశ్వరులలోనఁ దగిన వాఁడు। పురుషోత్తమాంశాంశుఁ బుణ్యు దత్తాత్రేయు నారాధనము సేసి యతనివలనఁ । బరిపంథిజయమును బాహుసహస్రంబును నణిమాదిగుణములు యశము బలము । యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబు చెడని యింద్రియములు సిరియుఁ బడసి। గాలికైవడి సకలలోకంబులందుఁ। దనకు బోగామి రారామి తలములేక । నెట్టిచోనైనఁ దన యాజ్ఞ యేపు మిగిలి। ధరణి వెలుఁగొందె వినువీధిఁ దరణి మాడ్కి* (మ॥ ఒకనాఁ డామను జేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై వీటనుం। డక రేవానదికేగి యందుఁ దెలినీటం జల్లుఁ బోరాడి దీ। ర్ఘకరాబ్జంబున నా నదీజలముల న్నట్టెన్వడి న్నీరు ద్రమో। లుకఁ బెల్లుబ్బి రణాగకుండ మునయూలంకేశు పైఁ గొట్టఁగన్* (వ॥ ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుండా రాజు చెంగటం దొట్టిన యేటినిటికి సహింపక రోషంబునం బోటరియుం బోలె నమ్మేటి మగని తోటి పోరాటమునం జననిఁ బాటింపకఁ దన బాహుపాటవంబున* (క॥ వీఁక మెయి నతఁడు రావణు। గూఁకటులు గలిం చిపట్టికొని మ్రోకాళ్లం దాకించి కోతికైవడి నాకం బెట్టించె నింక రావళి చేతన్ ॥ అంత నర్జునుడు మాహిష్మతీపురంబునకేతెంచి* (క॥ ఆరాజేంద్రుఁడు రావణు । నోరీయిటమీద నూరకుండుము జగతిన్ । వీరుండనని నుఁ గాచితిఁ। బోరా యని సిగ్గు పడ విడిపుచ్చెన్ మఱలన్॥ అంత* (సీ॥ ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున వేటకై కాంతారవీథికేగి। తిరిగి యాటల శ్రాంతదేహుఁడై జమదగ్ని ముని యాశ్రమముఁ జేరి మ్రొక్కి నిలువ । నా మునీంద్రుఁడు రాజు నర్థితోఁ బూజించి యా రాజునకు రాజునను చరులకు । దన హోమధేనువుఁ దడయక రప్పించి యిష్టాన్నములు కురియింపఁ దడవఁ। గుడిచి కూర్పుండి మొదవుపైఁ గోరెఁ జేసి। సంపదేటికి నీ యావు చాలు గాక । యిట్టి గోవుల నెన్నఁడు నెఱుఁగమనుచుఁ । బట్టి తెమ్మని తన యొద్ది భటులఁ బనిచె॥ వారలు దర్పంబునం జని* (క॥ క్రేపుం బాపకుఁ డంచును । నాపదలం బడితినంచు నంభాయంచుం। జూపోర్వరు నృపులంచును। వాపోవన్మొదవు గొనుచు వచ్చిరి పురికిన్॥ అంత నర్జునుండు మాహిష్మతీపురంబునకు వచ్చునెడ రాముండాశ్రమంబునకేతెంచి* (గీ॥ అర్ధిఁ బయ్యాయి యింటనశనంబు గుడిచి మా। యయ్య వలదనంగ నాక్రమించి। కోరి మొదవు రాజు గొంపోయినాఁడట। యేను రాముఁ డౌట యెఱుఁగఁడొకొ॥ అనిపలికి* (మ॥ ప్రళయాగ్ని చ్ఛటభంగిఁ గుంభివిదళింపఁ బాలు సిం

హోంకృతిం జెలఁగ రాముఁడు లేశు వెంటనట చెచ్చృథ్వీతలంధల్లనా। కులమై గ్రుంకఁగుఠారినై కవచినై కోదండినై కాండినై।
ఛలినై సాహసినై మృగాజినమునోఁ జ్ఞశ్రోణినై తూణినై చనిమాహిష్మతీపురంబుఁ జేరినిలుచున్న సమయంబున॥ (మ॥ క
ని యెన్మంకట గా ర్తవీర్యుఁడు సమిత్క-ముంబ్ర కాముస్మ రాసనతూణీంకుఠారభీముఁ నటిరోష। పాంచలఛ్ఛాయుగా। నన నే
తాంచలసీమునైణపటనా నామాలికోద్దామునూ। తనసంగంభున రేంద్రదారశుభసూత్రత్రాముని రామునిన్॥ కనికోపిం
చి॥ (ఉ॥ బాలుఁడు వెఱ్ఱి బ్రాహ్మణుఁడు బ్రాహ్మణు కైవడి నుంటమానిభూ। పాలురతోడ భూరిజయభవ్యులతో డభయంబుడ
కేల్క। యాల్లకువచ్చినాఁడు నయందిక పాపము లేదు లెండు లెం। డేలసహింపభూసురుని నేయుఁడు ద్రేయుఁడు గూల్పఁడి
మ్మహీశ్॥ (వ॥ అనికదలించి దండనాయకులంబురికొల్పిన వారురథగజతురగపదాతిసమూహసహితసప్తదశాక్షౌహిణుల
తో నెదురునడిచి శరచక్రగదాఖడ్గభిండివాలశూలప్రముఖసాధనంబుల। నొప్పించిన నవ్విప్రుండు గన్నులకొలంకులనిప్పులకు
ప్పలు తెప్పలుగొన రెట్టించిన కటుకట్టల్క మిట్టిపడి యజ్ఞోపవీతంబు చక్కనిడికొని కరాళించి బిట్టు రెట్టించి కఠోరంబగు కుఠారం
బు ఝళిపించి నూఁకలపై కురికి తొలియాడి మొగంబునం గ్రొత్తయలుక నెట్టంగఁ జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగున బడంబులు
డెంచుచును అటికంబంబులఁ దెగనడంచు నారామకారుని పగిది మస్తంబులు ద్రుంచుచుఁ దాల। ఫలంబులు రాల్చు వృక్షారోహకుని
కైవడి శిరంబులు ద్రుంచుచు మృగంబుల ఖండించు సూపకారుని భంగిన వయవంబుల జెక్కుచు నంతటం దనివిసనక। విలయకాలకీలి
కేళి నిక్కంటలు మియ్యుచు, విల్లందియె ల్లెడంబిడుగులసోనలు గురియు బలు మొగుళ్లపడువున నప్రమాణంబులగు బాణంబులఁ బఱపి
సుభటసైన్యంబులకు దైన్యంబులిచ్చుచు, నడ్డంబు లేని యాస్ఫాటంబులు గల బాణవర్షధృతంబుల చేఁ గోపానలంబున। కాహుతు
లు సేయుచుఁ దురంగంబుల నిరంగంబులఁ గావించుచు, రథంబులు వితథంబులుగా నొనర్చుచు, ద్విరదంబులనరదంబులపైఁ బడఁ
ద్రోయుచు నిర్వంథంబు వసేనలనంబవానలముంచి రూపుమాపిన॥ (క॥ నత్తెల్లి భూతజాలము చిత్తంబులఁ జొక్కి వేడ్కఁ జిందు
లువాఱన్ గ్రొత్తెల్లి సమిత్తలమున। నెత్తురు మేదంబు పలలనికరంబయ్యెన్॥ అయ్యవసరంబున॥ (క॥ మేలీ బ్రాహ్మణుఁ డొక్కఁడు,
నేలంబడఁగూల్చె సైన్యనిచయము నెల్ల। న్నాలార్ప నేల యీతనిఁ దూలించెదఁ గాక నాదు దోర్బలము వడిన్ ॥ అని పలికి॥ (ఉ॥
ఒకయేనూటుకరంబులన్ ధనువులత్యుల్లాసియై తాల్చె వే। యొకయేనూట గుణధ్వనుల్ని గుడశాతోగ్రాస్త్రముల్బూర్చి ప। ప్ర
కుఠారంబును నిన్నుఁ గూల్తునను చుస్ఫర్ధించి పుంఖానుపుం। ఖకఠోరంబుగ నేసియార్చె రయరేఖోద్దాముని రామునిన్॥ (క॥
వడిఁ దూపు లెగయ కుడుసులు। వడి కార్ముకపంచశతము పఱగ విభుఁడు సొం।పడరెం బరివేషకుండలి। నడుమ కరద్యుతుల వెలయు
నలినాప్తుక్రియన్॥ ఇట్లర్జునుండు బహువిలాసంబులు సూపిన॥ (మ॥ ధరణీదేవుఁడు రాముఁ డాఢ్యుఁడు జగద్ధానుష్క రత్నం
బుకు। ష్క రచాపంబొక టెక్కు వెట్టి శరముల్సంధించి పెల్లేసి భూ। వరు కోదండములొక్క మాడ్కి। దుని మెచ్చ్వాడంత టంబొక
వే। తెరువుల్ లువ్వఁగుఠారధారనజి కెక్క్ దబ్బాహుసందోహముల్॥ (క॥ కరములు దునిసిన నతనిక। శిరమొక్కటి చిక్కె శైల
శిఖరము భంగిం। బరశువున నదియుఁ ద్రుంచెను। బరసూదనుఁ డైనఘనుఁడు భార్గవుఁ డడరన్॥ (గీ॥ తండ్రి పడినన తని తనయు
లుపదివేలు। దలఁగిపోయిరతనిఁ దాఁక లేక। పరభయంకరుండు భార్గవుండంతనా। గోవుఁ గ్రేపుఁ దోడఁ గొనుచుఁ జనియె॥ (వ॥
ఇట్లు హోమధేనువు మఱలఁ దెచ్చి యిచ్చి తన పరాక్రమంబు దండ్రికిం దోఁబుట్టువులకుం దెలియం జెప్పిన జమదగ్ని రాముని
కిట్లనియె॥ (క॥ కిల వేల్పులెల్ల దమతమ। చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదురకటా। బలువేల్పు రాజువానిం జలమున నక్లైలపో
యిచంపితి పుత్రా॥ (క॥ తాలిమి మాకును ధర్మము। తాలిమి మూలంబు మనకు ధన్యత్వమునం। దాలిమి గలదని యీశుం। డేలిం
చును బ్రహ్మపదము నెల్లన్మనలన్॥ (క॥ క్షమగలిగిన సిరిగలుగును। క్షమగలిగిన వాణిగలుగు సౌఖ్యము లెల్లన్। క్షమగలుగ ముక్తి
గలుగును। క్షమగలిగిన మెచ్చుశౌరి సదయుఁడు తండ్రీ॥ (క॥ పట్టపు రాజును జంపుట। కట్టలుకన్విప్రుఁ జంపుకంటెను పాపం। బట్టి
ట్టనకుము నీవీ। చెట్టసెడన్ దీర్ఘసేవ సేయుము దనయా॥ (క॥ అని తన్నుఁ దండ్రి పంచినఁ। బనుపూని ప్రసాదమనుచు భార్గవుఁడుర
యంబున నొకయేఁడు ప్రయాణము। చని తీర్థంబులెల్ల నాడి చనుదెంచె నృపా॥ (ఉ॥ ఆమెడ నొక్కనాఁడు సలిలార్థము రేణు
క గంగలోనికిం। బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పగ నచ్చరలేమ పిండుతోఁ। దోయవిహారముల్సలుపు దుర్లభుఁ జిత్రరథు
న్సరోజమా। లాయుతుఁ జూచుచుండెఁ బతియాజ్ఞదలంపక కొంత ప్రేమతోన్॥ (వ॥ ఇట్లు గంధర్వవల్లభునిం జూచు కారణంబు
నఁ దడసి॥ (ఉ॥ అక్కటవచ్చి పెద్దతడవయ్యెడి హోమము వేళదప్పె నే। నిక్కట నేలయుండితి మునీశ్వరుఁ డేమనునో య
టంచుఁ దాఁ। గ్రక్కునఁ దోయకుంభము శిరస్థలమందిడి తెచ్చి యిచ్చె వే। మ్రొక్కి కరంబు మోడ్చి పతిముందడ నల్లననిల్చెఁ జూ
చుచున్॥ అప్పుడు॥ (క॥ చిత్తమున భార్య దడసిన। వృత్తాంతంబెఱిఁగి తపసి వేగన సుతులన్। మత్తం దీనిం జావఁగ। మొత్తుం డ
నమొత్తరైరి మునుఁగుచు వారల్॥ (క॥ కడుకొని పెండ్లముఁ జంపని। కొడుకులఁ బెండ్లాముఁ జంపగురుఁ డొసఁగిన దాఁనడుగు
లకు నెఱిఁగి రాముం। డడుగిడకుండంగఁ ద్రుంచెనన్నలఁ దల్లిన్॥ (శా॥ తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపుమను చోఁ దాఁ జంపరాకున్నఁ

బెం । పెల్లంబోవశపించుఁదండ్రితనపెంపేచేయుదుమ్మెచ్చినా । తల్లిన్బ్రాతలనిచ్చునిక్క ముతపోధన్యాత్మకుండంచు వేఁద
ల్లిన్బ్రాతులజంపెభార్గవుడు వేఁగాఁజంపజేయ్యాదునే॥ ఇవ్విధంబున* (క॥ అడ్డము సెప్పకకడపటి। బిడ్డఁడు రాముండు
సుతులఁజెండ్లమునచటఁ। గ్గొడ్డంటం దెగనడిచి న। జడ్డనఁదలయాఁచి మెచ్చిజమదగ్నిమదిన్* (క॥ మెచ్చినతండ్రినిఁగనుఁగొని।
చెచ్చెరనీపడినవారిజీవంబులునీ। విచ్చితినను మని మ్రొక్కి నని చ్చెన్వారలును లేచి రెప్పటిభంగిన్* (గీ॥ పడినవారినిఁ బల్ బ్ర
తికింపనోపును । జనకుఁడనుచుఁ జంపెఁ జామదగ్న్ని । యతఁడు సంపెనను చు నన్నలఁ దల్లిని । జనకునాజ్ఞ నైనఁ జంపఁదగదు*
(సీ॥ పరశురాముఁడు కోడిపరుగులు వెట్టిన యర్జునపుత్రకులాత్మయందుఁ । దండ్రి న్రుగ్గుటకు సంతప్తులై పొగలుచు నింతట
నంతట నెడరు వేచి । తివిరి యాడుచునొక్క దివసమున్ దారాముఁడడవికన్నలతోడ ననుగుపిదపఁ ।బగదీర్పఁదఱియనివర తెంచి
హోమాలయంబునసర్వేశునాత్మ సలిపి । నిరుపమధ్యానసుఖవృత్తి నిలిచియున్న । పుణ్యుజమదగ్ని నందఱు పొదివిపట్టి। క
దలకుండంగఁదలఁద్రెంచికొనుచుఁ జనిరి। యడ్డమే తెంచి రేణుకయడచికొనఁగ* (మ॥ జనకుం జంపిన వైరము న్దలఁచి రాజన్యా
త్మజుల్నేఁడుమిా । జనకుంజంపిరి రామ రామ రిపులన్యాసింతురన్మంచున । మ్మునిపైన్వ్రాలెలతాఁగి మోదికొనుచున్మ్యే
దుమాఱులరియంబున రాముండరుదెంచియెన్నికొననాపూర్ణాపదాక్రాంతయై* (వ॥ ఇట్లప్పుడు దల్లి మొఱపని జమదగ్నికుమా
రులు వచ్చి యిట్లని విలపించిరి* (క॥ వాకిలి వెడలపుకొడుకులు। రాకుండగనట్టినీవు రాజసుతులచేఁ। జీకాకుకొందిపోవఁగ ।నీకా
ల్లెట్లాడెఁ దండ్రినిర్జరపురికిన్ ॥ అని విలపించుచున్న యన్నలం జూచి రాముండిట్లనియె* (ఉ॥ ఏడువనేల తండ్రి తను వేవ
ఱకుండుఁడు దోడులార నేఁ। జూడుఁడు నేఁడటంచుఁ బరశుద్యుతిభీముఁడు రాముఁడు ఁగుఁడై । యోడకనర్జునాత్మజులనో
ప్పుపురంబున కేగి చొచ్చికో। డాడకపట్టి చంపె వడినర్జునజ్ఞాతులఁ బ్రహ్మఘాతులన్* (క॥ ఖండించిరిపులశిరములు । గొండలు
గాఁద్రోగులిడి యెగురు రక్తనదు । లిండికొనిపాసి యుబ్బెను । ఖండనమున నృపులు రిపులు భయమందిన్నృపా ॥ మఱియునం
తటఁబోక* (గీ॥ అయ్యపగకు రాముఁడలయక రాజుల । నిరువదొక్క మారు నరశిచంపె । జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ ।
సూడుదీర్పలేని సుతుఁడు సుతుఁడే* (వ॥ మఱియా నారాముండు శమంతపంచకంబున రాజరక్తంబులం దొమ్మిది మడుగులుగా
వించి తండ్రిశిరంబు దెచ్చి శరీరంబుతో సంధించి సర్వదేవమయుండగు దేవుండు దానకావునఁ దన్నునుద్దేశించి యాగంబు
సేసి హోతకుం దూర్పును, బ్రహ్మకు దక్షిణభాగంబును, నున్న వారలకవాంతరదిశలును, నుపద్రష్టయైన కశ్యపునకు నా
ర్యావర్తంబును, మధ్యభూమియు, సదస్యులకుం బగిన యెడలం గలయనిచ్చి బ్రహ్మనదియైన సరస్వతియందవభృథస్నానం
బు సేసి కల్మషంబులం బాసి మేఘవిముక్తుండయిన సూర్యుండునుం బోలె నొప్పుచుండెనంత* (క॥ ఆపుడగుపుత్రువలనను।
బ్రాప్తతనుండగుచుఁ దపముబలిమిని మింటన్। సప్తర్షిమండలంబున। సప్తముఁడై వెలుఁగుచుండె జమదగ్ని నృపా* (క॥ ఆజ
మదగ్నితనూజుఁడు। రాజీవాక్షుండు రాముఁడత్యధికుండై। యోజను వేదఘనులలో। రాజిల్లెడు మీఁద మనువు రాన వ్వేళన్*
(గీ॥ శాంతచిత్తుఁడగుచు సంగవిముక్తుడై। భవ్యుఁడైను హేంద్రపర్వతమున । నున్నవాఁడు రాముఁడోజతో గంధర్వ । సిద్ధవ
రులు నుతులు సేయుచుండ* (క॥ భగవంతుఁడు హరియాక్రియ। భృగుకులమునఁ బుట్టియెల్ల పృథివీపతులన్ । జగతీభారము వా
యఁగఁ। బగఁ గొని పలుమాఱుఁ జంపెఁ బచరమున నృపా* (వ॥ అంతగాధికి నగ్నితేజుండగు విశ్వామిత్రుండు జన్మించి తపోబలం
బున రాజధర్మంబును మాని బ్రహ్మర్షియై యేకశతసంఖ్యాగణితులగు కొడుకులం గనియె నయ్యెడ భృగుకులజాతుండయిన
యజగర్తుని కొడుకు శునశ్శేఫుండు దల్లిదండ్రులచేత హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకు నమ్ముడువడి బ్రహ్మాదిదేవతలవి
నుతి సేయుచు మెప్పించి పితృదేవతలచేత బంధవిముక్తుండయిన వానియందు గృపగలిగి విశ్వామిత్రుండు పుత్రులకిట్లనియె*
(క॥ కన్నులఁగంటిని వీనిని। మన్నన కొమరుండు నాకు మకుఁ నమీతో । నన్న న్నయనుచు నతనిన్। మన్నింపుం డనినఁ జూచి మదసం
యుతులై* (క॥ ఇతఁడన్నఁట నో మాకును । గృతకృత్యులమైతిమనుచు గేలియొనర్పన్। సుతులన్ మ్లేచ్ఛులు గండని। ధృతిలేక శ
పించెఁ దపసి తిరుగుడువడఁగన్* (వ॥ అయ్యెడ నతని శాపంబునకు వెఱచి మధ్యముండయిన మధుశ్ఛందుండేబండ్రుడమ్ములుం
దానును, నమస్కరించి తండ్రీ నీచెప్పిన క్రమంబున శునశ్శేఫుండు మాకన్నయని నమస్కరింపంగలవారమనవుడు సంతసిం
చి మంత్రదర్శియైన శునశ్శేఫుని వారలయందుఁ బెద్దజేసి మధుశ్ఛందునకిట్లనియె* (గీ॥ పాడిసెడక వీఁడు నేఁడు మీకతమునఁ ।
గొడుకుగలిగె నేఁడు కొడుకులార। కొడుకులార మీరు గొడుకులఁగనుఁడింక। ప్రీతితోడ దేవరాతుఁగూడి (వ॥ అనిపలికె నట్లు
శునశ్శేఫుండు దేవతలచేత విడివడుటం జేసి దేవరాతుండయ్యె మధుశ్ఛందుండు మొదలయిన యేబండ్రును, దేవరాతునకుఁ
దమ్ములైరి పెద్దలయినయష్టక హారీత జయంత సుమదాదులేబండ్రును, వేఱఁ జనిరి క్రమంబున విశ్వామిత్రుకొడుకులు రెండు
విధంబులయిన ప్రవరాంతరంబుగలిగెనని చెప్పి శుకుండిట్లనియె నాపురూరవుకొడుకగు నాయువునకు నహుషుండును, క్ష
త్రవృద్ధుండును, రజియును, రంభుండు, నేనస్సనను వారుపుట్టిరందు క్షత్రవృద్ధునకు సుహోత్రుండగుసు హోత్రునకుఁ గా

ష్యుండు, కుశుఁడు, కృత్స్నమకుఁడను ముగ్గురు గలిగి రాకృత్స్నమకునకు శునకుండును, శునకునకు శౌనకుండునన్మహాత్ముండు
బహ్వృచప్రవరుండై జన్మించి తపోనియతుండై చనియెఁ గాశ్యునకు గాశియుఁ, గాశికి సురాష్ట్రుండును, సురాష్ట్రునకు దీ
ర్ఘతముండు జనియించె*(క॥ ఆదీర్ఘతమునికధిపుఁడు। శ్రీదైత్యాంశమునఁ బుట్టె సేవ్యుండాయు। ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి । ఖే
దంబులు వాయునతని కీర్తన సేయన్* (వ॥ వాసుదేవాంశసంభూతుండగు నా ధన్వంతరి యజ్ఞభాగంబునకర్హుండతనికిఁ గేతు
మంతుండుఁ గేతుమంతునకు భీమరథుండతనికి దివోదాసుండనంబరగు ద్యుమంతుండుదయించె నాద్యుమంతునకుఁ బ్రతర్ద
నుండు జన్మించె నా ప్రతర్దనుండు శత్రుజిత్తనియు, ఋతధ్వజుండనియుం జెప్పంబడె నతనికిఁ గువలయాశ్వుండు సంభవిం
చెన్*(గీ॥ వసుమతీశ వినుకువలయాశ్వభూభర్త। లలితపుణ్యు ఘనునలర్కుఁ గనియె । నాతఁడేలె నేలనఱువదియాఱువే। లేం
డ్లు వానిభంగి నేలెనెవఁడు* (వ॥ అయ్యలర్కునకు సన్నతియు, నతనికి సునీతుండు నతనికి ధర్మకేతువు నతనికి సత్యకేతువు నాత
నికి ధృష్టకేతువు నా ధృష్టకేతువునకు సుకుమారుండును, సుకుమారునకు వీతిహోత్రుండును, వీతిహోత్రునకు భర్గుం
డును భర్గునకు భార్గభూమియు జనియించె*(గీ॥ వాఁడు మొదలుగాఁగ వసుమతీశుండాది। మైనవారు గాశులనఁగ నెగడి। రవని
మీఁద వారలా క్షత్రవృద్ధుని। వంశజాతులగుచు వంశవర్య*(వ॥ మఱియు క్షత్రవృద్ధునికి రెండవకొడుకగు కుశునకిఁ బ్రీతియును,
వానికి సంజయుండు, సంజయునికి జయుండు, జయునికిఁ గృతుండు, కృతునికి హర్యద్వనుండు, హర్యద్వనునకు సహదేవుండును,
సహదేవునికి భీముండు, భీమునకు జయత్సేనుండు, జయత్సేనునకు సంకృతియు, సంకృతికి జయుండు, జయునికి క్షత్రధర్ముండు పు
ట్టె వీరలు క్షత్రధర్ముని వంశంబునం గల రాజులు రభునికి రభసుండు, రభసునికి గంభీరుండు, గంభీరునికిఁ గృతుండు, కృతునికిఁ బ్ర
హ్మకులంబు పుట్టె నయ్యేనునికి శుద్ధుండు శుద్ధునకు శుచి శుచికి రజస్సు పుట్టె నతనికిఁ ద్రికకుత్తు జనించె నతనికి శాంతవిజ్ఞానవంతుం
డయిన కృతకృత్యుం పుట్టి విరక్తుండై చనియె* (సీ॥ రజియను వానికి రాజేంద్ర యేనూఱు కొడుకులు గలిగిరి ఘోరబలులు । వే
ల్పు లెల్లను వచ్చి వేఁడిన నారజి దైత్యులఁ జెక్కి యింద్రధరణిఁ గూల్చి । నాకంబు దేవేంద్రునకు నిచ్చె నిచ్చిన రజి కాళ్ళ కెరఁగి సురప్ర
భుండు। వెండియు నతనికి విబుధగేహము నిచ్చి సంతోషబుద్ధి నర్పన మొనర్చి। యంతనా రజి మృతుఁడైన నతని పుత్రు। లమరవిభుడు
దమ్మునడిగి కొనిన। నీకయింద్రలోక మేలిరి యాగభా।గములు పుచ్చికొనిరి గర్వమంది*(క॥ వేలుపుల ఱేఁడు సురుచే । వేలిమిఁ ద
ప్పించి బలిమి వెలయఁగ నిజదం।భోళి నిరజిసుతులను ని।ర్మూలముఁ గావించి స్వర్గముం గైకొనియెన్* (వ॥ అదియట్లుండె నహు
షునకు యతియు, యయాతియు, సంయాతియు, నాయాతియు, వియతియుఁ, గృతియు నననార్గురు కొడుకులు దేహికినింద్రియం
బుల చందంబున సంభవించి రందుఁ బెద్దకొడుకగు యతికి రాజ్యం బిచ్చిన నతండు విరక్తుండై*(క॥ రాజ్యంబు పాపమూలము। రా
జ్యముతో నొడలెఱుంగ రాదు మహాత్మా । రాజ్యమునఁ బూజ్యునెఱుఁగఁడు। రాజ్యము గీజ్యంబు ముక్తిలతులకి దేలా॥ అనిపలికి
వాఁడు రాజ్యంబునకుం బాసి చనియె*(క॥ ఆ నహుషుఁడు మఖశతమును। మానుగఁ గావించి యింద్రమానినిఁ గలియం। బూనిము
నీంద్రులు మోఁచిన। యానము పైనుండి కూలె నహియై నేలన్*(ఉ॥ అన్నయుఁ దండ్రియుం జన యయాతి మహీపతియై చతుర్దిశ।
ల్పన్నగఁ గావఁ దమ్ములకుఁ బాలిడి శుక్రమహాసురేశ సం।పన్నగుణాభిరామ వృషపర్వనికామతురనోలినాండ్రఁ గా । సన్నయ
శాలియై ధరణిచక్రధురంధరుఁ డయ్యె బేర్మితోన్॥ అనిన విని పరీక్షిన్నరేంద్రుండిట్లనియె* (గీ॥ పార్థివుఁడు యయాతి బ్రహ్మర్షి
భార్గవుఁ। డల్లుఁడనుట మామయనుట యెట్లు। రాజు రాచకూఁతురతి సేయఁదగుగాక। విప్రకన్యనొందనహితము గునే॥ అనిన శు
కుండిట్లనియె*(సీ॥ దనుజేంద్రుకూఁతురు తరళాక్షి శర్మిష్ఠ పురములో నొకనాఁడు ప్రొద్దువోక। వేలసంఖ్యల చెలుల్వెంటరాగు
రుపుత్రియగు దేవయానితో నాటమెఱిఁగి। పూఁచిన యెలతోఁటపొంత జొంపముగన్న క్రొమ్మావిచేరువ కొలకుఁ జేరి । యందుఁ ద
మ్ముల తేనెలాని చొక్కుచు మ్రోయ నలరుఝుంకృతుల కనఁ కరివడుచు। వలువలూడ్చి కొలఁకు వడిఁ జొచ్చి తమలోనఁ । జెల్లు రేఁగి
నీఁటజలులాడ। నంది నెక్కి మాళినిందు గొచులు పర్వ। శూలి వచ్చె కొండచూలితోడ* (చ॥ మలహరుఁ జూచి సిగ్గువడి మానినులం
దఱు సంభ్రమంబునన్। వలువలు గట్టుచో దనుజవల్లభుకూఁతురు దేవయాని దు।వ్వలువ ధరించి వేగమున వచ్చినఁ జూచి యెఱింగె
జెంగినావలువిది యేలఁగట్టికొని వచ్చు నుదాసవియంచుఁ దెప్పుమన్॥ దేవయానియిట్లనియె(శా॥ ఆలోకేశుముఖంబులం గలిగె
బ్రహ్మణ్యంబు బ్రహ్మంబునా । మేమై వైదికమార్గముల్దెలుపుచున్మిన్నందియందున్మహా । శీలున్భార్గవులందునొప్పెదు సుధీసే
వ్యుండునే వాసికిన్। జాలన్నావలువెట్లుగట్టితి ఖిరక్షోజాతివై చేటికా॥(క॥ మహిమవతులైన యాసుర। మహీళల విత్తంబులు పె
ఱుగువలకగునే। లుహిఁ బసిఁడి గొలుసులిడిన। న్విహితము లేదుక్కలకు హవిర్భాగంబుల్ (క॥ మీ తండ్రి మాకు శిష్యుఁడు । మా
తండ్రి సురుండు గొంతమాత్రంబు ఋనం బ్రీతుంగా వింపకపరి। భూతులఁ జేయుదు వెతులువ పోడిమిఁ జెనటీ (వ॥ అనిభర్జించుచు
న్న దేవయానిపలుకులు విని కరాళించి మ్రోఁగుచున్న భుజంగి వగిదినిట్టూర్పులు నిగుడించి పెదవులు గొఱుకుచు శర్మిష్ఠ యిట్లనియె
శా॥ భిక్షుండై తమతండ్రి మాజనకునిన్భిక్షించియుండంగ సం।రక్షింపం దుదినంతవైన అప్పుతో రాజప్రమత్తాకృతిన్ । రత్నో

రాజతనూజతోఁ సుగుణతో నాక్షేపముం జేసెడిన్ । కుక్షిస్ఫోటముగాఁగ దిదిఁ జెలులిహాపంబు సంద్రోవ రే॥ అనిపలికి* (గీ॥ బోఁ
టిపిండు చేతఁ బొమవంగఁ బట్టించి । రాజసమున దైత్యరాజతనయ । తోడరి దేవయానిఁ ద్రోపించె వలువీఁక । గుఱ్ఱికి నూఁతిలోనఁ

—* శుక్రాచార్యులతనూజయగు దేవయానయయాతిని వరియించుట. *—

గుదిలకొనఁగ *(వ॥ ఇట్లు సేసి శర్మిష్ఠ వోయిన వెనుక యయాతిభూపాలుండు వేఁట మార్గంబున నడవిం దిరుగుచు దైవయోగం
బున నా దేవయాని యున్న నూయి చేరంజను దెంచె నంత * (క॥ బంధువుల నెల్ల జీఱుచు । సంధుజలామగ్న సుధ్యమై వగచుచుదు ।
గ్బంధమునఁ జిక్కి పీడా । సింధుప్రసమునిం గియున్న చేడియఁ గనిమెన్ ॥ కనుంగొని * (శా॥ సప్తాంభోనిధిమేఖలావృతమహాస
ర్వంసహాకన్యకా । ప్రాప్తోర్వ్యద్వరదక్షదక్షిణకరప్రాలంబముం జేసి ప్రో । త్థిప్తం జేసె యయాతి గట్టికొనఁ బై చేలంబు మున్ని
చ్చిప వ్యాప్తస్వేదజలాంగి వారిసముదాయాలంకృతన్ భార్గవిన్ ॥ ఇట్లు నూయి వెడలించిన రాజునకు రాజవదన యిట్లనియె *
(మ॥ ననుఁ బాణిగ్రహణంబొనంగితి గదా నాభర్తవు నీవ దై । వనియోగంబిది నప్పదప్పరుమతా వాక్యంబు సిద్ధంబు సౌ । ఖ్యనివా
సున్నిమమాని యొండు వరుని గాంక్షింపనే నోర్తునే । వనజంబా నెడి తేఁటి యన్యకుసుమావాసంబ పేక్షించునే ॥ అదియునుం
గాక * (సీ॥ సుగుణాఢ్య వినునేను శుక్రునికూఁతుర దేవయానిసఁ దొల్లి దేవమంత్రి । తనయుండు గచుఁడు మాతండ్రి చేఁ దొల్లి సం
జీవనిం దానభ్యసించువేళ । సతని గామించిన నతఁడొల్లననవుడు నతఁడు నేర్చిన విద్య యడఁగిపోవ । సతని శపించిన నతఁడు నాభర్త
బ్రాహ్మణుఁడు గాకుండెడునని శపించె నదినిమిత్తంబునా కుబ్రాహ్మణుఁడు గాఁడు । ప్రాణనాథుఁడ వీవ సిపడఁతి వలుకఁ । దన
మహృదయంబు నెలఁత పైఁ దగులువడినఁ । దనకమొకయింతయును లేకఁ దలఁచి చూచి * (మత్తకోకిల ॥ దైవయుక్తముగాక వి
ప్రసుతన్వరించనే నాకునం । బేవిధంబున నీశ్వరాజ్ఞ నుపట్టిదం చువరించెదా । శ్రీవరం బను దేవయాని నిధీరబుద్ధులకున్మనో ।
భావమొక్కటియె ప్రమాణము భావ్యభావపరీక్షకున్ * (వ॥ ఇట్లు వివరించి యయాతి చనిన వెనుక దేవయాని శుక్రునికడకుం
జని శర్మిష్ఠ సేసినవృత్తాంతం బంతయుం జెప్పి కన్నీరు మున్నీరుగా వగచిన * (క॥ క్రూరాత్ములమందిరములఁ । బౌరోహిత్యంబు కం
క్షేఁ బాపంబీసం । సారము కంటె శిలద్ధిస । యూరక కాపోతవృత్తియుండుట యొప్పున్ * (వ॥ అని వృషపర్వుకడనుండక తనిందించు
చు శుక్రుండా కూఁతురిం దోడ్కొని పురంబు వెడలి చన నయ్యసురవల్లభుండెఱింగి శుక్రునిం బ్రార్థింపఁ దలంచి తెరువునకడ్డం
బువచ్చి పాదంబులపైఁ బడి ప్రసన్నుం జేసిన నా కోపంబు మాని శుక్రుండు శిష్యునకిట్లనియె * (తరల॥ చెలులు వేవురుదాసులు నీసు
త జేటికై వడి నా సుతం । గొలుచుచుండను దీఁ గోపము గొల్పఁ బెట్టెద వేనినీ । వెలది దోడ్కొని వత్తు నావుడు వేగరక్కసిభార
విం । గొలువఁ బెట్టెద రారి వర్యుఁడు గూఁతు నెచ్చెలి పిండుతోన్ * (మ॥ చలమిం కేలని తన్ను దండ్రి వనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో । జ
లజాక్షాస్యలు సద్వయస్యలు సహస్రంబున్న జస్రంబుఁ ద । న్మెలఁగన్ దాసియుదాసి యయ్యె వివిధామేయోగ్రకోపానలా ।
కలితగ్లానికి దేవయానికి మహాగర్వోద్యమస్థానికిన్ ॥ అంత * (ఉ॥ ఆతతమైన వేడ్కఁ దనుజాధిపమంత్రి సుగారి నందనో । పేతత
నూభవంపు బిలిచి పెండ్లి యొనర్చె మహావిభూతికిం । బ్రీతిమహోగ్రజాతికి నభీతికి సాధువినీతికిన్ సత । ఖ్యాతికి భిన్నదుఃఖబహు
శాత్రవభీయయాతికి నయ్యయాతికిన్ * (వ॥ ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి శుక్రుండు శర్మిష్ఠాసంగమంబు సేయకుమని నియమిం
చి చనియెఁ బిదప న ద్దేవయానియు నయ్యయాతివలన యదుతుర్వసులను కుమారులం గనియె నొక్క ఱేయిం జెఱంగు మాసిన యొ
డ శర్మిష్ఠ యెడను లేచి యేకాంతంబున యయాతికడకుం జని చెలువు విం టిజోదుపువ్వుటంపర కోహటించి తనతలంపు సెప్పిన *
(ఉ॥ ఆజవరాలిఁ జూచి సమానపక లేక తనూభవార్తుఁడై । యాజనభర్త మున్ను గని యాడిన మాటఁ దలంచి దైన్యనఁ జే । తోజను

* శుక్రాచార్యులు యయాతికి శాపం బొసంగుట. *

ఖంబులందని పెద్రోవగ వచ్చునె దైవయోగముల్ । రాజట సద్రహస్యమఁట రాజకుమారిని మాననేర్చునే * (వ॥ ఇట్లు య
యాతివలన శర్మిష్ఠ గర్భంబు ధరించి క్రమంబున ద్రుహ్యుండు, ననువును, పూరువును వారిం గాంచె నంత దేవయాని తద్వృ
త్తాంతంబంతయు నెఱింగి కోపించి శుక్రుకడకుం జని క్రోధమూర్ఛితయై యున్న సమయంబున యయాతి వెంటం జని యిట్లనియె *
(గీ॥ మానుకేల సెప్పమానుసరోజాక్షి । దనుజతనయఁ బొందితప్పవడితిఁ । గామి నైన నన్నుఁ గరుణింపు పతిమాట । దండ్రి నూట
కం బెఁ దగును నీకు * (వ॥ అనిపలికి పాదంబులకెఱఁగిన నయ్యింతి మొగంబడక యుండె నంత నెఱింగి శుక్రుండిట్లనియె * (క॥ నా
మాటఁ ద్రోచి మానవ । భామను బొందితి విధరణిపాలక తగవే । మేమాట యేది రూపము । కామినీగోలులకు నెచటఁ గలవే నిజముల్
(వ॥ అనిపలికి నీవు వనితాజనహేయంబైన ముదిమిం బొందెదవని శపియించిన యయాతి యిట్లనియె * (క॥ మామానాపైఁ గోప
ము । మామా నీపుత్రియందు మానవునాకుం । గామోపభోగవాంఛలు । ప్రేమన్ సచియిందిముదిమిఁ బిదపం దాల్తున్ * (వ॥ అనిపలికి
యనుజ్ఞం గొని దేవయానిం దోడ్కొని పురంబునకుం జని పెద్దకొడుకగు యదువుం బిలిచి యయాతి యిట్లనియె * (శా॥ నీతల్లిం గని
నట్టి శుక్రునివలన న్నేఁడీ విరంబొందితి । న్నాకుం దండ్రీయదూ నామధేయ తనయా నా వృద్ధతం దాల్పవే । నీతారుణ్యము నాకుసమ్ముతని

వోసండారఁగొన్నాళ్లు నేఁ। జేతోజాతసుఖంబులందిరి గెదరా శృంగారినై పుత్రకా ॥ అనినపని తండ్రికి యదుండిట్లనియె* (శా॥ కాంతాహేయముదుర్విశారముదురాకండూతిమిశ్రంబుహృ। ద్భ్రాంతామూలము పీనసజ్వరము ప్రస్వేద ప్రణాకం ఘనప్రాంశుస్ఫోటకయుక్తమీమాముదిమి వాంఛందాల్చినానాసుఖో। పాత్తంబైన వయోనిధానమిది యయ్యా ప్రాయమీవచ్చునే* (వ॥ అనియదుండొడఁబడకున్న యయాతిదుర్వసుద్రుహ్యుదులనడిగిన వారును యదుండుపలికినట్లపలికినఁ గడగొట్టు కుమారుండైన పూరువునకిట్లనియె* (ఉ॥ పిన్నవుగాని నీవుకడు పెద్దవు బుద్ధులయందు మరమ్మునా। యన్నను దాజ్ఞఁదాటవుగ దన్న వినీతుఁడవన్న నీవు నీయన్నలుసెప్పినట్లు పరిహారము సెప్పకున్న నాజరకా। మన్నన దాల్చి నీతరుణిమం బొనగూర్పుము నాకు పుత్రకా॥ అనినవినిసుంభక్తిగుణాధారుండైన పూరుండిట్లనియె* (శా॥ అయ్యా నన్నిటు వేడనేల భవదీయాజ్ఞాసముల్లంఘనం బయ్యుండం బరిహారము న్నొడువ నేన న్యాయి నేనీజరకా। నెయ్యంబొప్పగఁ దాల్చినాతరుణము న్నీకిచ్చెదన్ బంపినన్ గయ్యం బాడెడి పుత్రకుండు క్రిమిసంకాశుండు గాకుండునే॥ అదియునుంగాక* (క॥ మునివృత్తిడయ్యె నేటికి జనపాలక సుగతి గోరు సత్పురుషులు సందనుగన్న తండ్రి సెప్పిన। పని సేసిన సుగతిగొందురు పసిడియ కాదే* (క॥ పనుపక చేయుదురధికులు పనిచిన సంధ్యములు పొందుపఱతురింతండ్రుల్। పని చెప్పి కోరిపనిచిన, ననిశము మాతా పుత్రులధములు తండ్రీ* (వ॥ అని పలికి పూరుండు ముదిమిచేకొని తనలేత ప్రాయంబునయయ్యాతికిచ్చె యయాతియుం దరుణుండై* (శా॥ సప్తద్వీపము లేడువాడలుగ సర్వోర్వీతలంబెల్ల బేర్చి, వీడై లోనుగనేలుచుం బ్రజలన న్వేషించి రక్షించుచున్। దోడం భార్గవి రామనోజసుఖసంతోషంబులం దేలుచుం గ్రీడించె న్నియతేంద్రియుండగుచు నాక్రీడాపిశేషంబులన్* (క॥ మర్మంబులనతిసాధ్వీ ధర్మంబుల దేవయాని దన ప్రాణేశు న్నర్మములమనోవాక్కులకర్మంబుల నొండులేక కడు మెప్పించెన్* (శా॥ ఆకాశంబున మేఘబృందముఘనంబై సన్నమై దీర్ఘమై। యేకంబై బహురూపమై యడగునట్లే దేవుగర్భంబులో। లోకశ్రేణిజనించుచు న్మెలగుచున్లోపించు వాదేవుడు శ్రీకాంతుండు హరి యూర్చి యాగములు సేసె న్నాహుషుండిమ్ములన్॥ మఱియును* (మ॥ చెలికాండ్ర నరులన్రధమ్ముల భటశ్రేణిం మరంగంబులన్। గలలో గన్నధనావళి న్సుమనం గాజూచుచున్ భార్యతోఁ। బలు వేలేండ్లు మనోజభోగలహరీపర్యాప్తుఁడై తేలియున్। బలుతృష్ణం గడగానకెంతయు మహాబంధంబులన్ ద్రుస్సుచున్* (వ॥ ఒక్క దినంబున నాత్మజ్ఞానంబు సంజేసి కాంతానిమిత్తంబున మోసపోవుట నెఱింగి యయాతి యతివిషాదంబు నొంది దేవయానికిట్లనియె* (క॥ మనచారిత్రము వంటిది వినుమితిహాసంబు గలదు వృద్ధజనంబుల్ మునులును మెత్తురు నీవును। మనమున నంగీకరింపు మంజులవాణీ॥ అది

### * యయాతి దేవయానికి బస్తోపాఖ్యానమను వ్యాజంబున స్వవృత్తాంతంబును దెలుపుట. *

యెట్టిదనినన్* (సీ॥ అజ మొకండు వనంబున నందేగుచును గర్మఫలమున నూతిలో పలికి జారి। లోడిగి ఛాగి నాలోకించి కామియై కొమ్మునదరి కొంతమూల ద్రోచి। వెడలింపనచ్ఛాగి విభుని గాగోరిన నగుగాక యని తాను నదియు దిఱుఁగ। నెన్నియేనియుఁ దన్నునెంతఁగా మించిన నన్నిటికి నిభర్తయై తనర్చి। వాని నేప్రొద్దు రతులను వశలజేసి। సొరది క్రీడించి క్రీడించి సొక్కిసొక్కి। కాముఁడని యెడి మస్సహగ్రహముకతనఁ జిత్తమే మఱిమత్తిల్లి చెల్లఁజిక్కి* (క॥ వెడవిలుతు కేళి జిగురా। కడిదపు ద్రేటునకులోంగి యతిమోహితుఁడై। విడువక సతులందగిలెడు జడునకు నెక్కడిది బుద్ధిచాతుర్యంబుల్* (వ॥ అంతనచ్ఛాగంబు దనపెద్దపందగిలిన ఛాగీనివహంబులో పలం జూడ నొప్పెడి ఛాగియందు దగిలి క్రీడింపంగనిన నూతిలో వలాబడి వెలువడిన ఛాగి తనపతివలని నెయ్యంబు లేకుండుటకు విన్ననై తనమనంబున* (క॥ పలికిన పలుకులు పలుకడు। కలఁచున్నవకాంత జూచి కడు నంచలుఁడై। నిలిచిన చోటన్నిలువఁడు। నిలువెల్ల నుకల్ల కామినిజనుతిగలఁడే* (వ॥ అని పలికి విడిచి దన నయ్యజపల్లభుండు సురతపరతంత్రుండై మిసిమిసియను శబ్దంబు సేయుచు నచ్ఛాగి వెంటం జని యొడంబఱుపం జాలకుండె నంత దానికిఁ గర్తయైన బ్రాహ్మణుండు రోషంబున రతిసమర్థంబు గాకుండ నల్లాడుచుండ ఛాగవృషణంబులు డించి వేసిన నచ్ఛాగంబు గ్రిందఁబడి వేడుకొనిన ప్రయోజనంబు వొడగ నియోగవిదుండు గావున బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ నయ్యజవృషణంబులు సంధించిన* (క॥ వృషణములు మఱలంగలిగిన వృషముండై ఛాగివిభుఁడు సుందరితోడన్ విషయసుఖంబులఁ బొందియుఁ। దృషతుదిగనఁడయ్యె పెక్కుదివసములయ్యున్॥ అని యివ్విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతంబు గథారూపంబున నెఱింగించి యిట్లనియె (మ॥ అబలా నీ నిబిడాశిదుర్జయసలజ్జాపాంగభల్లంబులం బ్రబలంబై మనమంబు భగ్నముగ నా ప్రావీణ్యముం గోలుపోయి బలిష్ఠుండగు కాముఁ బారిబడి నేనెట్లో క్రైదన్ బందికన్ ద్రైబడింబాపపుతృష్ణ యిప్పుడకటా దిదీర్ఘాకృతిన్ట్తొప్పెడిన్* (క॥ అదలమప్రాణములదలినఁ గదలము సర్వాంగకములు గదులుచునుండన్। వదలదు బిగువులు వదలినఁ ముదిలేదీతృష్ణ దీనిఁ ద్రుంపఁగవలయున్* (క॥ వెయ్యేండ్లనుండి నీతోఁ। గ్రయ్యంబడి యున్నవాఁడఁ గామసుఖములం। గ్రుయ్యదొకయించుకైనను। డయ్యమకొనలిడ యొదృష్ణరశరవతోడన్* (క॥ ముదిసెను దంతావళియును। ముదిసెను గేశములు దనువు ముదిసెం దనకున్। ముదియనిప రెండుచిక్కెను। బ్రదికెడి తీపియును

విపయపశుస్పృహాయుర్ణ*(క॥ కడలేని కామలతకును। గడcజూడcగ ధాన్యరాశి కడcగని రేసి।న్న సుముద్రము ననసంసారము కడc
గంమునతత్వవిదుఃఖకనలదళాక్షీ*(క॥ నిండుహాటకపశువేదండాశ్వవిభూతిమూలధానా, దుఃఖపై। కుంఠడియునాశా
పాశముననిండిపcగలేవుజగతినిజమిదిసుమ్మి*(క॥ కామోపభోగసుఖములు। వేమారును బుగుపుcడనుభవించుచునున్నం।గా
మంబుశాంతిcబొందదు।ధూమధ్వజుcడాజ్యవృష్టిధ్యంగుమవడునే*(గీ॥అకట తలి చెల్లెలాత్మజలేకేన। పాను పెకఁ జనదు
పద్మనయన।పరమయోగికైనcబలిమినింద్రియ।గ్రామమధికపీడగలుగcజేయు*(క॥ వెంగలికిc త్రయిగ రుగక। యంగజులీలల
నుముక్తినాశించునతం।డంగనలతోడపడువని। సంగడములువదలవలయుజలజాతముఖీ*(వ॥ అవియునుంగాక నేదుమొదలు
తృష్ణాఖండనంబుcజేసినిర్విషయుండనై యహంకారంబువిడిచిమృగంబులంగలసి వనంబునసంచరించెదcబరబ్రహ్మంబునందుc
జిత్తంబుచేర్చెదబ్రహ్మనిష్ఠమనుష్యులకునాశానివారణయగుటంజేసి యేనందుకత్పరుండనై యాహారనిద్రాదియోగంబు
లంబరిహరించెనాత్మవిదుండై సంసారనాశంబుదలంచి వాcడె విద్వాంసుండనితలంచి పూరునియౌవనంబిచ్చి ముదిమి
తానకైకొని విగతలోభుండై నిజభుజశక్తిపాలితంబగు భూమండలంబు విభాగించి ద్రుహ్యునకు బూర్వభాగంబును,య
దువునకుదక్షిణభాగంబును, దుర్వసునకుcబశ్చిమదిగ్భాగంబును, ననుక్రునకునుత్తరదిగ్భాగంబును, సంరక్షింపుండనియిచ్చి
వారలసగముతుముంబున*(క॥ నాలుగు చెఱcగులనేలయుc। బాలింపుండనుచునగ్రభవులకుcబంచె। భూలోకమేలమనుచు
ను।బాలారోకండారుcబూరుcబట్టముగట్టె*(వ॥ ఇట్లుపూరునికిరాజ్యంబిచ్చి పెక్కువర్షంబులందనుభూతంబులైనయిం
ద్రియసుఖంబులవిసర్జించి*(క॥ మిక్కిలి విజ్ఞానంబునc। జక్కఁగదిగవిడిచి వైరిపడ్వర్గంబుల। తెక్కలువచ్చినవిహగముగ్ర
కుcనవీడంబువిడుచుకరణినుదిముcడై*(క॥ కారుణికోత్తముcడగుహరి। కారుణ్యముకనసతcడుఘనుcడై గెలిచెం।గ్రూర
ములనువిషయంబుల।నూరక గెలువంగశక్తుcడొకచెడుగలcడే*(వ॥ నుఱియునిర్మూలితసంగుండై సత్వరజస్తమోగుణంబు
లదిగనాడినిర్మలంబయినవాసుదేవాభిధానబ్రహ్మంబునందు యయాతిభూపాలుండుస్వగస్వస్థమైన భాగవతగతిం జెందెనం
త*(సీ॥ ప్రాణేశుcడాడినపలుకులునగవులుగాcజూడకంతరంగమునవిలిపి। పధికులై పోవుచుcబానీయశాలలcజల్లగానుండె
డిజనులనెల్ల। సంసారమునcగర్మసంబంధులైవచ్చు యాలుబిడలు మగండనుచుcగూడి। యుండుటగాని సంయోగంబుని
త్యంబుగాదీశమాయాప్రకల్పితంబు।నీనివిడుచుటతగవని తెగువ మెఱసి। నిద్రసాలించిమేలొన్నవెలవుచాలcగలిగిభార్గవి
సర్వసంగములవిడిచిహరిపరాధీనమైయముక్తికరిగెనధిప*(వ॥ ఆనియిట్లుయయాతిచరితంబుసెప్పి భగవంతుండును, సర్వ
భూతనివాసుండును,శాంతుండును, వేదనయుండునైనవాసుదేవునికినమస్కరించెననిశుకుండిట్లనియె*(క॥ ధారతనీవుజ
నించిన।పూరునివంశంబునందుcబుట్టినవారి।జారుయశోలంకారుల।ధీరులవినిపింతునధికతేజోధనులన్*(వ॥ పూరునకుజన
మేజయుండు, జనమేజయునకు బ్రాచిన్వాసుం, డతనికి బ్రవీరో ధనమన్యు, వతcకిజారువుపుట్టె, నాచారువునకు సుద్యువు,
సుద్యువునకుబహుగతుండు, బహుగతునకుశర్యాతి, శర్యాతికిసంయాతి, సంయాతికిరౌద్రాశ్వుండు, రౌద్రాశ్వునకుఘృ
తాచియన్నునచ్చరలేమయందుబుతేపువు,కక్షేపువు,స్థలేపువు,కృతేపువు,జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు,
వ్రతేపువు,వనేపువు లనువారు,జగదాత్మభూతుండయినప్రాణులకునింద్రియంబుల చందంబునc బదుగురు కొడుకులుజన్మిం
చిరంద - బుతేపువునకునంతిసారుండును,నంతిసారునకు-సుమతియు,ధ్రువుండు, నప్రతిరథుండు, ననుమువ్వురుపుట్టిరందు-
నప్రతిరథునకుగణ్వుండాకణ్వునికిమేధాతిథి,యతనికిcబ్రస్కందుండు మొదలగుబ్రాహ్మణులుజన్మించి, రాసుమతికిరైభ్యుం
డు,రైభ్యునకుదుష్యంతుండువుట్టె* (క॥ పారావారపరీతో। దారధరాభారదక్షదక్షిణహస। శ్రీరాజిల్లcగనొకనాcడా
రాజేంద్రుండువేటయందభిరతుcడై*(క॥ గండకకcఠీరవభే।రుండశశవ్యాళకోలరోహిషరురువే। దండవ్యాఘ్రమృగాధిక।
చండశరభశల్యభల్లచమరాటవులన్*(క॥ చప్పుడుసేయుచుమృగముల। ఱొప్పుచునీరములయందు రోcజుచవలలం। ద్రి
ప్పకొనిపడcగcజోవుచుc।దప్పకవేయుచును వేటతమకంబొప్పన్*(క॥ మృగయూథంబుల వెంటను। మృగలాంఛనసన్నిభుం
డు।మృగయారతుcడై।మృగయులుకొందఱుగొలువcగ।మృగరాజపరాక్రమంబు మెఱయcగవచ్చెన్*(వ॥ ఇట్లువచ్చివచ్చి
దైవయోగంబునcగణ్వమహామునితపోవనంబుచేరంజని*(సీ॥ ఉన్నతరశ్రాంతతాహియుగళంబులకుcబింఛములపిసరెడికే
కిముఖ్యములను । గరుణతోవదయుక్తకలభంబులకుమేcతలిడుచుముద్దాడు మృగేంద్రములను । ఘనమృగాదనముcలగాపు
గాశెల్లతోరతులుసాగించుసారంగములను।నమువు గాపొలాన ధేనువులకంఠంబులుదువ్వుచునాడుశార్దూలములను । దార
కలహంచమమూషికదంపతులకు। మైత్రినంకించుమార్జాలమల్లములను । మతినిజాతివైరంబులుమానికూడి।కలసిక్రీడించుమృ
గములగాంచెనతcడు*(క॥ ఇత్తెఱcగునమృగజాతుల।పొత్తులుమేమెఱుcగనమచుభూవల్లభుcడుం। జిత్తములోపలనాము
నిసత్తముసత్వవృత్తమునకుసంతసపడుచున్*(క॥ హల్లకబిసరుహసరసీ। కల్లోలోత్ఫుల్లయూధికాగిరిమల్లీ।మల్లీమరు

వకకులవకసల్లలితానిలములవలనసంతుష్టుండై ॥దుష్యంతుండువచ్చునవసరంబున* (క॥ఇందిందిరాలిసుందరి । యిందిందిర చికురయున్నదిందింసభంబిందందువంశయనుక్రియనిందీవరవీథిన్ మోసెనిందిందిరముల్ * (క॥ మాకందర్పుని ములుకులు మాకంధములనుటఁజేసిమాకందంబుల్ । మాకందములనుకైవడి । మాకందాగ్రములఁ బికసమాజమునిలిచెన్॥ అంత* (క॥ఇరుమన్నకణ్వమునికినివందన మొనరించితిరిగివచ్చెదననుచుంబొందుగననుచరులనుదా। నందనందనందనలిపియటఁజని గ్రమ్మోలన్ * (శా॥ ఆకణ్వాశ్రమమునందు నీరజనివాసాంత పదేశంబుల । స్తోకంబులనీడకల్పలతికామధ్యంబులన్మంజురం భాకాండాంచితశాలలోఁ గుసుమసంపన్నస్థితింజూచెనా । భూకాంతుండు శకుంతలన్నవనట ద్భూపర్యటత్కుంతలన్* (క॥పట్టపుతురుయునుమీఁదికిమిట్టించినఁదన్నుగవయుమిటిమిటిచూడుఁడల్లనట్టాడనమనుఁడేనియలుబ్టెడు మోవియునుమ సమునూటింపంగన్ *(వ॥అంత నారాజకుమారుండలరుటమ్ములపిలు కాని వెడవింటిఘుణఘుణాయమానంబై మ్రోయుఘంటల కుబబ్బరించితనమనంబున*(శా॥వన్యాహారములన్జితేంద్రియతనావాసించు వాకణ్వుఁడీ। కన్యారత్నము నేగతింగనియెడింగా నీకురంగాక్షి రాజన్యాపత్యముగాఁగ నోపునఖిలామంబయ్యెఁగాదేనినీ । యన్యాయత్తములందుఁబౌరవుల కెట్లాశించు నేద త్తముల్ * (క॥ అడిగిననృపసుతగానఁ నాడి వెడినావదేమనంబుకొప్పనపిభుండుడు రాజవదననడుగక నడుమనవొకకోంత్రపొద్దునడపఁగఁజొచ్చెన్ *(వ॥మఱియు నెట్టకేలకుఁదనచిత్తసంచలనంబుసత్యంబుగాఁదలంచియిట్లనియె* (క॥భూపాల కకన్యకవనినీపైఁజిత్తంబునాటెనీవారేరీనీపేరేదినిర్జనవనభూపర్యటనంబుదగ వెపూర్ణేందుముఖీ* (వ॥ అనిపలుకుచున్న రాజకుమారుని వదనచంద్రికారసంబు నేత్రచకోరంబులవలనంద్రావుచునయ్యువిద విభ్రాంతనైయున్నసమయంబున* (క॥కంతేకాలునిచేతంగుంతిసుఁడబెట్లువరుఁడుగుపమాస్త్రంబుల్గుంతించిగుణనినాదము శంతన్మనబాలనేసెతవతవలేమిన్ *(వ॥ఇట్లువలరాజువాడిక్రొవ్వాడికోలలవేడిమిదాలిమిపోడిమిసెడియావాలుగంటియిట్లనియె*(మ॥అనినార్యప్రభ మున్నుమేనకయువిశ్వామిత్రభూభర్తయున్ ।గనిరామేనకడించిపోయెనడవింగణ్వుండునన్వింతగా । గని చెన్నర్వమునామునీంద్రుఁడెలుగున్మశ్భాగధేయంబున । న్ననుఁగంటించిదపంగృతార్థనగుచు నేనడవీవనాంతంబునన్ * (క॥ నీవారముప్రజలేమనునీవారముపూజగొనుము నేడిటనీవునీవారునుమాయింటను । నీవారాన్నంబుగొనుఁడు నేడునరేంద్రా॥ అనిపలికిన దుష్యంతుండు మెచ్చిమచ్చకంటియిచ్చయెఱింగియిట్లనియె*(గీ॥రాజతనయవగుదు రాజీవదళనేత్ర మాటనిజముగోనిమాట లేదుతనకుసదృశుఁడైనతనయుఁగైకొంట రాజసుతకుతగవురాజవదన ॥ అనిమఱియుదియ్యనినెయ్యంపుం బలుకులవలన నయ్యుపదనయ్యకొలిపి*(క॥బంధుయశుఁడుజగన్నుతసంధుఁడు దుష్యంతుఁడుచితసమయజ్ఞుండై। గంధగజగమననప్పుడు

*భరతుని చరిత్రము.*

గాంధర్వవిధిన్వరించెగహనాంతమునన్*(వ॥ఇవ్విధంబున నమోఘవీర్యుఁడగు నారాచపట్టితపసిరాచూలికిఁజూలునిలిపిమ అనాఁడుతనవీటికిఁజనియె నయ్యింతియుఁగొంతకాలంబునకుఁగొడుకుంగనినఁ గణ్వమునీంద్రుండారాచపట్టికిజాతకర్మాది మంగళాచారంబులొనర్చెనాడింభకుండును దినదినంబునకుబాలచంద్రుండునుంబోలె నెగడుచు* (క॥ కుంతిసుఁడుగాక వాఁడుతక్కంతఁదనపిన్ననాఁడెకణ్వవనచరతక్కంఠీరవముఖ్యంబుల కంఠములంబట్టియడంచుఁగాననవీథిన్ ॥ అంతనాకణ్వమునీంద్రుండుబాలకుఁజూచిశకుంతలకిట్లనియె*(ఉ॥పట్టపురాజునీమగఁడుపావడనన్నిటనెక్కుడంతకుం । బట్టపుదేవివైగరిమబాగుగనుండకవారివారితోగట్టువనంబులో నవయగాఁబనిలేదిటఁదగ్గిపోగదే । పుట్టినయింట్లుమానిపతిబొందకయిట్లనిశంబునుందురే॥అనిననియ్యకొని*(క॥ఆపిన్నవానినతులవ్యాపారునుదారవైష్ణవాంశోద్భవునిం । జూపెదనంచుశకుంతల భూపాలునికడకువచ్చెఁబుత్రునిగొనుచున్॥వచ్చిదుష్యంతుండున్నసభామంటపంబునకుంజనినిలిచియున్నయెడ* (మ॥ వలకేలన్గురుచక్రరేఖయుఁబదద్వంద్వంబునంబద్మరే । ఖలనొప్పారఁగనింపువచ్చినరమాకాంతుండనాగాంతిన । గ్గలమైయున్నకుమారుమారసదృశాకారున్విలోకించితాఁబలుకండయ్యెపిభుండెఱింగిసతివిభ్రాంతాత్మయైయుండఁగన్॥ ఆసమయంబున*(మ॥ఆదెనీవల్లభీవాఁడునీసుతుఁడుభార్యాపుత్రులన్భ్రాతలన్ । వదలంగాదలనాటికణ్వదిశావైవాహికారంభము ల్మదినూహింపశకుంతలావచనమున్మాన్యంబుతోభూవరేం । ద్రదయంజేకొనుమంచుమ్రోసెను వియద్వాణీవధూవాక్యముల్ *(వ॥ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుం దేటపడభరింపుమనిపలికిననామమాపుండుభరతుండయ్యె నంతనారాజు రాజవదనసంగీకరించితనూభవుంజేకొనిగొంతకాలంబురాజ్యంబుఁజేసి పరలోకంబునకుంజనియెఁదదనంతరంబ* (క॥ రెండవహరిక్రియధరణీ । మండలభారంబు వెసనమంచితబాహా । దండమునసలిపితనకును । ఖండనమున నెదురులేకభరతుండొప్పెన్*(వ॥మఱియునాదౌష్యంతియమునాతటంబునదీర్ఘతపసునిబురోహితుండుగాఁజేబ్బదియెనిమిదియును,గంగాతీరంబుననేఁబదియైదు, నిట్లునూటముప్పదిమూఁడశ్వమేధయాగంబులు సదక్షిణంబులుగానొనర్చి, దేవేంద్రసభవంబుననతిశయిం

చి, పదుమూఁడు వేలు నెనుబది నాలుగు కనుపు ధేనువులు గలయద్వంద్వంబనంబగు నట్టి వెయ్యి ద్వంద్వంబులు పాడి మొదవులు క్రేపులతోడ నలంకార సహితలంజేసి వేవురు బ్రాహ్మణులకిచ్చి మహాహ్రదంబను పుణ్యతీర్థకూలంబున విప్రముఖ్యులకు రత్న భూషణశోభితంబులయిన ధవళదంతంబులు గలదంతావళులం బదునాలుగులక్షలొసంగె దిగ్విజయకాలంబున శకశబరబర్బరక షకకిరాతకొహూణమ్లేచ్ఛదేశంబుల రాజుల పీఁచంబడంచి రసాతలంబున రాక్షస కారాగృహంబులందున్న వేల్పులగరితలం జెక్కండ్రపడిపించి తెచ్చి వారలవల్లభులంగూర్చెఁ ద్రిపురదానవుల జయించి నిర్జరుల నిజమందిరంబులను నిచె నతని రాజ్యంబున గగనధరణీతలంబులు ప్రజలుగోరిన కోరికలిచ్చుచుండెనివ్విధంబున* (గీ॥ నిత్యచరితమంచు జలనమంచు బలనమందు। భాగ్యసం దులోకపతులకంటె। నెక్కుడైన పేర్మి నిరువదియేడువే। లేండ్లుధరణిభరతుఁడేలెనధిప* (క॥ అర్థపతికంటెఁ గలిమిగ్, తా ర్థుండై యతులశౌర్యమలవడియునతం। డర్థములను బ్రాణములను। వ్యర్థములని తలఁచి శాంతుడయ్యె నరేంద్రా* (క॥ భరతునిభా ర్యలు మువ్వురు। వరుసం బుత్రకులఁ గాంచి వల్లభు నోడక। సరగా రంతోడ్తోడను। శిరములు దునుమాడి రాత్మశిశువుల నధిపా॥ (వ॥ ఇట్లు విదర్భరాజపుత్రికలు శిశువులం జంపిన భరతుండపుత్రకుండై మరుత్స్తోమంబను యాగంబు పుత్రార్థియై చేసి దేవతల మెప్పించె నయ్యవసరంబున* (సీ॥ అన్నయిల్లాలిఁ జూలాలి నిను మతాఖ్యఁ జూచి బృహస్పతి సురతము నకుఁ। దొంకొని పైఁబడ్డఁ దొల్లి గర్భంబున నున్న బాలుడు భయంబొందవివలదు। తగదని మొఱ సేయఁ దమకంబుతో వాని నంధుండవగు మన్న నలిగి వాఁడు। యోనిలో పలివీర్యమూడదన్నిన నేలఁ బడి బిడ్డఁడై యున్న బాయ లేక। యితని పెంపు కొడుకు లిరువురు జన్మింది। రనుచు వెలయఁ జేయుమనిన మమతఁ। బెంపఁ జాల నీవ పెంపు భరింపుమీ ద్వాజు ననుచుఁ జనియె దాని విడిచి* (వ॥ ఇట్లు చథ్యుని భార్యయగు మమతయుఁ బృహస్పతియు, శిశువుం గని ద్వాజుండయిన వీని భరింపుమనివది నెమ్మ అందులు దమలోనొండొరులు పులంబలికిన కారణంబున వాఁడు భరద్వాజుండయ్యె గర్భస్థుండయిన వాఁడు బృహస్పతిశాపంబున దీర్ఘతముండయ్యెనంత నా బృహస్పతియు మమతయును దయించిన వానివిడిచిని జేచ్చఁ జనిన మరుత్తులు వానిం బోషించి పుత్రార్థియైన భరతునకిచ్చిరి భరతుండు వానిఁ జేకొని వితథంబైన భరతవంశంబునకు నా భరద్వాజుండు వంశకర్తయగుటం జేసి వితథుండనం బరగె, నా వితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్ర, జయ, మహావీర్య, నర, గర్గులను వారేవురు సంభవించిరందు, నరునికి సంకృతి, సంకృతికి గురుండు రంతిదే

—* రంతిదేవుని చరిత్రము. *—

వుండనని రువురు జన్మించిరందు* (సీ॥ రాజవంశోత్తమ రంతిదేవుని కీర్తి యేల చెప్పఁగ బడు నిందునందు। నా రాజు దనసంచితార్థంబులన్నియు నెడపక దీనులకిచ్చి యిచ్చి। సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై పేదయై కూడు నీరు లేక ధనవృత్తి। నెం దేనినలుబదియెనిమిది దివసము లుపవసియింప నొక దివసంబు రేపు। నెయ్యి పాయసంబు నీరును గలిగిన। బహుకుటుంబ భారభయముతోడ। నలసి నీరువట్టు నాఁకలియును మిక్కి। లొదవఁ జూచి కుడువ నుత్సహించి। యయ్యెడ* (సీ॥ అతిథి భూసురుఁడొకఁ డన్నాహారమడిగి నఁగ డపక ప్రియముతోఁ గారవించి। హరిసమర్పణ మంచు నన్నంబులో సగమిచ్చి నభుజియించి మేగె నాతఁ। డంతలోనొక శూద్రుఁ డశనార్థియై వచ్చి పాడ నూప లేదని పోక తనకు। నున్న యన్నములోన నొక భాగమిచ్చిన సంతుష్టుఁడై వాఁడు సనియె వెనుక। కుక్కఁగమియుఁ దానునొకఁడే తేరనా। యన్నశేషమిచ్చె సన్నయమున। వాని క్రమ్మఱఁ బంపవరుసతోఁ జండాలుఁ। డొక్కడసుదెంచి చక్క నిలిచి* (క॥ హీనుఁడఁ జండాలుండను। మానవకుల నాథ దప్పిమాని దెయవలం। బోనే నీకుఁ జిక్కిన పానీయము నాకుఁ బోసి బ్రతికింపఁగదే। అనిన దీనాలాపంబులకుం గరుణించి యిట్లనియె* (ఉ॥ అన్నములేమి నొద్దిన ధుశాంబువు మాత్రముద్రావు గన్నర। మ్మన్న శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపద। ల్గన్నన దాల్చి వారికి సుఖంబులు సేయుట కంటె నొండు మే। లున్నదె నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడు సుమ్ము పుల్కసా। అని పలికి* (మ॥ బలవంతంబగు నీరువట్టున నిజప్రాణాంతమైయున్నచో। నలయం జేమియు దీనహృజ్జ్వరము నారాటంబు ఖేదంబు నా। జలదానంబున నేఁడు మాను ననుచున్ రైశ్వర్యాధీనుఁడై। జలములు పోసె నురంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్* (వ॥ తదనంతరంబ బ్రహ్మాది దేవతలు సంతోషించి రంతిదేవునికి మేలుసేయుందలంచి నిజాకారంబుతో ముందర నిలువంబడి యా రాజు ధైర్యపరీక్షార్థంబు తము చేసిన వృషలాదిరూపంబులు విష్ణుమాయ నెఱింగించిన నానరేంద్రుం డందఱకి నమస్కరించి* (క॥ వారల నేమియు నడుగక। నారాయణ భక్తి దనమనంబున వెలుఁగ। ధీరుండా తదుమాయా। పారజ్ఞుండగుచు బరమపదముం బొందెన్* (క॥ ఆ రాజర్షిని గొలిచిన। వారెల్ల మదీయ యోగవైభవమున శ్రీ। నారాయణ చింతనులై। చేరిరి యోగీశులగుచు సిద్ధపదంబున్* (వ॥ ఇట్లు రంతిదేవుండు విజ్ఞానగర్భిణియగు భక్తివలనఁ బరమపదంబునకుం జనియె నంత గర్గునకు శినిజన్మించె శినికి గార్గ్యుండు గలిగె నాతనినుండి బ్రాహ్మణకులంబయ్యె- మహావీర్యునికి మరుత్క్షయుండు, మరుత్క్షయునకు ద్రయ్యారుణియుఁ గవియుఁ బుష్కరారుణియునన మువ్వురు సంభవించిరి వారు బ్రాహ్మణులై చనిరి- బ్రహ్మక్షత్రునకును హోత్రుండును, సుహోత్రునకు హస్తి జనించె - నతండుద

నపేరహస్తినాపురంబునిర్మించె నాహస్తికినజమీఢుండును, ద్విమీఢుండును, బురుమీఢుండనుముగ్గురుజనించిరి- యందజమీఢునివంశంబునఁబ్రియమేధాదులుగొందఱుపుట్టి బ్రాహ్మణులై చనిరి- యయ్యజమీఢునికి బృహదిషు వతనిపుత్రుండు, బృహద్ధనువతనికి, బృహత్కాయుండతనికి, జయద్రథుండాతనికివిశ్వజిత్తు, విశ్వజిత్తునకుసేనజిత్తు, సేనజిత్తునకురుచిరాశ్వుండు, దృఢహనువు, కాశ్యుండు, వత్సుఁడనననలుగురుజనించిరందు రుచిరాశ్వునకు బ్రాజ్ఞుండు, నతనికిబృథుసేనుండు, వృథుసేననికిబారుండు, వానికినీపుండు, నీపునికి నూఱ్వురుకొడుకులుపుట్టిరిమఱియును* (గీ॥ శుకునికూఁతురైన సుందరి సత్కృతిఁ| బొందె వేడ్క నీపభూపభుండు|విమలయోగమిత్తువిజ్ఞానదీపితో| దారచిత్తుబ్రహ్మదత్తుఁగనియె* (వ॥ బ్రహ్మదత్తుండు జైగిషవ్యోపదేశంబునయోగతంత్రంబునంజేసి గోదేవియను భార్యవలనవిష్వక్సేనుండను కుమారునింగనియె- విష్వక్సేనునకునుదక్సేనుండునుదక్సేనునకుభల్లాదుండు, వీరలుబార్హదిషవులను రాజులైరి-ద్విమీఢునకుయవీనరుండుయవీనరునికిఁగృతిమంతుండు, కృతిమంతునికిసత్యధృతి, సత్యధృతికిదృఢనేమి, దృఢనేమికిసుపార్శ్వకృత్తు, సుపార్శ్వకృత్తునకు సుపార్శ్వుండు, సుపార్శ్వునకుసుమతి, సుమతికిసన్నతిమంతుండు, సన్నతిమంతుకొడుకుకృతియనువాడు, హిరణ్యనాభునివలనయోగమార్గంబెఱింగిశోకంబువిడిచితూర్పుదేశంబునసామసంహితపఠియించె, నతనికినుగ్రాయుధుండు, నుగ్రాయుధునకుక్షేమ్యుండు, క్షేమ్యునకుసువీరుండు, సువీరునకుఁబురంజయుండు, పురంజయునకుబహురథుండుజన్మించె, హస్తికొడుకు పురుమీఢునికి సంతతిలేదయ్యె నయ్యజమీఢునకునళినియనుభార్యయందునీలుండు, నీలునికిశాంతి, శాంతికినుశాంతినుశాంతికి బురుజుండు, పురుజునికినర్కుండు నర్కునికిభర్మ్యాశ్వుండు, భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు కాంపిల్యసృంజయులనువారేవురుపుట్టిరి* (క॥మించినభర్మ్యాశ్వుఁడుసుత । పంచకమునుజూచివిషయపంచకమునువ । ర్జించితిమేమనిపలికెనఁ|బాంచాలురు నాగసుతులపరగిరిధరణికా*( వ॥ అంతముద్గలునుండిబ్రాహ్మణకులంబైన ముద్గలగోత్రంబనానెగడె- భర్మ్యాశ్వపుత్రుండైనయాముద్గలునికిదివోదాసుండునహల్యయను కన్యకయుంబుట్టిరి, యహల్యయందు గౌతమునికిశతానందుండుపుట్టె, శతానందునికిధనుర్వేదవిశారదుండైనసత్యధృతిపుట్టి యతండొకనాడు వనంబున నూర్వశింగనిన నతనికి రేతఃపాతంబై తద్వీర్యంబుశరస్తంభంబునంబడిమిథునంబైనసమయంబున*(క॥చపలరతిశంతనుండను|నృపవరుడడవికిని వేఁటనేవమనఁజనుచుం । గృపతోశిశుయుగముంగని|కృపియుఁగృపుండనుచుదెచ్చిగృహమునఁబెంచెకా* (వ॥ ఆకృపిద్రోణునకుభార్యయయ్యెదివోదాసునకుమిత్రాయువు, మిత్రాయువునకుచ్యవనుండు, చ్యవనునకుసుదాసుండు, సుదాసునకుసహదేవుండు, సహదేవునకుసోమకుండు, సోమకునకుసుజన్మకృత్తు, సుజన్మకృత్తునకు నూఱ్వురుకొడుకులుంగలిగిరి, వారిలోజంతువనువాడుజ్యేష్ఠుండు, కడచూలుపృషదుండు, పృషదునకుద్రుపదుండు ద్రుపదునకుదృష్టద్యుమ్నాదులయిన కొడుకులును ద్రౌపదియనుకూఁతురుంగలిగిరి, ధృష్టద్యుమ్ననకుధృష్టకేతువుపుట్టె, వీరలుపాంచాలరాజులనఁబెఱుంగుదురు, మఱియు నయ్యజమీఢునికొడుకు ఋక్షుండు, ఋక్షునకు సంవరణుండాసంవరణుండు సూర్యకన్యయందుకురువుంగనియె, నాకురువుపేరంగురుక్షేత్రంబయ్యె, నాకురువునకుఁబరిక్షిత్తు, సుధనుస్సు, జహ్నువు, నిషధుండునను వారలునలువురుపుట్టిరందు బరిక్షిత్తుకొడుకులు లేక చనియె, సుధనుస్సునకుసుహోత్రుండు, నతనికిచ్యవనుండు, చ్యవనునకుకృతి, కృతికివసువు, వసువునకు బృహద్రథకుసుంభమత్స్యప్రత్యగ్రచేదిపాదులుపుట్టిరందు బృహద్రథునకుఁ గుశాగ్రుండు, కుశాగ్రునికి ఋషభుండు ఋషభునికి సత్యహితుండు, సత్యహితునికిపుష్పవంతుండు, పుష్పవంతునకుజహ్నువనువాఁడుమఱియును* (సీ॥ ఆబృహద్రథునకు నన్యభార్యాగర్భమున రెండుతగఖండములుజనించె|దునుకలుగనితల్లితొలఁగంగవైచినసంధించెనొకటిగా జరయనంగ । నొకదైత్యకాంతవాఁడొప్పె జరాసంధుఁడనగిరివ్రజపురమాతఁడేలె । నతనికిసహదేవుఁడతనికిసోమాపితనయుఁడాతనికిశ్రుతశ్రవుండు । జహ్నుపుత్రుండుసురథుండుజనవరేణ్య। యతనికొడుకువిదూరథుఁడతనిపట్టి। సార్వభౌముండువానికిసంభవుండు । వినుజయత్సేనుఁడనువాఁడువిమలకీర్తి*(వ॥ఆజయత్సేనునికిరథికుండు, రథికునకునయుతాయువు, నయుతాయువునకుగ్రోధనుండు, క్రోధనునకుదేవాతిథి, దేవాతిథికిఋక్షుండు, ఋక్షునికి భీమసేనుండు, వానికి బ్రతీపుండుఁ, బ్రతీపునకుదేవాపిశంతన, బాహ్లీకులనముగ్వురుకొడుకులుపుట్టిరందు*(సీ॥ దేవాపిరాజ్యంబుదీర్పనొల్లక వనంబున కేగితమ్ముండుపూర్వజన్మ|మందుమహాభిషుఁడనియెడువాఁడుశంతనుఁడయ్యెవాఁడెయీధాత్రినెల్ల। నేలుచుగరములనెవనిముట్టినగాని వాఁడెల్ల నిందు జవ్వనమునందు । నధికశాంతి ప్రాప్తుఁడై యున్నదానబ ్రెండేండ్లువజ్రివర్షింపకున్న । వృష్టిలేనిచొప్పువిప్రులనడిగిన|నన్నయుండఁదమ్ముఁడగ్నిహోత్ర । దారసంగ్రహంబుదాల్చినపరివేత్త । యంద్రుదానశీవయతఁడవైతి*(వ॥ అదికారణంబుగానన్నయుండఁదమ్ముండురాజ్యార్హుండుగాడునీవుపరివేత్తవు మీయన్నకురాజ్యంబిచ్చిన ననావృష్టిదోషంబు చెడునని బ్రాహ్మణులవలికిన శంతనుండు వనంబునకుంజని దేవాపికిబ్రియంబుచెప్పి రాజ్యంబు చేకొమ్మనివలికెనంతకుమున్న వానితండ్రిదే

వాపి రాజ్యంబునకర్హుం జేయందలంచి విప్రులం బిలిచిన నా విప్రులు పాషండమత వాక్యంబులు దేవాపికి నుపదేశించిన దేవాపి వేదంబుల నిందించి నపాషండుండును, దేవదూషకుండును గావున దేవాపికి రాజ్యంబు లేదని బ్రాహ్మణులు చెప్పిన శంతనుండు నుమగిడివచ్చి రాజ్యంబు చేకొని యెనంత వర్షంబులు గురిసె నివ్విధంబున* (క॥ దేవాపికలాపపురం బావాసముగాఁగ యోగిమైయున్నాఁడు।ర్వీవరకలికష్టంబగు।జై వాతృకకులము మీద సంస్థాపించుఁ* (వ॥ బాహ్లీకుండను వానికి సోమదత్తుండు పుట్టె, సోమదత్తునకు భూరియు, భూరిశ్రవస్సు శలుండను వారు మువ్వురు పుట్టిరి* (క॥ ఖ్యాతిగ శంతనునకుసు।జ్ఞాతుండై గంగయందు జనియించెను స।ద్భ్యాతి విమలకీర్తుల చే। నాతతవ్యోముండు భీష్ముఁడాత్మజ్ఞుఁడు గాఁ* (గీ॥ పరశురాముతోడఁ బ్రతిఘటించి జయించె।నన్యుఁడొకడు నెఱుఁగఁ డతఁడు దక్షఁ।విరయాధపతి వివేకధర్మజ్ఞుండు।దివిజనదిసుతుండు దేవసముఁడు* (వ॥ఆశంతనునకు దాశకన్యకమైన సత్యవతియందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యులను వారు పుట్టిరంతఁ జిత్రాంగదుండు గంధర్వులచే నిహతుండయ్యెనట్టియును* (ఉ॥ సత్యవతీవధూటి మును శంతను పెండ్లము గానినాడు సాంగత్యము గా బరాశరుఁడు గర్భము చేసిన బాదరాయణుం।డత్యధికుండు శ్రీహరికళాంశజుఁడై ప్రభవించెఁ త్యముఁ । సత్యములైన వేదముల సాంగముల న్విభజింపదక్షుఁడై *(గీ॥బాదరాయణుండు భగవంతుఁ డపఘుండు।పరమగుహ్యమయిన భాగవతము।నందనుండ నైన నాకుఁ జెప్పెను శిష్యజనుల మొఱఁగి యేను జమవుకొంటి* (వ॥ ఆ విచిత్రవీర్యునకి గాశిరాజుకూతుల నంబికాంబాలిక లభీష్ముండు బలాత్కారంబునఁ దెచ్చి వివాహంబు సేసిన విచిత్రవీర్యుండు వారలం దగిలి మనోజరాగమత్తుండై చిరకాలంబు నానావిధక్రీడల విహరించుచు రాజయక్ష్మ పీడితుండై మృతుండయ్యెనంత*(క॥ అతని సతివలన సుతులను । సుమున త్తఱిదల్లి వనుపసారదింగ నియోగ।ధృతరాష్ట్ర పాండువిదురుల।మతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా* (వ॥అంత ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనాములగు కొడుకులు నూర్వురును దుశ్శలయను కన్యకయు నుజన్మించిరి. మృగశాపభయంబునం జేసి భార్యఁ బొంద వెఱచిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్రప్రసాదంబున యుధిష్ఠిర భీమార్జునులను మువ్వురును మాద్రీదేవివలన నాసత్యప్రసాదంబున నకులసహదేవులను వారిద్దఱును గా నేవురు పుట్టిరయ్యేవురకును ద్రుపదరాజపుత్రియైన ద్రౌపదియందుఁ గ్రమంబున ప్రతివింధ్యుండును శ్రుతసేనుండును శ్రుతకీర్తియు శతానీకుండును శ్రుతకర్ముండు నన నేవురు పుట్టిరి, మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును, భీమసేనునికి హిడింబియందు ఘటోత్కచుండును గాళియందు సర్వగతుండును, సహదేవునికి విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును, నర్జునునకు నులూచియను కన్యకయందు నిలావంతుండును, మణలూరుపతిపుత్రికయయిన చిత్రాంగదయందు బభ్రువాహనుండును, సుభద్రయందు శౌర్యధైర్య తేజోవిభవంబుల నఖిలరాజనికరంబునఁ బ్రఖ్యాతుండయిన యభిమన్యుండును, జన్మించిరందు బభ్రువాహనుండర్జునుని నియోగంబున మాతామహుని గోత్రంబునకు వంశకర్తయయ్యె* (ఉ॥ అన్యనృపపూజ్య నీజనకుఁడై యభిమన్యుఁడు భూవరేంద్రమూ । ర్ధన్యుడు ధన్యమార్గణకదంబవిదారితవైరివీరదా । జన్యుఁడు జన్యభీతకురుసైన్యుఁడు సైన్యసమూహనాథదృ । క్షామ్యుడు మాన్యకీర్తి మహిమందన రెంగురువంశకర్తమై ॥ ఆయభిమన్యునకు నుత్తరయందు నీవు జన్మించితి* (క॥ ద్రోణసుతు తూపు వేడిమిఁ।బ్రాణంబులఁ బాసి హరికృపాదర్శనసం । త్రాణంబునఁ బ్రతికితె కా । క్షోణీశ్వర మున్ను నీశిశుత్వము వేళ౯* (వ॥నీకుమారులు జనమేజయశ్రుతసేన భీమసేనోగ్రసేనులను నల్వురు వీరలు నీవు తక్షకునిచేత నిధనంబునొందితివని వినిసకలసర్పలోక సంహృతంబుగ సర్పయాగ మింక జనమేజయుండు సేయగలడు పూర్వరోష సహితుఁడగుచు మఱియు నతండు సర్వధరణీమండలంబును జయించి కావషేయుండు పురోహితుండుగా నశ్వమేధంబు సేయంగలవాఁడు వానికి శతానీకుండు జనియించి యాజ్ఞవల్క్యునియందు వేదంబులు పఠియించి కృపాచార్యునివలన నస్త్రజ్ఞానంబు నేర్చి శౌనకునివలన నాత్మజ్ఞానంబుఁ బడయంగలవాఁడా శతానీకునికి సహస్రానీకుండు వానికి నశ్వమేధజుండు-నశ్వమేధజునికి నాసీమకృష్ణుండు నాసీమకృష్ణునకు నిచకుండు, నిచకునకుఁ గౌశాంబియందు సుపుండు, సుప్తునికి జిత్రగధుండు, చిత్రగధునకు శుచిరథుండు, శుచిరధునికి వృష్టిమంతుండు, వృష్టిమంతునికి సుషేణుండు, సుషేణునికి సునీతుండు, సునీతికి న్నృచక్షుస్సు, నృచక్షుస్సునకు సుఖానిలుండు, సుఖానిలునికి బరిప్లవుండు, పరిప్లవునకు మేధావి, మేధావికి సునయుండు. సునయునికి న్నృపంజయుండు, నృపంజయునికి దూర్వుండు, దూర్వునికి సమి, సమికి బృహద్రధుండు, బృహద్రధునకు సుధాంశుండు, సుధాంశునికి శతానీకుండు, శతానీకునకు దుర్దమనుండు, దుర్దమనునికి విహీనరుండు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుండు, మితునకు క్షేమకుండు, క్షేమకునకు బ్రహ్మాత్ముండు వాఁడు నిర్వంశుండై దేవర్షి సత్కృతుండై కలియుగంబునందు జనగలవాఁడు* (క॥ జగతిని టమీఁద బుట్టెడు । మగధాధీశ్వరుల నఖిల మనుజేశ్వరుల।న్నిగమాంతవిదుల జెప్పెద।సుగుణాలంకారధీర సుభగవిచారా* (వ॥జరాసంధపుత్రుండైన సహదేవునికి మార్జాలి, మార్జాలికి శ్రుతశ్రవస్సు, శ్రుతశ్రవస్సునకు నయుతాయువు, నయుతాయువునకు నిరమిత్రుండు, నిర

మిత్రునకు సునక్షత్రుండు, సునక్షత్రునికి బృహత్సేనుండు, బృహత్సేనునికి గర్మజిత్తు, కర్మజిత్తునకు శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు, విప్రునకు శుచి, శుచికి క్షేముండు, క్షేమునికి సువ్రతుండు, సువ్రతునకు ధర్మనేత్రుండు, ధర్మనేత్రునకు శ్రుతుండు, శ్రుతునకు దృఢసేనుండు, దృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకు రిపుంజయుండును, జన్మించెదరని చెప్పి మఱియు నిట్లనియె* (గీ॥ వినుము మాగధదేశవిభులు జరాసంధప్రముఖధరణీపతులు ప్రబలయశులు। వీరు కలియుగమున వెయ్యేండ్లలోపలం। బుట్టి గిట్టగలరు భూవరేంద్ర* (వ॥ యయాతి కొడుకమవునకు సభానరుండు, చక్షుస్సు, పరోక్షుండు, నను వారు ముగ్గురు పుట్టిరందు సభానరునికి గాలనాభుండు, కాలనాభునకు సృంజయుండు, సృంజయునకు పురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాసాలుండు, మహాసాలునికి మహామనస్సు, మహామనస్సునకు నుశీనరుండు తితిక్షువను నిరువురు జన్మించిరందు శీనరునకు శిబియు, వనుండును, క్రిమియు, దర్పుండు, నననలువురు జన్మించి రందు శిబికి వృషదర్పు, సువీర, మద్ర, కేకయులు నలువురు పుట్టిరి- తితిక్షువునకు రుశద్రధుండు, రుశద్రధునకు హేముండు, హేమునకు సుతపస్సు, సుతపస్సునకు బలి పుట్టె, నా బలివలన నంగవంగకళింగ సింహపుండ్రాంధ్రులను పేళ్లు గలవారాఱ్వురు కుమారులు పుట్టిరి వారలు తూర్పుదేశంబున రాజులైరి తక్కిన దేశంబులకు తమ తమ నామధేయంబు లిడి యేలిరి వీరునకు సత్యరథుండు సత్యరథునికి నిరథుండు, నిరథునికి ధర్మరథుండు, ధర్మరథునకుఁ జిత్రరథుండు పుట్టె, వాఁడు రోమపాదుండను నా బరగి* (క॥ సంతతి లేనికతంబునఁ। జింతించుచు నుండ నతని చెలి కాఁడు సుధీ। మంతుఁడు దశరథుఁడతనికి। సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్* (వ॥ అంత రోమపాదుండు తనకూఁతురు శాంతయని కైకొని మెలంగుచుండు నా రాజు రాజ్యంబున నంగొంత కాలంబు వర్షంబు లేమికిం జింతించి విభాండకసుతుండైన ఋశ్యశృంగుండు వచ్చిన వర్షంబు గురియునని పెద్దలవలన నెఱింగి* (క॥ ఆ రాజు ఋశ్యశృంగుని। ఘోరతపోనియము దెచ్చుకొఱకై పనిచె। న్వారసతుల నేర్పరులను। దారస్తనభారభీరుతరమధ్యగలన్* (గీ॥ కాంతలార మేకమగన్నది మొదలుగా। నాడువారి నెఱుఁగడడవిలోన। గోచవిగియగట్టుకొనిన నావడుగు నిమత్తి గానిరతికి నుపవలయు॥ అని పలుకునంత* (క॥ ఆడుచుఁ జౌలకు నింపుగఁ। బాడుచు వాలోకనిశితబాణౌఘములఁ। వ్రీడుచు దగ్గర నోడుచుఁ। జేడియలాతపసికడకుఁ జేరిరి కలవన్॥ ఆ య్యవసరంబున వారలం జూచి* (సీ॥ మిళితాళినీలధమ్మిల్లభారంబులు చాగుజటాపిశేషంబులనియు। భర్మ్యాంచలోజ్జ్వలప్రభదుకూలంబులు తతచర్మవస్త్రభేదంబులనియు। బహురత్నకీలితభాసురదామంబు లధికరుద్రాక్షమాలాదులనియు। మలయజమృగనాభిమహిత లేపంబులు బహువిధభూతిలేపంబులనియు। మధురగానంబు శ్రుతియుక్తమంత్రజాతులనియు వీణెలు దండంబులనియు సతుల। మూర్తులెన్నడు నెఱుఁగని ముగుదతపసి। వారిఁ దాపసులని డాయవచ్చి మ్రొక్కె॥ ఇట్లు వచ్చి మ్రొక్కిన ఋశ్యశృంగుం జూచుచు నసుచుడగ్గరి* (సీ॥ సేను మేయని సతులు ఛేతులగ్రుద్దిక కర్కశకుచంబులు మోపి కౌఁగిలించి। చిరతపోనియతి డస్సితిగదా యని మోముఁ గంఠంబు నాభియుఁ గలయఁ బుడికి। క్రొత్తగా మమ్ముఁ జేకొను మని వీనులపొంత నాలుకలు చప్పుళ్లు చేసి। మావనంబుల పండ్లు మంచి వితినుమని పెక్కు భక్ష్యంబులు ప్రీతినొసగి। చర్మవస్త్రము వదలించి భర్మ్యకాంతి। మించి చెలగు పీతాంబర మిచ్చి వేసమ। మనము సొక్కంగనని జేకొనఁగ వారి। మఱుఁగునకు జేరెనతఁడు వేమఱిగి వారి* (వ॥ ఇట్లు హరిణీసుతుండు గాంతాకటాక్షపాశబద్ధుండై వారల వెంటంజని రోమపాదుకడకుం బోయిన నతండు దనప్రియనందనయైన శాంత నిచ్చి పురంబున నుచికొనియె నమ్మునీశ్వరుండు వచ్చిన వర్షదోషంబు సెడి వర్షంబు గురిసెనంత* (గీ॥ ఆనృపాలచంద్రుఁడనపత్యుఁడై యుంట। నెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁ గూర్చి। యిష్టి చేసి సుతుల నిచ్చె నాతని కృపఁ। బజ్రరథుఁడు పిదపఁ బడసె సుతుల* (వ॥ ఆ రోమపాదునకుఁ జతురంగుండును, జతురంగునకు బృథులాక్షుండు- పృథులాక్షునకు బృహద్రథుఁడు, బృహత్కర్ముఁడు, బృహద్భానుండు ననువారు మువ్వురు పుట్టిరందుఁ బృహద్రథునకు బృహన్మనస్సు బృహన్మనస్సునకు జయద్రథుండనంబరఁగె, జయద్రథునకు విజయుండు, విజయునకు సంభూతియను భార్యయందు ధృతియు, నా ధృతికి ధృతవ్రతుఁడు, ధృతవ్రతునకు సత్యకర్ముండు, సత్యకర్మునకు నతిరథుండు జన్మించె* (గీ॥ కుంతి పిన్ననాఁడు కోరి సూర్యుని బొంద। బిడ్డఁడుదితుఁడైనఁ బెట్టె బెట్టె। గంగనీటఁ బిడువ గని యతిరథుఁడంత। గర్ణుఁడను చుఁ గొడుకుఁ గారవించె* (వ॥ ఇట్లతిరథునకు గానీనుండైన కర్ణుండు కొడుకయ్యె గర్ణునకు వృషసేనుండు పుట్టె, నయ్యయాతి కొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, బభ్రుసేతువునకు నారబ్ధుండు, నారబ్ధునకు గాంధారుండు గాంధారునకు ఘర్మండు, ఘర్మునకు ఘృతుండు, ఘృతునకు దుర్మదుండు, దుర్మదునకు ప్రచేతస్సు, ప్రచేతస్సునకు నూర్గురు పుట్టి మ్లేచ్ఛాధిపతులై యుదీచీదిశ నాశ్రయించిరి- దుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుండు, భర్గునకు భానుమంతుండు, భానుమంతునకుఁ ద్రిసానువు, త్రిసానువునకుఁ గరంధముండు, కరంధమునకు మరుత్తుం, డతనికి యయాతిశాపంబున సంతతి లేదయ్యె వినుము* (చ॥ అనఘ యయాతి పెద్దకొడుకైన యదుక్షితిపాలు వంశము। న్వినినఁ బఠించినన్నరుఁడు వెండియుఁ బుట్టఁడు ముక్తిఁ బొందున।

య్యనుపమ మూర్తి విష్ణుఁడపరాకృతిఁ బొందిజనించెఁగావున । న్నిమము నరేంద్ర నాపలుకు ప్రీమలపండువుగాఁగఁ జెప్పెదన్ *

## * యదువంశచరిత్రము. *

(వ॥ యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుండు, రిపుండు, నను వారు నలువురు సంభవించిరందుఁ బెద్దకొడుకైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె, నా శతజిత్తునకు మహాహయ, వేణుహయ, హైహయులను వారు ముగ్గురందు హైహయునకు ధర్ముండు, ధర్మునకు నేత్రుండు, నేత్రునకుఁ గుంతి, కుంతికి మహిష్మంతుండు, మహిష్మంతునికి భద్రసేనుండు, భద్రసేనునకు దుర్మదుండు, దుర్మదునికి ధనికుండు, ధనికునకు కృతవీర్యుండు, కృతాగ్ని, కృతకర్మ, కృతౌజస్సులను నలువురు సంభవించి రందుఁ గృతవీర్యునికి నర్జునుండు జనియించె * (సీ॥ హరికళాసంజాతుఁడైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధిఁ బొంది। బహుయజ్ఞదానతపంబులు గావించి సకల దిక్కులు గెల్చి జయముతోడ। సతతంబు హరినామసంకీర్తనము సేయ ధనములనొందియు దారవృత్తి। యెనుబదియైదు వేలేండ్లు భూచక్రంబును కీర్తిఁ దనపేరుగాఁగ నేలె । ముదిమి లేకతరుణమూర్తియై యుకీర్తి । నమరెఁగార్తవీర్యుఁడనఁగ విభుఁడు। నిజము వానిభంగి నేలయేలిన యట్టి। రాజునెఱుఁగ మెందు రాజముఖ్య * (వ॥ అర్జునునకుం గల పుత్రసహస్రంబునం బరశురాముని చేతఁ జిక్కిందప్పిన జయధ్వజుండు, శూరసేనుండు, వృషణుండు, మధువు, నూర్జితుండను వారేవురు బ్రతికిరి, జయధ్వజునకుఁ దాళజంఘుండు, తాళజంఘునకు నౌర్వముని తేజంబున నూర్వురు కొడుకులు గలిగి రందుఁ బ్రథముండు- వీతిహోత్రుఁడు, మధువునకు వృష్ణుండు- వృష్ణునకుఁ బుత్రశతంబు పుట్టె- నందుఁ బ్రథముండు వృష్ణియగాన నావంశంబు వారు వృష్ణులు యాదవులనం బరగిరి- యదుపుత్రుండైన క్రోష్టువునకు వృజినవంతుండు- వృజినవంతునకు శ్వాహితుండు- శ్వాహితునకు భేరుశేకుండు- భేరుశేకునకుఁ జిత్రరథుండు- చిత్రరథునకు శశిబిందుండు పుట్టె నతండు * (మ॥ కృశమధ్యల్పది వేవురంగనలతోఁ గ్రీడం బ్రమోదింపఁ, దుష్కలుండై పది వేలు లక్షలు సుపుత్రుల్ భక్తిసేయం జతు । గ్దశరత్నుండును యోగినా బరగిన ప్రద్వీపరాజేంద్రుఁడై । శశిబిందుండు రుచిరాతుఁడను రెన్నతాఁ గాంతిపూర్ణేందుఁడై * (వ॥ అతనికొడుకుల మొత్తంబులకు ముఖ్యులైన యార్వురిలోఁ బృథుశ్రవుండను వానికి ధర్ముండు పుట్టె- ధర్మునకు నుశనస్సు పుట్టె నూఱశ్వమేధంబులు చేసెనయ్యుశనస్సునకు రుచికుండు పుట్టె నారుచికునకుఁ బురుజిత్తు- రుక్ముండు- రుక్మేషువు- పృథువు- జ్యామఘుండు నను వారేవురు పుట్టిరందు జ్యామఘుండు * (సీ॥ తొల్లి గొల్పెడు శైబ్యతోడి ప్రేమంబున ననపత్యుఁడయ్యును నన్యభార్యఁ । గైకొనక కొంతకాలంబునకుఁ బోయి పగవారి యింటను బలిమిఁ బట్టి । యొక కన్యఁ దేరిపై నునిచి శోడ్తరంగ జననాథుకన్యను శైబ్య చూచి । కోపించి మానవకుహక యీపడుచును దెచ్చి యేమి యుండఁ దేరి మీఁదఁ। బెట్టినాఁడవనుచు బిఱుసులు వలుకంగ । నతఁడు వలికె నంతనయముతోడ । నా కుఁగోడల య్యె నమ్ముమీ లలితాంగి । సవతి గాదు వినుము సత్య మనుచు * (వ॥ అయ్యవసరంబున శైబ్య కొడుకుం గాంచునని యెఱింగి విశ్వేదేవతలును, పితృదేవతలును - సంతసించి వారల ప్రసాదంబున * (క॥ తనసవతి యెఱిఁగి పెనిమిటి । తనుఁ బొందిన శైబ్య మఱి విదర్భుని గనియె । దనయుఁ గని జ్యామఘుండును । దను దెచ్చిన కన్య దెచ్చి తనయునకిచ్చెన్ * (వ॥ ఆకన్యకయందు విదర్భునకు కుశుండును- క్రథుండును - రోమపాదుండును బుట్టిరి - రోమపాదునకు బభ్రువు- బభ్రువునకు విభువు విభువునకుఁ గృతి- కృతికి నుశికుండు- నుశికునకుఁ జేది- చేదికిఁ జైద్యాదులుం బుట్టిరి- క్రథునకు కుంతి- కుంతికి ధృష్టి- ధృష్టికి నిర్వృతి- నిర్వృతికి దశార్హుండు- దశార్హునకు వ్యోముండు- వ్యోమునకు జీమూతుండు- జీమూతునకు వికృతి- వికృతికి భీమరథుండు- భీమరథునకు నవరథుండు- నవరథునకు దశరథుండు- దశరథునకు శకుని- శకునికి కుంతి- కుంతికి దేవరాతుండు- దేవరాతునకు దేవక్షత్రుండు- దేవక్షత్రునకు మధువు- మధువునకు కురువశుండు- కురువశునకు ననువు - ననువునకుఁ బురుహోత్రుండు - నతనికి నంశువు- నతనికి సాత్వతుండు- సాత్వతునకు భజమానుండును- భజియును- దివ్యుండును- వృష్ణియు- దేవావృధుండు- నందకుండు మహాభోజుండు నననేడురు పుట్టిరందు- భజమానునకుఁ బ్రథమభార్యయందు- నిమ్రోచి కంకణ వృష్ణియు నను ముగ్గురును. రెండవభార్యయందు శతజిత్తు సహస్రజిత్తు అయుతజిత్తులు ముగ్గురు పుట్టిరందు దేవావృధునికి బభ్రువు- వీరలిరువుర ప్రభావంబుల బెద్దలు శ్లోకరూపంబునఁ బరియించుచు రట్టిశ్లోకార్థం బెట్టిదనిన * (క॥ వినుముదూరంబునాడిన వినుచునుండు । మఱియు జూడము దగ్గఱనగు దేర। నరులలోఁ బభ్రుకం బెనున్నతుఁడు లేఁడు, యోజ దేవావృధునకైన నోరుదుగలఁడే * (క॥ పదునాలుగు వేవురునలు । వదినాలుగు నరులు ముక్తివడసిరి బభ్రుం । డుదితుడు దేవావృధుడును। బదపడి యోగంబుఁ దెలియఁ బలికిన కతన * (వ॥ మహాభోజుండతిధార్మికుండు వాని వంశంబు వారు భోజులనిపలుకంబడిరి- వృష్టికి సుమిత్రుండు యుధాజిత్తును జన్మించిరందు యుధాజిత్తునకు శినియు- ననమిత్రుండు జనించిరి- యనమిత్రునికి నిమ్నుండు- నిమ్నునికి సత్రాజిత్తుండు- ప్రసేనుండనని రువురు పుట్టిరి- మఱియు ననమిత్రునికి శినియను వాఁడు వేఱొకండు గలఁడతని పుత్రుండు సత్యకుండు నతనికి యుయుధానుండనం బరగిన సాత్యకియు- నా సాత్యకికి జయుండును- జయునకు గుణియు- నాగుణికి యుగధరుండును- మఱియు ననమిత్రునకు బృశ్ని

యను వేఱొక కొడుకుంగలఁడు-వానికిశ్వఫల్కుఁ- చిత్రకులుగలిగిరందు శ్వఫల్కునకు గాందినియందక్రూరుండు, నసంగుండును సారమేయుండును మృదుకుండును మృదుపచ్ఛివుండును వర్మదుండును ధృష్టవర్ముండును క్షత్రోపేక్షుండు నరిమర్దనుండును శత్రుఘ్నుండు సుగంధమాదుండును ప్రతిబాహునను వారుపన్నిద్దరు కొడుకులుగలిగిరి- సుచారువనుకన్యకయుంజనించెవారియందక్రూరునికి దేవలుం డనుప దేవుండునుంబుట్టిరి-మరియుం జిత్రునకుఁ బృథుండును విదూరథుండును మొదలుగాగలవారు పెక్కండ్రువృష్ణివంశజాతులైరి-భజమానుండు కుకురుఁడు శుచి కంబళ బర్హిషుండు విరంధునికిబుట్టిరి కుకురునికివృష్ణి-వృష్ణికివిలోమతనయుండు- విలోమతనయునికికపోతలోముండు- కపోతలోమునికి దుంబురుసఖుండైన యనువునకుదుందుభి దుందుభికి దవిద్యోతుండు దవిద్యోతునకుఁ బునర్వసు నతనికి నహుకుండను కుమారుం డాహుకియనుకన్యయుంగలిగిరి- యాహుకునికి దేవకుండుగ్రసేనుండు. ననునిరువురుజనించిరందు-దేవకునికి దేవలుం, డనుప దేవుండుసుదేవుండు దేవవర్ధనుండన నలువురుగలిగిరి - వారలకు ధృతదేవయు శాంతిదేవ యుపదేవయు శ్రీదేవయు దేవరక్షితయు సహదేవయు దేవకియు ననతోబుట్టువు లేడ్వురుగలిగిరివినుము* (క॥ ఆసదృశలలితాకారుల।కిసలయకరతలల దేవకీముఖ్యలనా।బిసరుహనయనలనంద।వసుదేవుఁడు పెండ్లియాడె వసుధాధీశా* (వ॥ ఉగ్రసేనునకుఁ గంసుండును న్యగ్రోధుండును సునామకుండును గహ్వుండును శంకుండును సుభువును రాష్ట్రపాలుండును విసృష్టుండును తుష్టిమంతుండుననుకొడుకులును, గంసయుఁ గంసవతియు సురభువు రాష్ట్రపాలికయు ననుకూతులుంబుట్టిరి-వారు వసుదేవానుజభార్యలైరి-భజమానునికి విదూరథుండును విదూరథునికిశినియు నతనికిభోజుండు భోజునికిహృదికుండు దేవమీఢుండు శతధనువు కృతవర్మయు ననుకొడుకులుగలిగిరియా దేవమీఢునికి మారిషయనుభార్యయందు వసుదేవుండును దేవభాగుండును దేవశ్రవుండు నానకుండు సృంజయుండును శ్యామకుండును కంకుండును నకుండును వత్సకుండును వృకుండునను వారుపదుగురుకొడుకులునుబృథయు శ్రు

### * వసుదేవునివంశక్రమానువర్ణనము. *

తదేవయు శ్రుతశ్రవస్సు రాజాధిదేవియు ననుకూతులేవురుంబుట్టిరందు* (ఉ॥ ధీనయశాలియైనవసుదేవుడుపుట్టినవెంటనింటిపై।నానకదుందుభుల్మొఱసెనచ్యుతుఁడీతనికిందనూజుఁడై । మానుగఁబుట్టునంచుగరిమంబునదేవతలుబ్బరాజసం। చానతన్నిమిత్తమునానకదుందుభియయ్యెవాఁడిలన్* (క॥ తనచెలికాడగుకుంతికిఁ । దనయులు లేకున్నఁజూచి తనతనయ పృథన్।దనయగనిమ్మనశూరుఁడు।దనయందులమైత్రినిచ్చెధరణీనాథా* (వ॥ అయ్యెంతి కుంతిభోజునింటంబెరుగుచుండ నొకనాడుదూర్వాసుండరుగు దెంచిననమ్మహాత్మునకుఁగొన్నిదినంబులు పరిచర్యలుచేసి వేల్పులంజేరంజీరువిద్యవడసి యావిద్యలావెలుంగనొక్కనాడేకాంతంబున వెలుంగుతేనినాకర్ణించిన నాదేవుండువచ్చినంజూచి వెఱఁగుపడియిట్లనియె* (క॥ మంత్రపరీక్షార్థంబభి । మంత్రించితిగాని దేవమదనక్రీడా । తంత్రంబుగోరిచీరను । మంత్రించినతప్పుసైచిమఱలుదినేశా ॥ అనిననయ్యుర్విదకుఁబద్మినీవల్లభుండిట్లనియె*(మ॥ తెఱవానీపలుకల్లయౌవినుము లేదేవోత్తమాహ్వానముల్మొఱగంబోలునె వేల్పులంబడయుటల్మోఘంబు లేనీకునీ।తఱిగర్భంబగుపుత్రుడుంగలుగునీతారుణ్యముంబాజ్యమా । వెఱవంగార్యము లేదుసిగ్గుదగునేత్రీడావనప్రానవా*(చ॥ అఁతగనయ్యకొల్పిలలితాంగికిగర్భము సేసిమింటికిం। జనియెదినేశ్వరుండపుడుచక్కని రెండవసూర్యుఁడోయనం । దనరెడుపుత్రుగాంచికృపదప్పిజగజ్జనవాదభీతయై । తనయునినీటబోవిడిచి తానరిగెంబృథతండ్రియింటికిన్*(వ॥అయ్యువిదనునిప్రపితామహుండైన పాండురాజువివాహంబయ్యెనయ్యంగనకుఁబాండురాజువలనధర్మజభీమార్జునులుపుట్టిరి-నమ్మగువ చెల్లెలగు శ్రుతదేవను గారూషకుండైన వృద్ధశర్మ పెండ్లియాడె నాదంపతులకుఁ బ్రతర్దనాదులేవురుపుట్టిరి-దానిభగినియైనరాజాధిదేవినిజయత్సేనుండుపరియణయంబయ్యెనామిథునంబునకువిందానువిందులుసంభవించిరి చేదిదేశాధిపతియైనదమఘోషుండు శ్రుతశ్రవస్సునుబరిగ్రహించె వారలకుశిశుపాలుండుదయించె - వసుదేవునితమ్ముఁడైన దేవభాగునికి గంసయందుఁజిత్రకేతు బృహద్బలులిరువురుజనించిరి వానిభ్రాతయగు దేవశ్రవస్సునువానికిఁ గంసవతియందు వీరుండును నిషుమంతుండును నుప్పతిల్లిరి-వానిసోదరుండైనకంకునికిఁ గంకయనుదానికిబకుండును సత్యజిత్తు పురుజిత్తనువారుద్భవిల్లిరి-వానిసహజుండైనసృంజయునికి రాష్ట్రపాలియందువృషదుర్మర్షణాదులావిర్భవించిరి-వానియనుజాతుండయినశ్యామకునకుసురభూమియందు హరికేశహిరణ్యాక్షులుప్రభవించిరి- వానితమ్ముండైన వత్సుండు మిశ్రకేశియను నప్సరసయందువృకాదిసుతులంగనియె-వానియనుజుండైనవృకుండు దుర్వాక్షియందుఁ దక్షపుష్కలసాళ్వాదులనుత్పాదించె-వాని జఘన్యజుండైనయనీకుండును దామనియనుదానియందుసుమిత్రానీక ఖాణాదులయినకొడుకులంబడసె-వానియనుజుండైన యానకుండుగర్ణికయందుఁ ఋతధామ జయులంగాంచె వసుదేవునివలన రోహిణియందు బలుండును గదుండును సారణుండునుదుర్మదుండును విపులుండును ధ్రువుండును కృతాదులును- పౌరవియందు సుభద్రుండును భద్రబాహుండును దుర్మ

దుండును భద్రుండును భూతాదులంగూడఁబన్నిద్దఱును; ఇందిరయందు నందోపనంద కృతక శ్రుత శూరాదులును, కౌసల్య
యందుఁ గేశియు, రోచనయందు హస్తహేమాంగాదులును, ఇళయందు యదుముఖ్యులైన యురువల్కలాదులును సహదేవియం
దుఁ ద్రిపృష్ఠుండును, శాంతాతిదేవాత్మజయందుఁ బ్రశ్రయ ప్రశ్రితాదులును, ఉపదేవియందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును,
శ్రీదేవియందు వసుహంస సువంశాదులు ఆర్గురును దేవరక్షితయందు గదాదులు తొమ్మండ్రును, సహదేవయందుఁ బౌరు
ఢశ్రుతముఖ్యాదు లెనమండ్రును దేవకీదేవియందుఁ గీర్తిమంతుండును సుషేణుండును భద్రసేనుండును ఋజువును సమ
దనుండును భద్రుండును సంకర్షణుండును వారు ఏడ్వురు వుట్టిరి మఱియును * (క॥ దుష్టజననిగ్రహంబును। శిష్టజనానుగ్రహంబు
సేయుటకో అకై। యష్టమగర్భమున గుణాఢ్యా। తత్స్పష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్* (గీ॥ విష్ణుఁడుదితుఁడైన వెనుక నా దేవకి।
భద్రమూర్తియగు సుభద్రగనియె। నానుణాఢ్యము త్తవగునీకునర్జుని। దయితయగుట జేసి ధరణినాథ* (క॥ ఎవ్వానిఘనమహత్తు
యనాగు। నెవ్వరుపాపంబువోడమునీలోకములో। నవ్వాసుదివ్వేశుఁడుహరి। దవ్వకవిభుఁడయ్యెఁదన్నుఁదాసృజియించున్*
(క॥ తనమాయలేకపరుసకు। ఘనునకునీశ్వరున కాత్మకర్తకుహరికిన్। జనములకుఁగర్మములకును। మను జేశ్వర కారణంబుమ
ఱియునుగలదే* (క॥ తలపఁగ నెవ్వనిమాయావిలసనములు జననవృద్ధివిలయంబులకు।న్నలిమికననుగ్రహమోక్షం। బులకును జీవు
నికిమూలములు నాకెపుడున్* (సీ॥ ఆట్టిపరేశునికరయంగ జన్మాదిపరతంత్రభావమేప్పాటిఁగలదు। రాజలాంఛనముల రా
క్షసవల్లభులక్షౌహిణీశులై యవనిబుట్టి। జనులను బాధింపశాసించుకొఱకునై సంకర్షణునితోడ జననమంది। యసురులమన
ములకైన లెక్కింపంగరాకుండునట్టికర్మములజేసి। కలియుగంబున జన్మింపఁగలుగు నరుల। దుఃఖజాలంబులన్నిటిఁదొలఁగన
డచి। నెల్లవేగెల్ల వారించి నిఖిలదిశల। విమలకీర్తులు వెదజల్లి వెలసెనధిప* (క॥ మంగళహారికీర్తిమహో। గంగామృతమించుకైఁ
నగణ్యాంజలులన్ సంగతము సేసిశ్రోత్రావఁదో। లంగును గర్మంబులావిలంబగుచున్నృపా* (క॥ వనజాక్షుని మందస్మిత। ఘనకుం
డలదీప్తిగండ। కలితాననముల్। వనితలుపురుషులుసూచుచు। ననిమిషభావంబు లేమికలయామరధిపా* (సీ॥ జనకునిగృహము
నజన్మించి మందగోఁ బెరిగి శత్రులనెల్ల బీచమడఁచి। పెక్కండ్రు భార్యల బెండ్లియై సుతశతంబుల్గాంచి తనునాదిపురుషుఁ
గూర్చి। శరణన్నవారిని కరుణించి పాండవ। కౌరవులకునంతకలహమైన। నందఱు సమయింప నర్జును గెలిపించి యుద్ధవునకు
దత్త్వమొప్పఁ జెప్పి। మగధపాండవసృంజయమధుదశార్హ। భోజవృష్ణ్యంధకాదిసంపూజ్యుఁడగుచు। నుర్విభరముని వారించి
యుండవొల్ల। కామహామూర్తి నిజమూర్తియందుబొందె* (చ॥ నగుమొగమున్ సుమధ్యమును నల్లని దేహమువచ్చి కాటప
ట్టగునురమున్ మహాభుజములందితకుండలకర్ణముల్ మదే। భగతియునీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁడి। మ్ముగఁ
బొడసూపు గాతకనుమూసినయప్పుడు విచ్చునప్పుడున్ ॥ అని చెప్పి॥..........................................*

క॥ జనకసుతాహృచ్చోరా। జనకవచోలబ్ధవిపినశైలవిహారా। జనకామితమందారా జనకాతిమహేశ్వరాతిశయసంచారా॥

మాలినీ॥ జగదుపవనచారీ సర్వలోకోపకారీ। సుగుణఘనవిహారీ సుందరీమానహారీ।
విగళకలుషపోషీ వీరవిద్యాభిలాషీ। స్వగురుహృదయపోషీ సర్వదాసత్యభాషీ॥

గద్య॥ ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు సూర్యవంశారంభంబును, వైవస్వతమనుజన్మంబును, హైమ్యచంద్రకథనంబును, సుద్యుమ్నాదిమనుసూనుల చరిత్రంబును, మరుత్తు తృణబిందు శర్యాతి కకుద్మి సగర నాభాగ ప్రముఖులచరిత్రంబును, అంబరీషునియందుఁ బ్రయోగింపబడిన దుర్వాసునికృత్యనిరర్థకంబగుటయు, ఇక్ష్వాకు వికుక్షి మాంధాతృ పురుకుత్స హరిశ్చంద్ర సగర భగీరథ ప్రముఖులచరిత్రంబును, భాగీరథీప్రవాహవర్ణనంబును, కల్మాషపాద ఖట్వాంగ ప్రముఖులచరిత్రంబును, శ్రీరామచంద్రకథనంబును, తదీయవంశపరంపరాగణనంబును, నిమికథయు, చంద్రవంశారంభంబును, బుధపురూరవులకథయును, జమదగ్ని పరశురాములవృత్తాంతంబును, విశ్వామిత్రునవృత్తాంతంబును, యయాతి పూరు దుష్యంత భరత రంతిదేవ పాంచాల బృహద్రథ శంతను భీష్మ పాండవ కౌరవముఖ్యులజన్మంబును, ఋశ్యశృంగవ్రతభంగంబును, ద్రుహ్యానుతుర్వసులవంశంబును, యదు కార్తవీర్య శశిబిందు జామఘ ప్రముఖ్యాదులచరిత్రంబును, శ్రీకృష్ణావతారకథాసూచకంబును ననుకథలుగల నవమస్కంధము సంపూర్ణము.

శ్రీ రుక్మిణీ సత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణార్పణమస్తు.







శ్రీ

రుక్మిణీసత్యభామాసమేతగోపాలకృష్ణపరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్రమహాభాగవతము* దశమస్కంధప్రారంభము.

## పూర్వభాగము.

శ్రీకంఠచాపఖండన। పాకారిప్రముఖవినుతభండనవిలసత్। కాకుత్స్థవంశమండన। రాకేందుయశోవిశాలరామనృపాలా.

(వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగిం గనుంగొని* (క॥ తెలిపితివి సోమసూర్యుల। కులవిస్తారంబు వారికులముధరిత్రీ। శులనడవళ్లును బెంపు మిఁకలరూపము లెల్ల నాకుఁగడువెఱఁగులుగన్* (క॥ శీలము గల యదుకులమున। నేలావు పుట్టెను మహాత్ముఁడీశుఁడు విష్ణుం। డేలీలమెలఁగెనెయ్యె। వేళల నేమేమిచేసె వివరింపు తగన్* (క॥ భవములకు మందుచిత్త। శ్రవణానందమును ముముక్షుజనపదము హరిస్తవము పశుఘ్నుఁడు దక్కను। జెవులకుఁ దనివయ్యెనెడ చెనఁటియుఁగలఁడే* (క॥ మాపెద్దలు మును వేల్పుల। నోపని భీష్మాదికురుకులోత్తమ సేనా। కూపారము నేకోలము। ప్రాపునలంఘించిరొక్కబాలపదము గాన్* (క॥ మాయమ్మ కుక్షి సుతుసుత। సాయకపీడితుఁడనై నశనన్నుంగాం। తేయకురుకులము మొదలుగ। నేయుత్తముఁడాత్తచక్రుఁడై రక్షించెన్* (గీ॥ కలసిపురుషమూర్తిఁ గాలరూపములను। లోకజనుల వెలిని లోనునుండి। జన్మమృత్యువులను సంసారముక్తుల। నిచ్చునతని చరితమెల్లఁ జెపుమ* (సీ॥ ఊహించి రాముఁడు రోహిణికొడుకంచు నప్పుడ యోగీంద్ర చెప్పితీవు। దేవకికడుపున నే వెఱవున నాతఁడుండెను దేహంబునొండు లేక। తనతండ్రియిలువాసి వనజాక్షుఁడేరీతి నందుకుఁబోయె నేమందిరమున। నుండె నెయ్యది సేయుచుండెను దన మేనమామఁ గంసుని నేలవానివడఁచె। నెన్నియేండ్లు మనియె నిలమీఁద మనుజుఁడై। యెందఱైరి భార్యలెట్లు మెలఁగె। మఱియు నేమి చేసె మాధవుసంచార। మెంత గలదు నాకు నేర్పరింపు॥ అని మఱియు నిట్లనియె* (గీ॥ నీముఖాంబుజాతనిర్ముక్తహరికథా। మృతముఁ ద్రావఁద్రావ మేను వొదలె। వంతమాని నీరువట్టునాఁకలియును। దూరమయ్యె నను దొంగలించె॥ అనిపలుకుచున్నరాజుమాటలు విని వైయ్యాసియిట్లనియె* (క॥ విష్ణుకథారతుడగు నరు। విష్ణుకథ లెస్స ప్వనగు నివినుచుండు నరుల్। విష్ణుకథాసంప్రశ్నము। విష్ణుపదీజలము భంగి విమలులఁ జేయున్* (సీ॥ రాజేంద్ర వినుతొల్లి రాజలాంఛనముల వేలసంఖ్యలదైత్యవిభులుదన్నునాక్రమించిన భారమాఁగఁజాలక భూమి గోరూపమై బ్రహ్మఁజేరఁబోయి। కన్నీరు మున్నీరుగా రోదనము సేయఁ గరుణతో భావించి కమలభవుఁడు। ధరణి నూరడఁబలికి ధాత్రియు వేల్పులుగదలి రా విష్ణుని గాననేగి। పురుషసూక్తంబుజదివి యద్భుత సమాధి। నుండ నొకమాట విని వారిజోద్భవుండు। వినుఁడు వేల్పు ధరయునే విన్నయట్టి। పలుకు వివరింతు నన ప్రీతిఁ బలికెఁ దెలియ* (క॥ యాదవకులమున నసురులు। మేదిని పైఁ బుట్టఁజనుడు మీయంశములన్। శ్రీదయితుఁడు వసుదేవుని। కాదరమునఁ బుట్టి భారశాంతియుఁ జాపున్* (క॥ హరిపూజార్థము పుట్టుడు। సురకన్యలు భూమియందు సుందరతనులై। హరికగ్రజుఁడై శేషుఁడు। హరికళతోఁ బుట్టుఁదప్పి ప్రియారంభుండై* (గీ॥ ఈప్రపంచమెల్ల నేమాయ చే మోహి। తాత్మయగుచునుండు నట్టి మాయ। కమలనాభునాజ్ఞఁగార్యార్థమై సజాం। శంబుతోడఁ బుట్టుఁ జగతియందు* (వ॥ అని యిట్లు వేల్పులనియ్యకొలిపి పుడమి ముద్దియ నొడంబఱిచి తమ్మిచూలి తన మొదలినెలవునకుం జనియె నంత యదువిభుండైన శూరసేనుండను వాఁడు మథురాపురంబు తనకు రాజధానిగా మాథురంబులు శూరసేనంబులనియెడు దేశంబులేలెం బూర్వకాలంబున* (క॥ పమథురయందు ప్రభియమున। శ్రీమన్నారాయణుండు చెలఁగును నిత్యం। బా మథుర సకల యాదవ। భూమీశుల కేల మొదలి పురియయ్యె నృపా* (సీ॥ ఆ శూరసేనుని కాత్మజుండగు వసుదేవుఁడా పురి నొక్క దినమునందు। దేవకిఁ బెండ్లియై దేవకియును దానుగదు నేడ్కరథ మెక్కి కదలు వేళ। నుగ్రసేనుని సుతుండుల్లాసి కంసుండు చెల్లెలు మఱఁది యనుమల్లసిల్ల। హయములపగ్గము లఁజే

---

శ్రీకంఠచాపఖండన॥ శ్రీకంఠ-గరళకంఠుడయిన శివునియొక్క, చాప-విల్లును, ఖండన-విఱిచినవాఁడా, పాకారిప్రముఖ-ఇంద్రుఁడు మొదలగు దేవతలచేత, వినుత-కొనియాడదగిన, భండన-యుద్ధముగలవాఁడా, విల...డన॥ విలసత్ - మిక్కిలి ప్రకాశించుచున్న, కాకుత్స్థవంశ-సూర్యవంశమునకు, మండన-భూషణమువంటివాఁడా, రాకేం...విశాల॥ రాకేందు-పూర్ణచంద్రునివంటి, యశోవిశాల - అమితమగు కీర్తిగలవాఁడా, రామనృపాలా-రాముఁడనురాజా—శీలముగల - యయాతి శాపముగలిగిన, భవము- జన్మము। పాపము, సేనాకూపారమున్-సైన్యమను సముద్రమును, ఏకోలము-ఏ తెప్పయొక్క, వంత-దుఃఖము, నీరువట్టు-దప్పి, దొంగలించెన్ - ప్రకాశించెను। నిర్మలమయ్యెను, వైయాసి-వ్యాసపుత్రుఁడయిన శుకుఁడు, విష్ణుపదీ-గంగ, ఇయ్యకొలిపి-సమాధానపఱచి, పుడమిముద్దియన్ - భూదేవిని, తమ్మిచూలి-బ్రహ్మ, నెలవు-స్థానము, రాజధాని-ముఖ్యపట్టణము,

నందిరొప్పఁదొడంగె ముందఱ భేరులు మురజములును । శంఖపటహములును జడిగొని మ్రోయంగ । గూఁతుతోన వేడ్క
నలుసాగ । దేవకుండు సుతకు దేవకీదేవికి నరణమీఁదలంచి యాదరించి* (వ॥ సార్థంబులయిన రథంబుల వేయు నెనమన్నూ
టిని కనకదామసముత్తుంగంబులయిన మాతంగంబుల నన్నూటిని బది వేల తురంగంబులను విలాసవతులయిన దాసీజనంబుల
నిన్నూటి నిచ్చి యనిచెను। గదలి వరవధూయుగళంబు తెరువునం జను సమయంబున* (క॥ పగ్గములు వదలి వేగిరఁ। బగ్గలముగ రథ
ముగడపు నాకంసుఁడు లో। బెగ్గిలి మొగ్గని తలఁపఁగ। దిగ్గన నశరీరవాణి దివి నిట్లనియెన్* (క॥ దుష్టయగు భగినిని మెచ్చఁగ। నిష్టుఁ
డవై రథము గడపెదెలుఁగవు మీఁదన్। శిష్టయగు నీ తలోదరి। యష్టమగర్భంబు నిన్ను హరియించుఁ జుమీ* (వ॥ అని యిట్లాకాశ
వాణి పలికిన నులికిపడి భోజకులపాంసనుండైన కంసుండు సంచలదంపుండై యడిదంబు బెడిదంబుగఁ బెఱికి ఝళిపించి చెప్ప
రంబున ననుజ కొప్పుఁబట్టి కప్పరపాటున నొప్పఱ దిగిచి యొడిసిపట్టి తోఁబుట్టువని తలంపక తెంపుఁ జేసి తెగ వ్రేయ గమకించు స
మయంబున వసుదేవుండు డగ్గఱి* (క॥ ఆపాపచిత్తు నత్తుం। గోపాగ్నిశిఖానువృత్తుఁ గొనకొని తన స। ల్లాపామృతధారాసం। తర్
పణమునఁ గొంత శాంతుఁ జేయుచుఁ బలికెన్* (ఉ॥ అన్నవు నీవు చెల్లెలికి నక్కట మాడలు చీరలిచ్చుటో। మన్ననసేయుటో మ
ధురమంజులభాషల నాదరించుటో । మిన్నుల మ్రోఁత లే నిజము మేలని చంపకుమన్న మానిరా । వన్న సహింపుమన్న తగదన్న
వధింపకుమన్న వేఁడెదన్॥ అదియునుంగాక* (మ॥ చెలియల్ కన్నియ ముగ్ధరాల బలనీ సేమంబె చింతించు ని। ర్మలదీనాన్వయులా
డుమాటలకునై మర్యాదఁ బోఁబెట్టిన । కులజాతుండవు పుణ్యమూర్తివకటా కోపంబు పాపంబునె । చ్చెలి నో హో హా తెగ
గ వ్రేయ జాడియగునే। చింతించు భోజేశ్వరా* (సీ॥ మేనితోడనఁ బుట్టు మృత్యువు జనులకు నెల్లి నేఁడైన నూఱేండ్లకైనఁ। దె
ల్లంబు మృత్యువు దేహంబు పంచతనొందఁగర్మానుగుణుఁడై శరీరి । మాఱు దేహము జొచ్చి మఱితొంటి దేహంబుఁ బాయును దన
పూర్వభాగ మెత్తి। వేఱొంటి పైఁబెట్టి వెనుకభాగం బెత్తగు క్రిమితృణజలూకయును బోలె । వెంటవచ్చు గనవిసరంబు
మును మేలు కన్న వేళ సరుఁడు గన్న విన్న । తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ । బాలితోడఁ గానఁబడిన యట్లు* (క॥ తన
తొంటి కర్మరాశికి । ననుచరమై బహువికారమైన మనము వడిం। జను నింద్రియముల తెరువులఁ। దనువులు పెక్కైనఁ జెడవు తనక
ర్మంబుల్* (గీ॥ జలఘటాదులందుఁ జంద్రసూర్యాదులు । గానఁబడుచుఁ గాలిఁ గదలుభంగి। నాత్మకర్మనిర్మితాంగంబులను
బ్రాణి గదలుచుండు రాగకలితుఁడగుచు* (క॥ కర్మములు మేలునిచ్చెడు। కర్మంబులు కీడునిచ్చు కర్తలు దనకున్ । గర్మములు బ్రహ్మ
కైనను। గర్మగుఁడై వగుల దడవగా నేమిటికిన్* (క॥ కావునఁ బరులకు హింసలు। గావింపఁగ వలదు తనకుఁ గల్యాణముగా। భా
వించి పరుల నొంచిఁ । బోవునె తత్ఫలముఁ బిదపఁ బొందక యున్నే* (మత్తకోకిల॥ వావిఁ జెల్లెలు గాని కూఁతురి వంటి దుత్తమ
రాలు సం। భావనీయచరిత్ర భీరువు బాల నూత్నవివాహ సు । శ్రీవిలాసిని దీన కంపితచిత్త నీకిదె క్రమ్ముకేడం । గావవే కరుణా
మయాత్మక కంసమానవవల్లభా* (వ॥ అని మఱియు సామభేదంబులగు పలుకులు పలికిన వినియు వాఁడు వేడిచూపుల రాలు నిప్పు
లుకుప్పలుగొన ననుకంప లేక చంపకగంధిం జంపఁ జూచుట నెఱింగి మొఱంగెడి తెఱంగు విచారించి తనలో నిట్లనియె*
(క॥ ఎందును కాలము నిజమని । పందతనంబున నబుద్ధిఁ బాయక ఘనుఁడై । యెందాఁకఁ బుద్ధి నెగడెడి । నందాకఁ జరింపవలయు
నాత్మబలమునన్॥ అని నిశ్చయించి* (సీ॥ ఆపన్నురాలైన యంగనఁ గక్షింప సుతుల నిచ్చెదనంట శుభము నేఁడు। మీఁదెవ్వఁడెఱుఁ
గును మెలఁత ప్రాణము తోడనిలిచిన మఱునాఁడు నేరరాదె । సుతులు పుట్టిరయేని సుతులకు మృత్యువు వాలాయమై వెంటవచ్చె
నేని। బ్రహ్మచేత నువీఁడు పాటేమియును లేక యుండునే సదుపాయ మొకటి లేదె । పొంతమ్రాఁకుల గాల్పఁ బోయి వహ్ని యొ
గసి దవ్వుల వాని దహించు భంగిఁ। గర్మవశమున భవసృతి కారణంబు। దూరగతిఁ బొందు సిది యేల తొట్రుపడఁగ* (క॥ కొడుకు
లని చ్చెదనని సతి। విడిపించుట నీతి వీఁడు విడిచిన మీఁద। న్గొడుకులు పుట్టిన కార్యము। పడఁబడదే నాటికొక్క దైవము లేదే* (క॥ ఎఱమి
దవచూలు వీనిఁ జంపు మటంచు మింటదోరపు పలుకుల్। విని బెడియ నేల తప్పను । వనితను విడిపించుటొప్పు వైళంబనుచున్*
(క॥ తిన్ననిపలుకులు పలుకుచుఁ। గ్రన్ననఁ దగఁ బూజఁ జేసి కంసు నృశంసున్। మన్నించి చిత్తమెఱియఁ బ్రసన్నాననుఁడగుచుఁ బ
లికె శౌరి నయమునన్* (క॥ లలనకుఁ బుట్టెడి కొడుకుల। వలనం దెగెదనుచు గగనవాణిఁ బలికె నం। చలిగెద వేని మృగాక్షికిఁ గల
కొడుకులఁ జంపనిత్తు గ్రమమున నీకున్* (వ॥ అని యిట్లు పలికిన విని కంసుండు కంపితాపతంసుండై సంతసించి గుణగ్రాహిత్వం
బుఁ గైకొని కొందలసం చెలియలి మందల విడిచి చనియె- వసుదేవుండును బ్రతుకు సందలగంటి ననుచు సుందరియుం దాను
నుమందిరంబునకుం బోయి డెందంబున నానందంబు నొందియుండె నంతఁ గొంత కాలంబు చనిన సమయంబున* (క॥ ఎడపక కం
సుని యెగ్గులఁ। బడి దేవకి నిఖిలదేవభావము దనకేఁ। గ్పడ నేటనొకని లెక్కను । గొడుకుల నెనమండ్ర నొక్క కూఁతుం గనియెన్॥
అంత* (గీ॥ సుదతి ముమ్మున్న గన్న సుతుఁ గీర్తిమంతుని। బుట్టుదడవు కంస భూవరునకుఁ । దెచ్చి యిచ్చెఁ జాల ధృతిగల్గి వసుదేవుఁ।
డాసపడక సత్యమంద నిలిచి* (క॥ పలికిన పలుకులు దిరుగక। సొలయక వంచనము లేక సుతుల రిపునకుం। గలఁగక యిచ్చిన ధీరుం। డిల

వసుదేవుఁ డుదక్రసితకులుగలరే* (గీ॥ మానవేంద్ర సత్యమతికి దుష్కర మెయ్యి। దెలుఁగ నేర్చువానికిష్ట మెయ్యి। దీశభక్తిర
తునకీఁ గాని దెయ్యది। మొఱుఁగ లేనివాని కేదికీడు ॥ ఇట్లు సత్యంబుఁ దప్పక కొడుకు నొప్పించిన వసుదేవు పలుకులు విని నిలుకడకు మె
చ్చి కంసుండిట్లనియె* (గీ॥ కొడుకు నీవు మరలఁ గొనిపొమ్ము వసుదేవ। వెఱపు లేదు నాకు వీనివలన। నష్టమీనికిఁ భవదష్టమపుత్రుండు
మృత్యువట వధింతు మీఁదనతని* (వ॥ అనిన నానకదుందుభి నందనుం గొనిచని యానందంబు నొందక దుష్టభావుండగు బావమ
లుకులు విని యనుమలుకుచుండెనంత* (సీ॥ ఒకనాఁడు నారదుం డొయ్యనఁ గంసునియింటికిఁ జనుదెంచి యేకతమున। బృందలోపల
నున్న నందాదులును వారి భార్యలు పుత్రులు బాంధవులును। దేవకి మొదలగు తెఱవలు వసుదేవుఁడాదిగాఁ గలసర్వయాదవులును
సురలు గాఁ నిజంబు నరులుగారని చెప్పి కంసుండ నీవు రక్కసుఁడవనియు। దేవమయుఁడు చక్రి దేవకీదేవికి। పుత్రుఁడై జనించి
భూతలంబు చెఱుపఁ బుట్టినట్టి చెనఁటిదైత్యుల నెల్లఁ। జంపు ననుచుఁ జెప్పి చనియె దివికి* (క॥ నారదు మాటలు విని బెల్లార్తా
టముఁ బొంది యదువుల సమితులనియు। న్నారాయణకరఖడ్గవిదారితుఁడగు కాలనేమి దానవుఁ డయమదిన్* (మ॥ కలగంబాతి
వ అందిఁ జెల్లెలిను దుగ్రక్రోధుఁడై పట్టి బద్ధులఁ గావించి హరిం దలంచి వెసదోడ్తో వారు గన్నట్టిపు। త్రులఁ జంపెన్ గుసుగ్రసేను
యదుభోజాంధకాధీశుని। నిగళులఁ బెట్టెన్ దువాఁడియేలె జలమారఁ శూరసేనంబులన్* (గీ॥ తల్లిఁ దండ్రి నైనఁ దమ్ముల
నన్నల। సఖులనైన బంధుజనులనైన। రాజ్యకాంక్షఁ జేసి రాజులు చంపుదు। రవనిఁ దఱుచు జీవితార్థులగుచు* (వ॥ మఱియును బా
ణ భౌమ మాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టిక అరిష్ట ద్వివిద పూతనాది సహాయసమేతుండై
కంసుండు కదనంబున మదంబుల డంచిన వదనంబులు వంచికొని సదనంబులు విడిచి యదవలై యదువులు పదవులు వదలి నిష
ధ కురు కోసల విదేహ విదర్భ కేకయ పాంచాల సాల్వ దేశంబులు సొచ్చిరి మచ్చరంబులు విడిచి కొందఱు కంసునిం గొలిచిరం
త* (క॥ తొలుదొడి కంసుఁడు దేవకి। కొడుకుల నార్వుర వధింపఁ గుఱు శేషాఖ్యున్। బొడవగు హరి రుచియానతి। కడుపున నేడవది
యైన గర్భంబయ్యెన్* (వ॥ అయ్యవసరంబున విశ్వరూపుండగు హరి తన్ను నమ్మిన యదువులకు గంసునివలన భయంబు గలుగు
ననియెఱింగి యోగమాయా దేవికిట్లనియె* (సీ॥ గోపికాజనములు గోపాలకులునున్న పసుల మందకుఁ బొమ్ము భద్ర నీవు। వసు
దేవు భార్యలు వరుసఁ గంసుని చేత నాఁకలఁ బడియుండ నందుఁ జొరక। తలఁగి రోహిణి యను తరళాక్షి నందగోకులమందు నున్నది
గుణగణాఢ్య। దేవకి కడుపున దీపించు శేషాఖ్యమైన నా తేజమీవు మరఁ బుచ్చి। నేర్పు మెరసి రోహిణీదేవి కడుపునఁ జొనుపు దేవ
కికి నిసుతుఁడనగుదు నంశభాగయుతుఁడనై యశోదకు నందు। పొలతి కడుపునందుఁ బుట్టెదీవు* (క॥ నానావిధసంపదలకుఁ దా
నకమైన సర్వకామదాయిని వగుని। న్మానవులు భక్తి గొలుతురు। కానుకలును బలులు నిచ్చి కల్యాణమయీ* (వ॥ మఱియు నిన్ను
మానవులు దుర్గ భద్ర కాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణి ఈశాన శారద అంబిక యనుపదు
నాలుగు నామంబులఁ గొనియాడుదు రాయా స్థానంబులయందని యెఱింగించిన సర్వేశ్వరుండగు హరి పొమ్మని యానతిచ్చిన మ
హాప్రసాదంబని యయ్యోగనిద్ర యియ్యకొని మ్రొక్కి చయ్యన నియ్యిలకయ్యెడ వాసి వచ్చి* (గీ॥ దేవకీదేవి కడుపులో దేజరిల్లు
దీప్తగర్భంబు మెల్లన దిగిచి యోగ। నిద్ర రోహిణి కడుపున నిలిపె చనియె। కడుపు దిగెననుచుఁ బౌరులు గలఁగఁబడఁగ ॥ అంత*
(గీ॥ బలము మిక్కుటంగఁ గలుగఁగ బలభద్రుఁడన లోకరమణుఁడగుటఁ జేసి రాముఁడనఁగ। సతికిఁ బుట్టె గర్భ సంకర్షణమున సంకర్షణుం
డనంగ ఘనుఁడు సుతుఁడు ॥ తదనంతరంబ* (క॥ ఆనకదుందుభి మనమున। శ్రీనాథుండంశభాగశిష్టతఁ జొరఁగన్। భానురుచినతఁ
డు వెలిఁగెను। గానఁ గఁబట్టయ్యె భూతగణములకు నృపా* (ఉ॥ ఆవసుదేవుఁ డంతఁ దనయందఖిలాత్మకమూర్తి భూతముల్। బా
వన రేఖయున్ శివసభద్రము నై వెలుఁగొందుచున్న లక్ష్మీవిభు తేజముచ్చుపడఁ జేర్చిన దాల్చె నవీనకాంతితో। దేవకి యొప్పెఁ బూ
ర్వాయగు దిక్సతి చందుని దాల్చు కైవడిన్* (వ॥ అనిన విని తరువాతి వృత్తాంతం బెట్లయ్యెనని రాజడిగిన శుకుండిట్లనియె* (క॥ గురు
తరముగఁ దన కడుపున। సరసిజగర్భాండ భాండచయములుగల యా। హరి దేవకి కడుపున భూ। భరణార్థము వృద్ధిఁబొందె బా
లారుక్క్రియన్ ॥ అంత* (సీ॥ విమతుల మోములు వెలవెలఁబాఱంగ విమలాస్యమోము వెల్వెలక బాఱె। మలయు వైరుల కీర్తి
మాసినల్లనగాఁగ నాతి చూచుకములు నల్లనయ్యె। దుష్టాలయంబుల ధూమరేఖలు వుట్ట లేమయాఱున రోమరేఖ మెఱసె। సరి
మానసముల కాహార వాంఛలు దప్ప వనజాక్షి కాహార వాంఛ దప్పె। శ్రమము సంధిల్లె రిపులకు శ్రమము గదుర। జడత వాటిల్లె శ
త్రులు జడను పడఁగ। మన్నరుచియయ్యెఁ పగతురు మన్ను చొఱఁగ। వెలఁదియుదరంబులో హరి వృద్ధిఁబొంద ॥ మఱియును*
(సీ॥ సలిలమాయాల నాగజఠరాగ్నికుని గానఁ జనిన కైవడి ఘర్మసలిలము ఒప్పె। నొగి దేజమాయింతియుదరడింభకు గొల్వఁగది

విమతులమోములు - శత్రువుల ముఖములు - విమలాస్యమోము - నిర్మలమయిన ముఖముగల దేవకీదేవి యొక్క - వెల్వెలవాఱెన్ - తెలతెలపాఱెను - మలయు - వ్యాపించియున్న - చూచుకములు - చను మొనలు - ధూమరేఖలు - పొగచుక్క మొదలగు ఉత్పాతములు - లేమయాఱునన్ - దేవకీదేవి నూగాఱున - జడత - జడను - మాంద్యము - బలహీనమై మందపడుట - పగతురు - పగవారు

సినక్రియ దేహకాంతి మెఱసెఁ బవనుఁడా కొమ్మ గర్భస్థుని సేవింపనొప్పుతో మిక్కిలియాహ్లాదనారెఁ। కుంభినియాలేపనుతోడిగు సర్పింపఁజొచ్చుభంగి నివంటిచొరవదనలె। గగనమింకు వదనకదుపులో బాలుసే। వలకురూపు మెఱపించిచ్చినట్లుఁ బయలువం టినడుముబహుళ పయ్యెనుబంద। భూతానుయుఁ దనలోన బొంపలసకె॥ తదనంతరంబ* (సీ॥ అతివ కాంచీగుణంబల్లనబిగియంగ కివఘూసుణవ్రజమునదలె। మెల్లనదన్వంగి మెయిదీఁగె మెఱుఁగెక్కె-నుష్టాంగనాతను వృష్టశాలఁడంగె। నాటికల్లనభూషణములుపల్లవలకఁగాఁబరసతీభూషణపజ్జు-లెడలెఁ। కలంటికొయ్యానగర్భంబు దొడ్డుగాఁబరిపంథిదారగర్భములు వగిలెఁ। బొలతి కంతంతనీళ్లాడఁబ్రొద్దులెక గనహితవల్లభలైనవలైననర్పు। ప్రొద్దులన్నియుఁ గనుమునఁ బోవదొడఁగె। నువిదకడుపునను రారియుంటఁజేసి॥ ఇవ్విధంబున* (గీ॥ జ్ఞానఖలుని లోని శారదయును బోలె ఘటములోని దీపకళికవోలె। భాసితయింటనాఁకిఁ బడియుండె దేవకీ। కాంత విశ్వగర్భగర్భయగుచు* (వ॥ అంతనకాంత తొలితిలకంబు నెమ్మొగంబు తెలివియును నేనిమెఱుంగును మెలంగెడిసొబగునుం జూచి వెఱఁగుపడి తలఁచుచు వెఱచుచుఁ గంసుండు తనలోనిట్లనియె* (క॥ కన్నులకుఁ జూడఁబడునై। యున్నది యేలనా గర్భములఁ బుగలఁగఁ గ్రమున న్నెన్నఁడు నిట్లుండదు। వెన్నుఁడు చొరఁ బోలు గర్భవివరములోనన్* (ఉ॥ ఏమితలంచువాఁడ నేనియ్యెడ గార్యము వాఁడునా కడికి। కామినిఁ జూలుపెంపెసఁగె గర్భిణిఁ జెల్లెగినాఁడు పేవనే। నేఁ నిఁచంపువాఁడ డగవేలని చంపితి నేసిశ్రీయును। ద్దామయశంబునాయువును ధర్మమునుం జెడిపోవకుండునే* (క॥ నాపయి మెఱుంగస్ర ముసి। జీవన్మృతుఁడను చు నిందసేయుదు రతఁడు। న్బొవ్వుమునరకమునకు। ర్పాపముతో బ్రతుకుటకాకబ్రతుకే తలఁపన్* (వ॥ అని శ్చయించి క్రౌర్యంబు విడిచి ధైర్యంబునొంది గాంభీర్యంబు వాటించి శౌర్యంబు ప్రకటించి కొనుచు దిగ్గనంజెలియలిం జంపు నగ్గలికయొగ్గని యగ్గడించి మానిమానియుంబోలె మారకుండియు* (గీ॥ పానశయ్యాదొడ్డుపగవుశ్రైనికనెట్టు। లింకసుఖిక చక్రిమెపుడు పుట్టు। పుట్టినపుడె పట్టిపురిటింటిలోఁ జెగఁ। జూతునను చు నెదురుచూచుచుండె* (వ॥ మఱియును వైరానుబంధంబున నన్యానుసంధానంబు వదియగంసు* (క॥ తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు। నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్। హరిఁ దలఁచి తలఁచి జగమా। హరిమయమనిచూచెఁ గంసుఁ డారనియలుకన్। వెండియు* (సీ॥ శ్రవణరంధ్రముల నేశబ్దంబు వినఁబడు నది హరిరవము నియాలకించు। నక్షిమార్గముల నెయ్యది మాడఁబడు నది హరిమూర్తిగా నూపునంచుఁ జూచుఁ। దిరుగుచో దేహంబు తృణమైనసోఁకిన హరికరాఘాతమో యనుచుఁ గలఁగు। గంధంబులేమైన ఘ్రాణంబు సోఁకిన హరిమాలికా గంధమనుచు నదరు। వలుకులెవ్వియైన వలుకుచో హరిపేరు। వలుకఁబడియెననుచు భ్రాంతిఁ బలుకుఁ। దలఁపులెట్టివైననఁ దనలఁచియా తలఁపులు। హరితలంపులనుచు నలుఁగఁ దలఁచు* (వ॥ అయ్యవసరంబున ననుచగ సమేతలైన దేవతలును నారదాదిమునులునుం గూడి నలువయును ముక్కంటియు నక్కడికి వచ్చి దేవకీదేవి గర్భస్థుఁడగు పురుషోత్తముని ట్లని స్తుతియిం

—* బ్రహ్మ మొదలగు దేవతలు దేవకీదేవిగర్భస్థుఁడగు దేవుని స్తుతియించుట. *—

చిరి* (సీ॥ సత్యవ్రతుని నిత్యసంప్రాప్తసాధను కాలత్రయమునందును గలుగువాని। భూతంబులైదును బుట్టుచోటగువాని నైదుభూతంబులందునుండువాని। నైదుభూతంబులు నడఁగిన పిమ్మటఁ బరగువాని సత్యభాషణంబు। సమదర్శనంబును జరిపెడువానిని నిన్నాశ్రయింతుము నీయధీన। మాయచేత నెఱుకమాలిన వారలు। పెక్కుగతుల విన్నఁ బేరుకొందు। రెఱుఁగనేర్చు విబుధులేక చిత్తంబున। నఖిలమూర్తులెల్ల నీవయంద్రు॥ అదియునుంగాక* (సీ॥ ప్రకృతియొక్కటిపాదఫలములు సుఖదుఃఖములు రెండు గుణములు మూఁడు వేళ్లు। దగు రసంబులు నాల్గు ధర్మార్థముఖరంబులెఱిఁగెడి తమ్ములైదింద్రియంబులాఱు స్వభావంబులాశోకమోహాదులూర్ములు ధాతువులొక్కయేడు। పైపొరలెనిమిది ప్రంగలు భూతంబులైదు బుద్ధియుమనోహంకృతులును। రంధ్రములు తొమ్మిదియు గోటరములు ప్రాణ। పత్రదశకంబు జీవేశపక్షియుగము। గలుగు సంసారవృక్షంబు గలుగఁ జేయఁ। గావ నడఁగింపరాజవొక్కరుఁడ నీవ* (క॥ నీదెసఁ దగు చిత్తములిడి। యే దెసలం బోక గడుగు రెఱుకగలుగువార। రాగూడ యదుగుక్రియ నీ। పాదంబను నావ కతన భవసాగరమున్* (గీ॥ మంచివారికెల్ల మంగళప్రదమగుఁ। గిల్లగులకుమేలుగాని యట్టి తనువులెన్నియేని దాల్చి లోకములకు సేమమెల్లప్రొద్దు సేయుదీవు* (క॥ ఎఱిఁగినవారలమనుచును। గొఱమాలిన మెఱుకఁగల అదికొందఱు నీ పై రెఱిఁగియు దలఁపఁగనొల్లరు। వఱుకురథోగతుల జాడబన్మ దళౌఘా* (క॥ నీవారై నీదెపదమ భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై। యే విఘ్నంబులఁ జెందక। నీవరయగ మేటిచోట నెగడుదురీశా* (క॥ నిను నాలుగాశ్రమంబుల। జనములు సేవింపనఖిలజనముల సత్త్వం। బును శుద్ధంబును శ్రేయంబును నగు గాత్రంబు నీవు పొందుదువు హరీ* (సీ॥ నళినాక్ష సత్త్వగుణంబు నీగాత్రంబుగా దేని విజ్ఞానకలితమగుచు। నజ్ఞానభేదకంబగు నెట్లు గుణములయందును వెలుగు నీవమహితంపఁ। బడుదువు సత్త్వరూపంబు సేవింపంగ సాక్షాత్కరింతువు సాక్షివగుచు। వాఙ్మనంబులకునవ్వలవైన మార్గంబుగలుగు నీగుణజన్మకర్మరహిత। మైన రూపునామ భేదనశ్యనఘుబుద్ధి। లెఱుఁగుదురు నిన్నుఁ గొల్వ నూహించుకొనుచు। నినుచు

దలచుచుఁబొగడుచు వెలయువాఁడు । భవమునొందఁడు నీ పాదభక్తుఁడగుచు* (ఉ॥ ధరణీభారమునాసెను। బురుషోత్తము
ఁగాశ నీదుపుట్టువున భవ। చ్చరణాంబుజములప్రాపున। ధరణియు నాకసముఁ గాంచెవమునీకరుణన్*(ఉ॥ పుట్టువు లేని నీక భ
వపుట్టుట క్రీడయెన్నః పుట్టుటే । యెట్టనుమున్న భవాదిసకలెల్లను జీవచునందవిద్యదాఁ । బుట్టుచునుండుఁ గాని నిను బుట్టినదింట
లెంబొంతనుండియుం । జుట్టగ లేని తతిక్రియలఁ జొక్కసి యెక్కటనాడు నీశ్వరా* (మ॥ గురుపాఠీనమవై జలగ్రహమవై
కోలంబవై శ్రీనృకేసరివై భిక్షుఁడవై హయాననుఁడవై త్వ్మాదేవతాభర్తవై । ధరణీనాథుఁడవై । దయాగుణగణోదారుం
డవై లోకముల్ । పరిరక్షించిన నీకు మ్రొక్కెదమిలా భారంబు వారింపవే* (క॥ ముచ్చిరియున్నది లోకము। నిచ్చలుఁ గంసాది
ఖలులు సిద్ధయు లేరన్ । నచ్చిక గావగవలయును। విచ్చేయుము తల్లి కడుపు వెడలి ముకుందా ॥ అని మఱియు దేవకీదేవితో నిట్లనిరి*
(మత్తకోకిల॥ తల్లి నీయుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్నవాఁ। డెల్లి వుట్టెడి గంసుచే భయమింత లేదు నిజంబు మా। కెల్ల
వారికి భద్రమయ్యెడు నింక నీకును పెంపు దుర్ । జల్లగావ లె యాదవావళి సంతసంబును బొందఁగన్*( వ॥ అని యివ్విధంబున హ
రింబొగడి దేవకీదేవి నీదీవించి యావతలీశాన బ్రహ్మల ముందటనిడుకొని చనిరంత* (క॥ పంకజముఖి నీల్లాడగ। సంకటపడ ఖలుల

— శ్రీకృష్ణావతారఘట్టము. —

మానసంబుల నెల్లన్ । సంకటము దోచె మెల్లన సంకటముల లేమి తోచె సత్పురుషులకున్*(సీ॥ స్వచ్ఛంబులై పొంగె జలరాసు
లేడునుగల ఘోషణముల మేఘుంబులురిమె । గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె దిక్కులు మిక్కిలి తెలివిదాల్చె । గమ్మనిచ
ల్లనిగాలి మెల్లన వీచె హోమానలంబు చెన్నొంది వెలిఁగెఁ । గొలఁకులు కమలాళికులములై సిరినొప్పె ప్రవిమలతోయలై
పాఱె నదులు। వరపురగ్రామ ఘోషయై వసుధయొప్పె। పొగరుత పుష్పఫలముల వెలసె వనము। లలరుసోనలు గురిసిరయ్యమ
రవరులు। దేవశపుని దేవకీదేవి గనగ* (క॥ పాడిరి గంధర్వోత్తము। లాడిరి రంభాదికాంతలానందమునన్ । గూడిరి సిద్ధులు భయ
ముల వీడిరి చారణులు మొఱసె వేల్పుల భేరుల్ ॥ అయ్యవసరంబున* (క॥ సుతుఁగనె దేవకి నడురే। యతిశుభగతిఁ దారలును
గ్రహంబులున్నుండన్ । దితిపుత్రనిరాకరిష్ణున్ । శ్రితవదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్* (క॥ వెన్నుని సతి ప్రసన్నునిఁ । గ్రన్ననఁ గని
మెఱుఁగుబోడి కడు నొప్పారెం। బున్నమ నాఁడు కళానిధిఁ। గన్నమహేంద్రాశ చెలువు గలిగిన రేంద్రా॥ అప్పుడు* (సీ॥ జలధ
రదేహు నాజానుచతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షుఁ । జారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ గరితకౌస్తుభమణి కాంతిభా
సుఁ। గనకనీయకటిసూత్ర కంకణకేయూరు శ్రీవత్స లాంఛనాంచితోరు । మురుకుండలప్రభా యుతకుంతలలలాటు వైడూ
ర్యమణిగణవరకిరీటు । బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక । పాలు మగుణాలవాలు కృపావిశాలుఁ । జూచి తిలకించి పు
లకించి చోద్యమంది। యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె* (క॥ స్నానము సేయఁగ రామిని । నానందరసాబ్ధి మగ్నుఁడై
విప్రులకున్ । ధేనువులను బదివేలను । మానసమున ధారవోసె మఱియిచ్చుటకున్ ॥ మఱియు వసుదేవుండు* (క॥ ఈవు
ఱటియింటికున్య । దీపంబును బోలి చాలదీపించెదజం । బీపాపఁడు నలు మొగముల । యాపాపని గనిన మేటియు ఘనని భక్తిన్*
(గీ॥ సాగ మ్రొక్కి లేచి సరగున నొసలిపైఁ । గేలుదమ్మిదోయి గీలుకొలిపి । పాఁపడనక వెఱక పాపని మొదలింటి । పోకలె
ల్లఁ దలఁచి పొగడఁ దొడఁగె* (క॥ ఏ నిన్ను నఖిలవర్మను । జ్ఞానానందస్వరూపు సంతతు నపరా। ధీనుని మాయాదూరుని। నూను
నిగాఁ గంటి నిట్టి చోద్యము గలదె*(క॥ అచ్చుగ నీమాయలమునుఁ। జెచ్చెఱఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగమున్। జొచ్చినక్రియఁ
జొరకుండువు। చొచ్చుటయును లేదు లేదు చొరకుండుటయున్* (సీ॥ అదియు నెల్లన మహదాదుల బోలెడవై వేఱు వేఱయైయు
న్నవిధము। లిసుసూత్మ్మభూతంబుల మరషోడశవికారములతోఁ గూడి విరాట్టనంగఁ। బరమాత్మ్మ నమనీకుఁ బఱపైన మేను సంపాదిం
చి యందులోఁ బడియుఁ బడక। యుండు సృష్టికి మ్రోలున్న కారణమున వానికి లోనిభవంబు గలుగ। దట్టిబుద్ధి యెఱుఁగ నను వైన
లాగున। గలుగు నింద్రియముల సడలనుండి। వానిపట్టు లేక వరుస జగంబులఁ। గలసియుండిరైన గలయవెపుడు* (క॥ సర్వము నీ
లోనిదిగా । సర్వాత్మ్ముఁడవాదివస్తుసంపన్నుఁడవై । సర్వమయుఁడవగు నీకును । సర్వేశ్వర లేవు లోను సంధులు వెలియున్*
(గీ॥ ఆత్మవలన గలిగియపరుదేహాదులు। నాత్మకంటె వేఱులవియటంచుఁ। దలఁచువాఁడు మూఢతముఁడు గావున నీశ। విశ్వమెల్ల
నీవ వేఱు లేదు॥ అదియునుంగాక *(సీ॥ గుణము వికారంబుఁ గోరికయును లేని నీవల్ల జగములు నెఱి జనించుఁ। బ్రబ్బు లేదగు సంచుఁ
బలుకుట తప్పు గాదీశుండవై బ్రహ్మమీవయైన। నినుగొల్చు గుణములు నీయానతులు సేయ భటుల శౌర్యంబులు వటికివచ్చు। వగిది నీ
గుణముల బాగులు నీవనితోచును నీమాయతోడఁ గూడి। నీవు రక్షదవళనీలవర్ణంబుల। జగము సేయ గావ సమయ జూడఁ। దనరు
దట్లు నేఁడవై త్యులఁ దండింపఁ బృథివిఁ గావ నవతరించితీశ* (శా॥ మింటన్మోగిసనమ్రోత తాలిమినిలో మేంద్రింపమున్నీవు నా।
యింటం బుట్టెదవంచు గంసుఁడు దొడ్డిన్ హింసించె నీయన్నలన్ । గంటం గూరుకు దేదు నీయుదయమీ కారాజను ల్సెప్పఁగా। బం
టింపం డెదురేఁగు దెంచునడి నీపై నేడు సన్నద్ధుఁడై *(వ॥ అనుచుండ దేవకీదేవి మహాపురుషలక్షణుండును, విచక్షణుండును, సు

—* దేవకీదేవి స్వామిని స్తుతియించుట. *—

కుమారుండునైన కుమారునింగని కంసునివలని వెఱపునఁ బరిస్మితయై యిట్లనియె* (సీ॥ అట్టిట్టిదనరానిదై మొదలై యెందుకొన్నదై వెలుఁగుచు గుణములేనిదై యొక్కచందంబుదై కలదై నిర్విశేషమై క్రియలేక చెప్పరాని । దీరూపమని శ్రుతు లెప్పుడునాడి వెదకి యారూపమగుచు నధ్యాత్మదీప । మై బ్రహ్మ రెండవ యర్థంబు తుదిజగంబులు నశింపంగ భూతగణము సూక్ష్మభూతసంముఁ జొరఁగ నాభూతంబు ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి వోయి । వ్యక్తమందుఁ జొరఁగ వ్యక్తమడంగును శేషసంజ్ఞ నీవు చెలువమగుదు* (ఉ॥ విశ్వములీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టమవైన నీకు నా । శాశ్వతమైన కాలమది సర్వము వేడబమంచు నెట్టివి । శ్వేశ్వరమేలుకుప్ప నిను నెప్పుడు గోరి భజించువాఁడె పో । శాశ్వతలక్ష్మి మృత్యుజయసౌఖ్యయుతుండభయుండు మాధవా* (మత్తకోకిల॥ ఒంటినిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై । కంటిమంకురు గానినిక్కముగా నరీభవ వాక్కృతిన్ । గంటిభద్రముగంటి మాంసపు కన్నులం గనబోలదీ । తొంటిరూపుఁ దొలంగఁబెట్టుము నోయజేక్షణ ప్రమొక్కెదన్* (గీ॥ విలయకాలమందు విశ్వంబు నీపెద్ద । కడుపులోన వాఁచు కడిమిమేటి । నటుడవీవు నేడు నాగర్భజుఁడవౌట । పరమపురుష వేడబంబుగాదె* (తరళ॥ నలినలోచన నీవు నక్కము నాకుఁ బుట్టెదవంచు నీ । ఖలుఁడు కంసుఁడు పెద్దగాలము కారయింటన డంచెనే । నాకలినచిత్తుని నాజ్ఞసేయుము మమ్ము గావుము భీతుల । న్నలుసులేక ఫలించె నోచిన నోములెల్లను నీవయై* (వ॥ అనియిట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుండిట్లనియె నవ్వా నీవు తొల్లి స్వాయంభువమన్వంతరంబునఁ బృశ్నియను పరమపతివ్రతవు వసుదేవుండు సుతపుండను ప్రజాపతి మీరిరువురు సృష్టికాలంబున బ్రహ్మ పంపునం బెంపున నింద్రియంబుల జయించి తెంపున వానగాలి యెండ మంచులకు సైరించి యేకలంబులై యాకలంబులుదిని యేకలంకంబును లేక వేంద్రఁబునఁ బంద్రెండువేల దివ్యవర్షంబులు తపంబుల నేపంబుల మీరూపంబులు మెఱయ యోజనాజపంబులుసేసి డాసి పేర్చి యర్చింప మీకు నాకుంగలరూపు జూపి యేను తిరంబులగు వరంబులు వేడుమనిన మీరు నామాయం బాయని మోహంబున బిడ్డలులేని దొడ్డయడ్డంబున మర్గమంబగు నపవర్గంబుఁ గోరక నాయీడు కొడుకునడిగిన మెచ్చి యట్లవరంబిచ్చి మీకేను బృశ్నిగర్భుండను నస్ఫకుండనైతి మఱియును* (క॥ అదితియుఁ గశ్యపుఁడనఁగా । విదితులగు మీకుఁ గురుచవేషంబున నే । నుదయించితి నామముఁడనఁ ద్రిదశేంద్రానుజుఁడనై ద్వితీయభవమునన్* (క॥ ఇప్పుడు మూఁడవ బామునఁ । దప్పక మీకిరువురకును । దనయుఁడనైతిన్ జెప్పితిఁ బూర్వము మీయం । దెప్పటికిని లేదు జన్మమిటపై నాకున్* (క॥ నందనుఁడని యెంబుమా । నందంబగు బ్రహ్మగుని యయనముఁ దలఁచుచు నా । పెందెరువు నొందెదరు నా । యందుల ప్రేమమున భవము నందరు మీరల్* (వ॥ అని యిట్లు పలికి యీశ్వరుండారూపంబు విడిచి* (క॥ తెప్పలిడక తలిదండ్రులు । తప్పక దనుఁజూడ మాయఁ దనరిలలితుఁడై । యప్పుడటు గన్న పాపని । యొప్పున వేడుకలుసేసె నొకకొన్ని నృపా* (వ॥ అంత వసుదేవుండు దనకుం జేయవలసిన పనులీశ్వరుండైన హరివలన నెఱింగిన వాఁడు గావున* (క॥ ఈపు జెఱియిల్లు వెలువడి । పాపని దరలించుకొనుచుం బరచెదననుచున్ । రూపించి యంపు భాతృకు । బాపయగుచు యోగమాయ ప్రభవించె నృపా ॥ అయ్యవసరంబున* (క॥ బిడ్డఁగరములఁ జొమ్మున । నడ్డంబుగఁ బట్టిపదములల్లన నిడుచున్ । జడ్డనగావలివారల । యొడ్డుగడచి పుఱఁటిసాలయొయ్యన వెడలెన్ ॥ అంతనట* (క॥ నందుని సతికి యశోదకు । బొందుగ హరి యోగమాయ పుట్టిన మాయా । స్పందమున నొక్క యెఱుఁగక । క్రిందుకొని మెనూరి వారిగావలివారిన్* (వ॥ అప్పుడు చప్పుడు గాకుండఁదప్పటడుగులిడ చుట్టుపగ్గోలుసుల మెలుసులు పీడినఁ దాలంబులును స్వాహాత్తాలుండై నబిడ్డకి నడ్డంబుగాక కీలూడి వీడిపడి యరళంబులు విరళంబులైన సరళంబులగు మొగసాలలంగడచి పాపతేఁడు వాకిండ్లు మరల మూయుచుఁ బడగలెడగలుగ విప్పి యేఁదికాఁదికొని వెంటనంటి రాఁగఁగడంగి నడుచు నెడ* (క॥ ఆశౌరికిఁ దెరువొసఁగె బ్ర । కాశోద్ధతతుంగభంగకలితథరాశా । కాశయగు యమునమును సీ । తేజునకుఁ బయోధి త్రోవయిచ్చిన భంగిన్* (వ॥ ఇట్లు యమున దాఁటి దూఁటి చనినం గనిమం గంజేరి యందమందనిద్రం బొంది యొడల్లెఱుంగక గొల్లలం దెలుపనొల్లక నిత్యప్రసాదయగు యశోదశయ్యనొయ్యన చిన్నినల్లనయ్యానుపడి చయ్యనయ్యవ్వకూతు నెత్తుకొని మఱలనింటికిం బంటింపక వచ్చియిచ్చి యుత పాపను దేవకీదేవి ప్రక్కంజక్క నిడి* (క॥ పదములసంకెలలిడుకొని । మదిఁదలఁకుచు శూరసుతుడు మందుడువోలెన్ । బెదరుగలరీతి దేహముఁ । గదలించుచు నొదిగియుండెఁ గఱువతనమునన్* (క॥ వనజాక్షుని దెచ్చుటయును । దనసుతఁ గొనిపోవుటయును దానెఱుఁగక మూఁ । గిననిద్రఁ జొక్కియుండెను । వనజాక్షి యశోద రేయి వసుధాధీశా* (సీ॥ అంత బాలిక యూవురని యేడ్చు దిలుచప్పుడాలించి వేగన నాకయింటి । కావలివారు మేల్కని చూచి తలుపుల తాళముల్తొంటి విధమున నుండఁ । దెలిసి చక్కనవచ్చి దేవకి నీళ్లాడె రమ్మురమ్మని భోజరాజుతోడఁ । జెప్పిన నాతఁడు చిడిముడిపాటుతోఁ దల్పంబుపై లేచి తత్తరమున । వెంట్రుకలు వీడ పైచీర ప్రేలియాడఁ । దాల్మి కీలూడ రోషాగ్ని దర్పమాడ । భూరి వైరంబుతోఁ గూడఁ బుఱఁటియింటి । జాడఁ జనుదెంచి యాపాపఁ జంపఁగదియ ॥ అంత దేవకీదేవి యడ్డంబు వచ్చి

యిట్లనియె* (ఉ॥ అన్నశమింపుమన్న తగదల్లుడు గాడిది మేనగోడలా । మన్ననసేయుమన్న వినుమా నిను జంపుట రాచపాడి
గా । దన్నసుకీర్తివై మనగదన్న మహాత్ములు వోవుత్రోవఁబో । వన్నభవత్సహోదరిఁ గనన్న నిరూఢశరణంబు వేడెదన్*
(క॥ కట్టా యల్లుడు కొడుకులఁ । బట్టి వధించితివి యాడుపడుచిది కోడల్ । నెట్టనఁ జంపఁగవలెనే । కట్టడి విడనాన్న యన్న కరుణిం
పఁగదే* (క॥ పుత్రుఁడు నీ బ్రతుకునకును । శత్రుండని వింటి గాన సమయింపనగున్ । పుత్రులకు నోమనైతిని । పుత్రీదానంబు సేసి పు
ణ్యముఁ గనవే* (వ॥ అని పయ్యెదఁ జక్కఁ సవరించుకొనుచుఁ బలవరించుచు భ్రాంతిపడి మూఁతుం గ్రక్కున నన్నరు సంజక్కఁ హ
త్తుకొని చెక్కుఁ జెక్కున మోపి చక్కఁను త్తరీయాంచలంబున సంచలతం గప్పి చప్పుడుగాఁ గుయ్యిడ నయ్యోయనఁ గ్రయ్యఁ బట్టి
వాఁడు పోడిమి సెడఁ దోబుట్టువుం దిట్టి చిట్టిపట్టియా వురనివాపోవఁ గావరంబున నడుగులాడిసి త్రిప్పి వడిం బెడిసిపడంబుస మిష
యింబడ వ్రేసిన నబ్బాలయు నేలంబడక నవలీల నెగసి నవ్యదివ్యమాలికాగంధబంధుర మణిహారాంబరాద్యలంకారను మొహా
రిణియు, గదాశరశంఖచక్రచర్మచాపాసిశూలంబులెనిమిది కరంబులం గరం బొప్పఁ గొప్పుచు సిద్ధచారణకిన్నరగరుడగంధర్వా
దివైమానికులు కానుకలిచ్చి పొగడ నెగడుచుఁ నచ్చరలయాటపాటలకు మెచ్చుచు, మింటనుండి కంటంబడి కంటువడ కంసునకిట్ల
నియె* (ఉ॥ తెంపరివై హరింబోరిని దేవకిబిడ్డలఁ జిన్నకుఱ్ఱలన్ । జంపితివింక నైననుపశాంతివహింపక జాలిమీఁదనో । ప్పం బతివి
స్ఫోరయిదయిబీరసె నా సరసన్నఁ గించిన । జ్జంపెడివీరుఁ డొక్కఁడెదెస తర్పృతిపొందెడివాఁడు దుర్మతీ॥ అనిపలికి* (క॥ వహనీ
యగుణాస్పదమై । మహిలో నాదేపజనము మానన్నింపంగా । బహునామనివాసంబుల । బహు నామములం జరించె శ్రామ్మికమై*
(వ॥ అంత నా బోటి పలికిన పలుకులు ములుకులై చెవులం జిలికిన నులికిపడి ఝుళుఝుగ దిరిన మనంబున ఘనంబుగ వెఱఁగందిక్రం
దకుం దెడు దేవకీవసుదేవుల రావించి యాదరంబునఁ గారంబు విడిచి చేరి వారితో నిట్లనియె* (ఉ॥ పాపుఁడ బాలఘాతుకుఁడ బంధువిర
క్తుఁడ దుష్టచిత్తుఁడన్ । గోపనుఁడన్ జరన్మృత్యుఁడ క్రూరుఁడ బ్రాహ్మణహంతభంగిమీ । పాపలఁ జంపితిన్ బయలిపలుకు నమ్మితి
సాధులార నా । పాపములుగ్గడింపక కృపాపరులైకనరేశమింపరే* (ఉ॥ ఒక్కెడఁ బ్రాణులందఱుని జోచితకర్మములోలిఁ ద్రె
ప్పఁగా । నొక్కొకచో మేనులం బొడమి యొక్కొక త్రోవల రాకపోకలం । జిక్కులఁ బొందుచుండుదురు చేరరు సంస్మృతితోడఁ బా
యలే । రెక్కడి హంతయీశిశువు లెక్కడి హంతలు మూరనేటికిన్* (క॥ పగతురఁ జెడఁజేచితినన యనుఁ బగతురఁ జేఁ జెడితినని యభి
మానుఁడు దలఁచున్ । బగ చెలిములు లేవాత్మకుఁ బగ చెలిమి లకీలుక మన బంధము సుండీ* (వ॥ అని పలికి కన్నీరు నించి వగచి వెఱ
చుచు దేవకీవసుదేవుల పాదంబులు బట్టుకొని సంకెలలు విప్పించి మిక్కిలి యక్కఱ గల వాక్యంబులనైక్యంబులు నెఱపిన వారును
బరతపుం బైనకంసునిం జూచి కోపంబును బాసి రంత నా వసుదేవుండు వావకిట్లనియె* (శా॥ బావా నీవచనంబు నిక్కము సుమీ
ప్రాణుల్గతిజ్ఞానులై । నీ వెనంచును లోభమోహమదభీనిర్మిత్రతా మోదశో । కావేశంబుల నొందొయుంబొందుదు రేకాకారుడై
సర్వరూ । వాపిట్టుండగు నీశ్వరుం దెలియ లేరన్యోన్యవిభ్రాంతులై *(వ॥ అని యిట్లు ప్రసన్నులైన దేవకీవసుదేవులయనుజ్ఞ వడ
సి కంసుడింటికింజని యారేయి గడపి మరునాడు గ్రద్దన బ్రొద్దున దనకుఁ బరతంత్రులగు మంత్రుల రావించి యోగనిద్రవల
నం దా విన్నవృత్తాంతం బంతయు మంతనంబున నెఱింగించిన నపుడు వారలతని కిట్లనిరి* (క॥ ఇట్టియెనఁ దడయ నేటికిఁ । బట్టణముల
మందలం దుఁ బల్లెల నెల్లన్ । బుట్టెడి పెరిగెడి శిశువులఁ । బట్టి వధించెదము నమ్ము బనుపు మధీశా* (మ॥ భవదీయోజ్జ్వలబాహు
చాపవిలసద్బాణాపలీభస్మలై । దివిజాధీశ్వరులే క్రియం జనిరొ యేదేశంబులం డాగిరో । శివునిం జొచ్చిరొ బ్రహ్మజెందిరొ హ
రిన్ సేవించిరో యీనివ్రు । త్తిం నాంతం బులనిల్చిరో మనకు శోకింపం దగునె వల్లభా* (క॥ నొచ్చిరి శాత్రవులనుచును । విచ్చలవిడి
దిగవలదు వితాకృతులన్ । ముచ్చిలి వత్తురు వారలు । సచ్చినయందాక మనవజనదధిపుఁడ కుఱా* (క॥ ఎత్తికొను చురాని
జన । డెత్తిఁ రోగములరివులనింద్రియములను । తృత్తినమయములఁ జెఱుపక । మెత్తన గారాదు రాన మీఁదటయింపన్*
(మ॥ అమరశ్రేణికి నెల్ల చక్రిముఖరుండా చక్రిధర్మంబునం । దమరుల్లోవులు భూమి దేవతలు దీక్షామ్నాయ కారుణ్య సత్యము
లున్ యాగతపోదమంబులును శ్రద్ధాశ్రాంతులున్ విష్ణుదే । హములిన్నింటిని సంహరించిన నతండంతంబునుం బొందెడిన్ । కా
వున* (ఉ॥ చంపుదుమే నిలింపులను జంకెలజంకెల దాపసావలిం । బంపుదుమే కృతాంతకుని పాలికి గ్రేపులతోడ గోవు
లన్ । ద్రుంపుదుమే ధరామరులఁ దోలుదుమే నిగమంబులన్నిటిం । రింపుదుమే వసుంధర హరింపుదుమే జనబాధ సంపుమా*
(వ॥ అని పలుకు మంత్రుల మంత్రంబులని మంత్రితుండై బ్రాహ్మణ రోధంబున సేయ బనితలంపక కాలపాశబద్ధుండై విప్రాదిసా
ధుమానవులం జంపఁ దానవులం బంపి యంతిపురంబునకుం జనియె నంతర ంబయ్యార క్కసులు వెక్కసంబుగు మొక్కలంబుల స
జ్జనులపజ్జలం బడి తగ్గసగ్గ సభర్జనాదిమర్దనత్వం బులసిగ్గింది పాపంబులాగ్గించిరి*॥ గీ॥ వెదకి వెదకి దైత్యవిభులు సాధుల నడపవా
రిబలము లడగిపోయె యశము శ్రీయు ధర్మమాయువు భద్రంబు । నార్యహింపసేయనడఁగుఁగాదె* (వ॥ అంత మందలోన
దుండు నందనుండు పుట్టుట యెఱింగి మహానందంబున నెఱవాడులగు వేదపఠులం బిలుపించి జలకంబులాడి శుచియై శృంగారించు

కొనిస్వస్తిపుణ్యాహవాచనంబులు చదివించి జాతకర్మంబులు సేయించి పితృదేవతలనర్చించి క్రేపులతోడం గూడఁగఁ జేసిన పాడిమొదవుల రెండులక్షలను గనకకలశమణివసనవిశాలంబులైన తిలశైలంబులు లేడింటి నిభూదేవతల కిచ్చిన* (క॥ ఈయాభీరకుమారుఁడు। శ్రీయుతుఁడై వీరవైరి జేతయునై దీ।ర్ఘాయుష్మంతుండగునని పాయక దీవించిరపుడు బ్రాహ్మణజనముల్ * (క॥ దుందుభులు మొఱసెఁగాయక।సందోహము వాడెసూతసముదాయముతో। వందిజనులు గీర్తించిరి। క్రందుగ వీతెంచె భద్రకాహాళరవముల్ * (క॥ పల్లవతోరణపుష్పచిర।వల్లీధ్వజరాజిధూపవాసనములతో। సల్లలితములై యొప్పెను।పల్లెవపల్లెభులయిండ్లవాకిండ్లెల్లన్ * (క॥ పసుపులునూనెలునలఁదిన।బసదనరిపువర్ణబర్హిబర్హప్రభతోఁ।బసిమిగలిగి వెలుఁగొందుచుఁ। బసులన్నియునలంకఁబ్రభఁజెన్నుపా* (క॥ క్రేళ్లుఱికి మసలె లేఁగలు। సల్లడఁగోడెలం కెలిడియె మదవృషభంబుల్। పెల్లుగ మొదవులహాళులుఁజల్లించె చెంబాలు బాలునంభవవేళన్* (క॥ ఆగఁజదివెడిపాగడెడి। వారికి విద్యలను బ్రసుకువారికిలేమిం। జేరినవారికి నెల్లను గోరికమనునంమడిచ్చె గోధనచయముల్ ॥ ఆసమయంబున* (క॥ కంచుకములు తలచుట్టలు। కాంచనభూషాంబరములుగడు మెఱయఁగ నేఁ। తెంచిరి గోపకులందఱు। మంచిపదార్థములు గొనుచు మాధవుఁ జూడన్* (క॥ ఏతెంచి చూచి చెలఁగుచు। నేతులఁ బెరుగులను బాలనీళ్లను వెన్నన్। ప్రీతి వసంతములాడిరి యాతురులై సరసభావలాసుచు గొల్లల్ ॥ తదనంతరంబ* (గీ॥ ఏమి నోముఫలమొ యింత ప్రొద్దొక వార్త। వింటిమబలలార వీనులలర। మనయశోద చిన్నిమగవానిఁ గనెనట। చూచివత్త మమ్మ సుదతులార* (వ॥ అనియొండొరుల లేపి గోపికలోపికలు లేక చిత్తంబుల నే త్త్రినతత్తరంబులొత్తుకొన నుదారంబులగు శృంగారంబుల నిండ్లు వెలువడి* (క॥ జడగతులును బలుపిఱుదులుఁ। బిడికెడునడుములును వలుదబిగిచనుగవలు। న్వేడదనయనములు సిరితడ।బడ నోములు భమగదికు సభరములు నరగన్* (ఉ॥ వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరిహార రేఖలల్లాడఁగఁ బోలపాలికలహాటకపత్రరుచుల్వినోదనం। బాడఁబటాంచలంబులసియాడుచుఁ జేరి యశోదయింటికిన్। జేడియలేగి చూచిరొగి జిష్ణుని విష్ణుని దిన్ని కృష్ణునిన్॥ చూచి సంతసించి తెచ్చినకానుకలిచ్చి* (గీ॥ పాపనికి నూనెతలయంటి పసపుఁబూసి। బోరుకాడించి హరిరక్షసొమ్మటంచు। జలములోకకొన్ని చుట్టిరాజి లెదుతొట్ల। నునిచిదీవించి పాడిరయ్యువిదలెల్ల* (క॥ జోజో కమలదళేక్షణ। జోజో మృగరాజమధ్య జోజో కృష్ణా। జోజో పల్లవకరపద। జోజో పూర్ణేందువదన జోజో యనుచున్॥ ఇవ్విధంబున* (క॥ పలుతోయంబుల జగముల। పలుతోయములందు ముంచి భాసిల్లెడియా। పలుతోయగాడు పల్లవ।లలనాకరతోయములఁ జెలంగుచు కడిరయున్* (క॥ లోకములు నిదురవోవఁగ। జోకొట్టుచు నిదురవోని శుభగుడు రమణుల్। జోకొట్టి పాడని దురఁ। గైకొనుక్రియనూకొండెఁ గనుదెఱువకయున్* (సీ॥ ఏబ్రాము లెఱుఁగక యేపాలు మేటికిఁ బసులకాపరియింటఁ బాముగలిగె। నేకర్మములు లేక యెనయు చక్రటికి నిజాతకర్మంబులు సంభవించె। నేతల్లిచనుపాలు నెఱుఁగని ప్రోడ యశోదచన్నులపాలఁ జొరవ నెఱిఁగె। నేహోసవృక్షులు నెఱుఁగని బ్రహ్మంబు పొదిగిటిలో వృద్ధిఁ బొందఁజొచ్చె। నేతపములనైన నెలమిఁ బండవివంట। వల్లవీజనముల వాఁడు బండె। నేచదువులనైన నెట్టెట్టి దనరాని। యర్థ మవయవముల నంద మొందె* (మ॥ చెయువు శ్రేయుతత్వసి ధాతకరణి నైజోన్ందుసంతోషదృ। ష్టియుతుండై నగుచున్న వార్దనునిమాడ్కిఁ బొల్చు రోషించియు। న్నయెడన్ రుద్రుడువిభవానొవ్వను సుఖానందంబునుం బొందిన। న్మయుఁడై బ్రహ్మము భాతి బాలుడనఁ దున్నాబాహుళ్య బాల్యంబునన్॥ అయ్యవసరంబున* (గీ॥ కొడుకుఁ గన్న వేడ్క గొనసాగ రోహిణిఁ। జీరఁబంచి చిత్రచేలములను। గండనములనిచ్చి మన్నించె నందుఁడా। యంబుజాక్షి ప్రీతయై చరించె* (వ॥ అది మొదలు మొదవులకు దుపులు పాకపులు గలిగియుండె నంతనందుండు గోపకుల నేకుల గోకులరక్షకదక్షులైన వారినినియమించి మథురకుం జని కంసునకు నేఁటెటం బెట్టెడి యరిం బెట్టి పీడ్కొని వసుదేవునికడకుం జనియథోచితంబుగ దర్శించిన* (క॥ నందుఁ గనుఁగొని ప్రాణము పొందిన బొందియును బోలెఁ బొలుపారుచు నా। నందాశ్రులు గడకన్నులఁ గ్రందుకొనంగేలు సాఁచి కౌఁగిటఁ జేర్చెన్* (వ॥ మఱియుఁ గౌఁగిలించుకొని సుఖాసీనుం గాఁ జేసి వసుదేవుండు తనకొడుకువలని మోహంబు దీపింప నందునకిట్లనియె* (క॥ సంతతి లేదని మనమున। జింతనములము నిగిము దిసి చిక్కి నటిను। సుంతతిఁ గలిగెను భాగ్యము। సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే* (క॥ పొడఁగంటి నిన్నుఁ బ్రతికితి। గడచితి నాపదల నింకఁ గార్యములందే। యెడపడుగు లేని నెచ్చెలి। పొడగాంచుట చచ్చి మఱలఁ బుట్టుట గాదే* (క॥ పలుపాటులఁ బడు జనులకు। నిలనొకచో నుండఁ గలదె మేలుల వెంటన్। గలసి చను ప్రాఁకులన్నియుఁ। బలు వెంటల బోవుఁ గాక పాయక యున్నే* (మ॥ బలురోగంబుల నొందకున్న వెపుల్ల పాలిచ్చునే ధేనువు। లొక్కలకుల్యాగులు వారిపూరితములే గోష్ఠప్రదేశంబులం। బులులుం దుష్టపులు సంచరింపవు గదా। పొల్పారునే ఘోషములక్కలవే పచ్చనిపూరిగి జొంపములు తత్కాంతారభాగంబులన్* (క॥ తనపుత్త్రమిత్రముఖరులఁ। దనుపకచూడక యువారుదటిగినశంపన్। మనుచు గృహమేధియాశ్రమ। మున నుండెడివానికొక్క మోదము గలదే* (క॥ నీకాంత యొద్ద నీవును। నీ కాంతయు గారవింపనిను దండ్రిగ నాలోకించుచు నీ మందను। నాకొడుకున్నాఁడె నందనందన్యుఁడై ॥ అని

నెనంచుండిల్లని యో* (శా॥ నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబుఁ దోడ్తోడను । నీకింపుం డనువధింపఁ జేసిమతి నాదిఱాహింసింపఁ జే
తప్పి తా।నాకాశంబున కేఁగె బాలయిది దైవాధీనమాపద్దశన్। శోకంబంపు నెతజ్జుడూకడిలునా మానుండు నీసూనుఁడే॥ అనినవ
సుదేవుండు నందునికిట్లనియె* (క॥ జనపతికరియిడి నీవిపుడును గనుఁగొంటివి మేమునిన్నుఁ గంటిమి మేల। య్యెనుబో
మ్మింకను గోకులమునను త్పాతములు దోఁచెను కొనవలయున్* (వ॥ అని పలికి వసుదేవుండు నందాదులైన వల్లవుల వీడ్కొలి
పినవారలు గొబ్బున వడిగలగిబ్బలంబూనిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి తమతమ పల్లెలకు త్రోవలు పట్టిచని రానందుండు
ప్రతీతంబులైనయుత్పాతంబులుం దలఁచియుఁ గౌశౌరితనతోఁ బలికిన పలుకులు దప్పదనుచుదలంచుచుండె నంత* (సీ॥ కం

—* కంసుని పంపున పూతనయను రాక్షసి రేపల్లెకు వచ్చుట. *—

సుపంపున బాలఘాతన పూతన పల్లెలఁ బురంబులఁ బట్టణములు । నిలయెల్లఁ జో బాలహింసఁ గావించుచుఁ జనుచు నెవ్వని పేరు శ్రవణవీ
థిఁ బడిన యంతన సర్వభయనివారణమగునట్టి దైత్యాంతకుండవతరించి । యున్న నందుని పల్లెకొకనాఁడు ఖేచరియై వచ్చి యం
దుమాయాప్రయుక్తిఁ । గామరూపిణి యైచొచ్చి కానకుండ నరిగి యిల్లిల్లు దప్పక నరసికొనుచు । నందగృహమున బాలుఁ గనా
దమొకటి నిని ప్రమోదించి సుందరీ వేషయై చను* (మత్తకోకిల॥ క్రాలుకన్నులు గుబ్బచన్నులుఁ గందువొందని చందురుం బో
లు మోమును గల్గు లేదను బుద్ధిఁ గానిన కౌను హో। రాళమైపిలుంచు పల్లవరాగ పాదకరంబులున్ । జాలదొడ్డపు కొప్పు కొప్పగ సర్వ
మోహనమూర్తితోన్* (మాలినీవృత్తము॥ కాంచనకుండల కాంతులు గండయుగంబునఁ గ్రేళుఁ జడపై। మించిన మల్లెల
మేలిమి తావులు మెచ్చి మదాళులు మిన్ననరా। సంచిత కంకణహారరుచుల్ పలువారఁగ గ్రైవ లువంచలమిం। చించుగ జారెఁగ
నిందునిభానన యే గెఁగు వారుసి యింటికినై ॥ ఆసమయంబున* (మ॥ సిరి మమ్మున్ బ్రతుకంగఁ జూచు కొఱకై శృంగారవేషం
బు త్రోవ రెదే నోవునటంచు గోపికలు జిహ్వాగ్రాక మోహించితి । స్వైరులై చూడల తాంగివో యొకని రౌద్ర పర్యంకమధ్యంబు
నం బరుభ స్థానల తేజుడు గ్జనవధ ప్రారంభ కుర్డింభకున్॥ కనికదియ వచ్చు సమయంబున* (శా॥ ఆలోకేశ్వరుఁడా చరాచ
రవిభుండా బాలగోపాలుఁడా । బాలధ్వంసిని గొంటు కంటిఁడి వెస న్బాలింతచందంబునన్ । బాలిండ్లన్విషమూని వచ్చుటమది
న్భావించి లోనవ్వుచున్। గాలుం గేలు నెఱుంగకున్న కరణిన్ కన్మోడ్చి గుత్పట్టుచున్* (క॥ ఆపాపజాతి సుందరి।యాపావని పా
న్పుఁ జేరనరిగి కరములన్। లేపి చనుంగవ శిశువున్। మోపు ముముద్దాడి శిరము మూర్కొని పలికెన్* (క॥ చనునీకుఁ గుడుపఁ జాలె
డి। చనువారలు లేరు నీవు। చనవలెననుచున్। జనుగుడిపి మీఁద నీకడఁ। జనుదాననఁ గవేడుఁ జనుఁ జనుగుడుపన్* (క॥ నాచను
బాలాక్రుకెండు। మోదిన్ని కుమార త్రావుమొయ్యన బిదపన్। నీ చెలువ మెఱుఁగవచ్చును। నాచెలువము సఫలమగును నలినద
ళాక్షా* (వ॥ అని బాలును దేశించి ముద్దాడె మఖ భంగి మాటలాడుచు చేడియం జూచి* (మ॥ వనితా ముట్టకుమమ్మ చన్ను గుడుపన్న
ల్లన్ముని చన్నునా। తెనయుం డొల్లఁడు వాసిపొమ్మనియశోదా రోహిణుల్ సేఱఁగై ॥ కొనకీక్షించుచు మాయఁ బన్ని పెలుచన్ గోశం
బులోవాలు మె।ల్పునరాజిల్లు చుమాటమెత్తిదన ముల్లో వాడి యున్నేర్పడన్* (వ॥ కదిసి కలికి పలుకులంబులు చనులుకు చెడి
ర్ఘుళుళు సౌరకయెదురని దరంగదరిని ఫణియని యెఱుంగక గుణమతిం దిగుచు జడమతి బెడంగున గరట జరభి తెఱవ వలపు నడుమ
నోఱపు గలిగి మెఱయుచుఁ గనుంగవం దెఱవక వెఱపు మఱపు నెఱుంగక కోమరు మిగులు చిఱుతకోమరు నిం దిగిచి తొడల నడుమ
నిడుకొని యొడలు నివురుచు నెడనెడమ మతంగడలుకొలుపుచు వాఁకొన్నచిన్నియన్న చన్ను గుడుపుచు ని చన్నిచ్చు సమయంబు
న* (సీ॥ మేల్కొన్న తెఱఁగున మెల్లనఁ గనువిచ్చి క్రేగంటఁ జూచుచు గిదికి నీల్గి । యావులించుచుఁ జేతులాకసంబునఁ జాచి
యొదిగిలి యాకొన్న యోజ నాది। బిగి చన్నుఁ గవ కేలఁ బీడించి కబళించి గ్రుక్క గ్రుక్క కుసుటుగుటుకుమనుచు । నొకరెండు
గ్రుక్కలను విద ప్రాణంబులు సైతము మేనిలో సత్వమెల్లఁ । ద్రావె నదియును గుండెలు దల్లడిల్లఁ । జిమ్మదిరుగుచు సలువక శి
రము వ్రాల। నితర బాలుర క్రియ వాఁడవీవు గావు । చన్ను విడువుము విడువుము చాలుననుచు* (క॥ నిబ్బరము దప్పి మంటలు వ్ర
చ్చిన ధృతిలేక నేత్రపదహస్తంబుల్ । గొబ్బున వివృతములగుచును। గుబ్బను చన్నట్టి పూతగూలె న్నేలన్* (మ॥ అదరె గ్గోం
డలతో డభూమి గ్రహతారానీకముల్మింటిపై । బెదరెన్దిక్కులమూలు ప్రమోత లెనగె । భీతిల్లె లోకంబులుం। గదలం బాఱెను
వజ్రభిన్నగిరి రేఖంబూర్వ దేహంబుతోఁ। త్రిదశధ్వంసిని గూలెగుయ్యిడి వడిన్దిగ్ఘోషంబునన్* (క॥ అప్పుడు దెప్పరము
గునా। చప్పుడు హృదయముల జొచ్చి సందడిఁ బెట్టన్ముప్పిరిగొని పడిరెఱుకులు। దప్పి ధరన్గొల్ల లెల్ల దల్లడపడుచున్* (క॥ అడ
రభిరండరక్కసినై జశరీరంబు నేలనలియం బడిన్। యోజనమున్నరమేర ధ। రాజంబులునుగ్గులయ్యె రాజవరేణ్యా* (సీ॥ దా
రుణలాంగూలదండ దంతంబులును నగగహ్వరముబోలు నాసికయును। గండశైలాకృతిగల కుచయుగమును విరిసి తూలె జుపల్ల వెం
ద్రుకలును । జీకటినూఁతులఁ జెనయు నేత్రంబులు పెనుదబ్బఁబో లెడి పెద్దపిలుము । చాలుకట్టలఁ బోలు చరణోరుహస్తంబు
లింకిన మడువుతో నెనయు కడుపు। గలిగి షట్క్రోశదీర్ఘమై కదిసి చూడ। భయదమగు దానిఘనకళేబరముఁ జూచి। గోపగోపి

జనంబులు గుంపుగూడి బెగడుచుండిరి మనముల బెదరుగదురి॥ ఇవ్విధంబున* (క॥ ఆతఱిఁ గుడుపఁగ నడిచెను। నూతనఫుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యు।ద్యోతనగృత మునిసముదయ, యాతనఁ బూతన నెఱింగి యాఁగను లీలన్॥ (క॥ విషధరరిపుగమనునికిన్। విషగళసఖునకు నిర్విషు లవిషశయనునికిన్। విషభవభవజనకునకున్। విషకుచ చనువిషము గొనుట విష మే తలఁపన్॥ (వ॥ అంత నా గోపగోపీజనంబులు దెలిసి రోహిణీయశోదలం గూడుకొని బెగ్గడిలి కడ్డగ్గరి* (శా॥ నేలం గూలిన మేటి పెన్నురముపై నిర్భీతిం గ్రీడించు నా బాలా గన్గొని మూఁపుఁ జేర్చుకొని సంస్పర్శించి యారాఁ బ్రోచిర్। గోలాంగూలము ద్రిప్పి గోపురజము న్గోమూత్రము న్జల్లి తద్బాలాంగంబునం గోనయంబలది రా పంౘ్రెండు నామంబులన్॥ (రక్షావచనము॥ నాటియు నెంతటం దనియక గోపికలాచమనంబులు సేసి దక్షులై మున్నడ మకరతూకరంబగు బీజన్యాసంబు చేసికొని చిన్నయన్న నీయడుగుల నజుండును, జానువులను మణిమంతుండును, దొడలు యజ్ఞుండును, గటితలంబచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబు కేశవుండును, నురము నీశుండును, కంఠంబు నినుండును, భుజంబులు జతుర్భుజుండును, ముఖంబు ద్రివిక్రముండును, శిరం బీశ్వరుండును రక్షింతురు, ముందు చక్రియు, వెనుక గదాధరుండైన హరియు, పార్శ్వంబుల ధనుర్ధరుండైన మధువైరియు, నసిధరుండగు జనార్దనుండును, గోణంబుల శంఖచక్రగదాధరుండైన యురగశయనుండును, మీఁదను పేంద్రుండును, గ్రింద తార్క్ష్యుండు, నంతటను హలధరుండగు పురుషుండును గాతురు నీయింద్రియంబుల హృషీకేశుండును, ప్రాణంబుల నారాయణుండును, జిత్తంబున శ్వేతద్వీపపతియును, మనంబు యోగీశ్వరుండును, బుద్ధిఁ బృశ్నిగర్భుండు, నహంకారంబును భగవంతుండైన పరముండుఁ బాలనబు సేయుదురు, నీవు క్రీడించునెడ గోవిందుండును, శయనించుతఱి మాధవుండును, నడచువేళ వైకుంఠుండును, గూర్చున్న సమయంబున శ్రీపతియును, గుడుచు కాలంబున సర్వభక్షకుం డయిన యజ్ఞభుజుండు నేమఱకుండుదురు, నిన్నుఁ బేర్కొనిన దుస్స్వప్న వృద్ధబాలగ్రహంబులును, గూష్మాండ ఢాకినీ యాతుధానులును, భూత ప్రేత యక్ష రాక్షస పిశాచ వినాయకులును, గోటరాములును, జ్యేష్ఠాదభూతనాధులును, మాతృకాదిగణంబులు నశియించును, నీయందు ప్రాణేంద్రియ శరీరపరోధంబులైన యున్మాదంబులు నపస్మారంబులును, మహోత్పాతంబులును బొందకుండుంగావుత యని రక్షఁ జేసి దీవించిరంత* (క॥ ఆపెద్ద నేడబంబులు। పాపనికిన్ జన్నుఁ గుడిపి పానుపుపైనిం। బ్రాపించి నిక్షిప్తగుకు। మోపాపడయని యశోదయొయ్యనఁ బాడన్॥ (వ॥ అంత నంద నందుమొదలైన గోపకులు మధురమండి వచ్చి రక్కసిమేనుగని వెఱఁగుపడి మున్న వసుదేవుండుత్పాతంబులెఱింగి చెప్పినతండు మహాయోగియని పొగడి కఠోరంబగు పూతన యొడలు కుఠారంబుల నఱికి తునుకలింబులకుం దవ్వగు ప్రదేశంబులం బెట్టించుక దహనంబు సంగ్రహించి దహించిరి* (గీ॥ పొగిలి పొగిలి కాలు మగువ దేహంబున। నగరు పరిమళముల పొగలు వెడలె। దేహము లమ్మహములు శ్రీహరి ముఖమునఁ। ద్రావఁబడుటఁ జేసి భూవరేణ్య॥ (క॥ హరి దన మీఁదం బదములు। గరములు నిడి చన్నుఁ గుడిచి కరిసిన ముక్తిన్। హరిజనని పగిది బరగతి। కరిగెను దురితములఁ బాసి యసురాంగనయున్॥ (క॥ వెన్నుని కొకమఱి విషము గురన్నిచ్చిన బాలహంత్రిచ నెనటదివికిన్। వెన్నునిగని పెంచు చుదన చన్నిచ్చిన సతికి నుఱియు జన్మముగలదే* (క॥ హరిఁ గని చన్నులు గుడిపెడి। తెఱుణులు ప్రాపించు పదము తలఁపఁగ వశమే। హరియారగించుటను బా। ల్గురిసిన ధేనువులు ముక్తిఁ గొనల జరించున్॥ (క॥ ఆపూతన మెయిగంధము। గోపాలురెఱింగి యిట్టి కువనిత యొడలం। దీపాటి స్వాదు గంధము। ప్రాపించు నెయనుచుఁ జనిరి పల్లెలకధిపా* (వ॥ అంత నందుండు పరమానందంబున నింటికిఁ జని వేత్రలచేత రక్కసి సేఁతలన్నియు నెఱింగి వెఱంగుపడి పాపని లేపి శిరంబు మూర్కొని ముద్దాడి ముదంబున నుండె వని చెప్పి నవిని పరీక్షిన్నరేంద్రుండిట్లనియె* (క॥ ఏమేయవతారంబుల నేయే కర్మములు చేసెనీశుఁడు హరి భ। ద్రాయతనములన్నియు వినఁ। బాయదు చిత్తంబు చెవులపండువులయ్యెన్* (క॥ ఉరుసంసారపయోనిధి। తరణంబులుఁ బాపపుంజదళనంబులు శ్రీ। కరణంబులు ముక్తిసమా। చరణంబులు బాలకృష్ణ సంస్మరణంబుల్ (వ॥ అనిత రువాత బాలకృష్ణుండేమి చేసెనాయందుం గృపగలదేని చెప్పవే యని యడిగిన రాజునకు శుకుండిట్లనియె॥

—* బాలుండగు కృష్ణుండు శకటమును దన పాదములచే గూలదన్నుట. *—

(సీ॥ బాలుఁడొదిగిలబడ నేర్చెనని జన్మనక్షత్రమందొక నాడు నందు। పొలఁతి వేడుకఁ తోడఁ బేరుగుఁ బ్రేఁతల జీజీవాదిత్రగీతాగరంబు చెలఁగ। విప్రులతోఁ గూడ వేదమంత్రంబులఁ। భిషేచనాదిక మాచరించి। వారిదీవెనఁ బొంది వారికి మొదవులు నన్నంబు చీరెలు నడిగినట్టు। లిచ్చి బాలుఁడయ్యె మెసఁగఁ బానుపుఁ జేర్చి। నిదురఁ బుచ్చి గోపనివహమునకు। గోపికలకుఁ బూజఁ గోమరారజేయుచు। జన్నఁ గొడుకును అచెసంభ్రమమున॥ ఆ సమయంబున* (క॥ నిదురించిన శిశువాకొని। కిమ్మనుచుఁ జనుఁ గోరఁ గెరలి కిసలయపలసన్మృదుచక్రచాపరేఖాస్పదపదము నదన్నెకొకటఁ బండిన్ దండిన్* (క॥ శకటము హరిఁ దన్నినదివి। ప్రకటంబై మొగసియు బుసుభరమునఁ గండ్లన్। శకటంబుగ నేలంబడె। నకటా యని గోపబృందమాశ్చర్యపడన్* (వ॥ అప్పుడందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై నేలం గూలుటఁ జూచి యశోదానందముఖ్యులైన గోపగోపికాజనంబులు పనులు మఱచి ప్రబ్బంబులు

మాహియుబ్బు చెడి వైరుపులు ఘనంబులగు మనంబులం దుంగమర॥ (క॥ మిన్నున దూరక యెగయదు। తన్న సమర్థుండు గాదు తల్ప గకుండీ। దిన్నకుమారుఁడు తేరే। విన్నను వున నెగసెడి దీనివిధ మెట్టిదియో॥ అని పతర్కించు సమయంబున॥ (క॥ బాలకుఁ డాఁకొనియేడ్చుచుఁ। గాలెత్తినఁ దాఁకి నెగసెఁ గానశకటమే। మూలముననెగయదనిత। న్బాలుని కడనాడుచుండి పలికిరి శిశువుల్॥ ఇట్లు శిశువుల పలుకులు విని॥ (శా॥ బాలుం డెక్కడ జంకి మొక్కడన భోభాగంబుపైఁ జేడ్పడఁ। గాలం దన్నుట లెక్కడ టాటపడు చుల్లల్లాడిరి జడ్డువ। శ్శేక లోకంబున నైనఁ జెప్పఁబడు నే మేచంక మో కాకయం। చాలాపించుచుఁ బ్రేలు ప్రేలు ప్రభూ తౌశ్వర్యలై రంతటన్॥ (వ॥ అప్పుడా బాలుని రోదనంబు విని యశోద వరు తెఁచిన॥ (గీ॥ అలసితివిగదన్న యాఁకొంటివిగదన్న। ముందియున్న యేడ్పు మానుమన్న। చన్నుగుడువుమన్న సంతసపడుమన్న। యనుచుఁ జన్నుఁ గుడిపె నగ్ర్యునకును॥ (వ॥ అంత నబ్బాలుని మేన బాలగ్రహంబు సోఁకెనుగదా యని శంకించి గోపకులనేకులనేక బలివిధానంబులు సేసిరి బ్రాహ్మణులు దధిపాత్రాక్షతంబుల హోమంబులాచరించిరి ఋగ్యజుస్సామమంత్రంబుల నభిషేచనంబులు సేయించి స్వస్తి పుణ్యాహవాచనంబులు చదివించి కొడుకున కభ్యుదయార్థంబు నంకుండలంకరించిన పాడిమొదవుల విద్వజ్జనంబులకిచ్చి వారల యాశీర్వాదంబులు గైకొని ప్ర

—* తృణావర్తుఁడను రాక్షసుఁడు సుడిగాలియై కృష్ణుని యెత్తుకొనిపోవుట. *—

మోదించెనని చెప్పి శుకుండిట్లనియె॥ (క॥ కొడుకు నొకనాఁడు తొడపై। నిడుకొని ముద్దాడి తల్లి యొలమిని వురుచోఁ గడు దొడ్డకొండశిఖరము వడువున। వేఁగ మ్యోనతఁడు వమ ధాత్రీశా॥ (క॥ బరువైన కొడుకు మోవను। వెరవిడి యిలమీఁద బెట్టి వెఱవి జననిదా। ధరఁ గావఁ బుట్టిన మహా। పురుషుఁడు గాఁబోలు ననుచు బుద్ధిం దలంచెన్। అప్పుడు॥ (క॥ ఖరమతి కంసుని పంపున। నరిగి తృణావర్తుఁడవనికతిచోద్యముగా। సురగగు వలియై బిసబిస। నరుదరుదనము సరివి సరి హరిఁ గొనిపోయెన్॥ (క॥ సుడి యెలుఁగ నిసారి సుడివడ। సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడియా। సుడిగాలి ధూళి గన్నుల। సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా॥ (వ॥ సుటియుమలయపవనదనుజుండు విలయపవనుని తెఱంగునం గసిమసంగి ముసరిముసరుకవిసి విసరెడి మరకరువలిం బొడమిన పుడమిరజంబు వడి నెగసి గగనమున మెఱసి తరణి కిరణములకు మఱుఁగు వడిన నిబిడమగు బెడిదంపుఁ దిమిరమున దశదిశలెఱుంగఁబడక గోకులంబాకులంబు నొందనొండొరుల నెఱుంగక బెండువడుచున్న జనంబుల గనంబుల ఘనంబగు భయంబు రయంబున నంజెందనదభ్రపరిభ్రమణశబ్దంబున దిగంతంబులు చెవుడువడి పరిభ్రాంతంబులుగ నొక్కముహూర్తమాత్రంబున భువనభయంబుదోఁచె నా సమయంబున॥ (ఉ॥ పాపనిఁ జూడఁగానక విపద్దశ నొందికలంగి తల్లి యో। పాపఁడఁ బాలసూర్యనిభ బాలశిరోమణి నేఁడు గాలికిన్। జేపడిపోయి తే యనుచుఁ జీఱుచు దైవముఁ జాలదూఱుచున్। దావమునొంది నెవ్వగలడయ్యుచుఁ గుందుచు బిట్టుగుయ్యుచున్॥ (క॥ సుడిగాలి వచ్చి నన్నున్। సుడిగొని కొనిపోవమింట సుడివడి గొనుచున్। బెడఁగడరెడి నా ముద్దుల। కొడుకా యెటనుంటివనుచు ఘోరంబనుచున్॥ (ఉ॥ ఇక్కడఁ బెట్టితిం దనయుఁ। డిక్కడనాడుచునుండె గాలిదా। నెక్కడనుండి వచ్చె శిశు వెక్కడి మార్గము వట్టిపోయెనే। నెక్కడఁ జొత్తునంచుఁ గమలేక్షణ యగ్రేపుఁ దోఁ జంగిఖన్నమై। పొక్కుచు వ్రాలు గోవు క్రియ భూస్థలి వ్రాలె దురంతచింతమై॥ (క॥ పాపనికై యిటుపొగిలెడి। యా పాపనితల్లిఁ జూచి యాఁటవపడుచున్। గోపాల సతులు బాష్పజలాపూరితనయనలై రియార్తింబడుచున్॥ (శా॥ ఆలోఁ జక్రసమీరదైత్యుఁడు మహాహంకారుడై మింటికిన్। బాలుం దోకొనిపోయిపోయితుదిఁ దద్భారంబు మోవన్ బల। శ్రీ లేమింబరిశాంతవేఁగుఁడగుచున్ జిట్టార్పగా లేకము। న్నీలాగర్భుఁ జూడనంచు నిట్లమీఁ దెట్లంచుఁ జింతించుచున్॥ అట్లు దనుజుండు చింతించుచున్న సమయంబున॥ (క॥ బాలవ్రిరదకరంబులఁ। బోలెడి కరములమదనుజుఁ బొందుగ బిగియం। గీలించి వేలఁబడియెను। బాలకుఁ డొకకొండభంగిఁ బరువైయధిపా॥ (క॥ మెడబిగియబట్టుకొని డిగఁ। బడియెడి బాలకుని చేతఁ బర్వతనిభు చే। విడివడఁ జాలక వాఁడుటిఁ। బడిపెగడెను ఖగముభంగి భయమ్మంబొందెన్॥ (క॥ హరికరతలపీడనమునఁ। బరవశుడై త్రాలమీఁద భగ్నాంగకుఁడై। సురవైరి భటుఁడుసూ లెను। బురభంజను కోలఁగూలుపురముం బోలెన్॥ (వ॥ అంత గోపకాంతలంత యుంగనిరోదనంబులు మానిసమ్మోదంబున నెక్కువిరిసి రక్కసుని యురమున మురువుఁ గలిగి బరువు లేక వ్రేలు బాలుం గొనివచ్చి ముచ్చిఱుచున్న తల్లికిచ్చి రప్పుడు గోపగోపికాజనంబులందఱు నిట్లనిరి॥ (క॥ రక్షణము లేకసాధుఁడు। రక్షితుఁడను సహతఁ జేసి రాయిదులందున్। రక్షణములు వేయిగలిగిన। శిక్షితుఁడను ఖలుఁడు పాపచిక్కుంకగుటన్॥ (మ॥ గతజన్మంబుల నెంకుఁబుట్టితిమొ యాగ శ్రేణులేమేమి చే। సితమో యెవ్వరికేమి పెట్టితిమొ యేచింతారతిం బ్రొద్దువు। చ్చితిమో సత్యము లేమిపల్కితిమొ యే సిద్ధప్రదేశంబులన్। కిట్టితిమోయిప్పుడుఁ జూడఁగంటిమి చటం గృష్ణార్భకున్ నిర్భయున్॥ (వ॥ అని పలికిరంత నందుండు మున్ను దనకు వసుదేవుండు సెప్పిన మాటలకు వెఱఁగుపడుచుండె నంటియును॥ (సీ॥ జననాథ యొకనాఁడు చన్నుఁ జేపినఁ దల్లి చిన్నిముద్దుల కృష్ణుఁ జేఁదిగిచి। యెత్తి పెందొడలపైఁ నిడికొని ముద్దాడి చన్నిచ్చె నెమ్మోము చక్కనివిరి। యల్లన నగవుతో నావలించిన బాలువదనగహ్వరమున వారిధులు। దిశలు భూమియు వనద్వీపశైలం

డు రాజు నేఁ భటులు మీరలు రండు రండని ప్రాభవంబునఁ బెక్కు పలుకులు పలుకుచు । నే తస్కరుండ మీరింటివారని నిద్రవుచ్చి సొమ్ము
లుగొనిపోయెడుఁగు నే సూత్రధారి మీరందఱు బహురూపులని చెలంగుచు నాటలాడఁ బెట్టు। మూలలు ఉరుకుచు డాఁగిలిమూఁత
లాడు। నుయ్యాలలనూఁగుఁ జేబంతులాన రవ్వైచు । జారచోరుల జాడలఁ జాలఁ దగుడు । శౌరి బాలురతో నాడు సమయమందు॥
(వ॥ మఱియు నా కుమారశేఖరుండు కపటశైశవంబున దొంగజాడలఁ గ్రీడింప గోపికలోపికలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి

—* గోపికలు శ్రీకృష్ణుని దుడుకుతనంబుల యశోదాదేవితోఁ జెప్పుట. *—

(క॥ బాలురకుఁ బాలు లేవని। బాలింతలు మొఱలు వెట్టఁ బకపక నగి యీ। బాలుండాలము సేయుచు। నాలకుఁ గ్రేపుల విడిచె నం
భోజాక్షీ॥ (క॥ పడఁతీ నీ బిడ్డఁడు మా। కడవలలో నున్న మంచి కాఁగిన పాలా। పడుచులకుఁ బోసి చిక్కిన। కడవలఁ బో నడఁచె నాజ్ఞ
కలదో లేదో॥ (క॥ మీ పాపఁడు మా గృహముల। నా పోవఁగఁ బాలుఁ ద్రావి యవ్వడ కున్న। న్గోపింపఁ బిన్నవడు చుల। వాపోవఁగఁ జి
మ్ము గొనుచు వచ్చె నతల్లీ॥ (మ॥త్తకోకిల॥ పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలఁ బోయి మా యిలుఁ జొచ్చి తా। నుట్టి క్రిందొక రోలుఁ బీఁటలు
నొక్క ప్రోవిడి యెక్కి చేఁ। బెట్టఁ జాలక కుండ క్రిందొక పెద్ద తూఁటొనరించి మీ। పట్టి మీఁగడ పాలుఁ జేతులఁ బట్టి త్రావె వెలందిలో
దరీ॥ (క॥ ఆడం జని వీఁగిల పెరు। గూడక నీ సుతుఁడు ద్రావ యొతయిం మఁకదాఁ। గోడలి మామ లింజరిమిన। గోడలు ముచ్చ వచ్చుచున
త్తగొత్తె లతాంగీ॥ (క॥ వారిల్లుఁ జొచ్చి కడవలఁ। దోరంబగు నెయ్యి ద్రావి తుది వాకిడవ। ల్వారింట నీ సుతుండిడ। వారికి వీరికి వివాదో
డ్డవాద య్యె సతీ॥ (క॥ వేలుపుల కెనాకంటెను। వేలుపు మఱి యెవ్వఁడను చువికవికనగి మా। వేలుపుల గూడ పైవో। హేలావతి రీ
తి మా జుఁ డెంగిలిఁ జేసెన్॥ (క॥ వెన్నఁ దినఁగఁ బోడఁగ విమా। పిన్నది యడ్డంబు వచ్చి పిటెదికి దివియన్। జన్నొనడిదివట్టి చీరెను। జి
న్నికుమారుండె యిటఁ డు శీతాంశుముఖి॥ (క॥ ఇమ్మగువ తన్న వాకిటఁ। గ్రుమ్మరుచోఁ జీఁటి నిలిపి కొని పేరడుగ। న్నెమ్మోవి గఱ
చి విడిఁజనె। నమ్మాయీ ముద్దుకుఱ్ఱఁడల్లుఁడె సెపుమా॥ (క॥ చేబంతి తప్పి పడెనని। ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుక। న్నా
బిడ్డల కమాడ్వఁగ। నీబిడ్డఁడు వలువఁ దెచ్చె నెలఁతుక తగునే॥ (క॥ ఇచ్చెలువఁ జూచి ముద్దిలి। యచ్చుగ నుఱికించుకొనుచు నరి
గెదనాతో। వచ్చెద వాయని యనినాఁ। డిచ్చి యుతఁడు మదలి చిగ్గి మిట్టి దిగలదే॥ (క॥ కొడుకులు లేరని యొక సతి। కడువగ
వగఁదన్ను గనిఁగా గ్రైకొనినన్। గొడుకులు గలిగెదరని పైఁ। బడి నాఁడిది విమమి శిశువు పను వేతల్లీ॥ (క॥ తలఁగిన దానం
దలవనఁ। దలఁగక నా చెలికి నాన తలయెత్తఁగనీ। తలఁగిన చో సెఱ్ఱ్యోదియని। తలమూఁ చెన్నీసుతుండు తగ వెమ్మృగాక్షీ॥ (క॥ వ్రా
లఁగవచ్చి ననీసతి। చూలాలందలఁ సునసుఁదుఁ జూలగుటను నే। మూలంబు చెప్పుమనెనీ। బాలుఁడు చెప్పదు రెసతులు పర్వేందు
ముఖీ॥ (క॥ ఘనువానీకొనరుఁడు మా। నగవార టుఁ బోవఁ జూచి మంతనమునకు। న్దగఁ జీఱి పొందనడిగెను। జగములు ముని
ట్టి శిశువు చదువంబడెనే॥ (గీ॥ నమ్మి సిదురవోవ నావట్టి చుంచుమా। లేఁగతోఁక ఫోడలీలఁ గట్టి। వీథులందుఁ దోలె వెలఁది నీకొను
రుండు। రాచబిడ్డఁ డైన నవ్వ మేలె॥ (క॥ నా పట్టి పొట్ట నిండఁగఁ। బై బడి నీపట్టి వెన్న బానెండిడినాఁ। డూపిరి వెడలక వాసిం। జూ
పెద నేమైన నీవ సుమ్ముల తాంగీ॥ (క॥ తెఱవ యొకతె నిద్రింపఁగ। నెఱిఁ గట్టిన వలువ వీడ్చి నేఁడొక తేలుం। గఱపించె నీకుమారుఁ
డు। వెఱచుచు నది పఱవ నగుట విహితమె సాధ్వీ॥ (క॥ నా కొడుకును నా కోడలు। నేకతమునఁ బెనఁగఁ బాముపీతఁడు వైచె। గూ
కలెఱుంగకఁ బాఱినఁ। గూకలిడెన్నీ సుతుండు గుణమె గుణాఢ్యా॥ (గీ॥ తరుణి యొకతె పెరుగు దఱుచుచుఁ జుదివంగి। వెన్నదీ
యనొదిగి వెసుకఁ గదిసి। మగువ నీ సుతుండు మగపోడుములు సేయి। పాఁగి నాఁడు తగదె చకిర్కఁ జేయ॥ (సీ॥ కలకంఠి మా వాడఁగ
రితల మెల్ల నీపట్టి రాఁగలఁడని పాలు పెరుగు। లిండ్ల లోపల నిడి మేమెల్లఁ దనత్రోవఁ జూచుచో నెప్పుడు చొచ్చి వాఁడొ। తలపు
లు ముద్రలు తాళంబులును బెట్టి యున్నచందంబున నున్నవరయ। నొకయింటిలోఁ బాడు నొకయింటిలోఁ నాడు నొకయింటిలో
నవ్వు నొకటఁ దిట్టు। నొకట వెక్కరించు నొక్కొక్క చో మృగ। పక్షి ఘోషణములు పరగఁ జేయు। నిట్లు చేసి వెనుక నెక్కడఁ బోవునో
కానరాఁడు ఱిత్తకడవ లుండు॥ (క॥ కడు లచ్చిగలిగె నేనియుఁ। గుడుతురుగట్టు మరుగాక కొడుకుల నగుచు। న్బడుగుల వాడల పైఁ
బడ। విడుతురెరా కాంత లెంకు వినులేం ముఖీ॥ (క॥ ఓయమ్మ నీ కుమారుఁడు। మా యిండ్లను బాలుఁ బెరుగు మననీడమ్మా। పో
యెద మెక్కడికైనను। మాయన్నల సురభులాన మంజులవాణీ॥ (వ॥ అని మఱియు ననేక విధంబుల బాలకృష్ణుండు సేయు వినో
దంబులు దమ యందుఁ జేయు మహాప్రసాదంబులని యెఱుంగక దూరుచున్న యట్టి గోపికలకు యశోద యిట్లనియె॥ (క॥ చన్నువి
డిచి చనఁ డిట్టటు। నెన్నఁడుఁ బొరుగిండ్ల త్రోవ లెఱుఁగఁడు నేఁడుం। గన్నులు దెఱువని మాయీ। చిన్నికుమారకుని యవ్వ సేయం
దగునే॥ (గీ॥ అన్నమెఱుఁగఁడు తనయంత నాడుచుండు। మంచివాఁడితఁ డెగ్గులు మానరమ్మ। రామలార త్రిలోకాభిరామలార।
తల్లులార గుణవతివతల్లులార॥ (వ॥ అని యశోద వారల నొడంబఱిచి పంపి కొడుకుం గోపింపం జాలక యుండె నిట్లు॥ (ఉ॥ కాం
తలు దల్లితోఁ దన వికారము లెల్ల గణింప భీతుఁడై। శాంతుని సొంపు నస్వరమ సాధుని పెంపుని గోలమాడ్కి వి। భ్రాంతుని కైవడి

—* మృద్భక్షణవిశ్వరూపప్రదర్శనాద్యభివర్ణనము. *—

జడునిభంగిఁ గుమారకుఁ డూరకుండెనే । వింతయు లేకపల్లి కుచవేదికపైఁ దలమోపియాడుచున్ ॥ (వ॥ అంతనొకనాఁడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినెనని చెప్పిన యశోద బాలుని కేలువట్టి కోపించి యిట్లనియె ॥ (క॥ మన్నేటికి భక్షించెదు । మన్నియ సామి లేలని వుమన్నింపవు నీ । యన్నయు సఖులును జెప్పెద । రన్నా మన్నేల మఱిపదార్థము లేదే ॥ (వ॥ అనిపలికిన ముకుదతల్లికి నెఱకంటనైన కొడుకిట్లనియె ॥ (శా॥ అమ్మా మన్నుఁదినంగ నేశిశువనో యాఁకొంటినో వెఱ్ఱినో । నమ్మంజూడకు వీరిమాటలు మది న్నన్నీవు గొట్టంగవీ । రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేని న్మదీయాస్యగం । ధమ్మాఘ్రాణము సేసి నావచనముల్ దప్పైన దండింపవే ॥ (వ॥ అని పలికి నెయ్యంబున నయ్యవ్యయుండు లీలామనుజబాలకుండైన యీశ్వరుండు తననోరుఁ దెఱచి ముఖంబుఁ జూపిన ॥ (క॥ ఆలలితాంగి గనుంగొనె । బాలుని ముఖమందు జలధిపర్వతవనభూ । గోళశిఖితరణిశశిదిక్పాలాదికరండమైన బ్రహ్మాండంబున్ ॥ కనుంగొని ॥ (మ॥ కలయో వైష్ణవమాయయో యితరసంకల్పార్థమో సత్యమో । తలఁపన్నేరక యున్నదాననొ యశోదాదేవి గానో పర । స్థలమో బాలకుఁ డెంతయీతని ముఖస్థంబై యజాండంబు ప్రజ్వలమై యుండుటకేమిహేతువొ మహాశ్చర్యంబు చింతింపఁగన్ ॥ (గీ॥ బాలమాత్రుఁడగు పలిలుని ముఖమందు । విశ్వమెల్ల నెట్లు వెలసియుండు । బాలుభంగి నితఁడు భాసిలుఁ గాని న । రాత్ముఁడాదివిష్ణుఁ డగుట నిజము ॥ అని నిశ్చయించిన ॥ (గీ॥ ఏమహాత్మువలన నీవిశ్వరూపంబు । గానఁబడి బుద్ధి కంపమయ్యె । నామహాత్ము విష్ణు నఖిలలోకాధారు । నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు ॥ (క॥ నా మగఁడు నేను గోవులు । నీ మందలు గోపజనులు నిబ్బాలుని నె । మ్మోమందున్న విధము గని । యేమఱితిమి గాని యీశుఁడీతఁడు మాకున్ ॥ (వ॥ అని తన్నుఁ బరమేశ్వరుండని తలంచుచున్న యశోదయందు నా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన ॥ (క॥ జడను వడి మఱుక చెడియో । పడఁతుక పశ్చాత్తుఁ డనుచుఁ బలుకక యతని న్గొడుకని తొడపైనిడుకొని । కడువేడుక తోడను మతాగావించెన్నృపా ॥ అని నవిని రాజిట్లనియె ॥ (గీ॥ జగదధీశ్వరునకుఁ జన్నిచ్చి ప్రల్లిగా । నేమి నోము నోఁచె నీ యశోద । పుత్రుఁడనుచు నతనిఁ బోషించు తండ్రిగా । నందుఁ డేమి చేసె నందితాత్మ ॥ (క॥ ప్రబ్బిన భక్తిని హరిపైఁ । గబ్బంబులు సెప్పి కవులు కైవల్యశ్రీ కబ్బు మఱట హరిపోషణ । మబ్బిన తలిదండ్రులెచటి కబ్బదురుతుదిన్ ॥ అనిన విని రాజయోగికి శుకయోగీంద్రుఁ డిట్లనియె ॥ (సీ॥ అవనీశ విను ద్రోణుఁ డను వాఁడు వసువులయందు ముఖ్యుఁడు ధర యతని భార్య । వారిద్దఱును బ్రహ్మ వసుధపై జన్మించుఁడంచుఁ బంపిన వారలనెఁ జూచి । విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి మాకిచ్చితేని యమహీజనింతు । మనవుడు నట్ల కాకని యె వేల్పుల పెద్దయాద్రోణుఁడే నందుఁడై జనించె । ధర యశోదయయ్యెదను జేంద్రవైరియుఁ । గమలగర్భుమాటఁ గారవించి । తల్లిదండ్రులను చుఁదగ వారిమన్నించె నధిక భక్తితోడ నలరి రిట్టు ॥ (వ॥ అంతనొక్క నాఁడు తనయింటి కడపాపలం దఱు నయ్యయిపనులందుఁ బంపువ

—* కృష్ణుఁడు దధిభాండవికలనాదుల చేసుటవలన యశోద యతని వెంట దిరిగి పట్టుకొనుట. *—

డిపోయిన నందసుందరి సంరంభమునందరి కంబంబుకడ మదుదుగా నొక్క దధికుంభంబు వెట్టి మిసిమిగల మీఁగడ పెరుగుతూడం బోసి వీఁక నాఁకత్రాడు కవ్వంబున నలవరించి ॥ (సీ॥ కరకమలారుణకాంతిఁ గవ్వపుఁ ద్రాడు పవడంపు నునుదీఁగె పగిది మెఱయఁ । గ్రమముతో రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడ నొండొంటి వీఁక మెత్తఁ । గుచకుంభముల మీఁది కొంగు జాఱఁగఁ జిక్కు వడుచు హారావళుల్ బయలుపడఁగఁ । బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము మంచు పైఁ బడిన పద్మంబుఁ దెగడఁ । గౌను నులియంగఁ గంకణక్వణన మెసఁగఁ । దుఱుము బిగి వీడఁ గర్ణికాద్యుతులు మెఱయ । బాలు నంకించియప్పుడు పాటఁ బాడఁ । బరువులిడు రొత్తఁ జెమరింతి పఱువఁ జొచ్చె ॥ ఆ సమయంబున ॥ (క॥ సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు । సడిగొట్టుచు నమ్మరమ్ము చన్నిమ్మనుచున్ । వెడవెడ కంతులువైచుచుఁ । గడవఁగ దిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్ ॥ (క॥ కవ్వముఁ బట్టిన ప్రియసుతు । నవ్వనరుహనేత్ర దగిచి యంకతలమున న్నవ్వుచు నడుకొని కూఁకటి । దువ్వుచుఁ జన్నిచ్చెన తఁడు దూఁటుచుఁ గుడిచెన్ ॥ (మ॥ కడు పారంజను బాలుఁ ద్రావినసుతుంగం జాత్కిపీఠంబుపై । నిడి పొంగారెడు పాలు డించుటకుఁ బోవం జూచి తద్బాలుఁడె । క్కుడు కోపంబున వాఁడి ఱ్ఱాఁత దధిమత్కుంభంబు వోఁ గొట్టి తెం । పడ రంగుంభములోని వెన్నఁ దినె మిథ్యాసంకులద్బాష్పుఁడై ॥ (వ॥ అంత వాలోలలోచన పాలు డించి వచ్చి వికలంబులయిన దధికుంభశకలంబులఁ బొడఁగని తుంటకొడుకు వెన్న దింట నెఱింగి నగుచు నాకలభగామిని యతని గానక చనిచని ॥ (గీ॥ వికచకమలనయన వేఱొకయింటిలో । వెలయ రోలుఁ దిరుగ వేసి యెక్కి । యుట్టిమీఁద వెన్న నులుపుచు నొకకోఁతి । పాలు సేయుచున్న బాలుఁ గనియె ॥ (మ॥ కని చేత న్సెలగోల వట్టికొనుచు న్గానిమ్ము కానిమ్ము రా । తనయా యెవ్వరియాజ్ఞఁ జిక్కపడ నేదండంబు నంగాననే । విని వారంబును బొందనే వెఱవు నేవి భ్రాంతియుం జెందము । న్ననియున్ని విటునన్నుఁ గైకొనవు నేఁడారీతి సిద్ధించునే ॥ అని యదలించుచుఁ గొడుకు నడ్డు వడిందలం చితను మధ్యతనమనంబున ॥ (సీ॥ బాలుఁ డీతండని భావింతునందునా యేపెద్దలును నేరరీక్రమంబు । వెఱపెఱుంగుటకునై వెఱపింతునందు నాకలిగి లేకొక్కఁడుగాని లేఁడు ।

వెఱపుతో నాబుద్ధివినుపింతునంచు నాతనుదానమైబుద్ధిఁదప్పకుండు । నొండెఱుంగక యింటనుండెడినందు నాచొచ్చిచూడని దొకచోటు లేదు।నన్ను నెవ్వరైనఁదలపోయఁబాతెడు।నోఁజలేదు భీతిమెుక టెఱుంగఁ । డెలమి నూరకుండఁడెకసక్కెముల నాఁడు।బట్టిశాస్తి సేయుఁభంగియెట్లు ॥ అనివితర్కించి*(క॥లాలనమునబహుదోషము।లోలింబ్రాపించుఁదాడనో పాయముల౯।జాలగుణంబులుగలుగును।బాలురకును దాడనంబుపథ్యంబరయ౯ (వ॥అనినిశ్చయించి కేలనున్నకోలఝళిపించి బాలానిలునిలుమనిభగ్నుభగ్నుననవల్చితల్లిడగ్గరిన బెగ్గడిలినచందంబునసగ్గలికచెడికోలుడిగ్గనుఱికి*(క॥గజ్జలుఘల్లనిమ్రోయఁగ।నజ్జుట్రొక్కటలు మానియతిజవమున యో।షిజ్జనములనగఁదల్లియుఁ । బజ్జంజను దేరనతఁడు పరువిడెనధిపా॥అప్పుడు*(మ॥స్తనభారంబునడస్సి గ్రుస్సియసదైజవ్వాడు మధ్యంబుతో । జనితస్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో । వనజాతేక్షణ పాఱి వెంటఁదిరిగె౯ వారించుచున్ వ్రేఁకట౯ । ఘనయోగీంద్రమనంబులున్ వెనుకొనంగా లేనిలీలారతు౯ ॥ ఇట్లు కూడంజని* (సీ॥ స్తంభాదికంబులు దనమనసడ్డంబై నట్టట్టుఁ జనిపట్టనీనివాని । నీతప్పుసైరింపుమింకఁదొంగిలఁబోవ నేననిమును ముట్టనేడ్చువానిఁ।గాటుక నెఱయంగఁ గన్నులునులుముచు వెడలు కన్నీరుతో నడలువాని। నేదెసవచ్చునో యిదియనిపలుమాఱుసారుచుఁ గ్రేఁగంట జూచువానిఁ।గూడఁబాఱిపట్టుకొని వెఱపించుచుఁ।జిన్ని వెన్నదొంగచిక్కెననుచు । నలిగికొట్టఁ జేతులాడకపూఁబోఁడి।కరుణతోడ బాలుఁగట్టఁదలఁచి*(క॥వీరెవ్వరు శ్రీకృష్ణులు । గారాయెన్నఁడును వెన్నఁగానరటఁకదా।చోరత్వంబించుకయును। నేరరటధరిత్రీనిట్టిసయితులు కలరే* (క ॥ పట్టినఁబట్టువడనినినుఁ । బట్టెదననిచలముఁగొనినఁ బట్టుట బెట్టే।పట్టుఁబడవంద్రు పట్టీ।పట్టుకొనన్నాఁడుఁగాక పరులకువశమే*(క॥ఎక్కడనైననుదిరిగెద । వొక్కయెడ౯ గుణముగలిగియుండవునియమం।బెక్కడిదినీకును అదనఁ । జక్కఁగఁబోయెదవు పెక్కుజాడలఁబుత్రా* (సీ॥ తోయంబులివియనితొలఁగకచొచ్చెదుశలచెదవెల్లెనఁదరల నెత్తి మంటితో నాటలు మానవుకోరాడె మన్నత స్తంభంబులూఁపఁబోయె । దన్నులనల్పంబులడుగంగఁబాఱెదురాచ వేఁటలజాలఁఅవ్వఁదెచ్చె । దలయవునీళ్లకు నడ్డంబుగట్టెదుముసలిపైహరివృత్తిమొనయఁజూచె। దంబరంబుమొలకునడుగవుతిరిగెద।వింకఁగలికి సేఁతలేలపుత్ర । నిన్నువంపవ్రాల్ప నే నేరననియునీ।విట్లు క్రింమమిూఁమ నెఱుఁగకునికి॥అనినర్మంబులెత్తిపలికి*

—* ఉలూఖలబంధన-యమళార్జునభంజనాద్యభివర్ణనము. *—

(క॥ఆలలనగట్టెరోల౯।లీలన్నవనీతచౌర్యశీలు౯ బ్రియవా।గ్జాలు౯ బరివిస్మితగో।పాలున్ముక్తాలామహాలున్ బాలు౯*(క॥రోలనుగట్టువడియును।బ్బాలుడుపలసిల్లెభక్తపరతంత్రుండై । యాలానసన్నిబద్ధవి।శాలమదేభేంద్రకలభసమరుచినధిపా*(క॥వెలిలోను మొదలుతుదినడు । ములులేకజగంబుతుదియు మొదలున్నడును।న్వెలియయ్లోనగునీశ్వరు।నలవడునేకట్టబ్రజకురాల్గాకున్న౯* (గీ॥ పట్టియలరుబోఁడిపట్టియీతండని।గట్టెతలఁపుతోడఁగట్టెగాక । పట్టికడుపు పెక్కుబ్రహ్మాండములుపట్టు। బెట్టిఁగె నేఁదల్లి మేలకట్టు* (క॥ చిక్కఁడుసిరికౌఁగిటిలోఁ।జిక్కఁడుసనకాదియోగిచిత్తాబ్జముల౯।జిక్కఁడుశ్రుతిలతికావలిఁ।జిక్కెనతఁడులీలఁదల్లిచేతన్ రోల౯* (వ॥ఇట్లుగ్రద్దనవాముద్దియముద్దులపట్టియుదరంబుగట్టనడరుచుఁ జతురంబుగఁజక్కనొక్కత్రాడుచుట్టిననది రెండంగులంబులకడసుపడియె మఱియునొక్కబంధంబు సంధించివలగొననినంతియకొలంతయయ్యె- వెండియునొక్కపాశంబుఁగూర్చివరివేష్టించినవెత్తిఁజూపెనిట్లు* (క॥ తజ్జననిలోఁగిటంగల।రజ్జుపర్వంపరలఁ గ్రమ్మరన్నుతుఁగట్ట।న్నొజ్జదిరిగి రాదయ్యెజ।గజ్జాలములున్న బొజ్జఁగట్టన్వశమే(వ॥అప్పుడాయవ్వ యుగోపికలును వెఱంగుపడిరితదనంతరంబ* (గీ॥ఒడలఁజెమటలెగయను త్తరీయముజాఱ।వీడియున్నతుఱుమువిరులురాలఁ।గట్టరానితన్నుఁగట్టెదననిచింతఁ।గట్టుకొనినతల్లిఁగరుణఁజూచి* (క॥బంధవిమోచనుఁడీశుఁడు । బంధింపఁబెనంగుజననిపాటొర్చిసుహృ।ద్బంధుఁడుగావునజనని।బంధంబునగట్టువడిమెఁబాటించినృపా* (క॥ సంగడితిరిగెదుశంభుఁడు।నంగాశ్రయమైనసిరియునాత్మజుఁడైయు।స్పొంగెదుపద్మజుఁడుగో।పాంగనక్రియఁగరుణవడయరఖిలేశ్వరుచే౯* (క॥జ్ఞానులచేమానులచే।దానులచేయోగసంవిధానులచేత।న్మానినిబద్ధుండగునే । శ్రీనాథుఁడుభక్తియుతులచేతంబోలె౯* (వ॥ అంతనయ్యశోదయింటికడపనులవెంటందిరుగఁగృష్ణుండుతొల్లి నారదుశాపంబుననిరుమద్దులైయున్ననలకూబరమణిగ్రీవులను గుహ్యకులనిద్దరింగనిరోలీడ్చుకొనిచనియెననిచెప్పినశుకయోగివరునకుభూవరుండిట్లనియె* (క॥నారదుఁడేలశపించెను।వారావృతుత్వమునకువచ్చినపనికిం।గారణమెయ్యదియోగికు। లారాధ్యయెఱుంగఁజెప్పవయ్యవివరము౯* (వ॥ అనినశుకుండిట్లనియె-మున్నుకుబేరునికొడుకులిరువురుశంకరకింకరులై యహంకరించి వెండికొండమీఁద విరులతోఁటలంబాడెడిచేడియలంగూడికొని కరేణుసంగతంబులైనయేనుంగులభంగిసురగంబులైన మందాకినీతరంగంబులంగ్రీడింప నారదుండువచ్చిననచ్చెలువలుచెచ్చెరవలువలుధరియించిరి - మదిరాపానపరవశులుగావున వారలిరువురువివస్త్రులై మెలంగుచున్నామునీశ్వరుండుచూచి

శపియించు వాఁడై ప్రతీతంబగు గీతంబు నాడెపినుము॥* (శా॥ సంపన్నుండొరుఁ గాన లేఁడు తనువున్ సంసారమున్నమ్మి హింసింప
సంజూచు దరిద్రుఁ డెత్తునడిఁ బుష్టిః భూతుఁడై దిక్కు హింసింపండన్యులవాత్మకుప్పములు గాఁ జింతించు నజ్ఞాతుఁడై ॥ స్పంచి
న్నాంధునకంజనంబువిను మీ దారిద్ర్యమూహింపఁగన్ ॥ అని గీతంబు వాడి తనన నంబున* (క॥ కలవాని సుతులనాను మమును॥ గ
లకంటులతోడఁ గూడి కానరు పరులన్ గలలో నైనను వీరికిఁ। గల క్రొవ్వడఁగించి బుధులఁ గలుపుట యొప్పున్* (వ॥ అని చింతించి వి
జ్ఞానవిశారదుండగు నారదుండు నలకూబర మణిగ్రీవులం జూచి మీరలు శ్రీదుబాంధులరు గావున భూలోకంబున నర్జునత
రువులై నూఱు దివ్యవర్షంబులుండుండుట మీఁద గోవిందచరణారవిందపరిస్పందంబున* (క॥ ముక్తులరై నారాయణ। భక్తులరై
పరమసాధు భావశ్రీసం। యుక్తులరై సురలోక। వ్యక్తులరయ్యెదరు నాదు వాక్యము కతనన్* (వ॥ అని యిట్లు పలికి నారదుండు నా
రాయణాశ్రమంబునకుం జనియె వారిరువురుం గాఢమత్తులై రిపదమభాగవతుండైన నారదు మాటలు పాటించుచ్చి పాటించి*
(క॥ ముద్దులతక్కరి బిడ్డఁడు। గద్దరిగా ఱ్రంగఁ దలఁచి యసలక డానా। గద్దించి వయన్న చోటికిఁ। గ్రద్దన రోలీడ్చికొనుచుఁ గడఁక
న్జనియెన్* (వ॥ చని యా యమార్జునంబు వలుం డునిజోదరదామసమాకృష్యమాణ తిర్యగ్భవముల యూఖలుండై యారెంటి మ్రాకు
లనడుమం జొచ్చిముందరికిని గుదుచు* (క॥ బాలుఁడు రోలడ్డముదివ। మూలంబులు పెకలి విటపములు విరిగి మహా। భీలధ్వనిఁ గూ
లెను శాఖా। పాలస్యవివర్జనములు యమళార్జునముల్* (వ॥ ఇట్లు నిర్మూలంబులై పడిన పాలంబుల లోనుండి కీలికీలలు వెల్వడలు
పోలికనెక్కుడు తేజంబున దిక్కులు పికటిల్లం బ్రసిద్ధులైన సిద్ధులిద్దఱు వెడలి వచ్చి ప్రబుద్ధులై భక్తలోకపాలకుండైన బాల
కునకు మ్రొక్కి లేచి కరకమలంబులు మోడ్చి యిట్లనిరి* (క॥ బాలుఁడవె నీవు పరుఁడవు। నాలంబుఁడ వధీశ యోగివాద్యుఁడవు త
నుస్థూలాకృతియగు విశ్వము। నీ లీలారూపము ముని పుణులు కృష్ణా* (సీ॥ ఎల్ల భూతంబుల క్రిందియహంకృతి ప్రాణంబులకు
నధిపతివి నీవ। ప్రకృతియుఁ బ్రకృతి సంభవమహత్తును నీవ వీనికన్నిటికిని ప్రభుఁడవీవ। ప్రాకృతగుణవికారములఁ బొందక పూర్వ
సిద్ధుఁడవగు నిన్నుఁ జింత జేయ। గుణహతుండో పునే గుణహీనని యుండక లగుణంబుల నీవకప్పఁబడుదు। మొదల నెవ్వని యవతా
రములు శరీరులం దు సరిదొడ్డు లేని వీర్యముల తనువులు। డలజన్మించి వారలయందుఁ జిక్క। నట్టి పరమేశ మ్రొక్కెదమయ్య నీకు*
(క॥ భువనములు సేయఁగావఁగ। నవతీర్ణుఁడవైతి కాదె యఖిలేశ్వర యో। గివరేణ్య పశ్యమంగళ। కిపసన్నుతవాసుదేవ కల్యా
ణనిధీ* (ఉ॥ పేంద్రవజ్రము॥ తపస్వి వాక్యంబులు దప్పవయ్యె। న్నేపంబునం గంటిమి నిన్నుఁ జూడ। న్దపంబులొప్పెన్ మముఁ దావకీ
య। ప్రసన్నులం జేయుము భక్తమిత్రా* (శా॥ నీపద్యాళులాలకించు చెవులన్ నానాడు వాక్యంబులన్। నీ పేరంబని సేయు హ
స్తయుగము న్నీమూర్తిపైఁ జూపులు। నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపై జిత్తము। లీ పైబుద్ధులు మాకు నిమ్ము
కరుణన్నీరేజపత్రేక్షణా* (వ॥ అని యిట్లు కీర్తించిన గుహ్యకులం జూచి నగుచు నులూఖలబద్ధుండైన హరి యిట్లనియె* (క॥ తనుత
మకర్మముఁ దప్పక। సములై ననునమ్మి తిరుగు సభ్యులకును బం। ధమనను జూచిన పరియును। గనులాపుఁడు వోడమువిరియు ఘన
తమము క్రియన్* (క॥ కారుణ్యమానసుండగు। నారదు వచనమునఁ జేసి ననుఁ బొడఁగనుట। నీ మీరు ప్రబుద్ధులరైతిరి। చేరెన్నా మీ
దఁ డలఁపు సిద్ధము మీకున్* (వ॥ అని యీశ్వరుండు మీరు మీ నెలవులకుం బొమ్మని యానతిచ్చిన మహాప్రసాదంబని వలగొని పె
క్కు మ్రొక్కులిడి నలకూబర మణిగ్రీవులు నుత్తరభాగంబునకరిగిరంత నందాదులైన గోపాలకులు నిర్మూలంబులై పడిన సా
లంబుల చప్పుడు పిడుగు చప్పుడని శంకించి వచ్చి చూచి* (క॥ ఈ పాదపములు గూలఁగ। నీ పాపఁడు లూఖలమున నిటబద్ధుండై। యేప
గిది బ్రతికెఁ గంటిరె। వాపోవఁడు వెఱవఁ డెట్టివాఁడో యితఁడున్* (గీ॥ పిడుగు వడదు గాక పెనుగాలి విసరదు। ఖండితంబులగుట
గానరాదు। బాలుఁడితఁడు పట్టి పడఁద్రోయఁ జాలఁడు। తరువులేల కూలె ధరణిమీఁద* (వ॥ అని పెక్కండ్రు పెక్కువిధంబులను
త్పాతంబులు గావలయునని శంకించిన నక్కడనున్న బాలకులిట్లనిరి* (క॥ నందుని కొమరుఁడు వినుఁడీ। సందున ముందూఱి రోలు
సరినడ్డముగా। ముందఱికీడ్చిన మద్దులు। గ్రంకుగొనంగూలెఁ జనులఁ గంటిమి మరువురన్* (వ॥ అని యిట్లు పలికిన బాలకాలాపంబులు
విని మిథ్యారూపంబులని కొందరందురు - కొందరు నానావిధంబుల సందేహించిరంత నందుండు వికసితవదనారవిందుండగు
చుఁ బట్టికట్టు విడిచెనట్టి యెడఁ దన తెఱంగెవ్వరు నెఱుంగకుండ వలెనని కపటకుమారుండు* (ఉ॥ పాడుమ్మందు నిభంగి గోపవని
తల్ పాణితాళను ల్సేయఁగా। నాడున్ జంత్రముకై వడిస్బరవశుండై హస్తముల్ద్రిప్పుచు। న్జూడన్నేరనివాని భంగిఁ దలయూఁ
చున్నగువ్వాలుర। న్గూడున్ బ్భృద్గలపంపు సేయఁజనుడాఁగున్ మట్టిజిట్టాడుచున్* (క॥ చుంచొదవుఁ బాలు ద్రావుము। దంచితముగ
ననుఁడుపాలు ద్రావ జననితోఁ। జుంచొదవదను చులీలా। చుంచుండై యతఁడు చుంచుఁ జూపెన రేంద్రా* (క॥ సెలగోల పట్టుకొని
జలకలశము లోనీడఁ జూచి కలశియుతుండై। సెలగోలపాపఁడొకఁ డిదె। తలచెన్నను గొట్టననుచుఁ దల్లికిఁ జెప్పెన్* (క॥ భిక్షు
లువచ్చెద రేడ్చెన। భిక్షాపాత్రమున వేసి బెగడించినన్। శిక్షించెదరని చెప్పిన। భిక్షులఁ గని తల్లి గని యభీతిల్లెన్ నృపా* (వ॥ ఇట్లు

—* నందాదులు బృందావనంబునకు నరుగుదెంచుట. *—

కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింపఁ బృహద్వనంబున నందాదులైన గోపవృద్ధులు నానా త్పాతంబులగుట యుఁ జూచి యెల్లవారుఁ బాలుండు తరించుటయును జూచి యేకాంతంబున నొక్కనాఁడు విచారింప నుపనందుండను వృద్ధగోపకుండు తన యోజన మెఱిఁగింపఁ దలఁచి యిట్లనియె.* (ఉ॥ ఇక్కడనుండు రేనుజులీమ కృష్ణున కెగ్గు సేయఁగా। రక్కసులాలు చన్నొసఁగె, దాని లవ యుఁ బ్రిదిగాలిపీఁచెఁ బైఁ । గ్రిక్కిరియండ కుల్వడియెఁ గేశవు సత్కృప దప్పె జాలునేఁ । డెక్కడికైనఁ బోవలయు సంకటగోపకు లారవింటిరే॥ (క॥ కసవుగలదిగ వృపసులకు, లసదద్రి నదీ నహీజలతికావళిఁ బెంపెసఁగును గా పురమునకు నుబ్బొసఁగును బృందావనంబు పోదఁడ చ్చటికిన్* (వ॥ అనుపలుకుల కార్యులైన గోపకులిదియ కార్యంబని యందఱు నియ్యకొండని మందలయాలమంద లానంద గమనంబున నందఱు నడువం బంది పిలుందంగ్రందుకొనకుండ బాలవృద్ధనారు లెక్కిన తేరులు సాగించి తనుత్రాణ తూణీర బాణధరులై వింట్లు పట్టుకొని నడువ బండ్ల వెనుకం గొమ్ములు నిమ్ములం బూరించుచు ననార్యంబులగు తూర్యరవంబులు సార్యపురోహిత సమేతులై వేడుకలుకొనలు నిగుడ మొనలేర్పఱచుకొని పావనంబగు బృందావనంబునకుం జనిరప్పుడు.* (తరల॥ పసపులాడి యురోజకుంకుమ పంకశోభితలై లసద్వసనలై కచభారచంపకదామలై సులలామలై పసిఁడిమాడల కాంతు లట్లులఁ బస్సెఁ దేరుల మీఁద పెం పెసఁగఁ బాడిరి వ్రేతలా హరి హేలలింపను నేలలన్* (వ॥ అప్పుడు రోహిణీయశోదలేకరథంబునం బరి పూర్ణమనోరథలై రామకృష్ణుల ముందిడుకొని వారల వినోదంబులకుం బ్రమోదంబునొందుచుండిరిట్లు గోపకులు బృందా వనంబుసొచ్చి యందర్ధచంద్రాకారంబుగ శకటసందోహంబు నిలిపి మందలు విడియించి వసియించిరి* (క॥ చెందిరి బలమాధవుల భీ । నందించుచుఁ బావనమిది యంచిత కాళిందీసంజీవనము । న్బృందావనము న్మహేంద్రబృందావనమున్ * (వ॥ ఇట్లు బృందావనంబు చేరి కొంతకాలంబునకు రామకృష్ణులు సమానవయస్కులై గోపబాలకులం గూడుకొని వేడుకలు దుకొ నెమ్మాడల గ్రామము చు * (సీ॥ వేణువులూఁదుచుఁ బక్షిరూపములతో గంతులువైచుచు గొరుకుకము న । సురుకంబళాదులఁ గోవృ షంబులఁ బన్నపరవృషభములని ప్రతిభటించు । గల్లుబుధట్టించి యంఘ్రులగజ్జెలు మొఱయ దన్నుదురోలి మున్మరముగఁ । బన్ని దంబులువైచి ఫలములు జగులు గూర్చి వేటులాడుచు రుచిప్రావీణ్యమొప్ప । వన్యజంతుచయంబుల వానివాని । బదులు పలుకుచు వం చించి పట్టఁబోవు । రంబుజాకరముల జల్లులాడఁ జనుచు । రాకుమారులు బాల్యవిహారులగుచు* (క॥ పోరుమరుగికురువాడుచు చుంద్దాఁగుడుమూఁత యంబులేక తోరపుటెవ్వుల్లజ్జా లుదురు ఘనశిలాతటి । మీఁదు దెన్నంగ రాని మెలఁకువలన్నృపా॥......*

—* వత్సాసుర బకాసురుల వధ. *—

(వ॥ అంతనొక్కనాఁడు యమునాతీరంబున నాకుమారులు గోపకుమారకులందఱును క్రేపుల మేఁపనొక్కరక్కసుండు క్రేపు రూపంబున వచ్చి వారిలఁ బెనంపందలంచి* (క॥ క్రేపులయట్టుల నాఁకుచుఁ । గ్రేపుల లోనిదియుఁ బొంచి క్రేపఁగఁ గదుమన్ । జూపట్టి భక్తసంగతి । క్రేపై చనువాని ద్రోలఁ గ్రేపై తిరిగెన్ ॥ వానినెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పిన* (చ॥ ఇది యొక దానవుఁ డేగతివినుఁడెంతయు నొప్పెడి సంచుఁ దానెత । త్పదములు తోఁకయున్ బిగియఁ బట్టి చెలంగి వెలంగ నానుతోఁ । జదియఁ గనొక్కపెట్టుఁ గొనిచంపెఁ గుమారుఁడు లేఁగ రక్కసుం । గుదుఁబుకొనంగ బాలకులు కేయని యార్చ నఖర్వలీలతోన్ * (వ॥ ఇట్లు రక్కసుండు వట్టువడి విశాలంబగు సాలంబుతో నేలం గూలెనప్పుడు * (క॥ గొంగడు లెగరఁగ వైచుచుఁ । జంగున దాఁటుచును జెలఁగి చప్పటలిడుచున్ । బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచుఁ । గ్రుంగిన రక్కసునిఁ జూచి గుల్లిరిగోపకుల్ * (వ॥ ఆసమయంబున వేలుపులు విరులవానఁ గురియించి రప్పుడు* (క॥ వత్సములవగిది జగముల । వత్సలతన్మనుపఁ జూచువాఁడై యిం టన్ । వత్సముల మేపుచుండియు । వత్సాసురుఁ జంపె భక్తవత్సలుఁ డధిపా* (వ॥ మఱియునొక్కనాఁడు రేపకడ గోపకుమారులు క్రేపులం గొంచు నడపికిం జని యెండం బడి మెండుకొనిన దప్పి బెండువడి నతమతము లేఁగికదుపుల నేర్పఱించి నలువరించు కొనకలంకంబులేని యొక్క కొలంకున నీరుం ద్రావి వారును జలపానంబు చేసి వచ్చునెడ నందు* (క॥ అకలంకులు బాలురు గని । రకుటిలశంభోశిహాసిత ాద్రిశిఖరరూపక మున్ హరిహింసారంభకమున్ బకమున్ గాపిశాలభయదాంబకమున్ * (వ॥ కని దాని మొదలిపొడవునకు వెఱఁగుపడి చూచుచుండ* (గీ॥ ఎల్ల పనులు మాని యేకాగ్రచిత్తుఁడై । మౌనివృత్తి నతఁడు మసలుచున్న । వనములోన నిలిచి వనజాక్షుపై దృష్టి । జేర్చి బకుఁడు తపసి చెలువుఁదాల్చె॥ ఇవ్విధంబున నొదుగు బెట్టుకొని యుండిన * (ఉ॥ చంచువుఁ దీటవత్తుములు రుఖ్లన విచ్చి పదంబు లెత్తిన । ప్పించిన భంబుపై కెగసి భీషణ ఘోషణవక్త్రుఁడై విజృంభించి గరుత్సమీరము నభిన్నములై తమలోలఁ గూలఁగా । మించి బకాసురుండొడిసి మ్రింగెసహిష్ణుని జిష్ణు కృష్ణునిన్ * (క॥ సంగడిలోకముల న్నియు మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచును । ప్పొంగెడు వేడుకకాఁడటు । మ్రింగుడువడె బకుసచేత మిఁదెఱఁగి

నృపా* (క॥ దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ, గనలేక బలాదిబాలకప్రముఖులచే । తనులై వెలఁగందిరి వ, య్యనప్రాణము లేని యింద్రియంబుల భంగిన్ ॥ ఇట్లు మ్రింగుడుఁబడి లోనికిం జనక* (శా॥ కంఠోపాంతము దొండలున్నెఱియుమన్ గాలాగ్నిచందంబునన్ । గుంఠీభూతుఁడు గాక వేంద్రమును నా గోపాలబాలున్ జయో । త్కంఠన్ బన్నగగురున్ మహామహిమఁ జిక్కన్ గా మ్రింగరాదంచు సోల్లుంఠంబాడుచు వాఁడు గ్రక్కెన్ వెడలన్ లోకంబ శోకింపఁగన్ ॥ (క॥ కక్కిన నాహా ఘోషముతోఁ । జక్కఁగఁ దనుఁ బొడువ దాఁగఁ గఁజంచులు రెండున్ । ప్రుక్కఁగఁ బట్టి తృణముఁ గ్రియ । గ్రక్కున హరి చీరె బకునిఁ గల హైహావ్వరునన్ ॥ (వ॥ అప్పు డానందనంబున మీఁద వేలుపులు చాలుపులుగా నందనవల్లికాదికుసుమవర్షంబులు హర్షంబునం గురియించిరి - దేవవాద్యంబులు మ్రోయింప రామాది గోపకుమారులు ప్రాణంబులతోఁ గూడిన యింద్రియంబులం బోలెఁ గ్రమ్మఱఁ గృష్ణునిం గరమ్మని కౌఁగిలించుకొని కృష్ణసహితులై లేఁగదాఁటులను అలదాఁటించుకొని మందగమనంబున మందకరిగిన వారలచేత నా వృత్తాంతం బంతయు విని వెఱంగుపడి గోపగోపికాజనంబులు * (క॥ ఆపదలమీఁద నాపదలీ పాపఁడు సెంది తొలఁగెనీ యచ్చికుమై । వేపడి నఖిలులు దమహానిని, వైపున శలభములవగిదిఁ బడిరి ధరిత్రిన్ ॥ (వ॥ అని పలికిరి. అంత నారామకృష్ణులు లేఁగలం గాచుతఱి* (సీ॥ కపులమై జలరాశిఁ గట్టుదమా యని కట్టుదు రడ్డంబు కాలువలకు । మునులమై తపములు మొనయుదమా యని మౌనులై యుందురు మాటలేక । గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ బాడుదమా యని పాడఁజొత్తు । రప్సరోజనులమై యాడుదమా యని యాఁడురూపముఁ దాల్చి యాడఁజనుదు । రసురదైత్యవరులమై యబ్ధిఁద్రత్తమా । యని సరోవరములయందు హస్తిగండచయముఁ ద్రిప్పి తరుతురుతనువు యూఁడు । కోమరులను సరింపఁగోమకుమిగుల* (వ॥ అంత నొక్కనాఁడు రామకృష్ణులు కాంతారం

—* శ్రీకృష్ణుండు గోపకులతోఁ జేరి బంతిచల్దులు గుడువఁ గాంతారంబున కరుగుట. *—

బున బంతిచల్దులు గుడువ నుద్యోగించి ప్రొద్దున లేచి గ్రద్దన నందనయింటి లేఁగకదుపులం గదలించి సుగంధంబులగు శృంగంబులు పూరించిన విని మేలుకని సంరంభంబున గోపడింభకులు చలిదికావడులు మూఁపున వహించి సజ్జంబులగు ఖజ్జంబులు గట్టికొని పదత్రాణవేత్రదండధరులై లెక్కలకు వెక్కసంబైన తమతమ లేఁగకదుపులం జప్పుడించి రొప్పికొనుచుఁ గాననంబు సొచ్చి కాంచనమణిపుంజగుంజాదిభూషణభూషితులయ్యును ఫలకుసుమకోరకపల్లవవల్లరులతోడవుగా నిడికొని కొమ్ములు మ్రోఁగఁ బూరించుచు, వేణువు లూదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబులతోడం గూడి యాడుచుఁ, బికంబులం గలసి కూయుచు, శుకంబులం జేరి రొదలు సేయుచుఁ, బులుఁగులనీడ్యంబాఱుచుఁ, బొదరిండ్ల దూఱుచు, సరాళంబులగు వాఁగులు గడచుచు, మరాళంబుల చెంత నడచుచు, బకమ్ములం గని నిలుచుచు, సారసంబులఁ జొచ్చి యలంచుచు, నదీజలంబులందోఁగుచుఁ, దీఁగెయుయ్యాల లూఁగుచుఁ, బల్లంబులం డాఁగుచుఁ, దూరంబుల కేగుచుఁ, గపులసంగడిఁ దరువు లెక్కుచు, ఫలంబుల మెక్కుచు, రసంబులకుం జొక్కుచు, నింగికి నిక్కుచు, నీడలు చూచి నవ్వుచుఁ, గయ్యంబులకుం గాలుఁ ద్రవ్వుచుఁ, జెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు, బహుప్రకారంబుల శరీరవికారంబులు సేయుచు, మఱియును* (క॥ ఒకనొకని చల్దికావడి, నొకఁ డొకఁ డడఁగించి దాఁచు నొకఁ డొకఁ డది వే, యొకొకరి మొఱఁగికొని చను, నొకఁ డొకఁ డిది దెచ్చి యిచ్చు నుర్వీనాథా* (క॥ ఒక్కఁడు మున్నే మఱచిన, నొక్కఁడు బలుబొబ్బ వెట్టు నులికిపడన్నే, రొక్కఁడు మీఁఱి తటాలున, నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగన్ ॥ (క॥ తీపులగు ఖజ్జమ్మ్యాఁడు, గోపింపఁగ నోడి సిఫుచ్చుకొనుచు న్వాఁడు । న్నేపఱియదుగఁ గనొక్కఁడు, గ్రేపులలో నట్టునిట్టుఁ గిఱిరించు నృపా* (క॥ వనజాక్షుఁడు మున్నరిగిన, మనుపఁడ గానతని మేనుము ముట్టెదననుచున్ । జనిమును ముట్టనివాఁ, న్ముందుముట్టిన వాఁడు నవ్వు మొనసిన రేంద్రా ॥ ఇత్యర్థంబున* (ఉ॥ ఎన్నఁడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయున్ । గన్నులఁ గానరట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁబట్టుచున్ । దన్నుచు గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బైఁబడి కూడియాడుచున్ । న్మన్ననసేయు వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పునే* (క॥ వింతలకును బ్రహ్మసుఖా । నందంబై భక్తగణమునకు దైవతమై । మాంసలకు బాలుఁడగు హరి । హొందుగ నిరిగొల్ల లెట్టి పుణ్యులు గలరే ॥ అని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె* (క॥ అనుగులవృతపానఁబున । నమరిన వారయ్యు నేని శాటునిపంచ । త్వమునను నెవలు సూతురు । తమునన్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁడై* (క॥ బకునికిఁ దమ్ముఁడు గావున । బకమరణముఁ దెలిసి కంసు పంపున గోపా । లకబాలురతోఁ గూడన్ । బకవైరినిఁ ద్రుంతు నను చుఁ బటురోషమునన్* (క॥ బాలుర ప్రాణంబులు గో । పాలుర కుమదగ్రజాతు ప్రాణము మాఱీ । బాలురఁ జంపిన నంతియ । బాలును గోపాలు రెల్ల సమసిన వారల్* (వ॥ అని నిశ్చయించి యోజనంబు నిడుపును, మహాపర్వతంబు పొడవును, గొండతుదలమీఱిన కోరలును, మిన్నందన్నిపన్ని నల్లమొగుళ్ల పెల్లుగల పెదవులును, బిలంబులకు నగ్గలంబైన యిగుళ్లసందులు నంధకారబంధురంబైన వదనాంతరాళంబును, దావానలజ్వాలాభీలంబైన దృష్టిజాలంబును, వేఁడిమికి నివాసంబులైన యుచ్ఛ్వాసనిశ్వా

అల్లులు-భుజములును—పన్నిదము-పందెము—కిఱురువాడుచుచున్ = వెక్కిరించుచు, పలాలించుచు. వత్సము-శిశువు-దూడ. వత్సలతన్-కృపచేత.

సంబులును మెఱయు నేలనాలుకలును జెఱచుకొని ఘోరంబగు నజగరాకారంబున* (క॥ జాపెరము లేకయిప్పుడు। గ్రేపులతోఁ గో
ల్లమతులఁ గృష్ణుఁ దొరలఁ। గీపెట్ట మ్రింగెదనని। పాపపురక్కసుఁడు నేలఁబడియుండెన్ నృపా॥ ఆ సమయంబున* (మ॥ ఒకవ
న్యాజగరేంద్ర నగల్లదెగి రింద్రోత్సేధమై దావపా। వకకీలా పరుష ప్రచండతర నిశ్వాసంబుతో ఘోరవ। హ్నికరాళాతత జి
హ్వాకోడమునలఁ హింసింపనీక్షించుచుఁ। వికటంబై పడిసాగియున్నదిపురో వీథింగనుంగొంటిరే॥ అని యొండొరులకుం జూపు
చు* (మ॥ బకునిం జంపిన కృష్ణుఁడుండ మనకుం బాఁపంచుఁ జింతింపనే। టికిరా పోదము దాఁటి కాకయది కౌటిల్యంబుతో మ్రింగు
డుఁ। బకువెంటం జనుఁ గృష్ణుచేతననుచున్ బద్ధాతుఁ నీక్షించియు। న్నకుతై చేతులు వ్రేసికొంచు నగుచుం దుర్వారులై పోవఁ
గఁ॥ వారలఁ జూచి హరితన నంబున* (మ॥ అక్కట వీరెల్లఁ బాము దిపజాంతకుఁ డౌట నెఱుంగరక్కటా। నిగ్భయులై యొకరొ
క్కరి నేఁగల నంచు విమూఢులంచు నా। విఘ్నవదాగ్రహత్వమున వెఁదగులఁ దమ శేఁగపెందుతో। దుర్భర ఘోర సత్వ ఘనతుం
డబిలాంతముఁ జొచ్చి రందఱుఁ॥ అయ్యవసరంబున* (శా॥ వేల్పుల్ చూచి భయంబునొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వలత్క
ల్పాంతోజ్జ్వలమాః జిహ్వా దహనాకారంబు శ్రోమ్రింగెనా। స్వల్పాహీంద్రక్షుమాధ నార్పితమనో వ్యాపార సంచారుల
న్నల్పాకారుల శశ్వ భారులఁ గుమారాభీరులన్ క్షీరులన్॥ ఇట్లు పెనుబాము చేత మ్రింగు పడు పసులంగడి కాపి గములంజూచి కృష్ణుం
డు* (ఉ॥ పసుచులు లేఁగలుం గలసి పైకొని వత్తురు తొల్లి కృష్ణమా। కొడుకులఁ జేలరారనుచు గోపిక లెల్లను బలకన్ నేక్రియ। న్నా
డివెదనేఁడు పన్నగముఁ నోరికి వీరికి నొక్కలంకెగా। నొడఁబడ నేల చే సెపిధి యోడక సేయఁగదయ్య కార్యముల్* (వ॥ అనంత
లపోసి, నిఖిలలోచనుండును, నిజాశ్రిత నిగ్రహ మోచనుండును నైన, తమ్మికంటి మింటి వెరువరులు మొఱలిడ, రక్కసులుపొక్కమి
గుల వెక్కసంబగున జగరంబు కుత్తుకకుఁ బొత్తుగొని మొత్తంబు వెంటనంటంజని తమ్ము నందఱంచిందరవంకర చేసి మ్రింగనగ్గ
లించు నజగరంబు కంఠరంధ్రంబున సమీరంబు వెడలకుండ తన శరీరంబు పెంచి గద్దరి మిద్దైసలచింప్లుఁడు* (క॥ ఊపిరి వెడలక
డుపున। వాపోదవిసంబాము ప్రాణ వాతంబులు సం। తాపించి శిరము వ్రక్కలు। వాపికొనుచు వెడలిచని యోఁబటు ఘోషము
తోఁ* (శా॥ క్రూరవ్యాళవిశాల కుక్షిగతులన్ గోవత్ససంఘంబుతోఁ। గారుణ్యామృతదృష్టిచేత బ్రతుకంగాఁ జూచి వత్సంబు
లు। న్యారుం దానుఁ దదాస్య వీథి వెడల్ చెన్ ఘనోన్మత్తుఁడై। తా రాజీవముఖోడనా ప్పెనఁగునా తాఁదేశుచందంబునన్*
(గీ॥ అమరవరులకుఁ జూపఁగ నజాండంబెల్ల। బలిఁ దిరస్కరించి బలియవట్లు। గోపసుతులకోఁ అసుఁ బాపపు పెనుబాము। గళ
ముదూఁటుఁగట్టఁబడియెను న్నే* (ఉ॥ ఆ పెనుబాము మేననొక యద్భుతమైన వెలుంగు నిర్గతంబై దీపకమై నవడిల్వెడలి దేవపథంబు
నఁ దేజరిల్లుచుఁ। గ్రేపులు బాలురుం బెదరఁ గృష్ణుని దేహము వచ్చి చొచ్చె నా। పాపఁడు చొచ్చి ప్రాణములఁ బాపిన యంతన శుద్ధస
త్వమై* (క॥ తననూపా కవటాత్మైనను। మననమున నిడికొని నఁ బాపమంతయుఁ దన యొగ్గొనిచనుహరి తను మ్రింగిన। దనుజుఁ సంగొనిఁ
పోవకున్నెతన యొపలికిన్* (వ॥ తదవసరంబున, సురలు కుసుమవర్షంబులు గురియించిరి, గంధర్వులాడిరి మేఘంబులు మృదం
గంబులభంగి ఘోషించె, సిద్ధ గంధర్వులు జయజయ భాషణంబులు భాషించిరంత* (శా॥ ఆ వాద్యంబులు నా మహాజయరవం
బా పాటలా యాటలుం। దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిన్ భూమికేతెంచి నేఁ। డీవత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగనీ బా
లకుండీ వెంటప్ప్రతికించె మేలనుచు మోహం చెన్గనున్ని చ్వలోక్* (వ॥ అంత నయ్యజగర చర్మంబు కొన్ని దివసంబుల కెండి పె
ద్దకాలంబు గోపాలురకు కేళీ బిలంబై యుండె నట్లు కౌమారవిహారంబున నైదవయేఁట గృష్ణుండఘాసురుని నిందెగఁ జూచుటయుఁ
దమ్ముం గాఁచుటయు నా అవయేఁటి వృత్తాంతం బని త్తంబుల గోపకుమారులు పౌగండమునితలఁచు చుందురని చెప్పిన నప్పుడమి
ఱేఁడప్పరమయోగీంద్రున కిట్లనియె* (సీ॥ అయిదేండ్లు కౌమారమట మీఁద నయిదేండ్లు పౌగండమన మెడు ప్రాయమందు। న
యిదేండ్ల వాఁడై న యబ్జాక్షు చరితంబు పౌగండమని గోపబాలురెల్లఁ। దలఁతురంటది యొట్లు తలఁతురు వారలు నిరుడు చేసిన పని
నేఁటిదనఁగ। వచ్చునే యిది నాకు వరుసతో నెఱిఁగింపుమనవుడు యతిచంద్రుఁడైన శుకుఁడు। యోగదృష్టిఁ జూచి యొక్కింత భా
వించి। వినుము రాజవర్య పినయధుర్య। పరమ గుహ్యమైన నుచుఁ బలుకుదు రార్యులు। శిష్యజనులకీవు సేయుతలఁపు* (క॥ ప్రియురా
లి వలని వార్తలు। ప్రియజనులకు నెల్ల ప్రొద్దు ప్రియమగు భంగిన్। బ్రియుఁడగు హరి చరితంబులు। ప్రియభక్తుల కెల్ల యెడలఁ బ్రి
యములుగావే* (వ॥ అని పలికి యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె - నట్లఘాసురు ముఖంబువలనం గడచి లేఁగల గోపవరులం
బ్రతికించి వారును దానును జనిచని* (మ॥ కనియెన్ గృష్ణుఁడు సాధునీరము మహాగంభీరముం బద్మకైరవ కవస్వాదు విమోద

—* గోపాలబాలురు కృష్ణునితోఁ గూడి చల్దులారగించుట. *—

మోదమదభృంగద్వంద్వ ఝుంకారముఁ। ఘనకల్లోలలతావితాన విహార తాండవకోలాహల। స్వన విస్ఫారము నంచ వాయు
జకణాసారంబుఁ గాసారముఁ* (వ॥ కని తమ్మికంటి తమ్ములయింటి సొబగునకు నిచ్చ మెచ్చుచుఁ జెచ్చెరఁ గాలింగదలెడు కబుల్ల

సజ్జంబుల గుఖజ్జంబులు - మనోహరములయిన కర్ణకాయలను పిండివంటవిశేషము, గుంజ - గురివెంద — జాపెరము - ఆలస్యము.

తుంపురులజల్లు పెల్లుననొండొల్లుగఁ బుర్వొందు వకోలంపు కెలంకులఁ గాయపండులఁ గోలలఁ బ్రేఁగునవీఁగి పట్టుగల చెట్టుకొటుమునీడనొ
ప్పుచున్న యిసుకతిప్పలవిప్పు చూచి వేడుకఁ బిచ్చలింపఁ జెలులకిట్లనియె* (శా॥ ఎండన్ గ్రాగితి రారకట్టంబడితిరిం కేలావిలంబింప
గా। రండో బాలకులార చల్దిఁ గుడువన్ రమ్యస్థలంబిక్కడీ। దండన్ లేఁగలు నీరు ద్రావియిరవం దం బచ్చికల్ మేయుచుం। దండంబై వి
హరించుచుండఁగ నమంద ప్రీతి భక్షింతమే* (వ॥ అనిననగుఁగాకయని వత్సంబులను త్సాహంబున నిర్మలంబులగు జలంబులు ద్రా
వించి పచ్చికలమొల్లంబులుగల పల్లంబులనిలిపి చౌకళంబులగు చల్దులచిక్కంబులు చక్కడించి* (మ॥ జలజాంతస్స్థితకర్ణికం చిరి
గిరాసంఘంబులై యున్నరేఖల చందంబున గృష్ణునందిరిగి రాఁగూర్చుండి వీక్షించుచున్। శిలలున్ పల్లవముల్ తృణంబులు లతల్ ప్ర
క్కలంబులున్ బువ్వులా। కులు కంచంబులుగా భుజించిరి చటన్ గోపార్భకుల్ప్పావరా* (సీ॥ మాఁటిమాఁటికి వ్రేలు మడిచియూరిం
చుచు నూరుగాయలు దినుచుండు నొక్కఁడు। డొకనికంచములోని దొడిసి చయ్యన మ్రింగి చూడు లేదని నోరుఁ జూపునొకఁడు। పే
గురార్గురిచల్దు లెలమిఁ బన్నిదమాడి కూర్కొని మూర్కొని కుడుచునొకఁడు। డిన్నయుఁ బోరలు చునిడుచు నెచ్చెలితనమును చుబం
తినగుండ్లు నాడునొకఁడు। గృష్ణుఁ జూడుమనుచుఁ గకురించి వడిమ్రోల। మేలిభక్ష్యరాశి మెసఁగునొకఁడు। నవ్వునొకఁడు సఖుల
నవ్వించు నొకఁడు। ముచ్చటాడు నొకఁడు మురియు నొకఁడు॥ అయ్యవసరంబున* (సీ॥ కడుపున దిండుగాఁ గట్టిన వలువలో లా
లితవంశనాళంబుఁ జొనిపి। విమలశృంగంబును వేత్రదండంబును జాఱి రానీక డాచంకనిఱికి। మీఁగడపెరుగుతో మేళవిం
చిన చల్దిముద్ద డాపలిచేత మొనయనునిచి। చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుగాయలు వ్రేళ్లసందులను దా నెలయనిఱికి। సం
గడీలనడుమఁ జక్కనఁ గూర్చుండి। నర్మభాషణములనగవు నెఱపి। యాగభోక్త కృష్ణుఁడు బాగులు వెలుఁగఁ దశైశవంబు మెఱ
సిచల్దిగుడిచె* (వ॥ ఇట్లు కృష్ణసహితులైన గోపకుమారులు చల్దులు గుడుచు నెడ క్రేపులు మేపులకుం జొచ్చి పచ్చనిగఱికి జొం
పంబుల గుంపులకు ఱికిలంపులు మేయుచు ఘోరంబగు వనంబునడుమ దోరంబగు దూరంబు చనిన వారుం గానక వెఱచుచున్న గో
పడింభకులకు నంభోజనయనుండిట్లనియె* (మ॥ వినుఁడో బాలకులార క్రేపులటవీవీధిన్ మహాదూరముం। జని యెన్నోమలఘాసఖా
దనరతోత్సాహంబుతో నెంచుఁబో। మనో యేమమ్యో నా క్రూరజంతువులచే నేయాపదం బొందెనో। కని తెత్తున్నుదువుండు చ

—* బ్రహ్మ గోవత్సములను గోపాలకులనంతర్ధానంబు చేయుట. *—

ల్దిఁ గొఱఁతల్గాకుండ మీరందఱున్॥ అని చెప్పి* (శా॥ కర్ణాలంబితకాకపక్షములతో గ్రైవేయహారాళితో। స్వర్ణాభాసితవేత్ర
దండములతో సత్పింఛదామంబుతోఁ। బూర్ణోత్సాహముతో ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతోఁ। దూర్ణత్వంబున నేఁగె
లేఁగలకునై దూరాటవీవీధికిన్* (క॥ ఇచ్చోఁ బచ్చిక మేసెనొ। యిచ్చోఁ ద్రావెనొ వితోయ మేఁగెనొ యిచ్చో। నిచ్చోటనుండఁ గొన్నవి।
యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె యనుచున్* (క॥ కంజదళాక్షుఁడు వెదకెను। గొంజక లేఁగలను పారగురుతృణవనికా। పుం
జంబుల భీకరమృగ। కుంజంబులఁ దరుల గిరులఁ గోఁదరులనకున్॥ అంత* (శా॥ బాలుండయ్యు బకాసురానుజునిఁ ద్రుంపన్ బా
లుర క్రేపులన్। మేలిం బ్రతికించెనో యీ భువిన్ మాహింపంగడు జోద్యమం। చాలో నంబుజసంభవుండు చనిమాయా బా
లుకుంభద్బలం। బాలోకింపఁదలంచి డాఁచెనొకచో నాలేఁగలన్ బాలురన్* (వ॥ ఆసమయంబున కూడలు పోయిన జాడ లెఱుం
గక తప్పియప్పద్మలోచనుండెప్పటికోలంకులు కడకువచ్చి యచ్చోట నెచ్చెలులం గానక వారింజీఱి లేకుండుట నిశ్చయించి గోవిం
దుండు విశ్వవిదుండు గావున యిది విరించి మొఱంగని యెఱింగి తిరిగిపోవుచు* (శా॥ వంచింపంబని లేదు బ్రహ్మకిచటన్ వత్సంబు
లన్ బాలురన్। వంచించెం గనుఁ బ్రామితన్ను మఱలన్ వంచించుటాశ్చర్యమే। వంచింపన్ దన కేల తెచ్చుటయు నీ వర్ధించు బ్ర
హ్మాండము। న్వంచింపన్మఱలింప నేర్చు హరిలీలన్ మందహాసాస్యుఁడై* (క॥ గోబాలసుతులు లేరని। గోపికలకుఁ జెప్ప నేల గోపా
లకులున్ గోపికలును నలర బాలుర। క్రేపుల రూపముల నేఁ జరించెద ననుచున్* (మ॥ కరముల్ పాదములున్ శిరంబులవలగ్నంబుల్ ము
ఖంబుల్ భుజాం। తరముల్ ముక్కులు గన్నులున్ శ్రవణముల్ దంతాదులున్ దండకాం। బరశిగ్వేణువిషాణభూషణవయోభా
షా గుణాఖ్యానత। త్పరతల్ వ్రేడ్పడకుండఁ దాల్చె విభుఁడావత్సార్భకాకారముల్* (క॥ రూపంబులెల్లనగు బహురూపకుఁ డిటు
బాలవత్సరూపంబులతోఁ। దేపారుటేమి చోద్యము। రూపింపఁగ నతనికితరరూపము గలదే* (క॥ పలుపుల మని యెడుక ర్త్రయు।
వాఱిఁచు సుమారకులును వాఱ లెడి క్రేపు। ల్వరికింప దాన యైహరి। నా లంజనెలీలతోడ నందకునధిపా* (వ॥ ఇట్లు బాలవత్సరూ
పంబులతో విహరించుచు మందకు వచ్చి వారి వారి దొడ్లనయ్యా వత్సంబుల ముందఱికం దువలనిలిపి తద్బాలరూపంబులనందఱి
గృహంబులఁ బ్రవేశించి వేణునాదంబులు చేసిన* (చ॥ కొడుకుల వేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబులై। ముడివడలే
చి యెత్తికొని మూర్కొని తల్లులుఁ గౌఁగిలించుచుం। జడిగొనఁ జేఁపువచ్చి తమ చన్నులయందు సుధాసమంబులై। వెడలెడి పాలు
నిండఁ గొను వేడుక నిచ్చిరి తత్సుతాళికిన్* (వ॥ మఱియుఁ దల్లులుల్లంబులఁ జెల్లుగ వెల్లిగొను వేడుకలందమ నందములకు నలుంగులి
డి మజ్జనంబులు గావించి గంధంబులలందితోడవులు దొడిగి నిటలతటంబుల రక్షాతిలకంబులు వెట్టి సకలపదార్థసంపన్నంబులైన

యన్నంబులొసంగి సన్నాహములు గానిపున్నెనలు చేసిరి* (క॥ ఏతల్లుల కేబాలకు । లేతెఱఁగునఁ దిరిగ ప్రీతి నెసఁగింతు రెము।న్నా
తల్లుల కా బాలకు।లా తెఱఁగున బ్రీతిఁ జేసి రవనీనాథా॥ అసమయంబున* (ఉ॥ పాయని వేడ్కతో మనికిపట్టులకుం జని గోవులె
ల్లనం । ఛాయని చీఁకిపిలుమ్మనుచుఁ బైఁబడి మూర్కొని పంచటిల్లఁ బై । ల్లియతిరేకమై పొదుగులం దెడలేక స్రవించుచున్న పా।
లా యెడ నానుచున్నముఖులై యొసఁగెన్నిజవత్సకోటికిన్* (క॥ వ్రేతలకును గోవులకును। మాతృత్వము చాలఁ గలిగె నా తి
మాధవుపై। మాతలని హరియు నిర్మల । కౌతూహలమొప్పఁ దిరిగెఁ గడు బాల్యమునన్ * (గీ॥ ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వే
డ్క। పూఁటపూఁట కెలమిఁ బొటమరించె నిచ్చ క్రొత్తయగు మనింది రేపుసమీద। వేడ్కఁ దమకుఁ దొల్లి వెలసినట్లు* (వ॥ ఇట్లు కృ
ష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁదా రక్షించుకొనుచు మందను వనంబునను మంద మహిమంబున నొక్క యేఁడు గ్రీ
డించె నా యేఁటికి నైదాఱు దినంబులు కడమపడి యుండ నందొక్క నాఁడు బలభద్రుండును దానును వనంబునకుం జని మందచే
రువ లేఁగల మేఁపన విదూరంబున గోవర్ధనశైలశిఖరంబున ఘాసంబులు గ్రాసంబులుగొనుచున్న గోవులా లేఁగలం గని* (చ॥
ముదమున హుంకరింపుచును మూఁపులపై మెడలెత్తి నాఁచుచున్ । బదములు నాల్గు రెండయిన భాగునఁ గూడఁగ బెట్టి దాఁటుచున్।
న్వదనములన్ విశాలతరవాలములన్ వడి నెత్తి సాఁటియా । మొదవులు చన్నులం గుడిపె మూఁకల క్రమింగెడి భంగి నాకుచున్ *
(వ॥ అంత గోపకులు గోవులని వారింపనలవిగాక దిగ్గనలుకతోడ సిగ్గులగ్గలంబుగ దుర్గమమార్గంబున వాని వెంటనంటి వచ్చి లేఁగ
ల మేఁపుచున్న కొడుకులం గని* (ఉ॥ అయ్యలఁ గంటి మంచుఁ బులకాంకురములు వెలయంగఁ గుఱ్ఱలన్। జయ్యన డాసి యెత్తికొని
సంతసమంచుఁ గౌఁగలింపఁగా। దయ్యెడ నాఁదలల్ మనములాఱఁగ మూర్కొని ముద్దు సేయుచున్। దయ్యమెఱుంగు గోపకులు త
ద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్* (వ॥ ఇట్లు బాలకాలింగనంబుల నానందబాష్పపూరితనయనులై గోపకులు గోవులనాలించుకొ
నితలంగి చను వారలం జూచి బలభద్రుండిట్లని తనలోఁదలంచె* (సీ॥ చన్నుమాన్నయట్టి శాబకశ్రేణిపై గోగణంబులకును గోప
కులకు । నిబ్బరంగి వాత్సల్య మెబ్బంగి నుదయించె హరి తొల్లి మన్నించు నట్లు వీరు । మన్నించుచున్నారు మఱి మఱిఁ జేయుఁచు బ్రీతి
నంబుజాక్షునిఁ గన్నయట్లు నాకుఁ । బ్రేమ మయ్యెడి డింభబృందంబుఁగనుఁగొన్న నిది మహాద్భుతమెంచ నెఱుఁగరాదు। మను
జదైవత దానవ మాయయొక్కొ । లోకనాథుత్తయగు చన్నకమలనయను। మాయ యో కాకయితరుల మాయ యన్నఁ। గలఁ
ప నోపదు విభుమాయ గాఁగనోపు* (క॥ అని మున్ను ముగ్ధుఁడయ్యును । దనయందుల దివ్యదృష్టిఁ దప్పక బుద్ధిం దనచెలికాండ్రను
గ్రేపుల। వనజాక్షుండను చుఁజూచె వసుధాధీశా* (వ॥ ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి యెఱింగియు నమ్మక బలదేవుండు కొండలపడు
చు కృష్ణుం జూచి మహాత్మా తొల్లి యెల్ల క్రేపులను ఋషులయంశంబని యును, గోపాలకులు వేల్పులయంశంబని యును దోఁచు
చుండునిపుడు వత్సబాలక సందోహంబు సందేహంబులేక నీవయని తోఁచుచున్నది యిది యేమియని యడిగిన నన్నకు మున్నరూ
పంబు వెన్నుండు మున్నఁ జేసి క్రన్నన నెఱింగించెనతండు నెఱింగె నివ్విధంబున హరి బాలవత్సంబులు దానయై సంచరించిన యే
డు విరించికిఁ దనమానంబున చాంద్రమాన వత్సరంబు నొక్క త్రుటిమాత్రంబయిన విరించి చను దెంచి వత్సపాలకుండయిన కృష్ణ
బాలకుం జూచి యిదిగో పాలకృతంబని వెఱంగుపడి యిట్లని వితర్కించె* (శా॥ మందం గల్గినవత్సబాలకులు నామాయాగుహా
సుప్తులై । యెందుం బోవరు లేవ రెప్పుడును వేఱే చేయ నాకన్యులొం । డెంతే లేరు విధాతలుం బరులు వీరెవ్వార లెట్లైరకో।
యొండే తెంచిరొ కృష్ణుతో మెలఁగువారే మయ్యెడిన్నేఁటికిన్ * (మత్తకోకిల॥ బ్రహ్మపంపునఁ గాని పుట్టదు ప్రాణిసంతతి యెప్పు
డున్। బ్రహ్మ నొక్కఁడఁ గాని వేఱొక బ్రహ్మ లేడు సృజింపఁగా । బ్రహ్మ నేను సృజింపనొండొక బాలవత్సకదంబమే । బ్రహ్మ మం
దు జనించెనొక్కఁడ బ్రహ్మమైనది చూడఁగాన్ * (వ॥ అని యిట్లు సకలంబును సుకరంబుగ వెఱవెఱంగెడి నెఱవాది ముదుకయె
ఱుకగలక్రోఁగు వెఱంగుపడి గ్రగ్గనఁ బెద్ద ప్రొద్దు తద్దయుం దలపోసి కర్జంబు నందలయెఱుంగక కొండలపడుచు నొందోళంబున*
(క॥ మోహము లేక జగంబుల। మోహింపఁగఁ జేయ నేర్పు మొనసిన విష్ణున్। మోహింపఁ జెద నేనని యెడు । మోహమునవిధాత తాన
మోహితుఁడయ్యెన్* (గీ॥ పగలు ఖద్యోతరుచి చెడు పగిరి రాత్రి। మంచు చీఁకటి లీనమై మాయుమాడ్కి। విష్ణుపైనన్య మాయలు
విశదము గునె। చెడిని జేశులగరిమంబుఁ జెఱుచుఁగాక॥ ముఱియుము* (క॥ పుట్టిఱి బుద్ధి యెఱింగితిఁ। బుట్టించితి జగము సగము పోయె
మ బ్రాయం। బిట్టి విమానాన స్రష్టలు। పుట్టుట లేదౌర యిట్టి బూమెలు భూమిన్* (వ॥ అని యిట్లు తలవాఁకిట వాఁడిమిగల వాణిపో
డిమి చేవాఁడి కెక్కసనలు మొగంబుల తక్కరి గొంటు పెను దంటపను వెంటలైన తనమనంబున వితర్కించి విచారించు నెడ నలం
దుగనుంగొను చుండ నబ్బాలకులు మేఘశ్యాములును, హారకుండలకిరీటవనమాలి కాభిరాములును, శ్రీవత్సమంగళాంగదనూ
పురకనకకటకకంకణకటిఘటిత కాంచీగుణోద్దాములును, నాపాదమస్తకతులసీనవదాములును, విలసదంగుళీయకస్తోములు
ను, శంఖచక్రగదాకమలహస్తులును, చతుర్భుజప్రశస్తులును, పీతకౌశేయవాసులును, చంద్రికాధవళహాసులును, గరుణాక

టాక్షవీక్షణవిలాసులును, రవికోటిభాసులు ననంతసచ్చిదానందరూపసహితులు నణిమాదిగుణోపేతులును, విజాతీయభేదరహితులును, శ్రీమన్నారాయణప్రతిమాన విగ్రహస్వరూపులునై తమకుం బరతంత్రులగుచు నృత్తగీతాదిసేవావిశేషంబుల కుంజొచ్చి మెలంగుచు మూర్తిమంతంబులైన బ్రహ్మాదిచరాచరంబులు నణిమమహిమాదిసిద్ధులును, మాయాప్రముఖంబులైన శక్తులును, మహదాదిచతుర్వింశతితత్త్వంబులును, గుణక్షోభకాలపరిమాణహేతుసంస్కారకామకర్మగుణంబులును, సేవింప వేదాంతవిదులకైన నెఱుంగరాని తెఱంగున మెఱయుచుం గాననంబడినవారలం గనుంగొని * (ఉ॥ బాలురఁ గంటి నా మదికిఁ బాసినవారి నిమున్న దారి నేఁ । బోలఁగఁ జూచు నంతటన భూరినిగర్గళ దుర్గమ ప్రభా । జాలము తోడఁ జూపులకుఁ జాలమి దెచ్చుచునున్నవార లే । మూలము మార్గ మెయ్యది యిమోసము వచ్చెఁ గదే విధాతకున్ * (వ॥ అనేక లేంద్రియంబులకు వెక్కసంబులైన స్రుక్కి * (ఉ॥ ఏపరమేశు తేజమున నీసచరాచరమైన లోకము । దీపితమయ్యె నట్టి విభు తేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా । నోపక పారవశ్యమును నొందుచు నంస్తిమితాఖిలేంద్రియుం । డై పరమేష్ఠి మైనఁ బడె నెస్సపుచిత్రపురూపుకైవడిన్ * (వ॥ ఇట్లు మాయాతీతుండును, వేదాంతవిజ్ఞానదుర్లభుండును, స్వప్రకాశసంపన్నుండునునైన, తన బాహుళ్యంబుఁ జూచి నివ్వెఱపడిన బ్రహ్మం గని యీశ్వరుండు * (శా॥ బాలుండై చతురాననుండు ఘనయు బ్రహ్మాభిమానంబునన్ । లోలుండై నను డప్పి నా మహిమ యాలోకింప నెంతేం చేదా । నాలోకింపఁగ నెంత వాఁడను చు మాయాజాలముల్ విప్పి తత్ల్లీలారూపము లెల్లఁ దాఁచె నట కేలీచాతురీధుర్యుఁడై * (వ॥ అంతలో నప్పిర్ణ్యంబునఁ జీవుండైన తెఱంగున నెనిమిది కన్నులుగల వేల్పుగమికాఁడు తేఁటి తెప్పరిలి కాలుఁగేలుఁ గదలించి చెచ్చెరం గన్నుఁదెఱచి చూడ సమర్థుండై ముందఱఁ గని వెనుకఁ జూచి దివివిలోకించి పిక్కటిలు లుపీఠించి యెల్ల యెడలం గలయఁ దర్శించి. తనపురోభాగంబున హరిసంచరించుటం జేసి జాతివైరంబు లేని నరపశుమృగాదులకు నాటపట్టయి సిరిగలిగి కామక్రోధాదిరహితులకు జీవనంబై నబృందావనంబు మెడగాంచి యందు * (సీ॥ తనకన్యము లులేక తనరారి మూలమై భుఁడయ్యు గ్రేవుల వెదకువాని । సకలజ్ఞుఁడై యొక్కఁడయ్యు నజ్ఞాకృతిఁ జెలికాండ్రఁబెక్కండ్రఁ జీఱువాని । బహిరంతరాద్యంతభావశూన్యుండయ్యు నలతంతనము సేచొప్పరయువాని । గుణగభీరుండయ్యుఁ బసువులు వాఱుచునట్టిట్టు పాతరలాడువాని । జాతిరహితుఁడయ్యుఁ జగురగోపార్భక । భావ మెల్ల నచ్చుపడిన మేని । చెలువువానిహస్తశీతాన్నకబళంబు । వానిఁ గాంచె నపుడు వాణిమగఁడు * (వ॥ కనిసంభ్రమించి విరించి రాయంచ డిగ్గనుఱికి కనకదండసుకుమారంబైన శరీరంబుతోడ నేలం జాగిలంబడి మణిగణసుప్రకాశంబులైన తనకిరీటశిఖరప్రదేశంబులాకుమారుని పాదపద్మంబులు మోవ మ్రొక్కి తోరంబులగు నానందబాష్పజలపూరంబుల నతనియడుగులు గడిగి నుతియించు * (క॥ అడుగులపైఁ బడు లేచున్ । బడుఁ గ్రమ్మఱ లేచు మునిట్లు భక్తిన్ మునుఁగాఁ । బొడగనిన పెంపుఁ దలఁచుచు । కుడుకమహిమాబ్ధిఁ జొంగుడుదుడుకడఁ జెన్నుపా * (వ॥ అంతనల్లనల్ల న లేచి నిలుచుండి యయనారవిందంబులు దెఱచి గోపింక నిసందర్శించి చతుర్ముఖుం డముఖంబులు వంచి కృతాంజలియై దిగ్గన డగ్గుత్తికయిడికొనుచు నేకచిత్తంబునఁ జతుర్ముఖంబుల నిట్లని స్తుతియించె * (సీ॥ శంపాలతికతోడి జలదంబుకైవడి మెఱుఁగుటొల్లియతోడి మేనివానిఁ । గమనీయమృదులాన్నకబళ వేత్ర విషాణ వేణుచిహ్నంబుల వెలయువాని । గుంజావినిర్మితకుండలంబులవాని శిఖిపింఛవేష్టితశిరమువాని । వనపుష్పమాలికావ్రాతకంఠమువాని నలినకోమలచరణములవానిఁ । గరుణగడలుకొను నవకడకంటివాని గోపాలబాలభంగిఁ బొంగువాని । నను మొగంబువాని నమ్నంతం డ్రిని । నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష * (మ॥ ననుమన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించినీ । తనురూపంబిదె నామనంబునకచింత్యంబయ్యె నీయుల్లస । ద్ఘనవిశ్వాకృతి నెవ్వఁడోపు నెఱుఁగన్ గైవల్యమై యొప్పు నాత్మసివేద్యంబగు నీమవైభవము చందం బెట్టిదో యీశ్వరా * (క॥ విజ్ఞానవిధము లెఱుఁగక । తద్జ్ఞులు నీవార్తఁ జెప్పఁ దనువాఙ్మనముల్ । యజ్ఞేశ నీకు నిచ్చిన । యజ్ఞులు నిన్నుం బట్టి గెలుతురజితుఁడవైనన్ * (క॥ శ్రేయములు గురియు భక్తిని । జేయక కేవలము బోధసిద్ధికిఁ దపముల్ । జేయుట విఫలము పొల్లుం । దాయను చేకురు నెతలఁపనధికంబైనన్ * (క॥ నిజముగ నిన్నెఱుఁగరు మును । నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీకథపను చున్ । నిజకర్మలబ్ధభక్తిన్ । సుజనులు నీమొదలి టెంకిఁ జొచ్చిరధీశా * (సీ॥ విక్రియాశూన్యమై విషయత్వమును లేనిదగుచు నాత్మాకారమైతనరు । నంతఃకరణ మొక్కయధికసాక్షాత్కారవిజ్ఞానమునఁ బట్టి వేఱొరులకు । నెఱుఁగంగరానిదై యేపారియుండుటఁ జేసి నీనిర్గుణశ్రీవిభాతి । బహిరంగవీథులఁ బాఱక థిరములై యనలంబులగు నింద్రియముల చేత । నెట్టకేలకైన నెఱుఁగంగనగుఁ గాని । గుణవిలాసివగుచుఁ గొమరుమిగులు నీగుణవ్రజంబు నేరరాదెఱుఁగంగ । నొక్కమితము లేకయుంట నీశ * (క॥ శ్రారాతుషారశీకర । భూరజముల కైన లెక్క బుధులిడుదురు భూ । భారావతీర్ణ భువ్ఁడగు । నీరమ్యగుణంబు లెన్న నేరరు గణ్యా * (శా॥ ఏవేళం గృపఁ జూచు నెన్నఁడు హరి నీవీక్షింతునో యంచు । నీవెంటన్బడి తొంటికర్మచయముల్ నిర్మూలముం జేయుచు । నీవాఁడై తనువాఙ్మనోగతులని న్సేవించువిన్నాణి వో । కైవల్యాధిపలక్ష్మి నుద్ధవడిఁ దాఁ గైకొన్నవాఁ డీశ్వరా * (ఉ॥ మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి ప్రోడ నిన్ను నా ।

మాయఁగలందినీమహామహిమాననుఁజూచెదనంచు నేరమిన్ । జేయఁగఁబూనితిన్దరుణ సేయుము కావుము యోగిరాజవా।గ్దే
యదవాగ్నిఁదజ్జనితకీలము గెల్పి వెలుంగనేర్చునే॥ (సీ॥ సర్వేశ నీరజోజనితుండ మూఢుండ ప్రభుఁడ నేనని వెఱ్ఱిప్రల్లదమున
గర్వించి నాఁడను గర్వాంధకారాంధనయనుండ కృపఁజూడుమనుఁబ్రధాన। మహదహంకృతినభోమరుదగ్నిజలభూమిపరివేష్టి
తాండకుంభంబులోన । నేడుజానల మేన నెనయనొకఁడనే నీవృగ్విధాండంబు నేరికైన। సంఖ్యసేయంగరానిదిసంతతం
బు। నీరోమబరమాణువులభంగి నాడలిరోమ।వివరములయందువర్తించు విపులభాతి। నెనయుచున్న నీ వెక్కడ నెంతకెంత॥ (త
రల॥ కడుపులోపలనున్న పాపఁడు కాలదన్నఁగినఁతో । నడువబోలు నె కాఁగితల్లికి నాథ సన్నముదోష్ఠునై। యడఁగికార
ణకార్యరూపములైన యీ సకలంబు నీ।కడుపులోనిది గాదె పాపఁడఁగాక యేమటి మెవ్వఁడన్॥ (క॥ భూరిలయజలధినిద్రిత।
నారాయణనాభికములనాళమునసజుం।డారయఁబుట్టెననుట నిజ। మోరాజీవదళాక్షపుట్టనో పుఁడలంపన్॥ (సీ॥ నళినాక్షునీ
వాదినారాయణుండవు జలము నారము జీవచయము నార । మందు నీవుంట నీయందవియుంటను నారాయణుండను నామమ
య్యె। సకలభూతములకు సాక్షివధీశుండ వబ్ధినిద్రించు నారాయణుడవు । నీమూర్తి యిది నీకు నిజమూర్తి యనరాదు నళిననాళ
ము త్రోవనడిచి యున్న।కడఁగి నూరేండ్లు వెదకి నేఁగాననైతి। నేక దేశస్థుఁడవు గావనేకరుచివి। జగములో నుండు నీలోన జగము
లుండు।నరుఁడు నీమాయనెటులైన నడుచుచుండు॥ (మ॥ వినుమా యీశ్వర వేల్పులన్ వెలుఁగు నీవిశ్వంబు నీమాయగా।కనిజంబై
నయశోదయెల్లు కనుగొన్న న్నారనీకుక్షిలోఁ । గనెఁబో క్రమ్మఱ గాంచె నే భవదపాంగశ్రీ ప్రపంచంబుచ । క్కనలో నావెలి
నుండులోను వెలియై వీక్షింపఁ ధన్యంబగున్॥ (మ॥ ఒకఁడై యుంటివి బాలవత్సములతో నొప్పారి నీవంతట।న్సకలోపాశ్రితు
లైచతుర్భుజులునై సంప్రీతితోఁ గొల్వఁగాఁ।బ్రకట శ్రీగలవాఁడవై తివిపుడున్ బ్రహ్మాండముల్వ్యాపియె। ల్లకయిట్లొకఁడవై
నీవివిధలీలత్వంబుఁగంటింగదే॥ (క॥ ఎఱుఁగని వారికిఁదోఁపవు। నెఱిఁబ్రకృతిఁజేరి జగమునిర్మింపఁగనా। తెఱఁగున రక్షింపఁగనీ।
తెఱఁగునఁబ్రహరింపరుద్రుతెఱఁగునఁనీశా॥ (క॥ జలచరమృగభూసురనర।కులములజన్మించితీవుకుజనులఁజెఱుపన్। జెలిమి
నిసుజనులమనుపను,దలపోయఁగరాదు నీవిధంబులనంతా॥ (గీ॥ మబ్బుగొనిపి యోగమాయనిద్రించెద।వో పరాత్మభూమ యో
గరాజ।యే తెఱంగులెన్నియెంతయెచ్చోటనీ। హేలలెవ్వఁడెఱుఁగు సందిరేశ॥ (సీ॥ ఆదిగానని జరూపనఁనరాదు కలవంటిదై బ
హువిధదుఃఖమై విహీన। సంజ్ఞానమైయున్న జగము సత్సుఖబోధతనుఁడవై తుదిలేకతనరుదీవు। మాయచేఁబుట్టుచు మనుచు లే
కుండు చున్నచందంబునఁనుండుచుండు। నొకఁడవాత్ముండవితరోపాధిశూన్యుండ వాద్యుండ వమృతుండవక్షరుండ । వద్వ
యుండవును స్వయంజ్యోతివాపూర్ణుఁ।డవు పురాణపురుషుఁడవు నితాంత।సౌఖ్యనిధివి నిత్యసత్యమూర్తివి నిరం । జనుఁడవీవుత
అఁవఁజను నెనినన్॥ (వ॥ దేవా యిట్టి నిన్ను జీవాత్మస్వరూపుండవనక సకలాత్మలకునాత్మయైన పరమాత్మస్వరూపకుఁడవని యె
వ్వరెఱుంగుదురువారుగదా గురువని యెడు దినకరునివలనఁబ్రాప్తంబైన యుపనిషదర్థజ్ఞానంబను నేత్రంబునంజేసి సంసా
రమిథ్యాసాగరంబుఁదరించినవందంబుననుండురు రజ్జువందు గజ్జువనియెఱింగెడి మెఱుక లేకుండనయ్యెఱుంగమి సదిసర్ప
రూపంబై తోఁచినపిదప నెఱింగిన వారివలన రజ్జువని తెలుపుచుండ సర్పరూపంబు లేకుండుకైవడి నాత్మయప్పరమాత్మయని యె
ఱుంగరు వారికయ్యెఱుంగమివలన సకలప్రపంచంబులుగలిగితోఁచు నాత్మయప్పరమాత్మయని యెవ్వరెఱుంగుదురు వారిక
య్యెఱుకవలనఁబ్రపంచంబులేకుండు నజ్ఞానసంభావితనామకంబులైన సంసారబంధమోక్షంబులుజ్ఞాన విజ్ఞానంబులలోని
పిగావుకావునఁగములమిత్రునకహోరాత్రంబులు లేని తెఱంగున బరిపూర్ణజ్ఞానమూర్తియగునాత్మయందు జ్ఞానంబులేమి
మోక్షంబులేదాత్మవైననిన్ను దేహాదికంబని తలంచియునాత్మ వెలినుండునంచుమూఢులు మూఢత్వంబున వెదకుచుందురువా
రిమూఢత్వంబు జెప్ప నేల బుద్ధిమంతులైన పరతత్వంబుగాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమతమశరీరంబులయం
దనిన్నఱయుచుందురది గావున॥ (శా॥ దేవా నీచరణప్రసాదకణలబ్ధింగాక లేకున్ననొం।డే వెంటన్ జను నీమహామహిమమూ
హింపంగనెవ్వారికి।న్నీవారైచనువారిలోనొకడనైనిన్గొల్చు భాగ్యంబుగా। కీవేయిప్పటిజన్మమందైననొండెందైన నోయీ
శ్వరా॥ (తరల॥ క్రమశతంబున బూర్ణకుక్షివిగాని నీవిటు ద్రేపులు।న్నమతులునైచను బాలు ద్రావుచు జొక్కి యాడుచు గౌతుక।
స్థితిఁజరింపఁగదల్లులైపిలసిల్లు గోవులుగోపికా। సతులధన్యత లెట్లు చెప్పఁగఁజాలువాఁడఁగృపానిధీ॥ (క॥ పరిపూర్ణంబు పురాణ
ము।పరమానందంబునైన బ్రహ్మమె చెలికాఁ।డఁడు నందరుమనంత ఘోష।స్థిరజనములభాగ్యరేఖ చింతింపంగన్॥ (సీ॥ ఏకాదశేంద్రి
యాధీశుఁబుచంద్రాదులేను ఫాలాక్షుండు నిట్లు గూడఁ।బదుమువ్వురము నెడపడక నింద్రియపాత్రముల నీపదాంభోజములనురం

ఏకాదశేంద్రియాధీశులు చంద్రాదులు॥ ఏకాదశేంద్రియ-జ్ఞానకర్మేంద్రియములుపది-మనసు-పినికి,అధీశులు-ప్రభువులు, చంద్రాదులు-చంద్రుఁడు మొదలగువారు - అనఁగా - మనస్సునకు చంద్రుఁడధిదేవత. జ్ఞానేంద్రియములైన శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములకు - దిగ్వాతార్క ప్రచేతసాశ్వినులు అధిదేవతలు, కర్మేంద్రియములైన వాక్పాణిపాదపాయూపస్థలకు వహ్నీంద్రోపేంద్రమృత్యుప్రజాపతులధిదేవతలు.

దామృతంబు ద్రావియునమరనేకైకేంద్రియాభిమానులునయ్యు నతికృతార్థభావులమైతిమివరగసర్వేంద్రియవ్యాప్తులునీ మీద వాల్చితిరు. గోపిగోపకజనములగురువిశిష్టభాగ్యసంపదదలపోసి ప్రస్తుతింప నలవిగాదెవ్వరికినైననంబుజాక్షుభక్త వత్సలసర్వేశపరమపురుష॥ (శా॥ ఏలా బ్రహ్మపదంబు వేదములకున్వీక్షింపఁగారానినీ। నీలోకంబుననీవనాంతరమునందీనం దులోఁ గృష్ణయం। చాలాపాదిసమస్తభావములునీయందే సమర్పించినీ। వేలంద్రొక్కినపాదరేణువులపై వేష్టించినంజాల దే॥ (మ॥ సనుహింసించినపూతవాడులకుమున్నీమేటిసంకేతమిచ్చితినీకన్నుర దారపుత్రగృహగోస్త్రీ ప్రాణదేహాదులెల్ల నువంచింపకనిచ్చు గోపకులకున్లక్షింపనేమిచ్చెదో। యంసం దేహముదోఁచుచున్నది ప్రసన్నానీకరత్నాకరణీ * (క॥ గేహము కారాగేహము। మోహముని గళంబు రాగముఖరములురిపువ్యూహములుభక్తిలోని। న్మోహింపఁగనెంతదడవో యొకను లాక్షా (గీ॥ ఆశ్రయించుజనులకానందసందోహ। మీఁదలంచివివిధహేలతోడ। నప్రపంచకుండవయ్యుఁ బ్రపంచంబు। వెలయజే యుదీవువిశ్వమూర్తి॥ (క॥ ఎఱిఁగినవారలెఱుంగుదు। రెఱుగన్బహుభాష లేలనీశ్వరనీపెం। పెఱుఁగమనోవాక్కులకు। గు ణసేయంగొలఁదిగామగుణరత్ననిధీ॥ (క॥ సర్వము నీవయెఱుఁగుదు। సర్వవిలోకనుఁడవీవ జగదధిపతివి। సర్వాపరాధినను నో। సర్వేశయనుగ్రహింపుచనివెదనింక॥ (క॥ జిష్ణుః శాటవిపాటన। వృష్ణికులాంభోజసూర్యప్రాణారగో। వైష్ణవసాగ రహిమకర। కృష్ణాపాషండధర్మగృహదావాగ్ని॥ (వ॥ దేవానీకుఁ గల్పపర్యంతంబునమస్కరించెదననియివ్విధంబునసంస్తు తించిముమ్మాఱువలగొనిపాదంబులపైఁబడివీడ్కొని బ్రహ్మసనెలవునకుంజనియె నతనినమన్నించిభగవంతుండైన హరితొల్లి చెడితిరిగివచ్చినవత్సబాలకులం గ్రమ్మఱంగైకొనిపులినంబుకడఁజేర్చెనట్లు॥ (క॥ క్రించుతనంబునవిధిదము। వంచిందినయేఁడు గోపవరనందనులొక్కించుకకాలంబుగనిరీక్షించిరిరాజేంద్రబాలకృష్ణునిమాయన్॥ (గీ॥ ఏమహాత్ముమాయనీవిశ్వమంత యు। మోహితాత్మయగుచుమఱిఁగియుండు। నట్టివిష్ణుమాయనర్భకులొక్కయేఁడెఱుఁగకుండిరనుటయేమిదొడ్డ॥ అప్పుడు॥ (మ॥ చెలికాఁడాయరుదెంచితేయిచటికిన్నేమంబునంగ్రేపులున్నెలవుల్వెరనరణ్యభూమివలననీన్నివచ్చునందాఁకజ ల్దులు మీరించుకయెవ్వరున్గుడవరాలోకింపురమ్మంచునా। జలజాక్షుండునగన్నుజిందిరచటన్సంభావలన్దింభకుల్॥ (వ॥ ఇట్లు బాల కులతోడఁజల్దిగుడిచివారలకునజగరచర్మంబుచూపుచువనంబుననుండితిరిగి॥ (వనమయూరవృత్తము॥ ప్రసన్నపింఛమాలి కాప్రభావిభాసితాంగుఁడుం। ప్రసిద్ధశృంగవేణునాదపాశబద్ధలోలుఁడుం। ప్రసన్నగోపబాలగీతబాహువిస్ఫురద్యశుఁడయ్యును। ల్ల సించిమేగె గోపకుల్ఛెలంగిచూడనందకున్॥ ఆసమయంబున॥ (క॥ పెనుబాముదమ్ముఁ బ్రమింగిన। మనన్నందనుతుండుపామును మ ర్దించిచుమ్ము। న్మనిచెనరణ్యములోపల। నని ఘోషించిరికుమారులాఘోషములోన్॥ అనవిని నరేంద్రుండిట్లనియె॥ (క॥ కనినవి చిమెత్తిపెంచిన। తనుజన్ములకంటెనందతనయుండాఘోషనివాసులకునుసోరం। జనుడెట్లయ్యెనుబుధేంద్రచనునెఱిఁగిం పర॥ అనినశుకుండిట్లనియె॥ (సీ॥ అఖిలజంతువులకునాత్మవల్లభుఁడైనభంగిబిడ్డలునింధ్లుఁబసిఁడిమొదలు। వస్తువులెవ్వియువ ల్లభంబులుగావుసకలాత్మకుండైనజలజనేత్రుఁ। డఖిలజంతువులకునాత్మగావునఘోషవాసులకెల్లనువల్లభత్వ। మునుమి క్కిలిప్పెనుమూఁడులోకములకుహితముసేయఁగజలజేక్షణుండుమాయతోడమూర్తిమంతుఁడైయొప్పెఁ। గలఁడతం డునిఖిలగణములందు। భవతిధాతువెట్లుభావార్థమైసర్వ। ధాతుగణమునందుఁదనరునట్లు॥ (క॥ శ్రీపతిపదమనునావను। బ్రాపిం చుభవాబ్ధివత్సపదముగధీరు। లూపించిదాఁటిజేరుదు। రాపత్పదరహితులగుచునమృతపదంబున్॥ (గీ॥ అఘునిఁజంపికృష్ణు డాప్తులుదానును। జల్దిఁగుడిచిజలజసంభవునకుఁ। జిద్విలాసమైనచెలువుఁజూపినకథ। జనువవినినగోర్కెసఫలమగును॥ అని చెప్పినవిని యువ్వ్యాసనందనుండిట్లనియె॥ (క॥ రాగంబులబలకృష్ణులు। పౌగండవయస్కులగుచుఁబశుపాలకథా। యోగం బునబృందావన। భాగంబునఁగాఁచిరంతఁబశువులనధిపా॥ (వ॥ ఆయ్యెడఁగృష్ణుండొక్కనాఁడు రేపకడలేచివేణువుపూరించి బలభద్రసహితుండై గోపకుమారులుదన్నుబహువారంబులుగైవారంబులుసేయ మ్రోలనాలకదుపులనిడికొని నిరంతర ఫలకిసలయకుసుమంబును, సుమమకరంద నిష్యందపానానంద దిందిందిరకదంబంబును, గదంబాది నానాతరులతాగు ల్మసంకులంబును, కులవిరోధరహితమృగపక్షిభరితంబును, భరితసరస్సరోరుహపరిమళ మిళితపవనంబును నైన,వనంబుఁ గనియందువేడుకంగ్రీడింపనిశ్చయించివెన్నుఁడన్నకిట్లనియె॥ (శా॥ శాఖాపుష్పఫలప్రభారనతలై చర్చించియో దేవమా। శాఖిత్వంబుహరింపుమంచుశుకభాషన్నీకెఱింగించుచున్। శాఖాహస్తములన్ బ్రసూనఫలముల్పక్కన్సమర్పించుచున్। శాఖిశ్రేణులునీపదాబ్జములకోజన్ మ్రొక్కెడిన్జూడితే॥ (సీ॥ నిఖిలపావనమైననీకీర్తిఁబాడుచునీతుమ్మెదలువెంటనేఁగు దెంచె। నడవిలోగూఢుండవైన యీశుఁడవనిముసరికొల్పగవచ్చెమునిగణంబు। నీలాంబరముతోడనీవుజీమూతమవనినీల కంఠంబులాడఁజొడఁగెఁ। బ్రియముతోఁజూడుగోపికలచందంబున। నినుఁజూచెనదెహరిణీచయంబు। నీవువిందవనుచుని ర్మలసూక్తులు। పలుకుచున్నవిచటఁబరభృతములు। నేఁడువిపినచరులునీవువిచ్చేసిన। ధన్యులైరిగాదెతలఁచిచూడ॥ (సీ॥ నీ

పాదములుసోఁకి నేఁడుసీరుకుద్యణపుంజంబుతో భూమిపుణ్యయయ్యె । నీనఖంబులు దాఁకి నేఁడు నానాలతాతరుసంఘము లుకృతార్థంబులయ్యె । నీకృపాదృష్టిచే నేఁడునదీశైలఖగమృగంబులుదివ్యకాంతిఁజెందె । నీ పెన్నురము మోవ నేఁడు గోపాంగనాజనములపుట్టువుసఫలమయ్యె । ననియరణ్యభూమినంకించి పసులను । మిత్రజనులు దాను మేపుచుండి । నలినలోచనుండునవులందు గిరులందు నెంతసంబు మెఱయ సంచరించె॥ మఱియును ఖ్యాశ్వగుండు* (సీ॥ ఒకచోట మత్తాళి యూథంబు ఘుమ్మని మ్రోయంగ ఝుమ్మని మ్రోయుచుండు । నొకచోటఁగలహంసయూథంబుగూడి క్రేంకృతులు సేయంగఁ గ్రేంకృతులు సేయు । నొకచోటనుద కేకియూథంబులాడంగ హస్తాబ్జములు ద్రిప్పి యాడఁ దొడఁగు । నొకచోట వనగజయూథంబు నడువంగ భయముతో మెల్లననడుచుఁ జొచ్చుఁ । గ్రౌంచచక్రముఖరఖగములొక్కచోటఁ । బలుక వానియట్ల పలుకుఁగదిసి । పులులసింహములను బొడఁగని యొకచోటఁ । బఱచుమృగములం దుఁడలుచుగూడి॥ మఱియును* (సీ॥ రాపూర్ణచంద్రికరా గౌతమీగంగ రమ్ము భగీరథరాజతనయ । రాసుధాజలరాశి రా మేఘమాలిక రమ్ము చింతామణి రమ్ము సురభి । రామనోహారిణి రా సర్వసంగళరా భారతీదేవి రా ధరిత్రి । రా శ్రీమహాలక్ష్మి రా మందమారుతి రమ్ము మందాకిని రా శుభాంగి । యనుచు మఱియుఁ గలుగు నాఖ్యలుగల గోవులడవిలోనదూరమందునుమేయ । ఘనగభీరభాషఁ గడు నొప్పఁజీరునా భీరజనులు వొగడఁ బెంపు నెగడ* (క॥ కాంతావిహారమ్ముల । శ్రాంతుండై గోపకాంకశయనుండ సుతస్వాంతస్థితిఁ బొందఁజేయుని । రంతరకరచరణమర్దనాదులనధిపా* (క॥ పాడుచు నాడుచు ముచ్చటలాడుచు నొండొరులఁ దాఁకునాప్తులఁ గని బి । ట్టాడుచుఁ జేగులు ద్రేయుచుఁ । గ్రీడింతురు నగుచు బలుఁడుఁ గృష్ణుఁడు నొకచో॥ ఇవ్విధంబున* (సీ॥ వేదాంతవీథుల విహరించువిన్నాణి విహరించు గాంతారవీథులందు । ఫణిరాజశయ్యపైఁ బవళించు సుఖభోగి పల్లవశయ్యల బవ్వళించు । మునియోగిమానసముహాలఁ గ్రుమ్మరుమేటి గ్రుమ్మరు నద్రిగుహాలలోనఁ । గమలతోడఁ బెనంగి కడుఁడయ్యుచతురుఁడా । భీరజనులతోడఁ బెనగిడయ్యు । నఖిలలోకములకు నాశ్రయుండగుధీరుఁ । డలసితరులనీడనాశ్రయించు । యాగభాగచయములాహారించుమహాత్ముఁ । డడవిలోని ఫలములాహారించు॥ ఆసమయంబున* (సీ॥ అలసిన చోఁ గొండ అతిమోదమున వీపు లెక్కించుకొని పోము రేఁపు మెఱసి । సొలసిన ద్రిండిన చోనూరు తల్పంబులిడ దురుకొండలు హితవుగలిగి । చెమరించియున్న చోఁ జిగురుటాకులఁ గొండ లొయ్యన విసరుదు స్నేహంది । దప్పిఁ గొనిలుచు చోఁ దడయక కొండలు పదములొత్తుచు రతిబాంధవమున । గోపవరులు మఱియుఁ గొందఱు కొందరు । మాధవునకుఁ బెక్కుమార్గములను । బనులు సేసిరెల్ల భవములఁ జేసిన । పాపసంచయములు భస్మములుగ* (వ॥ అయ్యవసరంబున శ్రీరామనామధే

—* గార్దభాకారుండైన ధేనుకాసురునివధ. *—

యుండైన గోపాలకుండు రామకేశవులం జూచి యిట్లనియె* (క॥ దూరంబగు తాలతరుస్ఫారంబగు వనము గలదు మతి దానుపత । ద్భూరిఫలసహితమది యే । ధీరులు చొరవెఱతురందు ధేనుకుఁ డుంటన్* (వ॥ ఆ ధేనుకాసురుండు మహాశూరుండును, ఖరాకారుండునునై, సమానసత్వసమేతులైన జ్ఞాతులుండానును, మనుష్యులం బట్టి భక్షించుచుండు నయ్యెడఁ, బరిమళోపేతంబులైన నూతనఫలవ్రాతంబుల సంఖ్యాతంబులుగఁ గలవు వినుఁడు* (క॥ ఫలగంధము నాసాపుటములవెంటన్ జొచ్చి చిత్తములఁ గొనపోయెన్ । ఫలములు నమలింపుము మము । బలియుర కును మీకు దైత్యభటులడ్డంబే* (వ॥ అనిపలికిన చెలికాండ్ర పలుకులాదరించి వినినగి వారును దాను, నుత్తాలంబగు తాలవనంబున కుంజనిరంత* (క॥ తత్తరమున బలభద్రుఁడు । దత్తాలానోకహములఁ దన భుజబలసంపత్తిఁ గదల్చుచుఁ గ్రక్కున నమ్మత్తేభము భంగిఁ బండ్లు మహిపై రాల్చెన్* (వ॥ అప్పుడు పండ్లు రాల్చిన చప్పుడు చెవులకు దెప్పరంబైన నదరిపడి రిపు మార్గనకు తుకంబున గార్దభాకారుండైన ధేనుకాసురుండు* (మ॥ పదవిక్షేపములన్నవృత్తధరణీభాగంబు గంపింపఁగా, రదముల్ దీటుచుఁ గ్రత్తరించి చెవుల్ ఱాజిల్ల వాలంబు భీ । తిదమై తూలఁగఁ గావరంబున సముద్దీపించి గోపాలకుల్ బెదర న్రాముని ఱొమ్ము ఘుర్ఘురదన్నె వెనుకై బీరంబుతోరంబుగన్* (క॥ మఱియును దనుజుఁడు రామునిఁ గఱవఁగ గమకించి తెఱపిఁ గానక యతనిఁ జుఱచుఱఁ జూచుచు శౌర్యము పఱివోవఁ గనంతనంతఁ బదములఁ దన్నెన్* (వ॥ అంత బలభద్రుండు రౌద్రాకారంబున గర్దభాసురు పదంబులు నాలుగు నొక్కకేలనంటం బట్టి బెట్టు భట్టించి త్రిప్పిపిగళజీవుం జేసి* (మ॥ ఒక తాలాగ్రముఁదాఁకవైవ నదికంపోద్రేకమై ద్రెళ్లి వే । ఱొక తాలాగ్రముపైఁ బడన్నదియ నశ్యద్గ్రావహాతిన్నిల్వకొం । డొక తాలాగ్రముపైఁ బడన్ విరిగి యిట్లొండొంటిపైఁ దాలవృక్షకముల్లూలెఁ బ్రచండమారుతముదాఁకన్ మ్రాలుచందంబునన్* (ఉ॥ తంతువులందుఁ జేలము విధంబున నేపరమేశమూర్తియం । దింతయుఁ బుట్టు నట్టి జగదీశుఁడనంతుఁడు దైత్యమాత్రుని । ట్లంతము సేయుటెంతపని యచ్యుతమేనమమంతలోన వాఁ । డంతముఁ బొందఁ బెల్లఁగనియాతని బంధులు గార్దభంబులై* (క॥ బలకృష్ణులపైఁ గదిసిన । బలియుర ఖర దైత్యభటులఁ బశ్చిమపాదంబులు పట్టి తాలశిఖరం । బుల నెగరఁగవైచి వారిఁ బోరిఁ గొనిరధిపా॥ అప్పుడు* (క॥ ఆలమున నోలిఁ గూలిన । తాలద్రుమఖండ దైత్యతనుఖండములన్ గ్లీలితమై ధరజలధర । మాలావృతమైన మింటిమాడ్కిన్

న్వేలిఁగెఁ* (క॥ ధేనుకవనమునఁ జనిరి। మానవులా వేళఁ దాటిమ్రానులఫలముల్। ధేనువులు మేసెఁ గెఁగసవులు। ధేనుకహరభ
క్తకామధేనువుగలుగన్* (వ॥ ఆసమయంబున సురలు విరులవానలు గురియించి రంతఁ గమలలోచనుండు గోపసగీయవర్తమా
నుండై యన్నయుం దానును గోపగణంబులం బిలిచికొని మందకుం జనియెనయ్యెడ (ఉ॥ గోపదరేణుపంకలితకుంతలబద్ధమయూ
రపింఛును। దీపితమందహాసశుభదృష్టిలసన్ముఖునవ్యపుష్పమా। లాపరిబూర్ణు గోపజనలాలితవేణురవాభిరాము నా। గోపకు
మారు నింగనిరి గోపసతుల్ నయనోత్సవంబుగన్* (గీ॥ కమలనయనువదనకమలమరందంబు। నవిలి నయనషట్పదము లనంగఁ।
దాగి దినవియోగతాపంబు మానిరి। గోపకాంత లెల్లఁ గోర్కు లలర* (వ॥ ఇట్లు గోపికలాదరంబునం జూడ వ్రీడాహాసవినయం
బులం జూచుచుం గ్రీడాగరిష్ఠుండైన ప్రోడ గోష్ఠంబు ప్రవేశించె నంత రోహిణీయశోదలు కుఱ్ఱలవలని మచ్చిక పిచ్చలింపనిచ్చకు
వచ్చినట్లయ్యై వేళలవీవించిరి-వారును మజ్జనోన్మర్దనాదుల నంగీకరించి సురభికుసుమగంధంబులు గైకొని రుచిర చేలంబులు గట్టికొ
నిరసోపపన్నంబులైన యన్నంబులు గుడిచి తృప్తులై మంజులశయ్యలను సుప్తులైయుండిరంత* (సీ॥ ఒకనాఁడు బలభద్రుఁడొక్క

—* శ్రీకృష్ణుఁడు కాళీయమర్దనము గావించుట. *—

డు రాకుండ గోపాలకులు దానుఁ గూడి కృష్ణుఁ। డడవికి జని యెండ నా గోవులును గోపకులు నీరువట్టునఁ గుందియుండఁ। గాళింది
లోని విషకలితతోయము ద్రావి ప్రాణానిలంబులు వాసి పడిన। యోగీశ్వరేశుండు యోగివంద్యుఁడు కృష్ణుఁ డీక్షణామృతధా
రలెల్ల మిగురిసి। పసుల గోపకులను బ్రతికించె మఱలంగ। వారు దమకుఁ గృష్ణువలన నాఁ టలఁ। బ్రతుకు గలిగెనంచు భావించి సంతు
ష్టమానసములఁ జనిరి మానవేంద్ర* (క॥ కాళియఫణిదూషితయగుఁ। గాళిందిఁ బవిత్రఁ జేయఁగా నుత్సుకుఁడై కాళిందీజలవ
ర్ణుఁడు। కాళియు వెడలంగనడఁచెఁ గౌరవముఖ్యా* (వ॥ అని నన్నయ్యగాధజలంబువలన మాధవుండెట్టి నేర్పున సర్పంబు దర్పంబు
మాపి వెడలించె నంచుఁ బెద్దకాలంబు వ్యాళమ్మేలయుండె నెఱింగింపుము* (క॥ తొల్లి పలఁగాచిన నంచుని। పల్లవిచరితామృతం
బు గొనకొని చెవులన్। జుఱ్ఱంగదనివిగల్గునె। వెఱ్ఱులకైననుదలాపవిప్రవరేణ్యా॥ అనిన శుకుండిట్లనియె * ( సీ ॥ మానవేశ్వర
యొక్క మడుగు కాళిందిలోఁ గలదది యెప్పుడు కాళియాహి। విషవహ్నిశిఖలచే వేల్చుచుండును మీఁదబఱతెంచినం తెనఁ బక్షు
లైనఁ। బడి మ్రగ్గునందుఁ దచ్ఛృంగశీకరయుక్తపవనంబు సోఁకిన ప్రాణులెవ్వి। యైన నప్పుడె చచ్చు నట్టియాయమడుగులో మదకంబు
పొంగుచునుడుకుచుండుఁ। జూచి వెఱఁగందిజనుల మ్రుక్కఁజేయ। నవతరించిన బలువీరుఁడాగ్రహించి। భుజగవిషవహ్నిదో
షంబు పొలియఁజేసి। సుజలఁగాఁ బంచి యానదిఁ జూతునంచు* (వ॥ కృతనిశ్చయుండై పూర్వజన్మ భాగ్యంబునం దనచరణస
స్పర్శంబునకు యోగ్యంబై తత్సమీపంబున విశాలవిటపశాఖాకదంబంబు గోమున్న కదంబభూజంబు నెక్కి* (మ॥ కటిచేలంబు బి
గించి పింఛమునఁ జక్కంగొప్పు బంధించి దోః। స్తటసంస్ఫాలనమాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి తత్కుటశాఖాగ్రమునిమ్మఁ
దనుండి యురికెన్ గోపాలసింహంబు ది। క్తటముల్ ఘోరయద్రావంబులో గుభగుభధ్వానంబనూనంబుగన్* (ఉ॥ భూరిమహాప్ర
తాపపరిపూర్ణభయంకరగోపబాలకం। తీరవపాతవేగవికటీకృతదుర్విషభీషణోర్మిసం। పూరితమైపడిం గలఁగి పొంగి ధనుశ్శత
మాత్రభాగవిస్తారముఁ బొందెనమ్మడుగు తప్తపయఃకణబుద్బుదోగ్రమై * ( శా ॥ పాఠీనాకృతిఁ దోయరాశి నడుమన్ పాపిల్లి
మున్నాథ్యుఁడై। కాఠిన్యక్రియనీమ నేర్పు దనకున్ గల్మిన్భుజగేంద్రహృ। త్పీఠాగ్రంబున రోషవహ్ని లెగయన్ భీమంబుగా నీడె
ను। ల్లుంఠోత్తుంగతరంగమయిమడుగు దుర్లోకంబుగా బాహులన్॥ ఆసమయంబున॥ ( శా ॥ బాలుండొక్కఁడు ఢీఁడు నా మడు
గు విభ్రాంతోచ్చలతీర్ణక। ల్లోలంబై కలఁగన్ జరించెనట నేలో నుండఁ జూడండు మ। త్కీలాభీలవిశాలమత్సహావిషాగ్నిజ్వాల
లచ్ఛన్నమయి। కాలంజేసెద నేఁడు లోకులకు నాకోపంబు దీపింపఁగన్॥ అని తలంచి విజృంభించి* (ఉ ॥ ఘోరవిషానలప్రభలు
గొబ్బున గ్రమ్మగ సర్పసైన్యవి। స్ఫారగుడుకాళియోరగుడు పాటివడిన్ గల చెచ్చ యోధరా। కారుబయోవిహారుభయకంప
విదూరు మహాగభీరునా। భీరకుమారు విపునపీతశుభాంబరధారు ధీరునిన్* (క॥ కఱచి పెఱుతివకమఱియును। వెఱవక నిజవ
దనజనితవిషదహనశిఖ। లెఱయఁ దనని మదమొదలిని। నెఱిహరిఁ బెనఁగొని యె భుజగనివహపతివడిన్* (వ॥ ఇట్లు భోగిభోగ
వేష్టితుండై చేష్టలు లేనివానిఁ దెలుంగున గానంబడుచున్న ప్రాణసఖునింగనుంగొని తత్ప్రభావంబు లెఱుంగక తత్సమర్పిత
ధనదారమనోరథమానసులుగావున* (చ॥ అడె మనకృష్ణునింగఱచె నంతటఁ బోక భుజంగమంబు మ। ర్మదమున నేమఁ జుట్టికొ
నిమానకయున్నది యింక నేమి సే। యుదమెటు సొత్తమే పురుషులో పుదురీయహి నడ్డపెట్టనె। య్యదిసదుపాయమంచుఁ
బడి రార్తరవంబులఁ దూలి గోపకుల్ *(క॥ గోపకుమారకశేఖరు। నేపున సర్పంబుగఱచుటీక్షించి వగ। న్నేబులకుఁ దోలఁగి గో
వులు। వాపోవుచునుండె నృభవత్సంబులతోన్ *(క॥ భూతములు వడఁకెను లాక్క। పాంతంబులు మింటఁ గానఁబడె ఘోరమ
లో। ద్వేతలకును గోపకసంఘాతములకును దరెను గడగన్నులి లేశా* (వ॥ అంతనా దుర్నిమిత్తంబులు పొడగని బెగడుగదరి నచి
త్తంబులను త్తలపడుచుమందనున్న నందయశోదాదులైన గోపగోపికాజనంబులు హరిదళసరి యెఱుంగక గోపాలగోగణ

పరివృతుండైనకృష్ణుం డెక్కడనైనంజిక్కనొప్పునని పొక్కుచుం జెక్కులవైనమక్కువలు చెక్కులొత్తనొక్క పెట్టబాలవృద్ధసమేతులై మహాఘోషంబుననా ఘోషంబు వెలువడి॥(క॥ వారిట్లుంగి నెఱుంగని। వారై హరిఁ జూడఁ బోవ వడిగొని సగుడున్వారింపఁడయ్యె రాముఁడు। వారిని హరి లా వెఱుంగువాఁడయ్యు న్నృపా* (వ॥ అంతలోన వారును గాంతారమార్గంబు వట్టి పోవుచు నెడ నెడ గోపగోవృందంబుల సంకులనింతనంతనక్కడక్కడికి యవాంకుశకమల కులిశ చక్ర చాప కేతనాది రేఖాలంకృతంబులై మార్గాభరణంబులైన హరిచరణంబుల జాడఁ గని చొప్పుదప్పక చని దుర్ఘటంబైన యమునాతటంబు చేరి వారిమధ్యంబున నితరులకసాధ్యంబైన సర్పంబుచేతఁ గాటుపడి దర్పంబు చూపక భోగిభోగపరివృతుండైన శ్రీకృష్ణునిం గని కృష్ణకృష్ణేతివిలాపంబులఁ దాపంబులం బొంది చుఁదదత్తాలంబునం బ్రతికూలంబయ్యెననుచు దైవంబుఁ దిట్టు గోపికలును గోపకులుం గలిసి మేతలుడిగి యేడ్పులిడక కృష్ణునిం దప్పక చూచుచు నొఱలుచున్న గోవులం గని రందు గోపికలు యశోదం బట్టుకొని విలపించుచుఁ గృష్ణునుద్దేశించి యిట్లనిరి॥(సీ॥ ఎవ్వరు వచ్చినఁ జాల నెదుఱుఁగా జనుదెంతు వెదురువచ్చిన నేఁడ దేల రావు। చూచిన గృపతోడఁ జూచుచుందువు నీవు చూచినఁ గనువిచ్చి చూడవేల। డాసినఁ జాలకడాయంగ వత్తువు డాసిన నేఁటికి డాయవిచటఁ। జీజీననోయని చెలరేఁగి పలుకుదువు పదివేలు మీఁరిన నెఱుఁగకుంట। తలఁపు సేయ నంతఁ దలఁపోయుచుందువు। తలఁపు సేయ నేఁడు తలఁపవకట। యనుచుభక్తివివశులా డెడ్డికైవడి। వ్రేత లెల్లనాడి వివశులైరి॥(వ॥ ఆసమయంబున నందయశోదాదులు హరింజూచి యధికంబయిన శోకంబున నిట్లనిరి॥ (క॥ విషకుచయగు రక్కసి। విషకుచదుగ్ధంబు ద్రావి విజయుఁడవై। విషహరహంభోచనయద్భుత। విషయుండవు నీకు సర్పవిషమెక్కెఁగదా॥(క॥ కట్టా క్రూరభుజంగము। గట్టలుక న్నిన్నుఁ గఱవఁ గంపించితివో। పట్టితివో పాపపువిధిఁ। బట్టి సుముఁదలఁచి కాకపలవించితివో॥(క॥ పన్నగము నమ్ముఁ గఱవక। న న్నేటికిఁ గఱచె కుట్లు నెమ్మిగలిగినీ। పున్నను సుమి రక్షింతువు। నిన్నున్ రక్షింపనేము నేరము తండ్రీ॥ (ఉ॥ చూడవదేమి గారవపుచూపుల నమ్ము సఖాలితోడ మా। టాడవదేమిమర్మముగ నందెలు పాదములందు మ్రోయ నేఁ। డాడవదేమిన ర్తనములవ్వల మ్రోలను గోపికావళిన్। గూడవదేమి నవ్వులకు గోపకుమారవరేణ్య చెప్పవా॥(సీ॥ శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందంగ నెలమి భాషించువారెవ్వరింక। కరచరణామలకలిమ ధన్యతనొంద నెగరి పైఁ బ్రాకువారెవ్వరింక। నయనయుగ్మంబులున్నతిఁ గృతార్థములుగా నవ్వులు చూపువారెవ్వరింక। జిహ్వలు గౌరవశ్రీఁ జేరఁ బాటలమెడఁ బరికించువారెవ్వరింకఁ। దండ్రి నీవు సర్పదష్టుండవైయున్న। నిచట మాకుఁ బ్రభువులెవ్వరింక। నుజిగి పాయలేము మాకు నీతోడిది। లోకమీవు లేని లోకమేల (వ॥ అని యొండొరులం బట్టుకొని విలపించుచుం గృష్ణునితోడనమడుగు జొత్తమనుచుఁ గృష్ణవిరహవేదనానలభారతప్తులైవడు సుఁ జొరఁ బారుచున్న వారలం గనుంగొని భగవంతుండైన బలభద్రుండు మీరు మీఁదెఱుఁగరు ధైర్యంబు విడుచుట కార్యంబుగాదు సహించి చూడుఁడనుచు వారిని వారించి॥ (క॥ తనుఁ గూర్చియుబ్బిధంబున। వనితలు బిడ్డలును దారువాపోయెడి ఘో। షనివాసులఁ గని కృష్ణుఁడు। మనుజుండ క్రియనొకముహూర్తమాత్రము జరిపెన్॥(శా॥ అంతం గృష్ణుఁడు మేనుఁ జెంచ భుజగుండా వృత్తులన్ బాసి తా। సంతప్తాయత భోగుఁడై కఱచుటల్ చాలించి నిట్టూర్పుతో। శ్రాంతుండై తల లెత్తి మర్విషము నాసావీధులం గ్రమ్మచు। శ్చింతన్ దిక్కులు చూచుచున్ దలఁగి నిల్చెన్ధూమశాస్త్రాకృతిన్॥(చ॥ వెలవల లేని మేటిబలువీరుఁడు కృష్ణుకు పాఁడొక్కచేఁ। జలచిఖగేంద్రుచందమునఁ జక్కనదౌడలు వట్టి కన్నులన్। జొజ్జొ అమర్విషానలము జొబ్బిలుచుండఁగ నెత్తి లీలతో। జిజిజి యంద్రిప్పివైచె బరి శేషితదర్పము క్రూరసర్పమున్॥(వ॥ ఇట్లు వేగంబున నాగంబు వీఁచివై చి జగజెట్టియైన నందునివట్టి రెట్టించిన సంభ్రమంబున॥(సీ॥ ఘనయమునానదికల్లోలఘోషంబున సరసమృదంగఘోషంబుగాఁగ। సాధుబృందావనచర చంచరీకగానంబు గాయకసుగానంబు గాఁగ। కలహంససారసకమనీయమంజుశబ్దంబులు తాళశబ్దములుగాఁగ। దివినుండి వీక్షించు దివిజగంధర్వాదిజనులు సభాసీనజనులు గాఁగఁ। బద్మరాగాదిరత్నప్రభాసమాన। మహితకాళీయఫణిఫణామంటపమున। నళినలోచనవిఖ్యాతనర్తకుండు। నిత్యనైపుణమునఁ జేర్చి నృత్యమాడె॥ (శా॥ మత్తిన్ లోకములున్న గౌరవముతో గోపాకృతి మన్నియా। రక్షోహంగవడిన్ మహాఫణిఫణారంగప్రదేశంబుపై। నక్షీణోద్ధతి నాఁడుఁ బాడుఁ జెలఁగు న్వ్యాసంబుతోడం బద। ప్రత్యేషంబులు సేయఁగేళిగతులన్నాట్యైక శేషంబుగన్॥(క॥ ఘనతర సుమశరానంద। స్వనమురతో సిద్ధసాధ్యచారణగంధ। ర్వనిలింపమునిసతులుచ। య్యనగురిసిరివిరులవానలాడుచు హరిపై॥ (వ॥ ఇట్లు హృష్టజననందధరావతారుండైన హరి వడిగలిగిన పడగలమీఁదఁ దాండవంబు సలుప బెండువడి యొండొంటిముఖంబులరక్తమాంసంబులుమియుచుఁ గన్నుల విషంబు గ్రక్కుచు ముక్కు చెడి చిక్కి దిక్కులు చూచుచుం గంఠగతప్రాణుండై ఫణీంద్రుండు తనమనంబున॥(ఉ॥ వేలుపులైన లావు చెడి వేదనఁ బొందుచు నావిషానల। జ్వాలలు సోఁకినంతటనె చత్తురు నేఁడిది యేమి చోద్యమా। భీలవిషాగ్నిహేతిభయపీడకు నోర్చియుఁ గ్రమ్మఱంగనీ। బాలుఁడు మర్త్యుఁడా శతముఖాగ్నము గావెసఁ ద్రొక్కియాడెడిన్॥ (క॥ ఈతఁడు సర్వచరాచర। భూతేశుఁడు పరమయోగి పురుషుఁడు సేవా। ప్రీతుఁడు శ్రీ

హరియగువని భీతిన్మరణంబువేడెబిట్టలసిన్నపా*(వ॥ ఇట్లు క్రూరంబులైన హరిచరణప్రహారంబులం బడగలిడిసి నొచ్చి వచ్చిన

—* కాళియుని భార్యలయిన నాగాంగనలు శ్రీకృష్ణుని స్తుతించుట. *—

క్రియం బడియున్న పతిం జూచి నాగకాంతలు దురంతంబైన చింతాభరంబు నివ్వటిల్లెడు నెవ్వగల నొల్లంబోయి పల్లటిల్లిన యు
ల్లంబుల(ఉ॥ కచబంధంబులు వీడ భూషణములాకంపింపఁ గొందఁగెలు। స్తనయుగ్మంబుల వ్రేఁగునం గదలఁ బైకొంగుల్వడి జార
గాఁ బ్రచురభ్రాంతిఁ గలంగి ముందటను దద్బాలావలిం గొంచు న్రు । కృచుభక్తిం జక్రాంచి రాగుణనణీన్గోపాలచూడామ
ణికిన్*(వ॥ కని దండప్రణామంబు లాచరించి నిటలతటఘటితకరకమలలై యిట్లనిరి(క॥ క్రూరాత్ములఁ దండింపఁగ । ధారుణిపైనవ
తరించితన రెడి నీకీ క్రూరాత్ముని దండించుట క్రూరత్వము గాదు సాధుగుణము గుణాఢ్యా*(క॥ పగవారిసుతులయందును । బగ
యించక లేక విసుతెంబ గెడి నీకుఁ బగగలదె ఖలుల నడఁచుట జగదవనముకొఱకుఁ గాదె జగదాధారా*(క॥ నిగ్రహ మెనఁ ము
విషాస్యులను గ్రుల శిక్షించు టెల్లనూహింప ననుగ్రహము గాక మాకీ నిగ్రహము విషాస్యభావనిర్గతిఁ జేసెన్*(ఉ॥ ఎట్టి త
పంబు చేసెనొకొ యెట్టి సుకర్మము లాచరించెనో । యెట్టి ఘజంబు వలెనొకొ యీ ఫణి పూర్వభజంబునందుము । నెట్టన హ
మభావులకు నెన్నఁడు చేరువ గాని నీవు నేఁడిట్టి వినోదలీలఁ దలలెక్కి నటించెద వీఫణీంద్రుపై*(మ॥ బహుకాలంబు తపంబు
చేసి వ్రతముర్పాటించి కామించి నీ మహనీయోజ్జ్వలపాదరేణుకణసంస్పర్శాధికారంబు శ్రీ। మహిళారత్నము తొల్లి కాంచె
నిది నేమంబేమియు న్లేక యహి నీపాదయుగాహాలిన్బడసెనేఁ డత్యద్భుతం బీశ్వరా*(ఉ॥ ఒల్లరు నిర్జరేంద్రపదమొల్లరు బ్ర
హ్మపదంబు నొందఁగా । నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యమే । నొల్లరు యోగసిద్ధి మఱి యొండు భవంబులనొం
దనీనినీ సల్లలితాంఘ్రి రేణువుల సంగతి నొందినధన్యులెన్నఁడున్*(క॥ ఘనసంసారాహితులను । జనులా కాంక్షింపఁగడు సశ
క్యంబగు శోభనము సమక్షంబున నహి గని యెందామసుఁడు దోషకలితుండయ్యున్*(వ॥ దేవా సకలపురుషాంతర్యామిరూప
త్వంబువలనఁ బురుషుండవయ్యు నపరిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండవయ్యు నాకాశాది భూత సమాశ్రయత్వంబువలన
భూతవాసుండవయ్యు భూతమయత్వంబువలన భూతశబ్దవాచ్యుండవయ్యుఁ గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండవ
య్యు జ్ఞానవిజ్ఞాన పరిపూర్ణత్వంబు గలిగి నిర్గుణనిర్వికారంబులవలన బ్రహ్మంబవయ్యుఁ బ్రకృతిప్రవర్తకత్వంబువలన ననం
తశక్తివై యప్రాకృతుండవయ్యుఁ గాలచక్రప్రవర్తకత్వంబువలనఁ గాలుఁడవయ్యుం గాలశక్తి సమాశ్రయత్వంబువల
నం గాలనాభుండవయ్యు సృష్టిజీవన సంహారాదిదర్శిత్వంబువలనం గాలావయవసాక్షివయ్యు నొప్పు నీకు నమస్కరించె
దము మఱియును*(సీ॥ విశ్వంబు నీవయై విశ్వంబుఁ జూచుచు విశ్వంబు సేయుచు విశ్వమునకు । హేతువవై పంచభూతమా
త్రేంద్రియములకు మనఃప్రాణబుద్ధిచిత్త । ములకెల్ల నాత్మవై మొనసి గుణంబుల నావృతమగుచు నిజాంశభూత । మగు నా
త్మచయమునకనుభూతి సేయుచు మూఁడు హంకృతులచే మూసుఁగువడక । నెఱిననంతుఁడవై దర్శనీయరుచివి । కారసూక్ష్ముఁ
డవై నిర్వికార మహిమఁ । దనరి కూటస్థుఁడన సమస్తంబు నెఱుఁగు । నీకు మ్రొక్కెదమాలింపు నిర్మలాత్మ*(వ॥ మఱియుఁ గలం
డు లేఁడు సర్వంబు నెఱుంగు నించుక యెఱుంగు నించుక బద్ధుండు విముక్తుండొకండ నేకుఁడు ననునివి మొదలుగాఁ గల వాదంబు
లు మాయవలన ననురోధింపుదురు గావున నానావాదానురోధకుండవయ్యు నభిధానాభిధేయశక్తిభేదంబువలన బహుప్రభా
వప్రతీతుండవయ్యుఁ జక్షురాదిరూపంబులవలనఁ బ్రమాణరూపకుండవయ్యు నిరపేక్షజ్ఞానంబు గలిమిం గవివయ్యు వేదమయని
శ్వాసత్వంబువలన శాస్త్రయోనివయ్యు సంకర్షణవాసుదేవప్రద్యుమ్నానిరుద్ధరూపంబులవలనఁ జతుర్మూర్తివయ్యు భక్తజన
పాలకుండవయ్యు నంతఃకరణప్రకాశత్వంబు గలిగి నీవ సజ్జనఫలప్రదానంబుకొఱకు గుణాచ్ఛాదకుండవయ్యుఁ జిత్తాదివర్తనం
బులఁ గానందగిన గుణంబులకు సాక్షివై యొరులకెఱుంగరామిన గోచరుండవయ్యుఁ దర్కింపరాని పెంపువలన నవ్యాహతవి
హారుండవయ్యు సకలకార్యహేతువయ్యు నంతఃకరణప్రవర్తకత్వంబువలన హృషీకేశుండవయ్యును సాధనవశంబుగాని
యాత్మారామత్వంబువలన మునివయ్యు నధికసూక్ష్మమతుల నెఱుంగుచు నెంచుంజెందక నీవు విశ్వంబుగాక యావిశ్వంబు నీవ
యయ్యును విశ్వభావాభావసందర్శనంబు సేయుచు విద్యావిద్యలకు హేతువైన నీకుం బ్రణామంబు లాచరించెద మవధరింపు
ము*(క॥ లోకజనస్థితిలయములు। గైకొని చేయుచు త్రిగుణకలితుఁడవై కాలాకారమునన మోఘ। శ్రీకలితుఁడవగుచు నిచ్చఁ
జెందక నీ శా*(క॥ ఈ శాంతలుగా నితనువు లీశా యీమూఢజాతు లీసజ్జాతు। ల్నీ శాంతతనువులందుఁ బ్ర। కాశింతువు ధర్మహి
తము గా సుజనులలోన్*(ఉ॥ నేరములెన్న నెక్కడిది నేము దలంచ తలంపులందు లో। నేరుపులున్న వేసుతుల నేరమిఁ దంద్రు
లు ద్రోచిపుచ్చరే । నేరముసేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే। నేరమిగల్గు మద్విభుని నేఁ డిటు గావఁగ దే కృపాని
ధీ*(శా॥ బాలుం డీతఁడు మంచివాఁడనుచుఁ జెప్పన్రాము క్రూరుండు దు। శ్శీలుండౌటయు నైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్యదుః
ఖాలంకారముఁ బొందనోడెద మనాథాలాపమాలింపవే। చాలున్నీపద తాండవంబు పతిభిక్షుం బెట్టి రక్షింపవే*(ఉ॥ అకులమ

య్యెభోగమి దెయాఁదలలన్నియుఁ బ్రవిస్సెఁ బ్రాణము। ప్రాకలఁబోకలన్బొలిసె రాయిడిఁబెట్టకమానిజేశపై। నీకరుణాకటాక్షములు నిల్పగదే తగ నోనమస్తులో। కైకశరణ్యయోయభయకారణయోకమలామనోహరా* (గీ॥ నమ్ముఁబెండ్లిసేయుమా ప్రాణవల్లభు। ప్రాణమిచ్చి కావుభక్తవరద। నీవుసేయు పెండ్లి సత్యంబు భద్రంబు। పిన్ననాఁటి పెండ్లి పెండ్లి కాదు * (ఇంద్రవజ్రము॥ నీయానయెవ్వారిని నిగ్రహింపం। డాయుగ్రపాపాకృతి నందడింక। నీయాజ్ఞలోనుండెదు నేఁటనుండి। స్వామీయీశు ప్రాణంబులు మా కునీవే* (వ॥ అని యిట్లు వనపెనిమిట్ల బ్రతుకుఁగోరెడి భుజగసతులయందు శరణాగతవత్సలుండైన పుండరీకాక్షుండు కరుణించి చరణఘట్టనంబు చాలించి తలంగిన నెట్టకేలకుఁ బ్రాణేంద్రియములవలంబడసి చిదిసి నలఁగిన తలలు సవరించుకొని వగపున దురభుజగపతి జలజనయనునికి నంజలిచేసి మెల్లన నిట్లనియె* (చ॥ ఖలకలుమా ప్రచారములు మా ముఖములు విషవహ్ని ఘోరముల్। ఖలుల మురోగజాతులము గర్వులమే మొక మంచివారమే। నలినదళాక్ష ప్రాణులకు నైజగుణంబులు మాననేర్పునే। వెలయ వెమావికారములు వింతలె మేలోనరించితీశ్వరా* (సీ॥ వివిధభావాకారవీర్యబీజాశ్రయజనయోనియుతముగా జగములెల్ల। నీవ చేసితిమున్ను నేమా జగంబులో సహజకోపనులము సర్పములము। దుర్వారమైన నీతోరంపుమాయ నేమెఱిఁగి దాఁటెడు పనికెంత వార। మంతకుఁ గారణమఖిలేశ్వరుఁడవు సర్వజ్ఞుడవు నీవు జలజనయన। మనిచెదే నియుమన్నింతు మనువునన్ను। నిగ్రహించెద వేనియు నిగ్రహింపు। మింక సర్వేశ మాయమ్ము లెంచఁగలవు। చిత్తమందున్న క్రమమునఁ జేయఁదగును* (క॥ నాపుణ్యమేమి చెప్పదు। నీపాదరజంబుఁ గంటి నేసనకాదుల్। నీపాదరజముఁ గోరుదు। రేపదమందున్న నైన నటమేలు హరీ* (వ॥ అని విన్నవించినఁ గాళియు పలుకులు విననవధరించి కార్యమానుసుండయిన సర్వేశ్వరుండతని కిట్లనియె* (క॥ గోవర్గము తో మనుజులు। ద్రావుదురీ మడుగు నీరుఁ దగదింక యుండఁగా। నీవును నీ బాంధవులును। నీవనితలు సుతులు జనుఁడు నేఁడంబుధికిఁగా* (క॥ నిను నేశాసించిన కథ। మనమునఁ జింతించి రేపు మాపును గీర్తించిన మనుజులు నీభయమున। విను మెన్నఁడుఁ బొందరెందు విషవిజయముతోఁగా* (చ॥ ఇది మొదలెవ్వరైన నను లీయమునానది నీహ్రదంబులో। వదలక తోఁగి నన్ను నుపవాసముతో డఁదలంచి కొల్చుచుం। గదలక దేవతాదులకుఁ గా జలతర్పణ మాచరించిన। నృతమల చిత్తులయి దురితసంఘముఁ బాయుదు రాక్షణంబునఁగా* (గీ॥ గరుడభీతిరమణకద్వీప మొల్లకీ। మడువుఁ జొచ్చితీవు మత్పదాబ్జ। లాంఛనములు నీతలల నుంటఁ జూచియా। పక్షిరాజు నిన్నుఁ బట్టఁ డింక* (వ॥ అని యిట్లు విచిత్రవిహారుండైన గోపాలకృష్ణుఁ మానుండానతిచ్చిన నీయకొని చయ్యన నయ్యహీంద్రుండు తోయ్యలులుం దానును నెయ్యంబున నయ్యీశ్వరునకు నవ్యదివ్యాంబరాభరణ రత్నమాలికాను లేపనంబులు సమర్పించి తేఁటితండంబులకు దండయగు నీలోత్పలంబుల దండనిచ్చి పుత్రమిత్రకళత్రసమేతుండయి బహువారంబులకై వారంబు చేసి వలగొని మ్రొక్కి లేచి వీడ్కొని రత్నాకరద్వీపంబునకుం జనియెనిట్లు* (క॥ వారిజలోచనుఁ డెవ్వరు। వారింపఁగ

—* కాళియుని పూర్వకథ. *—

లేని ఫణిని వ్యాసత్వంబు। న్వారించిన యమునసుధా। వారింబొలుపారె నెల్లవారికిఁ బ్రియమై* (వ॥ అనిన విని మునీంద్రా యేమి కారణంబునఁ గాళియుండు భుజగనివాసంబయి నరమణకద్వీపంబు విడిచె నతండొక్కరుండును గరుడునకేమి తలంచెననినరవరుండడిగిన మునివరుండిట్లనియె* (సీ॥ సర్పభీరువులై నజను లెల్ల నెల నెల సరసభక్షములు వృక్షముల మొదల। సర్పంబులకుఁ బెట్టసర్పంబులును మును సర్పాంతకుఁడు దమ్ముఁ జంపకుండఁ। బ్రతిమాసమును దమభాగభక్ష్యంబులా పక్షిరాజునకిచ్చి బ్రతుకుచుండ। విషవీర్యదుర్మదావిష్టుఁడై కాళియుఁ డహిపులాంతకుని పాలపహరించి। యీకతనబాలిభాగంబులెల్లఁ దినిన। వినిఖగేంద్రుఁడు కోపించి వీనితలలు। చీఱి చెండాడి భోగంబు చించివైచి। ప్రాణములఁ బాపి వచ్చెదఁ బట్టియనుచు* (క॥ అక్షీణక నకసన్నిభ। పక్షయుగోద్భూత ఘోరపవమానమహా। విక్షేపకంపితానేకక్ష్మాధరేంద్రుఁడగుచు గరుడుఁడు వచ్చెన్* (ఉ॥ వచ్చిన సర్పవైరిఁ గని వ్రాలక లేచి మహాఫణావళుల్। విచ్చి దృగంచలంబుల నవీన విషాగ్నికణంబులొల్కఁగా। నుచ్చలదుగ్రజిహ్వలు మహోద్ధతిఁ ద్రిప్పుచు నార్పులందుఁ గా। ర్చిచ్చెగయంగ బాఱిక అచెన్విహగేంద్రు నహీంద్రుఁడుగ్రతన్* (క॥ కఱచిన భుజగము రదములు। విఱుగఁగ వదనముల విషము వెడలఁగ శిరము। ల్పఱియలుగ నడచె గరుడుఁడు। తఱిమి మిక్కనకరుచులుగలుగు తనవలతెక్కఁగా* (వ॥ ఇట్లహికులారాతి చేత వ్రేటువడి వెఱచి పరతెంచి కాళియుండీ గభీరంబైన మడుగుఁ జొచ్చె మఱియు నొక్క విశేషంబుగలదు * (సీ॥ మున్ను సౌభరియను ముని యాహ్రదంబునఁ దపము చేయుచునుండ ధరణిలోన। నాఁకలిఁ గొనిపన్నగాంతకుఁడొకనాఁడు చనుదెంచి యందుల జలచరముల। నొడిసి భక్షించిన నున్న మీనము లెల్ల ఖిన్నంబులై వగఁ గ్రుస్సియున్నఁ। జూచి యా మునిరాజు శోకించి కోపించి గరుడుఁడు నేఁడాదిగాఁగ నిందుఁ। జొచ్చి మీనంబులను మ్రింగ జూచెనేని। చచ్చుఁగావుత యని యుగ్రశాపమిచ్చెఁ। గాళియుండొక్కఁడా శాపకథ నెఱుంగు। నితరభుజగంబులెవ్వియు నెఱుఁగ వధిప* (వ॥ అదికారణంబునఁ గాళియుండా మడుగుఁ జొచ్చిన గోమనుజరక్షణార్థంబు కృష్ణుండతని వెడలించె నిట్లు దివ్యగంధాంబర సువర్ణమ

ణిగణమాలికాలంకృతుండై మడుగు వెడలివచ్చిన మాధవుంగని ప్రాణలాభంబులం బొందిన యింద్రియంబులుం బోలె యశో
దారోహిణీసమేతలైన గోపికలును, నందసునందాదులైన గోపకులును మూర్ఛలం బాసి తేజిచెప్పఁజాలిలేదిపరమానందంబు
లం బొందిరి బలభద్రుండును తమ్ముని నాలింగనంబు చేసె నప్పుడు* (క॥ రంకెలువైచె వృషభములు। హుంకారముతోడ లేఁగలట్టిట్టు
లికె। న్బొంకములనొప్పె ధేనువు। లంకురితములయ్యెఁ దరువులా హరిరాకన్* (క॥ నీసుతుఁడహిచేఁ జిడవఁడె। నీసురుచిరభాగ్య
మహిమ నిశ్చలమను చు। న్భూసురులు సతులుదారును। భాసురవచనములనందుఁ బలికిరి లేశా* (శా॥ సన్నాయుగ్రభుజంగమం
బుగఱవనీ్న వాపదం బొందుచు। న్నన్నేమంటి తనూజ యోడవుగదా నాహూననాతండ్రి రా। వన్నాయంచు శిరంబు మూర్కొ
ని నిజాంకాగ్రంబుపై నిల్పుచు। న్గన్నీరొల్కఁగఁ గౌఁగలించె దనయున్నారాబు తోఁదల్లి దాన్* (వ॥ ఇటు పరమసంతోషులై
ఘోషజనములా రేయి కాళిందీతటంబున నాఁకలినీరువట్టులడస్సి క్రుస్సి గోవులుందారునుఁ దనగణ్యంబగు నరణ్యంబున నొక్క

—* గోగోపగోపికాసంఘమును గార్చిచ్చు చుట్టుకొనుట. *—

దవానలంబు పుట్టి చుట్టుముట్టికొని నను రేయి నిద్రితవ్రజంబైన వ్రజంబు మీఁదఁ గదసిన నదరిపడి లేచి దందహ్యమాన దేహు
లై సకలజనులును మాయామనుజబాలకుండైన హరికి శరణాగతులై యిట్లనిరి* (మ॥ అదె వచ్చెన్ దవవహ్నిధూమకణకీలాభీ
లను ర్వారనై। యిదె కప్పెన్మము నెల్ల వారి నిటమీఁదేలా గురక్షింపునీ। పదపద్మంబులుగాని యొండెఱుఁగ మోపద్మాక్షమో
కృష్ణ రామ్రయో। కెఁ దమో రామమహాపరాక్రమ దవాగ్ని న్వేగవారింపవే* (క॥ నీపాదంబులు నమ్మిన। నాపద లెక్కడివి జనులక
త్యుగ్రమహా। దీపితతాపజ్వలనము। పైఁబడకుండెడి విధంబు భావింపఁగదే* (వ॥ అని ఘోషించు ఘోషజనులం గరుణించి యప్ప
ద్మలోచనుండగు ననంతుండనంతశక్తియుతుండై గహనంబు నిండిన దావదహనంబు పానంబు చేసి విజయగానంబు దశదిశలని
గుడనంతఁ గృష్ణుండు గోగణజ్ఞాతిసమేతుండై మందయానంబున నందకుంజ నిరిట్లు రామకేశవులు గోపాలవేషంబులఁ గ్రీడించు
సమయంబున* (సీ॥ దినములంతంతకు దీర్ఘంబులై యుండె దిననాథుఁడుత్తరదిశఁ జరించె। నాఁడునాఁటికి నెండ నవ్యమై ఘనమ

—* గీష్మఋతువర్ణనము *—

య్యె వెచ్చనిగాడ్పులు విసరఁజొచ్చె। మేదినీ రేణువుల్మింట సంకులమయ్యె నేఱులు గొలఁకులు నిగిరిపోయెఁ। బానీయశాలలఁ బథి
కసంఘము నిల్వెఁ జప్పరంబుల భోగిచయము డాఁగెఁ। దరులు కుసుమచయము దళములతో వాడె। మిథునకోటికి రతి మెండు దో
చె నఖిలజంతుభీష్మమైన గ్రీష్మము రాక। గలిగి యడవులందుఁ గేలిసలిపె* (గీ॥ వాడిరుచులు గలుగువాఁడు వేఁడిమి గ్రీష్మ। కాల
మందు జగము గలయఁ బడియె। బ్రహ్మజనులకొలకు బ్రహ్మాండఘటమున। నుష్ణరసముఁ దెచ్చి యునిచెననఁగ* (వ॥ ఇట్లాభీలం
బైన నిదాఘకాలంబు వర్తింప బృందావనంబు రామగోవిందమందిరంబైన కతంబున నిదాఘకాలలక్షణంబులం బాసి నిరంతరగి
రినిపతితనిర్ఝరశీకరపరంపరాభాసితపల్లవిత కుసుమితతరులతాంబయ్యును, దరులతాకుసుమపరిమళమిళిత మృదులపవనంబ
య్యును, బవనచలితకమలకల్హారసరోవరమహాగభీరనదీహ్రదంబయ్యును, నదీహ్రదకల్లోలకంకణప్రభూతపంకరంబయ్యును,
బంకసంజనితహరితాయమానతృణనికుంజంబయ్యును, జనమనోరంజనంబై నవసంతకాలలక్షణంబులు గలిగి లలితమృగపక్షి
శోభితంబై యొప్పుచుండె మఱియు నందు* (క॥ పికముల కోలాహలమును। శుకసంఘము కలకలంబు సుభగమయూర। ప్రకర
ము కేకారవము। ళినికరము రొదయును జెలంగె నెఱిన య్యడవిన్* (క॥ ఆతతయమునాసరసీ। జాతతరంగాభిషిక్తజలరుహగం
ధో। పేతానిలము డఁచె నిదా। ఘాతతదావాగ్ని నీడనవ్వనమందున్* (వ॥ ఇట్లామనికందువ తెఱంగు గల్గి సుందరంబైన బృందా
వనంబునకు బలకృష్ణులు గోవులఁ ద్రొప్పికొని చని గోవులుందారును నొండొరులతో నగుచుఁ, దెగడుచుఁ, జెలంగుచుఁ, దలంగుచు
జిఱ్ఱజిఱ్ఱందిరుగుచుఁ, దరులసందులను డుకుచు, దాగరమూఁతలాడుచు, గీతంబులు పాడుచు, వేణునాదంబులు ఘటియించుచు
నటియించుచు, గతులు దప్పిన క్రియ నొరగుచుఁ, గుప్పలు డుకుచుఁ, జప్పట్లు వెట్టుచుఁ, గందుకంబులఁ దట్టుచు, నుప్పరంబెగసి దర్దు
రంబుల చందంబున దాఁటుచు, నామలకబిల్వాదిఫలంబుల మీఁటుచుఁ, గుటవిటపంబులు గదల్చుచు, మృగంబుల నదల్చుచుఁ, బె
రల రేఁపుచును ధుమక్షికంబులఁ జోఁపుచుఁ, దేనియలు ద్రావుచు సామ్యసిలం బోవుచు, గురుశిష్యకల్పనంబులం బనులు సేయుచు,
గాక పక్షధరులై ముష్టియుద్ధంబుల డాయుచుఁ, బన్నిదంబులు చఱుచుచుఁ బులుఁగులభంగిని అచుచు బహురూపంబులఁ బన్నుచు
నెగరితన్నుచు, సేవ్యసేవకమిత్రామిత్రభావంబులు వహించుచు, నుత్సహించుచు, మఱియు ననేకవిధంబులఁ గ్రీడించిరంత*
(క॥ మాపాలికి బలకృష్ణులు। భూపాలకులంచు నెగరి బొబ్బలిడుచు నా। గోపాలురు మోతురు ప్రమ। దాపాదకులగుచు వల్లి కాం
దోళికలన్ (క॥ గోపకులందఱునాడుచు। దీపింపగ రామవాసుదేవుల వెనుకన్। గైకొని పాఠకగాయక। రూపంబులఁ బొగడుదు
రు నిరూఢాత్మకులై* (క॥ ప్రీతిన్గోపకులందఱు। గీతంబులు పాడఁ దరులక్రిందను నగుచు। న్జైతులు ద్రిప్పుచు వెడ పెడఁ। బాతరలాడఁ
గ యశోదపాపండడవిన్* (మ॥ జలజాక్షుండును రాముడున్నటనముల్సల్పంగ గోపాల। మూర్తులతో వారఁ గొల్చు నిర్జరుల

సంతోషింపవేణుస్వనంబులుగావించుచుగోష్ఠములూనుచుశిరంబల్లి త్రిప్పుచువ్వాడుచున్ । వలనొప్పన్వ్యపులించి స్పష్టమునటు ల్వర్ణించుచుచందంబునన్* (వ॥ ఇట్లు రామకృష్ణులునదనదీతీరంబులంగోలంకులసమీపంబులగిరుల జెలువుల సెలయేటులమ

—* బలభద్రుడుప్రలంబాసురునివధించుట. *—

డుగులనీడలపొంతలంబసిమిగులకసవుజొంపంబులంబసులనుమేపుచుండం బ్రలంబుండనురక్కసుండు కుటిలి గోపాలరూ సంబునవచ్చి వారలహింసచేయందలంచుచుండ నయ్యఖిలదర్శనుండగు సుదర్శనధరుండెఱింగియు నెఱుంగని లెఱంగున* (క॥ ఆరామునిసహజన్ముండు దారమ్మనివాజీజితరాక్షస్తోమా । గ్రామముచేసి మెల్లనబోరామియొనర్చి పలికె భూరిగోనుకొల కుల్* (వ॥ ఇట్లు వలంబునితోఁ జెలిమిసేయుచుకృష్ణుండుగోపాలుఫలకునిట్లనియె* (గీ॥ నరపరబ్రౌఢ్వవోధుననమిందఱము రెండు గములవారమగుచుగందుకములశిలలుగుఱులుచేసి చేరిక్రీడింతము। రండువలయుజయపరాజయములు* (వ॥ అని యిట్లుపలికి తానుబలభద్రుండు పెన్నుఁడ్డ్రై యితరవల్లవులెల్లను దీపించుకొనుచిట్లుద్దులైవచ్చి సమయంబున విభజించుకొని రెండుగములవారై మార్గంబులందుంద్రుణదారుశిలాకల్పితంబులగుగుఱులుగొడ్డికొండుకశిలాదిప్రక్షేపణంబుల లక్ష్యంబుల డాసి వైచిజయపరాజయనిర్ణయంబులంగనివాహ్యవాహకలక్షణంబులం జేతులుచేతులవహించి క్రీడించుచుబలరామునికి వానిచందంబురహస్యంబున నెఱింగించిపసులబిల్చుచుభాండీరకంబను వటంబుచేరి రాక్రీడయందుఁ బిదపగృష్ణుని శ్రీదాము నాను ధేయుండై నగోపకుండువహించె భద్రసేనుండు వృషభునెక్కించుకొనియె బలభద్రుండు ప్రలంబునారోహించెనప్పు డు* (మ॥ వనజాతున్బలిమిన్బలాఢ్యుండుకృష్ణావర్తుండుమున్మింటికి । న్గొనిపోజాలకజిక్కి నాడతనిన కుక్షోపరాదంచు నా దనుజారిన్గొనిపోదలంపకవడిన్ రై త్యేశుఁడ య్యాటలోఁ । గొనిపోయెన్గిరిదాటి రామునఖలప్రహరకుఁ యోద్దామునిన్* (వ॥ ఇట్లుక్రీడాకల్పితవాహనుండైనప్రలంబుండు బలభద్రుఁ గొనిపోవుచు* (మ॥ గురుశైలేంద్ర సమానభారుఁడగు నాగో పాలకున్ మోవలే। కరయోద్రేకముమానసైత్యుండునరాకారంబుపాలించిభీ। కరసై త్యాకృతినే గెహేమకటకాకల్పంబు తోరామునితో। మురువొప్పంగదటిల్లతెందయుతజీమూతంబుచందంబునన్* (ఉ॥ మోసము లేకవానిపెనుమూపుననుండు చునాహలాయుధుం। డాసమయంబునంగనియెహాటకరత్నకిరీటకుండలో। ద్భాసితమస్తకున్ భ్రుకుటిభాసురదారుణనేత్రు నుగ్రదంష్ట్రాసహితుంబ్రలంబునురుశౌర్యవిలంబుదావలంబునన్ ॥ కనినక్తంచరుఁడనియించుకశంకించివెఱవక* (క॥ క డువడిదనువెసగొనిచని। మిడుదనుజునిశిరముపగుల నెగిరిహలధరుం । డడరిపడిచటులతరముగు। పిడికిటవెస విసిరిపొడిచెబి ఱునననలుకన్* (క॥ హలధరుబలుపిడికిటిహతిఁ। పలవగిలినరుధిరజలముతనువివరములం। దొలుకమొఱయిడుచు దనుజుఁడు బలరిపుపవినిహతనగముపగిదింబడియెన్* (తరల॥ మేలుమేలుగదయ్యరాముఁడుమేటిరక్కసునొక్కనిన్ । న్నేలఁగూలిచెనో కక్కపోటుననే మువిస్మయమంచుగో। పాలకుల్గనిచచ్చివచ్చినభ్రాతఁగన్నవిధంబునన్ । జాలదీ వెనలిచ్చి రామునిసత్కరించిరి వేడుకన్* (క॥ బలవంతుఁడగుప్రలంబుఁడు। బలుముష్టిన్నిహతుఁడయ్యెబ్రతికితిమనుచున్ । బలసూదనాదిదివిజులు। బలుపైగుసు మములవానఁబరగిందిరొగిన్* (వ॥ ఇట్లుగోపకులుక్రీడింప గోవులంతంగాంతారంబున వింతకసవులు మేసవుచు మేతవడి నొండడవికిదూరంబుచనియంమదవదహానపవనసంస్పర్శంబుపైరింపకకంపించిదప్పినొప్పు నెడిఘోషించిన* (శా॥ ఆగోపా

—* శ్రీకృష్ణుడుదావాగ్నినిమ్రింగిగోపికగోసంఘమును గాపాడుట. *—

లకులందఱున్నపసులకుయ్యాలించికౌమారకేళీగాఢత్వముమాని గోఖురరదావిచ్ఛిన్నఘాసంబుతో। బాగైయున్నపథంబున న్జనిదవాపన్నంబుగాకుండవే। వేగన్ గోగణమున్మరల్చిరటవీవీధిన్జవంబొప్పఁగ* (క॥ జలధరగభీరరవమున। నలినదళాక్షుం డుదమ్మునామాంకములం। బిలిచినవినప్రతిఘోషణ । ములుసేయుచుబసులుదిరిగె. ముదమునసధిపా* (వ॥ అంతనవ్వనంబున దైవయోగంబునఁ గార్చిచ్చుపుట్టిబెట్టువిసరెడికరువలివలనమిన్నుముట్ట మిట్టివడిగట్టుచెట్లనకదరికొనివట్టికాలుచుఁ జుట్టుకొ నిపరవన్గనిపల్లటిల్లినయుల్లంబువల్లవులెల్లఁదల్లడిల్లి ప్రబలుండైనహరికిమృత్యుభీతులరీతింజక్క మ్రొక్కి యిట్లనిరి* (క॥ ఆర్భం కపశుగణాయుత। విభ్రాంతమహాస్ఫులింగపనరోగ్రశిఖా। విభ్రష్టదగ్ధలోకా। దభ్రంబై వచ్చెఁజూడుదవశిఖకృష్ణా* (శా॥ నీ చుట్టాలకునాపదల్గలుగునే నేమెల్లనీవారము। వ్యాచారంబులెఱుంగమీశుఁడవుమా కాఖిలదావాగ్ని నేఁ । డేచందంబుననింక దాటుదుముచమ్మిండించిరక్షింపవ। న్నాచంద్రాభవిపన్నులన్ శిఖివితానచ్ఛన్నులన్ ఖిన్నులన్॥ అనిమఱియును* (ఉ॥ బంధు జనంబుచేతనిటుప్రార్థితుడైహరివిశ్వరూపుఁడో । బంధువులారమీనయనపంకజముల్ముకుళింపుడగ్నినిస్పంధినడంతునేనని నఁజక్కనవారలునట్లచేయుమస్కంధుకదావపావకముఁబట్టిముఖంబునఁద్రావెలీలతోన్* (వ॥ ఇట్లునిజయోగవైభవంబు నదావదహనంబుపానంబుచేసినిమిషమాత్రంబునగోపకులనందఱభాండీరకవటసమీపంబునకుందెచ్చివిడిచిన వారుపికసిత నయనకమలులై కృష్ణునియోగమాయాప్రభావంబుననెఱగలిచిచ్చుద్రుగ్గెననియెఱింగించుచుఁదమమనంబులందు* (క॥ కా

ర్చిచ్చార్పుచటుత్వము। నేర్చు నెనయుఁడొకఁడుశౌరి నేఁడిదె కార్చి । చ్చార్చిమనలరక్షింపఁగ। నేర్చెనితఁడజుఁడొహరియొని టలాడుకొండో* (వ॥ అనివితర్కించిరంతఁగృష్ణుండు సాయాహ్నసమయంబున రామసహితుండై వంశనాళంబుపూరించు చుగోపజేగీయమానుండై గోష్ఠంబుప్రవేశించినప్పుడు* (క॥ కమలాక్షుయొద్దనుండని। నిమిషముయుగశతముగాఁగ నెగడిన గోప॥ స్త్రీమదలుసంభ్రమమునను। కమలాక్షునిఁజూచిముదముగనిరిమహేశా* (వ॥ ఆసమయంబునగోపకులింద్లకడనున్న వృద్ధకాంతాజనంబులకు రామకృష్ణులచిత్రచరిత్రంబులు చెప్పినవిని వారువారిని కార్యార్థులైవచ్చిన వియచ్చరవరులని తలఁ

—* వర్షాఋతువర్ణనము *—

చిరంత* (సీ॥ పూర్వవాయువులుప్రభూతంబులైవీఁచెఁ బడమటనింద్రచాపంబుదోఁచె । బరివేషయుక్తమైభానుమండల మొప్పె మెఱుఁగు త్తరదిశ మెఱవఁదొడఁగె। దక్షిణగాములై తనరెమేఘంబులుజలచరానీకంబుసంతసించెఁ। జాతకంబుల పిపాసలుకడపలఁజేరెఁగాంతారవహ్నులగర్వ మడఁగె । నిజకరాళివలననీరజబంధుండు। దొల్లిపుచ్చుకొనినతోయ మెల్ల। మాఱలనిచ్చుచుండె మహికర్షకానందకందమైనవానకంపువంను* (క॥ వర్షాకాలభుజంగుఁడు। హర్షముతోనిడిననవనఖాంక ములనియుత్కర్షింపభూమిసతిసైఁ। గర్షకహలరేఖలమరెగహనాంతముల* (క॥ చెలువుఁడుప్రావృట్కాలుఁడు। పొలసి నఁబులకించుభూమిపులకములనఁగా। మొలిచితలలెత్తినిక్కుచు । సలలితగతిజాలువారెసస్యములధిపా* (వ॥ మఱియుఁజ టులపవనచలితంబులై పన్నిమిన్నందన్ని లెక్కలకుమిక్కిలియై ఱెక్కలుగలనీలగిరులసిగులమీఁజి కాలుకొని లెఱపిపడకనిబి డంబులై శిశిరకిరణతరణిమండలంబులచొప్పుదప్పించి విప్పగలిగిచదలుగప్పుకొనిననీలమేఘంబులును, మేఘవిముక్తంబులైజ లదసమయవిటుండు సరసగతిధరణిసతియురమ్మునదర్పించి నేర్పునసమర్పించు కర్పూరఖండంబులవడువునఁ బుడమింబడు కరకములును, గరకానుగతంబులై యసితభోగిభోగంబులబాగుననీలమణిమాలికావిశేషంబులవిధంబున నెడపడకపడు సలిల ధారలును, ధారాధరవిగళితవిమలసలిలంబులందోఁగుచు మదజలాభిషిక్తమాతంగంబులసొబగునునుండుకొండలును, గొం డలతుదలనుండిగండశైలంబులపైఁబడిపకీర్యమాణంబులగుగిరినిర్ఝరంబులసీకరంబులును, శీకరపరంపరలచోదుకులుచుదు గులుగొనినఁ బిదఁబిదనగుచుఁ జిదుకుమనుతూంపులును, తూంపులుగ్రొచ్చి క్రచ్చఱనుచ్చలితంబులై పఱచు వఱపలవలన మెదలికదలిపాఱెడిమేలులును, నేఱులవెంటగరులుత్రిప్పుచుగములుగొని క్రొన్నీటికెదుఱునడుచుమీనంబులును, మీననయ నలమేనులమెఱుంగుసొంపు పెంపుసైరింపక కంపించిసురిగితిరిగిచనియెడి కరణి మేఘమధ్యంబులంబొలసి మలసినిలువకమఱ లిచనుక్రొమ్మెఱుంగులును, మెఱుంగులతెఱంగునఁ దెరవలుపురుషులందగిరినిలువరనిజనులకెఱుంగనలువ మెఱయిడినవడు వునమొఱయునుఱుములును, నుఱుములకులికిపడక కికురుపొడుచుచుఁబింఛంబులు కొంచంబులుసేయక విప్పిదెప్పరంబుగతూ ప్పుచునర్తనంబులుసేయుమయూరంబులును, మయూరఘోషంబులుభీషణంబులై చెవులకుసోఁక ననూనంబులైనమానంబు లనాసలుచెడియొండొరులకుంగ్రింకుపడిక్రందుకొనువిరహిజనులును, జనులకురేపుమాపు నిరూపింపరాక మాలతీకుసుమ వికసనవిదితావసానంబులగుదుర్దినంబులును దినావసానసమయంబునమినుకుమినుకుమని మెఱయుచుందిరుగు ఖద్యో తంబులును, ఖద్యోతదర్శనంబుగోరుచు నడుగకవిడువక గురియుజడింబడి వలిగొనివడఁకుచు నశనయత్నంబులు వర్జించి ఖర్జూరజంబూఫలభక్షణంబులదేహసంరక్షణంబులాచరించువనచరులును, వనచరానందకారిణులైన వారరమణులరుచిన నవరతభుజగసమేతలగుకేతకులు, గేతకీకదంబయూధికా కుటజకుసుమపరిమళమిళితంబులగు విపినమార్గంబులును, మార్గ నిరోధంబులగుచుంబెరిగిరసికంబులైవసరుడాలుగలుగుచుఁ, బద్మరాగకిరణపుంజంబులభంగిరంజిల్లి తొంగలించుచు, జొం పంబులుగొనినకసవులును, గసవులుమెసవిమిసమిసందనువులు మెఱయవలుదపొదుగులబరువునకదలకనిల్చి నెమరువరనిడు ధేనువులునుగలిగి, ధేనువ్రజంబుకై వడిఁబయఃకణమనోహరంబై, హరకరముభంగిఁబరిపూర్ణసాగరభాసురంబై, సురగిరి చెలువునహరిశరాసనవిభీషణంబై, విభీషణహృదయంబుపోలికఁబ్రకటితహరిశబ్దవైభవంబై, భవపూజనంబుచందంబున నింద్రగోపాదివిభవజనకంబై, జనకయాగంబుభాతిసీతాప్రకరణాలంకృతంబై, కృతయుగంబుసొంపునబహువర్షంబునైన ప్రావృడాగమంబువచ్చెనందు* (క॥ వాడకప్రాలకతెవులుఁ। గూడకతగనల్లగిరులగొనినవకములై । చూడఁగభద్రములగుచును। వీడెన్సస్యంబులిద్ధమువిడెంబ్రజకర్త* (క॥ జీవనముచాలఁగలిగియుఁ। గావరమునమిట్టిపడనిఘనునిక్రియనదీ। జీవనములుసౌర జలనిధి। ప్రావృట్కాలమునడెందుపడియుండెనృపా* (శా॥ అవర్షాగమమందుగోవులనరణ్యాంతంబులన్మేపుచు। న్గోవిందుం డుగ్రలంబవైరియుతుఁడై గోపాలవర్గంబుతోఁ। బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్భక్షించుచున్మంజుల। గ్రావాగ్రంబు లఁబ్రీతిజల్లిగుడిచెన్నాసారతీరంబుల॥ ఆసమయంబున* (సీ॥ విశ్వమోహనమైన వేణునినాదంబు సరసగంభీరగర్జనముగాఁ గ। మహనీయనర్మలమందహాసద్యుతిలలితసౌదామినీ లతికగాఁగ। దలచుట్టుబాగుగదనరు పింఛపుదండశైలభేదను శరాస

నముగాఁ గరఁగి కరుణాకటాక్షవీక్షణసుధావర్షంబు సలిలధారాప్రవర్షంబు గాఁగ। జాడనేతెంచు గోపాలజనమునీంద్రచాతకంబులదురపన్థఁ జక్కఁ జేసె। కృష్ణమేఘంబు బహుతరకీర్తినొప్పె। విమలబృందావనాకాశవీథియందు.* (క॥ గోవులవృషవత్సంబుల। వావిరిఁ బూజించి పిదపవర్షాకాల। శ్రీవనితను బూజించెను। శ్రీవల్లభుఁడయ్యుఁ గోపశేఖరుఁడధిపా॥ ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబు చ్చినంత* (క॥ జొంపములుగొని యౌవనములు। రొంపులిగిరె నెమలిగములఁ రొదలుడిగెనదు

—* శరదృతువర్ణనము- *—

ల్పెంపులకు బాసెను ఱుములు। శంపలసంపదలు మానె శారదవేళన్.* (వ॥ మఱియు జీవనంబులు విడిచి విమలజ్ఞానవశంబున ముక్తులగు పురుషరత్నంబుల చెన్నునఁ జెన్ను వదలి మిన్ను విడిచి వాయువశంబులై వెల్లివిఱిసిచను మేఘంబులును, మేఘపటలరహితంబును, గలశభవమునిసహితంబును నై విజ్ఞానదీపవిలసితంబగు యోగిహృదయంబు చందంబున శుభంబైన నభంబును, నభంబు నీలదుకూలవితానసంయుక్త ముక్తాఫలంబుల వడువున నెగడు నుడుగణంబులును, నుడుగణనాయకముఖంబుఁ గ్రొవ్వులువ్వెత్తుగఁ గొని నివ్వటిల్లుచు బ్రహ్మాండకరండకర్పూరఖండాయమానంబులగు చంద్రకిరణంబులును, చంద్రకిరణసమ్మర్శనంబున సగర్భంబులై భూమికి మర్భకంబులగుచు నిండిపండి హాలికకరనిశితలవిత్రధారాసంరంభంబు దలంచి తల్లడిల్లి వెలవెలఁ గంబాఱుచుఁ దల్లియగు విశ్వంభరకును గొనిప్రణతంబులై వడంకుచు నెఱుఁగ మొఱయిడుచున్న పెంపున సంపన్నంబులయిన యెన్నులఁ ద్రేవకునవ్రాలి గాలిం దూలుచు ధర్మరథ్వనులసారస్యంబులగు కలమాది సస్యంబులును, సస్యమంజరీపుంజంబులు గొంచకచంచువులఁ ద్రుంచికబళించి పిల్లపెంటితండంబులఁ గూడి కడుపులనిండ మెక్కి పిక్కవిరిసి చౌకళించుఁ ద్రిక్కలు గొని మహోత్తుంగసమంచితమంచప్రదేశంబులెక్కి సంచరించుచు వెన్నులకావలియున్న యన్నులకెమ్మోవులు బింబఫలంబులని కఱచి నితకరాస్ఫాలనంబులను లికిపడి యెగసిచను శుకనికరకలకలంబులును, కలహంసకోకసారసకోలాహలమండితంబులై నిండి నిర్మలజలంబులుగల జలాశయంబులును, జలాశయంబుల జలములను దినమునికుడ గృహములఁ బ్రతుకుదినములు సనుటయు నెఱుంగనిమపుజాలగవానికందిరుగు జలచరంబులును, జలచరహృదయములు బెగడుగదుర డొంకియుంకిన నదులును, నదులందుఁగపూర మండపంబుల తెఱంగున, మణిసట్టిమంబు మాడ్కిని, సౌధసోపానమార్గంబుల జాడను, విలోకితంబగు నూతన సైకతంబులును, సైకతప్రదేశంబుల నుదయవేళ నిత్యకర్మానుష్ఠాననిరతులగు మునులును, మునికన్యకాకరకలశ సలిలాభిషిక్త మూలంబులగు తపోవనబాలసాలంబులును, సాలవిటపి వాసంతికాకుంజపుంజంబుల తఱుచున నిముడుకొని దినకరకిరణములకుం గఱువలికిం జొరవెఱవుపడని వనములును, వనములందరుల కొమ్మల నాకలంబులు నేకలంబులై మెసంగి మసరుకవిసి గ్రొవ్విక్కొమ్ములకొనలనూఁది యేటిదసులుఁ ద్రవ్వి చిమ్మి క్రుమ్మి కోరాడెడి వనగజంబులును, గజకుంభకనకకుంభరుచిరకుచభారభీరుమధ్యనమంచితలగు చెంచితలును, జెంచితలక్రూరమ్ములగు వాలమ్ముల సారమ్ములు చెడి బెడిదంబునఁ బాదంబుల ద్రొక్కుపడఁ, బెనుగాఢంబులంబడు వరాహపుండరీకంబులును, పుండరీకకుముదకురంటకాది కుసుమమకరందంబు గ్రోలి తేలిసోలి వ్రాలి మహాహంకృతులఝుంకృతులు సేయు తేఁటికదుపులును, గదుపులంగలయ నెడగలిగి మదమున నదమువద నెఱింగి మదనమార్గణప్రేరితంబులై పెంటితుటుముల వెంటంజని యొండొంటిఁ గెంటించుచుఁ దగుల నెక్కి గర్భంబులు నెక్కొలుపు మృగవృషభరాజంబులును గలిగి, రాజరాజగృహంబు పగిది విలసితకుందపద్మసౌభాగ్యంబై, భాగ్యహీనుకర్మంబు రేఖ నస్రుతనీలకంఠశబ్దంబై, శబ్దశాస్త్రవేదితహృదయంబు భాగున విశదప్రకాశాభిరామంబయి రామసంగ్రామంబుకైవడి బాణాసనాలంకృతంబయి, కృతాంతహృదయంబు కరణి నపంకంబయి, పంకజాసను గేహంబు సొంపున రాజహంసవిరాజమానంబయి, మానధనుని చరిత్రంబు సొబగున నకల్మషజీవనంబయి, వననిధిపాలువున సమ్మిళితభూభృద్వాహినీసంకులంబయి, కులవధూరత్నంబు చెలువున నదృష్టపయోధరంబయి, ధరణికిం దొడవగుచు శరత్కాలంబు వచ్చెనంత.* (క॥ రాజులనీరాజనములు। రాజులజయగమనములును రాజితలక్ష్మి। పూజలు దేవోత్సవములు। రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా.* (క॥ చాగగలచెలుకుంటను। బాసగ నీలోత్పలంబు బాణంబుగ సం। యోగంబు చేసి మదనుఁడు। వేగంబున విరహిజనుల వేఁటాడెనొగిన్.* (వ॥ ఇట్లు భాసురంబయిన శరద్వాసరంబుల గోవిందుండు గోబృందసమేతుండై బృందావనంబునం బసులం బొసంగ మేపుచు* (సీ॥ కర్ణావతంసితకర్ణికారప్రభా గండభాగద్యుతిఁ గడలుకొలుప। భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప। నవసవ్యకరమృదులాంగుళీచారురవజన్యనికిమార్గసరణిఁ జూప। డాకాలిమీఁద నడ్డము సాఁచి నిల్చినపదనఖద్యుతి భూమి బ్రబ్బికొనఁగ। మౌళిపింఛముకుందదామమున మెఱయ। విలసితగ్రామముగ నొకవేణువందు। బ్రహ్మగాంధర్వగీతంబు పరఁగఁజేసె। జతురనటమూర్తి గోపాలచక్రవర్తి.* (వ॥ ఇట్లు హరి వేణునాదంబు పూరించిన మారవికారహేతువను తద్గీతంబాలించి సిగ్గులు సాలించి మఱవఁబు చెక్కులొత్తి గోపికలోపికలు లేక తమతమపొత్తుకత్తెలకుఁ వారును దత్తరంబునఁ బనుగుసు వేగురుం మాటుములు

గొనిజిలిబిలిముచ్చటలకుంజొచ్చితనులోన* (మ॥ శ్రవణోదంచితకర్ణికారములతో స్వర్ణాభ చేలంబుతో। నవతంసాయిత కేకిపింఛములతో నంభోజదామంబుతో। స్వవశుండై నధురాధరామృతముచే వంశంబుఁబూరించుచు।న్నవిదామాధవుఁడాలవెంటవనమందొప్పారెడిఁజూచితే* (శా॥ రావే సుందరి నేమెమేఁటిపన వేరాజీవనేత్రుండు బృం।దావీథిం దగ వేణువూఁదుచు లసత్సవ్యానతాస్యంబుతో । భ్రూశిన్యాసములంగుళీక్రమములం బొల్పారషడ్జంబుగాఁ । గాఁ పంచెన్నటు భంగిబ్రహ్మనుతగాంధర్వసంగీతముల్* (క॥ తన కెనుగొబ్బునఁజిత్తము । నలినాక్షుని మధుర వేణునాదము నా వీనులు సోఁకినంతమాత్రన। చెలియాయిఁక దేటి వెలుపు చింతింపఁగ దే* (క॥ నాతోడ వెలువవలదే। నాతోడ నెకొనుచు బోయి నలినదళాక్షుల్ । నీతోడు తఁబలికించెను। నీతోడుజనంబు మెచ్చనీతోడుమమీ* (వ॥ అని పెక్కుభంగుల నూర్పోర్తును ద్దేశించి పలుకుచు గోపసుందరులు బృందావనంబునకు గోపిందునకెనురుచని పరమానందంబున నానందనునంబులఁ బ్రతిపదంబునునాలింగనంబు చేసిన వారలను చు రామకృష్ణులను ద్దేశించి* (మ॥ నవగోష్ఠానకరంగమం బరమానందంబుతోఁ జూడఁ బల్లవనీలోత్పలపింఛపద్మదళమాలావస్త్రసంపన్నులై। కవనై వేణువులూఁదుచు బహునటాకారంబులన్ గేళితాండవము ల్సేసెద రీకుమారకులు నేడ్కంగా మిమ్ముల్లంటి రే* (క॥ ఓ చెలువలార వినుఁడీ। వాచాశతకంబు లేల వర్ణింపంగా। లోచనములకలిమికి ఫల । మీ చెలువుర జూడఁగలుగుటంతియసుండీ॥ అనిపలికిరందు గొందఱు గోవిందునుద్దేశించి* (మ॥ ఒనరన్ వ్రేతలకించుకేనియును లేకుండంగ గోపాలకృష్ణుఁ కెమ్మోవిసుధారసంబు గొనుచున్ రాజోద్యంబు గా మ్రోయుచు। న్ఘనపర్వంబులు నేత్రపర్వములు గాఁ దర్పించెఁ బూర్వంబున న్వనితా మెట్టితపంబు సేసెనొకో యీవంశంబు వంశంబులన్* (మ॥ ముదితామేఘతటినీపయఃకణముల న్మున్వేణువింతయ్యెనా। నదిసత్పుత్రునిగన్నతల్లి పగిదిన్నందంబుతో నేఁడును । మ్మదహంసధ్వనిపాటగా వికచపద్మశ్రేణి రోమాంచమై। మొదవ స్థుంగతరంగహస్తనటనోద్యోగంబుఁ గావించదే* (క॥ ఎలినోదరుభక్తునిగని। కులజులు నందాశ్రుజలము నురియు తెఱఁగు న్మాకులు పూదేనియలాలికెను । నలినాక్షుని చేతి వంశనాళము మ్రోఁతన్* (శా॥ నా మోసమ్మున కెద్ది మేరపిన వేనాపూర్వజన్మంబులన్। లేమా నోములు నోఁచుచో నకట కాళిందీతటి న్వేణువై । భూమిన్పుట్టెనసంచు గోరఁ దగదే బోధిల్లి యెట్లయిననీ। ఘామందిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుంగదే* (క॥ కాళిందీకూలంబున। నాళీయానందతనయు నధరామృతముల్। గ్రోలెడి వేణువునగునో। మేలాగుననో మవచ్చునెటిఁగింపఁగదే* (క॥ వని తా కృష్ణుఁడు నల్లని। ఘనమనియు న్వేణురవము గర్జనమనియున్। మనమునఁదలంచి రొప్పెను। ననవరతము నెమలితుటుములాడెడిఁ గంటే* (క॥ గిరిచరమిధునములొలిన్। బరికింపఁగ గృష్ణపాదపద్మాంకితమై। పుర రాజునగరికంటెను। దరుణీ బృందావనంబు తద్దయు నొప్పెన్* (మ॥ అను రేంద్రాంగనలాకసంబున పమానారూఢులై పోవుచున్। గనలాక్షుల్ శుభమూర్తిఁ గాంచి మురళీగానంబులందందఁగ। ర్ణములన్నిల్పుచు మేఖలల్వదలగా నాథాంకమధ్యంబులన్। బ్రమదా వ్రాలిరి చూచితే వివశలై పంచాశుగభ్రాంతలై* (ఉ॥ కానలనుండుచున్సరసగానవివేకవిహీనజాతలై। పీనులనేడు కృష్ణముఖవేణురవామృతధారసోఁకినన్। మేనులు మేతలున్మఱచి మెత్తనిచూడ్కి మృగీమృగావళుల్। మానినిచూడవమ్మబహుమానము సేసెగృతార్థచిత్తలై* (ఉ॥ తల్లులచన్నుబాలుమును ద్రావుతఱిన్ దమకర్ణవీథులన్ వల్లభమైన మాధవుని వంశరవామృతధారచొచ్చినన్। ద్రుళ్ళక పాలు రాదివకదూఁటక మానక కృష్ణుమీఁద దృ। గ్వల్లులు చేర్చిని ల్చెన దెవత్సములంగనలార గంటిరె* (మ॥ సుమతన్మాములు మీఁది కెత్తుకొని రోమంథంబు సాలించి హృ। త్కమలాగ్రంబులఁ గృష్ణునిల్పి మురళీగానామృతశ్రేణికర్ణములం గ్రోలుచు మేతమానిగళితానందాశ్రులై చిత్రితో। పమలై గోవులునూఁచుచున్నవది గోపద్మాక్షివీక్షించితే* (మ॥ జగతీజంబుల శాఖలెక్కి మురళీశబ్దామృతస్యందముల్। మిగులన్ వీనులఁ ద్రావి వ్రేగు పడి నెమ్మిం గృష్ణరూపంబుచి। త్తగమైయుండఁగ నడ్డపెట్టు క్రియ నేత్రంబుల్దగన్మూసియీ। ఖగముల్పొక్కెడిఁ జూచితే మునిజనాకారంబులం గామినీ* (మ॥ క్రమమొప్పన్నదులెల్ల వంశరవమాకర్ణించి సంజాతమో। హములన్మన్మథసాయకక్షతపశాలావర్తలై హంసవాక్యములం జీఱితరంగహస్తములనాకర్షించి పద్మోపహా। రములన్ గృష్ణపదార్చనంబు సలపెన్ రామా విలోకించితే* (గీ॥ వనిత నేఁడు కృష్ణువంశనినాదంబు। వినివమోదరంబు విరులుసురిసి। తనశరీరమెల్ల ధవళాతపత్రంబు । జేసెమింటనీడఁజేసెఁ గంటె* (క॥ చుంచిఫలంబులు హరిచే । నించిక రాలంబనముల నెగడుచుని దెక్రీ। డించెదరంగన చూడుము। చెంచితలంబింఛపత్ర చేలాంచితలన్* (క॥ ఉల్లసితకుచభరంబుల। నల్లాడెడినడుముతోడ నలకులడంద। గ్భిల్లి యొకతె హరికిచ్చెను। హల్లాహలకలితయగుచు నంగనకంటే* (క॥ గిరులెల్ల జలములయ్యెం । దరులెల్లను బల్లవించె ధరణీగగనభూ। చరులెల్లను జొక్కిరి హరి। మురళీరవామృతము సోఁకి ముద్దియ కంటే* (మ॥ బలకృష్ణాంఘ్రిసరోజసంగమము చే భాసిల్లుచున్ ధన్యమై । ఫలపుష్పంబుల గానుకల్గురిసి సంభావించి మిన్నంటుచున్ । జలఘాసంబుల గోవులన్దనిపి చంచద్భూజరోమాంచమై। వెలసెన్ జూడగదమ్మ యీగిరి పురోవీథిన్ సరోజాననా* (వ॥ అని యిట్లు బృందావనవిహారియైన గోవిందుని సందర్శించి పంచబాణభల్లభగ్నహృదయలై వల్లవకాంత

లేకాంతంబులఁ జింతించుచుఁ దత్పరతంత్రలై యుండిరంత * (క ॥ శామంతికాస్రగంచితసీమంతవతీకుచోష్ణజితశీతభయా।

—* హేమంతఋతువర్ణనము. *—

శ్రీమంతంబై గొబ్బున। హేమంతము దోఁచె నుదనుఁ డేఁచె విరహులన్ * (క ॥ ఉత్తరపు గాలి విసరెవి। యత్తలమునఁ దుహినకిరణుఁడు హితుండయ్యెన్। బొత్తుజరిగె మిథునములకు। నెత్తమ్ములు దఱిగె హిమము నెలకొనియె నృపా * (క ॥ అహములు సన్నములయ్యెను। దహనము హితమయ్యె దీర్ఘదశలయ్యె నిశల్। బహుళశీతోపేతంబై। యుహుహుహూయని వడఁకె లోకముర్వీనాథా * (క ॥ అన్నులచన్నులకండపి। పన్నులుగా కెల్లవారు బ్రతికిరిగాకీ। చన్నులమీఱినచలినా। పన్నులుగాకుండఁదర మెబ్రహ్మాదులకున్ * (గీ॥ పొడుపుఁ గొండమీఁద పొడచిందె మొదలుగాఁ। బరువువెట్టియినుఁడు పశ్చిమాద్రి। వఁడుకుఁ జొచ్చెఁగాక మసలినచలిచేత। జిక్కెఁజిక్కె ననఁగఁ జిక్కఁదునెన్నె * (క ॥ చెంగల్వవిరులగంధము। మంగళముగఁ గ్రోలుచున్న మధుపము నొప్పె। న్నంగజవహ్నులపైను। ప్పొంగి విజృంభించు పొగలపోలికనదిపా * (గీ॥ శంభుకంటనొక్కటి జలరాశినొక్కటి। మఱియు నొక్కటి మనుజమందిరముల। నొదిగెఁగాక మెఱసియున్న మూఁడగ్నులు। చలికినోడి భక్తిపలుపకున్నె * (శా॥ ఈ హేమంతము రాకఁ జూచి రమణీహేలాపరీరంభస। త్సాహాయ్యంబునఁ గాక వీనిఁ గెలువ న్నక్యంబుగా దంచుఁ దా। రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీయుక్తాంగులై వారుగా। కో హా హా వారల దేమిసంతతవధూయోగంబు రాఁగం మరే * (క ॥ ఈ హేమంతము రాకను। శ్రీహరి యొక్కింతవడఁకి చింతింపంగా। నో హా హా వెఱవకుమనుచును। నాహరికిని శ్రీకుచంబు లభయంబిచ్చెన్ (వ॥ ఇట్లుని తాంతంబగు హేమంతఋతువు మొదలి నెలతొలిదినంబునందు నందునిమందఁగల గోపకుమారికలు రేపకడ లేచి చని కాళిందీజలంబులందోఁగి జలతీరంబున నిసుమున నంగాత్యాయనీరూపంబుఁ జేసి సురభికుసుమగంధంబులిడి ధూపదీపంబులిచ్చి బహువిధోపహారంబులు సమర్పించి * (క ॥ ఓ కాత్యాయని భగవతి। నీకును మ్రొక్కెదము మేము నేఁడనుకంప। న్నాకిందఱకును వైశము। శ్రీకృష్ణుఁడు మగఁడుగాఁగఁ జేయుము తల్లీ * (క ॥ ఓతల్లి మాకుఁ గృష్ణుఁడు। చేతోవిభుఁడైన నాఁడు చెలువల మెల్ల। న్నేతివసంతములాడుచు। జాతరఁ జేసెదము భక్తిచాతురితోడన్ * (వ॥ అని నమస్కరించి హవిష్యంబులు గుడుచుచు నివ్విధంబున మాసవ్రతంబు సల్పిరందొ

— * గోపికావస్త్రాపహరణము - *—

క్కనాఁడు * (మ॥ రమణుల్ప్రొద్దున మేలుకాంచి సఖులన్ రండంచు నాత్మీయనా। మములం జీఱుచు చద్వయీభరములన్మధ్యంబులల్లాడఁగాఁ। బ్రమదోద్దామగజేంద్రయానలగుచున్ బద్మాక్షునిన్బాడుచున్। యమునాతీరముఁ జేరఁ బోయిరి గృహీతాన్యోన్యహస్తాబ్జలై * (వ॥ ఇట్లానదీతీరంబు చేరంజని గజగమనలు విజనప్రదేశంబున వలువలు విడిచియిడి మదిశంక లేక యకలంకలై క్రుంకులిడఁ జలంబున జలంబు సొచ్చి * (క ॥ వారిజలోచనుఁ బాడుచు। వారిజలోచనలు వారి వారికి వేడ్క। న్వారివిహారము సలిపిరి। వారివిహారములు జగతి వారికిఁ గలవే। ఆసమయంబున * (క ॥ తోయజనయనలు యమునా। తోయములందుండు టెఱిఁగి దూరగుఁడయ్యుం। దోయజనయనుఁడు హరితన। తోయము గోపకులు దానుఁ దోఁతెంచె నృపా * (తరల॥ కదలకుండని తోడివారలఁ గన్నుసన్నల నిల్పుచున్। బదములొయ్యన నేలఁ బెట్టుచుఁ బద్మనేత్రుఁడు పూనిమై। పొదలమాటున నల్లనల్లనఁ బొంచిపొంచి నతాంగుఁడై। యదను గోరుచు డాసి వ్రేతలయంబరంబులు దొంగిలెన్॥ ఇట్లు దొంగిలి * (శా॥ ఉద్యద్గంధగజేంద్రగౌరవముతో యోషాంబరంబుల్విభుం। డాద్యుం డర్భకుభంగి నర్భకులతో హాసార్ద్రుఁడై కొంచుఁ ద। న్నద్యంభఃకణశీతవాతజనితానందంబుతో నెక్కెఁ దా। సద్యోముక్తదురంతపాదపజనుస్సంతాపము న్నీపమున్॥ అప్పుడయ్యింతులిట్లనిరి (క ॥ మామావలువలు ముట్టకు। మామా కొనిపోకుపోకు మన్నింపఁదగున్। మామాన మేల కొనియెదు। మామానసహరణ మేల మానుము కృష్ణా * (సీ॥ బహుజీవనముతోడ భాసిల్లియుంటతో గోత్రంబు నిల్పుటతో కూర్మితోడ। మహి నుద్ధరించుటో మనుజసింహంబవై ప్రజలఁ గాచుటో కాక బలిఁ దెరల్చి। పిన్నవై యుండియుఁ బెంపువహించుటో రాజుల గెల్చుటో రణములోన। గురునాజ్ఞ సేయుటో గుణనిధివై బలప్రఖ్యాతిఁ జూపుటో భద్రలీల। బుధులు మెచ్చ భువిఁ బ్రబుద్ధత మెఱయుటో। కలికితనము సేయఘనత గలదె। వావి లేదు వారివారు నావారని। మెఱుకవల దెవలువ లిమ్ము కృష్ణ * (క ॥ కొంటివి మామహృదయంబులు। గొంటివి మామనములజ్జఁ గొంటివి వలువల్। గొంటివిఁక నెట్లు చేసెదో। కొంటెవుగద నిన్ను నెఱిఁగికొంటిమి కృష్ణా * (సీ॥ రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమె చెలరేఁగి వింతలు సేయుచుండ। సత్త్వసంపద గల్గి జరుగుటఁ దలఁప మే సిరిగల్గి యన్యులఁ జెనకుచుండ। గురుతరశక్తియుక్తుఁడవౌటఁ జూడమె తామసంబున నెగ్గుదలఁచుచుండ। నొకభంగి నుండకుంటఁ జింతింపమె మాయావివై మాఱుమలయుచుండ। నేమి జాడవాడ వేపాటిగలవాఁడ। వేగుణంబు నెఱుఁగ వెల్లయెడల। నొదిగియుండ నేరవో రెంతప్రొద్దును। బటము లీఁగదయ్య పద్మనయన (క ॥ రాజుల నెఱుఁగవు బలిమిని। రాజిల్లెదు చీరలీవు రమణుల మింక। న్రాజున కెఱిఁగించెద మో। రాజీవదళాక్ష నీవు రాజవె ధరపన్ * (వ॥ అనిపలికిన కన్నియలపలుకులాలించి మందహాససుందర వదనారవిందుండై గోపాలబాలకులకరంబులం గరం

బులువ్రేసియమ్ముద్దియలనుద్దేశించి నెలవాదిచతురుండిట్లనియె* (శా॥ రాములా ప్రేమలతోడ నీపనికి రాఁగా రింతు రేమీకి ప్రి
య। న్నోమా టేమియు లేకమూ తెవరుమీ మోసంబు చింతింపరం। భోమధ్యంబుననుండి వెల్వడి వెసన్పూర్ణేందుబింబానన। లీ
మీచీరెలువచ్చి పుచ్చుకొనుఁడా మీకిచ్చెదం జెచ్చెర౯* (వ॥ అనిననమ్మానవతులొండొరుల మొగంబులుచూచి నగుచు మర్మం
బుల నాఁటినమాటలకును గుడంబలుక సిగ్గుపడుచు నగ్గలంబైనచలినివలిగొని కంఠపర్యంతజలంబులందుండి డోలాయమాన
మానసలై యిట్లనిరి* (క॥ మావలువలు లాఘవమున। నీవేటికిఁ బుచ్చుకొంటి నీవల్వఁడవే। నీవెఱుఁగని దేమున్నది। నీవిందటిలోన
ధర్మనిరతుఁడవుగదె (శా॥ ఇంతుల్తోయములాడుచుండ మగవాదే తెంతు రేవచ్చి గా। యింత ల్సేయుదు రేక్రియాపారహీనులై యే
లోకమందైననీ। వింతల్నీతలఁ బుట్టెఁ గాక నజిమే వీక్షృష్ణ యోచల్లనీ। చెంతన్దాసులమై చరించెదము మా చేలంబులిప్పింపవే *
(క॥ వచ్చెదము నీవు పిల్చిన। నిచ్చెదమే మైనఁగాని నెటుచూరుమనిన। న్జొచ్చెదము నేఁడు వస్త్రము। లిచ్చినముంగరుణతోడ నేలు
ము కృష్ణా॥ అనినదరహాసితవదనుండై హరి యిట్లనియె** (క॥ పరుణుఁడు నుగడొటకు। మీతపములు చెప్పఁడింక మీయాసలసుం
డీ తప్పినమీకు హరిమి। మీతలల నెపు ట్టైనోటు మేదిని లేదే* క॥ ఎవ్వని గని మోహించితి। రెవ్వఁడు మీమానధనము లెల్ల హరించె। నిన్న
న్వటి లేమీకుఁ గూరిమి। యెవ్వనిపైఁ బలుకరాదె యేమన్యుఁడనే* (వ॥ అనినవిని సుందరులన్యోన్యసందర్శనంబులు సేయుచు హృ
దయారవిందంబులందుఁ గందర్పుండు సంకడింపనగుచు నిరుత్తరలై యున్న లోకోత్తరుండిట్లనియె (క॥ నాయింటికి దాసులరై।
నాయాజ్ఞ వహించి మీరు నడిచెదరేని౯। మీయంబరంబులిచ్చెదఁ। దోయంబులు వెడలి రండు తొయ్యలులారా॥ అనినవిని హరిమ
ధ్యలు చలికి వెఱచి సలిలమధ్యంబుననిలువనోపక (క॥ కొందఱు వెడలుదమందురు। కొందఱు వెఱలుట యుసిగ్గుఁగొను గోవిందుం
డందురు కొందఱుదమలోఁ। గొందలపడుదురు వడఁకుఁగొనిమనుజేంద్రా* (వ॥ మఱియు నెట్టకేలకుఁజిత్తంబులుగట్టిపఱచు
కొనితనుమధ్యలుతోయమధ్యంబు వెలువడి* క॥ చంచత్పల్లవకోమల। కాంచననవరత్నఘటితకంకణరుచిరో। ధంచితకరసం
ఛాదిత। పంచాయుధగేహలగుచుఁ బడఁతులువరుస౯* (వ॥ చనిప్రౌఢలైనసుందరులముందఱనిడుకొనిమందగమనలు మంద
హాసంబుతోడ నెదుఱనిలిచిననరవిందనయనుండిట్లనియె* (సీ॥ శృంగారవతులార సిగ్గేల మముఁ గూడి పిన్ననాఁట నుగోలెఁ బె
రిగినాఁడ। నెఱుఁగనే మీలోననెప్పుడును న్నాఁడ నేనుఁ జూడనిమర్మమెద్ది గలదు। వ్రతనిష్ఠలై యుండి వలువలు గట్టక నీరుచొత్తు
రె మీరు నియతిఁ దప్పి। కాత్యాయనీదేవిఁ గల్ల సేయుటగాక నీరీతి నోము వారెందుఁ గలరు। వ్రతముఫలము మీరు వలసినఁ జక్కఁ
గ। నింతులెల్లఁ జేతులెత్తి మ్రొక్కి। చేరిపుచ్చుకొనుఁడు చీరెలు సిగ్గువో। నాడ నేల యెగ్గులాడనేల॥ అనినవిని మానవతులుతమ
లోన* (మ॥ వ్రతము ల్సేయుచు నొక్కమాటయిన నెవ్వానిన్విచారించిన। న్వ్రతభంగంబులు మానునట్టివరదు న్వామాక్షులీ
క్షించియున్నత చేలాక్షనంబు నేఁడు వ్రతభంగంబంచు శంకించి పా। లతటన్యస్తకరాబ్జలై సరసలీల౯ మ్రొక్కిరట్లందఱు౯*
(క॥ బాలలకు హస్తకీలిత। ఫాలలకుని తాంతశీతపవనాగమనా। లోలలకు నంబరములు గృ। పాలుఁడు హరియిచ్చె భక్తపాలకుఁడ
గుట౯* (గీ॥ చీరెలపహరించి సిగ్గులు విడిపించి। పరిహసించి మైనఁ బరగ ననుకు। ఘనుఁడు నోముకొఱతగాకుండ మ్రొక్కిం
చెననుచు హరినుతించి రబలలెల్ల* (క॥ ఉల్లములు నొవ్వనాడినఁ। గల్లలు చేసిననునగినఁ గలఁచిననైన౯। వల్లభులు సేయుకృ
త్యము। వల్లభలకు నెగ్గుగాదు వల్లభమధిపా* (వ॥ ఇట్లు హరివలువలిచ్చినఁ గట్టుకొని సతులతనియందు బద్ధానురాగలై యచ్చ
రింపక రెప్పలిడక తప్పక చూడనాప్రోడయెఱింగి చేరి వారికిట్లనియె* (సీ॥ లక్షణవతులార లజ్జించి చెప్పరుగాని మీమర్మములు నాకుఁ
బడియె। నన్నుఁ గొల్వఁ జింతించినారు నాచేతను సత్యంబు మీనోము సఫలమగును। గామితార్థంబుల కలిమి చెప్పఁగ నేల ననుఁ గొ
ల్వ ముక్తికి నడువవచ్చుఁ। గడమకూడఁగ నంబికాదేవి నోమంగ నటమీఁద రాత్రులయందు మీకు। నన్నుఁ బొందఁగల్గు నమ్మిపొండ
ని హరి। పల్కనింతులెల్ల భావించెఁ జనిరి। తపముపండెననుచుఁ దత్పదాంభోజము। ల్మానసించికొనుచు మందకడకు* (వ॥ ఇట్లు గో

—* మునిభార్యలన్నము దీసికొనివచ్చి శ్రీకృష్ణున కారగింపు సేయుట- *—

పకన్యకలందుఁ బ్రసన్నుండై గోవిందుండు బృందావనంబు దాఁటి దూరంబున ధేనువుల మేపుచుండఁ జండకిరణుని యెండం బడి
దండి చెడిత మలదండనండఁ గొనుచు నాతపత్రాకారంబులై నీడలు సేయుచున్న వృక్షంబులనీక్షించి కృష్ణ బలశ్రీరామ దేవప్రశ
స్తవిశాలార్జున ప్రముఖులకుండకిన గోపకులిట్లనిరి* (మ॥ అపకారంబులు సేయ వెవ్వరికి నేకాంతంబు లాదుండును నా। తపశీతా
నిలవర్షవారకములై త్వగ్గంధనిర్యాస। భస్మపలాశాగ్రపరందమూలకుసుమచ్ఛాయాఫలశ్రేణిచే। నుపకారంబులు సేయు
నర్థులకు నీయుర్వీజముల్గంటిరే* (వ॥ అని చిగురాకు పువ్వు కాయపండు తండంబుల వ్రేఁగున వీఁగినతరువులనడిమి తెరువులం బ
సులఁ దాఁటులదాఁటించి యమునకుఁ జని వెడఁదమడుగుల మెల్లనఁ జల్లని నీరుఁ ద్రావించి తత్సమీపంబున మేపుచు వల్లవులెల్ల
మూఁకలుగొని యాఁకలిగొంటిమని విన్నవించినఁ దనకు భక్తురాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుండై వారలం జూచి రా

మసహితుండై నహరియిట్లనియె* (సీ॥ వల్లవులార యీవనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు। నరుగుట కాంగిర సాహ్వయ సత్త్రంబు సలుపుచున్నారు సనుఁడు మీరు। మా నామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబుఁ బెట్టెదరనుచుఁ బలుక। వారలుచని విప్రవరుల కెల్లను మ్రొక్కి పసుల మేపుచు బలభద్రకృష్ణు। లలసి పుత్తెంచిరిటమ్ము నన్న మడుగ। ధర్మవిదులార యర్థిప్రదాతలార। పెట్టుఁడన్నంబు శ్రాంతులఁ బిలిచి తెచ్చి। పెట్టుమనరుగా దెమిముఁ బోటి పెద్దలెల్ల* (క॥ ఘనదీక్షితునకు నైనం। జనుఁ గుడువఁగఁ బశువధంబు సౌత్రామణియుం। జనిన వెనుక దోషము లే। దనఘాత్ములార పెట్టుఁడన్నము మాకున్॥ అని గోపకులు వలికిన* (మ॥ క్రతువున్మంత్రముతంత్రముం ధనములుం గాలంబు దేశంబు దే। వతయుం ధర్మము నన్యముల్దలఁప నెవ్వాఁడట్టి సర్వేశ్వరు। న్మతినూహింపక గోపబాలుఁడనుచు న్మందస్థితిం జూచిరు। ర్మకులై యన్నము లేదు లేదనిరి సన్న్యాసక్రియాశూన్యులై* (వ॥ అంతగోపకులు నిరాశులై వచ్చి యెఱింగించిన హరి లోకానుసారియగుచు మీరయ్యాగ్యుల నడుగక వారి భార్యలకు మా రాకఁ జెప్పుఁడన్నంబు వెట్టెదరని పంచిన వారుఁ జని బ్రాహ్మణసతుల దర్శించి నమస్కరించి సంపూజితులై యిట్లనిరి* (క॥ గోవుల మేపుచు నాఁకొని। గోవిందుండన్నమడిగి కొనిరండని మమ్మీ వేళను బుత్తెంచెను। ధీవిలసితలార రండు తెం డన్నంబుల్ * (వ॥ అని నవిని గోవింద సందర్శన కుతూహలలై ధరణీసుర సుందరులు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయ భేదంబులం గలిగి సంస్కారసంపన్నంబులైన యన్నంబులు కుంభంబులనిడికొని సంరంభంబుల సముద్రంబునకు నదులు చనుమలతెఱంగున* (క॥ బిడ్డలు మగలు భ్రాతలు। నడ్డము చనివలదనంగ నటుదలఁడనిమా। యొడ్డుచు జగదీశ్వరునకుఁ। జడ్డన నన్నంబు గొనుచుఁ జనిరా సుదతుల్ (వ॥ చనియమునా సమీపంబున నవపల్లవాతిరేకంబును విగతవనచరశోకంబు నైన యశోకంబు క్రిందనిర్మలస్థలంబున* (సీ॥ ఒకచెలికాని పైనొక చెయి చాఁచి వేఱొక చేత నీలాబ్జము నూనువానిఁ। గొప్పునకందని కొన్ని కుంతలములు చెక్కులనృత్యంబు సేయువానిఁ। గులుచ చుంగులు పుచ్చికొమరారఁ గట్టిన పసిఁడివన్నియ గలపటము వాని। నొసలఁ దిరిగిరానల వడఁ జుట్టిన దట్టంపు శిఖిపింఛదండ వాని। రాజితోత్పల కర్ణపూరముల వాని। మహితపల్లవపుష్ప దామముల వాని। భువనమోహననటవేషభూతివానిఁ। గనిరి కాంతలు గన్నులకఱవుదీఱ* (క॥ కనిలోచనరంధ్రంబుల। మునుమిడి హరిలలితరూపమును లోఁగొని నెమ్మనములఁ బరిరంభించిరి। తనుమధ్యలు హృదయజనిత తాపము వాయన్॥ ఇవ్విధంబున* (క॥ వారితసర్వస్పృహలై। వారందఱు తన్నుఁ జూడవచ్చుట మదిలో। వారిజనయనుఁడు వొడగని। వారికి నిట్లనియె నగియు వారిత దృష్టిన్ * (శా॥ కాంతారత్నములార మీ గృహములం గళ్యాణమే యేమిగా। వింతున్నీకిటు రండు మమ్ము సచటన్వీక్షింప నే తెంచినా। రెంతో వేడుకతో నెఱుంగుదు మనిష్ఠాతుస్థితి న్నన్న దీ। మంతుల్ క్రియఁ జేరికందురుగదా మత్సేవల సర్వముల్ (వ॥ కావున గృహస్థులైన మీపతులు మిమ్ముం గూడి క్రతువు సమాప్తింజేసెదరు మీరు యాగవాటంబునకుం జనుండనిన విప్రభార్యలిట్లనిరి* (మ॥ తగునే మాధవ యిట్టివాఁడి పలుకుల్ ధర్మంబు లేయీ యెడ। న్మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్మమ్మున్నివారింపమ। చ్చిగనీయంఘ్రులు చేరినారమటబోఁ జేకొందు రే వారలా। పగిదే మొల్లముకింకరీజనులఁగా భావించి రక్షింపవే॥ అనిన జగదీశ్వరుండు (సీ॥ నా సమీపమ్మున నున్నారఁ టంచు నలుగురు బంధులు భ్రాతలు పతులు సుతులు। మిమ్ము దేవతలైన మెత్తురంగనలార నా దేహసంగంబు నకుల కెల్ల। సౌఖ్యానురాగసంజనకంబు గాదు మత్కీర్తిప్రదాయకము నాకీర్తనంబు। దర్శనాకర్ణనధ్యానంబులను గర్మబంధదేహంబులఁ బాసి మీరు। మానసంబులు నాయందు మనుపఁగఁ జేసి। నన్నుఁ జేరెదరిటమీఁద నమ్ముఁడనుచుఁ। బలికి వారలు దెచ్చిన భక్ష్యనాదులా ప్తవర్గంబుతో హరియారగించె* (క॥ పరమేశ్వరార్పణంబుగఁ। బరజనులకు భిక్ష యిడినఁ బరమపదమునన్। బరగెదరఁట హరి సాక్షా। త్పరమేశ్వరు భిక్ష సేయు ఫలమెట్టిదియో* (వ॥ ఇట్లు సర్వేశ్వరుండయిన హరికి భిక్షయిడి తమతమ భార్యలతని వలనం గృతార్థులగుట నెఱింగి భూసురులు తమలో నిట్లనిరి* (ఉ॥ కటకట మోసపోయితిమి కాంతలపాటియు బుద్ధి లేమనే। డిటహరిఁ గానఁబో నెఱుఁగ మేము దురాత్ముల మేము గల్మషో। త్కటులము విష్ణుదూరగుల ప్రాజ్ఞతలేల తపంబు లేల ప। ర్యటనము లేల శీలములు యాగములున్మఱి యేల శాల్పనే* (క॥ జపహోమాధ్యయనంబులు। తపములు వ్రతములును లేని తరుణులు హరిస। త్కృపఁ బడసిరన్ని గలిగియుఁ। జపలతఁ బొందితిమి భక్తిసలుప మినకటా* (క॥ సురగురులగు యోగీంద్రులు। నరుమగ మోహితులఁ జేయు హరిమాయ మము। న్నరగురుల మూఢవిప్రులనురువడి మోహితులఁ జేయనోపకయున్నే* (మ॥ క్రతువుల్ధర్మము మంత్ర తంత్ర ధనముల్కాలంబు దేశంబు దే। వతయున్ వహ్నులు మేదినీసురులు నెవ్వాఁడట్టి సర్వేశుఁడీ। క్షితిరక్షింపజనించినాఁడెఱుఁగ మా శ్రీభర్తకుం భర్తకుం। గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షో నాథసంహర్తకున్* (వ॥ అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబులం బొందిహరిం దలంచి శమింపుమని మ్రొక్కి బ్రాహ్మణులు కంసభీతులయి కృష్ణసందర్శనంబు సేయం జనరైరంతనక్కడ నఖిలదర్శనుండైన హరి యింద్రయాగంబు సేయం దలంచి తనకడకు వచ్చిన నందాది గోపవృద్ధులం గని నందునకిట్లనియె * (సీ॥ యాగంబు సేయంగ నర్థించి వచ్చితిరీ యాగమున ఫలమేమి గలుగు। నెవ్వాఁడు దీని

—* గోపాలకృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తుట. *—

కినీశ్వరుండధికారియెవ్వఁడు సాధన మెంతవలయు । శాస్త్రీయమో జనాచారమో కార్యంబు వైగుల కెఱిఁగింపవలదు గాని। యెఱిఁగెడి మిత్రులకెఱిఁగింపఁదగుఁ జేరి యెఱిఁగి చేసినఁ గోర్కు లెల్లఁ గలుగుఁ। బగయుఁ జెలిమి లేక పరగిన మిము బోఁట । సంచివారికెల్ల సంతసంబు। తలఁపులెల్ల మాకుఁ దగ నెఱిఁగింపవే। తాతవాక్సుధాప్రదాతవగుచు ॥ అని పలికిన పౌత్రున కూరునికిఁ దండ్రి యిట్లనియె* (సీ॥ పర్జన్యుఁ డధికుండు భగవంతుఁ డమరేంద్రుఁ డతనికిఁ బ్రియమూర్తులగుచు నున్న। మేఘబృందంబులు మేదినీతలము పైనతని పంపునభూతహర్షణముగ। జలములు గురియుఁ దజ్జలపూరములఁ దోఁగి పండు సస్యంబులా పంటదమకు। ధర్మార్థకామప్రదాయకములు లోకులెల్లను బ్రతుకుదురింత యెఱిఁగి । మేఘవిభుఁడైన నింద్రుంబు మెచ్చుకొఱకు। నింద్రమఖములు సేయుదురెల్ల నృపులు। కామలోభభయద్వేషకలితులగుచుఁ । జేయకుండిన నశుభంబు చెందుఁ బుత్ర ॥ అదియునుం గాక * (గీ॥ మఖము సేయ వజ్రి మదిసంతసించును । వజ్రి సంతసింప వాన గురియు । వానగురియఁగ సవుపసు మతిఁ బెరుగును । గసవుమేసి ధేనుగణము బ్రతుకు * (క॥ ధేనువులు బ్రతికె నేనియు । మానదు ఘనమైన పాఁడి మందలఁ గలుగుఁ। మానము గఁ బాడిగలిగిన। మానవులును సురలుదనిసి మనుదురు పుత్రా * (వ॥ అనియిట్లు వొడివిన నందునివచనంబులు విని యింద్రునికిఁ గోపంబు దీపింపదనుజదమనుండు తండ్రికిట్లనియె * (క॥ కర్మమునఁ బుట్టు జంతువు। కర్మమునన్ వృద్ధిఁ బొందుఁ గర్మమునన్ జెడున్। కర్మమె జనులకు దేవత। కర్మము సుఖదుఃఖములకుఁ గారణమధిపా (క॥ కర్మములకుఁ దగు ఫలములు। కర్మాచలనిడఁగ రాజు గాని సదా। నిష్కర్మ్యుఁడగు నీశ్వరుండును। కర్మవిహీనునికి రాజుగాఁడు మహాత్మా (వ॥ కావున గర్మానుయాతంబులై నభూతంబులకుఁ బురుహూతునివలన భీతియేటికిఁ బురాతనజన్మసంస్కారంబు ఉప్పలు గొనికప్పినఁ, గర్మంబులఁ దప్పించి పెంపువడయ నప్పరమేశ్వరుండును నేరఁడితరులం జెప్పనేల, సురాసురనరానీకంబులతోడి లోకంబు, నిజసంస్కారవశంబై యందడుఁడియున్నది, సందేహంబు లేదు, దేహి కర్మవశంబున గురుతను దేహంబులఁ జొచ్చి వెడలు, నొజ్జ వేలుపు నెచ్చెలి పగ రుచుట్టంబులు కర్మంబు, జీవుండు కర్మంబుతోడ వర్తించు, నతనికిఁ గర్మంబు దైవతంబు, కర్మంబునం బ్రతుకుచు, నితరసేవ సేయుట సతి పతి విడిచి జారుం జేరిన చందంబగు విప్రుఁడు వైదికకర్మంబున మెలంగు నృపతి ధరణీపాలనంబున సంచరించు వైశ్యుండు వాణిజ్యకృషికుసీదగోరక్షణాదులవర్తించు, శూద్రుండగ్రజన్ముల సేవించి బ్రతుకు, సత్త్వరజస్తమోగుణంబులుత్పత్తిస్థితిలయకారణంబు, లందు రజంబున జగంబు జన్మించు, రజోగుణప్రేరితంబులై మేఘంబులు వర్షించు, వర్షంబునం బ్రజావృద్ధియగు నింద్రుం డేమి సేయం గలవాఁడదియునుం గాక * (శా॥ కోపింపంబని లేదు శక్రునికిఁ దాఁ గోపించుఁ గా కేమి సం। క్షేపంబయ్యెడి దేమి పట్టణములున్ దేహంబులున్ దేశము। ల్వ్యాపారంబులు మీకుఁ బో మొడ నెశైలారణ్యభాగంబుల। న్గోపత్వంబున నుండుచున్న నకు సంకోచింపఁగా నేటికిన్ * సీ॥ పసులకుఁ గొండకు బ్రాహ్మణోత్తములకు మఖము గావించుట మంచిబుద్ధి। యింద్రయాగంబునకే మేమి దెప్పించు రవి యెల్లఁ దెప్పింపుఁడరసి మీరు । పాయసంబులు నపూపంబులు సైదపు పిండివంటలుఁ బప్పు వలయునట్టి । ఫలశాకములు వంటఁ బంపుఁడు హోమంబు సేయుఁడు ధేను దక్షిణల నిచ్చి। బహురసాన్నంబు పెట్టుఁడు బ్రాహ్మణులకు । నచలులై పూజయొనరింపుఁడచలమునకు। నధమచండాలశునకసంహతికిఁ దగిన। భక్ష్యములు వెట్టి కసవులు పసులకిండు * (శా॥ గంధాలంకరణాంబరావళులచేఁ గైచేసి యిష్టాన్నము। ల్బంధుశ్రేణియు మీరలుం గుడిచి నానాభాషారతిన్ వేడుక । ల్సంధిల్లం గిరిగోద్విజానలనమస్కారంబు గావింపుమా। సంధిల్లున్ సకలేప్సితంబులును మీ జన్మంబు ధన్యంబగున్ (వ॥ అనిమఱియు నిలింపపతి సొంపుదింపు తలంపున నిమ్మఖంబు తనకు సమ్మతంబని గోవిందుండు పలికిన నందాదులు మేలు మేలని తద్వచనప్రకారంబున నంబున్ స్వాహా వాచనంబులు చదివించి ధరణీసురులకు భోజనంబు లిడి పసులకుం గసవులొసంగి రప్పుడు * (మ॥ సకలాభీరులు వీఁడె కృష్ణుఁడన నైజంబైన రూపంబుతో। నకలంకస్థితి నుండి శైలమిదె మీ రర్పింపరండంచుఁ దా। నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో నాఁ డొండఁ బూజించి గో। పకదత్తాన్నములాహరించె విభుఁడా ప్రత్యక్షశైలాకృతిన్ * (మ॥ వినుఁడీ శైలము కామరూపి ఖలుల న్వేధించు నాజ్యాన్నము। ల్మన మొప్పించిన నాహరించె మన లక్ష్మన్నిం చె జిత్తంబులో । ననుకంపాతిశయంబు చేసె మనపై నెంచున్న గోపాలుఁడై । వనజాతుం డనుమస్కరించె గిరికిన్ బృందారు మందారుఁడై (వ॥ ఇట్లు గోపకులు హరి సమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి గోధనంబులం బురస్కరించుకొని భూసురాశీర్వాదవచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు చేసి రాసమయంబున * (క॥ గుఱ్ఱములపరువు మెచ్చని। నెఱ్ఱలఁ గట్టిన రథంబునం ప్రముఖు। ల్లుఱ్ఱల యార్పులు చెలఁగఁగఁ। దొఱ్ఱులగమి వెంటనంటఁ దోలిరి తేశా * (క॥ పాటించి గానవిద్యా। పాటవమునఁ దేరు లెక్క బహుతానముల । న్నాటలఁ గంధులు కృష్ణునిఁ । బాటలు వాడిరి విరోధి పాటనుఁడను చున్ * (క॥ మండనిభాపీనంబులు। మండిత వర్ణములు వివిధమహిదాకృతులు। న్నిండిన కడుపులుఁ గన్నుల। పండువులుఁ గఁ బాడిపజ్జపదువులు జరిగెన్ (క॥ పొగరెక్క నమూఁపురములు। దెగగలవాలములు శైలదేహంబులు భూ। గగనములునిండ అంకెలు। మిగు

లమెఱయు వృషభగణము మెల్లనడిచెఁ* (వ॥ ఇట్లు పర్వతప్రదక్షిణంబులు చేసి గోపకులు మాధవసమేతులై మందకుం జనిరం
తమహేంద్రుం డంతయు నెఱింగి మహాకోపంబునఁ బ్రళయప్రవర్తకంబులగు సంవర్తకాది మేఘంబులం జీఁజియిట్లనియె *
(మ॥ పెనుగుల్నేఱులుఁ ద్రావి క్రొవ్వి భువి నాభీరుల్మదాభీలురై। గిరిసంఘాతకఠోరపత్త్రదళనక్రీడాసమారంభమ। గ్భురదం
భోళిధరుం బురందరుననుం బాటించి పూజింపక। గిరికిం బూజలు చేసి పోయిరి దెపో కృష్ణుండు ప్రేరేపఁగన్* (క॥ గురుదేవహీ
ను బాలుని। గిరిభూజప్రముఖవాసుఁ గృష్ణుననీశున్। బరిమాణశీలకులగుణ। విరహితుఁ జేపట్టి యింద్రు విడిచిరి గొల్లల్* (గీ॥ విమ
లఘనతరాత్మవిజ్ఞానవిద్యచే। నిగుడ లేక యూడుపనిభములగుచుఁ। గర్మమయములై నక్రతువుల భవమహా। ర్ణవముఁ గడువఁ గోరి
వారు వీరు* (శా॥ ఉద్యత్సంపదనమ్మి నందతనయోద్యోగంబున న్వెఱ్ఱులై। మద్యాగంబు విసర్జనీయమనిరీ మర్త్యుల్వడిన్మీరుమీ।
విద్యుద్వల్లులఁ గప్పి గర్జనముల న్వేధించి గోవుల్జనుల్। పద్యోగ్యమృత్యువుఁ బొందఁజాల్లురియుఁడీ శౌర్యంబు వార్యంబుగన్* (క॥ మీ
వెంటవత్తు నేనై। రావణహాగంబు నెక్కి రయమొప్పం గా। దేవగణంబులతోడను। గోవిందుని మందలెల్లఁ గొందల పెట్టన్* (వ॥
అని యిట్లు పలికి జంభవైరి సంరంభంబున దంభోళి ఝుళిపించి, బింకంబున శంకింపక, కిన్కతోడ సంకిలులు విప్పించిన, మహానిల
ప్రేరితంబులై చన, నందుని మందమీఁదన మోఘంబులైన మేఘంబులు, మహౌఘంబులై పన్ని, ప్రచండగతిం జండమరీచిమండ
లంబుఁ గప్పి, దివి నిండి, దిశలావరించి, రోదోంతరాళంబు నిరంతరనీరంధ్రనిబిడాంధకారబంధురంబుగ నిరోధించి, బలిభంజన
తృతీయపాదపల్లవభగ్నంబైన బ్రహ్మాండభాండంబు, చిల్లులు జల్లించినఁ దొరఁగు బహిస్సముద్రసలిలనిర్ఘరంబుల వడువున నె
డ తెగక, తోరంబులైన నీరధారలం గురియుచు, శిలలవర్షించుచుఁ బిడుగుల రువ్వుచు, మిఱ్ఱుపల్లంబులు సమతలంబులై యేకార్ణ
వంబు రూపు చూపినం దుడుకడంచు చువిలయ శిఖిశిఖాసంరంభవిజృంభమాణవిద్యుల్లతావిలోకనంబుల మిఱుమిట్లుగొని సొ
మ్మసిలం బోవు లేఁగలును, లేఁగలకు మూఁతులడ్డంబులిడి ప్రళయభైరవభేరీభాంకారభీషణంబులగు గర్జనఘోషణంబులఁ జెవు
డువడి చిందరవందరలై నడెందంబులం గలదికుందివ్రాలు ధేనువులును, ధేనువుల వెనుక నిడుకొని దురంతకల్పాంతకాలకీలిక
రాళకాలకరవిశాలగదాఘాతప్రఘాతంబులైన నస్గ్లాతపాతంబుల భీతంబులై, హరికి మ్రొక్కి రక్షరక్షేతి శబ్దంబులు సేయు
కై నడి, విడువని జడిం బడి సైరింపక, శిరంబులు వంచుకొని, గద్గదకంఠంబుల, నంభారవంబులు సేయు, వృషభంబులును, వృషభా
దిగోరక్షణంబు సేయుచు దుర్వారఘోరశిలాసారంబుల సారంబులు నెడిశరీరంబులు భారంబులైన మ్రానువడు గోపకులు
ను, గోపకులం బట్టుక దట్టంబైన వానగొట్టునం బెట్టువడి బడుగునడుములును వడవడవడవడంకుచు గోవిందునిం జీరు గోపికలు
ను గోపికాజనకఠినకుచకలశయుగళంబుల మఱుంగున నందలలు వెట్టుకొని పరవశులైన శిశువులుం గలిగి మహాఘోషంబుతోడన
ష్టంబైన ఘోషంబుఁ జూచి ప్రబుద్ధులయిన గోపవృద్ధులు కొందఱు దుర్జనశిక్షకుండును, సజ్జనరక్షకుండునయిన పుండరీకాక్షున
కు మ్రొక్కి యిట్లనిరి* (ఉ॥ అక్కటవానఁ దోఁగి ప్రజలాకులమయ్యెఁ గదయ్య కృష్ణనీ। వెక్కడనుంటి వింతదడ వేలసహించితి
నీపవాజ్జముల్। దిక్కుగనున్న గోపకులు దీనతనొంద భయాపహారివై। గ్రక్కునఁ గావకిట్లునికి కారుణికోత్తమ నీకుఁ బాడి
యే* (క॥ ఈయఱుములు నీ మెఱుపులు। నీయశనీఘోషణములు నీ జలధారల్। నీయానతొల్లి యెఱుఁగము। కుయ్యాలింపం
గదయ్య గుణరత్ననిధీ* (క॥ వారిబరువయ్యె మందల। వారికి నిదెపరులు లేరు వారింపంగా। వారిదవటలభయంబును। వారి
రుహదళాక్ష నేఁడు వారింపఁగదే॥ అనిన విని సర్వజ్ఞుండైన కృష్ణుండంతయు నెఱింగి* (ఉ॥ తన్నొకయింతగైకొనరు తప్పిరి
యాగము చేసి రంచుఁ దా। మిన్నుననుండి గోపకులమీఁద శిలల్ గురియించుచున్నవాఁ। డున్నతసర్జరేంద్రవిభవోద్ధితగర్వన
గాధిరూఢుఁడై। కన్నులఁ గానఁ డింద్రుఁ డిటు గర్వపరుండొరుఁ గాననేర్చునే* (క॥ దేవతలందఱు నన్నును। సేవింతురు రా
జ్యమదముఁ జెందరు చెఱుపం। గావలదు మానభంగము। గావింపఁగవలయు శాంతిగలిగెడుకొఱకై * (వ॥ అని చింతించి శిలా
వర్షహతులయి శరణాగతులైన ఘోషజనుల రక్షించుట తగవని సకలలోకరక్షకుండయిన విచక్షణుండు* (చ॥ కలఁగకుఁడీ
వధూజనులు కంపమునొందకుఁడీ వ్రజేశ్వరు। ల్తలఁగకుఁడీ కుమారకులు తక్కిన వారలు జాలవానచే। నలయకుఁడీ పశువ్రజము న
క్కడనక్కడ నిల్వనీకుఁడీ। మెలఁపున మీకు నీశ్వరుఁడు మేలొసఁగున్ గరుణార్ద్రచిత్తుఁడై॥ అని పలికి* (క॥ కిరివైభవరమొత్తిన హరి।
కరిసరసిజము కళమెత్తుగతిఁ ద్రిభువనశంకరకరుఁడై గోవర్ధనగిరి యెత్తెం జక్కనొక్క కేలన్లీలన్* (క॥ ధండిని బ్రహ్మాండం
బులు। చెండులక్రియఁ బట్టి యెగరఁజిమ్మెడు హరికి। న్గొండఁ బెకలించి యెత్తుట। కొండొకపనిగాక యొక్కకొండాతలఁపన్॥ ఇ
ట్లు గిరియెత్తి* (ఉ॥ బాలుండాడుచు నాతపత్త్రమని సంభావించి పూగుత్తికెన్। గేలం దాల్చినలీల లేనగవుతోఁ గృష్ణుండు దాన
మ్మహాశైలంబున్వల కేలఁ దాల్చి విపులచ్ఛత్త్రంబుగాఁ బట్టెనా। భీలాభ్రచ్యుతదుశ్శిలాచకితగోపీగోపగోపక్తిక్కికెన్॥ ఇట్లు గో
త్రంబు ఛత్త్రంబుగాఁ బట్టి గోపజనులకు గోపాలశేఖరుండిట్లనియె (క॥ రా తల్లి రమ్ము తండ్రీ। వ్రేతలు గోపకులు రండు వినుఁడీ గత్త్ర।
త్రాతలము ననుండుఁడు గో। వ్రాతముతో మీరు మీకువలసిన యెడలన్* (శా॥ బాలుండీతఁడు కొండదొడ్డది మహాభారంబు సైరిం

వఁగాఁ। జాలండో యనిదీని క్రిందనిలువన్నంకింపఁ గాఁబోలదీ। శైలాంభోనిధిజంతుసంయుతధరాచక్రంబు పైఁబడ్డనా। కేల్లా
డదుబంధులార నిలుఁడీ క్రిందన్ ప్రమోదంబునన్* (వ॥ ఇట్లు పలుకుచున్న హరిపలుకులు విని నెమ్మనమ్ముల నమ్మి కొండయడుగునఁ బ
శుతమయుమ్ములం బుత్రమిత్రకళత్రాదిసమేతులై గోవులుం దారును గోపజనములు జనార్దన కరుణావిలోకనామృతవర్షంబున నాక
లినీరుదప్పుల చొప్పెఱుంగక కృష్ణకథావినోదంబుల నుండిరి య వ్విధంబున (మ॥ హరిదోర్దండము కామగుబ్బ శిఖరం బాలంబిముక్తా
వళుల్వరుగంజా రెడుతోయబిందువులుగా గోపాంగనాపాంగహా। సరుచుల్ రత్నచయంబుగాఁ గనచలచ్ఛత్రంబు శోభిల్లెఁ ద
ద్గిరిభిత్సుర్మ్యకభంజియై జలభరాఖిన్నప్రజారంజియై* (క॥ రాజీవాక్షుని చేనొక। రాజీవము భంగి శైలరాజము మెఱసెన్। రా
జేంద్రమీఁద మధుకర। రాజక్రియ మేఘరాజి రాజిల్లెఁ గడున్* (క॥ వడిగొని బలరిపు పనుపున। నుడుగక జడి గురిసె నేడహో
రాత్రములు। మ్యోడ గోపజనులు బ్రతికిరి। జడిఁగడియక కొండగొడుగు చాటున నధిపా* (వ॥ ఇట్లు హరి యేడహోరాత్రంబు
లుగిరి వరించిన గిరిభేది విసివి వేసరి కృష్ణుచరితంబులు విని వెఱఁగుపడి విఫలమనోరథుండై మేఘంబుల మఱలించుకొని చని యెనం
తనభోమండలంబు పద్యోతమానఖద్యోతమండలంబగుటయు విని గోవర్ధనధరుండు గోపాలకుల కిట్లనియె* (క॥ ఉడిగెను వానయు
గాలియు। వడిచెడి నదులెల్లఁ బొలపపరదలిగెఁ గొం। డమగున నుండక వెడలుఁడు। కొడుకులుఁ గోడండ్ర సతులు గోవులు మీ
రున్* (వ॥ అనిన విని సకలగోపజనులు శకటాద్యుపకరణసమేతులై గోవులుం దారును గొండయడుగు విడిచివచ్చి రచ్యుతుం
డును జెచ్చెఱఁ దొల్లింటియట్ల నిజస్థానంబున నిరిగిని నిలిపె నంత వల్లవులెల్లం గృష్ణుం గౌఁగిలించుకొని సముచిత ప్రకారంబుల సంభా
వించి దీవించిరి గోపికలు సేసలిడి నర్ఘ్యన్నక బళంబులా పంగుచు నాశీర్వదించిరి నందబలభద్రరోహిణీ యశోదలాలింగనంబు సే
సి భద్రవాక్యంబులు పలికిరి సిద్ధసాధ్యగంధర్వవరులు విరులు గురియించిరి సురలు శంఖదుందుభులు మ్రోయించిరి తుంబురుప్ర
ముఖులయిన గంధర్వులు పాడిరప్పుడు* (క॥ వల్లవకాంతలు దనకథ। లెల్లను బాడంగ నీరజేక్షుఁ డంతన్। వల్లవబలసంయుతుఁ
డై। యెల్లన గోష్ఠంబు చేరెను ర్వీనాథా॥ అయ్యవసరంబునఁ గృష్ణచరిత్రంబులు తలంచి వెఱఁగుపడి గోపజనులు నందున కిట్లనిరి *
(సీ॥ కన్నులు దెఱవనికడు చిన్నపాపఁడై దానవిఁ జనుబాలు ద్రావి చంపె। మూఁడవ నెలనాఁడు ముద్దులబాలుఁడై కోపించి శ
కటంబుఁ గూలఁదన్నె। నేఁడాదికుఁడై యెగసి తృణావర్తు మెడఁబట్టుకొని మూల్చి మృతునిఁ జేసెఁ। దల్లి వెన్నెలకునై తనుఁ రోలఁ
గట్టినఁ గొమరుఁడై మద్దులఁ గూలనీడ్చెఁ। బసులఁ గ్రేపులఁ గాఁచుచు బకునిఁ జీఱె। వెలగతో వత్సదైత్యుని వ్రేసి గెడపె। సబలుఁడై
ఖరదైత్యుని సంహరించెనితఁడు కేవలమనుజుఁడే యెంచి చూడ* (క॥ తెంపరియై రాముని చేఁ। జంపించెఁ బ్రలంబుఁ ద్రుంగెఁ జ
టులదవాగ్ని। న్సొంపుచెడఁ ద్రొక్కెఁ గాళియుఁ। ద్రుంపక కాళింది వెడలఁ దోలెన్ లీలన్* (క॥ ఏడేండ్ల బాలుఁ డెక్కడ। క్రీడం
గరితమ్మి యెత్తు క్రియ నందఱముల్। జూడ గిరి యెత్తు టెక్కడ। వేడుకనొక చేత నేఁడు వెఱఁగౌఁ గాగో* (క॥ ఓ నంద గోపవల్లభ।
నీనందనుఁ డాచరించు నేర్పరితనముల్। మానవులకు శక్యంబులె। మానవమాత్రుండె నీకుమారుఁడు తండ్రీ* (వ॥ అనిన విని నం
దుండు వారలం జూచి మున్ను తనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబు తెలిపి శంక లేదు కృష్ణుండు లోకరక్షకుండై నపుండరీకా
క్షుని నిజాంశమున చునంతరంగంబున నంజింతింతు నని పలికిన వెఱఁగుపడి గోపకులు కృష్ణుం డనంతుండని పూజించిరంత* (మ॥ హ
రి కేలన్గిరి యెత్తి వర్షజలఖిన్నాభీరగోరాజికి। న్శరణంబై నత్రిలోకరాజ్యమదముం జాలించి నిర్గర్వుఁడై। సురభిం గూడి బలారి వ
చ్చి కనియె న్సొంపేది దుష్టప్రజేశ్వరదుర్మానని రాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు శ్రీకృష్ణునిన్* (క॥ కని యింద్రుఁడు పూజించెను। దినక
రనిభ నిజకిరీటదీధితి చేత। న్మునిహృదలంకరణంబులు। మనతోద్ధరణములు నందసుతు చరణంబుల్* (వ॥ ఇట్లు నమస్కరించి కరక
మలంబులు ముకుళించి హరికి హరిహయుం డిట్లనియె* (సీ॥ పరమనిధానంబు భాసురతత్త్వంబు శాంతంబు హతరజస్తమము నిత్య।
మధిక తపోమయ మట్లుగావున మాయ నెగడెడి గుణములు నీకు లేవు। గుణహీనుఁడవు గాన గుణములనయ్యెడి లోభాదికములు నీ
లోనఁ జేర। వైన ముర్జననిగ్రహము శిష్టరక్షయుఁ దగిలి సేయఁ గదండధారివగుచు। జగముభర్తవు సురుఁడవు జనకుఁడవును। జగద
ధీశుల మను మూఢజనులు దలఁక। నిచ్చ పుట్టిన రూపంబులీవు దాల్చి। హితము సేయుదు గాదె లోకేశ్వరేశ* (క॥ నావంటి వెఱ్ఱి వా
రిని। శ్రీవల్లభ నీవు శాస్తి చేసితి వేనిన్। గావరము మాని పెద్దల। త్రోవం జరుగుదురు బుద్ధితో మతనీశా* (క॥ ఒక్కొక లోకము
గాఁచుచు। నెక్కుడు గర్వమున నే మెయీశుల మనుచున్। జొక్కినను బోఁటి వెఱ్ఱులు। నిక్కము నీ మహిమఁ దెలియ నేరరనంతా
(గీ॥ వాసుదేవ కృష్ణ వరద స్వతంత్రవి। జ్ఞానమయ మహాత్మ సర్వపుణ్య। పురుష నిఖిలబీజభూతాత్మక బ్రహ్మ। నీకు వందనంబు ని
ష్కళంక (శా॥ నీ సామర్థ్య మెఱుంగ మేఘముల చే నిర్ఘోషముల్ భీషణో। గ్రాసారంబు నముంచితి న్మఖము నాకై వల్లవుల్సేయ
రం। చో సర్వేశ భవన్మహత్త్వమున నా యుద్యోగ మిట్లయ్యెనీ। దాసున్నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ధర్మింప వే మాధవా* (మ॥ ని
ను బ్రహ్మాదు లెఱుంగలేరు జడతానిష్ఠుండ లోకత్రయా। వనమత్తానగరిష్ఠుఁ డన్విపులమున్ రై వ్రదుర్వ్యభూయిష్ఠుఁడ। న్వినయ
త్యాగకనిష్ఠుఁ డన్గుజనగర్వ శ్రేష్ఠుఁడన్ దేవ నీ। ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియంగా నెవ్వఁడన్సర్వగా* (వ॥ అనిన విని నగ

చుజలధరగంభీరరవంబున శక్రునకుం జక్రి యిట్లనియె* (మ॥ అమరాధీశ్వరలక్ష్మితోఁ దగిలి యిట్లంధుండవై యున్ననీ। సమదో ద్రేకముఁ ద్రుంచివైచుటకు నీజన్నంబు దప్పించితి న్బ్రమదశ్రీరతదండధారి యగు నన్భావింపఁ డెవ్వాఁడు ని। క్కము శిక్షింపఁ దలంతు వానిన ధనుం గావింతు జంభాంతకా* (క॥ నాయాజ్ఞ సేయుచుండుము। నీయధికారంబునందు నిలువుము రేంద్రా। శ్రీయుతుఁడవై మదింపకు। శ్రేయంబులు గల్గుఁ బొమ్ము సితకరిగమనా* (వ॥ అని యిట్లు జిష్ణునిం బలుకుచున్న కృష్ణునికి మ్రొక్కి గోగణసమేతయయిన కామధేనువు భక్తజనకామధేనువయిన యీశ్వరునకిట్లనియె* (క॥ విశ్వేశ విశ్వభావన। విశ్వాకృతి యోగివంద్య విను నీచేతన్। శాశ్వతులమైతి మిప్పుడు। శాశ్వతముగఁ గంటి మధికసౌఖ్యంబు హరీ* (వ॥ దేవా మాకుం బరమదైవంబవింద్రుండవు భూసురగోసురసాధుసౌఖ్యంబులకొఱకు నిన్నింద్రుని జేసి వట్టము గట్టుమని విరించి నియమించి పుత్తెంచె నీవు భూతలభూరిభారనివారణంబు సేయ నవతరించిన హరివని పలికి యంత* (మ॥ సురభిక్షీరములన్ సురద్విపమహాశుండాలతానీతని। జలరగంగాంబువులన్ని లింపజననీసన్మానిసంఘంబుతో। సురనాథుండభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁడం। చురగాక్రాంతవిపత్తుఁ దోయజదళాక్షున్ సాధుసంరక్షణున్* (సీ॥ తుంబురునారదాదులు సిద్ధచారణగంధర్వులును హరికథలు వాడిరమరకాంతలు మింటనాడిరి వేల్పులు కురియించి రందితకుసుమవృష్టి। జగములుఁ మూఁడును సంతోషమును బొందెఁ గుఱ్ఱలచన్నుల గురిసెఁ బాలు నవజలంబులతోడ నదులెల్లఁ బ్రవహించె నిఖిలవృక్షములు తేనియలు వడిసె। సర్వలతికలు ఫలపుష్పచయములమరెఁ। బర్వతంబులు మణిగణప్రభలనొప్పెఁ। బ్రాణులకు నెల్ల తమలోని పగలు మానె। వాసుదేవుని యభిషేకవాసరమున* (వ॥ ఇట్లు గోపగోగణపతిత్వంబునకు గోవిందునభిషిక్తుం జేసి వీడ్కొని పురందరుండు దేవగణంబులతో దివంబునకరిగెనంత*

—* శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుంచి గొనితెచ్చుట. *—

(సీ॥ నందుఁ డేకాదశి నాఁ డుపవాసంబు చేసి శ్రీహరిపూజ చేసి దనుజ। వేళ యెఱుంగక వేఁగకముందఱ ద్వాదశీస్నానంబు తగనొనర్ప। యమునాజలము సొర నందొక్క దైత్యుండు నందుని వరుణుని నగరమునకుఁ। గొనిపోవ దక్కిన గోపకులందఱు నందగోపకుఁ గానక కలంగి। రామకృష్ణులఁ బేర్కొని రవము సేయఁ। గృష్ణుఁ డీశుండు తమతండ్రిఁ గికురువెట్టి। వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు। పెటిఁగి రయమున నచ్చోటి కేఁగె నధిప॥ అప్పుడు* (క॥ వచ్చిన మాధవుఁ గనుఁగొని। చెచ్చెఱ వరుణుండు పూజ చేసి వినతుఁడై। యచ్చుగ నిట్లని పలికెను। విచ్చేసితి దేవ నా నివేశంబునకున్* (ఉ॥ ఏ విభు పాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెంపు। ద్రోవ జరింతు రట్టి బుధతోషక నీ వరుదెంచుటన్ బ్రమో। దావృతమయ్యెఁ జిత్తము కృతార్థత నొందె మనోరథంబు నీ। సేవఁ బవిత్రభావమును జెందె శరీరము నేఁడు మాధవా* (ఉ॥ ఏ పరమేశ్వరుండ్జగములిన్నిటిఁ గప్పిన మాయఁ గప్పఁగా। నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక యిట్టి నీకును। దీపితభద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దపూ। తాపము వాయ మ్రొక్కెదను దారతపోధనచక్రవర్తికిన్* (చ॥ ఎఱుఁగడు వీఁడు నాథుఁ డొకించుకయైన మనంబులోపలన్। దెఱవులేక నీజనకుఁ దెచ్చెదయం గొని పొమ్ము ద్రోహము। న్మఱపుము నన్ను నీభటుని మన్నన సేయుము నీదు సైరణ। న్నెఱుకు దుగాదె యో జనకవత్సల నిర్మలభక్తవత్సలా* (వ॥ అని యిట్లు పలుకుచున్న వరుణునిం గరుణించి తండ్రిం దోడ్కొని హరి తిరిగి వచ్చెనంత నందుండు తన్ను వెన్నుండు వరుణనగరంబున నుండి విడిపించి తెచ్చిన వృత్తాంతంబంతయు బంధువులకెఱింగించిన వారలు కృష్ణుం డీశ్వరుండని తలంచి రఖిలవర్ణకుండైన యీశ్వరుండును వారల తలంపెఱింగి వారికోరికె సఫలంబు సేయుమనని వారినందఱ బ్రహ్మహ్రదంబున ముంచి యెత్తిన* (గీ॥ ప్రకృతిఁ గామకర్మపరవశమైయుచ్చ। నీచగతులఁ బొంది నెఱియ భ్రమసి। తిరుగుచున్న జనము తెలియనేరదు నిజ। గతివిశేష మీజగంబునందు* (మ॥ అని చింతించి దయాళుఁడైన హరి మాయాదూరమై జ్యోతియై। యనిరూప్యంబయి సత్యమై యెఱుకయై యానందమై బ్రహ్మమై। యనఘాత్ముల్ గుణనాశమందుఁ గను నిత్యాత్మీయలోకంబు గ్ర। క్కునఁ జూపెన్ గరు

—* శరద్రాత్రియందు గోపికలు గానము చేసెడు శ్రీకృష్ణుని సన్నిధికి వచ్చుట. *—

ణార్ద్రచిత్తుఁడగుచున్ గోపాలకశ్రేణికిన్* (వ॥ ఇట్లు హరి మున్నక్రూరుండు వొందిన లోకమంతయుం జూపి బ్రహ్మలోకంబునుం జూపినం జూచి నందాదులు పరమానందంబును బొంది వెఱఁగుపడి హంసస్వరూపకుండైన కృష్ణునిం బొడగని పొగడి పూజించిరంత* (చ॥ కలువలమేలి కందువలు కామునికయ్యపు బాణములు విర। క్తులు దలడించు వేళలు చకోరకపక్షులభోగకాలము। చ్చెలువలు సైరణల్విడిచి చిక్కఁ దఱుల్లసచంద్రచంద్రికా। జ్వలితదిశల్ శరన్నిశలు జారకదుర్దశలయ్యె నయ్యెడన్* (గీ॥ శావతంత్రటీకకలువలజోకకందర్పధాకవిటులతాల్మిపోక। చకితచక్రవాకసంప్రీతజనలోక। రాకవచ్చె మేలు రాశయగుచు* (క॥ పతితనకరములఁ గుంకుమ। సతి మొగమున నలఁదు భంగి సముదయవేళాం। చితకరరాగము ననిశా। పతి రంజించెన్సురేంద్రప్రాక్సతి మొగమున్* (సీ॥ విటసేన పైదండు వెడలెడు వలతేని గొల్లెన పైహేమకుంభమనఁగ। గాముకధృతివల్లికలు దెంపనెత్తిన శంబరాంతకు చేతిచక్రమనఁగ। మారుండు పాంథుల మానాటవులు గాల్పఁ గూర్చిన నిప్పుల కుప్పయనఁగ। విర

హిణీవ్యూగముల వేటాడమదనుండు దెచ్చిన మోహనదీపమనఁగ। వింతమనుపుగల్గివృత్తమైయరుణమై। కాంతితోఁజకోరగర ములుబ్బఁ।బాడుపుకొండచక్కిఁ బొడిచె రాకాచంద్ర। మండలంబుగగనమండలమున* (వ॥ ఇట్లు పొడమినవకుంకుమాంకితణ మాముఖమండలమండితంబై యఖండంబైనచంద్రమండలంబుపొడగని పుండరీకనయనుండు యమునాతటంబున జగన్మోహ నంబుగనొక్కగీతంబుఁ బాడినవినివరాయత్తచిత్తలై తత్తరంబున వ్రేతలుపనులకుం జేతులాడకయు, గోవులకుం గ్రేపులవి డువకయు, విడివివిడిచియాడకయు, నీడియాడియు, నీడినపాలుకాఁపకయుఁ, గాఁచికాఁచియుఁ, గాగినపాలుడింపకయు, డిం చిడించియు, డించినపాలుబాలురకుంబోయకయుఁ, బోసిపోసియుఁ, బతులకుఁబరిచర్యలు సేయకయుఁ, జేసిచేసియు, నశనం బులుగుడువకయుఁ, గుడిచిగుడిచియుఁ, గుసుమంబులుముడువకయు, ముడిచిముడిచియుఁ, దొడవులుదొడగకయుఁ, దొడిగితొ డిగియు, గోష్ఠంబులపట్టులనుండకయుఁ, జాయసంబు నెఱయవండకయు, నయ్యై యెడలనిలువంబడకయుఁ, గాటుకలుఁ బూఁటని డకయుఁ, గురులుచక్కనొత్తకయుఁ, గుచంబులగంధంబులుకలయమెత్తకయుఁ, బయ్యెదలువిప్పికప్పకయు, సఖులకుం జెప్పక యు, సహోదరులుమగలుమామలు నత్తలు బిడ్డలునడ్డంబుచనినివారింపందలారింపక సంచలించి, పంచభల్లునిభల్లంబు లమొల్లంపుజల్లుల పెల్లునందల్లడిల్లి డిల్లపడి మొగుళ్లగమి వెలువడియుల్ల సిల్లుతటిల్లతలపొందున, మందగమనలమందగమనం బులమందలువెలువడి గోవిందసందర్శనంబునకుంజనిరప్పుడు* (మ॥ తరుణుల్లొందఱుమూలగేహములనుద్దండించి రారాకత। ద్విరహాగ్నింబరితాపమొందుచు మనోవీథిన్విభున్మాధవుం । బరిరంభంబులు సేసి జారుఁ డనుచున్భావించియుఁ జొక్కి పొం। దిరిముక్తిన్గుణదేహముల్విడిచి ప్రీతిన్బంధనిర్ముక్తలై॥ అనిన నరేంద్రుండిట్లనియె* (క॥ జారుఁడని కాని కృష్ణుఁడు। భూరిపరబ్ర హ్మమనియు బుద్ధిదలంప। న్నేరరు గుణమయదేహము। లేరీతిన్విడిచి రింతు లెఱిఁగింపు శుకా॥ అనిన శుకుండిట్లనియె* (మ॥ మును నేఁ జెప్పితిఁ జక్రికిం బగతుఁడై మాధుండు చైద్యుం డుపెం । పునఁ గైవల్యపదంబునొందెఁ బ్రియలై పొందంగ రాకున్నదే। యన ఘుండవ్యయుఁడప్రమేయుఁడ గుణుండై నట్టి గోవిందమూ। ర్తినరశ్రీశికి ముక్తిదాయిని సుమీ తెల్లంబు భూవల్లభా* (గీ॥ బాంధ వముననైనఁ బగనైనవగనైనఁ। బ్రీతినైనఁ బ్రాణభీతినైన। భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు। జను లెమోక్షమునకుఁ జను దురధిప* (వ॥ అటుగావునఁ బరమపురుషుండు, నజుండును, యోగీశ్వరేశ్వరుండైనహరిని సోఁకిన స్థావరంబైన ముక్తం బగు వె ఱగుపడవలవదివ్విధంబున (క॥ ఘనమధురగీతనినదము। విని వచ్చిన గోపికలను వీక్షించిన యం। బుజమేటి సుగుణి నేర్పరి। తనవా గ్వైభవము మెఱయఁదగనిట్లని యెక్* (ఉ॥ మేలా మీకు భయంబు పుట్టదు గదా మీరుం దదున్నింహశా। ర్దూలానేకవముఖ్యము ల్దిరిగెడిన్ఘోరంబులే తెంతురే। యేలా వచ్చితిరీనిశాసమయమందిచ్చోటవర్తింతురే । చాలుం జాలుల తాంగులార చనుఁడీసం ప్రీతితో మందకుఁ* (చ॥ మీరేతెంచిన జాడఁ గానకవగన్మీతల్లులుదండ్రులు। న్మీశ్యామలు అనుత్తలునూజులు గురుల్మీసోదరు ల్బంధువుల్మేరల్మీరిరి లేరుపోయిరనుచున్మీ ఘోషభూభాగమం। దేరీతిం బరికించిరో తగవులే యీసాహసోద్యోగముల్* (చ॥ ఇలువడినున్నఁ జేసి హృదయేశులసిగ్గులఁ జంపియత్తమా। మల నెఱయించి సోదరుల మానము సూరలువుచ్చి తల్లిదం। డ్రులరుచి మాన్చి బంధులకురోఁత యొనర్చుచు జారవాంఛలన్। స్వలనటిసత్కులాంగనలు వత్తురె లోకులు చూచి మెత్తురే* (సీ॥ ప్రాణేశుఁ డెఱిఁగిన బ్రాణంబునకుఁ దెగుదండించు నెఱిఁగిన ధరణివిభుఁడు। మామ యెఱింగిన మను వెల్లఁ జెడిపోవుఁ దలవరి యెఱిఁగిన దగు లు సేయుఁ। దలిదండ్రులెఱిఁగినఁ దలలెత్తకుండుదు రేరాలెఱింగిన నెత్తిపొడుచు। నాత్మజులెఱిఁగిన నాదరింపరు చూచిబంధు వులెఱిఁగిన బహిష్కరింతు। రితరులెఱిఁగి రేని నెంతయుఁ జుల్కఁగాఁ। జూతురింక నంత సుఖము లేదు। యశము లేదు నిశ్చయా నందమును లేదు। జారుఁ జేరఁ జనదు చారుముఖికి* (క॥ నను వడికొఱగా మన్ననుఁ। బడుఁగైనఁ గురూపియైనఁ బామరుఁడైనన్ । జ డుఁడైన రోగియైనను। విడుచుట మర్యాదగాదు విభునంగనకున్* (చ॥ ఇదియమునానదీజలసమేధితపాదపపల్లవప్రసూ। నదళ విరాజితంబగు వనంబు మనంబులమేరదప్పెనో। పొదిగిట నేడ్చు బిడ్డలకుఁ బోయుఁడు పాలు విడుండు లేఁగల । న్మొదవులకున్ని జే శ్వరులముద్దియలార భజింపుఁ డొప్పుగన్* (చ॥ వనితలు నన్నుఁ గోరి యిటవచ్చితిరింతఁ గొఱంత లేదు మే। లొనరెసమస్తజం తువులు నోలిఁ బ్రియంబులు గావె నాకునై। నమ నిలువంగఁ బోలదు సనాతనధర్మములాఁడువారికిం। జెనిమిటులన్భజించుటలు పెద్దలు చెప్పుచునుందు రెల్లెడన్ (క॥ ధ్యానాకర్ణనదర్శన। గానంబుల నాతలంపు గలిగినఁ జాలున్। బూనెదరు కృతార్థత్వము। మా నవతుల్చనుఁడు మఱలి మందిరములకున్॥ అనిపలికిన విని* (సీ॥ విరహాగ్నిశిఖలలో వెడలునిట్టూర్పులముమ్మరంబులఁ గందిమో ములెండఁ। గన్నుల వెడలెడి కజ్జలధారలు కుచకుంకుమంబుల గుప్పి పాఱఁ। జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి మోముఁదమ్ములమే లిమురువుడింపఁ। బొరిపొరి పుంఖానుపుంఖంబులై తాఁకుమదమకోలల ధైర్యమహిమ వెడల। దుఃఖభరమున మాటలు దొట్రుపడ గఁ। బ్రియములాడని ప్రియుఁ జూచి బెగ్గడిల్లి। చరణములు నేలవ్రాయుచు సంభ్రమములఁ। గాంతలెల్లను వగలనాక్రందలగు చు॥ ఇట్లనిరి* (మ॥ అకటా నమ్మితి మేము కూరుఁడ నని న్నర్థంబె మా యిండ్లలో । సకలవ్యాప్తులడించి నీపదసరోజాతంబులర్పిం

పంజికఁ జిక నేతెంచితిమి యశోదాధ్యుండుముము తాఁ నసక్తులం గాంచుపో। లికఁ గావందగుఁ గావవే విడువ మేలే కాంతలన్ భ్రాంత
లన్* (మ॥ పతులన్ బిడ్డలబంధులన్ సుతులకున్ వ్యాటించుటే ధర్మమం। త్రతినీవంటివి దేహధారిణులకున్ ధర్మజ్ఞ దింతింపుమా। పతిపుత్రా
దికి నాయమూర్తివగుచున్న సిల్లునీయందుండ।త్పతిపుత్రాధిక వాంఛలన్నలిపి సంభాపించుటన్యాయమే* (మత్తకోకిల॥ నీపయి
న్రతిసేయుచుంమరు నేర్పరుల్సతతప్రియో।ద్దీపకుండవుగాన నెవ్వఁగఁ దెచ్చునాథమతాదులన్। జాపనేటికి మన్మహాశలు చుట్టినీ
కడనుండఁగాఁ। బావనేల మదీయతాపముఁ బాపఁ బోలుఁ గృపానిధీ* (సీ॥ నీపాదకమలంబు నెమ్మి డగ్గరఁగాని తరలి వోవంగ బా
దములు రావు। నీకరాబ్జంబుల నెఱిఁ నంటితివఁగాని తక్కిన పనికి హస్తములు చొరవు। నీవాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని చె
వులన్యభాషలఁ జేరిపనవు। నీసుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని చూడ వన్యంబులఁ జూడ్కికవలు। నిన్నె కాని పలుక నేరవు మా
జిహ్వ। లొల్లననుచుఁ బలుకనోడవీవు। మా మనంబులెల్ల మరలించి దొంగిలి। తేమి సేయువార మింకఁ గృష్ణ* (చ॥ సిరికి ముదార
చిహ్నములు సేయు భవచ్చరణారవిందము। ల్సరసిజనేత్ర మాతపము సంపదఁ జేరితి మెట్టకేలకున్। మఱలఁగ లేము మా మగలమా
టలనొల్లము పద్మగంధము। ల్మఱిఁగిన తేటులన్యకుసుమంబుల చెంతలఁ జేర నేర్చునే* (గీ॥ సవతులేక నీవిశాలవక్షస్థలిఁ। దులసి
తోడఁ గూడఁ దోయజాక్ష। మనుపుమనుచు గాంతమా కాంత నీపాద। కమలరజముఁ గోరుఁ గాదె కృష్ణ* (ఉ॥ అత్తలు మామలు
న్నగవ నాఁడి గొడక నాథులన్ము గా। యత్తులఁ జేసి యిల్వరుసలా జిడివోవఁగ నీమనవ్వులు। నెత్తనమాటలన్ మరుఁడు మేల్కొ
నియేచిన వచ్చినార మే। పొత్తులనొల్లమో పురుషభూషణ దాస్యములిచ్చి కావవే* (మ॥ మగువల్ చిక్కరె తొల్లి వల్లభులకున్ మన్నింపం
చితద్వల్లభు। ల్మగపంతంబు తలంపరే తగులముల్మాపాల నేపుట్టెనే। మగవారాడెడు మాట లేత గవునీ మాటల్మనోజాగ్ని చేఁ।
బొగలం జాలము కౌఁగిలింపుము మముం బుణ్యంబు పుణ్యాత్మకా* (ఉ॥ కుండలదీప్తి గండము నగుంచిత కుంతలఫాలమున్ సుధా। మం
డితపల్లవాధరము మంజులహాసవిలోకనంబునై। యుండెడు నీ ముఖంబు గనియుండగ వచ్చునె మన్మథేతు కౌ। దండవిముక్త
బాణముల దాసులమయ్యెద మాదరింపవే* (సీ॥ నీయధరామృతనిర్ఝరంబులు నేఁడు చేరి వాతెఱలపైఁ జిలుకకున్న। నీవిశా
లాంచిత నిర్మలవక్షంబు కుచకుట్మలంబులఁ గూర్పకున్న। నీరమ్యతరహస్తనీరజాతంబులు చికురబంధంబులఁ జేర్పకున్న। నీకృపా
లోకననివహంబు మెల్లన నెమ్మొగంబుల మీఁద నెఱపకున్న। నీనవీనమాననీయసల్లాపంబు। కర్ణరంధ్రదిశలఁ గప్పకున్న। నెట్లు
బ్రతుకువార మెందుఁ జేరెడువార। మది పవిన్ గదగదె యాడు కుయాలు* (మ॥ భవదాలోకనహాసగీతజములై భాసిల్లు కా
మాగ్నులన్। భవదీయాధరపల్లవామృతము చే బాపందగున్ బాపవే। వినియోగానలహేతిసంహతులచే నీ త్రైభవచ్చింతలన్।
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీపాదంబు లేయానగా* (క॥ తరుమృగఖగగోగణములు। కరమొప్పెడు నిన్నుఁ గన్నఁ
గానము విన్నన్। గరగి పులకించు నబలలు। కరఁగరె నినుఁ గన్న నీదు గానము విన్నన్* (సీ॥ ఈ పంచబాణాగ్ని నేమిట నార్పెదము
నీమంజువాగ్వృష్టి నెగడదేని। నీమన్మథాంబోధి నేత్రోవఁ గడతుము నీదృష్టి నావమై నిలువదేని। నీచిత్తజధ్వాంత మేజా
డఁ జెఱుతుము నీహాసచంద్రిక నిగుడదేని। నీదర్పకజ్వర మేభంగి నడఁతుము నీనవాధరసుధ నింపవేని। నెట్లు నిర్వహింతు
మేలాగు మ్రాలాగు। కరుణ సేయవేని గదియవేని। మరుఁడు నిర్దయుండు మననిచ్చునే యశో। దాకుమార యువతిధైర్య
చోర* (క॥ అసురులఁ గాచిన హరిక్రియ। గమలేక్షణ నీవు నేఁడు కరుణన భయహ। స్తము మాయురముల శిరములఁ। బ్రమదంబు
న నిడుము మూర్ఛపాల్పడకుండన్* (క॥ కట్టా తలమునుకలునై। దట్టపు విరహాగ్నిశిఖలు తరుణుల నేఁచ। న్నెట్టుం బలుకవు చూడ
వు। కట్టడి విగదా కుమారక కరుణోదారా* (వ॥ అని యిట్లు కుసుమశరుని శరపరంపరాపరవశలై యోపికలు లేక పలికిన గోపికలదీ
నాలాపంబులు విని నవ్వి యోగీశ్వరేశ్వరుండయిన కృష్ణుండాత్మారాముండై వారలతో రమియించె నప్పుడు* (మ॥ కరుణాలో
కములం బటాంచలకచాకర్షంబుల న్మేఖలా। కరబాహుస్తనమర్దనంబుల నఖాంకవ్యాప్తుల న్నర్మవా। క్పరిరంభంబుల మంజులా
ధరసుధాపానంబులం గాంతలన్। గరగించె న్రతికేళిఁ గృష్ణుఁడు కృపన్ గందర్పబాలార్చనన్* (క॥ మక్కువ వికసితవదన
లు। చక్కఁగఁ దనుఁ గొల్వ హాసచంద్రికతోడన్। మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు। చుక్కలగమి నడిమి పూర్ణసోముని భంగిన్*
(గీ॥ సతులుఁ దన్నుఁ బాడ సంప్రీతి నాడుచు। నలుతనున్నవైజయంతి తోడ। వనజలోచనుండు వనభూషణుండయ్యె। యువతిజన
శతంబు లోలిఁ గొలువ* (ఉ॥ చిక్కక యీశుఁడై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడి మాయలానికిన్। జిక్కె కృతార్థులై మరుని చిక్కులఁ
జొక్కి లతాంగులుండఁగా। మక్కువశాంతి సేయుటకు మన్ననఁ జేసి ప్రసన్నుఁ డౌటకున్। జక్కని నాభిభండు గుణశాలి తిరోహి
తుఁ డయ్యె నయ్యెడన్* (వ॥ ఇట్లు హరి కనుమొఱంగి చనిన కటింగా నకతిరుగుక రేణుల పెలుకునల్లంబులు దల్లడిల్ల వల్లవకాంతలు
తదీయగమనహాసవిలాసవీక్షణవిహారవచనరచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి వివిధచేష్టలకుం బాల్పడి తదాత్మక
త్వంబున నేన నేన కృష్ణుండననిక్కృష్ణగుణావేశంబులం జరియించుచు* (క॥ భూతములలోన వెలఁగు। ఖ్యాతుండగునట్టి వానిఁ
గాంతలు కాళిం। దీతీరవనాంతరముల। భ్రాంతి న్వెదుకం గజనిరిపాడు చనదిపా* (సీ॥ పున్నాగ కానవే పున్నాగవందితుఁ దిల

కంబ కాన వేతిలకనిటలు।ఘనసార కాన వేఘనసారశోభితుబంధూక కాన వేబంధుమిత్రు।మన్మథ కాన నేమన్మథాకారుని।వంశం
బ కాన వేవంశధరుని।చందన కాన వేచందనశీతలుఁ।కుందంబ కాన వేకుందరదను। ఇంద్రభూజమ కాన వేయింద్రవిభవుఁ।కువల
వృక్షము కాన వేకువలయేశుఁ। ప్రియక పాదప కాన వేప్రియవిహారు। ననుచుఁగృష్ణుని వెదకిరయ్యబ్జముఖులు॥ మఱియును*
(ఉ॥నల్లనివాఁడుపద్మనయనంబులవాఁడుకృపారసంబుపైఁ।జల్లెడువాఁడుమౌళిపరిసర్పితపింఛమువాఁడునవ్వురా।జిల్లెడు
మోమువాఁడొకఁడుచెల్వలమానధనంబుఁదెచ్చెనో।మల్లియలార!మీపొదలమాటునలేఁడుగదమ్మచెప్పరే* (ఉ॥ అంగజు
నైనజూడహృదయంగముడైకరఁగించువాఁడు।శ్రీ। రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడుమా। మ్మంగజుపు
వ్వుఁదూపులకునగ్గముచేసెలవంగలుంగనా। రంగములార!మీకడకురాఁడుగదా కృపనుంచిచూడరే*(సీ॥మానినీమన్మథుమా
ధవుఁగానరే!సలలితోదారవత్సకములార।సలలితోదారవత్సకవైరిఁగానరే!సుందరోన్నతలతార్జునములార। సుందరోన్నత
లతార్జునభంజుఁగానరే।ఘనతరలసదశోకంబులార। ఘనతరలసదశోకస్ఫూర్తిఁగానరే!నవ్యరుచిరకాంచనంబులార।న
వ్యరుచిరకాంచనకిరీటుఁగానరే। గహనపదవిగురవకంబులార। గహనపదవిగురవకములార కానరే। గణికలార చారుగణిక
లార*(సీ॥అదెనందనందనుండంతహితుండయ్యెఁబాటలీతరులార!పట్టరమ్మ।హేలావతులఁగృష్ణయేలపాసితివనియైలేయల
తలారయడుగరమ్మ।వనజాక్షుఁడిచటికివచ్చెఁడాఁగఁడుగదా చూతమంజరులార చూడరమ్మ। మానినీమదనుతో మారాకమెఱిఁ
గించిమాధవీలతలార!మనుపరమ్మ।జాతిసతులబాయనీతిమెహరికని। జాతులారదిశలఁజాటరమ్మ। కదళులారపోయికదలింది
శిఖిపింఛజూటుఁదెచ్చికరుణజూపరమ్మ*(క॥హరిచరణములకుఁబ్రియమై। హరినినుమన్నింపభద్రమందెదుతులసీ।హరినీ
చెసరాడుగదా।హరిచొప్పెఱిఁగించిశుభమునందింపఁగదే*(గీ॥పొగడదగువానిఁగానరేపొగడలార। యీడెఱుంగనివిభుఁ
జూపుఁడీడెలార।మొల్లమనుకీర్తివాఁడేడిమొల్లలార।శుకనిగదితునిఁజెప్పుఁడుకింశుకములార*(క॥తరుణీకుచకుంకుమయు
త।హరికుందకదామగంధమడరెడిమాడ్కిఁ।హరిఁగనినపగిదిఁదనరెడి। హరిణీహరిజూడఁబుణ్యమయ్యెడిజెప్పుమా*(క॥కేటి
మైకౌఁగిటఁజేర్చెను। వటుఁడై వర్ధిల్లి కొలిచె వడిగృష్ణుండై। యిటుపదచిహ్నములిడె క్రిం।దటిబాముననేమినోఁచితమ్మ
ధరిత్రీ*(వ॥అనుచునున్మత్తచిత్తలైతదాత్మకత్వంబునఁగృష్ణులీలననుకరించుచు* (సీ॥పూతనయైయొక్కపొలఁతిచరింపం
గశౌరియైయొకకాంతచన్నుడుచు।బాలుఁడై యొకభామపాలకునేడ్చుచో బండినేనను లేమఁబాఱఁదన్ను। సుడిగాలినని
యొక్కసుందరిగొనిపోవహరిననివర్తించునబ్జముఖియు। బకుఁడనేనని యొక్కపడఁతిసంరంభింపఁ బద్మాక్షుఁడనుకొమ్మపరి
భవించు।నెలమిరామకృష్ణులింతులిద్దరుగాఁగ।గోపవత్సగణముకొందఱగుదు।రసురవైరిననుచుసబలయొక్కతెచీఁటుఁ। బసు
లమనెడిసతులభరతముఖ్య*(గీ॥లోకమెల్లగుక్షిలోపలనున్నట్టి। మాధవుండనేనుమాతవీవు। చూడుమనుచునొక్కసుంద
రియొకతెపముఖముఁదెఱచిచూపుముఖ్యచరిత*(క॥ వెన్నలుదొంగిలితినియెడి। వెన్నుఁడననియొకతెనడువవేఱొక్కతె
చే।సన్నలయశోదనంచును।గ్రన్ననఁగుసుమములఁదండఁగట్టునిలేశా* (క॥ కాళియఫణియిదిపీఠలు।కాళియఫణిసతులు।మ్రొ
క్కఁగడగిరినేఁగో।పాలకుమారుఁడననుచును।లీలాగతినాడునొక్కలేమనరేంద్రా*(క॥తరుణులుగోపకులందఱు। హరిహ
యుఁడిదెవానఁగురిసెహరినేననిభా।సురచేలాంచలమొక్కతె।గిరినెత్తెదననుచునెత్తెఁగేలన్నృపా* (క॥ మీరలుగోపకు
లేనసు।రారినిదావాగ్నివచ్చెనటుచూడకుఁడీ।వారించెదననియొక్కతె।చేరిబయలొక్కబళనంబుసేయునరేంద్రా* (వ॥ ఇట్లు
తన్మయత్వంబునగోపసుందరులుబృందావనంబునంగలతరులతాదులహరినడుగుచు నిరర్గళంబులయినవిపినమార్గంబులసరో
జాతకేతనకులిశాంకుశాదిలక్షణలక్షితంబులై మనోహరంబులయిన హరిచరణంబులచొప్పుఁగని తప్పకచెప్పికొనుచుఁ దమ
లోనిట్లనిరి* (సీ॥ కొమ్మకుఁబువ్వులుగోసినాఁడిక్కడమొనసిపాదాగ్రంబుమోపినాఁడు। సతినెత్తికొనివేడ్కఁజరిగినాఁడి
క్కడఁదృణములఁదోపదుతెలవజాఁడ। ప్రియకుధమ్మిల్లంబుపెట్టినాడిక్కడఁగూర్చున్నచొప్పి దెకొమరుమిగులు। నింతికిఁ
గెమ్మోవినిచ్చినాఁడిక్కడ వెలఁదినిక్కనగతివిశదమయ్యె।సుదతితోడనీరుఁజొచ్చినాఁడిక్కడఁ। జొచ్చితావెడలినచోటులవు
రెఁ। దరుణిగాముకేళిఁదనిపినాఁడిక్కడ। ననగిపెనఁగియున్నయందమొప్పె॥మఱియును* (సీ॥ ఒకయెలనాగచెయ్యూఁది
నాఁడిక్కడపరసనున్నవినాల్గుచరణములును। నొకనీలవేణితోనొదిగినాఁడిక్కడమగజాడలోనిదెమగువజాడ। యొకలేమ
మ్రొక్కినఁ నొడిపినాఁడిక్కడ రమణిమ్రొక్కినచొప్పు రవ్యమయ్యె। నొకయింతికెదురుగానొలసినాఁడిక్కడ నన్యోన్యము
ఖములై యంఘ్రులొప్పె।నొకతె వెంటఁదగులనుండకమేఁగినాఁ।డమగుమీఁదఁదరుణియడుగులమరె। నబలలిరుగెలంకులం
డురాఁదిరిగివాఁ।డాయుపదములున్నవమ్మయిచట* (సీ॥ ఈచరణంబులేయిందునిభానన సనకాదిమునియోగసరణినొప్పు।
నీపాదతలములేకొమ్మలనాగ।శ్రుతివధూసీమంతవీధులఁజెన్నుమిగులు। నీపదాబ్జంబులేయిభకులోత్తమయానపాలేటిరాచూలి
పట్టుకొమ్మ। యీపుండరాంఘ్రులేయిందీవరేక్షణముక్తికాంతామనోమోహనంబు। యీయడుగులరజమెయింద్రబ్రహ్మాశాది।

దివిజవరులుమాలిదిశలఁదా.ల్తు । రనుచుఁగొందరబలలజ్జాతుఁడేగిన। క్రమముఁగనియనతనిఁగానరయిరి* (సీ॥ పతులనైన్యంబును భామలక్రౌర్యంబుఁజూపుచువిభుఁడొక్కసుదతితోడ।విహరింపనదియెల్ల వెలఁదులవర్జించి నా యొద్దను న్నాఁడు నాథుఁడనుచు । గర్వించిరాజాలకసులాత మూపుననిడుకొనుమనుఁడునయ్యీశ్వరుండు । మొఱఁగిపోయినదాపమునుబొంది యోకృష్ణయెక్కడజనితిప్రాణేశరమణ। నీకువరవుడనయ్యెదనిలువుమనుచు । వగవఁగొందఱు కాంతలావనితఁజూచి।వరుఁడుమన్నింపగర్వించివనజనేత్రి।చిక్కనేఁడని వెఱఁగును జెందిరపుడు॥మఱియును* (సీ॥ఈపొదరింటిలోనింపొదరింటిలోనించాఁకఁగృష్ణుండు నాతోడమన్మథనటనమాడె । నియ్యోలమగుచోటనిందాఁకఁజెలువుండు గాఢంబుగానన్నుఁ గౌఁగలించె । నీమహీజమునీడనిందాకసుభగుండుచిట్టట్టు సేఁతలసిగ్గుగొనియె।నీపువ్వులతపొంతనిందాకదయితుండునను డాసియధరపానంబుఁజేసె । నీప్రసూనవేదినిందాకరమణుండు । కుసుమదామములనుగొప్పుదీర్చె । ననుచుగొందఱతివలంభోజనయనుని।పూర్వలీలఁదలఁచి పొగడిరధిప* (మ॥ అనియిబ్భంగిలతాంగులందఱునుబృందారణ్యమందీశ్వరు।న్వనజాక్షుంబరికించి కానకవిభున్వర్ణించుచు న్బాపుచు।మనముల్మాటలుచేష్టలుంగ్రియలునమ్మానాథుపైఁజేర్చివే।చనిరయ్యామునసైకతాగ్రములకుం సంత్యక్తగేహేచ్ఛలై ॥చనిగోపికలుహరినుద్దేశించియిట్లనిరి*

—* గోపికాగీతలప్రారంభము. *—

(క॥నీవుజనించినకతమున।నోవల్లభలక్ష్మిమందవా ప్పెనధికమై। నీవెంటనె ప్రాణములిడి।నీవారరసెదగుచూపునీరూపంబున్* (క॥ శారదకమలోదరరుచి। చోరకమగుచూపువలనసుందరమమ్ము।న్గోరివెలయూనిదాసుల।ధీరతనొప్పించుటిదివధించుటగాదె* (గీ॥ విషజలంబువలనవిషధరదానవు।వలనగాలివలనవహ్నివలన। మిగులువానివలననొగిమమ్మురక్షించి।కుసుమశరుని బారిగూల్పఁదగునె* (ఉ॥నీవుయశోదబిడ్డఁడవెనీరజనేత్రసమస్తజంతుచేతోవిదితాత్మ వీశుఁడవుతొల్లి విరించివలంచిలోకర । క్షావిధమాచరింపుమనిసన్నుతిసేయగసత్కులంబునన్ । భూవలయంబుఁగావనిటుపుట్టితి గాదెమనోహరాకృతిన్* (గీ॥చరణసేవకులకుసంసారభయమును।బాపిశ్రీకరంబుపట్టుగలిగి। కామదాయియైనకరసరోజంబుమా।మస్తకములనునిచుమనుపుమీశ* (ఉ॥గోవులవెంటఁద్రిమ్మరుచుఁగొల్చినవారలపాపసంఘముల్ద్రోవఁగజాలిశ్రీదనరిదుష్టభుజంగఫణాలతాగ్రసం । భావితమైననీచరణపద్మముచన్నులమీఁదమోపితా। ద్భావజపుష్పభల్లభవబాధహరింపువరింపుమాధవా* (క॥బుధరంజనియనుసూక్తయు।మధురయునగునీదువాణిమఱగింజెనునీ । యధరామృతసంసేవన।విధినంగజతాపమెల్లవిడిపింపఁగదే* (క॥మగువలయెడనీక్రౌర్యము। తగునే నిజభక్తభీతిదమనుడవకటా।తగదుభవద్దాసులకును।నగుమొగముంజూపి కావునళినదళాక్షా* (మ॥ఘనలక్ష్మీయుతమైమహాశుభదమై కామాదివిధ్వంసియై।సనకాదిస్తుతమైనిరంతరతపస్సంతప్తపున్నాగజీ।వనమైయొప్పెడునీకథామృతముద్రావంగల్గునేభూరిదా। ననిరూఢత్వము లేనివారలకుమానారీమనోహారకా* (క॥నీనగవులునీచూడ్కులు।నీనానావిహారణములునీధ్యానంబుల్।నీనర్మాలావంబులుమానసములనాటినేఁడు మగుడవుకృష్ణా* (గీ॥ ఘోషభూమి వెడలిగోవులమేపంగ । నీరజాభమైననీపదములు।కసవుశిలలుదాఁకికడువచ్చునోయని।కలఁగుమామనములుకమలనయన* (ఉ॥మాపటివేళనీవువనమధ్యము వెల్వడివచ్చి గోప్పదప్రాపితధూళిధూసరితభాసితకుంతలమైసరోరుహాభా। ద్దీపితమైననీ మొగముధీరజనోత్తమమాకువేడ్కతోఁ । జూపిమనంబులన్మరునిఁజూపుదుగాదెక్రమక్రమంబునన్* (గీ॥ భక్తకామదంబుబ్రహ్మసేవితమిలా।మండనంబుదుఃఖమర్దనంబు । భద్రకరమునైనభవదంఘ్రియుగమువమాయురములందుమరమణయునుపఁదగదె* (గీ॥సురతవర్ధనంబుశోకాపహరణంబు । స్వనితవంశనాళసంగతంబు।నన్యరాగజయమునైననీమధురాధ। రామృతమునదాపమార్పుమీశ* (ఉ॥నీవడవింబగల్దిరుగనీకుటిలాలకలాలితాస్యము।చ్ఛావిధిజూడకున్ననిమిషంబులుమాకుయుగంబులైచనుం । గావునరాత్రులైన నినుఁగన్నులనెప్పుడుఁజూడకుండలక్ష్మీవరరెప్పలడ్డముగఁజేసెనిదేలవిధాతక్రూరుఁడై* (ఉ॥ అక్కటబంధులన్మలినున్నలుదమ్ములఁబుత్రకాదులన్నెక్కనిరాత్రిబోకుఁడననీమృదుగీతరవంబువీనుల । న్వెక్కసమైనవచ్చితిమివేగమెమోహమునొందినాథనీ । వెక్కడవోయితోమొఱఁగమీక్రియనిర్దయుఁడెందుగల్గునే* (గీ॥ మదనుఁడార్వంగనీవాడుమంతనములు । నవరసాలోకనంబగు నగుమొగంబు।కమలకిరవైనమహితవక్షస్థలంబు। మామనంబులలోఁగొనిమరపెఁగృష్ణ* (మ॥ అరవిందంబులకంటెఁగోమలములైయందంబులై యున్ననీ । చరణంబుల్కఠినంబులైమొనయుమాచన్నుంగవన్మోవఁగా। నేఱియంబోలునటంచుఁబొక్కుదుమునయ్యోకర్కశారణ్యభూ।పరిసంచారముకృష్ణనీప్రియలకుంప్రాణవ్యథంజేయదే* (క॥కట్టామన్మథుకోలలు। నెట్టననోనాఁటబెగడినీపాదంబుల్పట్టికొనఁగవచ్చినమము।నట్టడవినిడించిపోవనాయమెకృష్ణా* (క॥హృదయేశ్వరమాహృదయము। మృదుతరముగఁజేసితొల్లి మిక్కిలికదునీ।హృదయముకఠినముఁజేసెను।మదీయసౌభాగ్యమిట్టిమందముగలదే* (ఉ॥క్రమ్మనిశాచరుల్సురనికాయములన్వడిఁదాఁకివీఁకవా।లమ్ముల తెట్టెముల్వఱుప।నడ్డమువచ్చిజయింతువంద్రుని। న్నమ్మినముగ్ధలకార

హితవాధలనక్కట నేఁడు రెండు మూఁడమ్ములయేటు కాఁడె సువనడ్డము రాదగ దేక్ష్యపానిధీ* (క॥ తియ్యవిలుకాఁడు డీకొని।
వ్రయ్యలుగాఁ దూఱనేసె వనితలఁ జనము। ల్నియ్యానియింక నైనను। గుయ్యాలింపంగదయ్య గోవిందహరీ* (మ॥ అనియిట్లంగ
నలంచితస్వరముతో నంకించుచున్ బాడుచున్నను రా వేయనిచీఁటియేదువజగత్రాణుండువై త్రిలోక్యమో। హనుఁడై మన్మథు
న్మథుండయిన సొజ్ఞాకారిమైయంతటన్। ఘనపీతాంబరధారియై పొడమెఁ దక్షాంతాసమీపంబునన్* (క॥ వచ్చినవల్లభుఁ గ
నుఁగొని। విచ్చేసె నటంచు సతులు వికసితముఖులై। యచ్చుగ నిల్చిరి ప్రాణము। వచ్చిన నిలుచుండునవయంబుల భంగిన్* (సీ॥ అబ
లయొక్కతె భక్తి నంజలి గావించి ప్రాణేశు కెంగేలు బట్టుకొనియె। నింతియొక్కతె జీవితేశ్వరు బాహువు మూఁపునఁ జడికొని
ముదమునొందె। వనితయొక్కతె తన వల్లభు తాంబూలచర్వితమాత్మహస్తమునఁ దాల్చెఁ। బడఁతియొక్కతె ప్రియుపదములు
విరహాగ్నితప్తకుచంబుల దాపుకొనియె। భామయొకతె భ్రుకుటిబంధంబు గావించి। ప్రణయభంగకోపభావమున దష్టద
శనయగుచు దండించుకైవడి। వాఁడిచూడ్కిఁ గములవరుని జూచె* (క॥ హరిముఖకమలముఁ జూచుచుఁ। దరుణియొకతె ఱెప్పలి
డక తనియకయుండెన్। హరిపదకమలముఁ జూచుచు। ముఱిఁగి తనివి లేని సుజను మాడ్కి నరేంద్రా* (ఉ॥ ఒక్కలతాంగి మాధ
వుని యుజ్వలరూపము చూడ్కి తీగెలం। జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ జేసి వెలింజనకుండ నేత్రముల్। గ్రక్కన మూసి మేనఁ బులకం
బులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచున్। జొక్కము లైన లోచవులఁ జొక్కుచునుండెను యోగికైవడిన్* (సీ॥ ఎలయించి ప్రాణేశ యెం
దుబోయితి వనితోరంపుటలుకతో దూరు నొకతె। జలజాక్షు నను బాసి చనఁగ నీ పాదంబు లెట్లాడె నని వగ నెదిఱెనొకతె। నాథ
నీవరిగిన నా ప్రాణమున్న దిహూమిన్ యేయిది యని సిగ్గుందె నొకతె। యీశ్వర నను నిన్ను నిందాకఁ బాపె నే పాపవు విధియని పలుకు
నొకతె। తలఁగిపోవునట్టి తప్పేమి చేసితి। నధిప పలుకుమధవుఁ మనియెనొకతె। యేమి నోము ఫలమొ హృదయేశ నీ మోము। వ అలఁ
గంటిననుచు నసలె నొకతె* (క॥ పలికిన ప్రతిజ్ఞ దప్పెడిఁ। బలికించిన గానిరమణుఁ బలుకక నటంచున్। గలకంఠియొకతె చెలితోఁ। బ
లుకుల నమృతములు గురియ పలుకులు వలికెన్* (క॥ పట్టినఁగాని మనోవిభుఁ। బట్టగదా యంచు నొక్కబాలిక సఖిచే। పట్టుకొని
చెప్పె ధైర్యము। ప్పట్టెల్లను మురుని కెంకి వట్టు గనధిపా* (క॥ చెలువుఁడు చెప్పక పోయిన। సొలపున నొకముగ్ధ మున్ను చూడనను
చునెఁ। దలవంచియుండఁ జాలక। తలయెత్తెను మురుఁడు లోనఁ దలయెత్త నృపా॥ ఇవ్విధంబున* (క॥ హరిసురుచిరలలితాకృతిఁ। ద
రుణులఁ గనిముక్తవిరహతాపజ్వరులై। పరమోత్సవంబు సలిపిరి। పరమేశ్వరుఁ గనిన ముక్తబంధుల భంగిన్* (వ॥ అంతనక్కాం
తుండు కాంతాజనపరిక్రాంతుండై వనాంతరంబున శక్తినికరసంయుక్తుండైన పరమపురుషుండునుంబోలె వారలం దోడ్కొని
మందార కుందకుసుమ పరిమళమిళిత పవమానమానితమధుకర నికరఝుంకార సుకుమారంబును, శరత్కాలచంద్రకిరణసం
దోహసంవళితాంధకారంబును, యమునాతరంగసంగత కోమలవాలుకాస్ఫారంబును నైన యమలినంబైన పులినంబుఁ బ్రవే
శించె, వారు నజ్ఞానకాండంబున నీశ్వరుం గని శ్రుతులు ప్రమోదంబునం గామానుబంధంబుల విడిచినవిధంబున హరిం గని విర
హవేదనల విడిచి పరిపూర్ణమనోరథలై* (క॥ పాఠీనయన లెల్లను। శౌరి న్యపటాంచలములఁ గౌతుకములు హృత్తీవ్రములసం
డడింపఁగ। బీఠముఁ గల్పించిరంతఁ బ్రియునకు నధిపా* (గీ॥ పరమయోగిహృదయభద్రపీఠంబుల। నుండుమేటి వజవధూత్త
రీయపీఠమున వసించి పెంపారెఁ। ద్రిభువన దేవలక్ష్మి మేనఁ దేజరిల్ల* (మ॥ మదనోద్దీపితుఁడైన నాథునికి సన్మానంబు గావించు
చున్। ముదితల్వాసవిలోకవిభ్రమములన్ మోదింపుచుం జేరి తత్పదముల్ హస్తతలంబులన్ బిసుకుచున్ బైముట్టుచున్ మారుచున్। జ
దురులై ల్లుచుఁ గూర్మినిట్లనిరి యాపత్కోపదీప్తాస్యలై* (క॥ కొలిచినఁ గొలుతురు కొందఱు। గొలుతురు దము గొల్వకున్నఁ గొం
దఱు పశులం। గొలిదినను గొలువకున్నను। గొలువరు మఱి కొంద ఱెలమి గోపకుమారా* (వ॥ అనితన్నునుద్దేశించి రహస్యంబు
గాఁ బలికిన సుందరుల పలుకులు విని గోపాలసుందరుం డిట్లనియె* (సీ॥ కొలిచినఁ గొలుతురు కొందఱు పశువుల భజనము భంగి నిష్ఫల
ముకొఱకు। నై సఖ్యధర్మంబులందు సిద్ధింపవు కొందఱుతంత్రుల గుణము దాల్చి। దయఁగలవారును దగిన సుహృత్తులు। గొలువని
వారలఁ గొల్తురెపుడు। దర్మకామంబులు తనరంగఁ గొందఱు కొలువని వారినిఁ గొలుచువారిఁ। గొలుచుతలపు లేమిఁ గొలువరాత్మా
రాము। లాప్తకాములజ్ఞులతికఠినులు। వారియందుఁ బిదపవారి గాజింతింది। యేల తాంగులార యిట్టులనుట* (క॥ ఏ నిందె
వ్వఁడ నైనం। గానంగ నలార పరమకారుణికుండన్। మానసబంధుఁడ నిత్య। ధ్యానము మీకొనర వలసి తలఁగితి సుండీ* (మ॥ నను సే
వించుచున్న వారలకు నేనా రూపముం జూపఁ జూ। చినఁ జాలించి మదించి వారు మది నన్సేవింపరో యంచు ని। ర్ధనికుండాత్మధనం
బు చెడ్డ నెపుడున్ దత్పారవశ్యంబు దా। ల్చిన భంగిన్ననుఁ బాసి మత్ప్రియుఁడు దాఁ జింతించు నా రూపమున్* (తరల॥ తగవు ధర్మ
ముఁ జూడ నొల్లక దల్లిదండ్రుల బంధులన్। మగల బిడ్డల బాసి వచ్చిన మన్నిమ క్తలమిమ్ము నేఁ। దగదు పాసితిఁ దప్పు సైపుఁడు తద్వి
యోగభరంబున న్వగలఁ బొంకుచు మీరలాడిన వాక్యముల్ విను చుండితిన్* (ఉ॥ పాయని గేహశృంఖలము బాసి నిరంతరమత్ప
రత్వము। న్జేయుచున్న మీకుఁ బ్రతిసేయ యుగంబుల నైన నేరన। న్బాయక గొల్చు మానసము ప్రత్యుపకారము గాఁ దలంచినా।

పాయుటఁదప్పు గాఁగొనక భామినులార కృపన్నమింప రే* (క॥ చక్కఁగ హరి యిటు పలికినఁ। జక్కని వాక్యములనతని సంగమము వలో। సిక్కని విరహ తాపము। లొక్కటవిడిచిరిల తాంబులుర్వీనాథా* (ఉ॥ ఆసమయంబునన్విభుఁడనంతుఁడు కృష్ణుఁడుచి

—*. రాసక్రీడాభివర్ణనము. *—

త్రమూర్తియై। చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహుకాం। తాసువిలాసమున్ బహువిధస్ఫురితాననహస్తపాదవి। న్యాసము రాసమున్ గృతవియచ్చరనేత్రమనోవికాసమున్* వ॥ ఇట్లు బహుగతులందిరుగ నేర్పరియగు హరిదర్పించితనయిరుగెలంకులకునలంకృతలై కళంకరహితచంద్రవదనలిద్దరుముద్దియలందుకొని వీణలం బ్రవీణలై సొంపు మెఱసి యింపుగవాయించుచు నానందలహరీనిధానంబగు గానంబు సేయ నవిరళంబై తరళంబుగాని వేడుకసరళంబగుమురళంబు లీలంగేలనందుకొని మధురంబగు నధరంబునంగదియించిమించి కామినీజనకబరికాసౌగంధికగంధబంధురకరాంగుళీకిసలయంబులుయతిలయంబులంగూడి వివరంబుగ మురళీవివరంబులసారించి పూరించుచు సరిలేనిభంగిం ద్రిభంగియై కమలకర్ణికాకారంబున నడుమనిలిచినుఱియుగోపమందరు లెందఱందఱకునండఱయి సుందరులకవలియెడలందానునుదనకవలియెడలసుందరులును దేజరిల్లనృత్యవిద్యామహార్ణవవేలావలయవలయితంబై విస్మితాఖండలంబైనరాసమండలంబుఁ గల్పించి వేల్పులుహర్షంబునంగుసుమవర్షంబులుగురియనందుఁ బ్రసూనమంజరీసహచరంబులైనచంచరీకంబులమించు ప్రకటించు సువర్ణమణిమధ్యగంబులైనను హేంద్రనీలంబుల తెఱంగు నెఱపుచుఁ గరిణీవిహారబంధురంబులైనసింధురంబులచెలువు గైకొలుపుచుఁ బల్లవితకుసుమితలతానుకూలంబులై నతమాలంబులసొబగునిగుడించుచు మెఱుపుతీగలయెడనెడంబెడంగడరునల్ల మొగుళ్లపెల్లుచూపుచుఁదరంగిణీసంగతంబులైన రోహణాచలశృంగంబుల బాగులాగించుచు జగన్మోహనంబై యుండి రక్తకమలారుణంబులును జంద్రశకలనిర్మల నఖరసంస్ఫురణంబులును శ్రుతినితంబినీసీమంత వీథికాలంకరణంబులును సనకసనందనాది యోగీంద్రమానసాభరణంబులును నైనచరణంబులుగదియనిడిసమస్థితినంజలిపుటంబులంబుష్పంబులుల్లసిల్లఁజల్లి సల్లలితకమలప్రశస్తంబులైనహస్తంబులువల్లవీజనులకంఠంబులపైనిడి గీతానుసారంబుగ విచిత్రపాదసంచారంబులు సలుపుచు వర్తులాకారరాసబంధంబులన్ర్తనంబునంబ్రవర్తించి వెండియు త్రేతలుంచానును శంఖ పద్మ వజ్రకందుకచతురస్రఖచక్రవాళచతుర్భద్రసౌభద్రనాగనంద్యావర్తకుండలీకరణకురళీబంధ ప్రముఖంబులయిన విశేషరాసబంధంబులకుంజొక్కి యేకపాదసమపాదవినివర్తితగతాగతవలితవైశాఖమండలత్రిభంగిప్రముఖంబులయిన తానకంబులనిలుచుచుఁ గనకకింకిణీమంజులమంజీరశింజనంబులు జగజ్జనకర్ణరంజనంబులై చెలంగఘటితమర్దితపార్శ్వగప్రముఖంబులైన పాదకర్మభేదంబులు సేయుచుసమపాదశకటివదనమతల్లిశుక్తిప్రముఖంబులయినపార్థివచారివిశేషంబులును నపక్రాంతడోలాపాద సూచీప్రముఖంబులయిన వ్యోమచారివిశేషంబులం జూపుచు సురేంద్రశాఖిశాఖామనోహరంబులు నవహసితదిక్కరీంద్రకరంబులును ద్రిలోకక్షేమంకరంబులునునగు కరంబులందిరంబులగు రత్నకటకంబుల మెఱుంగులు నింగిచెఱంగులందఱు దుకొనన్ధచంద్రకర్తరీముఖకపిత్థకటకాముఖశుకతుండలాంగూలపద్మకోశపతాకాప్రముఖంబులయిన స్వస్వభావసూచకనానావిధకరభావంబులాచరించుచుఁగటిని బద్ధసువర్ణవర్ణచేలాంచల ప్రభానికరంబులు సుకరంబులై దిశాంగనాముఖంబులకుహరిద్రాలేపనముద్రాలంకారంబులొనంగుచునాస్కందితభ్రమరశకటాసనప్రముఖంబులయిన భానుమండలభేదంబులునలాతదండవాతలలితవిచిత్రచిత్రప్రముఖంబులయినదైవమండలంబులొనర్చుచుఁగమనీయకంబుకంఠాభిరామంబులును శ్యామతేజస్తోమంబులయిననీలమౌక్తికవజ్రవైడూర్యదామంబులరుచు లిందిరాసుందరికి మందిరంబులై సుందరంబులయినయురంబులందిరుగుడువడి కలయంబడినం గాంతారవాహ్యాలకుచత్రప్రముఖంబులయిన భ్రమరవిశేషంబుల విలసించుచునిద్దంబులగు చెక్కుటద్దంబులనుద్దవిడితద్దయుంబ్రభాజితచంద్రమండలంబులగు కుండలంబుల మెఱుంగుమొత్తంబులు నృత్యంబులొనరింపఁగటిభ్రాంతదండరచితలలాటతిలక మయూరలలితచంద్రమండలనికుంచిత గంగావతరణప్రముఖంబులైన కరణంబులెఱింగించుచు వెలిదమ్మివిరులసిరులు చెన్నుమిగులు కన్నులవలనదీనజనదైన్యకర్కశంబులైతనరు కటాక్షదర్శనజాలంబులుజాలంబులై కామినీజననయన మీనంబులనావరింప లలితకుంచితవికాస ముకుళప్రముఖంబులైన చూడ్కులదేజరిల్లుచునేకపరిపూర్ణచంద్రసౌభాగ్యసదనంబులగువదనంబులఁ బ్రసన్నరాగంబుఁ బ్రకటించుచు నుదంచిత పింఛమాలికామయూఖంబులఁగాలచక్రచాపంబులసొంపుసంపాదింప నికుంచితాకుంచిత కంపితాకంపిత పరివాహిత పరావృత్తప్రముఖంబులయినశిరోభాగంబులు నెఱపుచు మృగనాభితిలకంబులుగల నిటలఫలకంబుల జికురంబుల నికరంబులుగప్ప నపరాజితసూచికావిద్ధపరిచ్ఛిన్నవిష్కంభరేచితప్రముఖంబులగునంగహారంబులవిలసిల్లుచుఁ జరణకటికరకంఠరేచకంబులాచరించుచువొప్పినప్పుడారాసంబు సంజనితసకలజన మానసోల్లాసకరంబై సుధార్ణవంబునుంబోలె నుజ్జ్వలరసాభిరామంబై

రామరాజ్యంబునుంబోలె రాగపరిపూర్ణంబై పూర్ణచంద్రమండలంబునుంబోలెఁ గువలయానందమై నందనవనంబునుం బోలె భ్రమరవిరాజమానంబయి మానధనునిచిత్తంబునుంబోలె బ్రధానవృత్తిసమర్థంబయి సమర్థకవివిలసనంబునుంబోలె బహుప్రబంధభాసురంబయి సురలోకంబునుంబోలె వసుదేవనందనవిశిష్టంబయి శిష్టచరితంబునుంబోలె ధరణీగగనమండలసుందరంబయి సుందరీరత్నంబునుంబోలె నంగహారమనోహరంబయి హరవధూనిలయంబునుంబోలె ననేకచారిసుకుమారంబయి సుకుమారవృత్తంబునుంబోలె నుద్దీపితవశంబై యుండెనందు.* (చ॥ నడుములువీఁగియాడఁ జిఱునవ్వులు నివ్వటిలంగ హారముల్। సడివడమేఖలల్వదలఁ జూడ్కి మెఱుంగులువర్వఘర్మము। ల్వొడమగురుల్చలింప శ్రుతిభూషణములమ్రోయఁ గాసకృష్ణులై। పడతుకలాడుచుం జెలఁగి పాడిరి మేఘతటిల్లతాప్రభల్ ॥* (క॥ అంకరహితేందువదనలు। పంకజలోచనునిఁ గూడి పరగ నటింపన్। గింకిణులనూపురంబుల। కంకణముల మ్రోఁత లెసఁగె గర్ణోత్సవమై॥* (క॥ హరిణీనయనలతోడను। హరిరాసక్రీడ సేయ నంబరవీధిన్। సురనాథులు భార్యలతో। సొరిది విమానంబులెక్కి చూచిరి రేశా॥* క॥ కురిసెన్ బువ్వులవానలు। మొరసెన్ దుందుభులు మింట ముదితలు దారు। న్స్వరసగ్గంధర్వపతుల్। వరుసన్ హరి బాడిరపుడు వసుధాధీశా॥* (క॥ రామలతోడను రాసము। రామానుజుఁడాడఁ జూచి రాగిల్లి మనో। రామలమీఁద వియచ్చర। రామలు మూర్ఛిల్లి పడిరి రాసవినోదా॥* క॥ తారాధిపనిభవదనలు। తారాధిపవంశుఁ గూడి తారు నటింపన్। దారలు నిల్చె సుధాంశుఁడు। దారును వీక్షింప రేయి తడవుగ జరిగెన్॥* (మ॥ యమునాకంకణచారియై వనజపుష్పామోదసంచారియై। రమణీఘర్మనివారియై మదవతీరాశ్రమోత్తారియై। ప్రమదామానసనవ్యభవ్యసుఖసంపత్కారియై చేరియా। కమలాక్షుం డలరంగ గాలి విసరెన్ గల్యాణభావంబునన్ ॥ అప్పుడు॥* (చ॥ ప్రమద యొకర్తె మాధవుఁడు పాడ విపంచి ధరించి కేల సంభ్రమమునఁ దంత్రిమీఁటుచుఁ దిరంబుగ గానముచేసె నొక్కరా। గమున తగ నాలపించి పుభగస్వరజాతులు వేలువేలఁ గా। నమరఁ గఁ బాడె వల్లరమణుండౌనన దారువులంకురింపఁగన్॥* (క॥ ఆడుచుఁ బాడుచునందొక। చేడియ మంజీరమంజుశింజితమమరం। గూడి హరికరము చనుగవ। పైడాయఁగఁ దిగిచె జఘనభారాలసయై॥* (క॥ చందనలిప్తంబై యర। విందామోదమున నొప్పు విపులభుజము గో। విందుఁడొకతరుణిమూఁపునఁ। బొందించిన నది దెమల్చి పులకించె స్పృహా॥* (సీ॥ చెలువయొక్కర్తె చెక్కు చెక్కుదో మోపిన విభుఁడు తాంబూలచర్వితము వెట్టె। నాడుచునొకలేమ యలసినఁ బ్రాణేశుఁ డున్నతదోస్స్తంభమూఁతఁ జేసెఁ। జెమరించి యొకభామ చేరినఁ గడగోరఁ జతురుఁడు కుచఘర్మజలము వాపె। నలకంబులొకయింతి కలికి చిత్రకరేఖ నంటినఁ బ్రియుఁడు పాయంగఁ దువ్వెఁ। బడఁతియొకతె పాటఁ బాడి డస్సినయధ। రామృతమున నాథుఁ డాదరించె। హార మొక్క సతికి నంసావృతంబైనఁ। గాంతుఁ డురముఁ జేర్చి కౌఁగలించె॥* (క॥ హాసంబులఁ గరతలవిన్యాసంబుల దర్శనముల నాలాపములన్। రాసశ్రాంతలకా హరి। సేసె న్మన్ననలు కరుణఁ జేసి నరేంద్రా॥* (క॥ హరితనుసంగసుఖంబునఁ। బరవశలై వ్రేతలెల్లఁ బయ్యెదలు నిజాం। బరములు నెఱుఁగమి చోద్యమె। సురసతులీక్షించి కరఁగి చొక్కిరి మింటన్॥* (వ॥ ఇట్లు భగవంతుండైన కృష్ణుండాత్మారాముండయ్యును గోపసతులెంత యందఱకు నందఱై నిజప్రతిబింబంబులతోడం

—* జలక్రీడాభివర్ణనము. *—

గ్రీడించు బాలురపోలిక రాసకేళిసలిపిన॥* (క॥ తగఁ గూడి యాడి మనములఁ। దనరె జూచెంబలి కైనందనందనుఁడనుచు। న్మగువలు పెద్దటికముతోఁ। బొగడిరి తమపూర్వజన్మపుణ్యశ్రేణిన్॥* (వ॥ ఇట్లు హరి రాసకేళి సాలించి తలంగుతటిల్లతలచాలువునఘర్మసలిలకణాక్రాంతలగు కాంతలం గూడి జలక్రీడాకుతూహలుండై యమునాజలంబు సొర నందు ముందర సుందరులు సొచ్చి పదప్రమాణంబు జానుదఘ్నంబు కటిద్వయసంబు మధ్యమాత్రంబు కుచంబులబంటియని పలుకుచుం గుచనయనాభి వివరకుంతలంబులు చక్రవాకజలచరావర్తశైవాలంబుల చందంబున నందంబుగ నీడుపొందినయేఱులని కళిందనందన కరంబులు సాఁచి పరిరంభంబులకు నారంభించుకై వడి నెదురఁజను దెంచి తాకుతరంగంబులకు నులుకుచు సారసంబులకుం గరంబులు సాఁచుచు మరాళంబులం జోపుచుఁ జెన్నుమిగిలిన చన్నుల యెత్తుపత్తు మను నెపంబులఁ దపంబుల నీటఁ గావించుమాడ్కిని సంచరించుచక్రవాకంబుల దోలుచుని తాంత కాంతిసదనంబులగు వదనంబులకు నోడి క్రీడం జెంది కంది చందురుఁడు చలముడిగి జలమ్మునంబడి కంపించు కరణి నిజకరకలిత జలప్రతిఫలితుండై కదలు చంద్రునింగని మెచ్చి సోలుచు సలిలావగాహసమయసముచ్ఛలిత వారిశీకరపరంపరలవలనమకరందపానసుత్తమధుకరపక్షవిక్షేపణ సంజాత వాత సముద్ధూత కుముదాదిపరాగపటలంబులం జేరుచు మోముదమ్ములకమ్మగనమ్ములకుమూఁగి ఝమ్మురను తుమ్మెదలను వెలచుచుఁ గరంబులనీరెగయం జలుచుచు నీలనీరదనిపతితపయోబిందుసందోహంబులందడియు పువ్వుఁదీవియలబాగునఁ గృష్ణుకరద్వయంబునం బెక్కుతోయంబులందడియుచుఁ గ్రందుకొనిసుడియుచు ననమబాణుని పులుగడిగినకుసుమబాణంబులపగిది మేనులు మెఱయ సలిలావగాహనపరాయత్తచిత్తలగుచు మొత్తంబులై సరసభాషణంబుల న్రుద్దులు బాహులనీరు నించుచు హరిమీఁదఁ జల్లుచుఁ జల్లు నెడం దడబడదాఁటుచు దాఁటిచనకనిలువరించుచు వినోదింపం గరేణుకరవికీర్ణనీరధారాభిషిక్తంబగు శుండాలంబు లీలనాభీరకామి

నీకరసముజ్జ్వితజలాసారంబులందోఁగుచు వ్రజవధూజనహస్తప్రయుక్తకహ్లారకైరవ పరాగపటలంబులవలనభూతిభూషణు సిరివహించుచు గోపికాజనపాణికిసలయసమున్ముక్తకమలదళంబువలనసహస్రనయనుని రూపుఁజూపుచు గోపాల బాలికాకుచకలశకుంకుమ పంకమ్మువలన బ్రభాత భానునిభంగి భాసిల్లుచు ఘోషయోషాకటాక్షవిక్షేపణంబులవలనమధుపవరివృతహరిచందనసౌందర్యంబునొందుచు వల్లవీహాసరుచులవలనఁ జంద్రికాప్రభాభాసిత నీలశైలంబుక్రియ నమరెనంత* (చ॥ సతులుం దానునునీటిలో వెడలి భూషాగంధచేలాద్యలం।కృతుఁడై కుంభికరేణుయాధములతోఁ గ్రీడించు చందంబునన్। లతలం గంధరులందుఁ బుష్పమయలీలాశయ్యలందున్సఖీ।న్వితుఁడై కృష్ణుఁడు క్రీడలన్దనిపెనా నారీలలామంబులన్*(వ॥ ఇట్లుశరత్కాలంబున వెన్నుండింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమియించెనని చెప్పినమునివరునకు భూవరుండిట్లనియె* (మత్తకోకిల॥ ధర్మకర్తయుధర్మభర్తయుధర్మమూర్తియునైనస।త్కర్ముఁడీశుఁడుధర్మశిక్షయుధర్మరక్షయుసేయఁగా।నర్మిలిన్ధరమీఁదబుట్టిపరాంగనాజనసంగమే।ధర్మనుంచుఁదలంచిచేసెను దాత్తమానస చెప్పవే॥ అనినశుకుండిట్లనియె*(గీ॥ సర్వభక్షుఁడగ్నిసర్వంబుభక్షించి।దోషిగానిపగిదిదోషమైనఁ।జేసిదోషపదముఁజెందరు తేజస్వు।లగుటఁ జంద్రవాసవాములధిప*(క॥ ఈశ్వరుఁడుగానివాఁడున।రీశ్వరవర కాంతఁదలఁచియెట్లుఁ బ్రతుకుగా । రీశ్వరుఁడుదక్క నన్యుఁడు।విశ్వభయదవిషముఁ ద్రింగి వెలయఁగలఁడే* (క॥ సత్యముప్రభువులవచనము । నిత్యముతద్వచనవిధిని నిలుతురు పెద్దల్।సత్యాసత్యముగావున।సత్యమును దజనరు వారిచరితమునునృపా* (మ॥ ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యానసంప్రాప్తయో। గనిరూఢత్వము చేమునీంద్రులు మహాకర్మంబులం బాసి బం । ధనిరోధంబులు లేక విచ్చలవిడిం దర్పింతు రానిత్యశో। భనుఁ డెట్లుండినను డెఁగాక కలవే బంధంబులుర్వీశ్వరా*(గీ॥ గోబజనములందు గోపికలందును । సకలజంతులందు సంచరించు। నామహాత్మునకుఁ బరాంగనలెవ్వరు। సర్వమయుఁడు లీలసలిపెఁగాక*(వ॥ అని చెప్పి శుకుండిట్లనియెనంత బ్రాహ్మ్యముహూర్తంబునఁ గృష్ణునీడొక్కని గోపికలిచ్చలేకయునిండ్లకడకేఁగినం గృష్ణమాయామోహితులై గోపకులువారలం గోపింప నెఱుంగనేరరైరి* (ఇంద్రవజ్రము॥ గోపాలకృష్ణుండును గోపకాంతల్।ప్రాపించి క్రీడించినభంగులెల్లన్।రూపించివర్ణించినరుం డహృత్సం। తాపంబులన్బాయును దత్ప్రసక్తిన్*(వ॥ అంతనొక్కనాడు నందాదులైనగోపకులంబికావనంబునకు శకటంబులెక్కి జాతరకుం

—సర్పరూపియగు సుదర్శనుండను గంధర్వుని శాపవిమోచనము.—

జనిసరస్వతీనదీజలమ్ములస్నానమ్ము సేసియుమామహేశ్వరులనర్చించి కానుకలిచ్చి బ్రాహ్మణులకు గోభూహిరణ్యవస్త్రాన్నదానమ్ములొసంగి జలప్రాశనంబు సేసి నియమమ్మున నుండ దయివయోగమ్మున నాఁకొని యొక్క మహోరగంబునిదురవోయిన నందునింగబళించి మ్రింగ నగ్గలింపనతండు కృష్ణకృష్ణయితివచనంబులం దన్నువిడిపింపుమని మొఱయిడిన విని* (క॥ గోపకులందఱు మేలొక్కని।కోపముతోఁ బెద్దగుదెలఁగొఱవులమొత్తన్।దాపమునొందియు వదలక పాపపుఁ బెనుబాముననంమజుఁ బట్టె నృపాలా*(వ॥ అయ్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి పాదతాడనంబు సేసిన త్రొక్కిన సర్పంబు సర్పరూపంబు విడిచి విద్యాధరేంద్రరూపంబుదాల్చి హరికి మ్రొక్కిన నతనికి హరియిట్లనియె* (ఉ॥ మండితమూర్తితోఁ గనకమాలికతో శుభలక్షణుండవై। యుండెడు నీకు దుష్టపు మహోరగదేహమిదేలవచ్చెనే। వ్వండవు నామమెయ్యది భవంబున కెద్దిమిషంబు నాకు నొం। డొండ యెఱుంగ జెప్పుము బుధోత్తమ నీపనిచోద్యమయ్యెడిన్*(వ॥ అనినవాఁడిట్లనియె దేవా యేను సుదర్శనుండను విద్యాధరుండవిమానారూఢుండనై రూపసద్గర్వంబులజొక్కి దిక్కులం జరించుచు నొక్కయెడ నాంగిరసులైన ఋషులం గురూపులైన వారలంగనినగిన వారు నీవు రూపదర్పంబునం దమ్ము నగితివి గావున మహాసర్పంబవై యుండుమని శపించినం బిదప నేవేఁడుకొననిట్లనిరి*(చ॥ యదుకులమందు భక్తులభయంబుహరించుటకుం జనార్దనుం । డుదయమునొందియీయడవి కొక్కదినంబున రాఁగలండు తత్పదమున నీవుఁదన్నఁ బడి పన్నగదేహముతోడఁ బాసినీ । మొదలిటి మేనుగాంచెదవు మూఢుడ పొమ్మని శాదయానిధుల్*(మ॥ నినుఁ జింతించిననిన్నుఁ జేరొక్కనినన్నిర్మూలమై క్రుస్సిపా । పని కాయంబు వినష్టమాన్యఁటభవత్పాదంబు నామీఁదఁబెట్టినఁ దద్బ్రాహ్మణశాపసంజనితకౌటిల్యంబు దానిల్పునే।వనజాతేక్షణ నేడు వాసెను రగత్వంబెల్ల నే బోయెదన్* (వ॥ అనివిన్నవించి హరికిఁ బ్రదక్షిణంబువచ్చి మ్రొక్కి సుదర్శనుండు దివమ్మునకుం జనియె సర్పంబువలన నందుండు విముక్తుండయ్యెఁ దత్ప్రకారంబు విని వెఱఁగుపడి గోపకులు దేవతామహోత్సవంబు సమాప్తినొందించి కృష్ణకీర్తనంబు సేయుచుమ

—* కుబేరభటుండగు శంఖచూడుండను గుహ్యకుని సంహరించుట. *—

ఱలమందకుం జనిరంత*(చ॥ మఱియొకనాఁటి రాత్రిబలమాధవులుజ్జ్వలవస్త్రమాలికా। ధరులును లేపనాభరణధారులునై చనిమల్లికాదిపుష్పరసనిమగ్నమైనమధుపంబులగీతము వించుఁ దద్వనాం । తరమున వెన్నెలన్ వ్రజనితంబినులుం దగఁ బాడిరింపుగన్*(క॥ ఆపాట చెవులసోఁకిన।నేపాటియు దేహలతల నెఱుఁగక దృగ్వా।చాపాటవములు చెడిపడి। రాపాటలగంధులెల్ల

నటవీవీథిన్ *(వ॥ఇట్లుసకలభూతసమ్మోహనంబగుగానంబుసేయుచునిచ్ఛావర్తనంబులంబ్రశస్తులచందంబునరామకృష్ణు
లుక్రీడింపఁగుబేరభటుండుశంఖచూడుండనువాఁడు రామకృష్ణరక్షితలగు గోపికలందనయోగబలంబున నుత్తరపుదిక్కునకుం
గొనిపోవనయ్యోషిజ్జనంబులు రామకృష్ణేతిభాషణంబులువలుకుచుఁ బులికినగపడిన మొదవులక్రియ మొఱయిడినవిని *
(ఉ॥గ్రద్దనసాలవృక్షములుగైకొనిబల్లిదులన్నదమ్ములాయిద్దరుకాలమృత్యువులమేపునవేఁజనియోడకుండుఁడో । మద్దియ
లారయంచుఁదనుమట్టిననజూదికలంగిగుహ్యకుండుద్దవిడిందగంజఱచెనుత్తలమింతులడించిభీతుఁడై *(వ॥ఇట్లుగుహ్యకుని
చేతవిడివడినగోపికలరక్షించుకొనియుండుమనిబలభద్రునింబలికి *(శా॥ఓరీగుహ్యకపోకుపోకువనిరోషోత్కింబ కారాతివాఁ
డేరూపంబుననెందుఁజొచ్చెనేటఁబోయెందోడఁడానేగిదు । ర్వారోదంచితముష్టివానితలఁద్రెవ్వంబట్టితద్వీరుకో । టీరభ్రా
జితరత్నముంగొనియెదండిన్ గోపికల్వ్వాడఁగన్ వ॥ఇట్లుశంఖచూడునింజంపివానిశిరోరత్నంబుదెచ్చిబలభద్రునకిచ్చి మెప్పిం
చెమఱియునొక్కదినంబునఁగృష్ణుండుపవంబునకుంజనిననతనలీలలువాడుచునిండ్లకడఁదద్విరహవేదనానలభరమ్మునహిం
పకఁగోపికలుదమలోనిట్లనిరి *(శా॥భ్రూవిక్షేపముతోడఁదావలిభుజమ్మున్ జెక్కఁగీలించికె । మ్మోవిన్వేణువుగూర్చిసుస్వర
ముగాఁమ్రోయించుచున్నఝ్ఝులి । ప్రావీణ్యంబువిభుండుసూపఁగనిసప్రాణేశలైయుండియు । న్నీవీబంధములూడఁజొక్కుదు
రుపోనింగిన్నిలింపాంగనల్ *(మ॥నవమాధుర్యముగల్గుకృష్ణుమురళీనాదామృతస్యందము । ల్చెవులన్ జొచ్చి హృదంతరాళ
ములభాసిల్లన్సువత్సంబులై । యువిదామేపులకుందొఱంగిమృగగో । యూథ బులుతక్కరతో । దివికింగణ్ణములెత్తి ఱోవదలుఁ
బోదేహ ప్రియవ్యాప్తులన్ *(శా॥ఓకంజేక్షణకృష్ణుఁడుజ్జ్వలితహారోద్దాముఁడైగానవి । ద్యాకౌతూహలతన్మనోజ్ఞము
రళీధ్వానంబుగావింపఁగా । నాకర్ణించిసశంపమైమెఱయునీలాభ్రంబుగాఁజూచుచున్ । గేకారావములిచ్చుచున్మరియుఁబో
కేకీంద్రసంఘాతముల్ *(మ॥లలనామేటికిఁదెల్లవారెరవిమేలాదోఁచెఁబూర్వాద్రిపైఁ । గలకాల బు నహంబుఁగాకనిశి
గాఁగల్పింపఁడాబ్రహ్మదా । వలతేఁడున్కృపలేదుకీరములుదుర్వారంబులెట్లోకదే । కలదేమాపటికాలమందు మనకుంగంజా
క్షుసంభోగముల్ *(ఉ॥ఎప్పుడుపాద్ద్రుగుంకుహరియెప్పుడుగోవులమేపివచ్చుమా । కెప్పుడుతన్ముఖాంబుజసమీక్షణమబ్బు
నతండువచ్చిన । న్నెప్పుడుగారవించుదుదియెప్పుడుమద్విరహాగ్నిరాశికిన్ । జెప్పగదమ్మబోఁటిమరుచేతలనుల్లముతల్లడి
ల్లెడిన్ *(మ॥చెలియాకృష్ణుఁడునన్నుఁబాసివనముంజేరఁగనయ్యాక్షణం । బులునాకన్నియు నుండనుండఁగదగన్ బూర్ణాం
బులైసాగిలో । వలదోచంద్రహరమ్ములైదినములైపక్షస్వరూపమ్ములై । నెలలైయబ్దములై మహాయుగములై నిండారుక
ల్పమ్ములై *(వ॥అనిమఱియుంగృష్ణవిరహదుఃఖమ్మునబహువిధమ్ములఁబశ్చాత్తాపమ్మునొందుచుగోపికలోపికలులేకయెట్ట
కేలకుదివమ్ముగడిపిదినాంతసమయమ్మునందు *(మ॥అదెభానుండపరాద్రిజేరెనదెసాయంకాలమేతెంచెనల్లదెగోపాదప
రాగమొప్పెనఁగెబృందారణ్యమార్గమ్మున । దిదెవీతెంచెవృషేంద్రఘోషముప్రియుండేతెంచెరండఁచుఁడా । మెదుతే
తెన్తురుమాపుకృష్ణునికిసయ్యెన్తుల్పరిభ్రాంతలై *(వ॥ఇట్లుతనకెదురువచ్చినవచ్చికనచ్చెలువలనచ్యుతుండిచ్ఛావర్తనమ్ము

శ్రీకృష్ణుండు వృషభాసురుని సంహరించుట.

లగారవించెనంతనొక్కనాడు *(సీ॥ఎవ్వనిమూపురమీక్షించిమేఘమ్ములద్రిశృంగమ్ముసియాశ్రయించు । నెవ్వనిఱంకెకర్ణం
ద్రియమ్ములుసోకగర్భపాతనమగుగర్భిణులకు । నెవ్వనిపదహతినెగయుపరాగమ్ములద్ధకారారాతినావరించు । నెవ్వఁడుకొ
మ్ములనెదిరించిచిమ్మినఁబృథ్వీధరమ్ములుపెల్లగిల్లు । నట్టివృషభాసురేంద్రుఁడహంకరించి । వాలలతనెత్తిపెనుఱంకెవైచినేలఁ
గాలద్రవ్వుచునిశితశృంగములుసాచి । మున్దబెగడంగఁగవిసెనమందుఁడగుచు *(వ॥ ఇట్లువృషభాకారమ్మునరిష్టుండు
హరికినరిష్టమ్ముసేయందలన్చిపైపరికిన *(ఉ॥క్రేపులువాతెగోవుఁ గ్రేపులుగోవులుగోవృషమ్ములం । బైపడెవత్సధేను
వృషభమ్ములుగోపకులందుఁజొచ్చెనా । గోపకులావృషేంద్రములుగోవులులేగలువిచ్చిపాఱఁగా । గోపచమూవిభుండుగనె
గోవృషదైత్యుఁడువెంటనంటగన్ *(వ॥ఇట్లుభయభ్రాంతలయికాంతలుందారును గృష్ణకృష్ణరక్షింపుమనియెడు గోపకుల
కునడ్డమ్ముచ్చిదీనజనరక్షకుండగుపుండరీకాక్షుండిట్లనియె * (ఉ॥ బాలురనింతులమ్మసులఁ బాఱఁగఁదోలుట బంటువన్త
మే । చాలువృషాసురేన్ద్రబలసప్పదజూపఁగనెల్లబాడిగో । పాలురమన్దగాదు చనుపైఁబడితేనిఁ బ్రచణ్డకృష్ణశా । ర్దూ
లమునేడునీగళముద్రుమ్మకచమ్మకపోవనిచ్చునే *(గీ॥అనుచుధిక్కరించిహస్తతలమ్ములఁ । జప్పడిన్చినగుచు సఖునిమీఁదఁ
బన్నగేన్ద్రభయదబాహుదన్డముసాచి । దన్డిమెఱసిదనుజదన్డినిలిచె ॥ అప్పుడు * (చ॥ ఖురములనేలఁద్రవ్వుచు నకుంఠిత
వాలసమీరణమ్ములన్ । విరవిరబోయిమేఘములువిప్పవిషాణములొడ్డికొంచుమ । స్తరతరమూర్తియైవృషభదైత్యుఁడుక
న్నులనిప్పులొలుకఁగా । దురదురవచ్చితాకెరిపుదుర్మదమోచనుబద్మలోచనున్ * (ఉ॥ యాదవకుంజరుండు వృషభాసు
రుకొమ్ములురెండుబట్టియ । ష్టాదశపాదమాత్రముగజమ్ముగజమ్మునద్రొబ్బకైవడిన్ । భేదిలద్రొబ్బనయ్యసుర బిమ్మటనొం

దిచమర్పె(మ్రొగ్గిమ । గ్నాదముతోడడీఁకొనెబ్రిసస్త్తవినుద్దసునాజవార్ధనుఁ * (గీ॥ అంతగోపసింహుఁడసురఁగొమ్ములువట్టి
ధరణిద్రొబ్బిత్రొక్కి దైత్యభటుల । కొమ్ముపీఁగసురలకొమ్మవర్థిలవాని । కొమ్ము వెఱికిమొత్తి కూల్చెనధిప * (క॥ ఉక్కు
చెడిరోజినెత్తురు । ముక్కునవాతనుస్రవింపమూత్రశకృత్తు । ల్మిక్కిలివిడుచుచుఁబసరపు। రక్కసుఁడనిసమసెఁబ్రజకనిరా
గముఁలమరఁ * (వ॥ ఇట్లువృషభాసురుంజంపిన నిలింపులు గుంపులుగొనివిరులువర్షింప గోపకులుహర్షింప గోపసతులుతర
షింప బలభద్రుండును వారునుగోవిందుండును బరమానందంబునమందకుంజనిరంత * (చ॥ ఘనుఁడొకనాఁడునారదుఁడు
కంసునితోడయశోదకూఁతునిం । గనుటయుఁజక్రిదేవకికిగర్భజుఁడౌటయుమున్నురోహిణీ । తనయుఁడురాముఁడౌటయునుద
ద్విభులిద్దరుమందనున్నవా । రనియెఱుఁగంగజెప్పినమహాద్భుతమంచుఁజలించిగిన్కతోఁ * (చ॥ కొడుకులమందలోననిడి
గొంటుతనంబునమోసపుచ్చెనీ । బడుగునుబట్టిచంపుటదిభావ్యమటంచుఁగృపాణపాణియై । వడివసుదేవునిందునుమవచ్చిన
కంసునిఁజూచినారదుం। డుడుగుముచపలబోలదనియోడకమానిచిపోయెమింటికిఁ * (వ॥ మఱియునలుకదీఱంగంసుండుదేవకీ
వసుదేవులలోహపాశబద్ధులంజేసికేశియనువానింబిలిచి రామకేశవులంజంపుమనిపంపి మంత్రిభటగజారోహకచాణూర
ముష్టికసాల్వకోసలప్రముఖులరావించియిట్లనియె * (శా॥ ఎందున్నెదిరించిపోరుటపుడేవేంద్రాదులుఁజాలరీ । బృందార
ణ్యముమందనిష్పవమదాభీరార్భకుల్రామగో । విందుల్వర్ధిలుచున్నవారఁటరణోర్విఁగంసునొప్పింతురుం। చుందర్పంబు
లువలుకుచుండుఁరఁటగుయాచోద్య బులన్వింటిరే * (క॥ పట్టణజనములుచూతురు। దట్టంబుగమల్లరంగతలపార్శ్వములు। న్నెట్టిం
పుడుతనఁగంబులుపుట్టింపుడుపీటమల్లుపోరనుమాటఁ * (శా॥ విన్నాణంబులఁబోరనేర్తురుమహావీర్యప్రతాపాదిసం। ప
న్నుల్ మీరలుమేటిమంతనములన్వఖ్యాతులైపెంపుతో। మున్నారాబలకృష్ణులంబెనకువన్మర్దించిమత్ప్రీతికా। సన్నుల్లుండు
పురీజనుల్బొగడనోచాణూరయోముష్టికా * (శా॥ రారాహస్తిపకేంద్రగండమదధారాగంధలోభాంధగం। భీరాళివ్రజమై
నమత్కువలయాపీడద్విపేంద్రంబుదు। ర్వారోదంచితజీహాళీపరిసరప్రాంభంబుడాయంగనా। భీరుల్రానవలించిడీకొలుపునీభీ
రమ్ముతోరమ్మునఁ * (క॥ పశువిశసనములుసేయుఁడు। పశుపతికింబ్రియముగాఁగభావించిచతు। ర్దశినాఁడుధనుర్యాగము। విశ
దంబుగఁజేయవలయువిజయముకొఱకున్ * (వ॥ అనితనవారినందఱనమ్మైపనులకునియమించియదుశ్రేష్ఠుఁడగునక్రూరునిం
బిలిచిచెట్టబట్టికొనియిట్లనియె * (శా॥ అక్రూరత్వముతోడనీవుమనఁగానక్రూరనామంబుని। ర్వక్రత్వంబునఁజెల్లమైత్రిసలుప
న్వచ్చున్నినుంజేరినీ। వక్రోధుండవుమంద-గోపబలకృష్ణాభీరులస్మద్విషా । శక్రీడారతులైచరింతురఁటయోజందెచ్చియొప్పిం
పవే * (గీ॥ నాకువెఱచిసురలునారాయణునివేఁడి। కొనిననతఁడువచ్చిగోకులమ్ము। నందుఁగృష్ణమూర్తినానకదుందుభి। సుదిశు
డయ్యెననఁగనొకటవింటి * (వ॥ కావుననీవుగోపకులచేతనరులుగొని ధనుర్యాగంబుఁజూడరండని వారలందోడ్కొనిరమ్ము
దెచ్చిన * (శా॥ కొండల్ గూలగద్రొబ్బుకొమ్ములతుదింగోపించికోరాడుచో । దండిఁదంటినధిక్కరించునొకవేదండంబునా
యింటబ్ర। హ్మాండంబైనగదల్పనోపుబలకృష్ణాభీరులఁబోరిలో । ఖండింపఁదడవెంతదానికదియుంగాదేనియక్రూరకా *
(శా॥ చాణూరుండునుముష్టికుండును సభాసంఖ్యాతమల్లుల్జగ । త్ప్రాణుల్మెచ్చరుసత్యసంపదలబాహాబాహిసంగ్రామ
ప్రాఽరీణుల్వారలురామకృష్ణులబలోద్రేకంబుసైరింతురే । క్షీణప్రాణులఁజేసిచూపుదురుసంసిద్ధంబుయుద్ధంబునఁ * (సీ॥ ఆ
రామకేశవులంతరిన్చినవసుదేవముఖ్యులఁజమ్పితెగువమెఱసి । వృష్ణిభోజదశార్హవీరులదెగటార్చి ముదుకఁడురాజ్యకా
ముకుఁడుఖలుఁడు। నగునుగ్రసేనుమాయయ్యగీటడఁగిన్పిపినతండ్రిదేవకుబిలుకుమూర్పి। మఱియువయిరులనెల్లమర్దిన్చినేజ
రాసన్ధనరకబాణశంబరాది । సఖులతోడభూమిచక్రమేలెదఁబొమ్ము । తెమ్మువేగమవసుదేవసుతుల। ముఖముపేరుసెప్పిమం
త్రభేదముసేయ। వలయుఁబెంపఁజనమువైరిజనుల॥ అనినక్రూరుండిట్లనియె * (ఉ॥ పమ్పినఁబోనివాఁడనెనృపాలకమానవు
లైనతమ్మునా । హింపరుదైవయోగములనిన్పకగానసుతోఁచినట్లుని । ష్కంపగతిఁ జరింతురదిగాదనవచ్చునె యూశ్వరే
చ్ఛఁద । ప్పింపఁగరాదునీతగతుబిడ్డలఁదెచ్చెదఁబోయివచ్చెదఁ * (వ॥ అనిపలికిరథంబెక్కియక్రూరుండుచనినసకలజనులనువీ

—* శ్రీకృష్ణుండు కేశివ్యోమాసురులసంహరించుట. *---

డుకొలిపికంసుండంతిపురమ్మునకుంజనియెనంతకంసప్రేరితుఁడై * (సీ॥ ఖురపుటాహతిరేగుకుధరణీపరాగమ్ము ఫణిరాజఫణు
లకుబరువుసేయ । భీషణహేషావిభీషితులైమింటనమృతాంశులొండొండనందగొనఁగఁ । జటులచన్నలసటాచ్ఛటలగాడ్పు
లమేఘములు విమానములపైమునుఁగువడఁగ । విసృతాస్యగహ్వరవిపులదన్తమ్ములుప్రళయాగ్నికీలలపగిదిమెఱయఁ । గాల
పాశలీలగావాలమేపార । వాహమగుచుగన్ధవాహగతుల । విజితశక్రపాశివీర్యఁపయోరాశి । కేశివచ్చెనందక్లేశమంద *
(క॥ భీషణఘోటకదానవ। హేషానిర్ఘోషభిన్నహృదయనిఖిలగో। యోషాపురుషార్భకమై । ఘోషముహరిచూడరైన్య
ఘోషంబయ్యెఁ ॥ అయ్యవసరమ్మున * (ఉ॥ పేదలఘోషగోపకులబిట్టదలిన్పుటవీరధర్మమా। కాదువననమ్ములోదనుజస్మరుఁ

వేడనితమ్మరోయక్క । వ్యాదుఁ జూచిగోపకులకడ్డమువచ్చినికాటయింకఁబో, రాదనిశౌరిచీఱెన్మృగరాజుక్రియన్నెదిరించె
వేడనితమ్మరోయక్క । వ్యాదుఁ జూచిగోపకులకడ్డమువచ్చినికాటయింకఁబో, రాదనిశౌరిచీఱెన్మృగరాజుక్రియన్నెదిరించె
దైత్యుఁడుర*(గీ॥ నిష్ఠురోగ్రసింహనినదంబుతోనింగి । మ్రింగుభంగినోరుమిగులదెఱచి కబళవరాగనతఁడు కాటుఁదప్పిం చినఁదన్నెనెగసితురగదానవుండు* (ఉ॥ తన్నినతన్నునంబడకదానవహంతసమీకరంతమై । కన్నులగెంపుపెంపెస యగ్రకుఁ నఘోటనిశాటుపాదముల్ । వన్నెచెడంగఁబట్టిపడవైచెధనుశ్శతమాత్రదూరముల్ । బన్నగడి భ్రమల్ విసరిపా ఱఁగవైచుఖగేంద్రుకైవడిన్*(ఉ॥ వైచినమ్రొగ్గిలేచివెసవాజినిశాటుఁడుహుంకరించిసం। కోచములేకపైఁబడినగోపకు లేంద్రుఁడుదిగ్గజేంద్రవశం । డాచటులప్రభాబలవిడంబకమైనభుజార్గళంబుదో, షాచరునోటిలోననిడెఁజండఫణిన్ గుహ నించుకైవడిన్*(శా॥ దంభోళిప్రతిమానకర్కశముహాబాహాద్యద్వామదోస్తంభముల్। శుంభల్లీలనఘోరివానిరదముల్ చూ ర్ణంబులైరాలఁగా। గంభీరంబుగఁగుక్షిలోఁజొనిపిపీఁకన్ వృద్ధిఁబొందించుచున్ । గుంభించెన్పవనంబుపిక్కటిలఁదత్కుక్షి న్నరేంద్రోత్తమా*(క॥ వాయువువెడలకనిలిచినఁ। గాయంబుచెమర్పఁగన్నుఁగవవెలికుఱుకన్। మాయచెడితన్నుకొనుచును ఘాయచునశ్వాసురుండుగూలెన్నేలన్*(గీ॥ ఘోటకాసురేంద్రుఁ కుక్షిలోఁగృష్ణుని। బాహువధికమైనఁబట్టలేమిఁ। బగిలిదోస పండుపగిదిఁదద్దేహంబువసుమతీశ రెండువ్రయ్యలయ్యె*(క॥ నలినాక్షుఁడులీలాగతి। విలయముఁబొందించెనిట్లువీరావేశన్ బలలాశిన్ జగదభినవ। బలరాశిన్ విజితశక్రపాశిన్ గేశిన్* (వ॥ ఆసమయంబునంబుష్పవర్షంబులుగురియించిసురలువినుతిం చిరంతహరిభక్తివిశారదుండైననారదుండువచ్చిగోవిందునసందర్శించిరహస్యంబుననిట్లనియె* (సీ॥ జగదీశయోగీశసర్వ భూతాధారసకలసంపూర్ణయీశ్వరమహాత్మ । కాష్ఠగతజ్యోతికైవడినిఖిలభూతములందునొకడవైతనరుదీవు। సద్గూఢుఁ డవుగుహాశయుఁడవుసాక్షివి। నీయంతవాఁడవై నీవుమాయఁ। గూడికల్పింతువుగుణములవానిచేఁబుట్టించిరక్షించిపొలియఁజే యు। దీప్రపంచమెల్లనిట్టినీవిప్పుడు। రాజమూర్తులయినరాక్షసులను । సంహరించిభూమిచక్రంబురక్షింప । నవతరించినాఁడవ య్యకృష్ణ* (వ॥ దేవానీచేతనింక, చాణూర, ముష్టిక, గజ, కంస, శంఖ, యవన, ముర, నరక, పౌండ్రక, శిశుపాల, దంతవక్త్ర, సాల్వప్రముఖులువధింపఁబడెదరు, పారిజాతంబపహృతంబయ్యెడిని, నృగుండుశాపవిముక్తుండగు, శమంతకమణిసంగ్రహంబగు, మృతబ్రాహ్మణపుత్రప్రదానంబుసిద్ధించు, నర్జునసారథివైయనేకాక్షౌహిణీబలంబులవధియించెదవుమఱియును* (శా॥ కృ ష్ణానీవొనరించుకార్యములులెక్కింపనస్మచ్ఛక్యమా?)ఁ దేవ। ర్ధిష్ణుండైనవిధాతమూఁడుగుణముల్దీపించులోపించురో । చిష్ణుత్వంబున నుండునీవలననిస్సీమంబునీరూపముల్। విష్ణుల్ జిష్ణుసహిష్ణునీశునమితుల్ విశ్వేశ్వరుల్ మ్రొక్కెదన్*(వ॥ అనివినుతించివీడు కొనినారదుండరిగెనంత నొక్కనాడుకృష్ణసహితులై గోపకుమారులడవికింజనిపసులమేపుచునొక్కకొండదండనిలాయన క్రీడచేసిరందు*(క॥ కొందఱుగొఱియలమంచును। గొందఱుపాలకులమంచుఁగుటిలత్వమునన్। గొందఱుదొంగలమనుచును। జెందికుమారకులుక్రీడఁజేసిరితమలోన్* (శా॥ ఆలోదొంగలలోమయాసురసుతుండాద్యుండువ్యోముండుగో, పాలుం డైచనిమేషకల్పనలతోభాసిల్లిక్రీడించుత। ద్బాలవ్రాతమునెల్లమెల్లనఁ జక్షుఃపంచావశిష్టంబుగా । శైలాంతర్గుహలోనికిం గొనిచనెన్ శౌర్యంబవార్యంబుగన్* (వ॥ ఇట్లుకొండగుహలోనఁగ్రమక్రమంబున గోపకుమారులనడిమొక్కపెనుఱాతఁ దద్ద్వారంబుగప్పిమెప్పటియట్లవచ్చిన*(ఉ॥ వీరుఁడుమాధవుండఖిలవేదినిశాచరభేదినవ్వుతో। నారనిశాటదొంగతనముచ్చ పడెన్నీఁడదొంగవాఁడువా। భీరులనెల్లశైలగుహఁబెట్టితిచిక్కినవారిబెట్టరా । రారయటంచుఁబట్టెమృగరాజువృకాఖ్యముఁ బట్టుకైవడిన్*(ఉ॥ పంకజలోచనుండొడిసిపట్టినశైలనిభాసురాకృతిన్ । బింకముతోడఁబొంగివిడిపించుకొనంగబలంబులే మిలో। శంకిలిబిట్టుతన్నుకొనఁజక్కనవారణభీమువ్యోమునిన్ । గొంకకఁగూల్చెనవ్విభుఁడు కోయనిమింటసుపర్వులార్వఁ గన్*(గీ॥ ఘోరదనుజునేలఁగూల్చిపర్వతగుహా। వాతనున్నఱాయిప్రయ్యఁదన్ని। గుహఁజరించుచున్నగోపాలకులఁగొంచు। బల్లిదుండుగొల్లపల్లెకరిగె* (వ॥ అంతనారాత్రిమధురానగరంబున నక్రూరుండువసియించినియతుండయి రేపకడరథంబె

—*కంసునిపంపునఁనక్రూరుండుబృందావనంబునకుజనుదెంచుట*—

క్కి కదలినందగోపకులంబునకుంబోవుచుందెరువునఁదనలోనిట్లనియె* (ఉ॥ ఎట్టితపంబుసేయఁబడెనెట్టిచరిత్రములబ్ధమయ్యె నో। యెట్టిధనంబులర్హులకునీబడెనోతొలిజాముసంకునా। యట్టివివేకహీనునకునాదిముసీంద్రులుయోగదృష్టులన్। బట్టఁగ లేనియీశ్వరునిబ్రహ్మమయున్ హరిఁజూడఁగలైడిన్*(ఉ॥ సూరులుతొల్లియేపిభునిశోభితపాదలఖప్రభావలిన్। జేరిభవాం ధకారములఁజిక్కకదాటుదురట్టిదేవుని। నైర్వరముతోడనైనఁబిలువన్నముఁబందిశుభంబుఁజేసెని। షాకరణప్రేమతోడనిదె కంసునిబోలుపక్షుండుగల్గునే*(మ॥ ఇతఁడాకంసునిచేతఁబంపువడినన్ హింసింపనేతెంచినాఁ। డతిమష్టుండనిచూచునోసకల భూతాంతర్బహిర్మధ్యసం। గతుఁడొటండలపోసినన్నుసుజమంగాఁజూచునోయొట్టియు। న్నతిగావించునొయేక్రియంబలు కునోభాగ్యమెట్లున్నదో। అనిమఱియును* (మ॥ అలకభ్రాజితమైసుధాంశునిభమైమాసప్రభోద్ధామమై । జలజాక్షుంబ

యికర్ణకుండలవిరాజద్గండమైయున్నయా । జలజాతాక్షుముఖంబుచూడఁగలుగుట సత్యంబువో నాకునా । వలదిక్కేఁగుచు
నున్నవీవనమృగవ్రాతంబులీ త్రోవలన్* (ఉ॥ మాపటివేళ నేనుఁజనిమాధవుపాదసమీపమందుదం। డాపతితుండనై ననతఁ
డాశుగకాలభుజంగవేగసం।రాపితభక్తలోకభయదారుణమైనకరాబ్జమాఁదల । న్నోపిహసించినాక భయముల్కృపతోడు
తనీయకుండునే*(వ॥ అనిమఱియునక్రూరుండనేకపథంబుల, గోవిందసందర్శనంబుగోరుచు,నమందగమనసుందరస్యంద
నారూఢుండై చనిచని*(క॥ముందటఁగనెఘనచందన।కుందకుటజతాలసాలకురువకవటమా।కందన్నందితబలగో। విందవ్యాక
చారుణారవిందస్బృందన్*(వ॥కని బృందావనంబుఁదరియంజొచ్చి,యందుసాయంకాలంబున, నడవికినెఱిగలమేతలవెంబ
డిఁగంబడిరాకచిక్కన,కుట్టుకోడెపడ్డతండంబులంగానక,పొదయిరువుమిట్టుపల్లంబులనక,తూఱిపాఱివెదకిచీఱెడుగోపకుల
యాహ్వానశబ్దంబులాకర్ణించుచుఁ,గోమలఘాసఖాదనకుతూహలంబులంజిక్కఁ,దుక్కవలఁ గ్రేపులందలంచి, తలారింపకత
మకంబులందమతమయంతనంభారవంబులుసేయుచు, మూత్రంబులుస్రవింపఁ బరువులిడుధేనువులకు నోసరించుచు, సద్యో
జాతంబులగుతర్ణకంబులవహించి,నవసూతికలువెనుతగులుటవలనలదామహస్తులై,చనువల్లవులమెల్లనవిలోకించుచు,మంద
యిరుగెలంకులంగిళంకరహితులై, పులి శివంగి వేగి వాలపుమొత్తంబులవలన,నప్రమత్తులై,కుఠారకుంతశరాసనప్రముఖం
బులుదరియించి, కావలిదిగుగువారలఁగడచినానావిధసరసతృణకబళఖాదనగరిష్ఠలైగోష్ఠంబులుప్రవేశించి, రోమాంథలీలా
లసలైనధేనువులును, జున్నులుగుడిచితల్లులమ్రోలఁ,జెల్లురేఁగి,క్రేళ్ళురుకులేఁగలును, నెదలైనమొదవులపైకొనిపరస్పరవిరు
ద్ధంబులైడీకొని కొమ్ములయుద్ధంబుసలుపువృషభంబులును,నకుంఠితబలంబులఁగంఠరజ్జువులంద్రెంచుకొని, పొదలుఱికిదాఁటి
తల్లులందూఁటికుడుచుతఱిపిదూడలఁదట్టించిపట్టనోపక, గ్రద్దనఁబెద్దలంజీరుగోపకుమారులును, గొండుకులమగలమామలమ
అందులవంచించిపంచాయుధభల్లభగ్నహృదయలై,గృహకృత్యంబులుమఱచి, శంకిలకసంకేతస్థలంబుల గృష్ణాగమతత్పర
లయినగోపకామినులును, గోష్ఠప్రదేశంబులగోవులకుం గ్రేపులవిడచియొడ్డుచు, మఱలంగట్టుచు, నీడ్చుచుం గ్రీడించుగో
పకులును, గోఖురసముద్ధూతకరీషపరాగపటలంబులవలననుల్లారి,దులదులనై,ధేనుదోహనవేళాపకీర్ణ పయోబిందుసందో
హపరంపరాసంపాదితపంకంబులును,దోహనసమయగోపకరాకృష్టగోస్తననిర్గతంబులయికలశంబులందుఁబడియెడుక్షీర
ధారలచప్పుళ్ళును,ను హుంకారత్కంఠసంస్పర్శనస్నిగ్ధంబులైన మందిరద్వారదారుస్తంభంబులపొంత నూతనజనవిలోకనకు
పితంబులైకరాళించుసారమేయంబులునుంగలిగిబలకృష్ణబాహుదండప్రాకారరక్షావిశేషభూషణంబయిన ఘోషంబుఁబ్ర
వేశించియందు*(క॥ జలజాంకుశాదిరేఖలు।గలహరిపాదములచొప్పుఁగనిమోదముతోఁ।బులకించిరథముడిగియు। త్కలికె
న్నంతోనబాష్పకలితాక్షుండై*(మ॥కనెనక్రూరుఁడుపద్మనేత్రులనురంగద్గాత్రులన్ ధేనుదో । హనవాటీగతులన్నలంకృ
తులనుద్యద్భానులన్బీలనీ । లనవీనోజ్జ్వలవాసులన్ గుసుమమాలాధారులన్ ధీరులన్ । వనితాకాములఁగృష్ణరాములజగ
ద్వంద్యక్రమోద్దాములన్*(క॥కనివారలపాదములకు। వినయంబునమ్రొక్కెభక్తివివశుండగుచున్ । దనువునబులకాంకు
రములు। మొనయఁగనానందబాష్పములుజడిగురియన్ ॥ తదనంతరంబ* (క॥ అక్రూరులైనజనులన।వక్రగతింగాఁచుభక్త
వత్సలుఁడంతే । న్నక్రూరుగౌఁగిలించెను। జక్రాంకితహస్తతలముసాఁచినరేంద్రా* (వ॥ మఱియునక్రూరుండుబలభద్రుని
కింబ్రణతుండైనఁగౌఁగిలించిచెట్టపట్టుకొని కృష్ణసహితుండై గృహంబునకుంగొనిపోయి మేలడిగిగద్దియనిడిపాదప్రక్షాళనం
బుచేసి మధుపర్కంబుసమర్పించి గోవునిచ్చియాదరంబున రసవదన్నంబువెట్టించి తాంబూలగంధమాల్యంబులొసంగెన
య్యవసరంబునసుఖోపవిష్టుండైనయక్రూరునకిట్లనియె*(క॥చెలియలుమొఱయిడనల్లుర । ఖలుఁడైపొరిగొనినయట్టికం
సుఁడుబ్రతుకం।గలదెమనకీదశాహర్షులు। కిలపైమీసేమమింకనేమనియడుగన్*(వ॥అనిపలికియంతనక్రూరుండొకపర్యం
కంబునసుఖోపవిష్టుండైయుండహరియిట్లనియె*(మ॥శుభమేనీకుఁబ్రమోదమేసఖులకుంజుట్టాలకున్నేమమే। యభయంబే
వ్రజకెల్లగోత్రజులకత్యానందమేమామమ। క్షభయుండేవసుదేవదేవకులుతత్కారాగృహంబందుమ।త్ప్రభవవ్యాజనిబద్ధులై
బ్రతికిరే ప్రాణానిలోపేతులై * (మ॥ నెఱినేడికఁడనీవురాగవగతోనీతోడనేమైననా । కెఱుఁగంజెప్పుమటంచుఁజెప్పరు
గదాయేమందురావార్తయే । తెఱఁగున్లేదనిడస్సిరోవగచిరోదీనత్వముంజెందిరో । వెఱతోనాతలిదండ్రులెట్లుపడిరోవిన్పిం
పుమక్రూరకా*(వ॥మఱియునీవేమికారణంబునవచ్చితనిహరిపలికిన నతండుకంసునికి నారదుండువచ్చిచెప్పినవైరానుబం
ధప్రకారంబును, గంసుండుదేవకీవసుదేవులవధియింపంగమకించి మానినతెఱంగును, ధనుర్యాగంబుపేరుసెప్పిపుత్తెంచిన
ప్రకారంబులెఱింగించిన రామకృష్ణులునగితమ్మునుబరివేష్టించిననందాదిగోపకులంజూచికృష్ణుండిట్లనియె*(శా॥ధూనాథుం
డుసుఖంబుఁజూడఁబిలువంబుత్తెంచినాఁడవ్విభుం।గానంబోవలెఁబాలునెయ్యిపెరుగుల్లట్నంబులుల్దానుకల్।మీనేర్పొప్పఁగ
గూడఁబెట్టుఁడుతగన్ మీమీనివాసంబులన్।యానంబుల్గొనిరండుపొండుమధురాయాత్రాభిముఖ్యంబుఁగన్* (వ॥అనినియ

మించెనంతనక్రూరుండుమధురనుహరింగొనిపో యెడినియెఱింగి వ్రేతలుగలంగి* (మ॥ హరినవ్వుల్హరిమాటలున్హరిచునో
జ్ఞాలాపముల్లీలలు।న్హరివేడ్కల్హరిమన్ననల్హరికరాబ్జాలంబనాహ్వానము।ల్హరిణీలోచనలందఱున్మఱియుపాయంబెల్ల కెూ
యంచులో। నెఱియన్నచ్చటలాడిరంతరగములై యే కాంత గేహంబులన్॥మఱియుందములోనిట్లనిరి* (ఉ॥మేటిగృహస్థుబ్రహ్మ
యనిమిక్కిలినమ్మితినమ్మచూడ నే। పాటియు లేదుమాకుఁబరిపాలకుఁడైనసరోజనేత్రుని।చోటనసింపనీక యొకచోటికిఁబోవి
ధియించిపిన్నబి। మాటలుచేసెనీసుఖములకట భారతికైనఁజెప్పరే॥అనివిధిందూరుచుమదనతాపాయత్తచిత్తలై* (ఉ॥ర
మ్మనిచీఱినంత నెపురంబునకేగెదుగానినన్నునీ। కొమ్మలునమ్మినామమరుకోలలకగ్గముఁజేసిపోవఁగా। ముమ్మరమైన తాపమున
క్రొమ్మగ్గుమకోయనఁడంబుజాక్షుఁడా।యమ్మలుగోపవృద్ధులుప్రయాణమువల్దనరైరి చెల్లరే* (శా॥ ఆక్రూరుండనిపేరుఁబె
ట్టుకొని నేఁడస్మన్మనోవల్లభుం। జక్రిన్మాకడఁబాపికొంచునరుగన్జర్చించిమే తెంచినాఁ। డక్రూరుండఁట క్రూరుఁడీతఁడునిజం
బక్రూరుఁడా నేనినిర్వక్రత్వంబునఁగృష్ణుఁబెట్టితనక్రోవంబోవిచారింపఁడే* (ఉ॥ ఫుల్ల సరోజలోచనలు పూర్ణసుధాంశు
ముఖులరాంగన।ల్మెల్ల నెమొల్లిపట్టణము మేడలనుండిసువర్ణలాజము।ల్సల్లఁగవారిఁజూచిహరిసంగతిసేయఁదలంచుఁగాక
వ్రే।పల్లెవసించుముద్దియలపైఁబడ నేలతలంచునక్కటా* (క॥పురసతులవిలోకనములు। సరసాలాపములునర్మసంభోగము
లున్।మరిగిహరిమనలనొల్లఁడు।నరవరులో యన్నూతనప్రియులుగదే* (క॥పుట్టిన్నడుహరి నెఱుఁగని।పట్టణసుందరులకిత
నిఁబతిఁజేసికడు।నట్టపువిరహాగ్నులకును।గట్టడిదైవంబు ఘోషకాంతలవిడిరే* (మ॥హరి నేలాకొనిపోయెదంచుమననా
యక్రూరుఁబ్రార్థింతమా।హరిఁబోనీకుఁడునిల్ప రేయన్నుచు నేఁడర్చింతమా వేల్పులన్। హరిపాదంబులకడ్డముల్పడుదమాహా
దైవమాయంచునా।తరుణుల్ముప్పలుచీరెలున్మఱచికందర్పజ్వరభ్రాంతలై* (మ॥ఉవిదల్సిగ్గులుమానికన్గవలనీరొండొండ
వర్షించుచున్।వివశత్వంబులతోఁగపోలతటసంవిన్యస్తహస్తాబ్జలై।పవనోద్ధూతలతాభలై నుముఁగ్రపంబాలింపు గోవింద
మాధవదామోదరయంచు నేడ్చిరిసుజాతంబైనగీతంబులన్* (వ॥ అంతమఱునాఁడు సూర్యోదయకాలంబునందనతోడఁబ
యనంబునకుంగమకించినడుచు గోపికలనుమఁ అలివత్తుననిదూతికాముఖంబులనివర్తించి కృష్ణుఁడుశకటంబులందుగానుకలు
ను,గోరసంబునిడికొని నందాదులయినగోపకులు వెనుదగులనక్రూరచోదితంబయినరథ-జెక్కి-మధురాభిముఖుండై చను సమ
యంబున* (చ॥అదెచనుచున్నవాఁడుప్రియుఁడల్ల దె తేర దెవ్వై జయంతియల్ల దెరథఘోటకాంఘ్రిరజమాదెసమార్గముచూ
డుడంచులో।నొదవెడిమక్కువన్హరిరథోన్ముఖలై గములైవ్రజాంగనల్దదలకనిల్చిచూచిరటుకన్నులకన్నుతమైనదూరమున్
(వ॥ఇట్లుబలభద్రకృష్ణాక్రూరులుచనిచని* (క॥ఆలోకించెనుఁగృష్ణుఁడు।ప్రవిమలకల్లోలపవనభాసితజన్య। న్నవసన్నపావ
నైన్య।న్గవిజనమాన్యన్గళిందకన్యన్ధన్యన్* (వ॥కనితత్కాళిందియందుఁబరికుణ్ణ మణిగణ సముజ్జ్వలంబులగుజలంబులు ద్రావి
తరుసమూహసమీపంబునరామసహితుండై కృష్ణుండురథంబుఁబ్రవేశించెనంతనక్రూరుండు వారలకు మ్రొక్కి-వీడ్కొని కాళి

—* ఆక్రూరుండుయమునాజలంబులశ్రీరామకృష్ణులదర్శించినుతించుట. *—

న్దీహ్రదంబుసొచ్చివిధిపూర్వకంబుగ వేదమంత్రంబులుజపియించుచు* (ఉ॥స్నానముచేసి చేసినదిచల్లనినీటనురామకృష్ణుల।
న్మానుగఁజూచివారురథమధ్యముపైవసియించియున్నవా। రీననినీటిలోపలికి నెప్పుడువచ్చిరటంచు లేచిమే। ధానిధిచూచెవా
రినిరథస్థులభక్తమనోరథస్థులన్॥కనివెఱఁగుపడి* (శా॥కంటిన్మున్నురథంబుపైజలములోఁగంటిన్దదిగ్రన్మఱిన్। గంటిన్
గొంటిరథంబుమీఁదనిదెయీకల్యాణచారిత్రులే। వెంటన్దోఁచిరి రెండుదిక్కులనునోవిభ్రాంతియోనీటిలో। నుంటాశ్చర్యము
చూతునంచుమఱియున్నూహించినగ్నాంగుఁడై* (ఉ॥ పోషితబాంధవుండుయదుపుంగవుఁడాజలమందుఁగాంచెన। ద్భా
షుసహస్రసన్నుతకవిభాసితభూషణసహస్రభూమిభృ। త్సేదుగ్ధపాభిలాషుబ్రతివీరచమూవిజిగీషుసత్యసం। తోషునదోష
నిర్దళితరోషుననేకవిశేషుశేషునిన్* (వ॥మఱియునీలాంబరసంయుతుండునుసిద్ధోరగాదిసంయుతుండును నైయొప్పునప్పా
పతేనిందప్పకకనుంగొని* (సీ॥ఆభోగిభోగపర్యంకమధ్యంబునవలనొప్పువచ్చనివలువవాని। మేఘంబుపైనున్న మెఱుఁగుచం
దంబునమరమునశ్రీదేవి యొప్పువాని। ముసురుతేఁటులువిప్పముఖచతుష్కముగల తనయుఁడాడెడిబొడ్డుతమ్మివానిఁ। గద
లనిబహుపదక్రమవిశేషంబులరవముచూపెడినూపురములవాని। జలజగర్భరుద్రసనకసనందనసద్విజామరప్రశస్యమాన
చతురుఁడైనవానిసౌందర్యఖనియైన।వానినొక్కపురుషవర్యుఁగాంచి* (వ॥ మఱియుంజారులక్షణలక్షితనఖపాదగుల్ఫజా
నుజంఘోరుకటినాభిమధ్యోదరుండును, సాదరుండును, శ్రీవత్సకౌస్తుభవనమాలికా విరాజితవిశాలవక్షుండును, బుండరీ
కాక్షుండును, శంఖ చక్ర గదా పద్మ హస్తుండును, సత్త్వగుణప్రశస్తుండును, బ్రహ్మసూత్రకటిసూత్ర హార కేయూరకటక
కంకణమకర కుండలకిరీటాది విభూషణుండును, భక్తజనపోషణుండును సుందరకపోలఫాల నాసాధరవదనకర్ణుండును నీల
నీరదవర్ణుండును, కంబుకంఠుండును, గరుణాగుణబంధురుండును, బ్రహ్లాదనారదసునందనందప్రముఖసంభావితుండును, శ్రీ

పుష్టితుష్టికీర్తికాంతీలోర్జావిద్యాశక్తి మాయాశక్త్యాదిసేవితుండును నైయొప్పునప్పరమేశ్వరునకు (మొక్కి- భక్తిసంభ్రమంబులగ్గలంబులుగ గద్గదకంఠుండయి దిగ్గనంగరంబులుముకుళించియిట్లనివినుతించె* (దండకము॥ శ్రీమానినీమాన చోరాశుభాకారవీరాజగద్ధేతు హేతుప్రకారా సమస్తంబునస్తంగతంబైమహాలోలకల్లోలమాలాకులాఖిలపాథోనిధింబాలకేళీగతిం జేలి నారాయణాఖ్యంబటుఖ్యాతి శోభిల్లునీనాభికంజంబులో లోకపుంజంబులంబన్నవిన్నాణిమైయున్న యాబమ్మయుప్పన్నుండయ్యెంగదా పావకాకాశవాతావనీవార్యహంకారమాయామహామానసాద్యుల్ హృషీకాదులుల్ లోకముల్లోకబీజంబులన్నిన్నయనం బోహమై నీమహాదేహమందుల్లసించు న్నసించున్నశించు న్జడత్వంబులేకాత్మనైయొప్పునీయొప్పిదంబెల్లనోచెల్లచెల్లన్ విచారింపవారెంతవారెంతవారైన మాయావులున్మాయతోఁగూడిక్రీడించు లోకానుసంధాత యాధాతయున్నేతయే నీకళాశాశికింగొంచరంభోజగర్భాదులధ్యాత్మలందున్న శేషాధిభూతంబులందున్న నేకాధిదైవంబులందున్ సదా సాక్షివైయుండువంచున్ దదంతర్గతజ్యోతివీవుండవంచున్ త్రయీపద్ధతింగొంద రింద్రాదిదేవాభిధానంబులన్నీకు దోకకుండవంచున్ మదిం గొందఱారూఢకర్మంబులందుంచి సంసారముం ద్రెంచి సన్న్యస్తులై మించి విజ్ఞానచక్షుండవంచు న్మతిం బంచగాత్రానుసారంబున న్దన్మయత్వంబుతోఁ గొందఱీవాత్మయంచు న్మతింగొందఱా వాసుదేవాదిభేదంబులన్నల్పులైచెల్వు వాటింతువంచున్మతిన్నీవు నారాయణాఖ్యుండవంచున్ శివాఖ్యుండవంచున్ మతింబెక్కుమార్గంబులన్నిన్ను నగ్గింతురెగ్గేమియేటుల్పయోరాశినేరాను లైకూడుగ్రీడన్విశేషంబులెల్లన్నశేషంబులైడిందినీయందునూనంబులీనంబులౌనేకరాకేందుబింబంబుకుంభాంతరాళంబులం బింబితంబైనవేలున్నదే యన్ననేలా ఘటాంతర్గతాకాశముల్దగ్ధటాంతంబులందేకమౌరేఖలోకావధి న్నీవుకనేపోకలంబోకయేకాకివై యుండుదీశాకృశానుండునెమ్మోముసోముండుభానుండుకన్నుల్దిశల్కర్ణముల్భూమిపాదంబులంభోధులుప్కుక్షిశల్యంబులద్రుల్లతాపాలముల్రోమముల్గాలిప్రాణంబుబాహుల్సురేంద్రుల్ ఘనంబుల్కచంబుల్నభోవీధినాభిప్రదేశంబురేలుంబగళ్ళున్నిమేషంబులంభోజగర్భుండుశేఫంబువర్షంబువీర్యంబునాకంబుమూర్ధంబునున్నేకమైయున్ననీనేందండంబయోజాతగర్భాండముల్మండితోదుంబరానోకహానేకశాఖాఫలాపూరితానంత జంతుప్రకాండంబులీలం బ్రసిద్ధోదరాశిస్థజంతుప్రకారంబుగా నిండియుండన్మహారూపనీరూపము ల్వేగ్గలంబుగ్గడింప న్మహాంభోధిలోమీనుమేన న్విరోధిన్విరోధించి సాధించిమున్వేదము న్వేదరాశింబ్రసాదింపవే ద్రుంపవేకైటభ శ్రీమధుంజక్రివైమొత్తవే యెత్తవే మందరాగంబురాగంబుతోఁగూర్మలీలాపరిష్పందివైపందివై మేదినీ న్మీదికిం ద్రోచి దోషాచరుం గొమ్ములన్నెమ్ములంజిమ్మచున్నుగ్రివ్వవే ద్రవ్వవే ఘోరవైరిన్నృసింహుండవై దండివై దండివైరోచనింజూచియాచింపవే పెంపవే మేనుబ్రహ్మాండమున్నిండపాఱుండవై రాజకోటిన్విదారింపవే రాజవై రాజబింబాస్యకై దుర్విదారిన్విదారింపవే నొంపవే కౄరిరుల న్వాసుదేవాదిరూపంబులన్సిద్ధబంధుండవై యేపుదీపింపబౌద్ధుండవై వైరివారాంతరంగంబుల న్నంతరంగంబులెంతంగరంగింపవే పెంపుదీపింపవే కల్కిమూర్తిం బ్రవర్తించిమించున్నిను న్నెన్ననేనెవ్వఁడన్నన్నుమాయావిపన్నున్విపణ్ణుం బ్రపన్నుం బ్రసన్నుండవై ఖిన్నతంబాపిమన్నింపవే పన్నగాధీశతల్పా కృపాకల్ప వందారుకల్పా నమస్తే నమస్తే నమస్తే నమః* (మ॥ కలలంబోలెడిపుత్రమిత్రవనితాగారాదిసంయోగము। ల్జలవాంఛారతియెండమావులకునానల్సేయుచందంబున। న్దలఁతున్నిత్యములంచు మూఢుఁడవృథాతత్త్వజ్ఞుఁడన్నాకునీ। విలసత్పద్మపదంబుజూపికరుణన్వీక్షింపులక్ష్మీపతీ* (వ॥ మఱియునువినుతింపనక్రూరునికియమునాజలంబులోననతనమొదలిమేనుచూపి చాలించి నటునికైవడిఁదిరోహితుండయిననక్రూరుండునీరువెడలి వెఱంగుపడుచువచ్చిరథారోహణంబుసేసినహరియిట్లనియె* (క॥ జలములుచేరువనున్నవి। తలపోయఁగనీవుపోయితడవయ్యెనదీ। జలముననభముననధరణిం। గలుగనిచోద్యములునీకుఁగానంబడెనే॥ అనిననతండిట్లనియె* (క॥ నీలోనలేనిచోద్యము। లేలోకమునందుఁజెప్పరీశ్వరనీట। న్నేలంనింగినిదిక్కుల। నీలోచోద్యంబులెల్లనెగడెమహాత్మా* (వ॥ అనిపలికిసాయంకాలంబునకునక్రూరుండు మధురానగరంబుచేర రథంబుగడపె నంత నటమున్నుచనినసందాదులుపురోపవనంబునవిడిసియుండ వారలంగూడికొనికృష్ణుండక్రూరునింజూచినీవురథంబుగొనుచునగరంబునకుంజనుము మేము వెనుకవచ్చెదమనిననతండిట్లనియె

శ్రీకృష్ణమూర్తిమధురానగరప్రవేశము సేయుట.

(క॥ నాయింటికివిచ్చేయుము। నీయంఘ్రిసరోజరేణునికరముసోక। న్నాయిల్లుపవిత్రంబగు। శ్రీయుతనీభటునిఁబెద్దసేయందగదే॥ అనిమఱియుంబ్రార్థించినహరియిట్లనియె* (క॥ యదుకులవిద్వేషణుడై। మదమునవర్తించుకంసుమర్దించిభవ। త్సదనంబుచూడవచ్చెదఁ। బొదయాస్యందనముగొనుచుఁబురమునకనఘా* (వ॥ అనిపలికిననక్రూరుండు పురంబునకుంజని రామకృష్ణులువచ్చిరనికంసునకెఱింగించితనగృహంబునకుఁజనియెనంత నపరాహ్ణంబున బలభద్రగోపాలసహితుండై కృష్ణుండు* (మ॥ వరిఖల్కోటలుకొమ్మలుంబడగలున్ప్రాసాదముల్వీథులు। హరులుద్వారులువీథులున్గజములున్హర్మ్యంబులు న్వాద్యముల్। త్తరు

ణుల్లాన్యములున్థవంబులును హేహా ద్యానంబులున్దీర్ఘికల్దర మాశ్చర్యము చిందనర్చు మధురన్నాం చెన్ని భుండంతటన్ ॥ కనియ స్ఫురంబుప్రవేశించివచ్చు సమయంబున*(ఉ॥నంచితపక్షఫలంబుహుగుణంబులపుంజముగోపకామినీబృందమునోముపంటసిరి విందుదయాంబుధియోగిబృందముల్ । డెందములందుఁ గోరెడుకడింది నిధానము చేరవచ్చెనో । సుందరులార రండు చని చూత ముకన్నుల కోర్కెదీఱఁగన్*(వ॥అనిమఱియుగోవిందసందర్శనకుతూహలంబులం బౌరసుందరులుపరస్పరాహూయమాన లై భుంజానలై భోజనభాజనంబులు దలంగఁద్రోచియు, శయానలై లేచియు, నభ్యంజ్యమానలై జలంబులాడకయు,గురుజన శిక్ష్యమాణలై యోడకయు,గృహకార్యప్రవర్తమానలై పరిభ్రమింపకయు,రమణరమమాణలై రమింపకయు, శిశుజనబిభ్రాణలై డించియు,నలంక్రియమాణలై యన్యోన్యవస్త్రాభరణమాల్యానులేపనంబులువీడ్వడధరించియు,నరిగి*(క॥వీటఁగలచేడెలెల్లను,హాటకమణిఘటితతుంగహర్మ్యాగ్రములన్ఘాటువలు గొనుచుఁజూచిరి । పాటించి విశాలవక్షుఁ పద్మదళాక్షున్*(సీ॥ వీఁడఁటే నక్కఁ సివిగతజీవఁగ జన్ను బాలు ద్రావిన మేటిబాలకుండు । వీఁడఁటేనందుని వెలఁదికిఁజగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు । వీఁడఁటే మందలో వెన్నలు దొంగిలి దప్పించి మెక్కిన దాపరీఁడు । వీఁడఁటే యలయించి ప్రేతల మానంబు చూఱలాడినలోకసుందరుండు । వీఁడు లేకున్న బురమువటవీస్థలంబు । వీనిఁబొందని జన్మంబువిగతఫలము । వీనిఁబలుకని వచనంబు వివిగరుత ము । వీనిఁజూడని చూపులు వ్యర్థలువ్యర్థలు* (మ॥ చెలియా గోపికలీకుమారతిలకున్జింతించుచున్నాడు చున్గలయంబల్కుచు నాటుచున్నగుచునాకర్షించుచున్ హస్తగా । మలక క్రీడకుఁదెచ్చి నిచ్చలు నుసన్మానంబులం బొందఁగాఁ । దొలిజన్మంబులనేమి నోము చిరోకదేదుర్గప్రశంబులా* (క॥ అనిమఱియుఁ బౌరకాంతలు మునుకొని హరిరూపు నేత్రములవెంటనులోఁ గొని తాల్చి రిహృదయములను జనితప్రమదమున విరులుచల్లుచు నధిపా॥ మఱియును* (క॥ నానావిధగంధములుప్రసూనఫలాములును హరితశుభలాజములున్ । గానుకలిచ్చు చు విప్రులు మానుగఁ బూజించిరాకుమారోత్తములన్* (వ॥ఆసమయంబున నగ

—* శ్రీకృష్ణుఁడురజకునిఁజంపి వాయకనుదాములా సంగుపూజలనఁగీకరించి మేలొసంగుట. *—

రద్వారంబుననుండి వచ్చు రాగ కారుండగు నొక్కరజకుం గాంచి హరి యిట్లనియె*(ఉ॥వింకులమైన రేశ్వరుని వీటికి వచ్చితిమే మువామవమా । వాందలలోనఁగట్టుకొనమంచిపటంబులు లేవు నీముడి । స్పందగధౌతచేలములు శోభిలుచున్నవి తెమ్ము నిన్ను మేలందెడినిమ్ము రాజు దెసనల్లురమోరజకాన్వయాగ్రణీ॥ అనిన వాఁడిట్లనియె* (శా॥ ఎట్టెట్రా మనుజేంద్రుచేలములు మీకీఁ బాడియే మీరలుం । గట్టం బోలు మరేప యోధృతదధిగ్రాసంబులన్మత్తులై । యిట్లాడం జనఁగాక గొల్లరకు మీకిట్లాడనో రాడెడిన్ । గట్టాప్రాణముగోలు పోయెదు సుమీకం సోగ్రధీన్బాలకా* (క॥మారాజుసొమ్ముఁగైకొన । నేరాజులు వెఱకురింతయెల్లిదమేనీ । కీరాజరాజగృహమున నీ రాజస మేల గొల్ల యేగుము తలఁగన్॥ అనిన విని రోషించి* (క॥ ఘోరకరాగ్రతలంబున ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁగొట్టెన్ । బౌరులగుండెలు వగులఁగ వీరోద్రేకిన్మదాపి వేకిన్ జాకిన్ (వ॥ఇట్లు భగ్నుండై నరజకుంజూచి వానివారలు పటంబులుడించి వెఱచిపఱచిన రామకృష్ణులు వలసినవస్త్రంబులు ధరియించి కొన్ని గోపకులకొసంగి చనుచుండ*(క॥అంతటనొకవాయకుఁడా । క్రంతన్వసుదేవసుతులఁగని బహువర్ణా । త్యంతమృదుపటాభరణము । లెంతయు సంతసముతోడనిచ్చె న్మెచ్చెన్*(శా॥కారుణ్యంబున వానిఁగైకొని యలంకారంబుగా వించిశ్రృంగారోదంచిత దిగ్గజేంద్రకలభాకారంబులం బొల్చిరా । శూరుల్మాధవుఁడంత వాయకుని శుశ్రూషన్మహాప్రీతుఁడై । సారూప్యంబును లక్ష్మియున్నొసఁగెనైశ్వర్యాది సంధాయియై* (వ॥ అంత నా రామకృష్ణులు సుదాముండను మాలాకారు గృహంబునకుం జనిన నతండు గని లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన నర్ఘ్యపాద్యాదికంబులాచరించి సానుచరులయిన వారలకుఁ దాంబూల కుసుమగంధంబులొసఁగి యిట్లని యె*(ఉ॥పావనమయ్యె నాకులము పండెఁదపంబు గృహంబు లక్ష్మికి । న్సేవితమయ్యె నిష్టములు సేకుఱె విశ్వనిధానమూర్తులై । భూవలయంబుగావ నిటుపుట్టిన మీరలు రాక చేసినే । నేవిధమాచరింతు బను లెయ్యెవి బంటనై యుంగఁ జెప్పరే॥అనిపలికి*(క॥ దామోదరరాములకు న్దామయశోహసితతుహినధాములకు వధూ । కాములకు దెచ్చియిచ్చెసుదాముఁడు ఘనసురభికుసుమదామములధిపా* (క॥ వారును మాలికుఁడిచ్చిన భూరికుసుమదామములను భూషితులై నీ । కోరిన వరమిచ్చెదమని । కారుణ్యము నేయుచతఁడు గనియిట్లనియెన్* (క॥ నీపాదకమలసేవయు నీపాతార్చకులతోడి నెయ్యము నునితాం । తాపారభూతదయయును । తాపసమందార నాకు దయ సేయఁగదే* (వ॥ అని వేడికొనిన నిచ్చి మఱియు మాధవుండమ్మాలికునకు బలాయుః కాంతి కీర్తి సంపదలొసంగి వానిగృహంబు వెడలి రాజవీథిం జనిచని* (క॥ ఆనలినాక్షుఁడు గాంచెను । నానాలేపముల భాజనము చేఁగొనుచు మ్యాసిచను డెంచుదానిని నాననరుచినిచయవినమితాబ్జన్ కుబ్జన్॥కనియిట్లనియె* (క॥ ఎవ్వరిదానవు లేపము లెవ్వరికిం గొనికొనుచు నేగెదు నీపే । రెవ్వతె మాకిమ్మిన్నియు నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రా॥అనినయ్యబలయిట్లనియె* (ఉ॥ చక్కని వాఁడవౌదు సరసంబులనొంపకు మెల్ల వారికి । న్జక్కదనంబు లెక్కడివి చారుశరీర త్రివక్రయం ద్రుదనే । నెక్కముకంసు

దాసినివినిర్మలలేపనవిద్యదానన।న్మికిలి రాజు మెచ్చఁదగమీగువిలేపనముద్ధరింప రే*(క॥ అనిపలికియాకుమారుల।తనువులు
నగవులునువీక్షితములునుమాటల।ల్లనచిత్తముఁగరఁగించిన।నను లేపములిచ్చెవారికబలప్రియముతోన్* (సీ॥ ఇవ్విధంబునఁగు
బ్జయిచ్చినలేపంబులన్నయుఁదాను దేహముననలఁది । కోనప్రసన్నతనొంది కుబ్జముమ్వంకలయొడలుచక్కఁగనొత్తియనుపఁ
దలఁచి । తత్పదంబులమీఁదఁదనపదంబులుద్రొక్కిహస్తాంగుళీద్వయమబలనడుము । క్రిందవిప్పగనిడికృష్ణుఁడుమీఁదికినెత్తి
నవక్రతలెల్లమాని।చక్కనైన చిత్తజన్మబాణముక్రియఁ । గొమరుమిగులఁబిఱుఁదుఁగుచయుగంబు । సొంపుఁజేయఁదరుణి
సుందరమూర్తియై।కమలనయనుఁజూచి కాంతుతోడ* (క॥ వేంచేయుమునాయింటికిఁ।బంచశరాకారయనుచుఁబైకొంగా
కర్షించిహరిఁదిగిచెఁగామిని।పంచాశుగబాణజాలభగ్నహృదయయై*క॥కామినితిగిచినఁగృష్ణుఁడు।రాముసవీక్షించినగుచు
రాజాననమ।తాలిమితముదీర్చిపిదప।న్నిమందిరమునకువత్తునేఁడలుగకుమీ* (వ॥ అనివీడుకొలిపికృష్ణుండువిపణిమార్గంబు
నంజనిచని, తాంబూలమాలికాగందంబులును, బహువిధంబులయినకానుకలును, పౌరులిచ్చినఁబరిగ్రహించుచు, ధనుశ్శాల
కజెగియందు*(క॥సురరాజువింటికైవడి।గురుతరమైభూరిపీరగుపంబైదు। స్థిరమైనవిల్లుఁబొడగని । నరువలడనంగబిట్టున
గివికసితుఁడై *(శా॥బంధుత్మేలనవామహస్తమునజాపంబెత్తిమౌర్వీలతా । సంధానంబొనరించికొంచెపుతెగళ్ళశబ్దించుచు
న్నీరతా।సింధుండాహరిజానిఖండితముగాఁజేసెజనుల్చూడఁగా । గంధేభంబురసాలదండమునొగిన్ఖండించుచందంబు
నన్* (క॥కోదండభగ్ననిర్గత।నాదమువీనులకుభీషణంబైయాశా।రోదోంతరములునిండుచు।భేదించెన్భోజపతిభుజబిక్రమున
ధిపా* (ఉ॥అద్దిరరాచవిల్విరిచెనర్భకుఁడెంతయుశంకలేకనే।దుద్దవిడిన్సహింపఁదగదుగ్రతఁబట్టుదమంచుఁగ్రుద్ధులై।గ్ర
ద్దనలేదితద్ధనువుకావలివారరుదేరవారిన।య్యిద్దరుఁగూడిపట్టినుడియించిరికార్ముకఖండహస్తులై* (వ॥ఇట్లురామకృష్ణులుమ
ధురాపురంబునవిహరించి వెడలివిడిదులకుంజనిరంత*(మ॥గగనారణ్యచరాంధకారగజముల్గాలాహ్వయవ్యాధుఁడ।చ్చు

—*సూర్యాస్తమయచంద్రోదయములవర్ణనము.*—

గఁబట్టంగనుకిర్మిమచ్చిడుటకైచుంతాంకురశ్రేణిచే । నొగిఁగల్పించినకందుకంబనఁగసూర్యుండంతవీక్షింపఁగా।దగెమంద
ప్రభతోడఁబశ్చిమవహాధాత్రీధరేంద్రంబుననన్* క॥తరుణుఁడగుశీతకరునిని।గుజెగిపియల్లక్ష్మితన్నుమానిముదుకడుగా।ఖ
రకరుఁడుననుచుఁద్రొబ్బిన।కరణిన్ రవిపశ్చిమాద్రికడఁగ్రుంకెనృపా* (గీ॥ కళలుగలుగుఁగాకకనులతోడగుఁగాక । శివుని
మౌళిమీఁదఁజేరుఁగాక ।నన్యు నెల్లడవనుఁడైననుతృప్తియని।సాధ్విభంగిఁగనులజాతిమొగిడె* (క॥సుందరసాయంసంధ్యా।
వందనవిప్రార్ఘ్యతోయవజ్రహతోద్య।న్మందేహాసురరక్త।స్యందముక్రియఁగెంపుసొంపెసఁగెనపరదిశన్* (గీ॥ధూమినిం
డమింటఁబూగ్గమైకర్కట।మకరమీనరాశిమహితమైన । హరియశస్సుధాబ్ధియందులతుంపురు।లనఁగఁజుక్కలొప్పెనాకస
మున*(క॥ఎల్లదిశలునిండినశ్రీ । వల్లభగుణమహిమబ్రహ్మవాసించుటకై।చల్లినమ్యగమదమనఁగా । వెల్లివిరిసెనమముగగ
నవీధులనెల్లన్* (క॥ఆచీకటివెనుఁదగిలినఁ।బ్రాచీదిశనుండిగంతుపగుపునరవిభ।త్యాచలముమలఁకత్రోవను।వేచనియొకగా
కవిలిచివిరుగకయున్నే* (ఉ॥మీకునువైరియిప్పుడునుమిక్కిలిమాకునువైరిరాజుదో । పాకరుఁడింకవచ్చుజలజాతములార
మదీయబాలుర్ । జేకొనుఁడంచుబాలకులఁ జీకటిదాఁచినభంగిఁజిక్కిరా। రాకవసించెఁదుమ్మెదలురాత్రిసరోరుహకుట్మ
లంబులన్*. (సీ॥ప్రాచీదిశాంగనాఫాలతలంబునదీపించుసిందూరతిలకమనఁగ।దర్పించివిరహులధైర్యవల్లులుద్రెంపదర్పకుం
డెత్తినదాత్రమనఁగ।నలిగిఁగాలకిరాతుఁడంధకారమృగంబుఖండింపమెఱయించుఖడ్గమనఁగ । గగనతమాలవృక్షముతూర్పు
కొమ్మనులలితమైమెఱయుపల్లవమనంగ।దొగలుసంతసిల్లదొంగలుభీతిల్లఁ । గడలిమిన్నుముట్టిగడలుకొనఁగఁ । బోడిచెలీత
కరుఁడుభూరిచకోరక।ప్రీతికరుఁడుజారభీతికరుఁడు*(క॥దర్పితతారాధిపపరి । సర్పితకిరణౌఘమిళితసకలదిశంబై।యేర్పడి
కమలభవాండము।కర్పూరపుఁగ్రోవిభంగిఁగనుపట్టెన్నృపా* (క॥ఆరేయిగోపయుతులై।క్షీరాన్నముగుడిచిరామకృష్ణులుమ
దిఁగం।సారంభమెఱిఁగియిష్టవి।హారంబులనప్రమత్తులైయుండిరిటన్* (క॥ తనపురికిరామకృష్ణులు।చనుదెంచినిజానుచరు
లఁజంపుటయుమహా।ధనువుఁగదిసివిరుచుటయును।వినికంసుఁడునిద్రలేకవిహ్వలమతియై* (సీ॥ కర్ణరంధ్రములుచేఁగప్పిన
లోపలిప్రాణఘోషమువినఁబడకడించెఁ । దోయాదికములంచుఁదొంగిచూచుచునుండఁదలగానఁరాదయ్యెఁదనువుమీఁదఁ।
గరశాఖనాసికాగ్రంబుపైనిడిచూడ గ్రహతారకలురెంటఁగానఁబడియె। వెలుఁగుననిలుచుండివీక్షింపఁగామేనినీడసరంధ్ర
మై నేలఁదోఁచెనడుగుజాడదృష్టమౌటలేదయ్యెను।వరువులెల్లహేమతరువులగుచు । మెఱయుచుండెఁగాలమృత్యువుడగ్గర।
బుద్ధిమెల్లగలఁగెభోజపతికి* (క॥గరళముఁదినుటయుఁబ్రేతముఁ।బరిరంభించుటయునగ్నభావుఁడవుటయున్।శిరమునఁదైల
మువడుటయు।ఖరపతినెక్కుటయునతఁడుకలలోఁగనియెన్*(వ॥మఱియురక్తకుసుమమాలికాధరుండై, యొకరుండును
నెకడేనియుంజనుచున్నవాఁడనని, కలఁగాంచిమరణహేతుకభీతిం జింతాక్రాంతుండై, నిద్రఁజెందక వేగించుచున్నసమ

యంబున* (క॥ అరుణహరినఖరవిదళిత। గురుతిమిరేభేంద్రకుంభకూటవినిర్యు। క్తరుధిరమౌక్తికములక్రియ। సురపతిదిశఁ గెంపుతోఁడఁ జుక్కలు మెఱసెన్* (సీ॥ పౌలోమి తన బాలుపాన్పుపైఁ గనుపట్టఁ బన్నినపవడంపుఁ బంతియనఁగ । నాయుర్థములఁ బ్రయంబులొత్తుటఁ జాటు కాలశాంఖికుచేతిఘంటయనఁగ । ఘనజంతుజీవితకాలరాసులవిధిఁ గొల్వ నెత్తినహేమకుంభ మనఁగ। బశ్చిమదిక్కాంతపరగఁ గైసేయుచో ముంగఁ గనిడు కొన్నముకుర మనఁగ । గోకతాపోపశమదివ్యఘుటిక యనఁగ। బన్నినీకాంత నోములఫల మనంగ। మూఁడుమూర్తులసారంపుముద్ద యనఁగ । మిహిరమండలముదయాద్రిమీఁదనొప్పె* (క॥ వచ్చెఁ జల్లని గాడ్పులు। విచ్చెఁ గమలములు దమము విరిసె బిలంబుల్ । చొచ్చెఁ బద్మాకరందము । మెచ్చెఁ గదుమ్మెదలు గ్రోలి మిహిరుఁ డుదయించెన్* (క॥ సంకాశితోదయాచల। పంకజసఖకిరణ రాగపరిపూర్ణంబై। పంకేరుహాగర్భాండము। కుంకుమసలిలంబుఁ గ్రోలు కాసారముగ నొప్పెన్॥ తదనంతరంబున* (సీ॥ పాషాణవల్మీకపంకాదిరహితంబు మృదులకాంచననిభమృణ్మయంబు। కమనీయకస్తూరికాజలసిక్తంబు బద్ధచందనదారుపరివృతంబు । మహనీయకుసుమదామధ్వజతోరణమండితోన్నతమంచకశ్రేష్ఠంబు । బ్రాహ్మణక్షత్రాదిపౌరకోలాహలం బశ్రాంతతూర్యత్రయాంచితంబు । నిర్మలంబు సమము నిష్కంటకంబునై। పుణ్యపురుషుమనముఁ బోలి కంస। సైన్యతుంగమగుచు సంతుష్టలోకాంత। రంగమైన మల్లరంగ మొప్పె* (క॥ ఆ మల్లరంగపరిసర। భూమిస్థితమంచమందు భోజేంద్రుఁడు మా। న్యామాత్యసంయుతుండై। భూమీశులు గొలువ నుండెఁ బొంకుచు నధిపా॥ (మ॥ సకలాంభోనిధిమేఖలావహనముం జాలిందిమే తెంచునా। గకులాగంబులభంగి నొప్పుచుఁ దగం గైసేసి చాణూరముష్టికకూటుల్ప్రలకోసలుల్తుసుపులన్ సేవించుచుండ్ రంగథా। త్రికినే తెంబిరి తూర్యఘోషములను ద్రేకంబనేకంబుగన్* (క॥ నందాదులైన గోపకు। లందఱు చని కానుకలు సమర్పించి నృపున్ । సందర్శించి తదనుమతిఁ । జెందిమహామంచమున వసించిరి వసుధేశా* (వ॥ అంతనా రామకృష్ణులు, నలంకృతులై, మల్లదుందుభినినదంబు విని, సందర్శనకుతూహలంబున* (క॥ ఓడక రంగద్వారము। జాడం జని వారు గనిరి సమదకువలయా। పీడంబుఁ భిన్నపరా। క్రీడంబు భ్రమదకంటకితచూడంబున్* (వ॥ కనితత్కరిపాలకశ్రేష్ఠుం డైనయంబష్ఠునికి, మేఘనాదగంభీరభాషణంబుల, రిపుభీషణుండగు హరి యిట్లనియె* (శా॥ ఓరీ కుంజరపాల

శ్రీకృష్ణుండు కువలయాపీడమను గజంబును వధించుట.

మా దెసకు నీ యుద్వన్మదేభేంద్రము౦ । ద్రే రేపంబని లేదు త్రిప్పుము జలంబ్రే రేపనన్నిన్నుఁ గం । భీరోగ్రాశనితుల్యముష్టిహతులం భేదించి నేఁ డంతకుం। జేరంబుత్తు మహాత్తరద్విపముతో సద్ధంబు యుద్ధంబునన్॥ అని పలికి* (మ॥ మించిన కోపంబున జక్కని డిమేలనఁ బచ్చని చీఱ కాశబం। తించి లలాటకుంతలలతిన్ మలిం చుచు సంగరక్రియా। చుంచుతఁ బేర్చి బాలకుఁడు చూచు జనంబులు దన్ను బాపు రే। యంచనుతింపఁ డగ్గరి యెహస్తిజి తాగము గంధనాగమున్* (క॥ అంజక బాలకుఁ డని యును। గొంజక దయమాలి రాజకుంజర యంత్రన్। కుంజరమును డీకొలిపెను। గుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్* (వ॥ మఱియు నయ్యనేకపంబనేకపపాలకప్రేరితంబయి మహావాతసంఘాతసముద్ధూతంబగు విలయకాలకీలి కేళి నిబిట్టుమిట్టిపడి, మృత్యుదేవత యెత్తునంగాలుపోలిక, శమనుగమనిక నెదిరి మదసలిలపరిమళలుబ్ధపరిభ్రమ దదభ్రభ్రమరగాయక ఝుంకృతులహంకృతిసంపాదింపంగు లకుంభినీధరగుహాకుంభకుంభమంబుగ ఘీంకరించి రోషభీషణశేషభోగి భోగభయంకరంబగు కరంబున శౌరిం జీజీ చీరికింగొన కపట్టి యట్టిట్టు గెంటి, విధుంతుదవదనగహ్వరంబువలన విడివడియురుకుతరణికరణి, దప్పించి, కుప్పించి, పాదమధ్యంబునకునసాధ్యుండై, దూఁటి దాఁటి మాటుపడిన, క్రోధబంధురంబై సింధురంబు, మహార్ణవమధ్యమంథాయమానమందరమహీధరంబు కయివడి, జిఱజిఱం దిరిగి కానక, భయానకంబై, గాలి వెఱవునం గనిపొంగి చెంగటం, బ్రళయదండివండప్రశస్తం బగు హస్తంబువంచి వంచించి చుట్టి పట్టి పడ ద్రేయం గమకించినం జలింపక తెంపున హరి కరిపిఱిందికి ఱికి, మహోగ్రాహునాలవల్లి కాకవర్ణ్ణో దీర్ణుండగు సుపర్ణు తెఱంగున నెగరి శుండాలంబు వాలంబు లీలం గేలనొడిసి పట్టి ఝళిపించి పంచవింశతిబాణాసనప్రమాణదూరంబున, బిఱబిఱం ద్రిప్పి వైవ, న వ్వారణంబు దుర్నివారణంబై, రణంబున కోహటింపక, సవ్యాపసవ్యపరిభ్రమణంబుల నవక్రంబై కవిసిన, నసవ్యసవ్యక్రమంబున దప్పించి, ఱొప్పక కుప్పించి యెదుర్కొనిన, కరకుండై మేచకాచలతుంగశృంగగుంభంబగు కుంభికుంభంబు చక్కటి వ్రక్కలై చెక్కలెగయ దురంతకల్పాంత జీమూతప్రభూత నిర్ఘాతనిష్ఠురంబగు ముష్టి సారించి యూచి పాడిచిన, నందద్వికీర్ణపూర్ణరక్తసిక్తమౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగరక్తతారకాచ్ఛన్నంబగు మిన్ను చెన్నల

రసాలదండమున్-చెఱకుగెడ.---పౌలోమి-ఇంద్రునిభార్య. శాంఖిక-శంఖమూదువాఁడు. కోక-చక్రవాకపక్షి. మిహిర-సూర్యుఁడు. తూర్యత్రయ॥ నృత్య-గాన-వాద్యములు. అంజక-ఆలస్యముచేయక. కొంజక-సంకోచింపక. అయ్యనేకపంబు-ఆగజము. అనేకపపాలక-మావటివానిచే. విధుంతుద-రాహువు. శుండాలము-దంతావళ, ఏనుఁగు. ఓహటింపక-వెనుకఁదీయక. మదకలంబు-మదపుటేనుఁగు.

సంహారసమయసముద్రసంఘాతసం
పరింపనిలువరింపక మ్రొగ్గిమ్రోకరిలి మ్రొగ్గకదిగ్గన నగ్గజంబు లేచిచూచి త్రోంచినడచ సంహారసమయసముద్రసంఘాతసం
ఘాతసముత్తుంగభంగసంఘట్టితంబగు,కులాచలచక్రంబుక్రియఁగ్రమ్మఱ, నమ్మహాభుజుబిభుజాదండంబులవలనఘట్టితంబై, కట్ట
లుకముట్టినెట్టెడికొని, ముష్టిరంబునఁగ్రొమ్ములంజిమ్మిన నమ్మేటిసూటిమెఱసి హస్తాహస్తిసంగరంబునఁ గరంబొప్పిదప్పిం
బడనొప్పించిననకుంఠిత కాలకంఠకఠోరభల్లభగ్నంబగు పురంబువగిదిం జటులజంఝూనిలవికలంబగు కలంబుకైవడినమ్మద
కలభంబు బలంబుదక్కిచిక్కి మ్రుక్కిపడిలోభికరంబునుంబోలె దానసలిలధారావిరహితంబై,విరహితలంపునుంబోలె నిరం
తరచిత్తజాతనిగ్రహంబై, గ్రహణకాలంబునుంబోలెంబరాధీనఖరకరంబై, ఖరకరోదయంబునుంబోలె భిన్నపుష్కరంబై,
పుష్కరవైరివిలసనంబునుంబోలె నభాసితపద్మకంబై యున్నసమయంబున* (ఉ॥ కాలంద్రొక్కిసలీలుఁడై నగవుతోఁగంఠీ
రవేంద్రాకృతి। న్గేలన్భీషణదంతము ల్వెఱికిసంక్షీణంబుగామొత్తిగో। పాలగ్రామణివీరమాళిమణియైప్రాణంబులంబాపెనా
శైలేంద్రాభముప్రాణలోభమునుదంచత్సారగంధేభముల్* (వ॥మఱియుదంతిదంతతాడనంబుల దంతావళపాలకులహ
రించితత్ప్రదేశంబువాసి* (మ॥కరిదంతంబులుమూఁపులందు మెఱయన్ఘర్మాంబుపుల్లోమముల। న్నెఱయంగోపకులంతన త
మలయన్నిత్యాహవస్థేములా। హరిరాముల్ఘను దెంచికాంచిరిమహాహుంకారగాఢంబరాపూరితా। మరమర్త్యాదిజనాంతరంగ
ములసన్మల్లావనీరంగముల్* (సీ॥ మహితరౌద్రంబునమల్లురకశనిమైనరులకద్భుతముగ నాథుఁడగుచు। శృంగారముగఁబుర
స్త్రీలకుఁగాముఁడై నిజబంధువులకు వై కంపునికిభయముగ। మూఢులుభీభత్సమునుబొందవికలుఁడై తండ్రికిఁదయరాఁగఁదనయుఁ
డగుచు। ఖలులకువిరసంబుగాఁదండియైగోపకులకుహాస్యంబుగఁగులజుఁడగుచు। బాంధవులకుఁబ్రేమభాసిల్లు వేలుపై। శాంత
మొనరయోగిజనులకెల్లఁ। బరమతత్త్వమగుచుభాసిల్లెబలునితో। మాధవుండురంగమధ్యమందు॥ అప్పుడు* (క॥ చచ్చినకుంభిం
ద్రంబును। వచ్చినబలమాధవులనువరుసంగనితా। వొచ్చినచిత్తముతోడుతఁ। జెచ్చెఱఁగడువెఱచెభోజసింహుండధిపా*
(ఉ॥ధీరులవస్త్రమాల్యమణిదీప్తవిభూషణధారులన్నటా। కారులసర్వలోకశుభకారులమానవమానినీమనో। హారులరం
గభూతలవిహారులగోపకుమారులన్మహా। వీరులఁజూచిచూచితనివిందుదిముట్టకలోకులందఱున్* (ఉ॥ సన్నుతరామకృష్ణ
ముఖచంద్రమయూఖసుధారసంబులన్। గన్నులఁద్రావుచందమునఁగాంచుచుజిహ్వలనంటిచూచుచున్। లన్నుతిసేయుచున్గర
ములంబరిరంభణసేయుభంగిన। త్యున్నతిఁజూపుచుందగిలియుండొరుతోడరహస్యభాషలన్*(క॥వసుదేవునివాసంబున। వ
సుధన్రక్షింపవీరువైష్ణవతేజో। ల్లసనమునఁబుట్టినారఁట। పసిబిడ్డలనంగఁజనదుపరదేవతలన్* (సీ॥ చంపెరక్కసిఁబట్టిచక్ర
వాతునిఁగూల్చెఁబడద్రొబ్బెమద్దులఁబకునిఁజీఱె। నఘదైత్యుఁబొరిగొనెనడరివత్సకుద్రుంచె గిరిమొత్తి దేవేంద్రుఁగ్రిందుపఱ
చెఁ। గాళియుమర్దించెఘనానలముఁద్రావెఁ గేశినంతకుపురికేవకనిచె। మయుఁబుత్త్రుఁబరిమార్చెమఱియుదానవభటుల
హరించిగోపకులంబుఁగాచె। గోపకాంతలమానములకోరెడిదీర్చె। నీసరోరుహలోచనుఁడీశుభాంగుఁ। డీమహామహుఁడీ

—* శ్రీకృష్ణబలరాములుచాణూరముష్టికులనువధించుట. *—

దిగ్గజేంద్రమడఁచె। ననుజమాత్రుఁడెతలపోయమాధవుండు* (వ॥ అనిపలుకుసకలజనులుచూచుచుండ రామకృష్ణులకుఁజా
ణూరుండిట్లనియె* (మ॥ వనమార్గంబునగోపబాలకులతో వత్సంబులన్మేపుచున్। బెనఁగన్మిక్కిలి నేర్చినారనుచునీపృథ్వీజను
ల్చెప్పమా। మనుజేంద్రుండిటమిమ్ముజీఱఁబనిచె మల్లాహవక్రీడకు। న్జనదేకొంతపరాక్రమింపమనకున్ సభ్యుల్విలోకింపఁగన్
(మ॥ జవసత్త్వంబులుమేలె సాముగలదే సత్రాణమేమేనుభూ। ప్రవరుంబోసనమిమ్మనంగవలెనే పాలీలభీష్టంబులే। వవివో కాక
కృతాంతదండకమువో ఫాలాక్షునేత్రాగ్నివో। నవనీతంబులముద్దగాదు మెసఁగన్నా ముష్టిగోపార్భకా (క॥జనములునేర్చిన
విద్యలు। జననాథునికొఱకుగాదెజననాథుఁడునీ। జనములుమెచ్చగయుద్ధం। బునమనముంగొంతప్రొద్దుపుత్తమెకృష్ణా॥ అనినవిని
హరియిట్లనియె* (ఉ॥ సాములులేవుపిన్నలమునత్త్వముగల్దనరాదుమల్లసం। గ్రామవిశారదుల్కలిశకర్కశదేహులుమీ
రుమీకడన్। నేముచరించుటెట్లుధరణీశునివేడ్కలుసేయువారమున్। గామువినోదముల్సలుపగాదనవచ్చునెయొక్కమా
టికిన్* (క॥ నీతోమతనేఁబెనఁగెదఁ। బ్రీతిన్ముష్టికునితోడఁబెనఁగెడిబలుఁడు। గ్రాతతమల్లాహవమున। భూతలనాథునికి
మెచ్చుఁబుట్టింతుసభన్॥ అనినవినిరోషించిచాణూరుండిట్లనియె* (శా॥నాతోఁబోరఁగనెంతవాఁడవిసిరోనాపాటియేనీవు
విఖ్యాతుండన్గుణజుండసద్గుణుఁడసత్కర్మస్వభావుండనీ। కేతాదృగ్విభవంబులెల్లఁగలవేయీవీటబోరాడుట। ల్వే తల్లీ
డఁగఁగుప్పిగంతులిడుటేవీక్షింపుగోపార్భకా*(శా॥స్థాణున్మెచ్చఁడుబ్రహ్మఁగైకొనఁడువిష్వక్సేనునవ్వున్జగ। త్ప్రాణుల్ గర
మ్మనఁడీడుగాఁడనిమహాబాహాబలప్రౌఢిన। క్షీణుండాజికినెల్లినేఁడనఁడువై చిత్రిన్విరోధించున। చ్చాణూరుండొకగోపబాలు
పనికిన్నష్టుండుగాకుండునే* (క॥ ప్రల్లదమేటికిగోపక। బల్లిదుఁడనులోకమందుఁబ్రఖ్యాతుఁడనా। చల్లడముక్రిందదూరని।
ఘల్లుమలేరెందుజగతిమండలమందున్* (సీ॥చలముననను డాసిజలరాశిఁజొరరాదునిగుడిగోత్రముదండనిలువరాదు। కే

డించికుంభినిక్రిందికిఁబోరాదు మనుజసింహుండవై మలయరాదు । చేరినఁబడవై తుఁజేయిసాఁగరాదు బెరసినాముందఱఁ బెఱుఁగరాదు। భూనాథహింసకుఁబోరాదు ననుమీఁజెశోధింతుఁగాన లఁజొరఁగరాదు। ప్రబలమూర్తినను చు భాసిల్లగారాదు। ధరఁబ్రబుద్ధుఁడననితరుచు రాదు । కలికితనము నూపఁగర్వింపఁగా రాదు । తరముగాదు కృష్ణ తలఁగుతలఁగు॥ అదిగాక నీవు శ్రీహరినంటేని* (సీ॥ మహిమతో నుండంగ మధురాపురము గాని పాలుపాలువై కుంతపురము గాదు। గర్వంబుతో నుండఁగంసుని సభగాఁ సంసారరహితులసభయుఁగాము । ప్రకటించి వినఁగనాపాహునాదము గాని నారదువీణాస్వనంబు గాదు । చదురులాడఁగ మల్లజనవిగ్రహము గాని రమతోడిప్రణయవిగ్రహము గాదు। వెలసితిరుగంగ వేదాంతవీధి గాదు। మొఱఁగిపోము నినఁ నములమూలగాదు। సాగినదువంగ భక్తులజాడ గాదు। శౌరి నా మ్రోలనీ వెందుఁజనిగొదింక॥ అనిపలికి* (సీ॥ రోషాగ్నిధూమప్రరోహంబుకై వడిశిరము నసన్నపుసిక సెలంగ । నాశామదేభేంద్రహస్తసన్నిభములై బాహుదండంబులు భయదములుగ। లయసమయాంతకోల్లసితదంష్ట్రిలభంగిఁ జాగినకోరమీసములు మెఱయ । నల్లని తెగగల నడగొండ చాడ్పున నాభీలనీలదేహంబు మెఱయఁ। జరణహతులధరణిసంచలింపఁగ నభో। మండలంబు నిండ మల్లసఱచి । శౌరిదెసకు నడిచె జాణూరమల్లుండు। పౌరలోకహృదయభల్లుఁడగుచు* (వ॥ ఇట్లగ్గలంబగు నగ్గలిక డగ్గరిన మల్లునింగని మెల్లన మొల్లంబగు బీరంబు వెల్లిగొన వల్లవవల్లభుండుల్లసిల్లి బాహునాదంబున రోదోంతరాళంబు పూరించి మించికవిసినట్లిద్దరునుద్దవిడి నున్నతవిషమంబులగు తాణలిడి కరికరియును, హరిహరియును, గిరిగిరియునుం, దాఁకువీఁకం దలపడియితరేతరహేతిహింసితంబులగు దవానలంబుల తెఱంగునంబరస్పరదీర్ఘనిర్ఘాతఘట్టితంబులగు మహాభ్రింబులవిభ్రమంబున నన్యోన్యతుంగతరంగతాడితంబులగు కల్పాంతకాలసముద్రంబుల రౌద్రంబున నొండొరులముష్టిఘట్టనంబుల ఘట్టితశరీరలై దద్దరిలఁ డగ్గరి గ్రద్దన నయ్యిద్దఱుందిరుగు నెడ హరిసొచ్చిపేర్చియార్చి జెట్టింబట్టిపడం దిగిచి పాదంబులఁ జండించి సముల్లాసంబున నెసకంబులకు వచ్చిన మెచ్చి మెచ్చియచ్చపలుండు మీఱి మోరసారించి తెరలక పొరలం ద్రొబ్బిన నబ్బలానుజుండుబ్బి గొబ్బున మేను వద్దిల్ల నర్ధాంగకంబు ననుండి జానువుల నొత్తుచు నురువడిం గరవడంబున నున్న నాదుర్నయుండును, బాలమేలు మేలని లీలంగాలు సొరనిచ్చి త్రోచి పంజూచి మేచిఖేచరులగ్గించి యుగ్గడింపన గ్గోపకుమారుండు పాటవంబున నురాటవంబున కంజనివెన్నెక్కి నిక్కి నకంసభటుండు మదగజరేఖ బంధురంబగు పదంబును బదంబునం జాఁపి కరంబును కరంబునం గ్రహించి సహించి వహించి నైపుణంబున లోపలం దిరిగి యట్టిట్టుతప్పించిన దిట్టతనంబునం దప్పక నప్పద్మలోచనుండు కేడించి యేచి సమతలంబునవైచి ప్రచండంబగు వానిపిచండంబు వాగించి కాలధికఱరించి డొక్కఱరంబుఁగొనిన నయ్యభ్యాసిసభ్యులు సన్నుతింపం గ్రమ్మఱించి జడ్డన గాలడ్డగించి రక్షించుకొనిన నారట్రోవైరి వైరికటిచేలంబు పట్టి యెత్తియొత్తిన నదుమరా గెయిడి సందు వెట్టినవ్వాన నవ్విరోధి కాలు కాలిలోనిడి వేధించి నిరోధించినఁ ఱరోధంబు బాసి తిరిగిన వసుదేవుపట్టి పట్టసంబు గొనిధట్టించిన నుబ్బరిక చేసి చాణూరుండు హరికరంబు పట్టి హుమ్మని నెమ్మొగంబునం గాలిడి మీఁదై నంగేళి బాలకుండు కాలు గాలననివారించి మీఁదై నెగడి యుండియు నుండక దుర్వారబలంబున విదలించి లేచి గృహీతపరిపంథిచరణుండై విపక్షుని వక్షంబు వజ్రివజ్రసన్నిభంబగు పిడికిటం బొడిచిన వాఁడు వాడి చెడక విజృంభించి యంభోరాశిమథనంబునం దిరుగు శైలంబు పోలిక నేలఁ జిఱజిఱం దిరిగి తన్నిన వెన్నుండు కుప్పించి యుప్పరంబెగసి మీఁదను ఱికిన నతండు కృష్ణపాదసంధిపరిక్షిప్తపాదుండై యెగసి లేచి సముద్ధతుండయ్యె నయ్యెడ* (క॥ బలభద్రుఁడు ముష్టికుఁడును। బలములు మెఱయంగఁ జేసి బాహాబాహిం। బ్రళయాగ్నులక్రియఁ బోరిరి। వెలయఁగ బహువిధములైన విన్నాణములన్॥ ఆవ్విధమ్మున*
(క॥ వల్లవులు పెనఁగిరున్నత। గల్లులతో భిన్నదిగిభకరవల్లులతో। మల్లులతో రిపుమానస । భల్లులతో భీతగోపవల్లులతోడన్*
(వ॥ ఆసమయమ్మునం బౌరకాంతలు మూఁకలుగట్టి వెచ్చనూర్చుచు ముచ్చటలకుం జొచ్చి తమలో నిట్లనిరి* (ఉ॥ మంచికుమారులన్ గుసుమమంజులశరీరులఁ దెచ్చి చెల్లరే। యచ్చితవజ్రసారులు మహాద్రికఠోరులునైన మల్లురన్। గ్రిన్నులఁ బెట్టి రాజు పెనఁగిన్చుచుఁ జూచుచునున్న వాఁడు మే । లిన్చుక లేదు మానుమనఁ। డిట్టిదురాత్మునిమున్న వింటిమే* (క॥ చూ చెదరు గాని సభికులు। నీచిన్నికుమారకులకు నీ మల్లురకు। న్నో చెల్ల యీడు గాదని। నూచిమ్మ రుపలికిఁ దమకు శోకము గాదే* (సీ॥ వేణునాళములమై వెలసిన మాధవుం డధరామృతములిచ్చి యాదరిన్చుఁ । బిన్ఛదామములమై పెరిగిన వెన్నుండు మస్తకమ్మున దాల్చి మైత్రి నెఱపుఁ। బీతాంబరములమై బెరసిన గోవిందుఁ డంసభాగముల బాయక ధరిన్చు । వైజయంతికలమై వ్రాలిన కమలాక్షుఁ డతికుతూహలమున నలుత దాల్చుఁ । దనరు బృందావనమ్మున దరులమైన । గృష్ణుఁ డానన్దమునఁ జేరి క్రీడసల్పు । నెట్టి నోములనైన మున్నిట్టి విధము। లేలకా మైతి మోయమ్మ యింక నెట్లు* (ఉ॥ పాపపు బ్రహ్మ గోపికల పల్లెలలోన సృజింపరాదె మము । నీ పురిలోపలన్ మనలదేల సృజిన్చెనమైన నిచ్చలున్ । జేపడుగాదె యీ సుభగుఁ జెందెడి భాగ్యము సంతసమ్ము నీ । గోపకుమారుఁ బొందమును గోపకుమారికలేమి నోఁచిరో* (క॥ గోపాలకృష్ణుతోడను । గోపాలన వేళలందుఁ గూడి తిరుగునా। గోపాలు రెంతధన్యులొ। గో

పాలురకైనఁబట్టిరురుచిగలదే*(క॥ శ్రమజలకణసిక్తమై। కమలదళేక్షణుని వదనకమలము మెఱసెన్। హిమజలకణసిక్తం
బై। కనునీయంబగుచునున్న కమలముభంగిన్*(గీ॥ సభకుబోవఁజనఁ బసభవారిదోషంబు। నెఱిఁగియూరకున్న నెఱుఁగకున్న
నెఱిఁగియుండియైన నిట్టట్లు పలికినఁ। బ్రాజ్ఞుఁడైనఁ బొందు పాపచయము*(క॥ అని పెక్కండ్రు పెక్కువిధంబులం బలుకఁద
ద్బాహుయుద్ధంబున*(క॥ ధృతిచెడి లోఁబడెను మల్లుం। డతులిత భవజలధితరికి గతరిపుపురికిన్। హితకరికిన్ ధృతగిరికిన్। దతహారి
రవభూతశిఖరిదరికిన్ హారికిన్*(క॥ హరికినిలోఁబడి జెగడక। హరియురము ముష్ట్యాగ్రముష్టి నహితుఁడు పొడువన్। హరికు
సుమమాలి కాహత। కరిభంగిఁ బరాక్రమించెఁ గలహార్థుఁడై*(క॥ శౌరి నెఱిఁ జొచ్చి కరములు। క్రూరగతిన్ బట్టి త్రిప్పి
కుంభిని వైచెన్। మూరుంగలహగభీరున్। వీఁకం జాణూరు ఘోరవితతాకారున్*(క॥ శోణితము నోర నెలుకఁగఁ। జాణూ
రుండట్లు కృష్ణసంభ్రమమున సంక్షీణుండై। క్షోణింబడి। ప్రాణంబులు విడిచెఁ గంసుప్రాణము గలఁగన్*(క॥ బలభద్రుఁడును
లోకులు। బలభద్రుఁ డనఁగఁ జెనఁగి పటుబాహుగతిన్। బలభేది మెచ్చఁ ద్రిప్పెను। బలవన్ముష్టికుఁ గంసుబలములు బెగడన్*
(గీ॥ త్రిప్పి నేలవైవ దిగ్గనరక్తంబు। వదనగహ్వరమున వరదవాఱ। ముష్టికుండు ఘోరముష్టి సత్వము సెడి। కూలెఁ గాలిఁ దరువు
గూలినట్లు*(క॥ పాటవమున బలుపిడికిట। సూటింబడఁ బొడిచె బలుఁడు శోభితఘనబా। హాటోపన్నృపకిరీటున్। గూటు న్వాచా
టునధిక ఘోరలలాటున్*(వ॥ అంతనగ్గనుజాంతకుండు చరణప్రహారణంబుల భిన్నమస్తకుం జేసె, వాని చెలులనంతకాంతికంబు
వకనిచిన*(క॥ వల్లవబాలకులని మన। మల్లవరులు పెనఁగి నేఁడు మడిసిరి వీరల్। బల్లిదులు తలఁడు తలఁడన్। చెల్లాచెదరై రిపాటి

శ్రీకృష్ణుండు కంసుని వధించుట.

చిక్కినమల్లుల్*(ఉ॥ మల్లురఁ జంపి గోపకసమాజములో మృగరాజురేఖతో। భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయ
వచ్చునా వల్లవరాజనందనుల వారకఁ జూచి మహీసురాదు లల్లన సంస్తుతించిరి। ప్రియంబుగఁ గంసుఁడు దక్క నందఱున్*(వ॥ అం
తసభాజనుల కలకలంబుని వారించి మంత్రులం జూచి కంసుండిట్లనియె*(మ॥ వల్లవబాలురన్నగరి వాకిటికిన్ వెడలంగఁ ద్రొబ్బు
డీ। గొల్లలముట్టికోల్లనుఁడు క్రూరుని నందుని గట్టుఁ డుర్వికిం। దెల్లముగాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు తండ్రిగాఁడు వీఁ। డె
ల్లపథంబులం బరులకిష్టుఁడు కావఁడు ఉగ్రసేనునిన్॥ అనిపలుకు సమయంబున*(శా॥ జంఘాలత్వముతోన గోపరిచర త్సారంగ
హింసేచ్ఛను। ల్లంఘింపంగ మకించు సింహముక్రియన్ లక్షించి పౌరప్రజా। సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహిం
సార్థియై। లంఘించెన్ దమగంబుమీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్*(క॥ తమగమున కెదురుయదునత్తమగణ్యుఁ జూచి ఖ
డ్గధరుఁడై యెదిరె న్దమగమి వారలు వీరో। త్తమగణపభుఁ డనఁగఁ గంసధరణీపతియున్*(శా॥ పక్షీంద్రుండురగంబుఁ బట్టువిధ
మొప్పం గేశబంధంబులో। కక్షోభంబుగఁ బట్టి మౌళిమణులాకల్పాంతవేళాపత। న్నక్షత్రంబులఁ భంగి రాల రణసన్నాహం
బుడిందించి రంగక్షోణిం బడఁద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం గంసున్నృపోత్తంసునిన్*(శా॥ మంచాగ్రంబుననుండి రంగధరణీమ
ధ్యంబునం గూలియే। సంచారంబును లేక చిక్కి జనులాశ్చర్యంబునుం బొందఁగాఁ। బంచత్వంబును బొందియున్న విమతుం బ
ద్మాక్షుఁ డీడ్చెన్వడిన్। బంచాస్యంబు గజంబు నీడ్చుపగిదిన్ బాహాబలోల్లాసియై*(క॥ రోమప్రమోదనిద్రా। భాషాశనపానగతు
లఁబాయక చక్రి। ద్వేషరతిఁ జూచియైనవి। విశేషరుచిం గంసుఁ డతఁ జెందెన రేంద్రా॥ ఆసమయంబున*(క॥ గోపాలుఁ డొక్క
డద్దిర। భూపాలకుఁ జంపెనీఁ బోడువుం డేత। ద్భూపాలస్యము లేలని తా పాలఘురోషులగుచు దర్పోద్ధతులై*(శా॥ న్యగ్రో
ధుండును గహ్వుఁడున్ మొదలుగా నానాయుధానీకసా। మగ్రిం గంసుని సోదరుల్ గవియుడున్ మాద్యద్గజేంద్రాభుఁడై। యుగ్రుం
డై పరిఘాయుధోల్లసితుఁడై యొండొండఁ జెండాడి కా। లాగ్రక్షోణికిఁ బంపె రాముఁడు గరీయస్థేముఁడై వారలన్॥ అయ్యవ
సరంబున*(క॥ చేతులతాళముఁ బట్టుక। చేతోమోదంబుతోడ సిగముడివీడన్। బాతరలాడుచు మింటను। గీతము నారదుఁడు
బాడెఁ గృష్ణాయనుచున్*(క॥ వారిజభవరుద్రాదులు। భూరికుసుమవృష్టిఁ గురిసి పొగడిరి కృష్ణున్। భేరులు మ్రోసెను నిర్జర। నా
రులు దివి నాడిరధికనటనములన్నృపా*(వ॥ అంతఁ గంసాదులకాంతలు, భర్తృమరణదుఃఖాక్రాంతలై కరంబుల శిరంబులు
మోఁదుకొనుచు, నశ్రుసలిలధారాపరిషిక్తవదనలై, సదనంబులు వెలువడి వచ్చి, వీరశయ్యాసుప్తులైన విభులం గౌఁగిలించు
కొని, సుస్వరంబుల విలపించి రందుఁ గంసభార్యలిట్లనిరి*(సీ॥ గోపాలసింహంబు కోపించి వెల్వడి నిను గజేంద్రునిభంగి నేఁ
డుగూల్చె। యాదవేంద్రానిలమాభీలజవమున నినుమహీజము మాడ్కి నేలఁ ద్రాల్చె। వాసుదేవాంభోధి వారియుద్వేలమై నిను
దీవికై వడి నేఁడు ముంచె। దేవకీసుతవజ్రి దేవతలలరంగ నినుఁ గొండక్రియ నేఁడు నిహతుఁ జేసె। హా మనోనాథ హా వీర హా మ
హాత్మ। హా మహారాజ నీవిట్లు హతుఁడవైన। మనుతు మన్నార మక్కట నమ్ముఁబోలు। కఠినహృదయులు జగతిపైఁ గలరె యెందు*
(క॥ భూతములకెగ్గుఁ జేసిన। భూతంబు నీకు నెగ్గు పుట్టించె నృభా। భూతమగుమనికి యెల్లను। భూతద్రోహికిని శుభము పొందద
ధీశా*(క॥ గోపాలకృష్ణుతోడను। భూపాలక మున్ను తొడరి పోలిసినవారి। న్నీపాలబుధులు సెప్పరె। గోపాలస్యములు విడిచి

కొలువందగదె* (వ॥ అనివిలపించుచున్న రాజవల్లభులనూరార్చి జగద్వల్లభుండై నహరి, కంసాదులకుం బరలోకసంస్కా
రంబులు సేయంబనిచి, దేవకీవసుదేవులవిడిపించి బలభద్రసహితుండై, వారలకుం బ్రణామంబులు సేసిన* (మ॥ కనిలోకే
శులుగా వీరు కొడుకుల్ గారంచుఁ జిత్తంబులన్। జనయిత్రీజనకుల్విచారపరులై శంకింపఁ గృష్ణుం డుదారజనసమ్మోహినియైన
మాయ తదభిజ్ఞానంబు వారింది యి। ట్లనియె న్సాగ్రజుండై మహావినతుండై యానందసంధాయియై॥......................*

—*శ్రీకృష్ణుండు దేవకీవసుదేవుల చెరమాన్పి యుగ్రసేనునికి పట్టంబుఁ గట్టుట.*—

(సీ॥ మమ్ముఁ గంటిరి గాని మా బాల్యపౌగండకైశోరవయసులఁ గదిసి మీర। లెత్తుచు దించుచు నెలమి మన్నించుచు నుండుసౌ
భాగ్యంబులొందరైతి। రాకాంతు గలిగియు నదిదైవయోగంబు తల్లిదండ్రులయొద్దఁ దనయుఁ డుండి। యే యవసరమైన నెబ్బంగి
లాలితులగుచు వర్ధిల్లు మరట్టిమహిమ। మా కునిన్నాళ్ళు లేదయ్యె మఱియు వినుఁడు। నిఖిలపురుషార్థహేతువై నెగడుచున్న। మే
నికెవ్వారలాఢ్యులు మీరకారె। యా ఋణము దీర్పనూఱేండ్లకైన జనదు* (క॥ చెల్లుబడి గలిగి యెవ్వఁడు। తల్లికిం దండ్రికిని దే
హాధనములు వృత్తుల్ । చెల్లింపఁ డట్టికష్టుఁడు। ప్రల్లదుఁ డామీఁద నాత్మపలలాశియగున్ *(క॥ జననీజనకుల వృద్ధుల। దనయుల గు
రువిప్రసాధుదారాదుల నే। జనుఁడు ఘనుఁడయ్యుఁ బ్రోవక। వనరు నుజీవన్మృతుండు వాఁడె ధరిత్రిన్ ॥ అదియునుంగాక*
(శా॥ కారాశాలల మా నిమిత్తము మిమ్ముం గంసుండు గాఱింపఁగా। వారింపంగ సమర్థతల్ గలిగియు న్వారింపఁగా లేక ని। ష్ఠారు
ణ్యాత్ములమైన క్రూరులమహాకౌటిల్యసంచారులన్। సారాతిక్షములార మమ్ముం గొఱఁతల్ సైరించిర క్షింపరే* (వ॥ అనియిట్లు
మాయామనుష్యుండైన హరి పలికిన పలుకులకు మోహితులై, వారలనంకపీఠంబులనిడుకొని, కౌఁగిలించుకొని, కన్నీటం దడు
పుచుఁ, బ్రేమపాశబద్ధులై దేవకీవసుదేవులూరకుండిరంత, మాతామహుండైన యుగ్రసేనునిం జూచి* (చ॥ అనఘ యయాతి
శాపమున యాదవవీరులకున్న రేశ్వరా। సనమునను ండరాదు నృపసత్తమ రాజవు గమ్ము భూమికిన్। నినుఁ గొలువంగ నిర్జరులు
నీకరిఁ బెట్టుమరన్యరాజులం బనిగొను టెంత లెమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్ ॥ అనిపలికి*(క॥ మన్నించి రాజుఁ జేసెను।
వెన్నుఁడు సత్యానధాను విశ్రుతదానున్। సన్నుతమానున్ గదన। చ్ఛిన్నాహితసేనునుగ్రసేనున్ నీనున్* (వ॥ తదనంతరంబ,
తొల్లి కంసభీతులై విదేశంబుల నంగృశియించుచున్న, యదు, వృష్ణి, భోజ, మరు, దశార్హ, కుకురాంధక, ప్రముఖులగు, సకలజ్ఞాతి
సంబంధులను రావించి, విత్తంబులను విత్తంబులిచ్చి, వారి వారి నివాసంబులనుండ నియమించె, నివ్విధంబున* (క॥ మధుసూద
నసత్కరుణా। మధురాలోకనవిముక్తమానసభయులై। మధురవచనముల దారును। మధురానగరంబునను సులు నిరిన రేంద్రా*
(వ॥ అంతనొక్కనాఁడు సంకర్షణసహితుండై నందునిం జేరి గోవిందుం డిట్లనియె* (శా॥ తండ్రిం జూడము తల్లిం జూడము
యశోదాదేవియు నీవును మా। తల్లిం దండ్రియునంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లియే। తండ్రుల్ బిడ్డలనిట్లు పెంచిరి భవత్సౌజ
న్యభావంబులన్। దాండ్రీయింతటి వారమైతిమిగదా తత్త్వ యోమాలీలలన్* (ఉ॥ ఇక్కడనున్న బాంధవుల కెల్ల ను సౌఖ్యము చే
సి వత్తుమే। మక్కడికిన్మదీయులకు నందటికిన్ వినిపింపుమయ్య నే। మెక్కడనున్న మాకు మది నెన్నఁడు బాయవు మీ వ్రజంబులో,
మక్కువతోడ మీరు కృప మాకొనరించు క్రియావిశేషముల్* (వ॥ అనిపలికి వస్త్రభూషణాదులొసంగి సాదరంబుగ నం
గౌఁగిలించుకొని, గోవిందుండనిచిన, నందుండు ప్రణయవిహ్వలుండై, బాష్పజలపూరితలోచనుండగుచు, వల్లవులుం దానును
వ్రేపల్లెకుం జనియె నంత* (క॥ గర్గాదిభూసురోత్తమ। వర్గము చే నుపనయనము వసుదేవుఁడు స। న్మార్గంబునం జేయించెను। నిర్గ

—* రామకృష్ణులుపనీతులై కాశీపట్టణంబునకుం జని విద్యాభ్యాసము చేయుట. *—

ర్వచరిత్రులకు తనిజపుత్రులకున్*(క॥ ద్విజరాజవంశవర్యులు। ద్విజరాజముఖాంబుజోపదిష్టవ్రతులై। ద్విజరాజత్వము నొం
దిరి। ద్విజరాజాదిక జనంబు దీవింపంగన్* (వ॥ ఉపనయనానంతరంబున, వసుదేవుండు బ్రాహ్మణులకు సదక్షిణంబులు గాననేక
గోహిరణ్యదానంబులొసంగి తొల్లి రామకృష్ణుల జన్మసమయంబులందు నిజమనోదత్తలైన గోవులను చ్చరించియిచ్చి కా
ర్తార్థంబులనర్థులకుం బెట్టె, నిట్లు బ్రహ్మచారులై *(శా॥ ఉర్విన్మానవులెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కామితత్వ్వార్యారంభ
ము సేయంబోలరనుచున్ బోధించు చందంబునన్ । సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియున్ । గుర్వంగీకర
ణంబు సేయఁ జనిరా గోవిందుఁడున్ రాముఁడున్*(వ॥ చని మహావైభవరాశియైన కాశి జేరి, తత్తీరంబున, నవంతీపురనివా
సియు సకలవిద్యావిలాసియునయిన, సాందీపుండను బుధవర్యునింగని, యథోచితంబుగ దర్శించి, శుద్ధభావవర్తనంబుల భక్తిచే
యుచుసుండ వారలవలన సంతుష్టుండై * (శా॥ వేదశ్రేణియు నంగకంబులు ధనుర్వేదంబు దంత్రంబు ను । న్యాదివ్యాహృతధ
ర్మశాస్త్రములును ద్యన్యాయముం దర్కవి । ద్యాదక్షత్వము రాజనీతియును శబ్దప్రక్రియం జెప్పెనా । భూదేవాగ్రణి రామ
కృష్ణులకు సంభూతప్రమోదంబునన్* (క॥ అఱువదినాలుగువిద్యలు। నఱువదినాలుగు దినంబులంతనవార। ర్నెఱవాదులై సక
తమున। నెఱినొక్కొక నాఁటివిని కి నేర్చిరి లేశా* (క॥ గురువులకు నెల్లగురులై। గురులఘుభావములు లేక కొమరారు జగ। ద్గురు

లుత్రిలోకహితార్థము। గురుశిష్యన్యాయలీలఁగొలిచిరి వేడ్కన్* (వ॥ ఇట్లుకృతకృత్యులై నశిష్యులంజూచి వారలమాహా
త్మ్యంబునకు వెఱఁగుపడి, సభార్యుండైన సాందీపుండిట్లనియె*(శా॥అంభోరాశిప్రభాసతీర్థమునమున్నస్మత్తనూసంభవుం।
డంభోగాహము సేయుచున్మునిగి లేఁడన్యోన్యంగ్రహాంభోనిధుల్ । శంభద్వీర్యులుమీరుమీగురునికింజోద్యంబుగాశిష్యతన్।
గాంభీర్యంబునఁబుత్రదక్షిణయిడన్గర్తవ్యమూహింపరే* (క॥ శిష్యులుబలాఢ్యులైనవి। శేవస్థితినొందిగురువుజీవించునని।
దూర్వ్యగుణబలగరిష్ఠులు। శిష్యులరై గురునికోర్కెఁ నేయందగదే*(వ॥అనినవిని రామకృష్ణులుగుర్వర్థంబుగాదుర్వారరథా
రూఢులై,రయంబునంజని, రౌద్రంబునసముద్రంబుఁజేరియిట్లనిరి*(క॥సాగరనుబుద్ధితోడను। మాగురుపుత్రకునిదెమ్ముమా
ఱాడినని।వాగడమువుడువుడుస్సహ।వేగరణాభీలనిశితవిశిఖాస్సులకున్॥అనినవారలకుజలరాశియిట్లనియె*(ఉ॥వంచనయే
మిలేదుయదువల్లభులార ప్రభాసతీర్థమం। దంచితమూర్తివిప్రసుతుఁడాడ్యుఁడుతోయములాడుచుండను।త్సంచలితోర్మి
మొక్కటిప్రచండగతింగొనిబోయెఁబోవఁగాఁ। బంచజనుండుమ్రింగెనతిభాసురశీలునివిప్రబాలునిన్ ॥ అనివానివసియించు
చోటెఱింగించిన*(శా॥శంఖారావముతోడఁబంచజనుఁడాశంకించిచిత్తంబులో । నక్షిన్నంబుగవార్ధిఁజొచ్చెదహనజ్వా
లాభహేమోజ్జ్వల।త్పుంఖాస్త్రంబునఁగూల్చివానిజఠరంబున్వ్రచ్చిగోవిందుఁడు। ప్రేంఖద్విప్రసుతుఁడుబాలుఁగానకగురుప్రే
మోదితోద్యోగుఁడై*(క॥దానవునిదేహజ్ఞంబగు। మానితశంఖంబుఁగొనుచుమసలకబలుఁడున్।దోనేతేరఁగరథియై।దాన
వరిపుఁడరిగెదండధరుపురికిన్నపా*(వ॥చనిసంయమినీనామనగరంబుఁజేరి,తద్ద్వారంబునఁబ్రళయకాలమేఘగంభీరనినదభీష
ణంబగుశంఖంబుపూరించినవిని,వెఱఁగుపడి*(శా॥అస్మద్బాహుబలంబుఁగైకొనకశంఖారావము న్మానసా।వస్మారంబుగనే
వ్వఁడొకోనగరప్రాంతంబునంజేసెను।ద్విస్మేరాహవరోషపావకునిచేవిధ్వస్తుఁడైవాఁడుదా। భస్మంబై చెడునంచునంత
కుఁడుకోపప్రజ్వలన్మూర్తియై*(వ॥వచ్చిరామకృష్ణులంగని, వారులీలామనుష్యులైనవిష్ణుమూర్తులనియెఱింగి, భక్తితోడ
శుశ్రూషచేసి, సర్వభూతమయుండగుకృష్ణునకునమస్కరించి, యేమిసేయుదునానతిమ్మనినమహాత్ముండిట్లనియె*(క॥చె
ప్పెదమాగురునందనుఁ।దప్పుగలుగఁజూచినీవుదండనమునకున్।దెప్పించినాఁడవాతని। నొప్పింపుముమాకువలయునుత్తమచ
రితా*(క॥అనినవినివీఁడెవీనిం।గొనిపొండనిభక్తితోడగురునందనుని । చ్చినకృష్ణుఁడువీడ్కొలిపెను।ఘనదుర్జనదమనుమహి
షగమనున్శమనున్*(వ॥ఇట్లుజమునడిగితెచ్చిరామకృష్ణులుసాందీపునకుంబుత్రునిసమర్పించి యింకనేమిసేయవలయునా
నతిండనిననతండిట్లనియె*(క॥గురునకుఁగోరినదక్షిణ।గరుణన్నామున్నెవ్వఁడిచ్చెఘనులారభవ। ద్గురునకుగోరినదక్షిణఁ।దిర
ముగనిచ్చితిరిమీరుదీపితయశులై*(క॥కాలునివీటికిఁజనిమృత। బాలకుఁదెనొరులవశమెభవదీయకృపన్।మేలుదొరకొని
యెమాకవి।శాలమగుంగాతమీయశములోకములన్*(వ॥మహాత్ములారామేనుకృతార్థుండనయితినని దీవించినసాందీపుని
వీడ్కొని,కృతకృత్యులై రామకృష్ణులురథారోహణంబుచేసి,మథురకుంజనుదెంచిపాంచజన్యంబుపూరించినఁగని,నష్టధనం
బులుగనినవారిభంగింబ్రజలుప్రమోదించిరంతనొక్కనాఁడేకాంతంబున*(శా॥నాపైఁజిత్తములెప్పుడున్నిలుపుచున్నారా

## శ్రీకృష్ణుండు గోపకాంతలచెంతకు నుద్ధవునింబంపుట.

కఁగాంక్షించుచు।న్నాపేరాత్మలనావహించుచువగన్నానాప్రకారంబులన్ । గోపాలాంగనలెంతజాలిఁబడిరోకోపించిరో
దూఱిరో।వ్రేపల్లెన్నిజధర్మగేహములలోవిభ్రాంతలై తన్వులై॥అనిచింతించి*(క॥సిద్ధవిచారుఁగభీరున్।వృద్ధవచోవర్ణనీయు
వృష్ణిప్రవరున్।బుద్ధినిధినమరగురుసము।నుద్ధవునంజూచికృష్ణుఁడొయ్యనఁబలికెన్*(శా॥రమ్మాయుద్ధవ గోపకామినులునా
రాకల్నిరీక్షించుచున్।సమ్మోహంబుననన్నియున్మఱచియేచందంబునన్నుందిరో । తమ్మున్నమ్మినవారిడిగ్గవిడువన్ధర్మంబుగా
దంద్రు వే। పొమ్మాప్రాణములేక్రియన్నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్*(క॥లౌకికమెల్లకనన్నా।లోకించుప్రపన్నుల
కనులోఁబడికరుణా।లోకనములఁబోషింతును।నాకాశ్రితరక్షణములునైసర్గికముల్*(క॥సందేహమువానుండర।విందా
ననలారమిమ్ము విడువనువత్తున్।బృందావనమునకనిహరి। సందేశముపంపెననుమసంకేతమున్న*(వ॥అనిమందహాససుం
దరవదనారవిందుండై,కరంబుకరంబుననవలంబించి, సరసవచనంబులాడుచువీడ్కొలిపిన నుద్ధవుండునురథారూఢుండైసూ
ర్యాస్తమయసమయంబునకునందవ్రజంబుచేరి వనంబులనుండివచ్చుగోవులచరణరేణువులంబ్రచ్ఛన్నరథుండైచొచ్చినందు
మందిరంబుఁబ్రవేశించిన*(శా॥ఆపుణ్యాత్మునిఁగౌఁగిలించుకొనినందాభీరుఁడానందియై।మాపాలింటికిఁగృష్ణుఁడీతఁడనుచున్
మన్నించిపూజించివాం।ఛాపూర్ణంబుగమంజులాన్నమిడిమార్గాయాసముంబాపిన। ల్లాపోత్సాహముతోడనిట్లనియెసంబ
క్షించిమోదంబునన్*(క॥నామిత్రుఁడావసుదేవుఁడు।నేమమ్మునయున్నవాఁడెచెలువుగఁబుత్రుల్। నేమంబునసేవింపను।
హామత్తుండైనకంసుఁడడఁగినపిదపన్*(శా॥అన్నాభద్రమెతల్లిదండ్రులమమున్నాహాషింపచిచింతించునే।తన్నుంబాసినగోప
గోపికలమిత్రవ్రాతమున్గోగణం। బున్నిత్యంబుఁదలంచునేవననదీభూముల్ ప్రసంగించునే। వెన్నుండెన్నఁడువచ్చునయ్యా

యిటమాత్రేవపల్లెకో యుద్ధవా* (క॥ అంకిలిగలుగగమాకక। లంకేందునిపగిదిఁగాంతిలలితంబగుత। త్పంకజనయనుని నెమ్మొగ। మింకవిలోకింపఁగలదెయీజన్మమునన్* (క॥ అనిహరిమున్నొనరించిన। పనులెల్లన్నుడివి చెప్పి బాష్పాకుల లో। చనుఁడై డగ్గు త్తికతో। వినయంబుననుండె గోపవీరుండంతన్* (క॥ పెనిమిటిబిడ్డనిగుణములు। వినుపంపయశోదప్రేమవిహ్వలమతియై। చను మొనలబాలుగురియఁగఁ। గనుఁగొనలనుజలములొలుకఁగాబెగ్గిలియెన్* (వ॥ ఇట్లుగోవిందసందర్శనాభావవిహ్వలులైన యశోదానందులకునుద్ధవుండిట్లనియె* (క॥ జననీజనకులమిమ్ముం। గనుఁగొనశీఘ్రింబెవచ్చుఁగసిభద్రంబు। ల్పనజాక్షుండొనరిం చును। మనమునవగవకుడు ధైర్యమండనులారా* (మ॥ జలజాక్షుండుంగృష్ణుఁడు మర్త్యులేవసుమతీభారంబు వారింపవా। రలరూపం బులఁబుట్టినాఁడుహరినిర్వాణప్రభుండిప్పుడు। జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్స్వేశుఁజింతించువాఁ। డలఘుశ్రే యముఁబొందుబ్రహ్మమయుఁడై యశోకభుఁడై నిత్యుఁడై *(సీ॥ అట్టినారాయణుండఖిలాత్మభూతుండు కారణమానవాకా రుఁడైనఁ। జిత్తంబులతనిపైఁజేర్చిసేవించితిరతికృతార్థులరై తిరనవరతము। శోభిల్లునింధనజ్యోతిచందంబున నఖిలభూతము లందునతఁడతనికి। జననీజనకదారసఖపుత్రబాంధవశత్రుప్రియాప్రియజనులులేరు। జన్మకర్మములునుజన్మంబులును లేవు। శిష్టరక్షణంబుసేయుకొఱకు। గుణవిరహితుఁడయ్యుగుణియగుసర్వేశ। తుఁడవినాశకేళిసలుపుచుండు* (వ॥ అనిమఱియుఁ బె క్కువిధంబులహరిప్రభావంబులువన్యసించుచు నారేయిగడపి దధిమథనశబ్దంబులాకర్ణించుచు లేచిమఱునాఁడుకృతానుష్ఠా నుండై యుద్ధవుండొక్కరహస్యప్రదేశంబున నున్నసమయంబున* (శా॥ రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోదార స్కంధుఁడుపీతాంబరుం। డానుస్థితబాహుదండంబురుహమాలాలంకృతుండుల్లస। ద్రాజత్కుండలుఁడొక్కవీరుఁడిచటన్రా

శ్రీమరగీతలు.

జిల్లుచున్నాఁడుమా। రాజీవాక్షునిభంగినంచుఁగనిరారాజాస్యయుంగోపికల్* (వ॥ కనిలజ్జాసహితహాసవిలోకనంబు లుముఖంబులకుంజెలువొసంగనిట్లనిరి* (చ॥ ఎఱుఁగుదుమేమునిన్నువనజేక్షణమిత్రుఁడవీవుహరిమిమ్। మెఱయుచుఁదల్లిదం డ్రులపమేలెఱుఁగింపఁబ్రియుండుపంపఁగా। వలిలేదుభక్తివచ్చితివి వారలనైనమనంబులోవలన్। మఱువఁడుశౌరిమేలు మఱిమాన్యులురాజునకెవ్వరిచ్చటన్* (క॥ మునివరులైనబంధుల। ఘనసఖ్యముపిడువలేరుగాకవిడువరే। యనిమిత్తస ఖ్యమాఁకటి। పనిదీరిననళులువిరులఁబాయునోలేదో* (చ॥ అనియిటుగోపికల్వలుకనందొకగోపిక కృష్ణపాదచిం। తనమునఁ జొక్కిచేరువను-రైవవశంబునగాంచెనుజ్జ్వల। త్సునిశితసద్వివేకముఁబ్రసూనచరందమదాతిరేకమున్। ఘనమృదునాద సంచలితకాముకలోకముఁజంచరీకమున్* (వ॥ కనిహరిదమ్మంబ్రార్థింపఁబుత్తెంచినదూతయనికల్పించుకొని యుద్ధవునికిన న్యాపదేశంబై యెఱుకపడనయ్యళికిందొయ్యలియిట్లనియె* (మ॥ ధరిమరాదుర్జనమిత్రముట్టకుముమాపాదాబ్జములన్నా గర। ప్రమదాళీకుచకుంకుమాంకితలసత్పాత్రీశదామప్రసూ। నమరందాగుణితాననుండవగుటన్నాథుండుమన్నించుఁగా। క మమున్నేఁపుచుఁజొరకాంతలశుభాగారంబులన్నిత్యమున్* (మ॥ ఒకపువ్వందలితేనెద్రావిమధుపాయుత్సాహివై నీవు వే। జొకటింబొందెదుభంగిమన్మథరపియ్యాపంబులందేల్చిమా। యకలంకోజ్జ్వలయౌవనంబుఁగొనియన్యాసక్తుఁడయ్యె న్విభుం। డకటాయాతనికెట్లుదక్కెసిరిమిథ్యాకీర్తియయ్యెన్జుమీ* (శా॥ భృంగాకృష్ణుఁడుమంచివాఁడనుచుసంప్రీతింబ్ర శంసించెదీ। సంగీతంబుననేముసొక్కుదుమెతచ్చారిత్రముల్వింతలే। యంగీకారముగావుమాకుఁబురకాంతాగ్రప్రదేశంబు లన్। సంగీతంబొనరించువారిదుడురోజన్నీకునిష్టార్థముల్ *(మ॥ సమదాళీశ్వరచూడుముజ్జ్వలితహాసభ్రూవిజృంభంబు లన్। రమణీయుండగుశౌరిచేఁగరఁగరేరామల్త్రిలోకంబులన్। బ్రమదారత్నములక్ష్మియాతనిపదాబ్జాతంబుసేవించుని। కన్నునేమెవ్వరమాకృపాజలధికింగారుణ్యముంజేయఁగన్* (శా॥ రోలంబేశ్వరనీకుదౌత్యముమహారూఢంబు నీనేరుపు। ల్పాలున్మచ్చరణాబ్జముల్విడువుమస్మన్నాథపుత్రాదులన్। లీలంబాసిపరంబుడించితనకున్లీనత్వముంబొందుమ। మ్మేలా పాసెవిభుండుధార్మికులుమున్నీచందముత్మెత్తురే* (శా॥ వాలింజంపెనువేఁటకానిపగిదిన్వందించిదైత్యానుజన్। లో లంబట్టివిరూపఁజేసెనుబలిన్లోభంబుతోఁగట్టియా। త్రైలోక్యంబుమొఱంగిపుచ్చుకొనియెన్ధర్మజ్ఞుఁడేమాధవుం। డేలా షట్పదయొగ్గుమావలననీకెగ్గింపఁగానేటికిన్* (ఉ॥ పన్నగమింటిపైకెగసిపాలువిహంగములైననీనులన్। దన్నొకమాటువి న్నగృహదారసుతాదులఁబాసివిత్తసం। పన్నతడిందిసంసరణపత్త్థిఁబాపెడువాఁడునిత్యకాం। తున్నెఱినున్నమాత్రబతుకుసై చునెయేలమధువ్రతోత్తమా* (మ॥ కమనీయంబగువేఁటకానిపలుకాకర్ణించినికన్బుగాఁ। దనుచిత్తంబులఁజేర్చిచేరి హరిణుల్తద్బాణనిర్భిన్నలై। యమితోగ్రవ్యథనొందుభంగి హరిమాయాలాపముల్నమ్మిదుః। ఖములంజెందితి మంగజా స్త్రజనితోగ్రశ్రాంతిసందిఁదిరా* (ఉ॥ బంధులబిడ్డలన్మగలభ్రాతలఁదల్లులఁదండ్రులన్మనో। జాంధతఁజేసి డించితనున న్మిమనమ్ముచివియోగదుర్దశా। సింధువులోనఁద్రోఁచియిటుచేరకపోవుటపాడిగాదువు। వ్వంధయమీయధీశునకుఁబాదము

లంబడియొత్తి చెప్పవే* (సీ॥ కాంచనరత్నసంఘటితసౌధంబు లేమాకుటీరంబులుమాధవునకు। వివిధనరేంద్రసేవితరాజధాని యేమాపల్లెయమవంశమండనునకు। సురభిపాదపలతాశోభితారామ మేమాయరణ్యముసింహమధ్యమునకుఁ। గమనీయలక్షణ గజతురంగంబు లేమాధేనువులుకంసమర్దనునకు । రూపవిభ్రమనైపుణరూఢలైన। మగువలమెమేముమన్మథమన్మథునకు। నేలఁజింతించుమముఁగృష్ణుఁడేలతలఁచుఁ। బృథివినధిపులునూతనప్రియులుగారె* (వ॥ అనిమఱియుఁనిట్లనేకవిధంబులఁగృష్ణ సందర్శనలాలసలయి పలుకుచున్న గోపికలవచనంబులువిని యుద్ధవుండుమధురాలాపంబులనూరార్చుచు నిట్లనియె* (మ॥ జపదానవ్రతహోమసంయతతపస్స్వాధ్యాయముఖ్యంబులన్। నిపుణుల్గోరియు నేవిభున్మనములన్నిల్పంగ లేరట్టిసు। ద్వి పులాకారుని పైమహామహిముపైవిశ్వేశుపైమీకజ । స్రపటుధ్యానము లిట్లునిల్చెనె భవచ్చారిత్రము ల్చిత్రముల్ *(క॥ న నుమీకడకుంగృష్ణుఁడు। పనిపంపెడువేళఁబిలిచిపలికినపలుకు। ల్వినుఁడన్నియువివరించెద। వనజేక్షణలార మీరువగవకుఁడింకన్॥ అనిహరివచనంబులుగానిట్లనియె * (సీ ॥ ఎల్లకార్యములకు నేనుప్రధానకారణముగావున మీకురమణులార । కలుగదుమ ద్వియోగముచరాచరరూపములలోమహాభూతములువసించు । కరణినుండుదుసర్వగతుఁడనై నేమనఃప్రాణబుద్ధిగుణేంద్రి యాశ్రయుండ । నాత్మయందాత్మచేనాత్మఁబుట్టింతురక్షింతునుద్రుంతుహృషీకభూత । గుణగణాకారమాత్మలోఁగోమరు మిగుల। నిబిడమాయానుభవమునసత్యశుద్ధ। మాత్మ విజ్ఞానమయము వేఱయ్యుఁగుణము । ప్రకృతికార్య మనోవృత్తిఁబట్టిపొం దు* (చ॥ కలఁగని లేదిమున్నుగలఁగన్నసమస్తవిధంబుకల్లగాఁ । దలఁచినభంగిమానసపదార్థము చేనిఖిలేంద్రియార్థముల్ బ్బలమునఁగట్టితజ్ఞుఁడు ప్రపంచములేదనుఁదన్మనంబుఁదా । రలయకగట్టుఁడున్బుధులకవ్వలనొండొక భేదమున్నదే*(గీ॥ సాంఖ్యయోగనిగమసత్యతపోదమ। ములుమనోనిరోధములుగడపల। గాఁగనుండుజలధికడపలగాఁగల । నములభంగినళినన యనలార*(మ॥ చెలువల్దవ్వులనున్నవల్లభులపైఁజిత్తంబులంగూర్తురు। తఱలికంజేరువవారికంటెనదియుంగాదెప్పుడు న్నన్నుమీ। రలుచింతించుచునుండఁగోరియిటుదూరస్థత్వముంబొందితిన్। దలఁకంబోలమనన్నుఁబొందెదరునిత్యధ్యానపారీణ లై*(వ॥ అనిమీకుంజెప్పుమనికృష్ణుండు సెప్పెననవుఁడునుద్ధవునికింగోపికలుసంతసించియిట్లనిరి* (ఉ॥ ఇమ్ములనున్నవాఁడె హరియిక్కడికెన్నఁడువచ్చువచ్చిమా। యుమ్మలికంబువాపునెప్రియుండిటవచ్చెదనన్న సైఁతురే । యమ్మధురాపురీరమణులడ్డ మువత్తురుగాక చెల్ల రే। మమ్ము విధాతనిర్దయుఁడు మన్మథవేదనపాలుచేసెనే* (చ॥ మఱచు నెకో మదింపఁదిమాధవుఁడా యమునాతటంబునన్। దలుచుగదివ్యసౌరభలతాగృహసీమల నేము రాఁగమా । ములుపులనుండినీడలకు మమ్మెలయించి కలంచి దేహముల్। మఱచినఁనేర్చినూలొత్తౌలిపిమన్మథలీలలఁదేల్చుచందముల్* (శా॥ నీతోనర్మగృహంబులం బలుకునే నే మెల్లవంశో ల్లస। ద్గీతభ్రాంతలమైకళిందతనయాతీరంబునంజేరినన్ । జేతోజాతసుఖంబులందనిపిమాచిత్తస్థితుల్బాడలీ । లాతంత్రజ్ఞత దాఁగి మెల్లనమదాలాపంబులాలించుటల్ * (క॥ ముచ్చటవేళలఁజెప్పునె । యచ్చుగమును నేము నోము నప్పుడు జలముల్ ల్సొచ్చినమాచేలంబులు। మ్రుచ్చిలియిచ్చినవిధంబుమూలంబెల్లన్* (శా॥ ఏకాంతంబుననీదుపైనొరిగితానేమేనిభాషించు చో। మాకాంతుండువదించు నేరవిసుతామధ్యప్రదేశంబునన్। రాకాచంద్రమయూఖముత్మైఱయఁగారాసంబుమాతోడనం। గీ కారంబొనరించిబంధనియతింగ్రీడించువిన్నాణముల్ * (సీ॥ తనుబాసియొక్కింతతడవైననిటమీఁద నేలపైమేనులు నిలువ వనుము। నేలపైమేనులునిలువకయటమున్నధైర్యంబులొక్కటఁదలఁగుననుము। ధైర్యంబులొక్కటఁదలఁగినపిమ్మటఁజిత్తంబు లిక్కడఁజిక్కవనుము । చిత్తంబులిక్కడఁజిక్కకవచ్చిన ప్రాణంబులుండక పాయుననుము । ప్రాణములుపోవ మఱివచ్చి ప్రాణవిభుఁడు। ప్రాణిరక్షకుఁడగుతన్నుఁబ్రాణులెల్లఁ। జేరిదూఱంగమఱియేమి సేయువాఁడు । వేగ విన్నపమొనరింపవేమ హాత్మ* (మ॥ తగులరెమఁగలనుమగువలు। దగులదెతనుమున్నుగమలతగవువిడిచియున్। దగిలినమగువలవిడుచుట। దగుఁ దగదనితగవుబలుకఁదగదువుహరికిన్ *(సీ॥ విభుఁడుమాప్రేవల్లెవీథులనే తేరఁజూతు మేయొకనాఁడుచూడ్కులలరఁ । బ్రభుఁ డుమాతోనర్మభాషలుభాషింపవిందుమేయొకనాడువీనులలరఁ । దనువులుపులకింపఁదయితుండుఁడాసినఁగలుగునే యొక నాఁడుకౌఁగిలింపఁ। బ్రాణేశమమ్మెలపాసితివనిదూఱఁదొరకునే యొకనాఁడుతోట్రుపడఁగ । వచ్చునేహరిమేమున్నవనముఁ జూడఁ। దలఁచునే భర్తమాతోడితగులుతెలుఁగుఁ। దెచ్చునేవిధిమున్నాథుఁదిట్టుపడక। యెఱుఁగఁబలుకుమహాత్మనీకెఱుఁగవ చ్చు*(వ॥ అనిదుఃఖార్ణవమగ్నంబైనగోపకులంబునుద్ధరింపుమురమానాథయనిగోపికలువగచితదనంతరంబమఱియునుద్ధ వనిగదితంబయినకృష్ణసందేశంబువలనవిరహవేదనలువిడిచియుద్ధవునింబూజించిరిట్లుకృష్ణలీలావర్ణనలుసేయుచు వ్రేపల్లెనుద్ధ వుండుగొన్నినెలలుండినందాదులవీడ్కొనిమఱలిరథారూఢుండై చనిచని*(క॥ సారమతిఁబ్రణుతిసేయుచు । నారయనుద్ధవుఁ డుగాంచెనఘసంహారి। ద్వారిన్మధురానగరవి। హారిన్రిపుజనమదాపహారిన్ శౌరిన్*(వ॥ కనియథోచితంబుగాభాషించుచు దనచేతనందాదులుపుత్తెంచినకానుకలుబలకృష్ణులకునునుగ్రసేనునికివేఱు వేఱయిచ్చెనని చెప్పి శుకుండుపరీక్షిన్నరేంద్రునకిట్ల

మాగతభృంగసంగము । నొప్పదు నిద్రఁ గైకొనదు రోజపరస్పరసక్తహారము । ల్విప్పదు కృష్ణమార్గగతవీక్షణపఙ్క్తులఁ ద్రిప్ప దెప్పుడున్ ॥ * (చ॥ తుడవదు కన్నుల న్వెడలుతోయకణంబులఁ గొప్పుజక్కఁగా । ముడువదు నెచ్చెలింగదిసి ముచ్చటకుం జనదన్న మేమియు । న్గుడువదు నీరముం గొనదు భూరిమిఁ గీరముఁ జేరి పద్యము । న్నొడువదు వల్లకీగుణవినోదము సేయదు డాయ ధన్యులన్ * (సీ॥ మృగనాభియలఁదదు మృగరాజమధ్యమ జలములనాడదు జలజగంధి । ముకురంబుఁ జూడదు ముకురసన్నిభముఖి పువ్వులఁ దురుమదు పువ్వుఁబోఁడి । వనకేళిఁ గోరదు వనజాతలోచన హంసంబుఁ బెంపదు హంసగమన । లతలఁ బోషింపదు లతికాలలితదేహ తొడవులు దొడవదు తొడవుతొడవు । తిలకమిడదు నుదుటఁ దిలకినీతిలకంబు । కమలగృహముఁ జేరదు కమలహస్త । గారవించితన్నుఁ గరుణఁ గైకొనవన । మాలి రాఁడు తగవుమాలి యనుచు ॥ మఱియును * (మ॥ మలఁగున్మెల్లనిగాలికిన్వటునటన్మత్తద్విరేఫాలికిన్నదలఁగున్గోయిలమ్రోతకై యలుగు నుద్యత్కీరసంభాషలన్నలఁగున్వెన్నెలవేడిమిన్మెలఁగు మాకందాంకురచ్ఛాయకున్ । డోలగున్గొమ్మమనోభవానలశిఖాదోధూయమానాంగియై * (వ॥ ఇట్లు హరిరాక కెదురుచూచుచు సకలప్రయోజనంబులయందు నుపరక్తయై మనోజానలంబునం బొగిలెడి మృదువకు శుభంబుఁ జెప్పు చందంబున వామోరులోచన భుజంబు లదరె నంతఁ గృష్ణునిర్యోగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన నతని ముఖలక్షణంబు పలక్షించి యాకలకంఠి సుహాసాంకురంతతోడ నకుంఠితనైమోగంబున సంజలి నగవు సేగుడ నెదురంజలి నిలువంబడిన బ్రాహ్మణుం డిట్లనియె * (ఉ॥ మెచ్చె భవద్గుణోన్నతికి మేయధనావళు లిచ్చె నాకుఁ దా । వచ్చెను దగ్గనాయుధుఁడు వాఁ డసురాసురులెల్ల నడ్డమై । వచ్చిననైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ననీ । సచ్చరితంబు భాగ్యమును సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా । అనిన వైదర్భి యిట్లనియె * (మ॥ జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశము న్జెప్పవా । న్నలువం బెట్టితి శ్రీకృపం బతికి తిన్నీయుట్టిపుణ్యాత్మకు । ల్గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిన్గావింపఁగా నేరనంజలిఁ గావించెద భూసురాన్వయమణీ సద్బంధుచింతామణీ * (వ॥ అని నమస్కరించె నంత రామకృష్ణులు దనకూఁతు వివాహంబునకు వచ్చుట విని తూర్యఘోషంబులతో నెదుర్కొని విద్యుక్తప్రకారంబునం బూజించి మధుపర్కంబు లిచ్చి వివిధాంబరాభరణంబులు మొదలైన కానుకలొసంగి భీష్మకుండు బంధుజన సేనాసమేతులైన వారలకుం దూర్ణంబున సకలసంపత్పరిపూర్ణంబులైన నివేశంబులు గల్పించి విడియించె నిట్లు గూడిన రాజులకెల్లను వయోవీర్యబలవిత్తంబు లెట్లట్ల కోరినపదార్థంబులెల్ల నిప్పించి పూజించె నంత విదర్భపురంబు ప్రజలు హరిరాక విని వచ్చి చూచి నేత్రాంజలులం దదీయవదనకమల మధుపానంబు సేయుచు * (మ॥ తగు నీచక్రి విదర్భరాజసుతకున్ దథ్యంబు వైదర్భియుం । దగు నీచక్రికి నింతవంది దగు నీదాంపత్యమీయిద్దరిం । దగులం గట్టిన బ్రహ్మ నేర్పరిగదా దర్పాహతారాతియై । మగఁడౌఁగావుత చక్రి యీరమణికిన్ మా పుణ్యమూలంబునన్ ॥ అని పలికి రా సమయంబున * (సీ॥ సన్నద్ధులై బహుశస్త్రసమేతులై బలసి చుట్టును వీరభటులు గొలువ । ముందఱ నుపహారములు కానుకలు గొంచు వర్గంబులై వారవనితలేఁగఁ । బువ్వుగంధాంబరభూషణకలితలై పాడుచు భూసురభార్యలరుగఁ । బణవమర్దళశంఖపటహకాహళవేణుభేరీధ్వనులమిన్నుపిక్కటిలఁగ । దగిలి సతులు గొల్వఁ దల్లులు బాంధవసతులు దోడరాఁగ సవినయమున నగరు వెడలి నడిచె నగజాతకును మ్రొక్క । బాలచికురపిహితఫాలయగుచు * (వ॥ మఱియు సూతమాగధవందిగాయకపాఠకజనులు సంతసంబున నభినందించుచుం జనుదేర మందగమనంబున ముకుందచరణారవిందంబులు డెందంబునం దలంచుచు నిందుధరసుందరీమందిరంబు చేరి సలిలధౌతచరణకరారవిందయై వార్చి శుచియై గౌరీసమీపంబునకుం జనియె నంత ముత్తైదువలగు భూసురోత్తముల భార్యలు భవసహితమైన భవానికి మజ్జనంబు గావించి గంధాక్షతంబు లిడి వస్త్రమాల్యాదిభూషణంబుల నలంకరించి ధూపదీపంబులొసంగి నానావిధోపహారంబులు సమర్పించి కానుకలిచ్చి దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించిరప్పుడు * (ఉ॥ నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్ । మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ మేటిపె । ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరిం బతిసేయుమమ్మ ని । న్నమ్మినవారి కెన్నటికి నాశము లేదు గదమ్మ యీశ్వరీ * (వ॥ అని గౌరీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణభార్యలకు లవణాపూపంబులును దాంబూలకంఠసూత్రంబులును ఫలంబులు నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారలం బూజించిన * (గీ॥ వారలుత్సహించి వలనొప్ప దీవించి । సేసలిడిరి యువతిశిరమునందు । సేసలెల్లఁ దాల్చి శివవల్లభకు మ్రొక్కి । మౌననియతి మాని మగుడ వెడలె * (వ॥ ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగున మృగధరమండలంబు నిర్గమించి చరించు మృగంబు చందంబునఁ, గమలభవనర్తకుం డెత్తి నిజవనిక మఱుఁగు దెరలి పొడసూపిన మోహినీదేవత కైవడి, దేవదానవసంఘాతకరతలసవ్యాపసవ్యసమాకృష్యమాణపన్నగేంద్రపాశపరివలయితపర్యాయపరిభ్రాంత మందరాచలమంథానమథ్యమానఘూర్ణితఘుమఘుమాయిత మహార్ణవమధ్యంబుననుండి చనుదెంచు నిందిరాసుందరీవైభవంబున, బహువిధప్రభాభాసమానయై, యిందుధరసుందరీమందిరంబు వెడలి, మా

కలువడములు-చిన్నటెక్కెములు—తూర్ణము-శీఘ్రము==జవనిక-తెర,

నపకాసార హేమకమల కాననవిహారమాణ మత్తమరాళంబుభంగి, మందగమనంబునఁగనకకలశయుగళసంకాశకర్కశవయోధరభారపరిశంవ్యమానమధ్యయై,రత్నముద్రికాలంకృతంబైన కెంగేలనొక్క సఖీలలామంబుకైదండఁగొని, రత్ననివహసముంచిత కాంచనకర్ణపత్త్రమయూఖంబులుగండభాగంబుల నర్తనంబులసలుప,నరవిందపరిమళకుతూహలావతీర్ణమత్తమధుకరంబులమాడ్కినరాళంబులైనకుంతలజాలంబులు ముఖమండలంబునఁగ్రందుకొన, సుందరమందహాసరోచులుదిశలందు బాలచంద్రికాసౌందర్యంబునావహింప, నధరబింబఫలారుణమరీచిమాలికలు రదనకుందకుట్మలంబులకనురాగంబు సంపాదింప-మనోజాతకేతనసన్నిభంబైనపయ్యెదకొంగుదూఁగసువర్ణమేఖలాఘటితమణికిరణపటలంబుల కాలశక్రచాపజనకంబులై మెఱయఁ,జెలువుకుప్పలుగుండొఅవెటికివాడియిడిఝళిపించిన దగద్ధగాయమానంబులగు బాణంబులపగిది,సురుచిరవిలోకననికరంబులు రాజవీరులహృదయంబులుభేదింప, శింజానమంజుమంజీరనినదంబు చెవులపండువులుసేయఁ బాదసంచారంబునహరిరాక కెదురుచూచుచు,వీరమోహినియైచను దెంచుచున్నసమయంబున*(మ॥అలినీలాలకఁబూర్ణచంద్రముఖినేణాక్షింబ్రవాళాధరి। న్గలకంఠిన్నవపల్లవాంఘ్రియుగళింగంధేభకుంభస్తనిన్। బులినశ్రోణినిభేంద్రయాననరుణాంభోజాతహస్తన్మహోత్పలగంధిన్మృగరాజమధ్యఁగనివిభ్రాంతాత్ములైరందఱున్*(వ॥మఱియునయ్యింతిదరహాసలజ్జావలోకనంబులంజిత్తంబు లేమఱి ధైర్యంబులుదిగనాడిగాంభీర్యంబులువిడిచిగౌరవంబులుమఱచి చేష్టలుమాని యెఱుకలుడిగియాయుధంబులుదిగవైచిగజతురగరథారోహణంబులుసేయనేరక రాజులెల్ల నేలకువ్రాలిరామేణీలోచనతనవామకరనఖంబులనలకంబులుదలంగంద్రోయుచును త్తరీయంబు చక్కనొత్తుచుఁగడగంటిచూపులంగ్రమంబున నారాజలోకంబు నాలోకించుచు*(శా॥ కనియెంగారుక్మిణిచంద్రమండలముఖింగంఠీరవేంద్రావల। గ్నునవాంభోజదళాక్షుఁజారుతరవక్షున్మేఘసంకాశదేః। హునగారాతిగజేంద్రహస్తనిభబాహుంజక్రిఁబీతాంబరు। న్ఘనభూషాన్వితుఁగంబుకంఠుఁ(?)విజయోత్సాహం

...*శ్రీకృష్ణుండుశత్రురాజులుచూచుచుండరుక్మిణిదేవింగొనిపోవుట-*...

ఢున్జగన్మోహనున్*(వ॥ కనితదీయరూపవయోలావణ్యవైభవగాంభీర్యచాతుర్యతేజోవిశేషంబులకుసంతసించిమనోభవశరాక్రాంతయైరథారోహణంబుఁగోరుచున్నవరారోహంజూచిపరిపంథిరాజలోకంబులుసూచుచుండ మందగమనంబునగంధసింధురంబులీలంజనుదెంచి ఘేరవంబులనడిమిభాగంబుగొనిచనుకంఠీరవంబుకైవడి, నిఖిలభూపాలగణంబుల గణింపకఁదృణీకరించిరాజకన్యకందెచ్చి, హరితనరథంబుమీఁదనిడికొని భూనభోంతరాళంబులునిండశంఖంబుపూరించుచు,బలభద్రుండుతోడనడువయాదవవాహినీపరివృతుండై,ద్వారకానగరమార్గంబుపట్టిచనియెనంత జరాసంధవశులైనరాజులందఱుహరిపరాక్రమంబువిని సహింపనోపక *(మ॥ ఘనసింహంబులకీర్తినీచమృగముల్గైకొన్నచందంబునన్। మనకీర్తుల్గొనిబాలుఁదోడ్కొనుచునున్మాదంబుతోగోపకు। ల్చనుచున్నారదెశౌర్యమెన్నటికిమీశస్త్రాస్త్రముల్గాల్పనే। తనుమధ్యన్విడిపింపమేనినగదేఘాత్రీజనుల్గ్రింతలన్*(వ॥ అనియొండొరులఁదెల్పుకొని రోషంబులుహృదయంబులనల్పుకొనిసంరంభించితనుత్రాణంబులవహించిధనురాదిసాధనంబులు ధరియించిపంతంబులాడి తమతమచతురంగంబులంగూడి జరాసంధాదులుయదువీరులవెంటనంటందాఁకినిలునిలుండనిధిక్కరించిపలికి యుక్కుమిగిలి మహీధరంబులమీఁద సలిలధారలుగురియుధారాధరంబులచందంబున బాణవర్షంబులుగురిసిన యాదవసేనలంగలదండనాథులుకోదండంబులెక్కిడిగుణంబులు మోయించినిలువంబడిరప్పుడు*(క॥అరిబలభటసాయకములఁ।హరిబలములుగప్పఁబడిననడరెడుభీతిన్।హరిమధ్యసిగ్గుతోడను।హరివదనముఁజూచెఁజకితహరిణేక్షణయై॥ ఇట్లుచూచిన*(క॥ వచ్చెదరదెయదువీరులు। వ్రచ్చెదరరిసేననెల్లవైరులపెలుచన్నొచ్చెదరునువిచ్చెదరును।జచ్చెదరును నేఁడుచూడుజలజాతాక్షి*(వ॥ అనిరుక్మిణీదేవినిహరియూరడించెనంతబలభద్రప్రముఖులైనయదువీరులుప్రళయవేళమిన్నునంబన్నిబలుపిడుగులడరించుపెనుమొగుళ్లవడువున జరాసంధాదిపరిపంథిరాజచక్రంబుమీఁదనవక్రపరాక్రమంబునశిఖిశిఖాసంకాశనిశితశిలీముఖనారాచభల్లప్రముఖంబులైన బహువిధ బాణపరంపరలుగురియుననదియును, విగళితమత్తమాతంగంబును- విచ్ఛిన్నతురంగంబును- విభిన్నరథవరూథంబును - వినిహతపదాతియూథంబును.. విఖండితవాహవారణరథారోహణమస్తకంబును - విశకలితవక్షోమధ్యకర్ణకంఠకపోలహస్తంబును - విస్ఫోటితకపాలంబును-వికీర్ణకేశజాలంబును - విపాటితచరణజానుజంఘంబును-విదళితదంతసంఘంబును-విఘటితవీరమంజీరకేయూరంబులును-విభ్రష్టకుండలకిరీటహారంబును-విశ్రుతవీరాలాపంబును - విదార్యమాణగదాకుంతతోమరవరశుపట్టసప్రాసకరవాలశూలచక్రచాపంబును - వినిపాతితకేతనచామరఛత్త్రంబును - విలూనతనుత్రాణంబును-వికీర్యమాణఘోటకసంఘరింఖాసముద్ధూతధరణీపరాగంబును - వినష్టరథవేగంబును-వినివారితసూతమాగధవందివాదంబును- విఘూర్ణిత హయహేషాపటహభాంకార - కరటిఘటాఘీంకార,రథనేమిపటాత్కార -తురగనాభిఘంటాఘణఘణాత్కార-వీరహుంకార- భూషణ

ఘుణఘుణాత్కార, నిస్సాణధణధణాత్కార, మణినూపుర క్రేంకార, కింకిణీకిణకిణాత్కార, శింజినీటంకార, భటపరస్పరగర్జి
త్కార నాదంబును, విభిద్యమాన రాజసమూహంబును- విసృమాన రక్తప్రవాహంబును, విఘూర్ణమాన భూతభేతాళ కల
కలంబును- విజృంభమాణ ఫేరవ కాకకంకాది సంకులంబును, ప్రచలిత కబంధంబును- ప్రభూత పలలగంధంబును- ప్రదీపిత మే
దోమాంసరుధిర ఖాదంబును- ప్రవర్తిత ఢాకినీ ప్రమోదంబును నై యుండె నప్పుడు* (చ॥ మగుడ చలించి పాఱుచును వాగధము
ఖ్యులు గూడి యొక్కచో। వగచుచు వాలి గోల్పడిన వాని క్రియం గడు వెచ్చనూర్చుచున్। మొగమునఁ దప్పిదేఱ దమ ముంగటఁ
బొక్కుచున్న చైద్యుతోఁ। బగతుర చేతులోఁబడక ప్రాణముతో మృతమున్నవాఁడవే* (గీ॥ బ్రతుకవచ్చు నోడలఁ బ్రాణంబు
లుండినఁ। బ్రదుకుఁ గలిగెనేని భార్య గలదు। బ్రతికితీవు భార్యవట్టు దైవమెఱుంగు। వగవవలదు చైద్య వలదు వలదు* (వ॥ ఓనృప
దేహధారి స్వతంత్రుండు గాఁడు। జంత్రగాని చేతి జంత్రపు బొమ్మకైవడి - నీశ్వరతంత్ర పరాధీనుండై సుఖదుఃఖంబులందు వర్త
నంబులు సలుపు; దొల్లి నేను మధురాపురంబు మీఁదఁ బదియేడుమాఱులు పరాక్రమంబున విడిసి సప్తదశ వారంబులు చక్రిచేత ని
ర్జాలిత బలచక్రుండనై కామపాలు చేతం బట్టువడ నీకృష్ణుండు కరుణతో విడిపించిన వచ్చి క్రమ్మఱ నిరువదిమూఁడక్షౌహిణులం
గూడుకొని పదునెనిమిదవమాఱు దాడిచేసి శత్రువులం దోలి విజయంబుఁ జేకొంటిఁ - జయాపజయములందు హర్ష శోకంబులం
జెంద నే నెన్నఁడు నేఁటిదినంబున నీకృష్ణుని కెదిరి బోర మన రాజలోకంబు లెల్లను గ్రాతుఁ గూడుకొని యెదిరిపోరిన నోడుదు-
మింతియ కాక దైవయుక్తంబయిన కాలంబునం జేసి లోకంబు పరిభ్రమించుచుండు నదియునుంగాక * (మ॥ తపకుంగాల
ము మంచిదైన మనలం దైత్రైలోక్యవిఖ్యాతవి। క్రమములం గల్పెరి యాదవుల్ హరిభుజాగర్వంబున న్నేఁడు కా। లము మేలై చను
దెంచెనీ మన ముననీ లక్షించి విద్వేషులన్ సమరక్షోణి జయించె మింతపనికై శోకింపనీ కేటికిన్* (వ॥ అని యిట్లు జరాసంధుండును
తక్కిన యొద్దిరాజులును - శిశుపాలుని పరితాపంబు నివారించి తమతమ భూములకుం జనిరి శిశుపాలుండును అనుచర సేనాసమేతుం
డై తననగరంబునకుం జనియె నంత రుక్మియనువాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబున దన చెలియలం గొనిపోవుటకు సహింప
క నేకాక్షౌహిణీ బలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదగిలి పోవుచుఁ దన సారథి కిట్లనియె* (ఉ॥ బల్లిదుననన్న
భీష్మజనపాలకుమారుని జిన్న చేసినా। చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కక చిక్కపు బంటువోలెనీ। గొల్లడు వో యెడిన్ రథముఁ
గూడఁగఁ దోలుము తేజిశోల్ల సుద్ఘల్ల పరంపరన్ మదముఁ బాపెదఁ జూపెద నా ప్రతాపమున్* (వ॥ అని యిట్లు నారుక్మి హరికోలం
ది యెఱుంగక సారథి నదలించి రథంబు గూడం దోలించి గోపాలక వెన్నముచ్చ నిమిషమాత్రంబు నిలు నిలుమని తిరస్కరించి బలు
వింటనారి సంధించి మూఁడు వాఁడి తూఁపుల హరి నొప్పించి యిట్లనియె* (సీ॥ మా సరివాఁడవా మా పాప గొనిపోవ నే పాటిగల
వాఁడ వేది వంశ। మెందు జన్మించితి వెక్కడఁ బెరిగితి వెయ్యది నడువడి యెవ్వఁడెఱుఁగు। మానహీనుఁడవీవు మర్యాద లెఱుఁగవు
మాయగైకొని కాని మలయరావు। నిజరూపమున శత్రునివహంబు పైఁ బోవు వసుధీశుఁడవు గావు వావి లేదు। కొమ్మనిమ్ము నీవు గుణ
రహితుండవు। విడువు విడువవేని పలయకాల। శిఖిశిఖాసమాన శితశిలీముఖముల। గర్వమెల్లఁ గొందుఁ గలహమందు* (వ॥ అని పలికి
న నగధరుండు నగి యొక్క బాణంబున వాని కోదండంబు ఖండించి- యాఱు శరంబుల శరీరంబు గూరనేసి- యెనిమిది విశిఖంబుల
రథ్యంబులం గూల్చి రెండమ్ముల సారథిం జంపి మూఁడు వాఁడి తూఁపులం గేతనంబు ద్రుంచి మఱియు నొక్క విల్లందినం దుత్రించి,
వెండియు నొక్క ధనువు పట్టిన విదళించి - క్రమంబునం బరిఘ పట్టస శూల శక్త్యాసి శక్తి తోమరంబులు ధరియించినం దునకలు చే
సి, క్రమ్మఱ నాయుధంబు లెన్ని యెత్తిన, నన్నియు శకలంబులుగాఁ బంచె, నంతటం దన విసనకవాఁడు రథంబు డిగ్గి ఖడ్గహస్తుండై
దవానలంబుపైఁ బడు మిడుత చందంబునం గదిసిన ఖడ్గ కవచంబులు- చూర్ణంబులు చేసిన- సహింపక - మెఱుంగులు చెదర నడిదం
బు వెఱికి ఝళిపించి, వాని శిరంబు తెగఁ గ్రేయుదునని గమకించి నడుచుచున్న నడ్డంబు వచ్చి రుక్మిణీదేవి హరి చరణారవిందంబులు
పట్టుకొని యిట్లనియె* మత్తకోకిల॥ నన్ను నీశ్వర దేవదేవుని నిగ్గణింపఁగ లేక యో। సన్నుతామర కీర్తి శోభిత సర్వలోక శరణ్యా
మా యన్నయైతఁడు నేఁడు చేసె మహాపరాధము నీ యెడ। న్నన్ను మన్ననఁ జేసి కావుము నాథ నాథ దయానిధీ* (మత్తకోకిల॥
కల్ల లేదని పిన్నవించుట గాదు వల్లభ యీతనిన్। బ్రల్లదుం దెగఁ జూచితే నయ భాగ్యవంతుల మైత్రిమా। కల్లుఁడయ్యె ముకుందుఁ
డీశ్వరుఁ డంచు మోదితులైన మా తల్లిదండ్రులు పుత్రశోకముఁ దాల్చి చిక్కుదు రీశ్వరా* (మ॥ అని డగ్గుత్తికతో మహాభయ
ముతో నాకంపితాంగంబుతో। వినతక్రాంత ముఖంబుతో శ్రుతి చలద్వేణీ కలాపంబుతోఁ। గను దోయిం జడిఁ గొన్న బాష్పముల
తోఁ గన్యాలలామంబు మ్రొ। క్కిన నక్కఁ దెగ వేయఁ బోక మగిడెన్ గృష్ణుండు రోచిష్ణుఁడై* (వ॥ ఇట్లు చంపక బావా రమ్మనిచి
లునగవునగుచు, వానిం బట్టి బంధించి ఖడ్గంబున- మీసంబునం దలయును- నొకకత్తివాతి యమ్మున రేవులువారఁ గొఱిగి వి
రూపింజేసె నంతట యదువీరులు పరసైన్యంబులం బాఱఁదోలి తత్సమీపంబునకు వచ్చి రప్పుడు, హతప్రాయుండై కట్టువడి యున్న రు
క్మింజూచి కరుణ చేసి బలభద్రుండు బంధంబు విడిచి హరి డగ్గరి యిట్లనియె* (క॥ తలమనక భీష్మనందను। తలయును మూఁతియును

గోలుగఁదగవేబంధుం । దలయును దూఁటియుఁగోలుగుట। తలఁదలుగుటకంటెఁదుచ్ఛతరముమహాత్మా*(క॥ కొందరురిపులని యలుగవు। గొందఱుహితులనుచు మేలుఁగూర్పవునిజమీ। వింతటియందును సముఁడవు । పొందఁగ నేలయ్య వైషమ్యబుద్ధి ననంతా॥ అనివితర్కించిపలికిరుక్మిణీదేవినుపలక్షించి యిట్లనియె*(శా॥ తోడంబుట్టినవానిభంగమునకున్ దుఃఖించిమా కృష్ణునే। గ్గాడం

==* స సోదరునిభంగమునకు ఖిన్నయగు రుక్మిణీదేవినిబలభద్రుఁడూరార్చుట, *==

జూడకుమమ్మపూర్వభవకర్మాధీనమై ప్రాణుల । న్గీడున్మేలును జెందు వేఁడొకడు శిక్షింపంగ రక్షింపనీ । తోడంబుట్టువు కర్మశేష పరిభూతుండయ్యె నేఁడయ్యెడన్ *(క॥ చంపెడిదోషముఁగలిగినఁ। జంపఁజనదు బంధుజనులఁజనువిడువంగాఁ। జంపినదోషము సిద్ధము । చంపనుమఱి వేలమున్న చచ్చినవానిన్ *( గీ॥ బ్రహ్మచేత భూమిపతులకీధర్మంబు। కల్పితంబు రాజ్యకాంక్షఁజేసి। తోడిచూలినైనఁ దోడఁబుట్టినవాఁడు । చంపుచుండుఁగ్రూరచరితుఁడగుచు*(క ॥ భూమికిధనధాన్యములకు। భామలకును మానములకుఁ బాత్రిభవములకుం। గామించిమీఁదఁగానరు। శ్రీమదమునమానఘనులు చెనఁకుదురొరులన్*(వ॥ వినుము దైవమాయం జేసి దేహాభిమానులైనమానవులకుం బగవాఁడు - బంధుండును, దాసీనుండునను, మోహంబునసిద్ధంబై యుండు, జలాదులయందుఁ జంద్రసూర్యాదులును, ఘటాకాశంబులందు గగనంబును పెక్కండ్రై కానంబడుభంగి - దేహధారులకందఱికి నాత్మయొక్కండయ్యును- పెక్కండ్రై తోఁచు, నాద్యంతంబులుగలయీ దేహంబు, దివ్యపాపగుణాత్మకంబయి యాత్మయందుఁబనవిద్యచేతఁగల్పితంబై, దేహినిసంసారంబునందిప్పు, సూర్యుండుతటస్థుండై యుండం బ్రకాశమానంబులైనదృష్టిరూపంబులంబోలె నాత్మతటస్థుండై యుండ దేహేంద్రియంబులు ప్రకాశమానంబులగు నాత్మకు వేఱొక్కటితోడసంయోగవియోగంబులు లేవు వృద్ధిక్షయంబులు చంద్రకళలకుం గానిచంద్రునికి లేనిక్రైవడి, జన్మనాశంబులు దేహంబునకుంగాని యాత్మకుఁగలుగ నేరవు, నిద్రవోయినవాఁడాత్మను విషయఫలానుభవంబులు సేయించు తెఱంగున నెఱుకలేనివాఁడు నిజముగానియర్థంబుసందునను భవమునొందుచుండుఁగావున*(క॥ అజ్ఞానజమగు శోకము। విజ్ఞానవిలోకనమున విడువుము నీకుం। బ్రజ్ఞావతికిందగునే। యజ్ఞానులభంగి వగవనంభోజముఖీ*(వ॥ ఇట్లుబలభద్రునిచేఁదెలుపంబడి రుక్మిణీదేవి దుఃఖంబుమానియుండె, నటరుక్మియనువాఁడు ప్రాణావశిష్టుండై విడువంబడి నవిరూపభావంబునకు నెఱియుచు, హరింగెల్చికాని కుండినపురంబు చొరననిప్రతిజ్ఞఁజేసి తత్సమీపంబుననుండె, నివ్విధంబున*(క॥ రాజీవలోచనుఁడుహరి। రాజసమూహములఁగెల్చి రాజసమొప్పన్ । రాజితయ

...(*) శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిని బెండ్లియాడుట, (*)...

గుశనపురికిని। రాజాననఁదెచ్చెబంధు రాజినుతింపన్ *(వ॥ అంతనయ్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధవివాహకృత్యంబును, బ్రవర్తమానగీతవాద్యనృత్యంబును, బ్రతిగృహాలంకృతవిలసితాశేష నరనారీవర్గంబును, బరిణయమహోత్సవసమాహూయమాన మహీపాలగజగటాగండమండలదాన సలిలధారాసిక్తమార్గంబును । బ్రతిద్వారమంగళాచారసంఘటితక్రముకకదళికాకర్పూరకుంకుమాగరుధూపదీపపరిపూర్ణకుంభంబును- విభూషితసకలగృహవేదికాకవాటదేహళీస్తంభంబును, విచిత్రస్రక్కుసుమాంబరరత్నతోరణవిరాజితంబును, సముద్ధూతకేతనవిభ్రాజితంబును నై యుండె, నయ్యవసరంబున *

(మ॥ ధుర్యకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతోహారిణిన్ మానవై । భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసంపత్కారిణిన్ సాధు బాం। ధవసత్కారిణిఁ బ్రహ్మచారిణి మహాదారిద్ర్యసంహారిణిన్। సువిభూషాంబరధారిణిన్ గుణవతీచూడామణిన్ రుక్మిణిన్ ।(క॥ సతులుం దారును బౌరులు। హితమతిఁగానుకలు దెచ్చి యిచ్చిరి కరుణో। న్నతవర్ధిష్ణులకునుమా। నితశోభిష్ణులకు రుక్మిణీకృష్ణులకున్ *(క॥ హరిపెండ్లికిఁగ్రైకేయకు। కురుసృంజయయదువిదర్భకుంతిన రేంద్రుల్ । పరమానందముఁబొందిరి। ధరణీశులలోన గాథ తాత్పర్యములన్ *క॥ హరియీ తెఱఁగున రుక్మిణి। సరుమగఁగొనివచ్చి పెండ్లియాడుట వినిమ। వ్వరకృత్యమనుచు నెఱఁగం। దిరి రాజులు రాజసుతులు దిక్కులనెల్లన్ *(గీ॥ అనఘయా దిలక్ష్మియైన రుక్మిణితోడఁ। గ్రీడసలుపుచున్న కృష్ణుఁజూచి। పట్టణంబులోనిపౌరజనులుల్లసిల్లిరి। ప్రీతలగుచును క్తభీతలగుచు॥ అనిచెప్పి॥.........................................*

క॥ కువలయరక్షోత్సర। కువలయదళనీలవర్ణకోమలదేహ। కువలయనాథశిరోమణి । కువలయజనవినుతవిమలగుణసంఘాతా *మాలిని॥ సరసిజనిభహస్తా సర్వలోకప్రశస్తా। నిరుపమశుభమూర్తీ నిర్మలారూఢకీర్తీ । పరహృదయవిదారీ భక్తలోకోపకారీ। గురుబుధజనపోషీ ఘోరదైతేయశోషీ॥ గద్య॥ ఇది-శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు దేవకీదేవివివాహంబును, గగనవాణీశ్రవణంబునఁగంసోద్రేకంబును, వసుదేవప్రార్థనయును యోగమాయాప్రభావంబును-బలభద్రునిజన్మంబును, బ్రహ్మాదిసురస్తోత్రంబును-కృష్ణావతారంబును, ఘోషప్రవేశంబును, యోగనిద్రాచరితంబును, నందపుత్రోత్సవంబును, పూతనాసంహారంబును, శకటభంజనంబును, తృణావర్తుమరణంబును, గర్గాగమనంబును, నారాయణాదినామనిర్దేశంబును, బాలక్రీడయును

మృద్భక్షణంబును, వాసుదేవవదనగహ్వరవిలోక్యమానాఖిలలోకాలోకనంబును, నవనీతచౌర్యంబును, యశోదారోషంబు నులూఖలబంధనంబు, నర్జునతరుయుగళనిపాతనంబును, నలకూబరమణిగ్రీవులశాపమోక్షణంబును, బృందావనగమనంబును వత్సపాలనంబును, వత్సాసురవధయును, బకదనుజవిదారణంబును, నఘాసురమరణంబును, వత్సాపహరణంబును, నూతనవత్సబాలకకల్పనంబును బ్రహ్మకృతనుతియు, గోపాలకత్వంబును, గార్దభాసురమదనంబును, గాళియఫణిమర్దనంబును, గరుడకాళియనాగవిరోధకథనంబును, ప్రలంబాసురహింసనంబును, దవానలపానంబును-వర్షర్తువర్ణనంబును-శరత్కాలలక్షణంబును, వేణువిలాసంబును, హేమంతసమయాగమంబును, గోపకన్యాచరితహవిష్యవ్రతంబును, కాత్యాయనీసేవనంబును-వల్లవీవస్త్రాపహరణంబును, విప్రవనితాదత్తాన్నభోజనంబును, నింద్రయాగనివారణంబును, నందముకుందసంవాదంబును - పర్వతభంజనంబును- పాషాణసలిలవర్షంబును, గోవర్ధనోద్ధరణంబును, వరుణకింకరుండు నందుని గొనిపోయినహరి తెచ్చుటయును, వేణుపూరణంబును, గోపికాజనఘోషనిర్గమంబును, యమునాతీరవనవిహరణంబును, కృష్ణాంతర్ధానంబును, ఘోషకామినీగణాన్వేషణంబును, గోపికాగీతలును, హరిప్రసన్నతయును, రాసక్రీడనంబును, జలకేళియును, సర్పరూపకుండైన సుదర్శనవిద్యాధరుండు హరిచరణతాడనంబున నిజరూపంబు వడయుటయును, శంఖచూడుండను గుహ్యకుని వధించుటయును, వృషభాసురవిదళనంబును, నారదోపదేశంబున హరిజన్మకథ నెఱింగి కంసుండు దేవకీవసుదేవులబద్ధులం జేయుటయును, ఘోటకాసురుండైన కేశియను దనుజుని వధియించుటయును, నారదస్తుతియును, వ్యోమదానవమరణంబు, నక్రూరాగమనంబు, నక్రూరరామకృష్ణులసల్లాపంబును, ఘోషనిర్గమంబును - యమునాజలాంతరాళంబున నక్రూరుండు హరివిశ్వరూపంబు గాంచుటయు, నక్రూరస్తవంబును, మధురానగరప్రవేశంబును, రజకవధయును, వాయకమాలికులచే సమ్మానంబు నొందుటయును, కుబ్జాప్రసాదకరణంబును, ధనుర్భంగంబును, కంసుదుస్స్వప్నంబును-కువలయాపీడపీడనంబును-రంగస్థలప్రవేశంబును- చాణూరముష్టికులవధయును కంసువధయును-వసుదేవదేవకీబంధమోక్షణంబును - నుగ్రసేను రాజ్యస్థాపనంబును- రామకృష్ణులు సాందీపునివలన విద్యలభ్యసించుటయును, సంయమనీనగరగమనంబును - గురుపుత్రదానంబును - నుద్ధవుని ఘోషయాత్రయును - భ్రమరగీతలును-కుబ్జావాసగమనంబును- గరినగరంబునకు నక్రూరుండు సనికుంతీదేవినూరార్చుటయు-కంసభార్యలగు నస్తిప్రాప్తులు జరాసంధునకుం గంసుమరణం బెఱింగించుటయును - జరాసంధుని దండయాత్రయును - మధురానగరనిరోధనంబును -యుద్ధంబున జరాసంధుండు సప్తదశవారంబులు పలాయితుండగుటయును- నారదప్రేరితుండయి కాలయవనుండు మధురపైదాడి వెడలుటయును - ద్వారకానగరనిర్మాణంబును - మధురాపురనివాసులందనయోగబలంబున హరి ద్వారకానగరంబునకుం దెచ్చుటయును, కాలయవనుండు హరిం గెంటంజని గిరిగుహయందు నిద్రితుండయిన ముచికుందుని దృష్టివలన నీఱగుటయును - ముచికుందుండు హరిని సంస్తుతి చేసి తపంబునకు జనుటయును-జరాసంధుండు గ్రమ్మర రామకృష్ణులపై నేతెంచుటయును - ప్రవర్షణపర్వతారోహణంబును-గిరిదహనంబును-గిరి డిగ్గనుఱికి రామకృష్ణులు ద్వారకకుం జనుటయును-రుక్మిణీజననంబును- రుక్మిణీసందేశంబును - వాసుదేవాగమనంబును-రుక్మిణీగ్రహణంబును, రాజలోకపలాయనంబును- రుక్మియనువాని భంగంబును-రుక్మిణీకల్యాణంబును ననుకథలం గల దశమస్కంధంబునందుఁ బూర్వభాగము సంపూర్ణము-.................................................*

శ్రీకృష్ణార్పణమస్తు-

# శ్రీమదాంధ్రభాగవతము — దశమస్కంధము.

## ఉత్తరభాగము.

శ్రీకరపరితోషితర । త్నాకరకమనీయగుణగణాకరకారు । ణ్యాకరభీకరశరధా। రాకంపితదానవేంద్ర రామనరేంద్రా॥

వ ॥ మహనీయగుణగరిష్ఠులగునమ్మునిశ్రేష్ఠులకునఖిలపురాణ వ్యాఖ్యానవైఖరీసమేతుండైనసూతుండిట్లనియె - నట్లుప్రా
యోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు రుక్మిణీపరిణయానంతరంబుననైనకథావృత్తాంతంబంతయు వినుపింపుమనిన శుక
యోగీంద్రుండిట్లనియె॥ ఉ ॥ తామరసాక్షువంశమునదర్పకుఁడీశ్వరుకంటిమంటల । న్దామునుదగ్ధుఁడైపిదపఁదత్పరమేశుని
దేహలబ్ధికై । నేమమునిష్టఁజేసిహరివీర్యమునంబ్రభవించెరుక్మిణీ । కామినిగర్భమందసురఖండనుమారటమూర్తియోయ
నన్ ॥ వ ॥ అంతనాడింభకుండుప్రద్యుమ్నుండనుపేరవిఖ్యాతుండయ్యె నాశిశువుసూతికాగృహంబునందల్లిపొదిగిటనుండం
దనకుశత్రుండనియెఱింగి , శంబరుండనురాక్షసుండుదనమాయాబలంబునంగామరూపియై వచ్చికొనిపోయిసముద్రంబు
లో వైచితనగృహంబునకుంజనియె - నంతనాబాలకుండుజలధిజలంబునందిగంబడనాడసి, యొకమహామీనంబుమ్రింగెనం
దు॥ క॥ జాలిఁబడిపాఱుజలచర। జాలంబులఁబోవనీకచనిరోషాగ్ని। జ్వాలలునిగుడఁగనూరక। జాలంబులువైచిపట్టిజాలరు
లంతన్ ॥ వ ॥ సముద్రంబులోననామీనంబునుదత్సహచరంబులైనమీనంబులఁబట్టుకొనితెచ్చిశంబరునకుంగానుకగానిచ్చి
న, నతండువండి తెండనిమహానసగృహంబునకుంబంచిన ॥క॥ రాజసగరిమెడచాలలు। రాజీవముకడుపువ్రచ్చి రాజనిభా
స్యున్। రాజశిశువుఁగనిచెప్పిరి। రాజీవదళాక్షియైనరతికినరేంద్రా॥ వ॥ అంతనారదుండువచ్చి,బాలకునిజన్మంబును,శంబ
రోద్యోగంబును , మీనోదరప్రవేశంబునుం జెప్పినవిని , యారతిమాయావతియనుపేర , శంబరునియింటఁబాత్రవ్రత్యం
బునడుపుచు, దహనదగ్ధుండైనతనపెనిమిటిశరీరధారణంబు సేయుటకెదురుచూచుచున్నయదిగావున, నయ్యర్భకుండు
కందర్పుఁడని తెలిసి, మెల్లనఁబుత్రార్థియైన తెఱంగున, శంబరునియనుమతివడసి, సూపకారులయొద్దనున్నపాపనిం దెచ్చి
పోషించుచుండెనాకుమారుండును, శీఘ్రకాలంబుననారూఢయౌవనుండై॥ క॥ సుందరమగుతనరూపము । సుందరులాక
మాఱుదేఱిచూచినఁజాలున్। సౌందర్యమేమిచెప్పన। బొందెదమనిడాయబుద్ధిఁబుట్టించున్నృపా॥ సీ॥ చక్రినివారలచక్క
దనంబునకుపమింపనెవ్వఁడుయోగ్యుఁడయ్యె । మిక్కిలితపమునమెఱయుచంబికకునైశంకరునెవ్వఁడుసగముసేసె । బ్ర
హ్మత్వమునుబొందిపరగువిధాతనువాణికైయెవ్వఁడువాఁడిగొటిచె । వేయుడాగులతోఁడవిబుధలోకేశుని మూర్తికినె
వ్వఁడుమూలమయ్యె। మునులతాలిమికెవ్వఁడుముల్లుసూపు। మగలమగువలనెవ్వఁడుమరులుగొలుపుఁ । గుసుమధనువున
నెవ్వఁడుగొనువిజయము। చిగురువాలుననెవ్వండుచిక్కుపఱచు॥ వ॥ అనితన్నులోకులువినుతించుప్రభావంబులుగలిగి, ప
ద్మదళలోచనుండును. బ్రలంబబాహుఁడును, జగన్మోహనాకారుండునైన, పంచబాణునింగని, లజ్జాహాసగర్భితంబులై
నచూపులంజూచుచు, మాయావతిసురతభ్రాంతిఁజేసినంజూచి, ప్రద్యుమ్నుండిట్లనియె॥ మత్తకోకిల ॥ నాతనూభవుఁడీతఁ
డంచునునానయించుకలేకయో । మాతనీవిదియేమినేఁడిటుమాతృభావముమానిసం । ప్రీతిఁగాముకిభంగిజేసెదుపెక్కు
విభ్రమముల్మహా। ఖ్యాతవృత్తికినీకుధర్మముగాదుమోహముసేయఁగాన్॥వ॥ అనినరతియిట్లనియె, నీవునారాయణనంద
నుండవైనకందర్పుండవు, పూర్వకాలంబుననేనునీభార్యనైనరతిని , నీవుశిశువైయుండ నిర్దయుండై దొంగిలితల్లిఁదొలం
గఁజేసి, శంబరుండుగొనివచ్చినిన్నునీరధిలోవైచిన , నొక్కమీనంబుమ్రింగె , మీనోదరంబువెడలితివి , మీఁదటికార్య
మాకర్ణింపుము॥క॥ మాయావివీఁడుదుర్మతి। మాయఁడుసంగరములందమర్త్యులఁగెలుచున్। మాయకరణమునవీనిన్।మా
యింపుముమోహనాదిమాయలచేతన్॥మత్తకోకిల॥ పాపకర్ముఁడువీఁడునిన్నిటుపట్టితెచ్చినలేచినా । పాపఁడెక్కడఁబో
యెనోసుతుఁడాపితేవిధినుంచుఁదాఁ। గ్రేపుఁబాపినగోవుభంగిఁఖిన్నయైపడిగాఢసం । తాపయైనినునోఁచికాఁచినతల్లి
కయ్యెడకుండునే॥వ॥అనిపలికిమాయావతి, మహానుభావుండైన, ప్రద్యుమ్నునికిసర్వశత్రుమాయావినాశినియగు, మహా
మాయావిద్యనుపదేశించె, నివ్విధంబున॥మ॥ గురుమాయారణవేదియైయెకవచియైకోదండియైబాణియై।హరిజుండోరనిశాట
వైచితివి వాఁడంభోనిధిన్నన్నుఘో। రరణాంభోనిధివైతునిన్నునిదెపేరమ్మంచుజీతెన్మనో । హరదివ్యాంబరునుల్లసద్ధనుజ
సేవాడంబరున్శంబరున్॥ వ॥ అదలిచియిట్లుకృష్ణసుతుఁడాడిననిష్ఠురభాషణంబులకు। బదహతమైవడింగవయుపన్నగరా
జముఁబోలిశంబరుం । డదరుచులేచివచ్చిగదనచ్యుతనందనుఁద్రేసెనుజ్జ్వల । ద్భిదురకఠోరఘోషసమభీషణనాదముచేసి

యార్చుచున్॥ క॥ దనుజేంద్రుఁడు వ్రేసినగదఁ। దనగదచేఁ బాయనడఁచి దనుజులు బెదరన్। దనుజాంతకునికుమారుఁడు। ద
నుజునిమీఁద నార్చి తనగద వైచెన్॥ వ॥ అంత నారక్కసుండు వెక్కసంబగు రోసంబునఁ దనకుఁ దొల్లి మయుం డెఱింగించి
న నైతేయమాయ నాశ్రయించి మింటికి నెగసి పంచబాణునిపై బాణవర్షంబు గురిసిన నమ్మహారథుండు నొచ్చియు సంచ
లింపక మత్సరంబున సర్వమాయావినాశినియయిన సాత్త్వికమాయం బ్రయోగించి దనుజుని బాణవృష్టి నివారించె - మఱి
యు వాఁడు భుజగగుహ్యకపిశాచమాయలు వన్నినొప్పించిన నన్నియుం దప్పించి॥ క॥ దండధరమూర్తి గైకొని। యొండాడక
చక్రిసూనుఁ డుగ్రత రాసి। ఖండించె శంబరుని తలఁ। గుండలకోటీరమణులు కుంభిని రాలన్॥ క॥ చిగురాకడిదపుధారను। జగ
ములఁ బరవశము సేయు చలపాడికిఁ దా। డ్డగునుక్కడిదంబునఁ దన। పగతుం దెగ వ్రేయు టెంత పని చింతింపన్॥ క॥ బెగడుచు
నుండక శంబరు। దెగడుచుఁ బూవింటిజోదు ధీరగుణంబుల్। బ్పొగడుచుఁ గురిసిరి ముదమున। నెగడుచుఁ గుసుమముల ముసరుని

రతీదేవిప్రద్యుమ్నసహితయై గగనమార్గంబున ద్వారకకుఁ బోవుట.

ర్జరులధిపా॥ వ॥ ఇట్లు శంబరుని వధియించి, విలసిల్లుచున్నయించువిలుకానిం గొంచు, నాకాశచారిణియై, యారతీదేవి గగన
పథంబువట్టి ద్వారకానగరోపరిభాగంబునం జనుదెంచిన॥ గీ॥ మెఱుఁగుతీఁగెతోడి మేఘంబుకైవడి। యువిదతోడ మింటనుం
డి కదలి। యరుగుదెంచె మదనుఁ డంగనాజనములు। మెలఁగుచున్న లోనిమేడకడకు॥ మ॥ జలదశ్యాముఁ బ్రలంబబాహు యు
గళుఁ జంద్రాననున్ నీలసం। కులవక్రాలకుఁ బీతవాసు ఘనవక్షున్ సింహమధ్యున్ మహో। త్పలపత్త్రేక్షణు మందహాసలలి
తు బంచాయుధున్ నీరజా। క్షులు దారేమఱి పాటఁ జూచి హరి యంచున్ డాఁగి రయ్యాయెడన్॥ క॥ కొందఱు హరి యగు నందురు।
కొందఱు చిహ్నములు గొన్నికొన్ని హరికిసి వే। యందురు మెల్లనె తెలియుద। మందురు మఱి చూచి కొంద ఱబలలు గుములై॥
క॥ హరి యని వెఱచని పిదపన్। హరిఁ బోలెడువాఁ డుగాని హరి గాఁ డనుచున్। హరిమధ్యలల్ల నల్లన। హరినందనుఁ డాయవ
చ్చి రాశ్చర్యములన్॥ ఉ॥ అన్నులు సేరవచ్చి నరుసందఱుఁ జూడఁగఁ దానువచ్చి సం। పన్నగుణాభిరామ హరిపట్టపుదేవి విద
ర్భపుత్త్రి గ్రే। గన్నుల నాకుమారకుని కైవడి నేర్పడఁ జూచి బోటితోఁ। జన్నులు చేఁపనిట్లని యసంభ్రమధైర్యములుల్లసిల్లఁ
గన్॥ శా॥ ఈకంజేక్షణుఁ డేసుమారతిలకుం డీయిందుబింబాననుం। డీకంఠీరవమధ్యుఁ డిచ్చటికి నే డెందుండి యేతెంచెనో।
యీకల్యాణునిఁ గన్న భాగ్యవతి మున్నే నోములన్నోఁచెనో। యేకాంతామణి యందుపేర్మిఁ గనెనో యేకాంతుఁ డీకాంతు
నిన్॥ శా॥ ఆళీ నాతొలుచూలిబిడ్డనికి బోరాడించి నే సూతికా। శాలామధ్యవిశాలతల్పగతనై చన్నిచ్చి నిద్రింపనా। బాలు
న్నా నను బాలకుం జెఱిచి యేపాపాత్ముఁ డేత్రోవనో। న్నేలీలం గొనిపోయెరో శిశువుఁ దానేతల్లి రక్షించెనో॥ క॥ కొడుకఁడు
నా పొడిగిటిలోఁ। జెడిపోయిన నాఁట నుండి చెలియా తెలియం। బడ దే వార్తయు నేఁ డే। వడువున నెచ్చోట నిలిచి వర్తించెనో
కో॥ క॥ ఇందాక వాఁడు బ్రతికిన। సందేహము లేదు దేహచాతుర్యవయః। సౌందర్యంబున లోకులు। వందింపఁగ నితఁ డియంత
వాఁడగు సుమ్మీ॥ మ॥ అతివాసిద్ధము నాఁటి బాలకున కియ్యాకారమీవర్ణమీ। గతిహాసంబు విలోకనస్వరము లీగాంభీర్యమీ
కాంతిపెం। పతఁ డే కాఁదగునున్నవారలకు నాయాత్మేశు సారూప్యసం। గతిసిద్ధింపదు వీని యందు మిగులం గన్నూహాలంబ
వ్యాడెన్॥ క॥ పొదలెడి ముదమునఁ జిత్తము। గదలెడి నాయెడమ మూఁపు గన్నుల వెంటన్। బొదలెడి నానందాశ్రులు। మెదలె
డిఁ బాలిండ్లఁ బాలు మేలయ్యెడినో॥ వ॥ అని డోలాయమానమానసయై వితర్కించుచు॥ క॥ తనయుఁడని నొడువవలఁచును। దన
యుఁడు గాకున్న మిగులఁ దతిఁ గొని సవతుల్। తను నగియెదరని తలఁచున। దనుసంశయ మెలమిఁ గొని యెదను మధ్యమదిన్॥
వ॥ ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ లోపలి నగరికావలివారివలన విని కృష్ణుండు దేవకీవసుదేవులఁ దోడ్కొని చనుదెంచి సర్వ
జ్ఞుండయ్యు, నేమియు వివరింపక, యూరకుండె, నంత నారదుండు చనుదెంచి శంబరుండు కుమారునిం గొనిపోవుట మొదలైన
వార్తలెఱింగించిన॥ క॥ చచ్చిన బాలుఁడు గ్రమ్మర। వచ్చిన క్రియ వచ్చెఁ బెక్కువర్షములకు నీ। సచ్చరితు నేఁడు గంటిమి। చె
చ్చెర మున్నెట్టి తపము సేయఁబడెనో॥ వ॥ అని యంతఃపురకాంతలును, దేవకీవసుదేవరామకృష్ణులును, యథోచితక్రమం
బున నాదంపతులకు దివ్యాంబరాభరణాలంకృతుల సత్కరించి సంతోషించిరి - రుక్మిణీదేవియు నందనుం గాఁగిలించుకొని॥
శా॥ అన్నా నాచనుఁ బాపి నిన్ను దనుజుం డంభోనిధిం వైచెనే। యెన్నేవర్షముల య్యె బాసి సుతనీ వెరీతి జీవించితే। సన్నా
హంబున శత్రుఁ గెల్చితివి యాశ్చర్యంబు సంధిల్లెడి। న్నిన్నుం గాంచితి నింత కాలమునకు న్నే ధన్యతన్ జెందితిన్॥ వ॥ అని కొ
డుకునుం జూచి సంతోషించి కోడలి గుణంబులు కై వారంబుచేసి వినోదించుచుండె - నంత ద్వారకానగరంబు ప్రజలు విని హ
ర్షించిరందు॥ క॥ సిరి పెనిమిటి పుత్త్రకుఁ డగు। మరుఁ గని హరిఁ జూచినట్లు మాతలు దమలో। గరుగుదురఁట పరకాంతలు। మరుఁగ

శ్రీకృష్ణుండు లోకాపవాదనివృత్తికొఱకు శమంతకమణిని దెచ్చుట.

ని మోహాంధకారమగ్నులు గారే॥ అని చెప్పిన శుకుం డిట్లనియె॥ క॥ సత్రాజిత్తు నిశాచర। శత్రునకుం గీడుఁ జేసి సద్వినయము

తోఁబుత్రిశమంతకమణియును। మైత్రింగొని తెచ్చియిచ్చె మనుజాధీశా॥ అనినవిని రాజిట్లనియె ॥గీ॥ శౌరికేమితప్పుచేసెస త్రాజిత్తు। కూఁతుమణియు నేలకొసఁగి యిచ్చె। నతనికెట్లుఁగలిగె నాశమంతకమణి। విప్రముఖ్య నాకువిస్తరింపు ॥వ॥ అనినవిని శుకయోగివర్యుండిట్లనియె- సత్రాజిత్తనువాఁడు సూర్యునకు భక్తుండై చెలిమి సేయుచుండ నతనివలన సంతసించి సూర్యుండు శమంతకమణి నిచ్చె నామణి కంఠంబున ధరియించి సత్రాజిత్తుండు భాస్కరునిభంగి భాసమానుండై ద్వారకానగరంబునకు వచ్చిన మూర్తంబున నతనింజూచి జనులు మణిప్రభాపటలతిరోహితదృష్టులై సూర్యుండని శంకించి వచ్చి హరికిట్లనిరి ॥క॥ నారాయణ దామోదర। నీరజదళనేత్ర చక్రిశిఖిలేశ గదా। ధారణ గోవిందనమ। స్కారము గొను మపుత్రనిత్యకల్యాణహరీ ॥మ॥ ద్విజాధీశ్వరుఁ డిచ్చగించు నుగదా దేవేశ నిన్ జూడ యా। దవవంశంబున గూఢమూర్తి వి జగత్త్రాణుండవై యుండఁగా। భవదీయాకృతిఁజూడ నేఁడ దెరుచి ప్రచ్ఛన్నదిగ్భాగుఁడై। రవియో యీ జగచ్చక్షుండో యొకఁడు చేరన్ వచ్చె మార్గంబునన్ ॥వ॥ అనియిట్లు పలికిన మూఢజనులం జూచి గోవిందుండు నగుచు మణిసమేతుండైన సత్రాజిత్తుండు గాని సూర్యుండు గాఁడని పలికిన నంతసత్రాజిత్తుండు శ్రీయుతంబై మంగళాచారసంచారితంబైన తనగృహంబునకుం జని మహీసురులచేత నిజదేవతామందిరంబున నమ్మణిశ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె నది ప్రతిదినంబును నెనిమిది బారువుల సువర్ణంబులొసంగుచుండు ॥క॥ ఏరాజేలెడు వసుమతి। నా రత్నము పూజ్యమాన మగునక్కడరో। గారిష్టసర్వమాయిక। మారీదుర్భిక్ష భయము మానును రెండాః ॥క॥ అమ్మణి యాదవవిభునకు। నిమ్మని హరియడుగ నాతఁడీక నేర్చున్। బొమ్మనిపలికెను జక్రికి। నిమ్మణి యీకున్న మీఁద నేమానను దున్ ॥అంత నొక నాఁడు॥ అతని తమ్ముఁడు ప్రసేనుఁ డా మణిఁ దాల్చి యొక్కనాఁడు అడవికి ఘోరసత్త్వమృగయారతిఁ జనిన వానిఁ జంపి పైఁ। బఱిమణిఁగొంచునొక్క హరి పాఱఁగ దాని వధించి డాసి యే। ఋక్షుఁ గను జాంబవతుఁ డుప్రభాత్తని గంత ముచ్చా శమంతమున్ ॥క॥ కనిజాంబవంతుఁ డామణి। గొనిపోయి సమీపశైలగుహఁ జొచ్చి ముదం। బునఁ దనకూరిమి సుతకును। ఘనకేళీకందుకంబుగాఁ జేసెన్ నృపా ॥వ॥ అంత సత్రాజిత్తుండు తనసహోదరుండైన ప్రసేనుని గానక దుఃఖించుచు ॥మ॥ మణికంఠంబునఁ దాల్చి నేఁడడవిలో మావాఁడు వర్తింపఁగా। మణికై పట్టి వధించినాఁడు హరి కిన్నర్యాదలేదంచు దూ। షణముం జేయఁగ వాని దూషణముఁ గంసధ్వంసి యాలించి యే। వ్రణమున్నామొడ లేదు నిందగలిగెన్ వారించుచేరీతి మో। అనిచితరించి ॥మ॥ తనవారెల్లఁ బ్రసేనుఁ జూడఁ దెలుపం దరించుచున్ వచ్చి తద్ద్వనపీథింగనె నేలఁ గూలినమహాశ్వంబుం బ్రసేనుం బ్రసే। నుని హింసించిన సింహమున్ మృగపతిన్ నొప్పించి ఖండించి యేఁ। గినభల్లూకము చొచ్చియున్న గుహయుం గృష్ణుండు గోచిష్ణుఁడై ॥వ॥ కనితన వెంటనంటి వచ్చిన ప్రజనెల్ల గుహాముఖంబున విడిచి సాహసంబున మహానుభావుండైన హరి నిరంతరనీరంధ్రనిబిడాంధకారబంధురంబై భయంకరంబై విశాలంబైన గుహాంతరాళంబు సొచ్చి చనియక్కడ నొక్క బాలిక కెదురదర్శనీయకేళీకందుకంబుగా వ్రేలఁగట్టిన యమ్మణిశ్రేష్ఠంబుఁ గని హరింపనిచ్చయించి ॥క॥ మెల్లనె పదములిడుచుం। వల్లభుఁ డా బాలకడకు వచ్చిన గుండెల్ ఝల్లనఁగఁ జూచి కంపము। మొల్లంబుగ దాని దాదిమొఱ వెట్టె నృపా ॥వ॥ అంత నా ధ్వని విని బలవంతుండైన జాంబవంతుండు వచ్చి తనస్వామి యని కృష్ణునెఱుంగక ప్రాకృతపురుషుండని తలంచి కృష్ణునితో రణంబు చేసె నంత ॥క॥ పలలమునకుఁ బోరెడు డే।గలక్రియ నా శస్త్రములఁ దరులఁ గరములవిజయేచ్ఛలని రువది యెనిమిదిదిన। ములు వోరిరి నగచరేంద్రముఖ్యుఁడు హరియున్ ॥క॥ అపదములుదరులువిఱిగిన। బెడిదములగు ముగతనములఁ బిఱుతివక వడిన్। బిడుగులవడువున బడి రొమ్ములి। పిడికిటఁ బొడుచుటలుగలన బెరసిరి యిరువురున్ ॥శా॥ స్పష్టాహంకృతులుల్లసిల్ల హరియున్ భల్లూకలోకేశుఁడున్। స్పష్టాయుష్టినహోర్నిశంబు జయసంమోహంబులం బోరుచోఁ। బుష్టింబాసి ముకుందముష్టిహతులన్ భగ్నద్రశ్రమోపేతుఁడై। పిష్టాంగోరుశరీరుఁడై యతఁ డుదాభీతాత్ముఁడై యిట్లనెన్ ॥వ॥ దేవా నిన్ను పురాణపురుషు నధీశ్వరుండైన విష్ణుం బ్రభవిష్ణుం గా నెఱుంగుదు- సర్వభూతములకుం బ్రాణప్రతాపస్థైర్య బలంబులు నీవ. విశ్వంబునకు సర్గస్థితిలయంబుల నెవ్వరాచరింతురు వారికి సర్గస్థితిలయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ. యాత్మకుం బరమాత్మవు నీవ. యని మఱియును ॥సీ॥ బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశినింకించి బధించి యేపు మాఁపెఁ। బరగ నెవ్వఁడు ప్రతాపప్రభారాశిచే దానవగర్వాంధతమసమడఁచెఁ। గంజాతములు డొంచుకరిభంగి నెవ్వఁడు దశకంఠుకంఠబృందములు ద్రుంచె। నాచంద్రసూర్యమైయమరులంకా రాజ్యమునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె। నన్ను నేలినలోకాధినాథుఁ డెవ్వఁ। డంచితోదారకరుణారసాబ్ధి యెవ్వఁ। డాతఁడవు నీవ కావె మహాత్మ నేఁడు। మాఱుపడి యెగ్గుఁ జేసితి మనువవలయు ॥వ॥ అనియిట్లు పరమభక్తుండైన జాంబవంతుండు వినుతించిన నతని శరీరనిగ్రహనివారణంబుగా భక్తవత్సలుండైన హరితనకరంబున నతనిశరీరంబు నిమిరి మేఘగంభీరభాషణంబుల హరి యిట్లనియె ॥క॥ ఈమణి మా చేఁబడెనని। తామసులూనరించు నిందదస్సెను కోఱకైనీ మందిరమగు బిలమున। కేమరు దెంచితిమి భల్లుకేశ్వర వింటే ॥వ॥ అనిన విని సంతసించి జాంబవంతుండు మణియును గందన

కూఁతు జాంబవతియను కన్యకామణియనుం దెచ్చి హరికిం గానుకగా సమర్పించెనట మున్ను హరి వెంటవచ్చినవారలు బిలం
బు వాకిటం బండ్రెండు దినంబులు హరి రాక కెదురు చూచి వేసఱి వగచి తమ పురంబునకు జనిరంత, దేవకీవసుదేవులు రుక్మిణి
యును, మిత్రబంధుజ్ఞాతిజనులును గుహసొచ్చి కృష్ణుండు రాఁడు చిక్కెనని శోకించి । క॥ దుర్గమమగు బిలమున హరి । నిర్గతుఁడై
చేరవలయు నేఁడని పౌరు। ల్వర్గములై సేవించిరి। దుర్గన్యతకుశలమార్గతోషితభర్గన్ ॥క॥ డోలాయితమానసులై। జాలింబ
డి జనులు గొలువఁ జెండికఁ బలికె। న్బాలామణితో మణితో । హేలాగతి వచ్చునంబుజేక్షణుఁడనుచున్ ॥క॥ యత్నము సఫలంబై
నసపత్నసమూహములు బెగడఁ బద్మాక్షుండా। రత్నముతోఁ గన్యాజన। రత్నముతోఁ బురికి వచ్చె రయమున నంతన్ ॥క॥ వృ
త్తుఁడైనవాఁడు పునరా। గతుఁడై సక్రియం దలంచి కన్యామణిసంయుతుఁడై వచ్చిన హరిఁ గని। వితతోత్సవకౌతుకముల వెలసి
రి పౌరుల్ ॥వ॥ ఇట్లు హరి తన పరాక్రమంబున జాంబవతి దేవిం బరిగ్రహించి రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి యావృత్తాం
తమంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణినిచ్చిన నతండు సిగ్గువడి మణిం బుచ్చికొని పశ్చాత్తాపంబు నొందుచు, బలవద్వి
రోధంబునకు వెఱచుచు, నింటికిం జని ॥క॥ పాపాత్ముల పాపములం। బాపంగా నోపునట్టి పద్మాక్షుని పైఁ। బాపము గలదని నొడి
విన। పాపాత్ముని పాపమునకుఁ బారము గలదే ॥మ॥ మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు చే । సి
తిఁ బాపాత్ముఁడనర్థలోభుఁడను దుశ్చిత్తుండ మత్తుండఁ దు । ర్మతినీ దేహముఁ గాల్ప నే దురితమే మార్గంబునం బాయునే । గతిఁ
గంసారి ప్రసన్నుఁడై మనుచునన్ గారుణ్యభావంబునన్ ॥గీ॥ మణియుఁ గూఁతు నిచ్చి మాధవు పదములఁ, బట్టుకొంటినేని బ్రతు
కు గలదు। సంతసించు నతఁడు సదుపాయమగు నిది। సత్యమితరవృత్తిఁ జక్కఁబడదు ॥మ॥ అనియుబ్బంగి బహుప్రకారములనే
కాంతస్థుఁడై యింటిలోఁ । దన బుద్ధిం బరికించి నీతిఁ గని సత్రాజిత్తు సంప్రాప్తశో । భనుఁడై యిచ్చె విపత్పయోధితరికిన్ భా
మామనోహరికిన్ । దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్ ॥ ఉ॥ తామరసాక్షుఁ డచ్యుతుఁ డుదార
యశోనిధి పెండ్లియాడెనా । నామను జేంద్రనందితగుణస్థితిలక్షణ సత్యభామ । సుద్దామపతివ్రతాత్వనయ ధర్మవిచక్షణ
తాదయాయశః। కామను సత్యభామను ముఖద్యుతిసర్జితసోమనవ్యయన్ ॥క॥ మణియిచ్చినాఁడు వాసర । మణి సేకను మా
కుఁ గలవు మణులు కుమారీ । మణి చాలునంచు కృష్ణుఁడు । మణి సత్రాజిత్తునకును మఱలఁగ నిచ్చెన్ ॥వ॥ అంతనక్కడ, కుంతీస

శతధన్వుఁడు సత్రాజిత్తుని బంపి మణి నపహరించుట.

హితులైన పాండవులు, లాక్షాగారంబున దగ్ధులైరని విని, నిఖిలార్థదర్శనుండయ్యును. కృష్ణుండు బలభద్రసహితుండై, క
రి నగరంబునకుం జని కృప విదుర గాంధారీ భీష్మ ద్రోణులం గని దుఃఖోపశమనంబులు సేయుచు నయ్యెడ॥ సీ॥ జగతీశ వినవయ్య శత
ధన్వుఁ బొడగని యక్రూరకృతవర్మలాప్తవృత్తి । మనకిత్తునను చుసన్మతిఁ జేసి తన కూఁతుఁ బద్మాక్షునకు నిచ్చి పాడిదప్పె । ఖ
లుఁడు సత్రాజిత్తు గడఁగి యేక్రియనైన మణిపుచ్చుకొను మునీ నుతము మెఱసి । యనితన్నుఁ బ్రేరేపనా శతధన్వుఁడు పశువుఁ
గటికివాఁడు పట్టి చంపు। కరణి నిదుర వోవఁ గడఁగి సత్రాజిత్తుఁ । బట్టి చంపి వాని భామలెల్ల । మొఱలు వెట్టలోభమునఁ జేసి మ
ణిగొంచుఁ। జని యెనొక్కనాఁడు జనవరేణ్య॥ వ॥ ఇట్లు హనుమంతుండైన తండ్రిం గని శోకించి సత్యభామ యతనిం దైలద్రోణి
యందుఁ బెట్టించి హస్తిపురంబునకుం జని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తు మరణంబు విన్నవించిన హరియును బలభద్రుండు
నీశ్వరులయ్యును మనుష్యభావంబుల విలపించిరంత బలభద్రసత్యభామాసహితుండై హరి ద్వారకానగరంబునకు మఱలి
వచ్చి శతధన్వుం జంపెదనని తలంచిన నెఱింగి శతధన్వుండు ప్రాణభయంబునఁ గృతవర్మ యింటికిం జని తనకు సహాయుండవు
గమ్మని పలికినం గృతవర్మ యిట్లనియె ॥ ఉ ॥ అక్కట రామకృష్ణులు మహాత్ములు వారలకెగ్గు సేయఁగా । నిక్కడ నెవ్వఁడోపు వి
ను మేర్పడ గంసుఁడు బంధుయుక్తుఁడై । చిక్కఁడె మున్ను మాగధుఁడు సేనలతో బదియేడుతోయము । ల్దిక్కుల బాఱఁడే మన
కు దృష్టము వారల లావు వింతయే॥ వ ॥ అనియుత్తరంబు చెప్పిన విని శతధన్వుండక్రూరుని యింటికిం జని వారితోడి పగకుఁ దోడు
రమ్మని చీఱిన నక్రూరుండు హరిబలపరాక్రమధైర్యస్థైర్యంబు లుగ్గడించి మఱియు నిట్లనియె ॥ సీ ॥ ఎవ్వఁడు విశ్వంబు నెల్లన
లీలుఁడై పుట్టించు రక్షించు బొలియఁజేయు । నెవ్వని చేష్టల నెఱుఁగరు బ్రహ్మాదు లెవ్వని మాయ మోహించు భువన । మేడేం
డ్లపాపఁడై యే విభుఁ డొకచేత గోరక్షణమునకై కొండ నెత్తె । నెవ్వఁడు కూటస్థుఁ డీశ్వరుఁ డద్భుతకర్ముఁ డనంతుఁడు గర్భసా
క్షి । యట్టి ఘనునకు శౌరికి నవరతము । మ్రొక్కెదము గాక విద్వేషమునకు నేము । వెఱతు మొల్లము నీపొందు వేగ బొమ్ము
చాలుఁ బడి వేలు వచ్చెనే సఖ్యము నను ॥ వ ॥ అనియిట్లక్రూరుండుత్తరంబు వలికిన నమ్మహామణి యక్రూరుని వద్ద నునిచి వెఱచి శత
ధన్వుండు తురగారూఢుండై శతయోజనదూరంబు చనియె నంత గరుడకేతనాలంకృతంబైన తేరెక్కి రామకృష్ణులు వెను
చని రంత నతండు మిథిలానగరంబు జేరి సమీపంబునందు॥ చ॥ తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై । పరు
విడఁ బోకు పోకుమని పద్మదళాక్షుఁడు గూడ బాఱి భీ । కరగతి వాని మస్తకము ఖండితమై పడ వ్రేసెఁ జక్రముం । బరిహతసై

త్యచక్రముఁ బ్రభాచయమోదితదేవశక్రముఁ ॥ వ ॥ ఇట్లు హరి శతధన్వుని వధియించి వాని వస్త్రంబులందు మణి వెదకి లే ధనుటెఁ దెలిసి బలభద్రునికడకు వచ్చి శతధన్వుండూరక హతుండయ్యె మణి లేదనిన బలభద్రుండిట్లనియె ॥ సీ ॥ ఆమణి శత ధన్వుఁ డపహరించుటనిక్క మెవ్వరిచే దాపనిచ్చినాఁడొ । వేగ మెసీ వగివెదుకుము పురిలోన వైదేహుదర్శింపవాంఛగలదు । పోయి వచ్చెదనీవు పొమ్మని వీడ్కొల్పి మెల్లన రాముండు మిథిలఁజొచ్చి । పోయి నజనకుండు వాడగని హర్షించి యంతయుఁ బ్రి యముతో నెదురువచ్చి । యర్ఘ్యపాద్యాదికృత్యంబులాచరించి । యిచ్చవచ్చినవస్తువులెల్లనిచ్చి । యందుమనిభక్తి జేసిన నుండెముసలి। గువలయేశ్వర మిథిలలోఁ గొన్నియేండ్లు॥ వ ॥ అంత దుర్యోధనుండు మిథిలానగరంబునకుం జను దెంచి జనకరా జుచేత సమ్మానితుండై॥ క॥ చలమున గాంధారేయుఁడు। లలితగదాయుద్ధకౌశలము నేర్చెఁ దగన్। హలిచే*శ్రితజనసిర్జర । ఫలిచేద్రైలోక్యవీరభటగణబలిచేన్ ॥ వ ॥ అటఁ గృష్ణుండును ద్వారకానగరంబునకుం జని శతధన్వునిమరణంబును, మణి లేకుండుటయును, సత్యభామకుం జెప్పి సత్యభామా ప్రియకరుండు గావున సత్రాజిత్తునకుం బరలోకక్రియలు సేయించెన క్రూరకృతవర్మలు శతధన్వుమరణంబు విని వెఱచి ద్వారకానగరంబు వెడలి బహుయోజన దూరభూమికిం జనిరక్రూరుండు లేమిం జేసి వానలు లేక మహోత్పాతంబులును, శరీరమానసతాపంబులును, ద్వారకా నగరవాసులకు సంభవించిన నం దులవృద్ధజనులు బెగడి హరికిట్లనిరి ॥ సీ ॥ కమలాక్షువినవయ్య కాశీశుఁడెలెడి కంభినివానలు కురియకున్న। గోఁఁ శ్వఫల్కుఁ గొనిపోయి యతనికి గాందినియను మొదుకన్య నిచ్చి । కాశీవిభుఁడు సత్కారంబు జేసిన వానలు గురిసె నావసుధమీఁద। నాతని పుత్రకుండైన యక్రూరుండునంతటివాఁడె మహాతపస్వి । మఱలివచ్చె నేని మానును త్పాతంబు । లెల్ల వానగురియు నీస్థలము న। దేవయతని నోడి తెప్పింపు మన్నింపు। మానవలయు పీడమానవులకు ॥ వ ॥ అనిపలుకు పెద్దలపలుకులాకర్ణించి దూతజనుల నుంబంపి కృష్ణుండక్రూరుని రావించి పూజించి ప్రియకథలు కొన్ని జెప్పి సకలలోకజ్ఞుండు గావున మృదుమధురభాషణంబుల నిట్లనియె ॥ సీ ॥ తానేగుశేఁటి శతధన్వుండు మణిఁ దెచ్చి నీయింట బెట్టుట నిజము దెలిసి । నాఁడ సత్రాజిత్తునకుఁ బుత్రకులు లే మినతనికి గార్యంబులాచరించి । విత్తంబు బుణమును విభజించుకొని మొదరతెసి పుత్రిక లెల్లనతఁడు పరుల । చేత దుర్మరణం బుఁ జెందినాఁడతనికై సత్కర్మములు మీఁద జరుపవలయు । మణి గ్రహింపుమీవ మాయన్న నను నమ్మ । డెలమిబంధుజనుల కె ల్ల జూపు । మయ్యనీగృహమున హాటక వేదికా। సహితమఖములమరు సంతతమును॥ వ॥ అని యిట్లు సామవక్త్రంబులు హరి ప లికిన నక్రూరుండు వస్త్రచ్ఛన్నంబైన మణిఁ దెచ్చి హరికిచ్చిన॥ ఉ ॥ సంతసమంది బంధుజనసంతతికిన్ హరి దెచ్చి చూపె । స క్రాంతవిభాసమానఘృణిజాలపలాయితభూనభోంతర। ధ్వాంతము హేమభారచయవర్షణవిస్మితదేవమానవ । స్వాంత మగీర్తిపూరితదిశావలయాంతము నాశమంతమున్ ॥ క ॥ చక్రాయుధుడీక్రియ దన। యక్రూరత్వంబు జనులకంటఁబడఁ జను ని । ర్వక్రముగ దెలిపి క్రమ్మఱ। నక్రూరునకిచ్చె మణిఁ గృపాకలితుండై ॥ క ॥ ఘనుఁడు భగవంతుఁ డీశ్వరుఁ। డనఘుఁడు మణిఁ దె చ్చియిచ్చినట్టి కథను మున్వినబరించినఁ దలఁచిన । జనులకు దుర్యశము బాప సంఘము దలగున్ ॥ వ ॥ అంత నొకనాఁడు

—* శ్రీకృష్ణుండింద్రప్రస్థపురంబునకరుగుట. *—

పాండవులం జూడ నిచ్ఛయించి సాత్యకిప్రముఖయాదవులు గొలువఁ బురుషోత్తముం డింద్రప్రస్థపురంబునకుం జనినం బ్రా ణంబులం గనిన యింద్రియంబులభంగి నఖిలేశ్వరుండైన హరిం గని కౌగిలించుకొని కృష్ణుని దివ్యదేహసంగమంబున నిర్ధూత కల్మషులై యనురాగహాసవిభాసితంబైన ముకుందముఖారవిందంబు దర్శించి యానందంబు నొందిరి గోవిందుండును యుధి ష్ఠిరభీమసేనులచరణంబులకు నభివందనంబు చేసి యర్జునునాలింగనంబున సత్కరించి నకుల సహదేవుల మ్రొక్కిన గ్ర చ్చి మొత్తియుత్తమపీఠంబున నాసీనుండై యుండనప్పుడు॥ క॥ చంచద్ఘనకుచభారా । కుంచితమై క్రొత్త పెండ్లికూఁతురగు టనిం। చించుక సిగ్గుజనింపగ। బాంచాలతనూజ మ్రొక్కె బద్మాక్షునకున్ ॥ వ ॥ అంత సాత్యకి పాండవులచేతం బూజితుం డై మొక్కపీఠంబున నాసీనుండయ్యె దక్కిన యదువరులును వారిచేత బూజితులై కొలిచియుండిరి హరియుం గుంతీదేవి క డకుం జని నమస్కరించి యిట్లనియె॥ క ॥ అత్తా కొడుకులు గోడలు। జిత్తానందముగ బనులు సేయగ నాత్మా। యత్తానుగవై యాజ్ఞాసత్తాగులు గలిగి మను జెసమ్మోదమునన్ ॥ వ ॥ అనవుడుఁ బ్రేమవిహ్వలత నందుచు గద్గదభాషణంబునన్ । గనుగవ నశ్రుతోయములు గ్రమ్మగ గుంతి సుయోధనుండు చే । సిన యపకారముం దడవి చెందిన దుఃఖము లెల్లఁ జెప్పియా । దనుజవి రోధికిట్లని మొదద్దయు జెద్దఱికంబు సేయుచున్ ॥ సీ ॥ అన్న నీచుట్టాలనరయుదు మఱువవు నీవు పుత్తెంచిన నెమ్మితోడ । మా యన్న యే తెంచి మముఁ జూచిపోయెను నిల్చియు న్నారము నీబలమున । నాపిన్నవాండ్రకు నాకుదిక్కెవ్వరు నేఁడాది గాని కనీ వెకాక। నఖిలజంతువులకీ వాత్మవు గావునఁ బనులు నావాని భ్రాంతి సేయు । వయ్యనా భాగ్యమెట్టిదో యనవరతము । జి

* శ్రితజననిర్జరఫలిచే- అను చోట- హతరాసిచరఫలిచే- అని యొకపాఠము గలదు.

త్తమునను౦డి కరుణఁజూచికుంతియెల్లఁ । బాయుచుందువుగాదె యోపరమపుణ్య యదుకుమారవరేణ్యబుధాగ్రగణ్య ॥ అనిన యుధిష్ఠిరుండిట్లనియె ॥ ఉ ॥ పట్టఁగ లేరు నిన్ను దమభావములందు సనందనాదులే । పట్టున నైన నట్టి గుణభద్రచరిత్రుఁడ వీవ నేఁడు మా । చుట్టమటంచు వచ్చెదవు చూచెద వబ్బులనైన మమ్మునే । మెట్టితపంబు చేసితిమొ యీశ్వర పూర్వశరీరవేళలన్ ॥ వ ॥ అని ధర్మజుండు దన్నుం బ్రార్థించిన నింద్రప్రస్థపురంబు వారలకు నయనానందంబు సేయుచు హరి గొన్ని నెలలు వసియించి యుండె నందొక్కనాఁడు ॥ మ ॥ తురగశ్రేష్ఠము నెక్కి కంకట ధనుస్తూణీశరోపేతుఁడై । హరితోఁ డన్యవనభూమికేఁగి విజయుండాసక్తుఁడై చంపె శం । బర శార్దూల తరక్షు శల్య చమరీ భల్లూక గంధర్వకా । సరకంఠీరవ ఖడ్గ కోల హరిణీ సారంగముఖ్యంబులన్ ॥ క ॥ అచ్చోటఁ బవిత్రములై । చచ్చిన మృగరాజి నెల్ల జననాథునకుం । దెచ్చిరి పర్వము వచ్చినఁ । జెచ్చెర ననరుగల్భియున్న సేవకులధిపా ॥ వ ॥ అంత నర్జునుండు నీరుదప్పిగొని డస్సి యమునకుం జనియె - నమ్మహారథులైన నరనారాయణు

సూర్యతనూజయగు కాళిందిని గృష్ణుండు వరించుట.

లందు వార్చి జలంబులు ద్రావి యొక్క పులినప్రదేశంబున నుండుచు ॥ చ ॥ ఉపగతులైన యట్టి పురుషోత్తమ పార్థులు గాంచి రాపగా । విపులవిలోలనీలతరవీచికలందశిరోజభారరు । చ్యపహసితాళిమాలికను దంచిత బాలశశిప్రభాలికం । దసనసచాలికన్మకనదర్పణతుల్యకపోలపాలికన్ ॥ వ ॥ అని యచ్యుతుండు పంచిన విజయుండు చని యాకన్యకిట్లనియె ॥ మ ॥ సుదతీ యెవ్వరిదాన వేమి కోరికఁ జొచ్చెంటం బ్రవర్తించెదె । య్యది నీ నామము కోరి యెట్టిది వివాహాకాంక్షతోఁ గూడి నీ । నదికి వచ్చిన జాడ గానఁ బడెదు ఒంటివి యొయ్యనీ రాకనీ । యదియు నాదిస్థితి నెల్లఁ జెప్పను బలాయుద్యత్కురంగేక్షణా ॥ అనిన నర్జునునకుఁ గాళింది యిట్లనియె ॥ మా ॥ నరవీరోత్తమ యే సుసూర్యుని సుతన్ నా పేరు కాళింది భా । సుర సంకల్పిత గేహ సిందు నదిలోఁ గంజాక్షుని ష్ణుం బ్రభుం । వరుగా గోరి తపంబు సేయుచుననా నన్వాంచింపఁ గృష్ణుండు వ । న్యరతిన్వచ్చి వరించునంచుఁ బలికె న్నాతండ్రి నాతోడు కన్ ॥ వ ॥ అనిన విని ధనంజయుండా సీలవేణి పలుకులు హరికిం జెప్పిన విని సర్వజ్ఞుండైన హరియు హరిమధ్యను రథంబు మీఁద నిడుకొని ధర్మజు రాజుకడకుం జని వారలు కోరిన విశ్వకర్మను రావించి వారి పురంబతి విచిత్రంబు సేయించె ॥ క ॥ దేవేంద్రుని ఖాండవము । ప్పావకునకు నీఁ దలంచి పార్థుని రథికున్ । గావించి సూతుఁడయ్యెను । గోవిందుఁడు మరుల తోడఁ గూరిమి వెలయన్ ॥ వ ॥ ఇట్లు నరనారాయణులు సహాయులుగా దహనుండు ఖాండవవనంబు దహించి సంతసించి విజయునకు నక్షయతూణీరంబులు నభేద్యకవచంబును, గాండీవమను మేటిచాపాసనంబును, దివ్యరథంబును, ధవళరథ్యంబుల నిచ్చె నందు॥ ఉ ॥ వాసవసూను చేఁ దనకువహ్నిశిఖాజనితోగ్రవేదన । ల్వాసినఁ జేసి యొక్క సభ పార్థునకిచ్చె మయుండు ప్రీతుఁడై । యాసభలోన గాదెగమునాగమనంబులఁ గౌరవేంద్రుఁడు । ల్లాసము బాసియుండుట జలస్థలనిర్ణయబుద్ధిహీనుఁడై ॥

శ్రీకృష్ణుండు-కాళింది-మిత్రవింద-నాగ్నజిత్తి-భద్ర-లక్షణ యను వారలం బరిణయంబగుట.

వ ॥ అంత గృష్ణుండు ధర్మరాజప్రముఖుల వీడుకొని సాత్యకిప్రముఖసహచరులు గొలువ నలితన పురంబునకుం జనుదెంచి బంధుజనంబులకుఁ బరమానందంబు సేయుచు నొక్క పుణ్యదివసంబున శుభలగ్నంబున గాళిందిం బెండ్లియయ్యె నవ్వియు నవంతీదేశాధీశ్వరులైన విందానువిందులు దుర్యోధనునకు వశులై హరికి మేనత్తయైన రాజాధిదేవికూఁతురైన తమ చెలియలిని వివాహంబు సేయ నుద్యోగించి స్వయంవరంబు చాటించిన ॥ క ॥ భూరమణులు సూడఁగ హరి । వీరత జేకొనియె మిత్రవిందను నిత్యా । పూరితసుజనానందన్ । జారుచికురకాంతివిజితషట్పదబృందన్ ॥ సీ ॥ జననాథ వినుము కోసలదేశమేలెడి నగ్నజిత్తను నరనాథుఁడొకఁడు । సుమతి ధార్మికుఁడు తత్సుత నాగ్నజిత్తియన్ కన్యక గుణవతి గలదు దానిం । బెండ్లియాడుటకు నై పృథివీశులేతెంచి వాఁడి కొమ్ములు గలవాసి వీర । గంధంబు సోఁకినఁ గాలుద్రవ్వెడివానినతిమదమత్తంబులైనవాని । గోవృషంబుల నేడింటిఁ గూర్చి తిగిచి । బాహుబలమున నెవ్వఁడు పట్టికట్టు । నతఁడు కన్యకు వల్లభుండనిన వానిఁ । బట్టజాలక పోదు రా ప్రజలు బెగడి ॥ వ ॥ ఇట్లు గోవృషంబుల జయించినవాఁడు కన్యకకు వరుండనిన భగవంతుండైన హరి విని సేనాపరివృతుండై కోసలపురంబునకుం జనినఁ గోసలాధీశ్వరుండు హరి నెదుర్కొని యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి పీఠంబు సమర్పించి ప్రతినందితుండై యున్నయెడ ॥ క ॥ ఆ రాజకన్య ప్రియమున । నా రాజీవాక్షు మోహనాకారుఁ దిలో । కారాధితు మాధవుఁ దన । కారాధ్యుండైన నాథుఁడని కోరె నృపా ॥ వ ॥ మఱియు నక్కన్యకారత్నంబు దన మనంబున ॥ గీ ॥ విష్ణుఁ డవ్యయుండు విభుఁడుఁ గావలెనని నోఁచినట్టి తొంటి నోముఫలము । సిద్ధమయ్యె నేని జేకొనుఁ బో నన్నుఁ । జక్రధరుఁడు వైరిచక్రహరుఁడు ॥ మ ॥ సిరియుం బద్మభవేశదిక్పతులు మున్సేవించి యెవ్వాని శ్రీ । చరణాంభోజపరాగముల్ శిరములన్సవ్యగ్రతం దాల్తురీ । ధరణీచక్రభరంబు వాపుటకు నుద్యత్కేళి మూర్తుల్దయా । పరుఁడై యెవ్వఁడు దాల్చు నట్టి హరి యెబ్భంగిం బ్రవర్తించునో ॥ వ ॥ అని యిట్లు నాగ్నజిత్తి విచారించు నెడఁ గృష్ణుం డా రాజుం జూచి మేఘగంభీరనినదంబున నిట్లనియె ॥ క ॥ అన్యుల యాచింపరు రా । జన్యుల్య

సౌజన్యకాంతుఁ జూచి దండించినసి। కన్య నీ వెవని దానవు! కన్యా*శుల్కము లేమి గా మునశేంద్రా! అనిన రాజిట్లనియె ॥శా॥ క
న్యం జేకొనఁ జిన్ని లోకపాలసేకన్ ఘనుం డైన రా। జన్యుం డెవ్వఁడు నీగుణంబులకు నాశ్చర్యంబునుం బొందితా। నన్యాగం
భము మానిలక్ష్మి భవదీయాంగంబు నన్నిత్యయై। ధన్యత్వంబునఁ జెందియున్న నిగడా తాత్పర్యసంయుక్తయై ॥శా॥ చంచ
ద్గోవృషసప్తకంబు కడిమిన్ స్తైరించి యెవ్వాఁడు భం। జించు న్వానికిఁ గూఁతు నిత్తునని యేఁ జేసెం జినసైవ్యభవో। దంచద్గర్వ
లు వచ్చి రాజతనయుల్ తత్పావశృంగాహతి। నిశ్చి త్తాఖిలమునోర్వ కేగుదురనిన్నేడింక భిన్నాంగులై ॥శా॥ ఉష్ణాంశుండు తమం
బుఁ దోలు క్రియ నీవు గ్రాహవత్క్షోణిలోఁ। గృష్ణా వైరులఁ దోలినాఁడవు రణక్రీడావిశేషంబులన్। *నిష్ణాతుండవు సప్తగోవృష
ములన్నేఁడాజి భంజింపరో। విష్ణుత్వంబున నేఁడు చేకొను ముమాశీతాంశుబింబాననన్॥ వ ॥ అనిన నగ్నజిత్తుదన కూఁతు వివా
హంబునకుం జేసిన *సమయంబు చెప్పిన విని॥ చ ॥ కని మొనఘూరివత్సబకకంసపిదారిఖలప్రహారి దా। ఘనతరకల్బిషంబులన
గణ్యభయంకరపౌరుషంబులన్। సునిశితశృంగనిర్దళితశూరసమూహము*ఖామిషంబులన్। హసనగు నోన్మిషంబులమ
హాపరుషంబుల గోవృషంబులన్ ॥ఉ॥ చేలము చక్కఁగట్టుకొని చిత్రగతిన్ వడి నేడు మూర్తులై। బాలుఁడు దారరూపములఁ బ
ట్టి కుక్షై వడిఁ బట్టి వీర। శార్దూలుఁ డుగ్రుడ్డి నేలఁబడఁ ద్రోచి మహాత్థితిఁ గట్టియూర్చె భూ। పాలకులెల్ల మెచ్చ వృషభంబు
లఁ బవ్వతేసన్నిభంబులన్ ॥వ ॥ ఇట్లు వృషభంబుల నన్నిటి నీంగట్టి యూర్చెఁ జూచి సంతసించి హరికి నగ్నజిత్తు నాగ్నజిత్తిని
చ్చిన విధివత్ప్రకారంబున బెండ్లియయ్యె నా రాజసుందరులానందంబునుఁ బొంది రాసమయంబున బ్రాహ్మణాశీర్వాదం
బులును, గీత పటహ శంఖ కాహళ భేరీ మృదంగ నినదంబు చెలంగె నంత నాకోసలేంద్రుండు దంపతుల రథారోహణంబు సే
యించి పది వేల ధేనువులును. విచిత్రాంబరాభరణభూషితలైన యువతులు మూఁడు వేలును తొమ్మిది వేల గజంబులును, గజం
బులకు శతగుణరథంబులును, రథంబులకు శతగుణంబులైన హయంబులును, హయంబులకు శతగుణాధికంబైన నరసమూ
హంబును నిచ్చి పుత్తెంచిన వచ్చువప్పుడు॥ ఉ ॥ భూతిపయలప్పఁ గోసలునిపుత్రికకై చను దెంచి తొల్లియాఁ। బోఁటుల చేతనోటు
వడి పోయిన భూపతులెల్ల మాధవుం। డాతరుణీస్వరించుటచ రావలిచేసి త్రోవ సైన్యసం। ఘాతముతోఁ దడాఁకి రక ర్వవి
మోచనుబన్మలోచనున్ ॥ ఉ ॥ దండిని రాజులెల్ల హరి దాకిన నడ్డము వచ్చి ఫీకతో। భండనభూమియందుఁ దన బాంధవులె
ల్లను సన్నుతింపగా। గాండీవచాపముక్తవిశిఖంబుల వైరుల నెల్ల జంపెనా। ఖండలనందనుండు* శశకంబుల సింహము వం
పుకైవడిన్ ॥ వ ॥ ఇట్లు నాగ్నజిత్తిం బెండ్లియాడి యరణంబు పుచ్చుకొని ద్వారకానగరంబునకు వచ్చి సత్యభామతోఁ గ్రీ
డించుచుండె మఱియును ॥ మ ॥ జనవంద్యన్ శ్రుతకీర్తి నందదరుణిన్ సంతర్ధన క్షోణిపా। ద్యనుజన్ మేనమఱందలిన్ వివాహలో
లాపాంగఁ గైకేయిని। త్యనయోన్నిద్రఁ బ్రపూర్ణసద్గుణసముద్రన్ భద్రనక్షుద్రనా। వనజాతాక్షుఁడు పెండ్లియాడెను
హితప్రాంతంబు భీతిల్లఁగన్॥ మఱియును ॥ చ ॥ అమరులఁ జాఁడదోలి భుజగాంతకుడై వఖగేశ్వరుండు ముం। న్నమృతమున్ దె
చ్చుకైవడిమ బాంధుల రాజుల నుక్కడంచియా। కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను మద్రకన్యకన్। సమజన్మృగే
క్షణ నన్నయవిచక్షణలక్షణ బుధ్యలక్షణన్॥ వ ॥ ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయుఁ, గాళిందియు, మిత్ర
విందయు, నాగ్నజిత్తియు, భద్రయు, మద్రరాజనందనయైన లక్షణయు, ననంగ నెనమండ్రు భార్యలైరి-మఱియు నరకాసు

*** శ్రీకృష్ణుఁడు-సత్యభామతోఁగూడి-మురాసుర- నరకాసురులవధించుట. ***

రుని వధియించి తన్నిగుద్ధకన్యల సహస్రసంఖ్యలరోహిణి మొదలైనవారిం బరిగ్రహించెనని విని ॥ క ॥ ధరణీంద్రియనంద
నఁ డగు। నరకుని హరి యేలచంపె నరకాసురుఁడా। వరకుంతలలగు చామీ। కరకుంభస్తనుల నేలకారల బెట్టెన్ ॥ వ ॥ అనిన న
రేంద్రునకు మునీంద్రుం డిట్లనియె నరకాసురుని చేత నదితి కర్ణకుండలంబులును, వరుణఛత్రంబులును, మణిపర్వతమనియెడు న
మరాద్రిస్థానముం గోలుపడుటయు, నింద్రుండు వచ్చి హరికి విన్నవించిన హరి నరకాసురవధార్థంబు గరుడవాహనారూ
ఢుండై చను సమయంబున హరికి సత్యభామ యిట్లనియె ॥ శా ॥ దేవా నీవు నిశాటసంఘములనుద్దీపించి చెండాడనీ। పారిణీయ్యం
బు బుచూడఁగోరుమగదా పాణీశ మన్నించిన। న్నీ వెంటం గొనిపొమ్ము నేఁడు గరుణన్నే జూచి యేతెంచినీ। దేవీసంహతికె
ల్ల జెప్పదు భవద్దీప్తప్రతాపోన్నతుల్ ॥ అనిన బ్రాణవల్లభకు వల్లభుండిట్లనియె ॥ సీ ॥ సమదపుష్పంధయఝంకారములు
గావు భీషణకుంభీంద్రబృంహితములు। వాయునిర్గతపద్మవనరేణువులు గావు తురగరింఖాముఖోద్ధూతరజము। లాకీర్ణ జలత
రంగాసారములు గావు శత్రుధనుర్ముక్తసాయకములు। కలహంససారసకాసారములు గావు దనుజేంద్ర సైన్యకదంబకము
లు కమ కల్హారకుసుమసంఘములు గావు। చటులరిపుశూలఖడ్గాదిసాధనములు। కన్యనీ వేడ రణరంగగమన మేడ। వత్తువేగ
మనిలువుము వలదు వలదు ॥ వ ॥ అనిన సంభ్రమయునఁ బ్రియంబు జనియింపఁ డగ్గరి ॥ ఉ ॥ దానవులైన నేమి మఱిదైత్యసమూహ

* కన్యాశుల్కము। ఓలియిచ్చువారము. *నిష్ణాతుండవు। నిపుణుఁడవు. *సమయము। ప్రతిజ్ఞ. *ఆమిషము। మాంసము. *శశకంబులు కుందేళ్లు.

నుఱ్ఱైన నేమిని । మానితబాహుదుర్గములమాటునసుండఁగ నేమిశంకనీ । తోనరుదెంచునంచుఁ గరతోయజముల్లసిల్లించి మ్రొక్కిన । మ్మానినిదన్నుభర్త బహుమానపురస్సర దృష్టిఁజూడఁగన్ ॥ వ ॥ ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను గరకమలంబులం గ్రుచ్చియెత్తి తోడ్కొని గరుడారూఢుండై హరిగగనమార్గంబునం జని గిరిశస్త్రసలిల దహనపవన దుర్గంబై మురాసురపాశపరివృతంబైన ప్రాగ్జ్యోతిషపురంబు డగ్గఱి ॥ మ ॥ గదచేఁ బర్వతదుర్గముల్ సకలముల్ గ్లానించి సత్తేజిత । ప్రదరశ్రేణుల శస్త్రదుర్ధయముల్ భంజించి చక్రాహతిన్ । జెదరన్వాయుజలాగ్నిదుర్గముల నిశ్శేషంబులం జేసి ధీ । ప్రదుఁడై వాలునఁ ద్రుంచెఁ గృష్ణుఁడు మురప్రచ్ఛన్నపాశంబులన్ ॥ మఱియును ॥ శా ॥ ప్రాకారంబుగ దా ప్రహారములను త్పాటించి యంత్రంబుల । న్నాకారాతులమానసంబులను ఖిన్నత్వంబునొందించియు । స్తోకాకారుఁడు శౌరియొత్తె విలయోద్ధూతాభ్రనిర్ఘాతరే ! ఖాకారిత్వముఁ బాంచజన్యము విముక్తప్రాణిచైతన్యమున్ ॥ వ ॥ అంతలయకాల కాలాభ్రగర్జనంబు పగిది నొప్పు నమ్మహాధ్వని విని పంచశిరుండైన మురాసురుండు నిదుర చాలించి యావులించి స్లీల్గి లేచి జలంబులువెడలివచ్చి హరిం గని ప్రళయకాలకీలికైవడి మండుచు దుర్నిరీక్ష్యుండై కరాళించుచుం దన పంచముఖంబులం బంచభూతమయుండై లోకంబులు మ్రింగనప్పళించు చందంబునం గదసి యాభీలకీలచ్ఛటాజాలంబగు శూలంబున గరుడుని వైచి భూనభోంతరంబులు నిండ నార్చుచు ॥ క ॥ దురదురఁ బరువడి బిరుసున । హరిహరి నిలు నిలువుమనుచు నసురయుఁ గదిసెన్ । స్మరమురదివిజుల హృదయము । మెరమెరయి దెయఁడఁగు ననుచు మెఱసెన్ హరియున్ ॥ అప్పుడు ॥ క ॥ గరుడునిపైఁ బడవచ్చిన । మురశూలముమనడుమ నొడిసి ముత్తునియలుగాఁ । గరములవిరిచి ముకుందుఁడు । మురముఖములనిశితవిశిఖములు వడిఁ జొనిపెన్ ॥ వ ॥ గద ద్రవ్వెసెన్ముర దానవుండు హరిపైఁ గంసారియుం దద్గదన్ । గదచేఁ ద్రుంచి సహస్రభాగములుగాఁ గల్పించె నాలోనవాఁ । డెమ్మెహస్తములెత్తికొంచు వడిరా నీక్షించి లీలాసమ । గ్రదశన్వాని శిరంబులైదును వడిన్ఖండించెఁ జక్రాహతిన్ ॥ వ ॥ ఇట్లు శిరంబులు చక్రిచక్రధారాచ్ఛిన్నంబులైన వజ్రివజ్రధారాదళిత శిఖరంబై కూలెడి శిఖరచందంబున మురాసురుండు జలంబులందుఁ గూలిన వానిసూనులు జనకవధజనితశోకాతురులై జనార్దనుమర్దింతుమని *రణకర్దనంబునం దామ్రుండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు, నననేడ్వురు యోధులు సక్రోధులై కాలాంతకచోదితంబైన ప్రళయపవనసప్తకంబు భంగి నరకాసురప్రేరితులై రయంబునఁ బీఠుండను సేనాదండనాథుం బురస్కరించుకొని పఱతెంచి హరిం దాఁకి శరశక్తిగదాఖడ్గ కరవాలశూలాది సాధనంబులు ప్రయోగించిన । ఉ ॥ ఆదను జేంద్రయోఘవిపిధాయుధ సంఘము నెల్లను గ్రతన్ । మేదినిఁ గూలనేయుచు సమిద్ధనిరర్గళమార్గణాళిఁ గ్ర । వ్యాదకులాంతకుండసురహస్తభుజాననకంఠజానుజం । ఘాములఁ ద్రుంచి వైచె దిలలంతలఖండములై యిలం బడన్ ॥ వ ॥ మఱియు హరిశరజాల చక్రనిహతులైతనవారలు మడియుటకు వెఱంగుపడి రోషించి గరుడగమనుని దూషించి తన్నుభూషించుకొని సరకుసేయక నరకుండు వరకుండల ప్రముఖాభరణభూషితుండై దానసలిలధారాసిక్తగండంబులును, మహోద్దండశుండాదండవేదండంబులు దండతండంబులై నడువ వెడలి భండనంబునకుం జని ॥ మ ॥ బలవంతుండు ధరాసుతుండు గనె శుంభద్దాత్రబింబోపరి । స్థలశంపాన్వితమేఘమో యనఖగేంద్రస్కంధపీఠంబుపై । లలనారత్నముఁ గూడి సంగరకథాలాపంబులం జేయను । జ్జ్వలనీలాంగుఁ *గనన్నిషంగుఁ గుహనాచంగున్ రణాభంగురున్ ॥ వ ॥ కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక విలోకించి సంభ్రమంబున ॥ శా ॥ *వేణిన్జొల్లెము వెట్టి సంఘటితకక్షీబంధయై భూషణ । శ్రేణిం దాల్చి ముఖేందుమండ

## సత్యభామ నరకాసురునితో యుద్ధంబు చేయుట.

లమరీచీజాలముల్ పర్వఁగాఁ । బాణంబమ్మొదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభయై । యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబునన్ ॥ క ॥ *జన్యంబున దనుజులఁ దో । ర్జన్యములుడుపంగఁ గోరి చను దెంచిన సౌ । జన్యవతిఁ జూచి యదురా । జన్యశ్రేష్ఠుండు సరససల్లాపములన్ ॥ క ॥ లేమా దనుజులఁ గెలువఁగ । లేమా నీ వేలఁ గడఁగి లేచితి విటు రా । లేమా ను మాన వేనియు । లేమా విల్లందికొను ము లీలం గేలన్ ॥ అని పలికిన ॥ క ॥ హరిణాక్షికి హరియొసఁగెను । సురనికరోల్లాసనమును శూరకఠోరా । సురసైన్యత్రాసనమును । బరగర్వనిరాసనమును చాణాసనమున్ ॥ శా ॥ ఆవిల్లందిబలంబునొందితదగణ్యానంత తేజోవిశే । షావిర్భూతమహాప్రతాపమున వీరాలోకదుర్లోకమై । తావేగన్సగుణంబుచేసెధనువుం దన్వంగియై త్యాంగనా । గ్రీవాసం

*రణకర్దనంబున్ । యుద్ధవిలాసము చేత. *కనన్నిషంగున్ । ప్రకాశమానములగు అంబులపొదలుగల. కుహనాచకగున్ । మహామాయావి యయిన. *వేణిన్ జొల్లెము వెట్టి । జడను ముడిగా నమర్చి. *జన్యంబున్ । యుద్ధమునందు. *లేమా ను మాన వేయను చోట - వేమా ను మాన వేయని యొక పాఠముఁ గలదు. *రింఖణ । చలనము నకు. *ప్రత్యాలీఢము । ఎడమ కాలు ముందఱికిఁ జాఁచి నిలుచుట.

ఘుమునిగ్గూణంబుగరణ క్రీడామహోత్కంఠతోన్ ॥క॥ నారిమొరయించెవిపుసే । నారింఖణహేతువైననాదమునిగుడ న్నారీమణిబలసంప । న్నారీభాదికముమూర్ఛనందనరేందాి ॥సీ॥ సౌవర్ణకంకణఝుణఝుణనినదంబుశింజినీరవముతోఁ జెలిమిసేయఁ । దాటంకమణిగణధగధగదీప్తులుగండమండలరుచుల్గప్పికొనఁగ । ధవళతరాపాంగధళధళరోచులుబాణజాలప్రభాపటలినడఁప । శరపాతఘుమఘుమశబ్దంబు పరిపంథిసైనికకలకలస్వనములుడుప । వీరశృంగారభయరౌద్రవిస్మయములుగలసిభామినియొప్పెనోకాకయనఁగ । నిషువ్వఁదొడుగుటదివుచుటయేయుతెల్ల । నెఱుఁగరాకుండననిఁజేసెనిందువదన ॥మ॥ పరుఁజూచున్విభుఁజూచునొంపనలరింపన్ రోషరాగోదయా । వితతభ్రూకుటిమందహాసములతో వీరంబుశృంగారము । న్జరగన్ఘన్నులఁగెంపుసొంపుబరగన్జండాస్త్రసందోహన్ । సరసాలోకసమూహమున్నెరపుచున్ జందాస్యహేలాగతిన్ ॥మ॥ అలినీలాలకచూడనొప్పసగెఁ* బ్రత్యాలీఢమానంబుతో । నలికస్వేదవికీర్ణకాలకలతో నాకర్ణకాసీతసల్లలితజ్యానఖపుంఖదీధితులతోలక్ష్యావలోకంబుతో । వలయాకారధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై ॥సీ॥ బొమ్మపెండ్లిండ్లకుఁబోనొల్లనను బాలరణరంగమునకెట్లురాఁదలంచె । మగవారిఁగనినఁదామఱుఁగుఁజేరెడునింతిపగవారిగెల్వనేపదగెఁజూడె । బగిడియుమ్మెల్లలెక్క భయమందుభీరువుఖగపతిస్కంధమెకడిఁదినెక్కె । సఖులకోలాహలస్వనములోర్వనికన్యపటహభాంకృతులకెట్లంగినోర్చె । నీలకంఠములకునృత్యంబుఁగఱపుచు । నలసితలఁగపోవునలరుబోఁడి । యేవిధముననుండెనెలమి* నాలీఢాది । మానములనురిపులమానమడఁప ॥సీ॥ వీణఁజక్కఁగఁబట్టనేరవెఱుంగనికొమ్మబాణాసనంబెట్లుపట్టనేర్చె । మారికనఁదీఁగెఁగూర్పంగనేరని లేమగుణమునేక్రియధనుఃకోటిఁగూర్చె । సరసముత్యముగ్రువ్వఁజాలనియబలయేనిపుణతసంధించె నిశితశరముఁ । జిలుకకుఁబద్యంబు చెప్పనేరనితన్వియస్త్రమంత్రము లెన్నఁడభ్యసించె । బలుకుమనినఁబెకుర్కపలుకనిముగుదయే । గతినొనర్చెసింహగర్జనములు । ననఁగమెఱసెఁద్రిజగదభిరామగుణధామ । చారుసత్యభామసత్యభామ ॥శా॥ జ్యావల్లీధ్వనిగర్జనంబుగసురల్సారంగయోధంబుగా । నావిల్లింద్రశరాసనంబుగసరోజాక్షుండుమేఘుంబుగాఁ । దావిద్యుల్లతభంగినింతిసురజిహ్వావాగ్నిమగ్నంబుగాఁ । బ్రావృట్కాలము సేసెబాణచయమంభశ్శీకరశ్రేణిగాన్ ॥సీ॥ రాకేందుబింబమైరవిబింబమై యొప్పుసీరజాతేక్షణనెమ్మొగంబు । కందర్పకేతువైఘనధూమకేతువైయలరుపూబోఁడిచేలాంచలంబు । భావజుపరిధియైప్రళయారుకపరిధియైమెఱయునాకృష్టమైమెలఁతచాప । మమృతప్రవాహమైయనలసందోహమైతనరారునింతిసందర్శనంబు । హర్షదాయియైమహారోషదాయియై । పరఁచుముద్దరాలిబాణవృష్టి । హరికినరికిఁజూడనందందశృంగార । వీరరసములోలివిస్తరిల్ల ॥ఇవ్విధంబున ॥క॥ శంపాలతాభబెడిదపు । టంపఱచేఘోరదానవానీకంబుల్ । పెంపరిసన్నాహంబుల । సొంపరిభూసుతునివెనుకఁజొచ్చెన్విచ్చెన్ ॥వ॥ అయ్యవసరంబు నంగనసంహారిమనోహారిణింజూచిసంతోషకారియుం గరుణారసావలోకసంప్రసారియు మధురవచనసుధారసవిసారియుందదీయసమరసన్నాహనివారియునై యిట్లనియె ॥క॥ కొమ్మాదానవనాథుని । కొమ్మాహవమునకుఁదోలఁగెగురువిజయముఁగై । కొమ్మామెచ్చితినిచ్చెదఁ । గొమ్మాభరణములునీవుగోరినవెల్లన్ ॥వ॥ అనిపలికిసమ్మానరూపంబులును, మోహనదీపంబులును, దూరీకృతచిత్తవిక్షేపంబులునైన సల్లాపంబులంగళావతిం దద్దయుఁబెద్దరికంబుచేసి తత్కరకిసలయోల్లసితబాణాసనంబుమఱలనందుకొని యెనప్పుడుసురవైరిమురవైరికిట్లనియె ॥క॥ మగువమగవారిముందఱ । మగతనములుసూపరణముమానుటనీకున్ । మగతనముగాదుదనుజులు । మగువలదెసఁజనరుమగలమగలగుటహరీ ॥ అనినహరియిట్లనియె ॥క॥ నరకాఖండించెదమ । తకరకాండాసనవిముక్తఘనశరములభీకరకాయునిన్నుసురకీ । న్నరకాంతలుఃసూచినేఁడునందముఁబొందన్ ॥ అనిపలికిహరినరకాసురయోధులమీఁదశతఘ్నియను దివ్యాస్త్రంబు ప్రయోగించిననొక్కవరుసను వారలందఱుమహావ్యధంజెందిరిమఱియును ॥మ॥ శరవిచ్ఛిన్నతురంగమైపటుగదాసంభిన్నమాతంగమై । యసుచక్రాహతవీరమధ్యపథబాహుస్కంధముఖ్యాంగమై । సురభిత్తైన్యముదైన్యముంబొరయచున్నోషించిసైన్యంబుతో । హరిమోహలన్నిలువంగలేకపఱచెన్హాహానివాదంబులన్ ॥ అప్పుడు ॥గీ॥ మొనసిదనుజయోధముఖ్యులునిగుడించు । శస్త్రసముదయములు జవవరేణ్యసురహరుండువరుసమూఁడేసికోలల । ఖండితంబుచేసెఁగదనమందు ॥క॥ వెన్నునిసత్యనుమోచుచుఁబన్నగశబధనఖరచంచుపక్షాహతుల । న్భిన్నములుసేసెగరుడుఁడు । పన్నిగజసముదయములఁబొరవముఖ్యా ॥వ॥ మఱియువిహగరాజపక్షవిక్షేపణసంజాతవాతంబును సైరింపంజాలకహతశేషంబైన సైన్యంబుపురంబుసొచ్చుటంజూచినరకాసురుండు మున్నువజ్రాయుధంబుండిరస్కరించినఁదనచేతిశక్తింగొనిగరుడునిపై చెనతండును విరులదండప్రేటునఁజలింపనిమదోద్దండంబగువేదండంబునుంబోలి విలసిల్లెనయ్యవసరంబున గజారూఢుండైకలహరంగంబున ॥మ॥ సమదేభేంద్రమునెక్కిభూమిసుతుఁడాచక్రాయుధున్వైపహా । అముచేఁబట్టిననంతలోనరుచిమాలాభిన్నఘోరాసురో । త్తమచక్రంబగుచేతిచక

మున దైత్యధ్వంసిఖండించెర । త్నమయోదగ్రవినూత్నకుండలసమేతం బైనతన్మూర్ధముల్॥ శా॥ ఇల్లాలింగిట మైనకాలను నముస్నేనంచు ఘోషింతువో । తల్లీనిన్నుఁదలంచి మైననిచటందన్నుంగృపం గావదే । చెల్లంబోతలచెంచెనంచునిలనాక్షేపించుచందంబున। నైల్లంజప్పుడు గాగభూమిసుతుఁడుద్దీప్తాహవక్షోణిపై॥ క ॥ కంటిమినరకుడువడఁగా।మంటిమినేఁడనుచు వెసనమర్త్యులుమునులు। న్మింటంబువ్వులుగురియుచుఁ। బంటింపక పొగడిరోలిఁబద్మదళాక్షున్॥వ॥ అంతటభూదేవి వాసుదేవునిడగ్గరనే తెంచి* జాంబూనద రత్నమండితం బైన కుండలంబులును, వైజయంతియను వనమాలయును, వరుణదత్తం బైనసితచ్ఛత్రంబు నొకమహారత్నంబును సమర్పించి మ్రొక్కి భక్తితాత్పర్యంబులతోడం గరకమలంబులు ముకుళించి

—* భూదేవి శ్రీకృష్ణునిస్తుతించుట. *—

విబుధవందితుండును, విశ్వేశ్వరుండును నైన దేవదేవునినిట్లని వినుతించె॥ సీ ॥ అంభోజనాభునకంభోజనేత్రునకంభోజనిలయాసమన్వితునకు।నంభోజపదునకనంతశక్తికివాసుదేవునకును దేవదేవునకును। భక్తులకోరినభంగి నేరూపైనఁ బొందువానికినాదిపురుషుదకును । నఖిలనిధానమైయా పూర్ణవిజ్ఞానమైనవానికిఁ బరమాత్మునకును । ధాతగన్నమేటితండ్రికినజునికి।నీకువందనంబు లేనొనర్తు।నఖిలభూతరూపనిరుపమయీశప। రాపరాత్మమహితయమితచరిత॥ వ॥ దేవానీవులోకంబులుసృజియించుటకురజోగుణంబును, రక్షించుటకుసత్వగుణంబును, సంహరించుటకుఁదమోగుణంబును.ధరియింతువు కాలమూర్తివిప్రధానపూరుషుండవు పరుండవునీవనేనునువారియువహ్నియు ననిలుండునాకాశభూతతన్మాత్రలునింద్రియంబులును, దేవతలును.మనంబును, గర్తయును,మహత్తత్వంబును, జరాచరం బైనవిశ్వంబునద్వితీయుండ వైననీయందసంభవింతుము ॥ చ ॥ దయనిటుజూడుమానరకదైత్యునిబిడ్డఁడువీఁడునీదెసన్। భయమునునున్నవాఁడుగమబాలుడనన్యశరణ్యుఁడార్తుఁడా । శ్రయరహితుండుతండ్రిక్రియ శౌర్యము నేరదునీపదాంబుజ । ద్వయిబొడగాంచెభక్త పరతంత్రసువీక్షణదీనరక్షణా॥వ॥అనియిట్లుభూదేవిభక్తితోడహరికినమస్కరించి వాక్కుసుమంబులఁబూజించిననర్చితుండైభక్తవత్సలుం డైన పరమేశ్వరుండునరకపుత్రుం డైన భగదత్తునకభయంబిచ్చి సర్వసంపదలొసంగి నరకాసురగృహంబు ప్రవేశం

—* శ్రీకృష్ణుడుపదాఱువేలకన్నియలవరించి దేవలోకమునకుఁబోయిపారిజాతముదెచ్చుట. *—

చియందు॥ఉ॥ రాజకులావతంసుఁడుపరాజితకంసుఁడుసొచ్చికాంచెఘో। రాజులరాజులన్ బటుశరాహతినొంచిధరాతనూజుఁడు। తేజితశక్తిఁబొల్చిఁ జెఱఁదెచ్చినవారిఁబదాఱువేలధా । త్రీజనమాన్యలన్ గుణవతీ వ్రతధన్యలరాజకన్యలన్ ॥ మ॥ కనిరారాజకుమారికల్పరిమళత్కౌతూహలాకాంతలై । దనుజాధీశవిమార్దదారునతమందారున్ శుభాకారునూతనశృంగారువికారదూరుసుగుణాధారున్మృగీలోచనా। జనచేతోధనచోరురత్నమకుటస్ఫారున్మనోహారునిన్॥ వ॥ కనియతనిసౌందర్యగాంభీర్యచాతుర్యాదిగుణంబులకు మోహించి తమకంబులుజనియింప ధైర్యంబులుసాలించి సిగ్గులువర్జించిపంచశరసంచలితహృదయ లై దైవయోగంబునం బరాయత్తంబు లైన చిత్తంబులనమ్మత్తకాశినులు దత్తరంబునమనోజుఁడుత్తలపెట్టనతండుతమకుఁ బ్రాణవల్లభుండనివరియించి॥ ఉ ॥ పాపపురక్కసుండు చెఱబట్టె.టంచుఁదలంతుమెప్పుడున్ । బాపుడెవీనిధర్మువునఁ బద్మదళాక్షునిఁగంటిమించుము । స్నిపురుషోత్తముం గదియ నేమివ్రతంబులు చేసి నారమో । యాపరమేష్ఠిప్రణమ్యుఁడుగదమ్మహరిన్మముఁగూర్చెఁ జెచ్చటన్॥ క ॥ ఉన్నతినీతఁడు గొంగట । మన్నింపంగనిన బ్రతుకుమానినిమనలో, మున్నెమినోముసోచెనో। సన్నుతమార్గములవిపినజలదుర్గములన్॥క॥ విన్నారమెయిచేలువముఁ । గన్నారమెయిట్టిశౌర్యగాంభీర్యంబుల్। మన్నాగమింత గాలము । గొన్నారమెమెన్నడైనఁగూరిమిచికురుల్ ॥ సీ ॥ వనజదళాక్షునే వైజయంతికనైనఁ గదిసిగ్రేలుదుగదాకంఠమందు । బింబోష్ఠినేఘనపీతాంబరమునైన మెలసియుండుదుఁగదా మేనునిండఁ । గాంతాలలామనే కౌస్తుభమణినైననొప్పచూపుదుఁగదాయురమునందు । బాలికాతిలకనేఁ బాంచజన్యమునైనమొనసిచొక్కుదుఁగదా మోవిగ్రోలి। పద్మగంధినేనుబర్హదామమునైనఁ। జిత్రరుచులనుందుశిరమునందు । ననుచుఁ బెక్కుగతులనాడిరికన్యలు। గములుగట్టిగరుడగమనుఁజూచి॥ శా॥ భూనాథోత్తమకన్యకల్వరుసనంభోజాతనేత్రుండుసన్నేనన్వేర్ దగఁజూచెడగ్గరిమెవర్ణింపన్వివేకించెన । న్మానించెంగరుణించెఁ బేరడిగెసన్మార్గంబుతోఁ బెండ్లియా । యెనే చక్రికిదేవినంచుఁదమలోన్నిక్షేత లైరందఱున్ ॥ వ ॥ అనిబహువిధంబులందమతమమన్ననలకునువ్విళ్లూరుకన్నియలం బదాఱువేలధవళాంబరాభరణ మాల్యానులేపనంబుల నొసంగియందలంబులనిడివారలనునరకాసుర భాండాగారంబులంగల నానావిధంబులయినమహాధనంబులను, రథంబులను, దురంగంబులను, ధవళంబులై వేగవంతంబులై యైరావతకులసంభవంబులైన చతుర్దంతదంతావళంబులను, ద్వారకానగరంబునకుంబనిచి దేవేంద్రునిపురంబునకుం జనియదితిదేవి మందిరం

*ఆలీఢ।కుడికాలుముందరకుఁజాఁపినిలుచుట. *జాంబూనద।బంగరు. మండిత।ప్రకాశించుచున్న.

బుసొమ్పియా పెద్దమ్మకుముద్దుసూపి మణికిరణపటలపరిభావితభానుమండలంబులైన కుండలంబులొసంగి శచీసమేతుండైనమహేంద్రునిచేత సత్యభామతోడం బూజితుండై పిదప సత్యభామగోరిననందనవనంబు సొచ్చి ॥ మ ॥ హరి కేలం బెకెలించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టెసుం। దనగంధానుగతభ్రమద్భ్రమరనాదవ్రాతమున్ బల్లవాం। కురశాఖాఫలపర్ణపుష్పకలికాగుచ్ఛాదికోపేతమున్। గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలోకీయాచకాఖ్యాతమున్॥ వ॥ ఇట్లు పారిజాతమ్ము హరి యుంచియదువల్లభుండు వల్లభయుండును విహగవల్లభారూఢులయి చనుచున్న సమయంబున॥ సీ॥ నరకాసురుని బాధలఁ గిగోవిందునికడకేగి తత్పాదకమలములకు। దనకిరీటము సోఁక దండప్రణామముల్గా వింపనాచక్రికరుణఁజేసి। చనుదెంచి భూసుతుసమయించి తనవారిఁ దన్నురక్షించుటఁదలఁపమఱచి। యింద్రుండు బృందారకేంద్రత్వమదమునఁ బద్మలోచనపోకు పారిజాత। తరువు విడువు మనుచుఁ దాఁకెనడ్డము వచ్చి। తఱిమి సురలునట్లు దాఁకిరకట। మెఱుకవల దెనిర్జరేంద్రతఁగాల్పనే। సురలతామసమున జూడనరిది ॥ వ ॥ ఇట్లు తనకు నొడ్డారించియడ్డంబువచ్చిన నిర్జరేంద్రాదులనిర్జించి తనపురంబునకుం జనినిరంతర సురభికుసుమమకరందమాధురీవిశేషంబులకుం జొక్కి చిక్కక నాకలోకంబుననుండి వెంటనరుగుదెంచు తుమ్మెదలకు నెమ్మిదలంచుచున్న పారిజాతము నాశ్రితపారిజాతుండయిన హరి మహాప్రేమాభిరామయగు సత్యభామతోఁ గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి నరకాసురుని యింటం దెచ్చిన రాజకన్యకలెందఱందఱకు నన్నినివాసంబులు గల్పించి గృహోపకరణంబులు సమర్పించి॥ చ॥ అమితవిహారుఁడీశ్వరుఁడనంతుఁడు దా నొకనాఁడు మంచిలగ్నమునఁ బదాఱువేలభవనంబులలోఁ బదాఱువేలరూపములఁ బదాఱువేలనృపబాలలఁ బ్రీతిఁ బదాఱువేలచం। దములవిభూషితాందుచుయథావిధితో వరియించె భూవరా॥ ఉ। దానములందు సన్మదవిధానములందవలోకభాషణా। హ్వానములందు నొక్కక్రియనాలలితాంగులకన్నిమూర్తులై। తానని శంబుగానఁబడెతక్కువ యెక్కువ లేకయుత్తము। జ్ఞానగృహస్థధర్మమునఁ జక్రిరమించెఁ బ్రపూర్ణకాముఁడై॥ క॥ తరుణులు పెక్కండ్రైనను। బురుషుడు మనలేఁడు సవతిపోరాటమునన్। హరియాపదాఱువేవురు। తరుణులతో సమతమనిమోదత్వమునన్ ॥ శా॥ ఎన్నేభంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదులీక్షించుచు। న్నన్నే దేవుని జూడఁగానక తుదిన్మోహింతురామేటికే। విన్నాణంబున నోసతుల్గృహిణులై విఖ్యాతిసేవించిర। చ్చిన్నాలోకనహాసభాషణరతిశ్లాఘానురాగంబులన్ ॥ సీ ॥ ఇంటికి వచ్చిన నెదురేగుదెంచుచు నాసీతవస్తువులందుకొనుచు। సౌవర్ణమణిమయాసనములు వెట్టుచుఁ బదములుగడుగుచు భక్తితోడ। సంవాసితస్నానజలములందిచ్చుచు సద్గంధవస్త్రభూషణములొసఁగి। యిష్టపదార్థంబులిడుచుఁ దాంబూలాదులొసఁగుచు విసరుచనోజ మెఱసి। శిరముదువ్వుచుశయ్యాపైఁ జెలువుమిగుల। నడుగునొత్తుచు దాసీసహస్రయుక్త। లయ్యుఁగొలిచిరి దాసలై హరిను దారు। దారకాధిపవదనలువారుదగిలి ॥ శా॥ నన్నే పాయఁడు రాత్రులన్ దివములన్న స్నేకృపం జెందెడి। న్నన్నే దొడ్డుగఁ జూచు వల్లభలలో నాధుండు నాయింటనే। యున్నాఁడంచుఁ బదాఱు వేలుదనులో నూహించి సేవించిరా। యన్నల్గాఢపతివ్రతాత్వపరిచర్యాభక్తియోగంబులన్॥ క॥ ఆ రామలతో నెప్పుడుఁ। బోరాములు చాల నెఱపి పురుషోత్తముఁడు। న్నారామునఁ దిరిగెను సౌ। ధారామల తాసరోవిహారములన్ పా ॥ క ॥ ఏదేవుఁడు జగములను। త్పాదించును మనుచుఁ జెఱుచు బ్రాభవమున న। ర్యాదారత్వణ

—॥ శ్రీకృష్ణుండు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట. ॥—

మునకై। యాదేవుండట్లు మెఱసెయాదవులందున్ ॥ వ ॥ అంతనొక్కనాఁడు రుక్మిణీదేవిలోఁగిట మహేంద్ర నీల మరకతాది మణిస్తంభవలభీవిటంకపటల దేహళీకవాటవిరాజమానంబును, శాతకుంభకుడ్యగవాక్ష వేదికాసోపానంబును, విలంబమానముక్తాఫలదామ విచిత్రకౌశేయవితానంబును, వివిధమణిదీపికావిసరవిభ్రాజమానంబును, మధుకరకులకలిత మల్లికాకుసుమమాలికాభిరామంబును, జాలకరంధ్రనిర్గత కర్పూరాగరుధూపధూమంబును, వాతాయనవిప్రకీర్ణ శిశిరకర కిరణస్తోమంబును, పారిజాతప్రసవామోదపరిమిళితపవనసుందరంబునయిన లోపలిమందిరంబున, శరచ్చంద్రచంద్రికా ధవళపర్యంకమధ్యంబున, జగదీశ్వరుండయినహరి సుఖాసీనుండయియుండ సఖీజనంబులుండానను డగ్గరి కొలిచియుండి ॥ సీ ॥ కుచకుంభముల మీఁదికుంకుమతోఁ గాయు హారంబులరుణంబులగుచు మెఱయఁ। గరపల్లవముసాఁచికదలింప నంగుళీయకకంకణప్రభలావరింపఁ। గదలినబహురత్నకలితనూపురముల గంభీర నినదంబు గడలుకొనఁగఁ। గాంచనమణికణికామయూఖంబులు గండపాలికలపైఁ గంతులిడఁగ। గురులునర్తింపఁ బయ్యెదకొంగుదూగ। బోఁటిచేనున్నచామరఁబుచ్చుకొనుచు। జీవితేశ్వరు రుక్మిణి చేరనరిగి। వేడ్కలిగురొత్త మెల్లనవీవఁదొడఁగె॥ అప్పుడు॥ ఉ ॥ పతిమేరూపముదాల్చినన్ దదనురూపంబైన రూపంబుతో। సతితానుం డెడు నా సురూపవతి నాచంద్రాస్యనాలక్ష్మినా। సుతనున్ రుక్మిణినాయనన్యమతి నాశుద్ధాంతరంగంగళా। చతురత్వంబున శౌరియిట్లని మెఱంచన్ మందహాసంబుతోన్॥

మ॥ బలశౌర్యంబులుభోగమూర్తికులరూపత్యాగసంపద్గుణం। బులదిక్పాలురకంటెఁజైద్యముఖరుల్పూర్ణుల్మనుల్వారికిన్। నెలఁతా తల్లియుఁదండ్రియున్సహజుఁడున్నిన్నిచ్చినంబోకయీ । బలవద్భీరుల వార్ధిలీనులమముం బాటింపనీ కేటికిన్ ॥ సీ॥ లోకులనడువడిలోనివారముగామపరులకునూజాడబయలుపడదు। బలమదోపేతులుపగఁగొంద్రుమాతోడరాజపీఠములకు రామితయుచు। శరణంబుమాకునీజలరాశిసతతంబునిష్కించనులమేమునిధులులేవు । కలవారుచుట్టాలుగారునిష్కించనజనబంధులమముముక్తసంగ్రహులము । గూఢవర్తనులముగుణహీనులముభిక్షు । లైనవారిఁగానినాశ్రయింప । మిం చుముఖులదగులరిటువంటిమముబోఁటి । వారినేలఁదగులవారిజాక్షి॥ క॥సిరియునువంశముఁరూపును । సరియైనవివాహసఖ్యసంబంధంబు। ల్జరుగునుసరిగాకున్నను। జరుగవులోలాక్షి యెట్టిసంసారులకున్॥ క॥తగదనియెఱుఁగవుమమ్మున్ । దగిలితివిమ్మ గాక్షి దీనఁదప్పగునీకుం। దగినమనుజేంద్రునొక్కనిఁ। దగులుముగుణహీనజనులఁదగునేతగులన్॥ సీ॥ సాల్వజరాసంధచైద్యాదిరాజులు చెలఁగినిన్వీక్షింపమలయుచుండు రదిగాకరుక్మిణీయన్నయుగర్వించిపిన్యమదాంధుఁడైవెలయుచున్న । వారిగర్వంబులువారింపఁదటిగోరిచెలువనిన్నొడిచి తెచ్చితిమిగాని । కాంతాతనూజార్థకాముకులముఁగాముకామమోహములఁగ్రందుకొనము। వినుముదాసీనులముక్రియావిరహితులము। పూర్ణులముమేమునీత్యాత్మబుద్ధితోడ । వెలుఁగుచుందుముగృహదీపవిధముమెఱసి। నవలతాతన్వి మాతోడనవయవలదు॥ వ॥ అని యిట్లుభగవంతుండైనహరిదన్నుఁబాయకసేవించుఁబ్రియురాలింబట్టపుదేవినినియడిరుక్మిణీదర్పంబు నేర్పునసంహరించియూరకుండిన నమ్మానవతియప్రియంబులునగౌరవంబులున పూర్వకంబులునైన మనోవల్లభుమాటలువినిదురంతంబైన చింతాభరంబున సంతాపంబునొందుచు ॥ సీ॥ కాటుక నెఱయంగఁగన్నీరువరదలైకుచకుంభయుగళకుంకుమముఁదడియ । వడివడి నెడలెడి వేడి నిట్టూర్పుగాడ్పులలాలితాధరకిసలయముగందఁ। జెలువంబు నెఱిదప్పి చిన్నవోవుచునున్నవదనారవిందంబువాడుదోఁప। మారుతాహతిఁదూలుమహితకల్పకవల్లివడువునమేన్వడవడవడంకఁ । జిత్తమెరియంగఁజెక్కిటఁజెయ్యిఁజేర్చి । కౌతుకంబేదిపదతలాగ్రమున నేల। వ్రాసి పెంచుచుమోముర వాంచివగలఁ । బొందెమవ్వంబుగండినపువ్వుబోఁడి ॥ చ ॥ అలిగినలవెణిదన్నువిభుఁడాడినయప్రియభాషలిమ్మెయిన్। సొలవకకర్ణరంధ్రములసూదులుచొప్పినరీతినాత్మబె । ఘ్నలిరొదవిన్నలేడిక్రియఁబొల్పతిచేష్టలుదక్కినేలపై। వలనరిఁవ్రాలెఁగీలెడలివ్రాలినపుత్తడిబొమ్మకైవడిన్ ॥ ఇట్లువ్రాలిన ॥ మ॥ ప్రణుతామ్నాయుఁడుకృష్ణుఁడంతఁగదిసెన్ బాష్పావరుద్ధారుణే। క్షణవిస్రస్తవినూత్నభూషణదురూక్తకూరశరనారాచశో।క్షణనాలింగితధారుణిన్నిజకులాచారైకసద్ధర్మచా। రిణివిశ్లేషిణివీతతోషిణిఁబురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్ ॥ సీ॥ కనిసంభ్రమంబునఁదనుఁవునందనువుగానునువునఁజందనంబల్లనలఁది। కన్నీరుపన్నీటఁగడిగికర్పూరంపుపలుకులుచెవులలోఁబాఱనూది । కరమొప్పముత్యాలసరులుచిక్కెడలించియురమునఁబొందుగానూలుకొలిపి। తిలకంబునునుఫాలఫలకంబుపైఁదీర్చి వదలినభూషణావలులుదొడిగి। కమలదళచారుతాలవృంతములవిసరి। పొలుచుపయ్యెదకుచములఁబొందుపఱచి । చిత్తమిగురొత్తసాయ్యానసేదఁదేర్చి। బిగియఁగౌఁగిటఁజేర్చెనమ్మెగమునిమిరి ॥ గీ ॥ నెఱులుగలమరుసినీలంపుటురులసిరుల । వరుసఁగొనఁజాలినరులనుమరులుగొలుపు। నిరులగెలిచినకుమ్మెదగములదెగడు।కురులనులిదీర్చివిరులిడికొప్పువెట్టె॥ క॥ మురసంహారుడిందిందిర । గరుడనిలచలత్ప్రసూనకలికాంచితసుం। దరశయ్యఁజేర్చెభీష్మక। వరపుత్రింనుతచరిత్రవారిజనేత్రిన్॥ వ॥ ఇట్లుపానుపుసంచేర్చిమృదు

### రుక్మిణీదేవిశ్రీకృష్ణలాలితయై- యతనిస్తుతించుట.

మధురభాషణంబులననునయించిన॥ క ॥ పురుషోత్తమమ్ముఖకోమల । సరసిజమయ్యిందువదనసశ్రీదాహా । సరుచిస్నిగ్ధాపాంగ।స్ఫురదవలోకనములాలయఁజూచితగననెన్॥ క॥ మురహరదివసాగమదర। దరవిందదళాక్షతలఁపనదిమెట్టిదగు। న్నిరవధికవిమలతేజో। వరమూర్తివినీవభక్తవత్సలతొండున్॥గీ॥ సంతతజ్ఞానసుఖబలైశ్వర్యశక్తులాదిగాఁగలసుగుణంబులమరునీకు। నేనుదగుదునెసర్వలోకేశ్వరేశ। లీలమైసచ్చిదానందశాలివసఘ॥ సీ॥ యూధిమైఁబ్రకృతిపూరుషకాలములకునీశ్వరుఁడవైభవదీయచారుదివ్య । లలితకళాకౌశలమునసభిరస్థుఁడైకడగుసీరూపమెక్కడమహాత్మ । సత్వాదిగుణసముచ్చయయుక్తమూఢాత్మనైనమెనెక్కడననఘచరిత। కోరినీమంగళగుణభూతిదానంబుసేయంగఁబడుసనిచెందుభీతి। నంబునిధిమధ్యభాగమందమృతఫేన। పటలపాండురనిభమూర్తిపన్నగేంద్ర । భోగశయ్యనుబవ్వళించుచునుదనరు । నట్టియున్నతలీలదివ్యంబుదలఁప ॥ వ ॥ శబ్దస్పర్శరూపరసగంధంబులనియెడుగుణంబులచేతంబరిగ్రహింపఁబడినమంగళసుందరవిగ్రహుండవై యజ్ఞానాంధకారనివారకంబైన రూపంబుఁగైకొనిభవదీయులైన సేవకులకుననుభావ్యంబవైతిభవత్పాదారవిందమకరందరసాస్వాదలోలాత్ములైన యోగీంద్రులకైననుభవన్మార్గంబు స్ఫుటంబుగాదట్లగుటం జేసియీమనుజపశువులకు దుర్విభావ్యంబగుట యేమిచెప్పనిట్టియీశ్వరుండవైనసీకునిచ్చ స్వతంత్రంబదియును, నాకధికంబుగావ్వున

న్నునేననుసరింతు దేవానీవకించనుండవై తేనిబలిభోక్తలైన బ్రహ్మేంద్రాదులెవ్వనికొఱకు బలిసమర్పణంబుచేసిరి నీవు సమస్తపురుషార్థమయుండవనియును, ఫలస్వరూపివనియును, నీయందలి ప్రేమాతిశయంబులంజేసి విజ్ఞానదీపాంకురంబు ననిరస్తసమస్తదోషాంధకారులై యిహసౌఖ్యంబులువిడిచి భవదీయదాససంగమంబె కోరుచుందురట్లు సేయనేరకనిజాధికారాంధకారమగ్నులై భవత్తత్వంబు దెలిసి బలిప్రక్షేపణంబులు సేయంజాలక మూఢులై సంసారచక్రంబునంభరిభ్రమింతురదియునుంగాక ॥గీ॥ వరమునీంద్రయోగివరసురకోటిచే । వర్ణితప్రభావవైభవంబు।గలిగియఖిలచేతనులకువిజ్ఞాన ప్రదుండవగుదువభవదురితదూర ॥వ॥ దేవాభవదీయకుటిలభ్రూవిక్షేపాదీరితకాలవేగంబుచేత విధ్వస్తమంగళులగుకమలభవభవపాకశాసనాదులం దిరస్కరించినట్టి మదీయచిత్తంబున ॥చ॥ నినువరియించినం బెలుచనీరజలోచనశార్ఙసాయకా । సననినదంబులన్సకలశత్రుధరాపతులన్జయించిభో। రునఁబశుకోటిఁదోలువృగరాజునిజాంశముభూరిశక్తిఁగై । కొనినవిధంబునన్ననుసకుంఠిత శూరతఁజెచ్చితీశ్వరా ॥ఉ॥ ఆట్టినృపాలకీటములనాజినెదుర్పఁగలేనివానియ । ట్లొట్టినభీతిమైనిటుపయోధిశరణ్యుఁడవైతివింతయుక్ । నెట్టనమాయగాకసివిసిక్రమఃలేభవదీయభక్తులై । నట్టినరేంద్రమౌళిమణులంచితరాజ్యబుషుల్ముదంబునక్ ॥గీ॥ వితతరాజ్యగరిమవిడిచికాననముల। నాత్మలందునీపదాబ్జయుగము। వలఁతిగాఁగనిలిపివాతాంబుపర్ణాశ । నోగ్రనియతులగుచునుందురభవ ॥మ॥ విమలజ్ఞాననిరూఢులైనజనముల్వీక్షింపమీపాదకం। జమరందస్ఫుటదివ్యసౌరభమునాస్వాదించినిర్వాణరూ । పముసత్పూరుషవాగుదీరితముశోభాశ్రీనివాసంబునౌ । మిముసేవింపకమానవాధమునిదుర్మేంధాంధుసేవింతునే॥వ॥ మఱియును దేవాభూలోకంబునందును,నిత్యనివాసంబులందును, సకలప్రదేశంబులందును,జగదీశ్వరుండవైన నిన్నునభిమతంబులైన కామరూపంబులుగైకొనివరియింతుభవదీయ చరణారవిందమకరందాస్వాదనచాతుర్యభృంగినైన కామినియతిహేయంబైన త్వక్శ్మశ్రురోమనఖకేశంబులచేతఁ గప్పంబడియంతర్గతంబైన మాంసాస్థిరక్తక్రిమివిట్కఫపిత్తవాతంబుల భీభత్సంబైన నరాధముని మూఢాత్మనై కామించునేయదియునుంగాక ॥సీ॥ నీరదాగమమేఘ నిర్ముక్తపయఃపానచాతకంబెగునే చౌటిపడెకుఁ। బరిపక్వమాకందఫలరసంబులుగ్రోలుకీలుముల్చను నెదుత్తూరములకు । ఘనరవాకర్ణనోత్కలికమయూరముల్గోరునేకరినఝిల్లీరవంబుఁ। గరికుంభపిశితసద్గ్రాసమోదితసింహములుగునే శునకమాంశాభిలాషఁ। బ్రవిమలాకారభవదీయపాదపద్మ । యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త। మన్యుఁజేరునెతనకుపాస్యంబుగాఁగ।భక్తమందారదుర్భవభయవిదూర॥క॥ వాసవవందితభవకమ। లాసనదివ్యప్రభావభావినిమెపుడుక్ । నీసమధికచారిత్రక। థాసురుచిరగానమవితథంబై చెల్లుఁ ॥క॥ ధరణీనాథులుతమతమ।వరవనితామందిరములవసియించుచుగో। ఖరమార్జాలములగతిఁ। స్థిరబద్ధులగుదురునిన్నుఁదెలియనికతనక్॥గీ॥ జలజనాభసకలజగదంతరాత్మవై। నట్టిదేవనీపదారవింద। యుగళిసానురాగయుక్తనైచామదిఁ।గలుగునట్లుగాఁగఁదలపుమనఘ ॥గీ॥ పృథురజోగుణప్రవృద్ధమైనట్టినీ । దృష్టిచేతనన్నుఁజేరుకొనఁగఁ। జూడుటెల్లఁబద్మలోచననామీఁది । ఘనదయాద్రదృష్టిగాఁదలంతు ॥వ॥ అదియునుంగాక మధుసూదననీవాక్యంబులు మిథ్యగావుతల్లివచనంబు కూఁతురికభిమతంబుగాదె యౌవనారూఢమదంబున స్వైరిణియగుకామిని పురుషాంతరాసక్తయగుట విచారించుపరిజ్ఞానిమైన వాఁడువిడుచునవివేకియయినపురుషుండింద్రియలోలుండై రతిందగిలిడాసివిడువనేరకపరిగ్రహించియుభయలోకచ్యుతుండగునట్లుగావున నీమెఱుంగని యర్థంబుగలదేయనివిన్నవించిన రుక్మిణీదేవివచనంబులకుఁగృష్ణుండు సంతసిల్లియిట్లనియె॥

## కృష్ణుండురుక్మిణీదేవినియూరడించుట.

చ॥ అలికులవేణినవ్వులకునాడినమాటలకింతనీమదిం । గలఁగఁగనేలవేటలనుగయ్యములక్రతులందునొవ్వఁగాఁ। బలికినమాటలెగ్గులనిపట్టునుకొభవదీయచిత్తముం । దెలియఁగఁగోరిమేఁటకిలితిన్మదిలోనిటుగుందనేటికిక్॥ అదియునుంగాక॥ఉ॥ కెన్నకులుముద్దుపలుకులును గెంపుకనుంగవతీయమోవియుక్ । జంకెలుతేరిచూపులెకసక్కెములున్నెలవంకబొమ్మలుం । గొంకకవీడనాడుటలుఁగూరిమియుంగలకాంతగూడుటల్ । అంకిలిలేకజన్మఫలమబ్బుటగాదెకురంగలోచనా।అనిమఱియునిట్లనియె ॥ఉ॥ నీవుపతివ్రతామణివినిర్మలధర్మవివేకశీలవ। ద్భావవునీమనోగతులఁబాయకనెప్పుడునస్మదీయసం। సేవయకానియన్యముభజింపవుపుట్టిననాఁటనుండినీ। భావమెఱింగియుండియునుబలికెనతప్పుసహింపమానినీ ॥వ॥ అనివెండియు,నిట్లనియె నీవాక్యంబులు శ్రవణసుఖంబులుగావించెనీవు వివిధంబులైనకామంబులు గోరితివేనినవియన్నియును నాయందయుంటంజేసియే కాంతసేవాచతురవైననీకునవియన్నియు నిత్యంబులైయుండు నీపాతివ్రత్యంబును, నాయందలిస్నేహంబునతివిశదంబులయ్యె నావాక్యంబులచేత భవదీయచిత్తంబు చంచలంబుగాకనాయందులబుద్ధిదృఢంబుగుంగాపున సకలసంపద్విలసితంబైనద్వారకాదినగరదివ్యమందిరంబులందు నీదుభాగ్యంబునంజేసి సంసారివైవడనీయందుబద్ధానురా

గుండనైవర్తింతుఁదకేఁన ప్రాణేంద్రియపరవశత్వంబునవికృతశరీరధారిణినైన సతినన్నుం జెందుట దుష్కరంబదియు నుంగాక మోక్షప్రదుండనైననన్నుం గామాతురలై యల్పమతులయివ్రత తపోమహిమలచేత దాంపత్యయోగంబుకై సేవింతురది యంతయునామాయావిజృంభితంబునమందభాగ్యలై నిరయంబునొందుదురట్లుగావుననీసమానంబయినకాంత యేకాంతలంగలదెనీవివాహకాలంబుననేకరాజన్యవర్యులఁగైకొనక భవదీయమధురాలాపశ్రవణాత్మకుండనయిననా సన్నిధికన్యశరీరంబరయోగ్యంబునీకు శేషంబైయున్నదాననని యేకాంతంబునం బ్రాహ్మణుంబుత్తెంచిన యేనునుంజను దెంచినీపరిణయసమయంబున భవత్సహోదరుంబట్టివిరూపుంగావించిన నదిగనుంగొనియునునాయందలి ప్రేమాతిశయంబుననూరకుండితివదిగావునబహు ప్రకారంబులయివర్తించునీసద్గుణంబులకుసంతసింతునని యివ్విధంబున దేవకీసుతుండు నరలోకవిడంబనంబుగగృహస్థునిభంగినిజ గృహకృత్యంబులాచరించుచుండెననిశుకుండుమఱియునిట్లనియె ॥ క ॥ అనియి ట్లుకృష్ణుఁడాడిన। వినయవివేకానులాపవితతామృతసే। చనముదితహృదయయైయ। వ్వనితామణివికచవదనవనరుహయై గుచుఁ॥ క॥ నగవామతింపుచూపులు। నగధరుమొగముననునిలిపినయమునఁగరము। ల్మోగిచివినుతించెఁగృష్ణుఁ। ఖగవాహుఁ రుచిరదేహుఁగలితోత్సాహుఁ॥ చ॥ అతఁడువిరాజమానముఖుఁడైవివిధాంబరచారుభూషణ। ప్రతతులతోడఁగోరినవరంబులుఁదద్దయునిచ్చెఁగృష్ణుఁడు। న్నతశుభమూర్తిదేవగణనందితకీర్తిదయానువర్తియై। యతిమృదువాణికింగిసలయారుణపాణికినీలవేణికిఁ॥ వ॥ ఇట్లుసన్మానించికృష్ణుండురుక్మిణియుండానునుదదనంతరంబ॥ చ॥ ఎలమిఘటింపఁగాఁగలసియాడెలనీడలమల్లికాలతా। వలికరవీరజాతివిరవాదులవీధులఁగ్రమ్ముదెమ్మెర। ల్పొలయనవీనవాసనలఁబొన్నలదిన్నెలఁబచ్చరచ్చల। న్గొలఁకులలేగెలంకులనుగోరికెలిరికెలొత్తఁగ్రొత్తలై॥ క॥ ఆరామభూములందువి। హారాధికసౌఖ్యలీలనతిమోదముతో। నారామానుజుఁడుండెను। నారామామణియుఁదానునభిరామముగన్॥ వ॥ మఱియునవేకవివిధవిచిత్రమణివితానాభిశోభితప్రాసాదోపరిభాగంబులను, లాలితనీలకంఠకలకంఠకలపికశుకకలాపకలితమకరందపానమదవదిందిందిరఝుంకారసంకులకమలకల్హారసుధాసారనీహారపూరితకాసారతీరంబులను, ధాతునిర్ఝరరంజితసానుదేశగిరికుంజపుంజంబులను, కృతకశైలంబులను, క్రీడాగృహంబులనుం జెలంగి నందనందనుండువిదర్భరాజనందనందగిలికందర్పకేళీలోలాత్ముండైయనంతరంబా సుందరీలలామంబువలనఁ బ్రద్యుమ్నుండు, చారుదేష్ణుండు, సుదేష్ణుండు, చారుదేవుండు, సుచారువు, చారుగుప్తుండు, భద్రచారువు, చారుభద్రుండు, విచారువు, చారువుననియెడు పదుగురుతనయులంబడసె, నట్లు సత్యభామా, జాంబవతి, నాగ్నజిత్తి, కాళింది, మాద్రీ, మిత్రవిందా, భద్రలను, వేఱువేఱం బదుగురేసిభద్రమూర్తులైనకుమారులుదయించిరివ్విధంబునమఱియును॥ చ॥ అనఘపదాఱువేలసతులందుజనించిరివేఱువేఱనం। దనదశకంబుదత్ప్రసవితానముగాంచిరనేకసూనుల। న్ననయఁగనట్లుపిల్లచెఱుకీనినకైవడిఁబుత్రపౌత్రవ। ర్ధనముననొప్పెఁగృష్ణుఁడుమహంబునఁదామరతంపరైభువిన్॥ గీ॥ అట్లుయదువృష్టిభోజాంధకాదివివిధ। నామధేయాంతరములనెన్నంగనూట। యొక్కటైచాలవర్ధిల్లెనక్కులంబు। నృపకుమారులఁజదివించునేర్పుగలుగు॥ గీ॥ గురుజనంబులువినుమూఁడుకోట్లమీఁద। నెనుబదెనిమిదివేలపైనెసఁగనూఱు। రన్నఁదద్బాలకావలినెన్నఁదరమె। శూలికైననుదామరచూలికైన ॥ వ॥ అందుగోవిందనం

## *అనిరుద్ధునివివాహసమయంబునబలరాముండురుక్మిమొదలగువారిసఁజంపుట.*

దనుండైనప్రద్యుమ్నునకురుక్మికూఁతురివలననసిరుద్ధుండుసంభవించెననినమునివరునకుభూవరుండిట్లనియె ॥ క॥ బవరమునఁగృష్ణుచేము। న్నవమానమునొందిరుక్మియచ్యుతుఁగెలువం। దివురుదుఁదనసుతనరిసం। భవునకునెట్లిచ్చె నెఱుగఁబలుకుమునీంద్రా ॥ సీ ॥ నావుడుశుకయోగినరనాయకోత్తమనీవుచెప్పినయట్లనెమ్మనమునఁ। బద్ధాయతాత్తుచేఁబడెసబన్నమునకుఁగనలుచునుండియుననుజతోడి। నెయ్యంబుననుభాగినేయునకిచ్చెనుగూఁతునంచితపుష్పకోమలాంగిఁ। దనపూనికాదప్పినఁదగవిదర్భేశుండువినుమెఱిఁగింతునవ్విధముదెలియఁ। బరగరుక్మవతీస్వయంవరమునకొగి। నరుగుదెండనిభీష్మభూవరసుతుండు। వరుసరప్పించెరాజన్యవరకుమారి। వరులననువార్తకలరియాహరిసుతుండు॥ చ॥ వరమణిభూషణప్రభలవర్ధమనగ్గళభంగిఁబర్వఁగ్రు। స్ఫురితరథాధిరోహణవిభూతిదలిర్పమనోహరైకసు। స్థిరశుభలీలనేగుయదుసింహకిశోరము రాజకన్యకా। పరిణయవైభవాగతనృపాలకకోటికిరుక్మివీటికిన్॥ చ॥ చనిపురిఁజొచ్చివృష్టికులసత్తముడచ్చటచూఁగియున్నయ। ష్మనుజవరేణ్యనందనులమానముభూలభయాకులాత్ములై। చనఁగననేకచండతరసాయకసంపదఁజూపిరుక్మినందనఁగొనివచ్చివేడ్కనిజధామముసొచ్చెనవార్యశౌర్యుఁడై ॥ వ ॥ ఇట్లుతెచ్చిప్రద్యుమ్నుండుహరిణనయనంబరిణయంబందిఖిలసుఖంబులనుభవించుచుండెననంతరంబ॥ క॥ ధీరుఁడుకృతవర్మునిసుతు। మారుఁడువరియించెరుచిరమండనయుత

*మాకంద। మామిడిచెట్టు. దుత్తూరము। ఉమ్మెత్తచెట్టు. ఝల్లీరవంబు। చిమటరొద. ✽స్వైరిణి। వ్యభిచారి. పిశిత। మాంసము ✽ఆర్ద్ర। చల్లని.

నం। భోరుహముఖి రుక్మిణిసుతఁ। జారుమతిన్ గన్యఁ బ్రకటసజ్జనమాన్యున్॥ గీ॥ ప్రకటచరితుండు భీష్మభూవరసుతుండు। మన
ము మోదింపఁ దనకూర్మి మనుమరాలి। రుక్మలోచన ననసునరుక్మకాంతిఁ। బేర్మి ననిరుద్ధునకుఁ బెండ్లి సేయ నవుడు॥ క॥ పో
లుపగు రత్నవిభూషా। జ్వాలులై శుభవేళ నవ్వివాహార్థము ని। ర్మలబహువైభవశోభన। కలితవిదర్భావనీశకటకంబునకున్॥
చ॥ హరియును రుక్మిణీసతియు నా బలభద్రుఁడు శంబరారియు। న్నరిమదభేది సాంబుఁడును నాదిగ రాజకుమారకోటి సిం।
ధురరథవాజిసద్భటులతోఁ జనియందు సమగ్రవైభవా। చరితవివాహయుక్తదివసంబులు వేడుకఁ బుచ్చియుంటటన్॥ క॥ ఒ
కనాఁడు యదుకుమారకు। లకలంకసమగ్రవైభవాటోపముహా। త్సుకులై యుండఁగఁ జూపో। పక యొకసకేళిమున నవని
పాలురు వరుసన్॥ ఉ॥ ఎచ్చరికం గళింగధరణీశుఁడు రుక్మి మొగంబు సూచి నీ। యొచ్చెము దీర్చుకొ నిది యొప్పగు వేళ బలుం
డు జూదమం। దిచ్చగలండు గాని పాలు పెకిలిన సేపఱి గాఁడు గాన నీ। కిచ్చు నవశ్యమున్ జయము సీగుము తొల్లిటి బన్నముల్వ
డిన్॥ క॥ అని వురికొల్పిన రుక్మియుఁ। దన చేటు తలంపలేక తాలాంకునితో। డను జూదమాడఁ దివిరెను। దన జాసనుకృతము గడు
చువారెవ్వరిలన్॥ అంత॥ క॥ కోరి విదర్భుఁడు కుటిలవి। హారుండై పలిచె జూదమాడ జితారిన్। హరిస్సన్నుతసూరి। న్సీరిన్ రై
వతసుతార్ద్రచిత్తవిహారిన్॥ గీ॥ పు-నిమసముగొంత ప్రొద్దువోక రురామ। ❋ నైత్తమాడ నీవు నేర్తువనఁగ। విందుమిపుడు కొం
త వెల యొడ్డి యాడుద। మనిన బలుఁడు లెస్సయని చెలంగె॥ క॥ మదిలోని చలము డింపక। పదియిరువై నూఱు వేయి పదివేలి చెప।
న్నిదమని యొడ్డుచు నాడిరి। మదమున నిద్దఱును దురభిమానము పేర్మిన్॥ ఉ॥ ఆడిన యాటలెల్లను హలాయుధుఁ డోడిన రుక్మి గె
ల్చుడున్। దోడి నృపాలకోటి పరితోషముఁ జెందఁ గళింగభూవిభుం। డోడె బలుం డటంచుఁ బ్రహసోక్తుల నెంతయు రాముఁ జు
లకఁగా। నాడె నుదంతపఙ్క్తి వెలినై యొకని పెట్టఁగఁ జాలవవ్వుచున్॥ గీ॥ బలుఁడు కోపించి యొకలక్షపణము సేసి। యాడెఁ బ్ర
కటంబుగా జూదమపుడు గెల్చె। గెల్చినను రుక్మి యుడియేను గెల్చియుండ। గెలుపు నీదని కికుఱింపవలవియగునె॥ క॥ అనవుడు హ
లధరుఁ డచ్చటి। జనపాలకసుతులఁ జూచి సత్యము పలుకుం। డని యడిగిన వారలురు। క్మికి హితులై పలుక వైరి మొగమాటమున
న్॥ ఉ॥ అప్పటి యట్ల యొడ్డి ముసలాయుధుఁ డేపున నాడి జూదముం। జొప్పడ గెల్చి యీ గెలుపు చూడఁగ నాదియొ వానిదో
జనుల్। దప్పక చెప్పుడన్న విదితధ్వనితో నశరీరవాణి దా। నిప్పటి యాట రాముఁ డెజయించె విదర్భుఁ డెయోడె నావుడున్॥
వ॥ అనిన విని సకలజనంబులు నద్భుతానందనిమగ్నమానసులైరి కుటిలస్వభావులైన భూవరులు రుక్మిం గాఁగొల్పిన నతండు త
న తొల్లింటి పరాభవంబు దలంచి మెదిలిఁ దన్ను నెఱుంగక బలాబలవివేకంబు సేయ నేరక విధివశానుగతుండై చలంబు నంబ
లునిం గని యిప్పటి యాటయు నేన గెల్చియుండ వృథాజల్పనకల్పనుండవై నీవు గెల్చితినని పలికెదవు వత్స విద్యానైపుణముగల
భూపకుమారులతోఁ బసులగాపరులెత్తువత్తురే యని క్రొవ్వున నవ్వుచుం బలికిన నప్పలుకులు చెవులకు ములుకులక్రియం దాఁ
కినఁ గోపోద్దీపితమానసుండై పెటపెటం బండ్లు గొఱుకుచుం గన్నుల నిప్పులుప్పతిల్లంగిను కందోకఁ ద్రొక్కిన మహోర
గంబునోజన్ రోఁజుచు దండతాడితంబయిన పుండరీకంబు లీలహుమ్మని మోయుచుఁ బ్రచండబాహుదండంబులు సాఁచి ప
రిఘంబందుకొని రుక్మి నినతనికనుకూలంబయిన రాజలోకంబును బడలు పడనడచె నయ్యవసరంబున॥ క॥ మును దంతపఙ్క్తి వెలి
గాఁ। దను నవ్విన యక్కళింగుఁ దలవట్టి రయం। బునఁ బడఁ ద్రిగిచి వదనమే। పునఁ బెడచే వ్రేసి దంతములు వెసడులిచెన్॥ క॥ అం
తం బోవక రుక్మిని। దంతంబులు మున్ను డులిచితనువగలింప। న్నంతకపురికే గెనువాఁ। డెంతయు భయమంది రాజులెల్లం గలఁ
గన్॥ అట్లు చేసి యయ్యాదవసింహంబ వక్రవిక్రమంబునం జెలంగె నంత॥ క॥ భూవరపద్మాక్షుఁడు దన। బావ హతుండగుటఁ
గని యుఁ బలుకక యుండెన్। భావమున రుక్మిణీబల। దేవుల కేమనఁగ నెగ్గు దేనునో యనుచున్॥ అంత నా విదర్భనగరంబు నిర్గ
మించి॥ క॥ పరమానురాగరససం। భరితాంతఃకరణులగుచుఁ బాటించి వధూ। వరులను రథమందిడి హలి। ధర హరి రుక్మిణులఁ
గొల్చి తగ యదువీరుల్॥ ఉ॥ మంగళతూర్యఘోషముల మందగతిం జెలఁగంగ నుత్తమా। తంగతురంగసద్భటకదంబముతోఁ
జని కాంచిరంత నా। రంగలవంగలుంగవిచరన్మదభృంగసురంగనాదసం। సంగతరంగిణీకలితసంతతనిర్మలినాకుశస్థలిన్॥
ఇట్లు పురోపవనోపకంఠంబునకుం జని॥ క॥ అందు వసించిరి నందిత। చందనమందారకుందచంద్రలసన్మా। కందముల నీడ హృ
దయానందము సంధింప నందనందనముఖ్యుల్॥ వ॥ తదనంతరంబ పురప్రవేశంబు చేసిరని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షి

❋ బాణాసురుండీశ్వరప్రసాదంబు నొందుట. ❋

న్నరేంద్రునకిట్లనియె॥ గీ॥ అనఘ బలినందనులు నూఱ్వురందులోన। నగ్రజాతుండు బాణుఁ డత్యుగ్రమూర్తి। చిరయశోహ
రివిహితపూజితపురారి। యహితతిమిరోష్ణకరుఁడు సహస్రకరుఁడు॥ క॥ బాణుఁడు విక్రమజితగీ। ర్వాణుఁడు సని కాంచె భ
క్తివశుఁడై సగుణున్। స్థాణున్ నిరళితాసమ। బాణున్ దాండవధురీణు భక్తత్రాణున్॥ క॥ కనియనురాగవికాసము। దన
మనమునఁ గడలుకొనఁగ ధరజాగిలి వం। దనమాచరించె మోదము। దనరఁగఁ దాండవము సలుపు తజ్జిన యయ్యభవున్॥ ఉ॥ సంచి

నైత్తము- జూదము.

తభూరిబాహుబలసంపద పెంపుననారంజంబువా। యించియనేకభంగులను మేశుత్రిలోకశరణ్యునాత్మమె। ప్పించిప్ర మోదియైనిజవశీకృతనిశ్చలితాంతరంగుగాఁ। వంచితదాననాంబురుహవీక్షణుఁడైతెగమొ్రక్కియిట్లనెన్॥ ఉ॥ శంకరభ క్తమానసవశంకరదుష్టమదాసురేంద్రనా। శంకరపాండునీలరుచిశంకరవర్ణనిజాంగభోగిరా। ట్కంకణపార్వతీహృద యకైరవకైరవమిత్రయోగివ్హా। త్పంకజపంకజాప్తనిజతాండవఖేలసభక్తపాలనా॥ అనివినుతించి॥ ఉ॥ దేవమదీయ వాంఛితముచేటపడన్నిటువిన్నవించెద। నీవునునద్రినందనయునెమ్మినినాపురికోటవాకిట। న్గావలియుండినన్నఁగృప గావుముభక్తఫలప్రదాతయో। భావభవారినీచరణపద్మములెప్పుడునాశ్రయించెదన్॥ వ॥ అనియభ్యర్థించినంబ్రస న్నుండైభక్తవత్సలుండగు పురాంతకుండు గౌరీసమేతుండై తారకాదిభూతగణంబులతోడ బాణనివాసంబగుశోణపురం బువాకిటంగాఁపుండెబదంపడియొక్కనాఁడబ్బలినందనుండు॥ గీ॥ దర్పమునఁబొంగిరుచిరమార్తాండదీప్తి। మండలము తోడమార్పడుమహితశోణ। మణికిరీటముత్రిపురసంహరునిపాద। వనజములుసోఁకమొ్రక్కియిట్లనినుతించె॥ సీ॥ దేవజగ న్నాథదేవేంద్రవందితవినితచారిత్రసంతతపవిత్ర। హాలాహలాహారయహిరాజకేయూరబాలేందుభూషసద్భక్తపోష। సర్వలోకాతీతసద్గుణసంఘాత పార్వతీహృదయేశభవవినాశ। రజతాచలస్థానగజచర్మపరిధానసురవైరివిధ్వస్తశూల హస్త। లోకనాయకసద్భక్తలోకవరద। సురుచిరాకారమునిజనస్తుతివిహార। భక్తజనమందిరాంగణపారిజాత। నిన్నునె వ్వాఁడునుతిసేయనేర్చునభవ॥ మ॥ అనిలోనన్నునెదిర్చిబాహుబలశౌర్యస్ఫూర్తిఁబోరాడజా। లినవీరుండొకఁడైనఁబం డెమునకున్లేఁడయ్యెభూమండలి। న్ననయంబున్భవదగ్ర్యదత్తకరసాహస్రంబుకండూతివా। యునుపాయంబునులేదె యీభరమునెట్లోర్తున్నమానాయకా॥ సీ॥ హుంకారకంకణక్రేంకారశింజినీటంకారనిర్ఘోషసంకులంబు। చండధోర్దండ భాస్వన్మండలాగ్రప్రకాండఖండితరాజమండలంబు। శూలాహతక్షతోద్వేలకీలకరాళకేళీసమాలోలఖేలనంబు। శుం భదున్మదకుంభికుంభస్థలధ్వంససంభూత శౌర్యవిజృంభణంబు। గలుగునుద్దామభీమసంగ్రామకేళి। ఘనపరాక్రమవిక్ర మక్రమముగాఁగఁ। జరుపలేనట్టికరములుగరముదుఃఖ। కరములగుఁగాకసంతోషకరములగునె॥ ఉ॥ కానమదీయచండభు జగర్వపరాక్రమకేళికిన్సముం। డీనిఖిలావనింగలఁడెయిందుకళాధరనీవుదక్కఁగా। నానిటలాంబకుండుదనుజాధిపు మాటకుఁజాలరోసిలో। నూనినరోషవార్ధిగడలొత్తఁగనిట్లనిపల్కెభూవరా॥ క॥ వినుమూఢహృదయనీకే। తనమెప్పడకా రణంబధారుణిపైఁగూ। లునునపుడనీభుజావలి। తునియఁగనాయంతవానితోననిగల్గున్॥ వ॥ అనిపలికినవల్లసంప్రాప్తమ నోరథుండై భుజవినాశకార్యధురీణుండగు బాణుండుసంతుష్టాంతరంగుండగుచునిజ నివాసంబునకుంజని తనప్రాణవల్ల

**ఉషాకన్యయనిరుద్ధునిఁగూడినటులస్వప్నముగనుట.**

భలయుల్లంబులుపల్లవింపంజేయుచునిజధ్వజనిపాతంబునిరీక్షించుచుండెదదనంతరంబ॥ సీ॥ ఆదానవేశ్వరుననుఁగకూఁ తగునుషాకన్యసచ్చరితసౌజన్యధన్య।రూపవిభ్రమకళారుచిరకోమలదేహయతనునాఁటవబాణమనఁగనొప్పు। సుందరర త్నంబునిందునిభాననయలినీలవేణిపద్మాయతాక్షి। యొకనాఁడురుచిరసౌధోపరివేదికాస్థలమున మృదుశయ్యనెలమిఁ గూర్కి। మున్నుదనచౌలనెన్నఁడువిననయతఁడుఁ। గన్నులారంగఁదాఁబొడగననియతఁడు। గానియసమానరూపరేఖావి లాస। కలితుననిరుద్ధునమిళిలఁగవసినటుల॥ చ॥ కలగనియంత మేలుకనికన్నులబాష్పకణంబులొల్కఁగాఁ। గలవలెఁగాకని శ్చయముగాఁగమనీయవిలాసవిభ్రమా। కలితతదీయరూపముముఖంబునవ్రేలినయట్లతోఁచిన। న్గళవళమందుచుస్సిగి యఁగొఁగిలిచేబయలప్పళించుచున్॥మఱియును॥చ॥ సరిసఖ్యుదూక్తులుంగుసుమసాయకుకేళియుశాటికాకచా। కర్షణ ముల్నఖక్రియలుఁగమ్రకపోలలలాటమేఖలా। కరకుచబాహుమూలములుగైకొనియుండుటలాదిగాఁదలో। దరిమదిగాఢ మైతగిలెదపఁకుఁడచ్చుననొత్తినట్లయై॥ సీ॥ కలికిచేష్టలుభావగర్భంబులైనను బ్రియుమీఁదికూరిమిబెగ్గలింపఁ। బిదపిదపై లజ్జమదిఁబదనిచ్చినఁ జెలిమేనఁబులకలుచెక్కులొత్త। మదనాగ్నిసంతప్తమానసయగుటకు గురుకుచహారవల్లరులుగం దఁ। జిత్తంబునాయకాయత్తమైయుంటనమరుమాటలాడంగనయిపుగదుర। నతివమనమునసిగ్గుమోహంబుభయముఁ। బొడమ్మనుమమంచునెత్తమ్మిఁబోదువుమాడ్కిఁ బ్రథమచింతాభరంబునఁబద్మనయన। కోరితలఁచీరవాటింపనేరదయ్యె॥ వ॥ఇట్లువిరహవేదనాఘూయమానమానసయై।య్యుండెనంత - నచ్చెలులుడాయంజనుదెంచినం జవమునంబునఁ బొడము మనోజవికారంబుమఱుఁగు వెట్టుచునప్పుడు॥ చ॥ భోరిభోరివచ్చునూర్పుగమిఁబుక్కిటనుంచికుచాగ్రసీమపై। జెంసీనస న్నలేఁజెమటబిందువులొయ్యననార్చుఁగన్నుల। న్దొరిగెడుబాష్పపూరములుదొంగలిఱెప్పలనానిచుక్కలం। దరుణులు రందుచూతమనితామొగమెత్తునుగూఢరాగయై॥ ఇవ్విధంబుసంజరియించుచుండెనట్టియెడ॥ గీ॥ అంతకంతకుసంతాపము తిశయించి। వలుదచన్నులుగన్నీటివరదఁదడుపఁ। జెలులదెసఁజూడఁజాలలజ్జించిమొగము।వాంచిపలుకకయుండెనప్పను

హాక్షి ॥అంత॥గీ॥ బలితనూభవుమంత్రికుంభాండుతనయ । తనబహిఃప్రాణమిదియనదనరునట్టి । కామినీమణిముఖపద్మ కాంతివిజిత। శిశిరకరచారురుచి రేఖచిత్రరేఖ॥ కదిసియబ్బాలనుపలక్షించి ॥గీ॥ పడఁతినీవిప్డుసొబగునిబయల వెదకు । విధమునను నాత్మవిభుఁడని వేడ్కఁబిలిచి। పూని చేతికిలోనైనవానిఁజూసి। భ్రాంతిఁబొందినభావంబుప్రకటమయ్యె ॥గీ॥ వనిత నాకన్న నెనరైనవారునీకుఁ । గలుగ నేర్తురె నీకోర్కెఁ దెలియఁజెప్ప । కున్నమీయన్నతోడన్నఁ గన్నుఁగవల । నలరుననుసిగ్గుతోనగవామతింప॥ ఇవ్విధంబునఁజిత్రరేఖంగనుంగొని యిట్లనియె ॥చ॥ చెలికలలోననీనాక్క సరిసీరుహనేత్రుఁడుహారరత్నకుం। డలకటకాంగుళీయకరణన్మణినూపురభూషణుండుని। ర్మలకనకాంబరుండు సుకుమారతనుండువినీలదేహుఁడు। జ్జ్వలరుచినూతనప్రసవసాయకుఁడున్నత వక్షుఁడెంతయుఁ ॥చ॥ననుబిగియారఁ గౌఁగిటఁ ఘనంబల రారఁగఁ జేర్చి మోదముం।దనుకఁగనంచితాధరసుధారసమిచ్చి మనోజకేళికి।న్ననుపడఁజేసి మంజుమృదుభాషలఁ దేలిచియింతలోననే । చనియెనుదుఃఖవార్ధిఁ బెలుచన్ననుఁ ద్రోచి సరోరుహాననా ॥వ॥ అనుచునమ్మత్తకాశినిచిత్తంబు, చిత్తజాయత్తంబై తత్తరంబున విరహానలంబు త్తలపెట్టఁగన్నీరుమున్నీరుగావగచుదు విన్ననైనవదనారవిందంబువాంచియూరకున్నఁ జిత్రరేఖతనమనంబుననయ్యంతిసంతాపంబుచింతించియిట్లనియె ॥చ॥సరసిజనేత్రి యేటికివిచారము నాకుశలత్వమేర్పడ । న్నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్య కి। న్నరవరముఖ్యులంబటమునన్ లిఖియించినఁజూచి నీమనో । హరుఁగనినీఁ డెపొమ్మనిన నప్పుడెవానినినీకుఁ దెచ్చెదన్ ॥వ॥ అనియొడంబఱచి మిలమిలనిమంచుతోడంబురణించు ధళధళయని మెఱుంగులుదుఱంగలిగొనుపటంబు నావటంబుసేసి వజ్రంబు మెదియించి, పంచవన్నియలు వేఱు వేఱఁగనకరజతపాత్రంబులనించి, కేలందూలికధరించి యొక్క విజనస్థలంబున కుంజని ముల్లోకంబులం బేరుకలిగిన వయోరూపసంపన్నులైన పురుషముఖ్యుల నన్వయగోత్రనామధేయంబులతోడ వ్రాసియొంతంబైన యప్పటంబు దనముందఱికిం దెచ్చియుంచి యిప్పటంబునందగులనివారులేరు-సావధానంబున నాకర్ణింపుమని యిట్లనియె॥ సీ॥ కమనీయసంగీతకలిత కోవిదులుగింపురుష గంధర్వకిన్నరులువీరె। సతతయౌవనులునిచ్ఛావిహారులుసిద్ధసాధ్య చారణవిద్యాధరులువీరె । ప్రవిమలసౌఖ్యసంపద్వైభవులుసుధాశనమరుద్యక్షరాక్షసులువీరె।నిరుపమరుచికళాన్వితకామరూపులైపొగడొందునట్టిపన్నగులువీరె । చూడుమని నేర్పుదీపింపఁజూపుటయును । జిత్తమున నిజమనోరథసిద్ధివడయఁ । జాలకుండిన మధ్యమత్స్మాతలాధి। పతులఁజూపుచు వచ్చె నప్పద్మనయన॥ ఉ॥ మాళవకొంకణద్రవిడ మత్స్యపుళింద కళింగభోజనే । పాళవిదేహ పాండ్యకురుబర్బరసింధు యుగంధరాంధ్రబం। గాళకరూశ టెంకణత్రిక ర్తసుధేష్ణమరాటలాటపాం । చాలనిషాదఘూర్జరక సాళ్వమహీశులువీరెకోమలీ ॥ఉ॥ సింధురవైరివిక్రముఁడు శీతమయూఖమరాళికాపయ । సింధుతటీరనిర్మల విశేషయశోవిభవుండు శౌర్యద । ర్పాంధరిపుక్షితీశనికరాంధతమఃపటలార్కుఁడీజరా । సంధునిఁజూడుమాగధుని సద్బృహదశ్వసుతుం గృశోదరీ॥మ॥ సకలోర్వీతలనాథసన్నుతుఁడుశశ్వద్దుర్నివారిబాహాబలుఁ । ధికుఁడు నాహవ కోవిందుఁడుజ్జగద్విఖ్యాతచారిత్రకుం । దకలంకోజ్జ్వలదివ్యభూషుఁడువిదర్భాధీశ్వరుండైంభీష్మకభూపాలకుమారుఁజూడుమితనిన్మత్తద్విరేఫాలకా ॥ఉ॥ సంగరరంగనిర్దళితచండవిరోధివరూధినీశమా । తంగతురంగసద్భటరథప్రకరైకభుజావిజృంభణా । భంగపరాక్రమప్రకటభవ్యయశోమహనీయమూర్తికా। కింసుఁడువీఁడెచూడుమతరళీకృతచారుకురంగలోచనా ॥మ॥ సుగుణాంభోనిధి ఫాలలోచనను మెచ్చున్నాత్మ మెప్పించిశక్తిగరిష్ఠంబగు శూలముంబడసెయక్షీణ ప్రతాపోన్నతిన్ । జగతిన్మిక్కిలి మేటివీరుఁడురణోత్సాహుండుఁభూపాత్రుఁడీ। భగదత్తుంగనుఁగొం పెపంకజముఖీ ప్రాగ్జ్యోతిషాధీశ్వరుఁ ॥మ॥ వికచాంభోరుహపత్రనేత్రుఁడగుగోవిందుండు చాఁబూనునం। దకచక్రాబ్జగదాదిచిహ్నములచేత న్వాసుదేవాఖ్యను। త్సుకుఁడై యెప్పుడుమచ్చరించు మదిఁగృష్ణుండన్న నీనేటిపొం । డ్రకుఁగాశీశసఖుంగనుంగొనుము వేడ్కంజంద్రబింబాననా ॥మ॥ ద్విజమిత్రప్రియుఁడు సూనృతవ్రతముసద్వ్యాప్తిస్ఫుజాగర్వము । న్విజయాటోపము చాపనైపుణియుఁధీస్ఫూర్తి సత్కీర్తులీ । రజనీనాథకులప్రదీపకులఁబాఱంజూడుమపద్మాక్షిధ । ర్మజభీమార్జునమాద్రినందనుల సంగ్రామైకపాకీటులన్ ॥మ॥ బలిమిన్సర్వనృపాలు రన్నదిమికప్పంబుల్దగంగొంచును । జ్జ్వలతేజోవిభవాతిరేకమునభాస్వత్కీర్తిశోభిల్లఁగాఁ । బొలుపొందందను రాజరాజనమహాభూరిప్రతాపంబులుం । గలదుర్యోధనుఁజూడు సోదరయుతుం గంజాతపత్రేక్షణా॥వ ॥అనియిబ్భంగిసకలదేశాధీశులగురాజవరులనెల్లంజూపుచు యదువంశసంభవులైనశూరసేన,వసుదేవ, యుద్ధవాదులంజూపి యత్తియును ॥ఉ॥ శారదనీరదాబ్దఘనసారసుధాకరకాశచంద్రికా। సారపటీరవర్ణుఁ డనుసత్తమునుత్తమనాయకుంబ్రమ । త్తారినృపాలకాననహుతాశనమూర్తిఁబలంబుదైన్యసం । హారునిఁగామపాలుని హలాయుధుఁ జూడుమువైత్యనందనా ॥సీ॥ కమనీయశుభగాత్రుఁగంజాతదళ

నేత్రుఁ వసుధాకళత్రుఁ బావనచరిత్రు । సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు నతపన్నగాకల్పు నాగతల్పుఁ । గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు శ్రితజనపోషు నంచితవిశేషు । నీలనీరదకాయు నిర్జితదైతేయు ధృతపీతకౌశేయు నతవిధేయు । నఘమహాగదవైద్యు వేదాంతవేద్యు । దివ్యమునిసన్నుతామోదుఁ దీర్ఘపాదు । జిష్ణువరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ । జూడు దైతేయకులబాలసుభగలీల ॥ చ॥ స్ఫురదళిశింజినీరవవిభూషితపుష్పధనుర్విముక్తభా । స్వరనవచూతకోరకనిశాతశిలీముఖపాతభీతపంకరుహభవాదిచేతననికాయు మనోజని జాంశు రుక్మిణీ వరసుతు రాజకీరపరివారుని మారునిఁ జూడు కోమలీ ॥ ఇవ్విధంబునం జూపిన ॥ మ॥ వనితారత్నము కృష్ణనందనుని భావప్రౌఢిఁ దాఁ జూచి గ్ర । ద్దనఁ దన్మూర్తి వరించి చన్నసుగుణోత్తంసంబు కానాత్మలో । ననుమానించి యనంతరంబ యనిరుద్ధాఖ్యున్ సరోజాత్మునూ । తన చేతోభవమూర్తిఁ జూచి మది సంతాపించుచున్నిట్లనున్ ॥ ఉ॥ ఇంతి మదీయమానధన మెల్ల హరించిన మొద్దుని మ్మోయిం । కంత మెలర్ప వ్రాసి పటభాగ నిరూపితుఁ జేసినట్టి నీ । యంతటి పుణ్యమూర్తిఁ గొనియీడకుఁ గావేర్తునే నీచరిత్రము । ల్వింత లెనాకు నీ మహిత వీరకులంబు బలంబుఁ జెప్పమా ॥ చ॥ అనవుడు చిత్రరేఖ జలజాక్షికి నిట్లను నీకుమారకుం । డనఘుఁడు యాదవాన్వయసుధాంబుధిపూర్ణసుధాకరుండు నా । దనరిన కృష్ణపౌత్రకుఁడు దారచరిత్రుఁడు భూరిసింహసం । హననుఁ డరాతిసైన్యతిమిరార్కుఁడు పేర నిరుద్ధుఁ డంగనా ॥ వ॥ అని చెప్పి మేనతిత్వరితగతిం జనియక్కుమార రత్నంబుఁ దోడ్కొని వచ్చునంతకు సంతాపింపకుండుమని యక్షణంబ వియద్గమనంబునఁ జనిచని ముందట ॥ క॥ సరసిజముఖి కనుఁగొనె శుభ । భరిత విలోకన విధూతభవవేదనము । న్వరసాధనము నుసుకృత । స్ఫురణాపాదనముఁ గృష్ణపుటభేదనమున్ ॥ వ॥ కని డాయంజని తదీయసుషమావిశేషంబులకుం బరితోషంబు నొందుచుం గామినీచరణరణితమణినూపురఝణఝణధ్వనితమణిగోపురంబును, నతివిభవవిజితగోపురంబును, నగుద్వారకానగరంబు నిశాసమయంబునం బ్రచ్ఛన్నవేషంబునం జొచ్చి కనకకుంభకలిత సౌధాగ్రంబున మణిదీపనిచయంబు ప్రకాశింపఁ జంద్రకాంతశిలాభవనంబున సుధాధామరుచిరరుచి నిచయంబున పహసించు హంసతూలికాతల్పంబున నిజాంగనారతిశ్రమంబున నిద్రాసక్తుండై యున్నయ య నిరుద్ధుం జేరి, తనయోగవిద్యా మహత్వంబున నతని నెత్తికొని మనోవేగంబున శో

## ✻ చిత్రరేఖ యనిరుద్ధునిఁ దెచ్చి యుషాకన్యకకు నొప్పగించుట ✻

ణపురంబునకుం జని, బాణాసురనందన యగు నుషాసుందరీతల్పంబునం దిడి యిట్లనియె ॥ క॥ వనజాక్షి చూడు నీవిభు । ననిమిషనగధీరు శూరు నభినవమారు । న్ననధికభీరును చారుని । ననిరుద్ధకుమారు విదళితాహితవీరున్ ॥ క॥ అనిన నుషా సతి దనమన । మున ను రాగిల్లి మేనఁ బులకాంకురము । ల్మొనయఁగ నానందాశ్రులు । గనుఁగవ జడిగురియ ముఖవికాస మెలర్పన్ ॥ వ॥ ఇట్లు మనంబున నుత్సహించి చిత్రరేఖం గనుంగొని యయ్యింతి యిట్లనియె ॥ సీ॥ అతివ నీసాంగత్యమను భానురుచి నాకుఁ గలుగుటఁ గామాంధకారము డఁగెఁ । దరలాక్షి నీసఖిత్వంబను నావచేఁ గడిదివియోగాబ్ధిఁ గడవఁ గంటి । నబల నీయనుబంధమను సుధావృష్టిచే నంగజసంతాపమాఱ్పఁ గంటి । వనిత నీ చెలితనంబను రసాంజనము చే నామనోహరనిధానంబుఁ గంటిఁ । గలఁడె కోఁచినరూపు గ్రక్కున లిఖించు । వారు నౌ నన్నఁ దోడ్తెచ్చువారుఁ గలరె । నీటిలో జాడఁ బుట్టింప నేర్పుగల్గునీక । కాక గల్గునె మూఁడు లోకములయందు ॥ వ॥ అనివినుతించి చిత్రరేఖను నిజమందిరంబున కంబోవం బనిచి నం దనియె-ననంతరంబ వింతజనుల కెవ్వరికిం బ్రవేశింప గాని యంతఃపుర సౌధాంతరంబున ననిరుద్ధుండు మేలుకని యయ్యింతిం గనుంగొని యప్పుడు ॥ క॥ సురుచిరమృదుతల్పంబునఁ । బరిరంభణ సరసవచనభావగ శౌచా । తురి మెఱయ నాకుమారుఁడు । తరుణీమణిఁ బొంచె మదనతంత్రజ్ఞుండై ॥ వ॥ ఇవ్విధంబున నతి మనోహరవిభవాభిరామంబులగు దివ్యాంబరాభరణ మాల్యానులేపనంబులఁ గర్పూరతాంబూలంబుల వివిధాన్నపానంబుల సురుచిరమణిదీపికా నీరాజనంబుల సుగంధబంధురాగరుధూపంబుల, నాటలపాటల, వీణావినోదంబులం బరితుష్టిం బొంది - కన్యాకుమారకులానంద సాగరాంతర్నిమజ్జ్యమానమానసులై యుదయాస్తమయనిరూపణంబు సేయనేరక ప్రాణంబులొక్కటియైన తలంపులం గదిసి యిష్టోపభోగంబుల సుఖియించుచుండి రంత ॥ క॥ ఆలోనన నతిచిరమగు । కాలము సుఖలీల జరుగఁగా వరు ససుషా । బాలా లలామకొయ్యనఁ । జూలేపడి గర్భ మొదవె సురుచిరభంగిన్ ॥ క॥ కాచిన కావలివారలు । సూచిభయాకులత నొంది సుస్త్రీకుచుఁదమలో । నో చెల్ల యిట్లు దానవ । రాచూలికిఁ జూలు నిలిచెరా యెబ్బంగిన్ ॥ క॥ అనిగుజగుజఁ బోవుచుని । ప్పనిఁ దప్పక దనుజలోకపాలునితోడ । న్వినుపింపవలయు ననినవే । చని బాణుం జేరి మ్రొక్కి సద్వినయమునన్ ॥ క॥ మంతనమున దేవరక । న్యాంతఃపుర మేము గాచియరయుచునుండ । న్వింతజనములకుఁ జొరఁగదు । రంత మువినుపోఁ తుటేఁ గకైన సురారీ ॥ గీ॥ ఇట్టిచోఁ గావలున్న మేమెవ్వరమును । నేమికను మాయ యో కాని యేము గమధిప । నీకుమారిక గర్భంబు నివ్వటిల్లె । యున్నదన్నను విని రోషయుక్తుఁడగుచు ॥ వ॥ అట్టియెడ దానవేంద్రుండు రోషావేశ భీషణాకారుండై కటములధర బొమలు ముడివడంగ నుంగవలన నలకణంబులుప్పతిల్ల సటలు వెటికినంజటుల గతి నెగయు సిం

గంబువిధంబునలంఘించుచు, భీకరకరవాలంబు కేలందాల్చి సముద్దండగతింగన్యాసౌధాంతరంగంబునకుం జని ॥ సీ ॥ కనియె

—— బాణాసురుండనిరుద్ధుని నాగపాశబద్ధునిఁ జేయుట. ——

శుభోపేతుఁ గందర్పసంజాతు మానిత దేహు నాజానుబాహు । మకరకుండలకర్ణు మహితప్రభాపూర్ణు జిరయశోల్లాసుఁ గాశేయవాసుఁ । గస్తూరికాలిప్తఘనకాంతి కుముదాప్తహారశోభితవక్షు నంబుజాక్షు । యదువంశతిలకు మత్తాలినీలాలకు నవపుష్పచాపు బూర్ణప్రతాపు। నభినవాకారు నస్త్రవిద్యావిహారు। మహితగుణవృద్ధు మన్మథమంత్రసిద్ధుఁ । గలితపరిశుద్ధు నఖిలలోకప్రసిద్ధు। ఁజుకునిరుద్ధు నంగనాజననిరుద్ధు॥ చ॥ కనికనలగ్గలింపసురకంటకుఁ డుద్ధతినబ్బటా వళిం । గనుఁగొని యీ నరాధము నికఁ గట్టుఁడు పట్టుఁడు కొట్టుఁడన్నవా। రనపషహేతిదీధితులవార్పతి తేజము మాయఁ జేయఁడా । సినన్ప పశేఖరుండు పుడిఁ శేపజములాథును నేపుదర్పదుండై॥ చ॥ కలిగిమహోగ్రవృత్తిఁ బరిఘంబు గరంబున లీలఁ దాల్చి దో । ర్బలఘన విక్రమప్రళయభైరవుఁ భంగి విజృంభణక్రియా । కలన నెదిర్చి దానవనికాయముతోఁ దలపాటుఁ బోటునుం । జలము బలంబు ధైర్యమును శౌర్యము స్రేటునుఁ జాటుఁ జూపుచుఁ॥ చ ॥ పదములు బాహులుం దలలు ప్రక్కలు సెక్కలు జానుయుగ్మముల్। రదములు గర్ణము లెడలు రంబులు మూపులు వీఁపులూరువు। ల్చిదురుపలై ధరం దొరుఁగఁ జిందరవందర సేయ సైన్యము। ల్గదనపరాఙ్ముఖక్రమముఁ గైకొని పాఱిరి కాందిశీకులై ॥ వ ॥ ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబునొందియు వెఱచియుఁ బఱచియుఁ విచ్చియుఁ జచ్చియుఁ గలంగియు నలంగియు విరిగియు మరిగియుఁ జెదరియు బెదరియుఁ జేవదఱిగినఁ దమయుముదలై తనమాఱుఁగు సొచ్చిన బాణుండు శౌర్యధురీణుండును నుగ్రోద్దీపితమానసుండును నైకదిసి మేచిప్రవేసియుఁ బొడిచియు నడచియు ననంగియుఁ బెనంగియు॥ క॥ క్రుద్ధుండై యహిపాశసీ। బద్ధుంగావించె నసురపాలుఁడు రణసన్నద్ధున్ స్మరవిద్ధున్ సు। రుద్ధున్ మహితప్రబుద్ధు రూపసమృద్ధున్॥ వ॥ ఇట్లు కట్టిత్రోచినను షాసతి శోకవ్యాకులితచిత్తయైయుండెనంత నక్కడ॥ క॥ ద్వారకలో ననిరుద్ధు। మాదుని పోకకును చుటుప దూజకుల గలం। గూడుచు నొక వార్తయు విన। నేరక చింతింప నాల్గు నెలలటి గెన్యపా॥ అవ్వేడ॥

—— నారదునివలన ననిరుద్ధవృత్తాంతమును విని కృష్ణుఁడు బాణాసురునిమీఁదికి దండెత్తుట. ——

క॥ శారదనిర్మలనీరద । పారదరుచిదేహుఁ డతులభాగ్యోదయుఁడా। నారదమునివచ్చెం జన। పారదయామతి మురారిభజనప్రీతిన్ ॥ వ॥ ఇట్లు చనుదెంచిన నద్దివ్యమునికి నిర్మలమణివినిర్మితసుధర్మాభ్యంతరంబున యదువృష్ణిభోజాంధకవీరులుగొలువం గొలువున్న కమలలోచనుండు ప్రత్యుత్థానంబు చేసి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి సముచితకనకాసనాసీనుం జేసిన నత్తాపసోత్తముండు పురుషోత్తమునకు నాత్తతేజోనిధింబాగడి యనిరుద్ధువృత్తాంతంబంతయుఁ దేటపడ నెఱింగించియు పుండరీకాక్షుని చేత నామంత్రణంబువడసి యంతర్ధానంబు నొందెఁ దదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబు నదండయాత్రాభిముఖుండై ప్రయాణభేరి వేయించి బలంబుల వెడలింపఁ * బడవాండ్లం బనిచి తానును గట్టాయితంబయ్యెనంత॥ సీ॥ హారకిరీటకేయూరకంకణకటకాంగుళీయకనూపురాదివివిధ । భూషణప్రతతిచేఁ బొలుపారు కరములఘనగదాశంఖశక్రములు దనర। సురభిచందనలిప్తసురుచిరోరఃస్థలిఁ బ్రవిమలకౌస్తుభప్రభలు నిగుడఁ । జెలువారఁ బీతకౌశేయచేలము కాశవలను గారింగులు వ్వారఁ గట్టి । సైన్యసుగ్రీవమేఘపుష్పకకలాప। కములు పూన్పిన తేరాయితముగఁ జేసి। దారకుఁడు దేర నెక్క మోదంబుతోడ భానుఁ డుదయాచలం బెక్కుపగిది మెఱయ ॥ వ ॥ ఇట్లు రథారోహణంబు చేసి భూసురాశీర్వచనపూతుండును, మహితదూర్వాంకురాలంకృతుండును, లలితపుణ్యాంగనాకరకిసలయకలితశుభాక్షతవిన్యాసభాసురమస్తకుండును, మాగధమంజులగానానుమోదితుండును, వందిజనసంకీర్తనానందితుండును, చారకపఠనరవవికాసితహృదయుండును నై వెడలు నవసరంబున ॥ సీ ॥ బలభద్రసాత్యకిప్రద్యుమ్నయదుముఖవృష్ణిభోజాంధకవీరవరులు । దుర్వారపరిపంథిగర్వభేదనకళాచతురబాహాబలోత్సాహలీల । వారణస్యందనవాజిసందోహంబు సవరణ సేయించి సంభ్రమమున। సముచితప్రస్థానచటులభేరీభూరిఘోషమంభోనిధిఘోషమడఁప । ద్వాదశాక్షౌహిణీబలోత్కరములోలి। నడిచెఁ గృష్ణునిరథము వెన్నంటి చెలఁగి। పృథులగతిముసుభగీరథురథము వెనుక। ననుగమించు వియన్నదినసుకరించి॥ వ॥ ఇవ్విధంబున నంగదలికతిపయప్రయాణంబుల శోణపురంబు చేరం జని వేలాలంఘనంబు చేసి యదువీరులంత ॥ మ ॥ సరిదారామసరోవరోపవనయజ్ఞస్థానముముల్ మాపివే । పరిఘల్వ్రాడిచి యంత్రముల్దునిమివప్రవ్రాతముల్ ద్రొబ్బిగో । పురముల్గూలఁగ ద్రోఁచి సౌధభవనంబుల్ద్రుంచి ప్రాకారముల్ దరణింగూల్చి కవాటముల్ వ్రెచ్చి చిరుద్దండక్రియాలోలులై ॥ వ ॥ ఇట్లనేకప్రకారంబులఁ గాసి చేసి, పురంబు నిరోధించి పేర్చి యార్చినలం జూచి యాగ్రహసమగ్రోగ్రమూర్తియై సమరసన్నాహసంరంభవిజృంభమాణుండై సంగరభేరి వేయించిన ॥ సీ ॥ ఆచక్రవాళాచలాచక్రమంత యుభ్రమసి కుంభకర్ణ సారెపగిదిఁ దిరిగె । ఘనఘోణిఖు

* పడవాళ్లన్। సేనానాయకులను.

రకోటిఘట్టనస్వనములకరణిసంభోనిధుల్గలంగిపొరలెఁ । గాలరుద్రాభీలకరశూలహతిరాలు పిడుగులగతినుడుగణములరాలెఁ। జటులానిలోద్ధూతశాల్మలీతూలంబు చాడ్పునమేఘముల్చదలఁదూలె । గిరులుఁబడికాఁడెదివిపెల్లగిల్లెసురలు। గుండెలవిసెరసాతలక్షోభమొదవె। దిక్కులదరెవిమానముత్తరలిచెదరెఁ। గలఁగిగ్రహరాజచంద్రులగతులుదప్పె॥ వ॥ అట్టిసమరసన్నాహంబునకుఁగట్టాయితంబైన మణిఖచితభర్మవర్మనిర్మితనిర్మలాంశుజాలంబులును, శిరస్త్రాణకిరీటకోటిఘట్టితవినూత్నరత్నప్రభాపటలంబులును, కనకకుండలగ్రైవేయహారకంకణతులాకోటి వివిధభూషణవ్రాతరుచిని చయంబులును, ప్రచండబాహుదండ సహస్రంబును, వెలుంగశరశరాసనశక్తి ప్రాసతోమరగదాకుంతముసలముద్గర భిండివాలకరవాలపట్టసశూలక్షురికాపరిఘాదినిశాతహేతివ్రాతాతిదీధితులును, వియచ్చరకోటినేత్రంబులుమిఱుమిట్లుగొలుపఁగనకాచలశృంగసముత్తుంగంబగు రథంబెక్కి యరాతివాహినీసందోహంబునకుందుల్యంబైన నిజసేనాసమూహంబు లిరుగడల నడువబాణుండక్షీణ ప్రతాపంబుదీపింపననికివెడలెనయ్యవసరంబున ॥ చ ॥ హరదుఁడుదారభక్తజనవత్సలుఁడైనహరుండు

✽ బాణాసురునికిసహాయభూతుండగుశివునకుఁగృష్ణునకుయుద్ధమగుట. ✽

బాణునిం । గరమనురక్తినాత్మజులకంటెదయామతిఁజూచుఁగానఁదా । దూరమొనరించువేడ్కఁబ్రమథుల్గుహుఁడున్నిజభూతకోటియు। న్సరవిభజింపనుజ్వలనిశాతభయంకరశూలహస్తుఁడై ॥ సీ॥ ఖురపుటాహతిరేఁగుధరణీపరాగంబుపంకేరుహాప్తబింబంబుఁబొదువ । విపులవాలాటోపవిక్షేపజాతవాతాహతివారివాహములుపఱియఁ । గుఱుచకొమ్మునిఱాఁడికొమ్ములజిమ్మినబ్రహ్మాండభాండకర్పరముపగుల । నలవోకఖణిఖణిల్లనియఱుకవ్రేసినరోదసీకుహరంబుభేదిలంగ । గళచలద్భర్మఘంటికాఘణఘణప్ర । ఘోషమునదిక్తటంబులాకులతనొంద।లీలనడతెంచుకలధౌతశైలమనఁగ । నుక్కుమీఱిగలినవృషభేంద్రునెక్కి వెడలె॥ వ॥ ఇట్లువెడలిసమర సన్నాహసముల్లాసంబు మొగంబులకువికాసంబుసంపాదింపఁ బ్రతిపక్షబలంబులతోడందలపడి నద్వంద్వయుద్ధంబయ్యెనప్పుడప్పురాతనయోధుల యాయోధనంబుఁజూచు వేడ్కంజనుదెంచిన సరసిజసంభవశక్రసురయక్షసిద్ధసాధ్యచారణ గంధర్వకిన్నరకింపురుష గరుడోరగాదులునిజనిజవాహనారూఢులై వియత్తలంబుననిల్చిరట్టియెడఁగృష్ణుండునుహరుండును, మారుండునుగుమారుండును, కూపకర్ణకుంభాండులును గామపాలుండును, బాణపుత్రుండగుబలుండును, సాంబుండును, సాత్యకియునుబాణుండును, రథికులురథికులు, నాశ్వికులునాశ్వికులును, గజారోహకులుగజారోహకులును, బదాతులుపదాతులునుందలపడియితరేతరహేతిసంఘట్టనంబులమిడుంగుఱులుచెదరఁ బరస్పరాహ్వానబిరుదాంకిత సింహనాదహుంకారశింజినీటంకార వారణఘీంకారవాజిహేషారవంబులును, బటహకాహళభేరీమృదంగశంఖతూర్యఘోషంబులను, బ్రహ్మాండకోటరంబుపరిస్ఫోటితంబయ్యెనయ్యవసరంబున॥ చ॥ జలరుహనాభుఁడార్చినిజశార్ఙ్గశరాసనముక్తసాయకా । వలినిగుడించినొంచెఁబురవైరిపురోగములన్రణక్రియా । కలితులగుహ్యకప్రమథకర్బురభూతపిశాచఢాకినీ। బలవదరాతియోధులనుబమ్మెరపోయికెలంగిపాఱఁగన్ ॥ వ॥ ఇట్లేసియార్చినకుంభినీధరుభుజావిజృంభణసంరంభంబునకు సహింపకనిటలాంబకుండనల కణంబులునీయునిశితాంబకంబులం బీతాంబరునినేసినవానినన్నింటినదుమనంబ్రతి బాణంబులేసిత్రుంచినం గనుంగొనిమఱియును ॥ మ ॥ అనలాక్షుండుత్రిలోకపూజ్యమగుబ్రహ్మాస్త్రంబటింబోసియా । వనజాతేక్షణుమీఁదఁగ్రోధమహిమవ్యాకీర్ణుఁడైయేసెనే । సినఁదద్దివ్యశరంబుచేతనెమరల్చెన్గృష్ణుఁడత్యుద్ధతిన్। జనితాశ్చర్యరసాబ్ధిమగ్నులగుచున్శక్రాదులగ్గింపఁగన్ ॥ శా ॥ వాయువ్యాస్త్రముపేంద్రుపైనలిగిదుర్వారోద్ధతిన్నేయుడై । తేయద్ధ్వంసియుఁబార్వతాశుగముచేఁద్రెంచెంగ్రతుధ్వంసియా । గ్నేయాస్త్రంబడరించెనుగ్రగతిలక్ష్మీనాథుపైదానివే। మాయంజేసెనువైంద్రబాణమునఁబద్మాక్షుండులీలాగతిన్॥ మఱియును॥ఉ॥ పాయనికిన్కతోహరుఁడుపాశుపతాస్త్రమునారిఁబోసినన్।దోయరుహాయతాక్షుఁడునుదోడనలోకభయంకరోగ్రనా। రాయణబాణరాజమురయంబుననేసిమరల్చెదానిఁజ। క్రాయుధుఁడిట్లతంగునఁబురారిశరావలిరూపుమాపినన్ ॥ క॥ ఊహకలంగియువిగతో। త్సాహుండగుహరునిమీఁదజలజాక్షుఁడుస। మ్మోహనశిలీముఖంబ। వ్యాహతజయశాలియగుచునడరించెన్నృపా॥ అట్లేసిన॥క॥జృంభణశరపాతముచే । శంభుఁడునిజతనువుపరవశంబైసోలన్ । జృంభితుఁడైఘననిద్రా । రంభాతవృషభేంద్రుమూపురముపైవ్రాలెన్॥వ॥ ఇట్లువ్రాలినంజక్రపాణి పరబలంబులనిశితబాణపరంపరలందునిమియు, నొక్కమెడంగృపాణంబులంగణికలుచేసియు, నొక్కచోగదాహతులందుత్తుమురుగామొత్తియు,నిష్వాధంబునఁ బీనుఁగుపెంటలుగావించెనంత॥చ॥తరిమిమురాంతకాత్మజుఁడుదారబలంబునబాహులేయుపైఁ । గఱకరిదాఁకఁదీవ్రశరకాండపరంపరలేసినొంపఁగా । నెఱకలుగాడిపెల్లొరుగునెత్తుటఁజొత్తిలివైరులార్వఁగా । బరచెమయూరవాహనముపైకొనితోలుచునాజిభీతుఁడై॥ఉ॥సంబీరణావనీస్థల విపాటితశాత్రవవీరుఁడైనయా । సాంబుఁడుహేమపుంఖసితసాయకజాలములేర్చిభూకో।

పంబున నేసినం జెదరి బాణత నూభవుఁడోడిపాఱె శౌర్యంబును బీరముం దగవునా బడివోవ బలంబు లార్వఁగన్ ॥మ॥ వరబాహాబలశాలి యాహవిరణావష్టంభసంరంభవి। స్ఫురదుగ్రాశనితుల్య మైన ముసలంబుం బూన్చి ద్రవ్వె సైన్యవడిం ।భూరికుంభాండకకూపకర్ణుల శిరంబుల్ వ్రస్సి మేదంబునె । త్తురుకర్ణంబులవాతనుం దొఱఁగ సంధుల్ వీడి వేచావఁగన్ ॥వ॥ అట్టియెడ సైన్యంబు దైన్యంబు నొందియ నాథమై చెడి వితిగిపాఱినం గని బాణుండు సాత్యకిం గెడించి ప్రళయాగ్నియుం బోలి విజృంభించి చెయివీఁచి బలంబుల మఱలం బురికొల్పి తానును ముంగలి యైన డువనప్పుడు భయసైన్యంబు లన్యోన్య జయకాంక్షలం దలపడి దక్షిణోత్తర సముద్రంబుల వీకం దాఁకినం బోరు ఘోరం బయ్యె నట్టియెడం గదలనడఁచియుఁ, గుఠారంబులం బొడిచియు, సురియలం గ్రుమ్మియు, శూలంబులం జిమ్మియు, శక్తులమంచియుఁ, జక్రంబులం ద్రుంచియు, ముసలంబుల మొత్తియు, ముద్గరంబుల నొత్తియుఁ, గుంతంబులం గ్రుచ్చియుఁ, బంతంబు లిచ్చియు, బరిఘంబుల నొంచియు, బట్టసంబులం ద్రుంచియు, శరంబుల నేసియు, గరవాలంబుల వ్రేసియు- సతాగ్రసులై పాసియు- వితాగ్రసులై డాసియుఁ- బెనంగి నందు నిసిన శిరంబులును- దునుకలైన కరంబులును- దెగిన కాళ్లును- ద్రెస్సిన వ్రేళ్లును- దుమురులైన యెముకలును- బ్రోవులైన ప్రేవులును- నులిసిన మేనులును- నలిగిన జానువులును- నొగిలిన వర్మంబులును- బగిలిన చర్మంబులును- వికలంబులైన సకలావయవంబులును- విశీర్ణంబులైన కర్ణంబులును - విచ్ఛిన్నంబులైన నయనంబులును- వెడలు రుధిరంబులును- బడలు వడు బలంబులును- గొండలవడు పునంబడు మాంసఖండంబులును- వాచ లచుకొలు బహిగ్రణులును- వ్రాలిన తేరులును- గూలిన కరులును- నొఱలిన ఘట్టంబులును- బలలఖాదనకుతూహలజనిత మదాంధభూతపిశాచఢాకినీభూతభేతాళసమాలోలకోలాహలభయంకరారావ బధిరీకృత సకలదిశావకాశంబును నై సంగరాంగణంబు భీషణంబయ్యె నయ్యవసరంబున ॥చ॥ శరకుముదంబులు ల్లసితచామర ఫేనములాతపత్రభా।సురనవపుండరీకములు శోణితతోయములస్థిసైకతో।త్కరము భుజాభుజంగమనికాయము కేశకలాపశైవల। స్ఫురణరణాంగణంబమరెఁ బూరితశోణనదంబుపోలికన్ ॥వ॥ అట్టియెడ బాణుండు కట్టలుకం గృష్ణుని పైఁ దనరథంబు బరపించియు ఖర్వబాహాసహస్రదుర్వారగర్వాటోపప్రదీప్తుండై కదిసి ॥మ॥ ఒకయేనూఱు కరంబులన్ ధనువులత్యుగ్రాకృతిం బాల్చి త। కటకయొక్కొకకటట సాయకద్వయము వీఁకం బూన్చు నాలోనసం। దకహస్తుండు దదుగ్రచాపచయ విధ్వంసంబుఁ గావించి కొంౕ జకఁద త్సారథిఁ గూలనేసి రథముం జక్కాడె శౌర్యోద్ధతిన్ ॥గీ॥ప్రళయజీమూతసంఘాతభయదభూరి। భైరవారావముగ నొత్తెఁ బాంచజన్య। మఖిలజనులు భయభ్రాంతులై చలింపఁ। గడఁగి నిర్భిన్న గాత్రుసిగర్భములుగను ॥వ॥ అట్టియవక్రవిక్రమపరాక్రమంబున వెగడుపడి బాణుండు వ్రేలు మొగంబు వడి సేయునది లేక విన్ననైయున్న యెడ ॥సీ॥ అత్తఱిఁ గోటరియను బాణజననియి త్రిసుతుఁ గాఁచుమతముసన్మతిఁ దలంచి। వీడి శిరోజముల్ వ్రేలంగ నిర్ముక్తపరిధానయైము రాసురవిభేవి। యెదు ఱనిల్చినఁ జూడమదిఁ జాలరోసి పరాఙ్ముఖుఁడై యున్న యనువులేచి । తల్లడించుచు బాణుఁడుల్లంబు గలగంగఁ దలఁచీరవీడ యాదవులునవ్వ। నవ్యకాంచనమణిభూషణములు రాలఁ। బాదహతినేలగంపింపఁ బాఱియాత్మ। పురమువడిఁ జొచ్చె నప్పు

• ——* వైష్ణవజ్వరముచేఁ బరాజితంబైన శైవజ్వరము శ్రీకృష్ణుని స్తుతించుట. *——

డు భూతగణములాకులతనోడ నెక్కటియు ఘుటయును॥క॥శిరములు మూఁడును ఘనభీ। కర పదములు మూఁడు నగ్నికన లిమహాశ। జ్వరమిరు ఘోరాకృతితో। నరుదెంచుచునుండఁ గృష్ణుఁ డల్లననగుచున్ ॥చ॥ పరువడి వైష్ణవజ్వరముఁ బంచిన నయ్యుభయజ్వరంబులు । న్వెరవునులావు చేవయును వీరము బీరము గల్గి ఘోరసం । గర మొనరింపనందుఁ గరకంఠకృతజ్వరముగ్ర వైష్ణవ । జ్వరమున కోడి పాఱె ననివారణ వైష్ణవి వెంటనంటఁగన్ ॥గీ॥ పాఱి యేదిక్కుఁ గానక ప్రాణభీతిఁ । జేరి యెచ్చుచు నాహృషీకేశుపాద । కంజములకెఱఁగి నను గావు కావుమనుచు । నిటలతటలసితాంజలిఘటితయగుచు ॥ ఇట్లు వినుతించె॥ సీ॥ అవ్యయుననఘున నంతశక్తిని బరులైనట్టి బ్రహ్మరుద్రామరేంద్ర । వరులకీశ్వరుఁడైన వాని సర్వాత్మకు జ్ఞానస్వరూపు సమానరహితు । వరదు నిజగదుద్భవస్థితిసంహారహేతుభూతుని హృషీకేశు నభవు । బ్రహ్మచిహ్నంబులై పరగు సుజ్ఞానశక్త్యాదుల నొప్పు బ్రహ్మంబు నీశు।నజు*షడూర్మిరహితు నిజయోగమాయావి । మోహితాఖిలాత్మ ముఖ్యచరితు ! నుహితతేజు నాదిమధ్యాంతహీనునిఁ । జిన్మయాత్ముని నుభజింతుఁ గృష్ణ ॥వ॥ అదియునుం గాక లోకంబున దైవంబులనేక ప్రకారంబులయి యుండునది యెట్టిదనినం;కలాకాష్ఠాముహూర్తంబులుగల కాలంబును- సుకృతదుష్కృతానుభవరూపంబులుగల జీవకర్మంబులును- స్వభావంబును- సత్త్వరజస్తమోగుణాత్మకంబైన ప్రకృతియును- సుఖదుఃఖాశ్రయంబైన శరీరంబును- జగజ్జంతునిర్వాహకంబైన ప్రాణంబును సకలపదార్థపరిజ్ఞాన కారణంబైన యంతఃకరణంబును మహదహంకారశబ్దస్పర్శరూపరసగంధతన్మాత్ర తత్కార్యభూతగగనపవనానలసలిలధరాది పంచభూతంబులు నాదిగాఁగల ప్రకృతివికారంబులున

*షడూర్మి।అశన-పిపాస-శోక-మోహ-జరా-మరణములు.

న్నింటిసంఘాతంబును, బీజాంకురన్యాయంబునం గార్యకారణరూపప్రభావంబును నై, జగత్కారణశంకితంబై యుండు. నదియంతయు భవదీయ మాయావిడంబనంబుగాని యున్నయది కాదు, తదీయమాయానివర్తకుండ వైన నీవు నానావిధదివ్యావతారాదిలీలలం జేసి దేవగణంబులను, సత్పురుషులను, లోకనిర్మాణచణులైన బ్రహ్మాదులను బరిరక్షించుచు లోకహింసాప్రవర్తకులై న దుష్టమార్గగతులం గ్రూరాత్ముల హింసించుచు, విశ్వవిశ్వంభరాభార నివారణంబు సేయుటకుం గదా భవదీయదివ్యావతారప్రయోజనంబు గావున నిన్ను శరణంబు వేఁడెద॥ సీ॥ చండమై మహితవీక్షణదుస్సహంబయి యుదారమై వెలుఁగొందు తావకీన। భూరిభాస్వత్తేజమునఁ దాపమొందితిఁ గడుఁ గృశించితి నన్నుఁ గరుణఁ జూడు। మితరదేవోపాస్తిరతి మాని మీ పాదకమలముల్ సేవించు విమలబుద్ధి। యొందఁ దాఁక మదిఁ దోఁప దందాఁక నీ జగత్ప్రాణులు నిఖిల తాపము నఁబడుట। యనిరళానన్యగతికులనరసి ప్రోచు। బిరుదుగల నీకు ననుఁ గాచుట రుచెదేవ। ప్రవిమలాకారసంసారభయవిదూర। భక్తజనపోషపరితోషపరమపురుష॥ చ॥ అనినఁ బ్రసన్నుఁడై హరి యనంతుఁడు దైత్యవిభేదిదానికిట్లని మెమదీయసాధనమనన్యనివారణమగుటనీమదిం। గనినను నార్తిఁ జొచ్చితివి గావున మజ్జ్వరతీవ్రదాహవే। దనసనుఁ బొందదింకఁ బరితాపముదకుఁ ముసీమనంబునన్॥ వ॥ అవిమతియైన పుండరీకాక్షుండిట్లనూ-నెవ్వ రేనియు నీయుభయజ్వరవివాదంబును, నీవు మత్ప్రపత్తిం జొచ్చుటయుఁ జిత్తంబులఁ దలంతురట్టి పుణ్యాత్ములు శీతోష్ణజ్వరాది తాపంబులం బొరయరని యానతిచ్చిన నమ్మహేశ్వరజ్వరంబు పరమానందభరిత హృదయంబున నారథాంగపాణికి సాష్టాంగదండప్రణామంబాచరించి నిజేచ్ఛం

శ్రీకృష్ణునిచేఁ బరాహతుండగు బాణాసురునిఁ గాపాడుటకు శివుండు కృష్ణుని స్తుతించుట.

జనియె నంత బాణాసురుండు నకడ॥ సీ॥ కమనీయకింకిణీఘంటికాదిసహస్రఘణఘణధ్వనిచేత గగనమగల। నన్యజనాలోకనాభీలతరళోగ్రకాంచనధ్వజపతాకలు వెలుంగఁ। బృథునేమిఘట్టనఁ బృథివిఁ గంపింపంగ వలనొప్పఁ బటుజవాశ్వములఁ బూన్చి। నట్టియున్నతరథంబత్యుగ్రగతి నెక్కి కరసహస్రములభీకరత రాసి। శరశరాసనముఖ దివ్యసాధనములు। దనరఁ జలమును బలమును తఱటము గాఁగ। హర్షమిగురొత్తకయ్యంపుటాయితముగఁ। బురముఁ వెలువడె బలిపౌత్రుఁ డురుజవమున॥ క॥ చని రణభూమిని మధ్యందినమార్తాండప్రచండదీప్తాకృతితోఁ। దనరుచుఁ బరిపంథిబలేం। ధనదవశిఖి యైన కృష్ణుఁ దాఁకెం బెలుచన్॥ ఉ॥ తాఁకి భుజావిజృంభణము దర్పము నేర్పును నేర్పడంగ నా। కూఁకున వేయు చేతుల మహోగ్రశరావళి పింజపింజతోఁ। దాఁకఁగ నేసిన న్మురవిదారుఁడు తోఁడనదచ్ఛరావళి। న్నాఁకగొనాకఁ ద్రుంచె నిశితార్ధశశాంకశిలీముఖంబులన్॥ అంత॥ చ॥ నుతనవపుండరీకనయనుండననొప్పు మురారి రోషఘూర్ణితమహితారుణాబ్జదళనేత్రుఁడు దానయిపంచె దైత్యుపై। దితిసుతకాననప్రకరదీపితశుక్రమురక్షితాంచితా। శ్రితజనచక్రమున్నతత సేపితచక్రము దివ్యచక్రమున్॥ వ॥ అదియును బ్రచండమార్తాండ మండలప్రభావిడంబితంబును భీషణశత సహస్రకోటిదంభోళినిబిడనిశితనిష్ఠురధారాసహస్ర ప్రభూతజ్వలనజ్వాలికాపాస్త సమస్తకుటిలపరిపంథిదుర్వారబాహుగర్వాంధకారంబును, సకలదిక్పాలదేవతాగణశ్లాఘ్యమానంబును, సమంచితదానవజనలోకభయంకరదర్శనంబునగు సుదర్శనంబు నసురాంతకప్రేరితంబై చని యారాక్షసకారుండు కదళికాకాండంబుల నేర్పుచందంబునం బేర్చి సమదవేదండశుండాదండమండితంబును, గనకమణివలయకేయూర కంకణాంకితంబునగు తదీయబాహుసహస్రంబుఁ గరచతుష్టయావశిష్టంబుగాఁ దునుమునవసరంబున॥ గీ॥ కాలకంఠుఁడు బాణుపైఁ గరుణగలఁడు। గాన నఖిలాండపతిఁ గృష్ణుఁ గదియవచ్చి। పురుషసూక్తంబు చదివి సంపుటకరాబ్జుఁడగుచుఁ బద్మాయతాక్షుని ట్లని నుతించె॥ వ॥ దేవా నీవు బ్రహ్మస్వరూపంబగు జ్యోతిర్మయుండవు, నిఖిలవేదవేదాంతనిరూఢుండవు, నిర్మలుండవు, సమానాధికరహితుండవు, సర్వవ్యాపకుండ వైన నిన్ను నిర్మలాంతఃకరణులైన వారలు ఆకాశంబు పగిదియవలోకింతురదియునుం గాక పంచోపనిషన్మయంబయిన భవదీయ దివ్యమంగళమహావిగ్రహ పరిగ్రహంబు సేయునెడ నాభియందాకాశంబును, ముఖంబునం గృశానుండును, శిరంబున స్వర్గంబును, శ్రోత్రంబులఁ దిశలును, నేత్రంబుల సూర్యుండును, మనంబున సోమకాములును, పాదంబుల వసుంధరయు, నాత్మయందహంకారంబును, జఠరంబున జడధులును, రేతంబున నంబువులును, భుజంబుల నింద్రుండును, రోమంబుల మేఘమహీరుహౌషధివ్రాతంబును- శిరోజంబుల బ్రహ్మలును, జ్ఞానంబున సృష్టియు, నవాంతరప్రజాపతులును, హృదయంబున ధర్మంబును, గలిగి మహాపురుషుండవై లోకకల్పనంబుకొఱకు నకుంఠితతేజంబు గుప్తంబు చేసి జగదుద్భవంబు కొఱకుఁ గైకొన్న భవదీయదివ్యావతారవైభవం బెఱింగి నుతింప నెంతవారము- నీవు సకలచేతనాచేతననిచయంబులకాద్యుండవు, నద్వితీయుండవు, పురాణపురుషుండవు, సకలసృష్టిహేతుభూతుండవు, దినకరుండు కాదంబినీకదంబావృతుండగుచు భిన్నరూపుండై బహువిధచ్ఛాయలం దోఁచు విధంబున నీయఘటితఘటనానిర్వాహకంబైన సంకల్పంబునఁ ద్రిగుణాతీతుండవయ్యును సత్త్వాదిగుణవ్యవధానంబుల ననేకరూపుండవై గుణవం

తులైనసత్పురుషులకుఁదమోనివారకంబయినదీపంబుగూపంబునంబ్రకాశించుచుందువు భవదీయమాయావిమోహితులైనజీవులుపుత్రదారగృహక్షేత్రసంసారాదిరూపంబైనపాపపారావారమహావర్తగర్తంబులమునుంగుచుం దేలుచుందురు దేవా భవదీయదివ్యరూపానుభవంబు సేయంజాలక నింద్రియవరతంత్రులై భవత్పాదసరసీరుహంబుల నేర్పునఁజేరనెఱుంగనిమూఢాత్ముండాత్మవంచకుండనం బడువిపరీతబుద్ధింజేసి ప్రియుండవైన నిన్నునొల్లకనింద్రి యార్థానుభవంబు సేయుటయమృతంబుమాని హాలాహలంబు సేవించుటగాదెజగదుదయపాలనలయలీలాహేతుండవైశాంతుండవైసుహృజ్జనభాగధేయుండవై సాక్షాన్నాధికవస్తుశూన్యుండవైన నిన్ను నేసునుంబ్రహ్మాయుంబరిణతాంతఃకరణులయిన మునిగణంబులు నుభజించుచుందుమనుటియు॥గీ॥అవ్యయుండవనంతుండవచ్యుతుండ। వాదిమధ్యాంతశూన్యుండవఖిలధృతివి। నిఖిలమం దెల్లవర్తింతునీవుదగిలి। నిఖిలమెల్లనునీయందనెగడుఁగృష్ణ॥ సీ॥ అనిసన్నుతించినహరియాత్మమోదించి మొగమునఁజిఱునవ్వుమొలకలెత్త। అలితబాలేందుకళాహాళికిట్లనుశంకరసీమాటసత్యమరయ। నేదినీకిష్టమైనొసఁగెదఁదానినవేడుమునీకిత్తువీఁడవధ్యుఁ। డడిమొట్టివనినఁబ్రహ్లాదుండుమద్భక్తుఁడతనికివరమునియన్వయమున। జననమందినవారలఁజంపననుచుఁగడఁగిమున్నించితినినదిగారణమువ। విశ్వవిశ్వంభరాభారవిపులభూరివరభుజాగర్వమడఁపంగవలయుఁగాన॥క॥కరములు నాలుగుచిక్కఁగ।బరిమార్చితివీఁడునీదుభక్తులకగ్రేసరుఁడైపొగడొందిజరా। మరణాదిభయంబుదక్కిమనునిటమీఁదన్॥ వ॥అనియానతిచ్చినశంబికావరుండు సంతుష్టాంతరంగుండయ్యెనబ్బలి నందనుండురణరంగవేదింగృష్ణదేవతాసన్నిధింబ్రజ్వలితచక్రకృశానుశిఖాజాలంబులందునిజబాహాసహస్రశాఖాసమిత్సంచయంబులును, దత్తద్వేలకీలాలమహితాజ్యధారాశతంబులును-బరభయంకరవీరహుంకారమంత్రంబులతోడ వేల్చిపరిశుద్ధింబొంది విజ్ఞానదీపాంకురంబునభుజాగర్వదర్పాంధకారంబునివారించియనవరతపూజితస్థాణుండగుబాణుండు భుజవనవిచ్ఛేదజనితవిరూపితస్థాణుండయ్యును, దదీయవరధ్యానకలితానందహృదయారవిందుండగుచుగోవిందచరణారవిందంబులకుం బ్రణామంబులాచరించియనంతరంబు॥క॥పురమునకేయూషాసుం। దరికినననిరుద్ధునకుముదంబునభూషాం। బరదాసీదాసజనా। వరవస్తువితానమొసఁగి వారనిభక్తిన్॥క॥కనకరథంబునసిడికొని। ఘనవైభవముప్పఁగన్యకాయుక్తముగా। ననిరుద్ధునిగోవిందుం। డనుమోదింపంగఁదెచ్చియప్పించేనృపా॥ఉ॥ అంతమురాంతకుండుద్రిపురాంతకువీడ్కొనిబాణునిల్సియ। త్యంతవిభూతిమైనిజబలావలితోజనుదేరనాయుషా। కాంతుఁడుమున్నుగాఁబటహకాహళతూర్యనినాదపూరితా। శాంతరుఁడైవెసంజనియొనాత్మపురీముఖుఁడైముదంబునన్॥మ॥కనియొన్గోపకుమారశేఖరుఁడురంగత్ఫుల్లరాజీవకో। కనదోత్తుంగతరంగసంగతలసత్కాసారకన్యారిశోభనసిత్యోన్నతసౌఖ్యభారకనుదంచద్వైభవోదారక। స్వజనసంతాపనివారకస్వజనభాస్వత్తారకద్వారకన్॥ వ॥కనిడాయంజనిపురలక్ష్మీకృష్ణసందర్శనకుతూహలమైచేసన్నలంజీఱుచందంబున నందంబునొందుసుద్ధూతతరళవిచిత్రకేతుపతాకాభిశోభితంబును-మహనీయమరకతతోరణమండితంబును-గనకమణివినిర్మితగోపురసౌధప్రాసాదవీధికావిలసితమ్మును-మౌక్తికవితానవిరచితమంగళరంగవల్లీవిరాజితంబును- శోభనాకలితవిన్యస్తప్రశస్తకదళికాస్తంభసురభికుసుమమాలికాతత్తాలంకృతంబును - కుసుమసలిలసిక్తవిపణిమార్గంబును - శంఖదుందుభిభేరీమృదంగపటహకాహళాదిమంగళారావకలితంబును, వందిమాగధసంగీతప్రసంగంబును, గలిగియతిమనోహరవిభవాభిరామంబైనయప్పురంబునసచివపురోహితసుహృద్బాంధవముఖ్యులెదుఱుకొనభూసురాశీర్వాదంబులును, బుణ్యాంగనాకరకలితలలితాక్షతలను-గైకొనుచుంగామినీమణులు గర్పూరనీరాజనంబులునివాళింప నిజమందిరంబుప్రవేశించి యప్పుండరీకాక్షుండుపరమానందంబునసుఖంబుననుండెనంత॥ క॥ శ్రీకృష్ణునివిజయంబగు। నీకథఁబఠియించువారలెప్పుడుజయముం। గైకొనియి

→※ అనిరుద్ధుఁడుసాకన్యాసమేతుఁడైద్వారకాపురముఁబ్రవేశించుట. ※←

→※ నృగమహారాజుచరిత్రము. ※←

హపరసౌఖ్యము। లాకల్పోన్నతివహింతురవనీనాథా॥క॥అనిచెప్పినశుకయోగికి। జననాయకుఁడనియెఁగృష్ణచరితమువినఁగా। మనమెప్పుడుఁదనియదింకను। వినవలతుంగరుణఁజెప్పవేమునినాథా ॥ అనినంబరీక్షిన్నరేంద్రునకుశుకయోగీంద్రుండిట్లనియె॥ సీ॥ ధరణీశయొకనాఁడుహరితనూజులురతీశ్వరసాంబగదచారుచారుభానులాదిగాయదుకుమారావలియుద్యానవనమునకతివైభవముననేఁగి। వలనొప్పనిచ్ఛానువర్తులై సుఖలీలఁజరియించిఘనపిపాసలనుబొంది। నెఱీఁదప్పిసలిలమన్వేషించుచునువేగవచ్చుచొనొకచోటవారిరహిత। కూపమునునందులోనొకకొండవోలె। విపులమగుమేనియూసరవెల్లిఁగాంచి। చిత్తమునవిస్మయంబంచితతరమున। దానివెడలించువేడుకఁదగులుటయును॥చ॥పరువిడిపోయితెచ్చిఘనపాశచయంబులనంటగట్టియు। గ్గురుభుజులందఱుంగదిసికోయనియార్చుచుదానినెమ్మెయిం। దరలఁగఁదీయలేకదగదట్టముగా

మదిదుట్టగిల్లనొం । డొరుగడవంగ వేచనిపయోరుహనాభునకంతఁ జెప్పినన్ ॥ చ ॥ వినిసరసీరుహాక్షుఁడతివిస్మితుఁడై జనశూన్యకూపము। ల్లనఁగదియంగ నేగి* కృకలాసమునొక్క తృణంబపోలెగొ । బ్బున వెడలించె వామకరపద్మమునన్నదియంతలోనఁగాం। చనరుచిమేనుగల్గిపురుషత్వముతోఁ బొడసూపెనిల్చినన్ ॥ వ ॥ ఇట్లునిల్చినంజూచి కృష్ణుండతని వృత్తాంతంబంతయు నెఱింగియునక్కడిజనంబులుఁ గుమారవర్గంబునుం దెలియుకొఱకు నతనిచేతనతద్వృత్తాంతంబంతయు నెఱింగించువాఁడై యిట్లనియె॥ చ॥ కనదురురత్నభూషణనికాయుఁడవై మహనీయమూర్తివై । యనుపమకీర్తిశోభితుఁడవై విలసిల్లుచు ధాత్రిమీఁదఁ బెం । పొనరిననీకు నేమిగతినూసరవెల్లితనంబు చొప్పడెన్ । విననిదిచోద్యమయ్యె సువివేకచరిత్ర యెఱుంగఁ జెప్పుమా॥ క॥ అనియడిగిన మురరిపుపద। వనజంబులఁ దనకిరీటవరమణులొఱయన్। వినయమున మ్రొక్కి యిట్లను। ఘనమోదముతోడ నిటలఘటితాంజలియై ॥ గీ ॥ విశ్వసంవేద్యమహిత యావిశ్వమందుఁ । బ్రకటముగనీ వెఱుంగని దొకటిగలదె। యయిననా చేతవినని ష్టమయ్యెనేని: నవధరింపుమావినుపింతునంబుజాక్ష ॥ ఉ॥ ఏనిక్ష్వాకుతనూజుఁడన్నృగుఁడనా నేపారు భూపాలుఁడన్। దీనవ్రాతము నర్థిఁ బ్రోచుచుధరిత్రీనాయకుల్గాఁ చిన । మ్మానింపన్ జతురంతభూభరణసామర్థ్యుండనై సంతత । శ్రీనిండారినవాఁడనుల్లసితకీర్తిస్ఫూర్తిశోభిల్లగన్ ॥ చ ॥ పలుకులఁదన్నుఁ దాఁ బొగడఁ జాతకమందురటుండఁ దారకా। వలిసికతావ్రజంబుహిమవారికణంబులు లెక్కవెట్టఁగా । నలవడుఁ గానియేనువసుధామరకోటికిదానమిచ్చుగో। వులగణుతింపధాతయును నోపఁడుమాధవ యేమిచెప్పదున్॥అదియునుం గాక॥చ॥ పొలుచు సువర్ణశృంగఖురముల్గనర్ దొలుచూలులై సువ । త్సలుగల పాఁడియావులను దాత్తతపోవ్రతవేదపాఠముల్ । గలిగికుటుంబులై విహితకర్ములం జరియించు పేదవి। ప్రులకు సదక్షిణంబుగ విభూతిదలిర్పఁగనిత్తు నచ్యుతా ॥ వ॥ మఱియున్యాయసముపార్జితవిత్తమ్ములగోభూహిరణ్యరత్న నివాసరథహస్తివాజికన్యా సరస్వతీవస్త్రతిలకాంచనరజతశయ్యాది బహువిధ దానంబులనూనంబులుగాననేకంబులు సేసితిఁ బంచమహాయజ్ఞంబులొనరించితి- వాపీకూపతటాకవన నిర్మాణంబులు సేయించితి- నిష్ఠంబునం జేయుచోనొక్కనాఁడు॥ క॥ అనఘాత్మ కశ్యపాఖ్యుం । డనువిప్రునకేనకల్మషాత్ముఁడనై యి । చ్చినగోవుదప్పినామం। దనెగలసినఁ దెలియలేకఁ దగనాగోవున్ ॥ క॥ ఒండొక భూమీసురకుల । మండనునకు దానమీయ మసలక యావి। ప్రుండాగోవుంగొనిచను । చుండన్ మునుధారఁగొన్న యుర్వీసురుఁడున్ ॥క॥ మదిరోష మొదవ దోవతి । వదలినబిగియించికొనుచువడిఁ జనియిది నా। మొదవునడివీథిఁ దొంగిలి । వదలక కొనిపోయెదిట్టివారునుగలరే॥ చ॥ అనవుడునాతఁడిట్లనియెనాతనితో నిపుడేనుదీనినీ । జనపతిచేత ధారఁగొనిసాధుగతిం జననీ దియింటయె । ట్లనిననతఁడు నేనునుధరాధిపుచేముందధారఁ గొన్నయా । వనివినిపింపనిద్దరకునయ్యెనపారవివాదమచ్చటన్ ॥ వ ॥ ఇట్లువిప్రులిద్దరుందమలోనంతకంతకు మచ్చరంబునం బెచ్చుపెరిగి కలహించి నాయున్నయెడకుం జను దెంచి మున్నునా చేత గోదానంబుఁ గొన్న బ్రాహ్మణుండిట్లనియె॥ సీ ॥ మనుజేంద్ర ప్రజలధర్మప్రవర్తనముల నడుపకుండఁగనాజ్ఞ నపుడు నీవు।మనమున నేధర్మమాచరియించ రించితిమునునా కొసఁగిచ్చిన మొదవుదప్పి। వచ్చినీమందలోఁ జొచ్చిననిప్పుడీ భూసురునకు ధారఁబోసియిచ్చి । తగవు మాలితివీవదాత వునపహర్తవైననిన్నేమననవనినాథ। యనినమాటలు చెవులుసోఁకినఁ గలఁగి। భూసురోత్తముఁ యజ్ఞానపూర్వకమున । నిట్టిపాతకమెంబు సె నేనెఱిఁగిసేయఁ । గొనుము నీకిత్తునొక లక్షగోధనంబు ॥ క ॥ అనిమఱియు నవ్విప్రుని । సునయోక్తులసునయించుచు నిట్లంటి। న్ననుఁగావు నరకకూపం। బునఁబడఁగాఁ జాలఁ బురుషపుంగవ యనినన్ ॥ గీ ॥ ఎంత వేఁడిన మచ్చరంబంత పెరిగి। మొదలు నాకిచ్చినట్టియీ మొదవె కాని। యొనయునీ రాజ్యమంతయునిచ్చితేని । నొల్లననివిప్రుఁడచ్చటనుండక ఱిగె ॥ వ ॥ అట్లతండఱిగిన నా రెండవబ్రాహ్మణునిం బ్రార్థించిపనతండును జలంబుడింపక పదివేలేని కోరు పాఁడి మొదవుల నిచ్చిననైన నుదీనిన కాని యొల్లననినిలువక చనియె నంతఁ గాల పరిపక్వంబయిననన్ను దండధరకింకరులు గొనిపోయి వైవస్వతుసమ్ముఖంబుం బెట్టిన నతండు నన్నునుద్దేశించి యిట్లనియె ॥ మ ॥ మనుజేంద్రోత్తమవంశపావనజగన్మాన్యక్రియాచారనీ । ఘనదానక్రతుధర్మముల్ భువనవిఖ్యాతంబులై చెల్లెడిన్। మును దుష్కర్మఫలంబునొందిపిదపన్ బుణ్యానుబంధంబులై। చనుసౌఖ్యంబులఁ బొందు పద్మజుని యాజ్ఞం ద్రోవగా వచ్చునే ॥ వ ॥ అని వేగంబునం ద్రోపించిన నేనప్పుడుపుడమింబడి యీనికృష్టంబగు సయూసరవెల్లి రూపంబుగైకొంటి నింతగాలంబు భద్దోషనిమిత్తంబున సిద్ధురవస్థం బొందవలసెఁ బ్రాణులకుఁ బుణ్యపాపంబులను భావ్యంబులుగాని యూరకపోనేరవు నేఁడు సమస్తదురితనిస్తారకంబయిన భవదీయపాదారవిందసందర్శనంబునం జేసి యీ ఘోరదుర్దశలం బాసి నిర్మలాత్మకుండనైతి ననిపునఃపునః ప్రణామంబు లాచరించి మరియు నిట్లనియె ॥ గీ ॥ కృష్ణ వాసుదేవ కేశవ పరమాత్మ। యప్రమేయ వరద హరిముకుంద। నిన్నుఁ జూడగంటి నీకృపఁ గనుఁగొంటి । నఖిలసౌఖ్యపదవులం దఁగంటి॥ వ॥ అనియనేకభంగులం గొనియాడి గోవిందుని పదంబులు దనకిరీటంబులు సోఁకం బ్రణమిల్లి దేవా భవదీయపా

* కృకసాలాము। ఊసరవెల్లి- తొండ.

దారవిందంబులు నాహృదయారవిందంబునం బాయకుండునట్లుగాఁ బ్రసాదింపవేయని తదనుజ్ఞాతుండై యచ్చటిజనంబు
లుచూచియద్భుతానందంబునుం బొందనతుల తేజోవిరాజితంబైన దివ్యవిమానమందాసీనుండై దివంబునకఱిగె నంత
నమ్మాధవుండునచ్చటనున్న పార్థివోత్తమునకు ధర్మబోధంబుగానిట్లనియె ॥ సీ ॥ నరనాథకులకాననముదహించుటకు
నునవనీసురులవిత్తమగ్నికీల । జననాయకులనైశ్వర్యాబ్ధినింకింప బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు । పార్థివోత్తము
లసంపచ్ఛైలములఁగూల్ప భూసురధనముదంభోళిధార । జగతీవరులకీర్తిచంద్రికమాయింప సూర్యోదయముధరాసు
రులధనము। విప్రతతిసొమ్ముకంటెనువిషముమేలు। గరళమునకునుబ్రతికృతిగలదుగాని। దానిమాన్పంగభువినౌషధములులే
వు। గానబ్రహ్మస్వములుగొంటగాదుపతికి॥క॥ఎఱిఁగియొనైననుభూసుర। వరులధనంబపహరింపవలవదుపతికి। న్మఱపునన
నలముముట్టిన । దరకొనివెసఁగాల్పకున్నెతనువెరియంగన్ ॥ వ ॥ మఱియునుదనధనంబు పరులచేతఁ గోల్పడినవిప్రుండు
దుఃఖంబునరోదనంబు సేయరాలిన యశ్రుకణంబుల నవనిరేణువు లెన్నిదడియు నన్నివేలేండ్లుదదుపేక్షాపరుండైన పతి
దారుణవేదనలుగలకుంభీపాకనరకంబునొందు - మఱియును గ్రిందటఁబదితరంబులవారును - ముందటఁబదితరంబులవారు
ను, మహానరకవేదనలంబొందుదురు - స్వదత్తంబైనఁబరదత్తంబైన నర్థంబులోభంబునంజేసి దుశ్శీలుండై భుజించునప్పా
పాత్ముండరువదివేలసంవత్సరంబులు మలకూపంబునం గ్రిమిరూపంబునవర్తించునట్లగుట నెఱింగివిప్రుండెంతతప్పుచేసిన
నెన్నిగొట్టిన-నెన్నిదిట్టినవనతనికెదురుపలుకక వినయంబున వందనంబాచరించు పుణ్యాత్ములునాదుపాలింటివారలయును
గాకనేనుమ బ్రతిదివసంబునుభూసురుల నతివినయంబునఁబూజింతు.- నిట్లసేయకవిపరీతవర్తనులైన తామసులనేను వేద
కీదండింతునదిగావున మీరలుబ్రాహ్మణజనంబులవలనంబరమభక్తిగలిగి మెలంగుండనియానతిచ్చి యాదవప్రకరంబులు
సేవింపనఖిల లోకశరణ్యుండైనయప్పుండరీకాక్షుండు నిజనివాసంబునకుంజనియెనని చెప్పి శుకుండిట్లనియె ॥క॥ ఈకథఁజ
దివినవారలు । గైకొనివినువారువిగతకలుషాత్మకులై । లౌకికసౌఖ్యమునొందుదు । రాకైవల్యంబుగరతలామలకమగున్ ॥

✻ బలరాముండుసుద్బంధుజనదర్శనార్థమై వ్రేపల్లెకుఁబోవుట. ✻

సీ॥ నరనాథవినుమొకనాఁడు తాలాంకుండు చుట్టాలబంధులఁజూచువేడ్క । సుందరకాంచనస్యందనారూఢుఁడై బాసిల్లుచు
న్వ్రేపల్లెకఱిగి। చిరకాలసంగతస్నేహులై గోపగోపాంగనానికరమాలింగనములు। సముచితసత్కృతుల్సలుపఁగైకొని
మనోత్సుకలీలనందయశోదలకును । వందనంబాచరించినవారుమోద । మందిబిగియారఁగౌఁగిళ్లనొందఁజేర్చి। సమతిదీవిం
చియంకపీఠముఁజేర్చి।-శిరముమూర్కొనిచుబుకంబుఁగరముపుడికి ॥వ॥ మఱియునానందబాష్పధారాసిక్తకపోలయుగళం
బులతోడంగుశలప్రశ్నంబులనిట్లని - రన్నానీవునునీచిన్నితమ్ముండగువెన్నుండును లెస్సయున్నవారె - మమ్మెప్పుడునరసిర
క్షింపవలయుమాకునేడుగడయుమీరకాకయొరులుగలరేయనిసముచితసంభావణంబులంబ్రొద్దుపుచ్చుచుండిరంత ॥క॥ గో
పాలవరులుప్రమదం।బాపోవనిమదినవర్తితాఖిలగేహ। వ్యాపారులగుచుహలధరు। శ్రీపాదంబులకునతులుసేసిరివరుసన్॥
క॥సీరియువారికిఁగరుణో। దారుండైనడిపెసముచితక్రియలంతం। గోరితనయీడుగోపకు। మారులచేచఱచిబలుఁడుమంద
స్మితుఁడై॥క॥నిజసుందరదేహద్యుతి। రజతాచలరుచులఁదెగడరామఁడువార। ల్భజియింపనేఁగియొకచో। విజనస్థలమునవ
సించివిలసిల్లునెడన్॥ కవిరాజవిరాజితము॥ చరణములంగనకస్ఫుటనూపురజాలముఘల్లనుచుంజెలఁగ। న్నటగములఁగంకణ
ముల్మోఱయుచున్నలిఁగానసియాడఁగుచాగ్రముల। న్సరులునటింపఁగురుల్గనియస్వలసన్మణికుండలకాంతులువి। స్ఫురితకపో
లములస్వైరయద్రజ సుందరులందఱమందగతిన్॥ కవిరాజవిరాజితము॥ చనిబలభద్రుని శౌర్యసముద్రుని సంచితపుణ్యు
నగణ్యునిజం(దనఘనసారపటీరతుషారసుధారుచికాయువిధేయసుధా।శనరిపుఖండనుసన్మణిమండనుసారవివేకునశో
కుమహాత్మునిఁగనిగోపికలోపిక లేకయదుబ్రభునిట్లనిరుత్కలికన్ ॥చ॥ హలధరనీసహోదరుఁడు దంచితకంజవిలోచ
నుండుస। ల్లలితపురాంగనాజనవిలాసవిహారసమగ్రసౌఖ్యము। ల్గలిగిసుఖించునేమమునొకానొకవేళసమేనిబుద్ధిలోఁ। ద
లఁచునొనూతనప్రియులఁదార్కొనిమేమియుఁబలుకకుండువో ॥క॥ జననీజనకులననుజులఁ।దనుజులబంధువులమిత్రతతివిడి
మెపుడున్మనమునవొందుదలంపక। తనునమ్మినవారివిడువ। దగునేహరికిన్ ॥సీ॥ సలలితయామునసైకతస్థలమునఁడిము
మ్మెచనియారడించె । విమలబృందావనవీథిమాచుబుకముల్పొదుకుచు నేమనిబుజ్జగించెఁ । బుష్పవాటికలలోఁబొల్చెమా
కుచయుగ్మమంటుచు నేమనియావరించెఁ । గాసారములపొంతఁగౌఁగిటముముఁజేర్చి నయమొప్పనేమనినమ్మఁబలికె । సన్ని
యునుమఱచెఁగాఁబోలువెన్నుఁడాత్మ। గోరితాజాయలగువారిఁగేరివిడుచు। నట్టికృష్ణుఁడుతముఱట్టువెట్టుననక । మేలన
మ్మెరిపురసతుల్బేలలగుచు ॥మ॥ అనియిబ్బంగిసరోజలోచనునినర్మాలాపముల్నవ్వులు। న్ననుబంధుల్పరిరంభణంబులురతి
వ్యాసంగముల్బ్రాపనమున్ । వినయంబుల్సంసోక్తులందలఁచి యుర్విళ్లూరుచిత్తంబులన్ । జనితాసంగళరాగ్నిచేలదువవ

౧౦౯

స్థంబొందిశోకించినన్॥ వ॥ అంతబలభద్రుండు వారలమనంబులసంతాపంబులువారింపను పాయంబులగుసరసవచనవచనుండగుచుఁగృష్ణుని సందేశంబులుచెప్పుచువిగతఖేదలంజేసియచ్చట మాసద్వయంబునిలిచి వసంతవాసరంబులుగడుపుచుఁగాళిందీతీరంబున॥ సీ॥ మాకందజంబీరమందారఖర్జూరఘనసారశోభితవనములందు। నేలాలతాలోలమాలతీమల్లికావల్లీమతల్లికావాటికలను। దరళతరంగశీకరసాధుశీతలసైకతవేదికాస్థలములందు। మకరందరసపానమదపదిందిందిరపుంజరంజితమంజుకుంజములను। విమలరుచిగల్గుసానుదేశములయందు। లలితశశికాంతఘనశిలాతలములందు। లీలనిచ్ఛావిహారవిలోలుడగుచు। సుందరీజనములుగొల్వఁజూడనొప్పె॥ గీ॥ అట్లువిహారింపవరుణినియాజ్ఞ చేసి। వారుణీదేవిమధ్యభావంబునొంది। సఖిలతరుకోటరములందునిర్గమించి। మించువాసనచేతవాసించెవనము॥ అట్టియెడ॥ వ॥ కరమొప్పారునవినవాసనలనాఘ్రాణించిగోపాలసుం। దరుఖండానుసుడాయనేఁగియతిమోదంబొప్పసేవించియా। తరలాక్షుల్మణిహేమకంకణఝుణత్కారానుకారంబులయి। కరతాళంబులుమ్రోయఁబాడుచును వేడ్కన్నాడుచునోలుచున్॥ సీ॥ తనమీఁదిబిరుదాంకితముతైనగీతముల్పాడుచురాబలభద్రుఁడంత। మహితకాదంబరీమధుపానమదవిహ్వలాక్షుండులలితలీలాలకుండు। నాలోలనవపుష్పమాలికోరస్థలుఁడనుపమమణికుండలాంచితుండు। పాలేయసంయుక్తపద్మంబుగతినొప్పుసలలితాననఘర్మజలకణుండు। నగుచువనమధ్యమునసలీలానురాగ। శీలుఁడైజలకేళికిఁజేరియమున। నింగురప్పుఁబిలువఁగాళిందియతని। మత్తుఁడనిసరకుసేయకమసలుటయును॥ చ॥ ఘనకుపితాత్ముఁడైయమునఁగన్గొనిరామఁడువలెకఁడాఁజీ। జీనఁజనుదే
కతక్కిఁతిప్పుడేనునిందలుఁజూడనుద్భుజా। సునిశితలాంగలాగ్రమునసొంపఱయింపుదునూర్చుతోవనై। చనవెసఁజించి
నైతుపనిచండపరాక్రమమొప్పనుగ్రుఁడై॥ వ॥ అట్లుకట్టలుకరాముండుద్దామంబగుబాహుబలంబునహలంబుసాఁచియమ్మహావాహినిందగిల్చి పెకల్చిరాఁదిగిచిననన్నది భయభ్రాంతయై సుందరీరూపంబుగైకొని యాహరయంబునంజనుదెంచియయ్యదువంశతిలకుఁడగుహలధరునిపాదారవిందంబులకువందనంబాచరించియిట్లనియె॥ మ॥ బలరామా ఘనబాహనీయతులశుంభద్విక్రమంబంగన। గ్గెలియంజాలెడివారెయీయఖిలధాత్రీభారధౌరేయుని। శ్చలసత్త్వుండగుకుండలీశ్వరుఁడునిన్దర్శింపనీసత్కళా। కలితాంశప్రభవుండునీగురుభుజాగర్వంబుసామాన్యమే॥ చ॥ అనివినుతించియేనుభవదంఘ్రిసరోజములాశ్రయించెద। న్ననుఁగరుణింపుమన్నయమునందనుఁడన్నదిఁబూవకమార్గమై। చనుమనికామినీనికరసంగతుఁడైజలకేళిసల్పెనిం। పెనయఁగరేణుకాయుతమదేభముచాడ్పుననమ్మహావనిన్॥ గీ॥ అంతజలకేళిసాలించిసంతసంబు। నందుచుండవినీలవస్త్రాదిరత్న। మండనంబులుగాంచనమాలికయును। దెచ్చిహలికిచ్చెచక్కనదీలలామ॥ క॥ అవియెల్లఁదాల్చిహలధరుఁ। డవిరళగతినొప్పెవల్లవాంగనలునుదా। దివిజేంద్రుఁబోలిమహితో। త్సవమునవర్తించుచుండెసౌఖ్యోన్నతుఁడై॥ క॥ అవనీశయిట్లుహలమునఁ। దివిచినఁగాళిందివ్రయ్యదెలియఁగనేఁడు। న్బవినుతికెక్కెనురామునిప్రవిమలతరసైచబాహుబలసూచకమై॥ వ॥ అంతబలభద్రుండువ్రజసుందరీసమేతుండైనందఘోషంబునంబరితోషంబునొందుచుం

—※ శ్రీకృష్ణుండు - పౌండ్రకవాసుదేవునిమీఁదదండెత్తివానింజంపుట. ※—

డెనంతనకరూశాధిపతియైనపౌండ్రకుండుతనదూతంబిలిచియిట్లనియె॥ సీ॥ మనుజేశబలగర్వమునమదోన్మత్తుఁడైయవనిపైవాసుదేవాఖ్యుఁడనఁగ। నేనొక్కరుఁడఁగాకయితరులకీనామమలవడునేయనియదటుబిగిలి। తెగ్గిహరివాసుదేవుండననుకొంటయటఁబోయినీవవల్లనుముదూత। పద్మాయతాక్షునిపాలికిఁబొమ్మన్నసఁతిగివాఁడంబుజోదరుఁడుపెద్దకొలువుఁగైకొనియుండసంకోచపడక। వినుముమారాజుమాటగావనజనాభ। యవనిరక్షింపవాసుదేవాఖ్యనొంది। నట్టిమేనుండసిగ్గువోఁదట్టిసేవ॥ క॥ నాపేరునునాచిహ్నము। లేపునధరియించితిరిగెదిదిపంతమెయిం। తేపొమ్మదిఁబరికించిన। నేపంతమెఱుంగుగొల్లఁడేమిటనైనన్॥ గీ॥ ఇంతనుండియైనమొదిఱదన్నెఱిఁగినా। చిహ్నలెల్లవిడచిచేరికొల్చి। బ్రతుకుమనుముగాకపంతంబులాడినా। మొదుఱుమనుముఘోరకదనమునకు॥ క॥ అనుదుర్భాషలుసభ్యులు। వినియొండొరుమొగముసూచివిస్మితులగుచున్। జనులారయిట్టిక్రొత్తలు। వినఁబడిమెడినిచటలెస్సవింటిరెయనఁగన్॥ అట్టియెడఁగృష్ణుండువానికిట్లనియె॥ మ॥ వినరామీనృపుఁడన్నచిహ్నములునేనేవచ్చిఘోరాజిలోఁ। దనమీఁదన్వైసవైవఁగంకముఖగృధ్రవ్రాతముల్మ్రాఁగఁగా। ననిలోదర్పముదూలకూలివికలంబైజసారమేయాళికి। న్ననయంబున్నశనంబవయ్యెదనుమేనన్నట్లుగావానితోన్॥ క॥ అనియుద్రేకముగానా। డినమాటలకులికివాఁడుడెందముగలఁగన్। జనితనమేలికకంతయు। వినిపించెనునతనిమదికివిరసముగదురన్॥ వ॥ అంతఁగృష్ణుండువండయాత్రోత్సాహుండైవివిధాయుధకలితంబును, విచిత్రకాంచనపతాకకేతువిలసితంబునునగు సుందరస్యందనంబునఁబటుజవతురంగంబులంబూన్చి దారకుండుదెచ్చిన నెక్కియతిత్వరితగతింగాశికానగరంబునకఱిగినం బౌండ్రకుండునురణోత్సాహంబుదీపింపన క్షౌహిణీద్వయంబుతోడం బురంబు వెడలెనప్పుడత

నిమిత్తుండైన కాశికాధిపతియును మూఁడక్షౌహిణులతోడఁ దోడుపడువాఁడై వెడలె నట్లాప్తయుతుండై వచ్చువాని॥
సీ॥ చక్రగదాశంఖశార్ఙ్గాదిసాధనుఁ గృత్రిమకౌస్తుభశ్రీనివాసు । మకరకుండలహారమంజీరకంకణమణి ముద్రికావనమా
లికాంకుఁ । దరళవిచిత్రపతంగపుంగవకేతుఁ జెలువొందుపీతకౌశేయవాసు । జవనాశ్వకలితకాంచనరథారూఢునిరణకు
తూహలుని సన్మణికిరీటు । నాత్మసమవేషరంగవిహారకలిత । నటసమానునిఁ బౌండ్రభూనాథుఁ జూచి । హాసమిగురొత్తన
న్వెఁబద్మాయతాక్షుఁ । డంతవాఁడును నుద్వృత్తుఁడగుచు నడరి॥ క॥ పరిఘశరాసనపట్టిస । శరముద్గరముసలకుంతచక్రగ
దాతో । మరభిండివాలశక్తి । క్షురికాసిప్రాసపరశుశూలములవెసన్॥ చ॥ పరువడఁ బైచినన్ దనుజభంజనుఁ డంతయుగాం
తకాలభీ । కరమహితోగ్రపావకుని కైవడి మేచివిరోధిసాధనో । త్కరముల నొక్కటన్నఱకి కాయములన్నిగుడించి త్రుంచి
భా । స్వరగతి నొత్తె సంచలితశాత్రవసైన్యముఁ బాంచజన్యమున్ ॥ ఉ ॥ వారసిములల్లఁ దోఁగినసి వారిజనాభుఁడు వారిసైన్య
మున్ । మారిమసంగినట్లు నుఱుమాడినఁ బీనుఁగుపెంటలై వెసం । దేరులు వ్రాలె నశ్వములు ద్రెళ్లె గజంబులు ద్రుళ్లె సద్భ
టుల్ । ధారుణిఁ గూలిరిట్లు నెఱిఁ దప్పిచనెన్ హతశేషసైన్యముల్ ॥ వ ॥ అట్టి మెదడమేదోమాంసపంకంబులు రుధిరప్రవా
హంబులునై సంగరాంగణంబు ఘోరంబయ్యె నయ్యవసరంబునం గయ్యంబునకుం గాలుద్రవ్వు నప్పౌండ్రకునింగనుం
గొని హరి సంబోధించి యిట్లనియె॥ మ॥ మనుజేంద్రాధమ పౌండ్రభూప సుతనీమానంబు బీరంబు నేఁ । డసలో మాపుదు నెద్దు
గ్రొవ్వి పిలువ వ్యాఘ్రంబోఁచు పైరంకేవై । చినచందంబున దూతచేతనను నాక్షేపించి పల్కన్నెపే । రును చిహ్నంబులు నీపయి
న్విడుతు నంచున్ బలెరా నేఁడాజిలోన్॥ క॥ అదిగాక నీదు శరణము । పదపడి మేఁజొత్తు నీవు బలవిక్రమసం । పదగల పోటరివేని
యుఁ । గదలక నిలుమనుచు నిశితకాండములంతన్॥ మ॥ చలమొప్పన్ నిగుడించి వానిరథమున్ జక్కాడి తత్సారథిన్ । దలవేఁ
ద్రుంచి హయంబులన్నఱికి యుద్దండప్రతాపక్రియన్ । బ్రళయార్క ప్రతిమానచక్రమున నప్పౌండ్రుని న్వేసంద్రుంప
వాఁ । డిలఁ గూలెన్ గులిశాహతి న్నొరగు శైలేంద్రాకృతిన్ భూవరా॥ చ ॥ మడపక కాశికావిభుని మస్తకముం గ్రతిఁద్రుంచి బం
తికై । వడిన దిపింజపింజగ అవన్విశిఖాళిని గుప్పివానియే । లెడిపురిలోన వైచె నవలీలముఁ రాంతకుఁ డిట్లు వైరులన్ । గడఁగిజ
యించి చిత్తమునఁ గౌతుకమున్ని గురొత్తన న్తతిన్॥ క॥ సురగంధర్వనభశ్చర । గరుడోరగసిద్ధసాధ్యగణము నుతింప । న్నలిచ
ను దెంచి హరి నిజపురమున సుఖముండె నతివిభూతిఁ దలిర్పన్॥ క॥ వనజోదరుచిహ్నంబులు । గొనకొని ధరియించి పౌండ్రకుఁ
డు మచ్చరియై । యనవరతము హరిదనతలఁ । పునఁదగులుటఁ జేసి ముక్తిఁ బొందెను రేంద్రా ॥ సీ ॥ అక్కడఁగా శిలోనారాజు
మంది రాంగణమునఁ గుండలకలితమగుచుఁ । బడియున్నతలఁ జూచి పౌరులు మంత్రులు దమరాజుతలయని దగనెఱింగి । చెప్పి
న వాన్నృపుజీవితేశ్వరలును సుతులు బంధువులును హితులుగూడి । మొనసి హాహాకారమున నేడ్చి రత్తఱిఁ దత్తనూభవుఁడు సు
దక్షిణుండు । వెలయఁ దండ్రికిఁ బరలోకవిధులొనర్చి । జనకు ననిలో వధించిన చక్రపాణి । నడఁచి మర్దింపఁదగును పాయంబుద
లఁచి । చతురుఁ డగునట్టి తనపురోహితునిఁ బిలిచి॥ క॥ అతఁడుం దానునుఁ జని పశు । పతిపదసరసిజములకును బ్రముదముతోనా । న
తుఁడై యదేవుని భవుఁ । గతులం బూజింప నతఁడు గరుణాన్వితుఁడై ॥ క ॥ మెచ్చితి వరమేమైనను । నిచ్చెద నను వేఁడుమనిననీ
శ్వర నన్ను । న్మచ్చిక రక్షింతు పురార । హెచ్చెము సేయక మహేశ పురవరయుభవా ॥ క ॥ దేవా మజ్జనకుని వసు । దేవాత్మజుఁడా
జిలో వధించెను నేవా । గోవిందుని ననిలోపల । నేవిధమున గెల్తు నానతీవె పురారీ ॥ గీ ॥ అనిన శంకరుఁ డతనికి ననిమొనన ఘ । నీవు
ఋత్విజులును భూసురావళియును । ప్రీతి * నభిచార మొనరింప భూతయుక్తుఁ । డగుచు ననలుండు దీర్పనీ యభిమతంబు ॥ గీ ॥
అనిన నా చంద్రమౌళి వాక్యముల భంగి । భూరినియమముతో నభిచారహోమ । మొనరఁ గావింప నగ్ని యథోచితముగఁ । జె
లఁగి దక్షిణవలమానశిఖల వెలిఁగె ॥ వ ॥ అందుఁ దామ్రశ్మశ్రుకేశకలాపంబున శనిసంకాశంబులయిన నిడుదకోఱలును నిప్పులు
ప్పతిల్లుచూపులును, ముడివడుబొమలును, జేవురించుమొగంబును, గలిగి యతిరౌద్రాకారంబునం బ్రజ్వరిల్లుచుఁ గుండంబు
వెలువడి దైనందిన నిహన్యమాన ప్రాణిరక్తారుణమృత్యుకరవాలంబు లీలం జూపట్టు నాలుక సెలవుల నాకుచు నగ్నికీలాభి
లంబగుశూలంబు కేలం దాల్చి భువనకోలాహలంబుగా నార్చుచు త్తాలతాల ప్రమాణపాదద్వయ హతులం దూలు పెం
ధూళి నింగి బ్రమింగ భూతంబులు సేవింప * నగ్నవేషమై నిజవిలోచనసంజాత సముద్ధూతనిఖిలభయంకర జ్వాలికాజాలం
బుల స్వజాలంబు లోలిం బ్రేల్చుచు ద్వేలగగనగమనంబున నగధర నగరంబునకు నరుగుదేరఁ బౌరజనంబులు భయాకులమా
నసులై దావదహనునిం గని పఱచు వనమృగంబుల చాడ్పునం బఱచి సుధర్మాభ్యంతరంబునఁ జూదం బాడు దామోదరుం గని ర
క్షరక్షేతి యార్తరవంబులం గృష్ణకృష్ణ పెనుమంటలం బురంబు గాల్పం బ్రళయాగ్ని చనుదెంచెనను వారింజూచి మీరోడ
కుండుండ నిభయంబు నివారించి సర్వరక్షకుండైన పుండరీకాక్షుండు జగదంతరాత్ముండు గావునఁ దద్వృత్తాంతంబం
తయుఁ దనచిత్తంబున నెఱింగి కాశీరాజపుత్త్రప్రేరితమైన యమ్మహాకృత్తిని నిగ్రహింపందలంచి నిజపార్శ్వవర్తియైయు.

* సారమేయాళికిన్ । కుక్కలగుంపునకు * అభిచారము । మారణహోమము । పరహింసాకర్మ.

న్నఁడుద్ది వ్యసాధనంబుగనుంగొనియప్పుడు ॥ సీ ॥ భీమమైబహుతీవ్రధామమైవాతరిపుస్తోమమైసుమహితోద్దామమగుచుఁ।
జంఘమైపిహితమార్తాండమై పాలితాజాండమైవిజయ ప్రకాండమగుచు । దివ్యమైనిఖిలగంతవ్యమైసుజన సంభావ్యమైస
ద్భక్తసేవ్యమగుచు । నిత్యమైనిగమసంస్తుత్యమైవినమితాదిత్యమై నిర్జితదైత్యమగుచు । విలయసమయసముద్ధూతవిపుల
భాస్వ। దళికలోచనరోచనానలసహస్ర । ఘటితపటుసటాజ్వాలికాచటులసత్వ । భయదచక్రంబుకృత్తిపైఁబంపెశౌరి॥
వ॥ అదియునుబ్రళయవేళాసంభూతజీమూతసంఘాతప్రభూత ఘుమఘుమాటోపనినదాధరీకృతాతిదుస్సహకహకహని
బిడనిస్వననిర్ఘోష పరిపూరిత బ్రహ్మాండకుహరంబునభ్రంలిహ కీలాసముత్కటపటుచిట చిటస్ఫుటస్ఫుట స్ఫులింగచ్ఛటా
భీలంబును,సకలదేవతాగణజయజయశబ్దకలితంబు, ననంతతేజోవిరాజితంబును, ననుచుఁగదిసినంబంటింపకఁగంటగించు
చుగెంటివెంటనంటినఁదనతొంటి రౌద్రంబుపిడిచిమగుడికాశీపురంబుసొచ్చి పౌరలోకంబుభయాకులతంబొంది వాపోవ
రోషభీషణా కారంబుతోనప్పుడు బుఱ్ఱజ్జికాయయుతంబుగాసుదక్షుణునిందహించె నత్తఱిచక్రంబును దన్నగరసౌధ
ప్రాకారగోపురాట్టాలకాదివివిధ వస్తువాహనసికరంబులతో భస్మంబుగావించి మఱలియమరులు వెఱఁగంద కమలలోచ
ను పార్శ్వవర్తియైనిజప్రభావపుంజంబు వెలుఁగొందఁగొల్చియుండెనని చెప్పి—తిరియునిట్లనియె॥ క॥ మురరిపువిజయాంకిత
మగు। చరితముసద్భక్తిఁదగిలిచదివినవినిన। న్దురితములుఁబాసిజనులిహ। పరసౌఖ్యములఁదని చేతఁబడయుదురధిపా॥ అనిన శు

## ✻ బలరాముండుద్వివిదుఁడనువానరునిసంహరించుట. ✻

కయోగికిరాజిట్లనియె॥ క॥ బలభద్రుఁడప్రమేయుం। డలఘుఁడనంతుఁడునవనియద్భుతకర్మం। బులువినియుఁదనియదింకను
దెలియఁకనాకానతిమ్ముదివ్యమునీంద్రా॥ అనినరాజునకుశుకుండిట్లనియె ॥ క॥ జననాయకవినుసుగ్రీ। వునిసచివుఁడుమైం
దునకుసహోదరుఁడనఁగా। వినుతికినెక్కినద్వివిదుం। డనుప్లవగుఁడునరకసఖ్యుఁడతిదర్పితుఁడై॥ సీ॥ చెలికానిపగఁదీర్ప
దలఁచికృష్ణుండేలుపురములుజనపదంబులుదహించి। సరిదుపవనసరోవరములుగోరాడిమందలఁగొందలమందఁజేసి। ప్రా
సాదములుద్రొబ్బిపరిఘలుమాయించిచతురంగబలములసమయఁజేసి। పురుషులసతులనుభూధరగుహలలోఁ బెట్టివాకిలి
గట్టిబిట్టునొంచి।ఫలితతరువులఁద్రుంచిసాధులనలంచి।కోటలగలించిపడుచులనీటముంచి।ధరణినిబ్బంగిఁబెకుల-బాధలనలం
చి। పలువఁజేయుచునొకనాఁడుప్లవగవరుఁడు॥ క॥చతురమ్మృదుగీతరవము। న్నతివీతెంచినఁజెలంగినగచరుఁడారై। వతగిరి
కందరమునకా। యతగతిఁజనియందునెత్తమాడెడువానిన్॥ చ॥ లలితవినీలవస్త్రసువిలాసవతీయుతుఁజంద్రచంద్రికా। క
లితమహోన్నతాంగుమణి కాంచనదివ్యవిభూషణోన్నతున్ । విలసితవారుణీసమదవిహ్వలలోచనుఁగాంచెసీరిని । ర్ద
ళితరిపుక్షితీశనిజధాముని కాముని గామపాలునిన్॥ సీ॥ కనుఁగొనితత్పురోగమభూమి రుహశాఖలెక్కి-యాఁచుచుఁజాల
వెక్కిరించుఁ। గకురింతలిడుఁబండ్లుగీటుచునవ్వుచుఁగొమ్మకొమ్మకునుఱుకుచునదల్చుఁ । దోఁకయారకమేనుసోఁకఁగనులి
వెట్టువెడవెడనాలుకవ్రేళ్ళబెట్టు । బహులనఖంబులగిరగిరఁగ్రోఁకుచుఁబారిపోరిఫలములుగఱచివైచు । గోళ్లుతెగఁగోఱ్కి
యుమియుచుగుదముసూపు। బలసిమర్కటజాతియుప్పగిదిఁజేయఁ।గోపమునహలధరుఁడొకగుండువైవ। దానిఁదప్పించుకొ
నిప్రల్లదముననతని॥ క॥ నగ్నీ* యాప్లవకలశముఁగొని । జగతీరుహశాఖలెక్కిచాపలమునన।జ్జగతిపైవైచెఁదద్ఘట । మగలఁ
గనదిచూచికోపమగ్గలమొదవన్॥ మఱియును॥ క॥సీరినిఁదనమానమునవొక।చీరికిఁగైకొనకకదిసిచీరలునింపన్ । వారకదా
భువిజనముల। గారించుటమాన్పఁదలఁచిఘనకుపితుండై॥ వ॥ ఇట్లుకోపోద్దీపితమానసుండైకనుంగొనిహలాయుధుండప్పు
డు ॥ చ ॥ ముసలముఁదీవ్రశాతహలమున్ ధరియించిసమస్తచేతన । గ్రసనమునాఁడుపొంగులయ కాలునిభంగినదల్చిని
ల్వవాఁ । డసదృశవిక్రమక్రమవిహారమెలర్పఁసమీపభూజము । న్వేసఁబెకలించిమస్తకము వ్రేసెఁజలంబుబలంబు చూప్ప
డన్॥ ఇట్లువ్రేయబలుండప్పుడు॥ చ॥ ఉరువడిదండతాడితమహోరగుభంగిఁగడంగివీరసా । గరముసన్నేఁచిహేమకటకం
బులనొప్పుమునందవామభీ । కరముసలంబునన్ ద్వివిదుకంఠముద్రేసినఁ బొల్పెసాఁడుజే । గురుగలకొండచందమునఁగో
యనియార్చిసురల్ నుతింపఁగన్ ॥ మత్తకోకిల ॥ అంతవాఁడొకయింతమూర్ఛిలియంతలోఁదెలివొందిదు । దాంత
భూరిభుజావిజృంభణుఁడై మహీజముఖ్యూనిదై । త్యాంతకాగ్రజుబ్రేసెవ్రేసినవాగ్రహంబునదానినిం । తింతలైధరరా
లఁజేసెనహీనవిక్రమశాలియై॥ క॥ మఱియునుచలముడుగకతరు।చరుఁడొకతరువెత్తివ్రేయఁదాలాంకుఁడనా। దరమునఁదు
నిమినవెండియుఁ। దొరఁగించెఁగుజంబులతఁడుదోర్దర్పోదునుమన్॥ క॥ఆచందంబునవనచరుఁ। డేచిమహీరుహచయంబులెల్ల
నుహలిపై। వైచితరుశూన్యమగుటయుఁ। జూచిశిలావృష్టిగురిసెసురలగ్గింపన్॥ క॥బలుఁడపుడురాలుదుముపై। యిలశాలఁ
గఁజేసియార్చెసేప్పుడుగకయా। వలిముఖుఁడుచాలసన్నిభ । ములుగలబాహుయుగదండములనుగ్రుండై॥ క॥ పడిఁబిడుగు

* నగ్న। దిగంబరము* ఆసవ। మద్యము- కల్లు.

వోలుపిడికిటం। బొడిచినపడిసెడకబలుఁడుముసలముహలము । స్వైడిచిప్లవంగుని మెడగదు । వెడవెడబిగియించెఁ గుడ్లువెలికు
బుకంగన్ ॥క॥ వదనములచెవులరుధిరము। కుదుడునుదొరుగంగవాఁడు మేదినిమీఁదం। జదికిలఁబడియొక యంతయు మెదలక
మిడుకంగలేకమృతిఁబొందెన్నృపా ॥గీ॥ వానిపాటునకప్పుడువనసమేత। మగుడునాశైలరాజముల్లలఁగ నాడె। సురగణంబు
లురామపైసురభికుసుమ। వృష్టిగురియించిరతులసంతుష్టిమెఱసి ॥వ॥ ఇవ్విధంబునభువనకంటకుండైనదుష్టశాఖామృగేం
ద్రునివసుంధరకుంబలిచేసిసకలజనంబులుపరమానందకందళితహృదయారవిందులయి తన్నునందింప నయ్యాదునందనుండు
నిజనగరంబునకు నరుగుదెంచెనని శుకుండు వెండియు నమ్మనుజపతికిట్లనియె ॥సీ॥ కోరిసుయోధనకూఁతురుసల్లక్షణములు

బలరాముండుదనహలంబునహస్తినాపురమునుగంగలోఁద్రోయఁబూనుట.

గల్గిలక్షణయనంగ । మహినొప్పుకన్యకామణి వివాహంబునఁజక్రహస్తునితనూజాతుండైన । సాంబుఁడుబలసాహసమున
నెత్తుకపోవఁగౌరవులీక్షించికడఁగిక్రొవ్వి। పదుఁడువాఁడొకఁడ బాలికఁగొనిపోవుచున్నాఁడుమకైకొనకుమఱిగిలి। యిట్టి
దుర్మదుఁగయిముట్టిపట్టితెచ్చి। జనులు వెఱఁగందఁజెఱఁబెట్టియునుపుమేని। యాదవులుమనలనేమిసేయంగఁగలరో। యను
చుఁగురువృద్ధజనములయనుమతమున॥వ॥ఇట్లుగడంగియుద్ధసన్నద్ధులయిబలశౌర్యోపేతులగుకర్ణశల్యభూరిశ్రవయజ్ఞకేతు
సుయోధనాదులుసమున్నతరథారూఢులయికూడనరిగినవారలంగనుంగొని జాంబవతీనందనుండుమందస్మితవదనారవిం
దుండగుచుసింగంబుభంగి గర్జించుచుమణిదీప్తంబైన చాపంబుఁబూనిసిల్చినవారు నాసాంబునిసదల్చిసిలుసిలుమనిపలికి॥
గీ॥చండకోదండముక్తనిశాతవిశిఖ। జాలమందందఁ బెడియాభీలముగను। నందనందననందనస్యందనంబు। ముంచిరిచరేంద్ర
మునుముంచుమంచుపగిది॥ మఱియును ॥శా॥ శౌర్యాటోపవిజృంభణంబులసరోజాతాక్షుసూనుండు సురా। హార్యస్థైర్యుని
మీఁదనేయునతఁడుద్యన్మూర్ఖగిబాహాబలా । వార్యుండైశితసాయకాలినసిమాయం జేసినస్వైవతా । తూర్యంబుల్దిపిప్రేమానె
నంతనతఁడస్తోకప్రతాపోన్నతిన్ ॥వ॥ ఇట్లుగడంగిబాణజాలంబులుపలగించి యందఱకునస్వరూపులయిరథధ్వజసూతధ్వజ
పతాకాతపత్రంబులుచూర్ణంబులు గావించిపిరథులంజేసి వారలమెయిమఅవయవంబులువ్రల్లుగావించి యొకొక్కనిపెక్కు
బాణంబులనుచ్చిపోనేసినవారలుశోణితదిగ్ధాంగులయికుసుమితకింశుకంబులంబోలియుండిరంత॥ఉ॥ వారలనేకులయ్యుబల
వంతులునయ్యునుహొగ్రసంగరో । దారపరాక్రమప్రకటదక్షులయ్యుఁ గుమారకుంజరు। దీర్ఘుఁడొక్కనింజెనఁకిత్రే
లునువంపఁగలేకసిగ్గునం। గూరినచింతనొండొరులుగూడుచువిచ్చుచువెచ్చనూర్చుచున్ ॥ మగుడిసమరసన్నద్ధులయిసంరం
భించి॥ఉ॥అందఱుఁబన్నొక్కపెట్టదనుజాంతకనందనుఁజుట్టుముట్టియుం । దందనిశాతసాయకలయంబులముంచిరథంబుత్రుం
చి। లందునుమాడిచాపమురయంబునఁద్రుంచిహయాలిఁజంపిసూ । తునిఁదెగటార్చియంత విరథుండగుటన్వెసఁజొచ్చిప
ట్టినన్ ॥గీ॥ చాలకుఁడుచేయునదిలేకపట్టువడియెఁ। గౌరవులుతమమనమునఁగౌతుకంబు। లొలయసాంబునిఁగన్యకాయుక్త
ముగను। బురమునకుఁదెచ్చిరతులవిభూతిమెఱసి॥ అంతద్వారకానగరంబున ॥ఉ॥ జాంబవతేయువార్త యదుజాతులునా
రదయోగిచేసనా । స్తంబునువిన్నవారగుచుసంగర కౌతుకమొప్పతిల్లఁజి । త్తంబులఁగౌరవాన్వయకదంబమునొక్కటను
కడంచుగోత్రంబులనుగ్రసేనజనపాలునను జ్ఞసమస్తసైన్యముల్ ॥గీ॥ కూడినడువంగఁగనివారితోడబలుఁడు । ధార్తరా
ష్ట్రులుమనకునెంతయునుఁడాసి । నట్టిబంధులువారిపైనెట్టియలుక। మెత్తిచనుచుంటయిదినీతియేతలంప ॥వ॥ అనివారలవా
రించితత్తణంబుబంధుప్రియుండయినబలరాముండనలార్కసంకాశంబగు కాంచనరథంబెక్కియనురక్తులైనభూసురులను
యుద్ధవాదులగుకులవృద్ధులును సేవింపంగరిపురంబునకుంజని తత్పురోపకంఠవనంబున సురభికుసుమ ఫలభరితరుచ్ఛా
యావిరచితచంద్రకాంత శిలాతలంబునందువసియించి మహితగ్రహమధ్యగతుండయినపూర్ణచంద్రుననుకరించియుండె
నంతఁగార్యబోధనంబు సేయుటకయికౌరవ్యులయొద్దకుం బ్రబుద్ధుండయినయుద్ధవునింబనిచినఁజని యతండాంబికేయునకు
ధనురాచార్యాపగాతనూభవసుయోధనులకుం బ్రణమిల్లివారిచేత నభినందితుండయియిట్లనియె ॥సీ॥ భూరియశోధనులా
రయిలాంకుండుచనుదెంచినగరోపవనమునందు। నున్నవాఁడనినవారుత్సాహమునబలుఁబొడగనువేడుకబుద్ధిదోఁప। దన
రారఁగానుకల్గొనిదని యర్ఘ్యపాద్యాది సత్కృతులు నెయ్యమునఁజేసి । దేవునిచ్చుసన్మానించి యందఱునందందవంద
నంబాచరించి । యుచితభంగినియచటఁగూర్చున్నయెడను। కుశలమేమీకుమాకునుగుశలమనుచుఁ। బలికెరాముఁడుకురున
రపాలుఁజూచి। యచటిజనములువినఁగనిట్లనియెఁదెలియ ॥ఉ॥ మానరనాథునాజ్ఞనిజమస్తములన్ధరియించికౌరవు। ల్మా
నుగఁజేయుటొప్పగుఁగుమారకునొక్కనిఁజెక్కియోధవు । ల్పూనినలావుమైనెదిరివోరజయించుటనీఁదితప్పగు। పైప
నను గాంచెబాంధవహితాస్మకుఁడైమనజాధినాధుఁడున్ ॥క॥ అని మాటలువినికౌరవ। జననాయకుఁడాగ్రహంగలఁగిచాలుఁ

బురేమే! మనఁగలదు కాలగతివ । కర్నఁగాలం దొడుగు పాదుకలు దలకెక్కెన్ ॥ గీ ॥ మనము బంధువరుసమన్నించుమన్నఁ
గాదె రాజ్యభోగగరిమఁ బొందలి । వసుధ వేరుగలిగి వాసికి నెక్కుట । దమకు ననుభవింపఁదగినయట్టి ॥ వ ॥ సితచ్ఛత్ర చామర
శంఖ కిరీట చిత్ర శయ్యా సౌధ సింహాసనంబులు గైకొనుట మనమందె మేలంబునఁ గాదె యట్టిదో సరివారునుం బోలెనూర
కగర్వించు యదుకులులతోడ సంబంధసఖ్యంబులుఁ జాలుఁ బాములకుఁ బాలుపోసి పెంచిన విషంబు దప్పునే మమ్ము నదుమపను
పుసేయుమనుట సిగ్గులేకుంటఁ గాదె యదియునుం గాక దివ్యాస్త్రకోవిదులైన గంగానందన గురు కృప అశ్వత్థామ కర్ణాది
యోధవీరులకు లోఁబడ్డవానిని మహేంద్రుఁడైనను విడిపింప వచ్చునే యహహా వృథాజల్పంబుల కేమి పనియని దుర్భాష
లాడుచు విగ్గనలేచి నిజమందిరంబునకుఁ జనిరెనప్పుడు హలాయుధుండమ్మాటలకదరిపడి ॥ ఉ ॥ కౌరవులాడిపోయిన యగౌర
వభాషలకాత్మఁ గినుకమే । పారఁగనుల్లసత్ప్రళయభానుని కైవడి మండి చండరో । షారుణితాంబకుండగుచు యాదవవృద్ధు
లఁ జూచి పల్కెబెం । పారినరాజ్యవైభవమదాంధుల మాటలు మీరు వింటిరే ॥ గీ ॥ శ్రీమదాంధులు సామంబు చేతఁ జక్క । బడు
దురే మొందు బోయఁడు పసులఁ దోలు । పగిది నుగ్రఘుజావిజృంభణసమగ్ర । సుమహితాటోపమనిలోనఁ జూపకున్న ॥ క ॥ కౌర
వుల సమయఁజేయను । దారత యదువీరవరులు దామోదరుఁడున్ । రారా వలదనియచ్చట । వారించితిఁ గాదె బంధువత్సల
యుక్తిన్ ॥ అదియునుం గాక ॥ సీ ॥ ఏదేవుభృత్యులై యింద్రాదిదిక్పాలవరులు భజింతురు వరుసతోడ । నేదేవుమందిరంబే పారి
జేవతాతరుసభావిభవసుందరతఁ జెందు । నేదేవుపదయుగంబే ప్రొద్దు సేవించు నఖిలలోకైకమాతైన లక్ష్మి । యేదేవు చారుస
మిద్ధకళాంశసంభవులము పద్మజభవులు నేము । నట్టిదేవుండు దుష్టసంహారకుండు । హరి ముకుందుఁడు పంపుసేయంగ నొప్పు ।
నుగ్రసేనుని రాజ్యసమగ్రగరిమ । యింతయును దారయిచ్చినదఁట తలంప ॥ చ ॥ అదియును గాక యెవ్వని పదాంబుజ చారుర
జోవితానమా । త్రిదివవరాదిదిక్పతికిరీటములందు నలంకరించు భూ । విదిత మదీర్ఘతీర్థము పవిత్రమునయ్యె మునట్టి కృష్ణుచే ।
బొదలిన రాజ్యచిహ్నములఁ బొందఁగ రాదఁట యేమి చోద్యమో ॥ క ॥ తావాఁట తలఁపఁగ తలలఁట । యేమఁట పాదుకలమఁట
గణింపఁగ రాజ్య । శ్రీమదమున నిట్లాడిన । యీమనుజాధముల మాట లేమనవచ్చున్ ॥ అని క్రోధమాన మానసుండై యుప్పుడు ॥
క ॥ ధారుణిని టమీఁదఁటని । ష్కౌరవముగఁ జేయుకున్నఁ గాదని యుగ్రా । కారుండై బలభద్రుఁడు । సీరము వెసఁ బూన్చి లావు చే
వయు నెసఁగన్ ॥ వ ॥ ఇట్లు పూన్చి కౌరవరాజధానియైన కరినగరంబు కడతలఁ గరతలహలాగ్రంబున జొనిపి పూని యుప్పటభే
దన విస్తారంబగు నాభూఖండంబు భుజాబల గర్వము దుర్వారుండై త్రిగిచి గంగాప్రవాహంబునం బడఁద్రోయఁగమకించిన నప్పు
డు మహాజలమధ్యవిలోలంబగు నావచందంబున నన్నగరంబు వడంకుచు గోపుర వప్రప్రాకార సౌధాట్టాలక తోరణ ధ్వజ
ద్వారకవాట కుడ్యవేదీయుతంబుగా నొడ్డగిలి పడం బౌరజనంబులకుఁ బుడమి నడుగులిడంగరాక వడవడ వడంకుచు నాతుర్లై
కుయ్యిడుచున్నట్టియెడ నమ్మహోత్పాతంబు గనుంగొని తాలాంకుండు కినుకవొడమి కావించిన యుపద్రవంబుగా నె
ఱింగి దానికిఁ బ్రతికారంబు లేమిని గళవళంబున భయాకులమానసులై పుత్ర మిత్ర కళత్ర బంధు భృత్య పౌరజన సమేతంబు
గా భీష్మ సుయోధనాది కౌరవ్యులు వేగంబున నతని చరణంబులు శరణంబులుగాఁ దలంచి సాంబుని కన్యకాయుక్తంబుగా న
నేకమణిమయ భూషణాంబర జాలంబులతోఁ దోడుకవచ్చి దండప్రణామంబులాచరించి కరకమలంబులు మోడ్చి యిట్లని
రి ॥ క ॥ రామ సమంచితముక్తా । దామయశః కామఘనసుధాధామరుచి । స్తోమజయసీమ జగదభి । రామగుణోద్దామ సకల
రాజలలామా ॥ క ॥ నీమహిమ లెఱిఁగి పొగడఁగ । నేమెంతటివారము ఖిల నేతవు ద్రిజగ । త్స్థేమంకరుఁడవు సుమతివి । తామసు
లము మమ్ముఁ గావఁదగు హలపాణీ ॥ క ॥ భూచక్రమెల్లఁ దాల్చిన । యాచక్రీశ్వరుఁడు దావకాంశుఁడు బలదే । వాచక్రికి సగ్ర
జుఁడవు । నీచక్రియలుదుష్పఁ జెల్లు నీకు జితారీ ॥ క ॥ రక్షింపుము రక్షింపుము । పేక్షింపక నమిత సఖిలబృందారకగో । రక్షణదాచ
రణానిట । లాక్షభయాతురుల మమ్ము వరయమునంతా ॥ వ ॥ మఱియును దేవా యీ సచరాచరంబులైన జగంబులు నీ లీలావి
నోదంబులం జేసి దుష్టమర్దనంబును, శిష్టజనరక్షణంబునుం జేయుచు జగదుత్పత్తిస్థితిలయ హేతువైన నీకు నమస్కరింతు
మని వెండియు నిట్లనిరి ॥ గీ ॥ అవ్యయుండవు సర్వభూతాత్మకుఁడవు । సర్వశక్తిధరుండవు శాశ్వతుఁడవు । విశ్వకరుఁడవు గురుఁ
డవు విపులకీర్తి । వయిన నిన్ను నుతింప బ్రహ్మకును దరమె ॥ చ ॥ అని వినుతించినన్ బ్రముదితాత్ముకుఁడై హలపాణి వారలం । గ
నుఁగొని యోడ కోడకుఁడు కార్యగతిం దగి లిట్లు మీరు చే । సిన యవినీతి చేత నిటు చేసితి నింక భయంబు దక్కి పొం । డని సుయో
ధనుండు వినయంబున నల్లునిఁ గూఁతురిం దగన్ ॥ క ॥ అనుచు చనరణము దాసీ । జనముల వేయింట లక్షు సైంధవములఁ దా । సినుమ
డి మేనుంగులఁ గాం । చనరథముల నాఱువేల సమ్మతి నిచ్చెన్ ॥ వ ॥ ఇట్లిచ్చియ సిచినం బలభద్రుండు గాఢుకు సుం గొడిసిం
దోడ్కొనుచుఁ బరమానందంబు నొందుచు నక్కడి జనంబులు పదివేలవిధంబులఁ బొగడ సజపురంబునకు జగి యిట్టియా

దవులతోడఁ దాఁగరిపురంబునకుంబోయినవిధంబును, వారలాడినదురాలాపంబులును, నెఱింగించిసుఖంబుననుండె, వా
రణపురంబు నేఁడునుదక్షిణంబెగసి యుత్తరభాగంబాకించుకగంగకై క్రుంగి బలభద్రుమాహాత్మ్యంబుఁ దెలుపుచున్నయ

⁂ షోడశసహస్రస్త్రీసంగతుండైనశ్రీకృష్ణుని మహిమను నారదుండు దెలిసికొనుట. ⁂

దియనియమ్మహాత్మునిభుజవీర్యంబవార్యంబనిచెప్పి శుకయోగీంద్రుండుపరీక్షిన్నరేంద్రునకిట్లనియె ॥ చ ॥ నరవరయొకట-
నాఁడువిను నారదసంయమిమాధవుండుదా। నరకుని ద్రుంచివానిభవనంబుననున్నపదారువేలసుం । దరులనునొకట-నాఁ
డెప్రమదంబుననందఱకన్నిరూపులై । పరిణయమయ్యెనావినిశుభస్థితిఁదద్విభవంబుఁజూడఁగఁ ॥ వ ॥ అట్లుతలంచికృష్ణ
పరిపాలితంబైన ద్వారకానగరంబుడాయంజనిముందట ॥ సీ ॥ శుకశారికాళిపికకూజితప్రసవాంచితోద్యానవనౌఘము
లును। కలహంససారసకమలకైరవసుకల్హారశోభితకమలాకరములుఁ। గలమాదిసస్యసంకులవరక్షేత్రభూరిలసన్నదీ
తీరములును। గిరిసానుపతితనిర్ఘరశరసందోహసంతతహేమంతసమయములును।గమలసంభవకాంచనకారరచిత।చిరత
రైశ్వర్యనగరలక్ష్మీకరాబ్జ। ఘటితనవరత్నమయహేమకటకమనఁగ । సొబగుమీఱినకోటయుఁజూచిమౌని॥వ॥మఱియుస
ముత్తుంగమణి సౌధగవాక్షరంధ్రనిర్గత ఘనసారచందనాగరుధూప ధూమపటలపెలోకనసంజనిత పయోధరాభిశంకాం
గీకృత తాండవకేళీవిలోల పురకామినీజనోపలాలిత నీలకంఠసముదయంబులును, చంద్రకాంతమణిస్ఫటికస్తంభసంవృత
మరకతపద్మరాగఘటిత నవరత్నకాంచన ప్రాసాదశిఖరాగ్రవిన్యస్తబహు సూర్యవిభ్రమకృదంచిత శాతకుంభకుంభని
చయంబును, సమస్తవస్తువిస్తారసమర్పిత వైశ్యాగారపీఠీవేదికాకలితంబును, మహితతాపనివారణతరళ విచిత్రకేతనా
బద్ధమయూరశింజినీనినద పూరితాశాంతరిక్షంబును, సరోజనాభపూతనామచేతన ప్రహరాదినూతనవిజయసందేశలిఖిత
స్వర్ణవర్ణావళివిభాసితగోపురమణివిటంకప్రదేశంబులును, యాదవేంద్రదర్శనోత్సవాహూయమాన సమాగతనానాదే
శాధీశభూరివారణదానజల ప్రభూతపంకనిరసనైకగతాగత జనసమ్మర్దకరకంకణ నికర్షణవికీర్యమాణరజఃపుంజంబును
వినూత్నరత్నమయమంగళరంగవల్లీ విరాజితప్రతిగృహప్రాంగణంబును, గుంకుమసలిలసిక్తవిపణిమార్గంబును, వంది
మాగధసంగీతమంగళారావ విలసితంబును, భేరీమృదంగకాహళ శంఖతూర్యరవాధరీకృతసాగర ఘోషంబును నైయమ
రావతీపురంబునుంబోలెవసుదేవనందననివాసంబై, యనలపుటభేదనంబునుంబోలెఁ గృష్ణమార్గసంచారపూతంబై, సం
యమినీ నగరంబునుంబోలెహరి తనూభవాభిరామంబై, నైఋతినిలయంబునుంబోలెఁ బుణ్యజనాకీర్ణంబై, వరుణనివా
సంబునుంబోలె గోత్రరక్షణనువనప్రశస్తంబై, ప్రభంజనపట్టణంబునుంబోలె మహాబలసమృద్ధంబై, యలకాపురంబునుం
బోలెముకుందవరశంఖపుకరాంకకలితంబయి, రజతాచలంబునుంబోలె నుగ్రసేనాధిపార్వ్యాలంకృతంబై, నిగమంబునుం
బోలెవివిధవర్ణక్రమవివిక్తసంచారంబయి, గ్రహమండలంబునుంబోలె గురుబుధకవిరాజమిత్రవిరాజితంబయి, సంతతక
ల్యాణవేదియుంబోలెవైవాహికోపేతంబయి, బలిదానవకరతలంబునుంబోలె సంతతదానవారియుక్తంబై, యొప్పునప్పు
రంబుప్రవేశించియందువిశ్వకర్మనిర్మితంబైనయంతఃపురంబుననుండుషోడశసహస్రహర్మ్యంబులందు ॥ సీ ॥ పటికంపు
కంబముల్పవడంపుపట్టెలు మరకతరచితముల్మదిరలమర । వైడూర్యమణిగణావళులును బద్మరాగంబుల మొగడలకాంతు
లాలయు। సజ్జాతివజ్రాలసజ్జాతిరుచులతోభాసిల్లుసీలసోపానములును। గరుడపచ్చలవిటంకములునుఘనరుచి వెలసినళశి
కాంతవేదికలును । వరలుమౌక్తికఘటితకవాటములును । బ్రవిమలస్వర్ణమయసాలభంజికలును । మించుకలరవమెసఁగఁ
గ్రీడించుమిథున। లీలనొప్పుకపోతపాలికలుఁగలిగి॥ గీ॥ చేటికానీకపదతులాకోటిమధుర।నినదభరితంబురుచిరమాణిక్యదీప।
మాలికలుగల్గి మాపట్టులీలనొక్క। జలజలోచననిజసౌధతలమునందు॥ గీ॥ కనకకంకణఝుణఝుణతాకరకలిత। చంద్రబిం
బాననాహస్తజలజఘటిత। చామరోద్ధూతమారుతచలితచికుర। పల్లవునఁగృష్ణువల్లవీపల్లవునిని॥వ॥మఱియుహాటకనిష్కం
బులబ్జులందు వెలుంగొందఁగంచుకంబులుశిరోవేష్టనంబులుఁ గనకకుండలంబులుధరియించి సంచరించుకంచుకులును, స
మానవయోరూపగుణ విలాసవిభ్రమకలితలయిన విలాసినీసహస్రంబులుఁగొలువఁ గొలువున్న యప్పద్మలోచనుని
గాంచనసింహాసనాసీనుంగాంచె నప్పుండరీకాక్షుండును నారదునింగనుంగొనిప్రత్యుత్థానంబు సేసియప్పుడు ॥క ॥ మునిని
వరుపాదాంబుజములు। తనచారుకిరీటమణిని తానముసోఁకన్। వినమితుఁడైనిజసింహా । సనమునఁగూర్చుండఁబెట్టెసద్వినయమునన్॥క॥దనపాదకమలతీర్థ। మ్మునలోకములంబవిత్రముగఁజేయుపురా। తనమౌనిలోకగురుఁడ। మ్మునిపదతీర్థంబుమ
స్తమునధరియించెన్॥ వ॥ ఇట్లుబ్రహ్మణ్యదేవుండును, నరసఖుండును నైన నాగాయణుండ శేషతీర్థోపమానంబయిన ము
నీంద్రపాదతీర్థంబుధరియించినవాఁడయి సుధాసారంబులయినమితభాషణంబులనారదునకిట్లనియె ॥ క॥ ఏపనిపంచినఁజే
యుదుఁ। దాపసవరయనుఁడునతఁడు దామోదరచి।దూరిపకభవదవతార।వ్యాపారముదుష్టనిగ్రహార్థముగాదే॥గీ॥అఖిల

లోకైకపతివిదయార్ద్రమతివి। విశ్వసంరక్షకుండవు శాశ్వతుండవు। వెలయనేసదమ్మేఁగాంచితుననుట। యార్తబంధుండ వింపీకునద్భుతంబె॥ గీ॥ అబ్జసంభవహరదేవతాద్యనీయ। ఘోరసంసారసాగరోత్తారణంబు। నవ్యయానంద మోక్షదాయకంబునైన। నీపదధ్యానమాత్మలో నిలుపనీవె॥ వ॥ అని యభ్యర్థించి యుద్ధవునివలనఁ బ్రసన్నతవడసి తన్మందిరంబు వెడలి మునివరుండమ్మహాత్ముని యోగమాయా ప్రభావంబు దెలియం గోరి వేఱొక చంద్రబింబాననాగేహంబునకుం జని యందు నెత్తమాడుచున్నపురుషోత్తముని నుద్ధవసహితుంగని యద్భుతంబునొందుచు నచటనతని చేతసత్కృతుండై యచ్చోటు వాసి చనె॥ క॥ మునివరుఁడు గాంచెనొండొక। వనజాయతనేత్రనిజనివాసంబున నం। దనయుతుఁ జిష్ణుసహిష్ణు। స్వనుతగుణాలంకరిష్ణు విష్ణుం గృష్ణున్॥ క॥ నారదుఁ డటఁ జని కనెనొక। వారిజముఖియింటనున్నవాని మురారిన్। ఘోర దానవకులసం। హారిస్థమలామనోవిహారిన్ శౌరిన్॥ వ॥ ఇట్లు కనుంగొనుచునుండ నొక్కయెడ నమ్మునీంద్రునకు ముకుందుండు ప్రత్యుత్థానంబు చేసి మునీంద్రా సంపూర్ణకాములైన మిమ్ము నపూర్ణులమైన మే మేమిటఁ బరితృప్తినొందం జేయఁగలవారము భవదీయదర్శనంబున నఖిలశోభనంబులవం దెదమని ప్రియపూర్వకంబుగాఁ బలికిన నానందనందను మాటలకు నానందకందళితహృదయారవిందుండును, మందస్మితసుందరవదనారవిందుండునునగుచు నారదుండు వెండియుం జనె॥ క॥ అనఘాత్ముఁడు గనుఁగొనెనొక। వనితామణిమందిరమున వనకేళీసం। జనితానందుని ననిమిష। వినమితచరణారవిందు విభుగోవిందున్॥ క॥ పరమేష్ఠిసుతుఁడు గనెనొక। తరుణీభవనంబునం దుదనుఁదానమనోం। బురుహామునఁ దలఁచుచుండెడి। నరకాసురదమను శౌరుసందకుమారున్॥ మఱియునుం జనిచనె॥ సీ॥ ఒకచోటను చితసంధ్యోపాసనాసక్తు నొకచోటఁ బౌరాణికోక్తికళితు నొకచోటఁ బంచయజ్ఞోచితకర్ముని నొకచోట నమృతోపయోగలోలు। నొకచోట మజ్జనోద్యోగానుషక్తుని నొకచోట దివ్యభూషోజ్జ్వలాంగు। నొకచోట ధేనుదానోత్కలితాత్ముని నొకచోట నిజసుతప్రకరయుక్తు। నొక్కచోటను గానవినోదచిత్తు। నొక్కచోటను జలకేళియుతవిహారు। నొక్కచోటను సన్మంచకోపయుక్తు। నొక్కచో బలభద్రుతోఁ జొక్కుచుండు॥ మఱియును॥ సీ॥ సకలార్థసంవేదియొకయింటిలోపలఁ జెలువతో ముచ్చటల్సెప్పుచుండు। విపులయశోనిధి వేఱొక్కయింటిలో సరసిజాననఁ గూడి సరసమాడుఁ। బుండరీకాక్షుండు నొండొకయింటిలోఁ దరుణికి హారవల్లరులు గ్రువ్వఁ। గరుణాపయోనిధి నుతియొకయింటిలోఁ జెలిఁ గూడి విడియము సేయుచుండు। వికచకమలనయనుఁ డొకయింటిలో నవ్వఁ। బ్రమిమలాత్ముఁ డొకటఁ బాడుచుండు। యోగిజనవిధేయుఁ డొకయింట సుఖగోష్ఠి। సలుపునఘుఁ డొకటఁ జెలఁగుచుండు॥ ఇట్లు చూచుచుం జనిచనె॥ క॥ చతురాననందనుఁడం। చితమతి సనికాంచె నొక్కచెలిగేహమునన్। గ్రతుకర్మాచరణుని నా। శ్రితభయహరణుని సురేంద్రసేవితచరణున్॥ క॥ వృత్రారినుతుని బరమపవి। విత్రుని నారదుఁడు గాంచె వేఱొకయింటం। బుత్రకపౌత్రకదుహితృక। ళత్రసమేతుని ననంతుల క్షణవంతున్॥ క॥ సుందరముగ నొకసుందరి। మందిరమునఁ బద్మభవకుమారుఁడు గాంచెం। దన్నం చితనందున్ సుజనా। నందున్గోవిందు నుతసనందు ముకుందున్॥ క॥ జలజభవభవ్యుఁడు గనెనొక। నలినాక్షినివాసమందు నతభద్రేభున్। జలదాభున్ఘతలోభున్। నలకాళిజితద్విరేఫు నంబుజనాభున్॥ మ॥ ఒకయింటన్ గజవాజిరోహకుఁడునై యొక్కింట భుంజానుఁడై। సకలాత్ముండుపరుండు షోడశసహస్రస్త్రీనివాసంబుల। న్నొకటో టింటను దప్పకుండ కజమాయోత్సాహుఁడైయుండన। య్యకలంకున్ఁ బరమున్ మహాపురుషు బ్రహ్మణ్యున్ననత్జ్ఞాసనున్॥ క॥ ఆస్తోకచరితు నమితస। మస్తసుధాహాసు వేదమస్తకతలవి। న్యస్తపదాంబుజయుగళున। పాస్తాశ్రితనిఖిలపాపు బరమునసంతున్॥ గీ॥ పరమభాగవతుండు పరమేష్ఠితనయుండు। మనుజలీలఁ జెందిమహితసౌఖ్య। చిత్తుఁడైన యాహృషీకేశు యోగమా। యాప్రభావముసకనాత్మనలరి॥ క॥ మాయురె హరిహరివరదయ। మేయగుణాయనుచు నాత్మ మెచ్చి మునీంద్రుం। డాయదునాయకుసుజనవ్యపేయునకిట్లని యె దేవ త్రిజగములందున్॥ క॥ నీమాయఁ దెలియువారలె। తామరసాననసురేంద్రతాపసులైనన్। ధీమంతులు నిజభక్తిసు। ధామాధుర్యమునఁ బొదలు ధన్యులు దక్కన్॥ క॥ అనిహర్షించుచునిఁక నేఁ। బనివినియెదనిఖిలలోకపావనమనుసజ్జనహితమైచనుమీకీ। ర్తనమఖిలజగంబులందుఁ దగనెఱిగింతున్॥ క॥ అనితద్వచనసుధాసే। చనమున ముదితాత్ముఁడగుచు సంయమిచిత్తం। బునఁ దన్మార్తిం ద్రగనిదు। కొనిచని యెను హరినుతైకగుణయుతుఁ డగుచున్॥ క॥ ఈపగిది లోకహితమతి। నాపరమేశ్వరుఁడు మానవాకృతిఁ ద్రిజగ। ద్దీపితచారిత్రుఁడు బహు। రూపములం బొందెసుందరుల నరనాథా॥ చ॥ అని హరియిట్లు షోడశసహస్రవధూమణులస్ప్రియంబున। న్మనసిజకేళిఁ దేల్చినయమానుషలీలసమగ్రభక్తితో। వినిఁ బఠించిన సజ్జనులు విష్ణుపదాంబుజభక్తియున్మహా। ధనపశుపుత్రమిత్రవనితాముఖసౌఖ్యములున్న రేశ్వరా॥ వ॥ అని చెప్పి యప్పరాశర్యనందనుండభిమన్యునందనునకిట్లనియె - నాదివసాగమసమయంబున బద్మబాంధవాగమనంబుగమలిసి లోకంబునకు ముసు

జరాసంధభీతులయిన రాజుల పంపున నొక విప్రుండు కృష్ణసన్నిధికి నేతెంచి విజ్ఞాపనము చేయుట.

కలుగ నెఱింగించు చందంబునం గలహంస సారసరథాంగముఖ జలవిహంగంబుల యెలుంగులు చెలంగ నరుణోదయంబున
మంగళపాఠకసంగీతమృదు మధుర గాననినదంబును, లలితమృదంగ వీణావేణునినాదంబును, వీతేరమేలుకని తనచిత్తంబు
నం జిదానందమయుం బరమాత్ము నవ్యయు నవికారు నద్వితీయు నజితు ననంతు నచ్యుతు నమేయు నాద్యంతవిహీనుం బరమ
బ్రహ్మంబు నైన తన్నుం దానాకలించుక చింతించి యనంతరంబ విరోధిరాజన్యనయనకల్హారంబులు ముకుళింప భక్తజనన
యనకమలంబులు వికసింపనిరస్తనిఖిల దోషాంధకారుండై నగోపాలుండు మొగిచిన లోచనసరోజంబులు వికసింపంజే
యుచుం దల్పంబు డిగ్గి చనుదెంచి యంత ॥ సీ॥ మలయజకర్పూరమహితవాసితహేమకలశోదకంబుల జలకమాడి । సవ్యలస
న్మృదుదివ్యవస్త్రంబులు వలనొప్పరింగులువారంగ గట్టి। మకరకుండలహారమంజీరకేయూర వలయాదిభూషణావలులు దా
ల్చి। ఘనసారకస్తూరికాహరిచందనమిళితపంకము మేననలరనలంది। మహితసౌరభయుతకుసుమములు దుఱిమ్మి। పొసంగ
రూపైన శృంగారరసమనంగ। మూర్తిగైకొన్న కరుణాసముద్రమనంగ। రమణ నొప్పుచు లలితదర్పణము చూచి॥ గీ॥ కడంగి
సారథి దెచ్చినకనకరథము। సాత్యకిహితప్రియోద్ధవసహితుండగుచు। నెక్కి నిజకాంతి దిక్కులం బిక్కటిల్లం । బూర్వగిరిం
దోంచు భానునిం బోలి వెలింగె॥ సీ ॥ అభినవనిజమూర్తి యంతఃపురాంగనానయనాబ్జములకు నానందమొదవ । సలలితముఖ
చంద్రచంద్రికాతతిపౌరజన చకోరములకుత్సవము సేయ । మహనీయకాంచనమణిమయభూషణదీప్తులు దిక్కులం దేజరి
ల్ల। నల్లనల్లన వచ్చి యరదంబు వెసడిగ్గి హలకులిశాంకుశజలజకలశ। లలితరేఖలు ధరణి నలంకరింప । నుద్ధవునిహస్తతలమూ
నియొయ్యనం జని। మహితగతి దేవతాసభామధ్యమమున । రుచిరసింహాసనమునం గూర్చుండె నెలమి॥ చ॥ అతివిభవంబునం
దనరి యాత్మకనుద్యుతి జేజల్లంగా । హితులును పురోహితుల్ వసుమతీశులు మిత్రులు బాంధవుల్ బుధు । ల్సుతులును మాగధు
లకవులు సూతులు మంత్రులు భృత్యులున్సభ। స్థితిం గొలువంగ నొప్పెను దు సేవితుండై వసుధాంశుండో యనన్॥ క॥ కరుణా
ర్ద్రదృష్టిం బ్రజలం । బరిరక్షించుచు వివేకభావకళాచా । తురి మెఱసి యిష్టగోష్ఠిం । బరమానందమున రాజ్యభారకుండగు
చున్॥ వ ॥ ఇవ్విధంబునం బ్రతిదివసంబునుండ నొక్కనాండ పూర్వదృష్టుండైన భూసురుం డొక్కరుండు చనుదెంచి సభా
స్థానంబునం గొలువున్న ముకుందునిం బొడంగని దండప్రణామం బాచరించి వినయంబునం గరంబులు మొగిచి యిట్లనియె॥
క॥ కంజవిలోచన దానవ। భంజన యోగీంద్రవిమలభావనసద్మా। ధాంజనదృష్టినిదర్శన। రంజితశుభమూర్తి కృష్ణ రామావ
రజా॥గీ॥ అవధరింపు జరాసంధుండు తుల బలిమిం। దనకు మ్రొక్కని ధారుణీధవుల నెల్ల । వెదకి తెప్పించి యిరువదివేలనాం
కెట్టి వాండు గిరివ్రజపట్టణమున॥ గీ॥ వారు పుత్తెర వచ్చినవాండ నేను। నరవరోత్తమ నృపులవిన్నపము గాంగ। విన్నవించెద నా
మాట విని సమీంద। ననఘ నీదయ వారి భాగ్యంబు కొలదిం॥ అనిథరాధిపుల విన్నపంబు గా నిట్లనియె ॥ ఉ వారిజనాభ భక్తజన
వత్సల దుష్టనుదాసు రేంద్రసం। హారసరోరుహాననపురారిముఖామరవంద్యపాదపం । కేరుహ సర్వలోకపరికీర్తితదివ్యమ
హాప్రభావసం। సారవిదూరనందతనుజాతరమాహృదయేశమాధవా॥గీ॥ఆర్తజనుల మమ్మునరసి రక్షించుము । హాత్మభక్త
జంభయాపహరణ। నిన్ను మది నుతించి నీకు మ్రొక్కెదము నీ। చరణయుగము మాకు శరణమనఘ ॥ క॥ బలియురదండింపంగ
దు। ర్బలురను రక్షింపజగతి పై నిజలీలా। కలితుండవై యుగయుగమున। నలవడను దయింతు కాదె యభవ యనంతా॥క॥ నీమది
దోంపని యర్థం। బీమేదినియందుం గలదె యీశ్వర భక్త। స్తోమసురభూజ త్రిజగ। త్క్షేమంకర దీనరక్షం జేయు మురారీ॥ క॥ నీ
పంపు సేయకుండంగ। నాపద్మభవాదిసురలకైనను వశమె। శ్రీపతి శరణాగతులం। జేపట్టి నిరోధము దుగం జేయుము కృష్ణా॥
క॥ అభవుండవయ్యు నుజగతిం। బ్రభవించుట లీలగాక భవమొందుటయే । ప్రభువులకుం బ్రభుండవు మము । సభయాత్ములనర
సి కావం జనునార్తిహరా॥క॥కదనమున నీభుజావలి। కెదురింపంగ లేక పాఱండే విక్రమసంపదచెడంగ జరాసంధుండు। పదు
నెనిమిది మార్లు ధరణిపాలురు నవ్వన్॥ వ॥ ఇట్లు తనపటింబన్నములందలంపక సింహంబు సముదదంతావళంబులనరికట్టి కా
రింబుచందంబున మమ్ముం జెఱంబెట్టి బాధించుచున్న యప్పాపాత్ముని మర్దించి కారాగృహవాస బద్ధులమగు మా నిర్బంధం
బులం బాపి సుత దారమిత్రవర్గంబులం గూర్చి యనన్య శరణ్యులమైన మమ్ము రక్షింపుమని విన్నవించిరని బ్రాహ్మణుండు విన్న

## నారదుండు శ్రీకృష్ణునివద్దికే తెంచి ధర్మరాజు చేయు రాజసూయమును నెరవేర్చుమని చెప్పుట.

పంబు సేయు నవసరంబున॥ సీ॥ శారదచంద్రికాసారంగరుచితోడ జడముడి కెంపు చేంజఱచినవ్వ । శరదంబు దావృతసౌదా
మనీలతాశోభంగాంచనకటిసూత్రమలర । లలితపూర్ణేందుమండలకలంకముగతి వృదుమృగాజినరుచి మించుచూపంగ । గ
ల్పశాఖాగ్రసంగతపుష్పగుచ్ఛంబు లీలం గేలను నక్షమాలికమర । భూరిపుణ్యనదీతోయపూరణమునం । దగు కమండలువా
మకరాహస్తమునం దనర। వెల్లజన్నిదము మెఱుంగుల నిల్ల నచ్చె। నారదుండు వివేకవిశారదుండు॥క॥ చనుదెంచెనట్లు మునిసిజ। తను
కాంతులనఖిలదిగ్వితానము వెలుంగ। న్వనజాప్తుం బోలినయ్యెడు। జనములు గృష్ణుండు లెచి సంప్రీతి మెయిన్॥ క॥ వినయమున

మ్రొక్కి - కనకా । సనమునఁ గూర్చుండఁ బెట్టి సముచితవివిధా । ర్చనములఁ దనిపి మురాంతకుఁ । డని యొస్వనయంబుఁ దోఁపఁ బ్రసన్నుని తోడన్ ॥ గీ॥ ఎచ్చటనయుండి వచ్చితిరిచ్చ్వా టునకు । నఖిలలోకైక సంచారులగుటఁ జేసి । యీ రెఱుంగనియర్థంబు నిఖిలమందు । నలుయ లేదంద్రు మిమ్ము మ్రొక్కెడు గవలయు ॥ గీ॥ పాండునందనులిప్పు డేపగిది నెచట । నున్నవారలో యెఱిఁగింపుఁడన్న మౌని । కరసరోజాతములు మోడ్చి కడఁకతోడఁ । బలికెఁ కమలాక్షుఁ జూచి సద్భక్తి మెఱసి ॥ వ॥ దేవా నీవు విశ్వనిర్మాణకర్తవై మాయి వై సకలకార్యోత్పాదనాది శక్తియుక్తుండవై పావనుండవై పావకుండు దారువులందు నంతర్హితప్రకాశుండై యున్నచందంబున వర్తించుచున్న నీదు దురత్యయంబైన మాయాశతంబులఁ బెక్కుమార్లు పొడగంటి - నదియును నాకద్భుతంబు గాదదియునుంగాక నీసంకల్పంబున జగంబుద్భవంబయి భవత్పరతంత్రంబగునట్టి నీకిష్టంబయిన వస్తువు సాధుతరంబుగాఁ దెలియ నెవ్వండును సమర్థుండే పదార్థంబు ప్రమాణ మూలంబునం దోఁచు నదియును లోకవిచక్షణుండవైన నీదు రూపంబు మఱి యును ముక్తిమార్గంబు నేఱుంగక సంసారపరవశులైన జీవులమాయాంధకారంబు నివర్తింపఁ జేయు సమర్థంబగు నీదివ్యలీలావతారంబులం గలుగుకీర్తియను ప్రదీపంబు ప్రజ్వలింపం జేసి కృపసేయునట్టి నీకు నమస్కరించెద నదిగావున నీప్రపంచంబున నీ వెఱుంగనియర్థంబు గల దే యని కృష్ణునకు నారదుండిట్లనియె ॥ సీ॥ అయిననువినుపింతు నవధరింపుము దేవ పాండుతనూజుండు పారమేష్ఠ్య । కామాను మోదియై కావింపఁగలఁడు సద్రాజసూయమహాధ్వరంబు వేడ్క । శ్రవణింపలోకవిడంబనార్థము గాక పరికింపఁ దనకాత్మబాంధవుఁడవు । భక్తవత్సలుఁడవు పరమపూరుషుఁడవు యజ్ఞరక్షకుఁడవు యజ్ఞభోక్త । వగుభవత్సేవ చాల దేసుగతివడయ । నైన నీ మేన చావధర్మాత్మజుండు । నతని యజ్ఞంబు రక్షింపనంబుజాక్ష । వలయు విచ్చేయుమ చటికివలను మెఱసి ॥ క॥ నీపేరు వినిననాడి వినఁ । చాపంబులు మాసిపోవుఁ బద్మాక్షజగ । ద్దీపక నీదర్శనమున । నేపార వెభక్తజనులకిహపరసుఖముల్ ॥ మ॥ భవదీయోజ్వలకీర్తిదిగ్వితతులన్ భాసిల్లు యుష్మత్పదో । ద్భవనైర్మల్యజలంబులుత్కలికఁ బాతాళంబునం బాలుభో । గవతీ నామమునం దనర్చి ధరణింగంగానదీరూపమై । దివి మందాకినియై జగత్త్రయమునం దీపించుఁ గాదే హరీ ॥ క॥ ఆ మఖవేళ సమస్తధ । రామండలిఁ గల్గు మేటి రాజులు మాన । స్తోమంబు నుభవదీయుమ । హామహిమముఁ జూచి సత్కృతార్థతఁ బొందన్ ॥ క॥ కలరని చెప్పిన నమ్ముని । పలుకులకున్మదమునొంది పంకజనాభుం । డెలనవ్వు మొగమునకుఁ జెలు।

***** శ్రీకృష్ణుండుద్ధవునియాలోచనచొప్పున ధర్మరాజుపాలికిఁ బోవుట. *****

వొలయఁగఁ జాటించి యుద్ధవునకిట్లనియెన్ ॥ క॥ ఉద్ధవ మహితవివేకస । మిద్ధనచోవిభవ కార్యమేగతి నడుచున్ । వృద్ధవరాను మతంబుగ । బోద్ధవ్యము గాఁగఁ జెప్పు పురుషనిధానా ॥ గీ॥ అనఘచారిత్ర నీవు నాయక్షియుగము । వంటివాఁడవు మనకు నవశ్యమగుచుఁ । జేయఁదగినట్టి కార్యంబుఁ జెప్పునీవు । నేమిపంచినఁ గావింతు సిద్ధచరిత ॥ వ॥ అని సర్వజ్ఞుండైన హరి యజ్ఞుండువోలెఁ దన్నడిగిన పురుషోత్తముని భాషణంబుల మనంబున సంతసిల్లి యతని పాదాంబుజంబులఁ దనమనంబున నిడికొని వృద్ధానుమతంబుగా నే నెఱింగిన తెఱంగున విన్నవించెద నవధరింపుము - దేవా దేవముని చెప్పినట్లు భవదీయ భక్తుండైన యుధిష్ఠిరుయాగపాలనంబు సేయం గైకొనుట కార్యంబది యునుంగాక నిఖిలదిగ్విజయమూలంబగు రాజసూయకృత్యంబునం దజరాసంధమర్దనంబును నతని చేత బద్ధులైన రాజులం గారాగృహవిముక్తులం గావించుటయుం జేకూరు - నదియునుంగాక నాగాయుతసత్త్వుండును, శతాక్షౌహిణీబలాన్వితుండు నగు మాగధుని వధియింప మనప్రభఁ జననందనుఁ డు గాని యొండొరులు సమర్థులు గారట్లగుటనతండు భూసురులేమి గోరిన నయ్యర్థంబు వృథాకరింపక నిచ్చుం గావునఁ గపట విప్రవేషంబునం జని యా జరాసంధుని నాహవభిక్ష వేడి సభవత్సన్నిధానంబున నప్పవమానతనయుండతని వధియించునట్టి కార్యంబు చేతబహులార్థసాధనంబగునని పలికిన నారదుండును యాదవజనంబులును సభికులునుం బాగడి రంత ॥ సీ॥ తరలవిచిత్రకస్థగిత ప్రభావలిఁ దనరారు గరుడకేతనము వెలుఁగఁ । గాంచనచక్రసంగతఘంటికాఘణఘణని నాదమున దిక్కరులు బెదర । సలలితమేఘపుష్పకవలాహక సైన్యసుగ్రీవతురగవిస్ఫురణ దనర । బాలసూర్యప్రభాభాసమాన ద్యుతిదిగ్వితానంబు లదీటుకొనఁగఁ । బ్రకటరుచినొప్పు తేరు దారకుఁడు దేర । నెక్కి వెడవెడ నపుడు పెంపెనయఁ జెలఁగె । శంఖకాహళపటహనిస్సాణడిండిమాదిరవములు భరితదిగంతములుగ ॥ క॥ మనుజేశ్వరునకుఁ దాలాం । ఛనకును గురువృద్ధజనులకును మ్రొక్కి ప్రియంబునననుపఁ గాంచనస్యం । దనసామజవాజిభటకదంబము గొలువన్ ॥ గీ॥ వందిమాగధసూతకైవారరవము । వసుమతీసురకోటిదీవనల మ్రోఁత । లనుగమింపంగ సతులు సౌధాగ్రశిఖర । జాలములనుండి ముత్యాలశాసలాలుక ॥ క॥ లీలం జనికృష్ణుఁ డువా । హ్యాళి న్నవకుసుమఫలభరానతశాఖా । లోలఘనసారసాలర । సాలవనస్థలమునందుఁ జతురత విడిసెన్ ॥ వ॥ అట్టియెడ సరోజనాభుశుద్ధాంతకాంతాజనంబులు ॥ సీ॥ వికచమరందనవీనసౌరభలసన్మందారకుసుమదామములు దుఱిమి । చారుసుగంధకస్తూరికాఘనసారమిళిత చందనపంకమెలమి నలఁది । కనకకుండలకనత్కంకణనూపురముద్రికాభూషణములు ధ

రించి। యంచితముక్తాఫలాంచలమృదులదివ్యాంబరములు చెలువారఁగట్టి। యర్ధచంద్రుని నేకసకేళీ మాడునట్టి । యలికఫలకలందిలకములలరఁదీర్చి। పెంపుదీపింపనుడురాజబింబముఖులు। నవచతుర్విధశృంగారమవధరించి॥ గీ॥ జలజలోచనుకడకునుత్కలికతోడఁ। దనరుశిబికంబులెక్కి నందనులుఁదామును । గడకనేతేరఁ ఫణిహారజనులు వేత్ర। కలితులై పౌరులను నెడగలుగఁజడియ॥ క॥ అసమాస్త్రుఁడువులుఁగడిగిన । కుసుమాస్త్రములఁ బహసించుకోమలతనువు । లిమ్మిసమిసమెఱువగ వేశ్యా। వినరము దాసీజనంబు విభవమెలర్పన్॥ గీ॥ హరులవేసడములఁ గరులను నెక్కితో। నలుగుదేరబహువిధాయుధములు। దాల్చిసుభటకోటితగిలిరానంతఃపు । రాంగనలుసితాంబుజాక్షుకడకు॥ అంత॥ క॥ నారదునిమాధవుఁడుస । త్కారంబునఁబిడుకొలుపనశఁడునుహృదయాం। భోరుహమునఁగృష్ణునకును । వారక మ్రొక్కుచును వెసదివసంబునకఁదిగెన్॥ క। నరవరులదూతయునుమురహరుచేనభయప్రదానమందిధరిత్రి । వరులకడకేఁగి పద్మో । దరువచనము సెప్పిసమ్మదంబునఁదేల్చెన్॥ వ॥ అంతఁగృష్ణుండు నిజకాంతాతనయబంధుసుహృజ్జనసమేతుండై కదలిచనునెడ ॥ చ ॥ కటపటరత్నకంబళనికాయకుటీరములుల్లసిల్లను । త్కటపటుచామరధ్వజపతాకకిరీటసితాతపత్రవి । స్ఫుటఘనహేతిదీధితనభోమణిఁగప్పఁగఁదూర్యఘోషము। ల్చటులతిమింగిలోర్మిరవసాగరఘోషమునాక్రమింపఁగన్॥ క॥ కరిహరిరథసుభటసమూ। తక్రమములు సేవింపమురవిదారుఁడుగడచెన్। సరిదుపవనదుర్గసరో। వరజనపదపురపుళిందవనగోష్ఠములన్॥ వ॥ ఇట్లుగడచిచనుచు నానర్తకసౌవీరమరుదేశంబులు దాఁటి, యిందుమతి నిదర్శించి, దృషద్వతి నుత్తరించి, సరస్వతీనది దాఁటి, పాంచాలమత్స్యవిషయంబులలోను

## ✻ పాండవులు శ్రీకృష్ణునెదుర్కొనిదోడ్కొనిపోవుట. ✻

గాఁజనిచని యింద్రప్రస్థనగరంబు డాయఁజనితత్పురోపకంఠవనంబున విడిచిన॥ క॥ హరిరాకసంతోఁగిధర్మజుఁ । డఱలేనిముదంబుతోడననుజులుబంధుల్। గురుజనసచివపురోహిత । పరిచారకకరిరథాశ్వభటయుతుఁడగుచున్॥ క॥ చిందములుమొఱయఁగాయక। బృందంబులనుతులుసెవులబెరయఁగభక్తిన్। డెందమునదగులఁగఁబరమా। నందంబునహరినెదుర్కొనఁగఁజనుచెంచెన్॥ వ॥ అట్లు చనుదెంచి ధర్మనందనుండు సమాగతుండైన సరోజనాభునిం బెద్దతడవుగాఁ గౌఁగిలింగనంబు చేసి రోమాంచకంచుకితశరీరుండై యానంద బాష్పధారాసిక్తకపోలుండై నిర్భరానంద కందళితహృదయారవిందుండై బాహ్యంబును మఱచియుండె నప్పుడు హరి వాయునందనవాసవతనూభవులం గౌఁగిటం జేర్చి సమ్మదంబంది మాద్రేయులు దండప్రణామంబులాచరించిన సత్కరించి యప్పుండరీకాక్షుండు విప్రవృద్ధజనంబులకు నమస్కారంబులు సేసి వారలు గావించు వివిధార్చనలం బరితుష్టుండై కేకయసృంజయాదిభూవిభులమన్నించి సూతమాగధాదులకనేక పదార్థంబులొసంగి చతురంగబలసమేతుండై వివిధమణితోరణాది విచిత్రాలంకృతంబునతివైభవోపేతంబునైన పురంబు ప్రవేశించి రాజమార్గంబునంజనుచుండఁబౌరకామినులట్టియెడ॥ సీ॥ కొఱనెలపైఁదోఁచునిరులునాఁజెలువొందివ్రాసలిపైగురులుతుంపెసలుగునియ । హాటకమణిమయతాటంకరోచులు గండభాగంబునగంతులిడఁగ । స్ఫురితవిద్రుమనిభాధరబింబరుచితోడ దరహాసచంద్రికసరసమాడ। నొఱ్ఱొంటితోరాయుసుత్తుంగకుచకుంభములు మొగంబులకునుబుటములెగయ। బడుగునడుములువడకొంగ నడుగులిడుచు। రవళుమ్రైమెలుమణినూపురములు మెఱయఁ । బోల్పుకచబంధములుభుజంబులనటింపఁ । బయ్యెదలువీడియాడసంభ్రమముతోడ ॥ వ ॥ అట్లు కృష్ణసందర్శనకుతూహలపరస్పరాహూయమానలై గురుపతిసుతబంధుజనంబులు వారింపనతిక్రమించి సమున్నతభర్మహర్మ్యశిఖరాగ్రంబులెక్కి కృష్ణుంజూచి తమలో నిట్లనిరి ॥ సీ ॥ విశ్వగర్భుండు నావెలయు వేల్పులయశోదానందులకుఁబ్రియసూనుఁడయ్యె। బ్రహ్మాదిసురులకు భావింపఁగారాని బ్రహ్మంబు గోపాలబాలుఁడయ్యె । వేదశాస్త్రంబులు వెదకికానఁగలేని గట్టిద్రేతలరోలఁగట్టువడియె । దిక్కులకమృతంబు దివిరియిచ్చినభక్తసులభుండునవనీతచోరుఁడయ్యె । నేనయుఁగమలాసతికిఁజిత్తమీనివేల్పు । గొల్లయిల్లాండ్రయుల్లములువల్లవింపఁ । జేసెననికామినులుసొ... మఱియును॥ సీ॥ గోపాలబాలురఁగూడియాడెడినాఁడు వ్రేపల్లెలోపథశిఖరములను। గూడితమలోన ముచ్చటలాడిరధిప ॥ ... చెక్కిళ్లపైమీఁటిమీఁటి । కలికిమైముద్దాడఁ గౌఁగిటఁజేర్పినలనేపు రేఁగి । చల్లనమ్మఁగఁబోవుసతులకొంగులువట్టి మెఱుఁగుచెక్కిళ్లపైమీఁటిమీఁటి । పాయనియనురక్తడాయఁజేఁతినయింతియధరసుధారసంబానియాని । యరుసమాధిపఫుంభోఁడికుచములుపుడికిపుడికి। లైనయోగీశ్వరులుగాననట్టిజెట్టి। వల్లవీజననవకల్పవల్లియయ్యె । ననుచుఁబొగడిరికృష్ణునయ్యబ్జశాష్టాంగయోగయుక్తు। సరోజలోచనలుసౌధాగ్రంబులందుండియు । వ్వనజాతాక్షునిదివ్యమూర్తిఁదమభావంబందు ముఖుబు॥ మ॥ అనియిబ్భంగి సరోజలోచనలు సౌధాగ్రంబులందుండియు । న్వనజాక్షుని దివ్యమూర్తిఁదమభావంబందు ... ప్రీతిఁదద్భవ్యక్రీ । తనైచల్లిరినవ్యలాజములు మందారప్రసూనావళుల్॥ గీలించిసం। జనితానందరసాబ్ధిమగ్నులగుచున్ ... ధరామరధరావరవణిక్పుంగవులు దామోదరునకుఁగానుకలుదెచ్చి స... వ॥ తదనంతరంబున శోభనపదార్థంబులుగొనివచ్చి ధరామరధరావరవణిక్పుంగవులు దామోదరునకుఁగానుకలుదెచ్చి స... గర్పూరనీరాజనంబులు నివాళింపనంతఃపురంబు సొచ్చెనంత ... మర్పించిరి, పుణ్యాంగనాజనంబులు పసిండిపళ్లెరంబులఁ గర్పూరనీరాజనంబులు నివాళింపనంతఃపురంబు సొత్తెంచెనం

తంగుంతిభోజనందనయుం గృష్ణునింగనిపర్యంకంబుడిగ్గి కౌఁగిలింపనాయదువల్లభుండు మేనత్తకుదండప్రణామంబాచరిం చెంబాంచాలియు ముకుందునకునభివందనం బొనరించెనంతఁ గుంతిసంపున గోవిందుభావినులగు రుక్మిణీమొదలగువారికి గంధాక్షతకుసుమతాంబూలంబులిడిలలితదుకూలమణిభూషణంబులఁ బూజించెయుధిష్ఠిరుండును గమలనయనునివధూ జనులనమగతబంధుమిత్రపుత్రసచివపురోహితపరిచారికానికరంబుల నుచితంబులగుస్థలంబులవిడియింప నియమించిదిన దినప్రవర్ధమానాభినవవివిధోపచారంబులుగావించెనంత ॥ క ॥ హరియయ్యుధిష్ఠిరుసముచిత । పరిచర్యలకాత్మనలరి షా

## ధర్మరాజుశ్రీకృష్ణునియాలోచనచొప్పునదిగ్విజయార్థముగాభీమాదులంబంపుట.

ర్ధుఁడు దానుఁ । సరసవిహారక్రియలను । సురుచిరగతిఁ గొన్నినెలలు సుఖముండెన్ నృపా ॥ అంత ॥ సీ ॥ ధరణీశ యొకనాఁడుధర్మతనూజుండు ప్రవిమలనిజసభాభవనమందు । హితులుమంత్రులుపురోహితులును సుతులునుమిత్రులు బంధువుల్ క్షత్రవరులు । పరిచారకులుసూతపాఠకకవిబుధవరులునుమునులునువరుసఁగొలువఁ । జిరలీలనవరత్నసింహాస నస్థుఁడైకొలువుండి వినతుఁడైనలిననాభు । భువనరక్షణదక్షునచ్యుతచరిత్రు । యదుకులేశ్వరుమురదైత్యమదవిభేది। నాప్తునయవేదిఁజతురుపాయప్రవీణుఁ । జూచియిట్లనిపలికెనస్తోకచరిత ॥ గీ ॥ అనఘచారిత్రరాజసూయాధ్వరం బు। నెమ్మిఁగావించువేడుకనెమ్మనమున । నెనయుచున్నదియదినిర్వహింపనీవ । కాకనాకాత్మబంధువుల్లలరెయెరులు॥ ఉ ॥ ఎవ్వరునీపదాంబుజములెప్పుడుగొల్తురుభక్తినిష్ఠులై । యెవ్వరునిన్నుఁబ్రేమనుతియింతురుభూరివివేకశాలులై । య వ్విమలాత్ములందుదురుదంచితశోభననిత్యసౌఖ్యముల్ । నివ్విధిలంగఁగృష్ణనినునేర్చిభజించినఁజిత్తవృత్తిలోఁ నే ॥ వ ॥ అనినఁ గృష్ణుండుధర్మనందనునకిట్లనియె ॥ చ ॥ నయగుణశాలిపాండునృపనందననీతలఁపొప్పనీక్రతు । క్రియమునిదేవతాపితృసు కృత్యమునైనిఖిలోగ్రశాత్రవ । క్షయమునుబాంధవప్రియముసంచితపుణ్యమునిత్యకీర్తియుఁ । జయమునుగల్గుదీనఁగురు సత్తమవేగనుపక్రమింపుమా॥ క ॥ మనుచరితనీసహోదరు । లనుపమదివ్యాస్త్రవేదులాహవభూమిన్ । జెనకినవైరినృ పాలురఁ। దునుమఁగఁజాలుదురుశౌర్యదుర్దమభంగిన్॥ క॥ గెలువుమువిమతనృపాలుర। వెలయుముబుధవినుతమైననిర్మ లకీర్తి। న్నిలుపుమునిఖిలధరామం। డలినిభవచ్ఛాసనముదృఢంబుగఁజెల్లన్॥ క॥ నీపంపుకార్యమొరులం। బూపకనేఁజేయని న్నుఁజుట్టనరఁవేలన్। జూపగవచ్చునెసకలధ। రాపతులకనీకుఁజేయరానిదిగలదే॥ కావున॥ క॥విమలమతినిట్టిమఖరా । జము నకుఁదెప్పింపవలయుసంభారంబుల్। సముకూర్పుమునీయనుజుల। సమదగతింబంపునిఖిలశత్రులగెల్వన్॥ క॥ అనుమాటలు వినికుంతీ। తనయుఁడుమోదమునుబొందితామరసాక్షున్ ।వినుతించిశౌర్యకలితుల। ననుజులదెసఁజూచిపలికెహర్షముతో డన్॥ క॥ సృంజయభూపాలకులును। గుంజరరథవాజిసుభటకోటులునినుఁగొ।ల్వంజనుమసహదేవుని।నంజకిపొమ్మనియె దక్షిణాశజయింపన్॥క। ప్రకటచతుర్విధసేనా। ప్రకరంబులుగొలువఁబంచెబడమటిదిశకు। న్నకులున్విదళితరిపుభూ। పకు లున్నార్యంబుమెరసిపార్థివముఖ్యా॥క॥దుర్జనభంజనుశౌర్యో । పార్జితవిజయప్రకాండునాహవనిపుణు । న్నర్జునవహిత యశోనిధి। నర్జునునుత్తరపుదిశకునసిపెనరేంద్రా॥ గీ॥ మహితశౌర్యనిధులుమత్స్యకేకయభద్ర । భూతలేంద్రబలసమేత ముగను। దర్పమొప్పఁబంపెఁదూర్పుదిక్కునకును । ద్దామసిహతవైరిధాముభీము ॥ చ ॥ పసిచినవారలేఁగఘనబాహుపరాక్ర మవిక్రమంబులన్ । ననుపమశౌర్యులైనచతురంతమహీశులనోర్చికప్పముల్ । గనకవినూత్నరత్నతురగప్రముఖాఖిలవ స్తుజాతము। ల్గొనిచనుదెంచిధర్మజునకున్బ్రణమిల్లిరుదాత్తచిత్తులై॥ చ॥ తమతమపోయివచ్చినవిధంబులుభూపతులెన్న జ యించుటల్। గ్రమమునఁజెప్పనందులజరాతనయుండరివెట్టఁడయ్యెనం । చమరవరేణ్యనందనుఁడహంకృతిదక్కఁగనిన్నవిం చినన్ యమసుతుఁడూరకుండెవికలాత్మకుఁడైవినియంతఁగృష్ణుడున్॥ గీ॥ ధర్మనందనుఁజూచియుత్కలికతోడ। బలికెమా గధుబోరఁజంపఁగనుపాయ। మొకటిగలదెఱుఁగఁజెలిపెదనధ్వుండు । నాకుఁజెప్పినచందంబునయచరిత్ర ॥ చ ॥ వినుమ గధేశ్వరుండెపుడువిప్రజనావళియందుభక్తియున్ । వినయముగల్గియుండియునువేఁడినచోవృథసేయకిచ్చునే । పునవిజ యుండునుంబవనపుత్రుఁడునేనునుబ్రాహ్మణాకృతిన్ । జనిరణభిక్ష వేఁడినవశంవదుఁడైయతఁడిచ్చుకోరికల్ ॥ అట్టిమెడ॥ గీ॥తగిలియప్పుడుమల్లయుద్ధమునవాని। బిలుకుమార్పింపవచ్చునుభీముచేత। ననినధర్మజుఁడిదిలెస్సయనినవిప్ర। వేషములుదా

## శ్రీకృష్ణభీమార్జునులుజరాసంధునివధింపఁబోవుట.

ల్చియతిగిరివిశదయశులు ॥ వ ॥ అట్లుకృష్ణభీమార్జునులుబ్రాహ్మణవేషంబులుదాల్చిత్రేతాగ్నులుంబోలెఁ దమశరీరతేజో విశేషంబులువెలుంగ నతిత్వరితగతింజనిగిరివ్రజపురంబు సొచ్చియందునతిథిపూజాబుశ్రద్ధాగరిష్ఠచిత్తుండైకావించుచున్న జరాసంధునింగనుంగొనియిట్లనిరి॥క॥ ధరణీశయతిథిపూజా । పరుఁడవునీవనుచుదిశలఁబలుకఁగవినిమే । మరుదెంచితిమిమ దీప్సిత। మఱిసేయఁగనిమ్ముసువ్రతాచారనిధీ॥క॥అతిథిజనంబులభక్తిన్।సతతముఁబూజించియుచితసత్కారములు।న్నతినడు

వుసుజనులును శా। శ్వతకీర్తులు ధరణిఁబడయఁజాలుదురనఘా॥ క॥ పరికింపఁగ దేహంబస్థిరమగునిజబుద్ధిఁదలఁచి చిరతరకీర్తి। స్ఫురణఁబ్రస్తుతికెక్కని। పురుషుఁడు జీవన్మృతుండు భూరివివేకా॥ క॥ ధారుణిలో నవధాన్యల। కీరానిపదార్థమొకటి యెందును గలదే। కోరినఁదనమే నెముకలు। ధీరుండైయిచ్చె మునుదధీచనవినమే ॥ క॥ అడిగినవృథసేయక తన। యొడలాఁకలిఁగొన్న మెయికకోఁగిరముగనే। రృడనిచ్చి కీర్తిఁగనెనని। పుడమిన్మనువిన మెయులకపోతమునవఘా ॥ క॥ ఆయింద్రాగ్నులు శ్యేనక। వాయసరూపములఁదన్నువలఁతిగ వేడ। న్ధీయుతుఁడై మనుశిబితన। కాయము ఛేదించియిచ్చెఁగడువడివినమే॥ గీ॥ ధీరమతులురంతిదేవహరిశ్చంద్ర। బలులనుంఛవృత్తిబ్రాహ్మణునిని। మున్నుఁజెప్పవినవె సన్నుతచరితులు। సన్నవైననేఁడునున్నవారు॥ వ॥ అనినవినిజరాసంధుండు వారలరూపంబులును మేఘగంభీరభాషణంబులును గుణకిణాంకంబులును మహాప్రభావంబులును జూచితనమనంబున వీరలు బ్రాహ్మణవేషధారులైన రాజేంద్రులు గాఁదలంచి యిమ్మహాత్ములు గోరినపదార్థంబ కాదు ప్రాణంబులేనియునిత్తునదియునుం గాక తొల్లి బలీంద్రుండు విప్రవ్యాజంబున నడిగిన విష్ణుదేవునకు నాత్మపదభ్రంశత్వం బెఱింగియు విచారింపక జగత్త్రయంబునిచ్చి కీర్తిఁ బరుఁడయ్యె - క్షత్రబంధుండను వాఁడు బ్రాహ్మణార్థంబు ప్రాణపరిత్యాగంబు చేసి నిర్మలంబగు యశంబువడసె - నదిగావున ననిత్యంబైన కాయంబు విచారణీయంబు గాదు- కీర్తివడయుట లెస్సయని విచారించి యుదారుండై కృష్ణార్జునభీములం గని యిట్లనియె॥ క॥ భూరిగుణులార మీరలు। గోరికలెఱిఁగింపుఁడేమి గోరిననైనన్। ధీరతనొసఁగుటయేకా। దారయ నాశిరము ద్రుంచియైననునిత్తున్॥ ఉ॥ నావుడు కృష్ణుఁడమ్మగధనాథునకిట్లనుభూవరేణ్యనీ। భావముసూనృతవ్రతశుభస్థితిఁజెందు టెఱుంగవచ్చె మా। కీవలెనాజిభిక్షమితఁడింద్రతనూభవుఁడేను పేంద్రుఁడు। న్నావనిఁడెయిందొకనిఁబైకొని యొక్కటిపోరఁగాఁదగున్॥ చ॥ అనవినివాఁడునవ్వియహహావినవింతలు వుట్టెమున్నున। న్ననిమొనవోర్వఁజాలకభయంబునఁ బాఱితనేకమార్లు వం। చనమధురాపురస్విడిచి సాగరమధ్యమునందు డాఁగవే। వనరుహనాభనీబిరుదవాఁడితనంబులు నాకు వింతయే॥ క॥ ఇన్నేలఁజెప్పమాయలఁ। బన్నినభోవిడువగోపబాలకబలసం। పన్నునిమాగధభూవరు। నన్నెఱుఁగవె తొల్లినందనందనపోరన్ ॥ ఉ॥ కానరణోర్విననన్నెదుర గష్టము గానఁగడంగి గోత్రభి। త్సూనుఁడు భూరిబాహుబలదుర్గముఁడయ్యును బిన్నయీవరు। త్సూనుఁడుమామకప్రకటదోర్బలశక్తికిఁజూడఁ దుల్యుఁడా। వీని నెదుర్తునంచుఁ జెయివీఁచెజరాసుతుఁడుగ్రమూర్తియై॥ క॥ కరువలిసుతునకునొక భీకరగదనిప్పించి యొక్క-

శ్రీకృష్ణసహాయుఁడగు భీముండు జరాసంధునితో యుద్ధము సేయుట

గదఁదనకేలన్। ధరియించినలువురును మత్సరమునవెలికేఁగి యచటసమతలభూమిన్॥ సీ॥ పర్వతద్వంద్వంబు పాథోధియుగళంబు మృగపతిద్వితయంబు వృషభయుగము। పావకద్వయముదంతావళయుగళంబు దలపడు వీకనుద్దండలీల। గదిసియన్యోన్యభీకరగదాహతులనుగ్రంబుగ విస్ఫులింగములు చెదరఁ। గెరలుచు సవ్యదక్షిణమండలభ్రమణములను సింహచంక్రమణములను। గదిసిపాయుచు డాసిడగ్గరుచు మింటి। కెగసి గ్రుంగుచు గ్రుంగి వేవేగ సిభూమి। వగులవార్చి ఘటఘటోద్భటమహోగ్ర। ఘనగదాఘట్టనధ్వనిగగనమగల॥ అంత ॥ మ॥ గదసారించి బృహద్రథాత్మజుఁడుహుంకారప్రఘోషంబునన్। జదలల్లాడఁగ బాధఘట్టనమునన్సర్వంసహాభాగమున్। గదలన్వాయుజుబ్రేసెవ్రేయనతఁడుగ్రక్రోధదీప్తాస్యుఁడై। యదిదప్పించివిరోధిమస్తకముబ్రేయన్వాఁడు పోఁదట్టుచున్॥ చ॥ * మడపకభీమసేనుఁడును మాగధరాజుఁగడఁగి బెబ్బులు। ల్విడివడులీలనొండొరులవీఁపులుమూపులును * బ్రకోష్ఠము। ల్నడుతలలూరుజానజఘనప్రకరంబులు బిట్టుప్రగ్యాఁగాఁ। బిడుగులఁబోలు పెన్గదలబెట్టుగవ్రేయుచుఁ బాయుచున్వెసన్ ॥ లయవిభాతి ॥ బెడగడరఁ బెన్గదలు పోడిపోడిగాఁ। బిడుగుల బోలు పెన్గదల బెట్టుగవ్రేయుచుఁ బాయుచున్వెసన్ ॥ లయవిభాతి ॥ బెడగడరఁ బెన్గదలు పోడిపోడిగాఁ డాఁకఁ బెనుపిడుగులవనిం దొరుగనుడుగణము రాలన్। మిడుగురులు చెదరనభమడలహరిదంతములు వెడలజడధుల్గలఁగఁ బుడమిచలియింపన్। వెడచరువమొత్తియనుదడఁబడఁగనొత్తియును నెడమఁగుడులొంచితిరుగుడువడఁగవ్రేయన్। వడవడఁకుచును సుడివడక డాసిచలముడుగక వుడొండొరులు వడిచెడక పోరన్ ॥ వ॥ ఇవ్విధంబునం బోరుచుండ నొండొరుల గదాదండంబులు దుమురులై సంబెండువడక సమదదిగ్వేదండశుండాదండమండితప్రచండంబులగు బాహుదండంబులు ప్రకాల వెసడాఁచియును గిలెడలఁద్రోచియును దాలములు నాలఁజెడకేలవళించి ముష్టియుద్ధంబునకుడగ్గరి ॥ లయగ్రాహి ॥ కాలవిపులక్షతవిలోలమగుసెడి వ్రేయన్। ఫాలములు గక్షములు బాహువులు వక్షములు లీలనెముకల్మెదడు నేలదుమురైవే। తాలమదభూతములు ఖేలనలఁజేతులను దాళములు దట్టుచు నులీలవడి సాష్టురులు జాలు యోగిబెము గాలువలు గొనెఁబే। క్రకరలు చెకురలు స్నెముల శోణితలంబుల చేఁబగుల్పుదు। నృకురులనక్కలు నైవులు ముష్టిహతిన్నలియంగ గ్రుడ్డన్॥ ఉ॥ ప్రకరలు చెకురలు స్నెములు శోణితలంబుల చేఁబగుల్పుదు। దకరకశ్రుక్కఁ కొండొరులఁదార్కొని పేర్కొని దుచున్। డొకరలుఁ బికరలుఘనకఠోరపదాహతి నొంచుచున్నెఱిన్। కొమ్మనుచున్నెడల్లగిలిగుల్లలతిత్తుపోరిరుగ్రతన్ ॥ ఉ॥ హుమ్మని మోగ్రచుం బెలుచహుంకృతులిచ్చుచుఁ బాసిడాసి కో

లు గాఁబడంబులన్ । గ్రుమ్మువముష్టిఘట్టనల గ్రుక్కుచు నూర్పులు దండడింపఁగా । సొమ్మలఁబోవుచున్ దెలియుచుఁ గ్రమ్మఱఁ జేవయు లావుఁ జూపుచున్ ॥ వ ॥ ఇవ్విధంబున వజ్రీవజ్రసన్నిభంబులగు నితరేతరముష్టిఘట్టనల భిన్నాంగులై రక్తసిక్తశరీరంబులతోడఁ బుష్పితాశోకంబుల విధంబున నెగురు గొండలచందంబునం జూపట్టి పోరుచుండఁ గృష్ణుండు జరాసంధుని జన్మమరణప్రకారంబు లాత్మ నెఱుంగుటం జేసి వాయుతనూభవునకలయిక లేక లావును జేవయుఁ గల్గునట్లుగాఁ దద్గాత్రంబునందుఁ దనదివ్యతేజంబు నిల్పి విరోధినిరసనోపాయం బూహించి సమీరణనందనుండు సూచుచుండ నొక్కశాఖాగ్రంబు రెండుగాఁ జీల్చి వానినట్ల చీరి చంపుమని సంజ్ఞగాఁ జూపి చెప్పిన నతండు నాకీలు దెలిసి యవక్రవిక్రమ పరాక్రముండై మాగధుం బడఁద్రోచి వానిపదంబు పదంబునఁ ద్రొక్కి బాహుయుగళంబున రెండవ పదంబు గదలకుండం బట్టి మస్తకపర్యంతంబుఁ జెళపెళయను చప్పుళ్లుప్పతిల్ల మత్తదంతావళంబు దాళవృక్షంబు చీరుచందంబునఁ బాదజానుజంఘోరుకటిమధ్యోదరాంసకర్ణకనయనంబులు వేఱువేఱ భాగంబులుగా వ్రయ్యలు వాపి యార్చినఁ బౌరజనంబులు గనుంగొని భయాకులులై హాహాకారంబులు సేసిరంత॥ క॥ అనిలజుని దేవపతినం। దనుఁడును బద్మాక్షుఁడును నుదారత నాలిం। గనములు సేసి పరాక్రమ। మునకద్భుతమంది మోదమునఁ బొగడిరొగిన్ ॥

## ❋ కారాగృహవిముక్తులగు రాజులు శ్రీకృష్ణుని స్తుతించుట. ❋

క॥ వనజాక్షుఁ డంతఁ గరుణా। వననిధియును భక్తలోకవత్సలుఁడు నుగా। వున మాగధయుతు సహదే। వునిఁ బట్టము గట్టెఁ దన్మహోన్నతపదవిన్ ॥ క॥ మగధాధినాథునకుము। న్నగపడి చెఱసాలలను మహాదుఃఖములన్। న్నాఁగులుచుఁ దన పాదాంబుజ। యుగళము చింతించుచున్న యుర్వీశ్వరులన్ ॥ వ॥ అయ్యవసరంబునఁ గృష్ణుండు దనదివ్యచిత్తంబున మగధరాజనిరుద్ధుల చెఱలు విడిపించిన వారలు పెద్దకాలంబు కారాగృహంబులఁ బెక్కుబాధలంబడి కృశీభూతశరీరులగుటం జేసి రక్తమాంసశూన్యంబులై త్వగస్థిమాత్రావశిష్టంబులును, ధూళిధూసరంబులునైన దేహంబులును, గేశపాశంబులు మాసి జటాబంధంబులయిన శిరోజంబులును, మలినవస్త్రంబులునుం గలిగి చనుదెంచి రప్పుడు॥ సీ॥ నవపద్మలోచను భవబన్ధమోచను భరితశుభాకారు దురితదూరుఁ। గంకణకేయూరుఁ గాంచనమంజీరు వివిధశోభితభూషు విగతదోషుఁ। బన్నగాంతకవాహు భక్తమహోత్సాహు నవచంద్రజూటు నున్నతకిరీటు। హరినీలసిభకాయు వరపీతకౌశేయుఁ గటిసూత్రధారు జగద్విహారు। హారవనమాలికామహితోరువక్షు। శంఖచక్రగదాపద్మశార్ఙ్గహస్తు। లలితశ్రీవత్సశోభితలక్షణాంగు। సుభగచారిత్రు దేవకీసుతునిఁ గాంచి॥ చ॥ భరితముదాత్ములై విగతబంధనులై నిజమస్తముల్మురా। సురరిపుపాదపద్మముల సోఁకఁగఁ జాఁగిలి మ్రొక్కి రానముల్లై। కరములు మోడ్చి యో పరమకారుణికోత్తమ సజ్జనార్తిసం। హరణవివేకశీలమహితాశ్రితపోషణ పాపశోషణా॥ గీ॥ వరదపద్మనాభ హరికృష్ణ గోవింద। దాసదుఃఖనాశ వాసుదేవ। యవ్యయాప్రమేయ యనిశంబుగా నింతు। మిందిరేశ నీకు వందనములు॥ ఉ॥ ధీరవిచార మమ్ము భవదీయపదాశ్రయులన్ జరాసుతో। దారనిబంధనోగ్రపరితాపము మీకరుణావలోకనా। సారముచేత నార్చితివి సజ్జనరక్షయు దుష్టశిక్షయు। న్నారయ మీకు గార్యములు యాదవవంశపయోధిచంద్రమా॥ సీ॥ అవధరింపుము మాగధాధీశ్వరుఁడు మాకుఁ బరమబంధుఁడుగాని పగరగాఁడు। ప్రకటితరాజ్యవైభవమదాంధీభూతచేతస్కులము మమ్ముఁ జెప్పనేల। కమనీయజలతరంగములకైవడి దీపశిఖవోలి చూడనస్థిరములయిన। గురుసంపదలు నమ్మి పరసాధనక్రియాగమ మేదితద్బాధకంబులయిన। బలసి యన్యోన్యవైరానుబంధములను। ప్రజలఁ గారించుచును దుష్టభావచిత్తు। లగుచు నాసన్నమృత్యుభయంబు దక్కి। మత్తులై తిరుగుదురు దుర్మనుజులంత॥ చ॥ కడపటిసేఁత నైహికసుఖంబులఁ గోల్పడి చిత్తకోర్కె వెం। బడిఁబడి యెండమావులఁ బిపాసులునై సలిలాస సేయుచు। న్జెడుమనుజుల్భవాబ్ధిదరిఁ జేరఁగలేక నశింతు రట్టియా। యిడుములఁ బొందఁ జాలము రమేశ త్రిలోకశరణ్య మాధవా॥ ఉ॥ వేదవధూశిరోమహితవీధులఁ జాలనలంకరించు మీ। పాదసరోజయుగ్మము శుభస్థితి మా హృదయంబులందు ని। త్యోదితభక్తి మైఁ దగిలి యుండునుపాయ మెఱుంగఁ బల్కు దా। మోదర భక్తదుర్భవమహోదధితారణ సృష్టికారణా॥ క॥ అసితను శరణము వేఁడిన। జననాథులవలను జూచి సదమలభక్తా। వనచరితుఁడు పంకజలో। చనుఁ డిట్లను వారితోడ సదయామతియై॥ చ॥ జనపతులార మీపలుకు సత్యము రాజ్యమదాంధచిత్తులై। ఘనముగ విప్రులం బ్రజలఁ గారియఁ బెట్టుటఁ జేసి కాదె వే। గ నహుష రావణార్జునులు గాలము నొందిరి గాన ధర్మపా। లనమునఁ గాక నిల్చునె కులంబు బలంబు చిరాయురున్నతుల్ ॥ వ॥ అదిగావున మీమనంబుల దేహంబనిత్యంబుగా దెలిసి॥ ఉ ॥ మీరును ధర్మముం దగవు మేరయుఁ దప్పక భూజనాళిఁ బెం। పారుచు సౌఖ్యసంపదలనందఁగఁ బ్రోచుచు భూరియజ్ఞములు గౌరవవృత్తి మత్సరము గానొనరించుచు మామకాంఘ్రిపం। కేరుహముల్భజించుచు నకిల్బిషులై చరియింపుఁ డిమ్ములన్ ॥ వ॥ అట్లైన మీరలు బ్రహ్మసాయుజ్యప్రాప్తులయ్యెదరు మదీయపాదారవిందంబులందుఁ జలింపని

❋ పడమ। వెనుకదిక్కు, ప్రకోష్ఠము। మోచేతిక్రింది మంచిమణికట్టుదాఁకనుండెడు ప్రదేశము.

భక్తియుఁగలుగుసని యానతిచ్చియారాజవరుల మంగళస్నానంబులు సేయించివివిధమణిభూషణమృదులాంబరమాలా
నులేపనంబులొసఁగి భోజనతాంబూలంబులంబరితృప్తులంజేసి యున్నతరథాశ్వసామజాధిరూఢులంగావించి నిజరా
జ్యంబులకుఁబూజ్యులంజేసియనిచిన॥ క॥ నరవరులీచందంబున। మురసంహారుచేతబంధుమోక్షణులైసుస్థిరహర్షంబులతో
నిజ। పురములకుంజసిరిశుభవిభూతిదలిర్పన్॥ క॥ హరిమంగళగుణకీర్తన। నిరతముగావించుచునువిసర్మలమతులై। గురు
బంధుపుత్రజాయా। పరిజనములరంగఁగృష్ణుఁబద్మదళాక్షున్॥ వ॥ అనిబహుప్రకారంబులఁబొగడుచుఁ దమతమదేశంబు
లకుంజనిన॥ క॥ నలినదళలోచనుఁడుదముఁ। దెలిపినసద్ధర్మపద్ధతినిఁదగవరులయి। యిలఁబరిపాలించుచుసుఖ। ముల
నుండిరిమహితనిజవిభుత్వములలరన్॥ వ॥ ఇట్లుకృష్ణుండుజరాసంధవధంబును రాజలోకంబునకు బంధమోక్షణంబును
గావించివాయునందన వాసవనందనులుం దానునుజరాసంధతనయుండగు సహదేవుండు సేయువివిధంబులగుపూజ
లుగైకొనియతని నుండనియమించి యచ్చోటుఁగదలి కతిపయప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకుంజనుదెంచి త
ద్ద్వారప్రదేశంబున విజయశంఖంబులు పూరించినఁ బ్రతిపక్షభయదంబును బాంధవప్రమోదంబునునగు నమ్మహా
ఘోషంబువినిపౌరజనంబులుజరాతనయుమరణంబు నిశ్చయించిసంతసిల్లిరి - వారిజాక్షుండునుభీమసేన పార్థులతోఁబు
రంబుప్రవేశించిధర్మనందనునకువందనంబాచరించి తాముపోయినతెఱంగును, నచ్చటజరాసంధునివధియించినప్రకారం
బును సవిస్తరంబుగా నెఱింగించిననతండు విస్మయవికచలోచనంబులనానంద బాష్పంబులుగురియ నమ్మాధవుమాహా
త్మ్యంబునకుందనయందలిభక్తిస్నేహదయాదిగుణంబులకుం బరితోషంబునొందుచుఁగృష్ణునింజూచియిట్లనియె॥ సీ॥ కమ
లాక్షుసర్వలోకములకుగురుఁడవై తేజరిల్లెడుభవదీయమూర్తి। యంశాంశసంభవులగులోకపాలురు నీయాజ్ఞఁదలమో
చిఖిలభువన। పరిపాలనిపుణులయిభాసిల్లుచున్నారలట్టినీకొకనృపునాజ్ఞసేయుటయనీమాయగాదదినికిన్ మేమేకమై
యద్వితీయమైయవ్యయంబు। నైననీతేజమునకొకహానిగలదె। చిన్మయాకారనీపాదసేవకులకు। నాత్మపరభేదబుద్ధియెం

## ధర్మరాజుచేసెడురాజసూయయాగంబునశ్రీకృష్ణుఁడుశిశుపాలునివధించుట.

దైనఁగలదె। పుండరీకాక్షగోవిందభువనరక్ష॥ వ॥ అనిగోవిందునింబొగడియద్దేవునను మతంబునంగుంతీసుతాగ్రజుండుప
రతత్త్వవిజ్ఞానులయినధరణీసురులనుబుత్విక్కులుగావరియించి॥ సీ॥ సాత్యవతేయకశ్యపభరద్వాజోపహూతివిశ్వామి
త్రవీతిహోత్ర। మైత్రేయపైలసుమంతుమధుచ్ఛందగౌతమసుమతిభార్గవవసిష్ఠ। వామదేవాకృతవ్రణకణ్వజైమిని
ధౌమ్యపరాశరాథర్వకవషు। లసితవైశంపాయనాసురికశ్యపక్రతువీరసేనగర్గత్రికవ్య। ముఖ్యులయినబుషులమునులను
గృపుఁడుగాం। గేయకుంభజాంబికేయవిదుర। కురుకుమారబంధుకులవృద్ధధారుణి। సురనరేంద్రవైశ్యశూద్రవరుల॥క॥ ర
ప్పింపవారుహర్షము। లుప్పతిలన్నేగుదెంచియుచితక్రియలం। దప్పకకనుఁగొనుచుండఁగ। నప్పుడువిధ్యుక్తనియతులైభూమి
సురుల్॥ గీ॥ కడఁగిసవనభూమిఁగనకలాంగలముల। నర్థితున్నఁబాండవాగ్రజునకు। నచటఁదీక్షజేసియంచితస్వర్ణమ। యో
పకరణములనల్పములగను॥ ఇట్లునియమంబునసముచితక్రియాకలాపంబులునడుపుచుండిరప్పుడు॥ క॥ సకలావనీశునిచ్చి
న। యకలంకసువర్ణరత్నహయధనవస్త్రప్రకరంబులుమొదలగుతా। నుకలందుకొనన్సుయోధనుసినియమించెన్॥ సీ॥ అ
ర్థిజాతముగోరినట్టివస్తువులెల్లఁదగఁబంచియిడఁగరాధాతనూజు। సరసాన్నపానాదిసకలపదార్థముల్పాకముల్సేయుం
పఁబవనతనయు। బంకజోదరునొద్దఁబాయకపరిచర్యఁదవిలికావింపవాసవతనూజు। సవనసీమిత్తమైసంచితద్రవ్యము
ల్పెంపుతోవేఁడెప్పింపనకులు। దేవగురువృద్ధధాత్రీసురావలులను। నరసిపూజింపసహదేవునఖిలజనులఁ। బోలుచుమృ
ష్టాన్నశతులతృప్తులనుజేయ। ద్రౌపదిఁదగనియోగించెధర్మసుతుఁడు॥ అయ్యవసరంబున॥ చ॥ హరిశిఖిదండపాణిసికసా
త్మజపాశిసమీరగుహ్యకే। శ్వరశశిమాళిపంకరుహసంభవచారణసిద్ధసాధ్యకి। న్నరగరుడోరగామరగణంబులువచ్చిమ
ఖంబుఁజూచియు। చ్చెరువడితొల్లియెవ్వరునుజేయమఖంబులునింతయొప్పనే॥క॥ అదిగాకనిందిరావిభు। పదములుసేవిం
చునట్టిభాగ్యముగలుగన్। దుదిఁబడయరానిబహుసం। పదలెవ్వియుఁగలవెయనుచుఁబ్రస్తుతిసేయన్॥అప్పుడు॥ చ॥ అమర
సమానులయితనరుయాజకవర్గములోలిరాజసూ। యమఖవిధానమంత్రములనగ్నిముఖంబుగఁజేసిధర్మజుం। గ్రమమున
వేలుపింపఁగ్రతురాజసమాప్తినినంబునన్నృపో। త్తముఁడుగడంగియాజకసదస్యగురుద్విజకోటిఁజెంపుఁన్॥ వ॥ పూజిం
చునప్పుడందగ్రపూజార్హులెవ్వరనియడిగిన సదస్యులుందమకుఁదోచిన విధంబులంబలుకవారి భాషణంబులువారించి వి
వేకశీలుండును, జతురవచనకోవిదుండునునగుసహదేవుండు; భగవంతుండును, యదుకులసంభవుండునునైన శ్రీకృష్ణునిం
జూపియిమ్మహాత్మునిసంతుష్టుంజేసిన భువనంబులన్నియుం బరితుష్టింబొందునని చెప్పిధర్మజుంజూచియిట్లనియె॥ ఉ॥ కాల
ముదేశముక్రతువుఁ గర్మముఁగర్తయుభోక్తయున్జగ। జ్జాలముదైవమున్గురువు సాంఖ్యముమంత్రము యజ్ఞమూహ

తు। ల్వేళలువిప్రులుంజనవవృద్ధిలయంబులు హేతుభూతము। ల్లీలలఁదానమై యొగవెలింగెడినెకఁటితేజమీశుఁడక్క॥ చ॥ ఇ
తఁడెయితంఢుగన్నులాకయించుకమోడ్చినసీచరాచర। స్త్రిభువనంబులన్నియునశించునితండవివిచ్చిచూచిన। న్వివిధము
లయిజనించుబ్రభవిష్ణుఁడువిష్ణుఁడునైనయట్టియీ। క్రతుఫలరుండుగాకొరుఁడొకండెటులర్హుఁడుశిష్టపూజకున్॥ ఉ॥ ఈ
పురుషోత్తముఁ జగదధీశుననంతునిసర్వశక్తుఁజి। ద్రూపకునగ్రపూజఁబరితోషనుసేయసమస్తలోకము। ల్వేపరితుష్టి
బొందుఁబృథివీవరకావునసీవుకృష్ణునిక్। శ్రీపతిబూజసేయుమెడసేయకమాటలువేయనేటికిన్॥ క॥ అనిసహదేవుఁడుప
లికిన। విని యచ్చటిజనులుమనుజవిభులునుఋషులు। న్మనుకొనిమనమునమోదము। దనుకఁగనిదిలెస్సయనిరిధర్మజుఁడం
తన్॥ క॥ మునిజనమానసమధుకర। వనజాతములయినయట్టివారిజదళలో। చనుపదపద్మప్రతతి। శనమెంగిగావించితజ్జలంబు
లుభక్తిన్॥ క॥ తానునుగుంతియువనుజులు। మానుగద్రుపదాత్మజయునుమస్తకములఁ జెం। పూనినసియతిధరించిమ। హా
నందముఁబొందిరతిశయప్రీతిమెయిన్॥ క॥ చంచత్కాంచనరుచిరో। దంచితవస్త్రములనూతనారుప్రభల। న్మించినరత్న
ములంబూ। జించెంధర్మజుఁడుకృష్ణుజిష్ణుసహిష్ణున్॥ వ॥ ఇట్లుపూజించియానందబాష్పజలబిందుసందోహకందళితనయ
నారవిందంబులంగోవిందునిసుందరాకారంబుదర్శింపఁజాలకుండె నట్లుపూజితుండై తేజరిల్లుపుండరీకాక్షునిరీక్షించిహ
స్తంబులునిజమస్తకంబులధరించిపిన్నుతిసేయుచు నఖిలజనంబులుజయజయశబ్దంబులిచ్చిరి - దేవతలువివిధతూర్యఘోషం
బులతోడంబుష్పవర్షంబులుగురియించిరయ్యవసరంబున॥ క॥ దమఘోషసుతుఁడుదద్విభ। వముఁజూచిసహింపకలుకవ
ట్రిలగాఁచి। తముడిగ్గినిలిచినిజహ। స్తములెత్తిమనోభయంబుదక్కినవాఁడై॥ వ॥ అప్పుడప్పుండరీకాక్షుండువినుచుండస
భాసదులంజూచియిట్లనియె॥ క॥ చాలుబురేయహహాయీ। కాలముగడుపంగదురవగాహంబగునీ। తేలాతప్పెనునేఁడీ। బా
లకువచనములచేతఁబ్రాజ్ఞులబుద్ధుల్॥ వ॥ ఇట్లుతప్పినతెఱంగెట్లనినఁ బాత్రాపాత్రవివేకంబు సేయనేర్చినవిజ్ఞాననిపుణు
లు, నున్నతసత్వగుణగరిష్ఠులు, బహువిధతపోవ్రతనియమనిష్ఠులు, ననల్పతేజులు, మహైశ్వర్యశక్తిధరులుఁ, బరతత్వవే
దులు, నఖిలలోకపూజ్యులు, విగతపాపులు, బరమయోగీంద్రులునుండ వీరింగైకొనక వివేకరహితులై గోపాలబాలునిం
బూజసేయుటకునెట్లుసమ్మతించిరి- పురోడాశంబుసృగాలంబునకర్హంబగునేయదియునుంగాక॥ సీ॥ గురుదేవమాన్యుం
డుగులగోత్రరహితుండుఁ దలిదండ్రులెవ్వరోతడవగాన। మప్పులఁబారలెడునాదిమధ్యావసానంబులందరయ మానంబు
లేదు। బహురూపియై పెక్కుభంగులవర్తించువానివర్తనములువరుసలేవు। పరికింపవిగతసంబంధుండుదలపోయమానిమి
త్తంబునమానిసయ్యె। బరగమున్నుయయాతిశాపమునఁజేసి। వాసికెక్కఁడుయాదవవంశమెల్ల। బ్రహ్మతేజంబునెల్లఁ
గోల్పడినయతఁడు। బ్రహ్మఋషిసేవ్యుఁడగునెగోపాలకుండు॥ క॥ జారుఁడుజన్మావధియును। చోరుడుముప్పోకలాడుసు
మహితపూజా। చారక్రియలకునర్హుఁడె। వారకనితఁడనుచునశుభవాక్యస్ఫూర్తిన్॥ చ॥ అనితనుదూఱనాడినముకుంఠ
కుఁడాశిశుపాలువాక్యము। ల్వినిమదిఁజీఁకికింగొనఁడువిశ్రుతభైరవరావమాత్మనై। కొనినిమృగేంద్రురీతిమునికోటియు
రాజులుపద్మనాభునా। డినయుసినీతిభాషలకుడెందముననడువంగనొందుచున్॥ ఉ॥ వీనులుమూసికొంచుఖినవిస్మయహం
చుముకుందమాధవ। శ్రీనిధిపీనినేఁగతికిఁజేర్చెదొయించుదురాత్ముఁబిట్టుచు। న్నానరనాథులున్మునులునచ్చటసిల్వకపోవఁ
బాండుసం। తానములప్రమేయబలదర్పమహోద్ధతరోషచిత్తులై॥ వ॥ అప్పుడుకేకయస్పృంజయభూపతులుందామునువి
విధాయుధపాణులైయదల్చినిల్చినవాఁడునుంబిఱుతినక యదల్చిపలుకయువాలునుంగైకొని భుజాగర్వదుర్వారుండయి
గోవిందునిందదనుసర్తనులైనవారలంగుపితుండైనిందింప నమ్మకుందుండాగ్రహంబునలేచి తనకట్టెదుటనెదిర్చియున్న
శిశుపాలునిరూక్షేక్షణంబుల నిరీక్షించుచు నక్షణంబతన్మస్తకంబు ధారాకరాళంబైన చక్రంబుననవక్రపరాక్రముండై
ద్రుంచెనయ్యవసరంబున॥ క॥ మునివరులునుజనపతులును। గనుఁగొనివెఱగందఁజైద్యుగాత్రమునందు। న్ననుపమతేజమువె
లువడి। వనజోదరుదేహమందునడఁగెఁజొచ్చెన్నృపా॥ అనినమునివరునకుభూవరుండిట్లనియె॥ క॥ కమలాక్షునినిందించిన। దమ
ఘోషతనూభవుండుదారుణమలకూ। పమునుంబొందకమేక్రియ। సుమహితమతిఁగృష్ణునందుఁజొచ్చెమునీంద్రా॥ అనిన
శుకయోగిరాజయోగికిట్లనియె॥ మ॥ మధువైరత్యంతకుమీఁదిమత్సరమునన్ముత్తిల్లిజన్మత్రయా। వధినేర్పొర్గుఁదధీయరూ
పగుణధ్యానపారీణధీ। నిధియాటన్నిశుపాలభూవిభుఁడుదానిర్ధూతసర్వాఘుఁడై। విధిరుద్రాదులకందరానిపదవిన్నొ
నొందెనుర్వీశ్వరా॥ వ॥ అంతధర్మనందనుండు ఋత్విగ్గణంబులను సదస్యులనుబహుదక్షిణలఁదనిపి వివిధార్చనలం
బూజించియవభృథస్నానక్రియాపరితోషంబున॥ సీ॥ మురజమృదంగగోముఖశంఖడిండిమపణవాదిరవములంబరమునిం
డఁ। గవిసూతమాగధగాయకవందివైతాళికవినుతులందంధబెరయ। వితతమర్దళవేణువీణారవంబులగతులకునర్తకీగతు

లు సెలఁగఁ । దరిశవిచిత్రకధ్వజపతాకాంకితస్యందనగజవాజిచయము లెక్కి । సుతసహోదరహితపురోహితజనంబు। గటకకేయూరహారకంకణకిరీట। వస్త్రమాల్యానులేపనవ్రాతములను। విభవ మొప్పారఁగాఁ జేసి వెడలిరంత॥ వ॥ యదుసృంజయ కాంభోజకేకయకురుకోసల భూపాలముఖ్యులు చతుర్విధసేనాసమేతులై ధరణిఁ గంపింప వెన్నంటి నడతేర ఋత్విక్కాయంబులును సదస్యులును బ్రహ్మఘోషంబు లాలయించుచుండి కొని శోభమానానూనప్రభాభాసమానసువర్ణమయమాలికామధ్యగతదివ్యమణి హారంబులు కంఠంబులం దేజరిల్లుచున్న జవాశ్వ ఖులంబు పూన్చిన పుష్పరథంబు కళత్రసమేతుండై యెక్కి యతి మనోహర విభవాభిరాముండై చనుదెంచుచుండెనప్పుడు వారాంగనాజనంబులు దమతమ వారలం గూడికొని॥ సీ॥ కనకాద్రిసానుసంగత కేకిసులభాతిఁ గ్రొమ్ముళ్లు పింఛంపు నగుసిరియాడఁ । దరలతాటంకముక్తాఫలాంశుద్యుతుల్ చెక్కుటద్దములతోఁ జెలిమి సేయఁ । బాలసియాదృశ్యమైపోని క్రొమ్మెఱుంగుల గతులఁ గటాక్షదీధితులు దనర । మంచుపై సెగయనూకిం మజకవలనఁ జన్నులు జిలుగు * కంచెలల నమర । మహితకుచభారకంపితమధ్యలగుచు । నర్థిమొలనూళ్లు మెఱయఁబయ్యెదలు జాఱఁ। గరసరోజాతకంకణక్వాణములును । జరణనూపురఘోషములు సందడింప॥ వ॥ మఱియు నయ్యెందువదనలందందమందగమనంబునం జెందు ఘర్మజలబిందుసందోహకందళితమందహాసచంద్రికాసుందరవదనారవిందంబులు నిందిందిరరుచిచికురబృందంబులు చిందరవందరలై సుందరీగానసమందానందహృదయలై సువర్ణశృంగసంగతంబులయి నసంకుమదమలయజముఖసురభితోయంబులు పలుతోయంబుల సముదాయంబులయి తమతోయంబులవారిం జల్లుచుఁ జెందొవలకెంపు దమ్మివిరులగచియించిన చిమ్మనగ్రోవులం దావులుగల పూదేనియలు నించి వావులు దెలిపి తేవలు మీఱఁ గ్రోవలనుండి యుమ్మలంగ విసిచిమ్ముచు మృగమదకర్దమంబును గుంకుమపంకంబునుం గొంకక బింకంబులు జంకెలాలయం బంకజసన్నిభంబులగు మొగంబుల నేహాటించి దమురుచు నుల్లంబులు పల్లవింపం బెల్లడరియందియలు ఘల్లుఘల్లని మొఱయఁ గ్రేళ్లుదాఁటుచుం జాఱుచూ జారుచంద్రికాధవళఘనసారధూళిమిళితరజనీపరాగంబు రంజిల్లం గరంబులం బుచ్చికొని శిరంబులం జల్లుచుఁ జిత్తంబుల నమ్మత్తకాశినుల వృత్తంబులగు కుచంబుల కొత్తువత్తు రేయాసబిత్తరించి పువ్వుగుత్తులం దత్తాంబునవ్రేయుచుఁ బరిహాసించుచు నన్యోన్యకరకిసలయ కనకకరండభరితంబులగు పన్నీటం జెంగావిజిలుగుపుట్టంబులు దట్టంబులు గాఁదోఁగిన మర్మంబులు బయలుపడిన నగ్గలంబులగు సిగ్గులకు నొప్పిదంబులగు తమ కనురెప్పలకడ్డంబు సేయుచుఁ బురుషులును దామునా రామలభిరామలీలారసోక్తులెనయ యనంతరంగంబుల సంతసంబునం బంతంబులిచ్చుచు వసంతంబులాడిరి శ్వేళవతుల విహారరూఢులయి యింద్రపురంధ్రీజనంబులుం బోలె హాటకశిబికలెక్కి నిజచేటికాజనంబులు సేవింపం జనుదెంచు భూకాంతకాంతాజనంబులు తమకు సరసంబులగు నర్మంబులయిన ధరణీపాలవధూలలాముంబులాదరించు చెలులపైఁ దన సఖీజనంబులం బురిగొల్పి చల్లిందు చుభావగర్భితంబులగు పారిచతురసరసోక్తుల మందహాసచంద్రికలు ముఖకమలలీలావిలోకనలక్ష్మిం బ్రోచి సేయం జెలువలరం జనిరి వివిధంబున నిజసాంబ్రాజ్యవిభవంబు పూజ్యంబుగా నజాతశత్రుండు గంగాప్రవాహంబునకరిగి యందు నిజవధూయుక్తుండై శాస్త్రోక్తప్రకారంబున వేదఘోషంబు లెసఁగ నవభృథస్నానంబాచరించె నానమయంబున॥ క॥ అనిమిషదుందుభిశంభ। త్స్వనములు వీతెంచెఁ బువ్వువర్ష ముగురిసెన్ । ముని దేవపితృమహీవర। విసుతులరవ మెసఁగె నపుడు విమలచరిత్రా॥ క॥ నరులెట్టి పాపులయినను। గరమర్థిని నెద్ది చేసి గతకిల్మషులై । చరియింతురట్టి యవభృథ। మరుదుగఁ గావించి రెలమి నఖిలజనంబుల్॥ గీ॥ అంత ధర్మతనయుఁ డభినవవస్త్రము లదు। కూలసురభికుసుమమాలికానులేపనములు రత్నదీపితభూషణా। వళులు దాల్చి వైభవమున నొప్పె॥ అంత నవభృథస్నానానంతరంబున మఱలి చనుదెంచి॥ ఉ॥ పాండుతనూభవాగ్రజుఁడు పాండుయశోనిధి దానమానమార్తాండనిభుండు యాజకసదస్యమహీసురయోగిబంధురా। ఖ్యాండలిఁ బూజఁ జేసి బుధమాన్యచరిత్రుఁడు వారికిచ్చె నొం। డొండ దుకూలరత్నకనకోజ్జ్వలభూషణముఖ్యవస్తువుల్ ॥ వ ॥ ఇట్లు నారాయణపరాయణులై దేవసమానప్రకాశప్రభావంబుల సకలనరనారీలోకంబులు సర్వ్యరత్నమయ భూషణమాల్యానులేపనంబులు ధరియించి పరమానందభరితాత్ములయి యొప్పియుండిరంత॥ చ॥ సుసిశితభక్తితన్మఖముఁ జూడఁగవచ్చిన యట్టి దేవతా। మునిధరణీసురప్రకరభూవరవైశ్యజశూద్రకోటియు । జ్జనపతిచంద్రుచేఁ నుచితసత్కృతులం బరితోషచిత్తులై। వినయముతోడ ధర్మజుని వీడ్కొని పోవుచుఁ బెక్కుభంగులన్॥ చ॥ హరిచరణాంబుజాతయుగళార్చకులై పెమపొందు పాండుభూ। వరసుతు రాజసూయమఖవైభవము న్నుతియించుచున్నమా! దరమున నాత్మభూములకు దారత నేఁగిరి ధర్మసూనుఁడున్। సరసిజనేత్రు నిన్నను పఁజాలక నుండుమటంచు వేడినన్ ॥ వ ॥ ఇట్లు పాండవాగ్రజు ప్రార్థనం గైకొని దామోదరుండు సర్వయాదవులనుం గుశస్థలికిం బోవం బనిచి కతిపయ పరిజనంబులుం దానును నతనికిం బ్రియంబు గాఁ దన్న

* కంచెల । రవికె.

గరంబునం బ్రమోదంబునను జెందెనని చెప్పి మఱియు నిట్లనియె ॥ చ ॥ జనవర పాండుభూపతనుజాతుఁడు దుస్తరతన్మనోరథాబ్ధి నిసరసీరుహాక్షుఁడను తెప్పకతంబున దాఁటి భూరిశో । భనయుతుఁడై మనోరుజలఁ బాసి ముదాత్మకుఁడై వెలింగెన, వ్వనరుహనాభదాసజనవర్యులకుం గల వే యసాధ్యముల్॥ అట్టి యెడ॥ గీ॥ రాజసూయకాధ్వరప్రభావమునను । నఖిలజనులు మోదమందిరపుడు । కలుషమానసుండు కులపాంసనుఁడు సుయోధనుఁడొకండు దక్క ధరణినాథ॥ వ॥ అనిన విని శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె॥ గీ॥ అఖిలజనులకెల్ల నానందజనకమై । యెనయు మఖము గురుకులేశ్వరునకుఁ । గరమసహ్యమైన కారణమెట్లది । యెఱుఁగఁ బలుకు దీనిఁ దచ్చరిత ॥ చ॥ అనిన మునీంద్రుఁ డిట్లను ధరాధిపుతోఁ గురురాజు పాండునం । దనుల దెసన్ననేక దురితంబులు నిచ్చలు సేయుచుండునై । ననునొకనాఁడు పంకరుహనాభదయాపరిలబ్ధసర్వశో । భనజితదేవదైత్యనరపాలకరాజ్యరమామహత్త్వమై ॥ చ ॥ వెలయు ననూనసంపదలవిశ్రుతకీర్తులమిన్నుముట్టఁ బెం । పలరిన పాండుభూవరసుతాగ్రజుఁడంతిపురంబులోననుం । జ్వలమణిభూషణాంశురుచిజాలము వర్వఁ బయోజనాభును । తక్కలిక భజించుచున్న నసుఖస్థితి భూరిమనోహరాకృతిన్ ॥ వ ॥ ఉండం గనుంగొని యదియునుం గాక లలితాష్టమీశశాంకబింబంబు లవిడంబించుచు నింద్రనీలరుచినిచయంబు నపహసించు కుటిలకుంతలంబులు నటనంబుసలుపం దనరు నిటలఫలకంబులును, బుష్పచాపచాపప్రచారంబుల మేపు చూపు భ్రూయుగోపాంతమ్ములై సౌదామనీచామరుచి స్తోమంబులై కర్ణాంతసీమంబులై యంజనంబులతోడ రంజిల్లు నేత్రకంజంబులును, నవమల్లికాముకుళవిభాసితదంతమరీచికానిచయోద్దీపిత మందహాసచంద్రికాధవళితంబులును, ముకురోపమితంబులును, గర్ణకుండలమణిమరీచిజాలంబులు బెరసి బహుప్రకారంబులం బర్వం బొలుచు కపోలపాలికలును, విలచితగ్రైవేయక ముక్తాఫలహారనిచయంబులకిమ్ముచూపక మిసమిసని పసగల మెఱుంగులు గరిగొని మీఁటినం బగులవనం బొగడందగి మొగంబులెత్తుకొంబుటంబు లెగయు నుత్తుంగపీనకుచభారంబుల వేఁగులఁ గ లేక దూగాడుచుం గరతలపరిమేయంబుల సుమధ్యభాగంబులును, ఘనజఘనమండలావతీర్ణ కాంచనకాంచీకలాప కింకిణీకిలకినదోల్లసితంబులుం గల కటిప్రదేశంబులును, సల్లలితహల్లకపల్లవకాంతుల మొల్లంబులఁ గొల్లలుగొని యభిరామంబులై శోభిల్లుచుండ పాణితలంబులును, నలసగతులం పదంబులందనరు మణినూపురంబులు గోపురంబులఁ బ్రతిస్వనంబులాలయ మొఱయ నలరుచరణారవిందంబులును రత్నవలయకంకణాఙ్గుళీయకాదివివిధ భూషణమణిద్యుతినిచయంబులుష్ణ మరీచికరనిచయంబుల ధిక్కరింప వెలుంగు కరకంజంబులును మృగమదఘనసారహరిచందనాగరుకుంకుమపంకంబుల భాసురంబులగు వాసనలు నాసారంధ్రంబులకు వెక్కసంబులై సాలయ సౌభాగ్యంబులుం గలిగి చైతన్యంబునొందిన మాణిక్యపుబొమ్మలవిధంబులం గగన మండలంబు నిర్గమించి వసుధాతలంబున సంచరించు చంద్రరేఖల చెలువున శృంగారరసంబు మూర్తీభవించి జగంబుల మోహపఱచు మోహినీదేవతల చందంబున విలసించు మాధవవధూసహస్రంబులసంగతి సౌదామినీలతయునుంబోలి యొప్పుచుం డెడు ద్రుపదరాజనందన విభవంబును రాజసూయమహాధ్వరోత్సవంబునుం జూచి చిత్తంబు త్తలపెట్టు సుయోధనుండు సంతాపానలంబునం గ్రాగుచుండెనంత నొక్కనాఁడు ధర్మనందనుండు నిర్మలంబగు సభాభవనంబునకుం జని॥ సీ॥ సుతసహోదరపురోహితబాంధవామాత్యపరిచారభటకోటి బలసి కొలువఁ । గలితమాగధమంజుగానంబు పాఠకపఠనరవంబులు ప్రమదమెసఁగఁ । గంకణఝుణఝుణత్కారంబు శోభిల్ల సరసిజాననలు చామరములిడఁగ । మయవినిర్మితసభామధ్యంబున సుభాసమాన సింహాసనాసీనుఁడగుచు । నమరగణములు గొలువఁ బెంపారు నిలిమ । షేంద్రుకైవడి మెఱసి యుపేంద్రుఁడలర । వరుసఁ గొలువున్న యత్తఱిదురభిమాన । క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు॥ ఉ॥ కాంచనరత్నభూషణనికాయము దాల్చి సముజ్జ్వలప్రభో । దంచితమూర్తి నొప్పి ఫణిహారులు ముందటఁ గ్రందువాయ వా । రింపసహోదరుల్ నృపవరేణ్యులు పార్శ్వములన్ భజింపనే । తెంచెను రాజసంబున యుధిష్ఠిరుపాలికి వైభవోన్నతిన్ ॥ వ ॥ అట్లు చనుదెంచి మయమాయామోహితంబైన సభాస్థలంబునందు ॥క ॥ సలిలములు లేనితావున । వలువలు వెసనెగయఁ దిగిచి వారకతోయంబు । బులుగలచోటను చేలం । బులుదడియఁగఁబడియె నిజవిభుత్వము దలుగన్ ॥క॥ ఆవిధమంతయుఁ గనుంగొని । పావనివృకయును జటిపార్థివులును గాం । తావళియును యమతనయుఁడు । వావిరి చేసన్నఁ దమ్ము వారింపంగన్॥ వ॥ ఇట్లు దామోదరాను మోదితులై మహారావంబుగాఁ బరిహాసంబులు చేసిన సుయోధనుండు చిత్తంబు చిన్నఁబోయి లజ్జావనతవదనుండై కుపితమానసుండగుచు నవ్వ్యాడ నిలువక వెలువడి నిజగజపురంబునకరిగె నయ్యవసరంబున ధీవిశాలురైన సభాసదులగునచ్చటి జనంబుల కోలాహలంబు సంకులంబైన నజాతశత్రుండు చిత్తంబున విన్ననై యుండె నప్పుండరీకాక్షుండు భూభారనివారణకారణుండగుటం జేసి దుర్యోధనునపయశంబునకుం గాదనం డయ్యెనయ్యెడ॥క॥ హరిధర్మసుతుని వీడ్కొని । తరుణీహితబంధుజనకదంబము గొలువ । స్ఫురితోత్సవమునఁ గుశస్థలపురమునకుం జనియె మోదమున నరనాథా॥ చ॥ జనవరబంధ

మోక్షణముచైద్యవధంబునుచాండు రాజనం | దనుమఖరక్షణంబునుసుదారత జేసినయట్టి దేవకీ | తనయుచరిత్రభాషణ
కథాపఠనాత్ములు గాంతురిష్టశో| భనబహుపుత్రకీర్తులునుభవ్యవివేకముపిష్టలోకముల్॥ క॥ అనిశుకయోగీంద్రుండ | మ్మ

## సాల్వుండుశివప్రసాదంబునసౌభకవిమానంబువడసిద్వారకాపురిమీఁదదండెత్తుట.

నుజేంద్రునిఁజూచిపలికెమతియునుశ్రీకృ| ష్ణునియద్భుతకర్మంబులు | వినిపింతుఁ జిత్తగింపువిమలచరిత్రా ॥ సీ ॥ వసుధేశ
వినవయ్యవైదర్భిపరిణయ వేళదుర్మదశిశుపాలభూమి | వరునకుఁదోడ్పడనరుదెంచిసైనికావలితోడఁదొడరి దోర్బలము
దూలి | హరిచేతనిర్జితులైన రాజులలోనఁజైద్యుఁచెలికాఁడుసాల్వధరణి | పతిజరాసంధాదిపార్థివప్రకరంబువినుమత్స
రానలవిపులశిఖల| ధాత్రినిటమీఁదవీతయాదవముగాఁగ| గడఁగిసేయుదునిదురాగ్రహముతోడఁ| బంతములువలికి-యు
టంజసిభరితనిష్ఠఁ| దపముగావింపఁబూనిసుస్థలమునందు॥ క॥ ధృతివదలకయుగ్రస్థితిఁ| బ్రతిదినమునుబిడికెడవసిరజమశన
ముగా| సతినియమముతోనాపశు| పతిశంకరుఁఫాలనయనుభర్గునుమేశుల్॥ క॥ చెదరనినిజభక్తినిద| త్పదపద్మములాత్మనిలిపి
పాయకనొకవేఁ| ముదితక్రియభజియించిన | మదనారియువానిభక్తిమహిమకువశుఁడై॥ క॥ భోరునఁబత్యక్షంబై | గో
రినవరమేమియైనఁగొసరకసిత్తుఁ| వారకవేఁడుమటన్నను | నారాజతపోధనుండుహరునకుఁబ్రీతిన్ ॥ గీ ॥ వందనంబాచ
రించియానందవికచ | వదనుఁడై కేలుదోయిఫాలమునఁజేర్చి | శ్రితదయాకారనన్నురక్షించెదేని | నెఱుఁగవినిపింతువిను
ముమదీప్సితంబు॥ గీ॥ గరుడగంధర్వయక్షరాక్షససురేంద్ర| వరులచేసాధ్యపడకనావలయునెడల| నభ్రపథమునకఱిగెడు
నట్టిమహిత | వాహనమునాకుదయచేయువరదయీశ ॥ వ॥ అనియభ్యర్థించినంబ్రసన్నుండైహరుండువానికోరిక-కను
రూపంబైనవిమానంబునిర్మింప మయునకనప్పగించిన నతండునునట్లచేసి కామగమనంబునునతివిస్తృతంబుగాలోహంబు
ననిర్మించిసౌభకంబనునామంబిడి సాల్వునకిచ్చినవాఁడును బహుమానందంబునుంబొంది తద్విమానారూఢుఁడై యాదవు
లవలనిపూర్వవైరంబుఁదలంచి దర్పాంధచేతస్కుండై ద్వారకానగరంబుపైఁజనినిజ సేనాసమేతంబుగాఁ దత్పురంబువే
ధించి॥ సీ॥ సరిదుపవనసరోవరములుమాయించిచావులుగలంచికూపములుచెరిచి| కోటలువెసవీటతాటముల్గావించిపరిఘలు
పూడ్చివప్రములుద్రొబ్బి| యట్టళ్లుధరఁగూల్చియంత్రముల్దునుమాడికాంచనధ్వజపతాకములనఱికి | భాసురగోపురప్రా
సాదహర్మ్యేంద్రశాలాంగణములుభస్మములుచేసి | విమలకాంచనరత్నాదివివిధవస్తు | కోటినెల్లనునందందఁగొల్లఁబు
చ్చి| ప్రజలఁజెఱఁబెట్టిదారలనుభంగపెట్టి| తలమియిబ్బంగిఁబెక్కుబాధలనలంచి॥ చ॥ మదముననంతఁబోవకవిమానయు
తంబుగనభ్రవీధికిన్ | గొదగొనిసేవుమైమొగసికొంకకశక్తిశిలామహీరుహ | ప్రదరములోలిమైగురిసిబంధురభూమిప
రాగశరర్కరల్ | వదలకచల్లుచున్వలయువాయువుచేదిశలావరించుచున్॥ అట్టిమెడ॥ క॥ చటులపురత్రయదనుజో | త్కట
దుస్తరబాధ్యమానధారుణిగతిన| స్ఫుటభేదనమంతయుతిస్ఫుటపీడంజెందివగలసుడివడుచుండన్॥ చ॥ కనిభగవంతుఁడుఁగర
థిశిఖామణియున్నగురాక్మిణేయుఁడ | జ్జనములనోడకుండుఁడనిసంగరకౌతుకమొప్పదివ్యసాధనములఁబూనిసైనికకదంబ
ముఁగొల్వనూనమీనకే | తనరుచిరాగాలనున్నతరథస్థితుఁడై వెడలెన్రణోర్వికిన్ | అయ్యవసరంబున ॥ చ ॥ సమధికబా
హుశౌర్యజితచండవిరోధులుపాఱనున్నత | కుమగదభానువిందశుకసాత్యకిసారణచారుదేష్ణసాం | బమకరకేతనాత్మజ
శ్వఫల్కతనూభవతత్సహోదర | ప్రముఖయమాత్తముల్వ్యమతభంజనులైకృతవర్మమున్నుగన్ ॥ క ॥ వారణవాజిస్యం
దన| వీరభటుల్వేగఁజనిరిదిశ్వముపడఁగన్| ఘోరాకృతివివిధాయుధ| భూరిద్యుతులరబింబమునుసగబళింపన్॥ వ॥ చనియా
గోవిందనందనస్యందనంబునుంబలసందోహంబునుం దలకడచియదుసైన్యంబులు సాల్వబలంబులతోడందారొంటనిబెర
యునప్పుడు దేవదానవసంకులసమర విధంబునందుములంబయ్యెనివ్విధంబున ॥ మ ॥ వితతజ్యాచయటంకృతుల్మదజలావి
ర్భూతశుండాలఘీం | కృతుల్యద్భటహుంకృతుల్మహితభేరీభాంకృతుల్భీషణో | ద్ధతసిస్వాణధణంకృతుల్ప్రకటయోధ
వ్రాతసాహంకృతుల్| కుతలంబుల్దివినిండమోసెరిపుసంక్షోభంబుగాభూవరా ॥ మ ॥ హరిరింఖారథనేమిసద్భటపద
వ్యాఘట్టనోద్ధూతధు | స్తరధూళీపటలప్రభూతనిబిడధ్వాంతప్రవిధ్వంసకృ | తకరశాతాసిగదాదిహేతిరుచులాకాశం
బునిండన్వియ| చ్చరదృక్కుల్మిఱుమిట్లుగొల్పసమరోత్సాహంబుసంధిల్లఁగన్॥ చ॥ తలకొనిసైనికుల్గడచితారొటనిపేర్గొని
డాసిపాసియం | కిలిగొనకిమ్ములమ్ములఁబగిల్చినొగిల్చితరేతరుత్తల | ల్నలియఁగనొత్తిమొత్తివయనంబులనంబులరాలలీ
లనా| దలలులలాటముల్మునగదాహతినొంచికలంచిపాఱఁగన్ ॥ అయ్యవసరంబునఁబ్రద్యుమ్నుండుగనుంగొని॥ మ॥ అన
యంబున్గలుషించిసౌభపతిమాయాకోట్లుచంచచ్ఛరా | సనసిర్ముక్తసితాతదివ్యమహితాస్త్రశ్రేణిచేఁదక్షణం | బునలీ
లాగతినభ్రగుల్మనములన్వ్యాపింపమాయించెన | వ్వనజాతాప్తుఁడుభూరిసంతమసమున్వారించుచందంబునన్ ॥ మఱి
యును॥ చ॥ అతిరథికోత్తముండననుదంచితకాంచనపుంఖపంచవిం | శతివిశిఖంబులన్నతనిసైనికపాలునినొంచియుగ్రుఁడై

శతశతకోటికోటినిభసాయకముల్వరగించి సాల్వభూ। పతికకుదంబునొంచి లయభైరవవృత్తి వడిఁబేర్చి వెండియున్॥ చ॥ పదియమ్ముల న్మనుజపాలవరేణ్యులనొంచి రోషసు। న్గదురగముఁడు మూఁడుశితకాండములన్ రథదంతివాజుల। న్గదియఁగ నేసి యొక్కొకనిశాతశరంబుల సైనికావళి। న్మదములడంచి యిట్లతఁడమానుషలీలఁ బరాక్రమించినన్॥ క॥ దుర్మానవహరుసద్భుత। కర్మమునకు నుభయసైనికప్రకరంబు। ల్నిర్మలమతి నుతియించిరి। భర్మాచలధైర్యు విగతభయుఁ బ్రద్యుమ్నున్॥ అయ్యవసరంబున॥ ఉ॥ సాంబుని సాల్వభూవిభుఁడు సాయకజాలము లేసి నొంచిన। జ్జాంబవతీతనూభవుఁడు చాపము సజ్యము చేసి డాసి సా। ల్వుంబటియేను తూపుల నవోన్నతవక్షము గాడ నేసి తీ। క్ష్ణాంబక వింశతి న్నతని సౌభకమల్లలనాడ నేసినన్॥ చ॥ గదుఁడు మహోగ్రవృత్తి నిజకార్ముకనిర్గతవిస్ఫురద్వధుం। తుదవదనాభభాణవితతుల్వరగించి విరోధిమస్తము। ల్గ్రుదుబగ్రుచ్చి మెత్తుదునకుంఠితవిక్రమకేళిలోలుఁడై। చదలసురల్నుతింప రథిసత్తముఁడొప్పె నరేంద్రచంద్రమా॥ ఉ॥ సాత్యకి చండరోషమున సాల్వసుసీమవరుభూరిసౌభసాం। గత్యచతుర్విధోగ్రబలగాఢతమఃపటలంబు భాసురా। దిత్యమయూఖపుంజరుచితీవ్రశరంబుల మాపి సైనిక। స్తుత్యపరాక్రమప్రకటదోర్బలుఁడై విలసిల్లె భూవరా॥ ఉత్సాహ॥ ఛానువిందుఁ డుద్ధతిన్ విపక్షపక్షసైన్యదు। ర్మానకాననానలోపమానచండకాండసం। తానమూననేసి చూర్ణితంబు చేసెఁ జాపవి। ద్యాపరూఢి దేవతావితానమిచ్చ మెచ్చఁగాన్॥ ఉత్సాహ॥ చారుదేష్ణుఁ డాగ్రహించి శత్రుభీషణోగ్రదో। స్సారదర్పమేర్పడ న్నిశాతబాణకోటిచే। దారుణప్రతాపసాల్వదండనాథుమండలి। న్మారిరేఁగినట్లు బిలుకుమార్చి పేర్చి యార్చినన్॥ క॥ శుకుఁడా యోధనవిజయో। త్సుకమతి బాహాబలంబు సొప్పడ విశిఖ। ప్రకరంబులఁ దనుశౌర్యా। ధికుఁడన విద్వేషబలతతిం బరిమార్చెన్॥ ఉ॥ సారణుఁడేపుమైఁ గదిసి శాత్రవవీరుల సందడింపఁ దో। స్సారమెలర్పఁ గుంతశరశక్తిగదాక్షురికాదిహేతుల। న్వారకవాజిదంతిరథవర్గములందును మూడి కాల్వుర। స్వైరము తోడఁబంపె జమువీటికిఁ గాపురముగ్రమూర్తియై॥ క॥ అక్రూరుఁడుదదనుజులున। వక్రపరాక్రమము మెఱసి వైరుల బాహా। విక్రమమునవధిమించిరి। చక్రప్రాసాదివివిధసాధనముల చేన్॥ మ॥ కృతవర్మ క్షితినాయకుండు విశిఖశ్రేణిం బ్రమత్తార్యధి। శ్రితవర్మంబులఁ జించి మేనుల శతచ్ఛిద్రంబుల న్జేయన। ద్భుతకర్మంబని సైనికుల్వొగడ శత్రుల్బాఱుచో సంగర। క్షితిధర్మంబుఁ దలంచి కాచె రథికశ్రేష్ఠుండు భూమీశ్వరా॥ వ॥ అత్తఱి సాల్వుండు గోపోద్దీపితమానసుండై యుండ మాయావిడంబకంబైన సౌభకంబప్పుడు॥ సీ॥ ఒకమాటు నభమునఁ బ్రకటంబు గాఁదోఁచు నొకమాటు ధరణిపై నొనరనిల్చు। నొకమాటు శైలమస్తకమున వర్తించు నొకమాటు చరియించునుదధినడుమ। నొక్కఁడై తోఁచు నొక్కటియై యుండు నొక్కఁడ గనుఁగొనఁ బెక్కులగును। నొకమాటు సాల్వసంయుక్తమై పోడసూపు నొకతోయమున్నియనుడిగితోఁచు। నొక్కట తేపకొలఁదియుడుగకఁ ద్రిప్పిన। గతిమహోగ్రవృత్తి గానవచ్చు। మఱియుఁ బెక్కుగతుల నరివరుల్గలఁగంగఁ। దిరిగె సౌభకంబు ధీవరేణ్య॥ వ॥ ఇవ్విధంబున సౌభకంబు వర్తించుటం జేసి యదుసైన్యంబుల చే దైన్యంబు నొందిన నిజసైన్యంబుల మఱలం బురికొల్పి సాల్వుండప్పుడు॥ క॥ స్ఫురదనలాభశరంబులఁ బారిపారి పుంఖానుపుంఖములుగా నేయు। న్వైరులియమఱలియు మురిసియు। విరిసియుఁ బిలుతివకపోరవెసయదుబలముల్॥ క॥ అమ్మోడమానము వదలక। డయ్యక మగపాటితో దృఢంబుగఁ బోర। న్దమ్ము మెఱుంగును రొకటఁటి। కయ్యంబుపుడమ్యేఁ బేరుగలయోధలకున్॥ క॥ మును ప్రద్యుమ్నకుమారుని। ఘననిశితాస్త్రముల చేతఁ గడు నొచ్చిన సా। ల్వుని మంత్రి ద్యుమనాముఁడు। సునిశితగదచేన పర్చి సుమహితశక్తిన్॥ చ॥ వెరవును లావు చేవయును వీరముఁ బీరముఁ గల్గి డాసి యా। సరసిజనాభనందను విశాలభుజాంతరమున్ పగిల్చిన। న్వీరవిరఁబోవ మేనునిడు వెండ్రుకఁ బెట్టఁగఁ జేతిసాధనో। త్కరములు జారిపైవదల్గఁగన్నులు మూయుచు మూర్ఛనొందినన్॥ గీ॥ సమరధర్మవేది సమధికనయవాది। దారకునిసుతుండు ధైర్యయుతుఁడు। రథముదోలికొను దురణభూమి వెడలివే। చని మెయిమూర్ఛదేరి శంబరారి॥ ఉ॥ సారథిఁ బూచి యిట్లని రిపుశాత్రవవీరులు సూచినవ్వఁగాఁ। దేరు రణక్షితి న్వెడలఁ దెచ్చితిఁ దెచ్చితి దుర్యశంబు పం। కేరుహనాభుఁడున్ హలియుఁ గేలిగొనన్ యదువంశసంభవుల్। భీరము దప్పి యుప్పగిదిఁ బెల్కురిపోవుదు రే రణంబునన్॥ అనిన నతండతనికిట్లనియె॥ క॥ రథిరిపుచే నొచ్చిన సా। రథియును సారథియునొవ్వ రథియును గావ। న్బ్రథుసమరధర్మమిఁకన। వ్యథచిత్తుఁడవగుచుఁ గడఁగు వైరుల గెలువన్॥ అనిన విని॥ ఉ॥ సంచిత భూరిబాహుబలశౌర్యుఁడు సారథిమాటకాత్మమో। దించియుదాత్తకాండరుచిదీపితచాపముఁ దాల్చి మౌర్విసా। రించి గుణధ్వనిన్మహాదరిప్రకరంబుల భీతి ముంచితో। లించె రథంబు మేదిని చలింపఁగ నాద్యుమఁ మీఁద నేర్పునన్॥ అట్లు డగ్గరి॥ చ॥ అరితనువట్టబాణముల నాగ్రహవృత్తిఁ బగిల్చె నాల్గిటన్। దురగములన్వధించి యొకతూపున సారథిఁ ద్రుంచి రెంటని। ష్ఠురతరకేతుచాపములు చూర్ణముఁ జేసి యొకమ్మునన్భయం। కరముగఁ ద్రుంచె నద్ద్యుమునికంఠముకుంఠితవిక్రమోద్ధతిన్॥ మ॥ కని సాంబప్రముఖాదియోధవరులుల్లకాత్మలై మీనకే। తను నగ్గించి సువర్ణపుంఖనిశితాస్త్రశ్రేణి సంధించి సా। ల్వునిసై

న్యావలిమస్తము ల్వేరపు తావుల్ నేర్పడనొక్కొక్కయె। త్తున వేత్రముంచిరి తాటపండ్లు ధరఁ దోడ్తో రాల్చు చందంబునన్॥ అట్టి
యెడ॥ స్రగ్ధర॥ కూలన్ గుఱ్ఱంబు లేనుంగులు ధరఁ దోరఁగన్ గుప్పలై నుగ్గునూచై। వ్రాలన్ స్యందముల్ హతంబై వడిఁబడు సుభట
వ్రాతము ల్శోణితంబుల్ గ్రోలున్ మాంసంబునం జుఱ్ఱఁ గోరుకు నెముకల గుంపులై సోలుచున్ స్ఫో। తాళ క్రవ్యాదభూతోత్కర
ముబుజతలై తాళముల్దట్టి యాడన్॥ మఱియు నొక్కొక్కయెడ॥ సీ॥ ఖండితశుండాలగండముల్ నక్రముల్ బ్భారితుండంబు
లభుజగసమితి। పదతలంబులు గచ్ఛపంబులు దంతముల్ శుక్తులు కుంభనిర్ముక్తమౌక్తికములు రత్నములు వాలములు జలౌక
ముల్నెడలు భేకంబులు మెదడు శైవాలంపు। ప్రేవులు పవడంపుఁదీవలు నరములు నాచు మజ్జంబు ఫేనంబులస్థి। సైకతములు రక్తచయ
ము తోయంబులు। వారలు నెడలు నారలు మొఱలు ఘనత। రంగరవము గా పతంగజాయోధనస్థలము జలధిఁ బోల్పఁదగెనరేం
ద్ర॥ వ॥ ఇవ్విధంబున యదుసాల్వబలంబులు చలంబున నంబరస్పరజయకాంక్షలం దలపడి పోరు పూర్వపశ్చిమసముద్రంబుల
సరణి నిరువదియేడు దినంబు లతిఘోరంబుగాఁ బోరునెడ నింద్రప్రస్థపురంబుననుండి ద్వారకానగరంబునకు నగధరుండు
చను దేర ముందరం గానవచ్చు దుర్నిమిత్తంబులం గైకొని కృష్ణుండు దారకునిం జూచి యిట్లనియె॥ శా॥ కంటే దారక దుర్నిమి
త్తముల నేకంబుల్ మహోగ్రములున్ । మింట న్మేఘవినిర్దోఁచుచున్న యవి సెమ్మి న్నాండవప్రస్థమేనుంటన్ జైద్యహిత క్షితీశ్వరులు
మాయోపాయులై మత్పురిన్। గెంటింపన్ జను దేరఁబోలు దురుపోనీ తేరు వేగంబునన్॥ వ॥ అనియతిత్వరితగతిం జను దెంచి త
త్పురంబు డగ్గరి మహాబలపరాక్రమంబులం బ్రతిపక్షబలంబులతోఁ దలపడి పోరు యదుబలంబులును, నభోవీథి నభేద్యమా
యావిడంబకంబునఁ బ్రతివీరులెంత కాలంబుననుం గేయుపాయంబున సాధింపరాని సౌభకవిమానంబునం దున్న సాల్వునిం గ
నిత ద్విమానంబు డాయం దన తేరు దోల సారథిం నియమించి కపియుం జనుము రాంతకుని వీక్షించి యదుబలప్రకరంబులు పర
మానందంబునుం బొందిరి. మృతప్రాయంబై యున్న సైన్యంబు గనుంగొని సౌభకపతి విక్రమక్రియాకలాపుండగుచు ను
రువడించి॥ చ॥ మిఱుఁగురులెల్లెడం జెదర మింటను మంటలు వఁబ్బఘంటికా। ఘణఘణభూరినిస్వననికాయమునన్ హరిదంత
రాళముల్ వ్రాణఁగ మహోగ్రశక్తిఁ గొని వారకఁ దారకు మీఁద వైవఁ దా। రుణగతి నింగి నుండి నిజగోచులతోఁ బడుచుక్కకైవ
డిన్॥ క॥ వడిఁ జను దేరఁగఁ గనియం। బ్బుజగధరుండతుల లీలవోలె న్నారా। న్నొప్పడి పడి మైధరఁ ద్రోరుగఁగ। నడుమన వెసఁ ద్రుంచె
నొక్కనారాచమునన్॥ చ॥ గురుభుజుఁడంతఁ బోవక యకుంఠితశూరత శత్రుసైన్యము। ల్దైరలఁగ నుగ్రతన్ గొ అసిఁ ద్రిప్పిన
కైవడి మింటఁ దిర్దిరం। దిరుగుచు దుర్నిరీక్ష్యమగు దీపితసౌభకు సాల్వుఁ జండభా। స్కరకిరణాభషోడశనిశాతశరంబులఁ గా
డ నేసినన్॥ చ॥ కడువడి నల్లివాఁడు నిజకార్ముకమున్ జలదస్వనంబుకై। వడి మొఱయించుచు న్వాడఁ దవాతశరంబులఁ బద్మ
లోచను। న్నెడమభుజంబు గాడవడ నేసెనఁ దెంపరి చేతిశార్ఙ్గమున్। స్వడ చెరథంబుపై గగనవీథి సురల్ భయమంది చూడఁగన్॥
క॥ ఓహో యని భూతావలు। లాహాకారములు సేయ నంతటఁ దేర। న్నాహరిఁ గనుఁగొని యతఁడు। త్సాహంబునఁ బలికె
బాహుశౌర్యస్ఫూర్తిన్॥ చ॥ నలిదళితాక్షమత్సఖుఁడు నాఁదగు చైద్యుఁడు గోరినట్టికో। పలిన వినీతవైతగవు మాలి వరించి
తివంతఁ బోకదో। ర్బలమున ధర్మనందనుసభాస్థలి నేమఱియున్నవాని న। చ్చలమునఁ జంపినట్టి కలుషంబులు నేఁడు రణాంగ
ణంబునన్॥ క॥ తలచెడి పాఱక బాహా। బలమొప్పఁగ నాదు దృష్టిపథమున ధృతితో। నిలిచిన నిశ్శిత విశిఖా। ర్బలమునఁ జిమదీయ
సఖుని సూడి టు దీర్తున్॥ చ॥ అనిన మురాంతకుండు దరహాసము మోమునఁ దొంగలింపసా। ల్వునిఁ గని యోరి లాపములు గువ్వ న్న
లపోటరి వోలెఁ బ్రేలెదే। మనినను పాటు సన్నిహితమౌట యెఱుంగవు మూఢచిత్తపా। ప్మ నిగడఁ గేలఁ ద్రిప్పి యభియాతుని శ
త్రుని వ్రేసె సుద్ధతిన్॥ అట్లు వ్రేసిన॥ క॥ ఆ నుమూర్ఛఁ గొంది వెసము। కున్న వాతను నెత్తురోలుకఁ గొంతవడకనో। య్యనఁ దెలి
సి నిలువరింపక। చని వాఁడు నదృశ్యమయ్యె సౌభము దాసున్॥ అయ్యవసరంబున॥ గీ॥ గగనమందుండి యొకఁడు దూతుఁడగుచు
వచ్చి। నందనందను పాదారవిందములకు। వందనము చేసి యానకదుందుభి నిమ। హోగ్రుఁ డైపట్టి తెచ్చె సాల్వుండు గడఁ
గ॥ గీ॥ దేవకీ కెఱిఁగింపఁగా దివిరి యిటకు। దేవకీ దేవినన్నుఁ బుత్తెంచె ననఁగ। విని సరోరుహనాభుండు ఘనవిషాద। మగ్నుఁ
డయ్యెను గురుమీఁది మమతఁ జేసి॥ క॥ నరగంధర్వసురాసుర। వరులకు నిర్జింపరాని వాఁడు బలుండే। మఱకసహీనబలుని చేఁ బ
రికింపఁగ నెట్లు పట్టువడెనొకొ యనుచున్॥ మఱియును॥ క॥ భావంబుగలఁగన హాహా। దైవకృతం బెవ్వరికిని దప్పింపఁగ రా।
దే విధినైననునని శో। కావిలమతిఁ బలుకుచున్న సత్తఱివాఁడున్॥ వ॥ అప్పుడు దనమాయాబలంబునం గ్రమ్మఱం దోఁచి కృత్రిక
వసుదేవునిం గల్పించి యతని బంధించి కొని తెచ్చి పుండరీకాక్షు నిరీక్షింపు భవజ్జనకుండు వీఁడె యిప్పుడు నీవు గనుంగొనవీని
తలఁ ద్రుంతు నింక నెవ్వనికిం గాని మని యెదు కావంగల శక్తిగలదే నియ్యుం గావుమని దురాలాపంబులాడుచు మృత్యుజి
హ్వాకరాళంబైన కరవాలంబు గేలం బూని ఝుళిపించుచు నమ్మాయావసుదేవుని శిరంబు దునిమి తన్మస్తకంబుఁ గొని వియ
ద్వర్తియై చరియించు సౌభకవిమానంబు సొచ్చె నంత గోవిందుండు గొంతతడవు మనంబున ఘనంబగు శోకంబునం గుందు

చుండయ్యాన్సైనికులు దెలుపం దెలిసాంవియదిమాయోద్దీపితంబైన సాల్వుని యుపాయంబని యెఱింగియుండె నంతం దన
కువసుదేవుండు పట్టువడెనని చెప్పిన యూతయు నమ్మాయాకళేబరంబు నక్షణంబున విచిత్రంబుగా మాయంబై పోవఁ దద
నంతరంబ ॥క॥ మునులపుడు గొందఱచటికిఁ జనుదెంచి విమోహమైన జలజాతాక్షు|న్గనుఁగొని సమధికభక్తి|స్వినయంబు
నఁబలికి రంత విష్ణున్ జిష్ణున్ ॥సీ॥ కమలాక్ష సర్వలోకములందు సర్వమానవులు సంసారనానాపిశాచైక|దుఃఖాబ్ధిమగ్నులై తమ
దిఁ జేర నేరక వికలత్వమునఁ బొందు వేళ నిన్ను|దలఁచి దుఃఖంబు లుదరియింతు రట్టి సద్గుణనిధివై దేవకోటికెల్లఁ|బట్టుకొమ్మై
పరబ్రహ్మాఖ్యఁబొగడొందిపరమయోగీశ్వరప్రకరగూఢ ॥ పరచిదానందదివ్యరూపమున వెలుఁగు|దనఘునీవేడ నీచజనా
త్మజనిత|ఘనభయస్నేహ మోహశోకంబు లేడ|ననుచు సంస్తుతి చేసి వారరిగి రంత॥ చ॥ హరితనమీద ఘోరనిశితాశుగజాల
ములేయు సాల్వభూ|వరు వధియింపఁ గోరి బహువారిదనిర్గతభూరివృష్టి వి|స్ఫురణననూనతీవ్రశరపుంజములన్ గనఁ బుఁగ
ప్పిక్రొ|చ్చరరిపుమౌళిరత్నమును జాపము వర్మముఁ ద్రుంచి వెండియున్ ॥మ॥ వితతక్రోధముతోడఁ గృష్ణుఁడు జగద్విఖ్యాతశౌ
ర్యక్రియో| ద్ధతశక్తిన్వడిఁద్రిప్పి మింట మెఱుఁగుల్దట్టంబుగాఁ బర్వను| గ్రతచంచద్గదవైచి త్రుంచె వెసఁ బూర్ణంబై ధరన్
రాలనా|యతభూరిత్రిపురాభమున్మహితమాయాశోభమున్ సౌభమున్ ॥వ॥ ఇట్లు కృష్ణుండమ్మాయావిమానంబగు మ
యనిర్మితమాయావిమానంబు నిజగదాహతి నింతింతతునియలై సముద్రమధ్యంబునందొరుంగఁ జేసిన సాల్వుండు కోఁఱలు వె
ఱికిన భుజగంబు భంగి గండడంగి విన్ననై విగతమాయాబలుండయ్యును బాలివోవని బీరంబున వసుధాతలంబునకుడిగ్గి యా
గ్రహంబున ॥క॥ కరమునఁ బవినిభమగు భీ|కరగద ధరియించి కదియఁగాఁ జనుదేర|న్మురహరుఁడు దతిసాల్వుని|కరము గదా
యుక్తముగ నుఖండించెన్నృపా ॥క॥ అస్తంబోవనికినుకన|నంతుఁడు విలయార్కమండలాయతరుచిదు|ర్దాంతంబగు చక్రంబు
ని|శ్శాంతంబుగఁ బూన్చి సాల్వధరణిపుమీఁదన్ ॥ క॥ గురుశక్తిం వైచి వెసభా|సురకుండలమకుటరత్నశోభితమగు త|చ్ఛిరము

*శ్రీకృష్ణుండు దంతవక్త్రుని సంహరించుట.*

వడిఁద్రుంచె నింద్రుఁడుఁ|వరకులిశముచేత వృత్రువధియించు క్రియన్ ॥వ॥ ఇట్లు మాయావి యైన సాల్వుండును సౌభకంబును
కృష్ణుచేతం బొలియుటఁ గనుంగొని నిజసఖులగు సాల్వ పౌండ్రకశిశుపాలభూపాలకులకుఁ బరలోకమైత్రి వాటించి దం
తవక్త్రుండతిభీషణాకారంబుతో నప్పుడు ॥చ॥ పెటపెటఁ బండ్లు గీటుచును జెట్టుగ ద్రెమ్మాయుచుఁ గన్నుఁ గ్రేవలన్ | జిటచిట
విస్ఫులింగములు చిందమహోద్ధతి పాదఘట్టన | న్నటనిటనైధరిత్రి వడకాడ వడిన్గద కేలఁద్రిప్పుచు|న్నిటమిట మండు వేసవిని
మింటి దివాకరుఁ బోలి యుగ్రతన్ ॥ చ॥ వడిఁజనుదేరఁ జూచి యదువల్లభుఁడుల్లము పల్లవింపన|ప్పుడు గదకేలఁ బూని రథ
మున్నెయమొప్పఁ గడిగ్గి యుగ్రతన్|గడఁగి విరోధికిన్నెదురుగాఁ జనవాఁడతినీచవర్తియై | యడరుచు నట్టహాసముఖుఁడై ప
లచెఁ గదఁద్రిప్పుచున్ హరిన్ ॥ వ॥ కనుంగొని పరిహాసోక్తులుగా నిట్లనియె నీవు మదీయభాగ్యంబు కతంబున నేఁడు నా
దృష్టిపథంబునకు గోచరుండవైతివి మిత్రద్రోహివైన నిన్ను మాతులేయుండవని మన్నింపక దేహంబున విడువర్తించు ను
గ్రవ్యాధిని యౌషధాదిక్రియలనివర్తింపం జేయు చికిత్సకుని చందంబున బంధురూపశత్రువుండవుగావునన్ దంభోళిసంరం
భగంభీరంబైన మదీయగదాదండహతిం బరేతనివాసంబునకనిచి మున్ను నీచేత నిహతులైన నా దుస్సఖులఋణంబుఁ దీర్తు
నని దుర్భాషలాడుచు డగ్గరి ॥చ॥ పెనుగదఁ బూన్చి కృష్ణు తలఁ బెట్టుగ మొత్తిన నంకుశాహతి|న్ననలెడి గంధసింధురముకైవడి
దానవభంజనుండు పెం|పున నిజభాసమానగదఁ బూని బలంబునఁ ద్రిప్పి దంతవ|క్త్రుని యురముం బగిల్చిన గుదుల్కొనుచు
న్రుధిరంబుఁ గ్రక్కుచున్ ॥వ॥ తత్క్షణంబ పర్వతాకారంబగు దేహంబుతో నేలఁ గూలి కేశపాశంబులు చిక్కులు
వడం దన్నుకొనుచుఁ బ్రాణంబులు విడిచె నప్పుడు నిఖిలభూతంబులు నాశ్చర్యంబు నొందం దద్గాత్రంబునుండి యొక్క యతి
సూక్ష్మతేజంబు వెలువడి గోవిందుని దేహంబుఁ బ్రవేశించె నయ్యవసరంబున నగ్రజుమరణంబు గనుంగొని కుపితుండై కనుం
గవలనిప్పులుప్పతిల్ల విదూరుండు గాలానల జ్వాలాభీలకరాళంబై వాలుకరవాలంబునుం బలుకయుం గేలం దాల్చి దామో
దరుదెసకుం గవయుటయుం గనుంగొని ॥చ॥ జలరుహలోచనుండు నిజసాధనమైతనరారు చక్రము|జ్జ్వలముగఁ బూన్చి వైచి వన
జోదరకవాటశిరంబుఁ ద్రుంచెన | బ్బలియుఁడు సౌభసాల్వశిశుపాలసహోదరతత్సహోదరా | వలులవధించి యత్యు
ముదారిని నేకులఁద్రుంచె నీగతిన్ ॥ అయ్యవసరంబున ॥క॥ నరముని యోగిసురాసుర|గరుడోరగసిద్ధసాధ్య గంధర్వసభా|స్వర
కిన్నరకింపురుషులు|హరిమహిమ నుతించి రద్భుతానందములన్ ॥ వ॥ మఱియు నప్సరోజనంబులు నృత్యంబులు సలుప వేల్పు
లు గుసుమవర్షంబులు గురియ దేవతూర్యంబులవార్యంబులై మ్రోయ యదువృష్ణిప్రవరులు సేవింపఁ బరమానందంబునుం
బొందిన నిజవిజయాంకితంబులైన గీతంబులు వందిజనంబులు సంకీర్తనంబులు సేయ నతిమనోహరవిభవాభిరామంబగు నగ

*బలరాముండు సూతుని వధించుట.*

నాలంకారయుక్తంబునైన ద్వారకానగరంబు శుభముహూర్తంబునం బ్రవేశింపం జనునెడ ॥ క ॥ పురసతులు విరులు లాజ లు। గురుసౌధాగ్రములనుండి గురియంగ వికచాం । బురుహాక్షుండంతఃపుర। వరమర్థిం జొచ్చె వైభవంబలరారన్ ॥ వ ॥ అట్లు యోగీశ్వరేశ్వరుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును, నఖిలజగదీశ్వరుండును నైన పురుషోత్తముండు సుఖంబున నుండె నంత ॥

—* బలరాముండు తీర్థయాత్రకుం జనుట. *—

క॥ కౌరవపాండవపృథుసమ। రారంభ మెఱింగి తీర్థయాత్ర నెపముగా। సీరాంకుండుభయకులులకు నారయ సముండగుటం జేసియరిగె నరేంద్రా ॥ వ॥ అట్లు చని మొదలం బ్రభాసతీర్థంబున నవగాహనంబు చేసి, యందు దేవర్షిపితృతర్పణంబులు సంప్రీతిం గావించి విమలతేజోధనులగు భూసురప్రవరులు దనతో నరుగుదేరం గదలి చ క్రమంబున సరస్వతియు, బిందుసరోవరంబును, వజ్రతీర్థంబును, విశాలానదియు, సరయువు, యమునయు, జాహ్నవియు నుం గనుంగొనుచు, నచటనచట నవగాహనంబులును, దేవర్షిపితృతర్పణంబులును, బ్రాహ్మణసంతర్పణంబులును, భూసురయుక్తుండై నడుపుచుం జని సకలలోకస్తుత్యంబును, నిఖిలమునిశరణ్యంబునగు నైమిశారణ్యంబు సొచ్చి యందు దీర్ఘసత్రంబున నడుపుచున్న మునిజనంబులం గనుంగొనిన, వారలు ప్రత్యుత్థానంబు చేసి రామునకు వినతులై యాసనార్ఘ్యాది పూజావిధానంబులు గావించిన నతండు నప్రముదితమానసుండగుచు సపరివారంబుగాం గూర్చున్నయెడ ॥ క॥ ఆనెడం దనుగని ప్రత్యుత్థాననమస్కారవిధులు దగనడుపక పెంపూనిన పీఠముపైనా। సీనుండగు సూతుం శేముషీవిఖ్యాతున్ ॥ వ॥ అట్లున్నయతని సమీపంబుననున్న విప్రవరులం జూచి రాముండు రోషించి, వీడు నన్నుం గని లేవకుండుటకు హేతువెయ్యది యొకో, యీ ప్రతిలోమజాతుండు మునిగణసభాస్థలంబునం దానొక్క ముఖ్యుండు వోలె దురభిమానంబున శక్తిమనుమః వలనం గొన్ని కథలు గాథలుగాంగఱచి విద్వద్గణ్యుని విధంబున నెట్టినీ గడుట్టనీచాత్ముం డభ్యసించు విద్యలెల్ల నుమనంబున విచారించి చూచిన మదకారణంబులుగాః సత్త్వగుణగరిష్ఠంబులుగావు ధర్మసంరక్షణంబు సేయనవతరించిన మాకుః ట్టిదుష్టమర్దనం బవశ్యకర్తవ్యంబః తలంచి హస్తంబున ధరించిన కుశాగ్రంబున నా సూతుః వధించిన నక్కడి మునీంద్రులెల్ల హాహాకారంబులతోడం దాలాంకుం జూచి యిట్లనిరి ॥

క ॥ అనఘా యితనికి బ్రహ్మా। సనమిచ్చుటం జేసి నీవు చనుదేఃతండా । సననుడిగండవ్యాయునింతయు। మనునీమది నెఱుంగనర్థముం గలదె హలీ ॥ క॥ ఎఱింగెఱింగి బ్రహ్మహత్యా। దురితంబు ననీ మనంబు మాంకొనెం బాపో। త్తరణ ప్రాయశ్చిత్తము। నీవారం కొని కావింపుమయ్య దుర్జనహరణా ॥ వ॥ అదియునుం గాక పరమపావనుండవై ననీవు ధర్మంబు దప్పిన నెవ్వరు మాన్పంగలరు కావున ప్రాయశ్చిత్తంబు గైకొననడుపకున్న ధర్మంబు నిలువదట్లు గావున దీనికిం బ్రతీకారంబు పుట్టింపుమనిన నతండు వారలం గనుంగొని తామసంబున నిట్టి పాపంబు సేయంబడియె- దీనికి ముఖ్యపక్షంబైన ప్రకృతియె ఱింగింపుండు వీనికి నాయువును బహుసత్త్వంబును నొసంగిన మీకిష్టంబగు నేనసైన నా యోగమహిమచే బునర్జీవితుం గావింతునన నమ్మునులు నీయోగమాహాత్మ్యంబున మాకెవ్విధంబున నైననితండు మృత్యుగతుండు గాకుండునట్లు గావింపుమనన నతండందఱం జూచి యప్పుడు ॥ క॥ ధాత్రీవరసమధికచా। రిత్రుండు హలపాణి వలికె ధృతి నాత్మావై। పుత్రనామాసి యనెడి ప। విత్ర శ్రుతివాక్యసరణి విశదంబగుటన్ ॥ క॥ ఈసూతసుతునకిపుడు మ। హాసత్త్వము నాయువు నున నామయమును వి। ద్యాసామర్థ్యము గలిగిసు। ధీసత్తములారయిః క్షితిన్విలసిల్లున్ ॥ వ॥ అని సూతుం బునర్జీవితుం గాంజేసి మునులం జూచి యిట్లనియె ॥ గీ॥ ఏనెఱుంగక చేసిన యీయవజ్ఞ। శాంతివొందంగ నేయభీష్టంబు మీకు। దానిగావింతుననిన మోదంబు నొంది। పలికిర త్తాపసులు హలపాణిం జూచి ॥

చ ॥ హలధర యిల్వలుం డనుసురారి తనూజుడు పల్వలుండనా। గలడొక దానవుండు బలగర్వములం బ్రతిపర్వమందు సం। జలమున వచ్చి మా సవనశాలల మూత్రసురాస్రపూయవి। ట్పలలములోలి మైగఱసి పాడఱ జేయును యజ్ఞవాటముల్ ॥ వ ॥ కావున నా దుష్టదానవుం ద్రుంచుట యమాకుం గరంబు సంతసంబగు నంత మీదనీవు విమలచిత్తుండవై భారతవర్షంబు సంగలతీర్థంబుల ద్వాదశమాసంబులవగాహనంబు సేయుమల్లైన సర్వపాపనిష్కృతియగునని పలుకునంతం బర్వసమాగమంబైన॥ సీ॥ మునులు యజ్ఞక్రియోన్ముఖులౌటగనుంగొని పరతెంచియసురతద్భవనములను । రక్తవిణ్మూత్రసురామాంసజాలంబునించి హేయంబుగావించి పెలుచ । బెంనూళ్ళి రాలును జల్లులునురలెడి చక్రానిలము వీచి చదలనపుడు । కాటుకకొండ సంగతి బోల్చు మేను తామ్రశ్మశ్రుకేశసమాజములును ॥ నవ్యచర్మాంబరము భూరినాసికయును। కఱకుమిడిగ్రుడ్లనిప్పులు గ్రక్కుదృష్టు । వ్రేలుపెదవులు దీర్ఘకరాళజిహ్వ। కయు ముడివడ్డబొమలును గలుగువాని ॥ మహోగ్రగ్ధర॥ కనియెన్ దా శ లాంకుడుద్యత్కటచటులనటత్కాలదండాభశూలున్ । జనరక్తాసిక్తతాలున్సమధికసమరోత్సాహలోలున్ గరోరా। నిశుల్యోవగ్రదంష్ట్రాజనితశిఖికణాచ్ఛాదితాశాంతరాళున్ । హసనవ్యాపారశీలున్ నతదృక్షఘనమస్తాస్థమాలుం గరాఘన్॥ ఉ ॥ వెండియు గొర్వెఱుంగు ఉనునీధి వెః..గగనుల్ల సద్గదా । దండను గేలఁద్రిప్పుచును దారతరా బలభద్రుఁడా

సురో । ద్దండవిఘాతకుఁ డ్ముసల దారుణలాంగలముల్ దలంపమా । ర్తాండనిభంబులై యెదుర డక్షణమాత్రసదోచినద్వ
సఁ॥వ॥ అట్లు సన్నిహితంబులైన తన కార్యసాధనంబులగు నిజసాధనంబులు ధరియించియప్పుడు॥చ॥ గగనమునం జరించుసు
రకంటకుఁ గంఠము చేతనాఁగటఁ। దగిలిచి రోకలెత్తి వెడిదంబడరన్ నడునెత్తిమొత్తినన్ । భుగభుగనెత్తురోల్కి నిలఁ గూలఁగ
లంబ డెవజ్రధారచే । దెగిధరఁగూలుభూరిజగతీధరముం బురణింపఁ బెట్టుగాఁ ॥అట్లు పల్వలుండు మడిసిన॥క॥ మునివరులు
గామపాలునివినుతించిరి వేయు వేలవిధముల వృత్రుఁ। దునిమినయింద్రునిన మరులు। వినుతెంచినరీతి నపుడు విమలచరిత్రా॥
గీ॥ అంతనభిషిక్తుఁ జేసియత్యంతసురభి । మంజులామ్లానకంజాత మాలికయును। నంచితాభరణమృదుదివ్యాంబరములు ।
నర్థినిచ్చిరి వాల్చియాహలధరుండు॥ క ॥ దేవేంద్రుఁబోలి యొప్పెను। ధీవిలసితుఁడగుచు మునితతన్ వీడ్కొనితాఁ। సేవించు
చుఁ గతిపయవి। ప్రావలిచను దేరగౌశికాఖ్యంబునకుఁ॥ వ ॥ చనియమ్మహానదిం గృతస్నానుండైయచ్చోటు బాసి సరయు
వునందు గ్రుంకులిడి ప్రయాగనవగాహనంబు చేసి దేవర్షి పితృతర్పణంబులాచరించి పులస్త్యాశ్రమంబు సొచ్చి గోమతిం గ
ర్శించి గండకీనదిను త్తరించి విదళితభవపాశయగు విపాశయందుఁ దోగి శోణనదంబున నాప్లావితుండై గయనాడి గంగా
సాగరంబు దర్శించి మహేంద్రనగరంబునకరిగి॥ క ॥ రాముఁడు గనుఁగొనె భార్గవ । రాముఁ రజనీశకులధరావరనగసుఁ।
త్రాముస్సన్నుతసుగుణ। స్తోముఁ న్నారుణ్యసీమ సుజనలలామ ॥గీ॥ కనినమస్కరించి కౌతుకంబలరార। నతని వీడుకొని సహ
లాయుధుండు। గోమరుమిగిలిస ప్తగోదావరికనేగి। యందుఁ దీర్థమాడియనటుఁ గదలి॥వ॥ వేణాపంపాసరసులం జూచి భీ
మనది కేఁగియందుఁ గుమారస్వామిని దర్శించి, శ్రీశైలంబునకుం జని వేంకటాచలంబు దర్శించి, కామకోటశ క్తి నిరీక్షించి,
కాంచీపురంబుఁ గాంచి, కావేరికిం జని యమ్మహావాహినిన వగాహనంబు చేసి॥స్రగ్ధర॥ సేవించె న్రంగధాముస్న్ శ్రితనివహ
పయస్సింధుసంపూర్ణ సోము । న్నావేరీమధ్యసీమున్ సకలుషమహాకాలకూటోగ్రభీము । న్దేవారిశ్రేవిరాముంవిజవినుత
సందీపితానంత నాముఁ। ధీవిజ్ఞానాభిరాముం ద్రిభువనవిలసద్దేవతాసార్వభౌముఁ॥వ॥ అచ్చోటు వాసి వృషభాద్రి నెక్కి
హరిక్షేత్రంబు ద్రొక్కి, మధురాపురంబున కఱిగి, సేతుబంధనంబు మెట్టియచ్చటం బది వేలపాడి మొదవుల భూసురులకిచ్చి
రామేశ్వరుం దర్శించి, తామ్రపర్ణ కిం జని మలయాచలం బెక్కి యగస్త్యునిం గని నమస్కరించి దక్షిణసముద్రంబు దర్శించి
కన్యాఖ్యదుర్గాదేవినిను పాసించి, పంచాప్సరసంబను తీర్థంబునను పస్లావ్యం బాచరించి, గోకర్ణంబునను నిందుమౌళిం దర్శించి
ద్వీపవతియైన కామదేవి నిరీక్షించి, దాటి పయోష్ణిని దర్శించి, నిర్వింధ్యగడచి దండకావనంబునకఱిగి, మాహిష్మతీపురంబు
నవసియించి, మనుతీర్థంబునం దాడి, క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి యచ్చటి బ్రాహ్మణజనంబులవలనం బాండవధా ర్త
రాష్ట్రభండనంబునందు సకలరాజలోకంబులుం బరలోకగతులగుటయు వాయునందనసుయోధనులు గదాయుద్ధసన్న
ద్ధులగుటయు నెంతిగి వారలవారించుతలంపున నచ్చటికిం జని॥గీ॥ ధర్మనందనుఁ దనకు వందనము సేయు। కృష్ణులను మాద్రిసు
తులనీక్షించి యేమి। వలుకకుగ్రగదాదండపాణులగుచు। గ్రోధమునం బోరుగు భీమదుర్యోధనులను॥చూచి వారల డాయం జని
యిట్లని యె॥సీ॥ వీరపుంగవులార వినుఁడుమీలో పలభూరిభుజాసత్త్వమున నొకండు । ప్రకటితాభ్యాససంపద్విశేషంబున నొ
కఁడు నధికుఁడై యుంట జేసి । సమబలులటుగాన జర్చింపగానిందు జయమొక్కనికి లేదు సమరమందుఁ। గాన నూఱక
పోరఁగా నేలమీక నివారింపనన్యోన్య వైరములను। నకరితొల్లింటి దుర్భాషలాత్మలందు। దలచితద్భాషణములు పద్యములు
గాక। మొక్కలంబున బోరనాముష్టికాసు। రారివీక్షించి వీరిశుభాశుభములు॥వ ॥ ఎట్లుగావలయునట్లయ్యెడుం గాక యని
యచ్చోట నిలువక నుగ్రసేనాదిబంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొనఁ ద్వారకాపురంబు సొచ్చి యందుండి మగుడి
నైమిశారణ్యంబునకుం జని యమ్మునిపుంగవులను మతింపనచ్చోట నొక్క మఖంబు గావించి బహుదక్షిణలొసంగి యంచిత
జ్ఞానపరిపూర్ణులగునట్లు గావరంబిచ్చి రేవతియును దానును బంధుజ్ఞాతియుతంగా నవభృథస్నానం బాచరించియనంతరం
బు॥చ॥ విలసితమాల్యచందనన వీనవిభూషణరత్నవస్త్రముల్ వ్రాలుపుగ దాల్చియుంచితవిభూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా॥
కలితసుధాంశులేఖ మెసకం బెసఁగన్ నిజబంధులోచనో। త్పలచయముల్లసిల్ల బరిపాగీడు రచారుయశోవిలాసుఁడై।వ॥ ఇ
వ్విధంబున ననంతుండు, నప్రమేయుండు, మాయామానుషవిగ్రహుండు, ననంతబలశాలియునైన బలదేవుండతి విభవంబు
ననిజపురంబు ప్రవేశించసుఖంబుననుండెనని చెప్పి వెండియు నిట్లనియె॥ క ॥ హలధరుఁడమర్త్యచరితుం। డలఘుభుజాబలుఁ

## —* కుచేలోపాఖ్యానము. *—

డానర్చునద్భుతకర్మంబులు పెక్కునాల్గుమొగములు । గలమేటియు లెక్కవెట్ట గలడెన రేంద్రా॥చ॥ అనిన మునీంద్రుఁ గ
న్గొని ధరాధిపుఁ డిట్లను బద్మపత్రలో । చనుని యనంతవీర్యగుణసంపద వేమరు విన్ననైనను। న్దనియదుచిత్తమచ్యుతకథావిభ
వంబాకమాటు వీనుల । న్వినిన మనోజపుష్పశరవిద్ధుడునైన విరాళినొందడే॥ అదియునుం గాక॥చ॥ హరిభజియించుపా

స్తములుహస్తములచ్యుతుఁ గోరి మ్రొక్కుచు । చ్ఛిరము శిరంబు చక్రధరుఁ జేరనచిత్తము చిత్తమిందిరా। వరుఁ గనుదృష్టిదృ
ష్టిమురవైరిను తించిన వాణివాణియ । తురకథలానుకర్ణములు గర్ణములై విలసిల్లు భోభుపిన్॥ హరిపాదతీర్థసేవా । ప
రుఁడై విలసిల్లునట్టి భాగవతుని విస్ఫురితాంగములంగములా। పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకుము సీంచాస్త్రి సీ॥ అనుడు వే
దవ్యాసతనయుఁడా యభిమన్యుతనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి। జనవర గోవిందసఖుఁడు గుచేలుండు నానొక్క విప్రుండు
మానధనుఁడు। విజ్ఞాన రాగాదివిరహిత స్వాంతుండు శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు। విజితేంద్రియుఁడు బ్రహ్మవేత్త
దారిద్ర్యంబు బాధింప నోరులఁ గార్పణ్యవృత్తి । నడుగంబోవక తనకు దానమ్మినట్టి కాసుపదివేలనిష్కమల్లాదలంచి । యా
త్మ మోదించి పుత్రదారాభిరక్ష। యొకవిధంబున నడుపుచునుండు నంత॥ సీ॥ లలిత పతివ్రతాతిలకంబు వంశాభిజాత్యదచ్ఛా భ
ర్యదుస్సహదరిద్ర పీడ చేఁగడునొచ్చి పెదవులు దడుపుచు శిశువులాకఁటి బిచ్చ చేఁగృశించి। మలమలమాడుచు మానసంబె
జియంగఁ బ్రైడో రెము మాడు జట్టుమనుచుఁ। బత్రభాజనధృతపాణులైననుజేరి వేఁడవీసుటుచురఁ జూడినట్లు। మైనసొక
నాఁడువగచి నిజాధినాథుఁ। జేరి యిట్లని పలికె నో జీవితేశ। తట్టుముట్టాడు సెట్టి పేదలికమిట్టు। నొంపదీసి కుపాయమూహిం
పవైతె॥ అని మఱియు నిట్లనియె॥ గీ॥ బాలసఖుఁడైన యప్పద్మపత్రనేత్రుఁ । గాననేఁగి దరిద్రాంధకారమగ్న । లైనమము సుద్ధ
రింపుము హరి కృపాక। టాక్షరవిదీప్తి వడసి మహాత్మ నీవు॥ మఱియును॥ చ॥ వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁడార్తశరణ్యుఁ
డిందిరావరుఁడు దయాపయోధి భగవంతుఁడు గృష్ణుఁడు వాఁగుశస్థలి । పురమున యాదవప్రకరముల్భజియింపఁగనున్న
వాఁడు యి। ట్లరిగిన నిన్నుఁ జూచి విభుఁడప్పుడయిచ్చును నూనసంపదల్॥ మ॥ కలలోనం దనుమున్నెఱుంగని మహాకష్టాత్ముఁ
డైనట్టిదు । ర్బలుఁడాపత్సమయంబునన్ని జపదాబ్జాతంబులుల్లంబులోఁ । దలపన్నంతన మెచ్చియార్తిహరుఁడైత నైజస
నిచ్చున్నుని। శ్చలభక్తిన్భజియించువారికిడఁ జేసంపద్విశేషోన్నతుల్॥ క॥ అనిపలికిన నమ్మానిని। సునయోక్తులనలరి భూమి
సురుఁడా కృష్ణు । న్ననసేగుటయిహపరసాధనమగునని మదిదలంచి తనసతితోడన్॥ గీ॥ నీవు సెప్పిన యట్ల రాజీవనేత్రు । పా
దపద్మంబులాశ్రయింపంగఁ జనుట। పరమశోభన మాచక్రపాణికిపుడు। గాను కేమైనఁ గొంపోవఁగలదె మనకు॥ గీ॥ అసనన
య్యింతియాగాక యనుచు విభుని। శిథిలవస్త్రంబు కొంగున బృథుకతండు। లములనొక కొన్ని ముడిచి నెయ్యమున నన పఁజ
నియె గోవిందదర్శనోత్సాహియగుచు॥ అట్లు చనుచుం దనమనంబున॥ సీ॥ ద్వారకానగరంబు సేరితెఁ జొత్తునుభాసురాంతః
పురవాసియైన। యప్పుండరీకాక్షునఖిలేశు నెబ్బంగి దర్శింపగలనొ తద్ద్వారపాలు। రెక్కడివిప్రుండవెందేల వచ్చెదవనియు
డ్డపెట్టి రేసపుడు వారి । కేమైనఁ బరిదానమిచ్చి చొచ్చెదనన్న నూహింపసర్థశూన్యుండ నేను । నైననా భాగ్యమతనిదయా
ర్ద్రదృష్టి। గాక తలపోయఁగా నొండుగలదె యాతఁ। డేల నన్నునుపేక్షించు నేటిమాట। లనుచు నాద్ద్వారకాపురముపుడు సొ
చ్చి॥ వ॥ అట్లు ప్రవేశించి రాజమార్గంబున జనిచని కక్ష్యాంతరంబులు గడచిచని ముందట॥ సీ॥ విశదమై యొప్పు షోడశసహ
స్రాంగనాకలిత విశాలసంగతి దనర్చి। మహనీయ తపనీయమణిమయ గోపురప్రాసాదసౌధహర్మ్యములు సూచి। మనము
బ్రహ్మానందమును బొందగడునుబ్బి సంతోషబాష్పముల్జడికొనంగఁ । బ్రకటమై విలసిల్లు నొకవధూమణిమందిరము నని నింతు
లు చామరము లీవీవఁ దనరు మృదుహంసతూలికాతల్పమందుఁ। చానుఁ బ్రియయును బహువినోదములఁ దనరి। మహితలా
వణ్యమన్మథమన్మథుండు। ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు॥ సీ॥ ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ గరుణాలవాలు భా
సురకపోలుఁ। గౌస్తుభాలంకారుఁ గామితమందారు సురుచిరలావణ్యు సురశరణ్యు। హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు। ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ బన్నగశయను నబ్జాతనయను। మకరకుండల సద్భూ
షు మంజుభాషు। నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు। భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు। నిష్ణురోచిష్ణు జిష్ణుస
హిష్ణుఁ గృష్ణు॥ మ॥ కనిడాయఁ జనునంతఁ గృష్ణుఁడు దరకంజాక్షుఁ డెప్పేదవి। ప్రుని నక్రాంతదరిద్రపీడితుఁ గృశీభూతాంగుఁ
జీర్ణాంబరున్ । ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ఖండోత్తరీయుంగుచే। లుని నల్లంత నె చూచి సంభ్రమవిలోలుండై చ
గెన్ దల్పమున్॥ క॥ కరమర్థి నెదురుగాఁ జని। పరిరంభణమాచరించి బంధుస్నేహస్ఫురణన్ దోడ్తెచ్చి సమా। దరమున గూ
ర్చుండఁబెట్టె దనతల్పమునన్॥ గీ॥ అట్లు కూర్చుండఁ బెట్టి నెయ్యమునఁగనక। కలశసలిలంబు చేఁగాళ్ళు గడిగి భక్తి। దజ్జలంబు బు
దనమస్తకమునఁ దాల్చి। లలిత మృగమదఘనసారమిళితమైన॥ గీ॥ మలయజను మేనఁ జొబ్బిల్ల నలఁదియంత। శ్రమము వాయం
గఁ దాళవృంతములవిసరి। బంధురామోదకలితధూపంబులొసఁగి। మించు మణిదీపములనివాళించి మఱియు॥ వ॥ సురభికుసు
మమాలికలు సిగముడిచి మఱిమి కర్పూరమిళిత తాంబూలంబులిడి ధేనువ్వొసంగి సాదరంబుగా స్వాగతంబడిగిన నప్పుడ
వ్విప్రుండు మేనంబుల కాంకురంబులంకురింప నానందబాష్పజలబిందుసందోహుండయ్యె- నట్టియెడం బద్మలోచనుండు మన్నిం
చుసంగనామణియగు రుక్మిణి కరకంకణంబులు మొఱయఁ జామరలు వీవ నద్దజ్జాతవాతంబున ఘర్మసలిలంబు నివారింపుచుండం

జూచి శుద్ధాంతకాంతాజనంబులు మనంబుల నద్భుతంబందియుండిరి ॥ ఉ॥ ఏమితపంబు సేసెనొకో యీధరణీదివిజోత్తముం డుతొల్లి మున యోగివిస్ఫురదుపాస్యకుఁడై నరారుణీజగ । త్స్వామిరమాధినాథుని జతల్పమునన్వసియించి యున్నవాఁ। డీమహనీయమూర్తికెవరే మునిపుంగవులెంతవారలున్ ॥ అదియునుంగాక ॥ చ॥ తనప్పుడు తల్పమందు వసితావతియైన రమాలలామపొం। దనునెడఁ గాదలంపకయుదు ప్రవరుండెదురేగి మోదము। న్దనకఁగఁగాంచియుచితక్రియలన్భరిత పూజసేయుచు। న్వినయము నన్భజించె ధరణీసురుడెంతటి భాగ్యవంతుఁడో ॥ అయ్యవసరంబున ॥ క॥ మురసూదఁడు గుచేలుని। కరముగ రంబునఁ దెమల్చక డకస్మనమా। గురుగృహమునవర్తించిన। చరితములను కొన్నను డివె చతురత జెలియున్ ॥ సీ॥ బ్రాహ్మణోత్తమ వేదపాఠనలబ్ధదక్షత గలచారువంశంబునలరఁ। బరిణయంబైనట్టి భార్యసుశీలవర్తనమునం దగ గభవత్సదృశయగునె। తలఁపగృహక్షేత్రధనదారపుత్రాదులందునీచిత్తంబు చెందకుంట। తోఁచుచున్నది యే నుడువిలోకసంగ్రహార్థంబు కర్మాచరణంబు సేయు। గతిమనంబునఁ గామమోహితులుగాక। నర్థమై విహితకర్మంబులాచరించి। ప్రకృతిసంబంధమును చాసి భవ్యనిష్ఠ। దవిలి యుండు మహాత్ములుత్తములు భువని ॥ అని మఱియు నిట్లనియె ॥ క॥ ఎఱుగుదె గురుమందిరమున। వెఱవొప్పఁగ మనకు నతఁడు వలయఁగ దెలుప। న్నెఱుఁగఁగవలసిన యర్థము। లెఱిఁగి పరిజ్ఞానమహిమ లెఱుఁగుటలెల్లన్ ॥ అని మఱియు గురుప్రశంస సేయఁదలంచి యిట్లనియె ॥ గీ॥ తవిరియజ్ఞానతిమిరప్రదీపమగుచు। నవ్యయంబైన బ్రహ్మంబు ననుభవించు। భరితసత్వుండు సత్కర్మనిరతుఁడతుల। భూసురశ్రేష్ఠుఁడనఘుండు బుధనుతుండు ॥ వ॥ అమ్మహాత్మునివలన సకలవర్ణాశ్రమంబులవారికి నేను విజ్ఞానప్రదుండవగు గురుండనై యుండియు గురుభజనంబు పరమధర్మంబనియాచరించితినదిగావున ॥ క॥ భూసురులకెల్ల ముఖ్యుఁడనై సకలకులాశ్రమంబులందుల నెపుడున్ । ధీసుజ్ఞానప్రదుఁడన। దేశికుఁడననొప్పుచుండు ధృతి నెల్లెడలన్ ॥ గీ॥ అట్టివర్ణాశ్రమంబులయందు నర్థ। కుశలులగువారి నిఖిలైకగురుఁడనైన। నాదువాక్యంబు చేభవార్ణవము వెలుచ। దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరులు ॥ వ॥ అదియునుంగాక సకలభూతాత్మకుండనైన యేను తపోవ్రతయజ్ఞదానశమదమాదులచేత సంతసింపను గురుజనంబులఁ బరమభక్తి సేవించువారలం బరిణమింతు నని చెప్పి మఱియు మనము గురుమందిరంబున నున్న యెడ గురుపత్నీనియుక్తులమై యింధనార్థంబడవికిం జనిన యెడ ॥ సీ॥ ఘుమఘుమారావసంకుల ఘోరజీమూతపటలసంఛన్నభభాగమగుచుఁ। జటులరుఝంఝానిలోత్కటసముద్ధూత నానావిధజంతుసంతానమగుచుఁ। జండదిగ్వేదండతుండనిభాఖండవారిధారాపూర్ణ వసుధయగుచు। విద్యోతమానోగ్రఖద్యోతకిరణజిద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవమగుచు ॥ నడరి జడిగురియనినుఁడు మనస్తమింప। భూరినీరంధ్రనిబిడాంధకారమేచి। సూచికాభేద్యమై వస్తుగోచరంబు। గానియట్లుండె మనము సవ్యానఁ దడిసి ॥ గీ॥ బయలుగొందియుఁ బెనుమిట్టుపల్లములును। రహితసహితస్థలంబులేర్పఱుపరాక। నున్నయత్తఱిమన మొకరొకరి చేతు। లూఁతగాఁగొని నడచుచునుండనంత ॥ క॥ విసవిసనప్పడునుడుగక। విసరెడివలిచేతవడఁకువిడువక మనము। న్బసచెడి మార్గముగానక। మసలితిమంతటను నంశుమంతుఁడు వొడమన్ ॥ క॥ తెలతెలవారెడివేళ। న్నలకలమని పలికెంబక్షిగణమెల్లెడల। న్మొలమిలన్ ప్రొద్దుపొడుపున। ధళధళయను మెఱుఁగు దిగ్వితానమునిండెన్ ॥ క॥ అప్పుడు సాందీపుఁడు మన। చొప్పరయుచువచ్చి వాన సోఁకున నువ్వలి। న్దెప్పిర్లుటఁ గని ఖేదం। బుప్పతిలం బలికెనకట యోవటులారా ॥ చ॥ కటకటయిట్లు మాకొఱకుఁ గాఁ జనుదెంచి మహాటవిన్నను। త్కటపరిపీడనొంచితిరి గావునశిష్యులు మా ఋణంబునీ। గుటకేది కారణంబు ఏమకూరెడుఁ బోయిటమీఁద మీకు వి। స్ఫుటధనబంధు దారబహుపుత్రవిభూతిజయాయురున్నతుల్ ॥ క॥ అని గారవించి యాయన। మనలందోడ్కొనుచు నాశ్రమమందిరమునకు। న్జనుదెంచుట యెల్లను నీ। మనమునఁదలఁ తేయటంచు మఱియున్పలికెన్ ॥ వ॥ అనఘా మనమధ్యయనంబు సేయుచు నన్యోన్యస్నేహవాత్సల్యంబులం జేయుకృత్యంబులు మఱువఁగఁ గాయని యవియెల్లం దలంచియాడు మాధవు మధురాలాపంబులు విని యతనింగనుంగొని కుచేలుండిట్లనియె ॥ క॥ వనజోదర గురుమందిర। మునను మనము వసించు నాఁడు ముదమునఁ గావిం। పనిపను లెవ్వియుఁ గలవే। వసుమవియట్లుండనిమ్ము విమలచరిత్రా ॥ క॥ గురుమతిఁదలఁపఁగఁ ద్విజగ। ద్గురుఁడవనందగిననీకు గురుఁడనఁదానొం। డొరుఁడెవ్వఁడింతయును నీ। కరయంగ విడంబనంబులగుఁగాదె హరీ ॥ వ॥ అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని సమస్తభావాభిజ్ఞుండైన పుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుండగుచు నతనిం జూచి నీవిచ్చటికి వచ్చునప్పుడు నాయందుల భక్తిం జేసి నాకుసుపాయనంబుగా నేమి పదార్థంబుఁ దెచ్చితివప్పదార్థంబు లేశమాత్రంబైనను బడివేలుగా నంగీకరింతు నట్లుంగాక నీచవర్తనుండై మద్భక్తిం దగులనిదుష్టాత్ముండు హేమాచలతుల్యంబైన పదార్థంబు నొసంగిన నదియునాకు సంతుష్టునకు సమ్మతంబుగాదుకావున ॥ క॥ దళమైనఁ బుష్పమైనను। ఫలమైనను సలిలమైనఁ బాయనిభక్తిం। గొలిచిన జనులర్పించిన। నెలుకన్ రుచిరాన్నముగ నే నే సుభుజింతున్ ॥ క॥ అని పద్మోదరుఁడాడిన। వినయోక్తులకాత్మనలరి విప్రుండు దాఁ దెచ్చినయు

డుకుబుదగసర్పం । పను నేరక పోముపొంచి పలుకకయున్నన్॥ వ॥ అప్పుప్రిందుచను దెంచిన కార్యంబు గృష్ణుండు దన
వ్యాప్తత్వంబున నెఱింగి యితఁడు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపండైన యీకుచేలుండు నిజకాంతాము
ఖోల్లాసంబునకై నాయొద్దకుం జనుదెంచినవాఁ డితనికి నింద్రాదులకుం బడయరాని బహువిధంబులైన సంపద్విశేషంబు లొస
ఁగంబ యొడఁగూర్పవలయునని తలంచి యితండు జీర్ణవస్త్రంబు కొనముడిచి తెచ్చిన యయ్యటుకులముడియఁ గని యిదియేడ
దని యొయ్యన నన్నుఁ గడియఁ దనకరకమలంబుల విడిచి యయ్యటుకులు గొన్ని పుచ్చికొని యివి యనేకలోకంబుల నన్నుఁ బరితృ
ప్తిఁ బొందింపం జాలు ననియప్పుడు॥ క॥ మురహరుఁడు పిడికెడటుకులు । గరమొప్పఁగ నారగించి కౌతుకమతియై । మఱియును
పిడికెడు గొనఁద । త్కరమప్పుడు పట్టెఁ గమలకరకమలముల౯॥ క॥ సొంపారఁగ నితనికి బహు । సంపద లందింప నివియ చాలును
నిఁక భక్షింపఁగ వలవదు త్రిజగ । త్సంపత్కర దేవదేవ సర్వాత్మహరీ॥ వ॥ అని యిట్లు వారించిన నక్కుచేలుండు నారాత్రి గో
విందుమందిరంబునఁ దనకు హృదయానందకరంబులగు వివిధపదార్థంబుల ననుభవించి మృదులశయ్యాతలంబున నిద్రించి తన
మనంబునఁ దన్ను సమధిక స్వర్గభోగానుభవుం గాఁ దలంచుచు మఱునాఁ డరుణోదయంబున మేల్కని కాలోచితకృత్యంబు
లు దీర్చి యిందిరారమణుం డదన్నుఁ గొంతదవ్వనిపి యామంత్రితుం జేయఁ జనుచు నందనందనసందర్శనానంద లోలత్స్వాం
ద్వైతమనంబున నిట్లనియె॥ క॥ నాపుణ్యమరయ నెట్టిదో । యాపుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల । వ్యాపకు బ్రహ్మణ్యునిఁ
జిద్రూపకుఁ బురుషోత్తముని బరుంగనుఁ గొంటి౯॥ సీ॥ పరికింపఁ గృపణస్వభావుండనై నట్టి నేనెడ నిఖిలావనీశుఁడైన । యిం
దిరాదేవికి నెనయంగ నిత్యనివాసుఁడై యొప్పునవ్వాసుదేవుఁ । డేడ సన్నర్థిమైఁ దోడఁబుట్టినవానిఁ గైవడిఁ గౌఁగిటఁ గదియఁ జే
ర్చి । దైవంబుగా నన్ను భావించి నిజతల్పమున నునిచి సత్క్రియ లొనరించి । చారునిజవధూకరసరోజాతకలిత । చామరానిల
విగతవిశ్రముఁ జేసి శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జ । తలముల నడుగులొత్తె వత్సలత మెఱసి॥ కావున॥ ఉ॥ శ్రీసతియి
ట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్తమేమియు న్నీని తెఱంగుగా నబడె నెన్న దరిద్రుఁడు సంపదస్థుఁడై । కాసకతన్నుఁ జేరఁడ
ని కాక శ్రితార్తిహరుండు సత్కృపాంభోనిధి సర్వవస్తుపరిపూర్ణునిగా ననుఁ జేయకుండునే॥ వ॥ అని తన మనంబున వితర్కిం
చుచు నిజపురంబునకుం జనిచని ముందట॥ సీ॥ భానుచంద్రప్రభాభాసమానస్వర్ణ చంద్రకాంతోపలసౌధములును । గలకంఠ
శుకనీలకంఠసముత్కంఠమానితకూజితోద్యానములును । ఫుల్లసితాంభోజహల్లకకల్హారకైరవోల్లసితకాసారములును ।
మణిమయకనకకంకణముఖాభరణవిభ్రాజితదాసదాసీజనంబు॥ గలిగి చెలువొందు సదనంబుఁ గాంచి విస్మయమునుఁ బొం
దుచు నెట్టిపుణ్యాత్ముఁ డుండు నిలయమొక్కొ యపూర్వమై నెగడె మహిత । వైభవోన్నతలక్ష్మీనివాసమగుచు॥ అని తలఁపో
యుచున్న యవసరంబున॥ గీ॥ దివిజవనితలం బోలెడు తెఱవ లపుడు । డాయనే తెంచి యిందు విచ్చేయుఁ డనుచు । విమలసంగీత
నృత్యవాద్యములు చెలఁగ । గరిమఁ దోడ్కొనిచని రంతిపురమునకును॥ వ॥ ఇట్లు చనుదేర నతనిభార్యయైన సతీలలామంబు దన
మనంబున నానందరససమగ్నయగుచు నిట్లనియె॥ సీ॥ తనవిభు రాక ముందటఁ గని మనమున హర్షించి వైభవంబలర మనుజ । కా
మినీరూపంబుఁ గైకొన్న యిందిరావనిత చందంబునఁ దనరుచున్న । కలకంఠి తనవాలుకన్నులఁ గేవల నానందబాష్పంబు లంకు
రింప । నతనిపాదంబులకాత్మ బో మ్రొక్కి భావంబున నాలింగనంబుఁ జేసె॥ నాథ రా దేవ్రఁ డతులదివ్యాంబరాభ । రణవిభూ
షితయై రతిరాజుసాయ । కములగతి నొప్పు పరిచారికలు భజింప । లలితసౌభాగ్యయగు నిజలలనఁ జూచి॥ క॥ ఆనారీరత్నంబు
ను । దానును ననురాగరససముద్రమునఁ గొత్తఁ గని । త్యానందము నొందుచుఁ బెం । పూనిన హరిలబ్ధవైభవోన్నతి మెఱయ౯॥ సీ॥ కమ
నీయపద్మరాగస్తంభకంబులుఁ గోమరారు పటికంపుకుడ్యములును । మరకతవరరత్నమయకవాటంబులుఁ గీలితహరినీలజా
లకములు । దీపితచంద్రకాంతోపల వేదులు నంచితవివిధపదార్థములును । దగుహంసతూలికాతల్పంబులును హేమలాలితశ
యనస్థలములుఁ దనరు॥ సమధికోత్తుంగభద్రపీఠములు సిరులు । మానితోన్నతచతురంతయానములును । పలయు సర్వవస్తుపరి
పూర్ణవాటికలును । గలిగి చెలువొందు మంచెరం బెలమిఁ జొచ్చి॥ వ॥ సుఖంబున నుండునట్టి యెడ నతనికి మనోవికారంబులు పొడ
మకుండ వర్తించుచు నిర్మలంబగు తనమనంబున నిట్లను నింతకాలం బత్యంతదురంతంబగు దారిద్ర్యదుఃఖార్ణవంబున మునింగి
యున్న నాకుం గడపటం గలిగిన విధంబు నెప్పుడు॥ గీ॥ ఎన్నఁ గ్రొత్తైన యిట్టి సంపదలు నా । కబ్బె నెల్ల హరిదయావలోకన
మునఁ జేసి కాదె నలినాక్షుసన్నిధి । కర్థినగుచు నేను నరుగుటయును॥ క॥ నను నావృత్తాంతంబును । దనమనమునఁ గని యు నేమి
దడవక ననుఁ బొమ్మని యీసంపద లెల్లను । నొసరఁగ నోడఁగూర్చి నన్ను నొడయనిఁ జేసె౯॥ వ॥ అట్టి పురుషోత్తముండు భక్తి
నిష్ఠులైన సత్పురుషులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొనిన
నని నిరుపేద మలినదేహుండును జీర్ణాంబరుండు నని చిత్తంబున హేయంబుగాఁ బాటింపక నాచే
న్నించుటకు నిదియ దృష్టాంతంబుగాదె మలినదేహుండను జీర్ణాంబరుండును నని చిత్తంబున హేయంబుగాఁ బాటింపక నాచే
నున్న యటుకు లాదరంబున నారగించి నన్నుఁ గృతార్థుం జేయుటయ తనకు హేతుకదయయగాదె యట్టి కారుణ్యసాగరుండైన

గానుండుని చరాచరవిందంబులయందు లభ్యభక్తిప్రాభవంబులగుంగాక యనియుస్వాండు ... సంయుండు బార్వభక్తి తాత్ప ర్యంబునన్దగిలిపన్నేస మేతుండై నిఖిలభోగంబులయందు నాసక్తింబొరయక రాగాదివిరహితుండవును నిర్వికారుండవునునై యఖిలక్రియలయందు ననంతుని యనంతధ్యానసుధారసంబునం జొక్కుచు విగతబంధనుండై యపవర్గప్రాప్తినొందెదు మతి యును॥ గీ॥ దేవదేవుఁడఖిలభావజ్ఞుఁడాశ్రిత। వరదుఁడైనహరికిఁ శరణిసురులు। దైవతములుగాన ధారుణీవిబుజుల। కందెలైన మొక్కదుగలఁడె భువిని॥ క॥ మురహరుఁడిట్లుకుచేలుని। జరితార్థుంజేసినట్టి చరితము విను స। త్పురుషులకిహపరసుఖముల। హరిభక్తియు యశముగలుగు నవనీనాథా॥ అని మఱియు బరాశరపౌత్రునకర్జునపౌత్రుండిట్లనియె॥ గీ॥ దుష్టశిక్షణంబు దురి తసంహరణంబు। శిష్టరక్షణంబు సేయఁదలఁచి। భువిని మనుజుఁడగుచు బుట్టిన శ్రీకృష్ణు। విమలచరితమెల్ల విస్తరింపు॥ అనిన శుకుం డిట్లనియె॥ సీ॥ ధరణీశ బలుఁడును సరసిజోదరుఁడును సర్వోన్నత సుఖలీలనుండునంతఁ। జటులోగ్రకల్పాంతసమయమందును


॥ శ్రీకృష్ణుఁడు సకుటుంబముగా గ్రహణస్నానమునకుఁ బోవుట. ॥

బోలెడు గసహ్యమైసముద్దీప్తమగుచు। రాజిల్లుసూర్యోపరాగంబు చను జెంచుమెఱఁగి భూసురులెల్ల వరుసఁగదలి। మనుజ ఘుదగ్నిరాముఁడుపూనిమున్నే యిపుమారులు ఘనబలోదారుఁడగుచు। నిజభుజాదండమండితనిబిడనిశిత। చటులదంభోళిరు చిరభాస్వత్కుఠార। మహితనారాచనిర్భిన్నమనుజపాల। దేహనిర్ముక్తరుధిరప్రవాహములను॥ గీ॥ ఏనుమడువులఁ గావిం చెనెచట నేని। నట్టి పావనసుక్షేత్రమగు శమంత। పంచకంబునకవుడుసంభ్రమము నొందఁ। జనిరి బలకృష్ణులును సంతసం బెల ర్ప॥ వ॥ ఇట్లు నిష్కల్మషులైన రామకృష్ణులు లోకధర్మానుపాలనవర్తనులై ద్వారకానగరరక్షణంబునకుఁ బ్రద్యుమ్నగదసాం బసుచంద్రశుకసారణానిరుద్ధకృతవర్మాదియోధవరుల నియమించి యక్రూరవసుదేవోగ్రసేనాది సకలయాదవులుం గాం తాసమేతులై స్రక్చందనభరణవస్త్రాదులు ధరియించి శోభనాకారంబులతోడం బుష్పకవిమానంబుల నంబొలుచు నర దంబులను మేఘంబులననుకరించు గజంబులను మనోవేగంబులైన తురంగంబుల నెక్కి వియచ్చరులం బురణించు పురుషులు దమ్ము సేవింపం జని యప్పుణ్యతీర్థంబుల నవగాహనంబు చేసి యుపవసించి యనంతరంబ॥ క॥ భూసురవరులకు ననుపమ। వా సోలంకార ధేనువసురత్నధర। త్రీసమహితవస్తువులు। ల్లాసంబున దానమిచ్చి లాలితులగుచున్॥ క॥ పునరవగాహనములు పెంపొసరంగావించి బంధుబుధయుతులై భో। జనకృత్యంబులు దీర్చి స। దనురాగములుల్లసిల్ల నచ్చోటదగన్॥ క॥ ఘనశా ఖాకీర్ణములై। యినరశ్ములు గానరాక యెసకంబెసఁగ। న్ననిచిన పొన్నలనీడల। ననిచిన వేడుకలం నదనందనముఖ్యుల్॥ క॥ తన రిన పల్లవరుచిరా। సనములనాసీనులగుచు దత్సుఖగోష్ఠి। న్నెనపొందఁగనటవసియించినచో దత్పుణ్యతీర్థసేవారతులై॥ వ॥ మున్నచను దెంచియున్న యౌశీనరమత్స్యకురుకోసలవిదర్భ సృంజయకాంభోజ కేకయమద్రకుంతిఆరట్టకేరళాది భూపతులు మఱియుం దక్కిన రాజవరులును హితులును నందగోపాలాది గోపాలురును గోపికాజనంబులును ధర్మరాజా నుగతులై వచ్చిన భీష్మద్రోణధృతరాష్ట్రగాంధారీకుంతీపాండవతద్దారసివహసంజయవిదురకృపకుంతిభోజవిరాటభీష్మ కనగ్నజిత్ద్రుపదశైబ్యధృష్టకేతుకాశిరాజరాజరాజదమఘోషవిశాలాక్షమైథిలయుధామన్యుసుశర్మలునుసపుత్రకుం డైనబాహ్లికుండును మొదలుగాననేకులు నుగ్రసేనప్రముఖులం బూజలందృప్తులం జేసినవారును బ్రమోదితాత్మలైర య్యెడ॥ క॥ ఆరాజులు గాంచిరి నిజ। నారీయుతులగుచు నంగనాపరివారున్। ధీరున్ దానవశులసం। హారున్ గోపీమనోపహా రును దారున్॥ వ॥ కనియమ్మాధవబలదేవులు సేయు సముచితపూజావిధానంబులం బరితృప్తులై యమ్ముకుందు సాన్నిధ్యంబు గలిగి తదీయసంపద్విభవాభిరామంబుల నభిరాములై విలసిల్లుచున్న యుగ్రసేనాది యదువృష్ణిపుంగవులం జూచి వారల తోడ నారాజవరులు మాధవుం దలపోసి యిట్లనిరి॥ మ॥ మనశాస్త్రంబులు వాక్కులన్మనములన్ మాంగళ్యముం బొందఁ బా। వ నమై మొప్పుచు నేరమూవిభు నిభాస్వత్పాదపంకేజ సే। చనతోయంబుల నేమహాత్ముని పదాబ్జాతంబు లెందేనిసోఁ। కినచో ట్లిల్లను ముక్తిహేతువగు నీకృష్ణుం డెపోఁ జూడఁగన్॥ చ॥ సనకసనందనాదిమునిసత్తములుం జలితయోగదృష్టిచేఁ। బనివడి యాత్మలన్వెదకి పట్టనగోచరమైన మూర్తియి। ట్లనవరతంబు మాం సనయనాంచలగోచరుఁడయ్యెనట్టిదే। మనగ వీరిపు ణ్యమునకాడట నెట్టితపంబు చేసిరో॥ మ॥ నిరయస్వర్గములాత్మ నెగ్గొనక దాని ర్వాణసమ్మాన్ద్రియా। హరిఁ బూడన్ హరితో డంబల్కి హరి మేనంటన్ హరిం బాడఁగా। హరితో నేగ సహాసనాస్తరణశయ్యావాసులై యుండుటల్। హరిబంధుత్వసఖ త్వముల్గలుగు భాగ్యం బిట్లు సిద్ధించెనో॥ గీ॥ అనుచు యాదవవృష్ణిభోజాంధకులును। హరిదయాలబ్ధనిఖిలార్థులగుచునున్న। మునికిఁ దమచిత్తములబలుమారు వొగడి। యుపరమించిరి యంతన ప్పాండుపహిషి॥ అప్పుడు॥ క॥ తనసుతులకు గాంధారీ। త నయులు గావించునతకృతంబులు నాత్మన్। మనమున నెరయగదిచ్చటఁ। గనుగొనెవసుదేవు విగతకల్మషభావున్॥ అట్లుగ ... లనె॥ క॥ ఓయన్న ... ॥ ... దాయని యిడుమ

లఁబడఁగరు। నాయత్తులరగుచుమీరలరయఁగపలదె॥ వ॥ అనిబహుప్రకారంబులసంతాపించుచుమఱియునిట్లనియె॥ క॥ అత
బలవంతపువిధిదాఁ। బ్రతికూలంబైనగలరెబంధువులనుచుఁ। ధృతిగలఁగిబాష్పజలపూ। రితలోచనయగుచుసహోదరిని
జూచియనెఁ॥ సీ॥ తల్లినీకేలసంతాపింపమనమునఁదలఁపకవిధినేలసోలసెదింత। యఖిలనియామకుండగునీశ్వరుఁడుమా
యజవనికాంతరుఁడైనయవనిసూత్ర। ధారునికైవడిదగిలినటింపంగమనుజులుకీలుబొమ్మలుబదలంపఁ। గావునవిధిసేతఁగ
డచివర్తింపంగదేవతలకునైనఁదీరదట్లు। క్రోధచిత్తుఁడుగంసుండుబాధబఱచ। నిలయములుదప్పినేమడవులఁజరింప। ఘన
కృపానిధియీహరిగలుగఁబట్టి। కోరిమాయిండ్లుగ్రమ్మఱఁజేరగలిగె॥ అనియూరడంబలుకునవసరంబున॥ క॥ నందయశో
దలుగోపక। బృందంబులుగోపికలునుఁబిరిఁగొనిపరమా। నందంబులజనుదెంచిరి। మందరధరుజూచువేడ్కమనమునఁబొడ
మఁ॥ అట్లువనుదెంచిన॥ క॥ అతిచిరకాలసమాగతు। నతనినిరీక్షించివృష్ణియాదవభోజ। ప్రతతులునెదుటేఁగిసము। న్నతి
తో నాలింగనములునడపిరివరుసఁ॥ క॥ వసుదేవుఁడువారికిసం। తసమునఁగావించెసముచితక్రియలంతఁ। ముసలియుహ
రియుఁ మొక్కిరి। వెసనందయశోదలకునువినయంబెసఁగఁ॥ వ॥ అట్లునమస్కృతులుసేసియాలింగనంబుగావించిన
యనారవిందంబులనానందబాష్పంబులుదొరుగనరలేని స్నేహంబులఁజిత్తంబులుసత్తమిల్లనేమియుంబలుకకుండెరంత న
య్యశోదాదేవిరామకృష్ణులనిజాంకపీఠంబుననునిచియక్కునఁగదియందిగిచిచెక్కులుముద్దుగొనిశిరంబులుమూర్కొ
నిచుబుకంబులుబుజుకుచుఁబునఃపునరాలింగనంబులుగావించిపరమానందంబునంబొందుచునున్నంతఁబదంపడి॥ చ॥ స్థి
రమతితోడరోహిణియుదేవకియుందగనందగోపసుం। దరిఁగనికౌఁగలించికొనితత్కృతులెల్లదలంచియింతెసీ। వరుఁడునుస్నే
హబంధుజనవత్సలతన్మనుజేయుసత్కృతు। ల్మఱువఁగవచ్చునేతలఁపమాకికనెన్నటికిందలోదరీ॥ క॥ జననంబందినమొద
లుగ। ఘనమోహముతోడఁబెంచుకతమునఁదమకుఁ। జననీజనకులువీరని। మనములఁదలపోయతేరుమమునీతనయుల్॥ క॥
అంటెనప్రేమనువీరి। నంటికెరెప్పడ్డమైనగతిఁబెంపఁగమా। కంబెన్నెనరౌటనుమీ। యింటన్వసియించియుండిరిన్నిదినం
బుల్॥ వ॥ అనియిట్లుప్రియాలాపంబులుపలుకుచుండునవసరంబున గోపాలసుందరుల మందానందకందళితహృదయలయి
హృదయేశ్వరుండైనగోవిందునఁజిరకాలసమాగతుండగుటంజేసి యతనింజూచుతలంపులుల్లంబులవెల్లిగొనంజేరి॥ చ॥ న
లినదళాక్షుఁజూచి నయనంబులుమోడ్వఁగజాలకాత్మలం। దలఁచితదీయమూర్తివిభవంబుదలంచుచుఁ గౌఁగిలించుచు।
న్బులకలుమేనఁజాదుకొనబోఁటులుచొక్కిరిబ్రహ్మమున్మనం। బులఁగనిచొక్కుయోగిజనముస్స్మరణింపఁగమానవేశ్వ
రా॥ చ॥ పొలఁతులభావమాత్మఁగనిపుల్లసరోరుహలోచనుండువా। రలనపుడేకతంబునకురమ్మనితోకొనిపోయియందున।
ర్మిలిఁబరిరంభణంబునొనరించిలసద్దరహాసచంద్రికా। కలితకపోలుఁడైపలికెఁగాంతలభక్తినితాంతచిత్తలఁ॥ చ॥ వనజ
దళాక్షులారబలవద్రిపువర్గములంజయింపఁగాఁ। జనితడవయ్యెదీనికిభృశంబుగమీమదిసల్లకుండుఁడీ। యనయముదైవ
మిట్లుసచరాచరజాలమునొక్కవేళఁగూ। ర్చునునొకవేళఁబాపునుమరుద్ధతతూలతృణంబులుంబలెఁ॥ సీ॥ తరలాక్షులా
రమద్భక్తిచేతనులకుఁదనరుమోక్షానందదాయకంబు। జపతపోవ్రతదానసత్కర్మములభక్తికలుగంగనేరదుగానఁదలఁ
పవిధిశివసనకాదివిమలచిత్తంబులఁబొడమనిభక్తిమీబుద్ధులందు। జనియించెమీపూర్వసంచితసౌభాగ్యమెట్టిదోయదితు
దముట్టెనింక। నటమటముగాదుమీకునెన్నటికినైనఁ। గలుగనేరవుపునరయసంగతములైన। జన్మకర్మములిటమీఁదమన్మనీష।
సుమహితధ్యానలారయోరమణులార॥ సీ॥ అఖిలభూతములకునయంబునాదిమధ్యాంతకాంతర్బహిర్వ్యాప్తినైన।
ఘటపటాదికభూతకార్యంబులకుముప్రధానకారణములై తనరునట్టి। గగనానిలానలకతోయక్షోణులనుభూతపంచకంబైక్యత
వడయుఁగాదె। లోకంబులందుఁబంచీకరణవ్యవస్థలచేతనట్టిభూతములరీతి। గగనముఖభూతతత్కార్యకారణములఁ। ద
గిలియాధారహేతుభూతంబునైన। నాకుఁబరమన్యుఁడొకఁడునెన్నంగలేఁడు। విమలమతులారమాటలువేయునేల॥ గీ॥ అ
నినఁదెలివొందివారుదేహాభిమాన। ముఁసమస్తంబువిడిచియోనలిననాభ। నిఖిలజగదంతరాత్మమానితచరిత్ర। భక్తజన
మందిరాంగణపారిజాత॥ గీ॥ ఘోరసంసారసాగరోత్తారణంబు। ధీయుతజ్ఞానయోగహృద్ధ్యేయవస్తు। వగుచుఁజెలువొం
దునీచరణాంబుజాత। యుగళములుమామనంబులఁదగులనీవె॥ క॥ అనివేఁడినఁగృష్ణుఁడుముని। వినుతుఁడుగరుణించివల్లవీజ
నములుగోరినయట్లిచ్చెఁగరుణా। వననిధిసద్భక్తలోకవత్సలుఁడంతఁ॥ చ॥ ధర్మతనూభవుంగనిపదంబులకున్నతుఁడై స
పర్యలనిర్మలభక్తిమైనడపినీవునుతమ్ములుబంధుకోటిస। త్కర్మచరిత్రులైతగుసుఖంబులనెప్పుడునున్నవారెనా। నర్మి
లిఁబాండవాగ్రజుఁడునమ్మధుసూదనుతోడనిట్లనుఁ॥ క॥ సరసిజనాభభవత్పద। సరసీరుహమాశ్రయించుజనులతిసౌ
ఖ్యాస్ఫురణంబొలుపారుచుభువిఁ। జరియింపరెభక్తపారిజాతమురారీ॥ అదియునుంగాక॥ సీ॥ సుమహితస్వప్నసుషుప్తి
జాగ్రత్తలనుమూఁడవసలఁబాసి వాడిమిగిలి। వెలిసుందులోనుండువిశ్వమైయుందువువిశ్వంబునీయందు వెలుఁగుచుండు।

భవదీయమహిమచేఁ జాటిల్లు భువనంబులుదయించునొక వేళనుడిగిమడఁగు। సంచితాఖండసద్జ్ఞానివై యొప్పుచునవిహతయోగమాయాత్మఁదనరి। దురితదూరులునిత్యముక్తులకుఁ జెంద। నలవియై పెంపుదీపింతువంబుజాక్ష। ఘనకృపాకరనిఖిలవికారదూర। నీకు మ్రొక్కెదసర్వలోకైకనాథ॥ క॥ అనివినుతించిననచ్చటి। జనపాలకబంధుమిత్రసకలజనంబు। ల్వినియనురాగిల్లిరినె। మ్మనములనానందజలధిమగ్నులరగుచున్॥ గీ॥ అట్టియొప్పగు వేళ నెయ్యంబుమెఱసి। యొక్కచోటను సంతోష

※ లక్షణయను శ్రీకృష్ణునియష్టమభార్య ద్రౌపదీదేవికిఁదనవివాహవృత్తాంతంబుఁ దెలుపుట. ※

యుక్తలగుచు। దానవాంతకసతులును ద్రౌపదియును। గూడితమలోనముచ్చటలాడుచుండి॥ వ॥ అట్టియెడఁ గృష్ణకథావేశంబులు పరితోషంబున నుగ్గడించుచు ప్రసంగవశంబున నారుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణభార్యలం గనుంగొని పాంచాలియిట్లనియె- మిమ్ముసమ్మతితోఁ బుండరీకాక్షుండు వివాహంబునఁ జేకొనిన తెఱఁగు తెఱంబుగ వినుపింపుడనిన వారుదమపరిణయంబుల తెఱంగు మున్ను నేనీకుం జెప్పిన విధంబున వినిపించి రందు సవిస్తరంబుగాఁ దెలియంబలుకని మద్రరాజకన్యకావృత్తాంతంబామానిని పాంచాలికిం జెప్పిన విధంబు వినుమని శుకుండు పరీక్షిన్నరేంద్రునకిట్లనియె॥ సీ॥ పాంచాలితో మద్రపతిసుతయిట్లను సంగీతవిద్యావిశారదుండు। నారదుచేతివీణాస్వనకలితమైనట్టి గోవిందకథామృతంబు। దవిలిమే గ్రోలిచిత్తము దన్మయత్వంబునొంది మోదించుచునుండునంత। దుహితృవత్సలుఁడు మద్గురుఁడుఁదానదివిని సదుపాయమొక్కటమదిఁదలంచి। చదల నెబ్భంగి నైనగోచరముగాక। వారిమధ్యములోన భివ్యాప్తిఁదోఁచు। మత్స్యయంత్రంబుఁగల్పించి మనుజులెంత। వారికైననుదివ్వమోవంగరాని॥ గీ॥ ధనువు పవిచండనిష్ఠురాస్త్రంబునచట। నంచితంబైన గంధపుష్పాక్షతలును। బూజఁగావించియునిచియేపురుషుఁడేని। సిద్ధబలమున నీచాపమెక్కువెట్టి॥ క॥ ఈసాయకంబునారిం। బోసి వెసన్మత్స్యయంత్రముఁ ధరఁగూల। న్వేసిన శౌర్యధురీణుఁడు। నాసుతవరియించు ననిజనంబులు వినఁగన్॥ క॥ చాటించినసవ్వార్తకుఁ। చాటించిన సంభ్రమములఁ జాపాసనమా। ర్వీటంకారమహారవ పాటితశాత్రవులు బాహుబలసామగ్రుల్॥ క॥ సుందరతనులు దదుత్సవసందర్శనకుతుకులమిత సైన్యులు భూభృ। న్నందనులేతెంచిరిజన। నందితయశులగుచు మద్రనగరంబునకున్॥ క॥ చనుదెంచినవారికిమ। జ్జనకుఁడు వివిధార్చనములు సమ్మతిగావిం। చిననాబాహుబలాఢ్యులు। ధనువుం జేరంగనతిగర్ధైర్యస్ఫూర్తిన్॥ ఇట్లుడగ్గఱియద్ధనువుంగనుంగొని॥ ఉ॥ కొందఱుపూనలేకఁ జనఁ గొందఱు పూనికదల్పలేకపోఁ। గొందఱొకింత నెత్తనొకకొందఱుమోపిడలేకదక్కఁగా। గొందఱొకింతయెక్కిడుచుఁ గోరి నృపాలకులిట్లు సిగ్గునుం। జెందితెలంగిపోవుచును జీయిటకేగుటనీతితప్పనన్॥ అట్టియెడ॥ క॥ భీముఁడు రాధేయుఁడును। ద్ధామగతిన్నెక్కుద్రోచి తగనమ్మినఁ। జేమఱకదిరుగుచుంటయుఁ। దామేమియునెఱుఁగలేకతలఁగినపిదపన్॥ క॥ అమరేంద్రతనయుఁడవ్వా। త్స్యము నేయనుపాయమెఱిఁగితగనేసియు మీ। నముఁద్రుంపలేకసిగ్గున। విముఖుండై చనియెనంతవికలుండగుచున్॥ వ॥ ఇట్లు సకలరాజకుమారులుందమతమ ప్రయత్నంబులు విఫలంబులైన ముఖారవిందంబులు ముకుళించి దైన్యంబున విన్ననై చూచుచున్నయెడ॥ చ॥ సరసిజపత్రలోచనుఁడు చాపముసజ్యముచేసియుల్లస। చ్ఛరమరివోసికార్ముకవిశారదుఁడై మెలరేఖవోలె ఖే। చరమగు మీనముందునిమెసత్వరతన్సురసిద్ధసాధ్యఖే। చరజయలబ్ధమొప్పఁ బెలుచన్ గురిసెం దివిబుష్పవర్షముల్॥ వ॥ అయ్యవసరంబున నేను బరితుష్టాంతరంగనై పరమానందవికచవదనారవిందంబున నిందిందిరసన్నిభంబులగుచికురబృందంబులు విలసదలికఫలకంబునందళుకుబోలుకుఘర్మజలకణంబులం గరంగుమృగమదతిలకంపుటసలు మసలుకొనినం గరకిసలయంబున నోసరించుచు మిసమిసను మెఱుంగుగములు గిరికొనఁ గౌనువడవడవడంకనప్పుడు మందగమనంబున॥ చ॥ లలితపదాబ్జనూపురకలధ్వనితోదరహాసచంద్రికా। కలితకపోలపాలికలఁ గప్పుసువర్ణవినూత్నరత్నకుం। డలరుచులొప్పఁగంకణఝణంకృతులింపెసలారరంగభూ। తలమునకేఁగుదెంచి ముఖతామరసంబుపుడెత్తిచూచుచున్॥ చ॥ నరపతులంగనుంగొనిమనంబున వారిఁదృణీకరించిమ॥ త్కరజలజాతదివ్యమణికాంచనమాలికనమ్మురారికిం। ధరమునలీలమైనిడిపదంపడిసవ్యవధూకదామమా। హరికబరిం దగిల్చితినయంబునఁ గన్నులలజ్జదేరఁగన్॥ అప్పుడు॥ చ॥ కొలఁదికిమీఱఁగానమరు గోముఖడిండిమపడ్డుశంఖకా। హళమురళీమృదంగపణవానకదుందుభిఝల్లకాంస్యమ। ర్దలమురజారజాదివివిధధ్వనులేపునభూసభోంతరంబునఁ జెలఁగెన్నటీనటసముల్లనరా రెమనోహరాకృతిన్॥ అంత॥ చ॥ అమరగణంబుఁ ద్రోచియురగారిసుధాకలశంబుఁ గొన్నచందమున సమస్తశత్రువసుధావరకోటిఁ దృణీకరించియు। క్కమలవిలోచనుండు ననుఁ గౌఁగిటనొప్పఁగఁ జేర్చిసింహచంక్రమణమెలర్పఁ గొంచుఁజనెఁ గాంచనచారురథంబుమీఁదికిన్॥ అట్లు రథారోహణంబుచేసిన॥ చ॥ తురగచతుష్కమున్నిమతదుర్ధమశూరతఁబూన్చిదారకుం। డరదముఁ బొప్పశత్రునికరాంధతమస్సటలప్రచండభా। స్కరరుచినొప్పనట్టినిజకార్ముకయుక్తగుణప్రఘోషసం। భరితదిగంతరుండగుచుఁ బద్మదళాక్షుఁడు వోవుచుండఁగన్॥ వ॥ అట్టియెడ సకలరాజ

లోకంబుఁ గృష్ణా! నీ విభవంబుఁ జూపోపకన సంఖ్యంబులగు మూఁకలు గట్టి యస్మన్మహాత్మ్యని మాహాత్మ్యంబు దెలియలేక దర్పాంధులై కడంగి॥ ఉ॥ భావభవప్రసూనశరబాధితమానసులై సమస్తధా। త్రివరనందనుల్ బలువుఁ దెంపును బెంపును సొంపు నేర్పడ। న్దేవకిరీటరత్నరుచిదీపితపాదసరోజుఁడైన రా। జీవదళాక్షుఁ దాఁకిరి విశృంఖలవృత్తి నతిప్రయత్నులై॥ అంత॥ చ॥ సరసిజలోచనుండు నిజశార్ఙశరాసనముక్తహేమపుం। ఖరుచిరశాతసాయకనికాయము లుగ్రపుకోటి నేసి సిం। ధురరిపువిక్రమప్రకటదోర్బలుఁడై విలసిల్లి యొత్తె ను। స్తరచలితాన్యసైన్యమును సజ్జనమాన్యముఁ బాంచజన్యమున్॥ ఉ॥ అత్తఱి భూరిచాపబలులై నవిరోధినరేశ్వరుల్ మృగ। వ్రాతము లాక్రమించు మృగరాజకిశోరముపై నెదిర్చిన ట్లాతురులై చతుర్విధసమగ్రబలంబుతోడఁ గూడిని। ధూర్జటికంఠకంఠుఁడైన నవలోయజనేత్రుని చుట్టుముట్టినన్॥ చ॥ అలిగి మురాంతకుండు గులిశాభశరంబుల నూత్నరత్నకుం। డలములతో శిరంబు లురణన్మణినూపురరాజిలోఁ బదం। బులుఁ గటకాంగుళీయకవిభూషణచాపశరాలితోడఁ జే। తులు నిలఁ గూలఁగా విజయదోహలియై దునుమాడె వెండియున్॥ క॥ హతశేషులు జోకాకకు। లగతి మూలని శాతపవనకాండములసముద్ధతి నేసి తోలి విజయోన్। న్నతుఁడై నిజనగరికేఁగెన గధరుఁ డంతన్॥ వ॥ అట్లు మహితమంగళాలంకృతంబును, నతిమనోహరవిభవాభిరామంబును నగు ద్వారకానగరంబునకరుగుదెంచిన మజ్జనకుండు ప్రియంబున దోడన జను దెంచి॥ చ॥ రణితవినూత్నరత్నరుచిరస్ఫుటనూపురహారకర్ణభూ। షణకటకాంగుళీయకలసత్పరిధానకిరీటతల్పవా। రణరథవాజిహేతినికరంబులను౦బధిజారికాతతిన్। బ్రణుతగుణోత్తరుండు నవపద్మదళాక్షునకిచ్చె నెమ్మితోన్॥ వ॥ ఇట్లు మహనీయతేజోనిధియైన మాధవుఁ డయ్యాపరిలబ్ధనిఖిలవస్తువిస్తారుండయ్యును నిజాధికారశుద్ధికొఱకు మఱలం గన్యారత్నంబును, వినూత్నరత్నవ్రాతంబును, సమర్పించె నని భూసురవిసరంబులు వినుతింప మాతండ్రి మైన బృహత్సేనుండు మన్నన. సమస్తవస్తువులను గృష్ణునకు సమర్పించి క్రమంబున సకలయాదవులను బూజించి మఱలి నిజపురంబునకుం జనియెనని చెప్పిన కుంతియుఁ గాంధారియుఁ గృష్ణయు నఖిలనృపాలకాంతాజనంబులును గోపికలుం దమతమ మనంబుల సర్వభూతాంతర్యామియు, లీలామానుషవిగ్రహుండును నైన పుండరీకాక్షు చరణారవిందస్మరణానందపరవశలై కృష్ణుం బ్రశంసించిరంత॥

## ✽ నారదాదిమహర్షులు శ్రీకృష్ణదర్శనంబు చేసికొని వసుదేవుని చేఁ గ్రతువు చేయించుట. ✽

చ॥ బలవదరాతిమర్దనులఁ బాండురనీలనిభప్రభాంగుల। న్గలితనిజాననాంబుజవికాసజితాంచితపూర్ణచంద్రమం। డలులఁ బరేశులన్నరవిడంబనులన్గరుణాపయోధుల। న్విలసదలంకరిష్ణుల నహీనసహిష్ణుల రామకృష్ణులన్॥ వ॥ సందర్శించు తలంపుల నందఱుఁ దమహృదయారవిందంబులఁ బ్రేమంబు సందడిం గొనసప్పుడు॥ ఉ॥ ధీరమతిన్ ద్వితత్రితకదేవలసాత్యవతేయకణ్వులున్। నారదగౌతమచ్యవననాకుజగార్గ్యవసిష్ఠగాలవాం। గీరసకశ్యపాసితసుకీర్తిమృకండుజకుంభసంభవాం। గిరులు యాజ్ఞవల్క్యమృగశృంగముఖాఖిలతాపసోత్తముల్॥ వ॥ చనుదెంచినఁ గృష్ణుండు వారలకుఁ బ్రత్యుత్థానంబు లాచరించి వివిధార్చనలు గావించి యిట్లనియె॥ సీ॥ సన్మునీశ్వరులార జన్మభాగ్యకులమైన మాకు నిచ్చోట సన్మతిని దేవనికరదృష్టాత్ములు నిరుపమయోగీంద్రులైన మీదర్శనంబబ్బె గాదె। ధృతిమందభాగ్యులింద్రియపరతంత్రులు నైన మూఢాత్ములకనఘులార। భవదీయదర్శనస్పర్శనచింతనపాదార్చనలు దుర్లభంబులయ్యు। నేఁడు మాకిట సులభమైనెగడెఁ గాదె। జగతిపైఁ దీర్థభూతులు సాధుమతులు। మిమ్ము దర్శించుటయ చాలు నెమ్మితోడ। వేఱ తీర్థంబులవసిపై వెదుకనేల॥ వ॥ అదియునుంగాక నుదకమయంబులైన తీర్థంబులును, మృచ్ఛిలామయంబులైన దేవగణంబులును, తీర్థదేవతారూపంబులుగా నుండుట లేదైనను చిరకాలసేవనార్చనలం గాని పావనంబులు సేయవు. సత్పురుషులు దర్శనమాత్రంబున నంబావనంబు సేయుదురని వెండియు॥ సీ॥ ఆదిత్యచంద్రాగ్నిమేదినీతారంబుమారుతాకాశవాఙ్మనములోలిఁ। బరికింపఁ దత్తదుపాసనంబులఁ బూని తపముల చేసమర్థములుగావు। సకలార్థగోచరజ్ఞానంబుగల మహాత్మకులు ముహూర్తమాత్రమున సేవనసేసి పావనములు సేయుదురది యెట్లుండె ధాతుత్రయయుక్తమైన। కాయమందాత్మబుద్ధియుఁ గామినీకుమారులందు స్వకీయాభిమానములను। దివిరి జలమున దీర్థబుద్ధియును జేయునట్టి మూఢుండు పశుమార్గుఁడనఁగ బరఁగు॥ వ॥ అని యిష్విధంబున గృష్ణుండాడిన సాభిప్రాయంబులగు వాక్యంబులు విని యమ్మునీంద్రులు విభ్రాంతహృదయులై యూరకుండి ముహూర్తమాత్రంబునకప్పుడు మహాత్మనను గ్రహంబు వడసి మందస్మితముఖులై యప్పుండరీకాక్షునకిట్లనిరి- దేవా నేము నుం దత్త్వవిదుత్తములయిన బ్రహ్మరుద్రాదులును భవదీయమాయావిమోహితులమయి యుండుము- నిగూఢంబయిన నీయిచ్ఛ చేత మమ్ము ననుగ్రహించితివి- భవదీయచరిత్రంబున నిక్కము నీవొక్కటియయ్యును బహురూపంబులఁ గానఁబడు విధంబున నీవు మొదలఁ గారణరూపంబున నేకంబయ్యును ననేకరూపంబులు గైకొని జగదుత్పత్తిస్థితిలయంబులకు హేతుభూతంబున నదిష్ఠితకర్మంబులందగిలి లీలావతారంబులు గైకొని దుష్టజననిగ్రహంబును, శిష్టజనరక్షణంబును౦ గావించుచుందువది

యగుటం గాక వర్ణాశ్రమధర్మంబులంగీకరించిపురుషరూపంబున వేదమార్గంబువిదితంబు సేసినబ్రహ్మరూపివి- తపస్స్వ
ధ్యాయనియమంబుల చేతహృదయంబు పరిశుద్ధంబుగావున బ్రహ్మస్వరూపంబులైన వేదంబులందువ్యక్తావ్యక్తస్వరూపం
బులేర్పడంగానుందువు- కావున బ్రాహ్మణకులంబు నెల్ల బ్రహ్మకులాగ్రణివైరక్షించిన మహానుభావుండవు-మాయాతీ
తుండవైననిన్నును,నీభూపాలవర్గంబును, నేమునుదర్శింపంగంటిమి మాజన్మవిద్యాతపోమహిమలు సాఫల్యంబులయ్యె
నీకునమస్కరించెదమనిబహువిధంబులఁగృష్ణునభినందించియమ్మురాంతకు చేతనామంత్రణంబులువడసితమతమనివాసం
బులకుఁబోవందలంచునవసరంబున॥సీ॥అమ్మునీశ్వరులకునానకదుందుభియతిభక్తివందనంబాచరించి।తాపసో త్తములా
రధర్మతత్త్వజ్ఞులుమిమ్మిం చివినుడునావిన్నపంబు । సత్కర్మవితతిచేసంచితకర్మచయంబువాపెడునుపాయంబునాకు। ఘ
నదయామతిఁ జెప్పుఁడనినసమ్మునివరుల్భావరుల్వినవసు దేవుఁజూచి। మెలమిఁబలికిరినిఖిలయజ్ఞేశుఁడైన। కమలలోచనుఁ
గూర్చియాగములు సేయఁ।గర్మమునఁబాయు నెట్టిదుష్కర్మమైన। నదియధర్మంబు గాఁగనీమదిఁదలంపు॥ అదియునుంగాక॥
క॥ దేవర్షి పితృజఋణములు। భూవరమఖ వేదపాఠపుత్రులచేత। న్వావిరిసీఁగనిపురుషుఁడు। పోవునధోలోకమునకుఁ బు
ణ్యాచ్యుతుఁడై॥అట్లగుటంచేసినీవును॥క॥ వరతనయాధ్యయనంబులు। ధరియించితిబుణయుగంబుదడయుకధరణీ।వర దేవ
బుణమునవనా। చరణుడవై యాగుటొప్పుసమ్మతితోడన్॥ క॥ అనవుడునవ్వసు దేవుఁడు। మునివరులకు ననిమెవినయ
మునమీరలుచె।ప్పినయట్లమఖము సేసెద । దినకరసిభులారమీరుదీర్పఁగవలయున్॥ వ॥ అనియభ్యర్థించియమ్మునీంద్రుల
యాజకులంగావరించియప్పుణ్యతీర్థోపాంతంబున మహేంద్రామితవైభవంబున నష్టాదశభార్యాసమేతుండై దీక్షఁగై
కొనియమ్మహాధ్వరంబు వేదోపదిష్టవిధింబరిసమాప్తించి, ఋత్విక్సికాయంబులబహుదక్షిణ లందనిపి భార్యాసమేతుం
డైయవభృథస్నానంబాచరించివివిధరత్నమణిమయ భూషణవిచిత్రాంబర సురభికుసుమానులేపనంబులు ధరించిసిఖల
భూదేవమునిబంధు రాజలోకంబులనుచితసత్కారంబులఁబ్రీతులంగావించినవారు కృష్ణానుమతినాత్మనివాసంబులకుం
జనిరందు॥ఉ॥అతఁడునుగ్రసేనవసుధాధిపపంకజనాభముష్టికా। రాతులుదమ్మునర్థి మధురప్రియభాషలనిల్వ వేఁడినన్।గా
తుకమాత్మలన్వేలయఁగావసియించిరి.గోపగోపికా।వ్రాతముతోడనచ్చటధరావరనందయశోదలిమ్ములన్॥క॥హరినయ
ములహరిప్రియములు।హరిమధురాలాపములనుహరికథలమ।నోహరకేళిఁదగిలినందుఁడు।నిరుపమగతినచటమూఁడు నెల
లుండెన్నృపా॥చ॥ జలరుహలోచనాదియదుసత్తములందఱునన్నిభంగుల।నలితవిభూషణాంబరనికాయముల్చ్చిబహూ
కరించిరీ। ఢాకలిపిననందముఖ్యులు ముకుందపదాబ్జమరందపానస। ల్లలితనిజాత్మషట్పదములన్మరలించుచు నెట్టకేలకున్॥
చనిచని॥గీ॥మఱలిమఱలికృష్ణమాధవ.గోవింద।పద్మనాభభక్తపారిజాత। దేవ దేవయనుచుఁదివిరిచూచుచుమధు।రాభిము
ఖులునగుచునఱిగిరంత॥క॥క్రమమునసచ్చటఁబ్రావృ।ట్సమయంబగుటయును బంధుజనయాదవవ।ర్గములోలిఁగొలువసు

*** ✱ శ్రీకృష్ణబలభద్రులుమృతులైన తమసహోదరులఁదెచ్చి దేవకీదేవికిఁగనుపఱచుట. ✱ ***

రగణ।నమితులబలకృష్ణులాత్మనగరంబునకున్ ॥ వచ్చిసుఖంబుననుండ నంత॥సీ॥ అవనీశయొకనాఁడానకదుందుభిభా
ర్యపద్మాక్షుఁడుబలుఁడుదొల్లి। శరధిలోఁజచ్చినగురుతనూభవునిని మఱలఁగ దెచ్చినమహిమ లెల్ల। జనములుదమలోన
నన్నుతి ప్రయంగవినితసుతులదుర్వృత్తుఁడైన । కంసు చేసిహతులై కాలునిపురినున్న వారినందఱఁజూడఁగోరికృష్ణ । బ
లరానాథయోగీశ్వరేశకృష్ణ॥క॥మురకంసచైద్యపౌండ్రక।నరకజరాతనయయవననరనాయకులం।దురితాత్ములఁబొరి,గొ
నిభూ।భరముడిపినయట్టి మేటిబలులుదలంపన్॥గీ॥జననవృద్ధివిలయసంగతినిఖిలంబుఁ।బొంద జేయుపరమపురుషులార। మీ
కులీలలౌటమీరనిన న్మిన। దాన నేనువినుఁడు దారులార॥ వ॥ అనిబహుభంగులవినుతించుచుని ట్లనియెమీరలుమహానుభావుల
రుమీయుత్తి ల్లియ నేక కాలంబుచనినక్రిందట మృతుండయి దండధరుమందిరంబుననున్న గురుకుమారుని మీమహాప్రభావం
బులలోకంబులఁబరిపూర్ణంబులయి ప్రకాశింపనకాలుని చెంతనుండిమగుడం దెచ్చిగురుదక్షిణగానొసంగితిరివ్విధం
బునంగంసునిచేతహతులయిన మత్పుత్రులనందఱమఱలం దెచ్చి నామనంబుననున్న దుర్గంబునివారింపవలయునని దే
వకీదేవిప్రార్థించినం దమతల్లియాడిన మృదువాక్యంబు లత్యాదరంబున నాదరించి యప్పుడబ్బలకృష్ణులు దమయోగ
మాయామాహాత్మ్యంబున సుతలంబునకుంజనిరట్టియెడ॥ మ॥ కనియెన్ దానవుఁడింద్రసేనుఁడు దరతకంజాతులన్ద
తులన్ । ఘనసారాంబుదవర్ణులన్నిఖిలలోకైకప్రభాపూర్ణులన్। దనరారన్హలచక్రపాణులనుభక్తత్రాణులన్ సత్య
శో। భనవర్ధిష్ణుల రామకృష్ణులజయభ్రాజిష్ణులన్ జిష్ణులన్॥చ॥ కనిహితకోటితోనెదురుగాఁజనుదెంచిమనోనురాగసం।
జనితకుతూహలుండగుచుఁజాగిలిమ్రొక్కిసమగ్రకాంచనా । సనములనన్నిచిచ్చరణసారససేచనసర్వలోకపా। వనస

లిలంబులొదలఘుప్రవంబుగఁదాల్చుసుభక్తియుక్తుఁడై॥ సీ॥ సురభికాలాగరుహరిచందనేలాది ధూపంబులావిశ్వరూపకుల కుఁ। గాంచనపాత్రసంగతరత్నకర్పూరదీపంబులాజగద్దీపకులకుఁ। బాయసాపూపాన్నపక్వఫలాదినైవేద్యంబులావేద వేద్యులకును। దనరువినూత్నరత్నప్రభాభాసితాభరణంబులాదైత్యహరణులకును। మిలమిలమెఱుంగుతోఁబొలుపలరుబహువిధాంబరంబులునీలపీతాంబరులకు। సలలితకుసుమమాలికామలయజాను।లేపనంబులుభూరికల్పులకును॥ వ॥ సమర్పించియప్పుండరీకాక్షునిచరణారవిందంబులొత్తుచు నానందబాష్పపూరంబుతోరంబుగా రోమాంచకంచుకితశరీరుండగుచుందనకరకమలంబులుఫాలభాగంబునంగదియించియిట్లనిస్తుతించె॥ ఉ॥ ధీయుతుఁడైనమోభగవతేహరయేపరమాత్మనేనమఃసం।దాయసమస్తభక్తవరదాయనమఃపురుషోత్తమాయకృ।ష్ణాయమునీంద్రవంద్యచరణాయసురారివిహారాయసాంఖ్యరూ।గాయవినీలభాస్వదలకాయరథాంగధరాయవేధసే॥ అనియభినుతించియిట్లనియె॥ ఉ॥ రాజసతామసాత్మలకురాదుగదానినుగానవ్యాసం।కేజదళాయతాక్షమునిగేయపవిత్రచరిత్రవిస్ఫుర।ద్రాజకళాధరాజసురరాజముఖామరమౌళిరత్నవి।భ్రాజితపాదపీఠభవబంధవిమోచనపద్మలోచనా॥ మ॥ మదినూహింపఁగయోగివర్యులుభవన్మాయాలతాబద్ధులై యిదమిత్థంబనలేరుతామసధృతిన్నేపారుమాబోటిదు। ర్మదులేరీతినెఱుంగబోలుదురుసమ్యగ్ధ్యానధీయుక్తనీపదముల్చేరెడిత్రోవఁజూపిభవకూపంబుద్ధరింపింపవే॥ ఉ॥ వైరముచేతఁజేదినృపవర్గముగామముచేతగోపికల్।మీరినభక్తినాశ్రితులుమిమ్మునహర్నిశమున్మనంబులం।దారఁగనీకరూపగుణతత్పరులైమిముఁబొందుకైవడిన్। భూరివివేకసత్వగుణముల్గలదేవతలందనేర్తురే॥ క॥ కానభవత్పదపద్మ।ధ్యానంబునగానిశాస్త్రతత్వంబులచేఁ గానరుశ్రుతిసంవేద్యము।నైనభవత్పదముచిన్మయాకారహరీ॥ వ॥ దేవాయేనరుండైననేమిశ్రద్ధాగరిష్ఠచిత్తుండై మిమ్ము సేవించునట్టిమహాత్ముండువిధిచోదితంబైన ప్రమాణంబువలన విముక్తుండైవర్తించునట్లుగావున యోగీశ్వరుండవైన నీవుయిాశిలవ్యులమైనమమ్ముసిష్పాపులంజేయుమనినుతియించిమఱియునిట్లనియె॥ మత్తకోకిల॥ కంటిఁగంటిభవాబ్ధిదాటఁగఁగంటిముక్తినిధానముల్।గంటినీకరుణావలోకముఁగంటిరూపమువీడము।కంటితామరచూలులుంబొడఁగాననట్టిమహాత్మనా।యింటికింజనుదెంచితీశ్వర యేఁగృతార్థతబొందితిన్॥ వ॥ దేవాయేనుభవద్దాసుండనేదిపంచినంజేయుదునిచ్చటికిమీరలువిజయంబుచేసికార్యంబానతీయవలయుననికరంబులుమొగిచి విన్నవించినంబుండరీకాక్షుం డతనివాక్యంబులకుసంతసిల్లియిట్లనియె॥ సీ॥ బలిదైత్యవినుమున్నుప్రథమయుగంబుననామరీచికిభార్యయైనవర్ష। యనునింతివలననందనులారుగురుద్భవమైరివారొక్కనాఁడబ్జభవుఁడు। దనపుత్రిపైమోహమునఁగూడరతికేళి యొనరింపవీరునవ్వుటయుఁగోధ।మందియాసురయోనియందుఁబుట్టుండనిఘనశాపమిచ్చెనవ్వనజజుండు। దన్నిమిత్తమునసువారుదగిలిహేమ। కశిపునకుఁబుట్టిరంతనాకొకసార్థ।మొదపవీరలఁదెచ్చియయ్యోగమాయ।యడరిదేవకిగర్భంబునందుఁజొనుప॥ క॥ దొరఁకొనికంసుఁడుదోడ్తోఁ।బొరిఁగొనెదత్పుత్రశోకమునఁదనచిత్తం। బెరియఁగదేవకివారల। దర్శింపంగోరెబనుపఁదగుననుకేంద్రా॥ క॥ వచ్చితిమివారిఁగ్రమ్మఱఁ।దెచ్చెదమనితల్లికోర్కెఁదీర్పఁగనిపుడే। మిచ్చటికినీకడంబొర। పొచ్చములేకున్నవారుపోవిరనఘా॥ క॥ వీరలదోకొనియిపుడే।ధారుణికిన్నేఁగిజనని తాపమువాపన్। వీరలశాపంబంతటఁదీరిమదీయప్రసాదధీయుతులగుచున్॥ క॥ పొలుపుగసుగతింబొందఁగఁ।గలరనిహరియానతిచ్చెఁగరుణాస్వాంతుఁడై। బలిచేరననుమతిఁగొనివా।రలఁదోకొనివచ్చెనిద్ధరామండలికిన్॥ అట్లువారలందెచ్చియిట్లనియె॥ క॥ కనుఁగొనుమువీరునీనం। దనులనిజననయిత్రికడుముదంబునఁ గనుగొని క॥ చన్నులుదిగ్గనఁజేపఁగగన్నులనానందబాష్పకణములుదొరుఁగ।నన్నిన్నగౌఁగిటనిడినను।గన్నప్పలువచ్చిరనుచుఁగౌతుకమొప్పన్॥ వ॥ అట్లుకౌఁగిటంజేర్చినిజాంకపీఠంబుననునిచిశిరంబులుమూర్కొనిచుబుకంబులుపుడుకుచుం బ్రేమాతిశయంబునమేనఁబులకలొలయం జన్నిచ్చినవారునువైష్ణవమాయామోహితులై స్తన్యపానంబు సేయుచుభగవంతుండైనరథాంగపాణియంగసంగమంబునవిగళితకల్మషులైవిరించిశాపసాగరంబుహరిదయాకటాక్షంబనునావచేతందరియించినిజస్వరూపంబులుధరియించికృష్ణునకుదల్లిదండ్రులకువందనంబాచరించిగగనపథంబుననిజస్థానంబునకఱిగిరంతదేవకీదేవితనమనంబున॥ క॥ చచ్చినబాలురఁగ్రమ్మరఁదెచ్చుటగడుచిత్రమనుచుదేవకిమదిలో।నచ్చెరుపడియదియంతయు। నచ్చపుహరిమాయగాకయనితలఁచెన్నృపా॥ క॥ పరమాత్ముఁడఖిలజగదీ।శ్వరుఁడగుకృష్ణుండుసేయుసత్కృత్యంబు।ల్వరికింపనెన్నబెక్కులు।ధరణీవరయనినరాజుదామునికనియెన్॥

## ❋ సుభద్రాపరిణయము. ❋

సీ॥ మునినాథపార్థుండువనజనాభునిసహోదరిసుభద్రనునేవిధమునఁబెండ్లి। యయ్యెనావిధమంతనాయ్యానఁగ్రమముతోఁదెలియంగనెఱిఁగింపుధీవిశాల। యనవుడునవ్యాసతనయుఁడాతనిఁజూచివినవయ్యనృపదేవవిభునిసుతుఁడు

మునితర్థియా తాఁసముత్సుకుండగుచునురమణబ్రిభాతీర్థముననుండి । యాతెలోదరితోడ నెయ్యంబుగలిమి । జూడఁగో
రుచు రాముండుసుందరాంగిఁ।గౌరవేంద్రునకీసమకట్టైననుచుఁ। దనకు నెఱిగింపనాపురందరసుతుండు॥వ॥అట్లుసుభద్రా
దర్శనోత్సాహంబుదనమనంబునసందడిగొనంద్రిదండివేషంబుధరియించి ద్వారకాపురంబునకుంజనుదెంచి యప్పౌరజ
నంబులుభక్తిస్నేహంబులననిశంబుఁబూజింపందనమనోరథసిద్ధియగు నంతకుంగాచికొని వానకాలంబుచను నంతకున
ప్పట్టణంబుననుండుసమయంబున॥క॥రాముఁడుదత్కపటాకృతిఁ।దామదిఁదెలియంగలేకదగనొకనాఁడా।భూమీవరతా
పసుఁబో।రామింగనియాత్మమందిరమునకుఁదెచ్చెన్॥ గీ॥ తెచ్చిభిక్షసేయదేవేంద్రతనయుండు । గుడుచుచుండియచటఁ
గోరిమెలఁగు।నసమబాణుమోహనాస్త్రంబుకైవడి। వీరమోహినసవిహారలీల॥ అట్లుసుభద్రవిహరించుచున్నసమయం
బున॥చ॥ జలరుహపత్రనేత్రుననుసంభవచారువఘూలలామస । ల్లలితవిహారవిభ్రమ విలాసములాత్మకువిందుసేయన।
బ్బలరిపునందనుండుగనిభావజసాయకబాధ్యమానవి । హ్వలహృదయాబ్జుఁడైనిలిపె నత్తరుణీమణియందుఁజిత్తమున్॥
ఉ॥ ఆతరుణీశిరోమణియునర్జునుసర్జునచారుకీర్తిని । ఖ్యాతునినింద్రనందనునకల్మషమానసుఁగామినీమనో । జాతునిఁజూ
చిపుష్పశరసాయకజర్ఝరితాంతరంగయై।భీతిలియుండెసిగ్గుమురిపెంబును మోహముదేరిచూపులన్॥వ॥అట్లాన్నపస త్త
మనుత్తకాళనులొండొరులచిత్తంబులుచిత్తజాయత్తంబులైకోరుకలుదత్తరింపందాల్మిలువీడిసిగ్గునంజిట్టుముట్టాడుచు
న్నయంతనొకకనాడు దేవతామహోత్సవనిమిత్తంబున నత్తలోదరిపురంబువెలుపలికి నరుగుదెంచిన నర్జునుండు కృ
ష్ణవసుదేవ దేవకీదేవుల యనుమతంబువడసి తానునుందోడన చనియవ్వడు॥ సీ॥ సాంద్రశరచ్చంద్రచంద్రికాస్ఫూర్తిచే
రాజిల్లుపూర్ణిమారజనివోలెఁ। బూర్ణేంబుబింబావతీర్ణమైయిలమీఁదభాసిల్లుహరిణడింభంబువోలె। సులలితమేఘమండ
లమును నెడవాసివసుధఁగ్రుమ్మరుతటిద్వల్లివోలెఁ। మాణిక్యరచితసన్నిహితచైతన్యంబువొందినపుత్తడిబొమ్మవోలె। లలి
తవిభ్రమరుచికళాలక్షణములఁ। బొసఁగరూపైనశృంగారరసమువోలె।నర్థిఁజరియించుచున్నపద్మాయతాక్షిఁ। బ్రకట
సద్గుణభద్రసుభద్రఁజూచి॥ వ॥ అప్పుడుడాయంజనియరదంబుపైనిడికొనిపోవుచుండంగనుంగొని యదుబలంబులుమదం
బునసంటం దాఁకిననప్పుడ యాఖండలనందనుండుప్రచండగాండీవకోదండ నిర్ముక్తకాండంబులందూలించి యఖండబా
హాదండవిజయప్రకాండుండై కాండవప్రస్థపురంబునకఱిగె - నటబలభద్రుండవ్వార్తవినివిలయసమయసమీరసఖునికై
వడింబటురోషభీషణాకారుండై క్రోధించినంగనికృష్ణుండాదిగాఁగల బంధుజనంబు లతనిచరణంబులకుం బ్రణమిల్లిమృ
దుమధురభాషణంబులననునయించియొడంబడునట్లుగానాడిన నతండునుసంతుష్టుండైమనంబునఁగలంకదేరియప్పుడు॥
క॥కరులన్నేరులనుత్తమ।హయలరున్మణిహేమభూషణాంబరభృత్యో।త్కరదాసికాజనంబుల।నరణముఁదగనిచ్చిపంపెనను
జకుఁబ్రీతిన్॥వ॥ఇట్లుకృష్ణునకభిమతంబుగా నర్జునసుభద్రలకరణంబిచ్చి పంపెననిచెప్పి శుకయోగీంద్రుండు మఱియుని

❋ శ్రీకృష్ణుఁడుబుషసమేతుండైమిథిలానగరమునకుఁబోవుట. ❋

ట్లనియె॥సీ॥నరనాథవినుభువనప్రసిద్ధంబుగదీపించునట్టివిదేహదేశ । మందుభూకాంతకునాననదర్పణంబనఁదనర్చినమిథి
లనుపురమునఁ।గలఁడుశ్రీహరిపాదకంజాతభక్తుండుగళిత రాగాదివికారుఁడమల। చరితుఁడక్రోధుండుశాంతుండునిగ
మార్థకోవిదుండగుశ్రుతదేవుఁడనెడి। భూసురోత్తముఁడొకఁడనిచ్ఛాసమాగ। తంబుతుష్టమైన హేమశైలంబుగాఁగఁ।
దలఁచిపరితోషమందుచుఁదగగృహస్థ।ధర్మమునసుండెసముచితకర్ముఁడగుచు॥ఉ॥అపురినేలువాఁడుబహుళాశ్వుఁడునా
నుతికెక్కినట్టిధా । త్రీపతియాధరామరునిరీతినినిష్కలుషాంతరంగుఁడై । యేపనులందుధర్మగతి నేమఱకర్థిఁజరించు
చుండెల । క్ష్మాపతివారిపైఁగరుణఁజేసిప్రసన్నముఖాంబుజాతుఁడై॥ వ॥ అట్లుకృష్ణుండువారలంజూచు వేడ్కనిజస్యంద
నారూఢుండైనారదవామదేవాత్రి కృష్ణద్వైపాయనాసితలోమశారుణ దివిజగురుకణ్వమైత్రేయచ్యవనులును నేనును
మొదలైనమునులనుగమింపంజనుచుఁదత్తద్దేశనివాసులగునార్తక, ధన్వ, కురుజాంగల, కంకణ, మత్స్య, పాంచాల, కుం
తల, మధు, కేకయ, కోసలాదభూవరులువివిధవస్తుప్రచయంబులుగానుకలిచ్చి సేవింపగ్రహమధ్యగతుండైదీపించుసూ
ర్యునింబోలియప్పుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుండగుచు వారలంగరుణార్ద్రదృష్టిఁజూచి యోగక్షే
మంబులరసిసాదరంబగుభాషణంబులనాదరించుచుంగతిపయ ప్రయాణంబులంజనిచనివిదేహనగరంబుడాయుటయునా
బహుళాశ్వుండమ్మాధవురాకవినిమనంబునహర్షించుచు వివిధపదార్థంబులుగానుకలుగాఁగొని తానునుశ్రుతదేవుండ
భ్రోచనుఁడుదారచరిత్రుఁడుపాపగోత్రసు। త్రాముఁడుభక్తలోకశుభదాయకుఁడైనరమేశుసద్గుణ।స్తోముని పాదప
ద్మములుసోఁకగమ్రొక్కినవారముల్తగన్॥చ॥ కరములుమోడ్చియోపరమకారుణికోత్తమనీవునీమునీ। శ్వరులునుమద్గృ

హంబునకువచ్చిమమున్నగ్రపఁజేసియిచ్చుట। న్నరమనురక్తిబూజనలుగైకొనుడంచునుతించివేఁడనా। హరిమనమందువారి
వినయంబులకెంతయుఁబ్రమోదమందుచుఁ॥ చ॥ తిరముగవారియిష్టములుదీర్పదలంచిమురాసురారియుం। డూరులనెఱుం
గకుండమునియూథముదానునునేఁగివారిమందిరములకేకకాలమునధీరతనాథరణీవరుండువా। రిరుహదళాయతాత్ము
మునిబృందములంగనకాసనంబులఁ॥ సీ॥ కూర్చుండనియమించికొమరారుకాంచనకలధౌతకలశోదకములచేతఁ। బాదము
ల్గడిగితత్పావనజలములుదానునుసతియుబాంధవజనంబుఁ। గరమర్థినిజమస్తకంబులుధరియించివివిధార్చనములుసద్విధి
నొనర్చి। మణిభూషణాంబరమాల్యానులేపనరాజితధూపనీరాజనములు। భక్తిగావించిపరిమృష్టబహువిధాన్న। పాయ
సాపూపపరిపక్వఫలములోలి। నారగింపంగఁజేసికర్పూరమిళిత। లలితతాంబూలములునెయ్యమలరనొసఁగి॥ వ॥ ఇట్లుస
మర్పించినయనంతరమ్మునమిథిలేశ్వరుండైనజనకుఁడుపరమానందంబునొంది॥ చ॥ హరిపదపద్మయుగ్మమునిజాంకతలం
బునఁజేర్చియొత్తుచుం। బురుషవరేణ్యయీనిఖిలభూతగణావలియాత్మలందుసుస్థిరమతిఁ గన్నసాక్షివిసుధీవరనీపదభక్త
కోటితో। నరయరమాహినాథచతురాస్యులుఁబోలరటందురెప్పుడుఁ॥ వ॥ అట్టిలోకవిదితంబైనభవద్వాక్యంబునిక్కం
బుగాభవదీయపాదారవిందంబులయందునొకానొకవేళలేశమాత్రధ్యానంబుగలనాగృహంబునకేంచనుండని చిత్తం
బునన్దలంపకభక్తవాత్సల్యుండవగుటంజేసివిజయముచేసితిరి, భవత్పాదపంకేరుహధ్యానసేవారతిందగిలినమహాత్ములు
ద్వద్ధ్యానంబులువదలంజాలుదురే నిరంతరంబునుశాంతచిత్తులైనిషిద్ధించనుల్లై యోగీంద్రులైనీవలనంగోరికగలవారలకు
నిన్నైనొసనిత్తువుగదాయనివెండియునిట్లనియె॥ గీ॥ కృష్ణపరమాత్మయదుకులక్షీరవార్ధి। పూర్ణచంద్రమదేవకీపుత్రసుజన।
వినుతనారాయణాచ్యుతవేదవేద్య। భక్తజనపోషపరితోషపరమపురుష॥ ఉ॥ శ్రీపురుషోత్తమాఖ్యయదుసింహకిశోరకభ
క్తలోకర। క్షాపరతంత్రనీవుమునిసంఘము. గొన్నిదినంబులుండవే। నీపదపద్మరేణువులు నెమ్మిమదీయగృహంబుసోఁకినఁ।
దాపసవంద్యయేనిపుడ ధన్యుడనయ్యెదఁగాదెమాధవా॥ వ॥ అనియభ్యర్థించినం బ్రసన్నుండైయప్పుండరీకాక్షుండుని
మికులప్రదీపకుండైన జనకచక్రవర్తింగరుణించి యమ్మిథిలానగరంబునఁ బౌరజనంబులకునున్నతశోభనంబులుగావిం
చుచుం గొన్నిదినంబులుండెనంత॥ మ॥ శ్రుతదేవుండునుమోదియై మునిజనస్తోమంబుతోనిందిరా। పతిఁదోకొంచునిజాల
యంబునకునొప్పన్నేగియచ్చోటను। న్నతిదర్భాస్తరణమ్ములన్నునిచిసమ్యగ్జ్ఞానపారీణుఁడై। సతియుందానుఁబదాబ్జము
ల్గడిగిచంచద్భక్తిఁదత్తోయముల్॥ చ॥ శిరములఁదాల్చినవ్యతులసీదళదామకుశప్రసూనవిస్ఫురదరవిందమాలికలఁబూ
జయొనర్చిగృహాంధకూపసం। చరణుఁడనైననాకడకుఁజక్రితనంతనెవచ్చునట్టిసు। స్థిరమతినున్ననే తపముఁజేసితినం
చునుసంతసించుచుఁ॥ గీ॥ మఱియుదత్పాదతీర్థంబుమందిరమునఁ। గలయఁజిలికించిసంప్రీతిగడలుకొనఁగ। బత్రఫలపు
ష్పతోయముల్భక్తినొసగి। హరిమురాంతకమూర్తినిజాత్మనిలిపి॥ గీ॥ మానితంబగువిశ్వనిధానమూర్తియైనకృష్ణుండుతన
యింటనారగించెఁ। దనమనోరథసిద్ధియుఁదనకునబ్బె। ననుచుబైపుట్టమల్లార్చియాడుచుండె॥ చ॥ తరుణియుదానుఁబు
త్రులుపదంపడికృష్ణుభజించుచుండఁ। చ్చరణములంకపీఠమునఁజూచినమెల్లనఁనొత్తుచుఁ రమా। వరుఁగనిపక్కి-భక్తజ
నవత్సలమామకభాగ్యమెట్టిదో। హరచతురాస్యులున్నెఱుఁగనట్టినినుంగనుఁగొంటినెమ్మితోఁ॥ క॥ మునియోగమానస
స్ఫుట। వనజంబులనెల్లప్రొద్దువసియింపుభవ। ఘ్నదివ్యమూర్తినాలోచనగోచరమయ్యెఁగాదెసర్వాత్మహరీ॥ వ॥ దేవానీ
సచ్చరిత్రంబులుగర్ణరసాయనంబులుగానాకర్ణించుచు నీకుంబూజలొనర్చుచు నీచరణారవిందంబులకువందనంబులుసే
యుచునీదివ్యనామకీర్తనంబుసేయుచుం దమ శరీరంబులు భవదధీనంబులుగామెలంగు నిర్మలబోధాత్ములగు వారిచిత్తం
బులనుదర్పణంబులంగానంబడుచుండుదు- కర్మనిష్ఠప్రచిత్తులైనవారిహృదయంబులనుండియుదూరగుండవగుదువనిమఱి
యునిట్లనియె॥ సీ॥ నీకుమ్రొక్కెదఁగృష్ణనిగమాంతసంవేద్యలోకరక్షణభక్తలోకవరద। నీపాదసేవనానిరతుననన్నునే
పనిఁబంపెదాసతిమ్మనిగృష్ణ। డెలనవ్వుమోమునఁజెలువొందనావిప్రకరమాత్మకరమునఁగదియఁజేర్చి। పాటించియ
తనితోఁబలికెదపక్ష్మక్తివరలినయమ్మునిపర్యులెపుడుఁ। దమపదాంబుజరేణువితానములును। దగులలోకంబులనుబవిత్రం
బుసేయు। వారుననుగూడిమెప్పుడువలయునెడ। లకరుగుదెంతునీభాగ్యగరిమనిటకు॥ వ॥ చనుదెంచిరిపుణ్యస్థలంబులును
విప్రులును దేవతలును, సంస్పర్శనదర్శనార్చనంబులంబాపములను సమస్తకల్మషంబులంబాయంజేయుదురదియునుంగాక
బ్రాహ్మణుండుజననమాత్రంబునజీవకోటియందుఘనుండైయుండుజపతపోధ్యానాధ్యయనాధ్యాత్ములఁజతురుండయి
యతండుత్తముండైవెలుంగు నతనింజెప్పనేలయని మఱియునిట్లనియె॥ క॥ నాపదివిప్రుల
మతకర్మాశ్రయుండయ్యేనేని యతండుత్తముండైవెలుంగు నతనింజెప్పనేలయని మఱియునిట్లనియె॥ క॥ నాపదివిప్రుల
మతకర్మాశ్రయుండయ్యేనేని॥ క॥ ఇదిమే
పైఁగల। ప్రేమమునాతనువునందుఁబెట్టనికతనఁ। భూమీసురులమ్మలునీ। వీమునులంబూజసేయుమిద్ధచరిత్రా॥ క॥ ఇదిమే.
నాకిష్టమునను। బదివేలవిధంబులోలయభజియించిననా। మనికింపగునటుగావున। వదలనిభక్తిన్భజింపువసుధామరులఁ॥

క॥ అనిసర్వలోకగురుఁడగు। వనజోదరుఁడానతిచ్చువాక్యంబులజా। డనెభూమీసురుఁడమ్మౌని। జనులకుసద్భక్తిఁబూజసలిపెన్వరుసన్॥ చ॥ ఎనయఁగఁగృష్ణుఁడంతమిథిలేశ్వరభూసురులన్నృపావలో। కనమొలయన్మనూనశుభగస్థితిఁబొందఁగఁజేసివారివీ। డ్కొనిరథమెక్కిదివ్యమునికోటియుఁదానుసుఖప్రెగ్రమ్మఱ। న్జనవరమోక్షదంబగుకుశస్థలికిం బ్రమదాంతరంగుఁడై॥

### ——* శ్రుతిగీతలనుపరమతత్త్వార్థప్రతిపాదకమైనపురాతనేతిహాసము. *——

వ॥ అనిచెప్పినబాదరాయణికిననభిమన్యునందనుండిట్లనియె - మునీంద్రా! ఘటపటాదివస్తుజాతంబుభంగినిర్దేశింపనర్హంబుగాకసత్త్వాదిగుణశూన్యంబైన బ్రహ్మంబునందు సత్త్వాదిగుణగోచరంబులైన వేదంబులేక్రమంబునం బ్రవర్తించు నట్టిచందంబునాకెఱింగింపుమనిన భూవరునకు మునివరుండిట్లనియె సకలచేతనాచేతనాంతర్యామియైనసర్వేశ్వరుండు సర్వశబ్దవాచ్యుండుగావున సకలజంతునివహంబులకు బుద్ధీంద్రియ మనఃప్రాణశరీరంబులనుసృజియించి చేతనవర్గంబునకుజ్ఞానప్రదుండుగాన సకలనిగమ సమూహంబులును, దత్స్వరూపవైభవప్రతిపాదకంబులుగావున ముఖ్యంబై ప్రవర్తించుశ్రుతిస్తోత్రం బుపనిషత్తుల్యంబు ననేకపూర్వఋషి పరంపరాయాతంబునునైన దీనిని శ్రద్ధాయుక్తుండై యెవ్వండనుసంధించునతనికి మోక్షంబుసులభంబుదీనికినారాయణాఖ్యానంబనునొక్కయుపాఖ్యానంబుగలదువినిపింతువినుము భగవత్ప్రియుండైన నారదుం డొక్కనాఁడు నారాయణాశ్రమంబునకుంజని ఋషిగణసమేతుండైన నారాయణఋషింగనుంగొని నీవుసన్నడిగినట్లనారదుండమ్మహాత్మునినడిగిన నతండు మున్నునీయర్థంబు శ్వేతద్వీపవాసులైనసనకసనందనాదిదివ్యయోగీంద్రులు ప్రశ్నసలిపిన వారలకుసనందనుండువాక్రుచ్చినప్రకారంబు నీకెఱింగించెదనని వక్కాణింపం దొడంగె శయానుండైనరాజశ్రేష్ఠునిం దత్పరాక్రమదక్షతాదిచిహ్నంబులనుతియించువందిజనంబులచందంబున జగదవసానసమయంబున ననేకశక్తియుతుండై యోగనిద్రావశుండైనసర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబుసేయువిధంబు నారాయణుండువారమనకుం జెప్పిన తెఱంగునవినుమనియిట్లనియె॥ సీ॥ జయజయహరి దేవ సకలజంతువులకు జ్ఞానప్రదుండవుగానవారి। వలనదోషంబులుగలిగినసుగుణసంతానంబుగాఁబరిజ్ఞానశక్తి। ముఖ్యషడ్గుణపరిపూర్ణతఁజేసిమాయాత్మవశిష్టుఁడవగుచుఁగార్య। కారణాత్మకుఁడవై కడఁగిచరించుచున్ననీయందుఁబయోరుహాక్ష। తివిరియామ్నాయములుప్రవర్తించుఁగానఁ। బ్రకటత్రిగుణాత్మకంబైనప్రకృతితోడ। యోగమింతయుమాన్పవే యోగిమాన। సాంబుజాతమధువ్రతనియతినుంచి॥ అదియునుంగాక॥ సీ॥ పరమవిజ్ఞానసంపన్నులైనట్టియోగీంద్రులుమహితనిస్తంద్రలీలఁ। బరిదృశ్యమానమైభాసిల్లునిస్సీమపర్వతముఖరప్రపంచమెల్లఁ। బ్రకటబ్రహ్మస్వరూపముగాఁగఁదెలియుదురెలమినీవుసుజగద్విలయవేళ। నవశిష్టుఁడవుగాన ననఘనీయందునీవిపుల విశ్వోదయవిలయములగు। ఘటశరావాదులగుమృద్వికారములుమృ। దాత్మకంబైనయట్లుసద్బ్రహ్మయతాక్ష। తవిలికారణరూపంబుఁదాల్చిలీలఁ। గడఁగినీయందుబుద్ధివాక్కర్మములను॥ క॥ అలవడఁజేయుచునుందురు। బలుకొనియిలఁబెట్టఁబడినపదవిన్యాసం। బులపతనకారణములుగ। నలవ్రుల సేవించుచును గృతార్థులరగుచున్॥ క॥ లీలంబ్రాకృతపూరుష। కాలాదికనిఖిలమగుజగంబులకెల్లన్। మాలిన్యనివారకమగు। నీలలితకథాసుధాబ్ధినిం గ్రుంకితగన్॥ చ॥ భరితనిదాఘతప్తుఁడగుపాంథుఁడుశీతలవారిఁగ్రుంకిదు। ష్కరమగుతాపముందొరఁగుకైవడిసంసరణోగ్రతాపము। న్వెరవునఁబాయుచుండుదురునిన్నుభజించుమహాత్మకుల్జరా। మరణ మనోగుణంబులఁగ్రమంబునఁబాయుటచెప్పనేటికిన్॥ అదియునుంగాక॥ సీ॥ అనయంబు దేహానిత్యానిత్యసద్విలక్షణమునఁబంచకోశవ్యవస్థ। లనువృద్ధిబొరయుచునందులోపలనున్నప్రాణాదిబుద్ధివిజ్ఞానమయము। లనుచతుష్కోశంబులవ్వలవెలుగొందునానందమయుఁడవుగాన దేవ। సురుచిరస్వప్రకాశుండవునీపరిగ్రహముగల్గుటఁజేసికాదెప్రకృతి। మహదహంకారపంచతన్మాత్రగగన। పవన తేజోంబుభూభూతపంచకాది। కలితతత్త్వంబుబ్రహ్మాండకార్యకరణ। మందునెవుడుసమర్థంబులగుటఁజేసి॥ క॥ కోరిశరీరులుభవదనుసారంబుననిహపరైకసౌఖ్యంబులఁబెం। పారగనందుచునుందురు। ధీరజనోత్తములనంగదివిజారిహరా॥ గీ॥ నిన్ననుసరింపనేరనికుజనులు। పవనపూర్ణచర్మభస్త్రిసమితి। వోలెఁజేయుచుందురుచ్ఛ్వసనంబులు। బలసియాత్మభేద భజనులగుచు॥ సీ॥ దేవకొందఱుసూక్ష్మదృక్కులైనమహాత్మకులు దరస్థుడైనవహ్ని। గామదిదలఁతురుగైకొని మఱికొందఱారుణులనుపేరనమరుఋషులు। లెలసుషుమ్నానాడీమార్గగతుఁడవైహృత్ప్రదేశమునఁజరించుచున్న। రుచిరదేహాకాశరూపిగాభావింతురట్టిహృత్పద్మంబునందువెడలి। వితతమూర్ధన్యనాసికాగతులనోలి। బ్రహ్మరంధ్రంబుఁబ్రాపించి పరమపురుష। సుమహితానందమయపరంజ్యోతియైనయీశునినుఁబొందిమఱిపుట్టరిలమహీశ॥ వ॥ మఱియువివిధకాష్ఠాంతర్గతుండైనవాయుసఖుండుదద్గతదోషంబునంబొరయకనిత్యశుద్ధుండై తరతమభావంబున వర్తించుచందంబునస్వసంకల్పకృతంబులైనవిచిత్రశరీరంబులందునంతర్యామివై ప్రవేశించితత్తద్విచిత్రయోగనియతంబైన హేయంబునంబొరయక సకలా

త్మకంబై యేకరసంబై బ్రహ్మంబైన నినున్నైహికాముష్మికఫలసంగమంబులేక విగతరజోగుణంబులందగిలి భజ
యించుచుండుదురదియునుంగాక దేవా భవదీయసంకల్పాధీనంబులైన శరీరంబులం బ్రవేశించి యున్న జీవసమూహంబు
నీకు శేషభూతంబని తెలిసికొందఱు భవనివాకరంబైన శ్రీమత్త్వచ్చరణారవిందంబులు సేవించి కృతార్థులగుదురు మఱియు
ను॥సీ॥ అనఘ దుర్గమమైన యాత్మతత్త్వంబు ప్రవర్తించుకొఱకు దివ్యంబులైన। యుచితరామకృష్ణాద్యవతారముల్ప్రజేయుం
చేయున్న నీ భవ్యచరిత। మను సుధాంభోనిధిని వగాహనము సేసి విశ్రాంతచిత్తులై వెలయుచుండి। మోక్షంబుబుద్ధిని పేక్షిం
పనొల్లరు మఱియుఁ గొందఱు భవచ్చరణసంక। జములఁ దగిలి పుణ్యతములైన హంసల। వడువునొండి భాగవతజనములనో
నరువారు ప్రకటయోగిజనాప్తమై। నట్టిముక్తిఁ గోరరాత్మలందు॥ఉ॥ కొందఱు నీ శరీరములకుం దిరితభక్తి భవద్వశంబులై। జెం
దఁగ నీపదాబ్జములు సేరి భజించుచుఁ దత్సుఖాత్ములై। యుందురు కొందఱీతనువులో లిఖరించి భవత్పదాబ్జముల్ప్వొందుగఁ
గొల్వ లేక నిలఁబుట్టు మఁజచ్చుచునుందురవ్యయా॥చ॥ యమనియమాది యోగమహితాత్మకులైన మునీంద్రులున్వరో। ధము
నదలంచు శైద్యవసుధావరముఖ్యనృపుల్ఫణీంద్రభో। గములననొప్పుబాహువులు గల్గిన మిమ్ము భజించు గోపికల్। గ్రమ
మున నేమనున్సరియకామె భవత్కృపకంబుజోదరా॥మ॥ అరవిందాక్ష భవత్స్వరూపముఁ బ్రత్యక్షంబునం గాననె। వ్వ
రికింబోలదు శాస్త్రగోచరుఁడవై వర్తింతువీస్సృష్టిమున్। ధరసద్రూపుడవై ననీవలన నీధాతాద్యమర్త్యుల్జనిం। చిరినిన్నంతి
కమున్నెఱుంగఁగల మేచింతింప నేమచ్యుతా॥ వ॥ అట్టి నిన్ను బరమాణుకారణవాదులైన కణ్వ గౌతమాదులును బ్రకృతి
కారణవాదులైన సాంఖ్యులును దేహాత్మవాదులైన బౌద్ధులును వివిధంబులైన కుతర్కంబులచేతం బరస్పరావ్యాహతం
బులైన మతంబులు దమతమ కుతర్కవాదంబుల సమర్థించుచు నిన్నుం దెలియలేరు మహాభాగ్యవంతులైన యోగీంద్రులకు
నీవు ప్రత్యక్షంబైన నివియన్నియు నసత్యంబులని కానవచ్చు- వెండియుఁ గొందఱు సచరాచర వస్తుజాతంబులకు నంతర్యా
మివై సర్వంబు నీవ యగుటం దెలియలేక ననిత్యంబనియును విపరీతబుద్ధిం దెలియుదురు గాని భవదీయ దివ్యతత్త్వంబు నికరం
బుగఁ దెలియనేరరు కొందఱు జగద్భరితుండవు గాన జగద్రూపకుండవైన నిన్నుం గటకమకుటకర్ణికాదివివిధభూషణభేదం
బులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించు చందంబున జగద్వికారానుగతుండవయ్యును నిఖిలహేతుప్రత్యనీకక
ల్యాణగుణాత్మకుండవై యుండుదువనియాత్మవిదులైన వారు దెలియుదురదియునుంగాక॥మ॥ వనజాతాక్ష భవత్పదాబ్జ
యుగ సేవాసక్తులైనట్టియ। జ్జనముల్సంసృతి ఘోరంబుఁ దన్నిఘనసంసారాంబుధిన్ దాఁటి పా। వనులై లోకములం బునీతము
లుగావర్తించుచున్నిత్యశో। భనమైయొప్పెడి ముక్తిఁ బొందుదురు శుంభద్వైభవోపేతులై॥మ॥ మిము సద్భక్తిభజింపనో
ల్లకిలదుర్మేధస్స్ప్రవర్తించు నీ। చమతివ్రాతము నేర్పునం బసులఁ బాశశ్రేణి బంధించుచం। దమున నేకగుణనామరూపముల
ల్లకిలదుర్మేధన్ప్రవర్తించునీ। చమతివ్రాతము నేర్పునంబసులఁ బాశశ్రేణిబంధించుచం। దమునస్వేకగుణనామరూపముల
చేత న్వారిబంధించిదు। ర్గమసంసారపయోధిఁ ద్రోతువు దరత్కంజాతపత్రేక్షణా॥వ॥ దేవా కర్మమూలంబులైన పాణపా
చేత న్వారిబంధించిదు। ర్గమసంసారపయోధిఁ ద్రోతువు దరత్కంజాతపత్రేక్షణా॥వ॥ దేవా కర్మమూలంబులైన పాణపా
దంబులు లేనివాఁడవయ్యును స్వతంత్రుండవు బ్రహ్మాదులు భవత్పరతంత్రులై యుండుదురు- స్థిరచరరూపంబులు గల చేతన
కోటికి నీవు సర్వవిధినియంతవు కావున నీకృపావలోకనంబు గలవారికి మోక్షంబు కరస్థితంబై యుండు భవత్కృపావలోక
నంబు లేని కష్టాత్ములు నష్టాత్ములై దుర్గతింగూలుదురట్టి జీవులు దేవతిర్యఙ్మనుష్యస్థావరాది శరీరంబులు సొచ్చియణురూపు
లై యుందురం దును నీవుందువు తదంతరాత్మవగుచు మఱియును॥క॥ మదిదలపోయగ జలబు। ద్బుదములు ధరబుట్టిపోవుపోలికెగ
లయి। త్రిదశాది దేహములలో। వదలక వర్తించు నాత్మవర్గములోలిన్॥ గీ॥ ప్రళయవేళ నీవు భరియింతువంతకుఁ। గారణం
బవగుటఁ గమలనాభ। భక్తపారిజాత భవభూరితిమిరది। నేశ దుష్టదైత్యనాశ కృష్ణ॥చ॥ అనఘ జితేంద్రియస్ఫురణులయ్యు
నుజంచలమైన మానసం। బను తురగంబు బోధమహితాత్మవివేకపు నూలిత్రాటన। ల్లనఁగదియంగఁ బట్టనుదలంచుచు ముక్తి
కుపాయలాభమే। యనువున లేమికిన్వగలనొంచెదు నాత్మలు వోతలంపగన్॥ చ॥ గురుపదపంకజాతములు గొల్వనివార
లుపాయమహాబ్ధిని। స్తరణకుఁ గర్ణధారరహితంబగు నావననుగ్రహించు చే। హరిగతి భూరిదుస్తరభవాంబుధి లోనమునుంగు
చుందురం। బురుహదళాక్ష నిత్యపరిపూర్ణుఁడవై తనరారు నిన్నొగిన్॥గీ॥ పుత్రదారగృహక్షేత్రభూరివిషయ। ఘనసుఖా
స క్తుఁడగుచు నేమనుజుఁడేని। నర్థి భజియించువాఁడు భవాబ్ధిలోనఁ। జెంది మెన్నాళ్ళకును దరిఁ జేరలేడు॥సీ॥ జగతిపైఁ గలతీ
ర్థసాధనంబులు నెల్లఁబుణ్యానువర్తనస్ఫురితులగుచు। బాటించి నీయందు బద్ధమత్సరములు లేక భక్తామరావోకహంబు। నగు
భవత్పాదాబ్జయుగళంబు సేవించి భవపాశముల నెల్లఁ బారదోలి। సమమతులై యదృచ్ఛాలాభతుష్ట మేరుసమముగాఁ
గైకొని సాధులగుచుఁ। బాదతీర్థంబు గల మహాభాగవతజ। నోత్తమోత్తములైనట్టి యోగివరుల। వారకెప్పుడు సేవించు
వాఁడు పొందుఁ। బ్రవిమలానందమయమోక్షపదము మఱియు॥వ॥ సత్త్వైన ప్రకృతివలన నుత్పన్నంబైన యీ జగత్తు సత్తుగా
వఁ యునది మొల్లనిం గనకోత్పన్నంబులైన భూషణంబులు గనకమయంబులై కానంబడు చందంబున ననిసాంఖ్యుం షువలి.

కనవిని, యద్వైతవాదియిట్లను- నెయ్యదియుత్పన్నంబుగాదదియు సత్తుంగాదనువ్యతిరేక వ్యాప్తినియమంబు నిత్యసత్యంబైనబ్రహ్మంబునందుఁదర్కాహతంబగుంగావున బ్రపంచంబుమిథ్యయని నిరూపించిన నాప్రపంచంబు బ్రహ్మవిశేషణంబై కార్యకారణావస్థలంగలిగియున్ననంతమాత్రంబునమిథ్యగానేరదా ప్రపంచంబునకుంగార్యకారణావస్థలునిత్యంబులుగావుననవస్థాద్వయయుక్తంబైన ప్రపంచంబుసత్యంబని వెండియు నద్వైతియిట్లను. బహుగ్రంథప్రతిపాదితంబైనజగన్మిథ్యాత్వంబు లేమివెట్లనిననదియునుంగర్మవశులైన జడులనవిద్యాప్రతిపాదకంబై కుతర్కసమేతంబైన భారతీయంథపరంపరావ్యవహారంబునంజేసిభ్రమియించుఁ- గారణావస్థలయందు బ్రహ్మవిశేషణంబైనసూక్ష్మరూపంబునఁబ్రపంచంబుసత్తైయుండు- నసత్యంబుబాధాయోగ్యంబుగావుననీకువిశేషణంబైయుండును నీవు దేహగతుండైన దేహియందునంతర్యామివయ్యుంగర్మఫలంబులం బొరయకగర్మఫలభోక్తయైన జీవునకుసాక్షిభూతంబవైయుండుదువట్టినిన్నునజ్ఞులైనమానవులునిజకంఠలగ్నంబైనకంఠికామణి నిత్యసన్నిహితంబై వెలుంగుచుండినంగానక వర్తించు తెఱంగునహృదయపద్మమధ్యంబుననంతతేజోవిరాజమానుండవై ప్రకాశించునిన్నుం దెలియలేరు- సకలబ్రహ్మాండనాయకుండవైన నీయందు శ్రుతులుముఖ్యవృత్తింబ్రవర్తించునని శ్రుత్యధిదేవతలునారాయణు నభినందించిన తెఱంగున సనందనుండుమహర్షులకెఱింగించినప్రకారంబనినారాయణఋషి నారదునకుంజెప్పినయమ్మహాత్ముండుమజ్జనకుండైన వేదవ్యాసమునీంద్రునకునుపన్యసించెనయ్యర్థంబునతండునాకుంజెప్పినవిధంబుననీకుంజెప్పితి నీయుపాఖ్యానంబు సకలవేదశాస్త్ర పురాణేతిహాససారంబుపనిషత్తుల్యంబుదీనిఁబఠించువారును వినువారునువిగతకల్మషులై యిహపరసౌఖ్యంబులనొంది వర్తింతురనిచె

### పరీక్షిత్తునకుశుకయోగివిష్ణుసేవాప్రాశస్త్యంబుచెప్పుట.

ప్పినశుకయోగీంద్రునకు రాజయోగీంద్రుండిట్లనియె॥ మ॥ మునినాథోత్తమ దేవదానవులలో ముక్కంటిసేవించువా । రనయంబుస్పృహశక్తిసంపదలసౌఖ్యానందులై యుండన। వ్వనజాతాక్షురమామనోవిభునిశశ్వద్భక్తిసేవించుస।న్మునివర్యుల్లడుఁబేదలౌటకుఁ గతంబున్నాకెఱింగింపవే॥ సీ॥ నావుడుశుకయోగినరనాథుఁగనుఁగొని వినుమెఱింగింతుఁదద్విధముఁదెలియ।ఘనశక్తిసహితుండుకాలకంధరుఁడుదావినుతగుణక్రియాన్వితుఁడుగాన। రాగాదియుక్తమైరాజిల్లుసంపదలాతనిఁగొలుచువారందుచుందు। రచ్యుతుఁబరమునననంతగుణాతీతుఁబురుషోత్తమునినాదిపురుషునసఘు । నర్థిభజియించువారురాగాదిరహితు। లగుచుదీపింతురెంతయుననఘచరిత । ధర్మనందనుఁడశ్వమేధంబుఁజేసి। పిదపసాత్త్వికకథనముల్ప్రీతితోడ॥ఉ॥ నారదసంయమీంద్రువలనన్వినుచుండియనంతరంబపం । కేరుహనాభుఁజూచియడిగెన్ దగనిప్పుడునీవు నన్నునిం । డారినభక్తిమైనడిగినట్లయతండునుమందహాసనం । స్ఫారకపోలుఁడైపలికెఁబాండుతనూభవుతోడఁజెచ్చెరన్॥ సీ॥ వసుమతీనాథయెవ్వనిమీఁదనాకనుగ్రహబుద్ధివొడమునాతనివిత్త । మంతయుఁగ్రమమునసపహరించినవాఁడుధనహీనుఁడగుచుసంతాపమందు।విడుతురుబంధులవ్వ్యథమునసొందిల్మైచేయునదిలేకయఖిలకార్య। భాగఁబులుడిగిమద్భక్తులతోమైత్రినెరపుచువిజ్ఞాననిరతుఁడగుచుఁ॥ బిదపవాఁడవ్యయానందపదమునాత్మఁ । బరగిశ్రీవిష్ణులోకసంప్రాప్తినొందుఁ।గానమత్సేవమిగులదుష్కరమటంచు।వదలిభజియింతురితరదేవతలనెపుడు॥క॥ సేవింపవారుదమకుం। గా

### శివద్రోహంబుసేయంబూనినవృకాసురుండువిష్ణుమాయచేమడియుట.

వించినశోభనములుగనినిజములుగా।భావించివారుమఱతురు। భావములఁగృతఘ్నవృత్తిఁబనితమపనిగన్॥క॥ వెలఁగుచునుందురుదీనికిఁ। గలదొకయితిహాసమిపుడుగైకొనినీకుం।దెలియఁగఁజెప్పెదదానన । నలవడునీవడుగుప్రశ్నకగు నుత్తరమున్॥క॥శుకుఁడనుదైత్యునితనయుఁడు। వృకుఁడనువాఁడొకఁడుదుర్వివేకుఁడుసజన।ప్రకరములనలఁపఁదిరువున। నొకనాఁడొవిగుండిదివ్యయోగంగనుచున్॥ క॥ కరములుమోడిచిమానీ।శ్వరనారదలలితధీవిశారదనన్నం। గ్గరుణించియానతీశుభ।కరులగుహరిహరహిరణ్యగర్భులలోనన్॥గీ॥ కడఁగికొలువశీఘ్రకాలంబులోదన। యిష్టమైనవరముఁయిచ్చునట్టి। దైవమెవ్వఁడనినదానప్రఁగనుఁగొని । మునివరుండువలికెముదముతోడ ॥వ॥ వినుముదుర్గుణసుగుణంబులలోనొక్కటియెచ్చటంగలుగునచ్చటనక్షణంబకోపప్రసాదఫలంబులుచూపువాఁ డమ్మహేశ్వరయందు ఫాలలోచనుఁడివ్విధఁబుఁ దెలిసినపరైబాణాసురదశకంధరులు సమగ్రభక్తియుక్తులై సేవించి యసమానసామ్రాజ్యవైభవంబులనొంది ప్రసిద్ధులైరట్లుగావుననీవునమ్మహాత్ముని సేవింపుమతనివలన నభిమతఫలంబులు వేగఁబ్రాప్తంబయ్యెడినని చెప్పిననతఁడక్షణంబ॥ సీ॥ దీపించుకేదారతీర్థంబునకునేఁగియతిసాహసాత్మకుండైనయసుర। లోకమువ్వెరగఁదనాకాలకంధరుసరదఁనినంబికావరునిఁగూర్చి । తన మేనికండలుద్దండుడైఖండించియగ్నికాహుతులుగానలరవేల్చె । దర్పకారాతిప్రత్యక్షుఁబుగాకున్నఁజంయుకస్తవాసకములందుఁ।బూనితత్తీర్థమునఁగృతస్నానుఁడగుచు।వెడలుమృత్యుప్రకారనాపెలయునట్టి । గంగ్రగొడ్డఁటఁ

దనమస్తకంబుదునుము। కొనఁగఁబూనిననయ్యగ్నికుండమునను॥క॥ అరుదుగవెలువడిరుద్రుఁడు।గరుణదలిర్పంగవానిక
రమాత్మకరాంబురుహమునబట్టితెగువకుఁ। ఔరవలవదుమెచ్చువచ్చెసుమహితచరితా॥క॥నీమదిఁబొడమినకోరిక। లే
మైననువేఁడుమిపుడయిచ్చెదననిసన్। దామనమునసంతసపడి।యామనుజాశనుఁడుహరుపదాంబుజములకున్॥గీ॥ వందనంబాచరించియోయిందుమకుట। ఫాలలోచనవరదమత్పాణితలము। నేనునెవ్వనితలమీఁదనిడినవాని। మస్తకమునూ
ఱువ్రయ్యలైమడియనీవె॥క॥అనివేఁడిననమ్మాటకు। వినిమదనారాతినవ్వివిబుధాహితుకోరినవరమదడయఁకిచ్చినఁ। ద
నుజుఁడుదద్వరపరీక్షఁదాఁజేయుటకున్॥ అక్షణంబవరదానగర్వంబుననుద్వృత్తుండైకడఁగి॥ ఆహరుమస్తకమునఁగడు
సాహసమునఁజేయివెట్టఁజడియకగదియ। నొహెహోతనమెచ్చులుదన। కాహాపైవచ్చెననుచునభవుఁడుభీతిన్॥క॥ దను
జుఁడుదనవెనువెంటం। జనుదేముల్లోకములునుసంత్రాసముగై। కొనిపాఱసురులుమనములఁ। దనికిరిదానికినిబ్రతివిధా
నములేమిన్॥అట్లుచనిచని॥ సీ॥ నిరుపమానందమైనిఖిలలోకములకునవలమైయమృతపదాఖ్యఁదనరి। దినకరచంద్రదీధితు
లకుఁజొరరాకసలలితసహజతేజమునవెలుఁగు। సమధికంబగుశుద్ధసత్వగరిష్ఠమైకరమొప్పయోగీంద్రగమ్యమగుచు। హ
రిపదధ్యానపారాయణులైనతద్దాసులకలరునివాసమగుచుఁ। బ్రవిమలానంతతేజోవిరాజమాన। దివ్యమణిహేమకలిత
సందీప్తభవ్య।సౌధమంటపతోరణస్తంభవిపుల। గోపురాకీర్ణసురమువైకుంఠపురము॥వ॥ కనుంగొనియవ్మహాస్థానంబు
డాయంజనుటయునప్పుండరీకాక్షుండఖండవైభవంబునంగుండలీశ్వరభోగతల్పంబునంబరమానందకందళితహృదయా
రవిందుండైయుందిరానయనచకోరకంబులనిజమందహాససాంద్రచంద్రికావితతిందేల్చుచు నార్తభక్తజనరక్షణంబుపని
గామెలంగుచువివిధవినోదంబులందగిలియుండియు ఫాలలోచనుండద్దనుజపాలునకుందలంపకనిచ్చినవరంబుతనతలమీఁ
దవచ్చినంగలంగిచనుదెంచుటతనదివ్యచిత్తంబుననెఱింగియకాకలకంధరునియవస్థలనివారింపందలంచియయ్యిందిరాదే
వితోడివినోదంబుచాలించియప్పుడు॥సీ॥ తాపింఛరుచితోడఁద్రస్తరించెడుమేనుపసిఁడిముంజియుఁదగుపట్టుగోఁచుగు।ధవ
ళాంశురుచిజన్నిదంబునుదిన్ననిదండంబుసేతఁగమండలంబు। పసపుగోఁచియుఁజెన్నిపట్టెవర్ధనమునురాజతంబైనమృగా
జినంబుఁ।దూలాడుశిగయునుద్రేలుమారటగోఁచిద్రేలిమిబొట్టునుద్రేళ్ళదర్భ।దనరసందీప్తహవ్యవాహనసమాన।కాంతి
జెలువొందియద్భుతక్రమమెలర్పఁ। జతురగతిసద్వటుకవేషంబుదాల్చి। వచ్చియానీచదానవవరునిఁజేరి॥ వ॥ కైతవంబు
ననతనికిసమస్కరించి మృదుమధురభాషణంబులననునయించుచు నయ్యసురాధమునకిట్లనియె - నిర్వ్యథంబున మార్గపరి
శ్రాంతుండవైయింతదూరంబేల చనుదెంచితిసకలసౌఖ్యకారణంబైన యీశరీరంబునిరర్థకంబుచేసివృథాయాసంబున
దుఃఖపఱుపందగునే యిమ్మెడంగొంతదడవువిశ్రమింపుమీప్రయాసంబునకుంగతంబెయ్యది కపటహృదయుండవుగాక
నీయత్నవసాయంబెఱింగింపుమనిమృదుమధురంబుగాఁబలికిననమ్మహాత్ముని సుధారసతుల్యంబులైనవాక్యంబులువినిసంత
సిల్లియప్పిశితాశనుండుదనపూనినకార్యంబతనికెఱింగించిన॥చ॥హరిదరహాసమొప్పఁబిశితాశనుఁగన్గొనిపల్కెదానవే।
సిల్లియప్పిశితాశనుండుదనపూనినకార్యంబతనికెఱింగించిన॥చ॥హరిదరహాసమొప్పఁబిశితాశనుఁగన్గొనిపల్కెదానవే।
శ్వరమునుదక్షుశాపమునఁజాలపిశాచపతౌటసూనృత।స్ఫురణముమానిసంతతముబొంకుచునుంపఁబురారి మాటనీ।వ
శ్వరమునుదక్షుశాపమునఁజాలపిశాచపతౌటసూనృత।స్ఫురణముమానిసంతతముబొంకుచునుండుఁబురారి మాటనీ।వ
రయకవెంటనేఁగఁదగ దాతనిసేఁతలుమాకువింతలే॥ గీ॥ నిజమువలికెనేనినెఱిఁదనతలమీఁద।నీకరంబుమోపనీకఁదలఁగి।
వచ్చునోటునితనివలనఁబ్రత్యయమును।దగులనేమిగలదుదనుజవర్య॥ గీ॥ అశుచితోడనతనినంటఁగఁబనిగాదు। కాలఁజే
యిఁగడిగికరముహార్చి।యతనివెంటవేడ్కనఱుగుదువేనీవు।నవతలంటఁదగులునసురనాథ॥మ॥అతిదుశ్శంకలుమానిపొమ్మ
నినదైత్యారాతిపాయావిమో। హితుఁడైవిస్మృతినొందితామసమునన్నేపారివాఁడాత్మపా। ణితలంబున్దననెత్తి
మోపికొనితానేలన్వెసంగూలెవి।గ్రుతదంభోళిహతిన్వడిఁబడుమహాక్షోణీధరంబోయనన్॥ వ॥ అట్లుతనతలనూఱువ్ర
య్యలైనేలంగూలెనయసురంగనియప్పుడు॥క॥సురలసురాంతకుమీఁదన్।వరమందారప్రసూనవర్షములోలిన్।గుఱిసిరితు
ములంబైదివి।మొఱసెన్సురదుందుభిప్రముఖతూర్యంబుల్॥క॥ పాడిరిగంధర్వోత్తము। లాడిరిదివినప్సరసలునన్యోన్యము
గన్।గూడిరిగ్రహములుభయములవీడిరిమునికోటులంతవిమలచరిత్రా॥ క॥ మురహరుఁడెలనవ్వొలయఁగఁ।బురహరుఁ
గనుఁగొనిపలికెభూతేశ్వరయీ।నరభోజనుండునీకి। త్తఱినెగ్గొనరింపఁదలఁచితానేపొలిసెన్॥ వ॥అదియట్లుండకాదెయి
జగంబునసధికుండైనవానికినపకారంబుగానెంచినమానవులకుశుభంబుగలుగునేయదియునుంగాకజగద్గురుండవగునీకవ
జ్ఞఁదలంచుకష్టాత్ముండువాలియఁటంజెప్ప నేలనట్టిదుష్టచిత్తులకిట్టివరంబులిచ్చుటకర్జంబుగాదనియప్పురాంతకుపీడ్కొలి
పినతండుమురాంతకునినేకవిధంబులనభినందించినిజమందిరంబునకుంజనియెననిచెప్పియిట్లనియె॥ క॥ మానవనాయక
యీయాఖ్యానముఁజదివిననువిన్నఘనపుణ్యులునిత్యానందసౌఖ్యములుపెం। పూనుదురటమీఁదముక్తిఁ బొందుదురెల

## భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యంబు శోధించుటకుం బోవుట.

మిక్॥ అని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె॥ క॥ జననాయక యింకం బురా। తనవృత్తం బాకటిసీకుండ గనెఱిఁగింతు। న్వినుము తపోమహిమలఁ జెం। దిన మునిజనులును సరస్వతీనదిపొంతన్॥ క॥ వితతక్రియ లొప్పఁగ స। త్క్రతువు లనొనరింప నచటఁ గైకొని లక్ష్మీ। పతిభవపితామహులలో। నతులితముగ నెవ్వఁ డధికుఁడని తమలోనన్॥ వ॥ ఇట్లు తలపోసి తన్మహత్త్వం బంతయుం దెలిసిరమ్మని భృగుమహామునిఁ నమ్మునివరు వేల్పులకడకుం బంపిన నత్తాపసోత్తముండు చని చని ముందటు॥ క॥ జలరుహసంజాతుసభా। స్థలమునకొగి నేఁగి యతని సత్త్వగుణంబు। న్దెలియుటకై నుతివందన। ములు సేయక నున్న నజుఁడును సమును సయనుచున్॥ క॥ మనమునఁ గలఁగుచు భృగు తన। తనుజాతుం డగుటఁ బుద్ధిఁ దలఁచినవాఁడై। ఘనరోషస్ఫురితాగ్ని। గ్నవయము శాంతోదకముల నల్లన నార్పెన్॥ చ॥ మహితతపోధనుండు మునిమండనుఁ డవ్వెడఁ బాసి వెండియు। న్నహిపతిభూషఁ గానరజతాద్రికి నేఁగి యనగ్గిరీంద్రుపైఁ। దుహినమయూఖశేఖరుఁడు దుర్గయుఁ దానును విశ్రమింపుచున్। ద్రుహిణతనూభవుండు చనుదెంచుట కాత్మఁ బ్రమోదమందుచున్॥ క॥ కనుఁగొని భ్రాతృస్నేహం। బునఁ గౌఁగిటఁ జేర్చ ననుచు మొకకొంటి రయం। బున నెదు తేఁగిన మునిరు। ద్రునియందుల సత్త్వగుణముఁ దెలియుటకొఱకై॥ అతనిఁ గైకొనక యూరకుండిన॥ ఉ॥ ఆనిటలాంబకుండు గమలాసననందనుఁ జూచి భూరికా। లానలరోషవేగభయదాకృతిఁ దాల్చి పటుస్ఫులింగసం। తానము లొల్కు శూలమునఁ దాపసముఖ్యునిఁ రంబ్ర వేయఁగా। బూనినఁ బార్వతీరమణి భోరున నడ్డము సొచ్చి చెచ్చెరన్॥ క॥ తనవిభుపాదములకువం। దనముం గావించి సముచితప్రియముల న। య్యనలాత్మునికోపము నా। ర్చిన నమ్మునినాథుఁ డచట నిలువక చనియెన్॥ సీ॥ పొలుపొందు వైకుంఠపురమున కర్థితోఁ జని యందు సమధికైశ్వర్య మొప్పఁ। గమలాంకపర్యంకగతుఁడై సుఖించు నకౌస్తుభభూషవక్షస్థలంబుఁ। దనపాదమునఁ బెట్టుద న్నెఁదన్నినఁ బాన్పుడిగి వచ్చి మునిఁ జూచి నగధరుండు। పదములఁ గెఱఁగి యో పరమతపోధన యీగతి నీవచ్చు టెఱుఁగలేక। నున్న నాతప్పు మన్నించి నన్నుఁ గరుణఁ। జూచి యాదివ్యమణిమయస్ఫూర్తి దనరు। రుచిరసింహాసనమునఁ గూర్చుండు దివ్య। తాపసోత్తమ యభయప్రదాననిపుణ॥ క॥ అలఘుపవిత్రభవత్పద। జలములు నసునస్మదీయజఠరస్థజగం। బులు లోకపాలురను బాలు। పలరఁగ బుణ్యాలను జేయు ననఘచరిత్రా॥ వ॥ మునీంద్రా భవదీయపాదాబ్జహతి మద్భుజాంతరంబునకు భూషణం బయ్యె భవదాగమనంబు మాబోటివారికి శుభావహంబు గాదె యే సుధన్యుండనైతినని మృదుమధురాలాపంబుల ననునయించిన నమ్మునివరుండు లక్ష్మీనాథు సంభాషణంబులకుఁ జిత్తంబునం బరమానందంబు నొంది యమ్ముకుందు ననంతకల్యాణగుణనిధి నభినందించి యానందబాష్పధారాసిక్తకపోలుండగుచుఁ దద్భక్తిపారవశ్యంబున నొండు పలుకనేరక యతనిచేత నామంత్రణంబు వడసి మఱలి సరస్వతీతీరంబున నున్న మునుల సన్నిధికిం జనుదెంచి వారలం గనుంగొని॥ సీ॥ మునినాయకులతోడఁ దనపోయి వచ్చిన తెఱఁగును దనమది దృష్టమైన। మూఁడుమూర్తుల విధంబును నెఱిఁగించిన విని వారు మనముల విస్మయంబు। నంది చిత్తంబుల సందేహములు వాసి చిన్మయాకారు లక్ష్మీసతీశుఁ। డనుపముఁ డనవద్యుఁ డఖిలకల్యాణగుణాకరుఁ డాదిమధ్యాంతరహితుఁ। డై తనర్చిన పుండరీకాక్షుఁ డొకఁడు। గాకఁ బ్రణుతింప దైవ మొకఁ డను వేఱు। కలఁడె యని బుద్ధివిజ్ఞానకలితులగుచు। హరిపదాబ్జాతయు

## శ్రీకృష్ణుండు మృతులయిన విప్రసుతులం దెచ్చుట.

గళంబు నర్థిఁ గొలిచి॥ వ॥ అట్లు సేవించి యవ్యయానందంబైన వైకుంఠధామంబు నొందిరని చెప్పి వెండియు నిట్లనియె॥ సీ॥ నరనాథ యొకనాఁడు నలినాయతాక్షుండు పొలుచు కుశస్థలిపురమునందు। సుఖముండ నొక్క భూసురవర్యుభార్యకుఁ బుత్త్రుండు జన్మించి పుట్టినపుడ। మృతుఁడైన ఘనశోకవితతిచేఁ గ్రాఁగుచు నాడింభకుని గొంచు నవనిసురుఁడు। చనుదెంచి పొలుచు రాజద్వారమునఁ బెట్టి కన్నుల బాష్పాంబుకణము లొలుక। బాపురే విధి ననుదుఃఖపఱపఁ దగునె। యనుచుఁ దూరుచుఁ దనుఁ దిట్టికొనుచు వగల। డెందమందంద నెఱియ నాక్రందనంబు। సేయుచును వచ్చి యావిప్రశేఖరుండు॥ సీ॥ అధికశోకంబున నలమటఁ బొందుచు నచ్చటి జనులతోఁ ననియెఁ జెలుచ। బ్రాహ్మణద్వేషవంతుఁడై తగశాస్త్రపద్ధతి నడువకఁ బాపవర్తి। యగు క్షత్రబంధువుఁ డగు వాని దురితంబుచేత మత్పుత్త్రుండు జాతమైన। యప్పుడ మృతుఁడయ్యె నకట హింసకు రోయక నప్పుడ న్యాయకారి। యగుచు విషయానుగతచిత్తుఁడైనయట్టి। రాజు దేశంబు ప్రజలు నిరాశలగుచు। దుఃఖములఁ జాలవనటఁ బొందుదురటంచు। నేడ్చుచును నచట నిల్వక నేఁగినపుడు॥ వ॥ ఇవ్విధంబున మఱియుం దనసుతులు మృతులైన వారలం గొనివచ్చి యెప్పటియట్ల పలవరించుచు నవ్విప్రుండు రాజుమొగసాలం బెట్టి రోదనంబు సేయుచు నెప్పటియట్ల కొన్ని గాథలు సదివి పోవుచుండె నవ్విధంబున నెనమండ్రు సుతులు మృతులైన పిదపం దొమ్మిదవకుమారుండైన శిశువు నెత్తి తెచ్చి యెప్పటివిధంబునఁ బలవరించుచున్న బ్రాహ్మణుని గని యర్జునుం డిట్లనియె॥ క॥ ఈపగిది నీవు వగల। న్వాపోవఁగఁ జూచి యకట వారింపఁగఁ

దా। నోపినవిలుకాఁడొక్కఁడ। దపురివేడమ్యెనయ్యాయిదిపాపమగుక్ ॥ సీ ॥ పుత్రులఁగోల్పోయిభూరిశోకంబుగువ
టిఁబొందుచువిప్రవీరులుచాల। నేరాజురాజ్యముం జేనివసించుదురారాజుదలపోయననిమీదనటునిగా నాత్మనెన్నఁదన
నీపుత్రునేఁబ్రతికించెదనిపుడుఫ్రాని। యటుసేయనైతినేనలంబుసొచ్చెదననిభూసురుఁడువెరఁగందఁబలుక। నతఁడువిని
యూచెడుగుమాటలాడఁదగునె। భూరివిక్రమశాలిరాముండుమేటి। బలుఁడుహరియును స్థైర్యసంపన్నులనఁగ। దనరుప్ర
ద్యుమ్నుఁడతనినందనుఁడుమఱియు॥ గీ॥ వినుతబలులైనయాదవవీరవరులు। గలుగవారలచేఁగానికార్యమీవు। చక్కఁజెట్టు
టమెట్లునీచనెడితోఁచెఁ బొమ్ము పాపుడనయ్యింద్రపుత్రుడపుడు॥క॥మనమునదురహంకారము। ఘనముగఁబొడమఁటయు
నపుడుగవ్వడిచెవు నీ। గనుఁగొనియచ్చటిజనములు। వినఁగానిట్లనియెరోషవిహ్వలమతియై ॥ మ ॥ బలుఁడంగానుమురాసు
రాంతకుఁడఁగాఁబ్రద్యుమ్నుఁడంగానునేఁ। దలఁపందత్తనయుండఁగాననివిరుద్ధవ్రాతముస్ఫీషణో। జ్వలగాండీవధనుర్వి
ముక్తనిశితాస్త్రశ్రేణిచేఁబిట్టుపెం। టలుగావించుపరాక్రమప్రకటచండస్ఫూర్తిసేపార్థుఁడక్॥అదియటునుంగాక ॥ చ ॥ బ
లిమిమురాంతకుండొడరిచాపకువిజృంభణమొప్పనెక్కటిక్। దలపడిపోరుఁబట్టిరణధైర్యనినిన్నునెలుంగవక్కటా। జెలు
కురమృత్యుదేవతనుబింకమడంచిభవత్తనూజుల। న్నలవుఁజలంబుఁజూపికొనియాఁడఁగనిప్పుడెతెచ్చియిచ్చెదక్॥ వ॥ అనిన
మ్మాంబలికినయర్జున ప్రతిజ్ఞకుభూసురుండుమనంబుననూరడిల్లియతని నభినందించుచు నిజమందిరంబునకుం జనికొన్నిదినం
బులుండువంతకుందనభార్యకుఁ బ్రసూతివేద నాసమయంబైనంజనుదెంచివివ్వచ్చుంగనితద్విధం బెఱిఁగించినయ్యింద్ర
తనయుండప్పుడు ॥ చ ॥ లలితవిశిష్టసంచితజలంబులనాచమనంబుఁజేసిసు। స్థలముననిల్చిరుద్రునకుసన్నుతిమొక్కిమహా
స్త్రవేదిని। ర్మలశుభమంత్రదేవతలమానసమందుఁదలంచిగాండివం। బలవడనెక్కుఁద్రొచిబిగియంగదియించిసిషంగయు
గ్మముక్॥ఇవ్విధంబునఁగట్టాయితంబయియప్పుడు॥సీ॥భూసురువెంటనిమ్మలనేఁగిసూతికాభవనంబుచుట్టునుబాణవితతి న
రికట్టిదిక్కులునాకాశపథముధరాతలంబెల్లనీరంధ్రముగను। శరపంజరముఁగట్టిశౌర్యంబుదీపింపఁగడునప్రమత్తుఁడైకా
చియున్న। మొడనమ్మహీసురునింతికిఁబుత్రుండుజనియించెనప్పడచ్చటిజనంబు। పోయెఁబోయెఁగదేయనఁబొబ్బలిడఁగ।
బొందితోడనయాకాశమునకుమాయెఁ। జెందినప్పుడుదుఃఖంబునొందిభూమి। సురుఁడువిలపించుచునుమురహరుసికడకు॥
అప్పుడుచని॥క॥ముందఱనిల్చిముకుందస। నందనమునివినుతనందనందనపరమా। నందశరదిందుచందన।కుందయశస్సాంద్ర
కృష్ణగోవిందహరీ॥ వ ॥ అవధరింపుముదేవాయర్జునుఁడనెడిపౌరుషవిహీనుండాడినవృథాజల్పంబులునమ్మిపుత్రుంగోలుప
డిబేలనైననన్నునేమందు నిఖిలవిశ్వోత్పత్తిస్థితిలయంబులకుఁ బ్రధానహేతుభూతుండవైన నీవుసమర్థుండవయ్యువారిం
పంజాలకచూచుచుండనొక్కమనుష్యమా। త్రుండుదీర్పంజాలెడువాఁడుగలండేయనివెండియు॥ క॥ ఎక్కడిపాండుతనూ
భవుఁ। డెక్కడివిలుకాఁడునీనికెక్కడిసత్వం। బెక్కడిగాండీవముదన। కెక్కడిదివ్యాస్త్రసమితియేమనవచ్చుక్॥ క॥ అని
తనునోడకనింద్రిం। చినయయ్యర్జునుఁడుచాలఁజిడిముడిపడుచుక్। దనవిద్యావహిమపెంపునఁ। జనియెన్వైవసదండపాణిస
దనంబునకుక్॥ క॥ చనియందుధారుణీసుర। తనయులులేకుంటఁదెలిసితడయకనింద్రా।గ్నినిరృతివరుణసమీరణ।ధనదేశా
నాలయములువగఁబరికించెక్॥ వెండియు ॥ చ॥ నరసురయక్షకింపురుషనాగనిశాచరసిద్ధసాధ్యఖే। చరవిహగేంద్రగుహ్య
కపిశాచనివాసములందురోసిభూ। సురసుతులేఁగినట్టిగతిచొప్పడకుండుటఁజూచి క్రమ్మఱక్। ధరణికినేగుదెంచిపెడిదం
బుగనగ్నిసొరంగఁబూనినక్ ॥ వ ॥ ఇవ్విధంబంతయునెఱింగియమ్మురాంతకుండువిప్రనందనులకుఁజూపెదననియనలం
బుసొరకుండనతనినివారించియప్పుడు ॥ ఉ॥ సుందరదివ్యరత్నరుచిశోభితమైతనరారుకాంచన। స్యందనమంబుజాప్తుఁడు
ద యాచలమెక్కువిధంబుదోఁపఁబొ। రందరిదానునెక్కితనురశ్ములుదిగ్వితతిక్ వెలుంగఁగో। విందుఁడుదారలీలఁజనెవిప్ర
తనూజగవేషణార్థియై ॥ చ ॥ చనిపురగోష్ఠిదుర్గవనజానపదాచలపఙ్క్తులఁబ్రభూ। తనదనదీసరోవరయుతక్షితినంతయు
దాఁటిసప్తవా। ర్నిధులదీవులంగులగిరిప్రకరంబులను త్తరించిమే। రునగమునాక్రమించుచుమరుద్గతితోరథమేఁగెనత్త
తిక్॥ చ॥ మసలకభూరిసంతమసమండలముందరియంగఁజొచ్చినా। హసమునఁబోవఁబోవఁగభయంకరమైమదిగోచరిం
పమిక్। వసుమతిమొక్కరిల్లిరథవాజులుమార్గముదప్పినిల్చినక్। బిసరుహపత్రలోచనుఁడభేద్యతమఃపటలంబువాపఁ
గక్॥ సీ ॥ బాలభానుప్రభాభాసమానద్యుతిఁగరమొప్పనిజరథాంగంబుబనుప। నమ్మహాస్త్రంబేఁగిచిమ్మచీఁకటినెల్లనతి
ముఱినందందనరికివైచి। యగ్రభాగంబుననతులితగతినేఁగనామార్గమునసిజస్యందనంబు। గడువడిఁదోలియాకడిఁదిత
మోభూమిగడచముందఱకడఁగానరాక।మిక్కుటంబుగదృష్టిమిఱిమిట్లుగొలుప। చదలవెలుఁగొందుదివ్యతేజంబుచూచి।మొ
నసిగాండీవిగన్నులుమూసికొనుచు। నాత్మభయమందికొంతదవ్వఱిగియఱిగి ॥ గీ ॥ కడిఁదిదుర్వారమారుతోత్కటవిధూ
వ। చటులసర్వంకషోర్మిభీషణగభీర। వారిపూరంబుసొచ్చితన్నీరమధ్య। భాగమునఁగోటిసూర్యులప్రభలువెలుఁగ॥ వ॥అ

దిమఱియునుం జారుదివ్యమణి సహస్రస్తంభాభిరామంబునాలంబితకమనీయనూత్నరత్న మాలికాలంకృతంబును భాను శశిమయూఖాగమ్యంబును ననంతతేజోవిరాజితంబును బునరావృత్తిరహితమార్గంబును నిత్యైశ్వర్యదాయకంబును న వ్యయంబుననత్యున్నతంబును ననూనవిభవంబును బరమయోగీంద్ర గమ్యంబును బరమభాగవత నివాసంబును నైయొప్పునద్దివ్యధామంబునందు॥ సీ॥ సాంద్రశరచ్చంద్రచంద్రికాకర్పూరనీహారహారాభ దేహమమర। నిందిందిరేందీవరేంద్ర నీలద్యుతిఁగరమొప్పుమేచకకంఠసమితి। నరుణాంశుబింబభాసురపద్మరాగవిన్యస్తసహస్రరుమస్తకములు। వివృతాననో ద్గతవిషధూమరేఖలలీలఁజూపట్టిననాలుకలును। గలితసాయంతనజ్వలజ్వలనకుండ। ములవిడంబించువేడిచూపులునుగలిగి। ధూరికలధౌతగిరినిభాకారమమరఁ। బరగుభోగీంద్రభోగతల్పంబునందు॥ సుఖాసీనుండైయున్నవానిడాయంజననప్పుడు॥ సీ॥ సజలనీలాంబుదశ్యామాయమానాంగునాశ్రితావనముదితాంతరంగు। సనకాదియోగిహృద్వనజమరాళేంద్రుముఖ పద్మరుచిజితపూర్ణ చంద్రుఁ। గమనీయనిఖిలజగద్ధితచారిత్రుఁబ్రత్యూషసంఫుల్లపద్మనేత్రు। నింధిరాహృదయారవిందా రుణోల్లాసుశ్రీకరపీతకౌశేయవాసు। హారకుండలకటకకేయూరమకుట। కంకణాంగదమణిముద్రికావినూత్న। రత్ననూపురకాంచీవిరాజమాను। భవమహార్ణవశోషసద్భక్తపోషు॥ వ॥ మఱియుసనందనాదిమునిజనసంతతసేవితు, నానందకంద ళితహృదయారవిందు, నరవిందవాసినీవసుంధరాసుందరీసమేతు, నారదయోగీంద్రసంకీర్తనానందితు, నవ్యయు, ననఘు, ననంతు, నప్రమేయు, నజితు, నవికారు, నాదిమధ్యాంతరహితు, భవలయాతీతు, గరుణాసుధాసముద్రు, నచ్యుతు, మహాను భావుఁ, బరమపురుషుఁ, బురుషోత్తము, నిఖిలజగదుత్పత్తిస్థితిలయకారణుఁ, జిదచిదీశ్వరు, నష్టభుజుఁ, గౌస్తుభశ్రీవత్సవక్షు, శంఖచక్రగదాశార్ఙ్గాదిదివ్యసాధను, సర్వశక్తిసేవితుఁ, బరమేష్ఠిజనకుండగు నారాయణుంగనుంగొని దండప్రణా మంబులుసేసి కరకమలంబులు మొగిచిభక్తి పూర్వకంబుగా నభినందించినయయ్యాదిదేవుండు వారలంగరుణావలోకనం బులునిగుడనవలోకించిదరహాసపూరంబుతోరంబుగాసాదరంబుగనిట్లనియె॥ క॥ ధరణికిఁద్రేఁగగుదైత్యులఁ। బొరిపొరివధి యించిధర్మమున్నిలుపుటకై। ధరజనియించితిరిరువురు। నరనారాయణులనంగనాయంశమునన్॥ క॥ ఆరూఢనియతితోఁ బెం। పారినమిమునిమ్మునీంద్రులందఱుఁజూడం। గోరినమీవచ్చుటకై। ధారుణిసురసుతులనిటకుఁదగఁదేవలసెన్ ॥ క॥ అని యాడింభకులనుదో। కొనిపొండనియిచ్చివీడుకొలిపినవార। స్వినుతులఁబెక్కువిధమ్ముల। వినిపించుచునచటువాసివిప్రుని సుతులన్॥ వ॥ తోడ్కొనిసంప్రాప్తమనోరథులైయబ్బాలకులంద త్తద్వయోరూపంబులతోడఁదెచ్చియాబ్రాహ్మణునకు సమర్పించివనతండుసంతుష్టాంతరంగుండయ్యెనయ్యవసరంబున ॥ చ ॥ అనిమిషనాథనందనుఁడహర్పతితేజుఁడుగృష్ణుతో డఁదా। జనియచటంగనుంగొనియుసర్వశరణ్యునిఁబుండరీకనే। త్రునినిజధామవైభవసదున్నతతన్మహనీయకీర్తికి। న్మన మునమోదమందిపలుమారునుసన్నుతిఁజేసెభూవరా॥ గీ॥ వాగిజాక్షునిభక్తమందారునసఘుఁ। గృష్ణునఖిలేశుఁగేశవుజి ష్ణుఁబరము। వినుతిసేయుచుఁదత్పాదవనజములకు। వందనములాచరించియానందమొందె॥ అంత॥ మ॥ హరిసర్వేశుఁడనం తుఁడాద్యుఁడభవుండామ్నాయసంవేదిభూ। సురముఖ్యప్రజలన్సమస్తధనవస్తుశ్రేణినొప్పారఁగాఁ। బగిరక్షించుచుధ ర్మమున్నిలుపుచున్బాపాత్ములన్ద్రుంచుచు। న్బరమోత్సాహమెలర్పఁభూరిశుభవిభ్రాజిష్ణుఁడైద్వారకన్॥ క॥ జనవినుత ముగాఁబెక్కేస। వనములుదనుఁదానఁగూర్పివైదికయుక్తి। న్ఘనరించుచునను రాగమునమనమునఁదళుకొత్తదైత్యమర్దను

లీలామానుషవిగ్రహుండగుశ్రీకృష్ణునివంశానుక్రమము.

డెలమిన్ ॥ వ ॥ అట్లుకృష్ణుండుద్వారకానగరంబునఁబూజ్యంబగురాజ్యంబుసేయుచుఁబురందరవిభవంబుననిరవొందికన కమణిమయవిమానమంటపగోపురప్రాసాదసౌధచంద్రశాలాంగణాదివివిధభవనంబులందును, రంగదుత్తుంగతరంగడో లావిలోలకలహంస చక్రవాకకారండవసారస క్రౌంచముఖజలవిహగవిలసదుచ్ఛలిత గరుదనిలదరదమలకమలకు ముదక హ్లారసందోహనిష్యందమకరందరసపానమదవ దిందిందిరకులకలగాయకఝుంకారనినదంబులును, నిరంతరవసంతసమ యసముచితపల్లవితకోరకితబాలరసాల జాలలాలితకిసలయవిసరఖాదనజాతకుతూహలాయమానకపోయి కంఠకలకంఠ కలరవమృదంగఘోషణంబులును, నిశితనిజచంచూపుటనిర్దళిత సకలజననయనానందసుందరనందిత మాకందపరిపక్వఫల రంధ్రవిగళితమధురరసాస్వాదనముదిత రాజకీరశారికానికరమృదుమధురవచనరచనావంశకృత్యంబులు, నమరపురంధ్రీ జనపీనపయోధరమండలవిలస్తలలితకుంకుమపంకసంకులసౌగంధ్యానుబంధబంధురగంధానుమోదితుండును, జందనాచ లసానుదేశసంజాతమంజుళమాధవీలతానికుంజపుంజమంజుల కింజల్కరంజితనివాసవిసరవిహార మాణశబరికాకబరికా పరిపూర్ణసురభికుసుమమాలికాపరిమళవహుండును, గళిందకన్యకాకల్లోలసందోహపరిస్పందకందళితమందగమనుండు ననగు మందానిలవిమానకునిచేఁ బోషితాభ్యాసితలాలితలగు సేలాలతావితానసటునటనంబుల విరాజితంబులగుకా

సారతీరభాసురోద్యానంబులందును, జారుఘనసారపటీరచాలరసాలసాలనీపతాపింఛజంబూజంబీరనింబకదంబప్రముఖముఖ్యశాఖిశాఖాకీర్ణశీతలచ్ఛాయావిరచితవిమలచంద్రకాంతోపలవేదికాస్థలములందు, నుదంచితపింఛవిభాసితబాలనీలకంఠకేకారవాకులీకృతకృతకమహీధ్రంబులందును-లలితమణివాలుకానేకపులినతలంబులందును. కప్పురంపుదిప్పలను, కురువేరుచప్పరంబులను, విరచితదారుయంత్రనిబద్ధకలశనిర్యత్పయోధారాశీకరపరంపరాసంపాదితనిరంతరహేమంతసమయప్రదేశంబులనిందిరారమణుండు షోడశసహస్రవధూయుక్తుండై యందఱకన్నిరూపులై లలితసౌదామినీలతాసమేతనీలనీరదంబులపిడంబించుచుం గర్పూరరేణుకాకలితదిగ్గజంబునోజరాజిల్లుచుసలిలకేళీవిహారంబులు మొదలయినలీలావినోదంబులుసలుపుచునంతఃపురంబునం గొలువున్నయవసరంబున - వివిధవేణువీణాదివాద్యవినోదంబులను, మంజుగానంబులను, గవిగాయకసూతవందిమాగధజనసంకీర్తనంబులను. నటనటీజననాట్యంబులను, విదూషకపరిహాసోక్తులను, సరససల్లాపమృదుమధురభాషణంబులం బ్రొద్దుపుచ్చుచు నానందరసాబ్ధినోలలాడుచుండెనంత ॥మ॥ అరవిందాక్షపదాంబుజాతయుగళధ్యానానురాగక్రియా। సరసాలాపవిలోకనానుగతచంచత్సౌఖ్యకేళీరతిన్ । దరుణుల్ నీపుపచారులై వెలుమహోత్సాహంబునం జొక్కి-తత్వరలై మొందువలంపకుండిరి సవిభ్రాంతాత్మలై భూవరా॥అదియునుంగాక॥మ॥ హరినామాంకితమైనగీతమొకమాటాలించి మూర్ఛాత్ములు । స్వరతిం బొందంగ జాలయందురటయా విశ్వాత్ము నీక్షించుచు। స్పరిరంభించుచు నంటుచున్నగుచు సంభాషించుచున్నుండుసుం । దరులానందనిమగ్నలౌటకిల చోద్యంబేమి భూవల్లభా॥ అని చెప్పి మఱియునిట్లనియె ॥ఉ॥ వారకఁ గృష్ణుఁడిప్పగిది వైదికవృత్తి గృహస్థధర్మమే । పారగఁ గాంచి ధర్మమునునర్థముఁ గామమునందుఁ జూపుచు । న్గారకమీవిసజ్జనులకుం గతిదానయనంగనొప్పెసం । సారగతిన్మెలంగె నృపసత్తమలోకపిడంబనాగ్రమై॥సీ॥ హరియిట్లు గృహమేధియగుచు శతోత్తరషోడశసాహస్రసుందరులను । మునునీకు నెఱుఁగఁ జెప్పినరీతినందఱకన్నిరూపములు దానర్థిఁ దాల్చి । కైకొని యొక్కొక్క కామినీమణియందు రమణనమోఘవీర్యమునఁ జేసి । పదురేసికొడుకులం బడసె రుక్మిణ్యాదిపట్టమహిషులకుద్భవులునైన । నందనులలోనధరణినెన్నంగ బాహు । బలపరాక్రమవిజయసంపద్విశేష । మానితాత్ములుపదునెనమండ్రువారి । నెఱుఁగవినిపింతువినుము రాజేంద్రచంద్ర ॥వ॥ అనియిట్లనువారలు- ప్రద్యుమ్న, అనిరుద్ధ, దీప్తిమద్భాను, సాంబ, మిత్ర, బృహద్భాను, మిత్రవింద, వృక, అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునందన, చిత్రభాను, వరూథ, కవి, న్యగ్రోధులను నామంబులం బ్రసిద్ధులయిరి వెండియుం ద్రివక్రయందు సంభవించిన యుపశ్లోకుండను వాఁడుదనజనకుండైన కృష్ణపాదారవిందసేవారతుండగుచు నారదయోగీంద్రునకు శిష్యుండై యఖండితదివ్యజ్ఞానబోధాత్ముండగుచు నతండు స్త్రీశూద్రదాసీజన సంసారంబైస్మరణమాత్రంబున ముక్తి సంభవించునట్టి సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతిం గల్పించె నట్లు మధుసూదననందనులు బహుప్రజలును, నధికాయురున్నతులును, ననల్పవీర్యవంతులును, బ్రహ్మణ్యులునై విఖ్యాతిం బొందిరి-వారిని లెక్కపెట్టం బదివేలవత్సరంబులకైనం దీరదు-మున్ను నీకెఱిఁగించినట్లు తత్కుమారులకు విద్యావిశేషంబులు నియమించు గురుజనంబులు మూఁడుకోట్లనెనుబదెనిమిదివేలనూర్గురనం గలిగియుండు రక్కుమారులలెక్కింపనెవ్వరికినివశంబు గాదదియునుంగాక ॥క॥ నరవరదేవాసురసం। గరమున నునిహతులైన క్రవ్యాదసముత్కరమున రేశ్వరులై ద్వాపరమున జనియించి ప్రజలబాధలబరుపన్ ॥క॥ హరిదద్వధార్థమైని । ర్జరులను యదుకులమునందు జనియింపింపం । ధరనూటొక్కకులంబై । వరగిరివారినిగణింపబ్రహ్మకువశమే ॥వ॥ అట్టియన్వయంబునందు మాధవునకు రుక్మిణీదేవియందుఁ బిత్సమముండును సమగ్రభుజావిజృంభణుండును నైప్రద్యుమ్నుండు జనించె - నతనికి రుక్మికూఁతురు శుభాంగివలన ననిరుద్ధుండుదయించె-నతనికి మౌసలావశిష్టుండైన వజ్రుండు సంభవించె-నతనికిఁ బ్రతిబాహుండు పుట్టె-వానికి సుబాహుండు జన్మించె- నతనికి నుగ్రసేనుండు ప్రభవించె- నాతనికి శతసేనుండు గలిగె. నిట్లు యదువృష్ణిభోజాంధకవంశంబులు పరమపవిత్రంబులయి పుండరీకాక్షుని కటాక్షవీక్షణశయ్యాసనానుగతసరసాలాపస్నానాశనక్రీడావినోదంబులననిశంబుఁ జెందుచు సర్వదేవతార్ధంబు సమస్తంబైన క్రతువులొనరించుచుఁ బరమానందకందళితచిత్తులయిరని చెప్పి వెండియు॥మ॥ పరమోత్సాహముతోడ మాధవుఁడు శుంభల్లీలఁ బూరించిన। మ్మురళీగానము వీనులం జిలికి నన్మోదించి గోపాలసుం । దరులేతెంతురరణ్యభూములకుఁ దద్దాస్యంబు గావించియ। కరుణావార్ధి భజింపకుందురె బుధుల్దౌరవ్యవంశాగ్రణీ ॥మ॥ మతినెవ్వాని యమంగళఘ్నమగునామంబర్థిఁ జింతించిల । న్నుతిగావించిన విన్నమానవులు ధన్యుల్భూరిసంసారదుఃఖ్యతులన్దొంతురు కాలచక్రమహితాసిం బట్టి యాకృష్ణుఁడీ । క్షితిభారంబుడుపంగఁ జేయుటిది యేచిత్రంబు భూవల్లభా॥వ॥ ఇవ్విధంబున గోపికాజనమనోజాతుండైన కృష్ణుండు లీలామానుషవిగ్రహుండై నిజరాజధానియైన ద్వారకాపురంబున నమానుషవిభవంబులగు సౌఖ్యంబులం బొదలుచుండెనని చెప్పి మఱియునిట్లనియె॥మ॥ మనుజేంద్రోత్తమ యేను నీకుఁ

త్రిజగన్మాన్యంబునై యొప్పెడి నీ కృష్ణకథాసుధారసమును సంప్రీతాత్ములయి భక్తిం గ్రోలినపుణ్యాత్ములు గాంతురిం దుసుఖముల్నిర్ధూతసర్వాఘులై। యనయంబున్దుదిఁ గాంతు రచ్యుతపదంబైనట్టి కైవల్యముఁ॥ క॥ అనియిట్లు బాదరాయణి। మనమున రాజిల్ల రాభిమన్యునకుం జె। ప్పినవిధమున సూతుఁడు ముని। జనులకెఱింగింపవారు సమ్మతితోడన్॥ క॥ సూతునిబ హువిధములసం। ప్రీతునిఁ గావించి మహిమఁ బెంపారుచు వి। ఖ్యాతికి నెక్కిన కృష్ణక। థాతత్పరులై రిబుద్ధిఁ దరగనిభక్తిన్॥

చ॥ సరసిజపత్రనేత్ర రఘుసత్తమ దుష్టమదాసురేంద్రసం। హరణ దయాపయోధి జనకాత్మభవాననపద్మమిత్ర భా। స్కరకులవార్ధిచంద్ర మిహికావసుధాధరసూతిసన్నుత। స్ఫురితచరిత్ర భక్తజనపోషణ భూషణ పాపశోషణా॥ క॥ మారీచభూరిమాయా। నీరంధ్ర మహాంధకారనీరేజహిత। క్ష్మారమణవినుతపాదా। భూరుహమహితావతార పుణ్యవిచారా॥ మాలిని॥ శరధిమదపరామా సర్వలోకాభిరామా। సురరిపుపిశభీమా సుందరీలోకకామా। ధరణివరలలామా తాపసస్తోత్రసీమా। సురుచిరగుణధామా సూర్యవంశాబ్ధిసోమా॥ * * * * *

గద్య. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు, ప్రద్యుమ్నజన్మంబును, శంబరోద్యోగంబును, సత్రాజిత్తునకు సూర్యుండు శమంతకమణి నిచ్చుటయుఁ దన్నిమిత్తంబున ప్రసేనుని సింహంబు వధించుటయు, దాని జాంబవతుండు సింహముఁ జంపి మాణిక్యంబు గొనిపోవుటయు, గోవిందుఁడు ప్రసేనునిం దునిమి మణిఁ గొనిపోయెనని సత్రాజిత్తుండు నిందనారోపించుటయుఁ, గృష్ణుండు దన్నిమిత్తంబున జాంబవంతునింబోరి మణియుక్తంబుగా జాంబవతిం గొనివచ్చి వివాహంబగుటయు, సత్రాజిత్తునకు మణి నిచ్చుటయు సత్యభామాపరిణయంబును బాండవులు లాక్షాగృహంబున దగ్ధులైరనిన విని వారు చేవుండ బలభద్రసహితుండై హస్తినాపురంబునకరుగుటయు, నక్రూరకృతవర్మానుమతంబున శతధన్వుండు సత్రాజిత్తుం జంపి మణిఁ గొనిపోవుటయుఁ, దదర్థంబు సత్యభామ కరినగరంబునకేఁగి కృష్ణునకు విన్నవించిన నతండు మఱలి చనుదెంచి శతధన్వుఁ ద్రుంచుటయు, బలభద్రుండు మిథిలానగరంబునకుం జనుటయు, నందు దుర్యోధనుండు రామునివలనఁ గదావిద్య నభ్యసించుటయుఁ, గృష్ణుండు సత్రాజిత్తునకుం బరలోకక్రియలు నడుపుటయు, శతధన్వుని మణి దాఁచినవాఁడై యక్రూరుండు భయంబునం ద్వారకానగరంబు విడిచిపోయిన నతనిలేమిన నావృష్టియైనం గృష్ణుండక్రూరుని మఱలి రప్పించుటయు, ధార్మోదరుండింద్రప్రస్థపురంబునకరుగుటయు, నందర్జునసమేతుండై మృగయావినోదార్థం బరణ్యంబునకుం జని కాళిందిం గొనివచ్చుటయుఁ, గాండవదహనంబు నగ్నిపురుషుండర్జుననకు నక్షయతూణీర గాండీవ కవచ రథ తథ్యంబుల నిచ్చుటయు, మయుండు ధర్మరాజునకు సభ గావించియిచ్చుటయు, నగధరుండు మఱలి నిజనగరంబునకరుగుదెంచి కాళిందిని వివాహంబగుటయు, మిత్రవిందా - నాగ్నజితీ - భద్రా - మద్రరాజకన్యలం గ్రమంబునం గరగ్రహణంబగుటయు, నరకాసుర యుద్ధంబును, దద్గృహంబున నున్న రాజకన్యలం బదాఱువేలం దెచ్చుటయు, స్వర్గగమనంబు, నదితికిం గుండలంబు నిచ్చుటయుఁ, బారిజాతాపహరణంబును, బదాఱువేల రాజకన్యలం బరిణయంబగుటయు, రుక్మిణీదేవీవిప్రలంభంబును రుక్మిణిస్తోత్రంబును - కృష్ణకుమారోత్పత్తియుఁ, దద్గురుజన సంఖ్యయుఁ, బ్రద్యుమ్నవివాహంబు, ననిరుద్ధుజన్మంబును, దద్వివాహార్థంబు గుండిననగరంబునకుం జనుటయు, రుక్మి బలభద్రుల జూదంబును, రుక్మివధయు, నుషాకన్యయనిరుద్ధుని స్వప్నంబునం గని మోహించుటయుఁ, దన్నిమిత్తంబునం జిత్రరేఖ సకలదేశరాజులం బటంబున లిఖించి చూపి యనిరుద్ధునిం దెచ్చుటయు, బాణాసుర యుద్ధంబును, నృగోపాఖ్యానంబును, బలభద్రుని ఘోషయాత్రయుఁ, గాళిందీభేదనంబును, గృష్ణుండు పౌండ్రక వాసుదేవ - కాశిరాజుల వధియించుటయుఁ, గాశీరాజపుత్రుండైన సుదక్షిణుండభిచారహోమంబు వేల్చి కృత్తిం బడసి కృష్ణుపాలికిం బుత్తెంచిన సుదర్శనంబుచేతం గృత్తి - సుదక్షిణసహితంబుగాఁ గాశీపురంబు భస్మంబు సేయుటయు, బలరాముండు రైవతనగంబునందు ద్వివిదుండను వనచరుని వధియించుటయు. సాంబుండు దుర్యోధను కూఁతురగు లక్షణను దెత్తినివచ్చినఁ గౌరవులతనిం గొనిపోయి చెఱం బెట్టుటయుఁ, దద్వృత్తాంతంబంతయు నారదువలన విని బలుండు నాగనగరంబునకుం జనుటయుఁ, గౌరవులాడిన యగౌరవవచనంబులకు బలరాముండు గోపించి హస్తిపురంబును గంగం బడఁద్రోయఁగమకించుటయుఁ, గౌరవులు భయంబున నంగనాయుక్తంబుగా సాంబునిం దెచ్చియిచ్చుటయు, బలభద్రుండు ద్వారకానగరంబునకు వచ్చుటయు, నారదుండు హరి బదాఱువేల కన్యకలనొకముహూర్తంబున నందఱ నన్నిరూపులై వివాహంబయ్యెనని విని తత్ప్రభావంబు దెలియఁ గోరి యరుగుదెంచుటయుఁ, దన్మాహాత్మ్యంబు సూచి మఱలి చనుటయు, జరాసంధుని చేత బద్ధులైన రాజులు గృష్ణుపాలికి దూతంబు తెంచుటయు, నారదాగమనంబును, బాండవుల ప్రశంసయు, నుద్ధవకార్యబోధంబు నింద్రప్రస్థాగమనంబును, ధర్మరాజు సేయు రాజసూయారంభంబును, దిగ్విజయంబును, జరాసంధవధయును, రాజబంధమోక్షణంబును, రాజసూయంబు నెఱవేర్చుటయును శిశుపాలవధయు నవభృథంబును రాజసూయవైభవదర్శనాసహ్యమానమానసుండై సుయోధనుండు మయనిర్మితసభామధ్యంబున గట్టినపుట్టంబులు దడియ బ్రద్దల్లుటయుఁ, దన్నిమిత్తపరిభవంబు నొంది రారాజు నిజపురికరుగుటయుఁ, గృష్ణుండు ధర్మరాజప్రార్థితుండై యాదవులనిలిపికొన్ని నెలలు కాండప్రస్థంబున వసించుటయు, సాల్వుండుదపంబు చేసి హరుని మెప్పించి సౌభకాఖ్యంబగు విమానంబు నడసి నిజసైన్యసమేతుండై ద్వారకానగరంబు నిరోధించుటయు యాదవసాళ్వయుద్ధంబును, గృష్ణుండు మఱలి చనుదెంచి సాల్వుం బరిమార్చుటయును దంతవక్త్రవధయును, విదూరథమరణంబును, గృష్ణుండు యాదవబలసమేతుండై క్రమ్మఱ పురంబునకుం జనుటయుఁ గౌరవపాండవులకు యుద్ధంబగునని బలదేవుండు తీర్థయాత్ర చనుటయు, నందు జాహ్నవీప్రముఖనదులం గృతస్నానుండై నైమిశారణ్యంబునకుం జనుటయు, నచ్చటి మునులు పూజింపం బూజితుండై తత్సమీపంబుననున్న తాసనంబుననుండి సూతుండుఁ దన్నుం గని లేవకుండిననలిగి రాముండు గుశాగ్రంబున నతని వధించుటయు, బ్రహ్మహత్యాదోషంబు గలిగెనని మునులు పలికిన సూతుంబునర్జీవితుం జేయుట ***, నమ్మునులకు బ్రియంబుగా గ్రామపాలుం డిల్వలసుతుండగు పల్వలుం బరిమార్చుటయు, వారిచేత ననుమతుండై హతధరుండు దత్సమీపతీర్థంబుల స్నాతుండై గంగాసాగరసంగమంబునకుం జనుటయు, మహేంద్రనగప్రవేశంబును, బరశురామదర్శనంబును, సప్తగోదావరిం గ్రుంకుటయును, మఱియు మధ్యదేశమందుగల తీర్థంబులాడి శ్రీశైల వేంకటాచలంబులు దర్శించుటయు, వృషభాద్రిహరిక్షేత్ర సేతుబంధ రామేశ్వరములం గనితామ్రపర్ణీతీర్థంబులాడుటయును, గోదానంబులొనరించి మలయగిరియం

గస్త్యనింగనుటయు, సముద్రకన్యాదుర్గాదేవులను పాసించుటయు, నందు బ్రాహ్మణజనంబువలనం బాండవధార్తరాష్ట్రభండనం బునసకలరాజలోకంబునుమృతినొందిరని వినుటయు, వాయునందనసుయోధనులుగదాయుద్ధసన్నద్ధులగుటవిని వారినివారించుటకై తాఁజేయుండందులకరుగుటయు, నచటవారిచేబూజితుండయి వారినివారింపలేకమగుడిద్వారకకరుగుటయుఁ, గొన్నివాసరంబులకుమఱల నైమిశారణ్యంబునకుంబోయియచటయజ్ఞంబుఁ జేసి రేవతియుం దానునవభృథంబాడి నిజపురంబునకేతెంచుటయుఁ, గుచేలోపాఖ్యానంబును, సూర్యోపరాగంబునఁ గృష్ణుండు రామునితోఁ జేరిపురరక్షణంబునకుఁ బ్రద్యుమ్నాదికుమారులనిలిపి షోడశసహస్రాంగనాపరివృతుండై యక్రూరవసుదేవోగ్రసేనాదియాదవవీరులుతోడ శమంతపంచకతీర్థంబునకరిగికృతస్నానుండై వసియించియుండుటయుఁ, బాండవకౌరవాదిసకలరాజలోకంబునుదత్తీర్థంబునకువచ్చుటయుఁ గుంతీదేవిదుఃఖంబును, నందయశోదాసహితులై సగోపగోపికాజనంబులుజనుదెంచుటయుఁ, గుశలప్రశ్నాదిసంభాషణంబులును, మద్రకన్యాద్రౌపదీసంభాషణంబును, దదనంతరంబ సకలరాజలోకంబును శమంతపంచకతీర్థంబులస్నాతులై రామకృష్ణాదియాదవవీరులనామంత్రణంబుచేసినిజనగరంబునకుం బోవుటయుఁ, గృష్ణునిదర్శించుటకుమునీంద్రులేతెంచుటయు, వారియనుమతినివసుదేవుండుయాగముసేయుచున్నచోటయు, నందయశోదాదిగోపికానివహంబులనిజపురంబునకనిచి యుగ్రసేనాదియాదవవీరులుం దానునుమాధవుండును

నిజపురప్రవేశంబగుటయుఁ, దొల్లికంసునిచేతహతులై యమపురంబుననున్న దేవకీదేవిసుతులరామకృష్ణులుయోగమాయాబలంబునఁ దెచ్చియొసఁగిచ్చుటయు, నర్జునుండు సుభద్రనువివాహంబగుటయుఁ, గృష్ణుండుమిథిలానగరంబునకరుగుటయు, శ్రుతదేవజనకులచరిత్రంబును, వారలతో బ్రాహ్మణప్రశంస సేయుటయుఁ, గృష్ణుండు మఱలి తనపురంబునకరుగుటయు, శ్రుతిగీతలును, హరిహరబ్రహ్మలతారతమ్యచరిత్రంబును, గుశస్థలినుండుబ్రాహ్మణునిచరిత్రంబు, నతనితనయులు పరలోకంబునకుంబోయినఁ గృష్ణార్జునులు తమ యోగబలంబునవారిందెచ్చియవ్విప్రునకిచ్చుటయుఁ, గృష్ణుండర్జునునిఁ బీడ్కొని ద్వారకకరుగుటయు, నందుమాధవుండయ్యాప్రదేశంబులసకలభార్యాపరివృతుండయి విహరించుటయు, యాదవవృష్ణిభోజాంధకవంశచరిత్రంబు ననుకథలంగల దశమస్కంధంబునందుత్తరభాగంబు సమాప్తము.



శ్రీరస్తు.

శ్రీరాధారుక్మిణీసమేత శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్రభాగవతము.

## ఏకాదశస్కంధము.



శ్రీసీతాపతిలంకే! శాసురసంహారచతురశాశ్వతనుతవా! ణీసత్యాధిభూభవవ్య! తాసురరిపుదేవజాలరామనృపాలా॥

క॥ మహనీయగుణగరిష్ఠులగునమ్మునిశ్రేష్ఠులకునిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైనసూతుండిట్లనియె నట్లుప్రాయోపవిష్టుండైనపరీక్షిన్నరేంద్రునకుశుకయోగీంద్రుండిట్లనియె నాయా జన్మకర్మవ్యాధివిమోచనంబునకుఁ గారణంబగుదివ్యావధంబుగావున శ్రీమన్నారాయణకథామృతంబుగ్రోలుమనియిట్లనియె ॥ మ ॥ బలవత్సైన్యముతోడఁ గృష్ణుఁడు మహాబాహాబలోపేతుఁడై! కలననాత్మజుసవీరవర్యులవడిన్ఖండించిభూభారము! జ్జ్వలమైయుండఁగ నక్షకేళికతనన్ధారవ్యాదోత్సోనత! ద్బలముం బాండవసైన్యమున్నడిచె భూభాగంబు గంపింపఁగన్॥ అంత॥ కొమునివరులుసంతసిల్లఁగ! ననయమునం

(౧౨౦)

దాదులకునుహర్షంబమ్యెఁ। న్దననిజభక్తులుయాదవ। ఘనవీరసమూహమవ్రుదుగడునొప్పెసఁగన్॥ మ ॥ విదితుండైసకలో
మరుల్గాలువసుర్వీభారం మున్మాన్పిదు। ర్మదసంయుక్తవసుంధరాధిపతులన్మర్దించికంసాదుల।న్దుదిముట్టన్వధియించికృష్ణుఁడ
తిసంతుష్టాత్ముఁడైయున్నచో।యదుసైన్యంబులుభూమి మో]వఁగనసహ్యంబమ్యెనత్యున్నతిన్॥సీ॥ఈరీతిగృష్ణుండునేపార
బూతనాశకటతృణావర్తపాల్వవత్స।చాణూరముష్టికధేనుప్రలంబక చైత్యాఘశిశుపాలదంతవక్త్ర।కంసపౌండ్రాదిక ఖం
డనంబొనరించియాటమీఁదఁగురుబలంబడఁచిమఱియు। ధర్మజునభిషిక్తుఁదనరఁగాఁజేసిననతఁడుభూపాలనంబమరఁజేసె।
భక్తులగుయాదవేంద్రులఁబరఁగఁజూచి। యన్యపరిభవమెఱుఁగరీయదువులనుచు। వీరిఁబరిమార్ప నేఁదక్క వేఱొకండు।దై
వమిఁకలేఁడుత్రిభువనాంతరమునందు ॥ వ ॥ అనివితర్కించిజగదీశ్వరుండత్యున్నత వేణుగాననంబువాయువశంబుననొరసి
కొనియనలంబుద్భవంబై దహించుచందంబున యదుబలంబులకన్యోన్యవైరానుబంధంబులుకల్పించిహితంబొనర్చెదననివిప్ర
శాపంబుమూలకారణంబుగాదలంచియదుబలంబులనడంచెననిపలికినమునివరునకురాజేంద్రుండిట్లనియె॥క॥హరిపాదకమ
లసేవా। పరులగుయాదవులకెట్లుబ్రాహ్మణశాప।స్ఫురణంబుసంభవించెనా। యరయఁగసంయమివరేణ్యయానతియీవే॥
క॥అనినజనపాలునకుని। ట్లనుసంయమికులవరేణ్యుఁడతిమోదముతో। వినుమనిచెప్పఁగఁదొడఁగెను।ఘనతరగంభీరవాక్ప్ర

✽ విశ్వామిత్రవసిష్ఠనారదాదిమహర్షులుశ్రీకృష్ణదర్శనంబునకువచ్చుట. ✽

కాశస్ఫురణన్॥వ॥ నిరుపమసుందరంబయినశరీరంబుధరియించి సమస్తకర్మతత్పరుండై పరమేశ్వరుండుయదువులనడంగిం
పందలంచుసమయంబునజటావల్కలకమండలుధారులును, రుద్రాక్షభూతిభూషణముద్రాముద్రితులును,కృష్ణాజినాంబ
రులునునగువిశ్వామిత్ర,అసిత,కణ్వ,దుర్వాస,భృగు,అంగీరస,కశ్యప,వామదేవ,వాలఖిల్య,అత్రి,వసిష్ఠ, నారదాదిమునివ
రులు స్వేచ్ఛావిహారంబునద్వారకానగరంబునకుఁజనుదెంచినయందు॥ సీ॥ఘనునిశ్రీకృష్ణునిఁగౌస్తుభాభరణునిఁగర్ణకుండలయు
గ్మఘనకపోలుఁ। బుండరీకాక్షునంభోధరశ్యామునిఁగలితనానారత్నఘనకిరీటు। నాజానుదీర్ఘబాహుశార్ఙ్గశంఖాయుధహస్తుశ్రీ
వత్సుఁబీతకౌశేయవాసు। రుక్మిణీనయనసరోజదివాకరుబ్రహ్మాదిసురసేవ్యపాదపద్ము। దుష్టనిగ్రహశిష్టసంతోషకరణుఁ।
గోటిమన్మథలావణ్యకోమలాంగు। వార్తజనరక్షణైకవిఖ్యాతచరితుఁ। గనిరికరుణాసముద్రునిఘనులుమునులు॥ క॥ వచ్చిన
మునిసంఘములకు। విచ్చలవిడినర్ఘ్యపాద్యవిధులానరింప। న్మెచ్చుగుకనకాసనములనద్చుఁగఁగూర్చుండివనరుహాక్షునితో
డన్॥ క॥ జనములునిను సేవింపని।దినములువ్యర్థంబులగుచుఁదిరుగుచునుండున్। దనువులునిలుకడగావఁట। వనములలోను
న్నవైనవనరుహనాభా॥క॥తరణంబులుభవజలధికి। హరణంబులుదురితలతలకాగమములకా।భరణంబులార్తజనులకు।శర
ణంబులునీదుదివ్యచరణంబులిలన్ ॥ మత్తకోకిల॥ ఒక్కవేళను సూక్ష్మరూపమునొందుదీవణుమాత్రమై।యొక్కవేళనుస్థూ
లరూపమునొందుదంతయునీవవై।పెక్కురూపులుదాల్చిసడగుపెంపుమాకునులింపఁగా।నక్కజంబగుచున్నదేమననంబుజా
క్షరమాపతీ॥క॥శ్రీనాయకనీనామము। నానాభవరోగకర్మనాశమునకువి।న్నాణెంబగునౌషధమిది।కానరుదుష్టాత్ములకట
కంజదళాక్షా॥వ॥అనియనేకవిధంబులంబ్రస్తుతించినమునివరులంగరుణాకటాక్షవీక్షణంబులనిరీక్షించిపుండరీకాక్షుండిట్లని
యె-మదీయధ్యాననామస్మరణంబులుభవరోగహరణంబులును,బ్రహ్మరుద్రాదిశరణంబులును, మంగళకారణంబులునునగు
ననిమఱియు నారూపంబులైనమేదినీసురుల పరితాపంబపహరించుపురుషులనైశ్వర్యసమేతులుగాఁజేయుదుననని యోగీశ్వ
రేశ్వరుండానతిచ్చియనంతరంబమీరలిచ్చటికివచ్చిన ప్రయోజనంబేమియనినవారలుభవదీయ పాదారవిందసందర్శనార్థం
బుకంటెమిక్కిలివిశేషంబొండెద్దియనిన వాసుదేవవదనాబ్జామృతంబు నిజనేత్రచకోరంబులఁగ్రోలియథేచ్ఛావిహారులై
ద్వారకానగరంబునకనతిదూరంబుననుండుపిండారకంబనునొక్కపుణ్యతీర్థంబునకతిగిరంత॥క ॥ దర్పించియాదవులుదమ।
నేర్పునఁగొమరారుసాంబునెలతుకరూపం। బేర్పడశృంగారించుచుఁ। గర్పూరసుగంధిపోల్కఁగావించిరోగిన్॥ఉ॥మూఁ
కలుగూడియాదవులుముందఱఁబెట్టుకయార్చినవ్వుచు।న్పోకలఁబోవుచున్మునిసమూహమునొయ్యనసాగిమ్రొక్కుచు। న్బ్రా
కటమైనయీసుదతిభారపుగర్భమునందుఁబుత్రుఁడో।యేకతమందుబాలికయొయేర్పడఁజెప్పుడటన్ననుగ్రులై ॥ క॥ యదు
డింభకులన్గనుఁగొని।మదయుతులైవచ్చిరనుచుమదిలోరోషం। బొదవికనుఁగొనలనిప్పులు। సెదరగహాస్యంబుచనునెచే
యఁగనను చున్॥క॥వాలాయముమూఢుదుకులని।ర్మూలకరంబైనయట్టిముసలంబొకటీ। బాలికకుదయించునుబొం। డాలస్యము
లేదటంచునునిపలుకటయున్ ॥ వ ॥ మదోద్రేకులైనయాదవబాలకులుమునిశాపభీతులై వడవడవడంకుచుసాంబకుక్షినిబద్ధ
చేలగ్రంథివిమోచనంబుసేయుసమయంబున ముసలంబొకటిభూతలపతితంబయినవిస్మయంబునొంది దానింగొనిచనిదేవ
కీనందనుసన్నిధానంబునంబెట్టిమెఱింగించిన నతండాత్మకల్పిత మాయారూపంబగుటనెఱింగియు నెఱుంగనితెఱంగున వా

రలంబాచియుట్లనియె॥ క॥ మది చెడికన్నుంగానక । మదయుతులై మిగుల్ల మాటలమానులన్ । దిసికులజయకారియు । విదితంబ
గుశాపము ముందు వెఱ్ఱులుగలరే । క॥ ధరణీసురశాపమునకు । హరిహరబ్రహ్మాదులైన సడ్డముగలరే । నరులనఁగనెంతవారలు । గర
మరుదుఁగబూర్వజన్మకర్మముఁద్రోవఁగ ॥ వ॥ అదిగావున యతిసిందాపరత్వంబున యదువంశనాశంబగు సందియంబు లేదని
పరమేశ్వరుండు వారలం బాచి సముద్రతీరంబున నొక్క మహాపర్వతంబున్నదందునుండు నత్యుగ్రభయవిశాలభీషణంబగు పా
షాణంబున మీఁదు దాటలంబు చేతసీ ముసలంబు దివిచిచీని దూర్ణంబు మహార్ణవక బంధంబులం గలిపిరందుఁపొఁడని జగద్విష్ణుండై
సకృష్ణుండానతిచ్చిన- వారునట్లచేసి తత్కలితంబయినలోహఖండంబును సరకుగొనక సాగరంబునం బడవైచిన నొక్క ఝష
కంబు గ్రసించిన దానినొక్క లుబ్ధకుండు జాలమార్గంబునఁబట్టి కొనిత దుదరగతంబయిన లోహఖండంబు దెచ్చి బాణాగ్రంబు
నముల్కి గానొనర్చి ననియుఁ దత్కథావృత్తాంతంబు సెప్పి సబాదరాయణింగనుంగొని రాజేంద్రుండిట్లనియె॥ క॥ చిత్తంబే
క్రియ నిలుచుం । జిత్తజగురు పాదపద్మసేవ సదాయి । త్యుత్తమ మునివసుదేవుఁడు । జిత్తము దగ నిల్పి యెట్లుచెంచెదముసీంద్రా॥

✽ వసుదేవునకు నారదుండు పురాతనంబగు విదేహర్షభసంవాదంబు దెలుపుట. ✽

అనియడిగిన రాజునకు శుకుండిట్లనియె॥ క॥ వినుముఁ నృపాలక సెప్పెద । ఘనమైవిలసిల్లుఁ బూర్వకథగలదదియు । న్వినుద్వారక
కేతెంచియు । నొనరఁగ నారదుఁడు కృష్ణునొప్యనఁగాంచెఁ॥ వ॥ దేవమునికృష్ణసందర్శనార్థంబరుగు దెంచి తద్గృహాభ్యం
తరంబునకరిగిన వసుదేవుండమ్మునీంద్రునినర్ఘ్యపాద్యాదివిధులం బూజించి కనకాసనాసీనుం గావించి యుచితకథావినో
దంబులం బ్రొద్దుపుచ్చు చునిట్లనియె - నేనరుండను నారాయణచరణసరసీరుహభజనతారాయణత్వంబు నిరంతరంబు నొంద
డట్టివానికి మృత్యువు సన్నిహితంబై యుండు సీదర్శనంబున గృతార్థుండనైతి నద్యుతానంతగోవిందాది నామస్మరణైకా
గ్రచిత్తులైన మీవంటి పుణ్యపురుషుల సదాగమంబున లోకులు సుఖాశ్రయులయి యుందురు దేవతాభజనంబు సేయువారి
నిగీర్వాణులు ననుగ్రహింతురట్లు సజ్జనులును, దీనవత్సలురునగు వారలు పూజనాది క్రియలచేనా దేవతలను భక్తిసేయుదురు
కావున శ్రీమన్మహాభాగవతకథాసమూహంబులం గలధర్మంబులడిగెద నేమే ధర్మంబులు శ్రవణసుఖంబులుగా విని నదండధ
రకింకరతాడనంబులంటడక ముకుందచరణారవిందవందనాభిలాషులయి పరమపదప్రాప్తులగుదు రాధర్మంబులావతిమ్మతా
ల్లి గోవిందునింబుత్రునిఁగాఁగోరి ముక్తిమార్గం బెఱుంగలేక దేవతామాయం జేసి చిక్కిచిత్తవ్యసనాంధకారంబగు సంసా
రంబునందగులువడియున్న వాఁడ- హరికథామృతంబు వెల్లిగొల్పు మట్లయిన సుఖంబుగలుగుననిన వసుదేవకృతప్రశ్నుండైన
నారదుండు వ్వాసుదేవ కథాప్రసంగసల్లాపహర్షసమేతుండై సంతసంబందనిట్లనియె॥ క॥ ననుసీవు సేయుప్రశ్నము । జనప
స్నుత వేదశాస్త్రసారాంశంబై । ఘనమగు హరిగుణకథనము । వినుమని వినుపింపఁదొడఁగె వేడ్కదలిర్పన్ । క॥ అతిపాపకర్మ
లైనను । సతతము నారాయణాఖ్యశబ్దము మదిలో । వితతంబుగఁ బఠియించిన । చతురులఁగొనియాడఁగమలసంభవువశమే॥
వ॥ అట్లుగావునఁ బరమేశ్వర భక్తిజనకంబై కైవల్యపదప్రాప్తికరంబయి యొప్పుచున్న విదేహవృషభసంవాదంబు నాఁబరగు
నొక్కపురాతనపుణ్యకథాని శేషంబెఱింగించెద నావధానమనస్కుండవై యాకర్ణింపుమని యిట్లనియె॥ గీ॥ వినుము స్వా
యంభువుండను మనువునకును । రమణనుదయించె నటప్రియవ్రతుఁడనంగఁ । దనయుఁడాతని కాగ్నీధ్రుఁడనఁగసుతుఁడు । జా
తుఁడయ్యెను భువనవిఖ్యాతుఁడగుచు॥ వ॥ ఆయాగ్నీధ్రపుత్రునకు నాభియనుపార్థుండగు తనూభవుండుదయించి బలిచక్రవర్తి
తో మైత్రిం జేసి ధరణీభారంబు పూని యాజ్ఞాపరిపాలనంబున సహిత రాజన్యరాజ్యంబుల స్వవశంబుగా విందుకొనియుండె
నంత- నానాభికి సత్పుత్రుండయిన ఋషభుండు పుట్టె నతండు హరిదాసుండై సుతశతకంబు వడసె నందగ్రజుండయిన భర
తుండను మహానుభావుండు నారాయణపరాయణుండై యిహపరలోకసుఖంబులం బరిహరించి జన్మత్రితయంబున నారత
పంబాచరించి గీర్వాణసుఖసారవశ్యంబు పరిహరించి సకలబంధవిముక్తుండై వాసుదేవపదంబు నొందె నాతని పేర భారత
వర్షంబను భూఖండ నామవ్యవహారంబు నెగడి జగంబులం బ్రసిద్ధంబయ్యె మఱియు నందుఁదొమ్మండ్రు కుమారులు బలపరాక్ర
మప్రభావరూపసంపన్నులయిన నవఖండంబులకు నధిష్ఠాతలైరి మఱలవారలలో నెనుబదియొక్కండ్రు కుమారులు సత్యకర్మా
నుష్ఠానపరతంత్రులై విప్రత్వంబంగీకరించిరి యందు గొందఱు శేషించినవారలు కవి, హరి, అంతరిక్ష, ప్రబుద్ధ, పిప్పలాయన,
హావిర్హోత్ర, ద్రమిళ, చమస, కరభాజనులనం బరగు తొమ్మండ్రుగురూర్ధ్వరేతస్కులయి బ్రహ్మవిద్యావిశారదులగుచు జగత్ర
యంబునుఁ బరమాత్మస్వరూపంబుగాఁ దెలియుచు ముక్తులై యవ్యాహతగమనులగుచు సురసిద్ధసాధ్యయక్షగంధర్వకిన్నరకిం
పురుష నాగలోకంబులందు స్వేచ్ఛావిహారంబు సేయుచు నిరంతరానందంబు వడసి యుండ నొక్కనాఁడు ॥ క॥ జగదేకనాథు
గుణములు । మిగులగ సంస్మరణతోడ మీరినభక్తిన్ పగలును రాత్రియు సంధ్యలు । వగిలి జితేంద్రియులునైన తపసులు ధాత్రిన్ ॥

క॥ ఊహింపఁబుణ్యుఁడైనవి। దేహునియాజ్ఞాంతమందు నే తెంచినచో। గేహము వెడలి యెదుర్కొని। మోహవివర్జితులఁబుణ్య మునిసంఘములన్॥ గీ॥ అర్ఘ్యపాద్యాదివిధులనువర్తితోడఁ। బూజగావించివారలు బొలుపుమిగుల।ను చితపీఠంబులందుఁ లను నిచె నేంమి। నవమునిశ్రేష్ఠులను ధరాధినాయకుండు॥ క॥ వారలకిట్లనుమీరలు। గారవమునవిష్ణుమూర్తిఁగైకొనినమహా। భూరిశపోధనవర్యులు। సారవిహీనంబులైనసంసారములన్॥ క॥ పరీతిఁగడవ నేర్తురు। కూరులుబహుదుఃఖరోగకృత్సితబుద్ధుల్। మోహవిదగ్ధితులఁబుణ్య

❀ ఋషభకుమారుండగుకవియను మొదటివాఁడువిదేహునకు సేయుపరమార్థోపదేశము. ❀

❀ ఋషభకుమారుండగుకవియను మొదటివాఁడువిదేహునకు సేయుపరమార్థోపదేశము. ❀

ఘనరసులునరులుగావున। నారయసుజ్ఞానబుద్ధి వానతియీరే॥ వ॥ మఱియు సకలజంతుసంతానంబుకంటె మానుషాకారంబు వొందుటదుర్లభం బంతకంటె నారాయణచరణయుగళస్మరణపారాయణులగుట మేలు కావున సత్యంతావశ్యకంబగు శ్రేయంబడుగవలసెఁ బరమేశ్వరుండు ప్రపత్తినిష్ఠులకు సారూప్యంబెట్లొసంగు నత్తెఱంగానతిండనినవిని విదేహభూపాలునకు హరికథామృతపానాతిపరవశులైన మునిసమాజంబునందు కవియను మహానుభావుండిట్లనిచెప్పందొడంగె నరిషడ్వర్గంబును దుఃనీషణత్రయంబునందుండఁగుబువడి మాత్సర్యయుక్తచిత్తుండగునట్టివానికెవ్విధంబున నచ్యుతపాదారవింద భజనంబుసం భవింపదు విశ్వంబును నాత్మయు వేఱుగా భావించువానికిఁబరతత్వంబెట్లులేదు అవిద్యాంధకారమగ్నులకు హరిచింతనంబె ట్లుసిద్ధించునట్టినరుండుతొంటికళేబరంబువిడిచిపరతత్వంబెట్లుఁగింజేరు, ముకుళీకృతనేత్రుండయినరుండు మార్గభ్రమణం బునఁదొట్రుపాటువడిచనుచందంబున విజ్ఞానవిహీనులహృదయభక్తిభావనావశంబులేకున్నఁబరమపదంబు వీరికెవ్విధంబునం గలుగుననియడిగితివి గావున జెప్పెదసావధానుండవై యాకర్ణింపుము॥ క॥ కరణత్రయంబు జేతను। నరుఁడేకర్మంబు సేయు నయ్యవేళన్। హరికర్పణమనిపలుకుట। పరువడి సుజ్ఞానమందు పరమమునీంద్రుల్॥ వ॥ జ్ఞానాజ్ఞానంబులందు సంకలితుండయి నస్మృతివిపర్యయంబునొందునట్లు గావునగురుదేవతాత్మకుండయి బుద్ధిమంతుండైనమర్త్యుండు శ్రీవల్లభునుత్తమోత్తముని గాఁజిత్తంబునఁజేర్చి సేవింపవలయు స్వప్నమనోరథేచ్ఛాద్యవస్థలయందు సర్వసంకల్పనాశంబగుటంజేసి వానిఁగుదియం బట్టి నిరంతరధ్యానపరుండైనవానికిఁగైవల్యంబు సులభంబునం గరతలామలకంబయియుండు॥ సీ॥ సంతతంబులుకృష్ణ సంకీర్తనంబు వీనులకింపుగావినఁగవలయు। హరినామకథనంబు హర్షంబుతో మతఁబాటలనాటలఁబనుపవలయు। నారాయణునిదివ్యనామాక్షరంబులు హృద్వీథిసతతంబు నెన్నవలయుఁ। గంజాక్షులీలలు కాంతారములనైనభక్తియుక్తంబుగాఁ

❀ ఋషభకుమారులగుహరియనంతరిత్తుండును సేసెడుభాగవతస్వరూపోపదేశము. ❀

బాడవలయు। వెఱ్ఱిమాడ్కినిలీలతో విశ్వమయుని। నాడువుడును లోకబాహ్యతనొందవలయు। నింతయును విష్ణుమయమని యె ఱుఁగవలయు। భేదమునరింపవలవదు మేదినీశ॥ వ॥ అనినవిదేహభూపాలుండు భాగవతధర్మంబెద్ది యేప్రకారంబునం బ్రవ ర్తించునట్టిభాగవతచిహ్నంబులెవ్వియింతయు నెఱింగింపమీరయర్హులరనినవందులో హరియనుమహాత్ముండిట్లనియె॥ గీ॥ స ర్వభూతమయుండై సరసిజాక్షుఁ। డతఁడెతనయాత్మయందుండునని యెఱుఁగువాఁడు। శంఖచక్రధరుండనుఁ జనెడువాఁడు। భ క్తిభావాభిరతుఁడువో భాగవతుఁడు॥ ॥ వర్ణాశ్రమధర్మంబుల। సిర్ణయకర్మములఁజెడకనిఖిలజగత్సం। పూర్ణుఁడుహరియను నాతఁడె। వర్ణింపఁగభాగవతుఁడువసుధాధీశా॥ వ॥ ఇట్లు సర్వసంగపరిత్యక్తుండై నిఖిలాంతరాత్మకుండైన పరమేశ్వరుండరు ణగభస్తికిరణసహస్రంబులలోకత్రయంబుంబావనంబు సేయుచందంబుననందనందన చరణారవిందరజఃపుంజంబులచేతం బవిత్రంబు సేయుచు సురాసుర జేగీయమానంబైన జనార్దన పాదారవిందంబునకుఁ బంధనాభిలాషులై భక్తియుక్తులవమాత్రం బునుంజలింపనీక సుధాకరోదయంబున దివాకరజనిత తాపంబు నివారణంబయినభంగి నారాయణాంఘ్రినఖమణిచంద్రికాని రస్తహృదయతాపుండై యాత్మీయభక్తిరచనానుబంధబంధురుండును నై వాసుదేవచరణసరోరుహధ్యానానందపరవశుం డగునతండు భాగవతప్రధానుండని యెఱింగించినవినివిదేహుండిట్లనియె॥ క॥ గజరాజవరదుగుణములు। త్రిజగత్పావనముల గుటఁ జేటపడంగా। సుజనమనోరంజకముగ। విజితేంద్రియ వినఁగ నాకు వేడుకపుట్టెన్॥ అనినవిని యంతరిత్తుండను ఋషి శ్రేష్ఠుండిట్లనియె॥ క॥ పరమబ్రహ్మమనంగాఁ। బరతత్వమనంగఁబరమపథమనఁగనునీ। శ్వరుఁడనఁగృష్ణుఁడనజగ। ద్భరితుఁ డునారాయణుండు దా వెలుఁగొందున్॥ వ॥ అవ్యక్తనిర్గుణపరబ్రహ్మంబునందుఁదనకువిపర్యయంబుగా జననంబయినజ్ఞా నంబె విష్ణుమాయయనంబడు బరమేశ్వరుండట్టిమాయచేత జగంబు నిర్మించి నిశ్చింతుండైయుండు నింద్రియార్థభ్రమణంబు సేసెడుదుర్మతులకు సుప్త్యాద్యవస్థలువరుసనఁగలుగుటగాక పరమేశ్వరునింబొంద రామియనునాలుగవయవస్థయుఁగలు గు స్వప్నంబునందు గ్రాహ్యగ్రాహకగ్రాహయితృత్వంబులను త్రివిధభేదంబులుఁగలిగియుండు నీచందంబునవిద్యాంధకా రసంవృతంబై మూఁడువిధంబులం బర్యవసించు మనోరథంబుస్వప్నావస్థంగడంగిన క్రియ త్రివిధంబగుమాయయు నాత్మ

యందులీనంబగుచుం బంచభూతములు మొదలుగ బృథివ్యాదిమహాభూతములు లయంబయిన సృష్టికాలంబునం జనియించుచుం బంచభూతాత్మకంబయినయాత్మనేకాదశేంద్రియంబులచేత భేదంబుపుట్టించుగుణంబులచేతగుణంబులంగీకరించు నాత్మయందుఁ బ్రవ్యోతితగుణంబువలనఁగుణానుభవంబు సేయుచున్నవాఁడై సృష్టినినాత్మయంబుగా భావించును. దేహికర్మమూలంబుననైమిత్తికకర్మంబులనాచరించుచుఁదత్ఫలంబులంగీకరించిదుఃఖైకవశుండైవర్తించుఁ జెకుకదుఃఖంబులంబడ యీదేహికర్మఫలప్రాప్తుండగుచు భూతసంప్లవపర్యంతంబు పరవశుండై జన్మమరణంబులంబొరలుచునంత్యకాలంబాసన్నంబయినద్రవ్యగుణస్వరూపంబగుజగంబునాదినిధనంబగుకాలంబును బ్రకృతింబొందించునటమీఁదశతవర్షంబులువర్షంబులేమిచేతనత్యుగ్రలోకలోచనుతేజంబునసకలలోకంబులుదహింపంబడు నంతనధోలోకంబులనుండి సంకర్షణముఖజనితానలంబూర్ధ్వశిఖాజాలంబులవాయుసహాయంబై దిక్కులయందెల్లబ్రవర్తించునటమీఁదసంవర్తపలాహకగణంబులు శతవత్సరంబులుసలిలధారాపాతంబుగావర్షంబులుగురియునంతవిరాడ్రూపంబులీనంబగు నందునీశ్వరుండు నిన్ధనాగ్నిరూపంబుననవ్యక్తంబుగాబ్రవేశించుఁ దదనంతరంబధరణీమండలంబువాయుహృతగంధంబైకబంధరూపంబుఁదాల్చు. సాజలంబుహృతరసంబై తేజోరూపంబునొందునాతేజంబుతమోనిరస్తంబైవాయువందడంగునాగంధవహుండుస్పర్శవిరహితుండై యాకాశంబునందుసంక్రమించునావిష్ణుపదంబును విగతశబ్దగుణంబుగలదైయాత్మయందడంగు నింద్రియంబులునుమనంబునుబుద్ధియువికారంబులతోడనహంకారంబుఁబ్రవేశించునాయహంకారంబుగుణయుక్తంబై పరమాత్మంజేరు నిట్లుత్రివర్ణాత్మకమైసరస్థితిలయకారిణియగుమాయయిట్టిదియనితత్స్వరూపమాహాత్మ్యంబులు వివరించిన నరపాలుండిట్లనియె॥ ఆ॥ జ్ఞానవిహీనమైననరసంఘముఁగానగరానిమాయదా।టోననడంచి యెట్లుహరిలోకము జెందుదురత్యున్నత।భూభ్రనుతసత్యవాక్యగుణభూషణయిక్కథ వేడ్కతో మత।న్నావికిఁజెప్పుమన్న బ్రబుద్ధుడునిట్లనుగారవమ్మునన్॥

*** ఋషభకుమారులలోఁబ్రబుద్ధపిప్పలాహ్వయులుసెప్పెడుపరమార్థోపదేశము. ***

వ॥ సూర్యోదయాస్తమయంబులం బ్రతిదినంబునాయువుక్షయంబునొంద దేహికళత్రమిత్రభ్రాతృమమత్వపాశబద్ధుండై విడివడనుపాయంబుగానకసంసారాంధకారమగ్నుండై గతాగతకాలంబులనెఱుంగక దినాంధంబులగుజంతుజాలంబులభంగిజన్మజరారోగవిపత్తిమరణంబులందియుశరీరంబమేలనుచుబ్రమోదమోహమదిరాపానమత్తులై విషయాసక్తతంజిక్కుతమ్ముఁదారెఱుంగకయుండి విరక్తిమార్గంబుదెలియకవర్తించుమూఢులగుజనంబులపొంతలంబోవక కేవలవిష్ణుభక్తిభావంబుగలసద్గురులంబ్రతిదినంబుభజియించి సాత్వికంబుభూతదయయునుహరికథామృతపానంబును బ్రహ్మచర్యవ్రతంబును విషయంబులమనంబుచేరకుంటయు సాధుసంగమంబును సజ్జనమైత్రియువినయసంపత్తియుశుచిత్వంబు తపంబునుక్షమయు, మౌనవ్రతంబును వేదశాస్త్రాధ్యయనతదర్థానుష్ఠానంబునహింసయుసుఖదుఃఖాదిద్వంద్వసహిష్ణుతయు నీశ్వరునిసర్వగతునిగాభావించుటయుముముక్షుత్వంబునుజనసంగవర్జనంబును, వల్కలాదిధారణంబునుయదృచ్ఛాలాభసంతుష్టియు వేదాంతశాస్త్రార్థజిజ్ఞాసయును దేవతాంతరనిందావర్జనంబునుగరణత్రయశిక్షణంబును, సత్యవాక్యయు శమదమాదిగుణవిశేషత్వంబును గృహారామక్షేత్రకళత్రపుత్రవిత్తాదులహరికర్పణంబుసేయుటయునితరదర్శనవర్జనంబు జేయుటయును, భాగవతోత్తమధర్మంబులనిచెప్పి యిట్లనియె॥ క॥ హరిదాసులమిత్రత్వము।మురరిపుకథలెన్నికొనుచుమోదముతోడ।న్పరితోషపులకితుండై।పురుషుఁడుహరిమాయగెల్చుభూపవరేణ్యా॥ వ॥ అనినరాజేంద్రుండువారలకిట్లనియె భాగవతులారా సకలలోకనాయకుండగు నారాయణుండనంబరగినపరమాత్మనిప్రభావంబువినవలతునాసతోండనిన పిప్పలాహ్వయుండిట్లనియె॥ సీ॥ నరవరవినుజగన్నాథునిచారిత్రమెఱిఁగింతు నీమదికిం బ్రమిగుల। లసదుద్భవస్థితిలయకారణంబైనదేహేంద్రియాదులదిరముగాఁగ।జొనుపునెవ్వఁడుపరంజ్యోతిస్వరూపంబుజ్వాలలనలునందుజననిపగిది।నింద్రియంబు నాత్మనెసయవుశబ్దంబువారయకసుషిరంబుఁబొందుసత్య। మనఁగసత్వరజస్తమోమయగుణంబు।మహదహంకారరూపమైమహిమవెలయుఁ। చేతనత్వంబుగలదీనిజీవమందు।రిదియసదసత్స్వరూపమైయెన్నబడును॥ వ॥ దీనికింబక్కైరనదిపరమాత్మగానెఱింగికమలసంభవాదులును తెలియంతురిట్టిపరమాత్మస్థావరజంగమంబులనధిష్ఠించివృద్ధిక్షయంబులంబొందక నిమిత్తమాత్రంబునందనులతాదులందుజీవంబులేక తదంతరస్థుండైవర్తించునంతసర్వేంద్రియావృతంబైయాకారంబునష్టంబైనమనంబునుంబాసికృతవిరహితుండై తిరుగుచుండునిర్మలజ్ఞానదృష్టిగలవానికిభానుప్రభాజాలంబుతోచిన క్రియను సుజ్ఞానవంతుఁడుహరిభక్తిచేతగుణకర్మార్థంబులైనచిత్తదోషంబులుభజించిభగవత్సదనంబుచేరుననినవినిరాజిట్లనియె॥

*** ఋషభకుమారులు హవిర్హోత్రద్రమిళులు దెలుపు పరమార్థోపదేశము. ***

క॥ పురుషుండేయేకర్మము।పరువడిఁగావించిపుణ్యపరుఁడైమునుదా।దురితములఁదొరఁగిమురరిపు।చరణయుగంబెట్లు సే

రుసన్మునివర్యా॥ వ॥ అనిననవినిమియుండు హరిస్తోత్రుండట్లనియె, గర్మాకర్మవికర్మప్రతిపాదకంబులగు శ్రుతివాదంబులలౌకికవర్ణి
తంబులట్టియామ్నాయంబులు సర్వేశ్వరస్వరూపంబులుగాన విద్వాంసులు నెఱుంగ లేరవికర్మాచారంబులనంబడు మోక్షం
బుఁగోఱుకు నారాయణభజనంబు పరమపావనంబు వేదోక్తంబుల నాచరింపక ఫలంబులకు వాంఛ సేయువారల నేక జన్మా
యుతంబులం బడయుదురు మోక్షంబున పేక్షించువాఁడు విధిచోదితమార్గంబున హరిం బూజింపవలయు నట్టి పూజాప్రకా
రం బెట్లనిన బవిత్రగాత్రుండై జనార్దనుసన్నిధిం బూతచిత్తుండై విధ్యుక్తప్రకారంబునఁ జక్రధరుని ధ్యానించి గంధపుష్ప
ధూపదీపనైవేద్యంబులు సమర్పించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి భక్తిభావనావిశేషుండగునతండు హరిం జేరున
ని చెప్పిన విని విదేహుండిట్లనియె-నీశ్వరుండే యే కర్మంబుల నాచరించెననంతయు నెఱింగింపుమనిన ద్రమిళుం డిట్లనియె॥ క॥ తా
రల నెన్నఁగవచ్చును భూరేణుల లెక్కవెట్టఁబోలును ధాత్రి న్నారాయణగుణకథనములారయ వర్ణింపలేరు హరబ్రహ్మాదు
ల్॥ వ॥ ఇట్లు గావున నాత్మసృష్టంబైన మనంబున బంచభూతనికరంబను పురంబొనరించి యందు నిజాంశంబునం బ్రవేశించి సగు
ణనిష్ఠుండై నారాయణాభిధానంబుగల ఋషీశ్వరుండగు పరమేశ్వరుండు వెలుఁగొందె-నతనిదశేంద్రియంబుల జేఁ బాలితం
బులైన దేహంబులు ధరించి జగద్రక్షకత్వసంహారకత్వాదిగుణంబులు గలుగుటం జేసి గుణనిష్ఠుండయి రజస్సత్త్వతమోగుణం
బుల బ్రహ్మవిష్ణురుద్రమూర్తులనం బరగు త్రిగుణాత్మకుండనంబడు నారాయణాఖ్యునిచరిత్రం బెరిఁగించెద నాకర్ణింపుము॥ క॥ ధ
ర్మునకుఁ దక్షపుత్రిక నిర్మలమతి బెండ్లియాడె నెఱి బుత్రునిఁ దత్కర్మునిని నారాయణఋషి నర్మిలిఁగనె నమలు బదరికాశ్రమమం
దుండె॥ గీ॥ అట్టి నారాయణాహ్వయుండైన మౌని బదరికాశ్రమమందున పారనిష్ఠ దపము గావింపబల భేదిదలఁకి మదిని మీనకే
తనుదినిజకామినులఁ బనిచె॥ వ॥ వారు నారాయణాశ్రమంబునకు నతని తపోవిఘ్నంబు సేయవచ్చునప్పుడవ్వనంబు సాలరసా
లబిల్వకదళీఖర్జూరజంబూజంబీరచందనపున్నాగమందారాదివివిధవృక్షనిబిడంబును, బుష్పఫలభరితశాఖావనమ్రతరుల
తాబృందంబును, మాధవీకుంజమంజరీపుంజమకరందపానమత్తమధుకరనికరఝంకారరవముఖరితహరిదంతరంబును,
గనకకమలకల్హారవిలసత్సరోవిహరమాణచక్రవాకబకక్రౌంచమరాళ దంపతీమండలమండితంబును, మృణాళభోజనా
సక్త సారసచయచంచూపుటవిపాటితకమలముకుళకేసరవిసరవితతప్రశస్తసగోవరంబును నై వెలయు నవ్వనంబున నిం
దువదనలందందమందగమనంబులం జెందు ఘర్మజలబిందుబృందంబులు నఖాంతంబుల నోసరించుచు డాయం జనునప్పుడు॥
మదనుని బాణజాలమున మగ్నతఁ బొందక ధైర్యవంతుఁడై ।ముదితల వాఁడిచూపులకు మోహమునొందక నిశ్చలాత్ముఁడై।
హృదయమునందు నచ్యుతు రమేశు ననంతు జగన్నివాసుని । న్వదలక భక్తి నిల్పికొని వారికి నిట్లనె మౌని పెంపునన్॥ క॥ జంభారి
పంపున నుమీ రంభోరుహవదనలారయ యరుదెంచితిరా । శుంభద్విహారవాంఛారంభంబునఁ దిరుగుఁడనిన లజ్జించి వెసన్॥
సీ॥ దేవమౌనీశ నీదివ్యచారిత్రంబు నెఱిఁగి సన్నుతి సేయ నెవ్వఁడోపుఁ । బుత్రమిత్రకళత్రభోగాదులను మాని తపము
గావించు సద్ధర్ములకును విఘ్నములొందు నెవి శ్వేశుఁ గొల్చినయతనికెనంత దాయంబువలనఁ గామంబు గ్రోధంబుఁ గలిగిన
తపములు పల్వలోదకములభంగిఁ గావె॥ నిన్ను వర్ణింపనలవి యే నిర్మలాత్మ । రమణలోఁ గానుమా యపరాధమనుచు స
న్నుతించిన నతఁడు ప్రసన్నుఁడగుచుఁ దనదు సామర్థ్య మెఱిఁగింపఁ దలఁచి యపుడు॥ వ॥ అమ్మునీశ్వరుండు పరమాశ్చర్యని
ధానంబుగా నిజతనూరుహంబులవలనం ద్రికోటికన్యకానివహంబుల నుద్భవింపం జేసిన గంధర్వవిబుధకామినీసముదయం
బులు పరమాద్భుతభయంబులు మనంబులం బొడమ సన్నుతించి యవ్విలాసినీసమూహంబులో నూర్వశియను దానిం గొని
చని పాకశాసను సభాసదనంబునం బెట్టి తద్వృత్తాంతం బంతయు విన్నవించిన నాశ్చర్యయుక్తహృదయుండయి శునాసీ
రుండూరకుండె నిట్టి నారాయణమునీశ్వరుచరిత్రంబు వినువారలు పరమకల్యాణగుణవంతులగుదురని చెప్పిన॥ గీ॥ రుష
భునకు నాత్మయోగమహిమ నీక్షఁ జెప్పె నచ్యుతుఁడు భూమిభారమునడఁపనంత । సౌరిదినవతారములు దాల్చె సొంపు నెవఁడు।
రాత్రిచరుల నుజంపనీరసముతోడ॥ వ॥ అట్టి పరమేశ్వరుని లీలాగృహీతంబులగు మత్స్యకూర్మవరాహనారసింహవామన
రామరఘురామబుద్ధకల్క్యాద్యవతారంబు లనేకంబులు గలవు శేషభాషాపతులకైన నుతియింపనలవిగాదు మఱియును॥
సర్వలఘుసీసము॥ నవవికచసరసిరుహనయన యుగ నిజచరణగగనచరనది నిఖిలనిగమవినుత। జలధిజకుచకలశలలితమృగ
మదరుచిరపరిమళితనిజహృదయ ధరణిభరణ। ద్రుహిణముఖసురనికరవిహితనుతికలితగుణకటిఘటితరుచిరతరకనకవస
న। భుజగరిపువరగమన రజతగిరిపతివినుత సతతవ్రతజపనియమసరణిచరిత॥ తిమికమఠకిటినృహరినమితబలినిహితపద। ప
రశుధర దశవదనకరవిదళన। మురమథన కలికలుషముదపముదపహృతినిపుణ। కరివరద మునిమనుజసురగరుడవినుత॥ వ॥ ఇ
వ్విధంబునం బ్రవర్తిల్లిన శ్రీమన్నారాయణమూర్తిలీలావిలాసంబు లనంతంబులు గలవు- మనోవాక్కాయకర్మంబుల
హరిపూజనంబు సేయక విపరీతగతులందిరుగుచుండు జడుల కెవ్విధంబున గతి గలుగునని యనిన నప్పుడప్పుడమి ఱేఁడప్పరమపురు

*ఋషభకుమారులగుచమసకరభాజనులు సేయుపరమార్థోపదేశము*

షలంబూచి యట్టిజడులుముక్తినొందునుపాయంబెట్టులంతయు నెఱింగింపుమనినచమసుండిట్లనియె॥ సీ॥ హరిముఖబాహూరువరపదాబ్జములందు వరుసచతుర్వర్ణవర్గసమితి।జనియించెనందులోసతులునుశూద్రులుహరికథలంతురుకలిహాయసముల। వేదశాస్త్రపురాణవిఖ్యాతులై కర్మకర్తలైవిప్రులుగర్వమెసగి । హరిభక్తిపరులనుహాస్యంబుసేయుచునిరయంబునొందుటనిజముగాదె।మృదులపక్వాన్నములనుదామెసగఁగఁగోరి।జీవహింసకుజనువానిఁజెందునఘము। హరి నుతింపకస్త్రీలోలుఁడైనవాఁడునరకవాసుండునగుచుండుననవరతము॥ వ॥ అట్లుగావునగృహ, క్షేత్రపుత్రకళత్రధనధాన్యాదులందు మోహితుండయిముక్తిమార్గంబులప్రత్యక్షంబులనినిందించువాఁడునుహరిభక్తివిరహితుండును దుర్గతిం గూలుదురనిమునివరుండానతిచ్చినవిదేహుండిట్లనియె॥ గీ॥ ఏయుగంబులందు నేరీతివర్తించు।నెట్టిరూపువాఁడు నెవ్విధమున।మనుజులచేతం బడెనుముని దేవగణముచే।విష్ణుఁడవ్యయుండువిశ్వవిభుఁడు॥ వ॥ అనినవినియందుఁగరభాజనుండిట్లనియె.ననేకావతారంబులు, నానారూపంబులును, బహువిధవర్ణంబులునుంగలిగిరాక్షసులనుసంహరించిదుష్టనిగ్రహంబును, శిష్టజనపరిపాలనంబుంజేయుచుం గృతయుగంబునశుక్లవర్ణుండై, చతుర్బాహుండై, జటావల్కలకృష్ణాజినోత్తరీయజపమాలికాదండకమండలుధరుండై,హరి నిర్మలతపోధ్యానానుష్ఠానగరిష్ఠులయినపురుషశ్రేష్ఠులచేత హంసుండు,సుపర్ణుండు,వైకుంఠుండు,ధర్ముండమలుండుయోగీశ్వరుండీశ్వరుండుపురుషుం డవ్యక్తుండుపరమాత్ముండను దివ్యనామంబులం బ్రసిద్ధివహించి, మొదటియుగంబునగణుతింపంబడు,త్రేతాయుగంబునరక్తవర్ణుండై,బాహుచతుష్క-మేఖలాత్రయవిశిష్టుండయి,హిరణ్యకేశుండును, వేదత్రయస్వరూపుండును-స్రుక్స్రువాద్యుపలక్షణశోభితుండై-విష్ణు-యజ్ఞ పృశ్నిగర్భ-సర్వదేవమయ-ఉరుక్రమ-వృషాకపి జయంత-ఉరుగాయాఖ్యలబ్రహ్మవాదులచేతనుతియింపంబడు- ద్వాపరంబున-శ్యామలదేహుండును-పీతాంబరధరుండును-బాహుద్వయోపశోభితుండును-దివ్యాయుధధరుండును-శ్రీవత్సకౌస్తుభ వనమాలికావిరాజమానుండును.మహారాజోపలక్షణుండునునై జనార్దన,వాసుదేవసంకర్షణ,ప్రద్యుమ్నఅనిరుద్ధ,ఋషి,పురుష,మహాత్మవిశ్వ,నారాయణవిశ్వరూపసర్వభూతాత్మకాదినామంబుల వెలసిమూర్తాభిషిక్తులచేతసన్నుతింపంబడు.కలియుగంబునగృష్ణవర్ణుండును,కృష్ణనామకుండునై,భక్తసంరక్షణార్థంబుపుండరీకాక్షుండు వివిధయజ్ఞంబులచేసంకీర్తనాదులచేతంబ్రస్తుతింపంబడు హరి, రామ, నారాయణ,నృసింహ-కంసారి,నళినోదరాదిబహువిధనామములచేబ్రహ్మవాదులుమునీంద్రులునుతియింపుదురుమఱియును॥గీ॥ద్రవిడదేశంబులందులదామ్రపర్ణి।సహ్యజాకృతమాలాదిసకలనదుల।నెవ్వడేనియుభక్తితోనేగియచటఁ। బాడలితర్పణమొగిఁజేయపుణ్యమొదవు॥ వ॥ ఇవ్విధంబునంబ్రశంసింపందగినకావేర్యాదిమహానదీపావనజలస్నానపానదానంబులను,విష్ణుధ్యానకథాసుధా రసానుభవంబులనిరూఢులగుభాగవతోత్తములుగలిగి రేనియుం జెడనిపదంబునుంబొందుదురనిఋషభకుమారులుభగవత్ప్రతిబింబంబులయినపరమపురుషులునోలెవిదేహజనపాలునకునిశ్రేయసపదప్రాప్తికరంబులైనభగవద్భక్తిధర్మంబులుపదేశించియంతర్ధానంబునొందిరి.మిథిలేశ్వరుండును జ్ఞానయోగంబంగీకరించినిర్వాణపదంబునొందె.నీయుపాఖ్యానంబువ్రాసినఁబఠించినవినిననాయురారోగ్యైశ్వర్యంబులుగలిగిపుత్రపౌత్రవంతులై సకలకలికల్మషరహితులైవిష్ణులోకనివాసులగుదురనినారదుడువసుదేవునకుంజెప్పిమఱియు॥సీ॥కమలాక్షపదభక్తికథనముల్వసుదేవవినియఘంబులబాసి వెలసితీవు।భువనప్రసిద్ధిగాఁబాలుపొందుసతీర్తి కైవల్యలక్ష్మియుగలుగుమీఁద।నారాయణుండునీనందనుండను మోహమెడలించివిష్ణుగా నెఱిఁగికొలువు।మతఁడునీతనయుఁడైయవతరించుటజేసిసిద్ధించెదేహసంశుద్ధినీకు।సగనసల్లాపసౌహార్దసౌష్ఠవమునఁ।బావనంబైతిశిశుపాలపౌండ్రనరక।మురజరాసంధయవనులుముదముతోడ।వాసుదేవునిఁజెందిరివైరులయ్యు॥క॥దుష్టజననిగ్రహంబును।శిష్టప్రతిపాలనంబుసేయఁగహరిదా। సృష్టినవతారమొందెను।స్రష్టృముఖానేకదివిజసంఘమువొగడన్॥వ॥అట్లుగావున

*బ్రహ్మాదిదేవతలుశ్రీకృష్ణునివైకుంఠమునకుబిలువవచ్చుట.*

లోకరక్షణార్థంబుకృష్ణుండవతారంబునొందెననిహరిభక్తిపరంబులగు నుపాఖ్యానంబులునారదుండుపన్యసించినవినివిస్మితచిత్తులై దేవకీవసుదేవులుగృష్ణునిబరమాత్మునిగావిచారిస్చిరని శుకుండురాజునకుంజెప్పిననతండుమునీంద్రాయాదవులనేప్రకారంబునహరిహరియించెసపరివారులగుబ్రహ్మరుద్రేంద్రాదిదిక్పాలకమునీంద్రులుద్వారకానగరప్రవేశంబెట్లుచేసిరేమవ్యోమఱియుంబరమేశ్వరకథామృతంబువీనులలరంజవిగొనియునింకందనివిసనదుభక్తరక్షకుండగుహరిచారిత్రంబెరీతింజాగెదర్వాతివృత్తాంతంబంతయు నెఱింగింపుమనినశుకుండిట్లనియె॥క॥సురగరుడఖచరవిద్యాధరహరపరమేష్ఠిమఖసుధాశనులుమును।ల్సరసిజనయనునిగనుగొన।నరుదెంచిరిద్వారవతికినతిమోదమునన్॥ క॥కనిపరమేశునియాదవ।వన

శోభితపారిజాతు వనరుహనేత్రు। సజ్జనకామితఫలదాయకు। వినుతింప చిరదినజులపుడు ఎవ్వ కర్తులౌ ॥గ॥ అఖిలలోకేశ సచ్ఛ్రీ శయభవనీవు। సదయసంకటభూభారముడుపుకొఱకుఁ బచ్చిపింశోత్తరశతాబ్దపరితము వెయ్యె। గోరి విచ్చేయుమయ వైకుంఠమునకు॥వ॥ అనినఁ గమలభవభవముఖనిఖిలసురగణంబుల వచనంబు లయ్యాకర్ణించి కృష్ణుండు వారలతో దయాదృక్కులకు నన్యోన్యవైరానుబంధంబులు కల్పించి వారలహతంబుగా నిన్ని భూభారంబడంచియు దేవ చ్ఛేదంబొండని చెప్పి వీడ్కొలిపినఁ గమలాసనాదిబృందారకులు నిజస్థానంబులకుం జని రంత॥సీ॥ కాకఘూకంబు లకనకసౌధములలోఁ బగలువాపోయెడి బహువిధములు నశ్వవాలంబుల ననలముద్భవమయ్యె వసన్నంబు మొలిచె మహోద్భుతముగ। శుకశారికల రాత్రి సోగసె విస్వరముల జంతువు వేఱొకరూ జంతువుఁ గనియె। నాగిచారగృహముల నుత్పలులుదయించె బెరసె గావిరి రవిబింబమపుడు। గానను త్పాతములు చాలఁగానఁబడియె। నరయ నిందుండవలదు యాదవులార। తడయక యిపుడు ప్రభాసతీర్థమునకు బుగుఁడనుచు శ్రీకృష్ణుండంతయు నానతిచ్చె॥క॥ నారాయణువచనములకు। పారంబగు సమ్మదమున బలములతోడన్। దారసుతమిత్రయుతులై। వారణహయసమితితో డవడి నేగిరోగిన్॥ అంత॥క॥ జ్ఞానఘనునధ్వుఁడుఁదన। మానసమున నెఱిఁగి శ్రీరమాధిపహరియో। దీనజనకల్పభూజ

శ్రీకృష్ణమూర్తి యుద్ధవునికిం బరమార్థోపదేశము చేయుట.

మ। శ్రీనాయక మాకు నీవెదిక్కు నిజాగడన్॥వ॥ ఇట్లు నుతియించి దేవా నీవు యదుభయంబు గావించిచన నేవిధంబున నిర్వహింతు మునీ సహచరుల మైకడపిన సజ్జనభోజనశయనాసనాదికృత్యంబులు మరువవచ్చు నే యని యుద్ధవుం డాడినవాసుదేవుం డిట్లనియె బ్రహ్మాదిదేవతాప్రార్థనంబునం జేసి ధాత్రీభారంబు నివారించితి నింక ద్వారకానగరంబు నిందుకు సప్తమదివసంబున సముద్రుం డుముంపంగలవాడు యదుక్షయంబును నంగాగలయది యంతటం గలియుగంబు ప్రాప్తంబయ్యెడి నందు మానవులు ధర్మవిరహితులు నాచారహీనులున న్యాయపరులు నతిరోషులును మందమతులు నల్పతరాయువులును బహురోగపీడితులును నిష్ఫలారంభులును నాస్తికులు నొండొరుల మెచ్చకయుందురు గావున నీవు సుహృద్బాంధవస్నేహంబు వర్జించి యింద్రియసౌఖ్యంబులం బొరయక క్షోణీతలంబునం గల పుణ్యతీర్థావగాహనంబు సేయుచు మానసవాగక్షిశ్రోత్రఘ్రాణేంద్రియగ్రహ్యమాణంబగు వస్తుజాతంబు నశ్వరంబుగా నెఱుంగుము పురుషుండు నానార్థకామంబుల నంగీకరించి నిజగుణదోషంబుల మోహితుండై యుండుఁ గావున హస్తిపకుఁడు గంధనాగంబుల బంధించు చందంబున నింద్రియంబులను మనోవికారంబులను నిగ్రహించి యీషణత్రయంబును వర్జించి మోదఖేదంబుల సముండవుగా వర్తించుచు నీ జగంబంతయు నాత్మాధిష్ఠితంబుగా నెఱిఁగి మాయాదుల నాత్మతత్త్వాధీనంబుగాఁ దెలియుచు జ్ఞానవిజ్ఞానయుక్తుండవై యాత్మానుభవసంతుష్టుండవై విశ్వంబు నన్నుఁగా భావించి వర్తింపవలయు ననివాసుదేవుండాలనచ్చిన యుద్ధవుండు భక్తిభయవినయంబులం గరంబులు మొగిడ్చి మహాత్మా సన్న్యస్తలక్షణంబు దుష్కరంబు పామరులగువారలాచరింప లేరు నీమాయచేత భ్రాంతులై చేయునదిదె యని సాంసారికులు భవాబ్ధిం గడచి యెట్లు ముక్తివడయుదురు భృత్యుండనైన నామీఁద ననుగ్రహించి యానతిమ్ము బ్రహ్మాదిదేవతాసముదయంబులు బాహ్యవస్తువులభ్రాంతులై పర్యటనంబు సేయుదురు నీభక్తులైన పరమభాగవతులు నమ్మాయానిరసనంబు సేయుదురు గృహిణీగృహస్థులకైన యతులకైన నిత్యంబు నీనామస్మరణంబు మోక్షసామ్రాజ్యప్రదంబుగావునం బరమేశ్వర నీదుచరణంబు శరణంబు వొందెదఁ గృపారసంబు నాపైని గుడింపుమని ప్రియసేవకుండైన యుద్ధవుండు వలికిన నతనికింగంసమర్దనుండిట్లనియె నట్లు పురుషునకాత్మకు నాత్మయే గురువని యెఱుంగుము కుపథంబులకుం జనక సన్మార్గవర్తివై పరమంబైన మన్నివాసంబునకుం జనుము సర్వమూలశక్తిసంపన్నుండనైన నన్ను సాంఖ్యయోగపరులు నిరంతరభావంబులందుఁ బురుషభావంబుగా భావించి తలంచుచుండుదురు మఱియు నేకద్విత్రిచతుష్పాదబహుపాదాపాదంబులునైయుండు జీవజాలంబులో సమనుష్యులు మేలు వారలలోన నిరంతరధ్యానగరిష్ఠులయిన యోగీంద్రులుత్తములు వారలలో సందేహపరులచేన గ్రాహ్యుండగు నన్ను సత్త్వగుణగ్రాహ్యునిగా నెఱింగి నిజచేతఃపంకజంబునందు జీవాత్మపరమాత్మలనేకంబుగా జేసి శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గకౌమోదకీకౌస్తుభాభరణయుక్తుంగాఁ దలంచుచుండువారలు పరమయోగీంద్రులని యును బరమజ్ఞానులని యును జెప్పి మఱియు నవధూతయదుసంవాదంబను పురాతనేతిహాసంబుగలదు సెప్పెద నాకర్ణింపుము॥ఉ॥ పంకజ

అవధూతయదుసంవాదము.

నాభుఁ డుద్ధవునిపైఁగలకూర్మిని జెప్పెనొప్పనా। తంకములేక యన్నిదిశలందుఁ జరించుచునృత్యతృప్తుఁడై। శంకరవేషధారి యొకసంయమి యాయదురాజు జేరనే। వంకననుండి వచ్చి తనవానికి నిట్లనెనర్థినేర్పడన్॥క॥ అవధూతపరా నంతటఁ। బ్రవిమలవిజ్ఞాననిపుణ భవ్యులు గురువు। లవిలిన యిరువదినలుపురు। నవనిన్విజ్ఞాసినైతి ననిపలుకుటయున్॥వ॥ అంత యదుప్రవరుండిట్లనియె దేహి లోభమోహాదుల వర్జించి జనార్దనుని నేవిధంబునఁ జేరవచ్చు నెఱింగింపుమనిన నతండిట్లనియె॥సీ॥ పరధనపరదార

పరమహంసాదులం బరవస్తుచింత దాఁబరిహరించి। మదిమిచేరోగము లెదయింపక టముస్నలెనువుచంచలలెని దగలకుండ బుద్ధిసంచలతఁ బెంపొదలకయటముస్న శేష్మంబుగళమునఁ జేరకుండ।శక్తియు కులమది చేవదీయక మున్నభక్తిభావనచేతఁ బ్రౌఢుఁడగుచు॥ దైత్యభంజనుదివ్యపాదారవింద।భజననిజభక్తిభావనఁ బ్రాజ్ఞుఁడగుచు।నవ్యయానందమునుబొందు నను దినంబు।నరుఁడు కర్మవిముక్తుఁడౌ ననఘచరిత॥ ఉ॥ దారలయందుఁ బుత్రధనధాన్యములందు ననేకభంగులం।గూరిమిచేయుపుర్తుఁ డతిఘోరవియోగజదుఃఖమగ్నుఁడై।నేరుపుదక్కి చిక్కువడి నీతివివేకవిహీనుఁడైమనో।భారముతోఁ గపోతపతిభంగి నిజంబుగఁ బోవునష్టమై॥ వ॥ ఇందులకొక్కయితిహాసంబుగలదు మహారణ్యంబున నొక్కకపోతంబు దారసమేతంబుగా నొక్కచోట నికేతనంబు నిర్మించి యన్యోన్య మోహాతిరేకంబునఁ గొంతకాలంబు సకుసంతానసమృద్ధిగలదియై యపరిమితంబులైనపిల్లలు బిరుగాడుచుండఁ గొన్నిమాసంబులు భోగానుభవంబునం బొరలుచుండంగాలవశంబున నొక్కలుబ్ధకుండు వలపొడ్డిననందు ధారాపత్యంబులు దగులువడిన ధైర్యంబువదలి మోహాతిరేకంబునం గపోతంబు కళత్రపుత్రస్నేహంబునం దానునందుఁ జొచ్చియు నధికచింతాభరంబునం గృశీభూతంబయ్యెనా వునన తితీవ్రంబైన మోహంబుగొఁ యగాదట్లుగాన నిరంతర హరిధ్యానపరుండై భూమిపవనగగనకృమికీటభవసోమసూర్యకపోతతలిప్సజలధిశలభమధుమక్షికాగజద్విరేఫహరిణపాఠీనపింగళాకురరడింభకకుమారికాశరకృత్సర్పలూతాసుపేశకృత్తులసముదయంబునుండి వానిగుణంబు లెఱింగికొని యోగీంద్రులు మెలంగుదురనిన॥ క॥ ఇవి దెలియవలయు నాకును।బ్రవిమలమతి వాని దెలియఁబలుకుమనంగన్।గ్రమమున నవిసుమని కృష్ణుఁడు।సవినయుఁడగు నుద్ధవునికిఁ జయ్యనఁ జెప్పెన్॥ వ॥ ఇవ్విధంబున భూమివలన నైరణయు, గంధవహునివలన బంధురంబగు పరోపకారంబును, విష్ణుపదంబువలనఁ గాలసృష్టిగుణసాంగత్యంబు, నుదకంబువలన నిత్యశుచిత్వంబు, నగ్నివలన నిర్మలత్వంబును. నిశాకరప్రభాకరులవలన నధికాల్పసమత్వజీవగ్రహణమోక్షణంబులును, గపోతంబువలన గళత్రపుత్రస్నేహంబు-నజగరంబువలన స్వేచ్ఛాసమాగతాహారంబును, వననిధివలన నుత్సాహశోషణంబులును-శలభంబువలన శక్త్యనుకూలకర్మాచరణంబును-భృంగంబువలన సారమాత్రగ్రహణవిశేషంబును, స్తంబేరమంబువలనం గాంతావైముఖ్యంబును, సరఘవలన నిరంతర సారసంగ్రహగుణంబును, హరిణంబువలనం జింతాపరత్వంబును, జలచరంబువలన జిహ్వాచాపల్యంబును, బింగళవలన యథాలాభసంతుష్టియు, గురరంబువలన మోహపరిత్యాగంబును, గుమారికవలన సంగత్యాగంబు, శరకారునివలన నందదేకనిష్ఠయు, దందశూకంబువలనం బరగృహవాసంబు-నూర్ణనాభివలన సంసారపరిత్యాగంబును-గణుదురువలన లక్ష్యగతజ్ఞానంబున నంగలవీనిగుణంబు లెఱింగ కామక్రోధలోభమోహమదమాత్సర్యంబులను నరిషడ్వర్గంబుల జయించి జరామరణవిరహితంబుగా వాయువశంబు చేసి గాత్రపవిత్రత్వంబు నకరుగుచు షట్కర్మరతుండై పురనగరగ్రామంబులు పరిత్యజించి పర్వతారణ్యంబుల సంచరించుచు శరీరధారణార్థంబు నియమితస్వల్పభోజనుండై ఖేదమోదంబులు సరియకా భావించి లోభమోహంబులు వర్జించి నిర్జితేంద్రియుండై యొండెఱుంగక యాత్మనిష్ఠ చే బవిత్రాంతఃకరణుండైన యోగి నాయందు భ్రగలయుండు గావున॥ క॥ మోహితుండై వసుకాంతా।వాహిని లోఁజిక్కి క్రూరవశుఁడై యెవ్వం।డూహాపోహ లెఱుంగక।దేహమునలఁ గంగ జేయుదీనత నొందున్॥ వ॥ ఇందులకుం బురాతనవృత్తాంతంబు గలదు సావధానచిత్తుండవై వినుము మిథిలానగరంబున బింగళయను గణికారత్నంబు గలదు దానివలనం గొంతపరిజ్ఞానంబు గంటిన దెట్లనిన నమ్మానినీవసుకాంక్షం జేసి యాత్మసఖుని మొఱంగి ధనం బిచ్చువానిం జేకొని నిజనికేతనాభ్యంతరంబునకుం గొనిచని రాత్రినిద్ర లేకుండ చుంబుట భేదనవిపణిమార్గంబులఁ బర్యటనంబు సలుపుచు నిద్రాలసభావంబున జడనువడియర్థాపేక్షుండగిలి తిరిగియలసియాత్మసుఖంబు సేయునతం డేభర్తయని చింతించి నారాయణు నిట్లు చింతింప నతని కైవల్యంబు చేరవచ్చునని విచారించి నిజశయనావిస్థానంబు బువర్జించి వేగిరంబవాసుదేవచరణారవిందవన్నాభిలాషయై దేహంబు విద్యుత్ప్రకారంబని చింతించి పరమతత్వంబునందు జిత్తంబు గీలుకొల్పి ముక్తురాలయ్యెనని యెఱింగిన్చి॥ క॥ దేహము నిత్యము గాదని।మోహము దెగఁ గోసి సిద్ధమునివర్తనుఁడై।గేహము వెలువడిచననుం।త్సాహమున సంజెందుముక్తి సంపదననఘా॥ వ॥ మఱియు నొక్క పురాతనపుణ్యకథ వినుము కనకావతీపురంబున నొక్కధరామరునికన్యకారత్నంబు గలద వ్వధూతిలకంబు రత్నసమేతంబులగు కంకణంబులు ధరించి బంధుజనంబులకు నాతిథ్యంబు గావించుకొఱకు శాలితండులంబులను రహస్యంబుగా రోకలిఁ జేకొని దంచునప్పుడు కంకణంబులతిరావంబుగా మ్రోయుచుండ నప్పరమపతివ్రత యందులకు ననహ్యపడి యన్నియు డులిచి యొకటొకటిని పెనక్లేకచి తంబునందత్తరపడక భగవదాయత్తంబైన చిత్తంబునం బ్రసన్నచిత్తులై ముక్తులగుదురట్లుగాన నవిద్యావిద్యలు నా మాయగా విచారించి కేవలపశుమార్గులుగాక షడ్గుణైశ్వర్యసంపన్నులై నయోగీంద్రులపగిది సుఖంబు గోరక యందు వారలు ముక్తులగుదురు సర్వంబును విష్ణుమాయగా దెలియుమని యుద్ధవునికిం జెప్పిననతం డు దేవా నీరూపంబెలాగు సంగానవచ్చునని న

నతండట్లు మేభక్తిభావనాపరాయణుండై కృపాపరతంత్రుండై మిత్రభావనుండై సకలకర్మంబులు మదర్పణంబుగా జే
సినయతండు భాగవతుండు మత్కథలు మజ్జన్మకర్మంబులు వినుచు మత్సేవకులైన భాగవతులం జూచి తనగృహంబునకు న్గొని
పోయి మజ్జనపూజనభోజనశయనాసనధ్యానంబులం బరితుష్టులం జేసినయతండె భాగవతుండనంబడు నిట్లెంతకాలంబు
జీవించునంతకాలంబు నడుపునతండు మద్రూపంబున వైకుంఠనిలయంబునొందు నదియునుంగాక గంధపుష్పధూపదీపనైవే
ద్యంబుల లక్ష్మీసమేతుండనై శంఖచక్రగదాశార్ఙ్గాద్యాయుధయుక్తుండనైన నన్ను శుకసనకాదియోగీంద్రులు నంబరీష విభీషణ రు
క్మాంగదులు మొదలుగాగల భాగవతులు శాస్త్రాచారచోదితులుగాక భక్తిభావనావిశేషంబున నన్నే మఱక నిత్యంబును జిం
తనాయుక్తులైన న్నెఱింగిరి మధురాపురంబునకు హలాయుధసహితుండనై నే నరుగఁ జో గోపికలు లోపికలు లేక భక్తియో
గంబున జింతించి ముక్తులైరి. ఇది భక్తియోగప్రకారంబని యుద్ధవునికిం జెప్పిన॥ క॥ ధ్యానం బేక్రియ నిలుచును। ధ్యానం బేరీతి వెల
గును దాత్తచరిత్రా। ధ్యానప్రకారమంతయు। నూనంబుగఁ జెప్పుమయ్య యుర్వీరమణా॥ వ॥ అనియడిగిన యాదవేంద్రుండట్ల
ని పలుకం దొడంగె దారుమధ్యభాగంబున ననలంబు సూక్ష్మరూపంబున వర్తించు చందంబున నండంబై సకలశరీరులయందు న
చ్ఛేద్యుండు నదాహ్యుండును నశోష్యుండును నైన జీవుండు వసియించియుండునని న నుద్ధవుండిట్లనియె సనక సనందనాది యోగీం
ద్రులకు యోగమార్గం బేరీతి నానతిచ్చితివది యేవిధం బానతీయవే యని యభ్యర్థించిన నతండిట్లనియె. వారలు చతుర్ముఖు నడి
గిన నతండు నేనును దెలియనేరననిన వారలు విస్మయంబందుచుండ నే నాసమయంబున హంసస్వరూపుండనై వారల కెఱింగి
న్చిన తెఱంగు వినుము పంచేంద్రియంబులకు దృష్టంబైన పదార్థంబు నిత్యంబు నిత్యదృష్టి బ్రహ్మంబని తెలియవలయు దేహికర్మా
ర్జిత దేహుండై సంసారమమతల నిరసించి నిశ్చలజ్ఞానయుక్తుండై మత్పదప్రాప్తుండగు స్వప్నలబ్ధపదార్థంబు నిజముగాని క్రి
యఁ గర్మానుభవపర్యంతంబు కళేబరంబు వర్తించునని సాంఖ్యయోగంబు సనకాదుల కెఱింగించిన విని బ్రహ్మముఖ్యులైన దేవ
తలెఱింగిరి వారివలన భూలోకంబున ప్రసిద్ధంబయ్యె నది గావున నీవు నెఱింగి కొన్ని పుణ్యాశ్రమంబులకుం జను మస్మదీయ భక్తి
యుక్తులను హరిపరాయణులను సరసింపక యట్టి భాగవతుల చరణరజఃపుంజంబు తనశరీరంబు సోకఁ జేయునతండును, ము
ద్రాధారణయు హరిదివ్యనామంబును ధరించువారలకును న్నోదకంబులనిడునతండును వాసుదేవభక్తులంగని హర్షించువాఁ
డె భాగవతుండని చెప్పి మఱియు సర్వసంగపరిత్యాగంబు చేసి యొండెఱుంగక నన్నే తలంచు మానవులకు భుక్తిముక్తిప్రదా
యకుండనై యుండుమనని యానతిచ్చిన నుద్ధవుండు మజ్జ్ఞానమార్గం బేరీతి యానతీయవలయుననిన హరి యిట్లనియె- నేకాన్తమా
నసుండై హస్తాబ్జంబు లూరుద్వయంబున సంధించి నాసాగ్రంబున నీక్షణంబు నిల్పి ప్రాణాయామంబున సన్నహృదయగతుం
గావలచ్చి యష్టాదశధారణాసిద్ధు లెఱింగి యందు నణిమాదులు ప్రధానసిద్ధులుగా దెలిసి యింద్రియంబుల బంధించి మనంబా
త్మయందుఁ జేర్చి యాత్మనాత్మతోఁ గీలించిన బ్రహ్మపదంబుఁ బొందు భాగవతశ్రేష్ఠులితరధర్మంబులు మాని నన్నుం గాంతురు
తొల్లి పాండునందనుండగు నర్జునుండు యుద్ధరంగంబున విషాదంబునొంది యిట్లు యడిగిన నతనికి నే జెప్పిన తెఱంగెఱింగించెద
భూతంబులందు నాధారభూతంబును సూక్ష్మంబులందు జీవుండును దుర్జయంబులందు మనంబును దేవతలందు బద్మగర్భుం
డును వసువులందు హవ్యవాహుండు నాదిత్యులందు విష్ణువు రుద్రులందు నీలలోహితుండును బ్రహ్మలందు భృగువును ఋషు ల
లోన నారదుండును ధేనులందు గామధేనువును సిద్ధులలోఁ గపిలుండును దైత్యులలో బ్రహ్లాదుండును గ్రహంబులలోఁ గళాని
ధియును గజంబులలో నైరావతంబును హయంబులలో నుచ్చైశ్శ్రవంబును నాగంబులలో వాసుకియును మృగంబులలోఁ గేస
రియు నాశ్రమంబులందు గృహస్థాశ్రమంబును వర్ణంబులలో నోంకారంబును నదులందు గంగయు సాగరంబులలో దుగ్ధసాగ
రంబు నాయుధంబులలో గార్ముకంబును గిరులందు మేరువును వృక్షంబులలో నశ్వత్థంబును నోషధులలో యవలును- య
జ్ఞంబులందు బ్రహ్మయజ్ఞంబును వ్రతంబులందహింసయు యోగంబులందాత్మయోగంబును స్త్రీలలో శతరూపయు భా
షణంబులలో సత్యభాషణంబును ఋతువులందు వసంతాగమంబును మాసంబులలో మార్గశీర్షంబును నక్షత్రంబులలో నభి
త్తువును యుగంబులందు గృతయుగంబును భగవదాకారంబులందు వాసుదేవుండును యక్షులలోఁ గుబేరుండును వానరుల
న్నాంజనేయుండును రత్నంబులందు బద్మరాగంబును దానంబులలో నన్నదానంబును నరులయందు వైష్ణవుండై భాగవతప్రవ
ర్తనంబు ప్రవర్తించువాఁడును నివియన్నియు మద్విభూతులుగా నెఱుంగుమని కృష్ణుండుద్ధవునకు నుపన్యసించిన వెండియు నతండిట్లని
యె॥ క॥ వర్ణాశ్రమధర్మంబులు। నిర్ణయముగ నానతిమ్ము నీరజనాభా। కర్ణరసాయనముగ నివి। వర్ణింపుము వినెద నేఁడు వనరు
హనేత్రా॥ వ॥ అనినఁ గృష్ణుండు నాలుగువర్ణంబుల యుత్పత్తియు నాలుగాశ్రమంబులకిట్టి వర్ష్యంబులనియును నాల్గువేదంబు
లం జెప్పిన ధర్మంబులును బ్రవృత్తినివృత్తిహేతువులగు పురాణేతిహాసధర్మశాస్త్రంబులును వైరాగ్యజ్ఞానంబులును నివి
మొదలుగాఁ గలవన్నియు నెఱింగించి,, సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,, యనునుపనిషత్తుల్య-బగుగీతావచన

ప్రకారంబున నెవ్వఁడేనియు నాయందు లీనుఁడగు భక్తిఁ జేయువాఁడు నేననిపలుకంబడు పెక్కువిధంబులవాఁడు బులలనెందు సుందరులువడక నామీఁదఁదలంపుగలిగి వర్తింపుమనిన నుద్ధవుండిట్లనియె ॥క॥ తెలియఁగనగోన్నచెప్పితి । తెలియఁగఁగల వెల్లవాఁడు దెలుపుముకృపా వలనేఁగి తెలియవలయును । నలినాసనజనకభక్తనతపదయుగళా ॥ వ ॥ అనియుద్ధవుండడిగినఁ బుండరీకాక్షుండు నీప్రశ్నంబు బదుగ్లభంబులు వినుము నియమశమదమాదులు తపంబులనంబడు సుఖదుఃఖంబులు స్వర్గనరకంబులనంబడు నవియెవ్వియనిన మౌనవ్రత బ్రహ్మచర్య క్షమా జపతపంబులు సత్యసత్కారంబులును బరహితంబులైనమొదలైన నియమయంబు, లింద్రియనిగ్రహంబును, శత్రుమిత్రసమత్వంబును, శమంబనంబరగు మూఢజనులకు జ్ఞానోపదేశార్థంబుగఁ గామ్యత్యాగంబును, సమదర్శనంబును, వైష్ణవసమూహంబులందు భక్తియు, ప్రాణాయామంబునఁ జిత్తశుద్ధి నొందిపత్యప్రపుండనటదమంబటిని యమాదిగుణసహితత్వంబును మద్భక్తిసాహిత్యంబుననునదియె సుఖంబునన్నెలుంగకత మోగుణంబునఁ బరగుటయె దుఃఖంబనంబడు బంధుగురుజనంబులయెడ భేదబుద్ధినొంది శరీరంబు నిజగృహంబుగా భావించినవాఁడె దరిద్రుండింద్రియనిరసనుండు నుగ్రపణ గుణవిరక్తుండె యీశ్వరుండు నాయందుఁదలంపునిలిపి కర్మయోగంబులందును భక్తియోగంబులందును వాత్సల్యముండగిలి జనకాదులు కైవల్యంబు జెందిరి భక్తియోగంబునం జేసి శబరీప్రహ్లాదముచికుందాదులు పరమపదప్రాప్తులైరదిగావున నిదియె యింగినిరంతరభక్తియోగంబధికంబుగా మనంబున నిలుపుము మృణ్మయంబైనఘటంబునజలంబులు జాలుకొను తెఱంగున దినదినంబునకు నాయువు క్షయంబైన మృత్యుప్రసన్నిహితంబై వచ్చుగావుననిదియె యింగినిరంతరంబును నన్నేమఱకతలంచునతండు నాకుఁ బ్రియుండు ॥క॥ గర్భమునఁ బరిజ్ఞానము । నిర్భరమై యుండుజీవునికి దుదిన తేఁడా । విర్భూతుఁడైనజడునన్ దర్భావంబునను బోధమంతయు ననఘా ॥ వ ॥ అట్లుగావున బాల్యకైశోరకౌమారవయోవిశేషంబుల వెనుకనై నంబద్ధమై యెఱింగి నేనిగృతకృత్యుండగు సంపద్గర్వాంధుండైననన్ధకారకూపంబునంబడువారిద రిద్రునిగాఁ జేసిసజ్జ్ఞానిమెయస్మత్పాదారవింద వందనాభిలాషుఁడై ముక్తుండగునట్లుగావున దేహాభిమానంబు వర్జించి యైహికాముష్మికసుఖంబులం గోరక మనంబు గుదియించియే ప్రొద్దునన్నుఁదలంచువాఁడు వైకుంఠపదప్రాప్తుండగు నేనునతని విడువంజాలక వెంటనరుగుదు నారదాదిమునులును భక్తిభావంబునం జేసి నాస్వరూపంబైరనిరసయుద్ధవునకుం జెప్పిననుద్ధవుండిట్లనియె ॥క॥ అయ్యా దేవజనార్దన । నెయ్యంబునసృష్టికర్త నేర్పరివైమెఱా । నొయ్యననునడుపునెవ్వఁడు । సయ్యన నెఱిగింపు నాకు సర్వజ్ఞనిధీ ॥ వ ॥ అనుటయు హరియుద్ధవునకుం జెప్పె ఇట్లుమత్పరితంబులై మహదాదిగుణంబులు గూడియుండంబైయుద్భవించెనంత నానాభివివరంబున బ్రహ్మయుదయించెనంత సాగరారణ్యనదీనదసంఘంబులు మొదలుగాఁగలజగన్నిర్మాణంబునతనివలననంగల్పించితినంత శతానందునకు శతాబ్దంబులు పరిపూర్ణంబైన ధాత్రి గంధంబుదడంగు నాగంధంబుదకంబునంగలయుదకంబు రసంబునలీనంబగు నారసంబు తేజోరూపంబైయా తేజంబురూపంబున సంక్రమించు నారూపంబువాయువందుంగలయువాయువు స్పర్శగుణసంగ్రాహ్యంబయిననాస్పర్శగుణంబాకాశంబునలయంబగు నాయాకాశంబు శబ్దతన్మాత్రలచే గ్రసియింపంబడిననింద్రియంబులు మనోవైకారికగుణంబులంగూడి యీశ్వరునిం బొందియీశ్వరరూపంబులు దాల్చు నేనురజస్సత్వతమోగుణసమేతుండనై త్రిమూర్తులు వహించి జగదుత్పత్తిస్థితిలయకారణుఁడనైవర్తింతు గావున నీరహస్యంబు నీకునుపదేశించితి బరమపావనుండవు బరమభక్తియుక్తుండవు గావున ని చెప్పితినంత ॥గీ॥ రూపులేనినీకు రూఢిగా యోగులు । రూపునిల్పిరిన్నురుచిరభక్తి । గొల్చియుండవారికోరిక లిచ్చెద । వేమిలాగు మాకు నెఱుగఁబలుకు ॥ వ ॥ అనియుద్ధవుండడిగిన నారాయణుండిట్లనియె ॥ నేను సర్వవర్ణంబులకు సమంబైన పూజాప్రకారం బెఱిగించెద నాధారంబునం జేసి యొకరూపంబును బాషాణమృణ్మయదారువులం గల్పించియందు నారూపంబు నిల్పికొందు ఱు బూజింతురు కాంస్యతామ్రరజతకాంచన ప్రతిమావిశేషంబులు మంబులిట్లు నారూపంబులందు మద్భావముంచి కొల్చినవారికి నేఁ బ్రసన్నుండనగు మనీలోకంబున మనుష్యులకు ధ్యానంబు నిలువనేరదు గావునం బ్రతిమావిశేషంబులనేకంబులు గలవు వానియందుసౌందర్యసారంబులునై మనోహరంబులునైన రూపంబులనేనుందుగావున నర్ఘ్యార్ణవశాయిగా భావించి ధాతాంబరాభరణమాల్యానులేపనంబులను దివ్యాన్నపానంబులను షోడశోపచారపూజాప్రకారంబులను రాజోపచారంబులను బాహ్యపూజావిధానంబులనాచరించి మనస్సంకల్పితంబులైన పదార్థంబులు సమర్పించి నిత్యంబును నాభ్యంతరపూజావిధానంబులం బరితుష్టునిం జేసి దివ్యాంబరాభరణమాల్యానుశోభితుండును శంఖచక్రకిరీటాద్యలంకారభూషితుండును దివ్యమంగళవిగ్రహుండును గాఁదలంచి ధ్యానపరవశుండైన యతండు నాయందులంగలయును ద్ధవా నీవీప్రకారంబుగ దృఢనిష్ఠాతిశయంబున యోగనిష్ఠుండవై బదరికాశ్రమంబు చేరి మతపరిథితంబైన సాంఖ్యయోగంబంతరంగంబున నిలుపుకొని కల్పాంతయుగావసానపర్యంతంబు వర్తింపుమని యప్పరమేశ్వరుఁ డానతిచ్చిన నుద్ధవుండు నానందభరితాంతరంగుండై తత్పాదారవిం

దంబులు హృదయంబునం జేర్చుకొని పావనం బయిన బదరికాశ్రమంబునకుం జనియె నని శుకుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పుట జెప్పిన దనియదుచిత్తం। బొప్పగ మునిచం యును॥ క॥ చెప్పిన విని రాజేంద్రుడు। చొప్పడ శ్రీకృష్ణుకథలు చోద్యము గాఁగన్। జెప్పిన దనియదుచిత్తం। బొప్పగ మునిచంద్రు ద్వారకాపట్టణం ద్రనాకు సుత్తము లొప్పన్।అంతట నుగ్రుష్ణుం డేమయ్యె నరసి చూడ।యదువులెట్టులు వర్తించి రేర్పడంగ। ద్వారకాపట్టణం బెవ్విధమున నుండె।మునిజనశ్రేష్ఠ యానతీ ముదముతోడ॥ వ॥ అనిన రాజునకు శుకుండిట్లనియె వాసుదేవుం డన్యాయప్రవర్తకులగు దుష్టులసంహరించి న్యాయప్రవర్తకులగు శిష్టులబరిపాలనంబు చేసి బలరామసమేతంబుగా ద్వారకానగరంబు వెడ కరుగుట॥

॥ యాదవుల నన్యోన్యకలహంబున మడిసిన పిదప శ్రీకృష్ణబలరాములు వైకుంఠమున కరుగుట ॥

కరితురగరథపలిసన నియాదవులుదమలోదామ మదిరాపానమత్తులై మత్సరంబునను త్సాహకలహంబునకుంగమకించి కరితురగరథప దాతిబలంబులతో ననర్గళంబుగా యుద్ధసన్నద్ధులై యుద్ధంబునకుం జొచ్చి మునిశాపకారణంబున నుత్తుంగంబులైన తురంగస మూహంబులంబడలువడంబొడుచుచు వేయుచుండ వాకన వియునువజ్రాయుధసమానంబులై యొండొంటం దాకి భండనం బునంబడి ఖండంబులై యొరలుకబంధంబులును మొగ్గడి గజంబులునైన యాయోధనంబున నందరుం బొలియుటకు నగినధరుం డు రాముండును జని చనియంత నీలాంబరుండు వేలాకత్రోవంబోయి యోగమార్గంబున ననంతుని గల సెనప్పరమేశ్వరుం డు మఱి యొకమార్గంబున జని యొక్కనికుంజంబు చాటున విశ్రమించుటం జేసి చరణంబు వేలాకచరణంబమీద సంఘటించి చంచలంబుగా వినోదంబు సలుపుసమయంబున నొక్కలుబ్ధకుండు మృగవధార్థంబుగా వచ్చి దిక్కులు నిక్కినిరీక్షించుచుండ వృక్షంబు చాటున నప్పరమపురుషుని చరణకమలంబు హరిణకర్ణంబుగాఁ బోలునని దానింగని శరంబు శరాసనంబున సంధానంబు చేసి వేసిన నతండాహారవమ్ము వంగదచున్న యప్పరమేశ్వరుని సన్నిధానమ్మునకు వచ్చి భయమ్మున జగన్నాథుం గాఁ దెలిసి మహాపరాధుండను పాపచిత్తుండను కుటిలప్రచారుండనని యనేకవిధదీనాలాపమ్ములం బలుకుచు బాష్పజలధారాసిక్తవదనుండైన సరోజనేత్రుండు వానిం గరుణించి యిట్లనియె నీ వేల జాలింబడెదు పూర్వజన్మాంతరకర్మమ్ము లెంతవారికైనను నుభావ్యంగాని యూరకపోవనేరవు నీవు నిమిత్తమాత్రుండవింతియె కాని వానికిం దెలిపినవాడు మహాపరాధులైనవారూరకపోవరు దేవబ్రాహ్మణగురుద్రోహులకు నిలువనెట్లగునని పవిత్రాంతఃకరణుండై ప్రాయోపవేశమ్మున ప్రాణమ్ము లువర్జించి వైకుంఠపదప్రాప్తుండయ్యె నప్పుడు॥ క॥ దారకుడుగని యెనంతట।జారుని రూఢావధాను సర్వజ్ఞు హరిన్।మేరుసమధీరుదనుజవి।దారుని నేకాన్తపరుని దద్దయు వేడ్కన్॥ వ॥ కనియత్యంతభయభక్తి తాత్పర్యమ్ములముకుళితకరకమలుండై యిట్లనియె॥ గీ॥ నిన్ను జూడని కన్నులు నిష్ఫలములు।నిన్ను నొడువని జిహ్వ దాసీరసమ్ము।నిన్ను గానని దినములు నింద్యములగు।గన్నులను జూచి మమ్మును గారవింపు॥ వ॥ అనుచు నా దారకుండు నిర్వేదనపరుండై యిట్లని విన్నవించె యాదవసముద్రంబడ జేబంధుగురుమిత్రజనమ్ములకు డక్కడంబోయిరి ద్వారకకుం బోయి సుహృజ్జనంబులం గూడి యేమందు నని పలుకు నవసరంబున దివ్యాయుధంబులును దివ్యరథరథ్యమ్ములును నంతర్థానంబు నొందెనా రాయణుండు వానితో నక్రూరవిదురులకు నీవృత్తాంతం బంతయు జెప్పుమనుటయు సవ్యసాచిం గని స్త్రీబాలగురువృద్ధజనమ్ముల గరిపురమ్మునకుం గొనిచను మహాప్రామ్మనిన మహాత్ము వా డును జనికృష్ణునివాక్యంబులు సవిస్తరంబుగాఁ జెప్పి యట్లు జేయ నతక్షణంబ ద్వారకానగరమ్ము పరిపూర్ణజలంబై మునింగెనన్తనెవ్వరికిం జనరాకయుండెనప్పరమేశ్వరుండును శతకోటిసూర్యదివ్యతేజోవిభాసితుండై వెడలి నారదాదిమునిగణంబులును బ్రహ్మరుద్రాదిదేవతలును జయజయశబ్దంబులతో డగదలి రానిజపదంబునకు జేరెనా రాయణవిగ్రహంబు జలధిపాలితం బునజగన్నాథస్వరూపంబై యుండెనని శుకుండు పరీక్షిన్నరేంద్రునకు జెప్పెనని చెప్పి॥ క॥ ఈకథ విన్నను వ్రాసిన ప్రాకటము గలక్ష్మియు యశము భాగ్యముగలుగున్।జేకొని యాయువు ఘనుడై।లోకములో నుండు నరుడు లోకులు పొగడన్॥ క॥ రాజీవసదృశనయనవి।రాజితశుభదాభిధేయ రాజవినుతవి।భ్రాజితకీర్తిలతావృత।రాజీవభవాదిజనక రఘుకులతిలకా॥ మా॥ ధరణిదుహితృరంతా ధర్మమార్గావగంతా।నిరుపమనయవంతా నిర్జరారాతిహంతా।గురుబుధసుఖకర్తా కోసలక్షోణిభర్తా సురభయపరిహర్తా సూరిచేతోవిహర్తా॥ గద్య॥ ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రియశిష్య వెలిగందల నారాయణాఖ్యప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు కృష్ణుండు భూభారంబు వాపి యాదవులకన్యోన్యవైరానుబంధంబు కల్పించి వారలహతంబుగా వించుటయు విదేహర్షభసంవాదంబును నారాయణమునిచారిత్రంబును నాలుగుయుగంబులహరి నాలుగువర్ణంబులై వర్తించుటయు బ్రహ్మాదిదేవతలు ద్వారకానగరంబునకుం జని కృష్ణుం బ్రార్థించి నిజపదంబునకు రమ్మనుటయు నవధూతయదుసంవాదమ్ము నుద్ధవునకు గృష్ణుడు ననేకవిధమ్ములైన యుపాఖ్యానమ్ము లెఱిగించుటయు నారాయణ ప్రకారంబంతయు దారకుండెఱింగివచ్చి ద్వారకానివాసులకుం జెప్పుటయు గృష్ణుడు దనదివ్యతేజమ్ముతో బరమాత్మం గూడుటయు ననుకథలంగల ఏకాదశస్కంధము సమాప్తము.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్రభాగవతము.

## ద్వాదశస్కంధము.

శ్రీమదుదశనపతశయన। కామితమునిరాజయోగికల్పద్రుమమఘా। కామఘనజనకవరనృప। జామాతృవరేశరామచంద్రమహీశా॥ వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైనసూతుండిట్లనియె నట్లుపరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వాసుదేవనిర్యాణపర్యంతంబు తజ్జన్మకర్మంబులు సెప్పినపిదప వంశసంబంధియన్నరపాలపుంగవుండు మహాత్మా నారాయణకథాప్రపంచంబును సద్గుణంబులును నాచారవిధియును జీవాత్మభేదంబు హరిపూజావిధానంబును జ్ఞానయోగప్రకారంబును మొదలైనవి యెఱింగించి విజ్ఞానవంతుంగాఁ జేసి మన్నించి యింకభావి

### శుకయోగిపరీక్షిత్తునకు భావికాలగతులఁజెప్పుట.

కార్యంబులన్నియు నెఱింగింపుమనిన శుకయోగీంద్రుండిట్లనియె॥ క॥ నరవరయీప్రశ్నమునకు। సరిచెప్పఁగరాదు నాదుసామర్థ్యము చే। బరికించి నీకుఁజెప్పెదఁ గర మొప్పఁగ భావికాలగతులన్వరుసన్॥ వ॥ అందు రాజులప్రకారం బెఱింగించెద బృహద్రథునకుం బురంజయుండు పుట్టు వానికి శునకుండనెడివాఁడు మంత్రియై యతండు పురంజయునిం జంపి తా రాజ్యంబేలుచుండునంతం గొంతకాలంబున కతనికిం గుమారుడుదయించిన వానికిం బ్రద్యోతన నామంబిడి యతనికిం బట్టంబుగట్టు నా భూభుజునకు విశ్వయూపుండుదయింపఁగలం డాతనికి నందివర్ధనుండు జన్మించు నీయేవురు నూటముప్పది యెనిమిది సంవత్సరంబులు వసుంధరాపరిపాలనంబునం బెంపువడయుదురు తదనంతరంబ శిశునాభుండను పార్థివుండుదయించు నా మూర్ధాభిషిక్తునకు కాకవర్ణుండు జనియించు నా రాజన్యునకు క్షేమవర్ముండుదయింపఁగలం డా పృథ్వీపతికి క్షేత్రజ్ఞుండతనికి విధిసారుండును విధిసారునకు జాతశత్రుండు నా భూపాలునకు దర్భకుండును దర్భకునికి నజయుండు నతనికి శైశునాగుండన నతనికి నందియు నునంగల పదుండ్రు నరపాలకులుద్భవించి, షష్ట్యుత్తరత్రిశతహాయనంబులు కలికాలంబున ధరాతలంబేలెద రంతట నందికి మహానంది యతనికి శూద్రస్త్రీగర్భంబున నతిబలశాలియయిన మహాపద్మపతియను నందనుండుదయించు నతనితోఁ క్షత్రియవంశంబడంగిపోఁగల దా సమయంబున నరపతులు శూద్రప్రాయులై ధర్మవిరహితులై తిరుగుచుండ మహాపద్మ సునుసుమాల్యుండాదిగాఁగల యెనమండ్రుకుమారులుదయించెద రువారు నూఱుసంవత్సరంబులు క్షోణీతలంబేలెదరంతట నా నవనందుల నొకభూసురోత్తముం డున్మూలంబుసేయునప్పుడు వారు లేమిని మౌర్యులు గొంతకాలం బీజగతీతలంబు నేలుదు రత్తఱి నా నృపదేవుండు చంద్రగుప్తుండను వానిం దనరాజ్యంబందు నభిషిక్తుంగాఁ జేయంగలండంత నా చంద్రగుప్తునకు వారినాభుండును వానికి నశోకవర్ధనుండు నతనికి సుయశస్సు వానికి సమ్మితుండు వాని హనీయునకు శాలిశూకుండతనికి సోమశర్ముఁడు వానికి శతధన్వుండు నవ్వీరునకు బృహద్రథుండుదయించెదరు మౌర్యులతోఁ జేరిన యీ బదుగురును సప్తత్రింశదుత్తరశతబ్దమ్ములు కలియుగంబుగా భూపరిపాలనంబు సేసెదరంత నా బృహద్రథుపుత్రుండగు నగ్నిమిత్రుండను వానికిని జ్యేష్ఠుండును సుజ్యేష్ఠునకును మిత్రుండును నతనికి భద్రకుండును భద్రకునకు బుళిందుండును నా పూరునకు ఘోషుండును వానికి వజ్రమిత్రుండును నతనికి భాగవతుండును వానికి దేవభూతియు నతనికి శుంగుండనుద్భవించెదరు వీరు పదుండ్రును ద్వాదశోత్తరశతహాయనంబు లుర్వీపతులయ్యెదరంత షడ్ధటశుంగకులసంజాతుండైన దేవభూతిని గణ్వామాత్యుండగు వాసుదేవుండను వాఁడు వధియించి రాజ్యంబేలు వానికి భూమిత్రుండును నస్మహానుభావునకు నారాయణుండు గలిగెదరు కణ్వవంశజులైన వీరలు మున్నూటనలువదేనబ్దంబులు మేదినీతలంబేలుదురు మఱియును॥ క॥ చతురతనీక్షితి నేలియు। మతిమోహము విడువలేక మానవనాథులనేకులు। బతిచంచలమగుట సెఱుఁగరయ్యా మహాత్మా॥ క॥ నరపతుల మహిమనంతయు। సురగాధిపులైన నోదుపనో పతుఘాత్రం। చిరకాలము లేవియుందే। పరువడి నడుగునవారు భ్రాంతుల నగుచున్॥ క॥ గజతురగాదిశ్రీలన। నిజమనిన జ్ఞగరానని త్యము నహారిన్। గజిబిజిలేక తలంచిన। సుజనులను నతనియంతు జోరగావచ్చున్॥ వ॥ మఱియు కణ్వవంశజుఁడగు సువర్ముండను రాజు దయిన్న వాని హింసించి తద్భృత్యుండంధ్రజాతీయుండైన వృషలుండధర్మమూర్తియై వసుమతిచక్రంబునకు ప్రభుండై యేలు నింత వాని యనుజుండు కృష్ణనాథుండను వాఁడు రాజైనిలుచు నా మహామూర్తికి శాతకర్ణుండను వానికి పౌర్ణమాసుండు నతనికి లంబోదరుండు వానికి జివిలకుండు నతనికి మేఘస్వాతియు వానికి దండమానుండు వానికి హాలేయుండు గుప్తకర్ముండు నతనికి బురుషసేనుండును వానికి నందనుండు వాని రాజశేఖరుడనకు వృకుండు వృకునకు జటాపుండు జటాపునకు శి

శ్వామియు వానికి సునందనుండును వానికి భూమిమిత్రునకు గోమతియు వానికి బూలమిత్రుండు నతనికి దేవశీర్షుండు వానికి శతసత్య
ధుండును నతనికి యజ్ఞశీర్షుండు వానికి శ్యామకునకు జయుండు వానికి జంద్రబీజుండతనికి సులోమధియు నిట్లు పెక్కండ్రు ముప్పదియున్నిప
న్నూటయేబదియాఱు హాయనంబులు ధాత్రి నేలెదరటమీఁద నాభీరులేడ్వురు గర్దభులు పదుండ్రు కంకవంశజులు పదియాఱురు
మౌనిభరంబు దాల్చియుండెద రటమీఁద యవనులెనమండ్రు బర్బరులు, పదుండ్రు దేశాధీశులై యేలెదరు - మఱియు గురుం
డులు పదుమువ్వురు బహునవ్వురు మౌనులు వేయిందొంబదిన్నూట తొమ్మిదిహాయనంబులు గర్వాంధులై యేలెద రటమీఁద నా
మౌలివంశజులగు పదునొకండ్రు త్రిశతయుతంబైన వత్సరంబులు మత్సరంబున నేలెదరా సమయంబున కైలికిలులను యవనులు
భూపతులగుదు రంత భూతనందుండు నవభంగిరుండు శిశునందుండు దత్ప్రీతయగు యశోనందుండు ప్రవీరకుండు వీరలు
వీరులై షడుత్తర శతహాయనంబు లేలెదరంత నా రాజులకుఁ బదుముగ్గురు కుమారులుదయించి యందు నా ముగ్గురు బాహ్లిక దే
శాధిపతులయ్యెదరు కడమ యేడ్వురును గోసలాధిపతులయ్యెదరంత వైదూర్యపతులు నిషధాధిపతులై యున్నైదరు పురంజ
యుండు మగధదేశాధిపతియై పుట్టువంతనతండు పుళిందయదు మద్రదేశవాసులగు హీనజాతిజనుల బ్రహ్మజ్ఞానహీనులై
హరిభక్తిరహితులై యున్న వారికి ధర్మోపదేశంబు సేసి నారాయణభక్తి నిత్యంబు నుండునట్లు గాఁజేసి బలపరాక్రమవం
తుండై క్షత్రియవంశంబులడంచి పద్మావతీనగర పరిపాలకుండై యా గంగాప్రయాగ పర్యంతంబగు భూమి నేలఁగలఁడు సౌరా
ష్ట్రావంత్యాభీరార్బుద మాళవ దేశాధిపతులు వ్రాత్యబ్రాహ్మణులై శూద్రప్రాయులై యున్నఁగలరు వారు సింధుతీరంబుల
జంద్రభాగా ప్రాంత్యంబుల స్త్రీ బాల గో ద్విజాతుల వధియించిరో యక పరధన పరస్త్రీపరులై రజస్తమోగుణరతులై యల్ప
జీవులై యల్పబలులై హరిచరణారవిందమకరంద రసాస్వాదులు గాక తమలోనన్యోన్యవైరానుబంధులై సంగ్రామరంగం
బుల హతులయ్యెద రా సమయంబునఁ బ్రజలు తచ్ఛీల వేష భాషాదుల ననుసరించియున్నైదరు గావున॥ క॥ దినదినమును ధర్మంబు
లున్నయము ధరనడఁగిపోవు నాశ్చర్యముగా వినువర్ణ చతుష్టయములో నెన యగధనవంతుఁడైన నేలు ధరిత్రిన్॥ క॥ బలవంతు
డైనవాఁడే కులహీనుండైన దొడ్డ గుణవంతుఁడగు౦ గలిమియు బలిమియుఁ గలిగిన నిలలోపల రాజతండె యేమనవచ్చున్॥ వ॥
అట్లుగాన జనంబులు లోభులై జారత్వచోరత్వాదుల చేత ద్రవ్యహీనులై వన్యశాకమూలఫలంబుల భుజించుచు వసగిం దుర్గం
బులం గృశీభూతులై దుర్భిక్ష శీతవాతాతప ఝంఝాతాపంబుల చేత భయపడి ధనహీనులై యల్పాయుష్యులు నల్పతర శరీరు
లునై రాజులు చోరులై సంచరించుచు నధర్మప్రవర్తనులై వర్ణాశ్రమధర్మంబులు విడనాడి శూద్రప్రాయులై యున్నైదరంత
నోషధులల్పఫలదంబులు మేఘంబులు శూన్యంబులు సస్యంబులు నిస్సారంబులు నగునిట్లు ధర్మమార్గంబు దక్కి యున్న యెడము
ష్టం బగు దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబుకొఱకు శంబలగ్రామంబున విష్ణుయశుండను విప్రునకు పుత్రత్వంబునొంది దేవతాబృందం
బులనేకీభవింప దేవదత్త ఘోటకారూఢుండై దుష్టమ్లేచ్ఛజనంబులందనమస్తలగ్రంబున ఖండీభూతులం జేయునప్పుడు ధా
త్రీమండలంబు నిగతకూరిజనషన్డలంబై తేజరిల్లు నంత సరులు విష్ణుధ్యానవన్దనపూజాది విధానాసక్తులై నారాయణపరా
యణులయి వర్తిల్లెదరట్లు లోకల్యాణ తారంబున నఖిలజనులు ధన్యులయ్యెదరంతట కృతయుగధర్మంబయి యుప్పుచుండు నం
ద్రభాస్కర శుక్ర గురువులేక రాశిగతులయినఁ గృతయుగంబయితోఁచు రాజాగతవర్తమానకాలంబులు భవనజ్ఞంబు మొద
లు పంచదశాధికోత్తర శతసహస్ర హాయనంబు యినంచాభిషేక పర్యంతంబు నుండు నంతట నారాయణుండఖిలదుష్టరాజ
ధ్వంసంబు గావించి సర్గంబు నిలిపి వైకుంఠనిలయుండగునని చెప్పిన॥ క॥ మునినాథ యే విధంబున ఘనతర మగు జంద్రసూర్య
గ్రహముల జాడ ల్వినఁగాలవర్తన క్రమము నెఱఁగ నెఱింగింపవయ్య ముదముదయింపన్॥ వ॥ అనిన నట్ల కాకయని చెప్పం దొడం
గె వినుము సప్తర్షిమండలాంతర్గతంబులయిన పూర్వబుషిద్వయ సమమధ్యంబు నందు నిశాసమయంబున మధ్యమాసంబు
లో నొక్క నక్షత్రంబు గాను పించిన నా కాలంబు శతవత్సర పరిమితంబయ్యె నేనినా సమయంబు సంగలి ప్రవేశంబగుఁగానని
ష్పజనార్దనుండు నిజపదంబునం బాదలెసీ వేళ ధాత్రీమండలంబు కలిసమాక్రాంతంబయ్యెం గృష్ణుం డెంతకాలంబు భూమి
యందు వర్తించునంత కాలంబు కలిసమాక్రాంతంబు గాదు మఘానక్షత్రంబందు సప్తర్షులు సహస్రంబు సంచరియింతురా
ఘస్రంబున హరి పరమపదంబు ప్రాప్తుండయ్యె నద్దివసంబునందు కలి ప్రవేశించిన నందావసాన పర్యంతంబు ప్రవృద్ధంబైయుండు నంత నా
బుషిసంఘంబు పూర్వాషాఢ కరిగినఁ బ్రవృద్ధంబు నొందు నిట్లు దివ్యాబ్ద సహస్రంబులు చనిన యనంతరంబ నాలవపాదంబు
నగ్నకృతయుగధర్మంబు ప్రాప్తంబగు॥ చ॥ నరవరతో నటి భూపతుల నామ గుణంబులు వృత్తచిహ్నము ల్సిరియును రూపసంపద
లు చేకొని రాజ్యములాత్మవిత్తములు వ్వారు సనడం గెగానియటవారల కీర్తులు నిర్మలంబులై యువుపడి భూమిలో నిలిచి యున్నవి
నేమును రాజశేఖరా॥ వ॥ శంతనుడను జుండగు దేవాపియు నిక్ష్వాకువంశజుండగు మరుత్తు యోగయుక్తులై కలాపగ్రామసీమ
నైకవిద్యంగాంతరంబున తపసు చేయుచున్నవారి ముందు బ్రాహ్మణాచారంబులు తప్పకుండ నడుపుచు నారాయణ స్మరణంబు

త్యంతానర్హ కైవల్యపదప్రాప్తులగుదురు కలియుగంబున రాజులను నే నెఱింగించిన పూర్వరాజన్యులు ఘోరంబుగ నునుసపస్త్రసన్ససందోహంబులయందు మమతనొంది యుత్సాహపతులై యుండి పిదప నీభూతలంబు వదలి నిధనంబు నొందుదురు గావున గాలంబు జాడ యెవ్వరికిం గానరాదు కీర్తి సుకృతదుష్కృతంబులు వెంటనంటం గలయవి యుండియును గాక మత్పూర్వులు హరిధ్యానపరవశులై దయాసత్యశౌచశమదమాదిక ప్రశస్తగుణంబుల ప్రసిద్ధులై నడచిరట్లు గావున॥ క॥ నధర్మము సత్యము కీర్తియు। నిర్మలదయ శిష్టభక్తి నిరుపమఘనస। త్కర్మము హరివ్రతమును। నర్మిలి గలవారు పుణ్యులవని నాథా॥ గీ॥ ఈజగంబేలి తొల్లిటి రాజవరులు। కాలవశమున నాయువుల్లోపపోయి। నేమమాత్రావశిష్టులై నారు గాన। నుంపసంపదుపమమతను బెంపు తోడ॥ వ॥ గర్వాంధులైన నరపతులం జూచి భూదేవి పరిహాస్యంబు సేయు శత్రుజయంబు చేసి యెవ్వరికిం గతాము యేలుచుండెద మని యెడి మోహంబునం బితృపుత్రభ్రాతలకు భ్రాంతిం గల్పించి యన్యోన్యవైరానుబంధంబుల నాహంబు చేసి రణరంగంబుల దృణప్రాయంబుగా దేహంబుల వర్జించి నిర్జరలోకప్రాప్తులైన పృథుయయాతిగాధినహుష, భరత, కార్తవీర్యార్జున, మాంధాతృ, సగర, రామ, ఖట్వాంగ, దుందుమార, రఘు, తృణబిందు, పురూరవ, శంతను, గయ, భగీరథ, కువలయాశ్వ, కకుత్స, నిషదాదులగు రాజులును, హిరణ్యకశిపు, వృత్ర, రావణ, నముచి, శంబర, భౌమ, హిరణ్యాక్ష, తారకాములైన దైత్యులు ధరణి మమత్వంబున జేసి కదా కాలవశంబున నాశంబు నొందిరది యంతయు మిథ్యగాన సర్వంబును సంత్యజించి జనార్దన, వైకుంఠ, వాసుదేవ, నృసింహాది, హరినామామృతపానంబు నిరంతరంబు జేసి జరారోగమృత్యుల బాసి హరిపదంబు నొందుమని చెప్పి॥ గీ॥ ఉత్తమశ్లోకు డనఁ నెవ్వడున్నవాడు। సన్నుతుండగు నెవ్వాడు సకలదిశల। నట్టి పరమేశ్వరుని జిత్తమందు నిలిపి। తద్గుణంబుల వర్ణింపు ధరణినాథ॥ వ॥ అని శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె గలియుగంబు పాపసమ్మిళితంబు గాన మరితంబు లేలాగున నరులొండక యుండెదరు—

## ✻ యుగధర్మంబులం బ్రాకృతాదిప్రళయచతుష్టయంబునుం దెలుపుట. ✻

కాలంబు క్రమంబున నడచు—కాలస్వరూపకుండైన హరి ప్రభావం బేలాగున నంగానబడు నీజగజ్జాలం బెవ్విధంబున నిలుచు ననియడిగిన రాజేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె—కృతత్రేతాద్వాపరకలియుగంబులను యుగచతుష్టయంబున గ్రమంబుగా బ్రవర్తించు—నందు సత్య—దాన—ధర్మ దయా—శౌచ—తపోనియమవ్రత శాంతిదాంతి వర్ణాశ్రమాచారంబులు మొదలగునవి మొదటియుగంబున నాలుగుపాదంబులం బరిపూర్ణంబై ప్రవర్తిల్లు శాంతిదాంతి కర్మాచరణాదిరూపంబగు ధర్మంబు మూడుపాదంబుల రెండవయుగంబునం బ్రవర్తిల్లు హింసానృతాహింసావ్రతిజపానుష్ఠానాదిలక్షణంబులుగల ధర్మంబులు రెండుపాదంబుల మూడవయుగంబున దేజరిల్లు మఱియు జనులు కలియుగంబున ధర్మరహితులు నన్యాయకారులు క్రోధమాత్సర్యలోభమోహాదిదుర్గుణవిశిష్టులు వర్ణాశ్రమాచారరహితులు దురాచారులు దురన్నభక్షకులు శూద్రసేవారతులు నిర్దయులు నిష్కారణవైరులు దయాసత్యశౌచాదిహీనులు ననృతవాదులు మాయోపాయులు ధనవిహీనులు దోషైకదృక్కులునై పాపపరితులగు రాజుల సేవించి జనని జనక సుత సోదర బంధు దారాదస్నేహాజ్ఞలం బరిత్యజించి సురతాపేక్షులై కులంబులం జెరుపుచుండెదరు మఱియు క్షామడాంబరంబులం బ్రజాక్షయంబగు దుష్ప్రతిగ్రహవిహారులై యజ్ఞాదికర్మంబులు పరార్థపరులై చేయుచు హీనులై నశించెదరట్లు గాన నీకలియుగంబున నొక్కముహూర్తమాత్రంబైన నారాయణస్మరణపరాయణులై మనంబున శ్రీనృసింహ వాసుదేవ సంకర్షణాదినామంబుల నచంచలభక్తిం దలంచువారలకు గ్రతుశతఫలంబు గలుగునట్లు గావున రాజశేఖరా నీ మదిన నవరతంబు హరిం దలంపుము కలియనేక దురితాలయంబు గాన నొక్క నిమిషమాత్రంబు ధ్యానంబు చేసినం బరమపావనత్వంబు నొంది కృతార్థుండవగుదువని పలికి మఱియును॥ క॥ మూడవయుగమున జేయుచు। వేడుక హరికీర్తనంబు వెలయం గలెస్స। న్వాడుచు గృష్ణా యనుచుం। గ్రీడింతురు కలి నిదలచి కృతమతులగుచున్॥ వ॥ అంత గల్పప్రళయప్రకారం బెట్లనిన తండ్రి ట్లనియె చతుర్యుగసహస్రంబులు చనిన నది బ్రహ్మకు నొక్కపగలగు నాక్రమంబున రాత్రియు వర్తిల్లు నంత బ్రహ్మ కొక్కదినం బగు నవలన నది నైమిత్తికప్రళయంబనంబడు నందు విధాత సమస్తలోకంబులం దన యాత్మయందు నిలిపి శయనింపం బ్రకృతిస్థుండై నన దిప్రాకృత ప్రళయంబని చెప్పంబడు నాప్రళయప్రకారంబు వినుమిట్లు పవలునైమిత్తికప్రళయంబును రాత్రి ప్రాకృతప్రళయంబును నటుగలిగిన యజునకు నదిదిన ప్రమాణంబట్టిదిన ప్రమాణంబున మున్నూటయఱువది దినంబులైన నజునకు నొక్క సంవత్సరంబు పరిపూర్ణంబగు నదివత్సరంబులు శతపరిమితంబులైన॥ సీ॥ అంతలో శేషసకవసానకాలంబు వచ్చిన నూతేండ్లు వసుధలోన। వర్షంబులుడిగిన వడిదప్పి మానవుల్డప్పి నాకటజిక్కి నొప్పినొంది। యన్యోన్యభక్షులై యాకాలవశమున నాశ మొందెదరంత నదియనఘుడు। సాముద్రభౌతికస్థావరజాతరసముల జాతుడై కిరణాలిచేతం గాల్పనంత గాలాగ్నిసంకర్షణాఖ్యుడగుచు। మిన్నంగలయ మగనవియు గ్రమించునట్టి। వెడదనుశతవర్షములు దడసకమూడిసీకతో దుతవాయువృష్టి

చుండు॥వ॥ఇట్లు వర్షశతంబు వర్షశూన్యంబగు నంత శతవర్షంబులు ద్వాదశభానులు ప్రచండకిరణములఁ జండపవనంబులు వదిపెను తవర్షంబులు ప్రళయాగ్ని దందహ్యమానంబగు. బిమ్మట సంవర్తకమారుతఝంఝూనిల వేగ తాడితంబగునంతఁ బ్రళయ ఘనంబులనవ ధారాధరంబులు మహాఘోషంబుతో డంగరికలోపమానంబులైన నీరధారల నిఖిలజగంబును శంబరమయంబు చేసిన బ్రహ్మాండంబెల్ల జలమయంబగుటం జేసి భూమి హృతగంధగుణంబై కబంధంబున లీనంబగు నన్నీరంబు హృతరసగుణంబై తేజంబున నడంగు. నా తేజంబు వాయువందు నష్టరూపంబై కలయు నా పవనుండు గతస్పర్శగుణుండై నభంబున సంక్రమించు నాయాకాశంబు విగతశబ్దంబై భూతాదిప్రకృతియం దడంగు నాప్రకృతియు నాదంబయ వాఙ్మనసగోచరంబుగాక సత్వ రజస్తమోగుణరహితంబయి మహదాదిసన్నివేశంబు లేక స్వప్నాద్యవస్థారహితంబయి యప్రతర్క్యంబగు నాత్మయం దులయంబగు నదియె సర్వాధారభూతంబయిన పదంబని చెప్పంబడు కాలవిపర్యయంబయి పురుషావ్యక్తములు విలీనంబగ నది ప్రాకృతప్రళయంబనంబడునని చెప్పి మఱియు నొక్కవిశేషంబు వినుము బుద్ధీంద్రియార్థరూపంబులచే జ్ఞానంబు తదాశ్ర యంబయి వెలుంగు దృశ్యత్వావ్యతిరేకంబులచే నదియాద్యంతంబుగలదై యుండు తేజంబు చక్షుస్స్వరూపంబునకు వేఱుగాని యట్లు పదార్థంబు మూర్తికి నన్యంబుగాదు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు బుద్ధిధర్మంబులగు బ్రత్యగాత్మయందు నానాప్ర కారంబులం దోఁచు నీదృశ్యప్రపంచంబంతయు మిథ్యయని తెలియు మొక్క తేజంబు బహురంధ్రంబులం గానంబడు వడువున నొక్కయాత్మ పెక్కు దేహంబులం దోపంబడు హాటకంబు పెక్కురూపంబులు గలదైన నేకంబయిన తెఱంగున బరమాత్మవి వేకచేతనాచేతనశరీరంబులయందు బెక్కువిధంబులం గనుపడి నేకంబుగా భావింపవలయు నేత్రంబులకు నిర్మలాంబరంబు వల యుండు భాస్కరమండలంబు గనిపించు కరణిబంధహేతువయిన యహంకారంబాత్మజ్ఞానంబున నిరస్కృతంబయిన నప్పు డె పరమాత్మ నిర్మలంబయి తోఁచు నా పరమాత్మను నిరంతరంబును దలంచుచు యోగులు తదేకాయత్తచిత్తులై యుందు రు కాలంబు వేగంబున సర్వప్రపంచంబునకు నవస్థాంతరంబులం గల్పించుచుండు బరమేశ్వరమూర్తియైన కాలంబున భంబు సంగలుగు తారకంబులు గానరాని కరణిం గానంబడక కల్పావస్థలజలించు నిత్యనైమిత్తిక ప్రాకృతాత్యంతికంబులను ప్రళ యంబులు చతుర్విధంబులై పరగు నందుగల నారాయణలీలావతారంబుల గమలభవ భవాదులయిన వచింపనోపరు నే నెఱింగినంతయుం జెప్పితి సంసారసాగరంబు దాటహరికథయనెడు నావయు సహాయంబుగాని వేఱొకటి లేదని చెప్పి॥ ఉ॥ ఏను మృతుండనాదునని యెంత భయంబు మనంబులోపల। న్మానుము సంభవంబుగల మానవకోట్లకుఁ జావు నిత్యమౌ। గానహరిం దలంపుమిక గల్గదు జన్మము నీకు ధాత్రిపై। మానవనాథ పొందెదవు మాధవలోకనివాససౌఖ్యముల్॥ వ॥ఇట్లు

⟶ పరీక్షిత్తు తక్షకునిచే దష్టుండై మృతినొంద నతని పుత్త్రుండు సర్పయాగము చేయుట. ⟵

దేహఘటకంబయిన శరీరంబునుండి జీవుండు ఘటంబులో కనుపడు నాకాశంబు ఘటనాశంబయిన మహాకాశంబునం జేరు నీ నిస్స్వరూపంగలయుండైన నాశనపర్యంతంబు వర్తి తేజంబుతోడ వెలుంగు కరణి దేహకృతంబగు భవంబు రజస్సత్త్వతమోగుణం బులచే బ్రవర్తించు నాత్మ నభంబు మాడ్కి ధ్రువంబై యనంతంబై యనంతంబై వ్యక్తావ్యక్తంబులకుఁ బరంబయి యుండు నీవ్వా త్మస్వరూపుండగు హరిని నిరంతరంబు భావించుచుండుట విశేషంబు నిన్ను దక్షకుండు గఱచునపుడు యమంబు నొందవలదు హరిం దలంపుము ధనగృహదారాపత్యక్షేత్రపశుపరికరంబుల వర్జించి సమస్తంబును నారాయణార్పణంబు చేసి విగతశోకుండవై ధ్యానంబు సేయుమని యనిపించిన రాజేంద్రుండు నగుశాసనాసీనుండై జనార్దను భజించుచుండె నంత శకుం తుని శాపంబుచే ద్విజరూపంబున మార్గమధ్యంబున గాశ్యపుండను సర్పవిషహరణసమర్థుండను విప్రుండొక్కరుండు పరీక్షిత్తు దర్శనార్థంబుగా నేతెంచుచుండ మార్గమధ్యంబున గాశ్యపుండను సర్పవిషహరణసమర్థుండను విప్రుండొక్కరుండు మనోరథవశంబున నృపతి నిం గాంచి పరీక్షిన్నికటంబునకు రాకుండునట్లు నొనర్చి యంతఁ బరీక్షిన్మహారాజు చెంత కుం జని కామరూపుండగుటం జేసి యురగంబై రాజుం గఱచిన నతండు నాత్మయందు బ్రహ్మైకభూతుండయి వ్యక్తికి యవస రంబున భూమ్యంతరిక్షంబులనుండు నిఖిలప్రాణులాశ్చర్యకరంబగు తత్స్మరణంబున నహాహాకారంబులు నెరింత నీయగ్గంబు న తత్తనయుండైన జనమేజయుండు విని కోపించి వేశంబున సర్పప్రియంబగ నట్లు యజ్ఞంబు సేయుచుండ సహస్రసంఖ్యలు గల సర్పంబులు హోమంబుల వ్రేలాసమయంబున దక్షకుండు రాకుండుట నెఱింగి సహేంద్రతక్షకాయ స్వాహా యను ఋత్విక వాక్యమునొంపునంత తక్షకసహితుండయి విమానమ్ముతో నింద్రుండు స్థానభ్రంశంబునొంది పడఁజూడ నత్తఱి బృహ స్పతి మేలెంచి పరీక్షిత్తనయుని గీర్తింపఁదొడంగె॥చ॥ వృజినియుసఁ జీవనంబునిమిమేదినిలో పల జీవకోటికిన్ స్వతతముసంభ వింపు సహజంబిదిచోరహుతాశసర్పరంహహేతువులు నదప్పి యాకఁబునబంచవనాఁ జెడునట్టి జీవుఁడు। న్వైతలను బూర్వకర్మను వహేనన గాంపించు చుండు నెప్పుడున్॥వ॥అట్లుగా ప్రసన సంఖ్యాంబులై నదండశూకంబు ప్రహుతంబులయ్యె శాంతమానసుఁగ

డవై క్రోధంబు వర్జిం పుమునగురూపదిష్టప్రకారంబున సర్వయాగంబు మానియు - డనంత దేవతలు గుసుమవృష్టి గురియ స్వయంరాజన్యుండు మంత్రిసమేతుండై నగరప్రవేశంబు సేసె బాధ్యబాధకలక్షణంబులు గలిగి షూమా యాగుణవ్యాపారంబులనాత్మ మోహింపంబడుగా నట్టిమాయావికారంబులం బరిత్యజించి నిర్మలమానసుండై వర్తిస్చువాడు బరనసంయుకవైరంబు వర్జించి భగవత్పదాంభోజభక్తిసంయుక్తుండై తెరుగున తండు హరిపదంబు జేరునని చెప్పి వెండియు సూతుండు మునివరను

—ః శ్రీవేదవ్యాసుండు వేదములం బురాణములలోకమందు బ్రవర్తింపఁజేయుట. ః—

హర్షసమేతుండై శౌనకునకిట్లనియె॥ క॥ ధారుణి బారాశర్యుఁ ౹ కార్యులు పైలవసుమంతు జైమినిమునులున్ ౹ ధీరయుతవైశంపాయను ౹ డారయనలువురును శిష్యులయియుండిరిలన్॥ వ॥ వారలు ఋగ్యజుస్సామాథర్వంబులని నాలుగు వేదంబుల వ్యాసోపదిష్టక్రమంబున లోకంబులం బ్రవర్తింపఁజేసిరని చెప్పిన నాక్రమం బెట్లని శౌనకుండడిగిన సూతుండు నిప్పుండొడంగెనాగియంపజతుర్ముఖుని హృదయంబున నొక నాదంబుద్భవించె నదివృత్తినిరోధంబువలనఁ బూరీభవించివ్యక్తంబుగాగనుపట్టె నట్టి నాదోపాసవలన యోగిజనంబులు నిష్పాపులై ముక్తినొందుదురందు నోంకారంబు జనియించెనదియె సర్వమంత్రోపనిషన్మూలభూతయగు వేదమాతయని చెప్పంబడు నాయోంకారంబు త్రిగుణాత్మకంబై యకారయుకారమకారంబులనెడు త్రివర్ణరూపంబై ప్రకాశించుచుండె నంత భగవంతుండగు నజుండా ప్రణవంబువలన స్వరస్పర్శాంతస్థోష్మాదిలక్షణలక్షితంబగు నక్షరసమామ్నాయంబుఁ గల్పించి తత్సహాయనంబున నతనివదనచతుష్టయంబువలన వేదచతుష్టయమ్ముగలుగంజేసె. నంతనతనిపుత్రులగు బ్రహ్మవాదులా వేదంబులందదుపదిష్టప్రకారంబుగా నభ్యసించియా క్రమంబున వారలు దమశిష్యపరంపరలకునుపదేశించిరిట్లు వేదంబులు సమగ్రమంబులుగా బ్రహ్మయుగంబున మహర్షులచే నభ్యసింపంబడునట్టి వేదంబుల సమగ్రంబుగ బఠింపనశక్తులగువారలకు సహాయంబు సేయుటకై ద్వాపరయుగాది యందు భగవంతుండు సత్యవతీదేవియందు బరాశరమహర్షికి సుతుండుగా నవతరించి యావేదరాశిం గ్రమమ్మున ఋగ్యజుస్సామాథర్వణంబులనెడు నాలుగువిధంబులుగ భజించి పైలవైశంపాయన జైమినిసుమంతులని నెడు శిష్యవరులకు గ్రమంబుగ నాలుగువేదంబులనుపదేశించెనందు పైలమహర్షి జేకొన్న ఋగ్వేదంబనంతంబులగు ఋక్కులతో జేరియుండుటం జేసి బహ్వృచశాఖయని చెప్పబడు- నంత నాపైలుండింద్రప్రమితికి నుపదేశించె- నతండా సంహితం జతుర్విధంబులుగా విభజించి బాష్కలుండు - బోధ్యుండు, యాజ్ఞవల్క్యుండు, పరాశరుండు, మాండూకేయుం, డగ్నిమిత్రియనువారికి నుపదేశించె- నందు మాండూకేయుండు వేదమిత్రుండనువానికిం జెప్పె - నతనికి సౌభర్యాదిశిష్యులనేకులై ప్రవర్తిల్లిరి - యంత సౌభరేనుతుండు శాకల్యుండు తానభ్యసించిన శాఖనైదు విధంబులుగ విభజించి వాత్స్యుండు, మౌద్గల్యుండు, శాలీయుండు, గోముఖుండు, శిశిరుండనెడు శిష్యలకుపదేశించె నంత జాతుకర్ణి యనువానికి వారుపదేశింపనతండు బలాకుండు, పైలుండు జాబాలి, విరజుండను వారికి నుపదేశించె నిదియునుంగాక మున్ను విన్నవిన్చిన బాష్కలుని కుమారుడైన బాష్కలి వాలఖిల్యాఖ్యసంహితం బాలాయని, గార్గ్యుండు, కాసారుండను వారలకు జెప్పె నిట్లు తెలుగున బహ్వృచసంహితలనేక ప్రకారంబులం బూర్వోక్త బ్రహ్మర్షులచే ధరియింపంబడె, నంత యజుర్వేదధరుండగు వైశంపాయను నిశిష్యసంఘంబు నిఖిలక్రతువులనాధ్వర్యకృత్యంబులచే నుతికెక్కిరి- మఱియు నతని శిష్యుండగు యాజ్ఞవల్క్యుండు గుర్వపరాధంబు చేసిన నాగురువు గుపితుండై నీ చే వేదంబుల మఱలందిచ్చి పొమ్మనిన యతండు దానుజదివిన యజుర్గణంబును దదుక్తక్రమంబున గ్రక్కె- రుధిరాక్తంబగు రూపంబు దాల్చిన నా యజుర్గణాధిష్ఠితశాఖాది దేవతలు తిత్తిరిపక్షులై వానిభుజియించిన నంత నా శాఖలు తైత్తిరీయంబులయ్యె- నంత నిర్వేదయుతుండై యా యాజ్ఞవల్క్యుండపరిమితనిర్వేదంబునొంది యుగ్రతపంబున సూర్యుని సంతుష్టుంగావింప నతండు సంతసిల్లి హయరూపంబున దాల్చియా యజుర్గణంబున తనికుపదేశించెగాన నవి వాజసనేయశాఖయని వాక్రువ్వంబడె- నంత నా యజుర్గణంబు కాణ్వమాధ్యందినాదులచే నభ్యసింపంబడె నిట్లు యజుర్వేదంబు లోకంబునం బ్రవర్తిల్లె. సామవేదాధ్యేతయగు జైమినిమహర్షి తనసుతుండగు సుమంతునికి నుపదేశించె- నతండు సుకర్ముండనుతనసుతునకు జెప్పె- నతండా వేదమును సహస్రశాఖలుగా విభజించి క్రోసలునికొమారుండైన హిరణ్యనాభుకెందనగుమారుండగు పౌష్యంజియనువానికి నుపదేశించె నంత వారిరువుర బ్రహ్మవేత్తలగు నావంత్యులు, నుదీచ్యులను నేబురికె నుపదేశించి వారిని సామవేదపారగులుగాఁ జేసిరిట్లు సామవేదంబు లోకంబున వ్యాప్తినొందె. మఱియు నథర్వవేత్తయగు సుమంతమహర్షియు ననధ్యుండు వేదదర్శియను శిష్యులకుపదేశించె - నందు వేదదర్శియనువాడు సౌల్కాయని, బ్రహ్మబలి, యదోషుండు, పిప్పలాయనుండు, ముదుండు, శునకుండు, జాబాలి, బభ్రు, వాంగీరసుండు, సైంధవాయనుండను వారలకుపదేశించి ప్రకాశంబునొందించె- నిట్లు తెలుగున నథర్వవేదంబు వ్యాప్తినొందె-నిట్లు నాల్గు వేదంబులయుత్పత్తి ప్రచారక్రమం బెఱింగించితి- నింక పురాణక్రమం బెట్టులనిన నే నుపేంతు నెను లోకంబున బురాణ ప్రవర్త

కులనం బ్రసిద్ధులగుటై త్రయ్యారుణి, కశ్యపుండు, సావర్ణి, యకృతవ్రణుండు, శింశుపాయనుండు, హసితుండను నార్గురు మజ్జనకు
న్డగు రోమహర్షునివలన, వ్యాసపుత్రునివలనం గ్రహించిరట్టి పురాణంబు సర్గాదిదశలక్షణలక్షితంబుగా నుండు- మఱియుం గొ
న్ని పురాణంబు పంచలక్షణలక్షితంబని యుంబలుకుదురట్టి పురాణనామానుక్రమంబు పురాణపదులగు ఋషులు సెప్పెడు
తెఱంగున నెఱింగింతు వినుము- బ్రాహ్మంబు, పాద్మంబు, వైష్ణవంబు, శైవంబు, భాగవతంబు, భవిష్యోత్తరంబు, నారదీయం
బు, మార్కండేయం, బాగ్నేయంబు బ్రహ్మకైవర్తంబు, లైంగంబు, వారాహంబు, స్కాందం, వామనంబు, కౌర్మంబు, మా
త్స్యంబు, బ్రహ్మాండంబు, గారుడంబనుపదునెనిమిది మహాపురాణంబులు మఱియు నుపపురాణంబులుం గలవు- ఈనీకు విన్పినం
జవివినవినిన దురితంబులడంగునని సూతుండు శౌనకాదులకుం జెప్పిన వారు నారాయణగుణవర్ణనంబును దత్కథలును జెప్పి
తి- వింక దోషకారులును, బాపరతులు నెవ్విధంబున భవాబ్ధిం దరింతు రాక్రమంబు వక్కాణింప వేయని యడిగిన నెఱింగింపఁద

## మార్కండేయోపాఖ్యానము.

లంచి యిట్లనియె॥ క॥ తొల్లిటియుగమున దపముఁ బల్లిదులగు ఋషులమహిమ భాషింపగరం । జెల్లెడు మార్కండేయుం । డు
ల్లంబున హరినిలిపియుఁ జుగక బ్రతికెక్ ॥ వ॥ లోకంబులు గల్పాంతసమయంబునం గబంధమయంబులయి యంధకారబంధు
రంబులై యున్నయెడ నేకాకియయి చరించుచు బాలార్కకోటితేజుండయిన బాలునిహృదయంబునం బ్రవేశించియ నేక
సహస్రవత్సరంబులు దిరిగి వటపత్రశాయియయిన యబ్బాలుని గ్రమ్మరం గనియెనని చెప్పిన శౌనకాదులు సూతుని సన్నుతించి
యా మునీంద్రునకు నీప్రభావం బెట్లుగలిగెనని యడిగిన నతం డిట్లనియె॥ క॥ భూవినుత బ్రహ్మచర్యము । వేవదలక నిష్ఠ చేత విశద
ముగాఁగ్ । భావించి హరిందలంచుచు గోవిదనుతుఁడై మృకండు గుణములవెలసెక్ ॥ వ॥ ఇట్లు తపంబు సేయునతనికి
హరి హరుఁ బ్రత్యక్షంబయి వరంబడుగుమనిన గుణగణాఢ్యుండయిన కుమారుని డిగిననట్ల కాకయని యతండు కోరినవరం
బిచ్చియంతర్ధానంబునొందిరి యనంతరంబ యమ్మునికి మార్కండేయుండు దయించి నియమనిష్ఠాగరిష్ఠుండయి యుండ మృ
త్యువు వానిం బాశబద్ధుం జేసిన నెవ్విర్చిన మృత్యుని ధిక్కరించి పదివేల హాయనంబులు తపంబు సలుప నింద్రుండు భయంపడియ
మ్మునివరునియుగ్రతపంబు భంగపరచుటకు దేవతాంగనలం బంపహారి తెంచునెడ బుష్పఫలభరితంబును, మత్తమధుకరశు
కపికాదిశకుంతారవనిరంతర దిగంతరంబును, జాతీవైరరహిత మృగపక్షికులసంకులంబును, సాలసచక్రవాకబకక్రౌంచ
కారండవకోయష్టికాదిజలవిహంగమాకులిత సరోవరసహస్రసందర్శనీయంబును- నగునా తపోవనంబున జటావల్కల
ధారియై హవ్యవాహనుం బోలె తపంబు సేయు నమ్మునీంద్రుని గని యంగనలు వీణావేణువినోదగానంబుల నలవరింప
మెచ్చక ధీరోదాత్తుండగు నమ్మునీంద్రుని గెల్వనోపక నింద్రునికడకుం జనరంత హరియతనితపంబునకుఁ బ్రసన్నుండై యా
విర్భవించిన నంగనుంగొని దేవా నీదివ్యనామస్మరణంబునం జేసి యీశరీరంబుతోడన యనేకయుగంబులు బ్రతుకునట్లుగాఁ
జేయు వేయనిన నంగరుణించి యిచ్చుటయును॥ గీ॥ జగము రక్షింప జీవుల జంపమనుపఁ । గర్త వై సర్వమయుఁడవై కానుపిం
తు । వెచట నీమాయఁ దెలియంగ నెవ్వఁడోపు । విశ్వసన్నుతవిశ్వేశ వేదరూప॥ మ॥ బలభిన్ముఖ్యదిశాధినాథవరులుక్ ఫాలా
క్షుబ్రహ్మ ముఖుల్ । జలజాతాక్షపురందరాదిసురలుక్ జర్చించి నీమాయలక్ । దెలియన్నేరరు నావశంబె తెలియక్ దీనార్తిని
ర్మూలయుజ్జ్వలతేజోవిభవాతిసన్నుత గదాచక్రాంబుజాద్యంకితా॥ వ॥ అనిపినుతించి దేవా నీమాయం జేసి జగంబు భ్రాం
తంబై యున్నయది యిది దెలియవాన తీయవలయునని యడిగిన నతండు నెఱింగించి చనియె మునియును శివపూజ సేయుచుహ
రిస్మరణంబు సేయుచుండ నచిన శతవర్షంబులు ధారాధరంబులు ధారావర్షంబు చేధరాతలంబు నింపజలమయంబై యేకార్ణవం
బై యంధకారబంధురంబైనసంత మార్కండేయుండు నాతిమిరంబునం గానక భయపడియున్నయెడ నామధ్యంబున నొక
వటపత్రంబునం బద్మరాగకిరణపుంజంబుల రంజిల్లు పాదపద్మంబులుం గలబాలునిం గని మ్రొక్కి యతనిశరీరంబు ప్రవేశించియ
నేకకాలంబనంతంబగు జఠరాంతరంబునం దిరిగి యతనిచరణారవిందసంస్కరణంబునం జేసి వెలువడి కౌఁగిలింపం బోయిన
మాయ సైకొని యంతర్ధానంబునొంద మునియు నెప్పటియట్ల స్వాశ్రమంబు చేరి తపంబు సేయుచున్న సమయంబున॥ చ॥ నిశ్చి
నశంకరుండు పదగనిత్యసుఖంబుల నిచ్చు గౌరియు । మ్మఁహారభూతిభూపణసముజ్జ్వలగాత్రుని గంటె మెంతయుక్ । వలనుగ
వానితోడ నొకవాటవుమాటను బల్కఁ గాదగుక్ । సలితమైన యీతపము జాడవినంగడు వేడ్కయయ్యెడిక్ ॥ వ॥ అనినశం
కరుండును శాంకరియును నభంబుననుండి ధరణీతలంబునకు నేతెంచె నిర్గుణబ్రహ్మాత్మైక్యానుసంధానంబు చేసి శుద్ధచైతన్య
స్వరూపుండై యితరంబు గానక నేకాగ్రచిత్తుండగు నమ్మునిం గని శంకరుండు తనదివ్యయోగమాయాప్రభావంబు చేనతనిహృ
దయంబు ప్రవేశించి చతుర్బాహుండును విభూతిరుద్రాక్షమాలికాధరుండును త్రిశూలడమరుగాదిదివ్యసాధనసమేతుం
డును వృషభవాహనారూఢుండును నుమాసమేతుండయి శంకరుండు తన స్వరూపంబుగనుపఱచిన విస్మయంబు నొంది య

మ్మునియా పరమేశ్వరుని ననేకప్రకారంబుల స్తుతియించు నప్పుడు హరిహిరణ్యగర్భులమ్మునితపఃప్రభావంబునకు మెచ్చు మహాత్మా పరమశైవుండవని పరమేశ్వరుండానతిచ్చిన మార్కండేయుండును శంకరుని రీక్షించి దేవా హరిమాయాప్రభావంబు దుర్లభంబు భవత్సందర్శనంబునుగంటెనింతయచాలు నైననొక్కవరంబుగోరెద నారాయణచరణాంబుజ ధ్యానంబును మృత్యుజయంబునుంగలుగునట్లుగా గృపసేయవేయని ప్రార్థించిన గృపాసముద్రుండై యట్లకాక యని జరారోగపికృతులు లేక కల్పకోటిపర్యంతంబు నాయువుంబురుషోత్తమునియనుగ్రహంబుగలుగుననిమహాదేవుండానతిచ్చి యంతర్ధానంబునొందెనని చెప్పి యీమార్కండేయోపాఖ్యానంబు వ్రాసినవినినంజదివినను మృత్యువ్యవదోలంగునని మఱియు హరిపరాయణుండగు భాగవతుండు దేవతాంతరమంత్రాంతరసాధనాంతరంబులు వర్జించి దుర్జనులంగూడక నిరంతరంబు నారాయణ గోవిందాది నామస్మరణంబు చేయుచునుండెనేని యట్టి పుణ్యపురుషుండు వైకుంఠంబున వసియించు మఱియు హరి విశ్వరూపంబు చతుర్వ్యూహభేదంబులు చతుర్మూర్తులును లీలావతారంబులును జెప్పనగోచరంబులని పలికెను. క॥ హరికథలు హరిచరిత్రము। హరిలీలావర్తనములు నంచితరీతిన్। బరువడి నెఱిఁగితి మంతయు। సురనుతయసుమాన మొకటి చూప్ప డెడిమదిన్॥

చైత్రాదిమాసంబుల సంచరించెడు ద్వాదశాదిత్యుల క్రమంబును దెలుపుట,

వ॥ చైత్రము మొదలగు ద్వాదశమాసంబుల సౌరగణసప్తకంబీశ్వరనియుక్తంబై నానాప్రకారంబుల సంచరించెడు క్రమంబు తొల్లి శుకుండు విష్ణురాతునికిఁ దెలిపిన చందంబునఁ జెప్పుమనిన సూతుండిట్లనియె శ్రీమన్నారాయణస్వరూపుండగు మార్తాండుండేక స్వరూపుండై వతనిం గాలదేశక్రియాది భేదంబు పట్టి ఋషులనేక క్రమంబులనభివర్ణించి భావింపుచున్న వారాప్రకారం బెట్లనినఁ జైత్రంబున సూర్యుండు ధాతయను నామంబు దాల్చి కృతస్థల, హేతి, వాసుకి, రథకృత్తు, పులస్త్యుండు, తుంబురువనెడు పరిజనులతోఁ జేరికొని సంచరించు వైశాఖంబున నర్యముండను పేరువహించి పులహుం, డోజుండు, ప్రహేతి, పుంజికస్థల, నారదుండు, కచ్ఛనీరుండనునను చరసహితుండై కాలంబు గడపుచుండు- జ్యేష్ఠంబున మిత్రుండను నభిధేయధరుండై యత్రి, పౌరుషేయుండు, తక్షకుండు, మేనక, మహారథస్వనుండనెడు వారితోఁ జేరకాలనయనంబు సేయుచుండు నాషాఢంబున వరుణుండను నాహ్వాయంబు నొంది వసిష్ఠుండు, రంభ, సహజన్య, హూహూ శుక్రుండు, చిత్రస్వనుండను సహచరసహితుండై కాలక్షేపణంబు సేయుచుండు శ్రావణంబున నింద్రుండను నామంబు చేవ్యవహృతుండై విశ్వావసు, శ్రోత, బలాపుత్రుం, డాంగిరస్సు, ప్రమ్లోచ యరాక్షసుండను సభికులతోఁ జేరి కాలంబు నడుపుచుండు- భాద్రపదంబున వివస్వంతుండను నామంబు దాల్చి యుగ్రసేనుండు, వ్యాఘ్రుండా పూరణుండు, భృగుమ్లోచ శంఖపాలుండను పరిజనావృతుండై కాలయాపనంబు సేచునుండు॥ క॥ ధరలో ద్వష్టాహ్వయమును। బిరుదుగ ధరియించి మెపుడు బెంపుదలిర్పన్। జరియించుచు నభమందున। సరసిజహితుఁ డాశ్వయుజమున సయ్యవగడపున్॥ వ॥ ఈమాసంబున ఋచికతనయుండు, కంబళాశ్వుండు, తిలోత్తమ, బ్రహ్మాపేతుండు దృతరాష్ట్రుండను సభ్యులతోఁ గూడి కాలంబు కడుపుచుండు- గార్తికమాసంబున విష్ణువని వ్యవహరింపంబడియశ్వతరుండు, రంభ, సూర్యవర్చస్సు, శత్రుజిత్తు, విశ్వామిత్రుండు, మఖాపేతస్సను పరిజనవర్గంబుతోఁ గూడి కాలంబు నడుపుచుండు- మార్గశిరంబున నంశుమనామవ్యవహృతుండై కశ్యపుండు, తార్క్ష్యుండు, ఋతసేనుం, డూర్వశి, విద్యుచ్ఛంద్రుండు, మహాశంఖుండనెడు ననుచరులం గూడి చరించుచుండు- పుష్యమాసంబున భగుండను నామంబు దాల్చి స్ఫూర్జుం, డరిష్టనేమి, యూర్ణుం, డాయువు, కర్కోటకుండు, పూర్వచిత్తియనెడు సభ్యజనవృతుండై కాలక్షేపణంబు సలుపుచునుండు - మాఘమాసంబున బూషాహ్వయము వహించి ధనంజయుండు, వాతుండు, సుషేణుండు, స్వరుచియు, ఘృతాచి, గౌతముండను పరిజనవృతుండై చరించుచునుండు॥ క॥ క్రతునామంబు ధరించియుఁ। జతురత చాలించుచుండు జాతుర్యకళా। రతుఁడై సహస్రకిరణుఁడు। మతియుతులెంచనదపస్యమాసములీలన్॥ వ॥ అందుఁ జతుర్యుండు, భరద్వాజుండు, పర్జన్యుండు, సేనజిత్తు, విశ్వే, దేవత, లైరావతుండను వారలతోఁ నెనసి కాలయాపనంబు సేయుచుండు - నిట్లు ద్వాదశమాసంబుల నపరిమేయవిభూతులచే దేజరిల్లుచు నుభయసంధ్యలను పాసించు జనులపాపసంఘంబుల నున్మూలనంబు సేయుచు ప్రతిమాసంబును బూర్వోక్తపరిజనషట్కంబు వెన్నవెన్నటనుభయలోకనివాసులగు జనంబులకైహికాముష్మికఫలంబుల నొసంగుచు ఋగ్యజుస్సామాధర్వమంత్రంబుల బఠియించుచు ఋషిసంఘంబులు స్తుతియింప బురోభాగంబున నప్సరసలాడఁ గంధర్వులు పాడ బ్రహ్మవేత్తలగు నఱువదివేవురు వాలఖిల్యమహర్షులభిముఖులై నుతియించుచుండ నగణనాధిక బలవేగ రాజమానంబులగు నాగరాజంబు నురథోన్నయంబు సల్పబాహాబల ప్రతిష్ఠాగరిష్ఠులగు నైరృత శ్రేష్ఠులు రథపృష్ఠభాగంబు మోచి త్రోయుచుండ ననాదినిధనుండగు నాదిత్యుండు ప్రతికల్పంబున నిట్లు కాలయాపనంబు సేయుచు దేజరిల్లుచుండునట్లుగావున నయన్నియు వాసుదేవమయంబులుగా దెలియుమని పౌరాణికోత్తముండనుసూతుండు శుకయోగీంద్రుండు ప్రాయోపవిసనయన్నియు వాసుదేవమయంబులుగా

విష్ణుండగుపరీక్షిన్నరపాలునకుపదేశించిన తెఱంగున నైమిశారణ్యవాసులగు శౌనకాదిఋషిశ్రేష్ఠులకుఁ దెలిపి మఱియుం ట్టిపురాణరత్నంబగుభాగవతంబువినువారును-పఠియించువారును.లిఖియించువారును.నాయురారోగ్యైశ్వర్యంబులఁగలిగి విష్ణుసాయుజ్యంబునొందుదురదియునుంగాక॥గీ॥పుష్కరంబందు ద్వారకాపురమునందు।మథురయందునురవిదినమందు నెవఁడు।పఠనసేయునురమణతో భాగవతము।వాఁడుదరియించుస సారవార్ధినవృప॥ క॥ శ్రీరమణీరమణకథా।పారాయణచిత్తునకునుబతికిఁబరీక్షి।ద్భూరమణునకెఱింగించెను। గారవమొప్పారద్వాదశస్కంధములన్॥ *....*....*....*

క॥ జనకసుతా హృచ్చోరా। జనకవచః పాలనాత్తశైల విహారా।
జనకామిత మందారా। జనకాదిక నిత్య దుఃఖచయ సంహారా॥

మాలిని॥ జగదవన విహారీశత్రులోక ప్రహారీ.। సుగుణవన విహారీసుందరీమానహారీ।
విగతకలుషపోషీ వీరపర్యాభిలాషీ। స్వగురుహృదయపోషీ సర్వదా సత్యభాషీ॥

గద్య*ఇది.శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారాయణాఖ్యప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబనుమహాపురాణంబునందు రాజులయుత్పత్తియువాసుదేవలీలావతారప్రకారంబును గలియుగధర్మప్రకారంబునుబ్రహ్మప్రళయప్రకారంబును దక్షకునిచేదష్టుండై పరీక్షిన్మహారాజుమృతినొందుటయు సర్వయాగంబున బ్రళయవిశేషంబులును వేదవిభాగక్రమంబును బురాణానుక్రమణికయుమార్కండేయుమాహాత్మ్యంబును సూర్యుండుప్రతిమాసంబును వేర్వేరుపరిజనులతోఁ జేకొనిసంచరించుక్రమంబుననుకథలంగల ద్వాదశస్కంధంబు సర్వంబును సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ
భాగవతము
సంపూర్ణము.

